

బమ్మెరపోతనామాత్య ప్రణీత

# శ్రీమహాభాగవతము

సరళవ్యాఖ్యానసహితం





సంపుటం 6
10వ స్కంధము
పూర్వభాగము



తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి

బమ్మెర పోతనామాత్య ప్రణీత

# శ్రీమహాభాగవతము

## సరళ వ్యాఖ్యానసహితం

## ఆరవ సంపుటము

### 10వ స్కంధము - పూర్వభాగము


*వ్యాఖ్యాతలు*

**డా॥ అప్పజోడు వేంకటసుబ్బయ్య**

**డా॥ ఎ.ఎస్. గోపాలరావు**

**శ్రీ ప్రభల సుబ్రహ్మణ్యశర్మ**

**డా॥ పి. నరసింహారెడ్డి**

**విద్వాన్ ముదివర్తి కొండమాచార్యులు**

**డా॥ పి.ఆర్. హరినాథ్**

*ప్రధాన సంపాదకులు*

**డా॥ సముద్రాల లక్ష్మణయ్య**






**తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి**

**2017**

**Bammera Potanamatya Praneeta**
**SRI MAHABHAGAVATAMU, with Commentary**
**Volume - VI (Skandha - 10-1)**

*Author :* **Potana Mahakavi**

*Commentary by*
**Dr. Appajodu Venkatasubbaiah**
**Dr. A.S. Gopal Rao**
**Sri Prabhala Subrahmanya Sarma**
**Dr. P. Narasimha Reddy**
**Vidwan Mudivarthi Kondamacharyulu**
**Dr. P.R. Harinath**

*Edited by*
**Dr. Samudrala Lakshmanaiah**



T.T.D. Religious Publications Series No. 1242

*First Edition :* 2017

*Copies :* 3000

*Published by*
**Dr. D. Sambasiva Rao, I.A.S.,**
Executive Officer
Tirumala Tirupati Devasthanams
Tirupati.

*D.T.P.*
Publications Division
T.T.D., Tirupati.

*Printed at*
Tirumala Tirupati Devasthanams Press
Tirupati - 517 507

# ముందుమాట

భారతీయ సనాతన వాఙ్మయంలో అద్భుతమైన ఆధ్యాత్మిక గ్రంథాలు చాలా ఉన్నాయి. అందులో అమూల్యమైన రత్నాల్లాగా శ్రీమద్రామాయణ, శ్రీ మహాభారత, శ్రీమద్భాగవత గ్రంథాలు సంస్కృత వాఙ్మయ ప్రపంచంలో ప్రకాశిస్తున్నాయి.

వాటిల్లో శ్రీమద్రామాయణ మహాకావ్యం ఆదికవి వాల్మీకి మహర్షి ప్రణీతం. కాగా ఇక మిగిలిన భారత భాగవత గ్రంథాలు రెండూ కృష్ణద్వైపాయనుడైన శ్రీవ్యాసమహర్షి రచించినవి.

తి.తి.దేవస్థానం ధార్మిక సాహిత్య ప్రచురణలో భాగంగా ఇప్పటికే సంస్కృత శ్రీమద్రామాయణ కావ్యాన్నీ, తెలుగు కవిత్రయ మహాభారత కావ్యాన్నీ సవ్యాఖ్యానంగా ప్రచురించింది.

అదే వరుసలో పోతన మహాకవి తెలుగులో రచించిన భాగవతాన్ని కూడా తెలుగువారికి అందించాలన్న సదాశయంతో ప్రముఖ పండితులు డా॥ కరుణశ్రీ గారి ప్రధాన సంపాదకత్వంలో సరళమైన తాత్పర్యంతో పోతన భాగవతగ్రంథాన్ని ఐదుసంపుటాలుగా దేవస్థానం అందించింది. ఈ గ్రంథం పాఠకుల విశేషాదరణకు పాత్రమై పలు ముద్రణలను పొందింది.

ఆ తర్వాత కొందరు పండితుల సలహామేరకు, పాఠకుల అభ్యర్థనలమేరకు, 'కవిత్రయ భారతం' మాదిరిగానే పోతన మహాకవి భాగవతాన్ని కూడా అందరికీ సులభంగా అర్థం అయ్యేట్లు సరళమైనశైలిలో వ్యాఖ్యానాన్ని అందించాలనే లక్ష్యంతో దేవస్థానం ఆ కార్యక్రమాన్ని చేపట్టింది.

ప్రస్తుతం బమ్మెర పోతనగారి భాగవత గ్రంథం, ముప్ఫైమూడు మంది పండితులు సరళవ్యాఖ్యానాన్ని అందించగా ప్రముఖ సాహితీవేత్తలు విద్వాన్ ముదివర్తి కొండమాచార్యులు గారి ప్రధానసంపాదకత్వంలో తయారయ్యింది. ఈ వ్యాఖ్యానగ్రంథం తయారీలో కృషిచేసిన దేవస్థానం ప్రచురణల విభాగం అధికారి మరియు పోతన భాగవత వ్యాఖ్యాన పర్యవేక్షకులు, సమన్వయకర్త డా॥ సముద్రాల లక్ష్మణయ్య గారికీ, వారి సహాయకులు, ఉపసంపాదకులు డా॥ నొస్సం నరసింహాచార్య గారికీ, ఈ పోతన భాగవత వ్యాఖ్యానగ్రంథ ప్రధాన సంపాదకులు విద్వాన్ ముదివర్తి కొండమాచార్యులు గారికీ, వ్యాఖ్యాతలకూ, సంపాదకమండలి సభ్యులకూ, సహాయసహకారాలందించినవారికీ, కన్సల్టెంట్లందరికీ, ఈ గ్రంథాన్ని చక్కగా ముద్రింపజేసిన తి.తి.దేవస్థానం ప్రెస్సు వారందరికీ ప్రత్యేకంగా అభినందనలు తెలియజేస్తున్నాను. పోతన పద్యాలకు వ్యాఖ్యానాలనదగిన చక్కనైన బాపుగారి రేఖాచిత్రాలను ఈ గ్రంథ సంపుటాల్లో అక్కడక్కడా పొందుపరుచుటకు అనుమతించిన శ్రీ బాపుగారి కుటుంబ సభ్యులకు ప్రత్యేకంగా ధన్యవాదాలు తెలియజేస్తున్నాను.

ఈ సరళవ్యాఖ్యాన గ్రంథం ఎనిమిది సంపుటాలుగా, ఆ యా పుటల్లో అక్కడక్కడ ప్రముఖ చిత్రకారులు బాపుగారి బొమ్మల మెరుపులతో సర్వాంగసుందరంగా, శ్రీ హేమలంబి నామసంవత్సరం తెలుగు ఉగాదినాడు తెలుగువారందరికి శ్రీ తిరుమలేశుడు అనుగ్రహిస్తున్న ప్రసాదంగా స్వీకరించగలరని ఆకాంక్షిస్తూ...

*సదా శ్రీవారి సేవలో...*

**కార్యనిర్వహణాధికారి**

తిరుమల తిరుపతి దేవస్థానములు

తిరుపతి

శ్రీరస్తు

# బమ్మెర పోతనామాత్య ప్రణీత శ్రీమహాభాగవత ప్రాజెక్టు
# పుట్టుపూర్వోత్తరాలు

**వేదకల్పవృక్షవిగళితమై శుక**
**ముఖసుధాద్రవమున మొనసియున్న,**
**భాగవతపురాణఫలరసాస్వాదన**
**పదవి గనుడు రసికభావవిదులు.**

అని భాగవత రచనకు ఉపక్రమించిన సహజకవి పోతనామాత్యుడు భాగవతప్రాశస్త్యాన్ని ఉగ్గడించాడు.

వాల్మీకి విరచితమైన ఆదికావ్యం రామాయణం. "వేదః ప్రాచేతసాదాసీత్ సాక్షా ద్రామాయణాత్మనా" అన్నట్లు వేదానికి మారురూపంగా అది ప్రసిద్ధి పొందింది. వ్యాసవిరచితమహాభారతాన్ని పంచమవేదంగా (భారతం పంచమో వేదః) భావిస్తారు. సనాతనధర్మానికి అనల్పమైన వ్యాప్తిని గావించిన ఈ మూడుగ్రంథాలు భారతీయ సాహిత్యంలో సాటిలేని మేటిరచనలుగా ప్రసిద్ధి పొందాయి.

తిరుమల తిరుపతి దేవస్థానం హిందూ ధర్మ ప్రచారంకోసం ఆధ్యాత్మికగ్రంథాలను పెద్ద ఎత్తున ప్రచురిస్తోంది. దేశంలో మరే ఇతరదేవస్థానం కూడా ధర్మప్రచారంకోసం గ్రంథముద్రణను ఇంత పెద్ద ఎత్తున చెయ్యడం లేదని చెప్పడం అతిశయోక్తి కాదు. వేదార్థాలను ప్రతిపాదించే వాఙ్మయాన్ని వివిధ భాషల్లో ప్రచురించి ప్రచారం చేయడం తిరుమల తిరుపతి దేవస్థానం తన బాధ్యతగా స్వీకరించింది. అనేకభాషల్లో దేవస్థానం ద్వారా వెలువడుతున్న ధార్మికగ్రంథాలలో రామాయణ, భారత, భాగవతాలు మిక్కిలి ప్రధానమైనవని ప్రత్యేకించి చెప్పనవసరం లేదు.

1982లో జరిగిన భక్తకవి పోతన పంచశతాబ్ది జయంతి ఉత్సవాలలో పోతన భాగవతాన్ని తాత్పర్యంతో ముద్రించాలని దేవస్థానం సంకల్పించింది. **కరుణశ్రీ జంధ్యాలపాపయ్యశాస్త్రి** గారి నేతృత్వంలో 15 మంది పండితులు పోతనభాగవతానికి తాత్పర్యాన్ని సమకూర్చారు. తొలిసారిగా 1987లో తాత్పర్యసహిత పోతన భాగవతాన్ని తిరుమల తిరుపతి దేవస్థానం పాఠకలోకానికి అందించింది.

కవిత్రయవిరచితమహాభారతానికి ప్రసిద్ధపండితులచేత ప్రతిపదార్థతాత్పర్యవిశేషవివరణలు వ్రాయించి ప్రచురించాలన్న సంకల్పం 1983లో తిరుమల తిరుపతి దేవస్థానానికి కలిగింది. ముప్పైమంది పండితులు ఈ పద్ధతిలో భారతానికి వ్యాఖ్యానం రచించారు. 2005వ సంవత్సరంలో మహాభారతం సంపూర్ణంగా సవ్యాఖ్యానంగా వెలువడింది.

ప్రతిపదార్థ, తాత్పర్య, విశేషవ్యాఖ్యానాలతో కవిత్రయభారతం, తాత్పర్యసహితభాగవతం తిరుమల తిరుపతి దేవస్థానముల ప్రచురణలలో అగ్రశ్రేణికి చెందినవిగా రూపొంది అతివిస్తృతమైన ప్రజాదరణకు పాత్రమైనాయి. వేలకొలది ప్రతులు భక్తులకు, పాఠకులకు అందుతున్నాయి.

1981లో డా॥ పన్నాల రాధాకృష్ణశర్మగారి నేతృత్వంలో వ్యాసవిరచితసంస్కృతభాగవతాన్ని ద్వైత, అద్వైత, విశిష్టాద్వైత సిద్ధాంతాలను సమన్వయించే మూడువ్యాఖ్యానాలతో పరిష్కరించి ప్రచురించాలని దేవస్థానం నిర్ణయించింది. ఆ నిర్ణయం మేరకు భాగవతం ప్రాజెక్టు ఏర్పాటైంది. **డా॥ రాధాకృష్ణశర్మ, డా॥ ఎన్.సి.వి.నరసింహాచార్యులు, శ్రీ మల్లంపల్లి శరభేశ్వరశర్మ, డా॥ సముద్రాల లక్ష్మణయ్య** గార్ల నేతృత్వంలో శ్రీధరీయం (అద్వైతం), వీరరాఘవీయం (విశిష్టాద్వైతం), విజయధ్వజీయం (ద్వైతం) అన్న మూడువ్యాఖ్యానాలతో సమగ్రంగా 14 బృహత్ సంపుటాలుగా 2006 నాటికి భాగవతం సిద్ధమయింది.

ఈ పరిష్కరణ కార్యక్రమం ముగియగానే పురాణ ఇతిహాస ప్రాజెక్టు ప్రత్యేకాధికారి **డా॥ సముద్రాల లక్ష్మణయ్య** నాటి తితిదే శ్రీకార్యనిర్వహణాధికారి **శ్రీ ఎ.పి.వి.ఎన్. శర్మ** ఐ.ఏ.ఎస్., గారి వద్దకు వెళ్ళి వ్యాసభాగవత పరిష్కరణ పూర్తి అయిందని విన్నవించారు. అప్పుడు కార్యనిర్వహణాధికారిగారు ఎంతో సంతోషించి "పోతన భాగవతాన్ని తాత్పర్యంతో మాత్రమే ముద్రించగలిగాం. తెలుగు ప్రజలందరికీ ఎంతో ప్రియమైన భాగవతాన్ని కూడా అర్థ తాత్పర్య వివరణలతో సిద్ధం చేస్తే బాగుంటుంది. ఇందుకు తగిన ప్రతిపాదనలను సిద్ధం చెయ్యండి" అని నిర్దేశించారు.

ఈ బృహత్కార్యక్రమం భాగవతప్రాజెక్టుద్వారా కాకుండా కవిత్రయ మహాభారతానికి వ్యాఖ్యానం సమకూర్చడంలో అనుభవం గడించిన సప్తగిరి సంపాదక కార్యాలయం ద్వారానే నిర్వహించడం సముచితంగా ఉంటుందని తెలుపుతూ **డా॥ సముద్రాల లక్ష్మణయ్య** వ్యాఖ్యాన రచనకు అవసరమైన ప్రతిపాదనలను సిద్ధం చేసి కార్యనిర్వహణాధికారివారికి పంపగా వారు ఆమోదించారు.

**డా॥ సముద్రాల లక్ష్మణయ్యగారి ప్రతిపాదనలో సారాంశం**

- వ్యాఖ్య సామాన్యులకు కూడా అర్థమయ్యే తీరులో ఉండాలి.
- శిష్టవ్యావహారికభాషను ప్రయోగించాలి.
- వ్యాకరణాదివిశేషాలకు ఎక్కువ ప్రాధాన్యం ఉండరాదు.
- ఆధ్యాత్మిక అంశాలను పరిమితంగా విశేషాంశాలలో చెప్పవచ్చు.
- కార్యనిర్వహణాధికారి వారి అధ్యక్షతన తితిదే ప్రజాసంబంధాధికారి, సప్తగిరి ప్రధాన సంపాదకులు, తితిదే స్థానిక పండితులతో ఒక సంఘాన్ని ఏర్పాటుచేసి వ్యాఖ్యాతలను, సంపాదకమండలిని ఎన్నుకోవాలి.

- వ్యాఖ్యాత లందరితో తిరుపతిలో ఒక కార్యశాలను నిర్వహించి అందరి వ్యాఖ్యానం ఒకే విధంగా ఉండేలా చూడాలి.
- ఇంతకు మునుపు తితిదే ముద్రించిన తాత్పర్యసహిత భాగవతానికి తాత్పర్యం వ్రాసిన పండితులలో సమర్థులైనవారిని ఈ కార్యక్రమంలో వినియోగించుకోవచ్చు.

2007లో కార్యనిర్వహణాధికారి **డా॥ కె.వి.రమణాచారి** ఐ.ఏ.ఎస్., గారి ఆమోదంమేరకు నాటి సప్తగిరి సంపాదకులు **డా॥ సి.శైలకుమార్**, భాగవత ప్రాజెక్టు ప్రధానసంపాదకులుగా **విద్వాన్ ముదివర్తి కొండమాచార్యులు** గారిని నియమించారు. ఆ తరువాత ఈ బృహత్కార్యాచరణకు సలహాలు, సూచనలు చేసేందుకు కవిత్రయభారత వ్యాఖ్యాననిర్వహణలాగే తొమ్మిదిమందితో కూడిన సలహామండలిని ఏర్పాటు చేశారు. దీనికి తితిదే కార్యనిర్వహణాధికారి గౌరవ సంపాదకులుగా వ్యవహరించారు.

**సలహామండలి**

| | | |
|---|---|---|
| **శ్రీ కార్యనిర్వహణాధికారి** | - | **గౌరవ సంపాదకులు** |
| **శ్రీ ముదివర్తి కొండమాచార్యులు, తిరుపతి** | - | **ప్రధాన సంపాదకులు** |
| **డా॥ సముద్రాల లక్ష్మణయ్య, తిరుపతి** | - | **సభ్యులు** |
| **డా॥ దేవళ్ళ చిన్నికృష్ణయ్య, మద్రాసు** | - | **సభ్యులు** |
| **డా॥ శలాక రఘునాథశర్మ, రాజమండ్రి** | - | **సభ్యులు** |
| **ధర్మప్రచార పరిషత్ కార్యదర్శి** | - | **పదవీ నిమిత్త సభ్యులు** |
| **సప్తగిరి సంపాదకుడు** | - | **సి. శైలకుమార్, కన్వీనర్** |
| **తితిదే ప్రజాసంబంధాధికారి** | - | **విశేష ఆహ్వానితులు** |
| **తితిదే ప్రెస్ మేనేజర్** | - | **విశేష ఆహ్వానితులు** |

ఈ సంపాదక మండలిలోని పండితవర్గమైన **విద్వాన్ ముదివర్తి కొండమాచార్యులు, డా॥ సముద్రాల లక్ష్మణయ్య, డా॥ దేవళ్ళ చిన్నికృష్ణయ్య, డా॥ శలాక రఘునాథశర్మ** గార్లతో ప్రధాన సంపాదకమండలిని నెలకొల్పారు. ఆ తరువాత కారణాంతరాలవల్ల **డా॥ దేవళ్ళ చిన్నికృష్ణయ్య** గారి స్థానంలో **డా॥ అప్పజోడు వేంకటసుబ్బయ్య** గారు సంపాదక మండలి సభ్యులుగా నియమితులయ్యారు. ఈ ప్రధాన సంపాదక మండలివారు భాగవత

వ్యాఖ్యాన రచనకు ముప్పైమంది పండితులను ఎంపికచేసి ఒక్కొక్కరికి 300 – 350 పద్యగద్యాలకు వ్యాఖ్యాన రచనా బాధ్యతలను అప్పగించారు.

ఆ తరువాత అనుకున్నంత వేగంగా ఈ కార్యక్రమం ముందుకు సాగలేదు.

తిరుమల తిరుపతి దేవస్థానముల ప్రచురణలను, సవ్యాఖ్యాన భాగవతాన్ని త్వరితగతిన వ్యాప్తిలోకి తేవాలన్న ఉద్దేశ్యంతో 2011లో ద్రవిడ విశ్వవిద్యాలయ విశ్రాంత ఉపకులపతి **ఆచార్య రవ్వా శ్రీహరి**గారిని ప్రచురణల విభాగానికి ఎడిటర్–ఇన్–చీఫ్‌గా నియమిస్తూ వీరికి సహాయకులుగా **డా॥ నొస్సం నరసింహాచార్య, శ్రీమతి మొలకా ఉత్తరఫల్గుణి** గార్లను ప్రచురణల విభాగానికి ఉపసంపాదకులుగా నియమించారు. అలాగే **విద్వాన్ ముదివర్తి కొండమాచార్యులు, శ్రీ జూలకంటి బాలసుబ్రహ్మణ్యం** గార్లు కన్సల్టెంట్‌లుగా నియమితులయ్యారు.

అప్పటిదాకా మందకొడిగా సాగుతున్న ప్రచురణ కార్యక్రమంతోపాటు వ్యాఖ్యాన రచనా కార్యక్రమం కూడా **ఆచార్య రవ్వా శ్రీహరి** గారి సారథ్యంలో వేగాన్ని పుంజుకున్నది. వ్యాఖ్యాన రచయితలతో నిరంతరం ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపుతూ రాయలేమని తెలిపిన వారి భాగాలను వేరే పండితులకు అప్పగిస్తూ 2013నాటికి దాదాపు పండితులందరినుండి భాగవత వ్యాఖ్యానాలను తెప్పించారు. వెనువెంటనే డి.టి.పి. వగైరా పనులుకూడా ముమ్మరంగా సాగాయి. పుటల సంఖ్య ఆధారంగా 12 స్కంధాల భాగవతాన్ని 8 సంపుటాలుగా ముద్రించేందుకు ప్రణాళికలు సిద్ధం చేశారు.

**ఆచార్య రవ్వా శ్రీహరి**గారి తదనంతరం 2014లో ఎడిటర్–ఇన్–చీఫ్‌గా బాధ్యతలు చేపట్టిన పురాణ ఇతిహాస ప్రాజక్టు ప్రత్యేకాధికారి **డా॥ సముద్రాల లక్ష్మణయ్య** ఈ కార్యక్రమాన్ని మరింత వేగవంతం చేశారు. వ్యాఖ్యాన రచనలను పరిష్కరించడానికి, అక్షర దోషాలను తొలగించడానికి మరి కొందరు పండితులు అవసరం కావడంతో అప్పటికే భాగవతం కన్సల్టెంటుగా ఉన్న **డా॥ గల్లా చలపతి** గారితోపాటుగా **డా॥ ముదివేడు ప్రభాకరరావు, శ్రీ వైద్యం వేంకటేశ్వరాచార్యులు, శ్రీ కట్టా నరసింహులు** గార్లు భాగవతం ప్రాజెక్టు కన్సల్టెంట్‌లుగా నియమితులయ్యారు. భాగవత స్కంధాలను సంపాదకమండలి పరిష్కరణ స్థాయికి వీరు తీసుకువచ్చారు. 2015 ఏప్రిల్ 15వ తేదీన తితిదే కార్యనిర్వహణాధికారి **డా॥ డి.సాంబశివరావు** ఐ.ఏ.ఎస్., మరియు సంయుక్త కార్యనిర్వహణాధికారి (తిరుపతి) **శ్రీ పోల భాస్కర్** ఐ.ఏ.ఎస్., గార్ల ఆధ్వర్యంలో

**విద్వాన్ ముదివర్తి కొండమాచార్యులు**

**డా॥ సముద్రాల లక్ష్మణయ్య**

**డా॥ శలాక రఘునాథశర్మ**

**డా॥ అప్పజోడు వేంకటసుబ్బయ్య**గార్లతో కూడిన పోతనభాగవత సంపాదకమండలి తొలి సమావేశం జరిగింది. త్వరితగతిన పరిష్కరణ పూర్తిచేసేందుకు గాను అనుసరించాల్సిన ప్రణాళికను ఈ సమావేశంలో సిద్ధం

చేశారు. ఆ తరువాత **డా॥ సముద్రాల లక్ష్మణయ్య** గారి సంయోజకత్వంలో జరిగిన సంపాదక మండలి సమావేశాలలో మూడుస్కంధాల పరిష్కరణ పూర్తిచేసి ముద్రణార్హమైన ప్రతిని సిద్ధం చేశారు. అనివార్యకారణాలవల్ల సంపాదకమండలిలో కొందరు సభ్యులు తదుపరి సమావేశాలకు హాజరు కాలేకపోయారు.

2016లో ప్రచురణల విభాగానికి **శ్రీ ప్రయాగ రామకృష్ణ**గారు ప్రత్యేకాధికారిగా నియమితులయ్యారు. కార్యనిర్వహణాధికారి గారి అమోదం మేరకు వీరు భాగవత పరిష్కరణ కార్యక్రమం త్వరితగతిన పూర్తికావడానికి అంతకు మునుపున్న సంపాదకమండలి స్థానంలో

**డా॥ సముద్రాల లక్ష్మణయ్య (ప్రధాన సంపాదకులు)**

**శ్రీ గరిమెళ్ళ అచ్యుత సత్య శేషగిరి సోమయాజి శర్మ**

**డా॥ తిప్పాభట్ల రామకృష్ణమూర్తి**

**డా॥ మల్లాప్రగడ శ్రీమన్నారాయణమూర్తి**

**డా॥ ధూళిపాళ రామకృష్ణ**

**డా॥ పమిడికాల్వ చెంచుసుబ్బయ్య**

**డా॥ కసిరెడ్డి వెంకటరెడ్డి**

**డా॥ కె.వి. సుందరాచార్యులు**

**డా॥ కొంపెల్ల రామసూర్యనారాయణ**గార్లతో కొత్త సంపాదకమండలిని ఏర్పాటుచేశారు. అప్పటినుంచి వ్యాఖ్యాన పరిష్కరణ కార్యక్రమం వేగవంతం అయింది. కాగా 2017 ఉగాదినాటికి సవ్యాఖ్యాన భాగవతం ముద్రించబడి ప్రజలకు అందుబాటులోకి రావాలన్న తితిదే సంకల్పాన్ని అనుసరించి పరిష్కరణ కార్యక్రమాన్ని మరింత త్వరగా పూర్తి చేసేందుకుగాను కార్యనిర్వహణాధికారి వారి ఆమోదంమేరకు

**డా॥ నిట్టల సుబ్రహ్మణ్యేశ్వర శాస్త్రి**

**డా॥ మరడాన శ్రీనివాసరావు**

**డా॥ గల్లా చలపతి** గార్లకు సంపాదకమండలిలో స్థానం కల్పించారు. 2016 సెప్టెంబరునుండి పండితులందరితో ప్రతినెలా దాదాపు 20 రోజులపాటు తిరుపతి శ్వేత సమావేశ మందిరంలో సమావేశాలు ఏర్పాటుచేసి పండితులందరి ఆమోదంమేరకు పరిష్కరణ కార్యక్రమాన్ని విజయవంతంగా ముగించి శుద్ధప్రతిని ముద్రణకు పంపేందుకు సిద్ధం చేశారు. ఇలా అనుకున్న సమయానికి శ్రీమహాభాగవతాన్ని ప్రకటించగలిగినందుకు సంతోషిస్తున్నాము.

సామాన్య పాఠకులను దృష్టిలో ఉంచుకుని వ్యాఖ్యానం సరళంగా ఉండాలన్న కార్యనిర్వహణాధికారి, సంయుక్త కార్యనిర్వహణాధికారిగార్ల సూచనలమేరకు వ్యాఖ్యాన రచనలో విస్తృతంగా విశేషాలను వ్రాసిన పండితుల రచనల్లోంచి సంపాదకమండలి సూచనల ప్రకారం అవసరమైన మేరకు మాత్రమే విశేషాలను స్వీకరించడమయింది.

**కృతజ్ఞతలు**

ఈ ప్రణాళిక ఫలప్రదం కావడానికి ఆధికారికమైన ఆమోదాన్ని అందజేసిన తిరుమల తిరుపతి దేవస్థానముల పాలకమండలి అధ్యక్షులకు మరియు పాలకమండలి సభ్యులందరికీ కృతజ్ఞతలు.

లోగడ తితిదేవస్థానం కార్యనిర్వహణాధికారిగా ఉండి భాగవత ప్రాజెక్టు ప్రారంభానికి కారకులైన **శ్రీ ఎ.పి.వి.ఎన్.శర్మ** ఐ.ఏ.ఎస్., గారికి హృదయపూర్వక ధన్యవాదాలు. అదే పరంపరలో తితిదే కార్యనిర్వహణాధికారులుగా బాధ్యతలు నిర్వహించి భాగవత ప్రాజెక్టుకు సంపూర్ణ సహకారాన్ని అందించిన **డా॥ కె.వి.రమణాచార్య** ఐ.ఏ.ఎస్., **శ్రీ ఐ.వై.ఆర్.కృష్ణారావు** ఐ.ఏ.ఎస్., **శ్రీ ఎల్.వి.సుబ్రహ్మణ్యం** ఐ.ఏ.ఎస్., **శ్రీ ఎమ్.జి.గోపాల్** ఐ.ఏ.ఎస్., గార్లకు హృదయపూర్వక ధన్యవాదాలు.

పోతనభాగవతం ముద్రణదశకు చేరుకునేందుకు తగిన సూచనలు, సలహాలు ఇచ్చిన సలహామండలి సభ్యులందరికీ ప్రత్యేక ధన్యవాదాలు.

సవ్యాఖ్యాన భాగవత ప్రచురణలో ఆసక్తిని కనబరుస్తూ అన్నివిధాలా అందుకు తగిన ప్రోత్సాహాన్ని అందజేసిన గౌరవ శ్రీ కార్యనిర్వహణాధికారి **డా॥ డి.సాంబశివరావు** ఐ.ఏ.ఎస్., గారికి, సంయుక్త కార్యనిర్వహణాధికారి **శ్రీ పోల భాస్కర్** ఐ.ఏ.ఎస్., గారికి మా హృదయపూర్వక నమోవాకాలు.

భాగవత వ్యాఖ్యాన రచనకు అవసరమైన పండితులను ఎన్నుకొని వారికి వ్యాఖ్యాన బాధ్యతలను అప్పగించడంలో కృషిచేసిన నాటి సప్తగిరి ప్రధాన సంపాదకులు **డా॥ సి.శైలకుమార్** గారికి, సంపాదకులు **డా॥ కె.రాధారమణ** (ప్రస్తుత ప్రధాన సంపాదకులు) గార్లకు కృతజ్ఞతలు.

వ్యాఖ్యాతలందరినుండి వ్యాఖ్యాన భాగాలను రప్పించడంలో శ్రమించి, విశేష కృషిచేసిన నాటి ప్రచురణల విభాగం అధికారి **ఆచార్య రవ్వా శ్రీహరి** గారికి, పరిష్కరణ కార్యక్రమాన్ని వేగవంతంచేసిన తదుపరి అధికారి **డా॥ సముద్రాల లక్ష్మణయ్య** గారికి, కృతజ్ఞతాపూర్వక నమస్కృతులు.

పోతన భాగవత పరిష్కరణలో తమ అమూల్య సహాయసహకారాలనందించి శుద్ధప్రతిని తయారు చేయడంలో సహకరించిన **పోతన భాగవత సంపాదకమండలి సభ్యులందరికీ** పేరుపేరునా ధన్యవాదాలు.

ఈ కార్యక్రమంలో చేదోడువాదోడుగా ఉంటూ అన్నివిధాలా సంపూర్ణ సహాయ సహకారాలందించిన ప్రచురణల విభాగ ఉపసంపాదకులు **డా॥ నొస్సం నరసింహాచార్య** గారికి, పరిష్కరణ, అక్షరదోష సవరణల్లో సహకరించిన కార్యాలయ పండితులు **విద్వాన్ ముదివర్తి కొండమాచార్యులు, శ్రీ జూలకంటి బాలసుబ్రహ్మణ్యం, డా॥ గల్లా చలపతి, డా॥ ముదివేడు ప్రభాకరరావు, శ్రీ వైద్యం వేంకటేశ్వరాచార్యులు, శ్రీ కట్టా నరసింహులు**గార్లకు, ప్రచురణల విభాగంలో కొంతకాలం ఉపసంపాదకురాలుగా పనిచేసి భాగవత పరిశీలనా కార్యక్రమంలో సహకరించిన **శ్రీమతి మొలకా ఉత్తరఫల్గుణి** గారికి నా ప్రత్యేక ధన్యవాదాలు.

సవ్యాఖ్యాన పోతన భాగవత ముద్రణకు సంబంధించిన దస్త్రాలను నడపడంలోను, సంపాదకమండలి సమావేశాలను ఏర్పాటు చేయడంలోను సహకరించిన **ప్రచురణల విభాగ కార్యాలయ సిబ్బందికి** నా ధన్యవాదాలు.

సవ్యాఖ్యాన పోతన భాగవతం ఎనిమిది సంపుటాలలో చివరన ముద్రించిన అకారాదిక్రమ పద్యగద్య సూచికను తయారు చేయడంలో సహకరించిన **శ్రీ వాడపల్లి శేషతల్పశాయి** (ఆంధ్రభారతి.కామ్) గారికి మా కృతజ్ఞతలు.

ఈ పుస్తకాలను అందంగా డి.టి.పి. చేసి చక్కటి వర్ణచిత్రాలతో సర్వాంగ సుందరంగా తీర్చిదిద్దడంలో సహకరించిన ప్రచురణల విభాగ కార్యాలయ డి.టి.పి. సిబ్బంది **శ్రీమతి ఎమ్.సుబ్బరత్నమ్మ, శ్రీమతి జె.కరుణ, కుమారి ఎమ్.మానస, శ్రీ ఎమ్.రెడ్డిప్రసాద్** గార్లకు ధన్యవాదాలు.

ఈ గ్రంథంలో ప్రసిద్ధ చిత్రకారులు బాపుగారి అద్భుత వర్ణచిత్రాలను ముద్రించేందుకు అనుమతించిన బాపుగారి కుటుంబసభ్యులకు మా ప్రత్యేకధన్యవాదాలు.

తక్కువ వ్యవధిలో గ్రంథ ముద్రణను పూర్తిచేసి పాఠకులకు అందించేందుకు తోడ్పడిన టిటిడి ముద్రణాలయ ఉపకార్యనిర్వహణాధికారి **శ్రీమతి ఎమ్.గౌతమి** గారికీ, వారి సిబ్బందికీ మా హృదయపూర్వక ధన్యవాదాలు.

***సదా శ్రీవారి సేవలో...***

**ప్రయాగ రామకృష్ణ**
కన్వీనర్
ప్రత్యేకాధికారి, ప్రచురణల విభాగం
తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

బమ్మెర పోతనామాత్యప్రణీత

# శ్రీమహాభాగవతము

| వ్యాఖ్యాతలు | స్కంధాలు |
|---|---|
| 1) డా॥ కేసాప్రగడ సత్యనారాయణ | ప్రథమస్కంధము (1-275) |
| 2) డా॥ మల్లెల గురవయ్య | ప్రథమస్కంధము (276-529) |
| 3) డా॥ సముద్రాల లక్ష్మణయ్య | ద్వితీయస్కంధము (1-288) |
| 4) డా॥ కడిమిళ్ళ వరప్రసాద్ | తృతీయస్కంధము (1-388) |
| 5) డా॥ కసిరెడ్డి వెంకటపతిరెడ్డి | తృతీయస్కంధము (389-717) |
| 6) డా॥ గల్లా చలపతి | తృతీయస్కంధము (718-887) |
| 7) డా॥ కసిరెడ్డి వెంకటపతిరెడ్డి | తృతీయస్కంధము (888-1055) |
| 8) డా॥ దావులూరి కృష్ణకుమారి | చతుర్థస్కంధము (1-322) |
| 9) డా॥ ఆర్. అనంతపద్మనాభరావు | చతుర్థస్కంధము (323-636) |
| 10) డా॥ శలాక రఘునాథశర్మ | చతుర్థస్కంధము (637-977) |
| 11) డా॥ కె. సర్వోత్తమరావు | పంచమస్కంధము<br>ప్రథమాశ్వాసము (1-183)<br>ద్వితీయాశ్వాసము (1-167) |
| 12) శ్రీ జోస్యుల సూర్యప్రకాశరావు | షష్ఠస్కంధము (1-251) |
| 13) డా॥ కొంపెల్ల రామసూర్యనారాయణ | షష్ఠస్కంధము (252-346) |
| 14) డా॥ ఆకురాతి పున్నారావు | షష్ఠస్కంధము (347-440) |
| 15) శ్రీ కోట వేంకట లక్ష్మీనరసింహం | షష్ఠస్కంధము (441-530) |
| 16) డా॥ ఆకెళ్ళ విభీషణశర్మ | సప్తమస్కంధము (1-186) |

| | |
|---|---|
| 17) డా॥ ఆకురాతి పున్నారావు | సప్తమస్కంధము (187-482) |
| 18) డా॥ హెచ్.ఎస్. బ్రహ్మానంద | అష్టమస్కంధము (1-391) |
| 19) శ్రీ వైద్యం వేంకటేశ్వరాచార్యులు | అష్టమస్కంధము (392-744) |
| 20) డా॥ డి. మీరాస్వామి | నవమస్కంధము (1-364) |
| 21) శ్రీ కోట వేంకట లక్ష్మీనరసింహం | నవమస్కంధము (365-737) |
| 22) డా॥ అప్పజోడు వేంకటసుబ్బయ్య | దశమస్కంధము పూర్వభాగము (1-288) |
| 23) డా॥ ఎ.ఎస్. గోపాలరావు | దశమస్కంధము పూర్వభాగము (289-610) |
| 24) శ్రీ ప్రభల సుబ్రహ్మణ్యశర్మ | దశమస్కంధము పూర్వభాగము (611-912) |
| 25) డా॥ పి. నరసింహారెడ్డి | దశమస్కంధము పూర్వభాగము (913-1188) |
| 26) విద్వాన్ ముదివర్తి కొండమాచార్యులు | దశమస్కంధము పూర్వభాగము (1189-1485) |
| 27) డా॥ పి.ఆర్. హరినాథ్ | దశమస్కంధము పూర్వభాగము (1486-1792) |
| 28) డా॥ నాగళ్ళ గురుప్రసాదరావు | దశమస్కంధము ఉత్తరభాగము (1-245) |
| 29) డా॥ ఎన్.వి.ఎస్. రామారావు | దశమస్కంధము ఉత్తరభాగము (246-537) |
| 30) డా॥ కె. మలయవాసిని | దశమస్కంధము ఉత్తరభాగము (538-764) |
| 31) డా॥ కె.జె. కృష్ణమూర్తి | దశమస్కంధము ఉత్తరభాగము (765-1033) |
| 32) డా॥ సంగనభట్ల నరసయ్య | దశమస్కంధము ఉత్తరభాగము (1034-1343) |
| 33) డా॥ గల్లా చలపతి | ఏకాదశస్కంధము (1-127) |
| | ద్వాదశస్కంధము (1-54) |

**పోతన భాగవతప్రాజెక్టు కన్సల్టెంట్స్**

శ్రీ జూలకంటి బాలసుబ్రహ్మణ్యం ✻ డా॥ గల్లా చలపతి ✻ డా॥ ముదివేడు ప్రభాకరరావు

శ్రీ వైద్యం వేంకటేశ్వరాచార్యులు ✻ శ్రీ కట్టా నరసింహులు

# సంకేతాక్షర సూచి

| | | | | | |
|---|---|---|---|---|---|
| క. | – | కందం | య. | – | యగణం |
| ఆ. | – | ఆటవెలది | మ. | – | మగణం |
| తే. | – | తేటగీతి | త. | – | తగణం |
| సీ. | – | సీసపద్యం | ర. | – | రగణం |
| ఉ. | – | ఉత్పలమాల | జ. | – | జగణం |
| చ. | – | చంపకమాల | భ. | – | భగణం |
| మత్త. | – | మత్తకోకిల | న. | – | నగణం |
| మ. | – | మత్తేభవిక్రీడితం | స. | – | సగణం |
| శా. | – | శార్దూలవిక్రీడితం | ల. | – | లఘువు |
| శ్లో. | – | శ్లోకం | గ. | – | గురువు |
| వ. | – | వచనం | వ. | – | వగణం |
| అలం. | – | అలంకారం | | | |

| | | |
|---|---|---|
| అవ. | – | అవతారిక |
| తా. | – | తాత్పర్యం |
| ప్రతి. | – | ప్రతిపదార్థం |
| విశే. | – | విశేషార్థం |
| ప్ర.ఆ. | – | ప్రథమాశ్వాసం |
| ద్వి.ఆ. | – | ద్వితీయాశ్వాసం |
| క్రీ.శ. | – | క్రీస్తుశకం |
| సం. | – | సంవత్సరం |
| మొ. | – | మొదలైన |
| ... | – | తరువాతి పద్యం / వచనంతో అన్వయం |



# దశమస్కంధం - పూర్వభాగం

## కథాప్రాశస్త్యం

## ముఖారవింద సౌందర్యం

ప్రస్తావన

క. **ఉరుసంసారపయోనిధి, తరణంబులుఁ బాపపుంజతరణంబులు శ్రీ**
**కరణంబులు ముక్తి సమా, చరణంబులు బాలకృష్ణ సంస్మరణంబుల్.** - భాగవతం (10-1-246)

బాలకృష్ణుని బాల్యక్రీడలు భక్తితో స్మరించేవారికి అవి సంసార సాగరాన్ని దాటించే నావలు, పాపపుంజాలు నశింపజేసేవి, సకల జనులకూ సంపదలను ప్రసాదించేవి, ముముక్షువులకు మోక్షమార్గాన్ని చూపేవి.

శ్లో. **కరారవిందేన పదారవిందం - ముఖారవిందే వినివేశయంతమ్ ।**
**వటస్య పత్రస్య పుటే శయానం - బాలం ముకుందం మనసా స్మరామి ॥** **- శ్రీకృష్ణకర్ణామృతమ్**

బాలముకుందుని చేతులు, పాదాలు, ముఖం - అన్నీ లేత ఎఱుపురంగుగల తామరపూల మెత్తనిదనం గలవి. పసితనంలోని సహజ స్వభావంచే కుడిచేతితో ఎడమ కాలిబొటనవేలిని పైకిలాగి పట్టుకొని నోటిలో చొప్పిస్తూ మర్రి ఆకుపై వెల్లకిలా పవ్వళించిన పరమాత్మ బాలకృష్ణుని మనస్ఫూర్తిగా స్మరిస్తున్నాను.

**భాగవతపురాణం - భగవత్స్వరూపం**

తమాదిదేవం కరుణానిధానమ్ - తమాలవర్ణం సుహితావతారమ్
అపారసంసార సముద్రసేతుమ్ - భజామహే భాగవతస్వరూపమ్

పద్మపురాణంలోని శ్లోకంలో, **ముఖారవిందం దశమః ప్రఫుల్లమ్ ॥** (దశమస్కంధం - ముఖం)

అని చెప్పబడగా గర్గసంహితలో దశమస్కంధం బ్రహ్మరంధ్రమని సంభావింపబడింది. భగవంతుడైన శ్రీకృష్ణునికి భాగవత మహాపురాణానికి అభేద ప్రతిపత్తి. దీనినే **పాదాది కేశాంతస్తవం** అంటారు. భగవంతుని అర్చావిగ్రహాన్ని దర్శిస్తున్నప్పుడు ముందుగా పాదాలపై చూపులు నిల్పి క్రమంగా ఊర్ధ్వముఖంగా దృష్టిని ప్రసరింపజేస్తూ, మోకాళ్లు, నాభి, భుజాలు, కంఠం, ముఖం, లలాటం, శిరస్సు - ఇలా ఒక్కొక్క అవయవ సౌందర్యాన్ని ఆస్వాదించి ఆనందిస్తూ భగవద్దర్శనం చేయాలి. దీనినే **'నఖ శిఖ పర్యంత దర్శనం'** అని అంటారు.

పైన పేర్కొన్న మూడువిధాలైన స్తుతుల్లో ఒక అంశం గమనించాలి. శరీరంలో అన్ని అవయవాలకు సమాన ప్రాధాన్యం ఉన్నట్లే, భాగవతంలో అన్ని స్కంధాలకు సమాన ప్రాధాన్యముంది.

మొదటి రెండు స్తోత్రాలు త్రికరణశుద్ధిని పరోక్షంగా బోధిస్తున్నాయి. భాగవత దశమస్కంధం ప్రత్యేకించి - **'ముఖారవిందం దశమ : ప్రఫుల్లమ్'** - సంపూర్ణంగా వికసించిన పద్మమే స్వామి ముఖం అని చెప్పడం పరమ రమణీయమైన భావన. శ్రీకృష్ణకర్ణామృత శ్లోకంలో సరిగ్గా **'ముఖం అరవింద'** మని చెప్పగా, భాగవత స్వరూప

వివేచన చేసిన మరో రెండు పురాణాలలోనూ **'దశమోముఖ ఉచ్యతే, దశమోముఖమేవచ'** అని దశమస్కంధం ముఖమనే భావాన్నే ప్రతిపాదించాయి. మధుసూదనసరస్వతి వ్రాసిన **వంశీ విభూషిత కరాత్...**అనే శ్లోకంలో **'పూర్ణేందు సుందర ముఖాత్ అరవింద నేత్రాత్ కృష్ణాత్'** అని చెబుతూ పూర్ణేందు సుందర వదనం అరవింద నేత్రం అని వర్ణించారు. పోతనగారు కూడా భాగవతం తొలిపద్యంలోనే మహానందాంగనాడింభకుడైన బాలకృష్ణుని స్తుతించాడు. పోతనకు ఇష్టదైవం బాలకృష్ణుడుగా కనబడుతున్నాడు. భాగవత దశమస్కంధంలో బాలకృష్ణముఖారవింద సౌందర్యమే వ్యాపించి ఉన్నది. తత్త్వాన్ని ఒడిసిపట్టుకోవడం ఎవరికి మాత్రం సాధ్యం!? ఎప్పటికీ, ఎన్నటికీ, ఎవ్వరికీ అంతుచిక్కని ఆ బాలకృష్ణ తత్త్వం అగాధమైంది, అపూర్వమైంది. కాబట్టి, బాలకృష్ణుని బాల్యలీలల్ని గురించి తెలుసుకొని ఆనందించడమే మిగిలింది. మానవ శరీరంలో ముఖానికున్న ప్రాధాన్యం చెప్పనవసరం లేదు. ఇది భాగవతంలో దశమస్కంధానికి గల ప్రాముఖ్యాన్ని స్పష్టీకరిస్తున్నది.

## భాగవతంలో దశమస్కంధ వైశిష్ట్యం

i) **"శ్రుతి, స్మృతీ ఉభే నేత్రే, పురాణం హృదయం స్మృతమ్"** అని దేవీభాగవతపురాణం (XI-1-21). వేదమూ, ధర్మశాస్త్రమూ భగవంతునికి రెండు కళ్లు కాగా, పురాణమే హృదయంగా ఉంది. అప్పుడు మహావిష్ణువుకు భాగవత పురాణంలోని దశమస్కంధం – 'ముఖం' కావడంలో ఆశ్చర్యం లేదు. **పురాణపురుషుని పురాణహృదయం సమగ్రంగా ఆవిష్కృతమైంది భాగవత దశమస్కంధంలోనే.**

ii) భాగవత పురాణంలో మొత్తం 9000 గద్యపద్యాలున్నాయి. ఇందులో దశమస్కంధం పూర్వభాగంలో 1792 గద్యపద్యాలు, ఉత్తరభాగంలో 1337 గద్యపద్యా లున్నాయి. అంటే, పూర్వోత్తర భాగాలు కలిపితే 3129 గద్యపద్యాలు. మొత్తం భాగవతంలోని తొమ్మిదివేల పద్యాల్లో 1/3 భాగం దశమస్కంధమే ఆక్రమించింది.

దశమ – పూర్వోత్తర భాగాల్లోకూడ పూర్వభాగమే పెద్దది. 1792 గద్యపద్యాలు. ఈ విధంగా కథావస్తువిస్తృతియేగాక, మొత్తం భాగవత కథావస్తువులో సింహభాగం స్వాధీనం చేసుకొన్నది. దశమ – పూర్వభాగం రుక్మిణీకల్యాణంతో అంతమౌతూ ఉంది. అందులో రుక్మిణి శ్రీకృష్ణుని **'శ్రీయుతమూర్తి! ఓ పురుషసింహమ!'** అని సంబోధించింది. దశమస్కంధం పూర్వభాగం శ్రీకృష్ణజననంతో ప్రారంభమైంది. స్కంధారంభంలోని సింహకిశోరం రుక్మిణీకల్యాణ ఘట్టానికి 'పురుషసింహు'డైనాడు. కాబట్టి, దశమస్కంధ పూర్వభాగమే భాగవతపురాణంలో పెద్ద కథాభాగం.

iii) సంఖ్యాశాస్త్ర ప్రకారంగా చూస్తే సంఖ్యలు తొమ్మిదే. 'పది' అనే సంఖ్య వ్రాయడానికి భారతీయులు సున్న కనిపెట్టారు గనుక '1' ప్రక్క '0' చేర్చినప్పుడు 'పది' అయింది. అలా గణితశాస్త్రం పురోగమించింది. 'పది' అనే సంఖ్యలో 1 అనే అంకెకంటే సున్నకే ప్రాధాన్యమెక్కువ. లేకుంటే కేవలం 'ఒకటి' 'ఒకటి' గానే మిగిలిపోతుంది.

iv) తాత్త్వికపరంగా చూస్తే, 'పది' సంఖ్యలోగల 'ఒకటి' – ఈశ్వరుడైతే, 'సున్న' – మాయ లేదా ప్రకృతి. కాబట్టే, అంకెప్రక్కన సున్న చేరినప్పుడు గణితశాస్త్రం ఎలా పరవళ్లు తొక్కుతూ ముందంజవేసిందో అదే ప్రకారంగా, 'ఒకటి' అనే ఈశ్వరుని ప్రక్కన 'మాయ' అనే సున్న చేరినప్పుడు, 'ఏకం' 'అనేక' మై బహుముఖీనంగా సృష్టి

విస్తరించింది. ఈ 'సున్న' అనేది భారతీయ వేదాంత భావనలో కూడ కీలకమైంది. దీన్ని 'పూర్ణం' లేదా 'సంపూర్ణం' అంటారు. అంటే సంపూర్ణ తత్త్వం. అది రెండు విధాలు 1. జనన మరణ చక్రం, 2. సృష్టితత్త్వం.

మొదటిదానికి, పోతన చెప్పిన - "ఎచ్చటఁ బుట్టెఁ దా నచటి కేగుట నైజము ప్రాణికోటికిన్" అని చెప్పిన వాక్యమూ, రెండవదానికి ఉపనిషత్ శాంతిమంత్రం ఆధారాలు.

**మం॥ పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్ పూర్ణముదచ్యతే ।**
**పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవావశిష్యతే ॥**

అని, శుక్లయజుర్వేదాంతర్గతమైన (ఈశావాస్యాది) ఉపనిషత్తులకు శాంతిమంత్రం. " 'అది' అంటే కనిపించని ఆ 'అనంతం' పూర్ణమైనది. అలాగే కనిపించే 'ఇది' అంటే ఈ అనంతవిశ్వం కూడా పూర్ణమైనదే. కనిపించని ఆ 'పూర్ణం' నుంచి, కనిపించే ఈ 'పూర్ణం' బహిర్గతమౌతోంది. కనుక, 'పూర్ణం' నుండి 'పూర్ణాన్ని' తీసివేసినా చివరికి 'పూర్ణమే' మిగులుతోంది.

అవతారాలలో సంపూర్ణావతారమైన శ్రీకృష్ణావతార తత్త్వం దశమస్కంధంలోనే సంపూర్ణంగా ఆవిష్కృతం కావడంవల్ల భాగవత పురాణంలో దశమస్కంధానికి అత్యధిక ప్రాధాన్యం ఏర్పడింది. పఠన పాఠనాల్లోగాని, పారాయణం చేసేవారికి గాని, తత్త్వాన్వేషకులైనవారికి, ముముక్షుజనులకు ఎంతో ప్రీతిపాత్రమైన స్కంధం భాగవత దశమస్కంధం.

**v) దశమస్కంధం - ఆధ్యాత్మిక సమన్వయం**

'దశమ' శబ్దాన్ని ఆధ్యాత్మికపరంగా వివేచనచేస్తే -

ఎ) **'ద-శమ'** అని రెండుగా వింగడిస్తే, **'దమ' - 'శమ'** అనే రెండు అర్థవంతమైన పదాలుగాను,

బి) **'ద-శ-మ'** అని మూడుగా వింగడిస్తే **దమ - శమ - మోక్ష** అనే మూడు అర్థవంతమైన పదాలుగా సమన్వయమౌతాయి.

**'బృహదారణ్యకోపనిషత్తు' లోని 'ద' కథ**

బృహదారణ్యక ఉపనిషత్తులో ప్రజాపతి 'ద' అనే అక్షరతత్త్వాన్ని తెలుసుకోమని దేవతలు, దానవులు, మానవుల్ని అడిగాడు. వారు లోతుగా వివేచించి -

దేవతలు - **'దమము'** అనీ, దానవులు - **'దయ'** అనీ, మానవులు - **'దానము'** అనీ అర్థం చెప్పారు. వెంటనే ఆకాశంలో ఉరుములు మెఱిసి, ద, ద, ద అని మూడుసార్లు గర్జించింది. ప్రజాపతి సంతోషించి ఆమోదించాడు. ఈనాటి మానవుడు ఈ మూడు గుణాలను నేర్చుకోవలసి ఉంది.

ఆధ్యాత్మిక సాధన చతుష్టయంలో - 1. నిత్యానిత్యవస్తువివేకం 2. ఇహాముత్ర ఫలభోగవిరాగం 3. శమాదిషట్కసంపత్తి 4. ముముక్షుత్వం చెప్పబడినాయి.

ఇందులో **'శమాదిషట్కసంపత్తి'** లో - శమ - దమ - తితిక్ష - ఉపరతి - శ్రద్ధ - సమాధానం అనే ఆరు అంశాలున్నాయి. **శమ-దమా**లను గురించి చూద్దాం.

**దమం :** బాహ్యేంద్రియ నిగ్రహం. కర్మేంద్రియాలను అదుపులో పెట్టుకోవడం. ఇది సాధనలో తొలిమెట్టు.

**శమం :** అంతరింద్రియ నిగ్రహం. జ్ఞానేంద్రియాలను అదుపులో పెట్టుకోవడం. అంటే ఈ దశవిధ ఇంద్రియాలను కదలించే 'మనస్సు'ను సాధన చేత స్వాధీనపరచుకోవడాన్నే **'మనోనిగ్రహం'** అంటారు. **'యోగ శ్చిత్త వృత్తినిరోధః'** అని పాతంజల యోగసూత్రం.

**మోక్షం -** మనోనిగ్రహం సాధించిన సాధకునికి మోక్షం కరతలామలకమౌతుంది.

**సర్వోపాధివినిర్ముక్తం తత్పరత్వేన నిర్మలం - హృషీకేణ హృషీకేశ సేవనం భక్తి రుత్తమా ॥**

అని నారదపాంచరాత్రమ్. శరీరమనే ఉపాధిపై వ్యామోహాన్ని వదలి సకల ఇంద్రియాలతో ఇంద్రియాధీశుడైన విష్ణువును సేవించడమే భక్తి. బాహ్యముఖంగా సృజింపబడిన ఇంద్రియాలను అంతర్ముఖం చేసుకొని యోగసాధనచే ఇంద్రియాలను స్వాధీనపరచుకోవడమే భక్తియోగం. స్థిరభక్తియోగసులభుడు శ్రీమహావిష్ణువు. అంతేకాదు, **తస్యచ వశీకరణే తచ్ఛరణాగతి రేవ** (శ్రీభాష్యమ్ 1-1-1). ఆ మహావిష్ణువును వశీకరింపజేసుకోవడానికి శరణాగతి ఒక్కటే మార్గం. భాగవత దశమస్కంధం భక్తియోగానికి, శరణాగతికి కాణాచి.

**"శమదమకరుణాసంపూర్ణానామ్ । సాధుసమాగమసంకీర్త్యానామ్ ॥"** అని అవధూత శ్రీసదాశివ బ్రహ్మేంద్రులు. శమ, దమ, కరుణాసంపూర్ణులైన సాధువులు, సజ్జనులు, సన్న్యాసుల వల్లనే సమాజం ఉద్ధరింపబడుతుంది. భాగవత దశమస్కంధ పారాయణంవల్ల శమ-దమాలు పొంది సాధకుడు ముముక్షువై మోక్షాన్ని చూరగొంటాడు. అందుకే, ఆదిలోనే మహాకవి పోతన - **'శ్రీకైవల్యపదంబు చేరుటకునై చింతించెదన్"** అని వ్రాస్తూ- **'మహానందాంగనాడింభకుని'** అనుగ్రహంకోసం ప్రార్థించాడు. ఈ మహానందాంగనా డింభకుని సంపూర్ణవృత్తాంతమే దశమస్కంధ కథావస్తువు. జీవులందరూ చిట్టచివరి ఫలమైన మోక్షాన్నే కోరుకొంటారు. శమ, దమాలు పొందిన సాధకుడు మోక్షగామి అవుతున్నాడు. ఇదే దశమస్కంధ రచనాప్రయోజనం. సాధకునికి పారాయణ ఫలం.

**వ్యామోహప్రశమౌషధంమునిమనోవృత్తిప్రవృత్త్యౌషధం - దైత్యేంద్రార్తికరౌషధంత్రిభువనేసంజీవనైకౌషధమ్ ।**
**భక్తాత్యన్తహితౌషధం భవభయప్రధ్వంసనైకౌషధం - శ్రేయః ప్రాప్తి కరౌషధం పిబ మనః శ్రీకృష్ణదివ్యౌషధమ్ ॥**

- కులశేఖర ఆళ్వారుల ముకుందమాలాస్తోత్రమ్ (శ్లో. 32)

"ఓ మనసా! శ్రీకృష్ణనామమనే మహిమగల దివ్యౌషధాన్ని సేవించు. నీలో మోహమనేమహారోగాన్ని నయం చేయడానికీ, ముందుకీ, వెనక్కూలాగే మనస్సును ధ్యానమగ్నం చేయడానికీ, మునులకు మంచిస్ఫూర్తి అందించడానికీ, దుర్మార్గులకు భయం పుట్టించడానికీ ఇదే చక్కనిఔషధం. ముల్లోకాలకు తిరిగి నవచైతన్యం కల్గించడానికీ, భక్తులకు అనంతమైన హితాన్ని చేకూర్చడానికీ ఇదే పరమౌషధం! నిజంగా ఈ ఒక్క ఔషధమే పునర్జన్మ అనే భయాన్ని నశింపజేసి మనిషికి పరమశ్రేయోదాయకమైన మోక్షాన్ని చేకూరుస్తుంది"

**భాగవతం – ఉపక్రమ, ఉపసంహారాల కథాతత్త్వం**

క. **నిగమములు వేయుఁ జదివిన, సుగమంబులు గావు ముక్తిసుభగత్వంబుల్**
**సుగమంబు, భాగవతమను, నిగమంబుఁ బఠింప ముక్తినివసనము బుధా!** – భాగవతం (1–139)

వేయిశాఖలుగా విస్తరించిన వేదాలన్నీ చదివినా మోక్షాన్ని ఎలా సాధించాలనే మార్గం బోధపడదు. అందరికీ సులభంగా అర్థమయ్యే భాగవతమనే వేదాన్ని చదివితే 'ముక్తి' పొందవచ్చు. ఒక్క మాటలో చెబితే 'భాగవతమే వేదం' అని అర్థం. ఇది వేదపురుషుని సంపూర్ణావతారాన్ని ఆవిష్కరించిన కథ.

శ్రీమద్భాగవతానికి మోక్షశాస్త్రమని పేరు. అందులో శ్రవణమాత్రంచేతనే 'ముక్తి' నిచ్చే గ్రంథం భాగవతం. రామాయణ, భారత, భాగవతాలలో ధర్మ–అర్థ–కామ–మోక్షాలనే చతుర్విధ పురుషార్థాలు సమగ్రంగా వివరించి ఉన్నప్పటికీ, ప్రాధాన్యవివక్ష చేత, రామాయణం ధర్మసహితమైన కామాన్నీ, భారతం ధర్మసహితమైన అర్థాన్నీ, భాగవతం అర్థ కామాలను ధర్మసహితంగా సాధించినవాడికి మోక్షమెలా లభిస్తుందో, ఆయా భక్తిమార్గాలను చెప్పే గ్రంథం! అచంచలమైన భక్తి చేతనే ముక్తి సాధ్యమౌతుందని భాగవతం చెప్పింది.

పరీక్షిత్తు ముముక్షువు. ఏడురోజులలో తాను తక్షకుడనే పాముకాటుచే చనిపోతానని స్పష్టంగా తెలిసినవాడు. ఆ మరణం వట్టి మరణం కారాదు. మృత్యుభయంలేని అనాయాసమరణం కావాలి!, అదికూడా పునర్జన్మ లేని మోక్షాన్ని సంపాదించుకోవాలి! ఇది నిజమైన ముముక్షు లక్షణం!

పరీక్షిత్తు, ఏడు రోజుల్లో మోక్షాన్ని సాధించాలనే తీవ్రమైన కాంక్షతో ఉన్నాడు. తనచుట్టూ చేరిన ఋషుల్ని చూచి ఇలా అన్నాడు.

క. **ఏడు దినంబుల ముక్తిం, గూడఁగ నే రీతి వచ్చు గురు సంసార**
**క్రీడన మే క్రియ నెడతెగుఁ, జూడుఁడు మా తండ్రులార! శ్రుతివచనములన్.** – భాగవతం (1–510)

శృంగి శాపవార్త విన్నప్పటినుండి ఏడు రోజులలోనే మోక్షప్రాప్తి పొందాలనే గాఢకాంక్షలో ఉన్నాడు పరీక్షిత్తు. కనుక, **".....సప్తాహంబుల ముక్తి కేగెడు గతిన్ చర్చించి భాషింపరే"** – భాగవతం (1–511)

అన్నాడు. పరీక్షిత్తు లక్ష్యం మోక్షం. దానికి పరమ సాధనం భాగవత శ్రవణం. ఏడు రోజుల్లో మోక్షాన్ని పొందే మార్గాన్ని దయతో అనుగ్రహించండి అని ప్రార్థించాడు.

ఇక్కడ పోతనవాడిన ఉత్తరానందనుండు అనే మాట అత్యంత సాభిప్రాయం. ఉత్తర శబ్దానికి శ్రేష్ఠమని అర్థం. తురీయమైన మోక్షమే పురుషార్థాలలో శ్రేష్ఠం. దానిచే శాశ్వతమైన ఆనందం పొందాలనుకొనేవాడే ఉత్తరానందనుడు అనే అర్థం స్ఫురిస్తూ ఉన్నది.

మునులు రాజుకు వెంటనే ప్రత్యుత్తరం ఇవ్వలేక తమలోతాము చర్చించుకుంటున్నారు. లోకంలో ఒక గురువుగారి గొప్పతనాన్ని గూర్చి శిష్యుడే చెప్పాలి. అదేవిధంగా భగవంతుని గొప్పతనాన్ని గూర్చి భక్తుడు నిరూపించాలి. ఆ క్రమంలోనే భాగవతం అన్ని స్కంధాలలో భక్తుల కథలే విరివిగా ఉండడానికి కారణం, పరీక్షిత్తు అడిగిన మౌలికమైన ప్రశ్నకు సమాధానం.

మరొక ముఖ్యాంశం. సాధారణంగా జిజ్ఞాసువులైన శిష్యులు గురువును వెతుక్కుంటూ వెళ్లడం ఉంది. కానీ, ఒక్కొక్కసారి దానికి భిన్నంగా కూడా ఉంటుంది. ఎట్లంటే ఒక గాఢమైన ఆకాంక్షతో తదేక ధ్యానంతో ఉన్న ముముక్షువైన వాని దగ్గరకు గురువే స్వయంగా రావడం ఉంటుంది. ఇలా రావడం 'దైవయోగం'. భాగవతకథలో పరీక్షిత్తు వద్దకు శ్రీశుకమహర్షియే స్వయంగా వచ్చారు. ఆ సందర్భాన్నే పోతన **దైవయోగంబున** అని సూచించాడు. ఎప్పుడూ ఎవరింటికీ పోని అవధూత శుకుడు పరీక్షిత్తు ఇంటికి రావడం దైవయోగం కాక మరేమి? పరివ్రాజకుడై ఎక్కడిపోతున్నా గోదోహన కాలం మాత్రమే (ఒక ఆవుకు పాలు పిండేంత కాలం) ఉండే శుకమహర్షి ఏడు రోజులు పరీక్షిత్తుకు భాగవతపురాణాన్ని ప్రవచనం చేశాడు. ఇదికూడా దైవయోగమే అని పోతనగారి తీర్పు. పరీక్షిత్తుకూ – శుకునికి దైవమే యోగం (సంయోగం) ఘటింపజేసింది. లేదా శుకమహర్షిలో పరీక్షిత్తును చూడాలనే సంకల్పాన్ని కలిగించి ఆయనను సరియైన సమయంలో అక్కడికి వెళ్లేట్లు చేసింది. రెండు విధాలుగాను ఇది దైవసంకల్పమే అని చెప్పాలి.

భాగవతంలో గురువేకాదు, భగవంతుడే భక్తుని రక్షించడానికి స్వయంగా రావడం ఉంది. ఉదాహరణకు 1.గజేంద్రమోక్షణార్థం విష్ణువే వైకుంఠంనుండి రావడం, 2.ద్రౌపదికి అక్షయవస్త్రాలు అనుగ్రహించడం, 3.అహంభావియైన బలిచక్రవర్తి వద్దకు విష్ణువు వామనుడై వెళ్లి ఆయన గర్వాన్ని అణచడం, 4.ఎప్పుడూ రాముని గురించే ధ్యాసగల రావణుని లంకకు వెళ్లి రాముడు అతణ్ణి సంహరించడం. ఈ సంఘటనలు చూస్తే భగవంతుడు సజ్జనులైన భక్తులను రక్షించి మోక్షమివ్వడమేకాక, దుర్జనులైన వారిని శిక్షించి తనవద్దకు రప్పించుకొంటాడు. ఈ రెండు విషయాలలో ఆయా జీవుల పురాకృత సుకృతులే బలమైన కారణాలుగా పనిచేస్తుంది.

ఇదంతా చూస్తే ఏ విషయంలోనైనా సరే, గాఢమైన అభినివేశం, ఆభిముఖ్యం ఉన్నవాడే క్లిష్టమైన కార్యాన్ని సాధించగలడు. పరీక్షిత్తు అటువంటి గాఢమైన భగవద్భావన కలిగినవాడు కనుక పరమభాగవతుడు. అందుకే మోక్షాన్ని సాధించగలిగాడు.

ఆ. **పరమభాగవతుఁడు పాండవపౌత్త్రుండు, శుకునిభాషణముల శుద్ధబుద్ధి**
**యై విరాజమానుఁడై ముక్తి యగు విష్ణు, పాదమూల మెట్లు వడసె ననఘ!** – భాగవతం (1–444)

వ. **మహాత్మా! విచిత్రయోగనిష్ఠాకలితంబును, విష్ణుచరితలలితంబును, బరమపుణ్యంబును, సకలకల్యాణ గుణగణ్యంబును, భాగవతజనాపేక్షితంబును నైన పారీక్షితభాగవతాఖ్యానంబు వినిపింపు మనిన** – భాగ. (1–445)

విరక్తులై భయరాహిత్యాన్ని కోరేవారు, యోగాన్ని అవలంబించి హరినామ కీర్తన చేయాలని శుకమహర్షి సమాధానం చెప్పాడు (సంస్కృత భాగవతం 1–3)

క. **గోవిందనామకీర్తనఁ, గావించి భయంబు దక్కి ఖట్వాంగధరి**
**త్రీవిభుఁడు చూరగొనియెను, గైవల్యముఁ దొల్లి రెండుగడియలలోనన్.** – భాగవతం (2–11)

ఈ సమాధానమే పరీక్షిత్తుకు మోక్షం తథ్యమనే విశ్వాసాన్ని కల్గించింది.

అవధూతయైన శుకునిచూచి రాజు తన ఆనందాన్ని ఇలా వ్యక్తంచేశాడు.

**మ. అవధూతోత్తమ! మంటినేఁడు నిను డాయం గంటి నీవంటి వి**
**ప్రవరున్ బేర్కొను నంతటన్ భసితమౌ పాపంబు నా బోటికిన్**
**భవదాలోకన భాషణార్చన పదప్రక్షాళన స్పర్శనా**
**ది విధానంబుల ముక్తి చేపడుట చింతింపంగ నాశ్చర్యమే!** – భాగవతం (1–519)

ఇది భాగవత పురాణ ఉపక్రమం.

ఉపసంహారంలోని విషయానికి వస్తే, భయమంటే మరణభయమే. ఆ భయమెట్లాపోతుంది? హరినామ కీర్తనవలన పోతుంది. ఎవరికి? విరక్తులైన వారికి, యోగులకు, వైరాగ్యంతో కూడిన భక్తియోగం మరణభయాన్ని పోగొట్టుతుంది. మరణం వట్టి భయమే. సత్యం కాదు.

గ్రంథ **'ఉపసంహారం'**లో శ్రీశుకులిలా చెప్పారు "ఓ రాజా! చనిపోతాను అన్నది పశుబుద్ధి. దీన్ని జయించు. పుట్టింది నీవు కాదు. కాబట్టి, మరణించేది నీవు కాదు. (సంస్కృత భాగవతం XI-5). పుట్టిందేదో అది మరణిస్తుంది. నీవడిగిన దానికి సమాధానమిది – "కాటువేసే తక్షకుడు, కాటు పడిన శరీరం, దృశ్యమానమౌతున్న లోకం – సర్వమూ ఆత్మస్వరూపమే. ఆత్మకంటే భిన్నమైనవి కావు" అంటూ ఇలా అన్నాడు.

**ఉ. ఏను మృతుండ నౌదు నని యింత భయంబు మనంబులోపలన్**
**మానుము సంభవంబు గల మానవకోట్లకుఁ జావు నిత్య మౌఁ**
**గాన హరిం దలంపు మికఁ గల్గదు జన్మము నీకు ధాత్రిపై**
**మానవనాథ! పొందెదవు మాధవలోక నివాససౌఖ్యముల్.** – భాగవతం (12–25)

"మహర్షీ! అనుగ్రహింపబడినాను. సిద్ధుడనయ్యాను. ఆద్యంతాలులేని శ్రీహరి కథాశ్రవణం చేశాను. మీరు మార్గోపదేశం చేసిన అభయస్వరూపమైన బ్రహ్మ నిర్వాణాన్ని ప్రవేశించాను. తక్షకాది మృత్యువుల వలన నాకిప్పుడు భయం లేదు. ఈశ్వరునిలో మనస్సు నిలిపి ప్రాణాలను విసర్జిస్తాను. జ్ఞాన విజ్ఞాన నిష్ఠచే అజ్ఞానం నశించింది. ఉత్కృష్టమూ భద్రము అయిన ఆత్మపదాన్ని నాకు చూపారు" అని అన్నాడు రాజు.

**ఇవి శ్రీమహాభాగవత పురాణ ఉపక్రమ–ఉపసంహారాలు.** దీన్నిబట్టి మహాభాగవతంలో చెప్పబడింది. 'ఆత్మవిద్య' అని నిశ్చయింపబడుతోంది. అందుకే, భాగవతానికి **'మోక్షశాస్త్రం'** అనే పేరు సార్థకమయ్యింది.

**భాగవతార్థ సమన్వయం**

**భగవతః ఇదం భాగవతమ్:** భగవంతుని గురించి చెప్పేది భాగవతం. సాధుజనుల పరిత్రాణం కోసం, దుష్టజనుల వినాశనం కోసం మళ్లీమళ్లీ భగవంతుడు ఈ లోకంలో అవతరిస్తున్నాడు. మత్స్య, కూర్మ, వరాహాది దశావతారాలే కాదు, యజ్ఞవరాహ, నారద, కపిల, నర, నారాయణాదులతో కూడిన ఏకవింశతి (21) అవతారాలను గురించి కూడా భాగవతం విస్తరించి చెప్పింది. **సరసిన్ బాసిన వేయి కాలువల యోజన్ విష్ణునందైన శ్రీకర నానా ప్రకటావతారము లసంఖ్యాతంబులు** (1–62) అని ప్రథమస్కంధం.

వాసుదేవుడే శ్రీకృష్ణుడు. జ్ఞానం, శక్తి, బలం, ఐశ్వర్యం, వీర్యం, తేజస్సు – అనే ఆరుగుణాలు భగవచ్ఛబ్ద వాచ్యాలు. ఇవి వాసుదేవునిలో ఉంటాయి గనుక ఆయనను షాడ్గుణ్య విగ్రహుడన్నారు. భగవంతుని విశిష్టత్వాన్ని సమగ్రంగా వర్ణించేది శ్రీభాగవతం.

**భాగవతానాం ఇదం భాగవతమ్:** భాగవతులను గురించి చెప్పేది భాగవతం. భాగవతులంటే భగవంతుని భక్తులు. వారి విలక్షణ చరిత్రలు చెప్పేదే భాగవతం. తాము భగవంతుని సొత్తు అని భావించేవారు ఆయన భక్తులు. నారదుడు, ప్రహ్లాదుడు, ధ్రువుడు, గజేంద్రుడు, అంబరీషుడు, అక్రూరుడు, ఉద్ధవుడు, రంతిదేవుడు – ఇలా ఎందరెందరో భాగవతోత్తముల కథలు భాగవతంలో ఉన్నాయి.

**భాగవతస్య ఇదం భాగవతమ్:** ఈ సృష్టి సమస్తం భగవంతుని నుండి ఉద్భవిస్తూ ఉంది. ఆయనలోనే ఉంటున్నది. ఆయనలోనే లీనమైపోతున్నది. అందుచేత ఈ సృష్టే ఒక భాగవతం. భగవంతుని సృష్టి, స్థితి, సంహారాలను సమగ్రంగా వర్ణించేది భాగవతం.

**దశమస్కంధం – పూర్వభాగం – కథావస్తువు వింగడింపు**

పోతనభాగవతం – దశమస్కంధం పూర్వభాగంలోని కథావస్తువును తొమ్మిది విధాలుగా వింగడించవచ్చు.

1. బ్రహ్మాదిదేవతలు దేవకీగర్భస్థుడైన శ్రీకృష్ణుని స్తుతించడం మొదలుకొని, దేవకీవసుదేవుల పూర్వజన్మల వృత్తాంతం వరకు **(శ్రీకృష్ణావతార ఘట్టం)**

2. పూతన వృత్తాంతం మొదలుకొని, వ్రేపల్లెలో జరిగిన ఉలూఖలబంధనం, యమళార్జున భంజనం వరకు. **(బాలకృష్ణ లీలాఘట్టం)**

3. నందాదులు బృందావనానికి వలసపోయిన ఘట్టం మొదలుకొని శ్రీకృష్ణుడు నందుని వరుణలోకం నుండి తీసుకొని రావడం వరకు **(దివ్యభూమికా ఘట్టం)**

4. శరద్రాత్రి ఒంటరిగా అడవిలో మురళీగానం చేస్తున్న కృష్ణుని సన్నిధికి గోపికలు రావడం మొదలుకొని జలక్రీడాభి వర్ణనం వరకు **(గోపికాఘట్టం)** – రాసపంచాధ్యాయి.

5. సర్పరూపియైన సుదర్శనుడనే గంధర్వునిశాపవిమోచనం మొదలుకొని కేశి, వ్యోమాసుర సంహారం వరకు **(బృందావనఘట్టం)**

6. కంసుని పంపున అక్రూరుడు బృందావనానికి రావడం మొదలుకొని కంస సంహారానంతరం దేవకీవసుదేవులను చెఱశాలనుండి విడుదలచేసి, ఉగ్రసేనుని పట్టాభిషేకం వరకు **(మథురాఘట్టం)**

7. శ్రీకృష్ణుడు గోపకాంతలవద్దకు ఉద్ధవుని పంపడం మొదలుకొని ధృతరాష్ట్రునితో హితోపదేశంగా సంభాషించడం వరకు **(భ్రమరగీతికాఘట్టం)**

8. జరాసంధుడు మథురా పట్టణంపై దండెత్తి వచ్చి కృష్ణునితో యుద్ధంచేయడం మొదలుకొని జరాసంధుడు ప్రవర్షణ గిరిని దహించడం వరకు **(జరాసంధఘట్టం)**

9. రుక్మిణీ కళ్యాణకథ ప్రారంభం మొదలుకొని శ్రీకృష్ణుడు రుక్మిణిని పెండ్లి చేసుకొన్నంత వరకు **(రుక్మిణీ కల్యాణ ఘట్టం)**

**అతిరహస్యమైన హరిజన్మ కథనం**

**ఆ.వె. అతిరహస్యమైన హరిజన్మ కథనంబు - మనుజుఁడెవ్వఁడేని మాపురేపుఁ**
**జాలభక్తి తోడఁ జదివిన సంసార - దుఃఖ రాశిఁ బాసి తొలఁగి పోవు (భాగ.1-65)**

పోతన భాగవతంలో కంసుని మరణాన్ని గూర్చిన విషయం ఆకాశవాణి పలికినట్లు లేదు. నారదుడు కంసునితో చెప్పినట్లున్నది. కంసుడెవరో కాదు. దేవదానవ యుద్ధంలో విష్ణుచక్రంచే హతుడైన కాలనేమి అనే రాక్షసుడు. ఇంతలో దేవకీదేవి ఏడవ గర్భం ధరించింది. ఆ సమయంలో విష్ణువు యోగమాయను పిలిచి దేవకీ గర్భంలోని (శేషుని అవతారంగా జన్మించే బలరాముని) శిశువును రోహిణీదేవి గర్భంలో ప్రవేశపెట్టుమని చెప్పాడు. అప్పుడు దేవకికి గర్భస్రావమైందని ప్రజలు భావించారు.

**దేవకి కడుపున దీపించు శేషాఖ్యమైన నా తేజ మీ వమర బుచ్చి**

**ఆ. నేర్పు మెఱసి రోహిణీదేవి కడుపునఁ, జొనుపు, దేవకికిని సుతుఁడ నగుదు**
**నంశభాగయుతుఁడనై, యశోదకు నందు, పొలఁతికందు మీఁదఁ బుట్టె దీవు (10-1-59)**

యోగమాయ దేవకికడుపున నున్న శిశువును రోహిణి గర్భానికి చేర్చింది. తాను యశోదకడుపున నిల్చింది. దేవకికి అష్టమగర్భంలో స్వామి ఆవిర్భవించాడు.

మొదట విష్ణుతేజం వసుదేవునిలో ప్రవేశించింది. ఆ తేజాన్ని దేవకీదేవిలో వసుదేవుడు ప్రవేశపెట్టాడు. స్వామి ఆవిర్భవించిన వెంటనే తన స్వస్వరూపాన్ని చూపి మరలా శిశువయ్యాడు. అక్కడ దేవకీవసుదేవుల మూడు జన్మల వృత్తాంతం చెప్పబడింది.

**1. మొదటిజన్మలో** వసుదేవుడు సుతపుడనే ప్రజాపతి. దేవకీదేవి పృశ్ని అనే పతివ్రత (ఇది స్వాయంభువ మనువు కాలంలో జరిగింది). వీరికి శ్రీహరి 'పృశ్నిగర్భు" డనే పేరుతో జన్మించాడు.

**2. రెండవజన్మలో** వసుదేవుడు కశ్యపప్రజాపతి. దేవకీదేవి అదితి. హరి వీరికి 'వామనుడు' గా పుట్టాడు.

**3. మూడవజన్మలో** దేవకీవసుదేవులకు శ్రీకృష్ణుడుగా జన్మించాడు.

అంతా హరి చెప్పినట్లే జరిగింది. యోగమాయాప్రభావంచే కంసుడు తలక్రిందులయ్యాడు.

**యోగమాయ**

యశోదకు పుట్టిన 'యోగమాయ' స్త్రీ శిశువు. కంసుడు స్త్రీ శిశువునూ వదలిపెట్టక ఆకాశంలో ఎగురవేయగా ఆమె అక్కడే నిల్చింది. అష్టభుజాలతో అష్టాయుధాలతో ప్రకాశిస్తున్న ఆమె ఆదిశక్తి. గద, శంఖం, చక్రం, పద్మం, బాణం, ధనుస్సు, ఖడ్గం, శూలం అనే ఆయుధాలు ఆమె ధరించివుంది.

'యోగమాయ' కు (యోగనిద్ర) శ్రీహరి ఉన్నతస్థానమిచ్చాడు. ఆమెను మానవులు దుర్గ, భద్రకాళి, విజయ, వైష్ణవి, కుముద, చండిక, కృష్ణ, మాధవి, కన్యక, మాయ, నారాయణి, ఈశాన, శారద, అంబిక అనే 14 పేర్లతో లోకంలో వివిధ క్షేత్రాలలో పూజలందుకుంటావని ఈ సందర్భంలో శ్రీహరి చెప్పాడు. (10-1-61). ఇది శాక్తేయ సంప్రదాయంతో అన్వయించుకోవడానికి అవకాశం ఇచ్చింది. అవతారికలో పోతన చేసిన 'దుర్గాస్తుతిలో **దుర్గమాయమ్మ**' అంటూ మహత్వకవిత్వపటుత్వ సంపదలకోసం ఈ 'ముగురమ్మల మూలపుటమ్మ' నే ప్రార్థించాడు.

**బాలకృష్ణలీలలు**

**ఆ.వె. ఏమి నోము ఫలమొ యింత ప్రొద్దొకవార్త వింటి మబలార! వీనులలర**
**మన యశోద చిన్ని మగవానిఁ గనెనఁట, చూచి వత్తమమ్మ! సుదతులార** - (భాగ.10-1-184)

గోపయువతులారా! ఏనాడు నోచిన నోముల ఫలమోగాని, పొద్దున లేస్తూనే ఒక శుభవార్త చెపుతారా విన్నాము. మన యశోదమ్మ చిన్నమగబిడ్డను కన్నదట! చూచివద్దాము రండి, రండి అని కూడబలుక్కొని ఒకరినొకరు నిద్ర లేపుతున్నారు.

ఈ చిన్ని కందపద్యంలో 'మన యశోద' అన్నమాట గ్రామీణులు మాట్లాడే తీరుకు చక్కని ప్రతిబింబం. 'మన యశోద చిన్నిమగవాని గనెనట' అనే మాట పోతన భాగవతం తొలిపద్యంలో చెప్పిన 'మహానందాంగనాడింభకున్' అనే సుదీర్ఘ సంస్కృత సమాసానికి అచ్చతెనుగు రూపం. 'కనెనట' అనే భూతకాలిక క్రియాపదానికి 'ప్రసవించడం', 'చూడడం' అని రెండర్థాలున్నాయి. ప్రసవించింది నిజంగా 'యోగమాయ' ను, చూచినది 'బాలకృష్ణుని'. ఈ రెండర్థాలూ యథార్థాలేనని పోతనగారు మనకు బోధిస్తున్నారు. **సీ. ఏ బాము లెఱుఁగక యేపారు మేటికిఁ బసులకాపరి యింట బాము గలిగె** ఇత్యాది సీసపద్యం చివర్లో ఇలా అంటాడు. **ఏ చదువులనైన నిట్టిట్టి దనరాని, యర్థమవయవముల నందమొందె.** - (భాగ.10-1-194)

"ఏ పాపమూచేయని భగవంతుడు పశువుల కాపరుల ఇంట్లో పుట్టి బాధలతో పెరుగవలసిన పరిస్థితి ఏర్పడింది. కర్మలు అనేవి లేకుండా తానొక్కడే ప్రకాశించే విష్ణువు జాతకర్మలు చేయించుకున్నాడు. తానే జగత్తుకు తల్లీ, తండ్రీ అయి తల్లిపాలు అనేది ఎరుగనివాడు నేడు యశోదాదేవి చనుబాల రుచి మరగినాడు. పుట్టటం, పెరగటం, తరగటం అనేవి లేని పరబ్రహ్మం ఈనాడు యశోదమ్మకు పుట్టి పెరుగుతున్నాడు. ఎన్ని తపస్సులు చేసినా పండని బంగారుపంట నేడు గోపకుల వ్రేపల్లెవాడలో కన్నులపండువగా పండింది. ఎన్ని చదువులూ, శాస్త్రాలూ చదివినా 'ఇలా ఉంటుంది' అని తెలియరాని ఆ పరమార్థం అందాలుచిందే ఆ బాలుని అవయవాలన్నింటిలోను అభివ్యక్తం కాసాగింది"

చంటిబిడ్డగా ఉండేటప్పుడే శిశువైన కృష్ణుడు పూతన, శకటాసుర, తృణావర్తులను సంహరించాడంటే పుట్టడమే తరువాయి దుష్టశిక్షణ కార్యాన్ని ప్రారంభించాడని అర్థం. ఈ ఘనకార్యాలు మానవులకు ఏమి ఉపదేశిస్తున్నదంటే ఏ రోజు పని ఆ రోజే చేయడం నేర్చుకోవాలి. రేపు అనేది లేదన్నట్లుగా ప్రతివ్యక్తి కర్తవ్యనిష్ఠుడు కావాలని బాలకృష్ణుని లీలల సందేశం. ఇక్కడ పెద్దలు చెప్పే ఒక సందర్భోచితమైన శ్లోకం ఇలా ఉంది.

**శ్లో. పరోపకృతి కైవల్యే తులయిత్వా జగద్గురుః – గుర్వీం చోపకృతిం మత్వా అవతారాన్ దశగ్రహి ॥**

శ్రీవైకుంఠంలోని విష్ణువు ఇలా అనుకున్నాడట. తాను వైకుంఠంలో ఉండటం మంచిదా? లేక లోకంలో ఉండటం మంచిదా? అని ఆలోచించి ఆ రెండు కార్యభారాలను ఒక త్రాసులో వేసి తూచగా లోకంలో ఉండడమే మంచిదనే కార్యభారమే తూగిందట. అందుచేత భగవంతుడు దశావతారాలను ఎత్తి లోకోద్ధరణకే పెద్దపీట వేశాడని సంప్రదాయజ్ఞులు చెబుతుంటారు. ఆ విధంగా అవతరించిన క్షణం నుండి దుష్టశిక్షణ – శిష్టరక్షణ – ధర్మసంస్థాపన అనే మూడు విధాలైన కార్యాలను ఈ భూమిపై కృష్ణావతారంలో 125 సం॥లు నిర్వహించి తాననుకున్న ఘనకార్యాలన్నీ సాధించినాడని చెప్పే గ్రంథమే భాగవతపురాణం.

**'కృతకృత్యాః ప్రతీక్ష్యంతే మృత్యుం ప్రియ మివాతిథిః ॥'** అనే సూక్తి శ్రీకృష్ణావతారం పట్ల సార్థకం.

**పూతనాసంహారం**

బాలకృష్ణ లీలలు పూతన సంహారంతో ప్రారంభమౌతూ ఉంది.

క. **చను నీకుఁ గుడుపఁజాలెడి, చనువారలు లేరు, నీవు చనవలె," ననుచుం**
**చను నీకుగుడిపి నీకడ, జనుదాన ననంగ వేడ్కఁ జనుఁ చను గుడుపన్.** – (భాగ. 10-1-220)

క. **నా చనుఁబా లొక గ్రుక్కెఁడు, నోచిన్ని కుమార! త్రావు మొయ్యన పిదపన్**
**నీచెలువ మెఱుఁగ వచ్చును, నా చెలువము సఫల మగును నళినదళాక్షా!** – (భాగ. 10-1-221)

'నలినదళాక్షుడు' అంటే హరి 'పుండరీకాక్షుడే!' పోతనగారు రెండు అర్థాలు వచ్చేటట్లుగా ఈ రెండు పద్యాలు వ్రాశారు. మొదటిది పూతన పక్షంగాను, రెండవ అర్థం కృష్ణుని పక్షంగాను ఉంటుంది. ఏకపదఘటిత 'పద్యం' కనుక కవి, 'చను' అనే శబ్దంమీద ద్వంద్వార్థాన్ని సాధించగలిగాడు. **'చనుదాన'** – వెళ్లగలదానను / చనిపోగలదానను అని మొదటి పద్యంలోను, రెండవ పద్యంలో **'నా చెలువము సఫలమగును'** నా నైపుణ్యం సఫలమవుతుంది. / నా పుట్టుక సార్థకమౌతుంది అని రెండర్థాలు వస్తున్నాయి. **విషధరరిపు గమనునికి...** అనే సర్వలఘుకందం వ్రాయడంలో, పూతన అతిత్వరితంగా విషం నెత్తికెక్కి మరణించిన విషయాన్ని సూచించాడు. పైగా విష శబ్దాన్ని ఏడుసార్లు పునరావృత్తి చేయడం గమనింపదగింది. ఏడు అనే సంఖ్య విషమసంఖ్య. అంటే బేసి సంఖ్య. దానిచేత విషమసంఖ్యకే ప్రాధాన్యమేర్పడి ఆమెయొక్క విషమ మరణాన్ని సార్థకం చేసింది. బాలకృష్ణుడు ఆమె విషాన్ని ఆమెకే వదలిపెట్టి పంచప్రాణాలను మాత్రం జుర్రుకొన్నాడు. దానితో ఆమె విగతజీవ అయ్యింది. వ్యక్తి విషమభావనయే విషం. సమత్వభావనయే సుఖం. ఇది పూతన కథాపరమార్థం. కానీ, కృష్ణస్పర్శచేత పూతన పునీత అయింది.

రాక్షసుల పూర్వజన్మ వృత్తాంతాలు హరివంశం, గర్గసంహిత, బ్రహ్మవైవర్తపురాణాలలో కనబడుతాయి. పూతన పూర్వజన్మలో బలిచక్రవర్తి కుమార్తె. ఆమెపేరు రత్నమాల. వామనుడుగా వచ్చిన బాలుని చూచి అతడు తన బిడ్డయితే తాను స్తన్యమిచ్చేదానిని కదా! అని మాతృభావనకు లోనైంది. వామనుడది పసిగట్టి 'తథాస్తు'

అన్నాడు. కానీ ఆ వామనుడే త్రివిక్రముడై తన తండ్రి బలి చక్రవర్తి తలపై మూడవ పాదం పెట్టి పాతాళానికి తొక్కుతున్నపుడు ఈ దుర్మార్గుడిని నేను సంహరించాలి అని రత్నమాల కోపోద్రిక్త అయింది. మాతృత్వ, రాక్షసత్వ ద్వైధీభావనచే రాక్షస స్త్రీగా పుట్టి స్తన్యమిచ్చినా అది విషపూరితమైనదిగా చేసుకొన్నది. కృష్ణస్పర్శ చేత పూతన పునీతయై మోక్షాన్ని చూరగొన్నది.

**శకటాసుర సంహారం**

కృష్ణుని జన్మనక్షత్రమైన రోహిణి రోజు శిశువును ఒక తొట్టె (చక్రాలున్న బండి) లో పడుకోబెట్టి యశోదమ్మ తన పనుల్లో నిమగ్నమై ఉండగా కంసునిచే పంపబడిన శకటాసురుడనే రాక్షసుడు అదృశ్యరూపంగా వచ్చి బండిలో ప్రవేశించాడు. పడుకొన్న బిడ్డ పాలకోసం ఏడ్వడం ప్రారంభించాడు. ఆ ఏడుపులోనే సహజంగా కాళ్లు విదిలించగా శిశువు పాదాలు బండికి తగిలి అది గాలిలో లేచి రివ్వుమని పోసాగింది. ఆ బండి కొండశిఖరాలపై కూలగా శకటాసురుడు మరణించాడు. చనిపోయిన రాక్షసునిపై బాలకృష్ణుడు ఆడుకుంటున్నాడు. ఇది శకటాసుర సంహారలీల. లీల అంటే మానవమాత్రులచేత ఊహించడానికిగాని, చేయడానికిగాని వీలులేని పనిని అవలీలగా చేసి చూపించడం అని అర్థం. ఇదే కృష్ణలీల.

శకటంలో దూరినవాడు కాబట్టి శకటాసురుడన్నారు. అదే రూఢిగా ఏర్పడింది. అసలు శకటాసురునికి శరీరాకృతి లేదు. అదృశ్యశరీరుడు. దీనికి కారణం ఆయన పూర్వజన్మలో చేసిన తప్పిదానికి లోమశమహర్షిచే పొందిన శాపం. శరీరం లేనివాడు కావడంచేత అవలీలగా బండిలో ప్రవేశించి శకటాసురుడనిపించుకొన్నాడు.

శకటాసురునికి పూర్వజన్మలో ఉత్కచుడని పేరు (ఉత్+కచః= నిక్కబొడిచిన తలవెంద్రుకలు గలవాడు) ఉత్కచుడు హిరణ్యాక్షుని కుమారుడు. ఇతడు **లోమశమహర్షి** ఆశ్రమంలోని చెట్లను ధ్వంసం చేయడంవల్ల ఆయన శాపానికి గురియై స్థూలశరీరాన్ని పోగొట్టుకొని అదృశ్యశరీరుడయ్యాడు. కృష్ణస్పర్శచేత నీకు స్వశరీరం వస్తుందని మహర్షి చెప్పాడు. ఆ దుష్టుడు భగవంతుని సంహరించడానికే వచ్చాడు గనుక స్వశరీరం వచ్చినా కృష్ణస్పర్శచేత మోక్షధామాన్నే అలంకరించాడు. ఈ విధంగా లోమశుని శాపం ఉత్కచునికి వరమైంది. కాబట్టి, ఇది వరశాపం.

**తృణావర్తసంహారం**

తృణావర్తుడంటే 'సుడిగాలిలో తిరిగే గడ్డిపోచ' అని అర్థం. (తృణ+ఆవర్తుడు) ఇతని అసలు పేరు చక్రవాతుడు. అంటే సుడిగాలి రక్కసుడు. పోతన 'చక్రసమీరదైత్యుడు' (10–1–271) అని సురకరువలి (సుడిగాలి) (10–1–264) అని చెప్పి (10–1–1329) పద్యంలో **'చక్రవాకుడు'** అనడం అపపాఠం. **'చక్రవాతుడు'** అని ఉండాలి. అతడు సుడిగాలిలావచ్చి చిన్నిశిశువైన బాలకృష్ణుని చుట్టుకొని ఆకాశంలోకి తీసుకొనిపోయి కొండలపై పడవేసి చంపాలనుకొన్నాడు. కానీ, 'లఘిమా' శక్తిచే పైకెగిరిన బాలకృష్ణుడు 'గరిమా' శక్తిచే కొండంత బరువై క్రిందికిలాగి వదలివేయగా అతడు గిరిశిఖరాలపై పడి చచ్చాడు.

పాండ్యదేశాన్ని పరిపాలించే సహస్రాక్షుడనే రాజు విష్ణుభక్తుడు. అతడు ఒకరోజు సహస్రాక్షుడు వేయిమంది స్త్రీలతో పృథు యోగశక్తిచే వేయిరూపాలు ధరించి గంధమాదనగిరి ప్రాంతంలో పుష్పభద్రా నదీతీరంలో స్త్రీలతో శృంగారక్రీడలు జరుపుతూ, నదిలో నగ్నంగా జలక్రీడలాడసాగాడు. ఆ సమయంలో దుర్వాసుడు శిష్యులతో కలిసి శివుణ్ణి చూడటానికి పోతూవుండగా, మహర్షిని చూచికూడా తృణీకారభావంతో క్రీడామగ్నుడయ్యాడు. దానికి కోపించిన దుర్వాసుడు లక్ష సంవత్సరాలు దైత్యుడై ఉండమని శపించాడు. ఆ స్త్రీలను జారస్త్రీలు కమ్మని శపించాడు. రాజు ఒక అగ్నిగుండాన్ని ఏర్పాటుచేయగా సహస్రాక్షునితో సహా వేయిమంది స్త్రీలు అందులో దూకి ప్రాణ పరిత్యాగం చేశారు. ఆ స్త్రీలు రాజపత్నులై మరుజన్మలో పుట్టగా, సహస్రాక్షుడు తృణావర్తుడనే అసురుడై జన్మించి బాలకృష్ణునిచే మోక్షం పొందాడు. మహర్షిని తృణీకారభావనతో చూడడంచేత **తృణావర్తుడు** అనే అసురుడుగా పుట్టాడు. ఇతనికే **చక్రవాతుడు** అని పేరు. ఆవర్తశబ్దంచేత పునర్జన్మలు పొందవలసినవాడు కృష్ణస్పర్శచే మోక్షం పొందాడు.

**బాలకృష్ణుని బాల్యక్రీడలు**

**'బాలయ నీల వపుషే నవకింకిణీక - జాలాభిరామ జఘనాయ దిగంబరాయ ।**
**శార్దూలచర్మ నఖభూషణ భూషితాయ - నందాత్మజాయ నవనీతముషే నమస్తే** - శ్రీకృష్ణకర్ణామృతమ్

తల్లి, తండ్రి ఎవరూలేని భగవంతుడు యశోదను 'అమ్మా' అని పిలిచాడు. ఇది కృష్ణావతార తత్త్వంలో తొలి పిలుపు. లోకంలో ఏ శిశువైనా తల్లినే పిలుస్తాడు. ఈ తత్త్వాన్ని దేవుడుకూడా అనుసరించాడు. **అడుగులు వే గలిగియు....** (భాగ.10-1-295) అనే పద్యంలో వామనావతారస్ఫూర్తి ఉన్నది. విష్ణువు సహస్రశీర్షుడు, సహస్రాక్షుడు, సహస్రపాదుడు, సహస్రనాముడు అనే తత్త్వం తెలుస్తూ ఉంది. బాలకృష్ణుడు వేసిన రెండడుగులు వామనావతారంలో భూమినీ, ఆకాశాన్నీ కొలిచిన రెండడుగులను స్ఫురింపజేస్తాయి.

పిల్లలతో ఆడుకొనే ఆటల్లో, **'నే సూత్రధారి! మీరందరు బహురూపులు'** అనడం ఏకం, అనేకమైన సృష్టిని స్ఫురింపజేస్తుంది. బహురూపులు అనే మాటచేత **'సూత్రేమణిగణా ఇవ'** అనే గీతావాక్యాన్ని జ్ఞప్తికి తెస్తుంది. మణులకు గుచ్చిన దారం కనపడనట్లు భగవంతుడు అన్ని జీవాత్మలను కలుపుతున్న అంతస్సూత్రం అని అర్థం.

బాలకృష్ణుని చిలిపిచేష్టల్లో నవనీత చౌర్యం ఒక ప్రధాన ఘట్టం. **'గోపకుటీ పయోఘృతాపహారికి'** అని పోతన చెప్పగా, **'ఘోషకుటీర పయోఘృతచోరమ్'** అని సదాశివబ్రహ్మేంద్రుల సంకీర్తనం. బాల్యంలోని ఈ **నవనీతచోరుడే యౌవనంలో గోపికాచిత్తచోరుడైనాడు.**

**ఓయమ్మ! నీకుమారుఁడు మా యిండ్లను బాలు పెరుఁగు మననీఁ దమ్మా!**
**పోయెద మెక్కడి కైనను, మా యన్నల సురభు లాన మంజులవాణీ!** - (భాగ.10-1-329)

ఇదిగో తల్లీ! నీ బిడ్డడు మా ఇండ్లలో పాలు, పెరుగూ దక్కనివ్వడం లేదమ్మా! ఇలాగైతే మేము మా పుట్టింటికి వెళ్లిపోవలసివస్తుంది. మా పుట్టింటి ఆవులమీద ఒట్టు. మమ్మల్ని మెత్తని మాటలతో సర్ది చెప్పాలని చూస్తావేమో! మేము ఈ వాడను వదలి వలసపోవలసిందేగాని మాకు వేరేదిక్కు లేదు అని ప్రతిరోజు ఫిర్యాదులు వింటున్న యశోద మనస్సు చాలా కలవరపడింది.

**మృద్భక్షణం - విశ్వరూపదర్శనం**

బాలకృష్ణుడు ఒకరోజు మన్ను తిన్నాడని బలరాముడు యశోదకు చెప్పాడు. ఆమె కృష్ణుని తీవ్రంగా మందలించింది. కృష్ణుడు తాను మన్ను తినలేదని కావలసివస్తే తన నోరు వాసన చూడమని చెప్పాడు. అప్పుడు ఆమె కృష్ణుని నోరు చూడగా

**క. ఆ లలితాంగి కనుంగొనె బాలుని ముఖమందు జలధి పర్వత వన భూ**
**గోళ శిఖి తరణి శశి దిక్పాలాది కరండమైన బ్రహ్మాండములన్** (భాగ. 10-1-340)

నిశ్చేష్టురాలైన యశోద 'కలయో, వైష్ణవమాయయో' అని దిగ్భ్రాంతి చెందింది. చూడబోతే పసిబాలుడు. చూద్దామా అంటే నోట్లో బ్రహ్మాండభువనభాండాలు కనబడుతున్నాయి. 'బాలుభంగి నితఁడు భాసిల్లుగాని సర్వాత్ముఁడాది విష్ణుఁడగుట నిజము' అని సత్యదర్శనం చేసింది. ఇతడు బాలుడుగా కన్పించే ఆదివిష్ణువు అని గ్రహించింది.

**దధిభాండవికలనం**

బాలకృష్ణుని ఆగడాలు రోజురోజుకూ మితిమీరి పోతున్నాయి. ఒకరోజు పెరుగును కవ్వంతో చిలుకుతున్న యశోద దొంగ ఏడుపులు ఏడుస్తున్న బాలకృష్ణునికి పాలివ్వడానికి తీసుకోగా ఆమె చేతికవ్వాన్ని తాను తీసుకొని చిలుకుతున్న పెరుగుకుండకు కొట్టగా కుండ పగిలిపోయింది. దానితో కోపించిన యశోద బాలకృష్ణుని రోకటికి వేసి కట్టింది. ఆ రోలుకు వేసి కట్టడానికి ఆమె పడిన శ్రమయే ఉలూఖలబంధనం.

**ఉలూఖల బంధనం**

యశోదాదేవి అల్లరి బాలకృష్ణుని పట్టుకోవడంలోపడిన పాట్లు, ఒక భక్తునికి పట్టువడని భగవంతుని తత్త్వంతో సమానం. ఎంతగానో నిరీక్షింపజేసి, దోబూచులాడి, ఓపికను పరీక్షిస్తుందో, అన్నివిధాలుగా ఒక చిన్ని బాలుణ్ణి పట్టుకొని రోలుకు కట్టివేసే ప్రయత్నాన్ని సహజసిద్ధమైన ధోరణిలో వర్ణించి పాఠకుల బుద్ధికి, ఆ బాలకుడు 'భగవంతుడే సుమా!' అని పరోక్షంగా తెలియజేస్తున్నాడు.

**క. పట్టిన పట్టువడని నిను.... ।** (భాగ. 10-1-375) అనే పద్యంలో యశోదకు తెలియకుండానే అసలు తత్త్వం ఆమె నోటివెంట అంతరార్థంగా వెలువడింది. కృష్ణుని సాన్నిధ్యమే ఒక తన్మయత్వం. ఒక దివ్యప్రభావం. భగవంతుడు మామూలుగా పట్టుబడడు. కాని నిష్ఠగా, యోగసాధనచేస్తే ఆనందస్వరూపుడుగా పట్టుబడుతాడు. అందరిలోను, తనలోను అంతర్యామిగా ఉన్న 'నేను' అనే ప్రజ్ఞగామాత్రమే అతడు పట్టుబడతాడు కాని, తన తోటివారినే ఇతరులుగా, వేరుగా చూస్తే పట్టుబడడు.

**క. చిక్కడు సిరి కౌఁగిటిలోఁ.... ।** (భాగ. 10-1-383) ఆ లీలాగోపాలబాలుడు లక్ష్మీదేవి కౌగిటిలో చిక్కలేదు. మహాయోగుల హృదయాలలోను చిక్కలేదు. ఉపనిషత్తులలోను చిక్కలేదు. అట్టివాడు లీలగా అవలీలగా తల్లి చేతిలో చిక్కి రోటికి కట్టివేయబడ్డాడు. ఉపనిషత్తులకు పట్టుబడలేదని, 'యతోవాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ' (తైత్తిరీయోపనిషత్తు) తల్లికి చిక్కి రోలుకు కట్టివేయబడిన కృష్ణుని మధుసూదనసరస్వతి - **"ఉపనిషదర్థం**

**ఉలూఖలే నిబద్ధమ్"** అని చెప్పారు. 'ఉపనిషత్తులలో చెప్పబడిన భగవత్తత్త్వం ఇప్పుడు రోలుకు కట్టివేయబడి ఉన్నది' అన్నాడు. లేకుంటే ఆ యశోద తల్లి పడిన శ్రమ అంతాయింతా కాదు.

**క. తజ్జనని లోఁగిటంగల రజ్జు పరంపర..... ।** (భాగ. 10–1–385) యశోదానందులు రెండు జన్మల దంపతులు. రెండు జన్మలెత్తిన యశోద ఈ జన్మలో పట్టుకోగలిగింది. పట్టుకొన్నా కట్టివేయడానికి తీసుకొన్న తాడు ప్రతిసారీ రెండేసి అంగుళాలు తక్కువ పడుతూపోయింది. ఆఖరికి ముడులువేసిన తాడుతో కట్టగలిగింది. అదీ ఆ బాలగోపాలుని కృపచేతనే, తల్లిపై దయతో అనుమతించాడు. లేకుంటే 14 భువన భాండాలు ఏకదేశంలో ఉన్న ఆ బ్రహ్మాండమైన బొజ్జ కట్టడానికి ఆదిశేషుడు కూడ చాలడు!

ఎంతచెప్పినా ఇంకా మిగిలి ఉండడం భగవతత్త్వమైనట్లు ఎన్ని తాళ్లు తెచ్చినా ఎన్ని ముళ్లు వేసినా ఇంకా రెండంగుళాలు చాలకపోవడం చూస్తే, భగవత్తత్త్వం దేనికీ లొంగిరాదని చెప్పడమే దాని ఆంతర్యం!

**యమళార్జున భంజనం**

యశోదాదేవి కృష్ణుని రోటికి కట్టి ఇంటిపనుల్లో ఉండగా బాలకృష్ణుడు ఆ రోలును నడుముకు కట్టిన తాడుతో ఈడ్చుకుంటూ జంటగా పెరిగిన రెండు మద్దిచెట్లగా వెళ్లి గట్టిగా లాగాడు. దానితో ఆ రెండుచెట్లు కూలిపడ్డాయి. ఇదే **'యమళార్జునభంజనం'**. ఆ చెట్లు యిద్దరు యక్షులుగా సాక్షాత్కరించారు. వారెవ్వరో కాదు కుబేరుని పుత్రులైన నలకూబర, మణిగ్రీవులు. వారు కైలాసగిరుల్లో అప్సరసలతో నగ్నంగా విహరిస్తూ ఉండగా నారదుని కంటబడ్డారు. వారు నారదుని లక్ష్యపెట్టకపోవడం వల్ల శాపగ్రస్తులై రెండు మద్దిచెట్లుగా కృష్ణుని ఇంటిపెరట్లో చాలాకాలంగా శాపవిముక్తి కోసం వేచి ఉన్నారు. బాలకృష్ణుడు వారి శాపవిముక్తి కలిగించాడు. ఈ కథలో సంపన్నుల ప్రవర్తనలో పరివర్తన రావాలని, సంపన్నుల స్వభావాలెలా వుంటాయో పోతనగారు తెలుపుతూ–

**సంపన్నుం డొరు కానలేడు... ।** (భాగ. 10–1–394) అనే పద్యంలో ధనవంతుడు ఎవరినీ లెక్కచేయడు. తన ఐశ్వర్యాన్ని, శరీరసుఖాలను నమ్ముకొని ఇతరులను హింసించడమే చేస్తాడు. దరిద్రుడు దారిద్ర్యంలో మగ్గుతున్న కష్టాలు అనుభవిస్తాడేగాని ఇతరులను హింసించడు. వారూ తనవంటివారేకదా అని ఆలోచిస్తాడు. ఇది లోకరీతి. కాబట్టి ధనమదాంధులైనవారికి దారిద్ర్యమే చక్కని అంజనం అని నారదుడు ఒక పాటగా పాడాడు. దీనితర్వాత గల **కలవానిసుతుల మనుచును.... ।** (భాగ. 10–1–396) అనే పద్యంలో కూడా ధనవంతుడు ప్రేయసులతో కలసి ఉన్నప్పుడు ఎదుటివాడు కనపడడు. వాళ్ల కొవ్వును అణచి సత్పురుషులుగా మార్చాలని నారదుని అభిలాష. "శ్రీగోవిందచరణారవింద సంస్పర్శనంచేత...." ఆ అన్నదమ్ములు ముక్తులై, నారాయణభక్తులుగా మారాలని శాపవిమోచనాన్ని చెప్పాడు.

**బృందావన లీలలు**

శ్రీకృష్ణుని బాల్యలీలల్లో యమళార్జునభంజనంతో వ్రేపల్లెలీలలు ముగిసి, రెండవఘట్టంగా బృందావన లీలలు ప్రారంభమౌతాయి.

**మ. జలజాంత స్థిత కర్ణికం దిరిగిరా సంఘంబులై యున్న తే**
**కుల చందంబునఁ గృష్ణునిం దిరిగిరాఁ గూర్చుండి వీక్షించుచున్**
**శిలలుం బల్లవముల్ దృణంబులు లతల్ చిక్కంబులున్ బువ్వు లా**
**కులు కంచంబులుగా భుజించి రచటన్ గోపార్భకుల్ భూవరా!** (భాగ.10–1–495)

తాను గొప్ప ఇంటి బిడ్డయినా అందరితో కలసి మెలసిపోయి ఉండటం గొప్ప గుణం. స్నేహధర్మాన్ని పాటిస్తూ బాలకృష్ణుడు జీవులందరిలో ఒకడుగా ఆటపాటలలో నిమగ్నమైపోయిన ఘట్టం ఇది. దేవునికీ, జీవులకూ గల అవినాభావసంబంధాన్ని ఈ ఘట్టం రమణీయంగా వ్యాఖ్యానిస్తున్నది.

**"సంగడీల నడుమ చక్కఁగఁ గూర్చుండి – నర్మభాషణముల నగవుమెఱపి**
**యాగభోక్త కృష్ణుఁడమరులు వెఱగంద శైశవంబు మెఱసి చల్ది గుడిచె"** – (భాగ.10–1–498)

ఒక పద్మంయొక్క ఆకారాన్ని గమనిస్తే ఈ తత్త్వం బోధపడుతుంది. పద్మంయొక్క బొడ్డుభాగం భగవంతుడైతే దాన్ని అంటిపెట్టుకొన్న రేకులు జీవులు. సృష్టి అనేది ఒక పద్మపుష్పమైతే, దాని కేంద్రస్థానీయుడు దేవుడు. అదే పద్మంయొక్క నడిబొడ్డు. పూలరేకులన్నీ పుష్పాన్ని చుట్టుకొని ఉన్నట్లుగా దేవుని అంటిపెట్టుకొని జీవులు ఉజ్జీవిస్తున్నారు. ఇక్కడ గోపబాలురందరూ కృష్ణుని చుట్టూ వలయాకారంగా కూర్చొని చద్ది అన్నాన్ని ఆరగిస్తున్నారు. కృష్ణుడు వారి వలయమధ్యంలో కూర్చొని అందరి ఎంగిలి అన్నాన్ని ఊరగాయలతో నంచుకొని తింటున్నాడు. ఈ క్రమంలో పుష్పంలోని ప్రతి రేకులాగా జీవులందరి యోగక్షేమాలను భగవంతుడు సంరక్షిస్తాడనే ఆధ్యాత్మిక రహస్యాన్ని పోతనగారు నిక్షేపించారు. అనాదియైన జీవేశ్వరసంబంధం ఈ ఘట్టంలో ప్రతిపాదింపబడింది.

కాళీయమర్దన ఘట్టంలో కూడ ఊరికంతా ఉపయోగపడే మంచినీళ్ల చెరువులో సర్పరాజు కాళీయుడు అతని సంసారం ఉండిపోయి, జలాన్ని విషపూరితం చేయడాన్ని కృష్ణుడు అంగీకరించలేదు. కాళీయుడిని అతని సంసారాన్ని అక్కడనుండి వెళ్లేట్లు చేశాడు. ఇది సమాజంలో తాగునీటి సమస్యను పరిష్కరించిన 'సామాజిక స్పృహ' గల ఘట్టంగా చెప్పవచ్చు. జలకాలుష్యాన్ని శ్రీకృష్ణుడు నివారించిన కథ ఇది.

**యజ్ఞం కంటే అన్నదానం శ్రేష్ఠం**

ఈ 'యాగభోక్త' ఆంతర్యం, సోమిదమ్మలకు పరమపదప్రాప్తిని కల్గించడంలో కనబడుతుంది.

**"స్వర్గకామోయజేత!"** అని శాస్త్రవాక్యం – బ్రాహ్మణులు ఆంగీరసవ్రతాన్ని స్వర్గాన్ని కోరి చేస్తున్నారు. బాలకృష్ణుడే విష్ణువన్న సంగతి వారికి తెలియదు.

**యజ్ఞో వై విష్ణుః । విష్ణుర్వై యజ్ఞః । విష్ణుర్యజ్ఞః** – అని తైత్తిరీయోపనిషత్తు. విష్ణువే యజ్ఞం. యజ్ఞమే విష్ణువు. విష్ణువుకూ యజ్ఞానికీ భేదం లేదు.

ఒకరోజు అడవిలో గోవులను కాస్తున్నప్పుడు తోటి గోపాలకులు కృష్ణునితో తమకు ఆకలివేస్తున్నదని అన్నం కావాలని కోరారు. అడవిలో దూరంగా పొగలేస్తున్నదని అక్కడెవరో బ్రాహ్మణులు యజ్ఞం చేస్తుంటారని, అక్కడికి వెళ్లి అడిగితే అన్నం పెడతారని చెప్పాడు. యజ్ఞశాలలో యాజ్ఞికులైన బ్రాహ్మణులు –

**మ. క్రతువుల్ మంత్రము దంత్రమున్ ధనములుం గాలంబు దేశంబు దే**
**వతయున్ ధర్మము నన్యముల్ దలఁప నెవ్వాఁడట్టి సర్వేశ్వరున్**
**మతి నూహింపక గోపబాలుఁ డనుచున్ మందస్థితిం జూచి దు**
**ర్మతులై యన్నము లేదు లేదనిరి సమ్మానక్రియాశూన్యులై.** – భాగ. 10–1–855

ఆ బాలకులు కాళ్లీడ్చుకుంటూ వచ్చి కృష్ణునికి విన్నవించారు. కృష్ణుడు వారిని యజ్ఞశాలకు వెనుక గల 'పత్నీశాల' కు తీసుకుపోయాడు. అది సోమిదమ్మలు వారి కుటుంబసభ్యులుండేశాల. సోమయాజుల భార్యలనే సోమదమ్మలంటారు. ఆ స్త్రీలు తమకిచ్చిన స్వయంపాక సామగ్రితో వంటచేసి ఉన్నారు. తాము భుజింపక బాలకృష్ణునికి గోపబాలురకు అన్నాన్ని వడ్డించి సంతృప్తి పరచారు. బాలకృష్ణుడు వారికి జీవితాంత దశలో పరమపదప్రాప్తి ననుగ్రహించాడు. ఆ విషయం తెలిసిన యాజ్ఞికులు పరుగెత్తుకొనివచ్చి కృష్ణుని పాదాలపై బడి శరణువేడారు.

**మ. .... సర్వేశుఁ డీ – క్షితి రక్షింప జనించినాఁ; డెఱుఁగ; మా శ్రీభర్తకుం గర్తకుం**
**గుతలోద్ధర్తకు మేము మ్రొక్కెదము రక్షోనాథ సంహర్తకున్'.** – భాగ. 10–1–875

యజ్ఞం చేస్తే స్వర్గప్రాప్తి. అన్నదానం చేస్తే వైకుఠంప్రాప్తి. పునర్జన్మ లేని మోక్షప్రాప్తిని పొందారు సోమిదమ్మలు. ఇది అన్నదాన మహిమ. అందుచేత ఆకలితో ఉండేవారికి అన్నదానం చేయడం, యజ్ఞం చేయడం కంటే శ్రేష్ఠమని బాలకృష్ణుని తీర్పు. శ్రీకృష్ణావతారంలో ధర్మశాస్త్రరహస్యాలెన్నో కన్పిస్తుంటాయి.

**ఇంద్రయాగానికి బదులుగా అందరికీ శ్రీకృష్ణుడు అన్నదానం ఏర్పాటు చేయడం**

నందాదులు ఇంద్రయాగం చేయాలని సంకల్పించి కృష్ణునితో చెప్పగా ఆయన "మనుష్య లోకం కర్మానుబంధంగా నడుస్తున్నదేగాని, యాగాలవల్ల కర్మబంధాలు తెగిపోవని నచ్చచెప్పి, ఇంద్రయాగానికి ఏయే పిండివంటలు చేస్తారో అవన్నీ చేయించి, విరివిగా వ్రేపల్లెలోని వారి కందరికీ ఎటువంటి వివక్షలేకుండా అన్నదానం చేయించండి" అన్నాడు. గోవర్ధన పర్వతాన్ని పూజించండి చాలు అన్నాడు. (భాగ. 1–1–888) ఇంద్రునికి కోపంవచ్చి రాళ్లవాన కురిపించగా కృష్ణుడు చిటికెనవేలితో గోవర్ధన పర్వతాన్ని ఎత్తి గో గోపగోపీజన సంరక్షణం చేశాడు.

**రాసపంచాధ్యాయి**

'దివ్యభూమిక' లో వీరరసోచితకృత్యాలేగాక, దివ్యశృంగారకేళీలీలా విలాసాలు గూడ చోటుచేసికొంటాయి. వీర–శృంగార–అద్భుతరసాలు కృష్ణుని జీవితంలో అల్లిబిల్లిగా అల్లుకొనిపోయి ఉన్నాయి. 'రస' మనేది కృష్ణుని దివ్యశృంగార క్రీడలకు చెందిన ఒక అద్భుత విన్యాసం! ఇది ఆధ్యాత్మికమేతప్ప, భౌతిక దేహసంబంధమైనది కాదు. సాహిత్యానుభూతికి చెందింది – రసము – రస వివేచనం. దివ్యానుభూతులకు చెందినది రాసము. రాసతత్త్వ తాదాత్మ్యభావన. ఇటువంటి అతిలోకానుభూతులకు అధ్యాయాలు ఐదు, భాగవత దశమస్కంధం – పూర్వభాగంలోనే ఉన్నాయి.

**రాస పంచాధ్యాయి – ఐదు అధ్యాయాలు**

1. శరద్రాత్రి ఒంటరిగా అడవిలో వేణుగానం చేస్తున్న కృష్ణుని సన్నిధికి గోపికలు రావడం – భాగ. 10–1–967 – 1005 (39 గద్య పద్యాలు)

2. గోపికలు అంతర్హితుడైన కృష్ణుని వెదకడం – భాగ. 10–1–1006 – 1036 (30 గద్య పద్యాలు)

3. గోపికాగీతలు – భాగ. 10–1–1037 – 1058 (22 గద్య పద్యాలు)

4. కృష్ణుడు ప్రత్యక్షమై గోపికలను ఓదార్చడం – భాగ. 10–1–1059 – 1081 (23 గద్య పద్యాలు)

5. రాసక్రీడాభివర్ణనం (మహారాసలీల) – భాగ. 10–1–1082 – 1099 (18 గద్య పద్యాలు)

6. జలక్రీడాభివర్ణనం – భాగ. 10–1–1100 – 1111 (12 గద్య పద్యాలు) మొత్తం 144 గద్యపద్యాలు

**శరద్రాత్రి శ్రీకృష్ణుని వేణుగానం గోపికల నాకర్షించడం**

**'మందం మందం మధురనినదై వేణుమాపూరయంతమ్'** – శ్రీకృష్ణకర్ణామృతమ్

ఒక వెన్నెలరేయి బృందావనవీథుల్లో వేణుగానం వినరాగా గోపకన్యలు, గృహిణులు అవశలై అడవులలో వెళ్లి కృష్ణుని సన్నిధికి చేరారు. ఆయన వారి సమంజసం కాదనీ ఖండించి, మెత్తగా మందలించాడు. వారిని తిరిగి యిండ్లకు వెళ్లమన్నాడు. సనాతనధర్మాన్ని గురించి చెప్పాడు. **"మా మనంబు లెల్ల మరపించి దొంగిలి తేమి సేయువారమింక కృష్ణ!"** (10–1–990) 'గోపికాచిత్తచోరుడు కృష్ణుడు' అన్నారు.**పురుషభూషణ దాస్యము లిచ్చికావవే!** (10–1–993), **కౌగిలింపుము మముం బుణ్యంబు పుణ్యాత్మకా!** (10–1–994), **'కుసుమ శరపరంపరాపరవశలై యోపికలు లేక పలికిన గోపికల దీనాలాపంబులు విని, నవ్వి, యోగీశ్వరుం డయిన కృష్ణుండాత్మారాముండై వారలతో రమించెనప్పుడు"** (10–1–995).

ఈ మాటలు చాల కీలకమైనవి ఆత్మారాముడై రమించుట మనసా జరిగినది.

**అదృశ్యుడైన కృష్ణుని గోపికలు అన్వేషించడం**

గోపికలను తనయందు ఎంత నిష్ఠ ఉన్నదో పరీక్షించాలని కృష్ణుడు అదృశ్యుడైనాడు. గోపికల అన్వేషణ ఇలా సాగింది – గోపికలు మనస్సులు పోగొట్టుకొని వివిధ చేష్టలకు లోనయి, తాదాత్మ్య భావాన్ని పొంది 'నేను' 'నేను' కృష్ణుణ్ణీ అని చెబుతూ, కృష్ణగుణాలను ఆవేశించుకొన్న చిత్తవృత్తితో ఉన్మాదులై సంచరింపసాగారు. చెట్టునూ, పుట్టనూ అడగసాగారు.

**పున్నాగకానవే పున్నాగ వందితు! దిలకంబ! కానవే తిలక నిటలు!** అని మాటిమాటికి ప్రశ్నిస్తూ–

**ఉ. నల్లనివాఁడు పద్మనయనంబుల వాఁడు కృపారసంబు పైఁ**
**జల్లెడివాఁడు మౌళిపరిసర్పిత పింఛమువాఁడు నవ్వు రా**
**జిల్లెడు మోమువాఁ డొకఁడు చెల్వల మానధనంబుఁ దెచ్చె నో**
**మల్లియలార! మీ పొదలమాటున లేఁడు గదమ్మ చెప్పరే?** (10–1–1011)

ఈ సుప్రసిద్ధ పద్యంలో తమ హృదయంలో ముద్రవేసిన బాలకృష్ణుని భౌతిక సౌందర్యం కళ్లకు కట్టినట్లు వర్ణించారు. అతడు చెల్వల మానధనాన్ని దోచుకొన్నవాడు. 'మానినీ చిత్తచోరు' డని రుక్మిణీ కూడ ఈ మాటే అన్నది.

**'అదె నందనందనుండంతర్హితుం, డయ్యెపాటలీ తరులార! పట్టరమ్మ'** అని పేరుపేరున పిలవడంలో వారి ఆర్తి. హృదయావేదన, సర్వజీవగతమైన సార్వకాలిక వేదనగా పరిణమించి పరాకాష్ఠకు చేరింది. "శిఖిపింఛ జూటుతెచ్చి కరుణచూపరమ్మ!" అనడంలో విహ్వలమైన వారి మనో విహంగం రెక్కలు ముడుచుకొని సొమ్మసిల్లి పోవడానికి సిద్ధంగా ఉన్నట్లు తెలుస్తుంది.

వారు "మదనోన్మాద చిత్తలై తదాత్మకత్వంబున కృష్ణ లీలల ననుసరింపసాగారు" ఈ తదాత్మభక్తిన్ ఉన్మాద భక్తి అనవచ్చు. **"ఓ కృష్ణ! ఎక్కడ జనితి? ప్రాణేశ! రమణ!"** అనే మాటలు వారి ప్రాణేశుఁడు, ఆత్మరమణుడు శ్రీకృష్ణుడని స్పష్టపరిచారు.

**గోపికాగీతలు**

"నీవు యశోద బిడ్డడవే? నీరజనేత్ర! సమస్త జంతు చేతో విదితాత్మ వీశుఁడవు..." (10-1-1040) ఇత్యాది పద్యంలో, నీవు యశోద బిడ్డవు కావు! నిజమే! కాని, నీవు విశ్వజననీ శిశుమూర్తివి (Universal Child) అని సార్వకాలిక శిశుత్వ భావనలో మునిగిపోతారు. ఆ శిశువును ఇలా ప్రార్థిస్తారు. **...నీ చరణపద్మము చన్నులమీఁద మోపి త - ద్భావజ పుష్పభల్ల భవబాధ హరింపు వరింపు మాధవా!** -(10-1-1042) **"...మా నారీమనోహారకా!"** (10-1-1045) లక్ష్మీదేవి హృదయాన్నే దోచుకొన్నవాడు. **భద్రకరమునైన భవదంఘ్రియుగము మా, యురములందు రమణ! యునుపఁ దగదె?** (10-1-1049)

ఇక్కడ, కామోత్కంఠతయేకాదు, 'త్రిపాద్విభూతి'గల స్వామిపాదాలు తమ వక్షఃస్థలంపై మోపడంవలన హృదయనైర్మల్య మేర్పడి మనస్సు, నమస్సై గుండెలో స్వామి సాక్షాత్కారానికి వీలుకల్గుతోంది. పరమయోగి హృదయభద్ర పీఠాలపై ఉండే స్వామి గోపీకన్యల చీరకొంగులు పరిస్తే దానిపై కూర్చున్నాడు. ఆ స్వామి శరీరం త్రిభువనదేవియైన లక్ష్మీ కళలతో తేజరిల్లింది. గోపికలకు భౌతికంగా ఎడబాటు కల్గిస్తున్నందుకు వారిపై దయ, కృతజ్ఞత లేక కాదు, కరుణతో తన యెడబాటును సహించమన్నది. దానితో గోపికల విరహతాపం శమించింది. సంతుష్ట హృదయలయ్యారు.

**రాసక్రీడలు**

గోపికల హృదయాల్లో విరహదుఃఖం తొలగిపోయి గుండెనిండుగా ఎప్పుడు ఆనందం పొంగిపొర్లినదో

**ఉ. ఆ సమయంబునన్ విభు డనంతుఁడు గృష్ణుఁడు చిత్రమూర్తియై**
**చేసెను మండలభ్రమణశీల పరస్పరబద్ధబాహు కాం**
**తా సువిలాసమున్ బహువిధ స్ఫురితానన హస్త పాద వి**
**న్యాసము రాసముం గృతవియచ్చరనేత్ర మనోవికాసమున్. (10-1-1082)**

ఆ శరత్కాలంలో అంతర్యామీ, అంతంలేనివాడూ అయిన శ్రీకృష్ణుడు చిత్రాకారుడై రమణీమణులతో రాసక్రీడ సలపడానికి ఆరంభించాడు. గోపికలు గోవిందుని చుట్టూ వలయాకారంగా ఏర్పడి ఒకరి చేతులు ఒకరు సవిలాసంగా పట్టుకొని తిరిగినారు. పలురీతుల స్ఫురించే ముఖ, హస్త, పాదవిన్యాసాలతో ఆ రాసగోష్ఠి భాసిల్లింది. తిలకిస్తున్న ఖేచరుల లోచనాలకూ, మనస్సుకూ అది ఆనందాన్ని ఆహ్లాదాన్ని కల్గించింది.

**వ. ఇట్లు భగవంతుండైన కృష్ణుం డాత్మారాముం డయ్యును గోపసతు లెంద ఱందఱకు నందఱై నిజప్రతి బింబంబులతోడం గ్రీడించు బాలుపోలిక రాసకేలి సలిపిన.** (10–1–1098)

**క. తగఁ గూడి యాడి మనముల, నగెఁ జూచెం బలికె నందనందనుఁ డనుచున్**
**మగువలు పెద్దతికముతోఁ బొగడిరి తమ పూర్వజన్మపుణ్యశ్రేణిన్.** (10–1–1099)

నందకుమారుడు కలసిమెలసి నవ్వుతూ, చూస్తూ, సల్లాపాలు సలుపుతూ మెలగినాడని, ఆ యిందుముఖులు తమ పూర్వజన్మ పుణ్యాలను మిక్కిలి శ్లాఘించుకున్నారు.

**జలక్రీడలు**

**వ. ఇట్లు హరి రాసకేళి సాలించి, కరకాంచితలగు తటిల్లతల చెలువున ఘర్మసలిల కణాక్రాంతలగు కాంతలం గూడి జలక్రీడాకుతూహలుండై యమునా జలంబులు సొర,** (10–1–1100)

**మ. సతులుం దానును నీటిలో వెడలి భూషాగంధచేలాద్యలం**
**కృతుఁడై కుంభికరేణు యూథములతోఁ గ్రీడించు చందంబునన్**
**లతలందుం దరులందుఁ బుష్పమయ లీలాశయ్యలందున్ సుఖో**
**న్నతుఁడై కృష్ణుఁడు క్రీడలం దనిపె నా నారీలలామంబులన్.** (10–1–1101)

అతిశయమైన ఆనందంతో నందనందనుడు గోపసుందరీ మణులతో నీటినుండి వెడలివచ్చి సొమ్ములు, మంచి గంధం, వస్త్రాలు మొదలైనవి అలంకరించుకున్నాడు. గజరాజు, ఆడు ఏనుగులతో క్రీడించే విధంగా తన పొదరిండ్లలో, చిక్కని చెట్లనీడలలో, చక్కని పూసెజ్జలలో ఆ కన్యారత్నాలతో క్రీడించి వారిని సంతోష పెట్టినాడు.

**వ. ఇట్లు శరత్కాలంబున వెన్నుం డింద్రియస్ఖలనంబు సేయక గోపికలతోడ రమించె. (10–1–1102)**

ఈ రీతిగా గోవిందుడు ఆ శరత్కాలంలో 'అస్ఖలితేంద్రియుఁడై గోపీరమణులతో రమించాడు'

**పరీక్షిత్తు సందేహం – శుకమహర్షి సందేశం**

**మత్తకోకిల. ధర్మకర్తయు ధర్మభర్తయు ధర్మమూర్తియు నైన స**
**త్కర్ముఁ డీశుఁడ ధర్మశిక్షయు ధర్మరక్షయుఁ జేయఁగా**
**నర్మిలిన్ ధరమీఁదఁ బుట్టి పరాంగనాజనసంగ మే**
**ధర్మ మంచుఁ దలంచి చేసె? సుదాత్తమానస! చెప్పుమా!** – (భాగ. 10–1–1103)

మహాత్మా! పరమేశ్వరుడు ధర్మానికి కర్త! ధర్మానికి భర్త! ధర్మమే స్వరూపంగా గలవాడు. సత్కర్మలాచరించే వాడు. అతడు అధర్మాన్ని శిక్షించడానికి, ధర్మాన్ని రక్షించడానికి అవనిలో అవతరించాడు కదా! అటువంటి దేవుడే మరెట్టి ధర్మమని పరసతులతో సంగమించినాడో దయచేసి చెప్పవలసింది అని అడిగాడు. దానికి శుకమహర్షి ఇచ్చిన సమాధానమిది –

**తే. ఎందరెన్ని విధంబుల నీశుఁగొలువ – అందరకు నన్నిరూపులై యాతడుండు**
**ఏది గోరిన వారలకదియనిచ్చు – ఏది కోరని సుజ్ఞాని కిచ్చు ముక్తి!**

శ్రీకృష్ణుడు శరద్రాత్రివేళ అడవికి వచ్చిన గోపికలను వారించాడు, మందలించాడు, సనాతనధర్మాన్ని గురించి హితోపదేశం చేశాడు. కానీ, వారు సాభిప్రాయంగా ఆయన్ను చూచారు. 'కామోత్కంఠిత' లయ్యారు. కామానికి సంభోగమే సమాధానం. నారదునికి వచ్చిన సందేహానికి పదహారువేల గోపికలకు పదహారు వేలరూపాలు అష్టమహిషులకు అష్టవిధరూపాలు ధరించి చరిస్తూ, తాను మరలా విడిగా యోగమగ్నుడై ఉండడం నారదునికి చూపించాడు కదా! లోకములో సకలజీవులు భగవంతునికి ప్రతిరూపాలే కాని, ఎవరి కర్మలు, కర్మఫలాలు వారి వారివి.

సోమిదమ్మల కోరికను కూడా స్వామి సున్నితంగా తిరస్కరించాడు. మీరు నన్నెప్పుడూ ధ్యానాకర్ణన మననాదులతో మానసపూజతో సాధనచేయండి. దానిచేతనే మీకు ముక్తి లభిస్తుంది. అదే కుబ్జ విషయానికి వస్తే

**క. ఏ వేదంబులగానని దేవోత్తముగాంచి ముక్తి తెరువడుగక రా**
**జీవేక్షణ రతి యడిగెను భావింప తదీయ కర్మఫలమెట్టిదియో !?** (భాగ 10–1–1497)

ఎవరు ఏవిధంగా ఉపాసిస్తే వారిని ఆ విధంగా అనుగ్రహించడమే భగవంతునికి సహజగుణం.

**'యే యథామాం ప్రపద్యంతే తాంస్తథైవ భజామ్యహమ్'** అని గీతావాక్యం.

**ఆ.వె. గోపజనములందు గోపికలందును – సకలజంతులందు సంచరించు**
**నా మహాత్మునకునుఁ బరాంగన లెవ్వరు? సర్వమయుడు లీలసలిపె గాక !** (భాగ. 10–1–1109)

పరీక్షిత్తు ప్రశ్నకు సరియైన సమాధానం భాగవత ప్రథమస్కంధంలోనే ఉన్నది.

**చ. జననము లేక, కర్మముల జాడలఁ బోక, సమస్త చిత్త వ**
**ర్తనుఁడగు చక్రికిన్ గవు లుదారపదంబుల జన్మకర్మముల్**
**వినుతులు సేయుచుండుదురు, వేదరహస్యములందు నెందుఁ జూ**
**చిన మఱి లేవు, జీవునికిఁ జెప్పిన కైవడి జన్మ కర్మముల్** (భాగ. 1–66)

జన్మ కర్మాలే భగవంతునికి లేవని వేదం చెబుతోంది. కాని కవులైనవారు ఆయనకు జన్మను, కర్మను అంటగట్టి ఆయన దివ్యమెన భూమికలో బహువిధాలైన లీలలు ప్రదర్శించినాడని ముఖ్యంగా కృష్ణావతారంలో

అనేక లీలలను వర్ణించినారు. జన్మకర్మలే లేని భగవంతుడు ఇవన్నీ తటస్థంగా చేశాడేగాని నిజానికి అందులో సత్యం లేదు. అందుచేత జీవునికి సంబంధించిన జన్మకర్మలు భగవంతునిపై ఆపాదించి ఆయన చేసిన లీలలను కర్మలుగా పరిగణించి దోషారోపణ చేయడం సరియైనవాదం కాదు. అందుచేత పరీక్షిత్తు మనవంటి సామాన్యుడిగా ఈ ప్రశ్నవేసినాడని మనం అనుకోవలసి వస్తున్నది. దీనికి ప్రమాణ శ్లోకం భగవద్గీతలో ఉన్నది.

**"జన్మ కర్మ చ మే దివ్యం - ఏవం యో వేత్తి తత్త్వతః ।**
**త్యక్త్వా దేహం పునర్జన్మ - నైతి మామేతి సోర్జున ॥"** - భగవద్గీత, జ్ఞానయోగం (4-9)

అర్జునా! ఎవడు ఈ ప్రకారంగా నా యొక్క దివ్యమైన పుట్టుకనూ దివ్యభూమికలోని కర్మలను యథార్థంగా తెలిసికొంటున్నాడో, అటువంటివాడు మరణానంతరం పునర్జన్మ లేకుండా సాయుజ్య మోక్షాన్ని పొందుతున్నాడు.

భాగవతం దశమస్కంధంలో విశేషించి 'రాసపంచాధ్యాయి', 'దివ్యభూమిక' లో సమన్వయింపదగినవి కాని కేవల 'మనుష్యభూమిక' లో నయితే అపార్థానికి దారితీస్తాయి. పరీక్షిత్తు భగవంతుని దివ్యభూమికను విస్మరించడం చేత మానవసామాన్యమైన ప్రశ్న వేశాడు. లీలావిభూతి అంటే దివ్యమైన భూమిక. ఈ లోకంలో భగవంతుడు దివ్యభూమికలో సంచరించాడు. దాన్ని తత్త్వతః అర్థం చేసుకున్నవారికి సందేహాలు రావు. యథార్థమనుకుంటే అవి అపార్థానికి దారితీస్తాయి.

**భ్రమరగీతలు**

ఉద్ధవుడు శ్రీకృష్ణుని దగ్గరి చుట్టం. శ్రీకృష్ణుడు భగవంతుడని తెలిసిన జ్ఞానులలో ఒకడు. నిరంతర జిజ్ఞాసువు. జ్ఞానమార్గంలో ఉన్న ఉద్ధవుని పిలిచి వ్రేపల్లెలో గోపికల భక్తిమార్గం తెలియజేయడానికి కృష్ణుడు వారి వద్దకు పంపి తాను వ్రేపల్లెకు వస్తానని కబురంపుతాడు. యశోదానందులను చూడటానికి కృష్ణుడు వ్రేపల్లెకు వస్తాడన్నదే అక్కడ ప్రధాన విషయం.

ఉద్ధవుడు గోపికల వద్దకు వెళ్లినపుడు ఒక భృంగం (నల్లని గండు తుమ్మెద) తప్పును క్షమింపు మన్నట్టుగా గోపిక పాదాలపై వ్రాలింది. దాన్ని ఉద్దేశించి అన్యాపదేశంగా, ఉపాలంభన పూర్వకంగా తమను వదలి వెళ్లిన శ్రీకృష్ణుని మనసులో పెట్టుకొని గోపికలు భ్రమర! దుర్జన మిత్రా! భృంగా! సమదాళీశ్వర! రోలంబేశ్వర! వంటి రమణీయ సంబోధనలతో కృష్ణుని ఉపాలంభించినారు. గోపికల శ్రీకృష్ణ విరహదుఃఖమే భ్రమరగీతలు.

మేనులు, ధైర్యము, చిత్తము, ప్రాణములు ఒక్కటొక్కటే తరిగి కరిగిపోతున్నాయని-

**తే.గీ. ప్రాణములు వోవ మఱి వచ్చి ప్రాణవిభుడు, ప్రాణిరక్షకుఁడగు తన్నుఁ, బ్రాణులెల్లఁ**
**తేరి దూఱంగ మఱియేమి సేయువాఁడు, వేగ విన్నప మొనరింపవే మహాత్మ!** (భాగ.10-1-1480)

అని **"దుఃఖార్ణవ మగ్నంబైన గోకులంబు నుద్ధరింపుము, రమానాథ!"** అని గోపికలు కన్నీరుమున్నీరవుతూ చెప్పిపంపిన సందేశమే భ్రమరగీతలు. ఇది గోపికల పరమైకాంత భక్తికి ప్రగాఢనిదర్శనం. దీనిని అధ్యయనం చేసినవారు గోపికలభక్తికంటే వేరొక భక్తిమార్గం ఉందని ఎప్పటికీ అంగీకరించరు. ఉద్ధవుడీ వార్తను శ్రీకృష్ణునికి చేరవేశాడు.

**రుక్మిణీ కల్యాణం**

సముద్రంలో ద్వారకానగర నిర్మాణం జరిగిన తర్వాతనే శ్రీకృష్ణరుక్మిణీ కల్యాణం జరిగింది. ఆ కల్యాణ కమనీయతను చూద్దాం!

రుక్మిణీకల్యాణ కథనం గరుడుడు దేవలోకంలో ఇంద్రుని ఓడించి అమృతాన్ని భువికి తెచ్చిన గొప్ప ఉపమానంతో ప్రారంభించబడింది. లక్ష్మీ అమ్మవారు స్వామివారికి నిత్యానపాయిని. దివినుండి భువికి అవతరించింది. కుచేలాది పరమైకాంత భక్తులను ఉద్ధరించడానికి అమ్మవారు స్వామిప్రక్కన ఉంటేనే సాధ్యమౌతుంది. అది స్వామి అవతార రహస్యం! ప్రద్యుమ్న, అనిరుద్ధులతో స్వామివారి కుటుంబం విస్తరించడానికి అమ్మవారి ఆగమనం అత్యావశ్యకం!

**మ. ఖగనాథుం డమరేంద్రు గెల్చి సుధ మున్ గైకొన్న చందంబునన్**
**జగతీనాథులఁ జైద్యపక్షచరులన్ సాల్వాదులం గెల్చి భ**
**ద్రగుఁడై చక్రి వరించె భీష్మకసుతన్ రాజీవగంధిన్ రమా**
**భగవత్యంశభవన్ మహాగుణమణిన్ బాలామణిన్ రుక్మిణిన్.** (10–1–1682)

భారతీయ ఆధ్యాత్మిక సంప్రదాయంలో జీవాత్మ, పరమాత్మలకు అనాది సంబంధం చెప్పబడింది. ఈ జీవేశ్వర సంబంధం లౌకిక – అలౌకిక సమన్వయంతో కూడుకొన్నది. జీవునికి, ఈశ్వరునికి ఎడతెగని ఈ సంబంధమే ఆధ్యాత్మిక శాస్త్రంగా చెప్పబడింది. దీనికి ప్రబల ప్రమాణం శ్రీకృష్ణపరమాత్మ చెప్పిన గీతాబోధలో భక్తియోగం అనే అధ్యాయంలో బహుధా నిరూపింపబడింది. భాగవతంలోని గోపికల శృంగారం కూడా జీవేశ్వర శృంగారమే. దీనినే శృంగారభక్తి లేదా మధురభక్తి అని ఆలంకారికులు చెప్పారు. రుక్మిణీకల్యాణ కథలో రుక్మిణి జీవాత్మ అయితే శ్రీకృష్ణుడు పరమాత్మ. ఏ నీ గుణములు కర్ణేంద్రియంబులు సోఁక దేహతాపంబులు దీరిపోవు... అనే సీసపద్యంలో **అట్టి నీయందు నా చిత్త మనవరతము – నచ్చియున్నది నీ యాన నానలేదు**
**కరుణఁ జూడుము కంసారి! ఖలవిదారి! – శ్రీయుతాకార! మానినీ చిత్తచోర!** (10–1–1701)

రుక్మిణీకల్యాణ కథలో రుక్మిణి శ్రీకృష్ణుని సింహంతోనే పోలుస్తుంది. 'శ్రీయుతమూర్తి ఓ **పురుష సింహమ! సింహము పాలి సొమ్ము** గోమాయువు కోరుచందమున' అనే నిన్ను నే కన్యల్ గోరరు? కోరదే మును రమా కాంతాలలామంబు **రాజన్యానేకప సింహ!** నావలననే జన్మించెనే మోహముల్. (10–1–1702)

గోపికలు కూడా కృష్ణుని మానినీ చిత్తచోరుడనే చెప్పారు. ఆ విషయంలో రుక్మిణికి, గోపికల భక్తికి భేదం లేదు. కాని, రుక్మిణియొక్క భక్తి దాస్యభక్తిగా మనం గ్రహించవలసి ఉంది. రుక్మిణీకల్యాణం మానవజాతికి ప్రేమయొక్క పరమార్థాన్ని చెప్పడంలో ముఖ్యంగా భగవత్సేవ సుకరంగా చేసి జన్మ ధన్యత చేసుకోవాలనేదే పరమార్థం. ఆ సేవకు ఆయన భార్య అయితేనే దానికి సార్థకత. భగవద్దాస్యం భార్య అయితేనే సౌలభ్యం. అందుచేత రుక్మిణి **దాస్యభక్తి**నే వరించింది. వైకుంఠంలో నిత్యమూ స్వామి పాదసంసేవనం చేసుకొనే భక్తురాలు

కనుక కృష్ణావతారంలోకూడా ఆ భక్తినే ఆమె అనుసరించింది. **'ప్రాణేశ! నీ మంజుభాషలు వినలేని కర్ణరంధ్రంబుల కలిమి యేల?....'** అనే సీసపద్యంలో **'ధన్యచరిత! నీకు దాస్యంబు సేయని జన్మమేల యెన్ని జన్మములకు'.** (10-1-1708)

రుక్మిణీకల్యాణ కథలో ఆమెకు ఉపాధ్యాయుడైన అగ్నిద్యోతనుడనే పేరు పోతనగారు పెట్టినదే. వేదంలో అగ్నికి సుదేవుడు అని పేరు. స్వామికి అమ్మవారికి మధ్య శృంగార రాయబారం జరిపిన అగ్నిద్యోతనుడు వైదికాగ్నియంత పవిత్రమైనవాడు అని పోతనగారి భావన. దానికి తగినట్లుగానే ఆయన రాయబారం ఫలించింది. కృష్ణుడు రుక్మిణి కోరికను మన్నించి దుర్గాదేవి ఆలయానికి వచ్చి ఆమెను స్వీకరించి, రుక్మి-శిశుపాలాదులను ఓడించి, ద్వారకా పట్టణానికి చేరుకొన్నాడు.

దశమస్కంధ ప్రారంభంలోనే, **శ్రీకంఠచాపఖండన...** అనే (10-1-1) పద్యంలో రామావతారంలో శివధనుర్భంగాన్ని చేసిన సన్నివేశం చెప్పడంలో రామాయణంలో రాముడు రావణసంహారానంతరం సీతను ఒంటరిగా రథంపై అడవులకు పంపడం అనుచితమైన చర్యగా భావించి, కృష్ణావతారంలో రుక్మిణియొక్క కోర్కెను మన్నించి, రుక్మిణిని రథంపై అధివసింపజేసి ద్వారకకు తీసుకొని రావడం ఆ దోషాన్ని పోగొట్టుకోవడానికి కృష్ణావతారంలో చేసిన ఉచితమైన చర్యగా పెద్దలు చెబుతారు.

**శ్లో. రాఘవత్వేఽభవత్సీతా రుక్మిణీ కృష్ణ జన్మని - అన్యేషు చావతారేషు విష్ణోరేషాఽనపాయినీ ॥**

విష్ణువు రాముడై పుట్టినప్పుడు లక్ష్మి సీతగా పుట్టింది. కృష్ణుడై పుట్టినప్పుడు రుక్మిణిగా పుట్టింది. అన్ని అవతారాలలో నిత్యానపాయినిగా ఉండి విష్ణుసేవ చేసింది.

మరొక ముఖ్యమైన అంశం, రుక్మిణీ శ్రీకృష్ణుల అనాది జీవేశ్వరసంబంధం. దీనిని పోతనకూడా సూచించాడు. దేవకీ సుతుకోర్కె తీఁగెలు వీడంగ వెలఁదికి మైదీఁగె వీడఁ దొణఁగెఁ.... అనే సీసపద్యంలో పద్మనయను వలనఁ బ్రమదంబు నిండార నెలఁత యౌవనంబు నిండియుండె. (10-1-1689) అనే ఎత్తుగీతిలో అమ్మవారికి స్వామివారితో గల అనపాయినీత్వం చెప్పబడింది. **భగవతీం శ్రియం దేవీం నిత్యానపాయినీం** అని భగద్రామానుజుల శరణాగతి గద్య. విడదీయడానికి వీలులేని అవినాభావ సంబంధమే అనపాయినీత్వం. **విష్ణోః శ్రీరనపాయినీ** (విష్ణుపురాణం 1-8-1) రుక్మిణీకల్యాణ కథలో జీవేశ్వరుల అనాదిసంబంధం, దాస్యభక్తి, శరణాగతి, అవినాభావ సంబంధమైన అనపాయినీత్వం సమగ్రంగా నిరూపింపబడింది. శ్రీవేంకటేశప్రపత్తిలో శ్రీవాదిభీకరమహాగురు అణ్ణాగారు ఇలా స్తుతించారు.

**ఈశానాం జగతోఽస్య వేంకటపతే ర్విష్ణోఃపరాం ప్రేయసీమ్**
**తద్వక్షఃస్థల నిత్యవాసరసికాం తత్ క్షాంతి సంవర్ధినీమ్ ।**
**పద్మాలంకృత పాణిపల్లవయుగాం పద్మాసనస్థాం శ్రియమ్**
**వాత్సల్యాది గుణోజ్జ్వలాం భగవతీం వందే జగన్మాతరమ్ ॥**

**- డా॥ ముదివేడు ప్రభాకరరావు**

# దశమస్కంధం - పూర్వభాగ కథాసారం

పరీక్షిన్మహారాజు శుకమహర్షిని అడుగుతున్నాడు.

"మహర్షీ! మీ కృపతో చంద్రసూర్యవంశరాజులచరిత్రలు విన్నాను. మా తాతతండ్రులకు కృష్ణుడు ఎన్నో విధాల బాసటగా నిల్చాడు. అంతేకాదు – నేను తల్లిగర్భంలో దుర్భరవేదనతో పరితపిస్తున్న సమయంలో ఆ పరమాత్మ నన్ను రక్షించాడు. ఆ మహానుభావుడు కృష్ణుడు ఎక్కడ పుట్టాడు? ఎక్కడ పెరిగాడు? లోకోత్తరమైన ఎన్నో పనులు ఎలా చేశాడు? సవిస్తరంగా తెలుసుకోవాలి అనుకుంటున్నాను. దయతో ఆ విశేషాలన్నీ వివరించండి" అని ప్రార్థించాడు.

ఇలా అడగడంతో దశమస్కంధం పూర్వభాగం మొదలవుతుంది.

### శ్రీకృష్ణచరిత్ర

పరీక్షిత్తుకుగల జిజ్ఞాసకు, వినయవిధేయతలకు సంతోషించిన శుకమహర్షి ఇలా చెప్తున్నాడు.

"రాజా! ఆలకించు. ద్వాపరయుగాదిలో రాక్షసులు రాజులుగా పుట్టారు. సమస్తమూ ఆక్రమించుకొన్నారు. నీతినియమాలు లేక దుర్మార్గంలో నడిచారు. భూమి తల్లడిల్లింది. భూమాత గోరూపంతో వెళ్లి, బ్రహ్మ దేవునికి తన ఆవేదనంతా విన్నవించింది. భూమాత తోడురాగా బ్రహ్మ దేవతలతో కలిసి విష్ణువుదగ్గరి వెళ్లాడు. స్థిరచిత్తంతో 'పురుషసూక్తం' పఠించాడు. వెంటనే అతనికి ఒకమాట విన్పించింది. బ్రహ్మ ఆ వాక్యార్థాన్ని భూమాతకూ, దేవతలకూ వివరించాడు.

"శ్రీహరి వసుదేవునికొడుకుగా జన్మించనున్నాడు. ఆదిశేషుడు స్వామికి అన్నగా అవతరిస్తాడు. కనుక దేవతల్లారా! మీరందరూ భూలోకంలో యాదవులుగా జన్మించాలి. అప్సరసలు సుందరస్త్రీలై జన్మించాలి. శ్రీహరి సంకల్పించినకార్యం సఫలం కావడానికి యోగమాయ జన్మిస్తుంది. భూమాతా! నీమనోవ్యథ తీర్తుంది. ఇక నిశ్చింతగా ఉండు"– అని ఓదార్చి పంపించేశాడు. ఆ మేరకే అన్నీ తప్పక జరిగాయి.

### కంసునిదౌష్ట్యం

మథురాధిపతి శూరసేనుడు. అతనితర్వాత ఉగ్రసేనుడు రాజయ్యాడు. వసుదేవుడు మంత్రిగా రాజ్యం పాలిస్తున్నాడు. ఉగ్రసేనునికొడుకు కంసుడు. కంసునిదాయాదిచెల్లెలు దేవకి. దేవకీవసుదేవులకు వివాహం జరిగింది. ఆ పెండ్లివేడుకల్లో భాగంగా కంసుడు ఒకరథంలో దేవకీవసుదేవుల్ని కూర్చోబెట్టుకొని, రథం నడపుతున్నాడు. రథం రాజమార్గంలో సాగుతూంది. ఇంతలో ఆకాశవాణి విన్పించింది.

"కంసా! ఏమిటి నీ సంబరం? నీ చావు నిన్ను వెన్నంటివస్తూంది. నీ వెంతో సంతోషంతో ఊరేగించే దేవకీ వసుదేవుల అష్టమసంతానమే నీప్రాణనష్టానికి కారణమవుతాడు. ఇది ముమ్మాటికీ నిజం!" ఈ మాట వినగానే కంసుడు ఉలిక్కి పడ్డాడు. 'చెల్లెల్ని చంపేస్తే...' అని ఆలోచించి, కత్తి పైకెత్తాడు. వసుదేవుడు అడ్డుపడ్డాడు. "నీ మరణానికి కారణమయ్యే పిల్లల్ని నీకు అప్పగిస్తాను. దేవకిని వదలిపెట్టు" – అన్నాడు. కంసుడు 'సరే!'

నన్నాడు. సంవత్సరకాలం గడిచింది. వసుదేవుడు ఆడినమాటమేరకు తన మొదటిబిడ్డను కంసునికి అప్పగించాడు. అతని సత్యవ్రతానికి కంసుడు ఆశ్చర్యపడి “ఈ బిడ్డ నాకు అక్కర్లేదు. ఎనిమిదవ శిశువుకదా నా పాలిటి యముడు? ఆ బిడ్డ నిస్తే చాలు. వానిసంగతి నేను చూచుకొంటాను. ఈ బిడ్డను తీసుకెళ్లు” అని పంపించేశాడు.

ఒకరోజు నారదుడు కంసునిదగ్గరికి వచ్చాడు. కంసుడు దేవర్షిని పూజించాడు. నారదుడు పూజలందుకొన్నాడు. తర్వాత “కంసా! నీవు సామాన్యుడివి కావు. రాక్షసాంశంతో జన్మించినవాడివి. కాలనేమివి. విష్ణువు దేవకీపుత్రుడై పుట్టి, రాక్షసులందర్నీ చంపేయడం ఖాయం. అంతేకాదు - దేవతలందరూ యాదవులుగా జన్మించారు” అని దేవరహస్యం చెప్పి, నారాయణనామస్మరణతో వెళ్లిపోయాడు. ఇక కంసునికి భయం పట్టుకొంది. ముందుగా జాగ్రత్తపడడం మంచిదనుకొన్నాడు. దేవకీవసుదేవుల్ని చెరసాలలో బంధించాడు. ఏ బిడ్డవల్ల ఏమవుతుందో ననే భయంతో, పుట్టిన ప్రతిబిడ్డనూ నేలకేసి కొట్టి, నిర్దయతో దారుణంగా చంపాడు. తండ్రి ఉగ్రసేనుణ్ణి కారాగారంలో బంధించాడు. తానే రాజయ్యాడు. బాణుడు, భౌముడు, మహాశనుడు మున్నగురాక్షసులతో యాదవుల్ని పీడించసాగాడు.

**బలరామజననం**

దేవకి ఏడవసారి గర్భం దాల్చింది. ఆదిశేషుడు విష్ణుఅంశతో దేవకీగర్భంలో ప్రవేశించాడు. విష్ణువు యోగమాయతో వ్రేపల్లెలో ఉండే వసుదేవునిమరోభార్య రోహిణిగర్భంలో ప్రవేశించాడు. “నా శేషరూపతేజస్సును రోహిణిగర్భంలో ఉంచు. నేను నా అంశతో దేవకిగర్భంలో ప్రవేశిస్తా నని యోగమాయాదేవిని ఆజ్ఞాపించాడు. యోగమాయ అలాగే చేసింది. రోహిణీగర్భసంజాతుడుగా బలరాముడు పుట్టాడు.

దేవకి అష్టమగర్భం దాల్చింది. ఇటు దేవకీవసుదేవులకూ, అటు కంసునికీ గుండెల్లో దడ పుట్టుకవచ్చింది. పుట్టేబిడ్డకు జరుగబోయే వినాశనాన్ని తలచుకొని దేవకీవసుదేవులు బెంబేలెత్తిపోయారు. తనకు మరణం దగ్గర్లోనే ఉందని కంసుడు డీలాపడి, కట్టుదిట్టాలుచేయడం మొదలుపెట్టాడు. కాలం ఆగదుకదా ! యోగమాయ నందుని భార్య యశోదబిడ్డగా పుట్టింది. మాయాప్రభావంవల్ల లోకం మైమరచి ఉంది. అష్టమగర్భంలో పుట్టిన బాలకృష్ణుణ్ణి కంసునిబారినుండి రక్షించడంకోసం బిడ్డను గుండెకు హత్తుకొని, గోకులానికి బయలుదేరాడు - వసుదేవుడు. యోగమాయవల్ల అడ్డంకులు తొలగిపోయాయి. ఆదిశేషుడు పడగ విప్పి వెన్వెంట వస్తుంటే – యమునానది దారి చూపుతుంటే - గోకులంలోని యశోదామందిరం చేరుకొన్నాడు - వసుదేవుడు. ఆమెప్రక్కలో బాలకృష్ణుణ్ణి ఉంచి, అక్కడి యోగమాయను ఎత్తుకొని, మరలా కారాగారం చేరి, దేవకిప్రక్కలో పడుకోబెట్టాడు. యోగమాయవల్ల - ఈ సన్నివేశమంతా దేవకికీ, యశోదకూ తెలియదు.

యోగమాయ ఆవులించింది. భటులు నివ్వెరపోయారు. జాగ్రత్తపడ్డారు. వెంటనే కంసునికి ఆ వార్త అందించారు. చర్రున వచ్చినకంసుడు ఆ బిడ్డను తీసుకొని, నేలకేసి కొట్టాడు. ఆ బిడ్డ నేలపై పడకుండా రివ్వున ఆకాశానికి ఎగిరింది. ఎనిమిదిఆయుధాలతో, ఎనిమిదిచేతులతో ఆదిశక్తిగా దర్శన మిచ్చింది. “కంసా! నీకు చావు మూడింది. నిన్ను అంతమొందించడానికై మరోచోట శిశువు పుట్టాడు. ఆ బిడ్డను నీవేమీ చేయలేవు” - అంటూ మాయమయ్యింది. కంసుడు ఇక చేసేదేమీలేక దేవకీవసుదేవుల్ని కారాగారంనుండి విడిపించాడు. ఆపై

సభ ఏర్పాటు చేశాడు. సహచరుల్ని సలహాలడిగాడు. వాళ్లు చుట్టుప్రక్కల్లో పుట్టి ఉండే బిడ్డలందర్నీ చంపుదాం. గోవుల్ని వధిస్తాం. బ్రాహ్మణుల్ని పీడిద్దాం. తాపసుల్ని హింసిద్దాం" – అన్నారు. కాలవైపరీత్యంతో కంసుడు ఊకొట్టాడు. రాజాజ్ఞతో కంససేవకులు విజృంభించారు. వాళ్లఆగడాలకు అంతు లేకపోయింది. వినాశకాలం దాపురిస్తే దుష్టులప్రవర్తనలు ఇలాగే ఉంటాయి.

**గోకులంలో బాలకృష్ణుడు**

యశోదానందులు బాలకృష్ణునికి జాతకర్మలు చేయించారు. దానధర్మాలు సమృద్ధిగా చేశారు. గోపాలురు కానుకల్తో వచ్చి, కృష్ణుణ్ణి దర్శించి, ఆనందించారు. గోపికలు "మనయశోద చిన్ని మగవాని గనె నట! చూచి వత్త మమ్మ సుదతులార!" అంటూ కలిసికట్టుగా వచ్చి, బిడ్డను చూచి, చాలా సంతోషించారు. బాలుణ్ణి జలకమాడించి, ఉయ్యాల్లో పడుకోపెట్టి, జోజోలు పాడారు.

నందుడు ఏటేటా కంసునికి పుల్లరికానుకలు అర్పించడానికై మథురకు వెళ్లాడు. కంసుణ్ణి దర్శించాక– వసుదేవుణ్ణి కలిశాడు. వసుదేవుడు బాలునిక్షేమవార్త లడిగాడు. అంతేకాదు – నందుడు 'నాకొడుకు నీ కొడుకే' అని వసుదేవుణ్ణి ఊరడించాడు. అంతా విన్నాక వసుదేవుడు "రాక్షసులు మాయావులు, కుటిలబుద్ధులు, పసిపిల్లవానికి అరిష్టాలుంటాయి. జాగ్రత్త సుమా!" అని మరీ మరీ హెచ్చరించాడు. వసుదేవుడు ఎందుకు ఇలాంటి జాగ్రత్తలు చెప్పాడో నని తర్కించుకొంటూ నందుడు వ్రేపల్లెకు చేరాడు.

**పూతనాహరణం**

కంసుణ్ణి మరణభయం వెంటాడుతూంది. మంత్రిమండలిసలహాలమేరకు కామరూపులైన రాక్షసుల్తో– శిశువుల్ని సంహరించేందుకు ప్రత్యేక పథకంవేశాడు. ఆ పథకాన్ని అమలుపరచేవాళ్లలో పూతన ఒకతె. పూతన గ్రామాల్లో తిరుగుతూ, శిశువులకు పాలు గుడుపుతూ, ప్రాణాలు తీయడం తన రాజధర్మంగా తలపోసింది. ఒకసారి పూతన వ్రేపల్లెకు వచ్చింది. కామరూపిణి కనుక అందగత్తెగా మారింది. ఊరివాళ్లను సమ్మోహపరచింది. యశోద ఇంటివైపు అడుగులు వేసింది. ఉయ్యాలలో – కృష్ణుణ్ణి (బాలుణ్ణి) చూచింది. మాయాతీతుడైన ఆ బాలపరబ్రహ్మ ఉయ్యాలలో నిద్రపోతున్నట్లు నటిస్తున్నాడు. పూతన అక్కడికి చేరి, మెల్లగా తట్టిలేపి, ఒడిలోకి తీసుకొనింది. కాసంత దూరంలో ఆడిస్తూ కూర్చొనింది. 'పసిపిల్లవానికి పాలమీద చింత' అని పూతనకు తెలుసు. ఎంతో పారవశ్యాన్ని అభినయిస్తూ, బిడ్డకు పాలివ్వబోయింది. పాలరూపంలో ఉండేది విష మని కృష్ణునికి తెలుసు. బాలుడు లీలాబాలుడు గదా! అందువల్ల ఒక గుక్క త్రాగాడు. పూతన ఒక్కమారుగా పెద్దగా చావుకేక పెట్టింది. కూర్చొన్నపూతన కళ్లు తేలవేసి, నేలపై పడిపోయింది. ఆమెశరీరం ఒకటిన్నరఆమడ పొడవై పడుతుంటే – చెట్లు చేమలు ఫెళఫెళలాడాయి. గోపాలురు భయపడ్డారు. అయినా కృష్ణుడు ఆడుకొంటూనే ఉన్నాడు. గోపికలు వచ్చి, 'గభాలున' బిడ్డను లాగారు. దిష్టితీశారు. రక్ష కట్టారు. దిగదుడుపు చేశారు. ఆవుడెక్కలోని మట్టితీసి, బొట్టుపెట్టారు. గోమూత్రం కాసింత చల్లారు. ఆవుపేడ అవయవాలకు పులిమారు. కన్నయ్య ఇదంతా మాయ అనుకొంటూ హాయిగా నవ్వుతూనే ఉన్నాడు. నిజమే! జగద్రక్షకుడికి రక్ష కట్టడం ఏంటి ? అయినా ప్రేమ, వాత్సల్యం ఇలాంటి పనులు చేయిస్తుంటాయి.

ఇంతలో నందుడు రానేవచ్చాడు. పూతనశరీరం అంతపెద్దదై ఇంటిముందు పడి ఉండడం మంచిది కాదని తలచి, ముందుగా పూతనశరీరానికి సంస్కారం చేయాలనుకొన్నాడు. ఆ శరీరాన్ని గొడ్డళ్లతో ముక్కలు ముక్కలు చేసి, ఆపై కుప్పగా పోసి, గోపాలురు దహనసంస్కారం చేశారు. మంటలు రేగుతోంటే పూతన కళేబరంనుంచీ సువాసనలు వ్యాపించాయి. కృష్ణస్పర్శవల్ల నిజంగా 'పూతన' – (పవిత్రురాలు) పూతనే అయింది.

**శకటాసురభంజనం**

ఆవేళ రోహిణీనక్షత్రం. అదే శ్రీకృష్ణుని జన్మనక్షత్రంకూడా! వ్రేపల్లె అంతా వేడుకలూ, వినోదాలూ... జరుపుకొంటున్నారు. కృష్ణుడు పడుకొని ఉంటే ఒకబండి ఆ పిల్లవానికేసి దొర్లుతూ వస్తూంది. చుట్టూ ఎవరూ లేరు. కృష్ణుడు చూచాడు. తన చిన్నిచిన్నికాళ్లతో బండిని ఒక్క తన్ను తన్నాడు. అంతే! ఆ బండి ఆకాశానికి ఎగిరింది. ఆపై ముక్కలై రాక్షసరూపంతో పడింది. అతడు శకటాసురుడు. తనమరణాన్ని కోరితెచ్చుకొన్న రాక్షసుడు. ఈ హడావిడికి యశోద పరుగున వచ్చింది. బిడ్డను గుండెకు హత్తుకొనింది, రక్ష కట్టం'డని బ్రాహ్మణుల్ని వేడుకొనింది. చివరకు ఆ శకటరాక్షసునికి దహనక్రియలు చేశారు.

**తృణావర్తసంహారం**

బాలకృష్ణుడు రోజురోజుకు పెరుగుతున్నాడు. పడుకొన్నబాలుడు కూర్చునేవా డయ్యాడు. ఒకసారి తల్లి యశోద ప్రేమతో ఒడిలో కూర్చో బెట్టుకొనింది. బాలుడు బరువెక్కువవుతున్నాడు. తల్లి మెల్లగా బిడ్డను నేలకు దించింది. ఇంతలో సుడిగాలి వీచింది. కృష్ణుణ్ణి ఎత్తిపడేయాలని వచ్చినవాడు – రాక్షసుడు. కానీ ఆ గాలి బాలుణ్ణి కదిలించలేకపోయింది. చివరకు ఆ రాక్షసుడు గాలివేగాన్ని పెంచాడు. పిల్లవాడు గాలిలోకి తేలాడు. ఈలోగా బాలుడు కన్పించకపోవడంతో యశోద బాధపడింది. కృష్ణుణ్ణి రాక్షసుడు గాలిలోకైతే ఎత్తగలిగాడే కానీ ఆతర్వాత ఆ సుడిగాలికూడా బలహీనపడింది. అప్పుడే కృష్ణుడు తన రెండుచేతుల్తో రాక్షసునిమెడ చుట్టేశాడు. మెడపట్టుకొని వ్రేలాడసాగాడు. చూచేవాళ్లకు ఒక కొండ వ్రేలాడుతున్నట్లు అనిపిస్తూంది. శిశువుబరువుకు తట్టుకోలేక రాక్షసుడు నేలపడి ముక్కలు ముక్కలయ్యాడు. అతడే తృణావర్తుడు.

**గర్గమహర్షిరాక –**

యాదవపురోహితుడైన గర్గుడు ఒకసారి నందునిఇంటికి వచ్చాడు. నందుడు తమక్షేమవార్తలతోపాటు పిల్లలసంగతులూ విన్నవించాడు. గర్గుడు ఆ బాలురకు నామకరణంచేశాడు. పిల్లలకు క్రమంగా రాముడు, కృష్ణుడు – అనేపేర్లు పెట్టాడు. జనులు రమించేలాగా తిరుగుతాడు కనుక రాముడు, యాదవుల నుండి వ్రేపల్లెలోకి సంకర్షణం (లాగబడడం) చేయబడ్డాడు. కనుక సంకర్షణుడనీ – మహాబలవంతుడు కనుక బలుడనీ పేర్లు పెట్టాడు. నల్లనివాడు కనుక రెండవబాలుణ్ణి 'కృష్ణుడు' అన్నాడు. అంతేకాదు – ఈ ఇద్దరూ కారణజన్ములు. వీళ్లవల్ల శుభపరంపరలు చేకూర్తాయనీ చెప్పి, గర్గుడు వెళ్లిపోయాడు. రామకృష్ణులు కూర్చొనే దశనుండి, నడిచేదశకు వచ్చారు. ఆపై పరిగెత్తడం మొదలు పెట్టారు. గోకులమంతా వాళ్లదే! ఎక్కడ చూచినా వాళ్లే! గోపికల ఇండ్లన్నీ వాళ్లవే! వాళ్లఅల్లరికి హద్దేలేదు. ఆ ముద్దు ముద్దు అల్లరిపనులు చూచి, పరవశిస్తూ వచ్చారు – గోపికలు. రోజులు

గడిచేకొద్దీ వాళ్లమితిమీరినఅల్లరిపనుల్ని భరించలేకపోయారు. అందరూ మూకుమ్మడిగా వచ్చి, యశోదకు బాలకృష్ణునిఅల్లర్లపై 'ఫిర్యాదు' చేశారు.

"అమ్మా! యశోదమ్మా! వినమ్మా! అల్లరి, కల్లరి కృష్ణునిఆగడాల్ని! పాలు లేవని బాధపడుతుంటే – లేగల్ని విడిపించి, ఆవులదగ్గరికి తోలేస్తున్నాడు. ఇంట్లో మీగడ, పాలు తినీ, త్రాగీ, కుండలు బద్దలు కొడుతున్నాడు. ఈ అల్లరికి అదుపు, ఆజ్ఞా లేదా? ఉట్టిమీది కుండలు అందకపోతే – పగలగొట్టున్నాడు. మా యింట్లోని మీగడపెరుగు తీసి, కోడలిమూతికి కాసింతపూసి పరుగెత్తుతాడు. కోడలే మీగడ, పెరుగు తినిం దని అత్తా – కోడళ్ల మధ్య గొడవలు తెస్తున్నాడమ్మా! మా యింట్లో నెయ్యి త్రాగి, పక్కింట్లో కుండ బెట్టి, తగవులు తెచ్చిపెడ్తున్నాడు. చిన్నా, పెద్దా అనే తేడాలేకుండా తగని పరిహాసప్రసంగాలు చేస్తున్నాడమ్మా! పట్టుకొందామంటే దొరక్కుండా తప్పించుకొని పోతాడు. ఈ చిక్కడూ, దొరకడుతో ఎట్లమ్మా ఏగించేది? అమ్మా! నిజం చెప్తున్నాం. ఇంక ఈ వ్రేపల్లెలో మేం ఉండలేమమ్మా! మా ఆవులపై ఒట్టు! మరోచోటికి వెళ్లిపోతాం" – అని తమ బాధలన్నీ పూసగ్రుచ్చినట్లు ఏకరవుపెట్టారు. యశోద అంతా వినింది. "అమ్మలారా! నా చిన్ని కుమారుడు నన్ను విడిచి ఎక్కడికీ వెళ్లడే!! పసిబిడ్డమీద ఇంతింత నిందలు వేస్తారా? అంటూ గద్దించి, గోపికల్ని పంపించేసింది. ఆ ఫిర్యాదులూ, తల్లిసమర్థనా విని, బుద్ధిగా కూర్చొన్నాడు - జగన్నాటకసూత్రధారి!

ఒకరోజు బలరాముడూ, గోపబాలురూ గబగబా పరుగెత్తుకొని, యశోదవద్దకు వచ్చారు. "అమ్మా! కృష్ణుడు మన్ను తిన్నాడు. మేం కండ్లారా చూశాం" అన్నారు. యశోద పరుగు పరుగున వచ్చి, బాలకృష్ణుణ్ణి" ఏరా ఎందుకు తిన్నావు మన్ను? నామాట వినవా ఏంటి? అని గద్దించింది. కృష్ణుడు ఓరచూపుల్తో బలరామాదుల్ని చూచాడు. తల్లి రుసరుసలాడడమూ చూచాడు. "అమ్మా! నేనేం చిన్న బిడ్డనా? నాకు ఆకలేంటమ్మా? మన్ను తినడానికి నేనేం వెర్రివాణ్ణా? వీళ్లమాటలు అస్సలు నమ్మవద్దమ్మా! నన్ను ఎట్లయినా నీతో కొట్టించాలని ఇలా చేశారమ్మా! అంతగా నాపై నమ్మకంలేకపోతే – నా నోరు వాసన చూడమ్మా!" అన్నాడు. యశోద కానీ చూస్తామని 'నోరు తెరువు' అనింది. కృష్ణుడు నోరు తెరిచాడు. అంతే!! ఆనోటిలో సముద్రాలూ, పర్వతాలూ, సూర్యుడూ, చంద్రుడూ, అగ్నీ – ఇలా కొన్నేమిటి? విశ్వమంతా కన్పించింది. మరి వాసుదేవునితత్త్వం అంటే ఇదే కదా! యశోద ఆశ్చర్యంతో ఉలిక్కిపడింది. ఇది కలేనా? వైష్ణవమాయనా? నేను యశోదను కానా? ఈ చిన్నిబాలుని నోటిలో విశ్వమంతా కన్పిస్తూందేమిటి?' అని దిగ్భ్రాంతురాలైంది. కృష్ణుడు యశోదపై మాయ గప్పాడు. అంతే! యశోద మామూలుతల్లి అయింది. బిడ్డను దగ్గరికి తీసుకొనింది. జరిగిందీ, చూచిందీ అంతా మరచిపోయింది. అంతా వైష్ణవమాయ!! ఈ మాయను దాటడం ఎవ్వరికీ శక్యంకాదు.

పరమాత్మునికి తల్లిదండ్రులైన యశోదానందులు ఎంత భాగ్యవంతులోకదా!' అని పరీక్షిత్తు అనగానే శుకమహర్షి వాళ్లు దేవజాతికి చెందినవాళ్లనీ, ఆ దంపతుల పూర్వవృత్తాంతం చెప్పాడు...

### యశోదానందల పూర్వజన్మవృత్తాంతం

రాజా! వసువుల్లో ముఖ్యుడు ద్రోణుడు. అతనిభార్య ధర. బ్రహ్మ ధరాద్రోణుల్ని భూలోకంలో జన్మించాల్సిందిగా ఆజ్ఞాపించాడు. కానీ ఆ దంపతులు మాకు నిరంతరం విష్ణుసేవాభాగ్యం కలిగితే అలాగే జన్మిస్తా మని ప్రాధేయపడ్డారు.

బ్రహ్మ 'అలాగే' అన్నాడు. వాళ్లే యశోదానందులు. బ్రహ్మవాగ్దానం ప్రకారమే యశోదానందులు కృష్ణపరమాత్మ సేవాభాగ్యానికి నోచుకొని, ధన్యులయ్యారు - అని శుకమహర్షి వాళ్లపూర్వజన్మవృత్తాంతం చెప్పాడు.

**ఉలూఖలబంధనం - యమళార్జునమోక్షణం**

యశోద ఒకరోజు పెరుగు చిలుకుతూ ఉంటే కృష్ణుడు తనకు పాలిమ్మన్నాడు. యశోద బిడ్డను ఒడిలో పెట్టుకొని పాలు కుడుపుతూ ఉంది. ఈ లోగా పొయ్యిమీద పాలు పొంగడం చూచింది. యశోద చర్రున లేచింది. బిడ్డను నేలపై పడుకోబెట్టింది. కృష్ణునికి కోపం వచ్చింది. వెంటనే ఒక రాయి తీసుకొని సగం చిలికిన పెరుగు కుండను పగులగొట్టాడు. వెన్న తింటూ పక్కింటికి వెళ్లాడు. యశోద తిరిగి వచ్చి చూచేసరికి కృష్ణుడు లేడు. పక్కింటిరోలెక్కి వెన్న తీసుకొని ఒకకోతికి పెట్టడం చూచింది. యశోదమ్మకు చిరాకువేసింది. కన్నయ్యను పట్టుకోవాలనుకొనింది. ఎడాపెడా దెబ్బలు వాయించాలనుకొనింది. ఈలోగా 'కృష్ణుడు క్షమించమ్మా!' అంటూ కన్నీరు కారుస్తూ పట్టువడ్డాడు. యశోదకు బాలకృష్ణుణ్ణి చూడగానే కొట్టాలనిపించలేదు. అయినా కోపం తమాయించుకోలేక నీ అల్లరి భరించలేక పోతున్నా. నీళ్లలో దూకుతావు. గట్టెక్కాలని చూస్తున్నావు. మట్టిలో ఆడుకొంటావు. కంబంచాటున దాక్కొంటావు. చిన్నదానాలకై, చేతులు చాస్తావు. రాచవేటలతో నిందలకు ఒడిగడుతున్నావు. నీళ్లకు అడ్డుకట్ట వేస్తావు. (ఈ మాటలన్నీ స్వామివారి అవతారాల్ని సూచించేవే!) కానీ ఇప్పుడేం చేస్తావో చూద్దాంలే! నిన్ను తాటితో కట్టిపడేస్తా' అంటూ తాడు తెచ్చింది. ఎన్ని తాళ్లుతెచ్చినా ఆ బాలకృష్ణుని నడుముకు చాలడంలేదు. ఇంకా రెండంగుళాలు తక్కువే అవుతూన్నాయి. తల్లి ఇలా ప్రయత్నం చేసి చేసి, విసిగిపోయింది. అప్పుడు కృష్ణుడు యశోదకు చిక్కాడు. ఆమె ఎట్లో తాటితో రోటికి కట్టేసింది - చిన్నికృష్ణుణ్ణి. ప్రేమకూ, వాత్సల్యభక్తికీ స్వామి చిక్కుతాడేకానీ, బెదిరింపులకు లొంగడు కదా!

కృష్ణుడు కాసేవు అలాగే ఉన్నాడు. ఆ తర్వాత గుంజడం మొదలుపెట్టాడు. రోలు అడ్డంగా తిరగబడింది. ఆ రోలు ఈడ్చుకొంటూ, ఈడ్చుకొంటూ రెండు మద్దిచెట్ల మధ్యలోకి లాక్కొని వెళ్లాడు. ఆపై కదల్లేదు. చివరకు ఆ మద్దిచెట్లు కూకటివేళ్లతో నేలకూలాయి. నలకూబరమణిగ్రీవులనే యక్షులుగా ఆ చెట్లుమారి, కృష్ణునికి నమస్కరించి, వెళ్లిపోయారు. యశోద కన్నయ్యను వెదుక్కొంటూ వచ్చి, మద్దిచెట్టుమధ్యలో ఉన్న కొడుకును చూచి, గబాలున ఎత్తుకొనింది' - అని శుకుడు చెబితే పరీక్షిత్తు 'ఆ యక్షుల వృత్తాంతం తెల్పం'డని ప్రార్థించాడు.

**ఇద్దరుయక్షుల పూర్వవృత్తాంతం**

రాజా! ఆలకించు? నలకూబరమణిగ్రీవులు కుబేరునికొడుకులు. వాళ్లు శివభక్తులు. వీళ్లకు మద్యపానం అలవాటు. ఒకసారి కైలాసగిరివనాల్లో ప్రియురాండ్రతో జలకాలాడుతున్నారు. అటువైపు నారదమహర్షి రాగా - యక్షులభార్యలు కలవరంతో వస్త్రాలు ధరించారు. కానీ యక్షులుమాత్రం దిగంబరులుగానే ఉన్నారు. నారదునికి కోపం వచ్చింది. "తత్ - సంపన్నాంధుల కంజనం బగుఁ జుమీ దారిద్ర్య మూహింపఁగన్" అని వాళ్ల ఐశ్వర్యమదానికి నొచ్చుకొన్నాడు. వాళ్లను భూలోకంలో నూరుదివ్యసంవత్సరాలు మద్దిచెట్లుగా పడి ఉండండి' అని శపించాడు. ఆ యిద్దరూ ప్రాధేయపడ్డారు. నారదుడు 'గోవిందునిచరణస్పర్శతో మీకు శాపవిమోచనం అవుతుంది' అని

అనుగ్రహించాడు. 'శాపవిమోచనానంతరం మీరు ముక్తులై నారాయణభక్తులవుతారు' అన్నాడు - ఇదీ వాళ్ల పూర్వవృత్తాంతం' అని శుకుడు చెప్పాడు.

**బృందావనవిహారం**

వ్రేపల్లెలోనే నందాదులు ఉంటున్నారు. కానీ అడపా దడపా ఎన్నో ఇబ్బందులు ఎదురవుతున్నాయి. అందువల్ల వేరే ప్రాంతానికి మార్చడం మంచిదని ఒక యాదవవృద్ధుడు నందునికి సలహా ఇచ్చాడు. నందుడు 'నిజమేకదా!' అని వ్రేపల్లెనుండి బృందావనంకు నివాసాన్ని మార్చాడు.

ఒకసారి రామకృష్ణులు గోపబాలురతో కలిసి ఆవుదూడల్ని మేపుతున్నారు. ఒక రాక్షసుడు వత్స (దూడ) రూపంతో వచ్చి - అక్కడి దూడల్లో కలిసిపోయాడు. దూడల్లో వింతగా ఉండే ఆ దూడను కృష్ణుడు చూచాడు. తమదూడ కాదని పసిగట్టాడు. వెంటనే ఆ దూడకాళ్లు పట్టుకొని మద్దిచెట్లుకు కొట్టి, బాది చంపేశాడు. గోపబాలురు చూచి, తమదూడలకు ఆపదలు తప్పినందుకు సంతోషించారు.

అలాగే ఒకమారు రామకృష్ణులు దూడల్ని ఒక కొలనిదగ్గరికి తీసుకెళ్లి నీరు త్రాగించాలనుకొన్నారు. ఇంతలో ఒక కొంగ అమాంతం వచ్చి, కృష్ణుణ్ణి మింగేసింది. కృష్ణుడు దానికంఠంలో చిక్కుకొన్నాడు. గొంతులో భరించరానిమంటలకు తట్టుకోలేక కొంగ కృష్ణుణ్ణి కక్కేసింది. కృష్ణుడు బయటపడ్డాడు. కానీ కొంగ అంతటితో ఆగలేదు. ముక్కుతో కృష్ణుణ్ణి పొడవాలనుకొనింది. కృష్ణుడు వెంటనే దానినోటిని రెండుగా చీల్చేశాడు. కొంగరూపంలోని రాక్షసుడు (బకాసురుడు) చచ్చాడు. గోపాలురందరూ ఆశ్చర్యంతో వింతగా చూచారు.

మరోసారి కృష్ణుడు స్నేహితుల్తో ఆవులు మేపుకొంటూ అడవికి వెళ్లాడు. వయోభేదంలేకుండా గోపాలురు కలిసికట్టుగా ఒకరిచల్ది మరొకరు తింటూ ఆనందంగా ఉన్నారు. అదొక పసందైన వనభోజనం! ఆటపాటల్లో మునిగి తేలుతూంటే - బకాసురుని తమ్ముడు అఘాసురుడు పెద్దకొండంత (కొండ)చిలువ పాముగా వచ్చాడు. నోరు తెరిచాడు. దూడలతో పాటు గోపాల బాలకులందరూ ఆ పామునోట్లోకి పడ్డారు. కృష్ణుడు ఆ దృశ్యం చూచి, తానూ కొండచిలువ నోటిలో దూరి, శరీరం గొప్పగా పెంచాడు. పాము ఊపిరాడక ప్రాణాలు వదిలింది. దూడలతో కూడా గోపకులందరూ బయటపడ్డారు. పాముకు జన్మరాహిత్యవిముక్తి కల్గింది. వీడు బకాసురుని తమ్ముడు - అఘాసురుడు.

**బ్రహ్మమాయ**

ఒకసారి గోపాలురతో కృష్ణుడు ఆవులు మేపుతూ అడవికి వెళ్లాడు. హాస్యసంభాషణలతో మునిగి తేలుతూ ఉంటే - ఆవులు పచ్చిక మేస్తూ సుదూరంగా వెళ్లిపోయాయి. గోపాలురు దిగాలుపడ్డారు. కృష్ణుడు తాను వెళ్లి, వెదకి పట్టుకొని, ఆవుల్ని వెనక్కు తోల్తాను అన్నాడు. ఎంతదూరం వెదకినా కృష్ణునికి ఆవులు కనపడలేదు. గోపాలురూ కన్పించలేదు. చివరకు ఇదంతా బ్రహ్మమాయ అని తేలింది. అయినా కృష్ణుడు కలవరపడలేదు. తానే గోవులూ, గోపాలురూ అయ్యాడు. తర్వాత అందరూ హాయిగా బృందావనం చేరారు. ఈ తేడాను ఎవ్వరూ గుర్తించలేక పోయారు. ఏడాదికాలం ఇలాగే గడిచింది. బ్రహ్మకు గోపాలురు విష్ణురూపాలుగా కనిపించారు.

బ్రహ్మ బాలకృష్ణునికాళ్లమీదపడి, క్షమించమని వేడుకొన్నాడు. తన మాయకంటే విష్ణుమాయ గొప్పదని అనుభవపూర్వకంగా తెలుసుకొన్నాడు – బ్రహ్మ. చివరకు గోవులూ, గోపాలురూ తమతమ సహజరూపాల్తో ఇండ్లకు చేరుకొన్నారు.

**కాళియమర్దనం**

ఒకసారి బలరాముడు ఇంటిపట్టునే ఉండిపోయాడు. కృష్ణుడు గోవుల్తో, గోపాలురతో అడవికి వెళ్లాడు. ఎండవేడిమి ఎక్కువ కావడంతో గోవులూ, గోపాలురూ ఒక మడుగులో నీళ్లు తాగారు. ఆ మడుగులోని నీళ్లు మంచినీళ్లు కావు. విషజలం! కనుక ఆ నీళ్లు తాగగానే గోపాలురు మూర్ఛపోయారు. కృష్ణుడు కరుణామృతంతో వాళ్లను బ్రతికించాడు. అయినా ఆ మడుగునీళ్లు విషపూరితం కావడానికి గల కారణం కనుక్కోవాలనుకొన్నాడు. అర్థమైంది – కాళియు డనేసర్పం తనవిషాగ్నులతో సరోవరజలాన్ని విషపూరితం చేస్తున్నాడని గ్రహించాడు. కాసేపాగి కృష్ణుడు తానే సరస్సులోకి దూకాడు. కాళియుడు కోపంతో కృష్ణుణ్ణి చుట్టుముట్టాడు. కృష్ణుడు నిశ్చేష్టుడయ్యాడు. ఆ దృశ్యం చూచి గోపాలురు భయపడ్డారు. హాహాకారాలు చేశారు. అపశకునాలు కనబడడంతో యశోదానందులు బృందావనంనుండి పరువెత్తివచ్చారు. రోదనలు మిన్నుముట్టాయి. అపుడు బలరాముడు వాళ్లకు ధైర్యంచెప్పి, ఓదార్చాడు.

చూస్తూండగానే కృష్ణుడు శరీరం పెంచాడు. నాగబంధం వీడిపోయింది. కాళియుడు అలసిపోయాడు. తలలు పైకెత్తి ఉస్సురుమంటుంటే – కృష్ణుడు తోకపట్టుకొని, కాళియునిపడగలపై ఆనందతాండవం చేశాడు. కాళియుడు నోళ్లనుండి నెత్తురు క్రక్క సాగాడు.

'అన్యథా శరణం నాస్తి త్వమేవ శరణం మమ' అంటూ శ్రీకృష్ణుణ్ణి శరణుకోరాడు. కాళియునిభార్యలు తమకు పతిభిక్ష పెట్టి, సౌమంగల్యం ప్రసాదించమని దీనంగా వేడుకొన్నారు. కృష్ణుడు 'సరే' నంటూ, కాళియుణ్ణి సంసారంతో సాగరానికి వెళ్లమని ఆదేశించాడు. కృష్ణునిపాదస్పర్శ తనకు దక్కిందని కాళియుడు సంతోషపడి, కృష్ణునికి కానుకలిచ్చి, మ్రొక్కి సాగరంవైపు పయనించాడు – అని శుకుడు చెబితే – పరీక్షిత్తు కాళియుని పూర్వవృత్తాంతం అడిగాడు. శుకుడు 'అలాగే' అంటూ – మొదలెట్టాడు.

**కాళియునిపూర్వవృత్తాంతం**

రాజా! మానవులు భయభక్తుల్తో సర్పాల్ని పూజించేవాళ్లు. ఎన్నో ఆహారపదార్థాలు సమర్పించేవాళ్లు. పాములు వాటిల్ని అరగించుకోలేక గరుత్మంతునికి వదలిపెట్టేవి. ఈ కారణంగా గరుత్మంతుడు పాముల్ని ఏమీ చేసేవాడు కాదు. కానీ కాళియుడు అలా చేయకుండా అన్నీ తానే స్వీకరించేవాడు. గరుత్మంతునికి కోపం వచ్చింది. కాళియుని పడగల్ని చితుకదన్నాడు. కాళియుడు భయపడి ఈ సరస్సులో దాగాడు. అంతేగాక గరుడుడు ఆ సరోవరంలోని చేపల్ని తింటే మరణిస్తా డనే సౌబరిశాపం ఉండడంతో – ఆ సరస్సువద్దకు గరుడుడు రాడనే ధైర్యంతో కాళియుడు అక్కడే దాగాడు. కాళియునితలలపైగల కృష్ణునిపాదాల గుర్తులు అతనికి రక్షకమయ్యాయి.

**శ్రీకృష్ణలీలలు**

శ్రీకృష్ణునిబృందావనవిహారం రమణీయం! కమనీయం! కృష్ణుడు ఆవుల్ని మేపుతున్నాడు. నెమలిపింఛం సిగలో పెట్టాడు. వనమాలను మెడలో తాల్చాడు. కొండ గోగుపువ్వును చెవిలో తురిమాడు. తలను ఎడమ ప్రక్కకు వంచి, కనుబొమలు వింతగా కదలుతూంటే - కుడికాలును ఎడమకాలికి అడ్డంగా నిల్పి, వేణువుపై 'బ్రహ్మగాంధర్వగానాన్ని' చేస్తున్నాడు. ఆ గానానికి ఆకర్షితలై, కృష్ణసౌందర్యాన్ని చూడాలనే కుతూహలంతో గోపికలు బిరబిరా వచ్చారు. ఆహా! పిల్లనగ్రోవి ఎంతపుణ్యం చేసుకొనిందో!! మేము వేణువులై పుట్టి ఉంటే ఎంతబాగుండేదో! అని మనసా భావించారు. ప్రకృతి పరవశత్వంతో పులకరించింది. ప్రకృతే కాదు - గోపికాసమూహమంతా - అంతే! అంతా తన్మయావస్థే!

హేమంత ఋతువు వచ్చింది. గోపికలు కాత్యాయనీ వ్రతం చేపట్టారు. మనసా శ్రీకృష్ణుడే తమకు భర్తకావాలని వేడుకొంటున్నారు. ఆ వ్రతం నెలరోజులపాటు జరిగింది. ఒకనాడు గోపికలు యమునలో జలకాలాడుతూ ఉంటే అటుగా వచ్చిన కన్నయ్య వాళ్లచీరలు అపహరించాడు. కడిమిచెట్టెక్కి కూర్చొన్నాడు. గోపికలు స్నానానంతరం గట్టుకు వచ్చి, చూస్తే - చీరలు కన్పించలేదు. కడిమిచెట్టుపై కృష్ణుడే కన్పించాడు. అబలలైన ఆ గోపికలు "కృష్ణా! ఇందేంపని? ఆడవాళ్లను ఇలా బాధించడం న్యాయంకాదు కదా! నీ కంత కసి ఉంటే పొగరుపోతులైన రాజుల్తో పోరాడరాదా? ప్రజలు మెచ్చేపనులు చేయరాదా? మా మానం ఎందుకు తీస్తున్నావు? ఇది సరికాదు. మా వలువలు మా కిచ్చేయ్" - అని దీనంగా బతిమలాడారు.

"గోపికలారా! వస్త్రాలు వదిలేసికదా మీరు నీళ్లలో దిగారు! మరి కాత్యాయనీ వ్రతం చేస్తున్నారే! స్నాననియమాలు పాటించవద్దా? ఆ కాత్యాయనీదేవి మీపై కోపించదా? కనుక రెండుచేతులెత్తి నాకు నమస్కరించి, నావద్దకు వచ్చి, మీ వస్త్రాలు తీసుకోండి" అన్నాడు - కృష్ణుడు. ఇక గత్యంతరంలేక ఆ గోపికలు అలాగే చేశారు. అపుడు కృష్ణుడు "మీ నోము ఫలిస్తుంది. మీరు కోరుకొన్నవాడే మీకు పతి అవుతాడు" - అంటూ గోపికల్ని అనుగ్రహించి, చీరలిచ్చి, మిత్రుల్తో కలిసి నవ్వుతూ వెళ్లాడు.

**మునిభార్యలవిందు**

ఒకసారి కృష్ణుడు గోపాలురతో, గోగణంతో అడవికి వెళ్లాడు. గోపాలురు గోవుల్ని కాస్తున్నారు. ఎండ తీవ్రంగా ఉంది. వాళ్లకు ఆకలి ఎక్కువయింది. కృష్ణునిదగ్గరికి వెళ్లి "ఆకలి, ఆకలి" అని మొరపెట్టుకొన్నారు. కృష్ణుడు కాసేపు మౌనంగా ఉండి, తర్వాత "మిత్రులారా! ఇక్కడికి దగ్గర్లో మునిపల్లె ఉంది. అక్కడ మునులు 'ఆంగిరస సత్రం' (యజ్ఞం) చేస్తున్నారు. అక్కడికి వెళ్లండి. నాపేరుకూడా చెప్పండి భోజనం తీసుకురండి" అన్నాడు. వాళ్లు పరుగుపరుగున అక్కడికి వెళ్లారు. కృష్ణుడు చెప్పినట్లే మునుల్ని అడిగారు. ప్రాధేయపడ్డారు. మునులేమో వచ్చినవాళ్లను సామాన్యగోపాలురుగా భావించి, కసురుకొన్నారు. దిగాలుమొగాలతో వాళ్లు అడవికి వచ్చి, కృష్ణునితో జరిగిన సంగతంతా చెప్పారు. 'సరే! అయితే - మునిపత్నులవద్దకు వెళ్లి, అడగండి' అని పురమాయించాడు - కృష్ణుడు. వాళ్లు అలాగే చేశారు. ఆ మునిపత్నులు అన్నపానాదులు సమకూర్చుకొని వెంటనే అడవికి బయలుదేరారు.

భర్తలు బెదిరించారు. తల్లిదండ్రులు 'ఇది మర్యాద కాదు' అన్నారు. పిల్లలు చెరగులు పట్టుకొన్నారు. అయినా వాళ్లు వినలేదు. శ్రీకృష్ణునిదర్శనంకై బయలుదేరారు. కృష్ణుడు మునిపత్నుల నిర్మలసేవాభావానికి పరవశించాడు. వాళ్లకు సాయుజ్యం ప్రసాదిస్తా నన్నాడు. కాసేపటికి మునులు తమ తప్పు తెలుసుకొని, పశ్చాత్తాపపడ్డారు. కంసునిభయంవల్ల మునులు రాలేకపోయా రని కృష్ణునికి అర్థమయ్యింది.

## గోవర్ధనోద్ధరణం

ఆ రోజుల్లో వర్షాలు పడకపోతే 'ఇంద్రయాగం' చేయడం సంప్రదాయం. నందుడూ మొదలగు వృద్ధులు 'ఇంద్రోత్సవం' చేద్దామని తలంచి, కృష్ణునితో ప్రస్తావించారు. కృష్ణుడు 'ఇంద్రు డెవడు? వర్షాలు కురిపించే అధికారం ఆయనకు ఎవరిచ్చారు? కర్మమే దేవత. జీవులు కర్మానుసారులు. అంతేకాదు – మనకు సమస్తం ప్రసాదించేది – గోవర్ధనపర్వతం. ఆ పర్వతానికే పూజలు చేయండి' – అన్నాడు. నందాదులు 'సరే'నన్నారు. ఈ సంగతి తెలిసి, ఇంద్రుడు భగ్గున మండిపడ్డాడు. నేను పర్వతాల్ని భేదించగల వజ్రాయుధంకలవాణ్ణి – నన్ను లక్ష్యపెట్టక ఒక పర్వతానికి పూజలు చేస్తారా? పాలు, పెరుగు, వెన్న, నెయ్యి తిని, యాదవులకు కొవ్వెక్కింది. వాళ్లపొగరు అణచాలి – అంటూ రాళ్లవర్షం కురిపించాడు. అపారనష్టం వాటిల్లింది. గోపాలురు తమగోడును కృష్ణునితో చెప్పుకొన్నారు. 'ముల్లోకాలకూ అధిపతి కావడంవల్లనే ఇంద్రునికి ఈ గర్వం! ఇతనిగర్వాన్ని అణచాల్సిందే' అనుకొన్నాడు. చక్కనిగుణపాఠం నేర్పాలనుకొన్నాడు – కృష్ణుడు. గోవర్ధనపర్వతాన్ని ఒకచేత్తో పైకెత్తాడు. వర్షధారల్లో అది గొడుగుగా కన్పించింది. గోవుల్నీ, గోపాలకుల్నీ ఆ గొడుగుకిందికి రమ్మన్నాడు. వాళ్లు బ్రతుకు జీవుడా! అంటూ పర్వతం కింద ఆశ్రయం పొందారు. ఏడురోజులు ఇలా గడిచాయి. ఇంద్రుడు గుర్తించాడు. తానెంతో, తనశక్తి ఎంతో తెలుసుకొన్నాడు. పట్టుదల వదలి, ప్రళయమేఘాల్ని వెనక్కి మళ్లించాడు. వర్షం వెలిసింది. హర్షం వెలసింది. సూర్యుడు కన్పించాడు. గోవులూ, గోపాలురూ ఊపిరిపీల్చుకొన్నారు. అందరూ శ్రీకృష్ణుణ్ణి వేనోళ్ల పొగడారు. ఇంద్రుడు శరణాగతి చేశాడు. దేవగణంతో అభిషేకించి, శ్రీకృష్ణుణ్ణి **'గోవిందనామపట్టాభిషిక్తుణ్ణి'** చేశాడు. అప్పటినుండి కృష్ణునికి "గోవిందు"డనే పేరు సార్థకమయ్యింది. ఇంద్రుడు దేవతల్తో కలిసి అమరావతి చేరుకొన్నాడు.

## అదృశ్యుడైన నందుణ్ణి కృష్ణుడు తిరిగి తేవడం

ఆ రోజు ఏకాదశి. నందుడు ఉపవాసం చేశాడు. తెల్లవారక ముందే ద్వాదశిస్నానంకోసం నదికి వెళ్లాడు. నదిలో మునుగుతుంటే – ఒక రాక్షసుడు నందుణ్ణి పట్టుకొని, వరుణనగరానికి తీసుకెళ్లాడు. నందుడు కన్పించకపోవడంతో గోపాలురు గగ్గోలుపడ్డారు. కృష్ణుడు వాళ్లగగ్గోలుకు కారణం తెలుసుకొన్నాడు. కృష్ణుడు తానే వరుణనగరంవైపు బయలుదేరాడు. వరుణుడు ఆశ్చర్యపడ్డాడు. తన సేవకుడు చేసిన తెలివితక్కువపనికి పశ్చాత్తపపడి, 'నందుణ్ణి' వదిలేశాడు. శ్రీకృష్ణుణ్ణి పరమాత్మగా భావించి, స్తుతించాడు.

## మోహనవేణుగానం

అది శరద్రాత్రి! వెన్నెల పిండారబోసినట్లుండే రాత్రి. సమస్తప్రాణులకూ ఆహ్లాదకారిణి. యమునానదీతీరంలో కృష్ణుడు వేణువు ఊదుతున్నాడు. ఆ గానం జగన్మోహనం! ఆ దివ్యగానాన్ని గోపికలు విన్నారు. ఎక్కడి గోపికలక్కడే

పనులు మానేసి, పరుగెత్తి వచ్చారు. ఎవరు అడ్డగించినా వారిగమనం ఆగలేదు. వాళ్లకు మానసికంగా శ్రీకృష్ణుడే సర్వస్వం! కృష్ణుడే భర్త! ఈ భావంతోనే ఆరాధించడంవల్ల గోపికలు ముక్తి పొందారని శుకమహర్షి పరీక్షిత్తుకు చెప్పసాగాడు.

“రాజా! కొందరిది వైరభక్తి. శిశుపాలాదులు వైరభావంతోనే కృష్ణుణ్ణి నిరంతరం స్మరించారు. వాళ్లకు దక్కాల్సిన ఫలం వాళ్లకు దక్కింది. ప్రేమవల్లగానీ, భయంవల్లగానీ, ఏ విధంగా సేవించినా గోవిందదర్శనంతో ముక్తి తథ్యం” – అన్నాడు – శుకమహర్షి.

కృష్ణుడు వేణుగానం చేస్తున్నాడు. తనను దర్శించడానికై వచ్చిన గోపికల్తో చాతుర్యంగా, “గోపికలారా! అంతా క్షేమమే కదా! గోకులానికి ఆపదల్లేవుకదా! ఏమిటి? ఇంతరాత్రివేళ ఇక్కడికి వచ్చారు? ఎందుకు? మీరు మీమీ ఇండ్లకు వెళ్లండి. మీకోసం బెంగపెట్టుకొనే పిల్లల్ని వదలి రావడం బాగలేదు. ఇంటివాళ్ల ఆలనా పాలనా చూడండి. నన్ను కోరివచ్చారు. నేను శ్రవణ, మనన, దర్శనాలతో సంతృప్తిపట్టాను. మీ మనస్సుల్లో నేనుంటే చాలు. మీరు ధన్యలౌతారు. ఇండ్లకు వెళ్లండి, వెళ్లండి’ అని బోధించాడు. ఈ మాటలతో గోపికలు ఆశ్చర్య, ఆవేదనలకు గురి అయ్యారు.

“కృష్ణా! ఏమిటి ఈవింత? ఎందుకిలా మా మనస్సులు గాయపడేటుగా మాట్లాడుతున్నావు? మేము మేమై కోరివస్తే ఇదేనా ఫలం? అన్నీ వదలుకొని వచ్చాం. ఎక్కడికని వెళ్లాలి? మా తాపం తీర్చడం నీ ధర్మంకాదా? నీ పాదాలు తాకి గానీ మేం వెళ్లం. నీ చేతులు సోకందే మా చేతులు ఏపనులూ చెయ్యవు. నీమాటలు ఆప్యాయంగా వినందే ఇతరులమాటలు మా చెవులకు విన్పించవు. మా దాస్యాన్ని అంగీకరించు. నీ కరస్పర్శతో మమ్మల్ని చైతన్యవంతుల్ని చేయవయ్యా! నీ గానానికి పశుపక్ష్యాదులే పులకిస్తుంటే మేము పులకించిపోవడం నేరమా ? మా శిరస్సుపై నీ చెయ్యి ఉంచి, మమ్మల్ని తరింపజేయ్!” అంటూ దీనంగా అర్థించారు. కృష్ణుడు ఆత్మారాముడై వాళ్లతో ఆనందించాడు. గోపికలు ప్రసన్నహృదయలయ్యారు. వాళ్లమనసులు గట్టిపడేందుకై కృష్ణుడు తానే మాయమయ్యాడు.

## కృష్ణుణ్ణి గోపికలు వెదకడం

పిల్లనగ్రోవి ఊదుతూ తమతో వాదిస్తున్న కృష్ణుడు హఠాత్తుగా మాయమయ్యేసరికి గోపికలు దిగ్భ్రాంతలయ్యారు. చుట్టూ వనాలు గనుక “ఓ పున్నాగ! ఓ తిలక! ఓ చందన!” అంటూ, అటూ ఇటూ వెదకసాగారు. అంతేకాదు – “నల్లనివాడు – పద్మనయనాలవాడు – నెమలిపింఛం తల దాల్చినవాడు – నవ్వుమొగంవాడు – మా మానధనం కొల్లగొట్టినవాడు మీ పొదలమాటున లేడుగదమ్మా? చెప్పండే! అంటూ ఏడ్చారు. కృష్ణునిఆచూకీకోసం చెట్లనూ, తీగల్నీ దీనంగా వేడుకొన్నారు. కొందరు గోపికలు పూతనలాగా అభినయిస్తున్నారు. కొందరు బాలకృష్ణుని లీలల్ని భావనలో నెమరు వేసుకొంటున్నారు. కొందరు నేలమీది అడుగులజాడలు చూచి, కృష్ణుడు ఎవ్వతెనో ఎత్తుకొని ఇక్కడ పూలుకోశాడు. అంతే కాదు – ఈపాదధూళిని బ్రహ్మాదిదేవతలు పావనంగా భావించి, తల దాలుస్తారంటూ నలువైపులా తిరుగుతున్నారు. కానీ కృష్ణుని అడుగులజాడలు చూచికూడా – అతణ్ణి కనుగొనలేక పోయారు. గోపికలకు విరహం దుర్భరమైంది. చివరకు యమునానదీతీరం చేరారు.

**గోపికాగీతాలు**

కృష్ణా! నీకోసం మావాళ్లు ఆందోళనపడుతుంటారు. నీవు కన్పించు. మమ్మల్ని ఆరడిపెట్టవద్దు. రాక్షసులబారినుండి రక్షించిన నీవు మమ్మల్ని మన్మథబాధలకు గురిచేస్తావా? నీ వేణుగానపరవశలమై మేము వస్తే – మాకు ఈ బాధలా? దర్శనభాగ్యం కల్గించకుండా నిర్దయుడవయ్యావే ఎందుకు? అంటూ తమ బాధనంతా వెళ్లబోశారు. మదనగోపాలుడు ప్రత్యక్షమయ్యాడు. అలకలతో, మురిపాలతో, సల్లాపాలతో, స్పర్శలతో గోపికలు సంతృప్తిపడ్డారు. "సంసారబంధాలుకూడా తెంచుకొనివచ్చిన మీ మనస్సుల్ని దృఢతరం చేయడానికే ఇలా ప్రవర్తించాను. తప్పుగా అర్థంచేసుకోవద్దు"– అంటూ వాళ్లను ప్రేమతో అనునయించాడు. ఆపై గోపికలతో రాస క్రీడ సల్పాడు. పద్మాకారంలో రాసనృత్యం చేశాడు. ఈ నృత్యం చూచి, దేవతలు మూర్ఛపోయారు. గోపికలపుణ్య విశేషాన్ని వేనోళ్ల కొనియాడారు (ఇది జీవాత్మపరమాత్మలు ఒక్కడై ఆనందించిన బ్రహ్మానందం!!)

తదనంతరం గోపికలతో జలక్రీడలాడాడు. మగఏనుగు మధ్యనుండగా – చుట్టూ చేరి ఆడుఏనుగులు నీళ్లు చిమ్మినట్లు – గోపికలు కృష్ణునిపై నీళ్లు చల్లుతూ ఆడీ, పాడీ పరవశించారు. పిదప ఆభరణాలు ధరించి, కృష్ణునితో సంతోషంగా కాలంగడిపారు" – అని చెప్పగానే – పరీక్షిత్తు

"మహర్షీ! ధర్మకర్త, ధర్మరక్షకుడు కదా కృష్ణుడు! మరి పరస్త్రీసంగమం ధర్మమా? ఇదెలాంటి ధర్మం? అని ప్రశ్నిస్తే – శుకుడు "సకలజీవుల్లో సంచరించే పరమాత్మకు పరాంగనలు ఎవ్వరున్నారు? అతడే సర్వమయుడు. ఇవన్నీ తనరూపాలతో తాను ఆనందించేలీలలే!" అని శుకుడు సమర్థించాడు.

**విద్యాధరశాపవిమోచనం**

ఒకనాడు నందుడూ మరికొందరు గోపకులు కృష్ణునితో కలిసి 'అంబికావనం' జాతరకు వెళ్లారు. సరస్వతీ నదీతీరజలంలో స్నానాలుచేసి, ఉమామహేశ్వరుల్ని పూజించారు. నదీజలస్నానంలో నియమాలు పాటించారు. అప్పుడొకసర్పం నందుణ్ణి మింగబోయింది. నందుడు 'కృష్ణా! కృష్ణా!' అని కేక వేశాడు. గోపకులు పామును చంపాలని ఎన్నోవిధాల ప్రయత్నించారు. కానీ లాభం లేకపోయింది. ఇంతలో కృష్ణుడు రానే వచ్చాడు. పామును పాదాల్తో తన్నాడు. పాదాలతో తొక్కి, పీడిస్తుంటే ఆ సర్పం విద్యాధరరాజుగా మారింది. అతడు కృష్ణునికి నమస్కరించాడు. తన శాపవృత్తాంతాన్ని వివరించాడు.

"దేవా! నేను సుదర్శనుడనే విద్యాధరుణ్ణి, ఒక రోజు విమానంలో వెళ్తున్నాను. కురూపులైన ఆంగిరసులైన ఋషుల్ని చూచి, నవ్వాను. వాళ్లు నన్ను మహాసర్పానివై ఉండుమని శపించారు. నేను పశ్చాత్తాపం ప్రకటించాను. వారు శాపానికి హద్దు చెప్పారు. అదే! నీ పాదస్పర్శ! ఈనాడు నాకోరిక తీరింది" – అంటూ నమస్కరించి, తనలోకానికి వెళ్లిపోయాడు. జాతర చూచుకొని గోపకులూ, కృష్ణుడూ, నందుడూ బృందావనం చేరుకొన్నారు.

శ్రీకృష్ణుడు గోపకులంలో అల్లర్లు సృష్టించే శంఖచూడుణ్ణీ, వృషభాసురుణ్ణీ అవలీలగా సంహరించాడు. అలాగే గృహిణులైన గోపికలవిరహాన్నికూడా శమింపజేశాడు. కృష్ణుణ్ణి తలచుకొని బాధపడుతూంటే – ఇంతలోనే గోధూళి లేచింది. కృష్ణుడు వస్తున్నాడని తెలిసి వాళ్లు తెప్పరిల్లారు.

బృందావనంలోని లీలావిహారాలు, చేష్టలూ సామాన్యుల ఊహలకు అందేవి కావు. ఆ విహారాలు జీవాత్మ పరమాత్మల సంబంధాన్ని తలపించేవి. అవి ప్రగాఢభావనాస్థితిలో గోచరించేవి. ఆలోచనాత్మకాలు. ఇబ్బందులన్నింటినీ కృష్ణుడు ఎదుర్కొన్నాడు. అవే రాక్షసాకారాలు. స్వామిఅనుగ్రహం, ప్రవర్తనవిధి, అవాఙ్మానసగోచరం! ఆత్మైకవేద్యం!

**కంసునిదురాలోచన**

కంసునివద్దకు ఒకరోజు కలహభోక్త నారదుడు వచ్చాడు. "కంసా! నీకోవార్త చెప్పాలని వచ్చా. నీవు మరణభయంలో ఉన్నావు. నీ శత్రువుల ఆచూకీ నేను చెప్తాను. బలరామకృష్ణులే నీ శత్రువులు. దేవకిగర్భంలో పుట్టి, యశోదవద్దకు చేరాడు – కృష్ణుడు. ఇదంతా నీకు తెలీదు. వసుదేవునిద్వారా జరిగినతతంగం ఇదంతా!" – అన్నాడు. కంసుడు కస్సుమని లేచాడు. వసుదేవుణ్ణి చంపాలని నిశ్చయించుకొన్నాడు. కానీ నారదుడు వద్దన్నాడు. అయినా అతనికోపం అణగారలేదు. వసుదేవుణ్ణి చెరసాలలో బంధించాడు. కంసునిలో 'కసి' పెరిగింది. నన్ను చంపుతామని బలరామకృష్ణులు గర్వోక్తులాడుతున్నారు. – అని విన్నాను. మీరందరూ సాయపడాలి. మల్లయుద్ధం ప్రకటిస్తాను. బలరామకృష్ణుల్ని రప్పిస్తాను. వాళ్లను నశింపజేస్తాను. సింహద్వారం ప్రవేశించకుండా కువలయాపీడంతో వాళ్ల అంతు తేలుస్తాను. వాళ్లిద్దర్నీ అణచేస్తే, ఇతరుల్ని అవలీలగా అణచవచ్చునని నిర్ణయించాడు – కంసుడు. ధనుర్యాగవిషయం చెప్పి, బలరామకృష్ణుల్ని పిల్చుక వచ్చేబాధ్యత అక్రూరునికి అప్పగించాడు. అక్రూరుడు గోకులానికి బయల్దేరి వెళ్లాడు.

కంసునిఅకృత్యాలు అన్నీ ఇన్నీ కాదు. ఒకసారి కేశి' అనే రాక్షసుణ్ణి పంపి, బలరామకృష్ణుల్నీ, గోకులాన్నీ అతలాకుతలం చేసి రమ్మని ఆదేశించి పంపాడు. కేశి – గుర్రం ఆకారంతో వెళ్లాడు. అగ్నిశ్వాసలు వదుల్తూ గోకులాన్ని చీకాకుపరుస్తుంటే – గోకులం చెదిరిపోయింది. కృష్ణుడు 'కేశి'ని అవలీలగా చంపాడు. అట్లే వ్యోముడనే రాక్షసుడు గోపాలకులు ఆడుకొంటుంటే తాను దొంగగా నటిస్తూ నల్గురైదుమందిని తప్ప తక్కిన గోపకులందర్నీ ఒక గుహలో దాచేశాడు. సర్వజ్ఞుడైన శ్రీకృష్ణుడు వాణ్ణి ఎదుర్కొన్నాడు. వ్యోముడు పర్వతమంతరూపాన్ని పొందాడు. సింహం తోడేల్ని పట్టుకొన్నట్లుగా కృష్ణుడు వాణ్ణి ఒడిసి పట్టుకున్నాడు. ఆ పట్టుకు ఊపిరాడక చచ్చాడు – వ్యోమాసురుడు. ఆ తర్వాత గుహబండను తొలగించి గోపాలకుల్ని విడిపించాడు.

గోకులానికి వెళ్లమనగానే అక్రూరుడు ఎగిరి గంతేశాడు. రొట్టె విరిగి నేతిలో పడినట్లైందనుకొన్నాడు. బలరామకృష్ణులసందర్శనభాగ్యం కలుగబోతున్నందుకు పరవశించాడు. కంసునివంటి మిత్రుడు లేడనీ, ఈ నెపంతో అయినా నన్ను సత్కార్యానికి పంపాడనీ సంతోషించాడు. కృష్ణుడు అక్రూరుణ్ణి కౌగలించుకొన్నాడు. అక్రూరుడు 'ధనుర్యాగ' ఆహ్వానవిషయం చెప్పగానే బలరామకృష్ణులు ఆనందించారు. కృష్ణుడు మథురానగరానికి వెళ్తున్నాడని తెలీగానే గుండెల్లో రాయిపడినట్లయింది – గోపికలకు. 'తొందరలోనే తిరిగి వస్తా'నని చెప్పి, కృష్ణుడు గోపికల్ని సముదాయించి, అక్రూరునితో బయలుదేరాడు. బలరాముడు వెంటవెళ్లాడు.

మథురానగరం చేరుకొన్నారు. ఆ నగరవీథుల్లో వెళ్తుంటే నాగరికస్త్రీలు కిటికీలనుంచీ బలరామకృష్ణుల సౌందర్యాన్ని చూచి, ముగ్ధలయ్యారు. కృష్ణునిలీలల్ని కీర్తిస్తూ తన్మయలయ్యారు. బలరామకృష్ణులకు దారిలో "రజకుడు" ఎదురయ్యాడు. కృష్ణుడు రజకునితో "మేం కంసుని అతిథులం. నీ దగ్గరుండే మంచిబట్టలు మా

కివ్వు. రాజాస్థానానికి వెళ్లాలి" - అన్నారు. రజకునికి కోపం నసాళానికెక్కింది. యాదవులు మా రాజుకు అతిథులా? పల్లెటూళ్లవాళ్లకు పట్టుబట్టలా? పాలూ, వెన్నలతో కొవ్వుపట్టిందా?" అంటూ గట్టిగా అరిచాడు, రాజుకు తెలిస్తే మీ ప్రాణాలు పోతాయన్నాడు. కృష్ణుడు కోపంతో రజకునితల తెగిపడేటుగా కొట్టాడు. తక్కిన రజకులు బట్టలు అక్కడే వదిలేసి, పారిపోయారు. బలరామకృష్ణులు తమకు కావాల్సిన వస్త్రాలు గైకొని, ముందుకు సాగారు. దారిలో ఒక సాలెఅతను సంతోషంతో చిత్రవిచిత్రవస్త్రాలు సమర్పిస్తే గైకొని అతనికి సారూప్యమోక్షం, ఐశ్వర్యం ప్రసాదించి, ముందు కెళ్లారు.

బలరామకృష్ణులు సుదాము డనేమాలాకారునిఇంటికి వెళ్లారు. అతడు వాళ్లను అర్చించాడు. ఫలపుష్ప సుగంధాదులు సమర్పించాడు. పూలహారాలు అందించాడు. సుదామునితో "నీకేం కావాలో కోరుకో" అన్నారు. సుదాముడు "స్వామీ! కృష్ణా! నీపాదకమలసేవ, భాగవతులతో స్నేహం, దయాగుణం - అనుగ్రహించండంతే!"- అన్నాడు. బలరామకృష్ణులు "అట్లే అగుగాక!" అన్నారు.

దారిలో బలరామకృష్ణులకు 'కుబ్జ' ఎదురయ్యింది. ఆమె కంసునిసైరంధ్రి. రకరకాలసువాసనద్రవ్యాలు సమకూర్చేది - ఆమె. కృష్ణుడు ఆమెను చూచి, "వాసనద్రవ్యాలు సమర్పిస్తే నిన్ను సుందరాంగిని చేస్తా"నన్నాడు. కుబ్జ విశ్వాసంతో 'సరే'నని, వాసనద్రవ్యాలు సమర్పించింది. కృష్ణుడు సంతోషించాడు. ఆమెపాదాలపై తనపాదం మోపాడు. గడ్డం పైకెత్తాడు. అంతే! ఆమెవంకరలన్నీ పోయాయి. అపురూపసుందరాంగి అయ్యింది. ఆమె కృష్ణుణ్ణి తన యింటికి రమ్మని ప్రార్థించింది. మా పనులు అయ్యాక వస్తామని చెప్పాడు - కృష్ణుడు. అటనుండి బలరామకృష్ణులు నేరుగా 'ధనుశ్శాల' వద్దకు వెళ్లారు.

నందాదిగోపాలురు కంసునికి కానుకలు సమర్పించారు. రంగద్వారానికి బలరామకృష్ణులు చేరుకోగానే కువలయాపీడం అనే పెద్ద ఏనుగు ఎదురయ్యింది. మావటీవాడు ఆ ఏనుగును బలరామకృష్ణుల పైకి తోల్తున్నాడు. కృష్ణుడు అటూ ఇటూ తిరుగుతూ ఏనుగును తోకపట్టుకొని, గిరగిరా తిప్పి ఇరవైఅయిదు ధనుస్సులదూరంలో పడేటుగా (ధనుస్సు అంటే నాల్గుమూరల కొలత 25×4=100 మూరలదూరం) విసరి వేశాడు. అది లేచి, మరల మీదపడుతూంటే - కృష్ణుడు తన పిడుగులాంటి పిడికిలిదెబ్బలతో మోదాడు. ఆ ఏనుగును క్రిందబడ దొబ్బారు. పిదప దానిదంతాలు పీకి, వాటితోనే దాన్ని పొడిచి చంపేశారు.

ఏనుగును చంపాక బలరామకృష్ణులు ధైర్యంతో రంగస్థలానికి నడిచారు. అపుడు చాణూరు డనే మల్లుడు బలరామకృష్ణులవద్దకు వచ్చి,

"భేష్ భేష్ మీరు వీరులు. మా రాజు వినోదంకై మల్లయుద్ధం ఏర్పాటు చేశాడు. ప్రజలందరూ ఈ వేడుక చూడాలని ఎంతో కుతూహలంతో ఎదురుచూస్తున్నారు. మాతో వినోదార్థం తలపడండి చూద్దాం" అన్నాడు. కృష్ణుడు చాణూరునితో, బలరాముడు ముష్టికునితో తలపడడానికి సిద్ధమయ్యారు. మల్లయుద్ధం సరసంగా సాగి హోరందుకొనింది. భీకరమైంది. రోషావేశాలతో వేడెక్కింది. కొండల్లాగా ఒకరినొకరు పడదోసుకొన్నారు. చివరకు చాణూరుడు బలం కోల్పోయాడు. ఇదే అద నని కృష్ణుడు వాడిచేతులు పట్టుకొని, గిరిగిరా తిప్పి, నేలకేసి కొట్టి చంపాడు. బలరాముడుకూడా ముష్టికుణ్ణి ఊపిరాడకుండా చేసి చంపేశాడు. మిగిలినయోధులు పారిపోయారు.

మల్లురు చనిపోవడంతో కంసుడు గతుక్కుమన్నాడు. తనప్రయత్నాలన్నీ వమ్ముకావడాన్ని జీర్ణించుకోలేక పోయాడు. 'బలరామకృష్ణుల్ని నగరివాకిలిబయిట తోసేయండి' అన్నాడు. వసుదేవుణ్ణీ, ఉగ్రసేనుణ్ణీ, నందుణ్ణీ చంపండంటూ కేకలు పెట్టాడు. కృష్ణుడు కంసునిఅట్టహాసాన్ని చూచాడు. సింహంలాగా కంసునిమీదికి దూకాడు. జుట్టుపట్టుకొన్నాడు. రంగస్థలంమధ్యకు ఈడ్చుక వచ్చి, పడదోశాడు. అప్పటికే కంసునిప్రాణాలు గాలిలో కలిశాయి. కృష్ణస్పర్శతో కంసుడు ప్రాణాలు వదిలి, కృష్ణుణ్ణే చేరాడు. అదే కృష్ణుని మహిమ! – అని పరీక్షిత్తుకు శుకుడు చెప్పాడు. పిదప కంసునిసోదరులు న్యగ్రోధుడు, కహ్వుడు అనే యిద్దరూ కృష్ణుని మీదికి లంఘించారు. బలరాముడు ఆ యిద్దర్నీ ఎదుర్కొని, అవలీలగా సంహరించాడు.

కంసమరణానంతరం కృష్ణుడు సరాసరి కారాగారంవైపు నడిచాడు. కారాగారంలోని దేవకీవసుదేవుల్ని విడిపించాడు. తల్లిదండ్రులు కుమారులిద్దర్నీ లాలించారు. కృష్ణుడు ఉగ్రసేనునికే రాజ్యాధికారం అప్పగించాడు. కంసభయంతో వెళ్లిన రాజుల్ని సమావేశపరచి, వాళ్లకు అభయం ఇచ్చాడు. ఉగ్రసేనునికి బాసటగా ఉండండని హితం చెప్పాడు. నందునికి వీడ్కోలు చెప్పాడు. "మథురలో అందర్నీ శాంతచిత్తుల్ని చేసి, మరల గోకులంకు వస్తా"నని మాటవరుసకు చెప్పాడు. గోపాలురు కన్నీటితో వ్రేపల్లెకు వెళ్లిపోయారు.

## బలరామకృష్ణులవిద్యాభ్యాసం – గురుదక్షిణ

వసుదేవుడు రామకృష్ణులకు సరైన విద్యార్జనపద్ధతిలో శిక్షణం ఇప్పించాలనుకొన్నాడు. గర్గాది బ్రాహ్మణులతో చర్చించాడు. వారిసలహామేరకు బలరామకృష్ణులకు ఉపనయనసంస్కారం నిర్వహించారు. పిదప కాశిలో విద్యాభ్యాసానికై పంపారు. అక్కడ బలరామకృష్ణులు సాందీపునికి శిష్యులైనారు. సాందీపునిబోధ, శిష్యుల ఆసక్తీ రెండూ జతకాగా, అరవైనాల్గువిద్యలూ అరవైనాల్గురోజుల్లో బలరామకృష్ణులు నేర్చుకొన్నారు. సాందీపునికి శిష్యుల గొప్పతనం అవగతమయింది. శిష్యులు తనను సేవిస్తుండగా ఒకరోజు "శిష్యులారా! మీరు సర్వసమర్థులు. నా జీవితంలో అనుకోని ఒక సంఘటన జరిగింది. నాకు ఒక్కగానొక్క కుమారుడు. ఆ బాలుడు ప్రభాసతీర్థంలో మునిగాడు. పైకి లేవలేదు. ఆచూకీ ఇంతవరకూ తెలీలేదు. పుత్రమమకారం మీకు తెలియందికాదు. మావాణ్ణి తెచ్చివ్వండి. ఇదే మిమ్మల్ని కోరే గురుదక్షిణ! మీరు నా బాధ తీర్చలేరా?" అని కన్నీళ్లతో అన్నాడు. బలరామకృష్ణులు గురువుకలతకు చలించారు. వెంటనే సముద్రంవైపు నడిచారు. సముద్రుడు తన తప్పేమీ లేదన్నాడు. గురుపుత్రుడు స్నానం చేసేవేళ పెద్దఅల వచ్చి, సుదూరం ఎత్తుకెళ్లింది. ఆ బాలుణ్ణి పంచజనుడు అనే రాక్షసుడు మింగేశాడు' – అన్నాడు. కృష్ణుడు సముద్రమధ్యంలోకి వెళ్లి పంచజనుణ్ణి కూలదోశాడు. వానిశరీరం చీల్చాడు. కానీ వాని శరీరంలో గురుకుమారుడు కనబడలేదు. ఒక శంఖం కన్పించింది. ఆ శంఖం తీసుకొని, బలరామకృష్ణులు యమపురికి చేరి, ప్రధానద్వారంవద్ద నిల్చి, శంఖం పూరించారు. ఆ ధ్వనికి యముడు భయపడి వచ్చాడు. వచ్చినవాళ్లెవరో తెలుసుకొని, గౌరవమర్యాదలు చేశాడు. బలరామకృష్ణులు తాము వచ్చిన పని చెప్పారు. యముడు సంతోషంతో ఆ బాలుణ్ణి అప్పగించాడు. బలరామకృష్ణులు గురుపుత్రుణ్ణి సాందీపునికి అప్పగించారు. గురువు సంతోషించాడు. మనసారా శిష్యుల్ని ఆశీర్వదించాడు. ఆపై మథుర చేరుకొన్నారు. కృష్ణుడు పాంచజన్యం అనే శంఖాన్ని పూరిస్తుంటే మథురానగరవాసులు సంతోషించారు.

## ఉద్ధవుడు గోకులానికి రావడం - గోపికాగీతం

కృష్ణుడు ఒకసారి తీరిగ్గా ఉండేవేళ అతనికి వ్రేపల్లి గుర్తుకు వచ్చింది. గోకులంలో వాళ్లు మదిలో మెదిలారు. గోపికలమాధుర్యఆరాధన గుర్తుకు వచ్చింది. తాను గోకులం వదలి మథురకు రావడంతో వాళ్లంతా తనను ఆడిపోసుకొంటున్నారేమో నని భావించాడు. అలా అయితే వాళ్లను ఊరడించడం ధర్మమనుకొన్నాడు. వెంటనే ఉద్ధవుణ్ణి రమ్మని కబురంపాడు. ఉద్ధవుడు సామాన్యుడు కాడు. బృహస్పతిసమానుడు, అతడు రానే వచ్చాడు. "ఉద్ధవా! నీవు గోకులం వెళ్లాలి. నన్ను నమ్ముకొన్న గోపికల్ని ఊరడించు. నేను వీలైనంత త్వరలో గోకులానికి వస్తా నని నమ్మేటుగా చెప్పు" - మని పంపించాడు. ఉద్ధవుడు గోకులం చేరాడు. నందుడు ఉద్ధవుణ్ణి చూచి, కృష్ణునిలా భావించి సంతోషించాడు. నందుడు కృష్ణుణ్ణి ఎన్నడు చూస్తానో ఏమో అనే బాధతో అడిగాడు. యశోద శోకమూర్తి అయింది. ఉద్ధవుడు - 'కృష్ణుడు త్వరలో వస్తా'డని నమ్మేటుగా పల్కాడు. కృష్ణునిదుష్టశిక్షణాదికార్యాలు విని ఆనందించారు.

ఉద్ధవుడు ఏకాంతప్రదేశంలో కూర్చొని ఉండగా గోపికలు వచ్చారు. కృష్ణునిపై తమకున్న అక్కసును అప్పుడే ఎగిరివచ్చిన భ్రమరం(తుమ్మెద)నెపంతో అన్యాపదేశంగా ఆడిపోసుకొన్నారు. ఆ బాధావాక్యాలే 'భ్రమరగీతాలుగా' ప్రసిద్ధి కెక్కాయి. అవి విరహగీతికలు. మధురగీతికలు. మనసులోనిబాధల్ని బాహ్యంగా ప్రదర్శించిన మాటలతూటాలు. వాటిలో వెక్కిరింపు ఉంది. జాడింపు ఉంది. ప్రార్థన ఉంది. ప్రాధేయపడడమూ ఉంది. ఈ గీతాలు విన్న ఉద్ధవుడుకూడా వాళ్లఆంతర్యం తెలిసి, చలించిపోయాడు. చివరకు వాళ్లను ఊరడించాడు. ఇదంతా సరే! మాకేమైనా సందేశామృతం' ఉందా? అన్నారు.

"గోపికలారా! మీరు ధన్యులు! నన్నే చింతిస్తూ ఉంటారు. సాధారణస్త్రీలకు భర్తపై చింతన - ఆపై నా చింత. మీరు అలాకాదు. మీరు తప్పక నన్ను చేరుకొంటారు. మీరు నన్ను గాఢంగా ధ్యానించాలని దూరంగా ఉన్నాను - అని చెప్పాడమ్మా! మనస్వామి" అన్నాడు - ఉద్ధవుడు. ఈ సందేశం గోపికలపాలిటికి అమృతంగా తోచింది. "మనకృష్ణుడు మనల్ని మరవలేదు. అంతేచాలు - ఈ జన్మకు" - అని ఊరడిల్లారు. అయినా సంతోషంపట్టలేక "కృష్ణుడు గోకులంకు వస్తాడా? మాకు రాసక్రీడావైభవం దక్కుతుందా? కృష్ణుడు రాకపోతే మా ప్రాణాలు గాలిలోకే!" అన్నారు. ఉద్ధవుడు కొన్నినెలలు అక్కడే ఉండి - తానూ కృష్ణలీలావర్ణనలు చేశాడు. ఆపై మథురకు వచ్చి, నందాదులిచ్చిన కానుకల్ని బలరామకృష్ణులకు అందజేశాడు. వారిసందేశాన్ని విన్పించాడు.

కృష్ణుడు అక్రూరునిఇంటికి బలరామఉద్ధవులతో వచ్చాడు. అక్రూరుడు కృష్ణుణ్ణి ప్రస్తుతించాడు. అపుడు కృష్ణుడు హస్తినకు వెళ్లి, కుంతిని ఓదార్చి, ధృతరాష్ట్రుణ్ణి కలసి, పాండవులభాగం పాండవులకు ఇవ్వడం న్యాయమని బోధించమన్నాడు. అంతేకాదు వాళ్లక్షేమసమాచారాలూ కనుగొని రమ్మంటే - అలాగే అక్రూరుడు చేశాడు. ధృతరాష్ట్రునికి హితం చెప్పాడు. ధృతరాష్ట్రుడు 'కృష్ణుడు ఎలా నిర్ణయిస్తే అలా జరుగుతుంది' అన్నాడు. అక్రూరుడు మథురకు వచ్చి, అన్నివార్తలూ కృష్ణునికి చెప్పాడు.

## కృష్ణజరాసంధయుద్ధం

కంసునికి ఇద్దరుభార్యలు - అస్తి, ప్రాప్తి. వీళ్లు జరాసంధునికూతుళ్లు. కంసుడు మరణించాక వీరిద్దరూ దిక్కులేని వాళ్లయ్యారు. తమ వైధవ్యానికి కృష్ణుడు మున్నగు యాదవులే కారకులని జరాసంధునికి చెప్పి, వలవల ఏడ్చారు. జరాసంధుడు చలించాడు. యాదవుల్ని రూపురేఖలు లేకుండా చేస్తా నని మథురపై దండెత్తాడు. కృష్ణుడు బలగర్వితుడైన జరాసంధుణ్ణి అణచడానికి దండోపాయమే ముఖ్యమని భావించాడు. ఆకాశవాణి ఆ సంకల్పానికి ప్రతిధ్వనించింది. ఆకాశంనుండి దైవయోగంవల్ల దివ్యాస్త్రాలతో కూడిన రెండుదివ్యరథాలు వచ్చాయి. కృష్ణుడు శంఖం పూరించాడు. జరాసంధుడు కృష్ణుణ్ణి సామాన్యుడైన గొల్లవానిగానే తలంచి, పరిహాసమాడాడు. కృష్ణుడు సమరానికి సన్నద్ధుడయ్యాడు. సమరం భయంకరంగా సాగింది. జరాసంధునిసేనలు కకావికలాలయ్యాయి. కృష్ణుడు జరాసంధునిరథాన్ని భగ్నం చేశాడు. పిడిగుద్దులతో ప్రాణంమాత్రం మిగిలినవాణ్ణిగా చేశాడు. భవిష్యత్కార్యం దృష్టిలో పెట్టుకొని, విడిచి పెట్టాడు. తపస్సువల్ల తప్ప మరోమార్గంలో బలరామకృష్ణుల్ని చంపలేమని జరాసంధుడు వెనుదిరిగాడు. అయినా అతనిబుద్ధి మారలేదు. మరోసారి రాజుల్ని కూడగట్టుకొని - ఇలా పదిహేడుమార్లు మథురను ముట్టడించాడు. అయినా పరాజయమే ఫలం! చివరికి పద్దెనిమిదవసారి యుద్ధానికి సన్నద్ధుడవుతూంటే నారదుడు కాలయవనునిదగ్గరికి వెళ్లి, "కాలయవనా! నీవు వీరుడివి. శూరుడివి. ఎందర్నో జయించావు. యాదవుల్ని జయించలేవా? కృష్ణుడు అజేయుడుగా ఉంటే నీవు చూస్తూ ఊరకే ఉంటావా?" అన్నాడు. కాలయవనుడు ఉక్రోషంతో బయలుదేరాడు. అతనికి జరాసంధుడు తోడయ్యాడు. కృష్ణుడు ఆలోచించాడు, తనవాళ్లను రక్షించుకోవాలంటే దుర్భేద్యనగరం అవసరమని తలచి, విశ్వకర్మను (దేవశిల్పి) సముద్రమధ్యంలో నగరం నిర్మించమని ఆదేశించాడు. అలాగే విశ్వకర్మ నిర్మించాడు. ఆ నగరం అన్నినగరాలకంటే గొప్పది. ఇంద్రుడు 'సుధర్మ' అనే సభను ఇచ్చాడు. వరుణుడు ఒక చెవివద్దమాత్రం నలుపుకల్గిన తెల్లనిగుర్రాలిచ్చాడు. కృష్ణుడు యోగమహిమతో రాత్రికి రాత్రే ప్రజల్ని ద్వారకాపురం చేర్చాడు.

ఆపై కృష్ణుడు ఒంటరిగా ఆయుధాలు లేకుండా మథురాపురంముందు తచ్చాడుతుంటే జరాసంధ కాలయవనులు అతణ్ణి పట్టుకొందామనుకొన్నారు. కృష్ణుడు వారికి దొరక్కుండా తప్పించుకొని అడవిలోనికి వెళ్లి, ఒకగుహలో దాగాడు. కాలయవనుడు కృష్ణుణ్ణి వెంబడించి - తానూ అదే గుహలో దూరాడు ఆ గుహలో ఒక మహాపురుషుడు నిద్రపోతున్నాడు. అతణ్ణి కృష్ణుడుగా కాలయవనుడు భ్రమించాడు. కాలితో తన్నాడు. ఆ మహాపురుషుడు కోపంతో కళ్లు తెరిచాడు. ఆ కంటిచూపులకు కాలయవనుడు కాలి బూడిద అయ్యాడు - (మహాత్ముల్ని నిష్కారణంగా అవమానిస్తే - ఫలం ఇలాగే ఉంటుంది.) - అని శుకుడు చెబితే - ఆమహాపురుషుడు ఎవడు? అని కుతూహలంతో ప్రశ్నించాడు - పరీక్షిత్తు. శుకమహర్షి అతనివృత్తాంతం చెప్పసాగాడు.

"రాజా! ఆ మహాపురుషుడు మాంధాతకొడుకు ముచికుందుడు అనేరాజు. దేవతల్ని రాక్షసబాధలనుండి చాలాకాలం రక్షించాడు. దేవతలు వరం కోరుకోమంటే 'మోక్షం' కావాలన్నాడు. దేవతలు "మోక్షప్రదాత అయిన శ్రీహరియే అందుకు సమర్థుడు. మరే వరమైనా కోరుకో" అన్నారు. అతడు నిద్ర కోరుకొన్నాడు. అందుకై

గుహలో నిద్రపోతుంటే కాలయవనునిదుశ్చర్యలకు కోపోద్రిక్తుడయ్యాడు - ఆ రాజు. కాలయవనునిమరణానికి కారకుడయ్యాడు. ఆపై కృష్ణుణ్ణి అయ్యా! మీరెవరు? మీకు సేవ చేస్తా' నన్నాడు. అపుడు కృష్ణుడు తానే కాలయవనుని మరణానికి పథకం వేసినవాణ్ణి అన్నాడు. ఈ మాట వినగానే ముచికుందుడు స్వామిపాదాలపై పడ్డాడు. కృష్ణుడు ముచికుందునితో "నీవు క్షత్రియుడివి. వేటాడి జంతువుల్ని సంహరించావు. అంచేత వచ్చేజన్మలో బ్రాహ్మణుడివై పుట్టి, నన్ను చేరుకుంటావు" అన్నాడు - కృష్ణుడు. ముచికుందుడు సరే! నని హిమాలయాల్లో తపస్సు చేయడానికై వెళ్లాడు.

తర్వాత కృష్ణుడు మథురకు వెళ్లాడు. మథురలోని ధనధాన్యసంపదంతా ద్వారకకు చేర్చాడు. జరాసంధుడు మరోమారు దండెత్తి వచ్చాడు. అపుడు బలరామకృష్ణులు ప్రహర్షిణిగిరిని ఎక్కారు. జరాసంధుడు ఆ గిరిచుట్టూ సైన్యం మోహరించాడు. బలరామకృష్ణులు కన్పించనందున చుట్టూ మంటలు పెట్టించాడు. మంటలు తీవ్రంగా ఆక్రమించాయి. కానీ బలరామకృష్ణులు తప్పించుకొని, యాదవుల్తో కలిసి, ద్వారక చేరుకొన్నారు. బలరామకృష్ణులూ, యాదవులూ మంటల్లో మాడి మసై ఉంటా రని భావించి - జరాసంధుడు వెనుదిరిగి వెళ్లాడు.

బలరామకృష్ణులు తదనంతరం ద్వారకలో ఉండిపోయారు. రైవతుడనే రాజు తనకూతురు రేవతిని - కృష్ణునిఅనుమతితో బలరామునికిచ్చి పెండ్లి చేశాడు. తర్వాత కృష్ణుడు రాక్షసవివాహంతో రుక్మిణిని పెండ్లాడా డని చెప్పగా - ఆ వృత్తాంతం సంపూర్ణంగా వివరించం డని శుకుణ్ణి పరీక్షిత్తు కోరాడు. నిజమే! కల్యాణాత్మకమైన విష్ణుకథలు ఎన్నిమార్లు - ఎంతగా విన్నా - అవి కొత్తవిగానే ఉంటాయి. భగవద్గుణవర్ణనం, కథలూ భక్తులకు నిత్యానందనిలయాలు కదా!

**రుక్మిణీకల్యాణం**

విదర్భదేశానికి రాజు భీష్మకుడు. అతనికి రుక్మి, రుక్మరథుడు, రుక్మబాహుడు, రుక్మకేశుడు, రుక్మమాలి - అనే ఐదుగురు కొడుకులూ, వీరితర్వాత ఒకే ఒక కూతురు రుక్మిణి. ఆమె అందాలబరిణె. ఆ అమ్మాయి యౌవన దశలో కృష్ణునిరూపగుణవిద్యాబలశౌర్యాదుల్నిగూర్చి విని, పరవశించింది. పెళ్లాడితే - శ్రీకృష్ణుణ్ణే వరించాలని నిర్ణయించుకొనింది. అలాగే కృష్ణుడుకూడా ఆ నోటా ఈ నోటా రుక్మిణి అందచందాలు, సుగుణసంపత్తినిగూర్చి విని, రుక్మిణినే పెళ్లాడాలనుకొన్నాడు. రుక్మిణి సాక్షాత్తు లక్ష్మి. కృష్ణుడు - సాక్షాత్తు శ్రీహరి. కనుక ఏ జన్మలో, ఏ అవతారంలో, ఎలా ఉన్నా - వీళ్లిద్దరిదాంపత్యం విడదీయరానిది. ఇలా ఉంటే - రుక్మిణిపెద్దన్న రుక్మి తన చెల్లెల్ని శిశుపాలుని కిచ్చి, స్నేహబంధాన్ని బంధుత్వంగా మార్చుకోవాలనుకొన్నాడు. ఆ దశలో ప్రయత్నాలు కొనసాగిస్తున్నాడు. రుక్మిణి గాబరాపడింది. తండ్రికి మనస్సులోనిమాట చెప్దామంటే - అతడు కొడుకుమాట కాదనే శక్తిమంతుడు కాడని తెలిసి మిన్నకుండింది.

రుక్మిణి ఆలోచించింది. ఈ వివాహప్రయత్నాలు చూచి, తన కోరిక ఫలిస్తుందో లేదో నని కలతపడింది- చివరకు అగ్నిద్యోతను డనే బ్రాహ్మణునిద్వారా తనమనస్సులోని అభిప్రాయాన్ని కృష్ణునికి విన్పించింది. అంతే కాదు - రాక్షసవివాహంతో తనను వివాహమాడమని ఉపాయంకూడా సూచించింది. అగ్నిద్యోతనుడు కృష్ణునికి రుక్మిణిసందేశాన్ని హృదయానికి హత్తుకొనేటుగా చెప్పాడు. మరి - నీకు ఆమె, ఆమెకు నీవూ తగినట్లున్నారు.

మా ఉపాధ్యాయులమీద ఒట్టు! నువ్వు ఆమెను పెండ్లాడడం మంచిది - అంటూ దీవించాడు. కృష్ణుడు సత్యప్రమాణం చేశాడు. ఈ ప్రమాణం సత్యమే! బ్రాహ్మణవాక్యం కృష్ణునికి శిరోధార్యం!! ఇక ప్రయాణానికి సర్వం సిద్ధం చేసుకున్నాడు.

పెండ్లిరోజు రానే వచ్చింది. రుక్మిణిని అలంకరిస్తున్నారు. కృష్ణుడు వస్తాడో, రాడో నని దిగులుపడుతూంది. ఏదేదో ఊహించుకొంటూండగా అగ్నిద్యోతనుడు సకాలంలోనే వచ్చాడు. మంచిశుభవార్తనే ఆమెకు చెప్పాడు. రుక్మిణి తేరుకొనింది. కులాచారంప్రకారం ఊరివెలుపలనున్న గౌరీదేవి ఆలయానికి పూజకై బయలు దేరింది. ఆలయంచేరి, మనసారా ఆ ఆదిదంపతుల్ని ప్రార్థించింది. కృష్ణుణ్ణి తనభర్తగా చేయండని విన్నవించింది. ముత్తైదువలకు కానుకలిచ్చి వస్తుంటే - రాజులెందరో ఆమెసౌందర్యానికి ముగ్ధులై, తమ దురదృష్టానికి బాధపడ్డారు. దూరంలో కృష్ణుణ్ణి చూచింది - రుక్మణి. అంతే! చటుక్కని కృష్ణుడు రుక్మిణిని చేపట్టి, రథంలోకి ఎక్కించుకొని, ద్వారకవైపు రథాన్ని పోనిచ్చాడు. అనుకోని ఈ పరిణామానికి శిశుపాలాదులు బెంబేలెత్తారు. తమాయించుకొని, సైన్యంతో కృష్ణునిమీదపడ్డారు. యాదవసైన్యం ధాటికి నిల్వలేక ఎవరిదారిన వారు వెళ్లారు. రుక్మిమాత్రం అక్షౌహిణీ సైన్యంతో కృష్ణునిదగ్గరికి వెళ్లి, పరిహాసప్రసంగాలు చేశాడు. 'మానహీనుడివి, మర్యాద లేనివాడివి, వావివరుసలు తెలియనివాడివి, అంటూ కారుకూతలు కూస్తుంటే - కృష్ణుడు ఇతనికి శాస్తి చేయాల్సిందే అనుకొన్నాడు. రుక్మిని చంపాలనుకొన్నా - రుక్మిణి ప్రార్థించడంతో ఆగి, రుక్మిమీసాలూ, గడ్డం, తల పాయలు పాయలుగా కత్తితో గొరిగి, అవమానించి విడిచిపెట్టాడు. ఈ చర్యల్తో కలతపడ్డ బలరాముడు రుక్మిణితో "నొచ్చుకోవద్దమ్మా! మా కృష్ణునిపై కోపం చెందకమ్మా! ఇదంతా మీ అన్నకర్మఫలం!" అని ఓదార్చాడు.

పిదప కృష్ణుడు రుక్మిణితోపాటు ద్వారకానగరం చేరి, శాస్త్రోక్తంగా కల్యాణం చేసుకొన్నాడు.

ఆదిలక్ష్మియైన రుక్మిణితో హాయిగా కాలం గడపుతుండే కృష్ణుణ్ణి చూచి, ద్వారకావాసులందరూ నిర్భయులై, పరమసంతోషంతో, ప్రశాంతంగా జీవనం సాగిస్తున్నారు" అని పరీక్షిత్తుకు శుకమహర్షి రుక్మిణీకల్యాణవిశేషాలు మంగళప్రదంగా వినిపించాడు.

జగత్కల్యాణకారకుడైన శ్రీకృష్ణునిజననంతో మొదలై - రుక్మిణీకల్యాణంతో పూర్తి అయిన కథాభాగంగల దశమస్కంధపూర్వభాగకథాసారం - ఇది.

**రుక్మిణీకృష్ణకల్యాణరుచిరకథను,**
**విన్నవారలు, చదివిన విమలమతులు,**
**ఆయురారోగ్యభోగభాగ్యములు కలిగి,**
**పరమకల్యాణమూర్తులై వరలువారు!!**

***!!శుభ మస్తు!!***

**- విద్వాన్ డా॥ పమిడికాల్వ చెంచుసుబ్బయ్య**

# విషయసూచిక

## దశమస్కంధము - పూర్వభాగము

**విషయము** **పుట**

పోతన గారి భాగవత పద్యాలు

అమ్మా! మన్నుతినంగ నే శిశువునో! ఆకొంటినో! వెఱ్ఱినో!
నమ్మంజూడకు వీరిమాటలు మదిన్ నన్నీవు కొట్టంగ వీరిమ్మార్గము

ఘటించి చెప్పెదరు కాదేనిన్ మదీయాస్యగంధమ్మాఘ్రాణము సేసి
నా వచనముల్ తప్పైన దండింపవే!

శ్రీరస్తు

# శ్రీమహాభాగవతము

## దశమస్కంధము - పూర్వభాగము

### ❖ పరీక్షిన్మహారాజు శుకయోగీంద్రు నడిగెడుప్రశ్న ❖

**శ్రీకంఠచాపఖండన!, పాకారిప్రముఖవినుతభండన! విలస**
**త్కాకుత్థ్సవంశమండన!, రాకేందుయశోవిశాల! రామనృపాలా! 1**

**ప్రతిపదార్థం :** రామనృపాలా= ఓ శ్రీరామప్రభూ!; శ్రీకంఠ= (విషాన్ని కంఠంలో బంధించిన) శివునియొక్క; చాప= ధనుస్సును; ఖండన= విరిచినవాడా!; పాక+అరి= పాకుడు అనేరాక్షసునికి శత్రువైన దేవేంద్రుడు; ప్రముఖ= మొదలైన దేవతలచేత; వినుత= పొగడబడిన; భండన= యుద్ధం కలవాడా!, యుద్ధవీరుడా!; విలసత్= ప్రకాశిస్తున్న; కాకుత్థ్స= కకుత్థ్సుడు అనే రాజుయొక్క; వంశ= వంశానికి; మండన= అలంకారమైనవాడా!; రాకా+ఇందు= పున్నమ చంద్రుని (వెన్నెల)వంటి; యశస్= కీర్తిచేత; విశాలా= విశాలమైనవాడా!– విస్తరించిన కీర్తికలవాడా!

**తాత్పర్యం :** శ్రీరామనృపాలా! నీవు శివధనుస్సును విరిచినవాడవు. దేవేంద్రుడు మున్నగు దేవతలచేత ప్రశంసలందుకొన్న యుద్ధవీరుడవు. ప్రకాశిస్తున్న కాకుత్థ్సవంశానికి అలంకారమైనవాడవు. పరిపూర్ణకాంతితో వెలిగే పున్నమచంద్రుని వెన్నెలవంటి విశాలమైన కీర్తికలవాడవు.

**విశేషం :** 'శ్రీ'కి ఉన్న లక్ష్మి, వృద్ధి, శోభ మొదలైన అనేకార్థాల్లో, 'విషం' అన్న అర్థం కూడ ఉంది. శ్రీకంఠుడు అంటే శివుడు. శ్రీని–విషాన్ని–కంఠమునందు కలవాడు.

కకుత్థ్సుడు సూర్యవంశపురాజు. ఇతని మరొక పేరు పురంజయుడు. దేవాసురయుద్ధంలో విష్ణుమూర్తి ఆదేశానుసారం ఇంద్రుడు వృషభమయ్యాడు. పురంజయుడు ఆ వృషభంయొక్క మూపురాన్ని అధిరోహించి రాక్షస సంహారం చేశాడు. కకుదం అంటే ఎద్దుమూపురం. ఎద్దు మూపురాన్ని అధిరోహించినవాడు కనుక కకుత్థ్సుడయ్యాడు. ఇతని వంశం కాకుత్థ్సవంశమైంది. ఈ రాజవంశం అయోధ్యను పాలించింది.

అమృత, మానద, పూష, తుష్టి, పుష్టి, రతి, ధృతి, శశిని, చంద్రిక, కాంతి, జ్యోత్స్న, శ్రీ, ప్రీతి, అంగద, పూర్ణ, పూర్ణామృత–ఈ పదునారు పూర్ణచంద్రుని కళలు.

**వ. మహనీయగుణగరిష్ఠులగు న మ్మునిశ్రేష్ఠులకు నిఖిలపురాణవ్యాఖ్యానవైఖరీసమేతుం డయిన సూతుం డిట్లనియె, నట్లు పరీక్షిన్నరేంద్రుండు శుకయోగీంద్రుంగనుంగొని. 2**

**ప్రతి :** నిఖిల= అన్ని; పురాణ= పురాణాలకు; వ్యాఖ్యాన= అర్థవివరణం యొక్క; వైఖరీ= వాక్యరూపమైన పద్ధతితో; సమేతుండు= కూడుకొన్నవాడు; అయిన= అయినటువంటి; సూతుండు= సూతమహర్షి; మహనీయ= గొప్పవైన; గుణ= గుణాలచేత; గరిష్ఠులు= ఉత్తములు; అగు= అయినట్టి; ఆ+ముని, శ్రేష్ఠులకున్= గొప్పవారైన ఆ మునులకు; ఇట్లు= ఈ

విధంగా; అనియెన్= అన్నాడు; అట్లు= ఆ విధంగా; పరీక్షిత్+నర+ఇంద్రుండు= పరీక్షిన్మహారాజు; శుకయోగి+ఇంద్రున్= శుకుడనే యోగిశ్రేష్ఠుణ్ణి; కనుంగొని= చూచి...

**తా :** అన్ని పురాణాల అర్థవివరణలో అత్యంత సమర్థమైన వాగ్ధోరణి గల సూతమహర్షి, గొప్ప గుణాలచేత మహోన్నతులైన ఆ ముని శ్రేష్ఠులకు, శుకయోగీంద్రుణ్ణి చూచి పరీక్షిన్మహారాజు ఈ విధంగా అడిగాడని అన్నాడు.

**క. తెలిపితివి సోమసూర్యుల, కులవిస్తారంబు, వారికులము ధరిత్రీ**
**శుల నడవళ్లును వింటిమి, కలరూపము లెల్ల మాకుఁ గడువెఱఁగులుఁగన్. 3**

**ప్రతి :** సోమ, సూర్యుల= చంద్రసూర్యుల; కుల= వంశాల; విస్తారంబు= వ్యాప్తిని; వారికులము= వారివంశము; ధరిత్రీ+ఈశుల= రాజులయొక్క; నడవళ్ళను= చరిత్రలును; వింటిమి= విన్నాము; కల= ఉన్న; రూపములు= విధములు; ఎల్లన్= అన్నింటిని; కడున్= మిక్కిలి; వెఱఁగులున్+కన్= ఆశ్చర్యకరంగా; మాకున్= మాకు; తెలిపితివి= తెలియజేశావు.

**తా :** చంద్రసూర్యవంశాలు విస్తరిల్లిన తీరును, ఆ వంశాల రాజుల చరిత్రలను విన్నాము. ఉన్నవి ఉన్నట్లు మిక్కిలి ఆశ్చర్యం కలిగేటట్లు మాకు తెలియ చెప్పావు.

**క. శీలము గల యదుకులమున, నేలా పుట్టెను మహాత్ముఁ డీశుఁడు విష్ణుం?**
**డే లీల మెలఁగె? నెయ్యే, వేళల నే మేమి సేసె వివరింపు తగన్. 4**

**ప్రతి :** మహా+ఆత్ముఁడు= గొప్ప ఆత్మగలవాడు; ఈశుఁడు= (లోకాలకు) ప్రభువు; విష్ణుండు= విష్ణుమూర్తి; శీలము= మంచినడవడి; కల= ఉన్న; యదుకులమునన్= యదువంశంలో; ఏలా= ఎందువల్ల; పుట్టెను= జన్మించాడు; ఏ లీలన్= ఏ విధంగా; మెలఁగెన్= ప్రవర్తించాడు; ఏ+ఏ వేళలన్= ఎప్పుడెప్పుడు; ఏమి+ఏమి, చేసెన్= ఏ మేమి చేశాడు; తగన్= తగిన విధంగా; వివరింపు(ము)= వివరంగా చెప్పు.

**తా :** మహాత్ముడు, లోకనాథుడు అయిన శ్రీమహావిష్ణువు సత్ప్రవర్తనగల యదువంశంలో ఎందుకు జన్మించాడు? ఏవిధంగా నడచుకొన్నాడు. ఎప్పుడెప్పుడు ఏ యే పనులు చేశాడు? చక్కగా వివరించండి.

**క. భవములకు మందు, చిత్త, శ్రవణానందము, ముముక్షుజనపదము, హరి**
**స్తవము పశుఘ్నుఁడు దక్కను, జెవులకుఁ దని వయ్యె ననెడి చెనఁటియుఁ గలఁడే. 5**

**ప్రతి :** హరి= విష్ణుమూర్తియొక్క; స్తవము= స్తోత్రం; భవములకున్= జన్మలకు; మందు= ఔషధం; చిత్త= మనస్సుకు; శ్రవణ+ఆనందము= చెవులకు ఆనందం; ముముక్షుజన= మోక్షాన్ని కోరుకొనేవారికి; పదము= స్థానం; పశుఘ్నుఁడు= జంతువులను చంపే కసాయివాడు; తక్కను= తప్ప; చెవులకున్= చెవులకు; తనివి= తృప్తి; అయ్యెన్= కలిగింది; అనెడి= అనే; చెనటియున్= మూర్ఖుడు; కలఁడు+ఏ= ఉన్నాడా?

**తా :** శ్రీహరి స్తోత్రం జన్మరాహిత్యానికి మందు. మనస్సుకు, చెవులకు ఆనందం. మోక్షాపేక్షకలవారికి స్థానం. అలాంటి శ్రీహరిస్తోత్రాన్ని విని–కసాయివాడు తప్ప, 'ఇక చాలు. నా చెవులకు తృప్తి కలిగింది' అనే మూర్ఖుడు ఇంకెవడైనా ఉంటాడా? (ఉండదని భావం)

**క. మా పెద్దలు మును వేల్పులు, నోపని భీష్మాదికురుకులోత్తమసేనా**
**కూపారము నేకోలము, బ్రాపున లంఘించి రొక్క బాలపదముగాన్. 6**

**ప్రతి :** మును= ఇదివరలో; మా పెద్దలు= మా వంశంలో పెద్దవారైన ధర్మరాజాదులు; వేల్పులున్= దేవతలుకూడా; ఓపని= చేయచాలని; భీష్మ+ఆది= భీష్ముడు మొదలైన; కురుకుల+ఉత్తమ= కురువంశశ్రేష్ఠులతోకూడిన; సేనా= సైన్యమనెడి; అకూపారమున్= సముద్రాన్ని; ఏ, కోలము= ఏ తెప్ప; ప్రాపునన్= సాహాయ్యంతో; ఒక్క= ఒక; బాలపదముగాన్= పసిబాలుడి అడుగునువలె; లంఘించిరి= దాటారు.

**తా :** ఇదివరలో దేవతలకు కూడా దాటశక్యం కాని భీష్మాదికురువంశశ్రేష్ఠులతో కూడిన సేనాసముద్రాన్ని, మా పెద్దలైన పాండవులు ఏ తెప్పసాయంతో ఒక పసిబాలుడి పాదముద్రను దాటినట్లు దాటగలిగారు?

**క. మా యమ్మ కుక్షి గురుసుత, సాయకపీడితుఁడ నైన జడు నన్నుం గౌం**
**తేయకురుకులము నిలుపఁగ, నా యుత్తముఁ డాత్తచక్రుఁడై రక్షించెన్. 7**

**ప్రతి :** కౌంతేయ= కుంతీదేవికి సంబంధించిన; కురుకులము= కురువంశాన్ని (అనగా పాండవ వంశాన్ని); నిలుపన్+కన్= నిలబెట్టడానికి; ఆ+ఉత్తముఁడు= ఆ మహానుభావుడు-శ్రీకృష్ణుడు; ఆత్త= పొందబడిన; చక్రుఁడు+ఐ= చక్రాయుధంకలవాడై; మా+అమ్మ= మా తల్లియొక్క; కుక్షిన్= కడుపులో; గురుసుత= ద్రోణాచార్యుని కుమారుడైన అశ్వత్థామయొక్క; సాయక= బాణంచేత; పీడితుఁడను+ఐన= బాధింపబడినవాడినైన; జడున్= కదలికలేనివాణ్ణి; నన్నున్= నన్ను; రక్షించెన్= రక్షించాడు.

**తా :** పాండవ వంశాన్ని నిలబెట్టటానికి మహానుభావుడైన శ్రీకృష్ణుడు చక్రాయుధం చేపట్టి, అశ్వత్థామ ప్రయోగించిన బ్రహ్మాస్త్రంవల్ల చైతన్యం లేనివాడినై మా తల్లిగర్భంలో ఉన్న నన్ను రక్షించాడు.

**ఆ. కలసి పురుషమూర్తి కాలరూపములను, లోకజనుల వెలిని లోన నుండి**
**జన్మమృత్యువులను సంసారముక్తుల, నిచ్చు నతనిచరిత మెల్లఁ జెపుమ! 8**

**ప్రతి :** పురుషమూర్తి= పురుష స్వరూపుడు (విష్ణుమూర్తి); కాలరూపములను= కాలరూపాలతో; కలసి= కూడి; లోక= లోకమందలి; జనుల= మానవుల; వెలిని= బయట; లోనన్= లోపల; ఉండి; జన్మమృత్యువులను= పుట్టుకలను, చావులను; సంసార= సంసారాలను (ఐహిక జీవితాలను); ముక్తులన్= మోక్షాలను; ఇచ్చున్= ఇచ్చుచున్నాడు; అతని= అతనియొక్క; చరితము= చరిత్ర; ఎల్లన్= అంతా; చెపుము+అ= చెప్పవలసింది.

**తా :** పురుషోత్తముడైన శ్రీమహావిష్ణువు త్రికాలస్వరూపాలతోకూడి, లోకంలోని జనుల వెలుపల లోపల ఉండి, జనన మరణాలను, సంసార మోక్షాలను ఇస్తున్నాడు. ఆయన చరిత్రనంతా చెప్పండి.

**విశే :** 'అంతర్బహి శ్చ తత్సర్వం వ్యాప్య నారాయణః స్థితః'- 'ఈ సృష్టి సమస్తంలో లోపల వెలుపల వ్యాపించి ఉన్నవాడు నారాయణుడు' అని శ్రుతి.

**సీ. ఊహించి రాముఁడు రోహిణికొడుకంచు నప్పుడు యోగీంద్ర! చెప్పి తీవు**
**దేవకికడుపున నే వెరవున నాతఁ డుండెను దేహంబు నొందు లేక?**

**తనతం(డియిలువాసి వనజాక్షుఁ డేరీతి మందకుఁ బోయె? నే మందిరమున**
**నుండి యెయ్యది సేయుచుండెను? దన మేనమామ కంసుని నేల నామ మణఁచె**

**ఆ. నెన్ని యేండ్లు మనియె నిలమీఁద మనుజుఁడై?, యెంద ఱైరి భార్య? లెట్లు మెలఁగె?**
**మఱియు నేమి చేసె? మాధవుచారిత్ర, మెంత గలదు? నాకు నేర్పరింపు. 9**

**ప్రతి :** యోగి+ఇంద్ర= యోగులలో శ్రేష్ఠుడవైనవాడా!; ఊహించి= ఆలోచించి; రాముఁడు= బలరాముడు; రోహిణి= రోహిణీదేవియొక్క; కొడుకు+అంచున్= కొడుకు అని; అప్పుడు= ఇదివరకు; ఈవు= నీవు; చెప్పితివి= చెప్పావు; ఒందు= మరొక; దేహంబున్= దేహమును; లేక= లేకుండా; అతఁడు= బలరాముడు; దేవకి= దేవకీదేవియొక్క; కడుపునన్= గర్భమునందు; ఏ, వెరవునన్= ఏ విధంగ; ఉండెను= ఉండినాడు; తన= తనయొక్క; తండ్రి= తండ్రిగారి; ఇలు= నివాసస్థలాన్ని; పాసి= వదలి; ఏ రీతి= ఏ విధంగా; మందకున్= వ్రేపల్లెకు; పోయెన్= పోయాడు; ఏ మందిరమునన్= ఏ ఇంట్లో; ఉండి; ఏ+అది= ఏది; చేయుచున్+ఉండెను= చేస్తూ ఉన్నాడు; తన= తనయొక్క; మేనమామ= తల్లిసోదరుడు; కంసునిన్= కంసుణ్ణి; ఏల= ఎందుచేత; నామము+అణఁచెన్= చంపాడు; ఎన్ని, ఏండ్లు= ఎన్ని సంవత్సరాలు; ఇలమీఁదన్= భూమిమీద; మనుజుఁడు+ఐ= మానవుడుగా; మనియెన్= జీవించాడు; భార్యలు; ఎందఱు+ఐరి= ఎంతమంది అయ్యారు; ఎట్లు= ఏ విధంగా; మెలఁగెన్= ప్రవర్తించాడు; మఱియున్= ఇంకా; ఏమిచేసెన్= ఏమి చేశాడు; మాధవు= లక్ష్మీపతి అయిన శ్రీకృష్ణునియొక్క; చారిత్రము= జీవిత చరిత్ర; ఎంతకలదు= ఎంత ఉన్నదో; నాకున్= నాకు; ఏర్పరింపు(ము)= వివరించు.

**తా :** శుకయోగీంద్రా! బలరాముడు రోహిణీదేవి కుమారుడని ఇంతకుముందే చెప్పావు. కానీ, ఇంకొక శరీరం లేకుండా దేవకీదేవి గర్భంలో ఆయన ఎలా ఉండినాడు? కృష్ణుడు మధురలో తనతండ్రి ఉన్న మందిరాన్ని వదలి ఏ విధంగా వ్రేపల్లెకు వెళ్ళాడు? ఎవరి ఇంట్లో ఉండినాడు. ఏమి చేస్తూ ఉండినాడు? తన మేనమామ అయిన కంసుణ్ణి ఎందుకు సంహరించాడు? ఎన్ని సంవత్సరాలు ఈ నేలమీద మానవుడుగా జీవించాడు? ఆయనకు భార్యలు ఎంతమంది? వారితో ఏ విధంగా ప్రవర్తించాడు? ఇంకా ఏమి చేశాడు? ఆ మాధవునిచరిత్ర అంతా నాకు వివరంగా చెప్పండి.

**విశే :** దేవకీదేవి గర్భంలో ఫలదీకరణ జరిగిన వెంటనే యోగమాయాప్రభావంతో ఆ పిండాన్ని రోహిణీదేవి గర్భంలోకి మార్చటం జరిగింది. తరువాత ఆ పిండం రోహిణిగర్భంలోనే పెరిగి బలరాముడు జన్మించాడు. ఇది ఒక అద్భుతం, అభూత కల్పన అని ఇదివరకు చాలమంది పెదవి విరిచేవారు.

కాని, ఆధునిక వైద్యవిజ్ఞానశాస్త్రం అభివృద్ధి చెందిన ఈ రోజుల్లో ఇలాంటివి జరుగుతున్నాయి కదా!

ఇవే కాదు – మన వేదశాస్త్రపురాణాల్లో అసహజాలు, అసంభవాలు, అభూతకల్పనలు అని అపహసించిన అనేక అంశాలు ఆధునికయుగంలో విజ్ఞానశాస్త్రపరిశోధనల ద్వారా నిరూపితాలౌతున్నాయి.

**వ. అని మఱియు నిట్లనియె. 10**

**ప్రతి :** అని= అంటూ; మఱియున్= ఇంకను; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తా :** అని, పరీక్షిన్మహారాజు శుకయోగితో ఇంకా ఇట్లా అన్నాడు.

**ఆ. నీ ముఖాంబుజాతనిర్ముక్తహరికథా, మృతముఁ ద్రావఁ ద్రావ మేను వొదలె,**
**వంత మానె, నీరువట్టు నాఁకలియును, దూరమయ్యె, మనము దొంగలించె. 11**

**ప్రతి :** నీ= నీ యొక్క; ముఖ+అంబుజాత= ముఖమనెడి పద్మంనుండి; నిర్ముక్త= వెలువడిన; హరికథా+అమృతమున్= విష్ణుకథ అనెడి అమృతాన్ని; త్రావన్+త్రావన్= త్రాగగా త్రాగగా; మేను= శరీరం; పొదలెన్= వర్ధిల్లెను; వంత= దుఃఖం; మానెన్= పోయింది; నీరు+పట్టున్= దప్పికయు; ఆఁకలియును= ఆకలికూడా; దూరము+అయ్యెన్= తొలగిపోయాయి; మనము= మనస్సు; తొంగలించెన్= వికాసం పొందింది.

**తా :** నీ ముఖపద్మంనుండి వెలువడిన విష్ణుకథ అనే అమృతాన్ని త్రావి త్రావి నా శరీరం ఉప్పొంగింది. దుఃఖం వదలిపోయింది. దప్పిక, ఆకలి దూరమయ్యాయి. మనస్సు వికాసం పొందింది.

**వ. అని పలుకుచున్న రాజుమాటలు విని, వైయాసి యిట్లనియె. 12**

**ప్రతి :** అని; పలుకుచున్+ఉన్న= చెప్పుతున్న; రాజుమాటలు విని= పరీక్షిన్మహారాజుమాటలను విని; వైయాసి= వ్యాసమహర్షి కుమారుడైన శుకయోగి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తా :** పై విధంగా అంటూ ఉన్న పరీక్షిన్మహారాజు మాటలు విని వ్యాసపుత్రుడైన శుకయోగి ఇలా అన్నాడు.

**క. విష్ణుకథారతుఁ డగునరు, విష్ణుకథల్ చెప్పునరుని వినుచుండునరున్**
**విష్ణుకథాసంప్రశ్నము, విష్ణుపదీజలముభంగి విమలులఁజేయున్. 13**

**ప్రతి :** విష్ణుకథా= విష్ణుకథలందు; రతుఁడు+అగు= ఆసక్తికలవాడగు; నరున్= మానవుణ్ణి; విష్ణుకథల్= విష్ణువును గూర్చిన కథలు; చెప్పు= చెప్పునట్టి; నరుని= మానవుణ్ణి; వినుచున్+ఉండు= వింటున్న; నరున్= మానవుణ్ణి; విష్ణుకథా సంప్రశ్నము= విష్ణుకథలను గూర్చి చక్కగా ప్రశ్నించి, అడుగుట; విష్ణుపదీ= విష్ణుపాదంనుండి పుట్టిన; జలముభంగిన్= నీళ్లవలె; విమలులన్= పరిశుద్ధులను; చేయున్= చేస్తుంది.

**తా :** విష్ణుకథలందే మనస్సు లీనమైనవారిని, విష్ణుకథలు చెప్పేవారిని, విష్ణుకథలు వినేవారిని–ఆ విష్ణుకథాప్రసంగం విష్ణుపాదంనుండి పుట్టిన గంగాజలంవలె పవిత్రుల్ని చేస్తుంది.

**విశే :** వామనావతారంలో విష్ణుమూర్తి ఒకపాదం పైకెత్తి ఆకాశాన్ని ఆక్రమించాడు. బ్రహ్మదేవుడు ఆ విష్ణుపాదాన్ని తన కమండలంలోని నీటితో కడిగాడు. ఆ నీరే గంగానది అయిందని పురాణగాథ. అందుకే గంగ విష్ణుపాదోద్భవ.

**సీ. రాజేంద్ర! విను తొల్లి రాజలాంఛనముల వేలసంఖ్యల దైత్యవిభులు దన్ను**
**నాక్రమించిన భార మాఁగఁజాలక భూమి గోరూపయై బ్రహ్మఁ జేరఁబోయి**
**కన్నీరు మున్నీరుగా రోదనము సేయఁ గరుణతో భావించి కమలభవుఁడు**
**ధరణి నూఱడఁ బల్కి ధాత్రియు వేల్పులుఁ గదలిరా విష్ణునిఁ గాన నేఁగి**

**తే. పురుషసూక్తంబుఁ జదివి యద్భుతసమాధి, నుండి యొకమాట విని వారిజోద్భవుండు**
**వినుఁడు వేల్పులు ధరయు నే విన్నయట్టి, పలుకు వివరింతు నని ప్రీతిఁ బలికెఁ దెలియ. 14**

**ప్రతి :** రాజ+ఇంద్ర= రాజశ్రేష్ఠా! – పరీక్షిన్మహారాజా!; విను= చక్కగా విను; తొల్లి= పూర్వం; దైత్యవిభులు= రాక్షసరాజులు; వేలసంఖ్యల= వేలసంఖ్యలో; రాజలాంఛనములన్= రాజ చిహ్నాలతో–రాజ్యాధికారాలతో; తన్నున్= తనను; ఆక్రమించినన్= ఆక్రమించగా; భారము= బరువును; ఆఁగన్+చాలక= ఓర్చుకొనలేక – మోయలేక; భూమి= భూమాత; గోరూప+ఐ= ఆవురూపాన్ని ధరించిందై; బ్రహ్మన్= బ్రహ్మదేవుణ్ణి; చేరన్+పోయి= దగ్గరకు వెళ్ళి; కన్నీరు; మున్నీరు+కాన్= సముద్రమగునట్లుగా; రోదనము+చేయన్= ఏడ్వగా; కమలభవుఁడు= పద్మంనుండి పుట్టినవాడు–బ్రహ్మ; కరుణతోన్= దయతో; భావించి= ఆలోచించి; ధరణిన్= భూమిని (గోరూపధారిణి అయివచ్చిన భూమాతను); ఊఱడన్= ఊరట చెందునట్లుగా; పల్కి= మాట్లాడి; ధాత్రియున్= భూమియు; వేల్పులున్= దేవతలును; కదలిరాన్= వెంటరాగా; విష్ణునిన్= విష్ణుమూర్తిని; కానన్= చూడడానికై; ఏఁగి= వెళ్ళి; పురుషసూక్తంబున్= పురుషోత్తముడైన పరమాత్మనుగూర్చి చక్కగా చెప్పబడిందైన పురుషసూక్తస్తోత్రాన్ని; చదివి; అద్భుత= ఆశ్చర్యకరమైన; సమాధిన్= తపస్సులో; ఉండి; ఒక; మాట; విని; వారిజ+ఉద్భవుండు= నీటినుండి పుట్టిన పద్మంనుండి జన్మించినవాడైన బ్రహ్మ; నేన్= నేను; విన్న+అట్టి= విన్నటువంటి; పలుకు= మాట; వివరింతున్ (వివరించుదున్)= వివరంగా చెపుతాను; వేల్పులు= దేవతలు; ధరయు= భూమికూడ; వినుఁడు= వినండి; అని; ప్రీతిన్= ప్రియంగా; తెలియన్= తేటతెల్లమగునట్లుగా; పలికెన్= చెప్పాడు.

**తా :** పరీక్షిన్మహారాజా! చెబుతాను విను. పూర్వం వేలకొలది రాక్షసులు రాజ్యాధికారాలు చేపట్టి తన్నాక్రమించగా, భూదేవి ఆ రాక్షసభారాన్ని మోయలేక గోరూపం ధరించి బ్రహ్మదేవుని దగ్గరకి వెళ్ళి కన్నీరు మున్నీరుగా దుఃఖించింది. బ్రహ్మదేవుడు దయతో భూదేవి నోదార్చి, ఆ భూదేవినీ, దేవతలనూ వెంటబెట్టుకొని విష్ణుమూర్తిని దర్శించాడు. పురుషసూక్తంతో ఆయన్ను స్తుతించాడు. సమాధిస్థితుడయ్యాడు. ఆ విధంగా సమాధి స్థితుడైన బ్రహ్మదేవునికి ఒకమాట వినిపించింది. తరువాత ఆయన 'ఓ దేవతలారా! ఓ భూదేవీ! నేను విన్నమాట మీకు వివరిస్తాను' అని ప్రియంగా ఇలా అన్నాడు.

**క. యాదవకులమున నమరులు, మేదినిపైఁ బుట్టఁ జనుఁడు మీ యంశములన్**
**శ్రీదయితుఁడు వసుదేవున, కాదరమునఁ బుట్టి భార మంతయుఁ బాపున్. 15**

**ప్రతి :** అమరులు= దేవతల్లారా; మేదినిపైన్= భూమి మీద; యాదవకులమునన్= యాదవవంశంలో; మీ+అంశములన్= మీ అంశలతో–మీ కళలతో; పుట్టన్= పుట్టడానికై; చనుఁడు= వెళ్ళండి; శ్రీదయితుఁడు= లక్ష్మీదేవి భర్త అయిన శ్రీమహావిష్ణువు; ఆదరమునన్= ప్రేమతో; వసుదేవునకున్= వసుదేవునికి; పుట్టి; భారము+అంతయున్= (భూ)భారాన్ని అంతా; పాపున్= తొలగిస్తాడు.

**తా :** దేవతల్లారా! మీరందరూ మీ మీ అంశలతో భూమిమీద యాదవకులంలో పుట్టండి. లక్ష్మీపతి అయిన శ్రీమహావిష్ణువు ప్రేమతో వసుదేవునిపుత్రుడుగా జన్మించి, భూభారాన్నంతా తొలగిస్తాడు.

**క. హరిపూజార్థము పుట్టుఁడు, సురకన్యలు భూమియందు సుందరతనులై**
**హరి కగ్రజుఁడై శేషుఁడు, హరికళతోఁ బుట్టుఁ దత్ప్రియారంభుండై. 16**

**ప్రతి :** సురకన్యలు= దేవతాస్త్రీల్లారా; (మీరు); సుందర, తనులు+ఐ= అందమైన శరీరాలు కలవారై; హరిపూజా+అర్థము= శ్రీమహావిష్ణువును (శ్రీమహావిష్ణువు అవతారమైన శ్రీకృష్ణుని) పూజించడంకోసం; భూమి+అందున్= నేలమీద; పుట్టుఁడు= పుట్టండి; శేషుఁడు= ఆదిశేషుడు; హరికిన్+అగ్రజుఁడు+ఐ= విష్ణుమూర్తికి (శ్రీకృష్ణునకు) ముందు పుట్టినవాడై – అనగా

అన్నయై; హరికళతోన్= విష్ణుమూర్తి అంశతో; తత్= ఆ విష్ణుమూర్తికి (శ్రీకృష్ణునికి); ప్రియ= ఇష్టమైన పనులను; ఆరంభుండు+ఐ= ప్రారంభించేవాడై; పుట్టున్= పుడతాడు.

**తా :** దేవతాస్త్రీల్లారా! మీరు అందమైన శరీరాలు గలవారై శ్రీమహావిష్ణువు అవతారమైన శ్రీకృష్ణుణ్ణి పూజించటానికి భూలోకంలో పుట్టండి. ఆదిశేషుడు ఆ విష్ణుమూర్తికళతోనే శ్రీకృష్ణునికి అన్నగా పుట్టి, ఆయనకు ప్రియమైన పనులు చేస్తూంటాడు.

**ఆ. ఈ ప్రపంచ మెల్ల నే మాయచే మోహి, తాత్మ మగుచు నుండు నట్టిమాయ**
**కమలనాభు నాజ్ఞఁ గార్యార్థమై నిజాం, శంబుతోడఁ బుట్టు జగతియందు. 17**

**ప్రతి :** ఈ, ప్రపంచము+ఎల్లన్= ఈ లోకం అంతా; ఏ, మాయచేన్= ఏ మాయచేత; మోహిత+ఆత్మ= భ్రమపడిన బుద్ధి కలది; అగుచున్+ఉండున్= అయి ఉన్నదో; అట్టిమాయ= అటువంటి మాయ; కమలనాభు+ఆజ్ఞన్= నాభిలో పద్మం ఉన్న శ్రీమన్నారాయణునిఆనతితో; నిజ+అంశంబుతోడన్= ఆ నారాయణునికళతోనే; కార్య+అర్థము+ఐ= ఒకానొక పనికొరకు; జగతి+అందున్= భూలోకంలో; పుట్టున్= జన్మిస్తుంది.

**తా :** ఈ ప్రపంచం అంతా ఏ మాయచేత మోహబుద్ధిని చెందుతూ ఉంటుందో. ఆ విష్ణుమాయ, విష్ణువుఆజ్ఞచేతనే ఆయన అంశతోనే ఒకానొక పనికొరకు భూమిపైన జన్మిస్తుంది.

**విశే :** అనిత్యమగు ఈ జగత్తంతా నిత్యమని భ్రమింప చేసేదే మాయ. ఈ మాయనే విష్ణుమాయ, యోగమాయ అని తత్త్వవేత్త లంటారు.

**వ. అని యిట్లు వేల్పుల నియ్యకొలిపి పుడమిముద్దియ నొడంబఱిచి తమ్మిచూలి తనమొదలి నెలవునకుం జనియె, నంత యదువిభుం డయిన శూరసేనుండనువాఁడు మథురాపురంబు తనకు రాజధానిగా మాథురంబులు శూరసేనంబు లనియెడు దేశంబు లేలెం బూర్వకాలంబున. 18**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; అని= చెప్పి; వేల్పులన్= దేవతలను; ఇయ్యకొలిపి= సమ్మతింపచేసి; పుడమిముద్దియన్= భూదేవిని; ఒడన్+పఱిచి= ఒప్పించి; తమ్మిచూలి= బ్రహ్మ; తన, మొదలి, నెలవునకున్= తాను మొదట ఉన్న చోటికి; చనియెన్= వెళ్లాడు; అంతన్= తరువాత; యదువిభుండు+అయిన= యాదవులకు రాజైన; శూరసేనుండు+అనువాఁడు= శూరసేనుడు అనే పేరుగలవాడు; మథురాపురంబు= మథుర అనుపేరుగల పట్టణాన్ని; తనకున్= తనకు; రాజధానిగా= ముఖ్యపట్టణంగా; మాథురంబులు= మథరకు సంబంధించినవైన; శూరసేనంబులు= శూరసేనునికి సంబంధించినవైన శూరసేనంబులు; అనియెడు= అను పేరుగల; దేశంబులు+ఏలెన్= దేశాలను పరిపాలించాడు; పూర్వకాలంబునన్= ప్రాచీనకాలంలో...

**తా :** బ్రహ్మదేవుడు ఈ విధంగా చెప్పి దేవతలను సమ్మతింపచేసి, భూదేవిని ఒప్పించి, తన తొలి నివాసస్థానానికి వెళ్ళాడు. తరువాత, యాదవులకు ప్రభువైన శూరసేనమహారాజు మథురాపురాన్ని రాజధానిగా చేసుకొని మథుర, శూరసేన దేశాలను పరిపాలించాడు.

**క. ఏ మథురయందు నిత్యము, శ్రీమన్నారాయణుండు సెలఁగుఁ బ్రియముమై**
**నా మథుర సకలయాదవ, భూమీశుల కెల్ల మొదలిపురి యయ్యె నృపా! 19**

**ప్రతి :** నృపా= పరీక్షిన్మహారాజా!; శ్రీమత్+నారాయణుండు= లక్ష్మీతోకూడిన మహావిష్ణువు; ఏ, మథుర+అందున్= ఏ మథురాపట్టణంలో; ప్రియముమైన్= ఇష్టంగా; నిత్యము= ఎల్లప్పుడు; చెలఁగున్= ప్రకాశించునో అనగా నివసించునో; ఆ, మథుర= ఆ మథురాపట్టణం; సకల; యాదవ, భూమి+ఈశులకున్+ఎల్లన్= యాదవరాజులందరికి; మొదలిపురి= మొదటిపట్టణం–రాజధాని; అయ్యెన్= అయింది.

**తా :** ఓ పరీక్షిన్మహారాజా! శ్రీమన్నారాయణుడు (శ్రీకృష్ణుడు) ఏ మథురానగరంలో ఎల్లప్పుడు ప్రీతితో విహరించాడో ఆ మథురానగరమే యాదవరాజులందరికి రాజధాని అయింది.

**సీ. ఆ శూరసేనున కాత్మజుం డగు వసుదేవుఁ డా పురి నొక్క దినమునందు**
**దేవకిఁ బెండ్లియై దేవకియును దానుఁ గడువేడ్క రథమెక్కి కదలువేళ**
**నుగ్రసేనునిపుత్త్రుఁ డుల్లాసి కంసుండు చెల్లెలు మఱఁదియు నుల్లసిల్లి**
**హరులపగ్గములఁ జేనంది రొప్పఁదొడంగె, ముందట భేరులు మురజములును**

**ఆ. శంఖపటహములును జడిగొని మ్రోయంగఁ, గూఁతుతోడి వేడ్క కొనలు సాఁగ**
**దేవకుండు సుతకు దేవకీదేవికి, నరణ మీఁదలంచి యాదరించి.** 20

**ప్రతి :** ఆ, శూరసేనునకున్+ఆత్మజుండు+అగు= ఆ శూరసేనునికి కుమారుడైన; వసుదేవుఁడు= వసుదేవుడు; ఆ, పురిన్= ఆ మథురానగరంలో; ఒక్క, దినము+అందున్= ఒకరోజు; దేవకిన్= (దేవకుని కూతురైన) దేవకీదేవిని; పెండ్లి+ఐ= వివాహం చేసుకొని; దేవకియును= ఆ దేవకీదేవితోపాటు; తాను= తానును; కడున్= మిక్కిలి; వేడ్కన్= సంతోషంతో; రథము+ఎక్కి= తేరును ఎక్కి; కదలు= బయలుదేర్తున్న; వేళన్= సమయంలో; ఉగ్రసేనుని= ఉగ్రసేనునియొక్క; పుత్త్రుఁడు= కుమారుడు; ఉల్లాసి= ఉత్సాహం కలవాడైన; కంసుండు= కంసుడను పేరుగలవాడు; చెల్లెలు= (తన) తోబుట్టువైన దేవకీదేవి; మఱఁదియున్= తనకు వరుసకు మరది అయిన వసుదేవుడు (దేవకికి మగడు); ఉల్లసిల్లన్= సంతోషించగా; హరుల, పగ్గంబులన్= గుఱ్ఱాల పగ్గాలను; చేన్+అంది= చేతపట్టుకొని; ముందటన్= రథానికి ముందుభాగంలో; భేరులు= పెద్దనగారాలు; మురజములును= మద్దెలలూ; శంఖ= శంఖాలూ; పటహములును= తప్పెటలూ; జడిగొని= ఎడతెగక; మ్రోయన్+కన్= మ్రోగుచుండగా; రొప్పన్= గుఱ్ఱాల్ని అదలించి త్రోలడానికై; తొడంగెన్= పూనుకొన్నాడు; దేవకుండు= దేవకితండ్రి; కూఁతుతోడి= కూతురి వెంట; వేడ్క= సంతోషం; కొనలుసాగన్= ముందుకు సాగగా; సుతకున్= కూతురికి; దేవకీదేవికిన్= దేవకీదేవికి; అరణము= వివాహసందర్భంలో కూతురికిచ్చే ధనాదుల్ని; ఈన్= ఇవ్వాలని; తలంచి= ఆలోచించి; ఆదరించి= ప్రేమాభిమానాలు చూపి...

**తా :** శూరసేనుని కుమారుడైన వసుదేవుడు ఒకరోజు మథురా నగరంలో దేవకుని కూతురైన దేవకిని వివాహమాడాడు. నూత్నదంపతులు ఎంతో సంతోషంతో రథమెక్కి బయలుదేరుతున్న సమయంలో – ఉగ్రసేనునికుమారుడైన కంసుడు ఉత్సాహంతో, చెల్లెలు దేవకీదేవి, మరది వసుదేవుడు సంతోషించగా, గుఱ్ఱాలపగ్గాలు చేపట్టి, రథానికి ముందు భాగంలో పెద్దనగారాలు, మద్దెలలు, శంఖాలు, తప్పెట్లు ఎడతెరిపిలేకుండ మ్రోగుతుండగా, గుఱ్ఱాల్ని అదిలించి, రథాన్ని నడపటానికి పూనుకొన్నాడు. దేవకీదేవితండ్రి తనకూతురికి పుట్టింటివారు ఇచ్చే కానుకలు ఇవ్వాలని ఆలోచించి, ప్రేమాభిమానాలతో

**విశే :** ఉగ్రసేనుడు, దేవకుడు ఆహుకుని కొడుకులు; అన్నదమ్ములు. ఉగ్రసేనుడికి తొమ్మిదిమంది కుమారులు; నలుగురు కుమార్తెలు. కొడుకులలో కంసుడు పెద్దవాడు. దేవకునిపుత్రిక దేవకిదేవి. కంసునికి చిన్నాయన కూతురు. శూరసేనునికి దేవమీఢు డని మరొకపేరు. ఇతని పుత్రుడే వసుదేవుడు.

**వ. సార్థంబు లయినరథంబుల వేయునెనమన్నూటినిఁ, గనకదామసముత్తుంగంబు లయిన మాతంగంబుల నన్నూటినిఁ బదివేలతురంగంబులను, విలాసవతు లయిన దాసీజనంబుల నిన్నూటి నిచ్చి యనిచినం గదలి వరవధూయుగళంబు దెరువునం జను సమయంబున. 21**

**ప్రతి :** స+అర్థంబులు+అయిన= ధనంతో కూడుకొన్నవి అయిన; రథంబులన్= తేరులను; వేయున్+ఎనమన్నూటినిన్= వెయ్యిన్నీ ఎనిమిదివందలను–అనగా పదునెనిమిదివందలను; కనక, దామ= బంగారుకట్టుగొలుసులతో; సమ్+ఉత్+తుంగంబులు+అయిన= మిక్కిలి ఎత్తైన; మాతంగంబులన్= ఏనుగులను; నన్నూటినిన్= నాలుగు వందలను; పదివేల తురంగంబులను= పదివేల గుర్రాలను; విలాసవతులు+అయిన= ఒయ్యారము కలవారైన; దాసీజనంబులన్= పనిగత్తెలను; ఇన్నూటిన్= రెండు వందలమందిని; ఇచ్చి= అరణంగా ఇచ్చి; అనిచినన్= పంపగా; కదలి= బయలుదేరి; వర, వధూ, యుగళంబు= పెళ్ళికొడుకు, పెళ్ళికూతురులజంట; తెరువునన్= మార్గంలో; చను= వెళ్ళు; సమయంబునన్= సమయంలో...

**తా :** సంపదలతో నింపబడిన పదునెనిమిదివందల రథాలను, బంగారు కట్టుగొలుసులు గల నాలుగువందల ఎత్తైన ఏనుగులను, పదివేల గుర్రాలను, ఒయ్యారులైన రెండువందల మంది పనిగత్తెలనూ అరణంగా ఇచ్చి పంపగా, వధూవరులజంట మార్గంవెంట బయలుదేరి వెళ్ళుతున్న సమయంలో

**విశే :** అరణము – క్రొత్త పెళ్ళికూతురికి పుట్టింటివారు ఇచ్చి పంపే కానుకలు.

**క. పగ్గములు వదలి వేగిర, మగ్గలముగ రథముఁ గడపు నా కంసుఁడు లో**
**బెగ్గిలి యెగ్గని తలఁపఁగ, దిగ్గన నశరీరవాణి దివి నిట్లనియెన్. 22**

**ప్రతి :** పగ్గంబులు= గుర్రాల కళ్ళెపు త్రాళ్లను; వదలి= సడలించి; వేగిరము= వేగం; అగ్గలముగన్= హెచ్చుగునట్లుగ; రథమున్= తేరును; కడపున్= నడుపుతున్న; ఆ, కంసుడు= ఆ కంసుడు; లోన్= తన మనస్సులో; బెగ్గిలి= కలవరపడి; ఎగ్గు+అని= కీడు అని; తలఁపన్+కన్= తలచుచుండగా; దిగ్గనన్= హఠాత్తుగా; అశరీరవాణి= ఆకాశవాణి; దివిన్= ఆకాశంలో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికింది.

**తా :** గుర్రాల పగ్గాలు సడలించి, వేగంగా రథాన్ని నడుపుతున్న కంసునిగుండెలు అదిరేట్లు, ఆకాశవాణి హఠాత్తుగా ఇలా పలికింది.

**క. తుష్టయగు భగిని మెచ్చఁగ, నిష్టుఁడవై రథము గడపె, దెఱుఁగవు మీఁదన్**
**శిష్టయగు నీ తలోదరి, యష్టమగర్భంబు నిన్ను హరియించుఁ జుమీ! 23**

**ప్రతి :** తుష్ట+అగు= తృప్తి పొందినదైన; భగిని= తోబుట్టువు; చెల్లెలు; మెచ్చన్+కన్= మెచ్చుకొనేట్లుగా; ఇష్టుఁడవు+ఐ= ఇష్టమైనవాడివై; రథమున్= తేరును; కడపెదు(వు)= త్రోలుచున్నావు; మీఁదన్= ఇకముందు జరగబోయేదాన్ని; ఎఱుఁగవు= తెలుసుకోలేవు; శిష్ట+అగు(న్)= సదాచారంగలదైన; ఈ, తల+ఉదరి= ఈ సుందరియొక్క; అష్టమగర్భంబు= ఎనిమిదవచూలు – ఎనిమిదవబిడ్డ; నిన్నున్= నిన్ను; హరియించున్= చంపుతుంది; చుమీ= సుమా!

**తా :** "సంతృప్తితో ఉన్న నీ తోబుట్టువు దేవకి మెచ్చుకొనేటట్లుగ, నీవు ఎంతో ప్రీతిగా రథాన్ని తోలుతున్నావు. ముమ్ముందు ఏమి జరుగుతుందో నీ వెరుగవు. ఈమె అష్టమసంతానం నీ పాలిటి మృత్యువౌతుంది సుమా!"

**వ. అని యిట్లాకాశవాణి పలికిన నులికిపడి భోజకులపాంసనుండైన కంసుండు సంచలదంసుండై యడిదంబు బెడిదంబుగాఁ బెఱికి జళిపించి దెప్పరంబుగ ననుజ కొప్పుఁ బట్టి కప్పరపాటున నొప్పఱం దిగిచి యొడిసి పట్టి, తోఁబుట్టువని తలంపక తెంపు సేసి తెగవ్రేయ గమకించు సమయంబున వసుదేవుండు డగ్గఱి. 24**

**ప్రతి :** అని; ఇట్లు= ఈ విధంగా; ఆకాశవాణి= అశరీరవాణి; పలికినన్= పలుకగా; ఉలికిపడి= అదిరిపడి; భోజ కుల= భోజుని వంశాన్ని; పాంసనుండు+ఐన కంసుండు= చెరిచేవాడైన కంసుడు; సంచలత్+అంసుండు+ఐ= మిక్కిలిగా కదలుచున్న మూపులు కలవాడై; అడిదంబున్= కత్తిని; బెడిదంబుగన్= భయంకరంగా; పెఱికి= (ఒరలోనుండి) పైకిలాగి; జళిపించి= ఆడించి; దెప్పరంబుగన్= దుస్సహంగా; అనుజ= చెల్లెలియొక్క; కొప్పున్= ముడిచిన జుట్టును; పట్టి= పట్టుకొని; కప్పరపాటునన్= తొట్రుపాటుతో; ఒప్పు+అఱన్= అందం చెడునట్లుగ; తిగిచి= లాగి; ఒడిసిపట్టి= పైకెగసి పట్టుకొని; తోఁబుట్టువు+అని= చెల్లెలని; తలంపక= ఆలోచింపక; తెంపున్+చేసి= తెగించి; తెగవ్రేయన్= తెగనరుకుటకు; గమకించు= ప్రయత్నించే; సమయంబునన్= సమయంలో; వసుదేవుండు= దేవకిభర్త వసుదేవుడు; డగ్గఱి= దగ్గరికి వచ్చి...

**తా :** అని ఈ విధంగా ఆకాశవాణి పలుకగా, భోజవంశాన్ని చెరిచేవాడైన కంసుడు అదిరిపడి మూపులు కదలుతుండగా ఒరనుండి కత్తిని భయంకరంగా లాగి, జళిపించి, చెల్లెలైన దేవకీదేవి కొప్పును చెదరలాగి, ఒడిసిపట్టుకొని, చెల్లెలనికూడ చూడకుండ తెగించి ఆమెను తెగనరుకుటకు ప్రయత్నించాడు. ఆ సమయంలో వసుదేవుడు సమీపించి

**క. ఆ పాపచిత్తు మత్తుం, గోపాగ్నిశిఖానువృత్తుఁ గొనకొని తన స**
**ల్లాపామృతధారావి, క్షేపంబునఁ గొంత శాంతుఁ జేయుచుఁ బలికెన్. 25**

**ప్రతి :** మత్తున్= మదించినవాణ్ణి; కోప+అగ్ని= కోపమనెడు అగ్నియొక్క; శిఖా= కొసమంటను; అనువృత్తున్= అనుసరించిన ప్రవర్తన కలవాడైన వాణ్ణి; ఆ పాపచిత్తున్= ఆ పాపాత్ముడైన కంసుణ్ణి; కొనకొని= పూనుకొని; తన= తనయొక్క; సల్లాప= మంచిమాటలనెడు; అమృతధారా= అమృతధారలయొక్క; విక్షేపణమునన్= చల్లుటచేత; కొంత శాంతున్= కొద్దిగా శాంతించినవాణ్ణిగా; చేయుచున్= చేస్తూ; పలికెన్= మాట్లాడాడు.

**తా :** మదించినవాడు, అగ్నిజ్వాలవలె కోపంతో మండుతున్నవాడు, పాపాత్ముడు అయిన కంసుణ్ణి – వసుదేవుడు పూనికతో తన మంచిమాటలనెడి అమృతధారలతో కొంతకు కొంత శాంతపరిచాడు.

**ఉ. అన్నవు నీవు చెల్లెలికి, నక్కట మాడలు చీర లిచ్చుటో**
**మన్నన సేయుటో, మధురమంజులభాషల నాదరించుటో,**
**మిన్నుల మ్రోఁతలే నిజము, మేలని చంపకు మన్న మాని రా**
**వన్న! సహింపు మన్న! తగ దన్న! వధింపకు మన్న! వేఁడెదన్. 26**

**ప్రతి :** అక్కట= అయ్యో!; నీవు అన్నవు= నీవు సోదరుడివి; చెల్లెలికిన్= తోబుట్టువుకు; మాడలు= బంగారు నాణేలు; చీరలు= కోకలు; ఇచ్చుట+ఓ= ఇవ్వటమో; మన్నన= మర్యాద; చేయుట+ఓ= చేయటమో; మధుర= తీయని; మంజుల= మృదువైన; భాషలన్= మాటలచేత; ఆదరించుట+ఓ= ప్రేమాభిమానాలతో చూడటమో; (చేయవలెను గాని); మిన్నుల,

మ్రోఁతలు+ఏ= ఆకాశంనుండి వినబడిన మాటలే; నిజము= సత్యం; మేలు+అని= మంచిచేసేవి అని; చంపకుము+అన్న= చంపవద్దయ్యా; మాని రావ+అన్న= నీ ప్రయత్నాన్ని వదలిరావయ్యా; తగదు+అన్న= (చెల్లెలిని చంపుట) తగినపని కాదయ్యా; వధింపకుము+అన్న= చంపవద్దయ్యా!; వేఁడెదన్= (నిన్ను); ప్రార్థిస్తాను.

**తా :** బావా! అన్నవైన నీవు నీ చెల్లెలికి బంగారునాణాలివ్వాలి. చీరలివ్వాలి. మర్యాద చెయ్యాలి. తీయని మృదువైన మాటలతో ఆదరించాలి. అంతేగాని, ఆకాశవాణి పలుకులే నిజమని, నీకు మేలు చేసేవని నమ్మి, చెల్లెల్ని చంపవద్దయ్యా! నీ ప్రయత్నాన్ని విరమించు. ఓర్పు వహించు. నిన్ను వేడుకొంటున్నాను. దేవకిని వధించవద్దు.

**వ. అదియునుం గాక. 27**

**ప్రతి :** అదియునున్+కాక= అంతేకాక...

**తా:** అంతమాత్రమే కాకుండా

**మ. చెలియల్, గన్నియ, ముద్దరా లబల, నీ సేమంబు చింతించు ని**
**ర్మల, దీనిన్ బయలాడుమాటలకు నై మర్యాదఁ బోఁదట్టి, స**
**త్కులజాతుండవు పుణ్యమూర్తి వకటా! గోపంబు పాపంబు, నె**
**చ్చెలి నోహో! తెగవ్రేయఁ బాడియగునే? చింతింపు భోజేశ్వరా! 28**

**ప్రతి :** భోజ+ఈశ్వరా!= భోజవంశపు రాజువైన ఓ కంసా!; సత్= మంచి; కుల= వంశంలో; జాతుండవు= పుట్టినవాడవు; పుణ్యమూర్తివి= రూపుదాల్చిన పుణ్యానివి-పుణ్యాత్ముడివి; అకటా!= అయ్యో!; చెలియల్= చెల్లెలు; కన్నియ= కూతురు-కూతురివంటిది; ముద్దరాలు= అమాయకురాలు; అబల= బలహీనురాలు; నీ, సేమంబు= నీ క్షేమాన్ని; చింతించున్= కోరుతుంటుంది; నిర్మల= కల్మషంలేనిది; దీనిన్= ఈ దేవకిని; నెచ్చెలిన్= స్నేహభావం కలదాన్ని; బయలు= ఆకాశం; ఆడు= పల్కు; మాటలకును+ఐ= మాటలకొరకై; తెగవ్రేయున్= తెగనరకడం, చంపడం; పాడి= న్యాయం; అగునే= అవుతుందా?; కోపంబు= కోపమనేది; పాపంబు= పాపకార్యమని; చింతింపు= ఆలోచింపు.

**తా :** భోజవంశప్రభువువైన ఓ కంసా! నీవు మంచి వంశంలో జన్మించావు. పుణ్యాత్ముడవు. చెల్లెలు కూతురితో సమానురాలు. అమాయకురాలు, అశక్తురాలు, నీ క్షేమాన్ని కోరుకొనేది ఎలాంటి కల్మషంలేని స్నేహితురాలు ఈ దేవకిని, ఏదో ఆకాశంలోని పలుకులు విని తెగనరకటం న్యాయమా? ఇది చాలా పాపం కనుక కోపంమాని ఆలోచించుకో.

**విశే :** కోపాన్ని తగ్గించటానికి, పాపపు పనులు ఆపటానికి అప్పుడప్పుడు ప్రశంస అద్భుతంగా ఉపయోగపడుతుంది. అందుకే ఇప్పుడు వసుదేవుడు చేసిన కంస ప్రశంస దేవకీదేవి ప్రాణాన్ని కాపాడింది.

**సీ. మేనితోడన పుట్టు మృత్యువు జనులకు, నెల్లి నేఁడైన నూఱేండ్ల కైనఁ**
**దెల్లంబు మృత్యువు దేహంబు పంచత నందఁ గర్మానుగుండై శరీరి**
**మాఱుదేహము నూఁది, మఱి తొంటిదేహంబుఁ బాయును దన పూర్వభాగ మెత్తి**
**వేఱొంటిపైఁ బెట్టి వెనుకభాగం బెత్తి గమనించు తృణజలూకయును బోలె,**

**ఆ. వెంటవచ్చు కర్మవిసరంబు, మును మేలుకన్నవేళ నరుఁడు గన్న విన్న**
**తలఁపఁబడిన కార్యతంత్రంబు కలలోనఁ, బాడితోడఁ గానఁబడిన యట్లు. 29**

**ప్రతి :** జనులకున్= మానవులకు; మృత్యువు= మరణం; మేనితోడన్+అ= దేహంతోనే; పుట్టున్= పుట్టుతుంది; ఎల్లి= రేపు; నేఁడు+ఐనన్= ఈ రోజైనా రేపైనా; నూఱు+ఏండ్లకున్+ఐనన్= వంద సంవత్సరాలకైనా; మృత్యువు= చావు; తెల్లంబు= స్పష్టం – చావు తప్పదు; దేహంబు= శరీరం; పంచతన్= చావును; అందన్= పొందగా; శరీరి= జీవుడు; కర్మ+అనుగుండు+ఐ= తన (పుణ్య, పాప) కర్మలను అనుసరించినవాడై; తన= తనయొక్క; పూర్వభాగము+ఎత్తి= ముందు భాగాన్ని పైకెత్తి; వేఱొంటిపైన్= మరొకదానిమీద–మరొక ఆధారం మీద; పెట్టి= ఉంచి; వెనుకభాగంబు+ఎత్తి= వెనుకభాగాన్ని ఎత్తి; గమనించు= ముందుకు సాగిపోవు; తృణజలూకయునున్+పోలెన్= గడ్డిజలగవలె; మాఱుదేహమున్+ఊఁది= మరొక శరీరాన్ని పొంది; మఱి= తరువాత; తొంటిదేహంబున్= మునుపటిశరీరాన్ని; పాయును= వదలును; కర్మ, విసరంబు= కర్మసమూహం – చేసిన మంచిచెడు కర్మలఫలసమూహం; మును= ముందు; మేలుకన్న వేళ= మేలుకొని ఉన్న సమయంలో; నరుఁడు= మానవుడు; కన్న= చూచిన; విన్న= వినిన; తలఁపన్+పడిన= ఆలోచింపబడిన; కార్య తంత్రంబు= పనుల విధము; కలలోనన్= కలలో; పాడితోడన్= క్రమంగా; కానన్+పడిన+అట్లు= కనిపించిన విధంగా; వెంటవచ్చున్= వెంబడించి వస్తుంది.

**తా :** మానవులకు దేహంతోపాటే మరణం కూడా పుట్టుతుంది. ఈ రోజైనా, రేపైనా, నూరేండ్లకయినా మరణం తప్పదు. జీవుడు మరణాన్ని పొంది కర్మానుసారియై, పచ్చిగడ్డిమీద ప్రాకే జలగ తనముందు భాగాన్ని పైకెత్తి వేరొక గడ్డిపరకమీద మోపి, తరువాత వెనుకభాగాన్ని ఎత్తి ముందుకు సాగినట్లు–క్రొత్తదేహాన్ని పొంది పాతదేహాన్ని వదలుతాడు. మానవుడు మేల్కొని ఉన్నప్పుడు చూచినవి, విన్నవి, ఆలోచించినవి అతనికలలో క్రమంగా కన్పించినట్లు, మంచి చెడ్డ కర్మల ఫలాలు అతణ్ణి వెంబడిస్తాయి.

**విశే :** "జాతస్య హి ధ్రువో మృత్యుః! ధ్రువం జన్మ మృతస్య చ" పుట్టివానికి మరణం తప్పదు. మరణించినవానికి పుట్టుక తప్పదు – అని గీతాచార్యునివచనం; సృష్టిధర్మం.

మంచిపనికి ఫలం శుభం. చెడుపనికి ఫలం పాపం – అనింది రామాయణం.

**క. తన తొంటికర్మరాశికి, ననుచరమై బహువికారమై మనసు వడిం**
**జను, నింద్రియములతెరువులఁ, దనువులు పెక్కైనఁ జెడవు తనకర్మంబుల్. 30**

**ప్రతి :** తన= తనయొక్క; తొంటి= ముందటి జన్మల; కర్మ రాశికిన్= కర్మల సమూహానికి; అనుచరము+ఐ= అనుసరించినడిచేదై; బహు, వికారము+ఐ= అనేకములైన మార్పులుగలదై; మనసు= మనస్సు; వడిన్= వేగంగా; ఇంద్రియముల= ఇంద్రియాలయొక్క; తెరువులన్= త్రోవలవెంట; చనున్= వెళ్ళుతుంది; తనువులు= శరీరాలు; పెక్కు+ఐనన్= అనేకంగా ధరించినా; తన కర్మంబుల్= తాను చేసినకర్మలు, కర్మఫలాలు; చెడవు= నశించవు.

**తా :** తాను పూర్వం చేసిన కర్మల ననుసరించే మనిషి మనస్సు అనేక వికారాలకు లోనవుతుంది. ఇంద్రియాలు ఎటువెళ్ళితే ఆ మనస్సు అటే వెళ్ళుతూ ఉంటుంది. మనిషి ఎన్ని జన్మలెత్తినా అతనికర్మఫలాలు నశించవు. అవి అతణ్ణి వదలవు.

**ఆ. జలఘటాదులందుఁ జంద్రసూర్యాదులు, గానఁబడుచు గాలిఁ గదలు భంగి**
**నాత్మకర్మనిర్మితాంగంబులను బ్రాణి, గదలుచుండు రాగకలితుఁడగుచు. 31**

**ప్రతి :** జలఘట+ఆదుల+అందున్= నీటికుండలు మొదలైనవాటిలో; చంద్ర సూర్య+ఆదులు= చంద్రుడు, సూర్యుడు మొదలైనవారు; కానన్+పడుచున్= అగుపడుతూ; గాలిన్= గాలివల్ల; కదలు భంగిన్= కదిలేవిధంగ; ప్రాణి= జీవుడు; ఆత్మ= తనయొక్క; కర్మ= కర్మలచేత; నిర్మిత= నిర్మింపబడిన; అంగంబులను= శరీరాలందు; రాగ= ఇష్టంతో; కలితుఁడు+ అగుచున్= కూడుకొన్నవాడవుతూ; కదలుచున్+ఉండున్= చలిస్తూ ఉంటాడు.

**తా :** నీటికుండ, నీటికుంట, చెరువు, కొలను మొదలగు వాటియందు సూర్యచంద్రాదులు ప్రతిఫలిస్తూ, గాలికి కదలుతూ ఉన్నట్లే, ప్రాణి తన కర్మఫలాలతో నిర్మితమైన దేహాల్లో కోరికలు కలవాడై కదలుతూ ఉంటాడు.

**క. కర్మములు మేలు నిచ్చును, గర్మంబులు గీడు నిచ్చు, గర్తలు దనకుం**
**గర్మములు బ్రహ్మ కైనను, గర్మగుఁడై పరులఁ దడవఁగా నేమిటికిన్? 32**

**ప్రతి :** తనకున్= జీవుడైన తనకు; కర్మములు= చేసేపనులు; మేలున్+ఇచ్చును= మంచిని కలుగచేస్తాయి; కర్మంబులు= చేసేపనులే; కీడున్+ఇచ్చున్= చెడును కలుగచేస్తాయి; బ్రహ్మకున్+ఐనను= బ్రహ్మదేవునికైనా; కర్మములు= చేసేపనులే (మంచి, చెడుపనులు); కర్తలు= (మేలుకీళ్ళను) చేసేటివి; కర్మగుఁడు+ఐ= (తాను) కర్మలు చేస్తూ, సుఖదుఃఖఫలాలు అనుభవించేవాడై; పరులన్= ఇతరులను; తడవన్+కాన్= విచారించడం (తనమేలుకీళ్ళకు ఇతరులు కారకులనడం); ఏమిటికిన్= ఎందుకు?

**తా :** మంచిని, చెడును కలుగచేసేవి కర్మలే! జీవుడికైనా, బ్రహ్మదేవుడికైనా అంతే! ఆలాంటప్పుడు తాను కర్మలు చేస్తూ తనకు జరిగే మంచి చెడులకు ఇతరులు కారకు లనటం ఎందుకు?

**క. కావునఁ బరులకు హింసలు, గావింపఁగ వలదు తనకుఁ గల్యాణముగా**
**భావించి పరుల నొంచినఁ, బోవునె? తత్ఫలము పిదపఁ బొందక యున్నే? 33**

**ప్రతి :** కావునన్= కనుక (తన మేలుకీళ్ళకు తనకర్మలే కారణం కనుక); పరులకున్= ఇతరులకు; హింసలు= బాధలు; కావింపన్+కన్= కలుగచేయటం; వలదు= వద్దు; తనకున్= తనకు; కల్యాణము+కాన్= శుభం అని; భావించి= తలచి; పరులన్= ఇతరులను; నొంచినన్= హింసించినట్లయితే; తత్+ఫలము= దానియొక్క ఫలితం; పోవును+ఎ?= పోతుందా?; పిదపన్= తరువాతైనా; పొందక+ఉన్నే= అనుభవించక తప్పుతుందా?

**తా :** అందువల్ల ఇతరుల్ని హింసించ కూడదు. తనకు శుభం కలుగుతుందని ఇతరుల్ని హింసించినట్లయితే దానిఫలితం ఊరకే పోదు. తరువాతనైనా దాన్ని అనుభవించక తప్పదు.

**విశే :** కర్మఫలం ఈ జన్మలో కాకున్న మరోజన్మలోనైన అనుభవించక తప్పదు. కర్మఫలం-మంచికి మంచి; చెడుకు చెడు.

**మత్త. వావిఁ జెల్లెలుగాని పుత్త్రికవంటి దుత్తమురాలు, సం**
**భావనీయచరిత్ర, భీరువు, బాల, నూత్నవివాహ సు**

**శ్రీవిలాసిని, దీన, కంపితచిత్త నీకిదె మ్రొక్కెదం,**
**గావవే! కరుణామయాత్మక! కంస! మానవవల్లభా! 34**

**ప్రతి :** కరుణామయ+ఆత్మక= దయయే స్వరూపంగాగల మనస్సు ఉండేవాడా!; మానవవల్లభా!= మానవులకు అధిపతి అయినవాడా!; కంస= కంసమహారాజా!; వావిన్= వరుసకు; చెల్లెలుకాని= (నీకు) తోబుట్టువుగాని; పుత్త్రికవంటిది= (నీకు) కూతురువంటిది; ఉత్తమురాలు= చాలమంచిది; సంభావనీయచరిత్ర= గౌరవింపదగిన నడవడిగలది; భీరువు= భయపడే స్వభావం గలది; బాల= చిన్నవయస్సు గలది; నూత్నవివాహ= క్రొత్తగా పెండ్లిఅయినది–క్రొత్తపెండ్లికూతురు; సు= మేలైన; శ్రీ= కాంతియొక్క; విలాసిని= విలాసవతి; దీన= ధైర్యం లేనిది; కంపిత చిత్త= వణుకుతున్న మనస్సుగలది; నీకున్+ఇదె= ఇదిగో నీకు; మ్రొక్కెదన్= నమస్కరిస్తున్నాను; కావవే= కాపాడవయ్యా!

**తా :** ఓ దయామయుడవైన కంసమహారాజా! ఈ దేవకి నీకు వరుసకు చెల్లెలే గాని, నీ కన్నబిడ్డవంటిది; చాలమంచిది. గౌరవించదగినప్రవర్తన గలది. భయపడేస్వభావంగలది; పిన్నది; క్రొత్తగా పెళ్ళి అయినట్టిది. చక్కని శోభకలది; భయంతో వణుకుతూంది; నీకు చేతులెత్తి మ్రొక్కుతున్నాను. ఆమెను కాపాడు.

**వ. అని మఱియు సామభేదంబులగు పలుకులు పలికిన వినియు వాఁడు వేఁడిచూపుల రాలు నిప్పులు గుప్పలు గొన ననుకంపలేక, తెంపుసేసి చంపకగంధిం జంపఁ జూచుట యెఱింగి మొఱంగెడితెఱంగు విచారించి తనలో నిట్లనియె. 35**

**ప్రతి :** అని= పైవిధంగా పలికి; మఱియున్= ఇంకను; సామ భేదంబులు+అగు= మంచివి; మనస్సును గాయపరచేవి అయిన; పలుకులు= మాటలు; పలికినన్= పలుకగా; వినియున్= వినికూడా; వాఁడు= ఆ కంసుడు; వేఁడిచూపులన్= (కోపంతో) వేడెక్కిన చూపులనుండి; రాలు= క్రిందికిపడుతున్న; నిప్పులు+కుప్పలు+కొనన్= నిప్పులు రాసులగుచుండగా; అనుకంపలేక= దయలేకుండా; తెంపు+చేసి= తెగించి; చంపకగంధిన్= సంపంగిపూవు వాసనవంటి శరీరసువాసనగల దేవకీదేవిని; చంపన్+చూచుటన్= చంపుటకు ప్రయత్నించడాన్ని; ఎఱింగి= తెలుసుకొని; మొఱంగెడి తెఱంగు= వంచించే విధం; విచారించి= ఆలోచించి; తనలోన్= తనమనస్సులో; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అనుకొన్నాడు.

**తా :** అని వసుదేవుడు సౌమ్యంగా, కటువుగా మాట్లాడగా, కంసుడు తన వేడిచూపులనుండి నిప్పులు కుప్పలువడ రాల్చి, దయలేనివాడై తెగించి దేవకిని చంపబోయాడు. అది తెలుసుకొని వసుదేవుడు అతని ప్రయత్నాన్ని ఏ విధంగా వంచించాలా అని ఇలా ఆలోచించాడు.

**క. 'ఎందును గాలము నిజ మని, పందతనంబునను బుద్ధిఁ బాయక ఘనులై**
**యెందాఁక బుద్ధి నెగడెడి, నందాఁకఁ జరింపవలయు నాత్మబలమునన్. 36**

**ప్రతి :** ఎందును= ఎక్కడైనా; కాలము= చావు; నిజము+అని= సత్యం అని; పందతనంబునను= పిరికితనంతో; బుద్ధిన్= తెలివిని; పాయక= విడువక–కోల్పోక; ఘనులు+ఐ= ధైర్యంపూనినవారై; ఎందాఁకన్= ఎంతవరకు; బుద్ధి= తెలివి; నెగడెడిన్= వ్యాపించునో; అందాఁకన్= అంతవరకు; ఆత్మబలమునన్= స్వశక్తిచే; చరింపవలయున్= ప్రవర్తించాలి.

**తా :** చావు తప్పదు కదా అని మనిషి తెలివి తక్కువగ పిరికితనంతో ఊరుకోకూడదు. ధైర్యం వహించి, బుద్ధి ఎంతవరకు పనిచేస్తుందో అంతవరకు అతడు స్వశక్తితో ప్రవర్తించాలి.

**వ. అని నిశ్చయించి** **37**

**ప్రతి :** అని= ఈ విధంగా; నిశ్చయించి= నిర్ణయించి...

**తా :** అని వసుదేవుడు నిర్ణయించుకొని

**సీ. ఆపన్నురాలైనయంగన రక్షించి సుతుల నిచ్చెద నంట శుభము నేఁడు**
**మీఁ దెవ్వఁ డెఱుఁగును? మెలఁత ప్రాణంబుతో నిలిచిన మఱునాఁడు నేరరాదె**
**సుతులు పుట్టిర యేని సుతులకు మృత్యువు వాలాయమై వెంట వచ్చెనేని**
**బ్రహ్మచేతను వీఁడు పా టేమియును లేక యుండునే? సదుపాయ మొకటి లేదె?**

**తే. పొంత మ్రాఁకులఁ గాల్పక పోయి వహ్ని, యెగసి దవ్వులవాని దహించుభంగిఁ**
**గర్మవశమున భవమృతికారణములు, దూరగతిఁ బొందు, నిఁక నేల తొట్రుపడఁగ?** **38**

**ప్రతి :** నేఁడు= ఈ రోజు – ఇప్పుడు; ఆపన్నురాలు+ఐన= ప్రమాదంలో ఉన్నదైన; అంగనన్= స్త్రీని– ఈ దేవకిని; రక్షించి= కాపాడి; సుతులన్= కొడుకులను; ఇచ్చెదన్= ఇత్తును; అంట= అనడం; శుభము= మేలు; మీఁద= తరువాత జరిగేది; ఎవ్వఁడు ఎఱుఁగును= ఎవడు తెలుసుకోగలడు; మెలఁత= ఈ స్త్రీమూర్తి–దేవకి; ప్రాణంబుతో= ఊపిరితో; నిలిచినన్= ఉన్నట్లయితే; మఱునాఁడు= తరువాతిరోజు; నేరరాదె= (ఏమి చేయవలెనో) తెలుసుకోవచ్చుకదా; సుతులు= కొడుకులు; పుట్టిర+ఏనిన్= పుట్టినట్లయితే; సుతులకున్= ఆ కొడుకులకు; మృత్యువు= మరణం; వాలాయము+ఐ= తప్పనిదై; వెంటన్= వెంబడించి; వచ్చెన్+ఏనిన్= వచ్చినట్లయితే; బ్రహ్మచేతను= బ్రహ్మదేవునిచేత; వీఁడు= ఈ కంసుడు; పాటు= పతనం; ఏమియును, లేక= ఏమీలేకుండా; ఉండును+ఏ= ఉంటాడా?; సద్+ఉపాయము= మంచి ఉపాయం; ఒకటి; లేదు+ఎ= ఉండదా; వహ్ని= అగ్ని; పొంత, మ్రాఁకులన్= చెంతనున్నచెట్లను; కాల్పక= కాల్చకుండా; పోయి= తొలగిపోయి; ఎగసి= విజృంభించి; దవ్వులవానిన్= దూరంగా ఉన్నవాటిని; దహించు= కాల్చు; భంగిన్= విధంగా; కర్మవశమున్= కర్మఫలాన్ని అనుసరించి; భవ= పుట్టుకయొక్క; మృతి= మరణంయొక్క; కారణం; దూరగతిన్= దూరపుమార్గాన్ని; పొందున్= పొందుతుంది; ఇఁకన్= ఇంక; తొట్రుపడన్+కన్= తడబాటుపడుట; ఏల= ఎందుకు?

**తా :** ఆపదలో ఉన్నదేవకిని రక్షించటానికై, పుట్టబోయే కుమారుల్ని వీడికి ఇచ్చివేస్తాననటం ప్రస్తుతానికి మంచిది. ముందు ఏమి జరుగుతుందో ఎవరికి తెలుసు? ఈమె ఇప్పటికి ఊపిరితో ఉంటే రేపు మరోమార్గం దొరకదా? కొడుకులు పుట్టి, వాళ్ళకు మరణం తప్పనిసరి అయితే – వీడుకూడా బ్రహ్మదేవునిచేత ఏ ఆపదా పొందకుండ ఉంటాడా? అడవిలో పుట్టిన అగ్ని–దావాగ్ని–ప్రక్కనున్న చెట్లను విడిచి, విజృంభించి ఎక్కడో దూరంలో ఉండే చెట్లను; దహించినట్లు–కర్మఫలాన్ని అనుసరించి జననమరణ కారణం దూరదూరంగా పోతుంటుంది. అందువల్ల ఇక నేను తడబడటం ఎందుకు?

**క. కొడుకుల నిచ్చెద నని సతి, విడిపించుట నీతి, వీఁడు విడిచినమీఁదం**
**గొడుకులు పుట్టినఁ గార్యము, దడఁబడదే? నాఁటి కొక్క దైవము లేదే?** **39**

**ప్రతి :** కొడుకులన్= (పుట్టబోయే) పుత్రులను; ఇచ్చెదన్+అని= (చంపుటకు) ఇస్తానని; సతిన్= భార్యను–దేవకిని; విడిపించుట= ఈ కంసుని బారినుండి రక్షించడం; నీతి= న్యాయం; వీఁడు= ఈ కంసుడు; విడిచిన, మీఁదన్= విడిచిపెట్టిన

తరువాత; కొడుకులు= పుత్రులు; పుట్టినన్= జన్మిస్తే; కార్యము= కంసుడు చేస్తాననుకొన్నపని; తడన్+పడదే= తారుమారుకాకుండా ఉంటుందా? నాటికిన్= ఆ నాటికి; ఒక్కదైవము లేదే= ఒక దైవమైనా ఉండదా?

**తా :** పుట్టబోయే కొడుకులను ఇస్తానని, కంసునిబారినుండి దేవకిని రక్షించటం ప్రస్తుతానికి తెలివైన పని. వీడు ఇప్పుడు ఆమెను చంపకుండా వదలితే-కొడుకులు పుట్టేనాటికి పరిస్థితులు తారుమారు కాకపోతాయా? ఆ నాటికి ఏ దైవమైనా అడ్డుపడక పోతుందా?

**క. ఎనిమిదవచూలు వీనిం, దునుమాడెడి నంచు మింటఁ దోరపుఁబలుకుల్**
**వినఁబడియె, నేల తప్పును?, వనితను విడిపించు టొప్పు వైళం బనుచున్. 40**

**ప్రతి :** ఎనిమిదవచూలు= ఎనిమిదవబిడ్డ; వీనిన్= ఇతణ్ణి; ఈ కంసుణ్ణి; తునుమాడెడిన్= చంపగలడు; అంచున్= అంటూ; మింటన్= ఆకాశంనుండి; తోరము+పలుకుల్= బలమైనమాటలు; వినన్+పడియెన్= వినబడినవి; ఏల= ఎందుకు; తప్పున్= తప్పిపోతాయి; వనితను= స్త్రీని అనగా దేవకిని; వైళంబు= త్వరగ; విడిపించుట= (కంసునిబారినుండి) తప్పించుట; ఒప్పున్= తగును; అనుచున్= అని అనుకొంటూ...

**తా :** 'దేవకిఎనిమిదవగర్భంనుండి పుట్టేకొడుకు కంసుణ్ణి చంపుతాడని గట్టిగా ఆకాశవీథినుండి వినిపించింది. ఆ మాటలు ఎందుకు తప్పిపోతాయి? తప్పక జరిగితీర్తాయి. అందువల్ల దేవకిని వెంటనే కంసుని బారినుండి విడిపించటం మంచిది" అని వసుదేవుడు అనుకొంటూ

**క. తిన్ననిపలుకులు పలుకుచుఁ, గ్రన్నన తగఁ బూజ చేసి కంసు నృశంసున్**
**మన్నించి చిత్త మెరియఁ బ్ర, సన్నాననుఁ డగుచుఁ బలికె శౌరి నయమునన్. 41**

**ప్రతి :** శౌరి= వసుదేవుడు; తిన్నని= మెత్తని; పలుకులు= మాటలు; పలుకుచున్= మాట్లాడుచు; క్రన్ననన్= త్వరత్వరగా; నృశంసున్= క్రూరుడైనవాణ్ణి; కంసున్= కంసుణ్ణి; తగన్= తగినవిధంగా; పూజచేసి= (మంచి మాటలనే పూలతో) పూజించి; మన్నించి= గౌరవించి; చిత్తము= మనస్సు; ఎరియన్= మండుతున్నా; ప్రసన్న= నిర్మలమైన; ఆననుండు= ముఖం కలవాడు; అగుచున్= అవుతూ; నయమునన్= మృదువుగా; పలికెన్= (ఈ క్రింది విధంగా) మాట్లాడాడు.

**తా :** వసుదేవుడు మృదువుగా మాట్లాడుతూ - వెంటనే ఆ క్రూరుడైన కంసుణ్ణి తగు రీతిగా పూజించి మాటలపూలతో గౌరవించాడు. మనస్సు మండుతూ ఉన్నా, ప్రశాంతముఖంతో అతనితో ఇలా అన్నాడు.

**విశే :** యాదవప్రభువైన శూరునికొడుకు కనుక వసుదేవుడు శౌరి.

**క. "లలనకుఁ బుట్టినకొమరుని, వలనం దెగె దనుచు గగనవాణి వలికె నం**
**చలిగెద వేని మృగాక్షికిఁ, గల కొడుకులఁ జంప నిత్తుఁ గ్రమమున నీకున్". 42**

**ప్రతి :** లలనకున్= స్త్రీకి-దేవకీదేవికి; పుట్టిన= జన్మించినట్టి; కొమరునివలనన్= పుత్రునివల్ల; తెగెదు(వు)+అనుచున్= చస్తావని; గగనవాణి= ఆకాశవాణి; పలికెనున్+అంచున్= పలికింది అని; అలిగెదవు+ఏనిన్= కోపపడుతున్నట్లయితే; మృగ+అక్షికిన్= లేడి కన్నులవంటి (అందమైన) కన్నులుగల ఈమెకు (దేవకీదేవికి); కల= ఉన్న; కొడుకులన్= పుత్రుల్ని; క్రమమునన్= వరుసగా; నీకున్= నీకు; చంపన్= చంపుటకు; ఇత్తున్ (ఇచ్చుదున్)= ఇస్తాను.

**తా :** దేవకీదేవికి పుట్టిన పుత్త్రునివల్ల నీవు చస్తావని ఆకాశవాణి పలికిందని గదా నీవు కోపపడుతున్నావు? ఈమెకు పుట్టే కొడుకుల్ని చంపడానికి వరుసగా నీ కిస్తాను.

**వ. అని యిట్లు పలికిన విని కంసుండు కంపితావతంసుండై సంతసించి గుణగ్రాహిత్వంబు గైకొని కొందలమందు చెలియలిముందల విడిచి చనియె, వసుదేవుండును బ్రదుకు మందలఁ గంటి ననుచు సుందరియుం దానును మందిరంబునకుం బోయి డెందంబున నానందంబు నొందియుండె, నంతఁ గొంతకాలంబు సనిన సమయంబున. 43**

**ప్రతి :** అని; ఇట్లు= ఈ విధంగా; పలికిన= (వసుదేవుడు) పలుకగా; విని; కంసుండు= కంసుడు; కంపిత+అవతంసుండు+ఐ= ఊచిన తల కలవాడై-(అంగీకరించినట్లు తల ఊచి); సంతసించి= సంతోషపడి; గుణ, గ్రాహిత్వంబున్= మంచిని గ్రహించేగుణాన్ని; కైకొని= స్వీకరించి; కొందలము+అందు= దుఃఖం పొందుచున్న; చెలియలిన్= చెల్లెలి; ముందల= శిరస్సు పైభాగాన్ని; విడిచి= వదలిపెట్టి; చనియెన్= వెళ్లాడు; వసుదేవుండును= వసుదేవుడుకూడ; బ్రదుకుమందలన్= బ్రదుకుయొక్క హద్దు - జీవితంయొక్క చివరను; కంటిన్= చూచితిని; అనుచున్= అనిఅంటూ; సుందరియున్= భార్య దేవకీదేవియు; తానును; (వసుదేవుడూ) మందిరంబునకున్= గృహానికి; పోయి= వెళ్ళి; డెందంబునన్= మనస్సులో; ఆనందంబున్= సంతోషాన్ని; ఒంది+ఉండెన్= పొంది ఉండాడు; అంతన్= తరువాత; కొంతకాలంబు+చనిన= కొంతకాలం గడచిన; సమయంబునన్= ఆ సమయంలో...

**తా :** అని ఈ విధంగా వసుదేవుడు పలుకగా, కంసుడు విని, అంగీకారసూచకంగా తలయూచి, గుణాన్ని గ్రహించే వానివలె ప్రవర్తించి, దుఃఖిస్తున్న చెల్లెలి కొప్పు వదలి ఇంటికి వెళ్ళాడు. వసుదేవుడు కూడా ఏలాగో బ్రతికి బయటపడ్డానని అనుకొని, భార్యతో కలిసి తన మందిరానికి వెళ్ళి సంతోషంగా ఉన్నాడు. కొంతకాలం గడిచిన తరువాత

**క. విడువక కంసుని యెగ్గులఁ, బడి దేవకి నిఖిలదేవభావము దన కే**
**ర్పడ నేఁట నొకని లెక్కను, గొడుకుల నెనమంద్ర నొక్కకూతుం గనియెన్. 44**

**ప్రతి :** విడువక= వదలక; కంసుని= కంసునివల్ల; ఎగ్గులన్= కీడులను; పడి= అనుభవించి; దేవకి= దేవకీదేవి; నిఖిల= అందరు; దేవభావము= దేవతలభావం; తనకున్= తనకు (దేవకిని); ఏర్పడన్= కలుగగా; ఏఁటన్= ప్రతి సంవత్సరం; ఒకని లెక్కను= ఒకని వంతుని; కొడుకులన్+ఎనమండ్రన్= ఎనిమిదిమంది కొడుకులను; ఒక్క; కూతున్= ఒక్క కూతురిని; కనియెన్= ప్రసవించింది.

**తా :** ఎడతెగకుండా కంసునివల్ల కష్టాలు అనుభవిస్తూ, దేవకీదేవి అందరి దేవతల భావాన్ని తాను పొంది, ఏడాదికొక్కడు చొప్పున ఎనిమిదిమంది కొడుకుల్నీ, ఒక కూతురునీ ప్రసవించింది.

**విశే :** దేవకికి ఎనిమిదిమంది కొడుకులు కల్గారు. వాళ్లు 1) కీర్తిమంతుడు 2) సుషేణుడు 3) భద్రసేనుడు 4) ఉదారధీ 5) మృదుడు 6) సమ్మర్దనుడు 7) బలభద్రుడు 8) కృష్ణుడు పిదప కల్గిన కూతురు - యోగమాయ.

**వ. అందు. 45**

**ప్రతి :** అందున్= అందులో...

**తా :** ఆ కన్నబిడ్డలలో

**ఆ. సుదతి మున్ను గన్న సుతుఁ గీర్తిమంతునిఁ, బుట్టుతడవ కంసభూవరునకుఁ**
**దెచ్చి యిచ్చెఁ జాల ధృతి గల్గి వసుదేవుఁ, డాసపడక సత్యమందు నిలిచి. 46**

**ప్రతి :** వసుదేవుఁడు= దేవకి భర్త ఐన వసుదేవుడు; చాలన్= మిక్కిలి; ధృతి= ధైర్యం; కల్గి= కలిగినవాడై; సత్యము+అందున్= సత్యాన్ని చెప్పడంలో; (అనగా చెప్పినమాటమీద); నిలిచి= నిలబడి; ఆసపడక= కొడుకులమీద ఆశపడకుండా; సుదతి= దేవకీదేవి; మున్ను= ముందుగా; కన్న= ప్రసవించిన; సుతున్= కొడుకును; కీర్తిమంతునిన్= కీర్తిమంతుడనేవాణ్ణి పుట్టుతడవ= పుట్టిన వెంటనే; కంసభూవరునకున్= కంసరాజుకు; తెచ్చి= తీసుకొనివచ్చి; ఇచ్చెన్= ఇచ్చెను.

**తా :** వసుదేవుడు ధైర్యం వహించి, సత్యాన్ని పాటిస్తూ, ఇచ్చిన మాటమీద నిలబడి, పుత్రమమకారాన్ని వదలుకొని, దేవకీదేవి మొదటిసారి కన్నకొడుకును కీర్తిమంతుడనేవాణ్ణి వెంటనే తెచ్చి కంసరాజు కిచ్చాడు.

**క. పలికిన పలుకులు దిరుగక, సొలయక వంచనము లేక సుతుల రిపునకుం**
**గలఁగక యిచ్చిన ధీరుం, డిల వసుదేవుండు దక్క నితరుఁడు గలఁడే? 47**

**ప్రతి :** ఇలన్= భూమిమీద; పలికిన పలుకులు= ఆడిన మాటలు; తిరుగక= తప్పక; సొలయక= వెనుదీయక; వంచనములేక= మోసంలేకుండ; కలఁగక= కలత చెందకుండ; రిపునకున్= శత్రువునికి (కంసునికి); సుతులన్= పుత్రుల్ని; ఇచ్చిన= అప్పగించిన; ధీరుండు= ధైర్యవంతుడు; వసుదేవుండు+తక్కన్= వసుదేవుడు తప్ప; ఇతరుఁడు= మరొకడు; కలఁడు+ఏ= ఉన్నాడా?

**తా :** ఆడినమాట తప్పకుండ, సంకోచం లేకుండ, మోసం చేయకుండ, కలత చెందకుండ తన కొడుకులను, చంపేందుకై శత్రువుకు అప్పగించిన ధీరుడు – వసుదేవుడు తప్ప లోకంలో మరొకడున్నాడా?

**ఆ. మానవేంద్ర! సత్యమతికి దుష్కరమెయ్య?, దెఱుక గలుగువాని కిష్ట మెయ్య?**
**దీశభక్తిరతుని కీరాని దెయ్యది?, యెఱుక లేనివాని కేది కీడు? 48**

**ప్రతి :** మానవ+ఇంద్ర= ప్రజలకు ప్రభువైనవాడా!; (ఓ పరీక్షిన్మహారాజా!); సత్యమతికి= సత్యంపై మనస్సుగలవానికి; దుష్కరము= చేయరానిది; ఏ+అది= ఏది?(ఏదీలేదనుట); ఎఱుక= జ్ఞానం; కలుగువానికిన్= కలిగియున్నవానికి; ఇష్టము= ఇష్టమైంది; ఏ+అది= ఏది? (ఏదీలేదనుట); ఈశ= పరమేశ్వరుని; భక్తి= భక్తియందు; రతునికిన్= ప్రగాఢమైన ఆసక్తికలవానికి; ఈరానిది= ఇవ్వకూడందీ; ఏ+అది= ఏది?; (ఏదీలేదనుట) ఎఱుక= తెలివి; లేనివానికి= లేనట్టివానికి; కీడు= హాని; ఏది= ఏముంది?

**తా :** ఓ పరీక్షిన్మహారాజా! సత్యవ్రతుడికి మాటతప్పడం తప్ప, దుష్కరమైంది ఏముంది? ఆలాగే బ్రహ్మజ్ఞానికి బ్రహ్మపదార్థం తప్ప ఇష్టమైంది మరొకటి ఏముంది? భగవద్భక్తిలో నిమగ్నుడైనవాడు త్యాగం చేయలేనిది ఏముంటుంది? ఆలాగే మేలు ఏదో, కీడు ఏదో తెలియనివానికి కీడు అనేది ఏముంటుంది?

**విశే :** సత్యపాలనే వ్రతంగా కలవాడు, ఇచ్చినమాటకోసం హరిశ్చంద్రునివలె జీవితంలో దేన్నైనా వదలుకోగలడు; అప్పగించిన ఏ పని అయినా చేయగలడు. అలాంటప్పుడు అతనికి కష్టమైంది అంటూ ఏముంటుంది?

**వ. ఇట్లు సత్యంబుఁ దప్పక కొడుకు నొప్పించిన వసుదేవునిపలుకునిలుకడకు మెచ్చి కంసుం డిట్లనియె. 49**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; సత్యంబున్= సత్యాన్ని; తప్పక= తప్పకుండా; కొడుకున్= పుత్రుణ్ణి; ఒప్పించిన= అప్పగించిన, ఇచ్చిన; వసుదేవుని= వసుదేవునియొక్క; పలుకునిలుకడకున్= మాటనిలుకడకు (ఇచ్చినమాట తప్పకుండా ఉండినందుకు); మెచ్చి= మెచ్చుకొని; కంసుండు= కంసుడు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తా :** ఈ విధంగా సత్యాన్ని తప్పకుండా కొడుకును తెచ్చి అప్పగించిన వసుదేవునిమాటనిలుకడకు మెచ్చికొంటూ కంసుడు ఈ విధంగా అన్నాడు.

**ఆ. కొడుకు నీవు మరలఁ గొనిపొమ్ము వసుదేవ!, వెఱపు లేదు నాకు వీనివలన,**
**నల్గ వీనికి, భవదష్టమపుత్త్రుండు, మృత్యువఁట! వధింతు మీఁద నతని. 50**

**ప్రతి :** వసుదేవ= ఓ వసుదేవా!; కొడుకున్= (నీ) పుత్త్రుణ్ణి; నీవు మరలన్= నీవు తిరిగి; కొనిపొమ్ము= తీసుకొనివెళ్ళు; వీని వలనన్= ఈ బాలుడివల్ల; నాకున్= నాకు; వెఱపు లేదు= భయంలేదు; వీనికిన్= ఈ బాలుడి విషయంలో; అల్గన్= కోపించడంలేదు; భవత్= నీయొక్క; అష్టమ= ఎనిమిదవ; పుత్త్రుండు= కొడుకు; మృత్యువు+అఁట= (నన్ను) చంపేస్తాడట; మీఁదన్= ఇకముందు; అతనిన్= ఆ అష్టమబాలుణ్ణి; వధింతున్ (వధించుదును)= చంపుతాను.

**తా :** నీ కొడుకును మరల నీవే తీసుకొని వెళ్ళు. వీనివల్ల నాకు భయం లేదు. అందువల్ల వీడిమీద కోపం లేదు. నీ ఎనిమిదవకొడుకే నా పాలిటి మృత్యువట! అందువల్ల అప్పుడే వాణ్ణి వధిస్తాను.

**వ. అనిన నానకదుందుభి నందనుం గొని చనియు నానందంబు నొందక, దుష్టస్వభావుండగు బావపలుకులు వినియు నులుకుచుండె, నంత. 51**

**ప్రతి :** అనినన్= కంసుడు ఆ విధంగా పలుకగా; ఆనకదుందుభి= వసుదేవుడు; నందనున్= కుమారుణ్ణి; కొని= తీసుకొని; చనియున్= వెళ్ళీకూడా; ఆనందంబున్= సంతోషాన్ని; ఒందక= పొందలేక; దుష్టస్వభావుండు+అగు= చెడు స్వభావం గలవాడైన; బావ, పలుకులు= బావ (కంసుని) మాటల్ని; వినియున్= వినీకూడ; ఉలుకుచున్+ఉండెన్= భయపడుతుండాడు; అంతన్= ఆ తరువాత...

**తా :** కంసుడు ఆ విధంగా అనగా, వసుదేవుడు తన కొడుకును తీసుకొని వెళ్ళాడు. అయినా అతనికి ఆనందం లేదు. దుష్టుడైన ఆ బావగారిమాటలు విన్నా, ఆ తరువాత ఎప్పుడు ఏమౌతుందో అని భయపడుతూనే ఉండినాడు. ఆ తరువాత

**విశే :** 'ఆనకదుందుభి' – వసుదేవునికి గల మరొక పేరు. అతడు పుట్టినపుడు ఆకాశంలో విష్ణువు ఈతని పుత్త్రుడై జన్మిస్తాడని ఆనకములు – అనగా మద్దెలలు, భేరులు మ్రోగాయట. అందువల్ల వసుదేవుడు 'ఆనకదుందుభి' అయ్యాడు (భాగ.9–715).

**సీ. ఒకనాఁడు నారదుం డొయ్యన కంసునియింటికిఁ జనుదెంచి యేకతమున**
**'మందలోపల నున్న నందాదులును, వారిభార్యలుఁ బుత్త్రులు బాంధవులును**
**దేవకి మొదలగుతెఱవలు వసుదేవుఁ డాదిగాఁగల సర్వయాదవులును,**
**సురలు గాని, నిజంబు నరులుగా రని చెప్పి 'కంసుండ! నీవు రక్కసుఁడ వనియు**

**ఆ. దేవమయుఁడు చక్రి దేవకీదేవికిఁ, బుత్త్రుఁడై జనించి భూతలంబు**
**సెఱుపఁ బుట్టినట్టి చెనఁటిదైత్యుల నెల్లఁ, జంపు' ననుచుఁ జెప్పి చనియె దివికి. 52**

**ప్రతి :** ఒకనాఁడు= ఒకానొకరోజు; నారదుండు= నారదమహాముని; ఒయ్యనన్= తిన్నగా; కంసుని= కంసునియొక్క; ఇంటికిన్= మందిరానికి; చనుదెంచి= వచ్చి; ఏకతమునన్= ఏకాంతంగా, రహస్యంగా; మందలోపలన్= వ్రేపల్లెలో; ఉన్న= ఉన్నటువంటి; నంద+ఆదులును= నందుడు మొదలైనవారును; వారిభార్యలున్= వారిపత్నులు; పుత్త్రులు= కొడుకులు; బాంధవులును= చుట్టాలును; దేవకి= దేవకిదేవి; మొదలగుతెఱవలు= మున్నగు స్త్రీలు; వసుదేవుఁడు ఆది+కాన్= వసుదేవుడు మొదలుగా; కల= ఉండే; సర్వ, యాదవులును= అందరు యాదవులు; సురలుగాని= దేవతలేగాని; నిజంబు= నిజంగ; నరులు గారు= మానవులు కారు; అని, చెప్పి= అని పలికి; కంసుండు+అ!= ఓ కంసుడా!; నీవు; రక్కసుఁడవు+ అనియు= రాక్షసుడవు అని; దేవమయుఁడు= దైవస్వరూపుడు; చక్రి= విష్ణుమూర్తి; దేవకీదేవికిన్+పుత్త్రుఁడు+ఐ= దేవకి కుమారుడై; జనించి= పుట్టి; భూతలంబు= భూలోకాన్ని; చెఱుపన్= నాశనంచేయడానికై; పుట్టినట్టి= జన్మించినట్టి; చెనఁటి= చెడ్డవారైన; దైత్యులన్= రాక్షసుల్ని; ఎల్లన్= అందరిని; చంపున్= వధిస్తాడు; అనుచున్+చెప్పి= అని అంటూ చెప్పి; దివికిన్= స్వర్గలోకానికి; చనియెన్= వెళ్లాడు.

**తా :** ఒకరోజు నారదమహర్షి తిన్నగా కంసునిమందిరానికి వచ్చాడు. రహస్యంగా అతనితో వ్రేపల్లెలో ఉన్న నందుడు మొదలైనవారు, వారిభార్యలు, కొడుకులు, బంధువులు, (మథురాపురంలో ఉన్న) దేవకి మొదలైన స్త్రీలు, వసుదేవాది యాదవులందరూ నిజానికి దేవతలేగాని మానవులు కారు. కంసా! నీవు రాక్షసుడవు. దైవస్వరూపుడైన శ్రీమహావిష్ణువు దేవకీదేవికిపుత్త్రుడై పుట్టి, భూలోకాన్ని చెరిచే దుష్టరాక్షసులనందర్నీ సంహరిస్తాడు అని చెప్పి, స్వర్గలోకానికి వెళ్ళాడు.

**క. నారదుమాటలు విని పె, ల్లారాటముఁ బొంది యదువు లనిమిషు లనియున్**
**నారాయణకరఖడ్గవి, దారితుఁడగు కాలనేమి దా ననియు మదిన్. 53**

**ప్రతి :** నారదు, మాటలు= నారదమహామునియొక్క మాటల్ని; విని= విన్నవెంటనే; పెల్లు= మిక్కిలిగా; ఆరాటమున్= పరితాపం; పొంది= చెంది; యదువులు= యాదవులందరు; అనిమిషులు= దేవతలు; అనియున్= అనీ; నారాయణ= శ్రీమహావిష్ణువుయొక్క; కర= చేతియందలి; ఖడ్గ= కత్తిచేత; విదారితుఁడు= నరుకబడినవాడు; అగు= అయినట్టి; కాలనేమి= కాలనేమి అనే రాక్షసుడు; తాను+అనియున్= తానే అని; మదిన్= మనస్సులో...

**తా :** నారదుని మాటలు విని మిక్కిలిగా కుమిలి, యాదవులంతా దేవతలనీ, గతంలో శ్రీహరి ఖడ్గంతో హతుడైన కాలనేమి అనే రాక్షసుడు తానే అనీ కంసుడు మనస్సులో

**విశే :** విష్ణుమూర్తి ఖడ్గం నందకం. కంసుడు గతజన్మలో కాలనేమి అనే రాక్షసుడు. అతడు దేవాసురయుద్ధంలో విష్ణువుచేత హతుడయ్యాడు. ఈ జన్మలో కంసుడుగా జన్మించాడు.

**మ. కలఁగంబాఱి మఱందిఁ జెల్లెలి నుదగ్రక్రోధుఁడై పట్టి బ**
**ద్ధులఁ గావించి హరిం దలంచి వెస తోడ్తో వారు గన్నట్టి పు**
**త్త్రులఁ జంపెన్, గురు నుగ్రసేను యదుఁ దద్భోజాంధకాధీశు ని**
**ర్మలు బట్టెం గడు వాలి యేలెఁ జలమారన్ శూరసేనంబులన్. 54**

**ప్రతి :** కలంగన్+పాఱి= కలతపడి; ఉదగ్ర= భయంకరమైన; క్రోధుఁడు+ఐ= కోపం కలవాడై; మఱందిన్= మరది అయిన వసుదేవుణ్ణి; చెల్లెలిన్= చెల్లెలు దేవకీదేవిని; పట్టి= పట్టుకొని; బద్ధులన్+కావించి= బంధించి; హరిన్= విష్ణుమూర్తిని; తలంచి= గుర్తుచేసుకొని; వెసన్= వేగంగ; తోడ్తోన్= వెంట వెంటనే; వారు= దేవకీవసుదేవులు; కన్న+అట్టి= కనినట్టి; పుత్రులన్= కొడుకుల్ని; చంపెన్= వధించాడు; గురున్= తండ్రిని; యదున్= యదువంశంలో జన్మించినవాణ్ణి; తద్= ఆ; భోజ= భోజునివంశానికి; అంధక= అంధకుని వంశానికి; అధీశున్= ప్రభువైనవాణ్ణి; నిర్మలున్= ఏ కల్మషం లేనివాణ్ణి-పరిశుద్ధుణ్ణి; ఉగ్రసేనున్= ఉగ్రసేన మహారాజును; పట్టెన్= బంధించాడు; చలము+ఆరన్= గొప్ప పట్టుదలతో; కడున్= మిక్కిలి; వాలి= అతిశయించి; శూరసేనంబులన్= శూరసేన దేశాలను; ఏలెన్= పాలించాడు.

**తా :** (నారదుడు చెప్పినమాటలకు) మనస్సులో మిక్కిలి కలవరపాటునొందిన కంసుడు పెల్లుబికిన కోపంతో చెల్లెలు, మరది అనికూడా చూడకుండా దేవకీ వసుదేవులను పట్టి బంధించాడు. విష్ణుమూర్తిని గుర్తు చేసుకొంటూ దేవకీ వసుదేవులకు పుట్టిన కొడుకులను వెంటవెంటనే వధించాడు. తండ్రి అనికూడా చూడకుండా యదువంశసంజాతుడు, భోజాంధక వంశాలకు రాజు, నిర్మలుడూ అయిన ఉగ్రసేనమహారాజును బంధించాడు. మితిమీరిన పట్టుదలతో విజృంభించి శూరసేనదేశాలను పాలించసాగాడు.

**ఆ. తల్లిఁ దండ్రి నైనఁ దమ్ముల నన్నల, సఖుల నైన బంధుజనుల నైన**
**రాజ్యకాంక్షఁజేసి రాజులు సంపుదు, రవనిఁ దఱచు జీవితార్థు లగుచు. 55**

**ప్రతి :** అవనిన్= భూమిమీద; రాజులు= పాలకులు; తఱచు= తరచుగా, (చాలామార్లు); జీవిత+అర్థులు+అగుచున్= జీవితాన్ని కోరుకొనేవారై; రాజ్యకాంక్షన్+చేసి= రాజ్యంమీది ఆశతో; తల్లిన్+తండ్రిన్= తల్లిదండ్రులను; ఐనన్= అయినా; తమ్ములన్+అన్నలన్= తమ్ముళ్లనూ, అన్నల్నీ; సఖులన్= స్నేహితులను; ఐనన్= అయినా; బంధుజనులను+ఐనన్= చుట్టాలనైనను; చంపుదురు= చంపుతారు.

**తా :** లోకంలో రాజులు తమకు గొప్పజీవితం ఉండాలని, రాజ్యకాంక్షతో తల్లిదండ్రులనైనా, అన్నదమ్ములనైనా, బంధువులనైనా చంపుతారు.

**వ. మఱియును బాణ భౌమ మాగధ మహాశన కేశి ధేనుక బక ప్రలంబ తృణావర్త చాణూర ముష్టి కారిష్ట ద్వివిద పూతనాది సహాయసమేతుండై కంసుండు గదనంబున మదంబు లడంచిన వదనంబులు వంచికొని, సదనంబులు విడిచి యదవలై, యదువులు పదవులు వదలి నిషధ కురు కోసల విదేహ విదర్భ కేకయ పాంచాల సాల్వ దేశంబులు సొచ్చి, మచ్చరంబులు విడిచి కొందఱు కంసునిం గొలిచి నిలిచి, రంత.56**

**ప్రతి :** మఱియును= ఇంకను; కంసుండు= కంసరాజు; బాణ= బాణాసురుడు; భౌమ= (భూదేవికుమారుడైన) నరకాసురుడు; మాగధ= మగధరాజైన జరాసంధుడు; మహా+అశన= అమితంగా ఆహారం తినే అఘాసురుడు; కేశి= కేశి అనే రాక్షసుడు; ధేనుక= ధేనుకాసురుడు; బక= బకాసురుడు; ప్రలంబ= ప్రలంబాసురుడు; తృణావర్త= తృణావర్తుడనే రాక్షసుడు; చాణూర= చాణూరుడు అనే మల్లయుద్ధయోధుడు; ముష్టిక= ముష్టికుడనే మల్లయుద్ధవీరుడు; అరిష్ట= అరిష్టుడనే రాక్షసుడు; ద్వివిద= ద్వివిదుడు; పూతనా+ఆది= పూతన (రాక్షసస్త్రీ) మొదలైన; సహాయ= సహాయులతో (సాయం చేసేవారితో); సమేతుండు+ఐ= కూడుకొన్నవాడై; కదనంబునన్= యుద్ధంలో; మదంబులు= పొగరులను; అడంచినన్= అణచివేయగా; వదనంబులు= ముఖాలు; వంచికొని= క్రిందికి వంచుకొని; సదనంబులు= ఇండ్లను; విడిచి= వదలి; అదవలై= దిక్కుమాలినవాళ్లై;

పదవులు= ఉన్నత స్థితులను; వదలి= విడిచిపెట్టి; నిషధ కురు కోసల విదేహ విదర్భ కేకయ పాంచాల సాల్వదేశంబులు= నిషధ, కురు, కోసల, విదేహ, విదర్భ, కేకయ, పాంచాల, సాల్వదేశంబులలో; చొచ్చి= ప్రవేశించి; కొందఱు= అందులో కొంతమంది; మచ్చరంబులు= ద్వేషాలు; విడిచి= వదలి; కంసునిన్= కంసరాజును; కొలిచి= సేవించి; నిలిచిరి= నిలిచారు; అంతన్= తరువాత...

**తా :** అంతేకాదు. కంసుడు – బాణాసుర, నరకాసుర, జరాసంధ, మహాశన, కేశి, ధేనుకాసుర, బకాసుర, ప్రలంబాసుర, తృణావర్త, చాణార, ముష్టిక, అరిష్ట, ద్వివిద, పూతన మున్నగు దుష్టుల్ని తనకు సహాయులుగా చేసుకొని, యుద్ధాల్లో యాదవులను ఓడించాడు. యాదవులు తమ పదవులు వదలుకొని దిక్కులేక వలస వెళ్ళి నిషధ, కురు, కోసల, విదేహ, విదర్భ, కేకయ, పాంచాల, సాల్వదేశాల్లో తలదాచుకొన్నారు. అందులో కొందరు యాదవులు అభిమానాలు వదలుకొని కంసుణ్ణి సేవించారు. ఆ తర్వాత

**క. తొడితొడిఁ గంసుఁడు దేవకి, కొడుకుల నార్వుర వధింప గురుశేషాఖ్యం**
**దొడవగు హరిరుచి యా సతి, కడుపున నేడవదియైన గర్భం బయ్యెన్. 57**

**ప్రతి :** కంసుఁడు= కంసరాజు; తొడితొడిన్= వెంటవెంటనే; దేవకికొడుకులన్= దేవకీదేవియొక్క కొడుకులను; ఆర్వురన్= ఆరుమందిని; వధింపన్= చంపగా; గురు= గొప్ప; శేష+ఆఖ్యన్= ఆదిశేషుడు అనే పేరుతో; తొడవు+అగున్= ఆభరణమైన; హరిరుచి= శ్రీమహావిష్ణువుయొక్కకాంతి; ఆ సతికడుపునన్= ఆ దేవకీదేవిగర్భంలో; ఏడవది+ఐన గర్భంబు= ఏడవ చూలు; అయ్యెన్= అయ్యింది.

**తా :** కంసుడు వెంట వెంటనే దేవకీదేవికొడుకులను ఆరుమందినీ వధించాడు. ఆదిశేషుడనే మహనీయమైన, మనోహరమైన విష్ణుతేజస్సు దేవకీదేవిగర్భంలో ఏడవదిగా ప్రవేశించింది.

**వ. అ య్యవసరంబున విశ్వరూపుండగు హరి దన్ను నమ్మినయదువులకుం గంసునివలన భయంబు గలుగు నని యెఱింగి యోగమాయాదేవి కిట్లనియె. 58**

**ప్రతి :** ఆ+అవసరంబునన్= ఆ సమయంలో; విశ్వరూపుండు+అగు= విశ్వమే తన స్వరూపంగా కలవాడైన; హరి= శ్రీమహావిష్ణువు; తన్నున్= తనను; నమ్మిన= నమ్ముకొని ఉన్న; యదువులకున్= యాదవులకు; కంసునివలన భయంబు= కంసునివల్ల ప్రమాదం; కలుగున్+అని= కలుగుతుంది అని; ఎఱింగి= తెలుసుకొని; యోగమాయాదేవికిన్= యోగమాయాశక్తితో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తా :** ఆ సమయంలో విశ్వరూపుడైన శ్రీహరి, తనను నమ్మి బ్రతుకుతున్న యాదవులకు కంసునివల్ల భయం ఏర్పడుతుందని తెలుసుకొని యోగమాయాదేవితో ఇలా అన్నాడు.

**సీ. 'గోపికాజనములు గోపాలకులు నున్న పసులమందకుఁ బొమ్ము భద్ర! నీవు**
**వసుదేవుభార్యలు వరుసఁ గంసునిచేత నాఁకలఁ బడియుండ నందుఁ జొరక**
**తలఁగి రోహిణియనుతరళాక్షి నందగోకులమందు నున్నది గుణగణాఢ్య**
**దేవకికడుపున దీపించు శేషాఖ్య మైన నా తేజ మీ వమరఁ బుచ్చి**

**ఆ. నేర్పు మెఱసి రోహిణీదేవి కడుపునఁ, జొనుపు దేవకికిని సుతుఁడ నగుదు**
**నంశభాగయుతుఁడనై, యశోదకు నందు, పొలఁతి కంత మీఁదఁ బుట్టె దీవు. 59**

**ప్రతి :** భద్ర= శుభస్వరూపిణివైన ఓ యోగమాయాశక్తీ!; నీవు=నీవు; గోపికాజనములు= గోపస్త్రీలు; గోపాలకులున్+ఉన్న= యాదవులును ఉన్న; పసులమందకున్= వ్రేపల్లెకు; పొమ్ము= వెళ్ళు; వసుదేవుభార్యలు= వసుదేవునియొక్క భార్యలు; వరుసన్= వరుసగా; కంసునిచేతన్= కంసునివల్ల; ఆఁకలన్= చెరసాలయందు; పడి+ఉండన్= పడిఉండగా; అందున్= ఆ చెరసాలయందు; చొరక= ప్రవేశింపక; తలఁగి= తొలగి; రోహిణి అను= రోహిణి అనే; తరళ+అక్షి= చలించే కన్నులు గలది - అనగా అందమైన కన్నులుగలది; నంద= నందునియొక్క; గోకులము+అందున్+ఉన్నది= వ్రేపల్లెలో ఉన్నది; గుణగణ+ఆఢ్య= మంచిగుణాలసమూహంతో సంపన్నురాలు; ఈవు= నీవు; దేవకి కడుపునన్= దేవకీదేవిగర్భంలో; దీపించు= ప్రకాశించునట్టి; శేష+ఆఖ్యము+ఐన= శేషుడు అనే పేరుగల; నా, తేజము= నా తేజస్సును; అమరన్= ఒప్పుగా, చక్కగా; పుచ్చి= బయటికి తీసి; నేర్పు= చాకచక్యంతో; మెఱసి= ప్రకాశింపచేసి; రోహిణీదేవి= రోహిణీదేవియొక్క; కడుపునన్= గర్భంలో; చొనుపు(ము)= ప్రవేశపెట్టు; అంశ భాగయుతుఁడన్+ఐ= నా శక్తులయొక్క ఐశ్వర్యంతో కూడుకొన్నవాడినై; దేవకికిన్= దేవకీదేవికి; సుతుఁడన్= కుమారుడను; అగుదున్= అవుతాను; ఈవు= నీవు; అందున్= ఆ గోకులంలో; అంత మీఁదన్= ఆ తర్వాత; నందుపొలఁతి= నందునిభార్య అయిన; యశోదకున్= యశోదకు; పుట్టెదు(వు)= జన్మిస్తావు.

**తా :** శుభస్వరూపిణివైన ఓ యోగమాయాశక్తీ! నీవు గోపస్త్రీలు, గోపాలకులు ఉన్న వ్రేపల్లెకు వెళ్ళు. వసుదేవుని భార్యలందరు కంసునిచేత బంధింపబడి ఉన్నారు. కాని రోహిణి అనే ఒక భార్యమాత్రం ఆ నందగోకులంలో తలదాచుకొని ఉన్నది. ఆమె మంచి గుణగణాలు కలది. దేవకి కడుపులో ఉన్న నా శేషునితేజస్సును నీవు బయటికి తీసి, నేర్పుగా రోహిణిగర్భంలో ప్రవేశపెట్టు. నేను నా అంశతో సకల శక్తులతో వైభవంగా దేవకీదేవికి కుమారుడిగా జన్మిస్తాను. ఆ తర్వాత నీవు నందునిభార్య అయిన యశోదగర్భంలో పుడతావు.

**విశే :** వసుదేవునిభార్యలు - ధృతదేవ, శాంతిదేవ, ఉపదేవ, శ్రీదేవ, దేవరక్షిత, సహదేవ, దేవకి అనే ఏడుగురు. ఈ ఏడుగురు దేవకుని కుమార్తెలు.

దేవకుడు ఆహుకునికుమారు లిద్దరిలో పెద్దవాడు, ఆహుకునిరెండవకొడుకు ఉగ్రసేనుడు.

**క. నానావిధసంపదలకుఁ, దానకమై సర్వకామదాయిని వగు నిన్**
**మానవులు భక్తిఁ గొలుతురు, కానుకలును బలులు నిచ్చి కల్యాణమయీ! 60**

**ప్రతి :** కల్యాణమయీ= నిత్యమంగళస్వరూపిణియైన ఓ యోగమాయా!; నానావిధసంపదలకున్= అనేక విధాలైన భాగ్యాలకు; తానకము+ఐ= ఉనికిపట్టయి; సర్వ= అన్ని; కామ= కోరికలు; దాయినివి+అగు= ఇచ్చేదానివైన; నిన్= నిన్ను; మానవులు= ప్రజలు; కానుకలును= పూజ్యభావంతో ఇచ్చే ద్రవ్యాలను; బలులున్= పూజలో భాగంగా బలులును; ఇచ్చి= ఇచ్చి; భక్తిన్= భక్తితో; కొలుతురు= సేవిస్తారు.

**తా :** నిత్యమంగళస్వరూపిణివైన ఓ యోగమాయాదేవీ! నీవు అనేకవిధాలైన సంపదలకు నిలయమైనదానవు, అన్నికోర్కెలు తీర్చగలదానివీ అయిన నీకు మానవులు కానుకలను, పూజలో భాగంగా బలులను ఇస్తూ భక్తితో నిన్ను కొలుస్తారు.

**వ. మఱియు నిన్ను మానవులు దుర్గ భద్రకాళి విజయ వైష్ణవి కుముద చండిక కృష్ణ మాధవి కన్యక మాయ నారాయణి యీశాన శారద యంబిక యను పదునాలుగు నామంబులం గొనియాడుదు రయ్యైస్థానంబులయం'దని యెఱింగించి, సర్వేశ్వరుండగు హరి పొమ్మని యానతిచ్చిన మహాప్రసాదం బని యయ్యోగనిద్ర యియ్యకొని మ్రొక్కి చయ్యన ని య్యిల కయ్యెడ వాసి వచ్చి. 61**

**ప్రతి :** మఱియున్= అంతేకాక; నిన్నున్= నిన్ను; మానవులు= ప్రజలు; దుర్గ భద్రకాళి విజయ వైష్ణవి కుముద చండిక కృష్ణ మాధవి కన్యక మాయ నారాయణి ఈశాన శారద అంబిక అను= దుర్గ, భద్రకాళి, విజయ, వైష్ణవి, కుముద, చండిక, కృష్ణ, మాధవి, కన్యక, మాయ, నారాయణి, ఈశాన, శారద, అంబిక, అనే; ఈ పదునాలుగు, నామంబులన్= ఈ పదునాలుగు పేర్లతో; ఆ+ఐ, స్థానంబుల+అందున్= ఆ యా ప్రదేశాలలో; కొనియాడుదురు= స్తోత్రం చేస్తారు; అని ఎఱింగించి= అని తెలియచెప్పి; సర్వ+ఈశ్వరుండు+అగు= సర్వానికి (ఈ జగత్తంతటికి) ప్రభువైన; హరి= శ్రీమహావిష్ణువు; పొమ్ము+అని= వెళ్ళుమని; ఆనతి= ఆజ్ఞ; ఇచ్చినన్= ఇవ్వగా; మహాప్రసాదంబు+అని= గొప్ప అనుగ్రహంఅని; ఆ+యోగనిద్ర= ఆ యోగమాయాదేవి; ఇయ్యకొని= అంగీకరించి; మ్రొక్కి= నమస్కరించి; చయ్యనన్= త్వరగా; ఈ+ఇలకున్= ఈ భూలోకానికి; ఆ+ఎడన్= ఆ చోటును, అనగా ఆ విష్ణులోకాన్ని; పాసి= వదలి; వచ్చి= వచ్చి...

**తా :** 'అంతేకాదు. మానవులు నిన్ను దుర్గ, భద్రకాళి, విజయ, వైష్ణవి, కుముద, చండిక, కృష్ణ, మాధవి, కన్యక, మాయ, నారాయణి, ఈశాన, శారద, అంబిక అనే పదునాల్గుపేర్లుతో దేశంలోని ఆ యా స్థానాల్లో నిన్ను పూజిస్తారు' అని శ్రీమహావిష్ణువు చెప్పి, వెళ్ళుమని ఆనతి ఇవ్వగా, యోగమాయాదేవి మహాప్రసాదమని అంగీకరించి, వెంటనే విష్ణులోకాన్ని విడిచి, భూలోకానికి వచ్చి

**విశే :** 'కాశీక్షేత్రం – దుర్గ; భద్రేశ్వరక్షేత్రం – భద్రకాళి; వరాహశైలక్షేత్రం – విజయ; మాతృకాక్షేత్రం – వైష్ణవి; మానసక్షేత్రం– కుముద; అమరకుండకక్షేత్రం – చండిక; హస్తినాపురక్షేత్రం – కృష్ణ; శ్రీశైలక్షేత్రం – మాధవి; కన్యాకుబ్జక్షేత్రం – కన్యక; మాయానగరక్షేత్రం – మాయ; సుపార్శ్వక్షేత్రం – నారాయణి; రుద్రకోటిక్షేత్రం – ఈశాన; బ్రహ్మక్షేత్రం – శారద; సిద్ధవనక్షేత్రం – అంబిక'.

**తే. దేవకీదేవి కడుపులోఁ దేజరిల్లు, దీప్తగర్భంబు మెల్లనఁ దిగిచి యోగ**
**నిద్ర రోహిణికడుపున నిలిపి చనియెఁ, గడుపు దిగె నంచుఁ బౌరులు గలఁగఁబడఁగ. 62**

**ప్రతి :** యోగనిద్ర= యోగమాయాదేవి; దేవకీదేవికడుపులోన్= దేవకీదేవిగర్భంలో; తేజరిల్లు దీప్తగర్భంబున్= దివ్యకాంతులతో ప్రకాశిస్తుండే పిండాన్ని; మెల్లనన్= నెమ్మదిగా; తిగిచి= బయటికి తీసి; పౌరులు= మధురానగరమందలి ప్రజలు; కడుపుదిగెన్+ అంచున్= కడుపు పోయింది, కడుపులోని పిండం దిగబడిపోయింది అంటూ; కలఁగన్+పడన్+కన్= కలతపడగా; రోహిణికడుపునన్= రోహిణీదేవిగర్భంలో; నిలిపి= ఉంచి; చనియెన్= వెళ్లింది.

**తా :** యోగమాయాదేవి దేవకీదేవికడుపులో దివ్యకాంతితో వెలుగుతున్న పిండాన్ని మెల్లగా బయటికి తీసి, రోహిణీదేవి గర్భంలో ఉంచి వెళ్ళింది. అప్పుడు మధురానగరప్రజలంతా దేవకీదేవిగర్భం పోయిందని కలత చెందారు.

**వ. అంత. 63**

**ప్రతి :** అంతన్= తరువాత...

**తా :** అంతలో

**ఆ. బలము మిగులఁ గలుగ 'బలభద్రుఁ'డన లోక, రమణుఁ డగుటఁ జేసి 'రాముఁ' డనఁగ**
**సతికిఁ బుట్టె గర్భసంకర్షణమున 'సం, కర్షణుం' డనంగ ఘనుఁడు సుతుఁడు. 64**

**ప్రతి :** బలము= శక్తి; మిగులన్= ఎక్కువగా; కలుగన్= కలిగియుండటంచేత; బలభద్రుఁడు+అనన్= బలభద్రుడనీ; లోక= ప్రపంచానికి; రమణుఁడు= మనోహరుడైనవాడు; అగుటన్+చేసి= అయినందువల్ల; రాముఁడు+అనఁగన్= రాముడనీ; గర్భ= (దేవకీదేవి) గర్భంనుండి; సంకర్షణమునన్= చక్కగ బయటికి లాగబడటంవల్ల; సంకర్షణుఁడు+అనంగన్= సంకర్షణుడు అనే; ఘనుఁడు= శ్రేష్ఠుడైన; సుతుఁడు= కొడుకు; సతికిన్= ఇల్లాలికి, రోహిణీదేవికి; పుట్టెన్= జన్మించినాడు.

**తా :** రోహిణీదేవికి శ్రేష్ఠుడైన ఒక కుమారుడు జన్మించాడు. మిక్కిలి బలవంతుడు కావటంవల్ల బలభద్రుడని, లోకానికి ఆనందం కలిగించేవాడు కనుక రాముడని, దేవకీదేవిగర్భంనుండి (మొదట) బయటికి లాగబడినవాడు కావటంవల్ల సంకర్షణుడని అతనికి పేర్లువచ్చాయి.

**వ. తదనంతరంబ. 65**

**ప్రతి :** తద్+అనంతరంబు+అ= ఆ తరువాత...

**తా :** రోహిణీదేవికి బలరాముడు పుట్టిన తరువాత

**క. ఆనకదుందుభి మనమున, శ్రీనాథుం డంశభాగశిష్టతఁ జొరఁగన్**
**భానురుచి నతఁడు వెలిఁగెను, గానఁగఁ బట్టయ్యె భూతగణములకు నృపా! 66**

**ప్రతి :** నృపా= రాజా!-పరీక్షిన్మహారాజా!; శ్రీనాథుండు= లక్ష్మీదేవి భర్తఅయిన శ్రీమహావిష్ణువు; అంశ భాగ, శిష్టతన్= తన దివ్యశక్తుల ఐశ్వర్యంతో; ఆనకదుందుభి మనమునన్= వసుదేవుని మనస్సునందు; చొరన్+కన్= ప్రవేశింపగా; అతఁడు= ఆ వసుదేవుడు; భానురుచిన్= సూర్యతేజస్సువంటి తేజస్సుతో; వెలిఁగెను= ప్రకాశించాడు; భూతగణములకున్= ప్రాణిసమూహములకు; కానన్+కన్= చూడడానికి; పట్టు+అయ్యెన్= స్థానమయ్యాడు.

**తా :** ఓ పరీక్షిన్మహారాజా! శ్రీమహావిష్ణువుఅంశ వసుదేవునిలో ప్రవేశించగానే అతడు సమస్తప్రాణులచూపులను ఆకర్షిస్తూ, సూర్యతేజస్సుతో ప్రకాశించాడు.

**ఉ. ఆవసుదేవుఁ డంతఁ దనయం దఖిలాత్మక మాత్మభూతముం**
**బావనరేఖయున్ భువనభద్రమునై వెలుఁగొందుచున్న ల**
**క్ష్మీవిభుతేజ మచ్చుపడఁ జేర్చినఁ దాల్చి నవీనకాంతితో**
**దేవకి యొప్పెఁ బూర్వయగుదిక్సతి చంద్రునిఁ దాల్చుకైవడిన్. 67**

**ప్రతి :** ఆ, వసుదేవుఁడు= ఆ వసుదేవుడుకూడ; అంతన్= అంతలో; తన+అందు= తన దేహంలోపల; అఖిల+ఆత్మకము= సర్వం తనలో కలిగి ఉండేది; (న+ఖిల+ఆత్మకము= నాశములేని స్వరూపం కలది;) ఆత్మభూతమున్= పరమాత్మ స్వరూపమైంది; పావనరేఖయున్= పవిత్రమైన వైభవంకలదీ; భువన= (పదునాల్గు) లోకాలకు; భద్రమును+ఐ= శుభాన్ని కలిగించేదై; వెలుఁగొందుచున్+ఉన్న= ప్రకాశిస్తున్న; లక్ష్మీ విభు= లక్ష్మీదేవిభర్త అయిన విష్ణువుయొక్క; తేజము= తేజస్సు;

అచ్చుపడన్= అచ్చొత్తినట్లుగ; చేర్చినన్= చేర్చడంతో; పూర్వ+అగు, దిక్+సతి= తూర్పుదిక్కనెడి కాంత; చంద్రునిన్= చంద్రుణ్ణి; తాల్చుకైవడిన్= ధరించినవిధంగా; దేవకి; తాల్చి= ధరించి; నవీనకాంతితోన్= క్రొత్తకాంతితో; ఒప్పెన్= ప్రకాశించింది.

**తా :** అఖిలమై, సర్వాత్మస్వరూపమై, తేజోవంతమై, భువనాలకంతటికి శుభదాయకమై ప్రకాశిస్తున్న విష్ణుతేజస్సు, వసుదేవుని శరీరంలో ప్రవేశించింది. అలాంటి విష్ణుతేజస్సును అచ్చొత్తినట్లుగా వసుదేవుడు దేవకీదేవిగర్భంలో ప్రవేశపెట్టినాడు. ఆ తేజస్సును గర్భంలో ధరించినందువల్ల, చంద్రునితో కొత్తకాంతులీనుతున్న తూర్పుదిక్కాంతవలె దేవకీదేవి ప్రకాశించింది.

**విశే :** భువనాలు పదునాలుగు. అతల, వితల, సుతల, రసాతల, మహాతల, తలాతల, పాతాళలోకాలు ఏడూ అధోలోకాలు. భూలోక, భువర్లోక, సువర్లోక, మహర్లోక, జనలోక, తపోలోక, సత్య లోకాలు ఏడూ ఊర్ధ్వలోకాలు.

**వ. అనిన విని తర్వాతి వృత్తాంతం బెట్లయ్యె నని రా జడిగిన శుకుం డిట్లనియె. 68**

**ప్రతి :** అనినన్= అనిచెప్పగా; విని= విని; తర్వాతి వృత్తాంతంబు= ఆ తర్వాతి సమాచారం; ఎట్లు= ఏ విధంగా; అయ్యెన్= జరిగింది; అని; రాజు= పరీక్షిన్మహారాజు; అడిగినన్= అడుగగా; శుకుండు= శుకమహర్షి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తా :** అని చెప్పగా విని, పరీక్షిన్మహారాజు తరువాత ఏమి జరిగిందని అడుగగా, శుకమహర్షి ఈ విధంగా చెప్పాడు.

**క. గురుతరముగఁ దనకడుపునఁ, సరసిజగర్భాండభాండచయములు గల యా**
**హరి దేవకికడుపున భూ, భరణార్థము వృద్ధిఁ బొందె బాలార్కుక్రియన్. 69**

**ప్రతి :** గురుతరముగన్= మిక్కిలిగొప్పగా; తన కడుపునన్= తనకడుపులో; సరసిజగర్భ+అండ= బ్రహ్మాండాలనెడి; భాండ= కుండలయొక్క; చయములు= సమూహాలు; కల= ఉన్నట్టి; ఆ, హరి= ఆ శ్రీమహావిష్ణువు; దేవకికడుపునన్= దేవకీదేవిగర్భంలో; భూభరణ+అర్థము= భూమిని రక్షించడంకోసం; బాల+అర్కుక్రియన్= బాలసూర్యునివలె – ఉదయకాల భానునివలె; వృద్ధిన్= పెరుగుదలను; పొందెన్= పొందాడు.

**తా :** ఎంతో గొప్పగా బ్రహ్మాండభాండాల నన్నింటిని తన కడుపులో దాచుకొన్న శ్రీహరి, ఈ భూమిని ఉద్ధరించటానికై దేవకీదేవికడుపులో ఒదిగి బాలభానునివలె వృద్ధి పొందాడు.

**వ. అంత. 70**

**ప్రతి :** అంతన్= అంతలో...

**తా :** ఆ తరువాత

**సీ. విమతులమోములు వెలవెలఁ బాఱంగ విమలాస్యమోము వెల్వెలుకఁ బాఱె**
**మలయు వైరులకీర్తి మాసి నల్లన గాఁగ, నాతిచూచుకములు నల్ల నయ్యె**
**దుష్టాలయంబుల ధూమరేఖలు పుట్ట లేమయారున రోమలేఖ మెఱసె**
**నరిమానసముల కాహారవాంఛలు దప్ప వనజాక్షి కాహారవాంఛ దప్పె**

**తే. ౹శమము సంధిల్లె రిపులకు ౹శమము గదుర, జడత వాటిల్లె శ౹తులు జడను వడcగ,**
**మన్ను రుచి యయ్యెc బగతురు మన్నుసొరcగ, వెలcదియుదరంబులో హరి వృద్ధిc బొంద. 71**

**౹పతి :** వెలcది= ౹స్త్రీ, దేవకీదేవియొక్క; ఉదరంబులోన్= కడుపులో; హరి= విష్ణుమూర్తి; వృద్ధిన్= పెరుగుదలను; పొందన్= పొందుతుండగా; విమతుల= శ౹తువులయొక్క; మోములు= ముఖాలు; వెలవెలన్= తెలతెల్లగా; పొఱంగన్= పోవగా (కళావిహీనాలవుతుండగా); విమల+ఆస్య= నిర్మలమైన మొగంగలదైన దేవకీదేవియొక్క; మోము= ముఖం; వెల్వెలుకన్+పాఱెన్= బాగా తెల్లబడింది; మలయు= ఉద్యమించే; వైరుల= శ౹తువులయొక్క; కీర్తి= ఖ్యాతి; మాసి= కాంతిచెడి; నల్లన= నలుపెక్కింది; కాcగన్= అవుతుండగా; నాతి= ౹స్త్రీ, దేవకీదేవియొక్క; చూచుకములు= చనుమొనలు; నల్లన+అయ్యెన్= నల్లబడ్డాయి; దుష్ట+ఆలయంబులన్= దుర్మార్గుల ఇండ్లలో; ధూమరేఖలు= పొగలగీరలు; పుట్టన్= ఏర్పడగా; లేమ= ౹స్త్రీ, దేవకీదేవియొక్క; ఆరునన్= నూగారున (పొత్తికడుపుమీది వెం౹టుకల చాలు); రోమలేఖ= వెం౹టుకలయొక్క దట్టమైనవరుస; మెఱసెన్= ౹పకాశించింది; అరి= శ౹తువుల; మానసములకున్= మనస్సులకు; ఆహారవాంఛలు= ఆహారం తినాలనే కోరికలు; తప్పన్= తప్పిపోతుండగా; వనజ+అక్షికిన్= పద్మాలవంటి కన్నులు కల దేవకీదేవికి; ఆహారవాంఛ= ఆహారం తినాలనే కోరిక; తప్పెన్= తప్పిపోయింది; రిపులకున్= శ౹తువులకు; ౹శమము= అలసట; కదురన్= కలుగగా; ౹శమము= అలసట; సంధిల్లెన్= (దేవకీదేవికి) కలిగింది; శ౹తులు= వైరులు; జడను= మాంద్యాన్ని; పడన్+కన్= పొందగా; జడత= బుద్ధిమాంద్యం; పాటిల్లెన్= కలిగింది; పగతురు= శ౹తువులు; మన్ను+చొరన్+కన్= మట్టిలో కలియగా; మన్ను= మట్టి; రుచి+అయ్యెన్= రుచించింది.

**తా :** దేవకీదేవిగర్భంలో విష్ణుమూర్తి వృద్ధిపొందే కొద్దీ శ౹తువుల ముఖాలు వెలవెలపోగా, గర్భవతి అయిన దేవకీదేవి ముఖం తెల్లబడసాగింది. ఉద్యమించే వైరులకీర్తి మాసి నల్లబడిపోగా, ఆమెచనుమొనలు నలుపెక్కాయి. దుర్మార్గుల ఇండ్లలో పొగలెగయగా, ఆమెనూగారు ౹కిక్కిరిసిన వెం౹టుకలవరుసతో ౹పకాశించింది. శ౹తువులకు ఆహారంమీద కోరికలు అడుగంటగా, ఆమెకు అన్నంమీది కోరిక తగ్గింది. శ౹తువులు అలసిపోతుండగా, ఆమెకు అలసట ఏర్పడింది. శ౹తువులకు శారీరక మానసిక మాంద్యం కలుగగా, ఆమెకు కూడా బుద్ధిమాంద్యం ఏర్పడింది. శ౹తువులు మట్టిలో కలియగా, ఆమెకు మట్టి రుచించసాగింది.

**విశే :** దుష్టశిక్షణకై అవతరిస్తున్న శ్రీహరి తల్లిగర్భంలో పెరుగుతూ ఉండగానే, ఆమెలో వచ్చే మార్పులతోపాటు దుష్టశ౹తువుల స్థితిగతుల్లో ఏలాంటి మార్పులు వచ్చాయో, మున్ముందు వాళ్ళు పడేపాట్లు ఏ స్థాయిలో ఉంటాయో భావార్థసూచనగా కవి ఇందులో అద్భుతంగా ధ్వనింపచేయటం గొప్పవిశేషం.

**వ. మఱియును. 72**

**౹పతి :** మఱియును= ఇంకా...

**తా :** ఆ తర్వాత

**సీ. సలిల మా యెలనాcగ జఠరార్భకునిc గానc, జనిన కైవడి ఘర్మసలిల మొప్పె,**
**నొగిc దేజ మా యింతియుదరడింభకుc గొల్వc గదిసిన౹కియ దేహకాంతి మెఱసెc**

**బవనుఁ డా కొమ్మగర్భస్థుని సేవింప నొలసె నా మిక్కిలియూర్పు లమరెఁ**
**గుంభిని యా లేమకుక్షిగు నర్చింపఁ జొచ్చుభంగిని మంటి చొరవ దనరె**

**ఆ. గగన మిందువదనకడుపులో బాలు సే, వలకు రూపు మెఱసి వచ్చినట్లు**
**బయలువంటినడుము బహుళ మయ్యెను బంచ, భూతమయుఁడు లోనఁ బొదల సతికి. 73**

**ప్రతి :** పంచభూతమయుఁడు= (పృథివ్యాపస్తేజోవాయురాకాశాలనెడి) అయిదు మహాభూతాలే ఆకారంగా కలవాడు, విష్ణుమూర్తి; లోనన్= (దేవకీదేవి) గర్భంలో; పొదలన్= వృద్ధి పొందుచుండగా; సలిలము= జలం; ఆ+ ఎలనాఁగ= ఆ స్త్రీమూర్తియొక్క; జఠర+అర్భకునిన్= గర్భంలో ఉండే బాలుణ్ణి; కానన్= చూడడానికై; చనిన= వెళ్ళిన; కైవడిన్= విధంగ; ఘర్మసలిలము= చెమటనీరు; ఒప్పెన్= తగినట్లు ఉంది; ఒగిన్= క్రమంగా; తేజము= అగ్ని; ఆ+ఇంతి= ఆ కాంత (ఆ దేవకీదేవి) యొక్క; ఉదర= కడుపులో ఉన్న; డింభకున్= బాలుణ్ణి; కొల్వన్= సేవించడానికై; కదిసినక్రియన్= సమీపించిన విధంగా; దేహకాంతి= శరీరకాంతి; మెఱసెన్= వెలిగింది; పవనుఁడు= వాయుదేవుడు; ఆ కొమ్మ= ఆ కాంతయొక్క (దేవకీదేవి); గర్భస్థునిన్= కడుపులో ఉన్నవాణ్ణి; సేవింపన్= కొలుచుటకు; ఒలసెన్+నాన్= ప్రవేశించిందా అన్నట్లు; మిక్కిలి= ఎక్కువ; ఊర్పులు= నిట్టూర్పులు; అమరెన్= ఒప్పాయి; కుంభిని= భూమి; ఆ లేమ= ఆ దేవకీదేవియొక్క; కుక్షిగున్= కడుపులో ఉన్నవాణ్ణి; అర్చింపన్= పూజించడానికై; చొచ్చు= ప్రవేశించే; భంగిని= విధంగా; మంటిచొరవ= మట్టిని తినాలనే కోరిక; తనరెన్= ఎక్కువయ్యింది; గగనము= ఆకాశం; ఇందువదన= చంద్రబింబంవంటి ముఖంగల దేవకీదేవియొక్క; కడుపులో బాలు సేవలకు= గర్భంలోని బాలునికి సేవలు చేయడానికై; రూపు మెఱసి= ఆకారం ప్రకాశింపగా; వచ్చినట్లు= బయటికి వచ్చినట్లు; బయలువంటి నడుము= శూన్యం వంటినడుము, లేదని అనిపించే నడుము; సతికిన్= దేవకికి; బహుళము+అయ్యెను= అధికమయింది.

**తా :** పంచభూతాత్మకుడైన శ్రీమహావిష్ణువు దేవకీదేవి గర్భంలో పెరుగుతూ ఉండగా పంచభూతాలు ఆయన్ను సేవించడానికై వచ్చాయా అన్నట్లు ఆ గర్భవతిలో మార్పులు అనేకం అగుపించాయి. జలం ఆ బాలకుణ్ణి సేవించడానికి వచ్చినట్లు ఆమె శరీరం చెమటలు పట్టసాగింది. అగ్ని ఆ బాలకుణ్ణి సేవించడానికై వచ్చిందా అన్నట్లు ఆమె దేహకాంతి అధికమై మెరిసింది. వాయుదేవుడు సేవించడానికి వచ్చినాడా అన్నట్లు ఆమె నిట్టూర్పులు అధికమయ్యాయి. ఆ బాలుణ్ణి పూజించటానికి భూమివచ్చిందా అన్నట్లు ఆమె మన్ను తినటం ఎక్కువైంది. ఆకాశం రూపుదాల్చి ఆ బాలుణ్ణి సేవించటానికి వచ్చిందా అన్నట్లు, అంతకు ముందు ఆకాశంవలె శూన్యమై లేదనిపించే ఆమెనడుము లావైంది.

**వ. తదనంతరంబ. 74**

**ప్రతి :** తద్+అనంతరంబు+అ= ఆ తరువాత...

**తా :** ఆ తర్వాత, ఇంకా

**సీ. అతివకాంచీగుణం బల్లన బిగియంగ వైరివధూగుణవ్రజము వదలె**
**మెల్లన తన్వంగిమెయిదీవ మెఱుఁగెక్క దుష్టాంగనాతనుద్యుతు లడంగె**
**నాతి కల్లన భూషణములు పల్చలన గాఁ బరసతీభూషణపంక్తు లెడలెఁ**
**గలకంఠి కొయ్యన గర్భంబు దొడ్డుగాఁ బరిపంథిదారగర్భములు వగిలెఁ**

**తే. బొలఁతి కల్లన నీళ్ళాడు ప్రొద్దు లెదుగ, నహితవల్లభ లైదువలై తనర్చు**
**ప్రొద్దు లన్నియుఁ గ్రమమునఁ బోవఁ దొడఁగె, నువిదకడుపున నసురారి యుంటఁజేసి. 75**

**ప్రతి :** ఉవిదకడుపునన్= స్త్రీ గర్భంలో, దేవకీదేవిగర్భంలో; అసుర+అరి= రాక్షసులకు శత్రువైన శ్రీహరి; ఉంటన్+చేసి= ఉన్నందువల్ల; అతివ= దేవకీదేవియొక్క; కాంచీ= మొలనూలియొక్క; గుణంబు= పేట; అల్లనన్= మెల్లగా; బిగియన్+కన్= బిగుసుకొంటుంటే; వైరి= శత్రువుల; వధూ= భార్యలయొక్క; గుణ= మంగళసూత్రాల; వ్రజము= సమూహం; వదలెన్= సడలిపోతున్నాయి; మెల్లనన్= క్రమక్రమంగా; తను+అంగి= అందమైన శరీరంగల దేవకీదేవియొక్క; మెయి+తీవ= శరీరమనే తీగె; మెఱుఁగు+ఎక్కన్= కాంతి అధికం కాగా; దుష్ట= దుర్మార్గులయొక్క; అంగనా= భార్యలయొక్క; తనుద్యుతులు= దేహకాంతులు; అడంగెన్= అణగిపోయాయి; నాతికిన్= దేవకీదేవికి; అల్లన= మెల్లగా; భూషణములు= సొమ్ములు; పల్బలన= బిగువు; కాన్= అగుచుండగా; పర= శత్రువులయొక్క; సతీ= భార్యలయొక్క; భూషణ= ఆభరణముల; పంక్తులు= సమూహాలు; ఎడలెన్= సడలిపోయాయి; కలకంఠికిన్= మనోహరమైన ధ్వనిగల గొంతు ఉన్న దేవకీదేవికి; ఒయ్యనన్= మెల్లగా; గర్భంబు= కడుపు; దొడ్డుగాన్= పెద్దదికాగా; పరిపంథి= శత్రువులయొక్క; దార= భార్యలయొక్క; గర్భములు= కడుపులు; పగిలెన్= ముక్కలయ్యాయి; పొలఁతికిన్= కాంతకు, దేవకీదేవికి; అల్లనన్= అంతకంతకు; నీళ్ళాడన్= ప్రసవించడానికి; ప్రొద్దులు= రోజులు; ఎదుగన్= పెరుగగా; అహిత= శత్రువులయొక్క; వల్లభలు= భార్యలు; ఐదువలు+ఐ= ముత్తైదువులై; తనర్చు= ఒప్పు; ప్రొద్దులు= రోజులు; అన్నియున్= అన్నీ; క్రమమునన్= వరుసగా; పోవన్= తరగి పోవడానికి; తొడఁగెన్= మొదలయ్యాయి.

**తా :** దేవకీదేవిగర్భంలో రాక్షసులశత్రువైన శ్రీహరి ఉన్నందువల్ల, ఆమెమొలనూలు నెమ్మదిగా బిగుసుకపోతుంటే శత్రువుల భార్యల మంగళసూత్రాలు సడలిపోతున్నాయి. ఆమె శరీరకాంతి ఎక్కువగా పెరుగుతూంటే – పగవారిభార్యల శరీరకాంతులు తరిగి పోసాగాయి. ఆమెకు ఆభరణాలు బిగువు లౌతూ ఉంటే, శత్రువుల భార్యల ఆభరణాలు తెగిపోసాగాయి. ఆమె కడుపు పెద్దదౌతూ ఉంటే, శత్రువుల భార్యల కడుపులు పగిలి పోసాగాయి. ఆమెకు ప్రసవించే రోజులు దగ్గరయ్యేకొద్దీ, శత్రువుల భార్యలు ముత్తైదువులుగా ఉండే దినాలు క్రమంగా కడచిపోసాగాయి.

**వ. ఇవ్విధంబున. 76**

**ప్రతి :** ఈ+విధంబునన్= ఈ విధంగా...

**తా :** ఇలా ఉండగా

**ఆ. జ్ఞానఖలునిలోని శారదయునుబోలె, ఘటములోని దీపకళికవోలె**
**భ్రాతయింట నాఁకఁ బడియుండె దేవకీ, కాంత విశ్వగర్భగర్భ యగుచు. 77**

**ప్రతి :** దేవకీకాంత= దేవకీదేవి; విశ్వగర్భ= బ్రహ్మాండాన్ని గర్భంలో కలిగిన శ్రీమహావిష్ణువును; గర్భ= గర్భంగా కలది; అగుచున్= అయి; జ్ఞానఖలునిలోని= విద్యావంతుడైన దుర్మార్గునిలోని; శారదయును+పోలెన్= సరస్వతివలె; ఘటములోని= కుండలోని; దీపకళిక+పోలెన్= దీపశిఖవలె; భ్రాత+ఇంట= అన్నగారి (కంసుని) ఇంటిలో; ఆఁకన్= చెరలో; పడి ఉండెన్= పడి ఉండింది (దుర్భరస్థితిలో ఉండింది).

**తా :** ఈ విధంగా లోకాలన్నింటినీ తన గర్భంలో మోస్తున్న శ్రీమహావిష్ణువును, తన గర్భంలో మోస్తూ ఉన్న దేవకీదేవి, దుష్టుడైన పండితునిలోని సరస్వతివలె, కుండలోని దీపకళికవలె అన్న కంసుని ఇంట్లో నిర్బంధింపబడి ఉండింది.

**వ. అంత న క్కాంతాతిలకంబు నెమ్మొగంబుతెలివియును, మేనిమెఱుంగును, మెలఁగెడిసొబగునుం జూచి వెఱఁగుపడి తఱచు వెఱచుచుఁ గంసుండు దనలో నిట్లనియె. 78**

**ప్రతి :** అంతన్= తరువాత; ఆ+కాంతాతిలకంబు= శ్రేష్ఠురాలైన ఆ స్త్రీ, దేవకీదేవియొక్క; నెఱ+మొగంబు= నిండు ముఖంయొక్క; తెలివియును= తేజస్సును; మేని= శరీరముయొక్క; మెఱుంగును= కాంతిని; మెలఁగెడి= నడత తీరులోని; సొబగునున్= అందాన్ని; చూచి; వెఱఁగుపడి= ఆశ్చర్యపడి; తఱచు= తరచూ (చాలమార్లు); వెఱచుచున్= భయపడుచు; కంసుండు; తనలోన్= తనలోనే; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అనుకొన్నాడు.

**తా :** దేవకీదేవి చెరలోఉన్నా ఆమె ముఖతేజస్సును, దేహకాంతిని, నడకతీరులోని సొగసును చూచి, కంసుడు ఆశ్చర్యపడి, తరచుగా భయపడుతూ తనలో ఈ విధంగా అనుకొన్నాడు.

**క. కన్నులకుఁ జూడ బరువై, యున్నది యెలనాఁగగర్భ ముల్లము గలఁగన్**
**ము న్నెన్నఁడు నిట్లుండదు, వెన్నుఁడు సొరఁబోలు గర్భవివరములోనన్. 79**

**ప్రతి :** చూడన్= గమనిస్తే; ఎలనాఁగ= స్త్రీ, దేవకీదేవియొక్క; గర్భము= కడుపు; ఉల్లము= మనస్సు; కలఁగన్= కలతనొందేటట్లుగానూ; కన్నులకున్= కన్నులకు; బరువు+ఐ+ఉన్నది= భారమై ఉంది; మున్ను+ఎన్నఁడున్= ఇంతకు ముందెన్నడూ; ఇట్లు= ఈ విధంగా; ఉండదు= ఉండలేదు; గర్భవివరములోనన్= గర్భంలోపల; వెన్నుఁడు= విష్ణుమూర్తి; చొరన్+ పోలున్= ప్రవేశించాడేమో!

**తా :** దేవకీదేవిగర్భం మనస్సుకు ఆందోళన కలిగేటట్లుగానూ, చూడడానికి భారంగానూ ఉంది. ఇదివరకటి ఈమెగర్భాలు ఇలా లేవు. బహుశః విష్ణుమూర్తి ఈమె గర్భంలో ప్రవేశించాడేమో!

**ఉ. ఏమి దలంచువాఁడ? నిఁక నెయ్యది కార్యము? నాఁడు నాఁటికిం**
**గామినిచూలు పెంపెసఁగె? గర్భిణిఁ జెల్లెలి నాఁడుపేద నే**
**నేమని చంపువాఁడఁ? దగ వేలని చంపితినేని శ్రీయు ను**
**ద్దామయశంబు నాయువును ధర్మమునుం జెడిపోవకుండునే? 80**

**ప్రతి :** ఏమి= ఏమని; తలంచువాఁడన్= ఆలోచించేది; ఇఁకన్= మున్ముందు; కార్యము= చేయదగినపని; ఏ+అది= ఏది?; నాఁడునాఁటికిన్= రోజురోజుకు; కామిని= స్త్రీ, దేవకీదేవియొక్క; చూలు= గర్భం; పెంపు+ఎసఁగెన్= పెరుగుతూ ఉంది; గర్భిణిన్= గర్భవతి అయినదాన్ని; చెల్లెలిన్= తోబుట్టువును; ఆఁడుపేదన్= అశక్తురాలైన స్త్రీని; ఏన్= నేను; ఏమి+అని= ఏ కారణం చెప్పి; చంపువాఁడన్= చంపేది?; తగవు+ఏల= న్యాయం ఎందుకు (న్యాయాన్యాయ విచారణ ఎందుకని); అని; చంపితిన్+ఏని= చంపినట్లయితే; శ్రీయున్= సంపదయును; ఉద్దామ= గొప్ప; యశంబు= కీర్తి; ఆయువున్= ఆయుస్సును; ధర్మమునున్= పుణ్యంకూడా; చెడిపోవక+ఉండునే= చెడిపోకుండా ఉంటాయా? (చెడిపోతాయని భావం)

**తా :** ఇక నేనేమి ఆలోచించాలి? ఏమి చేయాలి? రోజురోజుకూ దేవకీదేవిగర్భం పెరుగుతూ ఉంది. గర్భవతి అయిన చెల్లెలిని, అబలను నేను ఏ కారణం చూపి చంపేది. న్యాయాన్యాయాల విచారణ ఎందుకులే అని చంపితే-నా ఐశ్వర్యం, కీర్తి, ఆయువూ, ధర్మం అన్నీ నాశనమై పోవా?

**క. వావి యెఱుంగని క్రూరుని, జీవన్మృతుఁ డనుచు నిందసేయుదు, రతఁడుం**
**బోవును నరకమునకు, దు, ర్భావముతో బ్రదుకు టొక్క బ్రదుకే తలఁపన్? 81**

**ప్రతి :** వావి= బంధుత్వపువరుస; ఎఱుంగని= తెలియని; క్రూరునిన్= దుర్మార్గుణ్ణి; జీవత్+మృతుఁడు+అనుచున్= బ్రతికీ చచ్చినవాడని; నింద+చేయుదురు= నిందిస్తారు; అతఁడున్= అతడుకూడా; నరకమునకున్= నరకానికి; పోవును= పోతాడు; తలఁపన్= విచారిస్తే; దుర్+భావముతోన్= చెడ్డఆలోచనతో; బ్రదుకుట= జీవించటం; ఒక్క బ్రదుకు+ఏ= ఒక బ్రతుకేనా? (ఒక మంచి బ్రతుకుకాదని భావం)

**తా :** వావివరుసలు చూడకుండ ప్రవర్తించే క్రూరుడు, బ్రతికినా చచ్చినవాడితో సమానమని లోకులు నిందిస్తారు. ఆలాంటివాడు నరకానికి పోతాడు. విచారించి చూస్తే దురాలోచనతో జీవించేవాడి బ్రతుకు ఒక బ్రతుకేనా?

**వ. అనినిశ్చయించి క్రౌర్యంబువిడిచి ధైర్యంబు నొంది గాంభీర్యంబు వాటించి శౌర్యంబు ప్రకటించుకొనుచు దిగ్గనం జెలియలిం జంపునగ్గలిక యెగ్గని యుగ్గడించి మాని మౌనియుంబోలె నూరకుండియు. 82**

**ప్రతి :** అని నిశ్చయించి= అని ఈ విధంగా నిర్ణయించుకొని; క్రౌర్యంబు= క్రూరభావాన్ని; విడిచి= వదలి; ధైర్యంబున్= ధైర్యాన్ని; ఒంది= పొంది; గాంభీర్యంబు= తన మనస్సును బయటపడనీయని బింకాన్ని; పాటించి= వహించి; శౌర్యంబున్= పరాక్రమాన్ని; ప్రకటించుకొనుచున్= చూపిస్తూ; దిగ్గనన్= తటాలున; చెలియలిన్= చెల్లెలిని; చంపు= చంపాలనే; అగ్గలిక= పూనిక; ఎగ్గు+అని= కీడని; ఉగ్గడించి= చెప్పుకొని; మాని= (చెల్లెలిని చంపే ప్రయత్నాన్ని) మానుకొని; మౌనియున్+పోలెన్= మాట్లాడకుండా ఉండే వ్రతం పూనిన వానివలె; ఊరకుండియున్= ఏమియు చేయకుండియు...

**తా :** అని నిర్ణయించుకొని క్రౌర్యాన్ని వదలి, ధైర్యం తెచ్చుకొని, గాంభీర్యాన్ని వహించి, శౌర్యాన్ని ప్రదర్శిస్తూ, చెల్లెలిని చంపటం అనే కార్యం మహాపాపంగా భావించి, ఆ ప్రయత్నాన్ని విరమించి, ఏమీ మాట్లాడకుండ మౌనివలె ఊరకుండగా

**ఆ. 'పాపరాని దొడ్డపగ పుట్టె, నిఁక నెట్టు, లిందుముఖికిఁ జక్రి యెపుడు పుట్టుఁ**
**బుట్టినపుడె పట్టి పురిటింటిలోఁ దెగఁ, జూతు' ననుచు నెదురు సూచుచుండె. 83**

**ప్రతి :** పాపరాని= తొలగించేందుకు వీలులేని; దొడ్డ= పెద్ద; పగ= వైరం; పుట్టెన్= ఏర్పడింది; ఇఁకన్= ముమ్ముందు; ఎట్టులు= ఏలాగ? ఇందుముఖికిన్= చంద్రునివంటి ముఖంగల దేవకీదేవికి; చక్రి= చక్రాయుధుడు, శ్రీమహావిష్ణువు; ఎపుడు= ఏ సమయంలో; పుట్టున్= జన్మిస్తాడో; పుట్టిన+అపుడు+ఎ= జన్మించినప్పుడే; పట్టి= (ఆ బాలుణ్ణి) పట్టుకొని; పురిటింటిలోన్= పురిటింటిలోనే; తెగన్= హతుడయ్యేటట్లుగా; చూతున్ (చూచుదున్)= చూస్తాను; అనుచున్= అంటూ; ఎదురు చూచుచున్+ఉండెన్= ఎదురు చూడసాగాడు.

**తా :** తొలగించేందుకు వీలులేని పెద్దవైరం ఏర్పడింది. ముమ్ముందు ఏ మౌతుందో? దేవకీదేవికి ఎప్పుడు విష్ణువు పుడతాడో? పుట్టగానే పురిటింటిలోనే వాణ్ణి పట్టుకొని చంపివేస్తాను' అని కంసుడు ఆమె ప్రసవించేసమయంకోసం ఎదురు చూడసాగాడు.

**వ. మఱియు వైరానుబంధంబున నన్యానుసంధానంబు మఱచి యతండు. 84**

**ప్రతి :** మఱియున్= అంతేకాక; వైర+అనుబంధంబునన్= శత్రుత్వంతో ఏర్పడిన సంబంధంవల్ల; అన్య+అనుసంధానంబున్= ఇతరమైన చింతనల్ని; మఱచి= మరచిపోయి; అతండు= ఆ కంసుడు.

**తా :** దేవకీదేవికి పుట్టబోయే విష్ణువుమీద శత్రుభావన పెంచుకొన్నకారణంగా, కంసుడు, ఇతరవిషయాలన్నింటిని మరచిపోయాడు.

**క. తిరుగుచుఁ గుడుచుచుఁ ద్రాగుచు, నరుగుచుఁ గూర్చుండి లేచు చనవరతంబున్**
**హరిఁ దలఁచి తలఁచి జగ మా, హరిమయ మని చూచెఁ గంసుఁ డాఱనియలుకన్. 85**

**ప్రతి :** కంసుఁడు; ఆఱని= అణగని; అలుకన్= కోపంతో; తిరుగుచున్= సంచరిస్తూ; కుడుచుచున్= తింటూ; త్రాగుచున్= త్రాగుతూ; అరుగుచున్= నడుస్తూ; కూర్చుండి లేచుచున్= కూర్చుని లేస్తూ; అనవరతంబున్= ఎల్లప్పుడును; హరిన్= శ్రీమహావిష్ణువును; తలఁచి తలఁచి = స్మరించి స్మరించి; జగము= లోకమంతా; ఆ హరిమయము+అని= విష్ణుమయం అని; చూచెన్= దర్శించినాడు.

**తా :** కంసుడు విష్ణుమూర్తి మీది ఎడతెగనికోపంతో తిరుగుతున్నా, భోజనంచేస్తున్నా, త్రాగుతున్నా, నడుస్తున్నా, కూర్చున్నా, లేస్తున్నా ఇలా అన్ని వేళల్లో ఆ విష్ణుమూర్తినే తలచుకొంటూ జగత్తంతా విష్ణుమయంగా చూడసాగాడు.

**విశే :** విష్ణువు విశ్వమయుడు కదా! ఒక విధంగా కంసునిది విష్ణుభక్తే–కాకుంటే వైరభక్తి. అందువల్లనే ఆ వైరభక్తునికి జగత్తంతా విష్ణుమయంగా గోచరిస్తున్నది.

**వ. వెండియు. 86**

**ప్రతి :** వెండియున్= మరియును...

**తా :** ఇంకా

**సీ. శ్రవణరంధ్రముల నే శబ్దంబు వినఁబడు నది హరిరవ మని యాలకించు,**
**నక్షిమార్గమున నెయ్యది సూడఁబడు నది హరిమూర్తి గానోపు నంచుఁ జూచుఁ,**
**దిరుగుచో దేహంబు తృణమైన సోఁకిన హరికరాఘాతమో యనుచునులుకు,**
**గంధంబు లేమైన ఘ్రాణంబు సోఁకిన హరిమాలికాగంధ మనుచు నదరుఁ,**

**ఆ. బలుకు లెవ్వియైనఁ బలుకుచో హరిపేరు, పలుకఁబడియె ననుచు భ్రమసి పలుకుఁ**
**దలఁపు లెట్టివైనఁ దలఁచి యా తలఁపులు, హరితలంపు లనుచు నలుగఁ దలఁచు. 87**

**ప్రతి :** శ్రవణరంధ్రములన్= చెవుల సందులందు; ఏ శబ్దంబు= ఏ ధ్వని; వినన్+పడున్= వినబడుతుందో; అది= ఆ వినపడినధ్వని; హరి= విష్ణుమూర్తియొక్క; రవము+అని= కంఠధ్వని అని; ఆలకించున్= వింటాడు; అక్షి= కంటియొక్క; మార్గమునన్= త్రోవలో; ఏ+అది= ఏది; చూడన్+పడున్= చూడబడుతుందో; అది= ఆ చూడబడింది; హరిమూర్తి= శ్రీహరిరూపం; కాన్+ఓపున్= అయి ఉండవచ్చు; అంచున్= అంటూ; చూచున్= చూస్తాడు; తిరుగుచోన్= తిరుగుతున్నప్పుడు;

తృణము+ఐనన్= గడ్డిపోచ అయినా; దేహంబు= దేహాన్ని; సోఁకినన్= తాకినా; హరి= విష్ణుమూర్తియొక్క; కర+ఆఘాతము+ఓ= చేతిదెబ్బేమో; అనుచున్= అనుకొంటూ; ఉలుకున్= బెదుర్తాడు; గంధంబులు= సువాసనలు; ఏమి+ఐనన్= ఏవి అయినా; ఘ్రాణంబున్= ముక్కును; సోఁకినన్= తాకగా; హరి= విష్ణుమూర్తియొక్క; మాలికా= వనమాలయొక్క; గంధము= సువాసన; అనుచున్= అనుకొనుచు; అదరున్= భయపడతాడు; పలుకులు= మాటలు; ఎవ్వి+ఐనన్= ఏవి అయినను; పలుకుచోన్= మాట్లాడితే; హరి= విష్ణుమూర్తియొక్క; పేరు= నామం; పలుకన్+పడియెన్= పలుకబడింది; అనుచున్= అంటూ; భ్రమసి= భ్రమపడుతూ; పలుకున్= మాట్లాడతాడు; తలఁపులు= ఆలోచనలు; ఎట్టివి+ఐనన్= ఎటువంటివైనా; తలఁచి= ఆలోచించి; ఆ తలఁపులు= ఆ ఆలోచనలు; హరి= విష్ణుమూర్తినిగూర్చిన; తలంపులు= ఆలోచనలే; అనుచున్= అనుకొంటూ; అలుగన్+తలఁచున్= కోపగించుకొనేందుకు ప్రయత్నిస్తాడు.

**తా :** కంసుడు చెవులకు ఏ శబ్దం వినపడినా అది విష్ణుదేవునిమాటేమో అని వింటాడు. కంటికి ఏది కన్పించినా అది విష్ణుమూర్తి రూపమే కాబోలు అని చూస్తాడు. తాను తిరిగేటప్పుడు శరీరానికి గడ్డిపరక తగిలినా అది విష్ణుమూర్తిచేతి దెబ్బేమో అని ఉలిక్కి పడతాడు. ముక్కుకు ఏ సువాసన సోకినా అది ఆ హరిమెడలోని వనమాలికాసుగంధమేమో అని అదరిపడతాడు. ఏ మాటలు పలికినా, అవి విష్ణునామాలని భ్రమపడతాడు. ఎటువంటి ఆలోచనలు వచ్చినా అవి విష్ణుమూర్తిని గూర్చిన ఆలోచనలేమో అని ఆగ్రహపడతాడు.

**విశే :** భక్తికంటే వైరభక్తే ప్రగాఢమైందేమో! అది వ్యక్తిని హరిదగ్గరికి త్వరగా చేరుస్తుందేమో! అందుకే కాబోలు జయ విజయులు రాక్షసజన్మలెత్తి శ్రీహరికి వైరభక్తులై త్వరగా శాపనివృత్తిని పొందారు.

**వ. ఆయ్యవసరంబున ననుచరసమేతులైన దేవతలును, నారదాదిమునులునుం గూడి నడవ నలువయును, ముక్కంటియు నక్కడకు వచ్చి దేవకీదేవిగర్భంబున నర్భకుండై యున్న పురుషోత్తము నిట్లని స్తుతియించిరి. 88**

**ప్రతి :** ఆ+అవసరంబునన్= ఆ సమయంలో; అనుచరసమేతులు+ఐన= సేవకులతో కూడుకొన్న; దేవతలును= దేవలోకంవారు; నారద+ఆది= నారదుడు మొదలైన; మునులునున్= మహర్షులూ; కూడి= కలిసి; నడవన్= వెంటరాగా; నలువయును= బ్రహ్మయును; ముక్కంటియున్= శివుడును; అక్కడకు వచ్చి= ఆ దేవకీదేవి ఉన్న చెరసాలకు వచ్చి; దేవకీదేవిగర్భంబునన్= దేవకీదేవికడుపులో; అర్భకుండు+ఐ= శిశువై; ఉన్న= ఉన్నట్టి; పురుష+ఉత్తమున్= విష్ణుమూర్తిని; ఇట్లు+అని= ఈ విధంగా; స్తుతియించిరి= స్తోత్రం చేశారు.

**తా :** ఆ సమయంలో అనుచరులతో కూడి దేవతలు, నారదాది మహామునులు వెంటరాగా బ్రహ్మదేవుడూ, శివుడూ దేవకీదేవి ఉండే చెరసాల కేగి, ఆమెగర్భంలో శిశువురూపంలో ఉండే శ్రీమహావిష్ణువును ఈ విధంగా స్తుతించారు.

**విశే :** నలువ - నాలుగుముఖాలు గలవాడు-బ్రహ్మ; ముక్కంటి - మూడుకన్నులు గలవాడు - శివుడు.

## ✤ బ్రహ్మాది దేవతలు దేవకీ గర్భస్థుండగు శ్రీకృష్ణుని స్తుతించుట ✤

**సీ. సత్యవ్రతుని నిత్యసంప్రాప్తిసాధనుఁ గాలత్రయమునందుఁ గలుగువాని**
**భూతంబు లైదును బుట్టుచోటగువాని నైదుభూతంబులం దమరువాని**
**నైదుభూతంబులు నడఁగిన పిమ్మటఁ బరఁగువానిని సత్యభాషణంబు**
**సమదర్శనంబును జరిపెడువానిని ని న్నాశ్రయింతుము, నీ యధీన**

**ఆ. మాయచేత నెఱుకమాలినవారలు, పెక్కుగతుల నిన్నుఁ బేరుకొందు,**
**రెఱుఁగ నేర్చువిబుధు లేకచిత్తంబున, నిఖిలమూర్తు లెల్ల నీవ యంద్రు. 89**

**ప్రతి :** సత్యవ్రతునిన్= సత్యమే వ్రతంగా కలవానిని; నిత్య= శాశ్వతత్వాన్ని; సంప్రాప్తి= పొందడానికి; సాధనున్= ఉపకరణరూపుడైనవాణ్ణి; కాలత్రయము+అందున్= కాలాలు మూడింటి (భూతభవిష్యద్వర్తమానాలు) లోనూ; కలుగువానిన్= ఉండేటివాణ్ణి; భూతంబులు+ఐదును= పంచభూతాలూ; పుట్టుచోటు= పుట్టేచోటు; అగువానిన్= అయినవాణ్ణి; ఐదుభూతంబుల+అందున్= పంచభూతాలలో; అమరువానిన్= వ్యాపించినవాణ్ణి; ఐదు భూతంబులున్= పంచభూతాలూ; అడఁగిన= నశించిన; పిమ్మటన్= తరువాతకూడా; పరఁగువానిని= ఉండేటటువంటివాణ్ణి; సత్యభాషణంబు= నిజం మాట్లాడడం; సమదర్శనంబును= సమభావంతో చూడడం; జరిపెడువానిని= చేసేవాణ్ణి; నిన్నున్= నిన్ను; ఆశ్రయింతుము (ఆశ్రయించుదుము)= శరణు పొందుతాము; నీ, అధీన= నీ అదుపులో ఉన్న; మాయచేతన్= మాయాశక్తిచేత; ఎఱుక= జ్ఞానం; మాలినవారలు= నశించిన వాళ్లు; పెక్కు= అనేక; గతులన్= విధాలుగ; నిన్నున్+పేరుకొందురు= నిన్నుగూర్చి చెప్పుతారు; ఎఱుఁగన్= తెలిసికొనుటను; నేర్చు= చేతనైన; విబుధులు= పండితులు; ఏక= ఒకే; చిత్తంబునన్= మనస్సుతో; నిఖిల= అన్ని; మూర్తులు= రూపాలు; ఎల్లన్= సర్వం; నీవు+అ= నీవే; అంద్రు= అంటారు.

**తా :** సత్యాన్నే వ్రతంగా కలవాడివి. మోక్షప్రాప్తికి సాధనరూపమైనవాడివి. భూత భవిష్య ద్వర్తమానాలు మూడింటిలో ఉండేవాడివి, పంచభూతాలకు పుట్టుక స్థానమైనవాడివి, అయిదు భూతాలలో అంతర్యామిగా ఉండేవాడివి, అయిదుభూతాలు అంతరించిన తరువాత కూడా మిగిలి ఉండేవాడివి, సత్యాన్ని మాట్లాడేవాడివి, అన్నింటినీ, అందరినీ సమానంగా చూచేవాడివి ఇట్టి నిన్ను శరణు వేడుతున్నాం. నీ మాయాశక్తిచేత జ్ఞానశూన్యులైనవారు నిన్ను అనేకవిధాలుగా అనుకొంటున్నారు. కాని జ్ఞానులుమాత్రం ఏకచిత్తంతో అన్నీ నీవే అని అంటారు.

**విశే :** సమదర్శనం – అన్నింటిని, అందరిని సృష్టించింది, అన్నింటిలో, అందరిలో ఉన్నది పరమాత్మే కనుక ఆయన అన్నింటిని, అందరిని సమానంగా చూస్తాడు. ఆయనది సదా సమదర్శనమే! పరమాత్మతత్త్వాన్ని, సృష్టితత్త్వాన్ని తెలుసుకొన్న జ్ఞానిదికూడా సమదర్శనమే!

**వ. అదియునుంగాక. 90**

**ప్రతి :** అదియునున్+కాక= అంతేకాక...

**తా :** అంతేకాకుండా, ఇంకా

**సీ. ప్రకృతి యొక్కటి పాదు, ఫలములు సుఖదుఃఖములు రెండు, గుణములు మూఁడు వేళ్ళు,**
**తగు రసంబులు నాల్గు ధర్మార్థముఖరంబు, లెఱిఁగెడివిధము లై దింద్రియంబు,**
**లాఱు స్వభావంబు లా శోకమోహాదు లూర్ములు, ధాతువు లొక్కయేడు,**
**పైపొర లెనిమిది ప్రంగలు, భూతంబు లైదు బుద్ధియు మనోఽహంకృతులును,**

**తే. రంధ్రములు దొమ్మిదియుఁ గోటరములు, ప్రాణపత్త్రదశకంబు, జీవేశపక్షియుగముఁ**
**గలుగు సంసారవృక్షంబు గలుగఁజేయఁ, గావ నడఁగింప రాజ వొక్కరుఁడ వీవ. 91**

**ప్రతి :** ప్రకృతి= మూలప్రకృతి; ఒక్కటి= ఒక్కటే; పాదు= చెట్టుమొదట చుట్టూ ఉండే పల్లము; సుఖదుఃఖములు= సుఖ దుఃఖాలు; రెండు= రెండూ; ఫలములు= పండ్లు; గుణములు= సత్త్వరజస్తమోగుణాలు; మూఁడు= మూడూ; వేళ్ళు= (చెట్టుకు) వేళ్ళూ; ధర్మ+అర్థముఖరంబులు= ధర్మం అర్థం మొదలయినవి అంటే పురుషార్థములు - ధర్మార్థకామమోక్షములు; నాల్గు= నాలుగు; తగు= తగిన; రసంబులు= రుచులు; ఇంద్రియంబులు= చెవి, చర్మం, కన్ను, నాలుక, ముక్కు అనే జ్ఞానేంద్రియాలు; ఐదు= అయిదూ; ఎఱిఁగెడి= తెలిసికొనెడి - శబ్ద, స్పర్శ, రూప, రసగంధాలు వానిని తెలిసికొనే; విధములు= పద్ధతులు; స్వభావంబులు= సహజగుణాలు - కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాలు; ఆ శోక, మోహ+ఆదులు= ఆ శోకం, మోహం మొదలైనవి; ఆఱు ఊర్ములు= ఆరును ఊర్ములు అనగా ఆకలి, దప్పిక, శోకం, మోహం, ముసలితనం, మరణం; ధాతువులు= దేహంలో ఉండే మూలపదార్థాలు-రసం, రక్తం, మాంసం, మేదస్సు, అస్థి, మజ్జ, శుక్రం; ఒక ఏడు= ఒక ఏడు ధాతువులు; పైపొరలు= మీద కప్పిఉండే పొరలు; భూతంబులు= భూమి, నీరు, అగ్ని, గాలి, ఆకాశం అనే భూతాలు; ఐదు= అయిదును; బుద్ధి= బుద్ధియు; మనస్= మనస్సూ; అహంకృతులును= అహంకారం; ఎనిమిది= ఈ మొత్తం ఎనిమిదీ; ప్రంగలు= కొమ్మలు; రంధ్రములు తొమ్మిదియున్= తొమ్మిది రంధ్రాలు; కోటరములు= చెట్టు తొర్రలు; ప్రాణ= ప్రాణమనెడి; పత్త్ర, దశకంబు= ఆకులు పది; జీవ= జీవుడు; ఈశ= ఈశ్వరుడు; పక్షియుగమున్= పక్షులజంటను; కలుగు= కలిగినట్టి; సంసారవృక్షంబున్= సంసారమనెడి వృక్షమును; కలుగన్+చేయన్= సృష్టించడానికి; కావన్= రక్షించడానికీ; అడఁగింపన్= నశింపచేయడానికీ; ఒక్కరుఁడవు= ఒకే ఒక్కడివి; నీవు+అ= నీవే; రాజవు= ప్రభువవు.

**తా :** మూలప్రకృతి పాదుగా, సుఖదుఃఖాలు రెండు ఫలాలుగా; సత్త్వరజస్తమోగుణాలు మూడు వేళ్ళుగా, ధర్మార్థకామమోక్షాలుగా చెప్పబడే పురుషార్థాలు నాలుగు రసాలుగా, శబ్దస్పర్శరూపరసగంధాలను తెలుసుకొనే చెవి, చర్మం, కన్ను, నాలుక, ముక్కు-అయిదు ఇంద్రియాలుగా-జ్ఞానేంద్రియాలుగా, కామ, క్రోధ, లోభ, మోహ, మదమాత్సర్యాలనే ఆరు స్వభావాలుగా, ఆకలి, దప్పిక, శోకం, మోహం, ముసలితనం, మరణం అనే ఆరు ఊర్ములుగా, రసం, రక్తం, మాంసం, మేదస్సు, అస్థి, మజ్జ, శుక్రం అనే ఏడుధాతువులు పైపొరలుగా, భూమి, నీరు, అగ్ని, వాయువు, ఆకాశం అనే భూతాలు అయిదు, బుద్ధీ, మనస్సూ, అహంకారం అనేవి మూడు - మొత్తం ఎనిమిదీ కొమ్మలుగా, రెండుకళ్ళు, రెండుచెవులు, ముక్కురంధ్రాలు రెండు, నోరు, మలమూత్రద్వారాలు రెండు - మొత్తం తొమ్మిది రంధ్రాలు చెట్టుతొర్రలుగా, ప్రాణాపానవ్యానోదానసమానాలనే పంచప్రాణాలు, నాగ, కూర్మ, కృకర, దేవదత్త, ధనంజయాలనే అయిదు ఉపప్రాణాలు మొత్తం పదిప్రాణాలు - ఆకులుగా, జీవుడు, ఈశ్వరుడు పక్షులజంటగా ఉండే సంసారవృక్షాన్ని - పుట్టించటానికీ, రక్షించటానికీ, నశింపచేయటానికీ ప్రభువవు నీ వొక్కడివే!

**విశే :** సామాన్య దృష్టికి ఇంత అద్భుతమైన ఈ సంసారమహావృక్షాన్ని సృష్టించేది బ్రహ్మ అనీ, రక్షించేది విష్ణువనీ, లయం చేసేది శివుడనీ అనిపిస్తుంది. కాని, తాత్త్వికంగా / లోతుగా చూస్తే ఉన్నది ఒక్కపరమాత్మే - "ఏకం సత్" పరమాత్మ నామరూప గుణాలు లేనివాడు. ఆయన తనంత తానుగా గుణాత్మకుడు - త్రిగుణాత్మకుడు - అయినపుడు సృష్టి, స్థితి, లయాలు జరుగుతున్నాయి. అందుకే "సంసారవృక్షంబు గలుగఁజేయఁ, గావ, నడఁగింప రాజ వొక్కరుఁడ వీవ" అని చెప్పటం జరిగింది.

**క. నీదెసఁ దనుచిత్తము లిడి, యే దెసలకుఁ బోక కడతు రెఱుక గలుగు వా,**
**రాదూడయడుగుక్రియ నీ, పాదం బనునావకతన భవసాగరమున్. 92**

**ప్రతి :** ఎఱుక= జ్ఞానం; కలుగువారు= ఉండేవారు; ఏ, దెసలకున్= ఏ దిక్కులకును; పోక= వెళ్ళకుండ; నీ దెసన్= నీ యందే; తను, చిత్తములు= దేహాన్ని, మనస్సును; ఇడి= ఉంచి; భవసాగరమున్= సంసారమనెడి సముద్రాన్ని; నీ, పాదంబు+అను= నీ పాదం అనే; నావకతనన్= ఓడ కారణంగా; ఆ దూడ= ఆవుదూడయొక్క; అడుగుక్రియన్= అడుగువలె; కడతురు= దాటుతారు.

**తా :** జ్ఞానులైనవారు ఏది సత్యమో, ఏది నిత్యమో తెలిసినవారు ఏ వైపునకు వెళ్ళకుండా, తమ దేహాన్ని, మనస్సును నీయందే నిలిపి, సంసారమనే సముద్రాన్ని నీ పాదమనే నావ ఆధారంగా, ఆవుదూడ అడుగును దాటినంత సులభంగా దాటగలుగుతారు.

**విశే :** మనస్సును అన్యమైన వానివైపు పోనీయకుండా, పరమాత్మయందే లగ్నం చేయుట–అనన్య భక్తి.

సంసారసాగరాన్ని దాటటానికి, మోక్షాన్ని పొందటానికి ఈ అనన్యభక్తే అద్భుతసాధనం.

**ఆ. మంచివారి కెల్ల మంగళప్రద లయ్యుఁ, గల్లరులకు మేలుగానియట్టి**
**తనువు లెన్నియైనఁ దాల్చి లోకములకు, సేమ మెల్లప్రొద్దుఁ జేయు దీవు. 93**

**ప్రతి :** మంచివారికి= గుణవంతులకు; ఎల్లన్= అందరికి; మంగళప్రదలు+అయ్యున్= శుభం చేకూర్చేటేవి అయినా; కల్లరులకు= దుష్టులకు; మేలు= శుభం; కాని+అట్టి= కానటువంటి; తనువులు= శరీరాలు; ఎన్ని+ఐనన్= ఎన్నింటినైనను; తాల్చి= ధరించి; లోకములకున్= ప్రజలకు; ఎల్లప్రొద్దున్= అన్నివేళల్లో; ఈవు= నీవు; సేమము= క్షేమాన్ని; చేయుదు(వు)= కలిగిస్తావు.

**తా :** నీవు సజ్జనులకు మేలు, దుర్జనులకు కీడు కలిగించే అనేకశరీరాలు ధరించి, అన్నివేళల్లో లోకానికి క్షేమాన్ని కలుగ చేస్తూనే ఉంటావు.

**క. ఎఱిఁగినవారల మనుచును, గొఱమాలినయెఱుక లెఱిఁగి కొందఱు నీ పే**
**రెఱిఁగియుఁ దలఁపఁగ నొల్లరు, పఱతు రధోగతులజాడఁ బద్మదళాక్షా! 94**

**ప్రతి :** పద్మదళ+అక్షా!= తామరరేకులవంటి కన్నులు కల శ్రీహరీ!; కొందఱు= కొంతమంది; ఎఱిఁగినవారలము= తెలిసినవాళ్లం; అనుచును= అంటూ; కొఱమాలిన= పనికిమాలిన; ఎఱుకలు= విషయజ్ఞానాలు; ఎఱిఁగి= తెలుసుకొని; నీపేరు= నీ నామాన్ని; ఎఱిఁగియున్= తెలిసికొనికూడా; తలఁపన్+కన్= తలంచడానికి; ఒల్లరు= ఇష్టపడరు; అధోగతుల జాడన్= క్రిందికి పడిపోయినవారి వలె; పఱతురు= పరుగు పరుగున పోతారు.

**తా :** కొందరు తాము అన్నీ తెలిసినవాళ్ల మనుకొని, పనికిమాలిన విషయాలు తెలుసుకొని, నీ నామమాహాత్మ్యం తెలిసికూడ నామసంకీర్తనం చెయ్యరు. అధోగతిపాలైనవారిమార్గంలోనే తామూ పరుగులు పెడతారు. (నీచజన్మ లెత్తి మహాదుఃఖాల పాలవుతారని భావం)

**క. నీవారై నీ దెసఁ దమ, భావంబులు నిలిపి ఘనులు భయవిరహితులై**
**యే విఘ్నంబులఁ జెందక, నీ వఱలెడిమేటిచోట నెగడుదు రీశా! 95**

**ప్రతి :** ఈశా= ప్రభూ! ఘనులు= జ్ఞానులైన గొప్పవారు; నీవారు+ఐ= నీ సంబంధులై; నీదెసన్= నీ వైపే; తమ భావంబులు= తమ తలపులు; నిలిపి= నిలిపి ఉంచి; భయవిరహితులు+ఐ= భయమే లేనివారై; ఏ, విఘ్నంబులన్= ఏ అడ్డంకులూ; చెందకన్= పొందక; నీవు+వఱలెడి= నీవు ఉండేటి; మేటిచోటన్= ఉన్నతమైన స్థానంలో; నెగడుదురు= వర్ధిల్లుతారు.

**తా :** ప్రభూ! గొప్పవారు నీవారై, తమ హృదయాల్ని నీయందే నిలిపి, జననమరణ భయం లేనివాళ్లై, ఏ అడ్డంకులూ లేక, ఉన్నతోన్నత స్థానమైన పరమపదంలో వర్ధిల్లుతూ ఉంటారు.

**క. నిను నాలుగాశ్రమంబుల, జనములు సేవింప నఖిలజగముల సత్త్వం**
**బును శుద్ధంబును శ్రేయం, బును ననుగాత్రంబు నీవు వొందుదువు హరీ! 96**

**ప్రతి :** హరీ= ఓ విష్ణుమూర్తీ!; నినున్= నిన్ను; నాలుగు+ఆశ్రమంబుల= బ్రహ్మచర్యం, గార్హస్థ్యం, వానప్రస్థం, సన్న్యాసం అనునాలుగు ఆశ్రమాలకు సంబంధించిన; జనములు= ప్రజలు; సేవింపన్= కొలువగా; అఖిల, జగములన్= అన్ని లోకాలలో; సత్త్వంబును= సాత్త్వికమైంది, శుద్ధంబున్= పరిశుద్ధమైంది; శ్రేయంబును= క్షేమాలను చేకూర్చేది; అను= అని చెప్పదగిన; గాత్రంబును= శరీరాన్ని; నీవు+పొందుదువు= నీవు పొందుతావు.

**తా :** ఓ విష్ణుమూర్తీ! బ్రహ్మచారులు, గృహస్థులు, వానప్రస్థులు, సన్న్యాసులు అనే నాలుగుఆశ్రమాలప్రజలు నిన్ను సేవిస్తుండగా, అన్నిలోకాల్లో సత్త్వమయం, పరిశుద్ధం, క్షేమంకరం అయిన దేహాన్ని నీవు పొందుతావు.

**విశే :** హరి అంటే భక్తుల పాపాలను హరించువాడు. "హరి యను రెండక్షరములు, హరియించును పాతకంబు" అని కదా కృష్ణశతక పద్యం చెపుతూ ఉంది!

**సీ. నలినాక్ష! సత్త్వగుణంబు నీ గాత్రంబు గాదేని విజ్ఞానకలిత మగుచు**
**నజ్ఞానభేదకం బగు టెట్టు? గుణములయందును వెలుఁగ నీ వనుమతింపఁ**
**బడుదువు, సత్త్వరూపంబు సేవింపంగ సాక్షాత్కరింతువు సాక్షి వగుచు**
**వాఙ్మనసముల కవ్వలిదైనమార్గంబు గలుగు, నీ గుణజన్మకర్మరహిత**

**తే. మైనరూపును బేరు నత్యనఘబుద్ధు, లెఱుఁగుదురు, నిన్నుఁ గొల్వ నూహించుకొనుచు**
**వినుచుఁ దలఁచుచుఁ బొగడుచు వెలయువాఁడు, భవము నొందఁడు నీ పాదభక్తుఁ డగును. 97**

**ప్రతి :** నలిన+అక్ష= తామరలవంటి కన్నులు గల శ్రీహరీ!; నీ, గాత్రంబు= నీ దేహం; సత్త్వగుణంబు= సాత్త్వికం; కాదు+ఏనిన్= కాకపోయిందైతే; విజ్ఞాన= విశిష్టమైన జ్ఞానంతో, బ్రహ్మజ్ఞానంతో; కలితము= కూడింది; అగుచున్= అవుతూ; అజ్ఞాన= అజ్ఞానాన్ని; భేదకము= తొలగించేది; అగుట+ఎట్టు= ఎలా అవుతుంది?; గుణముల+అందును= రజోగుణ తమోగుణాలందును; వెలుఁగన్= ప్రకాశించుటకు; నీవు అనుమతింపన్+పడుదువు= నీవు సమ్మతింతువు; సత్త్వరూపంబున్= సత్త్వగుణమయమైన నీ నిజస్వరూపాన్ని; సేవింపన్+కన్= ఆరాధించితే; సాక్షివి= చూచుచున్నవాడవు; అగుచున్= అవుతూ; సాక్షాత్కరింతువు (సాక్షాత్కరించుదువు)= ప్రత్యక్షమవుతావు; వాక్= మాటలకు; మనసములకు= మనస్సులకు; అవ్వలిది+ఐన= అవతలిదైన; మార్గంబున్= త్రోవను; కలుగు= కలిగినట్టి; గుణ= గుణములు; జన్మ= పుట్టుకలు; కర్మ= కర్మలు;

రహితము+ఐన= లేనట్టిదైన; నీ= నీ యొక్క; రూపును= రూపాన్ని; పేరున్= నామాన్ని; అతి+అనఘ, బుద్ధులు= మిక్కిలి నిర్మలమైన బుద్ధిగలవారు; ఎఱుఁగుదురు= తెలుసుకొంటారు; నిన్నున్= నిన్ను; కొల్వన్= సేవించడానికి; ఊహించుకొనుచున్= యోచనచేస్తూ; వినుచున్= (నిన్నుగూర్చి) వింటూ; తలఁచుచున్= నిన్ను ధ్యానిస్తూ; పొగడుచున్= స్తుతిస్తూ; వెలయువాఁడు= ప్రకాశించేవాడు; భవమున్= పుట్టుకను; ఒందఁడు= పొందడు; నీ= నీ యొక్క; పాద= పాదాలందు; భక్తుఁడు+అగును= భక్తికలవాడు అవుతాడు.

**తా :** శ్రీహరీ! నీవు సత్త్వస్వరూపుడివి. అలా కాకుంటే నీ దేహం విజ్ఞానాన్ని కలిగించేది, అజ్ఞానాన్ని తొలగించేది ఎలా అవుతుంది? రజస్తమో గుణాల్లోకూడ నీవు ప్రకాశిస్తుంటావు. కాని, సత్త్వమయమైన నీ సహజస్వరూపాన్ని సేవిస్తేనే సాక్షివై నీవు సాక్షాత్కరిస్తావు. మాటకు, మనస్సుకు అతీతమైన మార్గంలో–గుణాలు, జన్మలు, కర్మలు లేనట్టి నీ రూపాన్ని, నీ నామాన్ని మహాత్ములు తెలుసుకొంటారు. నిన్ను భావించుకొంటూ, నిన్ను గూర్చి వింటూ, నిన్ను ధ్యానించుకొంటూ, నిన్ను స్తుతించుకొంటూ ప్రకాశించే వ్యక్తి జన్మరాహిత్యాన్ని పొందుతాడు. నీ పాదభక్తుడౌతాడు.

**క. ధరణీభారము వాసెను, బురుషోత్తమ! యీశ! నీదుపుట్టువున, భవ**
**చ్చరణాంబుజములప్రాపున, ధరణియు నాకసముఁ గాంచెదము నీ కరుణన్. 98**

**ప్రతి :** పురుష+ఉత్తమ= పురుషులలో శ్రేష్ఠుడవైన శ్రీహరీ!; ఈశ= ప్రభూ!; నీదు= నీయొక్క; పుట్టువునన్= పుట్టుకచేత; ధరణీభారము= భూభారం; పాసెను= తొలగిపోయింది; భవత్= మీయొక్క; చరణ+అంబుజముల= పాదపద్మాల; ప్రాపునన్= అండతో; నీ, కరుణన్= నీ దయతో; ధరణియున్= భూమినీ; ఆకసమున్= ఆకాశాన్నీ; కాంచెదము= చూడగలం.

**తా :** ఓ పురుషోత్తమా! ఓ ఈశ్వరా! నీవు జన్మించటంవల్ల భూభారం తొలగిపోయింది. నీ పాదపద్మాలు ఆదరువుగా నీ దయతో భూమ్యాకాశాలను పూర్తిగా చూడగలం.

**విశే :** ద్వాపరం నాటికే దుష్టులసంఖ్య భూమిమీద పెరిగింది. భూదేవి వాళ్ళను భరించలేని స్థితి ఏర్పడింది. దుష్ట సంహరణార్థం శ్రీహరి అవతరణ జరగాలి. అప్పుడే భూభారం తగ్గుతుంది.

**ఉ. పుట్టువు లేని నీ కభవ! పుట్టుట క్రీడయ కాక పుట్టుటే?**
**యె ట్టనుడున్ భవాదిదశ లెల్లను జీవులయం దవిద్య దాఁ**
**జుట్టుచు నుండుఁగాని నినుఁ జుట్టినదింబలెఁ బొంత నుండియుం**
**జుట్టఁగ లేమిఁ దత్క్రియలఁ జొక్కనియెక్కటి వౌదు వీశ్వరా! 99**

**ప్రతి :** అభవ= పుట్టుకలేనివాడా!; పుట్టువు లేని= పుట్టుకే లేని; నీకున్= నీకు; పుట్టుట= పుట్టడం; క్రీడయకాక= వినోదం మాత్రమేకదా; పుట్టుట+ఏ= (నిజంగా) పుట్టడమా? ఎట్టు+అనుడున్= ఎలా అంటే; భవ+ఆది= పుట్టుకమొదలైన; దశలు+ఎల్లను= స్థితులు అన్నీ; జీవుల+అందు= ప్రాణులందు; అవిద్య= అజ్ఞానం, మాయ; తాన్= ఆ మాయ; చుట్టుచున్= చుట్టుకొంటూ; ఉండున్+కాని= ఉంటుందికాని; నినున్= నిన్ను; చుట్టినదింబలెన్= చుట్టుకొన్నదానివలె; పొంతన్= చెంతనే; ఉండియున్= ఉండీకూడా; చుట్టఁగలేమిన్= చుట్టుకొనలేక పోవుటచేత; ఈశ్వరా= ఓ ప్రభూ!; తత్+క్రియలన్= ఆ పనులందు; చొక్కని= మోహంలేని; ఎక్కటివి= ఒంటరివాడివి; ఔదువు= ఔతావు.

**తా :** పుట్టడం, పెరుగడం, మరణించడం, మొదలైన వికారాలు ఏవీ లేని నీవు పలుమార్లు పుట్టటం అంటే, అది కేవలం నీకు ఒక క్రీడేగాని, నిజంగా నీవు పుట్టటమా? పుట్టడం, పెరుగడం, మరణించడం మొదలైన దశలన్నీ మాయ. ఆ మాయ జీవులనన్నింటినీ ఆవరించి ఉంటుంది. కానీ, ఆ మాయ నిన్నుకూడా చుట్టుకొన్నట్లు నీ చెంతనే ఉన్నా, నిన్ను ఆవరించే శక్తి దానికి లేదు. సర్వేశ్వరా! ఆ మాయామయాలైన క్రియల్లో ఏ వ్యామోహం లేని– 'ఏకో నారాయణో హరిః' అన్నట్లు ఒంటరివాడవు నీవు మాత్రమే!

**మ. గురుపాఠీనమవై జలగ్రహమవై కోలంబవై శ్రీనృకే**
**సరివై భిక్షుఁడవై హయాననుఁడవై క్ష్మాదేవతాభర్త వై**
**ధరణీనాథుఁడవై దయాగుణగణోదారుండవై లోకముల్**
**పరిరక్షించిన నీకు మ్రొక్కెద, మిలాభారంబు వారింపవే! 100**

**ప్రతి :** గురు= గొప్ప; పాఠీనమవు+ఐ= చేపవై; జలగ్రహమవు+ఐ= తాబేలువై; కోలంబవు+ఐ= వరాహమై; శ్రీనృకేసరివి+ఐ= లక్ష్మీనరసింహుడవై; భిక్షుఁడవు+ఐ= భిక్షను అడిగే వామనుడవై; హయ+ఆననుఁడవు+ఐ= హయగ్రీవుడవై; క్ష్మాదేవతాభర్తవు+ఐ= బ్రాహ్మణ (భూసుర) ప్రభువువై; ధరణీనాథుఁడవు+ఐ= భూమికి రాజువై; దయాగుణగణ+ ఉదారుండవు+ఐ= దయ మొదలైన సుగుణసమూహాలతో గొప్పవాడవై; లోకముల్= లోకాలను; పరిరక్షించిన= కాపాడిన; నీకున్= నీకు; మ్రొక్కెదము= నమస్కరిస్తాము; ఇలా భారంబు= భూభారాన్ని; వారింపవు+ఏ= తగ్గించవా?

**తా :** మత్స్య, కూర్మ, వరాహ, నారసింహ, వామన, హయగ్రీవ, పరశురామ, శ్రీరామావతారాలెత్తి, దుష్టులబారినుండి దయతో లోకాలను కాపాడిన నీకు మ్రొక్కుతాము. ఇప్పుడు భూభారాన్ని తొలగించు స్వామీ!

**క. ముచ్చిరి యున్నది లోకము, నిచ్చలుఁ గంసాదిఖలులు నిర్దయు లేఁచన్,**
**మచ్చిగఁ గావఁగవలయును, విచ్చేయుము తల్లికడుపువెడలి ముకుందా! 101**

**ప్రతి :** ముకుందా!= ఓ విష్ణుమూర్తీ; నిర్దయులు= దయలేనివారు; కంస+ఆది= కంసుడు మొదలైన; ఖలులు= దుర్మార్గులు; నిచ్చలున్= ఎల్లప్పుడు; ఏఁచన్= బోధించగా; లోకము= జగము; ముచ్చిరి+ఉన్నది= దుఃఖంతో ఉంది; మచ్చిగన్= ప్రీతితో; కావఁగవలయును= కాపాడాలి; తల్లికడుపువెడలి= తల్లిగర్భంనుండి బయటపడి; విచ్చేయుము= రమ్ము.

**తా :** ముకుందా! దయలేని దుర్మార్గులు కంసాదులు విజృంభించి ఎల్లప్పుడు బాధించటంవల్ల లోకం దుఃఖంలో మునిగి ఉంది. ప్రీతితో దీన్ని కాపాడాల్సిన అవసరం ఉంది. తల్లి కడుపునుండి వెడలిరా స్వామీ!

**వ. అని మఱియు దేవకీదేవిం గనుంగొని 102**

**ప్రతి :** అని= అని పలికి; మఱియున్= ఇంకా; దేవకీదేవిన్= దేవకీదేవిని; కనుంగొని= చూచి...

**తా :** అని పలికిన తర్వాత దేవకీదేవిని చూస్తూ

**మత్త. తల్లి! నీ యుదరంబులోనఁ బ్రధానపూరుషుఁ దున్న వాఁ**
**డెల్లి పుట్టెడిఁ,గంసుచే భయ మింత లేదు, నిజంబు, మా**

**కెల్లవారికి భద్రమయ్యెడు, నింక నీ కడు పెప్పుడుం**
**జల్లగావలె యాదవావళి సంతసంబునఁ బొంగఁగన్. 103**

**ప్రతి :** తల్లి= ఓ దేవకీదేవీ!; నీ, ఉదరంబులోనన్= నీ కడుపులో; ప్రధానపూరుషుఁడు= శ్రీమహావిష్ణువు; ఉన్నవాఁడు= ఉన్నాడు; ఎల్లి= రేపు; పుట్టెడిన్= పుడతాడు; కంసుచేన్= కంసునిచేత; భయము= భీతి; ఇంత= కొద్దిగాకూడ; లేదు= ఉండదు; నిజంబు= ఇది సత్యం; మాకున్+ఎల్లవారికిన్= మా అందరికి; ఇంకన్= ఇక మీదట; భద్రము+అయ్యెడున్= శుభం కలుగుతుంది; నీ కడుపు= నీ గర్భం; ఎప్పుడున్= ఎల్లప్పుడు; యాదవ+ఆవళి= యాదవులసమూహం; సంతసంబునన్= సంతోషంతో; పొంగన్+కన్= ఉప్పొంగగా; చల్ల గావలెన్= చల్లగా ఉండాలి.

**తా :** అమ్మా! దేవకీదేవీ! నీ గర్భంలో ఆదిపురుషుడైన శ్రీమహావిష్ణువు ఉన్నాడు. రేపు జన్మిస్తాడు. కంసునివల్ల ఏ మాత్రం భయం లేదు. ఇది నిజం. ఇకముందు మా అందరికి శుభం కలుగుతుంది. యాదవులంతా సంతోషంతో పొంగిపోగా ఎల్లప్పుడు నీ కడుపు చల్లగా ఉండాలి (నీవు సుఖంగా ప్రసవించాలి – అని భావం)

**వ. అని యి వ్విధంబున హరిం బొగడి దేవకీదేవిని దీవించి దేవత లీశానబ్రహ్మల మున్నిడుకొని చని, రంత- 104**

**ప్రతి :** అని ఈ+విధంబునన్= అంటూ ఈ విధంగ; హరిన్= విష్ణుమూర్తిని; పొగడి= స్తుతించి; దేవకీదేవినిన్= దేవకిని; దీవించి= ఆశీర్వదించి; దేవతలు= దేవతలు; ఈశాన, బ్రహ్మలన్= శివుణ్ణీ, బ్రహ్మను; మున్ను+ఇడుకొని= ముందుంచుకొని; చనిరి= వెళ్ళిపోయారు; అంతన్= ఆ తరువాత...

**తా :** అని ఈ విధంగా దేవతలు విష్ణుమూర్తిని స్తుతించి, దేవకీదేవిని దీవించి, శివుడు, బ్రహ్మ ముందు నడువగా తమ తమ స్థానాలకు వెళ్ళారు. తరువాత.

## ✤ శ్రీ కృష్ణావతార ఘట్టము ✤

**క. పంకజముఖి నీ ళ్ళాడను, సంకటపడ ఖలుల మానసంబుల నెల్లన్**
**సంకటము దోఁచె, మెల్లన, సంకటములు లేమి దోఁచె సత్పురుషులకున్. 105**

**ప్రతి :** పంజముఖి= పద్మంవంటి ముఖంగల దేవకీదేవి; నీళ్ళు+ఆడను= ప్రసవించుటకు; సంకటపడన్= వేదనపొందగా; ఖలుల= దుర్మార్గుల; మానసంబులన్+ఎల్లన్= మనస్సులందంతటను; సంకటము= బాధ; తోఁచెన్= అగుపించెను; సత్పురుషులకున్= మంచివారికి; మెల్లనన్= క్రమక్రమంగా; సంకటములు= బాధలు; లేమి= లేకుండుట; తోఁచెన్= కన్పించెను.

**తా :** దేవకీదేవి ప్రసవవేదన పడుతుండగా దుర్జనుల మనస్సుల్లో బాధ కలగటం, సజ్జనుల్లో బాధలు తొలగటం అగుపించింది.

**సీ. స్వచ్ఛంబులై పొంగె జలరాసు లేడును గలఘోషణముల మేఘంబు లుఱిమె,**
**గ్రహతారకలతోడ గగనంబు రాజిల్లె దిక్కులు మిక్కిలి తెలివిఁ దాల్చెఁ**
**గమ్మని చల్లని గాలి మెల్లన వీచె, హోమానలంబు చెన్నొంది వెలిఁగెఁ**
**గొలఁకులు కమలాళికులములై సిరి నొప్పెఁ, బ్రవిమలతోయలై పాఱె నదులు,**

**తే. వరపుర గ్రామఘోషయై వసుధ యొప్పె, విహగరవపుష్పఫలముల వెలసె వనము,**
**లలరుసోనలు గురిసి ర య్యమరవరులు దేవదేవుని దేవకీదేవి గనఁగ. 106**

**ప్రతి :** దేవకీదేవి= దేవకి; దేవదేవునిన్= దేవతలకు దేవుడైన శ్రీకృష్ణుణ్ణి; కనన్+కన్= ప్రసవించగానే; జలరాసులు+ఏడును= సముద్రాలు ఏడూ; స్వచ్ఛంబులు+ఐ= తేటనీళ్ళుకలవై; పొంగెన్= పొంగినవి; మేఘంబులు= మబ్బులు; కల= అవ్యక్త మధురమైన; ఘోషణములన్= శబ్దాలతో; ఉఱిమెన్= గర్జించాయి; గగనంబు= ఆకాశం; గ్రహ, తారకలతోడన్= గ్రహాలతో, నక్షత్రాలతో; రాజిల్లెన్= ప్రకాశించింది; దిక్కులు= దిశలు; మిక్కిలి= ఎక్కువైన; తెలివిన్= కాంతిని; తాల్చెన్= ధరించాయి; కమ్మని= సువాసనకల; చల్లనిగాలి= చల్లని వాయువు; మెల్లనన్+వీచెన్= మెల్లగా వీచింది; హోమ+అనలంబు= హోమంలోని అగ్ని; చెన్ను+ఒంది= చూడ ముచ్చట గొలుపునదై; వెలిఁగెన్= ప్రకాశించింది; కొలఁకులు= సరస్సులు; కమల= తామరల; అళి= తుమ్మెదల; కులములు+ఐ= సమూహాలుకలవై; సిరిన్= శోభతో; ఒప్పెన్= కళకళలాడాయి; నదులు= ఏరులు; ప్రవిమల= మిక్కిలి నిర్మలములైన; తోయలు+ఐ= నీళ్ళుకలవై; పాఱెన్= ప్రవహించాయి; వసుధ= భూమి; వర= శ్రేష్ఠములైన; పుర= పట్టణాలు; గ్రామ= పల్లెలు; ఘోష+ఐ= ఆలమందలు, గొప్ప పల్లెలుకలదై; ఒప్పెన్= అందంగా ఉన్నాయి; వనములు= అడవులు, తోపులు; విహగ= పక్షుల; రవ= ధ్వనులతో; పుష్ప= పూవులతో; ఫలములన్= పండ్లతో; వెలసెన్= ఒప్పాయి; ఆ+అమరవరులు= ఆ దేవతాశ్రేష్ఠులు; అలరు= పూలయొక్క; సోనలు= వానలు; కురిసిరి= కురిపించారు.

**తా :** దేవకీదేవి దేవదేవుడైన శ్రీకృష్ణుణ్ణి ప్రసవించగానే, సప్తసముద్రాలు స్వచ్ఛజలాలతో ఉప్పొంగాయి. మేఘాలు మనోహరధ్వనులతో గర్జించాయి. ఆకాశం గ్రహాలతో, నక్షత్రాలతో ప్రకాశించింది. దిక్కులు మిక్కిలి కాంతితో వెలిగాయి. చల్లనిగాలి కమ్మనివాసనలతో అల్లన వీచింది. హోమాగ్నులు చూడముచ్చటగ వెలిగాయి. కొలనులు తామరలతో, తుమ్మెదలతో శోభాయమానంగా కళకళలాడాయి. నదులు మిక్కిలి నిర్మలమైన నీటితో ప్రవహించాయి. భూమి శ్రేష్ఠాలైన నగరాలతో, పల్లెలతో, ఆలమందలుగల ఊళ్లతో అలరారింది. అడవులు, ఉద్యానవనాలు పక్షుల కిలకిలారావాలతో, పూలతో, పండ్లతో శోభిల్లాయి. దేవతా శ్రేష్ఠులందరు పూలవానలు కురిపించారు.

**విశే :** దుష్టులను శిక్షించటానికి, శిష్టులను రక్షించటానికి, భూభారం తగ్గించటానికి పరమాత్మ అవతరించగానే ప్రకృతి మొత్తం ఆనందంతో ఉప్పొంగింది.

**క. పాడిరి గంధర్వోత్తము, లాడిరి రంభాదికాంత, లానందమునం**
**గూడిరి సిద్ధులు, భయముల, వీడిరి చారణులు, మొరసె వేల్పులభేరుల్. 107**

**ప్రతి :** గంధర్వ+ఉత్తములు= గంధర్వులలో శ్రేష్ఠులైనవారు; పాడిరి= పాటలు పాడారు; రంభ+ఆది= రంభమొదలైన; కాంతలు= స్త్రీలు; ఆడిరి= నాట్యం చేశారు; సిద్ధులు= సిద్ధులు; ఆనందమునన్= సంతోషంతో; కూడిరి= సమావేశమయ్యారు; చారణులు= చారణులు; భయములు= భయాలను; వీడిరి= వదలారు; వేల్పుల= దేవతల; భేరుల్= నగారాలు; మొరసెన్= మ్రోగాయి.

**తా :** గంధర్వశ్రేష్ఠులు (విశ్వావస చిత్రసేనాదులు) ఆనందంతో గానం చేశారు. రంభ మొదలైన అప్సరసలు నాట్యం చేశారు. సిద్ధులు సంతోషంతో సమావేశ మయ్యారు. చారణులు నిర్భయులయ్యారు. దేవతల భేరులు మ్రోగాయి.

**వ. అయ్యవసరంబున. 108**

**ప్రతి :** ఆ+అవసరంబునన్= ఆ సమయంలో...

**తా :** ఆ వేళలో

**క. సుతుఁ గనె దేవకి నడురే, యతిశుభగతిఁ దారలును గ్రహంబులు నుండన్**
**దితిసుతనిరాకరిష్ణున్, శ్రితవదనాలంకరిష్ణు జిష్ణున్ విష్ణున్. 109**

**ప్రతి :** అతి= మిక్కిలి; శుభగతిన్= మంచి ఫలాలు ఇచ్చే వర్తనంతో; తారలును= నక్షత్రాలును; గ్రహంబులున్= గ్రహాలును; ఉండన్= ఉండగా; దితిసుత= దితికొడుకులైన రాక్షసులను; నిరాకరిష్ణున్= తిరస్కరించేవాణ్ణి; శ్రిత= ఆశ్రయించిన వారియొక్క (భక్తులయొక్క); వదన= ముఖాలను; అలంకరిష్ణున్= అలంకరించేవాణ్ణి (వికసింపచేసేవాణ్ణి); జిష్ణున్= జయశీలుణ్ణి; విష్ణున్= విష్ణుమూర్తిని; సుతున్= కొడుకును; నడురేయిన్= అర్ధరాత్రివేళలో; దేవకి కనెన్= దేవకి ప్రసవించింది.

**తా :** అశ్విని మొదలైన నక్షత్రాలు, సూర్యచంద్రాది గ్రహాలు మిక్కిలి శుభఫలాల నిచ్చేరీతిగ సంచరిస్తుండగా, రాక్షసులను తల్లడిల్ల చేసేవాడు, భక్తులముఖాలకు వికాసం కలిగించేవాడు, శత్రువులను గెల్చే స్వభావం కలవాడు, అన్నిలోకాల వెలుపల, లోపల వ్యాపించి ఉండేవాడు అయిన విష్ణుమూర్తిని కుమారునిగ దేవకీదేవి అర్ధరాత్రిసమయంలో ప్రసవించింది.

**క. వెన్నుని నతిప్రసన్నునిఁ, గ్రన్నన గని మెఱుఁగుఁబోఁడి గడు నొప్పారెం**
**బున్నమనాఁడు కళానిధిఁ, గన్న మహేంద్రాశచెలువు గలిగి నరేంద్రా! 110**

**ప్రతి :** నర+ఇంద్రా!= ఓ పరీక్షిన్మహారాజా!; మెఱుఁగున్+బోఁడి= మెరుపువలె అందమైన స్త్రీ, దేవకీదేవి; అతి= మిక్కిలి; ప్రసన్నునిన్= దయగలవాణ్ణి; వెన్నునిన్= విష్ణుమూర్తిని; క్రన్ననన్= శీఘ్రంగా; కని= ప్రసవించి; పున్నమనాఁడు=పూర్ణిమరోజు; కళానిధిన్= చంద్రుణ్ణి; కన్న= కనినట్టి; మహేంద్ర+ఆశ= తూర్పుదిక్కుయొక్క; చెలువు= అందం; కలిగి= కలదై; కడున్= మిక్కిలి; ఒప్పారెన్= ప్రకాశించింది.

**తా :** ఓ పరీక్షిన్మహారాజా! మెరపు తీగవంటి దేవకీదేవి భక్తులపట్ల అపారదయగల విష్ణుమూర్తిని సునాయాసంగా ప్రసవించి, పున్నమినాటిచంద్రుణ్ణి కన్న తూర్పుదిక్కువలె ఎంతో ప్రకాశించింది.

**వ. అప్పుడు. 111**

**ప్రతి :** అప్పుడు= ఆ సమయంలో...

**తా :** ఆ వేళలో

**సీ. జలధరదేహు నాజానుచతుర్బాహు సరసీరుహాక్షు విశాలవక్షుఁ**
**జారుగదాశంఖచక్రపద్మవిలాసుఁ గంఠకౌస్తుభమణికాంతిభాసుఁ**
**గమనీయకటిసూత్రకంకణకేయూరు శ్రీవత్సలాంఛనాంచితవిహారు**
**నురుకుండలప్రభాయుతకుంతలలలాటు వైదూర్యమణిగణవరకిరీటు**

**తే. బాలుఁ బూర్ణేందురుచిజాలు భక్తలోక, పాలు సుగణాలవాలుఁ గృపావిశాలుఁ**
**జూచి తిలకించి పులకించి చోద్య మంది, యుబ్బి చెలరేఁగి వసుదేవుఁ డుత్సహించె. 112**

**ప్రతి :** వసుదేవుఁడు= వసుదేవుడు; జలధరదేహున్= మేఘంవంటి (నల్లని) శరీరం కలవాణ్ణి; ఆజాను= మోకాళ్ళవరకు పొడవుగాఉన్న; చతుర్+బాహున్= నాలుగుచేతులుగలవానిని; సరసీరుహ+అక్షున్= పద్మాలవంటి కన్నులు గలవాణ్ణి; విశాలవక్షున్= విశాలమైన వక్షఃస్థలంకలవాణ్ణి; చారు= సుందరమైన; గదా= గదయొక్క; శంఖ= శంఖంయొక్క; చక్ర= చక్రాయుధంయొక్క; పద్మ= తామరయొక్క; విలాసున్= వైభవం కలవాణ్ణి; కంఠ= మెడయందలి; కౌస్తుభ= కౌస్తుభమనెడు; మణి= మణియొక్క; కాంతి= ప్రకాశంచేత; భాసున్= వెలుగుతున్నవాణ్ణి; కమనీయ= మనోహరమైన; కటిసూత్ర= మొలత్రాడు; కంకణ= కడియాలు; కేయూరున్= బాహుపురులు కలవాణ్ణి; శ్రీవత్స= శ్రీవత్సమనే; లాంఛన= గుర్తుచేత (పుట్టుమచ్చచేత); అంచిత= సుందరమైన; విహారున్= విహారం కలవాణ్ణి; ఉరు= గొప్ప; కుండల= (చెవులకు ఆభరణాలైన) మకరకుండలాలయొక్క; ప్రభా= కాంతులతో; యుత= కూడుకొన్న; కుంతల= ముంగురులుగల; లలాటున్= నొసలుగలవాణ్ణి; వైదూర్య= వైదూర్యం మొదలైన; మణి= మణుల; గణ= సమూహంతోకూడిన; వర= శ్రేష్ఠమైన; కిరీటున్= కిరీటంగలవాణ్ణి; పూర్ణ+ఇందు= పూర్ణచంద్రుని; రుచిజాలున్= కాంతిసమూహం కలవాణ్ణి; భక్తలోక= భక్తుల సమూహాన్ని; పాలున్= రక్షించేవాణ్ణి; సుగుణ+ఆలవాలున్= మంచిగుణాలకు ఉనికిపట్టయినవాణ్ణి; కృపావిశాలున్= దయ అధికంగా కలవాణ్ణి; బాలున్+చూచి= పసివాణ్ణి (కుమారుని)చూచి; తిలకించి= మెచ్చుకొని; పులకించి= (ఆనందించి) గగుర్పాటునొంది; చోద్యము+అంది= ఆశ్చర్యపడి; ఉబ్బి= ఉప్పొంగి; చెలరేఁగి= అతిశయించి; ఉత్సహించెన్= ఉత్సాహపడింది.

**తా :** మేఘంవంటినల్లనిదేహకాంతి కలవాడు, మోకాళ్ళను తాకే పొడవైన నాలుగుచేతులు కలవాడు, పద్మాలవంటి పెద్దకన్నులు కలవాడు, విశాలమైనవక్షఃస్థలం కలవాడు, అందమైన గదాశంఖచక్ర పద్మాలతో శోభిల్లేవాడు, మెడలోని కౌస్తుభమణి కాంతితో వెలిగేవాడు, మనోహరాలైన మొలత్రాడు, కడియాలు, బాహుపురులు కలవాడు; వక్షఃస్థలంమీద శ్రీవత్సమనే పుట్టుమచ్చ శోభిల్లగా విహరించేవాడు, గొప్పమకరకుండలాల కాంతులతో విరాజిల్లే ముంగురులుగల నుదురు కలవాడు; వైదూర్యాది వజ్రాలు పొదిగిన శ్రేష్ఠమైన కిరీటం ధరించినవాడు, నిండుచంద్రునివలె వెలుగువాడు, భక్తులను కాపాడువాడు, సుగుణాలకు ఉనికిపట్టయినవాడు, అపారకరుణ గలవాడు అయిన బాలకుణ్ణి చూచి వసుదేవుడు ఆనంద పరవశుడయ్యాడు. ఆశ్చర్య చకితుడయ్యాడు. ఉప్పొంగిపోయాడు. మహోత్సాహభరితుడయ్యాడు.

**క. స్నానము సేయఁగ రామిని, నానందరసాబ్ధిమగ్నుఁడై విప్రులకున్**
**ధేనువులం బదివేలను, మానసమున ధారవోసె మఱి యిచ్చుటకున్. 113**

**ప్రతి :** స్నానము+చేయన్+కన్= స్నానంచేయడానికి; రామినిన్= వీలు కానందున; ఆనందరస= ఆనందరసమనే; అబ్ధి= సముద్రంలో; మగ్నుఁడు+ఐ= మునిగినవాడై; విప్రులకున్= బ్రాహ్మణులకు; మఱి= ఇక; ఇచ్చుటకున్= దానం చేయడానికి; ధేనువులన్+పదివేలను= పదివేల గోవులను; మానసమునన్= తన మనస్సునందే; ధార+పోసెన్= ధారా దత్తం చేసాడు.

**తా :** వసుదేవుడు కారాగారంలో ఉన్నందువల్ల స్నానం చేయటానికి అవకాశం లేక ఆనందరససాగరంలో మునిగి, బ్రాహ్మణులకు పదివేలగోవులను దానం ఇవ్వాలని సంకల్పించి, తన మనస్సులోనే వాటిల్ని ధారపోశాడు.

**వ. మఱియు వసుదేవుండు. 114**

**ప్రతి :** మఱియున్= ఇంకను; వసుదేవుండు= వసుదేవుడు...

**తా :** ఇంకా, ఆ వసుదేవుడు

**క.** **ఈ పురిటియింటి కుద్య, ద్దీపంబునుబోలి చాల దీపించి నిజం**
**బీ పాపఁడు నలుమొగముల, యా పాపనిఁ గనినమేటి యగు నని భక్తిన్.** **115**

**ప్రతి :** ఈ పాపఁడు= ఈ బాలుడు; ఈ, పురిటియింటికిన్= పురుడు పోసుకున్న ఈ ఇంటిలో; ఉద్యత్+దీపంబునున్+పోలి= మిక్కిలిగా వెలుగుతున్న దీపంవలె; చాల= ఎక్కువగా; దీపించి= వెలుగుతూ; నలుమొగముల= నాలుగుముఖాలు గల; ఆ పాపనిన్= ఆ బిడ్డను (బ్రహ్మను); కనిన= కన్నట్టి; మేటి= గొప్పవాడు (విష్ణువు); అగున్= అవుతాడు; అని; భక్తిన్= భక్తితో...

**తా :** ఈ పురిటింటికి ఎంతో కాంతిగల దీపంలా వెలుగుతున్న ఈ బాలుడు, ఆ నాలుగుముఖాల పాపడైన బ్రహ్మను కన్న మహానుభావుడే ఈ శ్రీమహావిష్ణువని భక్తితో భావించి

**ఆ.** **చాఁగి మ్రొక్కి లేచి సరగున నొసలిపై, గేలుఁదమ్మిదోయిఁ గీలుకొలిపి**
**పాపఁ డనక వెఱక పాపనిమొదలింటి, పోకలెల్లఁ దలఁచి పొగడఁ దొడఁగె.** **116**

**ప్రతి :** చాఁగి= సాగిలపడి; మ్రొక్కి= నమస్కరించి; లేచి= లేచి నిలబడి; సరగునన్= త్వరగా; నొసలిపైన్= నొసటిమీద; కేలు+తమ్మి+దోయిన్= పద్మాలవంటి రెండు చేతులను; కీలుకొలిపి= చేర్చి; పాపఁడు= బాలుడు; అనక= (అని) అనుకోకుండా; వెఱక= జంకకుండ; పాపని= ఆ బాలునియొక్క; మొదలింటి= పూర్వపు; పోకలు+ఎల్లన్= నడవడికలన్నింటిని; తలఁచి= గుర్తుకు తెచ్చుకొని; పొగడన్= పొగడుటకు; తొడఁగెన్= పూనుకొన్నాడు.

**తా :** సాష్టాంగ నమస్కారంచేసి, లేచి నిలబడి, వెంటనే రెండు చేతులు జోడించి నొసట నిలుపుకొని, పసిబాలుడనీ, తన కుమారుడనీ, వెనుకాడకుండ ఆ బాలుని పూర్వచర్యలన్నీ గుర్తుకు తెచ్చుకొని పొగడడానికి పూనుకొన్నాడు.

**క.** **ఏ నిన్ను నఖిలదర్శను, జ్ఞానానందస్వరూపు సంతతు నపరా**
**ధీనుని మాయాదూరుని, సూనునిఁగాఁ గంటి, నిట్టిచోద్యము గలదే?** **117**

**ప్రతి :** అఖిల= సమస్తాన్ని; దర్శనున్= (సాక్షియై) చూస్తున్నవాణ్ణి; జ్ఞాన+ఆనంద స్వరూపున్= జ్ఞానం, ఆనందం స్వరూపంగా గలవాణ్ణి; సంతతున్= ఎల్లప్పుడు ఉండేవాణ్ణి, అనగా శాశ్వతుణ్ణి; న+పరాధీనునిన్= ఇతరుల అధీనంలో లేనివాణ్ణి, సర్వతంత్ర స్వతంత్రుణ్ణి; మాయాదూరునిన్= మాయకు దూరమైనవాణ్ణి (జనన జరామరణాదులు లేనివాణ్ణి); నిన్నున్= నిన్ను; ఏన్= నేను; సూనునిన్+కాన్= కుమారునిగా; కంటిన్= కన్నాను; ఇట్టి= ఇటువంటి; చోద్యము= వింత; కలదు+ఏ= ఉంటుందా?

**తా :** సాక్షిభూతుడవై సకలలోకాలను చూస్తున్నవాడవు, జ్ఞానానందస్వరూపుడవు, శాశ్వతుడవు, సర్వతంత్రస్వతంత్రుడవు, మాయామయాలైన జననమరణాదులు లేనివాడవు. ఆలాంటి నిన్ను పుత్రునిగా పొందాను. ఇంతకంటే వింత లోకంలో ఇంకొకటి ఏముంటుంది?

**విశే :** భగవంతుడు జ్ఞానానందస్వరూపుడు. అందుకే 'విజ్ఞానం బ్రహ్మేతి వ్యజానాత్'', 'ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్' అని తైత్తిరీయ ఉపనిషత్తు ప్రవచించింది.

**క. అచ్చుగ నీ మాయను మును, జెచ్చెరఁ ద్రిగుణాత్మకముగఁ జేసిన జగముం**
**జొచ్చినక్రియఁ జొరకుందువు, చొచ్చుటయును లేదు, లేదు చొరకుండుటయున్. 118**

**ప్రతి :** మును= మొదట; అచ్చుగ= స్పష్టంగా; నీ మాయను= నీ మాయచేత; చెర+చెరన్= శీఘ్రంగా; త్రిగుణ+ఆత్మకముగన్= మూడుగుణాలు (సత్త్వరజస్తమోగుణాలు) కలదియగునట్లుగా; చేసిన= సృజించిన; జగమున్= జగత్తునందు; చొచ్చినక్రియన్= ప్రవేశించినట్లే; చొరకుందువు= ప్రవేశించకుండా ఉంటావు; చొచ్చుటయును లేదు= ప్రవేశించడం; చొరక+ఉండుటయును లేదు= ప్రవేశించకుండా ఉండడమూ కూడా లేదు.

**తా :** సృష్టికి ముందు ఏదీ లేని స్థితిలో, స్పష్టంగా నీ మాయతో నీవు ఈ త్రిగుణాత్మకమైన జగత్తును సృజించావు. ఇందులో నీవు ప్రవేశించినా, ప్రవేశించనట్లే ఉంటావు. అందువల్ల ఇందులో నీ ప్రవేశం లేదు; నీ ప్రవేశం లేకుండడమూ లేదు.

**సీ. అదియు నెట్లన మహదాదులఁ బోలెడి దై వేఱువేఱయై యన్నివిధము**
**లగు సూక్ష్మభూతంబు లమర షోడశవికారములతోఁ గూడి విరా ట్టనంగఁ**
**బరమాత్మునకు నీకుఁ బఱపైన మేను సంపాదించి యందులోఁ బడియుఁ బడక**
**యుండు సృష్టికి మున్న యున్న కారణమున వానికి లోనిభవంబు గలుగ,**

**ఆ. దట్లు బుద్ధి నెఱుఁగ ననువైనలాగునఁ, గలుగు నింద్రియములకడలనుండి**
**వానిపట్టులేక వరుస జగంబులఁ, గలసియుండి యైనఁ గలయ వెపుడు. 119**

**ప్రతి :** అదియున్= నీ చేత సృజించబడిన ఈ జగత్తులో నీవు ప్రవేశించికూడ ప్రవేశించకుండడం అనేది; ఎట్లు= ఏ విధంగా; అనినన్= అనగా; మహత్+ఆదులన్= మహత్తత్త్వం మొదలగువాటిల్ని; పోలెడిది+ఐ= సరిపోలునట్టిదై; వేఱువేఱు+ఐ= దేనికది ప్రత్యేకమై; అన్నివిధములు+అగు= అన్నివిధాలైన; సూక్ష్మభూతంబులు= సూక్ష్మశక్తులు; అమరన్= ఒప్పుగా; షోడశ= పదునారు; వికారములతోన్= పంచప్రాణాలు మొదలగువానితో; కూడి= చేరి; విరాట్టు+అనన్+కన్= విరాట్టు అనే పేరుతో; పరమాత్మునకున్= ఉన్నతుడైన ఆత్మస్వరూపునికి; నీకున్= పరమాత్ముడివైన నీకు; పరపు= విశాలం; ఐన= అయినట్టి; మేనున్= శరీరాన్ని (జగత్తును); సంపాదించి= కలుగచేసుకొని; అందులోన్= ఆ జగత్తులో; పడియున్= పడి ఉంటూ; పడకయున్= పడకుండా ఉంటూ; ఉండున్= ఉంటావు; సృష్టికిన్= జగత్తుపుట్టుకకు; మున్న= ముందుగ; ఉన్న= ఉండిన; కారణమునన్= కారణంచేత; వానికిన్= ఆ సూక్ష్మభూతాలకు, షోడశవికారాలకు; లోని= లోనైన; భవంబు= పుట్టుక; కలుగదు= (నీకు) ఏర్పడదు; అట్లు= ఆ విధంగా; బుద్ధిన్+ఎఱుఁగన్= బుద్ధిని తెలుసుకొనుటకు; అనువు+ఐన= అనుకూలమైన; లాగునన్= విధంగ; కలుగున్= కలిగి ఉంటూ; ఇంద్రియముల= చెవి, కన్ను మొదలైన జ్ఞానేంద్రియాల, కాళ్ళు, చేతులు మొదలైన కర్మేంద్రియాల; కడలన్+ఉండి= దగ్గర ఉండి; వాని= ఆ ఇంద్రియాల; పట్టు= నిర్బంధం; లేక= లేకుండా; వరుసన్= వరుసగా; జగంబులన్= లోకాలందు; కలిసి= కూడి; ఉండియున్= ఉండీకూడ; ఐనన్= అయినా; ఎపుడున్= ఎప్పుడుకూడ; కలయవు= అంటుకొని ఉండవు.

**తా :** నీ చేత సృజింపబడిన ఈ జగత్తులో నీవు ఉండికూడా – ఉండకుండడం, ఎట్లంటే మహత్తత్త్వం మొదలగువాటిల్ని సరిపోలినట్టిదై, దేనికది ప్రత్యేకమైన సూక్ష్మశక్తులు అయిదు, వికారాలు పదహారు కూడి పరమాత్ముడివైన నీవు విరాట్టను పేరుతో విశాలమైన జగత్తును ఏర్పాటు చేసుకొని, అందులో ఉండికూడ, ఉండకుండా ఉంటావు. ఈ సృష్టికి ముందే నీవు ఉన్నావు కనుక సూక్ష్మభూతాలకు, వికారాలకు లోనైన పుట్టుక నీ కేర్పడదు. ఇది తెలుసుకొనడానికి, అనువైన ఇంద్రియాల్లో నీవు ఉన్నా, వాటి అధీనంలో నీవుండవు. ఇంద్రియాలకు అతీతుడవై ఈ లోకాల్లో అంటే, నీ విరాట్‌శరీరంలో ఉన్నట్లే ఉంటావు గాని ఉండవు.

**విశే :** 'విశేషేణ రాజత ఇతి విరాట్' – అనగా అత్యుత్తమంగా ప్రకాశించునది.

**క. సర్వము నీలోనిదిగా, సర్వాత్ముఁడ, వాత్మవస్తుసంపన్నుఁడవై**
**సర్వమయుఁడ వగు నీకును, సర్వేశ్వర! లేవు లోను సంధులు వెలియున్. 120**

**ప్రతి :** సర్వ+ఈశ్వర= సమస్తానికి ప్రభువువైనవాడా!; సర్వము= ఈ జగత్తు మొత్తం; నీ లోనిదికాన్= నీలో ఉన్నది అవుతుండగా; సర్వ+ఆత్ముఁడవు= సమస్త జగత్స్వరూపుడివి; ఆత్మవస్తు సంపన్నుఁడవు+ఐ= ఆత్మపదార్థంతో నిండినవాడివై; సర్వమయుఁడవు= సర్వం నీవే అయినవాడివి; అగు= అయినట్టి; నీకును= నీకు; లోను= లోపలయును; సంధులు= మధ్యప్రదేశాలు; వెలియున్= వెలుపలయును; లేవు= లేనేలేవు.

**తా :** సర్వానికీ ప్రభువువైనవాడా! ఈ జగత్తు మొత్తం నీ లోనే ఉంది. కనుక నీవు జగత్స్వరూపుడివి. ఆత్మస్వరూపుడవైన సర్వం నీవే కనుక, నీకు లోపల, మధ్య, వెలుపల అనేవి ఏవీ లేనే లేవు.

**ఆ. ఆత్మవలనఁ గలిగి అమరుదేహాదుల, నాత్మకంటె వేఱు లవి యటంచుఁ**
**దలఁచువాఁడు మూఢతముఁడు గావున నీశ!, విశ్వ మెల్ల నీవ, వేఱు లేదు. 121**

**ప్రతి :** ఈశ= ప్రభూ!; ఆత్మవలనన్= పరమాత్మవల్ల; కలిగి= ఏర్పడి; అమరు= ఒప్పుచున్నట్టి; దేహ+ఆదులన్= శరీరం మొదలగువాటిల్ని; ఆత్మకంటెన్= పరమాత్మవైన నీకంటె; అవి వేఱులు= అవి ఇతరమైనవి; అటంచున్= అని; తలఁచు వాఁడు= అనుకొనేవాడు; మూఢతముఁడు= మూర్ఖులలో కెల్ల మూర్ఖుడు; కావునన్= అందువల్ల; విశ్వము+ఎల్లన్= విశ్వమంతా; ఈవు+అ= నీవే; వేఱు లేదు= ఇతరమైంది లేదు.

**తా :** ప్రభూ! పరమాత్మవల్ల ఏర్పడిన దేహాదులను పరమాత్మకంటె వేరైనవని అనుకొనే వాడు మహామూర్ఖుడు. అందువల్ల ఈ విశ్వమంతా నీవే! నీవు కాని దేదీ లేదు.

**వ. అదియునుం గాక. 122**

**ప్రతి :** అదియునున్+కాక= అంతే కాకుండ...

**తా :** అంతేకాక, ఇంకా

**సీ. గుణము వికారంబుఁ గోరికయును లేని నీవలన జగంబు నేఁటి జనించుఁ,**
**బ్రబ్బు, లేదగు; నంచుఁ బలుకుట దప్పుగా దీశుండవై బ్రహ్మ మీవ యైన**

**నినుఁ గొల్చుగుణములు నీ యానతులు సేయ, భటులశౌర్యంబులు పతికి వచ్చు**
**పగిది నీ గుణములబాగులు నీ వని తోఁచును నీమాయతోడఁ గూడి**

**ఆ. నీవు రక్తధవళనీలవర్ణంబుల, జగము సేయఁ గావ సమయఁజూడఁ**
**దనరు, దట్లు నేఁడు దైత్యుల దండింపఁ, బృథివిఁ గావ నవతరించి తీశ! 123**

**ప్రతి :** ఈశ= ప్రభూ!; గుణము= సత్త్వాదిగుణం; వికారంబున్= జనన మరణాది రూపవికారం; కోరికయును= సృష్టి స్థితిలయాలు చేయాలనే కోరికకూడ; లేని= లేనట్టి; నీవలనన్= నీవల్ల; జగంబు= జగత్తు; నెఱిన్= క్రమంగా; జనించున్= పుట్టుంది; ప్రబ్బున్= వర్ధిల్లుతుంది; లేదు+అగున్= లేనిదవుతుంది, నశిస్తుంది; అంచున్= అంటూ; పలుకుట= చెప్పడం; తప్పుకాదు= తప్పు ఏమాత్రం కాదు; ఈశుండవు+ఐ= ప్రభువువై; బ్రహ్మము= పరబ్రహ్మమైనవాడివి; ఈవు+అ= నీవే; ఐనన్= అయినప్పటికిని; నిన్నున్= నిన్ను; కొల్చు= సేవించే; గుణములు= సత్త్వాది మూడుగుణాలు; నీ+ఆనతులు= నీ ఆజ్ఞలను; (సృష్టిస్థితిలయాలు) చేయన్= చేస్తుండగా; భటుల శౌర్యంబులు= సైనికుల శూరత్వాలు; పతికిన్= రాజుకు; వచ్చు పగిదిన్= చెందునట్లుగా; నీ మాయతోడన్= నీ మాయతో; కూడి= చేరి; నీ గుణముల= నీ సత్త్వాదిమూడుగుణాలయొక్క; బాగులు= విధాలు; నీవి+అని= నీవియే అని; తోఁచును= అనిపిస్తాయి; నీవు; రక్త= ఎఱ్ఱని; ధవళ= తెల్లని; నీల= నల్లని; వర్ణంబులన్= రంగులతో; జగము= జగత్తును; చేయన్= సృజించడానికి; కావన్= రక్షించడానికి; సమయన్+చూడన్= నశింపచేయడానికి; తనరుతు= ఒప్పుతావు; అట్లు= ఆ విధంగా; దైత్యులన్= రాక్షసులను; దండింపన్= శిక్షించుటకును; పృథివిన్= భూమిని; కావన్= కాపాడుటకు; నేఁడు= ఈరోజు; అవతరించితివి= పుట్టావు.

**తా :** ఓ స్వామీ! ఏ గుణం, ఏ మార్పు, ఏ కోరిక లేని నీ వల్లనే ఈ జగత్తు పుట్టడం, పెరగడం, నశించడం జరుగుతూందని చెప్పటం తప్పు కాదు. జగత్తుకంతా ప్రభుడివి. పరబ్రహ్మానివి నీవే. అయినా, నిన్ను సేవించే సత్త్వాదిగుణాలు నీ ఆజ్ఞల ప్రకారం ప్రవర్తిస్తున్నాయి కనుక, భటుల శౌర్యాలు ప్రభువుకు చెందినట్లుగా, నీ మాయతో కూడి ప్రవర్తిల్లే గుణాల విధాలు నీకు చెందినవే అని అనిపిస్తాయి. నీవు రక్తవర్ణంతో రజోగుణరూపుడివై ఉన్నప్పుడు జగత్తును సృజిస్తావు. తెలుపురంగుతో సత్త్వగుణరూపుడివై ఉన్నప్పుడు జగత్తును రక్షిస్తావు. నలుపురంగుతో తమోగుణరూపుడివై ఉన్నప్పుడు జగత్తును నశింపచేస్తావు. అదేవిధంగా రాక్షసుల్ని శిక్షించటానికి, భూమిని కాపాడటానికి ఈ రోజు అవతరించావు.

**విశే :** పరమాత్మ నిర్గుణుడు; నిర్వికారుడు; నిత్యతృప్తుడు. మాయవల్లనే ఆయనకు గుణాలు, వికారాలు, కోరికలు ఏర్పడతాయి. ఈ మాయకూడా ఆయన సృష్టే. తాను సృష్టించిన ఆ మాయకు ఒకమారు లోబడతాడు, మరోమారు లోబడడు. అదే పరమాత్మ వైచిత్రి!

**శా. మింటన్ మ్రోసినమ్రోఁత దాలిమిని లో మేంఁడ్రింప మున్ నీవు నా**
**యింటం బుట్టెద వంచుఁ గంసుఁడు దొడిన్ హింసించె నీ యన్నలం**
**గంటం గూరుకుఁ దేఁడు, నీ యుదయ మా కారాజనుల్ సెప్పఁగా**
**బంటింపం, దెదురేఁగుదెంచు వడి నీపై నేఁడు సన్నద్ధుఁడై. 124**

**ప్రతి :** మున్= ఇంతకు మునుపు; మింటన్= ఆకాశంలో; మ్రోసిన= మ్రోగిన; మ్రోఁత= శబ్దం (అనగా ఆకాశవాణి పలుకులు); తాలిమిని= ధైర్యాన్ని; లోన్= లోపల; మేంఁడ్రింపన్= పెల్లగించగా; కంసుఁడు= ఆ కంసుడు; నీవు=

విష్ణుస్వరూపుడివైన నీవు; నా+ఇంటన్= నా ఇంటిలో; పుట్టెదవు+అంచున్= జన్మిస్తావని అంటూ; నీ+అన్నలన్= నీ కంటె ముందు పుట్టిన నీ తోబుట్టువుల్ని; తొడిన్= త్వరగా; హింసించెన్= చంపాడు; కంటన్= కంటికి; కూరుకున్= నిద్రను; తేఁడు= తెచ్చుకోవడంలేదు (నిద్రపోవడంలేదు); నేఁడు= ఈ రోజు; ఆ కారాజనుల్= ఆ చెరసాలకావలివాండ్రు; నీ+ఉదయము= నీవు పుట్టడాన్ని; చెప్పన్+కాన్= చెప్పగానే; పంటింపండు= ఆలస్యంచేయడు; వడిన్= శీఘ్రంగా; సన్నద్ధుఁడు+ఐ= సిద్ధపడినవాడై (నిన్ను చంపుటకు సిద్ధపడినవాడై); నీపైన్= నీ మీదికి; ఎదురు+ఏఁగుదెంచున్= ఎదుర్కొనేందుకు వస్తాడు.

**తా :** ఇంతకు మునుపు తాను ఆకాశవాణివల్ల విన్న మాటల కారణంగా కంసుడు ధైర్యాన్ని కోల్పోయి, నీవు నాయింట జన్మిస్తావని, నీ కంటే ముందు పుట్టిన నీ అన్నల్ని చంపివేశాడు. కంటిమీద కునుకు లేకుండా కాలం గడుపుతున్నాడు. ఇప్పుడు ఈ చెరసాల భటులు నీవు జన్మించావని చెప్పగానే అతడు ఆలస్యం చేయకుండ నిన్ను చంపటానికి సన్నద్ధుడై వస్తాడు.

## ❖ దేవకీదేవి స్వామిని స్తుతించుట ❖

**వ. అనుచుండ దేవకీదేవి మహాపురుషలక్షణుండును, విచక్షణుండును, సుకుమారుండును నైన కుమారునిం గని, కంసునివలన వెఱపున శుచిస్మితయై యిట్లనియె. 125**

**ప్రతి :** అనుచున్+ఉండన్= ఈ విధంగ పుట్టిన బిడ్డతో వసుదేవుడు పలుకుతుండగా; దేవకీదేవి= దేవకి దేవికూడ; మహాపురుష= మహాపురుషునియొక్క; లక్షణుండును= లక్షణాలు కలవాడును; విచక్షణుండును= వివేకశాలియు; సుకుమారుండునున్= మిక్కిలి కోమలమైన దేహంకలవాడును; ఐన= అయినట్టి; కుమారునిన్= కొడుకును; కని= చూచి; కంసునివలనన్= కంసునివల్ల; వెఱపునన్= భయంచేత; శుచి= పరిశుద్ధమైన; స్మిత+ఐ= నవ్వుగలదై; ఇట్లు= ఈ విధంగ; అనియెన్= అనింది.

**తా :** ఈ విధంగా పుట్టిన బిడ్డతో వసుదేవుడు అంటూ ఉండగా, దేవకీదేవికూడా, మహాపురుషలక్షణాలు కలవాడు, గొప్ప సదసద్వివేకజ్ఞానం కలవాడు, మిగుల కోమలమైన దేహం కలవాడు అయిన తన కుమారుణ్ణిచూచి, కంసునిభయంతో స్వచ్ఛమైన ఒక నవ్వునవ్వుతూ ఈ విధంగా అనింది.

**సీ. అట్టిట్టి దనరానిదై మొదలై నిండుకొన్నదై వెలుఁగుచు గుణము లేని**
**దై యొక్క చందంబుదై కలదై నిర్విశేషమై క్రియలేక చెప్పరాని**
**దేరూప మని శ్రుతు లెప్పుడు నొడివెడి యా రూప మగుచు నధ్యాత్మదీప**
**మై బ్రహ్మరెండవయర్ధంబుతుది జగంబులు నశింపఁ, గఁ బెద్దభూతగణము**

**ఆ. సూక్ష్మభూతమందుఁ జొరఁగ నా భూతంబు, ప్రకృతిలోనఁ జొరఁగఁ బ్రకృతి వోయి**
**వ్యక్తమందుఁ జొరఁగ వ్యక్త మడంగను, శేషసంజ్ఞ నీవు సెలువ మగుదు. 126**

**ప్రతి :** అట్టిట్టిది (అట్టిది+ఇట్టిది)= అటువంటిది ఇటువంటిది; అనరానిది+ఐ= అని చెప్పటానికి వీలులేనిదై; మొదలు+ఐ= మూలమై; నిండుకొన్నది+ఐ= అంతట నిండిందై; వెలుఁగుచున్= ప్రకాశిస్తూ; గుణము లేనిది+ఐ= త్రిగుణాలలో ఏ గుణమూ లేనిదై; ఒక్క చందంబుది+ఐ= ఒకే విధమైందై; కలది+ఐ= ఉన్నదై (సత్యమైందై); నిర్విశేషము+ఐ= (తాను

కాక) మిగిలి ఉన్నది ఏదీ లేనిదై; క్రియలేక= ఏ పనికూడలేకుండ; చెప్పరానిది= చెప్పుటకు సాధ్యం కానిది; ఏ రూపము+అని= ఎటువంటి రూపం అని; శ్రుతులు= వేదాలు; ఎప్పుడున్= ఎల్లప్పుడు; నొడివెడిన్= చెప్పుచున్నట్టి; ఆ రూపము= ఆ రూపం; అగుచున్= ఔతూ; అధి+ఆత్మ= ఆత్మవిషయజ్ఞానానికి; దీపము+ఐ= దీపానివై; బ్రహ్మ= బ్రహ్మదేవునియొక్క; రెండవఅర్ధంబు= ఆయుస్సులోని రెండవదైన సగభాగం; తుదిన్= చివర; జగంబులు= లోకాలు; నశింపన్+కన్= నాశనమొందగా; పెద్ద= గొప్పవైన; భూత= భూతాలయొక్క; గణము= సమూహం; సూక్ష్మ= సూక్ష్మమైన; భూతము+అందున్= భూతంలో; చొరన్+కన్= కలిసిపోగా; ఆ భూతంబు= ఆ సూక్ష్మభూతం; ప్రకృతిలోనన్= మూలప్రకృతిలో; చొరన్+కన్= లీనంకాగా; ప్రకృతి= మూలప్రకృతి; పోయి= అడగిపోయి; వ్యక్తము+అందున్= వ్యక్తతత్త్వంలో; చొరన్+కన్= లయంకాగా; వ్యక్తము= వ్యక్తతత్త్వం; అడంగను= అణగిపోగా; శేష= శేషించినవాడివనెడి–మిగిలినవాడివనెడి; సంజ్ఞన్= పేరుతో; నీవు; చెలువము= సుందరంగా; అగుదువు= అవుతావు.

**తా :** అటువంటి, ఇటువంటిది అని వివరించటానికి సాధ్యం కానిది, సమస్తానికి మూలమై ఉండేదీ, సర్వత్ర వ్యాపించింది, ప్రకాశిస్తూ ఉండేదీ, త్రిగుణాలలో ఏ గుణమూ లేనిది, ఒకే విధమైంది, సత్యమైంది. తాను తప్ప మరేదీ లేనిది, కర్మలు లేనిది, వాక్కుకు అందనిది అయిన ఏ రూపాన్ని వేదాలు ఎల్లప్పుడు చెపుతున్నాయో ఆ రూపాని వౌతూ, ఆత్మజ్ఞానానికి దీపానివై, బ్రహ్మదేవునిఆయుస్సులో రెండవసగభాగం పూర్తి అయిన తరువాత, లోకాలు నశించినవేళ, పంచమహాభూతాలు సూక్ష్మభూతంలో కలిసిపోగా, ఆ సూక్ష్మ భూతం మూలప్రకృతిలో, మూలప్రకృతి వ్యక్తతత్త్వంలో లీనంకాగా, చివరకు ఆ వ్యక్తతత్త్వం కూడా లయం కాగా–శేషసంజ్ఞచేత స్వయంజ్యోతివై సుందర స్వరూపమై ఉంటావు.

**విశే :** దేవకీదేవి తనకు జన్మించిన కుమారుణ్ణి మానవమాత్రునిగ కాకుండా పరమాత్మునిగానే భావించి, పరమాత్మతత్త్వాన్ని తలచుకొంటూ చేసిన స్తోత్రం ఇది. పరమాత్మ "సత్యం, శివం, సుందరం" కనుక సర్వమూ లయించినా ఆయన మాత్రం సత్యశివసుందరాత్మకంగానే ఉంటాడు.

**ఉ. విశ్వము లీలఁ ద్రిప్పుచు నవిద్యకుఁ జుట్టమ వైన నీకుఁ దా**
**శాశ్వతమైనకాల మిది సర్వము వేడబ మందు, రట్టి వి**
**శ్వేశ్వర! మేలుకుప్ప! నిను నెవ్వఁడు గోరి భజించు వాఁడవో**
**శాశ్వతలక్ష్మి మృత్యుజయసౌఖ్యయుతుం డభయుండు మాధవా! 127**

**ప్రతి :** మాధవా= ఓ లక్ష్మీపతీ!, విష్ణుమూర్తీ! విశ్వమున్= జగత్తును; లీలన్= విలాసంగా; త్రిప్పుచున్= త్రిప్పుతూ; అవిద్యకున్= అజ్ఞానానికి; చుట్టమవు= చుట్టానివి; ఐన= అయినట్టి; నీకున్= నీకు; తాన్= తాను; శాశ్వతము+ఐన= ఎల్లప్పుడు స్థిరంగా ఉండునట్టి; కాలము= కాలం; ఇది సర్వము= ఇది అంతా; వేడబము= వేషం; అందురు= అంటారు; అట్టి= అటువంటి; విశ్వ+ఈశ్వర= విశ్వప్రభూ!; మేలుకుప్ప= శుభాలరాశీ!; నినున్= నిన్ను; ఎవ్వఁడు= ఎవడైతే; కోరి= ఇష్టపడి; భజించున్= ఆరాధిస్తాడో; వాఁడు+అ+పో= ఆ వ్యక్తే సుమా; శాశ్వతలక్ష్మిన్= స్థిరమైన సంపదతో; మృత్యుజయ= మృత్యువును జయించడంతో; సౌఖ్య= సుఖంతో; యుతుండు= కూడుకొన్నవాడు; అభయుండు= భయం లేనివాడు.

**తా :** ఓ మాధవా! నీవు పరిపూర్ణ జ్ఞానస్వరూపుడివే అయినా, ఈ జగత్తును సృష్టి స్థితిలయాలతో విలాసంగా త్రిప్పుతూ ఉంటావు. కనుక, అవిద్య అనే మాయకు నీవు చుట్టానివి. కాలాతీతుడవైన నీకు శాశ్వతమైన కాలమంతా మాయ

మాత్రమే. జగన్నాథా! నీవు శుభాలరాశివి. కోరి నిన్నెవ్వడు ఆరాధిస్తాడో అతడు శాశ్వతసంపద గలిగి, మృత్యువును జయించి, సుఖసంతోషాలతో భయం లేనివాడై ఉంటాడు.

**విశే :** పరమాత్మ పరిపూర్ణ జ్ఞానస్వరూపుడు. అలాంటప్పుడు ఆయన అవిద్యకు బంధువు ఎలా అవుతాడు?

పరమాత్మ పరిపూర్ణజ్ఞానస్వరూపుడే. కాని, ఈ జగత్తు మాయ. జగత్తే మాయ అయినపుడు సృష్టి, స్థితి, లయాలు కూడ మాయయే! మాయయే అవిద్య. ఈ మాయామేయ జగత్తును సృజించి, దాన్ని పోషించి, లయం చేస్తున్నప్పుడు పరమాత్మ అవిద్యకు చుట్టమౌతాడు కదా!

**మత్త. ఒంటి నిల్చి పురాణయోగులు యోగమార్గనిరూఢులై**
**'కంటి' మందురు కాని, నిక్కమ కాన రీ భవదాకృతిం**
**గంటి భద్రముఁ గంటి, మాంసపుఁగన్నులం గనఁబోల, దీ**
**తొంటిరూపుఁ దొలంగఁ బెట్టుము తోయజేక్షణ! మ్రొక్కెదన్. 128**

**ప్రతి :** తోయజ+ఈక్షణ= నీటినుండి పుట్టిన పద్మంవంటి కన్నులు కలవాడా! పురాణయోగులు= ప్రాచీన కాలంనాటి యోగులు; ఒంటిన్= ఒంటరిగా; నిల్చి= ఉండి; యోగమార్గ= మనస్సును నీ యందు లీనం చేసే మార్గంలో; నిరూఢులు+ఐ= మిక్కిలి స్థిరత్వం కలవారై; ఈ= ఇప్పుడు అగుపిస్తున్న; భవత్= నీయొక్క; ఆకృతిన్= రూపాన్ని; కంటిమి= చూశాం; అందురు= అంటారు; కాని; నిక్కము+అ= నిజంగా; కానరు= చూచి ఉండరు; కంటిన్= (నేను) చూశాను; భద్రమున్= శుభాన్ని; కంటిన్= పొందాను; మాంసము+కన్నులన్= (ఈ రూపం) మాంసంతో రూపొందిన కన్నులతో; కనన్= చూడటానికి; పోలదు= సాధ్యం కాదు; (కనుక) ఈ= ఇప్పుడు కనపడుతున్న; తొంటి= మొదటి; రూపున్= రూపాన్ని; తొలంగన్+పెట్టుము= తొలగిపోవునట్లు చేయుము; మ్రొక్కెదన్= (నీకు) నమస్కరిస్తాను.

**తా :** ఓ పద్మనయనా! పురాతనులైన మహాయోగులు (సనక సనందనాదులు) యోగమార్గంలో అత్యంతదీక్షతో ఒంటరిగా తమకు తాము సాధన చేసి, ఇప్పుడు అగుపిస్తున్న నీ దివ్యరూపాన్ని చూచామంటారు గానీ; నిజంగా వారు చూచి ఉండరు. ఇప్పుడు నేను చూచాను. శుభాన్ని పొందాను. ఈ భౌతిక నేత్రాలతో ఇక చూడలేను. అనాది అయిన నీ దివ్యస్వరూపాన్ని ఉపసంహరించుకో. నమస్కరిస్తున్నాను.

**ఆ. విలయకాలమందు విశ్వంబు నీ పెద్ద, కడుపులోన దాఁచు కడిమి మేటి**
**నటుఁడ వీవు, నేఁడు నా గర్భజుఁడ వౌట, పరమపురుష! వేడబంబు గాదె! 129**

**ప్రతి :** పరమపురుష= పురుషోత్తముడవైన ఓ స్వామీ!; ఈవు= నీవు; విలయకాలము+అందున్= ప్రళయకాలంలో; విశ్వంబున్= విశ్వాన్ని; నీ= నీయొక్క; పెద్ద= గొప్ప; కడుపులోనన్= పొట్టలో; దాఁచు= దాచేటి; కడిమి= గొప్ప; మేటి= శ్రేష్ఠుడవైన; నటుఁడవు= నర్తకుడివి; నేఁడు= ఇప్పుడు; నా= నా యొక్క; గర్భజుఁడవు+ఔట= గర్భంనుండి పుట్టినవాడివి కావడం; వేడబంబు= మాయ; కాదు+ఎ= కదా!

**తా :** ఓ పురుషోత్తమా! ప్రళయకాలంలో ఈ జగత్తునంతా ఎంతో పెద్దదైన కడుపులో దాచుకొనే గొప్పనటుడివి నీవు. అలాంటి నీవు, ఇప్పుడు నా కడుపున పుట్టడం ఒక పెద్దమాయే కదా!

**తరలము. నలినలోచన! నీవు నిక్కము నాకుఁ బుట్టెద వంచు నీ**
**ఖలుఁడు గంసుఁడు పెద్దకాలము కారయింట నడంచె, దు**
**ర్మలినచిత్తుని నాజ్ఞసేయుము, మమ్ముఁ గావుము భీతులన్,**
**నులుసులేక ఫలించె నోఁచిననోము లెల్లను నీవయై. 130**

**ప్రతి :** నలినలోచన= తామరులవంటి కన్నులుగలవాడా!; నీవు నిక్కము= నీవు నిజంగా; నాకున్= నాకు; పుట్టెదవు= జన్మిస్తావు; అంచున్= అంటూ; ఈ ఖలుఁడు+కంసుఁడు= దుర్మార్గుడైన ఈ కంసుడు; పెద్దకాలము= చాలకాలం; కారయింటన్= చెరసాలలో; అడంచెన్= అణచి ఉంచాడు; దుర్+మలినచిత్తునిన్= చెడ్డదైన కల్మషంకల మనస్సుకలవాణ్ణి (కంసుణ్ణి); ఆజ్ఞ+చేయుము= శిక్షించు; మమ్మున్= మమ్మల్ని; (నన్ను, మీతండ్రిని); భీతులన్= భయపడి ఉన్నట్టివారిని; కావుము= రక్షించు; నోఁచిననోములు+ఎల్లన్= నేను నోచిన నోములన్నీ; నులుసు లేక= కొరత లేకుండ; నీవు+అ= నీవే అయి (నీ రూపంతో); ఫలించెన్= సఫల మయ్యాయి.

**తా :** తామరులవంటి కన్నులు కలవాడా! నీవు నాకు తప్పక జన్మిస్తావని ఆ దుర్మార్గుడైన కంసుడు చాలకాలంగా నన్నూ, నీ తండ్రినీ, ఈ చెరసాలలో బంధించి ఉంచాడు. ఆ దుర్మార్గుణ్ణి శిక్షించి, మమ్మల్ని కాపాడు. నేను నోచిన నోములన్నీ ఏ కొరత లేకుండా నీ రూపంలో ఫలించాయి.

## ❖ దేవకీవసుదేవల పూర్వజన్మముల వృత్తాంతము ❖

**వ. అని యిట్లు దేవకీదేవి విన్నవించిన నీశ్వరుం డిట్లనియె, అవ్వా! నీవు దొల్లి స్వాయంభువ మన్వంతరంబునఁ బృశ్ని యను పరమపతివ్రతవు, వసుదేవుండును సుతపుం డనుప్రజాపతి, మీ రిరువురును సృష్టికాలంబున బ్రహ్మపంపునం, బెంపున నింద్రియంబుల జయించి తెంపున వాన గాలి యెండ మంచులకు సైరించి యేకలములయి యాకలములు దిని యే కలంకంబును లేక వేంద్రంబుగఁ బంద్రెండువేల దివ్యవర్షంబులు దపంబులు సేసిన నెపంబున మీ రూపంబులు మెరయ నోజ నాజపంబులు సేసి, డాసి, పేర్చి, యర్చింప మీకు నాకుం గల రూపుఁ జూపి యేను 'దిరంబు లగు వరంబులు వేఁడుం' డనిన మీరు నా మాయం బాయని మోహంబున బిడ్డలు లేని దొడ్డయడ్డంబున దుర్దమం బగు నపవర్గంబు గోరక నా యీడుకొడుకు నడిగిన మెచ్చి యట్ల వరం బిచ్చి మీ కేను 'బృశ్నిగర్భుం'డన నర్భకుండ నయితి, మఱియును. 131**

**ప్రతి :** అని ఇట్లు= అని ఈ విధంగ; దేవకీదేవి= దేవకి; విన్నవించినన్= మనవి చేసుకోగా; ఈశ్వరుండు= ప్రభువు (శ్రీకృష్ణుడు); ఇట్లు= ఈ విధంగ; అనియెన్= అన్నాడు; అవ్వా= అమ్మా!; నీవు తొల్లి= నీవు పూర్వం; స్వాయంభువమనువు+ అంతరంబునన్= స్వాయంభువుడనే మనువుకాలంలో; పృశ్ని అను= పృశ్ని అనే పేరుగల; పరమపతివ్రతవు= మహాపతివ్రతవు; వసుదేవుండును= వసుదేవుడుకూడా; సుతపుండు+అను= సుతపుడు అనే పేరుగలప్రజాపతి; మీరు+ఇరువురును= మీరు ఇద్దరును; సృష్టికాలంబునన్= బ్రహ్మదేవుడు సృష్టిచేసే సమయంలో; బ్రహ్మ= బ్రహ్మదేవునియొక్క; పంపునన్= ఆజ్ఞతో; పెంపునన్= మిక్కిలిగ; ఇంద్రియములన్= (పదునాల్గు) ఇంద్రియాలను; జయించి= గెలిచి, అనగా స్వాధీనం చేసుకొని; తెంపునన్= తెగువతో; వాన గాలి ఎండ మంచులకున్= వానకు, గాలికి, ఎండకు, మంచుకు; సైరించి= ఓర్చుకొని;

ఏకలములు+అయి= ఒంటరివారై; ఆకు+అలములు= ఆకులు అలములను; తిని= తింటూ; ఏ= ఏ విధమైన; కలంకంబును= కల్మషం; లేక= లేకుండా; వేఁడ్రంబుగన్= తీవ్రంగా; పండ్రెండువేల దివ్యవర్షంబులు= పండ్రెండువేల దేవమానసంవత్సరాలు; తపంబులు+చేసిన= తపస్సు చేసినట్టి; నెపంబునన్= కారణంగా; మీ రూపంబులు= మీ దేహాకృతులు; మెరయన్= ప్రకాశించగా; ఓజన్= క్రమంగా; నా జపంబులు= నన్ను గూర్చిన నామఉచ్చారణ; చేసి= చేసినందువల్ల; డాసి= సమీపించి; పేర్చి= అతిశయించి; అర్చింపన్= పూజింపగా; మీకున్= మీకు; నాకున్+కల రూపున్= నా స్వరూపాన్ని; చూపి= దర్శింపచేసి; ఏను= నేను; తిరంబులు= స్థిరమైనవి; అగు= అయినట్టి; వరంబులు= కోరికలు; వేఁడుండు= కోరుకొనుడు; అనినన్= అనగా; మీరు= మీరిరువురు; నా మాయన్= నా మాయచేత; పాయని= తొలగని; మోహంబునన్= అజ్ఞానంచేత; బిడ్డలు= సంతానం; లేని= లేదనెడి; దొడ్డ= పెద్ద; అడ్డంబునన్= అడ్డువలన; దుస్+దమంబు= అతికష్టసాధ్యమైన; అపవర్గంబున్= మోక్షాన్ని; కోరక= కోరుకొనక; నా, ఈడు= నాకు సమానమైన; కొడుకున్= కుమారుణ్ణి; అడిగినన్= కోరుకొనగా; మెచ్చి= మెచ్చుకొని; అట్లు+అ= ఆ విధంగానే; వరంబు+ఇచ్చి= వరాన్ని ఇచ్చి; మీకున్= మీ దంపతులిద్దరికి; ఏను= నేను; పృశ్నిగర్భుండు= "పృశ్నిగర్భుడు"; అనన్= అనే పేరుతో; అర్భకుండను= బాలుడను; అయితి(ని)= అయ్యాను; మఱియును= తరువాత...

**తా :** ఈ విధంగా దేవకీదేవి విన్నవించుకోగా శ్రీకృష్ణుడు ఆమెతో ఇలా అన్నాడు. అమ్మా! పూర్వం నీవు స్వాయంభువ మనువుకాలంలో పృశ్ని అను పేరుగల పరమపతివ్రతవు. వసుదేవుడు సుతపుడు అనే ప్రజాపతి. మీరిద్దరు సృష్ట్యాదియందు బ్రహ్మదేవుని ఆజ్ఞతో ఇంద్రియాలను నిగ్రహించి, తెగించి, ఎండకు, వానకు, గాలికి, మంచుకు ఓర్చుకొని, ఒంటరిగా, ఆకులలములను భక్షిస్తూ పండ్రెండువేల దివ్యసంవత్సరాలు కఠోరతపస్సు చేశారు. మీ దేహాలు తేజస్సుతో ప్రకాశించాయి. నా జపంచేసి, నా మీద మనస్సు నిలిపి, నన్నే పూజించారు. నేను ప్రత్యక్షమై స్థిరమైన వరాలు కోరుకొమ్మంటే నా మాయవలన, బిడ్డలు లేరనే బాధతో, అతికష్టసాధ్యమైన మోక్షాన్ని కోరుకోకుండా, నాకు సాటిరాగల కొడుకు నిమ్మని కోరుకొన్నారు. నేను మెచ్చి, ఆ వరమిచ్చి, పృశ్నిగర్భుడనే పేరుతో మీ కిప్పుడు జన్మించాను. అంతే కాదు

**విశే :** లోకంలో ధర్మపాలనకొరకు బ్రహ్మ మనువులను సృజించినవాడు. మనువులు పద్నాలుగుమంది. అందులో మొదటివాడు స్వాయంభువుడు.

**క. అదితియుఁ గశ్యపుఁడును నన, విదితుల రగు మీకుఁ గుఱుచవేషంబున నే**
**నుదయించితి వామనుఁ డనఁ,ద్రిదశేంద్రానుజుఁడనై ద్వితీయభవమునన్. 132**

**ప్రతి :** అదితియున్= అదితిదేవీ; కశ్యపుఁడునున్= కశ్యపుడూ; అనన్= అనే పేర్లతో; విదితులరు+అగు= ప్రసిద్ధిపొందిన; మీకున్= మీ దంపతులకు; కుఱుచ= పొట్టి; వేషంబునన్= రూపంతో; ఏన్= నేను; వామనుఁడు+అనన్= వామనుడనే పేరుతో; త్రిదశ+ఇంద్ర= దేవతలరాజైన ఇంద్రునికి; అనుజుఁడన్+ఐ= తమ్ముడినై; ద్వితీయ= రెండవ; భవమునన్= జన్మంలో; ఉదయించితిన్= పుట్టాను.

**తా :** అదితి కశ్యపులనే పేర్లతో ప్రసిద్ధులైన మీకు పొట్టివాడి రూపంలో వామనుడనే పేరుతో ఇంద్రుడితమ్ముడిగా మీకు పుట్టాను. అది నా రెండవజన్మ.

**క. ఇప్పుడు మూఁడవబామునఁ, దప్పక మీ కిరువురకును దనయుఁడ నైతిం**
**జెప్పితిఁ బూర్వము మీయం, దెప్పటికిని లేదు జన్మ మిటపై నాకున్. 133**

**ప్రతి :** ఇప్పుడు= ప్రస్తుతం; మూఁడవబామునన్= మూడవజన్మలో; తప్పక= మీ కిచ్చిన మాటను తప్పక; మీకున్+ ఇరువురకును= మీ యిద్దరికి; తనయుఁడను= కుమారుడిగా; ఐతిన్= అయ్యాను; పూర్వము= పూర్వవృత్తాంతాన్ని; చెప్పితిన్= (మీకు) చెప్పాను; ఇటపైన్= ఇక ముందు; నాకున్= నాకు; ఎప్పటికినిన్= ఎప్పటికి కూడ; మీ+అందున్= మీ యిద్దరియందు; జన్మము= పుట్టుక; లేదు.

**తా :** మీ కిచ్చిన వరం తప్పకుండ ఇప్పుడు ఈ మూడవజన్మలో మీకిద్దరికి కుమారుణ్ణి అయ్యాను. జరిగిన పూర్వవృత్తాంతమంతా మీకు చెప్పాను. ఇకపై మీ యందు నాకు జన్మ లేదు.

**క. నందనుఁ డనియుం బరమా, నందంబగు బ్రహ్మ మనియు ననుఁ దలఁచుచు నా**
**పెందెరువు నొందెదరు, నా, యందలిప్రేమమున భవము నందరు మీరల్. 134**

**ప్రతి :** మీరల్= మీరు; ననున్= నన్ను; నందనుఁడు= కుమారుడు; అనియున్= అని; పరమ+ఆనందంబు= అంతులేని ఆనందస్వరూపం; అగు= అయినట్టి; బ్రహ్మము= పరబ్రహ్మం; అనియున్= అనీ; తలఁచుచున్= భావిస్తూ; నా= నాయొక్క; పెన్+తెరువున్= గొప్పమార్గాన్ని (అపవర్గ మార్గాన్ని); ఒందెదరు= పొందుతారు; నా+అందలి= నా మీది; ప్రేమమునన్= ప్రేమవల్ల; భవమున్= (మరొక) జన్మను; అందరు= పొందరు.

**తా :** మీరు నన్ను కుమారుడిగా, బ్రహ్మానందస్వరూపుడనైన పరబ్రహ్మంగా భావిస్తూ, నా మీది ప్రేమవల్ల పునర్జన్మ లేని పరమపదాన్ని పొందుతారు.

**వ. అని యిట్ల పలికి యీశ్వరుం డా రూపంబు విడిచి. 135**

**ప్రతి :** అని=అంటూ; ఇట్లు= ఈ విధంగా; పలికి= చెబుతూ; ఈశ్వరుండు= ప్రభువు, జగత్ప్రభువు; ఆ రూపంబు= ఆ రూపాన్ని; (శ్రీమహావిష్ణురూపాన్ని); విడిచి= వదలిపెట్టి...

**తా :** అని ఈ విధంగా చెప్పి, జగత్ప్రభువైన శ్రీమహావిష్ణువు శంఖచక్రగదాఖడ్గాదులను ధరించిన చతుర్బాహు స్వరూపాన్ని వదలి

**క. ఱెప్ప లిడక తలిదండ్రులు, దప్పక తనుఁ జూడ మాయఁ దనరి లలితుఁడై**
**యప్పు డటు గన్న పాపని, యొప్పున వేడుకలు సేసె నొకకొన్ని నృపా! 136**

**ప్రతి :** నృపా!= పరీక్షిన్మహారాజా!; తనున్= తనను; తలిదండ్రులు= దేవకీవసుదేవులు; ఱెప్పలిడక= రెప్పలు వాల్చకుండా; తప్పక= తప్పకుండా; చూడన్= చూస్తుండగా; మాయన్= మాయతో; తనరి= ఒప్పి; లలితుఁడు+ఐ= మిక్కిలి కోమలమైన రూపంతో; అప్పుడు= అప్పుడే; అటు= ఆ విధంగ, ఆ రూపంతో; కన్న= కనిన; పాపని= బాలుని; ఒప్పునన్= చందంగా; వేడుకలు= సంతోషం కలిగించే పనులను; ఒకకొన్ని= కొన్నింటిని; చేసెన్= చేశాడు (ప్రదర్శించాడు).

**తా :** ఓ పరీక్షిన్మహారాజా! తల్లిదండ్రులైన దేవకీ వసుదేవులు రెప్ప లార్పకుండ అట్టె తనను చూస్తూ ఉండగా; మాయతో అప్పుడే పుట్టిన సుకుమార శిశువుగా మారిపోయాడు. కాలు సేతులు కదలించడం, కన్నులు మూసి తెరవడం, కేవు కేవు మని ఏడవడం మొదలైన వేడుకలను చేశాడు (చూపాడు).

**వ. అంత వసుదేవుండు దనకుం జేయవలసిన పను లీశ్వరుండైన హరివలన నెఱింగినవాఁడు గావున. 137**

**ప్రతి :** అంతన్= తరువాత; వసుదేవుండు= వసుదేవుడు; తనకున్= తనకు (బాలునికి); చేయవలసిన పనులు= నిర్వహించాల్సిన కార్యాలు; ఈశ్వరుండు+ఐన= సర్వానికి ప్రభువైన; హరివలనన్= శ్రీహరివల్ల; ఎఱింగినవాఁడు= తెలిసికొన్నాడు; కావునన్= కనుక...

**తా :** తరువాత వసుదేవుడు సర్వాంతర్యామి అయిన సర్వేశ్వరునివల్ల తాను ఆ బాలునికి చేయవలసిన పనులను తెలిసికొన్నాడు కాబట్టి

**క. ఆ పురిటియిల్లు వెలువడి, పాపనిఁ దరలించుకొనుచుఁ బఱచెద ననుచున్**
**రూపింప నందుభార్యకుఁ, బాప యగుచు యోగమాయ ప్రభవించె నృపా! 138**

**ప్రతి :** నృపా= ఓ పరీక్షిన్మహారాజా!; ఆ పురిటియిల్లు= బిడ్డను ప్రసవించిన ఆ ఇంటిని; వెలువడి= విడిచి బయటికి వచ్చి; పాపనిన్= పిల్లవాణ్ణి; తరలించుకొనుచున్= తరలించడానికి; పఱచెదను= పరుగెత్తి పోయెదను; అనుచున్= అనుకొంటూ; రూపింపన్= నిరూపించుకోగా (నిశ్చయించుకోగా); నందుభార్యకున్= నందుని భార్య అయిన యశోదకు; యోగమాయ= యోగమాయాశక్తి; పాప+అగుచున్= కూతురై; ప్రభవించెన్= పుట్టింది.

**తా :** ఓ పరీక్షిన్మహారాజా! వసుదేవుడు ఆ బిడ్డను పురిటి ఇంటినుంచి దాటించి తీసుకొని పారిపోవాలని నిశ్చయించుకోగా అక్కడ గోకులంలో నందునిభార్య యశోదాదేవికి, యోగమాయాశక్తి కూతురై జన్మించింది.

**వ. అయ్యవసరంబున. 139**

**ప్రతి :** ఆ+అవసరంబునన్= ఆ సమయంలో...

**తా :** అదే సమయంలోనే

**క. బిడ్డనిఁ గరముల ఱొమ్మున, నడ్డంబుగఁ బట్టి పదము లల్లన యిడుచున్**
**జడ్డనఁ గావలివారల, యొడ్డు గడచి పురిటిసాల యొయ్యన వెడలెన్. 140**

**ప్రతి :** బిడ్డనిన్= చంటిబిడ్డడైన కృష్ణుణ్ణి; కరములన్= చేతులతో; ఱొమ్మునన్= ఎదయందు; అడ్డంబుగన్= అడ్డంగా; పట్టి= అదిమి పట్టుకొని; పదములు= పాదాలను; అల్లన= మెల్లగా (చప్పుడుకాకుండ); ఇడుచున్= పెడుతూ; జడ్డనన్= తటాలున; కావలివారల ఒడ్డున్= కావలివాళ్ల అడ్డుపాటును; కడచి= దాటి; పురిటిసాల= పురిటిఇంటిని; ఒయ్యనన్= మెల్లగా; వెడలన్= దాటి వెళ్ళాడు.

**తా :** వసుదేవుడు చంటి బిడ్డడైన శ్రీకృష్ణుని చేతులతో ఎత్తుకొని, ఎదకు అడ్డంగా అదిమిపట్టుకొని, శబ్దం కాకుండ మెల్లగా అడుగులు వేసుకొంటూ, ఒక్క ఊపున కావలివాళ్ల అడ్డుపాటును జాగ్రత్తగా దాటుకొని, పురిటి ఇంటి నుండి బయటికి వెళ్ళాడు.

**వ. అంత నట. 141**

**ప్రతి :** అంతన్= అంతలో; అటన్= అక్కడ...

**తా :** అంత, ఆ స్థలంలో

**క. నందునిసతికి యశోదకుఁ, బొందుగ హరియోగమాయ పుట్టిన మాయా**
**స్పందమున నొక్క యెఱుఁగమి, గ్రందుకొనియె నూరివారిఁ గావలివారిన్. 142**

**ప్రతి :** నందుని= నందునియొక్క; సతికిన్= భార్యకు (భార్య అయిన); యశోదకున్= యశోదాదేవికి; పొందుగన్= పొందికగా; హరి యోగమాయ= శ్రీ మహావిష్ణుని యోగమాయాశక్తి; పుట్టినన్= పుట్టిన వెంటనే; మాయాస్పందమునన్= మాయయొక్క స్వల్పప్రేరణవల్ల; ఒక్క యెఱుఁగమి= ఏమీ తెలియని ఒక మైకం; ఊరివారిన్= వ్రేపల్లె ప్రజలనూ; కావలివారిన్= కావలివాండ్లను; గ్రందుకొనియెన్= కమ్మింది.

**తా :** నందునిభార్య యశోదాదేవికి యోగమాయ జన్మించగానే ఒక విధమైన ఏమీ తెలియని మైకం వ్రేపల్లె ప్రజలనూ, పురిటింటికి కావలియున్న భటులనూ ఆవరించింది.

**వ. అప్పుడు చప్పుడు గాకుండఁ దప్పుటడుగు లిడుచు, నినుప గొలుసుల మెలుసులు వీడినఁ దాలంబులు మహోత్తాలుండైన బిడ్డనికి నడ్డంబు గాక కీలూడి వీడి పడ, నరళంబులు విరళంబులైన సరళంబులగు మొగసాలలం గడచి, పాఁపఱేఁడు వాకిళ్ళు మరల మూయుచుఁ, బడగ లెడగలుగ విప్పి, కప్పి, యేచి, కాచికొని వెంట నంటి రాఁగఁ దూఁగి నడచు నెడ. 143**

**ప్రతి :** అప్పుడు= ఆ సమయంలో; చప్పుడు= శబ్దం; కాకుండన్= కలుగకుండ; తప్పుటడుగులు+ఇడుచున్= నేలమీద ఆనీ ఆననట్లు అడుగులు పెడుతూ; ఇనుప గొలుసుల= ఇనుముతో చేయబడిన గొలుసులయొక్క; మెలుసులు= మెలికలు; వీడినన్= ఊడగా; తాలంబులు= తాళాలు; మహా+ఉత్తాలుండు= మిక్కిలి గొప్పవాడు; ఐన= అయినట్టి; బిడ్డనికిన్= బిడ్డకు (బాలకృష్ణునికి); అడ్డంబు= అడ్డుకొనునవి; కాక= కాకుండ; కీలు+ఊడి= కీళ్ళు వదలిపోయి; వీడి= వేరుపడి; పడన్= క్రిందపడగా; అరళంబులు= తలుపులు; విరళంబులు+ఐన= ఎడము కలవికాగా (తెరచుకోగా); సరళంబులు= (వెళ్ళుటకు) సులువైనవి; అగు= అయినట్టి; మొగసాలలన్= తలవాకిటి చావళ్ళను; కడచి= దాటి; పాఁపఱేఁడు (పాము+ఱేఁడు)= నాగరాజు, ఆదిశేషుడు; వాకిళ్ళు= వాకిళ్లను; మరల= మళ్లీ; మూయుచున్= మూస్తూ; పడగలు ఎడ+కలుగన్= పడగల్ని వెడల్పుగా; విప్పి= తెరచి; కప్పి= మూసి; ఏచి= అతిశయించి; కాచికొని= కాపాడుకొని; వెంటన్+అంటి= వెంబడించి; రాఁగన్= వస్తుండగా; తూఁగి= ఊగి; నడచున్+ఎడన్= నడుస్తున్న సమయంలో...

**తా :** అప్పుడు వసుదేవుడు పురిటి బిడ్డడైన శ్రీకృష్ణుణ్ణి ఎత్తుకొని శబ్దం కాకుండ, అడుగులను నేలమీద ఆనీ ఆననట్లుగా మోపుతూ బయలుదేరాడు. ఆయనకు సంకెళ్ళుగా ఉన్న ఇనుప గొలుసుల మెలికలు వాటి అంతట అవే ఊడిపోయాయి. మహాపురుషుడైన బాలకృష్ణునికి అడ్డుగా ఉండే తాళాలు వాటి అంతట అవే ఊడిపడగా, తలుపులు వాటి అంతట అవే తెరుచుకొని, మార్గాన్ని సుగమం చేశాయి. వసుదేవుడు తలవాకిటిని, చావళ్ళను దాటగానే, ఆదిశేషుడు తన పడగలను ఆ బాలుడికి పైన ఆచ్ఛాదనంగా కప్పి కాపాడుకొంటూ వెంటరాగా, ఆయన నడువసాగాడు. ఆ సమయంలో

**క. ఆ శౌరికి దెరు వొసఁగెఁ బ్ర, కాశోద్ధతతుంగభంగకలితధరాశా**
**కాశ యగు యమున మును సీ, తేశునకుఁ బయోధి త్రోవ యిచ్చినభంగిన్. 144**

**ప్రతి :** మును= పూర్వం; సీతా+ఈశునకున్= సీతాదేవి భర్తకు, శ్రీరామచంద్రునికి; పయోధి= సముద్రం; త్రోవ ఇచ్చిన; భంగిన్= దారి ఇచ్చిన రీతిగా; ప్రకాశ= చక్కగా కన్పిస్తున్న; ఉద్ధత= అతిశయిస్తున్న; తుంగ= పొడవైన; భంగ= అలలతో;

కలిత= కూడిన; ధరా= భూమియును; ఆశా= దిక్కులును; ఆకాశ= ఆకాశం కల్గింది; అగు= అయిన; యమున= యమునానది; ఆ,శౌరికిన్= ఆ వసుదేవునికి; తెరువు= త్రోవను; ఒసఁగెన్= ఇచ్చింది.

**తా :** పూర్వం శ్రీరామునికి సముద్రం త్రోవ ఇచ్చినట్లుగానే, స్పష్టంగా కన్పిస్తూ, మిక్కిలి పొడవైన అలలతో నేలను, దిక్కులను, నింగిని ఆక్రమించిన యమునానది ఆ వసుదేవునికి మార్గమిచ్చింది.

**వ. ఇట్లు యమున దాఁటి, దూఁటి, చని, నందుని మందం జేరి, యం దమందనిద్రం బొంది, యొడ లెఱుంగని గొల్లలం దెలుప నొల్లక, నిత్యప్రసాదయగు యశోదశయ్య నొయ్యన చిన్ని నల్లనయ్య నునిచి, చయ్యన న య్యవ్వకూఁతు నెత్తుకొని, మరల నింటికిఁ బంటింపక వచ్చి, య చ్చిఱుతపాపను దేవకి ప్రక్కం జక్క నిడి. 145**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగ; యమునన్+దాఁటి= యమునానదిని దాటి; దూఁటిచని= వేగంగా వెళ్ళి; నందునిమందన్= నందుని గొల్లపల్లెను; చేరి= ప్రవేశించి; అందున్= ఆ వ్రేపల్లెలో; అమందనిద్రన్+పొంది= గాఢనిద్రను పొంది; ఒడలు= శరీరాలు; ఎఱుంగని= తెలియని; గొల్లలన్= గోపకులను; తెలుపన్= మేలుకొలుపుటకు; ఒల్లక= ఇష్టపడక; నిత్యప్రసాద+అగు= ఎల్లప్పుడు ప్రసన్నత కల్గిందైన; యశోదశయ్యన్= యశోదాదేవియొక్క పడకయందు (మీద); ఒయ్యనన్= తిన్నగా; చిన్నినల్లనయ్యన్= చిన్న శిశువైన నల్లని శ్రీకృష్ణుణ్ణి; ఉనిచి= ఉంచి; చయ్యనన్= అతిత్వరగా; ఆ+అవ్వ= ఆ యశోదాదేవియొక్క; కూఁతున్= కూతుర్ని; ఎత్తుకొని= చేతులలోకి తీసుకొని; మరలన్= తిరుగ; ఇంటికిన్= తనయింటికి; పంటింపక= ఆలస్యం చేయకుండా; వచ్చి= చేరుకొని; ఆ+చిఱుతపాపను= ఆ చిన్నపాపను; దేవకి ప్రక్కన్= దేవకీదేవి ప్రక్కన; చక్కన్= చక్కగ; ఇడి= ఉంచి (పరుండబెట్టి).

**తా :** ఈ విధంగా వసుదేవుడు యమునా నదిని వేగంగా దాటివెళ్ళి, నందుని వ్రేపల్లెలో ప్రవేశించి, గాఢనిద్రలో ఉన్న ఆ పల్లెవాసులైన గొల్లల్ని మేల్కొల్పుటకు ఇష్టపడక, ఎల్లప్పుడు ప్రసన్నంగా ఉండే యశోదాదేవిపడకమీద నల్లని ఈ చిన్నబాలుణ్ణి పడుకో పెట్టాడు. త్వర త్వరగా యశోదాదేవికూతురిని ఎత్తుకొని, ఏమాత్రం ఆలస్యం చేయకుండా తన యింటికి వచ్చాడు. ఆ పాపను దేవకీదేవి ప్రక్కన పడుకోపెట్టాడు.

**విశే :** వసుదేవుడు తనయింటికి తిరిగి రావటం అంటే, మధురలో కంసుడు అతణ్ణి బంధించిన కారాగారానికి తిరిగి రావటమే.

**క. పదముల సంకెల లిడుకొని, మదిఁ దలఁకుచు శూరసుతుఁడు మందుఁడు వోలెన్**
**బెదరు గలరీతి దేహము, గదలించుచు నొదిఁగి యుండె గఱువతనమునన్. 146**

**ప్రతి :** శూరసుతుఁడు= శూరుని కుమారుడైన వసుదేవుడు; పదములన్= కాళ్ళకు; సంకెలలు= సంకెళ్ళు; ఇడుకొని= తగిలించుకొని; మదిన్= మనస్సులో; తలఁకుచున్= భయపడుచు; మందుఁడు+పోలెన్= ఏమీ తెలియనివానివలె; బెదరు= భయం; కల= ఉన్న; రీతిన్= విధంగ; దేహము= శరీరాన్ని; కదలించుచున్= వణికిస్తూ; గఱువతనమునన్= గాంభీర్యంతో; ఒదిఁగి= ముడుచుకొని; ఉండెన్= ఉండినాడు.

**తా :** శూరసుతుడైన వసుదేవుడు కాళ్ళకు ఇదివరకున్నట్లుగానే సంకెళ్ళను తగించుకొని, మనస్సులో కలతపడుతూ ఏమీ తెలియనివానివలె భయపడుతున్నట్లు శరీరాన్ని వణికిస్తూ గంభీరంగా ముడుచుకొని కూర్చున్నాడు.

**క. వనజాక్షునిఁ దెచ్చుటయును, దనసుతఁ గొనిపోవుటయును దా నెఱుఁగక మూఁ**
**గిన నిద్రఁ జొక్కియుండెను, వనజాక్షి యశోద రేయి వసుధాధీశా! 147**

**ప్రతి :** వసుధా+అధీశా!= భూమికి ప్రభువువైనవాడా! ఓ పరీక్షిన్మహారాజా!; వనజ+అక్షి= నీటినుండి పుట్టిన పద్మమువంటి కన్నులు కలయశోద; వనజ+అక్షునిన్= నీటినుండి పుట్టిన పద్మంవంటి కన్నులు గలవాణ్ణి (శ్రీకృష్ణుని); తెచ్చుటయును= తనదగ్గరకు (వసుదేవుడు) ఎత్తుకొని రావడాన్ని; తన= తనయొక్క; సుతన్= కూతురిని; కొనిపోవుటయున్= (దేవకీదేవిదగ్గరకు) తీసుకొని పోవడాన్ని; తాన్= తాను; ఎఱుఁగక= తెలియక; మూఁగిన= ముంచుకు వచ్చిన; నిద్రన్= నిద్రయందు; చొక్కి+ ఉండెను= మైమరచి ఉండింది.

**తా :** ఓ పరీక్షిన్మహారాజా! పద్మంవంటి కన్నులుగల యశోదాదేవి, వసుదేవుడు తన దగ్గరికి బాలకృష్ణుణ్ణి తేవడం గానీ, తన బిడ్డను తీసుకొని పోవడంగానీ తెలియక గాఢనిద్రలో మైమరచి ఉండింది.

**సీ. అంత బాలిక యావు రని యేడ్చుచిఱుచప్పు డాలించి వే కన నాఁకయింటి**
**కావలివారు మేల్కని చూచి తలుపులతాళముల్ తొంటివిధమున నుండఁ**
**దెలిసి చక్కన వచ్చి దేవకి నీళ్ళాడె రమ్మురమ్మని యా భోజరాజుతోడఁ**
**జెప్పిన నాతఁడు చిడిముడిపాటుతోఁ దల్పంబు పై లేచి తత్తఱమున**

**తే. వెంద్రుకలు వీడఁ బై చీర వ్రేలియాడఁ, దాల్మి కీలూడ రోషాగ్ని దర్పమాడ**
**భూరివైరంబుతోఁ గూడ పురిటియింటి, జాడఁ జనుదెంచి యా పాపఁ జంపఁ గదియ. 148**

**ప్రతి :** అంతన్= తరువాత; బాలిక= ఆ ఆడుబిడ్డ, మాయాశక్తి; ఆవురు+అని= ఆవురనుచు; ఏడ్చు= ఏడ్చునట్టి; చిఱు= చిన్న; చప్పుడు= శబ్దం; ఆలించి= విని; వే= వెంటనే; కనన్= చూచుటకు; ఆఁకయింటి= చెరసాలయొక్క; కావలివారు= కావలివాండ్రు; మేల్కని= నిదురలేచి; చూచి= నిశితంగా చూచి; తలుపుల= తలుపులయొక్క; తాళముల్= తాళాలు; తొంటి విధమునన్= మునుపటివలెనే, అనగా వేసినవి వేసినట్లుగానే; ఉండన్= ఉండగా; తెలిసి= తెలుసుకొని; చక్కనన్+వచ్చి= నేరుగా వచ్చి; ఆ భోజరాజుతోడన్= ఆ కంసరాజుతో; దేవకి= దేవకీదేవి; నీళ్ళాడె= ప్రసవించింది; రమ్ము; రమ్ము+అని= రా రమ్మని; చెప్పినన్= చెప్పగా; ఆతఁడు= ఆ కంసుడు; చిడిముడిపాటుతోన్= తొట్రుపాటుతో; తల్పంబు పైన్= పడకమీదినుండి; లేచి= పైకిలేచి; తత్తఱమునన్= తత్తరపాటుతో; వెంద్రుకలు వీడన్= వెంట్రుకలు చెదిరిపోవగా; పై చీర= మీది ఉత్తరీయం, పైన వేసుకొన్న వస్త్రం; వ్రేలియాడన్= వ్రేలాడగా, జీరాడగా; తాల్మి= ధైర్యం; కీలు+ఊడన్= చెదరిపోవగా; రోష+అగ్ని= కోపమనెడి నిప్పు; దర్పము+ఆడన్= త్రుళ్ళిపడగా; భూరి= గొప్ప; వైరంబుతోన్+కూడన్= వైరంతో కూడుకొన్నవాడై; పురిటి+ఇంటి జాడన్= దేవకీదేవి ప్రసవించిన ఇంటిత్రోవలో; చనుదెంచి= వచ్చి; ఆ పాపన్= ఆ బిడ్డను; చంపన్= చంపుటకు; కదియన్= దగ్గరికి రాగా...

**తా :** తరువాత ఆ బాలిక ఆవుర మని ఏడ్చింది. ఆ శబ్దం విని చెరసాల కావలివారు నిద్రలేచారు. అటు ఇటు తిరిగి చూచారు. వేసిన తాళాలు వేసినట్లే ఉన్నాయి. తరువాత సరాసరి కంసునిదగ్గరకు వెళ్లారు. దేవకీదేవి ప్రసవించింది వెంటనే రండని అన్నారు. కంసుడు తొట్రుపాటుతో పడకమీది నుండి లేచాడు. భయంతో కంపింపసాగాడు. ముడిచిన అతని వెంద్రుకలు చెదరిపోయాయి. పైనున్న ఉత్తరీయం జారిపోయింది. ధైర్యం సడలిపోయింది. కోపాగ్ని ఎగసిపడి మిక్కిలి వైరంతో కంసుడు దేవకీదేవి ప్రసవించిన ఇంటికి వచ్చి ఆ ఆడబిడ్డను చంపాలని దగ్గరకి వచ్చేసరికి

వ. అంత దేవకి యడ్డంబు వచ్చి యిట్లనియె. 149

**ప్రతి :** అంతన్= అప్పుడు; దేవకి= దేవకిదేవి; అడ్డంబు వచ్చి= అడ్డంగా వచ్చి; ఇట్లు= ఈ విధంగ; అనియెన్= అనింది.

**తా :** అంతటిలోనే దేవకిదేవి కంసునికి అడ్డంగా వస్తూ ఇలా పలికింది.

ఉ. అన్న! శమింపు మన్న! తగ దల్లుఁడు గాఁ డిది మేనగోడ లౌ
మన్నన సేయుమన్న! విను మానినిఁ జంపుట రాచపాడి గా
దన్న, సుకీర్తివై మనఁ గ దన్న! మహాత్ములు వోవు త్రోవఁ బో
వన్న! భవత్సహోదరిఁ గదన్న, నినున్ శరణంబు వేఁడెదన్. 150

**ప్రతి :** అన్న!= ఓ కంసన్నా! శమింపుము+అన్న!= శాంతించుమన్నా!; తగదు= కూడదు; అల్లుఁడు+కాఁడు= వీడు నీకు మేనల్లుడు కాదు; ఇది= ఈ బిడ్డ; మేన+కోడలు+ఔన్= (నీకు) మేనకోడ లౌతుంది, ఆడపిల్ల; మన్నన+చేయుము+అన్న!= అన్నా మర్యాద చేయి; విను= చక్కగా విను; మానినిన్+చంపుట= స్త్రీని చంపటం; రాచపాడి కాదు+అన్న= ఇది రాజధర్మం కాదన్నా!; సుకీర్తివి+ఐ= మంచిపేరు కలవాడివై; మనన్+కద+అన్న= బ్రతుకు మన్నా!; మహా+ఆత్ములు= మహానుభావులు; పోవు= నడిచే; త్రోవన్= మార్గంలో; పోవు+అన్న= వెళ్ళుమన్నా!; భవత్= నీ యొక్క; సహోదరిన్+కదన్న= తోడపుట్టినదాన్ని కదా అన్నా; నినున్= నిన్ను; శరణంబు= రక్షణను; వేఁడెదన్= ప్రార్థిస్తున్నాను.

**తా :** అన్నా! శాంతించు మన్నా! వీడు నీ మేనల్లుడు కాదు. నీ మేనకోడలు. ఆడపిల్ల. దీన్ని ఆదరించు. స్త్రీని చంపటం రాజధర్మం కాదు. మంచిపేరు తెచ్చుకో. మహాత్ములు నడిచే మార్గంలో నడువు. నేను నీ తోడబుట్టినదాన్ని కదా. నిన్ను శరణు వేడుతున్నానన్నా!

**విశే :** అన్నా! ఆకాశవాణి మాటప్రకారం అష్టమసంతానం, కొడుకైతే నీకు ప్రమాదకారి అవుతాడేమో కాని, ఇది ఆడపిల్ల! నిన్నేమి చేయగలదు – అందువల్ల చంపవద్దు అని దేవకీదేవి ప్రార్థన.

క. కట్టా! యార్గురుకొడుకులఁ, బట్టి వధించితివి యాఁడుఁబడు చిది, కోడల్,
నెట్టన చంపఁగవలెనే?, కట్టిఁడివి గదన్న! యన్న! కరుణింపఁగదే! 151

**ప్రతి :** అన్న!= అన్నయ్యా!; కట్టా= అయ్యో!; ఆర్గురు కొడుకులన్= ఆరుమంది పుత్రులను; పట్టి వధించితివి= పట్టి చంపావు; ఆఁడుఁబడుచు+ఇది= ఇది ఆడుబిడ్డ; కోడల్= (నీకు) మేనకోడలు; నెట్టన= తప్పనిసరి అన్నట్లుగా; చంపన్+కన్= చంపాల్నా?; కట్టిఁడివి+కద+అన్న= నీవు క్రూరాత్ముడివి కదన్నా!; కరుణింపన్+కదే!= అన్నా దయ చూపరాదా!

**తా :** అన్నా! ఆరుగురు కొడుకులను చంపావు. ఇది ఆడుబిడ్డ. నీకు మేనకోడలు. తప్పనిసరి అన్నట్లు ఈ పాపనుకూడా చంపాల్నా! అన్నా! నీవు కఠినాత్ముడివి. అన్నా! నీవు దయచూపరాదా!

క. పుత్త్రుఁడు నీ బ్రతుకునకును, శత్రుం డని వింటి గాన సమయింపఁ దగుం,
బుత్త్రులకు నోఁచనైతిని, బుత్త్రీదానంబు సేసి పుణ్యముఁ గనవే! 152

**ప్రతి :** పుత్త్రుఁడు= కొడుకు; నీ బ్రతుకునకును= నీ జీవితానికి; శత్రుండు= శత్రువు; అని వింటి(వి)+కానన్= అని విన్నావు కనుక; సమయింపన్+తగున్= చంపవలసిందే; పుత్త్రులకున్= కొడుకులను కలిగి ఉండటానికి; నోఁచన్+ఐతిని= పుణ్యం చేయనిదాన్నయ్యాను; పుత్త్రీదానంబు+చేసి= కూతురిని దానంగా ఇచ్చి; పుణ్యమున్+కనవు+ఏ!= పుణ్యాన్ని పొందుమన్నా!

**తా :** నా కొడుకు గదా, నీ ప్రాణానికి శత్రువని ఆకాశవాణివల్ల విన్నావు. అందువల్ల పుట్టింది కొడుకైతే నీవు చంపవచ్చు. కాని, ఇప్పుడు పుట్టింది ఆడుబిడ్డ. నేను కొడుకులకు నోచుకోలేదు. ఈ కూతురినైనా నాకు దానంగా ఇచ్చి పుణ్యం కట్టుకో.

**వ. అని పయ్యెదఁ జక్క సవరించుకొనుచుఁ బలవరించుచు, భ్రాంతిపడి కూఁతున్ గ్రక్కున నక్కునం జక్క హత్తించుకొని, చెక్కు చెక్కున మోపి చయ్యన నుత్తరీయాంచలంబున సంచలతం గప్పి చప్పుడుగాఁ గుయ్యిడ, నయ్యెడం గ్రయ్యంబడి వాఁడు పోఁడిమి సెడఁ దోఁబుట్టువుం దిట్టి, చిట్టిపట్టి నావురని వాపోవఁ గావరంబున నడుగు లొడిసి తిగిచి వడిం బెడిసిపడం బుడమిపయిం బడవైచిన నబ్బాలయు నేలంబడక యవలీల నెగసి నవ్యదివ్యమాలికాగంధబంధురమణిహారాంబరాద్యలంకారమనోహారిణియు, గదా శంఖ చక్రపద్మశరచాపాసిశూలధారిణియునై యెనిమిదికరంబులం గరం బొప్పుచు, సిద్ధచారణకిన్నరగరుడ గంధర్వాది వైమానిక నికాయంబు గానిక లిచ్చి పొగడ, నెగడుచు నచ్చరలయాటపాటలకు మెచ్చుచు, మింటనుండి కంటఁబడి కంటువడఁ గంసున కిట్లనియె. 153**

**ప్రతి :** అని= ఈ విధంగా పలికి; పయ్యెదన్= పయిటను; చక్కన్= సరిగ; సవరించుకొనుచున్= సర్దుబాటు చేసుకొంటూ; పలవరించుచున్= ఏదేదో మాట్లాడుతూ; భ్రాంతిపడి= ఉన్నదిలేనట్లు, లేనిది ఉన్నట్లు భావించి; కూఁతున్= కూతురిని; గ్రక్కునన్= త్వరగా; అక్కునన్= ఎదమీద; చక్కన్= పొందికగా; హత్తించుకొని= ఒత్తుకొంటూ; చెక్కు= (తన)చెంపను; చెక్కునన్= (కూతురి) చెంపయందు; మోపి= ఆనించి; చయ్యనన్= తటాలున; ఉత్తరీయ+అంచలంబునన్= పైటచెరగుతో; సంచలతన్= వణకుతూ; కప్పి= ఆ బిడ్డను కప్పివేసి; చప్పుడుగాన్= పెద్దశబ్దమగునట్లుగా; కుయ్యిడన్= ఏడ్వగా; ఆ+ఎడన్= అప్పుడు; వాఁడు= కంసుడు; క్రయ్యన్+పడి= కలియబడి; పోఁడిమి= తగినవిధం; చెడన్= చెడునట్లుగా; తోన్+పుట్టువున్= తోడపుట్టిందైన దేవకీదేవిని, సోదరిని; తిట్టి= తిడుతూ; చిట్టిపట్టి= చిన్నపాప; ఆవురు+అని= ఆవురుమను ధ్వనితో; వాపోవన్= ఏడ్చుచుండగా; కావరంబునన్= మదంతో; అడుగులు= (ఆ బిడ్డ) కాళ్లను; ఒడిసి= అదిమిపట్టుకొని; తిగిచి= లాగి; వడిన్= వేగంగా; బెడిసిపడన్= చెదరిపడునట్లుగ; పుడమిపయిన్= నేలమీద; పడవైచినన్= పడవేయగా; ఆ+బాలయున్= ఆ పసిపాపకూడ; నేలన్= నేలమీద; పడక= పడకుండ; అవలీలన్= సులువుగ; ఎగసి= పై కెగిరి; నవ్య= క్రొత్తవైన; దివ్య= దేవలోకంలోని; మాలికా= పూలమాలల; గంధ= సువాసనచేత; బంధుర= మకుటం; మణిహార= మణులు పొదిగిన హారాలు; అంబర= వస్త్రాలు; ఆది= మొదలైన; అలంకార= అలంకారాలచేత; మనోహారిణియున్= ఇంపైనదీ; గదా= గదాయుధం; శంఖ= శంఖం; చక్ర= చక్రాయుధం; పద్మ= పద్మం; శర= బాణం; చాప= ధనుస్సు; అసి= ఖడ్గం; శూల= త్రిశూలం; ధారిణియున్+ఐ= ధరించిందై; ఎనిమిది కరంబులన్= ఎనిమిది చేతులతో; కరంబు= మిక్కిలి; ఒప్పుచున్= ప్రకాశిస్తూ; సిద్ధ= సిద్ధులు; చారణ= చారణులు; కిన్నర= కిన్నరులు; గరుడ= గరుడులు; గంధర్వ= గంధర్వులు; ఆది= మొదలైన; వైమానిక= విమానాలందు తిరుగువారియొక్క-ఆకాశసంచారులయొక్క; నికాయంబు= సమూహం; కానికలు= కానుకలు; ఇచ్చి పొగడన్= ఇస్తూ స్తుతింపగా; నెగడుచున్= వర్ధిల్లుతు; అచ్చరల= అప్సరసల;

ఆటపాటలకున్= నృత్యగీతాలకు; మెచ్చుచున్= మెచ్చుకొంటూ; మింటనుండి= ఆకాశంనుండి; కంటన్+పడి= అగుపించి; కంటు+పడన్= పగతో; కంసునకున్= కంసునితో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికింది.

**తా :** దేవకీదేవి ఆ విధంగ పలికి, పైటను సవరించుకొని, ఏదేదో మాట్లాడుతూ భ్రాంతికి లోనై తన కూతురిని త్వరత్వరగ ఎత్తుకొని ఎదకు ఒత్తుకొంటూ, తన చెక్కిలిని ఆ పాప చెక్కిలికి ఆనించి భయంతో కంపిస్తూ తటాలున తన పైటచెరగుతో ఆ బిడ్డను కప్పివేసింది. బావురుమని ఏడ్చింది. అప్పుడు కంసుడు అతిశయించిన కోపంతో ఔచిత్యాన్ని వదలి, తోబుట్టువని కూడా చూడకుండా దేవకీదేవిని తిట్టి, కెవ్వుమని ఏడుస్తున్న ఆ పసిపాపకాళ్ళు రెండూ ఎగసి పట్టుకొని లాగి నేలమీద ఎత్తి కొట్టాడు. కాని, ఆ పాప నేలమీద పడలేదు. అవలీలగా పై కెగిరింది. దేవలోక పుష్పమాలల పరిమళాలతో, కిరీటంతో, మణిహారాలతో, దివ్యాంబరాలతో అలంకృత అయి మనోహరంగా అగుపించింది. గద, శంఖ, చక్ర, పద్మ, బాణ, ధనుస్సు, ఖడ్గ, శూలాల్ని ధరించి, ఎనిమిది చేతులతో ప్రకాశిస్తూ, సిద్ధ చారణ కిన్నర గరుడ గంధర్వాదిదేవగణాలూ, విమానసంచారులూ కానుకలు సమర్పించి స్తోత్రాలు చేస్తుండగా, అప్సరసల ఆటపాటలను మెచ్చుకొంటూ, ఆకాశంలో అగుపించి, కంసునితో కసిగా ఇలా పలికింది.

**ఉ. తెంపరివై పొరిం బొరిని దేవకిబిడ్డలఁ జిన్నికుఱ్ఱలం**
**జంపితి వింకనైన నుపశాంతి వహింపక ఱాలమీఁద నొ**
**ప్పింపఁగ నిస్సిరో యిదియు బీరమె? నా సరసన్ జనించి నిన్**
**జంపెడు వీరుఁ డొక్క దెస సత్కృతి నొందెడువాఁడు దుర్మతీ! 154**

**ప్రతి :** దుర్మతీ!= చెడు బుద్ధిగల ఓ కంసా! తెంపరివి+ఐ= తెగింపుతో; పొరిన్+పొరిని= వెంటవెంటనే; దేవకిబిడ్డలన్= దేవకీదేవిబిడ్డలను; చిన్నికుఱ్ఱలన్= చిన్నపిల్లలను; చంపితివి= చంపావు; ఇంకన్+ఐనన్= ఇకనైనా; ఉపశాంతి= ఓర్పు; వహింపక= పొందకుండ; ఱాలమీఁదన్= బండరాయిమీద; నొప్పింపన్+కన్= (నన్ను) కొట్టిబాధించడం; ఇస్సిరి+ఓ= ఛీ ఛీ!; ఇదియున్= ఇదికూడా; బీరము+ఎ= వీరత్వమా?; నా, సరసన్= నాతో కూడా; జనించి= పుట్టి; నిన్= నిన్ను; చంపెడు= చంపునట్టి; వీరుఁడు= వీరుడైనవాడు; ఒక్కదెసన్= ఒక చోట; సత్కృతిన్= సమ్మానాన్ని; ఒందెడువాఁడు= పొందుచున్నాడు.

**తా :** ఓ దుర్మార్గుడా! పెద్ద తెగింపుతో వెంట వెంటనే దేవకీదేవి బిడ్డల్ని పసిపిల్లల్ని చంపావు. ఇకనైనా శాంతించకుండా, నన్ను బండమీద కొట్టి చంపాలనుకొన్నావు. ఛీ! ఛీ! ఇది కూడా శూరత్వమా? నిన్ను చంపటానికి నాతోపాటు పుట్టిన వీరుడు ఒకచోట కీర్తింపబడుతూ పెరుగుతున్నాడు.

**వ. అని పలికి. 155**

**ప్రతి :** అని పలికి= అని పలుకుతూ...

**తా :** అని అంటూ, ఇంకా

**క. మహనీయగుణాస్పదయై, మహిలో నా దేవి జనము మన్నింపంగా**
**బహునామనివాసంబుల, బహునామములం జరించె భద్రాత్మికయై. 156**

**ప్రతి :** ఆ దేవి= ఆ యోగమాయాదేవి; మహనీయ= చాలగొప్పవైన; గుణ= గుణాలకు; ఆస్పద+ఐ= ఉనికిపట్టయి; భద్ర+ఆత్మిక+ఐ= శుభములనిచ్చునట్టి మనస్సుగలద్రై; మహిలోన్= భూమిపై; బహు= అనేకమైన; నామ= పేర్లుగల; నివాసంబులన్= ప్రదేశాల్లో; బహు= అనేకమైన; నామములన్= పేర్లతో; చరించెన్= తిరిగింది.

**తా :** ఆ యోగమాయాదేవి మహనీయగుణాలు కలిగి, భక్తులకు శుభాలను కల్గిస్తూ, సకలజనులు పూజిస్తుండగా, వివిధ ప్రదేశాల్లో, వివిధనామాలతో దర్శనమిస్తూంది.

**వ. అంత నా బోటి వలికిన కలికి పలుకులు ములుకులై, చెవులఁ జిలికిన, నులికిపడి, జళుకు గదిరిన మనంబున ఘనంబుగ వెఱఁగంది, కంది, కుందెడు దేవకీవసుదేవుల రావించి, యాదరంబున సంభావించి, చేరి వారితో నిట్లనియె. 157**

**ప్రతి :** అంతన్= తరువాత; ఆ బోటి= ఆ యోగమాయాశక్తి; పలికిన= పలికినట్టి; కలికిపలుకులు= ముచ్చటైన మాటలు; ములుకులు+ఐ= బాణాలై; చెవులన్= చెవులలో; చిలికినన్= సోకగా; ఉలికిపడి= అదరిపడి; జళుకు= బెదరు; కదిరిన= అతిశయించినట్టి; మనంబునన్= మనస్సునందు; ఘనంబు+కన్= మిక్కిలిగ; వెఱఁగు+అంది= ఆశ్చర్యపడి; కంది= బాధపడి; కుందెడు= దుఃఖపడుచున్న; దేవకీ వసుదేవులన్= దేవకీవసుదేవుల్ని; రావించి= రప్పించి; ఆదరంబునన్= ప్రేమతో; సంభావించి= గౌరవించి; చేరి= దగ్గరకు పోయి; వారితోన్= ఆ దేవకీవసుదేవులతో; ఇట్లు+అనియెన్= ఈ విధంగ అన్నాడు.

**తా :** ఆ యోగమాయ పలికిన ముచ్చటైన మాటలు ములుకులవలె తన చెవిని సోకగా, కంసుడు అదరిపడి, బెదరిన మనస్సుతో మిక్కిలి ఆశ్చర్యపడి, బాధపడ్డాడు. పిదప దుఃఖిస్తున్న దేవకీ వసుదేవులను రప్పించి, ఆదరంగా, గౌరవంగా వారి దగ్గరకు వెళ్ళి ఈ విధంగా అన్నాడు.

**ఉ. పాపుఁడ, బాలఘాతకుఁడ, బంధువిరక్తుఁడ, దుష్టచిత్తుఁడన్,**
**గోపనుఁడం, జరన్మృతుఁడఁ, గ్రూరుఁడ, బ్రాహ్మణహంతభంగి మీ**
**పాపలఁ జంపితిన్ బయలిపల్కుల నమ్మితి సాధులార! నా**
**పాపము లుగ్గడింపక కృపాపరులై కనరే శమింపరే! 158**

**ప్రతి :** సాధులారా!= సజ్జనులైన దేవకీవసుదేవులారా!; పాపుఁడన్= (నేను) పాపాత్ముణ్ణి; బాలఘాతకుఁడన్= శిశువుల్ని చంపినవాణ్ణి; బంధువిరక్తుఁడన్= బంధువుల మీద ప్రేమ లేనివాణ్ణి; దుష్టచిత్తుఁడన్= చెడ్డబుద్ధి కలవాణ్ణి; కోపనుఁడన్= కోపస్వభావం కలవాణ్ణి; చరన్+మృతుఁడన్= నడిచే శవాన్ని; క్రూరుఁడన్= క్రూరమైనవాణ్ణి; బ్రాహ్మణహంతభంగిన్= బ్రాహ్మణుణ్ణి హత్యచేసినవానివలె; మీ పాపలన్= మీ బిడ్డలను; చంపితిన్= వధించాను; బయలిపల్కులన్= ఆకాశవాణి మాటలను; నమ్మితిన్= నమ్మాను; నా, పాపములు= నేను చేసినపాపపుపనులు; ఉగ్గడింపక= పేర్కొనకుండ; కృపాపరులు+ఐ= కరుణ కలవారై; కనరు+ఏ= (నన్ను దయతో) చూడండి; శమింపరు+ఏ= శాంతించండి.

**తా :** సాధుజనులైన దేవకీవసుదేవులారా! నేను పాపాత్ముణ్ణి; పసిపాపల చంపినవాణ్ణి; బంధువుల మీద ప్రేమ లేనివాణ్ణి; చెడుబుద్ధి కలవాణ్ణి; కోపస్వభావం ఉండేవాణ్ణి; బ్రతికికూడా చచ్చినవాడితో సమానమైనవాణ్ణి. బ్రహ్మహత్య చేసినవానివలె మీ బిడ్డలను చంపాను. ఆకాశవాణిమాటలు నమ్మాను. నా పాపాలు ఏకరువుపెట్టక నన్ను దయతో చూడండి. శాంతించండి

**ఉ. ఒక్కెడఁ బ్రాణు లందఱు నిజోచితకర్మము లోలిఁ ద్రిప్పఁగా**
**నొక్కొక మేనితోఁ బొడమి యొక్కొక త్రోవను రాక పోకలం**
**జిక్కులఁ బొందుచుండుదురు, చెల్మిని సంసృతితోడఁ బాయ రే**
**నెక్కడి హంత? మీ శిశువు లెక్కడి హన్యులు దూఱ నేటికిన్? 159**

**ప్రతి :** ఒక్క+ఎడన్= ఒకచోట; ప్రాణులు+అందఱు= జీవులు అందరు; నిజ+ఉచిత= తమకు తగిన; కర్మములు= పుణ్యపాపకర్మలు; ఓలిన్= వరుసగా; త్రిప్పన్+కాన్= తమను త్రిప్పుతుండగా; ఒక్క+ఒక= ఒక్కొక్కని కర్మననుసరించిన (ఎవరికి వారిది ప్రత్యేకమైన); మేనితోన్= శరీరంతో; పొడమి= పుట్టి; ఒక్క+ఒక= ఒక్కొక్కవిధమైన; త్రోవను= మార్గంలో; రాకపోకలన్= ఈ లోకంలోకి రావడంలో, పోవడంలో; చిక్కులన్= కష్టాలను; పొందుచున్+ఉండుదురు= అనుభవిస్తూ ఉంటారు; సంసృతితోడన్= సంసారంతో; చెల్మినిన్= స్నేహాన్ని; పాయరు= వదలుకోరు; ఏన్= నేను; ఎక్కడి హంతన్= హత్య చేసినాననడం ఏమిటి? మీ శిశువులు= మీ బిడ్డలు; ఎక్కడి హన్యులు= హత్య చేయబడినవారు కావడం ఏమిటి!; దూఱన్= దూషించడం; ఏటికిన్= ఎందుకు?

**తా :** జీవులంతా తాము చేసిన కర్మల ననుసరించి, ఒక్కొక్కరు ఒక్కొక విధమైన శరీరంతో జన్మించి, ఒక్కొక్క మార్గంలో రాకపోకలు సాగిస్తుంటారు. కష్టాలు అనుభవిస్తుంటారు. ఏ జన్మ స్నేహ సంబంధాలను ఆ జన్మతో వదలుకోరు. అలాంటప్పుడు నేను మీ బిడ్డల్ని చంపడం ఏమిటి? వాళ్ళు నాచేత చావడం ఏమిటి? మీరు నన్ను నిందించడం దేనికి?

**క. పగతురఁ జెఱిచితి ననియును, బగతురచేఁ జెడితి ననియు బాలుఁడు దలఁచున్,**
**బగచెలుములు లే వాత్మకుఁ, బగచెలుములకీలు కర్మబంధము సుండీ! 160**

**ప్రతి :** బాలుఁడు= అజ్ఞాని; పగతురన్= శత్రువులను; చెఱచితిన్= నశింప చేశాను; అనియున్= అని; పగతురచేన్= శత్రువులచేత; చెడితిన్= నాశనమయ్యాను; అనియున్= అనీ; తలఁచున్= అనుకొంటాడు; పగ, చెలుములు= శత్రుత్వ మిత్రత్వాలు; ఆత్మకున్, లేవు= ఆత్మకు లేనేలేవు; పగ, చెలుముల= మిత్రత్వ, శత్రుత్వాలయొక్క; కీలు= సంబంధం; కర్మబంధము= కర్మలతో ముడిపడింది; సుండీ= సుమీ!

**తా :** అజ్ఞాని తాను శత్రువులను నశింపచేశానని, లేదా శత్రువులచేత నాశనమయ్యానని అనుకొంటాడు. కాని, ఆత్మకు మిత్రత్వ శత్రుత్వాలు లేవు. మిత్రత్వ శత్రుత్వాల సంబంధం కర్మబంధంతో ముడివడి ఉంటుంది సుమా!

**వ. అని పలికి, కన్నీరు నించి, వగచి, వెఱచుచు, దేవకీవసుదేవుల పాదంబులఁ బట్టుకొని, సంకెలలు విప్పించి, మిక్కిలి యక్కఱ గల వాక్యంబుల నైక్యంబులు నెఱపిన, వారును బరితప్తుండైన కంసునిం జూచి, రోషంబును బాసిరి. అంత నా వసుదేవుండు బావ కిట్లనియె. 161**

**ప్రతి :** అని పలికి= అని చెప్పి; కన్నీరు నించి= కళ్ళల్లో నీరు నిండించి; వగచి= దుఃఖించి; వెఱచుచున్= భయపడుతూ; దేవకీవసుదేవుల= దేవకీదేవి వసుదేవులయొక్క; పాదంబులన్= పాదాలను; పట్టుకొని= పట్టుకొని క్షమాపణ కోరి; సంకెలలు= సంకెళ్ళు; విప్పించి= ఊడదీయించి; మిక్కిలి అక్కఱగల= చాలా ప్రీతిగల; వాక్యంబులన్= మాటలచేత; ఐక్యంబులు= కలసి మెలసి ఉండటం; నెఱపినన్= నడుపగా; వారును= ఆ దేవకీవసుదేవులును; పరితప్తుండు+ఐన=

పశ్చాత్తాపపడినవాడైన; కంసునిన్+చూచి= కంసమహారాజును చూచి; రోషంబును= కోపాన్ని; పాసిరి= వదలి పెట్టారు; అంతన్= ఆ తరువాత; ఆ వసుదేవుండు= ఆ వసుదేవుడు; బావకున్= తన భార్యకు అన్నయైన కంసునికి; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** అని చెప్పి, కంసుడు కన్నీరు కార్చి, దుఃఖించి, భయపడుతూ దేవకీవసుదేవుల పాదాలకు నమస్కరించి, సంకెళ్ళు విప్పించి, ప్రీతిగా కలుపుగోలు మాటలు మాట్లాడేసరికి పశ్చాత్తప్తుడైన ఆ కంసుణ్ణి చూచి, దేవకీ వసుదేవులు తమ కోపాన్ని విడనాడారు. తరువాత వసుదేవుడు తనబావ కంసునితో ఇలా అన్నాడు.

**శా. బావా! నీ వచనంబు నిక్కము సుమీ, ప్రాణుల్ గతజ్ఞానులై**
**నీ వే నంచును లోభమోహమదభీనిర్మిత్రతామోద శో**
**కావేశంబుల నొండొరుం బొడుతు రేకాకారుఁడై సర్వ రూ**
**పావిష్టుండగు నీశ్వరుం దెలియలే రన్యోన్యవిభ్రాంతులై. 162**

**ప్రతి :** బావా!= ఓ కంసరాజా!; నీ వచనంబు= నీవు చెప్పినమాటలు; నిక్కము= నిజం; సుమీ= సుమా; ప్రాణుల్= జీవులు; గత= కోల్పోయిన; జ్ఞానులు+ఐ= జ్ఞానం కలవారై; అన్యోన్య= పరస్పరం; విభ్రాంతులు+ఐ= చిత్తచాంచల్యం కలవారై; ఏక+ఆకారుఁడు+ఐ= ఒకే ఆకారంకలవాడై; సర్వ= అన్ని; రూప= ఆకారాలందు; ఆవిష్టుండు+అగు= చొచ్చినవాడైన; ఈశ్వరున్= భగవంతుణ్ణి; తెలియలేరు= తెలుసుకోలేకుండా ఉన్నారు; నీవు= నీవు; ఏను= నేను; అంచును= అనుకొంటూ; లోభ= లోభగుణంతో; మోహ= మోహంతో; మద= పొగరుతో; భీ= భయంతో; నిర్మిత్రతా= స్నేహభావం లేకపోవడంతో; ఆమోద= సంతోషంయొక్క; శోక= దుఃఖంయొక్క; ఆవేశంబులన్= ఆవేశాలతో; ఒండు+ఒరున్= ఒకరినొకరు; పొడుచుదురు= పొడుచుకొంటారు.

**తా :** బావా! కంసా! నీవు చెప్పినమాట నిజం. అజ్ఞానానికి, భ్రమకు లోనై, ప్రాణులు అందరిలో అంతర్లీనంగా ఉండే పరమాత్మను దర్శించలేక – నీవూ, నేనూ అనే భేదభావంతో; లోభ, మోహ, మద, భయ, శత్రుత్వభావాలకు, సంతోష దుఃఖావేశాలకు లోనై ఒకరి నొకరు చంపుకొంటున్నారు. (ఇది జ్ఞాని లక్షణంకాదు. జ్ఞాని సర్వత్ర సమదర్శనుడు)

**వ. అని యిట్లు ప్రసన్నులైన దేవకీ వసుదేవుల యనుజ్ఞ వడసి, కంసుం డింటికిం జని యా రేయి గడపి, మఱునాఁడు ప్రొద్దునం గ్రద్దనం దనకుం బరతంత్రులగు మంత్రుల రావించి, యోగనిద్రవలనం దా వినిన వృత్తాంతం బంతయు మంతనంబున నెఱింగించిన, నపుడు వార లతని కిట్లనిరి. 163**

**ప్రతి :** అని ఇట్లు= అని ఈ విధంగ; ప్రసన్నులు+ఐన= ప్రశాంతమైన మనస్సు కలవారైన; దేవకీవసుదేవుల= దేవకీదేవి వసుదేవులయొక్క; అనుజ్ఞ= అనుమతి; పడసి= పొంది; కంసుండు+ఇంటికిన్= కంసుడు తన ఇంటికి; చని= వెళ్ళి; ఆ రేయి= ఆ రాత్రి; కడపి= వెళ్లబుచ్చి; మఱునాఁడు ప్రొద్దునన్= మరునాటి ఉదయాన్నే; గ్రద్దనన్= వెంటనే; తనకున్= తనకు; పరతంత్రులు+అగు= విధేయులైన; మంత్రులన్= మంత్రులను; రావించి= రప్పించి; యోగనిద్రవలనన్= యోగమాయాదేవివల్ల; తాన్ వినిన= తాను విన్నట్టి; వృత్తాంతంబు+అంతయున్= విషయం అంతా; మంతనంబునన్= ఏకాంతమందు; ఎఱింగించినన్= తెలుపగా; వారలు= ఆ మంత్రులు; అతనికిన్= ఆ కంసునికి; ఇట్లు= ఈ విధంగ; అనిరి= అన్నారు.

**తా :** అని ఆ విధంగా ప్రశాంతచిత్తులైన దేవకీవసుదేవుల అనుమతిని పొంది, కంసుడు తన అంతఃపురానికి వెళ్ళి, ఆ రాత్రిగడపి, మరునాటి ఉదయం తనకు పూర్తిగా విధేయులైన మంత్రుల్ని వెంటనే రప్పించి, యోగమాయాదేవివల్ల తాను విన్న వృత్తాంతమంతా ఏకాంతంలో వారికి చెప్పాడు. అది విన్న మంత్రులు కంసునితో ఇలా అన్నారు.

**క. ఇట్టయినఁ దడయ నేటికిఁ?, బట్టణముల మందలందుఁ బల్లెల నెల్లన్**
**బుట్టెడి పెరిఁగెడి శిశువులఁ, బట్టి వధించెదము మమ్ముఁ బంపు మధీశా! 164**

**ప్రతి :** అధి+ఈశా!= ఓ కంసరాజా!; ఇట్టు+అయినన్= ఇలా జరగ్గా; తడయన్= ఆలస్యం చేయడం; ఏటికిన్= ఎందుకు?; మమ్మున్= మమ్మల్ని; పంపుము= పంపించు; పట్టణములన్= పట్టణాల్లో; మందల+అందున్= గొల్లపల్లెల్లో; పల్లెలన్+ ఎల్లన్= గ్రామాలన్నింటిలో; పుట్టెడి= పుట్టుచున్న; పెరిఁగెడి= పెరుగుచున్న; శిశువులన్= బిడ్డలను; పట్టి= పట్టుకొని; వధించెదము= చంపేస్తాం.

**తా :** ఓ కంసరాజా! యోగమాయాశక్తి చెప్పింది నిజమైతే, ఆలస్యం చేయటం ఎందుకు? వెంటనే మమ్మల్ని పంపండి. పట్టణాల్లో, పల్లెల్లో, గొల్లపల్లెల్లో పుట్టే పిల్లల్ని, పెరిగే పిల్లల్ని పట్టి వధిస్తాము.

**మ. భవదీయోజ్జ్వలబాహుచాపవిలసద్బాణావళీభగ్నులై**
**దివిజాధీశ్వరు లేక్రియం బడిరొ యే దేశంబులన్ డాఁగిరో**
**శివునిం జొచ్చిరొ బ్రహ్మఁజెందిరొ హరిన్ సేవించిరో మౌని వృ**
**త్తి వనాంతంబుల నిల్చిరో మనకు శోధింపం దగున్ వల్లభా! 165**

**ప్రతి :** వల్లభా!= ఓ ప్రభూ!; భవదీయ= మీ యొక్క; ఉజ్జ్వల= మిక్కిలిగా ప్రకాశిస్తున్న; బాహు= చేతియందలి; చాప= ధనుస్సునందు; విలసత్= వెలుగుచున్న; బాణ= బాణాలయొక్క; ఆవళీ= సమూహంచేత; భగ్నులు+ఐ= దెబ్బతిన్నవారై; దివిజ+అధి+ఈశ్వరులు= దేవతాప్రభువులు; ఏ క్రియన్= ఏ విధంగ; పడిరి+ఒ= పాట్లుపడ్డారో; ఏ, దేశంబులన్= ఏ యే దేశాల్లో; డాఁగిరి+ఓ= దాగుకొన్నారో!; శివునిన్= పరమేశ్వరుణ్ణి; చొచ్చిరి+ఒ= ఆశ్రయించారో; బ్రహ్మన్= బ్రహ్మదేవుణ్ణి; చెందిరి+ఒ= చేరుకొన్నారో!; హరిన్= విష్ణుమూర్తిని; సేవించిరి+ఓ= సేవిస్తున్నారో!; మౌనివృత్తిన్= మునివృత్తితో; వన+అంతంబులన్= అరణ్యాల మధ్యలో; నిల్చిరి+ఓ= ఉండిపోయారో!; మనకున్= మనకందరికి; శోధింపన్= వెదకడం; తగున్= మంచిది.

**తా :** ప్రభూ! భయంకరంగా ప్రకాశించే మీ చేతి ధనుస్సులో వెలుగుతున్న బాణాల దెబ్బలు తిని దేవతాధిపతులు ఏమై పోయారో? ఎక్కడ తల దాచుకొన్నారో? (కైలాసంలో) శివుణ్ణి శరణు జొచ్చారో! (సత్యలోకంలో) బ్రహ్మను ఆశ్రయించారో! (వైకుంఠంలో); విష్ణుమూర్తిని సేవిస్తున్నారో! అదీ కాకపోతే మునివృత్తిని స్వీకరించి, అడవుల నడుమ ఉన్నారో! మనం వెంటనే వాళ్లందర్నీ వెదకడం మంచిది.

**క. నొచ్చిరి శాత్రవు లనుచును, విచ్చలవిడిఁ దిరుగవలదు వివిధాకృతులన్**
**బ్రుచ్చిలి వత్తురు వారలు, సచ్చినయందాఁక మఱవఁ జన దధిపునకున్. 166**

**ప్రతి :** శాత్రవులు= పగవారు; నొచ్చిరి= దెబ్బతిన్నారు; అనుచును= అని అనుకొంటూ; విచ్చలవిడిన్= ఇష్టం వచ్చినట్లు; తిరుగున్= తిరుగుట; వలదు= కూడదు; వివిధ+ఆకృతులన్= అనేకరూపాల్లో; ప్రుచ్చిలి= మోసగించి; వత్తురు= వస్తారు;

వారలు= ఆ శత్రువులు; చచ్చిన+అందాఁకన్ (అంత+దాఁకన్)= చచ్చేంతవరకూ; మఱవన్= మరచిపోవడం; అధిపునకున్= రాజుకు; చనదు= కూడదు.

**తా :** శత్రువులు దెబ్బతిన్నారులే అని విచ్చలవిడిగా తిరుగ కూడదు. వాళ్ళు అనేకరూపాల్లో మోసగించి దండెత్తి వస్తారు. అందువల్ల శత్రువులు చచ్చేదాకా రాజు వాళ్ళఉనికిని మరువ కూడదు.

**క. ఒత్తికొనుచు రానీఁ జన, దెత్తిన రోగముల రిపుల నింద్రియముల ను**
**త్పత్తిసమయములఁ జెఱుపక, మెత్తన గారాదు రాదు మీఁద జయింపన్. 167**

**ప్రతి :** ఎత్తిన= విజృంభించిన; రోగములన్= వ్యాధుల్నీ; రిపులన్= శత్రువుల్నీ; ఇంద్రియములన్= ఇంద్రియాల్నీ (కర్మేంద్రియ జ్ఞానేంద్రియాలను, మనస్సును); ఒత్తికొనుచున్= త్రోసికొనుచు; రానీన్+చనదు= రానీయకూడదు; ఉత్పత్తి= పుట్టునట్టి; సమయములన్= సమయాలందే; చెఱుపక= నశింపచేయక; మెత్తన కారాదు= మెతకతనం వహించ కూడదు; మీఁదన్= తరువాత; జయింపన్= (వాటిని) అణచివేయడం; రాదు= సాధ్యం కాదు.

**తా :** విజృంభించిన రోగాల్నీ, శత్రువుల్నీ, ఇంద్రియాల్నీ, బలపడ నీయకూడదు. అవి పుట్టినపుడే వాటిని అణచి వేయాలి గాని, మెతకదనం వహించకూడదు. ఆ తరువాత వాటిని జయించటం సాధ్యం కాదు.

**మ. అమరశ్రేణికి నెల్లఁ జక్రి ముఖరుం డా చక్రియే ధర్మమం**
**దమరున్, గోవులు భూమిదేవులు దితిక్షామ్నాయకారుణ్య స**
**త్యములున్ యాగతపోదమంబులును శ్రద్ధాశాంతులున్ విష్ణు దే**
**హము లిన్నింటిని సంహరించిన నతం డంతంబునుం బొందెడిన్. 168**

**ప్రతి :** అమర= దేవతలయొక్క; శ్రేణికిన్= సమూహానికి; ఎల్లన్= అంతటికి; చక్రి= చక్రాయుధాన్ని ధరించినవాడైన విష్ణువు; ముఖరుండు= ముఖ్యుడు; ఆ చక్రి+ఏ= ఆ విష్ణుమూర్తే; ధర్మము+అందు= ధర్మంలో; అమరున్= అమరివుంటాడు; గోవులు= ఆవులు; భూమిదేవులు= బ్రాహ్మణులు; తితిక్షా= ఓర్పు; ఆమ్నాయ= వేదాలు; కారుణ్య= దయ; సత్యములున్= సత్యాలూ; యాగ= యాగాలు; తపస్= తపస్సు; దమంబులును= ఇంద్రియనిగ్రహాలూ; శ్రద్ధా= శ్రద్ధ; శాంతులున్= శాంతులు; విష్ణుదేహములు= విష్ణుమూర్తియొక్క స్వరూపాలు; ఇన్నింటిని= వీటినన్నింటినీ; సంహరించినన్= చంపితే; అతండు= ఆ విష్ణుమూర్తి; అంతంబునున్= నాశనాన్ని; పొందెడిన్= పొందగలడు.

**తా :** దేవతలందరికీ చక్రాయుధుడైన శ్రీమహావిష్ణువే ముఖ్యుడు. ఆ విష్ణువు ధర్మమందు చక్కగా నిలిచి ఉంటాడు. ఆవులు, బ్రాహ్మణులు, ఓర్పు, వేదాలు, దయ, సత్యం, యాగాలు, తపస్సు, ఇంద్రియనిగ్రహం, శ్రద్ధ, శాంతి – ఇవి విష్ణుస్వరూపాలు. వీటి నన్నింటినీ సంహరిస్తే ఆ విష్ణుమూర్తి అంతమౌతాడు.

**వ. కావున. 169**

**ప్రతి :** కావునన్= అందుచేత...

**తా :** కనుక

**ఉ. చంపుదుమే నిలింపులను? జంకెల అంకెలఁ దాపసావలిం**
**బంపుదుమే కృతాంతకుని పాలికిఁ? గ్రేపులతోడ గోవులం**
**ద్రుంపుదుమే? ధరామరులఁ దోలుదుమే? నిగమంబులన్ విదా**
**రింపుదుమే? వసుంధర హరింపుదుమే? జననాథ! పంపుమా! 170**

**ప్రతి :** జననాథ!= ఓ కంసరాజా!; నిలింపులన్= దేవతల్ని; చంపుదుము+ఏ= సంహరింపుమంటావా? తాపస= మహర్షులయొక్క; ఆవలిన్= సమూహాన్ని; జంకెలన్= బెదరింపులతో; అంకెలన్= పెద్ద అరుపులతో; కృతాంతకుని= యమధర్మరాజుయొక్క; పాలికిన్= దగ్గరికి; పంపుదుము+ఏ= పంపుమందువా? క్రేపులతోడన్= దూడలతోకూడ; గోవులన్= ఆవులను; త్రుంపుదుము+ఏ= హతంచేయుమంటావా? ధరా+అమరులన్= భూదేవుల్ని, బ్రాహ్మణుల్ని; తోలుదుము+ఏ= తరిమి వేయుమంటావా? నిగమంబులన్= వేదాలను; విదారింపుదుము+ఏ= చింపి చెల్లాచెదురు చేయుమంటావా? వసుంధరన్= భూమిని; హరింపుదుము+ఏ= అణచి వేయుమందువా? పంపుమా!= (ఆజ్ఞాపించి) మమ్మల్ని పంపండి.

**తా :** ఓ కంసరాజా! దేవతల్ని హతమార్చ మంటావా? మహర్షుల్ని బెదరింపులతో, అరపులతో యమధర్మరాజు దగ్గరికి పంప మంటావా? దూడలతో కూడా ఆవుల్ని చంప మంటావా? బ్రాహ్మణుల్ని తరిమి వేయమంటావా? వేదాలను ధ్వంసం చేయ మంటావా? భూమిని అణచివేయ మంటావా? ఆజ్ఞాపించి, మమ్మల్ని పంపండి.

**వ. అని పలుకుమంత్రుల మంత్రంబుల నిమంత్రితుండై బ్రాహ్మణనిరోధంబు నిషిద్ధం బని తలంపక కాలపాశబద్ధుండై విప్రాదిసాధుమానవులఁ జంప దానవులం బంపి యంతిపురంబునకుం జనియె, ననంతరంబ యా రక్కసులు వెక్కసంబులగు మొక్కలంబుల సజ్జనులపజ్జలం బడి తర్జన గర్జన భర్జనాది దౌర్జన్యంబులంజేసి నిర్జించి పాపంబు లార్జించిరి. 171**

**ప్రతి :** అని= ఈ విధంగా; పలుకు= చెప్పుచున్న; మంత్రుల= మంత్రులయొక్క; మంత్రంబుల= ఆలోచనలచేత; నియంత్రితుండు+ఐ= కట్టువడినవాడై; బ్రాహ్మణ= బ్రాహ్మణులకు; నిరోధంబు= చేటు చేయుట; నిషిద్ధంబు= కూడందని; తలంపక= ఆలోచించక; కాల= కాలమనెడు; పాశ= త్రాటిచేత; బద్ధుండు+ఐ= కట్టివేయబడినవాడై; విప్ర+ఆది= బ్రాహ్మణులుమొదలైన; సాధుమానవులన్= సజ్జనుల్ని; చంపన్= చంపుటకు; దానవులన్= రాక్షసులను; పంపి= పంపించి; అంతిపురంబునకున్= అంతఃపురానికి; చనియెన్= వెళ్లాడు; అనంతరంబు+అ= తరువాత; ఆ రక్కసులు= ఆ రాక్షసులు; వెక్కసంబులు+అగు= సహింపరానివైన; మొక్కలంబులన్= మిడిసిపాట్లతో; సజ్జనుల= మంచివారి; పజ్జలన్+పడి= వెంటబడి; తర్జన= బెదరించడం; గర్జన= పెద్దగా అరవడం; భర్జన= వేయించడం; ఆది= మొదలైన; దౌర్జన్యంబులన్= దుష్టచేష్టలతో; నిర్జించి= జయించి (హింసించడం విజయం సాధించి); పాపంబులు= పాపాలు; ఆర్జించిరి= సంపాదించారు.

**తా :** కంసుడు ఆ విధంగా చెపుతున్నమంత్రులఆలోచనలకు లొంగినవాడై, బ్రాహ్మణుల్ని హింసించడం మంచిది కాదని యెంచక, కాలమనే పాశానికి బద్ధుడై; బ్రాహ్మణులు మొదలైన సజ్జనుల నందరిని చంపటానికి రాక్షసుల్ని పంపించి, తన అంతఃపురానికి వెళ్ళాడు. తరువాత ఆ రాక్షసులు క్రూరంగా మాట్లాడుతూ సజ్జనుల్ని వెంటాడి, బెదిరించి, గర్జించి, వేయించి, అనేక దుష్టచేష్టలతోవాళ్ళను హింసించడంలో విజయం సాధించారు. పాపాలు మూటగట్టుకొన్నారు.

**ఆ. వెదకి వెదకి దైత్యవీరులు సాధుల, నణఁప వారిబలము లడఁగి పోయె,**
**యశము సిరియు ధర్మ మాయువు భద్రంబు, నార్యహింస సేయ నణఁగుఁ గాదె! 172**

**ప్రతి :** దైత్యవీరులు= రాక్షసవీరులు; వెదకి వెదకి= బాగా వెతుకుతూ; సాధులన్= సత్పురుషులను; అణఁపన్= అణచివేయగా; వారి= ఆ రాక్షసులయొక్క; బలములు= శక్తులు; అడఁగిపోయెన్= తగ్గిపోయాయి; ఆర్య= సాధువులను; హింసచేయన్= బాధించినట్లయితే; యశము= కీర్తి; సిరియున్= సంపద; ధర్మము= ధర్మం; ఆయువు= ఆయుస్సు; భద్రంబు= క్షేమం; అడఁగున్= నశించిపోతుంది; కాదు+ఎ= కదా!

**తా :** రాక్షసవీరులు వెదకి వెదకి సజ్జనుల్ని అణచివేయగా, ఆ రాక్షసుల శక్తులుకూడా అణగిపోయాయి. సాధువుల్ని బాధిస్తే కీర్తి, సంపద, ధర్మం, ఆయుస్సు, క్షేమం అన్నీ నశిస్తాయి కదా!

**వ. అంత మందలో నందుండు నందనుండు పుట్టుట యెఱింగి మహానందంబున నెఱవాదులగు వేదవిదులం బిలిపించి, జలకంబులాడి, శుచియై, శృంగారించుకొని, స్వస్తిపుణ్యాహవాచనంబులు సదివించి, జాతకర్మంబులు సేయించి, పితృదేవతల నర్చించి, క్రేపులతోడం గూడఁ గైసేసిన పాఁడిమొదవుల రెండులక్షలను, గనక కలశ మణి వసన విశాలంబులైన తిలశైలంబు లేడింటిని భూదేవతల కిచ్చిన. 173**

**ప్రతి :** అంతన్= తరువాత; మందలోన్= వ్రేపల్లెలో; నందుండు= నందుడు; నందనుండు పుట్టుట= కొడుకు పుట్టడం; ఎఱింగి= తెలుసుకొని; మహా+ఆనందంబునన్= మిక్కిలి ఆనందంతో; నెఱవాదులు+అగు= నేర్పరులైనట్టి; వేదవిదులన్= వేదపండితులను; పిలిపించి= రప్పించి; జలకంబులు+ఆడి= స్నానం చేసి; శుచి+ఐ= పరిశుద్ధుడై; శృంగారించుకొని= చక్కగా అలంకరించుకొని; సు+అస్తి పుణ్య+ఆహవాచనంబులు= స్వస్తివాచకాలు, పుణ్యాహవచనాలు అనే మంత్రాల్ని; చదివించి= చెప్పించి; జాతకర్మంబులు+చేయించి= శిశువు జన్మించినపుడు చేయదగిన వేదవిహిత క్రియలను చేయించి; పితృదేవతలను+అర్చించి= పితరులను పూజించి; క్రేపులతోడన్= దూడలతో; కూడన్= కూడిన; కై+చేసిన= అలంకరించిన; పాఁడి మొదవులన్= పాడి ఆవులను; రెండులక్షలను= రెండు లక్షలు; కనకకలశ= బంగారు చెంబులను; మణి= మణులను; వసన= వస్త్రాలను; విశాలంబులు+ఐన= పెద్దవైన; తిలశైలంబులు+ఏడింటిని= కొండలవంటి ఏడు నువ్వులరాసుల్ని; భూదేవతలకున్= బ్రాహ్మణులకు; ఇచ్చినన్= దానం చేయగా...

**తా :** తరువాత వ్రేపల్లెలో నందుడు తనకు కొడుకు పుట్టిన విషయం తెలుసుకొని, మహానందభరితుడై సమర్థులైన వేదపండితుల్ని రావించి, తాను స్నానంచేసి పరిశుద్ధుడై, చక్కగా అలంకరించుకొని, స్వస్తివాచక పుణ్యాహవచన మంత్రాలను చదివించి, వేదవిహితజాతకర్మలు చేయించి, పితృదేవతలను పూజించి, అలంకరించిన రెండులక్షల పాడిఆవుల్ని దూడలతోకూడ బ్రాహ్మణుల కిచ్చాడు. అంతేకాదు – బంగారుకలశాల్నీ, మణుల్నీ, వస్త్రాల్నీ, కొండలవంటి ఏడునువ్వుల రాసుల్నీ బ్రాహ్మణులకు దానం చేయగా

**క. ఈ యాభీరకుమారుఁడు, శ్రీయుతుఁడై వీరవైరిజేతయునై దీ**
**ర్ఘాయుష్మంతుం డగు నని, పాయక దీవించి రపుడు బ్రాహ్మణజనముల్. 174**

**ప్రతి :** అపుడు= నందుడు వైదిక కార్యక్రమాలు, బ్రాహ్మణులకు దానాలు చేసిన సమయంలో; బ్రాహ్మణజనముల్= బ్రాహ్మణులందరు; ఈ, ఆభీరకుమారుఁడు= ఈ నందగోపుని కుమారుడు; శ్రీయుతుఁడు+ఐ= సంపదతో కూడుకొన్నవాడై;

వీర= వీరులైన; వైరి= శత్రువులను; జేతయున్+ఐ= జయించేవాడై; దీర్ఘ+ఆయుష్మంతుండు= పూర్ణాయువు కలవాడు; అగున్+అని= ఔతాడని; పాయక= తొలగకుండా (చక్కగా); దీవించిరి= ఆశీర్వదించారు.

**తా :** పుట్టిన బిడ్డకు నందుడు జాతకర్మాది వైదిక కార్యక్రమాలు జరిపించి, బ్రాహ్మణులకు ఎక్కువగా దానాలిచ్చిన తరువాత, ఆ బ్రాహ్మణులందరూ, ఈ నందగోపుని కుమారుడు ఐశ్వర్యవంతుడు, శత్రువీరులను జయించేవాడు, పూర్ణాయువు కలిగినవాడు అవుతాడని ఆశీర్వదించారు.

**క. దుందుభులు మొరసె, గాయక, సందోహము పాడె, సూతసముదాయముతో**
**వందిజనులు కీర్తించిరి, క్రందుగ వీతెంచె భద్రకాహళరవముల్. 175**

**ప్రతి :** దుందుభులు= నగారాలు; మొరసెన్= మ్రోగాయి; గాయక= గాయకులయొక్క; సందోహము= సమూహం; పాడెన్= పాడారు; సూత= పురాణకథలు చెప్పి పొగడేవారియొక్క; సముదాయముతోన్= సమూహంతో; వందిజనులు= స్తుతిచేసేవారు, భట్టులు; కీర్తించిరి= పొగడారు; భద్ర= మంగళకరమైన; కాహళ= పెద్దబూరగలయొక్క; రవముల్= ధ్వనులు; క్రందుగన్= అధికంగ; వీతెంచెన్= వీచాయి (అనగా వినిపించెను).

**తా :** నగారాలు మ్రోగాయి. గాయకులు పాడారు. సూతులు, వందిజనులు కీర్తించారు. మంగళకరాలైన బాకాల ధ్వనులు ముమ్మరంగా వినిపించాయి.

**క. పల్లవతోరణసురుచిర, వల్లీధ్వజరాజధూపవాసనములతో**
**సల్లలితములై యొప్పెను, వల్లవవల్లభులయిండ్లవాకిం డ్లెల్లన్. 176**

**ప్రతి :** పల్లవ వల్లభుల= గొల్లనాయకుల; ఇండ్ల= గృహాలయొక్క; వాకిండ్లు+ఎల్లన్= వాకిళ్ళన్నీ; పల్లవ= చిగురుటాకుల; తోరణ= తోరణాలతో; సురుచిర= రమణీయమైన, వల్లీ= తీవలతో; ధ్వజరాజ= గొప్పజెండాలతో; ధూప= పొగల; వాసనములతో= సువాసనలతో; సత్+లలితములు+ఐ= మంచి అందం గలవై; ఒప్పెను= ప్రకాశించాయి.

**తా :** యాదవనాయకుల ఇళ్ళవాకిళ్ళన్నీ చిగురుటాకుల తోరణాలతో, అందమైన తీవలతో, ఎత్తైన జెండాలతో, పరిమళ ధూపాల సువాసనలతో చూడముచ్చటగా ప్రకాశించాయి.

**క. పసుపులు నూనెలు నలఁదిన, పసఁ దనరి సువర్ణబర్హిబర్హప్రభతోఁ**
**బసిమి గలిగి వెలుఁగొందుచుఁ, బసు లన్నియు మందలందుఁ బ్రసరించె నృపా! 177**

**ప్రతి :** నృపా!= రాజా!; మందలు+అందున్= ఆవులమందల్లో; పసుపులు= పసుపుకుంకుమలు; నూనెలున్= తైలాలు, అలఁదినన్= పూయగా; పసన్= మెరుగైన కాంతితో; తనరి= ఒప్పి; సువర్ణ= బంగారుమయమైన; బర్హి= నెమళ్ళయొక్క; బర్హ= పింఛముల; ప్రభతోన్= కాంతివంటి కాంతితో; పసిమి= పసుపువన్నె కలిగి; వెలుఁగొందుచున్= ప్రకాశిస్తూ; పసులు+అన్నియున్= ఆవులన్నీ; ప్రసరించెన్= తిరుగాడాయి.

**తా :** ఓ పరీక్షిన్మహారాజా! మందల్లోని ఆవులకు పసుపు, కుంకుమ, నూనె పూయగా అవి మెరుగైన కాంతితో బంగారు నెమళ్ళ పింఛాల కాంతివంటి కాంతిగల పసిమిరంగుతో ప్రకాశిస్తూ తిరుగాడాయి.

**క. క్రేళ్లుఱికి మసలె లేఁగలు, మల్లడిగొని ఱంకె లిడియె మదవృషభంబుల్,**
**పెల్లుగ మొదవులపొదుఁగుల, జల్లించెం బాలు బాలుసంభవవేళన్. 178**

**ప్రతి :** బాలు= బాలునియొక్క, బాలకృష్ణునియొక్క; సంభవవేళన్= పుట్టినసమయంలో; లేఁగలు= ఆవుదూడలు; క్రేళ్ళు+ఉఱికి= చెంగు చెంగున గంతులువేస్తూ, పరుగెత్తుతూ; మసలెన్= తిరిగాయి; మద= మదించిన; వృషభంబుల్= ఎద్దులు; మల్లడిగొని= (ఉత్సాహంతో) పెనుగులాడి; ఱంకెలు+ఇడియెన్= ఱంకెలు వేశాయి; మొదవులు= ఆవులు; పొదుఁగులన్= పొదుగులనుండి; పాలు= పాలు; జల్లించెన్= కార్చాయి.

**తా :** బాలకృష్ణుడు పుట్టగానే లేగదూడలు చెంగు చెంగున గంతులేశాయి. మదించిన వృషభాలు రంకెలు వేశాయి. ఆవులు పొదుగులనుండి పాలు వర్షించాయి. (అనగా వ్రేపల్లెలో పశువులు కూడా ఆనందంతో పరవశించాయి.)

**క. ఆరఁగఁ జదివెడి పొగడెడి, వారికి విద్యలను బ్రదుకువారికి లేమిం**
**జేరినవారికి నెల్లను, గోరక మును నందుఁ డిచ్చె గోధనచయముల్. 179**

**ప్రతి :** నందుఁడు= నందరాజు; ఆరఁగన్= నిండుగా, మనసార; చదివెడి= (వేదమంత్రాలు, పురాణాలు) చదువునట్టి; పొగడెడి= స్తోత్రాలు చేసేటి; వారికిన్= వాళ్లకు; విద్యలను= అనేక విద్యలతో; బ్రదుకు= జీవించునట్టి; వారికిన్= వాళ్లకు; లేమిన్= పేదరికంలో; చేరిన= చేరినట్టి; వారికిన్= వాళ్లకు; ఎల్లన్= అందరికి; కోరకమును= అడుగకముందే; గోధనచయముల్= గోవులను, ధనసమూహాలను; ఇచ్చెన్= దానం చేశాడు.

**తా :** నందరాజు పుత్రుడు పుట్టినాడనే ఆనందంతో వేదమంత్రాలు, పురాణాలు చదివే బ్రాహ్మణులకు, స్తోత్రాలు చేసే వందిమాగధులకు, ఇంద్రజాలాలు, గారడీలు, పగటివేషాలు మొదలైన విద్యలతో బ్రతికేవారికి, దారిద్ర్యంతో బాధపడేవారికి, వాళ్ళు కోరకముందే గోవులను, ధనరాసులను దానమిచ్చాడు.

**వ. ఆ సమయంబున. 180**

**ప్రతి :** ఆ సమయంబునన్= ఆ వేళలో...

**తా :** శ్రీకృష్ణుడు పుట్టిన ఆ వేళలో

**క. కంచుకములు తలచుట్లును, గాంచనభూషాంబరములుఁ గడు మెఱయఁగ నే**
**తెంచిరి గోపకు లందఱు, మంచిపదార్థములు గొనుచు మాధవుఁ జూడన్. 181**

**ప్రతి :** కంచుకములు= అంగీలు; తలచుట్లును= తలపాగాలు; కాంచనభూష+అంబరములున్= బంగారు ఆభరణాలు; వస్త్రాలు; కడున్= మిక్కిలి; మెఱయన్+కన్= ప్రకాశిస్తుండగా; గోపకులు+అందఱు= గొల్లలుఅందరు; మంచి పదార్థములు= మేలైన వస్తువులు; కొనుచున్= తీసుకొని; మాధవున్= శ్రీకృష్ణుణ్ణి; చూడన్= చూడడానికై; ఏతెంచిరి= వచ్చారు.

**తా :** గోపకులందరు అంగీలు తొడుగుకొని, తలపాగాలు చుట్టుకొని, బంగారు ఆభరణాలు, అందమైన దుస్తులు ధరించి ప్రకాశిస్తూ, మంచి పదార్థాలు కానుకలుగా తీసుకొని బాలకృష్ణుణ్ణి చూడడానికై వచ్చారు.

**క. ఏతెంచి చూచి చెలఁగుచు, నేతులఁబెరుఁ గులను బాల నీళ్లను వెన్నం**
**బ్రీతి వసంతము లాడిరి, యేతరులై సరసభాష లెసఁగన్ గొల్లల్. 182**

**ప్రతి :** గొల్లల్= గొల్లలు; ఏతెంచి= వచ్చి; చూచి= బాలకృష్ణుని చూచి; చెలఁగుచున్= సంతోషంతో విజృంభించి; నేతులన్= నేతులతో; పెరుఁగులను= పెరుగులతో; పాలన్= పాలతో; నీళ్ళను= నీళ్ళతో; వెన్నన్= వెన్నతో; ప్రీతిన్= ప్రేమతో; ఏతరులు+ఐ= ఉద్ధతులై; సరసభాషలు= సరసపు మాటలు; ఎసఁగన్= అతిశయిల్లగా; వసంతములు+ఆడిరి= వసంతాలాడారు.

**తా :** వ్రేపల్లెలోని గొల్లలంతా వచ్చి, బాలకృష్ణుని చూచి, సంతోషంతో చెలరేగి, సరసాలాడుకొంటూ నేతులతో, పెరుగులతో, పాలతో, నీళ్ళతో, వెన్నతో ప్రియమార వసంతా లాడుకొన్నారు.

**వ. తదనంతరంబ. 183**

**ప్రతి :** తద్+అనంతరంబు+అ= ఆ తరువాత...

**తా :** ఆ తర్వాత

**ఆ. ఏమినోము ఫలమొ యింత ప్రొ ద్దొకవార్త, వింటి మబలలార! వీను లలర**
**మనయశోద చిన్నిమగవానిఁ గనె నఁట, చూచి వత్త మమ్మ! సుదతులార! 184**

**ప్రతి :** అబలలార!= ఓ కాంతలారా!; ఏమినోము ఫలము+ఒ= ఏ నోముయొక్క ఫలమో; ఇంతప్రొద్దు= ఈ వేళలో; వీనులు= చెవులు; అలరన్= సంతోషించగా; ఒకవార్త= ఒక వృత్తాంతం; వింటిమి= విన్నాం; సుదతులార!= చక్కని పలువరుసగల వనితల్లారా!; మన యశోద= మన యశోదాదేవి; చిన్ని= చిన్న; మగవానిన్= మగబిడ్డను; కనెన్+అఁట= కనిందట; చూచివత్తము (వచ్చుదము)+అమ్మ= చూచి వద్దామమ్మా!

**తా :** ఓ అమ్మలారా! ఏ నోము నోచిన ఫలమో గాని ఇప్పుడు ఒక శుభవార్త విన్నాం. మన యశోదమ్మ ఒక చిన్ని మగబిడ్డను కనిందట! వెళ్ళి చూచి వస్తా రండి.

**వ. అని యొండొరుల లేపికొని గోపిక లోపికలు లేనిచిత్తంబుల నెత్తినతత్తఱంబు లొత్తుకొన నుదారంబులగు శృంగారంబులతో నిండ్లు వెలువడి. 185**

**ప్రతి :** అని= ఆ విధంగా అంటూ; గోపికలు= గొల్లస్త్రీలు; ఒండు+ఒరులన్= ఒకరినొకరు; లేపికొని= లేవదీసికొని; ఓపికలు= ఓర్పులు; లేని= లేనటువంటి; చిత్తంబులన్= మనస్సుల్లో; ఎత్తిన= పొంగిన; తత్తఱంబుల్= తడబాటులు; ఒత్తుకొనన్= ఒత్తిడి చేయగా; ఉదారంబులు= గొప్పవి; అగు= అయినట్టి; శృంగారంబులతోన్= అలంకారాలతో; ఇండ్లు= ఇండ్లనుండి; వెలువడి= బయటికి వచ్చి...

**తా :** ఆ విధంగా గోపికలు అనుకొని, ఒకరినొకరు పిలుచుకొని చిన్ని కృష్ణుని చూడాలనే తహ తహ త్వరపెట్టగా, లెస్సగా అలంకరించుకొని తమ యిండ్ల నుండి బయలుదేరి

**క. జడగతులును బలుపిఱుఁదులుఁ, బిడికెడునడుములును వలుఁదబిగిచనుఁగవలున్**
**వెడఁదనయనములు సిరి దడఁ, బడుమోములు భ్రమరచికురభరములు నమరన్. 186**

**ప్రతి :** జడగతులును= మెల్లని నడకలును; బలు= పెద్దవైన; పిఱుఁదులున్= పిఱ్ఱలును; పిడికెడు నడుములును= పిడికెట్లో ఇమిడిపోయేంతటి సన్ననినడుములు; వలుఁద= లావైన; బిగి= బిగువైన; చనున్+కవలున్= రెండుచనులును; వెడఁద=

విశాలమైన; నయనములను= కన్నులును; సిరి= లక్ష్మి; తడఁబడు= తొట్రుపాటునొందు; మోములు= ముఖాలు; భ్రమర= తుమ్మెదలవంటి; చికుర= వెంట్రుకల; భరములన్= భారములు; అమరన్= ఒప్పగా...

**తా :** మెల్లని నడకలతో, పెద్దపిరుదులతో, సన్ననినడుములతో, లావుగ, బిగువుగా ఉన్న చన్నులతో; విశాలమైన నేత్రాలతో; లక్ష్మికూడా తడబడే కళలతో కూడుకొన్న ముఖాలతో; తుమ్మెదలవంటి నల్లని వెంట్రుకల కొప్పులతో ఒప్పగా

**ఉ. వేడుకతోడఁ గ్రొమ్ముడులు వీడఁ గుచోపరిహారరేఖ ల**
**ల్లాడఁ గపోలపాలికల హాటకపత్త్రరుచుల్ వినోదనం**
**బాడఁ బటాంచలంబు లసియాడఁగఁ జేరి యశోద యింటికిం**
**జేడియ లేఁగి చూచి రొగి జిష్ణుని విష్ణునిఁ జిన్ని కృష్ణునిన్. 187**

**ప్రతి :** వేడుకతోడన్= సంతోషంతో; క్రొత్త+ముడులు= క్రొత్తగా వేసుకొన్న కొప్పులముడులు; వీడన్= సదలిపోగా; కుచ= రొమ్ముల; ఉపరి= మీది; హార= దండలయొక్క; రేఖలు= వరుసలు; అల్లాడన్= అటు ఇటు ఊగులాడగా; కపోల పాలికలన్= చెక్కిళ్లయొక్క; హాటక= బంగారు; పత్త్ర= మకరికాపత్రాల; రుచుల్= కాంతులు; వినోదనంబు= వేడుక; ఆడన్= చూపగా; పట+అంచలంబులు= పైటకొంగులు; అసి+ఆడఁగన్= కదలాడుచుండగా; చేరి= ఒకటిగాకూడి; యశోద+ఇంటికిన్= యశోదాదేవి ఇంటికి; చేడియలు= గొల్లకాంతలు; ఏఁగి= వెళ్ళి; ఒగిన్= వరుసగా; జిష్ణునిన్= జయశీలుడైనవాణ్ణి; విష్ణునిన్= వ్యాపనశీలుడైనవాణ్ణి; చిన్ని కృష్ణునిన్= బాలకృష్ణుణ్ణి; చూచిరి= చూశారు.

**తా :** గోపస్త్రీలందరు సంతోషంతో వడివడిగా తమ కొప్పులముడులు వీడగా, రొమ్ములమీది హారాలవరుసలు అటూ ఇటూ ఊగిసలాడగా, చెక్కిళ్ళమీది బంగారుమకరికాపత్రాలకాంతులు వేడుక చేయగా, పైటకొంగులు కదలాడగా – అందరు ఒకటిగా చేరి, యశోదయింటికి వెళ్ళి జయశీలుడు, సర్వవ్యాపకుడు అయిన చిన్నికృష్ణుణ్ణి వరుసగా చూచారు.

**వ. చూచి సంతసించి తెచ్చిన కానుక లిచ్చి. 188**

**ప్రతి :** చూచి= కన్నులారా చూచి; సంతసించి= ఎంతో సంతోషించి; తెచ్చిన= తమతో తెచ్చినట్టి; కానుకలు= బహుమతులు; ఇచ్చి...

**తా :** గోపికలు చిన్ని కృష్ణుని చూచి, ఎంతో సంతోషించి, తాము తెచ్చిన కానుకలు ఇచ్చి

**తే. పాపనికి నూనెఁ దలయంటి పసుపుఁ బూసి, బోరుకాడించి "హరి రక్ష పొ"మ్మటంచు**
**జలము లొకకొన్ని చుట్టిరాఁ జల్లి తొట్ల, నునిచి దీవించి పాడి రయ్యువిద లెల్ల. 189**

**ప్రతి :** ఆ+ఉవిదలు+ఎల్లన్= ఆ గోపస్త్రీలందరు; పాపనికిన్= బాలకృష్ణునికి; నూనెన్= నూనెతో; తల+అంటి= తల అంటి; పసుపున్+పూసి= (శరీరానికి) పసుపుపూసి; బోరుకాడించి= స్నానం చేయిస్తూ; హరి= శ్రీహరి; రక్ష పొమ్ము= నీకు రక్షపో; అట+అంచున్= అని అంటూ; జలముల్= నీళ్ళు; ఒకకొన్ని= కొద్దిగా; చుట్టిరాన్= చుట్టూ పడునట్లు; చల్లి= చల్లి; తొట్లన్= ఉయ్యాలలో; ఉనిచి= ఉంచి; దీవించి= దీవన లిచ్చి; పాడిరి= జోలపాటలు పాడారు.

**తా :** ఆ గోపస్త్రీలందరు బాలకృష్ణుడికి నూనెతో తల అంటి, శరీరానికి పసుపు పూసి, స్నానం చేయించారు, శ్రీహరి నీకు రక్ష పో'! అని అంటూ చుట్టూరా కొన్ని నీళ్లు పడునట్లు చల్లి, రక్ష పెట్టి, ఉయ్యాలలో పడుకోపెట్టి, ఆశీర్వదిస్తూ జోలపాటలు పాడారు.

**క. 'జోజో కమలదళేక్షణ!, జోజో మృగరాజమధ్య! జోజో కృష్ణా!**
**జోజో పల్లవకరపద!, జోజో పూర్ణేందువదన! జోజో' యనుచున్. 190**

**ప్రతి :** కమలదళ+ఈక్షణ= తామరరేకులవంటి కన్నులు కలవాడా!, జో!జో!= సుఖంగా నిద్రించు; జో జో మృగరాజమధ్య= మృగరాజైన సింహం నడుమువంటి (సన్నని) నడుము కలవాడా! సుఖంగా నిద్రించు; కృష్ణా! జో!జో!= చిన్నికృష్ణా! జోజో!; జోజో! పల్లవకరపద= చిగురుటాకులవంటి (మృదువైన) చేతులు, పాదాలు కలవాడా! జో!జో!; పూర్ణ+ఇందువదన జోజో= పూర్ణచంద్రునివంటి (అందమైన) ముఖం కలవాడా! జో!జో!; అనుచున్= అంటూ; (పాడారు – అనే వెనుకటి పద్యంలోని క్రియతో అన్వయం).

**తా :** జో!జో! తామరరేకువంటి కన్నులు కల ఓ కృష్ణా నిద్రపోవయ్యా! సింహం నడుంవంటి నడుంగల కృష్ణయ్యా జో జో! చిగురుటాకులవలె మృదువైన చేతులు, పాదాలు వున్న కన్నయ్యా జో జో! నిండు చందురునివలె నిండైన ముఖంతోవున్న కృష్ణా జో జో అంటూ జోకొడతాము నిద్రించవయ్యా కృష్ణా!

**విశే :** 'జో' అంటే – పిల్లల్ని నిద్రపుచ్చేటప్పుడు మెల్లగా అరచేతితో వీపుమీద తడుతూ చెప్పే పదం – నిద్రించు అని తాత్పర్యం. 'జో, జో' అనేది 'జో' శబ్దంయొక్క ఆమ్రేడితం (రెండుమార్లు వచ్చిన పదం).

**వ. ఇవ్విధంబున. 191**

**ప్రతి :** ఈ+విధంబునన్= ఈ ప్రకారంగా...

**తా :** అంటూ ఇలా జోలపాట పాడుతుండగా

**క. పలుతోయంబుల జగములఁ, బలుతోయములందు ముంచి భాసిల్లెడి యా**
**పలుతోయగాఁడు వల్లవ, లలనాకరతోయములఁ జెలంగుచుఁ దడియున్. 192**

**ప్రతి :** జగములన్= లోకాలను; పలు తోయంబులన్= ఎన్నోమార్లుగా; పలు తోయముల+అందున్= అధికజలాలలో (ప్రళయకాల సముద్రజలాల్లో); ముంచి= మునిగించి; భాసిల్లెడి= ప్రకాశించెడి; ఆ, పలుతోయగాఁడు= బహువిధారూపాల్లో ఉండేవాడు; వల్లవలలనా= గోపస్త్రీలయొక్క; కరతోయములన్= చేతులనుండి పోసే నీళ్ళలో; చెలంగుచున్= సంతోషిస్తూ; తడియున్= తడుస్తున్నాడు (స్నానం చేస్తున్నాడు).

**తా :** పెక్కుమార్లు ప్రళయకాల సముద్రజలాల్లో ముంచి, ప్రకాశించే ఆ బహురూపధారి, కృష్ణుడు ఇప్పుడు గోపస్త్రీల చేతుల నుండి పోసే నీళ్ళలో సంతోషంగా తడుస్తున్నాడు (స్నానం చేస్తున్నాడు).

**విశే :** ప్రళయకాలంలో "వట పత్రశాయి" అయిన ఈ తోయగాడు, ఒకప్పుడు మహామత్స్యంగా, మరొకప్పుడు కూర్మంగాను, ఇంకొకప్పుడు ఆదివరాహంగాను ఇలా వివిధరూపాల్లో జలాల్లో సంచరించిన వీడు, ప్రస్తుతం గోపికలు నీళ్లు పోస్తుండగా కేరింతలు కొడుతూ ఆనందిస్తున్నాడట – చిన్ని కృష్ణుడు. అంటే నీళ్ళలో (నారములు) తిరుగాడడం, మునగడం 'ఈ తోయగాడికి కొత్తేమీ కాదు. అని విశేషాంశం.

**క. లోకములు నిదుర వోవఁగ, జో కొట్టుచు నిదురవోని సుభగుఁడు రమణుల్**
**జోకొట్టి పాడ నిదురం, గైకొనుక్రియ నూరకుండెఁ గను దెఱవకయున్. 193**

**ప్రతి :** లోకములు= అన్నిలోకాలు; నిదుర+పోవన్+కన్= నిద్రించేట్టుగా; జోకొట్టుచున్= జోలపాట పాడుతు; నిదుర+పోని= (తాను) నిద్ర పోనట్టి; సుభగుఁడు= అందగాడు; రమణుల్= గోపస్త్రీలు; జోకొట్టి= జోజోయని; పాడన్= పాట పాడగా; నిదురన్= నిద్రను; కైకొను= స్వీకరించు, పొందు; క్రియన్= విధంగ; కనున్= కన్నులను; తెఱవకయున్= మూసికొని; ఊరుకుండెన్= కదలక పడుకున్నాడు.

**తా :** లోకాలన్నింటినీ జోకొట్టి నిద్రపుచ్చుతూ, తానుమాత్రం మెలకువగా ఉండే అందగాడు, గోపికలు జోకొట్టుతూ ఉంటే నిద్రపోయిన వానివలె కళ్ళు మూసికొని కదలకుండా పడుకున్నాడు.

**సీ. ఏ బాము లెఱుఁగక యేపారుమేటికిఁ బసులకాపరియింట బాము గలిగె,**
**నే కర్మములు లేక యెనయునెక్కటికిని జాతకర్మంబులు సంభవించె,**
**నే తల్లిచనుఁబాలు నెఱుఁగనిప్రోఢ యశోదచన్నులపాల చొరవ నెఱిఁగె,**
**నే హానివృద్ధులు నెఱుఁగనిబ్రహ్మంబు పొదిఁగిటిలో వృద్ధిఁ బొందఁ జొచ్చె,**

**ఆ. నే తపములనైన నెలమిఁ బండనిపంట, వల్లవీజనముల వాడఁ బండె**
**నే చదువుల నైన నిట్టిట్టి దనరాని, యర్థ మవయవముల నంద మొందె. 194**

**ప్రతి :** ఏ బాములు= ఏ పుట్టుకలూ; ఎఱుఁగక= తెలియకుండా; ఏ పారు= అతిశయించే; మేటికిన్= గొప్పవానికి; పసులకాపరి ఇంటన్= గొల్లవాని ఇంట్లో; బాము= పుట్టుక; కలిగెన్= కలిగింది; ఏ కర్మములు= ఏవిధమైన కర్మలు; లేక= లేకుండ; ఎనయున్= ప్రకాశించే; ఎక్కటికిని= ఒంటరివానికి; జాతకర్మంబులు= పుట్టినపుడు జరిపే వైదికక్రియలు; సంభవించెన్= కలిగాయి; ఏ తల్లి= ఏ తల్లియొక్క; చనున్+పాలున్= చనుబాలను; ఎఱుఁగని= తెలియని, త్రాగని; ప్రోఢ= నిపుణుడు; యశోద= యశోదాదేవియొక్క; చన్నులపాలన్= చనుబాలను; చొరవన్= త్రాగే ఆసక్తిని; ఎఱిఁగెన్= తెలుసుకొన్నాడు; ఏ హాని వృద్ధులున్= ఏ విధమైన కీడు, వృద్ధి; ఎఱుఁగని= తెలియని (పొందని); బ్రహ్మంబు= పరబ్రహ్మం; పొదిఁగిటిలో= యశోదపొత్తిగుడ్డలో; వృద్ధిన్= పెరుగుదలను; పొందన్+చొచ్చెన్= పొందసాగాడు; ఏ తపములన్+ఐనన్= ఎట్టి తపస్సులవల్లగాని; ఎలమిన్= వికాసంతో; పండనిపంట= సిద్ధించని ఫలం; వల్లవీజనముల= గొల్లస్త్రీల; వాడన్= వీధిలో; పండెన్= ఫలించింది; ఏ చదువులన్+ఐనన్= ఏ విద్యల చేతకూడ; ఇట్టి+ఇట్టిది= ఇటువంటిది; అనరాని= అని చెప్పటానికి సాధ్యం కాని; అర్థము= పరమార్థం; అవయవములన్= (బాలుని) అవయవాల్లో; అందము+ ఒందెన్= అందగించింది.

**తా :** పుట్టుకే లేని పరమాత్మ ఇప్పుడొక గొల్లయింట్లో పుట్టాడు. ఏ కర్మలూ ఎరుగనిఒంటరికి ఇప్పుడు జాతకర్మలు జరిగాయి. ఏ తల్లి చనుబాలూ త్రావని గడుసరి ఇప్పుడు యశోదచనుబాలరుచి మరిగాడు. ఏ హాని వృద్ధులు లేని పరమాత్మ ఇప్పుడు యశోదపొత్తిళ్ళలో వృద్ధి పొందుతున్నాడు. ఏ తపస్సులకూ పండనిపంట ఇప్పుడు గోపకాంతుల వీధిలో పండాడు. ఏ విద్యలవల్లా ఇట్టిదిట్టిదని చెప్పసాధ్యం కాని అర్థం, ఇప్పుడు ఈ బాలకృష్ణునిఅందమైన అవయవాల్లో అగుపిస్తూ ఉంది.

**విశే :** పరమాత్మకు ఏ రూప, గుణ, వికారాలు గాని, కర్మలు గాని, సంబంధ బాంధవ్యాలు గాని ఉండవు. కానీ ఒక కార్యార్థమై అవతరించినపుడు రూపగుణాలు ఏర్పడతాయి.

**మ. చెయువుల్ సేయుతఱిన్ విధాతకరణిం జెన్నొందు, సంతోష దృ**
**ష్టియుతుండై నగుచున్ జనార్దనునిమాడ్కిం బొల్చు, రోషించి యు**
**న్న యెడన్ రుద్రునిభంగి నొప్పును, సుఖానందంబునం బొంది త**
**న్మయుఁడై బ్రహ్మముభాతి బాలుఁ డమరు న్బాహుళ్యబాల్యంబునన్. 195**

**ప్రతి :** బాలుఁడు= చిన్నికృష్ణుడు; బాహుళ్య= విస్తారమైన; బాల్యంబునన్= పసితనంలో; చెయువుల్= చేష్టలు; చేయు= చేసే; తఱిన్= సమయంలో; విధాత= బ్రహ్మదేవుని; కరణిన్= విధంగ; చెన్ను+ఒందున్= ఒప్పుతున్నాడు; సంతోష= ఆనందంతో కూడుకొన్న; దృష్టి; యుతుండు+ఐ= చూపుతో కూడుకొన్నవాడై; నగుచున్= నవ్వుతూ; జనార్దనుని= విష్ణుదేవుని; మాడ్కిన్= వలె; పొల్చున్= కన్పిస్తాడు; రోషించి= కోపించి; ఉన్న= ఉన్నట్టి; ఎడన్= సమయంలో; రుద్రుని భంగిన్= ఈశ్వరునివలె; ఒప్పున్= తగి ఉంటాడు; సుఖ+ఆనందంబునన్+పొంది= సుఖమైన ఆనందాన్ని పొంది; తన్మయుఁడు+ఐ= పరవశించి, మైమరచి; బ్రహ్మము భాతిన్= పరబ్రహ్మంవలె; అమరున్= ఒప్పుతుంటాడు.

**తా :** చిన్నికృష్ణుడు బాల్యచేష్టలు చేసేటప్పుడు బ్రహ్మవలె, సంతోషం నిండినచూపులతో నవ్వేటప్పుడు విష్ణుమూర్తివలె; రోషంతో ఉన్నప్పుడు రుద్రునివలె, ఆనందతన్మయత్వంలో ఉన్నప్పుడు పరబ్రహ్మవలె కన్పిస్తున్నాడు.

**విశే :** పరమాత్మ మనం అనుకొనే బ్రహ్మ కాదు; విష్ణువు కాదు; శివుడు కాదు. ఆయన ఈ త్రిమూర్తులకు అతీతుడైన తేజోమయుడు; విశ్వచైతన్యస్వరూపుడు.

**వ. అయ్యవసరంబున. 196**

**ప్రతి :** ఆ+అవసరంబునన్= ఆ సమయంలో...

**తా :** ఇలా ఉండే ఆ సమయంలో

**ఆ. కొడుకుఁ గన్నవేడ్క కొనసాగ రోహిణిఁ, జీరఁ బంచి చిత్రచేలములను**
**మండనముల నిచ్చి మన్నించె నందుఁ డా, యంబుజాక్షి ప్రీతయై చరింప. 197**

**ప్రతి :** నందుఁడు= నందమహారాజు; కొడుకున్= పుత్రుణ్ణి; కన్నవేడ్క= కనిన సంతోషం; కొనసాగన్= వర్ధిల్లగా; రోహిణిన్= రోహిణీదేవిని; చీరన్= పిలవడానికై; పంచి= ఆజ్ఞాపించి; చిత్ర= రంగురంగుల; చేలములను= వస్త్రాలను; మండనములన్+ ఇచ్చి= ఆభరణాలను ఇచ్చి (ఇవ్వడంతో); అంబుజ+అక్షి= పద్మంవంటి కన్నులుగల–రోహిణీదేవి; ప్రీత+ఐ= సంతృప్తి చెందిందై; చరింపన్= వర్తించగా; మన్నించెన్= గౌరవించెను.

**తా :** నందుడు తనకు కొడుకు పుట్టాడన్న సంతోషాతిశయంలో రోహిణీదేవిని పిలిపించి, ఆమె తృప్తి చెందేటట్లు రంగురంగుల వస్త్రాలు, ఆభరణాలు ఇచ్చి గౌరవించాడు.

**వ. అది మొదలు మొదవులకదుపులు పొదువులు గలిగియుండె, నంత నందుండు గోపకుల ననేకుల గోకులరక్షకుం దక్షులైనవారిని నియమించి మథురకుం జని కంసునికి నేఁటేఁటం బెట్టెడి యరిం బెట్టి వీడ్కొని వసుదేవుని కడకుం జని యథోచితంబుగ దర్శించిన. 198**

**ప్రతి :** అది మొదలు= శ్రీకృష్ణుడు జన్మించింది మొదలు; మొదవుల= ఆవుల; కదుపులు= గుంపులు; పొదువులు= పాలతోనిండిన పొదుగులు; కలిగి+ఉండెన్= కలిగి ఉన్నాయి; అంతన్= తరువాత; నందుండు= నందమహారాజు; గోపకులన్= గొల్లవారిని; అనేకులన్= పెక్కుమందిని; దక్షులు+ఐనవారినిన్= సమర్థులు అయినవాళ్లను; గోకుల= వ్రేపల్లెయొక్క; రక్షకున్= రక్షణకు; నియమించి= ఏర్పరచి; మథురకున్= మథురానగరానికి; చని= వెళ్ళి; కంసునికిన్= కంసరాజుకు; ఏఁటన్+ ఏఁటన్= ప్రతిసంవత్సరం; పెట్టెడి= చెల్లించే; అరిన్= కప్పాన్ని; పెట్టి= అర్పించి; వీడ్కొని= అతని దగ్గర సెలవు తీసుకొని; వసుదేవుని కడకున్= వసుదేవుని దగ్గరకు; చని= వెళ్ళి; యథా+ఉచితంబుగ= తగినరీతిగ; దర్శించినన్= చూడగా...

**తా :** శ్రీకృష్ణుడు జన్మించింది మొదలు ఆలమందలు పొదుగులనిండ పాలతో కనువిందు చేశాయి. నందుడు వ్రేపల్లె రక్షణకు దక్షులైన పెక్కుమంది గోపకులను నియమించాడు. తరువాత మథురకు వెళ్ళి ప్రతిసంవత్సరం కట్టవలసిన కప్పాన్ని కంసునికి అర్పించి, అతని దగ్గర సెలవు తీసుకొని వెళ్ళి, తగురీతిగ వసుదేవుని దర్శించి,

**క. నందునిఁ గనుఁగొని ప్రాణము, పొందినబొందియునుఁబోలెఁ బొలుపారుచు నా**
**నందాశ్రులు గడకన్నులఁ, గ్రందుకొనం గేలుసాఁచి కౌఁగిటఁ జేర్చెన్. 199**

**ప్రతి :** నందునిన్= నందగోపుణ్ణి; కనుఁగొని= (వసుదేవుడు)చూచి; ప్రాణము= ఊపిరిని; పొందిన= పొందినట్టి; బొందియునున్+పోలెన్= దేహంవలె; పొలుపారుచున్= ఒప్పుతూ; ఆనంద+అశ్రువులు= సంతోషబాష్పాలు, సంతోషంతో వచ్చిన కన్నీటిబొట్లు; కడకన్నులన్= కనుకొలకులందు; క్రందుకొనన్= క్రమ్ముకోగా; కేలు+చాఁచి= చేయి చాచి; కౌఁగిటన్= కౌగిలిలో; చేర్చెన్= చీర్చుకొన్నాడు.

**తా :** వసుదేవుడు నందుణ్ణి చూడగానే ప్రాణంలేని శరీరానికి ప్రాణం వచ్చినట్లు ఉత్సాహవంతుడై, ఆనందబాష్పాలు కనుకొలకులు నిండగా, చేతులు చాచి కౌగిలించుకొన్నాడు.

**వ. మఱియుఁ గౌఁగిలించుకొని, సుఖాసీనుం జేసి, వసుదేవుండు దనకొడుకువలనిమోహంబు దీపింప నందున కిట్లనియె. 200**

**ప్రతి :** వసుదేవుండు= వసుదేవుడు; మఱియున్= ఇంకా; కౌఁగిలించుకొని= ఆలింగన చేసుకొని; సుఖ+ఆసీనున్+చేసి= సుఖంగా కూర్చొండబెట్టి; తన కొడుకువలని= తన కుమారుడైన బాలకృష్ణునిమీది; మోహంబు= ప్రేమ; దీపింపన్= ప్రకాశింపగా; నందునకున్= నందునితో; ఇట్లు= ఈ విధంగ; అనియెన్= పలికాడు.

**తా :** వసుదేవుడు మరొకసారి నందుణ్ణి కౌగిలించుకొని, సుఖంగా అతణ్ణి కూర్చుండపెట్టి, తన కుమారుడైన బాలకృష్ణుని మీది ప్రేమ ప్రకటమయ్యేటట్టుగా ఆయనతో ఇలా అన్నాడు.

**క. సంతతి లే దని మును ఘన, చింతనముల మునిఁగి ముదిసి చిక్కిననీకున్**
**సంతతి గలిగెను భాగ్యము!, సంతతిహీనునికి సౌఖ్యసంతతి గలదే? 201**

**ప్రతి :** సంతతి= సంతానం; లేదు+అని= కలుగలేదని; మును= ఇదివరకు; ఘన= పెద్ద; చింతనములన్= విచారించడంతో; మునిఁగి= మునిగి ఉంటూ; ముదిసి= ముసలితనంపొంది; చిక్కిన= కృశించిన; నీకున్= నీకూ; సంతతికలిగెను= సంతానం కలిగింది; భాగ్యము= (అది) (నీ) అదృష్టం; సంతతి హీనునికిన్= సంతానం లేనివానికి; సౌఖ్య= సుఖాల; సంతతి= సమూహం; కలదు+ఏ= కలదా?

**తా :** సంతానం లేదని ఇదివరలో ఎంతో చింతిస్తూ, ముసలితనం మీదపడిన ఇప్పుడు నీకు సంతతి కలగడం చాల అదృష్టం. సంతానం లేనివారికి సుఖాలు ఉండవు కదా.

**క. పొడగంటి నిన్ను బ్రదికితిఁ, గడచితి నాపదల నింకఁ గార్యంబులు నే**
**యెడమడుగు లేనినెచ్చెలిఁ, బొడఁగాంచుట చచ్చి మఱలఁ బుట్టుట గాదే! 202**

**ప్రతి :** నిన్ను= నందా నిన్ను; పొడగంటి= చూచాను; బ్రదికితిన్= బ్రతికాను; ఇంకన్= ఇకమీద; ఆపదలన్= కష్టాలను; కడచితిన్= దాటాను; కార్యంబులున్= పనులలో; ఏ= ఏ విధమైన; ఎడమడుగు= తేడా; లేని= లేనటువంటి; నెఱ+చెలిన్= మంచి మిత్రుణ్ణి; పొడన్+కాంచుట= చూడడం; చచ్చి= చనిపోయి; మఱలన్= మళ్ళీ; పుట్టుటకాదు+ఏ= జన్మించడమే కదా!

**తా :** ఓ నందుడా! నిన్ను చూచాను కనుక బ్రతికాను. ఇక మీద నాకు కష్టాలుండవు. చేసే పనులలో ఏవిధమైన అరమరికలు లేని ఒక మంచిమిత్రుణ్ణి చూడటం, చచ్చి, మళ్ళీ పుట్టడమే కదా!

**క. పలుపాటులఁబడు జనులకు, నిల నొకచో నుండఁ గలదె? యేఱుల వెంటం**
**గలిగి చనుమ్రాఁకు లన్నియుఁ, బలువెంటలఁ బోవుఁగాక పాయక యున్నే? 203**

**ప్రతి :** పలు= అనేకవిధాలైన; పాటులన్= కష్టాలను; పడు= పడునట్టి; జనులకున్= నరులకు; ఇలన్= భూమిమీద; ఒకచోన్= ఒకచోట; ఉండన్= ఉండడానికి; కలదు+ఎ?= వీలౌతుందా? ఏఱుల= నదుల; వెంటన్= వెంబడి; కలిగి= కలిసి; చను= వెళ్లే; మ్రాఁకులు= చెట్లు; అన్నియున్= అన్నీ; పలు= అనేకమైన; వెంటలన్= మార్గాల్లో; పోవున్+కాక= వెళ్ళుతాయిగాని; పాయక= విడివడక; ఉన్ను+ఏ= ఉంటాయా?

**తా :** జీవితంలో అనేకవిధాలైన కష్టాలుపడే మానవులంతా ఈ నేలమీద ఒకేచోట ఉండటం వీలు పడుతుందా? నదీప్రవాహాల్లో పడి కలిసి వెళ్ళే మ్రాకులు విడివడకుండా ఉంటాయా? వేర్వేరు మార్గాల్లో వెళ్ళకుండా ఉంటాయా?

**మ. పలురోగంబుల నొందకున్నవె పసుల్? పాలిచ్చునే ధేనువుల్?**
**కొలఁకుల్ వాఁగులు వారిపూరితములే? గోష్ఠప్రదేశంబులం**
**బులులున్ దుప్పులు సంచరింపవు గదా! పొల్పారునే ఘోషముల్?**
**కలవే పచ్చనిపూరిజొంపములు తత్కాంతారభాగంబులన్? 204**

**ప్రతి :** పసుల్= గోవులు; పలు= అనేకవిధాలైన; రోగంబులన్= జబ్బులను; ఒందక= పొందక; ఉన్నవి+ఎ= ఉన్నవికదా? ధేనువుల్= పాడి ఆవులు; పాలు+ఇచ్చును+ఏ= పాలు ఇస్తున్నాయి; కొలఁకుల్= నీటిగుంటలు; వాఁగులు= చిన్న చిన్న ఏరులు; వారి= నీళ్ళచేత; పూరితములు+ఏ?= నిండి ఉన్నాయి కదా!; గోష్ఠప్రదేశంబులన్= ఆలమందలు ఉండే చోట్లలో; పులులున్, దుప్పులు= పులులు, దుప్పులు మున్నగు క్రూరమృగాలు; సంచరింపవు కదా!= తిరుగాడవు కదా!; ఘోషముల్= గొల్లపల్లెలు; పొలుపు+ఆరును+ఏ= బాగున్నవి కదా!; తద్= ఆ యా గొల్లపల్లెల చెంతనున్న; కాంతార భాగంబులన్= అడవిప్రదేశాల్లో; పచ్చని= ఆకుపచ్చని; పూరి= గడ్డియొక్క; జొంపములు= గుబురులు; కలవు+ఏ= ఉన్నాయి కదా!

**తా :** 'నందరాజా! గోవులు వివిధరోగాలకు గురి కాకుండా ఉన్నాయి కదా? పాడిఆవులు పుష్కలంగా పాలు ఇస్తున్నాయి కదా? గుంటల్లో, వాగుల్లో నీళ్ళు నిండి ఉన్నాయి కదా? ఆలమందలు ఉండే ప్రదేశాల్లో పులులు, దుప్పులు తిరుగాడటం

లేదు కదా? గొల్లపల్లెలన్నీ అభివృద్ధి చెందుతున్నాయి గదా? ఆ పల్లెల ప్రక్కనున్న అడవుల్లో పచ్చగడ్డి మెండుగా ఉందికదా?' అని వసుదేవుడు అనేక కుశల ప్రశ్నలడిగాడు.

**క. తనపుత్త్రమిత్త్రముఖరులఁ, దనుపక చూడకయు వారు దఱిఁగి నశింపన్**
**మనుచు గృహమేధియాశ్రమ, మున నుండెడువాని కొక్క మోదముఁ గలదే? 205**

**ప్రతి :** తన= తనయొక్క; పుత్త్ర= కొడుకుల్ని; మిత్ర= స్నేహితుల్ని; ముఖరులన్= ముఖ్యులైనవారిని; తనుపక= తృప్తిపరుపక; చూడకయున్= (వారిని) చూడకుండ, అనగా వారి బాగోగులు చూడకుండ; వారు+తఱిఁగి= వారు తక్కువ స్థితికి పోయి; నశింపన్= నాశనమైపోగా; మనుచున్= బ్రదుకుతూ; గృహమేధి+ఆశ్రమమునన్= గృహస్థాశ్రమంలో; ఉండెడువానికిన్= ఉండేవానికి; ఒక్కమోదమున్= ఒక్క సంతోషమైనా; కలదు+ఏ= ఉన్నదా?

**తా :** తన కొడుకులను, స్నేహితులను, తనకు ముఖ్యులైనవారిని తృప్తిపరచకుండా, వారిబాగోగులు చూడకుండా, వారు అంతకంతకు క్షీణించి నశిస్తుంటే–తాను బాగా బ్రతుకుతూ గృహస్థాశ్రమంలో ఉండేవాడికి ఏ విధమైన సంతోషమైనా ఉంటుందా?

**క. నీకాంతయొద్ద నీవును, నీకాంతయు గారవింప నినుఁ దండ్రిఁగ నా**
**లోకించుచు నీ మందను, నా కొడు కున్నాఁడె? నంద! నందాన్వితుఁడై. 206**

**ప్రతి :** నంద= ఓ నందా!; నీ కాంత+ఒద్దన్= నీ భార్యదగ్గర; నీవును= నీవూ; నీ కాంతయున్= నీ భార్యయు; గారవింపన్= ప్రేమతో చూస్తూ ఉండగా; నినున్= నిన్ను; తండ్రిన్+కన్= తండ్రిగ; ఆలోకించుచున్= చూస్తూ; నీ మందను= నీ వ్రేపల్లెలో; నా కొడుకు= నా కుమారుడు; నంద+అన్వితుఁడు+ఐ= ఆనందంతో కూడుకొన్నవాడై; ఉన్నాఁడు+ఎ= ఉన్నాడు కదా?

**తా :** నందా! నీవు, నీ భార్య ప్రేమతో చూస్తుండగా, నిన్ను తండ్రిగా చూస్తూ, వ్రేపల్లెలో నా కొడుకు ఆనందంగా ఉన్నాడు కదా?

**వ. అనిన నందుం డిట్లనియె. 207**

**ప్రతి :** అనినన్= అని అనగా, (వసుదేవుడు ఆ విధంగా) అనగా; నందుండు= నందుడు; ఇట్లు= ఈ విధంగ; అనియెన్= అన్నాడు.

**తా :** అని వసుదేవుడు పలుకగా, దానికి నందుడు ఇట్లన్నాడు.

**శా. నీకున్ దేవకికిన్ జనించిన సుతానీకంబుఁ దోడ్తోడ ము**
**న్నీ కంసుండు వధించె, మీసుతఁ దుదిన్హింసింపఁ జేఁదప్పి తా**
**నాకాశంబున కేగె, బాల యది, దైవాధీన మాపద్దశన్**
**శోకం బందునె తద్‌జ్ఞుఁ డూఱడుము నా సూనుండు నీ సూనుఁడే. 208**

**ప్రతి :** మున్ను= ఇదివరకు; నీకున్= నీకును; దేవకికిన్= దేవకీదేవకికిని; జనించిన= పుట్టిన; సుత+అనీకంబున్= కొడుకుల సమూహాన్ని; తోడ్తోడన్= వెంటవెంటనే; కంసుండు వధించెన్= కంసుడు చంపాడు; తుదిన్= కడపట; మీసుతన్=

మీ కుమార్తెను; హింసింపన్+కన్= చంపబోగా; అది బాల= ఆ బాలిక; చేన్= చేత; తప్పి= తప్పించుకొని; తాన్= తాను; ఆకాశంబునకున్= ఆకాశానికి; ఏఁగెన్= వెళ్ళెను; దైవ+అధీనము= విధివశమైన; ఆపద్+దశన్= ఆపద ఏర్పడిన స్థితిలో; తద్‌జ్ఞుఁడు= అది తెలిసినవాడు; శోకంబు= దుఃఖాన్ని; అందును+ఎ= పొందునా?; ఊఱడుము= ఊరడిల్లుము; నా సూనుండు= నా కుమారుడు; నీ సూనుఁడు+ఏ= నీ కుమారుడే కదా?

**తా :** ఇదివరలో నీకూ, దేవకీదేవికీ పుట్టిన కొడుకులందరినీ, వెంటవెంటనే కంసుడు వధించాడు. చివరకు మీ కుమార్తెను కూడా చంపబోగా, ఆ బాలిక అతని చేతినుండి తప్పించుకొని, ఆకాశాని కెగిరిపోయింది. విధివశాన ఆపద ఏర్పడినపుడు వివేకవంతుడు దుఃఖించ వచ్చునా? వసుదేవా! ఊరట చెందు. నా కొడుకునే నీ కొడుకని అనుకో.

**వ. అనిన వసుదేవుండు నందునకు మఱియు నిట్లనియె. 209**

**ప్రతి :** అనినన్= అని పలికిన నందునికి; వసుదేవుండు= వసుదేవుడు; నందునకున్= నందమహారాజుతో; మఱియున్= ఇంకను; ఇట్లు= ఈ విధంగ; అనియెన్= అన్నాడు.

**తా :** అని పలికిన నందమహారాజుతో, వసుదేవుడు మళ్లీ ఈ విధంగా అన్నాడు.

**క. జనపతి కరి యిడితివి, మముఁ, గనుఁగొంటివి, మేము నిన్నుఁ గంటిమి, మే ల**
**య్యెను, బొమ్మింకను గోకుల, మున నుత్పాతములు దోఁచు మునుకొనవలయున్. 210**

**ప్రతి :** జనపతికిన్= రాజుకు, కంసరాజుకు; అరి= కప్పం; ఇడితివి= ఇచ్చావు; మమున్= మమ్మల్ని; కనుఁగొంటివి= చూచావు; మేమున్= మేము కూడ; నిన్నున్= నిన్ను; కంటిమి= చూచాము; మేలు+అయ్యెను= మంచిదయింది; గోకులమునన్= వ్రేపల్లెలో; ఉత్పాతములు= ఆపదలు కలుగుసూచనలు; తోఁచున్= కనుపడుతున్నాయి; మునుకొనవలయున్= ముందుజాగ్రత్తలు తీసుకోవాలి; ఇంకను= ఇక; పొమ్ము= (వ్రేపల్లెకు) వెళ్ళుము.

**తా :** ఓ నందరాజా! కంసునికి కప్పం కట్టావు. మమ్మల్ని చూడటానికి వచ్చావు. మేముకూడా మిమ్మల్ని చూచాం. చాల సంతోషం. వ్రేపల్లెలో ఉపద్రవాలు కలిగే సూచనలు కన్పిస్తున్నాయి. వాటిల్ని ముందు జాగ్రత్తతో ఎదుర్కోవాలి. నీ విక వెళ్ళు.

## ❖ కంసుని పంపునఁ బూతన యను రాక్షసి వ్రేపల్లెకుఁ జనుదెంచుట ❖

**వ. అని పలికి వసుదేవుండు నందాదులయినవల్లవుల వీడ్కొలిపిన వారలు గొబ్బున వడిగల గిబ్బలం బూనిన శకటంబులు ప్రకటంబులుగ నెక్కి తమ తమ పల్లెలత్రోవలు వట్టి చని రానందుండు ప్రతీతంబులైన యుత్పాతంబులు ముందటఁ బొడగని శౌరి దనతోఁ బలికిన పలుకులు దప్ప వనుచుఁ దలంచుచుం జనియె నంత. 211**

**ప్రతి :** అని= ఆ విధంగా; పలికి= చెప్పి; వసుదేవుండు= వసుదేవుడు; నంద+ఆదులు+అయిన= నందుడు మొదలైన; వల్లవుల= గోపకులను; వీడ్కొలిపినన్= సెలవిచ్చిపంపగా, సాగనంపగా; వారలు= ఆ నందాదులు; గొబ్బునన్= శీఘ్రంగ; వడి= వేగం; కల= కలిగిన; గిబ్బలన్= ఎద్దులను; పూనిన= కట్టిన; శకటంబులు= బండ్లను; ప్రకటంబులుగన్= ప్రసిద్ధంగా, అందరు చూస్తుండగ; ఎక్కి= ఎక్కినవాళ్లై; తమ తమ పల్లెల త్రోవలు= తమ పల్లెలమార్గాలను; పట్టి= అనుసరించి; చనిరి=

వెళ్ళిరి; ఆ నందుండు= ఆ నందమహారాజు; ప్రతీతంబులు+ఐన= స్పష్టంగ అగుపిస్తున్నవైన; ఉత్పాతంబులు= అరిష్ట సూచనలు; ముందటన్= ఎదుటనే; పొడగని= చూచి; శౌరి= వసుదేవుడు; తనతోన్= తనతో; పలికిన= చెప్పిన; పలుకులు= మాటలు; తప్పవు= తప్పిపోవు, అనగా తప్పక జరుగుతాయి; అనుచున్= అని అనుకొంటు; తలంచుచున్= ఆలోచిస్తూ; చనియెన్= వెళ్ళాడు; అంతన్= ఆ తరువాత...

**తా :** వసుదేవుడు ఆ విధంగా చెప్పి నందుడు మొదలైన గోపకులను సాగనంపగా, వారు వడిగా నడువగల ఎద్దులను కట్టిన బండ్లెక్కి అందరు చూస్తూ ఉండగ తమ తమ గ్రామాల త్రోవన వెళ్ళారు. నందుడు తన ముందర చెడు జరిగే సూచనలను స్పష్టంగా చూస్తూ, వసుదేవుడు తనతో చెప్పిన మాటలు తప్పవని అనుకొంటూ, ఆలోచిస్తూ వెళ్ళాడు. తరువాత

**సీ. కంసుపంపున బాలఘాతిని పూతన పల్లెల మందలఁ బట్టణముల**
**నిల నెల్లచో బాలహింసఁ గావించుచుఁ జనుచు నెవ్వనిపేరు శ్రవణవీథిఁ**
**బడినయంతన సర్వభయనివారణ మగు నట్టి దైత్యాంతకుం డవతరించి**
**యున్న నందునిపల్లె కొకనాఁడు ఖేచరి యై వచ్చి యందు మాయాప్రయుక్తిఁ**

**తే. గామరూపిణియై చొచ్చి కానకుండ, నరిగి యిల్లిల్లుఁ దప్పక యరసికొనుచు**
**నందగృహమున బాలుని నాద మొకటి, విని ప్రమోదించి సుందరీవేష యగుచు. 212**

**ప్రతి :** బాలఘాతిని= పిల్లలను చంపేదైన; పూతన= పూతన అనే రాక్షసస్త్రీ; కంసు= కంసునియొక్క; పంపునన్= అజ్ఞచేత; పల్లెలన్= చిన్నచిన్న ఊళ్ళలో; మందలన్= గొల్లపల్లెల్లో; పట్టణములన్= పట్టణాలలో; ఇలన్= భూమిమీద; ఎల్లచోన్= అన్నిచోట్ల; బాలహింసన్= పిల్లల్ని చంపడం; కావించుచున్= చేస్తూ; చనుచున్= వెళ్ళుతూ; ఎవ్వనిపేరు= ఎవనియొక్కపేరు; శ్రవణవీథిన్= చెవులమార్గంలోచెవుల్లో; పడిన+అంతన= వినిపించినంతనే; సర్వ= అన్ని; భయ= భయాలు; నివారణము+ అగున్= తొలగిపోతాయో; అట్టి= అటువంటి; దైత్య+అంతకుండు= రాక్షసుల్ని నాశనంచేసేవాడు; అవతరించి= పుట్టి; ఉన్న= ఉన్నట్టి; నందుని= నందునియొక్క; పల్లెకున్= ఊరికి–అనగా వ్రేపల్లెకు; ఒకనాఁడు= ఒకానొకరోజు; ఖేచరి+ఐవచ్చి= ఆకాశమార్గంలో వచ్చి; అందున్= ఆ వ్రేపల్లెలో; మాయాప్రయుక్తిన్= మాయను ప్రయోగించడంచేత; కామరూపిణి+ఐ= కోరుకొన్న రూపాన్ని ధరించిందై; చొచ్చి= ప్రవేశించి; కానకుండన్= ఎవ్వరికీ అగుపడకుండ; అరిగి= వెళ్ళి; ఇల్లున్+ఇల్లున్= ప్రతి ఇంటినీ; తప్పక= తప్పిపోకుండ; అరసికొనుచున్= వెదకుతూ; నంద= నందుని; గృహమునన్= ఇంటిలో; బాలుని= పసిబిడ్డయొక్క; నాదము+ఒకటి విని= శబ్దాన్ని ఒకదాన్ని విని; ప్రమోదించి= మిక్కిలి ఆనందించి; సుందరీవేష= అందమైన స్త్రీ వేషధారిణి; అగుచున్= అవుతూ...

**తా :** పసిబిడ్డల్ని చంపే పూతన అనే రాక్షసి, కంసుని ఆదేశానుసారం పల్లెల్లో, గొల్లపల్లెల్లో, పట్టణాల్లో పసిబిడ్డల్ని చంపుతూ ఎవరి పేరు చెపితే సర్వభయాలు తొలగిపోతాయో, ఆలాంటి రాక్షసాంతకుడు జన్మించి ఉన్న వ్రేపల్లెకు ఒకరోజు ఆకాశమార్గంలో వచ్చింది. మాయతో తాను కోరుకొన్న రూపాన్ని ధరించింది. ఎవ్వరికి అగుపించకుండ ఇల్లిల్లు తిరిగింది. నందుని ఇంట్లో ఒక పసిబిడ్డ చేసే శబ్దం వినింది. చాలా సంతోషించింది. అందమైన స్త్రీ వేషం ధరించి,

**మత్త. క్రాలుకన్నులు గుబ్బచన్నులుఁ గందువొందనిచందురుం**
**బోలు మోమును గల్గు లేదన బుద్ధి దూఱనికౌను హే**

**రాళమైన పిఱుందుఁ బల్లవరాగపాదకరంబులుం**
**జాల దొడ్డగుకొప్పు నొప్పఁగ సర్వమోహనమూర్తితోన్.** **213**

**ప్రతి :** క్రాలుకన్నులు= చలించే కన్నులు; గుబ్బ= గుండ్రని ఎత్తైమొనదేలిన; చన్నులున్= చనులును; కందున్= మచ్చను; ఒందని= పొందని; చందురున్= చంద్రుణ్ణి; పోలు= పోలినట్టి; మోమును= ముఖం; కల్గు= ఉందా; లేదు=లేదా; అనన్= అన్నట్లుగా; బుద్ధి= బుద్ధి; దూఱని= అందని; కౌను= నడుము; హేరాళము+ఐన= పెద్దవైన; పిఱుందున్= పిరుదులతో; పల్లవ= చిగురువంటి (మృదువైన); రాగ= లేత ఎరుపురంగుగల; పాదకరంబులున్= కాలుసేతులతో; చాల= మిక్కిలి; దొడ్డ+అగు= పెద్దదైన; కొప్పున్= తల కొప్పు; ఒప్పన్+కన్= ఒప్పుతుండగా; సర్వ= అందరికి; మోహన= మోహాన్ని కలిగించే; మూర్తితోన్= రూపంతో...

**తా :** చలించే కన్నులతో, మిక్కిలి ఎత్తై మొనదేలిన గుండ్రనిచన్నులతో, మచ్చలేని నిండైన చంద్రునివంటి ముఖంతో, ఉన్నదా లేదా అని బుద్ధికి అందని సన్ననినడుముతో, పెద్ద పిరుదులతో, చిగురుటాకువంటి లేత ఎరుపురంగుగల కాలుసేతులతో; పెద్దకొప్పుతో అందరికీ మోహాన్ని కలిగించే రూపంతో

**విశే :** కామరూపులైన రాక్షసులు కోరినరూపం ధరిస్తారు. అందుకే పూతన ఇలాంటి రూపాన్ని ధరించింది.

**మానిని.**

**కాంచనకుండలకాంతులు గండయుగంబునఁ గ్రేళ్లుఱుకన్ జడపై**
**మించిన మల్లెలమేలిమితావులు మెచ్చి మదాళులు మింటను రా**
**నంచితకంకణహారరుచుల్ చెలువారఁగఁబై వలు వంచల నిం**
**చించుక జాఱఁగ నిందునిభానన యేఁగెఁ గుమారునియింటికినై.** **214**

**ప్రతి :** కాంచన= బంగారు; కుండల= చెవి ఆభరణాల; కాంతులు= మెరుపులు; గండయుగంబునన్= రెండు చెక్కిళ్లపైనా; క్రేళ్ళు+ఉఱుకన్= చిందులాడగా; జడపై= తలవెంట్రుకల అల్లికమీద; మించిన= అతిశయించిన; మల్లెల= మల్లెపూలయొక్క; మేలిమి= మంచి; తావులు= సువాసనలు; మెచ్చి= ప్రీతిగొని; మద+అళులు= మదించిన తుమ్మెదలు; మింటను= ఆకాశంలో; రాన్= రాగా (వెంటబడిరాగా); అంచిత= ఒప్పిదమైన; కంకణ= కడియాలు; హార= దండలు; రుచుల్= కాంతులు; చెలువు+ఆరఁగన్= అందగించగా; పై= మీది; వలువ= వస్త్రం (అనగా పైటగుడ్డ); అంచలన్= ప్రక్కల; ఇంచున్+ఇంచుక= కొద్దికొద్దిగా; జాఱన్+కన్= జారుతుండగా; ఇందు= చంద్రునితో; నిభ= సమానమైన; ఆనన= ముఖంగలదైన ఆ పూతన; కుమారుని= బాలకృష్ణుని; ఇంటికిన్+ఐ= ఇంటినిగూర్చి; ఏఁగెన్= వెళ్లింది.

**తా :** చెవులకు అలంకరించుకొన్న బంగారుకుండలాల కాంతులు చెక్కిళ్ళమీద చిందులాడుతుండగా, జడలో దండిగ అలంకరించుకొన్న మల్లెపూల సువాసనలకు గండుతుమ్మెదలు పైనుండి ముసురుతుండగా, కంకణాల కాంతులు, హారాల వెలుగులు అందంగా అగుపిస్తుండగా, వల్లెవాటుగా మీదవేసుకొన్న పైట కొద్దిగా ప్రక్కలకు జారుతూ ఉండగా, చంద్రునివంటి అందమైన ముఖంతో ఆ పూతన బాలకృష్ణుడుండే నందుని ఇంటికి వెళ్ళింది.

**విశే :** మానినీ వృత్తగణములు: 7 భగణాలు మీద ఒక గురువు; యతి: 1-13-19 అక్షరాలకు.

**వ. ఆ సమయంబున. 215**

**ప్రతి :** ఆ సమయంబునన్= ఆ సమయంలో...

**తా :** పూతన నందునిఇంటికి వెళ్లిన సమయంలో

**మ. 'సిరి మమ్మున్ బ్రదుకంగఁ జూచుకొఱకై శృంగారవేషంబుతో**
**నరుదే నోపు' నటంచు గోపికలు జిహ్వాల్ రాక మోహించి త**
**త్పరలై చూడ లతాంగి వోయి కనియెం బర్యంకమధ్యంబునం**
**బరు భస్మానలతేజు దుర్జనవధప్రారంభకున్ డింభకున్. 216**

**ప్రతి :** గోపికలు= గోపస్త్రీలు; సిరి= లక్ష్మి; మమ్మున్= మమ్మలను; బ్రతుకన్+కన్= (బాగా) బ్రతుకునట్లు; చూచుకొఱకున్+ఐ= చూడడంకోసం; శృంగార= అందమైన; వేషంబుతోన్= రూపంతో; అరుదేన్+ఓపున్= వచ్చిందేమో; అటంచు= అని అనుకొంటూ; జిహ్వాల్= నాలుకలు; రాక= రాకపోగా (నీ వెవ్వరని అడుగుటకు నాలుకలు ఆడకపోగా); మోహించి= భ్రాంతి పొందినవారై; తత్పరలు+ఐ= దానియందే (మారురూపంలో వస్తున్న పూతనయందే) ఆసక్తి కలవారై; చూడన్= చూస్తుండగా; లతా+అంగి= తీవవంటి అందమైన శరీరంగల ఆ పూతన; పోయి= వెళ్ళి, ఇంటిలోపలికి వెళ్ళి; పర్యంక= మంచంయొక్క; మధ్యంబునన్= నడుమ; పరున్= పరమాత్మను; భస్మ= బూడిద కప్పువడి ఉన్న; అనల= నిప్పువలె; తేజున్= వెలుగుతున్నవాణ్ణి; దుర్జన= దుష్టులయొక్క; వధ= చంపుటను; ప్ర+ఆరంభకున్= గొప్పగా మొదలుపెట్టేవాణ్ణి; డింభకున్= బాలకుణ్ణి; కనియెన్= చూచింది.

**తా :** పూతన లోపలికి వెళ్ళుతూ ఉంటే గోపికలందరు మాకు గొప్ప బ్రతుకు ప్రసాదించటానికే లక్ష్మీదేవి ఈ అందమైన వేషం ధరించి వచ్చిందేమో అనే, భ్రాంతితో ఏమీ మాట్లాడటానికి నాలుకలు రాక; తదేకదృష్టితో ఆమెను చూస్తూ నిలబడ్డారు. అందమైనరూపంతో ఆ పూతన లోనికి వెళ్ళి, బూడిదలో నిప్పుకణికవలె వెలుగుతున్నవాడూ, దుష్టశిక్షణ మొదలు పెట్టుటకు సిద్ధంగా ఉన్నవాడూ, పరమాత్ముడూ అయిన బాలునిగా ఉండేవాణ్ణి మంచం మధ్యలో పరుండి ఉండగా చూచింది.

**విశే :** మాటకు, మనస్సుకు అందనివాడు, అన్నింటికి అతీతమైనవాడు, ఎన్ని ప్రళయాలు వచ్చినా చివరకు మిగిలేవాడు కనుక పరమాత్మ - పరుడు.

శ్రీకృష్ణావతారంలో దుష్టశిక్షణ పూతన సంహారంతోనే కదా ప్రారంభమౌతుంది. అందుకే ఆ బాలకృష్ణుడు దుర్జనవధ ప్రారంభకుడయ్యాడు.

**వ. కని కదియవచ్చుసమయంబున. 217**

**ప్రతి :** కని= చూచి (ఆ బాలకృష్ణుణ్ణి మంచంమధ్యలో చూచి) కదియవచ్చు= దగ్గరికి వచ్చే; సమయంబునన్= సమయంలో...

**తా :** (పడక మధ్యలో పవళించిన చిన్ని కృష్ణుని) చూచి దగ్గరికి వచ్చే సమయంలో

**శా. ఆ లోకేశ్వరుఁ డాచరాచరవిభుం డా బాలగోపాలుఁ డా**
**బాలధ్వంసిని గొంటు గం టిడి వెసన్ బాలెంతచందంబునం**
**బాలిండ్లన్ విస మూని వచ్చుట మదిన్ భావించి లో నవ్వుచున్**
**కాలుం గేలు నెఱుంగకున్నకరణిం గన్మోడ్చి గుర్వెట్టఁగన్ 218**

**ప్రతి :** ఆ, లోక+ఈశ్వరుఁడు= ఆ లోకాలన్నింటికి ప్రభువూ; ఆ, చర+అచర, విభుండు= ఆశ్చర్యంగా చలనం వున్న చలనం లేని వాటికన్నింటికి అధిపతీ అయిన; ఆ బాలగోపాలుఁడు= ఆ బాలకృష్ణుడు; ఆ, బాలధ్వంసిని= ఆ పసిపిల్లల్ని చంపేదైన, పూతన; గొంటు= దుష్టురాలు; కంటు+ఇడి= పగపెట్టి; వెసన్= వేగంగ; బాలెంత చందంబునన్= పురిటిబిడ్డతల్లివలె; పాలిండ్లన్= రొమ్ములందు; విసము= విషాన్ని; ఊని= పెట్టుకొని; వచ్చుటన్= రావడాన్ని; మదిన్= మనస్సులో; భావించి= తెలుసుకొని; లోన్= తనలో తాను; నవ్వుచున్= నవ్వుకొంటూ; కాలున్= కాలును; కేలున్= చేతిని; ఎఱుంగక+ఉన్న= తెలుసుకోలేకుండ ఉన్న; కరణిన్= విధంగ; కన్= కన్నులు; మోడ్చి= మూసుకొని; గుర్+పెట్టన్+కన్= నిద్రపోతున్నట్లు గురకపెట్టగా...

**తా :** లోకాలన్నింటికీ ప్రభువూ, చరాచరాలను పాలించేవాడూ, గోపాలబాలుడు అయిన శ్రీకృష్ణుడు, పసిపిల్లలను చంపేది, దుష్టురాలు అయిన పూతన, బాలింతరాలివలె పాలిండ్లలో విషాన్ని నింపుకొని త్వరత్వరగ రావటాన్ని తెలుసుకొని, తనలో తాను నవ్వుకొంటూ, కాలేదో చేయ్యేదో తెలుసుకోలేనంతగా నిద్రపోతున్నవాడిమాదిరిగా గురకలు పెట్టసాగాడు.

**క. ఆ పాపజాతిసుందరి, యా పాపనిపాన్పుఁ జేర నరిగి కరములన్**
**లేపి చనుంగవ శిశువున్, మోపుచు ముద్దాడి శిరము మూర్కొని పలికెన్. 219**

**ప్రతి :** ఆ పాపజాతి, సుందరి= ఆ పాపాత్ముల జాతికి చెందిన అందమైన ఆడుది, పూతన; ఆ పాపని= ఆ పసిబిడ్డయొక్క; పాన్పున్= పడకను; చేరన్= సమీపించడానికై; అరిగి= వెళ్ళి; కరములన్= చేతులతో; లేపి= బిడ్డను లేవనెత్తి; చనున్+కవన్= చన్నుల జంటమీద; శిశువున్= బిడ్డను; మోపుచున్= ఆనించుచు; ముద్దు+ఆడి= ముద్దుపెట్టుకొని; శిరము= తలను; మూర్కొని= వాసన చూచి; పలికెన్= (ఈ విధంగ) పలికింది.

**తా :** పాపాత్ముల జాతికి చెందిన ఆ అందమైన పూతన, పసిబిడ్డడి పడకదగ్గరికి వెళ్లి, చేతులతో బిడ్డనెత్తుకొని, తన చన్నుల మీద ఆనించుకొని, ముద్దు పెట్టుకొని, తలను వాసన చూచి ఈ విధంగా అనింది.

**క. "చను నీకుఁ గుడుపఁ జాలెడి, చనువారలు లేరు, నీవు చనవలె," ననుచుం**
**జనుగుడిపి మీఁద నిలుకడఁ, జనుదాన ననంగ వేడ్కఁ జనుఁ జను గుడుపన్. 220**

**ప్రతి :** నీకున్= నీకు; చను= చన్నులను; కుడుపన్= కుడిపించుటకు, అనగా చనుపాలు త్రాగించుటకు; చాలెడి= చాలినట్టి; చనువారలు లేరు= చెల్లుబడి కలవాళ్లు లేరు; నీవు చనవలెన్= నీవు చనిపోవలెను; అనుచున్= అని అంటూ; చను కుడిపి= చనుబాలు త్రావించి; మీఁదన్= తరువాత; నిలుకడన్= నిదానంగా; చనుదానన్= వెళ్తాను; అనంగన్= అని అన్నట్లుగ; వేడ్కన్= కుతూహలంతో; చనున్+చనున్= చన్నును చన్నును–అనగా రెండు చళ్ళను; కుడుపన్= త్రావిస్తే.

**తా :** నీకు చనుపాలు త్రావించటానికి తగినవారు ఇక్కడ ఎవ్వరు లేరు. నీవు చావాలి. నీకు చనుపాలు త్రాగించిన తరువాత నిదానంగా నేను వెళ్ళుతాను అన్నట్లుగ రెండు చళ్ళు త్రావించింది.

**విశే:** "చను గుడిపి మీఁద నిలుకడఁ జనుదాన" అనుటలో మరొక అర్థం కూడ స్ఫురిస్తుంది. నీకు చనుబాలు త్రావించి, నిన్ను చంపి, తరువాత నిదానంగా నేను కూడా చస్తానులే అనేదే మరోఅర్థం. ఈ 'చనుట' చనిపోవుట, పూతన ఆశించినట్లు కృష్ణుని విషయంలో జరుగలేదు గాని పూతనవిషయంలో మాత్రం జరిగింది.

**క. 'నా చనుఁబా లొక గ్రుక్కెఁడు, నోచిన్ని కుమార! త్రావు మొయ్యను పిదపన్**
**నీ చెలువ మెఱుఁగవచ్చును, నా చెలువము సఫల మగును నళినదళాక్షా!' 221**

**ప్రతి :** నళినదళ+అక్షా!= కమలపత్రాలవంటి కన్నులు కలవాడా!; ఓ చిన్నికుమారా!= ఓ పసిపాపడా!; ఒయ్యను= ఒప్పుగా; నా, చనున్+పాలు= నా చనుబాలను; ఒక గ్రుక్కెఁడు త్రావుము= ఒక గుక్కెడుతాగు; పిదపన్= ఆ తరువాత; నీ, చెలువము= నీ అందం లేదా నీవు ఉండేవిధం; ఎఱుఁగన్+వచ్చును= తెలుసుకోవచ్చును; నా, చెలువము= నా అందం లేదా నేనిప్పుడున్న విధం; సఫలము= ఫలవంతం; అగును= అవుతుంది.

**తా :** పద్మపత్రాలవంటి కన్నులు కలవాడా! ఓ చిన్నికుమారా! నా చనుబాలు ఒక గ్రుక్కెడు తాగవయ్యా! అప్పుడు నీవు ఎలా ఉంటావో తెలుస్తుంది. నేను చేసిన పనికూడా ఫలిస్తుంది.

**వ. అని బాలు నుద్దేశించి ముద్దాడెడిభంగి మాటలాడెడి చేడియం జూచి. 222**

**ప్రతి :** అని= ఈ విధంగా; బాలున్= బాలకృష్ణుణ్ణి; ఉద్దేశించి= తలచి; ముద్దు+ఆడెడి= ముద్దుపెట్టుకొనే; భంగిన్= రీతిలో; మాటలు+ఆడెడి= మాట్లాడుతున్నట్టి; చేడియన్= స్త్రీని; చూచి= చూస్తూ...

**తా :** అని ఆ బాలకృష్ణుణ్ణి ఉద్దేశించి ముద్దుపెట్టుకొనే విధంగా మాట్లాడుతున్న కాంతను (పూతనను) చూచి,

**మ. వనితా! ముట్టకు మమ్మ! చన్ను గుడుపన్ వల్దమ్మ! నీ చన్ను మా**
**తనయుం డొల్లఁడు వాసి పొ మ్మని యశోదారోహిణుల్ సీరఁ గై**
**కొన కీక్షించుచు మాయఁ బన్ని పెలుచం గోశంబులో వాలు మె**
**ల్పున రాజిల్లుచు మాట మెత్తఁదనమున్ లో వాఁడియు న్నేర్పడన్. 223**

**ప్రతి :** యశోదారోహిణుల్= యశోదాదేవి, రోహిణీదేవి; వనితా= ఓ కాంతా!; ముట్టకుము+అమ్మ= (మాబిడ్డను) తాకవద్దమ్మా!; చన్నున్+కుడుపన్= చనుపాలు త్రాగించడం; వల్దు+అమ్మ= వద్దమ్మా!; నీ చన్ను= నీ చనుత్రాగడం; మా తనయుండు= మా కుమారుడు; ఒల్లఁడు= ఇష్టపడడు; పాసి= వదలి; పొమ్ము= వెళ్ళు; అని, చీరన్= అంటూ పిలిచి చెప్పగా; కైకొనక= (వారిమాటలను) లెక్కపెట్టక; ఈక్షించుచున్= చూస్తూ; మాయన్= కపటాన్ని; పన్ని= ఏర్పరచుకొని; పెలుచన్= కఠినంగా; కోశంబులో= ఒరలో; వాలు= కత్తి; మెల్పునన్= వలె; రాజిల్లుచున్= ప్రకాశిస్తూ; మాటన్= మాటలో; మెత్తదనమున్= మృదుత్వం; లోన్= మనస్సులో; వాఁడియున్= క్రూరత్వం; ఏర్పడన్= ఉట్టిపడుతున్నట్లుగా...

**తా :** యశోదారోహిణులు 'మా బిడ్డను తాకవద్దు. నీ చనుబాలు ఇవ్వవద్దు. మా కొడుకు నీ చనుబాలు త్రాగడు. బిడ్డను వదలి వెళ్ళిపో' అని పూతనను దగ్గరికి పిలిచి చెప్పినా, ఆ రాక్షసి వాళ్ళమాటలు లెక్క పెట్టకుండ వాళ్ళవైపు సూటిగా చూస్తూ మాయతో, ఒరలోని క్రూరమైన కత్తిలా మాటల్లో మెత్తదనం, మనసులో క్రూరత్వం ఉట్టిపడుతుండగా

**వ. కదిసి కలికిపలుకులు పలుకుచు నులుకుసెడి జళుకు సొరక యెదుర నిదుర గదిరిన ఫణిని ఫణియని యెఱుంగక గుణమతిం దిగుచు జడమతి బెడంగునఁ గఱటి జఱభితెఱవ వెరవునం జనుదెంచి పఱపునడుమ నొఱపు గలిగి మెఱయుచుఁ గన్ను దెఱవక వెఱపు మఱపు నెఱుంగక కొమరుమిగులు చిఱుత కొమరునిం దిగిచి తొడలనడుమ నిడుకొని యొడలు నివురుచు నెడనెడ మమతం గడలుకొలుపుచు నాఁకొన్న చిన్నియన్న! చన్ను గుడువు మని చన్నిచ్చు సమయంబున. 224**

**ప్రతి :** కదిసి= చాలదగ్గరగావచ్చి; కలికిపలుకులు= తీయనిమాటలు; పలుకుచున్= మాట్లాడుతూ; ఉలుకు= భయం; చెడి= లేనిదై; జళుకు= తత్తరపాటు; చొరక= పొందక; ఎదురన్= ఎదుట; నిదుర+కదిరిన= నిద్రపోయిన; ఫణిని= పామును; ఫణి+అని= పాము అని; ఎఱుంగక= తెలుసుకోకుండ; గుణమతిన్= త్రాడనే భావంతో; తిగుచు= (తనవైపునకు) లాగు; జడమతి= బుద్ధిహీనుని; బెడంగునన్= విధంగా; కఱటి= మోసగత్తె; జఱభి= దుష్టురాలు; తెఱవ= స్త్రీ – ఆ పూతన; వెరవునన్= ఉపాయంతో; చనుదెంచి= వచ్చి; పఱపు= పాన్పు; నడుమన్= మధ్య; ఒఱపు+కలిగి= చక్కదనం కలిగి; మెఱయుచున్= ప్రకాశిస్తూ; కన్ను తెఱవక= కన్ను విప్పక; వెఱపున్= భయాన్ని; మఱపున్= మరచిపోవడాన్ని; ఎఱుంగక= తెలియక; కొమరు= అందం; మిగులు= అతిశయిల్లెడి; చిఱుత= చిన్న; కొమరునిన్= బాలుణ్ణి; తిగిచి= లాగితీసుకొని; తొడలనడుమన్= (తన) రెండుతొడలమధ్య; ఇడుకొని= ఉంచుకొని; ఒడలు= శరీరాన్ని; నిమురుచున్= తడవుచు; ఎడనెడన్= నడుమ నడుమ; మమతన్= ప్రేమను; కడలుకొలుపుచున్= అతిశయింపచేస్తూ; ఆఁకొన్న= ఆకలితో ఉన్న; చిన్ని అన్న= ముద్దుబిడ్డా!; చన్ను కుడువుము+అని= నా చలుబాలు త్రాగు అని; చన్ను+ఇచ్చు= చన్ను కుడుపు; సమయంబునన్= సమయంలో...

**తా :** చాలదగ్గరగా వచ్చి, తీయగా మాట్లాడుతూ, భయపడకుండ, తడబడకుండ, నిద్రపోతున్న బిడ్డను, నిద్రపోతున్న నాగుబాము అని తెలియక, త్రాడు అనే భావంతో బుద్ధిహీనుడు తనవైపు లాగుకొన్న విధంగా, మోసగత్తె, దుర్మార్గురాలు అయిన పూతన నేర్పుగ, పరుపుమీద చక్కగా ప్రకాశిస్తూ, కళ్ళు మూసుకొని నిర్భయంగా నిద్రపోతున్నట్లున్న అందాల బాలకృష్ణుణ్ణి ఎత్తి తన తొడల మధ్య ఉంచుకొన్నది. శరీరం నిమురుతూ ప్రేమను ఒలకపోస్తూ 'ఆకలితో ఉన్న నా ముద్దు బిడ్డా! నా చనుబాలు త్రావు' అని తన చన్నుకుడిపే సమయంలో

**సీ.** **మేల్కొన్న తెఱఁగున మెల్లన కనువిచ్చి క్రేఁగంటఁ జూచుచుఁ గిదికి నీల్గి**
**యావులించుచుఁ జేతు లాదరంబునఁ జూచి యొదిఁగిలి యాఁకొన్న యోజ నూఁది**
**బిగిచన్నుఁగవఁ గేలఁ బీడించి కబళించి గ్రుక్కగ్రుక్కకు గుటుగుటుకు మనుచు**
**నొక రెండుగ్రుక్కల నువిదప్రాణంబులుసైతము మేనిలో సత్త్వ మెల్లఁ**

**తే.** **ద్రావె నదియును గుండెలు దల్లడిల్లఁ, జిమ్మఁ దిరుగుచు నిలువక శిరము వ్రాల**
**నితరబాలురక్రియవాఁడ వీవు గావు, చన్ను విడువుము విడువుము చాలు, ననుచు.** **225**

**ప్రతి :** మేల్కొన్న= మేలుకొన్న; తెఱఁగునన్= విధంగ; మెల్లన= నిదానంగా; కనువిచ్చి= కళ్ళుతెరచి; క్రేఁగంటన్= ఓరగంటితో; చూచుచున్= చూస్తూ; కిదికి= ఒడలు విరుచుకొంటూ మూల్గి; నీల్గి= నిక్కి; ఆవులించుచున్= ఆవులిస్తూ; చేతులు= చేతులను; ఆదరంబునన్+చూచి= ఆప్యాయంగా చూస్తూ; ఒదిఁగిలి= ఒత్తిగిలి (ప్రక్కకు తిరిగి); ఆఁకొన్న= ఆకలి గొన్న; ఓజన్= విధంగ; ఊఁది= ఒత్తి; బిగి= బిగువైన; చన్నున్+కవన్= చన్నుల జంటను; కేలన్= చేతితో; పీడించి= గట్టిగా పట్టుకొని; కబళించి= నోట పెట్టుకొని; గ్రుక్కగ్రుక్కకున్= ఒక్కొక్క గ్రుక్కకు; గుటుగుటుకు మనుచున్= గుటుకు గుటుక్కుమని శబ్దం చేస్తూ; ఒక రెండు గ్రుక్కలన్= రెండు గ్రుక్కలలోనే; ఉవిద= (ఆ రాక్షస) స్త్రీయొక్క; ప్రాణంబులు సైతము= ప్రాణాలతోపాటు; మేనిలోన్= దేహంలోని; సత్త్వము+ఎల్లన్= బలమంతటినీ; త్రావెన్= త్రాగెను; అదియును= ఆ పూతనయును; గుండెలు= హృదయము; తల్లడిల్లన్= చలించిపోగా; చిమ్మన్= గిరగిరమని; తిరుగుచున్= తిరుగుతు; నిలువక= నిలబడి ఉండలేక; శిరము= తల; వ్రాలన్= వ్రాలిపోగా; ఈవు= నీవు; ఇతరబాలురక్రియవాడవు=

తక్కిన పిల్లలమాదిరివాడివి; కావు= కాజాలవు; చన్నువిడువుము విడువుము= (నా) చన్ను వదలు వదలు; చాలున్= (నీవు) చన్ను కుడిచింది ఇక చాలును; అనుచున్= అని అంటూ...

**తా :** బాలకృష్ణుడు అప్పుడే మేలుకొన్నట్లు నిదానంగా కళ్ళు విప్పి, ఓరగంట చూస్తూ, ఒడలు విరుచుకొంటూ మూల్గి, నిక్కి ఆవులిస్తూ, చేతులు చాచి, ప్రక్కకు తిరిగి, ఆకలితో ఉన్నవానివలె, పూతన బిగి చన్నులను చేతులతో గట్టిగా ఒత్తిపట్టుకొని నోటపెట్టుకొన్నాడు. గుటుకు గుటుకుమని శబ్దం చేస్తూ రెండుగ్రుక్కలు తాగాడు. ఆ రాక్షస స్త్రీ ప్రాణాల్ని, దేహబలాన్ని ఆ పాలతో పాటు పీల్చివేశాడు. పూతన గుండెలు తల్లడిల్లగా వేగంగా, గిరగిరా తిరుగుతూ, నిలబడలేక తలవాల్చి, 'నీవు నా దగ్గర పాలు తాగిన తక్కిన బాలుర వంటివాడివి కాదు. ఇపుడు పాలు తాగినంతవరకు చాలు. నా చన్ను విడిచిపెట్టు, విడిచిపెట్టు' అని అంటూ

**క. నిబ్బరపు దప్పి మంటలు, ప్రబ్బిన ధృతి లేక నేత్రపదహస్తంబుల్**
**గొబ్బున వివృతములుగ నా, గుబ్బగుచున్నట్టికూఁతఁ గూలెన్ నేలన్. 226**

**ప్రతి :** నిబ్బరము= అధికమైన; దప్పి= దప్పిక; మంటలు= దేహమంతా మంటలు; ప్రబ్బినన్= వ్యాపించగా; ధృతి లేక= ధైర్యములేక; నేత్ర= కన్నులు; పద= పాదాలు; హస్తంబుల్= చేతులు; గొబ్బునన్= శీఘ్రంగ; వివృతములు+కన్= విచ్చుకొన్నవి కాగా; ఆ, గుబ్బు+అగుచున్+ఉన్నట్టి= ఆ గుండెలదరే గుబ్బు గుబ్బు అనే శబ్దం కల్గినట్టి; కూఁతన్= అరుపుతో; నేలన్ కూలెన్= నేలమీద పడెను.

**తా :** అధికమైన దప్పిక, మంటలు శరీరమంతా వ్యాపింపగా, ధైర్యాన్ని కోల్పోయి, కళ్ళు విచ్చుకొని, కాళ్ళు, చేతులు చాచుకొని, గుండెలదరే గుబ్బనే శబ్దంతో అరుస్తూ నేలమీద కూలింది.

**మ. అదరెం గొండలతోడ భూమి, గ్రహతారానీకముల్ మింటిపై**
**బెదరెన్, దిక్కుల మాఱుమ్రోఁత లెసఁగెన్, భీతిల్లి లోకంబులుం**
**గదలం బాఱెను,వజ్రభిన్నగిరిరేఖం బూర్వదేహంబుతో**
**ద్రిదశధ్వంసిని గూలి కుయ్యిడిన తద్దీర్ఘోరుఘోషంబునన్. 227**

**ప్రతి :** త్రిదశ= దేవతలను; ధ్వంసిని= నాశనం చేసేదైనపూతన; వజ్ర= వజ్రాయుధంచేత; భిన్న= చీల్చబడిన; గిరిరేఖన్= కొండవలె; పూర్వ= మునుపటి; దేహంబుతోన్= శరీరంతో; కూలి= నేలమీదపడి; కుయ్యి+ఇడినన్= కేకపెట్టగా; తద్= ఆ యొక్క; దీర్ఘ= పొడవైన; ఉరు= పెద్దదైన; ఘోషంబునన్= ధ్వనిచేత; భూమి= నేల; కొండలతోడన్= కొండలతోకూడ; అదరెన్= కదలాడింది; గ్రహ= గ్రహాల; తారా= నక్షత్రాల; అనీకముల్= సమూహాలు; మింటిపైన్= ఆకాశంలో; బెదరెన్= భయపడెను; దిక్కులన్= దిక్కులందు; మాఱుమ్రోఁతలు= ప్రతిధ్వనులు; ఎసఁగెన్= అతిశయించెను; లోకంబులున్= లోకాలుకూడ; కదలన్+పాఱెను= కదలిపోసాగాయి.

**తా :** దేవతలను నాశం చేసేదైన పూతన, వజ్రాయుధంతో భేదింపబడిన పర్వతంవలె, తన తొలుతటి రాక్షసశరీరంతో నేలమీద కూలి, పెద్ద కేకపెట్టగా ఆ ధ్వనికి భూమి కొండలతోకూడ కదలాడింది. గ్రహాలు, నక్షత్రాలు ఆకాశంలో బెదిరిపోయాయి. అన్నిదిక్కులా ఆ కేకప్రతిధ్వనులు అతిశయిల్లాయి. అన్నిలోకాలు కంపించాయి.

**క. అప్పుడు దెప్పరమగు నా, చప్పుడు హృదయములఁ జొచ్చి సందడి పెట్టన్**
**ముప్పిరిగొని పడి రెఱుకలు, దప్పి ధరన్ గొల్ల లెల్లఁ దల్లడపడుచున్. 228**

**ప్రతి :** అప్పుడు= ఆ సమయంలో; దెప్పరము+అగు= సహింపశక్యంగానిదైన; ఆ చప్పుడు= ఆ శబ్దం; హృదయములన్= గుండెలలో; చొచ్చి= ప్రవేశించి; సందడి= ఒత్తిడి; పెట్టన్= కలిగింపగా; గొల్లలు= గొల్లవారు; ఎల్లన్= అందరు; తల్లడపడుచున్= చలించిపోతూ; ఎఱుకలు= స్పృహలు; తప్పి= కోల్పోయి; ధరన్= భూమిమీద; ముప్పిరిగొని= మెలికలు తిరిగి; పడిరి= పడిపోయారు.

**తా :** అప్పుడు సహింపశక్యం గాని ఆ శబ్దం తమగుండెల్లో ప్రవేశించి, భయపెట్టగా, గొల్లవాళ్ళందరూ, చలించినవాళ్లై, స్పృహ కోల్పోయి మెలికలు తిరిగి భూమిమీద పడ్డారు.

**క. ఆ జఱభి రండ రక్కసి, నైజశరీరంబు నేల నలియంబడినన్**
**యోజనమున్నర మేర ధ, రాజంబులు నుగ్గులయ్యె రాజవరేణ్యా! 229**

**ప్రతి :** రాజవరేణ్యా!= రాజులలో శ్రేష్ఠుడవైన ఓ పరీక్షిన్మహారాజా!; ఆ జఱభి= ఆ దుష్టురాలు; రండ= రంకుటాలు (ఇవి తిట్లు); రక్కసి= రాక్షసి; నైజ= సహజమైన; శరీరంబు= దేహం; నేల= నేలమీద; నలియన్= నలుగునట్లు; పడినన్= పడగా; యోజనమున్నరమేర= ఒకటిన్నర ఆమడదాకా; ధరాజంబులు= భూమినుండి పుట్టినవైన, వృక్షాలు; నుగ్గులు= చిన్న చిన్న ముక్కలు; అయ్యెన్= అయ్యాయి.

**తా :** ఓ పరీక్షిన్మహారాజా! దుష్టురాలు, రంకుటాలు, రాక్షసి అయిన ఆ పూతన సహజదేహం నలిగిపోయేట్టుగా నేలమీద పడగానే, దాని దెబ్బకు ఒకటిన్నర ఆమడల దూరందాకా ఉన్న చెట్లన్నీ నుగ్గు నుగ్గు అయ్యాయి.

**సీ. దారుణలాంగూలదండదంతంబులు నగగహ్వరముఁబోలు నాసికయును**
**గండశైలాకృతి గల కుచయుగమును విరిసి తూలెడి పల్లవెండ్రుకలును**
**జీఁకటినూతులఁ జెనయునేత్రంబులుఁ బెనుదిబ్బఁబోలెడి పెద్దపిఱుఁదుఁ**
**జాఁగుకట్టలఁబోలు చరణోరుహస్తంబు లింకినమడువుతో నెనయు కడుపుఁ**

**తే. గలిగి షట్క్రోశదీర్ఘమై కదిసి చూడ, భయదమగు దానిఘనకళేబరముఁ జూచి**
**గోపగోపీజనంబులు గుంపుగూడి, బెగడుచుండిరి మనముల బెదరు గదిరి. 230**

**ప్రతి :** దారుణ= భయంకరాలైన; లాంగూల= తోకలవంటి; దండ= పొడవైన కర్రలువంటి; దంతంబులు= పళ్ళును; నగ= పర్వతంయొక్క; గహ్వరమున్= గుహను; పోలు= పోలినట్టి; నాసికయును= ముక్కును; గండశైల= పెద్ద బండయొక్క; ఆకృతి= ఆకారం; కల= కలిగినట్టి; కుచయుగమును= చన్నుల జంటయు; విరిసి= చెదిరి; తూలెడి= చలించెడి; పల్ల= కావిరంగుగల; వెండ్రుకలును= వెంట్రుకలును; చీఁకటి నూతులన్= (మిక్కిలి లోతు అగుటచేత) చీకటి క్రమ్ముకొన్న చేదబావులను; చెనయు= పోలునట్టి; నేత్రంబులున్= కన్నులును; పెను= పెద్ద; దిబ్బన్= మట్టికుప్పను; పోలెడి= పోలునట్టి; పెద్ద= పెద్దదైన; పిఱుఁదున్= పిర్రను; చాఁగుకట్టలన్= పొడవైన కట్టల్ని; పోలు= సరిపోలునట్టి; చరణ= కాళ్ళు; ఊరు= తొడలు; హస్తంబులు= చేతులు; ఇంకిన= నీళ్ళు ఎండిపోయిన; మడువుతోన్= కొలనుతో; ఎనయు= పోలునట్టి; కడుపున్+కలిగి=

పొట్టయును కలిగి; షట్= ఆరు; క్రోశ= కోసుల; దీర్ఘము+ఐ= పొడవు కలదై; కదిసి= దగ్గరికి వెళ్ళి; చూడన్= చూడగా; భయదము+అగు= భయం కలిగించేదైన; దాని= ఆ రాక్షసి పూతనయొక్క; ఘన= పెద్ద; కళేబరమున్+చూచి= శవాన్ని చూచి; గోప, గోపీజనంబులు= గోపకులు, గోపికలు అయిన జనులు; గుంపుకూడి= ఒకటిగా చేరి; మనములన్= మనస్సులలో; బెదరు= భయము; కదిరి= హెచ్చి; బెగడుచున్+ఉండిరి= భయపడుతూ ఉన్నారు.

**తా :** తోకలవలె వంకరగా, కఱ్ఱలవలె నిడుపుగా కానవచ్చు పండ్లు, కొండగుహవంటి ముక్కు, పెద్ద బండలవలె ఉన్న చన్నులు, చెదిరి చలిస్తున్న ఎఱ్ఱని జుట్టు, చీకటి క్రమ్ముకొన్న చేదబావులవంటి కళ్ళు, పెద్ద మట్టిదిబ్బవంటి పిరుదులు, పొడవైన కట్టలవంటి కాళ్ళు, తొడలు, చేతులు, నీళ్ళు ఎండిపోయిన మడుగులాంటి కడుపు, ఆరుకోసుల పొడవు కలదై, దగ్గరకు వెళ్ళి చూస్తే భయాన్ని కలిగించే పూతన శవాన్ని చూచి, గోపకులు, గోపికలు అందరు గుమికూడి భయపడ్డారు.

**వ. ఇ వ్విధంబున. 231**

**ప్రతి :** ఈ+విధంబునన్= ఈ విధంగా...

**తా :** ఇలాగా

**క. ఆ తఱిఁ గుడువఁగ నడచెన్, నూతనపుల్లాబ్జలోచనుఁడు హరి మృత్యు**
**ద్యోతనఁ గృతమునిసముదయ, యాతనఁ బూతన నెఱింగి యాతనలీలన్. 232**

**ప్రతి :** ఆ, తఱిన్= ఆ సమయంలో; నూతన= క్రొత్తగా; పుల్ల= వికసించిన; అబ్జ= తామరలవంటి; లోచనుఁడు= కన్నులు గలవాడు; హరి= విష్ణువు, బాలకృష్ణమూర్తి; మృత్యుద్యోతనన్= (చిన్న పిల్లలను చంపి) మృత్యువును ప్రకాశింపచేసేదాన్ని; కృత= చేయబడిన; మునిసముదయ= మునుల సమూహంయొక్క; యాతనన్= తీవ్రవేదన కలదాన్ని, అనగా మునులను మిక్కిలిగ బాధించిన దాన్ని; పూతనన్= పూతనను; ఎఱింగి= (ఇది యిట్టి దుష్టురాలు అని) తెలుసుకొని; ఆ తనలీలన్= ఆ యొక్క తన బాలక్రీడావిలాసంతో (యాతనలీలన్= నరకవేదన విధిననుసరించి); కుడువన్+కన్= చనుబాలు త్రాగుటకై; నడచెన్= (దాని రొమ్ముమీద) ప్రాకసాగాడు.

**తా :** పూతన నేలకూలిన ఆ సమయంలో, కొత్తగా పూచిన తామరపువ్వవంటి కన్నులుండే ఆ బాలకృష్ణుడు పసిపిల్లలను చంపేది, మునులను బాధించేది, అయిన ఆ పూతనసంగతి తెలుసుకొని, తన బాలక్రీడావిలాసంతో, పాలు త్రాగటానికని ఆ రాక్షసి రొమ్ముమీద ప్రాకసాగాడు.

**క. విషధరరిపుగమనునికిని, విషగళసఖునికిని విమలవిషశయనునికిన్**
**విషభవభవజనకునికిని, విషకుచచనువిషముఁ గొనుట విషమే తలఁపన్? 233**

**ప్రతి :** విషధర= విషాన్ని ధరించిన పాములకు; రిపు= శత్రువైన గరుత్మంతునిమీద; గమనునికినిన్= ప్రయాణం చేసేవానికి; విషగళ= విషం కంఠంలోవున్న శివుని; సఖునికినిన్= స్నేహితునికి; విమల= నిర్మలమైన; విష= నీళ్ళమీద; శయనునికిన్= పవ్వళించేవానికి; విష= నీటినుండి; భవ= పుట్టిన పద్మంనుండి; భవ= పుట్టినవాని; జనకునికిని= బ్రహ్మకు తండ్రి అయినవానికి; విషకుచ= విషంతో కూడిన చన్నులు గలదాని; చనువిషమున్= చన్నులలో ఉన్న విషాన్ని; కొనుట= త్రాగడం; తలఁపన్= విచారించగా; విషము+ఏ= (అదొక) అది ఒక విషమా!

**తా :** విషసర్పాలను భక్షించే గరుత్మంతుడినే వాహనంగా కలవాడు, కంఠమందే విషముంచుకొన్న శివుడికి సుఖుడైనవాడు, విషం (నీళ్ళ)మీద శయనించేవాడు, విషం (నీటి)నుండి ఉద్భవించిన పద్మంనుండి పుట్టిన బ్రహ్మదేవునికి తండ్రి అయినవాడు విషపు చన్నుల పూతన చనువిషం త్రాగడం ఒక పెద్ద విషమా?

**విశే :** విషం= నీరు, గరళం.

**వ. అంత నా గోపగోపీజనంబులు తెలిసి రోహిణీయశోదలం గూడుకొని బెగ్గడిలక డగ్గఱి. 234**

**ప్రతి :** అంతన్= అప్పుడు; ఆ గోపగోపీజనంబులు= ఆ (వ్రేపల్లెలోని) గోపకులు, గోపికలు; తెలిసి= తెప్పరిల్లుకొని; రోహిణీ యశోదలన్= రోహిణీదేవిని, యశోదాదేవిని; కూడుకొని= కలిసి; బెగ్గడిలక= భయపడకుండ; డగ్గఱి= సమీపించి...

**తా :** ఈ సంఘటన నుండి తేరుకొన్న గోపీగోపకులు రోహిణీ, యశోదాదేవులను కలిసి, భయపడకుండా దగ్గరికి వచ్చి

**శా. నేలం గూలిన దానిపెన్నురముపై నిర్భీతిఁ గ్రీడింప నో**
**బాలా! రమ్మని మూఁపు జేర్చుకొని సంస్పర్శించి యూరార్చుచున్**
**గోలాంగూలముఁ ద్రిప్పి గోవురజమున్ గోమూత్రముం జల్లి త**
**ద్బాలాంగంబుల గోమయం బలఁది రా పంద్రెండునామంబులన్. 235**

**ప్రతి :** నేలన్= నేలమీద; కూలిన= పడిన; దాని= పూతనయొక్క; పెన్+ఉరముపై= పెద్దరొమ్ముమీద; నిర్భీతిన్= భయంలేకుండా; క్రీడింపన్= ఆడుకొనే; ఓ బాలా!= ఓ బాలుడా!; రమ్ము+అని= రా అని; మూఁపున్= భుజాల మీదికి; చేర్చుకొని= ఎత్తుకొని; సంస్పర్శించి= ఒళ్లు నిమిరి; ఊరార్చుచున్= లాలించుచు; గో= ఆవుయొక్క; లాంగూలమున్= తోకను; త్రిప్పి= దిగదుడిచి; గోవు= ఆవు; రజమున్= కాలి దుమ్మును; గో= ఆవుయొక్క; మూత్రమున్= పంచితమును; చల్లి= (మీద)చల్లి; తద్+బాల+అంగంబులన్= ఆ బాలుని అవయవాలమీద; పంద్రెండు నామంబులన్= పంద్రెండు నామాలను పఠిస్తూ; గోమయంబు= ఆవుపేడను; అలఁదిరి= పూశారు.

**తా :** నేలమీద కూలిన రక్కసి అయిన పూతన పెద్ద రొమ్ముమీద ఏ భయమూలేకుండా ఆడుకొనే ఆ బాలకృష్ణుణ్ణి 'రా బిడ్డా! అని భుజాలమీదికి ఎత్తుకొని, దేహమంతా, నిమిరి లాలించి, దోషపరిహారార్థం పవిత్రమైన ఆవుతోకతో దిగదుడిచి, ఆవు కాలిదుమ్మును, పంచితాన్ని పైనచల్లి, ఆవుపేడను పంద్రెండునామాలను స్మరిస్తూ పంద్రెండు అవయవాల్లో పూశారు.

**విశే :** ద్వాదశనామంబులు= కేశవాదిగా వున్న 24 నామాల్లో, మొదటి పంద్రెండునామాలను ఉచ్చరిస్తూ “లలాటం” మొదలు చివరగా “మెడమీద” ఊర్ధ్వపుండ్రాలు ధరించడం సంప్రదాయం. అలాగే గోపికలు కృష్ణునికి గోమయాన్ని పంద్రెండు అవయవాలకూ పూశారు.

**వ. మఱియు నంతటం దనియక గోపిక లాచమనంబు సేసి దక్షలయి, మునుపుగాఁ దమకు రక్షాకరం బగు బీజన్యాసంబు సేసికొని, 'చిన్ని యన్న! నీ యడుగు లజుండును, జానువు లనిలుండును, దొడలు యజ్ఞుండును, గటితలం బచ్యుతుండును, గడుపు హయాస్యుండును, హృదయంబుఁ గేశవుండును, నుర మీశుండును, గంఠం బినుండును, భుజంబులు చతుర్భుజుండును, ముఖంబు త్రివిక్రముండును, శిరం బీశ్వరుండును రక్షింతురు. ముందు చక్రియు, వెనుక గదాధరుండైన హరియుఁ బార్శ్వంబుల ధనుర్ధరుండైన**

**మధువైరియు నసిధరుండగు నజనుండును, గోణంబుల శంఖచక్రగదాధరుండైన యురుగాయుండును, మీఁ దుపేంద్రుండును, గ్రిందు తార్క్ష్యుండును, నంతటను హలధరుండగు పురుషుండును కాతురు. నీ యింద్రియంబుల హృషీకేశుండును, బ్రాణంబుల నారాయణుండును, జిత్తంబును శ్వేతద్వీపపతియును, మనంబును యోగీశ్వరుండైన కపిలుండును, బుద్ధిని పృశ్నిగర్భుండును, నహంకారంబును భగవంతుండైన పరుండును బాలనంబు సేయుదురు. నీవు క్రీడించునెడ గోవిందుండును, శయనించుతఱి మాధవుండును, నడచువేళ వైకుంఠుండును, గూర్చున్న సమయంబున శ్రీపతియును, గుడుచుకాలంబున సర్వభక్షకుండైన యజ్ఞభుజుండును నేమఱ కుండుదురు. నిన్నుఁ బేర్కొనిన దుస్స్వప్న వృద్ధబాలగ్రహంబులును, గూశ్మాండ డాకినీ యాతుధానులును, భూత ప్రేత యక్ష రాక్షస పిశాచ వినాయకులును, గోటరా రేవతులును, జ్యేష్ఠాపూతనలును, మాతృకాదిగణంబులును నశియింతురు. నీయందుఁ బ్రాణేంద్రియశరీరనిరోధంబు లయిన యున్మాదంబులును నపస్మారంబులును మహోత్పాతంబులును బొందకుండుం గావుతమని రక్షసేసి దీవించి రంత. 236**

**ప్రతి :** మఱియున్= అంతేకాక; గోపికలు= గోపస్త్రీలు; అంతటన్= అంతటితో; తనియక= తృప్తినొందక; ఆచమనంబు+చేసి= అరచేత జలము తీసుకొని అంతశ్శుద్ధికొరకు దేవతాసంబంధములైన నామాలు చెప్పుకొంటూ ఆ నీటిని త్రావుటచేసి; దక్షలు+అయి= యోగ్యత పొందినవారై; మునుపుగాన్= ముందుగా; తమకున్+రక్షాకరంబు+అగు= తమకు రక్షకలిగించేదగు; బీజన్యాసంబు= బీజాక్షరాలను తమ శరీరమందలి వివిధభాగాలలో ఉంచుకొనుటను; చేసికొని= కావించుకొని; చిన్ని, అన్న!= ఓ ముద్దులబాలుడా!; నీ, అడుగులు= నీ పాదాలను; అజుండును= బ్రహ్మయు; జానువులు= మోకాళ్ళను; అనిలుండును= వాయుదేవుడును; తొడలు= తొడలను; యజ్ఞుండును= యజ్ఞమూర్తి అయిన అగ్నిదేవుడును; కటితలంబు= నడుము ప్రదేశాన్ని; అచ్యుతుండును= చ్యుతి (పతనం) లేనివాడైన విష్ణుమూర్తీ; కడుపు= పొట్టను; హయ+ఆస్యుండును= గుఱ్ఱపు ముఖంకలవాడు అనగా హయగ్రీవుడూ; హృదయంబున్= హృదయాన్ని; కేశవుండును= కేశవుడూ; ఉరమున్= రొమ్మునూ; ఈశుండును= ఈశానుడును; కంఠంబున్= గొంతును; ఇనుండును= సూర్యుడూ; భుజంబులు= భుజాల్ని; చతుర్+భుజుండును= నాలుగుభుజాలుగల విష్ణుమూర్తీ; ముఖంబున్= ముఖాన్ని; త్రివిక్రముండును= త్రివిక్రమ రూపధారి వామనమూర్తీ; శిరంబున్= శిరస్సును; ఈశ్వరుండును= శివుడూ; రక్షింతురు= కాపాడుదురు; ముందు= ముందు భాగంలో; చక్రియు= చక్రాయుధాన్ని-ధరించిన చక్రి; వెనుక= వెనుక భాగంలో; గదాధరుండు+ఐన= గదాయుధాన్ని ధరించినవాడైన; హరియున్= విష్ణుమూర్తీ; పార్శ్వంబులన్= ప్రక్కభాగాల్లో; ధనుస్+ధరుండు+ఐన= ధనుస్సును ధరించినవాడు అయిన; మధువైరియున్= మధువనురాక్షసునికి శత్రువైనవాడు, విష్ణుమూర్తియు; అసిధరుండు+అగు= ఖడ్గం ధరించినవాడైన; అజనుండును= పుట్టుకలేనివాడును (పరమాత్ముడు); కోణంబులన్= మూలలందు; శంఖచక్రగదాధరుండు+ఐన= శంఖాన్ని, చక్రాన్నీ, గదనూ ధరించినవాడైన; ఉరుగాయుండును= గొప్ప కీర్తిగలవాడును; మీఁదున్= పైభాగంలో; ఉపేంద్రుండును= ఉపేంద్రుడను పేరుగల విష్ణుమూర్తియు; క్రిందున్= దిగువ భాగంలో; తార్క్ష్యుండును= గరుడుడును; అంతటను= అన్నిభాగాలందు; హలధరుండు+అగు పురుషుండును= నాగలిని ధరించినవాడైన బలరాముడును; కాతురు= కాపాడుదురు; నీ, ఇంద్రియంబులన్= నీ కర్మేంద్రియ జ్ఞానేంద్రియాలనన్నింటిని; హృషీకేశుండును= హృషీకేశనామకుడైన శ్రీహరియు; ప్రాణంబులన్= పంచప్రాణాలను; నారాయణుండును= శ్రీమన్నారాయణుడును; చిత్తంబును= హృదయాన్ని;

శ్వేతద్వీపపతియును= శ్వేతద్వీపానికి ప్రభువైన శ్రీహరియు; మనంబును= మనస్సును; యోగి+ఈశ్వరుండు+ఐన= యోగులకు ప్రభువైన; కపిలుండును= కపిలుడు; బుద్ధిని= బుద్ధిని; పృశ్నిగర్భుండును= (స్వాయంభువమన్వంతరంలో) పృశ్ని గర్భంలో జన్మించినవాడు విష్ణువు; అహంకారంబును= నేను అనే భావాన్ని; భగవంతుండు+ఐన పరుండును= భగవంతుడైన పరబ్రహ్మయు; పాలనంబు+చేయుదురు= కాపాడుదురు; నీవు క్రీడించునెడన్= నీవు ఆటలాడుకొనేటపుడు; గోవిందుండును= శ్రీహరియు; శయనించు తఱిన్= పడుకొన్న సమయంలో; మాధవుండును= లక్ష్మీపతియు; నడచువేళ= నడచే సమయంలో; వైకుంఠుండును= వైకుంఠుడు అనే పేరుగలవాడు, (విష్ణువు); కూర్చున్న సమయంబునన్= కూర్చున్న సమయంలో; శ్రీపతియును= లక్ష్మీపతియు; కుడుచుకాలంబునన్= భోజనం చేసేటపుడు; సర్వభక్షకుండు+ఐన= అన్నింటిని భక్షించువాడైన; యజ్ఞభుజుండును= యజ్ఞమును భుజించే శ్రీమహావిష్ణువు; ఏమఱక= అజాగ్రత్తగా ఉండకుండ; ఉండుదురు= ఉంటారు; నిన్నున్= నిన్ను; పేర్కొనినన్= పేరు చెప్పినట్లయితే, నీ పేరు చెప్పినట్లయితే; దుస్+స్వప్న= చెడ్డకలలు; వృద్ధ, బాలగ్రహంబులును= వృద్ధగ్రహాలు, బాలగ్రహాలు; కూశ్మాండ= కూశ్మాండగ్రహాలు; డాకినీ= డాకినీ పిశాచాలు; యాతుధానులును= యాతుధానులనే దుష్ట రాక్షసులు; భూత= భూతాలు; ప్రేత= ప్రేతాలు; యక్ష= యక్షులు; రాక్షస= రాక్షసులు; పిశాచ= పిశాచాలు; వినాయకులును= వినాయకులనే విఘ్నకారకులు; కోటరా, రేవతులును= కోటర రేవతులనే దుష్టగ్రహాలు; జ్యేష్ఠా= జ్యేష్ఠాదేవి (పెద్దమ్మ); పూతనలును= పూతనలనే రాక్షసస్త్రీలు; మాతృక+ఆది= మాతృకలు మొదలుగా; గణంబులును= దుష్టగణాలు; నశియింతురు= నాశనమైపోతారు; నీ+అందున్= నీలో; ప్రాణ= ప్రాణాలకు; ఇంద్రియ= ఇంద్రియాలకు; శరీర= శరీరానికి; నిరోధంబులు+అయిన= అడ్డుకలిగించేవైన; ఉన్మాదంబులును= చిత్తచాంచల్య వృత్తులు; అపస్మారంబులును= బుద్ధిని భ్రమకు లోనగునట్లు చేసేవృత్తులును; మహా+ఉత్పాతంబులును= పెద్దప్రమాదాలు; పొందకుండుంగావుత= కలుగకుండా ఉండుగాక; అని; రక్ష+చేసి= రక్షపెట్టి; దీవించిరి= ఆశీర్వదించిరి; అంతన్= తరువాత...

**తా :** అంతేకాదు, గోపికలు బాలకృష్ణునికి తాముపెట్టిన రక్ష చాలునని తృప్తి పొందక ఆచమనం చేసి, ఆ యా బీజాక్షరాలను తమ శరీరమందలి ఆ యా భాగాలలో న్యాసం గావించుకొని, తమ దేహాలను తాము ముందుగ సంరక్షణ చేసుకొని ఓ ముద్దులబిడ్డా! నీ పాదాలను బ్రహ్మదేవుడు, మోకాళ్ళను వాయుదేవుడు, తొడలను అగ్నిదేవుడు, నడుమును అచ్యుతుడు, పొట్టను హయగ్రీవుడు, హృదయాన్ని కేశవుడు, రొమ్మును ఈశానుడు, కంఠాన్ని సూర్యుడు, భుజాలను చతుర్భుజుడు, ముఖాన్ని త్రివిక్రముడు, శిరస్సును ఈశ్వరుడు కాపాడుదురు గాక! అంతేకాదు. ముందు భాగాన్ని చక్రాయుధుడు, వెనుక భాగాన్ని గదాయుధుడు, ప్రక్కభాగాలను మధుసూదనుడు మరియు ఖడ్గధారి అజనుడు, మూలలను శంఖచక్రగదాధరుడైన ఉరుగాయుడు, పై భాగాన్ని ఉపేంద్రుడు, క్రింది భాగాన్ని గరుడుడు, అన్ని భాగాలను హలధరుడైన మహాపురుషుడు రక్షింతురుగాక!

నీ ఇంద్రియాలను హృషీకేశుడు, పంచప్రాణాలను శ్రీమన్నారాయణుడు, హృదయాన్ని శ్వేతద్వీపప్రభువైన శ్రీహరి, మనస్సును యోగీశ్వరుడైన కపిలుడు, బుద్ధిని పృశ్నిగర్భుడు, అహంకారాన్ని పరబ్రహ్మ పాలన చేయుదురు గాక! నీవు ఆడుకొనేటప్పుడు గోవిందుడు, పడుకొన్నప్పుడు మాధవుడు, నడిచేటప్పుడు వైకుంఠుడు, కూర్చున్నప్పుడు శ్రీపతి, భుజించేటప్పుడు యజ్ఞభుజుడు ఏ మాత్రం ఏమరుపాటులేక నీకు రక్షగా ఉంటారు. నీ పేరు చెపితే చాలు దుస్స్వప్నాలు, వృద్ధబాలగ్రహాలు, కూశ్మాండగ్రహాలు, డాకినీ పిశాచాలు, యాతుధానులనే దుష్టరాక్షసులు, భూతాలు, ప్రేతాలు, యక్షరాక్షస పిశాచాలు, వినాయకులనే విఘ్నకారక గ్రహాలు, పెద్దమ్మ, పూతన, మాతృకలు మొదలైన దుష్టగణాలు నాశనమైపోతారు. నీ ప్రాణాలను, ఇంద్రియాలను, శరీరాన్ని అడ్డుకొని చిత్తచాంచల్యాన్ని, అపస్మారక స్థితిని కలిగించే ప్రవృత్తులు, మహోత్పాతాలు కలుగకుండుగాక!' అని దీవించారు. తరువాత

**విశే :** సర్వలోకాలకు "రక్ష"కుడైన చిన్ని కృష్ణుడు "పూతనను" సంహరించినా, గుర్తించక మాయకు లోనై అమాయకలైన గోపికలు, అత్యంతప్రేమతో "చిన్నిశిశువు"గా భ్రమించి, బాలకృష్ణునికి ఎలాంటి గ్రహదోషాలు సోకకుండా లోక నియమానుసారం 'రక్షలు' కట్టి దీవించారు.

**క. ఆ పెద్దవేడబంబుల, పాపనికినిఁ జన్నుఁ గుడిపి పానుపుపై సం**
**స్థాపించి కప్పి 'కూరుకు, మో పాపఁడ!'యని యశోద యొయ్యన పాడెన్. 237**

**ప్రతి :** ఆ పెద్దవేడబంబుల= ఆ హెచ్చయిన మాయల; పాపనికినిన్= బాలుడికి; యశోద= యశోదాదేవి; చన్నున్+కుడిపి= చనుబాలిచ్చి; పానుపుపైన్= పడకమీద; సంస్థాపించి= చక్కగా పరుండబెట్టి; కప్పి= పైన వస్త్రంకప్పి; ఓ పాపఁడ= ఓ బిడ్డడా!; కూరుకుము= నిద్ర పొమ్ము; అని; ఒయ్యనన్= మెల్లగా; పాడెన్= (జోలపాట) పాడింది.

**తా :** ఆ పెనుమాయల గోపాల బాలుడికి యశోద చన్నిచ్చి పాలుత్రాపి, పడకమీద చక్కగ పరుండబెట్టి, పైన గుడ్డకప్పి, 'బిడ్డా! నిద్రపొమ్మ' అని అల్లన జోలపాట పాడింది.

**వ. అంత నందుండు మొదలయిన గోపకులు మథురనుండి వచ్చి రక్కసిమేనుఁ గని వెఱఁగుపడి 'మున్ను వసుదేవుం డుత్పాతంబు లెఱింగి చెప్పె, నతండు మహాయోగి'యని పొగడి కఠోరంబగు పూతనయొడలు కుఠారంబుల నఱికి తమ కుటీరంబులకుం దవ్వగు ప్రదేశంబునఁ బటీరంబుల దహనంబు సంగ్రహించి దహించి రంత. 238**

**ప్రతి :** అంతన్= తరువాత; నందుండు= నందుడు; మొదలయిన= మున్నగు; గోపకులు= గొల్లవారు; మథురనుండివచ్చి= మథురానగరంనుండివచ్చి; రక్కసిమేనున్= రాక్షస స్త్రీ పూతన శరీరాన్ని; కని= చూచి; వెఱఁగుపడి= ఆశ్చర్యపడి; మున్ను= ఇంతకుముందు; వసుదేవుండు= వసుదేవుడు; ఉత్పాతంబులు= రానున్న విపత్తుల చిహ్నాలు; ఎఱింగి= తెలుసుకొని; చెప్పెన్= చెప్పాడు; అతండు= ఆ వసుదేవుడు; మహాయోగి+అని= గొప్పయోగసంపన్నుడు అని; పొగడి= ప్రశంసించి; కఠోరంబు+అగు= చాలగట్టిదైన; పూతన= పూతనయొక్క; ఒడలు= శరీరాన్ని; కుఠారంబులన్= గొడ్డళ్ళతో; నఱికి= తెగగొట్టి; తమ= తమయొక్క; కుటీరంబులకున్= ఇండ్లకు; దవ్వు+అగు= దూరమగు; ప్రదేశంబునన్= స్థలంలో; పటీరంబులన్= చంద్రకట్టెలతో; దహనంబు= నిప్పు; సంగ్రహించి= కూర్చి; దహించిరి= కాల్చిరి.

**తా :** తరువాత నందుడు మొదలైన గోపకులు మధురనుండి వచ్చి, పూతన కళేబరాన్ని చూచి, ఆశ్చర్యపడి, 'వసుదేవుడు ముందే రానున్న ప్రమాద చిహ్నాలు తెలుసుకొని మనల్ని హెచ్చరించాడు. అతడు మహాయోగి' అని పొగడి, ఎంతో కఠినమైన ఆ పూతన శరీరాన్ని గొడ్డళ్ళతో నరికి, తమ యిండ్లకు దూరంగా చంద్రకట్టెలు పేర్చి దహించారు.

**ఆ. పొగిలి పొగిలి కాలు మగువదేహంబున, నగురు పరిమళముల పొగలు వెడలె**
**దేహకల్మషములు శ్రీహరి ముఖమునఁ, ద్రావఁబడుటఁ జేసి భూవరేణ్య! 239**

**ప్రతి :** భూవరేణ్య!= రాజశ్రేష్ఠుడవైన ఓ పరీక్షిన్మహారాజా!; దేహ= దేహంలోని; కల్మషములు= మలినాలు; శ్రీహరిముఖమునన్= శ్రీకృష్ణుని ముఖంవల్ల; త్రావన్+పడుటన్+చేసి= త్రాగబడినందువల్ల; పొగిలి పొగిలి= రాజుకొని, రాజుకొని; కాలు= కాలుతున్నట్టి; మగువ= పూతన; దేహంబునన్= శరీరంనందుండి; అగురు= సుగంధపు; పరిమళములు= సువాసనలతో; పొగలు వెడలెన్= పొగలు వెలువడ్డాయి.

**తా :** పరీక్షిన్మహారాజా! పూతన దేహమందలి కల్మషాలను బాలకృష్ణుడు ఆమె చనుబాలతో పాటు పీల్చివేసినందున, మిక్కిలి రాజుకొంటూ కాలుతున్న ఆమె శరీరంనుండి సుగంధపు సువాసనల పొగలు వెలువడినాయి.

**క. హరి దనమీఁదం బదములుఁ, గరములు నిడి చన్నుఁ గుడిచి కదిసినమాత్రన్**
**హరిజననిపగిదిఁ బరగతి, కరిగెను దురితములఁ బాసి యసురాంగనయున్. 240**

**ప్రతి :** హరి= శ్రీహరి అవతారమైన శ్రీకృష్ణుడు; తనమీఁదన్= తన (పూతన) దేహంమీద; పదములున్= కాళ్లను; కరములున్= చేతులను; ఇడి= ఉంచి; చన్నున్+కుడిచి= చన్నుత్రావి; కదిసినమాత్రన్= బాగా తాకినందువల్ల; అసుర+ అంగనయున్= ఆ రాక్షస స్త్రీకూడ; దురితములన్= పాపాలను; పాసి= పోగొట్టుకొని; హరి= శ్రీకృష్ణుని; జనని= తల్లి; పగిదిన్= వలె; పరగతికిన్= ఉత్తమగతికి; అరిగెను= వెళ్లింది.

**తా :** శ్రీహరి అవతారమైన శ్రీకృష్ణుడు, తన శరీరంమీద కాళ్ళు, చేతులు ఆడిస్తూ, చనుబాలు త్రాగుతూ, బాగా స్పృశించిన కారణంగా, ఆ రాక్షసస్త్రీ పూతన పాపాలు తొలగి, శ్రీకృష్ణునితల్లి పొందదగిన ఉన్నతోన్నత స్థానమైన పరమపదాన్ని పొందింది.

**క. వెన్నుని కొకమఱి విషమగు, చన్నిచ్చిన బాలహంత్రి చనెనఁట దివికిన్,**
**వెన్నునిఁ గని పెంచుచుఁ దన, చన్నిచ్చిన సతికి మఱియు జన్మము గలదే? 241**

**ప్రతి :** వెన్నునికిన్= విష్ణుమూర్తికి; ఒకమఱి= ఒకసారి; విషము+అగు= విషంతోకూడిన; చన్ను+ఇచ్చిన= చనుబాలనిచ్చిన; బాలహంత్రి= పిల్లలను చంపెడుస్త్రీ; దివికిన్= స్వర్గానికి; చనెన్+అఁట= వెళ్ళిందట; వెన్నునిన్= విష్ణుమూర్తిని; కని= కొడుకుగా పొంది; పెంచుచున్= పెద్దచేస్తూ; తన= తనయొక్క; చన్ను+ఇచ్చిన= చనుబాలు త్రాగించిన; సతికిన్= ఇల్లాలికి; మఱియున్= ఇక; జన్మము= జన్మ; కలదు+ఏ= ఉన్నదా? (అనగా మోక్షాన్ని పొందుతుందని భావం).

**తా :** విష్ణుమూర్తికి ఒక్కసారి విషంతో కూడిన చనుబాలిచ్చిన పసిపిల్లల హంతకురాలే స్వర్గానికి వెళ్ళితే, విష్ణుమూర్తిని కని, చనుబాలిచ్చి పెంచి పెద్దచేసిన తల్లి యశోదమ్మకు మరొకజన్మ ఉంటుందా? ఆమెకు మోక్షమే ప్రాప్తిస్తుంది కదా!

**క. హరిఁ గని చన్నులు గుడిపెడి, తరుణులు ప్రాప్తించుపదము దలఁపఁగ వశమే?**
**హరి యారగించుటకుఁ బా, ల్గురిసినధేనువులు ముక్తికొనలఁ జరించున్. 242**

**ప్రతి :** హరిన్= శ్రీకృష్ణుని; కని= కొడుకుగా కని; చన్నులు గుడిపెడి= చనుబాలు త్రాగించునట్టి; తరుణులు= స్త్రీలు; ప్రాప్తించు= పొందునట్టి; పదము= స్థానము; తలఁపఁగన్= ఇట్టిదని ఎంచుటకు; వశము+ఏ= శక్యమా? హరి= శ్రీకృష్ణుడు; ఆరగించుటకున్= త్రాగుటకు; పాలు= పాలను; కురిసిన= ఇచ్చిన; ధేనువులు= ఆవులు; ముక్తికొనలన్= మోక్ష శిఖరాల్లో; చరించున్= చరిస్తాయి.

**తా :** శ్రీకృష్ణుని కొడుకుగా కని చనుబాలిచ్చిన స్త్రీలు దేవకీ యశోదలవంటివారు, పొందే మహోన్నతపదం ఇట్టిది అట్టిది అని చెప్పటం సాధ్యమా? ఆ హరికి త్రాగుటకు పాలిచ్చిన ఆవులు కూడ మోక్షాన్ని తప్పక పొందుతాయి.

**క. ఆ పూతన మెయిగంధము, గోపాలు రెఱింగి 'యిట్టి కువనిత యొడలం**
**దీపాటి స్వాదుగంధము', ప్రాపించునె యనుచుఁ జనిరి పల్లెల కధిపా! 243**

**ప్రతి :** అధిపా!= ఓ పరీక్షిన్మహారాజా!; ఆ పూతన= ఆ పూతనయొక్క; మెయిగంధమున్= శరీరంయొక్క వాసనను; గోపాలురు= గొల్లలు; ఎఱింగి= (వాసననుబట్టి) తెలుసుకొని; ఇట్టి= ఇటువంటి; కువనిత= నీచ స్త్రీయొక్క; ఒడలు+అందున్= దేహంలో; ఈపాటి= ఇంతమాత్రపు; స్వాదుగంధము= మంచివాసన; ప్రాప్తించును+ఎ= వస్తుందా? (అని ఆశ్చర్యపడుతూ); అనుచున్= అని అనుకొంటూ; పల్లెలకున్= తమ తమ గ్రామాలకు; చనిరి= పోయిరి.

**తా :** ఓ పరీక్షిన్మహారాజా! ఆ పూతనదేహం కాలుతుండగా అందుండి వెలువడిన సువాసనను పీల్చుతూ, అంతటి దుర్మార్గురాలి శరీరంనుండి ఇంతటిమంచి వాసన రావటమా! అని అందరు ఆశ్చర్యంగా అనుకుంటూ తమతమ పల్లెలకు వెళ్ళారు.

**వ. అంత నందుండు పరమానందంబున నింటికిం జని వ్రేతలచేత రక్కసిచేఁత లన్నియు నెఱింగి వెఱంగుపడి పాపని లేపి శిరంబు మూర్కొని ముద్దాడి ముదంబున నుండె నని చెప్పిన విని పరీక్షిన్నరేంద్రుం డిట్లనియె. 244**

**ప్రతి :** అంతన్= ఆ తరువాత; నందుండు= నందగోపకుడు; పరమ+ఆనందంబునన్= మిక్కిలి సంతోషంతో; ఇంటికిన్= తన ఇంటికి; చని= వెళ్ళి; వ్రేతలచేత= గోపస్త్రీలచేత; రక్కసిచేఁతలు= ఆ రాక్షసి పూతనచేసిన పనులను; అన్నియున్= అన్నింటిని; ఎఱింగి= తెలుసుకొని; వెఱంగుపడి= ఆశ్చర్యపడి; పాపని= బాలకృష్ణుణ్ణి; లేపి= మేల్కొల్పి; శిరంబున్= తలను; మూర్కొని= వాసనచూచి; ముద్దు+ఆడి= ముద్దుపెట్టుకొని; ముదంబునన్= సంతోషంతో; ఉండెన్= ఉండెను; అని చెప్పిన= అని పలికిన; విని= విని; పరీక్షిత్+నర+ఇంద్రుండు= పరీక్షిన్మహారాజు; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తా :** ఆ తరువాత నందుడు పరమానంద భరితుడై ఇంటికి వెళ్ళి, గోపకాంతలవల్ల ఆ రక్కసి చేసిన పనులన్నీ తెలుసుకొని, ఆశ్చర్యపడి, బాలకృష్ణుణ్ణి మేల్కొల్పి, తలను మూర్కొని, ముద్దాడి సంతోషంతో ఉండినాడని శుకమహర్షి చెప్పగా విని, పరీక్షిన్మహారాజు ఈ విధంగా అన్నాడు.

**క. ఏ యే యవతారంబుల, నే యే కర్మములు సేసె నీశుఁడు హరి భ**
**ద్రాయతనము లన్నియు వినఁ, బాయదు చిత్తంబు సెవులపండువు లయ్యెన్. 245**

**ప్రతి :** ఈశుఁడు= ప్రభువు; హరి= విష్ణుమూర్తి; ఏ+ఏ+అవతారంబులన్= ఏ యే అవతారాల్లో; ఏ+ఏ కర్మములు= ఏ యే పనులు; చేసెన్= చేసినాడో; భద్ర+ఆయతనములు= శుభాలకు ఉనికిపట్లయిన; అన్నియున్= అవి అన్నియు; వినన్= వినగా; చిత్తంబు= మనస్సు; పాయదు= (వాటినుండి) వదలిపోదు; చెవుల= చెవులకు; పండువులు= ఆనందం కలిగించేవి; అయ్యెన్= అయినవి.

**తా :** సర్వేశ్వరుడైన విష్ణుమూర్తి ఏ యే అవతారాల్లో ఏ యే పనులు చేశాడో, శుభాలకు నిలయాలైన వాటినన్నింటిని వింటూ ఉంటే, మనస్సు వాటిల్ని వదలిపోదు, చెవులకు అవి పండువులుగా ఆనందం కలిగిస్తాయి.

**క. ఉరుసంసారపయోనిధి, తరణంబులుఁ బాపపుంజతరణంబులు శ్రీ**
**కరణంబులు ముక్తిసమా, చరణంబులు బాలకృష్ణసంస్మరణంబుల్. 246**

**ప్రతి :** బాలకృష్ణ= బాలకృష్ణుణ్ణి గూర్చిన; సంస్మరణంబుల్= స్మరించడాలు; ఉరు= గొప్ప; సంసార= సంసారమనెడి; పయస్+నిధి= సముద్రాన్ని; తరణంబులు= దాటించేవి; పాప= పాపాలయొక్క; పుంజ= సమూహాలనుండి; తరణంబులు=

ముక్తి కలిగించేవి; శ్రీ= సంపదను; కరణంబులు= కలుగజేసేవి; ముక్తి= మోక్షాన్ని; సమ్+ఆచరణంబులు= చక్కగా చేసేవి.

**తా :** బాలకృష్ణుణ్ణి తలంచడాలు సంసార మహాసముద్రాన్ని దాటించే ఓడలు. అవి పాపసమూహాల్ని నశింపచేసే సాధనాలు. సంపదలను సమకూర్చే ఉపాయాలు. ముక్తిని ప్రసాదించే మంచిఆభరణాలు.

**వ. అని తరువాత బాలకృష్ణుం డేమి సేసె నాయందుఁ గృప గలదేనిం జెప్పవే యని యడిగిన రాజునకు శుకుం డిట్లనియె. 247**

**ప్రతి :** అని తరువాత= అంటూ, ఆ తర్వాత; బాలకృష్ణుండు= చిన్ని కృష్ణుడు; ఏమి+చేసెన్= ఏమి చేసినాడో; నా+అందు= నాపట్ల; కృప= దయ; కలదు+ఏనిన్= ఉండినట్లైతే; చెప్పవే= చెప్పవలసింది; అనిఅడిగినన్= అని అడుగగా; రాజునకు= పరీక్షిన్మహారాజుకు; శుకుండు= శుకయోగి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తా :** అని శ్రీకృష్ణునిసంస్మరణలవల్ల కలిగే ఫలాలు విన్న పరీక్షిత్తుడు ఆ తరువాత ఆ బాలకృష్ణుడు ఏమేమి చేశాడో ఆ విశేషాలను నా మీద దయపెట్టి చెప్పండని పరీక్షిన్మహారాజు అడుగగా, శుకమహర్షి ఈ విధంగా చెప్పాడు.

## ❖ బాలకృష్ణుండు శకటముం దన పాదమునఁ గూలఁ దన్నుట ❖

**సీ. బాలకుం డొదిఁగిలఁబడ నేర్చె నని జన్మనక్షత్రమం దొకనాఁడు నందు**
**పొలఁతి వేడుక బోర్కుఁ బోయ వ్రేతలఁ జీరి వాదిత్రగీతారవంబు సెలఁగ**
**విప్రులతోఁగూడ వేదమంత్రంబుల నభిషేచనాదిక మాచరించి**
**వారిదీవన లొంది వారికి మొదవుల నన్నంబుఁ జీరల నడిగినట్టు**

**ఆ. లిచ్చి బాలుఁ దియ్య మెసఁగఁ బానుపు సేర్చి, నిదురపుచ్చి గోపనివహమునకు**
**గోపికలకుఁ బూజఁ గొమరారఁ జేయుచు, జనని కొడుకు మఱచె సంభ్రమమున. 248**

**ప్రతి :** నందుపొలఁతి= నందునిభార్య, యశోద; బాలకుండు= పసిబిడ్డ అయిన కృష్ణుడు; ఒదిఁగిలన్+పడన్= ప్రక్కకు తిరిగి బోర్లపడటం; నేర్చెన్+అని= నేర్చుకొన్నాడని; జన్మనక్షత్రము+అందున్= పుట్టిన నక్షత్రంలో; ఒకనాఁడు= ఒకరోజు; వేడుకన్= పండుగ వేడుకగా; బోర్కున్+పోయన్= స్నానం చేయించడానికై; వ్రేతలన్= గోపికలను; చీరి= పేరంటానికి పిలిచి; వాదిత్ర= వాద్యాలయొక్క, గీతా= పాటలయొక్క; రవంబు= ధ్వని; చెలఁగన్= అతిశయిల్లగా; విప్రులతోన్+కూడ= బ్రాహ్మణులతో కూడ; వేదమంత్రంబులన్= వేదాలందలి మంత్రాలతో; అభిషేచన+ఆదికము= అభిషేకం మొదలైనవి; ఆచరించి= చేసి; వారి= ఆ బ్రాహ్మణులయొక్క; దీవనలు+ఒంది= ఆశీర్వచనాలు పొంది; వారికిన్= ఆ బ్రాహ్మణులకు; మొదవులన్= ఆవులను; అన్నంబున్= భోజనాన్ని; చీరలన్= వస్త్రాలను; అడిగినట్టుల+ఇచ్చి= (వారు) అడిగిన విధంగా ఇచ్చి; బాలున్= ఆ బాలకృష్ణుణ్ణి; తియ్యము= ప్రీతి; ఎసఁగన్= అతిశయిల్లగా; పానుపు+చేర్చి= పడకమీద పడుకోబెట్టి; నిదురపుచ్చి= నిద్రపోవునట్లుచేసి; గోప= గోపకుల; నివహమునకున్= సమూహానికి; గోపికలకున్= గోపకాంతలకు; పూజన్= పూజను; కొమరారన్= ఒప్పుగా; చేయుచున్= చేస్తూ; జనని= తల్లి, బాలకృష్ణునితల్లి యశోద; సంభ్రమమునన్= తత్తరపాటుతో; కొడుకున్= కుమారుడైన బాలకృష్ణుణ్ణి; మఱచెన్= మరచిపోయింది.

**తా :** యశోదాదేవి తన బిడ్డడు బాలకృష్ణుడు ఒత్తిగిలి బోర్లపడటం నేర్చుకొన్నాడని ఎంతో సంతోషించి, కొడుకు జన్మనక్షత్రాన ఒకరోజు వేడుకగా అతడికి స్నానం చేయించటానికి గోపికలను పేరంటానికి పిలిచింది. మంగళవాద్యాలు మ్రోగగా, గోపికలు పాటలుపాడగా, బ్రాహ్మణుల వేదమంత్రాలతో బిడ్డకు అభిషేకాదులు చేయించింది. ఆ వేదవిప్రుల ఆశీర్వచనాలు అందుకొని, వారికి ఆవుల నిచ్చింది. విందుభోజనం పెట్టింది. వస్త్రా లిచ్చింది. అడిగినవారికి అడిగినట్టుగ ఇచ్చింది. బాలకృష్ణణ్ణి ప్రియమార పానుపుమీద పడుకోబెట్టి నిద్రపుచ్చింది. గోపాలురకు, గోపికలకు పూజలుచేస్తూ ఆమె బిడ్డ విషయం మరచింది.

**వ. ఆ సమయంబున. 249**

**ప్రతి :** ఆ సమయంబునన్= ఆ వేళలో...

**తా :** చిన్ని కృష్ణుడు నిద్రపోయిన సంగతి మరచిన సమయంలో

**క. నిదురించిన శిశు వాఁకొని, కిదుకుచుఁ జను గోరి కెరలి కిసలయ విలస**
**న్మృదుచక్రచాపరేఖా, స్పదపదమునఁ దన్నె నొక్కబండిన్ దండిన్. 250**

**ప్రతి :** నిదురించిన= నిద్రపోయిన; శిశువు= పసిబిడ్డ; ఆఁకొని= ఆకలిగొని; కిదుకుచున్= చేతులు కాళ్ళు చాచి ఒడలు విరుచుకొనుచు; చనున్= (పాలుత్రాగుటకు) చన్నును; కోరి= కోరుకొని; కెరలి= కోపంతో కాళ్ళు, చేతులు ఎక్కువగా ఆడిస్తూ; కిసలయ= చిగురుటాకువలె; విలసత్= ప్రకాశించే; మృదు= కోమలమైన; చక్ర చాపరేఖా= చక్రము, ధనుస్సు మున్నగు రేఖలకు; ఆస్పద= ఉనికి పట్టయిన; పదమునన్= పాదంతో; దండిన్= బలంగా; ఒక్కబండిన్= ఒకానొక బండిని; తన్నెన్= తన్నాడు.

**తా :** నిద్రపోతున్న బాలకృష్ణుడు ఆకలి గొని, మేల్కొని, కాళ్ళుచేతులు ఆడిస్తూ, ఒడలు విరుచుకొంటూ, పాలకొరకు చన్నుకోరుకొని, అది దొరకకపోయే సరికి ఆగ్రహించి, చిగురుటాకువలె మృదువై, చక్రరేఖలు, ధనుస్సు రేఖలు మున్నగు సాముద్రిక లక్షణాలుండే తన పాదంతో ప్రక్కనున్న ఒక బండిని బలంగా తన్నాడు.

**క. శకటము హరి దన్నిన దివిఁ, బ్రకటం బై యెగసి యిరుసు భరమునఁ గండ్లన్**
**వికటంబుగ నేలం బడె, నకటా! యని గోపబృంద మాశ్చర్యపడన్. 251**

**ప్రతి :** హరి= శ్రీకృష్ణుడు; తన్నినన్= తన్నగానే; శకటము= ఆ బండి; గోప= గోపాలురయొక్క; బృందము= సమూహం; అకటా+అని= అయ్యో అని; ఆశ్చర్యపడన్= ఆశ్చర్యపడుతుండగా; ప్రకటంబు+ఐ= అందరికి స్పష్టంగా అగుపించేట్లై దివిన్= ఆకాశంలో; ఎగసి= ఎగిరి; ఇరుసు= ఆ బండి ఇరుసుయొక్క; భరమునన్= బరువుచేత; కండ్లన్= చక్రాలు; వికటంబుగన్= ఆకారం మారినవై; నేలన్= నేలమీద; పడెన్= పడ్డాయి.

**తా :** బాలకృష్ణుడు తన్నగానే ఆ బండి, గోపకులందరు చూస్తుండగా, ఆశ్చర్యకరంగా ఆకాశాని కెగిరింది. ఇరుసు బరువుకు దాని చక్రాలు ఆకారం మారినవై నేలమీద పడ్డాయి.

**వ. అప్పు డందున్న సరసపదార్థంబులు వ్యర్థంబులై నేలం గూలుటం జూచి యశోదానందముఖ్యులైన గోపగోపికాజనంబులు పనులు మఱచి పబ్బంబులు మాని యుబ్బుసెడి వెఱపులు ఘనంబులుగ మనంబులందు. 252**

**ప్రతి :** అప్పుడు= ఆ సమయంలో; యశోదానందముఖ్యులు+ఐన= యశోద, నందుడు మొదలగు ముఖ్యులైన; గోప, గోపికాజనంబులు= గోపకులు గోపికలు; అందున్= ఆ బండిలో; ఉన్న= ఉన్నట్టి; సరసపదార్థంబులు= మధురమైన పదార్థాలు; వ్యర్థంబులు+ఐ= నిరుపయోగాలై; నేలన్= నేలమీద; కూలుటన్+చూచి= పడిపోవడాన్ని చూచి; పనులు= (తాము) చేస్తుండే పనులు; మఱచి= మరచిపోయి; పబ్బంబులు= పండుగలు; మాని= మానుకొని; ఉబ్బు= సంతోషం; చెడి= పోయి; వెఱపులు= భయాలు; ఘనంబులు+కన్= అధికంగ; మనంబుల+అందున్= మనస్సులలో...

**తా :** అప్పుడు యశోద, నందుడు మొదలైన ముఖ్యగోపికలు, గోపకులు ఆ బండిలో ఉన్నట్టి మధుర పదార్థాలన్నీ నేలపాలై నిరుపయోగాలు కావటంచూచి, ఆశ్చర్యచకితులై తాము చేస్తున్న పనులు వదలిపెట్టి, పండుగలు మాని, సంతోషాన్ని కోల్పోయి, భయాలు నిండిన మనస్సులతో

**క. మిన్నున కూరక యెగయదు, తన్న సమర్థుండు గాఁడు తల్పగతుం డీ**
**చిన్నికుమారుఁడు దేరే, విన్ననువున నెగసె దీనివిధ మెట్టిదియో. 253**

**ప్రతి :** తేరు= బండి; మిన్ననకున్= ఆకాశానికి; ఊరక= కారణం లేకుండా; ఎగయదు= ఎగురదుకదా!; తల్పగతుండు= పాన్పుమీద పడుకొని ఉన్నట్టివాడైన; ఈ చిన్ని కుమారుఁడు= ఈ పసిబిడ్డడు; తన్నన్= అంత బండిని ఎగురతన్నుటకు; సమర్థుండు+కాఁడు= శక్తిగలవాడు కాఁడు; ఏ విన్ననువునన్= ఏ విధంగ; ఎగసెన్= ఎగిరింది; దీనివిధము= దీనిపద్ధతి– అనగా ఆకాశానికి ఎగరడం, పడడం; ఎట్టిది+ఓ= ఎటువంటిదో!

**తా :** కారణం లేకుండా బండి ఆకాశానికి ఎగురదు కదా! పక్కమీద పడుకొని ఉన్న ఈ చిన్నిబిడ్డడు ఆ బండిని తన్నటానికి సమర్థుడు కాడు. మరి ఏ విధంగా ఇది ఎగిరిందో! ఇది అలా ఎగరడమేమిటి?; దీనికి కారణం ఎలాంటిదో!

**వ. అని వితర్కించు సమయంబున. 254**

**ప్రతి :** అని= అంటూ; వితర్కించు= విశేషంగా చర్చించుకొను; సమయంబునన్= సమయంలో...

**తా :** అని పై విధంగా చర్చించుకుంటున్న సమయంలో

**క. బాలకుఁ డాఁకొని యేడ్చుచుఁ, గా లెత్తినఁ దాఁకి యెగసెఁ గాని శకట మే**
**మూలమున నెగయ దని య, బ్బాలుని కడ నాడుచుండి పలికిరి శిశువుల్. 255**

**ప్రతి :** బాలకుఁడు= బాలకృష్ణుడు; ఆఁకొని= ఆకలిగొని, ఏడ్చుచున్= ఏడుస్తూ; కాలు+ఎత్తినన్= కాలు ఎత్తగా; తాఁకి= ఆ కాలు తగిలి; శకటము= బండి; ఎగసెన్+కాని= పై కెగిరింది కాని; ఏ మూలమునన్= (ఇతరమైన) ఏ కారణం చేత; ఎగయదు+అని= ఎగురలేదు అని; ఆ+బాలునికడన్= ఆ బాలకృష్ణుని సమీపంలో; ఆడుచుండి= ఆడుకొంటున్న; శిశువుల్= బాలురు; పలికిరి= పలికారు.

**తా :** బాలకృష్ణుడు ఆకలిగొని ఏడుస్తూ కాలు ఎత్తగా, ఆ కాలు తగిలి బండి ఆకాశాని కెగిరింది గాని, అది ఎగరటానికి ఇతర కారణ మేదీ లేదని, కృష్ణుని పాన్పుకు దగ్గరలో ఆడుకొంటున్న పిల్లలు చెప్పారు.

**వ. ఇట్లు శిశువులు పలికిన పలుకు విని. 256**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగ; శిశువులు= ఆ బాలకులు; పలికిన= చెప్పిన; పలుకులు= మాటలు; విని= విన్న తర్వాత...

**తా :** అని పై విధంగా చిన్న పిల్లలు పలికిన మాటలను విన్న తర్వాత

**శా.** **బాలుం డెక్కడ? బండి యెక్కడ? నభోభాగంబుపైఁ జేద్పడం**
**గాలం దన్నుట యెక్క? దేల పడుచుల్ గల్లాడి? రీజడ్డుఁ బ**
**ల్కే లోకంబున నైనఁ జెప్పఁబడునే? యే చందమో కాక యం**
**చాలాపించుచు వ్రేలువ్రేతలుఁ బ్రభూతాశ్చర్యు లైరందఱున్. 257**

**ప్రతి :** బాలుండు= ఈ పసిబాలుడు; ఎక్కడ= ఏమిటి; బండి= (అంత) బండి; ఎక్కడ= ఏమిటి; నభస్+భాగంబుపైన్= ఆకాశంలో; చేద్పడన్= చెడిపోయేటట్లుగ, విరిగి ముక్కలయ్యేటట్లుగ; కాలన్ తన్నుట= కాలితో తన్నడం; ఎక్కడ= ఏమిటి; పడుచుల్= (ఆటలాడుకొంటున్న) పిల్లలు; కల్ల= అబద్ధం; ఆడిరి= చెప్పారు; ఈ జడ్డున్+పల్కు= ఈ తెలివి తక్కువమాట; ఏ లోకంబునన్+ఐనన్= ఏ లోకంలో అయినా; చెప్పన్+పడున్+ఏ= చెప్పబడుతుందా?; ఏ చందమోకాక= ఇది ఏ విధమోకాని; అంచున్= అంటూ; ఆలాపించుచున్= మాట్లాడుతు; వ్రేలు= గోపకులూ; వ్రేతలున్= గోపికలు; అందఱున్= అందరు; ప్రభూత= పుట్టిన; ఆశ్చర్యులు+ఐరి= ఆశ్చర్యం కలవారైరి.

**తా :** 'ఈ పసిబాలుడేమిటి! ఇంత పెద్ద బండి ఏమిటి! ఇతడు దాన్ని తన్నటమేమిటి! అది ఆకాశాని కెగిరి ముక్కలు ముక్కలుగ విరగడమేమిటి! ఈ ఆడుకొనే పిల్లలు అబద్ధం చెప్పారు. ఇంత తెలివి తక్కువమాట ముల్లోకాల్లో ఎక్కడైనా చెప్పబడుతుందా? ఇదంతా ఏ విధంగా జరిగిందో' అని అనుకొంటూ, సందేహాలతో సతమతమౌతూ గోపాలురు, గోపికలు అందరూ, ఆశ్చర్య చకితులయ్యారు (వ్రే= గొల్లకులానికి చెందినవాడు, వ్రేలు= గోపాలురు (బహువచనరూపం)).

**వ.** **అప్పు డా బాలునిరోదనంబు విని యశోద పఱతెంచి. 258**

**ప్రతి :** అప్పుడు= ఆ వేళ; ఆ బాలుని= ఆ బాలకృష్ణుని; రోదనంబున్= ఏడ్పును; విని= వినిందై; యశోద= యశోదమ్మ; పఱతెంచి= పరుగెత్తుకొనివచ్చి.

**తా :** అప్పుడు ఆ చిన్ని కృష్ణుని ఏడ్పును విన్న యశోద పరుగెత్తుకొని వచ్చింది.

**ఆ.** **అలసితివి గదన్న! యాఁకొంటివి గదన్న!, మంచియన్న! యేడ్పు మాను మన్న!**
**చన్ను గుడువు మన్న సంతసపడు మన్న, యనుచుఁ జన్ను గుడిపె నర్భకునకు. 259**

**ప్రతి :** అలసితివికద+అన్న= అలసిపోయావు కదా అన్నా!; ఆఁకొంటివికద+అన్న= ఆకలితో ఉన్నావుకదా అన్నా!; మంచి+అన్న= మంచివాడవుకదా అన్నా!; ఏడ్పు= ఏడుపును; మానుము+అన్న= ఆపు అన్నా!; చన్ను కుడువుము+అన్న= (నా) చనుబాలు త్రాగు అన్నా!; సంతసపడుము+అన్న= సంతోషించు అన్నా!; అనుచున్= అని అంటూ; అర్భకునకున్= పసిబిడ్డకు; చన్నున్+కుడిపెన్= (తన) చనుబాలు త్రావించింది.

**తా :** 'అన్నా! అలసిపోయావు కదన్నా!; ఆకలితో ఉన్నావు కదన్నా!; మంచివాడివి కదన్నా!; ఏడుపు మానుమన్నా!; నా చనుబాలు త్రావుమన్నా!; సంతోషంగా ఉండుమన్నా!' – అంటూ యశోదాదేవి ఆ బాలకృష్ణునికి తన చనుబాలిచ్చింది.

**విశే :** ఇక్కడ బాలకృష్ణుణ్ణి 'అన్నా' అనడం వాత్సల్యార్థకం.

**వ. అంత న బ్బాలునిమేన బాలగ్రహంబు సోఁకునుగదా యని శంకించి గోపకు లనేకు లనేక బలివిధానంబులు సేసిరి. బ్రాహ్మణులు దధికుశాక్షతంబుల హోమంబు లాచరించిరి. ఋగ్యజుస్సామ మంత్రంబుల నభిషేచనంబులు సేయించి స్వస్తి పుణ్యాహవాచనంబులు సదివించి కొడుకున కభ్యుదయార్థంబు నందుం డలంకరించిన పాఁడిమొదవుల విద్వజ్జనంబుల కిచ్చి వారల యాశీర్వాదంబులు గైకొని ప్రమోదించె నని చెప్పి శుకుం డిట్లనియె. 260**

**ప్రతి :** అంతన్= అంతలో; ఆ+బాలుని= ఆ బాలకృష్ణుని; మేనన్= దేహంలో; బాలగ్రహంబు= బాలురను హింసించేటి గ్రహంలేదా భూతం; సోఁకును+కదా= తాకిందేమో కదా; అని= అంటూ; శంకించి= అనుమానించి; గోపకులు= గొల్లవారు; అనేకులు= పెక్కుమంది; అనేక= అనేకమైన; బలివిధానంబులు= బలుల ఏర్పాట్లు; చేసిరి= చేశారు; బ్రాహ్మణులు= విప్రులు; దధి, కుశ+అక్షతంబులన్= పెరుగు, దర్భలు అక్షతలతో; హోమంబులు= హోమాలు; ఆచరించిరి= చేసిరి; ఋక్+యజుస్+సామమంత్రంబులన్= ఋక్కు, యజుస్సు, సామం అను మూడువేదాల మంత్రాలతో; అభిషేచనంబులు చేయించి= అభిషేకాలు చేయించి; సు+అస్తి, పుణ్య+అహవాచనంబులు= స్వస్తివాచనాలు, పుణ్యాహవాచనాలు, శుభాన్ని పుణ్యాన్ని కలిగించే వేదమంత్రాలను; చదివించి= చెప్పించి; కొడుకునకున్+అభ్యుదయ+అర్థంబు= పుత్రునికి మేలు కలుగడంకోసం; నందుండు= నందుడు; అలంకరించిన= ఆభరణాలు మొదలగు వానిచేత అందంగ ఉండునట్లు చేయబడిన; పాఁడి మొదవులన్= పాడి ఆవులను; విద్వత్+జనంబులకున్= విద్వాంసులకు-వేదశాస్త్రపురాణాదులు చదువుకొన్నవారికి; ఇచ్చి= దానం చేసి; వారల= వారియొక్క; ఆశీస్+వాదంబులు= దీవెనలు; కైకొని= తీసుకొని; ప్రమోదించెన్= సంతోషించెను; అని చెప్పి= అంటూ చెప్పి; శుకుండు= శుకమహర్షి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తా :** ఆ తరువాత బాలకృష్ణునికి పిల్లలను పట్టి హింసించే చెడుగ్రహం ఏదో సోకిందని, గోపకులు చాలామంది ఆ గ్రహపీడ తొలగటానికి అనేక బలిదానాలు చేశారు. బ్రాహ్మణులు పెరుగుతో, దర్భలతో, అక్షతలతో అనేకహోమాలు చేశారు. ఋగ్వేద, యజుర్వేద, సామవేద మంత్రాలతో అభిషేకాలు చేయించి, శుభాన్ని, పుణ్యాన్ని కలిగించే స్వస్తివాచనాలు, పుణ్యాహవాచనాలు చదివించి, కుమారుడికి మేలు జరగాలని నందుడు అలంకరించిన పాడిఆవులను పండితులకిచ్చి, వారి ఆశీర్వాదాలు పొంది, ఆనందించాడని చెప్పి, శుకుడు ఇంకా ఇలా అన్నాడు.

**క. కొడుకు నొకనాఁడు తొడపై, నిడుకొని ముద్దాడి తల్లి యెలమి నివురుచోఁ**
**గడుదొడ్డకొండశిఖరము, వడువున వ్రేఁగయ్యె నతఁడు వసుధాధీశా! 261**

**ప్రతి :** వసుధా+అధీశా!= భూమికి ప్రభువైనవాడా!, ఓ పరీక్షిన్మహారాజా!; ఒకనాఁడు= ఒకరోజు; తల్లి= తల్లి అయిన యశోదాదేవి; కొడుకున్= కుమారుడైన బాలకృష్ణుణ్ణి; తొడపైన్= తొడమీద; ఇడుకొని= ఉంచుకొని; ముద్దు+ఆడి= ముద్దుపెట్టుకొని; ఎలమిన్= ప్రేమతో; నివురుచోన్= (బాలుని) ఒడలు నిమురుతూ ఉండగా; కడున్= మిక్కిలి; దొడ్డ= పెద్ద; కొండశిఖరము వడువునన్= కొండశిఖరంవలె; అతఁడు= ఆ బాలుడు; వ్రేఁగు+అయ్యెన్= బరువయ్యాడు.

**తా :** ఓ పరీక్షిన్మహారాజా! ఒకరోజు యశోదాదేవి కొడుకును తొడమీద కూర్చోపెట్టుకొని ముద్దాడి దేహాన్ని ప్రేమతో అలా నిమురుతూ ఉండగా, పెద్దకొండ శిఖరంవలె బాలకృష్ణుడు బరువెక్కిపోయాడు.

## ❖ తృణావర్తుఁడను రాక్షసుఁడు సుడిగాలియై కృష్ణు నెత్తుకొని పోవుట ❖

**క. బరువైనకొడుకు మోవను, వెరవిఁడి యిలమీఁదఁ బెట్టి వెఱచి జనని దా**
**ధరఁ గావఁ బుట్టిన మహా, పురుషుఁడు గాఁబోలు ననుచు బుద్ధిఁ దలంచెన్. 262**

**ప్రతి :** బరువు+ఐన= బరువెక్కిన; కొడుకున్= కుమారుణ్ణి; మోవను= మోయడానికి; వెరవిఁడి= ఉపాయం లేనిదై అనగా మోయడానికి శక్తిచాలనిదై; వెఱచి= జంకి; ఇలమీఁదన్= భూమిమీద; పెట్టి= ఉంచి; తాన్= ఈ బాలుడు; ధరన్= భూమిని; కావన్+పుట్టిన= కాపాడడానికై పుట్టిన; మహాపురుషుఁడు= గొప్పవ్యక్తి; కాన్+పోలున్= ఔనేమో; అనుచున్= అనుకొంటూ; బుద్ధిన్= మదిలో; తలంచెన్= భావించింది.

**తా :** బరువెక్కిన కొడుకును మోయలేక యశోదాదేవి బిడ్డను క్రిందికి దించి, ఇతడు భూమిని ఉద్ధరించటానికి పుట్టిన మహాపురుషుడేమో అని మనస్సులో అనుకొంది.

**వ. అప్పుడు. 263**

**ప్రతి :** అప్పుడు= ఆ సమయంలో...

**తా :** ఆ సమయంలో

**క. ఖరుఁ డగు కంసునిపంపున, నరిగి తృణావర్తుఁ డవని కవచాటముగా**
**సురకరువలి యై బిసబిస, నరు దరు దన ముసరి విసరి హరిఁ గొనిపోయెన్. 264**

**ప్రతి :** ఖరుఁడు+అగు= క్రూరుడైన; కంసుని= కంసునియొక్క; పంపునన్= ఆజ్ఞచేత; తృణావర్తుఁడు= తృణావర్తుడనే రాక్షసుడు; అవనికిన్= భూమికి; అరిగి= వెళ్ళి; అవచాటముగా= అకస్మాత్తుగ; సురకరువలి+ఐ= సుడిగాలి అయి; బిసబిస= బిసబిస అనేధ్వని కలుగునట్లుగ; అరుదు+అరుదు= ముందెన్నడు లేదు, ముందెన్నడు లేదు; అనన్= అని అందరు అంటుండగా; ముసరి= ఆవరించి; విసరి= వీచి; హరిన్= బాలకృష్ణుణ్ణి; కొనిపోయెన్= ఎత్తుకొనిపోయాడు.

**తా :** కఠినాత్ముడైన కంసుడు ఆజ్ఞాపించగా, తృణావర్తుడనే రాక్షసుడు భూమిమీదికి వచ్చి, అకస్మాత్తుగా సుడిగాలిగా అయి, బిసబిస అని శబ్దం చేస్తూ, అందరు ఇలాంటి గాలిని ముందెన్నడు చూడలేదని ఆశ్చర్యపడుతుండగా క్రమ్ముకొని వీచి, బాలకృష్ణుణ్ణి ఎత్తుకొనిపోయాడు ('బిస బిస' – గాలి వీచేటప్పటి అనుకరణ ధ్వని).

**క. సుడి యెఱుఁగని హరి సుడివడ, సుడిగాలితెఱంగు రక్కసుఁడు విసరెడి యా**
**సుడిగాలిధూళి గన్నుల, సుడిసిన గోపకులు బెగడి సుడివడి రధిపా! 265**

**ప్రతి :** అధిపా!= రాజా!–ఓ పరీక్షిన్మహారాజా!; సుడి= తిరుగుడువడుట; ఎఱుఁగని= తెలియని; హరి= బాలకృష్ణుడు; సుడివడన్= చుట్టుకొని పడగా; సుడిగాలి తెఱంగు= సుడిగాలివలె కన్పించు; రక్కసుడు= రాక్షసుఁడు; విసరెడి= వీస్తున్నట్టి; ఆ సుడిగాలిధూళి= ఆ సుడిగాలివలన రేగిన దుమ్ము; కన్నులన్= కన్నులందు; సుడిసినన్= క్రమ్ముకోగా; గోపకులు= గొల్లలు; బెగడి= భయపడి; సుడివడిరి= గుండ్రంగా తిరుగుతూ పడిపోయారు.

**తా :** ఓ పరీక్షిన్మహారాజా! ఎవరివల్లనూ తిరుగుడువడని శ్రీహరి (బాలకృష్ణుడు) ఇప్పుడు తిరుగుడు పడ్డాడు. సుడిగాలి రూపంలో వచ్చిన రాక్షసుడు విసరిన సుడిగాలివల్ల రేగిన దుమ్ము కళ్ళనిండా క్రమ్ముకోగా, గోపకులంతా భయపడి గుండ్రంగా తిరుగుతూ పడ్డారు.

**వ. మఱియు న వ్వలయపవనదనుజుండు విలయపవనునితెఱంగునం గసిమసంగి ముసరి మసరు గవిసి విసరెడి సురకరువలిం బొడమిన పుడమిరజంబు వడి నెగసి గగనమున మెరసి తరణికిరణములకు మఱుఁ**

**గువడిన నిబిడమగు బెడిదంపుఁదిమిరమున దశదిశ లెఱుంగఁబడక గోకులం బాకులత నొంద నొండొరుల నెఱుంగక బెండుపడుచున్న జనంబుల మనంబుల ఘనంబుగ భయంబు రయంబునం జెంద నదభ్రపరిభ్రమణ శబ్దంబున దిగంతంబులు సెవుడు పడి పరిభ్రాంతంబులుగ నొక్క ముహూర్తమాత్రంబున భువనభయంకరత్వంబు దోఁచె, నా సమయంబున. 266**

**ప్రతి :** మఱియున్= ఇంకను; ఆ+వలయపవన దనుజుండు= ఆ సుడిగాలి రాక్షసుడు, తృణావర్తుడు; విలయ= ప్రళయకాలపు; పవనుని= వాయువు; తెఱంగునన్= వలె; కసిమసంగి= చెలరేగి; ముసరి= చుట్టుకొని; మసరుకవిసి= ఆక్రమించి; విసరెడి= వీచెడి; సురుకరువలిన్= సుడిగాలియందు; పొడమిన= పుట్టిన, రేగిన; పుడమిరజంబు= భూమిమీది దుమ్ము; వడిన్= వేగంగా; ఎగసి= పైకి లేచి; గగనమునన్= ఆకాశంలో; మెరసి= ప్రకాశించి, బాగా కనపడి; తరణి కిరణములకున్= సూర్యుని కిరణములకు; మఱుఁగు+పడినన్= కప్పుగా ఏర్పడగా; నిబిడము+అగు= దట్టమైన; బెడిదంపున్= భయంకరమైన; తిమిరమునన్= చీకటిచేత; దశదిశలు= పది దిక్కులు; ఎఱుంగన్+పడక= తెలియరాక; గోకులంబు= వ్రేపల్లె; ఆకులతన్= కలవరపాటును; ఒందన్= పొందగా; ఒండొరులన్= ఒకరినొకరు; ఎఱుంగక= తెలుసుకొనలేక; బెండుపడుచున్+ఉన్న= దిక్కుతెలియని స్థితిలో ఉన్న; జనంబుల= జనులయొక్క; మనంబులన్= మనస్సులందు; ఘనంబుగన్= మిక్కిలిగ; భయంబు; రయంబునన్= వేగంగ; చెందన్= పొందగా; అదభ్ర= అధికమైన; పరిభ్రమణ= తిరగడంయొక్క; శబ్దంబునన్= ధ్వనిచేత; దిక్+అంతంబులు= దిక్కుల చివరలు; చెవుడు+పడి= వినబడనిస్థితి ఏర్పడి; పరిభ్రాంతంబులు+కన్= అధిక భ్రాంతిని పొందినవికాగా; ఒక్క; ముహూర్తమాత్రంబున= రెండుగడియలకాలం; భువన= లోకాలకు; భయంకరత్వంబు= భయంకరమైన స్థితి; తోఁచెన్= కనపడింది; ఆ సమయంబునన్= అప్పుడు...

**తా :** అంతేకాక, ఆ సుడిగాలిరాక్షసుడు తృణావర్తుడు ప్రళయకాలవాయువువలె చెలరేగి, చుట్టుముట్టి, వీచిన సుడిగాలిలో పుట్టినదుమ్ము, పైకెగసి సూర్యకిరణాలను కప్పివేసింది. భయంకరమై దట్టమైన చీకటి పదిదిక్కులను ఆవరించింది. వ్రేపల్లెమొత్తం కలవరపాటు నొందింది. ఒకరికొకరు అగుపడనిస్థితి ఏర్పడింది. దిక్కు తెలియనిస్థితిలో జనులంతా భయపడ్డారు. ఆ సుడిగాలి తిరిగే వేగానికి, భయంకరధ్వనికి దిక్కుల చివరలు చెవిటివయ్యాయి. ఒక ముహూర్తకాలం లోకాలకు భయంకరస్థితి ఏర్పడింది. అప్పుడు

**ఉ. పాపనిఁ జూడఁ గానక విపద్దశ నొంది కలంగి తల్లి 'యో**
**పాపఁడ! బాలసూర్యనిభ! బాలశిరోమణి! నేఁడు గాలికిం**
**జేపడి పోయితే' యనుచుఁ జీరుచు దైవముఁ జాల దూఱుచుం**
**దాపము నొంది నెవ్వగల దయ్యుచుఁ గ్రుయ్యుచు బిట్టుఁ గూయుచున్. 267**

**ప్రతి :** తల్లి= బాలకృష్ణుని తల్లి అయిన యశోద; పాపనిన్= బిడ్డను; చూడన్+కానక= చూడలేక; విపద్+దశన్= ఆపద స్థితిని; ఒంది= పొంది; కలంగి= కలతనొంది; ఓ పాపఁడు+అ= ఓ బిడ్డా!; బాలసూర్యనిభ= బాలసూర్యునివంటివాడా!; బాలశిరోమణి!= బాలురందరిలో శ్రేష్ఠుడవైనవాడా!; నేఁడు= ఈ రోజు; గాలికిన్= గాలికి; చేపడిపోయితి(వి)+ఏ= చిక్కువడి పోయితివా; అనుచున్= అంటూ; చీరుచున్= పిలుస్తూ; దైవమున్= దేవుణ్ణి; చాలన్= ఎక్కువగా; దూఱుచున్= దూషిస్తూ; తాపమున్= బాధను; ఒంది= పొంది; నెఱ+వగలన్= నిండుదుఃఖంతో; దయ్యుచున్= బలహీనపడుచు; క్రుయ్యుచున్= క్రుంగుతూ; బిట్టున్= గట్టిగా; కూయుచున్= కేకలుపెట్టుతూ...

**తా :** యశోదకు బాలకృష్ణుడు అగుపడక పోయేసరికి, ఆపద కలిగినట్లుగా భావించి, కలతనొంది 'ఓ బిడ్డా! బాలభానునివంటి కాంతికలవాడా! బాలురందరిలో శ్రేష్ఠుడా! ఈ రోజు గాలిచేతిలో చిక్కువడితివా? అంటూ, బాలుణ్ణి పిలుస్తూ, ఈ స్థితి కలిగించినందుకు దేవుణ్ణి దూషిస్తూ, దుఃఖంతో క్రుంగి కృశించి గట్టిగా కేకలు పెట్టుతూ.

**క. సుడిగాలి వచ్చి నిన్నున్, సుడిగొని కొనిపోవ మింట సుడిసుడి గొనుచున్**
**బెడఁ గడరెడి నా ముద్దుల, కొడుకా! యే మంటి వనుచు ఘోరం బనుచున్. 268**

**ప్రతి :** సుడిగాలి+వచ్చి= నీ దగ్గరికి సుడిగాలి వచ్చి; నిన్నున్= నిన్ను; సుడిగొని= చుట్టుకొని; కొనిపోవన్= తీసుకుపోగా; మింటన్= ఆకాశంలో; సుడిసుడి గొనుచున్= చుట్టుకొంటూ చుట్టుకొంటూ తిరుగుతూ; బెడఁగు+అడరెడి= అందాలు చిందే; నా ముద్దుల కొడుకా!= నా చిన్నిబిడ్డా!; ఏమి+అంటివి= ఏమని అంటున్నావు; అనుచున్= అని అంటూ; ఘోరంబు= (ఇది) భయంకరం; అనుచున్= అంటూ...

**తా :** 'సుడిగాలి వచ్చి నిన్ను చుట్టుకొని ఆకాశానికి ఎత్తుకు పోయింది. ఆకాశంలో సుడితిరుగుతూ, భయపడుతున్న ఓ ముద్దుల కొడుకా! ఏమంటున్నావు? ఇది ఘోరం'- అని (దేవకీదేవి) అంటూ

**ఉ. ఇక్కడఁ బెట్టితిం దనయుఁ డిక్కడ నాడుచు నుండె గాలి దా**
**నెక్కడనుండి వచ్చె శిశు వెక్కడి మార్గము వట్టిపోయె నే**
**నెక్కడఁ జొత్తు నంచుఁ గమలేక్షణ గ్రేపుఁ దొఱంగి ఖిన్నయై**
**పొక్కుచు వ్రాలు గోవుక్రియ భూస్థలి వ్రాలె దురంతచింతయై. 269**

**ప్రతి :** ఇక్కడన్= ఇక్కడే; పెట్టితిన్= కూర్చుండపెట్టాను; ఇక్కడన్= ఇక్కడే; ఆడుచున్= ఆడుకొంటూ; ఉండెన్= ఉండాడు; గాలి= సుడిగాలి; తాన్= అది; ఎక్కడినుండివచ్చెన్= ఎటువైపునుండి వచ్చిందో; శిశువు=బిడ్డడు; ఎక్కడిమార్గము= ఏ త్రోవ; పట్టిపోయెన్= పట్టిపోయినాడో; ఏన్= నేను; ఎక్కడన్= ఎక్కడికని; చొత్తున్= వెళ్ళేది? అంచున్= అనుకొంటూ; కమల+ఈక్షణ= పద్మంవంటి కన్నులు కలదైన యశోద; క్రేపున్= దూడను; తొఱంగి= ఎడబాసి; ఖిన్న+ఐ= బాధనొందిందై; పొక్కుచున్= దుఃఖిస్తూ; వ్రాలు= నేలకూలునట్టి; గోవుక్రియన్= ఆవువలె; దురంతచింత+ఐ= అత్యంతమైన విచారంగలదై; భూస్థలిన్= నేలపైన; వ్రాలెన్= పడిపోయింది.

**తా :** 'కుమారుణ్ణి ఇక్కడే కూర్చోపెట్టాను. వాడు ఇక్కడే ఆడుకొంటూ ఉన్నాడు. ఇంతలోనే ఈ మాయదారి సుడిగాలి ఎటునుండి వచ్చిందో? బిడ్డ ఏ త్రోవపట్టిపోయాడో? నేను ఎక్కడికని వెళ్ళివెదికేది'? అంటూ యశోద, దూడను వదలిపెట్టి దుఃఖంతో నేలమీద కూలే ఆవులాగా నేలమీద పడిపోయింది.

**క. పాపనికై యిటు వొగిలెడి, యా పాపనితల్లిఁజూచి యారటపడుచున్,**
**గోపాలసతులు బాష్పజ, లాపూరిత నయన లైరి యార్తిం బడుచున్. 270**

**ప్రతి :** గోపాలసతులు= గొల్లఇల్లాండ్రు; పాపనికై= బిడ్డకోసం; ఇటు= ఈ విధంగా; పొగిలెడి= దుఃఖిస్తున్న; ఆ పాపని= ఆ బాలుని, బాలకృష్ణునియొక్క; తల్లిన్+చూచి= అమ్మయశోదను చూచి; ఆరటపడుచున్= కలతనొందుచు; ఆర్తిన్+పడుచున్= దుఃఖపడుతూ; బాష్పజల= కన్నీళ్ళచేత; ఆపూరిత= మిక్కిలి నిండిన; నయనలు+ఐరి= కన్నులు కలవాళ్లయ్యారు.

**తా :** బిడ్డకోసం ఈ విధంగా దుఃఖిస్తున్న యశోదాదేవిని చూచి గోపాలుర భార్యలందరు ఆర్తితో కలతపడి దుఃఖించగా వాళ్ళకళ్ళనిండా నీళ్ళునిండాయి.

**శా. ఆలోఁ జక్రసమీరదైత్యుఁడు మహాహంకారుఁడై మింటికిన్**
**బాలుం దాఁ గొనిపోయి పోయి తుదిఁ దద్భారంబు మోవన్ బల**
**శ్రీ లేమిం బరిశాంతవేగుఁ డగుచుం జేష్టింపఁగా లేక ము**
**న్నీలా గర్భకుఁ జూడనంచు నిట మీఁ దెట్లంచుఁ జింతించుచున్. 271**

**ప్రతి :** ఆలోన్= అంతలోపల; చక్రసమీరదైత్యుఁడు= సుడిగాలి రాక్షసుడు తృణావర్తుడు; మహా+అహంకారుఁడు+ఐ= మిక్కిలి అహంకారం కలవాడై; బాలున్= బాలకృష్ణుణ్ణి; తాన్= తాను; మింటికిన్= ఆకాశానికి; కొనిపోయి= తీసుకొనిపోయి; తుదిన్= చివర; తద్+భారంబు= ఆ బరువును; మోవన్= మోయడానికి; బలశ్రీ= బలసంపద; లేమిన్= లేకపోవటంచేత; పరిశాంత= మిక్కిలిగ తగ్గిన; వేగుఁడు+అగుచున్= వేగం కలవాడై; చేష్టింపన్+కాన్+లేక= కదలలేక; మున్ను= ఇంతకుముందు; ఈలాగు+అర్భకున్= ఇటువంటి బిడ్డను; చూడన్+అంచున్= చూడలేదంటూ; ఇటమీఁదన్= ఇకమీదట; ఎట్లు+అంచున్= ఏ మౌతుందో అంటూ; చింతించుచున్= విచారిస్తూ.

**తా :** అంతలోపల ఆ సుడిగాలి రాక్షసుడు తృణావర్తుడు మితిమీరిన అహంకారంతో బాలకృష్ణుణ్ణి ఆకాశానికి ఎత్తుకొని పోయాడు. కాని, ఆ బాలుడిబరువును మోయలేక గమనవేగం తగ్గి, కదలలేక 'ఇంతకుముందు ఇలాంటి బిడ్డను ఎక్కడా చూడనే లేదు. ఇక మీదట నా గతి ఏమౌతుందో అని చింతింపసాగాడు.

**వ. అటు దనుజుండు చింతించుచున్న సమయంబున. 272**

**ప్రతి :** అటు= అటు తరువాత; దనుజుండు= రాక్షసుడు; చింతించుచున్+ఉన్న= విచారిస్తూ ఉన్న; సమయంబునన్= సమయంలో...

**తా :** అని పై విధంగా సుడిగాలి రాక్షసుడు చింతిస్తున్న సమయంలో

**క. బాలద్విరదకరంబులఁ, బోలెడి కరములను దనుజు బొండుగ బిగియం**
**గీలించి వ్రేలఁబడియెను, బాలకుఁడొక కొండభంగి బరువై యధిపా! 273**

**ప్రతి :** అధిపా!= ఓ పరీక్షిన్మహారాజా!; బాలకుఁడు= బాలకృష్ణుడు; బాలద్విరద= పిల్లఏనుగుల; కరంబులన్= తొండాలను; పోలెడి= సరిపోలునట్టి; కరములను= చేతులతో; దనుజున్= రాక్షసుడైన తృణావర్తుని; బొండుగ= కుత్తుక నాళాన్ని; బిగియన్= బిగిసేట్లుగ గట్టిగ; కీలించి= ఒత్తిపట్టుకొని; ఒకకొండభంగిన్= ఒకకొండవలె; బరువు+ఐ= భారమై; వ్రేలన్+పడియెన్= వ్రేలాడాడు.

**తా :** పరీక్షిన్మహారాజా! బాలకృష్ణుడు పిల్లఏనుగుల తొండాలవంటి తన రెండుచేతులతో తృణావర్తరాక్షసుని కుత్తుక నాళాన్ని బిగియపట్టి, ఒక కొండవలె బరువై వ్రేలాడాడు.

**క. మెడ బిగియఁ బట్టుకొని డిగఁ, బడియెడి బాలకునిచేతఁ బర్వతనిభుచే**
**విడివడఁ జాలక వాఁ డురిఁ, బడి బెగడెడు ఖగముభంగి భయముం బొందెన్! 274**

**ప్రతి :** మెడన్= మెడను; బిగియన్= బిగుసుకొనునట్లుగా; డిగన్+పడియెడి= వ్రేలాడునట్టి; బాలకునిచేతన్= చిన్నవానిచేత; పర్వతనిభుచేన్= కొండను పోలినవానిచేత; వాఁడు= ఆ రాక్షసుడు; ఉరిన్+పడి= ఉచ్చునందు చిక్కుకొని; బెగడెడు= భయపడు; ఖగము= పక్షి; భంగిన్= వలె; భయమున్= భయాన్ని; పొందెన్= పొందాడు.

**తా :** తన మెడను బిగియపట్టి ఒక కొండలా వ్రేలాడుతున్న బాలకృష్ణుని పట్టునుండి బయటపడలేక ఆ రాక్షసుడు, మెడకు ఉచ్చుబిగుసుకొన్న పక్షివలె భయపడసాగాడు.

**క. హరికరతలపీడనమునఁ, బరవశుఁడై ఱాలమీఁద భగ్నాంగకుఁ డై**
**సురవైరిభటుఁడు గూలెను, బురభంజనుకోలఁ గూలు పురముంబోలెన్. 275**

**ప్రతి :** సురవైరిభటుఁడు= దేవతలకు విరోధి అయిన కంసునిబంటు, తృణావర్తుడు; హరి= విష్ణుస్వరూపుడైన కృష్ణునియొక్క; కరతల= అరచేతి; పీడనమునన్= రాపిడిచేత; పరవశుఁడు+ఐ= తన అధీనంలో తాను లేనివాడై; పురభంజను= త్రిపురములను నాశనము చేసిన శివునియొక్క; కోలన్= బాణంచేత; కూలు= పడునట్టి; పురమున్+పోలెన్= (త్రిపురాసురుల) పట్టణంవలె; భగ్న+అంగకుఁడు+ఐ= విరిగిన అవయవాలు కలవాడై; ఱాలమీఁదన్= రాళ్ళమీద; కూలెన్= పడ్డాడు.

**తా :** దేవతల శత్రువైన కంసునిబంటు తృణావర్తుడు, విష్ణుస్వరూపుడైన శ్రీకృష్ణునిఅరచేతిరాపిడికి స్వాధీనం తప్పినవాడై, త్రిపురాంతకుడైన పరమశివుని బాణంతో కూలిపోయిన పురంవలె, అవయవాలన్నీ విరిగి రాళ్ళమీద పడ్డాడు.

**వ. అంత గోపకాంత లంతయుం గని రోదనంబులు మాని సమ్మోదంబున విక్కవిరిసి రక్కసుని యురంబున మురువు గలిగి బరువులేక వ్రేలు బాలుం గొనివచ్చి ముచ్చిరుచున్న తల్లి కిచ్చి రప్పుడు గోపగోపికాజనంబు లందఱుఁ దమలో నిట్లనిరి. 276**

**ప్రతి :** అంతన్= అప్పుడు; గోపకాంతలు= గొల్లస్త్రీలు, అంతయున్= జరిగిందాన్నంతటిని; కని= చూచి; రోదనంబులు= ఏడ్పులు; మాని= విడిచి; సమ్మోదంబునన్= సంతోషంతో; విక్కవిరిసి (విరియు+విరియు)= మిక్కిలి వికాసాన్నిపొంది; రక్కసుని= రాక్షసుని; ఉరమునన్= ఎదమీద; మురువుగలిగి= అందంగా; బరువులేక= ఇంతకు ముందున్న బరువులేక; వ్రేలు= వ్రేలాడునట్టి; బాలున్= బాలుణ్ణి, బాలకృష్ణుణ్ణి; కొనివచ్చి= ఎత్తుకొనివచ్చి; ముచ్చిరుచున్+ఉన్న= శోకిస్తున్న; తల్లికిన్= యశోదాదేవికి; ఇచ్చిరి= ఇచ్చారు; అప్పుడు=ఆ సమయంలో; గోపగోపికాజనంబులు= గోపకులు; గోపికలు అయిన జనులు; అందఱున్= అందరు; తమలోన్= తమలో తాము; ఇట్లు+అనిరి= ఈ విధంగా అన్నారు.

**తా :** అప్పుడు గోపకాంతలు జరిగిందంతా చూచి, ఏడ్పులు మాని, సంతోషంతో రాక్షసుని వక్షఃస్థలం మీద ఉల్లాసంగా, చూడముచ్చటగా, ఇది వరకటి బరువులేక వ్రేలాడుతున్న బాలకృష్ణుణ్ణి ఎత్తుకొనివచ్చి, చింతాక్రాంతురాలై ఉన్న యశోదాదేవి కిచ్చారు. తరువాత అందరు గోపకులు, గోపికలు తమలో తాము ఈ విధంగా అనుకొన్నారు.

**క. రక్షణము లేక సాధుఁడు, రక్షితుఁ డగు సమతఁజేసి రాయిడులందున్**
**రక్షణములు వెయి గలిగిన, శిక్షితుఁ డగు ఖలుఁడు పాపచిత్తుం డగుటన్. 277**

**ప్రతి :** సాధుఁడు= మంచివాడు; రక్షణము= రక్షింపబడటం; లేక= లేకపోయినా; రాయిడులు+అందున్= కష్టాలు కలిగిన సమయాల్లో; సమతన్+చేసి= సమబుద్ధిచేత; రక్షితుఁడు+అగున్= కాపాడబడతాడు; ఖలుఁడు= దుర్జనుడు; రక్షణములు=

కాపుదలలు; వెయి= వెయ్యి; కలిగినన్= కలిగిఉన్నా; పాపచిత్తుండు= పాపబుద్ధి కలవాడు; అగుటన్= అగుటచేత; శిక్షితుఁడు= శిక్షింపబడినవాడు; అగున్= ఔతాడు.

**తా :** సాధుశీలుడు సమబుద్ధి కలిగి ఉంటాడు కనుక రక్షణలేకపోయినా కష్టాలు కలిగినపుడు రక్షింపబడుతాడు. దుర్మార్గుడికి వెయ్యి రక్షణలున్నా అతడు పాపాత్ముడు కనుక తప్పక శిక్షింపబడుతాడు.

**మ. గతజన్మంబుల నేమి నోఁచితిమొ? యాగశ్రేణు లే మేమి సే**
**సితిమో? యెవ్వరి కేమి వెట్టితిమొ యే చింతారతిం బ్రొద్దు వు**
**చ్చితిమో? సత్యము లేమి వల్కితిమొ? యే సిద్ధప్రదేశంబుఁ ద్రొ**
**క్కితిమో? యిప్పుడు సూడఁ గంటి మిచటం గృష్ణార్భకున్ నిర్భయున్. 278**

**ప్రతి :** గత= గడచిన; జన్మంబులన్= జన్మలలో; ఏమి నోఁచితిమి+ఒ= ఏ యే నోములు నోచామో? యాగశ్రేణులు= యాగాల వరుసలు; ఏమి+ఏమి= ఏమేమి; చేసితిమి+ఓ= చేశామో?; ఎవ్వరికిన్= ఏ సత్పురుషులకు; ఏమి+పెట్టితిమి+ఒ= ఏమి ఇచ్చామో?; ఏ చింతారతిన్= ఏ మంచి విషయాల ఆలోచనలలో మనస్సును నిలిపి; ప్రొద్దు+పుచ్చితిమి+ఒ= కాలం గడిపితిమో?; సత్యములు= నిజాలు; ఏమి+పల్కితిమి+ఒ= ఏమి చెప్పామో?; ఏ సిద్ధప్రదేశంబున్= ఏ పుణ్యక్షేత్రాన్ని; త్రొక్కితిమి+ఓ= మెట్టినామో; ఇప్పుడు= ప్రస్తుతం; ఇచటన్= ఇక్కడ; నిర్భయున్= భయంలేనివాణ్ణి; కృష్ణ+అర్భకున్= బాలకృష్ణుణ్ణి; చూడన్+కంటిమి= చూడగల్గాము.

**తా :** గత జన్మలలో ఏ యేనోములు నోచామో, ఏ యేయాగాలు చేశామో, ఏ యే సత్పురుషులకు ఏమేమి దానా లిచ్చామో, ఏ యే మంచి విషయాలమీద మనస్సు నిలిపి కాలం గడిపామో, ఏ యే సత్యాలు పలికామో; ఏ యే పుణ్యక్షేత్రాలలో సంచరించామో! ఆ పుణ్యఫలంగా ఇప్పుడిక్కడ భయం లేని బాలకృష్ణుణ్ణి దర్శించ గలిగాము.

**వ. అని పలికి రంత నందుండు మున్న దనకు వసుదేవుండు సెప్పిన మాటలకు వెఱఁగుపడుచుండె. మఱియును. 279**

**ప్రతి :** అని= అని ఈ విధంగా; పలికిరి= పలికారు; అంతన్= తరువాత; నందుండు= నందమహారాజు; మున్ను+అ= ముందుగానే; తనకున్= తనతో; వసుదేవుండు= వసుదేవుడు; చెప్పినమాటలకున్= చెప్పిన మాటలకు; వెఱఁగు పడుచుండెన్= ఆశ్చర్యపడ్డాడు; మఱియును= ఇంకను...

**తా :** అని పలికి గోపకుల మాటలు విన్న నందుడు, చాల ముందుగానే వసుదేవుడు తనతో తెలిపిన విషయాలకు ఆశ్చర్యపడుతూ ఉండినాడు. ఇంకా,

**సీ. జననాథ! యొకనాఁడు చన్ను చేఁపినఁ దల్లి చిన్నిముద్దుల కృష్ణుఁ జేరఁ దిగిచి**
**యెత్తి పెందొడలపై నిడికొని ముద్దాడి చ న్నిచ్చి నెమ్మోము సక్క నివిరి**
**యల్లని నగవుతో నావులించినబాలువదనగహ్వరమున వారినిధులు**
**దిశలు భూమియు వనద్వీపశైలంబులు నేఱులు గాలియు నినుఁడు శశియు**

**ఆ. దహనుఁ డాకసంబుఁ దారలు గ్రహములు, నఖిలలోకములుఁ జరాచరంబు**
**లైన భూతగణము లన్నియు నుండుటఁ, జూచి కన్నుమోడ్చి చోద్యపడియె. 280**

**ప్రతి :** జననాథ!= జనులకు ప్రభువువైన ఓ పరీక్షిన్మహారాజా!; ఒకనాఁడు= ఒకానొక రోజు; తల్లి= యశోద; చన్నుచేఁపినన్= చనులలో పాలు స్రవిస్తే; చిన్ని= బాలుడైన; ముద్దుల కృష్ణున్= ముద్దుకృష్ణుణ్ణి; చేరన్= దగ్గరకు; తిగిచి= లాగితీసుకొని; ఎత్తి= పైకెత్తి; పెన్+తొడలపైన్= పెద్దవైన తనతొడలమీద; ఇడికొని= ఉంచుకొని; ముద్దు+ఆడి= ముద్దుపెట్టుకొని; చన్ను+ఇచ్చి= చనుబాలు త్రావించి; నెఱ+మోము= అందమైనముఖాన్ని; చక్కన్= సరిగా; నిమిరి= తడమి; అల్లని= మెల్లని; నగవుతోన్= నవ్వుతో; ఆవులించినన్= ఆవులించగా; బాలు= ఆ బాలకృష్ణునియొక్క; వదనగహ్వరమునన్= గుహవంటి నోటియందు; వారినిధులు= సముద్రాలును; దిశలు= దిక్కులు; భూమియు= భూగోళం; వన= అడవులు; ద్వీప= దీవులు; శైలంబులున్= పర్వతాలు; ఏఱులు= నదులు; గాలియున్= వాయువును; ఇనుఁడు= సూర్యుడు; శశియు= చంద్రుడు; దహనుఁడు= అగ్నిదేవుడు; ఆకసంబున్= ఆకాశం; తారలు= నక్షత్రాలు; గ్రహములున్= గ్రహాలును; అఖిలలోకములున్= అన్నిలోకాలును; చర+అచరంబులు+ఐన= కదలని మరియు కదిలే; భూతగణములు= పృథివ్యాదులు; వృక్షపర్వతాదులు, వివిధప్రాణిసమూహాలు; అన్నియున్= అన్నియును; ఉండుటన్+చూచి= ఉండడం చూచి; కన్నుమోడ్చి= కన్నుమూసుకొని; చోద్యపడియెన్= ఆశ్చర్యపడింది.

**తా :** ఓ పరీక్షిన్మహారాజా! ఒక రోజు యశోద పాలిండ్లు చేపునకు రాగా, చిన్నారి ముద్దుల కృష్ణుణ్ణి దగ్గరికి తీసుకొని, తొడలమీద ఉంచుకొని, ముద్దుపెట్టుకొని చనుబాలు త్రావించింది. ప్రేమగా ముఖాన్ని నిమిరింది. అప్పుడు మెల్లగా నవ్వుతూ బాలుడు ఆవులించాడు. ఆ బాలకృష్ణునినోరు ఆమెకొక పెద్దగుహలాగా అగుపించింది. అందులో ఆమె సముద్రాలను, దిక్కులను, భూమిని, అడవులను, ద్వీపాలను, పర్వతాలను, నదులను, వాయువును, సూర్యచంద్రులను, అగ్నిని, ఆకాశాన్ని, గ్రహనక్షత్రాలను, అఖిలలోకాలను, చరాచరాలైన భూతగణాలను దర్శించి, కన్నులు మూసుకొని, ఆశ్చర్యచకితురాలైంది.

**విశే :** బాల్యంలోనే కృష్ణుడు ఆవులించి యశోదమ్మకు తననోట విశ్వరూపదర్శనభాగ్యమిచ్చాడు.

**వ. అంత నొక్కనాఁడు వసుదేవుపంపున యాదవపురోహితుండైన గర్గుండు మందకుం జనుదెంచిన నందుం డతనిఁ గనుంగొని లేచి నిలిచి కృతాంజలియై. 281**

**ప్రతి :** అంతన్= తరువాత; ఒక్కనాఁడు= ఒకరోజు; వసుదేవుపంపునన్= వసుదేవునిఆజ్ఞచేత; యాదవపురోహితుండు+ఐన= యాదవులకు పురోహితుడైన; గర్గుండు= గర్గమహాముని; మందకున్= వ్రేపల్లెకు; చనుదెంచినన్= రాగా; నందుండు; అతనిన్= ఆ గర్గమహామునిని; కనుంగొని= చూచి; లేచి నిలిచి= లేచి నిల్చొని; కృత+అంజలి+ఐ= చేతులెత్తి నమస్కారంచేస్తూ, అనగా నమస్కరించి...

**తా :** తరువాత ఒకరోజు వసుదేవుని ఆజ్ఞమేరకు యాదవుల పురోహితుడైన గర్గమహాముని వ్రేపల్లెకురాగా, నందుడు ఆయనను చూచి లేచి నిలబడి నమస్కరించి,

**క. కోరి భజించెను నందుఁడు, సారగుణాచారమార్గు సత్సంసర్గు**
**న్నారాధితభర్గున్ మతి, దూరితషడ్వర్గుఁ గుజనదుర్గున్ గర్గున్. 282**

**ప్రతి :** నందుఁడు= నందమహారాజు; సార= ఉత్తమమైన; గుణ+ఆచారమార్గున్= గుణాలయొక్క, ఆచారాలయొక్క మార్గాలు కలవాణ్ణి; సత్+సంసర్గున్= సత్పురుషులయొక్క సాంగత్యం కలవాణ్ణి; ఆరాధిత= అర్చించబడిన; భర్గున్= శివుడు కలవాణ్ణి; మతి= మనస్సునందు; దూరిత= దూరం చేయబడిన; షట్+వర్గున్= అరిషడ్వర్గం కలవాణ్ణి, అనగా కామక్రోధలోభాది ఆరు చెడుగుణాలను దూరంచేసినవాణ్ణి; కుజనదుర్గున్= చెడ్డవారిని దరిచేరనీయనివాణ్ణి; గర్గున్= గర్గమహామునిని; కోరి= ప్రీతిగలవాడై; భజించెను= సేవించాడు.

**తా :** ఉత్తమగుణాలు, నడవడులు, సత్పురుషులసాంగత్యం కలిగి, శివారాధకుడై, అరిషడ్వర్గాన్ని పారద్రోలి, నీచజనుల్ని దగ్గరకు రానీయనట్టి ఆ గర్గమహామునిని నందుడు అతిప్రీతితో సేవించాడు.

**వ. మఱియుఁ దగిన సత్కారంబులు సేసి యిట్లనియె. 283**

**ప్రతి :** మఱియున్= అంతేకాక; తగిన= చేయదగిన; సత్కారంబులు= మర్యాదలు; చేసి; ఇట్లు+అనియెన్= (ఆ మహామునితో) ఈ విధంగ అన్నాడు.

**తా:** వచ్చిన గర్గమహామునికి తగిన సత్కారాలు చేసిన పిదప నందుడు ఇలా అన్నాడు.

**క. ఊరక రారు మహాత్ములు, వా రధముల యిండ్లకడకు వచ్చుట లెల్లం**
**గారణము మంగళములకు, నీ రాక శుభంబు మాకు నిజము మహాత్మా! 284**

**ప్రతి :** మహా+ఆత్మా!= గొప్ప ఆత్మగల ఓ గర్గమహామునీ!; మహా+ఆత్ములు= గొప్పవారు; ఊరక= ఏ కారణం లేకుండ; రారు= (ఒకచోటికిగాని, ఒకరిదగ్గరికిగాని)రారు; వారు= ఆ గొప్పవారు; అధముల= తక్కువవారి; ఇండ్లకడకున్= ఇండ్లదగ్గరకు; వచ్చుటలు= రావడం; ఎల్లన్= అంతా; మంగళములకున్= శుభాలకు; కారణము= హేతువు; నీ, రాక= నీవు రావడం; మాకున్= మాకందరికి; శుభంబు= మేలు చేయునట్టిది; నిజము= (ఇది) సత్యం.

**తా :** మహాత్మా! ఓ గర్గమహామునీ! గొప్పవారు ఏ కారణం లేకుండా ఒక చోటికిగాని, ఒకరి దగ్గరికిగాని రారు. తక్కువవారిఇండ్ల దగ్గరికి వచ్చారంటే–వారి రాకలు శుభాలకు కారణాలు. ఇప్పటి మీ రాక మాకు శుభాన్ని సమకూరుస్తుంది. ఇది సత్యం.

**విశే :** ప్రస్తుత పద్యంలోని "ఊరక రారు మహాత్ములు" అనే పాదం అనేక సందర్భాల్లో, అనేకార్థాల్లో పెక్కుమందినోట వినపడే పద్యపాదం.

**శా. జ్యోతిశ్శాస్త్రుల కెల్ల మేటరివి తేజోమూర్తి వాశాంత వి**
**ఖ్యాతస్ఫూర్తివి బ్రహ్మబోధనుఁడ వాకర్ణింపు నా పల్కు ని**
**ర్ణీతుండైనగురుండు మానవులకున్విప్రోత్తముం డంద్రు నీ**
**చాతుర్యంబున నీ కుమారులకు సంస్కారంబు గావింపవే. 285**

**ప్రతి :** జ్యోతిస్+శాస్త్రులకున్+ఎల్లన్= జ్యోతిషశాస్త్రాన్ని చదివిన పండితులందరిలో; మేటరివి= మేటివి; తేజస్+మూర్తివి= తేజస్సే ఆకారమైనవాడివి; ఆశా+అంత= దిక్కుల చివరిదాకా; విఖ్యాత= ప్రసిద్ధమైన, స్ఫూర్తివి= ప్రకాశం కలవాడివి–అనగా దిక్కుల చివరలవరకు వ్యాపించి వెలుగుతున్న కీర్తికలవాడివి; బ్రహ్మబోధనుఁడవు= బ్రహ్మజ్ఞానం కలవాడివి; నా పల్కు= నా మాట; ఆకర్ణింపు(ము)= విను; మానవులకున్= మనుష్యులకు; నిర్ణీతుండు+ఐన= (వేదశాస్త్రాలచేత) నిర్ణయింపబడినవాడైన;

గురుండు= గురువు; విప్ర+ఉత్తముండు= బ్రాహ్మణశ్రేష్ఠుడు; అంద్రు= అంటారు; నీ చాతుర్యంబునన్= నీ నేర్పుతో; ఈ కుమారులకున్= ఈ చిన్నిబాలురకు; సంస్కారంబున్= సంస్కరించడాన్ని అనగా వేదోక్త మంత్రాలచేత నామకరణాదుల్ని; కావింపవు+ఏ= జరిపించు.

**తా :** ఓ గర్గమహామునీ! నీవు జ్యోతిశ్శాస్త్ర పండితులందరిలో శ్రేష్ఠుడివి. మిక్కిలి తేజోమూర్తివి. అన్నిదిక్కుల చివరలదాకా వ్యాపించి వెలిగే కీర్తి కలవాడివి. బ్రహ్మజ్ఞాన సంపన్నుడివి. నా మనవి విను. వేదజ్ఞుడైన బ్రాహ్మణశ్రేష్ఠుడే మానవులకు నిర్ణయింపబడిన గురువని పెద్దలంటారు. నీవు నేర్పుగ ఈ కుమారులిద్దరికి నామకరణాదిసంస్కారాలు వేదోక్తంగా జరిపించు.

**వ. అని రామకృష్ణులం జూపిన గర్గుండు మున్ను కంసునిచేత వ్రేటువడి దివి కెగసిపోయిన తెఱవ సెప్పిన తెఱంగు దేటపఱిచి దేవకీదేవికొడుకని కృష్ణునిఁ గంసుండు దలంచుం గావున రహస్యంబున సంస్కారంబు సేయుట కార్యం బని నందానుమతంబున రోహిణీసుకుమారు నుద్దేశించి. 286**

**ప్రతి :** అని= అని చెప్పి; రామకృష్ణులన్= బలరాముణ్ణి, శ్రీకృష్ణుణ్ణీ; చూపినన్= చూపగా; గర్గుండు= ఆ గర్గమహాముని; మున్ను= మునుపు; కంసునిచేతన్= కంసునివల్ల; వ్రేటుపడి= దెబ్బపడి; దివికిన్= ఆకాశానికి; ఎగసిపోయిన= ఎగిరిపోయిన; తెఱవ= స్త్రీ; చెప్పిన= చెప్పినటువంటి; తెఱంగు= విధం; తేటపఱిచి= స్పష్టంగా వివరించి; దేవకీదేవికొడుకు+అని= దేవకీదేవి పుత్రుడని; కృష్ణునిన్= కృష్ణుణ్ణి; కంసుండు= కంసుడు; తలంచున్+కావునన్= అనుకొంటాడు కనుక; రహస్యంబునన్= ఇతరులకు తెలియకుండా; సంస్కారంబు చేయుట= నాకరణాది సంస్కారం చేయడం; కార్యంబు+అని= తగినపని అని; నంద= నందునియొక్క; అనుమతంబునన్= సమ్మతితో; రోహిణీ సుకుమారున్= రోహిణీదేవియొక్క సత్పుత్రుణ్ణి; ఉద్దేశించి= గురించి...

**తా :** అని నందుడు చెప్పి బలరామకృష్ణులను చూపగా, ఆ గర్గమహాముని ఇదివరకు కంసునిచేత వ్రేటువడి ఆకాశానికి ఎగసిపోయిన యోగమాయ చెప్పినమాటలను నందునికి వివరించి, కృష్ణుడు దేవకీదేవికొడుకు అని కంసుడు తలచి, ప్రమాదం చేయవచ్చు కనుక, పిల్లలకు నామకరణాది సంస్కారాలు రహస్యంగా చేయటం మంచిదని సూచించాడు. నందుడు అందుకు సమ్మతించాడు. అప్పుడు ఆ మహాముని రోహిణికొడుకును గురించి

**క. జనులు రమియింపఁ దిరిగెడి, యనువు కలిమి రాముఁ డనియు యదుసంకర్షం**
**బున సంకర్షణుఁ డనియును, ఘనబలమున బలుఁడు ననియు గణుతించె నృపా! 287**

**ప్రతి :** నృపా!= ఓ పరీక్షిన్మహారాజా!; జనులు= ప్రజలు; రమియింపన్= ఆనందించునట్లుగ; తిరిగెడి= నడచుకొనే; అనువు= విధం; కలిమిన్= కలిగి ఉండుటచేత; రాముఁడు+అనియున్= రాముడనీ; యదు సంకర్షంబున= యదువంశ స్త్రీగర్భంనుండి లాగబడడంచేత; సంకర్షణుఁడు+అనియును= సంకర్షణుడను పేరుతోనూ; ఘన= గొప్ప; బలమునన్= బలంచేత; బలుఁ దును+అనియు= బలుడనీ; గణుతించెన్= కొనియాడాడు (పేర్లు పెట్టాడు).

**తా :** ఓ పరీక్షిన్మమారాజా! ప్రజలు ఆనందించేట్టు మెలిగే పద్ధతి కలవాడు కనుక రాముడనీ, ఒక గర్భంనుండి లాగబడి మరొక గర్భంలో ప్రవేశపెట్టబడినవాడు కావటంచేత సంకర్షణుడనీ, గొప్పబలం కలవాడు కావటంచేత బలుడనీ నామకరణం చేశాడు.

**వ. మఱియుం గృష్ణు నుద్దేశించి తొల్లి యీ శిశువు ధవళారుణ పీతవర్ణుండై యిప్పుడు నల్లనైనకతంబునఁ గృష్ణుం డయ్యె, వసుదేవునకు నొక్కెడ జన్మించిన కారణంబున వాసుదేవుం డయ్యె, నీ పాపనికి గుణరూపకర్మంబు**

**లనేకంబులు గలుగుటంజేసి నామంబు లనేకంబులు గలవు. ఈ శాబకునివలన మీరు దుఃఖంబులఁ దరియింతు, రీ యర్భకునిచేత దుర్జనశిక్షణంబును సజ్జనరక్షణంబును నగు, నీ కుమారుండు నారాయణసమానుం డని చెప్పి తన గృహమ్మున కమ్మునీశ్వరుండు సనియె. నందుండును బరమానందంబున నుండె నంత. 288**

**ప్రతి :** మఱియున్= ఇంకను; కృష్ణున్= బాలకృష్ణుణ్ణి; ఉద్దేశించి= గురించి; ఈ శిశువు= ఈ బిడ్డ; తొల్లి= మొదట; ధవళ= తెల్లని; అరుణ= ఎఱ్ఱని; పీత= పసుపుపచ్చని; వర్ణుండు+ఐ= వన్నెకలవాడై; ఇప్పుడు నల్లన+ఐన= ఇప్పుడు నల్లగా అయిన; కతంబునన్= కారణంవల్ల; కృష్ణుండు+అయ్యెన్= కృష్ణుడుగా పిలువబడుతున్నాడు; ఒక్క+ఎడన్= ఒకానొకచోట (చెరసాలలో); వసుదేవునకున్= వసుదేవునికి; జన్మించిన= పుట్టిన; కారణంబునన్= కారణంచేత; వాసుదేవుండు+అయ్యెన్= వాసుదేవుడని పేరుపొందాడు; ఈ, పాపనికిన్= ఈ చిన్నవానికి; గుణ= గుణాలు; రూప= రూపాలు; కర్మంబులు= కర్మలు; అనేకంబులు= పెక్కులు; కలుగుటన్+చేసి= కలగడంవల్ల; నామంబులు= పేరులు; అనేకంబులు కలవు= చాలా ఉన్నాయి; ఈ, శాబకుని వలనన్= ఈ బాలునివల్ల; మీరు; దుఃఖంబులన్= బాధలనుండి; తరియింతురు= దాటుతారు (తరియించుదురు); ఈ, అర్భకునిచేతన్= ఈ పిల్లవానివల్ల; దుర్జన శిక్షణంబును= దుష్టులను శిక్షించడమూ; సజ్జన రక్షణంబును= సజ్జనుల రక్షించడమూ; అగున్= జరుగుతుంది; ఈ కుమారుండు= ఈ బాలుడు; నారాయణ సమానుండు= శ్రీమన్నారాయణునితో సమానమైనవాడు; అని చెప్పి= అని చెప్పి; తన, గృహమ్మునకున్= తన ఇంటికి; ఆ+ముని+ఈశ్వరుండు= ఆ మునిశ్రేష్ఠుడు; చనియెన్= వెళ్లాడు; నందుండును= నందుడుకూడ; పరమ+ఆనందంబునన్= మిక్కిలి సంతోషంతో; ఉండెన్= ఉన్నాడు; అంతన్= తరువాత..

**తా :** తరువాత గర్గమహాముని యశోదకొడుకును ఉద్దేశించి 'ఈ శిశువు పూర్వం తెలుపు, ఎరుపు, పసుపు రంగులలో ఉండేవాడు. ఇప్పుడు నల్లగా ఉన్నాడు కనుక కృష్ణుడని పిలవండి. ఇతడు ఒకానొక ప్రదేశంలో వసుదేవునికి జన్మించాడు కనుక వాసుదేవుడనికూడ ఇతణ్ణి పిలువవచ్చు. ఈ బాలుడికి అనేకగుణాలు, రూపాలు, కర్మలు ఉండటంచేత ఇంకా ఎన్నో పేర్లు వస్తాయి. ఈ బిడ్డవల్ల మీరు అన్ని దుఃఖాలనుండీ గట్టెక్కుతారు. అంతేకాదు. ఈ బాలుడివల్ల దుష్టశిక్షణం, శిష్ట రక్షణం కూడా జరుగుతుంది. ఈ కుమారుడు శ్రీమహావిష్ణువుతో సమానమైనవాడు' అని చెప్పి తన ఇంటికి వెళ్ళాడు. అది విని నందుడుకూడా పరమానంద భరితుడయ్యాడు. ఆ తర్వాత

## ❖ శ్రీ కృష్ణ బలరాముల బాల్యక్రీడాభివర్ణనము ❖

**సీ. జానుభాగముల హస్తమ్ములు వీడ్వడ నిడుచు దిగ్గనఁ బోదు రింత నంత**
**నవ్వల పయ్యెద లంది జవ్వాడుదు రాలక్రేపులతోఁక లలమి పట్టి**
**విడువనేరక వానివెనువెంట జరగుదు రప్పంకముల దుదు కదరఁ జొత్తు**
**రెత్తి చన్నిచ్చుచో నిరుదెసం బాలిండ్లు చేతులఁ బుడుకుచుఁ జేఁపుఁ గలుగ**

**తే. దూఁటుదురు గ్రుక్క గ్రుక్కకుఁ దోర మగుచు, నాడుదురు ముద్దుపలుకు లవ్యక్తములుగఁ**
**గరము లంఘ్రులు నల్లార్చి కదలుపుదురు, రామకృష్ణులు శైశవరతులఁ దగిలి. 289**

**ప్రతి :** బలరామకృష్ణులు; శైశవరతులన్= బాల్యక్రీడలలో; తగిలి= ఆసక్తులై–ఆడుతూ; జానుభాగములన్= మోకాళ్ళమీద; హస్తమ్ములు= చేతులు; వీడు+వడన్= అటు నిటు జారిపోగా; ఇడుచున్= మళ్లీ పెట్టుకొంటూ; ఇంతనంతన్= అటు ఇటు;

దిగ్గనన్= తటాలున; పోదురు= అడుగులు వేస్తారు; అవ్వల= తల్లులయొక్క; పయ్యెదలు= పైటలు; అంది= పట్టుకొని; జవ్వాడుదురు= (జవ+ఆడు) ఉయ్యాల లూగుతారు; ఆలక్రేపుల= ఆవుదూడలయొక్క; తోఁకలు+అలమి పట్టి= తోకలను గట్టిగా పట్టుకొని; విడువన్+నేరక = వదలి పెట్టడం తెలియక; వానివెనువెంటన్= ఆ దూడల వెనుకగా; జరుగుదురు= కదులుతారు; ఆ సమయాల్లో; ఆ+పంకములన్= అక్కడవుండే బురదలో; దుదుకు+అదరన్= ఎంతో దూకుడుగా; చొత్తురు= చేరుతారు (బురదలో దిగుతారు); తల్లులు; ఎత్తి= ఎత్తుకొని; చన్నిచ్చుచోన్= చనుబాలు కుడుపగా; పాలిండ్లు= స్తనాలను; చేతులన్= తమ చిన్ని చేతులతో; పుడుకుచున్= తడుముతూ; గుక్క గుక్కకున్= ప్రతి గుక్కకు; తోరము+అగుచున్= ఎక్కువగునట్లుగా; చేపు+కలుగన్= (పాల్లిండు) పాలు చేపునకు రావడంకై; దూఁటుదురు= మూతితో పొడుస్తారు; ముద్దు పలుకులు= ముద్దులొలికే మాటలు; అవ్యక్తములు+కన్= ఇది అని తెలియని రీతిలో; ఆడుదురు= మాట్లాడుతారు; కరములు= చేతులు; అంఘ్రులు= పాదాలు; అల్లార్చి= తిప్పి; కదలుపుదురు= కదిలిస్తారు;

**తా :** బలరాముడు, శ్రీకృష్ణుడు బాల్యక్రీడలతో అందరినీ ఆనందపరుస్తున్నారు. పిల్లలు వచ్చీ రాని అడుగులు వేసుకుంటూ మోకాళ్లపై వచ్చి పడిపోతూ, మళ్లీ లేస్తూ అటూ ఇటూ తిరగడం, తల్లులపైటలు లాగిపట్టుకుని ఉయ్యాలలూగడం, ఆవుదూడలతోకలు పట్టుకొని అవి ముందుకు పరుగిడడంతో తోకలు వదలలేక వాటితోపాటు వీళ్లూ పరుగెత్తడం, అలా పరుగెత్తి బురదలో పడడం, తల్లులు ఎత్తుకొని చనుబాలిస్తున్నప్పుడు రెండుచేతులతో పాలిండ్లను తడుముతూ, మూతితో పొడుస్తూ, పాలు ఎక్కువగా చేపడంతో గుక్క గుక్కకూ తాగడం, వచ్చీ రాని ముద్దు మాటలాడుతూ చేతులను, పాదాలను అటూ ఇటూ తిప్పుతూ ఆడుకోవడం - ఇవన్నీ అంతటా చిన్న పిల్లలు చేసే చేష్టలే. బలరామకృష్ణులు కూడా అలాగే బాల్యచేష్టలుచేస్తూ చూసేవారికి ఆనందం కలిగిస్తున్నారు.

**క. తడ వాడిరి బలకృష్ణులు, దడ వాడిరి వారిఁ జూచి తగ రంభాదుల్**
**దడవాడి రరులు భయమునఁ, దడ వాడిరి మంతనములఁ దపసులు వేడ్కన్. 290**

**ప్రతి :** బలకృష్ణులు= బలరాముడూ, శ్రీకృష్ణుడూ ఇద్దరూ; తడవు= ఎంతోసేపు; ఆడిరి= పూర్వం చెప్పినట్లుగా ఆడుకున్నారు; (ఆ సమయంలో) రంభా+ఆదుల్= స్వర్గంలోని రంభ మొదలగు అచ్చరలు; వారిన్= ఆ బలరామకృష్ణులను చూచి; తడవు ఆడిరి= ఎంతోసేపు నాట్యం చేశారు; అరులు= శత్రువులు; భయమునన్= భయంతో; తడవాడిరి= తడబడ్డారు; తపసులు= మునీశ్వరులు; వేడ్కన్= ఆనందంతో; మంతనములన్= ఏకాంతంగా ఆలోచనలతో; తడవాడిరి= ఎంతోసేపు ముచ్చటించుకున్నారు.

**తా :** ఇలా వ్రేపల్లెలో బలరామశ్రీకృష్ణులు బాల్యచేష్టలు చేస్తూవుంటే పై లోకంలో వున్న రంభ ఊర్వశి మొదలగు అప్సరసలు ఆ బాలురచేష్టలకు ముచ్చటపడి వారూ తమకిష్టమైన నృత్యం చేయడం ప్రారంభించారు. ఇక శత్రువులు అప్పటికే పూతనాది రాక్షససంహారం చేసిన బాలునిగా శ్రీకృష్ణుణ్ణి గురించి వినడంవల్ల భయంతో తడబడ్డారు. మహర్షులు దుష్టశిక్షణం, శిష్టరక్షణం జరిగే సమయం ప్రారంభమయిందన్న సంతోషంతో వాళ్లలో వాళ్లు ఏకాంతంగా ముచ్చటించుకున్నారు.

**సీ. తల లెత్తి మెల్లన తడవి యాడెడువేళఁ బన్నగాధీశులపగిదిఁ దాల్తు,**
**రంగసమ్మృష్టపంకాంగరాగంబుల నేనుఁగుగున్నల యెత్తు వత్తు,**
**రసమంబులైన జవాతిరేకమ్ముల సింగపుఁగొదమలసిరి వహింతు**
**రాననంబులఁ గాంతు లంతకంతకు నెక్కు బాలార్కచంద్రులపగిదిఁ దోఁతు,**

**తే. రెలమిఁ దల్లులచన్నుఁబా లెల్లఁ ద్రావి, పరమయోగోద్భవామృతపానలీల**
**సోలి యెఱుఁగనియోగులసొంపు గందు, రా కుమారులు జనమనోహారు లగుచు. 291**

**ప్రతి :** ఆ కుమారులు= అలా ఆడుతున్న శ్రీకృష్ణబలరాములు; జనమనోహారులు= అక్కడిజనుల మనస్సులు హరించే వారు; అగుచున్= అవుతూ; తలలు+ఎత్తి= శిరస్సులు పైకెత్తి; మెల్లనన్= మెల్లగా; తడివి= ప్రాకుతూ; ఆడెడువేళన్= ఆడుతున్న సమయంలో; పన్నగ+అధీశుల= పాములకు పెద్దయైన ఆదిశేషుని, లేదా శేషుడు, వాసుకి మొదలగువారి; పగిదిన్= రీతిని; తాల్తురు= ధరిస్తారు, వహిస్తారు; అంగ= శరీరాలకు, సమ్మృష్ట= బాగా అంటుకున్న; పంక= బురదనే; అంగరాగంబులన్= చందనాదుల పూతవలె పులుముకున్న అవయవాలతో (లేదా వారి శరీరాలకు అంటుకున్న బురదే ఒంటికి పూసుకున్న కస్తూరి మొదలగు సుగంధ ద్రవ్యాల పూతలతో); ఏనుఁగు గున్నల= పిల్ల ఏనుగుల; ఎత్తు వత్తురు= వలె ఉన్నట్లు కనబడతారు; అసమంబులు+ఐన= సాటిలేనివైన; జవ+అతిరేకమ్ములన్= వేగాధిక్యాలతో; సింగము కొదమల= సింహంపిల్లలయొక్క; సిరి= శోభను, వహింతురు= తాలుస్తారు; ఆననంబులన్= ముఖాల్లో; కాంతులు= శోభలు, చక్కదనాలు; అంతకున్+అంతకున్= రోజు రోజుకూ; ఎక్కు= అధికమయ్యే; బాల+అర్క చంద్రుల పగిదిన్= ఉదయిస్తున్న బాలసూర్యచంద్రులవలె; తోఁతురు (తోఁచుదురు)= గోచరిస్తారు; ఎలమిన్= ప్రేమతో; తల్లుల= తమ తమ తల్లుల; చన్నుఁబాలు+ఎల్లన్= చనుబాలన్నీ (స్తన్యం అంతా); త్రావి= తాగి; పరమయోగ= ఎంతో ఉన్నతమైన బ్రహ్మ నిష్ఠవలన, ఉద్భవ=పుట్టిన (ప్రాప్తించిన); (మోక్షమనే) అమృతపాన లీలన్= అమృతం తాగినట్టి విలాసంతో; సోలి= పరవశించి; ఎఱుఁగని= తన్మయత్వ స్థితిలో ఉన్న; యోగుల= మహర్షుల; సొంపు= ప్రసన్నతను; కందురు= పొందుతారు.

**తా :** చిన్నపిల్లలు బోర్లాపడుకొని తలలు పైకి నిలుపుతారు. అలా రామకృష్ణులు తలలు పైకెత్తి ఆడే సమయంలో ఆదిశేషుడు మొదలైన సర్పరాజులు పడగలెత్తినట్లు ఉన్నారు. ఏనుగులకు ఒంటిపై మట్టి జల్లుకోవడం సరదా. దానిని 'వప్రకీడ' అంటారు. అలాగే ఈ బాలురు శరీరానికి బురద అంటించుకోగా ఒళ్ళంతా మట్టి జల్లుకున్న పిల్లఏనుగుల్లా కనబడుతున్నారు. ఉత్సాహంతో ముందుకు ఉరుకుతూఉంటే సింహంపిల్లలు దూకుతున్న శోభను వహిస్తున్నారు. రోజు రోజుకూ ముఖకాంతులు పెరుగుతూవుంటే ఉదయిస్తున్న బాలసూర్యచంద్రులవలె ప్రకాశిస్తున్నారు. తల్లుల చనుబాలు తాగుతూ జోగుతూవుంటే ఎంతో సాధనచేసి మోక్షానందమనే అమృతం గ్రోలి పరవశిస్తున్న యోగీశ్వరులవలె ముచ్చట గొలుపుతున్నారు. ఇలా చూచే జనులందరికీ ఒక్కొక్కసమయంలో వారిచేష్టలనుబట్టి ఆయా రూపాలుగా రామకృష్ణులు కనబడుతూ చూపరులకు ఆనందం కలిగిస్తున్నారు.

**క. చూడనివారల నెప్పుడుఁ, జూడక లోకములు మూఁడు చూపులఁ దిరుగం**
**జూడఁగ నేర్చిన బాలక, చూడామణి జనుల నెఱిఁగి చూడఁగ నేర్చెన్. 292**

**ప్రతి :** చూడనివారలన్= తనను చూడని, దర్శింపని వారిని; ఎప్పుడున్= ఎప్పుడూ; చూడక= తాను చూడకుండా; చూపులన్= తన చూపులతో, తాను చూడటంతో; లోకములు మూడు= ముల్లోకాలు; తిరుగన్= తిరిగేటట్లు; చూడన్+కన్= చూచేటుగా; నేర్చిన= తెలిసిన; బాలకచూడామణి= బాలకులలో శ్రేష్ఠుడైన ఆ గోపాలబాలకుడు; జనులన్= తనవద్దకు వచ్చిన, తనను చూస్తున్నవారిని; చూడన్+కన్= వీరూ వీరూ అని గుర్తుపట్టే విధాన్ని; నేర్చెన్= నేర్చుకున్నాడు అంటే జనాన్ని గుర్తుపట్టసాగాడు.

**తా :** తనవైపు చూడనివారిని ఎప్పుడూ తాను చూడకుండా, తనచూపులతో ముల్లోకాలనూ తిరిగేటట్లు చూచే ఆ బాలకృష్ణుడు తనను చూస్తున్నవారిని క్రమంగా గుర్తుపట్టడం ప్రారంభించాడు. (ఇక్కడి నుండి కేవలం బాలకృష్ణుని రూపాన్ని, చేష్టలను

వర్ణిస్తున్నాడు పోతన. ఒక వైపు పరమాత్మతత్త్వం, ఒక వైపు సామాన్య బాలకుల లక్షణాన్ని చూపుతున్నాడు. విష్ణువు తన నెవరైతే భావిస్తారో వాళ్లకు సులభుడు. అలా కానివారికి ఆయన కానరాడు)

**క. నగవుల నవిద్యపోఁడిమి, నగుబాటుగఁ జేయ నేర్చునగవరి యంతన్**
**నగుమొగముతోడ మెల్లన, నగుమొగములసతులఁ జూచి నగ నేర్చె నృపా! 293**

**ప్రతి :** నృపా= ఓ పరీక్షిన్మహారాజా! ఆ గోపాలుడు; నగవులన్= తన నవ్వులతో; అవిద్య= అజ్ఞానం (మాయ)యొక్క; పోఁడిమిన్= రూపాన్ని; నగుబాటు+కన్= నవ్వుల పాలయ్యేట్లుగా (తొలగిపోయేట్లుగా); చేయనేర్చు= చేసే నేర్పుగల; నగవరి= ఆ నవ్వులుగల ఆ బాలుడు; అంతన్= ఆ సమయంలో; నగుమొగముతోడన్= చిరునవ్వుతో కూడిన ముఖంతో; (చిరునవ్వు నవ్వుతూ); మెల్లనన్= మెల్ల మెల్లగా; నగుమొగముల= తనను చూచి నవ్వుతూఉన్న ముఖాలుగల; సతులన్= గోపకాంతలను, చూచి; నగనేర్చెన్= నవ్వడం మొదలుపెట్టాడు.

**తా :** బాలకృష్ణుడు లీలామానుష విగ్రహుడు. ఆయన నవ్వితే జ్ఞానం ప్రకాశించి, అజ్ఞానం పటాపంచలైపోతుంది. అట్టి బాలకుడు తన వద్దకు వచ్చి నవ్వుతున్న ముఖాలుగల గోపకాంతల్ని చూచి తానూ నవ్వసాగాడు.

**క. అవ్వల నెఱుఁగక ముప్వరి, కవ్వల వెలుఁగొందు పరముఁ డర్భకుఁడై యా**
**యవ్వలకు సంతసంబుగ, నవ్వా! యవ్వా! యనంగ నల్లన నేర్చెన్. 294**

**ప్రతి :** అవ్వలన్= తనకు జన్మనిచ్చిన తల్లులు అంటూ ఎవరినీ; ఎఱుఁగక= తెలియలేక; ముప్వరికిన్= త్రిమూర్తులైన బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులకు; అవ్వలన్= పైన అతీతంగా; వెలుఁగొందు= ప్రకాశించే; పరముఁడు= పరమ పురుషుడైన శ్రీమన్నారాయణుడు; అర్భకుఁడై= చిన్నికృష్ణునిరూపంలో బాలుడై; ఆ+అవ్వలకున్= రేపల్లెలోని అమ్మలందరికీ; సంతసంబుగన్= ఆనందమయ్యేట్లుగా; అవ్వా! అవ్వా!= అమ్మా! అమ్మా! అనన్+కన్= అనేటుగా; అల్లనన్= మెల్లగా; నేర్చెన్= అనడం, పిలవడం నేర్చుకున్నాడు.

**తా :** త్రిమూర్తులకు అతీతంగా ఉండే శ్రీమన్నారాయణుడు జన్మలు లేనివాడు గనుక “అమ్మ” అంటూ ఆయన కెవరూ లేరు. ఆ పరమపురుష డిప్పుడు బాలకుడై తన అమ్మలకు ఆనందం కలిగేటట్లు “అమ్మా” “అమ్మా” అని పిలవడం నేర్చుకున్నాడు.

**క. అడుగులు వే గలిగియు రెం, డడుగులనే మన్ను మిన్ను నలమిన బాలుం**
**డడుగిడఁ దొడఁగెను శాత్రవు, లడుగులు సడుగులును వదలి యడుగవనిఁ బడన్. 295**

**ప్రతి :** అడుగులు= పాదాలు; వేకలిగియున్= వేయికలిగినప్పటికీ; రెండు+అడుగులనే= రెండే రెండు అడుగులతో; మన్నున్= భూలోకాన్ని; మిన్నున్= ఆకాశాన్ని; అలమిన= ఆక్రమించిన; బాలుండు= బాలకృష్ణుడు; శాత్రవులు= శత్రువర్గంవారు; అడుగులు; సడుగులును= కటిప్రదేశంలో కీళ్లు; వదిలి= వీడి; అడుగు+అవనిన్+పడన్= భూమియొక్క అడుగుభాగం అంటే పాతాళంలోకి పడునట్లుగా; అడుగు+ఇడన్= అడుగు వేయగా; తొడఁగెన్= ప్రారంభించాడు.

**తా :** సహస్రాక్షుడైన పరమాత్ముడు సహస్రపాదుడు కూడా. అట్టివేయి అడుగుల శ్రీమహావిష్ణువు వామనావతారంలో ఒక అడుగుతో భూలోకాన్ని, మరో అడుగుతో ఆకాశాన్ని ఆక్రమించాడు. అతడే బాలకృష్ణుడై అడుగులు వేయటం ప్రారంభించడంతో, వామనునిమూడవపాదంతో బలి పాతాళానికేగినట్లు ఇప్పుడు శత్రువులు కూడా నేలకూలి పాతాళానికి వెళ్తున్నారు.

**వ. మఱియును. 296**

**తా :** అంతేకాదు;

'మఱియును' అంటూ ఇక్కడ పోతన బాలకృష్ణుని రూపాన్ని శివకేశవ అభేదరూపంగా అద్భుతంగా వర్ణిస్తున్నాడు.

**సీ. తనువున నంటిన ధరణీపరాగంబు పూసిన నెఱిభూతి పూఁత గాఁగ**
**ముందఱ వెలుఁగొందు ముక్తాలలామంబు తొగలసంగడికాని తునుక గాఁగ**
**ఫాలభాగంబుపైఁ బరఁగు కావిరిబొట్టు కాముని గెల్చినకన్ను గాఁగఁ**
**గంఠమాలికలోని ఘననీలరత్నంబు కమనీయ మగు మెడకప్పు గాఁగ**

**ఆ. హారవల్లు లురగహారవల్లులు గాఁగ బాలలీలఁ బ్రౌఢబాలకుండు**
**శివునిపగిది నొప్పె శివునికిఁ దనకును, వేఱులేమిఁ దెల్ప వెలయునట్లు. 297**

**ప్రతి :** తనువునన్= శరీరంమీద; అంటిన= అంటుకొన్న; ధరణీపరాగంబు= నేలమీది దుమ్ము; పూసిన= ఒంటికి పూసుకున్న; నెఱిభూతి= మంచి విబూది; పూఁతకాన్+కన్= లేపనంకాగా; ముందఱన్= ముఖంముందుభాగంలో; వెలుఁగొందు= ప్రకాశించే; ముక్తాలలామంబు= మంచిముత్యాలహారం, తొగల= కలువలయొక్క; సంగడికాని= స్నేహితుడైన చంద్రునియొక్క; తునుక కాఁగన్= ముక్క అనగా చంద్రరేఖ కాగా; ఫాలభాగంబుపైన్= నుదుటిపై; పరఁగు= ఒప్పు; కావిరిబొట్టు= ఎర్రనిబొట్టు, తిలకం; కామునిన్= మన్మథుణ్ణి; గెల్చిన= జయించిన, అనగా మన్మథుణ్ణి బూడిదచేసిన; కన్నుకాఁగన్= మూడవనేత్రంకాగా; కంఠ మాలికలోని= మెడలో ఉన్న హారంలోని; ఘననీల రత్నంబు= నాయక మణిగా ప్రకాశించే నల్లని పెద్దరత్నం; కమనీయము+అగు= అందమైన, మెడకప్పు కాన్+కన్= కంఠం మధ్య ఏర్పడిన నల్లని 'హాలాహలం' మచ్చవంటిదికాగా; హారవల్లులు= మెడలోని ముత్యాలహారాలు; ఉరగహారవల్లులు కాఁగన్= పరమశివుని మెడలో కదలాడే సర్పహారాలుకాగా; బాలలీలన్= చిన్న బాలునిరూపంలో ఉన్న; ప్రౌఢబాలకుండు= విష్ణుస్వరూపుడైన బాలుడు; శివునికిన్= పరమేశ్వరునికి; తనకున్= విష్ణుస్వరూపుడైన తనకు; వేఱు లేమిన్= భేదము లేకపోవడాన్ని; తెల్పన్= తెలిపే విధంగా; వెలయు+అట్లు= సూచించే రీతిగా; శివునిపగిదిన్= శివస్వరూపంగా; ఒప్పెన్= ప్రకాశించాడు.

**తా :** బాలకృష్ణునిఒంటికి పట్టిన దుమ్ముతోపాటు, పెట్టిన అలంకారాలు అన్నీ అతనిలో శివస్వరూపాన్నికూడా స్ఫురింపజేస్తున్నాయి. శరీరాని కంటిన నేలధూళి శివునిశరీరంపై నిండిన విభూతిలాగా; తల్లి బాలుని ముంగురులెత్తి పట్టి ఓ ముత్యాలహారాన్ని చుట్టగా, అది శివుని బాలచంద్రరేఖరూపం దాల్చగా, నుదుట పెట్టిన ఎర్రనితిలకం మన్మథుణ్ణి బూడిద చేసిన శివుని చిచ్చర కన్నులా ఉండగా; మెడలోనిహారం మధ్యలో నల్లగా ప్రకాశించే నాయకమణిగా వెలుగొందే నీలం శివునికంఠంమీది హాలాహలంమచ్చవలె కనబడగా; మెడలోని హారాలు శివుని సర్పభూషణాలుగా ప్రకాశించగా; బాలునిరూపంలో ఉన్న ఆ విష్ణుస్వరూపుడైన బాలుడు (కృష్ణుడు) తనకూ శివునికీ భేదం లేదని తెలియజేస్తున్నాడా అన్నట్లు శివస్వరూపంతో ప్రకాశించాడు.

**క. ఆ పాపలవిహరణములు, తీపులు పుట్టింప మరఁగి తేఁకువ లే కా**
**గోపాలసతులు మక్కువ, నే పనులును మఱచి యుండి రీక్షణపరలై. 298**

**ప్రతి :** ఆ పాపల= ఆ బలరామ శ్రీకృష్ణుల; విహరణములు= ఆటల చేష్టలు; తీపులు= మాధుర్యాలను, తీపి కోరికలను; పుట్టింపన్= కలిగింపగా; మరఁగి= చూడాలనే ఆసక్తికలిగి; తేఁకువలేక= భయం లేకుండా; ఆ గోపాలసతులు=

ఆ గోపకాంతలు; మక్కువన్= మిక్కిలి ప్రేమతో, కోరికతో; ఈక్షణపరలు+ఐ= కేవలం ఆ బలరామకృష్ణులనే చూడడంలో ఆసక్తి కలవారై; ఏ పనులును= ఇతరమైన ఏ కార్యాలనూ; మఱచి+ఉండిరి= మరచి ఉండిపోయారు.

**తా :** బలరామకృష్ణుల విలాసచేష్టలను చూస్తూవుంటే ఆ గోపకాంతలకు ఎంతమధురంగా అనిపిస్తోందో! అందుకే ఏ రకమైన భయం, సంకోచం లేకుండా చేయవలసిన పనులన్నీ మరచి కేవలం ఆ బాలురనే చూస్తూ ఉండిపోయాడు.

**వ. ఆ సమయంబున బాలకులతల్లులు గోరు గోఱకొమ్ములు గల జంతువులవలన నేమఱక, జలదహన కంటకాదులయెడ మోసపోక, బాలసంరక్షణంబు సేయుచు నుల్లంబుల మొల్లంబులైన ప్రేమంబు లభిరామంబులుగా విహరించుచుండి రంత. 299**

**ప్రతి :** ఆ సమయంబునన్= ఆ బాల బలరామకృష్ణులు వింత చేష్టలతో, క్రీడలతో చూపరులందరికీ ఆనందం కలిగిస్తున్న వేళ; బాలకుల తల్లులు= బలరామకృష్ణుల తల్లులైన రోహిణీ యశోదలు; గోరు= (భయంకరమైన) గోళ్లు, కోఱ=కోరలు; కొమ్ములు గల= వాడియైన కొమ్ములుగల; జంతువులవలనన్= జంతువుల విషయంలో; ఏమఱక= ఏమరపాటు లేకుండా; జల దహన కంటక+ఆదుల ఎడన్= నీళ్ళు, అగ్ని (నిప్పు), ముళ్లు మున్నగువాటి విషయంలో; మోసపోక= ప్రమాదం జరగకుండా జాగ్రత్త వహిస్తూ; బాలసంరక్షణంబు= బాలురను శ్రద్ధగా రక్షణం; చేయుచున్= చేస్తూ; ఉల్లంబులన్= హృదయాలలో; మొల్లంబులు+ఐన= అధికంగా ఉప్పొంగుతున్న; ప్రేమంబులు= అనురాగాలు; అభిరామంబులు+కాన్= మనోజ్ఞంగా, ఆనందంగా; విహరించుచున్+ఉండిరి= పిల్లలతో జీవనం గడపుతున్నారు; అంతన్= ఆ సమయంలో...

**తా :** అప్పుడు బలరామకృష్ణుల తల్లులు చక్కని జాగ్రత్తలతో తమ బాలురను పెంచుతూ వచ్చారు. గోళ్ళు, కోరలు, కొమ్ములు, ఉన్న జంతువులనుండి, నీళ్ళు, నిప్పు, ముళ్ళు మొదలైన వానినుండి ప్రమాదాలు జరగకుండా జాగ్రత్తపడ్డారు. ఆయా ఋతువులకు తగినవిధంగా రక్షించుకుంటూ వస్తున్నారు. హృదయాలలో బాలకులపై ప్రేమానురాగాలు ఉప్పొంగిపోతూ ఉండగా ఆనందంగా కాలం గడపుతున్నారు. అంతలో

**క. తనయీడు గోపబాలురు, దనుఁ గొలువఁగ రాముఁ గూడి తనుపు గలుగుచుం**
**దనుగమనంబులఁ గృష్ణుఁడు, తనుమధ్యలు మెచ్చ నీలతనురుచి మెఱసెన్. 300**

**ప్రతి :** కృష్ణుఁడు= బాలకృష్ణుడు; రామున్+కూడి= బలరామునితో కలిసి; తనఈడు= తన వయస్సే ఉండే; గోపబాలురు= రేపల్లెలోని గోపాలబాలకులందరూ; తనున్+కొలువన్+కన్= తననే కూడుకొని ఉండగా; తనుగమనంబులన్= చిన్న చిన్న నడకలతో; తనుపు+కలుగుచున్= తృప్తి కల్గుచుండగా; తనుమధ్యలు= సన్నని నడుములుగల గోపకాంతలు; మెచ్చన్= ఆనందిస్తూవుండగా; నీలతనురుచిన్= నల్లని శరీర కాంతితో; మెఱసెన్= ప్రకాశించాడు.

**తా :** తన వయస్సే కలిగిన గోపాలబాలకులు కృష్ణుణ్ణి తమనాయకుడన్నట్లుగా భావిస్తూ కలసి మెలసి ఆడుకొంటూ ఉన్నారు. బలరామునితో కలసి చిన్నచిన్న అడుగులతో కృష్ణుడు తృప్తి పొందుతున్నాడు. అలా ఆడుతున్న కృష్ణుణ్ణి చూస్తూ గోపకాంతలు ఆనందిస్తూ ఉండగా అతడు నల్లనిశరీరకాంతితో ప్రకాశించాడు.

**వ. మఱియు నా కుమారుండు దినదినంబునకు సంచారసంభాషణదక్షుండై. 301**

**ప్రతి :** మఱియున్= ఇంకా; ఆ కుమారుండు= ఆ బాలకృష్ణుడు; దినదినంబునకున్, రోజు రోజుకూ; సంచార= తానున్న ప్రాంతంలో తిరగడంలోను; సంభాషణ= నలుగురితో మాట్లాడే విషయంలోను; దక్షుండై= చక్కని సమర్థుడై...

**తా :** ఆ బాలకృష్ణుడు రోజురోజుకు ఆ ప్రాంతంలో తిరగడంలోను, మాట్లాడడంలోను సమర్థుడై

**ఉ. చప్పుడు సేయకుండు మని జంకె యొనర్చిన నల్గి పోవఁగా**
**నప్పుడు బార సాఁచి తన యర్మిలి విందులు వచ్చి రంచు న**
**వ్వొప్పఁగఁ జీరు తల్లిదెస కొత్తిలి కృష్ణుఁడు రంతు సేయుచు**
**నెప్పటి వచ్చి చన్గుడుచు నిం పొలయన్ మొలగంట మ్రోయఁగన్ 302**

**ప్రతి :** చప్పుడు+చేయక+ఉండుము+అని= అల్లరి చేయకుండా ఉండు అంటూ; (తన తల్లి); జంకె= బెదరింపు; ఒనర్చినన్= కావిస్తే; అల్గి= అలిగి, కోపించి; పోవన్+కాన్= దూరంగా వెళ్ళిపోగా; అప్పుడు= అలా అలిగిపోయినప్పుడు; బారసాఁచి= చేతులు చాపి; తన యర్మిలి విందులు వచ్చిరి+అంచున్= నాకు ప్రియమైన విందులు అనగా నా బాబు వచ్చాడు అంటూ; నవ్వు ఒప్పన్+కన్= నవ్వుతూ; చీరు= తనను దగ్గరకు రమ్మని పిలిచే; తల్లి దెసకున్= అమ్మ దగ్గరికి; ఒత్తిలి= హత్తుకొని; ఎప్పటి రంతు సేయుచున్= ఎప్పటిలాగే అల్లరిచేస్తూ; మొలగంట= మొలత్రాడుకున్న గంట; మ్రోయన్+కన్= మోగుతూవుంటే; ఇంపు+ఒలయన్= సంతోషం నిండగా; కృష్ణుఁడు= బాలకృష్ణుడు; చన్గుడుచున్= చనుబాలు తాగుతాడు.

**తా :** అల్లరి చేస్తున్న బాలకృష్ణునితో తల్లి అలా చేయవద్దని బెదిరిస్తే అలకతో దూరంగా పోతాడు. మళ్లీ తల్లి చేయిజాపి నా ముద్దుల బాబు వచ్చాడంటూ ప్రేమతో పిలిస్తే, తల్లి దగ్గరకు వచ్చి, హత్తుకొని, మళ్ళీ ఎప్పటిలాగే అల్లరిచేస్తూ, మొలనున్న గంట చక్కగా శబ్దంచేస్తూ ఉంటే ఆనందంతో వచ్చి చిన్ని కృష్ణుడు చనుబాలు తాగుతాడు.

**క. వల్లవగృహనవనీతము, లెల్లను భక్షించి వచ్చి యెఱుఁగనిభంగిం**
**దల్లిఁ గదిసి చి ట్టాడుచు, నల్లన చనుబువ్వఁ బెట్టు మవ్వా! యనుచున్. 303**

ఇంకా ఆ చిన్ని కృష్ణుడు

**ప్రతి :** వల్లవ= రేపల్లెలోని గోపకాంతల; గృహ= ఇండ్లలో ఉన్న; నవనీతములు= వెన్నలు; ఎల్లను= అంతటినీ; భక్షించి= తిని; వచ్చి= తిరిగి వచ్చి; ఎఱుఁగని భంగిన్= ఏమీ తెలియనట్లుగా; తల్లిన్= యశోదను; కదిసి= చేరి; చిట్టు+ఆడుచున్= అటూ ఇటూ తిరుగుతూ; అల్లనన్= మెల్లగా; అవ్వా!= అమ్మా!; చనుబువ్వ పెట్టుము అనుచున్= పాలివ్వమంటూ; వస్తాడు; లేదా అమ్మా బువ్వ పెట్టమంటూ; అల్లన చనున్= మెల్లగా వస్తాడు అనవచ్చు.

**తా :** చిన్ని కృష్ణుడు గోపవనితల ఇళ్ళలోని వెన్నంతా మెక్కి, ఏమి తెలియనివాడిలా అమ్మదగ్గరికి వచ్చి, అమ్మా! పాలివ్వమంటూ తల్లి చుట్టూ తిరుగుతాడు.

**వ. మఱియు గోపకుమారులం గూడికొని కృష్ణుండు 304**

**తా :** ఇంకా ఆ గొల్లబాలురతో కలిసి చిన్ని కృష్ణుడు...

**సీ. "గోవల్లభుఁడ నేను, గోవులు మీ'రని వడి ఱంకె వైచుచు వంగి యాడు,**
**'రాజ నే, భటులు మీరలు, రండు రం'డని ప్రాభవంబునఁ బెక్కుపనులు వనుచు,**
**'నేఁ దస్కరుండ, మీ రింటివా' రని నిద్ర పుచ్చి సొమ్ములు గొనిపోయి డాఁగు,**
**'నే సూత్రధారి! మీ రందఱు బహురూపు' లని చెలంగుచు నాటలాడఁ బెట్టు,**

**తే. మూల లుఱుకును, డాఁగిలిమూఁతలాడు, నుయ్యేలల నూఁగుఁ జేబంతు లొనర వైచు,**
**జారచోరుల జాడలఁ జాల నిగుడు, శౌరి బాలురతో నాడుసమయమందు. 305**

**ప్రతి :** శౌరి= కృష్ణుడు; బాలురతోన్= గోపబాలురతో; ఆడు= ఆడుకొనే; సమయము+అందున్= సమయంలో; ఏను; గోవల్లభుఁడను= ఆవులకు భర్తయైన ఆబోతును; మీరు= మీ గోపబాలురందరూ; గోవులు= ఆవులు; అని; వడిన్= వేగంగా; అంకె వైచుచున్= రంకె వేస్తూ; వంగి= ఆబోతులా వంగి; ఆడున్= ఆడతాడు; ఏను; రాజను= ప్రభువును, దొరను; మీరలు= మీరందరూ; భటులు= సేవకులు; రండు రండు= ఇలా రండి, రండి అని; ప్రాభవంబునన్= అధికారం చూపుతూ, పెక్కుపనులు= ఎన్నో పనులకు; పనుచున్= పంపుతాడు, ఆజ్ఞాపిస్తాడు; ఏన్= నేను; తస్కరుండన్= దొంగను; మీరు ఇంటివారు+అని= మీరు ఈ ఇంటి యజమానులని; నిద్ర పుచ్చి= వారందరినీ నిద్రపోవునట్లుచేసి; సొమ్ములు= వారి ఆభరణాదివస్తువులను; కొనిపోయి= ఎత్తుకొనిపోయి; డాఁగున్= దాగుంటాడు; ఏన్= నేను; సూత్రధారిన్= అందరినీ ఆడించేవాణ్ణి; మీరు+అందఱు= మీరంతా; బహురూపులు+అని= అనేక రూపాలు ధరించిన బొమ్మలవంటివారని; చెలంగుచున్= చెలరేగుతూ; ఆటలాడన్+పెట్టున్= ఆటలాడేటట్లు చేస్తాడు; మూలలు= మూలమూలకు; ఉఱుకును= పరుగెడతాడు; డాఁగిలి మూఁతలు+ఆడున్= దాగుడు మూతలాట ఆడతాడు; ఉయ్యలలన్= ఉయ్యాలలో; ఊఁగున్= ఊగుతాడు; చేబంతులు= చేతి బంతులాటలు; ఒనరవైచున్= అందంగా వేస్తాడు; జారచోరుల జాడలన్= జారులు, చోరులు అయినవారి విధానాల్తో; చాలన్ నిగుడున్= మిక్కిలిగా వ్యాపిస్తాడు.

**తా :** బాలకృష్ణుడు తన చుట్టూవున్న గోపబాలురతో ఆటలాడుతున్నప్పుడు వారితో 'నేను ఆబోతును మీరు ఆవులు' అంటూ పెద్దగా రంకెవేస్తూ, ఆబోతులా వంగి ఆడతాడు. 'నేను రాజును, మీరు సేవకులు. అందరూ ఇలా రండి రండంటూ తన అధికారాన్ని చూపుతూ పనులు పురమాయిస్తాడు. 'మీరు ఇంటివాళ్ళు, నేను దొంగను' అని వాళ్లందరినీ నిద్రపోయేట్లుగా చేసి వాళ్ళనగలు దొంగిలించి దాక్కుంటాడు. 'నేను మీ అందర్నీ నడిపేవాడను, మీరు నేను చెప్పినట్లుగా నడిచేవార'ంటూ వారందరినీ ఆటాడిస్తాడు. మూలమూలలకు వెళ్తాడు. దాగుడు మూతలాడతాడు. ఉయ్యాల లూగుతాడు, బంతులతో ఆడతాడు, జారులరూపంతో, దొంగల రూపంతో అంతటా తిరుగుతాడు.

**వ. మఱియు నా కుమారశేఖరుండు గపట శైశవంబున దొంగజాడలం గ్రీడింప గోపిక లోపికలు లేక యశోదకడకు వచ్చి యిట్లనిరి. 306**

**ప్రతి :** మఱియున్= ఇంకా; ఆ కుమారశేఖరుండు= బాలురలో శ్రేష్ఠుడైన ఆ బాలకృష్ణుడు; కపట శైశవంబునన్= మాయారూపంతో ఉండే బాల్యంతో; దొంగజాడలన్= దొంగల పద్ధతులలో; క్రీడింపన్= ఆడగా; గోపికలు= అక్కడి గొల్లభామలు, ఇల్లాండ్రు; ఓపికలు లేక= ఓర్పులులేనివారై; యశోద కడకున్= యశోద దగ్గరకు; వచ్చి= చేరి; ఇట్లు+అనిరి= ఈ విధంగా పలికారు.

**తా :** అలా కృష్ణుడు మాయారూపంతో ఉండినబాల్యంలో జారుడులాగా, దొంగలాగా ఆడుతూ ఉంటే గొల్లభామలు అతని ఆగడాలను సహించలేక యశోదతో ఇలా అన్నారు.

## ❖ గోపికలు శ్రీకృష్ణుని దుడుకుఁజేఁతల యశోదాదేవితోఁ జెప్పట ❖

**క. బాలురకుఁ బాలు లే వని, బాలెంతలు మొఱలు వెట్టఁ బకపక నగి యీ**
**బాలుం డాలము సేయుచు, నాలకుఁ గ్రేపులను విడిచె నంభోజాక్షీ! 307**

**ప్రతి :** అంభోజ+అక్షీ= కమలాలవంటి కన్నులుగల ఓ యశోదా!; బాలింతలు= పసిబిడ్డల తల్లులు; బాలురకున్= తమ బిడ్డలకు, పిల్లలకు; పాలు= తాగడానికి పాలు; లేవని= ఉండవని; మొఱలు+పెట్టన్= గట్టిగా అరవగా; పక పక నగి= పక పకా నవ్వి; ఈ బాలుండు= ఈ నీ పిల్లవాడు; ఆలము+చేయుచున్= వారిమాట వినకుండా మీ దగ్గర పాలు లేవా మీ పిల్లలకు? అన్నట్లు పరిహాసం చేస్తూ, ఆలకున్= గోవుల వద్దకు; క్రేపులను= దూడలను; విడిచెన్= విడిచి పెట్టాడు.

**తా :** ఓ యశోదమ్మా! మా ఇళ్ళలోని బాలింతలు తమ బిడ్డలకు పాలు లేవు కాబట్టి కృష్ణునితో దూడలను ఆవుల వద్దకు వదిలిపెట్టొద్దు అని గోల పెట్టినా వినకుండా పకపకా నవ్వి వాళ్ళను పరిహసిస్తూ, ఆవులవద్దకు దూడలను వదిలిపెట్టాడమ్మా!

**క. పడఁతీ! నీ బిడ్డఁడు మా, కడవలలో నున్న మంచి కాఁగిన పా లా**
**పడుచులకుఁ బోసి చిక్కిన, కడవలఁ బో నడిచె నాజ్ఞ గలదో లేదో? 308**

**ప్రతి :** పడఁతీ= యశోదమ్మా!; నీ బిడ్డఁడు= నీ కొడుకైన కృష్ణుడు; మా కడవలలోన్= మా ఇండ్లలోని పాలకుండలలో; ఉన్న= ఉన్నట్టి; మంచి కాఁగిన పాలు= బాగా కాగిన పాలను; ఆ పడుచులకున్= తన చుట్టూ ఉండే పిల్లలందరికీ; పోసి= తాగడానికి పోసి; చిక్కిన= అలా పోయగా మిగిలిన పాలుండే; కడవలన్= కుండలను; పోన్+అడిచెన్= పగిలిపోయేటట్లుగా కొట్టాడు; ఆజ్ఞ= ఇలా చేస్తే ఆ పిల్లవాడిని మందలించడం లేదా దండించడం; కలదో లేదో= ఉందా? లేదా?

**తా :** తల్లీ! యశోదా! ఈ నీ కొడుకు మేము మా ఇండ్లలోని, కుండలలో చక్కగా మరగపెట్టి ఉంచిన పాలను తనతో ఉండే గోపబాలురందరకూ తాగడానికి పోసి, పోయగా మిగిలిన పాలనైనా ఉంచాడా అంటే అలా కాకుండా ఆ కుండలను పగలగొట్టి పోయాడమ్మా!; ఇలా చేస్తే అతణ్ణి దండిస్తావో! లేదో!

**క. మీ పాపఁడు మా గృహముల, నాపోవఁగఁ బాలు ద్రావ నగపడ కున్నం**
**గోపించి పిన్నపడుచుల, వాపోవఁగఁ జిమ్ముకొనుచు వచ్చెం దల్లీ! 309**

**ప్రతి :** తల్లీ!= యశోదమ్మా! మీ పాపఁడు= మీ చిన్నికృష్ణుడు; మా గృహములన్= మా ఇండ్లలో; ఆపోవన్+కన్= తృప్తితీరా; పాలుద్రావన్= పాలుతాగడానికి; అగపడక+ఉన్నన్= కనపడకపోతే, లేకపోతే; కోపించి= కోపం తెచ్చుకొని, పిన్న పడుచులన్= మా ఇంట్లో ఉన్న పసిబిడ్డలను; వాపోవన్+కన్= ఏడ్చేటట్లు; చిమ్ముకొనుచున్= కొట్టుకొంటూ; వచ్చెన్= వచ్చాడు.

**తా :** యశోదమ్మా! మీ చిన్ని కృష్ణుడు మా ఇండ్లలోకి పాలకోసం వచ్చి, తృప్తితీర పాలు తాగడానికి పాలు కనబడకుంటే కోపంతో మా పసిపాపలను ఏడ్చేటట్లు కొట్టుకుంటూ వచ్చేశాడమ్మా!

**మత్త. పుట్టి పుట్టఁడు నేఁడు దొంగిలఁ బోయి మా యిలు సొచ్చి తా**
**నుట్టి యందక ఱోళ్ళుఁ బీఁటలు నొక్క ప్రోవిడి యెక్కి చే**
**వెట్టఁ జాలక కుండక్రిం దొక పెద్దతూఁ టొనరించి మీ**
**పట్టి మీఁగడపాలుఁ జేరలఁ బట్టి త్రావెఁ దలోదరీ! 310**

**ప్రతి :** తల+ఉదరీ= అరచేయంత సన్నని నడుము (కడుపు) గల యశోదమ్మా! మీ పట్టి= మీ బిడ్డడు; పుట్టి పుట్టఁడు= పుట్టాడో పుట్టలేదో అంటే నిన్న మొన్ననే పుట్టాడో లేదో; నేఁడు= ఈ రోజు, ఇప్పుడే; దొంగిలన్ పోయి= దొంగతనం చేయబోతూ; మా ఇలు+చొచ్చి= మా ఇంట్లో ప్రవేశించి; తాన్= ఆ పాపడు; ఉట్టి+అందక= (పాలకుండలు పైకి పెట్టిన) ఉట్టి

చేతికందకపోతే; ఱోళ్ళున్, పీఁటలున్= ఱోళ్ళను, దానిపై పీటలను; ఒక్కప్రోవిడి= ఒక్క దొంతిగా పెట్టి; ఎక్కి= వాటిపై ఎక్కి; చే= చెయ్యి; పెట్టన్+చాలక= పెట్టలేక, అందకపోవడంతో; కుండ క్రిందన్= ఆ పాలకడవల అడుగున; ఒకపెద్ద; తూఁటు= కన్నం; ఒనరించి= చేసి; మీఁగడపాలన్= మీగడతో కూడిన పాలను; చేరలన్+పట్టి= చేరలతో పట్టుకొని; త్రావెన్= తాగాడు.

**తా :** నిన్నగాక మొన్న పుట్టాడో లేదో అపుడే దొంగతనాలు మొదలు పెట్టాడు. అవికూడ మామూలు దొంగతనాలుగా ఉన్నాయా? మా యింట్లో జొరబడి ఉట్టి అందకపోతే రోళ్ళు, పీటలు ఒకదానిమీద ఒకటి ఎక్కించి అందుకోవాలని ప్రయత్నించాడు. చేయి పెట్టడానికి వాడికి సాధ్యం కాలేదు. క్రిందనుంచే కుండకు పెద్ద చిల్లిపెట్టి, మీగడపాలు దోసిళ్ళతో పట్టి తాగాడు. ఇంత సన్ననికడుపు గలదానవు. అంతపెద్ద పొట్టగల బిడ్డను ఎలా కన్నావమ్మా?

**క. ఆడం జని వీరల పెరుఁ, గోడక నీ సుతుఁడు ద్రావి యొకయించుక తాఁ**
**గోడలి మూఁతిం జరిమినఁ, గోడలు ద్రుచ్చనుచు నత్త గొట్టె లతాంగీ! 311**

**ప్రతి :** లతా+అంగీ= తీగెవంటి శరీరం గల ఓ యశోదమ్మా!; నీ సుతుఁడు= నీ కొడుకు; ఆడన్+చని= ఆడడానికై వెళ్ళి; ఓడక= భయపడక; వీరల పెరుఁగున్= ఆ ఇంటివారల పెరుగును; త్రావి= తాగి వేసి; ఒక ఇంచుక= కొంచెం పెరుగును; కోడలి మూఁతిన్= వారి కోడలి మూతికి; చరిమినన్= పూయగా; అత్త= ఆ కోడలి అత్త; కోడలు= తన కోడలు; ద్రుచ్చు= పెరుగును తానే తాగిన దొంగ; అనుచున్= అంటూ; కొట్టెన్= (కోడలిని) కొట్టింది.

**తా :** ఓ యశోదా! నీ కొడుకు ఆడుకోడానికి వెళ్ళి, ఇదిగో ఈ యింటివారి పెరుగంతా తాగి, చివరగా కొంచెం పెరుగును (పడుకునివున్న) ఆ యింటికోడలిమూతికి రాసిపోయాడు. అత్త కోడలిమూతిని చూచి, కోడలే పెరుగు తాగినదొంగ అంటూ ఆమెను కొట్టసాగింది.

**క. వా రిల్లు సొచ్చి కడవలఁ, దోరంబగు నెయ్యి ద్రావి తుది నా కడవల్**
**వీరింట నీ సుతుం డిడ, వారికి వీరికిని దొడ్డవా దయ్యె సతీ! 312**

**ప్రతి :** సతీ= (ఉత్తమ) మంచి ఇల్లాలైన ఓ యశోదా!; నీ సుతుండు= నీ కొడుకైన ఈ చిన్ని కృష్ణుడు; వారి+ఇల్లు= అదిగో వారింట్లో; చొచ్చి= ప్రవేశించి; కడవలన్= కుండలలో; తోరంబు+అగు= నిండుగా ఉండే; నెయ్యిన్= నేతిని; త్రావి= తాగి; తుదిన్= పిదప, నెయ్యి తాగిన తరువాత; ఆ కడవల్= ఆ ఖాళీనేతికుండలను; వీరి+ఇంటన్= ఇదిగో వీళ్లఇంట్లో; ఇడన్= పెట్టగా, ఉంచగా; వారికిన్+వీరికిని= ఆ ఇంటివారికి, ఈ ఇంటివారికి; దొడ్డ= పెద్ద; వాదు+అయ్యెన్= తగాదా అయింది.

**తా :** నందుని ఇల్లాలైన ఓ యశోదా! నీ కొడుకు అదిగో వారింట్లో కుండల్లో నిండుగా ఉండే నేతిని తాగి, ఆ ఖాళీ నేతి కుండల్ని ఇదిగో వీరింట్లో ఉంచగా, వారే నేతిని దొంగిలించారని వీరికీ వారికీ పెద్ద తగాదా అయిందమ్మా!

**క. వేలుపులటె! నా కంటెను, వేలుపు మఱి యెవ్వఁ డనుచు వికవిక నగి మా**
**వేలుపులగోడపై నో, హేలావతి! నీ తనూజుఁ డెంగిలిఁ జేసెన్. 313**

**ప్రతి :** హేలావతి= విలాసవతివైన ఓ యశోదా!; నీ తనూజుఁడు= నీ బిడ్డడు; వేలుపులు+అటె= వీళ్లు దేవతలా; నా కంటెను= నా కన్న; వేలుపు= దేవుడు; మఱి ఎవ్వఁడు= ఇంకెవడు; అనుచున్= అంటూ; వికవిక నగి= హేళనగా నవ్వి; మా వేలుపుల= మా ఇంటి దేవతల బొమ్మలున్న; గోడపై= గోడమీద; ఎంగిలిన్ చేసెన్= ఎంగిలి ఉమ్మేశాడు.

**తా :** ఓ యశోదమ్మా! మా ఇంటిగోడలపై మేము చిత్రించుకున్న దేవతల బొమ్మలు చూచి, వీళ్ళు దేవతలా? నా కన్నా వేరే దేవుడున్నాడా? అంటూ నవ్వుతూ, వేలుపుల చిత్రాలున్న మా గోడలపై ఎంగిలి ఉమ్మేశాడమ్మా!

**క. వెన్నఁ దినఁగఁ బొడగని మా, పిన్నది యడ్డంబు వచ్చి పిఱిఁదికిఁ దివియం**
**జ న్నొడిసి పట్టి చీరెను, జిన్నికుమారుండె యితఁడు? శీతాంశుముఖీ! 314**

**ప్రతి :** శీత+అంశుముఖీ= చల్లని కిరణాలు గల చంద్రునివంటి ముఖంకలదానా! ఓ యశోదా!; ఇతఁడు= నీ కృష్ణుడు, వెన్నన్+తినన్+కన్= మా యింట్లో వెన్నను దొంగిలించి తింటూవుంటే; పొడగని= చూచి; మా పిన్నది= మా చిన్నది, అమ్మాయి; అడ్డంబు వచ్చి= నీ కొడుకు బయటికి పారిపోకుండా అడ్డంగా నిల్చుని; పిఱిఁదికిన్= వెనుకకు; తివియన్= లాగగా; చన్నున్= ఆ చిన్నదాని స్తనాన్ని; ఒడిసి పట్టి= గట్టిగా చేత్తో పట్టుకుని; చీరెన్= గోళ్ళతో గీరాడు; (ఇలాంటి పనులు చేసే నీ బిడ్డడు); చిన్ని కుమారుండు+ఎ= చిన్న పిల్లవాడా?

**తా :** చంద్రముఖీ! యశోదా! నీ కొడుకు మా యింట్లోకి వచ్చి వెన్న తింటూ వుంటే చూచి మా(కోడలుపిల్ల) చిన్నది ఇతడు పారిపోకుండా అడ్డంగా నిల్చుని, వాడిచేయిపట్టుకొని వెనక్కులాగగా, ఆ చిన్నదాని స్తనం పట్టుకొని గోటితో గీరాడమ్మా! ఇవి చిన్న పిల్లవాడు చేసే పనులా?

**క. ఇమ్మగువ దన్ను వాకిటఁ, గ్రుమ్మరుచోఁ జీరి నిలిపికొని పే రడుగం**
**గెమ్మోవిఁ గఱచి వడిఁ జనె, నమ్మా! యీ ముద్దుఁగుఱ్ఱఁ డల్పుఁడె? చెపుమా. 315**

**ప్రతి :** అమ్మా= ఓ యశోదమ్మా!; ఈ మగువ= ఈ ఇల్లాలు; తన్నున్= తనను, నీ బిడ్డను; వాకిటన్= వారి యింటి వాకిలిముందు; క్రుమ్మరుచోన్= తిరుగుతూవుండగా; చీరి= కృష్ణణ్ణి పిలిచి; నిలిపికొని= ఆగేటట్లుచేసి; పేరు+అడుగన్= బాబూ! నీ పేరేమిటని అడగ్గా; కెంపు+మోవిన్= కెంపువంటి ఎర్రనైన ఆమె పెదవిని; కఱచి= కొరికి, పంటితో గాటుచేసి; వడిన్+చనెన్= వేగంగా వెళ్ళిపోయాడు; ఈ ముద్దు+కుఱ్ఱఁడు= ఈ నీ ముద్దుబిడ్డడు; అల్పుఁడు+ఎ= చిన్నవాడా; చెపుమా= చెప్పు తల్లీ!

**తా :** అమ్మా! నీ బిడ్డడు ఒకరింటిముందు తిరుగాడుతుంటే చూచి, ఆ ఇంటి యిల్లాలు పిలిచి బాబూ! నీ పేరేమిటి? అని అడిగింది. వెంటనే నీ కొడుకు ఎర్రనైన ఆమెపెదవిని కొరికి కాటు చేసి, వేగంగా పారిపోయాడు. ఇది చిన్న పిల్లవాడు చేసే పనంటావా? నీ బిడ్డడు చిన్నవాడంటావా? చెప్పవమ్మా.

**క. చేబంతి దప్పి పడె నని, ప్రాబల్యముతోడ వచ్చి భవనమువెనుకన్**
**మాబిడ్డ జలక మాడఁగ, నీ బిడ్డఁడు వలువ దెచ్చె నెలఁతుక తగునే? 316**

**ప్రతి :** నెలఁతుక= ఓ వనితా! యశోదమ్మా! నీ బిడ్డఁడు= నీ కొడుకు; చేబంతి= తన చేతిలోని బంతి (చెండు); తప్పి= తన చేతులనుండి జారి; పడెన్+అని= మా యింట్లో పడిందని; ప్రాబల్యముతోడన్ వచ్చి= జంకూ, కొంకూ లేకుండా వచ్చి; భవనము వెనుకన్= మా ఇంటి వెనుకవైపు; మా బిడ్డ= మా ఆడుబిడ్డ; జలకము+ఆడన్+కన్= స్నానం చేస్తూ ఉండగా; వలువన్ తెచ్చెన్= స్నానం చేస్తున్నప్పుడు పక్కగా పెట్టిన వస్త్రాన్ని తెచ్చేశాడు; తగునే= ఇట్టిచేష్టలు ఉచితమా?

**తా :** ఓ యశోదా! నీ కొడుకు తనచేతిలో వున్న బంతి ఎగిరి మా ఇంట్లో పడిందంటూ మా ఇంట్లోకి వచ్చాడు. మా పెరట్లో స్నానం చేస్తున్న మా ఆడుబిడ్డ పక్కన పెట్టిన వస్త్రాన్ని పట్టుకొనిపోయాడు. ఇలాంటి పనులు ఏమైనా బాగున్నాయా?

**క. ఇచ్చెలువఁ జూచి 'ముచ్చిలి, యచ్చుగ నుఱికించుకొనుచు నరిగెద, నాతో**
**వచ్చెదవా? యని' యన్నాఁ, డిచ్చిఱుతఁడు, సుదతి! చిత్ర మిట్టిది గలదే? 317**

**ప్రతి :** సుదతి!= అందమైన పలువరుసగల ఓ యశోదా! ఈ+చిఱుతఁడు= ఈ నీ చిన్న బిడ్డడు; ఈ+చెలువన్ చూచి= ఇదిగో ఈ యువతిని చూచి, ఈమెతో; ముచ్చిలి= దొంగిలించి; అచ్చుగన్= బాగా; ఉఱికించుకొనుచున్= పరిగెత్తుకుంటూ; అరిగెదన్= పోతాను; నాతో= అలానే తీసుకుపోయే నాతో; వచ్చెదవా= వస్తావా; అని; అన్నాఁడు= పలికాడు; చిత్రము+ఇట్టిది= ఇటువంటి వింత; కలదే= ఎక్కడైనా వుందా?

**తా :** ఓ యశోదా! ఈ చిన్నిబిడ్డడు ఇదిగో ఈ స్త్రీని చూచి – నిన్ను దొంగిలించి బాగా తీసుకొని పారిపోతాను నాతో వస్తావా? అని అడిగాడట. ఎక్కడైనా ఇటువంటి వింత ఉందా?

**క. కొడుకులు లే రని యొక సతి, గడు వగవఁగఁ దన్ను మగనిఁగాఁ గైకొనినం**
**గొడుకులు గలిగెద రని పైఁ, బడినాఁ డిది వినుము శిశువుపనులే తల్లీ! 318**

**ప్రతి :** తల్లీ= ఓ యశోదమ్మ తల్లీ!; ఇది= ఈ వింతను; వినుము= వినవమ్మా; ఒక సతి= ఒక ఇల్లాలు; కొడుకులు లేరు+అని= తనకు కొడుకులు కలగలేదని; కడున్= మిక్కిలిగా; వగవన్+కన్= బాధపడుతూ వుంటే; తన్నున్= తనను; మగనిన్+కాన్= భర్తగా; కైకొనినన్= తీసుకుంటే, చేసుకుంటే; కొడుకులు= పుత్రులు; కలిగెదరు+అని= పుడతారని; పైన్+పడినాఁడు= ఆమెమీద పడినాడు; శిశువు పనులే= ఇట్టివి పసిపిల్లలు చేసేచేష్టలా?

**తా :** ఓ యశోదమ్మా! ఈ వింత విను. ఓ ఇల్లాలు తనకు పిల్లలు లేరని బాధపడుతూవుంటే నీ కొడుకు ఆమెతో తనను మగనిగా చేసుకొంటే పిల్లలు పుడతారంటూ ఆమె మీద పడ్డాడు. ఇటువంటివి నీ కొడుకు కృష్ణునివంటి పసిపిల్లవాడు చేసే పనులా? చూడు.

**క. తలఁగినదానం దల మనఁ, దలఁగక యా చెలికి నాన తల యెత్తఁగ నీ**
**తలఁగినచో టెయ్యది? యని, తలయూఁచెన్ నీ సుతుండు దగవె మృగాక్షీ! 319**

**ప్రతి :** మృగ+అక్షీ= లేడి కన్నులవంటి కండ్లుగల ఓ యశోదా! (ఓ యువతి నీ కొడుకుతో); తలఁగిన దానను= ఇంట్లోకి రాకూడనిదాన్ని, బహిష్ఠను; తలము+అనన్= (నన్ను తాకక) దూరంగా పొమ్మనగా; తలఁగక= తొలగిపోకుండ; ఆ చెలికిన్= ఆ యువతికి; నాన= సిగ్గు; తల+ఎత్తన్+కన్= కలిగేటట్లు; నీ తలఁగినచోటు= నీ వన్న ఆ తలగిన స్థలం; ఏ+అయ్యది+అని= ఏదంటూ; తల+ఊఁచెన్= తల ఊపాడు; తగవె= ఇది న్యాయమా?

**తా :** ఓ హరిణాక్షీ! యశోదా! నీ కొడుకుతో ఓ యువతి "నేను బహిష్ఠను నన్ను తాకకూడదు – దూరంగా పో బాబూ" అంటే ఆమె సిగ్గుతో చితికిపోయేలా, నీవు బహిష్ఠ అయిన చోటేది? అంటూ కొంటెగా తల ఊపాడు. ఇదేమైనా న్యాయంగా ఉందా తల్లీ?

**విశే :** భగవంతుని విషయంలో స్పృశ్య, అస్పృశ్యతలకు తావులేదు. అతనికీ అన్నీ పవిత్రమైనవే!

**క. వ్రాలఁగ వచ్చిన నీ సతి, చూలాలం దలఁగు మనుడుఁ జూ లగుటకు నే**
**మూలంబు సెప్పు మనె నీ, బాలుఁడు, సెప్పుదురె సతులు పర్వేందుముఖీ! 320**

**ప్రతి :** పర్వ+ఇందుముఖీ= పున్నమనాటి చంద్రబింబంవంటి ముఖంగల యశోదా! నీ బాలుఁడు, వ్రాలన్+కన్+వచ్చినన్= తనపై పడడానికి రాగా, తన ఒళ్ళో కూర్చోడానికి రాగా; ఈ సతి= ఈ ఇల్లాలు; చూలాలను= గర్భవతిని; తలఁగుము+ అనుడున్= తొలగిపో – నా ఒళ్ళోకి రాకు అనగానే; చూలు+అగుటకున్= గర్భం కలగడానికి; ఏ మూలంబు= ఏది కారణం; చెప్పుము+అనెన్= చెప్పమన్నాడు; సతులు= కులస్త్రీలు; చెప్పుదురు+ఎ= ఆ విషయం చెప్పగలరా?

**తా :** పూర్ణబింబంవంటి ముఖంగల ఓ యశోదా! నీ కొడుకు ఒక ఇల్లాలి వడిలో పడడానికి రాగా, ఆమె "నేను గర్భవతిని. దూరంగా పో బాబూ" అంది. అప్పుడు నీ బిడ్డడు గర్భం రావడానికి కారణం ఏమిటో చెప్పమన్నాడు. ఏ ఇల్లాలైనా చెప్పగలదా! తల్లీ?

**క. మగువా! నీ కొమరుఁడు మా, మగవా రటు వోవఁ జూచి మంతనమునకుం**
**దగఁ జీరి పొందు నడిగెను, జగముల ము న్నిట్టి శిశువు సదువంబడెనే? 321**

**ప్రతి :** మగువా= ఓ యశోదా! మా మగవారు= మా భర్తలు; అటు పోవన్+చూచి= ఆవైపు దూరంగా వెళ్లిపోగా; నీ కొమరుఁడు= నీ కొడుకు; మంతనమునకున్= రహస్యంగా మాట్లాడడానికి; తగన్= అనువుగా, తగినట్లుగా; చీరి= మమ్మల్ని పిలిచి; పొందున్ అడిగెన్= తనతో మేము కూడుటకు కోరాడు; మున్ను= పూర్వం ఎప్పుడైనా; జగములన్= లోకంలో; ఇట్టి శిశువు= ఇలాంటి చేష్టలు చేసే బిడ్డడు ఉన్నట్లు; చదువన్+పడెనే= చదువబడిందా (తెలిసిందా?)

**తా :** యశోదమ్మా! మా భర్తలు కొంచెం దూరంగా వెళ్ళడం చూచి, నీ కొడుకు మాతో రహస్యంగా మాట్లాడేలా పిలిచి, మా పొందును కోరాడు. ఏ లోకంలోనైనా పూర్వం ఇట్టి బిడ్డడున్నట్లు తెలిసిందా?

**ఆ. నమ్మి నిదురవోవ నా పట్టిచుంచు మా, లేఁగతోఁకతోడ లీలఁ గట్టి**
**వీథులందుఁ దోలె వెలఁది నీ కొమరుండు, రాచబిడ్డఁడైన నవ్వ మేలె? 322**

**ప్రతి :** వెలఁది= ఓ యశోదా!; నా పట్టి= నా బిడ్డడు; నమ్మి= కృష్ణుడు మనవాడేననే నమ్మకంతో; నిదుర పోవన్= నిద్రింపగా; చుంచు= ఆ బిడ్డయొక్క జుట్టును; మా లేఁగ తోఁకతోడన్= మా దూడతోకతో; లీలన్= వినోదంగా; కట్టి= ముడివేసి; వీథుల+అందున్= వీథులలో; నీ కొమరుండు= నీ కొడుకు; తోలెన్= ఆ దూడను తోలాడు; రాచబిడ్డడు+ఐనన్= రాచపిల్లవాడైనంత మాత్రాన; అవ్వ= ఇలాంటి కొంటెపని; మేలు+ఎ= మంచిదా? (మంచిదికాదు)

**తా :** ఓ యశోదమ్మా! కృష్ణునితో ఆడుతూ పాడుతూ, మన కృష్ణుడే కదా అని నమ్మకంతో నా బిడ్డ నిద్రపోతే అతడి జుట్టును దూడతోకతో ముడివేసి, వీథులలో దూడను తోలాడమ్మా! నా బిడ్డది ఎంత బాధ! మా రేపల్లెకు రాజైన నందుని కుమారుడైనంత మాత్రాన ఇలాంటి చేష్టలు తగునా?

**క. నాపట్టిపొట్ట నిండఁగఁ, బై పడి నీ పట్టి వెన్న బానెం డిడినాఁ,**
**దూపిరి వెడలదు, వానిం, జూపెద నేమైన నీవ చుమ్ము లతాంగీ! 323**

**ప్రతి :** లతా+అంగీ= తీగవంటి అందమైన శరీరంగల ఓ యశోదా! నీ పట్టి= నీ కొడుకు; నా పట్టి పొట్ట= నా బిడ్డడి కడుపు; నిండన్+కన్= నిండిపోయి; పై పడన్= బయటికి వచ్చేటట్లు; బానెండు వెన్న= బానెడు వెన్నను; ఇడినాఁడు= పెట్టాడు; ఊపిరి వెడలదు= ఊపిరందడం లేదు; వానిన్= ఆ నా బిడ్డను; చూపెదన్= నీకు చూపిస్తాను; ఏమి+ఐనన్= అలాంటి పరిస్థితిలో నా బిడ్డకేమైనా జరిగితే; నీవు+అ= నీవే; చుమ్ము= కారణం అవుతావు సుమీ!

**తా :** తీగెవలె చక్కనిశరీరంతో ఒప్పే ఓ యశోదా! నీ కొడుకు నా కొడుక్కు పొట్టనిండిపోగా పైకి వచ్చేటంతగా బానెడు వెన్నముద్దలు పట్టించాడు. నా బిడ్డకు ఊపిరాడడం లేదు. ఏమైనా జరిగితే దానికి నీవే బాధ్యత వహించాలిసుమా!

**క. తెఱవ యొకతె నిద్రింపఁగ, నెఱిఁ గట్టిన వలువ వీడ్చి నే టగు తేలుం**
**గఱపించి నీ కుమారుఁడు, వెఱచుచు నది పఱవ నగియె విహితమె సాధ్వీ? 324**

**ప్రతి :** సాధ్వీ= ఉత్తమ స్త్రీవైన ఓ యశోదా! నీ కుమారుఁడు= నీ కొడుకు; తెఱవ ఒకతె= ఒక స్త్రీ; నిద్రింపన్+కన్= నిద్రిస్తూవుంటే; నెఱిన్= అందంగా; కట్టిన వలువన్= ఆమె కట్టుకున్న వస్త్రాన్ని; వీడ్చి= విప్పి; నేటు+అగు= పెద్దదైన; తేలున్= ఒక తేలును; కఱిపించి= ఆమెను కుట్టేటట్లుచేసి; వెఱచుచున్= ఆమె భయపడుతూ; పఱవన్= వివస్త్రగా పరిగెడుతూవుంటే; నగియెన్= ఆమెను చూచి నవ్వసాగాడు; విహితము+ఎ= ఇదేమైనా మంచిపనా?

**తా :** యశోదా! ఒక స్త్రీ నిద్రపోతూవుంటే ఆమె వస్త్రాన్ని విప్పి, ఒక పెద్ద తేలుతో కరిపించాడు. ఆమె బాధతో వివస్త్రగా పరిగెడుతూవుంటే, నీ కొడుకు పక పక నవ్వాడు. ఇదేమైనా బాగుందా? (బాగులేదు)

**క. నా కొడుకును నా కోడలు, నేకతమునఁ బెనఁగఁ బాము నీతఁడు వైవం**
**గోక లెఱుంగక పాఱినఁ, గూఁక లిడెన్ నీ సుతుండు గుణమె గుణాఢ్యా! 325**

**ప్రతి :** గుణ+ఆఢ్యా!= మంచి గుణములచే ప్రసిద్ధురాలవైన ఓ యశోదా! నా కొడుకును= నా కుమారుడూ; నా కోడలు= అతని భార్యయైన నా కోడలూ; ఏకతమునన్= ఏకాంతంలో; పెనఁగన్= సుఖిస్తూ వుండగా; ఈతఁడు= ఈ నీ కొడుకు; పామున్+వైవన్= వారిద్దరిమధ్యలో ఒక పామును వేయగా; కోకలు+ఎఱుంగక= వంటిమీద బట్టలు లేవనేదికూడా తెలీకుండా; పాఱినన్= పరుగెత్తగా; నీ సుతుండు= నీ బిడ్డడు; కూఁకలు+ఇడెన్= కూతలు వేశాడు-అరిచాడు; గుణము+ఎ= ఇది మంచిలక్షణమా?

**తా :** గుణవతిగా పేరు గాంచిన ఓ యశోదా! నా కొడుకూ, కోడలూ ఇంట్లో ఏకాంతంగా సుఖిస్తూవుంటే నీ కొడుకు వారిద్దరి మధ్యలో ఒక పామును తెచ్చి పడవేశాడు. దాంతో భయపడి వారిద్దరూ ఒంటిమీద బట్టలు లేవనే సంగతి కూడా మరచి పరిగెడుతూ ఉంటే – నీ బిడ్డడు నవ్వుతూ కేకలు వేశాడు. ఇదేమైనా మంచిపనా తల్లీ?

**ఆ. తరుణి యొకతె పెరుఁగుఁద్రచ్చుచోఁదుది వంగి, వెన్నదీయ నొదిఁగి వెనుకఁ గదిసి**
**మగువ! నీ సుతుండు మగపోఁడుములు సేయ, సాగినాఁడు తగదె? చక్కఁజేయ. 326**

**ప్రతి :** మగువ= ఓ యశోదా!; తరుణి ఒకతె= యౌవనంలో ఉన్న ఒక గోపిక; పెరుఁగున్= పెరుగును; త్రచ్చుచోన్= చిలుకునపుడు; తుదిన్= చిలికిన పిమ్మట; వంగి= ముందుకు వాలి; వెన్న దీయన్= వెన్న తీస్తూవుండగా; నీ సుతుండు= నీ కొడుకు; ఒదిఁగి= పక్కన పొంచివుండి; వెనుకన్= ఆమె వెనుకను; కదిసి= చేరి; మగపోఁడుములు= మగవాడుచేసే పనులు (శృంగారచేష్టలు); చేయసాగినాఁడు= చేయడం ప్రారంభించాడు; చక్కన్+చేయన్= నీ బిడ్డను చక్కదిద్దుటకు; తగదు+ఎ= నీకు ఉచితం గదా!

**తా :** ఓ యశోదా! ఒక గోపకాంత కుండలో పెరుగు చిలికి, ముందుకు వంగి వెన్న తీస్తూవుంటే, పక్కన పొంచి ఉన్న నీ కొడుకు ఆమె వెనుక చేరి శృంగారపరమైన మగవారు చేసే చేష్టలు చేయసాగాడు. ఇట్టి నీ కొడుకును చక్కదిద్దుకోవడం నీకు ఉచితం గదా!

**సీ. కలకంఠి! మావాడ గరితల మెల్ల నీపట్టి రాఁగలఁ డని పాలు పెరుఁగు**
**లిండ్ల లోపల నిడి యే మెల్లఁ దన(త్రోవఁ జూచుచో నెప్పుడు సొచ్చినాఁడొ?**
**తలుపులముద్రలుఁ దాళంబులును బెట్టి యున్నచందంబున నున్న వరయ**
**నొకయింటిలో నాడు నొకయింటిలోఁ బాడు నొకయింటిలో నవ్వు, నొకటఁ దిట్టు,**

**ఆ. నొకట వెక్కిరించు నొక్కొకచో మృగ, పక్షిఘోషణములు పరఁగఁ జేయు**
**నిట్లు సేసి వెనుక నెక్కడఁ బోవునో?, కాన రాఁడు రిత్తకడవ లుండు. 327**

**ప్రతి :** కలకంఠి= అవ్యక్త మధురమైన కంఠస్వరం గల ఓ యశోదమ్మా!; మా వాడ గరితలము= మా వీధిపేటలో వున్న ఆడవాళ్లం; ఎల్లన్= అందరం; నీ పట్టి= నీ కొడుకు; రాన్+కలడు+అని= వస్తాడని; పాలు పెరుఁగులు= మా వద్దనున్న పాలను, పెరుగును, ఇండ్ల లోపలన్ ఇడి= మా ఇండ్లలోవుంచి; ఏము+ఎల్లన్= మేమంతా; తన త్రోవన్ చూచుచోన్= తాను వచ్చే మార్గం వైపే చూస్తూవుంటే; ఎప్పుడు+చొచ్చినాఁడు+ఒ= ఏ వేళ ఇండ్లలో ప్రవేశించాడో; అరయన్= చూస్తే; తలుపుల ముద్రలున్, తాళంబులును= మేము తలుపులకు వేసినతాళాలు; వాటిపై (ముద్రలు) గుర్తులు; పెట్టి+ఉన్న= వేసిన; చందంబునన్+ఉన్నవి= విధంగానే వున్నాయి; ఒక ఇంటిలోన్= ఒకరి ఇంటిలో; ఆడున్= ఆట్లాడతాడు; ఒక ఇంటిలోన్= మరొక ఇంట్లో పాడున్= పాటలు పాడతాడు; ఒక ఇంటిలోన్= ఇంకోఇంట్లో; నవ్వున్= నవ్వుతాడు; ఒకటన్= మరొక ఇంట్లో; తిట్టున్= తిడతాడు; ఒకటన్= మరోచోట; వెక్కిరించున్= వెక్కిరింతలు చేస్తాడు; ఒక్క+ఒకచో= మరొకచోట, మృగ, పక్షిఘోషణములు= జంతువుల, పక్షులయొక్క అరుపులను, ధ్వనులను; పరఁగన్+చేయున్= ఎక్కువగా చేస్తాడు; ఇట్లు+చేసి= ఇలా రకరకాల చేష్టలు చేసిన; వెనుకన్= పిదప; ఎక్కడన్ పోవునో= ఎక్కడినుండి ఎలా పోతాడో; కానరాఁడు= కనపడడు; రిత్తకడవలు= వెన్న, పెరుగులేని ఖాళీకుండలుమాత్రం; ఉండున్= అక్కడ వుంటాయి.

**తా :** ఓ యశోదమ్మా! మా వాడలో వున్న గోపకాంతల మందరం కూడుకొని, నీ బిడ్డ వస్తాడేమో నని పాలు, పెరుగు అంతటినీ మా ఇండ్లలోపల పెట్టి, ఆ గదులకు తాళాలు వేసి, వాటిపైన గుర్తులు పెట్టి, తాను వచ్చే దారివైపే చూస్తూ ఉన్నాం. ఎలా వచ్చాడో తెలియదుగాని, మేము వేసిన తాళాలు, ముద్రలు వేసినవి వేసినట్లే వున్నాయి. కానీ నీ బిడ్డడు ఒక ఇంటిలో ఆడుతూ, మరో ఇంటిలో పాడుతూ, ఇంకోచోట నవ్వుతూ, మరోచోట తిడుతూ, ఇంకోచోట వెక్కిరిస్తూ, ఇంకో ఇంటిలో జంతువుల్లా, పక్షుల్లా ధ్వనులు చేస్తూ, ఇలా చేసి చేసి ఎలా వెళ్ళిపోతాడో తెలియదు, కనబడడు. తీరా మేము లోపలికి వెళ్ళిచూస్తే మా ఇండ్లలో పాలు, పెరుగులేని ఖాళీ కుండలే ఉంటాయి.

**క. కడు లచ్చి గలిగె నేనిం, గుడుతురు గట్టుదురు గాక కొడుకుల నగుచున్**
**బడుగుల వాడలపైఁబడ, విడుతురె రాకాంత లెందు? విమలేందుముఖీ! 328**

**ప్రతి :** విమల+ఇందుముఖీ= మచ్చలేని చంద్రబింబంవంటి మోముగల ఓ యశోదా!; కడున్ లచ్చి= అధికమైన సంపద; కలిగెన్+ఏని= కలిగినట్లైతే; కుడుతురు= చక్కగా తింటారు; కట్టుదురు= మంచి వస్త్రాలను కట్టుకుంటారు; కాక= అంతే కాని; ఎందున్= ఎక్కడైనా; రాకాంతలు= రాచ ఇల్లాండ్రు; నగుచున్= నవ్వుకుంటూ (పరిహసిస్తూ); కొడుకులన్= తమ బిడ్డలను; బడుగులవాడలపైన్= పేదవాళ్ళఇండ్లమీద, పడ విడుతురె= పోయి పడేటట్లుగా విడిచిపెడతారా!

**తా :** ఓ చంద్ర బింబంవంటి మోముతో ఒప్పే యశోదా! నీ వంటి రాచకాంతలకు మిక్కిలి సంపదవుంటే, మంచి మంచి పదార్థాలను తినవచ్చు, ఖరీదైన వస్త్రాలను కట్టుకోవచ్చు. కానీ పరిహాసంగా ఎక్కడైనా తమ బిడ్డలను పేదవారిఇండ్లపై పడి, బాధించండని విడిచిపెడతారా!

**క. ఓ యమ్మ! నీ కుమారుఁడు, మా యిండ్లను బాలుఁ బెరుఁగు మననీఁ దమ్మా!**
**పోయెద మెక్కడి కైనను, మా యన్నల సురభులాన మంజులవాణీ! 329**

**ప్రతి :** మంజులవాణీ= మృదువుగా మాట్లాడగల ఓ యశోదా!; నీ కుమారుఁడు= నీ కొడుకైన కృష్ణుడు; మా ఇండ్లను= మా గృహాలలోవున్న; పాలున్ పెరుఁగున్= పాలను, పెరుగును; మననీఁడు+అమ్మా= ఉండనియ్యడమ్మా; మా అన్నల సురభుల+ఆన= పెద్దలైన మా అన్నలయొక్క గోవులపై ఒట్టు; ఎక్కడికిన్+ఐనన్= వేరే ఏ చోటికైనా; పోయెదము= మేము వెళ్ళి పోతామమ్మా!

**తా :** ఓ యశోదతల్లీ! నీ బిడ్డడు మా ఇండ్లలో పాలు పెరుగు ఉండనివ్వడం లేదు. మా అన్నలయొక్క, గోవులమీద సాక్షిగా ఒట్టుపెట్టి చెపుతున్నామమ్మా! మేము వేరే ఎక్కడికైనా పోతాము.

**వ. అని మఱియు ననేకవిధంబుల బాలకృష్ణుండు సేయు వినోదంబులు దమయందుఁ జేయు మహాప్రసాదంబులని యెఱుంగక దూఱుచున్న గోపికలకు యశోద యిట్లనియె. 330**

**ప్రతి :** అని= పై ప్రకారం చెప్పి; మఱియును= ఇంకా; అనేకవిధంబులన్= ఎన్నో రకాలుగా; బాలకృష్ణుండు+చేయు= బాలుడైన శ్రీకృష్ణుడు చేసే; వినోదంబులు= వేడుకచేష్టలు; తమ+అందున్= తమవిషయంలో; చేయు= చేసే; మహాప్రసాదంబులు అని= గొప్ప అనుగ్రహం కలిగించే పనులని; ఎఱుంగక= తెలుసుకోలేక; దూఱుచున్న= నిందిస్తున్న; గోపికలకున్= ఆ గోపకాంతలతో; యశోద; ఇట్లు+అనియెన్= ఇలా పలికింది.

**తా :** ఈ విధంగా చిన్ని కృష్ణుని కొంటె చేష్టలన్నింటినీ రకరకాలుగా వివరిస్తున్నారు - గోపకాంతలు. అవన్నీ తమపై చూపే మహాప్రసాదాలని తెలుసుకోలేక నిందాపూర్వకంగా చెపుతున్నవారితో యశోద ఇలా అనింది.

**క. చన్ను విడిచి చనఁ డిట్టటు, నెన్నఁడుఁ బొరుగిండ్లత్రోవ లెఱుఁగడు నేఁడుం**
**గన్నులు దెఱవని మా యీ, చిన్న కుమారకుని అవ్వసేయం దగునే? 331**

**ప్రతి :** చన్నున్= నా చనుబాలు తాగడం; విడిచి= విడిచిపెట్టి, వదలి; ఇట్టు+అటు= ఈ పక్కకు ఈ పక్కకు; ఎన్నఁడున్= ఎప్పుడూకూడా; చనఁడు= వెళ్ళడు; పొరుగు+ఇండ్ల త్రోవలు= పక్కవున్న ఇండ్ల దారులు; ఎఱుఁగడు= తెలిసినవాడు కాదు; నేఁడున్= ఇప్పటికీ, ఈ రోజుకుకూడా; కన్నులు= కండ్లు; తెఱవని= పూర్తిగా తెరచుకోని; మా యీ చిన్ని కుమారకునిన్= ఈ మా చిన్న కృష్ణుణ్ణి; అవ్వచేయన్+తగునే= నిందించడం న్యాయమా!

**తా :** ఓ గోపకాంతలారా! నా ఈ చిన్ని కృష్ణుడు నా ఒళ్లో ఉండి పాలుతాగడం మాని ఎక్కడికీ వెళ్ళడంలేదు. అసలు మా ఇల్లు తప్ప - ఇరుగు పొరుగు ఇండ్లకు దారే తెలియదు - వాడికి. అంతేకాదు, ఇప్పటికీ ఇంకా కండ్లు పూర్తిగా విప్పని ఇంత చిన్నబాలుణ్ణి పట్టుకుని వీనిపై నిందలు మోపడం మీకు తగునా? (తగదని భావం.)

**తే. అన్య మెఱుఁగఁడు, తనయంత నాడుచుండు, మంచివాఁ డీతఁ, డెగ్గులు మానరమ్మ!**
**రామలార! త్రిలోకాభిరామలార, తల్లులార, గుణవతీమతల్లులార! 332**

**ప్రతి :** రామలార!= అందమైన గోపస్త్రీలారా! త్రిలోక+అభిరామలార= ముల్లోకాలలో కూడా మనోహర స్వరూపులైన ఓ అమ్మలారా!; గుణవతీమతల్లులార= మంచి గుణాలుగల స్త్రీలలో శ్రేష్ఠురాండ్రైన అమ్మలారా; ఈతఁడు= ఈ నా బిడ్డడు; అన్యము= తనను తప్ప ఇతరమైన దాన్ని; ఎఱుఁగఁడు= తెలియనివాడు; తన+అంతన్= తనకు తానే; అడుచున్+ఉండున్= ఆడుకుంటూ ఉంటాడు; మంచివాఁడు= ఇలా ఎంతో మంచివాడు; ఎగ్గులు= నిందలు; మానరు+అమ్మ= ఆపండమ్మా!

**తా :** ముల్లోకాలలో అందమైన గోపవనితలారా!, చక్కనిగుణములుగల ఆడువారిలో శ్రేష్ఠలారా! ఈ నా చిన్ని కృష్ణుడు తనంతట తానేదో కూర్చుని ఆడుకుంటాడే తప్ప – ఇతర విషయాలేమీ తెలియనివాడమ్మా! మావాడని కాదుకానీ, ఇతడెంతో మంచి బాలుడమ్మా! ఎందుకు అనవసరంగా ఈ నా బిడ్డడిపై నిందలు మోపుతూ రచ్చ చేస్తారు? ఇది మానండమ్మా!

**వ. అని యశోద వారల నొడంబఱిచి పంపి గొడుకుం గోపింపం జాలక యుండె నిట్లు. 333**

**ప్రతి :** అని= ఇలా చెప్పి, యశోద; వారలన్= ఆ గోపకాంతలను; ఒడంబఱిచి= సమాధానపడేటట్లుచేసి; పంపి= వారలను పంపివేసి; కొడుకున్= కృష్ణుణ్ణి; కోపింపన్+చాలక= కోపించలేక; ఉండెన్= ఊరకుండింది; ఇట్లు= ఈ విధంగా...

**తా :** తన చిన్నికృష్ణునిపై నిందలువేస్తూ వచ్చిన ఆ గోపకాంతలకు యశోద నచ్చచెప్పి, వాళ్లను సమాధానపరచి పంపివేసింది. కానీ కొడుకుమీదమాత్రం కోపించలేకపోయింది. ఈ విధంగా

## ✤ మృద్భక్షణ విశ్వరూప ప్రదర్శనాద్యభివర్ణనము ✤

**ఉ. కాంతలు దల్లితోఁ దన వికారము లెల్ల గణింప భీతుఁడై**
**శాంతుని సొంపునం బరమసాధునిపెంపున గోలమాడ్కి వి**
**భ్రాంతుని కైవడిన్ జడునిభంగిఁ గుమారకుఁ డూరకుండె నే**
**వింతయు లేక తల్లికుచవేదికపైఁ దల మోపి యాడుచున్. 334**

**ప్రతి :** కాంతలు= గోప స్త్రీలు; తల్లితోన్= అమ్మ యశోదతో; తనవికారములు= తాను చేసిన వికృత చేష్టలు, అల్లరి పనులు; ఎల్లన్= అన్నిటినీ; గణింపన్= వరుసగా చెప్పగా; కుమారకుఁడు= చిన్ని కృష్ణుడు; జడునిభంగిన్= అమాయకుని వలె; భీతుఁడై= భయపడ్డవాడై; శాంతుని సొంపునన్= ఏ రకమైన చేష్టలు చేయని అణగియున్నవానిరీతిగా; పరమసాధుని పెంపునన్= ఎంతో మంచి స్వభావంగలవానిలా; గోలమాడ్కిన్= ఏమీ తెలియనితీరుగా; విభ్రాంతుని కైవడిన్= ఆశ్చర్యంతో ఏ చేష్టలూ చేయనివానిలా; ఏ వింతయున్ లేక= ఏ రకమైన విశేషచేష్టలు లేకుండా; తల్లి= యశోదయొక్క; కుచవేదికపైన్= తిన్నెలాంటి అమ్మగుండెలపై; తలన్ మోపి= శిరస్సును ఆనించి; ఆడుచున్= చంటి పిల్లాడిలా ఆడుకుంటూ; ఊరక ఉండెన్= తనకేమీ పట్టనట్లు ఉన్నాడు.

**తా :** గోపకాంతలు తాను చేసిన పనులన్నీ తల్లితో చెప్పేసరికి భయపడిన చిన్ని కృష్ణుడు ఏమీ ఎరుగనట్లు ఎంతో శాంతమూర్తిలా సత్ప్రవర్తనతో సాధువులా, అమాయకునిలా, తనపై చెప్పినవన్నీ అసత్యాలన్నట్లు ఆశ్చర్యంతో నిశ్చేష్టుడైనవాడిలా, మొహం పెట్టి, కేవలం తల్లిని తప్ప మరేవిధమైన విషయం తెలియనివాడిలా అమ్మవక్షఃస్థలంపై తలపెట్టుకొని ఆడుకుంటూ ఉన్నాడు.

**వ. అంత నొక్కనాఁడు బలభద్రప్రముఖులైన గోపకుమారులు వెన్నుండు మన్ను దినె నని చెప్పిన యశోద బాలునికేలు పట్టుకొని యిట్లనియె. 335**

**ప్రతి :** అంతన్= ఆ తరువాత; ఒక్కనాఁడు= ఒక రోజున; బలభద్ర ప్రముఖులు+ఐన= బలరాముడు మొదలైన; గోపకుమారులు= గోపబాలురు; వెన్నుండు= కృష్ణుడు; మన్ను తినెన్+అని= మట్టి తిన్నాడని; చెప్పినన్= చెప్పగా; యశోద= తల్లి యశోదమ్మ; బాలుని= కృష్ణునియొక్క; కేలు= చేతిని; పట్టుకొని; ఇట్లు అనియెన్= ఇలా అన్నది.

**తా :** ఒక రోజు బలరాముడు, మరికొంతమంది గోపబాలురు కృష్ణుడు మన్ను తిన్నాడని యశోదతో చెప్పగా ఆమె కృష్ణుని చెయ్యిపట్టుకొని ఇలా అంటోంది.

**క. మ న్నేటికి భక్షించెదు?, మన్నియమము లేల నీవు మన్నింపవు? మీ**
**యన్నయు సఖులును జెప్పెద, రన్నా! మ న్నేల? మఱి పదార్థము లేదే? 336**

**ప్రతి :** అన్నా= నా చిన్ని నాన్నా!; మన్ను= మట్టిని; ఏటికిన్= ఎందుకు; భక్షించెదు(వు)= తింటావు; మత్+నియమములు= నేను చెప్పిన పద్ధతులను, ఆజ్ఞలను; ఏల= ఎందుకు; నీవు; మన్నింపవు= పాటించవు; మీ అన్నయున్= మీ అన్నయ్య బలరాముడు; సఖులును= చెలికాండ్రూ; చెప్పెదరు= మన్నుతిన్నావని చెపుతున్నారు; మన్ను+ఏల= మన్నెందుకు తినాలి; మఱి= వేరొక; పదార్థము= తినేవస్తువు; లేదే= లేదా?

**తా :** బలరాముడు మరికొంతమంది గోపబాలకులు యశోదవద్దకు వచ్చి, కృష్ణుడు మన్ను తిన్నాడని చెప్పగా, యశోద కృష్ణుణ్ణి చేరదీసి, "నాన్నా! మన్నెందుకురా తింటావు? నే చెప్పినవన్నీ ఎందుకు పాటించవు? మీ అన్నయ్య, మీ చెలికాండ్రు వచ్చి నువ్వు మన్ను తిన్నావని చెప్పారు. మన్నెందుకురా తినడం! తినడానికి మనింట వేరే వస్తువులు లేవా?" అంటూ అడిగింది.

**వ. అని పలికిన ముగుదతల్లికి నెఱదంటయైన కొడు కిట్లనియె. 337**

**ప్రతి :** అని= ఈ రీతిగా; పలికిన= మాట్లాడిన; ముగుద తల్లికిన్= అమాయకురాలుగా వున్న తన తల్లితో; నెఱదంట+ఐన= ఎంతో గడుసరి అయిన; కొడుకు= కుమారుడు కృష్ణుడు; ఇట్లు= చెప్పబోయే విధంగా; అనియెన్= పలికాడు.

**తా :** ఎంతో అమాయకంగా ఓ సామాన్యస్త్రీలా, మన్నెందుకు తిన్నావని అడిగిన తల్లి అయిన యశోదతో నేర్పరితనంలో ఎంతో దిట్ట అయిన కృష్ణుడు ఇలా అంటున్నాడు.

**శా. అమ్మా! మన్ను దినంగ నే శిశువనో? యాఁకొంటినో? వెఱ్ఱినో?**
**నమ్మం జూడకు వీరిమాటలు మదిన్, న న్నీవు గొట్టంగ వీ**
**రిమ్మార్గంబు ఘటించి చెప్పెదరు, కాదేనిన్ మదీయాస్య గం**
**ధమ్మాఘ్రాణము సేసి నా వచనముల్ దప్పైన దండింపవే! 338**

**ప్రతి :** అమ్మా= ఓ తల్లీ!; ఏన్= నేను; మన్నున్+తినన్+కన్= మట్టిని తినడానికి; శిశువన్+ఓ= చిన్నపిల్లవాడినా; ఆఁకొంటినో= ఆకలితో వున్నానా; వెఱ్ఱినో= తెలివి తక్కువ వాడినా; వీరి మాటలు= వీళ్లు చెప్పిన మాటలను; మదిన్= మనస్సులో; నమ్మన్+చూడకు(ము)= నిజాలని నమ్మవద్దు; నన్నున్+ఈవు= నన్ను నీవు; కొట్టన్+కన్= కొట్టాలని; వీరు= అన్నయ్య, మిగతా బాలకులు; ఈ+మార్గంబు= ఈ దారిని, ఈ విధానాన్ని; ఘటించి= కల్పించి; చెప్పెదరు= చెపుతున్నారు;

కాదు+ఏనిన్= నా మాట నిజం కాకుంటే; మదీయ+ఆస్యగంధమ్ము= నాయొక్క నోటి వాసనను; ఆఘ్రాణముచేసి= వాసనచూచి; నా వచనముల్= నేననే మాటలు; తప్పు+ఐనన్= నిజంకాకపోతే; దండింపవే= శిక్షింపవమ్మా!

**తా :** అమ్మా! మన్ను తినడానికి నేనేమైనా పసివాడినా? మరి నేనేమైనా ఆకలితో వున్నానా? లేదా తెలివిలేనివాడనా? అన్నయ్య, ఈ గోపబాలురు నీతో చెప్పిన ఈ మాటలను నమ్మకమ్మా! నన్ను నీవు కొట్టాలని వాళ్లలా చెప్పారు. ఒకవేళ నా మాట నమ్మకపోతే నా నోరు వాసన చూడమ్మా! అప్పుడు నేననింది తప్పైతే తప్పకుండా శిక్షించవచ్చు.

**వ. అని పలికి నెయ్యంబున నయ్యవ్వ నియ్యకొలిపి క్రీడామనుజబాలకుండైన యీశ్వరుండు తన నోరు దెఱచి ముఖంబుఁ జూపిన. 339**

**ప్రతి :** అని పలికి= తల్లితో అలా చెప్పి; నెయ్యంబునన్= ప్రేమ పుట్టేవిధంగా; ఆ+అవ్వన్= ఆ యశోదను; ఇయ్యకొలిపి= ఒప్పుకొనేటట్లుచేసి; క్రీడామనుజబాలకుండు+ఐన= వినోదార్థం మనుష్యరూపం పొందిన బాలుడైన; ఈశ్వరుండు= శ్రీకృష్ణభగవానుడు; తన నోరు తెఱచి= తన నోటిని విప్పి; ముఖంబున్ చూపినన్= మోమును చూపగానే...

**తా :** పయి రీతిని అమ్మతో అని, ఆమెకు తనపై ప్రేమ పుట్టేలా మెల్లగా తల్లిని తానన్నమాట నిజమని నమ్మేలా చేసి, సామాన్య మనిషిలా కాకుండా, లోక కల్యాణార్థం విలాసంగా, చిన్ని కృష్ణుడుగా పుట్టిన ఆ కృష్ణపరమాత్మ తల్లికి తన నోరు తెరచి ముఖాన్ని చూపగానే

**క. ఆ లలితాంగి కనుంగొనె, బాలునిముఖమందు జలధి పర్వత వన భూ**
**గోళ శిఖి తరణి శశి ది, క్పాలాదికరండమైన బ్రహ్మాండంబున్. 340**

**ప్రతి :** ఆ లలిత+అంగి= అందమైన అవయవాలుగల ఆ యశోద; బాలుని= చిన్ని కృష్ణుని; ముఖము+అందున్= నోటిలో; జలధి పర్వత వన భూగోళ శిఖి తరణి శశి దిక్పాల+అది కరండము+ఐన= సముద్రాలు, కొండలు, అడవులు, గుండ్రంగావున్న భూమి, అగ్ని, సూర్యుడు, చంద్రుడు, ఇంద్రాది దిక్పాలకులు మొదలగుగా గల వారికి ఆధారంలా వున్న బరణి రూపంలాంటి, బ్రహ్మ+అండంబున్= బ్రహ్మాండాన్ని; కనుంగొనెన్= చూచింది.

**తా :** తల్లితో తననోరు చూడమని చెప్పగా చూసిన యశోద ఆ బాలకృష్ణుని నోట్లో కొండలు, అడవులు, భూగోళం, అగ్ని, సూర్యచంద్రులు, అష్టదిక్పాలకులు ఇలా అన్నింటికి ఆధారమైన ఒక బరణి పెట్టెలావుండే బ్రహ్మాండ స్వరూపాన్నంతా దర్శించింది.

**వ. కనుంగొని. 341**

**ప్రతి :** కనుంగొని= యశోదాదేవి ఆ దృశ్యాన్ని చూచి...

**మ. కలయో! వైష్ణవమాయయో! యితరసంకల్పార్థమో! సత్యమో!**
**తలఁపన్ నేరక యున్నదాననొ! యశోదాదేవిఁ గానో! పర**
**స్థలమో! బాలకుఁ డెంత! యీతని ముఖస్థంబై యజాండంబు ప్ర**
**జ్వలమై యుండుట కేమి హేతువొ! మహాశ్చర్యంబు చింతింపఁగన్. 342**

**ప్రతి :** కల+ఓ= స్వప్నమో; వైష్ణవమాయ+ఓ= విష్ణువుకు సంబంధించిన మాయయో!; ఇతర సంకల్ప+అర్థము+ఓ= ఇతరమైన సంకల్పానికి సంబంధించినదా; సత్యము+ఓ= వాస్తవమో; తలపన్‌నేరక= ఇదీ అని అనడానికి సమర్థురాలిని

కాకుండా; ఉన్నదానన్+ఓ= ఉన్నానా; యశోదాదేవిన్+కాను+ఓ= అసలు నేను యశోదను కానా!; పరస్థలమో= ఇది ఇంకో ప్రదేశమా; బాలకుఁడు+ఎంత= ఈ చిన్నపిల్లవాడెంతవాడు; ఈతని ముఖస్థంబు+ఐ= ఈ పిల్లవాని నోట్లోవుండే; అజ+ అండంబు= బ్రహ్మాండం; ప్రజ్వలము+ఐ= ఎంతో ప్రకాశిస్తూ; ఉండుటకున్= ఉండడానికి; ఏమి హేతువు+ఓ= కారణమేమిటో; చింతింపన్+కన్= ఆలోచిస్తూ వుంటే; మహా+ఆశ్చర్యంబు= ఎంతో ఆశ్చర్యంగా వుంది.

**తా :** చిన్నికృష్ణుని నోట్లో బ్రహ్మాండాన్ని చూచిన యశోద పరిపరివిధాల ఆలోచనలకు గురి అయింది. నేనేమైనా కలగన్నానా? లేదా ఇది విష్ణుమాయా? మరి ఇందులో వేరే సంకల్పాలవల్ల ఏర్పడిన విషయమైందేదైనా ఉందా? నిజమేనా? ఇదీ అని ఊహించలేక పోతున్నాను. అసలు నేను యశోదనేనా? ఇది మేమున్న ప్రదేశంకాక వేరే చోటా? ఈ పసిబాలుడెంతటివాడు? ఇతనిముఖంలో కన్పించి, ప్రకాశిస్తున్న బ్రహ్మాండం ఉండడానికి కారణం ఏమో ఆలోచిస్తూవుంటే ఆశ్చర్యంగా ఉంది.

**ఆ. బాలమాత్రుఁ డగు సలీలునిముఖమందు, విశ్వమెల్ల నెట్లు వెలసి యుండు**
**బాలుభంగి నితఁడు భాసిల్లుఁగాని స, ర్వాత్ముఁ డాదివిష్ణుఁ డగుట నిజము. 343**

**ప్రతి :** బాలమాత్రుఁడు+అగు= సామాన్యబాలుడైన; సలీలుని= లీలలతో కూడినవాని; ముఖము+అందున్= నోటిలో; విశ్వము+ఎల్లన్= సమస్త ప్రపంచం; ఎట్లు= ఏ విధంగా; వెలసి+ఉండున్= ప్రకాశిస్తూ వుంటుంది. ఇతఁడు= ఈ కృష్ణుడు; బాలుభంగిన్= చిన్నపిల్లవానిలా; భాసిల్లున్+కాని= ప్రకాశిస్తున్నాడు కానీ; సర్వాత్ముఁడు= స్థావర జంగమాత్మకమైన లోకమంతా తనయందు గలవాడు; ఆది విష్ణుఁడు= పురాణపురుషుడైన విష్ణుమూర్తి; అగుట= అయివుండడం; నిజము= యథార్థం.

**తా :** సామాన్యమైన గోపబాలుడుగా లీలారూపంలో ఉండే ఇతనిముఖంలో సమస్త చరాచర ప్రపంచం ఎలా ఇమిడి ఉంటుంది? కాబట్టి ఇతడు పసివాడులా కనబడుతున్నాడు కానీ విశాలవిశ్వాన్నంతటినీ తనలో ఇముడ్చుకున్న పురాణ పురుషుడైన విష్ణుమూర్తి అయి ఉంటాడు. ఇదే వాస్తవం!

**వ. అని నిశ్చయించి. 344**

**ప్రతి :** ఈ విధంగా మనస్సులో ఓ నిశ్చయానికి వచ్చి...

**ఆ. ఏ మహాత్మువలన నీ విశ్వరూపంబు, గానఁబడిన బుద్ధి కంప మయ్యె**
**నా మహాత్ము విష్ణు నఖిలలోకాధారు, నార్తులెల్లఁ బాయ నాశ్రయింతు. 345**

**ప్రతి :** ఏ మహా+ఆత్మువలనన్= ఏ మహనీయునివల్ల; ఈ విశ్వరూపంబు= ఈ సమస్త ప్రపంచరూపం; కానన్+పడినన్= కనిపించగా; బుద్ధి= నాయొక్క మతి; కంపము+అయ్యెన్= చలించి పోయిందో; ఆ మహా+ఆత్మున్= ఆ మహనీయుణ్ణి; అఖిలలోక+ఆధారున్= ఎల్లలోకాలకు ఆధారభూతుడైన; విష్ణున్= సర్వవ్యాపకుడైన విష్ణుమూర్తిని; ఆర్తులు+ఎల్లన్= నా బాధలన్నీ; పాయన్= తొలగడానికి; ఆశ్రయింతున్= శరణు కోరతాను.

**తా :** ఏ మహిమగలవానిచే ఈ విశాలవిశ్వం కన్పించి, నా బుద్ధి భ్రమించిందో అట్టి సకల లోకాధారుడైన, మహా మహిమాన్వితుడైన, విశ్వవ్యాపకుడైన, ఆ విష్ణుమూర్తినే నా బాధలన్నీ పోవడానికి ఆశ్రయిస్తాను, సేవిస్తాను.

**క. నా మగఁడు నేను గోవులు, నీ మందయు గోపజనులు నిబ్బాలుని నె**
**మ్మోమున నున్న విధముఁ గని, యేమతితిమి గాని యీశుఁ డీతఁడు మాకున్. 346**

**ప్రతి :** నా మగఁడు= నా భర్త; నేను= యశోదనైన నేనూ; గోవులున్= ఈ ఆవులు; ఈ మందయున్= ఈ గొల్లపల్లె; గోపజనులున్= గొల్లవారందరూ; ఈ బాలుని= ఈ చిన్నికృష్ణుని; నెఱ+మోమునన్= అందమైనముఖంలో; ఉన్న విధమున్+ కని= ఉండే తీరు చూచి; ఏమఱితిమి+కాని= భ్రమలో పడ్డాముకానీ; మాకున్= మా అందరికీ; ఈతఁడు= ఈ మూర్తి; ఈశుఁడు= ప్రభువే!

**తా :** నేనూ, నాతో పాటు నా పెనిమిటి, ఆవులు, గొల్లపల్లె, గోపాలకులు అందరూ ఈ చిన్న బాలుని అందమైన ముఖాన్ని చూస్తూ, అసలు విషయం తెలుసుకోలేక మోహంలో పడ్డాము కానీ మాకు ఇతడే ప్రభువు!

**వ. అని తన్నుఁ బరమేశ్వరుం డని తలంచుచున్న యశోదయందు నా కృష్ణుండు వైష్ణవమాయం బొందించిన. 347**

**ప్రతి :** అని= ఆ విధంగా; తన్నున్= తనను (కృష్ణుని); పరమ+ఈశ్వరుండు+అని= సర్వోత్కృష్టుడైన భగవంతుడని; తలంచున్+ఉన్న= భావిస్తున్న; యశోద+అందున్= యశోదాదేవిమనస్సులో; ఆ కృష్ణుండు= ఆ శ్రీకృష్ణమూర్తి; వైష్ణవమాయన్= విష్ణు సంబంధమైన మాయను, పొందించినన్= కలుగునట్లు చేయగా...

**తా :** అలా యశోద యథార్థం గుర్తించి, చిన్నికృష్ణుణ్ణి జగన్నాటక సూత్రధారియైన శ్రీ మహావిష్ణువుగా ఎప్పుడైతే భావించిందో, అందులోంచి ఆమెను మళ్లీ సామాన్యలోకంలోకి మళ్ళించడానికి మళ్లీ వైష్ణవమాయను ప్రసరింపజేయగా

**క. జడనుపడి యెఱుక సెడి యా, పడఁతుక సర్వాత్ముఁ డనుచుఁ బలుకక యతనిం**
**గొడు కని తొడపై నిడుకొని, కడువేడుకతోడ మమత గావించె నృపా! 348**

**ప్రతి :** నృపా= ఓ పరీక్షిన్మహారాజా! ఆ పడఁతుక= ఆ యశోద; జడనుపడి= జాడ్యత్వాన్ని పొంది; ఎఱుక చెడి= జ్ఞానం నశించిందై; సర్వాత్ముఁడు+అనుచున్= ఈ సమస్త ప్రపంచానికి ఆధారుడని; పలుకక= చెప్పక; అతనిన్= ఆ కృష్ణుణ్ణి; కొడుకు+అని= తన కుమారుడే అని; తొడపైన్= తన ఒడిలో; ఇడుకొని= ఉంచుకొని; కడు వేడుక తోడన్= ఎంతో ఉత్సాహంతో; మమత+కావించెన్= ముద్దు చేసింది.

**తా :** పరీక్షిన్మహారాజా! యశోద జడత్వం పొంది, జ్ఞానం కోల్పోయి విశ్వాధారుడు అతడని చెప్పక, ఆ కృష్ణుణ్ణి తన చిన్న కొడుకే అంటూ తొడపై కూర్చోపెట్టుకొని, ఎంతో కుతూహలంతో ముద్దులాడింది.

**వ. అనిన విని రా జిట్లనియె. 349**

**ప్రతి :** అనినన్= శుకమహర్షి ఇట్లు చెప్పగా, విని; రాజు ఇట్లు+అనియెన్= పరీక్షిన్మహారాజు ఇలా అన్నాడు.

**తా :** అని చెప్పగా పరీక్షిత్తు ఇలా అన్నాడు.

**ఆ. జగదధీశ్వరునకుఁ జ న్నిచ్చు తల్లిగా, నేమి నోము నోఁచె నీ యశోద!**
**పుత్త్రుఁ డనుచు నతనిఁ బోషించు తండ్రిగా, నందుఁ డేమి సేసె నందితాత్మ! 350**

**ప్రతి :** నందిత+ఆత్మ= ఆనందంతో నిండిన మనస్సుగల ఓ శుకయోగీ!; జగత్+అధి+ఈశ్వరునకున్= ఎల్లలోకాలకూ అధిపతియైన శ్రీకృష్ణమూర్తికి; చన్నిచ్చు= తన చనుబాలిచ్చే; తల్లిగాన్= మాతగా; ఈ యశోద= ఈ అమ్మ యశోద; ఏమి

నోమునోఁచెన్= ఏ పుణ్యవ్రతం ఆచరించింది? పుత్త్రుఁడు+అనుచున్= కొడుకు అనుకొంటూ; అతనిన్= ఆ కృష్ణమూర్తిని; పోషించు= పెంచి పెద్దచేసే; తండ్రిగాన్= జనకుడుగా; నందుఁడు= యశోద భర్తయైన ఈ నందుడు; ఏమి చేసెన్= ఏ పుణ్యం చేసుకున్నాడు?

**తా :** నిత్యానందాన్ని అనుభవించే శుకమహర్షీ! విశ్వాధారుడైన ఈ విష్ణుమూర్తికి తన చనుబాలిచ్చే తల్లిగా యశోద ఎలాంటి పుణ్యవ్రతాలు ఆచరించిందో! అలాగే ఆ కృష్ణుణ్ణి పోషించి పెద్దజేసేతండ్రిగా ఈ నందుడు ఏ తపస్సు చేశాడో!

**క. ప్రబ్బినభక్తిని హరిపైఁ, గబ్బంబులు సెప్పి కవులు కైవల్య శ్రీ**
**కబ్బుదు రఁట! హరిపోషణ, మబ్బిన తల్లిదండ్రు లెచటి కబ్బుదురొ తుదిన్. 351**

**ప్రతి :** హరిపైన్= విష్ణుమూర్తిమీద; ప్రబ్బిన= అధికమైన; భక్తిని= భక్తితో; కబ్బంబులు= కావ్యాలు; చెప్పి= రచించి, రాసి; కవులు= వర్ణించేవారైన కావ్యకర్తలు; కైవల్య శ్రీకిన్= మోక్షసౌభాగ్యానికి; అబ్బుదురు+అఁట= వశమవుతారట; హరి పోషణము= ఆ విష్ణుమూర్తిని పోషించడం అనేది; అబ్బిన= కలిగిన, పొందిన; తలిదండ్రులు (తల్లి+తండ్రి)= ఆ శ్రీహరికి అమ్మా, నాన్నలైనవారు; తుదిన్= చివర; ఎచటికిన్+అబ్బుదురో= ఎక్కడికి వశులవుతారో! ఏ మహత్తర స్థితిని పొందుతారో!

**తా :** ఓ మహర్షీ! లోకంలో ఆ విష్ణుభక్తితో శ్రీహరిపై కవులు కావ్యరచనలు చేసి, మోక్షలక్ష్మీ కటాక్షానికి పాత్రులవుతారట! మరి అట్టి శ్రీహరిని పోషించే తల్లిదండ్రులుగావున్న ఈ యశోదానందులకు ఇంకెంతటి మహోన్నత స్థితి కలుగుతుందో కదా?

**వ. అనిన విని రాజయోగికి శుకయోగి యిట్లనియె. 352**

**ప్రతి :** అనినన్ విని= ఇలా పరీక్షిన్మహారాజు చెప్పగా విని; రాజ యోగికిన్= రాజర్షియైన పరీక్షిత్తుకు; శుకయోగి= శుకమహర్షి; ఇట్లు+అనియెన్= ఇలా చెప్పసాగాడు.

## ❖ యశోదానందుల పూర్వజన్మవృత్తాంతము ❖

**సీ. అవనీశ! విను ద్రోణుఁ డనువాఁడు వసువులయందు ముఖ్యుఁడు, ధర యతనిభార్య,**
**వారి నిద్దఱ బ్రహ్మ 'వసుధపై జన్మింపుఁ' డంచుఁ బంచిన వార లతనిఁ జూచి**
**'విశ్వేశ్వరుండైన విష్ణుసేవారతి మా కిచ్చితేనిని మహి జనింతు'**
**మనవుడు 'నట్ల కా' కనియె వేల్పులపెద్ద యా ద్రోణుఁ డీనందుఁడై జనించె**

**ఆ. ధర యశోద యయ్యె, దనుజేంద్రవైరియుఁ, గమలగర్భుమాట గారవించి**
**తల్లిదండ్రు లనుచుఁ దగ వారి మన్నించె, నధికభక్తితోడ నలరి రిట్లు. 353**

**ప్రతి :** అవని+ఈశ= ఓ భూపతీ; విను= వినుము; వసువుల+అందున్= అష్టవసువులలో; ద్రోణుడు అనువాడు= ద్రోణుడనే పేరుగల వసువు; ముఖ్యుఁడు= ప్రధానుడు; అతని భార్య= ఆ ద్రోణుని ఇల్లాలు; ధర= ధర అనే పేరుగల ఆమె; వారిన్ ఇద్దఱన్= ఆ దంపతుల నిరువురినీ; బ్రహ్మ= బ్రహ్మదేవుడు; వసుధపైన్= భూలోకంలో; జన్మింపుఁడు+అంచున్= పుట్టండి అని; పంచినన్= ఆదేశింపగా; వారలు= ఆ దంపతులు; అతనిన్ చూచి= బ్రహ్మదేవుణ్ణి చూచి; విశ్వ+ఈశ్వరుండు+ఐన = విశ్వానికంతటికీ ప్రభువైన; విష్ణుసేవారతిన్= విష్ణుదేవుణ్ణి సేవించే ఆసక్తి; మాకున్ ఇచ్చితి(వి)+ఏనిన్= మాకు ప్రసాదించినట్లయితే;

మహిన్= భూలోకంలో; జనింతుము(జనించుదుము)= పుడతాము; అనవుడున్= అనగా; వేల్పుల పెద్ద= దేవతలలో జ్యేష్ఠుడైన బ్రహ్మ; అట్లకాక+అనియెన్= అట్లేయగు గాక అని పలుకగా; ఆ ద్రోణుఁడు= వసువగు ద్రోణుడు; ఈ నందుఁడై= ఈ నందుడుగా; జనించెన్= పుట్టాడు; ధర= ద్రోణుని భార్యయైన ధర; యశోద అయ్యెన్= నందుని భార్య యశోద అయింది; దనుజ+ఇంద్ర వైరియున్= రాక్షసులపాలిట శత్రువైన విష్ణుమూర్తియు; కమలగర్భుమాట= పద్మం గర్భంగాగల బ్రహ్మదేవుని మాటను; గారవించి= ఆదరించి; (తల్లి+తండ్రి) తల్లిదండ్రులు+అనుచున్= తనకు వారిద్దరు అమ్మనాన్నలని భావిస్తూ; తగన్ వారిన్ మన్నించెన్= చక్కగా వారిని గౌరవించాడు; అధిక భక్తితోడన్= మిక్కిలి భక్తితో, అనన్య భక్తితో; ఇట్లు అలరిరి= వారు ఈ విధంగా ఒప్పారు.

**తా :** ఓ పరీక్షిన్మహారాజా! అష్టవసువులలో ముఖ్యుడైనవాడు ద్రోణుడు, అతనిభార్య ధర. బ్రహ్మ వారిద్దరినీ భూలోకంలో జన్మించండి అంటే వారు బ్రహ్మతో మాకు భూలోకంలో విష్ణుభక్తితో శ్రీహరిని సేవించేలా అనుగ్రహిస్తేనే మేము భూలోకంలో పుడతాం అనగానే అలాగే అవుతుంది అని బ్రహ్మ చెప్పగా వారిద్దరూ నందయశోదలుగా జన్మించారు. విష్ణుమూర్తి బ్రహ్మమాట ప్రకారం గోకులంలో యశోదానందులను తల్లిదండ్రులుగా గౌరవిస్తూవుంటే, వారిద్దరూ ఎంతో ఆనందంతో ఒప్పారు – అని శుకమహర్షి యశోదానందుల పూర్వజన్మవృత్తాంతాన్ని పరీక్షిత్తుకు తెలియజేశాడు.

**వ. అంత నొక్కనాఁడు దనయింటికడ పాపలందఱు నయ్యై పసులవెంటఁ బంపువడి పోయిన నందసుందరి సంరంభంబునం దరికంబంబుకడఁ గుదురున నొక్కదధికుంభంబు వెట్టి మిసిమి గల మీఁగడఁ బెరుఁగు గూడఁబోసి వీఁక నాఁకత్రాడు కవ్వంబున నలవరించి. 354**

**ప్రతి :** అంతన్= మాయచే కృష్ణుని తనకొడుకుగానే భావిస్తున్న సమయంలో; ఒక్కనాఁడు= ఒక దినం; నందసుందరి= నందుని భార్యయైన యశోద; తన ఇంటికడ పాపలందరున్= తన ఇంటివద్ద ఉండిన యువతులందరు; అయ్యై పసుల వెంటన్= వారి వారికి నిర్దేశింపబడిన పనులలో; పంపువడి= పంపబడి; పోయినన్= వెళ్ళిపోగా; సంరంభంబునన్= వేగిర పాటుతో; తరికంబంబు కడన్= పెరుగు చిలికే స్తంభం వద్ద; కుదురు+కాన్= కదలకుండా; ఒక్క దధి కుంభంబు పెట్టి= ఒక పెరుగు కుండను ఉంచి; మిసిమిగల= మెఱుగుతో కూడిన; మీఁదు+కడన్+పెరుఁగున్= మీగడతోకూడిన పెరుగును; కూడన్+పోసి= కలియునట్లుగా పోసి; వీఁకన్= చక్కగా; ఆఁకత్రాడు= చిలకడానికివాడే తాడును; కవ్వంబునన్= చిలికే కవ్వానికి; అలవరించి= చుట్టి బిగించి.

**తా :** కృష్ణునినోటిలో విశ్వాన్ని చూచి ఆశ్చర్యపడి, కృష్ణుని మాయచే మరల సామాన్యయశోదరూపంలోనికి వచ్చిన యశోద ఒకనాడు తనఇంటివద్దగల యువతులందరూ వాళ్లకు నిర్దేశించిన పనులకు వెళ్ళిపోగా, వెంటనే పెరుగు చిలకాలనే భావంతో ఒక పెరుగు కుండను కుదురుగా వుంచి, అందులో మెరిసిపోయే మీఁగడ పెరుగును పోసి, పెరుగు చిలికేలా కవ్వాన్ని ఆ స్తంభానికి తాడుతో బిగించింది.

## ✤ యశోద దధిభాండ వికలనాదులు సేసిన కృష్ణునిఁ బట్టుకొనుట ✤

**సీ. కరకమలారుణకాంతిఁ గవ్వపుఁ ద్రాడు పవడంపు నునుఁదీవపగిది మెఱయఁ**
**గ్రమముతో రజ్జు వాకర్షింపఁ బాలిండ్లు వీడ్వడి యొండొంటి వీఁక నొత్తఁ**

**గుచకుంభములమీఁదికొంగు జాఱఁగఁ జిక్కు వడుచు హారావళు ల్బయలుపడఁగఁ**
**బొడమినచెమటతోఁ బొల్పారునెమ్మోము మంచుపై పడిన పద్మంబుఁ దెగడఁ**

**తే. గౌను నులియంగఁ గంగణక్వణన మెసఁగఁ, దుఱుము బిగివీడఁ గర్ణికాద్యుతులు మెఱయ**
**బాలు నంకించి పాడెడిపాటవలనఁ, దరువు లిగురొత్తఁ బెరుఁ గింతి దరువఁ జొచ్చె. 355**

**ప్రతి :** కరకమల+అరుణకాంతిన్= ఎఱ్ఱతామరలవంటి ఆమె అరచేతి కాంతిచే; కవ్వము+త్రాడు= కవ్వానికి కట్టినతాడు; పవడము+నును+తీవ పగిదిన్= నునుపైన లేత పగడంతీగలా; మెఱయన్= ప్రకాశింపగా; క్రమముతోన్= కుడిచేతితో ఎడమచేతితో వరుసగా; రజ్జువు= త్రాడును; ఆకర్షింపన్= అటూ ఇటూ లాగగా; పాలిండ్లు= స్తనాలు; వీడ్వడి= విడివడి; ఒండొంటిన్= ఒకదానితో ఒకటి; వీఁకన్= చక్కగా; ఒత్తన్= ఉన్నతితో ఒరసికోగా; కుచకుంభములమీఁది= కలశాలవంటి ఉన్నత స్తనాలపైనున్న; కొంగు జాఱన్+కన్= పయటకొంగు జారిపోగా; చిక్కుపడుచున్= ఒకదానితో ఒకటి మెలికలుపడుతూ; హార+ఆవళుల్= హారాలన్నీ (హార పంక్తులన్నీ); బయలు+పడన్+కన్= బయటికి కనబడగా; పొడమిన= పుట్టిన; చెమటతోన్= స్వేదంతో; పొలుపు+ఆరు= ఒప్పే; నెఱ+మోము= అందమైన ముఖం; మంచుపై పడిన= పైభాగంమీద మంచుకమ్మిన; పద్మంబున్= కమలాన్ని; తెగడన్= తిరస్కరించగా; కౌను= నడుము; నులియన్+కన్= చలింపగా (కదలాడగా); కంకణక్వణనము= ముంజేతి గాజుల సవ్వడి; ఎసఁగన్= అతిశయింపగా; తుఱుము బిగి= కొప్పుయొక్క బిగువు; వీడన్= సడలగా; కర్ణికాద్యుతులు= చెవికమ్మల కాంతులు; మెఱయన్= ప్రకాశింపగా; బాలున్= కృష్ణుణ్ణి; అంకించి= భావించి; పాడెడి పాటవలనన్= పాడుచున్న పాటలతో; తరువులు= చెట్లు; ఇగురొత్తన్= చిగిర్చగా; ఇంతి= యశోద; పెరుఁగు= పెరుగును; తరువన్+చొచ్చెన్= చిలుక సాగింది.

**తా :** యశోద శ్రీకృష్ణునిపై పాటలు పాడుతూ, పెరుగును చిలకడం ప్రారంభించింది. ఆమె గానమాధుర్యానికి చెట్లు చిగురిస్తున్నాయి. పద్మినీజాతిస్త్రీ అయిన ఆమెఅరచేతులు ఎఱ్ఱతామరలవలె వున్నాయి. ఆ ఎఱ్ఱనికాంతులు కవ్వం తాడును పగడపు తీగలా చేస్తున్నాయి. తాడును కుడిచేత్తో, ఎడమచేత్తో క్రమంలో లాగుతూవుంటే ఆమె స్తనాలు విడివడి, ఒకదానితో ఒకటి ఒరుసుకుంటున్నాయి. అలా చేయడంతో ఆమె ఎదపై, స్తనాలపైనున్న పై కొంగు తొలగిపోవడంతో మెడలోనున్న హారాలన్నీ చిక్కుపడి బయటపడ్డాయి. చిలకడం అనే శ్రమవల్ల చిరుచెమట బిందువులతో ఒప్పే ఆమెముఖం మంచు బిందువులు చిందిన తామరపూవుకన్నా మనోహరంగా ఉంది. సన్ననినడుము కదలాడగా, గాజుల గలగలలతో, కొప్పువదులు కాగా, చెవిఆభరణాలకాంతులు ఒప్పగా, పాడుతూ యశోద పెరుగు చిలుకుతోంది.

**వ. ఆ సమయంబున. 356**

**ప్రతి :** ఆ సమయంబునన్= ఆ సమయంలో...

**తా :** అలా యశోద పెరుగు చిలుకుతూ వుండగా

**క. సుడియుచు వ్రాలుచుఁ గిదుకుచు, సడి గొట్టుచు నమ్మ రమ్ము! చ న్నిమ్మనుచున్**
**వెడవెడ గంతులు వైచుచుఁ, గడవఁ గదిసి బాలకుండు గవ్వముఁ బట్టెన్. 357**

**ప్రతి :** బాలకుండు= చిన్నికృష్ణుడు; సుడియుచున్= చుట్టూ తిరుగుతూ; వ్రాలుచున్= లేచిపడుతూ; కిదుకుచున్= మూలుగుతూ; సడిగొట్టుచున్= కోపంతో నిందిస్తూ; అమ్మ= అమ్మా; రమ్ము= రా; చన్ను+ఇమ్ము+అనుచున్= పాలు ఇవ్వమంటూ; వెడవెడగంతులు

వైచుచున్= అటు ఇటు పిల్లిగంతులు వేస్తూ, కడవన్+కదిసి= పెరుగుతోవున్న కుండకు దగ్గరగా వెళ్లి; కవ్వమున్+పట్టెన్= చిలికే కవ్వాన్ని పట్టుకున్నాడు.

**తా :** బాలకృష్ణుడు తిరుగుతూ, లేచిపడుతూ, చిన్నగా మూలుగుతూ కోపంతో నిందిస్తూ, అల్లరి చేస్తూ, యశోదతో 'అమ్మా' రా! పాలివ్వమని పిల్లిగంతులు వేస్తూ పెరుగుతోవున్న కుండ దగ్గరకు వచ్చి కవ్వాన్ని పట్టుకున్నాడు.

**క. కవ్వముఁ బట్టిన ప్రియసుతు, న వ్వనరుహనేత్ర దిగిచి యంకతలమునన్**
**నవ్వుచు నిడుకొని కూఁకటి, దువ్వుచుఁ జన్నిచ్చె, నతఁడు దూఁటుచుఁ గుడిచెన్. 358**

**ప్రతి :** ఆ+వనరుహనేత్ర= పద్మదళాలవంటి కన్నులుగల ఆ యశోద; కవ్వమున్+పట్టిన= తాను చిలుకుతున్న కవ్వాన్ని పట్టుకున్న; ప్రియసుతున్= తన ముద్దుల కొడుకును; తిగిచి= దగ్గరకు తీసుకొని; అంకతలమునన్= తొడమీద; నవ్వుచున్= నవ్వుతూ; ఇడుకొని= కూర్చోపెట్టుకొని; కూఁకటిన్ దువ్వుచున్= కృష్ణుని శిరస్సుమీద ముందున్న పిల్లజుట్టును దువ్వుతూ, సరిచేస్తూ; చన్ను ఇచ్చెన్= పాలు ఇచ్చింది (అందించింది); అతఁడు= బాలకృష్ణుడు; దూఁటుచున్= మూతితో పొడుస్తూ; కుడిచెన్= పాలుతాగాడు.

**తా :** అలా వచ్చిన బాలకృష్ణుణ్ణి కమలాలవంటి కన్నులుగల యశోద దగ్గరగా తీసుకుంది. తొడపై కూర్చోపెట్టుకుంది. పిల్లజుట్టును వ్రేళ్ళతో దువ్వుతూ స్తన్యాన్ని అందించగా ఆ బాలుడు తన మూతితో స్తనంపై పొడుస్తూ అమ్మపాలు తాగాడు.

**మ. కడుపారం జనుఁబాలు ద్రావని సుతుం గంజాక్షి పీఠంబుపై**
**నిడి పొంగారెడి పాలు డించుటకునై యేగంగఁ దద్బాలుఁ డె**
**క్కుడు కోపంబున వాఁడిఱాత దధిమత్కుంభంబు వోఁగొట్టి తెం**
**పడరం గుంభములోని వెన్నఁ దినె మిథ్యాసంకులద్బాష్పుఁడై. 359**

**ప్రతి :** కంజాక్షి (కంజ+అక్షి)= పద్మంవంటి నేత్రాలుగల యశోద; కడుపారన్= కడుపునిండా; చనుఁబాలు+త్రావని= స్తన్యపానం చేయని; సుతున్= కుమారుని; పీఠంబుపైన్+ఇడి= ఓ పీటమీద కూర్చోబెట్టి; పొంగు+ఆరెడి పాలు= (పొయ్యిపై) పొంగిపోతున్న పాలను; డించుటకున్+ఐ= దించడానికై; ఏగన్+కన్= వెళ్ళగా; తద్+బాలుడు= ఆ కృష్ణుడు; ఎక్కుడు కోపంబునన్= మిక్కిలి కోపంతో; వాఁడిఱాతన్= పదునుగల రాతితో; దధిమత్+కుంభంబున్= పెరుగుతో నిండిన కుండను; పోన్+కొట్టి= పగులగొట్టి; తెంపు+అడరన్= ధైర్యం ఎక్కువకాగా; కుంభములోని= ఆ కుండలో వున్న; వెన్నన్= వెన్నను; మిథ్యాసంకులత్ బాష్పుఁడై= లేని కన్నీళ్ళు నింపుకున్నవాడై, దొంగకన్నీళ్లుకార్చుతూ; తినెన్= భక్షించాడు.

**తా :** అలా తన ఒళ్ళో కూర్చుని పాలు పూర్తిగా తాగని కృష్ణుణ్ణి యశోద ఓ పీటపై కూర్చోబెట్టి, పొయ్యిపై పాలు పొంగుతూవుంటే ఆ పాలను దింపడానికి వెళ్ళింది. దాంతో చిన్నికృష్ణుడు తనను పూర్తిగా పాలు తాగనివ్వలేదని ఎక్కువ కోపంతో ఒక పదునుగలరాయితో ఆ పెరుగుకుండను పగులగొట్టాడు. అంతేకాదు, ధైర్యంతో ఆ కుండలోని వెన్న తిన్నాడు. తాను చేసిన దానికి అమ్మ ఎక్కడ కొడుతుందో అని ముందుగానే లేని కన్నీళ్ళు తెచ్చుకొని ఏడుస్తున్నట్లు ఉన్నాడు.

**వ. అంత నా లోలలోచన పాలు డించి వచ్చి వికలంబు లయిన దధికుంభశకలంబులఁ బొడగని తుంటకొడుకు వెన్న దింట యెఱింగి నగుచు నా కలభగామిని యతనిం గానక చని చని. 360**

**ప్రతి :** అంతన్= అప్పుడు; ఆ లోలలోచన= చలించేకండ్లుగల ఆ యశోద; పాలు డించి వచ్చి= పొంగుతున్న పాలను దించి వచ్చి; వికలంబులు+అయిన= ముక్కలైన; దధికుంభ శకలంబులన్= పెరుగుకుండపెంకులను; పొడఁగని= చూచి; తుంట కొడుకు= అల్లరి పిల్లవాడైన కృష్ణుడు; వెన్నన్ తింటన్= వెన్న తినడాన్ని; ఎఱింగి= తెలుసుకొని; నగుచున్= నవ్వుతూ; ఆ కలభగామిని= ఏనుగుగున్న నడకవంటి నడక నడిచే ఆ యశోద; అతనిన్= బాలకృష్ణుణ్ణి; కానక= అక్కడ చూడక; చని చని= అలా ముందుకు వెళ్ళి వెళ్ళి...

**తా :** తరువాత యశోద పొంగే పాలను దింపి వచ్చేసరికి పెరుగుకుండ పగిలిపోయి, కుండపెంకులు కనబడ్డాయి. అలా అల్లరి చిన్ని కృష్ణుడు కోపంతో కుండ పగులగొట్టి వెన్న తిన్నాడనుకొన్నదై నవ్వుతూ చూస్తే అక్కడ కృష్ణుడు కనబడలేదు. దాంతో అతడికోసం అలా వెళ్ళి వెళ్ళి

**ఆ. వికచకమలనయన వే ఱొకయింటిలో, వెలయ ఱోలు దిరుగ వేసి యెక్కి**
**యుట్టిమీఁదివెన్న నులుకుచు నొక కోఁతి, పాలు సేయుచున్న బాలుఁ గనియె. 361**

**ప్రతి :** వికచకమలనయన= వికసించిన కమలాలవంటి కన్నులుగల ఆ యశోద; వేఱొక ఇంటిలోన్= మరొక ఇంట్లో; వెలయన్= చక్కగా ఒప్పుతూ; ఱోలు= రోటిని; తిరుగన్ వేసి= బోరగిలవుంచి; ఎక్కి= దానిపై ఎక్కి; ఉట్టిమీఁది వెన్నన్= ఉట్టిమీదున్న వెన్నను; ఉలుకుచున్= భయపడుతూ; ఒక కోఁతి పాలుచేయుచున్+ఉన్న= ఒక కోతికి పెడుతున్న; బాలున్= చిన్ని కృష్ణుణ్ణి; కనియెన్= చూచింది.

**తా :** యశోద బాలకృష్ణుణ్ణి వెదుకుతూ వెళ్తే మరో ఇంట్లో రోలును తిరగవేసి ఎక్కి, ఉట్టిపైనున్న వెన్నకుండను అందుకుని, ఒక పక్క భయం నటిస్తూ, ఆ వెన్నను ఒక కోతికి తినిపిస్తున్న చిన్నికృష్ణుణ్ణి చూచింది.

**మ. కని చేతన్ సెలగోల వట్టికొనుచుం గానిమ్ము గానిమ్ము రా**
**తనయా! యెవ్వరియందుఁ జిక్కువడ నేదండంబునుం గాన నే**
**వినివారంబును బొంద నే వెఱపు నే విభ్రాంతియుం జెంద ము**
**న్ననియో నీవిటు నన్నుఁ గై కొనమి నేఁ డారీతి సిద్ధించునే 362**

**ప్రతి :** కని= అలావున్న కృష్ణుణ్ణి చూచి, యశోద; చేతన్= చేతిలో; సెలగోలన్= పశువుల్ని తోలే సాధనం (కఱ్ఱ, కఱ్ఱకు తాడు ఉంటుంది.); పట్టికొనుచున్= చేతపట్టుకొని; తనయా= కుమారా!; కానిమ్ము కానిమ్ము రా= నీవు చేస్తున్నదంతయు చెయ్యిరా చెయ్యిరా; మున్ను= ఇంతకు ముందు; ఎవ్వరి+అందున్= ఎవ్వరివలన; చిక్కుపడను= చిక్కుపడకుండా ఉన్నాను; ఏ దండంబునున్= ఎట్టి శిక్షను; కానను= పొందలేదు; ఏ వినివారంబునున్ పొందను= ఏ రకమైన అడ్డగింత లేనివాణ్ణి; ఏ వెఱపున్= ఎట్టి భయాన్ని; ఏ విభ్రాంతియున్= ఏ కలవరపాటును; చెందను= పొందలేదు; అని+ఓ= ఇలా అనుకున్నవాడివై; నీవు+ఇటు= నీ విలా; నన్నున్= తల్లినైన నన్ను; కైకొనమి= లక్ష్యపెట్టకపోవడం; నేఁడు= ఈ దినం; ఆ రీతి= నాకేమీ కాదు, నన్నేమీ అనరు అనుకోవడం; సిద్ధించున్+ఏ= కలుగుతుందా? (కుదురుతుందా?)

**తా :** కృష్ణుని అలా చూచి ఓ నా కుమారా! అంటూ యశోద బెత్తం చేతపట్టుకొని 'నీ వింతవరకు ఎవరిచేతికీ చిక్కలేదు. ఏ రకమైన శిక్షను పొందలేదు ఎక్కడా ఎవరిచేతా అడ్డగింపబడలేదు. భయాన్ని గాని భ్రాంతిని గాని పొందలేదు. ఇలా అనుకొని నీవు నన్ను లక్ష్యపెట్టడంలేదు. కానీ ఈ రోజుమాత్రం అలా కుదరదు'.

**వ. అని యదలించుచుఁ గొడుకునడవడిం దలంచి తనుమధ్య దనమనంబున. 363**

**ప్రతి :** అని అదలించుచున్= అలా అంటూ బెదిరిస్తూ; కొడుకు నడవడిన్ తలంచి= తన చిన్ని కృష్ణుడు ప్రవర్తించే తీరును భావిస్తూ; తనుమధ్య= సన్నని నడుముగల ఆ యశోద; తన మనంబునన్= తన మనస్సులో...

**తా :** అలా చిన్ని కృష్ణుణ్ణి బెత్తం పట్టుకుని భయపెడుతూ, కొడుకుప్రవర్తననుగూర్చి ఆలోచిస్తూ, సన్నని నడుము గల ఆ యశోద తన మనస్సులో

**సీ. బాలుఁ డీతం డని భావింతు నందునా యే పెద్దలును నేర రీక్రమంబు**
**వెఱ వెఱుంగుటకు నై వెఱపింతు నందునా కలిగి లే కొక్కఁడు గాని లేఁడు**
**వెఱపుతో నా బుద్ధి వినిపింతు నందునా తనుఁ దానయై బుద్ధిఁ దప్పకుండు**
**నొం డెఱుంగక యింట నుండెడి నందునా చొచ్చి చూడని దొకచోటు లేదు**

**ఆ. తన్ను నెవ్వరైనఁ దలపోయఁ బాఱెడి, యోజ లేదు భీతి యొకటి యెఱుఁగఁ**
**డెలమి నూర కుండఁ డెక్కసక్కెము లాడుఁ, బట్టి శాస్తి సేయు భంగి యెట్లు? 364**

**ప్రతి :** ఈతండు= ఈ నా కృష్ణయ్య; బాఁలుడు అని= చిన్న పిల్లవాడని; భావింతున్+అందునా= ఊహిద్దామనుకుంటానా; ఏ పెద్దలును= పెద్దవాళ్లెవరూ; ఈ క్రమంబు= ఈతనిచేష్టల పద్ధతిని; నేరరు= నేర్చినవారు కాదు; వెఱవు= భయం; ఎఱుంగుటకున్+ఐ= తెలుసుకోవడానికని; వెఱపింతున్ (వెఱపించుదున్)+అందున్+ఆ= భయపెడదామనుకుంటే; లేక= ఎన్నాళ్లో లేకుండా, కలిగి= పుట్టి; ఒక్కడు గాని= ఈ పిల్లవా డొక్కడే తప్ప; లేఁడు= ఇంకో బిడ్డలేడు; వెఱపుతోన్= భయపెట్టడంతో; నా బుద్ధి వినిపింతునందున్+ఆ= నాకు తోచిన మంచి మాటలతో మంచి బుద్ధి వచ్చేలా చెపుదామంటే; తనున్+తాన+ఐ= తనంతటతానే; బుద్ధిన్= మంచిబుద్ధిని; తప్పక+ఉండున్= తప్పకుండా వుంటాడు; ఒండు+ఎఱుంగక= ఇతరమైనవేవీ తెలియకుండా; ఇంటన్= ఇంట్లోనే; ఉండెడిన్+అందున్+ఆ= ఉన్నాడని అనుకుంటే; చొచ్చి చూడనిది ఒక చోటులేదు= తాను ప్రవేశించి చూడని ఏ చోటూ లేదు, (అంతటా సంచరిస్తున్నాడు); తన్నున్+ఎవ్వరు+ఐ= తన నెవరైనా; తలపోయన్= భావిస్తే; పాఱెడి= పారిపోయెడి; ఓజ లేదు= పద్ధతీ లేదు; భీతిఒకటి= ఏ భయాన్నీ; ఎఱుఁగడు= తెలుసుకోడు, దేనికీ భయపడడు; ఎలమిన్= ప్రీతితో (ప్రేమతో); ఊరక ఉండడు= ఊరకనే వుండడు, ఏమీ మాట్లాడకుండా చేయకుండా ఉండడు; ఎక్కసెక్కములు+ఆడున్= ఎత్తిపొడుపుమాటలు మాట్లాడతాడు; పట్టి= పట్టుకొని; శాస్తి+చేయు= శిక్షించే; భంగి= రీతి, విధము; ఎట్లు= ఎలా?

**తా :** యశోద ఆ అల్లరి కృష్ణుణ్ణి చూచి, ఇలా పరిపరివిధాల భావిస్తోంది. ఇతడు చిన్న పిల్లవాడు అనుకుందునా పెద్దవారెవరూ చేయలేని పని వీడిది. పోనీ భయమంటే తెలిసేలా భయపెడదామా అంటే లేక లేక పుట్టిన ఒక్క బిడ్డడే వీడు. ఇంకొకడు లేడు. భయపెట్టి మంచి బుద్ధి కలిగేలా నాలుగు మాటలు చెబుదామా అంటే తనంత తానే బుద్ధి తప్పకుండా ఉన్నట్లుంటాడు. ఏమీ తెలియనివానిలా ఇంట్లోనే వుంటాడా అంటే తాను ప్రవేశించని చోటేలేదు. తనను గురించి ఎవరైనా తెలుసుకున్నారని పారిపోవాలనే ఆలోచనా లేదు. ఏ రకమైన భయం ఎరుగడు. అలాగని ఊరకనే కూర్చోడు. అందరితో ఎత్తిపొడుపు మాటలు, వంకరమాటలు మాట్లాడతాడు. వీణ్ణి పట్టుకొని ఎలా శిక్షించాలో అర్థం కావడంలేదు.

**వ. అని వితర్కించి. 365**

**ప్రతి :** అని= ఈ విధంగా; వితర్కించి= విచారించి...

**తా :** పైన చెప్పిన విధంగా, అన్ని విధాలా ఆలోచించి

**క. లాలనమున బహుదోషము, లోలిం బ్రాపించుఁ దాడనోపాయములం**
**జాలగుణంబులు గలుగును, బాలురకును దాడనంబ పథ్యం బరయన్. 366**

**ప్రతి :** లాలనమునన్= (బిడ్డలను) ముద్దు చేయడంవల్ల; బహుదోషములు= ఎన్నో తప్పులు (లోపాలు); ఓలిన్= వరుసగా; ప్రాపించున్= కలుగుతాయి; తాడన+ఉపాయములన్= కొట్టడంవంటి మార్గాలతో; చాల గుణంబులు కలుగును= ఎన్నో సుగుణాలు ఏర్పడతాయి; బాలురకును= పిల్లలకు; అరయన్= ఆలోచింపగా; తాడనంబు+అ= కొట్టడమే; పథ్యంబు= మంచిది; మేలు చేస్తుంది.

**తా :** పిల్లలను ముద్దు చేయడంవల్ల ఎన్నో అనర్థాలు ఏర్పడతాయి. వాళ్ళను శిక్షించేలా కొట్టడంవంటివి చేస్తేనే వాళ్ళకు క్రమంగా మంచి జరుగుతుంది. కాబట్టి ఆలోచించి చూస్తే పిల్లల్ని కొట్టడంవంటిదే మేలు చేస్తుంది. అదే వాళ్లకు హితమైన పద్ధతి.

**వ. అని నిశ్చయించి కేల నున్న కోల జళిపించి బాలా! నిలునిలు మని బగ్గుబగ్గున నదల్చుచుఁ దల్లి డగ్గఱిన బెగ్గడిలినచందంబున నగ్గలిక సెడి ఱోలు డిగ్గ నుఱికి. 367**

**ప్రతి :** అని నిశ్చయించి= ఈ విధంగా నిర్ణయం చేసుకొని; కేలన్+ఉన్న= తనచేతిలో ఉండే; కోలన్= బెత్తాన్ని (కొరడాను); జళిపించి= అటు ఇటు ఆడించి; బాలా= ఓ చిన్ని కృష్ణుడా; నిలుము+నిలుము+అని= ఆగుము ఆగుము అని; బగ్గు బగ్గునన్= భగ్గుమన్నట్లుగా కోపంతో; అదల్చుచున్= భయపెడుతూ; తల్లి= యశోద; డగ్గఱినన్= దగ్గరగా రాగా; బెగ్గడిలిన= భయపడిన; చందంబునన్= విధంగా; అగ్గలిక+చెడి= అంతవరకూ ఉన్న ఉత్సాహాన్ని పోగొట్టుకొని; ఱోలుడిగ్గన్+ఉఱికి= ఱోలు మీదనుండి కిందికి దుమికి...

**తా :** ఎప్పుడైతే యశోద బాలుణ్ణి దండించడమే మంచిదని నిశ్చయించుకొని తన చేతిలోవున్న బెత్తాన్ని ఒక్కసారి విదిల్చి, ఓరి బాలుడా! ఆగాగు, అక్కడే వుండు అంటూ భగ్గుమన్న కోపంతో బెదిరిస్తూ బాలుణ్ణి సమీపించేసరికి, కృష్ణుడు అంతవరకూ తాను చేస్తున్న చేష్టలన్నీ వీడి, భయపడ్డవాడిలా రోలుమీదినుండి కిందికురికి

**క. గజ్జెలు గల్లని మ్రోయఁగ, నజ్జలు ద్రొక్కుటలు మాని యతిజవమున యో**
**షిజ్జనములు నగఁ దల్లియుఁ, బజ్జం జనుదేర నతఁడు పరువిడె నధిపా! 368**

**ప్రతి :** అధిపా!= ఓ పరీక్షిన్మహారాజా! గజ్జెలు= బాలకృష్ణుని కాలి గజ్జెలు; గల్లు+అని= ఘల్లు ఘల్లుమని; మ్రోయన్+కన్= శబ్దం చేయగా; అజ్జలు త్రొక్కుటలు మాని= చిందులేయడం మానివేసి; అతి జవమునన్= ఎంతో వేగంతో; యోషిత్+జనములు= చుట్టూ ఉన్న స్త్రీలందరూ; నగన్= నవ్వుతూ ఉండగా; తల్లియున్= అమ్మ యశోద కూడా; పజ్జన్= తనప్రక్కనే; చనుదేరన్= రాగా; అతఁడు= ఆ బాలకృష్ణుడు; పరువిడెన్= పరుగెత్తడం ప్రారంభించాడు.

**తా :** ఎప్పుడైతే యశోద బాలకృష్ణా! ఆగు ఆగుమంటూ బెత్తం ఝళిపించి వచ్చిందో వెంటనే చిన్నికృష్ణుడు కాలిగజ్జెలు ఘల్లు ఘల్లుమంటుండగా, అక్కడ చిందులేయడం మాని, చుట్టూ ఉన్న గోపకాంతలు నవ్వుతూ ఉంటే, తల్లి యశోద అతడి వెంటే రాగా పరుగెత్తాడు.

**వ. అప్పుడు.** **369**

**ప్రతి :** అప్పుడు= ఆ సమయాన...

**తా :** అలా కృష్ణుడు పరుగెడుతూ ఉండగా యశోద అతని వెంట వెళ్తూవుంటే

**మ. స్తనభారంబున దస్సి క్రుస్సి యసదై జవ్వాదుమధ్యంబుతో**
**జనితస్వేదముతోఁ జలత్కబరితో స్రస్తోత్తరీయంబుతో**
**వనజాతేక్షణ గూడ బాఱి తిరిగెన్ వారించుచున్ వాకిటన్**
**ఘనయోగీంద్రమనంబులున్ వెనుకొనంగా లేని లీలారతున్.** **370**

**ప్రతి :** వనజాత+ఈక్షణ= పద్మములవంటి కన్నులుగల ఆ యశోద; స్తనభారంబునన్= పాలిండ్లబరువుచేత; దస్సి= అలసి; క్రుస్సి= కృశించి, (సంకోచించి); అసదు+ఐ= సన్ననై; జవ్వాదు= కదలాడు; మధ్యంబుతోన్= నడుముతోను; జనిత స్వేదముతోన్= పుట్టిన చెమటతోను; చలత్= కదలాడుచున్న; కబరితోన్= కొప్పుతోను; స్రస్త+ఉత్తరీయంబుతోన్= జారినపైట (పయ్యెద), తోను; పాఱి= పరుగెత్తి; ఘన యోగీంద్ర మనంబులున్= గొప్పవారైన యోగీశ్వరుల మనస్సులు కూడా; వెనుకొనంగా లేని= వెంబడింప జాలని; లీలారతున్= విలాసంగా ఆడుతున్న ఆ బాలకృష్ణుణ్ణి; వాకిటన్= ఇంటిముంగిట; వారించుచున్= ఆగు! పోవద్దు! అంటూ; తిరిగెన్= తిరిగింది.

**తా :** పరిగెడుతున్న కృష్ణుణ్ణి యశోద వెంబడిస్తూ ముంగిలిలో తాను తిరుగుతోంది. ఆ సమయంలో పాలిండ్ల బరువుచేత అలసి, సంకోచించిన సన్నని నడుము కదలాడుతున్నది. పరుగెత్తిన అలసటవల్ల చెమటపట్టింది. కొప్పు కదలాడుతూవుంది, పైటజారిపోతున్నది. ఎంతో గొప్పవారైన యోగీశ్వరులమనస్సులుకూడా వెంబడించి పట్టుకోలేని ఆ లీలామానుష విగ్రహుడైన శ్రీకృష్ణుణ్ణి పట్టుకునే ప్రయత్నంతో యశోద తిరుగాడుతోంది. ఏమి అదృష్టం!!

**వ. ఇట్లు గూడం జని.** **371**

**ప్రతి :** ఇట్లు+కూడన్+చని= ఈ విధంగా పట్టుకోవడానికి వెళ్లి...

**తా :** ఈ రీతిగా కృష్ణుణ్ణి పట్టుకోవడానికి వెంట వెళ్ళి

**సీ. స్తంభాదికంబులు దనకు నడ్డం బైన నిట్టట్టు సని పట్టనీనివాని**
**నీ తప్పు సైరింపు మింక దొంగిలఁ బోవ నే నని మునుముట్ట నేడ్చువానిఁ**
**గాటుక నెఱయంగఁ గన్నులు నులుముచు వెడలుకన్నీటితో వెగచువాని**
**నే దెస వచ్చునో యిది యని పలుమాఱు సురుఁగుచుఁ గ్రేఁగంటఁ జూచువానిఁ**

**ఆ. గూడఁబాఱి పట్టుకొని వెఱపించుచుఁ, జిన్ని వెన్నదొంగ సిక్కె ననుచు**
**నలిగి కొట్టఁ జేతు లాడక పూఁబోఁడి, కరుణతోడ బాలుఁ గట్టఁ దలఁచి. 372**

**ప్రతి :** స్తంభ+ఆదికంబులు= ముంగిటనున్న స్తంభాలు మొదలైనవి; తనకున్ అడ్డంబు అయినన్= తాను తప్పించుకోడానికి ఆటంకం కలిగించగా; ఇట్టట్టు చని= అటూ ఇటూ వెళ్ళి; పట్టనీనివానిన్= పట్టుకొనేందుకు వీలీయనివాణ్ణి; ఈ తప్పు= ఈ నేరాన్ని; సైరింపుము= మన్నించు; ఇంకన్= ఇక ముందెప్పుడూ; దొంగిలన్ పోవన్+ఏను అని= దొంగిలించడానికి వెళ్ళను నేనంటూ; మునుముట్టన్= మును ముందుగానే అంటే తనను తాకకుండానే; ఏడ్చువానిన్= ఏడుస్తున్నవాణ్ణి; కాటుక= కంటికి పెట్టిన కాటుక (అంజనం); నెఱయన్+కన్= వ్యాపించగా; కన్నులు= కండ్లు; నులుముచున్= నలుపుకొంటూ, రాసుకుంటూ; వెడలు= వచ్చిన; కన్నీటితోన్= కారుచున్న కన్నీళ్ళతో; వెగచువానిన్= వెక్కివెక్కి ఏడ్చువాణ్ణి; ఇది= అమ్మ; ఏదెస వచ్చునో= ఏ వైపునుండి వస్తుందో; అని= అనుకొని; పలుమాఱు= అనేక పర్యాయాలు; సురుఁగుచున్= తప్పుకుంటూ; క్రేఁ గంటన్= ఓర కంటితో; చూచు వానిన్= చూస్తున్నవాణ్ణి; కూడన్+పాఱి= కృష్ణునితో కూడునట్లు పరిగెత్తి; పట్టుకొని= అతణ్ణి అందుకొని; వెఱపించుచున్= భయపెడుతూ; చిన్ని వెన్నదొంగ= వెన్నను దొంగిలించే చిన్నవాడు; చిక్కెన్ అనుచున్= నాకు దొరికిపోయేడు అంటూ; అలిగి= కోపించి; కొట్టన్= కొట్టడానికి; చేతులాడక= చేతులురాక; పూఁబోఁడి= పూవువలె మనోజ్ఞమైన ఆ యశోద; బాలున్= బాలుడైన కృష్ణుణ్ణి; కరుణతోడన్= జాలితో; కట్టన్+తలఁచి= కట్టివేద్దామని భావించి, నిశ్చయించి...

**తా :** యశోద కృష్ణుణ్ణి వెంబడిస్తూవుంటే తప్పించుకుంటున్న కృష్ణునికి అక్కడి స్తంభాదులు అడ్డుగా ఉంటే, వాటిమధ్యలో అటూ ఇటూ తిరుగుతూ పట్టుకోవడానికి వీలివ్వడంలేదు. ఈ ఒక్క తప్పు క్షమించమ్మా! ఇంకెప్పుడూ దొంగతనం చేయనంటూ తనను పట్టుకోకుండానే ఏడుపు ప్రారంభించాడు. కళ్ళకు పెట్టిన కాటుక ముఖమంతా అయ్యేటట్లు కళ్ళు నలుపుకుంటూ వెక్కి వెక్కి ఏడుస్తున్నాడు. అమ్మ ఎటు వైపునుండి వచ్చి పట్టుకుంటుందో అని పదే పదే తప్పించుకుంటూ, దాగుతూ, ఓరగంట చూస్తున్నాడు. చివరకు యశోద అతనితో కూడా పరుగెత్తి పట్టుకొని, భయపెడుతూ మా చిన్న వెన్న దొంగ దొరికిపోయాడంటూ, కోపంతో కొట్టడానికి చేతులురాక, ఆమె బాలకృష్ణుణ్ణి కట్టేద్దామని భావించి

**వ. ఇ ట్లనియె. 373**

**ప్రతి :** ఇట్లు+అనియెన్= ఇలా అన్నది యశోద.

**క. వీ రెవ్వరు? శ్రీకృష్ణులు, గారా? యెన్నఁడును వెన్నఁ గానరఁట కదా**
**చోరత్వం బించుకయును, నేర రఁట! ధరిత్రి నిట్టి నియతులు గలరే? 374**

**ప్రతి :** వీరు+ఎవ్వరు= ఈ పెద్దమనిషి ఎవరండీ!; శ్రీకృష్ణులు కారా= శ్రీకృష్ణులవారేనా; ఎన్నడును= ఎప్పుడూ కూడా; వెన్నన్ కానరు+అఁటకదా= వెన్నంటే ఎలా వుంటుందో చూడలేదట కదూ!; చోరత్వంబు= దొంగతనమనే; ఇంచుకయును= ఏ మాత్రమూ; నేరరు+అఁట= తెలియనివారట; ధరిత్రిన్= ఈ భూమిలో; ఇట్టి నియతులు= ఇంతటి నియమాలుగలవారు; కలరే= ఉన్నారా?

**తా :** కృష్ణుణ్ణి పరిహాసం చేస్తూ యశోద ఎత్తిపొడుపుగా ఆడుతున్నమాటలు. ఎవరండీ ఈ పెద్దమనిషి? శ్రీకృష్ణమూర్తి గారేనా? పాపం వీరికి వెన్నంటే తెలియదట. ఎప్పుడూ చూడలేదట. అంతేకాదు, దొంగతనం అనేది కొంచెమైనా తెలియని వారట! లోకంలో ఇంతటి నియమవ్రతులు ఎక్కడైనా ఉన్నారా?

**క. పట్టినఁ బట్టువడని నినుఁ, బట్టెద నని చలముగొనినఁ బట్టుట బెట్టే?**
**పట్టువడ వంద్రు పట్టీ!, పట్టుకొనన్ నాకుఁగాక పరులకు వశమే? 375**

**ప్రతి :** పట్టీ= ఓ నా బిడ్డా! పట్టినన్= పట్టుకున్నా; పట్టువడని= పట్టడానికి దొరకని; నినున్= నిన్ను; పట్టెదను అని= ఎలాగైనా పట్టుకుంటాను అంటూ; చలముగొనినన్= పట్టుదలగా అనుకుంటే; పట్టుట= పట్టుకొనడం; బెట్టే!= అదొక గొప్పా? (అంటే పట్టుకోవచ్చునన్నమాట); పట్టువడవు+అంద్రు= ఎవరికీ నీవు పట్టుబడవంటారు; (అట్టి నిన్ను) పట్టుకొనన్= పట్టుకొనుటకు; నాకున్+కాక= ఒక్క నాకు తప్ప; పరులకున్= ఇతరులెవరికైనా; వశమే= శక్యమా! సాధ్యమా!

**తా :** ఓ నా చిన్ని కృష్ణా! పట్టుకుందామన్నా పట్టుటకు దొరకని నిన్ను, పట్టుకుని తీరుతాను అని పట్టుదలగా ప్రయత్నిస్తే నిన్ను పట్టుకోవడం అదేమైనా పెద్ద ఘనకార్యమా! కాదు. నీవు ఎవరికినీ పట్టుబడవు అంటారు. అట్టి నిన్ను పట్టుకోవడం నాకు తప్ప ఇంకెవరికీ సాధ్యం కాదు.

**క. ఎక్కడ నైనను దిరిగెద, వొక్కయెడన్ గుణము కలిగి యుండవు, నియమం**
**బెక్కడిది నీకు? మఱచినఁ, జక్కఁగఁ బోయెదవు పెక్కుజాడలఁ బుత్త్రా! 376**

**ప్రతి :** పుత్రా= ఓ నా కుమారా!; ఎక్కడన్+ఐనను+తిరిగెదవు= ఇక్కడ అక్కడ అనికాకుండా ఎక్కడపడితే అక్కడ తిరుగుతావు; ఒక్క+ఎడన్= ఒక చోటంటూ ఎక్కడా; గుణము కలిగి+ఉండవు= మంచి బుద్ధితో ఉండవు; నీకున్= నీకు; నియమంబు= ఒక పద్ధతి; ఎక్కడిది= ఎక్కడ ఉంది?; మఱచినన్= నీ సంగతి మరిచిపోతే; పెక్కుజాడలన్= అనేక మార్గాలలో; చక్కన్+కన్ పోయెదవు= హాయిగా పోతావు.

**తా :** యశోద తనకు పట్టుబడిన చిన్ని కృష్ణునితో, ఓ నా బిడ్డా! నీకు ఒక చోటంటూలేదు! ఎక్కడ పడితే అక్కడ తిరుగుతావు! ఒక చోటంటూ, ఎక్కడా మంచి గుణాలు కలిగి ఉండవు కదా! నీకు నియమం, పద్ధతి ఎక్కడుంది? నీ సంగతి గనుక మరచిపోతే ఎలా పడితే అలా అనేకమార్గాలలో తిరుగుతూ పోతావు. (విష్ణువే కృష్ణుడు కనుక అన్ని మార్గాలలో, అంతటా తానే ఉంటాడు)

**సీ. తోయంబు లివి యని తొలఁగక చొచ్చెదు, తలఁచెదు గట్టైనఁ దరల నెత్త,**
**మంటితో నాటలు మానవు, కోరాడె, దున్నతస్తంభంబు లూఁపఁ బోయె,**
**దన్యుల నల్పంబు లడుగంగఁ బాటెదు, రాచవేఁటలఁ జాల నవ్వదెచ్చె,**
**దలయవు నీళ్లకు నడ్డంబు గట్టెదు, ముసలివై హలివృత్తి మొనయఁ,జూచె**

**ఆ. దంబరంబు మొలకు నడుగవు తిరిగెద, వింకఁ గల్కిచేఁత లేల పుత్త్ర!**
**నిన్ను వంప వ్రాల్ప నే నేర ననియొ, నీ విట్టు క్రింద మీఁదు నెఱుఁగ కునికి. 377**

**ప్రతి :** పుత్ర!= ఓ నా కుమారా!; చిన్ని కృష్ణా!,

1) తోయంబులు+ఇవి+అని= ఇవి నీళ్ళు అని ఇందులో పడితే ప్రమాదమని; తొలఁగక= దూరంగా పోకుండా; చొచ్చెదు(వు)= ఆ నీళ్ళలో ప్రవేశిస్తావు. **"మత్స్యావతార సమయంలో మహాసముద్రంలో ప్రవేశించావు"**

2) గట్టు+ఐనన్= కొండనైనా; తరలన్+ఎత్తన్= లేవనెత్తడానికి; తలఁచెదు(వు)= ప్రయత్నిస్తావు. **“కూర్మావతారంలో మందర పర్వతాన్ని ఎత్తావు”**

3) మంటితోన్= మట్టితో; ఆటలు మానవు= ఆడుకోవడం మానవు; కోరాడెదు(వు)= కోరాడతావు, ఆ మట్టిని ఎగజిమ్మి పైన పోసుకుంటావు; **“వరాహావతార మెత్తినపుడు కోరతో భూమిని పైకెత్తినావు”**

4) ఉన్నత స్తంభంబులు= ఎంతో పొడవైన పెద్దస్తంభాలను కూడా; ఊఁపన్+పోయెదు(వు)= కదిలించే ప్రయత్నం చేస్తావు. **“నరసింహావతారంలో స్తంభాన్ని చీల్చుకుని వచ్చావు”**

5) అన్యులన్= ఇతరులను; అల్పంబులు+అడుగన్+కన్+పాఱెదు(వు)= స్వల్పమైనవి అడగడానికి పరుగెత్తి పోతావు. **“వామనుడుగా మేడలో, మాణిక్యాలో అడగమన్న బలితో కేవలం అల్పమైన మూడడుగుల నేలను అడిగావు”**

6) రాచవేఁటలన్= రాజులను వేటాడుటలతో; చాల= ఎక్కువ; అవ్వన్+తెచ్చెదు(వు)= నిందను తెచ్చుకొన్నావు, అంటే రాజులవలె వేటాడి అపకీర్తి తెచ్చుకున్నావు. **“పరశురాముడై ఇరవై ఒక్కసార్లు దండెత్తి దేశాన్ని అరాజకం (రాజన్నవాడు లేకుండా) చేసి అపకీర్తి పొందావు”**

7) అలయవు= ఎప్పుడూ కూడా అలసిపోవు, విసుగుకోవు; నీళ్ళకున్= నీటి ప్రవాహానికి; అడ్డంబు+కట్టెదు(వు)= ఆడ్డకట్ట వేస్తావు - పారకుండా. **“రామావతారంలో సముద్రానికి సేతువు కట్టడం అనుసంధానం చేసుకోవాలి”**

8) ముసలివి+ఐ= పెద్దవయస్సువానిలా లేదా రోకలిని ఆయుధంగా తీసుకుని; హలివృత్తిన్= దున్నుకునే వ్యాపారంలో; మొనయన్ చూచెదు(వు)= ప్రవేశింప చూస్తున్నావు. **“బలరామావతారంలో రోకలి, నాగలి పూని ప్రవర్తించావు”**

9) అంబరంబున్= వస్త్రాన్ని; మొలకున్= మొలకు కట్టుకోవడానికి; అడుగవు= అడక్కుండా; తిరిగెదు(వు)= దిసమొలతో తిరుగుతావు. **“బౌద్ధావతారంలో దిగంబరుడవై తిరుగుతావు”**

10) ఇంకన్= ఇకమీద; కల్కి+చేఁతలు ఏల= నేర్పరి తనంతో పనులెందుకు? **“కల్క్యవతారం ఎందుకు!”** నిన్నున్ వంపన్= నిన్ను వశం చేసుకోవడానికి; వ్రాల్పన్= లొంగదీసుకోవడానికి, నేను నేరన్ అని+ఒ= నేను సమర్థురాలిని కానని కాబోలు; నీవు ఇట్టు= నీవు ఈ విధంగా; క్రిందు మీఁదున్= ఇది కింద ఇది మీద అనే తేడాలు; ఎఱుఁగక= తెలియకుండా; ఉనికి= ఉండడం! (ఉంటున్నావు)...

**తా :** ఓ నా కృష్ణా! నీళ్ళంటే భయంలేకుండా అందులో దిగుతావు. కొండనైనా, బండనైనా ఎత్తడానికి చూస్తావు. మట్టితో ఆడుకుంటూ, ఒంటిపై పోసుకుంటావు. పెద్ద పెద్ద స్తంభాలను కదిపేలా ప్రయత్నిస్తావు. ఇతరులనుండి స్వల్పమైన వస్తువును యాచిస్తావు. రాచవారిలా వేటంటూ చేసి మాటపడతావు. ప్రవహించే నీటికి అడ్డుకట్ట వేద్దామనుకుంటావు, నాగలిని రోకలిలాంటిదాన్ని పట్టుకొని సేద్యం చేద్దామనుకుంటావు. కట్టుకోడానికి వస్త్రాన్నడుగకుండా దిగంబరంగా తిరుగుతావు. ఇంకా ఇట్టి నేర్పరితనంతో కూడిన చేష్టలు ఎన్ని చేస్తావో? నిన్ను నేను లొంగదీసుకోవడంలో అసమర్థురాలనని గుర్తించావేమో! ఇలా కిందా మీదా తెలియక ప్రవర్తిస్తున్నావు.

## ✤ ఉలూఖలబంధన యమళార్జున భంజనాద్యభివర్ణనము ✤

**వ. అని మర్మంబు లెత్తి పలికి. 378**

**ప్రతి :** అని = ఈ విధంగా; మర్మంబులు= కృష్ణుడు చేసే దుడుకు చేష్టల రహస్యాలను (భగవంతుని అవతార రహస్యాలను) ఎత్తి పలికి= ఎత్తిపొడుపుగా పేర్కొని...

**తా :** ఈ విధంగా కృష్ణుడి దుడుకు చేష్టల రహస్యాలను వ్యంగ్యంగా పేర్కొని

**క. ఆ లలన గట్టె ఱోలన్, లీలన్ నవనీతచౌర్యలీలుం బ్రియవా**
**గ్జాలుం బరివిస్మిత గో, పాలున్ ముక్తాలలామఫాలున్ బాలున్. 379**

**ప్రతి :** ఆ లలన= ఆ యశోద; లీలన్= విలాసంగా; నవనీత చౌర్యలీలున్= వెన్నను దొంగిలించుటే ఆటగా గలవాణ్ణి; ప్రియవాక్+జాలున్= మధురంగా మాట్లాడేవాణ్ణి; పరివిస్మిత గోపాలున్= ఎంతో ఆశ్చర్యపడుతున్న గోపాలబాలుణ్ణి ముక్తాలలామ ఫాలున్= మంచి ముత్యాలతో కూడిన అలంకారం నుదుట గలవాణ్ణి; బాలున్= చిన్ని కృష్ణుణ్ణి; ఱోలన్= రోటికి; కట్టెన్= కట్టివేసింది.

**తా :** వెన్న దొంగతనం లీలగా చేసేవాడు, చక్కగా మాట్లాడే స్వభావంగలవాడు, తల్లి చేస్తున్న పనులను ఎంతో ఆశ్చర్యంగా చూస్తున్నవాడు, నుదుట ముత్యాల చేర్చుక్క గలవాడు అయిన చిన్ని కృష్ణుణ్ణి యశోద ఒక రోటికి కట్టివేసింది.

**క. ఱోలను గట్టువడియు న, బ్బాలుఁడు విలసిల్లె భక్తపరతంత్రుండై**
**యాలానసన్నిబద్ధ వి, శాలమదేభేంద్రకలభసమరుచి నధిపా! 380**

**ప్రతి :** అధిపా= ఓ పరీక్షిన్మహారాజా! ఆ+బాలుఁడు= ఆ చిన్ని కృష్ణుడు; ఱోలను= రోటియందు; కట్టువడియున్= కట్టబడిన వాడైనప్పటికీ; భక్తపరతంత్రుండు+ఐ= భక్తజనులకు వశమైనవాడై, ఆలాన, సన్నిబద్ధ, విశాల, మద+ఇభ+ఇంద్ర కలభ సమరుచిన్= తాడుతో, కట్టివేయబడి, అధికమైన మదంతోకూడిన ఏనుగుగున్నతో సమానమైనకాంతితో; విలసిల్లెన్= ఒప్పాడు.

**తా :** శుకమహర్షి పరీక్షిన్మహారాజును సంబోధిస్తూ ఓ రాజా! అలా ఆ చిన్ని కృష్ణుడు రోలుకు కట్టబడినప్పటికీ, భక్తులకు వశమైనవాడు కాబట్టి అతడు స్తంభానికి కట్టుబడి అధికమదంతో ఒప్పే ఒక ఏనుగుగున్నలా ఎంతో కాంతితో ప్రకాశించాడు.

**విశే:** భద్రజాతి ఏనుగులకు గండస్థలంనుండి పాదాలవరకు ఎనిమిది స్థానాలలో మదజలం ఉంటుందని చెప్పబడింది. మదపుటేనుగులు అంటాం కదా! బాలకృష్ణుడు అటువంటి మదజలంతో కూడిన ఏనుగుగున్నలా వున్నాడట.

**క. వెలి లోను మొదలు దుది నడు, ములు లేక జగంబు తుదియు మొదలున్ నడుమున్**
**వెలియును లో నగు నీశ్వరు, నలవడునే కట్టఁ బ్రణతురాల్ గా కున్నన్? 381**

**ప్రతి :** వెలి= వెలుపల; లోను= లోపల; మొదలు= ఆది; తుది= చివర; నడుములు లేక= మధ్యలు లేకుండా, ఆదిమధ్యాంతరహితుడై; జగంబు= లోకంయొక్క లేదా లోకానికి, తుది, మొదలు, నడుమున్, వెలియును, లోను అగు= అంతం, ఆది, మధ్య, బైట, లోపల తానే అయిన; ఈశ్వరున్= భగవంతుడైన కృష్ణుణ్ణి; ప్రణతురాల్(ప్రణత+ఆలు)= నతులర్పించే భక్తురాలు; కాక+ఉన్నన్= కాకపోయినట్లయితే; కట్టన్= బంధించడానికి; అలవడునే= వీలగునా, సాధ్యమవుతుందా?

**తా :** ఓ రాజా! వెలుపల లోపల అనేది లేకుండా, ఆది మధ్యాంతాలు లేని విశ్వానికి తానే తుది, మొదలు, నడుమ, బయట, లోపల అయిన ఆ సర్వేశ్వరుణ్ణి యశోద భక్తురాలు కాకపోతే రోటికి కట్టడం సాధ్యమయ్యేదా?

**ఆ. పట్టి యెల్లబోఁటి పట్టి యీతం డని, గట్టితలఁపుతోడఁగట్టెఁగాక**
**పట్టికడుపు పెక్కు బ్రహ్మాండములు వట్టు, టెఱిఁగె నేనిఁదల్లి యేల కట్టు? 382**

**ప్రతి :** తల్లి; పట్టి= తనకుమారుడు; ఎల్లబోఁటి పట్టి ఈతండు= అందరి పిల్లల్లాంటి పిల్లవాడే; అని= అనుకొని; గట్టి తలఁపుతోడన్= దృఢమైన ఆలోచనతో; కట్టెన్+కాక= బంధించిందే కాని; పట్టి కడుపు= తన కుమారుని పొట్ట; పెక్కు బ్రహ్మాండములు= అనేకమైన బ్రహ్మాండలోకాలు; పట్టుట= ఇమిడి ఉండటం; ఎఱిఁగెన్+ఏనిన్= తెలుసుకున్నట్లయితే; ఏల కట్టున్= ఎందుకు బంధిస్తుంది?

**తా :** యశోద తన చిన్ని కుమారుడు అందరి పిల్లల్లాంటి పిల్లవాడే అనే నిశ్చయంతో ఉంది కాబట్టే అతణ్ణి కట్టివేసింది కాని, ఆ చిన్నికృష్ణునిపొట్టలో సకలలోకాలూ ఉన్నాయని తెలిసినట్లయితే ఎందుకు కట్టివేస్తుంది?

**క. చిక్కఁడు సిరికౌఁగిటిలోఁ, జిక్కఁడు సనకాదియోగిచిత్తాబ్జములం**
**జిక్కఁడు శ్రుతిలతికావలిఁ, జిక్కె నతఁడు లీలఁ దల్లిచేతన్ ఱోలన్. 383**

**ప్రతి :** అతఁడు= బాలకృష్ణుడు; సిరి కౌఁగిటిలోన్= లక్ష్మీదేవికౌగిలిలో, ఆలింగనంలో; చిక్కఁడు= చిక్కినవాడు కాడు; సనక+ఆది యోగిచిత్త+అబ్జములన్= సనకుడు, సనందనుడు మొదలగు యోగీశ్వరుల హృదయకమలాలలో; చిక్కఁడు= చిక్కినవాడు కాలేదు; శ్రుతి లతికా+ఆవలిన్= వేదములనే తీవల పంక్తిలోనూ; చిక్కఁడు= చిక్కలేదు; అటువంటి బాలుడు; తల్లిచేతన్= తల్లి యశోదచేతిలో; లీలన్= విలాసంగా, క్రీడగా; ఱోలన్= రోటియందు; చిక్కెన్= చిక్కుకున్న వాడాయెను.

**తా :** భగవంతుడైన విష్ణువు నిత్యానపాయినిగా తననే అంటిపెట్టుకొని ఉన్న లక్ష్మీదేవి కౌగిలిలో చిక్కడు. యోగిగణములపాల కలడందురన్నట్లుగా బ్రహ్మమానసపుత్రులు పరమపవిత్రులు అయిన సనకాదియోగీశ్వరుల హృదయపద్మాల్లోనూ చిక్కడు. వేదపురుషుడంటున్నా ఆ వేదా లనేతీవలలోనూ చిక్కడు. అటువంటి ఆ సర్వేశ్వరుడు లీలగా తన తల్లిచేతికి చిక్కి, రోటికి బంధింపబడ్డాడు.

**వ. ఇట్లు గ్రద్దన నా ముద్దియ ముద్దులపట్టియుదరంబు గట్ట నదరుచుఁ జతురంబుగఁ జక్క నొక్కత్రాడు సుట్టిన నది రెండంగుళంబులు గడమపడియె, మఱియు నొక్కబంధనంబు సంధించి వలగొనిన నంతియ కొఱంత యయ్యెఁ, వెండియు నొక్కపాశంబు గూర్చి పరివేష్టించిన వెల్తి సూపె నిట్లు. 384**

**ప్రతి :** ఇట్లు= ఈ ప్రకారంగా; గ్రద్దనన్= వేగంగా; ఆ ముద్దియ= ఆ ముద్దరాలైన యశోద; ముద్దులపట్టి ఉదరంబునన్= తనకెంతో ప్రియమైన కుమారునికడుపున; కట్టన్= కట్టుటకు; అదరుచున్= ప్రయత్నిస్తూ; చతురంబుగన్= నేర్పుతో; చక్కన్ ఒక్కత్రాడు= ఒక తాడుతో చక్కగా; చుట్టినన్= చుట్టగా; అది= ఆ తాడు; రెండు అంగుళంబులు= రెండు వేళ్ళ పరిమాణం; కడమ పడియెన్= తక్కువ అయింది; మఱియున్+ఒక్క బంధనంబున్ సంధించి= మళ్ళీ మరో తాడును కలిపి; వలగొనినన్= చుట్టగా; అంతియ కొఱంత అయ్యెన్= అది కలిపినా మళ్ళీ రెండు అంగుళాలు తక్కువ అయింది; వెండియున్= మరల; ఒక్క పాశంబున్+కూర్చి= ఇంకొక తాడును చేర్చి; పరివేష్టించినన్= నడుముకు చుట్టగా; వెల్తి+చూపెన్= అదీ రెండంగుళాలు తక్కువగానే అయింది; ఇట్లు= ఈ విధంగా...

**తా :** యశోద వెంటనే తన ప్రియపుత్రుడైన శ్రీకృష్ణణ్ణి రోలుకు కడదామన్న నిర్ణయంతో అతనిపొట్టకు ఒకతాడు తెచ్చి చుట్టగా అది రెండంగుళాలు తక్కువయింది. మరో తాడును చేర్చి చుట్టినా, అదీ రెండంగుళాలు తక్కువ కావడంతో, ఇంకో తాడును తెచ్చి దానితో చేర్చగా, అదికూడా రెండంగుళాలు తక్కువే అయింది. బాలుని కడుపు ఈ విధంగా–

**క. తజ్జనని లోఁగిటంగల, రజ్జుపరంపరలఁ గ్రమ్మఱన్ సుతుఁ గట్టన్**
**బొజ్జ దిరిగి రా దయ్యె జ, గజ్జాలము లున్న బొజ్జఁ గట్టన్ వశమే? 385**

**ప్రతి :** తత్+జనని= ఆ తల్లి యశోద; లోఁగిటన్+కల= ఇంట్లో ఉన్నటువంటి; రజ్జుపరంపరలన్= తాళ్ళనన్నిటితో; క్రమ్మఱన్= తిరిగి; సుతున్ కట్టన్= కొడుకును కట్టడానికి యత్నించగా; బొజ్జ తిరిగి రాదు+అయ్యెన్= ఆ బాలకృష్ణుని కడుపు చుట్టి రాలేకపోయింది; జగత్+జాలములు+ఉన్న= సమస్తలోకాలూ నిండి వున్న; బొజ్జన్= పొట్టను; కట్టన్ వశమే?= కట్టుటకు శక్యమా?

**తా :** యశోద ఇంట్లో వున్న తాళ్ళనన్నిటినీ కలిపి కృష్ణుని బొజ్జచుట్టూ చుట్టిపెట్టినా చాలలేదు. ఎల్లలోకాలనూ తన కడుపులో ఉంచుకున్న ఆ పరమాత్ముని పొట్టను కట్టడానికి సాధ్యమవుతుందా?

**వ. అప్పు డా యవ్వయు గోపికలును వెఱంగుపడిరి, తదనంతరంబ. 386**

**ప్రతి :** అప్పుడు= ఆ సమయంలో; ఆ+అవ్వయున్= ఆ తల్లియైన యశోదా దేవియు; గోపికలును= ఇదంతా చూస్తున్న గోపకాంతలుకూడా; వెఱంగుపడిరి= ఆశ్చర్యపడ్డారు; తద్+అనంతరంబు+అ= పిమ్మట, తరువాత...

**తా :** అలా ఎన్ని తాళ్ళు చేర్చినా బాలకృష్ణుని కడుపు చుట్టి రావడానికి చాలకపోవడంతో యశోద, దీన్నంతటినీ చూస్తున్న గోపకాంతలు అందరూ కూడా ఎంతో ఆశ్చర్యపోయారు. తరువాత

**ఆ. ఒడలఁ జెమట లెగయ నుత్తరీయము జార, వీడి యున్న తుఱుము విరులు రాలఁ**
**గట్టరాని తన్నుఁ గట్టెద నని చింతఁ, గట్టుకొనిన తల్లిఁ గరుణఁ జూచి. 387**

**ప్రతి :** ఒడలన్= ఒళ్ళంతా; చెమటలు+ఎగయన్= చెమట పట్టి స్వేదబిందువులు చిందగా; ఉత్తరీయము= పైట; జారన్= జారిపోగా; వీడి+ఉన్న= విడిపోయివున్న; తుఱుము విరులు రాలన్= కొప్పులోని పూలు రాలిపోగా; కట్టరాని= బంధించడానికి వీలుకాని; తన్నున్= తనను (కృష్ణణ్ణి) కట్టెదను+అని= కట్టి వేస్తానని; చింతన్= విచారాన్ని; కట్టుకొనిన= పొందిన, వహించిన; తల్లిన్= యశోదను; కరుణన్+చూచి= దయతో చూచి...

**తా :** కొడుకు కనుక శిక్షించి బాగుచేయాలనే ప్రేమతో ప్రయత్నిస్తోంది – యశోద. ఆమె పడుతున్న శ్రమవల్ల ఒళ్ళంతా చెమట పట్టింది. పైట జారిపోయింది. కొప్పులో తురుముకున్న పూలు జలజల నేలమీద రాలిపోతున్నాయి. కట్ట శక్యం కాని తనను కట్టే ప్రయత్నంతో చింతిస్తున్న తల్లి యశోదమ్మను చూసి, పాపం కన్నయ్య కొంత జాలి చూపించి

**క. బంధవిమోచనుఁ డీశుఁడు, బంధింపఁ బెనంగు జననిపాటోర్చి సుహృ**
**ద్బంధుఁడు గావున జననీ, బంధంబునఁ గట్టువడియెఁ బాటించి నృపా! 388**

**ప్రతి :** నృపా= పరీక్షిన్మహారాజా!; బంధ విమోచనుఁడు= సంసారాది బంధాలను తొలగించేవాడు; ఈశుఁడు= విశ్వేశ్వరుడైన ఆ బాలకృష్ణుడు; బంధింపన్= తనను కట్టివేయుటకై; పెనంగు= ఎలాగైనా చేద్దామని ప్రయత్నించే; జనని= తల్లి యశోదయొక్క;

పాటు= కష్టాన్ని; ఓర్చి= సహించి; సుహృత్+బంధుఁడు కావునన్= తనకు ఆప్తులైన మంచిహృదయంగల భక్తులకు చుట్టంగా ఉండేవాడు కాబట్టి; జననీ బంధంబునన్= తల్లి అనే బంధంవల్ల, తల్లి బంధించడాన్ని; పాటించి= ఆదరించి; కట్టు+పడియెన్= బంధనానికి అంగీకరించాడు.

**తా :** రాజా! భగవంతుడు భవబంధాలను పోగొట్టేవాడు. అట్టివాణ్ణి బంధించే ప్రయత్నం శ్రమతో చేస్తున్న తల్లికష్టాన్ని గమనించి, తన ఆప్తులకు తాను బంధువు కాబట్టి, తల్లి కాబట్టి, తల్లి కట్టిన ఆ బంధానికి కట్టుబడ్డాడు.

**క. సంగడిఁ దిరిగెడు శంభుఁడు, నంగాశ్రయ యైన సిరియు నాత్మజుఁడై యు**
**ప్పొంగెడి పద్మజుఁడును గో, పాంగన క్రియఁ గరుణ వడయ రఖిలేశ్వరుచేన్. 389**

**ప్రతి :** సంగడిన్= స్నేహంతో; తిరిగెడు= ప్రవర్తించే; శంభుఁడును= శివుడునూ; అంగ+ఆశ్రయయైన= తన దేహంలో వక్షఃస్థలాన్ని ఆక్రమించి ఉండే; సిరియును= లక్ష్మీదేవియూ; ఆత్మజుఁడై= కుమారుడై; ఉప్పొంగెడి= ఆనందించే; పద్మజుఁడును= విష్ణువుయొక్క నాభికమలమునందు పుట్టిన బ్రహ్మయూ; వీరెవరూ కూడా; గోప+అంగన క్రియన్= నందగోపుని భార్యయైన యశోదవలె; అఖిల+ఈశ్వరుచేన్= జగదీశ్వరుడైన శ్రీకృష్ణునిచేత; కరుణన్+పడయరు= దయను పొందినవారు కారు.

**తా :** విష్ణుమూర్తికి శివుడు స్నేహితుడైనా ఆ శివుడుకానీ, నిత్యానపాయినియై దేహాన్నే అంటి పెట్టుకుని వక్షఃస్థలంపై అధివసించి ఉండే శ్రీమహాలక్ష్మికానీ, తన నాభికమలంనుండి పుట్టిన కుమారునిగా సంతోషించే ఆ బ్రహ్మకానీ, నందుని ఇల్లాలైన యశోదలా పరమేశ్వరుని దయకు పాత్రులు కాలేదు.

**క. జ్ఞానులచే మౌనులచే, దానులచే యోగసంవిధానులచేతం**
**బూని నిబద్ధుం డగునే, శ్రీనాథుఁడు భక్తియుతులచేతంబోలెన్? 390**

**ప్రతి :** శ్రీనాథుఁడు= లక్ష్మీవల్లభుడు; భక్తియుతులచేతన్+పోలెన్= తనయందు భక్తిభావంతో కూడిన వారిచేత కట్టుపడ్డట్లు; జ్ఞానులచేన్= వేద వేదాంతాది జ్ఞానం గలవారికి గానీ; మౌనులచేన్= నిరంతరం భగవన్నామ మననంతో మౌనులైన మునీశ్వరులకు గాని; దానులచేన్= ఎల్లప్పుడూ అర్థులకు దానం చేసే దాతలకు గానీ, యోగసంవిధానులచేతన్= యోగమార్గాన్ని అనుసరించేవారికిగానీ; పూని= ప్రయత్నించి; నిబద్ధుండు అగునే? కట్టుపడినవాడు అవుతాడా? కాడు.

**తా :** సర్వేశ్వరుడు తన భక్తులకు ఆధీనుడైనట్లు శ్రుతి, స్మృతి పురాణాది విజ్ఞానం కలవారిచేగానీ, మునీశ్వరులచే గానీ, దానగుణముండే దాతలైన ప్రసిద్ధి చెందినవారిచే గానీ, యమనియమాది అష్టాంగయోగమార్గాన్ననుసరించి ఉండేవారిచే గానీ పట్టుబడతాడా? పడడు.

**వ. అంత న య్యశోద యింటికడం బనులవెంటం దిరుగఁ గృష్ణుండు దొల్లి నారదుశాపంబున నిరుమద్దు లై యున్న నలకూబర మణిగ్రీవులను గుహ్యకుల నిద్దఱం గని తో లీద్చుకొని చనియె నని చెప్పిన శుకయోగివరునకు భూవరుం డిట్లనియె. 391**

**ప్రతి :** అంతన్= ఆ విధంగా కృష్ణుణ్ణి రోలుకు కట్టిన తరువాత; ఆ యశోద= ఆ యశోదమ్మ; ఇంటికడన్= తన గృహంవద్ద; పనుల వెంటన్ తిరుగన్= చేయవలసిన పనులకోసం తిరుగుతూ ఉండగా; కృష్ణుండు= రోటికి కట్టబడివున్న చిన్ని కృష్ణుడు; తొల్లి= పూర్వం; నారదు శాపంబునన్= నారదమహర్షియొక్క శాపంవల్ల; ఇరుమద్దులై= రెండు మద్దిచెట్లై; ఉన్న= ఉన్నట్టి;

నలకూబర మణిగ్రీవులు+అను= నలకూబరుడు, మణిగ్రీవుడు అనే; గుహ్యకులను+ఇద్దఱన్+కని= యక్షులను ఇరువురిని చూసి; ఱోలు+ఈడ్చుకొని= తాను కట్టుబడి ఉండే రోటిని ఈడ్చుకుంటూ, లాగుకుంటూ; చనియెన్= వెళ్లాడు; అని చెప్పిన; శుకయోగివరునకున్= శ్రేష్ఠుడైన శుకమహర్షితో; భూవరుండు= శ్రోతయైన పరీక్షిన్మహారాజు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికాడు.

**తా :** అలా కృష్ణుని పొట్టకూ, రోలుకూ కలిపి కట్టిన తరువాత యశోద ఇంట్లో చేయవలసిన పనులలో మునిగిపోయింది. పూర్వం నారదుడు ఇచ్చిన శాపంవల్ల రెండుమద్దిచెట్లుగా నిలిచిపోయిన యక్షులైన నలకూబర మణిగ్రీవులను చూచి, ఆ చెట్ల సమీపానికి కృష్ణుడు తనకు కట్టబడిన రోటిని లాగుకుంటూ వెళ్లాడు – అని శుకమహర్షి చెప్పగా విని, పరీక్షిన్మహారాజు ఇలా అన్నాడు.

**క. 'నారదుఁ డేల శపించెను?, వా రా వృక్షత్వమునకు వచ్చినపనికిం**
**గారణ మెయ్యది? యోగి కు, లారాధ్య! యెఱుంగఁ జెప్పుమయ్య! వినియెదన్.' 392**

**ప్రతి :** నారదుఁడు= నారద మహర్షి; ఏల శపించెను?= ఎందుకు శాపమిచ్చాడు? వారు= ఆ నలకూబర మణిగ్రీవులిద్దరు; ఆ వృక్షత్వమునకు వచ్చిన పనికిన్= అలా వృక్షరూపాలను పొందవలసిన కార్యానికి; కారణము+ఎయ్యది= ఏది నిమిత్తం; యోగికుల+ఆరాధ్య= యోగీశ్వరులచే పూజించదగిన ఓ శుకమహర్షీ!; ఎఱుంగన్+చెప్పుము+అయ్య= నాకు తెలిసేటట్లు చెప్పండి; వినియెదన్= వింటాను.

**తా :** నారదుడు శపించాడన్నారు, నారదుడు ఎందుకు శపించాడు! ఆ నలకూబరమణిగ్రీవులిద్దరూ మద్దిచెట్లుగా రూపొందాల్సిన కారణం ఏమిటి? పరమయోగులకును పూజ్యుడవైన ఓ శుకయోగీంద్రా! నాకు ఈ విషయాన్ని తెలియజేస్తే వింటాను అని అడిగాడు – పరీక్షిన్మహారాజు.

**వ. అనిన శుకుం డిట్లనియె – 'మున్ను కుబేరునికొడుకు లిరువురు శంకరకింకరులై యహంకరించి వెండికొండమీఁద విరులతోఁటలం బాడెడి చేడియలం గూడికొని కరేణుసంగతంబు లైన యేనుంగులభంగి సురంగంబు లైన మందాకినీతరంగంబులం గ్రీడింప, నారదుండు వచ్చిన నచ్చెలువలు సెచ్చెర వలువలు ధరియించిరి, మదిరాపానపరవశులు గావున వారలిరువురు వివస్త్రులై మెలంగుచున్న నా మునీశ్వరుండు సూచి శపియించువాఁడై ప్రతీతంబగు గీతంబు వాడె, వినుము. 393**

**ప్రతి :** అనినన్= పరీక్షిన్మహారాజట్లడుగగా; శుకుండు= శుకమహర్షి; ఇట్లు అనియెన్= ఇలా చెప్పబోవు రీతిగా అన్నాడు; మున్ను= పూర్వం; కుబేరునికొడుకులు ఇరువురు= కుబేరునిపుత్రులైన ఇద్దరు, నలకూబరమణిగ్రీవులనేవారు; శంకర కింకరులు+ఐ= శివునిసేవకులై; అహంకరించి= గర్వించి; వెండికొండమీఁదన్= కైలాసపర్వతంపై; విరులతోటలన్= పూలతోటలలో, (ఉద్యానవనాలలో); పాడెడి= గానంచేసే; చేడియలన్= స్త్రీలను; కూడికొని= కలిసి; కరేణు సంగతంబులు+ఐన= ఆడఏనుగులతో కూడివున్న; ఏనుంగులభంగిన్= మగఏనుగులవలె; సురంగంబులు+ఐన= చక్కగా వ్యాపిస్తున్న (ఒక రకమైన పూలమొక్కలతో కూడిన); మందాకినీ తరంగంబులన్= ఆకాశ గంగా ప్రవాహంయొక్క అలలలో; క్రీడింపన్= జలకాలాటలు ఆడుచుండగా; నారదుండు వచ్చినన్= దేవర్షి నారదుడు రాగా; ఆ+చెలువలు= ఆ కాంతలు; చెచ్చరన్= వెనువెంటనే; వలువలు ధరియించిరి= వస్త్రాలు కట్టుకున్నారు; మదిరాపాన పరవశులు కావునన్= మద్యపానం చేసినందున ఒళ్ళెరుగనివారు కాబట్టి;

వారలు+ఇరువురును= నలకూబరమణిగ్రీవులిద్దరూ; వివస్త్రులు+ఐ= వస్త్రాలులేకుండా దిగంబరులై; మెలంగుచున్+ఉన్నన్= తిరుగుచుండగా; ఆ మునీశ్వరుండు+చూచి= ఆ నారదమహర్షి వారిని పరికించి; శపియించువాఁడు+ఐ= శాపం ఇచ్చుటకు నిర్ణయించుకున్నవాడై; ప్రతీతంబు+అగు= ప్రసిద్ధమైన; గీతంబున్= పాటను; పాడెన్= పాడాడు; వినుము= దాన్ని వివరిస్తాను ఆకర్ణింపుము.

**తా :** పరీక్షిత్తుతో శుకమహర్షి ఇలా చెపుతున్నాడు. పూర్వం ఒకనాడు కుబేరుని కుమారులైన నలకూబరమణిగ్రీవులనే వారు శివునిసేవకులై సేవిస్తూ, ఆ గర్వంతో కైలాసపర్వతంపై ఉన్న ఒక పూలతోటలో గానంచేసే గంధర్వకాంతలతో కలిసి, ఆడేనుగులతో కలిసిన మగఏనుగులవలె చక్కని ఆకాశగంగాతరంగాలలో క్రీడిస్తూ ఉండగా, నారదమహర్షి అక్కడకు వచ్చాడు. అప్పుడు ఆ కాంతలు గబగబా తమ తమ వస్త్రాలను ధరించారు. కానీ మద్యపానంవల్ల కలిగిన మత్తున్న వారు కాబట్టి ఆ ఇద్దరూమాత్రం దిగంబరులుగానే కనిపించారు. నారదమహర్షి వారిద్దరినీ శపించాలనుకొని ఓ ప్రసిద్ధమైన గీతాన్ని గానంచేశాడు. ఆ గీతం విను.

**శా. 'సంపన్నుం డొరుఁ గానలేఁడు తనువున్ సంసారమున్ నమ్మి హిం**
**సింపం జూచు, దరిద్రుఁ డెత్తువడి శుష్కీభూతుఁడై చిక్కి హిం**
**సింపం డన్యుల నాత్మకున్ సములుగాఁ జింతించు నట్టౌటఁ ద**
**త్సంపన్నాంధున కంజనంబు వినుమీ దారిద్ర్య మూహింపఁగన్. 394**

**ప్రతి :** సంపన్నుండు= ధనవంతుడు; ఒరున్= ఇతరుణ్ణి; కానలేఁడు= చూడలేడు ఎదుటి మనిషి అతడి కంటికి ఆనడన్న మాట; తనువున్= శరీరాన్ని; సంసారమున్= తన భార్యాపుత్రరూప సంసారాన్ని; నమ్మి= నమ్ముకొని, అవే స్థిరములనుకొని; హింసింపన్+చూచున్= ఇతరులను బాధించాలని చూస్తాడు, బాధిస్తాడు; దరిద్రుఁడు= పేదవాడు; ఎత్తువడి= దీనావస్థలో చిక్కి; శుష్కీభూతుఁడు+ఐ= ఎండిన శరీరం కలవాడై, కష్టాలు అనుభవిస్తూ; చిక్కి= కృశించి; హింసింపండు= బాధించడు; అన్యులన్= ఇతరులను; ఆత్మకున్= తనతో; సములుగాన్= సమానంగానే; చింతించున్= తలుస్తాడు; అట్ట+ఔటన్= అలా కావడంచేత; తత్+సంపన్న+అంధునకున్= పైన చెప్పినట్టి ధనవంతుడైన గుడ్డివానికి; ఊహింపన్+కన్= ఆలోచిస్తే; దారిద్ర్యము= పేదరికం; అంజనంబు= కాటుక అవుతుంది; వినుము= వినండి.

**తా :** లోకంలో ధనవంతుడైనవాడు ఎదుటివారిని ఏ మాత్రం గుర్తించడు, గౌరవించడు. తన దేహం, తన కుటుంబం అంటూ అవే శాశ్వతమనుకుని, ఎదుటివారిని బాధిస్తాడు. పేదవాడైతే ఎండిన, నీరసించిన శరీరంతో కృశిస్తూ అయినా సరే ఎవరినీ హింసించకుండా ఇతరులందరూ తనతో సమానులే అనే భావంతో చూస్తాడు. కనుక ధన మదాంధులైనవారికి దారిద్ర్యమే చక్కని అంజనం అవుతుంది.

**వ. అని గీతంబు వాడి తన మనంబున. 395**

**ప్రతి :** అని= పై విధంగా అన్న; గీతంబు= పాటను; పాడి= గానంచేసి; తన మనంబునన్= తన మనస్సులో...

**తా :** పైవిధంగా సంపన్నునికి, పేదవానికీ గల భేదాన్ని తెలిపే పాటను పాడిన తరువాత నారదుడు తన మనస్సులో

**క. కలవానిసుతుల మనుచును, గలకంఠులతోడఁ గూడి కానరు పరులం**
**గలలో నైనను, వీరికిఁ, గల క్రొ వ్వడఁగించి బుధులఁ గలుపుట యొప్పున్. 396**

**ప్రతి :** కలవాని సుతులము= సంపదగలవాని పుత్రులము, ధనదుడైన కుబేరుని కొడుకులం; అనుచునున్= అనుకుంటూ; కలకంఠులతోడన్= స్త్రీలతో; కూడి= కలిసి; కలలోనైనను= స్వప్నంలోనైనాసరే; పరులన్= ఇతరులను; కానరు= చూడరు, లక్ష్యంచేయరు; కాబట్టి; వీరికిన్= ఇలా సంపదచే కన్నుగానని వీరిద్దరికీ; కల క్రొవ్వు= ఏర్పడి ఉన్న మదాన్ని, గర్వాన్ని; అడఁగించి= అణచివేసి; బుధులన్= జ్ఞానులతో (మంచివారితో); కలుపుట= కూడునట్లు చేయడం; ఒప్పున్= తగును.

**తా :** ఈ నలకూబరమణిగ్రీవులిద్దరూ ధనపతియైన కుబేరునికొడుకులమనే గర్వంతో, ప్రేయసులతో గూడి స్వప్నంలో సైతం ఎవరినీ లక్ష్యపెట్టడం లేదు. కాబట్టి వీరికేర్పడిన ఈ మదాన్ని పోగొట్టి, ఉత్తములగువారితో కలిసేటట్లు చేయడమే యుక్తమనుకున్నాడు – నారదుడు.

**విశే :** లోకంలో సాధారణంగా 'మత్తు' కలిగించే వాటిలో ధనం ప్రధానం. అందుకే ధనమదాంధులంటారు.

**యౌవనం ధనసంపత్తిః ప్రభుత్వం అవివేకితా ।**
**ఏకైకమప్యనర్థాయ కిము యత్ర చతుష్టయమ్? ॥** అన్నది హితోపదేశం

యౌవనం, ధనం, అధికారం, అవివేకం ఒక్కొక్కటే అనర్థాన్ని కల్గిస్తాయి. ఇక నాల్గూ ఒకేచోట ఉంటే చెప్పేదేముంది? సర్వనాశనం తప్పదు.

**వ. అని చింతించి విజ్ఞానవిశారదుండగు నారదుండు నలకూబరమణిగ్రీవులం జూచి మీరలు స్త్రీమదాంధులరు గావున భూలోకంబున నర్జునతరువులై నూఱుదివ్యవర్షంబు లుండుం, డట మీఁద గోవిందచరణారవిందపరిస్పందంబున. 397**

**ప్రతి :** విజ్ఞాన విశారదుండు+అగు నారదుండు= బ్రహ్మజ్ఞానసంపన్నుడైన నారదమహర్షి; అని చింతించి= పూర్వం చెప్పబడిన విధంగా ఆలోచించి; నలకూబరమణిగ్రీవులన్ చూచి= నలకూబర మణిగ్రీవులనిద్దరినీ చూచి; మీరలు= మీరు; స్త్రీమద+అంధులరు= ఆడువారిసంగమం అనే మత్తులోపడి గుడ్డివారైనవారు; కావునన్= కాబట్టి, భూలోకంబునన్= మర్త్యలోకంలో; అర్జునతరువులు+ఐ= మద్దిచెట్లుగా పుట్టి; నూఱు దివ్యవర్షంబులు ఉండుడు= దేవమానం ప్రకారం వంద సంవత్సరాలు ఉండండి; అటమీఁదన్= ఆపై, అనంతరం; గోవింద చరణ+అరవింద పరిస్పందంబునన్= శ్రీకృష్ణుని పాదపద్మములు తాకుటతో...

**తా :** విశేషజ్ఞాని అయిన నారదమహర్షి పైన చెప్పిన విధంగా ఆలోచించినవాడై నలకూబరమణిగ్రీవులతో 'మీరిద్దరూ స్త్రీల సంగమం అనే మత్తుచేత ఏమీ కానలేని గుడ్డివారుగా ప్రవర్తిస్తున్నారు. కాబట్టి మీరు భూలోకంలో మద్దిచెట్ల రూపం పొంది, దేవతల కాలమానంలో ఒక వంద సంవత్సరాలు అలా వుండి, అనంతరం శ్రీకృష్ణపరమాత్మ పాదస్పర్శతో

**క. ముక్తులరై నారాయణ, భక్తులరై పరమసాధుభావ శ్రీ సం**
**సక్తులరై సురలోక, వ్యక్తుల రయ్యెదరు నాదువాక్యముకతనన్. 398**

**ప్రతి :** నాదువాక్యము కతనన్= నా మాట కారణంగా, మీరు; ముక్తులరు+ఐ= దోషమునుండి విడువబడ్డవారై; నారాయణ భక్తులరు+ఐ= నారాయణుణ్ణి సేవించే భక్తులై; పరమసాధుభావ శ్రీసంసక్తులరు+ఐ= ఉత్తమమైన స్వభావ రూపసంపదతో కూడినవారై; సురలోక వ్యక్తులరు+అయ్యెదరు= తిరిగి దేవలోకంలో ఉన్నవారవుతారు.

**తా :** మీరిద్దరూ నేను పైన చెప్పిన ప్రకారంగా, శాపవిమోచనం పొంది, దుర్విషయాలనుండి దూరమై శ్రీమన్నారాయణుని భక్తులుగా, చక్కని స్వభావరూపసంపదకలవారై తిరిగి దేవలోకనివాసులవుతారు'.

**వ. అని యిట్లు పలికి, నారదుండు నారాయణాశ్రమంబునకుం జనియె. వా రిరువురును సంగడి మద్దులైరి. పరమభాగవతుండైన నారదుమాటలు వీటింబుచ్చక పాటించి. 399**

**ప్రతి :** అని ఇట్లు పలికి= వారిరువురుతో ఈ విధంగా చెప్పి; నారదుండు= నారదమహర్షి; నారాయణ ఆశ్రమంబునకున్= నారాయణ ఆశ్రమానికి; చనియెన్= వెళ్ళిపోయాడు; వారు+ఇరువురు= వారిద్దరూ; సంగడి మద్దులు+ఐరి= జంట మద్ది మానులైనారు; పరమభాగవతుండు+ఐన= భాగవతులలో, భగవద్భక్తులలో శ్రేష్ఠుడైన; నారదుమాటలు= నారదుడు పలికిన పలుకులను; వీటిన్ పుచ్చక= అలక్ష్యం చేయకుండా; పాటించి= ఆదరించి...

**తా :** వారిద్దరినీ శపించి, శాపావసానవిషయంకూడా చెప్పి, నారదమహర్షి నారాయణాశ్రమానికి వెళ్ళిపోయాడు. ఆ నలకూబరమణిగ్రీవులిద్దరూ రెండుమద్దిచెట్లుగా మారారు. భగవద్భక్తులలో శ్రేష్ఠతముడైన నారదుడన్న మాటలను వ్యర్థమైనవిగా భావించకుండా, వాటినెంతో ఆదరించి

## ❖ చిన్నికృష్ణుఁడు మద్దిచెట్లను కూల్చుట ❖

**క. ముద్దుల తక్కరి బిడ్డఁడు, మద్దులఁ గూల్పంగఁ దలఁచి మసలక తా నా**
**మద్దికవ యున్న చోటికి, గ్రద్దన ఱో లీడ్చుకొనుచుఁ గడఁకం జనియెన్. 400**

**ప్రతి :** ముద్దుల తక్కరి బిడ్డఁడు= ముద్దులొలికే టక్కులమారియైన బాలుడు(బాలకృష్ణుడు); మద్దులన్= ఆ మద్దిచెట్లను; కూల్పన్+కన్+తలఁచి= పడవేయాలని భావించి; మసలక= జాగుచేయక; తాన్= అతడు; ఆ మద్దికవ ఉన్నచోటికిన్= ఆ జంట మద్దిచెట్లున్న ప్రదేశానికి; గ్రద్దనన్= వేగంగా; ఱోలు+ఈడ్చుకొనుచున్= తనను కట్టినరోటిని లాగుకుంటూ; కడఁకన్= పూనికతో; చనియెన్= వెళ్లాడు.

**తా :** ఆ కపట బాలుడైన కృష్ణుడు మద్దిచెట్లను కూల్చి, నలకూబర మణిగ్రీవులను శాపంనుండి విముక్తులను చేసేలా, ఏ మాత్రం ఆలస్యం చేయకుండా ఆ మద్దిచెట్లున్న చోటికి రోటిని ఈడ్చుకుంటూ ఒక ప్రయత్నంగా వెళ్లాడు.

**వ. చని యా యూర్జిత మహాబలుండు నిజోదరదామసమాకృష్యమాణతిర్యగ్భవదులూఖలుండై యా రెండుమ్రాఁకుల నడుమం జొచ్చి ముందటికి నిగుడుచు. 401**

**ప్రతి :** చని= అలా వెళ్ళి, ఆ ఊర్జిత మహాబలుండు= దృఢమైన బలం కలిగిన ఆ శ్రీకృష్ణుడు, నిజ+ఉదర దామ సమాకృష్యమాణ తిర్యక్ భవత్ ఉలూఖలుండు+ఐ= తన కడుపునకు కట్టివున్న తాడుతో లాగబడుటచే అడ్డంగా అయిన రోలుకలవాడై; ఆ రెండుమ్రాకులనడుమన్+చొచ్చి= ఆ రెండు మద్దిచెట్ల మధ్యలో చేరి; ముందటికిన్= ముందుకు; నిగుడుచున్= సాగుతూ...

**తా :** సహజ సిద్ధంగా మహాబల సంపన్నుడైన ఆ బాలకృష్ణుడు తన పొట్టకు కట్టిన తాడును లాగడంవల్ల అడ్డంగా తిరిగిన రోటితో ఆ రెండు మద్దిచెట్లమధ్యలో ప్రవేశించి ముందుకు సాగుతూ

**క. బాలుఁడు ఱో లడ్డము దివ, మూలంబులు వెకలి విటపములు విఱిగి మహా**
**భీలధ్వనిఁ గూలెను శా, పాలస్యవివర్జనములు యమళార్జునముల్. 402**

**ప్రతి :** బాలుcడు= శ్రీకృష్ణుడు; ఱోలు అడ్డము+తివన్= రోటిని అడ్డంగా లాగగా; శాప+ఆలస్య వివర్జనములు= శాపంయొక్క అలసత్వాన్ని విడిచినవి అయిన అనగా శాపంతొలగిన; యమళ+అర్జునముల్= జంట మద్దిచెట్లు, మూలంబులు= వ్రేళ్ళు; పెకలి= పెల్లగిల్లి; విటపములు= కొమ్మలు; విఱిగి= తెగిపడి; మహత్+ఆభీల ధ్వనిన్= గొప్పభయంకరమైన శబ్దంతో; కూలెన్= నేల పడిపోయాయి.

**తా :** ఎప్పుడైతే శ్రీకృష్ణుడు చెట్లకు అడ్డంగా తిరిగిన రోటిని ముందుకు ఈడ్చుకుంటూ వెళ్తున్నాడో, నారదుడు చెప్పిన ప్రకారం శ్రీకృష్ణునిపాదారవిందస్పర్శ కలగడంతో, శాపావసానాన్ని పొందిన ఆ జంటమద్దిచెట్లు మూలం పెల్లగిలి కొమ్మలు విరిగిపడుతూండగా గొప్ప భయంకరధ్వని చేస్తూ నేల కూలాయి.

**వ. ఇట్లు నిర్మూలంబు లయి పడిన సాలంబులలోనుండి కీలికీలలు వెల్వడు పోలిక నెక్కుడు తేజంబున దిక్కులు పిక్కటిల్లం బ్రసిద్ధులైన సిద్ధు లిద్దఱు వెడలివచ్చి ప్రబుద్ధులై భక్తలోకపాలకుండైన బాలకునకు మ్రొక్కి లేచి కరకమలంబులు మొగిచి యిట్లనిరి. 403**

**ప్రతి :** ఇట్లు నిర్మూలంబులు+అయి పడిన= ఈ రీతిగా వేళ్ళతో పెకలిన మూలంగా కూలిన; సాలంబులలోనుండి= ఆ మద్ది చెట్లలోనుండి; కీలికీలలు వెల్వడు పోలికన్= అగ్నిజ్వాలలు వెడలిన విధంగా; ఎక్కుడు తేజంబునన్= అధికమైన ప్రకాశంతో; దిక్కులు పిక్కటిల్లన్= నలుదిక్కులు నిండినట్లు; ప్రసిద్ధులు+ఐన= ప్రఖ్యాతులైన; ఇద్దఱు సిద్ధులు= ఇరువురు సిద్ధపురుషులు; వెడలి వచ్చి= బయటికి వచ్చి; ప్రబుద్ధులు+ఐ= ముందటి జ్ఞానంకలవారై; భక్తలోక పాలకుండు+ఐన= తనను సేవించిన భక్తజనానికి రక్షకుడైన; బాలకునకున్= బాలుని రూపంలో వున్న శ్రీకృష్ణమూర్తికి; మ్రొక్కి= నమస్కరించి; లేచి= నిల్చుని; కరకమలంబులు మొగిచి= పద్మాలవంటి చేతులను అంజలిపూర్వకంగా జోడించి; ఇట్లు అనిరి= ఇలా అన్నారు.

**తా :** ఈ విధంగా వేళ్ళతో సహా పెకలింపబడిన ఆ మద్దిచెట్లు నేలకూలగా, ఆ చెట్లలో నుండి అగ్నిశిఖలు వెలువడినట్లు మిక్కిలి ప్రకాశంతో దిక్కులు పిక్కటిల్లేలా ప్రసిద్ధులైన ఇద్దరు దేవజాతికి చెందిన సిద్ధులు బయటకు వచ్చారు. అలా వచ్చి, ముందటి జ్ఞానంతో భక్తుల పాలిట రక్షకుండైన ఆ బాలకృష్ణమూర్తికి నమస్కరించి, లేచి, హస్తపద్మాలను జోడించి, అంజలి ఘటిస్తూ ఇలా అన్నారు.

**క. బాలుcడవె నీవు? పరుcడ వ, నాలంబుcడ వధికయోగి వాద్యుcడవు తను**
**స్థూలాకృతి యగు విశ్వము, నీ లీలారూప మండ్రు నిపుణులు కృష్ణా! 404**

**ప్రతి :** ఓ కృష్ణా!, నీవు= ఈ రూపంలో వున్న నీవు; బాలుcడవు+ఏ= బాలకుడివా!?; పరుcడవు= అన్నిటికీ అతీతమైన పరబ్రహ్మవు; న+ఆలంబుcడవు= ఏ ఆధారం అక్కరలేనివాడవు; అధిక యోగివి= మహాయోగివి; ఆద్యుcడవు= సృష్టి స్థితి లయభూతమైన ఈ విశ్వానికి మొదటివాడివి; నిపుణులు= జ్ఞానులు; తను స్థూల+ఆకృతియగు విశ్వము= సూక్ష్మమైన, విశాలమైన ఆకారంగల ఈ ప్రపంచం; నీ లీలా రూపము+అండ్రు= నీ విలాసరూపమే నంటారు.

**తా :** నారదశాపంనుండి విముక్తిపొందిన వారిద్దరూ, శ్రీకృష్ణుణ్ణి ఇలా స్తుతిస్తున్నారు. ఓ కృష్ణా! నీవు బాలుడివి కావు. అణువుకంటె అణువుగా, మహత్తుకంటె మహత్తుగా ఉండే పరబ్రహ్మవు. నీకు నీవే కాని వేరే ఆధారం అక్కరలేనివాడివి. విశ్వస్థితికి నీవే మూలపురుషుడివి. ఈ సూక్ష్మస్థూల రూపమైన, చరాచరమైన ఈ జగత్తు నీ విలాసరూపమని జ్ఞానులైనవారు భావిస్తారు.

సీ. ఎల్లభూతంబుల కింద్రియాహంకృతి ప్రాణంబులకు నధిపతివి నీవ!
ప్రకృతియుఁ బ్రకృతిసంభవమహత్తును నీవ, వీని కన్నిటికిని విభుఁడ వీవ,
ప్రాకృతగుణవికారములఁ బొందక పూర్వసిద్ధుండ వగు నిన్నుఁ జింత సేయ
గుణవృతుం డోపునే? గుణహీన! నీ యంద, కల గుణంబుల నీవ కప్పఁబడుదు,

తే. మొదల నెవ్వని యవతారములు శరీరు, లందు సరిదొడ్డు లేని వీర్యములఁ దనువు,
లడర జన్మించి వారలయందుఁ జిక్క, వట్టి పరమేశ! మ్రొక్కెద మయ్య! నీకు. 405

ప్రతి : ఎల్లభూతంబులకున్= సకల ప్రాణికోటికీ; ఇంద్రియ అహంకృతి ప్రాణంబులకున్= జ్ఞానేంద్రియ కర్మేంద్రియాలకు, అహంకారానికి, పంచప్రాణాలకు; అధిపతివి= ప్రభుడవు; నీవు+అ= నీవే!; ప్రకృతియున్= సృష్టి స్థితి లయ సాధనమైన నీ శక్తియైన ప్రకృతియు; ప్రకృతి సంభవ మహత్తును= అట్టి ప్రకృతివల్ల పుట్టిన మహత్తత్త్వమూ; నీవ= నీవే; వీనికిన్+ అన్నిటికిన్= ఈ చెప్పబడిన ప్రకృత్యాదులన్నిటికీ; విభుడఁవు ఈవ= అధిపతివి నీవే!; ప్రాకృత గుణ వికారములన్+పొందక= ప్రకృతి సంబంధమైన సత్త్వరజస్తమోరూపగుణాలకు సంబంధించిన జననాదిఎట్టివికారాలు పొందక; పూర్వ సిద్ధుండవు= వాటికి పూర్వమే స్వప్రకాశంతో వున్నవాడివి; అగు= అయినట్టి; నిన్నున్= నిన్ను; చింత+చేయన్= ధ్యానించడానికి; గుణవృతుండు= గుణాలతో ఆవరింపబడినవాడు, కామక్రోధ లోభమోహ మదమాత్సర్యాది దుర్గుణాలతో నిండిన మానవుడు; ఓపున్+ఏ= నిన్ను ధ్యానించుటకు సమర్థుడగునా? కాదు. గుణహీన!= సత్త్వరజస్తమోగుణాలకు అతీతుడవైన ఓ కృష్ణా!; నీయందు+అ= నీలోనే; కల గుణంబులన్= ఉన్న గుణాలతో; నీవు+ఆ= నీయంతట నీవే; కప్పన్+పడుదువు= కప్పబడతావు; (ఆచ్ఛాదింపబడతావు); మొదలన్= తొలుత; ఎవ్వని అవతారములు= ఏ సర్వాత్మకుని మత్స్యకూర్మాదిఅవతారాలు; శరీరుల+ అందున్= దేహధారులందు; సరి= సమానత్వం; దొడ్డు= ఆధిక్యం; లేని= లేనట్టి; వీర్యములన్= ప్రభావాలచేత; తనువులు= దేహాలు; అడరన్= వర్ధిల్లుచుండగా; జన్మించి= పుట్టి; వారల+అందున్= ఆ శరీరధారులలో; చిక్కవు= దొరకవో; అట్టి= ఇటువంటి రూపంగల; పరమేశ= ఓ భగవంతుడా; నీకున్= నీకు; మ్రొక్కెదము+అయ్య= నమస్కరిస్తాము స్వామీ!

**తా :** ఓ కృష్ణా! ఈ సృష్టిలో అన్ని జీవరాసులకూ, సర్వేంద్రియ, అహంకార, ప్రాణాలకూ అధిపతివి నీవే! ప్రకృతి స్వరూపుడవు నీవే! దానినుండి పుట్టిన మహత్తత్త్వానివీ నీవే! వీటన్నిటికీ అధిపతివీ నీవే! ప్రకృతి సంబంధ గుణాలవల్ల ఏ వికారాన్నీ పొందక వాటి కన్నింటికీ ముందే ఉన్నవాడివి నీవు. ప్రాకృతగుణాలతో కూడినవాడు వాటికతీతుడవైన నిన్నేవిధంగా ధ్యానం చేయగలడు? నీవు గుణాతీతుడవు. నీలో ఉన్న గుణాలతో నీవు కప్పబడి రహస్యంగా వుంటావు. శరీరాలు ధరించిన ఎవరూ నీ మత్స్యకూర్మాది అవతారవైభవాలకు సాటిరారు. ఈ జీవులంతా నీ తేజస్సుతో పుడతారు. కనుక నీవు వాళ్లకు అంతు చిక్కవు. సాటిలేని ప్రభావం కలవాడవగుటచే వారిలా చిక్కులలోపడి, సంకటపడక చరించే సర్వోత్కృష్టుడవైన నీకు నమస్కరిస్తున్నాము.

క. భువనములు సేయఁ గావఁగ, నవతీర్ణుఁడ వైతి కాదె యఖిలేశ్వర! యో
గి వరేణ్య! విశ్వమంగళ!, కవిసన్నుత! వాసుదేవ! కల్యాణనిధీ! 406

ప్రతి : అఖిల+ఈశ్వర= సర్వజగత్తునకు ప్రభువా! యోగివరేణ్య= యోగులలో శ్రేష్ఠుడా! విశ్వమంగళ= విశ్వమంతటికీ శుభములు కలిగించేవాడా!; కవి సన్నుత= కవీశ్వరులచేత నుతింపబడ్డవాడా! వాసుదేవ= జగాలన్నీ నీలో గలవాడా!, జగాలలో నీవూ ఉండేవాడా!; కల్యాణనిధీ= శుభకరమైన గుణాలకు స్థానభూతమైనవాడా!; భువనములు= లోకాలను; చేయన్= సృష్టించడానికి; కావన్+కన్= రక్షించడానికి; అవతీర్ణుఁడవు+ఐతి(వి)కాదె= అవతరించావు గదా!

**తా :** ఈ లోకాలన్నింటిని సృష్టించడానికి, రక్షించడానికి అవతరించావు. నీవు అంతటికీ ఈశ్వరుడవు. యోగిగణాలలో శ్రేష్ఠుడవు. లోకకల్యాణకారకుడివి. కవీశ్వరులచే సన్నుతింపబడేవాడివి. సకలలోకాలూ నీలో, సకల లోకాల్లో నీవూ ఉన్నాడవు. జగత్కల్యాణకారక గుణాలకు ఆధారభూతుడివి.

**ఉపేంద్రవజ్ర.**

**తపస్వివాక్యంబులు దప్ప వయ్యెన్, నెపంబునం గంటిమి నిన్నుఁ జూడం**
**దపంబు లొప్పెన్, మముఁ దావకీయ, ప్రపన్నులం జేయుము భక్తమిత్రా! 407**

**ప్రతి :** భక్తమిత్రా= భక్తులకు మిత్రుడా! తపస్వివాక్యంబులు= నారద మహర్షి మాటలు; తప్పవు+అయ్యెన్= యథార్థమయ్యాయి; నెపంబునన్= ఆ నారదుని శాపం అనే కారణంగా; నిన్నున్+చూడన్+కంటిమి= నిన్ను చూడ గలిగాము; తపంబులు+ఒప్పెన్= నిన్ను చూడాలనే తపనతో మేము చేసిన తపస్సులు ఫలించాయి; మమున్= మమ్ములను; తావకీయ ప్రపన్నులన్= నీ యొక్క భక్తులుగా (ప్రపత్తి కలవారుగా); చేయుము= అనుగ్రహింపుము.

**తా :** భక్తులపాలిట మిత్రుడా! ఓ శ్రీకృష్ణా! నారదమహాముని మాటలు (శాపవాక్యాలు) తప్పకుండా నిజమే అయ్యాయి. ఆ శాపం నిమిత్తంగానే నిన్ను దర్శింపగలిగాం. మేము నీ కోసం చేసిన తపస్సు ఫలించింది. మా యిద్దరినీ నీయందు ప్రపత్తి గల భక్తులుగా అనుగ్రహించు.

**విశే :** ఇది ఉపేంద్ర వజ్ర అనే ఒక వృత్తం. ఇందులో ప్రతి పాదానికీ వరుసగా "జ – త – జ – గ – గ" అనే గణాలు ఉంటాయి. 8వ అక్షరం యతి. ప్రాసనియమం ఉంటుంది.

**శా. నీ పద్యావళు లాలకించు చెవులున్ ని న్నాడు వాక్యంబులున్**
**నీ పేరం బనిసేయు హస్తయుగముల్ నీ మూర్తిపైఁ జూపులున్**
**నీ పాదంబులపొంత మ్రొక్కు శిరముల్ నీ సేవపైఁ జిత్తముల్**
**నీపై బుద్ధులు మాకు నిమ్ము కరుణన్ నీరేజపత్రేక్షణా! 408**

**ప్రతి :** నీరేజపత్ర+ఈక్షణా! = పద్మదళాలవంటి కన్నులుగలవాడా! ఓ శ్రీకృష్ణా!; మాకున్= మా యిద్దరికీ; నీ పద్య+ఆవళులు= నీ తత్త్వాన్ని వర్ణించే స్తుతులన్నింటినీ; ఆలకించు= వినేటటువంటి; చెవులున్= శ్రోత్రేంద్రియాలను; నిన్నున్ ఆడు వాక్యంబులున్= నీకు సంబంధించిన మాట్లాడేమాటలను; నీ పేరన్+పనిచేయు= ఏ పనైనా నీ నామంతో కూడేలా; హస్తయుగమున్= రెండుచేతులను; నీ మూర్తిపైన్= నీ రూపంమీదే లగ్నమయ్యే; చూపులున్= దృష్టినీ; నీ పాదంబుల పొంతన్= నీ చరణాలవద్దే; మ్రొక్కు= నమస్కరించే; శిరముల్= తలలను; నీ సేవపైన్= నిన్ను సేవించుటయందే లగ్నమైన; చిత్తముల్= మనసులను; నీ పైన్= నీయందే స్థిరంగావుండే; బుద్ధులున్= బుద్ధులను; కరుణన్= దయతో; ఇమ్ము= ప్రసాదించుము.

**తా :** ఓ కృష్ణమూర్తీ! నీవు మాయందు కరుణతో – మా చెవులెప్పుడూ నీ స్తోత్రాలే వినేటట్లుగా, మా వాక్కులు నీకు సంబంధించిన మాటలే మాట్లాడేటట్లుగా, చేతులు రెండూ నీకు సంబంధించిన కైంకర్యాదులే పనులే చేసేటట్లుగా, నీ దివ్యమంగళ మూర్తిపైనే మా చూపులుండేటట్లుగా, నీ చరణాల చెంతనే మా శిరస్సులెప్పుడూ మొక్కేలా, మా మనస్సులు నిన్నే సేవించేలా, నీపైనే మా బుద్ధులుండేలా, మమ్ములను అనుగ్రహించు.

**వ. అని యిట్లు కీర్తించిన గుహ్యకులం జూచి నగుచు నులూఖల బద్ధుండైన హరి యిట్లనియె. 409**

**ప్రతి :** అని ఇట్లు= అని ఈ విధంగా; కీర్తించిన= స్తుతించిన; గుహ్యకులన్ చూచి= యక్షులైన నలకూబర మణిగ్రీవులను చూచి; నగుచున్= నవ్వుతూ; ఉలూఖల బద్ధుండు+ఐన= రోటికి కట్టబడివున్న; హరి= శ్రీకృష్ణుడు; ఇట్లు అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** పై రీతిగా తనను స్తోత్రం చేసిన ఆ నలకూబరమణిగ్రీవులతో రోటికి కట్టబడే ఉన్న శ్రీకృష్ణుడు ఇలా అన్నాడు.

**క. 'తమతమధర్మము దప్పక, సములై నను నమ్మి తిరుగు సభ్యులకును బం**
**ధము నన్నుఁ జూడ విరియును, గమలాప్తుఁడు వొడమ విరియు ఘనతమము క్రియన్. 410**

**ప్రతి :** తమతమ ధర్మమున్= లోకంలో ఎవరెవరికి ఏది ధర్మంగా చెప్పబడిందో వారందరూ తమకు నిర్దేశింపబడిన మార్గాన్ని; తప్పక= తప్పకుండా; సములు+ఐ= అందరియందు భేదబుద్ధిలేక సమానభావంకలవారై; ననున్ నమ్మి తిరుగు= నన్నే అనన్య భక్తితో నమ్మి చరించే; సభ్యులకును= సజ్జనులైనవారికి, యోగ్యులైనవారికి; బంధము= అజ్ఞాన రూపమైన బంధం; కమల+ఆప్తుఁడు= పద్మములకు మిత్రుడైన సూర్యుడు, పొడమన్= ఉదయించగా; విరియు= తొలగిపోయే; ఘనతమము క్రియన్= దట్టమైన చీకటిలా; నన్నున్+చూడన్= నన్ను చూచినంతనే; విరియును= తొలగిపోతుంది.

**తా :** లోకంలో తమ తమ వర్ణాశ్రమాలకు విధింపబడిన ధర్మాన్ని వీడకుండా అందరియందునూ, సమదృష్టి కలిగి నన్నే నమ్మివుండే యోగ్యతగలవారికి, సూర్యోదయంకాగానే ఎంత దట్టమైన చీకటైనా ఎలా పటాపంచలవుతుందో అలాగే నన్ను దర్శించగానే వారి బంధాలన్నీ తొలగిపోతాయి. అంటే ముక్తులవుతారు.

**క. కారుణ్యమానసుండగు, నారదు వచనమునఁజేసి ననుఁ బొడఁగనుటన్**
**మీరు ప్రబుద్ధుల రైతిరి, చేరెన్ నామీఁది తలఁపు సిద్ధము మీకున్. 411**

**ప్రతి :** కారుణ్య మానసుండు+అగు= దయగల మనస్సుకలవాడైన; నారదు వచనమునన్+చేసి= నారదముని మాట కారణంగా; ననున్ పొడఁగనుటన్= నన్ను చూడటంచేత; మీరు= మీరిద్దరూ; ప్రబుద్ధులరు+అయితిరి= మేలుకొన్న (శాపంనుండి తొలగిన) వారయ్యారు; నామీఁది తలఁపు= నాపైన బుద్ధి (మనస్సు); మీకున్= మీ ఇరువురికీ; చేరెన్= ప్రాప్తించింది; సిద్ధము= ఇది నిశ్చయం.

**తా :** ఓ నలకూబరమణిగ్రీవులారా! దయామయుడైన నారదుడు శపించినా, మీయందు అనుగ్రహించిన కారణంగా, మీరు నన్ను చూడడంతో శాపంనుండి తొలగినవారయ్యారు. నన్ను భావించే బుద్ధికూడా మీకు లభించింది. ఇది యథార్థం.

**వ. అని యీశ్వరుండు 'మీరు మీ నెలవులకుం బొం' డని యానతిచ్చిన మహాప్రసాదంబని వలగొని పెక్కు మ్రొక్కులిడి వీడుకొని నలకూబర మణిగ్రీవు లుత్తరభాగంబున కరిగి, రంత నందాదు లయిన గోపాలకులు నిర్మూలంబులయి పడిన సాలంబుల చప్పుడు పిడుగుచప్పుదని శంకించి వచ్చి చూచి. 412**

**ప్రతి :** అని= ఇలా పలికి; ఈశ్వరుండు= సర్వేశ్వరుడైన శ్రీకృష్ణుడు; మీరు= మీ ఇద్దరూ; మీ నెలవులకున్= మీ నివాస స్థానాలకు; పొండు= వెళ్ళండి; అని ఆనతి+ఇచ్చినన్= అని ఆదేశించగా; మహాప్రసాదంబు అని= గొప్ప అనుగ్రహం ప్రసాదించారంటూ; వలగొని= ప్రదక్షిణంచేసి; పెక్కు మ్రొక్కులు+ఇడి= అనేక నమస్కారాలుచేసి; వీడుకొని=

పోయివచ్చెదమనిచెప్పి; నలకూబర మణిగ్రీవులు; ఉత్తర భాగంబునకున్= (కుబేర స్థానమైన) ఉత్తర దిక్కుకు; అరిగిరి= వెళ్ళిపోయారు; అంతన్= పిమ్మట; నంద+ఆదులైన గోపాలకులు= నందుడు మొదలుగాగల గొల్లవాండ్రు; నిర్మూలంబులు+అయి= వేళ్ళతో సహా పెల్లగింపబడి; పడిన= కూలిన; సాలంబుల= మద్దిచెట్లయొక్క; చప్పుడు= ధ్వని; పిడుగు చప్పుడు+అని= పిడుగు పడినట్టి శబ్దంగా; శంకించి= సందేహించి; వచ్చి= ఆ చెట్లు పడిన చోటికివచ్చి; చూచి= అక్కడి దృశ్యాన్ని చూచి...

**తా :** పై రీతిగా చెప్పిన పిమ్మట శ్రీకృష్ణుడు నలకూబర మణిగ్రీవులతో మీరు మీస్థానాలకు వెళ్ళండి అని ఆజ్ఞాపించగా, గొప్ప అనుగ్రహం అంటూ, వారిరువురూ స్వామికి ప్రదక్షిణం చేసి, ఎన్నో నమస్కారాలుచేసి, తమ తండ్రి వుండే ఉత్తర దిక్కునగల తమ నివాసస్థానాలకు వెళ్ళిపోయారు. ఇదంతా జరిగిన పిమ్మట నందునితో పాటు అక్కడున్న గొల్లలందరూ మూలంతోసహా పెల్లగిలి పడిన ఆ మద్దిచెట్ల ధ్వనిని విని, పిడుగు పడిన చప్పుడుగా భావించి, అక్కడకి వచ్చి చూశారు.

**క. 'ఈ పాదపములు గూలఁగ, నీ పాపఁ డులూఖలమున నిటు బద్ధుండై**
**యే పగిది బ్రదికెఁ? గంటిరె!, వాపోవఁడు, వెఱవఁ,డెట్టివాఁడో యితఁడున్. 413**

**ప్రతి :** ఈ పాదపములు= ఈ చెట్లు; కూలన్+కన్= పడిపోగా; ఈ పాపఁడు= ఈ చిన్నికృష్ణుడు; ఇటు= ఇలా; ఉలూఖలమునన్= రోటియందు; బద్ధుండు+ఐ= కట్టబడినవాడై; ఏ పగిదిన్= ఏ విధంగా; బ్రదికెన్= బతికిపోయాడు; ఇతఁడున్= ఈ బాలుడుకూడా; ఎట్టివాడో= ఎంతటివాడో; వాపోవఁడు= ఏడవడంలేదు; వెఱవఁడు= భయపడడంలేదు; కంటిరే= చూశారా?

**తా :** అక్కడకు వచ్చి చూచి, నందాదులు ఇలా అంటున్నారు. ఈ మద్దిచెట్లు నేలకూలగా, ఈ చిన్ని కృష్ణుడు రోటికి కట్టబడివున్నవాడై ఎలా బ్రతికిపోయాడో! ఇతడెట్టివాడో! ఇంత చిన్నవాడైనా ఈ సంఘటనకు ఏడవలేదు, భయపడలేదు, చూశారా?

**ఆ. పిడుగు వడదు, గాక పెనుగాలి విసరదు, ఖండితంబు లగుట గానరాదు,**
**బాలుఁ డితఁడు, వట్టి పడఁద్రోయఁజాలఁడు, తరువు లేల కూలె ధరణిమీఁద?' 414**

**ప్రతి :** పిడుగు పడదు= పిడుగు పడలేదు; కాక= కాకుండా పోనీ; పెనుగాలి= పెద్ద వాయువు (ప్రభంజనం); విసరదు= వీచలేదు; ఖండితంబులు+అగుట= కొట్టబడినవి కూడా; కానరాదు= కనబడదు; ఇతఁడు బాలుఁడు= కృష్ణుని చూస్తే చిన్న బాలుడు, పిల్లవాడు; పట్టి పడన్+త్రోయన్+చాలఁడు= ఆ చెట్లను పట్టుకొని కూల్చివేయలేదు; ఈ పరిస్థితిలో; తరువులు= ఈ చెట్లు; ధరణి మీఁదన్= ఈ భూమిమీద; ఏల కూలెన్= ఎలా కూలిపడ్డాయి?

**తా :** కూలిన చెట్లను చూచి వారిలా అనుకుంటున్నారు. పిడుగేమో పడలేదు, పోనీ పెద్దగా గాలి వీచిందా అంటే అదీ లేదు. ఎవరైనా చెట్లను నరికి వేసినట్లూ లేదు. వీడు చూస్తే చిన్న పిల్లవాడు, ఆ చెట్లను పట్టుకొని నేలకూల్చే శక్తి లేనివాడు, మరి ఆ చెట్లు భూమిమీద ఎలా కూలిపడ్డాయి?

**వ. అని పెక్కండ్రు పెక్కువిధంబుల నుత్పాతంబులు గావలయు నని శంకింప నక్కడ నున్న బాలకు లిట్లనిరి. 415**

**ప్రతి :** అని= ఈ విధంగా; పెక్కండ్రు= అక్కడున్న వారందరూ; పెక్కు విధంబులన్= అనేక విధాలుగా; ఉత్పాతంబులు కావలయున్ అని= ఇవేవో పిడుగులు పడడంలాంటి అరిష్టకార్యాలని; శంకింపన్= అనుమానిస్తూ ఉండగా; అక్కడన్ ఉన్న= ఆ సమయంలో ఆ స్థలంలోవున్న; బాలకులు= పిల్లలు; ఇట్లు+అనిరి= ఇలా అన్నారు.

**తా :** పైవిధంగా అక్కడున్న అందరూ తలోరకంగా ఇవేవో అపశకునాలని అనుమానించగా, అక్కడే ఉన్న చిన్న పిల్లలు వాళ్ళతో ఇలా అన్నారు.

**క. "నందునికొమరుఁడు వినుఁ డీ, సందున మును దూఱి ఱోలు సరి యడ్డముగా**
**ముందటి కీడ్చిన మద్దులు, గ్రందుకొనం గూలె, జనులఁ గంటి మిరువురన్." 416**

**ప్రతి :** వినుఁడు= మేము చెప్పేది వినండి; నందుని కొమరుఁడు= నందుని కొడుకైన ఈ బాలకృష్ణుడు; ఈ సందునన్= ఈ రెండుచెట్ల మధ్యలో; మును దూఱి= ముందుగా చొచ్చి; ఱోలు= రోటిని; సరి+అడ్డము+కాన్= సమంగా ఆ చెట్లమధ్య అడ్డంగా వచ్చేటట్లుపెట్టి; ముందటికిన్= ముందుకు; ఈడ్చినన్= లాగగా; మద్దులు= మద్దిచెట్లు; క్రందుకొనన్= పెద్ద శబ్దంతో సందడిచేస్తూ; కూలెన్= నేలమీదపడ్డాయి; ఇరువురున్ జనులన్= అప్పుడు ఇద్దరు మనుష్యులను; కంటిమి= చూశాము.

**తా :** ఈ నందకుమారుడైన బాలకృష్ణుడు మద్దిచెట్ల మధ్యలో దూరి, తనకు కట్టిన రోటిని సరిగ్గా ఆ చెట్ల మధ్యలో అడ్డంగా వచ్చేటట్లుచేసి ముందుకు లాగగా ఈ చెట్లు పెద్దధ్వనితో అట్టహాసంగా విరిగిపడ్డాయి. అక్కడ ఇద్దరు మనుష్యులను మేము చూశాం. మామాట వినండి అన్నారు.

**వ. అని యిట్లు పలికిన బాలకాలాపంబులు విని కొందఱు మిథ్యారూపంబు లనిరి, కొందఱు నానావిధంబుల సందేహించి రంత నందుండు వికసితవదనారవిందుం డగుచుఁ బట్టికట్టు విడిచె, నట్టియెడఁదనతెఱంగెవ్వరు నెఱుంగకుండవలె నని కపటకుమారుండు. 417**

**ప్రతి :** అని ఇట్లు పలికిన= అని ఈ ప్రకారంగా చెప్పినట్టి; బాలక+ఆలాపంబులు= ఆ గోపబాలుర మాటలు; విని= ఆలకించి; కొందఱు= అక్కడున్నవారిలో కొంతమంది; మిథ్యారూపంబులు అనిరి= మాయారూపాలని అన్నారు; కొందఱు= మరికొంతమంది; నానా విధంబులన్= అనేకరీతులుగా; సందేహించిరి= ఏమో, ఏమిటో అన్నట్లు అనుమానించారు; అంతన్= అప్పుడు; నందుండు= కృష్ణుని తండ్రియైన నందగోపుడు; వికసితవదన+అరవిందుండు+అగుచున్= వికసించిన పద్మంవంటి ముఖంకలవాడై; పట్టి= కొడుకుయొక్క; కట్టు విడిచెన్= రోటికి కట్టిన కట్టువిప్పాడు; అట్టి+ఎడన్= సమయంలో; తన తెఱంగు= తన విషయాన్ని; ఎవ్వరున్= ఇతరులెవరూకూడా; ఎఱుంగక+ఉండవలెన్+అని= తెలియకుండా ఉండాలని; కపటకుమారుండు= మాయారూపంలో ఉన్న ఆ బాలకృష్ణుడు...

**తా :** చెట్లు కూలిన సమయంలో అక్కడ వున్న బాలకులు అలా చెప్పగా, అక్కడున్నవారిలో కొందరు ఇదంతా అబద్ధం అన్నారు. మరికొందరు అనేక విధాలుగా సందేహించారు. అప్పుడు నందుడు వికసించిన పద్మంలా ముఖాన్ని సంతోషంతో నింపుకొని, కొడుకైన కృష్ణుని నడుముకు, రోటికి కట్టిన ఆ కట్టును విప్పాడు. ఇదంతా చూస్తున్న ఆ మాయాబాలకృష్ణుడు తన ఈ అద్భుతకార్యం సంగతి ఎవరూ తెలుసుకోకూడదని

**శా. పాడున్ మందునిభంగి, గోపవనితల్ పాణిధ్వనుల్ సేయఁగా**
**నాడున్ జంత్రముకైవడిం, బరవశుండై హస్తముల్ ద్రిప్పుచుం**
**జూడ న్నే రనివానిభంగి జనులం జూచున్, నగున్, బాలురం**
**గూడుం బెద్దలపంపు సేయఁ జను, డాఁగున్ మట్టిఁ జిట్టాడుచున్. 418**

**ప్రతి :** మందుని భంగిన్= ఏమీ చెలియని మూఢునిలా; పాడున్= పాటలు పాడతాడు; గోపవనితల్= గోపకాంతలు; పాణిధ్వనుల్ చేయన్+కాన్= చప్పట్లు కొడుతూవుండగా; జంత్రము కైవడిన్= మరబొమ్మలా; పరవశుండు+ఐ= ఒళ్ళు తెలియనివాడై; హస్తముల్ త్రిప్పుచున్= చేతులాడిస్తూ; ఆడున్= ఆడతాడు; చూడన్ నేరనివానిభంగిన్= చూడడం తెలియనివాడిలా; జనులన్= అక్కడున్నవారిని; చూచున్= చూస్తాడు; నగున్= నవ్వుతాడు; బాలురన్ కూడున్= తన తోటి గోపబాలురతో కలుస్తాడు; పెద్దలపంపు= పెద్దవారు చెప్పినట్లు; చేయన్+చనున్= చేయడానికి వెళతాడు; మట్టిన్= మట్టిలో; చిట్టాడుచున్= గంతులువేస్తూ; డాఁగున్= దాగుకుంటాడు.

**తా :** తన మాయారూపాన్ని ఎవరూ గుర్తించకుండా, ఆ బాలకృష్ణుడు ఏమీ తెలియని అమాయకుడిలా పాటలు పాడతాడు. గోపికలు చప్పట్లు కొడుతూవుంటే కీలుబొమ్మలా ఒళ్ళు తెలియనట్లు తానూ చేతులు తిప్పుతూ ఆడతాడు. చూడడం తెలియనివాడిలా చుట్టూవున్నవాళ్ళను చూస్తాడు. ఊరకే నవ్వుతాడు, తన తోటి బాలకులతో చేరతాడు, పెద్దలు చెప్పిన పనులన్నీ చేయడానికి వెళతాడు, మట్టిలో గంతులువేస్తూ, దాగుకుంటాడు.

**క. 'చుంచెదుగుఁ బాలు ద్రావు ము, దంచితముగ' ననుడుఁ బాలుద్రావి, జననితోఁ**
**జుంచెదుగ దంచు లీలా, చుంచుండై యతఁడు చుంచుఁ జూపు నరేంద్రా! 419**

**ప్రతి :** నర+ఇంద్రా= పరీక్షిన్మహారాజా! యశోద కృష్ణునితో; పాలు త్రావుము= పాలుతాగు; ఉత్+అంచితము+కన్= పైకి బాగా పెరిగినట్లుగా; చుంచు= జుట్టు; ఎదుగున్= పెరుగుతుంది; అనుడున్= అని చెప్పగా; పాలుత్రావి= పాలను తాగి; జననితోన్= తల్లి యశోదతో; చుంచు+ఎదుగదు+అంచున్= జుట్టు పెరగలేదే అంటూ; లీలాచుంచుండై= లీలలు చూపడంలో సమర్థుడై; అతఁడు= ఆ బాలకృష్ణుడు; చుంచున్ చూపెన్= తన పిల్లజుట్టును చూపాడు.

**తా :** సాధారణంగా పిల్లలు పాలు తాగడానికి, అన్నం తినడానికి అల్లరి చేస్తుంటారు. అలాగే కృష్ణుడు పాలుతాగడానికి అల్లరి చేస్తుంటే తల్లి యశోద పాలు నీవు తాగావంటే జుట్టు బాగా పెరుగుతుంది అంది. దాంతో పిల్లవాడు పాలు తాగి 'ఏదీ జుట్టు పెరగలేదే' అంటూ కొంటెగా తన జుట్టు చూపాడు.

**క. సెలగోల పట్టుకొని జల, కలశములో నీడఁ జూచి కలశయుతుండై**
**సెలగోలఁ బాపఁ డొకఁ డిదె, తలఁచెన్ ననుఁ గొట్ట ననుచుఁ దల్లికిఁ జెప్పెన్. 420**

**ప్రతి :** సెలగోల= (గొల్లవారు పశువులను అదిలించే) ములుకర్ర లేదా కంచీలాంటి దాన్ని; పట్టుకొని= చేతితోపట్టి; జలకలశములోన్= నీటితో నిండిన పాత్రలో; నీడన్+చూచి= తన నీడను చూసుకొని; కలశయుతుండు+ఐ= ఆ పాత్రతో పాటుగా; సెలగోలన్= సెలగోలతో; పాపఁడు ఒకఁడు= ఒక బాలుడు; ఇది= ఇదిగో; ననున్ కొట్టన్= నన్ను కొట్టాలని; తలఁచెన్= అనుకుంటున్నాడు; అనుచున్= అంటూ; తల్లికిన్= యశోదకు; చెప్పెన్= చెప్పాడు.

**తా :** బాలకృష్ణుడొక రోజు పశులను తోలే ఒక సెలగోల పట్టుకొని, నీళ్ళకుండలో తన నీడను చూపుతూ, అమ్మా! ఎవడో బాలుడు సెలగోలపట్టుకొని నన్ను కొడదామనుకుంటున్నాడు అంటూ తల్లికి తన ప్రతిబింబాన్ని చూపి, చెప్పాడు.

**క. భిక్షులు వచ్చెద రేడ్చిన, భిక్షాపాత్రమున వైచి బెగడించి నినున్**
**శిక్షించెద, రని చెప్పిన, భిక్షులఁ గని, తల్లిఁ గనియు భీతిల్లు నృపా! 421**

**ప్రతి :** నృపా= రాజా! యశోద కృష్ణునితో; ఏడ్చినన్= నీవు ఏడుస్తున్నట్లయితే; భిక్షులు= బిచ్చగాండ్రు; వచ్చెదరు= వస్తారు; అలావచ్చి; భిక్షాపాత్రమునన్ వైచి= వాళ్ళ బిచ్చం పట్టే బుట్టలో వేసుకొని; నినున్ బెగడించి= నిన్ను భయపెట్టి; శిక్షించెదరు= దండిస్తారు; అని చెప్పినన్= ఇలా యశోద చెప్పగా; భిక్షులన్ కని= భిక్షగాండ్రను చూచి; తల్లిన్ కనియు= తల్లి యశోదను చూస్తూ; భీతిల్లెన్= భయపడ్డాడు.

**తా :** ఓ పరీక్షిన్మహారాజా! చిన్ని కృష్ణుడు అల్లరి, మారాంచేస్తూ, ఏడుస్తూ వుంటే ఇలా చేస్తే బిచ్చగాండ్రు వచ్చి నిన్ను వాళ్ళ బిచ్చం పట్టే జోలిలో వేసుకొని భయపెట్టి దండిస్తారు సుమా! అనగానే బిచ్చగాండ్రను, యశోదనూ చూస్తూ బాలుడు భయపడ్డాడు.

## ✣ నందాదులు బృందావనంబునకు నరుగుదెంచుట ✣

**వ. ఇట్లు కృష్ణుండు బహువిధంబులఁ గపటబాలలీలల వినోదింప, బృహద్వనంబున నందాదు లైన గోపవృద్ధులు మహోత్పాతంబు లగుటయు, వానివలన బాలుం డుత్తరించుటయుఁ జూచి యేకాంతంబున నొక్కనాఁడు విచారింప నుపనందుండను వృద్ధగోపకుండు దన యెఱుక మెఱసి యిట్లనియె. 422**

**ప్రతి :** ఇట్లు= ఈ ప్రకారంగా; కృష్ణుండు= బాలకృష్ణుడు; బహువిధంబులన్= అనేకరీతులుగా; కపటబాలలీలలన్= మాయతో (వంచనతో) కూడిన పిల్లల చేష్టలతో; వినోదింపన్= ఆనందిస్తూ ఉండగా; బృహత్+వనంబునన్= నందాదులుండే బృహద్వనమనే పెద్దతోపులో; నంద+ఆదులు+అయిన= నందుడు మొదలైన; గోపవృద్ధులు= ముసలివారైన, పెద్దవారైన గొల్లవాండ్రు; మహత్+ఉత్పాతంబులు+అగుటయున్= పెద్ద పెద్ద అరిష్టాలు జరగడం; వానివలనన్= ఆ ఉత్పాతాలనుండి; బాలుండు= చిన్నికృష్ణుడు; ఉత్తరించుటయున్= క్షేమంగా బయటపడడమూ; చూచి= విచారించి; ఏకాంతంబునన్= రహస్యప్రదేశంలో; ఒక్కనాఁడు= ఒకరోజు; విచారింపన్= ఆలోచించగా; ఉపనందుండు అను= ఉపనందుడనే; వృద్ధగోపకుండు= ముసలి గొల్లవాడు; తన ఎఱుక= తన తెలివి; మెఱసి= ఒప్పగా; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** ఓ రాజా! ఇలా లీలామానుషధారియైన శ్రీకృష్ణుడు అనేకవిధాలుగా బాల్యచేష్టలతో ఆనందింపగా, బృహద్వనమనే ఓ పెద్దతోటలో నందుడు మొదలగు పెద్దవారైన గొల్లవారు ఇలా వరుసగా అరిష్టాలు (పూతన, శకటుడు, గుహ్యకులు మద్దిచెట్లు కూలడం) సంభవించడం, మెల్లగా బాలకృష్ణుడు బైటపడడం ఇవన్నీ ఆలోచించి, ఓ రోజు ఏకాంతంలో అందరూ కూర్చుని విచారిస్తూవుండగా, ఉపనందుడనే ఒక వృద్ధుడు తనకు గల తెలివితో ఆలోచించి ఇలా అన్నాడు.

**ఉ. 'ఇక్కడ నుందురే మనుజు? లీ మన కృష్ణున కెగ్గు సేయఁగా**
**రక్కసురాలు చ న్నొసఁగె, ఱాలపయిన్ సుడిగాలి వీచెఁ, బైఁ**
**గ్రిక్కిఱియం దరుల్ వడియెఁ, గేశవు సత్కృపఁ దప్పెఁ, జాలు నేఁ**
**డెక్కడి కైనఁ బోవలయు నింకిట గోపకులార! వింటిరే? 423**

**ప్రతి :** గోపకులార!= ఓ గొల్లలార!; ఇక్కడన్= ఈ ప్రదేశంలో; మనుజులు= మనుష్యులు; ఉందురే?= ఉంటారా?; ఎందుకంటే, ఈ మన కృష్ణునకున్= మన ఈ చిన్ని కృష్ణునికి; ఎగ్గు+చేయన్+కాన్= కీడు చేయడానికి; రక్కసురాలు= ఓ రాక్షసస్త్రీ – పూతన; చన్ను+ఒసఁగెన్= పాలు తాగేలా చన్నిచ్చింది; ఱాలపయిన్= రాళ్ళతో; సుడిగాలి వీచెన్= పెద్ద

సుడిగాలి వీచింది; పైన్= పైన; క్రిక్కిఱియన్= మిక్కిలి దగ్గరగునట్లు, తరులు= మద్దిచెట్లు; పడియెన్= కూలిపడ్డాయి; కేశవు సత్కృపన్= ఆ విష్ణుమూర్తిదయవల్ల, తప్పెన్= ఆపదలన్నీ తప్పాయి; చాలున్= ఇక్కడ ఉండడం చాలు; నేఁడు= ఈ దినం; ఎక్కడికిన్+ఐనన్= వేరే ఏ ప్రదేశానికైనా; ఇంకన్+ఇట= ఇక ఇక్కడనుండి; పోవలయును= వెళ్ళిపోవాలి; వింటిరే= వింటున్నారా?

**తా :** కృష్ణుడిలా లీలావినోదాలు చూపుతుండగా ఆ వ్రేపల్లెలోని బృహద్వనంలో వృద్ధగోపాలులందరూ నందునితో కూడివుండగా ఓ వృద్ధగోపాలుడిలా అన్నాడు. ఏ మర్రా వింటున్నారా! ఎవరైనా మనుష్యులనేవారు ఇక్కడ ఉంటారా! మన చిన్ని కృష్ణునికి కీడు చెయ్యడంకోసం ఓ రాక్షసస్త్రీ వచ్చి చనుబాలు ఇచ్చింది. రాళ్ళ సుడిగాలి వీచింది. ఇప్పుడు ఈ మద్దిచెట్లు కృష్ణునికి చాలా దగ్గరలోనే నేలకూలాయి. ఈ ఆపదలన్నీ ఆ నారాయణుని దయవల్లే తప్పిపోయాయి. ఇంక ఇక్కడ ఉండడం మంచిదికాదు. ఎక్కడికైనా పోదాం అన్నాడు.

**క. కసవు గల దిరవు పసులకు, లసదద్రినదీమహీజలతికావలి పెం**
**పెసఁగును, గాఁపురమునకును, బొసఁగును బృందావనంబు వొదఁ దచ్చటికిన్. 424**

**ప్రతి :** బృందావనంబు= 'బృందావనం' అనే ఒక ప్రదేశం; కసవు కలది= (ఆవుల మేతకు) గడ్డి కలిగివుంది; పసులకున్= మన గోవులకు; ఇరవు= సరియైనచోటు; లసత్+అద్రినదీమహీజలతికా+ఆవలిన్= చక్కగా ఒప్పే కొండలు, నదులు, చెట్లు తీవల గుంపులు; పెంపు+ఎసఁగును= అధికంగా ఉంటాయి; కాపురమునకున్= మనకు నివాసం ఉండడానికి; పొసఁగున్= సరిపడుతుంది కాబట్టి; అచ్చటికిన్= ఆ బృందావనప్రదేశానికి; పొదఁడు= పోదాం పదండి అన్నాడు.

**తా :** 'బృందావనం' పశువులమేతకు మంచిగడ్డితో సరియైనస్థలం. అక్కడ చిక్కగా కొండలు, నదీజలాలు, చెట్లు తీగల పంక్తులతో మనం నివాసం ఉండడానికి ఎంతో అనువుగా ఉంటుంది. కాబట్టి అక్కడికి పోదాం పదండి.

**వ. అని పలుకు నుపనందునిపలుకుల కార్యులైన గోపకు 'లిదియ కార్యంబు మందల' యని కొందల మందక యాలమందల నమందగమనంబున ముందర నడవం బనిచి పిఱుందం గ్రందుకొనకుండ, బాలవృద్ధనారు లెక్కిన తేరులు సాగించి తారు తనుత్రాణతూణీరబాణధరులై విండ్లఁ బట్టుకొని నడవ, బండ్లవెనుకం గొమ్ము లిమ్ములం బూరించుచు నవార్యంబులగు తూర్యరవంబులు సెలంగ నార్యపురోహిత సమేతులై వేడుకలు కొనలు నిగుడ మొన లేర్పఱచుకొని పావనం బగు బృందావనంబునకుం జని రప్పుడు. 425**

**ప్రతి :** అని పలుకు= ఇలా చెపుతున్న; ఉపనందుని పలుకులన్= ఉపనందుడాడిన మాటలకు; ఆర్యులు+ఐన= పెద్దవాళ్ళైన; గోపకులు= గొల్లవారు; ఇది+అ+కార్యంబు మందల= అతడు చెప్పినదే చేయతగినవిధం; అని= అంటూ; కొందలము+అందక= ఏ మాత్రం బాధపడకుండా; ఆలమందలన్= గోసమూహాన్ని; అమందగమనంబునన్= వడిగల నడకగలవి అగునట్లు; ముందరన్= మొదట; నడవన్+పనిచి= నడిచేటట్లుచేసి; పిఱుందన్= ఆ వెనుక; క్రందుకొనకుండన్= సందడి పడకుండా; బాలవృద్ధనారులు= పిల్లలు, ముసలివారు, స్త్రీలు; ఎక్కిన= ఎక్కినట్టి; తేరులు= బండ్లు; సాగించి= వెళ్లేటట్లుచేసి, తారు= తాము; తనుత్రాణ తూణీర బాణధరులు+ఐ= కవచాలు, అమ్ములపొదులు, బాణాలు ధరించినవారై; విండ్లన్+పట్టుకొని నడవన్= ధనుస్సులు చేతపట్టి సాగగా; బండ్లవెనుకన్= బండ్లకు వెనుక; కొమ్ములు+ఇమ్ములన్ పూరించుచున్= కొమ్ములతో చేసిన వాద్యాలను చక్కగా ఊదుతూ; అవార్యంబులు+అగు= అడ్డులేనివైన; తూర్యరవంబులు= వాద్యాల ధ్వనులు; చెలంగన్= వ్యాపించగా; ఆర్య పురోహిత సమేతులు+ఐ= పూజ్యులైన పురోహితులతో కూడినవారై; వేడుకలు కొనలు నిడుగన్= ముచ్చట్లు

కొనసాగుతూ ఉండగా; మొనలు+ఏర్పఱచుకొని= ముందుకు పోయేట్టుగా ఏర్పరచుకొని; పావనంబు+అగు= పరిశుద్ధమైన, పవిత్రమైన; బృందావనంబునకున్= బృందావన ప్రదేశానికి; చనిరి= వెళ్లారు; అప్పుడు= ఆ సమయంలో...

**తా :** ఇలా ఉపనందుడు బృందావనానికి పోదాం అన్న మాటకు పెద్దలందరూ ఇదే మనం చెయ్యవలసిన కార్యం అంటూ ఏమాత్రం సంకటపడకుండా, గోవుల మందలను త్వరగా వెళ్ళేటట్లు ముందర నిలిపి, ఆ వెనుక పిల్లలను, వృద్ధులను, స్త్రీలను, రథాలపై (బండ్లపై) ఎక్కించి, తాము కవచాలు, అమ్ములపొదులు, బాణాలతో విండ్లు పుట్టుకొని నడుస్తూ, కూడి బండ్లవెనుకగా 'కొమ్ము' వంటి వాద్యాలను ఊదుతూ, ఆ వాద్యధ్వనులు అంతటా వ్యాపించగా, పెద్దలు, పురోహితులతో ఉత్సాహంతో ముందుభాగంలో గుంపులుగా ఏర్పడి పవిత్రమైన బృందావన ప్రదేశానికి వెళ్లారు. ఆ సమయంలో

**తరలము.**

**పసుపు లాడి యురోజకుంకుమపంకశోభితలై లస**
**ద్వసనలై కచభారచంపకదామలై సులలామలై**
**పసిఁడిమాడలకాంతు లఱ్ఱులఁ బర్వఁ దేరులమీఁదఁ బెం**
**పెసఁగఁ బాడిరి వ్రేత లా హరిహేల లింపగు నేలలన్. 426**

**ప్రతి :** వ్రేతలు= గోపకాంతలు; పసుపులు+ఆడి= పసుపు రాసుకొని స్నానాలుచేసి, ఉరోజకుంకుమ పంకశోభితలు+ఐ= స్తనాలపై కుంకుమపూతలతో శోభిస్తున్నవారై; లసత్+వసనలై= ప్రకాశించే వస్త్రాలు ధరించినవారై; కచభార చంపక దామలు+ఐ= పెద్ద పెద్ద కొప్పులలో సంపెంగపూలదండలు ముడుచుకున్నవారై; సులలామలు+ఐ= నుదుట చక్కని బొట్లు ధరించినవారై; పసిఁడిమాడల కాంతులు= బంగారు కాసులపేరుల కాంతులు; అఱ్ఱులన్+పర్వన్= మెడలలో వ్యాపించగా; తేరుల మీఁదన్= రథాలమీద, (బండ్లమీద); పెంపు+ఎసఁగన్= అతిశయించునట్లుగా; ఆ హరిహేలలు= ఆ శ్రీకృష్ణుని లీలలు; ఇంపు+అగు= మనస్సుకు ఎంతో ఆనందం కలిగించేలా; ఏలలన్= 'ఏలలు' అనే ఒక విధమైన గేయాలను; పాడిరి= గానంచేశారు.

**తా :** గోపకాంతలు చక్కగా పసుపు రాసుకొని స్నానాలుచేసి, వక్షఃస్థలంపై కుంకుమాదిపూతలు పూసుకొని, మంచి వస్త్రాలు ధరించి, పెద్దపెద్దకొప్పుల్లో సంపెంగదండలు అలంకరించుకొని, నుదుట తిలకం ధరించి, బంగారు ఆభరణాల కాంతులు వారికంఠాలపై వ్యాపిస్తుండగా, రథాలపై వెళుతూ, శ్రీహరిలీలల్ని ఏలలుగా గానం చేశారు.

**విశే :** పై పద్యం 'తరలము' అనే ఒక విశేషవృత్తం. ఇందులో న, భ, ర, స, జ, జ, గ అనే గణాలు వరుసగా ఉంటాయి. 12వ అక్షరం యతిస్థానం. వృత్తం కాబట్టి ప్రాస నియమం నియతం.

**వ. అప్పుడు రోహిణీయశోద లేకరథంబునఁ బరిపూర్ణమనోరథలై రామకృష్ణుల ముందట నిడుకొని వారలవినోదంబులకుఁ బ్రమోదంబు నొందుచుం జని, రిట్లు గోపకులు బృందావనంబు సొచ్చి యం దర్ధచంద్రాకారంబుగ శకటసందోహంబు నిలిపి మందల విడియించి వసియించిరి. 427**

**ప్రతి :** అప్పుడు= ఆ సమయంలో; రోహిణీయశోదలు= రోహిణీదేవీ, యశోదాదేవీ; ఏక రథంబునన్= ఒకే తేరుమీద; పరిపూర్ణ మనోరథలు+ఐ= నెరవేరిన కోరికలుకలవారై; రామకృష్ణులన్= బాలరామ శ్రీకృష్ణులను; ముందటన్+ఇడుకొని= తమ ముందుంచుకొని; వారల వినోదంబులకున్= వారు చేసే ఆనందచేష్టలకు; ప్రమోదంబున్+ఒందుచున్+చనిరి=సంతోషిస్తూ

వెళ్లారు; ఇట్లు= ఈ విధంగా; గోపకులు= గొల్లవాండ్రు; బృందావనంబు+చొచ్చి= బృందావనంలో ప్రవేశించి; అందున్= ఆ బృందావనంలో; అర్ధచంద్ర+ఆకారంబు+కన్= అర్ధచంద్రుని ఆకారంవంటి ఆకారంలో; శకట సందోహంబున్= బండ్ల సముదాయాన్ని; నిలిపి= ఉంచి; మందలన్= ఆలమందలను; విడియించి= అక్కడ నిలిపి; వసియించిరి= ఉన్నారు, (నివసించారు.)

**తా :** అప్పుడు రోహిణీయశోదాదేవులిద్దరూ ఒకే రథంపై కూర్చున్నవారై ఆనందంతో తమ ముందున్న బలరామకృష్ణులు వినోదాలు చేస్తూవుంటే ఆనందిస్తూ వెళ్లారు. ఇలా ఆ గోపకులందరూ, బృందావనంలో ప్రవేశించి, బండ్లనన్నిటినీ అర్ధచంద్రాకారంగా ఉంచి, ఆవులమందలను చక్కగా నిలిపి అక్కడ నివసించారు.

**క. చెందిరి బలమాధవు లభి, నందించుచుఁ బరమపావనము నంచిత కా**
**ళిందీసంజీవనమున్, బృందావనమున్ మునీంద్రబృందావనమున్. 428**

**ప్రతి :** బలమాధవులు= బలరాముడు, శ్రీకృష్ణుడూ; పరమపావనము= మిక్కిలి పవిత్రమూ; అంచిత కాళిందీ సంజీవనమున్= ఒప్పునట్టి యమునా నదీజలము కలది; ముని+ఇంద్రబృంద+అవనమున్= ఋషిశ్రేష్ఠుల సమూహాన్ని రక్షించేది అగు; బృందావనమున్= బృందావనాన్ని; అభినందించుచున్= ప్రశంసిస్తూ; చెందిరి= ప్రవేశించారు.

**తా :** బలరామ శ్రీకృష్ణులిద్దరూ మిక్కిలి పవిత్రమూ, యమునా నదీప్రవాహ జలంతో నిండిందీ, ఋషిబృందాన్ని రక్షించేది అయిన బృందావనాన్ని పొగడుతూ అందులో ప్రవేశించారు.

**వ. ఇట్లు బృందావనంబుఁ జెంది యందుఁ గొంతకాలంబునకు రామకృష్ణులు సమానవయస్కులైన గోపబాలకులం గూడికొని వేడుక లూఁదుకొన దూడలఁ గాచుచు. 429**

**ప్రతి :** ఇట్లు= ఇలా; బృందావనంబున్+చెంది= బృందావనంలో ప్రవేశించి; కొంతకాలంబునకున్= కొన్నాళ్ళకు; రామకృష్ణులు= బలరామకృష్ణులు; సమాన వయస్కులు+ఐన= తమ ఈడువారైన; గోపబాలకులన్= గొల్లపిల్లవాండ్రను; కూడికొని= కలిసి; వేడుకలు= వినోదాలు; (సంతోషం) ఊఁదుకొనన్= (మనస్సుల్లో) నాటుకొనుచుండగా; దూడలన్= లేగలను; కాచుచున్= మేపుతూ...

**తా :** ఇలా బృందావనంలో చేరాక, కొన్నాళ్ళకు రామకృష్ణులు తమ ఈడుగల గొల్లపిల్లలతో కలసి ఉత్సాహంగా దూడలను మేపుకుంటూ

**సీ. వేణువు లూఁదుచు వివిధరూపములతో గంతులు వైతురు కౌతుకమున,**
**గురుకంబళాదుల గోవృషంబులఁ బన్ని పరవృషభము లని ప్రతిభటింతు,**
**రల్లులు దట్టించి యంఘ్రులగజ్జెలు మొరయఁ దన్నుదు రోలి ముమ్మరముగఁ**
**బన్నిదంబులు వైచి ఫలమంజరులఁ గూల్చి వ్రేటు లాడుదురు ప్రావీణ్య మొప్ప,**

**తే. వన్యజంతుచయంబుల వాని వాని, పదురు పదురుచు వంచించి పట్టఁబోదు,**
**రంబుజాకరములఁ జల్లులాడఁ జనుదు, రా కుమారులు బాల్యవిహారు లగుచు. 430**

**ప్రతి :** ఆ కుమారులు= ఆ బలరామకృష్ణులు; గోపబాలకులతో కలిసి; బాల్యవిహారులు+అగుచున్= చిన్నపిల్లల చేష్టలతో విహరిస్తూ; వేణువులు+ఊఁదుచున్= పిల్లనగ్రోవులు పూరిస్తూ; వివిధ రూపములతోన్= అనేక ఆకారాలతో; కౌతుకమునన్= ఉత్సాహంతో; గంతులు వైతురు (వైచుదురు)= నృత్యరూపంలో చిందులు వేస్తున్నారు; గురుకంబళ+ఆదులున్= పెద్దవిగావున్న కంబళ్లు మొదలగువాటితో; గోవృషంబులన్= ఆబోతులను; పన్ని= రూపొందించి, రూపాలను తయారుచేసి; పర వృషభములు అని= అవి ఇతరుల ఆబోతులంటూ; ప్రతిభటింతురు= వాటితో పోరుచేస్తారు; అల్లుల దట్టించి= కాసెలు బిగించి; అంఘ్రుల గజ్జెలు= పాదాలకున్న మువ్వల అందెలు; మొరయున్= మ్రోగగా; ముమ్మరముగన్= ఎక్కువగా; ఓలిన్= వరుసగా; తన్నుదురు= తన్నుతుంటారు; పన్నిదంబులువైచి= పందేలు వేసుకుంటూ; ఫలమంజరులన్= పండ్లను, పూలగుత్తులను; కూల్చి= రాల్చి; ప్రావీణ్యము+ఒప్పన్= నేర్పుకనబడునట్లు; వ్రేటులు+ఆడుదురు= రాళ్ళతో కొడుతూ ఉంటారు; వన్యజంతు చయంబులన్= అడవి జంతు సమూహాలను; వాని వాని పదురు పదురుచున్= ఆయా జంతువులయొక్క అరుపులవలె అరుస్తూ; వంచించి= మోసపుచ్చి; పట్టన్+పోదురు= పట్టుకోవడానికి ప్రయత్నిస్తారు; అంబుజ+ఆకరములన్= తామర కొలనులలో; చల్లులు+ఆడన్= ఒకరిపై ఒకరు నీళ్ళుచల్లుకునేలా ఆడడానికై; చనుదురు= వెళతారు.

**తా :** బలరామశ్రీకృష్ణులు తమ తమ ఈడు గోపబాలురతో కూడి పిల్లలాడుకునే ఆటలాడుతూ, పిల్లన గ్రోవులు ఊదుతున్నారు. నానావిధాలుగా నృత్యరీతులతో గెంతులు వేస్తున్నారు. ఉత్సాహంతో పెద్ద పెద్ద కంబళులతో ఆబోతుల రూపాలను తయారుచేసి అవి శత్రువుల లేదా ఇతరుల ఆబోతులంటూ వాటితో పోరుతున్నారు. గుడ్డలతో బొమ్మలుచేసి వాటిని గట్టిగా తన్నుతూ ఉంటే కాలిగజ్జెలు మోగుతున్నాయి. పందేలు వేసుకుని పండ్ల పూల గుత్తులను కొట్టి నేల పడేటట్లు చేసి నేర్పుతో వాటితో కొట్టుకుంటున్నారు. అడవిజంతువుల అరుపులను అనుకరిస్తూ వాటిని మోసపుచ్చి పట్టుకునేలా ప్రయత్నిస్తున్నారు. తామర కొలనుల్లో ఒకరిపై ఒకరు నీళ్ళుచిమ్ముకుంటూ ఈదుతూ ఆడుకుంటున్నారు.

**క. పోరుదురు గికురు వొడుచుచుఁ, దూఱుదురు భయంబు లేక తోరపుటిరవుల్,**
**జాఱుదురు ఘనశిలాతటి, మీఱుదు రెన్నంగరాని మెలఁకువల నృపా! 431**

**ప్రతి :** నృపా= ఓ రాజా; కికురు+పొడుచుచున్= వంచించుకుంటూ; పోరుదురు= పరస్పరం పోరాడుకుంటారు; భయంబు లేక= వెరపులేకుండా; తోరపు+ఇరవుల్= పెద్ద పెద్ద పొదరిండ్లున్న చోటులందు; దూఱుదురు= చొరబడతారు; ఘనశిలా తటిన్= పెద్ద బండ రాళ్ళమీద నుండి; జాఱుదురు= పైనుండి క్రిందకు జారుతారు; ఎన్నంగరాని= ఇలా అని చెప్పలేని; మెలఁకువలన్= నేర్పరి తనాలతో; మీఱుదురు= ఒకరినొకరు మించిపోతూ ఉంటారు.

**తా :** పరీక్షిన్మహారాజా! ఆ బాలకులచేష్టలు ఇంకా వినండి. వంచించుకొంటూ, పోరాడుతూ ఉంటారు. ఏ భయమూ లేకుండా పెద్ద పెద్ద గుబురుగా ఉండే స్థలాలలోకి ప్రవేశిస్తూ ఉంటారు. పెద్దబండరాళ్ళమీదనుండి కిందకి జారుతూ ఉంటారు. చెప్పరాని నేర్పరితనంతో ఒకరి నొకరు మించిపోతూ ఉంటారు.

**వ. అంత నొక్కనాఁడు యమునాతీరంబున నా కుమారులు గోపకుమారులుం దారును గ్రేపుల మేప నొక్క రక్కసుండు క్రేపురూపున వచ్చి వారల హింసింపం దలంచి. 432**

**ప్రతి :** అంతన్= అంతలో; ఒక్కనాఁడు= ఒక రోజు; యమునా తీరంబునన్= యమునా నది ఒడ్డున; ఆ కుమారులున్= ఆ బలరామకృష్ణులు; గోపకుమారులున్= మిగిలిన గోపబాలురును; తారును= తామందరూ; క్రేపులన్ మేపన్= దూడలను

మేపుతుండగా; ఒక్కరక్కసుండు= ఒక రాక్షసుడు; క్రేపు రూపునన్= దూడ ఆకారంతో వచ్చి; అక్కడకుచేరి; వారలన్= వారిని; హింసింపన్ తలంచి= బాధించాలని ఆలోచించి…

**తా :** ఇలా బలరామకృష్ణులు, గోపబాలురు ఇష్టం వచ్చినట్లుగా ఆడుకుంటూ ఉండి, ఒకనాడు యమునానదీతీరంలో దూడలను మేపుతూ ఉండగా, ఒక రాక్షసుడు దూడరూపంలో అక్కడికి వచ్చి వాళ్ళను బాధించాలనుకున్నాడు.

## ✤ వత్సాసుర బకాసురుల వధ ✤

**క. క్రేపుల యఱ్ఱులు నాకుచుఁ, గ్రేపులలో నిదియె మంచి క్రే పనఁగఁ గడుం**
**జూపట్టి భక్తి సంగతిఁ, గ్రేపై చనువాని మ్రోలఁ గ్రేపై తిరిగెన్. 433**

**ప్రతి :** క్రేపుల అఱ్ఱులు= దూడల మెడలను; నాకుచున్= నాలుకతో నాకుతూ; క్రేపులలోన్= దూడలలో కెల్ల; ఇది+ఎ= ఇదే; మంచి క్రేపు అనన్+కన్= చక్కని దూడ అనేటట్లుగా; చూపట్టి= కనబడి; భక్తిసంగతిన్= భక్తులవెంట; క్రేపై= తానే ఒక దూడగా; చనువానిమ్రోలన్= వెళ్ళేటటువంటి కృష్ణునిఎదుట; క్రేపు+ఐ= దూడయై; తిరిగెన్= సంచరించాడు ఆ రాక్షసుడు.

**తా :** అలా దూడరూపంలో వచ్చిన రాక్షసుడు మిగిలినమందలోని దూడల మెడలు నాకుతూ దూడల్లో కెల్లా ఇదే మంచి దూడ అనుకునేలా కనబడుతూ, భక్తజనాలవెంట దూడై సంచరించే శ్రీకృష్ణుని ఎదుట దూడగా తిరిగాడు.

**వ. వాని నెఱింగి కృష్ణుండు రామునకుం జెప్పి. 434**

**ప్రతి :** కృష్ణుండు; వానిన్ ఎఱింగి= అలా దూడరూపంలో వచ్చినవాణ్ణి రాక్షసుడుగా తెలుసుకుని; రామునకున్ చెప్పి= బలరామునితో ఆ విషయాన్ని చెప్పి…

**తా :** శ్రీకృష్ణుడు దూడరూపంలో వచ్చినవాణ్ణి రాక్షసుడుగా గుర్తించి బలరామునికి ఆ విషయం చెప్పి,

**చ. 'ఇది యొక మంచిలేఁగ, వినుఁ డెంతయు నొప్పెడి' నంచు డాసి, త**
**త్పదములఁ దోఁకయున్ బిగియఁ బట్టి చెలంగి వెలంగమ్రానితోఁ**
**జదియఁగ నొక్క పెట్టుగొని చంపెఁ గుమారుఁడు లేఁగరక్కసుం,**
**గుదులుకొనంగ బాలకులు గోయని యార్వ నఖర్వలీలతోన్. 435**

**ప్రతి :** కుమారుఁడు= బాలకృష్ణుడు; ఇది ఒక మంచి లేఁగ= ఇదొక మంచిదూడ; వినుఁడు= నా మాట వినండి; ఎంతయున్ ఒప్పెడిన్= ఈ దూడ ఎంతో చక్కగా కనబడుతోంది; అంచున్= అంటూ; డాసి= దగ్గరికి వెళ్ళి; తత్పదములన్= దాని పాదాలను; తోఁకయున్= తోకను; బిగియన్ పట్టి= గట్టిగా పట్టుకొని; చెలంగి= విజృంభించి; వెలంగ మ్రానితోన్= ఒక వెలగచెట్టుతో; చదియన్+కన్= నలిగేలా; ఒక్కపెట్టుగొని= ఒక్క దెబ్బకొట్టి; లేఁగరక్కసున్= దూడరూపంలో ఉన్న రాక్షసుడైన వత్సాసురుణ్ణి; కుదులు కొనంగన్= చలించిపోయేలా; బాలకులు= గోపకుమారులు; కో+అని ఆర్వన్= కో అంటూ కేకలుపెట్టగా; అఖర్వ లీలన్= గొప్పవిలాసంతో; చంపెన్= వధించాడు.

**తా :** శ్రీకృష్ణుడు – దూడరూపంగా వత్సాసురుడు వచ్చాడని బలరామునితో చెప్పాడు. గోపబాలురతో చూడండి ఇదొక మంచిదూడ, ఎంతోబాగుంది అంటూ దానికాళ్ళు తోక పట్టుకొని గిరగిరా తిప్పుతూ ఒక్క దెబ్బకొట్టి, కదిలిపోయేలా వెలగచెట్టుకు కొట్టి, గోపబాలురు కోయంటూ కేకలు వేస్తుండగా అవలీలగా ఆ వత్సాసురుణ్ణి చంపాడు.

**వ. ఇట్లు రక్కసుండు వ్రేటుపడి విశాలంబగు సాలంబుతో నేలంగూలె, నప్పుడు. 436**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; రక్కసుండు= రాక్షసుడైన వత్సాసురుడు; వ్రేటుపడి= దెబ్బతిని; విశాలంబు+అగుసాలంబుతోన్= పెద్దదైన ఆ చెట్టుతోకూడా; నేలన్ కూలెన్= నేలమీద కూలిపోయాడు; అప్పుడు= ఆ సమయంలో...

**తా :** శ్రీకృష్ణు డెప్పుడైతే దాని కాళ్ళు, తోక పట్టుకొని గట్టిగా వెలగచెట్టుకు వేసి కొట్టాడో ఆ దెబ్బతో వత్సాసురుడు ఆ చెట్టుతో సహా నేలమీద కూలిపోయేడు. ఆ సమయంలో

**క. గొంగడు లెగురఁగ వైచుచుఁ, జంగున దాఁటుచును జెలఁగి చప్పట లిడుచుం**
**బొంగుచుఁ గృష్ణునిఁ బొగడుచుఁ, ద్రుంగిన రక్కసునిఁ జూచి త్రుళ్ళిరి కొమరుల్. 437**

**ప్రతి :** కొమరుల్= గోపకుమారులు; గొంగడులు= కంబళ్ళు; ఎగురన్+కన్ వైచుచున్= పైకి ఎగురవేస్తూ; చంగునన్ దాఁటుచును= చెంగున గెంతుచూ; చెలఁగి= విజృంభించి; చప్పటలు+ఇడుచున్= చప్పట్లు కొడుతూ; పొంగుచున్= ఆనందంతో పొంగిపోతూ; కృష్ణునిన్ పొగడుచున్= కృష్ణుణ్ణి స్తుతిస్తూ; త్రుంగిన= చచ్చిన; రక్కసునిన్+చూచి= రాక్షసుని చూస్తూ; త్రుళ్ళిరి= గంతులు వేశారు.

**తా :** రాక్షసుడు చనిపోవడంతో, కంబళ్ళు ఎగురవేసుకుంటూ, చెంగున ఎగురుతూ, చప్పట్లు కొడుతూ, పొంగిపోతూ శ్రీకృష్ణుణ్ణి పొగడుతూ, చచ్చిన రాక్షసుణ్ణి చూస్తూ గోపకుమారులు గెంతులు వేశారు.

**వ. ఆ సమయంబున వేలుపులు విరులవానలు గురియించి, రివ్విధంబున. 438**

**ప్రతి :** ఆ సమయంబునన్= అలా వత్సాసురసంహారం అయినప్పుడు; వేలుపులు= దేవతలు; విరుల వానలు= పూల వర్షాలు; కురియించిరి= కురిపించారు; ఈ+విధంబునన్= ఈ ప్రకారంగా...

**తా :** ఆ సమయంలో దేవతలు పూలవాన కురిపించారు. ఈ విధంగా

**క. వత్సములపగిది జగముల, వత్సలతన్ మనుపఁజూచువాఁడై యుంటన్**
**వత్సముల మేపుచుండియు, వత్సాసురుఁ జంపె భక్త వత్సలుఁడధిపా! 439**

**ప్రతి :** అధిపా= పరీక్షిన్మహారాజా!; భక్తవత్సలుఁడు= తనను సేవించే భక్తులయందు ప్రేమకలవాడగు కృష్ణుడు; వత్సముల పగిదిన్= దూడల వలెనే; జగములన్= లోకాలను, జనులను; వత్సలతన్= దయతో, వాత్సల్యంతో; మనుపన్+ చూచువాఁడు+ఐ= రక్షింప చూచేవాడై; ఉంటన్= ఉండుటచేత; వత్సములన్= దూడలను; మేపుచున్+ఉండియున్= మేపుతూనే; వత్సాసురున్ చంపెన్= దూడరూపంలో వచ్చిన వత్సాసురుని సంహరించాడు.

**తా :** ఓ పరీక్షిన్మహారాజా! భక్తుల విషయంలో ఎంతో వాత్సల్యంగల శ్రీకృష్ణుడు, లోకంలో ఎల్లజనులను ఆవు దూడలను కాపాడేలా కాపాడుతూ, దూడలను మేపుకుంటూ, దూడరూపంలో వచ్చిన వత్సాసురుని సంహరించాడు.

## ❖ బకాసుర వధ ❖

**వ. మఱియు నొక్కనాఁడు రేపకడ గోపకుమారులు క్రేపులం గొంచు నడవికిం జని యెండంబడి మెండుకొనిన దప్పిని బెండువడిన తమతమ లేఁగకదుపుల నేర్పరించి నిలువరించుకొని కలంకంబు లేని యొక్క కొలంకున నీరు ద్రావించి, తారును జలపానంబు సేసి వచ్చునెడ నందు. 440**

**ప్రతి :** మఱియున్= ఇంకనూ; ఒక్కనాఁడు= ఒకరోజు; రేపకడన్= పొద్దున్నే; గోపకుమారులు= గొల్లబాలకులు; క్రేపులన్+ కొంచున్= దూడలను తోలుకుంటూ; అడవికిన్+చని= అరణ్యానికి వెళ్ళి; ఎండన్+పడి= ఎండలో చిక్కి; మెండుకొనిన దప్పినిన్= అధికమైన దాహంతో; బెండు వడిన= నీరసించిన; తమ తమ లేఁగకదుపులన్= తమ తమ దూడల గుంపులను; ఏర్పరించి= విడి విడిగా చేసి; నిలువరించుకొని= నిలిపి; కలంకంబులేని= నిర్మలమైన; ఒక్కకొలంకునన్= ఒక సరస్సులో; నీరు త్రావించి= దూడలకు నీళ్లు తాగించి; తారును= తాముకూడా; జలపానంబు+చేసి= నీళ్ళుతాగి; వచ్చు+ఎడన్= వస్తూవుండగా; అందున్= అచట...

**తా :** వత్సాసురుణ్ణి సంహరించిన తరువాత, ఒకనాడు పొద్దున్నే గొల్లబాలురు దూడలతో అడవికి వెళ్లారు. ఎండ తీవ్రం కావడంతో దాహం ఎక్కువయింది. దాహంతో నీరసించిన తమతమ దూడలను విడివిడిగా నిలిపి, నిర్మలమైన ఒక సరస్సులోని నీటిని తాగించారు. వారుకూడా దాహం తీర్చుకొని వస్తుండగా అక్కడ

**క. అకలంకులు బాలురు గని, రకుటిలదంభోళిహతసితాద్రిశిఖర రూ**
**పకమున్ హరిహింసారం, భకమున్ బకమున్ విశాలభయదాంబకమున్. 441**

**ప్రతి :** అకలంకులు= నిష్కల్మషులైన; బాలురు= గోపాలురు; అకుటిలదంభోళిహతసిత అద్రి శిఖరరూపకమున్= వంకరలేని అంచులుగల వజ్రాయుధంతో కొట్టబడిన వెండికొండయొక్క కొమ్మువంటి ఆకారంకల; హరిహింసా+ఆరంభకమున్= కృష్ణుణ్ణి బాధించే ప్రయత్నంతో కూడినదాన్నీ; విశాల భయద+అంబకమున్= వెడల్పైన – భయం కలిగించే – కళ్ళు కలదైన; బకమున్= కొంగను; కనిరి= చూశారు.

**తా :** అలా దూడలకు దాహంతీర్చి తాముకూడా నీళ్లుతాగి ఉన్న సమయంలో అక్కడ ఆ గోపబాలురు ఒక తెల్లకొంగను చూశారు. అదెలా ఉందంటే పదునైన అంచులుగల వజ్రాయుధంతో కొట్టిన వెండికొండ శిఖరమో అన్నట్లుంది. పెద్దగా భయంకలిగించే కళ్ళతో కృష్ణుణ్ణి హింసించే ప్రయత్నంతో ఉన్నట్లుంది.

**వ. కని దానియొడలిపొడవునకు వెఱఁగుపడి చూచుచుండ. 442**

**ప్రతి :** కని= చూచి; దాని ఒడలి పొడవునకున్= దాని శరీరంయొక్క పొడుగునకు; వెఱఁగుపడి= అశ్చర్యపడి; చూచుచున్+ఉండన్= చూస్తూవుండగా

**తా :** ఆ కొంగను చూశారు. ఎంతో పొడవైన దాని శరీరాన్ని చూచి, ఆశ్చర్యంతో అలా చూస్తూనే ఉండగా

**ఆ. ఎల్లపనులు మాని యేకాగ్రచిత్తుఁడై, మౌనివృత్తి నితరమమత విడిచి**
**వనములోన నిలిచి వనజాక్షుపై దృష్టిఁ, జేర్చి బకుఁడు దపసిచెలువుఁ దాల్చె. 443**

**ప్రతి :** ఎల్లపనులు మాని= పనులన్నిటినీ విడిచిపెట్టి, ఏకాగ్రచిత్తుఁడై= ఒకే పనియందు మనసుంచినవాడై అనగా శ్రీకృష్ణుణ్ణి హింసించే పనిమీదే మనస్సు లగ్నం చేసినవాడై అనుట; మౌనివృత్తిన్= మునీశ్వరునిప్రవర్తనలా; ఇతర మమతన్= వేరే అభిమానాన్ని; విడిచి= వదలి; వనములోనన్= అడవిలో లేదా నీటిలో; నిలిచి= నిలువబడి; వనజ+అక్షుపైన్= పద్మంవంటి నేత్రాలుగల శ్రీకృష్ణునిమీదే; దృష్టిన్+చేర్చి= చూపు నిలిపి; బకుఁడు= బకాసురుడు; తపసిచెలువున్ తాల్చెన్= ఒక తాపసివిధానాన్ని పూనాడు.

**తా :** మునీశ్వరు లెలాగైతే పనులన్నీ విడిచి, ధ్యానమార్గమందే మనసుంచి, ఇతరమైన కోరికలులేకుండా, భగవంతునిమీదే దృష్టితో ఉంటారో, అలాగే బకాసురుడుకూడా ఇంకే పనీ ఆలోచించకుండా, కృష్ణుణ్ణి హింసించే దృష్టితో మరో అభిమానం లేక, నీటి ఒడ్డున నిలిచి, పద్మదళాయతనేత్రుడైన శ్రీకృష్ణునిమీదే చూపుంచి ఒక తాపసివలె ఉన్నాడు.

**వ. ఇ వ్విధంబున నొదుఁగు వెట్టికొని యుండి. 444**

**ప్రతి :** ఈ+విధంబునన్= ఈ రీతిగా; ఒదుఁగు పెట్టుకొని= పొంచి ఉన్నట్లుగా; ఉండి= ఉన్నవాడై...

**తా :** పై రీతిని తపస్విగా నిలిచి పొంచి ఉన్నవాడై సమయంకోసం కనిపెట్టుకొని

**ఉ. చంచువు దీటి పక్షములు జల్లున విచ్చి పదంబు లెత్తి కు**
**ప్పించి నభంబుపై కెగసి, భీషణఘోషణవక్త్రుఁడై విజృం**
**భించి గరుత్సమీరమున భిన్నము లై తరులోలిఁ గూలఁగా**
**మించి బకాసురుం డొడిసి మ్రింగె సహిష్ణునిఁ జిన్నికృష్ణునిన్. 445**

**ప్రతి :** చంచువు దీటి= ముక్కు సరిచేసుకుని; పక్షములు= రెక్కలను; జల్లునన్ విచ్చి= తటాలున విప్పి; పదంబులు+ఎత్తి= కాళ్ళెత్తి; కుప్పించి= భూమిపైనుండి ఒక్కసారి శరీరాన్ని కుదిపి; నభంబుపైకిన్ ఎగసి= ఆకాశంలోకి ఎగిరి; భీషణ ఘోషణ వక్త్రుఁడు+ఐ= భయంకరమైన శబ్దం చేస్తున్న నోరు కలవాడై; విజృంభించి= చెలరేగి; గరుత్+సమీరమునన్=రెక్కల గాలిచేత; తరులు= చెట్లు; ఓలిన్= వరుసగా; కూలన్+కాన్= విరిగి నేలపడగా; మించి= అతిశయించి (మీరి); బక+అసురుండు= బకుడనే రాక్షసుడు; సహిష్ణునిన్= ఎట్టికష్టాన్నైనా ఓర్చే స్వభావం గలవాణ్ణి; చిన్ని కృష్ణునిన్= ఆ బాలకృష్ణుణ్ణి; ఒడిసి= లాగి పట్టుకొని; మ్రింగెన్= మింగాడు.

**తా :** బకాసురుడు ఒకసారి ముక్కును సరిచేసి, రెక్కలు విప్పి, కాళ్ళెత్తి నేలపైనుండి శరీరాన్ని కుదిపి, ఆకాశంమీదికి ఎగిరాడు. భయంకరంగా ధ్వనిచేస్తూ నోరువిప్పి, తన రెక్కల గాలికి చెట్లు విరిగి వరుసగా నేలకూలగా, ఏ పనైనా ఓర్మితో భరించే ఆ చిన్ని కృష్ణుణ్ణి లాగిపట్టి మింగేశాడు.

**క. సంగడిలోకము లన్నియు, మ్రింగుచుఁ గ్రక్కుచును బయల మెలఁగించుచు ను**
**ప్పొంగెడు, వేడుకకాఁ డటు, మ్రింగుడువడె బకునిచేత మీఁదెఱిఁగి నృపా! 446**

**ప్రతి :** నృపా= ఓ రాజా!; లోకములు+అన్నియున్= సమస్త లోకాలను; సంగడిన్= దగ్గరగా ఒకటిచేసి; మ్రింగుచున్= తనలో లయింపజేస్తూ; క్రక్కుచును= సృష్టిస్తూ; బయలన్= బయట; మెలఁగించుచున్= తిరిగేటట్లుచేస్తూ; ఉప్పొంగెడు= ఆనందించే; వేడుకకాఁడు= లీలా వినోదియైనవాడు; మీఁదు+ఎఱిఁగి= ముందు జరుగుబోయే విషయం తెలిసి; అటు= ఆ విధంగా; బకునిచేతన్= బకాసురునిచేత; మ్రింగుడు+పడెన్= మింగబడ్డాడు.

**తా :** రాజా! లోకాలన్నింటినీ ఒకటిగా చేర్చి, వాటిల్ని లయంచేస్తూ, సృష్టిస్తూ, బాహ్యంగా సంచరించేలా చేస్తూ సంతోషించే లీలావిలాసరూపుడైన శ్రీకృష్ణపరమాత్మ ముందు ఏం జరుగుతుందో ఊహించి అలా బకాసురునిచేత మింగబడ్డాడు.

**క. దనుజుఁడు మ్రింగినఁ గృష్ణునిఁ, గనలేక బలాదిబాలకప్రముఖు లచే**
**తనులై వెఱఁగందిరి చ, య్యనఁ బ్రాణము లేని యింద్రియంబుల భంగిన్. 447**

**ప్రతి :** దనుజుఁడు= బకాసురుడు; మ్రింగినన్= మింగిన తరువాత; కృష్ణునిన్= బాలకృష్ణుణ్ణి; కనన్+లేక= చూడలేక; బల+ఆదిబాలక ప్రముఖులు= బలరాముడు మొదలగు గోపకుమారులు; అచేతనులు+ఐ= చేష్టలులేనివారై; చయ్యనన్= హఠాత్తుగా; ప్రాణములేని= జీవంలేని; ఇంద్రియంబుల భంగిన్= ఇంద్రియాలవలె; వెఱఁగు+అందిరి= నిశ్చేష్టులయ్యారు.

**తా :** ఆ విధంగా బకాసురుడు కృష్ణుణ్ణి మింగేసరికి, బలరామునితోపాటు ఆ గోపబాలురంతా కృష్ణుణ్ణి కానకపోవడంతో ఒక్కసారిగా చేష్టలులేనివారై, జీవంలేని ఇంద్రియాలవలె నిశ్చేష్టులయ్యారు.

**వ. ఇట్లు మ్రింగుడువడి లోనికిం జనక. 448**

**ప్రతి :** ఇట్లు= ఈ రీతిగా కృష్ణుడు; మ్రింగుడుపడి= బకాసురునిచే మింగబడ్డవాడై; లోనికిన్+చనక= ఆ బకునికడుపులోనికి వెళ్ళకుండా...

**తా :** కృష్ణుణ్ణి బకాసురుడు మింగాడు. అయినా కృష్ణుడు బకుని కడుపులోకి వెళ్లకుండా

**శా. కంఠోపాంతము దౌడలున్ మెఱముచుం గాలాగ్నిచందంబునం**
**గుంఠీభూతుఁడు గాక వేండ్రమగు నా గోపాలబాలున్ జయో**
**త్కంఠున్ బ్రహ్మగురున్ మహామహిముఁ జక్కన్ మ్రింగ రాదంచు ను**
**ల్లుంఠం బాడుచ వాఁడు గ్రక్కె వెడలన్ లోకం బశోకంబుగన్. 449**

**ప్రతి :** కంఠ+ఉపాంతము= గొంతుక (అంగిలి); దౌడలున్= చెంపలలోపలి దవడలు; మెఱముచున్= ఇటూ అటూ మెదల్చుతూ; కాల+అగ్ని చందంబునన్= ప్రళయకాలంలోని అగ్నిలా; కుంఠీభూతుఁడు+కాక= అసమర్థుడు కాకుండా; వేండ్రము+అగు= తీవ్రతాపాన్ని కలుగజేస్తున్న; జయ+ఉత్కంఠున్= గెలవాలనే ఉత్సాహంతో ఉన్నవాణ్ణి; బ్రహ్మగురున్= బ్రహ్మకే తండ్రియైనవాణ్ణి; మహామహిమున్= గొప్ప మహిమలు కలవాణ్ణి; ఆ గోపాలబాలున్= ఆ బాలకృష్ణుణ్ణి; చక్కన్= సులభంగా; మ్రింగన్ రాదు+అంచున్= మింగడం శక్యం కాదంటూ; ఉల్లుంఠంబు= నిందా పూర్వకంగా; ఆడుచున్= మాట్లాడుతూ; లోకంబు= జగత్తంతా; అశోకంబు+కన్= దుఃఖం లేని దగునట్లు; వాఁడు= ఆ బకాసురుడు; వెడలన్ క్రక్కెన్= కృష్ణుణ్ణి బయటికి వచ్చేటట్లు కక్కాడు.

**తా :** బకుడు కృష్ణుణ్ణి మింగేసరికి అతని అంగిలి దవడలు అటూ ఇటూ మెదుపుతూ ప్రళయకాలంలో అగ్నిలా శ్రీకృష్ణుడు మొక్కవోని పరాక్రమంతో తీవ్రతాపాన్ని కలుగజేస్తూవుంటే అలా విజయం పొందాలనుకుంటున్న బ్రహ్మకే తండ్రియైన అణిమాదిమహిమలతో నిండియున్న ఆ బాలకృష్ణుణ్ణి మింగడం సాధ్యంకాదని తలచి, కృష్ణుణ్ణి నిందిస్తూ లోకాన్ని సుఖమయం చేసేలా బకుడు కృష్ణుణ్ణి బయటికి కక్కాడు.

**క. క్రక్కి మహాఘోషముతోఁ, జక్కఁగఁ దనుఁ బొడువరాఁగఁ జంచులు రెండున్**
**స్రుక్కఁగఁ బట్టి తృణముక్రియ, గ్రక్కున హరి సీరె బకునిఁ గలహోత్సుకునిన్. 450**

**ప్రతి :** క్రక్కి= అలా బయటికి కక్కి; మహాఘోషముతోన్= పెద్ద ధ్వనితో అరుస్తూ; చక్కన్+కన్= చక్కగా; తనున్= తనను; (కృష్ణుని); పొడువరాన్+కన్= పొడుచుటకు వస్తూవుండగా; హరి= శ్రీకృష్ణమూర్తి; చంచులు రెండున్= ఆ బకుని ముక్కుపుటాలు రెండింటినీ; స్రుక్కన్+కన్= ముడుచుకపోయేలా; పట్టి= పట్టుకొని; తృణముక్రియన్= గడ్డిపోచలా; గ్రక్కునన్= తటాలున; కలహ+ఉత్సుకునిన్= కయ్యానికి సంబరపడుతూవున్న; బకునిన్= బకాసురుణ్ణి; చీరెన్= రెండుగా చీల్చివేశాడు.

**తా :** గొంతుకలో ఉన్న కృష్ణుణ్ణి భరించలేక బయటికి కక్కి, పెద్దగా అరుస్తూ కృష్ణుణ్ణి ముక్కుతో పొడుద్దామని వస్తున్న ఆ కొక్కెర రక్కసియొక్క ముక్కుపుటాలు రెండూ ముడుచుకొనేట్లుగా పట్టుకొని, కృష్ణుడు గడ్డిపోచను నిలువునా చీల్చినట్లు తనపై కయ్యానికి కాలు దువ్వేలా వస్తున్న ఆ రక్కసుణ్ణి రెండుగా చీల్చివేశాడు.

**వ. అప్పు డా నందనందనునిమీఁద వేలుపులు చాలుపులుగా నందనమల్లికాదికుసుమవర్షంబులు హర్షంబునం గురియించిరి, దేవవాద్యంబులు మొరసె, రామాదిగోపకుమారులు ప్రాణంబులతోఁ గూడిన యింద్రియంబులునుం బోలెఁ గ్రమ్మఱఁ గృష్ణునిం గని రమ్మని కౌఁగిలించుకొని కృష్ణసహితులయి లేఁగ దాఁటుల మరల దాఁటించుకొని మందగమనంబున మంద కరిగిరి, వారలచేత నా వృత్తాంతం బంతయు విని వెఱంగుపడి గోపగోపికాజనంబులు. 451**

**ప్రతి :** అప్పుడు= ఆ సమయంలో; నందనందనునిమీఁదన్= నందకుమారుడైన శ్రీకృష్ణునిపై; వేలుపులు= దేవతలు; చాలుపులుగాన్= వరుసలుగా; నందన మల్లిక ఆది కుసుమ వర్షంబులు= నందనవనంలోనివైన మల్లెలు మొదలైన పూలవానలు; హర్షంబునన్= ఎంతో సంతోషంతో; కురియించిరి= కురిపించారు; దేవవాద్యంబులు= దేవ దుందుభులు; మొరసెన్= మ్రోగాయి; రామ+ఆది గోపకుమారులు= బలరాముడు మొదలుగాగల గోపబాలురందరూ; ప్రాణంబులతోన్+కూడిన= జీవంతో కూడిన; ఇంద్రియంబులునున్+పోలెన్= ఇంద్రియాలవలె; క్రమ్మఱన్= మరల; కృష్ణునిన్+కని= కృష్ణుణ్ణి చూచి; రమ్ము+అని= రమ్మని పిలిచి; కౌగిలించుకొని= ఆలింగనంచేసి; కృష్ణసహితులు అయి= కృష్ణునితో కూడినవారై; లేఁగ దాఁటులన్= దూడల గుంపును; మరల దాఁటించుకొని= మళ్ళీ నడిపించుకొంటూ; మందగమనంబునన్= మెల్లని నడకతో; మందకున్ అరిగిరి= బృందావనానికి పోయారు; గోపగోపికా జనంబులు= అక్కడి గోపాలురు, గోపవనితలు; వారలచేతన్= అలా వచ్చిన గోపబాలుర ద్వారా; ఆ వృత్తాంతంబు+అంతయున్= దూడలను మేపడానికి వెళ్ళిన దగ్గరనుండి బకాసురుని చావువరకు జరిగిన విషయాన్నంతటిని, విని= విన్నవారై; వెఱంగుపడి= ఆశ్చర్యపడ్డవారై...

**తా :** ఇలా ఎప్పుడైతే శ్రీకృష్ణుడు బకాసురుణ్ణి చీల్చి చంపాడో, అప్పుడు దేవతలు కృష్ణునిమీద పంక్తులు పంక్తులుగా నందన వనంలోని మల్లెలు మొదలగు పూలవానలు కురిపించారు. దేవ దుందుభులు మ్రోగాయి. బకాసురుడు కృష్ణుని మింగడం చూచి, ప్రాణంలేని ఇంద్రియాలతో అచేతనులైపోయిన బలరామాదులు మళ్ళీ జీవం నిండిన ఇంద్రియాలతో కృష్ణుణ్ణి దగ్గరకు పిలిచి కౌగిలించుకున్నారు. అందరూ దూడలగుంపులు తోలుకుంటూ తిన్నని నడకలు నడుస్తూ బృందావనానికి వచ్చి, అక్కడి గోపకులకు, గొల్లస్త్రీలకు అందరికీ విషయమంతా చెప్పగా, విన్నవారంతా ఎంతో ఆశ్చర్యపడ్డారు.

**క. ఆపదలమీఁద నాపద, లీ పాపనిఁ జెంది తొలఁగె, నీ యర్భకుపై**
**వే పడిన ఖలులు దహనుని, వైపున శలభముల పగిదిఁ బడిరి ధరిత్రిన్. 452**

**ప్రతి :** ఈ పాపనిన్= ఈ చిన్ని కృష్ణుణ్ణి; ఆపదల మీఁదన్ ఆపదలు= ఒక ప్రమాదం వెంట మరో ప్రమాదంగా; చెంది= పొంది; తొలఁగెన్= తప్పిపోయాయి; ఈ అర్భకుపైన్= ఈ బాలుడిమీద; వే= వేగంతో; పడిన= మీదపడిన; ఖలులు= దుర్మార్గులు; దహనుని వైపునన్= అగ్ని మీదకు వెళ్ళే; శలభముల పగిదిన్= మిడతలవలె; ధరిత్రిన్= నేలమీద; పడిరి= పడిపోయారు.

**తా :** ఆ గోపాలురు గోపకాంతలు ఇలా అనుకుంటున్నారు. ఈ చిన్నికృష్ణునికి ఆపదల మీద ఆపదలు వచ్చిపడి తప్పుతున్నాయి. ఈ బాలుడిపై వరుసగా పడ్డ దుర్జనులందరూ అగ్నిమీదకి వెళ్ళి మాడి రాలిన మిడతల్లా భూమ్మీద పడిపోతున్నారు.

**వ. అని పలికిరి, మఱియు నా రామకృష్ణులు క్రేపులం గాచుతఱి. 453**

**ప్రతి :** అని పలికిరి= పైరీతిగా అక్కడివారంతా అన్నారు; మఱియున్= ఇంకా; ఆ రామకృష్ణులు= ఆ బలరామకృష్ణులు; క్రేపులన్= దూడలను; కాచుతఱిన్= మేపుతూ ఉన్న సమయంలో...

**తా :** ఇలా వారంతా అన్నారు. ఆ పై రామకృష్ణులు దూడలను మేపుకుంటూ ఉన్న సమయంలో

**సీ. కపులమై జలరాశిఁ గట్టుదమా యని కట్టుదు రడ్డంబు గాలువలకు,**
**మునులమై తపములు మొనయుదమా యని మౌనులై యుందురు మాట లేక,**
**గంధర్వవరులమై గానవిద్యలు మీఱఁ బాడుదమా యని పాడఁ జొత్తు,**
**రప్సరోజనులమై యాడుదమా యని యాఁడురూపులఁ దాల్చి యాడఁ జనుదు,**

**ఆ. రమర దైత్యవరులమై యబ్ధిఁ ద్రత్తమా, యని సరోవరములయందు హస్త**
**దండచయముఁ ద్రిప్పి తరుతురు తమయీడుకొమరు లనుసరింపఁ గొమరు మిగుల. 454**

**ప్రతి :** కపులము+ఐ= వానరులమై; జలరాశిన్= సముద్రాన్ని; కట్టుదమా+అని= వారధి కడదామా అంటూ; కాలువలకున్= అక్కడి చిన్న ప్రవాహాలకు; అడ్డంబు= అడ్డుకట్ట; కట్టుదురు= కడతారు; మునులము+ఐ= ఋషులమై; తపములు= తపస్సులు; మొనయుదమా అని= చేయడానికి ప్రయత్నిద్దామా అంటూ; మాటలేక= మాట్లాడకుండా; మౌనులు+ఐ ఉందురు= మౌనాన్ని పాటిస్తూ ఉంటారు; గంధర్వవరులము+ఐ= గాయకశ్రేష్ఠులమై; గానవిద్యలు మీఱన్= గానకళలు అతిశయించగా; పాడుదమా అని= గానం చేద్దామా అంటూ; పాడన్+చొత్తురు= పాడడం ప్రారంభిస్తారు; అప్సరస్+జనులము+ఐ= దేవజాతికి చెందిన అచ్చరకాంతలరూపాన్ని పొంది; ఆడుదమా అని= నర్తిద్దామా అంటూ; ఆఁడురూపులన్+తాల్చి= ఆడువారి రూపాల్ని ధరించి; ఆడన్+చనుదురు= నృత్యం చేయబోతారు; అమర దైత్యవరులము+అయి= మీరు, మేము కలసి దేవతల్లా, రాక్షసుల్లా; అబ్ధిన్= సముద్రాన్ని; త్రత్తమా (త్రచ్చుదమా) అని= చిలుకుదామా అంటూ; సరోవరముల+అందున్= గొప్ప గొప్ప సరస్సులలో; హస్తదండచయమున్= కర్రలవంటి తమ చేతులను లేదా తమ హస్తాలు అనే కర్రల సముదాయాన్ని; త్రిప్పి= తిప్పుతూ; తమ ఈడు కొమరులు= తమవయస్సుగల పిల్లలు; అనుసరింపన్= తమతో చేరిరాగా; కొమరు మిగులన్= ఎంతో అందగించగా; తరుతురు(తరుచుదురు)= చిలుకుతారు.

**తా :** మనం వానరుల్లా సముద్రానికి సేతువు కడదామా అంటూ అక్కడున్న కాలువలపై అడ్డకట్టలు కడతారు. మునీశ్వరుల్లా తపస్సు చేసుకుందామా అంటూ, మాటలు మాని, మౌనుల్లా ఉంటారు. గానం చేసే గంధర్వుల్లా మనంకూడా పాడుదామా అంటూ పాడడం ప్రారంభిస్తారు. అచ్చరకాంతల్లా మనంకూడా నృత్యం చేద్దామా అంటూ ఆడవేషం ధరించి నర్తిస్తారు. దేవతలు, రాక్షసులు ఎలాగైతే సముద్రాన్ని చిలికారో మనమూ అలాచేద్దాం అంటూ తమ ఈడుగల గోపబాలురంతా కలిసిరాగా ఎంతో అందంగా తమ చేతులనే కర్రలుగా భావించి, అక్కడిసరస్సులను చిలుకుతారు.

## ❖ శ్రీకృష్ణుఁడు గోపకులతో బంతి చల్దులు గుడువ వనమున కేగుట ❖

**వ. అంత నొక్కనాఁడు రామకృష్ణులు గాంతారంబున బంతిచలుదులు గుడువ నుద్యోగించి ప్రొద్దున లేచి, గ్రద్దనం దమయింటి లేఁగకదుపులఁ గదలించి, సురంగంబులకు శృంగంబులు పూరించిన విని, మేలుకని,**

**సంరంభంబున గోపడింభకులు చలిదికావడులు మూపుల వహించి, సజ్జంబులగు కజ్జంబులు గట్టికొని, పదత్రాణవేత్రదండధరులై, లెక్కలకు వెక్కసంబైన తమతమ క్రేపుకదుపులం జప్పుడించి రొప్పుకొనుచుఁ, గాననంబు సొచ్చి, కాంచనమణి పుంజగుంజాది భూషణభూషితు లయ్యును, ఫలకుసుమ కోరకపల్లవవల్లరులు దొడవులుగా నిడుకొని, కొమ్ము లిమ్ముగఁ బూరించుచు, వేణువు లూఁదుచుఁ, దుమ్మెదలం గూడి పాడుచు, మయూరంబులతోడం గూడి యాడుచు, పికంబులం గలసి కూయుచు, శుకంబులం జేరి రొదలు సేయుచుఁ, బులుఁగుల నీడలం బాఱుచు, సరాళంబులగు వాఁగులు గడచుచు, మరాళంబులచెంత నడచుచు, బకమ్ములం గని నిలుచుచు, సారసంబులం జోపి యలంచుచు, నదీజలంబులం దోఁగుచుఁ, దీవయుయ్యెలల నూఁగుచుఁ, బల్లంబులన్ డాఁగుచు, దూరంబుల కేగుచుఁ, గపులసంగడిఁ దరువు లెక్కుచు, ఫలంబుల మెక్కుచు, రసంబులకుం జొక్కుచు, నింగికి నిక్కుచు, నీడలు సూచి నవ్వుచుఁ, గయ్యంబులకుం గాలు ద్రవ్వుచుఁ, జెలంగుచు, మెలంగుచు, వ్రాలుచు, సోలుచు బహుప్రకారంబుల శరీరవికారంబులు సేయుచు మఱియును. 455**

**ప్రతి :** అంతన్+ఒక్కనాడు= ఆపై ఒక రోజున; రామకృష్ణులు= బలరామకృష్ణులు; కాంతారంబునన్= అడవిలో; బంతి చలుదులు కుడువన్= వరుసగా అందరూ పంక్తిగా కూర్చుండి చద్ది తినడానికి; ఉద్యోగించి= ప్రయత్నించి; ప్రొద్దునన్ లేచి= తెల్లవారగానే లేచి; గ్రద్దనన్= వెంటనే; తమ ఇంటి లేఁగకదుపులన్= తమ ఇంట్లో ఉండే దూడల గుంపులను; కదలించి= వెడలునట్లు చేసి; సురంగంబులగు శృంగంబులు= సారంగాలవంటి చాలా పొడవైన కొమ్ముబూరాలు; పూరించనన్ విని= ఊదగా ఆ ధ్వనిని విని; మేలుకని= నిద్రలేచి; సంరంభంబునన్= తొట్రుపాటుతో; గోపడింభకులు= గొల్లబాలురు; చలిది కావడులు= చద్ది మూటలు కట్టిన కావళ్ళను; మూపులన్ వహించి= భుజాలపై ఉంచుకొని; సజ్జంబులు+అగు కజ్జంబులు= సిద్ధంగా ఉంచినవైన కజ్జకాయలు మొదలైన తీపిపదార్థాలను; కట్టుకొని= మూటలుగా కట్టి పట్టుకొని; పదత్రాణ వేత్రదండధరులు+ఐ= కాళ్ళకు చెప్పులు, చేతిలో బెత్తాలను పట్టినవారై; లెక్కలకు వెక్కసంబు+ఐన= లెక్కపెట్టుటకు అలవికాకుండా ఉన్న; తమ తమ క్రేపుకదుపులన్= వారివారిదూడల గుంపులను; చప్పుడించి= శబ్దంచేస్తూ; రొప్పుకొనుచున్= తరుముకొంటూ; కాననంబు+చొచ్చి= అడవిలో ప్రవేశించి; కాంచన+మణిపుంజగుంజా+ఆది భూషణ భూషితులు అయ్యును= బంగారం, రత్నాలు, గురివిందగింజలు మొదలగువానితో చేసిన ఆభరణాలను అలంకరించుకొన్న వాళ్లయి కూడా; ఫల కుసుమ కోరక పల్లవ వల్లరులు= పళ్లు, పూలు, మొగ్గలు, చిగుళ్ళగుత్తులను, తీగెలను; తొడవులు+కాన్ ఇడుకొని= సొమ్ములుగా పెట్టుకొని; కొమ్ములు= బూరాలు; ఇమ్ముగన్+పూరించుచున్= చక్కగా ఊదుతూ; వేణువులు+ ఊఁదుచున్= పిల్లనగ్రోవులను ఊదుతూ; తుమ్మెదలన్+కూడి పాడుచున్= ఝుమ్మంటూ రొదచేసే తుమ్మెదలతో కలిసి తామూ అలా ధ్వనిచేస్తూ; మయూరంబుల తోడన్ కూడి ఆడుచున్= నెమళ్లతో చేరి తామూ అలాగే నాట్యం చేస్తూ; పికంబులన్ కలసి= కోకిలలతో కూడి; కూయుచున్= కూస్తూ; శుకంబులన్+చేరి= చిలుకలతో కలిసి; రొదలు చేయుచున్= ధ్వనులు చేస్తూ; పులుఁగుల నీడలన్ పాఱుచున్= పైన పక్షులు ఎగురుతూ ఉంటే వాటి నీడలనుబట్టి పరుగెడుతూ; సరాళంబులు+అగు వాగులు కడచుచున్= తిన్ననైన సెలయేళ్ళను దాటుతూ; మరాళంబుల చెంతన్ నడచుచున్= హంసల పక్కనే నడుస్తూ; బకమ్ములన్+కని నిలుచుచున్= కొంగలను చూచి నిలుచుంటూ; సారసంబులన్+చోపి అలంచుచున్= సరస్సుల్లో వుండే బెగ్గురుపక్షులను ఎగద్రోలి శ్రమపెడుతూ, నదీజలంబులన్+ తోఁగుచున్= ఏటినీళ్లలో మునుగుతూ; తీవ ఉయ్యెలలన్ ఊఁగుచున్= తీగలను ఉయ్యాలలుగా చేసుకొని ఊగుతూ; పల్లంబులన్ డాఁగుచున్= లోతుగావున్న గోతులలో దాక్కుంటూ; దూరంబులకున్ ఏగుచున్= దూరంగా ఉండేచోట్లకు

వెళ్తూ; కపులసంగడిన్= కోతులతో కూడి; తరువులు+ఎక్కుచున్= చెట్లెక్కుతూ; ఫలంబులన్+మెక్కుచున్= పండ్లు తింటూ; రసంబులకున్+చొక్కుచున్= ఆ యా పండ్ల రసాల్ని ఆస్వాదించి పరవశిస్తూ; నింగికిన్ నిక్కుచున్= ఆకాశాన్ని అందుకోవడానికా అన్నట్లు పైకినిక్కుతూ; నీడలు చూచి నవ్వుచున్= తమ తమ నీడలను చూచి నవ్వుకుంటూ; కయ్యంబులకున్ కాలుద్రవ్వుచున్= దెబ్బలాటలకు కోరి దిగుతూ; చెలంగుచున్= చెలరేగుతూ; మెలంగుచున్= అంతటా తిరుగుతూ; వ్రాలుచున్= నేలపై వాలుతూ; సోలుచున్= అలసిపోతూ; బహుప్రకారంబులన్= అనేక విధాలుగా; శరీర వికారంబులు= శారీరికంగా అనేక విధాలైన చేష్టలను; చేయుచున్= చేస్తూ; మఱియును= ఇంకనూ...

**తా :** ఒకనాడు బలరామకృష్ణులకు వనభోజనంలో చద్ది బంతిగా కూడి తిందామన్న ఆలోచన కలిగింది. దాంతో పొద్దున్నే లేచి వెంటనే తమ ఇంట్లో వున్న దూడలన్నింటిని తోలుకొని వెళ్ళి, పెద్ద కొమ్ముబూరాలను ఊదారు. అది విన్న గోపబాలురందరూ లేచి, చల్దికావళ్ళు భుజాలపై పెట్టుకొని, మంచి రుచిగా వుండే కజ్జకాయల్లాంటి మధురపదార్థాలను మూటలు కట్టుకొని, కాళ్ళకు చెప్పులతో, చేతిలో బెత్తాలతో ఎక్కువగా వుండే తమ దూడల గుంపులను లేపి, కూడదీసి తోలుకుంటూ అడవిలో ప్రవేశించారు. బంగారంతో, మణులతో, గురిగింజలు మొదలైన వస్తువులతో తయారైన సొమ్ములు వాళ్ళకున్నా, అడవిలోని పళ్ళు, పూలు, మొగ్గలు, చివుళ్లు తీగలతో అలంకారాలు చేసుకొని ధరించారు. ఇక అక్కడనుండి వాళ్ళ ఆటపాటలు గెంతులు అన్నీ ఇష్టం వచ్చినట్లుగా చేస్తున్నారు. పెద్దపెద్ద కొమ్ముబూరలను పూరిస్తూ, పిల్లనగ్రోవులను ఊదుతూ, తుమ్మెదల్లా ఝుం అంటూ పాడుతూ, నెమళ్ళతో కలసి నృత్యం చేస్తూ, కోకిలల్లా కూస్తూ, చిలకల్లా అరుస్తూ, పైన పక్షులెగురుతూ ఉంటే వాటి నీడనుబట్టి కింద పరిగెడుతూ, చక్కనైన సెలయేళ్ళను దాటుకుంటూ, హంసలతో కలిసి వాటితో నడుస్తూ, కొంగలు ఒంటికాలుపై నిలుచున్నట్లు వీళ్ళూ కొంగల్లా నిలుస్తూ, నీటిపక్షులను అదలిస్తూ, ఏటినీట్లో మునుగుతూ, చెట్లకు అల్లుకునివున్న తీగెలను ఉయ్యాల్లా చేసికొని ఊగుతూ, గోతుల్లో దాక్కుంటూ, ఒక్కోసారి దూరంగా వెళ్తూ, చెట్లపైనున్న కోతులను చూచి, వాటివలె చెట్లెక్కుతూ, మంచిపండ్లు తింటూ, రసాన్ని ఆస్వాదించి పరవశిస్తూ, ఆకాశంపైకి ఎగురుతూ, తమ తమ నీడల ఆకారాలను చూచి నవ్వుకుంటూ, దెబ్బలాటలకు దిగుతూ, చెలరేగుతూ అంతటా తిరుగుతూ, నేలపైవాలుతూ, అలసిపోతూ నానావిధాల వికారాలు చేస్తూ తిరుగుతున్నారు. ఇంకనూ

**క. ఒకనొకని చల్దికావడి, నొకఁ డొకఁ డడకించి దాఁచు, నొకఁ డొకఁ డది వే**
**ఱొకఁ డొకని మొఱఁగి కొని చన, నొకఁ డొకఁ డది దెచ్చి యిచ్చు నుర్వీనాథా! 456**

**ప్రతి :** ఉర్వీనాథా= ఓ పరీక్షిన్మహారాజా!; ఒకని+ఒకని చల్దికావడిన్= ఒకనికి సంబంధించిన చల్ది కట్టిన కావడిని; ఒకడు+ఒకడు= ఇంకొకడు; అడకించి= వంచించి; దాఁచున్= దాచిపెడతాడు; అది= అలా దాచిన కావడిని; వేఱొకఁడు ఒకని మొఱఁగి కొని చనన్= మరొకడు ఇంకొకణ్ణి వంచించి ఎత్తుకొని పోగా; ఒకడు+ఒకడు= ఇంకొకడు; అది= ఆ చల్దికావడిని; తెచ్చి ఇచ్చున్= తీసుకొని వచ్చి అసలువాడికి ఇస్తాడు.

**తా :** ఓ రాజా! ఇంకా ఆ గొల్లబాలురు ఎలా ఆటలాడుతూ ఆనందిస్తున్నారంటే – ఒకడు తెచ్చుకున్న చల్దిమూటను ఇంకొకడు దాచి వేస్తాడు. మరొక దది చూచి, దాన్ని వేరొకనికి అందిస్తే వాడు దాన్ని దాచి ఉంచుతాడు. అప్పుడు ఇంకో గొల్లడు దాన్ని తెచ్చి అసలువానికి ఇస్తాడు.

**క. ఒక్కఁడు ము న్నేమఱి చన, నొక్కఁడు బలుబొబ్బ వెట్టు నులికిపడన్, వే**
**ఱొక్కఁడు మిట్టి తటాలున, నొక్కని కనుదోయి మూయు నొక్కఁడు నగఁగన్. 457**

**ప్రతి :** ఒక్కఁడు= ఒక గోపబాలుడు; మున్ను= ముందు; ఏమఱి చనన్= పరాకుపడి వెళ్ళగా; ఒక్కఁడు= మరొకడు; ఉలికిపడన్= (పరాకుతో ముందు పోయినవాడు) అదిరిపడేలా; బలు బొబ్బ+పెట్టున్= పెద్దగా అరుస్తాడు; (ఇది గమనించి); ఒక్కఁడు= వేరొకడు; నగన్+కన్= నవ్వగా; వేఱు+ఒక్కడు= ఇంకొకడు; తటాలునన్= హఠాత్తుగా; మిట్టి= ఎగిరి; ఒక్కని కనుదోయిన్= వేరొకడి రెండు కళ్ళనూ; మూయున్= మూస్తాడు;

**తా :** ఆ గొల్ల బాలురలో ఒకడు ఏదో పరధ్యానంలో ముందుకు వెళ్తూవుంటే, ఇంకొకడు వెనకనుంచి వచ్చి పెద్దగా అరచి భయపడేలా చేస్తాడు. మరొకడు, ఒక్కసారిగా వచ్చి వాణ్ణి తట్టి, పక్కవాడు చూచి నవ్వుతూ ఉంటే వాడిరెండు కళ్ళూ మూస్తాడు.

**క. తీపుగల కజ్జ మన్యుఁడు, గోపింపఁగ నొడిసి పుచ్చుకొని త్రోపాడం**
**బైపడి యది గొని యొక్కఁడు, క్రేపులలో నిట్టునట్టుఁ గికురించు నృపా! 458**

**ప్రతి :** నృపా!= ఓ రాజా!; తీపుగల కజ్జమున్= తియ్యని పదార్థాన్ని; అన్యుఁడు= మరొకడు; కోపింపన్+కన్= కోపగించగా; ఒడిసి పుచ్చుకొని= గట్టిగా పట్టి తీసుకుని; త్రోపాడన్= విసిరి వేయగా, ఎగుర వేయగా; పైపడి= మీదపడి; అది+కొని= దాన్ని తీసుకొని; ఒక్కఁడు= ఇంకొకడు; క్రేపులలోన్= దూడల మధ్యలో ఉండి; ఇట్టు నట్టున్= ఇటూ అటూ; కికురించున్= మోసగిస్తాడు.

**తా :** ఒకనిచేతిలో ఉండే తీపి పదార్థాన్ని ఇంకొకడు వాడికి కోపం వచ్చేలా చేత్తో తీసికొని, పైకి వేయగా దాన్ని ఇంకొకడు తీసుకొని, దొరక్కుండా దూడల గుంపులో ఇటూ అటూ దాక్కుంటూ తిరుగుతాడు.

**క. వనజాక్షుఁడు ము న్నరిగిన, 'మునుపడఁగా నతని నేనె ముట్టెద' ననుచుం**
**జని మును ముట్టనివానిన్, మును ముట్టినవాఁడు నవ్వు మొనసి నరేంద్రా! 459**

**ప్రతి :** నర+ఇంద్రా!= రాజా!; వనజ+అక్షుడు= పద్మంవంటి కన్నులగల శ్రీకృష్ణుడు; మున్ను అరగినన్= తమను దాటి ముందుకు వెళ్ళగా; అతనిన్= ఆ కృష్ణుణ్ణి; మునుపడన్+కాన్= ముందుగా; నేనె= నేనే; ముట్టెదను= తాకుతాను; అనుచున్+చని= అంటూ వెళ్ళి; మును ముట్టనివానిన్= అలా ముందు తాకనివాణ్ణి; మును ముట్టినవాఁడు= ఎవడైతే ముందుగా వెళ్ళి తాకినాడో వాడు; మొనసి= పూని; నవ్వున్= నవ్వుతాడు.

**తా :** ఆటల్లో ఇదొరకం. కృష్ణుడు ముందుగా వెళ్తుంటే గోపబాలురు అతణ్ని నేనే ముందు ముట్టుకుంటాను అంటూ వెళ్లారు. అలా వెళ్ళినవాళ్ళల్లో ఎవడైతే ముందుగా తాకలేక పోయాడో వాణ్ణి చూచి ముందుగా తాకినవాడు కావాలనే ఎగతాళిగా నవ్వుతాడు (ఇది ఇప్పటి కబడ్డీ ఆటలాంటిది).

**వ. ఇ వ్విధంబున. 460**

**ప్రతి :** ఈ+విధంబునన్= ఈ ప్రకారంగా...

**తా :** ఇలా పైన చెప్పిన రీతిగా గోపబాలురందరూ పంక్తి భోజనాలకై అడవికి వెళ్ళి, ఎంతో సంతోషంగా ఆటలాడుతూ ఉన్నారు.

**ఉ. ఎన్నఁడునైన యోగివిభు లెవ్వని పాదపరాగ మింతయుం**
**గన్నులఁ గాన రట్టిహరిఁ గౌఁగిటఁ జేర్చుచుఁ జెట్టఁ బట్టుచుం**

**దన్నుచుఁ గ్రుద్దుచున్ నగుచుఁ దద్దయుఁ బైపడి కూడి యాడుచున్**
**మన్నన సేయు వల్లవకుమారుల భాగ్యము లింత యొప్పునే? 461**

**ప్రతి :** ఎన్నఁడున్+ఐనన్= ఎప్పుడైనా; యోగివిభులు= యోగీశ్వరులు; ఎవ్వని పాదపరాగము= ఏ పరమాత్మయొక్క కాలి ధూళిని; ఇంతయున్= కొంచెమైనా; కన్నులన్ కానరు= కళ్ళారా చూడలేరో; అట్టి హరిన్= అటువంటి విష్ణుమూర్తిని; కౌఁగిటన్ చేర్చుచున్= ఆలింగనం చేసుకుంటూ; చెట్టన్ పట్టుచున్= చేత్తో పట్టుకుంటూ; తన్నుచున్= కాళ్ళతో తంతూ; గ్రద్దుచున్= గుద్దులు గుద్దుతూ; నగుచున్= హాస్యమాడుతూ; తద్దయున్ పైపడి= మిక్కిలిగా మీద పడుతూ; కూడి+ఆడుచున్= కలిసి ఆటలాడుతూ; మన్నన చేయు= ఆదరించే; వల్లవకుమారుల భాగ్యములు= ఆ గొల్లపిల్లల అదృష్టవిశేషాలు; ఇంతఒప్పునే= ఇంతగా ఒప్పిదంగా ఉంటాయా!

**తా :** ఎంతో తపస్సు చేసి మహిమలు పొందిన యోగీశ్వరులైనా సరే ఎప్పుడూ ఏ పరమాత్మ పాదధూళినికూడా కళ్ళారా చూడలేరో అటువంటి ఆ విష్ణుమూర్తిని కౌగిలించుకుంటూ, చేతులు పట్టుకుంటూ, తంతూ, గుద్దుతూ, నవ్వుతూ, మీదపడి, చేరి ఆడుతూ, ఆదరిస్తున్న ఈ గోపబాలుర అదృష్టం ఎంత గొప్పదో కదా!

**క. విందులకును బ్రహ్మసుఖా, నందంబై భక్తగణమునకు దైవతమై**
**మందులకు బాలుఁడగు హరి, పొందుఁ గనిరి గొల్ల! లిట్టిపుణ్యులు గలరే? 462**

**ప్రతి :** విందులకును= బ్రహ్మజ్ఞానం కలవారికి; బ్రహ్మసుఖ+ఆనందంబు అయి= బ్రహ్మాదుల ఆనందాన్ని మించిన ఆనంద స్వరూపంగా; భక్తగణమునకున్= తనను సేవించే భక్తబృందానికి; దైవతము+ఐ= ఆరాధింపదగిన దేవుడై; మందులకున్= అజ్ఞానులకు; బాలుఁడు+అగు= పసిబిడ్డడిలా కనిపించే; హరిపొందున్= శ్రీకృష్ణమూర్తి యొక్క సహవాసాన్ని; గొల్లలు= ఈ గోపకులు; కనిరి= పొందారు; ఇట్టి పుణ్యులు= ఇంతటి పుణ్యాత్ములు; కలరే!= ఎక్కడైనా ఉన్నారా!, లేరన్నమాట.

**తా :** బ్రహ్మవేత్తలకు, చక్రవర్తినుండిచతుర్ముఖ బ్రహ్మవరకు గల ఏ ఆనందం అయితే ఉందో, దాన్ని మించిన ఆనంద స్వరూపుడై, భక్త జనానికి ఆరాధ్యదేవుడై, అజ్ఞానులైన సామాన్యజనానికి బాలుడనిపించేలా కనిపించే, ఆ శ్రీకృష్ణునియొక్క కలయికను, స్నేహాన్ని ఈ గొల్లవారందరూ పొందారంటే, వీళ్ళవంటి పుణ్యాత్ములు మరెవరైనా ఉన్నారా!

**విశే :** 'విందువు' అంటే బుద్ధిమంతుడని అర్థం.

**వ. అని పలికి శుకయోగీంద్రుండు మఱియు ని ట్లనియె. 463**

**ప్రతి :** అని పలికి= ఇట్లుచెప్పి; శుకయోగి+ఇంద్రుడు= యోగులలో శ్రేష్ఠుడైన శుకమహర్షి; మఱియున్ ఇట్లు అనియెన్= ఇంకా ఇలా అన్నాడు.

**తా :** పై విధంగా గోపాలురభాగ్యాన్ని, భగవతత్త్వాన్ని శుకమహర్షి పరీక్షిన్మహారాజుతో చెప్పి ఇంకా ఇలా అంటున్నాడు.

## ✤ అఘాసుర వధ ✤

**అవ :** ఈ అఘుడనే రాక్షసుడు బకాసురునితమ్ముడు. అమరులైన దేవతలుకూడా ఈ రాక్షసుడంటే భయపడతారు. తన అన్నను శ్రీకృష్ణుడు చంపాడనే విషయం తెలుసుకొని కంసుడే పంపగా బృందావనానికి వచ్చాడు.

క. **అమరు లమృతపానంబున, నమరినవా రయ్యు నే నిశాటునిపంచ**
**త్వమునకు నెదుళ్ళు సూతురు, తము నమ్మక యట్టి యఘుఁడు దర్పోద్ధతుఁడై.** **464**

**ప్రతి :** అమరులు= దేవతలు; అమృతపానంబునన్= జరామరణాలు లేకుండా చేసే ఏ 'అమృతం' వుందో అట్టి అమృతాన్ని తాగటం చేత; అమరినవారు+అయ్యున్= చక్కగా కుదురుకొన్నవారయినా; తము నమ్మక= తమ మీద తమకే నమ్మకం లేకుండా; ఏ నిశాటుని పంచత్వమునకున్= ఏ రాక్షసునిమరణానికి; ఎదుళ్ళు చూతురు(చూచుదురు)= ఎప్పుడు వీడు చచ్చిపోతాడా అంటూ ఎదురుచూపులు చూస్తారో; అట్టి అఘుఁడు= అట్టివాడైన అఘాసురుడు; దర్ప+ఉద్ధతుఁడు+ఐ= గర్వంతో నిక్కుచున్నవాడై...

**తా :** దేవతలు అమృతం సేవించి అమరులైనప్పటికి తమమీద తమకే నమ్మకంలేక ఏ అఘాసురుని మరణానికి ఎదురుచూస్తూ ఉంటారో అలాంటి అఘాసురుడు గర్వంతోను రోషంతోను రెచ్చిపోతూ

క. **బకునికిఁ దమ్ముఁడు గావున, బకమరణము దెలిసి కంసుపంపున గోపా**
**లక బాలురతోఁ గూడను, బకవైరినిఁ ద్రుంతు ననుచుఁ బటురోషమునన్.** **465**

**ప్రతి :** బకునికిన్= ఇంతకుముందు కొంగ వేషంతో వచ్చి శ్రీకృష్ణునిచేతిలో చచ్చిన బకాసురునికి; తమ్ముఁడు కావునన్= తమ్ముడు కాబట్టి; బకమరణము తెలిసి= తన అన్న బకాసురుడు చనిపోయాడనే విషయం తెలుసుకొని, కంసుని పంపునన్= కంసుడు వెళ్ళమని పంపగా; బక వైరినిన్= బకుణ్ణి చంపడంతో శత్రువైన శ్రీకృష్ణుణ్ణి; గోపాలక బాలురతోన్+కూడను= గొల్లబాలురందరితో కలిపి; త్రుంతును(త్రుంచుదును)+అనుచున్= చంపుతాను అంటూ; పటురోషమునన్= మిక్కిలి కోపంతో...

**తా :** తన అన్న అయిన బకాసురుడు శ్రీకృష్ణునిచేతిలో మరణించాడనే విషయం తెలిసిన అఘాసురుడు కంసుడు పంపగా వచ్చి, ఈ గొల్ల బాలురందరితో కలిసి బకునికి శత్రువైన ఆ శ్రీకృష్ణుణ్ణి చంపుతానంటూ అధికమైన కోపంతో

క. **'బాలురు ప్రాణంబులు గో, పాలురకు, మదగ్రజాతుప్రాణము మా ఱీ**
**బాలురఁ జంపిన నంతియ, చాలును, గోపాలురెల్ల సమసినవారల్.** **466**

**ప్రతి :** గోపాలురకున్= గొల్లవారందరికీ; బాలురు= ఈ ఇద్దరు పిల్లలే (బలరామ కృష్ణులు); ప్రాణంబులు= జీవించడానికి ఆధారమైన ప్రాణాలవంటివారు; మత్ అగ్రజాతుప్రాణము మాఱు= మరణించిన నా అన్న ప్రాణానికి బదులుగా; ఈ బాలురన్+చంపినన్= ఈ ఇద్దరుబాలుర్నీ చంపినట్లయితే; అంతి+ఆ+చాలును= అంతమాత్రం సరిపోతుంది, అదిచాలునన్నమాట; గోపాలురు+ఎల్లన్= గొల్లవారంతా; సమసినవారల్= చచ్చినవారే (అవుతారు).

**తా :** 'గోపాలకులకందరికీ ప్రాణం ఈ బాలులిద్దరే. మా అన్న బకాసురుని ప్రాణాలు తీసినందుకు మారుగా శ్రీకృష్ణబలరాములనే ఈ ఇద్దరు బాలుర్నీ చంపితే సరిపోతుంది. గోపాలకులందరూ మరణించినట్లే' అనుకొన్నాడు - అఘాసురుడు.

వ. **అని నిశ్చయించి, యోజనంబు నిడుపును, మహాపర్వతంబు పొడవును, గొండతుదల మీఱిన కోఱలును, మిన్ను దన్ని పన్నిన నల్లమొగిళ్ళ పెల్లుగల పెదవులును, బిలంబులకు నగ్గలం బైన యిగుళ్ళసందులును, నంధకారబంధురంబైన వదనాంతరాళంబును, దావానలజ్వాలాభీలంబైన దృష్టిజాలంబును, వేఁడిమికి నివాసంబులైన యుచ్ఛ్వాసనిశ్వాసంబులును మెఱయ, నేల నాలుకలు పఱచుకొని ఘోరంబగు నజగరాకారంబున.** **467**

**ప్రతి :** అని నిశ్చయించి= పై రీతిగా అనుకున్నవాడై; యోజనంబు నిడుపును= ఆమడ వెడల్పు, మహాపర్వతంబు పొడవును= పెద్ద కొండంత పొడవును; కొండతుదల మీఱిన కోఱలును= కొండ కొమ్ముల్ని మించిన కోరపండ్లూ; మిన్ను తన్ని పన్నిన= ఆకాశాన్నంటి వ్యాపించిన; నల్ల మొగిళ్ళ పెల్లుగల పెదవులును= నల్లమబ్బులను మించిన పెదవులూ; బిలంబులకున్ అగ్గలంబు+ఐన= గుహలకంటే అధికమైన; ఇగుళ్ళ సందులును= పళ్ళమధ్యలోని సందులూ; అంధకారబంధురంబు+ఐన= చీకటితో పూర్తిగా నిండిన; వదన+అంతరాళంబును= నోటిలోపలి భాగమును; దావ+అనల జ్వాలా+ఆభీలంబు+ఐన= కార్చిచ్చు మంటల్లా భయంకరమైన; దృష్టిజాలంబును= కనుగుడ్లూ; వేఁడిమికిన్= ఉష్ణత్వానికి; నివాసంబులు+ఐన= ఉనికి పట్టైన; ఉచ్ఛ్వాస నిశ్వాసంబులును= ఊర్పులూ; మెఱయన్= ఒప్పగా; నేల నాలుకలు పఱచుకొని= నేలంతా నాలుకలు విప్పి; ఘోరంబు+అగు= భయంకరమైన; అజగర+ఆకారంబునన్= కొండచిలువ రూపంతో...

**తా :** పై విధంగా నిశ్చయించుకున్న అఘాసురుడు ఓ భయంకరమైన కొండచిలువ రూపాన్ని పూనాడు. అదెంత ఘోరంగా ఉందంటే, పెద్ద కొండంత పొడవు, ఆమడవెడల్పు కలిగివుంది. కొండకొమ్ముల్లాంటి కోరలూ, ఆకాశమంతా నిండిన నల్లమబ్బులను మించిన పెదవులతో, గుహలకంటే అధికమైన పళ్లమధ్యసందులతో, దట్టమైన చీకటితో నిండిన నోటి లోపలి భాగంతో, కార్చిచ్చు మంటల్లా మండే కంటిచూపుల్తో, వేడిసెగలు కక్కుతున్న నిట్టూర్పులతో, నేలంతా పరచుకొన్న నాలుకలతో భయంకరంగా ఉంది.

**క. జాపిరము లేక యిప్పుడు, గ్రేపుల గోపాలసుతులఁ గృష్ణునితోడన్**
**గీపెట్టఁగ మ్రింగెద నని, పాపపురక్కసుఁడు త్రోవఁబడి యుండె నృపా! 468**

**ప్రతి :** నృపా!= రాజా!; జాపిరము లేక= జాగుసేయకుండా; ఇప్పుడు= ఇప్పుడే; క్రేపులన్= దూడలను; గోపాలసుతులన్= గొల్లపిల్లలను; కృష్ణునితోడన్= కృష్ణునితో కూడా; గీపెట్టన్+కన్= గిల గిల అరిచేలా చేస్తూ; మ్రింగెదను అని= మింగేస్తాను అంటూ; పాపము+రక్కసుఁడు= పాపాత్ముడైన అఘాసురుడు; త్రోవన్+పడి+ఉండెన్= దారిలో పడుకొని ఉన్నాడు.

**తా :** ఓ పరీక్షిన్మహారాజా! పాపకర్ముడైన ఆ అఘాసురుడు నేనింకేమాత్రం ఆలస్యంచేయకుండా ఇప్పుడే దూడలను, గోపాలురను, కృష్ణునితో కలిపి వాళ్ళు గిలగిలా కొట్టుకొంటూ ఉండగా మింగేస్తానంటూ, వారున్న దారిలో అడ్డంగా పడుకున్నాడు.

**వ. ఆ సమయంబున. 469**

**ప్రతి :** ఆ సమయంబునన్= ఆ సమయంలో...

**తా :** గోపాకులతో కూడిన కృష్ణుని ఏ మాత్రం ఆలస్యం చేయకుండా మింగేస్తానంటూ ఆ పాపపు రక్కసుడు దారిలో పడుకొని ఉన్నప్పుడు.

**మ. 'ఒక వన్యాజగరేంద్ర మల్లదె గిరీంద్రోత్సేధమై దావ పా**
**వకకీలాపరుషప్రచండతరనిశ్వాసంబుతో ఘోర వ**
**ప్నీ కరాళాతతజిహ్వతోడ మనలన్ హింసింప నీక్షించుచున్**
**వికటంబై పడిసాఁగి యున్నది పురోవీథిం గనుంగొంటిరే? 470**

**ప్రతి :** ఒక వన్య అజగర+ఇంద్రము= పెద్ద అడవి కొండచిలువ ఒకటి; అల్లదె= అదిగో; గిరి+ఇంద్ర+ఉత్సేధమై= పెద్ద కొండంత పొడవైన శరీరంతో (హిమ పర్వతమంత దేహంతో పొడుగ్గా); దావ పావక కీలా పరుష ప్రచండతర నిశ్వాసంబుతోన్=

కార్చిచ్చు మంటల్లా మిక్కిలి ఉద్ధృతమైన నిట్టూర్పులతో; ఘోర వహ్ని, కరాళ+ఆతత జిహ్వాతోడన్= భయంకరమైన అగ్నిలాంటి పొడవై విస్తారమైన నాలుకతో; మనలన్= మనందరినీ; హింసింపన్+ఈక్షించుచున్= చంపాలని ఎదురుచూస్తూ; వికటంబు అయి= భయంకరంగా, వంకరగా; పడిసాఁగి= నేలమీదపడి వ్యాపించి; పురస్+వీథిన్= మన ముందుమార్గంలో; ఉన్నది= అడ్డంగా ఉంది; కనుగొంటిరే!= చూశారా!

**తా :** గొల్ల పిల్లలు దారికడ్డంగా వున్న ఆ కొండచిలువను చూచి ఇలా అంటున్నారు. ఏమర్రా! అడవికి సంబంధించిన ఓ పెద్ద కొండచిలువ కొండంత విస్తారమైన శరీరంతో, దావాగ్నిజ్వాలల్లా భయంకరమైన ఊర్పులతో, మండే నిప్పులాంటి నాలుకతో, మనందరినీ చంపాలని ఎదురుచూస్తూ మనముందు దారిలో పెద్దగా సాగి అడ్డంగా పడి ఉంది. చూశారా! అని (గొల్లబాలురు) ఒకరితో ఒకరు అనుకుంటున్నారు.

**వ. అని యొండొరులకుం జూపుచు. 471**

**ప్రతి :** అని= ఇలా అనుకుంటూ; ఒండు+ఒరులకున్= ఒకరు మరిరొకరికి; చూపుతూ...

**తా :** ఇలా అజగరాన్ని చూచి ఒకరు మరొకరికి చూపిస్తూ

**మ. బకునిం జంపిన కృష్ణుఁ డుండ మనకుం బామంచుఁ జింతింప నే**
**టికి? రా పోదము దాఁటి, కాక యది కౌటిల్యంబుతో మ్రింగుదున్**
**బకువెంటం జనుఁ గృష్ణుచేత' ననుచుం బద్మాక్షు నీక్షించి యు**
**త్సుకు లై చేతులు వ్రేసికొంచు నగుచున్ దుర్వారులై పోవఁగన్. 472**

**ప్రతి :** బకునిన్ చంపిన కృష్ణుఁడు= బకాసురుణ్ణి చంపినట్టి శ్రీకృష్ణుడు; ఉండన్= ఉండగా, మనకున్= మనకు; పాము+అంచున్= పామంటూ; చింతింపన్ ఏటికి?= విచారించడం ఎందుకు?; రా పోదము దాటి= రండి ఆ పామును దాటేసి పోదాం; కాక= ఒక వేళ అలాకాకుండా; అది= ఆ పాము; కౌటిల్యంబుతోన్= వంకరబుద్ధితో; మ్రింగుదున్= మింగినట్లయితే; కృష్ణుచేతన్= కృష్ణునిచేతిలో; బకు వెంటన్ చనున్= బకాసురుని వెంటే వెళ్తుంది, అంటే ఇది కూడా బకాసురుడులాగే కృష్ణునిచేతిలో చస్తుంది; అనుచున్= ఇలా అనుకుంటూ; పద్మాక్షున్+ఈక్షించి= పద్మాలవంటి కన్నులు గల ఆ కృష్ణుణ్ణి చూస్తూ; ఉత్సుకులై= ఉత్సాహంతో నిండినవారై; చేతులు వ్రేసికొంచున్= బకరిపై ఒకరు చేతులు వేసుకుంటూ; నగుచున్= నవ్వుతూ, దుర్వారులు+ఐ= ఏ అడ్డూ లేనివారై; పోవన్+కన్= ముందుకు పోగా...

**తా :** గోపాలురందరూ ఆ పెద్ద కొండచిలువ అంత భయంకరంగా ఉన్నా సరే, భయంలేకుండా ఇలా అంటున్నారు. బకాసురుణ్ణి చంపిన శ్రీకృష్ణుడే మనతో ఉంటే ఇక మనకు పాము, గీము అంటూ భయం ఎందుకు! అలా కాకుండా ఒక వేళ ఆ పాము మనలను మింగితే – వెంటనే శ్రీకృష్ణుడు దాన్ని బకాసురుడివెంటే పంపిస్తాడు. అంటే చంపేస్తాడు. ఇలా అనుకొంటూ కృష్ణుణ్ణి చూస్తూ, చాలా ఉత్సాహంతో ఒకరిచేయి మరొకరు పట్టుకుంటూ, ఏ అడ్డూలేకుండా రండి ఆ పామును దాటిపోదామంటూ ముందుకు సాగారు.

**వ. వారలం జూచి హరి దనమనంబున. 473**

**ప్రతి :** వారలన్ చూచి= ఇలా తానున్నాననే ధైర్యంతో ముందుకు పోతున్న ఆ గోపబాలురను చూచి; హరి= శ్రీకృష్ణుడు; తన మనంబునన్= తన మనస్సులో...

**తా :** భయంకరంగా ఉండే పామును చూచి కూడా కృష్ణుడుండగా మనకేం భయం? అంటూ ముందుకు పోతున్న గోపబాలురను చూచి, కృష్ణుడు తన మనస్సులో–

**ఉ. 'అర్భకు లెల్లఁ బాము దివిజాంతకుఁ డౌట యెఱుంగ, రక్కటా!**
**నిర్భయులై యెదుర్కొనిరి నేఁ గల నంచు విమూఢు లంచు నా**
**విర్భవదాగ్రహత్వమున వెన్తగులం దమలేఁగపిండుతో**
**దుర్భరఘోరసర్పఘనతుండబిలాంతముఁజొచ్చి రందఱున్. 474**

**ప్రతి :** అర్భకులు ఎల్లన్= ఈ గొల్లబాలురంతా; పాము= ఈ కొండచిలువ; దివిజ+అంతకుఁడు+ఔటన్= దేవతలకు శత్రువైన రాక్షసుడు కావడం; ఎఱుంగరు= తెలుసుకోలేదు; అక్కటా= అయ్యో; నేన్ కలను అంచున్= నేనున్నానంటూ; నిర్భయులు+ఐ= ఏ మాత్రం భయంలేనివారై; ఎదుర్కొనిరి= దానికి ఎదురుగా పోయారు; విమూఢులు+అంచున్= ఏమీ తెలియని వారంటూ; ఆవిర్భవత్+ఆగ్రహత్వమునన్= తనలో ఏర్పడుతున్నకోపంతో; వెన్+తగులన్= వారిని వెంబడిస్తూ వెళ్ళగా; తమ లేఁగపిండుతోన్= తమ తమ దూడలగుంపులతో పాటు; దుర్భరఘోరసర్ప ఘనతుండబిల+అంతమున్= భరింప శక్యంగాని క్రూరమైన పాముయొక్క కన్నంలా ఉండే నోటిలోనికి; అందఱున్= మొత్తం అందరూ; కృష్ణునితో సహా; చొచ్చిరి= ప్రవేశించారు.

**తా :** అయ్యో! ఈ పాము మామూలుది కాదు. రాక్షసుడు అనే విషయం తెలియనివారై ఏ భయంలేకుండా నేనున్నానన్న ధైర్యంతో ఈ గొల్లబాలురందరూ దానికి ఎదురుగా పోయారు – అనుకొన్నాడు కృష్ణుడు. దాంతో కృష్ణునికి తీవ్రంగా కోపం కలిగింది. తానుకూడా వారి వెంటనే వెళ్తూ ఉండగా, మొత్తం ఆ గొల్లవారంతా తమదూడల గుంపులతోపాటు భరింపలేని క్రూరమైన ఆ పాముయొక్క పెద్ద బిలంలా ఉండే నోట్లోకి ప్రవేశించారు.

**వ. అయ్యవసరంబున. 475**

**ప్రతి :** ఆ+అవసరంబునన్= అలా ప్రవేశించిన సమయంలో...

**తా :** శ్రీకృష్ణునితో పాటు మొత్తం గోపబాలురంతా తమ దూడలతో ఆ కొండచిలువ నోట్లోకి ప్రవేశించిన సమయంలో

**శా. వేల్పుల్ సూచి భయంబు నొంద గ్రసనావేశంబుతో నుజ్జ్వల**
**త్కల్పాంతోజ్జ్వలమానజిహ్వదహనాకారంబుతో మ్రింగె న**
**స్వల్పాహీంద్రము మాధవార్పితమనోవ్యాపారసంచారులన్**
**స్వల్పాకారుల శిక్యభారులఁ గుమారాభీరులన్ ధీరులన్. 476**

**ప్రతి :** వేల్పుల్ చూచి= దేవతలు చూచి; భయంబున్ ఒందన్= భయపడగా; అస్వల్ప+అహి+ఇంద్రము= గొప్ప కొండచిలువ; గ్రసన+ఆవేశంబుతోన్= వీళ్ళందరినీ మింగేద్దామన్న ఉద్రేకంతో; ఉజ్జ్వలత్= బాగా ప్రకాశిస్తున్న; కల్ప+అంత= ప్రళయకాలంలోని; ఉజ్జ్వలమాన జిహ్వా దహన+ఆకారంబుతోన్= మండే జ్వాలలుగల నిప్పులాంటి రూపంతో; మాధవ+అర్పితమనో వ్యాపార సంచారులన్= శ్రీకృష్ణునికే సమర్పించిన మనస్సులతో తిరుగుతుండేవారిని; స్వల్ప+ఆకారులన్= చిన్న పిల్లల రూపంతో ఉన్నట్టివారినీ; శిక్యభారులన్= తమ చద్దిమూటలున్న కావిళ్ళబరువు మోస్తున్నట్టివారినీ; ధీరులన్= ధైర్యం కలవారైన; కుమార+ఆభీరులన్= ఆ గొల్లపిల్లలను; మ్రింగెన్= మింగి వేసింది.

**తా :** అప్పుడు అఘాసురుడు వారందరినీ మింగివేసే ఆవేశంతో నోరు ఒక్కసారిగా అప్పళించాడు. ప్రళయకాలంలో భగ్గున జ్వలించే భయంకర జ్వాలలవలె మంటలు మండుతున్న తననాలుకలతో వారినందరినీ నోటిలోనికి లాక్కుని మింగివేశాడు. దేవతలందరూ ఆ మహాసర్పం వారిని మింగివేయడం చూచి భయపడిపోయారు. ఆ గోపబాలకుల మనస్సులన్నీ ఎప్పుడూ కృష్ణుని చుట్టునే తిరుగుతూ ఉంటాయి. వారు శారీరకంగా బలవంతులు కారు, చిన్న పిల్లలు. తాము మోస్తున్న చిక్కములు కూడా వారికి బరువే! అయితే ఆ గోపకుమారులు కృష్ణునికి తమను తాము సమర్పించుకున్నారు. కనుక చాలా ధైర్యవంతులుగా ఉన్నారు.

**వ. ఇట్లు పెనుఁబాముచేత మ్రింగుడుపడు సంగడికాండ్రగమిం జూచి కృష్ణుండు. 477**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; పెను+పాముచేతన్= పెద్ద పాముచే; మ్రింగుడుపడు= మింగబడుతున్నట్టి; సంగడికాండ్రగమిన్ చూచి= తన చెలి కాండ్రైన గోపబాలుర గుంపును చూచి; కృష్ణుండు= శ్రీకృష్ణుడు...

**తా :** ఇలా ఆ కొండచిలువచే మింగబడే తన చెలికాండ్రను చూసి శ్రీకృష్ణుడు

**చ. 'పడుచులు లేఁగలుం గలసి పై కొని వత్తురు తొల్లి కృష్ణ! మా**
**కొడుకు లదేల రా?' రనుచు గోపిక లెల్లను బల్క నే క్రియన్**
**నొడివెద? నేఁడు పన్నగమునోరికి వీరికి నొక్కలంకెగా**
**నొడఁబడ నేల చేసె? విధి యోడక సేయుఁ గదయ్య క్రౌర్యముల్! 478**

**ప్రతి :** కృష్ణా= ఓ కృష్ణుడా; తొల్లి= ఇంతకు మునుపు; పడుచులున్= గొల్లపిల్లలూ, లేగలున్= దూడలూ; కలసి= నీతోకూడి; పైకొని= ఉత్సాహంతో; వత్తురు= వచ్చేవారు; మా కొడుకులు= మా పిల్లలు; అది ఏల రారు?= ఈ రోజు ఎందుకు రాలేదు?; అనుచున్= అంటూ; గోపికలు+ఎల్లను= గోపవనితలందరూ; పల్కన్= అడగ్గా; ఏ క్రియన్= ఏ రీతిగా; నొడివెదన్= చెపుతాను; నేఁడు= ఈనాడు; పన్నగము నోరికిన్= పామునోటికి; వీరికిన్= ఈ గొల్ల పిల్లలకూ; ఒక్కలంకెగాన్= ఒక కూడికగా, తగులుపాటుగా; ఒడఁబడన్= కూడునట్లు; విధి= దైవము; ఏలచేసెన్= ఎందుకు చేశాడు?; విధి= దైవం; క్రౌర్యములు= క్రూరమైన పనులు; ఓడక= ఏమాత్రం సంకోచించకుండా; చేయున్ కదయ్య= చేస్తాడుగదా!

**తా :** ఆ సమయంలో కృష్ణుడు ఇలా అనుకుంటున్నాడు. నేనొక్కణ్ణే గోకులానికి వెళితే గోపవనితలంతా వచ్చి, కృష్ణా! ఇంతవరకూ రోజూ మా గొల్లబాలురు లేగలతో కూడి నీతో వస్తూవుండేవారు కదా! ఈ రోజు ఎందుకు రాలేదు? అని అడిగితే నేనేం సమాధానం చెపుతాను. ఈ రోజు ఈ పిల్లలను ఆ పామునోటితో కలిపేలా దైవం ఎందుకిలా చేశాడు. అయినా, దైవం క్రూరమైన కార్యాన్ని ఏమాత్రం సంకోచించకుండా చేస్తాడు కదా!

**వ. అని తలపోసి, నిఖిలలోచనుండును, నిజాశ్రితనిగ్రహమోచనుండును నైన తమ్మికంటి, మింటితెరు వరులు మొఱలిడ రక్కసు లుక్కుమిగుల వెక్కసంబగు నజగరంబయి యున్న య న్నరభోజనుకుత్తుకకుఁ బొత్తుగొని మొత్తంబు వెంటనంటం జని తమ్ము నందఱఁ జిందఱవందఱ సేసి మ్రింగ నగ్గలించు నజగరంబు కంఠద్వారంబున సమీరంబు వెడలకుండఁ దనశరీరంబు వెంచి గ్రద్దన మిద్దె సఱచి నట్లుండ. 479**

**ప్రతి :** అని తలపోసి= ఇలా ఆలోచించి; నిఖిల లోచనుండును= అందరి చూపు తానే అయినవాడు; అంటే మొత్తం అంతటినీ చూసేవాడు; నిజ+ఆశ్రిత నిగ్రహ మోచనుండును= తనను ఆశ్రయించే వాళ్ళ బంధాలను, బాధలను పోగొట్టేవాడూ; ఐన=

అయినట్టి; తమ్మికంటి= పద్మము వంటి కన్నులుగల ఆ శ్రీకృష్ణుడు; మింటి తెరువరులు= ఆకాశంపై సంచరించేవారైన దేవతలు; మొఱలు ఇడన్= ఆర్తధ్వనులు చేయగా; రక్కసులు= రాక్షసులు; ఉక్కుమిగులన్= మదిస్తూ; వెక్కసంబు+అగు= సహింపరానిదైన; అజగరంబు+అయి+ఉన్న= కొండచిలువగా ఉన్న; ఆ+నరభోజనుకుత్తుకకున్= మానవులను భోజనంగా గ్రహించే ఆ రాక్షసుడి గొంతుకు; పొత్తుగొని= కూడుకొని; మొత్తంబు వెంటన్ అంటన్+చని= ఆ బాలకులందరి వెంబడినే వెళ్ళి; తమ్మున్ అందఱన్= తామందరినీ; చిందఱ వందఱచేసి= ఛిన్నాభిన్నం చేసి; మ్రింగన్+అగ్గలించు= మింగడానికి ప్రయత్నించే; అజగరంబు కంఠ ద్వారంబునన్= ఆ కొండచిలువ గొంతు ద్వారంలో; సమీరంబు= గాలి; వెడలక ఉండన్= పోకుండా ఉండేలా; తన శరీరంబున్= తన దేహాన్ని; పెంచి= పెద్దదిగా చేసి; గ్రద్దనన్= శీఘ్రంగా; మిద్దె సఱచినట్లు+ఉండన్= దిమ్మెస కొట్టినట్లు ఉండగా...

**తా :** కృష్ణుడు సర్వమూ చూడగలవాడు. అందరిచూపూ తానే అయినవాడు. తనను ఆశ్రయించినవారికష్టాలను తొలగించేవాడు. తామరరేకులవంటి కన్నులు గలవాడు. ఆ రాక్షసుడు మహాభయంకరుడు. దేవతలుకూడా అతడు చేసిన పనికి భయపడి మొరపెట్టుకుంటున్నారు. రాక్షసులందరూ గర్వంతో మిడిసిపడసాగారు. అటువంటి ఈ రాక్షసుడు కొండచిలువ రూపంతో బాలకులను, లేగదూడలను మింగుతూ ఉంటే కృష్ణుడుకూడా వారివెనుకనే లోపలికి ప్రవేశించాడు. ఆ కొండచిలువ నాలుకలతో అందరినీ చిందర వందరచేసి కొద్దికొద్దిగా మింగడానికి ప్రయత్నిస్తూ ఉంటే – కృష్ణుడు కంఠద్వారం దగ్గరచేరి, తన శరీరాన్ని విపరీతంగా పెంచి, దిమ్మిసకొట్టినట్లు అక్కడ ఉండిపోగా

**క. ఊపిరి వెడలక కడుపున, వా పొదవినఁ బాము ప్రాణవాతంబులు సం**
**తాపించి శిరము వ్రక్కలు, వాపికొనుచు వెడలి చనియెఁ బటుఘోషముతోన్. 480**

**ప్రతి :** ఊపిరి= శ్వాస; వెడలక= బైటకు పోకుండా; కడుపునన్= పొట్టలో; వాపు ఒదవినన్= ఉబ్బడం ఏర్పడడంతో; పాము ప్రాణవాతంబులు= కొండచిలువయొక్క ప్రాణవాయువులు; సంతాపించి= మిక్కిలి తాపం చెంది; శిరము వ్రక్కలు= తల బద్దలయేలా; వాపికొనుచున్= కొట్టుకుంటూ; పటు ఘోషముతోన్= పెద్దశబ్దం చేస్తూ; వెడలి చనియెన్= బైటికి పోయాయి.

**తా :** కృష్ణుడెప్పుడైతే ఆ పాము గొంతుకడ్డంగా తన దేహాన్ని పెంచి ఊపిరాడకుండా చేశాడో, దాంతో దానికి శ్వాస పైకి రాకపోవడంతో కడుపుబ్బిపోయింది. లోపలి ప్రాణవాయువులు బైటికి వచ్చేమార్గం లేకపోవడంతో ఎంతో బాధపడి, చివరకు శిరస్సు ముక్కలయ్యేలా చేసి, పెద్ద ధ్వనిచేస్తూ బైటికి వచ్చాయి.

**శా. క్రూరవ్యాళవిశాలకుక్షిగతులన్ గోవత్ససంఘంబుతోఁ**
**గారుణ్యామృతవృష్టిచేత బ్రదుకంగాఁ జూచి వత్సంబులున్**
**వారుం దాను దదాస్యవీథి మగుడన్ వచ్చెన్ ఘనోన్ముక్తుఁడై**
**తారానీకముతోడ నొప్పెసఁగు నా తారేశుచందంబునన్. 481**

**ప్రతి :** క్రూర వ్యాళ విశాలకుక్షి గతులన్= క్రూరమైన ఆ పాముయొక్క విశాలమైన కడుపులో చేరిన వాళ్ళను; గోవత్స సంఘంబుతోన్= ఆవుదూడల గుంపులతో సహా; కారుణ్య+అమృతవృష్టిచేతన్= దయారసం అనే అమృతవర్షంతో; బ్రదుకన్+కాన్+చూచి= జీవించునట్లుగా చూచి; వత్సంబులున్= దూడలు; వారున్= ఆ గోపబాలురూ, తానున్= తానూ, తద్+ఆస్యవీథిన్= దానినోటిగుండా; ఘన+ఉన్ముక్తుఁడు+ఐ= మబ్బుచేత విడువబడినవాడై; తార+అనీకముతోడన్= చుక్కల గుంపుతో; ఒప్పు+

ఎసఁగు= అందగించే; ఆ తార+ఈశు చందంబునన్= ఆ తారలకు పతియైన చంద్రునిలా; మగుడన్= మరల; వచ్చెన్= బైటికి వచ్చాడు.

**తా :** క్రూరసర్పమైన ఆ కొండచిలువ పెద్దకడుపులో ఉన్న గోపబాలకులను, ఆవుదూడలతోకూడా దయారూపమైన అమృతవృష్టి కురిపించి బతికించి కృష్ణుడు దూడలతో, గోపాలురతో, తానుకూడా పాము నోటిమార్గం గుండా బైటికి వచ్చాడు. అప్పటి కృష్ణుడు ఎలా ఉన్నాడంటే మబ్బులు వీడి, నక్షత్రసముదాయంతో ప్రకాశించే చంద్రునిలా ఉన్నాడు.

**ఆ. అమరవరులకొఱకుఁ గమలజాండం బెల్ల, బలిఁ దిరస్కరించి బలియువడుగు**
**గోపసుతులకొఱకుఁ బాపపుఁబెనుఁబాము, గళము దూఁటుగట్ట బలియకున్నె! 482**

**ప్రతి :** అమరవరులకొఱకున్= శ్రేష్ఠులైన దేవతలకోసం, ఇంద్రాదులకోసం; బలిన్= బలిచక్రవర్తిని; తిరస్కరించి= ధిక్కరించి; కమలజ+అండంబు+ఎల్లన్= పద్మంనుండి పుట్టినట్టి బ్రహ్మాండమంతా; బలియు= నిండుగా పెరిగిన; వడుగు= వామనమూర్తి గోపసుతులకొఱకున్= గొల్లపిల్లలకోసం; పాపము+పెను+పాము గళము= దుష్టమైన ఆ కొంచ చిలువ గొంతుయొక్క; దూఁటుగట్టన్= గర్వాన్ని అణచడానికి; బలియక+ఉన్నె= పెరగకుండా ఉంటాడా? (తప్పక పెరుగుతాడని భావం).

**తా :** ఇంద్రాదిదేవతలకోసం బలిచక్రవర్తిని ధిక్కరించి, బ్రహ్మాండమంతా నిండిన వామనమూర్తిగా ఆనాడు విష్ణువు విక్రమించాడు. అలాంటిది గొల్లపిల్లలకోసం ఈనాడు క్రూరమైన, దుష్టమైన ఆ కొండచిలువగొంతు మదాన్ని తగ్గించడానికి పెరగకుండా ఉంటాడా? అందుకే అలా పెరిగి గోపాలురను కాపాడాడు.

**ఉ. ఆ పెనుఁబాము మేన నొక యద్భుతమైన వెలుంగు దిక్తటో**
**ద్దీపకమై వడిన్ వెడలి దేవపథంబునఁ దేజరిల్లుచుం**
**గ్రేపులు బాలురున్ బెదరఁ గృష్ణునిదేహము వచ్చి చొచ్చె నా**
**పాపఁడు సొచ్చి ప్రాణములఁ బాపినయంతన శుద్ధసత్త్వమై. 483**

**ప్రతి :** ఆపెను+పాముమేనన్= ఆ కొండచిలువశరీరం నుండి; ఒక అద్భుతము+ఐన వెలుంగు= ఆశ్చర్యం గొలిపే ఒక తేజస్సు; దిక్+తట+ఉద్దీపకము+ఐ= అన్ని దిక్కులనూ ప్రకాశింపజేస్తూండేదై; వడిన్ వెడలి= వేగంగా బైటికి వచ్చి; దేవ పథంబునన్= దేవతలు సంచరించే ఆకాశమార్గంలో; తేజరిల్లుచున్= (ప్రకాశిస్తూ) వెలుగుతూ; క్రేపులున్= దూడలు; బాలురున్= గోపాలకులు; బెదరన్= భయపడగా; ఆపాపఁడు= ఆ చిన్ని కృష్ణుడు; చొచ్చి= తనకడుపులో చేరి; ప్రాణములన్= తన ప్రాణాలను; పాపిన+అంతనన్= పోగొట్టినంతమాత్రాననే; శుద్ధసత్త్వము+ఐ= పరిశుద్ధ సత్త్వరూపం కలదై; వచ్చి; కృష్ణునిదేహము చొచ్చెన్= శ్రీకృష్ణమూర్తిదేహంలో ప్రవేశించింది.

**తా :** అప్పుడు ఆ కొండచిలువ దేహంనుండి ఆశ్చర్యం కలిగే విధంగా ఒక తేజస్సు దిక్కులన్నిటినీ ప్రకాశింపజేస్తూ బైటకు వచ్చింది. అది ఆకాశమార్గంలో ప్రకాశిస్తూ, అక్కడున్నదూడలూ, గోపబాలురూ, భయపడేలా వుంది. శ్రీకృష్ణమూర్తి ఆశ్చర్యం కలిగే విధంగా తనకడుపులో చేరి ప్రాణాలు హరించినంతనే ఆ మహనీయునిస్పర్శతో శుద్ధసత్త్వరూపంతో ఆ రాక్షసుని తేజస్సు శ్రీకృష్ణమూర్తిదేహంలో కలిసిపోయింది.

**క. తన రూ పొక మా త్రైనను, మనమున నిడికొనినఁ బాపమయు నైనను లోఁ**
**గొని చను హరి దను మ్రింగిన, దనుజునిఁ గొనిపోవకున్నె తన లోపలికిన్? 484**

**ప్రతి :** తన రూపున్= తన స్వరూపాన్ని; ఒక మాఱు+అయినను= ఒకసారైనా; మనమునన్= మనస్సులో; ఇడికొనినన్= నిలుపుకొన్నట్లైతే, ఉంచినట్లయితే; పాపమయున్+అయినను= పాపాత్ముడినైనా సరే; లోన్+కొనిచను= తనలోనికి తీసుకొని పోయే; హరి= శ్రీకృష్ణుడు; తను మ్రింగిన దనుజునిన్= తనను మింగిన రాక్షసుణ్ణి; తన లోపలికిన్= తనలోనికి; కొనిపోవక+ఉన్నె= తీసుకుపోకుండా ఉంటాడా! (తీసుకవెళ్తాడని భావం).

**తా :** ఎవరైనా తన రూపాన్ని ఒక్కసారైనా మనస్సులో భావిస్తే, వాడెంత పాపాత్ముడైనా తనలోకి తీసుకొని అనుగ్రహిస్తాడు శ్రీహరి. అటువంటి హరి తననే మింగిన రాక్షసుడైన అఘాసురుణ్ణి తనలోనికి తీసుకోకుండా ఉంటాడా! (తప్పక తీసుకొంటాడు)

**వ. తదవసరంబున, సురలు గుసుమవర్షంబులు గురియించిరి, రంభాదు లాడిరి, గంధర్వాదులు పాడిరి, మేఘంబులు మృదంగంబులభంగి ఘోషించె, సిద్ధగణంబులు 'జయజయ' భాషణంబులు భాషించి, రంత.** **485**

**ప్రతి :** తద్+అవసరంబునన్= ఆ సమయంలో; సురలు= దేవతలు; కుసుమవర్షంబులు= పూలవానలు; కురియించిరి= కురిపించారు; రంభ+ఆదులు= రంభ మొదలగు అప్సరసలు; ఆడిరి= నాట్యం చేశారు; గంధర్వ+ఆదులు= గంధర్వజాతికి చెందినవారంతా; పాడిరి= గానం చేశారు; మేఘంబులు= మేఘాలు, మబ్బులు; మృదంగంబుల భంగిన్= మద్దెలలవలె; ఘోషించెన్= శబ్దం చేశాయి, గర్జించాయి; సిద్ధగణంబులు= సిద్ధుల బృందాలు; జయజయ భాషణంబులు= విజయాన్ని సూచించే జయజయ శబ్దాలు; భాషించిరి= పలికారు; అంతన్= తరువాత...

**తా :** భయంకరుడైన అఘాసురుణ్ణి చంపి, తనలోనే లీనం చేసుకున్న కృష్ణునిపై దేవతలు పుష్పవర్షం కురిపించారు. రంభాది అప్సరఃకాంతలు నాట్యం చేశారు. గంధర్వులు గానం చేశారు, మేఘాలు మృదంగధ్వనిలా గర్జించాయి. సిద్ధులంతా విజయసూచకాలైన జయజయధ్వానాలు చేశారు. తరువాత

**శా. ఆ వాద్యంబులు, నా మహాజయరవం, బా పాట లాయాటలుం**
**దేవజ్యేష్ఠుఁడు పద్మజుండు విని ప్రీతిన్ భూమి కేతెంచి నేఁ**
**డీ వత్సార్భకులన్ భుజంగపతి హింసింపంగ నీ బాలకుం**
**డే వెంటన్ బ్రదికించె? మే, లనుచు నూహించెం గడున్ నివ్వెఱన్.** **486**

**ప్రతి :** దేవ జ్యేష్ఠుఁడు= దేవతలలో పెద్దవాడైన; పద్మజుండు= పద్మమునందు పుట్టినట్టి బ్రహ్మదేవుడు; ఆ వాద్యంబులు= దేవలోకంలోని వారంతా వాయించే ఆ వాద్యాలను; ఆ మహా జయరవంబు= గొప్పదైన ఆ జయ జయ ధ్వానాన్ని; ఆ పాటలు= గంధర్వుల పాటలు; ఆ+ఆటలున్= ఆరంభాదుల నృత్యాలను; విని; ప్రీతిన్= సంతోషంతో; భూమికిన్ ఏతెంచి= భూలోకాని వచ్చి; నేఁడు= ఈనాడు; ఈ వత్స+అర్భకులన్= ఈ దూడలను, గొల్లపిల్లలను; భుజంగపతి= సర్పరాజు; హింసింపన్+కన్= హింసించగా; ఈ బాలకుండు= ఈ చిన్న కుర్రవాడు; ఏ వెంటన్= ఏ విధంగా; బ్రతికించెన్= బతికించాడు అని; నివ్వెఱన్= (నిండు+వెఱన్) ఎంతో ఆశ్చర్యంతో; కడున్ మేలు అనుచున్= ఇది చాలా మంచి దంటూ; ఊహించెన్= తలచాడు.

**తా :** దేవతలలో పెద్దవాడైన బ్రహ్మదేవుడు దేవలోకంలో వినబడే ఆ వాద్యాలను, ఆ జయజయధ్వానాన్నీ, ఆ గానాలను, నృత్యాలను విని, చూచి సంతోషంతో భూలోకానికి వచ్చి, ఈ చిన్న పిల్లవాడు దూడలను, గొల్లపిల్లలను

ఆ మహాసర్పం చంపేస్తూవుంటే ఎలా కాపాడా డనుకుంటూ, ఆశ్చర్యపోతూ, ఇది ఎంతో మెచ్చుకోవలసిన విషయమే అనుకున్నాడు.

**వ. అంత న య్యజగరచర్మంబు గొన్ని దివసంబుల కెండి పెద్ద కాలంబు గోపాలబాలురకుం గేళీబిలంబై యుండె, నిట్లు కౌమారవిహారంబున నైదవయేఁటఁ గృష్ణుం డఘాసురునిం దెగఁ జూచుటయుఁ దమ్ముం గాచుటయు, నాఱవయేఁటిదైన పౌగండవృత్తాంతం బని చిత్తంబులం గోపకుమారులు దలంచు చుందు రని చెప్పిన నప్పుడమితేఁ డ ప్పరమయోగీంద్రున కిట్లనియె. 487**

**ప్రతి :** అంతన్= తరువాత; ఆ అజగరచర్మంబు= ఆ కొండచిలువచర్మం; కొన్నిదినంబులకున్= కొన్నాళ్ళకు; ఎండి= ఎండిపోయి; పెద్ద కాలంబు= చాలా కాలం ఆడుకోవడానికి; గోపాల బాలురకున్= గొల్లపిల్లలకు; కేళీబిలంబు అయి ఉండెన్= ఆడుకొనే ఓ గుహలా అయి ఉండింది; ఇట్లు= ఈ రీతిగా; కౌమార విహారంబునన్= కౌమార వయసులో చేసిన విహారాలలో; ఐదవ ఏటన్= తన ఐదో సంవత్సరంలో; కృష్ణుడు= బాలకృష్ణుడు; అఘాసురునిన్= అఘుడనే రాక్షసుణ్ణి; తెగన్ చూచుటయున్= సంహరించాలని చూడడం; తమ్మున్+కాచుటయున్= తమను కాపాడడం; ఆఱవ ఏఁటిది అయిన= ఆరో సంవత్సరానిదైన; పౌగండ వృత్తాంతంబు అని= 'పౌగండ' వయస్సులో చేసిన వ్యాపారమంటూ; గోపకుమారులు= గోపబాలురు; చిత్తంబులన్= మనస్సులలో; తలంచుచున్+ఉందురు= అనుకుంటూ ఉంటారు; అని చెప్పినన్= అంటూ శుకమహర్షి చెప్పగా; ఆ+ పుడమితేఁడు= ఆ పరీక్షిత్తు భూపతి; ఆ+పరమయోగి+ఇంద్రునకున్= ఆ యోగిశ్రేష్ఠుడైన శుకమహర్షితో; ఇట్లు అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** కొన్నాళ్ళకు ఆ కొండచిలువచర్మం ఎండిపోవడంతో చాలా కాలందాకా గోపబాలురందరికీ అది ఆడుకునే గుహలాగా పనికొచ్చింది. ఇలా కృష్ణుడు 'కౌమార' వయస్సు అయిదో ఏట అఘాసురుణ్ణి వధించాడు. అయితే ఈ వృత్తాంతం 'పౌగండ' వయస్సులో అంటే ఆరు సంవత్సరాల వయస్సులో కావించిన పనిగా గోపబాలకులు భావించారని శుకమహర్షి చెప్పగా విని పరీక్షిన్మహారాజు శుకునితో ఇలా అన్నాడు.

**సీ. 'అయిదేండ్లు కౌమార, మటమీఁద నైదేండ్లు పౌగండ మనియెడు ప్రాయమందు,**
**నయిదేండ్లవాఁడైన యబ్జాక్షుచరితంబు పౌగండ మని గోపబాలు రెల్లఁ**
**దలఁతు రంటివె? యెట్లు దలఁతురు వారలు? నిరుడు సేసినపని నేఁటి దనఁగ**
**వచ్చునే? యిది నాకు వరుసతో నెఱిఁగింపు' మనవుడు యతిచంద్రుఁడైన శుకుఁడు**

**ఆ. యోగదృష్టిఁ జూచి యొక్కింత భావించి 'వినుము రాజవర్య! వినయధుర్య!**
**పరమగుహ్య మనుచుఁ బల్కుదు రార్యులు, శిష్యజనుల కీవు సేయు తలఁపు. 488**

**ప్రతి :** పరీక్షిన్మహారాజు శుకమహర్షితో–

అయిదేండ్లు= మొదటి అయిదు సంవత్సారాలు; కౌమారము= కుమార రూపమని; అట మీఁదన్ ఐదేండ్లు= ఆ తరువాతి ఐదు సంవత్సరాలు అంటే ఆరు నుండి పదవ సంవత్సరం వరకు పౌగండము+అనియెడు= పౌగండమనబడే; ప్రాయం= ఈడు; అందున్= ఆ వయస్సులో; అయిదు ఏండ్లవాఁడు+ఐన= అయిదు సంవత్సరాల బాలుడైన; అబ్జ+అక్షచరితంబు= పద్మాలవంటి

నేత్రాలుగల శ్రీకృష్ణుని చరిత్రాన్ని; పౌగండము అని= అయిదేండ్లు దాటిన అనగా ఆరవఏడైన పౌగండం అంటూ; గోపబాలురు+ ఎల్లన్= గోపబాలకులందరూ; తలఁతురు(తలచుదురు)+అంటివె= భావించారని అన్నావు; ఎట్లు తలఁతురు వారలు= వాళ్లు అలా ఎలా అనుకుంటారు?; నిరుడు చేసిన పని= కిందటి సంవత్సరంలో చేసిన పనిని; నేఁటిది+అనఁగ వచ్చునే= ఈ ఏడు చేసిందనవచ్చునా!; ఇది నాకున్= ఈ విషయాన్ని నాకు; వరుసతోన్= క్రమంగా; ఎఱిఁగింపుము= తెలియజేయుము; అనవుడు= అనగా; యతిచంద్రుఁడు+ఐన= ఋషిశ్రేష్ఠుడైన; శుకుఁడు= శుకమహర్షి; యోగదృష్టిన్+చూచి= జ్ఞానదృష్టితో దర్శించి; ఒక్కింత భావించి= కొంచెం ఆలోచించి; రాజవర్య= రాజోత్తమా!; వినయధుర్య= వినయంతో ఒప్పేవాడా!; వినుము= చెప్తున్నాను వినవయ్య; ఆర్యులు= పెద్దలు; ఈవు చేయు తలఁపు= నీవు ఊహించిన ఈ ఆలోచన; శిష్యజనులకున్= శిష్యబృందానికి; పరమగుహ్యము+అనుచున్= ఎంతో రహస్యమైన విషయం అంటూ; పల్కుదురు= చెపుతారు.

**తా :** పరీక్షిన్మహారాజు శుకమహర్షితో ఇలా అంటున్నాడు 'ఓ యోగీంద్రా! సాధారణంగా ముందటి అయిదేండ్ల ప్రాయాన్ని కౌమారం అని, తరువాతి అయిదేండ్ల వయస్సును పౌగండమని అంటారు కదా!. మరి కౌమారప్రాయంలో శ్రీకృష్ణుడు చేసిన కార్యాలను పౌగండప్రాయంలో చేశాడని గోపాలురు ఎలా అనుకో గలుగుతున్నారు? నిరుడు చేసిన పనిని నేడు చేసింది అనవచ్చా? ఈ విషయాన్ని క్రమంగా నాకు తెలియజేయండి.' ఇలా అడిగిన పరీక్షిత్తుతో యోగీశ్వరుడైన శుకుడు తన యోగదృష్టితో చూచి, కొంత భావించి 'వినయంతో ఒప్పే ఓ రాజేంద్రా! నీ వడిగిన విషయం మిక్కిలి రహస్యమైందిగా పెద్దవాళ్ళు శిష్యబృందానికి చెపుతారు.' అన్నాడు.

**క. ప్రియురాలివలని వార్తలు, ప్రియజనులకు నెల్లప్రొద్దుఁబ్రియ మగు భంగిన్**
**బ్రియుఁడగు హరిచరితంబులు, ప్రియభక్తుల కెల్లయెడలఁ బ్రియములు గావే! 489**

**ప్రతి :** ప్రియురాలివలనివార్తలు= తమకు ప్రియమైన, ఇష్టమైన స్త్రీకి సంబంధించినమాటలు; ప్రియజనులకున్= వారంటే ఇష్టపడేవారికి; ఎల్లను+ప్రొద్దున్= పొద్దస్తమానం; ప్రియము+అగు భంగిన్= ఎంతో ఇష్టమైనవిగానే వుండే విధంగా; ప్రియుఁడు+అగు= తమకెంతో ఇష్టమైనవాడైన; హరిచరితంబులు= శ్రీకృష్ణుని వృత్తాంతాలు, కథలు; ప్రియభక్తులకున్= ఇష్టులైన భక్తజనానికి; ఎల్లను+ఎడలన్= అన్నివిధాలా; ప్రియములు కావే= ఇష్టమైనవి కావా! ఇష్టమైనవే!

**తా :** తమకెంతో ఇష్టమైన స్త్రీలయొక్క మాటలు, చేతలు ప్రియులైనవారికి ఎలా ఎప్పుడూ ఇష్టంగా ఉంటాయో అలాగే భక్తజనానికి ఇష్టుడైన శ్రీకృష్ణునివృత్తాంతాలన్నీ, భక్తులైనవారికి ఎల్లవేళలా అన్నివిధాలా ప్రియంగానే వుంటాయి.

**వ. అని పలికి యోగీంద్రుండు రాజేంద్రున కిట్లనియె. న ట్లఘాసురుమొగంబువలనం గడ చనిన లేఁగల గోపకుమారులన్ బ్రదికించి వారును దానునుం జని చని. 490**

**ప్రతి :** అని పలికి= ఇలా చెప్పి; యోగి+ఇంద్రుడు= యోగుల్లో శ్రేష్ఠుడైన శుకమహర్షి; రాజ+ఇంద్రునికిన్= రాజశ్రేష్ఠుడైన పరీక్షిన్మహారాజుకు; ఇట్లు+అనియెన్= ఇలా చెప్పాడు; అట్లు= ఆ విధంగా; అఘ+అసురు మొగంబువలనన్= అఘాసురుని నోటిలోనుండి; కడచనిన= చనిపోయిన; లేఁగలన్+గోపకుమారులన్= దూడలను, గోపబాలురను, బ్రదికించి= జీవింపజేసి; వారును తానునున్= వాళ్ళూ, తానూ; చనిచని= అలా వెళ్ళి వెళ్ళి...

**తా :** పై రీతిగా మళ్ళీ శుకయోగి పరీక్షిన్మహారాజుతో ఇలా అంటున్నాడు. అలా అఘాసురునినోటిలో చనిపోయిన దూడలను గోపాలకులను బతికించి, వాళ్ళతో కలిసి శ్రీకృష్ణుడుకూడా దూరం వెళ్ళి

**మ. కనియెం గృష్ణుఁడు సాధునీరము మహాగంభీరముం బద్మకో**
**కనదాస్వాదవినోదమోదమదభృంగద్వంద్వఝుంకారమున్**
**ఘనకల్లోలలతావితానవిహరత్కాదంబకోలాహల**
**స్వనవిస్ఫారము మందవాయుజకణాసారంబుఁ గాసారమున్. 491**

**ప్రతి :** సాధునీరమున్= మంచినీళ్ళు గలది; మహాగంభీరమున్= ఎంతో లోతైంది; పద్మకోకనద+ఆస్వాదవినోదమోదమదభృంగ ద్వంద్వ ఝుంకారమున్= కమలాలయొక్కయు, ఎఱ్ఱకలువల యొక్కయు తేనెను అనుభవించి ఆనందిస్తున్న తుమ్మెద జంటల ఝుంకారంతో కూడింది; ఘనకల్లోల లతావితానవిహరత్+కాదంబకోలాహల స్వన విస్ఫారమున్= పెద్ద అలలనే తీగల గుంపులో విహరించే కలహంసల కల కల ధ్వనులతో తిరుగుడు పడుతున్నది; మందవాయుజకణ+ ఆసారంబున్= తిన్నని గాలి వలన పుట్టిన నీటితుంపురులు కలది; అయినట్టి; కాసారమున్= సరస్సును; కృష్ణుఁడు= శ్రీకృష్ణుడు; కనియెన్= చూశాడు.

**తా :** ఆ గోపబాలురతో కలిసి శ్రీకృష్ణుడు వెళ్తూ అక్కడ ఒక సరస్సును చూశాడు. ఆ సరస్సు మంచినీళ్ళతో కూడి ఉంది. చాలా లోతుగా వుంది. అందులోని కమలాలలోని, ఎఱ్ఱకలువలలోని మకరందాన్ని గ్రోలడంచేత మత్తెక్కిన తుమ్మెదల జంటలు ఝుంకారం చేస్తున్నాయి. పెద్దతీగలవంటి అలలగుంపులో విహరించే కలహంసల కల కల ధ్వనులతో నిండి వుంది. పిల్లగాలివల్ల రేగిన నీటితుంపురులు కలిగి ఉంది.

## ❖ గోపాలబాలురు కృష్ణునితోఁ గూడి చల్దు లారగించుట ❖

**వ. కని తమ్మికంటి తమ్ముల యింటి సొబగునకు నిచ్చ మెచ్చుచుఁ జెచ్చెర గాలి నోలిం గదలెడు కరళ్లతుంపురుల జల్లుపెల్లున నొడళ్లు గగురుపొడువఁ గొలంకుఁ గెలంకులఁ గాయపండుల గొలలవ్రేఁగున వీఁగి పట్టు గల చెట్టుఁదుటుము నీడల నొప్పుచున్న యిసుక తిప్పల విప్పు సూచి వేడుక పిచ్చలింప నెచ్చెలుల కిట్లనియె. 492**

**ప్రతి :** తమ్మికంటి= తామరలవంటి కన్నులుగల శ్రీకృష్ణుడు; కని= ఆ సరస్సును చూచి; తమ్ముల ఇంటి సొబగునకున్= తామరలున్న ఆ సరస్సుఅందానికి; ఇచ్చన్ మెచ్చుచున్= మనస్సులో ప్రశంసిస్తూ; చెచ్చెరన్ (చెర+చెర)= శీఘ్రంగా; గాలిన్= వాయువుచే; ఓలిన్= క్రమంగా; కదిలెడు= కదలాడే; కరళ్ళతుంపురుల జల్లు పెల్లునన్= అలల నీటి బిందువుల జల్లు అధికం కావడంతో; ఒడళ్ళు= శరీరాలు; గగురుపొడువన్= గగుర్పాటు చెందగా, అనగా శరీరంమీదివెంట్రుకలు నిక్కబొడుచుకోగా; కొలంకు కెలంకులన్= ఆ సరస్సు యొక్క తీరాలలో; కాయ పండుల గొలల వ్రేఁగునన్= కాయలయొక్క, పండ్లయొక్క గెలలభారంతో; వీఁగి= వంగి; పట్టుగల చెట్టుతుటుము నీడలన్= దృఢమైన చెట్లసమూహంయొక్క నీడలలో; ఒప్పుచున్న= చక్కగా వున్న; ఇసుక తిప్పల విప్పు చూచి= ఇసుక దిబ్బల బాహుళ్యాన్ని చూచి; వేడుక పిచ్చలింపన్= ఉత్సాహం అధికంకాగా; నెచ్చెలులకున్= తనకెంతో ఇష్టమైన స్నేహితులైన గోపబాలురతో; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** శ్రీకృష్ణుడు చూచిన సరస్సు ఎంతో అందంగా వుంది. ఆ అందాన్ని మనసులో మెచ్చుకుంటూ, వేగంగా గాలి వీచడంతో కదిలే అలల నీటి తుంపురుల జల్లులకు దేహాలు గగుర్పాటు చెందగా, పార్శ్వములందు కాయలతో, పళ్ళతోకూడిన గెలల భారంతో వంగిన గట్టి చెట్ల సముదాయం, వాటి నీడలందు పెద్ద పెద్ద ఇసుక తిన్నెలు చూసి, ఎంతో ఉత్సాహంతో తన స్నేహితులైన గోపాలురతో ఇలా అన్నాడు శ్రీకృష్ణుడు.

**శా. "ఎండన్ ప్రగ్గితి రాఁకటం బడితి రిం కేలా విలంబింపఁగా**
**రండో బాలకులార! చల్ది గుడువన్ రమ్యస్థలం బిక్క డీ**
**దండన్ లేఁగలు నీరు ద్రావి యిర వందం బచ్చికల్ మేయుచుం**
**దండంబై విహరించుచుండఁగ నమందప్రీతి భక్షింతమే! 493**

**ప్రతి :** ఓ బాలకులార!= ఓ గొల్ల పిల్లలరా!; ఎండన్ ప్రగ్గితిరి= ఎండలో బాగా తాపం పొందారు; ఆఁకటన్ పడితిరి= ఆకలి బాధతో కూడా ఉన్నారు; ఇంకన్= ఇంకా; ఏలా విలంబింపన్+కాన్= ఆలస్యం చేయడం ఎందుకు!; చల్ది కుడువన్= చల్ది తినడానికి; రండు= రండి; ఇక్కడన్= ఈ చోటు; రమ్య స్థలంబు= చక్కనైన ప్రదేశం; ఈ దండన్= ఈ సమీపంలో; లేఁగలు= దూడలు; నీరు త్రావి= నీటిని తాగి; ఇరవు+అందన్= స్థిరంగా వుండి; పచ్చికల్ మేయుచున్= గడ్డి తింటూ; తండంబు+ఐ= గుంపుగా; విహరించుచున్+ఉండన్+కన్= సంచరిస్తూ ఉండగా; అమంద ప్రీతిన్= ఎంతో సంతోషంతో; భక్షింతమే!= చల్ది తిందామా!

**తా :** కృష్ణుడు గోపబాలురతో ఇలా అంటున్నాడు. ఏమర్రా! పాపం ఎండలో మాడిపోయారు, ఆకలితో కూడా వున్నారు. మనం చల్ది తినడానికి ఇది ఎంతో అందంగా ఉన్న స్థలం. ఈ పక్కనే మనదూడలుకూడా చక్కగా నీరు తాగి, కసవు మేస్తూ గుంపుగా తిరుగుతుంటాయి. మనం ఎంతో ఆనందంగా చల్ది తిందామా?

**వ. అనిన "నగుఁ గాక"యని వత్సంబుల నుత్సాహంబున నిర్మలంబులగు జలంబులు ద్రావించి, పచ్చికల మొల్లంబులు గల పల్లంబుల నిలిపి చొక్కంబులగు చల్దులచిక్కంబులు సక్కడించి. 494**

**ప్రతి :** అనినన్= కృష్ణుడిలా అనగానే; అగున్+కాక= అలాగే చేద్దాం అంటూ; వత్సంబులన్= దూడలను; ఉత్సాహంబునన్= పూనికతో; నిర్మలంబు+అగు= స్వచ్ఛమైన; జలంబులన్ త్రావించి= నీటిని తాగునట్లు చేసి; పచ్చికల మొల్లంబులుగల= గడ్డి అధికంగా పెరిగి వున్న; పల్లంబులన్ నిలిపి= పల్లపునేలల్లో; చొక్కంబులు+అగు= చక్కనైన; చల్దుల చిక్కంబులు= చల్ది మూటలను; చక్కడించి= దించినవారై.

**తా :** శ్రీకృష్ణుడిలా అనగానే! ఓ అలాగే కానిద్దాం అంటూ గోపాలురందరూ దూడలు మంచి నీళ్ళు తాగేలా చేసి, కసవు ఏపుగా పెరిగివున్న పల్లపునేలల్లో వాటిని నిలిపి, తమ తమ చల్ది మూటలను కిందికి దించుకున్నారు.

**మ. జలజాంతస్థ్సితకర్ణికం దిరిగిరా సంఘంబులై యున్న తే**
**కుల చందంబునఁగృష్ణునిం దిరిగిరాఁ గూర్చుండి వీక్షించుచున్**
**శిలలుం బల్లవముల్ దృణంబులు లతల్ చిక్కంబులున్ బువ్వు లా**
**కులు కంచంబులుగా భుజించి రచటన్ గోపార్భకుల్ భూవరా! 495**

**ప్రతి :** భూవరా!= ఓ రాజా!; జలజ+అంతస్థ్సిత కర్ణికన్= నీటబుట్టిన కమలంమధ్యలో వున్న మిద్దెను; తిరిగి రాన్= చుట్టుకొని; సంఘంబులు+ఐ+ఉన్న= గుబురులుగా వున్న; తేకుల చందంబునన్= పూరేకుల్లాగా; కృష్ణునిన్ తిరిగి రాన్= శ్రీకృష్ణుని చుట్టూ ఉండేలా; కూర్చుండి= కూర్చుని; వీక్షించుచున్= చూస్తూ; శిలలున్= రాతిపలకలు; పల్లవముల్= చిగుళ్లూ; తృణంబులు= పెద్దగడ్డిపోచలూ; లతల్= తీగలూ; చిక్కంబులున్= చిక్కాలునూ; పువ్వులు ఆకులు= పూలూ, ఆకులూ; కంచంబుల్+కాన్= తినే కంచాలుగా చేసుకొని; అచటన్= అక్కడ; గోప+అర్భకుల్= గొల్లపిల్లలు; భుజించిరి= చల్ది తిన్నారు.

**తా :** తామరపువ్వులో మధ్య ఉన్న కర్ణికచుట్టూ వరుసలు వరుసలుగా రేకులు పరుచుకుని ఉంటాయి. అలాగే కృష్ణుడు కర్ణికలాగా మధ్యన కూర్చుని ఉండగా గోపబాలురందరూ చుట్టూ రేకుల్లాగా సర్దుకుని కూర్చున్నారు. అందరూ కృష్ణుణ్ణే చూస్తున్నారు. వారికి కంచాలు అంటూ వేరే ఏమీ లేవు. విశాలమైన రాతిపలకులు, లేత తామరఆకులు; వెడల్పైన గడ్డిపోచలతోను, తీగెలతోను, పొడుగాటి పొన్నపూలవంటి పూవులతోను అల్లిన చదరలు, తోడ తెచ్చుకున్న చిక్కాలు, చెట్ల ఆకులు – వీటినే కంచాలుగా ఉపయోగించుకొని గోపాలబాలకులు చక్కగా చల్దులు ఆరగించారు.

**సీ. మాటిమాటికి వ్రేలు మడిచి యూరించుచు నూరుఁగాయలు దినుచుండు నొక్కఁ,**
**డొకని కంచములోని దొడిసి చయ్యన మ్రింగి "చూడు లే" దని నోరు సూపు నొక్కఁ,**
**డేగు రార్గురచల్దు లెలిమిఁ బన్నిద మాడి కూర్కొని కూర్కొని కుడుచు నొక్కఁ**
**డిన్ని యుండఁగఁ బంచి యిడుట నెచ్చలితన మనుచు బంతెనగుండు లాడు నొకఁడు,**

**ఆ. కృష్ణుఁ జూడు మనుచుఁ గికురించి పరుమ్రోల, మేలిభక్ష్యరాశి మెసఁగు నొకఁడు**
**నవ్వు నొకఁడు, సఖుల నవ్వించు నొక్కఁడు, ముచ్చటాడు నొకఁడు, మురియు నొకఁడు. 496**

**ప్రతి :** ఒక్కఁడు= ఒక గోపబాలుడు; మాటికిన్+మాటికిన్= పదే పదే; వ్రేలు మడిచి= వేలు వంచి; ఊరించుచున్= ఆశపెడుతూ; ఊరుఁగాయలు= అవకాయ వంటి ఊరగాయలను; తినుచుండును= తింటున్నాడు; ఒక్కఁడు= మరొకడు; ఒకని కంచములోనిది= ఒకని గిన్నెలోవున్న పదార్థాన్ని; ఒడిసి= పొంచి; చయ్యనన్ మ్రింగి= తొందరగా మింగేసి; చూడు లేదు= చూడు లేదు; అని= అంటూ; నోరు చూపున్= తన నోటిని చూపించాడు; ఒకఁడు= ఇంకో బాలుడు; ఏగురు+ఆర్గుర చల్దులు= ఐదారుగురి చల్ది అన్నాన్ని; ఎలమిన్= సంతోషంగా; పన్నిదము+ఆడి= పందెం వేసి; కూర్కొని కూర్కొని= నోట్లో కుక్కుకొని కుక్కుకొని; కుడుచున్= తింటున్నాడు; ఒకఁడు= మరొకడు; ఇన్ని+ఉండన్+కన్= ఇన్ని ఉండగా; పంచి+ఇడుట= అందరికీ పంచి ఇవ్వడం; నెచ్చెలితనము+అనుచున్= ఇదే స్నేహానికి తగింది అంటూ; బంతెనగుండులు+ఆడును= బంతెనగుండ్లనే ఆట ఆడతాడు; ఒక్కఁడు= ఇంకొకడు; కృష్ణున్ చూడుము అనుచున్= అదిగో కృష్ణుణ్ణి చూడండి అంటూ; కికురించి= మోసగించి; పరు మ్రోలన్= ఇతరుల ముందున్న; మేలి భక్ష్యరాశిన్= మంచి మంచి తిను పదార్థాలను; మెసఁగున్= తింటున్నాడు; ఒకఁడు నవ్వును= ఒక బాలుడు నవ్వుతున్నాడు; ఒకఁడు= మరొకడు; సఖులన్ నవ్వించున్= మిత్రులను నవ్విస్తున్నాడు; ఒక్కఁడు= ఇంకొకడు; ముచ్చట ఆడున్= సరదా మాటలు మాట్లాడుతున్నాడు; ఒకఁడు= మరొక బాలుడు; మురియున్= సంతోషిస్తున్నాడు.

**తా :** కృష్ణునిచుట్టూ వలయాకారంగా కూర్చున్న గోపాలకులంతా చల్దులారగిస్తున్నప్పుడు వారు చేసే పలుచేష్టలను పోతన సహజంగా వర్ణిస్తున్నాడు, కాదు కళ్ళకు కట్టిస్తున్నాడు. ఒకడు మళ్ళీ మళ్ళీ వేలు మడిచి ఊరగాయలు తాను తింటూ, మిగిలిన వారిని ఊరిస్తున్నాడు. ఇంకొకడు పక్కవానికంచంలోని పదార్థాన్ని తినేసి, వానితో చూడు నేనేమి తినలేదంటూ నోరు చూపిస్తున్నాడు. మరొకడు అయిదారుగురు తినే చల్దిని పందెం వేసి నేనొక్కడనే తింటానంటూ కుక్కుకుంటూ కుక్కుకుంటూ తింటున్నాడు. వేరొకడు పదార్థాలన్నిటినీ అందరికీ పంచి ఇస్తూ స్నేహమంటే ఇదేరా అంటూ బంతెనగుండులాట ఆడుతున్నాడు. ఇంకొకడు అదుగో కృష్ణుణ్ణి చూడమంటూ ఏమారించి ఇతరుల ముందున్న మంచి మంచి తినుబండారాలను మెక్కేస్తున్నాడు. ఒక్కడు నవ్వుతూ వుంటే, ఇంకొకడు నవ్విస్తున్నాడందరినీ. ముచ్చటలాడడం ఒకడు చేస్తే వాటిని చూచి, విని ఇంకొకడు మురిసిపోతున్నాడు.

**వ. అయ్యవసరంబున. 497**

**ప్రతి :** ఆ+అవసరంబునన్= అటువంటి సమయంలో...

**తా :** ఇలా గోపాలురందరూ కృష్ణునిచుట్టూ కూర్చుని ఎంతో సరాదాగా చల్దులారగిస్తున్న సమయంలో

**సీ. కడుపున దిండుగాఁ గట్టినవలువలో, లాలితవంశనాళంబుఁ జొనిపి**
**విమలశృంగంబును వేత్రదండంబును జాఱి రానీక డాచంక నిఱికి**
**మీఁగడ పెరుఁగుతో మేళవించిన చల్ది ముద్ద డాపలిచేత మొనయ నునిచి**
**చెలరేఁగి కొసరి తెచ్చిన యూరుఁగాయలు వ్రేళ్ల సందులయందు వెలయ నిఱికి**

**ఆ. సంగడీల నడుమఁ జక్కఁగఁ గూర్చుండి, నర్మభాషణముల నగవు నెఱపి**
**యాగభోక్త కృష్ణుఁ డమరులు వెఱఁగంద, శైశవంబు మెఱసి చల్ది గుడిచె. 498**

**ప్రతి :** కడుపునన్= పొట్టమీద; దిండుగాన్= చుట్టగా; కట్టిన= కట్టుకున్న; వలువలోన్= దట్టీగా కట్టిన బట్టలో; లాలిత వంశ నాళంబున్= చక్కనైన తన పిల్లన గ్రోవిని; చొనిపి= దోపుకొని; విమల శృంగంబును= మంచి కొమ్ముబూరాను; వేత్రదండంబును= బెత్తంకర్రను; జాఱి రానీక= జారిపోకుండా; డాచంకన్ ఇఱికి= ఎడమచంకలో ఇరికించి; మీఁగడపెరుగుతో= మీగడ గట్టిన పెరుగుతో; మేళవించిన= కలిపివున్న; చల్ది ముద్ద= చద్ది అన్నం ముద్దను; డాపలిచేతన్= ఎడంచేత్తో; మొనయన్ ఉనిచి= చక్కగా పట్టినట్లుంచి; చెలరేఁగి= విజృంభించి; కొసరి= ఇంకొంచెం, ఇంకొంచెం పెట్టుమంటూ అడిగి; తెచ్చిన= తీసుకవచ్చిన; ఊరు+కాయలు= ఊరబెట్టిన ఆవకాయలవంటి పదార్థాలను; వ్రేళ్ళసందుల+అందున్= కుడిచేతివేళ్ళమధ్యలో; వెలయన్ ఇఱికి= చక్కగా ఇరికించి; సంగడీలనడుమన్= తన స్నేహితుల మధ్యలో; చక్కన్+కన్ కూర్చుండి= చక్కగా కూర్చొని; నర్మభాషణములన్= ఛలోక్తులతో; నగవు మెఱసి= అందంగా నవ్వుతూ; యాగభోక్త= యజ్ఞంలో హవిస్సువంటి పవిత్రపదార్థాలను స్వీకరించే; కృష్ణుఁడు= శ్రీకృష్ణమూర్తి; అమరులు= దేవతలు; వెఱఁగు+అందన్= ఆశ్చర్యపడుతుండగా; శైశవంబు మెఱసి= బాల్యక్రీడలతో అందగిస్తూ; చల్ది కుడిచెన్= చద్దఅన్నం తిన్నాడు.

**తా :** కృష్ణుడు నడుముచుట్టూ దట్టీ చుట్టుకొని అందులో తన వేణువునుంచి, కొమ్ముబూరాను, బెత్తం కర్రను జారిపోకుండా ఎడమచంకలో ఇరికించాడు. మీగడతో నిండిన పెరుగు కలిపిన చద్ది అన్నాన్ని ఎడమచేతిలో ఇమిడేటట్లు చేశాడు. అల్లరి పెట్టి, ఇంకా కావాలి ఇంకా కావాలి అంటూ కొసరి కొసరి తెచ్చిన ఊరగాయలను కుడిచేతివేళ్ళ మధ్యలో ఇరికించి, తన చెలికాండ్రైన గోపాలకుల మధ్యలో కూర్చుని, ఛలోక్తులతో, హాస్యసంభాషణలతో నవ్విస్తూ, యజ్ఞాలలో నివేదించే హవిస్సు వంటి ప్రసాదాన్ని భుజించే శ్రీకృష్ణమూర్తి దేవతలందరూ ఆశ్చర్యపోయి చూస్తూ ఉండగా బాల్య లక్షణాలతో ప్రకాశిస్తూ చద్దిఅన్నం తిన్నాడు.

**వ. ఇట్లు కృష్ణసహితు లయిన గోపకుమారులు చల్దులు గుడుచు నెడఁ గ్రేపులు మేపులకుం జొచ్చి పచ్చనిగఱికిజొంపంబుల గుంపుల కుఱికి, లంపులు మేయుచు, ఘోరంబగు నరణ్యంబు నడుమఁ దోరంబగు దూరంబు సనిన, వానిం గానక వెఱచుచున్న గోపడింభకులకు నంభోజనయనుం డిట్లనియె. 499**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; కృష్ణ సహితులు+అయిన= కృష్ణునితో కూడుకున్నవారైన; గోపకుమారులు= గొల్లపిల్లలు; చల్దులు కుడుచు+ఎడన్= చద్ది తింటున్న సమయంలో; క్రేఁపులు= దూడలు; మేపులకున్+చొచ్చి= మేతలకు వెళ్లి; పచ్చని గఱికి

జొంపంబుల గుంపులకున్+ఉఱికి= పచ్చనైన గరిక గడ్డి ఉన్న గుబుర్లలోనికి దూరి; లంపులు మేయుచున్= దొంగ మేతలు మేస్తూ; ఘోరంబు అగు= భయంకరమైన; అరణ్యంబునడుమన్= అడవి మధ్యలో; తోరంబు+అగు దూరంబు+చనినన్= చాలా దూరంగా పోగా; వానిన్ కానక= ఆ దూడలు కనబడకపోవడంతో వాటిల్ని చూడలేక; వెఱచుచున్ ఉన్న= భయపడుతున్న; గోపడింభకులకున్= గోపబాలురతో; అంభోజనయనుండు= నీట బుట్టిన పద్మాలవంటి నేత్రాలుగల శ్రీకృష్ణుడు; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** ఇలా శ్రీకృష్ణునితో కలిసి ఎంతో సంతోషంగా గోపాలురు చల్దులు తింటున్నారు. ఇంతలో దూడలు మేతకై పచ్చగడ్డి గుబురుగా పెరిగిన చోటుకు వెళ్ళి దొంగమేతలు మేస్తూ, అలా అలా భయంకరమైన ఆ అడవిలో చాలా దూరం వెళ్ళిపోయాయి. గోపాలురకు దూడలు కనబడలేదు. దాంతో ఎంతో భయపడుతున్న వారితో పద్మాక్షుడైన శ్రీకృష్ణుడిలా అన్నాడు.

**మ. వినుఁ డో బాలకులార! క్రేపు లటవీవీథిన్ మహాదూరముం**
**జనియెం గోమలఘాసఖాదనరతోత్సాహంబుతో నెందుఁ బో**
**యెనొ యే మయ్యెనొ క్రూరజంతువులచే నే యాపదం బొందెనో?**
**కని తెత్తుం, గుడువుండు చల్దిఁ, గొఱఁతల్ గా కుండ మీ రందఱున్? 500**

**ప్రతి :** ఓ బాలకులార!= ఓ గోపబాలులారా!; వినుఁడు= నా మాట వినండి; క్రేపులు= దూడలు; అటవీ వీథిన్= అడవి మార్గంలో; కోమల ఘాసఖాదన రత+ఉత్సాహంబుతోన్= లేత గడ్డి మేయాలనే ఉత్సాహంతో; మహాదూరమున్+చనియెన్= చాలా దూరం పోయాయి; ఎందున్ పోయెనో= ఎక్కడికి పోయాయో!; ఏమి+అయ్యెనో= ఏమైపోయాయో!; క్రూరజంతువుల చేతన్= అడవిలోని పులులు మొదలగు క్రూరమైన జంతువులచేత; ఏ ఆపదన్ పొందెనో= ఎట్టి ఆపదను పొందాయో!; కని= చూచి; తెత్తున్= తోలుకొని వస్తాను; చల్ది= చద్ది; కొఱతల్ కాకుండన్+కన్= తక్కువ కాకుండా, నిండుగా; మీరు+అందరున్= మీరంతా; కుడువుండు= తినండి.

**తా :** దూడలు ఎమై పోయాయో అని భయపడుతున్న గోపాలురను చూచి, శ్రీకృష్ణుడిలా అన్నాడు. 'గోపబాలులారా! వినండి. మనదూడలు ఈ అడవిలో లేత పచ్చిక మేయాలనే ఉత్సాహంతో చాలా దూరం పోయినట్లున్నాయి. ఎక్కడికి పోయాయో! ఏమయ్యాయో! అడవిలోని పులులవంటి భయంకరజంతువులవల్ల ఏమి కీడు పొందాయో!, నేను వెళ్ళి చూచి తోలుకొని వస్తాను. మీరు చద్దిని పూర్తిగా తింటూ ఉండండి.

## ✤ బ్రహ్మ గోవత్సములను గోపబాలకులను నంతర్ధానంబు సేయుట ✤

**వ. అని చెప్పి. 501**

**ప్రతి :** అని= ఇలా; చెప్పి= గోపబాలురకు ధైర్యం చెప్పి...

**తా :** గోపబాలురతో నేను వెళ్ళి దూడలను తీసుకొని వస్తానని పలికి

**శా. కర్ణాలంబితకాకపక్షములతో గ్రైవేయహారాళితో**
**స్వర్ణభ్రాజితవేత్రదండకముతో సత్పింఛదామంబుతోఁ**

**బూర్ణోత్సాహముతో ధృతాన్నకబళోత్ఫుల్లాబ్జహస్తంబుతోఁ**
**దూర్ణత్వంబున నేగె లేఁగలకునై దూరాటవీవీథికిన్.** **502**

**ప్రతి :** కర్ణ+ఆలంబిత కాక పక్షములతోన్= చెవుల మీదకి వేలాడుతున్న జులపాల జుట్టుతోనూ; గ్రైవేయ హార+ఆళితోన్= మెడలోని రత్నాల హారాలతోనూ; స్వర్ణభ్రాజిత+వేత్ర దండకముతోన్= బంగారు కాంతితో ప్రకాశించే వెదురు కర్రతోనూ; సత్పింఛ దామంబుతోన్= చక్కని నెమలికుంచె దండతోనూ; పూర్ణ+ఉత్సాహముతోన్= నిండైన హూనికతోనూ; ధృత+అన్నకబళ+ ఉత్ఫుల్ల+అబ్జ హస్తంబుతోన్= పట్టుకున్న అన్నం ముద్దతో కూడి వికసించిన పద్మంవంటి చేతితోనూ; లేఁగలకున్+ఐ= దూడలకోసం; దూర+అటవీ వీథికిన్= దూరంలోని అడవిప్రాంతానికి; తూర్ణత్వంబునన్= ఎంతో వేగంగా; ఏగెన్= వెళ్లాడు.

**తా :** కృష్ణుడు గోపబాలురతో అలా చెప్పి, దూడలను వెతకడానికై దూరంగా ఉన్న అడవికి ఎంతో వేగంగా వెళ్లాడు. అప్పుడు కృష్ణుడు ఎలా ఉన్నాడంటే; జులపాలు చెవులవరకు వేలాడుతున్నాయి. మెడలో రత్నాలహారపంక్తులు మెరుస్తున్నాయి. చేతిలో వెదురు కర్ర బంగారుకాంతితో ప్రకాశిస్తోంది. శిరస్సుమీద నెమలిఫించం దండలా వుంది. ఎంత ఉత్సాహంతో వెళ్తున్నాడంటే తిందామనుకుని చేతనున్న అన్నం ముద్దను అలాగే పట్టుకున్నాడు. చెయ్యి వికసించిన పద్మంలా ఎర్రగా ప్రకాశిస్తూ వుంటే అన్నంముద్ద తెల్లగా వెలుగుతోంది.

**వ. ఇ ట్లేగుచు.** **503**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; ఏగుచున్= అడవిలోకి వెళ్తూ...

**తా :** అలా కృష్ణుడు దూడలకోసం అడవిలో దూరంగా వెళ్తున్నవాడై

**క. ఇచ్చోఁ బచ్చిక మేసిన, విచ్చోఁ ద్రావినవి తోయ, మేగిన విచ్చో,**
**నిచ్చోట మంద గొన్నవి, యిచ్చోఁ బాసినవి జాడ యిదె యిదె యనుచున్.** **504**

**ప్రతి :** ఈ+చోన్= ఇక్కడ; పచ్చిక మేసినవి= గడ్డి తిన్నాయి; ఈ+చోన్= ఈ ప్రదేశంలో; తోయము త్రావినవి= నీళ్ళు తాగాయి; ఈ+చోన్= ఇక్కడినుండి; ఏగినవి= వెళ్ళి పోయాయి; ఈ+చోటన్= ఈ స్థలంలో; మంద గొన్నవి= గుంపుగా చేరాయి; ఈ+చోన్= ఇక్కడనుండి; పాసినవి= వదలి వెళ్ళి పోయాయి; జాడ= దూడలు వెళ్ళిన తోవ; ఇది+ఎ, ఇది+ఎ+ అనుచున్= ఇదిగో ఇదే ఇదే అంటూ...

**తా :** అడవిదారిలో వెళ్తున్న శ్రీకృష్ణునికి దూడలఅడుగుజాడలు కనబడ్డాయి, వాటిల్ని బట్టి ఇక్కడ గడ్డిమేశాయి, ఇక్కడ నీళ్ళు తాగాయి, ఇక్కడనుండి వెళ్లాయి. ఇక్కడ మందగా నిలిచాయి, ఇక్కడనుండి విడిపోయాయి, దూడలు వెళ్ళిన తోవ ఇదిగో ఇదే ఇదే అంటూ కృష్ణుడు దూడలను వెదకుతూ ముందుకు వెళ్తున్నాడు.

**క. కంజదళాక్షుఁడు వెదకెను, గొంజక లేఁగల నపారగురుతృణవనికా**
**పుంజంబుల భీకరమృగ, కుంజంబులఁ దరుల గిరులఁ గొలఁకుల నదులన్.** **505**

**ప్రతి :** కంజదళ+అక్షుఁడు= తామర రేకులవంటి కన్నులుగల శ్రీకృష్ణుడు; కొంజక= వెనుకాడక; అపార గురుతృణవనికా పుంజంబులన్= మేరలేని ఎక్కువ గడ్డితో కూడిన గుబురులందు; భీకర మృగ కుంజంబులన్= భయంకరమైన జంతువులున్న

పొదలలోనూ; తరులన్= చెట్లచెంతా; గిరులన్= కొండప్రాంతాల్లోనూ; కొలఁకులన్= సరస్సుల్లోనూ; నదులన్= ఏళ్ళలోనూ; లేఁగలను= దూడలను; వెదకెను= వెదికాడు.

**తా :** పద్మదళాలవంటి విశాలమైన కళ్ళుగలవాడు కాబట్టే ఏ మాత్రం వెనుకాడకుండా, గడ్డితో ఎంతో ఒత్తుగా పెరిగివున్న చోటా, భయంకరమైన అడవిజంతువులుండే పొదలలోనూ, చెట్లదగ్గరా, కొండప్రాంతాలలోనూ, సరస్సులలోనూ, ఏళ్ళలోనూ, దూడలను వెదికాడు.

**వ. అంత. 506**

**ప్రతి :** అంతన్= అప్పుడు...

**తా :** ఇలా అంతటా కృష్ణుడు దూడలను వనమంతా వెదకుతూ ఉండగా

**శా. బాలుం డయ్యు నితం డఘాసురుఁడు ద్రుంపన్ బాలురం గ్రేపులన్**
**ఏ లీలన్ బ్రదికించెనొక్కొ? భువి నూహింపం గడుం జోద్య మం**
**చాలో నంబుజసంభవుండు సని మాయాబాలు శుంభద్బలం**
**బాలోకింపఁ దలంచి డాఁచె నొకచో నా లేఁగలన్ బాలురన్. 507**

**ప్రతి :** ఇతండు= ఈ కృష్ణుడు; బాలుండు+అయ్యున్= చిన్న పిల్లవాడైనప్పటికీ; అఘ+అసురుఁడు= అఘుడనే రాక్షసుడు; త్రుంపన్= చంపగా; బాలురన్ క్రేపులన్= గొల్ల పిల్లలను, దూడలను; ఏ లీలన్= ఏ విధంగా; బ్రతికించె నొక్కొ= బతికేలా చేశాడో; భువిన్= భూలోకంలో; ఊహింపన్= ఆలోచిస్తే; కడున్+చోద్యము= చాలా వింత; అంచున్= అనుకుంటూ; ఆలోన్= అంతలోనే; అంబుజసంభవుండు= పద్మమందు పుట్టినవాడైన బ్రహ్మ; చని= అడవికి వెళ్ళి; మాయాబాలు శుంభత్ బలంబు= ఆ కపట బాలకుడైన శ్రీకృష్ణునియొక్క చక్కనిశక్తిని; ఆలోకింపన్+తలంచి= చూడాలనుకున్నవాడై; ఒకచోన్= ఒక ప్రదేశంలో; ఆ లేఁగలన్= ఆ దూడలను; బాలురన్= గోపబాలురను; డాఁచెన్= దాచివేశాడు.

**తా :** అప్పుడు బ్రహ్మ ఇలా అనుకున్నాడు. ఈ శ్రీకృష్ణుడు చూస్తే చిన్నపిల్లవాడు. ఇట్టివాడు అఘాసురుడు దూడలను, గోపబాలురను చంపినప్పుడు ఎలా వాటిని, వాళ్ళను బతికించాడో! భూలోకంలో ఇట్టిది వింతే! అనుకొని వచ్చి ఆ కపట మానవరూపుడైన ఆ శ్రీకృష్ణుని బలం ఎంతటిదో చూడాలనుకుని, అడవిలోకి దూరంగా పోయిన దూడలను, అక్కడ చల్ది కుడుస్తున్న గోపబాలురను ఒకచోట దాచివేశాడు.

**వ. ఆ సమయంబున దూడలు వోయిన జాడ యెఱుంగక, తప్పి య ప్పద్మలోచనుం డెప్పటి కొలంకుకడకు వచ్చి, యచ్చోట నెచ్చెలులం గానక వారిం జీరి, లేకుండుట నిశ్చయించి గోవిందుండు విశ్వవిదుండు గావున నిది విరించి మొఱం గని యెఱింగి తిరిగిపోవుచు. 508**

**ప్రతి :** ఆ సమయంబునన్= అప్పుడు; దూడలు పోయిన జాడ= లేగలు వెళ్ళిన మార్గం; ఎఱుంగక= తెలియక; తప్పి= దారి తప్పి; ఆ+పద్మలోచనుండు= పద్మాలవంటి నేత్రాలుగల ఆ శ్రీకృష్ణుడు; ఎప్పటి కొలంకు కడకు వచ్చి= గోపబాలురు చల్ది తింటున్న ఆ సరస్సు దగ్గరకు వచ్చి; ఆ+చోటన్= అక్కడ; నెచ్చెలులన్+కానక= తన స్నేహితులైన గోపాలురను; కానక= చూడక; వారిన్ చీరి= వాళ్లను గట్టిగా పిలిచి; లేకుండుటన్+నిశ్చయించి= వారక్కడ లేరని నిర్ణయించుకొని; గోవిందుండు=

శ్రీకృష్ణుడు; విశ్వవిదుండు కావునన్= విశ్వంలోని అన్ని విషయాలు తెలిసినవాడు కాబట్టి; ఇది= ఈ పని; విరించి= బ్రహ్మయొక్క; మొఱంగు అని= మోసమని; ఎఱింగి= తెలుసుకున్నవాడై; తిరిగిపోవుచున్= అక్కడినుండి వెళ్ళిపోతూ...

**తా :** అలా అడవిలో దూడలను వెతుకుతున్న కృష్ణుడు, వాటిజాడ తెలియక పోవడంతో దారి తప్పి, తాను గోపాలకులతో చల్ది తిన్న కొలనువద్దకు వచ్చి చూస్తే అక్కడ గోపబాలురూ లేరు. పిలిస్తే ఎవరూ పలుకలేదు. అప్పుడు శ్రీకృష్ణుడు సర్వజ్ఞుడు కాబట్టి ఆలోచించి, ఇలా దూడలను, గోపాలకులను మాయం చేయడం బ్రహ్మ చేసిన మోసమే అని తెలిసినవాడై అక్కడి నుండి వెళుతూ

**శా. వంచింపం బనిలేదు బ్రహ్మ కిచటన్ వత్సంబులన్ బాలురన్**
**వంచించెం గనుఁబ్రామి, తన్ను మరలన్ వంచించు టాశ్చర్యమే?**
**వంచింపన్ మనకేల! తెచ్చుటకునై వల్దంచు బ్రహ్మాండముల్**
**వంచింపన్ మరలింప నేర్చు హరి లీలన్ మందహాసాస్యుఁడై. 509**

**ప్రతి :** బ్రహ్మకున్= బ్రహ్మదేవునికి; వంచింపన్ పనిలేదు= నన్ను మోసపుచ్చాల్సిన పనేమీ లేదు; ఇచటన్= ఇక్కడ; వత్సంబులన్= దూడలను; బాలురన్= గోపబాలురను; కనున్+ప్రామి= కనబడకుండా చేసి; వంచించెన్= మోసగించాడు; తన్నున్= ఆ బ్రహ్మను; మరలన్= తిరిగి; వంచించుట= మోసగించుట; ఆశ్చరమే!= అబ్బురమా!; వంచింపన్= బ్రహ్మను మోసగించడం; మనకున్ ఏల= మన కెందుకు; తెచ్చుటకును+ఐ= దూడలను, గోపాలురను తేవడానికి; వంచింపన్= బ్రహ్మను వంచించడం; వల్దు+అంచున్= అలా వద్దులే అంటూ; బ్రహ్మాండముల్= ఈ పదునాల్గు లోకాలను; వంచింపన్= మోసగించడానికి; మరలింపన్= మరల తేవడానికి; నేర్చు= సమర్థుడైన; హరి= శ్రీకృష్ణుడు; లీలన్= విలాసంగా; మందహాస+ఆస్యుఁడు+ఐ= చిరునవ్వుతో కూడిన ముఖం కలవాడై...

**తా :** శ్రీకృష్ణుడు అనుకుంటున్నాడు–బ్రహ్మకు నన్ను మోసగించే అవసరం లేదు. అయినా, ఇక్కడ దూడలనూ, గొల్ల పిల్లలనూ, నాకు కనబడకుండా మోసపుచ్చాడు. నేను తిరిగి అతణ్ణి మోసపుచ్చడం అదేమంత పనా? అది ఆశ్చర్యం కాదు. మనకెందుకు? లేగలను, గోపబాలురను మరల తీసుకొని రావడానికి బ్రహ్మను వంచించాల్సిన పనేముంది? అనుకొంటూ బ్రహ్మాండాలనే వంచించగల, మరలించగల సామర్థ్యముండే శ్రీకృష్ణుడు విలాసంగా నవ్వుతూ

**క. గోపాలసుతులు లే రని, గోపికలకుఁ జెప్పనేల? గోపాలకులున్**
**గోపికలు నలర బాలుర, క్రేపులరూపముల నేఁ జరించెద ననుచున్. 510**

**ప్రతి :** గోపాలసుతులు= గొల్లపిల్లలు; లేరు అని= లేరంటూ; గోపికలకున్= గోపకాంతలతో; చెప్పన్ ఏల?= చెప్పడం ఎందుకు?; గోపాలకులున్= ఆ పిల్లల తండ్రులైనవారు; గోపికలున్= తల్లులైన గోపవనితలూ; అలరన్= ఆనందించేలా; బాలుర క్రేపుల రూపములన్= గోపబాలురయొక్క దూడలయొక్క రూపాలుగా; ఏన్ చరించెదన్= నేనే సంచరిస్తాను; అనుచున్= అనుకొంటూ...

**తా :** నేను బృందావనానికి వెళ్ళి, గోపస్త్రీలతో మీ పిల్లలు లేరు, ఏమయ్యారో తెలీదు అంటూ చెప్పడం దేనికి? ఆ గోపబాలుర తల్లిదండ్రులు సంతోషించేలా నేనే గోపబాలురులా, దూడల్లా వాళ్ళ రూపాలతో తిరుగుతూ వుంటాను. ఇలా శ్రీకృష్ణుడు అనుకున్నవాడై

**మ. కరముల్ పాదములున్ శిరంబు లవలగ్నంబుల్ ముఖంబుల్ భుజాం**
**తరముల్ ముక్కులుఁ గన్నులున్ శ్రవణముల్ దంతాదులున్ దండ కాం**
**బర స్రగ్వేణువిషాణభూషణవయోభాషాగుణాఖ్యాన త**
**త్పరతల్ వీడ్వడకుండఁ దాల్చె విభుఁ డా వత్సార్భకాకారముల్. 511**

**ప్రతి :** కరముల్= చేతులు; పాదములున్= కాళ్ళు; శిరంబులు= తలలు; అవలగ్నంబుల్= నడుములు; ముఖంబుల్= ముఖాలు; భుజ+అంతరముల్= వక్షఃస్థలాలూ; ముక్కులున్= (నాసికలు) ముక్కులు; కన్నులున్= నేత్రాలు; శ్రవణముల్= చెవులూ; దంత+ఆదులున్= పళ్లూ మొదలైన; శరీరంలోని అన్ని అవయవాలు; దండక, అంబర, స్రక్, వేణు, విషాణ, భూషణ, వయస్, భాషా, గుణ, ఆఖ్యాన, తత్పరతల్= కర్రలు, వస్త్రాలు, పూలదండలు, పిల్లన గ్రోవులు, కొమ్ముబూరలు, సొమ్ములు, వయస్సు, మాటలు, స్వభావాలు, పూర్వం జరిగినవిషయాలు చెప్పడం; వీటియందలి ఆసక్తులు; వీడు+ పడకుండన్= వీడకుండా, తేడాలేకుండా; విభుఁడు= శ్రీకృష్ణుడు; ఆ వత్స+అర్భక+ఆకారముల్= ఆయా దూడల, గోపబాలుర రూపాలను; తాల్చెన్= ధరించాడు.

**తా :** శ్రీకృష్ణుడు పై రీతిగా భావించినవాడై గోపబాలుర, దూడల రూపాలను తానే ధరించాడు. ఆ ధరించడంలో ఏ మాత్రం తేడా లేకుండా, వాళ్లచేతులు, కాళ్ళు, ముఖాలు, నడుములు, వక్షఃస్థలాలు, నాసికలు, నేత్రాలు, చెవులు, మొదలైన శరీరఅవయవాలన్నీ ఆ విధంగానే ఉండేటట్లుగానూ, వాళ్ళచేతికర్రలు, కట్టుకున్నబట్టలు, వేసుకున్న పూలమాలలు, పట్టుకున్న కొమ్ముబూరలు, అలంకారాలు, వయస్సు, మాట్లాడే మాటతీరు, స్వభావాలు, పూర్వం జరిగిన వృత్తాంతాలను చెప్పేతీరు, వారి వారి కున్న ఆసక్తులు, ఎక్కడా మారుపడకుండా, దూడల రూపాలనూ, గొల్ల పిల్లల రూపాలను శ్రీకృష్ణుడే ధరించాడు.

**క. రూపంబు లెల్ల నగు బహు, రూపకుఁ డిటు బాలవత్సరూపంబులతో**
**నే పారు టేమి చోద్యము?, రూపింపఁగ నతని కితరరూపము గలదే? 512**

**ప్రతి :** రూపంబులు+ఎల్లన్+అగు= అన్ని రూపాలు తానే అయినట్టి; బహురూపకుఁడు= సర్వరూపాలు, సర్వనామాలూ తానే అగు భగవంతుడు; ఇటు= ఈ విధంగా; బాల వత్స రూపంబులతోన్= బాలురరూపంతో దూడలరూపంతో; ఏపారుట= ఒప్పడం; ఏమి చోద్యము?= ఏమాశ్చర్యం?; రూపింపన్+కన్= జాగ్రత్తగా పరికిస్తే; అతనికిన్= శ్రీకృష్ణునికి; ఇతర రూపము= వేరే రూపం; కలదు+ఏ= ఉందా? లేదన్న మాట.

**తా :** ఈ చరాచరమైన సమస్తజగత్తులో ఉండే రూపాలన్నీ తానే. అట్టి అన్నిరూపాలలో కనిపించే భగవంతుడు ఇలా గోపబాలురుగా, దూడలుగా రూపం పొంది, అతిశయించడంలో ఆశ్చర్యం ఏముంది? అంతేకాదు, ఆలోచించి చూస్తే ఆ సర్వాత్మకునికి ఇతర రూపమేదైనా లోకంలో ఉందా? ఆ పరమాత్మకు మించి అన్యమైన ఏ రూపం లేదు.

**క. మరలుపు మనియెడు కర్తయు, మరలించు కుమారకులును మరలెడి క్రేపుల్,**
**పరికింప దాన యై హరి, మరలం జనె లీలతోడ మందకు నధిపా! 513**

**ప్రతి :** అధిపా= రాజా; మరలుపుము= మళ్ళించు; అనియెడు= అనే; కర్తయున్= చెప్పేవాడూ; మరలించు= దూడలను మళ్ళించే, వెనకకు తిప్పే; కుమారకులును= గొల్ల పిల్లలూ; మరలెడి= అలా మళ్ళే; క్రేపుల్= దూడలూ; పరికింపన్= చూడగా; తాను+అ+ఐ= తానేయై; హరి= శ్రీకృష్ణుడు; మందకున్= బృందావనానికి; లీలతోడన్= వేడుకగా; మరలన్ చనెన్= తిరిగి బయలుదేరాడు.

**తా :** ఓ పరీక్షిన్మహారాజా! దూడలను మళ్ళించండి అనేవాడూ, అలా చెప్పగా మళ్ళించే గోపబాలురూ, దాంతో వెనక్కి మళ్ళిన దూడలూ, అన్నీ తానే అయి శ్రీకృష్ణుడు అడవినుండి బృందావనానికి తిరిగి బయలు దేరాడు.

**వ. ఇట్లు బాలవత్సరూపంబులతో విహరించుచు మందకు వచ్చి వారివారిదొడ్ల నయ్యై వత్సంబుల ముందఱి కందువల నిలిపి, తత్తద్బాలరూపంబుల నందఱిగృహంబులం బ్రవేశించి వేణునాదంబులు సేసిన, 514**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; బాలవత్సరూపంబులతోన్= గోపబాలుర, దూడల ఆకారాలతో; విహరించుచున్= తిరుగుతూ; మందకున్ వచ్చి= బృందావనానికి చేరి; వారి వారి దొడ్లన్= ఆయా గోపబాలుర పశువుల కొట్టాలలో; ఆ+అయి వత్సంబులన్= ఆయా దూడలను; ముందఱి కందువలన్ నిలిపి= అవి మునుపెక్కడున్నాయో ఆచోట్లలోనే ఉండేలా చేసి, కట్టి; తత్తద్ బాలరూపంబులన్= ఆయా గొల్లపిల్లల రూపాలతో, అందఱి గృహంబులన్= అందరిఇండ్లలో; ప్రవేశించి= చొచ్చి; వేణు నాదంబులు+చేసినన్= పిల్లనగ్రోవులు ఊదగా...

**తా :** ఈ రీతిగా శ్రీకృష్ణుడు తానే బాలుర, దూడల రూపాలు ధరించి చరిస్తూ, బృందావనం చేరి, ఎవరెవరిపశువుల దొడ్లలో వారి వారికి చెందిన దూడలను – అంతకు ముందు ఎక్కడెక్కడ వుండేవో అక్కడే నిలిపాడు. అలాగే ఆయా బాలుర రూపాలతో వారివారిఇండ్లలో చేరి, పిల్లనగ్రోవులు ఊదగా

**చ. కొడుకుల వేణునాదములు గొబ్బున వీనులకుం బ్రియంబు లై**
**ముడివడ లేచి యెత్తికొని మూర్కొని తల్లులు గౌఁగిలించుచుం**
**జడిగొనఁ జేఁపు వచ్చి తమచన్నులయందు సుధాసమంబు లై**
**వెడలెడిపాలు నిండుకొనువేడుక నిచ్చిరి తత్సుతాళికిన్. 515**

**ప్రతి :** కొడుకుల వేణునాదములు= తమ పిల్లల పిల్లన గ్రోవి ధ్వనులు; గొబ్బునన్= ఒక్కసారిగా; వీనులకున్= చెవులకు; ప్రియంబులు+ఐ= ఇంపులై; ముడివడన్= సంధిల్లగా; తల్లులు= ఆ పిల్లవాండ్రను గన్న గోపవనితలు; లేచి ఎత్తుకొని= నిలిచి ఎత్తుకుంటూ; మూర్కొని= శిరస్సులను ఆఘ్రాణించి; కౌఁగిలించుచున్= ఆలింగనం చేసుకుంటూ; జడిగొనన్= ఎక్కువగా; చేఁపు వచ్చి= పాలు ద్రవించి; తమ చన్నుల+అందున్= తమపాలిండ్లనుండి; సుధాసమంబులు+ఐ= అమృతంతో సమానమై; వెడలెడి= పైకి పొంగే; పాలు= పాలను; నిండుకొను వేడుకన్= సంపూర్ణమైన ఉత్సాహంతో; తత్+సుత+ఆళికిన్= తమ కొడుకులందరికీ; ఇచ్చిరి= ఇచ్చారు.

**తా :** ఇలా కృష్ణుడే గోపబాలుర వేషం ధరించి, వేణువు ఊదుతూ ఉంటే ఆ ధ్వనులు ఒక్కసారిగా తమ చెవులకు ఎంతో ఇంపు కావడంతో తల్లులు లేచి, పిల్లలను ఎత్తుకొని, వాళ్ళశిరస్సులను ప్రేమగా మూర్కొని, దగ్గరగా తీసుకోవడంతో, వాళ్ళలోని మాతృత్వం ఒక్కసారిగా పెల్లుబికింది. దాంతో పాలిండ్లు బాగా చేపుకు వచ్చాయి. అమృతంతో సమానంగా ఉండే తమ స్తన్యాన్ని ఎంతో ఉత్సాహంతో తమ తమ పిల్లలు తాగేలా ఇచ్చారు.

**వ. మఱియుఁ దల్లు లుల్లంబులఁ బెల్లుగ వెల్లిగొను వేడుకలం దమనందనులకు నలుంగు లిడి, మజ్జనంబులు గావించి, గందంబు లలంది తొడవులు దొడిగి నిటలతటంబుల రక్షాతిలకంబులు వెట్టి, సకలపదార్థసంపన్నంబు లయిన యన్నంబు లొసంగి సన్నములు గాని మన్ననలు సేసిరి. 516**

**ప్రతి :** మఱియున్= ఇంకా; తల్లులు= ఆ బాలుర తల్లులు; ఉల్లంబులన్= మనస్సులలో; పెల్లుగన్= ఎక్కువగా; వెల్లిగొను= ప్రవాహరూపంగా వచ్చే; వేడుకలన్= ముచ్చటలతో; తమ నందనులకున్= తమ బిడ్డలకు; నలుంగులు+ఇడి= ఒంటికి నలుగులు పెట్టి; మజ్జనంబులు కావించి= స్నానాలు చేయించి; గందంబులు+అలంది= చందనం పూసి; తొడవులు = వస్త్రాలు; తొడిగి= ధరింపజేసి; నిటలతటంబులన్= నుదిటిభాగాల్లో; రక్షాతిలకంబులు+పెట్టి= క్షేమకరమైన కావిరి బొట్లు దిద్ది; సకలపదార్థసంపన్నంబులు+అయిన= అన్ని వస్తువులతో నిండిన; అన్నంబులు+ఒసంగి= భోజనాలు పెట్టి; సన్నములు కాని= తక్కువలు కాని, ఎంతో ఎక్కువగా; మన్ననలు= గౌరవాలు; చేసిరి= చేశారు.

**తా :** అంతే కాకుండా ఆ బాలుర తల్లులు తమ తమ హృదయాలలో ముంపు గొనేలా వచ్చే ఉత్సాహాలతో, తమ తమ బిడ్డలకు నలుగు పిండితో ఒంటికి నలుగు పెట్టారు. చక్కగా స్నానాలు చేయించారు. మంచి గంధం పూశారు. అలంకారాలు తొడిగారు. నుదుట రక్షా తిలకాలుగా కావిరి బొట్లు పెట్టారు. షడ్రసోపేతమైన పదార్థాలతో భోజనాలు పెట్టారు. ఎంతో ఎక్కువగా ఆదరించారు.

**క. ఏ తల్లుల కే బాలకు, లే తెఱఁగునఁ దిరిగి ప్రీతి యొసఁగింతురు ము**
**న్నా తల్లుల కా బాలకు, లా తెఱఁగునఁ బ్రీతిఁ జేసి రవనీనాథా! 517**

**ప్రతి :** అవనీ నాథా!= ఓ పరీక్షిన్మహారాజా!; మున్ను= ఇంతకు ముందు; ఏ తల్లులకున్= ఏ గోపకాంతలైన తల్లులకు; ఏ బాలకులు= ఏ బిడ్డలు; ఏ తెఱఁగునన్= ఏ విధంగా; తిరిగి= మెలగుతూ; ప్రీతి ఎసఁగింతురు (ఎసగించుదురు)= సంతోషం కలిగిస్తున్నారో; ఆ తల్లులకున్= ఆ తల్లులకు; ఆ బాలకులు= ఆ గొల్లపిల్లలు; ఆ తెఱఁగునన్= అదే రీతిగా; ప్రీతిన్= సంతోషాన్ని; చేసిరి= కలుగజేశారు.

**తా :** ఓ రాజా! కృష్ణుడు ఈ విధంగా వత్సల, బాలకుల రూపాలను పొందక మునుపు అసలైన ఆ పిల్లలు తమ తమ తల్లులకు ఏ విధంగా ఆనందం కలిగించేవారో ఇప్పుడు కూడా ఆ బాలకులు ఆ తల్లులకు అదే రీతిలో ఆనందం కలుగ జేశారు.

**వ. ఆ సమయంబున. 518**

**ప్రతి :** ఆ సమయంబునన్= ఇలా తల్లులూ, పిల్లలూ పూర్వంలాగే ఆనందిస్తున్న సమయంలో...

**ఉ. పాయని వేడ్కతో నునికిపట్టులకుం జని గోవులెల్ల నం**
**బే యని చీరి హుమ్మనుచుఁ బేరిచి మూర్కొని పంచితిల్లి పె**
**ల్లై యతిరేకమై పొదుఁగులం దెడలేక స్రవించుచున్న పా**
**లాయెడ నాకుచున్ సుముఖలై యొసఁగెన్ నిజవత్సకోటికిన్. 519**

**ప్రతి :** గోవులు+ఎల్లన్= ఆవులన్నీ; పాయని వేడ్కతోన్= వీడని ఉత్సాహంతో; ఉనికి పట్టులకున్+చని= తమను కట్టి ఉంచే చోట్లకు వెళ్ళి; అంబే అని చీరి= ఆవులు అరచే ధ్వనిరూపంలో 'అంబే' అంటూ అరచి; హుమ్+అనుచున్ పేరిచి= హుంకారం చేస్తూ; మూర్కొని= తలలు వాసన చూచి; పంచితిల్లి= మూత్రాన్ని విడిచిపెట్టి; పెల్లై= అధికంగా; అతిరేకము+ఐ= మేర మీరినట్టి; పొదుఁగుల+అందున్= తమ పాల పొదుగులలోనుండి; ఎడలేక= సందులేక, అడ్డులేకుండా; స్రవించుచున్న పాలు= కారుచున్న పాలు; ఆ+ఎడన్= ఆ సమయంలో; సుముఖలు+ఐ= అభిముఖంగా ఉండి; నిజవత్సకోటికిన్= తమ దూడల సమూహానికి; ఒసఁగెను= ఇచ్చాయి.

**తా :** ఆవులన్నీ మిక్కిలి సంతోషంతో తమను కట్టివేసిన చోట్లకు పోయి, అంబే అంటూ అరుస్తున్నాయి. హుంకారం చేస్తున్నాయి. దూడలను మూచూస్తూ, మూత్రాన్ని విడిచిపెడుతున్నాయి. దూడల్ని నాకుతూ, అందువల్ల ఎడతెగని రీతిగా ఎక్కువగా కారుతున్న పాలను తమ దూడలకు అభిముఖంగా ఉండి దూడలన్నిటికీ ఇచ్చాయి.

**క. వ్రేతలకును గోవులకును, మాతృత్వము సాలఁ గలిగె మఱి మాధవు పై**
**మాత లని హరియు నిర్మల, కౌతూహల మొప్పఁ దిరిగెఁగడు బాల్యమునన్. 520**

**ప్రతి :** వ్రేతలకును= గోపవనితలకు; గోవులకును= ఆవులకూ; మాధవుపైన్= తమ బిడ్డలరూపంలోను, తమ దూడల రూపంలోను ఉన్న కృష్ణుని మీద; మాతృత్వము= తల్లియొక్క భావం; చాలన్+కలిగెన్= ఎక్కువగా సమకూరింది; హరియున్= శ్రీకృష్ణుడు కూడా; మాతలు+అని= తల్లులనే భావంతో; నిర్మల కౌతూహలము+ఒప్పన్= స్వచ్ఛమైన ఉత్సాహం ఒప్పేట్టుగా; కడుబాల్యమునన్= మిక్కిలి పసితనంతో; తిరిగెన్= మెలగాడు.

**తా :** గోపికలకూ, గోవులకూ కూడా తమతమ బిడ్డల రూపంలో ఉన్న కృష్ణునిమీద మాతృప్రేమ ఎంతో కలిగింది. అలాగే కృష్ణుడు కూడా వారిని తల్లులంటూ ఎంతో స్వచ్ఛమైన ప్రేమతో వారిమధ్య మిక్కిలి పసితనంతో ప్రవర్తించాడు.

**ఆ. ఘోషజనుల కెల్లఁ గుఱ్ఱలపై వేడ్క, పూఁటపూఁట కెలమిఁ బొటకరించె**
**నిచ్చ క్రొత్త యగుచు నీరజాక్షునిమీఁద, వేడ్కఁ దమకుఁ దొల్లి వెలసినట్లు. 521**

**ప్రతి :** ఘోషజనులకున్ ఎల్లన్= గోకులంలోని గొల్ల వారందరికీ; తొల్లి= ఇంతకు మునుపు; నీరజ+అక్షుని మీద= పద్మంవంటి కన్నులుగల శ్రీకృష్ణునిపై; వేడ్కన్= ప్రీతిని; తమకున్= తమకందరికీ; నిచ్చ= నిత్యం; క్రొత్త అగుచున్= కొత్త భావాలతో; వెలసినట్లు= ప్రకాశించినట్లే; కుఱ్ఱలపైన్= తమ బిడ్డలపై; వేడ్క= ఉత్సాహం; పూఁటకున్+పూఁటకున్= రోజురోజుకు; ఎలమిన్= ప్రీతితో; పొటమరించెన్= పుట్టింది.

**తా :** ఆ గొల్లపల్లెలోని వారందరికీ పూర్వం శ్రీకృష్ణునిమీద తమకు ఎల్లప్పుడూ కొత్త కొత్తగా ప్రీతి కలిగినట్లు, ఇప్పుడు తమ బిడ్డలమీద కూడా అటువంటి ప్రీతి రోజు రోజుకూ అధికం కాసాగింది.

**వ. ఇట్లు కృష్ణుండు బాలవత్సరూపంబులు దాల్చి తన్నుఁ దాన రక్షించుకొనుచు, మందను వనంబున నమందమహిమంబున నొక్కయేఁడు క్రీడించె. నా యేఁటికి నై దాఱు దినంబులు కడమవడి యుండ నం దొక్కనాఁడు బలభద్రుండును, దానును వనంబునకుం జని మందచేరువ లేఁగల మేప నతిదూరంబున గోవర్ధనశైలశిఖరంబున ఘాసంబులు గ్రాసంబులు గొనుచున్న గోవు లా లేఁగలం గని. 522**

**ప్రతి :** ఇట్లు= ఈ రీతిగా; కృష్ణుండు= శ్రీకృష్ణుడు; బాల వత్సరూపంబులు తాల్చి= బాలురుగా, దూడలుగా రూపం ధరించి; తన్నున్ తాను+అ+రక్షించుకొనుచున్= తనను తానే కాపాడుకుంటూ; మందను= అటు బృందావనంలోనూ; వనంబునన్= ఇటు అడవిలోనూ; అమంద మహిమంబునన్= మహామహిమతో; ఒక్క+ఏఁడు= ఒక సంవత్సరంపాటు; క్రీడించెన్= నటించాడు; ఆ+ఏఁటికిన్= అట్టి సంవత్సరానికి; ఐదు ఆఱు దినంబులు= అయిదారు రోజులు; కడమపడి ఉండన్= తక్కువై ఉండగా; అందున్= అలా తక్కువైన ఆ రోజుల్లో; ఒక్కనాఁడు= ఒక రోజు; బలభద్రుండును, తానును= బలరాముడు తానూ కలిసి; వనంబునకున్+చని= అడవికి వెళ్ళి; మందచేరువన్= బృందావనానికి దగ్గరగా; లేఁగలన్ మేపన్= దూడలను మేపుతూ

ఉండగా; అతి దూరంబునన్= చాలా దూరంలో; గోవర్ధనశైలశిఖరంబునన్= గోవర్ధనపర్వతంయొక్క పైభాగంలో; ఘాసంబులు= పచ్చగడ్డి పరకలను; గ్రాసంబులు+కొనుచున్న= మేతగా మేస్తున్న; గోవులు= ఆవులు; ఆ లేఁగలన్ చూచి= ఆ దూడలను చూచి...

**తా :** ఈ విధంగా కృష్ణుడు తానే దూడల రూపాన్నీ, బాలుర రూపాన్నీ ధరించి, తనను తానే రక్షించుకుంటూ, అటు బృందావనంలోనూ, ఇటు అడవిలోనూ గొప్ప మహిమతో ఓ సంవత్సరం నటించాడు. సంవత్సరానికి ఇంకో అయిదారురోజులు తక్కువయి ఉన్నప్పుడు బలరామునితో కలసి శ్రీకృష్ణుడు అడవికి వెళ్లాడు. బృందావనానికి దగ్గరలో దూడలు మేస్తున్నాయి. అక్కడికి చాలా దూరంలో వున్న గోవర్ధనపర్వతశిఖరంమీద గడ్డి మేస్తున్న ఆవులు ఈ దూడల్నీ చూచి

**చ. ముదమున హుంకరించుచును, మూఁపులపై మెడ లెత్తి చాఁచుచుం**
**బదములు నాల్గు రెండయిన బాగునఁ గూడఁగఁ బెట్టి దాఁటుచున్**
**వదనములన్ విశాలతరవాలములన్ వడి నెత్తిపాఱి యా**
**మొదవులు సన్నులం గుడిపె మూఁతుల మ్రింగెడిభంగి నాకుచున్. 523**

**ప్రతి :** ఆ మొదవులు= ఆ ఆవులు; ముదమునన్= సంతోషంతో; హుంకరించుచున్= 'హుం'కారం చేస్తూ, మూఁపులపైన్= మూపుల పైదాకా; మెడలు+ఎత్తి చాఁచుచున్= మెడలు ఎత్తి చాచుతూ; పదములు నాల్గున్= నాలుగు కాళ్ళు; రెండు+అయిన బాగునన్= రెండైన రీతిగా; కూడఁన్+కన్+పెట్టి= దగ్గరగా చేర్చి; దాఁటుచున్= దాటుకొంటూ; వదనములన్= ముఖాలను; విశాలతరవాలములన్= మిక్కిలి పొడవైనతోకలను; వడిన్ ఎత్తి= వేగంగా ఎత్తి; పాఱి= పరుగెత్తి; మూఁతులన్= మూతులతో; మ్రింగెడిభంగిన్= మింగేలా; నాకుచున్= దూడలను నాకుతూ; చన్నులను కుడిపెన్= చన్నులనుండి కారే పాలను తాగించాయి.

**తా :** దూడలను చూచిన ఆ ఆవులు, సంతోషంతో హుంకారం చేస్తూ మూపురాల పై దాకా మెడలు పైకెత్తి చాచుతూ, నాలుగు కాళ్ళూ రెండే అయినట్లు దగ్గరగా చేర్చి దాటుతూ, ముఖాలను పొడవైన తోకలను పైకెత్తి పరిగెత్తి వచ్చి దూడలను మింగేస్తాయా అన్నట్లు మూతులతో నాకుతూ తమపాలు తాగించాయి.

**వ. అంత గోపకులు గోవుల వారింప నలవి గాక, దిగ్గన నలుకతోడి సిగ్గు లగ్గలంబుగ దుర్గమ మార్గంబున వానివెంట నంటి వచ్చి లేఁగల మేపుచున్న కొడుకులం గని. 524**

**ప్రతి :** అంతన్= అంతట; గోపకులు; గోపులన్ వారింపన్= అలా వచ్చే ఆవులను అడ్డగించడానికి; అలవిగాక= శక్యం కాకపోవడంతో; దిగ్గనన్= వెంటనే; అలుకతోడి= కోపంతో కూడిన; సిగ్గులు అగ్గలంబుగన్= లజ్జలు అధికంకాగా; దుర్గమ మార్గంబునన్= చొర శక్యంకాని దారిగుండా; వానివెంటన్= ఆ ఆవుల వెనుకనే; అంటి వచ్చి= కూడా వచ్చి; లేఁగలన్= దూడలను; మేపుచున్న= మేసేలా కాస్తున్న; కొడుకులన్ కని= తమ బిడ్డలను చూచి...

**తా :** అలా ఎప్పుడైతే ఒక్కసారిగా దూకుతూ అవులు వెళ్లాయో, వాటిల్ని మేపుతున్న గొల్లవారు వాటిల్ని అడ్డగించడానికి శక్యం కాకపోవడంతో, కోపంతో కూడి ఎంతో లజ్జించినవారై చొర శక్యంకాని వాటిమార్గంలో తామూ శీఘ్రంగా వాటి వెంటే వచ్చి అక్కడ దూడలను మేపుతున్న తమ పిల్లలను చూచి

**ఉ. అయ్యలఁ గంటి మంచుఁ బులకాంకురముల్ వెలయంగఁ గుఱ్ఱలం**
**జయ్యన దాసి యెత్తుకొని సంతస మందుచు గౌఁగిలించి తా**
**రయ్యెడ నౌఁదలల్ మనము లారఁగ మూర్కొని ముద్దు సేయుచున్**
**దయ్య మెఱుంగు, గోపకులు దద్దయు నుబ్బిరి నిబ్బరంబుగన్. 525**

**ప్రతి :** అయ్యలన్= మా చిన్న తండ్రులను; కంటిమి+అంచున్= చూశామంటూ; పులక+అంకురముల్= పులకరింతలు, గగుర్పొడుపులు; వెలయన్+కన్= ఏర్పడగా; కుఱ్ఱలన్= తమపిల్లలను; చయ్యనన్ డాసి= శీఘ్రంగా చేరి; ఎత్తుకొని= చంకకు ఎత్తుకున్నవారై; సంతసము+అందుచున్= ఆనందిస్తూ; కౌఁగిలించి= ఆలింగనం చేసి; తారు= తాము; ఆ+ఎడన్= ఆ సమయంలో; ఔఁదలల్= తలలను; మనములు ఆరఁగన్= మనస్సులు తృప్తి పొందేటట్లుగా; మూర్కొని= ఆఘ్రాణించి; ముద్దు చేయుచున్= ముద్దులాడుతూ; గోపకులు= గొల్లవారు; తద్దయున్= మిక్కిలి; నిబ్బరంబు+కన్= నిలకడగా; ఉబ్బిరి= ఉప్పొంగారు; దయ్యము+ఎఱుంగున్= వారి ఆ ఆనందాతిశయమెల్ల ఆ దేవునికే తెలుసు.

**తా :** అలా తమ బిడ్డలను చూచిన ఆ గోపకులు మా కన్నతండ్రులను చూశామంటూ దగ్గరకు వచ్చి గగుర్పాటు పొందారు. బిడ్డలను ఎత్తుకొంటూ, ఆనందిస్తూ, కౌగిలించుకున్నారు. మనస్సులు నిండిన ఆనందంతో ఆ బిడ్డల శిరస్సులను ఆఘ్రాణించి, ముద్దుచేశారు. ఆ గోపకులు ఎంతగానో ఉప్పొంగి పోయారు. నిలకడ అయిన వారిసంతోషం ఆ దేవుడికే తెలియాలి.

**వ. ఇట్లు బాలకాలింగనంబుల నానందబాష్పపూరితనయనులై గోపకులు గోవుల మరలించుకొని తలంగి చన వారలం జూచి బలభద్రుండు దనలో నిట్లని తలంచె. 526**

**ప్రతి :** ఇట్లు= ఇలా; బాలక+ఆలింగనంబులన్= పిల్లలను దగ్గరగా తీసుకొని కౌగిలించుకోవడంతో; ఆనంద బాష్పపూరిత నయనులు+ఐ= సంతోషంవల్ల కలిగిన కన్నీళ్ళతో నిండిన కళ్లు కలవారై; గోపకులు= పెద్ద గొల్లలు; గోవులన్= ఆవులను; మరలించుకొని= వెనక్కి తోలుకుంటూ; తలంగి చనన్= తొలగిపోగా; వారలన్+చూచి= ఆ గోపాలకులను చూచి; బలభద్రుండు= బలరాముడు; తనలోన్= తన మనస్సులో; ఇట్లు+అని తలంచెన్= ఇలా అనుకున్నాడు.

**తా :** ఈ రీతిగా పిల్లలను దగ్గరగా తీసుకొని కౌగిలించుకొని ఆనందబాష్పాలు నిండిన కనులతో గోపకులు తమ గోవులను మళ్ళించుకొని పోగా, వాళ్ళను చూచి బలరాముడు ఇలా అనుకున్నాడు.

**సీ. చన్ను మానినయట్టి శాబకశ్రేణిపై గోగణంబులకును గోపకులకు**
**నిబ్భంగి వాత్సల్య మెబ్భంగి నుదయించె? హరిఁ దొల్లి మన్నించునట్లు వీరు**
**మన్నించుచున్నారు మమతఁ జేయుచుఁ బ్రీతి నంబుజాక్షునిఁ గన్నయట్లు నాకుఁ**
**బ్రేమమయ్యెడి, డింభబృందంబుఁ గనుఁగొన్న నిది మహాద్భుత మెందు నెఱుఁగరాదు**

**తే. మనుజ దైవత దానవమాయయొక్కొ?, కాక నా భర్త యగుచున్న కమలనయను**
**మాయయో కాక యితరులమాయ నన్నుఁ, గలఁప నోపదు విభుమాయ గాఁగ నోపు. 527**

**ప్రతి :** చన్ను మానిన అట్టి= తల్లిపాలు తాగడం విడిచిపెట్టినట్టి; శాబక శ్రేణిపైన్= పిల్లలందరిపైన, లేగలపైన; గోగణంబులకును= ఆవులగుంపులకూ; గోపకులకున్= గోపాలురకూ; ఈ+భంగి= ఇలాంటి; వాత్సల్యము= ప్రేమ; ఎ+భంగిన్= ఏ విధంగా;

ఉదయించెన్= పుట్టింది?; హరిన్= కృష్ణుణ్ణి; తొల్లి= పూర్వం; మన్నించునట్లు= గౌరవించినట్లు; వీరు= ఈ గోపకుమారులు; మమత చేయుచున్= మమకారం చూపుతూ; మన్నించుచున్+ఉన్నారు= గౌరవిస్తున్నారు; డింభబృందంబున్= ఈ గోకుమారుల సమూహాన్ని; కనుఁగొన్న= చూస్తున్న; నాకున్= నాకైతే; ప్రీతిన్= ప్రేమతో; అంబుజ+అక్షునిన్= పద్మంవంటి కనులుగల శ్రీకృష్ణుణ్ణి; కన్న+అట్లు= చూచినట్లు; ప్రేమము+అయ్యెడిన్= ప్రీతి కలుగుతోంది; ఇది మహాద్భుతము= ఇది ఎంతో ఆశ్చర్యకరం; ఎందున్ ఎఱుఁగన్+రాదు= ఏ రీతిగాకూడా తెలియ శక్యం కాదు; మనుజ దైవత దానవ మాయ ఒక్కొ!= ఇది మనుష్యుల, దేవతల, రాక్షసుల మాయో!; కాక= అది కాకపోతే; నా భర్త అగుచున్+ఉన్న= నా ప్రభువుగా ఉండే; కమలనయను మాయయో! విష్ణువుమాయో; కాక= కాకపోతే; ఇతరుల మాయ= అతనికంటే వేరైన, మనుష్య, దేవ, అసురుల మాయ అయితే; నన్నున్= విష్ణుమూర్తి యందే ప్రీతి, భక్తిగల నన్ను; కలంపన్+ఓపదు= కలవరపడేలా చేయలేదు; విభుమాయ= ఆ విష్ణునిమాయే; కాన్+కన్ ఓపున్= అయి ఉంటుంది.

**తా :** బలరాముడు ఈ సన్నివేశాన్ని చూచి, ఇలా భావిస్తున్నాడు. స్తన్యపానం విడిచిన వయస్సుగల ఈ పిల్లల పైనా, దూడలమీదా గోపాలకులకూ, గోవులకూ ఇంతటి ప్రేమ ఏ కారణంగా పుట్టింది? ఇదివరకు కృష్ణునిపై ఎంత మమకారంతో ఉండేవారో, ఇప్పుడు తమబిడ్డలపై ఆ విధమైన ప్రేమనే చూపుతున్నారు. నాకుకూడా ఈ పిల్లలను, దూడలను చూస్తూవుంటే కృష్ణుణ్ణి చూచినట్లే ప్రేమ కలుగుతోంది. ఇది చాలా ఆశ్చర్యంగా ఉంది. ఇంతకు ముందు ఇటువంటిది ఎన్నడూ ఎరుగను. ఒక వేళ ఇది మానవుల, లేక దేవతల, లేదా రాక్షసుల మాయ అయి ఉంటుందా? లేకుంటే నా స్వామి అయిన ఆ విష్ణుమూర్తిమాయేనా! ఇతరులు కల్పించే మాయ అయితే నన్ను ఈ విధంగా కలవరపెట్టదు. ఇది నిజంగా విష్ణుమాయే కావచ్చు.

**క. అని మున్న ముగ్ధుఁ డయ్యును, దనయందుల దివ్యదృష్టిఁ దప్పక బుద్ధిం**
**దన చెలికాండ్రను గ్రేపుల, వనజాక్షుం డనుచుఁ జూచె వసుధాధీశా! 528**

**ప్రతి :** వసుధా+అధీశా= ఓ రాజా!, బలరాముడు; అని= ఇట్లు ఆలోచించి; మున్ను+అ= తొలుత; ముగ్ధుఁడు+అయ్యును= ఏమీ తెలియని వాడైనప్పటికీ; తన+అందుల దివ్యదృష్టిన్= తన ఆలోచనవల్ల కలిగిన జ్ఞానదృష్టితో; తప్పక= ఆలోచన తప్పకుండా; బుద్ధిన్= జ్ఞానంచే; తన చెలికాండ్రను= తన చెలికాండ్రైన గోపకుమారులనూ; క్రేపులును= దూడలనూ; వనజ+అక్షుండు అనుచున్= శ్రీకృష్ణుడే అనే భావనతో; చూచెన్= తెలుసుకొన్నాడు.

**తా :** ఓ రాజా! బలరాముడు మొదట సామాన్యబుద్ధితో ఏమీ తెలియనట్లు ఆలోచించి, తరువాత జ్ఞానదృష్టితో చూశాడు. ఇంకేముంది! అసలు విషయం బయటపడింది. ఇలా తనతో ఉండే గొల్లపిల్లలూ, దూడలూ కూడా శ్రీకృష్ణునిరూపాలే అని తెలుసుకొన్నాడు.

**వ. ఇట్లు విజ్ఞానదృష్టిం జూచి యెఱింగియు నమ్మక బలదేవుండు గొందలంపడుచుఁ గృష్ణుం జూచి 'మహాత్మా! తొల్లి యెల్ల క్రేపులును ఋషులయంశం బనియును, గోపాలకులు వేల్పులయంశం బనియును దోఁచు చుండు, నిపుడు వత్సబాలక సందోహంబు సందేహంబు లేక నీవ యని తోఁచుచున్న, దిదియ యేమి?'యని యడిగిన నన్నకు నున్నరూపు వెన్నుండు మన్ననసేసి క్రన్నన యెఱింగించె, నతండు నెరింగె నవ్విధంబున హరి బాలవత్సంబులు దానయై సంచరించిన యేఁడు విరించికిఁ దన మానంబున నొక్క త్రుటి మాత్రంబైన, విరించి చనుదెంచి, వత్సబాలకాకారుండైన కృష్ణబాలకుం జూచి వెఱంగు పడి యిట్లని వితర్కించె. 529**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; విజ్ఞాన దృష్టిన్+చూచి= దివ్య దృష్టితో చూచి; ఎఱింగియున్= తెలుసుకొని కూడా; బలదేవుండు= బలరాముడు; కొందలము+పడుచున్= కంగారు పడుతూ; కృష్ణున్+చూచి= శ్రీకృష్ణుణ్ణి చూచి; మహాత్మా!= ఓ మహానుభావా! తొల్లి= మునుపు; ఎల్లక్రేపులును= దూడలన్నీ; ఋషుల అంశంబు+అనియును= మహర్షుల అంశతో పుట్టినవని; గోపాలకులు= గొల్లవారు; వేల్పుల అంశంబు+అనియును= దేవతల అంశంతో జన్మించిన వారని; తోఁచుచున్+ఉండును= నాకు అనిపించేది; ఇపుడు= ఈ సమయంలో అయితే; వత్స బాలక సందోహంబులు= దూడల పిల్లల సమూహాలు; సందేహంబు లేక= అనుమానం లేకుండా; నీమ+ఆ+అని+తోఁచుచున్+ఉన్నది= నీవే అనిపిస్తోంది; ఇది ఏమి?= ఇదంతా ఏమిటి?; అని= అట్లు; అడిగిన అన్నకున్= అడిగిన అన్న బలరామునితో; ఉన్న రూపున్= వాస్తవాన్ని; క్రన్ననన్= వెంటనే; వెన్నుండు= శ్రీకృష్ణుడు; మన్ననచేసి= గౌరవించి; ఎఱింగించెన్= తెలియజేశాడు; అతండు= బలరాముడుకూడా; ఎరింగెన్= తెలుసుకున్నాడు; ఆ+విధంబునన్= ఆ రీతిగా; హరి= శ్రీకృష్ణుడు; బాల వత్సంబులు తాన్+అ+ఐ= గోపబాలురూ, దూడలూ తానే అయి; సంచరించిన ఏఁడు= తిరిగిన ఒక సంవత్సరం; విరించికిన్= బ్రహ్మకు; తన మానంబునన్= తన కాలగణనంలో; ఒక్క త్రుటి మాత్రంబు+ఐనన్= ఒక్క క్షణకాలం మాత్రమేకాగా; విరించి= బ్రహ్మ; చనుదెంచి= వచ్చి; వత్సబాలక+ఆకారుండు+ఐన= బాలుర, దూడల రూపుడైన; కృష్ణబాలకున్+చూచి= బాలుడైన కృష్ణుణ్ణి చూచి; వెఱంగుపడి= ఆశ్చర్యపడి; ఇట్లు+అని వితర్కించెన్= తనలో ఇలా ఆలోచించాడు.

**తా :** యోగదృష్టితో బలరాముడు బాలురను, దూడలను కృష్ణుని రూపాలుగానే తెలుసుకొనికూడా కంగారుపడుతూ, కృష్ణుణ్ణి చూచి ఇలా అడిగాడు. 'మహానుభావా! ఇంతకుముందు ఈ దూడలన్నీ మహర్షుల అంశలతో పుట్టినవనీ, సంశయం లేకుండా గోపాలకులందరూ దేవతల అంశలతో జన్మించినవారనీ అనిపించేది. ఇపుడు బాలుర, దూడల సమూహాలు అన్నీ నీవే అనిపిస్తోంది. ఏమిటిదంతా?' అని అడిగిన అన్న బలరామునితో కృష్ణుడు ఎంతో గౌరవంగా అసలు విషయాన్ని తెలియజేశాడు. బలరాముడికి విషయం అంతా అర్థమయింది. ఇలా శ్రీకృష్ణుడు దూడల రూపమూ, బాలుర రూపమూ తానే అయి వ్యవహరించిన సంవత్సర కాలం బ్రహ్మదేవునికి తన కాలమాన ప్రకారం ఒక క్షణంమాత్రమే కాగా, బ్రహ్మ అచటికి వచ్చి, దూడల, గోపబాలుర రూపుడైన బాలకృష్ణుణ్ణి చూచి, నివ్వెరపోయి తనలో ఇలా ఆలోచించాడు.

**శా. మందం గల్గిన వత్సబాలకులు నామాయాగుహాసుప్తులై**
**యెందుం బోవరు, లేవ రిప్పుడును వేఱే చేయ నాకన్యు లొం**
**డెందున్ లేరు, విధాతలుం బరులు, వీ రెవ్వార లె ట్లైరొకో!**
**యెం దేతెంచిరొ కృష్ణుతో మెలఁగువా? రేఁడయ్యెడిన్ నేఁటికిన్. 530**

**ప్రతి :** మందన్= ఈ గోకులంలో; కల్గిన వత్సబాలకులు= ఉన్నట్టి దూడలూ, గోపబాలురూ; నా మాయా గుహా సుప్తులు+ఐ= నేను కావించిన మాయా గుహలో నిద్రపోతున్నవారై; ఎందున్+పోవరు= ఎక్కడికీ వెళ్ళరు; ఇప్పుడును= ఇప్పటికీ; లేవరు= నిద్రనుండి లేవలేదు; వేఱే చేయన్= వీళ్ళను వేరుగా సృష్టి చేయడానికి; అన్యులు= ఇతరులైన; విధాతలున్ పరులు= ఇతర బ్రహ్మలెవరూ; నాకున్= నా కంటే; ఒండు+ఎందున్= మరెక్కడా; లేరు; వీరు= ఈ దూడల్లా బాలకుల్లా ఉండే వీరు; ఏ+వారలు= ఎవ్వరు?; ఎట్లు ఐరి+ఒకో!= ఈ రూపంతో ఉండేవారుగా ఎలా అయ్యారో!; కృష్ణుని తోన్ మెలగువారు= కృష్ణునితో కూడి తిరిగే వీరు; ఎందున్+ఏతెంచిరో= ఎక్కడి నుండి వచ్చారో!; నేఁటికిన్= ఈ రోజుకు; ఏఁడు అయ్యెడిన్= ఒక సంవత్సరం అయింది.

**తా :** ఈ గొల్లపల్లెలో ఉండే దూడలూ, గోపబాలురూ కూడా నా మాయాగుహలో నిద్రపోతున్నారు. ఎక్కడికీ వెళ్లరు. ఇప్పుడే లేవరు. అలాంటప్పుడు వీళ్లను వేరుగా సృష్టించడానికి నాకంటే వేరే ఇతరబ్రహ్మలు ఎవరూ లేరు. మరి ఈ బాలురు, దూడలు ఎవరో, ఎక్కడనుండి వచ్చారో, కృష్ణునితో కలిసి తిరుగుతున్నారు. ఆలోచిస్తే భూలోకంలో నేటికి సంవత్సరం అయింది - నేను వీళ్ళను మాయం చేసి. ఇలా అనుకుంటున్నాడు - బ్రహ్మ.

**మత్తకోకిలము**

> **బ్రహ్మపంపునఁ గాని పుట్టదు ప్రాణిసంతతి యెప్పుడున్**
> **బ్రహ్మ నొక్కఁడఁ గాని వేఱొక బ్రహ్మ లేఁడు సృజింపఁగా**
> **బ్రహ్మ నేను సృజింప నొండొక బాలవత్సకదంబ మే**
> **బ్రహ్మమందు జనించె? నొక్కట బ్రహ్మ మౌ నది చూడఁగాన్. 531**

**ప్రతి :** ప్రాణి సంతతి= జీవకోటి; ఎప్పుడున్= ఎప్పుడైనా సరే; బ్రహ్మ పంపునన్+కాని= బ్రహ్మ ఆజ్ఞచే తప్ప; పుట్టదు= జన్మించదు, కలుగదు; బ్రహ్మను= బ్రహ్మగా; ఒక్కఁడన్+కాని= నేనొక్కడినే కాని; సృజింపన్+కాన్= సృష్టించడానికి; వేఱొక బ్రహ్మ లేఁడు= వేరే మరో బ్రహ్మ లేడు; బ్రహ్మ= బ్రహ్మనైన; నేను సృజింపన్= నేను సృష్టించగా; ఒండొక బాల వత్సకదంబము= వేరే గోపబాలురయొక్క, దూడలయొక్క సమూహం; ఏ బ్రహ్మము+అందున్ జనించెన్= ఇంకే బ్రహ్మవల్ల పుట్టింది?; చూడన్+కాన్= ఆలోచించి చూస్తే; అది= ఈ సృష్టికర్త; ఒక్కట బ్రహ్మము అవును= ఇందరిలో ఒక్కడుగా ఉన్న పరబ్రహ్మమే అవునేమో!

**తా :** ఏ లోకంలో నైనా ప్రాణికోటి బ్రహ్మ సృష్టిస్తేనే పుడుతుంది. బ్రహ్మ అనేవాణ్ణి నేనొక్కణ్ణే గాని సృష్టికర్తగా మరో బ్రహ్మ లేడు. బ్రహ్మగా వీళ్ళను నేను సృష్టించాను. మరి వేరే ఈ బాలుర, దూడల సమూహం ఏ బ్రహ్మ సృష్టిస్తే ఏర్పడింది? విచారించి చూస్తే ఇందరిలో ఒక్కడుగా ఉన్న పరబ్రహ్మే ఇలా రూపొందించాడేమో ననిపిస్తుంది.

**వ. అని యిట్లు సకలంబును సుకరంబున నెఱింగెడి నెఱవాది ముదుక యెఱుక గల ప్రోడ వెఱంగుపడి గ్రద్దనఁ బెద్దప్రొద్దు దద్దయుం దలపోసి కర్జంబు ముందల యెఱుంగక కొందలం పడుచు నాందోళనంబున. 532**

**ప్రతి :** అని+ఇట్లు= ఇలా అనుకొని; సకలంబును= సమస్తాన్నీ; సుకరంబునన్= ఎంతో తేలికగా; ఎఱింగెడి= తెలుసుకొనే; నెఱవాది ముదుక= నేర్పరియైన ముసలివాడు; ఎఱుకగల ప్రోడ= జ్ఞానం కల దిట్ట అయిన బ్రహ్మ; వెఱంగుపడి= ఆశ్చర్యం పొంది; గ్రద్దనన్= వెంటనే; పెద్దప్రొద్దు= చాలా సేపు; తద్దయున్= ఎంతో; తలపోసి= ఆలోచించి; ముందల కర్జంబు= ఇక ముందు చేయవలసి కార్యాన్ని; ఎఱుంగక= తెలియక పోవడంతో; కొందలము+పడుచున్= సంకటపడుతూ; ఆందోళనంబునన్= ఏం చేయాలో తెలియక చలించే బుద్ధితో...

**తా :** అన్ని విషయాలను సులభంగా తెలుసుకోగల నేర్పరియైన ఆ పితామహుడు, జ్ఞానవృద్ధుడు. అయిన బ్రహ్మ ఆశ్చర్యపడి వెంటనే ఎంతో సేపు విచారించి ముందు చేయవలసిన కార్యం తెలియక పోవడంతో ఆందోళనపడుతూ,

> **క. మోహము లేక జగంబుల, మోహింపఁగఁ జేయ నేర్చి మొనసినవిష్ణున్**
> **మోహింపించెద ననియెడు, మోహమున విధాత దాన మోహితుఁ డయ్యెన్. 533**

**ప్రతి :** మోహము లేక= ఏరకమైన భ్రమ లేకుండా; జగంబులన్= లోకాలను; మోహింపన్+కన్+చేయనేర్చి= భ్రమించేలా చేయడం నేర్చినవాడై; మొనసిన= ఒప్పిన; విష్ణున్= శ్రీ విష్ణుమూర్తిని; మోహింపించెదను= మోహపడేటట్లు చేస్తాను; అనియెదున్= అనుకునే; మోహమునన్= భ్రమతో; విధాత= బ్రహ్మ; తాను+అ= తానే; మోహితుఁడు+అయ్యెన్= మోహంలో పడ్డవాడు అయ్యాడు.

**తా :** ఏ రకమైన భ్రమ లేకుండా, జగత్తులన్నిటినీ మోహింపజేయగల విష్ణువును మాయలోపడేటట్లు చేద్దామనుకొని, బ్రహ్మ భ్రమతో తానే మోహంలో పడ్డాడు.

**తే. పగలు ఖద్యోతరుచి చెడుపగిది రాత్రి,మంచు చీఁకటి లీనమై మాయుమాడ్కి**
**విష్ణుపై నన్యమాయలు విశద మగునె?, చెడి నిజేశుల గరిమంబుఁ జెఱుచుఁగాక. 534**

**ప్రతి :** పగలు= పగటి వేళలో; ఖద్యోత రుచి= మిణుగురు పురుగుల కాంతి; చెడుపగిదిన్= అణిగిపోయే రీతిగా; రాత్రి= రాత్రివేళ; మంచు= మంచు; చీఁకటిన్ లీనము+ఐ= అంధకారంలో అణగిందై; మాయుమాడ్కిన్= నశించునట్లుగా; విష్ణుపైన్= విష్ణుమూర్తిమీద; అన్యమాయలు= ఇతరుల మాయలు; చెడి= నశించి; నిజ+ఈశుల గరిమంబున్= తమ దొరల గౌరవాన్ని; చెఱచున్+కాక= నశింపజేస్తాయే కాని; విశదము+అగునె= స్పష్టమవుతాయా? (స్పష్టం కావు)

**తా :** మిణుగురు పురుగుల కాంతి పగటివేళ అణగిపోతుందే కాని ప్రకాశించదు. రాత్రివేళ మంచు చీకట్లో కలిసిపోయి మాయమవుతుంది. విష్ణువు మాయకు పుట్టినిల్లు. అటువంటి విష్ణువుపై ఇతరుల మాయలు పనిచేస్తాయా? ఆ మాయలు పన్నిన దొరల గౌరవాన్ని అవి చెడగొట్టేస్తాయేగాని పనిచేయవు.

**వ. మఱియును. 535**

**ప్రతి :** మఱియును= ఇంకనూ...

**తా :** అంతే కాకుండా, ఇంకా

**క. పుట్టితి, బుద్ధి యెఱింగితిఁ, బుట్టించితి జగము, సగము వోయెను బ్రాయం,**
**బిట్టివి నూతనసృష్టులు, పుట్టుట లే, దౌర! యిట్టి బూమెలు భూమిన్. 536**

**ప్రతి :** పుట్టితిన్= విష్ణుమూర్తి నాభికమలంనుండి జన్మించాను; బుద్ధి ఎఱింగితిన్= తెలివికలిగి ఉన్నాను; జగమున్= లోకాన్ని; పుట్టించితిని= సృష్టించాను; ప్రాయంబు= వయస్సు; సగము+పోయెను= సగభాగం గడచిపోయింది; ఇట్టివి= ఇటువంటివి; నూతన సృష్టులు= కొత్తరకం పుట్టుకలు; పుట్టుటలేదు= పుట్టడంలేదు; ఇట్టి బూమెలు= ఇప్పుడు కనిపిస్తున్న ఇటువంటి మాయావేషాలు; భూమిన్= భూలోకంలో కనిపించడం; ఔరా!= ఆశ్చర్యం!

**తా :** విష్ణుదేవుని నాభికమలంనుండి ఏనాడో పుట్టాను, మంచిజ్ఞానం పొందాను, లోకాలను సృష్టించాను, వయస్సా? సగం గడచిపోయింది. కానీ భూలోకంలో ఇట్టి నూతనసృష్టులు, ఇటువంటి మాయాచేష్టలు పుట్టడం ఆశ్చర్యం! నాముందే ఇలాంటి మాయలా?

**వ. అని యిట్లు దలవాకిట వాణిగల పోఁడిమిచే వాఁడిమి కెక్కిన నలుమొగంబుల తక్కరిగొంటు పెనుదంట పలువెంటలం దనమనంబున వితర్కించి, విచారించునెడ, నతండు గనుంగొనుచుండ నబ్బాలకులు**

**మేఘశ్యాములును, హారకుండల కిరీట వనమాలికాభిరాములును, శ్రీవత్స మంగళాంగద నూపుర కనక కటక కంకణ కటిఘటిత కాంచీగుణోద్దాములును, నాపాదమస్తక తులసీదళదాములును, విలస దంగుళీయకస్తోములును, శంఖ చక్ర గదా కమల హస్తులును, చతుర్భుజప్రశస్తులును, బీతకౌశేయవాసులును, జంద్రికాధవళహాసులును, గరుణాకటాక్ష వీక్షణవిలాసులును, రవికోటిభాసులును, ననంత సచ్చిదానంద రూపమహితులును, నణిమాదిగుణోపేతులును, విజాతీయభేదరహితులును, శ్రీ మన్నారాయణ ప్రతిమాన విగ్రహస్వరూపులును నయి తమకుఁ బరతంత్రు లగుచు నృత్తగీతాదిసేవావిశేషంబులకుం జొచ్చి మెలంగుచు మూర్తిమంతంబులయిన బ్రహ్మాదిచరాచరంబులును నణిమాదిసిద్ధులును, మాయాప్రముఖంబులైన శక్తులును, మహదాదిచతుర్వింశతితత్త్వంబులును, గుణక్షోభ కాలపరిణామ హేతుసంస్కారకామ కర్మగుణంబులును సేవింప వేదాంతవిదులకైన నెఱుంగరాని తెఱంగున మెఱయుచుఁ గానంబడిన వారలం గనుంగొని. 537**

**ప్రతి :** అని ఇట్లు= ఇలా తలచినవాడై; తలవాకిటన్= ముఖభాగంలో, నోటిలో; వాణిగల పోఁడిమిచేన్= సరస్వతి ఉందనే అభిమానంతో కొంత గర్వపడుతూ; వాఁడిమికిన్+ఎక్కిన= ప్రసిద్ధిగాంచిన; నలుమొగంబుల= నాలుగు ముఖాలున్న; తక్కరి= మోసగాడు; గొంటు= కఠినుడు; పెనుదంట= గొప్ప నేర్పరి; పలువెంటలన్= అనేక విధాలుగా; తన మనంబునన్= తన మనస్సులో; వితర్కించి= చర్చించి; విచారించునెడన్= ఆలోచిస్తున్నపుడు; అతండు= ఆ బ్రహ్మ; కనుంగొనుచున్+ఉండన్= చూస్తూ ఉండగానే; ఆ+బాలకులు= ఆ గోపబాలురు; మేఘశ్యాములును= మబ్బువంటి నీలవర్ణంగలవారును; హారకుండల కిరీటవనమాలికాభిరాములును= ముత్యాలహారాలతో, మకరకుండలాలతో, సువర్ణమయకిరీటాలతో, వైజయంతీ వనమాలలతో అందంగా ఒప్పేవారును; శ్రీవత్స మంగళ అంగద నూపుర కనక కటక కంకణ కటిఘటిత కాంచీగుణ ఉద్దాములును= శ్రీవత్సం అనే మచ్చతోను, శుభంకరాలైన భుజకీర్తులు అందెలు, బంగారుకడియాలు, ముంజేతి మురుగుల చేత, మొలయందు కూర్చబడిన బంగారు మొలనూలుతోను మిక్కిలిగా ప్రకాశించేవారును; ఆపాద మస్తక తులసీదళ దాములును= పాదంనుండి శిరస్సువరకు తులసీదళాలతో కూర్చిన దండలు కలవారును; విలసత్ అంగుళీయక స్తోములును= ప్రకాశించే ఉంగరాల సమూహం కలవారును; శంఖ చక్ర గదా కమల హస్తులును= శంఖం, చక్రం, గద, పద్మం వీటిల్ని చేతులలో ధరించినవారును, చతుర్భుజ ప్రశస్తులును= నాలుగుచేతులతో ఒప్పేవారును; పీత కౌశేయ వాసులును= పచ్చని పట్టు వస్త్రంగలవారును; చంద్రికా ధవళ హాసులును= వెన్నెలవలె స్వచ్ఛమైన నవ్వులు కలవారును; కరుణా కటాక్ష వీక్షణ విలాసులును= దయతో నిండిన కడగంటి చూపుల శోభగలవారును; రవికోటి భాసులును= కోటి సూర్యుల తేజస్సుతో ప్రకాశించేవారును; అనంత సత్ చిత్ ఆనంద రూపమహితులును= అనంతమైన సత్యం, జ్ఞానం, ఆనందం అనే మూడింటి స్వరూపంచేత పూజితులును; అణిమ+ఆది గుణ+ఉపేతులును= అణిమ మహిమ మొదలగు ఎనిమిది విభూతులతో కూడుకున్నవారును; విజాతీయ భేద రహితులును= వారూ వీరూ అనే జాతి భేదంలేనివారును; శ్రీమన్నారాయణప్రతిమాన విగ్రహ స్వరూపులును= మహావిష్ణువుతో సమానమైన రూపం కలవారును; అయి= ఇలా ఉన్నవారై; తమకున్ పరతంత్రులు+అగుచున్= తమ కధీనమైన వర్తనం కలవారై; నృత్త గీత+ఆది సేవా విశేషంబులకున్= ఆట పాట మొదలైన కొలిచే సేవలకు; చొచ్చి= ప్రవేశించి; మెలంగుచున్= ప్రవర్తిస్తూ; మూర్తిమంతంబులు+అయిన= ఆకారాలు ధరించిన; బ్రహ్మ+ఆది చర+అచరంబులును= బ్రహ్మ మొదలు సృష్టిలోని కదిలేవీ, కదలనివీ అయిన జంగమ స్థావరాలును; అణిమాది సిద్ధులును= అణిమ, మహిమ, గరిమ, లఘిమ, ప్రాప్తి, ప్రాకామ్యం, ఈశత్వం, వశిత్వం అనే ఎనిమిది రకాల ఐశ్వర్యాలును; మాయా ప్రముఖంబులు+ఐన శక్తులును=

మాయ మొదలైన ఆదిశక్తి, జ్ఞానశక్తి, ఇచ్ఛాశక్తి, క్రియాశక్తులును; మహత్+ఆది చతుర్వింశతి తత్త్వంబులును= మహత్తు, అహంకారం, బుద్ధి, మనస్సు(4)+పృథివి, జలం, అగ్ని, వాయువు, ఆకాశం అనే పంచభూతాలు(5), త్వక్కు, చక్షుస్సు, శ్రోత్రం, జిహ్వ, ఘ్రాణం అనే అయిదు జ్ఞానేంద్రియాలు(5)+వాక్కు, పాణి, పాదం, పాయువు, గుహ్యం అనే అయిదు కర్మేంద్రియాలు(5)+రూప, రస, గంధ, స్పర్శ, శబ్దాలనే పంచ తన్మాత్రలను(5)+కలిసి ఇరవై నాలుగు తత్త్వాలును; గుణ, క్షోభ, కాల, పరిణామ, హేతు, సంస్కార, కామ, కర్మ గుణంబులును= సత్త్వరజస్తమోగుణాలు, కలతపాటు, కాలం, మార్పు, కారణం, సంస్కారం, కామం, కర్మగుణాలు, ఇవన్నీ; సేవింపన్= కొలుస్తూ ఉండగా; వేదాంత విదులకున్+ఐనన్= వేదాంత విజ్ఞానం తెలిసిన బ్రహ్మవేత్తలకు కూడా; ఎఱుంగరాని తెఱంగునన్= తెలియబడని విధంగా; మెఱయుచున్= ప్రకాశిస్తూ; కానన్+పడిన= తనకు దృష్టి గోచరంబైన; వారలన్= ఆ గోపబాలురను; కనుంగొని= చూచి...

**తా :** సకలవిద్యాస్వరూపిణి అయిన వాణి తన ముఖంలో ఉందనే గర్వంతో ఉన్న మాయావి అయిన ఆ చతుర్ముఖ బ్రహ్మ తన మనస్సులో పరిపరివిధాల తర్కించి ఆలోచిస్తున్న సమయంలో, అతనికి ఆ గోపబాలురు ఇలా కనబడ్డారు. నీల మేఘశ్యాముడైన ఆ విష్ణుస్వరూపంగానే వీళ్ళు ఉన్నారు. హారాలతో, మకరకుండలాలతో, స్వర్ణకటకాలు, కంకణాలు, బంగారు మొలతాళ్ళతో, శిరస్సునుండి పాదాలవరకున్న తులసిమాలలతో; చక్కని ఉంగరాలతో, శంఖం, చక్రం, గద, పద్మంతో కూడినచేతులతో, నాలుగుభుజాలతో, పచ్చని పట్టువస్త్రాలతో, వెన్నెలవంటి స్వచ్ఛమైన నవ్వులతో, దయా స్వభావంగల చూపులతో, కోటిసూర్యుల తేజస్సుతో, అంతం లేని సత్య, జ్ఞాన, ఆనంద రూపాలతో, అణిమాదిగుణాలతో, జాతిభేదం లేనివారై; శ్రీమహావిష్ణుస్వరూపంతో సమానమైన దేహంతో కూడినవారుగా వారున్నారు. అంతే కాదు, వారు తమకు అధీనం అయిన ఆట పాట మొదలైన సేవాకార్యక్రమాలలో చేరి, ప్రవర్తిస్తున్న ఆకారం పొందిన బ్రహ్మ మొదలు సకల జంగమ స్థావరరూపాలు, అణిమ, మహిమ, లఘిమ, గరిమ, ప్రాప్తి, ప్రాకామ్యం, ఈశత్వం, వశిత్వం అనే అష్టసిద్ధులు, పరాశక్తితోపాటు ఆది, జ్ఞాన, ఇచ్ఛా, క్రియాశక్తులు, మహత్తు, బుద్ధి, మనస్సు, అహంకారంతోపాటు పంచభూతాలు, పంచ జ్ఞానేంద్రియాలు, పంచ కర్మేంద్రియాలు, పంచతన్మాత్రలు, ఇలా ఇరవైనాలుగుతత్త్వాలు, సత్త్వరజస్తమోగుణాలు, కలత, కాలం, దానిమార్పు, కారణం, సంస్కారం, కామం, కర్మలు అనే గుణాలు, ఇలా ఇవన్నీ సేవిస్తూ ఉండగా, వేద వేదాంతవిజ్ఞానపరులైన బ్రహ్మవేత్తలకు కూడా తెలియరానివిధంగా ప్రకాశిస్తూ బ్రహ్మకు కనబడ్డారు. వారిని చూస్తూ స్వయంభువుడైన బ్రహ్మదేవునికి గోపబాలురు, గోవులు అన్నీ ఏకకాలంలో పరబ్రహ్మరూపులుగా కనబడగా చూచి

**ఉ. బాలురఁ గంటి నాచెయిదిఁ బాసినవారిని మున్నవారి నేఁ**
**బోలఁగఁ జూచునంతటన భూరినిరర్గళదుర్గమప్రభా**
**జాలముతోడఁ జూపులకుఁ జాలమిఁ దెచ్చుచు, నున్నవార, లే**
**మూలమొ? మార్గ మెయ్యదియొ? మోసము వచ్చెఁగదే! విధాతకున్.** **538**

**ప్రతి :** మున్ను+అ= మునుపు; నా చెయిదిన్= నా చేష్టతో; పాసినవారిన్= తొలగినవారిని; బాలురన్= పిల్లలను; కంటి(న్)= చూశాను; వారిన్= ఆ బాలురను; ఏన్= నేను; పోలన్+కన్= చక్కగా; చూచు+అంతటన్+అ= చూచే లోపలే; భూరి నిరర్గళ దుర్గమ= ఎక్కువగా ఉండి అడ్డులేని, పొందరాని, ప్రభాజాలముతోడన్= కాంతి సమూహంతో; చూపులకున్= నా దృష్టికి; చాలమిన్ తెచ్చుచున్= అశక్తతను కలుగజేస్తూ; ఉన్నవారలు= వీళ్ళున్నారు; ఏ మూలము+ఒ= కారణమేమిటో!; మార్గము ఎ+అది+ఒ= నేను అనుసరించవలసింది ఏ మార్గమో!; విధాతకున్= బ్రహ్మనైన నాకే; మోసము వచ్చెన్ కదే!= మోసం వచ్చింది కదా!

**తా :** "నా చేష్టకు లోబడక తప్పించుకున్న బాలురను ముందునుంచీ చూస్తూనే ఉన్నాను. వారు చూడగా చూడగా గొప్ప తేజస్సుతో కనబడుతున్నారు. ఆ తేజస్సు మహాప్రవాహంలాగా చూపులతోనైనా సమీపించడానికి వీలు కాకుండా ఉంది. వారి వర్చస్సు చూడటానికి నా చూపులకు శక్తి చాలడంలేదు. దీని కంతటికీ మూలకారణ మేమిటి? ఇప్పుడు నే నేమిటి చేయడం? ఆహా! సృష్టికర్త అయిన బ్రహ్మకే మోసం వచ్చింది గదా!"

**వ. అని సకలేంద్రియంబులకు వెక్కసంబయిన స్రుక్కి. 539**

**ప్రతి :** అని= ఇలా పలికి; సకల+ఇంద్రియంబులకున్= ఇంద్రియాలన్నింటికీ; వెక్కసంబు+అయినన్= సహింప శక్యం గాకుండా ఉండగా; స్రుక్కి= ఎంతో సంతాపంలో మునిగినవాడై...

**తా :** ఇలా అనుకున్న వాడైన బ్రహ్మకు ఆ బాలురరూపాలు మనస్సుతో పాటు పంచజ్ఞానేంద్రియ, కర్మేంద్రియాలకు భరింప శక్యంకాకపోవడంతో చేష్టలు దక్కి బాగా అలసిపోయినవాడై

**ఉ. ఏ పరమేశుతేజమున నీ సచరాచరమైనలోక ము**
**ద్దీపిత మయ్యె నట్టి విభుతేజముఁ గన్నులఁ జక్కఁ జూడఁగా**
**నోపక పారవశ్యమును నొందుచు సంస్తిమితాఖిలేంద్రియుం**
**డై పరమేష్ఠి మైమఱచె నప్పుడు చిత్రపురూపుకైవడిన్. 540**

**ప్రతి :** ఏ పరమేశు తేజమునన్= పరముడైన ఏ దేవదేవుని తేజస్సుతో; ఈ సచర+అచరము+ఐన= జంగమ స్థావరాలతో కూడుకున్న; లోకము= జగత్తు; ఉద్దీపితము+అయ్యెన్= ప్రకాశవంతం అయిందో, ఈ సమస్త జగత్తును వెలుగ జేసే సర్వేశు డెవడో; అట్టి విభుతేజమున్= అట్టి పరమేశ్వరుని తేజస్సును; కన్నులన్= కన్నులతో; చక్కన్ చూడన్+కాన్+ఓపక= చక్కగా చూడలేక; పారవశ్యమునున్+ఒందుచున్= పరవశిస్తూ; సంస్తిమిత+అఖిల+ఇంద్రియుండు అయి= శబ్ద స్పర్శాది వ్యాపారాలు లేని సమస్త ఇంద్రియాలు కలవాడై; అప్పుడు= ఆ సమయంలో; పరమేష్ఠి= బ్రహ్మ; చిత్రపురూపు కైవడిన్= చిత్తరువులోని రూపంలా; మైమఱచెన్= నిశ్చేష్టుడై ఉండి పోయాడు.

**తా :** సర్వేశ్వరుడైన ఏ భగవంతునితేజస్సుచే ఈ జంగమ స్థావర రూపమైన సకల జగత్తు ప్రకాశిస్తోందో, అట్టి పరమాత్మ స్వరూపుడైన శ్రీకృష్ణుని తేజస్సును చూడడానికి సమర్థుడుకాక, సర్వేంద్రియాలశక్తి క్షీణించి, పారవశ్యంతో బ్రహ్మ నిశ్చేష్టుడై నిలచాడు. అప్పుడతడెలా ఉన్నాడంటే, ఒక చిత్తరువులో వేసినచిత్రం ఎలాగైతే చలనం లేకుండా ఉంటుందో అలా ఉన్నాడు.

**వ. ఇట్లు మాయాతీతుండును, వేదాంతవిజ్ఞానదుర్లభుండును, స్వప్రకాశానందుండును నైన తన బాహుళ్యంబుఁ జూచి నివ్వెఱపడినబ్రహ్మం గని యీశ్వరుండు. 541**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; మాయా+అతీతుండును= మాయకు లోబడనివాడును; వేదాంత విజ్ఞాన దుర్లభుండును= ఉపనిషద్దర్శనం వలన కలిగే జ్ఞానంతోకూడా పొందశక్యం కానివాడును; స్వప్రకాశ+ఆనందుండును= కేవలం తన తేజస్సు చేతనే ఆనందించేవాడును; ఐన= అయినట్టి; తన బాహుళ్యంబున్+చూచి= తన ఆధిక్యాన్ని చూచి; నివ్వెఱపడిన= నిశ్చేష్టుడై నిలిచిన; బ్రహ్మన్ కని= బ్రహ్మను చూచి; ఈశ్వరుండు= విశ్వేశుడైన ఆ శ్రీకృష్ణమూర్తి...

**తా :** అవ్యక్త రూపమైన మాయకు లోబడనివాడును, ఉపనిషదర్థవిచారంచేసే విజ్ఞానంచేతకూడా పొంద శక్యం కానివాడును, తనంతట తానే వెలిగే వెలుగుతో అధికంగా ఆనందించేవాడును అయినట్టి శ్రీకృష్ణుని విరాడ్రూపాన్ని చూచి, నిశ్చేష్టుడై ఉన్న బ్రహ్మను చూచి శ్రీకృష్ణమూర్తి

**శా. 'బాలుండై చతురాననుండు తన యీ బ్రహ్మాభిమానంబునన్**
**లోలుండై మతిదప్పి నా మహిమ యాలోకింప నేతెంచెఁ దా**
**నాలోకింపఁగ నెంతవాఁ?డనుచు మాయాజాలమున్ విప్పి త**
**ల్లీలారూపము లెల్ల దాఁచె నటఁ గేళీచాతురీధుర్యుఁడై. 542**

**ప్రతి :** చతుర్+అననుండు= నాలుగు ముఖాలున్న బ్రహ్మ; బాలుండు+ఐ= చిన్న పిల్లవాడై; తన ఈ బ్రహ్మ+ అభిమానంబునన్= తానే బ్రహ్మను అన్న ఈ స్వాభిమానమందు; లోలుండు+ఐ= ఆసక్తుడై; మతి తప్పి= బుద్ధిచెడి; నా మహిమన్= నా మాహాత్మ్యాన్ని; ఆలోకింపన్= చూడడానికై; ఏ తెంచెన్= వచ్చాడు; తాన్ ఆలోకింపన్+కన్= ఆ బ్రహ్మ నా మహిమను చూడడానికి; ఎంతవాడు= ఏ మాత్రం సమర్థుడు; అనుచున్= అనుకొంటూ; కేళీ చాతురీధుర్యుఁడు+ఐ= క్రీడలయందు నేర్పరితనంతో కూడినవాడై; మాయాజాలమున్= మాయ అనే వలను; విప్పి= విడదీసి; తద్+లీలా రూపములు+ఎల్లన్= వేడుకగా తాను పూనిన ఆ గొల్ల పిల్లల, దూడల రూపాలన్నిటినీ; అటన్= అక్కడ; దాఁచెన్= మరుగు పరచాడు.

**తా :** శ్రీకృష్ణుడు బ్రహ్మను చూచి, 'పాపం ఈ చతుర్ముఖుడు బాలభావంతో తానే సృష్టిఅంతటికీ మూలం అయిన బ్రహ్మననే అభిమానగర్వంతో తెలివిదప్పి, నా మహిమను చూద్దామని వచ్చాడు. నా మాహాత్మ్యాన్ని చూడడానికి అతడెంతటివాడు?' అనుకొంటూ జగత్తంతటినీ క్రీడగా చేసి చూపే ఆ శ్రీకృష్ణుడు తాను పన్నిన ఆ మాయ అనే వలను విడదీసి, తనలీలారూపాలైన గొల్ల పిల్లలను, దూడలను అక్కడ మరుగుపరచాడు.

**వ. అంతలోన నజీవుండు సజీవుండైన తెఱంగున నెనిమిదికన్నులు గల వేలుపుగమికాఁడు తేఱి తెప్పిఱి కాలుఁ గేలుఁ గదలించి, చెచ్చెరం గన్నులు విచ్చిచూడ సమర్థుండై ముందటఁ గని, వెనుకఁ జూచి, దివి విలోకించి, దిక్కులు వీక్షించి, యెల్లయెడలం గలయ దర్శించి, తన పురోభాగంబున హరి సంచరించుటంజేసి జాతివైరంబులు లేని నరపక్షి మృగాదులకు నాటపట్టయి సిరి గలిగి కామక్రోధాదిరహితులకు జీవనంబైన బృందావనంబుంబొడగాంచి యందె. 543**

**ప్రతి :** అంతలోనన్= అంతలో; అజీవుండు= ప్రాణాలు పోయినవాడు; సజీవుండు+ఐన తెఱంగునన్= ప్రాణాలతో కూడినవాడైనట్లు; ఎనిమిది కన్నులుగల వేల్పుల గమికాఁడు= (నాలుగు ముఖాలు కాబట్టి) ఎనిమిది కళ్ళుకలిగి దేవతలలో పెద్దవాడైన బ్రహ్మ; తేఱి= నిశ్చేష్టత నుండి తేరుకొని; తెప్పిఱి= తమాయించుకొని; కాలున్ కేలున్ కదలించి= కాళ్ళూ చేతులు ఆడించి; చెచ్చెఱన్= వెంటనే; కన్నులు విచ్చి చూడన్= కళ్ళు విప్పి చూడడానికి; సమర్థుండు+ఐ= శక్తిగలవాడై; ముందటన్+కని= తన ముందుభాగాన్ని చూచి; వెనుకన్+చూచి= వెనక భాగాన్ని చూచి; దివి విలోకించి= ఆకాశం మీదికి చూచి; దిక్కులు వీక్షించి= అన్ని దిక్కులను చూచి; ఎల్ల+ఎడలన్+కలయన్ దర్శించి= అన్నివైపులా చక్కగా చూచి; తన పురోభాగంబునన్= తన ఎదుటనే; హరి= శ్రీకృష్ణమూర్తి; సంచరించుటన్ చేసి= తిరుగుతూ ఉండటంచేత; జాతి వైరంబులులేని= ఆయా జాతులకు ఉండే సహజవైరం లేకుండా; నరపక్షిమృగ+ఆదులకున్= మనుష్యులు, పక్షులు, జంతువులు మొదలగువానికి;

ఆటపట్టు+అయి= క్రీడాస్థానమై; సిరి గలిగి= సంపదతో కూడి ఉండి; కామక్రోధ+ఆది రహితులకున్= కామం, క్రోధం, లోభం, మోహం, మదం; మాత్సర్యం అనే అంతఃశత్రువులరూపంలోని దుర్గుణాలు లేనివారికి, జీవనంబు+ఐన= సుఖజీవన స్థానమైన; బృందావనంబున్= బృందావనాన్ని; పొడగాంచి= చూచి; అందె= ఆ బృందావనంలోనే...

**తా :** ఆ సమయంలో బ్రహ్మ చచ్చిపోయినవాడు బ్రతికినట్లుగా తేరుకొని ఒక్కసారి ఒళ్ళు తెలుసుకొని సమాళించుకున్నాడు. కాళ్లూ చేతులు కదిలించాడు, కళ్ళు విప్పి చూచే స్థితికి వచ్చాడు. ముందుకు, వెనుకకు, మీదికి, అన్ని దిక్కులకూ దృష్టి సారించాడు. అప్పుడు తన ముందుభాగంలోనే శ్రీకృష్ణమూర్తి ఉండడం కారణంగా నరులు, పక్షులు, జంతువులు తమ జాతిసహజమైన శత్రుత్వాలను మరచి తిరుగుతూ ఉండడం గమనించాడు. ఆ బృందావనంలో సంపద ఉంది. అందులో ఉన్నవారికెవరికీ కామక్రోధాలు లేవు. అలాంటి బృందావనం చూశాడు - బ్రహ్మ. ఆ బృందావనంలోనే

**సీ. తన కన్యములు లేక తనరారి ముమ్మూలవిభుఁ డయ్యుఁ గ్రేపుల వెదకువాని**
**నఖిలజ్ఞుఁడై యొక్కఁ డయ్యు నజ్ఞాకృతిఁ జెలికాండ్రఁ బెక్కండ్రఁ జీరువాని**
**బహిరంతరాద్యంతభావశూన్యుం డయ్యు నంతంత నడుగు చొప్పరయువాని**
**గురుగభీరుం డయ్యు పరువులు వాఱుచు నట్టిట్టుఁ బాతరలాడువాని**

**ఆ. జాతిరహితుఁ డయ్యుఁ జతుర గోపార్భక, భావ మెల్ల నచ్చువడినమేని**
**చెలువువాని హస్తశీతాన్నకబళంబు, వానిఁ గాంచె నపుడు వాణిమగఁడు. 544**

**ప్రతి :** తనకున్= తనకంటె; అన్యములు లేక= ఇతరమైనవేవీ లేక; తనరారి= ఒప్పి; ముమ్మూల విభుఁడు= సృష్టి, స్థితి, సంహారాలు చేసే త్రిమూర్తులకు ప్రభువు, లేదా సత్త్వరజస్తమోగుణరూపిణియైన ప్రకృతి పుట్టుకకు ముఖ్యకారకుడు లేదా జీవ ఈశ్వర జగత్తులనెడి సృష్టికి హేతువైనవాడు; అయ్యున్= అయినా; క్రేపులన్= దూడలను; వెదకు వానిన్= వెదకుతున్న వానిని; అఖిలజ్ఞుఁడు+ఐ= సర్వమూ తెలిసినవాడై; ఒక్కఁ డయ్యున్= ఒంటరివాడుగా ఉన్నవాడైనా; అజ్ఞ+ఆకృతిన్= జ్ఞానంలేని ఆకారంతో; పెక్కండ్రన్= చాలామంది; చెలికాండ్రన్= స్నేహితులను, చీరువానిన్= పిలిచేవాణ్ణి; బహిర్+అంతర్+ఆది+ అంతభావశూన్యుండు అయ్యున్= వెలుపల, లోపల మొదలు, తుద అనే భావాలు లేనివాడయ్యు; అంతన్+అంతన్= అంతటంతట; అడుగుచొప్పు= అడుగుల జాడను; అరయువానిన్= వెదికేవాణ్ణి; గురు గభీరుండు= మిక్కిలి గాంభీర్యం కలవాడు; అయ్యున్= అయినా; పరువులు పాఱుచున్= పరుగులెత్తుతూ; అట్టు ఇట్టున్= అటూ ఇటూ; పాతరలు+ఆడువానిన్= నటించువాణ్ణి; జాతి రహితుఁడు+అయ్యున్= బ్రహ్మక్షత్రియాది జాతి భేదాలులేని వాడయినప్పటికి; చతురగోప+అర్భకభావము+ ఎల్లన్= నేర్పుగల గొల్లపిల్లవాడి స్వభావమంతా; అచ్చుపడిన= ప్రతి రూపుగా ఏర్పడిన; మేని చెలువువానిన్= శరీరసౌందర్యం కలవాణ్ణి; హస్త శీత+అన్న కబళంబువానిన్= చేతిలో చద్దిఅన్నంముద్ద కలవాణ్ణి; అపుడు= ఆ సమయంలో; వాణిమగఁడు= సరస్వతికి భర్త అయిన బ్రహ్మ; కాంచెన్= చూశాడు.

**తా :** తనకంటె వేరేమియు లేక సృష్టి, స్థితి, లయాదులకు కర్తలైన త్రిమూర్తులకు మూలపురుషుడైనవాడూ, ఆవుదూడలను వెదకుచున్నవాడూ; సర్వజ్ఞుడై ఒంటరివాడుగా ఉన్నా అజ్ఞానాకారంతో పెక్కుమంది స్నేహితులను పిలిచేవాడూ, బయట, లోపల, ఆది, మధ్య అనే భావాలు లేనివాడైనా అక్కడక్కడా లేగల అడుగుజాడలను వెదికేవాడు, ఎంతో గంభీరుడైనా అటూ, ఇటూ పరిగెడుతూ ఆటలాడేవాడూ, జాతిభేదాలు లేనివాడైనా గొల్లపిల్లాడిస్వభావం అచ్చుపడే శరీరంతో ఒప్పేవాడూ, చేతిలో చల్దిముద్దతో ఉన్నవాడూ అయిన శ్రీకృష్ణుణ్ణి సరస్వతీదేవి భర్త అయిన బ్రహ్మ చూశాడు.

**వ. కని సంభ్రమించి విరించి రాయంచ డిగ్గనుఱికి కనకదండసుకుమారంబైన శరీరంబుతోడ నేలఁ జాఁగిలంబడి మణిగణసుప్రకాశంబులైన తన కిరీటశిఖరప్రదేశంబు లాకుమారునిపాదపద్మంబులు మోవ మ్రొక్కి తోరంబులగు నానందబాష్పజలపూరంబుల నతని యడుగులు గడిగి మఱియును. 545**

**ప్రతి :** కని= కృష్ణమూర్తిని చూచి; సంభ్రమించి= తొట్రుపాటుతో కూడినవాడై; విరించి= బ్రహ్మ; రాయంచ డిగ్గ నుఱికి= రాజహంసవాహనంనుండి దుమికినట్లుగా దిగి; కనక దండ సుకుమారంబు+ఐన= బంగారు కర్రవంటి కోమలమైన; శరీరంబుతోడన్= దేహంతో, నేలన్+చాఁగిలన్+పడి= భూమిపై నిలువుగా పడి, సాష్టాంగదండ ప్రణామంబుగా; మణిగణ సుప్రకాశంబులు+ఐన= మణులతో కాంతిమంతములైన; తన కిరీటశిఖరప్రదేశంబులు= తన కిరీటము యొక్క చివరలు; ఆ కుమారుని= ఆ శ్రీకృష్ణుని; పాదపద్మంబులుమోవన్= పద్మములవంటి పాదములు తాకునట్లు; మ్రొక్కి= నమస్కరించి; తోరంబులు+అగు= అధికములగు; ఆనందబాష్పజలపూరంబులన్= సంతోషంవల్ల జారే కన్నీటిప్రవాహంతో; అతని అడుగులు= శ్రీకృష్ణునిపాదాలను; కడిగి; మఱియును= ఇంకా...

**తా :** అలా శ్రీకృష్ణుని చూసి, తడబాటుతో బ్రహ్మ ఒక్కసారి తన వాహనం హంస పై నుండి దభాలున భూమిపైకి దుమికి, బంగారు దండంలా కోమలంగా వున్న తన శరీరంతో నేలపై సాష్టాంగపడ్డాడు. తన కిరీటం కొనలో వున్న రత్నాది మణుల కాంతులు ఆ బాలకృష్ణుని పాదాలు సోకేలా నమస్కరించాడు. ఆనందం ఎక్కువ కావడంతో కళ్ళనుండి జారే కన్నీటి ప్రవాహంతో అతని పాదాలను కడిగాడు ఇంకా

**విశే :** అలా కృష్ణునిపాదాలు బ్రహ్మ కడిగిన పాదాలయ్యాయి.

**క. అడుగులపైఁ బడు లేచుం, బడుఁ గ్రమ్మఱ లేచు, నిట్లు భక్తిన్ ముసు తాఁ**
**బొడగనిన పెంపుఁ దలఁచుచు, దుడుకని మహిమాబ్ధి నజుఁడు దుడు కడిచె నృపా! 546**

**ప్రతి :** నృపా= రాజా! అడుగులపైన్= పాదాల మీద; పడున్= పడుతున్నాడు; లేచున్= లేస్తున్నాడు; క్రమ్మఱన్= మళ్ళీ; పడున్= పడుతున్నాడు; లేచున్= లేస్తున్నాడు; ఇట్లు= ఈ విధంగా; భక్తిన్= భక్తిభావంతో; మును= ఇంతకుముందు; తాన్= తాను (బ్రహ్మ); పొడగనిన పెంపున్= చూచిన మహిమాతిశయాన్ని; తలఁచుచున్= తలచుకుంటూ; దుడుకని= దుడుకువాడైన ఆ బాలకృష్ణుని; మహిమ+అబ్ధిన్= ప్రభావం అనే సముద్రంలో; అజుడు= బ్రహ్మ; దుడుకున్= తనయొక్క ఉద్ధతిని; అడిచెన్= అణచివేశాడు.

**తా :** ఓ పరీక్షిన్మహారాజా! బ్రహ్మ శ్రీకృష్ణునిపాదాలపై పడుతూ లేస్తున్నాడు. మళ్ళీ పడుతున్నాడు లేస్తున్నాడు. ముందు తాను చూచిన శ్రీకృష్ణునిమాహాత్మ్యం అనే సముద్రంలో తన ఉద్ధతిని అణచివేశాడు. తాను చేసిన తప్పిదాన్ని అణచుకున్నాడన్న మాట.

**వ. అంత నల్లనల్లన లేచి నిలుచుండి నయనారవిందంబులు దెఱచి, గోవిందుని సందర్శించి చతుర్ముఖుండు ముఖంబులు వంచి కృతాంజలియై దిగ్గన దగ్గత్తిక యిడుచు నేకచిత్తంబునఁ జతుర్ముఖంబుల నిట్లని స్తుతియించె. 547**

**ప్రతి :** అంతన్= అంతట; చతుర్ముఖుండు= నాలుగుమోములుగల బ్రహ్మ; అల్లన్+అల్లనన్ లేచి= మెల్ల మెల్లగా లేచి; నిలుచుండి= నిలువబడి; నయన+అరవిందంబులు= పద్మాలవంటి నేత్రాలు; తెఱచి= విప్పి; గోవిందునిన్= గోపాలకుడైన

శ్రీకృష్ణణ్ణి; సందర్శించి= చక్కగా చూచి; ముఖంబులు వంచి= చతుర్ముఖుడు కాబట్టి నాలుగు మోములను వంచుకొని; కృత+అంజలి+ఐ= చేయబడిన నమస్కారం కలవాడై; దిగ్గనన్= తటాలున; డగ్గుత్తిక ఇడుచున్= తడబడిన గొంతు కలవాడై; ఏకచిత్తంబునన్= కృష్ణునియందే ఉంచిన మనస్సుతో; చతుర్ముఖంబులన్= నాలుగు మోములతో; ఇట్లు+అని= ఈ చెప్పబోయే రీతిగా; స్తుతియించెన్= స్తోత్రం చేశాడు.

**తా :** అనంతరం బ్రహ్మ మెల్ల మెల్లగా లేచి నిలుచున్నవాడై కమలాలవంటి కళ్ళు తెరచి, శ్రీకృష్ణణ్ణి చక్కగా దర్శించి, నాలుగు ముఖాలు వంచి, రెండు చేతులూ జోడించి నమస్కరిస్తూ, గొంతు కొంత తడబడగా, ఏకాగ్ర చిత్తంతో, నాలుగుముఖాలతో ఇలా స్తోత్రం చేశాడు.

## ❖ శ్రీకృష్ణమూర్తిని బ్రహ్మ స్తుతించుట ❖

శ్రీకృష్ణునిమహిమను గుర్తించి, అతణ్ణి సర్వేశ్వరుడుగా దర్శించి, చేతులు జోడించి నమస్కరిస్తూ బ్రహ్మ ఇలా స్తోత్రం చేస్తున్నాడు.

**సీ. శంపాలతికతోడి జలదంబుకైవడి మెఱుఁగు టొల్లియతోడి మేనివానిఁ**
**గమనీయమృదులాన్నకబళవేత్రవిషాణవేణుచిహ్నంబులు వెలయువాని**
**గుంజావినిర్మితకుండలంబులవాని శిఖిపింఛవేష్టితశిరమువాని**
**వనపుష్పమాలికావ్రాతకంఠమువాని నలినకోమలచరణములవానిఁ**

**ఆ. గరుణ గడలుకొనిన కడగంటివాని గో, పాలబాలుభంగిఁ బరఁగువాని**
**నగుమొగంబువాని ననుఁగన్న తండ్రిని, నిను భజింతు మ్రొక్కి నీరజాక్ష! 548**

**ప్రతి :** నీరజ+అక్ష! పద్మాలవంటి కన్నులుగల ఓ శ్రీకృష్ణా! శంపాలతికతోడి= మెరపుతీగతో కూడి ఉన్న; జలదంబు కైవడిన్= మేఘంవలె; మెఱుఁగు+ఒల్లియ తోడి మేనివానిన్= మెరుస్తున్న పచ్చడంతో కూడిన దేహం కలవాడిని; కమనీయ మృదుల అన్నకబళ, వేత్ర, విషాణ, వేణు చిహ్నంబులు= అందమైన మెత్తని అన్నం ముద్ద, బెత్తం, కొమ్ము, పిల్లని గ్రోవి గురుతులతో; వెలయు వానిన్= ప్రకాశించేవాడిని; గుంజా వినిర్మిత కుండలంబుల వానిన్= గురివెంద గింజలతో తయారైన కర్ణాభరణాలతో కూడినవాడిని; శిఖిపింఛవేష్టితశిరమువానిన్= నెమలిపింఛంతో చుట్టబడిన శిరస్సు గలవాడిని; వనపుష్పమాలికా వ్రాతకంఠమువానిన్= అడవిపూలమాలతో అలంకరింపబడిన మెడగలవాడిని; నలిన కోమల చరణములవానిన్= పద్మములవంటి మృదుమైన పాదాలు గలవాడిని; కరుణ కడలుకొనిన= కారుణ్యం తొణికిసలాడుతున్న కడకంటిచూపులు కలవాడిని; గోపాల బాలు భంగిన్= గొల్ల పిల్ల వానివలె; పరఁగు వానిన్= ఒప్పెడు వాడిని; నగుమొగంబు వానిన్= నవ్వుతున్న ముఖంగలవాడిని; ననున్+కన్న తండ్రినిన్= సృష్టికై నన్ను తన నాభికమలంలో కన్నట్టి వాడిని; నిను= అటువంటివాడవైన నిన్ను; మ్రొక్కి= నమస్కరించి; భజింతున్= సేవిస్తాను.

**తా :** ఓ పద్మాక్షా! నీవు మెరుపుతీగతోకూడిన నీలమేఘంవంటి శరీరం కలవాడవు. మెరుస్తున్న ఉత్తరీయం కలవాడవు, చేతిలో మృదువైన చల్ది ముద్ద, బెత్తం, బూరకొమ్ము, పిల్లనగ్రోవి, లాంఛనాలతో ప్రకాశించే వాడవు. గురివెంద గింజలతో చేసిన కర్ణాభరణాలతో, శిరస్సు చుట్టూ నెమలి పింఛంతో కూడినవాడవు. అడవిపూలమాలతో అలంకరించిన కంఠంతో, పద్మంలా

మెత్తని పాదాలతో ఒప్పేవాడివి. దయపొంగి ప్రవహించేలా కడకన్నులతో చూచేవాడివి, గొల్లపిల్లవాడిలా ఒప్పేవాడివి, సృష్టి చేయడం కోసం నీ నాభికమలంలో నన్ను పుట్టించినవాడివి, అట్టి నిన్ను నమస్కరించి సేవిస్తాను.

**మ. నను మన్నించి భవజ్జనంబులకు నానందంబు నిండించు నీ**
**తనురూపం బిదె నామనంబున కచింత్యం బయ్యె, నీ యుల్లస**
**ద్ఘనవిశ్వాకృతి నెవ్వఁ డోపు? నెఱుఁగం గైవల్యమై యొప్పు నా**
**త్మనివేద్యంబగు నీదు వైభవము చందంబెట్టిదో యీశ్వరా! 549**

**ప్రతి :** ఈశ్వరా!= సర్వాత్మ స్వరూపా; ననున్ మన్నించి= నన్ను క్షమించి; భవత్+జనంబులకున్= నీవాళ్లైన గోపాలకులకు; ఆనందంబు నిండించు= సంతోషాన్ని నింపునట్టి; నీ తను రూపంబు ఇదె= నీ శరీరాకారం ఇదే; నా మనంబునకున్= నా మనస్సునకు; అచింత్యంబు+అయ్యెన్= ఇట్టిదంటూ ఆలోచించడానికి కూడా శక్యంకానిదయింది; నీ= నీయొక్క; ఉల్లసత్+ఘన విశ్వ+ఆకృతిన్= ప్రకాశించే గొప్పదైన విరాడ్రూపాన్ని; ఎఱుఁగన్= తెలుసుకోడానికి; ఎవ్వఁడు ఓపున్= ఎవడు సమర్థుడవుతాడు, (ఎవ్వడూ కాడనుట); కైవల్యము+ఐ= మోక్షస్వరూపమై; ఒప్పు; ఆత్మనివేద్యంబు+అగు= పరమాత్మకు సంబంధించిన విజ్ఞానం చేతనే తెలియదగిందైన; నీదు వైభవము= సచ్చిదానంద నిత్య నిర్మలత్వాలతో కూడిన నీ విభవంయొక్క; చందంబు= విధం; ఎట్టిదో= ఎటువంటిదో!

**తా :** ఓ పరమాత్మా! నన్ను మన్నించావు. నీ వాళ్లైన గోపాలురకు ఎంతో ఆనందం కలిగించావు. అట్టి ఈ చిన్నికృష్ణుని రూపం నా మనస్సులో ఆలోచించడానికి కూడా సాధ్యం కావడం లేదు. ప్రకాశవంతమైన నీ విరాడ్రూపం తెలియడానికి ఎవడు సమర్థుడు? కేవల మోక్షదాయకమై, పరమాత్మకు సంబంధించిన విజ్ఞానంతో తెలియదగినట్టి పరబ్రహ్మ స్వరూపమైన నీ విభవంయొక్క తీరు ఎటువంటిదో!

**క. విజ్ఞానవిధము లెఱుఁగక, తజ్జ్ఞులు నీ వార్తఁ జెప్పఁ దను వాఙ్మనముల్**
**యజ్ఞేశ! నీకు నిచ్చిన, యజ్ఞులు నినుఁబట్టి గెలుతు రజితుఁడ వైనన్. 550**

**ప్రతి :** యజ్ఞేశ= యాగప్రభుడవైన ఓ స్వామీ!; అజితుఁడవు+ఐనన్= నీవు ఎవరిచేత జయింపబడే వాడివి కాకపోయినా; విజ్ఞాన విధములు= జ్ఞానమార్గాలు; ఎఱుఁగక= తెలుసుకోలేక; తజ్జ్ఞులు= తత్త్వం తెలిసినవారు అనగా బ్రహ్మవేత్తలు; నీ వార్తన్ చెప్పన్= నీ స్వరూప చిహ్నాలను బోధించగా; తను వాక్+మనములు= తమ దేహం, మాటలు, మనస్సును; నీకున్+ఇచ్చిన= నీకు సమర్పించిన; అజ్ఞులు= అజ్ఞానులు కూడా; నినున్+పట్టి= నిన్ను కనిపెట్టి, తెలిసికొని; గెలుతురు= జయిస్తారు.

**తా :** ఓ దేవా! నీకు పరాజయం లేదు. అయినా ఎవరైతే తమ స్థానమందున్న వారై సత్పురుషులచే గానంచేయబడి, తమ చెవిన పడిన నీ గాథను మనోవాక్కాయాలతో సత్కరిస్తూ జీవిస్తారో వారు బహుశః నిన్ను జయిస్తారు, నిన్ను పొందుతారు. నీ అనుగ్రహమే నిన్ను తెలుసుకొనే మార్గం. వాళ్ళకది తెలియదు. అట్టి నీ అనుగ్రహం కలిగినప్పుడు ఏమీ తెలియని వాళ్లుకూడా ఎవరిచేతా జయింపబడని నిన్ను జయిస్తారు. అంటే వారికి నీవు అధీనుడవవుతావు.

**క. శ్రేయములు గురియు భక్తినిఁ, జేయక కేవలము బోధసిద్ధికిఁ దపముం**
**జేయుట విఫలము, పొల్లున, నాయము సేకుఱునె తలఁప నధికం బైనన్. 551**

**ప్రతి :** శ్రేయములు= శుభాలను; కురియు= వర్షించే అనగా ఇచ్చే; భక్తినిన్+చేయక= భక్తిమార్గాన్ని అనుసరించక; కేవలము= ఒక్క; బోధ సిద్ధికిన్= జ్ఞానం పొందడానికి; తపమున్+చేయుట= తపస్సు కావించడం; విఫలము= నిష్ప్రయోజనం; తలఁపన్= విచారించగా; అధికంబు+ఐనన్= ఎక్కువగా ఉన్నా; పొల్లునన్= ఊకవల్ల; ఆయము= రాబడి; చేకుఱునె= లభిస్తుందా? (లభించదు)

**తా :** భక్తి మార్గంలో భగవంతుణ్ణి సేవించిన వారికి అన్ని శుభాలు కలుగుతాయి. అంతే కాని కేవలం జ్ఞానం పొందడానికే తపస్సు చేయడం నిరుపయోగం. అది ఎలాంటిదంటే బియ్యంపైన ఉండే పొల్లు అనబడే ఊక ఎంత ఉన్నా సరే దానివల్ల రాబడి ఉంటుందా, ప్రయోజనం ఉంటుందా! (ఉండదు.)

**క. నిజముగ ని న్నెఱుఁగఁగ మును, నిజవాంఛలు నిన్నుఁ జేర్చి నీ కథ వినుచున్**
**నిజకర్మలబ్ధభక్తిన్, సుజనులు నీ మొదలిటెంకిఁ జొచ్చి రధీశా! 552**

**ప్రతి :** అధీశా! = ఓ ప్రభూ!; నిజము+కన్= యథార్థంగా; నిన్ను ఎఱుఁగన్+కన్= నీ తత్త్వాన్ని తెలుసుకోడానికి; సుజనులు= సత్పురుషులు; మును= ముందుగా; నిజవాంఛలు= తమ తమ కోరికలను; నిన్నున్+చేర్చి= నీ యందుంచి, నీకే సమర్పించి; నిజకర్మలబ్ధభక్తిన్= తాము చేసిన మంచి పనులవల్ల ప్రాప్తించిన భక్తి సంపదతో; నీ కథ వినుచున్= నీ చరిత్రను వింటూ; నీ మొదలి టెంకిన్= నీ మొదటి ముఖ్యమైన స్థానాన్ని; చొచ్చిరి= ప్రవేశించగలిగారు.

**తా :** ఓ ప్రభూ! నీ స్వరూపాన్ని, తత్త్వాన్ని తెలుసుకొన గోరే సజ్జనులు మొదట తమ కోరికలన్నింటినీ నీ యందే అర్పించి, తాము చేసిన సత్కర్మలచే లభించిన భక్తివల్ల నీకు సంబంధించిన పవిత్ర గాథలను వింటూ, నీ వుండే నీ ప్రధాన స్థానాన్ని చేరుకో గలిగారు.

**విశే :** సూర్యుడు గాని, చంద్రుడుగాని, అగ్నిగాని ఏ స్థానాన్ని ప్రకాశింపజేయలేరో, దేన్ని పొందితే జీవులు మరల తిరిగి రారో, అదే నాయొక్క శ్రేష్ఠమైన స్థానం, అని భగవద్గీత పురుషోత్తమప్రాప్తియోగంలో (15 అధ్యా.6 శ్లో.) గీతాచార్యుడు వివరించాడు. అదే పరమపురుషుని మొదలిటెంకి. అనన్య భక్తితో సేవించిన భక్తులు ఆ స్థానాన్ని పొందుతారు.

**సీ. విక్రియాశూన్యమై విషయత్వమును లేని దగుచు నాత్మాకారమై తనర్చు**
**నంతఃకరణ మొక్క యధికసాక్షాత్కారవిజ్ఞానమునఁ బట్టి వే ఱొరులకు**
**నెఱుఁగంగ రానిదై యే పారి యుండుటఁజేసి నీ నిర్గుణ శ్రీవిభూతి**
**బహిరంగవీథులఁ బాఱక దిరములై యమలంబులగు నింద్రియములచేత**

**ఆ. నెట్టకేలకైన నెఱుఁగంగ నగుఁగాని, గుణవిలాసి వగుచుఁ గొమరుమిగులు**
**నీ గుణవ్రజంబు నేర రా దెఱుఁగంగ, నొక్క మితము లేక యుంట నీశ! 553**

**ప్రతి :** ఈశ= ఓ స్వామీ; విక్రియా శూన్యము+ఐ= వికారం లేనిదై, అనగా ఒక్కతీరుగా ఉన్నదై; విషయత్వమును లేనిది= రూప రస గంధ స్పర్శ శబ్దాది విషయానుభవం లేనిది; అగుచున్= అవుతూ; ఆత్మాకారము+ఐ= పరబ్రహ్మస్వరూపమై; తనర్చు= ఒప్పునట్టి; అంతఃకరణము= అంతరంగం; ఒక్క= అఖండాకారమైన; అధిక సాక్షాత్కార విజ్ఞానమునన్+పట్టి= ఉత్తమమైన అపరోక్షమైన అనుభవజ్ఞానాన్ని అవలంబించి; వేఱు+ఒరులకున్= ఇతరులెవరికీ; ఎఱుఁగన్+కన్ రానిది+ఐ=

తెలియ శక్యం కానిదై; ఏపారి ఉండుటన్+చేసి= అతిశయించి ఉండడంచేత; నీ నిర్గుణ శ్రీ విభూతి= నీ దైన గుణరహితమైన సంపదయొక్క విభవం; బహిరంగవీథులన్= బాహ్యామార్గాలలో; పాఱక= వ్యాపించక; తిరములై= నిలకడ కలవై; అమలంబులు+అగు= నిర్మలములైన; ఇంద్రియములచేతన్= మనసాది ఇంద్రియాలచేత; ఎట్టకేలకున్+ఐనన్= అతి కష్టంతో నైనా; ఎఱుఁగన్+కన్ అగున్+కాని= తెలుసుకోవచ్చుకాని; గుణవిలాసివి= త్రిగుణములవిలాసంకలవాడవు; అగుచున్= అవుతూ; కొమరు మిగులు= అందంగా ఒప్పే; నీ గుణ వ్రజంబున్= నీ యొక్క సర్వజ్ఞత్వం, సర్వేశ్వరత్వం, సర్వపాలకత్వం, సర్వపుష్టత్వం, సర్వసంహారకత్వం, సర్వభోక్తృత్వం మొదలగు గుణసముదాయాన్ని; ఒక్క మితములేక= ఒక మేరలేక; ఉంటన్= ఉండడంచేత; ఎఱుఁగన్+కన్+నేరన్= తెలుసుకోవడానికి; రాదు= శక్యం కాదు.

**తా :** ఓ స్వామీ! నీ త్రిగుణరహితమైన సచ్చిదానందపరబ్రహ్మస్వరూపాన్ని, వికారాలు లేకుండా, ఒకే రీతిగా ఉండి, విషయానుభవం లేక, స్వరూపానుసంధానవృత్తిరూపంగా, అఖండాకారమై, సర్వోత్కృష్టమై అపరోక్షంగా ఒప్పే అనుభవ జ్ఞానం కలిగినదై, బాహ్యమార్గాలలో వ్యాపించక, స్థిరంగా రాగద్వేషాలు లేని ఇంద్రియాలచేత అతి కష్టంగా తెలుసుకోవచ్చుగాని, త్రిగుణాత్మక, సత్త్వరజస్తమోరూప త్రిగుణ విలాసాత్మకమైన స్థావర జంగమాది ప్రపంచ స్వరూపాన్ని నీవు వహించినప్పుడు నీ గుణాలు హద్దులేనివిగా కనబడతాయి. కాబట్టి నీ స్వరూప స్వభావాలు తెలుసుకోవడం దుర్లభం.

**క. తారాతుషారశీకర, భూరజములకైన లెక్క బుధు లిడుదురు, భూ**
**భారావతీర్ణకరుఁడగు, నీ రమ్యగుణాలి నెన్న నేర రగణ్యా! 554**

**ప్రతి :** అగణ్యా!= లెక్కింప శక్యం కానివాడా!; బుధులు= జ్ఞానవంతులు; తారతుషారశీకర భూరజములకున్= నక్షత్రాలను, మంచు బిందువులను, నేలమీది రేణువులకైనా సరే; లెక్కలు+ఇడుదురు= లెక్కలుగట్టి చెపుతారు; భూభార+అవతీర్ణ కరుఁడు+అగు= భూదేవియొక్క భారాన్ని దించేవాడవగు; నీ రమ్యగుణాళిన్= నీ యొక్క మనోహరమైన గుణాలను; ఎన్నన్+నేరరు= లెక్క పెట్టలేరు.

**తా :** ఇంతటివాడు, అంతటివాడు, అని లెక్కింపరాని మహిమగల ఓ శ్రీకృష్ణా! పండితులు, జ్ఞానులు ఎంతో కష్టపడైనా నక్షత్రాల, మంచు తుంపరల, నేలమీది దుమ్మురేణువుల సంఖ్యనైనా లెక్కింపగలరు గాని, భూభారాన్ని అణచి వేయడానికి సమర్థుడవగు నీ అనంత కల్యాణగుణాలనుమాత్రం లెక్కపెట్ట సమర్థులు కారు.

**శా. 'ఏవేళం గృపఁ జూచు నెన్నఁడు హరిన్ వీక్షింతు' నం చాధ్యుఁడై**
**నీ వెంటంబడి తొంటి కర్మచయమున్ నిర్మూలముం జేయుచున్**
**నీవాఁడై తనువాఙ్మనోగతుల ని న్సేవించు విన్నాణి వో**
**కైవల్యాధిపలక్ష్మి నుద్దవడిఁ దాఁ గైకొన్నవాఁ డీశ్వరా! 555**

**ప్రతి :** ఈశ్వరా= ఓ ప్రభూ!; ఏ వేళన్= ఏ సమయంలో; కృపన్ చూచున్= దయతో నన్ను చూస్తాడో; హరిన్= ఆ విష్ణుమూర్తిని; ఎన్నడు వీక్షింతున్= ఎప్పుడు నేను దర్శిస్తానో; అంచున్= అంటూ; ఆధ్యుఁడు+ఐ= ఎక్కువ ఆసక్తి కలవాడై; నీ వెంటన్ పడి= నిన్ను వెంబడిస్తూ; అనగా ఇంద్రియవ్యాపారన్నిటినీ నీయందే సమర్పించి; తొంటి కర్మచయమున్= మునుపటి కర్మల సముదాయాన్ని; నిర్మూలమున్ చేయుచున్= పూర్తిగా తొలగేటట్లు చేస్తూ; నీవాఁడు+ఐ= నీ భక్తుడై; తను వాక్+ మనోగతులన్= శరీరం, వాక్కు, మనస్సుల వ్యాపారాలను ఏకం చేసి; నిన్= నిన్ను; సేవించు= కొలిచేటి; విన్నాణి పో=

విజ్ఞానిమాత్రమే సుమీ; కైవల్య+అధిప లక్ష్మిన్= ఆ పరమపదనాథునికి సంబంధించిన సంపదను, మోక్షలక్ష్మిని; ఉద్దవడిన్= ఎంతో వేగంగా; తాన్ కైకొన్నవాఁడు= తానే గ్రహించినవాడు.

**తా :** ఓ స్వామీ! ఆ శ్రీహరికెప్పుడు నాయందు దయకల్గుతుందో, నేనెప్పుడు ఆ స్వామిని దర్శించగలుగుతానో, అంటూ భక్తవరేణ్యుడు తన వ్యాపారాలన్నింటినీ నీయందే చేర్చి, తన పూర్వ ఆగామి, సంచిత, ప్రారబ్ధ కర్మలన్నింటినీ మొదలంటు నశింపజేస్తూ నీ దయకు పాత్రుడై, మనోవాక్కాయకర్మలతో నీ సేవను ఏమరకుండా ఉన్న విజ్ఞానవంతుడైన వాడే పరమపద అధినాథునికి సంబంధించిన మోక్షలక్ష్మిని పొందగలడు. అటువంటివాడు తప్ప ఇతరులు మోక్షలక్ష్మిని పొందటం శక్యం కాదు.

**ఉ. మాయలు గల్గువారలను మాయలఁ బెట్టెడి ప్రోఢ నిన్ను నా**
**మాయఁ గలంచి నీ మహిమ మానముఁ జూచెద నంచు నేరమిం**
**జేయఁగ బూనితిం గరుణ సేయుము, కావుము, యోగిరాజ వా**
**గ్గేయ! దవాగ్నిఁ దజ్జనితకీలము గెల్చి వెలుంగనేర్చునే? 556**

**ప్రతి :** యోగిరాజ వాక్+గేయ!= యోగులలో శ్రేష్ఠులైనవారి స్తుతివాక్కులతో పొగడదగినవాడా! ఓ స్వామీ; మాయలు= కపట వ్యాపారాలు; కల్గువారలను= కలిగినవాళ్ళను; మాయలన్= నీ మాయలలో; పెట్టెడి ప్రోఢన్= చిక్కేలా చేసే నేర్పరివైన; నిన్నున్= నీ వంటివానిని; నా మాయన్= నా మాయతో; కలంచి= కలచివేసి; నీ మహిమ మానమున్= నీ ప్రభావం ఎంతటిదో; చూచెదన్+అంచున్= చూద్దామనుకొని; నేరమిన్= తెలియని పనిని; చేయన్+కన్+పూనితిన్= చేసే ప్రయత్నం చేశాను; దవ+అగ్నిన్= కార్చిచ్చును; తద్+జనిత కీలము= దానియందే పుట్టినమంట; గెల్చి= జయించి అతిశయించేలా; వెలుంగ నేర్చునే= ప్రకాశింపగలదా?; కరుణ+చేయుము= నా పట్ల దయచూపు; కావుము= నన్ను కాపాడు.

**తా :** యోగీశ్వరుల, పాటలతో, స్తుతి వాక్కులతో స్తుతింపబడే ఓ స్వామీ! ఎవరు కపటంగా ప్రవర్తిస్తారో వాళ్ళను నీ మాయలో పడేలా చేసే నేర్పరివి – నీవు. అటువంటి నిన్ను నేను నా మాయతో కలత పెట్టి, నీ మాహాత్మ్యం ఎంతటిదో చూద్దామంటూ చేయరాని నేరం చేశాను. ఏ కార్చిచ్చు నుండి పుట్టిన చిన్న అగ్నిజ్వాల ఆ కార్చిచ్చును మించేలా ప్రకాశింప గలదా! నీ మహిమ కార్చిచ్చు ప్రకాశం అంతటిది. నా మాయ అందులో పుట్టిన ఓ చిన్న అగ్నికీల వంటిది. కాబట్టి ప్రభూ! నా పట్ల దయచూపి, నన్ను కాపాడు.

**సీ. సర్వేశ! నే రజోజనితుండ, మూఢుండఁ, బ్రభుఁడ నేనని వెఱ్ఱిప్రల్లదమున**
**గర్వించినాఁడను, గర్వాంధకారాంధనయనుండఁ, గృపఁ జూడు నను, బ్రధాన**
**మహదహంకృతి నభోమరుదగ్ని జలభూమి పరివేష్టితాండకుంభంబులోన**
**నేడుజేనలమేన నెనయు నే నెక్కడ నీ దృగ్విధాండంబు లేరి కైన?**

**తే. సంఖ్య సేయంగ రానివి, సంతతంబు, నోలిఁ బరమాణువులభంగి నొడలిరోమ**
**వివరములయందె వర్తించు విపులభాతి, నెనయుచున్న నీ వెక్కడ? నెంత కెంత? 557**

**ప్రతి :** సర్వ+ఈశ!= సర్వాధిపతివైన కృష్ణా!; నేన్= నేను; రజస్+జనితుండన్= రజోగుణంనుండి పుట్టినవాడను; మూఢుండన్= ఏమీ తెలియనివాడను; ప్రభుఁడన్+నేను+అని= నేనే దొరనని, అధికారం కలవాడినని; వెఱ్ఱి ప్రల్లదమునన్= పిచ్చి అహంకారంతో;

గర్వించినాఁడను= విర్రవీగాను; గర్వ+అంధకార+అంధనయనుండన్= అహంకారం అనే చీకటిచేత కానరాని కన్నులు కలవాడను; ననున్= అలాంటి నన్ను; కృపన్+చూడు= దయ చూపి అనుగ్రహించు; ప్రధాన మహత్+అహంకృతిన్+నభస్, మరుత్, అగ్ని, జల, భూమి, పరివేష్టిత+అండ కుంభములోనన్= అవ్యక్తం, మహత్తత్త్వం, అహంకారం, ఆకాశం, వాయువు, నిప్పు, నీరు, ధరణి అనే ఆవరణాలచే ఆవరింపబడిన బ్రహ్మాండభాండంలో; ఏడు జేనల మేనన్= ఏడు జేనల పొడవుగల శరీరంతో; ఎనయు= కూడిన; నేను ఎక్కడ?= నేనెక్కడ?, నేనెంతటివాడను?; ఈ దృక్+విధ+అండంబులు= ఇట్టి బ్రహ్మాండాలు; ఏరికిన్+ఐనన్= ఎవరికైనా సరే; సంఖ్యచేయన్+కన్‌రానివి= లెక్కింప వీలుకానివి; సంతతంబున్= ఎల్లప్పుడూ; ఓలిన్= వరుసగా; పరమాణువులభంగిన్= అణువులో ఆరవభాగమైన పరమాణువులవలె; ఒడలిరోమవివరముల+అందున్+ఎ= దేహం మీదివెంట్రుకల రంధ్రాలలోనే; వర్తించు= ఉండే; విపుల భాతిన్= విశాలమైన విధంగా; ఎనయుచున్+ఉన్న నీవు= పొందినట్టి నీవు; ఎక్కడ?= ఎంతటి అధికుడవో?; ఎంతకున్ ఎంత?= ఎక్కడికి ఎక్కడ!; నీ వెక్కడ!

**తా :** ఓ సర్వాత్మకా! నీ వల్ల ఏర్పడే సత్త్వరజస్తమోగుణాలలో ఒకటైన రజోగుణంనుండి పుట్టినవాడిని. విజ్ఞానం ఏమీ లేనివాడను. ఇట్టి వాడనైన నేను ప్రభువునంటూ వెర్రి అహంకారంతో గర్వించి, దానివల్ల గుడ్డివాడనైనాను. నన్ను దయతో అనుగ్రహించు. అవ్యక్తం, మహత్తు, అహంకారం, ఆకాశం, గాలి, నిప్పు, నీరు, భూమి అనే ఈ ఎనిమిది ఆవరణాలచేత నిండిన బ్రహ్మాండభాండంలో, ఏడుజేనలశరీరంతో కూడివున్న నేనెక్కడ? ఎవరికీ లెక్కింప అలవికానన్ని ఇలాంటి బ్రహ్మాండాలు ఎన్నింటినో నిత్యం ఒకదానివెంట ఒకటిగా నీ శరీరంలోని రోమకుపాలలో పరమాణువులుగా ధరిస్తూ ఉన్న నీ వెక్కడ? నేనెక్కడ? ఎక్కడికెక్కడి పోలిక?

**తరలము.**

> **కడుపులోపల నున్న పాపఁడు గాలఁ దన్నినఁ గిన్కతో**
> **నడువఁ బోలునె క్రాఁగి తల్లికి? నాథ! సన్నము దొడ్డు నై**
> **యడఁగి కారణకార్యరూపమునైన యీ సకలంబు నీ**
> **కడుపులోనిది గాదె? పాపఁడఁ గాక నే మఱి యెవ్వఁడన్? 558**

**ప్రతి :** నాథ!= ఓ స్వామీ!; కడుపులోపలన్+ఉన్న పాపఁడు= తన కడుపులో, గర్భంలో ఉండే చిన్ని శిశువు; కాలన్ తన్నినన్= కాలితో తన్నినా; కిన్కతోన్= తన్నినాడన్న కోపంతో; క్రాఁగి= కోపగించి, మండిపడి; తల్లికిన్= ఆ జననికి; అడువన్+ పోలునె= కొట్టదగునా!; సన్నము= చిన్నది; దొడ్డును+ఐ= పెద్దది అయి; అడఁగి= రెండూ కలిసి; కారణ కార్యరూపమును+ఐన= ఒకటి కారణరూపం ఇంకొకటి కార్యరూపం అయిన; ఈ సకలంబును= ఈ సమస్త ప్రపంచమూ; నీ కడుపులోనిది+కాదు+ఎ= నీ ఉదరంలోనిదే కదా!; నేన్= నేను; పాపఁడన్ కాక= నీకు చిన్నబిడ్డను కాక; మఱి ఎవ్వఁడన్= ఇంకెవడను?; నీ కడుపున ఉన్నట్టి బిడ్డను నేను.

**తా :** ఓ ప్రభూ! లోకంలో తల్లి తన గర్భంలోని శిశువు కాలితో తంతూ ఉంటే కోపంతో మండిపడి, ఆ బిడ్డను కొడుతుందా? కొట్టనే కొట్టదు. స్థూల, సూక్ష్మరూపాలై, కార్య, కారణ సంబంధంతో అణగి ఉండే ఈ సకల ప్రపంచం నీ కడుపులో ఉన్నదే కదా! అటువంటప్పుడు ఆ నీ కడుపులో ఉన్న నేను నీ బిడ్డడినే! తన్నిన పిల్లవాడిని తల్లి ఎలాగైతే కోపగించి దండించదో, అలాగే తప్పుచేసిన నన్ను నీ పిల్లవాణ్ణి కాబట్టి దండింపతగదు.

**క. భూరిలయజలధినిద్రిత, నారాయణనాభికమలనాళమున నజుం**
**డారయఁ బుట్టె ననుట నిజ, మో రాజీవాక్ష! పుట్టె నోటు తలంపన్. 559**

**ప్రతి :** రాజీవ+అక్ష! = కమలాలవంటి కన్నులుగల స్వామీ!; భూరిలయజలధి= ప్రళయసమయంలోని విస్తారమైన సముద్రంలో; నిద్రిత= నిద్రిస్తున్న; నారాయణనాభికమలనాళమునన్= వటపత్రశాయిగా ఉన్న శ్రీమన్నారాయణుని బొడ్డునందలి పద్మంయొక్క తూడునుండి; అజుండు= బ్రహ్మ; ఆరయన్ పుట్టెను= చక్కగా జన్మించాడు; అనుట= అన్నమాట; నిజము+ఓ= నిజమే నేమో!; తలంపన్= విచారింపగా; అలాగే; ఓటు= అపజయంకూడ; పుట్టెన్= పుట్టింది.

**తా :** మహాప్రళయ సమయంలో ఆ సముద్రజలం నడుమ నిద్రిస్తూ ఉన్న నారాయణునిబొడ్డుతామరనుండి బ్రహ్మదేవుడు పుట్టినాడు అనే మాట సత్యం. నేను పుట్టినప్పుడే నాతోపాటు నా ఓటమికూడా పుట్టింది.

**సీ. నళినాక్ష! నీ వాదినారాయణుండవు, జలము నారము జీవచయము నార**
**మందు నీ వుంట నీయం దవి యుంటను నారాయణుం దనునామ మయ్యె**
**సకలభూతములకు సాక్షి వధీశుండ, వబ్ధి నిద్రించు నారాయణుఁడవు**
**నీ మూర్తి యది నీకు నిజమూర్తి యనరాదు, నళిననాళముత్రోవ నడచి మున్ను**

**తే. కడఁగి నూతేండ్లు వెదకి నేఁ గాననయితి, నేకదేశస్థుఁడవు గా వనేకరుచివి**
**జగములో నుందు, నీలోన జగములుండు, నరుఁదు, నీమాయ నెట్లైన నగుచు నుందు. 560**

**ప్రతి :** నళిన+అక్ష= ఓ పద్మాక్షా!; నీవు ఆది నారాయణుండవు= సృష్టికి మూలభూతమైన ఆదినారాయణమూర్తివి; జలము= నీరు; నారము= నారమనబడుతుంది; జీవచయము= జీవ సముదాయం; నారము= నారమనబడుతుంది; అందున్= ఆ నారములందే; నీవు ఉంటన్= నీవు ఉండడంచేత; నారాయణుండు అను నామము అయ్యెన్= నీకు నారాయణుడనే పేరు కలిగింది; సకల భూతములకున్= ఎల్లప్రాణులకూ; సాక్షివి= దూరంగా ఉండి చూచేవాడవు; అధీశుండవు= అధిపతివి; అబ్ధిన్= సముద్రమందు; నిద్రించు= శయనించే; నారాయణుఁడవు= నారాయణుడవు; నీ మూర్తి అది= ఆ నీ రూపం; నీకున్; నిజమూర్తి అనరాదు= అసలు రూపమనకూడదు; నళిననాళము త్రోవన్= తామరపువ్వు తూడు ద్వారా; నడచి= వెళ్ళి; మున్ను= మునుపు; కడఁగి= ప్రయత్నించి; నూతేండ్లు= వంద సంవత్సరాలు; వెదకితిన్= వెతికానుకాని; కానన్+అయితిన్= నిన్ను చూడలేకపోయాను; ఏక దేశస్థుఁడవు కావు= ఒకే తావున ఉండే వాడవుకావు; అనేక రుచివి= బహువిధాల ప్రకాశించేవాడవు; జగములోన్+ఉందువు= లోకంలో నీవుంటావు; నీలోన్ జగములు ఉండున్= నీ యందు లోకాలుంటాయి; అరుఁదు= ఇదొక వింత; నీ మాయన్= నీవు పన్నే మాయచే; ఎట్లు అయినన్= ఏ విధంగానైనా సరే; అగుచున్ ఉందువు= అవుతూ ఉంటావు.

**తా :** ఓ కమలనేత్రా! నీవు త్రిమూర్తులకు మూలపురుషుడవైన ఆదినారాయణుడవు. జలానికి, నరసముదాయానికి 'నారము' అని పేరు. నారములలో నీవు ఉండడంవల్ల, నీయందు అవి ఉండడంవల్ల నీకు నారాయణుడనే పేరు ఏర్పడింది. సమస్త ప్రాణకోటికీ సాక్షీభూతుడవు. సర్వానికి ప్రభుడవు. సముద్రంలో మఱ్ఱాకుపై నిద్రించే నారాయణుడవు. అదే నీ నిజరూపం అనడానికి వీలులేదు. నేను పూర్వం తామరతూడుద్వారా నడచి, ఎంతో ప్రయత్నంతో వంద సంవత్సరాలు వెదికాను. కానీ నిన్ను చూడలేక పోయాను. ఒకచోట ఉండే వాడవుకావు. అనేక రూపకాంతులతో ప్రకాశిస్తూఉంటావు. జగత్తులో నీ వుంటావు. నీలో జగాలుంటాయి. ఇది చాలా ఆశ్చర్యం. నీ మాయవల్ల ఎలాగైనా అవగలవు, ఉండగలవు.

**మ.** **విను మో యీశ్వర! వెల్పలన్ వెలుఁగు నీ విశ్వంబు నీ మాయ గా**
**క నిజంబైన యశోద యెట్లు గనియెం? గన్నార నీ కుక్షిలోఁ**
**గనెఁ బో క్రమ్మఱఁ గాంచెనే? భవదపాంగశ్రీఁ బ్రపంచంబు చ**
**క్కన లోనౌ, వెలి యౌను, లోను వెలియుంగాదేఁ దదన్యం బగున్? 561**

**ప్రతి :** ఓ ఈశ్వర!= ఓ ప్రభూ!; వినుము= నా మాట అవధరించు; వెల్పలన్= బయట; వెలుఁగు= ప్రకాశించే; ఈ విశ్వంబు= ఈ ప్రపంచం; నీ మాయ కాక= నీ మాయే కాకుండా; నిజంబు+ఐనన్= యథార్థమే అయినట్లయితే; యశోద= నీ తల్లి యశోదమ్మ; కన్ను+ఆరన్= కన్నులార; నీ కుక్షిలోన్= నీ కడుపులో; ఎట్లు కనియెన్= ఏ విధంగా ఈ విశ్వాన్ని చూచింది; కనెన్ పో= చూచిందే అనుకో!; క్రమ్మఱన్= తిరిగి; కాంచెనే?= ఆ ప్రపంచాన్ని చూడగలిగిందా?; భవత్ అపాంగశ్రీన్= నీ కడగంటి చూపుయొక్క ప్రకాశంతో; ప్రపంచంబు= లోకం; చక్కనన్= క్రమంగా; లోన్+ఔన్ వెలి+ఔను= లోపల ఉంటుంది, బయటా ఉంటుంది; లోను, వెలియున్= లోపల, బయట; కాదేనిన్= కాని పక్షంలో; తత్+అన్యంబు+ అగున్= ఆ రెంటి కంటే వేరైంది అవుతుంది.

**తా :** ఓ ప్రభూ! బయట ప్రత్యక్షంగా కనబడే ఈ జగత్తంతా నీ మాయకాక నిజమే అయినట్లయితే యశోద కనులారా నీ కడుపులో ఈ విశ్వాన్ని ఎలా చూచింది? చూచిందే అనుకో, మళ్లీ ఏనాడైనా అది అలా చూడగలిగిందా? నీ కడగంటి చూపుతో ఈ ప్రపంచమంతా నీ లోపలా ఉంటుంది, నీ బయటా ఉంటుంది. అలా కాకుంటే ఆ రెండిటికంటే వేరైందవుతుంది.

**మ.** **ఒకఁడై యుంటివి, బాలవత్సములలో, నొప్పారి తీ వంతటన్**
**సకలోపాసితులౌ చతుర్భుజులునై సంప్రీతి నేఁ గొల్వఁగాఁ**
**బ్రకటశ్రీగలవాఁడ వైతి, వటుపై బ్రహ్మాండముల్ సూపి యొ**
**ల్లక యిట్లొక్కఁడ వైతి నీ వివిధలీలత్వంబుఁ గంటింగదే? 562**

**ప్రతి :** బాలవత్సములలోన్= గోప బాలురలోనూ, దూడలలోనూ; ఒకఁడు అయి= ఒకడవై; ఉంటివి= ఉన్నావు; అంతటన్= అన్ని చోట్లా; ఈవు= నీవు; ఒప్పారితి(వి)= ఒప్పి ఉంటివి; సకల ఉపాసితులు+ఔ= సమస్త ప్రాణికోటిచే ఆశ్రయింపబడిన వారైన; చతుర్భుజులును+ఐ= నాలుగు చేతులతోఉన్న వారై; సంప్రీతిన్= మిక్కిలి ప్రేమతో; నేన్ కొల్వన్+కాన్= నేను సేవించగా; ప్రకట శ్రీకలవాఁడవు+ఐతివి= ప్రకటించిన వైభవం కలవాడవయ్యావు; అటుపై= ఆ పైన ఇంకనూ; బ్రహ్మాండముల్+ చూపి= నీయందే అనేక బ్రహ్మాండాలను కనబరిచి; ఒల్లక= అలా చూపడం ఇష్టపడక; ఇట్లు= ప్రస్తుత రూపంలో; ఒక్కఁడవు+ ఐతి= ఒక్కడవై ఉన్నావు; నీ వివిధ లీలత్వంబున్= ఈ నీ పలురీతుల లీలాస్వభావాన్ని; కంటిన్ కదే= చూశాను కదా!

**తా :** ప్రభూ! మొదట ఒక్కడుగానే ఉన్నావు. గోపబాలురలో, దూడలలో వెలుగొందావు. అనంతరం, అందరిచేతా నమస్కారాలు స్వీకరిస్తున్న నాలుగుభుజాల విష్ణువురూపాల్లో కనిపించావు. ఆపై బ్రహ్మాండాలన్నీ చూపించావు. అలా ఇష్టం లేక మళ్ళీ ఈ కృష్ణుడుగా ఒక్కడవై కనిపిస్తున్నావు. ఇన్నాళ్ళకు ఈ రకమైన నీ లీలావిశేషాలన్నీ చూశాను కదా!

**క.** **ఎఱుఁగని వారికిఁ దోతువు, నెఱిఁబ్రకృతింజేరి జగము నిర్మింపఁగ నా**
**తెఱఁగున రక్షింపఁగ నీ, తెఱఁగున బ్రహరింప రుద్రు తెఱఁగున నీశా! 563**

**ప్రతి :** ఈశా!= ప్రభూ; ప్రకృతిన్+చేరి= మాయతో కూడుకొని; నెఱిన్= క్రమంగా; జగమున్ నిర్మింపన్+కన్= లోకాన్ని సృష్టించడానికి; నా తెఱఁగునన్= నా వలె; రక్షింపన్+కన్= లోకాన్ని రక్షించడానికి; నీ తెఱఁగునన్= ఈ నీవలె; ప్రహరింపన్= లయం చేయడానికి; రుద్రుతెఱఁగునన్= శివునివలె; ఎఱుఁగనివారికిన్= నీ స్వరూపం తెలియనివారికి; తోతువు (తోఁచుదువు)= అనిపిస్తావు, కనబడతావు.

**తా :** స్వామీ! నీవు ప్రకృతితో కూడిన మాయతో కలిసి లోకాన్ని సృష్టించడంలో నా వలె, రక్షించడంలో విష్ణువైన నీ వలె, లయం చేయడంలో శివునివలె నిన్ను తెలియని ఆ అజ్ఞానులకు కనబడతావు.

**క. జలచర మృగ భూసుర నర, కులముల జన్మించి తీవు కుజనులఁ జెఱుపం**
**జెలిమిని సుజనుల మనుపను, దలపోయఁగ రాదు నీవిధంబు లనంతా! 564**

**ప్రతి :** అనంతా!= దేశకాలాదులచే విభాగింపరాని స్వరూపంగల ఓ అనంతుడా!; ఈవు= నీవు; కుజనులన్= దుష్ట ప్రవృత్తిగల వారిని; చెఱుపన్= నశింపజేయడానికీ; సుజనులన్= శిష్టులైనవారిని; చెలిమినిన్= స్నేహంతో; మనుపన్= రక్షించడానికీ; జలచరమృగభూసురనర కులములన్= నీటచరించే వాని రూపంలో మత్స్య కూర్మావతారాలుగా, జంతువుల రూపంలో వరాహనరసింహావతారాలుగా; బ్రాహ్మణుల రూపంలో కశ్యప, భార్గవుల అవతారాలుగా; వామనావతారంగా; మానవుడుగా శ్రీరామావతారంగా; జన్మించితి(వి)= పుట్టావు; నీ విధంబులు= నీ యొక్క రీతులు; తల పోయన్+కన్= ఇట్టివని ఆలోచించడానికి; రాదు= శక్యం కాదు.

**తా :** నీవు దుర్మార్గులను శిక్షించడానికీ, సజ్జనులను ప్రేమతో రక్షించడానికీ, జలచరాలుగా, మృగాలుగా, బ్రాహ్మణులుగా, సాధారణమానవులుగా ఎన్నో అవతారాలు ధరించావు. నీ మార్గాలు ఈ విధంగా ఉంటాయని ఊహించడం సాధ్యం కాదు. నీ వలెనే నీ మార్గాలుకూడా అంతం లేనివి.

**ఆ. మ్రబ్బుగొలిపి యోగమాయ నిద్రించిన, యో పరాత్మభూమ! యోగిరాజ!**
**యే తెఱంగు లెన్ని యెప్పు డెచ్చోట నీ, హేల లెవ్వఁ డెఱుఁగు నీశ్వరేశ! 565**

**ప్రతి :** ఈశ్వర+ఈశ= దేవతలందరికీ ప్రభువైనవాడా!; మ్రబ్బుగొలిపి= లోకాన్ని అజ్ఞాన ఆవరణలో ఉంచి; యోగమాయన్= నీయందు వెలిగే అవ్యక్తమనే ప్రకృతిలో; నిద్రించిన= నిద్రపోయిన; ఓ పర+ఆత్మభూమ!= ఓ పరబ్రహ్మ స్వరూపా! యోగిరాజ= యోగులలో శ్రేష్ఠుడా! లేదా యోగులైన బ్రహ్మవేత్తల నేలువాడా! నీహేలలు= నీ లీలలు; ఏ తెఱంగులు= ఏ విధమైనవి; ఎన్ని= సంఖ్యాపరంగా ఎన్ని; ఎప్పుడు= ఏ సమయంలో; ఏ చోటన్= ఎక్కడ అన్నవాటిని; ఎవ్వఁడు ఎఱుఁగున్= ఎవడు తెలుసుకోగలడు? (ఎవ్వరికీ తెలియదన్నమాట.)

**తా :** దేవ దేవా! యోగమాయచే లోకాన్ని అజ్ఞాన ఆవరణం అనే చీకటిలో ముంచి నిద్రిస్తూ ఉంటావు. ఓ పరబ్రహ్మరూపా! యోగులలో శ్రేష్ఠుడా! నీ లీలలు ఎలా ఉంటాయి! ఎన్ని? వాటిపరిమాణమెంత? ఏ సమయాలలో, ఎక్కడ ప్రదర్శిస్తావో అనే విషయాలు ఎవరికి తెలుసు? (ఎవరికీ తెలియదు.)

**సీ. అది గాన నిజరూప మనరాదు, కలవంటిదై బహువిధదుఃఖమై విహీన**
**సంజ్ఞానమై యున్న జగము సత్సుఖబోధ, తనుఁడవై తుది లేక తనరు నీదు**

**మాయచేఁ బుట్టుచు మనుచు లే కుండుచు నున్న చందంబున, నుండుచుండు,**
**నొకఁడ, వాత్ముఁడ, వితరోపాధిశూన్యుండ, వాద్యుండ, వమృతుండ, వక్షరుండ,**

**ఆ. వద్వయుండవును, స్వయంజ్యోతి, వాపూర్ణుఁ, డవు, పురాణపురుషుఁడవు, నితాంత**
**సౌఖ్యనిధివి, నిత్యసత్యమూర్తివి, నిరం, జనుఁడ వీవు, దలఁపఁ జనునె నిన్ను? 566**

**ప్రతి :** అది గాన= మేము నీ లీలలను తెలియక పోవడమే కాకుండా; కలవంటిది+ఐ= స్వప్నంవంటిదై అనగా అసత్యరూపమై; బహువిధ దుఃఖము+ఐ= నానారకాలైన దుఃఖాలతో కూడిందై; విహీన సంజ్ఞానము+ఐ= లేని జ్ఞానం కలదై అంటే అజ్ఞానంతో కూడిందై; ఉన్న= ఉండే; జగము= జగత్తుయొక్క; నిజరూపము= నీదైన అసలు రూపము; అనరాదు= అన వీలుగాదు; ఈవు= నీవు; తత్+సుఖబోధ తనుడఁవు+ఐ= త్రికాలాలలో నశించకుండా నిరతిశయానందరూపం కలవాడివై; తుదిలేక= అంతం లేకుండా; తనరుదు(వు)= వర్తిస్తావు; నీదు మాయచేన్= నీ సంబంధమైన ప్రకృతిరూపమాయచేత; పుట్టుచున్= జన్మిస్తూ; మనుచున్= జీవిస్తూ; లేక+ఉండుచున్= నశిస్తూ; ఉన్నచందంబునన్= ఉన్న రీతిగా; ఉండుచున్+ఉండు= ఉంటూ ఉండే; ఒకఁడవు= ఒంటరివాడివి; ఆత్ముఁడవు= అంతట నిండియున్నవాడివి; ఇతర+ఉపాధి శూన్యుండవు= ఇతరాలైన స్థూల సూక్ష్మ కారణోపాధులు లేనివాడివి; ఆద్యుండవు= సృష్టి, స్థితి, లయాలకు కారణుడివి; అమృతుండవు= మరణంలేనివాడివి; అక్షరుండవు= శాశ్వతుడివి; అద్వయుండవును= నీకు సాటియైన రెండవవాడు లేనివాడివి; స్వయంజ్యోతివి= నీయంతట నీవు వెలిగేవాడివి; ఆ పూర్ణుఁడవు= అఖండస్వరూపుడివి; పురాణపురుషుఁడవు= సృష్టికి ముందున్నవాడివి; నితాంతసౌఖ్యనిధివి= అక్షీణమైన సుఖానికి స్థానభూతుడివి; నిత్యసత్యమూర్తివి= శాశ్వతమైన సత్యస్వరూపుడివి; నిరంజనుఁడవు= ప్రకృతిని మీరిన వాడివి; నిన్నున్= నిన్ను; తలఁపన్= ఇట్టి వాడని ఊహించడానికి; చనునె= తగునా! శక్యమా!

**తా :** స్వామీ! నీ అసలు రూపం ఇదే అనడానికి వీలు కాదు. ఈ జగత్తంతా కలవంటిది. ఎన్నోరకాల దుఃఖాలతో నిండి ఉంటుంది. అజ్ఞానంలో మునిగి ఉంటుంది. నీవైతే నిత్య స్వరూపుడవై, అంతం లేనివాడవై వర్తిస్తూ, ప్రకృతి రూపమాయవల్ల పుట్టినట్లు, జీవిస్తున్నట్లు, నశిస్తున్నట్లు ఉంటావు. నీవు ఒక్కడివే ఇతర ఉపాధులు లేనివాడవు. అంతటికీ ఆద్యుడవూ నీవే. నీవు మృతిలేనివాడవు, శాశ్వతుడవు, నీకు సాటియైన రెండవవాడు లేని అద్వయుడవు, స్వయం ప్రకాశకుడవు, ప్రాచీనులలో ప్రాచీనుడవైన మొట్టమొదటి పురుషుడవు, సంపూర్ణమైన సుఖానికి అనంత ఆనందానికి నిధివి, నిత్య సత్య స్వరూపుడవు, ఇటువంటి నిన్ను ఇట్టి వాడని ఊహించడం శక్యమా! శక్యంకాదు.

**వ. దేవా! యిట్టి నీవు జీవాత్మ స్వరూపకుండవును, సకలాత్మలకు నాత్మయైన పరమాత్మస్వరూపకుండవు నని యెవ్వ రెఱుఁగుదురు, వారు గదా గురువనియెడు దినకరునివలనఁ బ్రాప్తంబైన యుపనిషదర్థజ్ఞానం బను సునేత్రంబునంజేసి సంసార మిథ్యాసాగరంబుఁ దరించిన చందంబున నుండుదురు, రజ్జువందు రజ్జువని యెఱింగెడి యెఱుక లేకుండ, న య్యెఱుంగమి నది సర్పరూపంబయి తోఁచిన పిదప నెఱింగినవారి వలన రజ్జువు రజ్జువని యెఱుంగుచుండ, సర్పరూపంబు లేకుండు కైవడి, నాత్మయప్పరమాత్మయని యెవ్వరెఱుంగరు వారి కయ్యెఱుంగమివలన సకల ప్రపంచంబుఁ గలిగి తోఁచు, నాత్మ యప్పరమాత్మయని యెవ్వరెఱుంగుదురు, వారి కయ్యెఱుకవలనఁ బ్రపంచంబు లేకుండు, నజ్ఞానసంభావిత నామకంబులైన సంసారబంధమోక్షంబులు, జ్ఞానవిజ్ఞానంబుల లోనివి గావు! కావునఁ గమలమిత్రున కహోరాత్రంబులు లేని తెఱంగునఁ, బరిపూర్ణజ్ఞానమూర్తి**

**యగు నాత్మయందు నజ్ఞానంబులేమిని బంధంబును సుజ్ఞానంబు లేమిని మోక్షంబును లే, వాత్మవైన నిన్ను దేహాదికంబని తలంచియు, దేహాదికంబు నిన్నుఁగాఁ దలంచియు, నాత్మ వెలి నుండు నంచు మూఢులు మూఢత్వంబున వెదకుచుందురు, వారిమూఢత్వంబుఁ జెప్ప నేల? బుద్ధిమంతులై పరతత్త్వంబు గాని జడంబును నిషేధించుచున్న సత్పురుషులు తమ శరీరంబులయందు నిన్నరయుచుందు రది గావున. 567**

**ప్రతి :** దేవా!= పరమాత్మా!; ఇట్టి నీవు= నీవు ముందుచెప్పిన; జీవ+ఆత్మ స్వరూపకుండవును= జీవాత్మ స్వరూపుడవని; సకల+ఆత్మలకును= ఎల్ల జీవులకు; ఆత్మ+ఐన= శరీరమైన; పరమాత్మ స్వరూపకుండవు+అని= పరబ్రహ్మ స్వరూపుడవని; ఎవ్వరు ఎఱుఁగుదురు= ఎవరైతే తెలుసుకుంటారో; వారుకదా!= అలా తెలుసుకొన్న వారే కదా; గురువు= అజ్ఞాన నివారకుడైన ఆచార్యుడు; అనియెదు= అనబడే; దినకరునివలనన్= సూర్యునివల్ల; ప్రాప్తంబు+ఐన= లభించినట్టి; ఉపనిషద్+అర్థజ్ఞానంబు+అను= ప్రజ్ఞానం బ్రహ్మ, ఆయమాత్మా బ్రహ్మ, తత్త్వమసి, అహం బ్రహ్మాస్మి అనే వేదాంత మహావాక్యాల అర్థాన్ని విచారించడం వలన ఏర్పడిన అపరోక్షజ్ఞానమనే; సునేత్రంబునన్+చేసి= మంచి కంటితో; సంసార మిథ్యా సాగరంబున్= శరీరం ఇంద్రియాలు నేనే అన్న సంసారమనే అసత్యరూప సముద్రాన్ని; తరించిన చందంబునన్= దాటిన రీతిగా; ఉండుదురు= ఉంటారు; రజ్జువు+అందున్= తాడులో; రజ్జువు+అని= అది తాడని; ఎఱింగెడి= తెలుసుకొనే ఎఱుక లేకుండన్= జ్ఞానం లేకుండా; ఆ+ఎఱుంగమిన్= అలా తెలియకపోవడంచేత; అది= ఆ తాడు; సర్పరూపంబు+అయి తోఁచినన్= పాములా కనబడగా; పిదప= తరువాత; ఎఱింగినవారివలనన్= తెలిసినవారివల్ల; రజ్జువు రజ్జువు+అని= తాడును తాడని; ఎఱుంగుచున్+ఉండన్= తెలుసుకొనుచుండగా; సర్పరూపంబు లేకుండు కైవడిన్= సర్పం అనేది లేనివిధంగా; ఆత్మ= జీవుడే; ఆ+పరమాత్మ అని= ఆ సచ్చిదానందరూప పరబ్రహ్మమని; ఎవ్వరు+ఎఱుంగరు= ఎవరైతే తెలుసుకోలేరో; వారికిన్= అట్టివారికి; ఆ+ఎఱుంగమివలనన్= అలా తెలుసుకోలేని అజ్ఞానంచే; సకల ప్రపంచంబున్= లోకమంతా; కలిగి తోఁచున్= ఉన్నట్లు కనబడుతుంది; ఆత్మ= జీవాత్మయే; ఆ+పరమాత్మ అని= ఆ పరమాత్మ అంటూ; ఎవ్వరు+ఎఱుంగుదురు= ఎవరైతే తెలుసుకుంటారో; వారికిన్= అట్టివారికి; ఆ+ఎఱుకవలనన్= ఆ జ్ఞానంవల్ల; ప్రపంచంబు లేక+ఉండున్= ప్రపంచం లేనట్లే తోస్తుంది; అజ్ఞానసంభావిత+నామకంబులు+ఐన= తన్ను తా నెరుగక పోవడమనే అజ్ఞానంవల్ల ఏర్పడినవైన; సంసార బంధ మోక్షంబులు= సంసారంవల్ల కలిగే సంబంధం, దానినుండి విడివడడాలు; జ్ఞాన విజ్ఞానంబుల లోనివి కావు= వేదాంతశాస్త్రవిచారణవల్ల కలిగే జ్ఞానానికి, అనుభవజన్యజ్ఞానానికి చెందినవి కావు; కావునన్= కాబట్టి; కమలమిత్రునకున్= పద్మాలకు మిత్రుడైన సూర్యునికి; అహస్+రాత్రంబులు= రేయింబవళ్ళు; లేని తెఱంగునన్= లేని విధంగా; పరిపూర్ణజ్ఞానమూర్తి+అగు= ఏ సాధనాలు లేక స్వయంగా ప్రకాశించే వస్తుతత్త్వజ్ఞానమే స్వరూపంగాగల; ఆత్మ+అందున్= పరమాత్మయందు; అజ్ఞానంబులేమిని= మరుపు లేకపోవడంతో; బంధంబును= దుఃఖం; సుజ్ఞానంబు లేమినిన్= ఎరుక లేకపోవడంతో; మోక్షంబును లేవు= ప్రాపంచిక జీవితంనుండి విడుదల లేవు; ఆత్మవు+ఐన నిన్నున్= పరబ్రహ్మవైన నిన్ను; దేహాదికంబు+అని తలంచియున్= దేహ, ఇంద్రియ, మనఃప్రాణాలుగా ఎంచియు; దేహాదికంబున్= శరీర ఇంద్రియాదులను; నిన్నున్+కాన్+తలంచియున్= సచ్చిదానంద స్వరూపుడవైన నిన్నుగా ఎంచి; ఆత్మ= పరమాత్మ; వెలిన్ ఉండున్+అంచున్= తనకు వెలుపల ఉంటుంది అంటూ; మూఢులు= క్షేత్రక్షేత్రజ్ఞవిభాగజ్ఞానం లేనివారు, మూఢత్వంబునన్= అజ్ఞానంతో; వెదకుచుందురు= శోధిస్తూ ఉంటారు; వారిమూఢత్వంబున్= అట్టివారి అజ్ఞానాన్ని; చెప్పన్ ఏల?= ఇట్టిదని చెప్పడం ఎందుకు? చెప్పక్కరలేదు; బుద్ధిమంతులు+ఐ= ఆత్మానాత్మ జ్ఞానం కలవారై; పరతత్త్వంబు కాని= పరబ్రహ్మ స్వరూపం కానట్టి; జడంబును= పంచకోశాత్మక శరీరాదికాన్ని; నిషేధించుచున్+ఉన్న= అనృతం, జడం, దుఃఖం, మలినం, ఖండం అయిన ప్రకృతి జన్యమైనది కాబట్టి తాము కాదంటున్న; సత్పురుషులు=

విజ్ఞానులు; తమ శరీరంబుల+అందున్= తమ దేహాలలో; నిన్నున్+అరయుచున్+ఉందురు= సచ్చిదానందస్వరూపుడవైన నిన్ను వెదకుతూ ఉంటారు; అది కావునన్= కాబట్టి...

**తా :** దేవా! సకల ప్రాణులలో ఆత్మస్వరూపుడవై ఉన్నావు. ఎవరైతే గురువు అనే సూర్యునినుండి వేదాంతజ్ఞానమనే దివ్యనేత్రాన్ని సంపాదించి నిన్ను తన ఆత్మ స్వరూపునిగా దర్శిస్తారో వారు సంసారమనే మిథ్యాసముద్రాన్ని తరించిన వారవుతారు. మానవుడు తన స్వరూపాన్ని యథాతథంగా తెలియక పోవడంచేతనే తాడునందు పాము కనబడినట్లుగా, ఈ ప్రపంచమంతా ఉన్నట్లు కనపడుతుంది. జ్ఞానం పొందినవానికి తాడునందు పాము అనే భావం పోయినట్లే ఆత్మ, పరమాత్మల ఐక్యం తెలుస్తుంది. సంసారబంధం, మోక్షం, అనేవి రెండూ ప్రసిద్ధాలే కాని అవి అజ్ఞానంవల్ల కలిగిన నామాలుమాత్రమే! ఆత్మ నిత్యజ్ఞానస్వరూపమే, రెండవది లేనిది, ప్రకృతికి అతీతమైంది అనే ఆలోచనతో ఆత్మతత్త్వాన్ని విచారిస్తే, పరిశీలిస్తే, సూర్యునియందు రాత్రింబవళ్ళు లేనట్లే, ఈ బంధమోక్షాలు వేరుగా లేనే లేవు. అజ్ఞానులైన జనులు ఆత్మరూపుడవగు నిన్ను ఇతరునిగాను, ఆత్మకాని దేహాదులను అత్మగాను తలచి, ఆత్మరూపుడవగు నిన్ను తమకంటే బయటే వెదకుతూ ఉంటారు. వారిఅజ్ఞానం ఎంతటిదో కదా! విజ్ఞానులు తమ తమ దేహాలలోనే సచ్చిదానందస్వరూపుడవైన నిన్ను వెదకి తెలుసుకొని నిరతిశయానందంలో ఓలలాడుతూ ఉంటారు. కాబట్టి

**శా. దేవా! నీచరణప్రసాదకణలబ్ధింగాక లేకున్న నొం**
**దేవెంటం జను నీ మహామహిమ నూహింపంగ నెవ్వారికిన్?**
**నీవారై చనువారిలో నొకఁడనై నిన్ గొల్చు భాగ్యంబు నా**
**కీవే యిప్పటి జన్మమం దయిన నొండెందైన నో యీశ్వరా! 568**

**ప్రతి :** ఓ ఈశ్వరా!= బుద్ధి మొదలైన సర్వేంద్రియాలను నియమించే ప్రభూ; దేవా!; నీ చరణ ప్రసాదకణలబ్ధిన్+కాక= నీ పాదాలనుండి అనుగ్రహింపబడే ధూళికణం పొందడంవల్ల కాకుండా; లేకున్నన్= అలా కాదంటే; ఒండు ఏ వెంటన్= ఇతర యోగాలచేత; ఏ+వారికిన్= ఇంకెవ్వరికీ; నీ మహామహిమన్= నీ పరిపూర్ణమహత్త్వాన్ని; ఊహింపన్+కన్= తలచడానికి; చనున్= తగును? నీ వారు+ఐ చనువారిలోన్= నీ స్వరూపస్వభావాలెరిగిన బ్రహ్మజ్ఞానులలో; ఒక్కఁడను+ఐ= నేనూ ఒకడినై; ఇప్పటి జన్మము+అందు+అయినన్= ఈ శరీరం ధరించిన జన్మలోనైనా; ఒండు+ఎందైనన్= లేదా వీటికన్నా విలక్షణమైన ఇంకొక శరీరమందైనా; నిన్ కొల్చు భాగ్యంబున్= నిన్ను సేవించే అదృష్టాన్ని; నాకున్ ఈవే! నాకు అనుగ్రహింపవా!

**తా :** ఓ ప్రభూ! నీ మహామహిమను ఊహించాలంటే, నీ పాదములనుండి అనుగ్రహించబడిన ధూళికణంవలనమాత్రమే సాధ్యం కాని, లేకపోతే ఎవరికి సాధ్యం? నీ వారుగా జీవించగల ధన్యులలో నేను ఒకడనుగా ఉండి నిన్ను సేవించుకునే భాగ్యాన్ని నాకు ప్రసాదించు. ఈశ్వరా! ఈ జన్మలో కాకపోతే మరో జన్మలోనైనా సరే ఆ మహాభాగ్యం నాకు ప్రసాదించు.

**తరలము.**

**క్రతుశతంబులఁ బూర్ణకుక్షివి, కాని నీ విటు క్రేపులున్**
**సుతులునై చనుఁబాలు ద్రావుచుఁ జొక్కి యాడుచుఁ గౌతుక**
**స్థితిఁ జరింపఁగఁ దల్లులై విలసిల్లు గోవుల గోపికా**
**సతుల ధన్యత లెట్లు సెప్పఁగఁ జాలువాఁడఁ గృపానిధీ! 569**

**ప్రతి :** కృపానిధీ!= దయారసానికి స్థానభూతుడా!; క్రతుశతంబులన్= నూరుయజ్ఞాలతో; పూర్ణకుక్షివి= నిండిన కడుపుగలవాడవు; కాని= అట్టి యజ్ఞపురుషుడవైనా; నీవు ఇటు= నీవీ రీతిగా; క్రేపులున్= దూడలుగా; సుతులును+ఐ= గొల్ల బిడ్డలుగా అయి; చనుఁబాలున్ త్రావుచున్= స్తన్యపానం చేస్తూ; చొక్కి= పరవశించి; ఆడుచున్= గొల్లబాలురతో కలిసి ఆటలాడుతూ; కౌతుక స్థితిన్= ఎంతో ఉత్సాహంతో; చరింపన్+కన్= ప్రవర్తించగా; తల్లులు+ఐ= అలా బాలుర దూడల రూపం ధరించిన నీకు తల్లులై; విలసిల్లు= శోభించే; గోవుల, గోపికాసతుల, ధన్యతలు= ఆ ఆవులయొక్క గోపవనితలయొక్క ధన్యతలు; ఎట్లు= ఏ విధంగా; చెప్పన్+కన్= చెప్పడానికి; చాలువాఁడన్= సమర్థుడను అవుతాను?

**తా :** దయాసముద్రుడవైన ఓ స్వామీ! శతాధికయజ్ఞాలలోని హవిర్భాగంతో నిండినకడుపు నీది. అట్టి నీవు ఇలా దూడలుగా, గోపబాలకులుగా రూపొంది, గోపస్త్రీల స్తన్యాన్ని పానంచేస్తూ, చొక్కుతూ, ఆడుతూ, ఉల్లాసంగా తిరుగుతూ ఉంటే, ఆ దూడలకూ, బాలురకూ తల్లులైన ఆ గోపవనితల ధన్యత ఇట్టిదని చెప్పడానికి నేను సమర్థుడనా స్వామీ! (సమర్థుడను కాను.)

**క. పరిపూర్ణంబుఁ బురాణముఁ, బరమానందంబునైన బ్రహ్మమె చెలికాఁ**
**డరుదరుదు నందఘోష, స్థిరజనముల భాగ్యరేఖ చింతింపంగన్. 570**

**ప్రతి :** పరిపూర్ణంబున్= అంతటా నిండిఉన్నదీ; పురాణమున్= సృష్టికి ముందున్నదీ; పరమా+ఆనందంబును+ఐన= నిరతిశయసుఖస్వరూపమైందీ అయినట్టి; బ్రహ్మమె= పరబ్రహ్మమే; చెలికాఁడు= స్నేహితుడు; చింతింపన్+కన్= విచారింపగా; నందఘోషస్థిరజనముల= నందుని గొల్లపల్లెలో నివసించే ఈ గోపాలురయొక్క; భాగ్యరేఖ= అదృష్టరీతి; అరుదు అరుదు= ఎంతో అపురూపమైన విషయం.

**తా :** సర్వవ్యాపకమై, అనాదియై, ఆనందస్వరూపం అయిన, పరబ్రహ్మస్వరూపుడు చెలికాడుగా పొందిన, నందగోపకులంలో నివసించే ఈ గొల్లవారి అదృష్టం ఆలోచిస్తే ఎంత అరుదో కదా!

**సీ. ఏకాదశేంద్రియాధీశులు చంద్రాదు లేను ఫాలాక్షుండు నిట్లు సూడఁ**
**బదుమువ్వురము నెడపడక యింద్రియపాత్రముల నీ పదాంభోజముల మరంద**
**మమృతంబుగాఁ ద్రావి యమరనేకైకేంద్రియాభిమానుల మయ్యు నతికృతార్థ**
**భావుల మైతిమి, పరఁగ సర్వేంద్రియవ్యాప్తులు నీ మీఁద వ్రాల్చి తిరుగు**

**తే. గోపగోపికాజనముల గురువిశిష్ట, భాగ్యసంపదఁ దలపోసి ప్రస్తుతింప**
**నలవిగా దెవ్వరికి నైన నంబుజాక్ష! భక్తవత్సల! సర్వేశ! పరమపురుష! 571**

**ప్రతి :** అంబుజ+అక్ష= నీట మొలచిన పద్మం వంటి నేత్రాలు కలవాడా!; భక్తవత్సల= భక్తుల యెడ వాత్సల్యం చూపువాడా!; సర్వ+ఈశ= అంతటికి ప్రభువైనవాడా! పరమపురుష= ఓ పురుషోత్తమా!; ఏకాదశ ఇంద్రియ+అధీశులు= పంచ జ్ఞానేంద్రియాలు, పంచకర్మేంద్రియాలు, మనస్సు అనే పదకొండు ఇంద్రియాలకు అధిదేవతలైన; చంద్ర+ఆదులు= చంద్రుడు మొదలుగువారునూ; ఏనున్= బుద్ధి ఇంద్రియాధి దేవతనైన నేనూ; ఫాల+అక్షుండున్= నొసట నేత్రంతో అహంకారాధిదేవతయిన శివుడూ, ఇట్లు చూడన్= ఇలా చూడగా; పదుముప్వురమున్= మేము పదముగ్గురం; ఎడపడక= ఎడతెగక; ఇంద్రియపాత్రములన్= ఇంద్రియాలనే పాత్రలద్వారా; నీ పద+అంభోజముల మరందమున్= పద్మాలవంటి నీ పాదములయందున్న తేనెను;

అమృతంబుగాన్= అమృతంగా; త్రావి= తాగి; అమరన్= ఒప్పునట్లు; ఏక+ఏకరింద్రియ+అభిమానులము+అయ్యున్= ఒక్కొక్క ఇంద్రియాన్ని అభిమానించిన వారమయి; అతి కృత+అర్థభావులము+ఐతిమి= మిక్కిలి ధన్యత చెందిన వారమయ్యాము; పరఁగన్= చక్కగా; సర్వ+ఇంద్రియవ్యాప్తులున్= అన్ని ఇంద్రియాల ప్రవృత్తులను; నీ మీఁదన్ వ్రాల్చి= నీ లోపల ఉంచి; తిరుగు= సంచరించే; గోపగోపికాజనముల= ఈ గోపాలుర గోపకాంతలయొక్క; గురువిశిష్ట భాగ్య సంపదన్= గొప్పదైన విశేషమైన అదృష్టరూప సంపదయొక్క కలిమిని; తలపోసి= విచారించి; ప్రస్తుతింపన్= స్తుతించడానికి; ఎవ్వరికిన్+ఐనన్= ఎటువంటివారికైనా; అలవి కాదు= శక్యం కాదు.

**తా :** పద్మాక్షా! భక్తవరదా! సర్వేశా! పురుషోత్తమా! ఓ స్వామీ! చెవి, చర్మం, కన్ను, నాలుక, ముక్కు, వాక్కు, హస్తం, పాదం, గుదం, గుహం, మనస్సు, బుద్ధి, అహంకారం అనే పదమూడింద్రియాలకూ వరుసగా దిక్కులు, గాలి, సూర్యుడు, వరుణుడు, అశ్వినులు, అగ్ని, దేవేంద్రుడు, విష్ణువు, మృత్యువు, ప్రజాపతి, చంద్రుడు, చతుర్ముఖబ్రహ్మ, రుద్రుడు అనే పదముగ్గురమూ ఇంద్రియ అధిష్ఠాన దేవతలము. మేమందరం ఇంద్రియాలనే పానపాత్రలద్వారా నీ పాదకమలం నుండి స్రవించే తేనెను అమృతం తాగినట్లు తాగి, ఒక్కొక్కరం ఒక్కొక్క ఇంద్రియాభిమానులమయినా, ఎంతో ధన్యత పొందిన వారమయ్యాము. అటువంటిది తమ సర్వేంద్రియవ్యాపారాలన్నిటినీ నీమీదే ఉంచి తిరిగే ఈ గొల్లపల్లెలోని గోపాలుర, గోపవనితల గొప్పదైన, ప్రత్యేకతతో నిండిన అదృష్టంగా ఉన్న కలిమిని విచారించి స్తుతించడం ఎవ్వరికీ శక్యంగాదు.

**శా. 'ఏలా బ్రహ్మపదంబు? వేదములకున్ వీక్షింపఁగా రాని ని**
**న్నీ లోకంబున నీవనాంతరమునం దీ మందలోఁ గృష్ణ యం**
**చాలాపాదిసమస్తభావములు నీ యందే సమర్పించు నీ**
**వ్రేలం దొక్కని పాదరేణువులు పై వేష్టించినం జాలదే? 572**

**ప్రతి :** బ్రహ్మ పదంబు= బ్రహ్మస్థానం– బ్రహ్మగా నేనీ స్థానంలో ఉండడం; ఏలా!= ఎందుకు!; వేదములకున్= ఋగ్యజుస్సామాథర్వాలనెడి నాలుగు వేదాలకుకూడా; వీక్షింపన్+కాన్= చూడడానికి; రాని= శక్యంకాని; నిన్నున్= పరమాత్మ స్వరూపుడవైన నిన్ను; ఈ లోకంబునన్= ఈ భూలోకంలో; ఈ వనాంతరమున్+అందున్= ఈ అడవి లోపల; ఈ మందలోన్= ఈ గోకులంలో; కృష్ణ= ఓ కృష్ణుడా; అంచున్= అంటూ; ఆలాప+ఆది సమస్త భావములన్= నీతో ముచ్చటలాడేలా సంభాషించడంవంటి అన్ని వ్యాపారాలనూ; నీ అందే= నీకే; సమర్పించు= సమర్పణగావించే; ఈ వ్రేలందున్= ఈ గొల్లపిల్లలలో; ఒక్కని పాద రేణువులు= ఒక్క బాలుని కాలికి అంటిన దుమ్ము నలుసులు; పై వేష్టించినన్= శరీరంమీద తాకితే; చాలదే= చాలదా!

**తా :** చతుర్వేదాలుసైతం దర్శింపలేని నీ రూపాన్ని ఈ భూలోకంలో, ఈ అడవిలో, గోకులంలో, కృష్ణా! కృష్ణా! అంటూ సంభాషణలు మొదలు సర్వ వ్యాపారాలనూ నీయందే సమర్పించిన ఈ గోపబాలురలో ఏ ఒక్కడి పాదాలకంటిన ధూళి అణువులు నా శరీరాన్ని ముట్టినా చాలును. ఆ బాలురవంటి అదృష్టం లేనప్పుడు ఎందుకు నాకీ బ్రహ్మ పదవి?

**మ. నిను హింసించిన పూతనాదులకు మున్ నీ మేటిసంకేత మి**
**చ్చిన నీకుం బురదారపుత్త్రగృహ గో స్త్రీప్రాణదేహాదు లె**
**ల్లను వంచింపక యిచ్చు గోపకులకున్ లక్షింప నే మిచ్చెదో!**
**యని సందేహము దోఁచుచున్నది ప్రపన్నానీకరక్షామణీ! 573**

**ప్రతి :** ప్రపన్న+అనీక రక్షామణీ!= ప్రపత్తి పొందిన భక్తసమూహాన్ని రక్షించే శ్రేష్ఠుడా!, భక్త సంరక్షకా! నిన్ను; హింసించిన= బాధించిన; పూతన+ఆదులకున్= పూతన మొదలైనవారికి; మున్= ఇంతకు ముందు; నీ మేటి సంకేతమున్= నీ దైన పరమపదాన్ని; ఇచ్చిన= ప్రసాదించిన; నీకున్= సర్వభోక్తవైన నీకు, పుర, దార, పుత్ర, గృహ, గో, స్త్రీ, ప్రాణ దేహ+ఆదులు ఎల్లను= నగరం, భార్య, బిడ్డలు, ఇళ్ళు, గోవులు, స్త్రీలు, పంచప్రాణాలు, శరీరాలు మొదలుగా గల అన్నింటినీ; వంచింపక= మోసగించక నిర్మల స్వభావంతో; ఇచ్చు= ఇచ్చేటి; గోపకులకున్= ఈ గొల్లవాళ్లకు; లక్షింపన్= చూడగా; ఏమి ఇచ్చెదో= మోక్షంకంటే మించిందేమి ఇస్తావో అని; సందేహము= సంశయం; తోఁచుచున్నది= కలుగుతోంది.

**తా :** శరణాగత సంరక్షకా! కృష్ణా! నీకు కీడు తలపెట్ట వచ్చిన పూతన మొదలగు దుష్టరాక్షసులకు నీదైన పరమపదాన్ని ప్రసాదించావు. అటువంటిది పూతనలా వంచించే స్వభావం లేకుండా, తమ గృహ, దార, పుత్ర గోవులతోడి సర్వసంపదలను నీకు అర్పించి తమ ప్రాణాలనుసైతం నీ వశంలో ఉంచినట్టి ఈ గొల్లవారికి ఎంతటి ఉత్తమస్థానా న్నిస్తావో అని సంశయం కలుగుతోంది.

**క. దేహము కారాగేహము, మోహము నిగళంబు, రాగముఖరములు రిపు**
**వ్యూహములు భక్తితో ని, న్నూహింపని యంతదడవు నో కమలాక్షా! 574**

**ప్రతి :** కమల+అక్షా!= పద్మంవంటి కన్నులు కలవాడా!; నిన్నున్= నీ రూపాన్ని; భక్తితోన్= అనన్య భక్తితో; ఊహింపని= ఆలోచించకుండా; అంతతడవున్= ఉన్నంతకాలమూ వారికి; దేహము= వారిశరీరం; కారాగేహము= చెరసాల; మోహము= శరీరేంద్రియవ్యామోహం; నిగళంబు= సంకెల; రాగముఖరములు= రాగద్వేషాదులు; రిపువ్యూహములు= శత్రువ్యూహాలు!

**తా :** ఓ పుండరీకాక్షా! భక్తితో నిన్నెంతకాలం స్మరించకుండా కేవలం దేహేంద్రియాభిమానంతో ఎవరుంటారో వారిదేహం చెరసాలే! మోహం ఇనుపసంకెలే! రాగద్వేషాదులు శత్రువ్యూహాలే అవుతాయి.

**ఆ. ఆశ్రయించు జనుల కానందసందోహ, మీఁ దలంచి వివిధహేలతోడ**
**నప్రపంచకుండ వయ్యుఁ బ్రపంచంబు, వెలయఁ జేయు దీవు విశ్వమూర్తి! 575**

**ప్రతి :** విశ్వమూర్తి!= విశ్వమంతటా అంతర్యామిగా ఉండే ఓ స్వామీ!; ఈవు= సర్వరక్షకుడవైన నీవు; ఆశ్రయించు జనులకున్= నిన్నాశ్రయించే భక్తులకు; ఆనందసందోహము= సంతోషసముదాయాన్ని; ఈన్+తలంచి= ఇవ్వాలనుకొని; వివిధ హేలతోడన్= అనేకమైన లీలలతో; అప్రపంచకుండవు+అయ్యున్= భూ జల అగ్ని వాయు గగనాలనే పంచ భూతాత్మకంగా విభజింపబడేది ప్రపంచం, అట్టి ప్రపంచం లేనివాడవయినా; ప్రపంచంబున్= లోకాన్ని; వెలయన్ చేయుదువు= సృష్టించి నడుపుతూ ఉంటావు.

**తా :** విశ్వాత్మకుడా! నీ కంటూ నిజంగా ఓ ప్రపంచం అనేది లేదు. నీవు అప్రపంచకుడవు. అయినా నిన్ను భక్తితో సేవించే వారికి ఆనందం అందించాలనుకొని నానావిధలీలలతో ప్రపంచాన్ని సృష్టించి నడిపిస్తుంటావు.

**క. ఎఱిఁగినవార లెఱుంగుదు, రెఱుఁగగన్ బహుభాష లేల? యీశ్వర! నీ పెం**
**పెఱుఁగ మనోవాక్కులకున్, గుఱి సేయం గొలఁది గాదు గుణరత్ననిధీ! 576**

**ప్రతి :** గుణరత్న నిధీ!= సర్వజ్ఞత్వ, సర్వేశ్వరత్వ, సర్వభోక్తృత్వాది కల్యాణ గుణాలనే రత్నాలకు సముద్రంవంటివాడా!; ఈశ్వర!= ఓ ప్రభూ; నీ పెంపు= నీ మాహాత్మ్యాన్ని, నీ స్వభావాన్నీ; ఎఱిఁగినవారలు= తెలిసినవారు, బ్రహ్మవేత్తలు; ఎఱుంగుదురు=

తెలుసుకొందురు; ఎఱుఁగన్= తెలుసుకోడానికి; బహుభాషలు+ఏల= పెక్కుమాటలెందుకు; ఎఱుఁగన్= అలా తెలుసుకోవడానికి; మనస్+వాక్కులకున్= మనస్సునుగాని, మాటలనుగాని; గుఱిచేయన్= లక్ష్యంగా చేయుటకు; కొలది కాదు= శక్యం కాదు.

**తా :** కల్యాణగుణరత్నాకరా! ఇన్ని మాటలు అవసరం లేదు. నీ స్వరూపస్వభావాలను జ్ఞానులైన బ్రహ్మవేత్తలే తెలుసుకొంటారు. అంతే కాని తెలుసుకోవడానికి కేవలం మనస్సు, వాక్కులుమాత్రం చాలవు.

**విశే :** బ్రహ్మవేత్తలే బ్రహ్మస్వరూపాన్ని తెలిసినవాళ్లు.

**క. సర్వము నీవ యెఱుంగుదు, సర్వవిలోకనుఁడ వీవ, జగదధిపతివిన్,**
**సర్వాపరాధు నను నో, సర్వేశ! యనుగ్రహింపు, చనియెద నింకన్. 577**

**ప్రతి :** ఓ సర్వ+ఈశ!= సర్వానికి ప్రభువైన కృష్ణా; సర్వమున్= అంతటినీ; నీవు+అ= నీవే; ఎఱుంగుదు(వు)= తెలియుదువు; సర్వవిలోకనుఁడవు ఈవు+అ= సమస్తాన్నీ చూసేవాడివి నీవే!; జగత్+అధిపతివిన్= లోకానికంతటికీ ఈశ్వరుడివి నీవే; సర్వ+అపరాధున్= ఎన్నో తప్పులు చేసిన; ననున్= నన్ను; అనుగ్రహింపుము= దయచూడుము; ఇంకన్= ఇక; చనియెదన్= నేను వెళతాను.

**తా :** సకలలోకేశా! అన్నీ తెలిసినవాడివి. సమస్తవిషయాలను దర్శించేవాడివి నీవే! లోకానికంతటికీ ప్రభుడవు నీవే! అపరాధినైన నన్ను దయచూడు. నేనింక వెళ్ళివస్తాను.

**క. జిష్ణు! నిశాటవిపాటన!, వృష్ణికులాంభోజసూర్య! విప్రామర గో**
**వైష్ణవసాగరహిమకర!, కృష్ణా! పాషండధర్మగృహదావాగ్నీ! 578**

**ప్రతి :** జిష్ణు!= జయశీలుడా! నిశాట విపాటన= (తృణావర్త, వత్స, బక, అఘ మొదలైన రాత్రించరులైన) రక్కసులను సంహరించినవాడా!; వృష్ణికుల+అంభోజ సూర్య= వృష్ణివంశమనే పద్మానికి సూర్యుడా!; విప్ర, అమర, గో, వైష్ణవ, సాగర, హిమకర!= వసిష్ఠ వామదేవాది బ్రాహ్మణులు, బ్రహ్మేంద్రాదిదేవతలు, కామధేనువు మొదలగు గోవులు, నారద సనకసనందనాది విష్ణు భక్తులు అనే సముద్రానికి చంద్రునివంటివాడా; పాషండ ధర్మగృహ దావ+అగ్నీ= వేద ప్రామాణ్యం అంగీకరించని నిరీశ్వరులైన నాస్తికులు ఆచరించే పాషండధర్మం అనెడి ఇంటికి కార్చిచ్చు అయినవాడా! కృష్ణా! ఓ కృష్ణా!

**తా :** కృష్ణా! నీవు జయశీలుడివి. రాక్షస సంహారకుడివి. వృష్ణికులమనే పద్మానికి సూర్యునివంటివాడివి. బ్రాహ్మణులు, దేవతలు, గోవులు, విష్ణుభక్తులనే సముద్రానికి చంద్రునివంటివాడవు. వేదధర్మానికి విరుద్ధమైన కార్యాలు ఆచరించే పాషండుల ఇళ్ళకు కార్చిచ్చువంటివాడివి.

**వ. దేవా! నీకుఁ గల్పపర్యంతంబు నమస్కరించెద నని యివ్విధంబున సంస్తుతించి ముమ్మాఱు వలగొని పాదంబులపైఁ బడి వీడ్కొని బ్రహ్మ దన నెలవునకుం జనియె, నతని మన్నించి భగవంతుండైన హరి తొల్లి చెడి తిరిగి వచ్చిన వత్సబాలకులం గ్రమ్మఱం గైకొని పులినంబుకడఁ జేర్చి, నిట్లు. 579**

**ప్రతి :** దేవా!= ప్రభూ; నీకున్= సృష్టి స్థితి లయాత్మకకార్యకారణుండవైన నీకు; కల్పపర్యంతంబు= నా ఈ స్వామిత్వం లేదా బ్రహ్మత్వం ఉండే కాలపర్యంతం; నమస్కరించెదను= నమస్కరిస్తూనే ఉంటాను; అని; ఈ+విధంబునన్= ఇంతవరకూ చెప్పినరీతిగా; సంస్తుతించి= స్తోత్రంచేసి; మూడు+మాఱు= మూడు పర్యాయాలు; వలగొని= ప్రదక్షిణం చేసి; పాదంబులపైన్+పడి=

పాదాలపై వాలి; వీడ్కొని= సెలవు తీసుకొని; బ్రహ్మ; తన నెలవునకున్= తన నివాస స్థానమైన సత్యలోకానికి; చనియెన్= వెళ్లాడు; అతనిన్= ఆ బ్రహ్మను; మన్నించి= గౌరవించి; భగవంతుండు+ఐన హరి= షడ్గుణసంపన్నుడైన శ్రీకృష్ణమూర్తి; తొల్లి చెడి= మునుపు బాగు తప్పి; తిరిగి వచ్చిన= ఎప్పటిలా తన వద్దకు వచ్చిన; వత్సబాలకులన్= దూడలను, గోపబాలురను; క్రమ్మఱన్= తిరిగి; కైకొని= స్వీకరించి; పులినంబుకడన్= ఇసుక దిబ్బ వద్దకు; చేర్చెన్= వచ్చునట్లుగా చేశాడు; ఇట్లు= ఈ రీతిగా...

**తా :** ఓ కృష్ణమూర్తీ! ఈ కల్పపర్యంతం నీకు నమస్కరిస్తూనే ఉంటాను అని స్తుతించి, మూడుసార్లు ప్రదక్షిణంచేసి, పాదాలకు మొక్కి సెలవు తీసుకొని బ్రహ్మ తన లోకానికి వెళ్లిపోయాడు. బ్రహ్మను అలా గౌరవించిన కృష్ణుడు పూర్వం తమ బాగు చెడి మరలి వచ్చిన దూడలను బాలగోపాలకులను గ్రహించి, వాళ్ళందరినీ యిసుకదిబ్బదగ్గరకు చేర్చాడు. ఈ విధంగా

**క. క్రించుఁదనంబున విధి దము, వంచించిన యేఁడు గోపవరనందను లొ**
**క్కించుక కాలంబుగ నీ, క్షించిరి రాజేంద్ర! బాలకృష్ణునిమాయన్. 580**

**ప్రతి :** రాజ+ఇంద్రా!= ఓ రాజా; క్రించు+తనంబునన్= మోసకారితనంతో; విధి= బ్రహ్మ; తమున్= తమను; వంచించిన= మాయచేసి దాచినట్టి; ఏఁడు= ఒక సంవత్సరం; గోపవరనందనులు= ఉత్తమ గోపాలకుల బిడ్డలు; బాలకృష్ణుని మాయన్= శ్రీకృష్ణమాయచే; ఒక్క+ఇంచుక కాలంబు+కన్= ఎంతో స్వల్పసమయంగా; వీక్షించిరి= చూశారు, భావించారు.

**తా :** పరీక్షిన్మహారాజా! బ్రహ్మ మోసంతో తమను మాయచేసి దాచి ఉంచిన సంవత్సరకాలాన్ని ఆ గోపబాలురు శ్రీకృష్ణ మాయవల్ల ఎంతో అల్పసమయంగా, రెప్పపాటు కాలంలా భావించారు.

**ఆ. ఏ మహాత్మమాయ నీ విశ్వమంతయు, మోహితాత్మక మయి మునిఁగియుండు**
**నట్టి విష్ణుమాయ నర్భకు లొక్క యేఁ, డెఱుఁగకుండి రనుట యేమి వెఱఁగు? 581**

**ప్రతి :** ఏ మహా+ఆత్మ మాయన్= ఏ మహామహిమగలవాని మాయచేత; ఈ విశ్వము+అంతయున్= కంటికి కనబడే ఈ ప్రపంచమంతా; మోహిత+ఆత్మకము+అయి= మోహం పొందినట్లుగా మారి; మునిఁగి ఉండున్= అణగి ఉంటుందో; అట్టి= అటువంటి; విష్ణుమాయన్= విష్ణుమూర్తి మాయచేత; అర్భకులు= పిల్లలు; ఒక్క ఏఁడు= ఒక సంవత్సరం; ఎఱుఁగక ఉండిరి= తామున్నట్లు తెలుసుకోలేక ఉన్నారు; అనుట= అనడం; ఏమి వెఱఁగు= ఏమాశ్చర్యం! ఆశ్చర్యమేమీ కాదనుట.

**తా :** ఈ విశాలవిశ్వమంతాకూడా ఏ మహామహిమాన్వితుడైన విష్ణువుయొక్కమాయలో మోహం చెంది మునిగిపోయి ఉంటుందో, అట్టి భగవంతునిమాయవలననే, ఈ గోపబాలురుకూడా ఒక సంవత్సరకాలం తాము దాగి ఉన్నారన్న విషయం తెలుసుకోలేక పోయారనడంలో ఆశ్చర్యమేముంది?

**వ. అప్పుడు. 582**

**ప్రతి :** అప్పుడు= ఆ సమయంలో...

**మ. 'చెలికాఁడా! యరుదెంచితే యిచటికిన్? సేమంబునం గ్రేపులున్**
**నెలవుల్ సేరె నరణ్యభూమివలనన్ నీ వచ్చునందాఁకఁ జ**

**ల్దులు వీ రించుక యెవ్వరుం గుడువ, రాలోకింపు, ర' మ్మంచు నా**
**జలజాక్షుండు నగన్ భుజించి రచటన్ సంభాషలన్ డింభకుల్. 583**

**ప్రతి :** డింభకులు= గొల్లబాలకులు; చెలికాఁడా!= స్నేహితుడా; ఇచటికిన్= ఈ చోటికి; అరుదెంచితే= వచ్చావా?; క్రేపులున్= దూడలుకూడా; సేమంబునన్= క్షేమంగా; నెలవుల్ చేరెన్= వాటి వాటి స్థానాలకు చేరాయి; అరణ్య భూమి వలనన్= అడవి ప్రదేశంనుండి; నీ వచ్చునందాఁకన్= నీవు వచ్చునంతవరకు; వీరు ఎవ్వరున్= ఇక్కడున్న నీ చెలికాండ్రైన ఈ గోపబాలు రెవ్వరూ కూడా; ఇంచుక= కొంచెమైనా; చల్దులు= చద్ది అన్నాలు; కుడువరు= తిన్నవారుకారు; ఆలోకింపుము= చూడు; రమ్ము= రా; అంచున్= అంటూ; ఆ జలజ+అక్షుండు= పద్మంవంటి నేత్రాలుగల శ్రీకృష్ణుడు; నగన్= వారి మాటలు విని నవ్వుతూ ఉంటే; అచటన్= ఆ ఇసుకదిబ్బమీద; సంభాషలన్= ముచ్చటలాడుకుంటూ; భుజించిరి= చల్దులు తిన్నారు.

**తా :** ఆ గొల్లపిల్లలందరూ కృష్ణుణ్ణి చేరి మిత్రమా! వచ్చావా! మన దూడలన్నీ అడవి మృగాల బాధలేకుండా క్షేమంగా వాటి స్థానాలను చేరుకున్నాయి. నీవు దూడలను వెదకడానికి వెళ్లావు కదా! నీవు వచ్చేవరకూ ఈ పిల్లలెవరూ కూడా కొంచెమైనా చల్దులు తినలేదు చూడు. రా! అంటూ శ్రీకృష్ణుడు నవ్వుతూ ఉండగా అక్కడ వారంతా ముచ్చటలాడుకుంటూ, చల్ది తిన్నారు.

**వ. ఇట్లు బాలకులతోడఁజల్ది గుడిచి వారలకు నజగరచర్మంబు సూపుచు వనంబునుండి తిరిగి. 584**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; బాలకుల తోడన్= గొల్ల పిల్లలతో; చల్ది కుడిచి= చద్ది తిని; వారలకున్= ఆ పిల్లలందరికీ; అజగరచర్మంబున్= ఆ కొండచిలువతోలును; చూపుచున్= చూపిస్తూ; వనంబునుండి= అడవి నుండి; తిరిగి= మరలివస్తూ..

**తా :** ఈ రీతిగా సరదాగా మాట్లాడుకుంటూ, ఆ గొల్లబాలురతో కలిసి చల్ది ఆరగించి, దారిలో తానింతకు మునుపు కొండచిలువరూపంలో వచ్చిన అఘాసురుణ్ని సంహరించి ఉండగా అక్కడ పడి ఎండిన ఆ కొండచిలువతోలును చూపిస్తూ అడవినుండి మరలివస్తూ

**పంచచామరము**

**ప్రసూనపింఛమాలికా ప్రభావిచిత్రితాంగుఁడుం**
**బ్రసిద్ధశృంగవేణునాదపాశబద్ధలోకుఁడుం**
**బ్రసన్నగోపబాలగీతబాహువీర్యుఁడయ్యు ను**
**ల్లసించి యేఁగె గోపకుల్ సెలంగి చూడ మందకున్. 585**

**ప్రతి :** ప్రసూన పింఛ మాలికా ప్రభా విచిత్రిత+అంగుఁడున్= పూలు, నెమలిపింఛం, వనమాలల కాంతులతో విరాజిల్లే శరీరం కలవాడును; ప్రసిద్ధ శృంగ వేణునాద పాశబద్ధ లోకుఁడున్= లోకానికి బాగా పరిచయంగల కొమ్ముబూరా, పిల్లన గ్రోవి ఊదడంద్వారా కలిగిన నాదమనే తాడుకు లేదా పాశానికి వశమైపోయిన లోకంకలవాడును; ప్రసన్న గోపబాలగీత బాహువీర్యుఁడు= గోపబాలురగీతాలతో సంతోషపడిన భుజపరాక్రమం కలవాడు; అయ్యును= అయి కూడా; ఉల్లసించి= సంతసించి; గోపకుల్+చెలంగి= గొల్లవాండ్రంతా ఆనందంతో చెలరేగి; చూడన్= చూస్తూ ఉండగా; మందకున్= గొల్లపల్లెకు; ఏఁగెన్= వెళ్ళెను.

**తా :** శ్రీకృష్ణుడు తలలో పూలు, నెమలి పింఛం ధరించాడు. వాటి కాంతులు అంతటా ప్రతిఫలించి అతని శరీరభాగాలను అలంకరిస్తున్నాయి. కృష్ణుని కొమ్ముబూరామోత, అతని వేణుగానం అందరికీ పరిచయమైనవి. అవి వినపడగానే లోకమంతా

పరవశమై ఆకర్షింపబడుతుంది. గోపబాలురు సంతోషంతో కృష్ణుని బాహుబలాన్ని స్తుతించారు. కృష్ణుడు గోపబాలురతోకూడి ఉల్లాసంగా మందకు చేరుకుంటూ ఉంటే గోపకులందరూ ఆనందించారు.

**విశే :** పంచచామరవృత్తంలో– జ–ర–జ–ర–జ–గ అనే గణాలుంటాయి. యతినియమం–1–10 అక్షరాలు. ప్రాసనియమం ఉంటుంది.

**వ. ఆ సమయంబున. 586**

**ప్రతి :** ఆ సమయంబునన్= అలా ముందుకు వస్తున్నప్పుడు...

**క. పెనుఁబాము దమ్ము మ్రింగిన, మన నందసుతుండు పాము మర్దించి మమున్**
**మనిచె నరణ్యములోపల, నని ఘోషించిరి కుమారు లాఘోషములోన్. 587**

**ప్రతి :** పెను+పాము= పెద్ద కొండచిలువ; తమ్మున్+మ్రింగినన్= తమను మింగివేయగా; మన నందసుతుండు= మన నందుని కొడుకైన శ్రీకృష్ణుడు; పామున్= ఆ కొండచిలువను; మర్దించి= చంపి; అరణ్యము లోపలన్= అడవిలో; మమున్ మనిచెన్= మా అందరినీ కాపాడాడు; అని= అంటూ; కుమారులు= గొల్లపిల్లలు; ఆ ఘోషములోనన్= ఆ గొల్లపల్లెలో; ఘోషించిరి= చాటినట్లుగా, పెద్దగా చెప్పారు.

**తా :** అలా మందకు కృష్ణుడు గొల్లపిల్లలతో వస్తూ ఉంటే ఆ గోపబాలురందరూ, అరణ్యంలో మా అందరినీ ఒక కొండచిలువ మింగేస్తే నందుని కొడుకైన ఈ చిన్ని కృష్ణుడు ఆ కొండచిలువను చంపి, మా అందరినీ ప్రాణాలతో కాపాడాడు అంటూ గొల్లపల్లె అంతా చాటి చెప్పారు.

**వ. అనిన విని నరేంద్రుండిట్లనియె. 588**

**ప్రతి :** అనినన్= శుకమహర్షి ఈ రీతిగా చెప్పగా; విని= విన్నవాడై; నర+ఇంద్రుడు= నరపతి అయిన పరీక్షిన్మహారాజు; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** శుకమహర్షిద్వారా విషయం అంతా విన్న పరీక్షిన్మహారాజు శుకమహర్షితో తిరిగి ఇలా అన్నాడు.

**క. 'కని మనిచి యెత్తి పెంచిన, తనుజన్ములకంటె నందతనయుం డా ఘో**
**ష నివాసులకు మనోరం, జనుఁ డెట్లయ్యెను? బుధేంద్ర! చను నెఱిఁగింపన్' 589**

**ప్రతి :** బుధ+ఇంద్ర= ఓ పండిత శ్రేష్ఠా!; కని, మనిచి, ఎత్తి, పెంచిన= ప్రసవించి, కాపాడి, ఎత్తుకొని, పెంచి పోషిస్తున్న, తనుజన్ములకంటెన్= కొడుకులకంటె; (తను జన్ములు= తన శరీరం నుండి పుట్టినవారు); నంద తనయుండు= నందుని కొడుకైన శ్రీకృష్ణుడు; ఘోషనివాసులకున్= ఆ గొల్లపల్లెలో ఉన్న వారందరికీ; మనస్+రంజనుఁడు= మనస్సులను ఆనందింపజేసే వాడుగా; ఎట్లు+అయ్యెను= ఎలా అయ్యాడు!; ఎఱిఁగింపన్ చనున్= నా కిది తెలియజేయ దగును.

**తా :** పండితులలో శ్రేష్ఠుడవైన ఓ శుకమహర్షీ! ఆ గొల్లపల్లెలోని గొల్లవారి కందరికీ తాము కని, చక్కగా చూస్తూ, ఎత్తుకుంటూ, పెంచుతున్న తమ కన్నకొడుకుల కన్నా నందగోపునికొడుకైన శ్రీకృష్ణుడు అంత ప్రేమపాత్రుడెలా అయ్యాడో తెలియజేయండి.

**వ. అనిన శుకుం డిట్లనియె. 590**

**ప్రతి :** అనినన్= ఇలా పరీక్షిన్మహారాజు అడుగగా; శుకుండు= శుకమహర్షి; ఇట్లు= ఇలా; అనియెన్= పలికాడు.

**తా :** పరీక్షిన్మహారాజు ఎంతో ఆశ్చర్యంతో పై విధంగా అడిగేసరికి శుకమహర్షి దానికి సమాధానం చెప్పనారంభించాడు.

**సీ. అఖిలజంతువులకు నాత్మవల్లభమైన, భంగి బిడ్డలు నిండ్లుఁ బసిఁడి మొదలు**
**వస్తువు లెవ్వియు వల్లభంబులు గావు, సకలాత్మకుండైన జలజనేత్రుఁ**
**డఖిల జంతువులకు నాత్మ గావున ఘోషవాసుల కెల్లను వల్లభత్వ**
**మునను మిక్కిలి యొప్పె మూఁడులోకములకు హితము సేయఁగ జలజేక్షణుండు**

**ఆ. మాయతోడ మూర్తిమంతుఁడై యొప్పారుఁ, గలఁ డతండు నిఖిలగణములందు**
**భవతిధాతు వెట్లు భావార్థమై సర్వ, ధాతు గణమునందుఁ దనరునట్లు. 591**

**ప్రతి :** అఖిల జంతువులకున్= సమస్త ప్రాణికోటికి; ఆత్మవల్లభము+అయిన భంగిన్= తనకు తాను ఇష్టమైనట్లు; బిడ్డలు= పిల్లలు; ఇండ్లు= గృహాలు; పసిఁడి= బంగారం; మొదలు వస్తువులు+ఎవ్వియున్= మొదలైన ఏ వస్తువులు కూడా; వల్లభంబులు కావు= ప్రియమైనవి కావు; సకల+ఆత్మకుండు+ఐన= సర్వాత్మ స్వరూపుడైన; జలజనేత్రుఁడు= పద్మంవంటి నేత్రాలు గల శ్రీకృష్ణుడు; అఖిల జంతువులకును= ఎల్ల ప్రాణులకు; ఆత్మ కావునన్= ప్రాణం కాబట్టి; ఘోషవాసులకున్+ఎల్లను=గొల్లపల్లెలో ఉండే వారందరికీ; వల్లభత్వమునను= ప్రియరూపంతో; మిక్కిలి+ఒప్పెన్= చక్కగా వెలుగొందినాడు; జలజు+ఈక్షణుండు= పద్మాక్షుడైన శ్రీకృష్ణుడు; మూఁడు లోకములకున్= స్వర్గ మర్త్య పాతాళలోకాలకు; హితము+చేయన్+కన్=మేలు చేయడానికి; మాయతోడన్= ప్రకృతితో కలసి; మూర్తిమంతుఁడు+ఐ= శరీరాన్ని ధరించినవాడై; ఒప్పారున్= ప్రకాశిస్తున్నాడు; భవతి ధాతువు+ఎట్లు= భూ ధాతువు ఎలాగైతే; భావ+అర్థమై= భావార్థము అయి 'ఉండుట' అన్న అర్థంతో క్రియావాచకంగా; సర్వధాతు గణమున్+అందున్= (భ్వాది, అదాది, జుహోత్యాది, దివాది, తుదాది, స్వాది, రుధాధి, తనోత్యాది, క్ర్యాది, చురాది అనే దశగణ) అన్ని ధాతు సమూహాలలో; ఎట్లు= ఏ విధంగా; భావ+అర్థమై= భావార్థమై; తనరున్= ఒప్పుతుందో; అట్లు అతండు= అలా ఆ భగవంతుడు; నిఖిల గణముల+అందున్= ఎల్ల జీవసమూహంలో; కలఁడు= ఉన్నాడు.

**తా :** శుకుడు పరీక్షిన్మహారాజుతో ఇలా చెపుతున్నాడు "సృష్టిలోని సకలజీవరాశికి తనకు తాను ప్రియమైనట్లు తమ బిడ్డలుగాని, ఇండ్లుగాని, బంగారంవంటి వస్తువులు కాని ఏవీకూడా ప్రియం కావు. సకల ప్రాణికోటికీ పరమాత్ముడే ప్రాణం కాబట్టి, ఈ గొల్లపల్లెలోని వారందరికీకూడా అతడు ప్రేమాస్పదుడైనాడు. ముల్లోకాలకు మేలు చేయడానికే భగవంతుడు ప్రకృతిరూపమాయతో కలిసి దేహధారియై, క్రియారూపాల్లో, భవతి, అనే భూధాతువు ఎలాగైతే ఇతర ధాతుగణాలకు ప్రధానంగా అన్వయిస్తూ ఒప్పుతోందో అలాగే ఎల్ల జీవరాశులలో ఉన్నాడు".

**క. శ్రీపతి పద మనునావను, బ్రాపించి భవాబ్ధి వత్సపదముగ ధీరుల్**
**రూపించి దాఁటి చేరుదు, రాపత్పదరహితు లగుచు నమృతపదంబున్. 592**

**ప్రతి :** శ్రీపతిపదము= శ్రీమన్నారాయణుని పాదం; అను నావను= అనే ఓడను; ప్రాపించి= పొంది; ధీరులు= ఆత్మ, అనాత్మ జ్ఞానం కలిగిన జ్ఞానులు; భవ+అబ్ధిన్= జన్మ అనే సముద్రాన్ని; వత్సపదముగన్= లేగదూడ ఒక్క అడుగు వేసి దాటునట్లు;

రూపించి= భావించి; దాఁటి= ఆ భవసాగరాన్ని దాటి; ఆపత్+పద రహితులు అగుచున్= దుఃఖంవంటి ఆపదల స్థానం ఏదీ లేనివారై; అమృతపదంబున్= మోక్షపదాన్ని; చేరుదురు= చేరుకుంటారు.

**తా :** విష్ణుమూర్తిపాదం అనే పడవను ఆశ్రయించిన సుజ్ఞానులు ఒక చిన్నదూడ ఒక అంగవేసి దాటినట్లు, ఈ భవసాగారాన్ని దాటి ఏ ఆపదలూ లేని వారై, మోక్షపదాన్ని చేరుకుంటారు.

**ఆ. అఘునిఁ జంపి కృష్ణుఁ డాప్తులుఁ దానును, జల్ది గుడిచి జలజసంభవునకుఁ**
**జిద్విలాసమైన చెలువు సూపిన కథఁ, జదువ వినినఁ గోర్కి సంభవించు. 593**

**ప్రతి :** కృష్ణుఁడు= శ్రీకృష్ణుడు; అఘునిన్ చంపి= అఘాసురుని సంహరించి; ఆప్తులున్= తన కెంతో ప్రియమైన గోపబాలురూ; తానునూ= తానూ; చల్ది కుడిచి= చల్ది ముద్దను తిని; జలజసంభవునకున్= పద్మభవుడైన బ్రహ్మకు; చిద్విలాసము+ఐన= తన చిత్ స్వరూప లీలా విశేషాలన్నిటితో కూడిన; చెలువు చూపిన కథ= తన అందాన్ని కనబరచిన వృత్తాంతాన్ని; చదువన్= పఠింపగా; వినినన్= శ్రవణం చేయగా; కోర్కి= కోరిక; సంభవించున్= నెరవేరుతుంది.

**తా :** కృష్ణుడు అఘాసురుణ్ణి సంహరించడం, తన కెంతో ప్రేమాస్పదమైన గోపబాలురతో చల్ది తినడం, పద్మసంభవుడైన బ్రహ్మకు తన లీలలను - బ్రహ్మ దూడలను పిల్లలను దాచినా, ఆ విషయాన్ని కృష్ణుడెలా నిర్వహించాడో అనే వృత్తాంతాన్ని చదివిన వారికీ, విన్నవారికీ వారికోరిక నెరవేరుతుంది. (ఇది ఫలశ్రుతిగా అన్నమాట.)

**వ. అని చెప్పి మఱియు వ్యాసనందనుం డిట్లనియె. 594**

**ప్రతి :** అని చెప్పి= అలా చెప్పి; మఱియున్= ఇంకా; వ్యాసనందనుండు= వ్యాసమహర్షి కుమారుడైన శుకయోగీంద్రుడు; ఇట్లు అనియెన్= ఇలా అన్నాడు.

**క. రాగంబున బలకృష్ణులు, పౌగండవయస్సు లగుచుఁ బశుపాలకతా**
**యోగంబున బృందావన, భాగంబునఁ గాచి రంతఁ బశువుల నధిపా! 595**

**ప్రతి :** అధిపా= ఓ రాజా!; బలకృష్ణులు= బలరామకృష్ణులిరువురు; రాగంబునన్= ఆసక్తితో; పౌగండవయస్సులు+అగుచున్= ఆరేండ్ల వయస్సు గలవారై; పశుపాలకతా యోగంబునన్= పశులను మేపే వృత్తితో; అంతన్= అంతటా; బృందావనభాగంబునన్= గొల్లవారు నివసించే బృందావనం ప్రాంతంలో; పశువులన్= గోవులను; కాచిరి= మేపారు.

**తా :** మహారాజా! బలరాముడు శ్రీకృష్ణుడు ఎంతో ఆసక్తితో ఆయిదేండ్లు దాటి పౌగండమనే ఆరేళ్ళ వయస్సులో ఉన్నవారై, పశువులను మేపే గోపాలకుల వృత్తితో ఆ బృందావన ప్రాంతంలో పశువులను మేపారు.

**విశే :** పరీక్షిత్తు శుకునితో "ఆయిదేండ్లుకౌమార మటమీద".... అనే పద్యంలో (488వ. పద్యం) అయిదేండ్ల వాడైన అబ్జాక్షుచరితంబు పౌగండమని గోపబాలురెల్ల దలతు రంటివే! యెట్లుదలతువారలు, అని అడగడంతో తరువాతి కథ అంతా నడిచింది.

**వ. అయ్యెడఁ గృష్ణుం డొక్కనాఁడు రేపకడ లేచి, వేణువు పూరించి బలభద్ర సహితుండై గోపకుమారులు దన్ను బహువారంబులు గైవారంబులు సేయ మ్రోల నాలకదుపుల నిడికొని నిరంతర ఫల కిసలయ**

**కుసుమంబులును, గుసుమ మకరంద నిష్యంద పానానందదిందిందిర కదంబంబును, గదం బాది నానాతరు లతాగుల్మసంకులంబును, గులవిరోధరహిత మృగపక్షి భరితంబును, భరితసరస్సరోరుహపరిమిళిత వనంబును నయిన వనంబుఁ గని యందు వేడుకం గ్రీడింప నిశ్చయించి వెన్నుం డన్న కిట్లనియె. 596**

**ప్రతి :** ఆ+ఎడన్= ఆ సమయంలో; ఒక్కనాఁడు= ఓ రోజున; కృష్ణుండు= శ్రీకృష్ణుడు; రేపకడన్+లేచి= ప్రొద్దుటే లేచి; వేణువు పూరించి= పిల్లనగ్రోవి ఊది; బలభద్ర సహితుండు+ఐ= అన్న బలరామునితో కూడినవాడై; గోపకుమారులు= గోపబాలురు; తన్నున్= తనను; బహువారంబులు= పెక్కుసార్లు; కైవారంబులు+చేయన్= పొగడగా; మ్రోలన్= ఎదుట; ఆలకదుపులన్= ఆవుల మందలను; ఇడికొని= ఉంచుకొని; నిరంతర ఫల కిసలయ కుసుమంబులును= ఎల్లప్పుడూ అంటే అన్ని కాలాల్లోనూ, పండ్లు, చివుళ్ళు, పూవులును; కుసుమ మకరంద నిష్యంద పాన, ఆనందత్, ఇందిందిర కదంబంబును= పూవులనుండి జారుతున్న తేనెను త్రాగడంతో సంతోషిస్తున్న తుమ్మెదల సమూహమును; కదంబ+ఆది నానా తరు, లతా, గుల్మ, సంకులంబును= కడిమి చెట్లు మొదలైన పలు విధాలైన చెట్ల, తీగల, పొదలతో, దట్టమైనదియు; కులవిరోధ రహిత మృగ పక్షి భరితంబును= సహజజాతివైరం లేని సింహశార్దూలాదిమృగాలు, నెమళ్ళు, చిలుకలు మొదలగు పక్షులతో నిండి ఉన్నదియు; భరిత సరస్సరోరుహ పరిమిళిత వనంబును= నిండి ఉన్న కొలంకులయందలి పద్మాల, కలువల వాసనతో నిండిన నీళ్ళు గలది; అయిన= అయినట్టి; వనంబున్+కని= అడవిని చూచి; అందున్= ఆ అడవిలో; వేడుకన్= సరదాగా; క్రీడింపన్= ఆటలాడాలని; నిశ్చయించి= తలచినవాడై; వెన్నుండు= శ్రీకృష్ణుడు; అన్నకున్= బలరామునితో; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** ఒకనాడు కృష్ణుడు సూర్యోదయానికి ముందే మేల్కొని, వేణుగానం చేశాడు. గోపకుమారులందరూ వెంటనే మేల్కొని, లేగల మందలను తోలుకొని కృష్ణునివద్దకు చేరారు. కృష్ణుడు బలరామునితో కలసి గోపబాలకులు తనను పదే పదే పొగడుతూ ఉండగా, ఆవుల మందలను తోలుకుంటూ అడవికి బయలుదేరాడు. ఆ అడవిలో అన్ని ఋతువులలోనూ పళ్ళు, పూలు, చిగుళ్లు లభిస్తాయి. పూవులలో తేనెలు పొంగిపొరలుతూ ఉంటే ఆ తీయని తేనెలను తాగడానికి వచ్చి, జుమ్మ జుమ్మని ధ్వనులు చేసే తుమ్మెదల గుంపులు ఆనందం కలిగిస్తూ ఉన్నాయి. కడిమి మొదలైన అనేకవిధాల చెట్లు, తీగెలు, పొదరిండ్లు ఆ అడవినిండా అడుగడుగునా ఉన్నాయి. అక్కడి జంతువులు, పక్షులు తమ తమ జాతి సహజమైన శత్రుత్వాలను మరచిపోయి ప్రవర్తిస్తూ ఉన్నాయి. అక్కడి సరస్సులలోని నీళ్ళు తామరపూల పుప్పొడిచేత చక్కని పరిమళం వెదజల్లుతూ ఉన్నాయి. ఆ అడవిలో ఉత్సాహంగా ఆడుకోవాలని కృష్ణుడు నిశ్చయించుకున్నాడు. అన్నగారైన బలరామునితో ఇలా అన్నాడు.

**శా. శాఖాపుష్పఫలప్రభారనతలై చర్చించి యో దేవ! మా**
**శాఖిత్వంబు హరింపు' మంచు శుకభాషన్ నీ కెఱింగించుచున్**
**శాఖాహస్తములం బ్రసూనఫలముల్ సక్కన్ సమర్పించుచున్**
**శాఖిశ్రేణులు నీపదాబ్జముల కోజన్ మ్రొక్కెడిం జూచితే! 597**

**ప్రతి :** శాఖా పుష్పఫలప్రభారనతలు+ఐ= కొమ్మలయొక్క, పూవులయొక్క, పండ్లయొక్క అధికమైన బరువుచేత వంగినవై; చర్చించి= ఆలోచించి; ఓ దేవ!= ఓ స్వామీ; మా శాఖిత్వంబున్= మా వృక్షజన్మను; హరింపుము= పోగొట్టుము; అంచున్= అంటూ; శుకభాషన్= చిలుక పలుకలచేత; నీకున్+ఎఱింగించుచున్= నీకు తెలియజేస్తూ; శాఖాహస్తములన్= కొమ్మలనే చేతులతో; ప్రసూనఫలముల్= పూలు పండ్లు; చక్కన్= ఒప్పిదంగా; సమర్పించుచున్= భక్తి భావంతో ఇస్తూ; శాఖిశ్రేణులు=

ఈ చెట్లపంక్తులు; నీ పద+అబ్జములకున్= నీ పద్మాలవంటిపాదాలకు; ఓజన్= వరుసగా; మ్రొక్కెడిన్= నమస్కరిస్తున్నాయి; చూచితే= చూశావా?

**తా :** ఆ వనంలో చెట్లన్నీ కొమ్మల, పూవుల, పండ్ల అధికభారంతో బాగా వంగి ఉన్నాయి. కొమ్మలమీద చిలుకలు అందంగా పలుకుతున్నాయి. ఈ దృశ్యాన్ని చూచిన కృష్ణుడు దానిని అందంగా ఊహిస్తూ, అన్న బలరామునితో ఇలా అంటున్నాడు. అన్నా! చూశావా! ఇలా ఈ భారంతో వంగిన వృక్షాలు చిలుకపలుకుల నెపంతో, సృష్టిలో చరించలేని స్థావర రూపమైన మా యీ వృక్షత్వాన్ని పోగొట్టమంటూ నీకు తెలియజేస్తున్నాయి. ఎలా? కొమ్మలనే తమ హస్తాలతో నీకు పండ్లూ, పూలూ సమర్పిస్తూ ఈ చెట్లన్నీ నీ పాదపద్మాలకు మొక్కుతున్నాయి అన్నాడు.

**సీ. నిఖిలపావనమైన నీ కీర్తిఁ బాడుచు నీ తుమ్మెదలు వెంట నేగుదెంచె**
**నడవిలో గూఢుండ వైన యీశుఁడ వని ముసరి కొల్వఁగ వచ్చె మునిగణంబు**
**నీలాంబరముతోడ నీవు జీమూతమ వని నీలకంఠంబు లాడఁ దొడఁగెఁ**
**బ్రియముతోఁ జూచు గోపికలచందంబున నినుఁ జూచె నదె హరిణీచయంబు**

**ఆ. నీవు విందవనుచు నిర్మలసూక్తులు, వలుకుచున్న విచటఁ బరభృతములు**
**నేఁడు విపినచరులు నీవు విచ్చేసిన, ధన్యులైరి గాదె తలఁచి చూడ. 598**

**ప్రతి :** నిఖిల పావనము+ఐన= అంతటినీ, అన్నిటినీ పవిత్రం కావించే; నీ కీర్తిన్+పాడుచున్= నీ యశస్సును గానంచేస్తూ; ఈ తుమ్మెదలు= ఈ భ్రమరాలు; వెంటన్ ఏగు+తెంచెన్= నీ వెంటబడి వస్తున్నాయి; అడవిలోన్= ఈ అరణ్యంలో; గూఢుండవు+ఐన= రహస్యంగా ఉన్నట్టి; ఈశుఁడవు+అని= పరమాత్మవంటూ; మునిగణంబు= మునిబృందం (లేదా ఋషిపక్షులు); ముసరి= ముసరుకొని; కొల్వ+కన్+వచ్చెన్= నిను సేవించడానికి వచ్చాయి(రు); నీల+అంబరముతోడన్= నల్లని వస్త్రంతో ఉన్న; నీవు; జీమూతమవు+అని= మేఘమని; నీలకంఠంబులు= నెమళ్ళు; ఆడన్+తొడఁగెన్= నృత్యం చేయనారంభించాయి; ప్రియముతోన్+చూచు= ప్రీతితో చూచే; గోపికలచందంబునన్= గోపకాంతలవలె; హరిణీచయంబు= ఆడుజింకలగుంపు; నినున్ చూచెన్ అదె= అదిగో నిన్నే చూస్తున్నాయి; నీవు విందవు+అనుచున్= నీవు అతిథివంటూ; పరభృతములు= కోకిలలు; ఇచటన్= ఇక్కడ; నిర్మలసూక్తులు= మంచిమాటలు; పలుకుచున్నవి= అంటున్నాయి; తలఁచి చూడన్= విచారించి చూస్తే; నేఁడు= ఈ దినాన; నీవు విచ్చేసినన్= నీ అంతటివాడు రాగా; విపినచరులు= అడవిలో సంచరించేవారు; ధన్యులు+ఐరి కాదె= కృతార్థులైరి కదా!

**తా :** ఈ తుమ్మెదలు తమ ఝుంకారంతో అన్నిటిని పవిత్రం చేయగల నీ యశస్సును గానంచేస్తూ నీవెంట వస్తున్నాయి. అరణ్యంలో రహస్యంగా ఉన్న ఈశ్వరుడవు నీవేనంటూ మునులబృందం లేదా ఋషిపక్షులు చుట్టూ చేరి సేవించడానికి వస్తున్నా(రు)యి. నీవు నల్లని వస్త్రం ధరించడంతో నీలమేఘంలా ఉన్న నిన్ను చూచి నెమళ్లు నాట్యం చేయడం ప్రారంభించాయి. గోపవనిత లెలా ప్రియంతో చూస్తారో అలాగే ఈ ఆడులేళ్ళుకూడా నిన్ను చూస్తున్నాయి. నీవు మా అతిథివి అంటూ కోకిలలు మంచి పలుకులు వినిపిస్తున్నాయి. ఈ వనచరులందరూ నీవు అడవికి రావడంతో ధన్యులయ్యారు కదా!

**విశే :** పరీభృతములు= ఇతరులచే పెంచబడేవి అని వ్యుత్పత్తి. కోయిలలకు గ్రుడ్లు పెట్టడం తెలుసుకానీ వాటిల్ని పొదగడం తెలీదు. కాకికి తానెన్ని గ్రుడ్లు పెట్టిందో తెలీదు. కోయిల తన గ్రుడ్లు తీసుకెళ్లి, కాకి గ్రుడ్లతో చేరుస్తుంది. కాకి అన్నిటినీ

పొదుగుతుంది. అవి పిల్లలయ్యాక కొన్నాళ్లకు 'కుహూ' అంటూ కోయిల పిల్ల లరుస్తాయి. అప్పుడు కోయిల వెళ్లి వాటిల్ని తెచ్చుకొంటుంది. ఇలా కాకులచే పెంచబడేవి కనుక కోయిలలకు పరభృతాలని పేరు.

**సీ. నీ పాదములు సోఁకి నేఁడు వీరుత్తృణపుంజంబుతో భూమి పుణ్య యయ్యె**
**నీ నఖంబులు దాఁకి నేఁడు నానాలతా తరుసంఘములు గృతార్థంబు లయ్యె**
**నీ కృపాదృష్టిచే నేఁడు నదీశైలఖగమృగంబులు దివ్యకాంతిఁ జెందె**
**నీ పెన్నురము మోవ నేఁడు గోపాంగనాజనములపుట్టువు సఫల మయ్యె**

**ఆ. నని యరణ్యభూమి నంకించి పసులను, మిత్రజనులు దాను మేపుచుండి**
**నలినలోచనుండు నదులందు గిరులందు, సంతసంబు మెఱయ సంచరించె. 599**

**ప్రతి :** నేఁడు= ఈ రోజున; నీ పాదములు సోఁకి= నీ అడుగులు తాకి; వీరుత్+తృణ పుంజముతోన్= చివురు కొమ్మలతో, పచ్చికల జొంపాలతో; భూమి= నేల, భూదేవి; పుణ్య అయ్యెన్= పవిత్రురాలయింది; నేఁడు; నీ నఖంబులు తాఁకి= నీ గోళ్ళు తగిలి; నానాలతాతరుసంఘంబులు= పలురకాల తీగలయొక్క, చెట్లయొక్క సముదాయాలు; కృత+ అర్థంబులు+ అయ్యెన్= ధన్యములయ్యాయి; నీ కృపాదృష్టిచేన్= నీ దయగల చూపుతో; నేఁడు; నదీ శైల ఖగ మృగంబులు= సెలయేళ్ళు, కొండలు, పక్షులు, జంతువులు; దివ్యకాంతిన్+చెందెన్= విశేష ప్రకాశాన్ని పొందాయి; నీ పెను+ఉరము మోవన్= నీ విశాలమైన హృదయం తగులగా; నేఁడు; గోప+అంగనాజనముల పుట్టువు= గొల్లవనితల జన్మ; సఫలము+అయ్యెన్= ఫలవంతం, చరితార్థం అయింది; అని= ఇలా అంటూ; అరణ్యభూమిన్= ఆ వనప్రదేశాన్ని; అంకించి= పొగడి; మిత్రజనులు= తన చెలికాండ్రబృందం; తాను= శ్రీకృష్ణుడు; పసులను= గోవులను; మేపుచున్+ఉండి= కాచుతూ; నలినలోచనుండు= పద్మనేత్రుడైన శ్రీకృష్ణుడు; నదుల+అందున్= ఏళ్లలోను; గిరుల+అందున్= కొండలలోను; సంతసంబు మెఱయన్= ఆనందం అతిశయింపగా; సంచరించెన్= విహరించాడు.

**తా :** కృష్ణుడు బలరాముడితో అన్నా! ఈనాడు నీ పాదస్పర్శతో చివురుకొమ్మలతో, పచ్చికగుబురులతో ఉండే ఈ నేల పవిత్రమయింది. నీ గోటి తాకిడిచే తీగల, చెట్లగుంపులన్నీ ధన్యత చెందాయి. నీ దయాదృష్టిచే లేళ్లు, యమునానది మొదలు గోవర్ధనాదిపర్వతాలు, హంస, శుక, పిక, మయురాలు, లేళ్ళు, నెమళ్ళు, కుందేళ్ళు మొదలగు జంతువులు విశిష్ట కాంతిని సంతరించుకున్నాయి. నీ విశాల వక్షఃస్థలం తగులగా గోపకాంతల పుట్టుక సఫలమయింది. ఇలా అంటూ ఆ అడవిలో తన గొల్ల చెలికాండ్రూ, తానూ పసులను మేపుకుంటూ, పద్మాక్షుడైన శ్రీకృష్ణుడు సెలయేళ్ళల్లో, కొండల్లో విహరించాడు.

**వ. మఱియు న య్యీశ్వరుండు. 600**

**ప్రతి :** మఱియున్= ఇంకా; ఆ+ఈశ్వరుండు= సర్వేశ్వరుండైన శ్రీకృష్ణుడు

**సీ. ఒకచోట మత్తాళియూథంబు జు మ్మని మ్రోయంగ జుమ్మని మ్రోయుచుండు**
**నొకచోటఁ గలహంసయూథంబు గూడి కేంకృతులు సేయంగఁ గేంకృతులు సేయు**
**నొకచోట మదకేకియూథంబు లాడంగ హస్తాబ్జములు ద్రిప్పి యాడఁ దొడఁగు**
**నొకచోట వనగజయూథంబు నడవంగ నయముతో మెల్లన నడువఁ జొచ్చుఁ**

**ఆ. క్రౌంచచక్రముఖరఖగము లొక్కొకచోటఁ, బలుక వానియట్ల పలుకుఁ గదిసి**
**పులుల సింహములను బొడగని యొకచోటఁ, బఱచు మృగములందుఁ దఱచుఁ గూడి. 601**

**ప్రతి :** ఒక చోటన్= ఓ తావున; మత్త+అళి యూథంబు= మదించిన తుమ్మెదల గుంపు; జుమ్మ+అని మ్రోయన్+కన్= జుమ్మని ధ్వని చేస్తుండగా; తానూ; జుమ్మని మ్రోయుచున్+ఉండున్= జుమ్మని ధ్వని చేస్తున్నాడు; ఒక చోటన్= మరొకచోట; కలహంసయూథంబు= రాజహంసలసమూహం; కూడి= గుమిగూడి; కేంకృతులు+చేయన్+కన్= 'కేం' అనే ధ్వనిచేస్తుండగా; తానూ; కేంకృతులు చేయున్= వాటిలాగే కేంకార ధ్వనులు చేస్తున్నాడు; ఒక చోటన్= ఇంకోచోట; మదకేకియూథంబు= మదించిన నెమళ్ళగుంపు; ఆడన్+కన్= నృత్యం చేస్తుండగా; హస్త+అబ్జములు= పద్మాలవంటి చేతులను; త్రిప్పి= తిప్పుతూ; ఆడన్+తొడఁగున్= నాట్యం చేస్తున్నాడు; ఒకచోటన్= మరొకచోట; వనగజయూథంబు= అడవిఏనుగులగుంపు; నడవన్+కన్= నడుస్తూవుంటే; నయముతోన్= మృదువుగా; మెల్లనన్= తిన్నగా; నడవన్+చొచ్చున్= నడుస్తున్నాడు; ఒక్క+ఒకచోటన్= ఒక్కొక్క ప్రదేశంలో; క్రౌంచ చక్రముఖర ఖగములు= బెగ్గురు పక్షులు, చక్రవాకాలు మొదలైన పక్షులు; పలుకన్= కూయగా; వాని అట్ల= ఆ పక్షులలాగే; కదిసి= చేరి; పలుకున్= పలుకుతాడు; ఒక చోటన్= వేరొకచోట; పులుల సింహాలను పొడగని= పులులను, సింహాలను చూచి; పఱచు మృగముల+అందున్= పరుగెత్తే జింకలతో; తఱచు కూడి= పలుమారు కలిసి; పఱచున్= పరిగెత్తుతాడు.

**తా :** అలా ఆ వనంలో విహరిస్తున్న కృష్ణుడు పూదేనెను తాగి మత్తెక్కిన తుమ్మెదలు జుమ్మని శబ్దం చేస్తూ ఉంటే తనూ జుమ్మని ధ్వని చేస్తున్నాడు. రాజహంసల కేంకారాలతో సమానంగా అతడూ కేంకారాలు చేస్తున్నాడు. నెమళ్లు నాట్యం చేస్తుండగా తానూ పద్మాల్లాంటి చేతులు తిప్పుతూ నాట్యం చేస్తున్నాడు. అడవి ఏనుగుల నడకలతో సమానంగా తానూ గజగమనుడవుతున్నాడు. క్రౌంచ, చక్రవాక పక్షులు కూస్తుంటే అలాగే తానూ పలుకుతున్నాడు. పులులు, సింహాలు తిరిగే చోట తానూ లేళ్ళలో కలిసి పరిగెడుతున్నాడు.

**వ. మఱియును. 602**

**ప్రతి :** మఱియును= ఇంకా కృష్ణుడు...

**సీ. రా పూర్ణచంద్రిక! రా గౌతమీ గంగ! రమ్ము భగీరథరాజతనయ!**
**రా సుధాజలరాశి! రా మేఘబాలిక! రమ్ము చింతామణి! రమ్ము సురభి!**
**రా మనోహారిణి! రా సర్వమంగళ! రా భారతీదేవి! రా ధరిత్రి!**
**రా శ్రీమహాలక్ష్మి! రా మందమారుతి! రమ్ము మందాకిని! రా శుభాంగి!**

**ఆ. యనుచు మఱియుఁ గలుగు నాఖ్యలు గల గోవు, లడవిలోన దూరమందు మేయ**
**ఘనగభీరభాషఁ గడునొప్పఁ జీరు నా, భీరజనులు వొగడఁ బెంపు నెగడ. 603**

**ప్రతి :** ఘనగభీరభాషన్= మేఘధ్వనిలా గంభీరమైన మాటలతో; కడున్ ఒప్పన్= ఎంతో ఒప్పునట్లుగా; ఆభీరజనులు= గొల్లవారు; పొగడన్= కొనియాడుతూ ఉండగా; పెంపు= గొప్పతనం; నెగడన్= మీరగా; పూర్ణచంద్రిక రా; గౌతమీ గంగా రా అంటూ; భగీరథరాజ తనయ, సుధాజలరాశి, మేఘబాలిక, చింతామణి, సురభి, మనోహారిణి, సర్వమంగళ, భారతీ దేవి,

ధరిత్రి, మహాలక్ష్మి, మందమారుతి, మందాకిని, శుభాంగి; అనుచున్= అంటూ; మఱియున్= ఇంకా; కలుగు ఆఖ్యలుగల= కలిగిన పేర్లున్న; గోవులు= ఆవులు; ఆ అడవిలోనన్= ఆ అరణ్యంలో; దూరము+అందున్= చాలా దూరంలో; మేయన్= మేత మేస్తూవుండగా; చీరున్= పిలుస్తుంటాడు.

**తా :** శ్రీకృష్ణుడు అరణ్యంలో దూరంగా మేస్తున్న ఆవుల నుద్దేశించి, వాటికి గల అందమైన పేర్లతో, మేఘ గంభీర స్వరంతో, గొల్లవారంతా తనను కొనియాడుతూ ఉంటే రా! రమ్మ! అంటూ గోవుల్ని పిలుస్తున్నాడు.

**విశే :** తెలుగువారు గో మహాలక్ష్మి అంటూ పూజించటం సంప్రదాయం. అలాగే పిల్లలకు కూడా భగవంతుని పేర్లు పెట్టడం, గోవులకు పేరుపెట్టుకోవడం, ఆ పేర్లతో వాటిల్ని పిలవడం పూర్వాచారం.

**క. కాంతారవిహారమ్ముల, శ్రాంతుండై గోపకాంకశయుఁడగు నన్నన్**
**సంతుష్టిఁ బొందఁ జేయు ని, రంతరకరచరణమర్శనాదుల నధిపా! 604**

**ప్రతి :** అధిపా!= రాజా!; కాంతారవిహారమ్ములన్= అడవిలో సంచరించడాలతో; శ్రాంతుండు+ఐ= అలసినవాడై; గోపక+అంక శయుఁడు+అగు= గొల్లవారి ఒడిలో పడుకొనేటటువంటి; అన్నన్= అన్న బలరాముణ్ణి; నిరంతర కర చరణ మర్శన+ఆదులన్= చేతులను పాదాలను పిసకడంతో; సంతుష్టిన్ పొందన్+చేయున్= సంతోషించేలా చేస్తున్నాడు.

**తా :** ఓ రాజా! అరణ్యంలో తిరగడంతో అలసిపోయి ఆ గోపాలకులతొడలపై పడుకునేవాడైన, అన్న బలరాముణ్ణి కృష్ణుడు గౌరవంగా కాళ్ళు, చేతులు ఒత్తుతూ సంతోషింప జేస్తున్నాడు.

**క. పాడుచు నాడుచు మందట, లాడుచు నొండొరులఁ దాఁకు నాప్తులఁ గని బి**
**ట్టాడుచుఁ జేతులు వ్రేయుచుఁ, గ్రీడింతురు నగుచు బలుఁడు గృష్ణుఁడు నొకచోన్. 605**

**ప్రతి :** పాడుచున్= పాటలు పాడుతూ; ఆడుచున్= ఆటలాడుతూ; మందటలు ఆడుచున్= సమీపంలో కూడి ఆడుతూ; ఒండొరులన్+తాఁకు= ఒకరి నొకరు తాకుతున్న; ఆప్తులన్+కని= తన చెలికాండ్రను చూచి; బిట్టు+ఆడుచున్= గట్టిగా ఆడుతూ; చేతులు వ్రేయుచున్= ఒకరిపై ఒకరు చేతులు వేసుకుంటూ; నగుచున్= నవ్వుకుంటూ; బలుఁడు= బలరాముడు; కృష్ణుఁడున్= కృష్ణుడూ; ఒకచోన్= ఒక చోట; క్రీడింతురు= ఆడుకుంటున్నారు.

**తా :** బలరామకృష్ణులు ఇద్దరూ ఒకచోట ఉండి, గోపాలకులు పాడుతూ ఆటలు ఆడుతూ ఒకరినొకరు తోసుకుంటూ, ఒకరిపై మరొకరు చేతులేసుకుంటూ ఉంటే తామూ వారితో కలిసి ఆడుకుంటున్నారు.

**వ. ఇవ్విధంబున. 606**

**ప్రతి :** ఈ+విధంబునన్= ఈ ప్రకారంగా ఆటపాటలలో మునిగి తేలుతూ...

**సీ. వేదాంతవీథుల విహరించు విన్నాణి, విహరించుఁ గాంతారవీథులందు**
**ఫణిరాజశయ్యపైఁ బవళించు సుఖభోగి పల్లవశయ్యలఁ బవ్వళించు**
**గురుయోగిమానసగుహలఁ గ్రుమ్మరు మేటి గ్రుమ్మరు నద్రీంద్రగుహలలోనఁ**
**గమలతోడఁ బెనఁగి కడు డయ్యు చతురుఁ డా భీరజనులతోడఁ బెనఁగి డయ్యు**

**ఆ. నఖిలలోకములకు నా(శయుండగుధీరుఁ, దలసి తరులనీడ నా(శయించు**
**యాగభాగచయము లాహరించుమహాత్ముఁ, డడవిలోని ఫలము లాహరించు. 607**

(ప్రతి : వేదాంతవీథులన్= వేద శిఖలైన ఉపనిషత్తుల మార్గంలో; విహరించు= సంచరించే; విన్నాణి= నేర్పరి; కాంతార వీథుల+అందున్= అడవి మార్గాలలో; విహరించున్= విహరిస్తున్నాడు; ఫణిరాజశయ్యపైన్= నాగులకు రాజైన ఆదిశేషుడు శయ్యగా; పవళించు= పడుకొనే; సుఖభోగి= సుఖాలను అనుభవించేవాడు; పల్లవశయ్యలన్= చిగురుటాకులే శయ్యగా ఏర్పరచుకొని; పవ్వళించున్= పడుకొంటున్నాడు; గురుయోగి మానస గుహలన్= లోకారాధ్యులైన పరాశర, వ్యాస, వసిష్ఠ, శుక, నారదాది (బ్రహ్మనిష్ఠుల మనస్సులనే గుహలయందు; క్రుమ్మరు మేటి= తిరుగాడే స్వామి; అద్రి+ఇంద్ర గుహలలోనన్= పెద్ద పర్వతగుహలలో; క్రుమ్మరున్= తిరుగుతున్నాడు; కమలతోడన్= శ్రీమహాలక్ష్మితో; పెనఁగి= శృంగారక్రీడలకుగా పెనుగులాడి; కడున్= మిక్కిలి; డయ్యు= అలసిపోయే; చతురుఁడు= నేర్పరి; ఆభీర జనులతోడన్ పెనఁగి= గొల్లవాం(డతో కలసి ఆడి; డయ్యున్= అలసిపోతున్నాడు; అఖిలలోకములకున్= లోకాలన్నిటికి; ఆ(శయుండు+అగు= ఆధారభూతుడైన; ధీరుఁడు= ధైర్యవంతుడు; అలసి= బడలి; తరులనీడన్= చెట్లనీడను; ఆశ్రయించున్= అండగొంటున్నాడు; యాగభాగచయములు= యజ్ఞాలలో సమర్పింపబడే (ప్రధాన హవిర్భాగాలను; ఆహరించు= ఆరగించే; మహా+ఆత్ముఁడు= భగవంతుడు; అడవిలోని ఫలములు= అరణ్యంలో దొరికే పండ్లను; ఆహరించున్= ఆహారంగా తింటున్నాడు.

**తా :** ఉపనిష(త్ప్రతిపాద్యుడుగా తిరిగే నేర్పరి అరణ్యంలో తిరుగుతున్నాడు. ఆదిశేషుడు శయనంగా పవళించే స్వామి చిగురుటాకుల పక్కపై పడుకుంటున్నాడు. గొప్ప గొప్ప యోగివరులైనవారిహృదయాలలో సంచరించే (ప్రభువు కొండ గుహలలో తిరుగాడుతున్నాడు. లక్ష్మీదేవితో సరస(క్రీడలాడి అలసిసొలసే శృంగారి గొల్లవాం(డతో ఆడి అలసిపోతున్నాడు. చతుర్దశభువనాధారుడైన ధీరుడు అలసి చెట్ల నీడను ఆ(శయిస్తున్నాడు. యజ్ఞంలో హవిర్భాగాన్ని ఆహారంగా స్వీకరించే యాగపురుషుడు అడవిలో దొరికే పండ్లను భుజిస్తున్నాడు.

**వ. ఆ సమయంబున. 608**

(ప్రతి : ఆ సమయంబునన్= అలా అడవిలో గోపాలురతో విహరిస్తున్న సమయంలో...

**సీ. అలసినచోఁ గొంద ఱతిమోదమున వీఁపు లెక్కించుకొని పోదు రేపు మెఱసి**
**సొలసి ని(ద్రించినచో నూరుతల్పంబు లిడుదురు కొందఱు హితవు గలిగి**
**చెమరించి యున్నచోఁ జిగురుటాకులఁ గొంద ఱొయ్యన విసరుదు రుత్సహించి**
**ద వ్వేఁగి నిలుచుచోఁ దడయక కొందఱు పదము లొత్తుదు రతిబాంధవమున,**

**ఆ. గోపవరులు మఱియుఁ గొందఱు (ప్రియమున, మాధవునకుఁ బెక్కుమార్గములను**
**బనులు సేసి రెల్లభవములఁ జేసిన, పాపసంచయములు భస్మములుగ. 609**

(ప్రతి : కృష్ణుడు; అలసినచోన్= అలసిపోతే; గోపవరులు కొందఱు= గొల్లవారు కొంతమంది; అతి మోదమునన్= మిక్కిలి సంతోషంతో; వీఁపులు+ఎక్కించుకొని= తమ వీపులపై ఎక్కించుకొని; ఏపు మెఱసి= సామర్థ్యం ఒప్పేటట్లుగా; పోదురు= వెళతారు; సొలసి= బడలి; ని(ద్రించినచోన్= ని(ద్రపోయినప్పుడు; హితవు కలిగి= మేలు కలిగించాలని; కొందఱు= కొంతమంది;

ఊరుతల్పంబులు= తమ తొడలనే పాన్పులు; ఇడుదురు= ఇస్తారు; చెమరించి ఉన్నచోన్= చెమట పట్టి ఉంటే; ఉత్సహించి= ఉత్సాహం పొంది; కొందఱు; చిగురు+ఆకులన్= చిగురుటాకులతో; ఒయ్యనన్= మెల్లగా; విసరుదురు= విసురుతారు; దవ్వు+ఏఁగి నిలుచుచోన్= దూరంగా వెళ్లి నిల్చుని ఉంటే; తడయక= ఆలసింపక; కొందఱు; అతి బాంధవమునన్= మిక్కిలి చుట్టరికంతో; పదములు+ఒత్తుదురు= పాదాలు పడతారు, ఒత్తుతారు; మఱియున్= ఇంకా; కొందఱు; గోపవరులు= గోపాలురు; ప్రియమునన్= ప్రేమతో; మాధవునకున్= శ్రీకృష్ణునికి; పెక్కుమార్గములను= అనేకవిధాలుగా; ఎల్లభవములన్= ఇది వరలో ఎత్తిన అన్నిజన్మలలో; చేసిన పాపసంచయములు= ఒనర్చిన పాపసముదాయాలు; భస్మములు+కన్= బూడిదై నశించిపోయేటట్లుగా; పనులు చేసిరి= సేవలు చేశారు.

**తా :** కృష్ణుడు అడవిలో అలా గోపాలురతో పశువుల్ని కాస్తున్న సమయంలో అలసి ఉంటే కొందరు గోపాలురు అతణ్ణి తమ వీపు మీద ఎక్కించుకుని పోతారు. బడలికతో నిద్రపోదామనుకుంటే మరికొందరు ప్రేమతో తమ తొడలనే పాన్పులుగా చేస్తారు. చెమట పట్టినట్లైతే సంతోషంతో చివురాకులతో విసరుతారు. దూరంగా వెళ్ళి నిల్చుంటే మిక్కిలి బంధుత్వంతో, స్నేహంతో, కొందరు పాదాలు పిసుకుతారు. ఇలా గోపాలకులు వాళ్ల పూర్వజన్మ లెన్నింటిలోనో చేసిన పాపాలన్నీ నశించిపోయేలా శ్రీకృష్ణునికి పరిపరివిధాల సేవలు చేస్తున్నారు.

**వ. అ య్యవసరంబున శ్రీదామనామధేయుండైన గోపాలకుండు రామకేశవులం జూచి యిట్లనియె. 610**

**ప్రతి :** ఆ+అవసరంబునన్= ఆ సమయంలో; శ్రీదామనామధేయుండు+ఐన= శ్రీదాముడు అనే పేరుగల; గోపాలకుండు= గొల్లవాడు; రామకేశవులన్ చూచి= బలరామకృష్ణులను చూచి; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** ఇలా గోపాలురందరూ శ్రీకృష్ణునికి పలు పలు విధాల సేవలుచేస్తూ, తమ జన్మలను పునీతం చేసుకుంటున్న సమయంలో శ్రీదాముడనే పేరు గల ఒక గోపాలకుడు బలరామకృష్ణులతో ఇలా అన్నాడు.

## ❖ గార్దభాకారుండైన ధేనుకాసురుని బలభద్రుఁడు వధించుట ❖

**క. దూరంబునఁ దాలతరు, స్ఫారం బగు వనము గలదు, పతితానుపత**
**ద్భూరిఫలసహిత మది, యే, ధీరులు సొరవెఱతు రందు ధేనుకుఁ డుంటన్. 611**

**ప్రతి :** దూరంబునన్= ఇక్కడికి చాల దూరంలో; తాలతరు= తాటిచెట్లచేత; స్ఫారంబు= విశాలం; అగువనము= అయిన అడవి; కలదు= ఉంది; అది= ఆ అడవి; పతిత= పడినదానిని; అనుపతత్= అనుసరించి పడుతున్న; భూరి= అధికమైన; ఫల= పండ్లతో; సహితము= కూడింది; అందున్= ఆ అడవిలో; ధేనుకుఁడు= ధేనుకుడనే పేరుగల రాక్షసుడు; ఉంటన్= ఉండుటచే; ఏ ధీరులున్= ఎంత ధైర్యం గలవారయినా; చొరన్= (ఆ వనంలోనికి) ప్రవేశించడానికి; వెఱతురు= భయపడతారు.

**తా :** ఓ బలరామకృష్ణులార! ఇక్కడికి చాలదూరంగా, ఒక పెద్దతాటితోపు ఉంది. ఆ చెట్లనుండి పండిన పండ్లు గుట్టలు గుట్టలుగా రాలుతూ ఉంటాయి. అందులో ధేనుకుడనే పేరుగల రాక్షసుడు ఉంటున్నాడు. వానిమూలంగా ఎంత ధైర్యవంతులయినా సరే, ఆ తాటితోపులో అడుగు పెట్టడానికి భయపడుతూ ఉంటారు.

**వ. ఆ ధేనుకాసురుండు మహాశూరుండును, ఖరాకారుండును నై సమానసత్త్వసమేతులైన జ్ఞాతులుం దానును మనుష్యులం బట్టి భక్షించుచుండు, నయ్యెడఁ బరిమళోపేతంబులైన నూతన ఫలవ్రాతంబులసంఖ్యాకంబులు గలవు. వినుఁడు. 612**

**ప్రతి :** ఆ ధేనుక+అసురుండు= ధేనుకుడనే పేరుగల ఆ రాక్షసుడు; మహాశూరుండును= మిక్కిలి పరాక్రమం గలవాడును; ఖర+ఆకారుండును= గాడిద రూపంవంటి రూపం గలవాడును; ఐ= అయిన; సమాన= తనతో సాటియగు; సత్త్వ= బలంతో; సమేతులు= కూడినవారు; ఐన= అయినట్టి; జ్ఞాతులున్= దాయాదులయినవారును; తానును= తానూ; మనుష్యులన్= మానవులను; పట్టి= పట్టుకొని; భక్షించుచున్+ఉండున్= తింటూ ఉంటాడు; ఆ+ఎడన్= ఆ చోటులు; పరిమళ+ఉపేతంబులు= సువాసనతో కూడుకొన్నవి; ఐన నూతన ఫలవ్రాతంబులు= అయినట్టి క్రొత్తగా పండిన పండ్ల సముదాయాలు; అసంఖ్యాకంబులు= లెక్కపెట్టుటకు శక్యం కానన్ని; కలవు= ఉన్నవి; వినుఁడు= చక్కగా ఆలకించండి.

**తా :** ధేనునుకుడనే పేరుగల ఆ రాకాసి మహాపరాక్రమం కలవాడు, గాడిదరూపంతో ఉన్నవాడు, తనతో సమాన బలంగల తన దాయాదులతో కలిసి, ఆ వనంలో ప్రవేశించినవారిని పట్టుకొని తింటూ ఉంటాడు. అక్కడ కొత్తగా పండినవి, మంచివాసన కలవి అయిన తాటిపండ్లు రాసులు రాసులుగా ఉన్నాయి. ఇంకా వినండి.

**క. ఫలగంధము నాసాపుట, ములఁ జొచ్చి కలంచి చిత్తములఁ గొనిపోయెన్**
**ఫలముల నమలింపుఁడు మము, బలియురకును మీకు దైత్యభటు లడ్డంబే? 613**

**ప్రతి :** ఫలగంధము= ఆ పండ్లయొక్క వాసన; నాసాపుటములన్= ముక్కుదొప్పలగుండా; చొచ్చి= (మా మనస్సులలోనికి) ప్రవేశించి; చిత్తములన్= మా మనస్సులను; కలంచి= కలతపెట్టి; కొనిపోయెన్= (ఆ పండ్లవద్దకు) తీసుకొనిపోయింది; మమున్= మా చేత; ఫలములన్= పండ్లను; నమలింపుఁడు= తినిపించండి; బలియురకును= బలవంతులైన; మీకున్= మీకు; దైత్యభటులు= రాక్షసవీరులు; అడ్డంబు+ఏ= అడ్డమా! (కారని భావం)

**తా :** ఆ పండ్లవాసన మా ముక్కు పుటాలగుండా మా మనస్సులలోకి ప్రవేశించి, వాటిని తినాలనే కోరిక పుట్టించి, క్షోభ కలిగించి, మా మనస్సుల్ని ఆ పండ్లవద్దకు లాగుకొని పోయింది. కావున ఏలాగైనా సరే! ఆ పండ్లు తినే అవకాశం మాకు కలిగించండి. అమితబలం కల మీకు ఆ రాక్షసులు ఒక లెక్కలోనివారా? (కారు కదా!)

**వ. అని పలికిన చెలికానిపలుకు లాదరించి విని నగి వారునుం దారును నుత్తాలంబగు తాలవనంబునకుం జని యందు. 614**

**ప్రతి :** అని= ఈ రీతిగా; పలికిన చెలికాని పలుకులు= చెప్పిన స్నేహితుని మాటలను; ఆదరించి= మన్నించి; విని= విని; నగి= నవ్వి; వారునున్= శ్రీదాముడు మొదలయిన స్నేహితులును; తారునున్= తామును; ఉత్తాలంబు+ అగు= చాల ఎత్తైన; తాలవనంబునకున్= తాటితోపునకు; చని= వెళ్లి; అందున్= ఆ తోపులో...

**తా :** ఈ విధంగా చెప్పిన స్నేహితుని మాటలు మన్నించి, శ్రద్ధగా విని, అంగీకార సూచకంగా నవ్వి, ఆ బలరామకృష్ణులు స్నేహితులతో కలిసి, ఎత్తైన తాటిచెట్లుగల ఆ తోపులో ప్రవేశించి

**క. తత్తఱమున బలభద్రుఁడు, తత్తాలానోకహములఁ దనభుజబల సం**
**పత్తిఁ గదల్చుచు గ్రక్కున, మత్తేభముభంగిఁ బండ్లు మహిపై రాల్చెన్. 615**

**ప్రతి :** బలభద్రుఁడు= బలరాముడు; తత్తఱమునన్= తొందర తొందరగా; మత్త+ఇభము భంగిన్= మదపుటేనుగువలె; తత్+తాల+అనోకహములన్= ఆ తాటిచెట్లను; తన భుజబల సంపత్తిన్= తన భుజాల గొప్ప బలంతో; కదల్చుచున్= అటు ఇటూ కదలిస్తూ; గ్రక్కునన్= వడిగా; పండ్లు= పండ్లను; మహిపైన్= నేలమీదకు; రాల్చెన్= రాలగొట్టాడు.

**తా :** బలరాముడు మదగజంలాగ తన భుజబలంతో, ఆ తాటిచెట్లను అటూ ఇటూ వేగంగా ఊపి ఊపి, తాటిపండ్లను నేలమీద రాలగొట్టాడు.

**వ. అప్పుడు పండ్లు రాల్చినచప్పుడు సెవులకు దెప్పరంబయిన నదిరిపడి రిపుమర్దనకుతుకంబున గర్దభాసురుండు. 616**

**ప్రతి :** అప్పుడు= ఆ సమయంలో; పండ్లు రాల్చిన చప్పుడు= పండ్లు రాలగొట్టినందువలన కలిగిన సవ్వడి; చెవులకున్= చెవులకు; దెప్పరంబు+అయినన్= సహింపరానిదగుటచే; అదిరిపడి= ఉలికిపడి; గర్దభ+అసురుండు= గాడిదరూపం కల ఆ ధేనుకాసురుడు; రిపుమర్దనకుతుకంబునన్= శత్రువులను అణచివేయాలనే కుతూహలంతో...

**తా :** అప్పుడు తాటిపండ్లు రాలగొట్టడంచేత కలిగిన చప్పుడు విని, ఉలికిపడి అసహనంతో ధేనుకాసురుడు శత్రువులను అణచివెయ్యాలనే కుతూహలంతో,

**మ. పదవిక్షేపములన్ సవృక్షధరణీభాగంబు గంపింపఁగా**
**రదముల్ దీటుచుఁ గత్తిరించిన చెవుల్ రాజిల్ల వాలంబు భీ**
**తిదమై తూలఁగఁ గావరంబున సముద్దీపించి గోపాలకుల్**
**బెదరన్ రామునిఱొమ్ముఁ దన్నె వెనుకై బీరంబు దోరంబుగన్. 617**

**ప్రతి :** పదవిక్షేపములన్= (వడివడిగా) అడుగులు వేయడంచేత; సవృక్ష ధరణీభాగంబున్= చెట్లతోకూడిన నేలంతా; కంపింపన్+కాన్= అదరగా; రదముల్= పండ్లు; దీటుచున్= కొరకుచు; కత్తిరించిన చెవుల్= కత్తిరింపబడిన చెవులు; రాజిల్లన్= ప్రకాశిస్తుండగా; వాలంబు= తోక; భీతిదము+ఐ= భయంకరమై; తూలన్+కన్= ఇటు అటు ఊగులాడుచుండగా; కావరంబునన్= గర్వంతో; సముద్దీపించి= మిక్కిలి ప్రకాశించి; గోపాలకుల్= గొల్లవారు; బెదరన్= భయపడునట్లుగా; వెనుక+ఐ= వెనుకకు తిరిగినవాడయి; బీరంబు= వీరత్వం; తోరంబు+కన్= వృద్ధి పొందగా; రాముని ఱొమ్మున్= బలరామునియొక్క వక్షఃస్థలాన్ని; తన్నెన్= తన్నాడు.

**తా :** ఆ ధేనుకాసురుడు వడివడిగా అడుగులు వేయడంచేత, ఆ బరువుకు తాటిచెట్లతో కూడిన ఆ నేలంతా కంపించిపోయింది. కోపంతో పండ్లు కొరుకుతున్నాడు. కత్తిరించిన చెవులు నిక్కబొడుచుకొన్నాయి. తోక భయంకరంగా అటూ ఇటూ అల్లాడుతోంది. గర్వంతో చెలరేగిపోయాడు. గొల్లవారు అదిరిపోయేట్టుగా వెనుకకు దిరిగి, వెనుకకాళ్లతో బలరాముణ్ణి గుండెమీద తన్నాడు. (వెనుక కాళ్లతో తన్నడం గాడిద నైజం)

**క. మఱియును దనుజుఁడు రామునిఁ, గఱవఁగ గమకించి తెఱపి గానక యతనిం**
**జుఱచుఱఁ జూచుచు శౌర్యము, పఱివోవఁగ నింత నంతఁ బదములఁ దన్నెన్. 618**

**ప్రతి :** మఱియునున్= ఆ తరువాత; దనుజుఁడు= ఆ ధేనుకాసురుడు; రామునిన్= బలరాముని; కఱవన్+కన్= కరచుటకు; గమకించి= ప్రయత్నించి; తెఱపి కానక= సందు చిక్కక; అతనిన్= ఆ బలరాముణ్ణి; చుఱచుఱన్+చూచుచున్= కోపంతో చురచుర చూస్తూ; శౌర్యము= పరాక్రమము; పఱి+పోవఁగన్= వ్యర్థం కాగా; ఇంతన్+అంతన్= ఇటు అటుగా; పదములన్= కాళ్లతో; తన్నెన్= తన్నాడు.

**తా :** పిమ్మట ఆ ధేనుకాసురుడు బలరాముణ్ణి కరవాలని ప్రయత్నించి, వీలు కాకపోవడంవల్ల, అతణ్ణి కోపంతో చుర చుర చూస్తూ తన్నబోయాడు. కానీ వానికి శక్తి చాల్లేదు. ఇటూ అటూ వట్టినేలను తన్నాడు. ఆ తాపులు బలరామునికి తగలలేదు.

**వ. అంత బలభద్రుండు రౌద్రాకారంబున గర్దభాసురుపదంబులు నాలుగు నొక్కకేల నంటం బట్టి బెట్టు దట్టించి త్రిప్పి విగత జీవునిం జేసి. 619**

**ప్రతి :** అంతన్= తరువాత; బలభద్రుండున్= బలరాముడును; రౌద్ర+ఆకారంబునన్= భయంకరమైన రూపంతో; గర్ధభ+అసురు పదంబులు నాలుగున్= గాడిద రూపంతో ఉన్న ఆ ధేనుకాసురుని నాలుగు కాళ్లను; ఒక్కకేలన్= ఒంటి చేతితో; అంటన్+పట్టి= దగ్గరకు చేర్చి పట్టుకొని; త్రిప్పి= గిరగిర త్రిప్పి; బెట్టు దట్టించి= గట్టిగా (నేలకేసి) కొట్టి; విగతజీవునిన్+చేసి= చంపివేసి...

**తా :** అటుపిమ్మట బలరాముడు కోపావేశంతో ఆ ధేనుకాసురుని నాలుగుకాళ్లు ఒంటిచేతితో పట్టుకొని, గిరగిర త్రిప్పి, నేలకేసి కొట్టి, చంపి

**మ. ఒక తాలాగ్రముఁ దాఁక వైవ నది కంపోద్రిక్తయై త్రుళ్ళి వే**
**టొక తాలాగ్రము పైఁబడ న్నదియు నయ్యుగ్రాహతిన్ నిల్వ కొం**
**డొక తాలాగ్రముపైఁ బడన్ విఱిగి యిట్లొండొంటిపైఁ దాల వృ**
**క్షకముల్ గూలెఁ బ్రచండమారుతము దాఁకం గూలు చందంబునన్. 620**

**ప్రతి :** ఒక తాల+అగ్రమున్= ఒక తాటి చెట్టుకొనను; తాఁకన్= సోకునట్లుగా; వైవన్= వాణ్ణి విసరివేయగా; అది= ఆ తాటిచెట్టు; కంప+ఉద్రిక్తము+ఐ= ఇటు అటు ఊగిసలాడడంచేత అతిశయించినదై త్రుళ్లి= తూలి; వేఱు+ఒక తాల+అగ్రముపైన్= మరియొక తాటిచెట్టు కొనమీద; పడన్= పడగా; అదియున్= ఆ తాటిచెట్టు కూడ; ఆ+ఉగ్ర+ఆహతిన్= మిక్కిలి తీవ్రమైన ఆ తాకిడిచేత; నిల్వక= నిలబడలేక; ఒండు+ఒక తాల+అగ్రముపైన్= వేరొక తాటిచెట్టు కొనమీద; పడన్= పడగా; ఇట్లున్= ఈ రీతిగా; తాలవృక్షకముల్= తాటిచెట్లు; విఱిగి= తుంటలై; ఒండు+ఒంటిపైన్= ఒక దానిమీద మరొకటి; ప్రచండమారుతము= మిక్కిలి తీవ్రమైన గాలి; తాఁకన్= సోకగా; కూలుచందంబునన్= పడునట్లుగా; కూలెన్= పడ్డాయి.

**తా :** బలరాముడు ఆ ధేనుకాసురుని కళేబరాన్ని, ఒక తాటిచెట్టు కొనమీద పడేవిధంగా విసరగా, దాని దెబ్బకు ఆ తాటిచెట్టు విరిగి, మరొక తాటిచెట్టుకొనమీద పడింది. అది విరిగి మరో తాటిచెట్టు కొనమీద పడింది. ఈ విధంగా ఒకదాని మీద మరొకటి పడి, విరిగి, సుడిగాలి తాకిడికి కూలే విధంగా, ఆ తోపులోని తాటిచెట్లన్నీ కూలిపోయాయి.

**ఉ. తంతువులందుఁ జేలము విధంబున నే పరమేశుమూర్తియం**
**దింతయుఁ బుట్టునట్టి జగదీశుఁ డనంతుఁడు దైత్యమాత్రు ని**
**ట్లంతము సేయు టెంతపని? యద్భుత మే విను మంతలోన వాఁ**
**డంతముఁ బొందుటెల్లఁ గని యాతనిబంధులు గార్దభంబులై. 621**

**ప్రతి :** తంతువుల+అందున్= దారములందు; చేలము విధంబునన్= వస్త్రంవలె; ఏ పరమ+ఈశు మూర్తి+అందున్= ఏ పరమాత్మయొక్క రూపంలో; ఇంతయున్= ఈ ప్రపంచమంతా; పుట్టున్= పుట్టుందో; అట్టి జగత్+ఈశుఁడు= అటువంటి లోకేశ్వరుడయిన; అనంతుఁడున్= ఆదిశేషుని అవతారమైన బలరాముడును; దైత్యమాత్రున్= ఒక సామాన్యుడైన రాక్షసుణ్ణి;

ఇట్లున్= ఈ రీతిగా (తేలికగా); అంతము+చేయుట= చంపుట; ఎంతపని= పెద్దపనా?; అద్భుతము+ఏ= అదొక వింతా?; వినుము= చెప్పబోయే వృత్తాంతం విను; అంతలోనన్= అంతటిలోపల; వాఁడు= ఆ ధేనుకాసురుడు; అంతమున్+పొందుట+ ఎల్లన్= మరణించిన తీరునంతటిని; కని= చూచి; ఆతనిబంధులు= ఆ ధేనుకాసురుని చుట్టాలు; గార్దభంబులు+ఐ= గాడిదలుగా మారి...

**తా :** పడుగు పేకగా అల్లుకొన్న దారాలనుండి బట్ట పుడుతోంది. అలాగే ఈ ప్రపంచమంతా విష్ణువునుండే పుడుతోంది. లోకనాయకుడైన మహావిష్ణువు యొక్క అంశ అయిన బలరాముడు, ఒక సామాన్యుడైన రాక్షసుణ్ణి సంహరించడంలో వింత ఏమీ లేదు. వాణ్ణి చంపడం చూచిన వానిబంధువులంతా గాడిదలుగా మారి

**విశే :** బలరాముడు ఆదిశేషుని అవతారం. శ్రీకృష్ణుడు శ్రీమహావిష్ణువు అవతారం. విష్ణువుయొక్క అంశయే శేషుడు. కావున ఇక్కడ బలరాముణ్ణి జగదీశునిగా చెప్పడంలో విరోధం లేదు.

**క. బలకృష్ణులపైఁ గవిసిన, బలియుర ఖరదైత్యభటులఁ బశ్చిమపాదం**
**బులు వట్టి తాలశిఖరం, బుల కెగురఁగ వైచి వారు పొరిగొని రధిపా! 622**

**ప్రతి :** అధిపా!= ఓ పరీక్షిన్మహారాజా!; బలకృష్ణులపైన్= బలరామకృష్ణులమీద; కవిసిన= కలియబడిన; బలియురన్= బలవంతులను; ఖరదైత్యభటులన్= ఖరాసురుని భటులను; పశ్చిమపాదంబులున్= వెనుకటి కాళ్లను; పట్టి= పట్టుకొని; తాలశిఖరంబులకున్= తాటిచెట్ల కొనలకు తగులునట్లుగా; ఎగురన్+కన్+వైచి= ఎగురవేసి; వారు= ఆ బలరామకృష్ణులు; పొరిగొనిరి= చంపారు.

**తా :** ఓ పరీక్షిన్మహారాజా! గాడిదలుగా మారిన ఆ ధేనుకాసురుని భటులంతా బలరామకృష్ణుల మీద కలియబడ్డారు. దానితో వారు బలంగల ఆ గాడిదల వెనుకకాళ్లు పట్టుకొని, తాటిచెట్ల కొనలమీదకు విసిరికొట్టి చంపారు.

**వ. అప్పుడు. 623**

**ప్రతి :** అప్పుడు= ఆ సమయంలో...

**తా :** ఆ సమయంలో ఇంకా,

**క. ఆలమున నోలిఁ గూలిన, తాలద్రుమఖండదైత్యతనుఖండములన్**
**గీలితయై ధర జలధర, మాలావృతమైన మింటిమాడ్కిన్ వెలిఁగెన్. 624**

**ప్రతి :** ఆలమునన్= యుద్ధంలో; ఓలిన్= వరుసగా; కూలినన్= పడిన; తాలద్రుమ= తాటిచెట్లయొక్క; ఖండ= ముక్కలచేతను; దైత్య= రాక్షసులయొక్క; తను= శరీరాలయొక్క; ఖండములన్= భాగాలను; కీలిత+ఐ= కూర్పబడిందయి; ధర= భూమి; జలధరమాలా+ఆవృతము= మేఘపంక్తులచే ఆవరింపబడింది; ఐనమింటి మాడ్కిన్= అయిన ఆకాశంవలె; వెలిఁగెన్= ప్రకాశించింది.

**తా :** అప్పుడు జరిగిన యుద్ధంలో తాటిచెట్లు, రాక్షసుల శరీరాలు ఖండఖండాలుగా తెగి, నేలమీద వరుసగా పడ్డాయి. వాటితోగూడిన యుద్ధభూమి వరుస మబ్బులతోగూడిన ఆకాశంలా కనిపించింది.

**క. ధేనుకవనమున నమలిరి, మానవు లావేళఁ దాటిఫలకులఫలముల్,**
**ధేనువులు మెసఁగెఁ గసవులు, ధేనుకహరభక్తకామధేనువు గలుగన్. 625**

**ప్రతి :** ఆ వేళన్= అప్పుడు; ధేనుకహర= ధేనుకాసురుణ్ణి సంహరించినవాడైన; భక్తకామధేనువు= భక్తులకు కామధేనువు అయిన బలరాముడు; కలుగన్= (వారికి) లభించడంచేత; మానవులు= మనుష్యులయిన గొల్లవారు; ధేనుక వనమునన్= ధేనుకవనంలో; తాటిఫ్రాఁకులఫలముల్= తాటిచెట్లపండ్లను; నమలిరి= తిన్నారు; ధేనువులు= ఆవులు; కసవులు= పచ్చికలను; మెసఁగెన్= మేశాయి.

**తా :** అపుడు ధేనుకాసురుణ్ణి సంహరించినవాడూ, భక్తులు కోరిన కోరికలు తీర్చడంలో కామధేనువూ అయిన బలరాముడు వారికి లభించడంచేత ఆ గొల్లలు ఆ తోపులోని తాటిపళ్లను తిన్నారు. ఆవులు తనివితీరా అక్కడ ఉన్న పచ్చగడ్డిని మేశాయి.

**వ. ఆ సమయంబున సురలు విరులవానలు గురియించి దుందుభులు మొరయించి, రంతఁ గమలలోచనుండు గోపజనజేగీయమాన వర్తనుండై యన్నయుం దానును గోగణంబులం దోలుకొని మందకుం జనియె, నయ్యెడ. 626**

**ప్రతి :** ఆ సమయంబునన్= అప్పుడు; సురలు= దేవతలు; విరులవానలున్= పూలవానలను; కురియించి= కురిపించి; దుందుభులు= భేరులు; మొరయించిరి= మ్రోగించారు; అంతన్= అంతలో; కమలలోచనుండు= శ్రీకృష్ణుడు; గోపజన= గొల్లలచేత; జేగీయమాన= బాగుగా కీర్తింపబడుతున్న; వర్తనుండు+ఐ= ప్రవర్తన కలవాడయి; అన్నయున్= అన్న అయిన బలరాముడును, తానును= తానూ (శ్రీకృష్ణుడు); గోగణంబులన్= ఆవులమందలను; తోలుకొని= తోలుకుంటూ; మందకున్= గొల్లపల్లెకు; చనియెన్= వెళ్లాడు; ఆ+ఎడన్= ఆ సమయంలో...

**తా :** అప్పుడు దేవతలు పుష్పవృష్టి కురిపించి, భేరీలు మోగించారు. గొల్లలంతా గొంతెత్తి, తన కీర్తిని గానం చేస్తూండగా, శ్రీకృష్ణుడు అన్న బలరామునితో కలిసి, ఆవుల మందలను తోలుకొని, గొల్లపల్లెకు వెళ్లాడు. అప్పుడు

**మ. గోపదరేణుసంకలితకుంతలబద్ధమయూరపింఛు; ను**
**ద్దీపితమందహాసశుభదృష్టిలసన్ముఖు, నవ్యపుష్ప మా**
**లా పరిపూర్ణు, గోపజనలాలితవేణురవాభిరాము, నా**
**గోపకుమారునిం గనిరి గోపసుతుల్ నయనోత్సవంబుగన్. 627**

**ప్రతి :** గోపద= ఆవుల కాళ్లయొక్క; రేణు= దుమ్ముతో; సంకలిత= కూడుకొన్న; కుంతల= తల వెండ్రుకలలో; బద్ధ= కట్టబడ్డ; మయూర= నెమిలియొక్క; పింఛున్= పురి కలవాడూ; ఉద్దీపిత= బాగుగా ప్రకాశిస్తూ; మందహాస= చిరునవ్వుతో కూడిన; శుభదృష్టిన్= మేలు చేసే చూపుతో; లసత్= ఒప్పుచున్న; ముఖున్= మొగం కలవాడూ; నవ్య= క్రొత్తవి అయిన; పుష్ప= పూలయొక్క; మాలా= దండలతో; పరిపూర్ణున్= నిండినవాడూ; గోపజన= గొల్లలచేత; లాలిత= మెచ్చుకొనబడిన; వేణురవ= పిల్లనగ్రోవి సవ్వడిచేత; అభిరామున్= మనోహరమైనవాడూ; (అగు) ఆ గోపకుమారునిన్= గొల్లపిల్లవాడగు ఆ శ్రీకృష్ణుణ్ణి; నయన+ఉత్సవంబు+కన్= కన్నుల పండువుగా; గోపసుతుల్= గోపకులు; కనిరి= చూశారు.

**తా :** ఆవులకాళ్లచేత పైకి లేచినదుమ్ముతో కూడిన జుట్టుమీద నెమిలిపింఛం కలవాడు, చిరునవ్వుతో కూడిన చల్లని చూపులుగల మొగం కలవాడు. అప్పుడే పూసిన పూలతో కట్టిన దండలు ఒంటినిండా ధరించినవాడు, గొల్లవారు సంతోషించేలా పిల్లనగ్రోవి ఊదేవాడు, అయిన శ్రీకృష్ణుణ్ణి అప్పుడు గోపకులు కన్నుల పండువుగా చూశారు.

**ఆ. కమలనయను వదనకమలమరందంబుఁ, దవిలి నయనషట్పదములవలనఁ**
**ద్రావి దినవియోగతాపంబు మానిరి, గొపకాంతలెల్ల గోర్కు లలర. 628**

**ప్రతి :** గోపకాంతలు+ఎల్లన్= గొల్ల ఇల్లాళ్లందరు; కోర్కులు+అలరన్= కోరికలు తీరేలాగ; కమలనయను= తామరపూలవంటి కన్నులు కలిగిన శ్రీకృష్ణునియొక్క; వదనకమల= ముఖం అనే పద్మంలోని; మరందంబున్= మకరందాన్ని; తవిలి= ఆసక్తిపొంది; నయన షట్పదములవలనన్= (తమ) కన్నులు అనే తుమ్మెదలతో; త్రావి= త్రాగి; దిన= పగటియందలి; వియోగ= ఎడబాటువల్ల కలిగిన; తాపంబున్= బాధను; మానిరి= విడిచిపెట్టారు.

**తా :** గోపికలందరు శ్రీకృష్ణునిముఖం అనే కమలంలో ఉన్న సౌందర్యం అనే మకరందాన్ని తమ కన్నులనే తుమ్మెదలతో తనివితీరా త్రాగి, పగటివేళ శ్రీకృష్ణునితోడి ఎడబాటువల్ల కలిగినతాపాన్ని పోగొట్టుకొన్నారు. (శ్రీకృష్ణుడు ఆవుల మందలతో పగటివేళ మేపడానికి అడవికి వెళ్లినందువల్ల వ్రేపల్లెలో ఉన్న గోపికలకు శ్రీకృష్ణునితో వియోగం కలిగింది. ఇప్పుడు అతణ్ణి తనివితీరా చూచి ఆ బాధను పోగొట్టుకొన్నారు.)

**వ. ఇట్లు గోపికలు సాదరంబుగం జూడ వ్రీడాహాసనవినయంబులం జూచుచుఁ గ్రీడాగరిష్ఠం డయిన ప్రోఢ గోష్ఠంబు ప్రవేశించె, నంత రోహిణీయశోదలు గుఱ్ఱలవలని మచ్చికలు పిచ్చలింప నిచ్చకు వచ్చిన ట్లయ్యైవేళల దీవించిరి. వారును మజ్జనోన్మర్దనాదు లంగీకరించి సురభికుసుమగంధంబులు గైకొని, రుచిరచేలంబులు గట్టికొని, రసోపపన్నంబు లయిన యన్నంబులు గుడిచి, తృప్తులై మంజులశయ్యల సుప్తులయి యుండి, రందు. 629**

**ప్రతి :** ఇట్లు= ఈ రీతిగా; గోపికలు= గొల్ల ఇల్లాండ్రు; స+ఆదరంబు+కన్= మన్నన కల్గునట్లుగా; చూడన్= (కృష్ణుని) చూడగా; క్రీడాగరిష్ఠుండు= ఆటలలో మేటి; అయినప్రోఢ= నేర్పరి అయినట్టి శ్రీకృష్ణుడు; వ్రీడాహాసన వినయంబులన్= (గోపికల చూపులలోని) సిగ్గు, నవ్వు, అణకువలను; చూచుచున్= చూస్తూ; గోష్ఠంబున్= గొల్లపల్లెలో; ప్రవేశించెను; అంతన్= అప్పుడు; రోహిణీయశోదలు= రోహిణీయశోదలిరువురు; కుఱ్ఱలవలని= కొడుకులయందలి; మచ్చికలు= మోహములు; పిచ్చలింపన్= అధికం కాగా; ఇచ్చకు వచ్చినట్లు= తమకు నచ్చినవిధంగా; ఆ+ఐ వేళలన్= సమయములందు; దీవించిరి= దీవెనలిచ్చారు; వారును= ఆ బలరామకృష్ణులును; మజ్జన+ఉన్మర్దన+ఆదులు= స్నానం, నలుగు మొదలయిన వాటిని; అంగీకరించి= సమ్మతించి (చేయించుకొని); సురభి కుసుమ గంధంబులు= సువాసన గల పూలు, ఒంటికి పూసుకొనే సుగంధ ద్రవ్యములు; కైకొని= స్వీకరించి; రుచిర చేలంబులు= చక్కని వస్త్రములు; కట్టికొని= ధరించి; రస+ఉపపన్నంబులు= తీపు మొదలయిన ఆరురుచులతో కూడుకొన్నవి; అయిన అన్నంబులు= అయినట్టి భక్ష్య లేహ్యచోష్యపానీయాలనే నాలుగు విధాలయిన ఆహారాలను; కుడిచి= ఆరగించి; తృప్తులు+ఐ= తనివినొందినవారై; మంజుల శయ్యలన్= తీరైనపాన్పుల మీద; సుప్తులు+అయి= నిద్రించినవారై; ఉండిరి= ఉండినారు; అందున్= (ఈ విధంగా) జరుగుతున్న కాలంలో...

**తా :** ఈ విధంగా గోపికలంతా ఆదరంతో తనను చూస్తూ ఉండగా, ఆటలలో మేటి అయిన శ్రీకృష్ణుడు వారి చూపులలోని సిగ్గు నవ్వు వినయం అనే భావాలను వీక్షిస్తూ వ్రేపల్లెలో ప్రవేశించాడు. అపుడు రోహిణీ యశోదలు తమ కొడుకులయిన

బలరామకృష్ణులందు పుత్రప్రేమ అతిశయించగా, తమకు నచ్చిన రీతిలో వారికి దీవెనలిచ్చారు. తల్లులు చేసిన ఉపచారాలను బలరామకృష్ణులు స్వీకరించారు. నలుగులు పెట్టించుకొన్నారు. స్నానం చేశారు. పరిమళాలు వెదజల్లే పూలదండలు అలంకరించుకొన్నారు. అందమైన బట్టలు కట్టుకొన్నారు. తీపి, పులుపు మొదలయిన ఆరురుచులతో కూడిన భక్ష్య – లేహ్య – చోష్య – పానీయాలనే నాలుగు విధాలయిన ఆహారాలు ఆరగించారు. ఎగుడుదిగుళ్లు లేక మెత్తగా అమర్చిన పాన్పులమీద హాయిగా పవ్వళించారు. దినచర్య ఈ విధంగా నడుస్తూ ఉన్న కాలంలో

## ❖ శ్రీకృష్ణుఁడు కాళియమర్దనము గావించుట ❖

**సీ. 'ఒకనాఁడు బలభద్రుఁ డొక్కఁడు రాకుండ గోపాలకులు దానుఁ గూడి కృష్ణుఁ**
**దడవికిఁ జని యెండ నా గోవులును గోపకులు నీరు వట్టునఁ గుంది దస్సి**
**కాళిందిలో విషకలితతోయముఁ ద్రావి ప్రాణానిలంబులు వాసి పడిన**
**యోగీశ్వరేశుండు యోగివంద్యుఁడు గృష్ణుఁ డీక్షణామృతధార లెలమి గురిసి**

**ఆ. పసుల గోపకులను బ్రదికించె మరలంగ, వారు దమకుఁ గృష్ణువలన మరల**
**బ్రదుకు గలిగె నంచు భావించి సంతుష్ట, మానసములఁ జనిరి మానవేంద్ర! 630**

**ప్రతి :** మానవ+ఇంద్ర= ఓ పరీక్షిన్మహారాజా!; ఒకనాఁడు= ఒకానొక దినమందు; బలభద్రుఁడు+ఒక్కఁడున్= ఒక్క బలరాముడు మాత్రము; రాక+ఉండన్= రాకుండగ; కృష్ణుఁడు= శ్రీకృష్ణుడును; గోపాలకులున్= మిగిలిన గొల్లలును; తానున్= తానును; కూడి= కలిసి; అడవికిన్= అరణ్యమునకు; చని= వెళ్లి; ఎండన్= ఎండలో; ఆ గోవులును= అడవికి తోలుకొనిపోయిన ఆ ఆవులును; గోపకులును= గొల్లలును; నీరు+పట్టునన్= దప్పికచేత; కుంది= బాధపడి; దస్సి= అలసిపోయి; కాళిందిలోన్= యమునానదిలో; విషకలిత తోయమున్= విషంతో కూడుకొనిన నీటిని; త్రావి= త్రాగి; ప్రాణ+అనిలంబులు= ప్రాణవాయువులు; పాసి= విడిచి; పడినన్= మరణింపగా; యోగి+ఈశ్వర+ఈశుండున్= యోగీశ్వరులను పాలించువాడును; యోగి వంద్యుఁడున్= యోగులచేత నమస్కరింపదగినవాడు (అగు); కృష్ణుఁడు= శ్రీకృష్ణుడు; ఈక్షణ+అమృతధారలు= చూపులనెడి అమృతధారలను; ఎలమిన్= ప్రేమతో; కురిసి= కురిపించి; పసులన్= ఆవులను; గోపకులన్= గొల్లవారిని; మరలన్+కన్= తిరిగి; బ్రదికించెను= బ్రతికించినాడు; వారున్= ఆ గొల్లలును; తమకున్= తమకు; కృష్ణువలనన్= కృష్ణునివల్ల; మరలన్= తిరిగి; బ్రదుకు= జీవనం; కలిగెన్+అంచున్= కలిగింది అంటూ; భావించి= తెలిసికొని; సంతుష్టమానసములన్= సంతోషించిన మనస్సులతో; చనిరి= (గొల్లపల్లెకు) వెళ్లారు.

**తా :** ఓ పరీక్షిన్మహారాజా! ఒకనాడు ఒక్క బలరాముడు తప్ప, శ్రీకృష్ణుడు మిగిలిన గొల్లపిల్లలు అందరు తన వెన్నంటి రాగా, ఆవులను తోలుకొని అడవికి వెళ్లాడు. ఎండలో తిరగడంచేత కొంత సమయం గడిచేటప్పటికి ఆవులకు గొల్లలకు దప్పిక కలిగింది. యమునానదికి వెళ్లి, నదిలోని విషం కలిగిన నీటిని తాగి, ప్రాణాలు పోగొట్టుకొన్నారు. వెంటనే కృష్ణుడు తన చూపులు అనే అమృతధారలను వారిపై కురిపించి, వారిని బ్రదికించాడు. అపుడు వారందరు శ్రీకృష్ణుని దయవల్లనే తాము బదికినట్లు తెలిసికొని, సంతోషంతో గొల్లపల్లెకు వెళ్లారు.

**క. కాళియఫణిదూషిత యగు, గాళిందిఁ బవిత్రఁ జేయఁగా నుత్సుకుఁడై**
**కాళిందీజలవర్ణుఁడు, కాళియు వెడలంగ నడిచెఁ గౌరవముఖ్యా! 631**

**ప్రతి :** కౌరవముఖ్యా!= కురువంశ రాజులలో శ్రేష్ఠుడవైన ఓ పరీక్షిన్మహారాజా!; కాళియఫణి దూషిత= కాళియుడనే పాముచేత కలుషితం చేయబడింది (ప్రాణహాని కలిగించునది); అగు కాళిందిన్= అయినట్టి యమునానదిని; పవిత్రన్= పరిశుద్ధమైన దాన్ని; చేయన్+కాన్= చేయడంకోసం; ఉత్సుకుఁడు+ఐ= కుతూహలం కలవాడై; కాళిందీ జలవర్ణుఁడు= యమునానది నీటివంటి రంగు కలవాడయిన శ్రీకృష్ణుడు; కాళియున్= కాళియసర్పమును; వెడలన్+కన్+అడిచెన్= వెళ్లగొట్టాడు.

**తా :** ఓ పరీక్షిన్మహారాజా! అపుడు శ్రీకృష్ణుడు కాళియసర్పవిషంచేత కలుషితమైన యమునానదిని స్వచ్ఛమైన దాన్ని చేయాలని సంకల్పించి ఆ కాళియుణ్ణి ఆ నదినుండి దూరంగా తరిమివేశాడు.

**వ.అనిన 'నయ్యగాధజలంబువలన మాధవుం డెట్టి నేర్పున సర్పంబుదర్పంబు మాపి వెడలించె, నందుఁ బెద్దకాలం బా వ్యాళం బేలయుండె? నెఱింగింపుము. 632**

**ప్రతి :** అనినన్= అని చెప్పగా; (శుకుడు ఈ విధంగా చెప్పగా); ఆ+అగాధ జలంబువలనన్= మిక్కిలి లోతుగల ఆ యమునానది నీటినుండి; మాధవుండు= కృష్ణుడు; ఎట్టినేర్పునన్= ఎటువంటి సామర్థ్యంతో; సర్పంబుదర్పంబున్= ఆ పాము గర్వాన్ని; మాపి= పోగొట్టి; వెడలించెన్= వెళ్లగొట్టెను; అందున్= ఆ యమునానదిలో; ఆ వ్యాళంబు= ఆ పాము; పెద్ద కాలంబు= చాలకాలం; ఏల+ఉండెన్= ఎందుకని ఉండెనో; ఎఱింగింపుము= తెలియజెప్పుము.

**తా :** అని శుకమహర్షి చెప్పగా విన్న పరీక్షిన్మహారాజు ఈ విధంగా ప్రశ్నించాడు. ఓ మునిశ్రేష్ఠా! చాలా లోతైన ఆ యమునానది మడుగులో ఉన్న పాముపొగరును శ్రీకృష్ణుడు ఏ విధంగా అణచాడు? ఎలా బయటకు వెళ్లగొట్టాడు? అక్కడే ఆ పాము చాలాకాలం ఉండడానికి కారణం ఏమిటి? అంతా వివరంగా తెలియజెప్పు.

**క. తొఱ్ఱులఁ గాచిన నందుని, కుఱ్ఱనిచరితామృతంబు గొనకొని చెవులన్**
**జుఱ్ఱంగఁ దనివి గల్గునె!, వెఱ్ఱుల కయినను దలంప? విప్రవరేణ్యా!' 633**

**ప్రతి :** విప్రవరేణ్యా!= బ్రాహ్మణులలో శ్రేష్ఠుడవైన ఓ శుకమహర్షీ!; తలంపన్= ఆలోచింపగా; తొఱ్ఱులన్= ఆవులను; కాచిన= రక్షించినట్టి; నందుని కుఱ్ఱని= నందుని బిడ్డయగు శ్రీకృష్ణునియొక్క; చరిత+అమృతంబున్= చరిత్ర అనే అమృతాన్ని; కొనకొని= ప్రయత్నించి; చెవులన్= చెవులతో; జుఱ్ఱన్+కన్= జుఱ్ఱుకొనగా; వెఱ్ఱులకున్+అయినను= వివేకం లేనివారికైనా; తనివి= తృప్తి; కల్గును+ఎ= కలిగిస్తుందా? (కలుగదు).

**తా :** ఓ శుకమహర్షీ! ఆవులను కాపాడిన శ్రీకృష్ణుని కథామృతాన్ని చెవులారా ఎంతవిన్నా అమాయకులకైనా కూడ తనివి తీరదంటే ఇంక మాబోటి భక్తుల విషయం చెప్పేదేమిటి? కావున మరింతగా విస్తరించి వినిపింపవయ్యా!

**వ. అనిన శుకుం డిట్లనియె. 634**

**ప్రతి :** అనినన్= అని పరీక్షిన్మహారాజు పలుకగా; శుకుండు= శుకమహర్షి; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= పలికాడు.

**తా :** అని పరీక్షిన్మహారాజు పలుకగా శుకమహర్షి మళ్లీ ఈ విధంగా అన్నాడు.

**సీ. మానవేశ్వర! యొక్కమడుఁగు కాళిందిలోఁ గల, దది యెప్పుడుఁ గాళియాహి**
**విషవహ్నిశిఖలచే వేఁచు చుండును, మీఁదఁ బఱతెంచి నంతన పక్షులైనఁ**

**బడి మ్రగ్గు, నందుఁ దద్భంగశీకరయుక్తపవనంబు సోఁకినఁ బ్రాణు లెవ్వి**
**యైన నప్పుడ చచ్చు? నట్టి యా మడుఁగులో నుదకంబు పొంగుచు నుడుకుచుండఁ**

**తే. జూచి వెఱఁగంది కుజనుల స్రుక్కఁజేయ, నవతరించిన బలువీరుఁ డాగ్రహించి**
**భుజగవిషవహ్నిదోషంబు పొలియఁజేసి, సుజలఁ గావించి యీనదిఁ జూతు ననుచు. 635**

**ప్రతి :** మానవ+ఈశ్వర= ఓ పరీక్షిన్మహారాజా!; కాళిందిలోన్= యమునానదిలో; ఒక్కమడుఁగు కలదు= ఒక లోతైన మడుగు (మిక్కిలి లోతుగల చోటు) కలదు; అది= ఆ మడుగు; ఎప్పుడున్= ఎల్లపుడును; కాళియ= కాళియుడనే పేరుగల; అహి= సర్పంయొక్క; విషవహ్ని= విషాగ్నియొక్క; శిఖలచేన్= జ్వాలలచేత; వేఁచుచున్+ఉండును= తపింపజేస్తూంటుంది; మీఁదన్= మడుగుమీదుగా; పఱతెంచిన+అంతనన్= వచ్చినంత మాత్రంచేతనే; పక్షులు= పిట్టలు; ఐనన్= అయినా; అందున్= ఆ మడుగులో; పడి= పడిపోతూ; మ్రగ్గున్= చస్తాయి; తద్= ఆ మడుగునందలి; భంగ= కెరటాలయొక్క; శీకరయుక్త= తుంపరలతో గూడిన; పవనంబు= గాలి; సోఁకినన్= తగిలినను; ప్రాణులు+ఎవ్వి+ఐనన్= ఎంత బలంగల జీవులయినా; అప్పుడు+అ= వెంటనే; చచ్చున్= చచ్చిపోతాయి; అట్టి= అటువంటి; ఆ మడుఁగులోన్= ఆ హ్రదములోపలి; ఉదకంబు= నీరు; ఉడుకుచున్+ఉండన్= కుత కుత ఉడుకుచుండగా; పొంగుచున్= పైకి పొంగుతూ ఉంటుంది; కుజనులన్= దుష్టులను; స్రుక్కన్+చేయన్= శిక్షించుటకై; అవతరించిన= భూమిపై జన్మించిన; బలవీరుఁడు= గొప్ప వీరుడగు శ్రీకృష్ణుడు; చూచి= ఆ మడుగును చూచి; వెఱఁగు+అంది= ఆశ్చర్యపడి; ఆగ్రహించి= కోపించి; భుజగ= కాళియుడను సర్పంయొక్క; విష= విషమనెడి; వహ్ని= అగ్నివల్ల కలిగిన; దోషంబున్= దుష్టత్వాన్ని; పొలియన్+చేసి= నిర్మూలించి; ఈ నదిన్= ఈ యమునను; సుజలన్= మంచి నీరు కలదాన్నిగా; కావించి= చేసి; చూతున్(చూచుదును)= చూస్తాను; అనుచున్= అని అనుకుంటూ...

**తా :** ఓ పరీక్షిన్మహారాజా! యమునా నదిలో మిక్కిలి లోతైన పెద్దమడుగు ఉంది. అందులో కాళియుడు అనే పేరుగల పెద్ద పాము ఉంది. అది తన విషాగ్ని జ్వాలలతో, ఆ నదినీటిని మరుగుతూ ఉప్పొంగేలా చేస్తూ ఉంటుంది. ఆ మడుగుమీదుగా ఎగిరివెళ్లే పక్షులు ఆ వేడి సోకి అందులో పడి చచ్చిపోతూ ఉంటాయి. ఆ మడుగులోని కెరటాల మీదుగా వచ్చిన గాలి సోకిందంటే చాలు. ఎటువంటి బలం కల ప్రాణి అయినా సరే చచ్చిపోవలసిందే. దుష్టసంహారం చేయడంకోసం భూమిమీద అవతరించిన శ్రీకృష్ణుడు, సర్పవిషంతో కూడిన ఆ నదిలోని నీటిని, స్వచ్ఛమైన దాన్నిగా చేస్తాను అని సంకల్పించాడు.

**వ. కృతనిశ్చయుండై, పూర్వజన్మ భాగ్యంబులం దన చరణ సంస్పర్శంబునకు యోగ్యంబై, తత్సమీపంబున విశాలవిటపశాఖాకదంబంబుతో నున్న కదంబభూజంబు నెక్కి. 636**

**ప్రతి :** కృతనిశ్చయుండు+ఐ= చేయబడిన నిర్ణయం కలవాడయి; పూర్వజన్మ భాగ్యంబులన్= కడచిన పుట్టుకలలో చేసిన పుణ్యంవల్ల; తన చరణ సంస్పర్శంబునకున్= తన పాదముల స్పర్శకు; యోగ్యంబు+ఐ= తగిందై; తత్+సమీపంబునన్= ఆ మడుగు దగ్గరలో; విశాల= విస్తరించిన; విటపశాఖా= చిగిర్చిన కొమ్మల, రెమ్మల; కదంబంబుతోన్= సమూహంతో; ఉన్న కదంబ భూజంబున్= ఉన్నట్టి కడిమిచెట్టును; ఎక్కి= అధిరోహించి...

**తా :** ఈ విధంగా మనస్సులో నిశ్చయించుకొన్న వాడయి శ్రీకృష్ణుడు ఒడ్డున ఉన్న కడిమిచెట్టు మీదికి ఎక్కాడు. అది శ్రీకృష్ణుని అడుగుల స్పర్శను నోచుకోవడానికి తగినంత పుణ్యం గత జన్మలలో చేసికొని ఉంది. అది పెద్దవి చిన్నవి అయిన కొమ్మలతోను రెమ్మలతోను కూడుకొని ఉంది.

**విశే :** ఈ మడుగు మీది విషపు గాలి తగిలి ఆకాశంలో ఎగిరిపోయే పక్షులే చచ్చిపోతున్నాయి కదా! అటువంటిది యమున ఒడ్డుమీద ఈ కడిమిచెట్టు ఎలా బతికి ఉంది అనే సందేహం కలుగవచ్చు. గత జన్మలో అది శ్రీకృష్ణుని అడుగులు సోకడానికి తగినంత పుణ్యం చేసుకుంది. పాదస్పర్శ జరగాలంటే అది జీవించి ఉండాలి. ఇంతకీ దాని పూర్వపుణ్యం కారణం. ఇదే కవి సమర్థనం.

**మ. కటిచేలంబు బిగించి పింఛమునఁ జక్కం గొప్పు బంధించి దో**
**స్తటసంస్ఫాలన మాచరించి చరణద్వంద్వంబుఁ గీలించి త**
**త్కుటశాఖాగ్రము మీఁదనుండి యుఱికెన్ గోపాలసింహంబు ది**
**క్తటముల్ మ్రోయ హ్రదంబులో గుభగుభధ్వానం బనూనంబుగన్. 637**

**ప్రతి :** గోపాల సింహంబు= గొల్లవారిలో గొప్పవాడయిన ఆ శ్రీకృష్ణుడు; కటిచేలంబున్= మొలపైనున్న బట్టను; బిగించి= గట్టిగా కట్టి; పింఛమునన్= నెమిలిపురితో; కొప్పు= జుట్టుముడిని; చక్కన్= చక్కగా; బంధించి= బిగించి; దోస్+తట సంస్ఫాలనము= భుజప్రదేశాలమీద చరచుటను; ఆచరించి= చేసి; చరణద్వంద్వంబున్= అడుగులు రెండింటిని; కీలించి= (దగ్గరకు) చేర్చి; దిక్+తటములు= దిక్కులయొక్క ప్రదేశాలు; మ్రోయన్= మారుమ్రోగునట్లుగా; హ్రదంబులోన్= మడుగులో; గుభగుభ ధ్వానంబు= గుభ గుభ అనే చప్పుడు (ఇది ధ్వన్యనుకరణం); అనూనంబు+కన్= పెచ్చు పెరుగుతుండగా; తత్= ఆ; కుట= చెట్టుయొక్క; శాఖా= కొమ్మయొక్క; అగ్రముమీఁదన్+ఉండి= చివరిచోటునందుండి; ఉఱికెన్= దూకాడు.

**తా :** శ్రీకృష్ణుడు నడుముమీది బట్టను బిగించి కట్టుకొని, నెమిలి పింఛాన్ని జుట్టుముడితో బంధించి, ఉత్సాహంతో జబ్బలు చరుస్తూ, రెండు పాదాలు కూడతీసికొని, ఆ కడిమి చెట్టుకొమ్మ కొననుండి మడుగులోనికి దూకాడు. ఆ అదురుపాటుకు నాలుగు దిక్కులు పిక్కటిల్లాయి. మడుగులో గుభగుభ ధ్వనులు హెచ్చైపోయాయి.

**ఉ. భూరిమహాప్రతాపపరిపూర్ణభయంకరగోపబాల కం**
**ఠీరవపాతవేగవికటీకృతదుర్విషభీషణోర్మిసం**
**పూరితమై వడిం గలఁగి పొంగి ధనుశ్శతమాత్రభాగ వి**
**స్తారము వొంగె నమ్మడుఁగు తప్తపయఃకణబుద్బుదోగ్రమై. 638**

**ప్రతి :** భూరి= మిక్కిలి; మహాప్రతాప= అధికమైన పరాక్రమంచేత (తేజస్సుచేత); పరిపూర్ణ= చక్కగా నిండిన; భయంకర= భయాన్నిగొల్పే; గోపబాల= గొల్లపిల్లలలో; కంఠీరవ= శ్రేష్ఠుడయిన శ్రీకృష్ణునియొక్క; పాత= పడుట (దూకుట) యొక్క; వేగ= వడిచేత; వికటీకృత= అల్లకల్లోలంగా చేయబడిన; దుర్+విష= చెడ్డది అయిన విషంచే; భీషణ= భయంకరమైన; ఊర్మి= కెరటాలచే; సంపూరితము+ఐ= బాగుగా నింపబడిందయి; ఆ+మడుఁగు= ఆ మడుగు; తప్త= కాచబడిన; పయస్= నీటియొక్క; కణ= బిందువులచేతను; బుద్బుద= బుడగలచేతను; ఉగ్రము+ఐ= భయంకరమైనదయి; వడిన్= వేగంగా; కలఁగి= కల్లోలమై; పొంగి= పైకి ఉబికి; ధనుస్+శతమాత్ర= నూరువిండ్లు కొలత మాత్రంగల; భాగ= ప్రదేశంయొక్క; విస్తారము= విరివిని; పొంగెన్= పొందింది. (ధనుస్సు= నాలుగుమూరలకొలది, దనుశ్శత= 4×100=400 మూరల విస్తీర్ణం)

**తా :** మహాప్రతాపవంతుడైన శ్రీకృష్ణుడు దూకగానే, ఆ వేగానికి ఆ మడుగు కలతపడిపోయింది. విషమయమైన తరంగాలచేతను, కుతకుత ఉడికే నీటి బిందువులచేతను, నీటి బుడగలచేతను భయాన్ని కలిగిస్తూ కల్లోలమై పొంగుతూ నాల్గువందలమూరల మేర వ్యాపించింది.

**శా. పాఠీనాకృతిఁ దోయరాశి నడుమన్ భాసిల్లి మున్నాఢ్యుఁడై**
**కాఠిన్యక్రియ నీఁదునేర్పు దనకుం గల్మిన్ భుజంగేంద్ర హృ**
**త్పీఠాగ్రంబున రోషవహ్ను లెగయన్ భీమంబుగా నీఁదె ను**
**ల్లోలోత్తుంగతరంగమై మడుఁగు దుర్లోక్యంబుగా బాహులన్. 639**

**ప్రతి :** మున్ను= పూర్వం; పాఠీన+ఆకృతిన్= చేప ఆకృతితో; తోయరాశి నడుమన్= సముద్రం మధ్య భాగంలో; ఆఢ్యుఁడు+ఐ= ప్రసిద్ధుడై; భాసిల్లి= ప్రకాశించి; కాఠిన్యక్రియన్= గట్టితనం కలిగిఉన్నట్లుగా; ఈఁదునేర్పు= ఈదునట్టి నైపుణ్యం; తనకున్= తనకు; కల్మిన్= కలిగి ఉండుటచేత; భుజంగ+ఇంద్ర= పాములలో గొప్పవాడగు కాళియునియొక్క; హృత్+పీఠ= గుండె అనే పీఠంయొక్క; అగ్రంబునన్= పై భాగం వరకు (కాళియుని హృదయమునందని భావం); రోషవహ్నులు= కోపాగ్నులు; ఎగయన్= ప్రజ్వరిల్లగా; ఉత్+లోల+ఉత్+తుంగ తరంగము+ఐ= పైకి పొంగి పొరలుచున్న మిక్కిలి పొడవైన కెరటాలు కలదయి ఉన్న; మడుఁగున్= మడుగును; దుర్+లోక్యంబు= చూడ శక్యం కానిది; కాన్= కాగా; బాహులన్= భుజాలతో; భీమంబు+కాన్= భయంకరంగా; ఈదెన్= ఈదాడు.

**తా :** పూర్వం మత్స్యావతారాన్ని ఎత్తి, సముద్రంలో బాగా ఈదిన అనుభవం ఉన్నవాడు కనుక శ్రీకృష్ణుడు ఆ మడుగులో పెద్ద పెద్ద అలలు పైకి లేచేటట్లు నదిని కలచివేస్తూ, అటూ ఇటూ భయంకరంగా ఈదాడు. దానితో కాళియుని మనస్సులో కోపాగ్ని జ్వాలలు ఎగదోసినట్లయింది.

**విశే :** విష్ణువే కృష్ణుడు కనుక మత్స్యావతార విశేషాన్ని కృష్ణునికి అన్వయించడం జరిగింది.

**వ. ఆ సమయంబున. 640**

**ప్రతి :** ఆ సమయంబునన్= అప్పుడు...

**తా :** ఆ సమయంలో

**శా. 'బాలుం డొక్కఁడు వీఁడు నామడుఁగు విభ్రాంతోచ్చలత్కీర్ణ క**
**ల్లోలంబై కలఁగం జరించె నిట నే లో నుంటఁ జూడండు, మ**
**త్కీలాభీలవిశాలదుస్సహవిషాగ్నిజ్వాలలన్ భస్మమై**
**కూలంజేసెద నేఁడు లోకులకు నాకోపంబు దీపింపఁగన్.' 641**

**ప్రతి :** వీఁడున్= ఈతడు; బాలుండు= చిన్న పిల్లవాడు; ఒక్కఁడు= ఒంటరివాడు; నా మడుఁగు= (కాళియుడు) నేనుండే ఈ మడుగును; విభ్రాంత= మిక్కిలి భ్రాంతిని కలిగిస్తూ; ఉత్+చలత్= పైకి పొంగుచున్న; కీర్ణ= అంతట వ్యాపించిన; కల్లోలంబు+ఐ= పెద్ద కెరటాలు కలదయి; కలఁగన్= క్షోభించేట్లుగా; చరించెన్= ప్రవర్తించాడు; ఇటన్= ఇచ్చట; లోన్= మడుగులోపల; ఏన్= నేను; ఉంటన్= ఉండడాన్ని; చూడండు= చూడలేదు; నేఁడు= ఈనాడు; లోకులకున్= ప్రజలకు; నా కోపంబు= నా

క్రోధం; దీపింపన్+కన్= వెల్లడి అయ్యేట్లుగా; మత్= నాయొక్క; కీలా= మంటలచేత; ఆభీల= భయంకరమైన; విశాల= విస్తృతమైన; దుస్+సహ= సహించడానికి శక్యంకాని; విష+అగ్ని= విషం వల్ల కలిగిన అగ్నియొక్క; జ్వాలలన్= మంటలచేత; భస్మము+ఐ= బూడిదగా మారి; కూలన్= చనిపోవునట్లు; చేసెదన్= చేస్తాను.

**తా :** వీడు చిన్నపిల్లవాడు. పైగా ఒంటరివాడు. ఇటువంటివాడు అయివుండి, నా మడుగును క్షోభింపజేశాడు. నేను ఈ మడుగులోపల ఉన్నాననే సంగతి వీనికి తెలిసి ఉండదు. నాకు కోపం వచ్చిందంటే ఎంత తీవ్రంగా ఉంటుందో, లోకానికి తెలియజేయడానికి ఇదే అదను. నా క్రోధాగ్నిజ్వాలలతో ఇతణ్ణి బూడిద చేసి, వీనిప్రాణాలు తీస్తాను.

**వ. అని తలంచి విజృంభించి. 642**

**ప్రతి :** అని= ఇట్లు; తలంచి= ఆలోచించి; విజృంభించి= చెలరేగినవాడయి...

**తా :** అని ఈ విధంగా అనుకొని, ఇంకా విజృంభిస్తూ,

**ఉ. ఘోరవిషానలప్రభలు గొబ్బునఁ గ్రమ్మఁగ సర్పసైన్య వి**
**స్ఫారుఁడు గాళియోరగుఁడు పాఱి వడిం గఱచెం బయోధరా**
**కారుఁ బయోవిహారు భయకంపవిదూరు మహాగభీరు నా**
**భీరకుమారు వీరు నవపీతశుభాంబరధారు ధీరునిన్. 643**

**ప్రతి :** ఘోర= భయంకరమైన; విష= విషంనుండి పుట్టిన; అనల= అగ్నియొక్క; ప్రభలు= కాంతులు; గొబ్బునన్= శీఘ్రంగా; క్రమ్మన్+కన్= వ్యాపింపగా; సర్పసైన్య విస్ఫారుఁడు= పాములదండుచేత అధికుడయిన; కాళియ+ఉరగుఁడు= కాళియుడనే సర్పం; పాఱి= పరిగెత్తుకొనిపోయి; పయోధర+ఆకారున్= నీలమేఘంవంటిరూపం గలవాణ్ణి; పయోవిహారున్= నీటిలో విహరించువాణ్ణి; భయకంపవిదూరున్= బెదురు వణకు లేనివాణ్ణి; మహాగభీరున్= గొప్ప గంభీరుడయినవాణ్ణి(మిక్కిలి లోతైనవాడును); వీరున్= పరాక్రమవంతుణ్ణి; నవ= నూతనమైన; పీత= పచ్చనిదీ; శుభ= మంగళకరమైందీ అగు; అంబరధారున్= వస్త్రాన్ని ధరించినవాణ్ణి; ధీరునిన్= ధైర్యవంతుడును అగు; ఆభీరకుమారున్= గొల్లపిల్లవాడగు శ్రీకృష్ణుణ్ణి; వడిన్= వేగంగా; కఱచెన్= కాటువేశాడు.

**తా :** ఈవిధంగా ఆలోచించిన కాళియుడు సర్పసైన్యంతో కలిసి, విషాగ్ని జ్వాలలకాంతులు అంతట వ్యాపిస్తూ ఉండగా, వేగంగా వెళ్లి, శ్రీకృష్ణుణ్ణి కాటు వేశాడు. ఆ శ్రీకృష్ణుడు నీలమేఘంలా ఉన్నాడు. జంకు గొంకు లేకుండా ఆ మడుగునీళ్లలో స్వేచ్ఛగా విహరిస్తున్నాడు. ధైర్యగాంభీర్య గుణాలు కలిగి ఉన్నాడు. బంగారురంగు గల పట్టు వస్త్రాన్ని కట్టుకొని ఉన్నాడు.

**క. కఱచి పిఱుతివక మఱియును, వెఱవక నిజవదనజనితవిషదహనశిఖల్**
**మెరయఁ దననిడుదయొడలిని, నెఱి హరిఁ బెనఁగొనియె భుజగనివహపతి వడిన్. 644**

**ప్రతి :** కఱచి= కాటువేసి; పిఱుతివక= వెనుదీయక; వెఱవక= జంకక; మఱియునున్= ఇంకా; నిజ= తనయొక్క; వదన= ముఖమునందుండి; జనిత= వెలువడిన; విషదహన= విషాగ్నియొక్క; శిఖల్= జ్వాలలు; మెరయున్= ప్రకాశించగా; భుజగనివహపతి= పాముల గుంపులకు రాజయిన కాళియుడు; వడిన్= వేగంగా; తన నిడుద+ఒడలినిన్= తన పొడవైన శరీరంచేత; నెఱిన్= పరాక్రమంతో; హరిన్= శ్రీకృష్ణుణ్ణి; పెనుఁగొనియెన్= బంధించాడు.

**తా :** సర్పరాజయిన కాళియుడు శ్రీకృష్ణుణ్ణి కాటువేసి, అంతటితో ఊరుకోకుండా, తన నోటినుండి విషపుమంటలు వెలిగ్రక్కుతూ, జంకూ గొంకూ లేకుండా తన పొడవైన శరీరంతో శ్రీకృష్ణుణ్ణి వేగంగా బంధించివేశాడు.

**వ. ఇట్లు భోగిభోగపరివేష్టితుండై, చేష్టలు లేనివానితెఱంగునఁ గానంబడుచున్న ప్రాణసఖునిం గనుంగొని తత్ప్రభావంబు లెఱుంగక, తత్సమర్పితధనదారమనోరథమానసులు గావున. 645**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; భోగి= పాముయొక్క; భోగ= శరీరంచేత; పరివేష్టితుండు+ఐ= చుట్టుకొనబడినవాడయి; చేష్టలులేని వాని తెఱంగునన్= కాళ్లు చేతులు ఆడనివాడి విధంగా; కానన్+పడుచున్+ఉన్నన్= కనబడుతూ ఉన్నటువంటి; ప్రాణసఖునిన్= ప్రాణసమానమైన స్నేహితుణ్ణి; కనుంగొని= చూచి; తత్ ప్రభావంబులు= ఆ శ్రీకృష్ణునిమహిమలు; ఎఱుంగక= తెలుసుకొనలేక; తత్= ఆ శ్రీకృష్ణునియందు; సమర్పిత= సమర్పింపబడిన; ధన= సంపదలు; దార= భార్యలు; మనోరథ= కోరికలు; మానసులు= హృదయములును కలవారు; కావునన్= అయిన కారణంచేత...

**తా :** ఈ రీతిగా శ్రీకృష్ణుడు కాళియసర్పంచేత బంధింపబడి, కాళ్లుచేతులు ఆడనందువల్ల కదలిక మెదలిక లేకుండా ఉండడం చూశారు గొల్లపిల్లలు. అతడు తమకు ప్రాణస్నేహితుడు. అతని మహిమలు వారికి తెలియవు. తమ సంపదలు, భార్యలు, కోరికలు మనస్సులు అన్నింటిని శ్రీకృష్ణునికి సమర్పించి, సర్వస్వం శ్రీకృష్ణుడే అని నమ్మినవారు కావున

**చ. అదె మన కృష్ణునిం గఱిచె, నంతటఁ బోక భుజంగమంబు దు**
**ర్మదమున మేనఁ జుట్టికొని మానక యున్నది, యింక నేమి సే**
**యుద? మెటఁ జొత్త మే పురుషు లోపుదు రీయహి నడ్డపెట్ట నె**
**య్యది సదుపాయ? మంచుఁ బడి రార్తరవంబులఁ దూలి గోపకుల్. 646**

**ప్రతి :** గోపకుల్= గొల్లవారు; అదె= అదిగో; భుజంగమంబు= సర్పం; మనకృష్ణునిన్= మనవాడయిన శ్రీకృష్ణుణ్ణి; కఱిచెన్= కరచింది; అంతటన్+పోక= అంతటితో విడిచివెళ్లక; దుర్+మదమునన్= పాడు పొగరుతో; మేనన్= శరీరంపై; చుట్టుకొని= పెనవేసికొని; మానక ఉన్నది= విడువకుండగా ఉంది; ఇంకన్= ఇటుపైన; ఏమి చేయుదము= శ్రీకృష్ణుణ్ణి విడిపించుకొనేందుకై ఏమి చేయగలం; ఎటన్+చొత్తము= ఎక్కడకు వెళ్తాం; ఈ+అహిన్= ఈ పామును; అడ్డపెట్టన్= అడ్డగించడానికి (లొంగదీయుటకు); ఏ పురుషులు= ఏ మగవారు; ఓపుదురు= సమర్థులవుతారు; సత్+ఉపాయము= మంచి ఉపాయం; ఏ+అది= ఏది; అంచున్= అంటూ; ఆర్తరవంబులన్= ఆర్తితో కేకలు పెడుతూ; తూలి= ఒరిగిపోతూ; పడిరి= నేలపై పడ్డారు.

**తా :** అదిగో! ఆ పాము మన కృష్ణుణ్ణి కరచింది, అంతటితో వదలిపెట్టకుండా, పొగరుబోతు తనంతో అతని శరీరమంతా చుట్టుకొని కదలకుండా బంధించివేసింది. ఇంక ఇప్పుడేమి చేస్తాం? ఎక్కడికి వెళ్తాం? దీన్ని లొంగదీయగల సమర్థులెవరు? ఏమిటి ఉపాయం? అని గొల్లపిల్లలంతా శోకంతో బొబ్బలు పెడుతూ నేలమీద పడిపోయారు.

**క. గోపకుమారకశేఖరు, నేపున సర్పంబు గఱచు టీక్షించి వగన్**
**మేపులకుఁ దొలఁగి గోవులు, వాపోవుచు నుండె వృషభవత్సంబులతోన్. 647**

**ప్రతి :** గోపకుమారక శేఖరున్= గొల్లకుఱ్ఱలలో గొప్పవాడయిన శ్రీకృష్ణుణ్ణి; ఏపునన్= విజృంభణంతో; సర్పంబు= పాము; కఱచుట= కాటువేయడం; ఈక్షించి= చూచి; గోవులు= ఆవులు; వృషభవత్సంబులతోన్= ఎద్దులతోను, దూడలతోనుగూడ; వగన్= దుఃఖంతో; మేపులకున్+తొలఁగి= మేత మేయడాలు మానివేసి; వాపోవుచున్+ఉండెన్= అరుస్తూ ఉన్నాయి.

**తా :** శ్రీకృష్ణుణ్ణి కాళియసర్పం కరవడంచూచిన ఆవులు, ఎద్దులు, దూడలు అన్నీ దుఃఖంతో మేత మేయడం మానేసి అరుస్తూ ఉండిపోయాయి.

**క. భూతలము వడఁకె నుల్కా, పాతంబులు మింటఁ గానఁబడె ఘోషములో**
**వ్రేతలకును గోపక సం, ఘాతములకు నదరెఁ గీడుకన్ను లిలేశా! 648**

**ప్రతి :** ఇలా+ఈశా!= భూమికి ప్రభువైన ఓ పరీక్షిన్మహారాజా!; భూతలమున్= భూమియు; వడఁకెన్= కంపించింది; మింటన్= ఆకాశంలో; ఉల్కాపాతంబులు= ఉల్కలు రాలడం; కానఁబడెన్= కనుపించాయి; ఘోషములోన్= గొల్లపల్లెలో; వ్రేతలకున్= గోపికలకును; గోపసంఘాతములకున్= గోపాలకుల గుంపులకును; కీడుకన్నులు= కీడును సూచించునట్లుగా కన్నులు; అదరెన్= చలించాయి.

**తా :** ఓ రాజా! కాళియుడు శ్రీకృష్ణుణ్ణి కరచి చుట్టివేయడంతో, ఎన్నో ఉత్పాతాలు సంభవించాయి. భూమి కంపించింది. ఆకాశంనుండి నిప్పురవ్వలు రాలుతూ కనిపించాయి. గొల్లపల్లెలో ఉండే ఆడవారికి కుడికన్నులు, మగవారికి ఎడమ కన్నులు అశుభాన్ని సూచిస్తూ అదిరాయి.

**వ. అంత నా దుర్నిమిత్తంబులు వొడగని బెగడు గదిరినచిత్తంబుల నుత్తలపడుచు మందనున్న నందయశోదాదులైన గోపగోపికాజనంబులు హరిదళసరి యెఱుంగక గోపాలగోగణపరివృతుండైన కృష్ణుం డెక్కడ నైనం జిక్కనోపు నని పొక్కుచుం బెక్కువలయిన మక్కువలు చెక్కులొత్త నొక్కపెట్ట బాలవృద్ధసమేతులై మహాఘోషంబున నా ఘోషంబు వెలువడి. 649**

**ప్రతి :** అంతన్= అపుడు; మందన్+ఉన్న= గొల్లపల్లెలో ఉన్నట్టి; నందయశోదా+ఆదులు= నందుడు యశోద మొదలుగాగలవారు; ఐన గోప గోపికాజనంబులు= గొల్లలు గొల్లెతలు అయినట్టి జనులు; ఆ దుర్+నిమిత్తంబులు= ఆ అపశకునాలు; పొడఁగని= చూచి; బెగడు గదిరిన చిత్తంబులన్= భయపడిన మనస్సులతో; ఉత్తలపడుచున్= కలత నొందుతు; హరిదళసరి= శ్రీకృష్ణునియొక్క సామర్థ్యం; ఎఱుంగక= తెలియక; గోపాల= గోపారుల; గో= ఆవుల; గణ= సమూహాలతో; పరివృతుండు+ఐన= చుట్టు ఉన్నవాడైన; కృష్ణుండు= శ్రీకృష్ణుడు; ఎక్కడన్+ఐనన్= ఏదో ఒకచోట; చిక్కన్+ఓపును+అని= ఇరుకుకొని ఉండవచ్చును అంటూ; పొక్కుచున్= దుఃఖించుతూ; పెక్కువలు+అయిన మక్కువలు= పెచ్చు పెరిగిన ప్రేమలు; చెక్కులు+ఒత్తన్= మితిమీరుచుండగా; ఒక్కపెట్టన్= ఒక్కసారిగా; బాలవృద్ధ సమేతులు+ఐ= చిన్నపిల్లలతోను; ముసలివారితోను కూడుకొన్నవారయి; మహాఘోషంబునన్= పెద్దసవ్వడితో; ఆ ఘోషంబున్= ఆ గొల్లపల్లెనుండి; వెలువడి= బయటకువచ్చి...

**తా :** గొల్లపల్లెలో ఉన్న నందుడు యశోద మొదలయిన గొల్లవారు ఆడవారు, మగవారు అందరు ఆ దుశ్శకునాలు చూచి, భయపడిపోయారు. శ్రీకృష్ణుని సామర్థ్యం తెలియక, గొల్లపిల్లలు ఆవులమందలతో కలిసి ఉన్న శ్రీకృష్ణుడు, ఎక్కడయినా ఆపదలో చిక్కుకొన్నాడేమో అని ఆరాటపడ్డారు. మిక్కిలి ప్రేమతో పిన్న పెద్ద అన్న తేడా లేకుండా అందరు పెద్దపెట్టున ఆక్రందన చేస్తూ గొల్లపల్లె నుండి బయలుదేరారు.

**క. వా రిబ్భంగి నెఱుంగని, వారై హరిఁ జూడఁ బోవ వడిగఁగొని నగుచున్**
**వారింపఁ డయ్యె రాముఁడు, వారిని హరి లావెఱుంగువాఁ డయ్యు నృపా! 650**

**ప్రతి :** నృపా!= ఓ పరీక్షిన్మహారాజా!; వారు= ఆ గొల్లలు; ఈ+భంగిన్= ఈ విధంగా; ఎఱుంగనివారు+ఐ= (శ్రీకృష్ణుని శక్తి) తెలియనివారయి; హరిన్= శ్రీకృష్ణుని; చూడన్+పోవన్= చూడడానికి వెళ్లుతుండగా; రాముఁడు= బలరాముడు; హరిలావు= శ్రీకృష్ణునిశక్తి; ఎఱుంగువాఁడు= తెలిసినవాడు; అయ్యున్= అయి ఉండికూడా; వడిగఁగొని నగుచున్= పకపక నవ్వుతు; వారిన్= (నందుడు మొదలైన గొల్ల) వారిని; వారింపఁడు+అయ్యెన్= అడ్డగింపలేదు.

**తా :** ఓ రాజా! ఈ విధంగా గొల్లపల్లెలోని వారంతా, శ్రీకృష్ణునిశక్తి తెలియక, అజ్ఞానంతో అతనిజాడ తెలుసుకొనడంకోసం వెడుతూ ఉంటే, అతనిశక్తి తెలిసినవాడైనా బలరాముడు వారిని ఆపు చెయ్యలేదు. పైగా పకపక నవ్వుకొంటూ, వారిని గమనిస్తూ ఊరుకున్నాడు.

**వ. అంతలోన వారునుం దానును గాంతారమార్గంబు వట్టి పోవుచు నెడనెడ గోపగోష్పదంబులసందుల నింత నంత నక్కడక్కడ యవాంకుశ హల కమల కులిశ చక్ర చాప కేతనాది రేఖాలంకృతంబులై మార్గాభరణంబులైన హరిచరణంబుల జాడఁ గని చొప్పు దప్పక చని దుర్ఘటంబయిన యమునాతటంబు సేరి, వారిమధ్యంబున నితరుల కసాధ్యంబైన సర్పంబుచేతఁ గాటు వడి దర్పంబు సూపక భోగిభోగపరివృతుండైన కృష్ణునిం గృష్ణ కృష్ణేతివిలాపంబులఁ దాపంబులం బొందుచుఁ దత్కాలంబునం బ్రతికూలం బయ్యె ననుచు దైవంబు దిట్టు గోపకులను, గోపకులం గలసి మేఁత లుడిగి ఱెప్పలిడక కృష్ణునిం దప్పక చూచుచు నొరలుచున్న గోవులం గని, రందు గోపికలు యశోదం బట్టుకొని విలపించుచుఁ గృష్ణు నుద్దేశించి యిట్లనిరి. 651**

**ప్రతి :** అంతలోనన్= అపుడు; వారునున్= ఆ గొల్లలు; తానునున్= బలరాముడును; కాంతారమార్గంబున్+పట్టి పోవుచున్= అడవిదారిలో వెళ్లుతూ; ఎడన్+ఎడన్= అక్కడక్కడ; గోప= గోపాలుర; గోష్పదంబుల సందునన్= ఆవులఅడుగుల సందుల్లో; యవ= యవలు; అంకుశ= అంకుశం; హల= నాగలి; కమల= పద్మం; కులిశ= వజ్రాయుధం; చక్ర= చక్రం; చాప= ధనుస్సు; కేతన= ధ్వజం; ఆది= మొదలుగాగలవానియొక్క; రేఖా= ఆకృతులతో; అలంకృతంబులు= అలంకరింపబడినవి; ఐ= అయి; మార్గ+ఆభరణంబులు= దారికి అలంకారాలవంటివి; ఐన హరిచరణంబుల జాడన్= అయినటువంటి శ్రీకృష్ణునియొక్క అడుగులగుర్తును; కని= చూచి; చొప్పు తప్పక= దారి తప్పకుండగ; చని= వెళ్లి; దుర్+ఘటంబు+అయిన= చేరుటకు శక్యంకానిది అయిన; యమునా తటంబున్= కాళిందీనది ఒడ్డును; చేరి= సమీపించి; వారి మధ్యంబునన్= నీటి నడుమ; ఇతరులకున్= తనకంటె వేరయినవారికి; అసాధ్యంబు= లొంగదీయుటకు శక్యంకానిది; ఐన సర్పంబుచేతన్= అయినట్టి పాముచేత; కాటు+పడి= కరవబడి; దర్పంబు= గర్వమును; చూపక= ప్రకటింపక; భోగి భోగపరివృతుండు= పాము శరీరంతో చుట్టుకొనబడినవాడు; ఐనకృష్ణునిన్= అయినట్టి కృష్ణుణ్ణి గురించి; కృష్ణ కృష్ణ+ఇతివిలాపంబులన్= కృష్ణా! కృష్ణా! అనే ఏడ్పులతో; తాపంబులన్= బాధలను; పొందుచున్= అనుభవిస్తూ; తత్+కాలంబునన్= ఆ సమయంలో; ప్రతికూలంబు= అనుకూలం కానిదిగా; అయ్యెను+అనుచున్= అయిందని అంటూ; దైవంబున్= (తమ) భాగ్యమును; తిట్టు గోపకులను= నిందించునటువంటి గొల్లవారిని; గోపకులన్= గొపాలురతో; కలిసి; మేఁతలు= గడ్డి మేయుటలు; ఉడిగి= మాని; ఱెప్పలు+ఇడక= కనురెప్పలార్పక; కృష్ణునిన్= శ్రీకృష్ణుణ్ణీ; తప్పక= మానక; చూచుచున్= చూచుచు; ఒరలుచున్= అరచుచు; ఉన్నగోవులన్= ఉన్నటువంటి ఆవులను; కనిరి= చూశారు; అందున్= అక్కడ; గోపికలు= గొల్లతలు; యశోదన్= యశోదాదేవిని; పట్టుకొని= పట్టుకొని; విలపించుచున్= రోదించుచు; కృష్ణునిన్+ఉద్దేశించి= శ్రీకృష్ణుని గురించి; ఇట్లు+అనిరి= ఈ విధంగా పలికారు.

**తా :** బలరాముడు నందుడు మొదలయిన గొల్లలు అడవిదారిలో శ్రీకృష్ణుణ్ణి వెదుకుతూ వెళ్లుతున్నారు. ఆవులను కాచే గోపబాలుర అడుగుజాడలు, ఆవుల అడుగుజాడల నడుమ శ్రీకృష్ణుని అడుగుజాడలు కనబడుతున్నాయి. వాటి అడుగుల జాడలలో ఉత్తమ సాముద్రిక చిహ్నాలయిన యవరేఖ, అంకుశరేఖ, హలరేఖ, కమల రేఖ, కులిశరేఖ, చక్రరేఖ, చాపరేఖ, ధ్వజరేఖ మొదలయిన రేఖలు ఆ అడవిదారికి ఆభరణాలుగా అందంగా ఉన్నాయి. ఆ జాడల వెంబడి దారి తప్పకుండా వెళ్లి, కాళియుని భయంవల్ల అక్కడికి వెళ్లడానికి అందరూ భయపడే కాళిందీనది ఒడ్డుకు చేరారు. ఏటినడుమ ఎవరికీ లొంగని బలంకల కాళియుడు కరవడంచేత చేష్టలుడిగి, ఆ పాము శరీరంతో శరీరమంతా చుట్టుకొన్నందువల్ల, సొమ్మసిల్లిపడి ఉన్న శ్రీకృష్ణుణ్ణి చూచి, ఒడ్డున నిలబడి, దుఃఖం ఆపుకోలేక, కృష్ణా! కృష్ణా! అని గొంతెత్తి విలపిస్తూ తమ దురదృష్టాన్ని తిట్టుకొనే కృష్ణుని తోడివారయిన గొల్లకుఱ్ఱల్ని చూశారు. మేతలు మాని, రెప్ప వేయకుండా, దుఃఖంతో శ్రీకృష్ణుణ్ణే చూస్తూ ఉండే గోవుల్ని, దూడల్ని చూశారు. (ఈ గొల్లపిల్లలు, ఆవులు ఆనాటి ఉదయమే శ్రీకృష్ణునితోబాటుగా, గొల్లపల్లెనుండి అడవికి వచ్చినవారన్నమాట) ఈ సన్నివేశం అంతా చూచిన గోపికలు యశోదను కౌగిలించుకొని, శ్రీకృష్ణునిచేష్టలు తలచుకొని, ఈ విధంగా విలపిస్తున్నారు.

**సీ. ఎదురువచ్చినఁ జాల నెదురుగాఁ జనుదెంతు, వెదురు వచ్చిన నేఁడదేల రావు?**
**చూచినఁ గృపతోడఁ జూచు చుందువు నీవు, సూచినఁ గనువిచ్చి చూడ వేల?**
**డాసిన నఱలేక డాయంగ వత్తువు, డాసిన నేటికి డాయ విచటఁ?**
**జీరిన 'నో' యని చెలరేఁగి పలుకుదు, విది యేమి సీరిన నెఱుఁగ కుంట?**

**ఆ. తలఁపు సేయునంతఁ దలపోయుచుందువు, తలఁపు సేయ నేఁడు దలఁప వకట!**
**యనుచు భక్తివివశ లాడెడి కైవడి, వ్రేత లెల్ల నాడి వివశలైరి. 652**

**ప్రతి :** ఎదురు వచ్చినన్= (నీకు మేము) ఎదురుగా వచ్చినట్లయిన; చాలన్= మిక్కిలిగా; ఎదురు+కాన్+చనుదెంతువు (చనుదెంచుదువు)= (మాకు) ఎదురుగా వచ్చేవాడివి; ఎదురువచ్చినన్= మేము ఎదురుగా వచ్చినా; నేఁడు= ఈనాడు; అది+ఏలరావు= ఎందుకని ఎదురుగా రావు; చూచినన్= (నిన్ను) చూచినచో; కృపతోడన్= దయతో; నీవు= నీవూ; చూచుచున్+ ఉందువు= చూస్తూ ఉంటావు; చూచినన్= మేము నిన్ను చూచినప్పటికిని (నీవు); కనువిచ్చి= కన్నుతెరచి; చూడవు+ఏల= (మమ్ము) ఎందుకుచూడవు?; డాసినన్= (నిన్ను) సమీపించినచో; అఱలేక= భేదభావం లేకుండగ; డాయన్+కన్ వత్తువు= సమీపించుటకు వచ్చెడివాడవు; ఇచటన్= ఇక్కడ; డాసినన్= (మేము) నిన్ను సమీపించినప్పటికిని; ఏటికిన్= ఎందుకు; డాయవు= సమీపానికి రావు; చీరినన్= పిలిచినచో; ఓ+అని= ఓ అంటూ; చెలరేఁగి= మిక్కిలి విజృంభించి; పలుకుదువు= పలుకుతావు; చీరినన్= పిలిచినప్పటికినీ; ఎఱుఁగక+ఉంటన్= తెలియనట్లుగా ఉండడం; ఇది+ఏమి= ఎందువలన?; తలఁపు+చేయునంతన్= తలచినంతమాత్రాన్నే; తలపోయుచున్= మా గురించి తలచుకొంటూ; ఉందువు= ఉంటావు; నేఁడు= ఈనాడు; అకట= అయ్యో; తలఁపుచేయన్= (నిన్ను గురించి) తలంచినా; తలఁపవు= ఆలోచింపవు; అనుచున్= అంటూ; వ్రేతలు+ఎల్లన్= గోపికలు అందరు; భక్తి వివశలు= భక్తిచే పరవశించేవారు; ఆడెడి+కైవడిన్= మాటలాడే విధంగా; ఆడి= పలికి; వివశలు= పరవశత్వం పొందినవారు; ఐరి= అయ్యారు.

**తా :** శ్రీకృష్ణా! మేము నీకు ఎదురుగా వస్తే నీవు మాకు ఎదురు వచ్చేవాడవు. ఈ వేళ మేము వచ్చినా నీవెందుకు ఎదురు రావడం లేదు? మేము నీకేసి చూస్తే చాలు. నీవు దయతో మా వైపునకు చూచేవాడవు. నేడు మేము నిన్ను చూస్తూ ఉన్నా నీవు మాకేసి చూడడం లేదు. మేము కృష్ణా! అని పిలిస్తే చాలు 'ఓ' అని వెంటనే గట్టిగా ఉత్సాహంతో బదులు పలికేవాడవు. నేడు

మేము ఎంత పిలిచినా నీవు పలకడం లేదు. మేము నిన్ను తలచుకొంటే చాలు. మమ్మల్ని గురించి తలచేవాడవు. ఈనాడు ఆ ఆలోచనే నీకు రావడం లేదు అని గోపికలు భక్తితో పరవశించిన భక్తురాళ్లవలె పలికి ఒళ్లు మరచిపోయారు.

**వ. ఆ సమయంబున నందయశోదాదులు హరిం జూచి యధికంబైన శోకంబున నిట్లనిరి. 653**

**ప్రతి :** ఆ సమయంబునన్= అప్పుడు; నందయశోదా+ఆదులు= నందుడు యశోద మొదలైన గొల్లవారందరు; హరిన్= శ్రీకృష్ణుణ్ణి; చూచి= చూస్తూ; అధికంబు= ఎక్కువ; ఐన శోకంబునన్= ఐన దుఃఖంతో; ఇట్లు= ఈవిధంగా; అనిరి= పలికారు.

**తా :** అప్పుడు నందుడు యశోద మొదలైన గొల్లవారంతా అధికమైన శోకంతో శ్రీకృష్ణుణ్ణి చూచి, ఈ విధంగా అన్నారు.

**క. విషకుచయుగ యగు రక్కసి, విషకుచదుగ్ధంబు ద్రావి విషవిజయుఁడవై**
**విషరుహలోచన! యద్భుత, విషయుండగు నీకు సర్పవిష మెక్కెఁ గదా! 654**

**ప్రతి :** విషరుహలోచన= నీటినుండి పుట్టిన తామరపూవువంటి కన్నులుగల ఓ కృష్ణా!; విషకుచయుగ= విషంతోగూడిన చన్నులయొక్క జంటకలది; అగు= అయినట్టి; రక్కసి= రాక్షసియొక్క; విషకుచ= విషంతోగూడిన చన్నులయొక్క; దుగ్ధంబున్= పాలను; ద్రావి= పానంచేసి; విషవిజయుఁడవు+ఐ= విషమును జయించినవాడవు అయి; అద్భుత విషయుండు= ఆశ్చర్యకరమైన సామర్థ్యము కలవాడవు; అగునీకున్= అయినట్టి నీకు; సర్పవిషము= పాము విషం; ఎక్కెన్+కదా!= ఎక్కింది కదా!

**తా :** తామరపూలవంటి కన్నులు గల ఓ శ్రీకృష్ణా! విషాన్ని రొమ్ములలో దాచుకొని వచ్చిన దుష్టరాక్షసి పూతన ఇచ్చిన పాలు త్రాగి అరిగించుకొన్న అద్భుతమైన శక్తి కలిగినవాడివి గదా! అటువంటి నీకు ఈ పాము విషం ఎక్కిందంటే ఎంత ఆశ్చర్యకరమైన విషయమో కదా!

**విశే :** విషమంటే – నీరు, విషం – అనే అర్థాలున్నాయి. ఇక్కడ 'విషరుహ' అంటే నీటినుండి పుట్టిన – అనగా పద్మం – అని అర్థం.

**క. కట్టా! క్రూరభుజంగము, గట్టలుకన్ నిన్నుఁ గఱవఁ గంపించితివో?**
**తిట్టితివో పాపపువిధి?, పట్టీ! మముఁ దలఁచి కాఁకఁ బలవించితివో? 655**

**ప్రతి :** పట్టీ= ఓ బిడ్డా!; కట్టా= అయ్యో!; క్రూరభుజంగము= క్రూరమైన సర్పం; కట్టలుకన్ (కడు+అలుకన్)= మిక్కిలి కోపంతో; నిన్నున్= నిన్ను; కఱవన్= కాటువేయగా; కంపించితివి+ఓ= వణకిపోయావేమో?; పాపపువిధి= చెడ్డదియగు విధిని; తిట్టితివి+ఓ= నిందించావో; కాఁకన్= పరితాపంతో; మమున్= మమ్ము; తలఁచి= తలచుకొని; పలవించితివి+ఓ= పలవరించిపోయావో?

**తా :** అయ్యో! బిడ్డా! భయంకరమైన ఆ సర్పం కోపంతో నిన్ను కరుస్తూ ఉంటే ఎంతగా వణికిపోయావో? నీ దౌర్భాగ్యాన్ని ఎంతగా తిట్టుకొన్నావో? మాకోసం ఎంతగా పలవరించిపోయావో గదా?

**క. పన్నగము మమ్ము గఱవక, ని న్నేటికిఁ గఱచెఁ గుఱ్ఱ! నెమ్మి గలిగి నీ**
**వున్నను మము రక్షింతువు, నిన్నున్ రక్షింప నేము నేరము తండ్రీ! 656**

**ప్రతి :** కుఱ్ఱ= ఓ బిడ్డా!; పన్నగము= పాము; మమ్మున్+కఱవక= మమ్మల్ని కాటువేయకుండ; నిన్నున్= నిన్ను; ఏటికిన్= ఎందుకు; కఱచెన్= కాటువేసెను; తండ్రీ!= నాయనా; నీవు నెమ్మి కలిగి= నీవు క్షేమం కలవాడవయి; ఉన్నను= ఉంటే;

మమున్= మమ్ములను; రక్షింతువు= కాపాడుతుంటావు; నిన్నున్= నిన్ను; ఏము= మేము; రక్షింపన్= రక్షించడానికి; నేరము= సమర్థులము కాము.

**తా :** బిడ్డా! ఈ పాము మమ్మల్ని కరవకుండా నిన్నెందుకు కరచిందో కదా! నీవు క్షేమంగా ఉంటే మాకు ఏ ఆపదలూ రాకుండా కాపాడుతూ ఉంటావు. నాయనా! నీకు ఆపద కలిగితే నిన్ను మేము రక్షించలేము కదా!

**ఉ. చూడ వ దేమి గౌరవపుఁజూపుల మమ్ము? సఖాలితోడ మా**
**టాడ వ దేమి? నర్మముగ నందెలు పాదములందు మ్రోయ? నేఁ**
**డాడ వ దేమి నర్తనము? లవ్వలమ్రోలను గోపికావళిం**
**గూడ వ దేమి నవ్వులకు? గోపకుమారవరేణ్య! చెప్పుమా! 657**

**ప్రతి :** గోపకుమారవరేణ్య!= గోపకుమారులలో శ్రేష్ఠుడవైన ఓ శ్రీకృష్ణా!; గౌరవము+చూపులన్= గౌరవంతో గూడిన చూపులతో; మమ్మున్= మమ్ములను; చూడవు+అది+ఏమి= ఎందుకు చూడకుండా ఉన్నావు; సఖ+ఆలితోడన్= స్నేహితుల వరుసలతో; నర్మము+కన్= రహస్యంగ; మాటాడవు= పలుకవు; అది+ఏమి= ఎందులకని; నేఁడు= ఈనాడు; పాదములందున్= కాళ్లయందు; అందెలు= నూపురములు; మ్రోయన్= ధ్వనించునట్లుగా; అవ్వల మ్రోలను= తల్లుల యెదురుగా; ఆడవు= నాట్యము చేయవు; అది+ఏమి= ఎందులకు; నవ్వులకున్= పరిహాసము లాడుటకు; గోపికా+ఆవళిన్= గొల్లపడుచులతో; కూడవు= కలియవు; అది+ఏమి= ఎందుకు; చెప్పుము+ఆ= చెప్పు.

**తా :** ఓ కృష్ణా! ఈ వేళ ఎప్పటిలాగ మమ్మల్ని గౌరవంగా ఎందుకు చూడవు? స్నేహితులతో ఏకాంతంగా ఎందుకు మాటాడవు? చెవులకు ఇంపుగా కాళ్లగజ్జెలు మ్రోగేవిధంగా తల్లుల ఎదుటకు వచ్చి ఎందుకు నాట్యం చేయవు? గొల్ల పడుచులచో పరిహాస ప్రసంగాలు ఎందుకు చేయవు?

**సీ. శ్రవణరంధ్రంబులు సఫలతఁ బొందంగ నెలమి భాషించువా రెవ్వ రింకఁ?**
**గరచరణాదులకలిమి ధన్యత నొంద నెగిరి పైఁ బ్రాఁకువా రెవ్వ రింక?**
**నయనయుగ్మంబు లున్నతిఁ గృతార్థములుగా నవ్వులు సూపువా రెవ్వ రింక?**
**జిహ్వలు గౌరవశ్రీఁ జేరఁ బాటల యెడఁ బలికించువా రెవ్వ రింక?**

**ఆ. దండ్రి! నీవు సర్పదష్టుండవై యున్న, నిచట మాకుఁ బ్రభువు లెవ్వ రింక?**
**మరగి పాయ లేము, మాకు నీ తోడిద, లోక మీవు లేనిలోక మేల? 658**

**ప్రతి :** ఇంకన్= ఇటుపైన; శ్రవణరంధ్రంబులు= చెవులు; సఫలతన్= ప్రయోజనం; పొందన్+కన్= పొందునట్లుగా; ఎలమిన్= సంతోషంతో; భాషించువారు= మాటాడేవారు; ఎవ్వరు= ఎవరు; ఇంకన్= ఇటుమీద; కర= చేతులు; చరణ= కాళ్లు; ఆదుల= మొదలగువానియొక్క; కలిమి= కలిగియుండుట; ధన్యతన్= ధన్యత్వమును; ఒందన్+ఎగిరి= పొందునట్లుగా ఎగురుతూ; పైన్= మీదికి; ప్రాఁకువారు= జరుగువారు; ఎవ్వరు= ఎవరు; ఇంకన్= ఇటు తరువాత; నయనయుగ్మంబులు= కనుల జంటలు; ఉన్నతిన్= గొప్పతనముతో; కృత+అర్థములు= నెరవేరిన ప్రయోజనము కలవి; కాన్= అగునట్లుగా; నవ్వులు+చూపువారు= నవ్వులను ప్రదర్శించేవారు; ఎవ్వరు+ఇంకన్= ఇంక ఎవరు ఉన్నారు; జిహ్వలు= నాలుకలు; గౌరవశ్రీన్=

గౌరవసంపదను; చేరన్= పొందునట్లుగా; పాటల+ఎడన్= పాటలు పాడేటపుడు; పలికించువారు= కలిపిపాడించేవారు; ఎవ్వరు+ఇంకన్= ఇంకపైన ఎవరు; తండ్రి= నాయనా!; నీవు= సర్వసమర్థుడవైన నీవు; సర్పదష్టుండవు+ఐ= పాముచే కరవబడినవాడవై; ఉన్నన్= ఉంటే; ఇచటన్= ఇక్కడ; మాకున్= మాకందరికి; ప్రభువులు= పాలకులు; ఎవ్వరు+ఇంకన్= ఇటమీదట ఎవరు; మరగి= (నీయందు) ప్రేమ కలిగియుండి; పాయన్+లేయు= (నిన్ను) విడువజాలము; మాకున్= మాకు; నీతోడిది+అ= నీతో ఉండడమే; లోకము= ప్రపంచం; ఈవు= నీవు; లేని లోకము= లేనట్టి లోకం; ఏల= ఎందులకు?

**తా :** తండ్రీ! కృష్ణా! నీవు ఈ విధంగా పాముకు చిక్కిపోయావే! ఇంక మా చెవులు సఫలములయ్యేలా మాతో ఎవరు మాటాడుతారు? మా కాళ్లు చేతులు ధన్యములయ్యే విధంగా ఎత్తుకోమని మా పైకి ఎవరు ఎగబ్రాకుతారు? మా కళ్లు చల్లగా ఎవరు చిరునవ్వులు చిందిస్తారు? నోటికింపుగా మా చేత మంచి పాటలు ఎవరు పాడిస్తారు? ఇటుపైన మా ఆలనా పాలనా చూచే వారెవరు? నీ యందే మా మనస్సులు లగ్నమైపోయాయి. నిన్ను విడిచి వెళ్లలేము. ఇంక మాకు ఇళ్లు వాకిళ్లు అక్కరలేదు. నీవు ఎక్కడ ఉంటే అదే మా ప్రపంచం. నీవు లేని ఈ లోకం మాకెందులకు?

**వ. అని యొండొరులం బట్టుకొని విలపించుచుం గృష్ణునితోడన మడుఁగు జొత్తము, చత్త' మనుచుఁ గృష్ణవిరహవేదనానలభారతప్తులై మడుఁగుఁ జొరఁ బాఱుచున్నవారలఁ గనుంగొని భగవంతుండైన బలభద్రుండు 'మీరు మీఁదెఱుంగరు, ధైర్యంబు విడుచుట కార్యంబు గాదు. సహించి చూడుఁ' దనుచు వారిని వారించె. 659**

**ప్రతి :** అని= ఈ విధంగా పలికి; ఒండు+ఒరులన్= ఒకరినొకరు; పట్టుకొని; విలపించుచున్= దుఃఖంతో కేకలువేస్తూ; కృష్ణుని తోడనన్= కృష్ణుని తోగూడ; మడుఁగున్= అగాధంలో; చొత్తము= ప్రవేశిద్దాం; చత్తము= ప్రాణాలు విడిచి పెడదాం; అనుచున్= అని పలుకుతూ; కృష్ణ= కృష్ణునితోడి; విరహ= ఎడబాటువల్ల గలిగిన; వేదనా= బాధ అనెడి; అనల= అగ్నియొక్క; భార= బరువుచేత; తప్తులు+ఐ= తపింపజేయబడినవారయి; మడుఁగున్= అగాధంలోనికి; చొరన్= ప్రవేశించేందుకు; పాఱుచున్+ఉన్నవారలన్= పరుగులిడుతూ ఉన్న గొల్లలను ఉద్దేశించి; భగవంతుండు= భగవంతుని అవతారం; ఐనబలభద్రుండు= అయినట్టిబలరాముడు; మీరు= మీరందరు; మీఁదు+ఎఱుంగరు= రాబోయే మంచిచెడ్డలను తెలియలేరు; ధైర్యంబున్= ధీరత్వమును; విడుచుట= విడిచిపెట్టడం; కార్యంబున్+కాదు= చేయదగిన పనికాదు; సహించి= ఓర్చుకొని; చూడుఁడు= వేచి చూడండి; అని= ఈ విధంగా పలుకుతూ; వారిని= నందుడు మొదలయిన గొల్లలను; వారించెన్= ఆపు చేశాడు.

**తా :** ఈ విధంగా నందాదులయిన గొల్లవారంతా ఒకరి నొకరు పట్టుకొని దుఃఖిస్తున్నారు. కృష్ణుణ్ణి విడిచి బ్రతుకలేక దుఃఖంతో కాలిపోతూ అతనితో బాటే మనంకూడా మడుగులోపడి ప్రాణాలు విడిచి పెట్టేద్దాం – అని మడుగులో దూకడానికి సిద్ధమయ్యారు. భగవంతుని అంశావతారమైనవాడు, శ్రీకృష్ణునిశక్తిసామర్థ్యాలు తెలిసినవాడు అయిన బలరాముడు వారిని ఆపు జేసి, ముందు ముందు ఏమి జరుగబోతోందో మీకు తెలియదు. కనుక ధైర్యం విడిచి పెట్టకండి. ఓర్చుకొని వేచిచూడండి అని చెప్పాడు.

**క. తనుఁ గూర్చి యి వ్విధంబున, వనితలు బిడ్డలును దారు వాపోయెడి ఘో**
**షనివాసులఁ గని కృష్ణుఁడు, మనుజునిక్రియ నొక ముహూర్తమాత్రము జరిపెన్. 660**

**ప్రతి :** కృష్ణుఁడు= శ్రీకృష్ణుడు; తనున్+కూర్చి= తనను ఉద్దేశించి; ఈ+విధంబునన్= ఈ తీరుగా; వనితలు= స్త్రీలు; బిడ్డలును= పిల్లలును; తారున్= తామును; (కలిసి) వాపోయెడిఘోషనివాసులన్= రోదిస్తున్న గొల్లపల్లెలోని వారందరినీ;

కని= చూచి; మనుజుని క్రియన్= సాధారణ మానవునివలె; ఒక ముహూర్తమాత్రము= రెండుగడియలసేపు; జరిపెన్= గడిపాడు. (గడియ= 24 నిమిషాలు)

**తా :** గొల్లపల్లెలో ఉండే గొల్లలందరు, తమ ఆలుబిడ్డలతో వచ్చి, తనకోసం విలపించడం చూచి, శ్రీకృష్ణుడు ఏమీ చేతకాని సామాన్య మానవునివలె రెండుగడియల సమయంమాత్రం ఊరుకున్నాడు.

**శా. అంతం గృష్ణుఁడు మేను వెంప భుజగుం డావృత్తులం బాసి తా**
**సంతప్తాయతభోగుఁ డై కఱచుటల్ సాలించి నిట్టూర్పుతో**
**శ్రాంతుండై తలలెత్తి దుర్విషము నాసావీథులం గ్రమ్మ దు**
**శ్చింతన్ దిక్కులు సూచుచుం దలఁగి నిల్చెన్ ధూమకాష్ఠాకృతిన్. 661**

**ప్రతి :** అంతన్= అపుడు; కృష్ణుఁడు= శ్రీకృష్ణభగవానుడు; మేను+పెంపన్= శరీరాన్ని పెంచగా; భుజగుండు= కాళియసర్పం; ఆ వృత్తులన్= తన చుట్లను; పాసి= విడిచి; తాన్= తాను; సంతప్త+ఆయతభోగుఁడు+ఐ= మిక్కిలి తపింపజేయబడిన; సాగదీయబడిన శరీరం కలవాడయి; కఱచుటల్= కాటు వేయుటలు; చాలించి= ఆపు చేసి; నిడు+ఊర్పుతోన్= పొడవైన నిశ్వాసంతో; శ్రాంతుండు+ఐ= అలసినవాడయి; తలలు= పడగలు; ఎత్తి= పై కెత్తి; దుర్+విషము= చెడ్డ విషం; నాసావీథులన్= ముక్కుల మార్గాలనుండి; క్రమ్మన్= (బయటకువచ్చి) వ్యాపింపగా, దుస్+చింతన్= చెడువిచారంతో; దిక్కులు+చూచుచున్= నాలుగువైపుల చూస్తూ; తలఁగి= తొలగించిన; ధూమకాష్ఠ+ఆకృతిన్= పొగ చూరినకట్టెవలె; నిల్చెన్= నిలబడ్డాడు.

**తా :** అపుడు శ్రీకృష్ణుడు తన శరీరాన్ని బాగా పెంచాడు. కాళియుని చుట్టలు విడిపోయాయి. పాము శరీరం బాగా వేడెక్కి పోయింది. దానితో కరవడం మానేశాడు. అలసిపోయాడు. పెద్దగా నిట్టూరుస్తూ పడగలు పైకెత్తాడు. ముక్కులనుండి విషం చిమ్ముతూ, ఏమీ చెయ్యలేక, కృష్ణుణ్ణి విడిచి, దూరంగా నిలబడ్డాడు. పొగచూరిన కట్టెలాగ కాంతిని కోలుపోయాడు.

**చ. వెఱ మెర లేనియట్టి బలువీరుఁడు కృష్ణకుమారుఁ డొక్కచేఁ**
**జఱచి ఖగేంద్రుచందమునఁ జక్కన దౌడలు వట్టి కన్నులం**
**జొఱచొఱ దుర్విషానలము జొబ్బిలు చుండఁగ నెత్తి లీలతో**
**జిఱజిఱఁ ద్రిప్పి వైచెఁ బరిశేషితదర్పముఁ గ్రూరసర్పమున్. 662**

**ప్రతి :** వెఱ= భయము; మెర= సంకోచం; లేనియట్టి= లేనటువంటి; బలువీరుఁడు= గొప్పవీరుడగు; కృష్ణకుమారుఁడు= శ్రీకృష్ణుడు; పరిశేషిత దర్పమున్= కొంచెమే మిగిలిన గర్వంగల; క్రూరసర్పమున్= భయంకరమగు పామును; ఒక్కచేన్= ఒంటిచేతితో; చఱచి= కొట్టి; ఖగ+ఇంద్రుచందమునన్= పక్షులరాజగు గరుత్మంతునివలె; చక్కనన్= చక్కగా (పట్టుసడలనట్లుగా); దౌడలుపట్టి= పాము రెండు దౌడలు పట్టుకొని; కన్నులన్= (పాము) కన్నులనుండి; దుర్+విష+అనలము= చెడ్డదియగు విషాగ్ని; చొఱచొఱ= చొర చొర అనుచప్పుడు చేస్తూ; జొబ్బిలుచున్+ఉండన్+కన్= (బయటకు) కారుచుండగా; లీలతోన్= విలాసంగా; ఎత్తి= పైకిఎత్తి; చిఱచిఱన్= చిర చిర యని చప్పుడు కలుగునట్లుగా; త్రిప్పి= గుండ్రంగా త్రిప్పుతూ; వైచెన్= విసరి వేశాడు.

**తా :** మహాపరాక్రమ వంతుడయిన ఆ శ్రీకృష్ణుడు, జంకుగొంకు లేకుండా, ఆ పాముపడగలమీద చేతితో ఒక్క చరపు చరిచాడు. గరుత్మంతునివలె ఆ పాము రెండుదౌడలు చిక్కబట్టి. కళ్లనుండి విషాగ్నులు బయటకు ప్రసరిస్తూ ఉండగా, దాన్ని పైకెత్తి గిరగిర త్రిప్పి విసరివేశాడు. దానితో ఆ భయంకరమైన సర్పం యొక్క గర్వం చాలా భాగం అణగిపోయింది.

**వ. ఇట్లు వేగంబుగ నాగంబు వీచి వైచి జగజెట్టియైన నందునిపట్టి రెట్టించిన సంభ్రమంబున. 663**

**ప్రతి :** జగజెట్టియైన= జగదేకవీరుడును; నందుని పట్టి= నందుని కుమారుడును అగు శ్రీకృష్ణుడు; ఇట్లు= ఈ ప్రకారంగా; నాగంబున్= కాళియసర్పాన్ని; వేగంబున్+కన్= వేగంగా; వీచి వైచి= విసరికొట్టి; రెట్టించిన సంభ్రమంబునన్= రెట్టింపు వేగంతో...

**తా :** ఈ విధంగా పామును విసరికొట్టి, రెట్టించిన వేగంతో జగదేక వీరుడయిన శ్రీకృష్ణుడు కదిలాడు.

**సీ. ఘనయమునానదీకల్లోలఘోషంబు సరసమృదంగఘోషంబు గాఁగ**
**సాధుబృందావనచరచంచరీకగానంబు గాయకసుగానంబు గాఁగ**
**గలహంససారసకమనీయమంజుశబ్దంబులు దాళశబ్దములు గాఁగ**
**దివినుండి వీక్షించు దివిజగంధర్వాదిజనులు సుఖాసీనజనులు గాఁగఁ**

**తే. బద్మరాగాదిరత్నప్రభాసమాన, మహితకాళియఫణిఫణామండపమున**
**నళినలోచనవిఖ్యాతనర్తకుండు, నిత్యనైపుణ్యమునఁ బేర్చి నృత్య మాడె. 664**

**ప్రతి :** ఘన= గొప్పదైన; యమునానదీ= కాళిందీనదియందలి; కల్లోల= పెద్ద పెద్ద కెరటాలయొక్క; ఘోషంబున్= ధ్వని; సరస మృదంగఘోషంబు= రసవంతమైన మద్దెలధ్వని; కాన్+కన్= అవుతుండగా; సాధు= చక్కనయిన; బృందావనచర= బృందావనంలో సంచరించునట్టి; చంచరీక= తుమ్మెదలయొక్క; గానంబు= పాట; గాయకసుగానంబు= గాయకులయొక్క మంచిపాట; కాన్+కన్= అవుతుండగా; కలహంస= రాజహంసలయొక్కయు; సారస= బెగ్గురు పక్షులయొక్కయు; కమనీయ= మనోహరమయిన; మంజు= (చెవికి) ఇంపయిన; తాళ శబ్దంబులు= తాళముల ధ్వనులు; కాన్+కన్= అవుతుండగా; దివినుండి= ఆకాశంనుండి; వీక్షించు= చూస్తున్నట్టి; దివిజ= దేవతలు; గంధర్వ= గంధర్వులు; ఆది= మొదలగు; జనులు= ప్రజలు; సుఖ+ఆసీనజనులు= సుఖంగా కూర్చున్న ప్రజలు; కాన్+కన్= అవుతుండగా; పద్మరాగ= కెంపులు; ఆది= మొదలగు; రత్న= రతనాలచేత; ప్రభాసమాన= మిక్కిలి ప్రకాశిస్తున్న; మహిత= గొప్పది అయిన; కాళియఫణి= కాళియుడు అనే పాముయొక్క; ఫణ= పడగలు అనే; మండపమునన్= మంటపంలో; నళినలోచన= పద్మములవంటి కన్నులుగల కృష్ణుడు అనే; విఖ్యాత= ప్రసిద్ధుడయిన; నర్తకుడు= నాట్యం చేసేవాడు; నిత్యనైపుణ్యమునన్= స్థిరమైన నేర్పుతో; పేర్చి= అతిశయించి; నృత్యము+ఆడెన్= నాట్యం చేశాడు.

**తా :** శ్రీకృష్ణుడు అనే ప్రసిద్ధనర్తకుడు కాళియుని పెద్ద పెద్ద పడగలమీదికి ఎక్కి, మిక్కిలి నేర్పుతో నాట్యం చేశాడు. ఆ సమయంలో ఆ పాము పడగలు, కెంపులు మొదలయిన రతనాలు పొదిగిన విశాలమయిన నాట్యమండపంలా ప్రకాశించాయి. యమునానదిలోని పెద్దపెద్ద కెరటాలచప్పుళ్ళు, ఆ నాట్యానికి సహకారం అందించే మద్దెలచప్పుళ్లవలె ఉన్నాయి. ఆ బృందావనంలో తిరిగే తుమ్మెదలయొక్క ఝుంకారం, వీనులవిందుగా ప్రక్కనున్న గాయకులు అందించే సహకారగానంలా ఉంది. ఆ నదిలోని రాజహంసలు, బెగ్గురు పక్షులుచేసే శ్రావ్యమైన ధ్వనులు, తాళాల మ్రోతలవలె ఉన్నాయి. ఆ రమణీయ సన్నివేశాన్ని ఆకాశంలో ఉన్న దేవతలు, గంధర్వులు సభలో సుఖంగా కూర్చుండి, నాట్యం చూస్తూవున్న ప్రేక్షకులవలె ఉన్నారు.

**శా. కుక్షిన్ లోకములున్న గౌరవముతో గోపాకృతి న్నున్న యా**
**రక్షోహంత వడిన్ మహాఫణిఫణారంగప్రదేశంబుపై**
**నక్షీణోద్ధతి నాఁడుఁ, బాడుఁ, జెలఁగున్, హాసంబుతోడం బద**
**ప్రక్షేపంబులు సేయుఁ గేళిగతులం బ్రాణైకశేషంబుగన్. 665**

**ప్రతి :** కుక్షిన్= కడుపులో; లోకములు= అన్ని లోకాలు; ఉన్నగౌరవముతోన్= ఉన్నట్టి గొప్పతనంతో (బరువుతో అని అర్థాంతరము); గోప+ఆకృతిన్= గొల్లవాని రూపంతో; ఉన్న= ఉన్నట్టి; ఆ రక్షోహంత= రాక్షసులను సంహరించుటకై అవతరించిన ఆ శ్రీకృష్ణుడు; వడిన్= వేగంగా; మహత్= పెద్దదియగు; ఫణి= కాళియసర్పంయొక్క; ఫణా= పడగలు అనే రంగప్రదేశంబుపైన్= నాట్యరంగం మీద; అక్షీణ+ఉద్ధతిన్= తరగని దర్పంతో; ఆఁడున్= నృత్యం చేస్తాడు; పాడున్= గానం చేయును; చెలఁగున్= కేకలు వేయును; ప్రాణ+ఏకశేషంబు+కన్= ప్రాణం ఒకటిమాత్రమే మిగులునట్లుగా; హాసంబుతోడన్= నవ్వుతో; కేళిగతులన్= ఆడునట్టి రీతులతో; పదప్రక్షేపంబులు= అడుగులు వేయుటలు; చేయున్= చేస్తున్నాడు.

**తా :** తన కడుపులో లోకాలన్నీ దాచుకొన్న గోపాలకృష్ణుడు రాక్షస సంహారం చెయ్యడంకోసం భూమిమీద అవతరించాడు. అతడు కాళియునిపడగలను రంగస్థలంగా చేసుకొని, తరగనిదర్పంతో నాట్యం చేశాడు. ఆడాడు, పాడాడు, కేకలు వేశాడు, కేరింతలు కొట్టాడు. ఆతనిఅడుగుల తాకిడికి కాళియునితలప్రాణం తోకకు వచ్చినట్లయింది.

**క. ఘనతరసుషిరానంద, స్వనములతో సిద్ధ సాధ్య చారణ గంధ**
**ర్వ నిలింప మునిసతులు చ, య్యనఁ గురిసిరి విరులవాన లాడెడు హరిపై. 666**

**ప్రతి :** సిద్ధ= సిద్ధులయొక్కయు; సాధ్య= సాధ్యులయొక్కయు; చారణ= చారణులయొక్కయు; గంధర్వ= గంధర్వులయొక్కయు; నిలింప= దేవతలయొక్కయు; ముని= మునులయొక్కయు; సతులు= భార్యలు; ఘనతర= మిక్కిలి అధికమయిన; సుషిర= పిల్లనగ్రోవి మొదలగు ఊదెడి వాద్యాలయొక్క; ఆనంద= సంతోషం కలిగించే; స్వనములతోన్= ధ్వనులతో; ఆడెడు హరిపైన్= నాట్యం చేస్తున్న శ్రీకృష్ణునిమీద; విరులవానలు= పూలవానలు; చయ్యనన్= శీఘ్రంగా; కురిసిరి= కురిపించారు.

**తా :** సిద్ధులు, సాధ్యులు, చారణులు, గంధర్వులు, దేవతలు, మునులు, మున్నగువారి భార్యలు – పిల్లనగ్రోవులు మొదలైనవి సంతోషం కలిగించేలా ఊదుతూ నాట్యం చేస్తున్న శ్రీకృష్ణునిమీద పూలవానలు కురిపించారు.

**వ. ఇట్లు దుష్టజనదండధరావతారుండైన హరి వడి గలిగిన పడగల మీఁదఁ దాండవంబు సలుప, బెండుపడి యొండొండ ముఖంబుల రక్తమాంసంబు లుమియుచుఁ గన్నుల విషంబు గ్రక్కుచు నుక్కుసెడి చిక్కి దిక్కులు సూచుచుం గంఠగతప్రాణుండై ఫణీంద్రుండు తన మనంబున. 667**

**ప్రతి :** ఇట్లు= ఈ ప్రకారంగా; దుష్టజన= దుర్మార్గులయినవారికి; దండధర+అవతారుండు= యముని వంటి అవతారం కలవాడు; ఐనహరి= అయినట్టి శ్రీకృష్ణుడు; వడిగలిగిన= వేగంగా చలిస్తున్న; పడగలమీఁదన్= కాళియుని పడగలమీద; తాండవంబున్= నాట్యాన్ని; చలుపన్= చేస్తుండగా; బెండు+పడి= చేవతప్పి; ఒండు+ఒండు+అ= క్రమక్రమంగా; ముఖంబులన్= పడగలనుండి; రక్తమాంసంబులు= రక్తమును, మాంసమును; ఉమియుచున్= వెలిగ్రక్కుచు; కన్నులన్= కన్నులనుండి; విషంబున్= విషమును; క్రక్కుచున్= వెలువరిస్తూ; ఉక్కు+చెడి= శౌర్యం కోల్పోయి; చిక్కి= కృశించి; దిక్కులు+చూచుచున్= ఏమీతోచక నలువైపులచూస్తూ; కంఠగతప్రాణుండు+ఐ= గొంతులోనికి చేరిన ప్రాణాలు గలవాడయి; ఫణి+ఇంద్రుండు= కాళియుడనే సర్పరాజు; తన మనంబునన్= తన మనస్సులో...

**తా :** ఈ విధంగా దుర్మార్గులను శిక్షించడంలో యమునివంటివాడయిన శ్రీకృష్ణుడు. వడిగలిగిన కాళియుని పడగలమీద తాండవం చేశాడు. కాళియుని చేవ చచ్చింది. వరుసగా ఉన్న పడగలనుండి రక్తమాంసాలు వెలిగ్రక్కాడు. కళ్లనుండి విషం కారిపోయింది. చౌరవ తగ్గి నీరసించిపోయాడు. ప్రాణాలు పైపైకి రాగా తనలో ఈ విధంగా అనుకొన్నాడు.

**ఉ. 'వేలుపులైన లావులుసెడి వేదనఁ బొందుచు నావిషానల**
**జ్వాలలు సోఁకినంతటన చత్తురు, నేఁడిది యేమి చోద్య? మా**
**భీలవిషాగ్నిహేతిచయపీడకు నోర్చియుఁ గ్రమ్మఱంగ నీ**
**బాలుఁడు మత్ఫణాశతము భగ్నముగా వెసఁ ద్రొక్కి యాడెడిన్. 668**

**ప్రతి :** వేలుపులు+ఐనన్= దేవతలయినా; నా విష+అనలజ్వాలలు= నా యొక్క విషమనే అగ్నియొక్క మంటలు; సోఁకిన+ అంతటను+అ= తగిలినంత మాత్రంచేతనే; లావులు+చెడి= బలమును కోల్పోయి; వేదనన్= బాధను; పొందుచున్= అనుభవిస్తూ; చత్తురు= మరణిస్తారు; ఈ బాలుఁడు= ఈ కుఱ్ఱవాడు; నేఁడు= ఈ దినం; ఆభీల= భయంకరమైన; విష+అగ్ని= విషమనెడు నిప్పుయొక్క; హేతిచయ= మంటల సమూహంవల్ల కలిగే; పీడకున్= బాధకు; ఓర్చియున్= సహించియు; క్రమ్మఱంగన్= తిరిగి; మత్+ఫణాశతము= నా నూరు పడగలను; భగ్నము+కాన్= చెల్లాచెదురవునట్లుగా; వెసన్= శీఘ్రంగా, త్రొక్కి+ఆడెడిన్= నాట్యం చేస్తున్నాడు; ఇది= ఇట్లు నాట్యం చేయుట; ఏమి చోద్యము= ఎంత ఆశ్చర్యం.

**తా :** దేవతలైనా సరే! నా విషాగ్ని జ్వాలలు తాకాయంటే చాలు, గిలగిల లాడుతూ ప్రాణాలు విడిచిపెట్టేస్తారే! ఈ వేళ ఈ పిల్లవాడు ఇదేమిటి? భయంకరమైన నా విషాగ్ని జ్వాలలను సహించడంమాత్రమే కాక తిరిగి నా నూరు పడగలను చితికి చెల్లా చెదరు చేస్తూ, నిర్భయంగా నాట్యం కూడ చేస్తున్నాడే? ఎంతటి ఆశ్చర్యం?

**క. ఈతఁడు సర్వచరాచర, భూతేశుండైన పరమపురుషుఁడు సేవా**
**ప్రీతుఁడు శ్రీహరి యగు నని, భీతిన్ శరణంబు నొందె బిట్టలసి నృపా! 669**

**ప్రతి :** నృపా= ఓ పరీక్షిన్మహారాజా! (కాళియుడు) బిట్టు+అలసి= శీఘ్రంగా నీరసించి; ఈతఁడు= ఈ బాలుడు; సర్వ= సమస్తమయిన; చర= చలించెడి మనుష్య పశుపక్ష్యాదులు; అచర= చలింపని చెట్లు పొదలు మొదలగు; భూత= ప్రాణులకు; ఈశుండు= ప్రభువు; ఐన పరమపురుషుఁడు= అయినట్టి భగవానుడును; సేవాప్రీతుఁడు= భక్తియందు ప్రీతిగలవాడును అగు; శ్రీహరిఅగును+అని= శ్రీమహావిష్ణువే అయి ఉంటాడని భావించి; భీతిన్= భయంతో; శరణంబున్+ఒందెన్= శరణు పొందినాడు.

**తా :** ఓ పరీక్షిన్మహారాజా! బాగా అలసిపోయిన కాళియునికి వివేకం కలిగింది. ఈతడు సామాన్యబాలుడు కాదు. సమస్త చరాచరప్రాణికోటికి ప్రభువు. భగవంతుడు. భక్తికి సంతోషించేవాడు అయిన శ్రీమహావిష్ణువే అయి ఉంటాడని భావిస్తూ భయంతో అతణ్ణి శరణు వేడినాడు.

## ❖ కాళియుని భార్యలైన నాగాంగనలు శ్రీకృష్ణుని నుతించుట ❖

**వ. అట్లు క్రూరంబులైన హరిచరణప్రహారంబులం బడగ లెడసి నొచ్చి చచ్చిన క్రియం బడియున్న పతిం జూచి నాగకాంతలు దురంతంబైన చింతాభరంబున నివ్వటిల్లెడు నెవ్వగల నొల్లంబోయి పల్లటిల్లిన యుల్లంబుల. 670**

**ప్రతి :** అట్లు= ఆ ప్రకారంగా; క్రూరంబులు= బాధాకరములు; ఐన హరిచరణ ప్రహారంబులన్= అయినటువంటి శ్రీకృష్ణుని పాదతాడనంచేత; పడగలు= పాముతలలు; ఎడసి= విడిపోయి; నొచ్చి= బాధనొంది; చచ్చిన క్రియన్= ప్రాణాలు పోయినట్లుగా; పడి+ఉన్నపతిన్= పడిఉన్న తమ పెనిమిటిని; చూచి= చూచి; ఆ నాగకాంతలు= ఆ కాళియుని భార్యలు; దుర్+అంతంబు+ఐన= అంతులేనిది అయిన; చింతాభరంబునన్= విచారం యొక్క బరువుచే; నివ్వటిల్లెడు= అతిశయించు; నెఱ+వగలన్= అధిక దుఃఖములతో; ఒల్లన్+పోయి= బాధపడి; పల్లటిల్లిన+ఉల్లంబులన్= కలతనొందిన మనస్సులతో...

**తా :** ఈ విధంగా శ్రీకృష్ణుడు కాళియుని పడగలమీద తాండవం చేయడంచేత, తీవ్రమైన ఆతని కాలితాపులకు కాళియుని పడగలన్నీ చితికిపోయాయి. కాళియుడు బాధతో కదలిక లేక శవంలాగ పడి ఉన్నాడు. అటువంటి దీనావస్థలో ఉన్న తమభర్తను చూచి, కాళియునిభార్యలమనస్సులు శోకంతో కలవారపాటుకు లోనయ్యాయి.

**మ. కచబంధంబులు వీడ భూషణము లాకంపింప గౌఁదీవియల్**
**కుచయుగ్మంబుల వ్రేఁగునం జడియఁ బై కొంగుల్ వడిన్ జాఱఁగాఁ**
**బ్రచురభ్రాంతిఁ గలంగి ముందట రుదద్బాలావలిం గొంచు స్రు**
**క్కుచు, భక్తిం జని కాంచి రాగుణమణిన్ గోపాలచూడామణిన్. 671**

**ప్రతి :** కచబంధంబులు వీడన్= కొప్పుముళ్లు వీడిపోతుండగా, భూషణములు= అలంకారాలు; ఆకంపింపన్= మిక్కిలి చలిస్తుండగా; కుచయుగ్మంబులు వ్రేఁగునన్= స్తనముల జంటల బరువుచే; కౌన్+తీవియల్= తీగలవంటి నడుములు; జడియన్= చలింపగా; పైకొంగుల్= పైటకొంగులు; వడిన్= వేగంగా; జాఱన్+కాన్= జారుతుండగా; ప్రచుర భ్రాంతిన్= అధికమయిన తొట్రుపాటుచేత; కలంగి= కలతనొంది; రుదత్+బాల+ఆవలిన్= ఏడ్చుచుండెడి పిల్లలను; ముందటన్= ముందు భాగంలో; కొంచున్= (ఉండునట్లుగా) తీసుకొనివస్తూ; స్రుక్కుచున్= సంకోచిస్తూ; భక్తిన్= భక్తిభావంతో; చని= వెళ్లి; ఆ గుణమణిన్= ప్రసిద్ధమైన మంచిగుణాలు కలవాడిని; గోపాలచూడామణిన్= గోవులను కాచేవారిలో శిరోమణివంటివాడగు శ్రీకృష్ణుణ్ణి; కాంచిరి= దర్శించారు.

**తా :** కాళియుని భార్యలు శ్రీకృష్ణుణ్ణి దర్శించడానికి బయలుదేరారు. ఆ తొందరలో ముడుచుకొన్నవారి కొప్పులు విడివడి పోయాయి. అలంకారాలు చెదరిపోయాయి. పాలిండ్లబరువుకు తీగలాగ సన్నంగా సుకుమారంగా ఉన్న నడుములు అల్లాడిపోయాయి. పైటకొంగులు జారిపోయాయి. దిక్కుతోచక, భ్రాంతితో కలవరపడిపోయారు. ఏడుస్తూ ఉండే తమ పిల్లల్ని ముందుంచుకొని, జంకుగొంకులకు లోనవుతూ, భక్తిభావంతో, మంచి గుణాలు కలవాడయిన శ్రీకృష్ణుణ్ణి దర్శించారు.

**వ. కని దండప్రణామంబు లాచరించి నిటలతటఘటితకరకమలలై యిట్లనిరి. 672**

**ప్రతి :** కని= శ్రీకృష్ణుణ్ణి దర్శించి; దండ ప్రణామంబులు= కఱ్ఱవలె సాగిలబడి మ్రొక్కుటలు; ఆచరించి= చేసి; నిటలతట= ఫాలభాగంపై; ఘటిత= కూర్పబడిన; కర కమలలు+ఐ= తామరపూలవంటి చేతులు కలవారయి; ఇట్లు+అనిరి= ఈ విధంగా పలికారు.

**తా :** కాళియునిభార్యలు శ్రీకృష్ణుణ్ణి దర్శించి, సాష్టాంగనమస్కారాలు చేసి, నుదుటిమీద చేతులు జోడించి, ఈ విధంగా విన్నవించుకొన్నారు.

**క. క్రూరాత్ముల దండింపఁగ, ధారుణిపై నవతరించి తనరెడి నీ కీ**
**క్రూరాత్ముని దండించుట, క్రూరత్వము గాదు సాధుగుణము గుణాఢ్యా! 673**

**ప్రతి :** గుణ+ఆఢ్యా= మంచి గుణాలు సంపదగాగల ఓ శ్రీకృష్ణా! క్రూర+ఆత్ములన్= భయంకరమైన మనస్సులుగల దుర్మార్గులను; దండింపన్+కన్= శిక్షించుటకు; ధారుణిపైన్= భూమిమీద; అవతరించి= అవతరించి; తనరెడి నీకున్= ఒప్పునట్టి నీకు; ఈ క్రూర+ఆత్మునిన్= భయంకర స్వభావంగల ఈ కాళియుణ్ణి; దండించుట= శిక్షించుట; క్రూరత్వం కాదు= చెడ్డతనం కాదు; సాధుగుణము= మంచి గుణమే అవుతుంది.

**తా :** సకలసద్గుణసంపన్నుడవైన ఓ శ్రీకృష్ణా! దుష్టశిక్షణ చేయడంకోసం భూమిమీద అవతరించినవాడివి నువ్వు. దుర్మార్గుడయిన ఈ కాళియుణ్ణి శిక్షించడం గుణమే కాని దోషం కాదు.

**క. పగవారి సుతులయందును, బగ యించుక లేక సమతఁ బరఁగెడి నీకుం**
**బగ గలదె? ఖలుల నడఁచుట, జగదవనముకొఱకుఁ గాక జగదాధారా! 674**

**ప్రతి :** జగత్+ఆధారా= లోకమునకు ఆధారమయినవాడా; పగవారి సుతుల+అందున్= శత్రువుల కొడుకులందును; పగ+ఇంచుక లేక= శత్రుత్వం కొంచెం కూడ లేకుండగ; సమతన్= సమభావంతో; పరగెడి నీకున్= ప్రవర్తించే; నీకున్= నీకు; పగ గలదె= శత్రుత్వం కలదా? (లేదని భావము); ఖలులన్= దుష్టులను; అడఁచుట= అణచివేయుట; జగత్+అవనము కొఱకున్+కాదె= లోకాల్ని రక్షించుటకొరకే గదా!

**తా :** సర్వలోకాలకు ఆధారభూతుడవయిన ఓ పరమేశ్వరా! శత్రువుల కొడుకులయందు గూడ సమభావంతో దయ చూపే వాడవు. అట్టి నీకు ఎవరిమీదను పగ ఉండదు. దుష్టుల్ని శిక్షించడం లోకసంరక్షణంకోసం తప్ప మరేమీ కాదు.

**క. నిగ్రహమె మము విషాస్యుల, నుగ్రుల శిక్షించు టెల్ల? నూహింప మహా**
**నుగ్రహము గాక మా కీ, నిగ్రహము విషాస్యభావనిర్గతిఁ జేసెన్. 675**

**ప్రతి :** విష+ఆస్యులన్= ముఖమందు విషం కలవారును; ఉగ్రులన్= భయంకరమైనవారును అగు; మమున్= మమ్ములను; శిక్షించుట= దండించుట; ఎల్లన్= అంతయును; ఊహింపన్= ఆలోచింపగా; మహత్+అనుగ్రహముకాక= గొప్పదియైన రక్షణయే కదా!; నిగ్రహమె= దండించుట అవుతుందా?; ఈ నిగ్రహము= ఈ విధమైన దండనం; మాకున్= మాకు; విష+ ఆస్యభావనిర్గతిన్= ముఖంలో విషం కలవాళ్లమనే పొగరు తొలగిపోవుటను; చేసెన్= చేసింది.

**తా :** విషం నోట్లోను, మనస్సులో కోపం ఉంచుకొని తిరిగేవారం అయిన మమ్మల్ని శిక్షించడం వాస్తవానికి దండనం కాదు. ఒకవిధంగా మాకు మేలు కలిగించడమే. నీవు చేసిన ఈ పనితో మాకు విషం కలవారమనే పొగరు దిగిపోయింది.

**ఉ. ఎట్టి తపంబు సేసెనొకొ? యెట్టి సుకర్మము లాచరించెనో?**
**యెట్టి నిజంబు వల్కెనొకొ? యీ ఫణి పూర్వభవంబునందు ము**
**న్నెట్టి మహానుభావులకు నెన్నఁడు ఁజేరువగాని నీవు నేఁ**
**డిట్టి వినోదలీలఁ దలలెక్కి నటించెద వీ ఫణీంద్రుపై. 676**

**ప్రతి :** ఈ ఫణి= ఈ కాళియసర్పం, పూర్వభవంబునన్= క్రిందటిజన్మలో, ఎట్టితపంబున్= ఏ విధమగు తపస్సును; చేసెన్+ ఒకొ= ఆచరించిందో; ఎట్టి సుకర్మములు= ఎటువంటి పుణ్యకార్యములు; ఆచరించెన్+ఓ= చేసిందో; ఎట్టినిజంబు= ఎటువంటి సత్యమును; పల్కెను+ఒకొ= చెప్పిందో; మున్ను= పూర్వం; ఎన్నఁడున్= ఏనాడును; ఎట్టిమహా+అనుభావులకున్= ఎంతటి గొప్పవారికిని; చేరువకాని నీవు= దగ్గర కానట్టి నీవు; నేఁడు= ఈనాడు; ఈ ఫణి+ఇంద్రుపైన్= సర్పరాజయిన ఈ కాళియుని మీద; తలలు+ఎక్కి= పడగలపైనుండి; ఇట్టి వినోదలీలలన్= ఈ తీరున విలాసాలతో; నటించెదవు= నాట్యం చేస్తున్నావు.

**తా :** ఈ కాళియసర్పరాజు పూర్వజన్మంలో ఎంతగొప్పతపస్సు చేశాడో? ఎటువంటి పుణ్యకార్యాలు ఆచరించాడో? ఎటువంటి సత్యవాక్యాలు పలికాడో? ఎంతటి మహానుభావులకయినా ఒనగూడని పరమేశ్వరుడవైన నీవు వేడుకతో ఈతని పడగలమీద నాట్యం చేశావంటే అదెంతటి అదృష్టమో గదా!

**మ.** **బహుకాలంబు దపంబు సేసి వ్రతముల్ వాటించి కామించి నీ**
**మహనీయోజ్జ్వల పాదరేణుకణసంస్పర్శాధికారంబు శ్రీ**
**మహిళారత్నము దొల్లి కాంచె నిదె నేమం బేమియున్ లేక యీ**
**యహి నీ పాదయుగాహతిం బడసె నేఁ డత్యద్భుతం బీశ్వరా!** **677**

**ప్రతి :** ఈశ్వరా= ఓ ప్రభూ!; తొల్లి= పూర్వం; శ్రీమహిళారత్నము= స్త్రీలలో శ్రేష్ఠురాలగు లక్ష్మీదేవి; బహుకాలంబు= చాలాకాలం; తపంబు+చేసి= తపస్సు చేసి; వ్రతముల్= నోములు; పాటించి= నోచి; కామించి= (నిన్ను)కోరి; నీ= నీయొక్క; మహనీయ= గొప్పవీ; ఉత్+జ్వల= మిక్కిలి ప్రకాశించేవియు అగు; పాద= అడుగులయందలి; రేణు= ధూళియొక్క; కణ= అణువుయొక్క; సంస్పర్శ= స్పృశించే; అధికారము= అర్హతను; కాంచెన్= పొందింది; ఇదె= ఇదుగో; నేఁడు= ఈనాడు; ఈ అహి= ఈ కాళియసర్పం; నేమంబు= నియమం; ఏమియున్= ఏమీ; లేక= లేకుండా; నీపాదయుగ+ఆహతిన్= నీ అడుగుల జంటయొక్క తాపులను; పడసెన్= పొందాడు; అతి+అద్భుతంబు= ఇది మిక్కిలి ఆశ్చర్యం కదా!

**తా :** ఓ పరమేశ్వరా! స్త్రీలందరిలోను శ్రేష్ఠురాలయిన లక్ష్మీదేవి నిన్ను పొందడంకోసం, చాలకాలం తపస్సుచేసి, ఎన్నో గొప్ప గొప్ప నోములు నోచి, మహాతేజస్సుతో ప్రకాశించే నీ పాదాల ధూళిలో ఒక కణాన్ని మాత్రమే స్పృశించే అర్హతను సంపాదించుకొనింది. ఈ కాళియుడు ఏ తపస్సు చేయకుండానే, ఏ నోములు నోచకుండానే, నీ పాదాల పూర్ణస్పర్శకు నోచుకొన్నాడంటే ఇది ఎంత ఆశ్చర్యకరమైన విషయం!

**ఉ.** **ఒల్లరు నిర్జరేంద్రపద మొల్లరు బ్రహ్మపదంబు నొందఁగా**
**నొల్లరు చక్రవర్తిపద మొల్లరు సర్వరసాధిపత్యము**
**న్నొల్లరు యోగసిద్ధి మఱి యొందు భవంబుల నొందనీని నీ**
**సల్లలితాంఘ్రిరేణువుల సంగతి నొందిన ధన్యు లెప్పుడున్.** **678**

**ప్రతి :** మఱి= ఇంకా; ఒందుభవంబులన్= వేరగుపుట్టుకలను; ఒందనీనిన్= పొందనీయనట్టి; నీ= నీయొక్క; సత్= మంచివీ; లలిత= చక్కనివీ; అంఘ్రి= పాదములయొక్క; రేణువుల= (ధూళి) కణములయొక్క; సంగతిన్= స్పర్శను; ఒందిన ధన్యులు= పొందినట్టి కృతార్థులు; ఎప్పుడున్= ఏ కాలంలో; నిర్జర+ఇంద్రపదమున్= దేవతలకు ప్రభువగు ఇంద్రుని పదవిని; ఒల్లరు= అంగీకరింపరు; బ్రహ్మపదంబున్= బ్రహ్మదేవుని పదవిని; ఒల్లరు= అంగీకరింపరు; చక్రవర్తిపదమున్= మహారాజపదవిని;

ఒల్లరు= సమ్మతింపరు; సర్వరస+ఆధిపత్యమున్= సర్వపాతాళలోకాలయొక్క అధిపత్యమును; ఒల్లరు= కావాలనరు; యోగసిద్ధిన్= అష్టాంగాలతో కూడిన యోగంయొక్క సిద్ధినికూడా; ఒల్లరు= వద్దంటారు.

**తా :** ఓ శ్రీకృష్ణా! మంచివీ, చక్కనివీ అయిన నీపాదాల ధూళికణాలు సోకాయి అంటే, ఇంక వారికి పుట్టుక ఉండదు. అట్టివారు పూర్ణకాములయి, ఇంక కోరదగినదేదీ లేని కృతార్థులౌతారు. అందువల్ల వారు దేవేంద్రపదవిని గాని, బ్రహ్మపదవినిగానీ, మహారాజపదవినిగానీ, పాతాళలోకాధిపత్యాన్ని గాని, హఠయోగ రాజయోగ సిద్ధులను గాని వేటినీ అంగీకరింపరు.

**క. ఘనసంసారాహతులగు, జను లాకాంక్షింపఁ గడు నశక్యం బగు శో**
**భనము సమక్షంబున నహి, గనియెం దామసుఁడు రోషకలితుం డయ్యున్. 679**

**ప్రతి :** అహిన్= ఈ కాళియుడును; తామసుఁడు= తమోగుణం కలవాడును; రోషకలితుండు= కోపంతో కూడుకొన్నవాడును; అయ్యున్= అయినప్పటికీ; ఘనసంసార+ఆహతులు= గొప్పదగు సంసారంచే బాధింపబడినవారు; అగు జనులు= అయినట్టి ప్రజలు; ఆకాంక్షింపన్= కోరుటకు; కడున్= మిక్కిలి; అశక్యంబు= శక్యం కానిది; అగు శోభనమున్= అయిన చక్కని ప్రయోజనమును; సమక్షమునన్= ప్రత్యక్షంగా; కనియెన్= పొందెను.

**తా :** ఈ కాళియుడు తమోగుణం కలవాడు. క్రోధం కలవాడు. అయినప్పటికిని, చావుపుట్టుకలకు, కామక్రోధాదులకు, సుఖదుఃఖాలకు లోనవుతూ ఆలుబిడ్డలతో జీవించే సంసారు లెవ్వరికీ కోరడానికి కూడ శక్యం కానట్టి శ్రీకృష్ణపాదస్పర్శరూపమైన ప్రయోజనాన్ని ప్రత్యక్షంగా పొందింది.

**వ. దేవా? సకలపురుషాంతర్యామి రూపత్వంబువలనఁ బరమపురుషుండ వయ్యు నపరిచ్ఛిన్నత్వంబువలన మహాత్ముండ వయ్యును, నాకాశాదిభూతసమాశ్రయత్వంబువలన భూతవాసుండ వయ్యును, భూతమయ త్వంబువలన భూతశబ్ద వాచ్యుండ వయ్యును, గారణాతీతత్వంబువలనఁ బరమాత్ముండ వయ్యును, జ్ఞానవిజ్ఞాన పరి పూర్ణత్వంబు గలిగి నిర్గుణత్వ నిర్వికారత్వంబుల వలన బ్రహ్మంబ వయ్యును, బ్రకృతి ప్రవర్తకత్వంబువలన ననంతశక్తివై యప్రాకృతుండ వయ్యును, గాలచక్రప్రవర్తకత్వంబువలనఁ గాలుండ వయ్యును, గాలశక్తి సమాశ్రయత్వంబువలనఁ గాలనాభుండ వయ్యును, సృష్టిజీవనసంహారాదిదర్శిత్వంబువలనం గాలావయవసాక్షి వయ్యును నొప్పు నీకు నమస్కరించెదము, మఱియును. 680**

**ప్రతి :** దేవా= ఓ ప్రభూ!; సకల= సమస్తమయిన; పురుష= జీవులయొక్క; అంతర్యామి= లోపలనున్నట్టి; రూపత్వంబువలనన్= రూపం కలవాడివగుటచేత; పురుషుండవు= పురుషుడను పేరుగలవాడివి; అయ్యును= అయినప్పటికీ; అపరిచ్ఛిన్నత్వంబువలనన్= దేశకాలవస్తువుల పరిమితికి లోబడని స్వభావం కలిగిన వాడివగుటచేత; మహాత్ముండవు+అయ్యునున్= అంతటా వ్యాపించేట్టి గొప్పరూపం కలవాడివి అయినప్పటికీ; ఆకాశ= ఆకాశం; ఆది= మొదలుగాగల; భూత= వాయువు; ఆకాశం, అగ్ని, జలం, భూమి అనే పంచభూతాలకును; సమాశ్రయత్వంబువలనన్= ఆధారమగునట్టి స్వభావం కలవాడివగుటచేత; భూతవాసుండవు= పంచభూతములకు నివాసస్థానమయినవాడివి; అయ్యున్= అయినప్పటికీ; భూతమయత్వంబువలనన్= పంచభూతములరూపంగా కలిగినవాడవగుటవలన; భూతశబ్దవాచ్యుండవు= భూతం అనుపదమునకు అర్థమయినవాడవు; అయ్యును= అవుతూ; కారణ+ అతీత్వంబువలనన్= కారణాలన్నింటికి అతీతమైనట్టి; పరమ+ఆత్ముండవు= సచ్చిదానందరూపుడివి; అయ్యును= అయినప్పటికి; జ్ఞాన విజ్ఞాన పరిపూర్ణత్వంబు+కలిగి= ఆధ్యాత్మిక జ్ఞానం, ప్రాపంచిక జ్ఞానం అనేవాటిలో సంపూర్ణ భావం (వెలితి లేకుండుటను)

కలిగి; నిర్గుణత్వనిర్వికారత్వంబువలనన్= సత్త్వరజస్తమోగుణాలు లేకుండుట, పుట్టుట – పెరుగుట – మారుట – ముదియుట – తరుగుట – చచ్చుట అనేషడ్భావ వికారాలు లేకుండుట అనువాని వల్ల; బ్రహ్మంబవు= అఖండ సచ్చిదానందరూప పరమాత్మవు; అయ్యును= అయినప్పటికీ; ప్రకృతి ప్రవర్తకత్వంబువలనన్= మాయాకార్యములగు సృష్టి స్థితిలయాలను కావించుచుండుటవలన; అనంతశక్తివి+ఐ= అంతులేని సామర్థ్యం కలవాడవయి; అప్రాకృతుండవు= ప్రకృతితో సంబంధంలేనివాడివి; అయ్యును= అయినప్పటికీ; కాలచక్రప్రవర్తకత్వంబువలనన్= సంవత్సరం, ఋతువు, మాసం మొదలగు భేదాలతో గూడిన కాలం అనే చక్రమును త్రిప్పుచున్నవాడగుటవలన; కాలుండవు= కాలస్వరూపుడవు; అయ్యును= అయినా; కాలశక్తిసమాశ్రయత్వంబువలనన్= కాలమనెడి శక్తికి ఆధారమైనవాడివి అయినందువల్ల లేదా కాలశక్తులగు సృష్టి స్థితిలయాలకు ఆధారమైనవాడివి అయినందువల్ల; కాలనాథుండవు= కాలానికి ఆధారమైనవాడవు; అయ్యును= అయినా; సృష్టి= పుట్టించుట; జీవన= బ్రదికించుట; సంహార= చంపుట; ఆది= మొదలగు పనులయొక్క; దర్శిత్వంబువలనన్= ప్రదర్శనం చేయడంవల్ల (చేస్తుండడం అనే అనిభావం); కాల+అవయవసాక్షివి= కాలంలో భాగాలయిన సంవత్సరం, ఋతువు, మాసం మొదలగువానిని ఉదాసీనంగా చూస్తున్నవాడవు; అయ్యును= అయినా; ఒప్పు= ప్రకాశించునట్టి; నీకున్= నీకు; నమస్కరించెదము= నమస్కారం చేస్తున్నాం; మఱియును= ఇంకను...

**తా :** దేవా! నీవు నశించే స్వభావంగల జీవులందరిలోనూ నశింపనివాడివై, అక్షరరూపుడవయి అంతర్యామి అనే పేరుతో ఉన్న పరమపురుషుడివి. దేశకాలవస్తువుల పరిమితులకు లోబడని మహాత్ముడవు. ఆకాశం, వాయువు, అగ్ని, జలం, భూమి అనే పంచభూతాలకును, వానిచే నేర్పడిన సకలవస్తు సముదాయాలకును ఆధారమైనవాడగుటవలన భూతావాసుడివి. పంచభూతాలే రూపంగా గలవాడవగుటచే భూతశబ్దమునకు అర్థమైనవాడివి. అన్ని కారణములకు కారణమయిన మూలప్రకృతికి గూడ అతీతమైన పరమాత్ముడవు. ఆత్మజ్ఞానం, ప్రాపంచికజ్ఞానంకూడ పరిపూర్ణంగా కలవాడివి. సత్త్వరజస్తమోగుణసంబంధం లేనివాడివి. పుట్టుట, పెరుగుట, రూపం మారుట, ముదురుట, తరుగుట, చచ్చుట అను ఆరువిధాలయిన వికారాలు లేని పరబ్రహ్మవు. మాయాశక్తిని అధీనంలో ఉంచుకొని, సృష్టి స్థితిలయాలు కొనసాగిస్తూ అనంతమైన సామర్థ్యం కలవాడవయి, ఆ మాయతో కొంచెంకూడ సంబంధం లేనివాడివి. అఖండమైన కాలాన్ని సంవత్సరాలు, అయనాలు, ఋతువులు, మాసాలు మొదలయిన భేదాలతో చక్రంలాగ త్రిప్పుతూ ఉన్నవాడివి. కాలస్వరూపుడవు. కాలశక్తికి ఆధారమైనవాడివి. సృష్టిస్థితి సంహారాలనే, కాలవిభాగాలయిన సంవత్సరాదులను గమనిస్తూ కూడ వానితో ఏ విధమైన సంబంధంలేకుండా ఉండే సర్వసాక్షివి. నీకు నమస్కరిస్తున్నాము. ఇంకా

**సీ.** **విశ్వంబు నీవయై విశ్వంబుఁ జూచుచు, విశ్వంబు సేయుచు విశ్వమునకు**
**హేతువవై పంచభూతమాత్రేంద్రియములకు మనఃప్రాణబుద్ధిచిత్త**
**ములకెల్ల నాత్మవై మొనసి గుణంబుల నావృత మగుచు నిజాంశభూత**
**మగు నాత్మచయమున కనుభూతి సేయుచు మూఁ దహంకృతులచే ముసుఁగువడక**

**తే.** **నెఱి ననంతుఁడవై దర్శనీయరుచివి, గాక సూక్ష్ముఁడవై నిర్వికారమహిమఁ**
**దనరి కూటస్థుఁ దన సమస్తంబు నెఱుఁగు, నీకు మ్రొక్కెద మాలింపు నిర్మలాత్మ!** **681**

**ప్రతి :** నిర్మల+ఆత్మ= స్వచ్ఛమైన ఆత్మస్వరూపుడవైన ఓ శ్రీకృష్ణా!; విశ్వంబున్= ప్రపంచమును; నీవు+అ= నీవే; ఐ= అయి; విశ్వంబున్= ప్రపంచమును; చేయుచున్= సృష్టించుచు; చూచుచున్= సాక్షిభూతంగా చూస్తూ; విశ్వమునకున్= ప్రపంచానికి;

హేతువవు= కారణమయినవాడవు; ఐ= అయి; పంచభూత= ఆకాశం, వాయువు, అగ్ని, జలం, భూమి అనే అయిదుభూతాలకు; మాత్ర= శబ్దస్పర్శరూపరసగంధాలను అయిదుమాత్రలకును; ఇంద్రియ= అయిదు జ్ఞానేంద్రియములకును, అయిదు కర్మేంద్రియములకును; మనఃప్రాణబుద్ధి చిత్తములకున్= మనస్సు, ప్రాణం, బుద్ధి, చిత్తం అనేవానికి; ఎల్లన్= అన్నింటికిని; ఆత్మవు= స్వరూపుడవయి; మొనసి= ప్రయత్నించి; గుణంబులన్= సత్త్వరజస్తమోగుణాలచేత; ఆవృతము+అగుచున్= ఆవరింపబడింది అవుతు; నిజ+అంశభూతము= తన అంశచే పుట్టింది; అగు= అయినట్టి; ఆత్మచయమునకున్= ప్రాణుల సముదాయానికి; అనుభూతి= సుఖదుఃఖముల అనుభవమును; చేయుచున్= కలిగిస్తూ; మూఁడు+అహంకృతులచేన్= మూడయిన సాత్త్వికరాజసిక తామసికములగు అహంకారాలచేత; ముసుఁగు+పడక= ఆవరింపబడక; నెఱిన్= నిండుదనంచే; అనంతుఁడవు+ఐ= అంతం లేనివాడవయి; దర్శనీయ రుచివిన్= చూడదగిన కాంతిగలవాడివి కాక; సూక్ష్ముఁడవు+ఐ= సూక్ష్మరూపం గలవాడవయి; నిర్వికారమహిమన్= పుట్టుట మొదలగు వికారాలు లేనివాడవయి; తనరి= ఒప్పి; కూటస్థుఁడు= దేహమనేకూటంలో ఉండువాడు; అనన్= అనునట్లుగ; సమస్తంబున్= సర్వప్రపంచమును; ఎఱుఁగునీకున్= తెలిసిన నీకు; మ్రొక్కెదము= నమస్కరిస్తాము; ఆలింపుము= మా మొరవిను.

**తా :** మాయాతీతుడవైన ఓ శ్రీకృష్ణా! ఈ ప్రపంచం అంతా నీ రూపమే. దీనికి సృష్టికర్తవు నువ్వే. ఉదాసీనంగా ఉండి, దీనినంతనూ గమనిస్తూ ఉన్నవాడివీ నువ్వే. ఆకాశం, వాయువు, అగ్ని, జలం, భూమి అనే పంచభూతాలు, వానికి విషయాలయిన శబ్దస్పర్శరూపరసగంధాలు, ప్రాణం, మనస్సు, బుద్ధి, చిత్తం అనే అంతఃకరణ భేదాలు అన్నీ నీ రూపమే. సత్తరజస్తమోగుణాలచేత ఆవరింపబడుతూ, నీ అంశలుగా పుట్టిన ప్రాణులకు సుఖదుఃఖానుభవం కలిగించేవాడివి నువ్వే. వాస్తవానికి సత్త్వరజస్తమోగుణాలకు లోబడక, ఏ విధమైన వికారాలు పొందకుండగా, ఇంద్రియాలకు గోచరించకుండా, సూక్ష్మరూపంలో ఏకరూపంగా ఉన్నవాడివి, సర్వజ్ఞుడవు. నీకు నమస్కరిస్తున్నాము. మా మనవి చిత్తగించు.

**విశే :** కూటస్థుడు - పంచభూతాత్మకమైన శరీరంలోని జీవుణ్ణి నడిపించేవాడు= పరమాత్మ. అంటే ఏ వికారాలూ లేక నిశ్చలంగా ఉండే ఆత్మ. కూటము= దాగలి. దీనిపై ఎన్ని వస్తువులు పెట్టి కొట్టూ - ఏ రూపాలుగా మారుస్తున్నా - వాటిగుణం కానీ, మార్పుకానీ చెందక, తన స్థితిలోనే నిర్వికారంగా ఉంటుంది. ఆత్మకూడా - దాగలి వంటిదే.

**వ. మఱియుఁ గలఁడు లేదు, సర్వంబు నెఱుంగు, నించుక యెఱుంగు, బద్ధుండు, విముక్తుం డొకం, డనేకుండు నను నివి మొదలుగాఁ గల వాదంబులు మాయవలన ననురోధింపుదురు గావున నానావాదానురోధకుండ వయ్యును, నభిధానాభిధేయశక్తిభేదంబువలన బహుప్రభావప్రతీతుండ వయ్యును, జక్షురాది రూపంబులవలనఁ బ్రమాణరూపకుండ వయ్యును, నిరపేక్షజ్ఞానంబు కలిమిం గవి వయ్యును, వేదమయ నిశ్శ్వాసత్వంబువలన శాస్త్రయోని వయ్యును, సంకర్షణ వాసుదేవ ప్రద్యుమ్నానిరుద్ధ రూపంబులవలనఁ జతుర్మూర్తి వయ్యును, భక్తజనపాలకుండ వయ్యును, నంతఃకరణప్రకాశకత్వంబుగలిగి సేవకజనఫలప్రదానంబుకొఱకు గుణాచ్ఛాదకుండ వయ్యును, జిత్తాదివర్తనంబులఁ గానం దగిన గుణంబులకు సాక్షివై యొరుల కెఱుంగరామి నగోచరుండ వయ్యును, దర్కింపరాని పెంపువలన నవ్యాహతవిహారుండ వయ్యును, సకలకార్యహేతు వయ్యు, నంతఃకరణప్రవర్తకత్వంబువలన హృషీకేశుండ వయ్యును, సాధనవశంబుగాని యాత్మారామత్వంబువలన ముని వయ్యును, స్థూలసూక్ష్మగతుల నెఱుంగుచు నెందుం జెందక నీవు విశ్వంబు గాకయు విశ్వంబు నీవ యయ్యును,**

**విశ్వభావాభావసందర్శనంబు సేయుచు విద్యావిద్యలకు హేతువయిన నీకుం బ్రణామంబు లాచరించెద మవధరింపుము. 682**

**ప్రతి :** మఱియున్= ఇంకను; కలఁడు= దేవుడు ఉన్నాడు; లేఁడు= ఎన్నడు లేడు; సర్వంబును= అంతయును; ఎఱుంగును= తెలుసుకొనును (సర్వజ్ఞుడని భావం) ఇంచుకన్= కొంచెము; ఎఱుంగున్= తెలుసుకొనును; ఇంచుక బద్ధుండు= మాయకు కొంచెము లోబడినవాడు; విముక్తుండు= మాయకు లోబడనివాడు; ఒకండు= ఏకరూపుడు; అనేకుండున్= బ్రహ్మ, విష్ణువు, శంకరుడు, ఇంద్రుడు మొదలగు రూపాలతో కనబడేవాడు, అనునివి మొదలు+కాన్+కల వాదంబులు= అనునటువంటి ఇవి మొదలయిన అభిప్రాయభేదాలు; మాయవలనన్= అజ్ఞానంచేత; అనురోధింపుదురు= అనుసరిస్తారు; కావునన్= కనుక; నానావాద+అనురోధకుండవు= కలడు, లేడు, కించిద్జుడు, సర్వజ్ఞుడు, బద్ధుడు ముక్తుడు, ఏకరూపుడు, బహురూపుడు అనునట్టి అనేకములగు పరస్పరం విరుద్ధాభిప్రాయాలకు వీలయినవాడవు; అయ్యునున్= అయి ఉండియును; అభిధాన= నామాలయొక్క; ఆభిధేయ= పదార్థాలయొక్కయు; శక్తి= గుణాలయొక్కయు; భేదంబువలనన్= భిన్నత్వంచేత; బహుప్రభావ ప్రతీతుండవు= అనేక విధాలగు గొప్పతనంచేత ప్రసిద్ధుడవు; అయ్యునున్= అగుచును; చక్షుస్+ఆదిరూపంబువలనన్= కన్ను మొదలగు ఇంద్రియములచేత; ప్రమాణరూపకుండవు= నిశ్చయింపబడిన రూపాలుగలవాడివి; అయ్యునున్= అగుచును; నిర్+అపేక్ష జ్ఞానంబుకలిమిన్= ఇంద్రియాదుల సహాయం అక్కరలేని జ్ఞానం కలిగి ఉండుటచేత; కవివి= సమస్తాన్నీ కల్పించి ప్రకటించేవాడివి; అయ్యును= అగుచును; వేదమయ నిశ్వాసత్వంబువలనన్= వేదరూపమయిన నిశ్వాసముగలవాడవగుటచేత; శాస్త్రయోనివి= వేదములకు జన్మస్థానమయినవాడవు; అయ్యును= అయినప్పటికీ; సంకర్షణవాసుదేవప్రద్యుమ్న+ అనిరుద్ధరూపంబులవలనన్= సంకర్షణుడు, వాసుదేవుడు, ప్రద్యుమ్నుడు, అనిరుద్ధుడు అనే రూపాలు గలవాడవవగుటవల్ల; చతుర్+మూర్తివి= నాలుగురూపాలు గలవాడివి; అయ్యునున్= అయి ఉండియు; భక్తజనపాలకుండవు= భక్తులను రక్షించువాడవు; అయ్యునున్= అయినా; అంతఃకరణ ప్రకాశకత్వంబున్= జీవుల అంతఃకరణాల్ని విషయాల్లో ప్రవర్తింపజేయడం అనే ధర్మం; కలిగి= కలిగి ఉండి; సేవక జనఫలప్రదానంబుకొఱకున్= నను సేవించేవారికి తగినఫలాన్ని ఇవ్వడంకొరకు; గుణ+ఆచ్ఛాదకుండవు= సత్త్వరజస్తమోగుణముల చేత ప్రపంచాన్ని ఆవరించేవాడివి; అయ్యునున్= అయినప్పటికీ; చిత్త+ఆదివర్తనంబులన్= చిత్తం, అహంకారం, మనస్సు, బుద్ధి అనే అంతఃకరణదశా భేదాలయొక్క స్మరణం, కర్తృత్వం, సంకల్ప వికల్పాలు; నిశ్చయజ్ఞానం అనే వ్యాపారాలచేత; కానన్+తగినగుణంబులకున్= తెలుసుకొనదగిన సత్త్వరజస్తమోగుణాలకు; సాక్షివి+ఐ= ఉదాసీనంగా ఉండి చూచేవాడివయి; ఒరులకున్= ఇతరులకు; ఎఱుంగన్ రామిన్= తెలుసుకొనుటకు శక్యం కానివాడి వగుటచేత; అగోచరుండవు= ప్రత్యక్షం కానివాడివి; అయ్యునున్= అయియుండికూడా; తర్కింపన్= ఊహించడానికి; రాని పెంపువలనన్= శక్యంకాని అభివృద్ధివల్ల; అవ్యాహత విహారుండవు= అడ్డులేని సంచారంగలవాడివి; అయ్యునున్= అయియుండియును; సకలకార్యహేతువు= అవ్యక్తం మొదలు స్థావర జంగమాల వరకుగల సకలసృష్టికి కారణమయినవాడివి; అయ్యున్= అయియుండియును; అంతఃకరణప్రవర్తకత్వంబువలనన్= మనస్సును ఇంద్రియాలద్వారా ప్రవర్తింపజేయడంచేత; హృషీక+ఈశుండవు= జ్ఞానేంద్రియ కర్మేంద్రియములకు అధిపతివి; అయ్యునున్= అయియుండియును; సాధనవశంబు= జపమంత్రయోగంచేత స్వాధీనమగుట; కాని+ఆత్మ+ఆరామత్వంబువలనన్= కుదరనటువంటి (తన) ఆత్మయందే క్రీడించుట కలవాడివి అగుటచేత; మునివి+అయ్యున్= మౌనంగా ఉండే వాడివి అయియుండియును; స్థూల సూక్ష్మగతులన్= స్థూల సూక్ష్మభూతముల యొక్కయు ప్రవర్తనములను; ఎఱుంగుచున్= తెలుసుకొనుచు; ఎందున్= దేనియందును; చెందక= ప్రవేశింపక (దేనితోను సంబంధం లేకుండగ అని భావం) నీవు= నీవు; విశ్వంబున్+కాకయున్= ప్రపంచ స్వరూపుడివి కాకుండగనే; విశ్వంబున్= ప్రపంచస్వరూపుడివి;

నీవు+అ= నీవే; అయ్యునున్= అయి ఉండియును; విశ్వభావ+అభావ సందర్శనంబు+చేయుచున్= ప్రపంచముయొక్క ఉండుట లేకుండుటలను చూస్తూ; విద్యా+అవిద్యలకున్= జ్ఞానాజ్ఞానాలకు; హేతువు+అయిన= కారణమయిన; నీకున్= నీకు; ప్రణామంబులు= నమస్కారాలు; ఆచరించెదము= చేస్తాము; అవధరింపుము= చిత్తగింపుము.

**తా :** ఓ శ్రీకృష్ణా! మాయకు లోబడిన ప్రజలు నిన్నుగురించి అనేకవిధాలవాదాలకు లోనవుతూ ఉంటారు. దేవుడు ఉన్నాడని భక్తులు మొదలయినవారివాదం. అసలే లేడని చార్వాకులు మొదలయినవారివాదం. ఏకరూపుడు- కాదు అనేక రూపుడు, అన్నీ తెలిసినవాడుకాదు, కొంచెమే తెలిసిన జీవరూపుడు, మాయకు లోబడినవాడు కాదు, మాయకు అతీతుడు. ఈ విధంగా నీ మాయాప్రభావంవల్ల ఎందరో ఎన్నో విధాలుగా వాదిస్తూ ఉంటారు. అన్నివాదాలకు అనుకూలంగా ఉన్నట్లే కనబడుతూ ఉంటావు. పదాలు (సంకేతాలు), వాని అర్థాలు, వాని స్వభావాలు, వానిలోని తారతమ్యాలు మొదలగువానిచేత సర్వజ్ఞత్వం, అల్పజ్ఞత్వం మొదలయిన మహిమలతో గూడినవాడివి. జ్ఞానసాధనాలయిన చక్షురాదులు అయిన ఇంద్రియాలు నీరూపమే. ఇంద్రియాపేక్షలేని జ్ఞానం ఉన్నవాడివగుటచే పరమాత్మవు. వేదాలను నిశ్వాసరూపంగా వెలువరించావు కనుక వేదాలకు జన్మస్థానం నువ్వే ('శాస్త్రయోనిత్వాత్' – బాదరాయణుని వేదాంతసూత్రం) (యస్య నిశ్వసితం వేదాః శ్రుతి). అంతఃకరణ దశా భేదాలయిన అహంకారం – బుద్ధి – మనస్సు- చిత్తం అనే వానికి అధిదేవతలయిన సంకర్షణుడు – వాసుదేవుడు – ప్రద్యుమ్నుడు – అనిరుద్ధుడు అను నలుగురు నీ వ్యూహరూపాలవారే. భక్తజనుల్ని రక్షించేవాడివి నువ్వే. జీవులఅంతఃకరణాన్ని ఇంద్రియాలద్వారా విషయాలమీదకు మళ్లిస్తూ ఉంటావు. నిన్ను సేవించేవారికి తగిన ఫలాలు ఇవ్వడంకోసం సత్త్వరజస్తమోగుణాలతో ప్రపంచాన్ని ఆవరించి ఉన్నావు. సాత్త్విక – రాజసిక – తామసిక కర్మలకు తగిన సాత్త్విక – రాజసిక – తామసిక ఫలాలు ఇస్తూ ఉంటావు. జీవుల అంతఃకరణవృత్తులద్వారా తెలియదగిన సత్త్వరజస్తమో గుణాలకు సాక్షివిగా ఉంటూ, జనులకు గోచరించకుండా ఉంటావు. ఊహకందని అభివృద్ధి కలవాడివి కనుక బ్రహ్మవు. నిరాఘాటమైన ప్రవర్తన కలవాడవు. అవ్యక్తం మొదలుకొని సకలస్థావర జంగమ సృష్టికి కారణమైనవాడివి. మనస్సును ఇంద్రియాలద్వారా ప్రవర్తింపజేయడంవల్ల జ్ఞానేంద్రియ కర్మేంద్రియాలకు నీవే అధిపతివి. జప మంత్ర యోగాదులచేత స్వాధీనంకాని ఆత్మయందే క్రీడిస్తూ ఉంటావు కనుక ఆత్మారాముడవు. మౌనాన్ని ఆశ్రయించిన వాడవు. స్థూల సూక్ష్మభూతాల గతులు గుర్తిస్తూ, దేనితోనూ సంబంధం లేకుండా ఉంటావు. ఈ ప్రపంచం నీ రూపం కాదు. కానీ సమస్తమూ నీవే. ఈ ప్రపంచంయొక్క స్థితిలయాలకు సాక్షివి నీవే. జ్ఞానాజ్ఞానాలకు నీవేకారణం. నీకు నమస్కారం.

**క. లోకజనిస్థితిలయములు, గైకొని చేయుదువు త్రిగుణకలితుఁడవై కా**
**లాకారమున నమోఘ, శ్రీకలితుఁడ వగుచు నిచ్చ సెందక యీశా! 683**

**ప్రతి :** ఈశా= విశ్వానికి ప్రభువైన ఓ శ్రీకృష్ణా; త్రిగుణకలితుఁడవు+ఐ= సత్త్వరజస్తమో గుణాలతో కూడిన వాడివయి; కాల+ ఆకారమునన్= నిమేషము మొదలు మహాకల్పమువరకుగల కాలంయొక్క రూపంతో; అమోఘ= అద్భుతమైన; శ్రీకలితుఁడవు= లక్ష్మీసంపన్నుడవు, సమస్తములైన ఐశ్వర్యసంపన్నుడవు; అగుచున్= అయిఉంటూ; ఇచ్ఛ= కోరికను; చెందక= పొందకుండగా (నిష్కాముడివై); లోక జని స్థితి లయములు= విశ్వంయొక్క సృష్టి స్థితి నాశాలను; కయికొని= చేకొని; చేయుదువు= చేస్తుంటావు.

**తా :** సమస్త జగత్తులకు ప్రభువైన శ్రీకృష్ణా! నీవు యశస్సు, వీర్యం మొదలగు ఆరువిధాలయిన ఐశ్వర్యం కలవాడివి. కాలస్వరూపుడివి. ఏ విధమయిన కోరిక లేకుండానే లీలామాత్రంగా చతుర్ముఖబ్రహ్మరూపం ధరించి విశ్వసృష్టినీ, విష్ణురూపం ధరించి స్థితినీ, రుద్రరూపం ధరించి నాశాన్నీ చేస్తూ ఉంటావు.

**క. నీ శాంతలు గాని తనువు, లీశా! యీ మూఢజాతు లీ సజ్జాతుల్**
**నీ శాంతతనువులందుఁ బ్ర, కాశింతువు ధర్మహితముగా సుజనులలోన్. 684**

**ప్రతి :** ఈశా!= ఓ పరమేశ్వరా! శాంతలుగాని= శాంతించనటువంటి; ఈ తనువులు= మాయొక్క ఈ జన్మలు, (ఈ శరీరాలు); ఈ మూఢజాతులు= అజ్ఞానులతో కూడుకొన్న ఈ మూర్ఖమైన జన్మలు; సత్+జాతుల్= నీ జ్ఞానంగల్గి సత్త్వగుణప్రధానమయిన జాతికి చెందినవియు; శాంత తనువుల+అందున్= శాంతిని అనుభవిస్తున్న వాళ్లలోను; సుజనులలోన్= మంచివాళ్లలోను; ధర్మహితము+కాన్= ధర్మమునకు మేలుకల్గడంకోసం; నీ= నీవు; ప్రకాశింతువు(ప్రకాశించుదువు)= వెలుగొందుతుంటావు.

**తా :** ఓ పరమేశ్వరా! ఈ శరీరాలు ఎంతకూ శాంతిలేనివి. అంతేకాక అజ్ఞానంతో కూడుకొన్న మూర్ఖమైన జన్మలు ఇవి. కాని నీవు ప్రశాంతతను అనుభవిస్తున్న మంచివాళ్లలోమాత్రమే ధర్మానికి మేలు కలిగించేందుకు అనుభవానికి వస్తూ, ప్రకాశిస్తూ ఉంటావు.

**ఉ. నేరము లెన్న నెక్కడివి? నేము దలంచు తలంపులోపలన్**
**నేరుపు లున్నవే? సుతులనేరమిఁ దండ్రులు త్రోచిపుచ్చరే?**
**నేరము సేయువారి ధరణీపతు లొక్కొకమాటు గావరే?**
**నేరము గల్గు మద్విభుని నేఁడిటఁ గావఁ గదే కృపానిధీ! 685**

**ప్రతి :** కృపానిధీ= దయకు గనివంటివాడవగు ఓ శ్రీకృష్ణా; ఎన్నన్= పరిశీలింపగా; నేరములు= (నీ విషయంలో) తప్పులు; ఎక్కడివి= ఎక్కడ ఉన్నవి (లేవనిభావం); నేము= మేము; తలంచు తలంపులోపలన్= చేసే ఆలోచనలలో; నేరుపులు= నైపుణ్యాలు; ఉన్నవే= ఉన్నవా (లేవనిభావం); సుతులనేరమిన్= కొడుకులు చేసేతప్పులను; తండ్రులు= తల్లిదండ్రులు; త్రోచిపుచ్చరే= క్షమించి విడిచిపెట్టరా (క్షమిస్తారని భావం); ఒక్క+ఒక్కమాటు= ఒక్కొక్క మారు; ధరణీపతులు=రాజులుకూడ; నేరము+చేయువారినిన్= తప్పు చేసినవారిని; కావరు+ఏ= రక్షింపరా (రక్షిస్తారు); నేఁడు= ఈనాడు; ఇటన్= ఇక్కడ; నేరము+కల్గు మత్+విభునిన్= తప్పు చేసిన మా భర్తను; కావన్+కదు+ఏ= కాపాడవే, రక్షించవా?

**తా :** కృపానిధీ! శ్రీకృష్ణా! నీలో ఏ తప్పు లేదు. తప్పు చేసిన మా భర్తను శిక్షించడం నీ తప్పు కాదు. మా పెనిమిటి ఆలోచనలలోను, చేతలలోనే పొరపాట్లు ఉన్నాయి. లోకంలో కుమారులు ఎటువంటి తప్పు చేసినా తల్లిదండ్రులు క్షమిస్తూ ఉంటారు గదా! రాజులు కూడ తప్పు చేసినవారిని ఒక్కొక్కసారి దండించకుండా విడిచిపెడుతూ ఉంటారు. నీవు జగత్తునకే ఈశ్వరుడవు. దయకు గనివంటివాడవు. అటువంటి నీవు మా భర్తను దయ తలచి కాపాడుమయ్యా!

**శా. బాలుం డీతఁడు మంచివాఁ డనుచుఁ జెప్పన్ రాము క్రూరుండు దు**
**శ్శీలుం డౌ నవు నైన నేము సుభగశ్రీఁ బాసి వైధవ్య దు**
**ష్టాలంకారముఁ బొంద నోడెద మనాథాలాప మాలింపవే?**
**చాలున్ నీ పదతాండవంబు, పతిభిక్షం బెట్టి రక్షింపవే? 686**

**ప్రతి :** ఈతఁడు= మా మగడు; మంచివాఁడు= సజ్జనుడు; అనుచున్= అంటూ; చెప్పన్ రాము= చెప్పడానికై ప్రయత్నం చేయము; బాలుండు= వివేకం లేనివాడు; క్రూరుండు= తీవ్రమైనకోపం కలవాడు; దుస్+శీలుండు+ఔను+అవును= ఇతడు

చెడ్డనడవడిక గలవాడే ముమ్మాటికీ అది నిజమే!; ఐనన్= ఇతడు మంచివాడు కాకపోయినప్పటికిని; ఏము= మేము; సుభగశ్రీన్= సౌభాగ్యసంపదను; పాసి= కోలుపోయి; వైధవ్యదుష్ట+అలంకారమున్= విధవాత్వం అనెడి అశుభమయిన అలంకారమును; పొందన్= పొందుటకు; ఓడెదము= వెనుదీయుచున్నాము; అనాథ+ఆలాపము= (నీవు తప్ప)వేరు దిక్కులేని వారమయిన మా మాటను; ఆలింపవు+ఏ= వినవా, వినవయ్యా; నీపదతాండవంబున్= నీ కాళ్లతో త్రొక్కడం; ఇంక చాలున్= ఇంక చాలును; పతిభిక్షన్+పెట్టి= మా భర్తను రక్షించుట అనేభిక్షను పెట్టి; రక్షింపవు+ఏ= కాపాడవా?

**తా :** మా పెనిమిటి మంచివాడని సమర్థించలేము. ముమ్మాటికీ ఇతడు మూర్ఖుడు. ముక్కోపి, దుర్మార్గుడు. అయినప్పటకీ ఇతణ్ణి నీవు సంహరిస్తే మేము వైధవ్యదుఃఖం అనుభవించవలసివస్తుంది. దాన్ని మేము భరించలేము. నీవు తప్ప మాకు మరొక దిక్కులేదు. కాబట్టి దయతో మా భర్తను మన్నించి, మా భర్త పడగలమీద కాళ్లతో త్రొక్కడం చాలించి, మాకు పతిభిక్షను ప్రసాదించు స్వామీ!

**ఉ. ఆకులమయ్యె భోగ, మిదె యౌఁదల లన్నియు వ్రస్సెఁ, బ్రాణముల్**
**రాకలఁ బోకలం బొలిసె, రాయిడి వెట్టక మా నిజేశుపై**
**నీ కరుణాకటాక్షములు నిల్పఁగదే తగ, నో సమస్త లో**
**కైకశరణ్య! యో యభయకారణ! యో కమలామనోహరా! 687**

**ప్రతి :** ఓ సమస్తలోక+ఏకశరణ్యా= అన్నిలోకాలకూ ఒక్కడవే శరణు వేడదగినవాడా!; ఓ అభయకారణ= అభయమివ్వడానికి కారణమయినవాడా; ఓ కమలా మనోహరా= లక్ష్మీదేవికి భర్తవయిన ఓ శ్రీకృష్ణా; ఇదె= ఇదిగో; భోగము= కాళియుని శరీరం; ఆకులము+అయ్యెన్= నలగిపోయినది; ఔఁదలలు+అన్నియున్= పడగలన్నియు; వ్రస్సెన్= పగిలిపోయాయి; ప్రాణముల్= ప్రాణవాయువులు; రాకలన్+పోకలన్= శరీరములోనికి రావడం, పోవడం అనే పనులచేత; పొలిసెన్= క్షీణించాయి; రాయిడి+పెట్టక= బాధపెట్టక; మా నిజ+ఈశుపైన్= మా భర్తమీద; తగన్= ఉచితంగా; నీ కరుణాకటాక్షములు= దయతో కూడిన నీకడకంటిచూపులను; నిల్పన్+కదే= ప్రసరింపజేయుమా!

**తా :** సర్వలోకాలవారు తమకు ఏ ఆపద వచ్చినా నిన్ను ఆశ్రయించవలసిందే. నీవు భక్తులకు అభయ మిచ్చేవాడివి. లక్ష్మీదేవికి భర్తవు. ఓ కృష్ణా! ఇదిగో చూడు. ఇప్పటికే మా భర్త శరీరం అంతా నలిగిపోయింది. పడగలన్నీ పగిలి పోయాయి. ప్రాణాలు వస్తూ పోతూ ఉన్నట్టుగా సొమ్మసిల్లి పోయాడు. ఇతణ్ణి దయతో చూచి, ఇంక బాధించక విడిచి పెట్టవయ్యా!

**ఆ. మమ్ముఁ బెండ్లిసేయు మా ప్రాణవల్లభు, ప్రాణ మిచ్చి కావు భక్తవరద!**
**నీవు సేయుపెండ్లి నిత్యంబు భద్రంబుఁ, బిన్ననాఁటిపెండ్లి పెండ్లి గాదు. 688**

**ప్రతి :** భక్తవరద= భక్తులకు వరాలిచ్చే శ్రీకృష్ణా!; మమ్మున్+పెండ్లి+చేయుము= (తిరిగి) మాకు పెండ్లిచేయి; మా ప్రాణవల్లభున్= మా ప్రాణాలకు ప్రభువయిన కాళియుని; ప్రాణమున్= ప్రాణాన్ని; ఇచ్చి= ప్రసాదించి; కావు= రక్షింపుము; (ఇపుడు) నీవు+చేయుపెండ్లి= నీవు ఇపుడు చేసే పెండ్లి; నిత్యంబున్= శాశ్వతమైంది; భద్రంబున్= శుభకరమైంది; పిన్ననాఁటిపెండ్లి= చిన్నప్పటిపెండ్లి; పెండ్లి కాదు= వివాహమే కాదు.

**తా :** భక్తులకు కోరిన వరాలిచ్చి అనుగ్రహించే ఓ శ్రీకృష్ణా! మా ప్రాణనాథుని ప్రాణాలు ప్రసాదించి, ఆతనితో మళ్లీ మాకు వివాహం జరిపించు. నీవు జరిపించే ఈ పెండ్లియే శాశ్వతంగా నిలిచేది. శుభాలు కలిగించేది. అంతేగాని మాకు చిన్నప్పుడు

జరిగిన పెండ్లి పెండ్లే కాదు. (నిజమే కదా! మనం చేసే పెండ్లికంటే సర్వమంగళప్రదుడైన భగవంతుడు చేసేపెండ్లి శుభప్రదం, శాశ్వతం అవుతుంది. దంపతులు చిరకాలం వర్ధిల్లుతారు)

**ఇంద్రవజ్ర.**

**నీయాన, యెవ్వారిని నిగ్రహింపం**
**దా యుగ్ర పాపాకృతి నందఁ డింకన్,**
**నీ యాజ్ఞలో నుండెడు నేఁటఁ గోలెన్**
**మా యీశుప్రాణంబులు మాకు నీవే! 689**

**ప్రతి :** నేఁటన్+కోలెన్= ఈనాటినుండి; ఇంకన్= ఇటుపైన; ఏ+వారినిన్= ఏ ప్రాణులను; నిగ్రహింపండు= బాధింపడు; ఆ+ఉగ్రపాప+ఆకృతిన్= అప్పటి భయంకరమైన పాపపురూపాన్ని; అందఁడు= పొందడు; నీ+ఆజ్ఞలోన్= నీ ఆజ్ఞకు లోబడి; ఉండెడున్= ఉంటాడు; నీ+ఆన= నీ మీద ఒట్టు; మా+ఈశుప్రాణంబులు= మా భర్త అయిన కాళియుని ప్రాణాల్ని; మాకున్+ఈవు+ఏ= మాకు ప్రసాదించవా!

**తా :** నీ మీద ఒట్టు పెట్టి మరీ చెబుతున్నాము. ఈనాటినుండి ఇంక ఎవ్వరినీ బాధించడు. ఇంతకు ముందులాగ భయపెట్టి పాపపు పనులు చేయడు. నీ చెప్పుచేతలలో ఉంటాడు. కాబట్టి మా పెనిమిటి ప్రాణాలు మాకు ప్రసాదించవయ్యా!

**విశే :** ఈ పద్యం ఇంద్రవజ్ర వృత్తం. ఇందులో నాల్గుపాదాల్లోనూ క్రమంగా త,త,జ,గగ – అనే గణాలుంటాయి. ప్రతిపాదంలోనూ 1–8 అక్షరాలు యతిమైత్రి కల్గి ఉంటాయి. ప్రాసనియమం ఉంటుంది.

**వ. అని యిట్లు తమ పెనిమిటిబ్రదుకుఁ గోరెడి భుజగసతులయందు శరణాగతరక్షకుండైన పుండరీకాక్షుండు గరుణించి, చరణఘట్టనంబు సాలించి, తలంగిన నెట్టకేలకుఁ బ్రాణేంద్రియంబుల మరలం బడసి, చిదిసి నలఁగిన తలలు సవరించుకొని వగర్చుచు భుజగపతి జలజనయనునికి నంజలి సేసి మెల్లన నిట్లనియె. 690**

**ప్రతి :** అని= పలికి; ఇట్లు= ఈ తీరుగా; తమపెనిమిటి బ్రదుకున్= తమ భర్తయగు కాళియుని జీవితాన్ని; కోరెడి భుజగసతుల+అందున్= కోరుతుండే సర్పకాంతులయందు; శరణాగతరక్షకుండు+ఐన= శరణు చొచ్చిన వారిని రక్షించేవాడైన; పుండరీక+అక్షుండున్= తెల్లతామరపూలవంటి కన్నులుగలవాడయిన శ్రీకృష్ణుడును; కరుణించి= జాలిగొని; చరణఘట్టనంబున్= కాళ్లతో తొక్కుటను; చాలించి= ఆపుచేసి; తలంగినన్= (పడగలమీదనుండి) పక్కకు తొలగిపోగా; ఎట్టకేలకున్= చివరకు; ప్రాణ+ఇంద్రియంబులన్= ప్రాణాల్ని, ఇంద్రియాల్ని; మరలన్= తిరిగి; పడసి= పొంది; చిదిసి నలఁగిన తలలు= చితికి నలిగిపోయిన పడగలను; సవరించుకొని= చిక్కబట్టుకొని; వగర్చుచున్= నిట్టూరుస్తూ; భుజగపతి= సర్పాలకు ప్రభువయిన కాళియుడు; జలజనయనునికిన్= పద్మాలవంటి కన్నులుగల శ్రీకృష్ణునికి; అంజలి+చేసి= చేతులు జోడించి; మెల్లనన్= నెమ్మదిగా; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= పలికాడు.

**తా :** శరణుచొచ్చినవారిని రక్షించే స్వభావంకల శ్రీకృష్ణుడు – తమ భర్త జీవితాన్ని కోరే కాళియునిభార్యలను అనుగ్రహించాడు. కాళ్లతో తొక్కడం చాలించి, పక్కకు తప్పుకొన్నాడు. దాంతో కాళియుడు తన ప్రాణాల్ని, ఇంద్రియాల్ని పగిలిన పడగల్నీ చాలా కష్టంమీద కూడ తీసికొని, ఆయాసపడుతూ శ్రీకృష్ణునికి నమస్కారం చేసి, పశ్చాత్తాపంతో ఈ విధంగా అన్నాడు.

చ. **మలఁకలు మా ప్రచారములు, మా ముఖముల్ విషవహ్నిఘోరముల్,**
**ఖలులము, రోషజాతులము, గర్వుల, మే మొక మంచివారమే?**
**నళినదళాక్ష! ప్రాణులకు నైజగుణంబులు మాన నేర్చునే?**
**వెలయవె? మా వికారములు వింతలె? మే లొనరించి తీశ్వరా!** **691**

**ప్రతి :** నళినదళ+అక్ష= తామరరేకులవంటి కన్నులుగల ఓ శ్రీకృష్ణా!; ఈశ్వరా= ప్రభువయినవాడా; మా ప్రచారములు= మా నడకలు; మలఁకలు= వంకర అయినవి; మా ముఖముల్= మా నోళ్లు; విషవహ్నిఘోరముల్= విషాగ్నిచేత భయంకరమైనవి; ఖలులము= చెడ్డవారము; రోషజాతులము= కోపంతో పుట్టినవారము; గర్వులము= గర్వం గలవారం; ఏము= మేము; ఒక మంచివారము+ఏ= ఒక మంచివారమా ఏమి? (కాము); ప్రాణులకున్= జంతువులకు; నైజగుణంబులు= సహజగుణాలు; మానన్+నేర్చును+ఏ= మానడం సాధ్యమవుతాయా?; మా వికారములు= మా చెడుచేతలు, చెడుతలపులు; వెలయవు+ఎ= అందరికి తెలిసినవే కదా; వింతలు+ఎ= (సర్వజ్ఞుడవైన నీకు) ఆశ్చర్యం కలిగించేవా?; మేలు+ఒనరించితి(వి)= (మాకు) ఉపకారం చేశావు.

**తా :** తామరరేకులవంటి కళ్లు గలవాడివి పరమేశ్వరుడివి, అయిన శ్రీ కృష్ణా! మా నడకలు తిన్ననైనవి కావు. మా నోళ్లలో భయంకరమైన విషం ఉంటుంది. దుర్మార్గులం. కోపం గర్వం కలిగి ఉంటాం. ఇటువంటి మేము మంచివాళ్లం ఎందుకు అవుతాం? ప్రాణులు పుట్టుకతో వచ్చినగుణాలను ఎక్కడయినా విడిచిపెడతాయా? మా మనోవికారాలు అందరికీ తెలిసినవే! సర్వజ్ఞుడవైన నీకు ఇవి వింతగా ఎందుకు కనబడతాయి? మాలో ఎన్ని దోషాలు ఉన్నప్పటికీ దయతలచి మాకు ఉపకారం చేశావు.

సీ. **వివిధభావాకారవీర్యబీజాశయజవయోనియుతముగా జగము లెల్ల**
**నీవ చేసితి మున్న, నే మా జగంబులో సహజకోపనులము సర్పములము,**
**దుర్వారమైన నీ తోరంపుమాయ నే మెఱిఁగి దాఁటెడు పని కెంతవార?**
**మంతకుఁ గారణ మఖిలేశ్వరుండవు సర్వజ్ఞుఁడవు నీవు జలజనయన!**

తే. **మనిచె దేనిని మన్నించి మనుపు నన్ను, నిగ్రహించెద వేనిని నిగ్రహింపు,**
**మింక సర్వేశ! మా యిమ్ము లెందుఁ గలవు, చిత్తమందున్న క్రమమునఁ జేయఁ దగును.** **692**

**ప్రతి :** సర్వ+ఈశ= సమస్తమునకు ప్రభువయినవాడా!; జలజనయన= పద్మములవంటి కన్నులుగలవాడా; వివిధ= అనేక విధాలయిన; భావ+ఆకార= పుట్టుట మొదలైన ఆరువిధాల భావాలు, ఆకారాలు; వీర్య= శక్తులు; బీజ= సర్వప్రాణుల పుట్టుకకు కారణములు (విత్తనములవంటి సంస్కారములు); ఆశయ= ఆలోచనలు; జవ= వేగాలు; యోని యుతముగాన్= జన్మస్థానాలతో గూడిన; జగములు+ఎల్లన్= లోకాలన్నింటిని; మున్నన్= ముందుగానే; నీవు+అ= నీవే; చేసితివి= సృష్టించావు; ఏము= మేము; ఆ జగంబులోన్= ఆ లోకంలో; సహజ కోపనులము= కోపంతో పుట్టినవారం; సర్పములము= పాములం; దుర్+వారము+ఐన= ఎంతటివారికిని జయింపరానిది ఐన; నీతోరము+మాయను= పెద్దదయిన నీ మాయను; ఏము= మూఢులమైన మేము; ఎఱిఁగి= తెలుసుకొని; దాఁటెడు పనికిన్= జయించునట్టి పనికి; ఎంతవారము= ఏపాటివారం; అంతకున్= సృష్టి స్థితి లయరూపకార్యాలకు; కారణము= హేతువయినవాడివి; అఖిల+ఈశ్వరుండవు= సమస్తమునకు

ప్రభువయినవాడివి; సర్వఁజ్ఞుడవు నీవు= అన్నియు తెలిసినవాడివగు నీవు; మనిచెదు(వు)+ఏనినిన్= బ్రదికించే పక్షంలో; మన్నించి= క్షమించి; మనుపు(ము)= బ్రదికించు; నన్నున్= నన్ను; నిగ్రహించెదవు+ఏనినిన్= దండించే పక్షంలో; నిగ్రహింపుము= దండింపుము; ఇంకన్= ఇక; మా+ఇమ్ములు= మాకు నివసింపదగినచోటులు; ఎందున్+కలవు= ఎక్కడ ఉన్నవి; చిత్తమందున్= నీ మనస్సునందు; ఉన్నక్రమమునన్= ఉన్నట్టి విధంగా; చేయన్+తగును= చేయ తగింది.

**తా :** సమస్తలోకాలకు ప్రభువయిన శ్రీకృష్ణా! అనేకవిధాలయింది ఈ ప్రపంచం. దీనికి నీవు సృష్టికర్తవు. జన్మ మొదలయిన షడ్భావవికారాలు, రూపాలు, శక్తులు, బీజరూపాలయినసంస్కారాలు, ఆలోచనలు నీవు నిర్మించిన ఈ ప్రపంచంలోని అంశాలే – అన్నీ కూడా నీవే!. మేము కూడ ఆ ప్రపంచంలోని వాళ్లమే. మేము సహజంగా కోపస్వభావం కలవాళ్లం. ఎలాపడితే అలాగ ప్రాకులాడే స్వభావం కలవాళ్లం. మహాయోగులకు గూడ అంతుబట్టనిది నీ మాయ. అటువంటి దాన్ని మేము ఏవిధంగా దాటగలం? నువ్వు సర్వజ్ఞుడివి. మమ్మల్ని రక్షించాలి అనిపిస్తే రక్షించు. శిక్షించాలి అనిపిస్తే శిక్షించు. ఈ సమస్త విశ్వం నీదే. మాది అంటూ ఒకచోటు లేదు. నీవు ఎక్కడ ఉండమంటే అక్కడ ఉంటాము.

**విశే :** పుట్టుట, ఉండుట, మారుట, పెరుగుట, తరుగుట, నశించుట అనేవి షడ్భావవికారాలు.

**క. నా పుణ్య మేమి సెప్పుదు? నీ, పాదరజంబుఁ గంటి నే, సనకాదుల్**
**నీ పాదరజము గోరుదు, రే పదమం దున్ననైన నిఁక మేలు హరీ! 693**

**ప్రతి :** హరీ= ఓ శ్రీకృష్ణా!; ఏన్= నేను; నీపాదరజంబున్= నీ అడుగులయందలి ధూళిని; కంటిన్= పొందాను; నా పుణ్యము= నా సుకృతమును; ఏమి+చెప్పదున్= ఏమని చెప్పను; నీపాదరజమున్= నీ పాదధూళిని; సనక+ఆదుల్= సనకుడు మొదలగు మహాయోగులు కూడా; కోరుదురు= అపేక్షింతురు; ఇఁకన్= ఇకమీదట; ఏ పదము+అందున్= ఏ చోటులో; ఉన్నన్+ఐనన్= ఉన్నప్పటికిని; మేలు= మంచిదే కదా!

**తా :** ఓ శ్రీకృష్ణా! సనకాది మహాయోగీశ్వరులకు కూడా దుర్లభమైన నీ పాదధూళి నాకు లభించింది. నా భాగ్యం ఎంతటిదో కదా! ఇంక నేను ఎక్కడ ఉన్నా నాకు మంచే జరుగుతుంది.

**వ. అని విన్నవించినఁ గాళియుపలుకులు విన నవధరించి కారుణ్యమానసుండయిన సర్వేశ్వరుం డతని కిట్లనియె. 694**

**ప్రతి :** అని= ఈ విధంగా; విన్నవించినన్= విన్నవించగా; కాళియుపలుకులు= కాళియునిమాటలను; వినన్= వినునట్లుగ; అవధరించి= నిశ్చయించి; కారుణ్యమానుసుండు= కనికరంతో నిండిన మనసుగలవాడు; అయిన= అయినట్టి; సర్వ+ఈశ్వరుండు= సర్వలోకాలకు ప్రభువయిన శ్రీకృష్ణుడు; అతనికిన్= కాళియునితో; ఇట్లు= ఈ ప్రకారంగా; అనియెన్= పలికాడు.

**తా :** ఈ విధంగా మనవి చేసిన కాళియునిమాటలు విన్న శ్రీకృష్ణుడు, కరుణతో స్థిరనిశ్చయానికి వచ్చి, అతనితో ఇలాగ అన్నాడు.

**క. 'గోవర్గముతో మనుజులు, ద్రావుదు రీ మడుఁగు నీరు, తగ దిం దుండన్,**
**నీవును నీ బాంధవులును, నీ వనితలు సుతులుఁ జనుఁడు నేఁ డంబుధికిన్. 695**

**ప్రతి :** గోవర్గముతోన్= ఆలమందలతోగూడి; మనుజులున్= మనుష్యులును; ఈ మడుఁగునీరు= (యమునయొక్క) ఈ మడుగులోని నీటిని; త్రావుదురు= పానం చేస్తారు; ఇందున్+ఉండన్+తగదు= (మీరు) ఇచట ఉండగూడదు;

నేఁడు= ఈనాడే, నీవును= నీవూ; నీ బాంధవులును= నీ చుట్టాలూ; నీ వనితలు= నీ భార్యలూ; సుతులున్= బిడ్డలును; అంబుధికిన్= సముద్రంలోనికి; చనుఁడు= పొండు.

**తా :** ఓ కాళియుడా! ఈ మడుగులోని నీటిని ఆవులమందలు, మనుష్యులు త్రాగుతూ ఉంటారు. నీవు ఇంక ఇక్కడ ఉండడానికి వీలు లేదు. ఈ వేళే నీవు – నీ భార్యలు, బిడ్డలు, బంధువులతో కలిసి సముద్రంలోకి వెళ్లిపొండి.

**క. నిను నే శాసించిన కథ, మనమునఁ జింతించి రేపు మాపును గీర్తిం**
**చిన మనుజులు నీ భయమును, విను మెన్నఁడుఁ బొంద రెందు విషవిజయముతోన్. 696**

**ప్రతి :** ఏన్= నేను; నినున్= నిన్ను; శాసించిన కథను= శిక్షించిన ఈ వృత్తాంతాన్ని; మనమునన్= మనస్సునందు; చింతించి= ధ్యానం చేస్తూ; రేపున్+మాపును= ఉదయమూ, సాయంకాలమూ; కీర్తించిన మనుజులు= స్తోత్రం చేసిన మానవులు; విషవిజయముతోన్= విషాన్ని జయించడంతో బాటుగ; ఎందున్= ఎక్కడయినా; ఎన్నఁడున్= ఎప్పుడైనా; నీ భయమును= నీ (సర్పజాతి) వలన కలిగే భయాన్ని; పొందరు= పొందనే పొందరు.

**తా :** ఓ కాళియుడా! ఎవరైతే నేను నిన్ను శిక్షించిన ఈ కథను, నన్ను మనస్సులో ధ్యానం చేస్తూ, ఉదయమూ, సాయంకాలమూ, పారాయణ చేస్తూ, స్తుతిస్తూ ఉంటారో, వారికి ఎప్పుడైనా, ఎక్కడైనా మీ సర్పజాతివల్ల భయం కలుగదు. మీ విషం వారికి ఏవిధమైన హానీ కలిగించదు.

**చ. ఇది మొద లెవ్వరైన నరు లీ యమునాతటినీహ్రదంబులో**
**వదలక తోఁగి నన్ను నుపవాసముతోడఁ దలంచి కొల్చుచుం**
**గదలక దేవతాదులకుఁగా జలతర్పణ మాచరించినన్**
**సదమలచిత్తులై దురితసంఘముఁ బాయుదు రాక్షణంబునన్. 697**

**ప్రతి :** ఇది మొదలు= ఇప్పటినుండి; నరులు+ఎవ్వరు+ఐనన్= ఏ మానవులయినా; ఈ యమునాతటినీ హ్రదంబులోన్= యమునా నదిలోని కాళిందీ మడుగులో; వదలక= స్థిరబుద్ధితో; తోఁగి= స్నానం చేసి; ఉపవాసముతోడన్= ఉపవాసం చేస్తూ; నన్నున్= నన్ను; తలంచి= ధ్యానం చేసి; కొల్చుచున్= పూజిస్తూ; కదలక= ఈ చోటు విడువక; దేవతా+ఆదులకున్= దేవతలు మొదలగువారికి; జలతర్పణము= నీటిని విడుచుటచే కలిగే ప్రీతిని; ఆచరించినన్= చేసినయెడల; ఆ క్షణంబునన్= తత్క్షణమే; దురితసంఘమున్= పాపాల రాసుల్ని; పాయుదురు= పోగొట్టుకొంటారు; సత్+అమలచిత్తులు+ఐ= మంచివియు, స్వచ్ఛమైనవియు అగు మనస్సులు కలవారవుతారు.

**తా :** ఈ క్షణంనుండి ఏ మానవులు ఈ యమునలోని కాళిందీ మడుగులో స్నానంచేసి, ఉపవాసం ఉండి, స్థిరభక్తితో నన్నే ధ్యానిస్తూ, పూజిస్తూ, దేవతలకు, పితరులకు, ఋషులకు తర్పణాలు విడుస్తూ ఉంటారో, వారు సర్వపాపాలనుండి విముక్తులయి, నిర్మలమైన మనస్సు కలవారయి మేలు పొందుతారు.

**ఆ. గరుడభీతి రమణకద్వీప మొల్ల కీ, మడువుఁ జొచ్చి తీవు, మత్పదాబ్జ**
**లాంఛనములు నీతలను నుంటఁ జూచి యా, పక్షిరాజు నిన్నుఁ బట్టఁ డింక. 698**

**ప్రతి :** ఈవు= నీవు; గరుడభీతిన్= గరుత్మంతుని వల్ల కలిగిన భయంచేత; రమణకద్వీపమున్= రమణకం అను పేరుగల దీవిని; ఒల్లక= ఇష్టపడక; ఈ మడువున్= ఈ మడుగునందు; చొచ్చితివి= ప్రవేశించావు; ఆ పక్షిరాజు= పక్షులకు ప్రభువయిన

ఆ గరుత్మంతుడు; మత్పద+అబ్జలాంఛనములు= తామరలవంటి నా అడుగులగుర్తులు; నీ తలను= నీ పడగలమీద; ఉంటన్+చూచి= ఉండడం చూచి; ఇంకన్= ఇటుపైన; నిన్నున్+పట్టఁడు= నిన్ను పట్టుకోడు.

**తా :** ఇంతకుమునుపు నీవు రమణక ద్వీపంలో ఉండేవాడవు. గరుత్మంతుడు నిన్ను పట్టుకొని తింటాడేమోననే భయంతో వచ్చి, అతనికి కనబడకుండా ఉండడంకోసం లోతైన ఈ మడుగులో దాగుకొన్నావు. నేను నీ మీద నాట్యం చేయడంవల్ల నా పాదాల ముద్రలు నీ పడగలమీద పడ్డాయి. వాటిల్ని చూచి, గరుత్మంతుడు ఇంక నీ జోలికి రాడు. నిర్భయంగా ఉండు.

**వ. అని యిట్లు విచిత్రవిహారుండైన గోపాలకృష్ణకుమారుం డాన తిచ్చిన, నియ్యకొని, చయ్యన నయ్యహీంద్రుండు దొయ్యలులుం దానును నెయ్యంబున న య్యీశ్వరునకు నవ్యదివ్యాంబరాభరణరత్నమాలికానులేపనంబులు సమర్పించి, తేఁటితండంబులకు దండయగు నీలోత్పలంబుల దండ యిచ్చి, పుత్త్రమిత్రకళత్రసమేతుండై, బహువారంబులు గైవారంబు సేసి, వలగొని, మ్రొక్కి, లేచి, వీడ్కొని రత్నాకరద్వీపంబునకుం జనియె, నిట్లు. 699**

**ప్రతి :** అని= ఈ విధంగా పలికి; విచిత్రవిహారుండు= ఆశ్చర్యకరమైన ప్రవర్తన గలవాడు; ఐన గోపాలకృష్ణకుమారుండు= అయిన బాలశ్రీకృష్ణుడు; ఆనతి+ఇచ్చినన్= ఆజ్ఞాపింపగా; ఇయ్యకొని= అంగీకరించి; ఆ+అహి+ఇంద్రుండు= సర్పరాజయిన ఆ కాళియుడు; తొయ్యలులున్= భార్యలును, తానును= తానూ; నెయ్యంబునన్= ప్రేమతో; ఆ+ఈశ్వరునకున్= పరమేశ్వరుడయిన శ్రీకృష్ణునికి; నవ్య= క్రొత్తవియు; దివ్య= స్వర్గంలో లభించేవియు అగు; అంబర= వస్త్రాలు; ఆభరణ= అలంకారాలు; రత్నమాలికా= రతనాలపేరులు; అనులేపనంబులున్= ఒంటికి పూసికొనే గంధాలను; సమర్పించి= ఇచ్చి; తేఁటి తండఁబులకున్= తుమ్మెదల గుంపులకు; దండ+అగు= చోటయిన(తేనె బిందువులకు ప్రాపైన); నీల+ఉత్పలంబులదండన్+ఇచ్చి= నల్లకలువల దండను ఇచ్చి; పుత్త్రమిత్రకళత్రసమేతుండు+ఐ= కొడుకులతోను, స్నేహితులతోను, భార్యలతోను కూడుకొనినవాడయి; బహువారంబులు= చాలమారులు; కైవారంబు+చేసి= స్తోత్రం చేసి; వలగొని= ప్రదక్షిణంచేసి; మ్రొక్కి= నమస్కరించి; లేచి= లేచి నిలబడి; వీడ్కొని= సెలవు పుచ్చుకొని; రత్న+ఆకరద్వీపంబునకున్= రత్నాలకు నిలయమైన సముద్రం నడుమనున్న దీవికి; చయ్యనన్= శీఘ్రంగా; చనియెన్= వెళ్లాడు; ఇట్లు= ఈ ప్రకారంగా...

**తా :** ఎవరికీ అంతు చిక్కకుండా విహరించే శ్రీకృష్ణుడు ఈ విధంగా ఆజ్ఞాపించగానే, కాళియుడు అలా చేయడానికి అంగీకరించాడు. తన భార్యలతో కలిసి తాను క్రొత్తవి, దేవలోకంలో మాత్రమే లభ్యమయ్యేవి అయిన వస్త్రాలు, ఆభరణాలు, మణిసరాలు బహుమతిగా ఇచ్చాడు. తుమ్మెదలకు ఆశ్రయమై, తేనెలు వెల్లివిరిసే నల్లకలువల దండను భక్తితో సమర్పించాడు. భార్యలు, కొడుకులు, స్నేహితులతో కలసి శ్రీకృష్ణుణ్ణి చాలా పర్యాయాలు స్తోత్రం చేసి, సాష్టాంగ దండప్రణామ ప్రదక్షిణలుచేసి, లేచి నమస్కరించి, శ్రీకృష్ణునివద్ద సెలవు తీసుకొని, సముద్రంలోని ద్వీపానికి వెళ్లిపోయాడు. ఈ ప్రకారంగా

**క. వారిజలోచనుఁ డెవ్వరు, వారింపఁగ లేని ఫణినివాసత్వంబున్**
**వారించిన యమున సుధా, వారిం బొలుపారె నెల్లవారికిఁ బ్రియమై. 700**

**ప్రతి :** వారిజలోచనుఁడు= పద్మములవంటి నేత్రములు గల శ్రీకృష్ణుడు; ఎవ్వరున్= ఎంతటివారును; వారింపన్+కన్+లేని= నివారింపలేని; ఫణినివాసత్వంబున్= కాళియుని ఉనికిని; వారించినన్= తొలగింపగా; యమున= యమునానది; ఎల్లవారికిన్= అందరికీ; ప్రియము+ఐ= ప్రీతిని కలిగించేదై; సుధావారిన్= అమృతంవంటి నీటితో; పొలుపారెన్= శోభించింది.

**తా :** కాళియుణ్ణి యమునానదినుండి దూరంగా సముద్రంలోకి వెళ్లగొట్టడం ఎంతటి గొప్పవారికీ సాధ్యంకాని పని. అటువంటి పనిని శ్రీకృష్ణుడు అలవోకగా చేశాడు. దానితో యమునానది అమృతంవంటి నీటితో అందరికీ ప్రీతిపాత్రమై వెలుగొందింది.

## ❖ కాళియుని పూర్వకథ ❖

**వ. అనిన విని 'మునీంద్రా! యేమి కారణంబునఁ గాళియుండు భుజగనివాసంబయిన రమణకద్వీపంబు విడిచె? నతం డొక్కరుండును గరుడున కేమి తప్పు దలంచె?'నని నరవరుం డడిగిన మునివరుం డిట్లనియె. 701**

**ప్రతి :** అనినన్= (శుకుడు) ఇట్లు చెప్పగా; విని= (పరీక్షిత్తు) విని; ఏమికారణంబునన్= ఎందువలన; కాళియుండు= సర్పరాజైన కాళియుడు; భుజగనివాసంబు+అయిన= పాములకు నెలవయిన; రమణకద్వీపంబున్= రమణకం అనే పేరుగల దీవిని; విడిచెన్= విడిచిపెట్టాడు; అతండు+ఒక్కరుండును= అతడొక్కడే, గరుడునకున్= గరుత్మంతునికి; ఏమితప్పున్+తలంచెన్= ఏ విధమయిన కీడు తలపెట్టాడు; అని= ఈ విధంగా; నరవరుండు= పరీక్షిన్మహారాజు; అడిగినన్= ప్రశ్నించగా; మునివరుండు= మునులలో గొప్పవాడగు శుకుడు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తా :** శుకునిమాటలు విన్న పరీక్షిన్మహారాజు 'కాళియుడు ఏ కారణంచేత పాములకు నివాసస్థానమయిన రమణక ద్వీపాన్ని విడిచిపెట్టి వచ్చాడు? అక్కడ ఇంకా ఎన్నో పాములు ఉంటూ ఉండగా కాళియుడొక్కడే గరుత్మంతునివిషయంలో ఏమి అపరాధం చేశాడు?' అని ప్రశ్నించాడు. అందుకు శుకుడు ఈవిధంగా సమాధానం చెప్పాడు.

**సీ. 'సర్పభీరువులైన జను లెల్ల నెలనెల సరసభక్ష్యములు వృక్షముల మొదల**
**సర్పంబులకుఁ బెట్ట, సర్పంబులును మును సర్పాంతకుఁడు దమ్ముఁ జంపకుండఁ**
**బ్రతిమాసమును దమభాగభక్ష్యంబు లా పక్షిరాజున కిచ్చి బ్రదుకుచుండ**
**విషవీర్యదుర్మదావిష్టుఁడై కాళియుఁ డహికులాంతకునిపా లపహరించి**

**తే. యీక తనపాలిబలిభాగ మెల్లఁ దినిన, విని ఖగేంద్రుఁడు కోపించి 'వీని' తలలు**
**సీరి చెండాడి భోగంబు చించివైచి, ప్రాణములఁ బాపి వచ్చెదఁ బట్టి' యనుచు. 702**

**ప్రతి :** మును= పూర్వం; సర్పభీరువులు+ఐన= పాములకు భయపడునట్టి; జనులు+ఎల్లన్= ప్రజలందరు; నెలనెలన్= ప్రతిమాసంలోనూ; వృక్షముల మొదలన్= చెట్ల మొదళ్లయందు; సరసభక్ష్యములు= రుచికల్గినవైన తినుబండారములు; సర్పంబులకున్= పాములకొరకు; పెట్టన్= పెట్టగా; సర్పంబులును= ఆ పాములు; సర్ప+అంతకుఁడు= గరుత్మంతుడు; తమ్మున్= తమను; చంపక+ఉండన్= చంపక ఉండుటకుగాను; ప్రతిమాసమును= నెలనెలయందును; తమ భాగభక్ష్యంబులు= తమవంతు వచ్చిన తినుబండారములను; ఆ పక్షిరాజునకున్= ఆ గరుత్మంతునికి; ఇచ్చి= సమర్పించి; బ్రదుకుచున్+ఉండన్= జీవిస్తూండగా; కాళియుఁడు= కాళియుడనే సర్పం; విషవీర్యదుర్మద+ఆవిష్టుఁడు+ఐ= విషంచేత, బలంచేత కలిగిన చెడ్డదియగు పొగరు తలకెక్కినవాడగుటచేత; అహికుల+అంతకునిపాలు= సర్పములను చంపేవాడగు గరుత్మంతునిభాగాన్ని; అపహరించి= దొంగలించి; ఈక= ఈయక; తనపాలిభాగంబులు+ఎల్లన్= తనవంతునకు వచ్చు భాగములను అన్నింటిని; తినన్= తినగా; విని= ఆ వృత్తాంతం విని; ఖగ+ఇంద్రుఁడు= పక్షులకు రాజయిన గరుత్మంతుడు; కోపించి= ఆగ్రహించి; వీని తలలు= వీని

పడగలను; పట్టి= పట్టుకొని; సీరి= చీల్చి; చెండాడి= పై కెగురగొట్టి; భోగంబున్= శరీరాన్ని; చించివైచి= చీల్చివేసి; ప్రాణంబులన్+పాపి= ప్రాణములు తీసి; వచ్చెదన్= (తిరిగి) వస్తాను; అనుచున్= అని సంకల్పించి...

**తా :** పూర్వం పాములకు భయపడిన ప్రజలు, అవి తమజోలికి రాకుండా ఉండడంకోసం, రుచికరంగా ఉండే పదార్థాలు పాముల పుట్టలున్న చెట్ల మొదళ్లవద్ద, వాటికి నైవేద్యంగా సమర్పిస్తూ ఉండేవారు. ఆ పాములు తమను చంపి తినే గరుత్మంతుడు తమజోలికి రాకుండా ఉండడంకోసం ఆ నైవేద్యంలో తలకొక కొంత గరుత్మంతునికి సమర్పిస్తూ ఉండేవి. కానీ కాళియుడుమాత్రం 'విషబలం అధికంగా ఉన్న తనను ఎవరు ఏమి చేయగలరులే' అనే పొగరు తలకెక్కి తనవంతులో కొంచెంకూడ గరుత్మంతునికి సమర్పించకుండా తానే తినేస్తూ ఉండేవాడు. అది తెలిసిన గరుత్మంతుడు కోపంతో వీణ్ణి పట్టుకొని, వీని పడగలు, శరీరం చీల్చి చెండాడి, ప్రాణాలు తీస్తానని బయలుదేరాడు.

**క.** **అక్షీణకనకసన్నిభ, పక్షయుగోద్ధూతఘోరపవమానమహా**
**విక్షేపకంపితానే, క క్షోణిధరేంద్రుఁ డగుచు గరుడుఁడు వచ్చెన్.** **703**

**ప్రతి :** గరుడుఁడు= గరుత్మంతుడు; అక్షీణ= తక్కువకాని; కనకసన్నిభ= బంగారంలాంటివయిన; పక్షయుగ= రెక్కల జంటనుండి; ఉద్ధూత= పుట్టిన; ఘోర పవమాన= గొప్పగాలియొక్క; మహా+విక్షేప= గొప్పగావిసరుటచేత; కంపిత= వణికింప చేయబడ్డ; అనేక= ఎక్కువయిన; క్షోణిధర+ఇంద్రుఁడు= పర్వతశ్రేష్ఠములు కలవాడు; అగుచున్= అవుతూ; వచ్చెన్= వచ్చాడు.

**తా :** గరుత్మంతుడు తన బంగారు రెక్కలను ఆడిస్తూ, కాళియుణ్ణి దండించడానికని బయలుదేరి వస్తూండగా, అతని రెక్కలనుండి వేగంగా బయలు వెడలిన గాలి తీవ్రతకు మహాపర్వతాలు కంపించిపోయాయి.

**ఉ.** **వచ్చిన సర్పవైరిఁ గని వ్రాలక లేచి మహాఫణావళుల్**
**విచ్చి దృగంచలంబుల నవీనవిషాగ్నికణంబు లొల్కఁగా**
**నుచ్చలదుగ్రజిహ్వలు మహోద్ధతిఁ ద్రిప్పుచు నూర్పులందుఁ గా**
**ర్చి చ్చెగయంగఁ బాఱి కఱచెన్ విహగేంద్రు నహీంద్రుఁ దుగ్రతన్.** **704**

**ప్రతి :** వచ్చినన్= ఇలా వచ్చినట్టి; సర్పవైరిన్= పాములకు శత్రువయిన గరుత్మంతుణ్ణి; కని= చూచి; అహి+ ఇంద్రుఁడు= సర్పరాజయిన కాళియుడు; ఉగ్రతన్= భయంకరభావంతో; వ్రాలక= తలవంచక; లేచి= పైకిలేచి; మహాఫణ+ఆవళుల్= గొప్పవి అయిన పడగల వరుసలను; విచ్చి= విస్తరింపజేసి; దృక్+అంచలంబులన్= కంటి కొనలనుండి; నవీనవిష+ అగ్నికణంబులు= క్రొత్తగా పుట్టిన విషంయొక్క నిప్పురవ్వలు; ఒల్కన్+కాన్= రాలుతుండగా; ఉత్+చలత్+ఉగ్రజిహ్వలు= పైకి చాచుటచేత చలించునట్టి భయంకరమైన నాలుకలు; మహా+ఉద్ధతిన్= మిక్కిలి గర్వంతో; త్రిప్పుచున్= ఆడిస్తూ; ఊర్పుల+ అందున్= శ్వాసలనుండి; కార్చిచ్చు= దావాగ్ని; ఎగయన్+కన్= ఎగదన్నుచుండగా; పాఱి= (ఎదురుగా) పరుగెత్తి; విహగ+ ఇంద్రున్= పక్షిరాజయిన గరుత్మంతుణ్ణి; కఱచెన్= కాటువేశాడు.

**తా :** ఈ విధంగా వచ్చిన గరుత్మంతుణ్ణి చూచి, కాళియుడు తలవంచలేదు. సరికదా తన పెద్దపడగలను బాగా విస్తరింపజేశాడు. గరుత్మంతుని రాక చూచి, అప్పటికే తనలో ఉన్నదానికి తోడుగా క్రొత్తగా విషం ఊరింది. అది కనుకొనలనుండి బయటకు ప్రవహిస్తూ నిప్పురవ్వల్ని రాలుస్తోంది. కాళియుడు నాలుకలను తీవ్రంగా అల్లల్లాడిస్తున్నాడు. ముక్కులనుండి అగ్నిజ్వాలలు ఎగసిపడుతున్నాయి. తానే ముందుకు పరుగెత్తుకొని వెళ్లి, గరుత్మంతుణ్ణి గట్టిగా కాటువేశాడు.

**క. కఱచిన భుజగము రదములు, విఱుగఁగ వదనములు విషము వెడలఁగ శిరముల్**
**పఱియలుగ నడిచె గరుడుఁడు, తఱిమి కనకరుచులు గలుగు తన డాఁటెక్కన్. 705**

**ప్రతి :** కఱచినన్= (కాళియుడు) కరవగా; గరుడుఁడు= గరుత్మంతుడు; భుజగమురదములు= కాళియుని కోరలు; విఱుగన్+కన్= విరుగునట్లుగా; వదనములన్= మొగముల (పడగల) నుండి; విషము= విషం; వెడలన్+కన్= బయటకు వెడలునట్లుగా; శిరముల్= తలలు (పడగలు); పఱియలు+కన్= బ్రద్దలగునట్లుగా; కనకరుచులు= బంగరుచాయలు; కలుగు= కలిగినట్టి; తన డాఁటెక్కన్= తన ఎడమరెక్కతో; తఱిమి= తరుముకొనిపోయి; అడిచెన్= అణగగొట్టాడు.

**తా :** కాళియుడు కాటు వేయడంతో గరుత్మంతుడు రెచ్చిపోయాడు. కాళియుణ్ణి తరుముకొని వెళ్లి, బంగారుచాయలు విరజిమ్మే తన ఎడమరెక్కతో అణగగొట్టాడు. దానితో కాళియుని కోరలు విరిగిపోయాయి. నోళ్లనుండి రక్తం కక్కుకొన్నాడు. పడగలు చీలికలు పేలికలు అయిపోయాయి.

**వ. ఇ ట్లహికులారాతిచేత వ్రేటువడి వెఱచి పఱతెంచి కాళియుం డీ గభీరంబయిన మడుఁగుఁ జొచ్చె, మఱియు నొక్కవిశేషంబు గలదు. 706**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; అహికుల+అరాతిచేతన్= సర్పకులమునకు శత్రువయిన గరుత్మంతునిచేత; వ్రేటు+పడి= దెబ్బతిని; వెఱచి= భయపడి; పఱతెంచి= పరుగెత్తి వచ్చి; ఈ గభీరంబు+అయిన మడుఁగున్= లోతయిన ఈ మడుగులో; చొచ్చెన్= ప్రవేశించాడు; మఱియును= ఇంకను; ఒక్క విశేషంబు+కలదు= చెప్పదగిన అంశం మరొకటుంది.

**తా :** ఈ విధంగా గరుత్మంతుని దెబ్బతిన్న కాళియుడు భయంతో పారిపోయివచ్చి, ఈ లోతైన మడుగులో దాగుకొన్నాడు. ఈ సందర్భంలో చెప్పవలసిన వృత్తాంతం మరొకటి ఉంది.

**సీ. మున్ను సౌభరి యనుముని యీ హ్రదంబునఁ దపము సేయుచు నుండ ధరణిలోన**
**నాఁకలిగొని పన్నగాంతకుఁ డొకనాఁడు సనుదెంచి యిందుల జలచరేంద్రు**
**నొడిసి భక్షించిన నున్న మీనము లెల్ల ఖిన్నంబులై వగఁ గ్రిస్సి యున్నఁ**
**జూచియు మునిరాజు శోకించి కోపించి 'గరుడుఁడు నేఁడాది గాఁగ నిందుఁ**

**తే. జొచ్చి మీనంబులను మ్రింగఁ జూచెనేనిఁ, జచ్చుఁ గావుత' మని యుగ్రశాప మిచ్చెఁ**
**గాళియుం డొక్కఁ డా శాపకథ యెఱుంగు, నితరభుజగంబు లెవ్వియు నెఱుఁగ వధిప! 707**

**ప్రతి :** అధిప= ఓ పరీక్షిన్మహారాజా!; మున్ను= పూర్వం; సౌభరి+అనుముని= సౌభరి అనే పేరుగల ఋషి; ఈ హ్రదంబునన్= ఈ మడుగులో; తపము+చేయుచున్+ఉండన్= తపస్సు చేస్తుండగా; ధరణిలోనన్= భూమియందు; ఒకనాఁడు= ఒకానొక రోజు; పన్నగ+అంతకుఁడు= పాములను చంపేవాడగు గరుత్మంతుడు; ఆఁకలిన్+కొని= ఆకలిపొంది; చనుదెంచి= వచ్చి; ఇందులన్+జలచర+ఇంద్రున్= ఆ మడుగులోనున్న చేపలరాజును; ఒడిసి= పట్టి, పొంచి; భక్షించినన్= తినగా; ఉన్నమీనములు+ ఎల్లన్= మిగిలిన చేపలన్నియును; ఖిన్నంబులు+ఐ= దుఃఖమును పొందినవయి; వగన్= బాధతో; క్రిస్సి= చిన్నబుచ్చుకొని; ఉన్నన్= ఉండగా; చూచియున్= గమనించి; ఆ మునిరాజు= మునిశ్రేష్ఠుడగు ఆ సౌభరి; శోకించి= దుఃఖించి; కోపించి= కోపగించుకొని; నేఁడు+ఆది+కాన్+కన్= ఈనాడు మొదలుకొని; గరుడుఁడు= గరుత్మంతుడు; ఇందున్= ఈ మడుగులో;

చొచ్చి= ప్రవేశించి; మీనంబులనున్= చేపలను; మ్రింగన్+చూచెన్+ఏనిన్= తినుటకు పూనుకొంటే; చచ్చున్+కావుతన్+అని= చచ్చిపోవును గాక అని; ఉగ్రశాపము= భయంకరమైన శాపం; ఇచ్చెన్= ఇచ్చాడు; కాళియుండు+ఒక్కఁడు= ఒక్క కాళియుడుమాత్రమే; ఆ శాపకథను= ఆ శాపవృత్తాంతాన్ని; ఎఱుంగున్= తెలియును; ఇతర భుజంగంబులు= తక్కిన పాములు; ఎవ్వియున్= ఏవీ; ఎఱుఁగవు= ఈ కథను గురించి తెలియవు.

**తా :** పూర్వం సౌభరి అనే ముని ఈ మడుగులో తపస్సు చేసికొంటూ ఉండేవాడు. ఒకనాడు గరుత్మంతుడు ఆకలితో వచ్చి, ఈ మడుగులో ఉన్న చేపలరాజును ఒడిసి పట్టుకొని, భక్షించాడు. అది చూచిన మిగిలిన చేపలన్నీ, దుఃఖంతో ఉసూరుమంటూ ఉండడం చూచిన సౌభరికి దుఃఖం కలిగింది. వెంటనే కోపం వచ్చింది. 'ఇక మీదట ఎప్పుడయినా గరుత్మంతుడు ఈ మడుగులోకి వచ్చి, ఇందులో ఉన్న చేపలను తినాలని అనుకొన్నాడో, వెంటనే మరణిస్తాడు' అని శపించాడు. అందువల్ల కాళియుడు గరుడునిబాధ లేకుండా చేసుకొనడంకోసం ఈ మడుగులోనికి వచ్చి, దాగుకొన్నాడు. ముని శపించిన విషయం ఒక్క కాళియునికి మాత్రమే తెలుసు. మిగిలిన పాములకు తెలియదు. అందువల్లనే అవేవీ ఈ మడుగులోనికి రాలేదు.

**వ. అది కారణంబుగాఁ గాళియుం డీ మడుఁగుఁ జొచ్చియున్న, గో మనుజ రక్షణార్థంబు కృష్ణుం డతని వెడలించె, నిట్లు దివ్యగంధాంబరసువర్ణమణిగణమాలికాలంకృతుండై, మడుఁగు వెడలి వచ్చిన మాధవుం గని, ప్రాణలాభంబులం బొందిన యింద్రియంబులంబోలె, యశోదారోహిణీ సమేతలయిన గోపికలును, నందసునందాదులైన గోపకులును మూర్ఛలం బాసి, తేఱి, తెప్పిఱి, లేచి, పరమానందంబునం బొందిరి, బల భద్రుండు తమ్ముని నాలింగనంబు సేసె, నప్పుడు. 708**

**ప్రతి :** అది= ఆ శాపవృత్తాంతం; కారణంబు+కాన్= హేతువుకాగా; కాళియుండు= కాళియసర్పం; ఈ మడుఁగున్= ఈ మడుగునందు; చొచ్చి ఉన్నన్= ప్రవేశించి ఉండగా; గోమనుజరక్షణ+అర్థంబున్= ఆవులను, మనుష్యులను రక్షించుటకొరకు; కృష్ణుండు= శ్రీకృష్ణుడు; అతనిని= ఆ కాళియుని; వెడలించెను= వెళ్లగొట్టెను; ఇట్లు= ఈ విధంగ; దివ్య= గొప్పవి అయిన; గంధ= సువాసననిచ్చు ద్రవ్యములచేత; అంబర= వస్త్రములచేత; సువర్ణమణిగణమాలికా= మణులు తాపిన బంగారు హారాలచేతను; అలంకృతుండు+ఐ= అలంకరింపబడినవాడయి; మడుఁగు వెడలివచ్చిన మాధవున్= మడుగునుండి బయటకు వచ్చిన శ్రీకృష్ణుణ్ణి; కని= చూచి; ప్రాణలాభంబులన్= ప్రాణలాభాల్ని; పొందిన+ఇంద్రియంబులన్+పోలెన్= పొందినట్టి ఇంద్రియములలాగా; యశోదారోహిణీ సమేతలు= యశోదాదేవితోను, రోహిణీదేవితోను కూడినవారయిన; గోపికలును= గోపికలును; నందసునంద+ఆదులు+ఐన= నందుడు సునందుడు మొదలగువారు; గోపకులును= గొల్లలును; మూర్ఛలన్+పాసి= మూర్ఛలను వీడి; తేఱి= తేరుకొనినవారయి; తెప్పిఱిన్= అవయవాలను స్వాధీనంలోనికి తెచ్చుకొని; లేచి= స్పృహను పొంది; పరమ+ఆనందంబునన్= గొప్పసంతోషాన్ని; పొందిరి= అనుభవించారు; బలభద్రుండున్= బలరాముడును; తమ్మునిన్= తమ్ముడయిన శ్రీకృష్ణుని; ఆలింగనంబు+చేసెన్= కౌగిలించుకొన్నాడు; అప్పుడు= ఆ సమయంలో...

**తా :** సౌభరిముని ఇచ్చిన శాపంవల్ల గరుత్మంతుడు ఆ మడుగులోనికి రాలేడు అనే ధైర్యంచేత, కాళియుడు ఆ మడుగులోనికి ప్రవేశించాడు. అతని మూలంగా ఆవులకు, మనుష్యులకు ఉపద్రవం కలుగకుండా ఉండడంకోసం, శ్రీకృష్ణుడు అతణ్ణి మడుగునుండి బయటకు వెళ్లగొట్టాడు. కాళియుడు సమర్పించిన దివ్యమైన గంధాలు, వస్త్రాలు, రత్నాభరణాలు ధరించిన శ్రీకృష్ణుడు మడుగులోనుండి బయటకు వచ్చాడు. పోయిన ప్రాణం తిరిగివస్తే ఇంద్రియాలకు చైతన్యం కలిగినట్లుగా, మరణించాడనుకొన్న శ్రీకృష్ణుడు తిరిగి రాగానే, యశోద, రోహిణి మొదలయిన ఆడువారు, నందుడు, సునందుడు మొదలయిన

మగవారు, తేరుకొని, తెప్పరిల్లి, పరమానందాన్ని పొందారు. బలరాముడు సంతోషంతో శ్రీకృష్ణుణ్ణి కౌగిలించుకొన్నాడు. అప్పుడు

**క. ఱంకెలు వైచె వృషభము ల, హంకారముతోడ, లేఁగ లట్టిట్టుఱికెం,**
**బొంకముల నొప్పె ధేనువు, లంకురితము లయ్యెఁ దరువు లా హరిరాకన్. 709**

**ప్రతి :** ఆ హరిరాకన్= ఆ శ్రీకృష్ణునియొక్క రాకచేత; వృషభములు= ఆబోతులు; అహంకారముతోడన్= గర్వంతో; ఱంకెలు వైచెన్= రంకెలు వేశాయి; లేఁగలు= దూడలు; అట్టు+ఇట్టు= అటు ఇటు; ఉఱికెన్= గంతులు వేశాయి; ధేనువులు= ఆవులు; పొంకములన్= సంతోషంచే కలిగిన ఉప్పొంగులతో; ఒప్పెన్= ప్రకాశించాయి; తరువులు= చెట్లు; అంకురితములు= చిగిర్చినవి; అయ్యెన్= అయ్యాయి.

**తా :** శ్రీకృష్ణుడు తిరిగి రావడంతో ఆబోతులు గర్వంతో రంకెలు వేశాయి. లేగదూడలు అటూ ఇటూ చెంగుచెంగున దూకాయి. ఆవులు సంతోషంతో పొంగిపోయాయి. చెట్లు చిగురించాయి.

**క. 'నీ సుతుఁ దహిచే విడివడె, నీ సురుచిరభాగ్యమహిమనిశ్చల' మనుచున్**
**భూసురులు సతులు దారును, భాసురవచనముల నందుఁ బలికి రిలేశా! 710**

**ప్రతి :** ఇలా+ఈశా= ఓ పరీక్షిన్మహారాజా!; భూసురులు= బ్రాహ్మణులు; సతులున్= (వారి) భార్యలును; తారును= తామును; భాసుర వచనములన్= మంచి మాటలతో; నందున్= నందుణ్ణి ఉద్దేశించి; నీ సుతుఁడు= నీ కొడుకు; అహిచేన్= పామునుండి; విడివడెన్= విడుదల పొందాడు; నీ సురుచిర భాగ్యమహిమ= నీదయిన చక్కని అదృష్టంయొక్క గొప్పతనం; నిశ్చలము= స్థిరమైంది; అనుచున్+పలికిరి= అని చెప్పారు.

**తా :** ఓ పరీక్షిన్మహారాజా! అప్పుడు బ్రాహ్మణదంపతులు నందుణ్ణి చూచి, 'నీ కొడుకు పామునుండి విడుదల పొందాడు, నీ భాగ్యం స్థిరమైంది. గొప్పది. దానికి తిరుగులేదు' అని ఆశీర్వదించారు.

**శా. 'ని న్నా యుగ్రభుజంగమంబు గఱవన్ నీ వాపదం బొందుచున్**
**న న్నే మంటి తనూజ! యోడవు గదా నాకూన! నా తండ్రి! రా**
**వన్నా!' యంచు శిరంబు మూర్కొని నిజాంకాగ్రంబుపై నిల్పుచుం**
**గన్నీ రొల్కఁగఁ గౌఁగిలించెఁ దనయున్ గారాముతోఁ దల్లి దాన్. 711**

**ప్రతి :** తనూజ= ఓ కొడుకా!; నిన్నున్= నిన్ను; ఆ+ఉగ్రభుజంగమంబు= ఆ భయంకరమైన కాళియసర్పం; కఱవన్= కాటువేయగా; నీవు+ఆపదన్= నీవు విపత్తును; పొందుచున్= అనుభవిస్తూ; నన్నున్= నన్ను గురించి; ఏమి+అంటివి= ఏమని పిలిచావు; ఓడవు+కదా= భయపడలేదు కదా; నా కూన= నా బిడ్డా; నా తండ్రి= నా నాయనా; రావు+అన్నా= (నా దగ్గరకు) రావయ్యా; అంచున్= అనుచు; శిరంబు మూర్కొని= తలను ప్రేమతో ముద్దాడుతూ; నిజ+అంక+అగ్రంబుపైన్= తన తొడచివర; నిల్పుచున్= కూర్చుండబెట్టుకొంటూ; కన్నీరు+ఒల్కన్+కన్= కన్నీరు కారుచుండగా; తల్లి= తల్లియగు యశోద; తాన్= తాను; తనయున్= కొడుకయిన శ్రీకృష్ణుణ్ణి; గారాముతోన్= ప్రేమతో; కౌఁగిలించెన్= ఆలింగనం చేసుకొంది.

**తా :** యశోద కృష్ణుణ్ణి ఒడిలో కూర్చుండబెట్టుకొని, తలను ప్రేమతో నిమురుతూ, నాయనా! నిన్ను ఆ భయంకరమైన పాము కరచినపుడు నన్ను ఏమని పిలిచావో గదా! భయపడిపోలేదు గదా! రా నాయనా! అని ప్రేమతో కన్నీరు కారుస్తూ శ్రీకృష్ణుని శిరస్సును మూర్కొంటూ ప్రేమతో అతణ్ణి కౌగిలించుకొంది.

**వ. ఇట్లు పరమసంతోషులై ఘోషజను లారేయి కాళిందీతటంబున నాఁకలి నీరువట్టుల డస్సి క్రుస్సి, గోవులం దారు నుండ, నగణ్యంబగు న య్యరణ్యంబున నొక్క దవానలంబు పుట్టి చుట్టు ముట్టికొని నడురేయి నిద్రితంబైన వ్రజంబుమీఁదఁ గదిసిన నదిరిపడి, లేచి, దందహ్యమానదేహులయి సకలజనులును మాయామనుజబాలకుండైన హరికి శరణాగతులై యిట్లనిరి. 712**

**ప్రతి :** ఇట్లు= ఈ తీరుగ; పరమసంతోషులు+ఐ= గొప్పది అయిన ఆనందం పొంది; ఘోషజనులు= వ్రేపల్లె (మంద) లోని ప్రజలు; ఆ రేయి= ఆ రాత్రి; కాళిందీ తటంబునన్= యమునా నదియొక్క గట్టుమీద; ఆఁకలి నీరువట్టులన్= ఆకలి దప్పికలతో; డస్సి= అలసి; క్రుస్సి= కృశించి; గోవులన్= ఆవుల్ని; తారును= తామును; ఉండన్= ఉండగా; అగణ్యంబు+అగు= ఇంత అని లెక్కింపరానిదగు; ఆ+అరణ్యంబునన్= ఆ అడవిలో; ఒక్క దవ+అనలంబు= ఒక కార్చిచ్చు; పుట్టి= ఏర్పడి; చుట్టుముట్టికొని= అన్నివైపుల ఆవరించి; నడురేయిన్= అర్ధరాత్రంలో; నిద్రితంబు+ఐన= నిద్రలో ఉన్న; వ్రజంబుమీఁదన్= గొల్లపల్లెలో; కదిసినన్= కమ్ముకొనగా; అదిరిపడి లేచి= ఉలిక్కిపడి లేచి; దందహ్యమానదేహులు+అయి= కాలుతున్న శరీరాలు కలవాళ్లయి; సకలజనులును= ప్రజలందరును; మాయామనుజబాలకుండు+ఐన= మాయచేత మనుష్య బాలుడుగా అవతరించిన; హరికిన్= శ్రీకృష్ణునికి; శరణ+ఆగతులు+ఐ= శరణువేడినవారయి; ఇట్లు+అనిరి= ఈ విధంగా విన్నవించారు.

**తా :** ఈ విధంగా జరిగినదానికి సంతోషించి ఆ సాయంకాలం గొల్లలంతా ఆ యమునానది ఒడ్డు మీదే ఉండిపోయారు. ఆకలిదప్పికలకు తట్టుకోలేక అలసి, సొలసి అక్కడే ఆలమందలతో పరుండిపోయారు. అర్ధరాత్రంలో కార్చిచ్చు పుట్టి విశాలమైన ఆ అడవిని అన్నివైపులా దహిస్తూ వచ్చింది. గొల్లల ఒళ్లు కాలాయి, దానితో ఉలిక్కిపడి, లేచి, వారు మాయా బాలకుడుగా అవతరించిన శ్రీకృష్ణుణ్ణి శరణువేడి ఈ విధంగా అర్థించారు.

## ✤ గో గోప గోపికా సంఘమును గార్చిచ్చు చుట్టుకొనుట ✤

**మ. 'అదె వచ్చెన్ దవవహ్ని ధూమకణకీలాభీలదుర్వారమై**
**యిదె కప్పెన్ మము నెల్లవారి నిట మీఁ దేలాగు రక్షింపు నీ**
**పదపద్మంబుల కాని యొం డెఱుఁగ, మో పద్మాక్ష!, యో కృష్ణ! మ్రొ**
**క్కెద మో రామ! మహాపరాక్రమ! దవాగ్నిన్ వేగ వారింపవే! 713**

**ప్రతి :** ఓ పద్మ+అక్ష= ఓ తామరపూలవంటి కన్నులుగలవాడా; ఓ కృష్ణ!= శ్రీకృష్ణా!; మ్రొక్కెదము= నమస్కరిస్తున్నాము; మహాపరాక్రమ= గొప్ప పరాక్రమం గలవాడా; ఓరామ= ఓ బలరామా! మొక్కుతున్నాము; అదె= అదిగో; దవవహ్ని= కార్చిచ్చు; ధూమ= పొగచేతను; కణ= నిప్పురవ్వలచేతను; కీలా= మంటలచేతను; ఆభీల= భయంకరమై; దుర్+వారము+ఐ= అడ్డగింపరానిది అయి; వచ్చెన్= వచ్చింది; ఇది+ఎ= ఇదిగో; మమున్+ఎల్లవారిన్= మమ్మందరిని; కప్పెన్= ఆవరించింది; ఇటన్+మీఁదు+ఏలాగు= ఈపైన ఏ విధంగా బతుకగలం; రక్షింపు= కాపాడు; నీ పదపద్మంబులు+అ+కాని= తామరలవంటి నీ పాదములు తప్ప; ఒండు= వేరొకటి; ఎఱుఁగము= తెలియము; దవ+అగ్నిన్= ఈ కార్చిచ్చును; వేగన్= వెంటనే; వారింపవే= అణచివేయవా?

**తా :** కమలాలవంటి కన్నులు గల కృష్ణా! మహాపరాక్రమా బలరామా! ఈ కార్చిచ్చు చుట్టుముట్టి మమ్మల్ని అందరినీ కాల్చివేయడానికి దూసుకొని వస్తోంది. పొగలతో, నిప్పురవ్వలతో, మంటలతో భయంకరంగా ఉంది. మాకు మీరు తప్ప వేరుదిక్కు లేదు. ఈ కార్చిచ్చును అణచి, మమ్మల్ని రక్షించండి.

**క. నీ పాదంబులు నమ్మిన, నాపద లెక్కడివి? జనుల కత్యుగ్ర మహా**
**దీపితదావజ్వలనము, పైపడ కుండెడివిధంబు భావింపఁ గదే.' 714**

**ప్రతి :** జనులకున్= ప్రజలకు; నీ పాదంబులు= నీ అడుగులను; నమ్మినన్= విశ్వసిస్తే; ఆపదలు= విపత్తులు; ఎక్కడివి= ఎక్కడుంటాయి? (ఉండవు); అతి+ఉగ్ర= మిక్కిలి భయంకరమైనది; మహా= గొప్పది; దీపిత= మండేది అగు; దావ జ్వలనము= దావాగ్ని; పై పడక+ఉండెడి విధంబు= ఆక్రమించకుండునట్టి ఉపాయాన్ని; భావింపన్+కదు+ఏ= ఆలోచింపవా?

**తా :** ఓ కృష్ణా! నిన్ను నమ్మినవారికి ఆపదలు కలుగవు. భయంకరంగా అన్నివైపుల నుండి కమ్ముకొని వచ్చే ఈ కార్చిచ్చు మా జోలికి రాకుండా చెయ్యి.

**వ. అని ఘోషించు ఘోషజనులం గరుణించి జగదీశ్వరుండగు ననంతుం దన శక్తియుతుండై గహనంబు నిండిన దావదహనంబు పానంబు సేసిన, విజయగానంబు దశదిశల నిగిడె, నంతం గృష్ణుండు గోగణజ్ఞాతి సహితుండై మందయానంబున మందకుఁ జనియె, నిట్లు రామకేశవులు గోపాలబాలవేషంబులం గ్రీడించు సమయంబున. 715**

**ప్రతి :** అని= ఈ విధంగా; ఘోషించు= మొరపెట్టునట్టి; ఘోషజనులన్= మందలోని వారిని; కరుణించి= దయతలచి; ఆ జగత్+ఈశ్వరుండు+అగు= లోకాలకు ప్రభువయిన ఆ శ్రీకృష్ణుడు; అనంతుండు+అనన్= అంతం లేనివాడన్నట్లుగా; శక్తియుక్తుండు+ఐ= శక్తి కలిగినవాడయి; గహనంబునిండిన= అడవినంతటిని ఆక్రమించిన; దావదహనంబు= కార్చిచ్చును; పానంబు+చేసినన్= త్రాగివేయగా; విజయగానంబు= శ్రీకృష్ణుని జయం సూచించే పాటలు; దశదిశలన్= పది దిక్కుల్లో; నిగిడెన్= వ్యాపించాయి; అంతన్= అప్పుడు; కృష్ణుండు= శ్రీ కృష్ణుడు; గోగణజ్ఞాతి సహితుండు+ఐ= ఆలమందలతోను, బంధువులతోను కూడినవాడయి; మందయానంబునన్= మెల్లని నడకలతో; మందకున్= గొల్లపల్లెకు; చనియెన్= వెళ్లాడు; ఇట్లు= ఈ ప్రకారంగా; రామకేశవులు= బలరామకృష్ణులు; గోపాలబాలవేషంబులన్= గొల్లపిల్లల వేషాల్లో; క్రీడించు సమయంబునన్= వినోదించుకాలంలో...

**తా :** ఈ విధంగా మొర పెట్టుకుంటున్న గొల్లలందరిమీద శ్రీకృష్ణుడు జాలి చూపించాడు. సర్వలోకాలకు ప్రభువయినవాడూ అనంతమైన సామర్థ్యం కలవాడూ, కనుక ఆ కార్చిచ్చును మంచినీళ్లప్రాయంగా తాగేశాడు. గొల్లలంతా పదిదిక్కులు పిక్కటిల్లేలాగ అతని గొప్పతనాన్ని వర్ణిస్తూ పాటలు పాడారు. పిమ్మట కృష్ణుడు ఆవులమందలతోను, బంధువులతోను కలిసి నెమ్మదిగా నడచుకొంటూ వ్రేపల్లెకు వెళ్లాడు. ఈ విధంగా బలరామకృష్ణులు మాయామానుషరూపంతో వినోదిస్తూ ఉండగా

## ❖ గ్రీష్మర్తువర్ణనము ❖

**సీ. దినము లంతంతకు దీర్ఘంబులై యుండ దిననాథుఁ దుత్తరదిశఁ జరించె,**
**నాఁటి నాఁటికి నెండ నవ్యమై ఖర మయ్యె, వెచ్చనిగాడ్పులు విసరఁ జొచ్చె,**

**మేదినీరేణువుల్ మింట సంకుల మయ్యె, నేఱులుఁ గొలఁకులు నిగిరిపోయెఁ,**
**బానీయశాలలఁ బథికసంఘము నిల్చెఁ, జప్పరంబుల భోగిచయము డాఁగెఁ,**

**ఆ. దరులఁ గుసుమచయము దళములతో వాడె, మిథునకోటికి రతి మెందు దోఁచె,**
**నఖిలజంతుభీష్మమైన గ్రీష్మము రాకఁ, గీలి యడవులందుఁ గేలి సలిపె. 716**

**ప్రతి :** దినములు= పగళ్లు; అంతకున్+అంతకున్= ఆనాటి కానాటికి; దీర్ఘంబులు= పొడవైనవి (ఎక్కువైనవి);ఐ= అయి; ఉండెన్= ఉన్నాయి; దిననాథుఁడు= సూర్యుడు; ఉత్తరదిశన్= ఉత్తరదిక్కునందు; చరించెన్= సంచరించాడు; నాఁటికిన్+నాఁటికిన్= దినదినమునకు; ఎండ= ఎండ; నవ్యము+ఐ= క్రొత్తదై; ఖరము+అయ్యెన్= తీక్ష్ణమయింది; వెచ్చనిగాడ్పులు= వేడిగాలులు; విసరన్+చొచ్చెన్= వీవ దొడగాయి; మింటన్= ఆకాశంలో; మేదినీరేణువుల్= భూమి పరాగాలు (దుమ్ము); సంకులము+అయ్యెన్= దట్టంగా రేగింది; ఏఱులున్= నదులును; కొలఁకులును= సరస్సులును; ఇగిరిపోయెన్= ఇంకిపోయాయి; పానీయశాలలన్= చలివేంద్రాల్లో; పథికసంఘము= బాటసారుల గుంపు; నిల్చెన్= నిలబడింది; భోగిచయము= పాముల గుంపులు; చప్పరంబులన్= పందిళ్ల కింద; డాఁగెన్= దాగుకొన్నాయి; తరులన్= చెట్లయందు; కుసుమచయము= పూలరాసులు, దళములతో= ఆకులతోకూడ; వాడెన్= వాడిపోయింది; మిథునకోటికిన్= దంపతుల గుంపులకు; రతి= కలయికయందు; మెందుతోఁచెన్= (ఆసక్తి) హెచ్చయ్యెను; అఖిల జంతుభీష్మము= సమస్త ప్రాణులకు భయంకరమయింది; ఐన గ్రీష్మము+రాకన్= అయినట్టి వేసవికాలంయొక్క రాకచే; కీలి= అగ్ని; అడవుల+అందున్= అడవుల్లో; కేలిసలిపెన్= క్రీడించింది.

**తా :** గ్రీష్మ ఋతువులో పగళ్లు పొడవవుతున్నాయి. సూర్యుడు ఉత్తరాయణంలో సాగుతున్నాడు. అంతకంతకు ఎండ చుఱ్ఱుమనిపిస్తోంది. వేడిగాడ్పులు వీస్తున్నాయి. నేలమీదనుండి దుమ్ములేచి ఆకాశంలో వ్యాపిస్తోంది. నదులు, సరస్సులు ఎండిపోయాయి. బాటసారులు చలివేంద్రాలలో చతికిలబడుతున్నారు. పాములు పందిళ్ల చాటుకు చేరి దాగుకొంటున్నాయి. చెట్లనుండి పూవులు, ఆకులు రాలిపోతున్నాయి. దంపతులకు రతిమీద ఆసక్తి పెరిగింది. సమస్తప్రాణికోటికి బాధ కలిగించే వేసవిరాకవల్ల అడవులు అంటుకొని కాలిపోతున్నాయి.

**ఆ. వాఁడిరుచులు గలుగువానివేఁడిమి గ్రీష్మ, కాలమందు జగము గలయఁ బడియె**
**బ్రహ్మ జనులకొఱకు బ్రహ్మాండఘటమున, నుష్ణరసముఁ దెచ్చి యునిచె ననఁగ. 717**

**ప్రతి :** బ్రహ్మ= సృష్టికర్త; జనులకొఱకున్= ప్రజలకొరకు; బ్రహ్మాండ ఘటమునన్= బ్రహ్మాండం అనే కుండలో; ఉష్ణరసమున్+తెచ్చి= వేడినీటిని (వేడి ద్రవమును) తెచ్చి; ఉనిచెన్+అనన్+కన్= ఉంచెనా అనునట్లు; వాఁడిరుచులు గలుగు వాని వేఁడిమిన్= తీక్ష్ణమైన కిరణములు గల సూర్యునివేడిచేత; గ్రీష్మకాలము+అందున్= వేసవి కాలంలో; జగము= లోకం; కలయన్+పడియెన్= కలగుండుపడింది.

**తా :** బ్రహ్మదేవుడు వేసవికాలంలో బ్రహ్మాండమనే కుండను సలసలమరిగే నీటితో నింపాడా అన్నట్లుగా ప్రజలు ఉష్ణబాధతో కలగుండు పడిపోతున్నారు.

**వ. ఇ ట్లొభీలం బయిన నిదాఘకాలంబు వర్తింప బృందావనంబు రామగోవిందమందిరంబైన కతంబున నిదాఘకాలలక్షణంబులం బాసి, నిరంతరగిరినిపతితనిర్ఝరశీకరపరంపరాభాసితపల్లవితకుసుమితతరులతం**

**బయ్యును, దరులతాకుసుమపరిమళమిళితమృదులపవనం బయ్యును, బవనచలితకమలకహ్లారసరోవర మహాగభీరనదీహ్రదం బయ్యును, నదీహ్రదకల్లోలకంకణప్రభూతపంకం బయ్యును, బంకసంజనిత హరితాయమానతృణనికుంజం బయ్యును, జనమనోరంజనంబైన వసంతకాలలక్షణంబులు గలిగి లలిత మృగపక్షి శోభితం బయి యొప్పుచుండె, మఱియు నందు. 718**

**ప్రతి :** ఇట్లు= ఈ ప్రకారం; ఆభీలంబు+అయిన= భయంకరమైన; నిదాఘకాలంబు= వేసవికాలం; వర్తింపన్= రాగా; బృందావనంబు= బృంద అనే పేరుగల ఆ అడవి; రామగోవింద మందిరంబు= బలరామ శ్రీకృష్ణులకు నివాసస్థానం; ఐనకతంబునన్= అయిన కారణంచేత; నిదాఘలక్షణంబులన్= వేసవికాలపు గుర్తులను; పాసి= విడిచి; నిరంతర= ఎడతెగక; గిరి= కొండలనుండి; నిపతిత= జాలువారునట్టి; నిర్ఝర= సెలయేళ్లయొక్క; శీకర= తుంపరలయొక్క; పరంపరా= వరుసలచేత; భాసిత= ఒప్పునట్టివియు; పల్లవిత= చిగిర్చినవియు; కుసుమిత= పూచినవియు (అగు); తరు= చెట్లతో; లతంబు+అయ్యునున్= తీగలతో కూడిందీ; తరు= చెట్లయందలి; లతా= తీగలయందలి; కుసుమ= పూలయొక్క; పరిమళ= సువాసనతో; మిళిత= కలిసిన; మృదుల= సుకుమారమగు; పవనంబు= గాలి కలది; అయ్యును= అగుటచేతను; పవన= గాలిచేత; చలిత= కదల్పబడిన; కమల= తామరపూవులును; కల్హార= ఎఱ్ఱ కలువలును గల; సరోవర= చెరువులు; మహాగభీర= మిక్కిలి లోతయిన; నదీహ్రదంబు= నదులలో మడుగులు గలది; అయ్యునున్= అగుటచేతను; నదీ= నదుల్లో; హ్రద= మడుగులలోని; కల్లోల= కెరటాలయొక్క; కంకణ= నీటి తుంపరలనుండి; ప్రభూత= పుట్టిన; పంకంబు= బురదగలది; అయ్యునున్= అగుటచేతను; పంక= బురదనుండి; సంజనిత= బాగుగా పుట్టిన; హరితాయమాన= పచ్చనివి అగుతున్న; తృణ= గడ్డియు; నికుంజంబు= పొదరిండ్లు గలదియు; అయ్యునున్= అగుటచేతను; జనమనోరంజనంబు= ప్రజల మనస్సులను సంతోషపెట్టునట్టి; వసంతకాల లక్షణంబులు+కలిగి= వసంత ఋతువుయొక్క చిన్నెలు కలిగి; లలిత= మనోహరమయిన; మృగ= లేళ్లతోను; పక్షి= పిట్టలతోను; శోభితంబు= ప్రకాశించునది; అయి= ఒప్పుతూ ఉంది; మఱియును= ఇంకను; అందున్= ఆ వేసవికాలంలో...

**తా :** ఈ విధంగా భయంకరమైన వేసవికాలం వచ్చింది. మహానుభావులయిన బలరామకృష్ణులు అక్కడ నివసిస్తూ ఉండడంవల్ల వేడిగాడ్పులు లేకుండా చల్లగా ఉంది. కొండలమీదనుండి ఎడతెగకుండ సెలయేళ్లు ప్రవహిస్తున్నాయి. వాటినుండి పుట్టే నీటితుంపరలు తెరలు తెరలుగా వస్తూ ఉంటే అక్కడి చెట్లు, తీగలు, చిగురించి, పూలు పూస్తున్నాయి. ఆ పూలవాసనలు గాలులతో కలిసి అన్నివైపులా వ్యాపిస్తున్నాయి. అచటి చెరువులలోను, నదులలోని లోతైన మడుగులలోను పూచిన తామరపువ్వులు, కలువలు పిల్లగాలులకు ఇటూ అటూ తలలూపుతున్నాయి. నదుల మడుగులలోని అలలనుండి జలకణాలు ఎగిరివచ్చి, సమీపప్రదేశాల్ని బురదబురదగా మారుస్తున్నాయి. ఆ బురదలో పచ్చికలు, పొదరిళ్ళు పెరుగుతున్నాయి. అక్కడ అందమైన మృగాలు, పక్షులు సంచరిస్తున్నాయి. ఆ బృందావనం అంతా జనమనోహరంగా ఉండి, ఇది వేసవికాలం కాదు, వసంతకాలమే అన్న భావనను కలిగిస్తోంది. అట్టి వేసవిలో

**క. పికములకోలాహలమును, శుకసంఘముకలకలంబు సుభగమయూర**
**ప్రకరముకేకారవ, మళి, నికరమురొదయును జెలంగె నెఱి నయ్యడవిన్. 719**

**ప్రతి :** ఆ+అడవిన్= ఆ బృందావనంలో; పికముల కోలాహలమును= కోకిలలయొక్క కలకల ధ్వనియు; శుకసంఘము, కలకలంబు= చిలుకల గుంపులయొక్క కలకల ధ్వనియు; సుభగ= మనోహరమయిన; మయూర ప్రకరము= నెమళ్ల

గుంపుయొక్క; కేకారవము= క్రేంకారధ్వనియు; అళినికరముఠొదయున్= తుమ్మెదల గుంపులు చేయు ఝంకారాలూ; నెఱిన్= ఇంపుగా; చెలంగెన్= ఒప్పాయి.

**తా :** ఆ బృందావనంలో కోకిలల కూతలు, చిలుకల కలకలాలు, నెమళ్ల కేకలు, తుమ్మెదల ఝంకారాలు వినసొంపుగా ఉన్నాయి.

**క. ఆతతయమునాసరసీ, జాతతరంగాభిషిక్తజలరుహగంధో**
**పేతానిల మడఁచె నిదా, ఘాతతదావాగ్నిపీడ న వ్వనమందున్. 720**

**ప్రతి :** ఆ+వనము+అందున్= ఆ బృందావనంలో; ఆతత= విస్తారమయిన; యమునా= కాళిందీ నదిలో; సరసీ= చెరువులలో; జాత= పుట్టిన; తరంగ= కెరటాలచేత; అభిషిక్త= తడుపబడ్డ; జలరుహ= తామరపూలయొక్క; గంధ= పరిమళంతో; ఉపేత= కూడకొన్న; అనిలము= గాలి; నిదాఘ= వేసవికాలంలో; ఆతత= విస్తారమయిన; దావ+అగ్ని= కార్చిచ్చుయొక్క; పీడన్= బాధను; అడఁచెన్= అణచింది (తగ్గించింది).

**తా :** ఆ యమునా నదిలోను, ఆ వనంలోని అక్కడి చెరువులలోను రేగిన కెరటాలు అక్కడి తామరపూలను తడుపుతున్నాయి. తడిసినవి, సువాసనలను వెదజల్లేవి అయిన ఆ తామరపూల మీదనుండి వీచినగాలులు ఆ చల్లదనాన్ని, పరిమళాన్ని మోసికొనివచ్చి అక్కడివారికి అడవి వేసవిలో అంటుకొనడంవల్ల కలిగిన తాపాన్ని పోగొట్టాయి.

**వ. ఇ ట్లామనికందువ తెఱంగు గల్గి సుందరంబైన బృందావనంబునకు బలకృష్ణులు గోవుల రొప్పికొని చని గోపకులుం దారును నొండొరులతో నగుచుఁ,దెగడుచుఁ, జెలంగుచుఁ,దలంగుచు, జిఱజిఱం దిరుగుచుఁ, దరులసందుల కరుగుచు, దాఁగిలి మూఁతలాడుచు, గీతంబులు వాడుచు, వేణునాదంబులు ఘటియించుచు, నటియించుచు, గతులు దప్పినక్రియ నొఱఁగుచుఁ, గుప్పల కుఱుకుచుఁ, జటలు గొట్టుచుఁ, గందుకంబులం దట్టుచు, నుప్పరం బెగసి, దర్దురంబులచందంబున దాఁటుచు, నామలకబిల్వాదిఫలంబుల మీటుచుఁ, గుటవిటపంబులఁ గదల్చుచు, మృగంబుల నదల్చుచుఁ, బెరల రేఁపుచు, మధుమక్షికలఁ జోపుచుఁ, దేనియలు ద్రావుచు, సొమ్మలు వోవుచు, గురుశిష్యకల్పనంబులం బనులు సేయుచుఁ, గాకపక్షధరులై ముష్టియుద్ధంబులకు డాయుచుఁ, బన్నిదంబులు సఱచుచుఁ బులుఁగులభంగి నఱచుచు, బహురూపంబులు వన్నుచు, నెగిరి తన్నుచు, సేవ్యసేవకమిత్రామిత్రభావంబులు వహించుచు నుత్సహించుచు, మఱియు ననేకవిధంబులఁ గ్రీడించి, రందు. 721**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; ఆమనికందువతెఱంగున్= వసంతఋతువు తీరుగా; కల్గి= కలిగి; సుందరంబు+ఐన= చక్కనిది అయిన; బృందావనంబునకున్= బృంద అనే అరణ్యమునకు; బలకృష్ణులు= బలరాముడును కృష్ణుడును; గోవులన్= ఆవులను; రొప్పికొని= తోలుకొని; చని= వెళ్లి; గోపకులున్= గొల్లలును; తారును= తామును; ఒండు+ఒరులతోన్= ఒకరు మరిఒకరితో; నగుచున్= నవ్వుతూ; తెగడుచున్= తిరస్కరిస్తూ; చెలంగుచున్= అరుస్తూ; తలంగుచున్= తప్పుకొంటూ; జిఱజిఱన్+తిరుగుచున్= గిరగిర తిరుగుతూ; తరుల సందులకున్= చెట్లమధ్యకు; అరుగుచున్= వెళ్లుతూ; దాఁగిలిమూఁతలు= దాగుకొంటూ ఆడెడి ఆటలను; ఆడుచున్= ఆడుతూ; గీతంబులు= పాటలు; పాడుచున్= పాడుకొంటూ; వేణునాదంబులు+ఘటియించుచున్= పిల్లనగ్రోవులు ఊదుతూ; నటియించుచున్= నాట్యం చేస్తూ; గతులు తప్పిన క్రియన్= నడకలు తడబడినట్లుగా;

ఒఱఁగుచున్= ప్రక్కకు వ్రాలుతూ; కుప్పలకున్+ఉఱుకుచున్= కుప్పలపైనుండి దూకుతూ; చటలు= చప్పట్లు; కొట్టుచున్= కొట్టుతూ; కందుకంబులన్+తట్టుచున్= బంతులాడుతూ; ఉప్పరంబు+ఎగసి= పైకిఎగిరి; దర్దురంబుల చందంబునన్= కప్పలవలె; దాఁటుచున్= దుముకుతు; ఆమలకబిల్వ+ఆదిఫలంబులన్= ఉసిరి మారేడు మొదలగు పండ్లను; మీటుచున్= ఎగురగొట్టుతూ; కుటవిటపంబులు= చెట్లకొమ్మలు; కదల్చుచున్= కదలిస్తూ; మృగంబులన్= జంతువులను; అదల్చుచున్= బెదరిస్తూ; పెరలన్= తేనెపట్టులను; రేఁపుచున్= రేగగొట్టుతూ; మధుమక్షికలన్= తేనె టీగలను; చోపుచున్= ఎగురగొట్టుతూ; తేనియలు= తేనెలను; త్రావుచున్= త్రాగుతూ; సొమ్మలు+పోవుచున్= సొమ్మసిల్లుతూ; గురుశిష్యకల్పనంబులన్= గురువులుగాను, శిష్యులుగాను ఒకరినొకరు కల్పన చేసికొనబడే; పనులు+చేయుచున్= వారికి తగిన పనులు చేస్తూ; కాకపక్షధరులు+ఐ= పిల్లజుట్లు ధరించి; ముష్టియుద్ధంబులకున్= పిడికిళ్లచే గ్రుద్దుకొనుచు చేసే పోట్లాటలచేత; డాయుచున్= ఒకరినొకరు సమీపిస్తూ; పన్నిదంబులు+చఱచుచున్= పందేలు కాస్తూ; పులుఁగులభంగిన్= పక్షులవలె; అఱచుచున్= కేకలు వేయుచు; బహురూపంబులు= అనేక విధాలయిన వేషాలు; పన్నుచున్= వేసుకొంటూ; ఎగిరితన్నుచున్= ఎగిరి తన్నుకొంటూ; సేవ్య= సేవింపదగినవాడు; సేవక= సేవించేవాడు; మిత్ర= స్నేహితుడు; అమిత్ర= శత్రువు అనేవారి; భావంబులు= తీరులను; వహించుచున్= పాటిస్తూ; ఉత్సహించుచున్= ఉత్సాహంగలవారవుతూ; మఱియున్= ఇంకను; అనేకవిధంబులన్= ఎన్నియో తీరులుగ; క్రీడించిరి= ఆడారు; అందున్= ఆ ఆటల సందర్భంలో...

**తా :** ఈ విధంగా వసంతఋతుశోభతో మనోహరంగా ఉన్న బృందావనానికి బలరామకృష్ణులు ఆవులను తోలుకొని వెళ్లారు. మిగిలిన గొల్లపిల్లవాళ్లతో కలిసి, పరిహాసాలాడుకుంటూ, ఎగతాళి చేసుకుంటూ, పెద్ద పెద్ద కేకలువేస్తూ, ఎవరయినా మీదికి వస్తూ ఉంటే ప్రక్కకు తప్పుకొనిపోతూ, గిరగిర తిరుగుతూ, చెట్లసందులలో దూరుతూ, దాగుడుమూత లాడుతూ, పాటలు పాడుతూ, పిల్లనగ్రోవులు ఊదుతూ, నాట్యంచేస్తూ, కాళ్లు తడబడినట్లుగా ప్రక్కకు ఒరుగుతూ, కుప్పిగంతులు వేస్తూ, చప్పట్లు కొడుతూ, పైకెగిరి కప్పల్లా దూకుతూ, ఉసిరికాయలను మారేడుకాయలను పైకి ఎగురవేస్తూ, చెట్లకొమ్మలు ఊపుతూ, జంతువుల్ని బెదిరిస్తూ, తేనెపట్టులను చిందరవందర చేసి తేనెటీగలను ఎగురగొడుతూ, తేనెలు త్రాగుతూ, సోలిపోతూ, గురుశిష్యుల్లా నటిస్తూ వారికి తగిన చేష్టలు చేస్తూ, పిల్లజుట్లు ముందుకు వేసికొని పిడికిళ్లతో పొడుచుకొంటూ, పందేలు కాసుకొంటూ, పిట్టల్లా అరస్తూ, చాలావిధాల వేషాలు వేస్తూ, పైకెగిరి తన్నుతూ, యజమానుడు సేవకుడు, మిత్రుడు శత్రువు అనేవిధంగా కల్పించుకుంటూ, ఉత్సాహంతో ఎన్నోవిధాలుగా వినోదించారు. ఆ ఆటల సందర్భంలో

**క. మాపాలికి బలకృష్ణులు, భూపాలకు లంచు ఎగిరి బొబ్బ లిడుచు న**
**గ్గోపాలురు మోతురు ప్రమ, దాపాదకు లగుచు వల్లికాందోళికలన్. 722**

**ప్రతి :** మా పాలికి= మా పక్షమునకు; బలకృష్ణులు= బలరాముదును శ్రీకృష్ణుడును; భూపాలకులు= రాజులు; అంచున్= అంటూ; ఎగిరి; బొబ్బలు+ఇడుచున్= కేకలు వేస్తూ; ఆ గోపాలురు= ఆ గొల్లవారు; ప్రమద+ఆపాదకులు= సంతోషం కలిగించేవారు; అగుచున్= అవుతూ; వల్లికా+ఆందోళికలన్= తీగలతో చేసిన పల్లకిలను; మోతురు= మోస్తారు.

**తా :** మా పక్షానికి బలరామకృష్ణులే రాజులు అని ఎగిరి గంతులువేస్తూ, కేకలుపెడుతూ, బలరామకృష్ణులకు సంతోషం కలిగిస్తూ, వారిని తీగలతో చేసిన అందలాల మీద కూర్చుండ బెట్టుకొని మోస్తున్నారు.

**క. గోపకు లందఱు నాడుచు, దీపింపఁగ రామవాసుదేవులవెనుకం**
**బై పడి పాఠకగాయకరూపంబులఁ బొగడుదురు నిరూఢాత్మకులై. 723**

**ప్రతి :** గోపకులు+అందఱున్= గొల్లవారందరును; ఆడుచున్= నాట్యం చేస్తూ; దీపింపన్+కన్= ప్రకాశిస్తూన్న; రామవాసుదేవులవెనుకన్= బలరామకృష్ణుల వెనుకవైపున (చేరి); పాఠకగాయక రూపంబులన్= వంశప్రశస్తిని చదివేవారి వలె; బిరుదులను పాడేవారివలె; రూపంబులన్= వేషాలతో; పైపడి= ఒకరిని మించి మరియొక్కరయి; నిరూఢ+ఆత్మకులు+ఐ= మంచి మనసులతో; పొగడుదురు= స్తుతిస్తారు.

**తా :** ఆ గొల్లపిల్లలంతా ఉత్సాహంగా, ఆడుతూ బలరామకృష్ణుల వెనుక నడుస్తూ వారిని వందిమాగధులవలె స్తుతిస్తున్నారు.

**క. ప్రీతిన్ గోపకు లందఱు, గీతంబులు వాడఁ దరుల క్రిందను నగుచుం**
**జేతులు ద్రిప్పుచు వెడవెడ, పాతర లాడును యశోదపాపం డడవిన్. 724**

**ప్రతి :** గోపకులు+అందఱున్= గొల్లలందరు; ప్రీతిన్= సంతోషంతో; గీతంబులు= పాటలు; పాడన్= పాడుతుండగా; యశోదపాపండు= యశోదకొడుకయిన శ్రీకృష్ణుడు; అడవిన్= అడవిలో; తరులక్రిందను= చెట్లక్రింద; నగుచున్= నవ్వుతూ; చేతులున్+త్రిప్పుచున్= చేతులను త్రిప్పుతూ; వెడవెడ= కొంచెం కొంచెంగ; పాతరలు+ఆడును= (వారి పాటలకు అనుకూలంగా) నర్తిస్తాడు.

**తా :** ఆ ఆడవిలో చెట్ల నీడలలో గొల్లపిల్లలందరు గానం చేస్తూ ఉంటే, యశోదకొడుకయిన శ్రీకృష్ణుడు వారి పాటల కనుకూలంగా నవ్వుతూ చేతులు త్రిప్పుతూ నర్తిస్తున్నాడు.

**మ. జలజాక్షుండును రాముఁడున్ నటనముల్ సల్పంగ గోపాల మూ**
**ర్తులతో వారలఁ గొల్చు నిర్జరులు సంతోషించి, వేణుస్వనం**
**బులు గావించుచు గొమ్ము లూఁదుచు శిరంబుల్ ద్రిప్పుచుం బాడుచున్**
**వలనొప్పన్ వినుతించి రప్పుడు నటుల్ వర్ణించు చందంబునన్. 725**

**ప్రతి :** జలజ+అక్షుండును= తామరపూలవంటి కన్నులుగల శ్రీకృష్ణుడును; రాముఁడున్= బలరాముడును; నటనముల్= నాట్యాలను; సల్పన్+కన్= చేస్తూ ఉంటూ; అప్పుడు= ఆ సమయంలో; గోపాలమూర్తులతోన్= గొల్లల రూపాలతో; వారలన్= బలరామకృష్ణులను; కొల్చు నిర్జరులు= సేవించే దేవతలు; సంతోషించి; వేణుస్వనంబులు+కావించుచున్= పిల్లనగ్రోవులు ఊదుచు; కొమ్ములు+ఊఁదుచున్= కొమ్ములతో చేసిన బూరలు ఊదుతూ; శిరంబుల్= తలలు; త్రిప్పుచున్= ఆడిస్తూ; పాడుచున్= గానం చేస్తూ; వలను= నేర్పు; ఒప్పన్= వెల్లడి అగునట్లుగా; నటుల్= నటించేవారు; వర్ణించుచందంబునన్= వర్ణించునట్లుగా; వినుతించిరి= పొగడారు.

**తా :** ఆదిశేషుడు బలరాముడుగాను, శ్రీమహావిష్ణువు శ్రీకృష్ణుడుగాను భూమిమీద అవతరించారు. వారిని సేవించడం కోసం దేవతలు గోపకులుగా అవతరించారు. బలరామకృష్ణులు నాట్యం చేస్తూండగా గోపకులరూపంలో ఉండే దేవతలు సంతోషించి, వేణువులు, కొమ్ముబూరాలు ఊదుతూ, తలలు త్రిప్పుతూ నటులవలె అభినయిస్తూ బలరామకృష్ణుల్ని స్తుతిస్తారు.

## ✤ బలభద్రుండు ప్రలంబాసురుని వధించుట ✤

**వ. ఇట్లు రామకృష్ణులు నదనదీతీరంబులఁ, గొలంకుల సమీపంబుల, గిరులచఱుల, సెలయేఱుల పొంతల, మడుఁగుల చెంతలఁ, బొదల క్రేవలఁ, బసిమిగల కసవుజొంపంబులఁ బసుల మేపుచుండఁ బ్రలంబుం దను**

**రక్కసుం డుక్కు మిగిలి గోపాలరూపంబున వచ్చి వారల హింససేయం దలంచుచుండ న య్యఖిలదర్శనుం డగు సుదర్శనధరుం డెఱింగియు నెఱుంగని తెఱంగున. 726**

**ప్రతి :** ఇట్లు= ఈ ప్రకారం; రామకృష్ణులు= బలరాముదును, శ్రీకృష్ణుదును; నదనదీతీరంబులన్= నదములయొక్క, నదులయొక్క తీరాల్లో; కొలంకుల సమీపంబులన్= సరస్సుల దగ్గర; గిరులచఱులన్= కొండల చరియలలో; సెలయేఱుల పొంతలన్= కొండకాలువల సమీపంలో; మడుఁగుల చెంతలన్= లోతయిన నీరుగల మడుగుల దగ్గర; పొదలక్రేవలన్= పొదరిండ్ల ప్రక్కలను; పసిమిన్+కల కసవు జొంపంబులన్= ఆకుపచ్చని పచ్చికల గుబురుల్లో; పసులన్= పశువులను; మేపుచున్+ఉండన్= మేపుతుండగా; ప్రలంబుండు+అను రక్కసుండు= ప్రలంబుడు అనే పేరుగల రాక్షసుడు; ఉక్కుమిగిలి= బలంచేత అతిశయించి; గోపాలరూపంబునన్ వచ్చి= గొల్లవానిఆకారంతో వచ్చి; వారలన్= వారిని; హింస+చేయన్= బాధించడానికి; తలంచుచున్+ఉండన్= ఆలోచిస్తుండగా; ఆ+అఖిల దర్శనుండు+అగు సుదర్శనుండు= సమస్తమును చూచేవాడగు ఆ శ్రీకృష్ణుడు; ఎఱింగియున్= తెలిసియు; ఎఱుంగని తెఱంగునన్= తెలియని తీరున...

**తా :** ఈ విధంగా బలరామకృష్ణులు నదీనదాలు, సరస్సులు, కొండలు, సెలయేళ్లు, మడుగులు, పొదలు మొదలయినవానికి సమీపంలో ఎక్కడెక్కడ చిక్కని పచ్చికబయళ్లు ఉన్నాయో అక్కడంతా ఆవులను మేపుతున్నారు. అపుడు ప్రలంబుడు అనే పేరుగల బలవంతుడయిన రాక్షసుడు వారిని బాధించడం కోసమని గోపబాలునిరూపంలో వచ్చి, వారిలో కలిసిపోయాడు. సర్వజ్ఞుడయిన శ్రీకృష్ణుడు ఈ సంగతి తెలిసికూడ తెలియనట్టుగా

**విశే :** నదములు పడమరకు ప్రవహిస్తాయి. నదులు తూర్పునకు ప్రవహిస్తాయి.

**క. ఆ రామునిసహజన్ముఁడు, రా రమ్మని వానిఁ జీరి రాకం బోకన్
గారాముసేసి మెల్లన, పోరామి యొనర్చెఁ బిదపఁ బొరిగొనుకొఱకున్. 727**

**ప్రతి :** ఆ రామునిసహజన్ముఁడు= ఆ బలరామునికి తోడబుట్టువయిన ఆ శ్రీకృష్ణుడు; వానిన్= ఆ ప్రలంబాసురుణ్ణి; పిదపన్= పిమ్మట; పొరిగొను కొఱకున్= చంపుటకయి; రారమ్ము+అని= రమ్ము రమ్ము అని; చీరి= పిలిచి; రాకన్+పోకన్= రాక పోకలతో; గారాము+చేసి= మాలిమి చేసి; మెల్లనన్= నెమ్మదిగా; పోరామిన్= విడిచిపెట్టి వెళ్లలేకపోవునట్లు (స్నేహాన్ని); ఒనర్చెన్= చేశాడు.

**తా :** అపుడు శ్రీకృష్ణుడు ప్రలంబాసురుణ్ణి నమ్మించి చంపడంకోసం, వానితో రమ్మని, పొమ్మని ఆటలు ఆడుతూ విడవలేనట్లుగా స్నేహం చేశాడు.

**వ. ఇట్లు ప్రలంబునితోఁ జెలిమిసేయుచుఁ, గృష్ణుండు గోపాలకులకు నిట్లనియె. 728**

**ప్రతి :** కృష్ణుండు= శ్రీకృష్ణుడు; ఇట్లు= ఈ విధంగా; ప్రలంబునితోన్= గొల్లవేషంతో ఉండే ప్రలంబునితో; చెలిమిన్+చేయుచున్= స్నేహం చేస్తూ; గోపాలకులకున్= గొల్లలతో; ఇట్లు= ఈ ప్రకారంగా; అనియెన్= పలికాడు.

**తా :** శ్రీకృష్ణుడు ప్రలంబాసురునితో ఈ విధంగా స్నేహం చేస్తూ, మిగిలిన గొల్లవారితో ఈ విధంగా అన్నాడు.

**ఆ. 'మనకుఁ బ్రొద్దువోదు మన మిందఱము రెండు, గములవార మగుచుఁ గందుకముల
శిలలు గుఱులు సేసి చేరి క్రీడింతము, రండు వలయు జయపరాజయములు.' 729**

**ప్రతి :** మనకున్= మనకు; ప్రొద్దు+పోదు= కాలం గడవటం లేదు; మనము+ఇందఱమున్= మనము ఇంతమంది; చేరి= కలిసి; రెండుగములవారము= రెండు పక్షాల వాళ్లం; అగుచున్= అవుతూ; శిలలు= రాళ్లు; గుఱులు+చేసి= లక్ష్యాలుగా చేసి; కందుకములన్= బంతులతో; క్రీడింతము= ఆడుదాం; జయపరాజయములు= గెలుపు ఓటములు; వలయున్= పొందుదాం; రండు= రండి.

**తా :** మనకు కాలక్షేపం అవడం లేదు. అందుకని మనమందరం ఒకచోట చేరి, రెండు పక్షాలుగా విడిపోయి, రాళ్లను లక్ష్యాలుగా ఏర్పరచుకొని బంతు లాడుదాం. ఎవరు గెలుస్తారో, ఎవరు ఓడిపోతారో తేల్చుకొందాం రాండి.

**వ. అని యిట్లు పలికి, తానును బలభద్రుండును బెన్నుద్దులై యితరవల్లవులెల్ల నుద్దించుకొని చిఱుద్దులై వచ్చిన సమయంబున విభజించుకొని, రెండుగములవారై మార్గంబులందుఁ దృణదారుశిలాకల్పితంబులగు గుఱులొడ్డి, కందుకశిలాదిప్రక్షేపణంబుల లక్ష్యంబులఁ దాఁకవైచి, జయపరాజయనిర్ణయంబులు గైకొని, వాహ్యావాహకలక్షణంబుల జేతలను నిర్జితులు వహించి క్రీడించుచు, బలరామునికి వానిచందంబు రహస్యంబున నెఱింగించి పసుల వెల్బుచు భాండీరకం బనువటంబు సేరి; రా సమయంబునఁ గ్రీడయందు శ్రీదామనామధేయుండైన గోపకుండు శ్రీకృష్ణుని వహించె; భద్రసేనుండు వృషభు నెక్కించుకొనియె; బలభద్రుండు ప్రలంబు నారోహించె; నప్పుడు. 730**

**ప్రతి :** అని+ఇట్లు పలికి= అని ఈ విధంగా చెప్పి; తానును బలభద్రుండును= శ్రీకృష్ణుడును, బలరాముడును; పెను+ఉద్దులు= పెద్ద ఉజ్జీలు అయి; ఇతర వల్లవులు+ఎల్లను= తక్కిన గోపాలురు అందరును; చిఱు+ఉద్దులు+ఐ= చిన్న ఉజ్జీలు అయి; వచ్చిన సమయంబునన్= వచ్చిన వేళలో; విభజించుకొని= (వారిలో వారు) విడదీసికొని; రెండు గములవారు+ఐ= రెండు పక్షాలవారై; మార్గంబుల+అందున్= దారుల్లో; తృణదారుశిలా కల్పితంబులు= గడ్డితోను; కొయ్యతోను, రాళ్లతోను ఏర్పరుపబడినవి; అగుగుఱులు= అగు లక్ష్యాలను; ఒడ్డి= నిలిపి; కందుక+శిలా+ఆది ప్రక్షేపణంబులన్= బంతులు, రాళ్లు మొదలగువాటిల్ని విసరడంతో; లక్ష్యంబులన్= గురులను; తాఁకన్= తగులునట్లుగా; వైచి= విసరి; జయపరాజయ నిర్ణయంబులున్= గెలుపోటములయొక్క నిశ్చయాలను; కైకొని= అంగీకరించి; వాహ్యావాహకలక్షణంబులన్= మోయదగినవాడు మోసేవాడు అనే లక్షణాలచేత; జేతలను= నెగ్గినవారిని; నిర్జితులు= ఓడినవారు; వహించి= మోసి; క్రీడించుచున్= ఆడుతూ; బలరామునికిన్= బలరామునికి; వానిచందంబున్= ప్రలంబాసురుని తీరును; రహస్యంబునన్= గుట్టుగా; ఎఱింగించి= తెలియజెప్పి; పసులన్= పశువులను; వెల్బుచున్= తోలుతు; భాండీరకంబు+అనువటంబు= భాండీరకము అనే పేరున్న మఱ్ఱిచెట్టును; చేరి= సమీపించారు; ఆ సమయంబునన్= ఆ సమయంలో; క్రీడ+అందున్= ఆటలో; శ్రీదామనామధేయుండు+ఐన= శ్రీదాముడు అను పేరుగలవాడైన గోపాలుడు; శ్రీకృష్ణునిన్= శ్రీకృష్ణుణ్ణి; వహించెన్= ఎత్తుకొని మోసెను; భద్రసేనుండు= భద్రసేనుడు; వృషభుని= వృషభుడు అనువాణ్ణి; ఎక్కించుకొనియెన్= భుజములమీదికి ఎక్కించుకొన్నాడు; బలభద్రుండున్= బలరాముడును; ప్రలంబున్=ప్రలంబుణ్ణి (రాక్షసుని); ఆరోహించెన్= మీదికెక్కాడు; అప్పుడు= ఆ సమయంలో...

**తా :** ఈ రీతిగా అనుకొని శ్రీకృష్ణుడు బలరాముడు చెరొక పక్షానికి ముఖ్యనాయకులుగా నిలబడ్డారు. మిగిలిన గొల్లపిల్లలందరు రెండు చిన్న జట్లుగా చీలి, ఆ యిద్దరివైపు చేరారు. గడ్డితో, కొయ్యలతో, రాళ్లతో లక్ష్యాలు ఏర్పరచుకొని, వాటిల్ని బంతులతోను, రాళ్లతోను కొడుతూ, కొట్టినవారు నెగ్గినట్లు, కొట్టలేనివారు ఓడినట్లు నిర్ణయం చేసికొన్నారు. ఓడినవారు నెగ్గిన వారిని భుజాలమీదికి

ఎక్కించుకొని మోయాలి. ఇదే ఆటతీరు! ఈ విధంగా ఆడుతున్నారు. అపుడు శ్రీకృష్ణుడు బలరాముడికి ప్రలంబాసురుడు మారువేషంతో వచ్చి తమలో ఒకడుగా చేరిన విషయం రహస్యంగా చెప్పాడు. గొల్లలంతా ఆవుల్ని తోలుకొంటూ వెళ్లి 'భాండీరకము' అనే పేరుగల మఱ్ఱిచెట్టు క్రిందికి చేరారు. ఆటలో ఓడిన శ్రీదాముడు నెగ్గిన శ్రీకృష్ణుణ్ణి, అలాగే భద్రసేనుడు వృషభుణ్ణి, ప్రలంబాసురుడు బలరాముణ్ణి భుజాలమీది కెక్కించుకొని మోస్తున్నారు. ఆ సమయంలో

**మ. 'వనజాక్షున్ బలిమిన్ బలాఢ్యుఁడు దృణావర్తుండు మున్ మింటికిం**
**గొనిపోఁ జాలక చిక్కినాఁ డితని నాకున్ మోవరా' దంచు నా**
**దనుజారిన్ గొనిపోఁ దలంపక వడిన్ దైత్యేశుఁ డయ్యాటలోఁ**
**గొనిపోయెన్ గిరి దాఁటి రాము నఖిలక్రూరక్షయోద్దామునిన్. 731**

**ప్రతి :** మున్= పూర్వం; బల+ఆఢ్యుఁడు= బలసంపన్నుడయిన; తృణావర్తుండు= తృణావర్తుడు అనే రాక్షసుడు; వనజ+అక్షున్= పద్మములవంటి కన్నులుగల శ్రీకృష్ణుణ్ణి; మింటికిన్= ఆకాశానికి; కొనిపోన్+చాలక= తీసికొనిపోలేక; చిక్కినాఁడు= లొంగిపోయినాడు (కావున); నాకున్= నాకు; ఇతనిన్= శ్రీకృష్ణుణ్ణి; మోవన్+రాదు= మోయడం శక్యం కాదు. అంచున్= అని ఆలోచించుకొనుచు; ఆ దనుజ+అరిన్= రాక్షసాంతకుడైన ఆ శ్రీకృష్ణుణ్ణి; కొనిపోన్= తీసుకొనిపోడానికి; తలంపక= ఆలోచింపక; దైత్య+ఈశుఁడు= రాక్షసరాజైన ఆ ప్రలంబుడు; ఆ+ఆటలోన్= ఆ క్రీడలో; అఖిల= సమస్తమయిన; క్రూర= దుర్మార్గులయొక్క; క్షయ= నాశనం చేయడంలో; ఉద్దామునిన్= అడ్డులేనివాణ్ణి; రామున్= బలరాముణ్ణి; గిరిన్= కొండను; దాఁటి= అతిక్రమించి; వడిన్= వేగంగా; కొనిపోయెన్= ఎత్తుకొనిపోయాడు.

**తా :** పూర్వం మహాబలవంతుడయిన తృణావర్తుడు శ్రీకృష్ణుణ్ణి సంహరించాలని వచ్చి అతణ్ణి ఆకాశంలోనికి ఎత్తుకొనిపోయి, భరించలేక చివరికి అతనిచేతిలోనే ప్రాణాలు విడిచిపెట్టాడు. కాబట్టి శ్రీకృష్ణుణ్ణి ఎత్తుకొనిపోవడం తెలివైన పని కాదని భావించి, రాక్షసాంతకుడైన బలరాముణ్ణి తేలికగా చంపవచ్చని ప్రలంబాసురుడు అనుకొని అతణ్ణి కొండ దాటించి తీసుకొనిపోయాడు.

**వ. ఇట్లు క్రీడాకల్పితవాహనుండైన ప్రలంబుండు బలభద్రునిం గొనిపోవుచు. 732**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; క్రీడాకల్పితవాహనుండు= ఆటయందు ఏర్పరుపబడిన వాహనమైనవాడు; అయిన ప్రలంబుండు= అయినటువంటి ప్రలంబాసురుడు; బలభద్రునిన్= బలరాముణ్ణి; కొనిపోవుచున్= తీసుకొనిపోతూ...

**తా :** ఈ విధంగా ఆటకోసం వాహనంగా మారిన ప్రలంబాసురుడు బలరాముణ్ణి తీసుకొనిపోతూ ఉండగా

**మ. గురుశైలేంద్రసమానభారుఁ డగు నా గోపాలకున్ మోవ లే**
**క రయోద్రేకము మాని దైత్యుఁడు నరాకారంబు సాలించి భీ**
**కరదైత్యాకృతి నేగె హేమకటకాకల్పంబుతో రాముతో**
**మురు వొప్పంగఁ దటిల్లతేందుయుతజీమూతంబుచందంబునన్. 733**

**ప్రతి :** దైత్యుఁడు= ఆ ప్రలంబాసురుడు; గురు= గొప్పదైన; శైల+ఇంద్ర= పర్వతరాజంతో; సమాన= సమానమగు; భారుఁడు= బరువుగలవాడు; అగు+ఆ గోపాలకున్= అయినట్టి గొల్లవాడయిన ఆ బలరాముణ్ణి; మోవన్+లేక= మోయలేక;

రయ+ఉద్రేకమున్= వేగంయొక్క విజృంభణాన్ని; మాని= విడిచి; నర+ఆకారంబున్= మానవరూపాన్ని; చాలించి= విడిచిపెట్టి; భీకరదైత్య+ఆకృతిన్= భయంకరమైన రాక్షసరూపంతో; హేమకటక+ఆకల్పంబుతోన్= బంగారు కడియాలు అనే ఆభరణాలు గల్గినవాడైన; రాముతోన్= బలరామునితో; మురువు+ఒప్పంగన్= చక్కదనం ప్రకాశించేట్టుగా; తటిత్+లతా= మెరుపుతీగలతోను; ఇందు= చంద్రునితోను; యుత= కూడినట్టి; జీమూతంబుచందంబునన్= మేఘంవలె; (ఆ రాక్షసుడు) ఏగెన్= వెళ్లాడు.

**తా :** ప్రలంబాసురుడు బలరాముణ్ణి మోసికొని పోతూ ఉండగా బలరాముడు మహాపర్వతమంత బరువు పెరిగినాడు. బలరాముణ్ణి మోయలేక రాక్షసుని గమనవేగం తగ్గింది. దానితో ఇంక లాభం లేదని వాడు మానవరూపం విడిచిపెట్టి తనదైన భయంకరమైన రాక్షసరూపం ధరించాడు. బంగారు కడియాలతో అలంకరింపబడి, మెరుపుతీగలతోకూడిన చంద్రబింబంలాగా ప్రకాశిస్తున్న బలరాముణ్ణి ఎత్తుకొని, ఆ రాక్షసుడు నీలిమేఘంలాగా కన్పిస్తూ వెళ్లాడు.

**ఉ. మోసము లేక వాని పెనుమూఁపున నుండుచు నా హలాయుధుం**
**డా సమయంబునం గనియె హాటకరత్నకిరీటకుండలో**
**ద్భాసితమస్తకున్ భ్రుకుటిభాసురదారుణనేత్రు నుగ్ర దం**
**ష్ట్రాసహితుం బ్రలంబు నురుశౌర్యవిలంబు మదావలంబునిన్. 734**

**ప్రతి :** ఆ హల+ఆయుధుండు= నాగలి ఆయుధముగా కలిగిన ఆ బలరాముడు; వాని పెనుమూఁపునన్= పెద్దది అయిన వాని భుజాగ్రంలో; మోసములేక= ఏమరుపాటు లేకుండగా; ఉండుచున్= కూర్చుండిన; ఆ సమయంబునన్= అప్పుడు; హాటక= బంగారు (మయమైన); రత్న= రత్నాలతో కూడినవి అగు; కిరీట= కిరీటంతో; కుండల= కర్ణాభరణాలతో; ఉత్+భాసిత= మిక్కిలి ప్రకాశించే; మస్తకున్= శిరస్సుగలవాణ్ణి; భ్రుకుటి= బొమముడిచేత; భాసుర= ప్రకాశించే; దారుణ= భయంకరమైన; నేత్రున్= కన్నులుగలవాణ్ణి; ఉగ్రదంష్ట్రాసహితున్= భయంకరమైన కోరలతో కూడినవాణ్ణి; ఉరుశౌర్యవిలంబున్= మహాపరాక్రమంతో మిడిసిపడేవాణ్ణి; మద+అవలంబునిన్= గర్వానికి ఆశ్రయమైనవాణ్ణి అయిన; ప్రలంబున్= ప్రలంబాసురుని; కనియెన్= చూశాడు.

**తా :** ఆ ప్రలంబాసురుని మూపుమీద బలరాముడు ఏమరుపాటుకు లేకుండ కూర్చుండి, వాణ్ణే గమనిస్తున్నాడు. బంగారంతో చేసిన రత్నాలు పొదిగిన కిరీటంతోను, చెవులకు పెట్టుకొన్న కుండలాలతోను వాని శిరస్సు ప్రకాశిస్తోంది. బొమముడితో కూడిన కళ్లు, నోటిలో కోరలు భయంకరంగా కనబడుతున్నాయి. పొగరెక్కి పరాక్రమానికి నిలయమా అన్నట్లుగా ఉన్నాడు.

**వ. కని నక్తంచరుం డని యించుక శంకించి వెఱవక. 735**

**ప్రతి :** కని= చూచి; నక్తంచరుండు= రాక్షసుడు (రాత్రులందు చరించేవాడు); అని ఇంచుకన్= అంటూ కొంచెం; శంకించి= సందేహించి; వెఱవక= భయపడకుండా...

**తా :** బలరాముడు చూశాడు. వీడు రాక్షసుడా అని సందేహించాడు. అయినా భయపడకుండా

**క. కడువడిఁ దను దివికిం గొని, వడిఁ జనియెడు దనుజశిరము వ్రయ్య హలధరుం**
**డదరి పటుచటులతర మగు, పిడికిట వెస విసిరి పొడిచె బిఱుసున నలుకన్. 736**

**ప్రతి :** హలధరుండు= నాగలిని ధరించునట్టి బలరాముడు; కడువడిన్= అతివేగంగా; అదరి= విజృంభించి; తనున్= తనను; దివికిన్= ఆకాశంవైపునకు; కొని= గ్రహించి; వడిన్= వేగంగా; చనియెడు దనుజశిరము= పోవునట్టి రాక్షసునియొక్క

శిరస్సు; వ్రయ్యన్= పగులునట్లుగా; పటుచటులతరము= మిక్కిలి దృఢమైన; అగుపిడికిటన్= అయినట్టి పిడికిలితో; వెసన్= శీఘ్రంగా; విసరి= ప్రయోగించి; బిఱుసునన్= కఠినంగా; అలుకన్= కోపంతోను; పొడిచెన్= పొడిచాడు.

**తా :** ఆ బలరాముడు తనను ఆకాశంలో వేగంగా తీసికొనిపోయే ప్రలంబుడితల పగిలేలా వెంటనే గట్టిగా వేగంగా బలంగా పిడికిలితో పొడిచాడు.

**క. హలధరుబలుపిడికిటి హతిఁ, దల పగిలిన రుధిరజలము దనువివరములం**
**దొలఁక మొఱయిడుచు దనుజుఁడు, బలరిపుపవినిహతనగముపగిదిం బడియెన్. 737**

**ప్రతి :** హలధరు= నాగలిని ధరించిన బలరామునియొక్క; బలు= బలమైన; పిడికిలి= పిడికిలియొక్క; హతిన్= దెబ్బతో; తలపగిలినన్= తలపగిలిపోగా; తనువివరములన్= శరీరంలోని నవరంధ్రాలనుండి; రుధిరజలము= నెత్తురు; తొలఁకన్= ప్రవహిస్తుండగా; మొఱ+ఇడుచున్= మొర్రోయని అరుస్తూ; దనుజుఁడు= ప్రలంబాసురుడు; బలరిపు= బలాసురుణ్ణి సంహరించిన ఇంద్రునియొక్క; పవి= వజ్రాయుధంతో; నిహత= కొట్టబడ్డ; నగముపగిదిన్= కొండవలె; పడియెన్= కూలిపోయింది.

**తా :** బలరాముని పిడికిటిపోటుతో ప్రలంబాసురుని తల పగిలింది. శరీరంలో ఉన్న కన్ను ముక్కు మొదలయిన నరవరంధ్రాలనుండి నెత్తురుకారింది. చివరకు వాడు మొర్రో అని అరుస్తూ – దేవేంద్రుడు వజ్రాయుధంతో కొట్టడంచేత కూలిన పర్వతంలాగ నేలకూలాడు.

**మత్తకోకిలము.**

**'మేలు మేలు గదయ్య! రాముఁడు మేటిరక్కసు నొక్కఁడున్**
**నేలఁ గూలిచె నొక్కపోటున నేఁడు విస్మయ' మంచు గో**
**పాలకుల్ గని చచ్చి వచ్చిన భ్రాతఁ గన్న విధంబునం**
**జాల దీవన లిచ్చి రాముని సత్కరించిరి వేడుకన్. 738**

**ప్రతి :** గోపాలకుల్= గొల్లవారు; కని= ఈ దృశ్యం చూచి; మేలు మేలు కదు+అయ్య= బాగు బాగు కదయ్య; నేఁడు= ఈ వేళ; రాముఁడు= బలరాముడు; ఒక్కఁడున్= వేరెవరి సహాయం లేకుండ ఒక్కడే; మేటి రక్కసున్= బలవంతుడయిన రాక్షసుణ్ణి; ఒక్కపోటునన్= ఒక్కదెబ్బతో; నేలన్+కూలిచెన్= చంపాడు; విస్మయము= (ఇది ఎంత) ఆశ్చర్యకరం; అంచున్= అంటూ; చచ్చి వచ్చిన భ్రాతన్= చచ్చి బతికి వచ్చిన సోదరుణ్ణి; కన్నవిధంబునన్= చూచిన విధంగా; చాలదీవనలు+ఇచ్చి= ఎన్నో దీవెనలు పలికి; రామునిన్= బలరాముణ్ణి; వేడుకన్= సంతోషంతో; సత్కరించిరి= గౌరవించారు.

**తా :** ఆ గొల్లవారు ఈ సంఘటన చూచి 'బలే! బలే! మన బలరాముడు ఒంటరిగా చాలా బలవంతుడైన రాక్షసుణ్ణి ఒక్కదెబ్బతో చంపేశాడు. ఇది ఎంత ఆశ్చర్యకరం' అనుకున్నారు. ఏ దెబ్బ తినకుండా వచ్చిన బలరాముణ్ణి చూచి, చచ్చిన తమ తోబుట్టువు బ్రతికి వస్తే ఎలా సంతోషిస్తారో అలా సంతోషించారు. అతణ్ణి సత్కరించి ఎన్నో దీవెనలిచ్చారు.

**క. బలవంతుఁ డగు ప్రలంబుఁడు, బలుముష్టిన్ నిహతుఁడైన బ్రదికితి మనుచున్**
**బలసూదనాది దివిజులు, బలుపైఁ గుసుమములవానఁ బరఁగించి రొగిన్. 739**

**ప్రతి :** బలవంతుఁడు= బలం కలవాడు; అగు ప్రలంబుఁడు= అయిన ప్రలంబాసురుడు; బలుముష్టిన్= బలరాముని పిడికిలి పోటుకు; నిహతుఁడు= చచ్చినవాడు; ఐనన్= ఐనందువలన; బ్రదికితిమి+అనుచున్= బ్రతికిపోతిమి అంటూ; బలసూదన+ఆదిదివిజులు= ఇంద్రాదిదేవతలు; బలుపైన్= బలరామునిమీద; కుసుమములవానన్= పూలవానను; ఒగిన్= బాగుగా; పరఁగించిరి= కురిపించారు.

**తా :** బలవంతుడయిన ప్రలంబాసురుడు బలరాముని పిడికిలిపోటుతో చచ్చాడు. ఇంక మనం సుఖంగా బ్రతుకవచ్చు నని ఇంద్రాది దేవతలందరూ సంతోషంతో బలరాముని మీద పూలవాన కురిపించారు.

## ✤ శ్రీకృష్ణుఁడు దావాగ్నిని మ్రింగి గోగోపకసంఘమును కాపాడుట ✤

**వ. ఇట్లు గోపకులు క్రీడింప గోవు లంతంతఁ గాంతారంబున వింత కసవులు మెసవుచు, మేఁతవడి నొండడవికి దూరంబు సని యందు దవదహనపవన సంస్పర్శంబు సైరింపక కంపించి దప్పినొప్పు సెడి ఘోషించిన. 740**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; గోపకులు= గొల్లవారు; క్రీడింపన్= ఆడుకొంటుండగా; గోవులు= ఆవులు; అంత+అంతన్= అక్కడక్కడ; కాంతారంబునన్= అడవిలో; వింత కసవులు= వేరు వేరు పచ్చికలు; మెసవుచున్= మేస్తూ; మేఁతవడిన్= మేయునట్టి తొందరలో; ఒండు+అడవికిన్= వేరొక అడవికి; దూరంబు+చని= దూరంగా వెళ్లి; అందున్= ఆ దూరపుటడవిలో; దవదహన= కార్చిచ్చువల్ల కలిగిన; పవన= గాడ్పుయొక్క; సంస్పర్శంబున్= తాకిడిని; సైరింపక= సహింపలేక; కంపించి= వణకి; దప్పిన్= దాహంచేత; ఒప్పు+చెడి= నీరసించి; ఘోషించినన్= పెద్ద పెట్టున అరవగా...

**తా :** ఈ విధంగా గోపాలురు ఆటల సందడిలో మునిగి ఉండగా, ఆవులు ఆ అడవిలో ఉన్న రకరకాల పచ్చికలు మేస్తూ మేస్తూ దూరంగా ఉన్న మరొక అడవిలో ప్రవేశించాయి. అంతలో అక్కడ కార్చిచ్చు చెలరేగింది. ఆ వేడికి అవి తట్టుకోలేక వణికిపోయి, దాహంతో అంబారవాలు చేస్తూ ఆక్రోశించగా

**శా. ఆ గోపాలకు లందఱుం బసుల కుయ్యాలించి కౌమార కే**
**ళీగాఢత్వము మాని గోఖురరదాళిచ్ఛిన్నఘాసంబుతో**
**బాగై యున్న పథంబునం జని దవాపన్నంబు గాకుండ వే**
**వేగన్ గోగణమున్ మరల్చి రటవీవీథిన్ జవం బొప్పఁగన్. 741**

**ప్రతి :** ఆ గోపాలకులు+అందఱున్= ఆ గొల్ల పిల్లలందరును; పసులకుయ్యి= ఆవులమొరను; ఆలించి= విని; కౌమార కేళీగాఢత్వమున్= బాల్యముచేతనయిన ఆటలయందలి ఆసక్తిని; మాని= విడిచి; గోఖుర= ఆవుల గిట్టలయొక్కయు; రద= దంతములయొక్కయు; ఆళి= వరుసలచేత; ఛిన్న= ముక్కలు చేయబడ్డ; ఘాసంబుతోన్= పచ్చికతో; బాగు+ఐ= చక్కనిదయి; ఉన్న పథంబునన్= ఉన్నట్టి దారిలో; చని= వెళ్లి; గోగణమున్= ఆవులమందను; దవ+ఆపన్నంబున్= కార్చిచ్చువల్ల ఆపదను; కాక+ఉండన్= పొందకుండునట్లుగా; వేవేగన్= మిక్కిలి వడిగా; జవంబు= తొందర; ఒప్పన్= ఒప్పునట్లుగా; అటవీవీథిన్= అడవినుండి; మరల్చిరి= మళ్లించిరి.

**తా :** ఆ గొల్లకుఱ్ఱవాళ్లు అందరూ ఆర్తిగావున్న ఆవుల మొరలను ఆలకించారు. కుఱ్ఱతనంచేత నిమగ్నమైన ఆటలలోని ఆసక్తిని విడిచిపెట్టి, ఆవులున్న చోటుకి వేగంగా బయలుదేరారు. ఆవుల కాళ్లగిట్టల చేత నలిగి, దంతాలచేత కొరకబడి దారిలోపడి

ఉన్న గడ్డి తునుకల ఆనవాళ్లనుబట్టి వెంటనే ఆ ఆవులు వెళ్లినదారిలో వెళ్లి, దావాగ్ని అంటుకున్న అడవినుండి మంచిచోటుకి ఆవుల్ని నేర్పుతో మళ్లించారు.

**క. జలధరగభీరరవమున, నలినదళాక్షుండు దమ్ము నామాంకములం**
**బిలిచిన విని ప్రతిఘోషణ, ములు సేయుచుఁ బసులు దిరిగె ముదమున నధిపా! 742**

**ప్రతి :** అధిపా!= ఓ పరీక్షిన్మహారాజా!; నలినదళ+అక్షుండు= తామరరేకులవంటి కన్నులుగల శ్రీకృష్ణుడు; జలధర= మేఘాలయొక్క; గభీర= గంభీరమయిన; రవమునన్= ధ్వనితో; తమ్మున్= తమను (ఆవులను); నామ+అంకములన్= వాటి పేరుల గుర్తులతో; పిలిచినన్= పిలువగా; విని= (ఆవులు) విని; ప్రతిఘోషణములు చేయుచున్= ప్రతిధ్వనులుచేస్తూ (అంబా, అంటూ); పసులు= ఆవులు; ముదమునన్= సంతోషంతో; తిరిగెను= మళ్లాయి.

**తా :** శ్రీకృష్ణుడు ఉరుమువంటి గంభీర ధ్వనితో ఆవుల్ని పేరుపేరున పిలిచాడు. ఆ పిలుపులకు 'అంబా' అని మారుపలుకుతూ ఆ ఆవులన్నీ వెనక్కు మళ్లాయి.

**వ. అంత న వ్వనంబున దైవయోగంబునం బుట్టిన కార్చిచ్చు బిట్టు విసరెడి కరువలివలన మిన్నుముట్ట మిట్టిపడి గట్టు చెట్టనక దరికొని, యట్టె క్రాలుచుఁ జుట్టుకొని, పఱవం గని పల్లటిల్లిన యుల్లంబులతో వల్లవు లెల్లఁ దల్ల డిల్లి సబలుండైన హరికి మృత్యుభీతులరీతిం జక్క మ్రొక్కి యిట్లనిరి. 743**

**ప్రతి :** అంతన్= అప్పుడు; ఆ+వనంబునన్= ఆ అడవియందు; దైవయోగంబునన్= విధి వశంవల్ల; పుట్టిన కార్చిచ్చు= పుట్టినట్టి దావాగ్ని; బిట్టువిసరెడి= మిక్కిలి వేగంగా వీచునట్టి; కరువలి వలనన్= గాలివల్ల; మిన్నుముట్టన్= ఆకాశం తాకునట్లుగా; మిట్టిపడి= పైకెగసి; గట్టు చెట్టు= ఇది కొండ ఇది చెట్టు; అనక= అనే తారతమ్యం లేక; దరికొని= రగులుకొని; అట్టు+ఏ క్రాలుచున్= శీఘ్రంగా కమ్ముకొని; చుట్టుకొని= అడవిని నాలుగువైపుల ఆక్రమించి; పఱవన్= వ్యాపించగా; కని= చూచి; వల్లవులు+ఎల్లన్= గొల్లపిల్లలందరును; పల్లటిల్లిన+ఉల్లంబులతోన్= చలించిన మనస్సులతో; తల్లడిల్లి= మిక్కిలి భయపడి; మృత్యుభీతులరీతిన్= చావుకు భయపడినవారివలె; సబలుండు+ఐన హరికిన్= బలరామునితో కూడిన శ్రీకృష్ణునికి; చక్కన్= సాగిలబడి; మ్రొక్కి= నమస్కరించి; ఇట్లు= ఈ ప్రకారంగా; అనిరి= విన్నవించారు.

**తా :** ఆ అడవిలో విధివశంవల్ల పుట్టిన కార్చిచ్చు, గాలితీవ్రతకు ప్రజ్వరిల్లి ఆకాశాన్ని అంటుతోంది. కొండలు చెట్లు అనే తేడా లేకుండా అన్నింటినీ కాల్చివేస్తూ అన్ని వైపులా అలము కొంది. అది చూచి గొల్లపిల్లల గుండెలు గుభిల్లుమన్నాయి. చచ్చిపోతామేమో అని భయం పట్టుకున్నది. బలరామునితో కలిసి ఉండే శ్రీకృష్ణునికి సాష్టాంగపడుతూ నమస్కరించి, వారు ఈ విధంగా విన్నవించారు.

**క. అభ్రంకషధూమాయిత, విభ్రాంతమహాస్ఫులింగవిసరోగ్రశిఖా**
**విభ్రష్టదగ్ధలోకా, దభ్రంబై వచ్చెఁ జూడు దవశిఖి కృష్ణా! 744**

**ప్రతి :** కృష్ణా!= శ్రీకృష్ణా; అభ్రంకష= ఆకాశాన్ని ఒరుసుకొంటున్న; ధూమ= పొగచేత; ఆయిత= అంతట వ్యాపించిన; విభ్రాంత= వెరపును కలిగించే; మహాస్ఫులింగ= పెద్ద పెద్ద అగ్నికణముల యొక్క; విసర= సమూహములతో; ఉగ్ర= భయంకరమయిన; శిఖా= మంటలచేత; విభ్రష్ట= మిక్కిలి చెడిన; దగ్ధ= కాల్చబడిన; లోక= లోకములు కలదగుటచేత; అదభ్రంబు+ఐ= హెచ్చిందయి; దవశిఖి= దావానలం; వచ్చెన్= (మాపైకి) వచ్చింది; చూడు= చూడుము.

**తా :** ఓ కృష్ణా! చూడు. ఆ కార్చిచ్చు తన పొగలతో ఆకాశాన్ని ఆవరించింది. భయంకరంగా పెద్ద పెద్ద నిప్పురవ్వల్ని విరజిమ్ముతోంది. పెద్ద పెద్దమంటలు పైపైకి ఎగసి లోకాలన్నిటినీ కాల్చి పారేస్తున్నాయా అన్నట్లుగా ఉన్నాయి.

**శా. నీ చుట్టాలకు నాపదల్ గలుగునే! నే మెల్ల నీవార; మ**
**న్యాచారంబు లెఱుంగ, మీశుఁడవు మా; కాభీలదావాగ్ని నేఁ**
**డే చందంబున నింక దాఁటుదుము? మమ్మీక్షించి రక్షింప వ**
**న్నా! చంద్రాభ! విపన్నులన్ శిఖివితానచ్ఛన్నులన్ ఖిన్నులన్. 745**

**ప్రతి :** అన్నా= తండ్రీ; చంద్ర+ఆభ= చంద్రునివలె ఆహ్లాదకరుడవైన శ్రీకృష్ణా; నీ చుట్టాలకున్= నీ బంధువులకు; ఆపదల్= కష్టాలు; కలుగున్+ఏ= కలుగునా (కలుగవు); నేము+ఎల్లన్= మేమందరము; నీవారము= నీ చుట్టాలం; అన్య+ఆచారంబులు= నిన్ను సేవించడంకంటె వేరయిన ప్రవర్తనలను; ఎఱుంగము= తెలియము; మాకున్= మాకు; ఈశుఁడవు= ప్రభుడవు; నేఁడు= ఈనాడు; ఆభీలదావ+అగ్నిన్= భయంకరమైన (ఈ) కార్చిచ్చును; ఇంకన్= ఇంకమీదట; ఏచందంబునన్= ఏ తీరున; దాఁటుదుము= దాటగలం; విపన్నులన్= ఆపదనొందినవారిని; శిఖివితానచ్ఛన్నులన్= నిప్పుల కుప్పలచే కప్పబడినవారిని; ఖిన్నులన్= ఖేదమునొందినవారిని; మమ్ము= మమ్మల్ని; ఈక్షించి= చూచి; రక్షింపవు= రక్షింపవా (రక్షించు).

**తా :** చంద్రునివలె చల్లనివాడవయి ఆహ్లాదం కలిగించే కృష్ణా! తండ్రీ! నీ బంధువులకు కష్టాలు కలుగవు కదా! మేమంతా నీ బంధువులమే కదా! నీ సేవ చేయడం తప్ప మాకు ఇంకేమీ తెలియదే. కానీ నేడేమిటి ఈ దురవస్థ? ఈ కార్చిచ్చు నుండి ఎలా బయటపడగలం? అన్నివైపులా మంటలు కమ్ముకొనడంచేత ఆపదనొంది అలమటించే మమ్మల్ని చూచి రక్షించుము.

**వ. అని విన్నవించి రంత. 746**

**ప్రతి :** అని= ఈ విధంగా; విన్నవించిరి= విజ్ఞాపన చేశారు; అంతన్= అపుడు...

**తా :** ఈ విధంగా గొల్లపిల్లలంతా కృష్ణుని ప్రార్థించారు. ఆ తర్వాత

**ఉ. బంధుజనంబుచేత నిటు ప్రార్థితుఁడై హరి విశ్వరూపుఁ డో**
**బంధువులార! మీ నయనపంకజముల్ ముకుళింపుఁ డగ్ని నీ**
**సంధి నడంతు నే ననినఁ జక్కన వారలు నట్ల చేయుడున్**
**బంధురదావపావకముఁ బట్టి ముఖంబునఁ ద్రావె లీలతోన్. 747**

**ప్రతి :** విశ్వరూపుఁడు= విశ్వమే (తన) రూపంగా గలవాడగు; హరి= శ్రీకృష్ణుడు; బంధుజనంబుచేతన్= చుట్టాలయిన గొల్లవారిచేత; ఇటు= ఈ రీతిగా; ప్రార్థితుఁడు+ఐ= ప్రార్థింపబడినవాడై; ఓ బంధువులార= ఓ చుట్టములార; మీ నయనపంకజముల్= తామరపూలవంటి మీ కన్నుల్ని; ముకుళింపుఁడు= మూసుకొనండి; ఏను= నేను; ఈ సంధిన్= ఈ నడుమగల; అగ్నిన్= కార్చిచ్చును; అడంతును= అణచివేస్తాను; అనినన్= అని పలుకగా; వారలు= ఆ గొల్లలు; చక్కనన్= వెంటనే; అట్ల చేయుడున్= ఆ విధంగా చేయగా; బంధురదావపావకమున్= పెచ్చుమీరిన కార్చిచ్చును; పట్టి= ఒడిసిపట్టి; లీలతోన్= సవిలాసంగా; ముఖంబునన్= నోటితో; త్రావెన్= త్రాగాడు.

**తా :** చుట్టాలయిన గొల్లవారందరు శ్రీకృష్ణుణ్ణి ఈ విధంగా ప్రార్థించారు. విశ్వమంతా తన రూపమే అయిన శ్రీకృష్ణుడు వారితో 'బంధువులార మీరు మీ కళ్లు మూసుకోండి. తిరిగి తెరిచే లోపున ఈ కార్చిచ్చును అణచివేస్తాను' అని అన్నాడు. గొల్లలంతా అలాగే చేశారు. శ్రీకృష్ణుడు పెచ్చుపెరిగిన కార్చిచ్చును పట్టుకొని వేడుకగా నోటితో త్రాగేశాడు.

**వ. ఇట్లు నిజయోగవైభవంబున దావదహనంబు పానంబు సేసి నిమిషమాత్రంబున గోపకుల నందఱ భాండీరకవటసమీపంబునకుం దెచ్చి విడిచిన వారు వికసితనయనకమలు లయి కృష్ణునియోగమాయా ప్రభావంబున నెరగలి చిచ్చు ప్రగ్గె నని యగ్గించుచుఁ దమ మనంబులందు. 748**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; నిజయోగ వైభవంబునన్= తన యోగమహిమచేత; దావదహనంబున్= కార్చిచ్చును; పానంబు+చేసి= త్రాగి; నిమిషమాత్రంబునన్= రెప్పపాటు కాలంలో; గోపకులన్+అందఱన్= ఆ గొల్లవారినందరిని; భాండీరక వటసమీపంబునకున్= భాండీరకం అనే మఱ్ఱిచెట్టు వద్దకు; తెచ్చి= చేర్చి; విడిచినన్= విడువగా; వారు= ఆ గొల్లవారు; వికసిత నయనకమలులు+అయి= ఆరవిచ్చిన తామరలవంటి కన్నులు కలవారు అయి; కృష్ణునియోగమాయా ప్రభావంబునన్= శ్రీకృష్ణుని యోగమాయగొప్పతనంచేత; ఎరగలి చిచ్చు= కార్చిచ్చు; ప్రగ్గెన్+అని= అణగింది అని; అగ్గించుచున్= (కృష్ణుని) ప్రశంసిస్తూ; తమ మనంబుల+అందున్= తమ మనస్సులలో...

**తా :** శ్రీకృష్ణుడు ఈ విధంగా తన యోగమహిమచేత కార్చిచ్చును త్రాగివేసి ఆ గొల్లవారందరిని నిమిషంలో భాండీరకమనే పేరుగల వటవృక్షం క్రిందికి చేర్చాడు. ప్రశాంతంగా ఉన్న ఆ ప్రదేశాన్ని కళ్లారా చూస్తూ వారు శ్రీకృష్ణునియోగశక్తివల్ల కార్చిచ్చు అణగిపోయింది గదా! అని అతణ్ణి ప్రశంసిస్తూ, తమ మనస్సులలో...

**క. 'కార్చి చ్చార్చుపటుత్వము, నేర్చునె నరుఁ డొకఁడు? శౌరి నేఁ డిదె కార్చి**
**చ్చార్చి మనల రక్షింపఁగ, నేర్చె నితం డజుఁడొ హరియొ నిటలాక్షుండో!' 749**

**ప్రతి :** నరుఁడు+ఒకఁడు= ఒక సామాన్య మానవుడు; కార్చిచ్చున్= దావాగ్నిని; ఆర్చుపటుత్వము= ఆర్పివేయునట్టి సామర్థ్యమును; నేర్చున్+ఎ= కలిగి ఉండునా (ఉండడు అని భావం); నేఁడు= ఈనాడు; ఇది+ఎ= ఇదిగో; శౌరి= శ్రీకృష్ణుడు; కార్చిచ్చు+ఆర్చి= దావాగ్నిని ఆర్పివేసి; మనలన్= మనల్ని; రక్షింపన్+కన్+నేర్చెను= రక్షించగలిగినాడు; ఇతండు= ఈ కృష్ణుడు; అజుఁడు+ఒ= బ్రహ్మయో; హరి+ఒ= విష్ణువో; నిటల+అక్షుండు+ఓ= నుదుట కన్నుగల రుద్రుడో...

**తా :** 'ఒక సామాన్య మానవునికి ఇటువంటి దావాగ్నిని ఆర్పివేసే శక్తి ఉంటుందా? ఈ వేళ శ్రీకృష్ణుడు ఈ కార్చిచ్చును ఆర్పివేసి మనల్ని అందరినీ రక్షించాడు. ఇతడు మామూలు గొల్లపిల్లవాడు కాదు. బ్రహ్మగాని విష్ణువుగాని, రుద్రుడుగాని అయ్యుంటాడు' అని ఆ గొల్లపిల్లలందరు తమ తమ మనస్సులలో

**వ. అని వితర్కించి రంతఁ గృష్ణుండు సాయాహ్నసమయంబున రామసహితుండై వంశనాళంబు పూరించుచు గోపగణజేగీయమానుండై గోష్ఠంబు ప్రవేశించె నప్పుడు. 750**

**ప్రతి :** (గోపబాలకులు) అని= ఇట్లు; వితర్కించిరి= ఊహించిరి; అంతన్= అపుడు; కృష్ణుండు= శ్రీకృష్ణుడు; సాయ+అహ్న సమయంబునన్= సాయంకాలంలో; రామసహితుండు+ఐ= బలరామునితో కూడినవాడయి; వంశనాళంబున్= వేణువును; పూరించుచున్= ఊదుతూ; గోపగణ జేగీయ మానుండు= గొల్లవారిచే కీర్తించబడుతున్నవాడు; ఐ= అయి; గోష్ఠంబున్= మందలో; ప్రవేశించెన్= ప్రవేశించాడు; అప్పుడు= ఆ సమయంలో...

**తా :** ఈ విధంగా గొల్లపిల్లలు ఊహించారు. సాయంకాలం శ్రీకృష్ణుడు బలరామునితో కలిసి, వేణువు ఊదుతూ, వారిచే ప్రశంసలు అందుకొంటూ మందలో ప్రవేశించాడు. ఆ సమయంలో

**క. కమలాక్షునొద్ద నుండని, నిమిషము యుగశతము గా౦గ నెగడిన గోప**
**ప్రమదలు సంభ్రమమున నా, కమలాక్షుని౦ జూచి ముదము౦ గనిరి మహీశా! 751**

**ప్రతి :** మహి+ఈశా= ఓ రాజా!; కమల+అక్షుని+ఒద్దన్= కృష్ణుని సమీపంలో; ఉండని నిమిషము= లేకున్నట్టి నిమిషకాలం; యుగశతము= నూరు యుగాల కాలంగా; నెగడినన్= పెరుగగా; గోపప్రమదలు= గోపికలు; సంభ్రమమునన్= వేగిరపాటుతో; ఆ కమల+అక్షునిన్+చూచి= తామరవంటి కన్నులుగల ఆ శ్రీకృష్ణణ్ణిచూచి; ముదమున్= సంతోషం; కనిరి= పొందారు.

**తా :** శ్రీకృష్ణుడు దగ్గరగా లేని ఒక నిముషం అయినా గోపికలకు నూరు యుగాలుగా అనిపించింది. అందువల్ల వారు గబ గబా వచ్చి శ్రీకృష్ణణ్ణి చూచి, పరమానందం పొందారు.

**వ. ఆ సమయంబున గోపకు లిండ్లకడ నున్న వృద్ధకాంతాజనంబులకు రామకృష్ణుల చిత్రచరిత్రంబులు సెప్పిన, విని వారు వారిని౦ గార్యార్థులై వచ్చిన వియచ్చరవరు లని తలంచి రంత. 752**

**ప్రతి :** ఆ సమయంబునన్= అప్పుడు; గోపకులు= గొల్లవారు; ఇండ్లకడన్= ఇండ్లవద్ద; ఉన్న= ఉన్నట్టి; వృద్ధకాంతాజనంబులకున్= ముసలివారికిని, ఆడవారికిని; రామకృష్ణుల చిత్రచరిత్రంబులు= బలరామ శ్రీకృష్ణుల ఆశ్చర్యకరాలయిన ప్రవర్తనలను; చెప్పినన్= చెప్పగా; విని= విని; వారు= ఆ ముసలివారును స్త్రీలును; వారినిన్= ఆ బలరామకృష్ణులను; కార్య+అర్థులు+ఐ= రాక్షససంహారం అనే పని నెరవేర్చే కోరికతో; వచ్చిన వియత్+చరులు= ఆకాశసంచారులైన దేవతలు; అనితలంచిరి= అని భావించారు; అంతన్= అప్పుడు...

**తా :** అప్పుడు అడవినుండి వచ్చిన గోపాలకులు ఇళ్ల దగ్గరున్న పెద్దవారితోను, ఆడవారితోను బాలరామకృష్ణుల రాక్షస సంహారాది మానవాతీత చేష్టలను గురించి చెప్పగా, వారు ఆ బలరామకృష్ణులు అనేక ఘనకార్యాలు చేయడానికి భూమిమీద అవతరించిన దేవతా శ్రేష్ఠులు అనీ, సామాన్య మానవులు కారనీ భావించారు.

## ✤ వర్షర్తువర్ణనము ✤

**సీ. పూర్వవాయువులు ప్రభూతంబులై వీచె౦ బడమట నింద్రచాపంబు దో౦చె౦**
**బరివేషయుక్తమై భానుమండల మొప్పె మెఱపు లుత్తరదిశ మెఱవ౦ దొడ౦గె**
**దక్షిణగాములై తనరె మేఘంబులు జలచరానీకంబు సంతసించె౦**
**జాతకంబులపిపాసలు కడప౦ జేరె౦ గాంతారవహ్నులగర్వ మడ౦గె**

**ఆ. నిజకరాళివలన నీరజబంధుండు, దొల్లి పుచ్చుకొన్నతోయ మెల్ల**
**మరల నిచ్చుచుండె మహి౦ గర్షకానంద, కందమైన వాన కందు వందు. 753**

**ప్రతి :** మహిన్= భూమియందు; కర్షక+ఆనందకందము= పంటకాపుల సంతోషానికి మూలం; ఐన; వానకందువ+అందున్= వర్ష ఋతువులో; పూర్వవాయువులు= తూరుపు గాలులు; ప్రభూతంబులు+ఐ= అధికంగా; వీచెన్= వీచాయి; పడమటన్=

పశ్చిమ దిక్కునందు; ఇంద్రచాపంబున్= ఇంద్రధనుస్సు; తోఁచెన్= కనుపించింది; భానుమండలము= సూర్యబింబం; పరివేషయుక్తము+ఐ= గాలితో చుట్టబడింద్రై; ఒప్పెన్= ప్రకాశించింది; ఉత్తరదిశన్= ఉత్తర దిక్కులో; మెఱపులు= మెరుపుతీగలు; మెఱవన్+తొడఁగెన్= ప్రకాశింపసాగాయి; మేఘంబులు= మబ్బులు; దక్షిణగాములు+ఐ= దక్షిణంగా నడుస్తూ; తనరెన్= ఒప్పాయి; జలచర+అనీకంబు= నీటిలో తిరుగాడు చేపలు మొదలగువాని సమూహం; సంతసించెన్= సంతోషించాయి; చాతకంబుల పిపాసలు= వానకోయిలల దప్పికలు; కడపలన్+చేరెన్= తుదముట్టాయి; కాంతారవహ్నుల గర్వము= కార్చిచ్చుల పొగరు; అడఁగెన్= అణగిపోయింది; నీరజబంధుండు= తామరలకు చుట్టమయిన సూర్యుడు; తొల్లి= మునుపు (గ్రీష్మ ఋతువునందు); నిజకర+ఆళివలనన్= తన కిరణముల పంక్తులతో; పుచ్చుకొన్న తోయము+ఎల్లన్= గ్రహించిన నీటినంతటిని; మరలన్= తిరిగి; ఇచ్చుచున్+ఉండెన్= ఇచ్చివేస్తున్నాడు.

**తా :** చేలు దున్నుకొంటూ జీవించే రైతులకు ఆనందం కలిగిస్తూ వానాకాలం వచ్చింది. తూరుపుగాలులు ఎక్కువయ్యాయి. ఇంద్రధనుస్సు కనిపించింది. సూర్యునిచుట్టూ ఆవరించిన గాలి గుడి కట్టింది. ఉత్తరాన మెరుపులు మెరుస్తున్నాయి. మబ్బులు దక్షిణంగా సాగుతున్నాయి. నీటి చేరికచేత చేపలు మొదలయిన జలచరాలకు సంతోషం కలిగింది. వానకోయిలల దప్పిక తీరింది. కార్చిచ్చులు కనబడకుండా పోయాయి. ఎండాకాలంలో సూర్యుడు తన కిరణాలతో త్రాగిన నీటినంతా వానాకాలంలో తిరిగి ఇచ్చేస్తున్నాడు.

**క. వర్షాకాలభుజంగుఁడు, హర్షముతో నిడిన నవనఖాంకము లని యు**
**త్కర్షింప భూమిసతిపైఁ, గర్షకహలరేఖ లమరె గహనాంతమునన్. 754**

**ప్రతి :** గహన+అంతమునన్= అడవుల చివర; వర్షాకాల భుజంగుఁడు= వర్షఋతువు అనే శృంగారపురుషుడు; హర్షముతోన్= సంతోషంతో; ఇడిన నవనఖ+అంకములు+అని= చేసిన కొత్త గోళ్లగీతలా అన్నట్లుగా; ఉత్కర్షింపన్= మెచ్చుకొనునట్లుగా; భూమిసతిపైన్= భూమి అనెడి పడతిమీద; కర్షకహలరేఖలు= రైతులనాగటి చాళ్లు; అమరెన్= కనపడ్డాయి.

**తా :** అడవులచివర చెట్టూ పుట్టా లేకుండా సమతలంగా ఉండే చేలను దున్ని రైతులు పంటలు పండిస్తూ ఉంటారు. ఆ చేలలోని నాగటిచాళ్లు, వర్షఋతువు అనే రసికుడు భూమి అనే పడతిమీద చేసిన కొత్త గోళ్లగీతలా! అన్నట్లుగా ఉన్నాయి.

**క. చెలువుఁడు ప్రావృట్కాలుఁడు, పొలసినఁ బులకించుభూమిపులకము లనఁగా**
**మొలచి తల లెత్తి నిక్కుచు, సలలితగతి జాలువాఱె సస్యము లధిపా! 755**

**ప్రతి :** అధిపా= ఓ పరీక్షిన్మహారాజా!; సస్యములు= పైరులు; చెలువుఁడు= ప్రియుడయిన; ప్రావృట్కాలుఁడు= వర్ష ఋతువు అనే పురుషుడు; పొలసినన్= (తనను) సమీపించటంచేత; పులకించు= గగురుపాటు పొందునట్టి; భూమి పులకములు= భూదేవియొక్క రోమాంచాలు; అనన్+కాన్= అనునట్లుగా; మొలచి= మొలకెత్తి; తలలెత్తి= తలలు పైకి పొడ చూపి; నిక్కుచున్= అతిశయిస్తూ; సలలితగతిన్= చక్కని రీతితో; జాలువారెన్= ప్రసరించాయి.

**తా :** ఓ పరీక్షిన్మహారాజా! వర్షాకాలమనే ప్రియుడు సమీపించడంచేత, పుడమిపడతికి కల్గిన గగురుపాటు అనునట్లుగా మొలచి తలలెత్తి పెరుగుచున్న పైరులు అందగించాయి.

**వ. మఱియుఁ జటులపవనచలితంబులై మిన్ను దన్ని, లెక్కకు మిక్కిలియై, తెక్కలు గల నీలగిరుల సిరుల మీఱి, కాఱుకొని తెఱపిపడక, నిబిడంబులై, శిశిరకిరణతరణి మండలంబుల చొప్పు దప్పించి, విప్పు కలిగి,**

చదలు గప్పుకొనిన లీలం గ్రాలు నీలమేఘంబులును, మేఘవిముక్తంబులయి జలదసమయవిటుండు సరసగతి ధరణిసతియురమ్మున దర్పించి నేర్పున సమర్పించు కర్పూరఖండంబులవడువునఁ బుడమిఁ బడు కరకలును, గరకానుగతంబులై యసితభోగిభోగంబుల బాగున నీలమణిమాలికావిశేషంబువిధంబున నెడపడక పడు సలిలధారలును, ధారాధరవిగళితవిమలసలిలంబులం దోఁగుచు, మదజలాభిషిక్తమత్తమాతంగంబుల సొబగున నుండు కొండలును, గొండలతుదలనుండి గండశైలంబులపైఁ బడి వికీర్యమాణంబులగు గిరినిర్ఝరంబుల శీకరంబులును, శీకరపరంపరలఁ జొదుగులు మదుగులఁ గొనినఁ బిదపిద నగుచుఁ జిదుకు చిదుకు మను రొంపులును, రొంపులు గ్రొచ్చి క్రచ్చఱ నుచ్చలితంబు లయి పఱచువఱదలును, వఱదలవలన మెదలి కదలి పాఱెడి యేఱులును, నేఱులవెంట గఱులు ద్రిప్పుచు గములు గొని క్రొన్నీటి కెదురు నడుచు మీనంబులును, మీననయనలమెఱుంగు సొంపుపెంపు సైరింపక కంపించి తిరిగి సురిఁగి చనియెడికరణి మేఘమధ్యంబులం బొలసి మలసి నిలువక మరలి చను క్రొమ్మెఱుంగులును, మెఱుంగుల తెఱంగున మగువలు పురుషులం దగిలి నిలువ రని జనుల కెఱుంగ నలువ మొఱయిడిన తెఱంగున మొరయునుఱుములును, నుఱుముల కులికిపడక కికురు పొడుచుచుఁ బింఛెంబులు గొంచెంబులు సేయక విప్పి దెప్పరంబుగ రొప్పుచు నర్తనంబులు సేయు మయూరంబులును, మయూరఘోషంబులు భీషణములై చెవులు సోఁక ననూనంబులైన మానంబుల నాసలు సెడి యొండొరులకుఁ గ్రిందుపడి క్రందుకొను విరహిజనులును, జనులకు రేపు మా పని నిరూపింపరాక మాలతీకుసుమవిసరవికసనవిదితావసానంబు లగు దుర్దినంబులును, దినావసాన సమయంబున మినుకుమినుకుమని మెఱయుచుం దిరుగు ఖద్యోతంబులును, ఖద్యోతసందర్శనంబు గోరుచు నుడుగక విడువక కురియు జడింబడి వలిగొని వడఁకుచు నశనయత్నంబులు వర్జించి ఖర్జూరజంబూఫల భక్షణంబుల దేహసంరక్షణంబు లాచరించు వనచరులును, వనచరానందకారిణులయి వారరమణుల రుచి ననవరతభుజగసమేతలగు కేతకులును, గేతకీకదంబయూధికా కుటజ కుసుమ పరిమళమిళితంబు లగు విపినమార్గంబులును, మార్గనిరోధంబు లగుచుం బెరిఁగి రసికంబులై పసరు దొలంకుచు హరిన్మణికిరణ పుంజంబులభంగి రంజిల్లి తొంగలించుచు జొంపంబులు గొనిన కసవులును, గసవులు మెసవి మిసమిసం దనువులు మెఱవ వలుఁదపొదుఁగులబరువునం గదలక నిలిచి నెమ రమర నిదు ధేనువులును గలిగి ధేనువ్రజంబు కైవడిఁ బయఃకణమనోహరంబై, హరకరంబుభంగిఁ బరిపూర్ణసారంగభాసురంబై, సురగిరి చెలువున హరిశరాసనవిభీషణంబై, విభీషణహృదయంబు పోలికం బ్రకటిత హరిశబ్దవైభవంబై, భవపూజనంబు చందంబున నింద్రగోపాదివిభవజనకంబై జనకయాగంబుభాతి సీతాప్రకరణాలంకృతంబై, కృతయుగంబు సొంపున బహువర్షంబునై వర్షాగమంబు చెలువొందె నప్పుడు. **756**

**ప్రతి :** మఱియున్= ఇంకను; చటులపవన చలితంబులు+ఐ= తీవ్రమైన గాలులచేత చంచలించునట్టివయి; మిన్ను+తన్ని= ఆకాశమంత ఎత్తు పెరిగి; లెక్కకున్= లెక్కించుటకు; మిక్కిలి+ఐ= శక్యం కానివయి; ఱెక్కలు గల నీలగిరుల సిరులన్= రెక్కలు గల కాటుక కొండలయొక్కశోభలను; మీఱి= మించి; కాఱుకొని= నలుపెక్కి; తెఱపి పడక= ఎడమీయక; నిబిడంబులు+ఐ=

దట్టమయినవి అయి; శిశిరకిరణ= చల్లనికిరణములు గల చంద్రునియొక్కయు; తరణి= సూర్యునియొక్కయు; మండలంబుల= బింబములయొక్క; చొప్పు= శోభను; తప్పించి= అణచి; విప్పుకలిగి= వైశాల్యము కలిగి; చదలు+కప్పుకొనిన లీలన్= ఆకాశం కప్పుకొనిన విధంగా; క్రాలు నీలమేఘంబులును= ఒప్పునటువంటి నల్లని మబ్బులును; మేఘ విముక్తంబులు+అయి= మేఘాలచేత విడవబడిన; జలదసమయవిటుండు= వర్షాకాలం అనే ప్రియుడు; సరసగతిన్= విలాసంతో; దర్పించి= గర్వించి; నేర్పునన్= నేర్పుతో; ధరణిసతి+ఉరమ్మునన్= భూదేవి వక్షస్థలమునందు; సమర్పించు కర్పూర ఖండంబుల వడువునన్= ఉంచునట్టి కప్పురపు పలుకులవలె; పుడమిన్= భూమిమీద; పడుకరకలునున్= పడునట్టి వడగండ్లును; కరక+అనుగతంబులు+ఐ= వడగండ్లను వెంబడించినవయి; అసితభోగిభోగంబుల బాగునన్= నల్లని పాముల శరీరములవలెను; నీలమణిమాలికా విశేషంబు విధంబునన్= ఇంద్రనీలమణుల దండలవలె; ఎడపడక= ఎడములేక; పడుసలిలధారలును= కురియునట్టి జలధారలును; ధారాధర= మేఘములనుండి; విగళిత= జారిన; విమల= స్వచ్ఛమయిన; సలిలంబులన్= నీళ్లలో; తోఁగుచున్= తడియుచు; మదజల= మదజలంచేత; అభిషిక్త= అంతట తడుపబడిన; మత్త= మదించిన; మాతంగంబుల= ఏనుగులయొక్క; సొబగునన్= శోభవలె; ఉండుకొండలును= ఉన్నట్టి పర్వతములును; కొండలతుదలనుండి= కొండకొనలనుండి; గండశైలంబులపైన్+పడి= పెద్ద పెద్ద బండరాళ్లమీద పడిన; వికీర్యమాణంబులు+అగు= చెల్లాచెదరగుచున్నవగు; గిరినిర్ఝరంబుల శీకరంబులును= కొండలందలి సెలయేళ్ల నీటితుంపరలును; శీకరపరంపరలన్+చొదుగులు= నీటి తుంపరలు చెమ్మలు; మదుగులన్+కొనినన్= మడుగులు గట్టగా; పిదపిదనగుచున్= పలుచగా నగుచు; చిదుకు చిదుకు మను రొంపులును= చిదుకు చిదుకుమని చప్పుడు చేయు బురదలును; రొంపులున్+క్రొచ్చి= బురదలను పెల్లగించి; క్రచ్చఱన్= వేగంగా; ఉత్+చలితంబులు+అయి= పైకి లేచినవయి; పఱచు వఱదలును= పారునట్టి ప్రవాహములును; వఱదలవలనన్= ప్రవాహములవల్ల; మెదలి= కొంచెం చలించి; కదలి= వెడలి; పాఱెడి+ఏఱులునున్= ప్రవహించునట్టి నదులును; ఏఱులవెంటన్= నదులవెంబడి; గఱులు= రెక్కలను; త్రిప్పుచున్= త్రిప్పుచు; గములు+కొని= గుంపులు గూడి; క్రొత్త+నీటికిన్= క్రొత్తదియగు నీటికి; ఎదురునడుచు మీనంబులును= ఎదురీదు చేపలును; మీన నయనల= చేపలవంటి కన్నులు గలవారయిన స్త్రీలయొక్క; మెఱుంగు= కాంతియొక్క; సొంపు పెంపున్= చక్కదనముయొక్క వృద్ధిని; సైరింపక= ఓర్వక; కంపించి= వణకి; తిరిగి సురిఁగి చనియెడి కరణిన్= వెంటనే అదృశ్యమగునట్లుగా; మేఘమధ్యంబులన్= మబ్బుల నడిమిచోటులందు; పొలసి= గోచరించి; మలసి= వ్యాపించి; నిలువక= స్థిరంగా ఉండక; మరలి చనుక్రొత్త+మెఱుంగులును= తిరిగి పోవునట్టి క్రొత్త మెరుపులును; మెఱుంగుల తెఱంగునన్= మెరుపులవలె; మగువలు= స్త్రీలు; పురుషులన్= మగవారియందు; తగిలి= ప్రేమ గలిగి; నిలువరు= స్థిరంగా ఉండరు; అని= అంటూ; జనులకున్= ప్రజలకు; ఎఱుంగన్= తెలిసేటట్లు; నలువ= బ్రహ్మ; మొఱ+ఇడిన తెఱుంగునన్= మొరపెట్టినట్లుగ; మొరయున్+ఉఱుములును= పెద్దగా ధ్వనిచేసే ఉరుములును; ఉఱుములకున్= (ఆ) పెద్ద చప్పుళ్లకు; ఉలికిపడక= బెదరక; కికురు పొడుచుచున్= ఉత్సాహంతో విజృంభిస్తూ; పించెంబులు= పురులను; కొంచెంబులు+చేయక= ముడువక, విప్పి= విశాలంగాజేసి; దెప్పరంబుగన్= అధికంగా; రొప్పుచున్= కేకలు వేస్తూ నర్తనంబులు= నాట్యములు; చేయు మయూరంబులును= చేసే నెమళ్లును; మయూర ఘోషంబులు= నెమళ్ల కేకలు; భీషణములు+ఐ= భయంకరములయి; చెవులు సోఁకన్= వినబడగా; అనూనంబులు+ఐన= తక్కువకానివైన; మానంబులన్= అభిమానములందు; ఆసలు+చెడి= ఆశలు తగ్గి; ఒండు+ఒరులకున్= ఒకరికొకరికి; క్రిందుపడి= లోబడి; క్రందుకొను విరహి జనులును= సందడి చేయు విరహం గలవారును; జనులకున్= ప్రజలకు; రేపు మాపు+అని= ఇది పగలు ఇది రాత్రి అని; నిరూపింపన్+రాక= నిశ్చయించుటకు శక్యంకాని విధంగా; మాలతీకుసుమ= జాజిపూలయొక్క; విసర= సమూహాలు; వికసన= విప్పారుటచేత; విదిత= తెలియబడ్డ; అవసానంబులు= ముగింపులు కలవి; అగుదుర్దినంబులును= మబ్బులు కమ్మిన పగళ్లును; దిన+అవసాన

సమయంబునన్= సాయంకాలంలో; మినుకు మినుకుమని మెఱయుచున్= మినుకు మినుకుమను కాంతులతో ప్రకాశిస్తూ; తిరుగు ఖద్యోతంబులును= సంచరించునట్టి మిణుగురు పురుగులూ; ఖద్యోత సందర్శనంబు= సూర్యునియొక్క దర్శనాన్ని; కోరుచున్= వాంఛిస్తూ; ఉడుగక= మానక; విడువక= ఎడతెగక; కురియు జడిన్+పడి= కురియునట్టి వానలో చిక్కుకొని; వలిగొని= చలికి లోబడి; వడఁకుచున్= వణకిపోతూ; అశన యత్నంబులు= అన్నంకోసం చేసేవంటపనులు; వర్జించి= మాని; ఖర్జూర= ఖర్జూరాలయొక్కయు; జంబూ= నేరేళ్లయొక్కయు; ఫల= పండ్లయొక్క; భక్షణంబులన్= తినుటచే; దేహసంరక్షణంబులు= శరీరాలను కాపాడుకోడాలు; ఆచరించువనచరులును= చేయునట్టి ఆటవికులును; వనచర+ ఆనందకారిణులు+అయి= అడవులందు తిరుగు బోయలు మొదలగువారికి సంతోషం కలిగించే వయి; వార రమణుల రుచిన్= వేశ్యా స్త్రీల సౌందర్యంవలె; అనవరత భుజగసమేతలు= ఎల్లపుడు మిన్నాగులు అనే విటులతో కూడినవి; అగు కేతకులును= మొగలిచెట్లును; కేతకీ= మొగలి; కదంబ= కడిమి; యూధికా= అడివిమొల్ల; కుటజ= కొండమల్లె (అనే వీటియొక్క); కుసుమ= పూలయొక్క; పరిమళ= సువాసనలతో; మిళితంబులు+అగు= కలిసినవి అగు; విపిన మార్గంబులును= అడవుల త్రోవలును; మార్గనిరోధంబులు+అగుచున్= దారిని అడ్డగించినవి అవుతూ; పెరిఁగి= వృద్ధిపొంది; రసికంబులు+ఐ= రసము కలిగినవయి; పసరు+తొలంకుచున్= పచ్చదనమును వ్యాపింపజేస్తూ; హరిత్+మణికిరణ పుంజంబులభంగిన్= గరుడపచ్చల కాంతుల సమూహములవలె; రంజిల్లి= ప్రకాశించి; తొంగలించుచున్= అతిశయిస్తూ; జొంపంబులు+కొనిన కసవులును= గుబురులు కట్టిన పచ్చికలును; కసవులు మెసవి= పచ్చికలు మేసి; మిసమిసన్= మిసమిసలాడు కాంతులతో; తనువులు= ఒడళ్లు; మెఱవన్= ప్రకాశింపగా; వలుఁదపొదుఁగుల బరువునన్= పెద్దవయిన పొదుగులయొక్క భారంచేత; కదలక= నిశ్చలంగా; నిలిచి= నిలబడి; నెమరు+అమరన్+ఇడు= చక్కగా నెమరు వేయునట్టి; ధేనువులును+కలిగి= ఆవులును కలిగి; ధేనువ్రజంబుల కైవడిన్= ఆవుల మందలవలె; పయఃకణమనోహరంబు+ఐ= జలబిందువులచే మనస్సును ఆకర్షించేదయి (వర్షాకాలమునకు చెందిన అర్థము), క్షీరబిందువులచే మనోహరమయినదయి (ఆవుల మందలకు చెందినవని అర్థం); హరకరంబు భంగిన్= శివుని హస్తంవలె; పరిపూర్ణ సారంగ భాసురంబు+ఐ= నిండిన వానకోయిలలచే ప్రకాశించునదయి (వర్షం), నిండుగా ఉన్న జింకచే ప్రకాశించేదయి (శివుని హస్తం); సురగిరి చెలువునన్= మేరు పర్వతంవలె; హరిశర+ఆసన భీషణంబు+ఐ= ఇంద్రధనుస్సుచేత మిక్కిలిభయం కలిగించేది అయి (వర్షా), విష్ణువనే బాణానికి చోటగుటచే భయంకరమైనదయి (మేరుపర్వతం); విభీషణ హృదయంబుపోలికన్= విభీషణుని మనస్సువలె; ప్రకటిత= వెల్లడి అయిన; హరి= కప్పలయొక్క; శబ్ద= కూతలనెడి చప్పుళ్లయొక్క; వైభవంబు= కలిమి గలది; ఐ= అయి (వర్షా); ప్రకటిత= ప్రకటింపబడిన; హరిశబ్ద= హరి హరి అను నామములయొక్క; వైభవంబు= కలిమిగలది; ఐ= అయి (విభీషణునిహృదయం); భవపూజనంబు చందంబునన్= శివునిపూజవలె; ఇంద్రగోప= ఆరుద్రపురుగులు; ఆది= మొదలగువానియొక్క; విభవజనకంబు= కలిమిని కలిగించేది; ఐ= అయి (వర్షా); ఇంద్ర= ఇంద్రుడు; గోప= గోవిందుడు; ఆది= మొదలగువారికి; విభవజనకంబు= ఐశ్వర్యమును కలిగించింది; ఐ= అయి; (హరపూజనం); జనకయాగంబుభాతిన్= జనక మహారాజుయొక్క; యాగంవలె; సీతాప్రకరణ+అలంకృతంబు+ఐ= నాగలిచాళ్లను తీర్చిదిద్దుటతో కూడిందయి (వర్షా), సీతాదేవియొక్క సంగతిచేత అలంకరింపబడిందయి (జనకుని యాగము); కృతయుగంబుసొంపునన్= కృతయుగంయొక్క చక్కదనంవలె; బహువర్షంబును= అధికమైన వానలు గలదియును; ఐ= అయి (వర్షా), అనేకములయిన సంవత్సరములు గలదియును అయి (కృతయుగం); చెలువు+ఒందెన్= అందగించింది; అప్పుడు= ఆ వర్షాకాలంలో...

**తా :** ఆ వానాకాలంలో తీవ్రమయిన గాలుల తాకిడికి కదలివచ్చిన మబ్బులు ఆకాశం నిండా అలముకొన్నాయి. లెక్కకు మిక్కిలిగా వచ్చిన ఆ మబ్బులు రెక్కలుగల కాటుక కొండలా అన్నట్లు ఎడం లేకుండా దట్టంగా కమ్ముకొన్నాయి. సూర్యచంద్రుల

కాంతుల్ని అడ్డుకొన్నాయి. వర్షఋతువు అనే ప్రియుడు మదించి భూకాంతవక్షస్థలం మీద నేర్పుగా జల్లిన కర్పూరపు పలుకులా అన్నట్లుగా మబ్బులనుండి వడగళ్లు రాలిపడ్డాయి. ఆ వడగళ్ల వెంబడి నల్లత్రాచుల తీరున, ఇంద్రనీలహారాలవిధంగా ఎడతెరపిలేకుండా వర్షధారలు కురిశాయి. ఆ జలధారలతో తడిసినకొండలు మదజలధారలతో నిండుగా తడిసిన మత్తగజాలవలె కనబడుతున్నాయి. కొండకొమ్మలనుండి బండరాళ్లమీద పడుతున్న సెలయేటి నీటిధారలు చెల్లాచెదురయిన నీటితుంపరలు నలుగడలా పడుతున్నాయి. ఆ తుంపరలకు చెమ్మగిలిన నేల చిత చితలాడుతూ అడుసు అయింది. అందులో నడిచేటప్పుడు చితుకు చితుకుమని చప్పుడవుతోంది. ఆ బురదలమీదుగా పారిన నీరు వరద గట్టింది. వాగులు వంకలు ఏకమై ప్రవహించాయి. గుంపుగట్టిన రెక్కల చేపలు ఆ వరదనీటికి ఎదురీదాయి. చేపలవంటి కన్నులుగల చెలువల నెమ్మేని తళుకుబెళుకులకు తాళలేక, కళవళపడి, వణుకుతూ పారిపోతున్నవా అన్నట్లుగా మెరుపులు మేఘాలమధ్య మెరసి మాయమైపోయాయి. మెరపులవలె చపలచిత్తలయిన చెలువలు పురుషులచెంత నిలుకడగా నిలువరు సుమా అని ప్రజలకు వినబడేలాగున బ్రహ్మదేవుడు ఎలుగెత్తి చాటుతున్నాడా అన్నట్లుగా ఉరుములు ఉరిమాయి. ఆ ఉరుముల చప్పుళ్లకు నెమళ్లు జంకులేక పురులు విప్పుకొని నాట్యం చేశాయి. కేకలు పెట్టాయి. భయంకరమైన ఆ కేకలకు తాళలేక ప్రణయకలహంవల్ల విరహంతో వేగుతున్న దంపతులు పట్టుదలలు మాని ఒకరికొకరు దాసులై దగ్గరయ్యారు. కారుమబ్బులు కమ్మినందువల్ల ఇదిరేయి; ఇదిపగలు అని గుర్తించడానికి వీలులేకుండా పోయింది. అయినప్పటికి జాజిపూలు పూసి సాయంసమయాన్ని తెలియజేశాయి. చీకటి పడేటప్పటికి మిణుగురుపురుగులు మినుకుమని మెరుస్తూ మింట తారట్లాడాయి. ఎడతెరిపిలేకుండా కురిసే జడివానలో చలికివణుకుతూ, ఎప్పుడు సూర్యోదయం అవుతుందో అని ఎదురుచూస్తూ, వంటను వండుకొని తినే వీలులేక, ఖర్జూరపుపండ్లు, నేరేడుపండ్లు తిని ఆటవికులు ఆకలి తీర్చుకున్నారు. విటులపొత్తు వీడని వేశ్యవిధంగా మిన్నాగు పాములపొత్తు వీడని మొగలిపూగుత్తులు ఆటవికులకు సంతోషం కలిగించాయి. అడవిదారులు విరబూచిన మొగలి కడిమి అడవిమొల్ల కొండమల్లె పూలతావులతో నిండిపోయాయి. గరుడపచ్చల కాంతులు వెలిగ్రక్కుతూ పచ్చిక అంతటా గుబురుగా పెరిగింది. ఆ పచ్చికలు మేసిన ఆవులు బలిసి మిసమిస లాడుతున్నాయి. పాలతో నిండిన పొదుగుల బరువువల్ల ఇటూ అటూ తిరగలేక నిలబడి నెమరు వేస్తున్నాయి. వర్షఋతువు క్షీరసమృద్ధిగల ఆవులమందలాగ జలసమృద్ధ మయ్యింది. జింకతో నిండుగా కనబడే శివునిచేతిలాగ వానకోయిలలతో నిండుగా కనబడింది. విష్ణువనే బాణానికి ఆసనం (విల్లు) అయిన మేరుపర్వతంలాగ ఇంద్రధనుస్సుతో ప్రకాశించింది. ఎడతెగకుండా హరినామాన్ని సంకీర్తించే విభీషణుని హృదయంలాగ కప్పల బెకబెకల ధ్వనులతో కూడుకొని ఉంది. ఇంద్రోపేంద్రాదులకుగూడా ఐశ్వర్యాన్ని అనుగ్రహించే శివపూజలాగ ఆరుద్రపురుగులతో అలరారింది. సీతాదేవి చరిత్రతో జనకచక్రవర్తియాగంలాగున నాగలిచాళ్లతో అందగించింది. బహుసంవత్సరాలు కలిగిన కృతయుగంలాగ అధికమైన వర్షాలతో నిండిపోయింది.

**క. వాడక వ్రాలక తెవుళులఁ, గూడక తగ నల్లగెఱలుకొని నవకములై**
**చూడఁగ భద్రము లగుచును, వీడెన్ సస్యంబు లిడుమ వీడెం బ్రజకున్. 757**

**ప్రతి :** సస్యంబులు= పైరులు; వాడక= ఎండిపోక; వ్రాలక= నేలమీద వ్రాలకుండగ; తెవుళులన్= చీడపీడలతో; కూడక= కూడిక పొందక; తగన్= తగినవిధంగా; నల్లగెఱలుకొని= నల్లటి చారలు కలిగి; నవకములు+ఐ= కోమలములై; చూడన్+కన్= చూచుటకు; భద్రములు= మేలయినవి; అగుచున్= అవుతూ; వీడెన్= వృద్ధిపొందాయి; ప్రజకున్= జనులకు; ఇడుమ= కష్టం; వీడెన్= తీరింది.

**తా :** ఎండక, నేలమీద వ్రాలిపోక, చీడపీడలు సోకక, బలుపునకు గుర్తుగా నల్లనిచారలు గలిగి, చక్కగా పైరులు పెరిగాయి. జనులకు కష్టాలు గట్టెక్కాయి.

**క. జీవనము సాలఁ గలిగియుఁ, గావరమున మిట్టిపడని ఘనునిక్రియ నదీ**
**జీవనములు సొర జలనిధి, ప్రావృట్కాలమున డిందుపడియుండె నృపా! 758**

**ప్రతి :** నృపా= పరీక్షిన్నరేంద్రా; జలనిధి= సముద్రుడు; ప్రావృట్క్కాలమునన్= వర్షఋతువునందు; జీవనము= జీవించుటకు కావలసిన సంపద; చాలన్= మిక్కిలిగ; కలిగియున్= కలిగి ఉండియు (జలం, పుష్కలంగా కలిగి ఉండీ అని మేఘపరమైన అర్థము); కావరమునన్= గర్వంతో; మిట్టిపడని ఘనుని క్రియన్= మిడిసిపడని గొప్పవానివలె (మేఘంవలె అని అర్థాంతరం); నదీజీవనములు= నదుల జలాలు; చొరన్= (తనలో) ప్రవేశింపగా; డిందుపడి+ఉండెన్= అణగిమణగి ఉన్నాడు.

**తా :** ఓ పరీక్షిన్మహారాజా! ఎంత సంపదగలిగి ఉన్నప్పటికీ గొప్పవాడు గర్వంతో మిడిసి పడడు. ఆ తీరుగా నదులలోని నీరంతా వచ్చి తనలో చేరుతున్నా సముద్రుడు హద్దు మీరక అణగి ఉన్నాడు.

**శా. ఆ వర్షాగమమందు గోవుల నరణ్యాంతంబులన్ మేపుచున్**
**గోవిందుండు ప్రలంబవైరియుతుఁడై గోపాలవర్గంబుతోఁ**
**బ్రావీణ్యంబునఁ గందమూలఫలముల్ భక్షించుచున్ మంజుల**
**గ్రావాగ్రంబులఁ బ్రీతిఁ జల్ది గుడిచెం గాసారతీరంబులన్. 759**

**ప్రతి :** ఆ వర్షా+ఆగమము+అందున్= ఆ వానకాలమందు; గోవిందుండు= శ్రీకృష్ణుడు; ప్రలంబవైరియుతుఁడు= ప్రలంబాసురుణ్ణి సంహరించిన బలరాముణ్ణి గూడినవాడు; ఐ= అయి; అరణ్య+అంతంబులన్= అడవుల చివరలలో; గోవులన్= ఆవులను; మేపుచున్= మేపుతూ; గోపాలవర్గంబుతోన్= ఆవులను కాచే గొల్లల సముదాయంతోగూడి; ప్రావీణ్యంబునన్= నేర్పుతో; కందమూల ఫలముల్= దుంపలు వేళ్లు పండ్లను; భక్షించుచున్= తింటూ; కాసారతీరంబులన్= చెరువుల గట్లమీద; మంజులగ్రావ+అగ్రంబులన్= చక్కనైన రాతిబండలమీద (కూర్చుండి); ప్రీతిన్= సంతోషంతో; చల్ది= చద్ది అన్నం; కుడిచెన్= తిన్నాడు.

**తా :** ఆ వర్షాకాలంలో శ్రీకృష్ణుడు అడవుల చివరలలో ఆవులను మేపుతూ, బలరామునితోను, గోపాలకులతోను గూడినవాడై కందమూలఫలాలు తింటూ, మడుగులగట్లమీద, రాతిచట్టులమీద కూర్చుండి ప్రీతిగా చలుదులు భుజించాడు.

**వ. ఆ సమయంబున. 760**

**ప్రతి :** ఆ సమయంబునన్= అప్పుడు...

**తా :** అలాంటి వేళలో

**సీ. విశ్వమోహనమైన వేణునినాదంబు సరసగంభీరగర్జనము గాఁగ**
**మహనీయనిర్మలమందహాసద్యుతి లలితసౌదామనీలతిక గాఁగఁ**
**దలచుట్టు బాగుగఁ దనరు ఫింఛపుదండ శైలభేదనశరాసనము గాఁగఁ**
**గరుణాకటాక్షవీక్షణసుధావర్షంబు సలిలధారాప్రవర్షంబు గాఁగ**

**తే. జాడ నేతెంచు గోపాలజన మునీంద్ర, చాతకంబుల దురవస్థ సక్కఁ జేసి**
**కృష్ణమేఘంబు బహుతరకీర్తి నొప్పె, విమలబృందావనాకాశవీథియందు. 761**

**ప్రతి :** విశ్వమోహనము= లోకమును మోహింపజేసేది; ఐన వేణునినాదంబు= అయిన పిల్లనగ్రోవియొక్క ధ్వని; సరసగంభీరగర్జనము= రసవంతమయింది, గొప్పది అగు ఉరుము; కాన్+కన్= అవుతుండగా; మహనీయ= గొప్పది; నిర్మల= స్వచ్ఛమైనది; మందహాస= చిరునవ్వుయొక్క; ద్యుతి= కాంతి; లలితసౌదామనీలతిక= చక్కనైన మెరుపుతీగ; కాన్+కన్= అగుచుండగా; తలచుట్టున్= తలకు అన్నివైపులను; బాగుగన్= చక్కగా; తనరుపింఛపము+దండ= ఒప్పునట్టి నెమలిపురిచేత చేయబడినదండ; శైలభేదనశర+ఆసనము= పర్వతములను భేదించినవాడగు ఇంద్రునిధనుస్సు; కాన్+కన్= అవుతుండగా; కరుణా= కరుణగల; కట+అక్ష= క్రేగన్నులయొక్క; వీక్షణ= చూపు అనెడు; సుధా= అమృతంయొక్క; వర్షంబు= వాన; సలిలధారాప్రవర్షంబు= జలధారలచేతనయినవాన; కాన్+కన్= అవుతుండగా; జాడన్= (తన అడుగు) గుర్తులతో; ఏ తెంచు= వచ్చునట్టి; గోపాలజన= గొల్లవారు; ముని+ఇంద్ర= గొప్పమునులును అనెడి; చాతకంబుల= వానకోయిలల; దురవస్థ= చెడ్డదశను; చక్కన్+చేసి= పోగొట్టి; కృష్ణమేఘంబు= శ్రీకృష్ణుడనెడి నల్లనిమేఘం; విమల=స్వచ్ఛమైన; బృందావన= బృందావనం అనే; ఆకాశవీథి+అందున్= ఆకాశంలో; బహుతరకీర్తిన్= అధికకీర్తితో; ఒప్పెన్= ప్రకాశించింది.

**తా :** అప్పుడు బృందావనం అనే ఆకాశంలో శ్రీకృష్ణుడనే మేఘం అందగించింది. లోకాలకు మైమరపుకలిగించే పిల్లనగ్రోవి పాటయే ఆ మేఘానికి రసవంతమయిన గంభీరమైన ఉరుము అయ్యింది. చక్కనైన చిరునవ్వు కాంతియే మెరుపుతీగ అయింది. తలచుట్టు చక్కగా ఉన్న నెమలిపురి దండయే ఇంద్రధనుస్సు అయ్యింది. దయతోగూడిన కడకంటి చూపులనుండి వెల్లిగొనే అమృతవర్షమే జలధారల జడివాన అయింది. ఈ విధంగా భాసించిన శ్రీకృష్ణుడు అనే నీలమేఘం తన వెన్నంటివచ్చే గోపాలురు, మునులు అనే చాతకపక్షుల తాపాలు తొలగించింది.

**క. గోవుల వృషవత్సంబుల, వావిరిఁ బూజించి పిదప వర్షాకాల**
**శ్రీవనితను బూజించెను, శ్రీవల్లభుఁడయ్యు గోపశేఖరుఁ డధిపా! 762**

**ప్రతి :** అధిపా= ఓ పరీక్షిన్మహారాజా!; గోపశేఖరుఁడు= గొల్లవారిలో గొప్పవాడయిన శ్రీకృష్ణుడు; శ్రీవల్లభుఁడు+అయ్యున్= తాను లక్ష్మీదేవికి భర్తయగు శ్రీమహావిష్ణువు అయి ఉండియును; గోవులన్= ఆవులను; వృషవత్సంబులన్= ఎద్దులను, దూడలను; వావిరిన్= వరుసగా; పూజించి= అర్చించి; పిదపన్= అనంతరం; వర్షాకాల శ్రీవనితనున్= వర్షాకాలపు సంపద అను లక్ష్మీదేవిని; పూజించెను= అర్చించాడు.

**తా :** ఓ రాజా! శ్రీకృష్ణుడు తాను లక్ష్మీదేవికి భర్తయగు విష్ణువే అయినా, లోకమర్యాదను అనుసరించి, ముందుగా ఆవులను, ఎద్దును, దూడలను పూజించి, తరువాత వర్షాకాలసంపదకు అధిదేవత అగు లక్ష్మీదేవిని పూజించాడు.

**వ. ఇట్లు కృష్ణుండు విహితవిహారంబుల వర్షాకాలంబు పుచ్చె నంత. 763**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; కృష్ణుండు= శ్రీకృష్ణుడు; విహిత విహారంబులన్= వర్షాకాలమునకు తగిన ప్రవర్తనలతో; వర్షాకాలంబున్= వర్షాకాలాన్ని; పుచ్చెన్= కడపాడు; అంతన్= అపుడు...

**తా :** ఈ విధంగా శ్రీకృష్ణుడు వర్షాకాలానికి అనుగుణంగా ప్రవర్తిస్తూ కాలం గడిపాడు. అపుడు

## ✤ శరదృతు వర్ణనము ✤

**క. జొంపములు గొనియె వనములు, రొంపు లిగిరెఁ; నెమిలిగములరొద లుడిగెఁ; నదుల్**
**పెంపులకుఁ బాసెఁ; నుఱుముల, శంపల సంపదలు మానె శారదవేళన్.** **764**

**ప్రతి :** శారదవేళన్= శరత్కాలంలో; వనములు= అరణ్యాలు; జొంపములు+కొనియెన్= గుబురులుగా ఏర్పడ్డాయి; రొంపులు= బురదలు; ఇగిరెన్= ఇంకిపోయాయి; నెమలిగముల రొదలు= నెమళ్ల గుంపుల కేకలు; ఉడిగెన్= తగ్గిపోయాయి; నదుల్= ఏళ్లు; పెంపులకున్= అభివృద్ధికి; పాసెన్= దూరమయ్యాయి; ఉఱుముల శంపల సంపదలు= ఉరుముల మెరుపుల సంపదలు; మానెన్= తొలగాయి.

**తా :** ఆ శరత్కాలంలో అడవులన్నీ గుబురులు గుబురులుగా పెరిగాయి. బురదలు ఎండిపోయాయి. నెమళ్లగుంపుల కేకలు ఆగిపోయాయి. ఉరుముల మెరుపుల అలజడలు ఆగిపోయాయి.

**వ. మఱియు జీవనంబులు విడిచి, విమలజ్ఞానవశంబున ముక్తులగు పురుషరత్నంబుల చెన్నున నన్ను వదలి, మిన్ను విడిచి, వాయువశంబులై, వెల్లివిరిసి చను మేఘంబులును; మేఘపటలరహితంబును గలశభవముని సహితంబునునై, విజ్ఞానదీపవిలసితం బగు యోగిహృదయంబుచందంబున శుభ్రం బయిన యభ్రంబును; నభ్రంబున నీలదుకూలవితానసంయుక్తముక్తాఫలంబులవడువున నెగడు నుడుగణంబులును, నుడుగణ మయూఖంబు క్రొవ్వు లువ్వెత్తుగొని నివ్వటిల్లుచు బ్రహ్మాండకరండకర్పూరఖండాయమానంబులగు చంద్రకిరణంబులును, జంద్రకిరణసంస్పర్శనంబున సగర్భంబులై భూమికి దుర్భరంబు లగుచు నిండి పండి హాలికకరనిశితలవిత్రధారాసంరంభంబుఁ దలంచి తల్లడిల్లి వెలువెలుకం బాఱుచుఁ దల్లియగు విశ్వంభరకు మునుకొని ప్రణతంబులై వడంకుచు నెఱుఁగ మొఱయిడుచున్న పెంపున సంపన్నంబు లయిన యెన్నుల వ్రేఁగున వ్రాలి గాలిం దూలుచు మర్మరధ్వనుల సారస్యంబులగు కలమాదిసస్యంబులును; సస్యమంజరీ పుంజంబులఁ గొంచక చంచువులఁ ద్రుంచి కబళించి పిల్ల పెంటి తండంబులం గూడి కడుపులు నిండ మెక్కి విక్కవిరిసి చొక్కుచుఁ ద్రిక్కలు గొని మహోత్తుంగసమంచితమంచప్రదేశంబు లెక్కి సంచరించుచు వెన్నుల కావలియున్న యన్నుల కెమ్మోవులు బింబఫలంబు లని కఱచి తత్కరాస్ఫాలనంబుల నులికిపడి యెగసి చను శుకనికరంబుల కలకలంబులును, గలహంస కోక సారస కోలాహల మండితంబులై నిండిన నిర్మల జలంబులు గల జలాశయంబులును, జలాశయంబుల జలంబు లనుదినంబు నిగుర గృహంబుల బ్రదుకుదినంబులు సనుట యెఱుంగని మనుజుల గమనికం దిరుగు జలచరంబులును, జలచరహృదయంబుల బెదరు గదుర డొంకి యింకిన నదులును, నదులందుఁ గర్పూరమండపంబుల తెఱంగున, మణికుట్టిమంబులమాడ్కిని, సౌధసోపానమార్గంబులజాడను, విలోకితంబులగు నూతనసైకతంబులును, సైకతప్రదేశంబుల నుదయవేళల నిత్యకర్మానుష్ఠాననిరతులగుమునులును, మునికన్యకాకరకలశసలిలాభిషిక్తమూలంబు లగు తపోవన బాలరసాలసాలంబులును, సాలవిటపివాసంతికాకుంజపుంజంబులతఱచున నిముడుకొని దినకరకిరణంబులకుం గరువలికిం జొర వెరవుపడని వనమ్ములును, వనమ్ములం దరులకొనల నాకలములు నేకలములై మెసంగి**

**మసరుకవిసి క్రొవ్వి కొమ్ముకొనల సూటి నేటిదరులు త్రవ్వి చిమ్మి క్రుమ్మి కోరాడెడి వనగజంబులును, గజకుంభకనకకుంభరుచిరకుచభారభీరుమధ్యసమంచిత లగు చెంచితలును, జెంచితల క్రూరమ్ములగువాలమ్ముల సారమ్ములు సెడి ఖేదమ్మునఁ బాదమ్ములు దొట్రుపడఁ బెనుగాతమ్ములం బడు వరాహపుండరీకంబులును, బుండరీకకుముదకురంటకాదికుసుమమకరందంబులు గ్రోలి తేలి సోలి వాలి మహాహంకృతుల ఝంకృతులు సేయు తేఁటికదుపులును, గదుపులం గలయక యెడగలిగి మదమున నదనుపద నెటింగి మదనమార్గణప్రేరితంబులై పెంటితుటుముల వెంటం జని యొండొంటి గెంటించుచుఁ దగుల నెక్కి గర్భంబులు నెక్కొలుపు మృగవృషభరాజంబులును గలిగి, రాజరాజగృహంబు పగిది విలసితకుందపద్మ సౌభాగ్యంబై, భాగ్యహీనుకర్ణరేఖగతి నశ్రుతనీలకంఠశబ్దంబై, శబ్దశాస్త్రవేదిహృదయంబుబాగున విశదప్రకాశాభిరామంబై, రామసంగ్రామంబుకైవడి బాణాసనాలంకృతంబై, కృతాంతహృదయంబుకరణి నపంకంబై, పంకజాసనుగేహంబు సొంపున రాజహంసవిరాజమానంబై, మానధనునిచరిత్రంబుసొబగున నకల్మషజీవనంబై, వననిధిపొలుపున సమ్మిళితభూభృద్వాహినీసంకులంబై, కులవధూరత్నంబు చెలువున నదృష్టపయోధరం బై ధరణికిం దొడ వగుచు శరత్కాలంబు వచ్చె నంత.** **765**

**ప్రతి :** మఱియున్= ఇంకను; జీవనంబులు విడిచి= జలములను విడిచి; (బ్రతుకు తెరువులను విడిచి అని అర్థాంతరము); విమల విజ్ఞానవశంబునన్= స్వచ్ఛమైన ఆత్మజ్ఞానంచేత; ముక్తులు+అగు పురుషరత్నంబుల చెన్నునన్= మోక్షాన్ని పొందే బ్రహ్మజ్ఞానులలాగా; అన్నువదలి= బాగుతప్పి; మిన్నున్= ఆకాశాన్ని; విడిచి= వదలి; వాయువశంబులు+ఐ= గాలి వాలునకు లోబడినవయి; వెల్లివిరిసి= విచ్చలవిడిగా చెదరి; చనుమేఘంబులును= పోవునట్టిమబ్బులూ; మేఘపటలరహితంబును= మబ్బులగుంపులచేత విడువబడిందీ; కలశభవమునిసహితంబునున్+ఐ= అగస్త్యమునితో కూడుకొన్నదీ అయి; విజ్ఞానదీపవిలసితంబు= బ్రహ్మజ్ఞానం అనే దీపంతో వెలుగొందేది; అగు యోగిహృదయంబు చందంబునన్= అగునట్టి యోగిహృదయంవలె; శుభ్రంబు= పరిశుద్ధం; అయిన అభ్రంబునున్= అయినట్టి ఆకాశాన్ని; అభ్రంబునన్= ఆకాశంలో; నీల= నల్లనిదగు; దుకూల= వస్త్రంచేత; వితాన= మేలుకట్టునందు; సంయుక్త= అమరియున్న; ముక్తాఫలంబుల వడువునన్= ముత్తెపు పూసలవలె; నెగడు+ఉడుగణంబులునున్= అతిశయించునట్టి నక్షత్ర సమూహాలూ; ఉడు= నక్షత్రంయొక్క; గణ= సమూహములయొక్క; మయూఖంబు= కాంతులయొక్క; క్రొవ్వులు= గర్వాలను; ఉవ్వెత్తుగొని= నిశ్శేషంగా అపహరించి; నివ్వటిల్లుచున్= వ్యాపిస్తూ; బ్రహ్మాండకరండ కర్పూర ఖండాయమానంబులు+అగు= బ్రహ్మాండమనే భరణిలోని కప్పురపు పలుకులో అనదగిన; చంద్రకిరణంబులును= చంద్రునికిరణాలూ; చంద్రకిరణసంస్పర్శంబునన్= చంద్రుని కిరణములయొక్క స్పర్శచేత; సగర్భంబులు+ఐ= గర్భాలతో కూడినవయి (పొట్టలు గలిగినవయి అని భావం); భూమికిన్= నేలకు; దుర్భరంబులు= భరించుటకు శక్యంకానివీ; అగుచున్= అవుతూ; నిండి= పూర్ణమయి; పండి= ఫలించి; హాలిక= రైతులయొక్క; కర= చేతులందలి; నిశిత= వాడి అయిన; లవిత్ర= కొడవళ్లయొక్క; ధారా= అంచులయొక్క; సరంభంబున్= ఆటోపాన్ని; తలంచి= భావించి; తల్లడిల్లి= పరితపించి; వెలువెలుకన్+పాఱుచున్= వెలవెలబోవుచు; తల్లియగు విశ్వంభరకున్= తల్లి అయిన భూదేవికి; మునుకొని= హెచ్చరిక గలిగి; ప్రణతంబులు+ఐ= నమస్కరించినవయి (వంగినవయి అని అర్థాంతరం); వడంకుచున్= భయపడుతూ(గాలికి ఇటునటు ఊగుచు అని అర్థాంతరం); ఎఱుఁగన్= ఆమెకు తన దీన స్థితి అర్థమగునట్లుగా; మొఱ+ ఇడుచున్+ఉన్న పెంపునన్= మొర పెట్టుచున్నవో అనునట్లుగా; సంపన్నంబులు= చక్కగా పక్వానికి వచ్చినవి; అయిన+ఎన్నుల

వ్రేఁగునన్= అయినట్టి కంకుల బరువుచేత; వ్రాలి= నేలమీదకు వంగి; గాలిన్= గాలిచేత; తూలుచున్= కదలాడుతూ; మర్మరధ్వనులన్= మరమర అను చప్పుళ్లతో; సారస్యంబులు= రసవంతములు; అగుకలమ+ఆది సస్యంబులును= అయినట్టి వరి మొదలగు పైరులును; సస్యమంజరీ పుంజంబులన్= పంటకంకుల గుంపులను; కొంచక= సంకోచించకుండగ; చంచువులన్= ముక్కులతో; త్రుంచి= ఖండించి; కబళించి= మ్రింగి; పిల్ల పెంటితండంబులన్= శిశు, ఆడపక్షుల గుంపులతో; కూడి= కలిసి; కడుపులు నిండన్= కడుపులు నిండునట్లుగా; మెక్కి= తిని; విక్కవిరిసి= మిక్కిలి సంతోషించి; చొక్కుచున్= పరవశిస్తూ; త్రిక్కలు+కొని= వెఱ్ఱెత్తి; మహా+ఉత్తుంగ= మిక్కిలి ఎత్తయినవి; సమంచిత= చక్కనయినవి అగు; మంచ ప్రదేశంబులు+ఎక్కి= మంచెలమీద ఎక్కి; సంచరించుచున్= తిరుగుతూ; వెన్నులకావలి= కంకులను కాపాడుటకై; ఉన్న+అన్నులకెమ్మోవులు= ఉన్నట్టి స్త్రీలయొక్క ఎఱ్ఱని క్రింది పెదవుల్ని; బింబఫలంబులు+అని= దొండపండ్లు అని భ్రమించి; కఱచి= తమ ముక్కులతో పొడిచి; తత్+కర+ఆస్ఫాలనంబులన్= వారిచేతిచరుపులచేత; ఉలికిపడి= భయపడి; ఎగసి= పైకెగిరి; చను శుకనికరంబుల కలకలంబులును= పోవునట్టి చిలుకలగుంపులకలకలధ్వనులును; కలహంస= రాజహంసలు; కోక= చక్రవాకములు; సారస= బెగ్గురుపక్షులు (అనువానియొక్క); కోలాహల= కలకల ధ్వనులచేత; మండితంబులు+ఐ= అలంకరింపబడినవై; నిండిన= పూర్ణమయిన; నిర్మల జలంబులు= స్వచ్ఛమయిన నీళ్లు; కల జలాశయంబులును= కలిగిన సరస్సులును; జలాశయంబుల జలంబులు= చెరువులలోని నీళ్లు; అనుదినంబును= ప్రతిదినమూ; ఇగురన్= ఇంకిపోవుచుండగా; గృహంబులన్+ బ్రదుకుదినంబులు= ఇండ్లలో జీవించే దినములు; చనుట= కడచిపోవుట; ఎఱుంగని మనుజులగమనికన్= తెలియని మనుష్యులవలె; తిరుగు జలచరంబులును= తిరుగు చేపలు మొదలగు జలజంతువులును; జలచరహృదయంబులన్= జలజంతువుల మనస్సులలో; బెదురు= భయం; కదురన్= పెరుగునట్లుగా; డొంకి= శుష్కించి; ఇంకిన నదులును= ఇంకిపోయిన ఏరులును; నదుల+అందున్= ఏరులందు; కర్పూర మండపంబుల తెఱంగునన్= కప్పురపు మండపాలలాగా; మణికుట్టిమంబుల మాడ్కినిన్= రతనాలు పరచి ఏర్పరచిన నేలలలాగా; సౌధసోపానమార్గంబుల జాడను= మేడలకు కట్టినమెట్లదారులలాగా; విలోకితంబులు= చూడబడేవి; అగు నూతన సైకతంబులును= అగుక్రొత్త ఇసుకతిన్నెలును; సైకత ప్రదేశంబులన్= ఇసుక తిన్నెల చోటులందు; ఉదయవేళలన్= ప్రాతఃకాలాల్లో; నిత్యకర్మ+అనుష్ఠాన నిరతులు= స్నాన సంధ్యావందనాలు మొదలగు నిత్యం తప్పక చేయవలసిన వేదోక్త కర్మలను ఆచరించుటలో ఆసక్తి కలవారు; అగు మునులును= అయినట్టి ఋషులును; మునికన్యకా= మునుల బాలికలయొక్క; కర= చేతులందలి; కలశ= కుండల; సలిల= జలంచేత; అభిషిక్త= బాగుగా తడుపబడిన; మూలంబులు= మొదళ్లు కలవి; అగు= అగునట్టి; తపస్+వనబాలరసాలసాలంబులును= తపోవనమునందలి గున్నమావిచెట్లును; సాలవిటపి= మద్దిచెట్లయొక్కయు; వాసంతికా= పూగురివిందలయొక్క; కుంజ= పొదరిండ్లయొక్క; పుంజంబుల= సమూహాలయొక్కయు; తఱచునన్= బాహుళ్యంచే; ఇముడుకొని= దట్టంగా అలముకొని; దినకరకిరణంబులకున్= సూర్యకిరణాలకూ; కరువలికిన్= గాలికీ; చొరన్= ప్రవేశించుటకు; వెరవుపడని వనమ్ములును= వీలుకాని అడవులూ; వనమ్ములన్= అడవుల్లో; తరులకొనలన్= చెట్ల చివరలందలి; ఆకు+అలములు= ఆకులను తీగలను; ఏకలమ్ములు+ఐ= ఒంటరులై; మెసంగి= మేసి; మసరుకవిసి= బలిసి; క్రొవ్వి= మదించి; కొమ్ము కొనలన్= దంతాల కొనలతో; సూటిన్= సూటిగా; ఏటిదరులు త్రవ్వి= ఏర్ల గట్టులను త్రవ్వి; చిమ్మి= వెదచల్లుతూ; క్రుమ్మి= దంతాలతో పొడిచి; కోరాడెడివనగజంబులును= మట్టి నెగజిమ్ము అడవి యేనుగులూ; గజకుంభ= ఏనుగుల కుంభస్థలములలాగా; కనకకుంభ= బంగారు కుండలలాగా; రుచిర= చక్కనయిన; కుచభార= స్తనాల బరువుచేత; భీరు= భయపడునట్టి; మధ్య= నడుములతో; సమంచితులు= కూడినవారు; అగుచెంచితలును= అగుచెంచుల పడతులును; చెంచితల= చెంచుజాతి స్త్రీలయొక్క; క్రూరమ్ములు= కఠినమైనవి; అగు వాలమ్ములన్= అగు బాణాలచేత; సారమ్ములు+చెడి= సత్తువతగ్గి; ఖేదమ్మునన్= బడలికచేత; పాదమ్ములు= అడుగులు; తొట్రుపడన్=

తడబడగా; పెనుగాతమ్ములన్= పెద్ద పెద్ద గోతులలో; పడు వరాహ పుండరీకంబులును= పడునట్టి అడవిపందులు; పెద్దపులులును; పుండరీక= తెల్లతామరలు; కుముద= తెల్లకలువలు; కురంటక= పచ్చగోరంటలు; ఆది= మొదలుగాగల; కుసుమ= పూలయొక్క; మకరందంబు= తేనెను; క్రోలి= త్రాగి; తేలి= తృప్తినొంది; సోలి= చొక్కి; వాలి= అతిశయించి; మహా+అహంకృతులన్= హెచ్చయిన అహంకారాలతో; ఝుంకృతులు= ఝుంకారాలు; చేయు తేఁటి కదుపులును= చేసే తుమ్మెదల గుంపులును; కదుపులన్= గుంపులతో; కలయక= కలియకుండగ; ఎడ+కలిగి= దూరంగా ఉండి; మదమునన్= కామమదముచేత; అదనుపదను= ఎద అయిన సమయమును; ఎఱింగి= తెలిసికొని; మదనమార్గణ ప్రేరితంబులు+ఐ= మన్మథుని బాణాలచేత రెచ్చగొట్టబడినవయి; పెంటితుటుముల వెంటన్= ఆడు గుంపుల వెంటబడి; చని= పోయి; ఒండు+ ఒంటిన్= ఒక దానితో ఒకటి; గెంటించుచున్= తోసికొంటూ; తగులనెక్కి= ఒడుపుగా దాటి; గర్భంబులు= చూళ్లను; నెక్కొలుపు= నిలుపునట్టి; మృగవృషభరాజంబులును= మేలయిన జింకలు; ఎద్దులును; కలిగి= కలిగినదయి; రాజరాజగృహంబుపగిదిన్= కుబేరునియింటివలె; విలసిత= ప్రకాశించునట్టి; కుంద= మొల్లల యొక్కయు; పద్మ= తామరపూలయొక్కయు; సౌభాగ్యంబు= చక్కదనం కలది; ఐ= అయి (శరదృతు పరమయిన అర్థము); విలసిత= ప్రకాశించునట్టి; కుంద= కుందము; పద్మ= పద్మము అను నిధులయొక్క; సౌభాగ్యంబు= శోభ కలది; ఐ= అయి (ఇది కుబేరుని యింటికి చెందిన అర్థము); భాగ్యహీనుకర్ణరేఖగతిన్= అదృష్టహీనుని చెవివలె; అశ్రుతనీలకంఠ శబ్దంబు= వినబడని నెమళ్ల ధ్వనులు కలది; ఐ= అయి (ఋతుపరము); అశ్రుత= వినబడని; శివ= శివునియొక్క; శబ్దము= నామము కలది; ఐ= అయి (భాగ్యహీనుని చెవిని గురించిన అర్థము); శబ్దశాస్త్రవేది= వ్యాకరణశాస్త్రం తెలిసినవానియొక్క; హృదయంబు బాగునన్= మనస్సువలె; విశద ప్రకాశ+అభిరామంబు= తెల్లని కాంతిచేత మనోహరమైంది; ఐ= అయి (ఋతుపరము); (స్వచ్ఛమయిన తెలివిచే మనోహరమైనది అని వ్యాకరణ పండితపరమయిన అర్థం); రామసంగ్రామంబుకైవడిన్= శ్రీరామునియొక్క యుద్ధంవలె; బాణ+ఆసన+అలంకృతంబు+ఐ= నల్ల గోరింట చెట్లచేతను; వేగిమ్రాకులచేతను అలంకరింపబడినదయి (ఋతుపరము), ధనుస్సులచేత అలంకరింపబడింది అని (రామయుద్ధ పరం); కృత+అంతహృదయంబుకరణిన్= యముని హృదయంలాగా; అపంకంబు+ఐ= బురదలేనిదయి (ఋతుపరము), (పాపము లేనిదయి అని యమహృదయ పరం); పంకజ+ఆసనుగేహంబు సొంపునన్= పద్మం ఆసనంగా గల బ్రహ్మయొక్క గృహంలాగా; రాజహంస విరాజమానంబు+ఐ= చంద్రసూర్యులచే ప్రకాశిస్తున్నదయి (ఋతుపరం), పరమహంసలచే (బ్రహ్మజ్ఞానులచే) ప్రకాశిస్తున్నదయి అని (బ్రహ్మ గృహపరం); మానధనుని చరిత్రంబు సొబగునన్= మంచితనమే ధనముగా గలవాని నడవడికలాగా; అకల్మష జీవనంబు+ఐ= తేట అయిన నీరుకలదయి (ఋతుపరం), దోషంలేని బ్రతుకు కలదయి (మానధనుని చరిత్రపరం); వననిధి పోలుపునన్= నీటికి నిలయమగు సముద్రంలాగా; సమ్మిళిత= కూడిన; భూభృత్= రాజులయొక్క; వాహినీ= సేనలయొక్క; సంకులంబు= సందడికలది; ఐ= అయి (ఋతుపరం); సమ్మిళిత= కలిసిన; భూభృత్= కొండలనుండి వచ్చిన; వాహినీ= నదులయొక్క; సంకులంబు= పెద్ద చప్పుళ్లు కలది; ఐ= అయి (సముద్రపరము); కులవధూరత్నంబు చెలువునన్= ఉత్తమురాలయిన ఇల్లాలిలాగా; అదృష్టపయోధరంబు+ఐ= కనబడని మేఘములు కలది అయి (ఋతుపరము); కనబడని స్తనములు గలదయి (ఇల్లాలిపరం); ధరణికిన్= భూమికి; తొడవు= ఆభరణమువంటిది; అగుచున్= అవుతూ; శరత్కాలంబు= శరదృతువు; వచ్చెన్= వచ్చింది (ప్రవేశించింది); అంతన్= అపుడు...

**తా :** ఆ శరత్కాలంలో బ్రతుకుతెరువులు విడిచి, ఆత్మజ్ఞాన సిద్ధిచేత జీవన్ముక్తులయి యథేచ్ఛగా దేశాటనం చేసే యోగీశ్వరులవలె, మేఘాలు నీటిని జారవిడిచినందువల్ల మునుపటినలుపు విరిగి తెల్లబడి, గాలితాకిడికి చెల్లాచెదరై పోతున్నాయి. మేఘావరణం తొలగిపోవడంచేత అగస్త్యనక్షత్రంతో కూడిన ఆకాశం ఆత్మజ్ఞానం అనే దీపంతో ప్రకాశించే యోగీశ్వరుని హృదయంవలె

చక్కగా ప్రకాశిస్తోంది. ఆకాశంలో ఉదయించిన నక్షత్రాలు నల్లనిమేలుకట్టుకు (చాందినీ) కూర్చికుట్టిన ముత్యాలవలె ప్రకాశిస్తున్నాయి. ఆ నక్షత్రాలకాంతుల్ని మించి ప్రకాశిస్తూ, బ్రహ్మాండమనే పెట్టెలో పేర్చిన కర్పూరపు పలుకుల్లాగ చంద్రకిరణాలు చెలువారుతున్నాయి. వెన్నెల సోకి నిండుగా పండిన పైరుల వెన్నులు పొట్టలు విచ్చి, పంట బరువుకి, చప్పుడు చేస్తూ వీచే పైరగాలి తాకిడికి, నేలమీదకు ఒరగిపోయాయి. అప్పుడు అవి తమను కోయబోయే రైతుల కరకు కొడవళ్ల పదును తలచి భయపడి, తమను రక్షించమని మొరపెట్టుకుంటూ తమ తల్లి అయిన భూదేవికి ప్రణామం చేస్తున్నాయా అన్నట్లుగా ఉన్నాయి. చిలుకలు ఓపినన్ని పైరుల వెన్నులను సంకోచం లేకుండ ముక్కులతో త్రుంచి నోటితో కరచిపెట్టుకొని, గూళ్లకు చేరి తమ పెంటులతోను, పిల్లలతోను కలిసి కడుపార మెక్కి, చొక్కి, పొగరెక్కి పంటచేలలోని ఎత్తైన మంచెలమీద వ్రాలుతున్నాయి. ఆ మంచెలమీదనుండి పైరులను కాచే కాపుపడుచుల కెమ్మోవులను చూచి అవి ఆరబండిన దొండపండ్లు అనుకొని కొరికాయి. వారు హఠాత్తుగా చేతిచరుపులతో ఎగురగొట్టగా కిలకిల చప్పుళ్లు చేస్తూ ఎగిరిపోయాయి. తేటనీటితో నిండిన సరస్సులలో కలహంసలు, చక్రవాకాలు, బెగ్గురుపక్షులు కలకలధ్వనులు చేస్తూ సంచరిస్తున్నాయి. తరిగిపోయే తమ ఆయుస్సును పట్టించుకోకుండగా భార్యాపిల్లలమీది వ్యామోహంతో సంచరించే మనుష్యులవలె ఇంకిపోయే నీటిని గుర్తించకుండ సరస్సులలో చేపలు మొదలయిన జలచరాలు సంచరిస్తున్నాయి. జలచరాలకు భయం కలిగిస్తూ నదులలోని నీరు ఎండిపోతోంది. ఆ నదులలో వేరు వేరు ఆకృతులుగా మేట వేసిన ఇసుకతిన్నెలు కర్పూరమండపాలవలె, మణులు పొదిగిన నేలలవలె, మేడమెట్ల మాదిరి కనబడుతున్నాయి. ఆ ఇసుక తిన్నెలమీద ఉదయసమయంలో మునులు స్నానసంధ్యావందనాది నిత్యకర్మానుష్ఠానంలో నిమగ్నులయ్యారు. అక్కడి తపోవనాలలోని గున్నమామిడిచెట్లపాదులలో మునికన్యకలు తమ చేతులతో బిందెలతో నీళ్లు మోసికొని వచ్చి పోస్తున్నారు. ఆ వనంలో సూర్యకిరణాలు గాని, గాలికెరటాలు కాని ప్రవేశించడానికి వీలుకానంత దట్టంగా మద్దిచెట్లు, అడవిమొల్లలు అల్లిబిల్లిగా అల్లుకుపోయాయి. అడవిలోని చెట్ల చివరలనుండెడి లేతఆకులను అలములను మేసిన అడవియేనుగులు పొగరెక్కి దంతాగ్రాలతో ఏటిగట్లు పెల్లగించి కోరాడుతున్నాయి. అచటి చెంచెతల సన్నవినడుములు – ఏనుగుల కుంభస్థలాలవలె, బంగారుకుండలవలె బరువైన వారి స్తనాలను భరించడం ఎలాగ అనే భయంతో వణుకుతున్నాయా అన్నట్లుగా ఉన్నాయి. చెంచితలకరకుటమ్ములు గుచ్చుకొనడంచేత సత్తువ చెడి కాళ్లు తడబడుతూ ఉండగా అడవిపందులు పెద్దపులులు పెద్ద పెద్ద గోతులలో పడిపోతున్నాయి. తామరలు కలువలు గోరంటలు మొదలైన పూవులలోని తేనెలు త్రాగి మత్తెక్కి సొక్కిన తుమ్మెదల గుంపులు ఝుంఝుమ్మని రొద చేశాయి. కామంతో మదించిన మగజింకలు, ఆబోతులు తమ తమ మందల్ని విడిచిపెట్టి, వెదకి వెదకి ఎదకువచ్చిన ఆడలేళ్లను, ఆవుల్ని మన్మథతాపంతో దాటి చూలు కట్టిస్తున్నాయి. ఆ శరదృతువు కుందం, పద్మం అనే నిధులతో నిండిన కుబేరునిగృహంలాగ మొల్లలు, తామరలతో చూడ చక్కనిదయింది. శివశబ్దం వినడానికి నోచుకోని భాగ్యహీనుని చెవిలాగ నెమళ్లకేకలు లేనిదయింది (వర్షాకాలంలో మదించిన నెమళ్లుకేకలు పెడతాయి. శరత్కాలంలో వానిమదంతోబాటు కేకలు తగ్గుతాయి). వ్యాకరణశాస్త్రవేత్త హృదయంవలె సమస్త ప్రపంచము తేటతెల్లం అయినందువల్ల ఒప్పిదమయ్యింది (వర్షాకాలంలో కారుమబ్బులు కమ్ముకొని ఉండడంవల్ల భూమిమీద వస్తువులన్నీ తమ సహజకాంతుల్ని పూర్తిగా ప్రసరింపజేయలేవు. వర్షాకాలం గడచి మబ్బులు మాయమవడంవల్ల ప్రపంచంలోని వస్తువులన్నీ తమ తమ సహజగుణంతో ప్రకాశిస్తున్నాయి. అలా ప్రకాశింపజేసింది శరదృతువు). వింటితో విజృంభించిన రాముని యుద్ధంలాగ నల్లగోరింట వేగిసచెట్లతో వెలసింది. పాపచింతలేని యముని హృదయంలాగ బురద లేనిదయ్యింది. మహాపుణ్యం చేసినందువల్ల సత్యలోకం చేరిన మహారాజులతో కూడిన బ్రహ్మదేవుని సభామందిరంలాగ రాజహంసలతో విరాజిల్లింది. పాపసంపర్కం లేని ఉత్తమపురుషుని ప్రవర్తనలాగ బురదలేని నీటితో అలరారింది. కొండలనుండి పుట్టే నదులు వచ్చి చేరడంవల్ల సందడించే సముద్రంలాగ దండయాత్రలకు బయలుదేరే రాజుల చతురంగ బలాల కోలాహలంతో కూడిందయ్యింది.

ఉత్తమురాలయిన ఇల్లాలి స్తనములు కనబడనట్లు మబ్బులు కనబడనిదయింది. ఆ శరదృతువు భూమండలానికి భూషణం అయింది. ఆ తర్వాత

**క. వాజుల నీరాజనములు, రాజుల జయగమనములును రాజితలక్ష్మీ**
**పూజలు దేవోత్సవములు, రాజిల్లెను జగతియందు రాజకులేంద్రా! 766**

**ప్రతి :** రాజకుల+ఇంద్రా= చంద్రవంశశ్రేష్ఠుడవైన ఓ పరీక్షిన్మహారాజా!; జగతి+అందున్= భూమియందు; వాజుల నీరాజనములు= గుఱ్ఱములకు హారతులిచ్చుటలు; రాజుల జయగమనములును= రాజుల దిగ్విజయ యాత్రలును; రాజిత లక్ష్మీపూజలును= ఒప్పిదమయిన లక్ష్మీదేవి పూజలును; దేవ+ఉత్సవములు= వివిధ దేవతలకు చేసే పండుగలును; రాజిల్లెన్= వెలుగొందాయి.

**తా :** ఓ పరీక్షిన్మహారాజా! శరదృతువు రాగానే రాజులందరు దిగ్విజయయాత్రకు బయలుదేరబోతూ తమ తమ వాహనాలకు హారతు లెత్తుతున్నారు. విజయయాత్రలు సాగిస్తున్నారు. లక్ష్మీపూజలు, దేవతలకు ఉత్సవములను జరిపిస్తున్నారు.

**విశే :** దండయాత్రకు బయలు దేరేటప్పుడు గుఱ్ఱాలు మొదలయిన వాహనాలకు హారతులిస్తారు. ఆ సమయంలో జ్వాలలు ప్రదక్షిణక్రమంగా వెలిగాయంటే దాన్ని శుభసూచనగా భావిస్తారు.

**క. చేగ గల చెఱకువింటను, బాగుగ నీలోత్పలంబు బాణంబుగ సం**
**యోగంబు సేసి మదనుఁడు, వేగంబున విరహిజనుల వేఁటాడె నొగిన్. 767**

**ప్రతి :** మదనుఁడు= మన్మథుడు; చేగ గల చెఱకువింటను= చేవగలిగిన చెరుకువింటియందు; బాగుగన్= చక్కగా; నీల+ఉత్పలంబున్= నల్ల కలువను; బాణంబు+కన్= అమ్ముగా; సంయోగంబు+చేసి= సంధించి; మదనుఁడు= మన్మథుడు; విరహిజనులన్= వియోగం పొందిన ప్రజలను; వేగంబునన్= వడిగా; ఒగిన్= వరుసగా; వేఁట+ఆడెన్= బాధించాడు.

**తా :** మన్మథుడు చేవగల తన చెఱకువింటియందు నల్లకలువ అనే తన అమ్మును సంధించి వియోగంతో ప్రజలను వడిగా బాధించసాగినాడు.

**విశే :** మన్మథునికి ఉన్న అయిదు పుష్పబాణాలలో నల్లకలువ ఒకటి. మిగిలిన నాలుగు అరవిందం, అశోకం, చూతం (మామిడిపూవు), నవమల్లిక.

**వ. ఇట్లు భాసురంబు లయిన శరద్వాసరంబుల గోవిందుండు గోబృందసమేతుండై బృందావనంబునఁ బసులఁ బొసంగ మేపుచు. 768**

**ప్రతి :** ఇట్లు= ఈ ప్రకారంగా; భాసురంబులు+అయిన= ప్రకాశించునట్టి వయిన; శరత్+వాసరంబులన్= శరత్కాల దినములందు; గోవిందుండు= శ్రీకృష్ణుడు; గోబృందసమేతుండు= ఆలమందలతో కూడినవాడు; ఐ= అయి; బృందావనంబునన్= బృంద అను పేరుగల అడవియందు; పసులన్= ఆవులను; పొసంగన్= చక్కగా; మేపుచున్= మేపుచు...

**తా :** ఈ విధంగా ఆ శరత్కాలపు రోజులలో శ్రీకృష్ణుడు బృందావనంలో చక్కగా ఆలమందలను మేపుతూ

**సీ. కర్ణావతంసితకర్ణికారప్రభ గండభాగద్యుతిఁ గడలుకొలుప**
**భువనమోహనమైన భ్రూవిలాసంబుతో వామభాగానతవదన మొప్ప**

**నపసవ్యకరమృదులాంగుళిచాతురి షడ్జధ్వనికి మర్మసరణిఁ జూప**
**డాకాలిమీఁద నడ్డము సాఁచి నిల్పినపదనఖద్యుతి భూమిఁ బ్రబ్బికొనఁగ**

**తే. మౌళిపింఛముఁ గంఠదామమును మెఱయ, విలసితగ్రామముగ నొక్కవేణువందు**
**బ్రహ్మగాంధర్వగీతంబు పరఁగఁ జేసెఁ, జతురనటమూర్తి గోపాలచక్రవర్తి. 769**

**ప్రతి :** చతురనటమూర్తి= నిపుణుడయిన నటునియొక్క ఆకారం కలవాడు; గోపాలచక్రవర్తి= గొల్లలలో మేలు బంతివంటి వాడయిన శ్రీకృష్ణుడు; కర్ణ= చెవులయందు; అవతంసిత= అలంకారంగా చేయబడ్డ; కర్ణికార= కొండగోగు పువ్వుయొక్క; ప్రభ= కాంతి; గండభాగద్యుతిన్= చెక్కిళ్లకాంతిని; కడలుకొలుపన్= అన్నివైపులకు వ్యాపింపజేయగా; భువనమోహనము+ఐన= లోకానికి మైమరపు కలిగించునట్టిది ఐన; భ్రూవిలాసంబుతోన్= కనుబొమల చక్కదనంతో; వామభాగ+ఆనతవదనము= ఎడమవైపునకు వంచబడిన మొగం; ఒప్పన్= అందగించగా; అపసవ్యకర= కుడిచేతియొక్క; మృదుల= మెత్తనయిన; అంగుళి= వ్రేళ్లయొక్క; చాతురి= నేర్పు; షడ్జధ్వనికిన్= షడ్జమనే(స) స్వరంయొక్క ధ్వనికి; మర్మసరణిన్= రహస్యమార్గాన్ని; చూపన్= దర్శింపజేస్తుండగా; డాకాలిమీఁదన్= ఎడమకాలిమీద; అడ్డము+చాఁచి= అడ్డంగా చాపి; నిల్పిన పదనఖద్యుతి= నిలిపినట్టి కాలిగోళ్ల కాంతి; భూమిన్= నేలను; ప్రబ్బికొనన్+కన్= ఆవరింపగా; మౌళిపింఛమున్= సిగలోని నెమలిపించెము; కంఠదామమును= మెడలోని దండయును; మెఱయన్= ప్రకాశిస్తూండగా; విలసిత గ్రామము+కన్= ప్రకాశించునట్టి స్వరాలు కలుగునట్లుగా; ఒక్క వేణువు+అందున్= ఒక పిల్లనగ్రోవియందు; బ్రహ్మగాంధర్వగీతంబున్= వేదసంబంధమయిన గంధర్వగానాన్ని; పరఁగన్+చేసెన్= ప్రకాశింపజేశాడు.

**తా :** చక్కగా నటించే నేర్పుగల ఆ శ్రీకృష్ణుడు పిల్లనగ్రోవి చేతబట్టి స, రి, గ, మ, ప, ద, ని అనే సప్తస్వరాలు చక్కగా వ్యక్తమయ్యే విధంగా వేదసంబంధమయిన గంధర్వగీతం ఆలపించాడు. సిగలో నెమలిపించెం, మెడలో పూలదండ అందంగా అలరిస్తున్నాయి. చెవులలోని కొండగోగుపూలరంగు చెక్కిళ్లమీద అంతట వ్యాపించి వానిశోభను ఇనుమడింపజేసింది. కనుబొమ్మల సొబగుతో ఎడమవైపునకు వంచబడిన మొగం లోకానికి మైమరపు కలిగిస్తోంది. సుకుమారమైన కుడిచేతివ్రేళ్లు పిల్లనగ్రోవిరంధ్రములమీద నటిస్తూ సప్తస్వరాలకు ధ్వనిరహస్యాలు నేర్పుతున్నాయి. ఎడమకాలిమీద అడ్డంగా చాచి ఉంచిన కుడికాలిగోళ్ల కాంతి నేలమీద అంతటా వ్యాపించింది.

**వ. ఇట్లు హరి వేణునాదంబు పూరించిన మారవికారహేతువగు తద్గీతం బాలించి సిగ్గులు చాలించి మక్కువలు సెక్కులొత్త గోపిక లోపికలు లేక తమతమ పొత్తుకత్తెలుం దారును దత్తరంబునఁ బదుగురు నేగురుఁ దుటుములు గట్టి జిలిబిలి ముచ్చటలకుం జొచ్చి తమలోన. 770**

**ప్రతి :** హరి= శ్రీకృష్ణుడు; ఇట్లు= ఈ ప్రకారంగా; వేణునాదంబు పూరించినన్= పిల్లనగ్రోవిని ఊదగా; మార వికారహేతువు= కామోద్దీపకము; అగుతద్+గీతంబు= అయినట్టి ఆ పాటను; ఆలించి= విని; సిగ్గులు+చాలించి= సిగ్గువిడిచి; గోపికలు= గొల్లపడుచులు; మక్కువలు= అనురాగాలు; చెక్కులు+ఒత్తన్= ఎక్కువకాగా; ఓపికలులేక= సహనం లేక; తమ తమ పొత్తు కత్తెలును= తమ తమ చెలికత్తెలును; తారును= తామును; తత్తరంబునన్= తత్తరపాటుతో; పదుగురును= పదిమందీ; ఏగురున్= అయిదుగురూ; తుటుములుగట్టి= గుంపుగా గూడి; తమలోనన్= తమలో తాము; జిలిబిలి ముచ్చటలకున్= ముద్దు ముచ్చట్లకు...

**తా :** ఈ విధంగా శ్రీకృష్ణుడు పిల్లనగ్రోవి ఊదాడు. కామోద్దీపకమైన ఆ పాట విన్న గోపికలు సిగ్గులు విడిచిపెట్టేశారు. వలపులు ఊరడంచేత సహనం కోల్పోయారు. తమ చెలికత్తెలతో కలిసి, అయిదుగురు, పదిమంది చొప్పున గుంపులు గుంపులుగా చేరి ముద్దుముచ్చట్లలో

**మ.** **శ్రవణోదంచితకర్ణికారకముతో స్వర్ణాభచేలంబుతో**
**నవతంసాయితకేకిపింఛకముతో నంభోజదామంబుతో**
**స్వవశుండై మధురాధరామృతముచే వంశంబుఁ బూరించుచున్**
**ఉవిదా! మాధవుఁ డాలవెంట వనమం దొప్పారెడిం జూచితే!** **771**

**ప్రతి :** ఉవిదా= ఓ పడతీ; శ్రవణ+ఉత్+అంచిత కర్ణికారముతోన్= చెవిమీద చక్కగా అమరి ఉన్న కొండగోగు పువ్వుతోను; స్వర్ణ+ఆభ చేలంబుతోన్= బంగారు వన్నెకల బట్టతోను; అవతంసాయిత కేకి పింఛకముతోన్= సిగపూవుగా అలంకరింపబడ్డ నెమలిపింఛంతోడను; అంభోజ దామంబుతోన్= తామరపూల మాలతోను; మాధవుఁడు= శ్రీకృష్ణుడు; స్వవశుండు+ఐ= స్వతంత్రుడయి; మధుర+అధర+అమృతముచేన్= తీయనైన మోవితేనెతో; వంశంబున్= పిల్లనగ్రోవిని; పూరించుచున్= ఊదుతూ; ఆలవెంటన్= ఆవులవెంబడి; వనము+అందున్= బృందావనంలో; ఒప్పారెడిన్= మిక్కిలి ఒప్పుతున్నాడు; చూచితి+ఏ= చూచావా!

**తా :** ఓ చెలీ! శ్రీకృష్ణుడు చెవిలో కొండగోగుపువ్వును ధరించాడు. పసిడివన్నె బట్ట కట్టాడు. సిగలో నెమిలి పింఛం తురుముకున్నాడు. మెడలో తామరపూలదండ ధరించాడు. వేణువు నూదుతూ అడవిలో ఆవులవెంట తిరిగే శ్రీకృష్ణుణ్ణి చూచావా! ఎంత చక్కగా ఉన్నాడో!

**శా.** **రావే సుందరి! యేమె బోటి! వినవే! రాజీవనేత్రుండు బృం**
**దావీథిం దగ వేణు వూఁదుచు లసత్సవ్యానతాస్యంబుతో**
**భ్రూవిన్యాసము లంగుళీక్రమములుం బొల్పార షడ్జంబుగాఁ**
**గావించెన్ నటుభంగి బ్రహ్మమగు తద్గాంధర్వసంగీతమున్.** **772**

**ప్రతి :** సుందరి= ఓ చక్కనిదానా!; రావు+ఏ= ఇటు రమ్ము; బోటి= చెలీ; ఏమి+ఎ= పరాకు ఏలనే; వినవు+ఏ= నా మాట వినవే; రాజీవనేత్రుండు= తామరపూలవంటి కన్నులు గలవాడు అగు శ్రీకృష్ణుడు; బృందావీథిన్= బృందావనమార్గంలో; తగన్= ఒప్పిదంగా; వేణువు+ఊఁదుచున్= పిల్లనగ్రోవి నూదుతూ; లసత్= చక్కనగునట్లు; సవ్య= ఎడమవైపున; ఆనత= బాగుగావంచబడ్డ; ఆస్యంబుతోన్= మొగంతో; భ్రూవిన్యాసములన్= కనుబొమలకదలికలును; అంగుళీక్రమములున్= వ్రేళుల కదలికలును; పొల్పారన్= చక్కనగుచుండగా; షడ్జంబు+కాన్= షడ్జస్వరంతో కూడునట్లుగా; నటుభంగిన్= నటునిలాగా; బ్రహ్మము+అగు= వేదస్వరూపమయిన; తద్+గాంధర్వ సంగీతమున్= గంధర్వులు చేసే గానంవంటి గానాన్ని; కావించెన్= చేశాడు.

**తా :** ఓ సుందరీ! ఇటురా! చెలీ! నే చెప్పేది శ్రద్ధగా విను. శ్రీకృష్ణుడు బృందావనంలో విహరిస్తూ, ఎడమవైపునకు వంచిన ముఖంతో కనుబొమలు కదిలిస్తూ, వేణువుమీద వ్రేళ్ల స్వరవిన్యాసాలు నెరపుతూ, ఆరితేరిన నటుని లాగ షడ్జస్వరప్రధానంగా గాంధర్వగీతాన్ని ఆలపిస్తున్నాడు.

**క. తలఁకెను గొబ్బునఁ జిత్తము, నలినాక్షుని మధురవేణునాదము నా వీ**
**నులు సోఁకినంతమాత్రన, చెలియా! యిఁక నేటివెఱపు చింతింపఁ గదే! 773**

**ప్రతి :** చెలియా= ఓ సఖీ!; నలిన+అక్షుని= తామరపూలవంటి కన్నులుగల శ్రీకృష్ణునియొక్క; మధుర= తియ్యనైన; వేణునాదము= పిల్లనగ్రోవిధ్వని; నా వీనులు= నా చెవులు; సోఁకినంత మాత్రనన్= తాకినంతమాత్రంచేతనే; గొబ్బునన్= శీఘ్రంగా; చిత్తము= మనస్సు; తలఁకెన్= చలించింది; ఇఁకన్= ఇంక; ఏటివెఱపు= భయమెందుకు; చింతింపన్+కదు+ఏ= ఆలోచించవే.

**తా :** ఓ చెలీ! శ్రీకృష్ణుని తీయని వేణుగానం చెవులలో బడిన వెంటనే నా మనస్సు వశం తప్పింది. ఇంక భయం ఎందుకు? దీన్ని గురించి ఆలోచించవే.

**క. నాతోడ వెఱవ వలదే?, నాతోడనె కొనుచుఁ బోయి నలినదళాక్షున్**
**నీతోడుతఁ బలికించెద, నీతోడిజనంబు మెచ్చ నీతోడు సుమీ! 774**

**ప్రతి :** నాతోడు+అ= నా తోటిదానా! వెఱవ వలదు+ఏ= భయపడ వద్దే!; నా తోడను+ఎ= నా తోనే; కొనుచున్+పోయి= తీసుకొని వెళ్లి; నీ తోడిజనంబు మెచ్చన్= నీ తోటివారు మెచ్చుకొనునట్లుగా; నీ తోడుతన్= నీతో; పలికించెదన్= మాటాడిస్తాను; నీ తోడు సుమీ= నీ మీద ఒట్టు సుమా!

**తా :** నా తోడ రావడానికి భయపడ వద్దు. నీ తోటివారు నిన్ను మెచ్చుకొనే విధంగా నిన్ను తీసికొని పోయి, శ్రీకృష్ణునితో మాటాడిస్తాను. నీమీద ఒట్టు సుమా!

**వ. అని పెక్కుభంగుల నోర్తొర్తె నుద్దేశించి పలుకుచు, గోపసుందరులు బృందావనంబునకు గోవిందుని కెదురు చని పరమానందంబున నతనిం దమమనంబులఁ బ్రతిపదంబును నాలింగనంబు సేసినవార లగుచు, రామకృష్ణుల నుద్దేశించి. 775**

**ప్రతి :** అని= ఈ ప్రకారంగా; గోపసుందరులు= గొల్ల స్త్రీలు; ఓర్తు+ఓర్తెన్+ఉద్దేశించి= ఒకరిని గురించి మరి ఒకరు; పలుకుచున్= మాటాడుతూ; బృందావనమునకున్= బృందావనానికి; గోవిందునకున్= శ్రీకృష్ణునికి; ఎదురు చని= ఎదురుగా వెళ్లి; పరమ+ఆనందంబునన్= మిక్కిలి సంతోషంతో; అతనిన్=శ్రీకృష్ణుని; తమ మనంబులన్= తమ మనస్సులలో; ప్రతిపదంబునున్= అడుగడుగునకు; ఆలింగనంబు+చేసినవారలు+అగుచున్= కౌగిలించుకొన్నవారలు అవుతూ; రామకృష్ణులన్+ ఉద్దేశించి= బలరామకృష్ణులను ఉద్దేశించి...

**తా :** ఈ విధంగా గొల్లపడుచులు తమలో తాము చెప్పుకొంటూ, మాటి మాటికీ శ్రీకృష్ణుణ్ణి తమ మనస్సులోనే కౌగిలించుకొంటూ, బలరామ కృష్ణుల గురించి

**మ. నవగోస్థానకరంగమందుఁ బరమానందంబుతోఁ జూత ప**
**ల్లవ నీలోత్పలపింఛపద్మదళమాలావస్త్రసంపన్నులై**
**కవయై వేణువు లూఁదుచున్ బహునటాకారంబులం గేళితాం**
**డవముల్ సేసెద రీ కుమారకులు; వేడ్కం గామినుల్ గంటిరే? 776**

**ప్రతి :** కామినుల్= ఓ కామినులారా!; ఈ కుమారకులు= ఈ బాలకులగు బలరామకృష్ణులు; నవగోస్థానకరంగము+ అందున్= క్రొత్తది అయిన గోష్ఠం (ఆవులను కట్టు దొడ్డి) అనే రంగస్థలంలో; చూతపల్లవ= మామిడి చిగుళ్లయొక్కయు; నీల+ఉత్పల= నల్ల కలువలయొక్క; పింఛ= నెమలి పింఛములయొక్క; పద్మదళ= తామరపూరేకులయొక్క; మాలా= దండలతో; వస్త్ర= మంచిబట్టలతో; సంపన్నులు= కూడినవారు; ఐ= అయి; కవ+ఐ= జంటగా కూడినవారయి; వేణువులు+ ఊఁదుచున్= పిల్లనగ్రోవులు ఊదుతూ; బహునట+ఆకారంబులన్= అనేక నటుల వేషాలతో; పరమ+ఆనందంబుతోన్= మిక్కిలి సంతోషంతో; కేళి తాండవముల్= వినోదంతో నాట్యాలు; చేసెదరు= చేస్తున్నారు; వేడ్కన్= కుతూహలంతో; కంటిరి+ఏ= చూచారా?

**తా :** ఓ చెలులారా! ఈ బలరామకృష్ణులు మామిడిచిగుళ్లు, నల్లకలువలు, నెమలిపింఛాలు, తామరపూలు దండలుగా చేసుకొని ధరించారు. మంచిబట్టలు కట్టుకొన్నారు. వేణువులు ఊదుతూ, అనేకవేషాలు వేస్తూ వినోదం కలిగిస్తూ సంతోషంతో బహువిధాలైన నాట్యాలు చేస్తున్నారు. చూడండి.

**క. ఓ చెలువలార! వినుఁడీ, వాచాశతకంబు లేల? వర్ణింపంగా**
**లోచనముల కలిమికి ఫల, మీచెలువురఁ జూడఁగలుగు టింతియ సుండీ? 777**

**ప్రతి :** ఓ చెలువలార= ఓ సుందరులారా!; వినుఁడు+ఈ= వినండి; వర్ణింపన్+కాన్= వర్ణించడానికి; వాచాశతకంబులు= నూరుమాటలు; ఏల= ఎందుకు; లోచనముల కలిమికిన్= కన్నులున్నందుకు; ఫలము= ప్రయోజనం; ఈ చెలువురన్= ఈ అందగాండ్రను; చూడన్+కలుగుట= చూడడమే; ఇంతియ+చుండు+ఈ= ఇంతే సుమా!

**తా :** ఓ సుందరులారా! చక్కగా వినండి! వీరిని వర్ణించడానికి వందమాటలు పలకడం ఎందుకు? కళ్లున్నందుకు ఈ బలరామకృష్ణుల్ని చూడడమే ప్రయోజనం.

**వ. అని పలికి; రందుఁ గొందఱు గోవిందు నుద్దేశించి. 778**

**ప్రతి :** అని= ఇట్లు; పలికిరి= చెప్పిరి; అందున్= ఆ గోపికలలో; కొందఱు= కొంతమంది; గోవిందున్+ఉద్దేశించి= శ్రీకృష్ణుని గురించి...

**తా :** ఈ విధంగా మాటాడుకొన్నారు. వారిలో కొందరు శ్రీకృష్ణుణ్ణి గురించి

**మ. ఒనరన్ వ్రేతల కించుకేనియును లే కుండంగ గోపాల కృ**
**ష్ణునికెమ్మోవిసుధారసంబు గొనుచుం జోద్యంబుగా మ్రోయుచుం**
**దన పర్వంబులు నేత్రపర్వములుగా దర్పించెఁ బూర్వంబునన్**
**వనితా! యెట్టితపంబు సేసెనొకొ యీ వంశంబు వంశంబులోన్. 779**

**ప్రతి :** వనితా= ఓ చెలీ; ఈ వంశంబు= ఈ వేణువు; వ్రేతలకున్= గొల్ల పడుచులకు; ఇంచుక= కొంచెం; ఏనియున్= కూడ; లేక+ఉండన్+కన్= లేకుండేటట్లుగా; గోపాలకృష్ణునికెమ్మోవిసుధారసంబున్= గోపాలకృష్ణునియొక్క ఎఱ్ఱని అధరంయొక్క అమృతరసాన్ని; ఒనరన్= చక్కగా; కొనుచున్= గ్రహిస్తూ; చోద్యంబు+కాన్= ఆశ్చర్యం కలిగేటట్లు; మ్రోయుచున్= మ్రోగుతూ; తన పర్వంబులు= తన కనుపులు; నేత్రపర్వములు కాన్= కనుల కానందం కలిగిస్తున్నవి అవుతుండగా; దర్పించెన్=

గర్వించింది; వంశంబులోన్= తన వంశంలో; ఎట్టితపంబు= ఎటువంటి తపస్సును; చేసెను+ఒకొ= చేసిందో కదా!

**తా :** ఓ చెలియా! ఈ పిల్లనగ్రోవి అదృష్టం ఎంతటిదో కదా! గోపికలకు కొంచెంకూడ మిగుల్చకుండ శ్రీకృష్ణుని అధరామృతం అంతా తనొక్కతే త్రాగేస్తోంది. చక్కగా మ్రోగుతోంది. తన పర్వాలను నేత్రపర్వంగా చూచుకొంటూ మిడిసిపడుతోంది. ఇది పూర్వం ఎంత తపస్సు చేసిందో కదా!

**మ. ముదితా! యే తటినీపయఃకణములన్ మున్ వేణు వింతయ్యె నా**
**నది సత్పుత్రునిఁ గన్నతల్లిపగిదిన్ నందంబుతో నేఁడు స**
**మ్మదహంసధ్వని పాటగా వికచపద్మశ్రేణి రోమాంచమై**
**యొదవం దుంగతరంగహస్తనటనోద్యోగంబు గావింపదే! 780**

**ప్రతి :** ముదితా= ఓ యువతీ; వేణువు= ఈ పిల్లనగ్రోవి; మున్= పూర్వం; ఏ తటినీ పయఃకణములన్= ఏ నదియొక్క జలబిందువులచేత; ఇంత+అయ్యెన్= ఇంతగా పెరిగిందో; ఆ నది= ఆ ఏరు; సత్పుత్రునిన్= మంచి కొడుకును; కన్నతల్లి పగిదిన్= కన్నతల్లివలె; నందంబుతోన్= సంతోషంతో; నేఁడున్= ఇప్పుడూ; సమ్మదహంసధ్వని= మదించిన హంసలయొక్క ధ్వని; పాట+కాన్= పాట అగునట్లుగాను; వికచపద్మశ్రేణి= వికసించిన తామరపూల గుంపుతో; రోమాంచము= గగుర్పాటు; ఐ+ఒదవన్= అయి ఒప్పుతుండగా; తుంగ= పొడవయిన; తరంగ= కెరటములనెడి; హస్త= చేతులతో; నటన= నటించుట అనెడి; ఉద్యోగంబున్= ప్రయత్నాన్ని; కావింపదు+ఏ= చేయదా?

**తా :** ఓ చెలీ! ఈ వేణువు పూర్వం ఏ నదీజల బిందువులవల్ల పెరిగి ఇంతటి మహాభాగ్యాన్ని పొందిందో కదా! కాని ఆ నదికి కలిగే సంతోషాన్ని వర్ణించగలమా? ఆ నది మంచి కొడుకును గన్న తల్లిలాగ తనలో విహరించే హంసల కల కల ధ్వనులే పాటగా, తన కెరటాల కదలికలే హస్తాభినయంగా నాట్యం చెయ్యదా! తప్పక చేస్తుంది.

**క. నలినోదరుభక్తునిఁ గని, కులజులు నందాశ్రుజలము గురియుపగిది భ్రూఁ**
**కులు పూఁదేనియ లొలికెడు, నలినాక్షునిచేతివంశనాళము మ్రోఁతన్. 781**

**ప్రతి :** నలిన+ఉదరు భక్తునిన్= తామరపూవు ఉదరమునందు కల విష్ణువుయొక్క భక్తుణ్ణి; కని= చూచి; కులజులు= అదే వంశంలో పుట్టినవారు; నంద+అశ్రుజలము= సంతోషబాష్పాలు; కురియుపగిదిన్= రాల్చేరీతిగా; నలిన+అక్షుని= తామరపూలవంటి కన్నులు గల శ్రీకృష్ణునియొక్క; చేతి= చేతియందలి; వంశనాళము= పిల్లనగ్రోవియొక్క; మ్రోఁతన్= ధ్వనిచేత; భ్రూఁకులు= చెట్లు; పూవు+తేనియలు= మకరందాలు; ఒలికెడున్= కురుస్తున్నవి.

**తా :** తమ కులంలో పుట్టిన గొప్ప విష్ణుభక్తుణ్ణి చూచి, ఆ కులంలోని వారంతా సంతోషంతో ఆనందబాష్పాలు రాల్చేవిధంగా, శ్రీకృష్ణునిచేతిలోని వేణువు యొక్క రమణీయ రవళిని విని సంతోషించిన చెట్లు మకరందాన్ని వర్షిస్తున్నాయి.

**శా. నా మోసంబున కెద్దిమేర? వినవే నా పూర్వజన్మంబులన్**
**లేమా! నోముల నోఁచుచో నకట! కాళిందీతటిన్ వేణువై**
**భూమిం బుట్టెద నంచుఁ గోరఁ దగదే? బోధిల్లి యట్లైన నీ**
**బామం దిప్పుడు మాధవాధరసుధాపానంబు గల్గుంగదే! 782**

**ప్రతి :** లేమా= ఓ చెలీ!; నా మోసంబునకున్= నేను పొందిన మోసానికి; మేర= హద్దు; ఎద్ది= ఏది?; వినవు+ఏ= చక్కగా విను; నా పూర్వజన్మంబులన్= ముందు గడచిన నా పుట్టుకలలో; నోములు నోఁచుచోన్= వ్రతాలను ఆచరించేటప్పుడు; అకటా= అయ్యో; బోధిల్లి= తెలివి కలదాన్నై; కాళిందీ తటిన్= యమునానది ఒడ్డునందు; వేణువు+ఐ= వెదురునయి; భూమిన్= ఈ భూలోకంలో; పుట్టెదన్= జన్మిస్తాను; అంచున్= అని భావిస్తూ; కోరన్+తగదు+ఏ= కోరుకొనరాదా?; అట్లు+ఐనన్= ఆ విధంగా అయితే; ఈ బాము+అందున్= ఈ జన్మలో; ఇప్పుడు= ఈ సమయంలో; మాధవ+అధరసుధాపానంబు= శ్రీకృష్ణునియొక్క మోవితేనెను త్రాగుట; కల్గున్+కద+ఏ= సంభవించేది కదా!

**తా :** అయ్యో! నేనెంత మోసపోయానో గదే! సఖీ! నేను పూర్వజన్మంలో నోములు నోచేటప్పుడు రాబోయేజన్మలో భూలోకంలో యమునానది ఒడ్డున వెదురుగా పుట్టాలని కోరుకున్నా బాగుండేది. అలా కోరుకొని ఉంటే నాకు శ్రీకృష్ణుని మోవితేనె దక్కేది కదా!

**క. కాళిందీకూలంబున, నాళీ! యీ నందతనయునధరామృతముం**
**గ్రోలెడి వేణువ నగు నో, మేలాగున నోఁచవచ్చు నెఱిఁగింపఁగదే! 783**

**ప్రతి :** ఆళీ= ఓ సఖీ!; కాళిందీ కూలంబునన్= యమునానది ఒడ్డునందు; ఈ నందతనయు= నందుని కొడుకగు ఈ శ్రీకృష్ణునియొక్క; అధర+అమృతమున్= మోవితేనెను; క్రోలెడి వేణువన్= త్రాగునట్టి వెదురుగా; అగు నోము= తగినట్టి వ్రతాన్ని; ఏలాగునన్= ఏ విధంగా; నోఁచవచ్చున్= చేయవచ్చునో; ఎఱిఁగింపన్+కదు+ఏ= తెలియజెప్పుమా!

**తా :** ఓ చెలీ! యమునాతీరంలో శ్రీకృష్ణుని అధరసుధను పానం చేసే వెదురుగా పుట్టాలంటే ఏమి నోము నోచాలో నాకు చెప్పు.

**క. వనితా! కృష్ణుఁడు నల్లని, ఘన మనియున్ వేణురవము గర్జన మనియున్**
**మనమునఁ దలంచి రొప్పుచు, ననవరతము నెమలితుటుము లాడెడిఁ గంటే! 784**

**ప్రతి :** వనితా= ఓ సఖీ!; కృష్ణుఁడు= శ్రీకృష్ణుడు; నల్లనిఘనము+అనియున్= నల్లని మేఘమనియు; వేణురవము= పిల్లనగ్రోవి రవళి; గర్జనము+అనియున్= ఉరుము అనియును; మనమునన్= మనస్సులో; తలంచి= భావించి; రొప్పుచున్= కేకలు వేస్తూ; నెమలితుటుములు= నెమళ్లగుంపులు; ఆడెడిన్= నాట్యం చేస్తున్నవి, కంటి(ఎ)+ఏ= చూచినావా!

**తా :** శ్రీకృష్ణుణ్ణి చూచి నల్లనిమేఘం అనీ, వేణురవం విని అది ఉరము చప్పుడు అనీ సంతోషంతో కేకలు వేస్తూ నెమళ్ల గుంపులు నాట్యం చేస్తున్నాయి చూచావా?

**క. గిరిచరమిథునము లోలిం, బరికింపఁగఁ గృష్ణపాదపద్మాంకితమై**
**సురరాజునగరికంటెను, దరుణీ! బృందావనంబు దద్దయు నొప్పెన్. 785**

**ప్రతి :** తరుణీ= ఓ యువతీ; గిరిచరమిథునములు= కొండలలో తిరుగునట్టి దేవతాదంపతులు; ఓలిన్= వరుసగా; పరికింపన్+కన్= చూస్తుండగా; కృష్ణపాదపద్మ+అంకితము+ఐ= శ్రీకృష్ణుని పద్మాలవంటి అడుగుల గుర్తులతో కూడిందై; సురరాజు నగరికంటెను= ఇంద్రుని నగరమగు అమరావతికంటే; బృందావనంబు= ఈ బృందారణ్యం; తద్దయున్= మిక్కిలిగ; ఒప్పెన్= ప్రకాశించింది.

**తా :** ఓ సఖీ! కొండలలో తిరిగే దేవ గంధర్వాది జాతులకు చెందిన దంపతులు శ్రీకృష్ణుని పాదముద్రలచే పవిత్రీకరింపబడి అందంగా కనిపించే బృందావనాన్ని; అమరావతికంటె గొప్పదిగా భావిస్తూ చూస్తూ ఉండిపోతున్నారు.

**మ. అమరేంద్రాంగన లాకసంబున విమానారూఢలై పోవుచుం**
**గమలాక్షున్ శుభమూర్తిఁ గాంచి మురళీగానంబు లందంద క**
**ర్ణములన్ నిల్పుచు మేఖలల్ వదలఁగా నాథాంకమధ్యంబులం**
**బ్రమదా! వ్రాలిరి చూచితే వివశలై పంచాశుగభ్రాంతలై. 786**

**ప్రతి :** ప్రమదా= ఓ మదవతీ!; అమర+ఇంద్ర+అంగనలు= దేవతాశ్రేష్ఠుల భార్యలు; ఆకసంబునన్= ఆకాశంలో; విమాన+ఆరూఢలు= విమానాలు అధిరోహించినవారు; ఐ= అయి; పోవుచున్= వెళ్లుతూ; శుభమూర్తిన్= మంగళకరమైన ఆకారంగల; కమల+అక్షున్= తామరపూలవంటి కన్నులుగల శ్రీకృష్ణుణ్ణి; కాంచి= చూచి; మురళీగానంబులు= వేణుగానాలు; అందున్+అందున్+అ= మాటిమాటికి; కర్ణములన్= చెవుల్లో; నిల్పుచున్= నిల్పుకొంటూ; పంచ+ఆశుగ భ్రాంతలు+ఐ= మన్మథ భ్రాంతికి లోనయినవారై; వివశలు+ఐ= పరవశించి; మేఖలల్= మొలనూళ్లు; వదలన్+కాన్= విడివడుచుండగా; నాథ+అంకమధ్యంబులన్= భర్తల ఒడల్లలో; వ్రాలిరి= ఒదిగారు; చూచితి(వి)+ఏ= చూచావా?

**తా :** ఓ సఖీ! అటు చూడు. దేవతాశ్రేష్ఠుల భార్యలు విమానాలమీద ఆకాశంలో విహరిస్తూ వెడుతూ మంగళకరమైన శ్రీకృష్ణునిరూపం చూశారు. ఆతని మురళీగానం మరీమరీ విన్నారు. అంతే! మన్మథావేశానికి లోనయి కోకముడులు వీడిపోతుండగా భర్తలకౌగిళ్లలో వాలిపోయారు.

**ఉ. కానల నుండుచున్ సరసగానవివేకవిహీనజాతులై**
**వీనుల నేఁడు కృష్ణముఖవేణురవామృతధార సోఁకినన్**
**మేనులు మేఁతలున్ మఱచి మెత్తనిచూడ్కి మృగీమృగావళుల్**
**మానిని! చూడవమ్మ! బహుమానము సేసెఁ గృతార్థచిత్తలై. 787**

**ప్రతి :** మానిని= అభిమానం కల ఓ సఖీ!; కానలన్= అడవులలో; ఉండుచున్= బ్రతుకుతూ; సరస= రసవంతమయిన; గాన= సంగీతంలోని; వివేక= మంచిచెడులను విడదీసి చూచే తెలివిచేత; విహీన= మిక్కిలి తక్కువ అయిన; జాతులు+ఐ= పుట్టుక కలవారయి; నేఁడు= ఈనాడు; కృష్ణ= శ్రీకృష్ణునియొక్క; ముఖ= నోటినుండి; వేణురవ= మురళీగానం అనే; అమృతధార= అమృతప్రవాహం; వీనులన్= చెవులకు; సోఁకినన్= తగులగా; మృగీమృగ+ఆవళులు= ఆడ, మగ జింకల గుంపులు; కృత+అర్థ చిత్తలు+ఐ= నెరవేరిన కోరికలు గల మనస్సులు గలవై; మేనులు= శరీరాలూ; మేఁతలున్= ఆహారాలూ; మఱచి= మాని; మెత్తనిచూడ్కిన్= మెత్తనయిన చూపులను; బహుమానము+చేసెన్= బహుమతిగా సమర్పించాయి; చూడవు+అమ్మ= చక్కగా తిలకించవమ్మా!

**తా :** ఓ సఖీ! ఈ అడవిలోని మృగాలజంటలు రసవంతమయిన శ్రీకృష్ణునివేణుగానాన్ని వింటున్నాయి. ఆ పాటలో స్వారస్యం గుర్తించే వివేకం వాటికి లేదు. అయినప్పటికీ పరవశించిపోయి, ఒళ్లుమరచి, మేతలు విడిచి, తిన్ననయిన చూపులతో శ్రీకృష్ణుణ్ణి అభినందిస్తున్నాయా అన్నట్టుగా ఉన్నాయి. గమనించు.

**ఉ. తల్లుల చన్నుఁబాలు మును ద్రావు తఱిన్ దమకర్ణవీథులన్**
**వల్లభమైన మాధవునివంశరవామృతధార సొచ్చినం**
**ద్రుళ్ళక పాలురాఁ దివక దూఁటక మానక కృష్ణుమీఁద దృ**
**గ్వల్లులు సేర్చి నిల్చె నదె! వత్సము లంగనలార! కంటిరే! 788**

**ప్రతి :** అంగనలార= ఓ చెలులారా!; వత్సములు= దూడలు; మును= ముందుగ; తల్లుల చన్ను+పాలు= తల్లుల పొదుగుల పాలను; త్రావుతఱిన్= త్రాగే సమయంలో; తమ కర్ణవీథులన్= తమ చెవిరంధ్రాల్లో; వల్లభము= ఇష్టం; ఐన= అయినట్టి; మాధవుని= శ్రీకృష్ణునియొక్క; వంశరవ= మురళీధ్వని అనే; అమృతధార= అమృతప్రవాహం; చొచ్చినన్= ప్రవేశింపగా; త్రుళ్లక= గంతులు వేయక; పాలురాన్= పాలు గొంతులోనికి వచ్చేటట్లు; తివక= పీల్చక; దూఁటక= క్రుమ్మక; మానక= శ్రీకృష్ణుని చూచుట మానకుండగా; కృష్ణుమీఁదన్= శ్రీకృష్ణునిమీద; దృక్+వల్లులు= చూపుల తీగలను; చేర్చి= లగ్నం చేసి; నిల్చెన్= నిలబడిపోయాయి; అది+ఎ= అదిగో; కంటిరే= చూచారా.

**తా :** చెలులారా! లేగలు తల్లులపాలు త్రాగే సమయంలో, తమ చెవులలో తమకు ఇష్టమయిన శ్రీకృష్ణుని మురళీరవం అనే అమృతధార ప్రవేశించింది. అంతే, పరవశించిపోయి అవి, త్రుళ్లిపాటు విడిచిపెట్టి, పాలు త్రాగడం మాని, పొదుగులు కుమ్మకుండా చూపులు కృష్ణునిమీద లగ్నం చేసి నిలబడిపోయాయి. చూశారా!

**మ. మమతన్ మోములు మీఁది కెత్తుకొని రోమంథంబు సాలించి హృ**
**త్కమలాగ్రంబులఁ గృష్ణు నిల్పి మురళీగానామృతశ్రేణి క**
**ర్ణములం గ్రోలుచు మేఁత మాని గళితానందాశ్రులై చిత్రితో**
**పమలై గోవులు సూచుచున్న వదిగోఁ, బద్మాక్షి! వీక్షించితే? 789**

**ప్రతి :** పద్మ+అక్షి= తామరపూలవంటి కన్నులుగల ఓ సఖీ!; గోవులు= ఆవులు; మమతన్= మమకారంతో; మోములు= మోరలు; మీఁదికిన్+ఎత్తుకొని= పైకి ఎత్తి; రోమంథంబు= నెమరువేయుట; చాలించి= మాని; హృత్+కమల+అగ్రంబులన్= తామరపూలవంటి మనస్సులపై; కృష్ణున్= శ్రీకృష్ణుణ్ణి; నిల్పి= నిల్పుకొని; మురళీగాన+అమృతశ్రేణి= వేణుగానం అనే అమృతధారల పంక్తిని; కర్ణములన్= చెవులతో; క్రోలుచున్= త్రావుతూ; మేఁతమాని= మేత విడిచి; గళిత+ఆనంద+అశ్రులు+ ఐ= కన్నులనుండి జాలువారుతున్న ఆనందబాష్పాలు కలవై; చిత్రిత+ఉపమలు= చిత్రించబడ్డ దానితో పోలిక గలవిగా; ఐ= అయి; చూచుచున్నవి= చూస్తున్నాయి; అదిగో(న్) వీక్షించితి+ఏ= అదిగో తిలకించావా!

**తా :** తామరపూలవంటి కన్నులుగల ఓ చెలీ! ఆవులు మమకారంతో శ్రీకృష్ణునిరూపం మనస్సులో నిల్పుకొని, శ్రీకృష్ణుని మురళీగానామృతాన్ని ఆస్వాదిస్తూ మైమరచిపోయి, మోరలు చాచి, మేతలు మాని, ఆనందబాష్పాలు రాలుస్తూ బొమ్మలవలె నిలబడి పోయాయి. అదిగో చూశావా?

**మ. జగతీజంబులశాఖ లెక్కి మురళీశబ్దామృతస్యందమున్**
**మిగులన్ వీనులఁ ద్రావి వ్రేఁగుపడి నెమ్మిం గృష్ణరూపంబు చి**
**త్తగమై యుండఁగ నడ్డపెట్టుక్రియ నేత్రంబుల్ దగన్ మూసి, యీ**
**ఖగముల్ సొక్కెడిఁ జూచితే! మునిజనాకారంబులం గామినీ! 790**

**ప్రతి :** కామినీ= ఓ సఖీ!; ఈ ఖగముల్= ఈ పక్షులు; జగతీజంబులశాఖలు= చెట్లకొమ్మలు; ఎక్కి= ఎక్కినవై; మురళీశబ్ద+అమృతస్యందమున్= మురళీరవం అనే అమృత ప్రవాహాన్ని; వీనులన్= చెవులతో; మిగులన్= హెచ్చుగా; త్రావి= తాగి; వేఁగుపడి= మత్తెక్కి; నెమ్మిన్= ప్రేమతో; కృష్ణురూపంబు= శ్రీకృష్ణుని రూపాన్ని; చిత్తగము= మనస్సునందు లగ్నం; ఐ+ఉండన్+కన్= అయి ఉండగా; అడ్డపెట్టు క్రియన్= బయటకు రాకుండగా అడ్డుకొన్నట్లుగా; నేత్రంబుల్= కన్నులు; తగన్= ఒప్పునట్లుగా; మూసి= మూసుకొని; మునిజన+ఆకారంబులన్= మునులవలె; చొక్కుచున్+ఉన్నవి= సుఖిస్తున్నవి; చూచితి(వి)+ఏ= చూచితివా?

**తా :** ఓ సఖీ! ఈ పక్షులు చెట్లకొమ్మలమీద కూర్చుండి, శ్రీకృష్ణునిమురళీగానామృతాన్ని చెవులారా ఆస్వాదిస్తూ, కళ్లు మూసుకొని పరవశించిపోతున్నాయి. ఆ కనులమూతలు తమ మనస్సులో లగ్నమైన శ్రీకృష్ణునిదివ్యసుందరరూపం బయటికి పోకుండగా బంధించి యోగీశ్వరులవలె బ్రహ్మానందం అనుభవిస్తున్నాయా అన్నట్లుగా ఉన్నాయి. చూశావా?

**మ. క్రమ మొప్పన్ నదు లెల్ల వంశరవ మాకర్ణించి సంజాత మో**
**హములన్ మన్మథసాయకక్షతవిశాలావర్తలై హంసవా**
**క్యములం జీరి తరంగహస్తముల నాకర్షించి పద్మోప హా**
**రములం గృష్ణపదార్చనంబు సలిపెన్ రామా! విలోకించితే? 791**

**ప్రతి :** ఓ రామా= ఓ యువతీ!; నదులు+ఎల్లన్= నదులన్నీ; క్రమము+ఒప్పన్= ఒక వరుస ఒప్పునట్లుగా; వంశరవము= పిల్లనగ్రోవి పాటను; ఆకర్ణించి= విని; సంజాత మోహములన్= పుట్టిన మోహాలచేత; మన్మథ= మన్మథునియొక్క; సాయక= బాణాలచేత ఏర్పడిన; క్షత= గాయాలో అనునట్లుగా; విశాల= పెద్దవి అయిన; ఆవర్తలు= సుడిగుండాలు కలిగినవి; ఐ= అయి; హంసవాక్యములన్= హంసల కలధ్వనులు అనే మాటలతో; చీరి= శ్రీకృష్ణుణ్ణి పిలిచి; తరంగహస్తములన్= కెరటాలనే చేతులతో; ఆకర్షించి= తమవైపునకు లాగికొని; పద్మ+ఉపహారములన్= తామరపూలబహూకృతులతో; కృష్ణపద+అర్చనంబు= శ్రీకృష్ణునిపాదాలు పూజించుట; సలిపెన్= చేశాయి; విలోకించితి(వి)+ఏ= చూశావా?

**తా :** ఓ యువతీ! నదులన్నీ శ్రీకృష్ణుని వేణురవం విని, మన్మథవేదనకు లోనయ్యాయి. తమలోని సుడిగుండాలు మన్మథ బాణాల తాకిడివల్ల కలిగిన గాయాలా అన్నట్లుగా ఉన్నాయి. ఆ వేదననుండి బయటపడడానికి హంసలకలధ్వనులనే మిషతో శ్రీకృష్ణుణ్ణి ఆహ్వానిస్తున్నాయా అన్నట్లుగా ఉన్నాయి. అలలనే చేతులతో శ్రీకృష్ణుణ్ణి దగ్గరకు లాగికొని తామరపూల సమర్పణలతో శ్రీకృష్ణునిపాదాలు పూజిస్తున్నాయా అన్నట్లుగా ఉన్నాయి. చూశావా

**ఆ. వనిత! నేఁడు కృష్ణ వంశనినాదంబు, విని పయోధరంబు విరులు గురిసి**
**తన శరీర మెల్ల ధవళాతపత్రంబుఁ, జేసి మింట నీడఁ జేసెఁ గంటె. 792**

**ప్రతి :** వనిత= ఓ యువతీ!; నేఁడు= ఈనాడు; పయస్+ధరంబు= నీటిని ధరించిన మేఘం; కృష్ణ వంశనినాదంబు= శ్రీకృష్ణునిమురళీరవాన్ని; విని; విరులు+కురిసి= వర్షం అనే పూవులు వర్షించి; తన శరీరము+ఎల్లన్= తన దేహం అంతటిని; ధవళ+ఆతపత్రంబున్+చేసి= తెల్లగొడుగుగా జేసి; మింటన్= ఆకాశంలో; నీడన్+చేసెన్= నీడను కలిగించింది; కంటి(వి)+ఏ= చూచితివా.

**తా :** రమణీ! నేడు శ్రీకృష్ణుని మురళీగానం విని మేఘం పూలవాన కురిపించింది. దానితో తెల్లబడి తన శరీరాన్నంతటినీ వెల్లగొడుగుగా మార్చి, శ్రీకృష్ణునికి ఎండ తగులకుండా నీడ కల్పించింది. చూశావా.

**క. మంచిఫలంబులు హరిచే, నించి కరాలంబనముల నెగడుచు నిదె క్రీ**
**డించెద, రంగన! చూడుము, చెంచితలం బింఛపత్రచేలాంచితలన్. 793**

**ప్రతి :** అంగన= ఓ యువతీ!; పింఛ= నెమలి పింఛాలు; పత్ర= ఆకులు; చేల+అంచితలన్= చీర చెరగులుగా ధరించిన; చెంచితలన్= చెంచుపడుచులను; చూడుము= చక్కగాచూడు; (వారు); మంచిఫలంబులు= ఆరమగ్గినపండ్లను; హరిచేన్+నించి= శ్రీకృష్ణునిచేతుల నిండుగా పోసి; కర+ఆలంబనములన్= చేయూతలతో; నెగడుచున్= విజృంభిస్తూ; ఇది+ఎ+క్రీడించెదరు= ఇదిగో క్రీడిస్తున్నారు.

**తా :** ఓ చెలీ! ఆ చెంచితలను చూడు. వారు నెమలియీకలు, చెట్లఆకులు కోకలుగా కట్టుకున్నారు. బాగా మాగిన పండ్లు తెచ్చి శ్రీకృష్ణుని చేతుల నిండా నింపి, ఆపైన ఆతనిచేతులు పట్టుకొని ఆనందంతో ఆడుతున్నారు.

**క. ఉల్లసితకుచభరంబుల, నల్లాడెడి నడుముతోడ నలరులదండన్**
**భిల్లి యొకతె హరి కిచ్చెను, హల్లోహలకలిత యగుచు నంగన! కంటే! 794**

**ప్రతి :** అంగన= ఓ చెలీ!; భిల్లి+ఒకతె= ఒక భిల్లాంగన; ఉత్+లసితకుచభరంబులన్= నిక్కిన పాలిండ్లబరువుచేత; అల్ల+ఆడెడి నడుముతోడన్= కదలాడుతున్న నడుముతో; అలరులదండన్= పూలదండను; హల్లోహలకలిత= తొట్రుపాటుతో కూడింది; అగుచున్= అవుతూ; హరికిన్= శ్రీకృష్ణునికి; ఇచ్చెన్= ఇచ్చింది; కంటి(వి)+ఏ= చూశావా?

**తా :** ఓ సఖీ! అటు చూడు. ఒక ఆటవిక స్త్రీ బరువయిన తన పాలిండ్లను మోయలేక, నడుము జవజవలాడుతూ తొట్రుపాటుతో వచ్చి, ఒక చక్కని పూలదండను శ్రీకృష్ణునికి సమర్పిస్తోంది.

**క. గిరు లెల్ల జలము లయ్యెం, దరు లెల్లను బల్లవించె ధరణి గగన భూ**
**చరు లెల్లను జొక్కిరి హరి, మురళిరవామృతము సోఁక ముద్దియ! కంటే! 795**

**ప్రతి :** ముద్దియ= ఓ ముద్దరాలా!; హరిమురళిరవ+అమృతము= శ్రీకృష్ణునియొక్క మురళిధ్వని అనెడి అమృతం; సోఁకన్= తాకగా; గిరులు+ఎల్లన్= కొండలన్నియు; జలములు+అయ్యెన్= కరగి నీరయ్యాయి; తరులు+ఎల్లను= చెట్లన్నియు; పల్లవించెను= చిగురించాయి; ధరణిన్= భూమిలో; గగన భూచరులు= దేవతలు, మానవులు; ఎల్లను= అందరును; చొక్కిరి= పరవశించారు; కంటి(వి)+ఏ= చూశావా?

**తా :** ఓ ముద్దలారా! శ్రీకృష్ణుని మురళీనాదామృతం సోకగానే కొండలన్నీ కరిగి నీరయ్యాయి. చెట్లన్నీ చిగురించాయి. దేవతలు మానవులు అందరు పరవశించిపోయారు. చూశావా?

**మ. బలకృష్ణాంఘ్రిసరోజసంగమముచే భాసిల్లుచున్ ధన్యమై**
**ఫలపుష్పంబులఁ గానికల్ గురిసి సంభావించి మిన్నందుచున్**
**జలఘాసంబుల గోవులం దనిపి చంచద్భూజరోమాంచమై**
**వెలసెం జూడఁ గదమ్మ! యీ గిరిపురోవీథిన్ సరోజాననా! 796**

**ప్రతి :** సరోజ+ఆననా= పద్మంవంటి ముఖంకలదానా!; ఈ గిరి= ఈ కొండ; బల= బలరామునియొక్కయు; కృష్ణ= శ్రీకృష్ణునియొక్కయు; అంఘ్రి సరోజ= పద్మాలవంటి పాదాలయొక్క; సంగమముచేన్= స్పర్శచేత; భాసిల్లుచున్= ప్రకాశిస్తూ;

ధన్యము+ఐ= కృతార్థమై; ఫలపుష్పంబులన్= పండ్లను పువ్వులను; కానికల్+కురిసి= కానుకలుగా సమర్పించి; సంభావించి= గౌరవించి; మిన్ను+అందుచున్= మిన్నుముట్టుచు; జలఘాసంబులన్= నీటితోను, గడ్డితోను; గోవులన్= ఆవులను; తనిపి= తృప్తి పొందించి; చంచత్+భూజ రోమ+అంచము+ఐ= చక్కనయిన చెట్లు అనెడి పులకాంకురాలు కలదై; పురస్+వీథిన్= ముందుభాగంలో; వెలసెన్= ప్రకాశించింది; చూడన్+కదమ్మ!= చూడవమ్మా!

**తా :** ఓ పద్మముఖీ! ఎదురుగా ఉన్న ఈ కొండను చూడు. బలరామకృష్ణుల పాదన్యాసములచేత తనను ధన్యమైన దాన్ని భావించుకొంటోంది. పండ్లు పువ్వులు అనే కానుకలు వారికి సమర్పిస్తోంది. సంతోషంతో మిన్ను ముట్టుతోంది. నీటిని, గడ్డిని సమృద్ధిగా కలిగించి ఆవులకు ఆప్యాయనం కలిగిస్తోంది. చక్కనైన చెట్లు అనే పులకాంకురాలతో అందగిస్తోంది.

**వ. అని యిట్లు బృందావన విహారియైన గోవిందుని సందర్శించి పంచబాణభల్లభగ్నహృదయ లయి వల్లవకాంత లేకాంతంబులఁ జింతించుచుఁ దత్పరతంత్ర లయియుండి రంత. 797**

**ప్రతి :** అని+ఇట్లు= ఈ ప్రకారంగా; బృందావన విహారి= బృందారణ్యంలో విహరించేవాడు; ఐన గోవిందునిన్= అయినట్టి శ్రీకృష్ణుణ్ణి; సందర్శించి= బాగుగా చూచి; వల్లవకాంతలు= గొల్లపడుచులు; పంచబాణ= మన్మథునియొక్క; భల్ల= బాణములచేత; భగ్న= ముక్కలయిన; హృదయలు+అయి= హృదయాలు కలవారయి; ఏకాంతంబులన్= రహస్య ప్రదేశాల్లో; చింతించుచున్= ధ్యానిస్తూ; తత్+పరతంత్రలు= శ్రీకృష్ణుని అధీనమందున్నవారు; అయి+ఉండిరి= అయి ఉన్నారు; అంతన్= అంతలో...

**తా :** ఈ విధంగా గొల్లపడుచులు బృందావనంలో విహరిస్తూ ఉన్న శ్రీకృష్ణుణ్ణి చూచి, కామవికారానికి లోనయి ఏకాంత ప్రదేశాలలో అతణ్ణే ధ్యానం చేస్తూ ఉండిపోయారు.

## ✣ హేమంతఋతు వర్ణనము ✣

**క. శామంతికాస్రగంచిత, సీమంతవతీకుచోష్ణజితశీతభయ**
**శ్రీమంతంబయి గొబ్బున, హేమంతము దోఁచె; మదనుఁ డేఁచె విరహులన్. 798**

**ప్రతి :** శామంతికా= చేమంతి పూలయొక్క; స్రక్= దండలతో; అంచిత= కూడుకొన్న; సీమంతవతీ= చక్కని పాపటలు కల స్త్రీలయొక్క; కుచ= స్తనాలయొక్క; ఉష్ణ= వెచ్చదనంచేత; జిత= జయించబడిన; శీతభయ= చలివలన కలిగే భయంగల; శ్రీమంతంబు+అయి= సంపదకలదయి; గొబ్బునన్= హఠాత్తుగా; హేమంతము= మంచుకురిసే ఋతువు; తోఁచెన్= కనబడింది; మదనుఁడు= మన్మథుడు; విరహులన్= ప్రియులతో ఎడబాటు గలవారిని; ఏఁచెన్= బాధించాడు.

**తా :** శ్రీమంతమైన హేమంతం ఒక్కసారిగా వచ్చిపడింది. చేమంతిపూల దండలు ధరించిన యువతుల స్తనాల వేడిమిచేత పురుషులకు చలిబాధ తీరింది. మన్మథుడు విరహులైన జనాన్ని వేధించాడు.

**క. ఉత్తరపుగాలి విసరె వి, యత్తలమునఁ దుహినకిరణుఁ డహితుం డయ్యెన్**
**బొత్తు జరిగె మిథునములకు, నెత్తమ్ములు దఱిఁగె హిమము నెలకొనియె నృపా! 799**

**ప్రతి :** నృపా= ఓ పరీక్షిన్మహారాజా!; ఉత్తరపుగాలి= ఉత్తరదిక్కు నుండి వచ్చే గాలి; విసరెన్= వీచింది; వియత్+తలమునన్= ఆకాశప్రదేశంలో; తుహిన కిరణుఁడు= చల్లని కిరణములు కలవాడయిన చంద్రుడు; అహితుండు= పగవాడు; అయ్యెన్=

అయ్యాడు; మిథునములకున్= దంపతులకు; పొత్తు= కలయిక; జరిగెన్= నడచింది; హిమము= మంచు; నెలకొనియెన్= వ్యాపించింది; నెత్తమ్ములు= తామర శోభ; తఱిఁగెన్= తగ్గింది.

**తా :** ఓ రాజా! ఉత్తరపు గాలులు వీచాయి, ఆకాశంలో చంద్రుడు బాధ కలిగిస్తున్నాడు. విడివిడిగా ఉన్న దంపతులు కలిసికొంటున్నారు. తామరపూలకు శోభ తరిగింది. అంతటా మంచు అలముకొంది.

**క. అహములు సన్నము లయ్యెను, దహనము హితమయ్యె దీర్ఘ దశలయ్యె నిశల్;**
**బహుశీతోపేతంబయి, యుహుహూ యని వడఁకె లోక ముర్వీనాథా! 800**

**ప్రతి :** ఉర్వీనాథా= ఓ పరీక్షిన్మహారాజా!; అహములు= పగళ్లు; సన్నములు+అయ్యెను= తగ్గాయి; దహనము= అగ్ని; హితము= మేలయింది; అయ్యెన్= అయింది; నిశల్= రాత్రులు; దీర్ఘదశలు= పెద్దవి; అయ్యెన్= అయ్యాయి; లోకము= జగం; బహుశీత+ఉపేతంబు+అయి= మిక్కిలి చలితో కూడుకొన్నదయి; ఉహుహూ+అని= ఉహుహూ అంటూ; వడఁకెన్= వణకిపోయింది.

**తా :** ఓ రాజా! పగళ్ల పరిమాణం తగ్గింది. రాత్రులు పెరిగాయి. చలిమంటలు హాయి కలిగిస్తున్నాయి. చలివల్ల లోకం అంతా గజగజ వణికిపోతోంది.

**క. అన్నుల చన్నులదండ వి, పన్నులు గా కెల్లవారు బ్రదికిరిగా కీ**
**చన్నుల మీఱిన వలి నా, పన్నులు గాకుండఁ దరమె బ్రహ్మాదులకున్. 801**

**ప్రతి :** ఎల్లవారున్= మగవారందరు; అన్నులచన్నులదండన్= స్త్రీల స్తనముల ఆశ్రయంచేత; విపన్నులుకాక= ఆపదకు లోనయినవారుకాక; బ్రతికిరి+కాక= జీవించారు కదా!; ఈ చన్నులమీఱినన్= ఈ స్తనములను వద్దని అతిక్రమించినట్లైతే; వలిన్= చలిచేత; బ్రహ్మ+ఆదులకున్= బ్రహ్మ మొదలగు దేవతలకుగూడా; ఆపన్నులు కాక= కీడుకు లోనయినవారు కాకుండగ; ఉండన్+తరమే= జీవించుటకు శక్యమగునా?

**తా :** ఆ చలికాలంలో చెలులచన్నులఅండ చూచుకొని, మగవారు బ్రదికిపోయారు కాని, ఆ చెలులచన్నులే వద్దనే పక్షంలో బ్రహ్మాదులయినా సరే చలికి తట్టుకొని బ్రదుకగలరా?

**ఆ. పొడుపుఁ గొండమీఁదఁ బొడుచుట మొదలుగాఁ, బరువువెట్టి యినుఁడు పశ్చిమాద్రి**
**మఱుఁగుఁ జొచ్చెఁగాక మసలినఁ జలిచేతఁ, జిక్కెఁ జిక్కె ననఁగఁ జిక్కకున్నె. 802**

**ప్రతి :** ఇనుఁడు= సూర్యుడు; పొడుపు+కొండ మీఁదన్= తూరుపు కొండమీద; పొడుచుట మొదలు+కాన్= ఉదయించుట మొదలుగా; పరవువెట్టి= వేగంగా పరువెత్తి; పశ్చిమ+అద్రి మఱుఁగున్= పడమటి కొండయొక్క దాపున; చొచ్చెన్= ప్రవేశించాడు; కాక= అట్లు చేయక; మసలినన్= ఆలస్యం చేస్తే; చలిచేతన్+చిక్కెన్+చిక్కెను= చలికి చిక్కి లోబడినట్లయితే అని (జనులు); అనన్+కన్= పలుకుతుండగా (పరిహసిస్తుండగా); చిక్కక+ఉన్నె= చిక్కులపాలు కాకుండా ఉండేవాడా?

**తా :** చలికి తట్టుకోలేక తిరిగేవారు గబగబా వెళ్లి, వెచ్చని చోటుకు చేరడం లోకసహజం. అదేవిధంగా లోకబాంధవుడయిన సూర్యుడు కూడ తూరుపుకొండమీద పొడిచింది మొదలు ఎక్కడ ఆగకుండా పరుగెత్తి గబగబా పడమటికొండ మరుగులో దూరిపోయాడు. కానీ అలా కాకుండ ఆలస్యం చేస్తూ మధ్యలో ఆగినపక్షంలో చలికి చిక్కి, చిక్కులపాలయి ఉండేవాడు కదా!

**క. చెంగల్వవిరులగంధము, మంగళముగఁ గ్రోలుచున్న మధుపము లొప్పె**
**న్నంగజ వహ్నులపై ను, ప్పొంగి విజృంభించు పొగలపోలిక నధిపా! 803**

**ప్రతి :** అధిపా= ఓ పరీక్షిన్మహారాజా!; చెంగల్వవిరుల గంధమున్= ఎఱ్ఱకలువల సువాసనను; మంగళముగన్= చక్కగా; క్రోలుచున్న మధుపములు= ఆస్వాదిస్తున్న తుమ్మెదలు; అంగజవహ్నులపైన్= మన్మథాగ్నులమీద; ఉప్పొంగి= బాగుగా ఉబికి; విజృంభించు= రేగునట్టి; పొగలపోలికన్= పొగలవలె; ఒప్పెన్= తోచాయి.

**తా :** ఓ పరీక్షిన్మహారాజా! ఎఱ్ఱ కలువల సువాసనను తనివితీరా ఆస్వాదించే తుమ్మెదలు పైకి రేగి, మన్మథాగ్నినుండి దట్టంగా వెలువడే పొగలలాగా ఉన్నాయి.

**ఆ. శంభుకంట నొకటి, జలరాశి నొక్కటి, మఱియు నొకటి మనుజ మందిరముల**
**నొదిగెఁగాక; మెఱసియున్న మూఁడగ్నులు, చలికి నులికి భక్తి సలుపకున్నె? 804**

**ప్రతి :** ఒకటి శంభుకంటన్= ఒక అగ్ని ఈశ్వరునిమూడవకంటియందును; ఒక్కటి= మరియొక అగ్ని; జలరాశిన్= సముద్రంలో; ఒకటి= మరియొక అగ్ని; మనుజ మందిరములన్= మానవుల ఇండ్లలో; ఒదిగెన్= ఇమిడింది; కాక= అలాకాని పక్షంలో; మెఱసి+ఉన్నన్= బహిరంగంగా వెల్లడి అయి ఉంటే; మూఁడు+అగ్నులున్= గార్హపత్యం, ఆవహనీయం, దక్షిణాగ్ని అనే మూడు అగ్నులు; చలికిన్+ఉలికి= చలికి భయపడి; భక్తిసలుపక+ఉన్నె= సేవ చేయకుండ ఉండేవా? (సేవచేసేవని భావం.)

**తా :** గార్హపత్యం, ఆహవనీయం, దక్షిణాగ్ని అనే మూడింటిలో ఒకటి శివుని కంటిలోను, మరియొకటి సముద్రంలోను, మరియొకటి మనుష్యుల ఇండ్లలోను తలదాచుకొన్నాయి. లేకపోయినట్లైతే ఆ అగ్నులు భయపడి, చలికి దాస్యం చేసేవే.

**శా. ఈ హేమంతము రాకఁ జూచి రమణీహేలాపరీరంభ స**
**త్సాహాయ్యంబునఁగాని వీని గెలువన్ శక్యంబుగా దంచుఁ దా**
**రూహాపోహవిధిం ద్రిమూర్తులు సతీయుక్తాంగు లైనారు గా**
**కోహో! వారలదేమి సంతతవధూయోగంబురాఁ గందురే? 805**

**ప్రతి :** త్రిమూర్తులు= బ్రహ్మ విష్ణు మహేశ్వరులు; ఈ హేమంతము రాకన్+చూచి= ఈ హేమంతఋతువుయొక్క రాకను చూచి; రమణీ= భార్యలయొక్క; హేలా= విలాసంతో కూడిన; పరీరంభ= కౌగిలింతయొక్క; సత్+ సాహాయ్యంబునన్+కాని= మంచి సహకారంచేత తప్ప; వీనిన్= ఈ హేమంత ఋతువును; గెలువన్= జయించేందుకు; శక్యంబు+కాదు= సాధ్యం కాదు; అంచున్= అంటూ; తారు= తాము; ఊహ+అపోహవిధిన్= మంచిచెడుల చర్చచేత; సతీయుక్త+అంగులు= భార్యలతో గూడిన దేహాలు కలవారు; ఐనారు= అయిరి; కాక+ఓహో= అట్లుకాని యెడల; వారలు= వాళ్లు; అది+ఏమి= అట్లుండుటకు కారణమేమి?; సంతతవధూయోగంబు= ఎల్లపుడు భార్యలతో గూడియుండుట; రాన్= కలుగునట్లు; కందురు+ఏ= పొందుదురా?

**తా :** ఈ హేమంత ఋతువు చలిని జయించాలని అంటే భార్యల బిగికౌగిళ్లు తప్ప మరో మార్గం లేదని భావించిన బ్రహ్మ విష్ణు మహేశ్వరులు వాణీ లక్ష్మీపార్వతులను తమ శరీరాలలో చేర్చుకొన్నాడు. కాకపోతే ఈ త్రిమూర్తులకు భార్యలతో విడదీయరాని సంబంధం ఎందుకు ఏర్పడుతుంది?

**క. ఈ హేమంతము రాకకు, శ్రీహరి యొక్కింత వడఁకి చింతింపంగా**
**నోహో! వెఱవకు మని తా, మా హరికిని శ్రీకుచంబు లభయం బిచ్చెన్. 806**

**ప్రతి :** శ్రీహరి= విష్ణువు; హేమంతము రాకకున్= హేమంత ఋతువు వచ్చేందుకు; ఒక్క+ఇంత= కొంచెం; వడఁకి= భయపడి; చింతింపన్+కాన్= చింతిస్తూండగా; ఓహో= ఓయీ; వెఱవకుము= భయపడకుము, అని; శ్రీకుచంబులు= లక్ష్మీదేవి స్తనాలు; తాము= మేము ఉన్నామంటూ; ఆ హరికిన్= ఆ విష్ణువుకు; అభయంబు+ఇచ్చెన్= ధైర్యం అనుగ్రహించాయి.

**తా :** చలికాలం వచ్చేసింది. ఎలాగ గడపడం అని విష్ణువు భయపడుతూ ఉండగా లక్ష్మీదేవి స్తనాలు **మేము ఉన్నాం కదా నీ కేవిధమైన భయమూ అక్కరలేదని** ధైర్యం చెప్పాయి.

**వ. ఇట్లు నితాంతంబగు హేమంతంబున మొదలినెల తొలిదినంబు నందు నందునిమందం గల గోప కుమారికలు రేపకడ లేచి చని కాళిందీజలంబులం దోఁగి; జలతీరంబున నిసుమునం గాత్యాయనీరూపంబుఁ జేసి, సురభికుసుమగంధంబు లిడి, ధూపదీపంబు లిచ్చి, బహువిధోపహారంబులు సమర్పించి; 807**

**ప్రతి :** ఇట్లు= ఈ ప్రకారం; నితాంతంబు= అధికమయినది; అగుహేమంతంబునన్= అగు హేమంతఋతువులో; మొదలినెల తొలి దినంబు+అందున్= మొదటి నెలయగు మార్గశీర్ష మాసంలో శుక్ల ప్రతిపత్తు (పాడ్యమి) నందు; నందుని మందన్= నందుని వ్రేపల్లెలో; కల గోపకుమారికలు= ఉన్నట్టి గొల్లపడుచులు; రేపకడన్= ఉదయాన్నే; లేచి; చని= వెళ్లి; కాళిందీ జలంబులన్= యమునానది నీళ్లలో; తోఁగి= స్నానం చేసి; జలతీరంబునన్= నీటిదగ్గరి ఒడ్డున; ఇసుమునన్= ఇసుకతో; కాత్యాయనీ రూపంబున్= పార్వతీదేవిబొమ్మను; చేసి; సురభి కుసుమ గంధంబులు= మంచివాసన గల పువ్వులు మైపూతలు; ఇడి= సమర్పించి; ధూపదీపంబులు+ఇచ్చి= ధూపం దీపం ఇచ్చి; బహువిధ+ ఉపహారంబులు= అనేకవిధాలయిన నైవేద్యాలు; సమర్పించి= సమర్పణంచేసి...

**తా :** ఇటువంటి హేమంత ఋతువులో మొదటిదయిన మార్గశీర్షమాసంలో మొదటిరోజు శుక్లపక్షంలోని పాడ్యమినాడు, వ్రేపల్లెలోని గొల్లపడుచులు వేకువనే లేచి, యమునకు వెళ్లి స్నానంచేసి, ఒడ్డున ఇసుకతో పార్వతీదేవి బొమ్మను చేసి, ధూపదీప నైవేద్యాలు సమర్పించి,

**క. 'ఓ కాత్యాయని! భగవతి, నీకున్ మ్రొక్కెదము నేము నేఁ డనుకంపన్**
**మా కిందఱకును వైళమ, శ్రీకృష్ణుఁడు మగఁడు గాఁగఁ జేయుము తల్లీ! 808**

**ప్రతి :** భగవతి= భగవంతురాలవయిన; ఓ కాత్యాయనీ= ఓ పార్వతీ; నేము= మేము; నేఁడు= ఈనాడు; నీకున్ మ్రొక్కెదము= నీకు నమస్కరిస్తున్నాము; తల్లీ= అమ్మా; అనుకంపన్= దయతో; మాకున్+ఇందఱకును= మాకు ఇంతమందికిని; వైళము+అ= శీఘ్రంగా; శ్రీకృష్ణుఁడు= కృష్ణభగవానుడు; మగఁడు+కాఁగన్= భర్త అయ్యేటట్లు; చేయుము= కావించుము.

**తా :** షడ్గుణైశ్వర్య సంపన్నురాలవయిన ఓ పార్వతీ! మేము నిన్నీనాడు పూజించి నమస్కరిస్తున్నాము. మా కందరికీ శీఘ్రంగా శ్రీకృష్ణుడు భర్త అయ్యేటట్లు అనుగ్రహించు.

**విశే :** భగము కలవాడు 'భగవంతుడు', భగము కలది 'భగవతి'. "భగము" అనగా పరిమితం లేని, సమగ్రమైన జ్ఞానం, ఐశ్వర్యం, యశస్సు, వీర్యం, వైరాగ్యం, సంపదలు అని అర్థం. కత్యయనుని కూతురు – కాత్యాయని. మోక్షమార్గాలు ఎన్ని ఉన్నాయని విచారించేవాడు – కత్యయనుడు. కాత్యాయని బ్రహ్మవిద్యాస్వరూపిణి – పార్వతి. ఈమె ఒక జన్మలో కత్యయనుని పుత్రిక అయింది.

**క. ఓ తల్లి! మాకుఁ గృష్ణుఁడు, చేతోవిభుఁ డైననాఁడు చెలువల మెల్లన్**
**నేతివసంతము లాడుచు, జాతర సేసెదము భక్తిచాతురితోడన్. 809**

**ప్రతి :** ఓ తల్లి= ఓ అమ్మా; మాకున్= మాకు; కృష్ణుఁడు= శ్రీకృష్ణుడు; చేతస్+విభుఁడు= మనఃప్రియుడు; ఐననాఁడు= అయిన దినాన; చెలువలము+ఎల్లన్= గోపికలం అందరం; నేతివసంతములు= నేతితో వసంతాలు; ఆడుచున్= ఆడుతూ; భక్తిచాతురితోడన్= పూజయందలి నేర్పుతో; జాతర+చేసెదము= ఉత్సవం చేస్తాము.

**తా :** ఓ తల్లీ! శ్రీకృష్ణుడు మాకు భర్తగా లభించిననాడు నీకు నేతితో వసంతాలాడుతూ భక్తితో జాతర చేస్తాము.

**వ. అని నమస్కరించి హవిష్యంబులు గుడుచుచు న వ్విధంబున మాసవ్రతంబు సలిపి రందొక్కనాఁడు. 810**

**ప్రతి :** అని= ఈ విధంగా పలికి; నమస్కరించి= మ్రొక్కి; హవిష్యంబులు= హోమంలో వ్రేల్చడానికై పెట్టే అన్నం, నెయ్యి మొదలైన పదార్థాలను; కుడుచుచున్= తింటూ; ఆ+విధంబునన్= ఆ ప్రకారంగా; మాసవ్రతంబున్= నెలకాలం చేసే వ్రతం; సలిపిరి= చేశారు; అందున్= ఆ నెలలో; ఒక్కనాఁడు= ఒక్క దినం...

**తా :** ఈ విధంగా కాత్యాయనీ దేవికి మ్రొక్కికొని పవిత్రమైన ఆహారం నియమంగా స్వీకరిస్తూ నెలనాళ్లు వ్రతం చేశారు. ఆ రోజులలో ఒకనాడు

**విశే :** వ్రతమంటే – ఉపవాసంతో లేదా శాస్త్రం విధించిన ప్రకారం పాలు, పండ్లు మొదలైనవి స్వీకరించి, నియమంగా చేసే పూజ.

## ❖ గోపికా వస్త్రాపహరణము ❖

**మ. రమణుల్ ప్రొద్దున మేలుకాంచి సఖులన్ రం డంచు నాత్మీయ నా**
**మములం జీరి, కుచద్వయీభరములన్ మధ్యంబు లల్లాడఁగాఁ**
**బ్రమదోద్దామగజేంద్రయాన లగుచుం బద్మాక్షునిం బాడుచున్**
**యమునాతీరముఁ జేరఁ బోయిరి గృహీతాన్యోన్యహస్తాబ్జలై. 811**

**ప్రతి :** రమణుల్= గోపికలు; ప్రొద్దులన్= ఉదయమే; మేలుకాంచి= మేలుకొని; సఖులన్= తమ చెలికత్తెలను; రండు+అంచున్= రండురండని; ఆత్మీయనామంబులన్= ప్రియమైన పేళ్లతో; చీరి= పిలిచి; కుచద్వయీ భరములన్= పాలిండ్ల జంటల బరువుచే; మధ్యంబులు= నడుములు; అల్లాడఁగాన్= చలింపగా; ప్రమద= మిక్కిలి సంతోషంతో; ఉద్దామ= నివారింపగరాని; గజ+ఇంద్రయానలు= శ్రేష్ఠమయిన ఏనుగులనడకలవంటి నడకలు కలిగినవారు; అగుచున్= అవుతూ; పద్మ+అక్షునిన్= శ్రీకృష్ణణ్ణి గురించి; పాడుచున్= గానం చేస్తూ; గృహీత= పట్టుకొనబడిన; అన్యోన్య= పరస్పరం – ఒండొరులయొక్క; హస్త+అబ్జలు+ఐ= తామరపూలవంటి చేతులు కలవారై; యమునాతీరమున్= యమునానది ఒడ్డును; చేరన్+పోయిరి= సమీపించారు.

**తా :** ఒకనాటి ఉదయం గోపికలు మేలుకొని, ఒకరినొకరు రండురండని ప్రియంగా పేర్లు పెట్టి పిలుచుకొంటూ, శ్రీకృష్ణుని స్తోత్రం చేస్తూ, పాటలు పాడుతూ, బరువైన చనుగవలవల్ల సన్నని నడుములు అల్లలాడుతూ ఉండగా గజగమనంతో ఒకరి చేతులు మరొకరు పట్టుకొని యమున ఒడ్డుకు చేరుకొన్నారు.

**వ. ఇట్లా నదీతీరంబు సేరం జని గజగమనలు విజనస్థలంబున వలువలు విడిచి యిడి మది శంక లేక యకలంకలై క్రుంకులిడఁ జలంబుల జలంబులు సొచ్చి. 812**

**ప్రతి :** గజగమనలు= ఏనుగు నడకవంటి నడక గల ఆ గోపికలు; ఇట్లు= ఈ ప్రకారం; ఆ నదీతీరంబు= ఆ యమునానది ఒడ్డును; చేరన్+చని= సమీపించి; విజనస్థలంబునన్= జనులు లేనిచోట; వలువలు విడిచి+ఇడి= తాము కట్టిన బట్టలువిప్పి పెట్టి; అకలంకలు+ఐ= ఏ దోషంలేనివారయి; మదిన్= మనస్సులో; శంకలేక= సంకోచం లేక; జలంబులన్= నీళ్లలో; క్రుంకులు+ఇడన్= స్నానం చేసేందుకు; జలంబులు+చొచ్చి= నీళ్లలో దిగి...

**తా :** గజగమనలయిన ఆ గోపికలు ఈ విధంగా యమునానదీతీరానికి చేరుకొన్నారు. ఒక ఏకాంత ప్రదేశంలో తాము కట్టుకొన్న బట్టలు విడిచి పెట్టి, మనస్సులో ఏ సంకోచం లేకుండా స్నానం చేయడంకోసం నీళ్లలోకి దిగారు.

**క. వారిజలోచనుఁ బాడుచు, వారిజలోచనలు వారివారికి వేడ్కన్**
**వారివిహారము సలిపిరి, వారివిహారములు జగతివారికిఁ గలవే? 813**

**ప్రతి :** వారిజలోచనలు= పద్మాలవంటినేత్రాలు గల ఆ గోపికలు; వారిజలోచనున్= పద్మాలవంటి కన్నులు గల శ్రీకృష్ణుణ్ణి గురించి; పాడుచున్= గానం చేస్తూ; వారివారికిన్= వారి వారికి ఇష్టమైన రీతిలో; వేడ్కన్= వినోదంతో; వారి విహారము= జలవిహారం; సలిపిరి= చేశారు; వారి విహారములు= వారి ఆటపాటలు; జగతివారికిన్= లోకంలోనివారికి; కలవు+ఏ= ఉన్నవా? (లేవు).

**తా :** ఆ గోపికలు శ్రీకృష్ణుణ్ణి గురించి గానం చేస్తూ వినోదంగా, ఇచ్ఛానుసారంగా జలవిహారాలు సాగించారు. వారి విహారాలకు లోకంలో సాటి లేదు.

**వ. ఆ సమయంబున. 814**

**ప్రతి :** ఆ సమయంబునన్= అప్పుడు...

**తా :** అలాంటి వేళలో

**క. తోయజనయనలు యమునా, తోయములం దుండు టెఱిఁగి దూరగుఁ డయ్యుం**
**దోయజనయనుఁడు హరి తన, తోయము గోపకులు దానుఁ దోతెంచె నృపా! 815**

**ప్రతి :** నృపా= ఓ రాజా!; తోయజనయనలు= పద్మాలవంటి కన్నులుగల గోపికలు; యమునాతోయముల+అందున్= యమునా నదీజలాల్లో; ఉండుట+ఎఱిఁగి= ఉండటం తెలుసుకొని; తోయజనయనుఁడు= (పద్మములవంటి కన్నులు గల) శ్రీకృష్ణుడు; దూరగుఁడు= దూరంలో ఉన్నవాడు; అయ్యున్= అయినప్పటికినీ; తన తోయము గోపకులు= తన మిత్రులగు గొల్లవారు; తానున్= తానూ; తోతెంచెన్= వచ్చాడు.

**తా :** ఓ రాజా! దూరంగా ఉన్న శ్రీకృష్ణునికి గోపికలు యమునానదిలో స్నానం చేస్తున్నారనే సంగతి తెలిసింది. వెంటనే తన సావాసగాండ్రతో కలిసి అక్కడకు చేరుకొన్నాడు.

**తరలము**

**కదలకుం డని తోడివారలఁ గన్ను సన్నల నిల్పుచుం**
**బదము లొయ్యన నేలఁ బెట్టుచుఁ బద్మనేత్రుఁడు మౌనియై**
**పొదల మాటున నల్లనల్లన పొంచి పొంచి నతాంగుఁడై**
**యదను గోరుచు డాసి వ్రేతల యంబరంబులు దొంగిలెన్. 816**

**ప్రతి :** పద్మనేత్రుఁడు= (తామరపూలవంటి కన్నులుగల) శ్రీకృష్ణుడు; తోడివారలన్= తన చెలికాండ్రను; కదలక+ఉండుడు+అని= నిశ్చలంగా ఉండండి అని; కన్ను సన్నలన్= కంటి సైగలతో; నిల్పుచున్= ఆపుతూ; పదములు= అడుగులు; ఒయ్యనన్= మెల్లగా; నేలన్= నేలమీద; పెట్టుచున్= మోపుతూ; మౌని+ఐ= మౌనం వహించినవాడయి; పొదలమాటునన్= పొదలచాటున; అల్లనన్+అల్లనన్= మెలమెల్లగా; నత+అంగుఁడు+ఐ= శరీరాన్ని వంచినవాడై; పొంచి పొంచి= నక్కి నక్కి; అదనున్= అవకాశంకోసం; కోరుచున్= చూస్తూ; డాసి= సమీపించి; వ్రేతల+అంబరంబులు= గోపికల వస్త్రాలను; దొంగిలెన్= దొంగిలించాడు.

**తా :** శ్రీకృష్ణుడు తనతోవచ్చిన గొల్లవారిని కదలకుండ నిలబడండి అని కంటితో సైగ చేశాడు. తాను మెల్లమెల్లగా పొదల మాటున నుండి నక్కి దాగి నడచుకుంటూ వచ్చి, గోపికల వస్త్రాలను అపహరించాడు.

**వ. ఇట్లు దొంగిలి. 817**

**ప్రతి :** ఇట్లు= ఈ ప్రకారంగా; దొంగిలి= దొంగిలించి...

**తా :** ఈ విధంగా గోపికల వస్త్రాలను దొంగిలించినవాడై,

**శా. ఉద్యద్గంధగజేంద్రగౌరవముతో యోషాంబరంబుల్ విభుం**
**డాద్యుం డర్భకుభంగి నర్భకులతో హాసార్థియై కొంచుఁ ద**
**న్నద్యంభఃకణశీతవాతజనితానందంబుతో నెక్కెఁ దా**
**సద్యోముక్తదురంతపాదపజనుస్సంతాపమున్ నీపమున్. 818**

**ప్రతి :** ఆద్యుండు= సృష్టికి ముందున్నవాడు; విభుండు= విశ్వానికే భర్త అయిన శ్రీకృష్ణుడు; అర్భకు భంగిన్= బాలునివలె; అర్భకులతోన్= గొల్లపిల్లవాండ్రతో (కలసి); హాస+అర్థి+ఐ= హాస్యాన్ని కోరినవాడయి; ఉద్యత్= ఉదయిస్తూన్న; గంధ= మదముగల; గజ+ఇంద్ర= శ్రేష్ఠమయిన ఏనుగుయొక్క; గౌరవముతోన్= గాంభీర్యంతో; యోషా+అంబరంబుల్= గోపికా స్త్రీల వస్త్రాలను; కొంచున్= అపహరిస్తూ; తాన్= తాను; తద్+నదీ= ఆ యమునా నదియందలి; అంభఃకణ= జలకణాలచేత; శీత= చల్లనయిన; వాత= గాలిచేత; జనిత= పుట్టిన; ఆనందంబుతోన్= సంతోషంతో; పాదపజనుః= వృక్ష జన్మమెత్తుటవల్ల కలిగిన; దురంత= అంతులేని; సంతాపమున్= వేదనను; సద్యః= వెంటనే; ముక్త= విడువబడిన; నీపమున్= కడిమిచెట్టును; ఎక్కెన్= ఎక్కాడు.

**తా :** ఆదిపురుషుడు, విశ్వభర్త అయిన శ్రీకృష్ణుడు లీలాబాలకుడయి, తనతోటివారితో వచ్చి, గోపికల వస్త్రాలు అపహరించాడు. యమునానదికెరటాల మీదనుండి వచ్చే చల్లనిగాలి అతనికి హాయి కలిగిస్తోంది. ఏనుగులాగ విలాసంగా నడుచుకుంటూ

వెళ్ళి, సమీపంలో ఉన్న కడిమిచెట్టును ఎక్కినాడు. ఆ చెట్టు వృక్ష జన్మ ఎత్తినందువల్ల కలిగిన సంతాపాన్ని ఆ క్షణంలోనే విడిచిపెట్టి, తన జన్మ ధన్యమయిం దని భావించింది.

**వ. అప్పు డయ్యింతు లిట్లనిరి. 819**

**ప్రతి :** అప్పుడు= ఆ సమయంలో; ఆ+ఇంతులు= ఆ గోపికలు; ఇట్లు+అనిరి= ఈ విధంగా పలికారు.

**తా :** ఆ సమయంలో గోపికలు ఇలా అన్నారు.

**క. 'మా మా వలువలు ముట్టకు, మా మా! కొనిపోకు పోకు మన్నింపు తగన్**
**మా మాన మేల కొనియెదు?, మా మానసహరణ మేల? మానుము కృష్ణా! 820**

**ప్రతి :** కృష్ణా= శ్రీకృష్ణా; మా మా= వద్దు వద్దు; మా మా వలువలు= మాయొక్క బట్టలు; ముట్టకు= ముట్టుకొనవద్దు; కొనిపోకు పోకు= తీసుకొని వెళ్లవద్దు; తగన్= ఉచితంగా; మన్నింపు= మా మాటను పాటించుము; మా మానము= మా అభిమానాన్ని; కొనియెదు(వు)+ఏల= ఎందుకు హరిస్తావు; మా మానసహరణము= మా మనస్సులు దొంగిలించుట; ఏల= ఎందుకు; మానుము= ఊరుకో.

**తా :** కృష్ణా! వద్దు వద్దు. మా వస్త్రాలు అపహరించి మా అభిమానాన్ని పాడు చేయవద్దు. మా మనస్సులు అపహరించి మాకు మైమరపు కలిగించవద్దు.

**సీ. బహుజీవనముతోడ భాసిల్లి యుండుటో గోత్రంబు నిల్పుటో కూర్మితోడ?**
**మహి నుద్ధరించుటో? మనుజసింహంబవై ప్రజలఁ గాచుటొ? కాక బలిఁ దెరల్చి**
**పిన్నవై యుండియుఁ బెంపు వహించుటో? రాజుల గెల్చుటో రణములందు?**
**గురునాజ్ఞ సేయుటో? గుణనిధి వై బలప్రఖ్యాతిఁ జూపుటో భద్రలీల?**

**ఆ. బుధులు మెచ్చ భువిఁ బ్రబుద్ధత మెఱయుటో, కలికితనము సేయ ఘనత గలదె?**
**వావి లేదు వారివారు నా వా రని, నెఱుఁగ వలదె వలువ లిమ్ము కృష్ణ! 821**

**ప్రతి :** కృష్ణ= ఓ శ్రీకృష్ణా!; (నీవు ఇప్పుడు మా వస్త్రాలను అపహరించడం) బహుజీవనముతోడన్= గొప్ప బతుకుతెరువుతో; భాసిల్లి= ప్రకాశించి; ఉండుట+ఓ= ఉండుటయో; (జీవనం అనగా జలం. అధిక జీవనం అనగా ఎక్కువ నీరు గల సముద్రంలో మత్స్యావతారమెత్తి విలసిల్లుట అని అర్థాంతరం); గోత్రంబు= వంశాన్ని; కూర్మితోడన్= ప్రేమతో; నిలుపుట+ఓ= ఉద్ధరించుటయో (గోత్రమనగా పర్వతం); (మందరపర్వతాన్ని సముద్రమథన సమయంలో మునుగకుండా నిలుపడమో! కూర్మావతారమెత్తుట అని అర్థాంతరం); మహిన్= భూమిని; ఉద్ధరించుట+ఓ= రక్షించుటో!, పైకి లేవనెత్తుటో; (వరాహావతారమెత్తి, హిరణ్యాక్షునిచే సముద్రంలో అణచబడ్డ భూమిని పైకి లేవనెత్తుటో, అని అర్థాంతరం); మనుజ సింహంబవు+ఐ= పురుషశ్రేష్ఠుడవై; ప్రజలను= బిడ్డలను; కాచుటో= కాపాడుటో; (మనుజసింహంబువు+ఐ= నరసింహస్వామివై హిరణ్యకశిపుణ్ణి సంహరించి జనులను రక్షించుటో అని అర్థాంతరం); కాక= ఇంతేకాక; పిన్నవు+ఐ+ఉండియున్= చిన్నపిల్లవాడవు అయి ఉండీ; బలిన్= బలవంతుడైన వాణ్ణి; తెరల్చి= తరిమి; పెంపువహించుటో= గౌరవము పొందుటో; (చిన్నపిల్లవాడవు – వామనుడవు అయి యుండియు బలిచక్రవర్తిని అణచి త్రివిక్రముడవై ముల్లోకాలను ఆక్రమించుటో అని అర్థాంతరం);

రణముల+అందున్= యుద్ధాలలో; రాజులన్= రాజుల్ని; గెల్చుటో= జయించుటో; (పరశురాముడవై ఇరవై ఒక్కమార్లు క్షత్రియ సంహారం చేయుటో); గుణనిధివి+ఐ= మంచిగుణాలకు గనివంటివాడవయి; గురు+ఆజ్ఞన్= తండ్రియొక్క ఆజ్ఞను; చేయుటో= పాటించుటో; (రామావతారమెత్తి తండ్రిమాట నిలబెట్టుటకయి అరణ్యముల కేగుటో అని అర్థాంతరం); భద్రలీలన్= మంగళకరమైన విలాసంతో; బలప్రఖ్యాతిన్= బలంయొక్క ప్రసిద్ధిని; చూపుటో= ప్రదర్శించుటో; (బలరామావతారమెత్తి రాక్షస సంహారంచేసి బలప్రసిద్ధిని పొందుటయో అని అర్థాంతరం); భువిన్= భూలోకమునందు; బుధులు మెచ్చన్= పండితులు ప్రశంసించునట్లు; ప్రబుద్ధతన్= మేలయిన తెలివితో; మెఱయుటో= ప్రకాశించుటో; (బుద్ధావతారమెత్తి వెలుగొందుటో అని అర్థాంతరం); కలికితనము+చేయన్= కొంటెతనం ప్రదర్శించుటచేత; ఘనతకలదె= గొప్పతనం గల్గునా?; ('కలికి' అనే శబ్దం ప్రయోగించుటవల్ల శబ్దశక్తిచేత కల్క్యవతారం స్ఫురిస్తున్నది); వావిలేదు= బంధుత్వం చూడవు; వారివారు= ఇతరులకు చెందినవారు; నా వారు= నాకు చెందినవారు; అని; ఎఱుఁగవలదు+ఎ= తెలుసుకోవలదా?; వలువలు= మా వస్త్రాలు; ఇమ్ము= ఇచ్చేసేయ్.

**తా :** ఓ కృష్ణా! నీవు మత్స్యకూర్మ వరాహ నారసింహ వామన పరశురామ రఘురామ బలరామ బుద్ధ కల్క్యవతారాలెత్తి, లోకాలను రక్షించావు. అటువంటి నీవు మంచిజీవిక కలిగి ఉండాలి. ప్రేమతో నీ వంశంవారిని సాకుతూ ఉండాలి. ప్రభుత్వాన్ని వహించి భూమిని పాలిస్తూ ఉండాలి. ఇతడు సింహంవంటివాడు అనే ప్రశస్తిని పొందాలి. 'వయసున చిన్నవాడవయినా నీకంటె బలవంతుడయిన వాణ్ణి వంచి లోకానికి మేలు చేశాడనే' కీర్తిని పొందాలి. లోకంలో దుర్మార్గులయిన రాజులను జయించాలి. మంచిబుద్ధి కలవాడవు అనిపించుకోవాలి. నీ కులం వారిని ఆదుకోవాలి. స్వపరభేదం లేకుండా ప్రవర్తించాలి. ఇటువంటి కొంటెపనులు నీ వంటివాడు చేయకూడదు. మా వస్త్రాలు మాకు ఇవ్వు.

**క. కొంటివి మా హృదయంబులు, గొంటివి మానంబు; లజ్జఁ గొంటివి; వలువల్**
**గొంటి; విఁక నెట్లు సేసెదొ, కొంటెవు గద! నిన్ను నెఱిఁగికొంటిమి కృష్ణా! 822**

**ప్రతి :** కృష్ణా!= శ్రీకృష్ణా!; మా హృదయంబులు= మా హృదయాలు; కొంటివి= కైకొన్నావు; మానంబున్= మా అభిమానాన్ని; లజ్జన్= సిగ్గును; కొంటివి= తీసుకొన్నావు; వలువల్+కొంటివి= (ఇపుడు) మా బట్టలూ అపహరించావు; ఇఁకన్+ఎట్లు+చేసెదు(వు)+ఒ= ఇంకా ఏ విధంగా ప్రవర్తిస్తావో; కొంటెవు+కద= కొంటెవాడవు కదా; నిన్నున్+ఎఱిఁగికొంటిమి= నీ సంగతి తెలిసికొన్నాము.

**తా :** శ్రీకృష్ణా! మా మనస్సులను, మానాభిమానాలను, సిగ్గును, చివరకు బట్టలను కూడా నీవు అపహరించావు. ఇంకా ఏమేమి చేయదలచుకొన్నావో గదా! నీవు కొంటెవాడివికదా! నీ సంగతి బాగా తెలుసుకొన్నాము.

**సీ. రాజసంబున నీవు రంజిల్లు టెఱుఁగమే? చెలరేఁగి వింతలు సేయుచుండ**
**సత్త్వసంపద గల్గి జరగుటఁ దలఁపమే?, సిరి గల్గి యన్యులఁ జెనకుచుండ**
**గురుతరశక్తియుక్తుఁడ వౌట యెఱుఁగమే? తామసంబున నెగ్గు దలఁచుచుండ**
**నొకభంగితో నుండకుంటఁ జింతింపమే? మాయావియై మాఱుమలయుచుండ**

**ఆ. నేమి జాడవాఁడ? వేపాటి గలవాఁడ, వే గుణంబు నెఱుఁగ వెల్ల యెడల**
**నొదిఁగి యుండనేర? వోరంత ప్రొద్దును, బటము లీఁగదయ్య! పద్మనయన! 823**

**ప్రతి :** పద్మనయన= తామరపూలవంటి కన్నులు గల ఓ కృష్ణా!; నీవు= నీవు; చెలరేఁగి= రెచ్చిపోయి; వింతలు= ఆశ్చర్యకరాలయిన కార్యాలు; చేయుచున్+ఉండన్= చేస్తుండగా; రాజసంబునన్= రాచఠీవితో; రంజిల్లుట= ప్రకాశించడం; ఎఱుఁగము+ఏ= తెలియమా (నీవు రజోగుణమును ఆశ్రయించి విశ్వమును సృష్టిస్తున్న సంగతి మేమెరుగుదుము అని అర్థాంతరం); సిరి+కల్గి= సంపద కలిగియుండియు; అన్యులన్= ఇతరులను; చెనకుచున్+ఉండన్= దండిస్తూండగా; సత్త్వసంపదన్+కలిగి జరుగుటన్= బలసమృద్ధి కలిగి ప్రవర్తించుట; తలఁపమే= తలచుకొనమా; (సత్త్వగుణము నాశ్రయించి దుష్టులను శిక్షిస్తూ, శిష్టులను రక్షిస్తున్నావని ఎరుగుదుము అని అర్థాంతరం); తామసంబునన్= తమోగుణంతో; ఎగ్గు+తలఁచుచున్+ఉండన్= దుర్మార్గులకు చెరుపు కలిగిస్తూండగా; గురుతరశక్తియుక్తుఁడవు= అధికమైన బలంతో కూడుకొన్నవాడవు; ఔటన్= అగుటచే; ఎఱుఁగము+ఏ= తెలిసికొనమా (తమోగుణాన్ని ఆశ్రయించి నీవు విశ్వసంహారం చేస్తున్నావని మేమెరుగుదుము అని అర్థాంతరం); మాయావి+ఐ= మాయలుగలవాడవయి; మాఱుమలయుచున్+ ఉండన్= వేరు వేరు రూపాలతో సంచరిస్తుండగా; ఒక భంగితో= ఒకే తీరుతో; ఉండక+ఉంటన్= లేకపోవుటను; చింతింపము+ఏ= తెలిసికొనలేమా (మాయను ఆశ్రయించి సర్వభూతముల రూపాన్ని వహించి ప్రవర్తిస్తుండడం తెలుసుకొంటిమి అని అర్థాంతరం); ఏమి జాడవాఁడవు= ఏ తీరుతెన్నులు కలవాడివి; (తీరుతెన్ను లేమియు లేనివాడివి); ఏపాటి కలవాఁడవు= ఎంత కొలత కలవాడివి; (పరిమాణం లేనివాడివి – అపరిచ్ఛిన్నుడవు); ఏ గుణంబును+ఎఱుఁగవు= నీలో ఏ గుణమూ లేదు (గుణాతీతుడవు); ఓరంత ప్రొద్దును= ఎల్లకాలం; ఎల్ల+ఎడలన్= అన్నిచోట్లను; ఒదిఁగి+ఉండన్+నేరవు= ఇమిడి ఉండలేవు (సర్వకాలానికీ, సర్వదేశానికీ అతీతుడవు అని అర్థాంతరం); పటములు= వస్త్రాలు; ఈన్+కదు+అయ్య= ఇయ్యవయ్యా!

**తా :** ఓ కృష్ణా! నీవు రాచఠీవితో లోకాతీతమైన కార్యాలు సాధిస్తూ ఉంటావు. బలవంతుడవై ఇతరులను శిక్షిస్తూ ఉంటావు. కోపంతో లోకాలు కూల్చివేస్తూ ఉంటావు. మాయలమారివై ఒక తీరుగా ఉండవు. నీ తీరుతెన్ను లేమిటి? నీ పరిమితి ఏమిటి? ఒక్కగుణం కూడ నీలో లేదు. ఏనాడు ఒకచోట నిలకడగా ఉండవు. మా బట్టలు మా కిచ్చివేయుము.

**అర్థాంతరం :** ఓ కృష్ణా! నీవు పరమాత్మవు. రజోగుణాన్ని ఆశ్రయించి విశ్వసృష్టిని, సత్త్వగుణాన్ని ఆశ్రయించి స్థితినీ, తమోగుణాన్ని ఆశ్రయించి లయాన్నీ కొనసాగిస్తూ ఉంటావు. సమస్తరూపుడవు. అపరిచ్ఛిన్నుడవు. గుణాతీతుడవు. దేశకాలాలకు లోబడనివాడివి.

**క. రాజుల నెఱుఁగవు బలిమిని, రాజిల్లెదు చీర లీవు రమణుల మింకన్**
**రాజున కెఱిఁగించెద; మో రాజీవదళాక్ష! నీవు రాజవె ధరకున్? 824**

**ప్రతి :** ఓ రాజీవదళ+అక్ష= తామరరేకులవంటి కన్నులు గల ఓ శ్రీకృష్ణా!; రాజులన్= ప్రభువులను గురించి; ఎఱుఁగవు= తెలియవు; బలిమిని= బలంతో; రాజిల్లెదు(వు)= ప్రకాశిస్తూ ఉంటావు; చీరలు+ఈవు= చీరలీయవు; ధరకున్= భూమికి; రాజవు+ఎ= నీవే రాజువా (కాదు); ఇంకన్= ఇటుపైన; రమణులము= గోపికలమందరం; రాజునకున్= ప్రభువుకు; ఎఱింగించెదము= తెలియజేస్తాము.

**తా :** ఓ కృష్ణా! నీకు రాజులసంగతి తెలియదు. నువ్వేమీ ఈ రాజ్యానికి రాజువు కావు. మా చీర లియ్యకపోతే నందమహారాజుకు నీ ఆగడాల్ని గురించి, చెప్తాం.

**వ. అని పలికిన కన్నియలపలుకు లాలించి మందహాససుందరవదనారవిందుండై గోపాలబాలకుల కరంబులం గరంబులు వ్రేసి య మ్ముద్దియల నుద్దేశించి నెఱవాది చతురుం డిట్లనియె. 825**

**ప్రతి :** అని పలికిన కన్నియల పలుకులు= ఈ విధంగా మాటాడిన గోపికలమాటలు; ఆలించి= విని; మందహాస= చిరునగవుచేత; సుందర= అందమయిన; వదన+అరవిందుండు+ఐ= పద్మంవంటి ముఖం కలవాడయి; గోపాల బాలకులకరంబులన్= గొల్లపిల్లవాండ్ర చేతులలో; కరంబులు వ్రేసి= చేతులు వేసి; నెఱవాది= చక్కగా మాట్లాడేవాడు; చతురుండు= నేర్పరియు అయిన శ్రీకృష్ణుడు; ఆ+ముద్దియలన్+ఉద్దేశించి= ఆ గోపికలను గూర్చి; ఇట్లు+అనియెన్= ఈ ప్రకారంగా పలికాడు.

**తా :** శ్రీకృష్ణుడు గోపికల మాటలు విన్నాడు. ముసి ముసి నవ్వులు నవ్వుతూ, తన సావాసుల చేతులలో చేతులు వేసి, చతురుడైన కృష్ణుడు నేర్పుగా వారితో ఇలా అన్నాడు.

**శా. రామల్ రాజులతోడ నీ పనికి నారంభింతురే మీ క్రియన్**
**మోమో టేమియు లేక దూఱెదరు మీ మోసంబు చింతింప; రం**
**భోమధ్యంబున నుండి వెల్వడి వెసం బూర్ణేందుబింబాననల్**
**మీ మీ చీరలు వచ్చి పుచ్చుకొనుఁడీ? మీ కిచ్చెదం జెచ్చెరన్' 826**

**ప్రతి :** రామల్= స్త్రీలు; రాజులతోడన్= ప్రభువులతో; ఈపనికిన్= ఇటువంటి పనికి; మీక్రియన్= మీకువలె; ఆరంభింతురు+ఏ= చేస్తారా; మోమోట= మొగమోటము; ఏమియున్ లేక= ఏ కొంచెమూ లేక; దూఱెదరు= నిందిస్తున్నారు; మీమోసంబు= మీ వంచనను; చింతింపరు= తలచుకోరు; పూర్ణ+ఇందుబింబ+ఆననల్= నిండు జాబిల్లివంటి మొగాలు గల గోపికలారా; అంభోమధ్యంబునన్+ఉండి= నీటి నడుమనుండి; వెసన్= తొందరగా; వెల్వడి వచ్చి= బయటకువచ్చి; మీ మీ చీరలు= మీ మీ కోకలు; పుచ్చుకొనుఁడీ= తీసుకోండి; చెచ్చెరన్= వెంటనే; మీకున్= మీకు; ఇచ్చెదన్= ఇస్తాను.

**తా :** స్త్రీలు రాజులతో ప్రవర్తించవలసిన తీరు ఇదేనా? కేవలం నన్ను నిందిస్తున్నారు. కానీ మీ తప్పు మీరు తెలిసికోవడం లేదు. చంద్రబింబాననల్లారా అయిన మీరు నీటినుండి బయటకు వచ్చి మీ బట్టలు తీసికోండి. వెంటనే ఇచ్చేస్తాను.

**వ. అనిన న మ్మానవతు లొండొరుల మొగంబులు సూచి నగుచు, మర్మంబుల నాఁటు న మ్మాటలకు మగుడం బలుక సిగ్గుపడుచు, నగ్గలంబైన చలిని వలిగొని కంఠప్రమాణజలంబులం దుండి డోలాయమాన మానసలై యిట్లనిరి. 827**

**ప్రతి :** అనినన్= శ్రీకృష్ణుడు ఇట్లు పలుకగా; ఆ+మానవతులు= మానవతులైన ఆ గోపికలు; ఒండు+ఒరుల మొగంబులు+ చూచి= ఒకరి మొగములొకరుచూచుకొని; నగుచున్= నవ్వుతూ; మర్మంబుల నాఁటు= మర్మములను సోకు; ఆ+ మాటలకున్= ఆ పలుకులకు; మగుడన్= తిరిగి; పలుకన్= సమాధానం చెప్పుటకు; సిగ్గు+పడుచున్= సిగ్గుపడుతూ; అగ్గలంబు+ఐన= హెచ్చు అయిన; చలిని= చలిచేత; వలిగొని= వడకుతూ; కంఠప్రమాణ జలంబుల+అందున్= గొంతువరకుండే నీటిలో; ఉండి= నిలబడి; డోలాయ మానమానసలు+ఐ= చెప్పడమా మానడమా అని ఊగిసలాడుతున్న మనస్సులు కలవారై; ఇట్లు+ అనిరి= ఈ ప్రకారంగా పలికారు.

**తా :** శ్రీకృష్ణుని మాటలు విన్న గోపికలు ఒకరి మొగం ఒకరు చూచి నవ్వుకొన్నారు. మర్మాలు నాటే ఆ మాటలకు తిరిగి జవాబు చెప్పడానికి సిగ్గుపడ్డారు. గొంతులోతు నీటిలో నిలబడి చలికి వణకిపోతూ నిలకడలేని మనస్సుతో ఇలా అన్నారు.

క. 'మా వలువ లాగడంబున, నీ వేటికిఁ బుచ్చుకొంటి? వీ వల్పుఁడవే?
నీ వెఱుఁగని దేమున్నది? నీ వందఱిలోన ధర్మనిరతుఁడవు గదే? **828**

**ప్రతి :** మా వలువలు= మా చీరలు; ఆగడంబునన్= దుందుడుకుతనంతో; నీవు= నీవు; ఏటికిన్= ఎందుకు; పుచ్చుకొంటివి= తీసుకొన్నావు; ఈవు= నీవు; అల్పుఁడవు+ఏ= తక్కువైనవాడివా?; నీవు ఎఱుఁగనిది= నీకు తెలియనిది; ఏమి+ఉన్నది= ఏమి ఉన్నది?; అందఱిలోనన్= జనులందరిలో; నీవు= నీవు; ధర్మనిరతుఁడవు+కదు+ఏ= ధర్మాత్ముడవు గదా!

**తా :** దుందుడుకు తనంతో మా బట్టలు ఎందుకు అపహరించావు. నీవేమైన తక్కువవాడవా! కాదు గదా! నీకు తెలియని ఏదైనా విషయం ఉందా? ప్రజలందరిలోను నీవు గొప్ప ధర్మాత్ముడవు గదా!

శా. ఇంతుల్ తోయము లాడుచుండ మగవా రేతెంతురే? వచ్చిరా
యింతల్ సేయుదురే? కృపారహితులై యేలోకమందైన నీ
వింతల్ నీ తలఁ బుట్టెఁ గాక! మఱి యేవీ కృష్ణ! యో చెల్ల! నీ
చెంతన్ దాసులమై చరించెదము మా చేలంబు లిప్పింపవే! **829**

**ప్రతి :** కృష్ణ!= శ్రీకృష్ణా!; ఏ లోకము+అందున్+ఐనన్= దేవమానవ పాతాళలోకాలలో ఎక్కడైనా; ఇంతుల్= స్త్రీలు; తోయములు+ఆడుచున్+ఉండన్= స్నానం చేస్తుండగా; మగవారు= పురుషులు; ఏతెంతురు+ఏ= వస్తారా; వచ్చిరా= తెలియక వచ్చినా; కృపారహితులు+ఐ= దయలేనివారయి; ఇంతల్+చేయుదురు+ఏ= ఇంతటి దుందుడుకుగా ప్రవర్తిస్తారా; ఈ వింతల్= ఈ (కూడని) పనులు; నీ తలన్= నీ బుద్ధిలోనే; పుట్టెన్+కాక= పుట్టాయి కాని; మఱి+ఏవీ= ఇతరులలో ఎక్కడున్నాయి; ఓచెల్ల= ఔరా; నీ చెంతన్= నీ దగ్గర; దాసులము= సేవకురాండ్రము; ఐ= అయి; చరించెదము= సంచరిస్తాము; మా చేలంబులు= మా బట్టలు; ఇప్పింపవు+ఏ= ఇప్పించుమయ్యా!

**తా :** ఓ కృష్ణా! ఆడవాళ్లు స్నానం చేస్తూ ఉండగా మగవారువచ్చి ఎక్కడైనా చూస్తారా! పొరపాటున వచ్చినా, చీరలు ఎత్తుకొని పోవడంలాంటి తప్పుడు పనులు దయమాలినవారయి చేస్తారా? ఇటువంటి కూడని పనులు నీకే తగినవి కానీ, ఇంకెవరూ ఇలాగ చేయరు. నీ సేవ చేసుకొంటాం. మా చీరలు మాకివ్వండి.

క. వచ్చెదము నీవు పిలిచిన; నిచ్చెద మేమైనఁగాని; యెటఁ జౌరు మనినం
జొచ్చెదము; నేఁడు వస్త్రము, లిచ్చి మముం గరుణతోడ నేలుము కృష్ణా? **830**

**ప్రతి :** కృష్ణా!= శ్రీకృష్ణా!; నీవు పిలిచినన్= నీవు పిలిస్తే; వచ్చెదము= వస్తాము; ఏమి+ఐనన్+కాని= దేనినైనా; ఇచ్చెదము= ఇస్తాము; ఎటన్+చొరుము+అనినన్= ఎక్కడకు వెళ్లమన్నా; చొచ్చెదము= వెళ్తాము; నేఁడు= ఇప్పుడు; వస్త్రములు+ఇచ్చి= బట్టలిచ్చి; మమున్= మమ్మల్ని; కరుణతోడన్= దయతో; ఏలుము= పాలించుము.

**తా :** కృష్ణా! నీవు రమ్మంటే వచ్చేస్తాం. నీ వేది కోరినా ఇచ్చేస్తాం. నీ వెక్కడికి వెళ్లమన్నా వెళ్లిపోతాం. ఇపుడు మాత్రం మా చీరలు మాకిచ్చి మమ్ము ఏలుకో.

వ. అనిన దరహసితవదనుండై హరి యిట్లనియె. **831**

**ప్రతి :** అనినన్= గోపికలు ఇట్లు పలుకగా; హరి= శ్రీకృష్ణుడు; దరహసితవదనుండు+ఐ= చిరునగవుతో కూడిన మొగం గలవాడై; ఇట్లు= ఈ ప్రకారంగా; అనియెన్= పలికాడు.

**తా :** అని గోపికలు ప్రాధేయపడగా, శ్రీకృష్ణుడు చిరునవ్వు మోముతో ఇలా అన్నాడు.

**క. 'ఏ తరుణుఁడు మగఁ డౌటకు, మీ తపములు? సెప్పుఁ డింక మీ యానలు సుం**
**డీ తప్పిన నీ కూరిమి, మీ తలలనె పుట్టెనోటు మేదిని లేదే? 832**

**ప్రతి :** ఏ తరుణుఁడు= ఏ యువకుడు; మగఁడు+ఔటకున్= భర్తగా లభించేందుకు; మీ తపములు= ఈ మీ వ్రతాలు; చెప్పుఁడు+ఇంక= ఇంక చెప్పండి; తప్పినన్= చెప్పకపోతే; మీ ఆనలు= మీ మీద ఒట్టు; చుండు+ఈ= నిశ్చయం; ఈ కూరిమి= ఈ ప్రేమ; మీ తలలను+ఎ= మీ బుద్ధిలోనే; పుట్టెను+ఓటు= పుట్టిందా ఏమి?; మేదినిన్= భూమిలో; లేదు+ఏ= లేదా? (ఉన్నదే కదా)

**తా :** ఏ యువకుణ్ణి భర్తగా కోరి మీ రీవ్రతం చేస్తున్నారో చెప్పండి. చెప్పకపోతే మీ మీద ఒట్టే. ఇటువంటి ప్రేమ లోకసహజమైందే కదా!

**క. ఎవ్వనిఁ గని మోహించితి, రెవ్వఁడు మీ మానధనము లెల్ల హరించెన్?**
**నివ్వటిలె మీకుఁ గూరిమి, యెవ్వనిపైఁ? బలుకరాదె? యే నన్యుఁడనే? 833**

**ప్రతి :** ఎవ్వనిన్= ఎవణ్ణి; కని= చూచి; మోహించితిరి?= కామించారు; ఎవ్వఁడు= ఏ యువకుడు; మీ మానధనములు+ఎల్లన్= మీ అభిమానసంపదనంతా; హరించెన్= దొంగిలించాడు; ఎవ్వనిపైన్= ఎవనిమీద; మీకున్= మీకు; కూరిమి= ప్రేమ; నివ్వటిలెన్= కలిగింది; పలుకరాదు+ఎ= చెప్పరాదా; ఏనున్= నేను; అన్యుఁడను+ఏ= ఇతరుణ్ణా ఏమి?

**తా :** మీరు ఎవణ్ణి చూచి మోహించారు? మీ మానధనాలు హరించిన వాడెవడు? మీకు ఎవరిమీద ప్రేమ పుట్టింది? నేను అన్యుణ్ణి కాను. నేను మీవాడనే. నాకు చెప్పవచ్చు కదా!

**వ. అనిన విని సుందరు లన్యోన్యసందర్శనమ్ములు సేయుచు, హృదయారవిందంబులందుఁ గందర్పుండు సందడింప నగుచు నిరుత్తరలయి యున్న లోకోత్తరుం డిట్లనియె. 834**

**ప్రతి :** అనినన్= శ్రీకృష్ణుడు ఇట్లు పలుకగా; సుందరులు= చక్కనివారగు గోపికలు; విని= విన్న వాళ్లయి; అన్య+అన్యసందర్శనమ్ములు+చేయుచున్= ఒకరినొకరు చూచుకొంటూ; హృదయ+అరవిందంబుల+అందున్= పద్మాలవంటి హృదయాలలో; కందర్పుండు= మన్మథుడు; సందడింపన్= కల్లోలపరుస్తుండగా; నగుచున్= నవ్వుతూ; నిరుత్తరులు+అయి+ఉన్నన్= సమాధానం చెప్పలేకుంటే; లోక+ఉత్తరుండు= లోకంలో గొప్పవాడయిన శ్రీకృష్ణుడు; ఇట్లు= ఈ ప్రకారం; అనియెన్= పలికాడు.

**తా :** ఈ మాటలు విని గోపికలు ఒకరి నొకరు చూచుకొన్నారు. వారిని కామభావం కల్లోలపరుస్తొంది. నవ్వుతూ మిన్నకుండి పోయారు. అప్పుడు లోకపూజ్యుడయిన శ్రీకృష్ణుడు ఈ విధంగా అన్నాడు.

**క. నా యింటికి దాసులరై, నా యాజ్ఞ వహించి మీరు నడిచెద రేనిన్**
**మీ యంబరమ్ము లిచ్చెదఁ, దోయంబులు వెడలి రండు తొయ్యలులారా! 835**

**ప్రతి :** తొయ్యలులారా= ఓ యువతులారా! నా ఇంటికి దాసులరు+ఐ= మాయింట సేవ చేసేవారయి; నా ఆజ్ఞ వహించి= నా ఆనతి పాటించి; మీరు నడిచెదరు+ఏనిన్= మీరు ప్రవర్తించే పక్షంలో; మీ అంబరమ్ములు= మీ వస్త్రాలను; ఇచ్చెదన్= ఇస్తాను; తోయంబులు వెడలి రండు= నీటిలోనుండి బయటకు రండి.

**తా :** ఓ గోపికలారా! మీరు నా యింటిలో సేవచేస్తూ నా ఆనతిప్రకారం నడుచుకొంటామంటే మీ కోకలు మీకిస్తాను.

**వ. అనిన విని హరిమధ్యలు చలికి వెఱచి సలిలమధ్యంబున నిలువనోపక. 836**

**ప్రతి :** అనినన్= శ్రీకృష్ణుడు ఇట్లంటే; హరిమధ్యలు= సింహం నడుంవంటి నడుం కలిగి ఉన్న గోపికలు; విని= విని; చలికిన్+వెఱచి= చలికి భయపడి; సలిలమధ్యంబునన్= నీళ్లనడుమ; నిలువన్+ఓపక= నిలువలేక...

**తా :** శ్రీకృష్ణునిమాటలు విన్న గోపికలు నీళ్లలో నిలబడలేక చలికి భయపడి

**క. కొందఱు వెడలుద మందురు, కొందఱు వెడలుటయు సిగ్గుగొను గోవిందుం**
**దందురు; కొందఱు దమలోఁ, గొందల మందుదురు వడఁకుగొని మనుజేంద్రా! 837**

**ప్రతి :** మనుజ+ఇంద్రా= పరీక్షిన్మహారాజా! కొందఱు= కొంతమంది గోపికలు; వెడలుదము= బయటకు వెళ్దాము; అందురు= అంటారు; కొందఱు= మరికొంతమంది; వెడలుటయున్= బయటికి వస్తే; గోవిందుండు= శ్రీకృష్ణుడు; సిగ్గు+కొనున్= సిగ్గు అపహరిస్తాడు; అందురు= అంటారు; కొందఱు= ఇంకొంతమంది; తమలోన్= తమమనస్సులలో; వడఁకు+కొని= వణకుతూ; కొందలము+అందుదురు= ఆందోళన పొందుతున్నారు.

**తా :** ఓ పరీక్షిన్మహారాజా! గోపికలలో కొందరు బయటికి వెళ్దాం అంటారు. మరికొందరు బయటకు వెడితే మన మానం పోతుంది అంటారు. ఇంకొందరు చలికి వణకిపోతూ ఆందోళన చెందుతున్నారు.

**వ. మఱియు నెట్టకేలకుఁ జిత్తంబులు గట్టిపఱచుకొని తనుమధ్యలు తోయమధ్యంబు వెలువడి. 838**

**ప్రతి :** మఱియున్= ఇంకను; ఎట్టకేలకున్= చివరకు; చిత్తంబులు= మనస్సులు; గట్టిపఱచుకొని= దృఢం చేసికొని; తనుమధ్యలు= సన్నని నడుంగల గోపికలు; తోయమధ్యంబు వెలువడి= నీటినడుమనుండి బయటకు వచ్చి...

**తా :** గోపికలు చివరకు ఎలాగో మనస్సుల్ని గట్టిచేసికొని నీటినుండి బయటకు వచ్చి,

**క. చంచత్పల్లవకోమల, కాంచన నవరత్నఘటితకంకణరుచిరో**
**దంచిత కరసంఛాదిత, పంచాయుధగేహ లగుచుఁ బడఁతులు వరుసన్. 839**

**ప్రతి :** చంచత్= కదలుతున్న; పల్లవ= చిగురాకులవలె; కోమల= సుకుమారమయినవీ; కాంచన= బంగారుమయమైనవీ; నవరత్నఘటిత= నవరత్నాలు తాపినవి; అగు; కంకణ= కడియాలచేత; రుచిర= ప్రకాశించేవీ; ఉత్+అంచిత= మిక్కిలి మనోహరమయినవీ; అగు; కర= చేతులచేత; సంఛాదిత= బాగుగా కప్పబడ్డ; పంచ+ఆయుధగేహాలు+అగుచున్= మన్మథుని గృహాలు (యోనులు) కలవారవుతూ; పడఁతులు= గోపికలు; వరుసన్= క్రమంగా...

**తా :** ఆ గోపికలు, కదలుతున్న చిగురుటాకులవలె కోమలమయినవి, నవరత్నాలు పొదిగిన బంగారపు కంకణాలు కలిగిన చేతులతో తమ మర్మాంగాలను మాటు పరచుకొని నీటినుండి వరుసగా (బయటకు వచ్చారు)

**వ. చని ప్రౌఢలైన సుందరుల ముందట నిడుకొని మందగమనలు మందహాసంబుతోడ నెదుర నిలిచిన నరవిందనయనుం డిట్లనియె. 840**

**ప్రతి :** మందగమనలు= మెల్లని నడకలుగల గోపికలు; ప్రౌఢలు= (నేర్పరులు) గడుసరులు; అయిన సుందరులను= అయిన చెలువలను; ముందటన్= తమ ముందు; ఇడుకొని= ఉంచుకొని; చని= వెడలి; మందహాసంబుతోడన్= చిరునగవుతో; ఎదురన్= శ్రీకృష్ణునికి ఎదురుగా; నిలిచినన్= నిలబడగా, అరవిందనయనుండు= తామరపూలవంటి కన్నులు కలవాడగు కృష్ణుడు; ఇట్లు+అనియెన్= ఈ ప్రకారంగా పలికాడు.

**తా :** మెల్లమెల్లగా నడిచే గొల్లపడుచులు తమలో గడుసరులయిన వారిని ముందుంచుకొని మడుగులోనుండి బయటకు వచ్చి శ్రీకృష్ణునిముందు నిలువగా అతడు వారితో ఇలా పలికాడు.

**సీ. శృంగారవతులార! సిగ్గేల? మిముఁ గూడి పిన్ననాఁటను గోలెఁ బెరిఁగినాఁడ**
**నెఱుఁగనే మీలోన నెప్పుడు నున్నాఁడ నేను జూడని మర్మ మెద్ది గలదు?**
**వ్రతనిష్ఠలై యుండి వలువలు గట్టక నీరు సొత్తురె మీరు నియతి దప్పి?**
**కాత్యాయనీ దేవిఁ గల్లసేయుట గాక యీ రీతి నోమువా రెందుఁ గలరు?**

**ఆ. వ్రతఫలంబు మీరు వలచినఁ జక్కఁగ, నింతు లెల్లఁ జేతు లెత్తి మ్రొక్కి**
**చేరి పుచ్చుకొనుఁడు చీరలు; సిగ్గువో, నాడ నేల? యెగ్గు లాడనేల? 841**

**ప్రతి :** శృంగారవతులార= చక్కని సింగారాలతో ఉన్న గోపికలారా!; సిగ్గు+ఏల= సిగ్గుపడుట ఎందుకు; పిన్ననాఁటనుగోలెన్= చిన్ననాటినుండి; మిమున్= మిమ్ము; కూడి= కలిసి; పెరిఁగినాఁడన్= పెరిగినవాణ్ణి; ఎఱుఁగనే= నాకు తెలుసుగదా!; ఎప్పుడును= ఎల్లప్పుడూ; మీలోనన్= మీ అందరిలో; ఉన్నాఁడన్= ఉన్నాను; ఏను చూడని మర్మము= నేను చూడని రహస్యస్థానం; ఎద్దికలదు= ఏది ఉంది; మీరు, వ్రతనిష్ఠలు= వ్రతపరాయణలు; ఐ+ఉండి= అయి ఉండీ; నియతిన్= నియమం; తప్పి= అతిక్రమించి; వలువలు కట్టక= వస్త్రాలు ధరింపక (దిగంబరంగా); నీరు+చొత్తురు (చొచ్చుదురు)+ఎ= నీటిలోనికి ప్రవేశిస్తారా? కాత్యాయనీదేవిన్= కాత్యాయనీదేవిని; కల్ల+చేయుటన్+కాక= తిరస్కరించుట కాక మరేమి? ఈ రీతి నోమువారు= ఈ విధంగా నియమం తప్పి వ్రతం ఆచరించేవారు; ఎందున్+కలరు?= ఎక్కడున్నారు?; మీరు= మీరందరు; వ్రతఫలంబున్= వ్రతంవల్ల కలిగే ఫలం; వలచినన్= కోరిన పక్షంలో; ఇంతులు+ఎల్లన్= యువతులందరూ; చేతులు+ఎత్తి= చేతులు పైకెత్తి; చక్కఁగన్= చక్కగా; మ్రొక్కి= నమస్కరించి; చేరి= నన్ను సమీపించి; చీరలు= కోకలు; పుచ్చుకొనుఁడు= తీసుకోండి; సిగ్గు+పోన్+ఆడన్+ఏల= సిగ్గులేకుండ మాటాడుట ఎందుకు? ఎగ్గులు+ఆడన్+ఏల= మోసపుమాటలాడడం ఎందుకు?

**తా :** గోపికలారా! మీ కీ సిగ్గెందుకు? చిన్నప్పటినుండి మీలో ఒకడుగా మీతో పెరిగివాణ్ణే కదా! నేను చూడని రహస్య స్థానాలు మీలో ఏమి ఉన్నాయి? మీరు కాత్యాయనీ వ్రతదీక్ష పూని ఇలా దిగంబరంగా యమునలో దిగి స్నానం చేయవచ్చునా? ఇది నియమం తప్పి ప్రవర్తించడం కాదా? దేవివిషయంలో అపరాధం చెయ్యడం కాదా? ఇలాగ అపమార్గంలో నోములు నోచేవారు ఎక్కడయినా ఉంటారా? మీకు వ్రతఫలం దక్కాలని మీరు అనుకొంటే, మీ రెండు చేతులు ఎత్తి నాకు నమస్కరించండి. నా వద్దకు వచ్చి మీ కోకలు తీసికోండి. సిగ్గులేకుండగా వాదించడం ఎందుకు? మోసపుమాటలు మాట్లాడడం ఎందుకు?

**వ. అనిన విని మానవతులు దమలోన. 842**

**ప్రతి :** అనినన్= కృష్ణుడు ఇట్లు పలుకగా; విని= విన్న తర్వాత; మానవతులు= అభిమానం గల గోపికలు; తమలోనన్= తమలో తాము (అనుకొంటూ ఇలా చేశారు)...

**తా :** అని పలికిన శ్రీకృష్ణుని మాటలను వినిన గోపికలు తమలో తాము

**మ. వ్రతముల్ సేయుచు నొక్క మాటయిన నెవ్వానిన్ విచారించినన్**
**వ్రతభంగంబులు మాను నట్టి వరదున్ వామాక్షు లీక్షించియున్**
**గతచేలాప్లవనంబు నేఁడు వ్రతభంగం బంచు శంకించి ఫా**
**ల తటన్యస్తకరాబ్జలై సరసలీలన్ మ్రొక్కి రట్లందఱున్. 843**

**ప్రతి :** వామ+అక్షులు= అందమైన కన్నులుగల గొల్లకన్నెలు; వ్రతముల్+చేయుచున్= నోములు నోస్తూ; ఒక్కమాటు+అయినన్= ఒక్కసారి అయినా; ఏ+వానిన్= ఏ పరమాత్ముణ్ణి; విచారించినన్= ధ్యానిస్తే; వ్రతభంగంబులు= వ్రతాలకు కలిగే ఆటంకాలు; మానున్= తొలగునో; అట్టి వరదున్= అటువంటి వరప్రదాతను; ఈక్షించియున్= చూచీ; అందఱున్= గోపికలందరూ; గతచేలాప్లవనంబు= బట్టలు లేక (దిగంబరంగా) స్నానం చేయుట; నేఁడు= ఈ దినం; వ్రతభంగంబు+అంచున్= వ్రతానికి లోపమంటూ; శంకించి= సందేహించి; ఫాలతట న్యస్తకర+అబ్జలు+ఐ= నుదుటిమీద పద్మాలవంటి చేతులను ఉంచినవారై; అట్లు= శ్రీకృష్ణుడు చెప్పినవిధంగా; సరసలీలన్= ఉచితమగు రీతిలో; మ్రొక్కిరి= నమస్కరించారు.

**తా :** నోములు నోచేవారు ఏ పరమాత్మను ధ్యానం చేస్తే చాలో, వ్రతాల ఆటంకాలు అన్నీ తొలగిపోతాయో అటువంటి శ్రీకృష్ణణ్ణి గోపికలు చూశారు. కట్టుబట్టలు విడిచి, దిగంబరంగా స్నానం చేయడం తమ తప్పే అని తెలిసికొన్నారు. తమ చేతులను ఎత్తి నుదుట చేర్చి అందరూ శ్రీకృష్ణునికి నమస్కారం చేశారు.

**క. బాలలకు హస్తకీలిత, ఫాలలకు నితాంతశీతపవనాగమ నా**
**లోలలకు నంబరములు కృ, పాలుఁడు హరి యిచ్చె భక్తపాలకుఁ డగుటన్. 844**

**ప్రతి:** కృపాలుఁడు= దయగలవాడగు శ్రీకృష్ణుడు; భక్తపాలకుఁడు= భక్తులను రక్షించేవాడు; అగుటన్= అగుటచేత; హస్తకీలితఫాలలకున్= చేతులచే కూర్పబడిన నుదుళ్లు కలవారును, నుదుట్లో చేతులు జోడించినట్టి; నితాంత= మిక్కుటమైన; శీతపవన= చలిగాలియొక్క; ఆగమన= రాకచేత; ఆలోలలకున్= గజగజ వణకేవారైన; బాలలకున్= గోపికలకు; అంబరములు= వస్త్రాలను; ఇచ్చెన్= ఇచ్చాడు.

**తా :** శ్రీకృష్ణుడు దయ గలవాడు. భక్తులను రక్షించే స్వభావం కలవాడు. అందులకే చలికి గజగజ వణకిపోతూ, పశ్చాత్తాపంతో నుదిటిపై చేతులెత్తి మొక్కుతున్న గోపికలకు వస్త్రాలు ఇచ్చివేశాడు.

**ఆ. 'చీర లపహరించి సిగ్గులు విడిపించి, పరిహసించి యైనఁ బరఁగ మనకు**
**ఘనుఁడు నోము కొఱఁతగాకుండ మ్రొక్కించె, ననుచు హరి నుతించి రబల లెల్ల. 845**

**ప్రతి :** అబలలు+ఎల్లన్= గోపికలందరును; చీరలు= వస్త్రాలు; అపహరించి= దొంగిలించి; సిగ్గులు= లజ్జలను; విడిపించి= పోగొట్టి; పరిహసించి+ఐనన్= ఎగతాళి చేసినప్పటికి; పరఁగన్= క్రమంగా; ఘనుఁడు= గొప్పవాడయిన శ్రీకృష్ణుడు; మనకున్=

మనకు; నోము= వ్రతం; కొఱంతకాక+ఉండన్= లోటురాకుండగ; మ్రొక్కించెన్= నమస్కరింప జేశాడు; అని= ఈ ప్రకారంగా; హరిని= శ్రీకృష్ణుణ్ణి; నుతించిరి= స్తోత్రం చేశారు.

**తా :** కోకలు దొంగిలిస్తే దొంగిలించాడు, సిగ్గులు పోగొడితే పోగొట్టాడు, వేళాకోళం చేస్తే చేశాడు. కానీ మన వ్రతానికి లోపం రాకుండా ఆదుకొన్నాడు అని భక్తిభావంతో గోపికలంతా శ్రీకృష్ణుణ్ణి స్తోత్రం చేశారు.

**క. ఉల్లములు నొవ్వ నాడినఁ, గల్లలు సేసినను నగినఁ గలఁచిన నైనన్**
**వల్లభులు సేయు కృత్యము, వల్లభలకు నెగ్గు గాదు; వల్లభ మధిపా! 846**

**ప్రతి :** అధిపా= ఓ రాజా! ఉల్లములు= మనస్సులు; నొవ్వన్= నొచ్చేటట్లు; ఆడినన్= మాట్లాడినా; కల్లలు+చేసినన్= మోసపుపనులు చేసినా; నగినన్= పరిహసించినా; కలఁచినన్+ఐనన్= కలవరపెట్టినా; వల్లభులు= ప్రియులు; చేయుకృత్యము= చేసే పని; వల్లభలకున్= ప్రియురాండ్రకు; ఎగ్గు+కాదు= కీడు కాదు; వల్లభము= ఇష్టమైందే.

**తా :** ఓ రాజా! మనస్సు నొచ్చేలా మాటాడినా, మోసగించినా, వేళాకోళం చేసినా, కలతను కలిగించినా ప్రియులు చేసే పనులు ప్రియురాండ్రకు బాధ కలిగించక పోగా, ఎంతో ఇష్టంగా ఉంటాయి.

**వ. ఇట్లు హరి వలువ లిచ్చినం గట్టుకొని సతు లతనియందు బద్ధానురాగ లయ్యుఁ జలింపక ఱెప్పలిడక తప్పక చూడ నా ప్రోఢ యెఱింగి చేరి వారి కిట్లనియె. 847**

**ప్రతి :** ఇట్లు= ఈ ప్రకారంగా; హరి= శ్రీకృష్ణుడు; వలువలు+ఇచ్చినన్= వస్త్రాలీయగా; కట్టుకొని= ధరించి; సతులు= గోపికలు; అతనియందున్= శ్రీకృష్ణునిపట్ల; బద్ధ+అనురాగలు+అయ్యున్= లగ్నమైన ప్రేమలు కలవారయినప్పటికీ; చలింపక= కలతపడక; ఱెప్పలు+ఇడక= రెప్పలు వేయక; తప్పక చూడన్= సూటిగా చూస్తూండగా; ఆ ప్రోఢ= నేర్పరియగు ఆ శ్రీకృష్ణుడు; ఎఱింగి= వారి అభిప్రాయం తెలుసుకొని; చేరి= సమీపించి; వారికిన్= వారితో; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తా :** ఈ విధంగా శ్రీకృష్ణుడు చీర లియ్యగా గోపికలు కట్టుకొని గాఢమైన అనురాగంతో, కలతపడక, రెప్పవేయక చూస్తూ ఉండగా నేర్పరి అయిన శ్రీకృష్ణుడు వారివద్దకు వెళ్లి ఈ రీతిగా అన్నాడు.

**సీ. లక్షణవతులార! లజ్జించి చెప్పరు గాని మీ మర్మముల్ గానఁబడియె;**
**ననుఁ గొల్వఁ జింతించినారు నాచేతను సత్యంబు మీ నోము సఫల మగును;**
**గామితార్థంబుల కలిమిఁ జెప్పఁగ నేల? ననుఁ గొల్వ ముక్తికి నడవవచ్చుఁ;**
**గడమ కూడఁగ నంబికాదేవి నోమంగ నటమీఁద రాత్రులయందు మీకు**

**ఆ. నన్నుఁ బొందఁ గల్గు నమ్మి పొందని హరి, పల్క నింతు లెల్ల భ్రాంతిఁ జనిరి**
**తపము పండె ననుచుఁ దత్పదాంభోజముల్, మానసించుకొనుచు మందకడకు. 848**

**ప్రతి :** లక్షణవతులార= మంచిలక్షణంగల ఓ గోపికలార! లజ్జించి= సిగ్గుపడి; చెప్పరు+కాని= చెప్పకున్నారు కాని; మీ మర్మముల్= మీ గుట్టులు; కానన్+పడియెన్= బయటపడ్డాయి; ననున్= నన్ను; కొల్వన్= సేవించేందుకు; చింతించినారు=

ఆలోచించినారు; నా చేతను= నా చేత; సత్యంబు= నిజంగా; మీ నోము= మీ వ్రతం; సఫలము+అగున్= ఫలవంతమవుతుంది; కామిత+అర్థంబుకలిమిన్= కోరినవన్నీ సిద్ధించుటను గురించి; చెప్పన్+కన్+ఏల= ప్రత్యేకంగా చెప్పటం ఎందుకు; ననున్= నన్ను; కొల్వన్= సేవింపగా; ముక్తికిన్= మోక్షానికే; నడవవచ్చున్= వెళ్లవచ్చు; కడమ= ముక్తికంటె వేరయిన ధర్మార్థకామాలు; మీకున్= మీకు; కూడన్+కన్= సిద్ధించేందుకు; అంబికాదేవిన్= కాత్యాయనీ దేవినిగురించి; నోమన్+కన్= వ్రతం చేస్తే; అటమీఁదన్= అటుపిమ్మట; రాత్రుల+అందున్= రాత్రుల్లో; నన్నున్+పొందన్+కల్గున్= నన్ను పొందకల్గుతారు; నమ్మి పొందు+అని= నా మాటలు నమ్మి ఇండ్లకు వెళ్లండి అని; హరి= శ్రీకృష్ణుడు; పల్కన్= చెప్పగా; ఇంతులు+ఎల్లన్= గోపికలందరూ; తపము= తపస్సు (వ్రతము); పండెన్+అనుచున్= ఫలించిందని భావిస్తూ; తత్పద+అంభోజముల్= శ్రీకృష్ణునిపాదపద్మాలను; మానసించుకొనుచున్= ధ్యానిస్తూ; మందకడకున్= వ్రేపల్లెకు; భ్రాంతిన్= భ్రమతో; చనిరి= వెళ్లారు.

**తా :** మంచి గుణాలుకల ఓ గోపికలారా! మీరు సిగ్గువల్ల చెప్పలేకుండా ఉన్నారు. కానీ మీ మనస్సులోని గుట్టులు బయటపడ్డాయి. మీరు నన్ను మగనిగా పొందడం కోసం ఈ కాత్యాయనీవ్రతం చేస్తున్నారు. నా అనుగ్రహంవల్ల మీ నోము పండుతుంది. నన్ను సేవించినవారికి మోక్షమే సిద్ధిస్తుంది. ఇంక మిగిలిన ధర్మార్థకామాలగురించి చెప్పేది ఏముంది? మీరు ఈ వ్రతం పూర్తిచేయండి. రాత్రులలో నా కలయిక లభిస్తుంది. నా మాటలు నమ్మి మీరు ఇండ్లకు వెళ్లిపొండి అని శ్రీకృష్ణుడు అన్నాడు. ఆ మాటలు విన్న గోపికలు తమ తపస్సు ఫలించిందని సంతోషిస్తూ, శ్రీకృష్ణుని పాదపద్మాలు మనస్సులో ధ్యానించుకొంటూ, వ్రేపల్లెకు వెళ్లిపోయారు.

## ✤ మునిభార్య లన్నముఁ దీసికొని వచ్చి శ్రీకృష్ణుని నారగింపఁ జేయుట ✤

**వ. ఇట్లు గోపకన్యకలందుఁ బ్రసన్నుండై గోవిందుండు బృందావనము దాఁటి దూరంబున ధేనువుల మేపుచుండఁ, జండకిరణుని యెండంబడి దండిచెడి తరులదండ నండగొనుచు నాతపత్రాకారంబులై నీడలు సేయుచున్న వృక్షంబుల నీక్షించి కృష్ణ బల శ్రీదామ దేవప్రస్థ విశాలార్జున ప్రముఖులకుం దక్కిన గోపకు లిట్లనిరి. 849**

**ప్రతి :** ఇట్లు= ఈ ప్రకారంగా; గోపకన్యల+అందున్= గొల్లపడుచులందు; ప్రసన్నుండు+ఐ= అనుగ్రహం కలవాడయి; గోవిందుండు= శ్రీకృష్ణుడు; బృందావనం దాఁటి; మేపుతూ ఉండగా; దూరంబునన్= దవ్వున; ధేనువులన్= ఆవులను; మేపుచున్+ఉండన్= మేపుతూ ఉండగా; చండకిరణుని+ఎండన్= తీవ్రమైన కిరణాలుగల సూర్యుని ఎండలో; పడి= చిక్కి; దండిచెడి= బలము కోల్పోయి; తరులదండన్= చెట్లకింద; అండన్+కొనుచున్= ఆశ్రయం పొందుతూ; ఆతపత్ర+ ఆకారంబులు+ఐ= గొడుగులవంటి రూపాలు కలవి అయి; నీడలు+చేయుచున్+ ఉన్నవృక్షంబులన్= నీడల నిచ్చుచున్న చెట్లను; ఈక్షించి= చూచి, కృష్ణ= శ్రీకృష్ణుడు; బల= బలరాముడు; శ్రీదామ= శ్రీదాముడు; దేవప్రస్థ= దేవప్రస్థుడు; విశాల= విశాలుడు; అర్జున= అర్జునుడు; ప్రముఖులకున్= మొదలగువారితో; తక్కిన గోపకులు= ఇతరులయిన గొల్లపిల్లవాండ్రు; ఇట్లు+అనిరి= ఈ విధంగా పలికారు.

**తా :** శ్రీకృష్ణుడు ఈ విధంగా గోపికలను అనుగ్రహించి, బృందావనాన్ని దాటి, దూరంగా తోలుకొనిపోయి ఆవుల్ని మేపుతున్నాడు. ఎండ మెండుగా కాస్తోంది. గొల్లవారు ఆ వేడికి తట్టుకోలేక పోతున్నారు. నీరసించి పోతున్నారు. అక్కడ విశాలంగా విస్తరించి గొడుగులవలె నీడనిచ్చే చెట్లు ఉన్నాయి. వాటిల్ని చూచి తక్కిన గొల్లవారు శ్రీకృష్ణుడు, బలరాముడు, శ్రీదాముడు, దేవప్రస్థుడు, విశాలుడు, అర్జునుడు, మొదలయినవారితో ఈ విధంగా అన్నారు.

**మ. 'అపకారంబులు సేయ వెవ్వరికి నేకాంతంబులందుండు నా**
**తపశీతానిలవర్షవారణములై త్వగ్గంధనిర్యాస భ**
**స్మ పలాశాగ్ర మరందమూల కుసుమచ్ఛాయాఫలశ్రేణిచే**
**నుపకారంబులు సేయు నర్థులకు నీ యుర్వీజముల్ గంటిరే?' 850**

**ప్రతి :** ఈ+ఉర్వీజములు= భూమినుండి పుట్టే ఈ చెట్లు; ఏ+వారికిన్ (ఎవ్వరికిన్)= ఎటువంటి జనులకైనా; అపకారంబులు+ చేయవు= కీడు చేయవు; ఏకాంతంబుల+అందున్= ఇతరులతో సంబంధం లేకుండా; ఉండున్= ఉంటాయి; ఆతప= ఎండను; శీత+అనిల= చల్లగాలిని; వర్ష= వానలను; వారణములు= ఆపునవి; ఐ= అయి; త్వక్= బెరడు యొక్క; గంధ= గంధం యొక్క; నిర్యాస= జిగురుయొక్క; భస్మ= బూడిదయొక్క; పలాశ= ఆకులయొక్క; అగ్ర= చిగుళ్ల యొక్క; మరంద= పూదేనెయొక్క; మూల= వ్రేళ్లయొక్క; కుసుమ= పూలయొక్క; ఛాయా= నీడలయొక్క; ఫల= పండ్లయొక్క; శ్రేణిచేన్= వరుసచేత; అర్థులకున్= కోరినవారికి; ఉపకారంబులు= మేళ్లను; చేయున్= చేస్తాయి; కంటిరి+ఏ= చూచారా!

**తా :** గోపబాలకులారా! ఈ చెట్లు చూడండి. ఎంత గొప్పవో! తమకు కీడు తలపెడదామని వచ్చినవారికికూడా కీడు చేయవు. ఎవరిసంబంధం లేకుండా ఏకాంతంగా ఉన్నాయి. ఎండ, చలి, వానలనుండి ప్రజల్ని కాపాడుతున్నాయి. వారికి అవసరమైన బెరడు, గంధం, జిగురు, బూడిద, చిగుళ్లు, తేనె, పూలు, పండ్లు, నీడలు ఇచ్చి ఆదుకుంటున్నాయి.

**విశే :** రాగద్వేషాలు లేని మహాయోగీశ్వరులు ఏకాంతంగా తపస్సు చేసుకొంటూ ఉంటారు. తమను ఆశ్రయించినవారు మంచివారయినా, చెడ్డవారయినా సర్వసమభావంతో ఆదరించి, వారికీడులను తొలగించి మేళ్లు కలిగిస్తారు. అటువంటివి ఈ వృక్షాలు అని సారాంశం.

**వ. అని చిగురాకు పువ్వు గాయ పండు తండంబుల వ్రేఁగున వీఁగిన తరువులనడిమితెరువునం బసులదాఁటుల దాఁటించి, యమునకుం జని, వెడఁదమడుఁగుల మెల్లన చల్లని నీరు ద్రావించి, తత్సమీపంబున మేపుచు, వల్లవులెల్ల మూఁకలు గొని, యాఁకలి గొంటి మని విన్నవించినఁ దనకు భక్తురాండ్రగు విప్రభార్యలవలనం బ్రసన్నుండై వారలం జూచి రామసహితుండైన హరి యిట్లనియె. 851**

**ప్రతి :** అని= ఇట్లుపలికి; చిగురు+ఆకు= చిగురుటాకు; పువ్వు= పుష్పం; కాయ, పండు= కాయ, పండు అనేవాటియొక్క; తండంబుల వ్రేఁగునన్= సమూహాలయొక్క బరువుచే; వీఁగిన తరువుల నడిమి తెరువునన్= వంగినచెట్లనడిమి దారిలో; పసులదాఁటులన్= ఆలమందలను; దాఁటించి= తోలుకొనిపోయి; యమునకున్+చని= యమునానదివద్దకు వెళ్లి; వెడఁద మడుఁగులన్= పెద్దవి అయిన మడుగులలో; మెల్లనన్= నెమ్మదిగా; చల్లనినీరు త్రావించి= చల్లనినీటిని త్రాగించి; తత్+సమీపంబునన్= ఆ యమునానదివద్ద; మేపుచున్= ఆవులను మేపుతూ; వల్లవులు+ఎల్లన్= గొల్లవారందరును; మూఁకలుగొని= గుంపులుగూడి; ఆఁకలిగొంటిమి= ఆకలితో ఉన్నాము; అని విన్నవించినన్= అని మనవిచేయగా; తనకున్, భక్తురాండ్రు= తనయందు భక్తిగలిగినవారు; అగు విప్రభార్యలవలనన్= అయిన బ్రాహ్మణ స్త్రీలపట్ల; ప్రసన్నుండు+ఐ= అనుగ్రహం కలవాడయి; రామసహితుండు+ఐన= బలరామునితో గూడినవాడైన; హరి= శ్రీకృష్ణుడు; వారలన్+చూచి= గొల్లవారిని చూస్తూ; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తా :** అక్కడి చెట్లన్నీ పువ్వులు కాయలు పండ్లు మెండుగా ఉండడంవల్ల వాటి బరువుకు వంగి ఉన్నాయి. వాటి నడుమనుండే దారులగుండా గొల్లవారు ఆలమందలను యమునవద్దకు తోలుకొని పోయారు. ఆ నదిమడుగులలోని చల్లనినీరు త్రాగించి,

సమీపంలోని పచ్చికబయళ్లలో మేపుతూ, తమకు ఆకలిగా ఉందని శ్రీకృష్ణునికి విన్నవించారు. బలరామ సహితుడైన శ్రీకృష్ణుడు తనయందు భక్తిగల బ్రాహ్మణభార్యలను అనుగ్రహించాలని సంకల్పించి, గొల్లవారితో ఈ విధంగా అన్నాడు.

**సీ. వల్లవులార! యీ వనమున విప్రులు బ్రహ్మవాదులు దేవభవనమునకు**
**నరుగుట కాంగిరసాహ్వయసత్త్రంబు సలుపుచునున్నారు సనుఁడు మీరు**
**మా నామములు సెప్పి మైత్రితో నడిగిన నన్నంబు వెట్టెద రనుచుఁ బలుక**
**వారలు చని విప్రవరుల కెల్లను మ్రొక్కి పసుల మేపుచు బలభద్రకృష్ణు**

**తే. లలసి పుత్తెంచి రిట మమ్ము నన్న మడుగ, ధర్మవిదులార! యర్థిప్రదాతలార!**
**పెట్టుఁ డన్నంబు; శ్రాంతులఁ బిలిచి తెచ్చి, పెట్టుదురు గాదె మిముబోఁటి పెద్దలెల్ల. 852**

**ప్రతి :** వల్లవులార= ఓ గోపకులార! ఈ వనమునన్= ఈ అరణ్యంలో; బ్రహ్మవాదులు= వేదాలను చదివేవారు; విప్రులు= బ్రాహ్మణులు; దేవభవనమునకున్= స్వర్గలోకానికి; అరుగుటకున్= వెళ్లడానికి; ఆంగిరస+ఆహ్వాయసత్త్రంబు= ఆంగిరసం అను పేరుగల యజ్ఞాన్ని, సలుపుచున్+ఉన్నారు= చేస్తున్నారు; మీరు= మీరందరు; చనుఁడు= అచటకు వెళ్లుడు; మా నామములు+చెప్పి= మాపేర్లను పేర్కొని; మైత్రితోన్= స్నేహభావంతో; అడిగినన్= కోరినయెడల; అన్నంబున్+పెట్టెదరు= అన్నం పెడతారు; అనుచున్+పలుకన్= అని చెప్పగా; వారలు= ఆ గొల్లలు; చని= వెళ్లి; విప్రవరులకున్+ఎల్లను= బ్రాహ్మణ శ్రేష్ఠులందరికీ; మ్రొక్కి= నమస్కరించి; పసుల మేపుచున్= ఆవులను మేపుతూ; బలభద్రకృష్ణులు= బలరాముడును, శ్రీకృష్ణుడును; అలసి= డస్సి; ఇటన్= ఈ చోటున; అన్నము+అడుగన్= అన్నం అడిగేందుకు; మమ్మున్= మమ్మల్ని; పుత్తెంచిరి= పంపారు; ధర్మవిదులార= ధర్మమెరిగిన పెద్దలారా; అర్థిప్రదాతలార= యాచకులకు కోరినవిచ్చే పెద్దలారా; అన్నంబు= అన్నం; పెట్టుఁడు= పెట్టండి; మిముబోఁటిపెద్దలు+ఎల్లన్= మీవంటి పెద్దలందరు; శ్రాంతులన్= ఆకలిచే డస్సినవారిని; పిలిచి తెచ్చి= పిలిచి తీసుకొనివచ్చి; పెట్టుదురు+కాదు+ఎ= అన్నం పెడతారు గదా!

**తా :** ఓ గోపాలకులారా! ఈ అడవిలో వేదాలు వల్లించిన బ్రాహ్మణులు స్వర్గలోకప్రాప్తికయి 'ఆంగిరసము' అనే యజ్ఞం చేస్తున్నారు. మీరు వారివద్దకు వెళ్లి, మా అన్నదమ్ముల పేరులు చెప్పి, వారు పంపగా వచ్చామని చెప్పి, అన్నం పెట్టుమని అడగండి. వారు పెడతారు. అలాగే అని గోపబాలకులు బ్రాహ్మణుల వద్దకు వెళ్లి, నమస్కరించి, అయ్యా! మీరు ధర్మతత్త్వం ఎరిగినవారు. యాచకులు అడిగినవి అనుగ్రహించేవారు! ఆవులను మేపుతూ అలసిపోయిన బలరామకృష్ణులు ఆకలితో అన్నం పెట్టమని మీ వద్దకు పంపారు. కాబట్టి అన్నం పెట్టండి. ఆకలితో నకనకలాడేవారిని పిలిచి మరీ అన్నం పెడతారు కదా మీవంటి పెద్దలు!

**క. 'ఘన దీక్షితునకు నైనం, జనుఁ గుడువఁగఁ; బశువధంబు సౌత్రామణియుం**
**జనిన వెనుక దోషము లే, దనఘాత్మకులార! పెట్టుఁ డన్నము మాకున్.' 853**

**ప్రతి :** ఘన దీక్షితునకున్+ఐనన్= గొప్పదగు యజ్ఞదీక్ష వహించినవాని కయినా; పశువధంబున్= యజ్ఞపశువును వధించుటయు; సౌత్రామణియున్= 'సౌత్రామణి' అను పేరుగల హోమం; చనిన వెనుకన్= ముగిసిన పిమ్మట; కుడువన్+కన్= భోజనము చేయుట; చనున్= తగును; (కావున) దోషము లేదు= మాకు అన్నం పెట్టుట తప్పు కాదు; అనఘ+ఆత్మకులార= పాపరహితమయిన మనస్సులుగల ఓ బ్రాహ్మణులారా!; పెట్టుఁడు+అన్నము= మాకు అన్నం పెట్టండి.

**తా :** ఓ పుణ్యాత్ములారా! యజ్ఞదీక్ష వహించిన యజమానుడు పశువిశసనం జరిగిన పిమ్మట, సౌత్రామణి క్రతువు పూర్తి అయిన పిమ్మట భోజనం చేయవచ్చు. ఇతరులకు పెట్టవచ్చు. అది దోషం కాదు. కావున మాకు అన్నం పెట్టండి.

**వ. అని గోపకులు పలికిన. 854**

**ప్రతి :** అని= ఇట్లు; గోపకులు= గొల్లవారు; పలికినన్= పలుకగా...

**తా :** ఈ విధంగా గొల్లవారు **అన్నం పెట్టండి** అని బ్రాహ్మణులను యాచిస్తే

**మ. క్రతువున్ మంత్రము దంత్రమున్ ధనములుం గాలంబు దేశంబు దే**
**వతయున్ ధర్మము నన్యముల్ దలఁప నెవ్వాఁ డట్టి సర్వేశ్వరున్**
**మతి నూహింపక గోపబాలుఁ డనుచున్ మందస్థితిం జూచి దు**
**ర్మతులై యన్నము, లేదు లేదనిరి సమ్మానక్రియాశూన్యులై. 855**

**ప్రతి :** క్రతువున్= యజ్ఞమును; మంత్రమున్= ఆ యజ్ఞంలో వినియోగింపబడే మంత్రాలును; తంత్రమున్= (అందలి) క్రియాకలాపం; ధనములున్= యజ్ఞనిర్వహణానికి అవసరమగు ధనం; కాలంబు= యజ్ఞం నిర్వర్తించేందుకు తగిన కాలం; దేశంబు= ప్రదేశం; దేవతయున్= అధిదేవత; ధర్మమున్= పుణ్యఫలం; అన్యముల్= యజ్ఞానికి సంబంధించిన మిగిలిన అంశాలును; తలఁపన్= ఆలోచిస్తే; ఏ+వాఁడు= (మూలం) ఎవడో; అట్టి సర్వ+ఈశ్వరున్= సర్వమునకు ప్రభువయినట్టి శ్రీకృష్ణుణ్ణి; మతిన్= బుద్ధియందు; ఊహింపక= తెలుసుకోలేక; గోపబాలుఁడు+అనుచున్= గొల్లపిల్లవాడు అని భావిస్తూ; మందస్థితిన్+చూచి= జడబుద్ధితో చూచి; దుర్మతులు+ఐ= చెడ్డబుద్ధి కలవారయి; సమ్మానక్రియాశూన్యులు+ఐ= గౌరవించుట అనే పనిచేయకున్నవారయి; అన్నము లేదు లేదు+అనిరి= అన్నం లేదు లేదు అని పలికారు.

**తా :** అజ్ఞానంతో కూడినవారు, దుర్బుద్ధి కలిగినవారు అగు బ్రాహ్మణులు, సమస్తానికీ ప్రభువయినవాడు శ్రీకృష్ణుడని గ్రహించ లేకపోయారు. వాస్తవానికి యజ్ఞం, మంత్రాలు, దేశకాలధనాలు, యజ్ఞం చెయ్యడంవల్ల కలిగే పుణ్యఫలం (అపూర్వం) అన్నీ కూడ శ్రీవిష్ణుస్వరూపాలే. అటువంటి శ్రీకృష్ణుణ్ణి సామాన్యమైన గొల్లపిల్లవాడు అని భావించి, అతని మాటలను గౌరవించకుండా, అన్నం లేదు లేదు వెళ్లిపొండి అని తిరస్కరించి పంపించారు.

**వ. అంత గోపకులు నిరాశులై వచ్చి యెఱింగించిన హరి లౌకికానుసారి యగుచు 'మీరయ్యార్యుల నడుగక, వారిభార్యలకు మా రాకఁ జెప్పుం; దన్నంబు వెట్టెద' రని పంచిన వారలు సని బ్రాహ్మణసతుల దర్శించి నమస్కరించి సంపూజితులయి యిట్లనిరి. 856**

**ప్రతి :** అంతన్= పిమ్మట; గోపకులు= గోపాలురు; నిర్+ఆశులు+ఐవచ్చి= ఆశ లేనివారయి శ్రీకృష్ణుడున్నచోటికి వచ్చి; ఎఱింగించినన్= (బ్రాహ్మణులు తమకు అన్నం పెట్టని వృత్తాంతం) తెలియజెప్పగా; హరి= శ్రీకృష్ణుడు; లౌకిక+అనుసారి= లోకధర్మం అనుసరిస్తున్నవాడు; అగుచున్= అవుతూ; మీరు= మీరందరు; ఆ+ఆర్యులన్= పూజ్యులగు ఆ బ్రాహ్మణులను; అడుగక= అడుగకుండగ; వారిభార్యలకున్= ఆ బ్రాహ్మణుల భార్యలకు; మా రాకన్+ చెప్పుండు= మేము వచ్చిన సంగతి చెప్పండి; అన్నంబు+పెట్టెదరు= అన్నం పెడతారు; అని పంచినన్= అని పంపించగా; వారలు+చని= ఆ గొల్లపిల్లవాండ్రు వెళ్లి; బ్రాహ్మణసతులన్ దర్శించి= బ్రాహ్మణులభార్యలను చూచి; నమస్కరించి= మ్రొక్కి; సంపూజితులు+అయి= వారిచేత పూజింపబడినవారయి; ఇట్లు+అనిరి= ఈ విధంగా అన్నారు.

**తా :** అపుడు గోపాలకులు నిరాశతో శ్రీకృష్ణుని వద్దకు వచ్చి, జరిగిన విషయం వివరించారు. అంతట శ్రీకృష్ణుడు లోకవ్యవహారాన్ని దృష్టిలో ఉంచుకొని ఆ గొల్లవారితో మీరు వెళ్లి ఆ బ్రాహ్మణులను గాకుండగా వారిభార్యలను దర్శించి, వారికి మా రాకను చెప్పండి. వారు తప్పక అన్నం పెడతారు, అని పంపించాడు. వారు వెళ్లి యజ్ఞవాటికలో ఉన్న బ్రాహ్మణ భార్యలను దర్శించి, నమస్కరించి వారిచే సత్కారం పొంది, వారితో ఈ విధంగా అన్నారు.

**క. 'గోవుల మేపుచు నాఁకొని, గోవిందుం డన్న మడిగికొని రం డని మ**
**మ్మీ వేళం బుత్తెంచెను, ధీవిలసితలార! రండు; తెం డన్నంబుల్.' 857**

**ప్రతి :** ధీవిలసితలార= బుద్ధియొక్క వికాసంగల తల్లులారా!; గోవిందుండు= శ్రీకృష్ణుడు; గోవులన్ మేపుచున్= ఆవులను మేపుతూ; ఆఁకొని= ఆకలిగొని; అన్నము అడిగికొని రండు+అని= అన్నం అడిగి తీసుకొనిరండి అని; ఈ వేళన్= ఈ సమయంలో; మమ్మున్= మమ్మల్ని; పుత్తెంచెను= పంపాడు; రండు= వెంటనే రండి; తెండు+అన్నంబుల్= అన్నం తీసుకొని రండు.

**తా :** బుద్ధిమతులయిన ఓ అమ్మలారా! శ్రీకృష్ణుడు ఆవులను మేపుతూ, ఆకలి గొన్నవాడయి మిమ్మల్ని అడిగి అన్నం తెమ్మని ఈరోజు మమ్మల్ని పంపించాడు. కావున వెంటనే అన్నం పట్టుకొనిరండి.

**వ. అనిన విని గోవింద సందర్శనకుతూహలలై ధరణీసురసుందరులు సంభ్రమానందంబులు డెందంబుల సందడింప, భక్ష్య భోజ్య లేహ్య చోష్య పానీయ భేదంబులు గలిగి, సంస్కారసంపన్నంబులైన యన్నంబులు కుంభంబుల నిడుకొని సంరంభంబుల సముద్రంబునకు నడచు నదుల తెఱంగున. 858**

**ప్రతి :** అనినన్= అని గొల్లవారు ఇట్లుపలుకగా; ధరణీసుర సుందరులు= బ్రాహ్మణస్త్రీలు; విని= విని; గోవింద సందర్శన కుతూహలలు+ఐ= శ్రీకృష్ణుణ్ణి చూచుటయందు కుతూహలం కలిగినవారై; సంభ్రమ+ఆనందంబులు= తొట్రుపాటు, సంతోషం; డెందంబులన్= మనస్సుల్లో; సందడింపన్= పెచ్చుపెరగగా; భక్ష్య= కర కర నమిలి తినదగ్గవి; భోజ్య= ముద్దచేసి తినదగ్గవి; లేహ్య= నాలుకతో ఆస్వాదించవలసినవి; చోష్య= జుర్రుకోవలసినవి; పానీయ= త్రాగదగ్గవి; అను భేదంబులన్+కలిగి= అనే భేదాలు కలిగి ఉన్నవి; సంస్కారసంపన్నంబులు= పరిశుద్ధితో కూడుకొన్నవి; ఐన అన్నంబులు= అయినట్టి భోజనపదార్థాలను; కుంభంబులన్+ఇడుకొని= పాత్రలలో ఉంచుకొని; సంరంభంబులన్= తొట్రుపాటులతో; సముద్రంబునకున్= సముద్రంవైపునకు; నడచు నదుల తెఱంగునన్= పోవునట్టి నదులవలె...

**తా :** గొల్లల మాటలు విన్న బ్రాహ్మణస్త్రీలు శ్రీకృష్ణుణ్ణి చూడాలనే కుతూహలంతో, సంతోషం, తొట్రుపాటు అధికం కాగా, భక్ష్య భోజ్య చోష్య లేహ్య పానీయాలనే భేదాలతో కూడుకొని ఉన్న ఆహారపదార్థాలను పాత్రలలో నింపుకొని, సముద్రం చేరడానికి తొందరపడే నదులవలె (బయలుదేరారు)

**క. బిడ్డలు మగలును భ్రాతలు, నడ్డము చని వల దనంగ నటు దలఁ డని మా**
**ఱొడ్డుచు జగదీశ్వరునకు, జడ్డన నన్నంబు గొనుచుఁ జని రా సుదతుల్. 859**

**ప్రతి :** బిడ్డలు= పిల్లలు, మగలును= భర్తలును; భ్రాతలున్= అన్నదమ్ములూ; అడ్డము చని= అడ్డం వచ్చి; వలదు+అనన్+కన్= వెళ్లవద్దని పలుకగా; అటు తలఁడు+అని= అవతలికి తప్పుకోండి అంటూ; మాఱు+ఒడ్డుచున్= ఎదిరిస్తూ; జడ్డనన్=

శీఘ్రుంగా; జగత్+ఈశ్వరునకున్= విశ్వానికి ప్రభువయిన శ్రీకృష్ణునికి; ఆ సుదతులు= ఆ బ్రాహ్మణస్త్రీలు; అన్నంబు+కొనుచున్+ చనిరి= అన్నం తీసుకొని వెళ్లారు.

**తా :** పిల్లలు, మగలు, అన్నదమ్ములు అడ్డం వచ్చి వెళ్లవద్దని వారించారు. అయినా ఆ బ్రాహ్మణస్త్రీలు వారిని లక్ష్యపెట్టక, ఎదిరించి, మాదారికి అడ్డురాకండి తొలగిపొండని గద్దించి, ఆహారపదార్థాలు తీసికొని వేగంగా శ్రీకృష్ణుణ్ణి సమీపించారు.

**వ. చని యమునాసమీపంబున నవపల్లవాతిరేకంబును విగతవనచరశోకంబును నైన యశోకంబు క్రింద నిర్మలస్థలంబున. 860**

**ప్రతి :** చని= వెళ్లి, యమునాసమీపంబునన్= యమునానదిదగ్గర; నవపల్లవ+అతిరేకంబును= క్రొత్త చిగుళ్లచేత అతిశయించినదీ; విగతవనచరశోకంబును= వనచరముల బాధలను పోగొట్టేదీ; ఐన అశోకంబుక్రిందన్= అయినట్టి అశోకవృక్షం క్రింద; నిర్మలస్థలంబునన్= స్వచ్ఛమయిన చోట...

**తా :** బ్రాహ్మణస్త్రీలు ఈ విధంగా వెళ్లి, యమునకు సమీపంలో కొత్తచిగుళ్లతో కూడిందీ, తన క్రిందికి చేరినవారి బడలికను పోగొట్టేదీ అయిన అశోకవృక్షచ్ఛాయలో ఒకమంచి చోట

**సీ. ఒక చెలికానిపై నొకచేయి సాఁచి వే ఱొకచేత లీలాబ్జ మూఁచువానిఁ**
**గొప్పున కందని కొన్నికుంతలములు సెక్కుల నృత్యంబు సేయువానిఁ**
**గుఱుచచుంగులు వుచ్చి కొమరారఁ గట్టిన పసిఁడి వన్నియ గల పటమువాని**
**నౌఁదలఁ దిరిగి రా నలవడఁ జుట్టిన దట్టంపుఁ బించెపు దండవాని**

**తే. రాజితోత్పలకర్ణపూరములవాని, మహితపల్లవపుష్పదామములవాని**
**భువనమోహననటవేషభూతివానిఁ, గనిరి కాంతలు కన్నుల కఱవు దీఱ. 861**

**ప్రతి :** కాంతలు= బ్రాహ్మణుల భార్యలు; ఒక చెలికానిపైన్= ఒక స్నేహితునిమీద; ఒక చేయి+చాఁచి= ఒకచేతిని చాపి; వేఱు+ఒకచేతన్= మరియొకచేతితో; లీలా+అబ్జమున్= వినోదంకోసం తామరపూవును; ఊఁచువానిన్= త్రిప్పుతున్నవాణ్ణి; కొప్పునకున్= జుట్టుముడికి; అందనికొన్ని కుంతలములు= అందకుండా ఉన్నట్టి కొన్ని వెంద్రుకలు; చెక్కులన్= చెక్కిళ్లలో; నృత్యంబు+చేయువానిన్= కదలాడుతున్న వాణ్ణి; కుఱుచ చుంగులు+పుచ్చి= పొట్టిగా కుచ్చిళ్లు విడిచి; కొమరు+ఆరన్= అందంగా; కట్టిన పసిఁడివన్నియగల పటమువానిన్= ధరించిన బంగారురంగు బట్టకలవాణ్ణీ; ఔఁదలన్= శిరస్సుమీద; తిరిగిరాన్= చుట్టివచ్చునట్లుగా; అలవడన్= అనువుగా (కట్టుకొన్న); చుట్టినన్= చుట్టుకొన్న; దట్టము+పించెము+ దండవానిన్= సందులేకుండగ గ్రుచ్చబడ్డ నెమలీకల దండగలవాణ్ణి; రాజిత= ప్రకాశించునట్టి; ఉత్పల= కలువపూల చేతనయిన; కర్ణపూరముల వానిన్= చెవికమ్మలు గలవాణ్ణి; మహిత= గొప్పవయిన; పల్లవ= చిగుళ్లయొక్కయు; పుష్ప= పూవులయొక్కయు; దామములవానిన్= దండలు కలవాణ్ణి; భువన= లోకానికి; మోహన= మైమరపు కలిగించే; నటవేష= నటుని రూపంయొక్క; భూతివానిన్= సంపద కలిగినవాడైన శ్రీకృష్ణుణ్ణి; కన్నుల కఱవు దీఱన్= కన్నుల కరవు తీరునట్లుగా, నేత్రానందంగా; కనిరి= చూచారు.

**తా :** అపుడు శ్రీకృష్ణుడు ఒక స్నేహితుని భుజంమీద ఒక చేయివైచి, రెండచేతితో వేడుకగా తామరపూవును ఇటు అటు త్రిప్పుతున్నాడు. తలమీది ముడికి అందని కొన్ని ముంగురులు చెక్కిళ్లమీద చిందులాడుతున్నాయి. కురుచగా కుచ్చెళ్ళువచ్చేలాగున

బంగారు రంగుబట్ట కట్టుకొని ఉన్నాడు. తలచుట్టు గుండ్రంగా అమరి ఉండునట్లుగా దట్టంగా కుట్టిన నెమలీకలదండ ధరించాడు. చెవిసందున కలువపూవు పెట్టుకొన్నాడు. పారవశ్యం కలిగించేటంతటి చక్కటి నటవేషంతో ప్రకాశిస్తున్నాడు. అటువంటి శ్రీకృష్ణణ్ణి బ్రాహ్మణవనితలు కన్నుల కరువెల్ల తీరేలా కనుగొన్నారు.

**క. కని లోచనరంధ్రంబుల, మునుమిడి హరిలలితరూపమును లోఁగొని నె**
**మ్మనములఁ బరిరంభించిరి, తనుమధ్యలు హృదయజనితతాపము వాయన్. 862**

**ప్రతి :** తనుమధ్యలు= సన్నని నడుములుగల ఆ విప్రవనితలు; కని= శ్రీకృష్ణణ్ణి చూచి; లోచనరంధ్రంబులన్= కన్నులనెడి ద్వారాలద్వారా; మునుమిడి= వరుసపెట్టి; హరిలలితరూపమును= శ్రీకృష్ణునియొక్క అందమయిన ఆకృతిని; లోన్+కొని= లోనికి గ్రహించి; నెఱ+మనములన్ (నెమ్మనములన్) నిండయిన మనస్సులతో; హృదయజనితతాపము= మనస్సుల్లో పుట్టిన వేదన; పాయన్= పోయేటట్లుగా; పరిరంభించిరి= కౌగిలించుకొన్నారు.

**తా :** సన్ననినడుములు గల ఆ బ్రాహ్మణస్త్రీలు శ్రీకృష్ణుని సుందరమైన రూపాన్ని కన్నులతో హృదయంలోనికి క్రమంగా ఆకర్షించుకొన్నారు. మనస్సులలోని తాపాలు హరించే విధంగా అతణ్ణి తమ మనస్సులతోనే కౌగిలించుకొన్నారు.

**వ. ఇ వ్విధంబున. 863**

**ప్రతి :** ఈ+విధంబునన్= ఈ ప్రకారంగా...

**తా :** ఇలా ఉండగా

**క. వారితసర్వస్పృహలై, వా రందఱుఁ దన్నుఁ జూడ వచ్చుట మదిలో**
**వారిజనయనుఁడు వొడగని, వారికి నిట్లనియె నగి యవారితదృష్టిన్. 864**

**ప్రతి :** వారు+అందఱున్= ఆ బ్రాహ్మణస్త్రీలందరు; వారిత సర్వస్పృహలు+ఐ= తొలగింపబడ్డ అన్నికోరికలు కలవారయి; తన్నున్= తనను; చూడన్= చూచేందుకు; వచ్చుటన్= రావడాన్ని; వారిజనయనుఁడు= పద్మాలవంటి కన్నులున్న శ్రీకృష్ణుడు; మదిలోన్= మనస్సులో; పొడగని= గ్రహించి; నగి= చిన్నగా నవ్వి; అవారితదృష్టిన్= తిన్ననయిన చూపుతో; వారికిన్+ఇట్లు+అనియెన్= వారితో ఇలా అన్నాడు.

**తా :** ఈరీతిగా ఆ బ్రాహ్మణస్త్రీలు ఐహికమైన అన్నికోరికలను వదలుకొని తనను దర్శించడానికి వచ్చిన సంగతిని గ్రహించిన శ్రీకృష్ణుడు, చిరునవ్వు నవ్వి, నిశ్చలదృష్టితో వారిని చూస్తూ, వారితో ఈ విధంగా అన్నాడు.

**శా. 'కాంతారత్నములార! మీ గృహములం గల్యాణమే! యేమి గా**
**వింతున్ మీ? కిటు రండు; మమ్ము నిచటన్ వీక్షింప నేతెంచినా**
**రెంతో వేడుకతో; నెఱుంగుదురు నిర్ద్వైతస్థితిన్ నన్ను ధీ**
**మంతుల్ మీ క్రియఁ జేరి కందురు గదా మత్సేవలన్ సర్వమున్. 865**

**ప్రతి :** కాంతారత్నములార= మేలు బంతులవంటి ఇంతులారా!; మీ గృహములన్= మీ ఇండ్లల్లో; కల్యాణము+ఏ= శుభమే గదా; మీకు ఏమి+కావింతున్= మీకు ఏవిధమయిన మేలు కలిగించేది; ఇటు రండు= సమీపానికి రండి; ఎంతో వేడుకతోన్=

మేరలేని కోరికతో; ఇచటన్= ఈ ప్రదేశంలో; మమ్మున్= మమ్మల్ని; వీక్షింపన్= చూడడానికి; ఏతెంచినారు= వచ్చారు; మీ క్రియన్= మీ తీరును; ధీమంతుల్= వివేకం గలవారు; ఎఱుంగుదురు= తెలుసుకొంటారు; నిర్హేతు స్థితిన్= కారణమేమీ లేనివిధంగా; నన్నున్+చేరి= నన్ను చేరుకొని; మత్+సేవలన్= సేవలతో నన్ను మెప్పించి; సర్వమున్= అన్ని ప్రయోజనాలను; కందురు+కదా= పొందుతారు గదా!

**తా :** గొప్పవారయిన ఓ పడతులారా! నా దగ్గరకు రండి. మీ యిండ్లలో అందరు క్షేమమే కదా! ఏ ప్రయోజనాన్ని కోరి నావద్దకు వచ్చారో చెప్పండి. పతిపుత్రాదులపట్ల ఉన్న ప్రేమనుకూడా కాదని నన్ను చూడాలనే వేడుకతో వచ్చారు. ఏ విధమైన ఫలాసక్తి లేకుండా వచ్చారని నాకు తెలుసు. యోగీశ్వరులుకూడ మీలాగుననే నన్ను ఆశ్రయించి, సేవించి, సమస్త ప్రయోజనాలు పొందుతూ ఉంటారు.

**వ. కావున గృహస్థులైన మీ పతులు మిమ్ముం గూడి క్రతువు నిర్విఘ్నంబుగా సమాప్తి సేసెదరు; మీరు యాగవాటంబునకుం జనుం' దనిన విప్రభార్య లిట్లనిరి. 866**

**ప్రతి :** కావునన్= కాబట్టి, గృహస్థులు= గృహస్థాశ్రమంలోనివారు; ఐన మీపతులు= అయినట్టి మీ భర్తలు; మిమ్మున్+కూడి= మీతో గలిసి; క్రతువు= యజ్ఞం; నిర్విఘ్నంబు+కాన్= ఆటంకాలు లేకుండా; సమాప్తిన్+చేసెదరు= పూర్తి చేస్తారు. మీరు= మీరందరు; యాగవాటంబునకున్= యజ్ఞశాలకు; చనుఁడు= వెళ్లండి; అనినన్= శ్రీకృష్ణుడిట్లు పలుకగా; విప్రభార్యలు= బ్రాహ్మణులభార్యలు; ఇట్లు+అనిరి= ఈ విధంగా పలికారు.

**తా :** "మీ భర్తలు గృహస్థధర్మాలను పాటించేవారు. వారు మీతో కలిసి యాగం పూర్తి చేస్తారు. కావున మీరు వెంటనే యాగశాలకు వెళ్లండి" అని శ్రీకృష్ణుడు చెప్పగా బ్రాహ్మణస్త్రీలు శ్రీకృష్ణునికి ఈ విధంగా సమాధానం చెప్పారు.

**మ. 'తగునే మాధవ! యిట్టి వాఁడిపలుకుల్? ధర్మంబులే మా యెడన్?**
**మగలున్ బిడ్డలు సోదరుల్ జనకులున్ మమ్మున్ నివారింప మ**
**చ్చిగ నీ యంఘ్రులు సేరినార; మటఁబోఁ జేకొందురే వార? లా**
**పగి దే మొల్లము; కింకరీజనులఁగా భావించి రక్షింపవే!' 867**

**ప్రతి :** మాధవ= ఓ శ్రీకృష్ణా! ఇట్టి వాఁడిపలుకుల్= ఇటువంటి పదునైన మాటలు; తగును+ఏ= పలుకవచ్చునా? మా+ఎడన్= మా విషయంలో; ధర్మంబులు+ఏ= ధర్మబద్ధమయినవేనా?; మగలున్= భర్తలును; బిడ్డలు= సుతులు; సోదరుల్= అన్నదమ్ములూ; జనకులున్= తండ్రులూ; మమ్మున్= మమ్మల్ని; నివారింపన్= అడ్డగిస్తుండగా; మచ్చిగన్= మోహంతో; నీ+అంఘ్రులు= నీ పాదాలను; చేరినారము= ఆశ్రయించాము; వారలు= ఆ భర్తలు, అన్నదమ్ములు, తండ్రులు; అటన్+పోన్= అక్కడకు వెళ్లినచో; చేకొందురు+ఏ= స్వీకరింతురా; ఆ పగిది= ఆ తీరు; ఏము= మేము; ఒల్లము= ఇష్టపడం; కింకరీజనులన్+కాన్= సేవకురాండ్రగా; భావించి= తలంచి; రక్షింపవు+ఏ= కాపాడవా?

**తా :** ఓ లక్ష్మీపతీ! మాతో ఇటువంటి తీక్ష్ణమైన మాటలు మాటాడవచ్చునా? ఇది నీకు న్యాయమా! మా భర్తలు, బిడ్డలు, అన్నదమ్ములు, తండ్రులు వద్దని అడ్డగిస్తూ ఉన్నా, వారిని కాదని నీ మీది వ్యామోహంతో నీ దగ్గరకు వచ్చాము. ఇపుడు ఇంటికి తిరిగి వెళితే వారు స్వీకరిస్తారా? కావున ఇపుడు నువ్వు చెప్పినమాటలు మాకు నచ్చవు. మేము నీ వద్దనే ఉంటాము. మమ్మల్ని నీ సేవకురాండ్రుగా భావించి కాపాడు.

**వ. అనిన జగదీశ్వరుండు. 868**

**ప్రతి :** అనినన్= బ్రాహ్మణస్త్రీలు ఈ విధంగా పలుకగా; జగత్+ఈశ్వరుండు= లోకానికి ప్రభువయిన శ్రీకృష్ణుడు...

**తా :** అని పలికిన విప్రవనితలతో శ్రీకృష్ణుడు

**సీ. నా సమీపమున నున్నా రంచు నలుగరు బంధులు భ్రాతలు పతులు సుతులు**
**మిమ్ము దేవతలైన మెత్తు రంగనలార! నా దేహసంగంబు నరుల కెల్ల**
**సౌఖ్యానురాగసంజనకంబు గాదు; ముక్తిప్రదాయకము; నా కీర్తనమున**
**దర్శనాకర్ణనధ్యానంబులను గర్మబంధదేహంబులఁ బాసి మీరు**

**తే. మానసంబులు నాయందు మరగఁజేసి, నన్నుఁ జేరెద రటమీఁద; నమ్ముఁ' డనుచుఁ**
**బలికి వారలు దెచ్చిన భక్షణాదు, లాప్తవర్గంబుతో హరి యారగించె. 869**

**ప్రతి :** అంగనలార= ఓ పడతులారా!; బంధులు= చుట్టాలూ; భ్రాతలు= సోదరులూ; పతులు= భర్తలూ; సుతులు= కొడుకులూ; నా సమీపమునన్= పరమాత్మనయిన నాదగ్గర; ఉన్నారు= ఉన్నారు; అంచున్= అని; అలుగరు= కోపించరు; మిమ్మున్= మిమ్మల్ని; దేవతలు+ఐనన్= దేవతలు కూడ; మెత్తురు= మెచ్చుకొంటారు; నా దేహసంగంబు= నా శరీరంతోడి సంబంధం; నరులకున్+ఎల్లన్= మానవుల కందరికి; సౌఖ్య+అనురాగసంజనకంబు గాదు= కామసుఖం, కామభావం పుట్టించేది కాదు; ముక్తిప్రదాయకము= మోక్షం ఇచ్చేది; నా కీర్తనమునన్= నన్ను కీర్తించడం చేత; దర్శన+ఆకర్ణన ధ్యానంబులను= చూచుట, వినుట, ధ్యానించుట అనే పనులచేత; మీరు= మీరందరు; కర్మబంధదేహంబులన్= కర్మములతోడి సంబంధంవల్ల వచ్చిన ఈ శరీరాలను; పాసి= విడిచి; మానసంబులు= మనస్సులను; నా అందున్= నాలో; మరుగన్+చేసి= లగ్నంచేసి; అటమీఁదన్= పిమ్మట; నన్నున్+చేరెదరు= నాలో ఐక్యం కాగలరు; నమ్ముఁడు= విశ్వసించండి; అనుచున్+పలికి= అని చెప్పి; హరి= శ్రీకృష్ణుడు; వారలు తెచ్చిన భక్షణ+ఆదులు= ఆ బ్రాహ్మణస్త్రీలు తెచ్చిన భోజనపదార్థాలను; ఆప్తవర్గంబుతోన్= తనవారితో కలిసి; ఆరగించెన్= తిన్నాడు.

**తా :** అని బ్రాహ్మణస్త్రీలు పలుకగా శ్రీకృష్ణుడు వారికి నచ్చ జెప్పాడు. మీరు నా దగ్గర ఉన్నారని మీ చుట్టాలు, అన్నదమ్ములు, మగలు, బిడ్డలు ఎవ్వరూ కోపపడరు, సరికదా – దేవతలయినా మిమ్మలను మెచ్చుకోవలసిందే. నా దేహంతోడి సంబంధం కామసౌఖ్యాన్ని, కామభావాన్ని కలిగించదు. పైగా ముక్తిని ప్రసాదిస్తుంది. నన్ను గూర్చి స్తుతించడం, దర్శించడం, వినడం, ధ్యానం చేయడం, మీ మనస్సులను నా యందే లగ్నం చేయడం అనే వాటివల్ల, కర్మసంబంధంతో ఏర్పడిన ఈ శరీరం విడిచి తగినకాలంలో నాలో ఐక్యమైపోతారు. నా మాటలు నమ్మండి అని పలికిన పిమ్మట శ్రీకృష్ణుడు వారు తెచ్చిన ఆహారపదార్థాలను తన ఆప్తవర్గంవారితో కలిసి ఆరగించాడు.

**క. పరమేశ్వరార్పణంబుగఁ, బరజనులకు భిక్ష యిడినఁ బరమపదమునం**
**బరఁగెద రఁట! తుది సాక్షా, త్పరమేశుఁడు భిక్ష గొన్న ఫల మెట్టిదియో? 870**

**ప్రతి :** పరమ+ఈశ్వర+అర్పణంబు+కన్= పరమాత్మకు సమర్పించినట్లు భావించి; పరజనులకున్= ఇతరులయిన సామాన్యజనులకు; భిక్ష+ఇడినన్= భిక్ష పెట్టితే; పరమపదమునన్= మిక్కిలి గొప్పదగు వైకుంఠంలో; పరఁగెదరు+అఁట=

ఉంటారట; తుదిన్= చివరకు; సాక్షాత్+పరమ+ఈశుఁడు= ప్రత్యక్షంగా పరమాత్మ అయిన శ్రీకృష్ణుడు; భిక్ష+కొన్నన్= భిక్షను స్వీకరిస్తే, ఫలము= ఫలితం; ఎట్టిదియో= ఎంతటిదో గదా!

**తా :** ఓ పరీక్షిన్మహారాజా! పరమేశ్వరభావంతో సామాన్యజనునికి భిక్ష పెడితే పరమపదం అయిన వైకుంఠం సిద్ధిస్తుంది. మరి, స్వయంగా పరమేశ్వరుడే శ్రీకృష్ణరూపంలో వచ్చి భిక్ష స్వీకరించినందువల్ల కలిగే ఫలం ఎంతటిదో ఎవరు చెప్పగలరు?.

**వ. ఇట్లు సర్వేశ్వరుం డయిన హరికి భిక్ష యిడి తమ తమ భార్య లతని వలనం గృతార్థ లగుట యెఱింగి భూసురవరులు తమలో నిట్లనిరి. 871**

**ప్రతి :** ఇట్లు= ఈ ప్రకారంగా; సర్వ+ఈశ్వరుండు= విశ్వానికి ప్రభువు; అయిన హరికిన్= అయినట్టి శ్రీకృష్ణునికి; భిక్ష= భిక్షను సమర్పించి; తమ తమ భార్యలు= వారి వారి ఇల్లాండ్రు; అతనివలనన్= శ్రీకృష్ణునివల్ల; కృత+అర్థలు+అగుటన్= ధన్యురాండ్రయిన సంగతిని; ఎఱింగి= తెలుసుకొని; భూసురవరులు= బ్రాహ్మణ శ్రేష్ఠులు; తమలోన్= తమలో తాము; ఇట్లు+అనిరి= ఈ విధంగా అనుకొన్నారు.

**తా :** ఈ విధంగా పరమేశ్వరుడయిన శ్రీకృష్ణునికి ఆహారం సమర్పించి, తమ భార్యలు ఆయనచేత ధన్యురాండ్రయిన సంగతి తెలుసుకొని ఆ బ్రాహ్మణులు తమలో తాము పశ్చాత్తాపం పొందారు.

**చ. 'కటకట! మోసపోయితిమి; కాంతలపాటియు బుద్ధి లేదు; నేఁ**
**డిట హరిఁ గానఁబో నెఱుఁగ; మేము దురాత్ముల; మేము కల్మషో**
**ద్భటులము; విష్ణుదూరగుల ప్రాజ్ఞత లేల? తపంబు లేల? ప**
**ర్యటనము లేల? శీలములు యాగములున్ మఱి యేల కాల్పనే? 872**

**ప్రతి :** కటకట= అయ్యో! అయ్యో!; మోసపోయితిమి= మోసగింపబడ్డాము, కాంతలపాటియు బుద్ధిలేదు= ఆడవారి కున్నంత బుద్ధికూడ మాకు లేకపోయింది; నేఁడు= ఈనాడు; ఇటన్= ఇక్కడ; హరిన్= శ్రీకృష్ణుణ్ణి; కానన్+పోన్+ఎఱుఁగము= చూడడానికి, వెళ్లవలెననే సంగతికూడ తెలియము; ఏము= మేము; దురాత్ములము= చెడ్డమనస్సుకలవారలం; కల్మష+ఉద్భటులము= మాలిన్యంచేత పొగరెక్కినవాళ్లం; విష్ణుదూరగుల ప్రాజ్ఞతలు= విష్ణువుకు దూరంగా పోయిన వారియొక్క తెలివితేటలు; ఏల= ఎందుకు; తపంబులు+ఏల= తపస్సులు ఎందుకు; పర్యటనములు+ఏల= తీర్థయాత్ర లెందుకు; శీలములున్= సదాచారాలు; యాగములున్= యజ్ఞములు; మఱి+ఏల= ఇంక ఎందులకు; కాల్పనే= కాల్చుటకా?

**తా :** అయ్యయ్యో! మనం ఎంత మోసపోయామో గదా! ఆడవారికున్నపాటి బుద్ధికూడ మనకు లేదు. దగ్గరకు వచ్చిన శ్రీకృష్ణుణ్ణి వెళ్లి దర్శించలేక పోయామే! మన మనస్సులు మంచివి కావు. మనం ఎంతో పాపం చేసుకొన్నాము. విష్ణువును పూజించనివారితెలివితేటలు, తపస్సు, సదాచారం, తీర్థయాత్రలు, యాగాలు వ్యర్థములే గదా!

**క. జపహోమాధ్యయనంబులు, దపములు వ్రతములును లేని తరుణులు హరి స**
**త్కృపఁ బడసి, రన్ని గలిగియుఁ, జపలతఁ బొందితిమి భక్తి సలుపమి నకటా! 873**

**ప్రతి :** అకటా= అయ్యో; జపహోమ+అధ్యయనంబులు= మంత్రజపాలు; యజ్ఞాలు, వేదాధ్యయనాలు; తపములు= తపస్సులు; వ్రతములును= అనేక వ్రతాలూ; లేని= ఆచరించని; తరుణులు= యువతులు; హరి సత్+కృపన్= శ్రీకృష్ణునియొక్క

మంచిదయను; పడసిరి= పొందారు; అన్ని కలిగియున్= జపం హోమం మొదలైనవి అన్నీ ఉండికూడా; భక్తి సలుపమిన్= భక్తి చూపించనందువల్ల; చపలతన్ పొందితిమి= చాంచల్యం పొందాము.

**తా :** ఆడవారు జపాలు, హోమాలు, వేదాధ్యయనాలు, తపస్సులు, వ్రతాలు, ఏమీ ఎరుగరు. అయినప్పటికినీ భక్తి కలిగి శ్రీకృష్ణునిదయకు పాత్రలయ్యారు. జపహోమాదులు అన్నీ చేస్తూ ఉండికూడ భక్తిలేని కారణంగా చాంచల్యానికి లోనయి, శ్రీకృష్ణునిఅనుగ్రహానికి నోచుకొనలేక పోయాము గదా!

**క. సురగురులగు యోగీంద్రుల, నరుదుగ మోహితులఁ జేయు హరిమాయ; మమున్**
**నరగురుల మూఢవిప్రుల, నురవడి మోహితులఁ జేయ నోపక యున్నే? 874**

**ప్రతి :** సురగురులు+అగు= దేవతలయొక్క గురువులు అగు; యోగి+ఇంద్రులన్= యోగీశ్వరులను; అరుదుగన్= వింతగా; మోహితులన్= మోహానికి లోబడునట్లుగ; చేయు హరిమాయ= చేసే శ్రీకృష్ణునిమాయ; నరగురులన్= మానవులకు గురువులును; మూఢవిప్రులన్= అజ్ఞానులయిన బ్రాహ్మణులు అగు; మమున్= మమ్ము; ఉరవడిన్= శీఘ్రంగా; మోహితులన్= మోహం పొందినవారినిగా; చేయక+ఉన్నే= చేయకుండునా? (చేస్తుంది)

**తా :** విష్ణుమాయ దేవతలకు గురువులయిన మహాయోగీశ్వరులనే మోహంలో ముంచేస్తుంది. ఇక సామాన్యమానవులకు గురువులమై అజ్ఞానులమయిన మమ్మల్ని మోహింప జేయడంలో ఆశ్చర్యం ఏమి ఉంది?

**మ. క్రతువుల్ ధర్మము మంత్రతంత్రధనముల్ గాలంబు దేశంబు దే**
**వతయున్ వహ్నులు మేదినీసురులు నెవ్వాఁ డిట్టి సర్వేశుఁ డీ**
**క్షితి రక్షింప జనించినాఁ; డెఱుఁగ; మా శ్రీభర్తకుం గర్తకుం**
**గుతలోద్ధర్తకు మేము మ్రొక్కెదము రక్షోనాథసంహర్తకున్'. 875**

**ప్రతి :** క్రతువుల్= యజ్ఞాలు; ధర్మము= పుణ్యం; మంత్రతంత్రధనముల్= మంత్రాలు, తంత్రాలు, ధనాలూ; కాలంబు= వేళ; దేశంబు= ప్రదేశం; దేవతయున్= అధిష్ఠానదేవత; వహ్నులు= త్రేతాగ్నులూ; మేదినీసురులును= భూదేవులగు బ్రాహ్మణులూ; ఏ+వాఁడు+ఇట్టి= ఎవడో ఇట్టి; సర్వ+ఈశుఁడు= సర్వప్రభువు; ఈక్షితిన్= ఈ భూమిని; రక్షింపన్= రక్షించడానికి; జనించినాఁడు= పుట్టాడు; ఎఱుఁగము= (ఈ సంగతిని) తెలుసుకొన లేకపోయాము; కుతల+ఉద్ధర్తకున్= భూమిని రక్షించేవాడూ; కర్తకున్= సృష్టిస్థితిలయం చేయువాడూ; రక్షస్+నాథసంహర్తకున్= రాక్షసరాజులను సంహరించేవాడూను; ఆ శ్రీభర్తకున్= లక్ష్మీదేవికి భర్త అయినవాడూను అయిన ఆ శ్రీకృష్ణునికి; మేము= మేము; మ్రొక్కెదము= నమస్కరిస్తున్నాము.

**తా :** యజ్ఞాలు, మంత్రాలు, తంత్రాలు, పుణ్యం, ధనం, కాలం, దేశం, దేవత, త్రేతాగ్నులు, బ్రాహ్మణులు అంతా విష్ణుమయమే! అట్టి పరమేశ్వరుడు భూమిని రక్షించడంకోసం శ్రీకృష్ణుడుగా అవతరించాడు అనే సంగతి తెలుసుకొన లేకపోయాం. లక్ష్మీదేవికి భర్త, సృష్టి స్థితిలయాలకు కర్త; భూమండలానికి ఉద్ధర్త, రాక్షసరాజులకు సంహర్త అయిన శ్రీకృష్ణునికి నమస్కరిస్తున్నాము.

## ❖ నందాదు లింద్రయాగము సేయ శ్రీకృష్ణునితో నాలోచించుట ❖

**వ. అని మఱియు ననేకవిధంబులఁ బశ్చాత్తాపంబులం బొంది హరిం దలంచి శమింపు మని మ్రొక్కి బ్రాహ్మణులు కంసభీతులయి బలకృష్ణసందర్శనంబు సేయంజనరై; రంత నక్కడ నఖిలదర్శనుండైన హరి**

**యింద్రయాగంబు సేయం దలంచి తన కడకు వచ్చిన నందాదిగోపవృద్ధులం గని నమస్కరించి నందున కిట్లనియె. 876**

**ప్రతి :** అని= ఇట్లు; మఱియున్= ఇంకా; బ్రాహ్మణులు= విప్రులు; అనేకవిధంబులన్= పలురీతులుగా, పశ్చాత్తాపంబులన్+ పొంది= చేసిన తప్పిదాలకు తపించి; హరిన్= శ్రీకృష్ణుణ్ణి; తలంచి= ధ్యానించి; శమింపుము+అని= మన్నింపుము అని; మ్రొక్కి= నమస్కరించి; కంసభీతులు+అయి= కంసునివల్ల భయపడినవారై; బలకృష్ణసందర్శనంబు+ చేయన్= బలరామకృష్ణులను చూచేందుకు; చనరు+ఐరి= వెళ్లని వారయ్యారు; అంతన్= అంతలో; అక్కడన్= యమునా తీరంలో; అఖిలదర్శనుండు+ఐన= సర్వమూ చూచేవాడైన; హరి= శ్రీకృష్ణుడు; ఇంద్రయాగంబు= ఇంద్రుని ఉద్దేశించి చేసే యాగాన్ని; చేయన్+తలంచి= చేసేందుకు పూనుకొని; తన కడకున్= తనవద్దకు; వచ్చిన; నంద+ఆదిగోపవృద్ధులన్= నందుడు మొదలయిన గొల్లలలోని పెద్దవారిని; కని= చూచి; నమస్కరించి= మొక్కి; నందునకున్= నందునితో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికాడు.

**తా :** ఈ విధంగా బ్రాహ్మణులు అనేక విధాలుగా అనుతాపం అనుభవించారు. తమ తప్పులు మన్నించమని మనస్సులోనే మాధవుణ్ణి ధ్యానించి నమస్కరించారు.అయినా కంసునిభయంవల్ల సమీపంలో ఉన్న బలరామకృష్ణులను సందర్శించడానికి వెళ్లలేదు. ఆ తర్వాత యమునాతీరంలో ఉన్న సర్వసాక్షి అయిన శ్రీకృష్ణుడు, ఇంద్రయాగం చెయ్యాలనే సంకల్పంతో తనవద్దకు వచ్చిన నందుడు మొదలగు పెద్దలైన యాదవులకు నమస్కరించి, నందునితో ఈ విధంగా అన్నాడు.

**సీ. యాగంబు సేయంగ నర్థించి వచ్చితి; రీ యాగమున ఫల మేమి గలుగు**
**నెవ్వాఁడు దీనికి నీశ్వరుం? డధికారి యెవ్వఁడు? సాధన మెంత వలయు**
**శాస్త్రీయమో, జనాచారమో కార్యంబు? వైరుల కెఱిఁగింపవలదు గాని**
**యెఱిఁగెడి మిత్రుల కెఱిఁగింపఁ దగుఁ జేరి యెఱిఁగి చేసినఁ గోర్కు లెల్లఁ గలుగుఁ**

**ఆ. బగయుఁ జెలిమి లేక పరఁగిన మిముబోఁటి, మంచివారి కేల మంతనంబు**
**తలఁపు లెల్ల మాకుఁ దగ నెఱిఁగింపవే, తాత! వాక్సుధాప్రదాత వగుచు. 877**

**ప్రతి :** తాత= ఓ తండ్రీ! యాగంబున్= యజ్ఞం; చేయన్+కన్= చేసేందుకు; అర్థించి= కోరి; వచ్చితిరి= వచ్చారు; ఈ యాగమునన్= ఈ యజ్ఞంవల్ల; ఫలము+ఏమి= ప్రయోజనమేమి; కలుగును= కలుగుతుంది; దీనికిన్= ఈ యాగానికి; ఈశ్వరుండు= అధిదేవత; ఏ+వాఁడు= ఎవ్వడు; అధికారి= అర్హతకలవాడు (యజమానుడు) ఏ+వాఁడు= ఎవడు; సాధనము= ఉపకరణం; ఎంతవలయున్= ఎంత కావాలి; శాస్త్రీయము+ఓ= (ఈ యాగం) శాస్త్రంచే విధింపబడిందా; (కాక) జన+ ఆచారము+ఓ= జనులవాడుక లోనిదా; కార్యంబు= చేయదగినపని; వైరులకున్= శత్రువులకు; ఎఱిఁగింపన్+వలదు+కాని= తెలియజేయ కూడదుగాని; ఎఱిఁగెడి మిత్రులకున్= తెలుసుకోదగ్గ స్నేహితులను; చేరి= సమీపించి; ఎఱిఁగింపన్+తగున్= తెలియజేయుట యుక్తం; ఎఱిఁగి చేసినన్= తెలిసి చేసినయెడల; కోర్కులు+ఎల్లన్= అన్ని కోరికలూ; కలుగున్= సిద్ధిస్తాయి; పగయున్= విరోధమూ; చెలిమి= స్నేహమూ; లేక; పరఁగిన మిముబోఁటి మంచివారికిన్= మీవంటి సజ్జనుల కందరికీ; మంతనంబు+ఏల= రహస్యం ఎందుకు?; వాక్+సుధాప్రదాతవు= మాటలనెడి అమృతాన్ని ఇచ్చేవాడవు; అగుచున్= అవుతూ; తలఁపులు+ఎల్లన్= నీ అభిప్రాయాలనన్నింటినీ; మాకున్= మాకు; తగన్= చక్కగా; ఎఱిఁగింపవు+ఏ= తెలియజెప్పవా!

**తా :** తండ్రీ! మీరేదో యాగం చెయ్యాలనే తలంపుతో ఇక్కడికి వచ్చారు. దీనివల్ల కలిగే ప్రయోజనం ఏమిటి? ఈ యాగానికి అధిదేవత ఎవరు? అధికారి (యజమానుడు) ఎవరు? దీనికి కావలసిన సాధన సంపత్తి ఎంత? ఈ యాగం శాస్త్రవిహితమా?

లౌకికమా? శత్రువులకు ఇటువంటి కార్యాల విషయాలు చెప్పకూడదు గాని, హితులకు, మిత్రులకు కావలసిన వారికి చెప్పవచ్చును. కర్మతత్త్వం తెలిసి చేస్తే ఫలం బాగా సిద్ధిస్తుంది. పగ, స్నేహం అనే ద్వంద్వం లేకుండా సమభావంతో మెలగే మీవంటి మంచివారికి దాచవలసిన రహస్యాలు ఏమి ఉంటాయి? అమృతతుల్యమైన మాటలతో మీ అభిప్రాయా లేమిటో చెప్పండి.

**వ. అని పలికిన ప్రౌఢకుమారునికిఁ దండ్రి యిట్లనియె. 878**

**ప్రతి :** అని; పలికినన్= శ్రీకృష్ణుడు పలుకగా; ప్రౌఢకుమారునికిన్= అన్నీ తెలిసిన కొడుకుతో; తండ్రి= తండ్రి అయిన నందుడు; ఇట్లుపలికెన్= ఇలా పలికాడు.

**తా :** ప్రౌఢుడైన శ్రీకృష్ణుడు ఈ విధంగా ప్రశ్నించగా, తండ్రి అయిన నందుడు ఈ విధంగా సమాధానం చెబుతున్నాడు.

**సీ. పర్జన్యుఁ డధికుండు భగవంతుఁ డమరేంద్రుఁ డతనికిఁ బ్రియమూర్తు లగుచు నున్న**
**మేఘబృందంబులు మేదినీతలముపై నతనిపంపున భూతహర్షణముగ**
**జలములు గురియుఁ, దజ్జలపూరములఁ దోఁగి పండు సస్యంబు లా పంట దమకు**
**ధర్మార్థకామప్రదాయకంబుగ లోకు లెల్లను బ్రదుకుదు; రింత యెఱిఁగి**

**తే. మేఘవిభుఁడైన యింద్రుండు మెచ్చుకొఱకు, నింద్రయాగము సేయుదు రెల్లనృపులు**
**కామలోభభయద్వేషకలితు లగుచుఁ, జేయ కుండిన నశుభంబు సెందుఁ బుత్ర! 879**

**ప్రతి :** పుత్ర= ఓ కుమారా! పర్జన్యుఁడు= వరుణుడు; భగవంతుఁడు= దేవుడు అయిన; అమర+ఇంద్రుఁడు= దేవేంద్రుడు; అధికుండు= ఈ యాగానికి అధిపతి (అధిదేవత); అతనికిన్= ఆ ఇంద్రునికి; ప్రియమూర్తులు= ఇష్టమయిన రూపాలు; అగుచున్+ఉన్న= అయి ఉన్న; మేఘబృందంబులు= మేఘాలగుంపులు; అతనిపంపునన్= ఆ ఇంద్రుని ఆజ్ఞచేత; మేదినీతలముపైన్= నేలమీద; భూతహర్షణము+కన్= ప్రాణులకు సంతోషం కలుగునట్లుగ; జలములు+కురియున్= నీళ్లను వర్షిస్తాయి; తద్+జలపూరములన్= ఆ నీటి వెల్లువల్లో; తోఁగి= తడిసి; సస్యంబులు= పైరులు; పండున్= ఫలిస్తాయి; లోకులు+ఎల్లన్= ప్రజలు అందరును; ఆ పంట= ఆ ఫలం; తమకున్= తమకు, ధర్మ+అర్థ కామప్రదాయకంబు+కన్= ధర్మం, అర్థం, కామం అనేపురుషార్థాలను ఇస్తూ ఉండగా; బ్రదుకుదురు= జీవిస్తారు; ఇంత= ఈ వృత్తాంతమంతా; ఎఱిఁగి= తెలుసుకొని; మేఘవిభుఁడు+ఐన= మబ్బులకు రాజు అయిన; ఇంద్రుండు= దేవేంద్రుడు; మెచ్చుకొఱకున్= మెచ్చుకోవడంకోసం; ఎల్లనృపులు= రాజులందరూ; ఇంద్రయాగము= ఇంద్రదేవతాకమైన ఈ యాగాన్ని; చేయుదురు= చేస్తారు; కామ= కామం; లోభ= పిసినిగొట్టుతనం; భయము= వెరపు; ద్వేషము= పగ; కలితులు= (అనువానితో) కూడుకొన్నవారు; అగుచున్= అవుతూ; చేయక+ఉండినన్= ఇంద్రయాగం చేయకపోతే; అశుభంబు= కీడు; చెందున్= కలుగుతుంది.

**తా :** వర్షానికి వరుణుడూ, షడ్గుణైశ్వర్యసంపన్నుడూ అయిన దేవేంద్రుడు ఈ యాగానికి అధిపతి. ఇంద్రుడికి ప్రియమైన మేఘాలు, అతని ఆజ్ఞచేత నేలమీద వానలు కురిపిస్తాయి. సర్వజీవులకూ ఆప్యాయనం కలిగిస్తాయి. ఆ నీటివల్ల పంటలు పండి ప్రజలకు ధర్మార్థకామాలు సిద్ధిస్తాయి. ఈ సంగతి అంతా ఎరిగిన రాజులు, లోకంలో ఇంద్రయాగం చేస్తూ ఉంటారు. ఒకవేళ ఎవరైనా కామ లోభ భయద్వేషాలకు లోబడి చేయడం మానేస్తే వారికి తప్పకుండా కీడు మూడుతుంది.

**వ. అదియునుం గాక. 880**

**ప్రతి :** అదియునున్+కాక= అంతేకాక...

**తా :** అంతమాత్రమేకాక, ఇంకా

**ఆ. మఖము సేయ వజ్రి మది సంతసించును, వజ్రి సంతసింప వాన గురియు**
**వాన గురియఁ గసవు వసుమతిఁ బెరుఁగును, గసవు మేసి ధేనుగణము బ్రదుకు. 881**

**ప్రతి :** మఖము+చేయన్= యజ్ఞం చేస్తే; వజ్రి= ఇంద్రుడు; మదిన్= మనస్సులో; సంతసించును= సంతోషిస్తాడు; వజ్రి సంతసింపన్= ఇంద్రుడు సంతోషిస్తే; వాన+కురియున్= వర్షం పడుతుంది; వాన= వర్షం; కురియన్= కురిస్తే; వసుమతిన్= భూమిపైన; కసవు= గడ్డి; పెరుఁగున్= పెరుగుతుంది; ధేనుగణము= ఆలమంద; కసవు మేసి= గడ్డి తిని; బ్రదుకున్= జీవిస్తుంది.

**తా :** ఇంద్రయాగం చేస్తే, దేవేంద్రుడు సంతోషించి వానలు కురిపిస్తాడు. వానలు కురిస్తే భూమిమీద గడ్డి పెరుగుతుంది. ఆ గడ్డిని మేసి ఆలమందలు బతుకుతాయి.

**క. ధేనువులు బ్రదికెనేనిన్, మానదు ఘనమైన పాఁడి మందలఁ గలుగున్**
**మానుగను బాఁడి గలిగిన, మానవులును సురలఁ దనిపి మనుదురు పుత్రా! 882**

**ప్రతి :** పుత్రా= ఓ కుమారా! ధేనువులు= ఆవులు; బ్రదికెనేనిన్= బతికితే; ఘనమైన పాఁడి= గొప్పదైనపాడి; మానదు= తరగదు; మందలన్= ఆలగుంపులందు; మానుగన్= చక్కగా; కలుగున్= (పాడి) కలుగుతుంది; పాఁడి+కలిగినన్= పాడి కలిగితే; మానవులును= మానవులూ; సురలన్+తనిపి= దేవతలను తృప్తిపరచి; మనుదురు= బతుకుతారు.

**తా :** కుమారా! ఆవులు బదికితే గొప్ప పాడి కలుగుతుంది. ఆవుల గుంపులవలన చక్కగా పాడి కలుగుతుంది. పాడి కలిగితే మానవులు దేవతలను తృప్తిపరచి జీవిస్తారు.

**వ. అని యిట్లు నొడివిన నందుని వచనంబులు విని యింద్రునికిఁ గోపంబు దీపింప దనుజదమనుండు తండ్రి కిట్లనియె. 883**

**ప్రతి :** అని= అంటూ; ఇట్లు= ఈ విధంగా; నొడివిన నందునిపలుకులు= పలికిననందునియొక్క మాటలను; దనుజదమనుండు= రాక్షసులను సంహరించిన శ్రీకృష్ణుడు; విని; ఇంద్రునికిన్= దేవేంద్రుడికి; కోపంబుదీపింపన్= కోపం పెరుగేటట్లుగా; తండ్రికిన్= తండ్రి అయిన నందునితో; ఇట్లు= ఈ ప్రకారంగా; అనియెన్= అన్నాడు.

**తా :** అని ఇలా నందుడు చెప్పిన మాటలు విని రాక్షససంహారకుడయిన శ్రీకృష్ణుడు, దేవేంద్రుడికి కోపం పెరిగే విధంగా, తన తండ్రితో ఈ విధంగా అన్నాడు.

**క. కర్మమునఁ బుట్టు జంతువు, కర్మముననె వృద్ధిఁ బొందుఁ గర్మమునఁ జెడుం**
**గర్మమె జనులకు దేవత, కర్మమె సుఖదుఃఖములకుఁ గారణ మధిపా! 884**

**ప్రతి :** అధిపా= ఓ నందరాజా! జంతువు= ప్రాణి; కర్మమునన్= కర్మం చేతనే; పుట్టున్= పుడుతుంది; కర్మమునన్+అ= కర్మ మాత్రం చేతనే; వృద్ధిన్+పొందున్= పెరుగుతుంది; కర్మమునన్= కర్మం చేతనే; చెడున్= నశిస్తుంది; కర్మము+ఎ= ఆ కర్మమే; జనులకున్= ప్రజలకు; దేవత= దైవం; కర్మమె= ఆ కర్మమే; సుఖదుఃఖములకున్= సుఖానికీ దుఃఖానికీ; కారణము= ప్రధాన హేతువు.

**తా :** ఓ నందరాజా! లోకంలో ప్రాణి తాను చేసిన కర్మకు తగిన జన్మనే ఎత్తుతోంది. కర్మచేతనే పెరుగుతోంది. కర్మచేతనే నశిస్తోంది. కాబట్టి ఆ కర్మమే మనుష్యులకు దేవత. ప్రాణుల సుఖదుఃఖాలకుకూడా ఆ కర్మమే మూలం.

**క. కర్మములకుఁ దగు ఫలములు, కర్ములకు నిడంగ రాజు గాని, సదా ని**
**ష్కర్ముఁడగు నీశ్వరుండును, గర్మవిహీనునికి రాజు గాఁడు మహాత్మా! 885**

**ప్రతి :** మహా+ఆత్మా= గొప్పమనస్సుగల ఓ నందరాజా! కర్ములకున్= కర్మలు చేసేవారికి; కర్మములకున్= వారు చేసే కర్మలకు; తగుఫలములు= తగిన ఫలితాలు; ఇడన్+కన్= ఇవ్వడానికి; రాజుగాని= రాజై ఉండగా; సదా= ఎల్లప్పుడు; నిష్కర్ముఁడు+అగు= కర్మలు చేయనివాడైన; ఈశ్వరుండును= ఈశ్వరుడును; కర్మవిహీనునికిన్= కర్మసంబంధం లేనివానికి; రాజు+కాఁడు= ప్రభువు కాడు. (అంటే కర్మఫలాలు ఇచ్చేవాడు కాడు.)

**తా :** మహాత్మా! కర్మాచరణం చేసేవాని కర్మలకు తగిన ఫలాన్ని ఇవ్వడానికి ఈశ్వరుని అవసరం ఉందనుకుంటే అతడుకూడా కర్మలుచేసిన వానికే ఫలం కలిగిస్తాడు. వాస్తవానికి కర్మసంబంధం లేని యీశ్వరుడు కూడా కర్మ చేయనివానికి ఫలమీయలేడు.

**వ. కావునఁ గర్మానుయాతంబు లయిన భూతంబులకుఁ బురుహూతునివలని భీతి యేటికి? పురాతనజన్మ సంస్కారంబులు గుప్పలు గొని కప్పినఁ గర్మంబులఁ దప్పించి పెంపు వడయ నప్పరమేశ్వరుండును నేరఁ డితరులం జెప్పనేల? సురాసుర నరానీకంబులతోడి లోకంబు నిజసంస్కారవశంబై యంద డిందియున్నది; సందేహంబు లేదు. దేహి కర్మవశంబున గురు తను దేహంబులం జొచ్చి వెడలు; నొజ్జ, వేలుపు, నెచ్చెలి, పగఱు, చుట్టంబులు, కర్మంబులు; జీవుండు కర్మంబు తోడన వర్తించు; నతనికిఁ గర్మంబు దైవతంబు. కర్మంబునం బ్రదుకుచు నితరసేవ సేయుట సతి పతిని విడిచి జారుం జేరినచందంబగు; విప్రుండు వైదికకర్మంబున మెలంగు; నృపతి ధరణీపాలనంబున సంచరించు; వైశ్యుండు వాణిజ్యకృషి కుసీద గోరక్షణాదుల వర్తించు; శూద్రుం డగ్రజన్ముల సేవించి బ్రదుకు; సత్త్వ రజ స్తమో గుణంబు లుత్పత్తి స్థితి లయ కారణంబు; లందు రజంబున జగంబు జన్మించు; రజోగుణ ప్రేరితంబు లయి మేఘంబులు వర్షించు; వర్షంబునం బ్రజావృద్ధి యగు; నింద్రుం డేమి సేయంగల వాఁ డదియునుం గాక. 886**

**ప్రతి :** కావునన్= కనుక; కర్మ+అనుయాతంబులు= కర్మను అనుసరించి వచ్చేవి; అయినభూతంబులకున్= అయినట్టి ప్రాణులకు; పురుహూతుని వలనిభీతి= ఇంద్రునివల్ల కలిగే భయం; ఏటికిన్= ఎందుకు? పురాతనజన్మ సంస్కారంబులు= ముందటి పుట్టువులకు చెందిన కర్మలయొక్క సంస్కారాలు; కుప్పలు+కొని= రాసులుగా ఏర్పడి; కప్పినన్= కప్పివేస్తే; కర్మంబులన్= ఆ కర్మలను; తప్పించి= విడిచి; పెంపు+పడయన్= వృద్ధిపొందేందుకు; ఆ+పరమ+ఈశ్వరుండును= ప్రసిద్ధుడయిన ఆ సర్వేశ్వరుడుకూడా; నేరఁడు= సమర్థుడు కాడు; (ఇంక) ఇతరులన్= పరమేశ్వరునికంటె వేరయిన వారిని గురించి; చెప్పన్+ఏల=

చెప్పడం ఎందుకు?; సుర= దేవతలయొక్కయు; అసుర= రాక్షసులయొక్కయు; నర= మానవులయొక్కయు; అనీకంబులతోడిలోకంబు= సమూహాలతో గూడిన ప్రపంచం; నిజసంస్కారవశంబు+ఐ= తన కర్మలయొక్క సంస్కారాలకు లోబడిందై; అందు+అ= ఆ సంస్కారంనందే; డింది+ఉన్నది= అణగి ఉంది; సందేహంబున్+లేదు= సంశయం లేదు; దేహి= ప్రాణి; కర్మవశంబునన్= కర్మమునకు లోబడుటచే; గురు తను దేహంబులన్= పెద్దవి చిన్నవి అయిన శరీరాలందు; చొచ్చి= ప్రవేశించి; వెడలున్= బయటపడతాడు; ఒజ్జ= గురువు; వేలుపు= దేవత; నెచ్చెలి= ముఖ్యస్నేహితుడు; పగఱు= పగవారు; చుట్టంబులు= బంధువులును; కర్మంబులు= తాను చేసిన కర్మలే; జీవుండు= జీవాత్మ; కర్మంబుతోడన= కర్మ సహాయంతోనే; వర్తించున్= ప్రవర్తిస్తాడు; అతనికిన్= ఆ జీవుడికి; కర్మంబు= కర్మమే; దైవతంబు= దేవుడు; కర్మంబునన్= కర్మంచేతనే; బ్రదుకుచున్= జీవిస్తూ; ఇతరసేవ+చేయుట= కర్మకంటె వేరయిన దేవతలయొక్క సేవచేయడం; సతి= భార్య; పతిని విడిచి= భర్తను వదలి; జారున్= విటుణ్ణి; చేరినచందంబు+అగున్= కూడిన తీరు అవుతుంది; విప్రుండు= బ్రాహ్మణుడు; వైదిక కర్మంబునన్= వేదం విధించిన కర్మతో; మెలంగున్= వర్తిస్తాడు; నృపతి= రాజు; ధరణీపాలనంబునన్= భూమిపాలనతో; సంచరించున్= మెలగుతాడు; వైశ్యుండు= కోమటి, వాణిజ్య= వర్తకం; కృషి= సేద్యం; కుసీద= వడ్డీకిచ్చి బతకడం; గోరక్షణ= ఆవులను పాలించడం; ఆదులన్= మొదలగు వానియందు; వర్తించున్= ప్రవర్తిస్తాడు; శూద్రుండు= శూద్రుడు; అగ్రజన్ములన్= బ్రాహ్మణ క్షత్రియవైశ్యులను; సేవించి= కొలిచి; బ్రతుకున్= జీవిస్తాడు; సత్త్వరజస్+తమోగుణంబులు= సత్త్వము, రజస్సు, తమస్సు అనే గుణాలు; ఉత్పత్తి స్థితిలయకారణంబులు= విశ్వంయొక్క పుట్టుకకు; నిలకడకు, రూపుమాసిపోవుటకు హేతువులు; అందున్= ఆ సత్త్వరజస్తమోగుణాలలో; రజంబునన్= రజోగుణంచేత; జగంబు= ప్రపంచం; జన్మించున్= పుడుతుంది; రజస్+గుణ ప్రేరితంబులు+అయి= రజోగుణంచేత ప్రేరేపింపబడ్డవి అయి; మేఘంబులు= మబ్బులు; వర్షించున్= వానలు కురుస్తాయి; వర్షంబునన్= వానచేత; ప్రజావృద్ధి+అగున్= ప్రజలకు పెంపు గలుగుతుంది; ఇంద్రుండు= దేవేంద్రుడు; ఏమి+చేయన్+కలవాఁడు= ఏమిచేసేందుకు సమర్థుడవుతాడు?; అదియునున్+కాక= అంతమాత్రమే కాక...

**తా :** కాబట్టి జీవులు తాము పూర్వజన్మలలో చేసుకొన్న కర్మలనుబట్టి సుఖదుఃఖాలు అనుభవిస్తూ ఉంటారు. అలాంటివారు ఇంద్రుడికి భయపడవలసిన అవసరంలేదు. పూర్వ పర్వజన్మలలో చేసిన కర్మలఫలాలు కుప్పలు తెప్పలుగా పడి ఉన్నాయి. వాటి ప్రభావంవల్ల ప్రస్తుత జన్మలలో తగిన కర్మలు చేస్తున్నారు. ఆ కర్మఫలాలనుండి తప్పించడం పరమేశ్వరునికి కూడా సాధ్యం కాదంటే ఇంక ఇతరుల సంగతి చెప్పేదేమిటి? దేవ దానవ మానవ సముదాయాలతో నిండిన ప్రపంచమంతా పూర్వకర్మకు లోబడే ప్రవర్తిస్తూ ఉంటుంది. ఇందులో సందేహం లేదు. జీవుడు తాను చేసిన కర్మలకు తగిన విధంగానే పెద్దవో, చిన్నవో దేహాలు ధరిస్తూ ఉంటాడు. విడిచి పెడుతూ ఉంటాడు. కర్మఫలాన్ని అనుసరించియే గురువు, దేవత, మిత్రుడు, శత్రువు, చుట్టము మనకు లభిస్తూ ఉంటారు. ఎన్నిజన్మ లెత్తినా జీవుడు కర్మఫలాన్ని అనుసరించే ప్రవర్తిస్తూ ఉంటాడు. జీవునికి కర్మమే దేవత. ఇంతటికీ ముఖ్యకారణం కర్మమే అయినప్పుడు ఆ కర్మను విడిచిపెట్టి ఇతరుల్ని ఆశ్రయించడం భార్య భర్తను విడిచిపెట్టి జారపురుషుణ్ణి ఆశ్రయించడంవంటిది. బ్రాహ్మణుడు వేదవిహితమైన కర్మను ఆచరిస్తూ జీవిస్తాడు. రాజు – ప్రజాపాలన చేస్తాడు. వైశ్యుడు – సేద్యం, వడ్డీకి ఇవ్వడం, పశువులను పోషించడం ద్వారా జీవిక గడుపుకొంటాడు. శూద్రుడు – పైవారిని సేవిస్తూ జీవిస్తాడు. సత్త్వం, రజస్సు, తమస్సు అనే గుణాలు ప్రపంచంయొక్క ఉత్పత్తి, స్థితి, నాశాలకు కారణాలు. వానిలో రజోగుణంవల్ల విశ్వం పుడుతుంది. రజోగుణప్రేరణవల్ల మబ్బులు వానలు కురుస్తూ ఉంటాయి, వానలవల్ల ప్రజలు వృద్ధిపొందుతూ ఉంటారు. ఇందులో ఇంద్రునిఅవసరం ఏమి ఉంది? అంతమాత్రమేగాక,

**శా. కోపింపన్ బనిలేదు శక్రునికిఁ, దాఁ గోపించుఁగా కేమి సం**
**క్షేపం బయ్యెడి దేమి? పట్టణములుం గేహంబులున్ దేశముల్**

**వ్యాపారంబులు మీకుఁ బోయెడినె? శైలారణ్యభాగంబులన్**
**గోపత్వంబున నుండుచున్ మనకు సంకోచింపఁగా నేటికిన్? 887**

**ప్రతి :** శక్రునికిన్= దేవేంద్రునికి; కోపింపన్+పనిలేదు= కోపించవలసిన అవసరం లేదు; (అయినప్పటికిని) తాన్= తాను; కోపించున్+కాక= కోపించా దనుకొందాం; ఏమి= దానివల్ల ఏమి జరుగుతుంది?; సంక్షేపంబు+అయ్యెడిది+ఏమి= ఏమి లోటు కలుగుతుంది; పట్టణములున్= నగరాలూ; గేహంబులున్= ఇండ్లూ; దేశముల్= రాజ్యాలూ; వ్యాపారంబులు= బ్రదుకు తెరువులూ; మీకున్= మీకందరికీ; పొయెడిన్+ఎ= పోవునా; శైల+అరణ్యభాగంబులన్= కొండలు అడవులుగల చోటు; గోపత్వంబునన్= ఆవుల కాచుకొంటూ; ఉండుచున్= ఉన్నట్టి; మనకున్= గోపకులమైన మనకు; సంకోచింపన్+కాన్= వెనుదీసేందుకు; ఏటికిన్= ఏమి కారణం?

**తా :** ఈ సందర్భంలో ఇంద్రుడు కోపగించవలసిన అవసరం లేదు. ఒకవేళ కోపగించుకొన్నాడే అనుకొందాం. అందువల్ల మనకు వచ్చే లోటు ఏమీ లేదు. మనకుండే నగరాలు, రాజ్యాలు, ఇళ్లు, వ్యాపారాలు పోతాయేమోనని భయమా? మనం వాటితో నిమిత్తం లేకుండా కొండలలో, అడవులలో పశువులను కాచుకొంటూ, బ్రదుకుతున్నవాళ్లు. మనకు జంకు ఎందుకు?

**సీ. పసులకుఁ గొండకు బ్రాహ్మణోత్తములకు మఖము గావించుట మంచి బుద్ధి**
**యింద్రయాగంబున కేమేమి దెప్పింతు రవి యెల్లఁ దెప్పింపుఁ డరసి మీరు**
**పాయసంబులు నపూపములు సైఁదపుఁబిండివంటలుఁ బప్పును వలయునట్టి**
**ఫలశాకములు వండఁ బంపుండు హోమంబు సేయుఁడు; ధేనుదక్షిణల నిచ్చి**

**తే. బహురసాన్నంబు పెట్టుఁడు బ్రాహ్మణులకు, నచలులై పూజ లొనరింపుఁ డచలమునకు**
**నధమ చండాల శునక సంహతికిఁ దగిన, భక్ష్యముల నిందు కసవులు పసుల కిందు. 888**

**ప్రతి :** పసులకున్= ఆవులకును; కొండకున్= పర్వతానికి; బ్రాహ్మణ+ఉత్తములకున్= బ్రాహ్మణశ్రేష్ఠులకును; మఖము+ కావించుట= యజ్ఞం చేయడం; మంచిబుద్ధి= మంచి తెలివి; మీరు= మీరందరూ; ఇంద్రయాగంబునకున్= ఇంద్రుడు దేవతగా గల యాగానికి; ఏమి+ఏమి+తెప్పింతురు= ఏ యే సంభారాలు తెప్పిస్తారో; అరసి= పరిశీలించి; అవి+ఎల్లన్= వానినన్నిటినీ; తెప్పింపుఁడు= తెప్పించండి; పాయసంబులును= పరమాన్నాలూ; అపూపములు= అప్పాలూ; సైఁదము+ పిండివంటలున్= గోధుమపిండితో చేసే తినుబండారాలూ; పప్పును; వలయునట్టి ఫలశాకములును= అవసరమైన పండ్లూ కూరలూ; వండన్+పంపుండు= వండేందుకు ఆజ్ఞాపించండి; హోమంబు+చేయుఁడు= అగ్నిలో ఆహుతులు సమర్పించండి; బ్రాహ్మణులకున్= విప్రులకు; ధేనుదక్షిణలన్+ఇచ్చి= పాడిఆవుల్ని ధనకనక రూపదక్షిణల్ని ఇచ్చి; బహురస+అన్నంబు= షడ్రసోపేతమైన భోజనాలు; పెట్టుఁడు= వడ్డించండి; అచలమునకున్= ఈ గోవర్ధనపర్వతానికి; అచలులు+ఐ= స్థిరమనస్కులై; పూజలు+ఒనరింపుఁడు= పూజలు చేయండి; అధమ= పతితుల; చండాల= చండాలుల; శునక= కుక్కల; సంహతికిన్= సముదాయానికి; తగినభక్ష్యములను= తగిన తినుబండారాల్ని; ఇందు= పెట్టండి; పసులకున్= ఆవులకు; కసవులు= వేరు వేరు తీరుల గడ్డిని; ఇందు= పెట్టండి.

**తా :** మనకు జీవనాధారమైన ఆవులను, ఆ ఆవులకు కడుపునిండుగా తినడానికి, త్రాగడానికి, గడ్డిని, నీటిని ఇచ్చే ఈ కొండను, ఎల్లప్పుడు మనహితం కోరే బ్రాహ్మణులను గురించి యజ్ఞం చేయడం మంచిపని. అంతేకాని ఇప్పుడు ఇంద్రయాగం

చేయవలసిన అవసరం లేదు. ఇంద్రయాగం గురించి ఏ యే ద్రవ్యాలు తెప్పించా లనుకొన్నారో వానినన్నిటిని తెప్పించండి. పరమాన్నాలు, అప్పాలు, గోధుమపిండివంటలు, పప్పులు, పండ్లు, ఆకుకూరలతో వండదగిన పదార్థాలు వండించండి. అగ్నికి ఆహుతులు సమర్పించండి. షడ్రసోపేతంగా బ్రాహ్మణులకు సంతర్పణ చేసి, పాడిఆవులను, అధికంగా దక్షిణలను సమర్పించండి. స్థిరచిత్తంతో పర్వతాన్ని పూజించండి. పతితులకు, చండాలురకు భోజనాలు పెట్టండి. కుక్కలకు తగిన వంటకాలు పెట్టండి. ఆవులకు కడుపు నిండుగా గడ్డిని పెట్టండి.

**శా. గంధాలంకరణాంబరావళులచేఁ గైసేసి యిష్టాన్నముల్**
**బంధుశ్రేణియు మీరలుం గుడిచి నా భాషారతిన్ వేడుకల్**
**సంధిల్లన్, గిరిగో ద్విజానల నమస్కారంబు గావింపుఁ డో**
**జం ధర్మం బని తోఁచెనేని జనకా! జన్మంబు ధన్యం బగున్. 889**

**ప్రతి :** జనకా= ఓ తండ్రీ!; గంధ= వాసనద్రవ్యాలయొక్క; అలంకరణ= భూషణాలయొక్క; అంబర= వస్త్రాలయొక్క; ఆవళులచేన్= వరుసలచేత; కైసేసి= అలంకరించుకొని; ఇష్ట+అన్నముల్= రుచికరమయిన భోజనపదార్థాలూ; బంధుశ్రేణియున్= చుట్టాల వరసలూ; మీరలున్= మీరూ; కుడిచి= తిని; నా భాషారతిన్= నా మాటయందలి ప్రీతితో; వేడుకల్= వినోదాలు; సంధిల్లన్= కలుగుతుండగా; ధర్మంబు+అని తోఁచెన్+ఏనిన్= ధర్మబద్ధమైనవి అనే ఆలోచన కలిగితే; ఓజన్= వరుసగా; గిరి= కొండకు; గో= ఆవులకు; ద్విజ= బ్రాహ్మణులకు; అనల= అగ్నికి; నమస్కారంబు= వందనం; కావింపుఁడు= చేయండి; జన్మంబు= మీ పుట్టుక; ధన్యంబు= కృతార్థం; అగున్= అవుతుంది.

**తా :** ఓ తండ్రీ! చందనం పునుగు జవ్వాజివంటి సుగంధద్రవ్యాలు పూసుకోండి. అలంకారాలు వేసుకోండి. కొత్తబట్టలు కట్టుకోండి. మీరు మీ చుట్టాలతో కలిసి నోరూరించే తినుబండారాలు తినండి. నా మాటమీద గురి ఉంచి, ఈ పర్వతానికి, బ్రాహ్మణులకు, ఆవులకు, అగ్నికి మొక్కండి. మీ పుట్టుక సార్థకం అవుతుంది.

**వ. అని మఱియు నిలింపపతిసొంపు దింపుతలంపున ని మ్మఖంబు దనకు సమ్మతం బని గోవిందుండు పలికిన, నందాదులు మేలు మే లని తద్వచనప్రకారంబునం బుణ్యాహవాచనంబులు సదివించి ధరణీసురులకు భోజనంబు లిడి పసులకుం గసవు లొసంగి, రప్పుడు. 890**

**ప్రతి :** అని= ఇట్లు; మఱియున్= ఇంకా; నిలింపపతి= దేవతలకు ప్రభువైన ఇంద్రుని; సొంపున్= అతిశయాన్ని; దింపుతలంపునన్= తగ్గించాలనే ఆలోచనతో; ఈ+మఖంబు= ఈ యజ్ఞం; తనకున్ సమ్మతంబు= తనకు ఇష్టం; అని; గోవిందుండు పలికినన్= శ్రీకృష్ణుడు పలుకగా; నంద+ఆదులు= నందుడు మొదలైనవారు; మేలు మేలు= బాగు బాగు అని; తద్+వచన ప్రకారంబునన్= ఆ శ్రీకృష్ణుని మాటచొప్పున; పుణ్యాహవాచనంబులు= పుణ్యాహవాచన మంత్రాలను; చదివించి= పఠింపజేసి; ధరణీసురులకున్= బ్రాహ్మణులకు; భోజనంబులు+ఇడి= భోజనాలు పెట్టి; పసులకున్= ఆవులకు; కసవులు= గడ్డిని (మేతలు); ఒసంగిరి= వేశారు; అప్పుడు= ఆ సమయంలో...

**తా :** శ్రీకృష్ణుడు ఇంద్రునిగర్వం అణచడానికి ఈ నూతనయాగం తనకు సమ్మతమని చెప్పాడు. దీన్ని విన్న నందాదులు బాగు బాగని బ్రాహ్మణులచేత పుణ్యాహవాచనమంత్రాలు చదివించారు. వారికి తృప్తిగా భోజనాలు పెట్టారు. ఆవులకు కడుపునిండుగా మేతలు పెట్టారు.

**మ. సకలాభీరులు వీఁడె కృష్ణుఁ డన నైజం బైన రూపంబుతో**
**నకలంకస్థితినుండి శైల మిదె మీ రర్చింప రం' డంచుఁ దా**
**నొక శైలాకృతిఁ దాల్చి గోపకులతో నొండొండ పూజించి గో**
**పక దత్తాన్నము లాహరించె విభుఁ డా ప్రత్యక్షశైలాకృతిన్. 891**

**ప్రతి :** సకల+ఆభీరులు= గొల్లలందరూ; వీఁడె కృష్ణుఁడు= ఇతడే (మన) కృష్ణుడు; అనన్= అని భావించేటట్లు; నైజంబు+ ఐనరూపంబుతోన్= తనది అయిన కృష్ణరూపంతో; అకలంకస్థితిన్= దోషరహితమైన ఉనికితో; ఉండి= ఉన్నవాడై; తాన్= తాను; ఒక శైల+ఆకృతిన్= ఒక పర్వత రూపాన్ని; తాల్చి= ధరించి; శైలము= పర్వతం; ఇదె= ఇదిగో; మీరు= మీరందరు; అర్చింపన్= పూజించడానికి; రండు అంచున్= రాండి అంటూ; గోపకులతోన్= తోటి గొల్లవారితో కలిసి; ఒండు+ఒండన్= క్రమంగా; పూజించి= తానుకూడ కొండను పూజించి; విభుఁడు= సర్వానికీ ప్రభువైన శ్రీకృష్ణుడు; ఆ ప్రత్యక్షశైల+ఆకృతిన్= కన్నులకెదురుగా కనబడే ఆ కొండయొక్క ఆకారంతో; గోపకదత్త+అన్నములు= (నందాదులయిన) గొల్లవారు పెట్టిన అన్నాలను; ఆహరించెన్= ఆరగించాడు.

**తా :** శ్రీకృష్ణుడు ఎప్పటిలాగా తన నిజమయినరూపంతో గొల్లలమధ్య ఉంటూనే "ఇదిగో పర్వతం. మీరంతా వచ్చి పూజించండి" అని చెప్పి, తాను పర్వతరూపం ధరించి, వారి యెదుట నిలిచాడు. తాను నందాదులతో కలిసి పర్వతరూపంలో ప్రత్యక్షమైన తననే పూజించుకొన్నాడు. ఆ గొల్లలు భక్తితో సమర్పించిన అన్నాదులన్నీ ఆరగించాడు.

**మ. 'వినుఁ డీ శైలము కామరూపి; ఖలులన్ వేధించు; నాజ్యాన్నముల్**
**మన మొప్పించిన వాహరించె; మనలన్ మన్నించెఁ; జిత్తంబులో**
**ననుకంపాతిశయంబు సేసె మనపై నంచున్ సగోపాలుఁడై**
**వనజాక్షుండు నమస్కరించె గిరికిన్ వందారుమందారుఁడై. 892**

**ప్రతి :** వనజ+అక్షుండున్= తామరపూలవంటి కన్నులు గలవాడగు శ్రీకృష్ణుడు; సగోపాలుఁడు+ఐ= గొల్లవారితో కూడుకొనినవాడై; వందారు మందారుఁడు+ఐ= తనకు నమస్కరించే వారికి కల్పవృక్షంవలె కోరిన కోరికలు తీర్చేవాడై; వినుఁడు+ఈ= మీరు నామాట వినండి; ఈ శైలము= ఈ పర్వతం; కామరూపి= కావలసినరూపం పొందగలిగింది; ఖలులన్= దుష్టులను; వేధించున్= బాధిస్తుంది; మనము+ఒప్పించినవి= మనం నివేదించినవి; ఆజ్య+అన్నముల్= నేతితోకూడిన భోజనాలను; ఆహరించెన్= ఆరగించింది; మనలన్= మనను; మన్నించెన్= ఆదరించింది; మనపైన్= మనమీద; చిత్తంబులోన్= మనస్సులో; అనుకంపా+అతిశయంబు= అతిశయించిన దయను; చేసెన్= చూపింది; అంచున్= అని పలుకుతూ; గిరికిన్= కొండకు; నమస్కరించెన్= మొక్కాడు.

**తా :** తనను ఆశ్రయించిన వారికి కల్పవృక్షమై, కోరిన కోర్కెలు తీర్చే శ్రీకృష్ణుడు గోపాలురతో ఈ విధంగా అన్నాడు. మీరు బాగా వినండి. ఈ పర్వతం తన యిచ్ఛ వచ్చిన రూపం ధరించగలదు. దుష్టుల్ని శిక్షిస్తుంది. మనం పెట్టిన నేతి బువ్వలన్నీ తిన్నది. మనల్ని ఆదరించింది. మనమీద దయ చూపించింది. ఈ విధంగా పలికి శ్రీకృష్ణుడు కొండకు నమస్కరించాడు.

**వ. ఇట్లు గోపకులు హరిసమేతులై గిరికిం బూజనోపహారంబులు సమర్పించి, గోధనంబులం బురస్కరించుకొని భూసురాశీర్వాదవచనంబులతో గిరికిం బ్రదక్షిణంబు సేసి, రా సమయంబున. 893**

**ప్రతి :** ఇట్లు= ఈ ప్రకారం; గోపకులు= గొల్లవారు; హరిసమేతులు+ఐ= శ్రీకృష్ణునితో కూడినవారై; గిరికిన్= పర్వతానికి; పూజన+ఉపహారంబులు= పూజను, నైవేద్యాలను; సమర్పించి= పెట్టి; గోధనంబులను= ఆలమందలను; పురస్కరించుకొని= ముందుంచుకొని; భూసుర+ఆశీర్వాద వచనంబులతోన్= బ్రాహ్మణుల దీవెనలతో; గిరికిన్= కొండకు; ప్రదక్షిణంబు+చేసిరి; ఆ సమయంబునన్= అప్పుడు...

**తా :** ఈ విధంగా గొల్లలందరు శ్రీకృష్ణునితో కలిసి కొండకు పూజలు చేసి నైవేద్యాలు పెట్టారు. ఆవులమందల్ని ముందుంచుకొని, బ్రాహ్మణులు ఆశీర్వదిస్తూ ఉండగా, పర్వతానికి ప్రదక్షిణ చేశారు. అప్పుడు,

**క. గుఱ్ఱముల పరువు మెచ్చని, నఱ్ఱులఁ గట్టిన రథంబు నందప్రముఖుల్**
**గుఱ్ఱల యార్పులు సెలఁగఁగఁ, దొఱ్ఱుల గమివెంట నంటఁ దోలి రిలేశా! 894**

**ప్రతి :** ఇలా+ఈశా= భూమికి ప్రభువగు ఓ పరీక్షిన్మహారాజా!; నందప్రముఖుల్= నందుడు మొదలయినవారు; గుఱ్ఱముల పరువున్= అశ్వాల పరుగును; మెచ్చని నఱ్ఱులన్= సహింపని ఎడ్లను; కట్టిన రథంబు= కట్టిన బండిని; కుఱ్ఱల+ఆర్పులు= బాలుర కేకలు; చెలఁగన్+కన్= మారు మోగుతుండగా; తొఱ్ఱులగమివెంటన్= ఆలమందల వెనుక; అంటన్= సమీపించునట్లుగా వెళ్తూ; తోలిరి= పరుగెత్తించారు.

**తా :** ఓ పరీక్షిన్మహారాజా! నందాదులు గుర్రాలకంటె వేగంగా పరుగెత్తే ఎడ్లతో బండి కట్టుకొని, గొల్లపిల్లలు కేరింతలు కొడుతూ ఉండగా ఆలమందల్ని వెన్నంటి తరిమి ముందుకు పరుగెత్తించారు.

**క. పాటించి గానవిద్యా, పాటవమునఁ దేరు లెక్కి బహుతానములం**
**బాటలగంధులు కృష్ణునిఁ, బాటలఁ బాడిరి విరోధిపాటనుఁ డనుచున్. 895**

**ప్రతి :** పాటలగంధులు= కలిగొట్టు పూలవంటి శరీర పరిమళంగల గోపికలు; తేరులు+ఎక్కి= రథాలపై ఎక్కి; పాటించి= ఆదరించి; గానవిద్యాపాటవమునన్= సంగీత విద్యాపాండిత్యంతో; బహుతానములన్= అనేక విధాల ఆరోహణ అవరోహణల క్రమాలతో; కృష్ణునిన్= శ్రీకృష్ణుణ్ణి గురించి; విరోధిపాటనుఁడు= శత్రువులను తీల్చేవాడు; అనుచున్= అంటూ; పాటలన్= గీతాలను; పాడిరి= ఆలపించారు.

**తా :** కలిగొట్టు పూలవాసనవంటి శరీర వాసనగల గోపికలు రథాలమీద వెళ్లుతూ తమ గాన విద్యానైపుణ్యం తేటతెల్లం అయ్యేలా, ఆరోహణావరోహణల క్రమంతో శత్రుసంహారం చేసేవాడు శ్రీకృష్ణుడు – అంటూ అతని లీలలను పాటలుగా పాడారు.

**క. కుండనిభాపీనంబులు, మండితవర్ణములు వివిధమహితాకృతులున్**
**నిండిన కడుపులు గన్నుల, పండువులుగఁ బాడికుఱ్ఱిపదువులు నడచెన్. 896**

**ప్రతి :** కుండనిభ+ఆపీనంబులు= కుండలవంటి పెద్ద పొదుగులును; మండితవర్ణములు= చిత్రించినట్లుగా ఉన్న రంగులును; వివిధ మహిత+ఆకృతులున్= అనేక విధాలగు పూజింపదగిన రూపాలను; నిండినకడుపులు= మేయుటచే నిండుగానున్న కడుపులును కలిగి; పాడి కుఱ్ఱి పదువులు= పాలిచ్చే ఆవుపెయ్యల మందలు; కన్నుల పండువు+కన్= నేత్రోత్సవం కలిగే విధంగా; నడచెన్= ముందుకు నడచాయి.

**తా :** పెద్ద కుండలవంటి పొదుగులతో, మెరుగుగొలుపే పలురంగులతో, బహువిధాలైన ఆకారాలతో, నిండుగా ఉన్న పొట్టలతో ఒప్పే పాడి ఆవులమందలు నేత్రానందం గొల్పుతూ ముందుకు కదిలాయి.

**క. పొగ రెక్కిన మూఁపురములు;, దెగ గల వాలములు, శైలదేహంబులు, భూ**
**గగనములు నిండు ఱంకెలు, మిగుల మెఱయు వృషభగణము మెల్లన నడచెన్. 897**

**ప్రతి :** పొగరెక్కిన మూఁపురములు= మదం మీరిన మూపులూ; తెగగలవాలములు= పొడవయిన తోకలూ; శైలదేహంబులు= కొండలవంటి శరీరాలూ; భూ గగనములు= భూమ్యాకాశాల్లో; నిండు ఱంకెలు= వ్యాపించే రంకెలూ; మిగులన్= విజృంభించగా; మెఱయు వృషభగణము= ప్రకాశించే ఎడ్లగుంపు; మెల్లనన్= నెమ్మదిగా; నడచెన్= నడచింది.

**తా :** బలిసిన మూపులు, పొడవైన తోకలు, కొండలవంటి పెద్ద శరీరాలు, నింగి నేల నిండేలా వేసే రంకెలుగల ఎడ్లగుంపు నెమ్మదిగా నడచింది.

**వ. ఇట్లు పర్వతప్రదక్షిణంబు సేసి గోపకులు మాధవసమేతులై మందకుం జని రంత మహేంద్రుం డంతయు నెఱింగి మహాకోపంబునఁ బ్రళయప్రవర్తకంబులగు సంవర్తక మేఘంబులం జీరి యిట్లనియె. 898**

**ప్రతి :** గోపకులు= గొల్లవారు; ఇట్లు= ఈ విధంగా; పర్వత ప్రదక్షిణంబు+చేసి= కొండకి ప్రదక్షిణంచేసి; మాధవసమేతులు+ఐ= శ్రీకృష్ణునితో కూడినవారై; మందకున్= వ్రేపల్లెకు; చనిరి= వెళ్లారు; అంతన్= అపుడు; మహేంద్రుండు= దేవేంద్రుడు; అంతయున్= పర్వతపూజావృత్తాంతమంతా; ఎఱింగి= తెలుసుకొని; మహాకోపంబునన్= అధికమయిన కోపంతో; ప్రళయ ప్రవర్తకంబులు= ప్రళయం కలిగించేవి; అగు సంవర్తక మేఘంబులన్= అయిన సంవర్తకం మొదలగు మేఘాలను; చీరి= పిలిచి; ఇట్లు= ఇలా; అనియెన్= పలికాడు.

**తా :** ఈ విధంగా పర్వతానికి ప్రదక్షిణం చేసిన గొల్లవారు శ్రీకృష్ణునితో కలిసి గొల్లపల్లెకు వెళ్లిపోయారు. అపుడు తనను కాదని కొండను పూజించిన వృత్తాంతం తెలుసుకొన్న దేవేంద్రుడు మహాకోపంతో ప్రళయం కలిగించే సంవర్తకాదిమేఘాలతో ఈ విధంగా అన్నాడు.

**విశే :** ప్రళయకాల మేఘాలు తొమ్మిది 1.సంవర్తకం 2.ఆవర్తకం 3.పుష్కరం 4.ద్రోణం 5.కాలం 6.నీలం 7.అరుణం 8.తమస్సు 9.వారుణం.

**మ. 'పెరుఁగుల్ నేతులు ద్రావి, క్రొవ్వి భువి నాభీరుల్ మదాభీరులై**
**గిరిసంఘాతకఠోరపత్త్రదళనక్రీడాసమారంభ దు**
**ర్భరదంభోళిధరుం బురందరు ననుం బాటించి పూజింప క**
**గ్గిరికిం బూజలు సేసి పోయి రదెపో కృష్ణుండు ప్రేరేపఁగన్. 899**

**ప్రతి :** భువిన్= భూమిలో; ఆభీరులు= గొల్లలు; పెరుఁగుల్= పెరుగులను; నేతులు= నేతులను; త్రావి= తాగి; క్రొవ్వి= పొగరెక్కి; మద+అభీరులు+ఐ= గర్వంచే భయం లేనివారై; గిరి= పర్వతాల; సంఘాత= సముదాయంయొక్క; కఠోర= కఠినమైన; పత్త్ర= రెక్కల; దళన= ఛేదించడం అనే; క్రీడ= ఆటలో; సమారంభ= వేగిరపాటుగల; దుర్భర= భరింపరాని; దంభోళిధరున్= వజ్రాయుధం ధరించిన; ననున్= నన్ను; పాటించి= గౌరవించి; పూజింపక= అర్చనచేయకుండా (నన్ను

ఉద్దేశించి యాగం చేయక అని భావం); కృష్ణుండు; ప్రేరేపన్+కన్= ప్రేరణ చేయడంచేత; ఆ+గిరికిన్= ఆ కొండకు; పూజలు చేసి= అర్చనలు చేసి; పోయిరి= ఇండ్లకు వెళ్లారు; అదెపో= అదుగో చూడండి.

**తా :** భూలోకంలో నందగోకులంలో ఉన్న గొల్లలు పెరుగులు నేతులు తాగి బాగా పొగరెక్కిపోయారు. వారికి భయం భక్తి కూడా లేకుండా పోయాయి. కొండల గుంపుల కఠినమైన రెక్కల్ని తెగనరకిన వజ్రాయుధం ధరించిన దేవేంద్రుణ్ణి నన్ను లక్ష్యపెట్టక, నా గురించి యాగం చెయ్యక, ఆ శ్రీకృష్ణుని మాట పట్టుకొని ఆ కొండకు పూజచేసి, ఇండ్లకు వెళ్లిపోయారు. చూశారా?

**క. గురుదేవహీను బాలుని, గిరిభూజప్రముఖవాసుఁ గృష్ణు ననీశుం**
**బరిణామశీలుఁ గులగుణ, విరహితుఁ జేపట్టి యింద్రు విడిచిరి గొల్లల్. 900**

**ప్రతి :** గొల్లల్= గొల్లవారు; గురుదేవహీనున్= గురువు దేవుడు లేనివాణ్ణి; బాలునిన్= లోకానుభవం లేని కుర్రవాణ్ణి; గిరిభూజప్రముఖవాసున్= కొండలు, చెట్లు మొదలగు వానివద్ద ఉండేవాణ్ణి; అనీశున్(న+ఈశున్)= శిక్షకుడు లేనివాణ్ణి; పరిణామశీలున్= నిలుకడలేని ప్రవర్తన కలిగినవాణ్ణి; కులగుణవిరహితున్= మంచివంశంలో పుట్టక, మంచి గుణాలు లేనివాణ్ణి; కృష్ణన్= కృష్ణుణ్ణి; చేపట్టి= స్వీకరించి; ఇంద్రున్= ఇంద్రుడనైన నన్ను; విడిచిరి= విడిచిపెట్టారు.

**తా :** భూలోకంలోని నందగోకులంలో ఉన్న గొల్లలు కృష్ణునిమాట విని, నన్ను విడిచిపెట్టారు. ఆ కృష్ణుడు గురువు, దేవత లేనివాడు, లోకానుభవం లేని పసివాడు. కొండలలోను చెట్లతోపులలోను తిరిగేవాడు, ఎవరిమాట విననివాడు, నిలకడలేనివాడు, మంచికులం, మంచిగుణం లేనివాడు.

**ఆ. విమలఘనతరాత్మవిజ్ఞానవిద్యచే, నిగుడలేక యుడుపనిభము లగుచుఁ**
**గర్మమయములైన క్రతువుల భవమహా, ర్ణవముఁ గడవఁ గోరినారు వీరు. 901**

**ప్రతి :** వీరు= ఈ గొల్లవారు; విమల= స్వచ్ఛమయిందీ; ఘనతర= మిక్కిలి గొప్పదీ అయిన; ఆత్మ= పరమాత్మకు సంబంధించిన; విజ్ఞాన= విశేషమైన తెలివి అనే; విద్యచేన్= చదువుచేత; నిగుడన్+లేక= చక్కబడలేక; ఉడుప నిభములు= తెప్పలవంటివి; అగుచున్= అవుతూ; కర్మమయములు= కేవలం కర్మమే స్వరూపంగా కలవి; ఐన క్రతువులన్= అయిన యజ్ఞాలచేత; భవమహా+అర్ణవమున్= సంసారమనే పెద్ద సముద్రాన్ని; కడవన్= దాటడానికి; కోరినారు= ఇష్టపడ్డారు.

**తా :** ఈ గొల్లవాళ్లు చాల తెలివి తక్కువవాళ్లు. బ్రహ్మవిద్య అనే ఓడతో దాటలేక ఈ పెద్ద సంసార సముద్రాన్ని యజ్ఞాలు, యాగాలు అనే తెప్పలతో దాటాలని వీళ్లు కోరుతున్నారు.

**శా. ఉద్యత్సంపద నమ్మి నందతనయోద్యోగంబునన్ వెఱ్ఱులై**
**మద్యాగంబు విసర్జనీయ మని రీ మర్త్యుల్ వడిన్ మీరు మీ**
**విద్యుద్వల్లులఁ గప్పి గర్జనములన్ వేధించి గోవుల్ జనుల్**
**సద్యోమృత్యువుఁ బొంద ఱాల్ గురియుఁడీ! శౌర్యం బవార్యంబుగన్. 902**

**ప్రతి :** ఈ మర్త్యులు= మానవులయిన ఈ గొల్లలు; ఉద్యత్+సంపదన్= పెరుగుతున్న కలిమిని; నమ్మి= నమ్మినవారై; నందతనయ+ఉద్యోగంబునన్= నందుని కొడుకయిన శ్రీకృష్ణుని ప్రయత్నంచే; వెఱ్ఱులు+ఐ= మతిలేనివారై; మత్+యాగంబు=

నన్ను గురించి చేసే యాగం; విసర్జనీయము= విడువదగింది; అనిరి= అని నిర్ణయించారు; మీరు= మీరు; వడిన్= వేగంగా; మీ విద్యుత్+వల్లులన్= మీ యొక్క మెరుపు తీగలచేత; కప్పి= ఆవరించి; గర్జనములన్= ఉరుములచే; వేధించి= బాధించి; గోవుల్= ఆవులును; జనుల్= మానవులును; సద్యః+మృత్యువున్+పొందన్= ఇప్పుడే చావును పొందునట్లుగా; శౌర్యంబు= పరాక్రమం; అవార్యంబు+కన్= అడ్డగింపరాని దగునట్లుగా; ఱాల్= రాళ్లను; కురియుఁడు+ఈ= వర్షించండి.

**తా :** ఓ మేఘములారా! మానవులయిన ఈ గొల్లవారు మరణించే స్వభావం కలవారు. తమ గోసంపద శాశ్వతం అనుకొని, కృష్ణుని ప్రేరణచేత నన్ను గురించిన యాగం చెయ్యడం మానివేశారు. కాబట్టి మీరు వెంటనే వెళ్లి, మెరుపులు మెరయించి, ఉరుములు మొరయించి, వారూ వారితోబాటు వారిఆవులూ ప్రాణాలు వదలేటట్లు అప్రతిహతంగా రాళ్లవాన కురిపించండి;

**క. మీ వెంట వత్తు నే నై, రావణనాగంబు నెక్కి రయ మొప్పంగా**
**దేవగణంబులతోడను, గోవిందునిమంద లెల్ల గొందలపెట్టన్. 903**

**ప్రతి :** ఏన్= మహేంద్రుడనయిన నేను; ఐరావణ నాగంబున్= ఐరావతం అనే పేరుగల ఏనుగును; ఎక్కి= ఎక్కి; రయము= వేగం; ఒప్పన్+కాన్= ఒప్పునట్లుగా; దేవగణంబులతోడను= దేవతాసమూహాలతో కలిసి; గోవిందుని మందలు+ఎల్లన్= కృష్ణుని మందలోని ఆవులనన్నింటిని; కొందలపెట్టన్= చికాకుపరచేందుకు; మీ వెంటన్= మిమ్మల్ని; వత్తున్ (వచ్చుదున్)= వస్తాను.

**తా :** ఆ కృష్ణుని ఆల మందల్ని బాధించడానికి, నేను నా వాహనమైన ఐరావతాన్ని ఎక్కి, దేవసైన్యంతో కలిసి, మీ వెనుకనే వస్తాను, నడవండి.

**వ. అని యిట్లు పలికి జంభవైరి సంరంభంబున దంభోళి జళిపించి, బింకంబున శంకింపక, కింకతోడ సంకలియ లూడ్చిన, మహానిలప్రేరితంబులయి చని, నందునిమందమీఁద నమోఘంబు లైన మేఘంబులు మహౌఘంబులై పన్ని, ప్రచండగతిం జండమరీచిమండలంబుఁ గప్పి, దివినుండి, దిశ లావరించి, రోదోంతరాళంబు నిరంతరనీరంధ్రనిబిడాంధకారబంధురంబుగ నిరోధించి, బలిభంజనద్వితీయ పాదపల్లవభగ్నంబైన బ్రహ్మాండభాండంబు చిల్లుల జల్లించినఁ దొఱఁగు బహిస్సముద్రసలిలనిర్ఝరంబుల వడువున నెడతెగక తోరంబులైన నీరధారలం గురియుచు, శిలల వర్షించుచుఁ, బిడుగుల ఋవ్వుచు నుండ, మిఱ్ఱు పల్లంబులు సమతలంబులయి, యేకార్ణవంబు రూపుసూపిన, నందు దుడు కడుచుచు నీఁదుచు, విలయశిఖి శిఖాసంరంభవిజృంభమాణవిద్యుల్లతావిలోకంబున రిమ్మలుగొని, సొమ్మలు వోవుచున్న లేఁగలును; లేఁగలమూతు లడ్డంబు లిడి ప్రళయభైరవభేరీభాంకారభీషణంబులగు గర్జనఘోషణంబులఁ జెవుడువడి చిందఱవందఱ లైన డెందంబులం గంది కుంది వ్రాలు ధేనువులును; ధేనువుల వెనుక నిడు కొని దురంతకల్పాంత కాలకీలికరాళకాలకంఠకరవిశాలగదాఘాతప్రభూతంబులైన నిర్ఘాతపాతంబులకు భీతంబులై హరికి మ్రొక్కి, రక్షరక్షేతి శబ్దంబులు సేయుకైవడి విడువని జడిం బడి, సైరింపక శిరంబులు వంచుకొని, గద్గదకంఠంబున నంభారవంబులు సేయు వృషభంబులును,వృషభాదిగోరక్షణంబు సేయుచు దుర్వారఘోరశిలాసారంబుల సారంబులు సెడి శరీరంబులు భారంబులైన మ్రానువడు గోపకులును; గోపకులం బట్టుకొని దట్టంబయిన వానకొట్టునం బెట్టువడి**

**బడుగునడుములు నుసులువడ వడవడ వడంకుచు గోవిందునిం జీరు గోపికలును, గోపికాజన కఠినకుచకలశయుగళంబుల మఱుంగునం దలలు వెట్టుకొని పరవశులైన శిశువులునుం గలిగి, మహాఘోషంబుతోడ నష్టంబైన ఘోషంబుఁ జూచి ప్రబుద్ధులైన గోపవృద్ధులు గొందఱు దుర్జనశిక్షకుండును సజ్జనరక్షకుండును నైన పుండరీకాక్షునకు మ్రొక్కి యిట్లనిరి. 904**

**ప్రతి :** జంభవైరి= జంభుడను రాక్షసుణ్ణి జయించిన దేవేంద్రుదు; అని+ఇట్లు= ఈ ప్రకారంగా; పలికి= చెప్పి; సంరంభంబునన్= ఆటోపంతో; దంభోళిన్= వజ్రాయుధాన్ని; జళిపించి= ఇటునటు ఊపి; బింకంబునన్= పట్టుదలతో; శంకింపక= సందేహంలేక; కింకతోడన్= కోపంతో; సంకలియలు= సంకెలలు; ఊడ్చినన్= వదిలింపగా; అమోఘంబులు= అడ్డులేనివి; ఐనమేఘంబులు= అయినట్టి మబ్బులు; మహా+అనిలప్రేరితంబులు+అయి= గొప్పగాలిచేత ప్రేరేపింపబడ్డవి అయి; చని= వెళ్లి; మహా+ ఓఘంబులు+ఐ= పెద్ద గుంపులుగా కూడి; నందునిమందమీఁదన్= నందుని గొల్లపల్లెమీద; పన్ని= కమ్ముకొని; ప్రచండగతిన్= తీవ్రమైన వేగంతో; చండమరీచి మండలంబున్= తీవ్రమైన కిరణములు కల సూర్యునిబింబాన్ని; కప్పి= ఆవరించి; దివినుండి= ఆకాశంనుండి; దిశలు= దిక్కులను; ఆవరించి= వ్యాపించి; రోదస్+అంతరాళంబు= భూమ్యాకాశాల నడిమి భాగాన్ని; నిరంతర= ఎడం లేక; నీరంధ్ర= సందులేక దట్టంగా; నిబిడ= నిండిన; అంధకార= చీకటితో; బంధురంబు+కన్= గట్టిగా; నిరోధించి= అడ్డగించి; బలిభంజన= బలి చక్రవర్తి నణచిన వామనునియొక్క; ద్వితీయ పాదపల్లవ= చిగురుటాకువంటి రెండవ అడుగుచేత; భగ్నంబు+ఐన= పగిలింది ఐన; బ్రహ్మ+అండంబు చిల్లులన్= బ్రహ్మాండం అనెడు కుండయొక్క చిల్లులనుండి; జల్లించినన్= రాల్పగా; తొఱఁగు= కారునట్టి; బహిః= బ్రహ్మాండానికి వెలుపలనున్న; సముద్ర= సముద్రంయొక్క; సలిల= నీటిచేతనయిన; నిఝరంబుల వడువునన్= సెలయేళ్లవలె; ఎడతెగక= ఎడము లేక; తోరంబులు= లావయినవి; ఐననీర ధారలన్= అయినట్టి నీళ్లధారలను; కురియుచున్= వర్షిస్తూ; శిలలన్= వడగండ్లను; వర్షించుచున్= కురిపిస్తూ; పిడుగులన్= పిడుగులను; ఱువ్వుచున్= విసరుతూ; ఉండన్= ఉండగా; మిఱ్ఱుపల్లంబులు= మిట్టయును పల్లమును; సమతలంబులు+అయి= సమాన ప్రదేశములయి; ఏక+అర్ణవంబు రూపు= ఒకటే సముద్రం అను తీరును; చూపినన్= కనబరచగా; అందున్= ఆ నీటి వెల్లువలో; దుడుకు+అడుచుచున్= నీటి ఉరవడిని తగిస్తూ; ఈఁదుచున్= ఈదుతూ; విలయ= ప్రళయకాలమందలి; శిఖి= అగ్నియొక్క; శిఖా= జ్వాలలయొక్క; సంరంభ= ఆటోపంచేత; విజృంభమాణ= చెలరేగుతున్న; విద్యుత్+లతా= మెరుపుతీగలయొక్క; విలోకంబునన్= కనబడుటచేత; రిమ్మలు+కొని= వెర్రెత్తి; సొమ్మలు+పోవుచున్+ఉన్న= సొమ్మసిలబోతూ ఉన్నట్టి; లేఁగలును= లేగదూడలును; లేఁగల= లేగదూడల; మూతులు= మోరలు; అడ్డంబులు+ఇడి= అడ్డంగా పెట్టి; ప్రళయ= ప్రళయవేళలో; భైరవ= భయంకొల్పే; భేరీ= పెద్ద నగారాలయొక్క; భాంకార= భాంభాం అనే ధ్వనులవలె; భీషణంబులు= భయంకరమైనవి; అగుగర్జన ఘోషణంబులన్= అయిన ఉరుముల పెద్ద చప్పుళ్లచేత; చెవుడుపడి= వినికిడి కోల్పోయి; చిందఱ వందఱలు+ఐన= చెల్లాచెదరైన; డెందంబులన్= మనస్సులతో; కంది= తపించి; కుంది= వంగి; వ్రాలుధేనువులును= నేలమీదకు ఒరుగునట్టి పాడిఆవులును; ధేనువులన్= పాడి ఆవులను; వెనుకన్= వెనుకవైపున; ఇడుకొని= ఉంచుకొని; దురంత= హద్దులేని; కల్ప+అంతకాల= కల్పంయొక్క ప్రళయ సమయంలో; కీలి= మంటలచే; కరాళ= భయంకరమైన; కాలకంఠ= విషం కంఠమందుగల రుద్రునియొక్క; కర= చేతులలోని; విశాల గదా+ఆఘాత= పెద్ద గదలచేత కలిగిన దెబ్బలవలన; ప్రభూతంబులు= పుట్టినవి; ఐన నిర్ఘాత పాతంబులకున్= అయినట్టి పిడుగుపాట్లచేత; భీతంబులు+ఐ= భయపడినవై; హరికిన్= కృష్ణునికి; మ్రొక్కి= నమస్కరించి; రక్ష రక్ష+ఇతి శబ్దంబులు= రక్షించు రక్షించు అనే మాటలు; చేయుకైవడిన్=

పలికే విధంగా; విడువని జడిన్+పడి= ఎడతెగని వానలో చిక్కుకొని; సైరింపక= తట్టుకోలేక; శిరంబులు వంచుకొని= తలలు వంచుకొని; గద్గద కంఠంబునన్= బొంగురయిన కంఠస్వరంతో; అంభారవంబులు= అంభా అనే ధ్వనులను; చేయు వృషభంబులును= చేసే ఆబోతులును; వృషభ+ఆది గోరక్షణంబు+చేయుచున్= ఆబోతులు మొదలగు ఆలజాతి జంతువులను కాపాడుతూ; దుర్వార= నివారింపలేని; ఘోర= భయంకరమైన; శిలా+ఆసారంబులన్= రాళ్ల వానలచే; సారంబులు= బలాలు; చెడి= తప్పి; శరీరంబులు= తనువులు; భారంబులు+ఐనన్= బరువైనవి కాగా; మ్రాను+పడుగోపకులును= నిశ్చేష్టులయిన గొల్లవారూ; గోపకులన్+పట్టుకొని= గొల్లవారిని పట్టుకొని; దట్టంబు= అధికం; అయిన వానకొట్టునన్= అయినట్టి వాన తాకిడిచేత; బెట్టు+పడి= సత్తువ కోల్పోయి; బడుగు నడుములు= బలహీనమయిన నడుములు; నుసులు+పడన్= వేలాడుతున్నట్లు; వడవడ వడంకుచున్= మిక్కిలి వణకుతూ; గోవిందునిన్= శ్రీకృష్ణుణ్ణి; చీరు గోపికలను= పిలిచే గొల్లెతలును; గోపికాజన= గొల్లపడుచుల; కఠిన= గట్టివై; కుచ= స్తనములనే; కలశయుగళంబుల మఱుంగునన్= కుండలయొక్క జంటలమాటున; తలలు+పెట్టుకొని= శిరస్సులు ఉంచుకొని; పరవశులు= పరవశం చెందినవారు; ఐన శిశువులునున్+కలిగి= అయిన చంటిబిడ్డలు; కలిగి; మహాఘోషంబుతోడన్= పెద్దచప్పుడుతో; నష్టంబు+ఐన= పాడయింది అయిన; ఘోషంబున్+చూచి= గొల్లపల్లెను చూచి; ప్రబుద్ధులు+ఐన= మేల్కొన్న బుద్ధిగలవారైన; గోపవృద్ధులు= ముదుసలి గొల్లలు; కొందఱు= కొంతమంది; దుర్జన శిక్షకుండును= దుష్టజనులను శిక్షించేవాడూ; సజ్జనరక్షకుండును= మంచివారిని రక్షించేవాడూ; ఐనపుండరీక+అక్షునకున్= అయిన తెల్లతామర పూలవంటి కన్నులు గల శ్రీకృష్ణునికి; మ్రొక్కి= నమస్కరించి; ఇట్లు+అనిరి= ఇలా పలికారు.

**తా :** జంభాసురుణ్ణి జయించిన దేవేంద్రుడు ఈ రీతిగా పలికిఆటోపంతో వజ్రాయుధం అటూ ఇటూ ఝుళిపించాడు. జంకు గొంకులు లేకుండా క్రోధంతో పుష్కలావర్తకాది మేఘాల సంకెలలు విడిపించి వ్రేపల్లెమీదికి ఉసిగొలిపాడు. పెనుగాలులు ప్రేరేపింపగా గుంపులుగూడి రేపల్లె మీది ఆకాశమండలాన్ని కారుమొయిళ్లు కమ్ముకొన్నాయి. సూర్యమండలాన్ని కప్పేశాయి. నింగికి నేలకు నడుమ కారుచీకట్లు కమ్మి కన్ను కానరావడం లేదు. త్రివిక్రముడైన వామనుని రెండవ అడుగుతాకిడికి పగిలిన బ్రహ్మాండభాండంచిల్లులనుండి కారే బాహ్యసముద్రజలప్రవాహాలవలె పెద్ద పెద్ద వర్షధారలు కురిశాయి. ఎడతెరిపి లేకుండా వడగళ్లు, పిడుగులు పడ్డాయి. ఎత్తుపల్లాలు ఏకమయ్యేలా వర్షజలం ప్రళయకాల సముద్రాన్ని తలపించింది. ఆ జలప్రవాహంలో దుడుకు తగ్గిన లేగదూడలు ఈదుతూ ప్రళయాగ్ని జ్వాలలవలె విజృంభించే విద్యుల్లతలను చూచి, కళ్లు బైరులు కమ్మి సొమ్మసిల్లి పోయాయి. ఆ లేగలకు తమ మోరలు అడ్డంగా ఉంచిన పాడిఆవులు ప్రళయకాల భయంకర భేరీ భాంకారాలవలె వినబడే మేఘగర్జనలకు తమ చెవులు చిల్లుపడగా, గుండెలు పగిలి సాగిలి పడసాగాయి. ఆ గోవులముందు ఆబోతులు నిలబడి, ప్రళయకాలరుద్రునిచేతిలోని పెనుగదాప్రహారాలనుండి పుట్టినవా అన్నట్లుగా ఎడతెగకుండా పడే పిడుగులపాట్లకు అంబా అంబా అని అరుస్తున్నాయి. ఆ అరుపులు శ్రీకృష్ణుణ్ణి రక్షించమని మొరపెట్టుకుంటున్నాయా అన్నట్లుగా ఉన్నాయి. లేగలను, ఆవులను, ఆబోతులను రక్షించుకునే ప్రయత్నంలో ఉన్న గొల్లవాళ్లు వడివడిగా కురిసే వడగళ్ల తాకిడికి సత్తువ తప్పి కొయ్యబారిపోయారు. దట్టమయిన వానతాకిడికి తాళలేక తమ మగలను పట్టుకొని, బలహీనమైన నడుములు వణుకుతూ ఉండగా, రక్షించుమని గోపికలు శ్రీకృష్ణుణ్ణి గురించి మొరపెడుతున్నారు. భయపడిన శిశువులు గట్టివి, పెద్దవి అయిన తమ తల్లుల చన్నులమాటున తలలు దాచుకొంటున్నారు. ఈ విధంగా అల్లకల్లోలమయి, ఆక్రందనలతో నిండిన వ్రేపల్లెను చూచి, ముదుసలి గొల్లలు కొందరు దుష్టశిక్షకుడు శిష్టరక్షకుడు అయిన శ్రీకృష్ణుణ్ణి సమీపించి, నమస్కరించి ఈ విధంగా ప్రార్థించారు.

**ఉ. అక్కట! వానఁ దోఁగి వ్రజ మాకుల మయ్యెఁ గదయ్య! కృష్ణ! నీ**
**వెక్కడ నుంటి? వింత తడవేల సహించితి? నీ పదాబ్జముల్**

**దిక్కుగ నున్న గోపకులు దీనత నొంద భయాపహారివై**
**గ్రక్కునఁ గావ కిట్లునికి కారుణికోత్తమ! నీకుఁ బాడియే!** 905

**ప్రతి :** కారుణిక+ఉత్తమ= దయగలవారిలో శ్రేష్ఠుడైనవాడా; కృష్ణ!= శ్రీకృష్ణా; అక్కట= అయ్యో; వ్రజము= గొల్లపల్లె; వానన్= వర్షంలో; తోఁగి= తడిసి; ఆకులము+అయ్యెన్+కదు+అయ్య= కలవరపాటుకు లోనయింది కదా; నీవు+ఎక్కడన్= నీవు ఏ చోటునందు; ఉంటివి= ఉంటివి; ఇంత తడవు= ఇంత సమయం; ఏల సహించితి= ఎందుకు ఊరకొంటివి; నీ పద+అబ్జముల్= తామరపూలవంటి నీ పాదాలు; దిక్కు+కన్= గతిగా; ఉన్న గోపకులు= ఉన్నట్టి గొల్లవారు; దీనతన్= దైన్యం; ఒందన్= పొందగా; భయ+అపహారివి+ఐ= భయం పోగొట్టేవాడివై; గ్రక్కువన్= శీఘ్రంగా; కావక= రక్షించక; ఇట్లు= ఈ విధంగా ఉదాసీనంగా; ఉనికి= ఉండటం; నీకున్= నీకు; పాడియే= ధర్మమా?

**తా :** దయగలవారిలో మేటివయిన కృష్ణా! ఎక్కడ ఉన్నావయ్యా! అయ్యో, గోకులమంతా జడివానలో తడిసి ముద్దయిపోయింది. మనవారంతా ఆకులపాటుతో అలమటించిపోతున్నారు. నువ్వే దిక్కని నిన్నే నమ్ముకొని ఉన్న మన వారందరినీ కాపాడకుండా ఇంతదాకా ఉపేక్షించడం నీకు తగునా?

**క. ఈ యుఱుములు నీ మెఱుములు, నీ యశనులఘోషములును నీ జలధారల్**
**నీ యాన తొల్లి యెఱుఁగము, కూయాలింపం గదయ్య! గుణరత్ననిధీ!** 906

**ప్రతి :** గుణరత్ననిధీ= గుణములనే మణులకు గనియైన కృష్ణా; ఈ ఉఱుములున్= ఇంతటి తీవ్రమైన ఉరుములూ; ఈ మెఱుములు= ఇటువంటి మెరుపులూ; ఈ+అశనుల ఘోషములునున్= ఈ పిడుగుల చప్పుళ్లూ; ఈ జలధారల్= ఈ నీటిధారలూ; నీ+ఆన= నీ మీద ఒట్టు; తొల్లి+ఎఱుఁగము= ఇంతకుమునుపు ఎన్నడూ తెలియము; కూయి+ఆలింపన్+ కదు+అయ్య= మా మొర వినవయ్యా.

**తా :** గుణమణులకు గనివంటి వాడవయిన కృష్ణా! నీ మీద ఒట్టుపెట్టి మరీ చెబుతున్నాము. ఇంతటి తీవ్రమైన ఉరుములు, మెరుపులు, పిడుగుల చప్పుళ్లు, వానధారలు ఇంతకు ముందెప్పుడూ కనీ, వినీ ఎరుగము. మా మొర వినవయ్యా!

**క. వారి బరు వయ్యె మందల, వారికి; నిదె పరులు లేరు వారింపంగా;**
**వారిదపటలభయంబును, వారిరుహదళాక్ష! నేఁడు వారింపఁగదే!** 907

**ప్రతి :** వారిరుహదళ+అక్ష= తామరపూలవంటి కన్నులు గల శ్రీకృష్ణా; ఇది+ఎ= ఇదిగో; మందలవారికిన్= వ్రేపల్లెలోని వారికి; వారి= నీరు; బరువు+అయ్యెన్= భరింపరానిదైంది; వారింపన్+కాన్= ఆపు చేయడానికి; పరులు లేరు= నీకంటె ఇతరులు లేరు; నేఁడు= ఇపుడు; వారిదపటల భయంబును= మేఘాల గుంపుల వలని భయాన్ని; వారింపన్+కదు+ఏ= పోగొట్టుమా!

**తా :** తామరపూలవంటి కన్నులు గల ఓ శ్రీకృష్ణా! గొల్లపల్లెలోని మనవారికి ఈ వర్షపునీటిబాధ భరింపరానిదయింది. నీవు తప్ప రక్షించేవారు ఇంకెవరూ లేరు. వెంటనే ఈ మేఘాల బాధ పోగొట్టవయ్యా!

**వ. అనిన విని సర్వజ్ఞుండైన కృష్ణుం డంతయు నెఱింగి.** 908

**ప్రతి :** అనినన్= గొల్లవారు ఇట్లు పలుకగా; విని= విన్న తర్వాత; సర్వజ్ఞుండు= అంతయు ఎరిగినవాడు; ఐన కృష్ణుండు= అయిన శ్రీకృష్ణుడు; అంతయున్= జరిగిన వృత్తాంతమంతా; ఎఱింగి= తెలిసికొని...

**తా :** సర్వజ్ఞుడయిన శ్రీకృష్ణుడు మందలోని వారు చెప్పిన మాటలన్నీ విని, జరగిందంతా తెలుసుకొని మనస్సులో ఈ విధంగా భావించాడు.

**ఉ. తన్నొక యింత గైకొనరు; తప్పిరి; యాగము సేసి' రంచుఁ దా**
**మిన్ననుండి గోపకులమీఁద శిలల్ గురియించుచున్న వాఁ**
**డున్నతనిర్జరేంద్రవిభవోత్థితగర్వనగాధిరూఢుఁడై**
**కన్నులఁ గానఁ డింద్రుఁ డిటు; గర్వపరుం డొరుఁ గాన నేర్చునే? 909**

**ప్రతి :** ఇంద్రుఁడు= దేవేంద్రుడు; తన్నున్= తనను; ఒక+ఇంత= కొంచెంకూడా; కైకొనరు= లక్ష్యపెట్టరు; తప్పిరి= క్రమం విడిచారు; యాగము+చేసిరి= పర్వతాన్ని ఉద్దేశించి యజ్ఞం చేశారు; అంచున్= అంటూ; తాన్= తాను; మిన్నునన్+ఉండి= ఆకాశంలో ఉండి; గోపకులమీఁదన్= గొల్లలమీద; శిలల్= రాళ్లను; కురియించుచున్+ఉన్నవాఁడు= వర్షిస్తున్నాడు; ఉన్నత= గొప్పదైన; నిర్జర+ఇంద్ర= దేవతల అధిపతియొక్క; విభవ= వైభవంవల్ల; ఉత్థిత= పుట్టిన; గర్వ= పొగరు అనే; నగ= కొండను; అధిరూఢుఁడు= ఎక్కినవాడు; ఐ= అయి; ఇటు= మనవైపు; కన్నులన్+కానఁడు= కన్నులెత్తి చూడడం లేదు; గర్వపరుండు= గర్వంతో కూడినవాడు; ఒరున్= ఇతరుణ్ణి; కానన్+నేర్చున్+ఏ= చూడగల్గునా?

**తా :** ఈ గొల్లలు తనంటే లక్ష్యం లేకుండా, క్రమానుగతంగా చేయవలసిన ఇంద్రయాగం చెయ్యకుండా, కొత్త పర్వతయాగం అంటూ మొదలుపెట్టారు అనే కోపంతో దేవేంద్రుడు గొల్లవారిమీద రాళ్లవాన కురిపిస్తున్నాడు. దేవేంద్ర వైభవంవల్ల కలిగిన గర్వం అనే గొప్ప పర్వతంమీద కూర్చుండి, తరతమభావం లేకుండా ఉన్నాడు. గర్వాంధుడయినవాడు ఇతరుల్ని లక్ష్యపెట్టడు గదా!

**క. దేవత లందఱు నన్నును, సేవింతురు; రాజ్యమదముఁ జెందరు, చెఱుపం**
**గా వలదు; మానభంగము, గావింపఁగ వలయు శాంతి గలిగెడుకొఱకై. 910**

**ప్రతి :** దేవతలు+అందఱును= సమస్త దేవతలూ; నన్నును= నన్నే; సేవింతురు= కొలుస్తారు; రాజ్యమదమున్= దేవపదవి వల్ల కలిగిన గర్వాన్ని; చెందరు= పొందరు; చెఱుపన్+కాన్+వలదు= కీడు కలిగింపకూడదు; శాంతి+కలుగుట కొఱకున్+ఐ= శాంతగుణం కలగడంకోసం; మానభంగమున్= గర్వభంగం; కావింపన్+కన్+వలయున్= చేయాలి.

**తా :** దేవతలంతా నన్ను సేవిస్తూ ఉంటారు. వారికి దేవపదవి వచ్చిందనే గర్వం లేదు. ఇంద్రునికి కీడు కల్గించకుండా గర్వభంగంమాత్రం చేయాలి.

**వ. అని చింతించి శిలావర్షహతులై శరణాగతులైన ఘోషజనుల రక్షించుట తగ వని, సకలలోకరక్షకుం డయిన విచక్షణుండు. 911**

**ప్రతి :** అని చింతించి= ఈ ప్రకారంగా ఆలోచించి; శిలావర్షహతులు+ఐ= రాళ్లవానవలన దెబ్బలు తిన్నవారై; శరణ+ఆగతులు= శరణుజొచ్చినవారు; ఐన ఘోషజనులన్= అయిన వ్రేపల్లెలోనివారిని; రక్షించుట= కాపాడడం; తగవు+అని= ధర్మమని తలచి; సకల లోకరక్షకుండు+అయిన= లోకమంతటిని రక్షించువాడైన; విచక్షణుండు= వివేకశాలియగు శ్రీకృష్ణుడు...

**తా :** అని ఆలోచించి రాళ్లవానవల్ల దెబ్బలు తిని, తన్ను శరణు జొచ్చిన వ్రేపల్లెలో గొల్లవారిని కాపాడడం ధర్మమని లోకరక్షకుడు, వివేకశాలి అయిన శ్రీకృష్ణుడు భావించి

**చ. కలఁగకుఁడీ వధూజనులు! కంపము నొందకుఁడీ వ్రజేశ్వరుల్!**
**తలఁగకుఁడీ కుమారకులు! తక్కినవారలు ఱాలవానచే**
**నలఁగకుఁడీ! పశువ్రజము నక్కడ నక్కడ నిల్వనీకుఁడీ!**
**మెలపున మీకు నీశ్వరుఁడు మేలొసఁగుం గరుణార్ద్రచిత్తుఁడై. 912**

**ప్రతి :** వధూజనులు= ఓ పడతులారా; కలఁగకుఁడు+ఈ= కలతపడకండి; వ్రజ+ఈశ్వరుల్= గొల్లల ఏలికలారా; కంపమును= వణకును; ఒందకుఁడు+ఈ= పొందకండి; కుమారకులు= బాలులార; తలఁగకుఁడు+ఈ= తొలగిపోకండి; తక్కినవారలు= మిగిలినవారు; ఱాలవానచేన్= శిలల వర్షంచే; నలఁగకుఁడు+ఈ= బాధపడకండి; పశువ్రజమున్= ఆలమందలను; అక్కడన్+ అక్కడన్= దూర దూరంగా; నిల్వన్+ఈకుఁడు+ఈ= నిలబడనీకండి; ఈశ్వరుఁడు= పరమేశ్వరుడు; మెలపునన్= జాగరూకతతో; కరుణా+ఆర్ద్రచిత్తుఁడు+ఐ= దయతో నిండిన చిత్తంకలవాడై; మీకున్= మీకు; మేలు+ఒసఁగున్= మేలు చేస్తాడు.

**తా :** వనితలారా! కలతపడకుండి, గొల్లపెద్దలారా! భయంతో వణకిపోకండి. బాలురూ! ఇటూ అటూ పారిపోకండి. మిగిలినవారుకూడా రాళ్లవాన చూచి కంగారు పడకండి. ఆలమందల్ని చెల్లాచెదరుగా గాకుండా ఒకచోట నిలపండి. పరమేశ్వరుడు జాగరూకతతో దయగలవాడై తప్పక మీకు మేలు చేస్తాడు.

## ❖ శ్రీకృష్ణుఁడు గోవర్ధన పర్వతము నెత్తుట ❖

**వ. అని పలికి. 913**

**ప్రతి :** అని పలికి= అని చెప్పి...

**క. కిరియై ధర యెత్తినహరి, కరి సరసిజముకుళ మెత్తుగతిఁ ద్రిభువన శం**
**కరకరుఁడై గోవర్ధన, గిరి యెత్తెం జక్క నొక్క కేలన్ లీలన్. 914**

**ప్రతి :** కిరి+ఐ= వరాహావతారుడై; ధరన్= భూమిని; ఎత్తిన= ఉద్ధరించిన; హరి= శ్రీమహావిష్ణువు; కరి= ఏనుగు; సరసిజముకుళము= తామర మొగ్గను; ఎత్తుగతిన్= పైకెత్తేవిధంగా; త్రిభువనశంకరకరుఁడు+ఐ= మూడులోకాలకు శుభం కలిగించేవాడై; గోవర్ధనగిరి= గోవర్ధనపర్వతాన్ని; చక్కన్= విలాసంగా; ఒక్కకేలన్= ఒకే చేతితో; ఎత్తెన్= పైకి ఎత్తాడు.

**తా :** శ్వేతవరాహావతారమెత్తి భూమిని సముద్రం నుండి పైకి ఎత్తి తెచ్చిన శ్రీమహావిష్ణువు, ఏనుగు సునాయాసంగా తామరమొగ్గను ఎత్తే విధంగా ముల్లోకాలకు శుభం కలిగించే శ్రీకృష్ణుడు విలాసంగా ఒక చేతితోనే గోవర్ధన పర్వతాన్ని పైకెత్తాడు.

**క. దండిని బ్రహ్మాండంబులు, చెండుల క్రియఁ బట్టి యెగురఁ జిమ్మెడు హరికిన్**
**గొండఁ బెకలించి యెత్తుట, కొండొక పనిగాక యొక్క కొండా తలఁపన్? 915**

**ప్రతి :** దండిని= అనేకమైన; బ్రహ్మాండంబులు= బ్రహ్మాండాలను; చెండులక్రియన్= బంతులవలె; పట్టి= చేతబట్టి; ఎగురన్+ చిమ్మెడు= పైకి ఎగురవేసే; హరికిన్= శ్రీమహావిష్ణువుకు; కొండన్= కొండను; పెకలించి= పెల్లగించి; ఎత్తుట= ఉద్ధరించడం; తలఁపన్= భావించిచూస్తే; కొండొక పని= తేలికపని; కాక; కొండ+ఆ= పెద్దవిషయమా?

**తా :** ఎన్నో బ్రహ్మాండాలను చెండులవలె ఎగురవేసి పట్టుకొనే శ్రీమహావిష్ణువుకు గోవర్ధనపర్వతం అనే కొండను పెల్లగించి ఎత్తడం సులువైన పనేకానీ బరువైనపని కాదు.

**వ. ఇట్లు గిరి యెత్తి. 916**

**ప్రతి :** ఇట్లు= ఇలా; గిరి+ఎత్తి= కొండనెత్తి...

**తా :** ఇలా కొండనెత్తి

**శా. బాలుం డాడుచు నాతపత్ర మని సంభావించి పూగుత్తి కెం**
**గేలం దాల్చిన లీల లేనగవుతోఁ గృష్ణుండు దా నమ్మహా**
**శైలంబున్ వలకేలఁ దాల్చి విపులచ్ఛత్రంబుగాఁ బట్టె నా**
**భీలాభ్రచ్యుతదుశ్శిలాచకితగోపీగోపగోపంక్తికిన్. 917**

**ప్రతి :** బాలుండు= చిన్నపిల్లవాడు; ఆడుచున్= ఆడుకుంటూ; ఆతపత్రము+అని= గొడుగు అని; సంభావించి= భావించి; పూగుత్తి= పూలగుత్తిని; కెంపు+కేలన్= ఎర్రనైన తన చేతితో; తాల్చిన లీలన్= ధరించినవిధంగా; లేనగవుతోన్= చిరునవ్వుతో; ఆ మహాశైలమున్= ఆ గోవర్ధనమహాగిరిని; వలకేలన్= కుడిచేతితో; తాల్చి= ధరించి; అభ్రచ్యుత= ఆకాశంనుండి జారుతున్న; ఆభీలదుశ్శిలాచకిత= కఠినమైన రాళ్లవల్ల నివ్వెరపడ్డ; గోపీ గోప గోపంక్తికిన్= యాదవస్త్రీలు, పురుషులు, గోవులవరుసలకు; కృష్ణుండు= శ్రీకృష్ణుడు; విపుల+ఛత్రంబు+కాన్= విశాలమైన గొడుగుగా; పట్టెన్= పట్టాడు.

**తా :** బాలుడు ఆడుకుంటూ పూలగుత్తిని గొడుగుగా భావించి అందమైన తన అరుణహస్తంతో పూలగుత్తిని ధరించినట్లుగా, కృష్ణుడు చిరునవ్వుతో ఆ గోవర్ధన మహాపర్వతాన్ని పైకెత్తి కుడిచేత ధరించి, ఆకాశంనుండి వర్షించే కఠినమైన రాళ్లతో చీకాకుపడుతూ ఉండిన యాదవస్త్రీలు, పురుషులు, గోవులపంక్తులకు విశాలమైన గొడుగుగా పట్టుకొన్నాడు.

**వ. ఇట్లు గోత్రంబు ఛత్రంబుగాఁ బట్టి గోపజనులకు గోపాలశేఖరుం డిట్లనియె. 918**

**ప్రతి :** ఇట్లు= ఇలా; గోత్రంబు= గోవర్ధనగిరిని; ఛత్రంబు+కాన్= గొడుగుగా; పట్టి= ధరించి; గోపజనులకున్= యాదవులతో; గోపాలశేఖరుఁడు= యాదవశ్రేష్ఠుఁడు అయిన కృష్ణుడు; ఇట్లు+ అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** ఈ విధంగా యాదవకులాగ్రణి అయిన శ్రీకృష్ణుడు గోవర్ధనగిరిని గొడుగులాగా పట్టుకొని ఇలా అన్నాడు.

**క. రా తల్లి! రమ్ము తండ్రీ!, వ్రేతలు గోపకులు రండు! వినుఁడీ గర్త**
**క్ష్మాతలమున నుండుఁడు గో, వ్రాతముతో మీరు మీకు వలసిన యెడలన్. 919**

**ప్రతి :** రా తల్లి!= అమ్మా రా!; రమ్ము తండ్రీ!= నాన్నా ఇలారా!; వ్రేతలు గోపకులు= గోపికాగోపకులారా!; రండు!= రండి! వినుఁడు= వినండి; ఈగర్తక్ష్మాతలమునన్= ఈ దిగుడుప్రదేశంలో; మీరు; గోవ్రాతముతోన్= గోవులమందతో; మీకు; వలసిన+ఎడలన్= ఇష్టంవచ్చిన ప్రదేశంలో; ఉండుఁడు= ఉండండి

**తా :** శ్రీకృష్ణుడు అందరినీ ఇలా పిలుస్తున్నాడు. అమ్మా రా! నాన్నా రండి! గోపస్త్రీపురుషులారా! ఇలా రండి! వినండి! మీ గోవులమందతోకూడా ఈ దిగుడు ప్రదేశంలో ఇష్టంవచ్చిన స్థలంలో ఉండండి.

**విశే :** గర్తక్ష్మాతలం= దిగుడుప్రదేశం: కొండ పెకలించినందువల్ల అడుగుభాగంలో ఏర్పడిన పల్లపు ప్రదేశం.

**శా. బాలుం డీతఁడు, కొండ దొడ్డది; మహాభారంబు సైరింపఁగాఁ**
**జాలండో? యని దీనిక్రింద నిలువన్ శంకింపఁగాఁ బోల; దీ**
**శైలాంభోనిధిజంతుసంయుతధరాచక్రంబు పైఁ బడ్డ నా**
**కే లల్లాడదు; బంధులార! నిలుఁ డీ క్రిందం బ్రమోదంబునన్. 920**

**ప్రతి :** బంధులు+ఆర= చుట్టాల్లారా; ఈతఁడు= శ్రీకృష్ణుడు; బాలుండు= పిల్లవాడు; కొండ= గోవర్ధనగిరి; దొడ్డది= పెద్దది; మహాభారంబు= (కొండయొక్క) గొప్పబరువును; సైరింపన్+కాన్+చాలండు+ఓ= భరించలేడేమో! అని; దీనిక్రిందన్= ఈ కొండకింద; నిలువన్= నిలబడడానికి; శంకింపన్+కాన్+పోలదు= అనుమానించవలసిన పని లేదు; ఈ శైల+అంభోనిధి= ఈ కానవచ్చే కొండలు, సముద్రాలు; జంతుసంయుత= జంతువులతో కూడిన; ధరాచక్రంబు= భూమండలం; పైన్+పడ్డన్= ఈ గోవర్ధనగిరిమీద పడినా; నాకేలు= నాచేయి; అల్లాడదు= కదలదు; ప్రమోదంబునన్= సంతోషంతో; ఈ క్రిందన్= ఈ కొండకింద; నిలుఁడు= వచ్చి నిలవండి.

**తా :** చుట్టాలయిన ఓ గోపకులారా! ఇతడు (నేను) పసివాడు. కొండ ఏమో గొప్పది. దానిబరువు భరించగలడో లేదో అని దీనికింద నిలవడానికి సంశయించవలసిన పనిలేదు. కొండలు, సముద్రాలు, నానాజంతువులతో కూడిన భూమి అంతా వచ్చి ఈ కొండమీద పడినా సరే నాచేయి అటూ ఇటూ కదలదు. మీరందరూ సంతోషంగా వచ్చి, ఈ కొండ కింద నిలవండి అని శ్రీకృష్ణుడు పలికాడు.

**వ. అని పలుకుచున్న హరిపలుకులు విని నెమ్మనమ్ముల నమ్మి కొండ యడుగునం దమ తమ యిమ్ములం బుత్త్ర మిత్త్ర కళత్త్రాదిసమేతులై గోవులుం దారును గోపజనులు జనార్దనకరుణావలోకనామృతవర్షంబున నాఁకలి నీరువట్టుల చొప్పెఱుంగక కృష్ణకథావినోదంబుల నుండి; రి వ్విధంబున. 921**

**ప్రతి :** అని= అంటూ; పలుకుచున్న= చెబుతూ ఉండే; హరిపలుకులు= శ్రీకృష్ణుని మాటలు; విని; నెఱ+మనంబులన్= సందేహంలేని తమ నిండుమనస్సులతో; నమ్మి= కృష్ణుని పలుకులు విశ్వసించి; కొండ అడుగునన్= కొండ అడుగుభాగంలో; తమతమ ఇమ్ములన్= తమకు తమకు ఇష్టమైన స్థలాలలో; పుత్త్రమిత్త్రకళత్త్ర+ఆది సమేతులు= కొడుకులు, స్నేహితులు, భార్యలు మొదలైన వారితో కూడుకున్నవారై; గోవులున్+తారును= ఆవులూ, తామూ; గోపజనులు= యాదవులు; జనార్దన= కృష్ణునియొక్క; కరుణ+అవలోకన= దయగల చూపులనే; అమృతవర్షంబునన్= అమృతపువానచేత; ఆఁకలి నీరువట్టుల= ఆకలి దప్పికల; చొప్పు+ఎఱుంగక= విధం తెలియకుండా; కృష్ణకథావినోదంబులన్= కృష్ణుని సంబంధమైన కథలు చెప్పుకొనే వేడుకతో; ఈ+విధంబునన్= ఈ రీతిగా ఉండిరి.

**తా :** ఇలా తమను చూచి చెపుతున్న కృష్ణునిమాటలు విని, నమ్మి, అందరూ కొండకింద తమకు తమకు ఇష్టమైన ప్రదేశాల్లో కొడుకులు, మిత్రులు, భార్యలు మొదలైనవారితోను, గోవులతోను, కృష్ణునికరుణగలిగిన చూపులు అమృతవర్షంలా సోకడంవల్ల ఆకలిదప్పులు మరిచిపోయి, కృష్ణసంబంధమైన కథలు చెప్పుకుంటూ వినోదంగా ఉండిపోయారు.

**మ. హరిదోర్దండము గామ; గుబ్బ శిఖరం; బాలంబిముక్తావళుల్**
**పరఁగన్ జాఱెడు తోయబిందువులు; గోపాలాంగనాపాంగ హా**

**స రుచుల్ రత్నచయంబు గాఁగ, నచలచ్ఛత్రంబు శోభిల్లెఁ ద**
**ద్గిరిభిద్దుర్మదభంజియై జలధరాక్లిన్నప్రజారంజియై. 922**

**ప్రతి :** హరిదోస్+దండము= శ్రీకృష్ణుని భుజాదండం; కామ= గొడుగుకాడగాను; శిఖరంబు= కొండ; గుబ్బ= గుబ్బగాను; ఆలంబిముక్తా+ఆవళుల్= కృష్ణుడు ధరించిన ముత్యాలహారాలు; పరఁగన్= అతిశయించగా; జాఱెడు తోయబిందువుల్= స్రవించే నీటిబిందువులుగాను; గోపాల+అంగనా= గోపస్త్రీల; అపాంగహాసరుచుల్= కడకంటి చూపులతో కూడిన నవ్వుల కాంతులు; రత్నచయంబు= కొండలోని రత్నసమూహం; కాన్+కన్= అవగా; తద్+గిరిభిత్+దుర్మదభంజి+ఐ= ఆ దేవేంద్రుని దుర్గర్వాన్ని అణచేదై; జలధర+ఆక్లిన్న= మేఘాలవలన తడిసే; ప్రజారంజి+ఐ= గోపకులను అలరించేదై; అచలత్+ఛత్రంబు= చలించని గొడుగు; శోభిల్లెన్= విలసిల్లింది.

**తా :** శ్రీకృష్ణుడు ఎత్తిపట్టిన గోవర్ధనపర్వతం గొడుగువలె విలసిల్లింది. ఎలాగంటే ఆ గొడుగుకు శ్రీకృష్ణుని బాహుదండమే కాడ. కొండశిఖరమే గొడుగు గుబ్బ. కృష్ణుడు ధరించిన రత్నాలహారాలు జారిపడుతున్న వర్షపునీటి బిందువులు. గోపస్త్రీల కడగంటి చూపులతో కూడిన నవ్వులకాంతులు గోవర్ధన పర్వతంలోని రత్న సమూహం. ఆ గొడుగు దేవేంద్రుని దుర్గర్వాన్ని అణచేది, మేఘాలనుండి కురిసే వర్షంలో తడుస్తున్న గోపకులను స్థిరంగా ఆనందపరచేది అయింది.

**క. రాజీవాక్షునిచే నొక, రాజీవముభంగి శైలరాజము మెఱసెన్;**
**రాజేంద్ర! మీఁద మధుకర, రాజిక్రియ మేఘరాజి రాజిల్లెఁ గడున్. 923**

**ప్రతి :** రాజ+ఇంద్ర= ఓ పరీక్షిన్మహారాజా; రాజీవ+అక్షునిచేన్= కమలనేత్రుడైన కృష్ణుని చేతిలో; శైలరాజము= పర్వతశ్రేష్ఠమైన గోవర్ధనగిరి; రాజీవము భంగిన్= కమలంవలె; మెఱసెన్= శోభిల్లింది; మీఁదన్= ఆ కొండమీద; మధుకరరాజిక్రియ= తుమ్మెదల పిండులాగా; మేఘరాజి= మేఘాలసమూహం; కడురాజిల్లెన్= మిక్కిలి శోభించింది.

**తా :** ఓ పరీక్షిన్మహారాజా! కమలాక్షుడైన శ్రీకృష్ణునిచేతిలో ఆ గోవర్ధనగిరి ఒక కమలంవలె విలసిల్లింది. ఆ కొండమీదనున్న మేఘాలగుంపు తుమ్మెదల గుంపులాగా శోభిల్లింది.

**క. వడిగొని బలరిపుపనుపున, నుడుగక జడి గురిసె నే డహోరాత్రము; ల**
**య్యెడ గోపజనులు బ్రదికిరి, జడిఁ దడియక కొండగొడుగు చాటున నధిపా! 924**

**ప్రతి :** అధిపా= ఓ రాజా! బలరిపు పనుపునన్= దేవేంద్రుని ఆజ్ఞ చేత; వడిగొని= మిక్కిలివేగం కలిగి; ఏడు+అహస్+రాత్రములు= ఏడు పగళ్లు, రాత్రుళ్లు; ఉడుగక= ఆగక, నిరంతరాయంగా; జడి+కురిసెన్= వాన కురిసింది; ఆ+ఎడన్= ఆ సమయంలో; గోపజనులు= గోపీగోపకులు; కొండగొడుగుచాటునన్= గోవర్ధనగిరి అనే గొడుగు కింద; జడిన్= వానలో; తడియక= తడవకుండా; బ్రదికిరి= జీవించారు.

**తా :** అధిపా! దేవేంద్రుని ఆజ్ఞచే మిక్కిలి వేగంతో ఏడు పగళ్లూ, రాత్రుళ్లూ జడివాన నిరంతరాయంగా కురిసింది. ఆ సమయంలో గోపీగోపకులు గోవర్ధనగిరి అనే గొడుగుకింద వానలో తడవకుండా బతికారు.

**వ. ఇట్లు హరి యే డహోరాత్రంబులు గిరి ధరించిన గిరిభేది విసిగి వేసరి కృష్ణచరితంబులు విని వెఱఁగుపడి విఫలమనోరథుండై మేఘంబుల మరలించుకొని చనియె; నంత నభోమండలంబు విద్యోతమాన ఖద్యోతమండలం బగుట విని గోవర్ధనధరుండు గోపాలకుల కిట్లనియె. 925**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; హరి= శ్రీకృష్ణుడు; ఏడు+అహస్+రాత్రంబులు= ఏడుపగళ్లు, ఏడు రాత్రులు; గిరి= కొండను; ధరించినన్= ఎత్తిపట్టుకోగా; గిరిభేది= పర్వతాలగర్వం అణచిన దేవేంద్రుడు; విసిగి; వేసరి= విచారపడి; కృష్ణచరితంబులు= శ్రీకృష్ణుని కథలు; విని; వెఱఁగుపడి= ఆశ్చర్యపడి; విఫలమనస్+రథుండు+ఐ= తనకోరిక ఫలించనివాడై; మేఘంబులన్= మేఘాలను; మరలించుకొని; చనియెన్= వెళ్ళిపోయాడు; అంతన్= అప్పుడు; నభస్+మండలంబు= ఆకాశమండలం; విద్యోతమాన= ప్రకాశిస్తున్న; ఖద్యోతమండలంబు= సూర్యమండలం కలది; అగుట= కావడం; విని; గోపాలకులకున్= యాదవులతో; గోవర్ధనధరుండు= గోవర్ధనగిరిని ఎత్తిన శ్రీకృష్ణుడు; ఇట్లు= ఇలా; అనియెన్= అన్నాడు.

**తా :** ఈ విధంగా శ్రీకృష్ణుడు ఏడుపగళ్లు, ఏడురాత్రులు గోవర్ధనగిరిని ఎత్తి పట్టుకోగా దేవేంద్రుడు విసిగివేసారి, కృష్ణుని కథలువిని ఆశ్చర్యపడి, తనకోరిక ఫలించనివాడై, మేఘాలను మరలించుకొని వెళ్లిపోయాడు. అప్పుడు ఆకాశమండలంలో సూర్యమండలం ప్రకాశించడం తెలుసుకొని గోవర్ధనధరుడైన కృష్ణుడు గోపాలకులతో ఇలా అన్నాడు.

**క. 'ఉడిగెను వానయు గాలియు, వడిసెడి నదులెల్లఁ బొలిచె; వఱద లిగిరెఁ, గొం**
**డడుగున నుండక వెడలుఁడు, కొడుకులుఁ గోడండ్రు సతులు గోవులు మీరున్'. 926**

**ప్రతి :** వానయున్ గాలియున్= వానా, గాలీ; ఉడిగెను= ఆగిపోయాయి; నదులు+ఎల్లన్= నదులన్నీ; వడి+చెడి= వేగంతగ్గి; పొలిచెన్= ఒప్పాయి; వఱదలు= ప్రవాహాలు; ఇగిరెన్= ఇంకిపోయాయి; కొండ+అడుగునన్= కొండకింద; ఉండక= ఉండకుండా; కొడుకులు; కోడండ్రు; సతులు= భార్యలు; గోవులు; మీరున్= మీరూ (గోపాలకులు); వెడలుఁడు= బయటికి రండి.

**తా :** గాలీ వానా ఆగిపోయాయి. నదుల వేగం తగ్గింది. వరదలు తగ్గుముఖంపట్టాయి. ఇక కొండకింద ఉండకుండా గోపజనులారా! మీ కొడుకులు, కోడండ్రు, భార్యలు, గోవులతో వెలుపలికి రండి. (అని కృష్ణుడు అన్నాడు)

**వ. అనిన విని సకలగోపజనులు శకటాద్యుపకరణసమేతులయి గోవులుం దారును గొండ యడుగు విడిచి వచ్చి; రచ్యుతుండును జెచ్చెరఁ దొల్లింటి యట్ల నిజస్థానంబున గిరి నిలిపె; నంత వల్లవు లెల్లం గృష్ణుం గౌఁగిలించుకొని సముచితప్రకారంబుల సంభావించి దీవించిరి; గోపికలు సేసలిడి, దధ్యన్నకబళంబు లొసంగుచు నాశీర్వదించిరి; నంద బలభద్ర రోహిణీ యశోద లాలింగనంబు సేసి భద్రవాక్యంబులు పలికిరి; సిద్ధ సాధ్య గంధర్వవరులు విరులు గురియించిరి; సురలు శంఖదుందుభులు మ్రోయించిరి; తుంబురు ప్రముఖు లయిన గంధర్వులు పాడి; రప్పుడు. 927**

**ప్రతి :** అనినన్= (ఇలా కృష్ణుడు) అనగా; విని; సకల గోపజనులు= గోపాలకులందరూ; శకట+ఆది= బండ్లు మొదలైన; ఉపకరణసమేతులు+అయి= పనిముట్లతో కూడినవారై; గోవులున్= ఆవులూ; తారును= తామూ; కొండ అడుగు= కొండకింది ప్రదేశం; విడిచి; వచ్చిరి= వచ్చేశారు; అచ్యుతుండును= శ్రీకృష్ణుడుకూడా; చెచ్చెరన్= వెంటనే; తొల్లింటి+అట్లు+అ= మునుపటిలాగానే; గిరిన్= కొండను; నిజస్థానంబునన్= దానిస్వస్థలంలో; నిలిపెన్= ఉంచాడు, నిలిపాడు; అంతన్= అప్పుడు; వల్లవులు= యాదవులు; ఎల్లన్= అందరూ; కృష్ణున్= శ్రీకృష్ణుణ్ణి; కౌఁగిలించుకొని= ఆలింగనం చేసుకొని; సముచితప్రకారంబులన్= తగిన విధంగా; సంభావించి= సత్కరించి; దీవించిరి= ఆశీర్వదించారు; గోపికలు= గోపస్త్రీలు; సేసలు+ఇడి= అక్షతలువేసి; దధి+అన్నకబళంబులు= పెరుగన్నంముద్దలు; ఒసంగుచున్= ఇస్తూ; ఆశీర్వదించిరి= దీవించారు;

నంద, బలభద్ర, రోహిణీ, యశోదలు, ఆలింగనంబు+చేసి= (కృష్ణుని) కౌగిలించుకొని; భద్రవాక్యంబులు= 'క్షేమం' , శుభం, కోరుతూ పలికే వాక్యాలు; పలికిరి= పలికారు; సిద్ధ; సాధ్య; గంధర్వ; వరులు= శ్రేష్ఠులు; విరులు= పువ్వులు; కురియించిరి= కురిపించారు; సురలు= దేవతలు; శంఖదుందుభులు; మ్రోయించిరి= ధ్వనింపజేశారు; తుంబురు ప్రముఖులు+అయిన= తుంబురుడు మొదలగు ముఖ్యులైన; గంధర్వులు; పాడిరి= గానంచేశారు; అప్పుడు...

**తా :** శ్రీకృష్ణుడు ఇలా చెప్పగానే, గోపాలకులు అందరూ బండ్లు మొదలైన తమ పనిముట్లతో కూడి గోవులు, తామూ కొండ అడుగును విడిచివచ్చారు. శ్రీకృష్ణుడు కూడా వెంటనే గోవర్ధనగిరిని దాని స్వస్థానంలో ఉంచాడు. అపుడు గోపాలకులందరూ కృష్ణుణ్ణి కౌగిలించుకొని, ఉచితవిధంగా సత్కరించి, దీవించారు. గోపికలు అక్షతలువేసి, పెరుగన్నంముద్దలు చేసి ఇచ్చి, ఆశీర్వదించారు. నందుడు, బలరాముడు, రోహిణి, యశోద కృష్ణుణ్ణి కౌగిలించుకొని క్షేమ శుభవాక్యాలు పలికారు. సిద్ధులు, సాధ్యులు, గంధర్వులు పువ్వులు కురిపించారు. దేవతలు శంఖాలు, దుందుభులు మోగించారు; తుంబురుడు మొదలగు ముఖ్యులైన గంధర్వులు గానంచేశారు. అప్పుడు.

**క. వల్లవకాంతలు దన కథ, లెల్లను బాడంగ నీరజేక్షణుఁ డంతన్**
**వల్లవబలసంయుతుఁడై, యొల్లన గోష్ఠంబు సేరె నుర్వీనాథా? 928**

**ప్రతి :** ఉర్వీనాథా= పరీక్షిన్మహారాజా!; వల్లవకాంతలు= గోపస్త్రీలు; తనకథలు= కృష్ణుని చరితలు; ఎల్లను= అన్నిటినీ; పాడన్+కన్= గానంచేస్తూ ఉండగా; నీరజ+ఈక్షణుఁడు= పద్మనేత్రుడైన శ్రీకృష్ణుడు; అంతన్= అప్పుడు; వల్లవబలసంయుతుఁడు+ఐ= గోపకులందరితో కూడి; ఒల్లనన్= మెల్లగా; గోష్ఠంబు= గోకులం; చేరెన్= చేరాడు.

**తా :** గోపస్త్రీలు తనకథలు పాడుతూ ఉండగా, కమలనేత్రుడైన శ్రీకృష్ణుడు గోపకులతో కలిసి, గోకులం చేరాడు.

**వ. అయ్యవసరంబునఁ గృష్ణచరిత్రంబులు దలంచి వెఱఁగుపడి గోపజనులు నందున కిట్లనిరి. 929**

**ప్రతి :** ఆ+అవసరంబునన్= ఆ సమయంలో; కృష్ణచరితంబులు= (ఆశ్చర్యకరమైన) కృష్ణునికథలు; తలంచి= భావిస్తూ; వెఱఁగుపడి= నివ్వెరపోయి; గోపజనులు; నందునకున్= నందునితో; ఇట్లు+అనిరి= ఇలా అన్నారు.

**తా :** ఆ సమయంలో కృష్ణునిచరితలు తలచుకొని, నివ్వెరపోతూ గోపకులు నందునితో ఇలా అన్నారు.

**సీ. కన్నులు దెఱవని కడుఁ జిన్నిపాపఁడై దానవిఁ జనుఁబాలు ద్రాగి చంపె**
**మూఁడవనెలనాఁడు ముద్దులబాలుఁడై కోపించి శకటంబుఁ గూలఁ దన్నె**
**నేఁడాదికుఱ్ఱఁడై యెగసి తృణావర్తు మెడఁ బట్టుకొని కూల్చి మృతునిఁ జేసెఁ**
**దల్లి వెన్నలకునై తను ఱోలఁ గట్టినఁ గొమరుఁడై మద్దులఁ గూల నీడ్చెఁ;**

**తే. బసులఁ గ్రేపులఁ గాచుచు బకునిఁ జీరె, వెలఁగతో వత్సదైత్యుని వ్రేసి గెడపె**
**సబలుఁడై ఖరదైత్యుని సంహరించె, నితఁడు కేవలమనుజుఁడే యెంచిచూడ 930**

**ప్రతి :** కన్నులున్+తెఱవని= కండ్లుకూడా సరిగా తెరవనట్టి; కడున్+చిన్ని పాపఁడు+ఐ= చాలా చిన్నపిల్లవాడై; దానవిన్= రాక్షసి అయిన పూతనను; చనుఁబాలు= చనుపాలు; త్రాగి; చంపెన్= సంహరించాడు; మూఁడవ నెలనాఁడు= మూడవనెల వయసులో; ముద్దులబాలుఁడు+ఐ; కోపించి; శకటంబున్= బండి ఆకారంలోఉన్న శకటాసురుణ్ణి; కూలన్+తన్నెన్=కూలిపోయేట్లు

తన్నాడు; ఏఁడాదికుఱ్ఱఁడు+ఐ= ఒకసంవత్సరం వయసుగలశిశువై; ఎగసి; తృణావర్తు= తృణావర్తుడు అనే రాక్షసుణ్ణి; మెడన్+పట్టుకొని= మెడబట్టుకొని; కూల్చి= కూలనేసి; మృతునిన్+చేసెన్= చంపేశాడు; వెన్నలకున్+ఐ= వెన్నలకోసం ఇతరుల ఇండ్లకు వెడుతున్నాడని; తల్లి= అమ్మ అయిన యశోదమ్మ; తనున్= తనను; ఱోలన్= రోలుకు; కట్టినన్= కట్టివేయగా; కొమరుఁడు+ఐ= బాలుడైనా; మద్దులన్= మద్దిచెట్లను; కూలన్+ఈడ్చెన్= కూలేటట్లు రోలును ఈడ్చాడు; పసులన్=గోవులను; క్రేపులన్= దూడలను; కాచుచున్= కాస్తూ ఉండి; బకునిన్= బకడు అనే రాక్షసుణ్ణి; చీరెన్= చీల్చివేశాడు; వెలఁగతో= వెలగచెట్టుతో; వత్సదైత్యుని= వత్సుడు అనే రాక్షసుణ్ణి; వ్రేసి= కొట్టి; కెడపెన్= సంహరించాడు; సబలుఁడు+ఐ= బలరామునితో కూడుకొన్నవాడై; ఖరదైత్యునిన్= ఖరుడు అనే రాక్షసుణ్ణి; సంహరించెన్= చంపాడు; ఇతఁడు= ఈ బాలకృష్ణుడు; ఎంచిచూడన్= భావించిచూస్తే; కేవలమనుజుఁడు+ఏ= కేవలం మనుష్యమాత్రుడా? (కాదని భావం)

**తా :** (ఈ సీస పద్యంలో బాలకృష్ణుని సాహసకృత్యాలు ఉన్నాయి) కన్నులు తెరవని చిన్ని పాపడుగా ఉండగానే రాక్షసియైన పూతనయొక్క చనుబాలు తాగి ఆ పూతనను చంపాడు. ముద్దుల బాలుడుగా ఉంటూ మూడోనెలలోనే బండిరూపంలో వచ్చిన శకటాసురుణ్ణి కాలితో తన్ని చంపేశాడు. ఏడాది కుర్రవాడై ఉండగానే తృణావర్తుడు అనే రాక్షసుణ్ణి మెడబట్టుకొని కూల్చివేసి పరిమార్చాడు. వెన్నలకోసం ఇతరుల ఇండ్లకు వెళ్తున్నాడని తల్లి యశోదమ్మ రోలుకు కట్టివేయగా, కృష్ణుడు రెండు మద్దిచెట్ల మధ్య దూరి, రోలును ఈడ్చుకుంటూ వెళ్లి వాటిని పడిపోయేట్లు లాగాడు. గోవులను, దూడలను మేపడానికి వెళ్లి బకుడు అనే రాక్షసుణ్ణి చంపాడు. వత్సుడు అనే రాక్షసుణ్ణి వెలగచెట్టుతో కొట్టి సంహరించాడు. బలరామునితో కలసి ఖరుడు అనే రాక్షసుణ్ణి చంపేశాడు. ఈ సాహసకృత్యాలు అన్నీ భావించి చూస్తే బాలకృష్ణుడు మనుష్య మాత్రుడా? అనిపిస్తుంది. (కాదని భావం)

**విశే :** పూతన, శకటాసురుడు, తృణావర్తుడు, బకుడు, వత్సుడు అనే వాళ్లందరూ రాక్షసులు. కంసుడు పంపగా కృష్ణుణ్ణి చంపడానికి వచ్చారు. బాలకృష్ణునిచేతిలో హతులయ్యారు.

**క. తెంపరియై రామునిచేఁ, జంపించెఁ బ్రలంబు; బ్రమింగెఁ జటులదవాగ్నిన్;**
**సొంపు సెడఁ ద్రొక్కి కాళియుఁ, ద్రుంపక కాళింది వెడలఁ దోలెన్ లీలన్. 931**

**ప్రతి :** తెంపరి+ఐ= సాహసియై; రామునిచేన్= అన్న అయిన బలరామునిచేత; ప్రలంబు= ప్రలంబుడు అనే రాక్షసుణ్ణి; చంపించెన్= సంహరింపజేశాడు; చటులదవాగ్నిన్= తీవ్రమైన దావానలాన్ని; బ్రమింగెన్= మింగాడు; కాళియున్= కాళీయుడనే సర్పరాజును; సొంపు+చెడన్= ప్రాభవం చెడేటట్లు; త్రొక్కి; త్రుంపక= చంపకుండా; లీలన్= విలాసంగా; కాళింది= కాళిందిమడుగునుండి; వెడలన్+తోలెన్= తరిమేశాడు.

**తా :** బాలకృష్ణుడు సాహసియై అన్న బలరామునిచేత ప్రలంబాసురుణ్ణి చంపించాడు. ఘోరదావాగ్నిని మింగాడు. కాళీయుని ప్రాభవం చెడేటట్లు కాళీయుణ్ణి పాదాలతో తొక్కి చంపకుండా, కాళింది మడుగునుండి బయటికి తరిమేశాడు.

**క. ఏడేండ్ల బాలుఁ డెక్కడ?, క్రీడం గరి తమ్మియెత్తుక్రియ నందఱముం**
**జూడ గిరి యెత్తు టెక్కడ?, వేడుక నొకచేత నేఁడు వెఱఁగౌఁ గాదే. 932**

**ప్రతి :** ఏడేండ్లబాలుఁడు= ఏడుసంవత్సరాల బాలుడు; ఎక్కడ?; కరి= ఏనుగు; క్రీడన్= ఆటలాగా; తమ్మి+ఎత్తుక్రియన్= తామరపువ్వును (తొండంతో) ఎత్తినట్లుగా; అందఱమున్= గోపకులందరమూ; చూడన్= చూస్తూ ఉండగా; వేడుకన్=

విలాసంగా; ఒకచేతన్= ఒకచేత్తోనే; గిరి+ఎత్తుట= గోవర్ధనగిరిని ఎత్తడం; ఎక్కడ?; వెఱఁగు+ఔను+కాదే= ఆశ్చర్యం కలుగదా?

**తా :** ఏడేండ్ల బాలు డెక్కడ? వేడుకగా ఆటవలె ఏనుగు తామరపువ్వును ఎత్తినట్లు, ఒక చేత్తోనే విలాసంగా గోవర్ధన గిరిఎత్తడం ఎక్కడ? ఆశ్చర్యం గదా!

**క. ఓ నంద! గోపవల్లభ, నీ నందనుఁ డాచరించు నేర్పరితనముల్**
**మానవులకు శక్యంబులె?, మానవమాత్రుండె నీ కుమారుఁడు తండ్రీ! 933**

**ప్రతి :** గోపవల్లభ= గోపకులరాజా!; ఓ నంద= ఓ నందుడా!; తండ్రీ= నాయనా!; నీ నందనుండు= నీ కొడుకు అయిన కృష్ణుడు; ఆచరించు నేర్పరి తనముల్= చేసే నేర్పరిపనులు; మానవులకున్= మనుష్యులకు; శక్యంబులు+ఎ?= సాధ్యం అయ్యే పనులా?; నీ కుమారుఁడు= నీ కొడుకైన కృష్ణుడు; మానవ మాత్రుండు+ఎ= సామాన్యమానవుడా?

**తా :** ఓ తండ్రీ! గోపవల్లభుడవైన నందుడా! నీ కొడుకు కృష్ణుడు చేసే నేర్పరిపనులు మనుష్యులకు శక్యమైనవేనా? అతడు అందరిలాంటి సాధారణ మానవుడా?

**వ. అనిన విని నందుండు వారలం జూచి మున్ను తనకు గర్గమహాముని చెప్పిన సంకేతంబుఁ దెలిసి శంక లేదు; కృష్ణుండు లోకరక్షకుం డయిన పుండరీకాక్షునినిజాంశ యనుచు నంతరంగంబునం జింతింతు'నని పలికిన వెఱఁగుపడి గోపకులు కృష్ణుం డనంతుం డని పూజించి; రంత. 934**

**ప్రతి :** అనినన్= గోపాలకులు ఇలా పలుకగా; విని; నందగోపుడు; వారలన్= వారిని; చూచి; మున్ను= పూర్వం; తనకున్; గర్గమహాముని; చెప్పిన సంకేతంబున్= తెలిపిన రహస్యవిషయం; తెలిసి= గుర్తుకు తెచ్చుకొని; శంకలేదు= సందేహంలేదు; కృష్ణుండు= శ్రీకృష్ణుడు; లోకరక్షకుండు+అయిన= లోకాలను రక్షించేవాడైన; పుండరీకాక్షుని నిజాంశ= పద్మనేత్రుడైన శ్రీహరి అంశయే; అనుచున్= అనుకుంటూ; అంతరంగంబునన్= మనస్సులో; చింతింతును= భావిస్తూ ఉంటాను; అని; పలికినన్= చెప్పగా; వెఱఁగుపడి= ఆశ్చర్యపడి; గోపకులు= యాదవులు; కృష్ణుండు= శ్రీకృష్ణుడు; అనంతుండు= అనంతుడైన శ్రీహరి; అని= అనుకుంటూ; పూజించిరి= పూజించారు; అంత= ఆ తర్వాత...

**తా :** ఇలా గోపకులు అనగానే నందుడు తనకు పూర్వం గర్గమహాముని చెప్పిన రహస్యాన్ని గుర్తుకు తెచ్చుకొన్నాడు. సందేహం లేదు. కృష్ణుడు పద్మాక్షుడైన శ్రీహరి అంశే అని అంతరంగంలో భావిస్తుంటాను అన్నాడు. అది విన్న గోపాలకులు ఆశ్చర్యంతో కృష్ణుడు శ్రీమహావిష్ణువే అని పూజించారు. ఆ తర్వాత

**మ. హరి కేలన్ గిరి యెత్తి వర్షజలఖిన్నాభీరగోరాజికిన్**
**శరణంబైనఁ ద్రిలోక రాజ్యమదముం జాలించి నిర్గర్వుఁడై**
**సురభిం గూడి బలారి వచ్చి కనియెన్ సొంపేది దుష్టప్రజే**
**శ్వరదుర్మాననిరాకరిష్ణుఁ గరుణావర్ధిష్ణు శ్రీకృష్ణునిన్. 935**

**ప్రతి :** హరి= శ్రీకృష్ణుడు; కేలన్= చేతితో; గిరి+ఎత్తి= గోవర్ధనపర్వతమెత్తి; వర్షజల ఖిన్న= వాననీటితో శోకతప్తులైన; ఆభీర గోరాజికిన్= యాదవులకు, గోవులసమూహానికి; శరణంబు+ఐన= శరణుకాగా; బలారి= బలుడనే రాక్షసుణ్ణి చంపిన

దేవేంద్రుడు; త్రిలోకరాజ్యమదమున్= ముల్లోకాలను ఏలుతున్నాననే గర్వం; చాలించి= మానుకొని; నిర్గర్వుఁడు+ఐ= గర్వంలేనివాడై; సొంపు+ఏది= ప్రాభవంచెడి; సురభిన్+కూడి= కామధేనువుతోసహా వచ్చి; దుష్టప్రజ+ఈశ్వర= దుష్టరాజులయొక్క; దుర్మాన నిరాకరిష్ణు= దుర్గర్వాన్ని నిరాకరించేవాడూ; కరుణావర్ధిష్ణు= కరుణతో వర్ధిల్లేవాడూ అయిన; శ్రీకృష్ణునిన్= శ్రీకృష్ణుణ్ణి; కనియెన్= దర్శించాడు.

**తా :** హరి ఒక చేత్తో గోవర్ధనగిరిని ఎత్తి, వర్షజలంవల్ల బాధపడుతున్న యాదవులకు, గోవులకు శరణుగా నిలిచాడు. అపుడు ముల్లోకరాజ్యం ఏలుతున్నాననే పొగరు తొలగిపోగా దేవేంద్రుడు గర్వం వదిలి, తన ప్రాభవం చెడి, కామధేనువుతో కూడా వచ్చి, దుష్టరాజుల దుర్గర్వాన్ని నిరాకరించేవాడు, కరుణతో వర్ధిల్లే వాడూ అయిన శ్రీకృష్ణుణ్ణి దర్శించాడు.

**క. కని యింద్రుఁడు పూజించెను, దినకరనిభనిజకిరీటదీధితిచేతన్**
**మునిహృదలంకరణంబులు, సునతోద్ధరణములు నందసుతుచరణంబుల్. 936**

**ప్రతి :** కని= చూచి; మునిహృద్+అలంకరణంబులు= మునులహృదయాల్లో అలంకారాలుగా ఉండేవి; సునత+ఉద్ధరణములు= అణకువగా ఉండేవారిని ఉద్ధరించేవి అయిన; నందసుతుచరణంబుల్= శ్రీకృష్ణుణ్ణి పాదాలను; దినకరనిభ= సూర్యకాంతితో సమానమైన; నిజకిరీటదీధితిచేతన్= తన కిరీటకాంతితో; ఇంద్రుడు; పూజించెను= పూజించాడు.

**తా :** కృష్ణుణ్ణి దర్శించి, మునుల హృదయాలకు అలంకారాలుగా ఉండేవి, అణకువగలవారిని ఉద్ధరించేవి అయిన శ్రీకృష్ణుణ్ణి చరణాలను, సూర్యకాంతితో సమానమైన తన కిరీట కాంతులతో దేవేంద్రుడు పూజించాడు.

**వ. ఇట్లు నమస్కరించి కరకమలంబులు ముకుళించి హరికి హరిహయుం డిట్లనియె. 937**

**ప్రతి :** ఇట్లు= ఇలా; నమస్కరించి= వందనంచేసి; హరిహయుండు= ఇంద్రుడు; కరకమలంబులు= పద్మాల్లాంటి చేతులు; ముకుళించి= జోడించి; హరికిన్= కృష్ణునితో; ఇట్లు= ఇలా; అనియెన్= అన్నాడు.

**తా :** దేవేంద్రుడు హరికి నమస్కరించి, హస్తపద్మాలు జోడించి ఇలా అన్నాడు.

**సీ. పరమ! నీ ధామంబు భాసురసత్త్వంబు; శాంతంబు; హతరజస్తమము; నిత్య**
**మధికతపోమయ; మట్లు గావున మాయ నెగడెడి గుణములు నీకు లేవు**
**గుణహీనుఁడవు గాన గుణముల నయ్యెడి లోభాదికములు నీలోనఁ జేర**
**వైన దుర్జననిగ్రహము శిష్టరక్షయుఁ దగిలి సేయఁగ దండధారి వగుచు**

**తే. జగముభర్తవు; గురుఁడవు; జనకుఁడవును, జగదధీశుల మను మూఢజనులు దలఁక**
**నిచ్చ పుట్టినరూపంబు లీవు దాల్చి, హితము సేయుదు గాదె లోకేశ్వరేశ! 938**

**ప్రతి :** పరమ= ఉత్తముడవైన శ్రీకృష్ణా!; నీధామంబు= నీ స్థానం; భాసురసత్త్వంబు= ప్రకాశించే సత్త్వగుణం గలది; శాంతంబు= శాంతగుణం గలది; హతరజస్+తమము= రజోగుణాన్ని, తమోగుణాన్ని నశింపజేసేది; నిత్యము= ఎల్లప్పుడు; అధిక తపస్+మయము= అధికతపస్సుతో విరాజిల్లేది; అట్లు= అలా; కావునన్= కాబట్టి; మాయన్+నెగడెడి= మాయతో వృద్ధిచెందే; గుణములు; నీకు; లేవు; గుణహీనుఁడవు= గుణరహితుడవు; కాన= కాబట్టి; గుణములన్= గుణాలతో; అయ్యెడి= కలిగే; లోభాదికములు= లోభం మొదలైన దుర్గుణాలు; నీలోనన్= నీలో; చేరవు; ఐనన్= అయినా; దుర్జననిగ్రహము=

దుష్టశిక్షణం; శిష్టరక్షయున్= శిష్టరక్షణం; తగిలి= ఆసక్తితో; చేయన్+కన్= చేయడానికి; దండధారివి+అగుచున్= దండం చేతపూనినవాడివై; జగత్+అధీశులము+అను= ఈ లోకానికి మేమేరాజులం అనుకొనే; మూఢజనులు= మూర్ఖులు; తలఁకన్= భయపడగా; జగముభర్తవు= జగత్పతివి; గురుఁడవు= గురుడివి; జనకుఁడవు= తండ్రివి అయిన; ఈవు= నీవు; ఇచ్ఛపుట్టినరూపములు= ఇష్టం వచ్చిన అవతారాలు; తాల్చి= ధరించి; లోక+ఈశ్వర+ఈశ= లోకాధిపతులకు ఈశ్వరా; హితము+చేయుదు(వు)+కాదె= మేలు చేకూరుస్తావు గదా!

**తా :** కృష్ణా! నీ స్వరూపం సత్త్వగుణోపేతం. శాంతగుణంకలది. రజస్తమోగుణాలను అణచివేసేది. నిత్యమూ అధికతపోమయం. మాయతో వర్ధిల్లే గుణాలు నీకు లేవు. నీవు గుణరహితుడవు కాబట్టి గుణాలవలన పుట్టే లోభం మొదలైన దుర్గుణాలు నీలో చేరవు. అయినా, దుష్టశిక్షణం, శిష్టరక్షణంకోసం లోకాధిపతులు భీతిల్లేటట్లు దండధారివై లోకహితం చేస్తావు. ఓ లోకేశ్వరేశ్వరా! నీవు జగత్పతివి, గురుడివి, తండ్రివి.

**విశే :** శ్రీహరి గుణరహితుడు కాబట్టి ఆయనకు ఎవరిమీదా కోపమూ, ఎవరిమీదా ప్రేమా ఉండవు. కానీ, లోకకల్యాణార్థం దుష్టశిక్షణలో కోపం, భక్తులమీద ప్రేమ చూపించడం ఆయన లీలలే!

**క. నావంటి వెఱ్ఱివారిని, శ్రీవల్లభ! నీవు శాస్తి చేసితి వేనిం**
**గావరము మాని పెద్దల, త్రోవల జరుగుదురు బుద్ధితోడుత నీశా! 939**

**ప్రతి :** శ్రీవల్లభ= లక్ష్మీనాథా! ఈశా!; నావంటి వెఱ్ఱివారిని= నావంటి వెర్రివాళ్లను; నీవు; శాస్తిచేసితివి+ఏనిన్= శిక్షిస్తే; కావరము మాని= గర్వం పోగొట్టుకుని; బుద్ధితోడుతన్= బుద్ధి తెచ్చుకొని; పెద్దలత్రోవలన్= సజ్జనుల మార్గాలలో; జరుగుదురు= వెళ్తారు.

**తా :** లక్ష్మీవల్లభా! ఈశా! నావంటి జ్ఞానశూన్యులను నీవు శిక్షిస్తే తక్కినవారు గర్వం వీడి, బుద్ధితెచ్చుకొని, సజ్జనుల మార్గాలను అనుసరిస్తారు.

**క. ఒక్కొక లోకముఁ గాఁచుచు, నెక్కుడు గర్వమున 'నేమె యీశుల' మనుచుం**
**జొక్కి నను బోఁటి వెఱ్ఱులు, నిక్కము నీ మహిమఁ దెలియనేర రనంతా! 940**

**ప్రతి :** అనంతా!= 'అంతం' అనేది లేని శ్రీకృష్ణా!; ఒక్క+ఒకలోకమున్= ఒక్కోలోకాన్ని; కాచుచున్= రక్షిస్తూ; ఎక్కుడుగర్వమునన్= మిక్కిలిమదంతో; ఏము+ఎ= మేమే; ఈశులము= ప్రభువులం; అనుచున్= అంటూ; చొక్కి= పరవశించి; ననుబోఁటి వెఱ్ఱులు= నాలాంటి అజ్ఞానులు; నీమహిమన్= నీమాహాత్మ్యాన్ని; తెలియనేరరు= తెలుసుకోలేరు.

**తా :** ఓ శ్రీహరీ! ఒక్కొక్క లోకాన్ని రక్షిస్తూ ఎంతో గర్వంతో; 'మేమే ఈశ్వరులం' అనుకుంటూ ఆనందించే నాబోటి అజ్ఞానులు నీ మహిమ నెరుగలేరు! ఇది నిజం.

**విశే :** ఒక్కొక్కలోకానికి ప్రభువు దేవేంద్రునివంటివాళ్లు. సర్వలోకాలకు ప్రభువు శ్రీమహావిష్ణువు. ఇది తెలుసుకోలేనివారు అజ్ఞానులేగదా!

**ఆ. వాసుదేవ! కృష్ణ! వరద! స్వతంత్ర! వి, జ్ఞానమయ! మహాత్మ! సర్వపుణ్య**
**పురుష! నిఖిలబీజభూతాత్మకబ్రహ్మ!, నీకు వందనంబు నిష్కలంక! 941**

**ప్రతి :** వాసుదేవ!; కృష్ణ!= కృష్ణా!; వరద!= వరాలను అనుగ్రహించేవాడా!; స్వతంత్ర!= స్వతంత్రుడా!; విజ్ఞానమయ!= విజ్ఞాన స్వరూపా!; మహా+ఆత్మ!= గొప్పవాడా!; సర్వపుణ్యపురుష!= అందరిలోనూ పుణ్యాత్మా!; నిఖిలబీజ భూతాత్మక బ్రహ్మ!= సర్వభూతాల్లోను బీజప్రాయంగా ఉండే పరబ్రహ్మమా!; నిష్కలంక!= కళంకంలేనివాడా!; నీకున్; వందనంబు= నమస్కారం!

**తా :** వసుదేవా! కృష్ణా! నీవు స్వతంత్రుడవు! జ్ఞానస్వరూపుడవు! మహాత్ముడవు! సర్వపుణ్యపురుషుడవు! సర్వభూతాల్లోను బీజరూపంలో ఉన్న పరబ్రహ్మవు! నిష్కలంకుడవు! నీకు వందనం.

**శా. నీ సామర్థ్య మెఱుంగ మేఘములచే నీ ఘోషమున్ భీషణో**
**గ్రాసారంబున ముంచితిన్ మఖము నాకై వల్లవుల్ సేయ రం**
**చో సర్వేశ! భవన్మహత్త్వమున నాయుద్యోగ మిట్లయ్యె నీ**
**దాసున్ నన్నుఁ గృతాపరాధుఁ గరుణన్ దర్శింపవే మాధవా! 942**

**ప్రతి :** మాధవా= లక్ష్మీపతివన ఓ కృష్ణా!; ఓ సర్వ+ఈశ!= సర్వులకు ప్రభువా!; నీ సామర్థ్యము= నీ మహిమను; ఎఱుంగన్= తెలుసుకోలేక పోయాను; నాకై= నాకోసం; వల్లవుల్= యాదవులు; మఖము= యాగం; చేయరు= చేయడం లేదు; అంచున్= అనుకుంటూ; మేఘములచేన్= మేఘాలచేత; ఈ ఘోషమున్= ఈ గోకులాన్ని; భీషణ+ఉగ్ర+ఆసారంబునన్= భయంకరమైన, తీవ్రమైన జడివానతో; ముంచితిన్= ముంచాను; భవత్+మహత్త్వమునన్= నీమహిమవల్ల; నా+ఉద్యోగము= నా ప్రయత్నం; ఇట్లు+అయ్యెన్= ఇలా వృథా అయింది; నీ దాసున్= నీ సేవకుడనైన, నన్నున్= నన్ను; కృత+అపరాధున్= తప్పుచేసిన వాణ్ణి; కరుణన్= దయతో; దర్శింపవు+ఏ= చూడవా! ('చూడండి' అని భావం)

**తా :** మాధవా! సర్వేశ్వరా! నీ సామర్థ్యం తెలుసుకోలేక, గోపకులు నన్ను ఉద్దేశించి యాగం చేయడం లేదని, నీ గోకులాన్ని భయంకరమైన, తీవ్రమైన జడివానతో ముంచెత్తాను. నీ మహిమవల్ల నా ప్రయత్నం ఇలా వృథా అయింది. నేను నీ సేవకుణ్ణి! అపరాధం చేసినవాణ్ణి! నన్ను దయతోచూడు.

**మ. నిను బ్రహ్మాదు లెఱుంగలేరు; జడతానిష్ఠుండ లోకత్రయా**
**వనదుర్మానగరిష్ఠుఁడన్ విపులదుర్వైదుష్యభూయిష్ఠుఁడన్**
**వినయత్యాగవరిష్ఠుఁడన్; గుజనగర్విశ్రేష్ఠుఁడన్ దేవ! నీ**
**ఘనలీలావిభవంబుపెంపుఁ దెలియంగా నెవ్వఁడన్? సర్వగా! 943**

**ప్రతి :** దేవ!= స్వామీ! సర్వగా!= సర్వాంతర్యామీ!; నినున్= నిన్ను; బ్రహ్మ+ఆదులు= బ్రహ్మమొదలైన దేవతలు; ఎఱుంగలేరు= తెలుసుకోలేరు; జడతానిష్ఠుండన్= జడభావం ఆవరించినవాణ్ణి;లోకత్రయ+అవన= మూడులోకాలను రక్షిస్తున్నాననే; దుర్మాన గరిష్ఠుఁడన్= దురభిమాన శ్రేష్ఠుణ్ణి; విపుల దుర్+వైదుష్యభూయిష్ఠుఁడన్= పనికిరాని పాండిత్యం కలవాళ్లలో మేటిని; వినయత్యాగ వరిష్ఠుఁడన్= వినయాన్ని త్యజించిన వాళ్లలో శ్రేష్ఠుణ్ణి; కుజనగర్విశ్రేష్ఠుఁడన్= దుర్జనులలో, గర్వించే వారిలో శ్రేష్ఠుడను; నీ ఘనలీలా విభవంబు పెంపున్= నీ గొప్పలీలా వైభవంయొక్క; పెంపున్= అతిశయాన్ని; తెలియన్+కాన్= తెలుసుకోవడానికి; ఎవ్వఁడన్= ఎంతటివాణ్ణి.

**తా :** దేవా! సర్వాంతర్యామీ! నిన్ను బ్రహ్మాది దేవతలే తెలుసుకోలేరు. నేను జడుణ్ణి! ముల్లోకాలను రక్షిస్తున్నాననే దురభిమానగరిష్ఠుణ్ణి. చెడ్డ పాండిత్యం కలవాళ్లలో మేటిని. వినయాన్ని త్యజించినవాళ్లలో శ్రేష్ఠుణ్ణి! దుర్జనులలో, గర్వులలో, శ్రేష్ఠుణ్ణి, నీ ఘనలీలా వైభవాతిశయాన్ని తెలియడానికి నేనెంతటివాణ్ణి?

**విశే :** నిష్ఠుఁడు, గరిష్ఠుడు, భూయిష్ఠుడు, వరిష్ఠుడు, శ్రేష్ఠుడు అనేవి శ్రేష్ఠతా వాచకాలు. వీటిని సాధారణంగా మంచివాటికి విశేషణాలుగా వాడుతుంటారు. ఇక్కడ దుర్గుణాలకు విశేషణాలుగా వాడడం విశేషం.

**వ. అనిన విని నగుచు జలధరగంభీరరవంబుల శక్రునకుం జక్రి యిట్లనియె. 944**

**ప్రతి :** అనినన్= అనగా; విని; నగుచున్= నవ్వుతూ; జలధర= మేఘ; గంభీర రవంబులన్= గంభీర ధ్వనులతో; శక్రునకున్= ఇంద్రునికి; చక్రి= శ్రీకృష్ణుడు; ఇట్లు= ఇలా; అనియెన్= అన్నాడు.

**తా :** ఇలా అనగా విని, నవ్వుతూ మేఘగంభీరమైన కంఠధ్వనితో ఇంద్రునితో శ్రీకృష్ణుడు ఇలా పలికాడు.

**మ. 'అమరాధీశ్వర! లక్ష్మితోఁ దగిలి యి ట్లంధుండవై యున్న నీ**
**సమదోద్రేకము ద్రుంచి వైచుటకు నీ జన్నంబుఁ దప్పించితిం;**
**బ్రమదశ్రీకులు దండధారి నగు నన్ భావింప; రెవ్వాని ని**
**క్కము రక్షింపఁ దలంతు వాని నధనుం గావింతు జంభాంతకా? 945**

**ప్రతి :** అమర+అధి+ఈశ్వర= దేవతలరాజా!; జంభ+అంతకా= జంభుడనే రాక్షసుణ్ణి చంపిన ఓ ఇంద్రా!; లక్ష్మితోన్= సంపదతో; తగిలి= చిక్కి; ఇట్లు= ఇలా; అంధుండవు= కళ్లు లేనివాడవు; ఐ+ఉన్న= అయి ఉండే; నీ సమద+ఉద్రేకమున్= నీ మదంతో కూడిన విజృంభణను; త్రుంచి వైచుటకున్= నాశనం చేయడానికి; ఈ జన్నంబున్= ఈ యజ్ఞాన్ని; తప్పించితిన్= నీకు కాకుండా చేశాను; ప్రమదశ్రీకులు= సిరిసంపదలతో మదించినవారు; దండధారిన్+అగు= దండధరుణ్ణి అయిన; నన్= నన్ను; భావింపరు= తలంపరు; ఏ+వానిన్= ఎవరిని; నిక్కము= నిజంగా; రక్షింపన్+తలంతున్= కాపాడాలనుకుంటానో; వానిన్= వానిని; అధనున్+కావింతున్= నిర్ధనుణ్ణిగా చేస్తాను.

**తా :** జంభారీ! దేవేంద్రా! రాజ్యసంపదచే అంధుడవై ఉన్న నీ మదోద్రేకాన్ని అణచివేయడానికి, ఈయజ్ఞం నేనే తప్పించాను. సిరిసంపదలతో మదించినవారు నన్ను తెలుసుకోలేరు. ఎవరిని నేను నిజంగా రక్షించాలనుకుంటానో, వారిని నిర్ధనులుగా చేస్తాను.

**క. నా యాజ్ఞ సేయుచుండుము, నీ యధికారంబునందు నిలువు; సురేంద్రా!**
**శ్రీయుతుఁడవై మదింపకు, శ్రేయంబులు గల్గుఁ; బొమ్ము సితకరిగమనా! 946**

**ప్రతి :** సితకరిగమనా!= తెల్లఏనుగైన ఐరావతం మీద తిరిగేవాడా!; సుర+ఇంద్రా= దేవేంద్రా!; నా+ఆజ్ఞ= నా ఆనతి; చేయుచున్+ఉండుము= పాటిస్తూ ఉండు; నీ+అధికారంబున+అందున్= నీ పదవిలో; నిలువు= నిలువుము; శ్రీయుతుఁడవు+ఐ= రాజ్యలక్ష్మీ యుతుడవై; మదింపకు= గర్వించవద్దు; శ్రేయంబులు= మేళ్లు; కల్గు= కలుగుతాయి; పొమ్ము= వెళ్లు.

**తా :** ఐరావతగమనా! దేవేంద్రా! నా ఆనతిని శిరసావహించు! నీ పదవిని నిలుపుకో! రాజ్యలక్ష్మీయుతుడి వయ్యావని గర్వించకు! నీకు శుభాలు కలుగుతాయి! వెళ్లు!

**వ. అని యిట్లు జిష్ణునిం బలుకుచున్న కృష్ణునికి మ్రొక్కి గోగణసమేతయయిన కామధేనువు భక్తజన కామధేను వయిన యీశ్వరున కిట్లనియె. 947**

**ప్రతి :** అని; ఇట్లు= ఇలా; జిష్ణునిన్= జయించే స్వభావంగల ఇంద్రునితో; పలుకుచున్+ఉన్న= చెబుతూ ఉన్న; కృష్ణునికి; మ్రొక్కి; గోగణసమేత+అయిన= ఆవులమందతో కలిసివచ్చిన; కామధేనువు= 'సురభి' అనే దేవతాగోవు; భక్తజన కామధేనువు= భక్తులకు సురభిలాగా అడిగిన వరాల నిచ్చేవాడు; అయిన; ఈశ్వరునకున్= శ్రీకృష్ణునితో; ఇట్లు= ఇలా; అనియెన్= అన్నది.

**తా :** అని ఇలా ఇంద్రునితో పలుకుతున్న కృష్ణునికి మ్రొక్కి, గోవుల మందతో వచ్చిన కామధేనువు భక్తజన సురభి అయిన శ్రీకృష్ణునితో ఇలా పలికింది.

**క. 'విశ్వేశ! విశ్వభావన!, విశ్వాకృతి! యోగివంద్య! విను నీచేతన్**
**శాశ్వతుల మైతి మిప్పుడు, శాశ్వతముగఁ గంటి మధికసౌఖ్యంబు హరీ! 948**

**ప్రతి :** విశ్వ+ఈశ= విశ్వానికి ప్రభువా!; విశ్వభావన= విశ్వభావం కలవాడా!; విశ్వ+ఆకృతి= విశ్వమే ఆకారంగా కలవాడా!; యోగివంద్య= మునులకు వందనీయుడా!; హరీ!= శ్రీహరీ!; విను; నీ చేతన్= నీవల్ల; ఇప్పుడు; శాశ్వతులము+ఐతిమి= ముక్తులమైతిమి; అధికసౌఖ్యంబు= అధికమైన ఆనందం; శాశ్వతముగన్= ఎల్లప్పుడు; కంటిమి= దర్శించాము.

**తా :** విశ్వేశ్వరా! విశ్వభావనా! విశ్వాకారా! మునులకు వందనీయా! వినండి! నీవల్ల మేం శాశ్వతులం అయ్యాము. ఇప్పుడు శాశ్వతానందాన్ని పొందగలిగాము.

**వ. దేవా! మాకుం బరమదైవతంబ; వింద్రుండవు; భూసుర గో సుర సాధు సౌఖ్యంబులకొఱకు నిన్నింద్రుని జేసి పట్టంబు గట్టు మని విరించి నియమించి పుత్తెంచె; నీవు భూతలభూరిభారనివారణంబు సేయ నవతరించిన హరి' వని పలికి యంత. 949**

**ప్రతి :** దేవా!; మాకున్= మాకు; పరమదైవతంబు+వు= పరమదైవానివి; ఇంద్రుండు+వు= సార్వభౌముడివి; భూసుర= బ్రాహ్మణుల; గో సుర= గోవుల, దేవతల; సాధు= సజ్జనుల; సౌఖ్యంబులకొఱకున్= సంతోషాలకోసం; నిన్ను; ఇంద్రునిన్+చేసి= సార్వభౌమునిగాచేసి; పట్టంబు+కట్టుము= పట్టాభిషిక్తునిగా చేయుము; అని; నియమించి= ఆజ్ఞాపించి; విరించి= బ్రహ్మ; పుత్తెంచెన్= మమ్మల్ని పంపాడు; నీవు; భూతల= భూమియొక్క; భూరిభారనివారణంబు+చేయన్= గొప్పదైన బరువును నివారించడానికి; అవతరించిన= భూమికి దిగివచ్చిన; హరివి= శ్రీమహావిష్ణువువు; అని; పలికి; అంతన్= అప్పుడు...

**తా :** దేవా! నీవు మాకు పరమదైవానివి, ఇంద్రుడివు, బ్రాహ్మణుల, గోవుల, దేవతల, సజ్జనుల సుఖాలకోసం నిన్ను ఇంద్రునిగా చేసి పట్టం కట్టుమని బ్రహ్మదేవుడు ఆజ్ఞాపించి పంపించాడు. నీవు భూమండలం యొక్క గొప్పదైన బరువు నివారించడానికి అవతరించిన శ్రీమహావిష్ణుడివి అని పలికి తర్వాత.

**మ. సురభిక్షీరములన్ సురద్విపమహా శుండాలతానీత ని**
**ర్జర గంగాంబువులన్ నిలింపజననీసన్మౌనిసంఘంబుతో**
**సురనాథుం డభిషిక్తుఁ జేసి పలికెన్ సొంపార గోవిందుఁ డం**
**చ రణాక్రాంతవిపక్షుఁ దోయజదళాక్షున్ సాధుసంరక్షణున్. 950**

**ప్రతి :** సురనాథుండు= దేవేంద్రుడు; రణ+ఆక్రాంతవిపక్షున్= యుద్ధంలో ఆక్రమించబడిన శత్రువులు గలవాణ్ణి; సాధుసంరక్షణున్= శిష్టరక్షకుడైనవాణ్ణి; తోయజదళ+అక్షున్= పద్మాక్షుడయిన శ్రీకృష్ణుణ్ణి; సురభిక్షీరములన్= కామధేనువు పాలతో; సురద్విప= దేవగజంయొక్క; మహాశుండాలతా+ఆనీత= లతవంటి పెద్దతొండంతో కొనిరాబడిన; నిర్జరగంగా+అంబువులన్= సురగంగా జలాలతో; నిలింపజననీ= దేవతల తల్లిఅయిన అదితితోను; సన్మౌని సంఘంబుతోన్= మహర్షి సంఘంతో కలిసి; సురనాథుండు= ఇంద్రుడు; అభిషిక్తున్+చేసి= అభిషేకంచేసి; సొంపారన్= విలాసంగా; గోవిందుడు= గోవుల్ని రక్షించేవాడు; అంచున్= అంటూ; పలికెన్= పలికాడు.

**తా :** కామధేనువు క్షీరంతోను, ఐరావతం తన తొండంతో తెచ్చిన సురగంగాజలంతోను, దేవేంద్రుడు దేవమాత అయిన అదితితోను, మహర్షులతోను కలిసి పద్మాక్షుడు, సాధుసంరక్షకుడు, యుద్ధాల్లో శత్రువులను జయించేవాడు అయిన పద్మాక్షుడైన కృష్ణుని అభిషిక్తుని చేసి 'నీవు గోవిందుడివి' అని విశేషంగా ప్రశంసించాడు.

**సీ. తుంబురునారదాదులు సిద్ధచారణగంధర్వులును హరికథలు వాడి;**
**రమరకాంతలు మింట నాడిరి; వేల్పులు గురియించి రంచిత కుసుమవృష్టి;**
**జగములు మూఁడును సంతోషమును బొందెఁ; గుఱ్ఱులచన్నులఁ గురిసెఁ బాలు;**
**నవజలంబులతోడ నదులెల్లఁ బ్రవహించె; నిఖిలవృక్షములుఁ దేనియలు వడిసె;**

**తే. సర్వలతికల ఫలపుష్పచయము లమరెఁ; బర్వతంబులు మణిగణప్రభల నొప్పెఁ;**
**బ్రాణులకు నెల్లఁ దమలోని పగలు మానె; వాసుదేవునియభిషేకవాసరమున. 951**

**ప్రతి :** వాసుదేవుని అభిషేకవాసరమునన్= వసుదేవసుతుడైన శ్రీకృష్ణుని అభిషేక దినంలో; తుంబురునారద+ఆదులు= తుంబురుడు నారదుడు మొదలైనవారు; సిద్ధచారణ గంధర్వులును= సిద్ధులు, చారణులు, గంధర్వులు అనే దేవతాగణాలూ; హరికథలు+పాడిరి= శ్రీకృష్ణలీలలను గానంచేశారు; మింటన్= ఆకాశంలో; అమరకాంతలు= దేవకాంతలు (అప్సరసలు); ఆడిరి= నృత్యంచేశారు; వేల్పులు= దేవతలు; అంచితకుసుమవృష్టిన్= గొప్పదైన పూలవానను; కురియించిరి= వర్షింపజేశారు; జగములు మూఁడును= ముల్లోకాలూ; సంతోషమును+పొందెన్= ఆనందం అనుభవించాయి; కుఱ్ఱులచన్నులన్= తొలిచూలు ఆవుల పొదుగులనుండి; పాలు; కురిసెన్= ధారలుగా స్రవించాయి; నదులు+ఎల్లన్= అన్నినదులూ; నవజలంబులతోడన్= కొత్తనీటితో; ప్రవహించెన్= పారాయి; నిఖిలవృక్షములు= అన్నిరకాలైన చెట్లు; తేనియలు వడిసెన్= మకరందాలు స్రవించాయి; సర్వలతికలన్= తీగలన్నిటిలోను; ఫలపుష్పచయములు= పండ్లు పూలసమూహాలు; అమరెన్= విలసిల్లాయి; పర్వతంబులు= కొండలు; మణిగణప్రభలన్= రత్నాల కాంతులతో; ఒప్పెన్= ప్రకాశించాయి; ప్రాణులకున్+ఎల్లన్= అన్నిజీవులకు; తమలోని= తమమధ్యగల; పగలు మానెన్= వైరాలు అంతరించాయి.

**తా :** వసుదేవసుతుడైన శ్రీకృష్ణునిఅభిషేకసమయంలో తుంబురుడు నారదుడు మొదలైనవారు, దేవజాతులైన సిద్ధులు, చారణులు, గంధర్వులు కృష్ణలీలలను గానంచేశారు. అప్సరసలు నాట్యం చేశారు. గొప్పదైన కుసుమ వృష్టిని దేవతలు కురిపించారు. ముల్లోకాలు సంతోషం పొందాయి. తొలిచూలు ఆవుల పొదుగులనుండి వాటంతట అవే పాలు ధారాపాతంగా స్రవించాయి. చెట్లన్నీ తేనెలు వర్షించాయి. తీగెలు పూలు, పండ్లతో విరాజిల్లాయి. పర్వతాలు మణులకాంతులతో ఒప్పాయి. ప్రాణులకన్నింటికి తమలోని వైరాలు అంతరించాయి.

**విశే :** జగతికి మేలు జరిగే సందర్భంలో కనిపించే శుభచిహ్నాలనన్నింటిని కవి వర్ణించాడు. శ్రీకృష్ణుడు సర్వలోక రక్షకుడు. అతని అభిషేక సమయం అందరికీ శుభసమయమే. అందుకే నారదుడు, తుంబురుడు, సిద్ధులు, చారణులు, గంధర్వులు పాడడం. అప్సరసలు ఆడడం. అప్రాణులైన చెట్లు లతలు కూడా సంతోషించాయి. స్వామికి ప్రాణి అప్రాణి భేదం లేదు. గోవులను రక్షించేవాని అభిషేక సమయం కాబట్టి తొలిచూలు ఆవులు క్షీరం స్రవించాయి. పర్వతాలు రత్నాలతో తళుక్కున మెరిశాయి. నదులు ఉప్పొంగాయి. ప్రాణులు తమ జాతి వైరాన్ని మరిచాయి.

**వ. ఇట్లు గోప గోగణ పతిత్వంబునకు గోవిందు నభిషిక్తుం జేసి వీడ్కొని పురందరుండు, దేవగణంబులతో దివంబున కరిగె నంత. 952**

**ప్రతి :** ఇట్లు= ఇలా; గోప= యాదవసమూహానికి; గోగణ= గోవుల మందకు; పతిత్వంబునకున్= నాథత్వానికి; గోవిందున్= కృష్ణుని; అభిషిక్తున్= పట్టంపొందినవానిగా; చేసి; వీడ్కొని= వెళ్ళడానికి అనుమతి పొంది; దేవగణంబులతోన్= తన దేవతల సమూహంతో; పురందరుండు= ఇంద్రుడు; దివంబునకున్= స్వర్గానికి; అరిగెను= వెళ్ళిపోయాడు; అంత= అప్పుడు...

**తా :** దేవేంద్రుడు ఇలా శ్రీకృష్ణుని గోపకులకు, గోవులకు అధినేతగా అభిషిక్తుని చేసి, వీడ్కోలు తీసుకొని, తన దేవగణాలతో స్వర్గానికి తిరిగి వెళ్ళాడు. ఆ తర్వాత–

## ❖ శ్రీకృష్ణమూర్తి నందుని వరుణనగరమునుండి కొనితెచ్చుట ❖

**సీ. నందుఁ డేకాదశినాఁ డుపవాసంబు చేసి శ్రీహరిపూజ చేసి దనుజ**
**వేళ యెఱుంగక వేగక ముందర ద్వాదశీస్నానంబు దగ నొనర్ప**
**యమునాజలము సొర నప్డు వరుణుదూత నందుని వరుణుని నగరమునకుఁ**
**గొనిపోవఁ దక్కిన గోపకు లందఱు నందగోపకునిఁ గానక కలంగి**

**తే. రామకృష్ణులఁ బేర్కొని రవము సేయఁ, గృష్ణుఁ డీశుండు తమతండ్రిఁ గికురువెట్టి**
**వరుణభృత్యుండు గొనిపోయి వరుణుఁ జేర్చు, టెఱిఁగి రయమున నచ్చోటి కేఁగె నధిప! 953**

**ప్రతి :** అధిప= ఓ పరీక్షిన్మహారాజా!; నందుఁడు= నందగోపుడు; ఏకాదశినాఁడు= ఏకాదశితిథినాడు; ఉపవాసంబుచేసి= నిరాహారవ్రతం చేసి; శ్రీహరిపూజ= శ్రీమహావిష్ణువుపూజ; చేసి; దనుజవేళ= అసురవేళ; ఎఱుంగక= తెలియక; వేగక ముందర= వేకువజాముకాక ముందే; ద్వాదశీస్నానంబున్= ద్వాదశితిథినాడుచేసే స్నానం; తగన్= బాగుగా; ఒనర్పన్= చేయడానికి; యమునాజలము= యమునా నది నీటిలోనికి; చొరన్= ప్రవేశించగా; అప్డు= అప్పుడు; వరుణుదూత= వరుణునియొక్క దూత; నందునిన్= నందగోపుణ్ణి; వరుణునినగరమునకున్= వరుణదేవునినగరానికి; కొనిపోవన్= తీసుకొనిపోగా; తక్కిన గోపకులు= మిగిలిన యాదవులు; అందఱు= అందరూ; నందగోపకునిన్= నందగోపుణ్ణి; కానక; కలంగి= కలతచెంది; రామకృష్ణులన్= బలరామకృష్ణులను; పేర్కొని= పేర్లతో పిలుస్తూ; రవము+చేయన్= శబ్దంచేయగా; ఈశుండు= ఈశ్వరుడు అయిన; కృష్ణుఁడు= శ్రీకృష్ణుడు; తమతండ్రిన్; కికురు+పెట్టి= మోసం చేసి; వరుణభృత్యుండు= వరుణునిసేవకుడు; కొనిపోయి= తీసుకొనివెళ్లి; వరుణున్= వరుణుని వద్ద; చేర్చుట= చేర్చడం; ఎఱిఁగి= తెలుసుకొని; కృష్ణుఁడు; రయమునన్= తొందరగా; ఆ+చోటికిన్= ఆవరుణునినగరానికి; ఏఁగెన్= వెళ్లాడు.

**తా :** నందగోపుడు ఏకాదశినాడు ఉపవాసవ్రతం చేసి, శ్రీహరిపూజచేసి, రాక్షసులు సంచరించేవేళ అని తెలియక, వేకువజాము కాకముందే ద్వాదశీస్నానం చేయడానికి యమునానదినీటిలో ప్రవేశించాడు. అప్పుడు వరుణునిదూత నందుణ్ణి వరుణనగరానికి కొనిపోయాడు. తక్కిన గోపకులు నందగోపుడు కనబడనందున కలతచెంది, బలరామకృష్ణులను పేర్లతో పిలుస్తూ శబ్దాలు చేశారు. ఈశ్వరుడైన కృష్ణుడు తన తండ్రిని మోసంతో వరుణదూత తీసుకొనిపోయి వరుణుని దగ్గర చేర్చడం తెలుసుకొని, వెంటనే వరుణుని నగరానికి వెళ్ళాడు.

**విశే :** సాయంసంధ్యలు పొద్దుకుంకే సమయాన్ని 'అసురసంధ్య' అంటారు. అలాగే వేకువజాముకు ముందు అసురులు సంచరించే వేళ అంటారు. ఆ సమయాల్లో ఏ శుభకార్యమూ చేయరు.

**వ. అప్పుడు. 954**

**ప్రతి :** అప్పుడు= ఆ సమయంలో...

**క. వచ్చినమాధవుఁ గనుఁగొని, చెచ్చెర వరుణుండు పూజ సేసి వినతుఁడై**
**యచ్చుగ నిట్లని పలికెను, విచ్చేసితి దేవ! నా నివేశంబునకున్. 955**

**ప్రతి :** వచ్చినమాధవున్= వచ్చినటువంటి శ్రీకృష్ణుణ్ణి; కనుఁగొని= చూచి; వరుణుండు= వరుణదేవుడు; చెరన్+చెరన్= ససంభ్రమంగా; పూజ+చేసి= పూజ నిర్వహించి; వినతుఁడు+ఐ= వినయంతో కూడినవాడై; అచ్చుగన్= పరిశుద్ధంగా; దేవ= ఓ స్వామీ!; నా నివేశంబునకున్= నాయింటికి; విచ్చేసితివి= వచ్చావు; ఇట్లు+అని= ఇలాగని; పలికెను= పలికాడు.

**తా :** ఇలా వచ్చిన శ్రీకృష్ణునిచూచి వడివడిగా శ్రీకృష్ణుణ్ణి పూజించి వినమ్రుడై, ఓ దేవా! నా యింటికి విచ్చేశావు అని ఆప్యాయంగా పలికాడు.

**ఉ. ఏ విభుపాదపద్మరతు లెన్నఁడు నెవ్వరుఁ బొందలేని పెం**
**ద్రోవఁ జరింతు రట్టి బుధతోషక! నీ వరుదెంచుటం బ్రమో**
**దావృత మయ్యెఁ జిత్తము; గృతార్థత నొందె మనోరథంబు; నీ**
**సేవఁ బవిత్రభావమును జెందె శరీరము నేఁడు మాధవా! 956**

**ప్రతి :** మాధవా!= శ్రీకృష్ణా!; ఎన్నఁడున్= ఎప్పుడూ; ఎవ్వరున్= ఎవ్వరుకూడా; పొందలేని= పొందడానికి శక్యంకాని; పెన్+త్రోవన్= గొప్పమార్గంలో; ఏ విభున్= ఏ స్వామియొక్క; పాదపద్మరతులు= పదకమలాలందు ఆసక్తికల; చరింతురు= నడుస్తారో; అట్టి బుధతోషక= అలాంటి సజ్జనులను సంతోషపరచే స్వామీ!; నీవు; అరుదెంచుటన్= రావడం వల్ల; నేఁడు= ఈ దినం; చిత్తము= నా మనసు; ప్రమోద+ఆవృతము+అయ్యెన్= పరమానందంతో నిండిపోయింది; మనస్+రథంబు= నా కోరిక; కృత+అర్థతన్+ఒందెన్= ధన్యత పొందింది; శరీరము= నాదేహం; నీ సేవన్= నీ సేవను; చేసి; పవిత్రభావమును+చెందెన్= పవిత్రతను పొందింది.

**తా :** మాధవా! ఎన్నడూ, ఎవరూ పొందశక్యంగాని పెనుత్రోవలో ఏ విభుని పాదపద్మాలను ఆసక్తితో ధ్యానించేవారు నడుస్తారో, అలాంటి భక్తులకు సంతోషం ప్రసాదించే స్వామివి నీవు. నీవు రావడంవల్ల నా మనసు పరమానందంతో నిండి పోయింది. నా కోరికలు ఫలించాయి. నీ సేవలో నా శరీరం పావనమైంది.

**విశే :** ఆనందం పొందేవి రెండు. అటు శరీరం ఇటు మనసు. ఇవి రెండూ సంతోషం పొందాయి అంటే వరుణుడు స్వామిదర్శనంతో ధన్యుడయినట్లే!

**ఉ. ఏ పరమేశ్వరున్ జగము లిన్నిటిఁ గప్పిన మాయ గప్పఁగా**
**నోపక పారతంత్ర్యమున నుందు మహాత్మక! యట్టి నీకు ను**
**ద్దీపిత భద్రమూర్తికి సుధీజనరక్షణవర్తికిం దనూ**
**తాపము వాయ మ్రొక్కెద నుదారతపోధనచక్రవర్తికిన్. 957**

**ప్రతి :** మహా+ఆత్మక= ఓ మహాత్మా!; జగములు+ఇన్నిటిన్= ఇన్ని ప్రపంచాలను; కప్పిన మాయ= ఆవరించిన మాయ; ఏ పరమ+ఈశ్వరున్= ఏ దేవుణ్ణి; కప్పన్+కాన్+ఓపక= ఆవరించలేక; పారతంత్ర్యమునన్= దాస్యభావంతో; ఉందున్= ఉంటుందో; అట్టి నీకున్= అలాంటి నీకు; ఉద్దీపిత భద్రమూర్తికిన్= దేదీప్యమానంగా ప్రకాశించే శుభస్వరూపునికి; సుధీజన రక్షణవర్తికిన్= సుజనులను రక్షించే వర్తనం కలిగినవానికి; ఉదారతపస్+ధనచక్రవర్తికిన్= గొప్పదైన తపస్సే ధనంగా కలిగినవారి సార్వభౌమునికి; తనూతాపము= నా శరీరవేదన; పాయన్= తొలగడానికి; మ్రొక్కెదన్= నమస్కరిస్తున్నాను.

**తా :** ఈ జగాలన్నిటినీ కప్పినమాయ ఏ పరమేశుడవైన నిన్ను కప్పలేక నీకు దాస్యం చేస్తూ ఉంటుందో, అలాంటి మహాత్మా! సుజనులను రక్షించేవాడివి, దేదీప్యమానశుభమూర్తివి, సుజన రక్షకుండవు, తపస్సే ధనంగా గలిగినవారికి చక్రవర్తివి అయిన నీకు నా శరీరతాపం తొలగించుకోవడానికి వందనాలు సమర్పిస్తున్నాను.

**చ. ఎఱుఁగఁడు వీఁడు నాభటుఁ డొకించుక యైన మనంబులోపలం**
**దెఱుకువ లేక నీజనకుఁ దెచ్చె; దయం గొని పొమ్ము; ద్రోహమున్**
**మఱవుము; నన్ను నీభటుని మన్నన సేయుము; నీదు సైరణన్**
**వఱలుదుఁ గాదె యో జనకవత్సల! నిర్మలభక్తవత్సలా! 958**

**ప్రతి :** ఓ జనకవత్సలా!= జనకునికి ప్రీతిని కలిగించినవాడా!; నిర్మలభక్తవత్సలా= స్వచ్ఛమైన భక్తులపై ప్రేమ చూపేవాడా!; వీఁడు; నా భటుఁడు= నా సేవకుడు; ఎఱుఁగఁడు= నీ మహిమ తెలిసినవాడు కాదు; ఒక+ఇంచుక+ఐనన్= ఒక కొంతగూడా; మనంబులోపలన్= మనస్సులో; తెఱకువలేక= తెలివిలేకుండా; నీ జనకున్= నీ తండ్రియైన నందుణ్ణి; తెచ్చెన్= (మా వరుణలోకానికి) తెచ్చాడు; దయన్= కరుణతో; కొనిపొమ్ము= తీసుకొని వెళ్లండి; ద్రోహమున్= వీడు చేసిన కీడును; మఱవుము= మరచిపోండి; నన్నున్= నన్నూ; ఈ భటుని= ఈ సేవకుణ్ణి; మన్నన+చేయుము= క్షమించండి; నీదు సైరణన్= నీ క్షమాగుణంవల్ల; వఱలుదున్+కాదె= బ్రదికిపోతాను కదా!

**తా :** ఓ జనక వత్సలా! నిర్మల భక్తవత్సలా! ఈ నా భటుడు కొంతైనా మనసులో వివేకంలేనివాడై, నీ తండ్రిని వరుణలోకానికి తీసుకొని వచ్చాడు. నీ తండ్రిని దయతో తీసుకొని పొమ్ము! వీడు చేసినద్రోహాన్ని మరచిపొండి! నన్నూ, ఈ భటుణ్ణీ మన్నించండి. నీ క్షమాగుణంవల్లనే నేను బతికిపోతాను.

**వ. అని యిట్లు పలుకుచున్న వరుణునిం గరుణించి తండ్రిం దోడ్కొని హరి దిరిగి వచ్చె; నంత నందుండు దన్ను వెన్నుండు వరుణనగరంబుననుండి విడిపించి తెచ్చిన వృత్తాంతం బంతయు బంధువుల కెఱింగించిన**

**వారలు కృష్ణుం డీశ్వరుం డని తలంచి; రఖిలదర్శనుం డయిన యీశ్వరుండును వారలతలం పెఱింగి వారికోరిక సఫలము సేయుదు నని వారి నందఱ బ్రహ్మహ్రదంబున ముంచి యెత్తి. 959**

**ప్రతి :** అని; ఇట్లు= ఈ విధంగా; పలుకుచున్+ఉన్న వరుణునిన్= అంటున్న వరుణుణ్ణి; కరుణించి; తండ్రిన్= జనకుడైన నందరాజును; తోడ్కొని= తీసుకొని; హరి= శ్రీకృష్ణుడు; తిరిగి వచ్చెన్= గోకులానికి మరలివచ్చాడు; అంతన్= అప్పుడు; నందుండు= నందరాజు; తన్నున్= తనను; వెన్నుండు= శ్రీకృష్ణుడు; వరుణనగరంబున్+ఉండి= వరుణుని పట్టణంనుండి; విడిపించి= వదలించుకొని; తెచ్చిన వృత్తాంతంబు= తీసుకొనివచ్చిన విషయాన్ని; అంతయున్= సమగ్రంగా; బంధువులకున్= చుట్టాలకు; ఎఱింగించినన్= తెలుపగా; వారలు= ఆ చుట్టాలు; కృష్ణుండు= శ్రీకృష్ణుడు; ఈశ్వరుండు= పరమాత్ముడు; అని; తలంచిరి= అభిప్రాయపడ్డారు; అఖిలదర్శనుండు+అయిన= సర్వజ్ఞుడు అయిన; ఈశ్వరుండును= శ్రీకృష్ణుడుకూడా; వారల తలంపు= చుట్టాల అభిప్రాయం; ఎఱింగి= గుర్తించి; వారికోరిక= వారి మనోరథం; సఫలము చేయుదును= నెరవేరుస్తాను; అని; వారిన్= వాళ్ళను; అందఱన్= సర్వులను; బ్రహ్మహ్రదంబునన్= బ్రహ్మకుండంలో; ముంచి+ఎత్తి= ముంచి పైకి లేవనెత్తాడు.

**తా :** ఇలా పలుకుతూ ఉన్న వరుణుణ్ణి శ్రీకృష్ణుడు కరుణించాడు. ఆయన తనతండ్రి అయిన నందుణ్ణి తోడుకొని గోకులానికి తిరిగివచ్చాడు. అప్పుడు నందరాజు కృష్ణుడు తనను వరుణపురంనుండి విడిపించుకొని తీసుకొనివచ్చిన విషయాన్ని సమగ్రంగా బంధువులకు వర్ణించి చెప్పాడు. బంధువులు శ్రీకృష్ణుణ్ణి సాక్షాత్తూ పరమాత్ముడు అని భావించారు. సర్వజ్ఞుడైన శ్రీకృష్ణుడు కూడా తన బంధువుల భావాన్ని గ్రహించాడు. వారి కోరికను నెరవేర్చడానికి యమునానదిలో ఓ మడుగైన బ్రహ్మకుండంలో ముంచెత్తాడు.

**ఆ. ప్రకృతి కామకర్మ పరవశమై యుచ్చ, నీచగతులఁ బొంది నెఱయ భ్రమసి**
**తిరుగుచున్న జనము తెలియనేరదు నిజ, గతివిశేష మీ జగంబునందు'. 960**

**ప్రతి :** ప్రకృతి= ప్రకృతికి సంబంధించిన; కామకర్మపరవశమై= కామకర్మలలో తగుల్కొన్నవారై; ఉచ్చ నీచగతులన్= ఉత్తమ, అధమస్థితులను; నెఱయన్= పూర్తిగా; పొంది= పొందుతూ; భ్రమసి= భ్రమలోపడి; తిరుగుచున్+ఉన్న= తిరుగుతూ ఉన్న; జనము= ఈ జనులు; (వీరు) నిజగతివిశేషము= నా నిజస్థితి విశేషాలను; ఈ జగంబున్+అందున్= ఈ ప్రపంచంలో; తెలియనేరరు= తెలుసుకోలేరు.

**తా :** ప్రకృతి సంబంధమైన కామకర్మలలో పరవశం పొందుతూ, ఉత్తమ అధమ స్థితులకు లోనవుతూ, భ్రాంతిలో జీవిస్తున్న ఈ జనం ఇహలోకంలో అసాధారణమైన నా నిజస్థితి విశేషాలను తెలుసుకోలేకుండా ఉన్నారు - అని కృష్ణుడు తలంచాడు.

**మ. అని చింతించి దయాళుఁడైన హరి మాయాదూరమై జ్యోతియై**
**యనిరూప్యం బయి సత్యమై, యెఱుకయై, యానందమై, బ్రహ్మమై**
**యనఘాత్మల్ గుణనాశమందుఁ గను నిత్యాత్మీయలోకంబు గ్ర**
**క్కునఁ జూపెం గరుణార్ద్రచిత్తుఁ డగుచున్ గోపాలకశ్రేణికిన్. 961**

**ప్రతి :** అని= ఈ విధంగా; చింతించి= ఆలోచించినవాడై; దయాళుఁడు+ఐన హరి= కరుణాస్వరూపుడైన శ్రీకృష్ణుడు; మాయాదూరము+ఐ= ప్రకృతికి దూరమైందై; జ్యోతి+ఐ= తేజస్స్వరూపమై; అనిరూప్యంబు+అయి= నిర్ణయించడానికి వీలుకానిదై;

సత్యము+ఐ= సత్యస్వరూపమై; ఎఱుక+ఐ= జ్ఞానాకృతియై; ఆనందము+ఐ= పరమానంద స్వరూపమై; బ్రహ్మము+ఐ= అంతటానిండినదై; అనఘాత్ముల్= పాపరహితులు; గుణనాశము+అందున్= త్రిగుణాలు (సత్వ, రజస్, తమోగుణాలు) ప్రకృతిలో లయమైన తర్వాత; కను= దర్శించే; నిత్య= ఎప్పుడూ నాశంలేని; ఆత్మీయ= తనదైన; లోకంబున్= వైకుంఠలోకాన్ని; గోపాలకశ్రేణికిన్= గోపాలులందరికీ; కరుణా+ఆర్ద్రచిత్తుఁడు+అగుచున్= దయచేత మనసు కరిగినవాడై; గ్రక్కునన్= శీఘ్రంగా; చూపెన్= చూపించాడు.

**తా :** అని ఇలా ఆలోచించినవాడైన శ్రీకృష్ణుడు దయాస్వభావంగలవాడై వ్రేపల్లెవాసులకు మాయకులో పడనిదీ, తేజోరూపమైందీ, నిరూపించవీలుగానిదీ, సత్యమైందీ, జ్ఞానస్వరూపమైందీ, ఆనందమయమైందీ, అంతటానిండినదీ, పాపరహితులు గుణాతీతస్థితిని పొందిన తరువాత పొందేదీ, స్వామివారికీ ఆత్మీయమైందిగా ఉండేది అయిన శాశ్వతమైన తన లోకాన్ని చూపించాడు.

**వ. ఇట్లు హరి ము న్నక్రూరుండు వొందిన లోక మంతయుఁ జూపి బ్రహ్మలోకంబు సూపినం జూచి, నందాదులు పరమానందంబునుం బొంది వెఱఁగుపడి హంసస్వరూపకుండైన, కృష్ణునిఁ బొడగని పొగడి పూజించి రంత. 962**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; మున్ను= ఇంతకుముందు (శుకమహర్షి పరీక్షిన్మహారాజుకు భాగవతోపదేశం చేయడానికి ముందు) అక్రూరుండు; పొందినలోకము+అంతయున్= పొందిన పుణ్యలోకమంతా; చూపి= చూపించి; బ్రహ్మలోకంబునున్= పరబ్రహ్మస్థానమైన బ్రహ్మలోకాన్ని కూడా; చూపినన్= చూపగా; చూచి= దర్శించి; నంద+ఆదులు= నందుడు మొదలైన గోపాలకులు; పరమ+ఆనందంబున్= మిక్కిలి ఆనందాన్ని; పొంది; వెఱఁగుపడి= ఆశ్చర్యపడి; హంసస్వరూపకుండు+ఐన= పరమాత్మస్వరూపం కలిగినవాడైన; కృష్ణునిన్= శ్రీకృష్ణుణ్ణి; పొడగని= గుర్తించి చూచి; పొగడిరి= స్తుతించారు; అంత= ఆ తర్వాత...

**తా :** ఈ విధంగా శ్రీకృష్ణుడు – ముందు అక్రూరుడు పొందిన పుణ్యలోకాన్ని పూర్తిగా చూపి, బ్రహ్మలోకాన్ని గూడా నందాదులకు కనిపింపజేశాడు. వారు ఆనందించి ఆశ్చర్యపడుతూ పరమాత్మ స్వరూపుడైన శ్రీకృష్ణమూర్తిని స్తోత్రం చేస్తూ పూజించారు. ఆ తర్వాత

**చ. కలువలమేలికందువలు, కామునికయ్యపుఁ బాళెముల్, వియో**
**గులఁ దలఁడించు వేళలు, చకోరకపంక్తులభోగకాలముల్,**
**సెలువలు సైరణల్ విడిచి చిక్కుతఱుల్, ఘనచంద్రచంద్రికా**
**జ్వలితదిశల్ శరన్నిశలు జారకదుర్దశ లయ్యె నయ్యెడన్. 963**

**ప్రతి :** ఆ+ఎడన్= ఆ సమయంలో; కలువల మేలికందువలు= కలువపూలకు మేలైన సమయాలు; కాముని కయ్యము+పాళెముల్= మన్మథునియొక్క యుద్ధ భూములు; వియోగుల= విరహుల; తలడించువేళలు= విషయ చింతతో తలలుదించుకొనే సమయాలు; చకోరపంక్తుల భోగకాలముల్= చక్రవాకపక్షులకు సంభోగ సమయాలు; చెలువలు= యువతులు; సైరణల్= నిబ్బరాలను; విడిచి; చిక్కుతఱుల్= చిక్కుపడే సమయాలు; ఘనచంద్ర చంద్రికా జ్వలితదిశల్= దట్టమైన వెన్నెలలలో ప్రకాశించే దిక్కులు గలవీ అయిన; శరత్+నిశలు= శరద్రాత్రులు; జారక దుర్దశలు+అయ్యెన్= విటీవిటులకు చెడ్డకాలాలు అయ్యాయి.

**తా :** ఆ సమయంలో శరదృతువు వచ్చింది. శరద్రాత్రులు కలువలకు మేలుగలిగే సమయాలుగా, మన్మథుడికి యుద్ధస్థానాలుగా, విరహాలకు తలలు వాల్చిన వేళలుగా, చక్రవాకపక్షులకు రతిసమయాలుగా, యువతులు విషయాలలో చిక్కుకొనే వేళలుగా, శరత్‌చంద్రుని దట్టమైన వెన్నెలలో దిక్కులు ప్రకాశించేవిగా, జారులకు దుర్దశలుగా అయ్యాయి.

**ఆ. కామతంత్రటీక, కలువలజోక, కం, దర్పుదాక, విటులతాల్మి పోక,**
**చకితచక్రవాక, సంప్రీత జనలోక, రాక వచ్చె మేలురాక యగుచు. 964**

**ప్రతి :** కామతంత్రటీక= కామశాస్త్రానికి వ్యాఖ్య అయింది; కలువలజోక= కలువపూలకు వికాసం ఇచ్చేది; కందర్పుడాక= మన్మథుని విజృంభణ కలది; విటులతాల్మిపోక= జారజనుల నిబ్బరాన్ని పోగొట్టేది; చకిత చక్రవాక= సంభ్రమం పొందిన చకోరపక్షులు గలది; సంప్రీత జనలోక= జనసమూహానికి సంతోషం కలిగించేది అయిందై; మేలురాక+అగుచున్= తన రాకతో మేలుకలిగించే దవుతూ; రాక= రాకాపూర్ణిమ; వచ్చెన్= వచ్చింది.

**తా :** శరదృతువులోని పున్నమిరాత్రి నిండుచంద్రుడు కలిగిందై ఆ మన్మథశాస్త్రానికి వ్యాఖ్యానంగా, కలువపూలకు వికాసం ఇచ్చేదిగా, మన్మథుని విజృంభణం కలిగిందిగా, జారుల నిబ్బరాన్ని పోగొట్టేదిగా, భయపడిన చక్రవాకాలు కలిగిందిగా, అందరికీ ప్రీతిని గలిగించేదిగా వచ్చింది.

**క. పతి దన కరములఁ గుంకుమ, సతిమొగమున నలఁదుభంగి సముదయవేళాం**
**చిత కరరాగమున నిశా, పతి రంజించెన్ నరేంద్ర! ప్రాక్సతిమొగమున్. 965**

**ప్రతి :** నర+ఇంద్ర= ఓ పరీక్షిన్మహారాజా; పతి= భర్త; తనకరములన్= తన చేతులతో; సతిమొగమునన్= భార్యమోముమీద; కుంకుమ; అలఁదు భంగిన్= అలంకరించే విధంగా; ప్రాక్సతి మొగమున్= తూర్పు అనే స్త్రీముఖాన్ని; సముదయవేళన్= (చంద్రుడు) ఉదయించే సమయంలో; అంచితకరరాగమునన్= ప్రకాశించే చంద్రకిరణాల ఎరుపురంగుతో; నిశాపతి= రాత్రి అనే భర్త; రంజించెన్= ప్రకాశింపజేశాడు/ఎరుపురంగుకలదిగా చేశాడు.

**తా :** ఓ పరీక్షిన్మహారాజా! భర్త తన భార్యముఖంమీద కుంకుమపూత పూసినట్లుగా చంద్రుడు తన ఉదయవేళలోని ఒప్పిదమైన కిరణాల ఎరుపుదనంతో తూర్పుదిక్కు అనే స్త్రీయొక్క ముఖాన్ని రంజింపజేశాడు.

**సీ. విటసేనపై దండు వెడలెడు వలతేని గొల్లెనపై హేమకుంభ మనఁగఁ**
**గాముకధృతివల్లికలు ద్రెంప నెత్తిన శంబరాంతకుచేతిచక్ర మనఁగ**
**మారుండు పాంథులమానాటవుల గాల్పఁ గూర్చిన నిప్పులకుప్ప యనఁగ**
**విరహిమృగమ్ముల వేఁటాడ మదనుండు దెచ్చిన మోహనదీప మనఁగ**

**ఆ. వింతనునుపు గల్గి వృత్తమై యరుణమై, కాంతితోఁ జకోరగణము లుబ్బఁ**
**బొడువుఁగొండ చక్కిఁ బొడిచె రాకాచంద్ర, మండలంబు గగనమండలమున. 966**

**ప్రతి :** విటసేనపై= జారులు అనే సైన్యంపైన; దండు వెడలెడు= యుద్ధం కోసం వెళ్లే; వలరేని గొల్లెనపైన్= మన్మథుని గుడారంపై ఉన్న; హేమకుంభము= బంగారుకలశం; అనన్+కన్= అనేటట్లు; కాముక ధృతి వల్లికలు= ప్రణయుల ధైర్యం అనే తీగలను; త్రెంపన్= తెంచడానికి; ఎత్తిన; శంబర+అంతకు= శ్రీమహావిష్ణువుయొక్క; చేతిచక్రము= చేతిలోని చక్రాయుధం;

అనన్+కన్; మారుండు= మన్మథుడు; పాంథుల= బాటసారులయొక్క; మాన+అటవులన్= అభిమానం అనే అరణ్యాలను; కాల్పన్= దహించడానికి; కూర్చిన= సిద్ధంచేసిన; నిప్పులకుప్ప= నిప్పుల సమూహం; అనన్+కన్; విరహి మృగమ్ములన్= విరహంలో ఉండే స్త్రీలు అనే జంతువులను; వేఁటాడన్= వేటాడడానికి; మదనుండు= మన్మథుడు; తెచ్చిన; మోహన దీపము= భ్రమింపజేసే దివ్వె; అనన్+కన్; వింత నునుపు= అద్భుతమైన నున్నదనం; కల్గి= కలిగింది; వృత్తము+ఐ= గుండ్రనిదై; అరుణము+ఐ= ఎర్రనిదై; కాంతితోన్= తనదైన ప్రకాశంతో; చకోరగణములు= చక్రవాక పక్షుల సమూహాలు; ఉబ్బన్= సంతోషించగా; గగనమండలమునన్= ఆకాశప్రదేశంలో; పొడుపు+కొండ చక్కిన్= ఉదయపర్వతంవైపున; రాకాచంద్రమండలంబు= పున్నమిచంద్రబింబం; పొడిచెన్= ఉదయించింది.

**తా :** ఆ సమయంలో మన్మథుడు విటులసేనపైన దండెత్తడానికి సిద్ధంచేసుకొన్న గుడారం మీద మెరిసే బంగారుకలశమో అన్నట్లుగా నునుపై – ఆ మన్మథుడు కాముకులయొక్క ధైర్యం అనే తీగను తెగగొట్టడానికి ఎత్తిన విష్ణుచక్రమో అన్నట్లుగా గుండ్రనిదై – ఆ మదనుడు బాటసారుల ప్రణయకోపాలను కాల్చడానికి ప్రోగుచేసిన నిప్పుల కుప్పో అన్నట్లుగా ఎర్రనిదై – ఆ పంచబాణుడు విరహిణులు అనే మృగాలను వేటాడడానికి తనవెంట తెచ్చుకొన్న మోహపుదీపమో అన్నట్లుగా కాంతిగలదై, చకోరాలు సంతసించగా, ఆకాశమండలంలో, ఉదయ పర్వతం చెంత పున్నమినాటి చంద్రబింబం ఉదయించింది.

## ✤ శరద్రాత్రి గాన మొనర్చు కృష్ణు సన్నిధికి గోపికలు వచ్చుట ✤

**వ. ఇట్లు పొడమిన నవకుంకుమాంకితరమాముఖమండలంబునుం బోలె నఖండంబైన చంద్రమండలంబుం బొడగని పుండరీకనయనుండు యమునాతటవనంబున జగన్మోహనంబుగ నొక్కగీతంబుఁ బాడిన విని, తదాయత్తచిత్తలై తత్తఱంబున వ్రేత లే పనులకుం జేతు లాడకయు, గోవులకుం గ్రేపుల విడువకయు, విడిచి విడిచియీడకయు, నీడి యీడికా నీడిన పాలు కాఁపకయు, గాఁచి కాఁచియుఁ, గాఁగినపాలు డింపకయు, డించి డించియు, డించినపాలు బాలురకుం బోయకయుఁ, బోసి పోసియుఁ బతులకుఁ బరిచర్యలు సేయకయుఁ, జేసి చేసియు నశనంబులు గుడువకయుఁ, గుడిచి కుడిచియుఁ గుసుమంబులు ముడువకయు, ముడిచి ముడిచియుఁ, దొడవులు దొడుగకయుఁ, దొడిగి తొడిగియు గోష్ఠంబులపట్టుల నుండకయుఁ, బాయసంబులు నెఱయ వండకయు, నయ్యెయెడల నిలువంబడకయుఁ, గాటుకలు సూటి నిడకయుఁ, గురులు సక్క నొత్తకయుఁ, గుచంబుల గంధంబులు కలయ మెత్తకయుఁ, బయ్యెదలు విప్పి కప్పకయు, సఖులకుం జెప్పకయు, సహోదరులు, మగలు, మామలు, మఱందులు, బిడ్డలు నడ్డంబు చని నివారింపం దలారింపకయు, సంచలించి పంచభల్లునిభల్లంబుల మొల్లంపు జల్లుల పెల్లునం దల్లడిల్లి, డిల్లపడి, మొగిళ్ళగమి వెలువడి; యుల్లసిల్లు తటిల్లతల పొందున మందగమనల మందగమనంబుల మందవెలువడి గోవింద సందర్శనంబునకుం జని రప్పుడు. 967**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; పొడమిన= ఉదయించిన; నవకుంకుమ+అంకిత= అప్పుడే అలదబడిన కుంకుమతో విలసిల్లే; రమాముఖమండలంబునున్+పోలెన్= శ్రీలక్ష్మీదేవీయొక్క గుండ్రని ముఖంలాగా; అఖండంబు+ఐన= సంపూర్ణమైన; చంద్రమండలంబున్= చంద్రబింబాన్ని; పొడగని= చూచి; పుండరీకనయనుండు= కమలాక్షుడైన శ్రీకృష్ణుడు; యమునాతటవనంబునన్= యమునానదీ తీరంలోని వనంలో; జగత్+మోహనంబు+కాన్= లోకసమ్మోహనంగా; ఒక్కగీతంబు=

ఒక పాట; పాడినన్= పాడగా; విని; తద్+ఆయత్తచిత్తలై= తదేకమనస్కలై; తత్తరంబునన్= సంభ్రమంతో; వ్రేతలు= గోపస్త్రీలు; ఏ పనులకున్= ఏ పనులుచేయడానికి; చేతులు+ఆడకయున్= చేతులాడక పోవడమూ; గోవులకున్= ఆవులకు; క్రేపులన్= దూడలను; విడువకయున్= విడువకుండా; విడిచివిడిచి= వదిలి వదిలి; ఈడకయున్= పాలుపిదుక కుండడమూ; ఈడియాడియున్= పాలుపిదికి పిదికి కూడా; ఈడినపాలు= పిదికినపాలు; కాఁపకయున్= కాచకుండా ఉండడమూ; కాఁచి కాఁచియున్= పాలను కాచికాచికూడా; కాఁగినపాలు; డింపకయున్= పొయ్యి మీదినుండి దింపకుండడమూ; డించిడించియున్= పాలుపొయ్యి మీద నుండి దించి దించి కూడా; డించినపాలు= పొయ్యిమీద నుండి దించినపాలను; బాలురకున్= పసిపిల్లలకు; పోయకయున్= తాగడానికి పోయకుండడమూ; పోసి పోసియున్= పిల్లలకు పాలు పోసిపోసి కూడా; పతులకున్= భర్తలకు; పరిచర్యలు చేయకయున్= సేవలు చేయకపోవడమూ; చేసి చేసియున్= పరిచర్యలు చేసి చేసి కూడా; అశనంబులు కుడువకయున్= భోజనాలుచేయకపోవడమూ; కుడిచి కుడిచియున్= భోజనాలు చేసి చేసి కూడా; కుసుమంబులు ముడువకయున్= పూలు కొప్పుల్లో పెట్టుకోకపోవడమూ; ముడిచి ముడిచియున్= పూలు ముడిచి ముడిచికూడా; తొడవులు తొడుగకయున్= వస్త్రాలు ధరించక పోవడమూ; తొడిగి తొడిగియున్= వస్త్రాలు ధరించి ధరించి కూడా; కోష్ఠంబులపట్టులన్= లోపలి ఇండ్లలో; ఉండకయున్= ఉండకపోవడమూ; పాయసంబులు= పరమాన్నాలను; నెఱయ వండకయున్= బాగా వండకపోవడమూ; ఆ+ఆ+ఎడలన్= అక్కడక్కడా; నిలువన్+పడకయున్= నిలబడి ఉండకపోవవడమూ; కాటుకలు; సూటిన్+ఇడకయున్= సరిగా పెట్టుకోకపోవడమూ; కురులు= శిరోజాలు; చక్కన్+ఒత్తకయున్= సరిగా అలంకరించుకోకపోవడమూ; కుచంబులన్= స్తనాలమీద; గంధంబులు= చందనాలు; కలయన్+మెత్తకయున్= సరిపాళ్ళలో పూసుకోకపోవడమూ; పయ్యెదలు= తమ చీర కొంగులు; విప్పి కప్పకయున్= జారినా కప్పుకోక పోవడమూ; సఖులకున్= చెలులకు; చెప్పకయున్= చెప్పక పోవడమూ; సహోదరులు= అన్నదమ్ములు; మగలు= భర్తలు; మామలు, మఱందులు, బిడ్డలున్; అడ్డంబు చని= అడ్డంగా వెళ్ళి; నివారింపన్= అడ్డుకోగా; తలారింపకయున్= భయపడకుండా; సంచలించి= మిక్కిలిగా కదిలిపోతూ; పంచభల్లుని భల్లంబుల= పంచబాణుడైన మన్మథుని బాణాలయొక్క; మొల్లంపు జల్లులపెల్లునన్= దట్టమైన ధారల అతిశయంతో; తల్లడిల్లి; డిల్లపడి= దీనలై; మొగిళ్ళగమిన్= మేఘాలసమూహంనుండి; వెలువడి= బయటపడి; ఉల్లసిల్లు= విలసిల్లే; తటిల్లతల పొందునన్= మెరపుతీగల విభవంతో; మందగమనలు= అలసత్వంగానడిచే యువతులు; అమందగమనంబులన్= వడివడినడకలతో; మంద= గోవులమందనుండి; వెలువడి= బయటపడి; గోవింద సందర్శనంబునకున్= శ్రీకృష్ణుని దర్శనంకోసం; చనిరి= వెళ్ళారు; అప్పుడు...

**తా :** ఈ విధంగా ఉదయించి కొత్త కుంకుమతో అలదిన శ్రీలక్ష్మీముఖమండలంలాగా పరిపూర్ణమైన చంద్రమండలాన్ని గోపికలు దర్శించారు. కమలనేత్రుడైన శ్రీకృష్ణుడు యమునాతీరవనంలో లోకసమ్మోహనంగా ఒక పాట పాడాడు. ఆ గానం విన్న గోపికలు తదేక మనస్కలయ్యారు. తత్తరపడుతున్న గోపికలకు పనులు చేయడానికి చేతులాడ లేదు. గోవులవద్దకు దూడలను విడువలేదు. విడిచినా పాలుపిదుకలేదు. పాలుపిదికినా కాచలేదు. కాచినా కాగినపాలు దించలేదు. దించినా పాలు పిల్లలకు పోయ లేదు. పోసినా భర్తలకు సపర్యలు చేయ లేదు. చేసినా భోజనాలు చేయ లేదు. చేసినా పూలు కొప్పుల్లో ముడువలేదు. ముడిచినా వస్త్రాలు ఆభరణాలు ధరించ లేదు. ధరించినా, ఇండ్లలో నిలువ లేదు. నిలిచినా పాయసాలు వండ లేదు. ఉన్నచోట ఉండడం లేదు. కాటుకలు సరిగా పెట్టుకోలేదు. కురులు చక్కగా దువ్వుకోలేదు. స్తనాలమీద గంధాలు పూసుకోలేదు. జారినపయ్యెదలు కప్పుకోలేదు. చెలులకు చెప్పలేదు. అన్నదమ్ములు, భర్తలు, మామలు, మరదులు, బిడ్డలు అడ్డంవచ్చి అడ్డుకొంటున్నా లెక్కచేయకుండా చలించి పోతూ మన్మథుని పూలబాణాలజల్లుకు తల్లడిల్లారు.

దీనులయ్యారు. మేఘాలవరుసనుండి వెలువడి ఉల్లసిల్లే మెరుపుతీగలలాగా మందగమనలైన గోపికలు వడివడి నడకలతో మందనుండి బయటపడి శ్రీకృష్ణ సందర్శనానికి వెళ్ళారు. అప్పుడు

**మ. తరుణుల్ గొందఱు మూలగేహముల నుద్దండించి రారాక త**
**ద్విరహాగ్నిం బరితాప మొందుచు మనోవీథిన్ విభున్ మాధవుం**
**బరిరంభంబులు సేసి జారుఁ డనుచున్ భావించియుం జొక్కి పొం**
**దిరి ముక్తిన్ గుణదేహముల్ విడిచి ప్రీతిన్ బంధనిర్ముక్తలై. 968**

**ప్రతి :** కొందఱు; తరుణుల్= యువతులు; మూలగేహములన్= లోపలి ఇండ్లనుండి; ఉద్దండించి= తమవారి ఆజ్ఞను ఉల్లంఘించి; రారాక= వెళ్ళలేక; తద్+విరహ+అగ్నిన్= ఆ కృష్ణుని ఎడబాటు అనే అగ్నితో; పరితాపము+ఒందుచున్= వేదన పొందుతూ; మనస్+వీథిన్= తమ తమ మనస్సుల్లో; విభున్= తమను ఏలినవాడైన; మాధవున్= శ్రీకృష్ణుణ్ణి; పరిరంభంబులు+చేసి= కౌగిళ్లలో బిగించి; జారుఁడు+అనుచున్= పరస్త్రీ సంగమం చేసేవాడని; భావించియున్= తలచి కూడా; చొక్కి= పరవశించి; గుణదేహముల్= త్రిగుణ సంబంధి అయిన శరీరాలను; విడిచి; ప్రీతిన్= ప్రేమతో; బంధనిర్ముక్తలు+ఐ= సంసారబంధాల నుండి విముక్తలై; ముక్తిన్= మోక్షాన్ని; పొందిరి= పొందారు.

**తా :** కొందరు గోపికలు తమ ఇంటివారినిర్బంధంవల్ల ఇండ్లు విడిచి బయటకు రాలేక శ్రీకృష్ణుని విరహంవల్ల తపిస్తూ, మనస్సులలోనే జారుడని భావిస్తూ కూడా శ్రీకృష్ణుణ్ణి తమకౌగిళ్ళలో నింపుకున్నారు. పరవశించి, బంధవిమోచనలై త్రిగుణాత్మకాలైన దేహాలు విడిచి ముక్తి పొందారు.

**విశే :** గోపికల భౌతికదేహాలు అలాగే ఉన్నా వారి గుణాధారదేహాలు విడిచిపెట్టినందువల్ల భర్త, బిడ్డలు మొదలైనవారి సంబంధాలు వదిలి ముక్తలయ్యారు అని భావం.

**వ. అనిన నరేంద్రుం డిట్లనియె. 969**

**ప్రతి :** అనినన్= అనగా; నర+ఇంద్రుండు= రాజశ్రేష్ఠుడైన పరీక్షిన్మహారాజు; ఇట్లు= ఇలా; అనియెన్= అన్నాడు.

**తా :** ఇలా శుకుడు చెప్పగా పరీక్షిన్మహారాజు ఇలా అన్నాడు.

**క. జారుఁ డని కాని కృష్ణుఁడు, భూరిపరబ్రహ్మ మనియు బుద్ధిఁ దలంపన్**
**నేరరు; గుణమయదేహము, లే రీతిన్ విడిచి రింతు? లెఱిఁగింపు శుకా! 970**

**ప్రతి :** శుకా!= ఓ శుకమహర్షీ!; ఇంతులు= గోపస్త్రీలు; జారుఁడు= పరస్త్రీలోలుడు; అని; కాని; కృష్ణుఁడు; భూరిపరబ్రహ్మము= మహనీయుడైన పరబ్రహ్మం; అనియున్= అనికానీ; బుద్ధిన్= మనస్సులో; తలంపరు= భావించరు; గుణమయ దేహములు= సత్త్వరజస్తమోమయాలైన శరీరాలను; ఏ రీతిన్= ఏ విధంగా; విడిచిరి= వదలిపెట్టారు; ఎఱిఁగింపు(ము)= తెలపండి.

**తా :** ఆ మాటవిని పరీక్షిన్మహారాజు ఇలా అన్నాడు. ఓ శుకమహర్షీ! ఆ గోపస్త్రీలు కృష్ణుణ్ణి కేవలం తమ జారునిగా భావించారే కానీ, మహిమాన్వితుడైన పరబ్రహ్మం అని భావించలేదు కదా! అలాంటి గోపికలు త్రిగుణమయమైన శరీరాలను ఎలా వదిలి ముక్తిపొందారో తెలపండి.

**వ. అనిన శుకుం డిట్లనియె. 971**

**ప్రతి :** అనినన్= అనగా; శుకుందు; ఇట్లు= ఇలా; అనియెన్= అన్నాడు.

**తా :** ఇలా పరీక్షిత్తు అడుగగా శుకుడు ఇలా అన్నాడు.

**మ. 'మును నేఁ జెప్పితిఁ జక్రికిం బగతుఁడై మూఢుండు చైద్యుండు పెం**
**పునఁ గైవల్యపదంబు నొందెఁ; బ్రియులై పొందంగ రాకున్నదే?**
**యనఘుం డవ్యయుఁ డప్రమేయుఁ డగుణుండై నట్టి గోవిందుమూ**
**ర్తి నరశ్రేణికి ముక్తిదాయిని సుమీ! తెల్లంబు భూవల్లభా! 972**

**ప్రతి :** భూవల్లభా= రాజా!; నేన్= నేను; మును= ఇంతకుముందు; చెప్పితిన్= చెప్పానుగదా!; చక్రికిన్= శ్రీహరికి; పగతుఁడు+ఐ= శత్రువై; మూఢుండు= మూర్ఖుడైన; చైద్యుండు= చేదిదేశపురాజైన శిశుపాలుదు; పెంపునన్= అతిశయంగా; కైవల్యపదంబున్= ముక్తిపదవిని; ఒందెన్= పొందాడు; ప్రియులు+ఐ= ప్రేయసులై; పొందన్+కన్= (ముక్తి) పొందడానికి; రాకున్నది+ఏ= వీలుపడదా?; అనఘుండు= పాపరహితుడు; అవ్యయుఁడు= తరగని శక్తిగలవాడు; అప్రమేయుఁడు= వాక్కుకు మనస్సుకు గోచరం కానివాడు; అగుణుండు= గుణాతీతుడు; ఐనట్టి; గోవిందుమూర్తి= శ్రీకృష్ణుని స్వరూపం; నరశ్రేణికిన్= జనసమూహానికి; ముక్తిప్రదాయిని= మోక్షదాయిని; సుమీ= కదా!; తెల్లంబు= ఇది సత్యం.

**తా :** రాజశ్రేష్ఠా! ఇంతకుముందే నేను నీకు చెప్పి ఉన్నాను – విష్ణువుకు విరోధి, మూర్ఖుడు అయిన శిశుపాలుడే ముక్తిపదవిని పొందగలిగాడని. మరి నారాయణునికి ప్రేయసులైనవారు పొందరాని పదవి ఏదైనా ఉందా? పాపరహితుడు, తరగని శక్తిగలవాడు, వాక్కుకు మనస్సుకు గోచరించనివాడు, త్రిగుణాతీతుడు అయిన శ్రీకృష్ణుని స్వరూపం భక్తజనానికి ముక్తిదాయిని అనడంలో సందేహం లేదు. ఇది సత్యం.

**విశే :** ఎవరివద్దనైనా విరోధంతో పొందగలిగిన దానికంటే, ప్రేమతో అధికంగా సంపాదించుకోగలగడం లోకసహజం. ఆ లోకసహజమైన అంశాన్ని శ్రీకృష్ణునికి ఆపాదించి, హరికి సంబంధించిన నిత్యసత్యాన్ని కవి ఆవిష్కరించాడు. చక్రికి పగవాడై ముక్తిపొందినవాడు శిశుపాలుడు. ప్రేమతో ముక్తి పొందినవారు గోపికలు.

**ఆ. బాంధవమున నైనఁ బగనైన వగనైనఁ, బ్రీతినైనఁ బ్రాణభీతినైన**
**భక్తినైన హరికిఁ బరతంత్రులై యుండు, జనులు మోక్షమునకుఁ జనుదు రధిప! 973**

**ప్రతి :** అధిపా= రాజా!; బాంధవమునన్= బంధుత్వంతో; ఐనన్= ఐనా; పగన్= విరోధంతో; ఐనన్= ఐనా; వగన్ ఐనన్= చింతతోనైనా; ప్రీతిన్ ఐనన్= ప్రేమతోనైనా; ప్రాణభీతిన్ ఐన= ప్రాణభయంతోనైనా; భక్తిన్+ఐన్= భక్తితోనైనా; హరికిన్= శ్రీమహావిష్ణువుకు; పరతంత్రులు+ఐ+ఉండు జనులు= ఎప్పుడూ తలంచేవారైన మనుషులు; మోక్షమునకున్+చనుదురు= ముక్తి పొందుతారు.

**తా :** బంధుత్వంతోనైనా, విరోధంతోనైనా, ప్రేమతోనైనా, చింతతోనైనా, ప్రాణభయంతోనైనా భక్తితోనైనా హరిధ్యానపరతంత్రులై ఉండే జనులు ముక్తిని పొందుతారు.

**వ. అటు గావునఁ బరమపురుషుండును, నజుండును, యోగీశ్వరేశ్వరుండును నైన హరిని సోఁకిన స్థావరం బయిన ముక్తం బగు; వెఱఁగుపడ వలవ, దివ్విధంబున. 974**

**ప్రతి :** అటు+కావునన్= అలాకాబట్టి; పరమపురుషుండునున్= పురుషోత్తముడు; అజుండును= పుట్టుకలేనివాడు; యోగి+ఈశ్వర+ఈశ్వరుండునున్= యోగిశ్రేష్ఠులలో శ్రేష్ఠుడు; ఐన; హరిని; సోఁకిన= తాకిన; స్థావరంబు+అయినన్= కదలికలేని చెట్లు కొండలలాంటివైనా; ముక్తంబు+అగున్= ముక్తిని పొందుతాయి; వెఱఁగు పడన్+వలవదు= ఆశ్చర్యపడవలసినపని లేదు; ఈ+విధంబునన్= ఈ విధంగా...

**తా :** కాబట్టి, పురుషోత్తముడు, పుట్టుకలేనివాడు, యోగీశ్వరేశ్వరుడు అయిన శ్రీహరిని స్పృశించినంతమాత్రాన అచేతనాలైన కొండలు, చెట్లు వంటివికూడా ముక్తిని పొందగలవు. ఈ విధంగా

**క. ఘనమధురగీతనినదము, విని వచ్చిన గోపికలను వీక్షించి నయం**
**బున మేటి సుగుణి నేర్పరి, తన వాగ్వైభవము మెఱయఁ దగ నిట్లనియెన్. 975**

**ప్రతి :** మేటి= అధికుడు; సుగుణి= సుగుణవంతుడు; నేర్పరి= చతురుడు (అయిన శ్రీకృష్ణుడు); ఘనమధురగీతనినదము= మహిమగలిగిన తన తీయని గీతధ్వని; విని; వచ్చిన గోపికలను= వచ్చినట్టి గోపస్త్రీలను; వీక్షించి= చూచి; తనవాక్+వైభవము= తన మాటల చతురత్వం; మెఱయన్= తేటపడగా; తగన్= ఒప్పిదంగా; ఇట్లు+అనియెన్= ఇలా పలికాడు.

**తా :** అధికుడూ శుభగుణాలు కలవాడూ, చతురుడూ అయిన శ్రీకృష్ణుడు మహిమగలిగిన తన తీయని పాట శబ్దం విని వచ్చిన గోపస్త్రీలను చూచి, తన మాటల నేర్పు తేటపడగా ఇలా పలికాడు.

**శా. మేలా మీకు? భయంబు పుట్టదు గదా మీమందకున్? సింహ శా**
**ర్దూలానేకపముఖ్యముల్ దిరిగెడిన్ దూరంబు లేతెంతురే?**
**యేలా వచ్చితి రీ నిశాసమయమం? దిచ్చోట వర్తింతురే?**
**చాలుంజాలు లతాంగులార! చనుఁడీ సంప్రీతితో మందకున్. 976**

**ప్రతి :** లతా+అంగులు+ఆర= తీవెలవంటి కోమలదేహులారా!; మీకు; మేలు+ఆ= కుశలమా?; మీమందకున్= మీ గోకులానికి; భయంబు పుట్టదుగదా= భయం లేదు గదా! సింహశార్దూల+అనేకప ముఖ్యముల్= సింహాలూ, పులులూ, ఏనుగులో మున్నగు క్రూరమృగాలు; తిరిగెడిన్= తిరుగుతూ ఉంటాయి; దూరంబులు= దూరప్రయాణాలు; ఏతెంతురు+ఏ (ఏతెంచుదురు)= రావచ్చునా?; ఈ నిశాసమయము+అందున్= ఈ రాత్రివేళలో; ఏలా= ఎందుకు; వచ్చితిరి= వచ్చారు; ఈ+చోటన్= ఈ ప్రదేశంలో; వర్తింతురు (వర్తించుదురు)+ఏ= తిరగవచ్చునా?; చాలున్+చాలు= చాలుచాలు; మందకున్= మీ గోకులానికి; సంప్రీతితోన్= సంతృప్తితో; చనుఁడు+ఈ= వెళ్లండి.

**తా :** ఓ లతాంగులారా! మీకు కుశలమా? మీ మందకు భయం లేదుగదా! సింహాలు, పులులు, ఏనుగుమున్నగు క్రూరజంతువులు తిరుగుతూ ఉంటాయి. దూరప్రయాణాలు మీరు రావచ్చునా? ఇక్కడ తిరగవచ్చునా? చాలుచాలు! మీ గోకులానికి సంతృప్తితో మరలి వెళ్లండి.

**విశే :** అతిథులు వస్తూనే 'క్షేమం' అడగడం మనసంప్రదాయం. ఆ సంప్రదాయాన్నే కృష్ణుని నోటివెంట పలికించడంవల్ల అందరూ అలాంటి మర్యాదను పాటించాలి అని ధ్వని.

**శా. మీ రేతెంచిన జాడఁ గానక వగన్ మీతల్లులుం దండ్రులున్**
**మీ రాముల్ మఱఁదుల్ తనూజులు గురుల్ మీ సోదరుల్ బంధువుల్**

**'మేరల్ మీఱిరి లేరు పోయి' రనుచున్ మీ ఘోషభూభాగమం**
**దేరీతిం బరికించిరో  తగవులే యీ సాహసోద్యోగముల్? 977**

**ప్రతి :** మీరు+ఏతెంచిన జాడన్= మీరు వచ్చినజాడను; కానక= తెలియక; వగన్= విచారంతో; మీతల్లులున్; తండ్రులున్; మీ రాముల్= మీ భర్తలు; మఱందుల్= మరదులు; తనూజులు= కొడుకులు; గురుల్= పెద్దలు; మీ సోదరుల్; బంధువుల్; మేరల్ మీఱిరి= హద్దులుదాటి ప్రవర్తించారు; లేరు; పోయిరి= వెళ్లిపోయారు; అనుచున్= అని భావిస్తూ; మీ ఘోషభూభాగము+అందున్= మీ గోకులంలో; ఏరీతిన్= ఏ విధంగా; పరికించిరి+ఓ= వెదకుతున్నారో; ఈ సాహస+ ఉద్యోగముల్= ఈ తెగువతో కూడిన పనులు; తగవులు+ఏ= తగినవేనా?

**తా :** మీరు వెళ్లినజాడ తెలియక విచారంతో మీ తల్లిదండ్రులూ, భర్తలూ, మరదులూ, కొడుకులూ, కులపెద్దలూ, తోబుట్టువులూ, బంధువులూ మీరు హద్దుమీరి ప్రవర్తించి వెళ్లిపోయారని వ్రేపల్లెలో ఎక్కడెక్కడ వెదకుతున్నారో? ఏమోగదా! ఇలాంటి సాహసప్రయత్నాలు మీకు తగినవికావు.

**చ. ఇలువడి సున్నసేసి హృదయేశుల సిగ్గులు వుచ్చి యత్త మా**
**మల నెరియించి సోదరుల మానము సూఱలు వుచ్చి తల్లి దం**
**డ్రుల రుచి మాన్చి బంధులకు రోఁత యొనర్చుచు జారవాంఛలన్**
**వలనఱి సత్కులాంగనలు వత్తురె? లోకులు సూచి మెత్తురే? 978**

**ప్రతి :** ఇలువడి= కుటుంబమర్యాదను; సున్న+చేసి= బూడిద(శూన్యం) లో కలిపి; హృదయ+ఈశుల= భర్తల; సిగ్గులు+ పుచ్చి= మర్యాదలు పోగొట్టి; అత్తమామలన్; ఎరియించి= బాధపెట్టి; సోదరుల మానము= తోబుట్టువుల గౌరవం; చూఱలు+పుచ్చి= పోయేటట్లుచేసి; తల్లి+తండ్రులరుచి= తల్లిదండ్రుల కోరిక; మాన్చి= తీరకుండాచేసి; బంధులకున్= చుట్టాలకు; రోఁత+ఒనర్చి= అసహ్యం పుట్టించి; జారవాంఛలన్= మారుమగలమీది కోర్కెలతో; వలను+అఱి= హద్దుమీరి; సత్+కుల+అంగనలు= ఉత్తమకులంలో పుట్టినస్త్రీలు; వత్తురు(వచ్చుదురు)+ఎ= వస్తారా, రావచ్చా?; లోకులు; చూచి; మెత్తురు (మెచ్చుదురు)+ఏ= ప్రశంసిస్తారా?

**తా :** కుటుంబమర్యాదను బూడిదలో కలిపి, భర్తలను సిగ్గుపడేటట్లు చేసి, అత్తమామలను పరితాపానికి గురిచేసి, సోదరుల మర్యాదను పోగొట్టి, తల్లిదండ్రుల ఆశలు అడియాసలు చేసి, చుట్టాలకు అసహ్యం కలిగిస్తూ, సత్కులంలో జన్మించిన స్త్రీలు మారుమగలమీది కోర్కెలతో హద్దుమీరి రావచ్చా? అలావస్తే లోకులు ఆ ప్రవర్తనను చూచి, మెచ్చుకుంటారా?

**సీ. ప్రాణేశుఁ డెఱిఁగిన బ్రాణంబునకుఁ దెగు దండించు నెఱిఁగిన ధరణివిభుఁడు**
**మామ యెఱింగిన మనువెల్లఁ జెడిపోవుఁ దలవరి యెఱిఁగినఁ దగులు సేయుఁ**
**దలిదండ్రు లెఱిఁగిన దల లెత్తకుండుదు రేరా లెఱింగిన నెత్తిపొడుచు**
**నాత్మజు లెఱిఁగిన నాదరింపరు చూచి బంధువు లెఱిఁగిన బహి యొనర్తు**

**ఆ. రితరు లెఱిఁగిరేని నెంతయుఁ జుల్కగాఁ, జూతు; రిందు నందు సుఖము లేదు;**
**యశము లేదు నిర్భయానందమును లేదు, జారుఁ జేరఁ జనదు చారుముఖికి. 979**

**ప్రతి :** ప్రాణ+ఈశుఁడు= భర్త; ఎఱింగినన్= తెలుసుకుంటే; ప్రాణంబునకున్+తెగు= ప్రాణం తీసేందుకు తెగిస్తాడు; ధరణివిభుఁడు= రాజు; ఎఱిఁగినన్= తెలుసుకొంటే; దండించును= శిక్షిస్తాడు; మామ= భర్తతండ్రి; ఎఱింగినన్= తెలుసుకొంటే; మనువు+ఎల్లన్= వర్తనమంతా; చెడిపోవున్= పాడైపోతుంది; తలవరి= రక్షకభటుడు; ఎఱిఁగినన్= తెలుసుకొంటే; తగులు+చేయున్= నిర్బంధంలో పెడతాడు; తలిదండ్రులు; (తల్లి+తండ్రి) ఎఱిఁగినన్= తెలుసుకొంటే; తలలు+ఎత్తక+ఉండుదురు= సిగ్గుతో తలలెత్తుకోలేక పోతారు; ఏరాలు= తోడికోడలు; ఎఱింగినన్= తెలుసుకొంటే; ఎత్తిపొడుచును= హేళనచేస్తుంది; ఆత్మజులు= కొడుకులు; ఎఱిఁగినన్= తెలుసుకొంటే; ఆదరింపరు= గౌరవించరు; చూచి; బంధువులు; ఎఱిఁగినన్= తెలుసుకొంటే; బహిఃకరింతురు= వెలివేస్తారు; ఇతరులు= ఇరుగుపొరుగువారు; ఎఱిఁగిరి+ఏనిన్= తెలుసుకొంటే; ఎంతయున్= ఎంతో; చుల్కగాన్= తేలికగా; చూతురు; ఇందున్+అందున్= ఇహంలో గానీ, పరంలోగానీ; సుఖము= ఆనందం; లేదు; యశము= కీర్తి; లేదు; నిర్భయ+ఆనందమును= భయంలేని సంతోషమూ; లేదు; చారుముఖికిన్= స్త్రీకి, (అందమైన ముఖంగలది); జారున్= విటుణ్ణి; చేరన్+జనదు= చేరడానికి వెళ్లడం సరికాదు

**తా :** సాధ్వి అయిన స్త్రీకి జారునితోడి సంగమం కోరదగిందికాదు. ఎందుకంటే భర్తకు తెలిస్తే ప్రాణంతీసేందుకు తెగిస్తాడు. రాజుకు తెలిస్తే దండిస్తాడు. మామకు తెలిస్తే కాపురం చెడుతుంది. తలారికి తెలిస్తే నిర్బంధిస్తాడు. తలిదండ్రులకు తెలిస్తే సంఘంలో తలెత్తుకోలేరు. తోడికోడలుకు తెలిస్తే ఎత్తిపొడుస్తుంది. కొడుకులకు తెలిస్తే అసహ్యించుకొంటారు. బంధువులకు తెలిస్తే వెలివేస్తారు. ఇరుగు పొరుగువారికి, ఇతరజనులకు తెలిస్తే చులకనగా చూస్తారు. జారిణి అయిన స్త్రీకి ఇటు ఇహంలోకాని, అటు పరంలోకాని సుఖం లేదు. కీర్తి లేదు. ఆనందమూ లేదు. అందువల్ల సాధ్వి అయినస్త్రీ విటుణ్ణి చేరడానికి వెళ్ళడం సరికాదు.

**క. నడవడి గొఱ గాకున్నను, బడుగైనఁ గురూపియైనఁ బామరుఁ డైనన్**
**జడుఁడైన రోగి యైనను, విడుచుట మరియాద గాదు విభు నంగనకున్. 980**

**ప్రతి :** నడవడి= ప్రవర్తన; కొఱ+కాక+ఉన్నను= సరిగాలేకున్నా; బడుగు+ఐనన్= అశక్తుడైనా; కురూపి+ఐనన్= అందంలేనివాడైనా; పామరుఁడు+ఐనన్= అజ్ఞాని అయినా; జడుఁడు+ఐనన్= మందబుద్ధి అయినా; రోగి; ఐనను= ఐనా; విభున్= భర్తను; విడుచుట; అంగనకున్= సాధ్వికి; మరియాద= గౌరవం; కాదు.

**తా :** తన భర్తయొక్క ప్రవర్తన బాగాలేకున్నా, అతడు శక్తిహీనుడైనా, అందంలేనివాడైనా, మందబుద్ధి అయినా, రోగి అయినా, అతణ్ణి వదిలివేయడం సాధ్వికి మర్యాద కాదు.

**చ. ఇది యమునానదీజలసమేధితపాదపపల్లవప్రసూ**
**న దళవిరాజితంబగు వనంబు; మనంబులు మేర దప్పెనో?**
**పొదఁ డటు నేడ్చు బిడ్డలకుఁ బోయుఁడు పాలు; విడుండు లేఁగలన్**
**మొదవులకున్; నిజేశ్వరుల ముద్దియలార! భజింపుఁ డొప్పుగన్. 981**

**ప్రతి :** ముద్దియలు+ఆర!= ఓ అమాయకపు గోపికలారా!; ఇది; యమునానదీజల= యమునానది నీళ్లచేత; సమేధిత= ప్రోది గావించబడిన; పాదపపల్లవ= చెట్ల చిగుళ్లతో; ప్రసూన= పూలతో; దళ= ఆకులతో; విరాజితంబు+అగు= విలసిల్లుతున్నట్టి; వనంబు= బృందావనం; మనంబులు= మీ మనస్సులు; మేర+తప్పెను+ఓ= హద్దులు అతిక్రమించాయేమో!; పొదఁడు=

పదండి; అటున్= ఆ గోకులంలో; ఏడ్చుబిడ్డలకున్= రోదించే శిశువులకు; పాలుపోయుఁడు= పాలు పోయండి; లేఁగలన్= ఆవుదూడలను; మొదవులకున్= గోవులవద్దకు; విడుండు= వదలండి; ఒప్పుగన్= ఒప్పిదంగా; నిజ+ఈశ్వరులన్= మీ మీ భర్తలను; భజింపుఁడు= సేవించండి.

**తా :** ఓ అమాయకపు గోపికలారా! ఇది యమునా నదీ జలాలతో ప్రోదిచేయబడిన చిగుళ్లు, పూలు, ఆకులతో విరాజిల్లే బృందావనం. మీ మనస్సులు హద్దుల్ని అతిక్రమించాయేమో! గోకులానికి మరలిపొండి. వెళ్లి ఏడుస్తున్న పిల్లలకు పాలు పోయండి. గోవులవద్ద పాలుతాగడానికి దూడలను విడవండి. ఒప్పిదం అయ్యేవిధంగా మీమీ భర్తలకు పరిచర్యలు చేయండి.

**చ. వనితలు నన్నుఁ గోరి యిట వచ్చితి, రింతఁ గొఱంత లేదు; మే**
**లొనరెె; సమస్తజంతువులు నోలిఁ బ్రియంబులు గావె నాకు; నై**
**నను నిలువంగఁ బోలదు, సనాతనధర్మము లాఁడువారికిం**
**బెనిమిటులన్ భజించుటలు; పెద్దలు సెప్పుచు నుందు రెల్లెడన్. 982**

**ప్రతి :** వనితలు= గోపకాంతలూ; నన్నున్= నన్ను; కోరి= ఇష్టపడి; ఇట= ఇక్కడికి; వచ్చితిరి= వచ్చారు; ఇంతన్= దీనితో; కొఱంతలేదు= కొరతలేదు; మేలు+ఒనరెన్= మీకు మేలు కలుగుతుంది; సమస్తజంతువులు= అన్నిప్రాణులు; నాకున్= నాకు; ఓలిన్= ఒప్పిదంగా; ప్రియంబులు+కావు+ఎ= ప్రియమైనవికావా?; ఐనను= అయినాకూడా; నిలువన్+కన్+పోలదు= ఇక్కడ ఉండడం భావ్యంకాదు; ఆడువారికిన్= స్త్రీలకు; పెనిమిటులన్= భర్తలను; భజించుటలు= సేవించడాలు; సనాతనధర్మములు= సంప్రదాయంగా వచ్చిన ధర్మాలు; (అని)ఎల్లన్+ఎడన్= అన్నిచోట్లా; పెద్దలు; చెప్పుచున్+ఉందురు= చెపుతూ ఉంటారు.

**తా :** ఓ కాంతలారా! నన్నుకోరి ఇక్కడికి వచ్చారు. మీకే కొరతా లేదు. శుభాలు కలుగుతాయి. సృష్టిలోని సమస్తప్రాణులు నాకు ప్రియమైనవే (అలాగే మీరుకూడా నాకు ప్రియమైనవారే) ఐనా, మీరు ఇక్కడ ఉండడం భావ్యం కాదు. స్త్రీలు భర్తలకు పరిచర్యలు చేయడమే ప్రాచీనకాలంనుండి విధించబడిన ధర్మం. ఆమాట పెద్దలు సర్వత్ర చెపుతూనే ఉంటారు.

**విశే :** నాకు సర్వప్రాణులూ ప్రియమైనవి అని చెప్పింది మహావిష్ణువే. బాలుడైన శ్రీకృష్ణుడు కాదు. సర్వప్రాణులలో గోపికలూ చేరతారు. వారికి సనాతనధర్మం గుర్తుచేయడం లోకకల్యాణంకోసమే.

**క. ధ్యానాకర్ణన దర్శన, గానంబుల నా తలంపు గలిగినఁ జాలుం**
**బూనెదరు కృతార్థత్వము, మానవతుల్! చనుఁడు మరలి మందిరములకున్. 983**

**ప్రతి :** ధ్యాన= ధ్యానించడం; ఆకర్ణన= వినడం; దర్శన= చూడడం; గానంబుల= పాటలుపాడడం; నాతలంపున్= నన్ను గురించిన ఆలోచన; కలిగినన్= కలిగితే; చాలున్= చాలు; కృత+అర్థత్వము= ధన్యత్వం; పూనెదరు= కలిగిన వారవుతారు; మానవతుల్= మానినులారా!; మరలి= తిరిగి; మందిరములకున్= మీ ఇండ్లకు; చనుఁడు= వెళ్లండి.

**తా :** మానవతులారా! నన్ను గూర్చి ధ్యానించడం, నన్నుగురించి వినడం, నన్ను దర్శించడం, నన్ను గురించి పాడడం (అనేవాటిద్వారా) నాపై మనసుపెడితే చాలు; మీరు ధన్యత్వం కలిగినవారవుతారు. మీ ఇండ్లకు మరలి వెళ్లండి.

**వ. అని పలికిన విని. 984**

**ప్రతి :** అని= ఈ విధంగా; పలికిన= శ్రీకృష్ణపరమాత్మ మార్గనిర్దేశనంచేస్తూ చెప్పగా; విని= గోపకాంతలు ఆలకించి...

**తా :** బృందావనంలో వేణుగానం చేస్తున్న శ్రీకృష్ణపరమాత్మ వద్దకు విచ్చేసిన గోపకాంతలకు సరైన మార్గనిర్దేశనం చేయగా వారు విని.

**సీ. 'విరహాగ్నిశిఖలతో వెడలు నిట్టూర్పుల ముమ్మరంబులఁ దాఁకి మోవు లెండఁ**
**గన్నుల వెడలెడి కజ్జలధారలు కుచకుంకుమంబుల గ్రొచ్చి పాఱఁ**
**జెక్కులఁ జేర్చిన చేతుల వేఁడిమి మోముఁదమ్ముల మేలి మురువు డిందఁ**
**బొరిఁ బొరిఁ బుంఖానుపుంఖంబులై తాఁకు మదనుకోలల ధైర్యమహిమ సెదర**

**తే. దుఃఖభరమున మాటలు దొట్రుపడఁగఁ, బ్రియము లాడని ప్రియుఁ జూచి బెగ్గడిల్లి**
**చరణముల నేల వ్రాయుచు సంభ్రమమునఁ, గాంత లెల్లను వగల నా క్రాంత లగుచు. 985**

**ప్రతి :** విరహ+అగ్నిశిఖలతోన్= విరహమనే మంటలతో; వెడలు= వెడలే; నిట్టూర్పుల ముమ్మరంబులన్= మిక్కుటమైన నిట్టూర్పులు; తాఁకి= సోకి; మోవులు+ఎండన్= పెదవులు ఎండిపోగా; కన్నుల= కన్నులలో; వెడలెడి కజ్జల ధారలు= స్రవించే కాటుక కలిసిన కన్నీరు; కుచకుంకుమంబులన్= స్తనాలమీద అలదుకొన్న కుంకుమ రేఖలను; క్రొచ్చి= చెదరిపోయేటట్లు; పాఱన్= స్రవించగా; చెక్కులన్= చెక్కిళ్లమీద; చేర్చిన= పెట్టుకొన్న; చేతుల; వేఁడిమి= కాక; మోము+తమ్ముల మురువు= తామరలవంటి వదనాల అందం; డిందన్= తగ్గి పోగా; పొరిన్+పొరిన్= మాటిమాటికి; పుంఖ+అనుపుంఖంబులు+ఐ= ఎడతెరిపిలేకుండా; తాఁకు= తాకుతున్న; మదనుకోలల= మన్మథునిబాణాలవల్ల; ధైర్యమహిమ= అతిశయమైన ధైర్యం; చెదరన్= చెదిరపోగా; దుఃఖభరమునన్= శోకభారంతో; మాటలు; తొట్రుపడన్+కన్= తడబడగా; ప్రియములు= ప్రియమైనమాటలు; ఆడని= పలుకని; ప్రియున్= ప్రియుణ్ణి; చూచి; బెగ్గడిల్లి= తల్లడిల్లి; చరణములన్= పాదాలతో; నేలవ్రాయుచున్= నేలమీదరాస్తూ; సంభ్రమమునన్= తొట్రుపాటుతో; కాంతలు+ఎల్లను= గోపికలందరు; వగలన్= విచారంతో; ఆక్రాంతలు+అగుచున్= ఆక్రమించబడినవారు అవుతూ...

**తా :** (అని శ్రీకృష్ణుడు చెప్పగావిని) విరహాగ్నిశిఖలతో కలిసి వెడలిన నిట్టూర్పులు సోకి వారిపెదవులు ఎండిపోయాయి. కన్నులనుంచి స్రవించే కాటుక కన్నీరు అలంకారంగా వారు స్తనాలమీద అలదుకొన్న కుంకుమ చెదరిపోయే విధంగా ప్రవహించింది. (విచారంతోవారు) చెక్కులమీద చేర్చిన చేతులవేడివల్ల వారివదనపద్మాలఅందం కందిపోయింది. ఎడతెరపిలేకుండా తాకుతున్న మన్మథబాణాలకు గోపికల ధైర్యం చెదరి పోయింది. మిక్కుటమైన శోకంవల్ల మాటలు తడబడ్డాయి. తమకు ప్రియమైన పలుకులు పలకని ప్రియుడైన శ్రీకృష్ణుణ్ణి చూచి వారు భయపడి, పాదాలతో నేలమీద రాస్తూ చింతలో మునిగిపోయారు.

**వ. ఇట్లనిరి. 986**

**తా :** ఇలా (గోపికలు) పలికారు.

**మ. 'అకటా! నమ్మితి మేము; క్రూరుఁడన ని న్నర్హంబె? మా యిండ్లలో**
**సకలవ్యాప్తుల డించి నీ పదసరోజాతంబు లర్చింపఁ జి**

**క్కక యేతెంచితి, మీశుఁ, డాఢ్యుఁడవు; మోక్షాసక్తులం గాచు పో**
**లికఁ గావందగుఁ గావవే? విడువ మేలే కాంతలన్ భ్రాంతలన్. 987**

**ప్రతి :** అకటా!= అయ్యో!; ఏము= మేము; నమ్మితిమి= నమ్మాము; నిన్నున్; క్రూరుఁడు+అనన్= బాధపెట్టేవాడనడం; అర్హంబు+ఎ= తగిందా?; మా+ఇండ్లలో= మాకుటుంబాలలో; సకలవ్యాప్తులన్= పనులన్నిటిని; డించి= వదిలివేసి; నీ పదసరోజాతంబులు= నీ పాదకమలాలు; అర్చింపన్= పూజించడానికి; చిక్కక= తప్పించుకొని; ఏతెంచితిమి= వచ్చాము; ఈశుఁడవు= పరమేశ్వరుడివి; ఆఢ్యుఁడవు= సకల సంపన్నుడివి; మోక్ష+ఆసక్తులన్= ముక్తిమీద ఆశతో వచ్చినవారిని; కాచుపోలికన్= రక్షించేవిధంగా; కావన్+తగున్= కాపాడడం అర్హమైంది; కావవు+ఏ= కాపాడు; భ్రాంతలన్= భ్రాంతిగొన్నవారైన; కాంతలన్= స్త్రీలను; విడువన్= వదిలివేయడం; మేలు+ఏ= మంచిదా?

**తా :** అయ్యో! శ్రీకృష్ణా! నిన్ను నమ్ముకొన్నాం. నిన్ను క్రూరుడనలేము. మా ఇండ్లలోని పనులన్నిటిని వదిలివేసి, పద్మాలవంటి నీ పాదాలు పూజించడానికి తప్పించుకొని వచ్చాము. నీవు పరమేశ్వరుడివి. సంపన్నుడివి. ముక్తిమీద ఆసక్తి కలవారిని కాపాడినట్లు మమ్ములను కూడా కాపాడు! భ్రమకు గురైన కాంతలను వదలడం నీకు తగదు.

**విశే :** గోపికల మాటల్లో మోక్షాసక్తి ధ్వనిస్తున్నది. శృంగారాసక్తికాదు.

**మ. పతులన్ బిడ్డల బంధులన్ సతులకుం బాటించుటే ధర్మ ప**
**ద్ధతి యౌ నంటివి; దేహధారిణులకున్ ధర్మజ్ఞ! చింతింపుమా;**
**పతిపుత్త్రాదికనామమూర్తి వగుచున్ భాసిల్లు నీయందుఁ ద**
**త్పతిపుత్త్రాదికవాంఛలన్ సలిపి సంభావించు టన్యాయమే? 988**

**ప్రతి :** పతులన్= భర్తలను; బిడ్డలన్= బిడ్డలను; బంధులన్= చుట్టాలను; పాటించుట+ఏ= అనువర్తించుటే; సతులకున్= పతివ్రతలకు; ధర్మపద్ధతి= ధర్మమార్గం; ఔను+అంటివి= అవుతుందని పలికావు; దేహధారిణులకున్= శరీరం ధరించిన స్త్రీలకు; ధర్మజ్ఞ= ధర్మం తెలిసినవాడా; చింతింపుమా= ఆలోచించు; పతిపుత్త్ర+ఆదిక= భర్త కొడుకులు మొదలైన; నామమూర్తివి+ అగుచున్= పేర్లతో కూడినవాడివవుతూ; భాసిల్లు= ప్రకాశించే; నీ+అందున్= నీలో; తత్+పతిపుత్త్ర+ఆదిక= ఆ భర్త, కొడుకు మొదలైన; వాంఛలన్= కోరికలను; సలిపి= నిలుపుకొని; సంభావించుట= మనసులో భావించడం; అన్యాయము+ఏ= న్యాయంకాదా? (న్యాయమే!)

**తా :** ధర్మజ్ఞుడవైన శ్రీకృష్ణా! భర్తలను, బిడ్డలను, బంధువులను అనువర్తించడమే సాధ్వీమణులకు ధర్మం అన్నావు. ధర్మవేత్తవైన నీవే ఆలోచించు. భర్త, పుత్రుడు మొదలైన బంధువులపేర్లు ధరించిన వాడివై ప్రకాశించే నీయందు దేహధారిణులైన స్త్రీలు పతిపుత్రాదులపట్ల తమకుగల కోరికలు తీర్చుకోవడం అన్యాయమంటావా?

**విశే :** శ్రీహరే అన్నిప్రాణులకు పతి, పుత్రుడు, గురుడు, బంధువు అయినప్పుడు తాము ఆయాసంబంధాలు ఆపాదించుకొని స్వామివారిని అనువర్తించడం అన్యాయం కాదని గోపభామినులు తమచర్యను సమర్థించుకొన్నారు.

**మత్తకోకిలము**

**నీపయిన్ రతి సేయుచుందురు నేర్పరుల్, సతతప్రియో**
**ద్దీపకుండవు; గాన నెవ్వగఁ దెచ్చు నాథసుతాదులం**

**జూప నేటికి? మన్మహాశలు సుట్టి నీకడ నుండఁగాఁ**
**బాప నేల? మదీయతాపముఁ బాపఁ బోలు కృపానిధీ!** **989**

**ప్రతి :** నేర్పరుల్= శాస్త్రనిపుణులైనవారు; నీపయిన్= (ఆత్మభూతుడైన) నీయందే; రతి+చేయుచున్+ఉందురు= ఆసక్తి చూపుతుంటారు; సతతప్రియ+ఉద్దీపకుండవు= ఎడతేగని ప్రేమను దీప్తంచేసేవాడివి; కానన్= కాబట్టి; నెవ్వగన్(నెఱ+వగన్)= పెద్ద దుఃఖాన్ని; తెచ్చు= తెచ్చే; నాథ సుత+ఆదులన్= భర్త, పిల్లలు మొదలైనవారిని; చూపన్= చూపడం; ఏటికి= ఎందుకు?; మత్+మహా+ఆశలు= మా గొప్పవైన ఆశలు; చుట్టి= అల్లుకొని; నీకడన్= నీ దగ్గర; ఉండన్+కాన్= ఉండగా; పాపన్+ఏల= తుంచడం ఎందుకు?; కృపానిధీ= ఓ దయానిధీ!; మదీయతాపమున్= మా పరితాపం; పాపన్+పోలు= పోగొట్టడంతగును.

**తా :** శాస్త్రనిపుణులైనవారు అంతర్యామివైన నీయందే ఆసక్తి కలిగి ఉంటారు. నీవు ఎడతెగని ప్రేమను కలిగించేవాడివి. కాబట్టి దుఃఖం కలిగించే భర్త పిల్లలు మొదలైన వారిని ఎందుకు మాకు చూపుతావు? మా మహనీయ జీవితాశలు నీచుట్టే అల్లుకొని ఉన్నాయి. వాటిని ఎందుకు తుంచివేస్తావు? మా పరితాపం పోగొట్టు స్వామీ!

**విశే :** ముగ్ధలైన గోపికలు భగవంతుని మీది ఆసక్తి బ్రహ్మానంద జనకమని తెలుసుకొన్నారు. ఎవరిద్వారా అంటే నేర్పరుల ద్వారా! అందువల్ల సుఖంతో పాటు దుఃఖాన్ని కూడా కలిగించే పతి పుత్రాదిక సంబంధం వ్యర్థం అంటున్నారు. వారి జీవితాశలు స్వామిచుట్టే అల్లుకొని ఉన్నాయి. తీగెను చెట్టునుండి విడదీస్తే తునిగి తీగే వాడిపోతుంది. అలాగే తమ జీవితాశలు అనే తీగెలు తెగిపోతే బతకలేము అన్నారు.

**సీ. నీ పాదకమలంబు నెమ్మి దగ్గఱఁ గాని తరలి పోవంగఁ బాదములు రావు**
**నీ కరాబ్జంబులు నెఱి నంటి తివఁ గాని తక్కిన పనికి హస్తములు సొరవు**
**నీ వాగమృతధార నిండఁ గ్రోలఁగఁ గాని చెవు లన్యభాషలు సేరి వినవు**
**నీ సుందరాకృతి నియతిఁ జూడఁగఁ గాని చూడ వన్యంబులఁ జూడ్కికవలు**

**ఆ. నిన్నె కాని పలుకనేరవు మా జిహ్వ, లొల్ల ననుచుఁ బలుకనోడ వీవు**
**మా మనంబు లెల్ల మరపించి దొంగిలి, తేమి సేయువార మింకఁ గృష్ణ!** **990**

**ప్రతి :** కృష్ణ= కృష్ణా!; నీపాదకమలంబు= నీ పాదపద్మాన్ని; నెమ్మిన్= ప్రీతితో; దగ్గఱన్= చేరడానికీ; కాని= తప్ప; తరలిపోవన్+కన్= తిరిగి వెళ్లడానికి; పాదములు రావు= కాళ్లాడడం లేదు; నీ కర+అబ్జంబులు= నీ హస్తకమలాలు; నెఱిన్= ప్రీతితో; అంటి తివన్= తాకి, పట్టుకోవడానికే; కాని= తప్ప; తక్కినపనికిన్= ఇతరకార్యాలకు; హస్తములు= మా చేతులు; చొరవు= రావడం లేదు; నీవాక్+అమృతధార= నీ పలుకులనే అమృతప్రవాహం; నిండన్= సంపూర్తిగా; క్రోలన్+కన్= ఆస్వాదించడానికే; కాని= తప్ప; చెవులు; అన్యభాషలు= ఇతరమైనమాటలు; చేరి; వినవు; నీ సుందర+ఆకృతి= నీ అందమైన రూపం; నియతిన్= పట్టుదలగా; చూడన్+కన్= చూడడానికే; కాని= తప్ప; అన్యంబులన్= ఇతరమైనవాటిల్ని; చూడ్కి కవలు= నేత్రద్వయం; చూడవు; నిన్ను+ఎ= నిన్నే; కాని= తప్ప; మాజిహ్వలు= మా నాలుకలు; పలుకనేరవు= వేరే ఉచ్చరించవు; ఒల్లను+అనుచున్= మిమ్ములను అంగీకరించను అంటూ; ఈవు= నీవు; పలుకన్+ఓడవు= చెప్పడానికి జంకడం లేదు; మామనంబులు= మామనసులను; మరపించి= మరిచేటట్లుచేసి; దొంగిలితివి= దొంగిలించావు; ఇంకన్= ఇంక; ఏమి చేయువారము= ఏమి చేయగలం?

**తా :** కృష్ణా! నీ పాదపద్మాలను ప్రీతితో చేరడానికి తప్ప తిరిగి వెళ్లడానికి మాకు కాళ్లు రావు. నీ కరకమలాలను స్పృశించడానికి తప్ప ఇతరపనులకు మాచేతులు పూనుకోవు. నీ మాటల అమృతప్రవాహాన్ని ఆస్వాదించడానికి తప్ప మా చెవులు ఇతరాలైన మాటలను వినవు. నీ అందమైన రూపాన్ని సంపూర్ణంగా చూడడానికే కాని మా కనులు ఇతరాలను చూడవు. మా నాలుకలు నిన్ను గురించి పలుకుతాయే కాని ఇతరాలైన మాటలు పలుకవు. నీవు 'మిమ్ములను ఒల్లను' అని పలకడానికి సందేహించడం లేదు. మా మనసులను మరిపించుకొని దొంగిలించావు. ఇప్పుడు ఏమి చేయగలం?

**విశే :** ప్రాణుల జ్ఞానేంద్రియాలు ఇహలోక సంబంధి పనులు మానివేసి, పరలోక సంబంధి పనులవైపు మళ్లితే ముక్తికి దగ్గరైనట్లే.

**చ. సిరికి నుదారచిహ్నములు సేయు భవచ్చరణారవిందముల్**
**సరసిజనేత్ర! మా తపముసంపదఁ జేరితి మెట్టకేలకున్**
**మరలఁగ లేము మా మగలమాటల నొల్లము; పద్మగంధముల్**
**మరఁగిన తేఁటు లన్యకుసుమంబులచెంతను జేరనేర్చునే? 991**

**ప్రతి :** సరసిజనేత్ర= పద్మనేత్రా!; సిరికిన్= శ్రీమహాలక్ష్మికి; ఉదారచిహ్నములు= పవిత్రాలైనగుర్తులు; చేయు= చేసేటివైన; భవత్+చరణ+అరవిందముల్= నీ పాదపద్మాలను; మాతపముసంపదన్= మా తపస్సు సిరితో; ఎట్టకేలకున్= చిట్టచివరికి; చేరితిమి= చేరగలిగాము; మరలఁగన్+లేము= మేము మరలిపోలేము; మా మగల మాటలన్= మా భర్తల మాటలను; ఒల్లము= ఇష్టపడము; పద్మగంధముల్= కమలసువాసనలు; మరఁగిన తేఁటులు= మరిగిన తుమ్మెదలు; అన్యకుసుమంబుల చెంతను= ఇతరపుష్పాలవద్దకు; చేరనేర్చునే= చేరడానికి ఇష్టపడతాయా?

**తా :** శ్రీమహాలక్ష్మి తన తొడలమీద స్వామివారి పాదాలుంచుకొని ఒత్తుతూ ఉంటుంది. స్వామివారి పాదపద్మాలు పవిత్రమైన గుర్తులను చేస్తూ ఉంటాయి. మా తపస్సంపదతో నీ వద్దకు ఎట్లో చేరగలిగాము. మేము నిన్ను వదలి మరలివెళ్లలేము. మా భర్తల మాటలను ఇష్టపడము. పద్మసువాసనలు మరిగిన తుమ్మెదలు ఇతరకుసుమాలవద్దకు వెళ్లడానికి ఇష్ట పడతాయా? (పడవు).

**విశే :** గోపికలు స్వామివారి చెంతకు చేరడంలో వారి 'తపము సంపద' కారణమని భావిస్తున్నారు. గోపికలు త్రేతాయుగంలో ఋషులు. శ్రీరాముని అందాన్ని వలచారు. శ్రీకృష్ణావతారంలో గోపికలుగా పుట్టి, మీ కోరికను తీర్చుకో వచ్చునన్నాడు - శ్రీరాముడు. అప్పటి ఆ ఋషుల తపస్సంపదే ఇప్పటి గోపికల తపోస్సంపదగా చెప్పబడింది.

**ఆ. సవతు లేక నీ విశాలవక్షస్థలిఁ, దులసితోడఁ గూడఁ దోయజాక్ష!**
**మనుపు మనుచు నెపుడు మాకాంత నీపాద, కమలరజముఁ గోరుఁ గాదె కృష్ణ! 992**

**ప్రతి :** కృష్ణ!= కృష్ణా!; సవతులేక= సాటిలేకుండా; నీ విశాలవక్షస్థలిన్= నీవెడల్పైనరొమ్ముపైన; తులసితోడన్= తులసితో సమేతంగా; కూడన్= కలసి ఉండడానికి; తోయజ+అక్ష= ఓ శ్రీహరీ; మనుపుము= మన్నించుము; అనుచున్= అంటూ; ఎపుడు= ఎల్లప్పుడూ; మాకాంత= లక్ష్మీదేవి; నీపాద కమలరజమున్= నీ పాదపద్మాలపుప్పొడిని; కోరున్+కాదె= కోరుతూ ఉంటుంది గదా!

**తా :** ఓ కృష్ణా! లక్ష్మీదేవి నీ విశాల వక్షస్థలంపైన, తులసీతో కలసి ఉండడానికి ఓ స్వామీ! నాకు అవకాశం ఇవ్వండి అని అభ్యర్థిస్తూ, నీ పాదకమలాల పుప్పొడిని కోరుకుంటూ ఉంటుంది గదా!

**విశే :** తులసి లక్ష్మీదేవి స్వరూపమే. సరస్వతీదేవి శాపంవల్ల లక్ష్మీదేవి తులసిగా మాధవీ ధర్మధ్వజులకు కుమార్తెగా జన్మిస్తుంది. శంఖచూడుని రూపంలో విష్ణువు ఈమెను వివాహమాడతాడు (బ్రహ్మవైవర్తపురాణం)

**ఉ. అత్తలు మామలున్ వగవ నాఱడి కోడక నాథులన్ శుగా**
**యత్తులఁ జేసి యిల్వరుస లాఱడి వోవఁగ నీదు నవ్వులన్**
**మెత్తని మాటలన్ మరుఁడు మేకొని యేఁచిన వచ్చినార; మే**
**పొత్తుల నొల్ల మో పురుషభూషణ! దాస్యము లిచ్చి కావవే! 993**

**ప్రతి :** ఓ పురుషభూషణ= ఓ పురుషులకు అలంకారమైనవాడా!; అత్తలు మామలున్= అత్తలూ మామలూ; వగవన్= చింతించగా; ఆఱడికిన్+ఓడక= నిందకు జంకక; నాథులన్= భర్తలను; శుక్+ఆయత్తులన్+చేసి= దుఃఖాలపాలుజేసి; ఇలు+వరుసలు= కుటుంబ మర్యాదలు; ఆఱడి+పోవన్+కన్= వృథాయైపోగా; నీదు నవ్వులన్= నీ నవ్వులకు; మెత్తనిమాటలన్= మృదువైన పలుకులకు ఇష్టపడి; మరుఁడు= మన్మథుడు; మేకొని= పట్టుదలతో; ఏఁచినన్= బాధించగా; వచ్చినారము= వచ్చాము; ఏ పొత్తులన్= ఇతరవిధాలైన సంబంధాలు ఏవీ; ఒల్లము= ఇష్టపడం; దాస్యములు+ఇచ్చి= పరిచర్యలు చేసే అవకాశం ఇచ్చి; కావవు+ఏ= రక్షించవా? (రక్షించుము)

**తా :** ఓ పురుషభూషణా! మా అత్తలూ, మామలూ చింతిస్తుండగా, నిందకు భయపడకుండా, మా భర్తలను దుఃఖాలపాలుచేసి, కుటుంబమర్యాదలు మంటగలిపి, నీ నవ్వులకు, మెత్తనిపలుకులుకు ఇష్టపడి, మన్మథుడు పట్టుదలతో బాధించగా మేము వచ్చాము. ఏ ఇతరసంబంధాలూ మాకు వద్దు. మీ పరిచర్యలు చేసే అవకాశం ఇచ్చి రక్షించుము.

**మ. మగువల్ సిక్కరె తొల్లివల్లభులకున్? మన్నించి తద్వల్లభుల్**
**మగపంతంబు దలంపరే? తగులముల్ మాపాలనే పుట్టెనే?**
**మగవా రాడెడు మాటలే తగవు నీ మాటల్ మనోజాగ్నిచేఁ**
**బొగులం జాలము; కౌఁగిలింపుము మముం; బుణ్యంబు పుణ్యాత్మకా! 994**

**ప్రతి :** పుణ్య+ఆత్మకా= పుణ్యాత్ముడా; మగువల్= స్త్రీలు; తొల్లి= పూర్వం; వల్లభులకున్= ప్రియులకు; చిక్కరు+ఎ= దొరకలేదా; తద్+వల్లభుల్= వారిప్రియులు; మన్నించి= ప్రేమతోచూచి; మగపంతంబు= పురుషధర్మం; తలంపరు+ఏ= భావించరా; తగులముల్= ప్రేమలు; మాపాలను+ఏ= మావద్దనే; పుట్టెను+ఏ= పుట్టాయా?; నీమాటల్= నీ పలుకులు; మగవారు; ఆడెదుమాటలు+ఏ= మాట్లాడే మాటలేనా; తగవు= (నీకు) సరిపోవు; మనోజ+అగ్నిచేన్= మన్మథాగ్నితో; పొగులన్+చాలము= పరితపించలేకున్నాము; మమున్= మమ్ములను; కౌఁగిలింపుము= ఆలింగనం చేసుకో; పుణ్యంబు= (నీకు) పుణ్యం కలుగుతుంది.

**తా :** పూర్వం స్త్రీలు భర్తల్ని ప్రేమించలేదా? భర్తలు వారిని ఆదరంతో తృప్తిపరచలేదా? అనురాగాలు మాకు మాత్రమే పుట్టినవా? నీ మాటలు మగవారికి తగినవేనా? (తగినవికావు) ఓ పుణ్యాత్మకా! మమ్మల్ని కౌగిలించు. నీకు పుణ్యం ఉంటుంది.

**ఉ. కుండలదీప్తగండమును గుంచితకుంతలఫాలమున్ సుధా**
**మండితపల్లవాధరము మంజులహాసవిలోకనంబునై**

**యుండెడు నీ ముఖంబుఁ గని యుండఁగ వచ్చునె? మన్మథేక్షు కో**
**దండ విముక్తబాణముల దాసుల మయ్యెద; మాదరింపవే.** **995**

**ప్రతి :** కుండలదీప్త గండమును= చెవులకు అలంకరించుకొన్న కుండలాలచేత ప్రకాశించే చెక్కిళ్లు; కుంచిత కుంతల ఫాలమున్= ముసురుకొన్న ముంగురులతో అందమైన నుదుటిప్రదేశమూ; సుధామండితపల్లవ+అధరము= అమృతం చిందించే చిగురువంటి పెదవీ; మంజులహాస విలోకనంబున్= మనోజ్ఞమైన చిరునవ్వుతో కలిసిన చూపులూ; ఐ+ఉండెడు= కలిగిఉన్న; నీ ముఖంబున్= నీ వదనాన్ని; కని= దర్శించి; ఉండన్+కన్+వచ్చును+ఎ= నిలువగలమా?; మన్మథ+ఇక్షుకోదండ= మన్మథుని చెరకువిల్లునుండి; విముక్త= వదలబడిన; బాణముల= బాణాలకు; దాసులము+అయ్యెదము= దాసులం అయ్యాము; ఆదరింపవు+ఏ= మమ్ములను రక్షించు.

**తా :** కృష్ణా! నీ చెక్కిళ్లు చెవికుండలాల ప్రకాశంతో ఒప్పారుతున్నాయి. నీ నుదురు ముసురుకొన్న ముంగురులతో అందంగా ఉంది. నీ చిగురుమోవి అమృతం చిందుతూ ఉంది. నీ చూపులు మనోజ్ఞమైన చిరునవ్వుతో సొంపారుతున్నాయి. ఇలాంటి నీ వదనం చూస్తూ - మేం నిలువగలమా? మన్మథుడు తన చెరకువింటినుండి వదిలిన బాణాలకు దాసులమైపోయాం. మమ్మల్ని రక్షించు.

**సీ. నీ యధరామృతనిర్ఝరంబుల నేఁడు సేరి వాతెఱలపైఁ జిలుకకున్న**
**నీ విశాలాంచితనిర్మలవక్షంబుఁ గుచకుట్మలంబులఁ గూర్పకున్న**
**నీ రమ్యతరహస్తనీరజాతంబులు చికురబంధంబులఁ జేర్పకున్న**
**నీ కృపాలోకననివహంబు మెల్లన నెమ్మొగంబుల మీఁద నెఱపకున్న**

**ఆ. నీ నవీనమాననీయసల్లాపంబు, కర్ణరంధ్రదిశలఁ గప్పకున్న**
**నెట్లు బ్రదుకువార? మెందుఁ జేరెదువార? మధిప! వినఁగఁ దగదె యాఁడుకుయులు.** **996**

**ప్రతి :** అధిప!= ఓ కృష్ణప్రభూ!; నేఁడు= ఈ దినం; నీ+అధర+అమృత నిర్ఝరంబులన్= నీ మోవిసుధా ప్రవాహాలను; చేరి= మా వద్దకు వచ్చి; వాతెఱలపైన్= మా అధరాలపైన; చిలుకక+ఉన్నన్= చిమ్మకపోతే; నీ విశాల+అంచిత= నీ విశాలమైన ఒప్పిదమైన; నిర్మలవక్షంబున్= విమలమైన ఎదను; కుచ కుట్మలంబులన్= మా మొగ్గలవంటి చనులపైన; కూర్పక+ఉన్నన్= ఉంచకపోతే; నీ రమ్యతర= నీ పరమసుందరమైన; హస్తనీరజాతంబులు= కరకమలాలను; చికురబంధబులన్= వెంట్రుకల ముడులపైన; చేర్పక+ఉన్నన్= ఉంచకపోతే; నీ కృప+ఆలోకననివహంబు= నీ దయార్ద్రమైనచూపులపరంపరను; మెల్లనన్= మెల్లగా; నెఱ+మొగంబులమీఁద= మా అందమైన ముఖాలమీద; నెఱపక+ఉన్నన్= ప్రసరింపజేయకపోతే; నీ నవీన మాననీయ సల్లాపంబు= నీ నవ్యమైన, ఆదరణీయమైన, మధురమైన పలుకులు; కర్ణరంధ్రదిశలన్= చెవుల మార్గాలను; కప్పక+ఉన్నన్= నింపకపోతే; ఎట్లు= ఎలా; బ్రదుకువారము= జీవించగలం; ఎందున్= ఎక్కడికి; చేరెదువారము= పోగలం; ఆఁడుకుయులు= స్త్రీల మొరలు; వినన్+కన్+తగదు+ఎ= విన కూడదా?

**తా :** ప్రభూ! మా చెంతకు చేరి నీ అధరామృతధారలను మా చిగురు పెదవులపైన చిలికించు. నీ విశాలమైన రమ్యతరమైన నిర్మలమైన ఎదను మా చను మొగ్గలపైన గదించు. నీ రమణీయ హస్తపద్మాలను మా కేశపాశంపైన చేర్చు. నీ దయార్ద్రమైన చూపులను మా నెమ్మొగాలమీద ప్రసరింపజేయి. నీ నవీనమైన, ఆదరణీయమైన సల్లాపంతో మా చెవులను కప్పివేయి. (అలా చేయకపోతే) మేం ఎలా జీవించగలం? ఎక్కడికి వెళ్లగలం? స్త్రీల మొరలు విన నర్హం కావా?

మ. భవదాలోకనహాసగీతజములై భాసిల్లు కామాగ్నులన్
భవదీయాధరపల్లవామృతముచేఁ బాపం దగుం, బాప వే
ని వియోగానలహేతిసంహతులచే నీఱై, భవచ్చింతలన్
భవదంఘ్రిద్వయవీథిఁ బొందెదము నీ పాదంబులానం బ్రియా! **997**

**ప్రతి :** ప్రియా!; భవత్+ఆలోకన= నీ చూపులచేత; హాస= నవ్వులచేత; గీతజములు+ఐ= పాటలచేత జనించి; భాసిల్లు= పెచ్చుపెరిగే; కామ+అగ్నులన్= కామాగ్ని కీలలను; భవదీయ+అధరపల్లవ+అమృతముచేన్= నీ చిగురుమోవినుండిస్రవించే అమృతధారలచేత; పాపన్+తగున్= చల్లార్చవచ్చు; పాపవు+ఏనిన్= అలా చల్లార్చకపోతే; వియోగ+అనలహేతిసంహతులచేన్= ఎడబాటు అగ్గి సెగలకు; నీఱై= బూడిదై; భవత్+చింతలన్= నీ స్మరణతోనే; భవత్+అంఘ్రిద్వయ వీథిన్= నీ పాదద్వంతట్టు; పొందెదము= చేరతాము; నీ పాదంబుల= నీ పాదాలపై; ఆన= ఒట్టు.

**తా :** ప్రాణేశ్వరా! నీ పాదాలమీద ఒట్టువేసి చెపుతున్నాము. నీ చూపులు, నీ నవ్వులు, నీ పాటలవల్ల పుట్టి పేట్రేగిన మన్మథాగ్నులను నీ చిగురుమోవినుండి స్రవించే అమృతధారలతో చల్లార్చు. అలా చల్లార్చకపోతే నీ ఎడబాటు మంటల్లో భస్మమైపోయి నిన్నే తలచుకుంటూ నీ పాదద్వయాన్నే చేరతాము.

క. తరుమృగఖగగోగణములు, కర మొప్పెడు నిన్నుఁ గన్న గానము విన్నం
గరఁగి పులకించు; నబలలు, గరఁగరె నినుఁ గన్న నీదు గానము విన్నన్? **998**

**ప్రతి :** తరు= చెట్లు; మృగ= జంతువులు; ఖగ= పక్షులు; గోగణములు= ఆవులమందలు; కరము+ఒప్పెడు= మిక్కిలిగా ప్రకాశించే; నిన్నున్= నిన్ను; కన్న= దర్శించినా; గానము విన్నన్= నీ పాట విన్నా; కరఁగి= ద్రవించి; పులకించున్= పరవశిస్తాయి; అబలలు= మాబోటి బలహీనులైన స్త్రీలు; నినున్= నిన్ను; కన్నన్= చూస్తే; నీదుగానము= నీపాట; విన్నన్= వింటే; కరఁగరు+ఎ= పరవశించిపోరా!

**తా :** మిక్కిలి ప్రకాశించే నిన్ను చూచినా, నీ సంగీతం విన్నా – చెట్లూ, మృగాలూ, పక్షులూ, ఆవుల గుంపులూ కరగి పులకించి పోతాయి. మరి అబలలు అయిన స్త్రీలు నిన్ను చూచి, నీ గానం విని ద్రవించిపోరా?

సీ. ఈ పంచబాణాగ్ని నేమిట నార్తుము నీ మంజువాగ్వృష్టి నెగడదేని
నీ మన్మథాంభోధి నే త్రోవఁ గడతుము నీ దృష్టి నావయై నిలువదేని
నీ చిత్తజధ్వాంత మే జాడఁ జెఱతుము నీ హాసచంద్రిక నిగుడదేని
నీ దర్పకజ్వర మే భంగి నడఁతుము నీ నవాధరసుధ నింపవేని

ఆ. నెట్లు నిర్వహింతు? మే లాగు మాలాగు;, కరుణ సేయ వేనిఁ గదియ వేని
మరుఁడు నిర్దయుండు మన నిచ్చునే? యశో, దా కుమార! యువతిధైర్యహార! **999**

**ప్రతి :** యశోదాకుమార!= యశోదపుత్రుడవైన ఓ కృష్ణా!; యువతిధైర్యహార= మానినుల ధైర్యాన్ని హరించేవాడా!; నీమంజువాక్+వృష్టి= నీ మధురమైన పలుకులజడివాన; నెగడదు+ఏనిన్= వ్యాపించకపోతే; ఈ పంచబాణ+అగ్నిన్= ఈ మన్మథాగ్నిని; ఏమిటన్= దేనితో; ఆర్తుము= చల్లార్చగలం?; నీ దృష్టి= నీ చూపులు; నావ+ఐ= పడవయై; నిలువదు+ఏనిన్=

లభించకపోతే; ఈ మన్మథ+అంభోధిన్= ఈ మన్మథసాగరాన్ని; ఏ త్రోవన్= ఏ విధంగా; కడతుము= దాటగలం?; నీ హాసచంద్రిక= నీ నవ్వువెన్నెల; నిగుడదు+ఏనిన్= ప్రసరించకపోతే; ఈ చిత్తజధ్వాంతము= ఈ మన్మథబాధ అనే చీకటిని; ఏ జాడన్= ఏ రకంగా; చెఱతుము= పోగొట్టుకోగలం?; నీ నవ+అధరసుధ= నీ నూతనమైన మోవిఅమృతం; నింపవు+ఏనిన్= నింపకపోతే; ఈ దర్పకజ్వరము= ఈ మదనజ్వరాన్ని; ఏభంగిన్= ఏ విధంగా; అడఁతుము= పోగొట్టుకోగలం?; ఎట్లు= ఎలా; నిర్వహింతుము= జీవించగలం?; మాలాగు= మాగతి; ఏలాగు= ఏమి గతి; కరుణ+చేయవు+ఏనిన్= దయచూపకపోతే; కదియవు+ఏనిన్= మమ్ములను హత్తుకోకపోతే; నిర్దయుండు= దయలేనివాడైన; మరుఁడు= మన్మథుడు; మనన్+ఇచ్చున్+ఏ= (మమ్ములను) బదుకనిస్తాడా?

**తా :** ఓ యశోదాకుమారా! మానినులధైర్యహారా! నీ మధురమైన మాటలు అనే జడివాన కురియకుంటే ఈ మన్మథాగ్నిని ఎలా చల్లార్చగలం? నీ చూపు అనే నావ లేకుంటే ఈ మన్మథసాగరాన్ని ఎలా దాటగలం? నీ చిరునవ్వు అనే వెన్నెల లేకుంటే ఈ కామాంధకారాన్ని ఎలా పారదోలగలం? నీ నవాధరామృతం చిలుకకుంటే ఈ మదనజ్వరాన్ని ఎలా పోగొట్టుకోగలం? నీవు కరుణించి కౌగిలించుకొనకుంటే మా బతుకు ఎలా సాగించగలం? మాగతి ఏమిటి? దయలేనివాడైన మన్మథుడు మమ్ములను బతకనిస్తాడా?

**ఆ. అమరులఁ గాచిన హరిక్రియఁ, గమలేక్షణ! నీవు నేఁడు కరుణ నభయ హ**
**స్తము మా యురముల శిరములఁ, బ్రమదంబున నిడుము మూర్ఛ పాల్పడకుండన్. 1000**

**ప్రతి :** కమల+ఈక్షణ= పద్మనేత్రా!; అమరులన్= దేవతలను; కాచిన= రక్షించిన; హరిక్రియన్= శ్రీ మహావిష్ణువువలె; నీవు; నేఁడు= ఇప్పుడు; కరుణన్= దయతో; అభయహస్తము= అభయం ఇచ్చే నీ చేతిని; మా+ఉరములన్= మా హృదయాలమీద; శిరములన్= మా తలల మీద; ప్రమదంబునన్= ప్రీతితో; మూర్ఛపాల్పడక+ఉండన్= మేము మూర్ఛపోకుండా ఉండడానికి; ఇడుము= ఉంచు.

**తా :** ఓ పద్మనేత్రా! దేవతలను శ్రీహరి రక్షించినట్లు - మేము మూర్ఛపోకుండా నీ అభయహస్తాన్ని మా హృదయాలమీదా, మాశిరస్సులమీదా ఉంచు.

**క. కట్టా! తలమునుకలునై, దట్టపు విరహాగ్నిశిఖలు తరుణుల నేఁచన్**
**నెట్టన్ బలుకవు చూడవు, కట్టిఁడివి గదా కుమార! కరుణోదారా! 1001**

**ప్రతి :** కుమార= నంద తనయుడవైన శ్రీకృష్ణా!; కరుణా+ఉదారా= దయానిధీ; దట్టము+విరహ+అగ్ని శిఖలు= సాంద్రమైన విరహాగ్నికీలలు; తలమునుకలున్+ఐ= శరీరాన్ని సంపూర్ణంగా ఆక్రమించినవై; తరుణులన్= మానినులను; ఏఁచన్= బాధించగా; ఎట్టన్= ఎలాగైనా; పలుకవు; చూడవు; కట్టిఁడివి= క్రూరుడివి; కదా!

**తా :** బాలకృష్ణా! దయానిధీ! తరుణులను దట్టమైన నీ విరహాగ్నికీలలు తలమునుకలుగా బాధించగా (దయతో) పలుకరించవు, చూడవు, నువ్వు ఎంత క్రూరుడివో గదా!

**వ. అని యిట్లు కుసుమశరునిశరపరంపరాపరవశలై యోపికలు లేక పలికిన గోపికల దీనాలాపంబులు విని, నవ్వి యోగీశ్వరుండయిన కృష్ణుం డాత్మారాముండై వారలతో రమించె నప్పుడు. 1002**

**ప్రతి :** అని; ఇట్లు= ఇలా; కుసుమశరుని= మన్మథునియొక్క; శరపరంపరా= బాణాలవరుసతో; పరవశలు+ఐ= సొమ్మసిల్లి; ఓపికలు లేక; పలికిన; గోపికలదీన+ఆలాపంబులు= గోపికల దీనమైన పలుకులు; విని; నవ్వి; యోగి+ఈశ్వరుండు+అయిన= యోగిశ్రేష్ఠుడయిన; కృష్ణుండు= శ్రీకృష్ణుడు; ఆత్మారాముండు+ఐ= ఆత్మారాముడై; వారలతో= గోపికలతో; రమించెను= రమించాడు; అప్పుడు. (ఆత్మారాముడు – మనస్సులందే ఉండి సంతోషపెట్టేవాడు)

**తా :** ఈ విధంగా పుష్పబాణుని బాణపరంపరలకు సొమ్మసిల్లి ఓపికలు లేకుండా పలికిన గోపికల దీనమైన పలుకులు విని, నవ్వి, యోగీశ్వరుడైన శ్రీకృష్ణుడు ఆత్మలో క్రీడించువాడై గోపికలతో రమించాడు. అప్పుడు

**మ. కరుణాలోకములం బటాంచలకచాకర్షంబులన్ మేఖలా**
**కర బాహు స్తన మర్శనంబుల నఖాంకవ్యాప్తులన్, నర్మ వా**
**క్పరిరంభంబుల మంజులాధరసుధాపానంబులం గాంతలం**
**గరఁగించెన్ రతికేళిఁ గృష్ణుఁడు గృపం గందర్పుఁ బాలార్చుచున్. 1003**

**ప్రతి :** కరుణా+ఆలోకములన్= దయార్ద్రమైన చూపులతోను; పటాంచల కచ+ఆకర్షంబులన్= చీరచెరగులను, తలవెండ్రుకలను లాగడంతోను; మేఖలా= మొలనూళ్లను; కర= చేతులను; బాహు= భుజాలను; స్తన= కుచాలను; మర్శనంబులన్= తాకడంతోనూ; నఖ+అంకవ్యాప్తులన్= గోటిగిచ్చుల గుర్తులచేతను; నర్మవాక్+పరిరంభంబులన్= రహస్యమైన పలుకులు, కౌగిళ్లచేతను; మంజుల+అధర సుధాపానంబులన్= అందమైనమోవితేనెలను ఆస్వాదించుటచేతను; (కృష్ణుడు) కందర్పున్+పాలార్చుచున్= మన్మథుణ్ణి తిరస్కరిస్తూ; రతికేళిన్= కామక్రీడతో; కాంతలన్= గోపికలను; కరఁగించెన్= పరవశింపజేశాడు.

**తా :** కృష్ణుడు తన కరుణాకటాక్ష వీక్షణాలతోను; చీరచెరుగులను, కేశపాశాలను లాగడంతోను; మొలనూళ్లు, చేతులు, భుజాలు, కుచాల స్పర్శలతోను; గోటిగిచ్చుల గుర్తులతోను; పరిహాసవాక్కులు, కౌగిళ్లతోను మన్మథుణ్ణి తిరస్కరిస్తూ గోపికలను రతిక్రీడలతో పరవశింపజేశాడు.

**క. మక్కువ వికసితవదనలు, సక్కఁగఁ దనుఁ గొల్వ హాసచంద్రికతోడన్**
**మిక్కిలి మెఱసెను గృష్ణుఁడు, చుక్కలగమినడిమి పూర్ణసోమునిభంగిన్. 1004**

**ప్రతి :** మక్కువన్= ప్రీతితో; వికసిత వదనలు= విప్పారిన ముఖాలుగలిగిన గోపికలు; చక్కన్+కన్= చక్కగా; తనున్= తనను; కొల్వన్= భజించగా; హాసచంద్రికతోడన్= చిరునవ్వువెన్నెలతో, చుక్కలగమి= నక్షత్రసమూహం; నడిమి= మధ్యనున్న; పూర్ణసోమునిభంగిన్= పూర్ణచంద్రునిలాగా; కృష్ణుఁడు; మిక్కిలిన్ మెఱసెను= అధికంగా ప్రకాశించాడు.

**తా :** వికసించిన ముఖాలు గలిగిన గోపకాంతలు సంప్రీతితో తనను భజించగా, శ్రీకృష్ణుడు చిరునవ్వు వెన్నెలతో చుక్కల మధ్య విలసిల్లే నిండుచంద్రునివలె భాసిల్లాడు.

**ఆ. సతులు దన్నుఁ బాడ సంప్రీతి నాడుచు, నఱుత నున్న వైజయంతితోడ**
**వనజలోచనుండు వనభూషణుం డయ్యె, యువతిజనశతంబు లోలిఁ గొలువ. 1005**

**ప్రతి :** సతులు= గోపికలు; తన్నున్= తననుగూర్చి; పాడన్= పాటలు పాడుతుండగా; సంప్రీతిన్= ఆనందంతో; ఆడుచున్= నర్తిస్తూ; అఱుతన్= మెడలో; ఉన్న; వైజయంతితోడన్= వైజయంతి అనే వనమాలతో; యువతి జనశతంబులు= శతాధికులైన

గోపికలు; ఓలిన్= వరుసగా; కొలువన్= పరిచర్యలు చేస్తూ ఉండగా; వనజలోచనుండు= పద్మనేత్రుడు; వనభూషణుండు= బృందావనానికి అలంకారం; అయ్యెన్= అయ్యాడు.

**తా :** గోపికలు తననుగురించి పాటలు పాడుతుండగా, ప్రీతితో నర్తిస్తూ, వందలకొలదీ గోపికలు తనను కొలువగా మెడలోని వైజయంతిమాలతో పద్మనేత్రుడైన కృష్ణుడు బృందావనానికి అలంకారమయ్యాడు.

**విశే :** శ్రీహరి మెడలో ధరించే హారంపేరు 'వైజయంతి'.

**ఉ. చిక్కక యీశుఁడై యెదిరిఁ జిక్కులఁ బెట్టెడి మాయలానికిం**
**జిక్కి కృతార్థలై మరునిచిక్కులఁ జొక్కి లతాంగు లుండఁగా**
**మక్కువ శాంతి సేయుటకు మన్నన సేసి ప్రసన్నుఁ డౌటకుం**
**జక్కన నా విభుండు గుణశాలి దిరోహితుఁ డయ్యె నయ్యెడన్. 1006**

**ప్రతి :** ఈశుఁడు+ఐ= పరమేశ్వరుడై; చిక్కక= ఎవరికీ దొరకక; ఎదిరిన్= ఎదుటివారిని; చిక్కులన్+పెట్టెడి= చిక్కుల్లోపెట్టే; మాయలానికిన్= మాయలమారి అయిన కృష్ణునికి; చిక్కి; కృతార్థలు+ఐ= ధన్యురాండ్రై; మరుని చిక్కులన్= మన్మథకేళిలో; చొక్కి= పరవశించి; లతా+అంగులు= గోపయువతులు; ఉండన్+కాన్= ఉండగా; మక్కువ= వారి కామోత్కంఠతను; శాంతి+ చేయుటకున్= శాంతి కలిగించడానికి; మన్నన+చేసి= ఆదరంతో అనుగ్రహించి; ప్రసన్నుడు+ఔటకున్= ప్రసన్నుడు కావడానికి; గుణశాలి= కల్యాణగుణశాలి అయిన; ఆ విభుండు= ఆ కృష్ణప్రభువు; చక్కనన్= చక్కగా; ఆ+ఎడన్= అపుడు; తిరోహితుఁడు+అయ్యెను= అదృశ్యమయ్యాడు.

**తా :** పరమేశ్వరుడై ఎవరికీ చిక్కకుండా, ఎదుటివారిని చిక్కులపాలు జేసే మాయలమారి అయిన కృష్ణునికి చిక్కి, గోపయువతులు ధన్యురాండ్రై, మన్మథకేళిలో పరవశించిపోయారు. అలా ఉండగా కల్యాణగుణశాలి అయిన కృష్ణప్రభువు గోపికల కామోత్కంఠతను ఉపశమింపజేయడానికి, ఆ తర్వాత ఆదరంగా దగ్గరికి తీసుకోడానికి అనువుగా అపుడు అదృశ్యమయ్యాడు.

**వ. ఇట్లు హరి గను మొఱంగి చనిన కరిం గానక తిరుగుకరేణులపెల్లున నుల్లంబులు దల్లడిల్ల వల్లవకాంతలు తదీయగమనహాసవిలాసవీక్షణవిహారవచనరచనానురాగంబులం జిత్తంబులు గోల్పడి, వివిధచేష్టలకుం బాల్పడి, తదాత్మకత్వంబున నేన నేన కృష్ణుండ నని కృష్ణగుణావేశంబులం జరియించుచు. 1007**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; హరి= కృష్ణుడు; కను మొఱంగి= కన్ను గప్పి; చనినన్= వెళ్లిపోగా; కరిన్= మగ ఏనుగును; కానక= చూడక; తిరుగు= సంచరించే; కరేణుల పెల్లునన్= ఆడఏనుగులవలె; వల్లవకాంతలు= గోపకాంతలు; తల్లడిల్లన్= సంచలించిపోగా; తదీయ= అతని (కృష్ణుని); గమన= నడక; హాస= నవ్వు; విలాస= విలాసం, వీక్షణ= చూపులు; విహార= క్రీడలు; వచన= పలుకులు; రచన= నేర్పు; అనురాగంబులన్= ప్రేమలలో; చిత్తంబులు= మనసులు; కోల్పడి= కోల్పోయి; వివిధ చేష్టలకున్= పలురకాలైన క్రియలకు; పాల్పడి; తద్+ఆత్మకత్వంబునన్= అతడే తాము అనే బుద్ధిచేత కలిగిన తన్మయత్వంతో; నేను+అ= నేనే; నేను+అ= నేనే; కృష్ణుండను= కృష్ణుణ్ణి; అని= అంటూ; కృష్ణగుణ+ఆవేశంబులన్= కృష్ణుని గుణాలు ఆవేశించగా; చరియించుచున్= తిరుగుతూ...

**తా :** ఇలా కృష్ణుడు అదృశ్యుడై వెళ్లిపోగా, మగ ఏనుగును కానక తిరిగే ఆడు ఏనుగుల మందలాగా, తమ హృదయాలు తల్లడిల్లిపోగా, గోపకాంతలు శ్రీకృష్ణుని నడక, నవ్వు, విలాసం, దృష్టి, విహారం, పలుకు, నేర్పు, అనురాగాల స్మృతిలో తమ

మనసులు పోగొట్టుకున్నారు. వివిధ చేష్టలకు పాల్పడి, తన్మయత్వంతో “నేను కృష్ణుణ్ణి” అని ఒకరు అంటే “కాదు! నేనే కృష్ణుణ్ణి” అని మరొకరు వాదులాడుకుంటూ, కృష్ణునిగుణాలు వారిలో ఆవేశించగా తిరుగుతూ –

**క. భూతములలోనఁ వెలిఁ బ్ర, ఖ్యాతుం డగు నట్టివాని గాంతలు కాళిం**
**దీ తీరవనాంతరముల, బ్రాఁతిన్ వెదుకంగఁ జనిరి పాడుచు నధిపా! 1008**

**ప్రతి :** అధిపా!= ఓ పరీక్షిన్మహారాజా!; భూతములలోనన్= ప్రాణులలోపల; వెలిన్= వెలుపల; ప్రఖ్యాతుండు+అగున్+ అట్టివానిన్= నివసించి ఉండేవాణ్ణి; కాళిందీతీరవన+అంతరములన్= యమునానదీతీరవన మధ్య ప్రాంతాలలో; బ్రాఁతిన్= ప్రేమతో; పాడుచున్= కృష్ణునిగురించి పాడుకుంటూ; వెదుకన్+కన్= వెదకడానికి; చనిరి= వెళ్లారు.

**తా :** ఓ పరీక్షిన్మహారాజా! చరాచరాలైన సమస్తభూతాల లోపలా, వెలుపలా విలసిల్లే వాసుదేవుణ్ణి గోపకాంతలు యమునాతీరవన మధ్య ప్రాంతాలలో ప్రేమతో పాడుతూ వెదకడానికి వెళ్లారు.

**సీ. పున్నాగ! కానవే పున్నాగవందితుఁ; దిలకంబ! కానవే తిలకనిటలు**
**ఘనసార! కానవే ఘనసారశోభితు; బంధూక! కానవే బంధుమిత్రు**
**మన్మథ! కానవే మన్మథాకారుని; వంశంబ! కానవే వంశధరునిఁ**
**జందన! కానవే చందనశీతలుఁ గుందంబ! కానవే కుందరదను**

**తే. నింద్రభూజమ! కానవే యింద్రవిభవుఁ, గువలవృక్షమ! కానవే కువలయేశుఁ**
**బ్రియకపాదప! కానవే ప్రియవిహారు; ననుచుఁ గృష్ణుని వెదకి రయ్యబ్జముఖులు. 1009**

**ప్రతి :** పున్నాగ= సురపొన్న వృక్షమా!; పున్నాగవందితున్= పురుషశ్రేష్ఠుల నమస్కారాలందుకొనే వాణ్ణి; కానవు+ఏ= చూడలేదా?; తిలకంబు+అ= ఓ బొట్టుగు వృక్షమా!; తిలక నిటలున్= నుదుటిమీద తిలకం ధరించినవాణ్ణి; కానవు+ఏ= తిలకించలేదా?; ఘనసార= ఓ కర్పూరపరటి చెట్టూ!; ఘనసారశోభితున్= గొప్పబలిమిచే భాసించేవాణ్ణి; కానవు+ఏ= కాంచలేదా; బంధూక= ఓ మంకెన చెట్టూ!; బంధు మిత్రున్= సర్వులకూ బంధువూ మిత్రుడైనవాణ్ణి; కానవు+ఏ= చూడలేదా; మన్మథ= ఓ వెలగవృక్షమా!; మన్మథ+ఆకారునిన్= మన్మథునివంటి సుందరస్వరూపుణ్ణి; కానవు+ఏ= ఆలోకించలేదా; వంశంబు+అ= ఓ వెదురు చెట్టూ!; వంశధరునిన్= వేణువు దాల్చిన వెన్నుణ్ణి; కానవు+ఏ= దర్శించలేదా; చందన= చందన వృక్షమా!; చందనశీతలున్= చందనంవలె చల్లనైనవాణ్ణి; కానవు+ఏ= సందర్శించలేదా; కుందంబు+అ= ఓ మొల్లతీగా!; కుందరదను= మొల్లమొగ్గలవంటి దంతాలుగలవాణ్ణి; కానవు+ఏ= పరికించలేదా; ఇంద్రభూజమ= దేవదారువృక్షమా! ఇంద్రవిభవున్= దేవేంద్ర వైభవం కలవాణ్ణి; కానవు+ఏ= చూడలేదా; కువలవృక్షము+అ= ఓ రేగుచెట్టూ!; కువలయ+ఈశున్= భూమండలానికి అధినాథుడైనవాణ్ణి; కానవు+ఏ= దర్శించలేదా; ప్రియకపాదప= ప్రేంకణవృక్షమా!; ప్రియవిహారున్= ప్రియమైనవిహారం కలిగినవాణ్ణి కానవు+ఏ= అవలోకించలేదా; అనుచున్= అని అడుగుతూ; ఆ+అబ్జముఖులు= ఆ పద్మముఖులు; కృష్ణుణ్ణి; వెదకిరి= వెదికారు.

**తా :** ఓ పున్నాగ వృక్షమా! పురుష శ్రేష్ఠుల నమస్కారాలందుకొనే వాణ్ణి చూశావా? ఓ బొట్టుగచెట్టా! నొసట తిలకం ధరించేవానిని దర్శించావా? ఓ కర్పూర వృక్షమా! మహాబలంతో విలసిల్లే వాణ్ణి చూడలేదా? ఓ మంకెన వృక్షమా! బంధువులకు మిత్రుడైన వాణ్ణి చూశావా? ఓ వెలగమానూ! మన్మథ రూపుణ్ణి సందర్శించలేదా? ఓ వెదురు వృక్షమా! వేణుధరుణ్ణి చూడలేదా?

చందనవృక్షమా! చందనంలాగా చల్లనైనవాణ్ణి సందర్శించలేదా? ఓ మొల్లతీగా! మొల్లమొగ్గల్లాంటి దంతాలుగలవాణ్ణి కాంచలేదా? ఓ దేవదారువృక్షమా! దేవేంద్రవైభవంతో విలసిల్లేవాణ్ణి కనలేదా? ఓ రేగుచెట్టూ! భూమండలానికి అధీశుడైనవాణ్ణి ఆలోకించలేదా? ఓ ప్రేంకణవృక్షమా! ప్రియవిహారంతో విరాజిల్లేవాణ్ణి చూడలేదా?-అంటూ పద్మముఖులైన గోపస్త్రీలు కృష్ణుణ్ణి వెదికారు.

**విశే :** ఒకేపదం భిన్నార్థాలతో పునరుక్తం కావడం పద్యం ప్రతిపాదంలో కనిపిస్తోంది. "పున్నాగ....పున్నాగ" ఇలా.

**వ. మఱియును. 1010**

**తా :** ఇంకనూ...

**ఉ. నల్లనివాఁడు పద్మనయనంబులవాఁడు కృపారసంబు పైఁ**
**జల్లెడివాఁడు మౌళిపరిసర్పితపింఛమువాఁడు నవ్వు రా**
**జిల్లెడు మోమువాఁ డొకఁడు చెల్వల మానధనంబుఁ దెచ్చె నో**
**మల్లియలార! మీ పొదలమాటున లేఁడు గదమ్మ చెప్పరే? 1011**

**ప్రతి :** నల్లనివాఁడు= నీలమేఘశ్యాముడు; పద్మనయంబులవాఁడు= కమలనేత్రుడు; కృపారసంబు= దయారసం; పైన్+ చల్లెడివాఁడు= (మన) మీద చిందించేవాడు; మౌళిపరిసర్పిత పింఛమువాఁడు= సిగపైన వ్యాపించిన నెమలి పురితో విలసిల్లేవాడు; నవ్వు రాజిల్లెడి మోమువాఁడు= నవ్వుతో విరాజిల్లే వదనంకలవాడు; ఒకఁడు= ఒకానొక కుర్రవాడు; చెల్వల మానధనంబున్= తరుణీమణుల అభిమానం అనే ధనాన్ని; తెచ్చెన్= దోచి తెచ్చాడు; ఓ మల్లియలు+ఆర= ఓ మల్లెతీవలారా! చెప్పరు+ఏ= చెప్పండి; మీ పొదల మాటున= మీ పొదల చాటున(దాగి); లేఁడు గద+అమ్మ= లేడుగదా!

**తా :** ఓ మల్లియలారా! నీలమేఘశ్యాముడు, కమలనేత్రుడు, దయారసం చిలికించేవాడు, సిగపైన వ్యాపించిన నెమలిపింఛం గలవాడు, చిరునవ్వు చిందించే సుందరవదనుడు అయిన ఒక కుర్రవాడు గోపికల మానధనం దోచి తెచ్చాడు. మీ పొదల మాటున లేడుగదమ్మా! చెప్పండి.

**విశే :** ఈ పద్యం తెలుగు ప్రజలనోట నానే రసగుళిక.

మల్లెతీగలను సాటిస్త్రీలలాగా చూస్తున్నారు కాబట్టే 'అమ్మా' చెప్పండి అంటున్నారు - గోపకాంతలు.

స్త్రీలకు అభిమానమే ధనం. అది కొల్లగొట్టితే తట్టుకోలేరు.

**ఉ. అంగజునైనఁ జూడ హృదయంగముఁడై కరఁగించువాఁడు శ్రీ**
**రంగదురంబువాఁడు మధురంబగు వేణురవంబువాఁడు మ**
**మ్మంగజుపువ్వుఁదూపులకు నగ్గము సేసి లవంగలుంగ నా**
**రంగములార! మీకడకు రాఁడు గదా! కృప నున్నఁ జూపరే! 1012**

**ప్రతి :** లవంగ= లవంగవృక్షాల్లారా!; లుంగ= మాదీఫలవృక్షాల్లారా!; నారంగములార= నారింజచెట్టులారా!; చూడన్= (అతణ్ణి) దర్శిస్తూనే; అంగజున్+ఐనన్= మన్మథుణ్ణికూడా; హృదయంగముఁడు+ఐ= మదికి ఇంపు కలిగించేవాడై; కరఁగించువాఁడు= పరవశింపజేసేవాడు; శ్రీరంగత్+ఉరంబువాఁడు= లక్ష్మీదేవి నర్తించే వక్షం కలవాడు; మధురంబు+అగు=

తీయనైన; వేణురవంబువాఁడు= మురళీనాదంకలవాడు అయిన కృష్ణుడు; మమ్మున్= గోపకాంతలైన మమ్మల్ని; అంగజు పువ్వు+తూపులకున్= మన్మథుని పూలబాణాలకు; అగ్గము+చేసి= అప్పగించి; మీకడకున్= మీవద్దకు; రాఁడు కదా= రాలేదు గదా; ఉన్నన్= అలా వచ్చిఉంటే; కృపన్= దయతో; చూపరు+ఏ= చూపండి;

**తా :** ఓ లవంగతరువులారా! మాదీఫలవృక్షాల్లారా! నారింజవృక్షాల్లారా! దర్శించిన మాత్రాన్నే మన్మథుణ్ణి అయినా చిత్తానికి ఇంపుగలిగించి పరవశింపజేసేవాడు, సిరికి నివాసమైన వక్షంవాడు, తీయనైన వేణునాదంతో విలసిల్లేవాడు అయిన శ్రీకృష్ణుడు మమ్మల్ని మన్మథుని పూలబాణాలకు అప్పగించి, మీ వద్దకు రాలేదు గదా! ఒకవేళ వచ్చి ఉంటే దయతో చూపండి!

**సీ. మానినీమన్మథు మాధవుఁ గానరే సలలితోదారవత్సకములార!**
**సలలితోదారవత్సకవైరిఁ గానరే సుందరోన్నతలతార్జునములార!**
**సుందరోన్నతలతార్జునభంజుఁ గానరే ఘనతరలసదశోకంబులార!**
**ఘనతరలసదశోకస్ఫూర్తిఁ గానరే నవ్యరుచిరకాంచనంబులార!**

**ఆ. నవ్యరుచిరకాంచనకిరీటుఁ గానరే, గహనపదవికురవకంబులార!**
**గహనపదవికురవకనివాసిఁ గానరే, గణికలార! చారుగణికలార!** **1013**

**ప్రతి :** సలలిత+ఉదార= మనోజ్ఞాలు, గొప్పవీ అయిన; వత్సకములు+ఆర= కొడిసె వృక్షాల్లారా!; మానినీ మన్మథున్= తరుణుల పాలిటి మదనుడైన; మాధవున్= శ్రీకృష్ణుణ్ణి; కానరు+ఏ= చూడలేదా? సుందర+ఉన్నతలతా+అర్జునములు+ఆర= సుందరమైన దీర్ఘమైన కొమ్మలతో కూడిన మద్దివృక్షాల్లారా!; సలలిత+ఉదారవత్సకవైరిన్= సుందరుడు, ఉదారుడు, వత్సరాక్షసుణ్ణి సంహరించినవాడు అయిన కృష్ణుణ్ణి; కానరు+ఏ= దర్శించలేదా? ఘనతరలసత్+అశోకంబులు+ఆర= సమున్నతాలై ప్రకాశించే కంకేళి వృక్షాల్లారా!; సుందర+ఉన్నత లతా+అర్జునభంజున్= అందమైన, సుదీర్ఘాలైన శాఖలలో విలసిల్లే యమళార్జునాలను (జంటమద్దుల్ని) భంజించిన కృష్ణుణ్ణి; కానరు+ఏ= చూడలేదా?; నవ్యరుచిర కాంచనంబులు+ఆర= నూతనమైన అందమైన సంపెంగలారా; ఘనతరలసత్+అశోకస్ఫూర్తిన్= మహిమగలిగి ప్రకాశిస్తూ దుఃఖరహితుడై విలసిల్లే హరిని; కానరు+ఏ= వీక్షించలేదా; కురవకంబులు+ఆర= ఎఱ్ఱగోరింట చెట్టులారా!; నవ్యరుచిరకాంచనకిరీటున్= నూతనమైన అందమైన బంగారు కిరీటం ధరించిన కృష్ణుణ్ణి; గహనపదవిన్= ఈ అడవి మార్గంలో; కానరు+ఏ= పరికించలేదా; గణికలు+ఆర= ఓ అందమైన అడవి మొల్లలారా!; చారుగణికలు+ఆర= మనోహరమైన నెల్లిచెట్టులారా!; గహనపదవిన్= బృందావనంలోని; కురవక నివాసిన్= ఎఱ్ఱగోరింట పొదలలో సంచరించే స్వామిని; కానరు+ఏ= చూడలేదా!

**తా :** మనోజ్ఞాలూ, గొప్పవీ అయిన కొడిసె వృక్షాల్లారా! రమణుల పాలిటి మన్మథుడైన లక్ష్మీశుణ్ణి చూడలేదా? సుందరమైన, సుదీర్ఘమైన మద్దివృక్షాల్లారా! సుందరుడూ, ఉదారుడూ, వత్సరాక్షసుణ్ణి సంహరించినవాడు అయిన హరిని కాంచలేదా? సమున్నతాలై ఒప్పిదమైన కంకేళీ వృక్షాల్లారా! సుందరాలు, దీర్ఘాలైన కొమ్మలతో కూడిన జంట మద్దిచెట్లను పడగొట్టిన కృష్ణుణ్ణి చూడలేదా? నూతనమైన, ఒప్పిదమైన సంపెంగలారా! మహిమతో ప్రకాశిస్తూ దుఃఖరహితుడై విలసిల్లుతున్న కమలనేత్రుణ్ణి దర్శించలేదా? ఎఱ్ఱగోరింట చెట్టులారా! నవ్యమై, అందంగా ఉన్న బంగారు కిరీటధారి అయిన నందనందనుణ్ణి బృందావనమధ్యంలో సందర్శించలేదా? ఓ సుందరమైన అడవిమొల్లలారా! అందమైన నెల్లి చెట్టుల్లారా! బృందావనంలోని ఎఱ్ఱగోరింట పొదల్లో తిరిగే శ్రీకృష్ణుని చూడలేదా? ('చూచి ఉంటే దయతో చెప్పండి' అని భావం)

సీ. అదె నందనందనుం డంతర్హితుం డయ్యెఁ బాటలీతరులార! పట్టరమ్మ!
హేలావతులఁ గృష్ణ! యేల పాసితి వని యైలేయలతలార! యడుగరమ్మ!
వనజాక్షుఁ డిచటికి వచ్చి డాఁగఁడు గదా! చూతమంజరులార! చూడరమ్మ!
మానినీమదనుతో మారాక యెఱిఁగించి మాధవీలతలార! మనుపరమ్మ!

ఆ. జాతిసతులఁ బాయ నీతియే హరి కని, జాతులార! దిశలఁ జాటరమ్మ!
కదళులార! పోయి కదలించి శిఖిపింఛ, జూటుఁ దెచ్చి కరుణఁ జూపరమ్మ! 1014

**ప్రతి :** అది+ఎ= అదిగో; నందనందనుండు= నందగోపుని పుత్రుడైన కృష్ణుడు; అంతర్హితుండు+అయ్యెన్= అదృశ్యం అయ్యాడు; పాటలీతరులు+ఆర= ఓ కలిగొట్టు వృక్షాల్లారా!; పట్టరు+అమ్మ= అమ్మా! పట్టుకోండి!; కృష్ణ= ఓ కృష్ణా!; హేలావతులన్= విలాసవతులైన గోపకాంతలను; ఏల= ఎందుకు; పాసితివి= వదలిపెట్టి వెళ్లావు; అని; ఐలేయలతలు+ఆర= బుడమ (దోసె) తీగెల్లారా!; అడుగరమ్మ= అమ్మా! అడగండి; చూతమంజరులు+ఆర= ఓ మామిడి గుబురులారా!; వనజ+అక్షుఁడు= పద్మనేత్రుడు; ఇచటికిన్= ఇక్కడికి; వచ్చి; డాఁగఁడు+కదా= దాగుకోలేదు గదా! చూడరు+అమ్మ= అమ్మలారా! చూడండి!; మాధవీలతలు+ఆర= పూలగురివెంద తీగలారా!; మానినీమదనుతోన్= తరుణీమన్మథునితో; మారాక= మేమురావడం; ఎఱిఁగించి= తెలిపి; మనుపరు+అమ్మ= అమ్మలారా! మమ్మల్ని బతికించండి; జాతులు+ఆర= జాజిలతలారా!; జాతిసతులన్= కులసతులను; పాయన్= వదిలిపెట్టడం; హరికిన్; నీతి+ఏ= నీతిగాదని; దిశలన్= దిక్కులలో; చాటరు+అమ్మ= అమ్మలారా! చాటండి; కదళులు+ఆర= అరటిచెట్టులారా!; పోయి= వెళ్లి; కదలించి= (కృష్ణుని) కదలేట్లుచేసి; శిఖిపింఛ జూటున్= మౌళిపైన నెమలిపింఛం అలంకరించుకొన్నవాణ్ణి; కరుణన్= దయతో; తెచ్చి; చూపరు+అమ్మ= అమ్మలారా! చూపండి.

**తా :** అదిగో! నందుని తనయుడైన కృష్ణుడు ఉన్నట్లుండి అదృశ్యమయ్యాడు. ఓ కలిగొట్టు వృక్షాలారా! పట్టుకొనండమ్మా! 'కృష్ణా! విలాసవతులైన గోపకాంతలను ఎందుకు వదిలివేశావు' అని ఓ బుడమ తీగెలారా! అతణ్ణి అడగండి. ఓ మామిడి గుబురులారా! కమలాక్షుడు ఇక్కడికి వచ్చి దాగుకోలేదు గదా! చూడండమ్మా! ఓ పూలగురివెంద లతలారా! తరుణులపాలిటి మన్మథుడైన కృష్ణునికి మారాక చెప్పి మమ్మల్ని బతికించండమ్మా! జాజిలతలారా! కులకాంతులను వదిలివెళ్లడం హరికి నీతిగాదని దిక్కుల్లో చాటండమ్మా! ఓ అరటి చెట్టుల్లారా! మీరు వెళ్లి నెమలిపింఛం శిఖలో ధరించిన పద్మనేత్రుణ్ణి కదలించుకొని తెచ్చి దయతో మాకు చూపండమ్మా!

క. హరిచరణములకుఁ బ్రియవై, హరి నిను మన్నింప భద్ర మందెదు తులసీ!
హరి నీ దెస రాఁడు గదా, హరి చొప్పెఱిఁగించి శుభము లందింపఁగదే! 1015

**ప్రతి :** తులసీ!; హరిచరణములకున్= విష్ణువుపాదాలకు; ప్రియవు+ఐ= ప్రియమైన దానివై; హరి; నినున్= నిన్ను; మన్నింపన్= సమాదరించగా; భద్రము+అందెదు= శుభం పొందుతున్నావు; హరి= కృష్ణుడు; నీదెస= నీవైపు; రాఁడుకదా= రాలేదు కదా; హరిచొప్పు= కృష్ణుని జాడ; ఎఱిఁగించి= తెలిపి; శుభములు+అందింపన్+కదు+ఏ= మాకు శుభాలను ప్రసాదించు.

**తా :** ఓ తులసీ! శ్రీహరిపాదాలకు ప్రియమైనదానివై, హరినిన్ను సమాదరించగా, నీవు శుభాలు అందుకొంటున్నావు. కృష్ణుడు నీ వైపు రాలేదుగదా? కృష్ణునిజాడ తెలిపి శుభాలు అందించవమ్మా!

**తే. పొగడఁ దగువానిఁ గానరె పొగడలార!, యీ డెఱుంగని విభుఁ జూపుఁ డీడలార!**
**మొల్లమగుకీర్తివాఁ డేడి మొల్లలార!, శుకనిగదితునిఁ జెపుఁడు కింశుకములార! 1016**

**ప్రతి :** పొగడలు+ఆర= పొగడల్లారా!; పొగడన్+తగువానిన్= ప్రస్తుతించదగినవాణ్ణి; కానరు+ఎ= చూడలేదా! ఈడలు+ఆర= ఎర్రకిత్తలి చెట్టులారా!; ఈడు+ఎఱుంగని విభున్= సాటిలేని ప్రభువును; చూపుఁడు= చూపండి; మొల్లలార= ఓ మొల్లలారా!; మొల్లము+అగు= వెల్లివిరిసిన; కీర్తివాఁడు= యశస్సుతో ప్రఖ్యాతి చెందినవాడు; ఏడి= ఎక్కడున్నాడు; కింశుకములు+ఆర= ఓ మోదుగు వృక్షాల్లారా!; శుకనిగదితున్= శుకమహర్షిచే వర్ణింపబడిన కృష్ణుణ్ణి గురించి; చెపుఁడు= చెప్పండి.

**తా :** పొగడలారా! పొగడదగిన పురుషోత్తముడైన కృష్ణుణ్ణి చూడలేదా; ఓ ఎర్రకిత్తలి చెట్టులారా! సాటిలేనికీర్తిగల కృష్ణప్రభును చూపండి; మొల్లలారా! సర్వవ్యాపితకీర్తిగలవాడైన కృష్ణుడు ఎక్కడున్నాడు? ఓ మోదుగుచెట్టులారా! శుకునిచే స్తుతించబడిన వనమాలి ఏడీ? చెప్పండి.

**క. తరుణీకుచకుంకుమయుత, హరికంధరదామగంధ మడరెడుఁ జూడ్కుల్**
**హరిఁ గనిన పగిదిఁ దనరెడి, హరిణీ! హరిజాడఁ బుణ్య మయ్యెడిఁ జెపుమా! 1017**

**ప్రతి :** హరిణీ= ఓ ఆడుజింకా!; తరుణీకుచకుంకుమయుత= యువతులు తమస్తనాలపై అలదుకొన్న కుంకుమపూతలంటుకొని; హరికంధర= కృష్ణుని కంఠంలోని; దామగంధము= పూలదండపరిమళం; అడరెడు చూడ్కుల్= బుగులు కొలుపుతున్న నీ చూపులు; హరిన్= కృష్ణుణ్ణి; కనినపగిదిన్= చూచినవిధంగా; తనరెడిన్= విలసిల్లుతున్నాయి; హరిజాడన్= శ్రీకృష్ణుని జాడను; చెపుము+ఆ= తెలుపు!; పుణ్యము+అయ్యెడిన్= నీకు పుణ్యముంటుంది.

**తా :** ఓ ఆడుజింకా! (హరిణీ) తరుణులు తమస్తనాలపై అలదుకొన్నకుంకుమ పూతలు అంటుకొని హరికంఠంలోని పుష్పమాలికా పరిమళం సర్వత్ర వ్యాపించగా– అలాంటి గోపాలుణ్ణి చూచినట్లు నీ చూపులు తలపిస్తున్నాయి. శ్రీకృష్ణుని జాడ తెలుపు. నీకు పుణ్యముంటుంది.

**క. కిటియై కౌఁగిటఁ జేర్చెను, వటుఁడై వర్ధిల్లి కొలిచె వడిఁ గృష్ణుండై**
**యిటఁ బదచిహ్నము లిడెఁ గ్రిం, దటి బామున నేమి నోఁచి తమ్మ ధరిత్రీ! 1018**

**ప్రతి :** ధరిత్రీ!= ఓ భూదేవీ!; కిటి+ఐ= వరాహమై; కౌఁగిటన్+చేర్చెను= నిన్ను కౌగిట్లోకి తీసుకొన్నాడు; వటుఁడు+ఐ= వామనుడై; వర్ధిల్లి= విలసిల్లి; కొలిచెన్= పాదాలతో కొలిచాడు (నిన్ను సేవించాడు); వడిన్= శౌర్యంతో; కృష్ణుండు+ఐ= శ్రీకృష్ణావతారియై; ఇటన్= ఇక్కడ; పదచిహ్నములు= పాదాలగుర్తులు; ఇడెన్= ఉంచాడు; క్రిందటి బామునన్= పోయిన జన్మలో; ఏమినోఁచితి(వి)+అమ్మ= ఏమి నోములు నోచావమ్మా!

**తా :** ఓ భూదేవీ! వరాహావతారం దాల్చినప్పుడు నిన్ను కౌగిట్లో చేర్చుకొన్నాడు. వామనావతారమెత్తి త్రివిక్రమస్వరూపుడై పాదాలతో నిన్ను కొలిచాడు. ఇప్పుడు శ్రీకృష్ణుడై నీమీద పాదాలగుర్తులుంచాడు! పూర్వజన్మలో ఏమి నోములు నోచావోగదా!

**వ. అనుచు మదనోన్మాదచిత్తలై తదాత్మకత్వంబున కృష్ణలీలల ననుకరించుచు. 1019**

**ప్రతి :** అనుచున్= అంటూ; మదన+ఉన్మాదచిత్తలు+ఐ= కామోద్రేకంచేత వెర్రెత్తిన మనస్సులుగలవారై; తద్+ఆత్మకత్వంబున= కృష్ణతాదాత్మ్యం పొందినవారై; కృష్ణలీలలన్= శ్రీకృష్ణుని లీలలను; అనుకరించుచున్= అనుకరిస్తూ...

**తా :** ఇలా అంటూ గోపకాంతలు మన్మథుని ప్రేరణతో వెర్రెత్తినట్లు ప్రవర్తిస్తూ, కృష్ణతాదాత్మ్యాన్ని పొంది, ఆయన లీలలను అనుకరిస్తూ

**సీ. పూతనయై యొక్క పొలఁతి చరింపంగ శౌరియై యొక కాంత చన్నుఁ గుడుచు;**
**బాలుఁడై యొకభామ పాలకు నేడ్చుచో బండి నే నను లేమఁ బాఱఁ దన్ను;**
**సుడిగాలి నని యొక్క సుందరి గొనిపోవ; హరి నని వర్తించు నబ్జముఖియు**
**బకుఁడ నే నని యొక్క పడఁతి సంరంభింపఁ బద్మాక్షుఁడను కొమ్మ పరిభవించు**

**ఆ. నెలమి రామకృష్ణు లింతు లిద్దఱు గాఁగ, గోపవత్సగణము గొంద ఱగుదు;**
**రసురవైరి ననుచు నబల యొక్కతె చీరుఁ, బసుల మనెడి సతుల భరతముఖ్య! 1020**

**ప్రతి :** భరతముఖ్య= భరతవంశప్రభువైన ఓ పరీక్షిన్మహారాజా!; పూతన+ఐ= పూతనవలె; ఒక్క పొలఁతి= ఒక యువతి; చరింపన్+కన్= ప్రవర్తించగా; శౌరి+ఐ= కృష్ణశిశువై; ఒకకాంత; చన్నున్+కుడుచున్= పాలు తాగినట్లు నటించింది; బాలుఁడు+ఐ= బాలుడై; ఒక భామ; పాలకున్= పాలకోసం; ఏడ్చుచోన్= ఏడుస్తున్నట్లు నటించగా; బండి= శకటాసురుణ్ణి; నేను; అనులేమన్= అనే కాంతను; పాఱన్+తన్నున్= పారిపోయేటట్లు తన్నింది; సుడిగాలిని= తృణావర్తుణ్ణి; అని; ఒక్కసుందరి= ఒక అందగత్తె; కొనిపోవన్= ఎత్తుకొనిపోగా; అబ్జముఖియు= ఒక పద్మవదన; హరిని= శ్రీకృష్ణుణ్ణి; అని; వర్తించును= ప్రవర్తించింది; నేను; బకుఁడను= బకాసురుణ్ణి; అని; ఒక్క పడఁతి= ఒక తరుణి; సంరంభింపన్= విజృంభించగా; పద్మ+ అక్షుఁడు= పద్మనేత్రుడైన కృష్ణుడు; అను= అనే; కొమ్మ= పడతి; పరిభవించును= అవమానించింది; ఎలమిన్= విలాసంగా; ఇద్దఱు= ఇద్దరు; ఇంతులు= యువతులు; రామకృష్ణులు= బలరామకృష్ణులు; కాన్+కన్= కాగా; కొందఱు= కొందరు యువతులు; గోపవత్సగణము= గోపాలులు; దూడలు; అగుదురు= అయ్యారు; అసురవైరిని= రాక్షసవైరినైన కృష్ణుణ్ణి; అనుచున్= అంటూ; ఒక్కతె అబల= ఒక సుందరి; పసులము= పశువులం; అనెడి= అని నటించే; సతులన్= కాంతలను; చీరున్= పిలిచింది.

**తా :** గోపికల్లో ఒక రమణి పూతనవలె ప్రవర్తించగా, కృష్ణునివలె అభినయిస్తున్న ఒక సుందరి పాలు తాగినట్లు నటించింది. ఒక గోపిక తనను శిశువుగా భావించుకొని పాలకు రోదిస్తూ, శకటాసురుడులాగా నటించే మరొక సుందరిని కాలితో తన్నింది. ఒక అందగత్తె తృణావర్తుడులాగా నర్తిస్తూ, నేను కృష్ణుణ్ణి అనే మరొకగోపకాంతను పైకి ఎగరవేసుక పోయింది. ఒక గోపకాంత నేను బకాసురుణ్ణి అని విజృంభించగా, 'నేను వాసుదేవుణ్ణి' అంటూ మరొకగోపిక ఆమెను పరాభవించింది. ఇద్దరు తరుణులు రామకృష్ణులుగా నటించగా, మరికొందరు గోపకులు, దూడలు అయ్యారు. 'మేము పసులము' అంటూ పలుకుతున్న సుందరులను 'నేను అసురవైరిని' అని మరొక గోపిక పిలిచింది.

**విశే :** ఈ పద్యంలో కృష్ణతాదాత్మ్యంతో గోపకాంతలు కృష్ణలీలలను అభినయించే దృశ్యం మనోహరం.

**ఆ. లోక మెల్లఁ గుక్షిలోపల నున్నది, మాధవుండ నేను మాత వీవు**
**చూడు మనుచు నొక్క సుందరి యొకతెకు, ముఖముఁ దెఱచి చూపు ముఖ్యచరిత! 1021**

**ప్రతి :** ముఖ్యచరిత= ప్రఖ్యాత చరిత్రుడవైన ఓ పరీక్షిన్మహారాజా!; ఒకతె= ఒక గోపిక; లోకము+ఎల్లన్= విశ్వమంతా; కుక్షిలోపలన్= (నా) కడుపు లోపల; ఉన్నది= ఉంది; నేను; మాధవుండన్= శ్రీహరిని; నీవు; మాతవు= తల్లి అయిన

యశోదమ్మవు; చూడుము= వీక్షించు; అనుచున్= అంటూ; ఒక్కసుందరి= ఒక అందగత్తె; ఒకతెకు= (యశోదమ్మగా నటించే) మరొక గోపకాంతకు; ముఖమున్= నోరును; తెఱచి; చూపున్= చూపింది.

**తా :** ప్రఖ్యాతచరిత్రుడవైన ఓ పరీక్షిన్మహారాజా! ఒక గోపకాంత హరియై విశ్వమంతా నా ఉదరంలోనే ఉంది చూడు అంటూ యశోదమ్మలా నటించే మరో గోపకాంతకు నోరు విప్పి చూపింది.

**క. వెన్నలు దొంగిలి తినియెడి, వెన్నుఁడ నని యొకతె నుడువ వేఱొక్కతె చే**
**సన్నల యశోద నంచును, గ్రన్నన కుసుమములదండఁ గట్టు నిలేశా! 1022**

**ప్రతి :** ఇలా+ఈశా= ఓ అవనీనాథా!; ఒకతె= ఒక గోపకాంత; వెన్నలు; దొంగిలి= దొంగిలించి; తినియెడి వెన్నుఁడను= భక్షించే కృష్ణుణ్ణి; అని; నుడువన్= చెప్పగా; వేఱు+ఒకతె= వేరే ఒక గోపిక; యశోదను= (నేను) యశోదను; అంచును= అంటూ; క్రన్ననన్= వెంటనే; సన్నలన్= చేతిసైగలచేత; కుసుమములదండన్= పూలహారంతో; కట్టును= బంధిస్తుంది.

**తా :** ఒక గోపకాంత వెన్నలు దొంగిలించి తినే కృష్ణుణ్ణి నేను అని చెప్పింది. వెంటనే వేరొక గోపిక తాను యశోదనంటూ చేతితో సైగలుచేస్తూ పూలదండతో (కృష్ణునివలె నటించే) ఆమెను కట్టివేసింది.

**క. 'కాళియఫణి యిది వీరలు, కాళియఫణిసతులు మ్రొక్కఁ గడఁగిరి నే గో**
**పాల కుమారుఁడ' ననుచును, లీలాగతి నాడు నొక్క లేమ నరేంద్రా! 1023**

**ప్రతి :** నర+ఇంద్రా= పరీక్షిన్మహారాజా!; ఇది; కాళియఫణి= కాళియసర్పం; వీరలు= వీరు; కాళియఫణిసతులు= కాళియఫణియొక్క భార్యలు; మ్రొక్కన్+కడఁగిరి= వందనం చేస్తున్నారు; నేన్= నేను; గోపాల కుమారుఁడను= గోప కుమారుడనైన కృష్ణుణ్ణి; అనుచును= అంటూ; ఒక్కలేమ= ఒక గోపకాంత; లీలాగతిన్= విలాసంగా; ఆడును= నర్తించింది.

**తా :** నరేంద్రా! "ఇది కాళియసర్పం. వీరు అతనిభార్యలు. నాకు వందనాలు చేస్తున్నారు. నేను గోపకుమారుడనైన కృష్ణుణ్ణి" అంటూ ఒక గోపకాంత కృష్ణునివలె విలాసంగా నర్తించింది.

**క. తరుణులు గోపకు లందఱు, హరిహయుఁ డిదె వానఁ గురిసె హరి నే' నని భా**
**సుర చేలాంచల మొక్కతె, గిరి నెత్తెద ననుచు నెత్తుఁ గెంగేల నృపా? 1024**

**ప్రతి :** నృపా= ఓ రాజా!; తరుణులు= గోపికలు; గోపకులు= గోపాలకులు; అందఱు= అందరూ; ఇది+ఎ= ఇదిగో; హరిహయుఁడు= దేవేంద్రుడు; వానన్+కురిసెన్= వర్షం కురిపించాడు; నేను; హరిని= శ్రీకృష్ణుణ్ణి; అని= అంటూ; ఒక్కతె= ఒక గోపయువతి; గిరిన్= గోవర్ధనపర్వతాన్ని; ఎత్తెదను= ఎత్తుతాను; అనుచున్= అంటూ; చేల+అంచలమున్= చీరచెరగును; కెంపు+కేలన్= కెంపులాంటి ఎర్రనిచేతితో; ఎత్తును= పయికెత్తి పట్టుకొంది.

**తా :** ఓ రాజా! ఒక గోపకాంత కొందరు గోపతరుణులను చూపి "వీరు గోపాలకులు. ఇదిగో ఇంద్రుడు వాన కురిపిస్తున్నాడు. నేను శ్రీకృష్ణుణ్ణి. గోవర్ధనగిరి నెత్తి మిమ్మల్ని రక్షిస్తాను" అంటూ తన కెంగేలితో చీరచెరగు ఎత్తి పట్టుకొంది.

**క. 'మీరలు గోపకు లే నను, రారిని దావాగ్ని వచ్చె నటు సూడకుఁడీ**
**వారించెద' నని యొక్కతె, సేరి బయల్ కబళనంబు సేయు నరేంద్రా!' 1025**

**ప్రతి :** నర+ఇంద్రా= ఓ రాజశ్రేష్ఠుడవైన పరీక్షిన్నరేంద్రా; ఒక్కతె= ఒక గోపిక; మీరలు= మీరు; గోపకులు= గోపాలకులు; ఏన్= నేను; అసుర+అరిని= రాక్షసశత్రువయిన కృష్ణుణ్ణి; దావాగ్ని= కార్చిచ్చు; వచ్చెన్= వస్తూ ఉంది; అటు= ఆ వైపు; చూడకుఁడీ= చూడవద్దు; వారించెదను= దాన్ని నివారిస్తాను; అని= అంటూ; చేరి; బయల్= శూన్యాన్ని; కబళనంబు+ చేయున్= మింగుతూ ఉంది.

**తా :** నరేంద్రా! ఒక గోపకాంత "నేను శ్రీకృష్ణుణ్ణి! మీరు గోపాలకులు. దావాగ్ని వస్తూ ఉంది. అటు చూడకండి. నేను దాన్ని నివారిస్తాను" అంటూ వట్టి బయలునే మింగింది.

**వ. ఇట్లు తన్మయత్వంబున గోపసుందరులు బృందావనంబునం గల తరులతాదుల హరి నడుగుచు, దుర్గమంబు లయిన విపినమార్గంబుల సరోజాతకేతన హల కులిశ కలశాంకుశాది శుభలక్షణ లక్షితంబు లయి మనోహరంబు లయిన హరిచరణంబుల చొప్పుఁ గని తప్పక చెప్పికొనుచుఁ దమలో నిట్లనిరి. 1026**

**ప్రతి :** ఇట్లు= ఇలా; గోపసుందరులు= గోపకాంతలు; తద్+మయత్వంబునన్= పరవశంతో; బృందావనంబునన్= బృందావనంలో; కల= ఉన్న; తరులతా+ఆదులన్= చెట్లు, తీగెలుమొదలైన వాటిల్ని; హరిన్= శ్రీకృష్ణుని గురించి; అడుగుచున్= విచారిస్తూ; దుర్గమంబులు+అయిన= సంచరించడానికి శక్యంగాని; విపిన మార్గంబులన్= అడవిదారులలో; సరస్+జాత= కమలం; కేతన= ధ్వజం; హల= నాగలి; కులిశ= వజ్రం; కలశ= కలశం; అంకుశ+ఆది= అంకుశం మొదలైన; శుభలక్షణ= శుభలక్షణాలతో; లక్షితంబులు+అయి= గుర్తులు కలిగి; మనస్+హరంబులు+అయిన= సుందరంగా ఉండే; హరిచరణంబుల చొప్పున్= శ్రీకృష్ణునిపాదాల తీరును; కని= దర్శించి; తప్పక; చెప్పికొనుచున్= ఆ స్వామిపాదాలను గురించి ప్రస్తావిస్తూ; తమలోన్= తమ మనస్సులలో; ఇట్లు+అనిరి= ఇలా భావించారు.

**తా :** ఇలా గోపసుందరులు పరవశంతో బృందావనంలో ఉండే చెట్లు, తీగెలు మొదలైనవాటిల్ని హరినిగురించి అడుగుతూ, సంచరించడానికి వీలుకాని అడవిదారుల్లో తిరుగుతున్నారు. అలా తిరిగేటప్పుడు శ్రీకృష్ణుని శుభలక్షణ లక్షితాలయిన పాదాల తీరును (అడుగుల ముద్రలద్వారా) గమనించారు. ఆ పాదాలు పద్మం, ధ్వజం, నాగలి, వజ్రం, కలశం, అంకుశం మొదలైన శుభలక్షణాలు కలిగినవి. వాటిల్ని గురించి చెప్పుకొంటూ తమ మనస్సులలో ఇలా భావించారు.

**విశే :** పద్మం, ధ్వజం, నాగలి, కులిశం, అంకుశం మొదలైన చిహ్నాలు పాదాలలో ఉండడం ఉత్తమపురుషలక్షణం.

**సీ. కొమ్మకుఁ బువ్వులు గోసినాఁ డిక్కడ మొనసి పాదాగ్రంబు మోపినాడు**
**సతి నెత్తుకొని వేడ్క జరిగినాఁ డిక్కడఁ దృణములోఁ దోఁపదు తెఱవజాడ**
**ప్రియకు ధమ్మిల్లంబు వెట్టినాఁ; డిక్కడఁ గూర్చున్న చోటిదె కొమరు మిగులు**
**నింతికిఁ గెమ్మోవి యిచ్చినాఁ డిక్కడ వెలఁది నిక్కిన గతి విశద మయ్యె**

**ఆ. సుదతితోడ నీరు సొచ్చినాఁ డిక్కడఁ, జొచ్చి తా వెడలిన చోటు లమరెఁ**
**దరుణిఁ గాముకేళిఁ దనిపినాఁ డిక్కడ, నవఁగి పెనఁగియున్న యంద మొప్పె. 1027**

**ప్రతి :** ఇక్కడ; కొమ్మకున్= ఒక ఇంతికోసం; పువ్వులు; కోసినాడు; మొనసి= ప్రయత్నించి; పాద+అగ్రంబు= మునివ్రేళ్లు; మోపినాఁడు; ఇక్కడన్; సతిన్= ఒక మగువను; ఎత్తుకొని; జరిగినాడు= ముందుకువెళ్లినాడు; తృణములోన్= గడ్డిలో;

తెఱవజాడ= ఆమెఅడుగులతీరు; తోఁపదు= కనిపించదు; ఇక్కడన్; ప్రియకున్= ప్రియురాలికి; ధమ్మిల్లంబు= కొప్పు; పెట్టినాఁడు= సవరించాడు; కూర్చున్నచోటు; ఇది+ఎ= ఇదే; కొమరు మిగులును= అందగిస్తూ ఉంది; ఇక్కడన్; ఇంతికిన్= పొలతికి; కెంపు+మోవి= కెమ్మోవి= ఎఱ్ఱనిపెదవి; ఇచ్చినాఁడు; వెలఁది= సుందరి; నిక్కినగతి= నిక్కిన తీరు; విశదము+అయ్యెన్= తేటతెల్లం అయింది; ఇక్కడన్; సుదతితోడన్= కుందరదనతో; నీరు+చొచ్చినాఁడు= నీటిలో ప్రవేశించాడు; చొచ్చి= ప్రవేశించి; తాన్= తాను; వెడలినచోటులు= బయటికి వచ్చిన తావులు; అమరెన్= విలసిల్లుతున్నాయి; ఇక్కడన్; తరుణిన్= ఒక యువతిని; కాముకేళిన్= మదనక్రీడలో; తనిపినాఁడు= తనివి తీర్చినాడు; అనఁగి పెనఁగి+ఉన్న= అన్యోన్యంగా కలిసిమెలసి ఉన్న; అందము= సౌందర్యం; ఒప్పెన్= ఒప్పుతూ ఉంది.

**తా :** ఇక్కడ ఒక సుందరికోసం కృష్ణుడు పూలుకోసినాడు కాబోలు – మునివేళ్లమాత్రమే నేలపై మోపినాడు, ఇక్కడ ప్రీతితో కలికి నెత్తుకొని ముందుకు వెళ్లాడు కాబోలు – ఈ పచ్చికమైదానంపై ఆమెఅడుగులు అగుపించడంలేదు. ఇక్కడ ఒక మదవతి కొప్పు సవరించి చక్కదిద్దాడు కాబోలు – ఇద్దరూ కూర్చున్న ప్రదేశం సుందరంగా ఉంది. ఇక్కడ ఒక సుందరికి కెమ్మోవి ఇచ్చాడు కాబోలు – ఆమె నిక్కినతీరు తేటతెల్లం అవుతూ ఉంది. ఒక కుందరదనతో ఇక్కడ ఈ కొలనునీటిలో దిగాడు కాబోలు – నీటినుండి వెలువడిన తావులు స్పష్టంగా కనిపిస్తున్నాయి. ఇక్కడ ఒక కొమరాలిని మన్మథక్రీడలో తనియించాడు కాబోలు – ఇద్దరూ అనగి పెనగిన చిహ్నాలు అందగా విలసిల్లుతున్నాయి.

**వ. మఱియును. 1028**

**తా :** అంతే కాకుండా...

**సీ. ఒక యెలనాఁగ చేయూఁదినాఁ డిక్కడ సరస నున్నవి నాల్గుచరణములును**
**నొక నీలవేణితో నొదిఁగినా డిక్కడ మగజాడలో నిదె మగువజాడ**
**యొక లేమ మ్రొక్కిన నురివినాఁ డిక్కడ రమణి మ్రొక్కిన చొప్పు రమ్య మయ్యె**
**నొక యింతి కెదురుగా నొలసినాఁ డిక్కడ నన్యోన్యముఖములై యంఘ్రు లొప్పె**

**ఆ. నొకతె వెంటఁ దగుల నుండక యేగినాఁ, డడుగుమీఁదఁ దరుణి యడుగు లమరె**
**నబల లిరుగెలంకులందు రాఁ దిరిగినాఁ, డాఱుపదము లున్న వమ్మ! యిచట. 1029**

**ప్రతి :** ఇక్కడ; ఒక యెలనాఁగ= ఒక రమణియొక్క; చేయి+ఊఁదినాఁడు= చేయి పట్టుకొన్నాడు; నాల్గుచరణములను= నాలుగుపాదాలు; సరసన్ ఉన్నవి= పక్కపక్కనే ఉన్నాయి; ఇక్కడ; ఒక నీలవేణితోన్= నీలమైన కురులుగలిగిన ఒక యువతితో; ఒదిఁగినాఁడు; మగజాడలోన్= పురుషునిజాడలో; ఇది+ఎ= ఇదో; మగువజాడ= తరుణిజాడ; ఇక్కడ; ఒకలేమ= ఒక యువతి; మ్రొక్కినన్= నమస్కరించగా; ఉరివినాఁడు= ఒడిసిపట్టుకున్నాడు; రమణి మ్రొక్కినచొప్పు= సుందరి చేసిన వందనంతీరు; రమ్యము+అయ్యెన్= సుందరత్వం సంతరించుకొంది; ఇక్కడన్; ఒకఇంతికిన్= ఒక లేమకు; ఎదురు+కాన్= అభిముఖంగా; ఒలసినాఁడు= ముందుకు జరిగినాడు; అన్యోన్యముఖములై= ఎదురెదురై; అంఘ్రులు= పాదాలు; ఒప్పెన్= అందగించాయి; ఒకతె= ఒక సుందరి; వెంటన్+తగులన్= వెంటబడగా; ఉండక= నిలువక; ఏఁగినాఁడు= వెళ్ళినాడు; అడుగుమీఁదన్= అడుగు గుర్తుమీద; అడుగులు+అమరెను= పాదం గుర్తులు అమరాయి; ఇచట; అబలలు= యువతులు; ఇరుకెలంకుల+అందున్= రెండువైపులా; రాన్= రాగా; తిరిగినాఁడు; ఆఱుపదములు= ఆరు అడుగులు; ఉన్నవి+అమ్మ= ఉన్నాయమ్మా!

**తా :** అంతేకాదు; ఇక్కడ నందనందనుడు ఒక తరుణి చేయిపట్టుకొని నడిచాడు కాబోలు నాలుగుపాదాలున్నాయి. ఒక అందగత్తెతో ఇక్కడ ఒదిగాడు కాబోలు, పురుషునిజాడలో స్త్రీజాడ కనిపిస్తూ ఉంది. ఒక యువతి వందనం చేయగా ఇక్కడ ఒడిసి పట్టుకున్నాడు కాబోలు ఇక్కడ ఎదురెదురుగా పాదాల గుర్తులు ఏర్పాడ్డాయి. ఒక సుందరి వెంటబడగా నిలువకుండా వెళ్ళిపోయాడు కాబోలు కృష్ణునిఅడుగుల మీద ఆ అందగత్తె అడుగులు అమరి ఉన్నాయి. ఇరువైపులా ఇద్దరుతరుణులు రాగా తిరిగాడు కాబోలు ఇక్కడ ఆరుఅడుగుల గుర్తులున్నాయి.

**సీ. ఈ చరణంబులే యిందునిభానన! సనకాదిమునియోగసరణి నొప్పు**
**నీ పాదతలములే యెలనాఁగ! శ్రుతివధూ సీమంతవీథులఁ జెన్ను మిగులు**
**నీ పదాబ్జంబులే యిభకులోత్తమయాన! పాలేటిరాచూలిపట్టుఁగొమ్మ**
**లీ సుందరాంఘ్రులే యిందీవరేక్షణ! ముక్తికాంతామనోమోహనంబు**

**ఆ. లీ యడుగుల రజమె యింతి! బ్రహ్మేశాది, దివిజవరులు మౌళిదిశలఁ దాల్తు**
**రనుచుఁ గొంద ఱబల లబ్జాక్షుఁ డేగిన, క్రమముఁ గనియు నతనిఁ గానరైరి. 1030**

**ప్రతి :** ఇందునిభ+ఆనన= ఓ చంద్రముఖీ; ఈ చరణంబులు+ఏ= ఈ పాదాలే; సనక+ఆది= సనకసనందనాది; ముని= మహర్షుల యొక్క; యోగసరణిన్= ధ్యానమార్గంలో; ఒప్పున్= స్ఫురిస్తుంది; ఎలనాఁగ= ఓ సుందరీ; ఈ పాదతలములు+ ఏ= ఈ పాదాలఅడుగుభాగాలే; శ్రుతివధూ= వేదాలనేకాంతల; సీమంతవీథులన్= పాపటలపై; చెన్నుమిగులున్= అందగిస్తాయి; ఇభకుల+ఉత్తమయాన= శ్రేష్ఠమైన ఏనుగు నడకవంటి నడకగలదానా!; ఈ పద+అబ్జంబులు+ఏ= ఈ పాదపద్మాలే; పాలేటిరాచూలి= పాలకడలిపుత్రిక అయిన లక్ష్మీదేవికి; పట్టు+కొమ్మ+లు= ఆధారాలు; ఇందీవర+ఈక్షణ= ఓ కలువనయనా!; ఈ సుందర+అంఘ్రులు+ఏ= ఈ అందమైన ఈ పాదాలే; ముక్తికాంతా మనస్+మోహనంబులు= మోక్షమనేకాంత మనస్సును మోహింపజేసేవి; ఇంతి= ఓ పడతీ!; ఈ+అడుగుల రజము+ఎ= ఈ పాదాలధూళియే; బ్రహ్మ+ఈశ+ఆది= బ్రహ్మ, ఈశ్వరుడు మొదలైన; దివిజవరులు= దేవతాశ్రేష్ఠులు; మౌళిదిశలన్= తలల కొనలమీద; తాల్తురు= ధరిస్తారు; అనుచున్= అంటూ; అబలలు= వనితలు; కొందఱు; అబ్జ+అక్షుఁడు= కమలనేత్రుడైన కృష్ణుడు; ఏగిన క్రమమున్= వెళ్లిన మార్గాన్ని; కనియున్= తెలుసుకొని కూడా; అతనిన్= ఆ స్వామిని; కానరు+ఐరి= కనుగొనలేకపోయారు.

**తా :** ఓ చంద్రముఖీ! ఈ పాదాలే సనకసనందనాదిమునీశ్వరుల ధ్యానమార్గంలో వెలుగుతూ ఉండేవి; ఓ యువతీ! ఈ పాదాలే వేదాలనే కాంతల పాపట్లలో విరాజిల్లేవి; ఓ మత్తగజయానా! ఈ పాదపద్మాలే క్షీరసాగరకన్య అయిన లక్ష్మీదేవికి ఆధారాలు. ఓ కలువకంటీ! ఈ అందమైన పాదాలే ముక్తికాంతమనస్సుకు సమ్మోహనకరాలు. ఓ సుందరీ! ఈ పాదాల ధూళియే బ్రహ్మ, ఈశ్వరుడు మొదలైన దేవతాశ్రేష్ఠులు నడితలపై ధరించేవి. అంటూ కొందరు యువతులు కృష్ణుడు వెళ్లిన దారిని గుర్తించికూడా అతణ్ణి కనుగొనలేకపోయారు.

**వ. అప్పుడు. 1031**

**తా :** ఆ సమయంలో...

**సీ. పతుల దైన్యంబును భామలక్రౌర్యంబుఁ జూపుచు విభుఁ డొక్క సుదతితోడ**
**విహరింప నది యెల్లవెలఁదుల వర్జించి నాయొద్ద నున్నాఁడు నాథుఁ' డనుచు**

**గర్వించి రాఁ జాలఁ గమలాక్ష! మూఁపున నిడుకొను మనుఁడు న య్యీశ్వరుండు**
**మొఱఁగిపోయినఁ దాపమును బొంది 'యో కృష్ణ! యెక్కడఁ జనితి? ప్రాణేశ! రమణ!**

**తే. నీకు వరవుడ నయ్యెద నిలువు' మనుచు, వగవఁ గొందఱు కాంత లా వనితఁ జూచి**
**వరుఁడు మన్నింప గర్వించి వనజనేత్ర, చిక్కె నేఁడని వెఱఁగును జెంది రపుడు. 1032**

**ప్రతి :** పతుల దైన్యంబును= మగలదీనత్వాన్ని; భామలక్రౌర్యంబున్= స్త్రీల క్రూరత్వాన్ని; చూపన్= చూపడానికి; విభుఁడు= కృష్ణుడు; ఒక్కసుదతితోడన్= ఒకరమణితో; విహరింపన్= విహారం చేయగా; అది= ఆమె; ఎల్లవెలఁదులన్= అందరుస్త్రీలను; వర్జించి= వదిలేసి; నాథుఁడు= కాంతుడు; నా ఒద్దన్= నా దగ్గర; ఉన్నాడు; అనుచున్; గర్వించి; కమల+అక్ష= ఓ పద్మనేత్ర!; రాన్+చాలన్= రాలేకున్నాను; మూఁపునన్= నీ భుజంమీద; ఇడుకొనుము= ఎక్కించుకో; అనుఁడున్= అనగా; ఆ+ఈశ్వరుండు= ఆ పరమేశ్వరుడైన శ్రీకృష్ణుడు; మొఱఁగిపోయినన్= అదృశ్యంకాగా; తాపమునున్+పొంది= పరితాపంపొంది; ఓ కృష్ణా; ప్రాణ+ఈశ; రమణ= నాథా; ఎక్కడన్= ఎక్కడికి; చనితి(వి)= వెళ్లావు; నీకు; వరవుడను+అయ్యెదన్= దాసురాలినవుతాను; నిలువుము= నిలబడు; అనుచున్= అంటూ; వగవన్= పరితాపం పొందగా; కొందఱు కాంతలు= తరుణులు కొందరు; ఆ వనితన్= ఆ యువతిని; చూచి; వరుఁడు= నాథుడు; మన్నింపన్= మన్ననచేయగా; గర్వించి= మదించి; వనజనేత్ర= పద్మనయన; నేఁడు= ఇప్పుడు; చిక్కెను= చిక్కుపడింది; అని; అపుడు; వెఱఁగున్+చెందిరి= ఆశ్చర్యపడ్డారు.

**తా :** ఆ సమయంలో నాథులు తమకాంతలకు లొంగిపోయి పొందే దీనత్వాన్నీ, తరుణులు చూపే క్రూరత్వాన్నీ తెలపడానికి కృష్ణుడు ఒక సుందరితో కలిసిమెలసి విహరించాడు. అంతలో ఆ సుందరి తక్కిన యువతులందరినీ వదిలి నాథుడు తన, వద్దనే ఉన్నాడని విర్రవీగింది. ఆ గర్వంతోనే ఆమె "ఓ కమలనేత్రా! ఇక నడచి రాలేకున్నాను. నన్ను నీ భుజంపైన ఎక్కించుకో!" అని పలికింది. ఆ మాట అన్నవెంటనే కృష్ణుడు అదృశ్యమయ్యాడు. అప్పుడు ఆ వనిత పరితాపం పొంది "ఓ కృష్ణా! వల్లభా! ప్రాణేశ్వరా! ఎక్కడికి వెళ్లావు! నీకు పాదదాసినవుతాను నిలు నిలు" అంటూ పలవరించింది. అపుడు కొందరు యువతులు ఆ తరుణిని చూచి, మగనిచేత మన్ననలు పొంది, దర్పించి, ఈ పద్మనేత్ర ఇప్పుడు ఇటువంటి కష్టాలకు లోనయింది" అని విస్మయం పొందారు.

**వ. మఱియును. 1033**

**తా :** ఇంకా...

**సీ. 'ఈ పొదరింటిలో నిందాఁకఁ గృష్ణుండు నాతోడ మన్మథనటన మాడె**
**నియ్యోల మగుచోట నిందాఁకఁ జెలువుండు గాఢంబుగా నన్నుఁ గౌఁగిలించె**
**నీ మహీజమునీడ నిందాఁక సుభగుండు చిట్టంటుచేఁతల సిగ్గుగొనియె**
**నీ పుష్పలతపొంత నిందాఁక దయితుండు నను దాసి యధరపానంబు సేసె**

**ఆ. నీ ప్రసూనవేది నిందాఁక రమణుండు, గుసుమదామములను గొప్పుఁ దీర్చె**
**ననుచుఁ గొంద ఱతివ లంభోజనయనుని, పూర్వలీలఁ దలఁచి పొగడి రధిప! 1034**

**ప్రతి :** అధిప= ఓ పరీక్షిన్మహారాజా!; ఈ పొదరు+ఇంటిలోన్= ఈ పొదరింటిలో; ఇందాఁకన్= ఇంతకుముందే; కృష్ణుండు= కృష్ణుడు; నాతోడన్= నాతో; మన్మథనటనము= మన్మథక్రీడ; ఆడెను= సలిపాడు; ఈ+ఓలము+అగుచోటన్= ఈ చాటుగా

ఉండే ప్రదేశంలో; ఇందాఁకన్(ఇంత+తనుక)= ఇంతకవరకూ; చెలువుండు= వల్లభుడు; గాఢంబు+కాన్= గట్టిగా; నన్నున్; కౌఁగిలించెను= కౌగిలించుకొన్నాడు; ఈ మహీజమునీడన్= ఈ చెట్టునీడలో; ఇందాఁకన్= ఇంతవరకు; సుభగుండు= మనోహరుడైన కృష్ణుడు; చిట్టంటుచేఁతలన్ (చిట్టి+అంటుచేఁతలు)= నఖదంతక్షతాది శృంగార చేష్టలతో; సిగ్గు+కొనియెన్= నా సిగ్గుహరించాడు; ఈ పుష్పలతపొంతన్= ఈ పూలతీగవద్ద; ఇందాఁకన్= ఇంతవరకు; దయితుండు= ప్రాణేశుడు; ననున్= నన్ను; డాసి= సమీపించి; అధరపానంబు+చేసెన్= మోవి అమృతం జుర్రినాడు; ఈ ప్రసూనవేదిన్= ఈ పూలతిన్నెమీద; ఇందాఁకన్= ఇంతవరకు; రమణుండు= ప్రియుడైన కృష్ణుడు; కుసుమదామములను= పూలదండలతో; కొప్పున్+తీర్చెన్= కొప్పు అలంకరించాడు; అనుచున్= అంటూ; కొందఱు+అతివలు= రమణులు కొందరు; అంభోజనయనుని= పద్మనేత్రుని; పూర్వలీలన్= ఇంతకుముందు జరిపిన శృంగారచేష్టలను; తలఁచి= భావించి; పొగడిరి= ప్రస్తుతించారు.

**తా :** ఓ పరీక్షిన్మహారాజా! గోపకాంతల వింత చేష్టలనుగురించి ఇంకా విను. ఈ పొదరింటిలో ఇందాక కృష్ణుడు నాతో మన్మథక్రీడసలిపాడు. ఈ చాటుప్రదేశంలో ఇంతవరకూ వల్లభుడు నన్ను గాఢంగా హత్తుకున్నాడు. ఈ చెట్టునీడలోనే ఇందాక సౌభాగ్యవంతుడు శృంగారచేష్టలతో నా సిగ్గును హరించాడు. ఈ పూలతీగవద్దనే ఇందాక మనోహరుడు నన్ను సమీపించి అధరామృతం ఆస్వాదించాడు. ఈ పూలతిన్నెమీద ఇందాక రమణుడు నా కొప్పులో పూలదండలను అలంకరించాడు అంటూ కొందరు యువతులు శ్రీకృష్ణుడు ఇంతకు ముందు సలిపిన శృంగారచేష్టలను కొనియాడారు.

**మ. అని యిబ్భంగి లతాంగు లందఱును బృందారణ్యమం దీశ్వరున్**
**వనజాక్షుం బరికించి కానక విభున్ వర్ణించుచుం బాడుచున్**
**మనముల్ మాటలుఁ జేష్టలుం గ్రియలు న మ్మానాథుపైఁ జేర్చి వే**
**చని ర య్యామునసైకతాగ్రమునకున్ సంత్యక్తగేహేచ్ఛలై. 1035**

**ప్రతి :** అని= ఇలా అంటూ; ఈ+భంగిన్= ఈ విధంగా; లతా+అంగులు= తీగలవంటి సన్నని శరీరంకలవాళ్లు (సుందరులు); అందఱును= అందరూ; బృందా+అరణ్యము+అందున్= బృందావనంలో; ఈశ్వరున్= పరమేశ్వరుడైన; వనజ+అక్షున్= పద్మనేత్రుడైన కృష్ణుణ్ణి; పరికించి= వెదకి; కానక; విభున్= వల్లభుణ్ణి; వర్ణించుచున్= అభివర్ణిస్తూ; పాడుచున్= గానంచేస్తూ; మనములు= మనస్సులు; మాటలు= పల్కులు; క్రియలున్= పనులు; ఆ+మానాథుపైన్= ఆ లక్ష్మీపతిపైన్నే; చేర్చి= లగ్నంచేసి; సంత్యక్తగేహ+ఇచ్ఛన్= ఇండ్లకు వెళ్ళాలనే కోరికను వదిలినవారై; ఆ+యామునసైకత+అగ్రమునకున్= ఆ యమునా నదీతీరంలోని ఇసుకతిన్నెల మీదికి; వే= త్వరత్వరగా; చనిరి= వెళ్లారు.

**తా :** ఈ విధంగా లతాంగులైన గోపికలు బృందావనంలో పరమాత్ముడైన శ్రీకృష్ణునికి వెదకి వెదకి దర్శించలేకపోయారు. ఆ విభుని గుణాల్ని, చేష్టల్ని వర్ణిస్తూ, గానంచేస్తూ మనోవాక్కర్మలను ఆ లక్ష్మీశునిపైన్నే చేర్చి, తమతమ ఇండ్లకు వెళ్లాలనే కోర్కెలను వదలి, ఆ యమునాతీరంలోని ఇసుక తిన్నెలమీదికి త్వరత్వరగా వెళ్లారు.

**వ. చని గోపికలు హరి నుద్దేశించి యిట్లనిరి. 1036**

**ప్రతి :** గోపికలు; చని= (యమునా తీరానికి) వెళ్లి; హరిన్= శ్రీకృష్ణుణ్ణి; ఉద్దేశించి= గురించి; ఇట్లు= ఇలా; అనిరి= పలికారు.

**తా :** అలా యమునా తీరంలోని ఇసుకతిన్నెల మీదికి వెళ్లిన గోపయువతులు, కృష్ణుణ్ణి ఉద్దేశించి ఇలా పలికారు.

## ❖ గోపికాగీతలు ❖

**క. నీవు జనించిన కతమున, నో వల్లభ! లక్ష్మి మంద నొప్పె నధికమై**
**నీ వెంటనె ప్రాణము లిడి, నీ వా రరసెదరు చూపు నీ రూపంబున్. 1037**

**ప్రతి :** ఓ వల్లభ= ఓ నాథా!; నీవు; జనించిన కతమునన్= నీవు జన్మించిన కారణంగానే; మందన్= గోకులంలో; లక్ష్మి= సిరి; అధికమై; ఒప్పెను; నీవెంటన్+ఎ= నీ వెంటే; ప్రాణములు+ఇడి= ప్రాణాలుంచుకొని; నీవారు= నీ వారైన గోపికలు; అరసెదరు= వెదుకుతున్నారు; నీరూపంబున్= నీ రూపాన్ని; చూపు= చూపించు.

**తా :** ఓ నాథా! నీవు జన్మించిన కారణంగానే మా గోకులం సిరిసంపదలు అధికమై అలరారుతున్నది. నీవారైన గోపికలు నీ మీదనే ప్రాణాలుంచుకొని వెదకుతున్నారు, నీ రూపం చూపించు.

**క. శారదకమలోదరరుచి, చోరకమగు చూపువలన సుందర! మిమ్ముం**
**గోరి వెల యీని దాసుల, ధీరత నొప్పించు టిది వధించుట గాదే? 1038**

**ప్రతి :** సుందర= అందగాడా; శారద= శరత్కాలంలోని; కమల+ఉదరరుచి= పద్మగర్భంలోని కాంతిని; చోరకము+అగు= దొంగిలించే; చూపువలనన్= నీ చూపువల్ల; మిమ్మున్; కోరి; వెల+ఈని దాసులన్= జీతభత్యాలులేని దాసులను; ధీరతన్= ధీరత్వంతో; నొప్పించుట= బాధపెట్టడం; వధించుట= చంపడం; కాదు+ఏ= కాదా?

**తా :** అందగాడవైన ఓ కృష్ణా! శరత్కాల కమలాల గర్భంలోని జిగిని దొంగిలించే నీ చూపువల్ల నిన్ను వలచి జీతభత్యాలు లేని దాసులమయ్యాము. అలాంటి మమ్మల్ని ధీరుడవై నొప్పించడం నిజంగా చంపడమే కాదా?

**ఆ. విషజలంబువలన విషధరదానవు, వలన ఱాలవానవలన వహ్ని**
**వలన నున్న వానివలనను రక్షించి, కుసుమశరునిబారిఁ గూల్పఁ దగునె? 1039**

**ప్రతి :** విషజలంబువలనన్= కాళియసర్ప విషం కలిసిన యమునానదీజలం నుండి; విషధర దానవువలనన్= సర్పరూపుడైన అఘాసురునినుండి; ఱాలవానవలనన్= ఇంద్రుడు కురిపించిన రాళ్లవాననుండి; వహ్నివలనన్= కార్చిచ్చునుండి; ఉన్నవానివలను= ఇంకా ఎన్నో భయాలనుండి; రక్షించి= కాపాడి; కుసుమశరుని బారిన్= పుష్పబాణునికి అప్పగించి; కూల్పన్+తగునె= చంపడం న్యాయమా?

**తా :** ఓ స్వామీ! మమ్ములను కాళీయుని విషం కలిసిన యమునానదిలోని విషజలం నుండి కాపాడావు. సర్పరూపుడైన అఘాసురుని బారినుండి తప్పించావు. ఇంద్రుడు కురిపించిన రాళ్లవాననుండి రక్షించావు. అడవిలో చెలరేగిన కార్చిచ్చునుండి కాపాడావు. ఇలా మరెన్నో ఆపదలనుండి తప్పించావు. మరి ఇప్పుడు ఇలా కుసుమబాణుడైన మన్మథునికి మమ్ములను అప్పగించి చంపడం నీకు భావ్యమా?

**ఉ. నీవు యశోదబిడ్డఁడవె? నీరజనేత్ర! సమస్తజంతు చే**
**తో విదితాత్మ వీశుఁడవు తొల్లి విరించి దలంచి లోక ర**
**క్షా విధ మాచరింపు మని సన్నుతి సేయఁగ సత్కులంబునన్**
**భూవలయంబుఁ గావ నిటు పుట్టితి గాదె మనోహరాకృతిన్. 1040**

**ప్రతి :** నీరజనేత్ర= కమలాక్షా; నీవు; యశోదబిడ్డండవు+ఎ= యశోద కొడుకువా?; సమస్తజంతుచేతస్= సమస్తప్రాణులయొక్క బుద్ధికి; విదిత+ఆత్ముండవు= సాక్షీభూతుడవైన అంతరాత్మవు; ఈశుండవు= పరమేశ్వరుడవు; తొల్లి= పూర్వం; విరించి= బ్రహ్మదేవుడు; తలంచి= (నిన్ను) స్మరించి; లోకరక్షావిధము= లోకాన్ని రక్షించే ప్రయత్నం; ఆచరించుము= చేయుము; అని; సన్నుతి+ చేయన్+కన్= నుతింపగా; సత్+కులంబునన్= ఉత్తమకులమైన యదువంశంలో; భూవలయంబున్+కావన్= భూమండలాన్ని రక్షించడానికి; మనస్+హర+ఆకృతిన్= సుందరరూపంలో; ఇటు= ఈవిధంగా కృష్ణుడవై; పుట్టితి(వి)+కాదు+ఎ= పుట్టావు కదా!

**తా :** కమలనేత్రా! నీవు యశోదకొడుకువే కాదయ్యా! సర్వదేహధారుల బుద్ధికి సాక్షీభూతుడవైన అంతరాత్ముడవు, పరమేశ్వరుడవు. పూర్వం బ్రహ్మదేవుడు నిన్ను స్మరించి, లోకరక్షణ చేయుమని సన్నుతించగా, ఉత్తమమైన యదుకులంలో భూమండలాన్ని రక్షించడానికి నీవు జన్మించావు కదా!

**ఆ. చరణసేవకులకు సంసారభయమును, బాపి శ్రీకరంబు పట్టు గలిగి**
**కామదాయియైన కరసరోజంబు మా, మస్తకముల నునిచి మనుపు మీశ! 1041**

**ప్రతి :** ఈశ= పరమేశా!; చరణసేవకులకున్= నీ పాదసేవకులకు; సంసారభయమును+పాపి= సంసారభయాన్ని పోగొట్టి; శ్రీకరంబు= లక్ష్మీదేవిహస్తం; పట్టు+కలిగి= చేయూతగా కలిగిందై; కామదాయి+ఐన= కోరినకోర్కెలను అందించేదైన; కరసరోజంబు= కమలంవంటి (నీ) హస్తం; మా మస్తకములన్= మాశిరస్సులమీద; ఉనిచి= ఉంచి; మనుపుము= బ్రదికించు.

**తా :** స్వామీ! నీపాదసేవకులకు సంసారభయాన్ని తొలగించేదీ, లక్ష్మీదేవిహస్తాన్ని చేయూతగా కలిగిందీ, అభీష్టాలను తీర్చేదీ ఐన నీ కరకమలాన్ని మా శిరస్సులమీద ఉంచి బ్రదికించు.

**ఉ. గోవులవెంటఁ ద్రిమ్మరుచుఁ గొల్చినవారలపాపసంఘముల్**
**ద్రోవఁగఁజాలి శ్రీఁ దనరి దుష్టభుజంగఫణాలతాగ్ర సం**
**భావితమైన నీ చరణపద్మము చన్నులమీఁద మోపి త**
**ద్భావజపుష్పభల్లభవబాధ హరింపు వరింపు మాధవా! 1042**

**ప్రతి :** మాధవా= లక్ష్మీవల్లభుడవైన శ్రీకృష్ణా!; గోవులవెంటన్= ఆవులవెంట; త్రిమ్మరుచున్= తిరుగుతూ; కొల్చినవారల= పూజించేవారియొక్క; పాపసంఘముల్= పాపాలసమూహాలను; త్రోవన్+కన్+చాలి= పోగొట్టగలిగే సామర్థ్యం కలిగిందై; శ్రీన్= సిరిచేత; తనరి= విలసిల్లేదై; దుష్టభుజంగ= దుష్టసర్పమైనకాళియుని; ఫణాలతా+అగ్ర= పడగలనే తీగమీద; సంభావితము+ ఐన= గౌరవనీయమైన; నీచరణపద్మము= పద్మంవంటి నీ పాదాన్ని; మా చన్నులమీఁదన్= మా గుండెలమీద; మోపి; తద్= ఆ; భావజ= మన్మథునియొక్క; పుష్పభల్లభవబాధన్= పుష్పబాణాలవల్ల; పుట్టిన బాధను; హరింపు= పోగొట్టు; వరింపు= స్వీకరించు.

**తా :** లక్ష్మీవల్లభా! నీ పాదపద్మం గోవులవెంట సంచరించేది. పూజించేవారి పాపసమూహాలను పోగొట్టేది. దుష్టసర్పమైన కాళియుని పడగలమీద నర్తించేది. అలాంటి నీ పాదపద్మాన్ని మా గుండెలపై మోపి, మాకు మన్మథుని పూలబాణాలవల్ల సంభవించిన బాధను పోగొట్టు. మమ్మల్ని స్వీకరించు.

**క. బుధరంజనియును సూక్తయు, మధురయు నగు నీదువాణి మరఁగించెను నీ**
**యధరామృతసంసేవన, విధి నంగజతాపమెల్ల విడిపింపఁగదే! 1043**

**ప్రతి :** బుధరంజనియును= పండితులకు ఇంపు నింపేదీ; సు+ఉక్తయు= స్పష్టంగా ఉచ్చరించబడేదీ; మధురయున్+అగు= తీయనిదీ అయిన; నీదువాణి= నీ పలుకు; మరఁగించెను= మాకు నీ పట్ల అత్యాసక్తి కల్గించేది అయింది; నీ+అధర+అమృత= నీ అధరామృతంయొక్క; సంసేవనవిధిన్= ఆస్వాదనక్రియతో; అంగజతాపమున్= మన్మథబాధను; ఎల్లన్= అంతటినీ; విడిపింపన్+కదే= విడిపించవా? (విడిపించుము)

**తా :** స్వామీ! నీ పలుకు పండితులకు ఇంపు నింపుతుంది. స్పష్టంగా ఉచ్చరించబడుతుంది. తీయనైంది. అలాంటి నీ పలుకు మమ్మల్ని మరులు కొల్పింది. నీ అధరామృతం ఆస్వాదించేటట్లు చేసి మా మన్మథబాధను పోగొట్టవా?

**క. మగువలయెడ నీ క్రౌర్యము, దగునే? నిజభక్తభీతి దమనుఁడ వకటా!**
**తగదు భవద్దాసులకును, నగు మొగముం జూపి కావు నళినదళాక్షా! 1044**

**ప్రతి :** నళినదళ+అక్షా= పద్మనేత్రా!; అకటా= అయ్యో; మగువల+ఎడన్= తరుణులపట్ల; నీక్రౌర్యము= నీక్రూరత్వం; తగునే= సరైందా!; నిజభక్త= నీ భక్తులయొక్క; భీతిదమనుఁడవు= భయాన్ని పోగొట్టేవాడివి; తగదు= ఇది సరైందికాదు; భవత్+దాసులకును= నీ సేవకులకు; నగుమొగమున్= చిరునవ్వుతో కూడిన నీ ముఖాన్ని; చూపి; కావు= రక్షించు.

**తా :** పద్మనేత్రా! నీవు నీ భక్తుల భయాన్ని పోగొట్టేవాడవు. అలాంటి నీకు ఈ క్రూరత్వం తగునా? తగదుగాక తగదు. నీదాసులయిన మాకు మీ నగుమోము చూపి రక్షించు.

**మ. ఘనలక్ష్మీయుతమై వినన్ శుభదమై కామాదివిధ్వంసియై**
**సనకాదిస్తుతమై నిరంతరతపస్సంతప్తపున్నాగ జీ**
**వనమై యొప్పెడు నీ కథామృతము ద్రావం గల్గునే భూరి దా**
**న నిరూఢత్వము లేనివారలకు మానారీమనోహారకా! 1045**

**ప్రతి :** మానారీమనోహారకా= లక్ష్మీదేవియొక్క మనస్సును హరించినవాడా! కృష్ణా!; నీ కథా+అమృతము= అమృతంలాంటి నీ చరిత్ర; ఘనలక్ష్మీయుతము+ఐ= గొప్పసిరితో కూడిందై; వినన్= వినడానికి; శుభదము+ఐ= శుభాన్ని కలిగించేదై; కామ+ఆదివిధ్వంసి+ఐ= కామం మొదలైన అరిషడ్వర్గాన్ని వినాశంచేసేదై; సనక+ఆది స్తుతము+ఐ= సనకసనందనాదిమునుల చేత స్తుతింపబడేదై; నిరంతరతపస్= ఎడతెగని తపస్సుచేత; సంతప్త= తపించే; పున్నాగ జీవనము+ఐ= పురుషశ్రేష్ఠులకు జీవనమై; ఒప్పెడున్= అలరారుతూ ఉంటుంది; భూరిదాన నిరూఢత్వము= గొప్పవైన వివిధదానాలు ఇచ్చిన ప్రసిద్ధి; లేనివారలకున్= పొందనివారికి; త్రావన్= (నీ కథామృతం) త్రాగడానికి; కలుగును+ఏ= వీలవుతుందా?

**తా :** లక్ష్మీమనోహరా! నీ కథామృతం గొప్ప సిరితో కూడింది; వినడానికి శుభకరమైంది. కామం మొదలైన అరిషడ్వర్గాన్ని విధ్వంసం చేసేది. సనకాదిమునులచే స్తుతించబడేది. నిరంతరతపస్సుచేత తపిస్తూ ఉండే పురుషపుంగవులకు జీవనం కలిగించేది. అలాంటి నీ కథామృతం గొప్పగొప్పదానాలు చేసి, సుప్రసిద్ధులైన వారికే అందుతుంది కానీ ఇతరులకు అందదు.

**క. నీ నగవులు నీ చూడ్కులు, నీ నానావిహరణములు నీ ధ్యానంబుల్**
**నీ నర్మాలాపంబులు, మానసముల నాఁటి నేఁడు మగుడవు కృష్ణా! 1046**

**ప్రతి :** కృష్ణా!; నీ నగవులు= నీ నవ్వులు; నీ చూడ్కులు= నీ చూపులు; నీ నానా విహరణంబులు= నీవు మాతోచేసిన అనేక విహారాలు; నీ ధ్యానంబుల్= నీ స్మరణలు; నీ నర్మ+ఆలాపంబులు= నీ పరిహాసవచనాలు; మానసములన్= మామనసుల్లో; నాఁటి= నాటుకొని; నేఁడు= ఈ దినానికికూడా; మగుడవు= తిరిగిపోవు.

**తా :** కృష్ణా! నీ నవ్వులు, నీ చూపులు, నీ నానావిహారాలు, నీ ధ్యానాలు, నీ పరిహాసవచనాలు మా మనసుల్లో నాటుకొనిపోయాయి. అవి ఈనాటికికూడా మరలి పోవడం లేదు.

**ఆ. ఘోషభూమి వెడలి గోవుల మేపంగ, నీరజాభమైన నీ పదములు**
**గసవు శిలలుఁ దాఁకి కడునొచ్చునో యని, కలఁగు మా మనములు కమలనయన! 1047**

**ప్రతి :** కమలనయన= పద్మాక్షా!; ఘోషభూమి= మందపట్టు; వెడలి= దాటి; గోవులన్= ఆవులను; మేపన్+కన్= మేపుతూఉంటే; నీరజ+ఆభమైన= పద్మాలతో సమానమైన; నీ పదములు= నీ పాదాలు; కసవు శిలలున్= గడ్డి మొక్కలు, రాళ్లు; తాఁకి= తగిలి; కడున్+నొచ్చునో= చాలా నొప్పిచెందుతాయేమో; అని; మా మనములు= మా మనస్సులు; కలఁగున్= కలత చెందుతుంటాయి.

**తా :** పద్మనేత్రా! మందపట్టు వదిలి గోవులను మేపడానికి నీవు వెళ్లినప్పుడు పద్మాల్లాంటి నీపాదాలు గడ్డిమొక్కలూ, రాళ్లు తాకి ఎంత నొస్తాయో అని మా మనస్సులు కలత చెందుతూ ఉంటాయి.

**ఉ. మాపటివేళ నీవు వనమధ్యము వెల్వడి వచ్చి గోష్పద**
**ప్రాపితధూళిధూసరితభాసితకుంతలమై సరోరుహో**
**ద్దీపిత మైన నీ మొగము ధీరజనోత్తమ! మాకు వేడ్కతోఁ**
**జూపి మనంబులన్ మరునిఁ జూపుదు గాదె క్రమక్రమంబునన్. 1048**

**ప్రతి :** ధీరజన+ఉత్తమ= ధీరులలో శ్రేష్ఠుడా; నీవు; మాపటివేళ= సాయంకాలం; వనమధ్యము= బృందావనమధ్యంనుండి; వెల్వడి వచ్చి= బయటికి వచ్చి; గోష్పద ప్రాపిత= గోవులపాదాలవల్ల పొందబడిన; ధూళి= దుమ్ముతో; ధూసరిత= ధూసరవర్ణం, బూడిదరంగు కలిగింద్రై; భాసిత= ప్రకాశించే; కుంతలము+ఐ= కురులుకలిగింద్రై; సరోరుహ+ఉద్దీపితము+ఐన= పద్మంవలె ప్రకాశించే; నీ మొగము= నీ ముఖం; మాకున్; వేడ్కతోన్= ప్రీతితో; చూపి; మనంబులన్= మా మనస్సుల్లో; క్రమక్రమంబునన్= అంతకంతకు; మరునిన్= మన్మథుణ్ణి; చూపుదు(వు)+కాదె= పొడసూపేటట్లు చేస్తావు గదా!

**తా :** ధీరజనోత్తమా! సాయంకాలం అయ్యేటప్పటికి నీవు బృందావనంమధ్యనుండి వచ్చి, గోవుల గిట్టలవల్ల రేగిన ధూళిచే కప్పబడి, బూడిదరంగుతో ఒప్పే శిరోజాలు కలిగిన నీ ముఖం పద్మంలా ఒప్పారుతూ ఉంటుంది. అలాంటి ముఖం మాకు వేడ్కతో చూపి, క్రమక్రమంగా మా మనస్సులలో మన్మథుణ్ణి పొడసూపేటట్లు చేస్తావు.

**ఆ. భక్తకామదంబు బ్రహ్మ సేవిత మిలా, మండనంబు దుఃఖమర్దనంబు**
**భద్రకరమునైన భవదంఘ్రియుగము మా, యురములందు రమణ! యునుపఁ దగదె? 1049**

**ప్రతి :** రమణ= నాథా!; భక్తకామదంబు= భక్తులకోర్కెలను తీర్చేది; బ్రహ్మ సేవితము= బ్రహ్మదేవునిచే కొలువబడేది; ఇలా మండనంబు= భూమికి అలంకారం; దుఃఖమర్దనంబు= దుఃఖాన్ని పోగొట్టేది; భద్రకరమున్= శుభకరమూ; ఐన= అయినట్టి; భవత్+అంఘ్రియుగము= నీ పాదద్వయాన్ని; మా+ఉరములందున్= మా వక్షోజాలపై; ఉనుపన్+తగదె= ఉంచకూడదా!

**తా :** రమణా! నీ పాదద్వయం భక్తులకోర్కెలను తీర్చేది. బ్రహ్మదేవునిచే పూజింపబడేది, భూమికి అలంకారమైంది. దుఃఖాన్ని పోగొట్టేది. శుభప్రదమైంది. అలాంటి నీ పాదద్వయాన్ని మా వక్షోజాలపై ఉంచకూడదా!

**ఆ. సురతవర్ధనంబు శోకాపహరణంబు, స్వరితవంశనాళసంగతంబు**
**నన్యరాగజయమునైన నీ మధురాధ, రామృతమునఁ దాప మార్పు మీశ!** **1050**

**ప్రతి :** ఈశ= కృష్ణా!; సురతవర్ధనంబు= సంభోగప్రీతిని పెంపొందించేది; శోక+అపహరణంబు= దుఃఖాలను పోగొట్టేది; స్వరితవంశనాళ సంగతంబు= మ్రోగే మురళితో కూడింది; అన్యరాగజయమున్= ఇతరాలైన అనురాగాలను ఎక్కువచేసేది; ఐన; నీ మధుర+అధర+అమృతమునన్= నీ తీయని అధరామృతంతో; తాపము+ఆర్పుము= మా బాధను పోగొట్టు.

**తా :** కృష్ణా! నీ అధరామృతం సంభోగప్రీతిని పెంపొందిస్తుంది. శోకాన్ని పోగొడుతుంది. మోగే మురళిని ముద్దులు గొంటుంది. ఇతరాలైన అనురాగాలను అతిశయింపజేస్తుంది. అలాంటి నీ అధరామృతంతో మా బాధను పోగొట్టు.

**ఉ. నీ వడవిం బవల్ దిరుగ నీ కుటిలాలకలాలితాస్య మి**
**చ్ఛావిధిఁ జూడకున్న నిమిషంబులు మాకు యుగంబులై చనుం**
**గావున రాత్రులైన నినుఁ గన్నుల నెప్పుడుఁ జూడకుండ ల**
**క్ష్మీవర! ఱెప్ప లడ్డముగఁ జేసె నిదేల? విధాత క్రూరుఁడై.** **1051**

**ప్రతి :** లక్ష్మీవర= రమావల్లభా!; నీవు; పవల్= పగటిపూట; అడవిన్+తిరుగన్= బృందావనారణ్యంలో సంచరించడంవల్ల; నీ కుటిల+అలక= వంకరలు తిరిగిన ముంగురులచే; లాలిత+ఆస్యము= అందగించిన నీ నెమ్మోము; ఇచ్ఛావిధిన్= ఇష్టంవచ్చినంత సేపు; చూడక+ఉన్నన్= చూడకపోయినందువల్ల; నిమిషంబులు= నిమిషాలు; మాకు; యుగంబులు+ఐనన్= యుగాలవలె గడుస్తుంటాయి; కావునన్= కాబట్టి; రాత్రులు+ఐనన్= రాత్రి వేళలలోనైనా; నినున్; కన్నులన్; ఎప్పుడున్= ఎడతెగకుండా; చూడకుండన్= చూడకుండా ఉండడానికి; విధాత= బ్రహ్మదేవుడు; క్రూరుఁడు+ఐ= క్రూరత్వం కలవాడై; ఱెప్పలు= కనురెప్పలను; అడ్డము+కన్= అడ్డంగా; చేసెను= చేశాడు; ఇది; ఏల?

**తా :** ఓ రమాపతీ! నీవు పగటివేళ బృందావనారణ్యంలో సంచరిస్తూ ఉండడంవల్ల ఉంగరాలు తిరిగిన ముంగురులచేత అందగించిన నీ నెమ్మోము తనివితీరా దర్శించలేకపోతున్నాం. అందువల్ల, మాకు క్షణాలు యుగాలుగా గడుస్తున్నాయి. పోనీ, రాత్రి సమయాలలోనైనా నిన్ను నిరంతరాయంగా కన్నులనిండా దర్శిద్దామనుకుంటే క్రూరుడైన బ్రహ్మదేవుడు మాకండ్లకు రెప్పలు అడ్డంగా సృష్టించాడు గదా! ఇదెందుకో?

**ఉ. అక్కట! బంధులున్ మగలు నన్నలుఁ దమ్ములుఁ బుత్త్రకాదులున్**
**నెక్కొని రాత్రిఁ బోకుఁ డన నీ మృదుగీతరవంబు వీనులన్**
**వెక్కసమైన వచ్చితిమి వేగమె మోహము నొంది నాథ! నీ**
**వెక్కడఁ బోయితో? యెఱుఁగ మీక్రియ నిర్దయుఁ డెందుఁ గల్గునే?** **1052**

**ప్రతి :** నాథ= మనోవల్లభా!; అక్కట= అయ్యో; బంధులున్= చుట్టాలు; మగలు= భర్తలు; అన్నలున్= అన్నలు; తమ్ములున్= తమ్ములు; పుత్త్రక+ఆదులన్= కొడుకులు మొదలైనవారు; నెక్కొని= అడ్డగించి; రాత్రిన్= రాత్రివేళలో; పోకుఁడు= ఇల్లువదిలి వెళ్లకండి; అనన్= అనగా; నీమృదుగీతరవంబు= నీ మెత్తనిపాటశబ్దం; వీనులన్= మా చెవులలో; వెక్కసమైనన్= అధికంకాగా; మోహమున్+ఒంది= మోహితలమై; వేగమె= పరుగుపరుగున; వచ్చితిమి= వచ్చాము; నీవు; ఎక్కడన్= ఎక్కడికి; పోయితి(వి)+ఓ= వెళ్లావో; ఎఱుఁగము= తెలుసుకోలేకున్నాము; ఈక్రియ= ఈ విధమైన; నిర్దయుఁడు= దయలేనివాడు; ఎందున్= ఎక్కడైనా; కల్గునే= ఉంటాడా?

**తా :** మనోవల్లభా! అయ్యో! మా బంధువులు, భర్తలు, అన్నలు, తమ్ములు, కొడుకులు మొదలైనవారు రాత్రిపూట ఇల్లువదలి వెళ్లవద్దని మమ్మల్ని అడ్డగిస్తున్నా వినకుండా నీ మెత్తని మధురగీతంయొక్క సవ్వడి మా చెవులలో పడి వెక్కసం కాగా, మోహంపొందిన వాళ్లమై వడివడిగా వచ్చాం. నీవు ఎక్కడ పోయావో! తెలియదు. ఇలాంటి నిర్దయుడు ఎక్కడైనా ఉంటాడా?

**తే.** **మదనుఁ డార్వంగ నీవాడు మంతనములు, నవరసాలోకనం బగు నగుమొగంబు**
**కమల కిరవైన మహితవక్షస్థలంబు, మా మనంబుల లోఁగొని మరపెఁ గృష్ణ!"** **1053**

**ప్రతి :** కృష్ణ= ఓ శ్రీకృష్ణా!; నీవు; ఆడు మంతనములు= పలికే రహస్యాలైన పలుకులు; నవరస+ఆలోకనంబు+అగు= నవరసాలకాటపట్టయిన చూపులతో కూడిన; నగుమొగంబు= చిరునవ్వుతో కూడిన నీ ముఖం; కమలకున్= లక్ష్మీదేవికి; ఇర+ఐన= నివాసస్థలమైన; మహిత వక్షస్థలంబు= విశాలవక్షస్థలం; మదనుఁడు= మన్మథుడు; ఆర్వన్+కన్= విజయసూచకంగా కేకలువేయగా; మా మనంబులన్= మా మనసులను; లోఁగొని= వశంచేసుకొని; మరపెన్= మురిపించాయి.

**తా :** కృష్ణా! నీవు పలికే నర్మగర్భవచనాలు, నవరసాలొలికించే చూపులతో నిండిన నవ్వుమొగం, శ్రీదేవికి నివాసమైన విశాల వక్షస్థలం, మా మనసులను వశంచేసుకొని మమ్ము మురిపించాయి.

**మ.** **అరవిందంబులకంటెఁ గోమలములై యందంబులై యున్న నీ**
**చరణంబుల్ కఠినంబులై మొనయు మా చన్నుంగవల్ మోవఁగా**
**నెరియంబోలు నటంచుఁ బొక్కుదుము నీ యీ కర్కశారణ్య భూ**
**పరిసంచారము కృష్ణ! నీ ప్రియలకుం బ్రాణవ్యథం జేయదే!** **1054**

**ప్రతి :** కృష్ణ= అచ్యుతా!; అరవిందంబులకంటెన్= పద్మాలకంటే; కోమలములై= సున్నితాలై; అందంబులై= సుందరాలై; ఉన్న= ఒప్పుతూ ఉన్న; నీ చరణంబుల్= నీ అడుగులు; కఠినంబులు+ఐ= కర్కశాలై; మొనయు= ఉండే; మా చన్నుంగవల్= మా కుచాలు; మోవన్+కాన్= ఒత్తుకోగా; ఎరియన్+పోలును= కందిపోతాయి; అటంచున్= అని అనుకొంటూ; పొక్కుదుము= బాధపడతాము; నీ= నీయొక్క; ఈ= ఈ విధమైన; కర్కశ+అరణ్యభూ పరిసంచారము= కఠినమైన అరణ్య ప్రదేశాల్లో తిరగడం; నీ ప్రియలకున్= ప్రేయసులమైమాకు; ప్రాణవ్యథన్+చేయదే= ప్రాణాంతకమైన బాధను కలిగించదా?

**తా :** ఓ కృష్ణా! తామరలకంటే కోమలాలై అందాలుచిందే నీ పాదాలు కఠినమైన మాచన్నుల ఒత్తిడికి కందిపోతాయేమో నని బాధపడుతూ ఉంటాం. అలాంటిది ఈ కర్కశారణ్య భూముల్లో నీ సంచారం నీ ప్రేయసులమైన మాకు ప్రాణాంతకమైన శోకాన్ని కలిగించదా?

**క. కట్టా! మన్మథుకోలలు, నెట్టన నో నాఁట బెగడి నీ పాదంబుల్**
**పట్టికొనఁగ వచ్చిన మము, నట్టడవిని డించి పోవ న్యాయమె? కృష్ణా! 1055**

**ప్రతి :** కృష్ణా!; కట్టా= అకటా!; మన్మథుకోలలు= మదనుని బాణాలు; నెట్టననోనాఁటన్= నొచ్చేటట్లు నాటుకోగా; బెగడి= భీతిచెంది; నీ పాదంబుల్= నీ పాదాలు; పట్టికొనన్+కన్= పట్టుకోడానికి; వచ్చిన మమున్= వచ్చిన మమ్మల్ని; నదు+అడవినిన్= అరణ్యమధ్యంలో; డించి పోవన్= వదిలివెళ్లడం; న్యాయము+ఎ= న్యాయమేనా?

**తా :** కృష్ణా! అకటా! మన్మథబాణాలు మమ్మల్ని నొచ్చేటట్లు నాటుకోగా, భీతిచెంది, నీపాదాలు పట్టుకోవడానికి వచ్చాం. అలాంటి మమ్ములను నట్టడవిలో వదిలి పోవడం నీకు న్యాయమా?

**విశే :** పాదాలు పట్టుకోవడం శరణాగతిచిహ్నం. శరణాగతులను రక్షించడం భగవంతుని ధర్మం అని గుర్తు చేస్తున్నారు గోపికలు.

**క. హృదయేశ్వర! మా హృదయము, మృదుతరముగఁ జేసి తొల్లి మిక్కిలి కడ నీ**
**హృదయము కఠినము చేసెను, మదీయసౌభాగ్య మిట్టి మందము గలదే? 1056**

**ప్రతి :** హృదయ+ఈశ్వర= ప్రాణేశ్వరా!; తొల్లి= మొదట; మా హృదయము= మా మనస్సును; మృదుతరము+కన్= మిక్కిలికోమలంగా; చేసి; మిక్కిలి= అధికంగా; కడ= వేరుగా; నీ హృదయము= నీ మనసును; కఠినముచేసెను= కర్కశంగా చేసింది; అలాంటి; మదీయ సౌభాగ్యము= మా భాగ్యం; ఇట్టిమందము= ఇలాంటి దురదృష్టకరమైంది; కలదే= (ఎక్కడైనా) ఉందా?

**తా :** ప్రాణేశ్వరా! మా మనసులను ముందుగా కోమలతరంగా చేసి, తరువాత వేరుగా నీ హృదయాన్ని మిక్కిలి కర్కశంగా చేసిన మా దురదృష్టం ఎక్కడైనా (ఎవరికైనా) ఉంటుందా?

**ఉ. క్రమ్మి నిశాచరుల్ సురనికాయములన్ వడిఁ దాఁకి వీఁక వా**
**లమ్ముల తెట్టెముల్ వఱప నడ్డము వచ్చి జయింతు వంద్రు; ని**
**న్నమ్మిన ముగ్ధలన్ రహితనాథల నక్కట! నేఁడు రెండు మూఁ**
**డమ్ముల యేటుకాఁ డెగవ నడ్డము రాఁ దగదే కృపానిధీ! 1057**

**ప్రతి :** కృపానిధీ= దయామయా!; నిశాచరుల్= రాక్షసులు; సురనికాయములన్= దేవతాసమూహాలను; వడిన్= ఒక్కపెట్టున; తాఁకి= ఎదుర్కొని; వీఁకన్= పరాక్రమంతో; వాలు+అమ్ముల తెట్టముల్= వాడిబాణాల గుంపులను; వఱపన్= ప్రయోగించగా; అడ్డమువచ్చి= అడ్డపడి; జయింతువు= (రాక్షసులను) జయిస్తావు; అంద్రు= అంటారు; నిన్= నిన్ను; నమ్మిన ముగ్ధలన్= నమ్ముకున్న అమాయకగోపికలను; రహితనాథలన్= అనాథలను; అక్కట= అయ్యో; నేఁడు= ఈనాడు; రెండు మూఁడమ్ముల ఏటుకాఁడు= ఐదుబాణాల వీరుడు; ఎగవన్= వెంటాడగా; అడ్డమురాన్= అడ్డం రావడానికి; తగదే= ఉచితం కాదా?

**తా :** దయానిధీ! రాక్షసులు ఒక్కపెట్టున పరాక్రమించి, ఎదుర్కొని పట్టుదలతో దేవతలపై వాడిబాణాలు ప్రయోగించేటప్పుడు అడ్డుపడి, ఆ రాక్షసుల్ని తునుమాడుతావని అంటారు. మరి, మేము నిన్ను నమ్ముకున్న అమాయికగోపికలం. అయ్యో! ఇలాంటి మమ్మల్ని పంచబాణుడు వెంటాడుతుంటే అడ్డుపడడం ఉచితం కాదా?

**క. తియ్యవిలుకాఁడు డీకొని, వ్రయ్యలుగాఁ దూఱనేసె వనితల మనముల్**
**వియ్యాన నింక నయినం, గు య్యాలింపం గదయ్య గోవింద! హరీ! 1058**

**ప్రతి :** గోవింద= గోవిందుడా!; హరీ= శ్రీహరీ! కృష్ణా!; తియ్యవిలుకాఁడు= చెరకు విల్లుగా గలిగిన మన్మథుడు; డీకొని= ఎదిరించి; వనితల మనముల్= మా గోపికల హృదయాలను; వ్రయ్యలు+కాన్= ముక్కలుగా; తూఱన్+ఏసెన్= దూరేటట్లు బాణాలు ప్రయోగించాడు; ఇంకన్+అయినన్= ఇప్పుడైనా; వియ్యానన్= మన పరస్పరసంబంధాన్ని భావించి; కుయి+ ఆలింపన్+కద+ అయ్య= మొరాలకించవా స్వామీ!

**తా :** గోవిందా! ముకుందా! కృష్ణా! చెరకు విల్లుగా గలిగిన మన్మథుడు మమ్మల్ని ఎదిరించి, మా హృదయాలలో దూరిపోయేటట్లు బాణాలు ప్రయోగించాడు. మన పరస్పరసంబంధాన్ని భావించి, ఇకనైనా మా మొరాలకించవా స్వామీ!

**మ. అని యిట్లంగన లంచితస్వరముతో నంకించుచుం బాడుచుం**
**దను 'రావే' యని చీరి యేడువ జగత్త్రాణుండు త్రైలోక్య మో**
**హనుఁడై మన్మథమన్మథుం డయి మనోజ్ఞాకారియై హారియై**
**ఘనపీతాంబరిధారియై పొడమెఁ దత్కాంతాసమీపంబునన్. 1059**

**ప్రతి :** అని; ఇట్లు= ఇలా; అంగనలు= గోపికలు; అంచితస్వరముతోన్= ఒప్పిదమైన కంఠంతో; అంకించుచున్= ప్రస్తుతిస్తూ; పాడుచున్= పాడుతూ; తనున్= తనను; రావే; అని; చీరి= పిలిచి; ఏడువన్= దుఃఖించగా; జగత్+త్రాణుండు= విశ్వరక్షకుడు; త్రైలోక్య మోహనుఁడు+ఐ= ముల్లోకసుందరుడై; మన్మథమన్మథుండు+అయి= మన్మథునికే మన్మథుడై; మనోజ్ఞ+ఆకారి+ఐ= మనోహరరూపుడై; హారి+ఐ= హారాలు ధరించినవాడై; ఘనపీత+అంబరధారి+ఐ= చక్కని పసుపుపచ్చనిపట్టువస్త్రం ధరించి; తత్+కాంతా సమీపంబునన్= ఆ కాంతల ముందు; పొడమెన్= ప్రత్యక్షమయ్యాడు.

**తా :** ఇలా అంటూ, గోపికలు మధుర స్వరంతో ప్రస్తుతిస్తూ, పాడుతూ కృష్ణుణ్ణి 'రావే' అని పిలిచి ఏడిచారు. విశ్వరక్షకుడు, ముల్లోకసుందరుడు, మన్మథమన్మథుడు, మనోహరాకారుడు, పీతాంబరధారి, హారాలు ధరించినవాడు అయిన కృష్ణుడు, వారిముందు ప్రత్యక్షమయ్యాడు.

**విశే :** 'మన్మథమన్మథుడు' అనడం స్వామివారి అపురూప సౌందర్యం చెప్పడానికి.

**క. వచ్చిన వల్లభుఁ గనుఁగొని, విచ్చేసె నటంచు సతులు వికసితముఖులై**
**యచ్చుగ ప్రాణము లొడలికి, వచ్చిన నిలుచుండు నవయవంబుల భంగిన్. 1060**

**ప్రతి :** వచ్చిన వల్లభున్= ఇలా వచ్చిన ప్రాణనాథుణ్ణి; కనున్+కొని= దర్శించి; విచ్చేసెన్= వచ్చాడు; అటంచున్= అనుకొంటూ; సతులు= గోపికలు; వికసితముఖులు+ఐ= విప్పారిన ముఖాలు కలిగినవారై; అచ్చుగన్= అచ్చంగా; ప్రాణములు= ప్రాణాలు; ఒడలికిన్= శరీరానికి; వచ్చినన్= చేరగా; నిలుచుండు= నిలిచిన; అవయవంబుల భంగిన్= దేహేంద్రియాలవలె...

**తా :** అలా వచ్చిన ప్రాణనాథుడైన కృష్ణుణ్ణి గోపకాంతలు దర్శించారు. విజయంచేశాడని వికసించిన ముఖాలుకలవారై పోయిన ప్రాణాలు మరల వచ్చిన దేహేంద్రియాలవలె

సీ. **అబల యొక్కతె భక్తి నంజలి గావించి ప్రాణేశుకెంగేలు వట్టికొనియె**
**నింతి యొక్కతె జీవితేశ్వరుబాహువు మూఁపున నిడికొని ముదము నొందె**
**వనిత యొక్కతె తనవల్లభుతాంబూలచర్వితమాత్మహస్తమునఁ దాల్చెఁ**
**బడఁతి యొక్కతె ప్రియుపదములు విరహాగ్నితప్తకుచంబులఁ దాపుకొనియె**

ఆ. **భామ యొకతె భ్రుకుటిబంధంబు గావించి, ప్రణయభంగరోషభాషణమున**
**దష్టదశన యగుచు దండించు కైవడి, వాఁడి చూడ్కిగముల వరునిఁ జూచె.** **1061**

**ప్రతి :** అబల= పడతి; ఒక్కతె; భక్తిన్= భక్తితో; అంజలి+కావించి= దోసిలొగ్గి; ప్రాణేశు కెంగేలు= ప్రాణేశ్వరుని ఎర్రని చేతిని; పట్టికొనియెన్= పట్టుకొన్నది; ఒక్కతె ఇంతి= ఒక సుందరి; జీవిత+ఈశ్వరుబాహువు= ప్రాణనాథుని భుజాన్ని; మూఁపునన్= తన భుజంమీద; ఇడికొని= వేసుకొని; ముదమున్+ఒందెన్= ఆనందపడింది; ఒక్కతె వనిత= ఒక రమణి; తనవల్లభు= తన ప్రియుడి; తాంబూల చర్వితము= నమలిన తమ్మిని; ఆత్మహస్తమునన్= తన చేతిలో; తాల్చెన్= ధరించింది; ఒక్కతె పడఁతి= ఒక యువతి; ప్రియుపదములు= రమణుని చరణాలను; విరహ+అగ్ని= విరహమనే అగ్నిచేత; తప్త కుచంబులు= వేడెక్కిన రొమ్ములను; తాపుకొనియెన్= తాకించుకొన్నది; ఒకతె భామ= కోపించిన ఒక పడతి; భ్రుకుటీ బంధంబు+కావించి= కనుబొమ ముడివేసి; ప్రణయభంగరోషభాషణమునన్= ప్రణయభంగం కావించినందువల్ల వచ్చిన కోపంతో కూడిన పలుకులతో; దష్టదశన+అగుచున్= పెదవికొరుకుతూ; దండించుకైవడిన్= కొట్టేదానివలె; వాఁడి చూడ్కిగములన్= పదునైనచూపుల సమూహంతో; వరునిన్= మనోహరుడైన కృష్ణుణ్ణి; చూచెన్= చూచింది.

**తా :** ఒక అబల భక్తితో దోసిలొగ్గి ప్రాణనాథునికెంగేలు పట్టుకొంది. మరొక ఇంతి జీవితేశ్వరునిబాహువు తన భుజంపైన వేసుకొని సంతోషించింది. ఒక వనిత భర్త నమిలిన తమ్మిని తనచేతితో అందుకొంది. ఒక సుందరి ప్రియుని పాదాలను విరహాగ్నితో తపించిన తన స్తనాలకు అద్దుకొంది. ఒక భామ కనుబొమముడివేసి ప్రణయభంగం చేశాడని కోపంగా మాట్లాడుతూ, పెదవి కొరుకుతూ, కొట్టేదానివలె కృష్ణుని వాడి చూపులతో చూచింది.

క. **హరిముఖకమలముఁ జూచుచుఁ, దరుణి యొకతె ఱెప్పలిడక తనియక యుండెన్**
**హరిపదకమలముఁ జూచుచు, మరగి తనివి లేని సుజనుమాడ్కి నరేంద్రా!** **1062**

**ప్రతి :** నర+ఇంద్రా= ఓ పరీక్షిన్మహారాజా; హరిపదకమలమున్= హరిపాదపద్మాన్ని; చూచుచున్= చూస్తూ; మరగి= అత్యాసక్తుడై; తనివిలేని సుజనుమాడ్కిన్= తృప్తిపొందని సత్పురుషునివలె; ఒకతె తరుణి= ఒక యువతి; హరిముఖకమలమున్= శ్రీకృష్ణుని ముఖపద్మాన్ని; చూచుచున్= చూస్తూ; ఱెప్పలు+ఇడక= రెప్పలార్పకుండా; తనియక+ఉండెన్= తనివి తీరనిదై ఉండింది.

**తా :** ఓ పరీక్షిన్మహారాజా! హరిపాదకమలం దర్శిస్తూ తనివి తీరని సత్పురుషునివలె ఒక తరుణి హరిముఖపద్మాన్ని రెప్పవేయకుండా చూస్తూ తనివి తీరందై ఉంది.

ఉ. **ఒక్కలతాంగి మాధవునియుజ్జ్వలరూపము సూడ్కితీవలం**
**జిక్కఁగఁ బట్టి హృద్గతముఁ జేసి వెలిం జనకుండ నేత్రముల్**

**గ్రక్కున మూసి మేనఁ బులకంబులు గ్రమ్మఁగఁ గౌఁగిలించుచుం**
**జొక్కములైన లోచవులఁ జొక్కుచు నుండెను యోగికైవడిన్.** **1063**

**ప్రతి :** ఒక్కలతాంగి= ఒక తీగెబోడి; మాధవుని ఉజ్జ్వలరూపము= కృష్ణుని వెలుగొందే రూపాన్ని; చూడ్కితీవలన్= చూపులనే తీగెలతో; చిక్కన్+కన్= చిక్కేటట్లు; పట్టి= బంధించి; హృద్+గతమున్= హృదయంలోనికి; చేసి= చేర్చి; వెలిన్= బయటికి; చనకుండన్= వెళ్లనీకుండా; నేత్రముల్= కండ్లు; గ్రక్కునన్= తటాలున; మూసి; మేనన్= శరీరంలో; పులకంబులు= పులకలు; క్రమ్మన్+కన్= విస్తరించగా; కౌఁగిలించుచున్= (కృష్ణుని) ఆలింగనం చేసుకొంటూ; చొక్కములు+ఐన= స్వచ్ఛాలయిన; లోచవులన్= అంతరంగ రుచులతో; యోగికైవడిన్= యోగివలె; చొక్కుచున్+ఉండెను= పరవశిస్తూ ఉంది.

**తా :** ఒక లతాంగి కృష్ణుని ప్రకాశవంతమైన రూపాన్ని చూపులనే తీగెలతో చిక్కేటుగా పట్టుకొని తన హృదయంలో బంధించింది. ఆ రూపం బయటికి వెళ్లకుండా కనురెప్పలు మూసివేసింది. పులకలు కమ్ముతుండగా కృష్ణుణ్ణి కౌగిలించింది. అలా స్వచ్ఛమైన అంతరంగంలోని రుచులతో ఆమె యోగివలె పరవశిస్తూ ఉండిపోయింది.

**సీ. ఎలయించి ప్రాణేశ! యెందుఁ బోయితి వని తోరంపుటలుకతో దూఱె నొకతె**
**జలజాక్ష! ననుఁ బాసి చనఁగ నీ పాదంబు లెట్లాడె నని వగ నెయిదె నొకతె**
**నాథ! నీ వరిగిన నాప్రాణ మున్నది కూర్మియే యిది యని కుందె నొకతె**
**యీశ్వర! నను నిన్ను నిందాఁకఁ బాపెనే పాపవిధి యని పలికె నొకతె**

**ఆ. తలఁగి పోవునట్టి తప్పేమి సేసితి?, నధిప! పలుకు ధర్మ మనియె నొకతె**
**యేమినోము ఫలమొ హృదయేశ! నీమోము, మరలఁ గంటి ననుచు మసలె నొకతె.** **1064**

**ప్రతి :** ప్రాణ+ఈశ= ప్రాణనాథా!; ఎలయించి= బాధించి; ఎందున్= ఎక్కడికి; పోయితివి= వెళ్లావు; అని; తోరము+అలుకతోన్= మిక్కిలికోపంతో; ఒకతె= ఒక యువతి; దూఱెను= నిందించింది; జలజ+అక్ష= పద్మనేత్రా!; ననున్= నన్ను; పాసి= విడిచి; చనన్+కన్= వెళ్లడానికి; నీ పాదంబులు= నీ చరణాలు; ఎట్లు= ఎలా; ఆడెను= కదలినవి; అని; వగన్= బాధతో; ఒకతె= ఒకసుందరి; ఎయిదెను= వెంబడించింది; నాథ= ప్రభూ!; నీవు; అరిగినన్= వెళ్లినా; నాప్రాణము= నాజీవం; ఉన్నది; ఇది; కూర్మి+ఏ= ప్రేమేనా; అని; ఒకతె= ఒకతరుణి; కుందెను= తల్లడిల్లింది; ఈశ్వర= పరమేశా; ననున్= నన్నూ; నిన్నున్= నిన్నూ; ఇందాఁకన్= ఇంతవరకు; పాపము+విధి= క్రూరవిధాత; పాపెన్+ఏ= విడదీశాడే; అని; ఒకతె= ఒకగోపిక; పలికెన్= పలికింది; ఒకతె= ఒకగోపసుందరి; అధిప= స్వామీ; తలఁగిపోవునట్టి= నన్ను వదిలిపోయేటంత; తప్పు; ఏమి; చేసితిని= చేశాను; ధర్మము= న్యాయం; పలుకు= చెప్పు; అనియెన్= అనింది; హృదయేశ= మనోనాథా!; ఏమి నోముఫలము+ఒ= ఏమి వ్రతం చేసిన ఫలమో; నీమోము= నీ వదనాన్ని; మరలన్= మళ్లీ; కంటిన్= చూచాను; అనుచున్= అంటూ; ఒకతె; మసలెన్= విహరించింది.

**తా :** "ప్రాణనాథా! నన్ను మోసంచేసి ఎక్కడికి వెళ్లావు" అని ఒక సుందరి మిక్కిలి కోపంతో నిందించింది. "పద్మనేత్రా! నన్ను వదిలివెళ్లడానికి నీకు కాళ్లెట్లాడాయి?" అని ఒక సుందరి వాపోయింది. "ప్రభూ! నీవు వెళ్లినప్పటికీ ఇంకా నేను ప్రాణాలతోనే ఉన్నానే! ప్రేమంటే ఇదేనా?" అని ఒక గోపసుందరి వాపోయింది. "ప్రియా! ఇంతవరకు మనలను పాపాత్ముడైన విధాత విడదీశాడు గదా" అని ఒక గోపిక విలపించింది; "నాథా! నన్ను వదిలి వెళ్లేంత తప్పు నేనేం చేశానో చెప్పు. నీ కిది న్యాయమా

అని ఒక సుందరి నిలదీసింది" "మనోనాథా! ఏనోము ఫలమోకానీ, మళ్లీ నిన్ను దర్శించగలిగాను" అంటూ ఒక యువతి విహరించింది.

**క. 'పలికినఁ బ్రతిజ్ఞఁ దప్పెడిఁ, బలికించినఁ గాని రమణుఁ బలుక' నటంచుం**
**గలకంఠి యొకతె చెలితోఁ, బలుకుల నమృతములు గురియుపగిదిం బలికెన్. 1065**

**ప్రతి :** పలికినన్= మాట్లాడితే; ప్రతిజ్ఞన్= ప్రతిజ్ఞను; తప్పెడిన్= తప్పినట్లు అవుతుంది; పలికించినన్= నన్ను పలకరిస్తే; కాని; రమణున్= నాథునితో; పలుకను= మాట్లాడను; అటంచున్= అంటూ; కలకంఠి ఒకతె= మధురస్వరం గలిగిన ఒక సుందరి; చెలితోన్= తన చెలికత్తెతో; పలుకులన్= తనమాటల్లో; అమృతములు కురియుపగిదిన్= అమృతాలు కురిసేటట్లు; పలికెన్= పలికింది.

**తా :** కమ్మని కంఠస్వరంగల ఒక సుందరి "నేను ముందుగా అతనితో మాట్లాడితే నా ప్రతిజ్ఞ భంగమవుతుంది – అతడు పలకరిస్తేనేగానీ పలుకను". అంటూ తన మాటల్లో అమృతాలు కురిసినట్లు తన చెలికత్తెతో పలికింది.

**విశే :** 'మాటల్లో అమృతం కురియడం' అనేది చక్కని జాతీయం.

**క. పట్టినఁ గాని మనోవిభుఁ, బట్టఁ గదా? యంచు నొక్క బాలిక సఖి చే**
**పట్టుకొని చెప్పె ధైర్యము, పట్టెల్లను మరునిటెంకిపట్టుగ నధిపా! 1066**

**ప్రతి :** అధిపా= ఓ పరీక్షన్మహారాజా!; పట్టినన్+కాని= (కృష్ణుడు) (నన్ను) పట్టుకోనట్లయితే; మనస్+విభున్= నాప్రాణేశుణ్ణి; పట్టన్+కదా= పట్టుకోనుగదా; అంచున్= అంటూ; ఒకబాలిక= ఒకగోపబాల; పట్టు+ఎల్లను= ఆమె ధైర్యమంతా; మరునిటెంకి పట్టుగన్= మన్మథుని నివాసస్థానంకాగా; సఖి చే= తన చెలిచేయి; పట్టుకొని; ధైర్యముచెప్పెన్= ధైర్యం చెప్పింది.

**తా :** పరీక్షిన్మహారాజా! ఒక నెరజాణ తన చెలిచేయి పట్టుకొని "ప్రాణేశుడు నాచేయి పట్టుకొంటేనే నేను ఆతని చేయిపట్టుకొంటాను". అని ధైర్యంగా చెప్పింది. అయితే–ఆ ధైర్యమంతా మన్మథుని నివాసస్థానం అయింది (ఆమె ధైర్యాన్ని మన్మథుడు ఛిన్నాభిన్నం చేశాడు).

**క. చెలువుఁడు సెప్పక పోయిన, సొలపున నొకముగ్ధ మున్ను చూడ ననుచు నౌ**
**దల వంచి యుండఁ జాలక, తల యెత్తెను లోన మరుఁడు దలయెత్త నృపా! 1067**

**ప్రతి :** నృపా= రాజా; చెలువుఁడు= ప్రియుడు; చెప్పకపోయిన సొలపునన్= చెప్పకుండా పోయినాడన్న విముఖతతో; ఒక ముగ్ధ= ఒక అమాయికురాలు; మున్ను= ముందుగా; చూడను= (కృష్ణుని) చూడను; అనుచున్= అంటూ; ఔదలవంచి= తలవంచుకొని; లోనన్= ఆమె హృదయంలో; మరుఁడు= మన్మథుడు; తల+ఎత్తన్= పొడచూపగా; ఉండన్+చాలక= తలవంచుకొని ఉండలేక; తల+ఎత్తెను= తల పైకెత్తింది.

**తా :** ఓ పరీక్షిన్మహారాజా! రమణుడు తనకు చెప్పకుండా వెళ్లి పోయాడన్న విముఖతతో, అందువల్ల తాను ముందుగా అతణ్ణి చూడనని తలవంచుకొని ఉన్న ఓ అమాయకురాలు తన మనసులో మన్మథుడు ప్రేరేపించగా అట్లే తలవంచుకొని ఉండలేక తానే తలఎత్తింది.

**వ. ఇవ్విధంబున. 1068**

**ప్రతి :** ఈ+విధంబునన్= ఇలాగా...

**తా :** ఈ విధంగా

**క. హరిసురుచిర లలితాకృతిఁ, దరుణులు గని ముక్తవిరహతాపజ్వరలై**
**పరమోత్సవంబు సలిపిరి, పరమేశ్వరుఁ గనిన ముక్తబంధుల భంగిన్. 1069**

**ప్రతి :** హరి సురుచిర లలితాకృతిన్= కృష్ణునియొక్క సుందరకోమలరూపాన్ని; తరుణులు= యువతులు; కని= సందర్శించి; ముక్త విరహతాపజ్వరలు+ఐ= విరహతాపంవల్లవచ్చిన జ్వరంనుండి విడుదల పొందినవారై; పరమ+ఈశ్వరున్= పరమాత్ముణ్ణి; కనిన ముక్తబంధుల భంగిన్= సందర్శించి భవబంధాలనుండి విముక్తి పొందిన భగవద్భక్తులవలె; పరమ+ఉత్సవంబు= మహోత్సవం; సలిపిరి= చేశారు.

**తా :** కృష్ణుని సుందరకోమల రూపాన్ని సందర్శించిన తరుణులు విరహతాపజ్వరంనుంచి విముక్తలై భవబంధాలనుండి విముక్తి చెందిన భగవద్భక్తులవలె గొప్పవేడుక సలిపారు.

**వ. అంత న క్కాంతుండు గాంతాజనపరిక్రాంతుఁడై వనాంతరంబున శక్తినికరసంయుక్తుండైన పరమ పురుషుండునుంబోలె వారలం దోడ్కొని మందారకుందకుసుమపరిమళమిళితపవమానమానితమధుకర నికరఝంకారసుకుమారంబును, శరత్కాలచంద్రకిరణసందోహసందళితాంధకారంబును, యమునా తరంగసంగతకోమలవాలుకాస్ఫారంబునునై యమలినంబైనపులినంబు ప్రవేశించె. వారును జ్ఞానకాండంబున నీశ్వరుం గని విరహవేదనలు విడిచి పరిపూర్ణమనోరథలై. 1070**

**ప్రతి :** అంతన్= అప్పుడు; వన+అంతరంబునన్= బృందావనంలో; ఆ+కాంతుండు= ఆ ప్రియుడైన కృష్ణుడు; కాంతాజన పరిక్రాంతుఁడు+ఐ= గోపికలు తన చుట్టూ కొలిచి నిలువగా; శక్తి నికరసంయుక్తుండు+ఐన= సర్వజ్ఞత్వం మున్నగు శక్తుల సమూహంతో కూడినవాడైన; పరమపురుషుండునున్+పోలెన్= పరమాత్మవలె; వారలన్= గోపవనితలను; తోడ్కొని; మందార= మందారం పువ్వుల; కుందకుసుమ= మొల్లపూల; పరిమళ మిళిత= సువాసనలతో కలగలిసిన; పవమాన మానిత= మందమారుతాలతో మన్నింపబడినట్టి; మధుకరనికర= తుమ్మెదల సమూహాల; ఝంకార+సుకుమారంబును= జుంజుమ్మనే ధ్వనులతో కోమలమైంది; శరత్+కాల= శరదృతువులోని; చంద్రకిరణసందోహ= చంద్రునికిరణాల సమూహాలచేత; సందళిత+ అంధకారంబును= ఎగురుగొట్టబడిన చీకటి కలది; యమునాతరంగసంగత= యమునానది అలలతో చేరిన; కోమల వాలుకా+స్ఫారంబును+ఐ= మెత్తని ఇసుకయొక్క సమృద్ధికలదై; అమలినంబు+ఐన= స్వచ్ఛమైన; పులినంబు= సైకతస్థలానికి; ప్రవేశించెన్= చేరాడు; వారును= గోప సుందరులుకూడా; జ్ఞాన కాండంబునన్= జ్ఞానోదయ(సమయ)ం అయినందువల్ల; ఈశ్వరున్= పరమేశ్వరుణ్ణి; కని= సందర్శించి; విరహవేదనలు= విరహబాధలు; విడిచి= విడిచిపెట్టి; పరిపూర్ణమనస్+రథలు+ఐ= తమ కోరికలన్నీ సంపూర్ణంగా తీరిన వారై...

**తా :** అప్పుడు బృందావనంలో గోపసుందరులు తన చుట్టూచేరి కొలువగా శ్రీకృష్ణుడు సర్వజ్ఞత్వం మొదలైన సమూహాలతో కూడిన శక్తిని పరమేశ్వరుడువలె ప్రకాశించాడు. వసుదేవనందనుడు ఆ గోపరమణులను వెంట బెట్టుకొని మందారాల,

మొల్లపూల సువాసనలతో నిండి మందమారుతాలచే మన్నింపబడి మృదువుగా జుంజుమ్మని ఝుంకారంచేసే తుమ్మెదల సమూహంగలదీ, శరత్కాల చంద్రకిరణాల సమూహాలచేత ఛిన్నాభిన్నమైన చీకట్లు కలదీ, యమునానది అలలచేత చేరిన మెత్తని ఇసుకతో విలసిల్లేదీ, అచ్ఛమైందీ అయిన సైకతస్థలానికి చేరుకున్నాడు. అక్కడ గోపికారమణులు జ్ఞానోదయ (సమయ)ంచేత పరమాత్మను సందర్శించి, శ్రీకృష్ణునివిరహంవల్ల ఇంతవరకూ ఉన్న తాపాన్ని పోగొట్టుకున్నారు. వారి కోరికలన్నీ పరిపూర్ణంగా నెరవేరాయి.

**క. పాఠీననయన లెల్ల న, కాఠిన్య పటాంచలములఁ గౌతుకములు హృ**
**త్పీఠముల సందడింపఁగఁ, బీఠముఁ గల్పించి రంతఁ బ్రియునకు నధిపా! 1071**

**ప్రతి :** అధిపా= రాజా; పాఠీననయనలు= మీననేత్రలు; (స్త్రీలు) ఎల్లన్= అందరూ; అంతన్= అప్పుడు; అకాఠిన్యపట+ అంచలములన్= మెత్తని పైటచెరగులచేత; కౌతుకములు= ఉత్సాహాలు; హృత్+పీఠములన్= హృదయసీమలలో; సందడింపన్+ కన్= అతిశయించగా; ప్రియునకున్= తమ మనోహరునికి; పీఠమున్= ఆసనాన్ని; కల్పించిరి= అమర్చారు.

**తా :** పరీక్షిన్మహారాజా! మీననేత్రలయిన ఆగోపరమణులు తమ హృదయసీమలలో ఉత్సాహాలు సందడించగా, తమ మెత్తని పైట చెరగులతో ప్రియుడైన శ్రీకృష్ణునికి ఆసనం కల్పించారు.

**ఆ. పరమయోగిహృదయభద్రపీఠంబుల, నుండు మేటి వ్రజవధూత్తరీయ**
**పీఠమున వసించి పెంపారెఁ ద్రిభువన, దేవి లక్ష్మి మేనఁ దేజరిల్ల. 1072**

**ప్రతి :** పరమయోగి= యోగీశ్వరులయొక్క; హృదయభద్రపీఠంబులన్= పవిత్రహృదయపీఠాలలో; ఉండు= నివసించే; మేటి= శ్రేష్ఠుడైన విష్ణువు; వ్రజవధూ+ఉత్తరీయ పీఠమునన్= గోపయువతులు తమ ఉత్తరీయాలతో సిద్ధంచేసిన ఆసనం మీద; వసించి= ఆసీనుడై; త్రిభువన= త్రిభువనాలకు; దేవి= దేవేరి అయిన; లక్ష్మి= శ్రీమహాలక్ష్మి; మేనన్= తన శరీరంలో; తేజరిల్లన్= ప్రకాశించగా; పెంపారెన్= విలసిల్లాడు.

**తా :** యోగీశ్వరులహృదయాలు అనే సుఖాసనాలమీద కూర్చునే ఆ పరమేశ్వరుడు ముల్లోకాలకు దేవేరి అయిన శ్రీమహాలక్ష్మి తన శరీరంమీద తేజరిల్లగా, గోపకాంతలు పయ్యెద కొంగులతో కల్పించిన ఆసనం మీద ఆసీనుడయ్యాడు.

**విశే :** యోగీశ్వరులహృదయాలు గోపకాంతల పయ్యెదకొంగులు పరమాత్మకు ఆసనాలయ్యాయి. గోపికలు త్రేతాయుగంలో మునీశ్వరులు అనే అంశం ఇక్కడ స్ఫురిస్తున్నది.

**మ. మదనోద్దీపకుఁడైన నాథునికి సమ్మానంబు గావించుచున్**
**ముదితల్ హాసవిలోకవిభ్రమములన్ మోదించుచుం జేరి త**
**త్పదముల్ హస్తతలంబులం బిసుకుచుం బైముట్టుచున్ దూఱుచుం**
**జదురుల్ వల్కుచుఁ గూర్మి నిట్లనిరి యీషత్కోపదీప్తాస్యలై. 1073**

**ప్రతి :** ముదితల్= ఆ ముగ్ధలు; మదన+ఉద్దీపకుఁడు+ఐన= మరులు పెంపొందిస్తూ ఉన్న; నాథునికిన్= రమణునికి; సమ్మానంబు+కావించుచున్= గౌరవిస్తూ; హాసవిలోకవిభ్రమములన్= నవ్వుతో కూడిన శృంగారం ఒలకబోస్తూ; మోదించుచున్= ఆనందిస్తూ; చేరి= నాథుని దగ్గరకుచేరి; తత్+పదముల్= ఆయన పాదాలు; పిసుకుచున్= ఒత్తుతూ; పై ముట్టుచున్=

శరీరాన్ని స్పృశిస్తూ; దూఱుచున్= తూలనాడుతూ; చదురుల్+పల్కుచున్= పరిహాసవచనాలు పలుకుతూ; ఈషత్+కోపదీప్త+ఆస్యలు+ఐ= కొద్దిగా కోపం తెచ్చు కున్నందువల్ల వెలిగే ముఖాలు కలవారై; కూర్మిన్= ప్రేమతో; ఇట్లు= ఇలా; అనిరి= పలికారు.

**తా :** ఆ ముగ్ధలు మరులు పెంపొందిస్తూ ఉన్న రమణునికి సమ్మానం చేస్తూ, నవ్వుతో కూడినచూపులలో శృంగారం ఒలకపోస్తూ, ఆయనపాదాలను చేతులతో ఒత్తుతూ, ఆయనశరీరాన్ని స్పృశిస్తూ, తూలనాడుతూ, పరిహాసవచనాలు పలుకుతూ, కొద్దిగా కోపం తెచ్చుకున్నందువల్ల ప్రకాశించే ముఖాలు గలవారై ప్రేమతో ఇలా పలికారు.

**క. 'కొలిచినఁ గొలుతురు కొందఱు, గొలుతురు దముఁ గొలువకున్నఁ గొందఱు పతులం**
**గొలిచినను గొలువకున్నను, గొలువరు మఱికొంద ఱెలమి గోపకుమారా!' 1074**

**ప్రతి :** గోపకుమారా= నందనందనా; కొందఱు; కొలిచినన్= తమను సేవిస్తేనే; కొలుతురు= సేవిస్తారు; కొందఱు= మరికొందరు; తమున్= తమను; కొలువక+ఉన్నన్= సేవించకున్నా; కొలుతురు= సేవిస్తారు; కొలిచినను= సేవించినా; కొలువక+ఉన్నను= సేవించకున్నా; మఱికొందరు= ఇంకొందరు; ఎలమిన్= నెమ్మదితో; కొలువరు= సేవించరు.

**తా :** నందనందనా! కొందరు తమను సేవించిన వారినే సేవిస్తారు. మరికొందరు తమను సేవించని వారినికూడా సేవిస్తారు. ఇక కొందరు సంతోషంతో తమను సేవించేవారినీ, సేవించనివారినికూడా సేవించరు. (వీరిలో నీ వెలాంటి వాడవో తెలుపు)

**వ. అని త న్నుద్దేశించి రహస్యంబుగాఁ బలికిన సుందరుల పలుకులు విని గోపాలసుందరుం డిట్లనియె. 1075**

**ప్రతి :** అని; తన్నున్= తనను; ఉద్దేశించి= గురించి; రహస్యంబు+కాన్= నర్మగర్భంగా; పలికిన సుందరులపలుకులు= మాట్లాడిన రమణుల మాటలను; విని; గోపాలసుందరుండు= గొల్లలలో సుందరుడైన కృష్ణుడు; ఇట్లు= ఇలా; అనియెన్= పలికాడు.

**తా :** ఇలా తనను ఉద్దేశించి నర్మగర్భంగా పలికిన గోపసుందరుల పలుకులు విని గోపసుందరుడు ఇలా పలికాడు.

**సీ. 'కొలిచినఁ గొలుతురు కొందఱు పశువులభజనము భంగిని ఫలముకొఱకు**
**నై; సఖ్యధర్మములందు సిద్ధింపవు కొందఱు తండ్రులగుణముఁ దాల్చి**
**దయ గలవారలు తగినసుహృత్తులు గొలువనివారలఁ గొల్తు రెపుడు**
**ధర్మకామంబులు దనరంగఁ గొందఱు కొలువనివారిని గొలుచువారిఁ**

**ఆ. గొలుచు తలఁపులేమిఁ గొలువ రాత్మారాము, లాప్తకాము లజ్ఞు లతికఠినులు**
**వారియందుఁ బిదపవానిఁగాఁ జింతించి, యే లతాంగులార! యిట్టు లనుట. 1076**

**ప్రతి :** లతాంగులారా= ఓ తీవెబోడులారా!; కొందఱు; ఫలముకొఱకున్+ఐ= ఫలం ఆశించే; పశువుల భజనము భంగిని= పశువులను కొలిచిన విధంగా; కొలిచినన్= కొలిస్తే; కొలుతురు= కొలుస్తారు; సఖ్యధర్మముల+అందున్= స్నేహధర్మాలలో; సిద్ధింపవు= ఇలాంటివి జరగవు; తండ్రులగుణమున్= తండ్రులగుణాన్ని; తాల్చి= వహించి; దయగలవారలు= దయగలిగినవారు; తగిన సుహృత్తులు= సముచితమైన మంచిమనస్సుగలవారు; ఎపుడు= సదా; కొందఱు; ధర్మకామంబులు తనరన్+కన్=

స్నేహధర్మాలు విలసిల్లగా; కొలువనివారలన్= తమని కొలువనివారినికూడా; కొలుతురు= కొలుస్తారు; కొలువనివారినిన్= తమను కొలువని వారిని; కొలుచువారిన్= తమను కొలిచేవారిని; కొలుచుతలఁపులేమిన్= కొలిచేఉద్దేశం లేనందువల్ల; కొలువరు; ఆత్మారాములు= ఆత్మయందే రమించేవారు; ఆప్తకాములు= భోగేచ్ఛలేనివారు; అజ్ఞులు= మూర్ఖులు; అతికఠినులు= మిక్కిలి కఠినమైన మనస్సుగలవారు; వారి+అందున్= వారిలో; పిదపవానిన్+కాన్= చివరితెగకు చెందిన వాణ్ణిగా; చింతించి+ఏ= భావించే; ఇట్టులన్= ఇలా; అనుట= అనడం...

**తా :** ఓ గోపికలారా! పశువులను ఫలం ఆశించి కొలిచిన విధంగా కొందరు కొలుస్తారు. వారు తమసొంతప్రయోజనమే కోరుకునేవారు. వారికి స్వార్థమే పరమావధి. కొలిస్తేనే తిరిగి కొలవడం స్నేహధర్మంకాదు. ఇక కొందరు దయగలవారు. మంచి మనసున్నవారు. తండ్రులు ఎలాగయితే తమను కొలువని కుమారులనూ కొలుస్తారో అలాగా తమను కొలువనివారిని కూడా కొలుస్తారు. వారి స్నేహధర్మాలు ప్రతిఫలం ఆశించనివి. మరికొందరు ఇతరులను కొలిచే ఉద్దేశంలేనివారు. వీరు తమను కొలిచేవారినైనా, కొలువని వారినైనా కొలువరు. వారు ఆత్మయందే రమించేవారు, భోగేచ్ఛలేనివారు. మరికొందరు మూర్ఖులు. మిక్కిలి కఠినహృదయులు. వారిలో నన్ను ఈ చివరితెగకు చెందినవానినిగా భావించి మీరు ఇలా పలుకుతున్నారు. ఔనా?

**క. ఏ నిం దెవ్వఁడ నయినం, గా నంగనలార! పరమకారుణికుండన్**
**మానసబంధుఁడ నిత్య, ధ్యానము మీ కొసఁగవలసి తలఁగితిఁ జుండీ! 1077**

**ప్రతి :** అంగనలార= మెలతలారా; ఏన్= నేను; ఇందున్= ఈ తెగలలో; ఎవ్వఁడను+అయినన్= దేనికి సంబంధించినవాడినైనా; కాను= కాదు; పరమకారుణికుండన్= పరమదయాశీలుణ్ణి; మానసబంధుఁడన్= ఆత్మబంధువును; నిత్యధ్యానము= నిరంతరధ్యానం; మీకున్; ఒసఁగవలసి= ఇవ్వడానికి; తలఁగితిన్+చుండీ= కనిపించకుండా వెళ్లాను సుమా!

**తా :** ఓ తరుణులారా! నేను పైన చెప్పిన వారిలో ఎవ్వడనూ కాను. పరమకరుణార్ద్ర హృదయుడను. మీకు ఆత్మబంధువును. మీకు నిరంతరధ్యానం సమకూర్చడానికే కనిపించకుండా వెళ్లాను సుమా!

**విశే :** దగ్గరనే ఉంటే గోపికలకు నిరంతరధ్యానం కుదరదు. దూరంగా ఉంటేనే వారికి కృష్ణునిమీద నిరంతరధ్యానం సిద్ధిస్తుంది.

**మ. నను సేవించుచునున్న వారలకు నే నా రూపముం జూపఁ; జూ**
**చినఁ జాలించి మదించి వారు మఱి నన్ సేవింపరో యంచు; ని**
**ర్ధనికుం డాత్మధనంబు సెడ్డ నెపుడుం దత్పారవశ్యంబుఁ దా**
**ల్చిన భంగిన్ ననుఁ బాసి మత్ప్రియుఁడు దాఁ జింతించు నా రూపమున్. 1078**

**ప్రతి :** ననున్= నన్ను; సేవించుచున్+ఉన్నవారలకున్= సేవిస్తూ ఉండే వారికి; నేన్= నేను; నా రూపమున్= నా స్వరూపాన్ని; చూపన్= చూపను; చూచినన్= అలాచూస్తే; చాలించి= (నన్నుసేవించడం) మాని; మదించి= గర్వించి; వారు; మఱి= మళ్లీ; నన్= నన్ను; సేవింపరు+ఓ= సేవించరేమో; అంచున్= అని భావించి; నిర్ధనికుండు= ధనహీనుడు; ఆత్మధనంబు= తనకున్న డబ్బు; చెడ్డన్= పోతే; ఎపుడున్= సదా; తత్+పారవశ్యంబు= అదేపరవశం; తాల్చినభంగిన్= ధరించిన రీతిగా; ననున్= నన్ను; పాసి= చూడనపుడు; మత్+ప్రియుఁడు= నన్ను ధ్యానించేవాడు; తాన్= తాను; నా రూపమున్= నా స్వరూపాన్నే; చింతించున్= భావిస్తుంటాడు.

**తా :** నన్ను సేవిస్తూ ఉండేవారికి నేను నారూపం చూపించను. ఎందుకంటే నన్ను దర్శించిన తర్వాత గర్వించి నన్ను కొలవడం మానేస్తారేమోనని. తనకున్న డబ్బుపోయినప్పుడు దరిద్రుడైనవాడు నిరంతరం డబ్బు చింతలోనే మునిగి పోయినట్లు నన్ను చూడకుండా ఉంటేనే నన్ను కోరే భక్తులు నా రూపాన్ని నిరంతరం ధ్యానిస్తూ ఉంటారు.

**తరలము**

**తగవు ధర్మముఁ జూడనొల్లక తల్లిదండ్రుల బంధులన్**
**మగల బిడ్డలఁ బాసివచ్చిన మన్నిషక్తల మిమ్ము నేఁ**
**దగదు; పాసితిఁ దప్పు సైపుఁడు; తద్వియోగభరంబునన్**
**వగలఁ బొందుచు మీర లాడిన వాక్యముల్ వినుచుండితిన్. 1079**

**ప్రతి :** తగవు, ధర్మమున్= న్యాయమూ, ధర్మమూ; చూడన్+ఒల్లక= పట్టించుకోకుండా; తల్లి+తండ్రి+లన్= జననీజనకులను; బంధులన్= చుట్టాలను; మగలన్= పతులను; బిడ్డలన్= బిడ్డలను; పాసివచ్చిన= వదిలివచ్చిన; మత్+నిషక్తలన్= నా మీద మనసులను లగ్నంచేసినవారైన; మిమ్మున్= మిమ్ములను; ఏన్= నేను; తగదు= (వదలడం) సముచితం కాదు; పాసితిన్= వదిలి వెళ్లాను; తప్పు సైపుఁడు= తప్పును మన్నించండి; తద్+వియోగభరంబునన్= నావిరహభారంతో; వగలన్+ పొందుచున్= చింత పొందుతూ; మీరలు= మీరు; ఆడినవాక్యముల్= ఆడిన పలుకులను; వినుచున్+ఉండితిన్= వింటూనే ఉన్నాను.

**తా :** న్యాయమూ, ధర్మమూ పట్టించుకోకుండా మీ తల్లిదండ్రులను, బంధువులను, భర్తలను, బిడ్డలను వదిలివచ్చి, నా యందు మనసులు లగ్నంచేసిన మిమ్మల్ని వదిలివెళ్లడం న్యాయం కాదు. అలా వదిలి వెళ్లినందుకు నన్ను మన్నించండి. నా వియోగభారంతో చింతిస్తూ మీరు పలికిన పలుకులను వింటూనే ఉన్నాను.

**విశే :** కృష్ణుడు గోపికలకు క్షమాపణ చెప్పడం ఆయన గొప్పమనస్సుకు, దయార్ద్రహృదయానికి సాక్ష్యం.

**ఉ. పాయని గేహశృంఖలలఁ బాసి నిరంతరమత్పరత్వముం**
**జేయుచు నున్న మీకుఁ బ్రతిసేయ యుగంబులనైన నేర; నన్**
**బాయక కొల్చు మానసము ప్రత్యుపకారముగాఁ దలంచి నా**
**పాయుటఁ దప్పుగాఁ గొనక భామినులార! కృపన్ శమింపరే!' 1080**

**ప్రతి :** భామినులార= ఓ భామలారా! పాయని గేహశృంఖలలన్= వీడరానిసంసారం అనే సంకెళ్లను; పాసి= వదిలించుకొని; నిరంతర మత్+పరత్వమున్= ఎడతెగకుండా నాయందే మనస్సును నిమగ్నం; చేయుచున్+ఉన్నమీకున్= చేస్తూ ఉన్న మీకు; ప్రతి+చేయన్= ప్రత్యుపకారం చేయడానికి; యుగంబులన్+ఐన= ఎన్నియుగాలకైనా; నేరను= చేయలేను; నన్= నన్ను; పాయక= ఎడబాయక; కొల్చుమానసము= ధ్యానించేమనస్సు; ప్రత్యుపకారము+కాన్= తిరిగిచేసే మేలుగా; తలంచి= భావించి; నా పాయుట= నేను మిమ్ములను వదిలివెళ్లడం; తప్పు+కాన్+కొనక= తప్పుగా భావించకుండా; కృపన్= దయతో; శమింపరే= కోపాన్ని తగ్గించుకోండి.

**తా :** ఓ భామినులారా! విడిపోని సంసారమనే సంకెళ్లను తొలగించుకొని నాయందే నిరంతరాయంగా మనస్సును నిమగ్నంచేసిన మీకు, ఎన్నియుగాలైనా ప్రత్యుపకారం చేయలేను. (అంటే అంతటి గొప్ప ప్రేమమీది) నేను మిమ్ములను వదిలివెళ్లడం కృతజ్ఞత

లేనందువల్ల కాదు, నన్ను మీరు నిరంతరం ధ్యానంచేస్తూ ఉండాలనే. ఇదే నేను మీకు చేసిన ప్రత్యుపకారంగా భావించి, నేను వదిలి వెళ్లడాన్ని తప్పుగా భావించక, దయతో మీ కోపాన్ని తగ్గించండి.

**విశే :** ప్రేయసులను బతిమలాడుకునే సామాన్యప్రేమికుడిగా కృష్ణుడు క్షమాపణ చెప్పుకోవడం ఆయన లీలగానే భావించాలి.

**క. చక్కగ హరి యిటు పలికిన, చక్కనివాక్యముల నతని సంగమమున లో**
**నిక్కిన వియోగతాపము, లొక్కట విడిచిరి లతాంగు లుర్వీనాథా! 1081**

**ప్రతి :** ఉర్వీనాథా= రాజా!; హరి= కృష్ణుడు; ఇటు= ఇలా; చక్కన్+కన్= మనోహరంగా; పలికినన్= చెప్పగా; లతా+అంగులు= తీవబోడులు; చక్కనివాక్యములన్= (అతని) మనోహరమైన పలుకులతో; అతని సంగమమునన్= అతని కలయికచే; లో నిక్కిన= మదిలో పొగిలిన; వియోగతాపములు= విరహవేదనలు; ఒక్కట= ఒక్కసారిగా; విడిచిరి= వదిలేశారు.

**తా :** ఓ పరీక్షిన్మహారాజా! ఇలా మనోజ్ఞంగా పలికిన కృష్ణుని మాటలాలకించి తీవెబోడులైన గోపరమణులు అతని చక్కని మాటలతోను, సంగమంతోను, తమ హృదయాలలో ఇంతవరకూ నిండి ఉండే విరహవేదనలను, ఒక్కసారిగా వదిలేశారు.

## ❖ రాసక్రీడాభివర్ణనము ❖

**ఉ. ఆ సమయంబునన్ విభు దనంతుఁడు గృష్ణుఁడు చిత్రమూర్తియై**
**చేసెను మండలభ్రమణశీలపరస్పరబద్ధబాహు కాం**
**తా సువిలాసమున్ బహువిధస్ఫురితాననహస్తపాద వి**
**న్యాసము రాసముం గృతవియచ్చరనేత్రమనోవికాసమున్. 1082**

**ప్రతి :** ఆ సమయంబునన్= ఆ శరత్కాలంలో; విభుఁడు= లోకనాథుడు; అనంతుఁడు= అంతంలేనివాడు; కృష్ణుఁడు= శ్రీకృష్ణుడు; చిత్రమూర్తి+ఐ= విచిత్రాకారుడై; మండల భ్రమణశీల= వలయాకారంగా ఏర్పడి తిరుగుతూ; పరస్పర బాహుబద్ధ= పరస్పరం ఒకరిచేతులు ఒకరు పట్టుకొన్న; కాంతా సువిలాసమున్= గోపకాంతల విలాసంకలదీ; బహువిధస్ఫురిత= పలురీతుల స్ఫురించే; ఆనన హస్త పాద విన్యాసము= ముఖవిన్యాసాలతోను, చేతులవిన్యాసాలతోను, పాదాలవిన్యాసాలతో కూడిందీ; కృతవియచ్చరనేత్ర మనోవికాసమున్= చూస్తూ ఉన్న దేవతలనేత్రాలకు, మనస్సులకు వికసనం కలిగించేదీ అయిన; రాసమున్= రాసక్రీడను; చేసెను= చేశాడు.

**తా :** ఆ శరత్సమయంలో లోకేశ్వరుడు, అనంతుడు అయిన శ్రీకృష్ణుడు చిత్రాకారుడై గోపకాంతలతో రాసక్రీడ సలపడానికి ప్రారంభించాడు. గోపరమణులు కృష్ణుని చుట్టూ వలయాకారంగా ఏర్పడి, ఒకరిచేతులు మరొకరు సవిలాసంగా పట్టుకొని తిరిగారు. ఎన్నోవిధాలుగా స్ఫురించే ముఖవిన్యాసాలతోను, కరవిన్యాసాలతోను, పాదవిన్యాసాలతోను ఆ రాసక్రీడ పరిఢవిల్లింది. గోపికా గోవిందుల రాసక్రీడను దర్శిస్తూ ఉన్న దేవతలకండ్లకు, మనస్సులకు వికాసం కల్గించి ఆనందం నింపింది.

**వ. ఇట్లు బహుగతులం దిరుగ నేర్పరి యగు హరి దర్పించి తన యిరుగెలంకుల నలంకృతలయి కళంక రహిత చంద్రవదన లిద్దఱు ముద్దియ లుద్దిగొని వీణ లందుకొని వీణలం బ్రవీణలై, సొంపుమెఱసి యింపుగ వాయించుచు నానందలహరీనిధానం బగు గానంబు సేయ నవిరళంబై తరళంబుగాని వేడుక సరళంబగు**

మురళంబు లీలం గేల నందుకొని మధురంబగు నధరంబునం గదియించి మించి కామినీజనకబరికా సౌగంధికగంధబంధురకరాంగుళీకిసలయంబులు యతిలయంబులం గూడి వివరంబుగ మురళీవివరంబుల సారించి పూరించుచు సరిలేనిభంగిం ద్రిభంగియై కమలకర్ణికాకారంబున నడుమ నిలిచి, మఱియు గోపసుందరు లెంద ఱందఱకు నందఱయి సుందరుల కవలి యెడలం దానును దన కవలియెడల సుందరులును దేజరిల్ల, నృత్తవిద్యామహార్ణవవేలావలయవలయితంబై, విస్మితాఖండలంబైన రాసమండలంబుఁ గల్పించి, వేల్పులు హర్షంబునం గుసుమవర్షంబులు గురియ నందుఁ బ్రసూనమంజరీ సహచరంబులైన చంచరీకంబుల మించు ప్రకటించుచు సువర్ణమణిమధ్యగంబులైన మహేంద్రనీలంబుల తెఱంగు నెఱపుచుఁ, గరిణీవిహారబంధురంబులైన సింధురంబుల చెలువుఁ గైకొనుచుఁ బల్లవితకుసుమిత లతానుకూలంబులైన తమాలంబుల సొబగు నెగడించుచు మెఱపుఁదీవల నెడ నెడం బెడం గడరు నల్ల మొగిళ్ళ పెల్లు సూపుచు, తరంగిణీసంగతంబు లయిన రోహణాచలశృంగంబులబాగు లాలించుచు, జగన్మోహనుండై యుండి రక్తకమలారుణంబులును, జంద్రశకలనిర్మలనఖరసంస్ఫురణంబులును, శ్రుతినితంబినీసీమంతవీథికాలంకరణంబులును, సనకసనందనాది యోగీంద్రమానసాభరణంబులును నయిన చరణంబులు గదియ నిడి సమస్థితి నంజలిపుటంబులం బుష్పంబు లుల్లసిల్లఁ జల్లి, సల్లలిత కమలప్రశస్తంబు లయిన హస్తంబులు వల్లవీజనులకంఠంబులపై నిడి, తాను గీతానుసారంబగు విచిత్ర పాదసంచారంబులు సలుపుచు, వర్తులాకారరాసబంధంబులవర్తనంబునం బ్రవర్తించి, వెండియు వ్రేతలుం దానును శంఖ పద్మ వజ్ర కందుక చతుర్ముఖ చక్రవాళ చతుర్భద్ర సౌభద్ర నాగ నంద్యావర్త కుండలీకరణ ఖురరీబంధ ప్రముఖంబు లయిన విశేషరాసబంధంబులకుం జొచ్చి యేకపాద సమపాద వినివర్తిత గతాగత వలిత వైశాఖమండల త్రిభంగిప్రముఖంబులైన తానకంబుల నిలుచుచుఁ, గనకకింకిణీ మంజులమంజీర శింజనంబులు జగజ్జనకర్ణరంజనంబులై చెలంగ; ఘటితమర్దితపార్శ్వగప్రముఖంబులైన పాదకర్మభేదంబులు సేయుచు, సమపాద శకటవదనమతల్లీశుక్తిప్రముఖంబులైన పార్థివచారివిశేషంబులును నపక్రాంతడోలాపాదసూచీ ప్రముఖంబులైన వ్యోమచారివిశేషంబులనుం జూపుచు, సురేంద్రశాఖి శాఖామనోహరంబులును, నపహసిత దిక్కరీంద్రకరంబులును, ద్రిలోకక్షేమంకరంబులును నగు కరంబులం దిరంబులగు రత్నకటకంబుల మెఱుంగులు నింగి చెఱంగులం దఱచుకొన నర్ధచంద్రకర్తరీముఖకపిత్థ కటకాముఖశుకతుండలాంగూల పద్మకోశపతాక ప్రముఖంబులైన స్వస్వభావసూచకనానావిధకరభావంబు లాచరించుచుఁ గటినిబద్ధ సువర్ణచేలాంచల ప్రభానికరంబులు సుకరంబులై దిశాంగనాముఖంబులకు హరిద్రాలేపన ముద్రాలంకారంబు లొసంగుచు, నాస్కందితభ్రమరశకటాసనప్రముఖంబులైన జానుమండలభేదంబులును, నలాతదండలాతలలిత విచిత్రప్రముఖంబులైన దైవమండలంబులు నొనర్చుచుఁ గమనీయ కంబుకంఠాభిరామంబులు నుద్దామతేజస్తోమంబులునైన నీలమౌక్తికవజ్రవైదూర్య దామంబులరుచు లిందిరాసుందరీమందిరంబు లయి సుందరంబులైన యురంబులం దిరుగుడువడి కలయంబడ నగాంతరవాహ్యాలగ్నచ్ఛత్ర ప్రముఖంబులైన భ్రమణవిశేషంబుల విలసించుచు, నిద్దంబులగు చెక్కుటద్దంబుల నుద్దవిడిం దద్దయుం బ్రభాసిత

**చంద్రమండలంబులందు కుండలంబులమెఱుంగు మొత్తంబులు నృత్యంబు లొనరింపఁ గటిభ్రాంతదండరచిత లలాటతిలకమయూరలలితచక్రమండల నికుంచితగంగావతరణ ప్రముఖంబులైన కరణంబు లెఱింగించుచు, వెలిదమ్మివిరులసిరులఁ జెన్ను మిగులు కన్నులవలన దీనజనదైన్య కర్కశంబులై తనరు కటాక్షదర్శనజాలంబులు జాలంబులై కామినీజన నయనమీనంబుల నావరింప లలితకుంచితవికాసముకుళ ప్రముఖంబు లయిన చూడ్కులం దేజరిల్లుచు, ననేక పరిపూర్ణచంద్రసౌభాగ్యసదనంబులగు వదనంబులఁ బ్రసన్నరాగంబులు ప్రకటించుచు, నుదంచిత పింఛమాలికామయూఖంబు లకాలశక్రచాపంబుల సొంపు సంపాదింప, నికుంచితాకుంచితకంపితాకంపిత పరివాహితపరావృత్త ప్రముఖంబులైన శిరోభావంబులు నెఱపుచు, మృగనాభితిలకంబులు గల నిటలఫలకంబులఁ జికురంబుల నికరంబులు గప్ప, నపరాజితసూచికావిద్ధపరిచ్ఛిన్న విష్కంభరేచిత ప్రముఖంబులగు నంగహారంబుల విలసిల్లుచుఁ, జరణకటికరకంఠరేచకంబు లాచరించుచు నొప్పె; నప్పు డా రాసంబు సంజనితసకలజనమానసోల్లాసకరంబై సుధార్ణవంబునుంబోలె నుజ్జ్వలరసాభిరామంబై, రామరాజ్యంబునుంబోలె రాగపరిపూర్ణంబై, పూర్ణచంద్రమండలంబునుంబోలెఁ గువలయానందంబై, నందనవనంబునుంబోలె భ్రమరీవిరాజమానంబై, మానధనుచిత్తంబునుంబోలెఁ బ్రధానవృత్తిసమర్థంబై, సమర్థకవివిలసనంబునుంబోలె బహుప్రబంధభాసురంబై, సురలోకంబునుంబోలె వసుదేవనందనవిశిష్టంబై, శిష్టచరితంబునుంబోలె ధరణీగగనమండలసుందరంబై, సుందరీరత్నంబునుంబోలె నంగహారమనోహరంబై, హారవధూనిలయంబునుంబోలె ననేకచారిసుకుమారంబై, సుకుమారవృత్తంబునుంబోలె నుద్దీపితవంశంబై యుండె; నందు.** **1083**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; బహుగతులన్= అనేక విధాలైన గతులతో; తిరుగన్= తిరగడంలో; నేర్పరి+అగుహరి= ప్రవీణుడైన శ్రీకృష్ణుడు; దర్పించి= విజృంభించి; తన ఇరు కెలంకులన్= తనకు రెండువైపులా; అలంకృతలు+అయి= అలంకరించుకొన్నవారై; కళంకరహితచంద్రవదనలు= మచ్చలేని చంద్రబింబంవంటి ముఖాలు కలిగినవారు; ఇద్దఱు; ముద్దియలు= ముగ్ధలు; ఉద్దిగొని= జోడుగా; వీణలు+అందుకొని= వీణలు తీసుకొని; వీణలన్= వీణావాదనంలో; ప్రవీణలు+ఐ= నేర్పరులై; సొంపుమెఱసి= తమ అందాన్ని మెరిపిస్తూ; ఇంపు+కన్= మనోహరంగా; వాయించుచున్= వాయిస్తూ; ఆనందలహరీనిధానంబు= సంతోషరసప్రవాహానికి ఉనికి పట్టు; అగు= అయిన; గానంబు+చేయన్= పాటపాడగా; అవిరళంబు+ఐ= ఎడతెగనిదై; తరళంబు+కాని= చలించునదికాని; వేడుకన్= కుతూహలంతో; సరళంబు+అగు= స్వరశుద్ధి కల్గిందైన; మురళయు= వేణువును; లీలన్= విలాసంగా; కేలన్= చేతితో; అందుకొని= పుచ్చుకొని; మధురంబు+అగు+అధరంబునన్= తియ్యని మోవిపైన; కదియించి= చేర్చి; మించి= అతిశయించి; కామినీజన= గోపస్త్రీలయొక్క; కబరికా= కొప్పులలోని; సౌగంధిక= ఎఱ్ఱదామరల; గంధ= సువాసనచేత; బంధుర= ఇంపైన; కర+అంగుళీ= చేతివ్రేళ్లనే; కిసలయంబులు= చిగుళ్లు; యతి లయంబులన్= విశ్రమస్థానాలతోను, నృత్తగీతవాద్యాలను సమరసంచేయుటతోను; కూడి= కూడగా; వివరంబు+కన్= విశదంగా; మురళీవివరంబులన్= పిల్లనగ్రోవి రంధ్రాలలో; సారించి= ప్రసరింపజేసి; పూరింపుచున్= ఊదుతూ; సరిలేనిభంగిన్= సాటిలేనిరీతిగా; త్రిభంగి+ఐ= ముప్వంపులతో; కమలకర్ణికా+ఆకారంబునన్= తామర మధ్యలోగల దుద్దుమాదిరి; నడుమన్+నిలిచి= మధ్యలో నిలబడి; మఱియున్= ఇంకా; గోపసుందరులు= గోపికారమణులు; ఎందఱు= ఎందరో; అందఱకున్= అందరికీ; అందఱు+అయి= అంతమంది శ్రీకృష్ణులై; సుందరులకున్= గోపికారమణులకు; అవలి+ఎడలన్=

అవతలి ప్రదేశాలలో; తానును= తానూ; తనకున్= తనకు; అవలి+ఎడలన్= అవతలివైపు; సుందరులును; తేజరిల్లన్= ప్రకాశించగా; నృత్తవిద్యా= నాట్యం అనే విద్యారూపమైన; మహా+అర్ణవ= మహాసముద్రానికి; వేలావలయ= చెలియలికట్టలాగా; వలయితంబు+ఐ= చుట్టుకోబడిందై; విస్మిత+అఖండలంబు+ఐన= ఇంద్రునికి కూడా విస్మయం కలిగించేదైన; రాసమండలంబున్= రాసమండలాన్ని (రాసము= చాలామంది నాట్యగత్తెలతో కూడి చేసే మండలాకార నృత్యం. మండలము= గుండ్రంగా నిలబడడం) కల్పించి= ఏర్పరచి; వేల్పులు= దేవతలు; హర్షంబునన్= ఆనందంతో; కుసుమవర్షంబులు= పూలవానలు; కురియన్= కురిపించగా; అందున్= ఆ రాసమండలంలో; ప్రసూనమంజరీ సహచరంబులు+ఐన= పూలగుత్తులలో సంచరించేవైన; చంచరీకంబులన్= తుమ్మెదలయొక్క; మించు= అతిశయాన్ని; ప్రకటించుచున్= వెల్లడిస్తూ; సువర్ణమణి మధ్యగంబులు+ఐన= బంగారు, మణుల మధ్యనున్న; మహా+ఇంద్ర నీలంబుల తెఱంగున్= ఇంద్రనీలమణుల రీతిని; నెఱపుచున్= ప్రసరింపజేస్తూ; కరిణీవిహార బంధురంబులు+ఐన= ఆడ ఏనుగులతో కలసి విహరించడంలో మేటి అయిన; సింధురంబుల చెలువున్= మగ ఏనుగుల అందాన్ని; కైకొనుచున్= పుణికిపుచ్చుకొంటూ; పల్లవిత= చిగిర్చిన; కుసుమిత= పూచిన; లతా= తీగలకు; అనుకూలంబులు+ఐన= అల్లుకోడానికి అనువైన; తమాలంబులసొబగున్= చీకటిమాకులఅందాన్ని; నెగిడించుచున్= వర్ధిల్లజేస్తూ; మెఱపు తీవలన్+ఎడన్+ఎడన్= మెరుపుతీగెల మధ్యమధ్యలో; బెడంగు+అడరు= అందగిస్తున్న; నల్ల మొగిళ్ల పెల్లు చూపుచున్= నల్లమబ్బుల అతిశయాన్ని చూపుతూ; తరంగిణీ సంగతంబులు+అయిన= ఏరులతో కూడిన; రోహణ+అచలశృంగంబులబాగున్= రత్నపర్వతంయొక్క శిఖరాల సౌందర్యాన్ని; లాలించుచున్= ఆకర్షిస్తూ; జగత్+ మోహనుండు+ఐ= విశ్వమోహనుడై; ఉండి; రక్తకమల+అరుణంబులును= కెందామరల్లాగా ఎఱ్ఱనైనవీ; చంద్రశకల నిర్మల= చంద్రరేఖల్లాగా స్వచ్ఛమైన; నఖర సంస్ఫురణంబులును= గోళ్లచేత బాగా ప్రకాశించేవీ; శ్రుతినితంబినీ= వేదసుందరియొక్క; సీమంత వీథికా+అలంకరణంబులును= పాపటలు అనే వీథులకు (మార్గాలకు) అలంకారాలయినవీ; సనకసనందన+ఆది= సనక సనందనులు మొదలైన; యోగి+ఇంద్ర= ఋషిశ్రేష్ఠులయొక్క; మానస+ఆభరణంబులును= మనస్సులకు సొమ్ములైనవీ; అయిన; చరణంబులు= పాదాలు; కదియన్+ఇడి= చేరువగా ఉంచి; సమస్థితిన్= సరైన ఉనికిచేత; అంజలిపుటంబులన్= దొప్పల్లాంటి దోసిళ్లలో; పుష్పంబులు= పూలు; ఉల్లసిల్లన్= రాజిల్లగా; చల్లి; సత్+లలిత= మిక్కిలి కోమలమై; కమలప్రశస్తంబులయిన= పద్మాలవలె ప్రశస్తమైన; హస్తంబులు= చేతులు; వల్లవీజనుల= గోపసుందరుల; కంఠంబులపైన్= మెడలపైన; ఇడి= ఉంచి; తాను; గీత+అనుసారంబు+అగు= పాటను అనుసరించిన; విచిత్రపాదసంచారంబులు= వింతవింతలైన పాదాల కదలికలు; సలుపుచున్= చేస్తూ; వర్తుల+ఆకార= గుండ్రనిఆకారం కలిగిన; రాసబంధంబులు= రాసక్రీడ నిర్వహించడంలోని బంధాలు; వర్తనంబునన్= నడిచే రీతిలో; ప్రవర్తించి= నడిచి; వెండియున్= ఇంకా; వ్రేతలున్= గోపరమణులు; తానును= తానూ; శంఖ, పద్మ, వజ్ర, కందుక, చతుర్ముఖ, చక్రవాళ, చతుర్భద్ర, సౌభద్ర, నాగ, నంద్యావర్త, కుండలీకరణ, ఖురరీ బంధ ప్రముఖంబులు+ఐన= మొదలైన; విశేష= విశిష్ట; రాసబంధంబులకున్= రాసక్రీడాబంధాలకు; చొచ్చి= ప్రవేశించి; ఏకపాద, సమపాద, వినివర్తిత, గతాగత, వలిత, వైశాఖ, మండల త్రిభంగి ప్రముఖంబులు+ఐన= మొదలైన; తానకంబులన్= నిలుకడలలో; నిలుచుచున్= నిలుస్తూ; కనకకింకిణీ= బంగారు గజ్జెల; మంజుల= మనోజ్ఞాలయిన; మంజీర= అందెలయొక్క; శింజనంబులు= మ్రోతలు; జగత్+జన= లోకంలోని జనులయొక్క; కర్ణరంజనంబులు+ఐ= చెవులకు ఇంపు గొలిపేవై; చెలంగన్= అతిశయిల్లగా; ఘటిత, మర్దిత, పార్శ్వగ ప్రముఖంబులు+ఐన= మొదలైన; పాదకర్మభేదంబులు= కాలితో చేసే చేష్టావిశేషాలను; చేయుచున్= చేస్తూ; సమపాద, శకటవదన, మతల్లీశుక్తి+ప్రముఖంబులు+ఐన= మొదలైన; పార్థివచారి విశేషంబులును= భూమిసంబంధమైన సంచారభేదాలూ; అపక్రాంత, డోలాపాద, సూచీ ప్రముఖంబులు+ఐన= మొదలైన; వ్యోమచారి విశేషంబులన్= భూమినంటకుండా చేసే సంచార విశేషాలూ; చూపుచున్= ప్రదర్శిస్తూ; సుర+ఇంద్రశాఖి=

దేవేంద్రునిదైన కల్పతరువుయొక్క; శాఖామనోహరంబులును= కొమ్మలవలె మనోహరాలు; అపహసిత= పరిహసింపబడిన; దిక్+కరీంద్ర కరంబులును= దిగ్గజాల తొండాలు కలిగినవీ; త్రిలోక క్షేమంకరంబులును= మూడులోకాలకు శుభప్రదమైనవీ; అగు= అయిన; కరంబులన్= చేతులలో; తిరంబులగు= నిలుకడగలిగినవైన; రత్నకటకంబుల మెఱుంగులు= రత్నాలు తాపినకడియాల నిగనిగకాంతులు; నింగి చెఱంగులన్= ఆకాశం అంచుల్లో; తఱచుకొనన్= దట్టంగా వ్యాపించగా; అర్ధచంద్ర, కర్తరీముఖ, కపిత్థ, కటకాముఖ, శుకతుండ, లాంగూల, పద్మకోశ, పతాక ప్రముఖంబులు+ఐన= మొదలైన; స్వస్వభావ సూచక= వారివారి అభిప్రాయాలను సూచించే; నానావిధ= బహుభంగులైన; కరభావంబులు= చేతులతో చేసే అభినయాలు; ఆచరించుచున్= చేస్తూ; కటినిబద్ధ= నడుముకు కట్టుకొన్న; సువర్ణచేల+అంచల= బంగారువన్నెగల వస్త్రంయొక్క; ప్రభానికరంబులు= కాంతిసమూహాలు; సుకరంబులు+ఐ= మంచిచేతులై; దిశా+అంగనాముఖంబులకు= దిక్కులనే స్త్రీల ముఖాలకు; హరిద్రాలేపన= పసుపుపూయడం అనే; ముద్రా+అలంకారంబులు= అచ్చొత్తడం అనే అలంకారాలు; ఒసంగుచున్= ఇస్తూ; ఆస్కందిత, భ్రమర, శకటాసన ప్రముఖంబులైన= మొదలైన; జానుమండల భేదంబులును= మోకాళ్లతో నిలిచిచేసే మండలాకారనృత్యవిశేషాలు; అలాత, దండలాత, లలిత, విచిత్ర-ప్రముఖంబులైన; దైవమండలంబులు= దేవతామండల నృత్యాలను; ఒనర్చుచున్= చేస్తూ; కమనీయ= మనోజ్ఞాలయిన; కంబుకంఠ+ అభిరామంబులున్= శంఖాలవంటి కంఠాలతో ఒప్పిదాలయినవీ; ఉద్దామ తేజస్తోమంబులును= అత్యధికమైన తేజస్సులయొక్క గుంపులుకలవీ; ఐన; నీల= నీలాల; మౌక్తిక= ముత్యాల; వజ్ర= వజ్రాల; వైదూర్య= వైదూర్యాల; దామంబుల= హారాలయొక్క; రుచులు= కాంతులు; ఇందిరాసుందరీ మందిరంబులు+అయి= లక్ష్మీదేవికి నివాసస్థానాలై; సుందరంబులు+ఐన= ఒప్పిదాలైన; ఉరంబులన్= వక్షస్థలాలతో; తిరుగుడు+పడి= కిందుమీదై; కలయన్+పడన్= చిక్కుపడగా; అంగాంతర, వాహ్యాలగ్న, ఛత్ర ప్రముఖంబులు అయిన; భ్రమణ విశేషంబులన్= తిరిగే విశేషాలతో; విలసించుచున్= ప్రకాశిస్తూ; నిద్దంబులు+అగు= మెరుగులు దేరుతున్న; చెక్కు+ అద్దంబులన్= అద్దాల్లాంటి చెక్కిళ్లమీద; ఉద్దవిడిన్= అధికమైన తేజస్సువలన; తద్దయున్= మిక్కిలి; ప్రభా= కాంతిచేత; సిత= తెల్లనైన; చంద్రమండలంబుల+అందున్= చంద్రబింబాలలో; కుండలంబుల మెఱుంగు మొత్తంబులు= కుండలాల కాంతుల సమూహాలు; నృత్యంబులు+ఒనరింపన్= తళతళమని మెరయగా; కటిభ్రాంత; దండరచిత, లలాటతిలక, మయూర లలిత, చక్రమండల, నికుంచిత, గంగావతరణ ప్రముఖంబులు+ఐన= మొదలైనవైన; కరణంబులు= చేష్టలను; ఎఱింగించుచున్= తెలుపుతూ; వెలిదమ్మివిరుల= తెల్లదామర పువ్వులయొక్క; సిరులన్= సౌందర్యసంపదలతో; చెన్నుమిగులు= అందాన్ని మించిందైన; కన్నులవలనన్= కన్నులనుండి; దీనజనదైన్య కర్కశంబులు+ఐ= దరిద్రులదైన్యాన్ని పారదోలేవై; తనరు= ఒప్పారే; కటాక్షదర్శనజాలంబులు= కడగంటి చూపుల గుంపులు; జాలంబులు+ఐ= వలలై; కామినీజన నయన మీనంబులన్= సుందరీమణుల నేత్రాలనే చేపల్ని; ఆవరింపన్= వ్యాపించగా; లలిత= మనోహరమైన; కుంచిత= ముడిగింపబడిన; వికాస= తేటదనం కల; ముకుళ= మూసుకోబడిన; ప్రముఖంబులు+అయిన= మొదలైన; చూడ్కులన్= చూపులతో; తేజరిల్లుచున్= ప్రకాశిస్తూ; అనేక= పెక్కండ్రయిన; పరిపూర్ణ= పదారు కళలతో నిండుకొని ఉన్న; చంద్ర= చంద్రునియొక్క; సౌభాగ్య= సౌందర్యానికి; సదనంబులు= గృహాలు; అగు వదనంబులన్= అయిన ముఖాల నుండి; ప్రసన్నరాగంబులు= తేటదనంతో కూడిన అనురక్తులను; ప్రకటించుచున్= స్పష్టంగా కనిపించేట్లు చేస్తూ; ఉదంచిత= మిక్కిలి నిక్కి ఒప్పుతున్న; పింఛ= నెమలిపురులనే; మాలికా= సరాలయొక్క; మయూఖంబులు= కాంతులు; అకాలశక్రచాపంబుల సొంపు= కాలంగాని కాలంలో ఏర్పడిన హరివిల్లుల అందాన్ని; సంపాదింపన్= కలిగించగా; నికుంచిత, ఆకుంచిత, కంపిత, ఆకంపిత, పరివాహిత, పరావృత్త - ప్రముఖంబులు+ఐన= మొదలైన; శిరస్+భావంబులు= శిరస్సుతో చేసే అభినయభావాలు; నెఱపుచున్= కనబరుస్తూ; మృగనాభి తిలకంబులు= కస్తూరిబొట్లు; కల= ఉన్న; నిటల ఫలకంబులన్= నొసటి ప్రదేశాలను; చికురంబుల

నికురంబులు= ముంగురుల సమూహాలు; కప్పన్= ఆవరించగా; అపరాజిత, సూచికా, ఆవిద్ధ, పరిచ్ఛిన్న, విష్కంభ, రేచిత- ప్రముఖంబులు= మొదలైనవి; అగు= అయిన; అంగహారంబులన్= అవయవాల కదలికలచేత; విలసిల్లుచున్= ఒప్పుతూ; చరణ= పాదాల; కటి= పిరుదుల; కర= చేతుల; కంఠ= మెడలతో; రేచకంబులు= తిలకనృత్యాలు; ఆచరించుచున్= చేస్తూ; ఒప్పెన్= అతిశయిల్లెను; అప్పుడు; ఆ రాసంబు= ఆ రాసక్రీడ; సంజనిత= పుట్టిన; సకలజన= జనులందరి; మానస+ ఉల్లాసకరంబు+ఐ= మనస్సులకు ఉత్సాహం కలిగించేదై; సుధా+అర్ణవంబునున్+పోలెన్= పాలసముద్రంవలె; ఉజ్జ్వల రస+అభిరామంబు+ఐ= ప్రకాశించే శృంగారాదిరసాలతో మనోజ్ఞమై, (తేటగా కనబడే నీళ్లతో మనోహరమైనదై అని మరో అర్థం); రామరాజ్యంబునున్+పోలెన్= శ్రీరామునిరాజ్యంవలె; రాగపరిపూర్ణంబు+ఐ= శ్రీరాగం మొదలైన వాటిచేత నిండుకొని ఉన్నదై (జనుల అనురాగంతో నిండుకొని ఉన్నదై అని మరో అర్థం) పూర్ణచంద్రమండలంబునున్+పోలెన్= పదారుకళలలో నిండుకొన్న చంద్రబింబంవలె; కువలయ+ఆనందంబు+ ఐ= భూమండలానికి సంతోషం కలిగించేదై (భూమిమీద జనులకు ఆనందం కలిగించేదై అని భావం); (కలువపూలకు వికాసం కలిగించేదై అని మరో అర్థం;) నందనవనంబునున్+పోలెన్= నందనవనంవలె; భ్రమరీవిరాజమానంబు+ఐ= నొసటిని కప్పివేస్తున్న ముంగురులచేత ప్రకాశించేదై; (తుమ్మెదలచేత ప్రకాశిస్తున్నదై-అని మరోఅర్థం); మానధను చిత్తంబునున్+పోలెన్= అభిమానమే ధనంగా గలిగినవాని మనస్సువలె; ప్రధానవృత్తి సమర్థంబు+ఐ= ముఖ్యమైన వృత్తి యందలి నైపుణ్యం కలిగినదై; సమర్థకవివిలసనంబునున్+పోలెన్= సమర్థుడైన కవియొక్క సామర్థ్య ప్రకటనవలె; బహుప్రబంధభాసురంబు+ఐ= నానావిధాలైన ప్రకృష్టబంధాలతో ప్రకాశించేదై (అనేక కావ్యాలచేత ప్రకాశించేదై-అని మరో అర్థం); సురలోకంబునున్+పోలెన్= దేవలోకంవలె; వసుదేవనందన విశిష్టంబు+ఐ= వసుదేవుని కొడుకైన శ్రీకృష్ణునిచేత విశేషించినదై; (వసువులచేత, దేవతలచేత, నందనవనంచేత విశేషించిందై అని మరో అర్థం) శిష్టచరితంబునున్+పోలెన్= పెద్దలనడవడివలె; ధరణీగగనమండల సుందరంబు+ఐ= భూమండలంలోను, ఆకాశమండలంలోను అందమైందై; సుందరీరత్నంబునున్+పోలెన్= స్త్రీరత్నంవలె; అంగహారమనోహరంబు+ఐ= అవయవాల కదలికలచేత మనోజ్ఞమై (అవయవాలచేత, కంఠహారాలచేత మనోజ్ఞమై అని మరో అర్థం); హరవధూనిలయంబునున్+పోలెన్= పార్వతీదేవి ఇల్లువలె; అనేక చారి సుకుమారంబు+ఐ= బహువిధ సంచారాలచేత మృదువై; సుకుమార వృత్తంబునున్+పోలెన్= గుణవంతుడైన కుమారునివల్ల కులం ప్రకాశించినట్లు; ఉద్దీపితవంశంబు+ఐ= మిక్కిలి ప్రకాశించే పిల్లనగ్రోవికలదై (మిక్కిలి వన్నెకెక్కిన వంశం కలదై అని మరో అర్థం) ఉండెను= విలసిల్లెను; అందున్= ఆరాసక్రీడలో...

**తా :** ఈ విధంగా పలువిధగతులలో, తిరగడంలో నేర్పరి అయిన శ్రీకృష్ణుడు విజృంభించి రాసక్రీడకు ఉపక్రమించాడు. మచ్చలేని చంద్రబింబంవంటి ఇద్దరు ముగ్ధలు అలంకరించుకొని వీణలు చేతబట్టారు. వారిద్దరూ వీణను వాయించడంలో మిక్కిలి ప్రావీణ్యం కలవారు. మనోజ్ఞంగా, ఇంపుగా వీణ వాయిస్తూ ఆనందప్రవాహాన్ని వెల్లిగొలిపే గీతం గానం చేశారు. శ్రీకృష్ణుడు నిరంతర నిశ్చలమైన వేడుకతో సమ్మోహనమైన మురళిని సవిలాసంగా చేతబూనాడు. దాన్ని తన మధురమైన కెమ్మోవికి గదియించాడు. గోపభామలు తమ కొప్పులలో చెరువుకొన్న కలువపూల కమ్మని సువాసనను వీడని తన చిగుళ్లవంటి చేతివేళ్లను లయబద్ధంగా ఆ మురళీరంధ్రాల మీద సారిస్తూ వేణువు ఊదాడు. తామర రేకుల మధ్యన ఉండే దుద్దువలె గోపాంగనల మధ్యలో కృష్ణుడు మువ్వంపులతో మురిపెం ఒలికిస్తూ నిలుచున్నాడు.

ఎందరు గోపసుందరులో అందరికీ తాను ఒక్కడే అందరయ్యాడు. గోపికపక్క తానూ, తన పక్కన గోపిక ఉండే విధంగా నిలిచి రాసమండలం కల్పించాడు. అది నృత్యవిద్యాసముద్రానికి చుట్టూ ఏర్పడిన చెలియలికట్టవలె సొంపు నింపింది. ఆ రాసమండలం సహస్రనేత్రుడైన దేవేంద్రుడికి సైతం ఆశ్చర్యం గొలిపింది. దేవతలు ఆనందంతో ఆకాశవీథినుండి పూలజల్లులు

కురిపించారు. ఆ పూలగుత్తులలో తిరుగాడే తుమ్మెదల రంగును హేళనచేస్తూ పలువురు కృష్ణులు విరాజిల్లారు. బంగారుమణులమధ్యలో ఉన్న ఇంద్రనీలమణులవలె విలసిల్లారు. ఆడఏనుగులతో విహరించడంలో అత్యాసక్తి వహించిన మగ ఏనుగుల అందాన్ని వారు చిందించారు. చిగురించి పూచినతీగలతో ఆవరించబడిన కానుగచెట్ల అందచందాలను ఆ గోపాలమూర్తులు అంది పుచ్చుకున్నారు. మెరుపుతీగలతో కూడిన కరిమబ్బులవలె మెరిశారు. జలజలా ప్రవహించే సెలయేళ్లతోనిండిన రోహణగిరి శిఖరాల పోలికతో వారు విరాజిల్లారు.

లోకాలను మోహింపజేసే కృష్ణుడు కెందామరలవలె ఎర్రనైనవీ, చంద్రరేఖలవలె గోళ్లు కలిగినవీ, వేదరమణులకు ఆభరణాలైనవీ– అయిన తన పాదాలను ఒకదానితో ఒకటి చేర్చాడు. అతడు సమంగా నిలిచి దోసిటితో పూలు విరజిమ్మాడు. ఎంతో సుందరాలై, పద్మాలవలె ప్రశస్తాలైన తన రెండుచేతులనూ తనకు ఈ వైపునా ఆ వైపునా ఉన్న గోపికల మెడలపై చేర్చాడు. పాటకు అనుగుణంగా, ఆశ్చర్యకరంగా అడుగులు వేశాడు– వలయాకారంలో ఉన్న రాసబంధాలతో అతడు నాట్యం చేశాడు. శ్రీకృష్ణుడు ఆగోపసుందరులతో కలిసి శంఖం, పద్మం, వజ్రం, కందుకం, చతుర్ముఖం, చక్రవాళం, చతుర్భద్రం, సౌభద్రం, నాగం, నంద్యావర్తం, కుండలీకరణం, ఖురరీబంధం మొదలైన విశిష్ట రాసబంధాలతో నర్తించాడు.

ఆ రాసక్రీడలో వారు ఏకపాదం, సమపాదం, నివర్తితం, వినివర్తతం, గతాగతం, వలితం, వైశాఖం, మండలం, త్రిభంగి మొదలైన భంగిమలతో నిలిచారు. వారి పాదాలలోని బంగారుగజ్జెల చప్పుడు, మనోజ్ఞాలైన అందెలరవళులు జగత్తులోని జనులకందరికీ వీనుల విందులు చేశాయి. ఆ రాసక్రీడలోవారు ఘటితం, మర్దితం, పార్శ్వగం మొదలైన పాదవిన్యాసాలు ప్రదర్శించారు. సమపాద, శకట, వదన, మతల్లీశుక్తి మొదలైన పార్థివచారి విశేషాలను, అపక్రాంతం, డోలాపాదం, సూచి మొదలైన గగనచారి విన్యాసాలను ప్రకటించారు. కల్పవృక్షం కొమ్మలవలె మనోహరాలైనవీ, దిగ్గజాల తొండాలను పరిహసించేవీ. మూడులోకాలకు శుభకరాలైనవీ అయిన వారి హస్తాలలోని రత్నకంకణకాంతులు గగనవీథి నలుమూలలా వ్యాపించాయి.

ఇంకా, ఆ రాసక్రీడలోవారు అర్ధచంద్రం, కర్తరీముఖం, కపిత్థం, కటకాముఖం, శుకతుండం, లాంగూలం, పద్మకోశం, పతాక మొదలైన హస్తాభినయాలను తమతమ మనోభావాలు ప్రతిబింబించే విధంగా ప్రదర్శించారు. వారు తమ నడుములమీద ధరించిన బంగారురంగు పట్టు వస్త్రాల అంచులకాంతులు దిక్కులనే ముదితల ముఖాలకు పసుపు పూతలనే ముద్రలు వేశాయి, ఆస్కందితం, భ్రమరం, శకటాసనం మొదలైన జానుమండల భేదాలను; అలాతం, దండలాతం, లలితం, విచిత్రం మొదలైన దేవతల మండలాకారనృత్యాలను వారు ప్రదర్శించారు. మనోహరాలైన శంఖాలవంటి మెడలకు అందాన్ని సమకూర్చేవీ, మిక్కిలి కాంతిపుంజం కలిగినవీ, ఇంద్రనీలాలు, వజ్రాలు, వైడూర్యాలలో కూర్చబడినవీ అయిన హారాలశోభలు లక్ష్మీ నివాస స్థానాలుగానున్న తమ వెడద వక్షస్థలాలపై సంచలించి, చిక్కుపడగా–వారు అంగాంతరం, బాహ్యాలగ్నం, ఛత్రం మొదలైన భ్రమణ విధాలతో విరాజిల్లారు. తమ కాంతిచేత చంద్రమండలాన్ని జయించిన కుండలాల కాంతులు అద్దాలవలె నునుపైన వారిచెక్కిళ్లపై తొణికిసలాడాయి.

ఆ రాసక్రీడలలో వారు కటిభ్రాంతం, దండరచితం, లలాటం, తిలకం, మయూరం, లలితం, చక్రమండలం, నికుంచితం, గంగావతరణం మొదలైన కరణాలను ఆచరించారు. తెల్లతామరలశోభతో ఒప్పారే వారిచూపులు దరిద్రులదైన్యాన్ని పారదోలుతూ ముగ్ధల కన్నులనే మీనాలకు వలలై ఆవరించగా లలితం, కుంచితం, వికాసం, ముకుళం మొదలైన చూడ్కులతో విలసిల్లారు. బహుపూర్ణ చంద్రబింబాల అందానికి గృహాలుగా అందగించిన తమ ముఖాలలో నిర్మలమైన అనురాగాన్ని వారు ప్రస్ఫుటీకరించారు. ఒప్పిదమైన నెమలిఫించపుకాంతులు అకాలంలో కనిపించిన హరివిల్లుల అందాన్ని వెలువరించగా వారు

నికుంచితం, ఆకుంచితం, కంపితం, ఆకంపితం, పరివాహితం, పరావృత్తం అనే శిరోభావాలను ప్రదర్శించారు. కస్తూరితిలకాలు దిద్దిన పలకలవంటి నుదుళ్లపై ముంగురులు ముసురుకొంటూ ఉండగా వారు అపరాజితం, సూచికావిద్ధం, పరిచ్ఛిన్నం, విష్కంభం, రేచితం మొదలైన అంగవిన్యాసాలు ప్రదర్శించారు. అందుకు తగినట్లు అడుగులు, నడుములు, చేతులు, మెడలు ఆడించారు. అలా ఆరాసక్రీడ వీక్షకుల మనస్సులకు ఉత్తేజాన్ని కలిగించింది. అది దీప్తిగల ద్రవంతోడి క్షీరసాగరంవలె శృంగారరసంతో పొంగారింది. అనురాగభరితమైన రామరాజ్యంవలె శ్రీరాగం మొదలైన రాగాలతో నిండిపోయింది. కలువలకు ఆనందం సమకూర్చే నిండుచంద్రునివలె భూమండలానికి సంతోషాన్ని కలిగించింది.

భ్రమరం మొదలైన హస్తాభినయాలతో తుమ్మెదలగుంపుతో నందనవనంవలె విలసిల్లింది. అభ్యుదయంతో కూడిన అభిమానధనుని మనస్సువలె ఉత్తరోత్తరాభివృద్ధితో విరాజిల్లింది. బహువిధాలుగా ప్రబంధాలు కూర్చే నేర్పరి అయిన కవి విలాసంవలె ప్రకృష్టాలైన నాట్యబంధాలతో విలసిల్లింది. వసువులతో, దేవతలతో నందనవనంతో అలరారే దేవలోకంవలె వసుదేవనందనునితో పూజనీయమైంది. సదాచారవంతుని నడవడివలె భూమండలానికి, ఆకాశమండలానికి భూషణమైంది. శరీరంపైన హారందాల్చిన సుందరివలె అవయవాలచలనంతో మనోహరమైంది. గౌరీనిలయమైన హిమవంతంవలె నానావిధానాలుగల సంభారాలతో శోభిల్లింది. గుణవంతుడైన కుమారునివల్ల కులం ప్రకాశించినట్లు వేణువిలాసంతో ఆ రాసక్రీడ భాసించింది.

**చ. నడుములు వీఁగి యాడఁ, జిఱునవ్వులు నివ్వటిలంగ, హారముల్**
**సుడివడ, మేఖలల్ వదలఁ, జూడ్కి మెఱుంగులు పర్వ, ఘర్మముల్**
**వొడమఁ గురుల్ చలింప, శ్రుతిభూషణముల్ మెఱయన్ సకృష్ణలై**
**పడఁతుక లాడుచుం జెలఁగి పాడిరి మేఘతటిల్లతాప్రభన్. 1084**

**ప్రతి :** నడుములు; వీఁగి+ఆడన్= జవజవలాడగా; చిఱునవ్వులు; నివ్వటిలన్+కన్= అతిశయిల్లగా; హారముల్= కంఠహారాలు; సుడివడన్= మెలిదిరగగా; మేఖలల్= మొలనూళ్లు; వదలన్= సడలిపోగా; చూడ్కి మెఱుంగులు= చూపుల నిగనిగలు; పర్వన్= వ్యాపించగా; ఘర్మముల్= చెమటలు; పొడమన్= కమ్మగా; కురుల్= అలకలు; చలింపన్= చెదరగా; శ్రుతిభూషణముల్= చెవులకమ్మలు; మెఱయన్= ప్రకాశించగా; పడతుకలు= ఆ గోపసుందరులు; నర్తిస్తూ; చెలఁగి= విజృంభించి; మేఘతటిల్లతా ప్రభన్= నల్లమబ్బుల నడుమ మెరుపుతీగెల కాంతితో; చెలంగి= విజృంభించి; ఆడుచున్= నర్తిస్తూ; పాడిరి= పాడారు.

**తా :** గోపరమణులు నడుములు జవజవలాడగా, చిరునవ్వులు వ్యాపించగా, హారాలు మెలిపడగా, మొలనూళ్లు సడలగా చూపుల నిగ్గులు పొలయగా, చెమటలు కమ్మగా, ముంగురులు చెదరగా, చెవికమ్మలు ప్రకాశించగా, నీలిమబ్బుల నడుమ మెరుపుతీగెల కాంతితో దీపిస్తూ కృష్ణునితో కూడి ఉల్లాసంగా ఆడుతూ, పాడారు.

**క. అంకరహితేందు వదనలు, పంకజలోచనునిఁ గూడి పరఁగ నటింపం**
**గింకిణుల నూపురంబుల, కంకణముల మ్రోఁత లెసఁగెఁ గర్ణోత్సవమై. 1085**

**ప్రతి :** అంకరహిత+ఇందువదనలు= మచ్చలేని చంద్రునివంటి మోములుగలవారు; పంకజలోచనునిన్= పద్మనేత్రుడైన కృష్ణుణ్ణి; కూడి; పరఁగన్= అతిశయంగా; నటింపన్= నాట్యమాడే వేళలో; కింకిణుల= నడుముల, చిరుగంటల; నూపురంబుల= కాలిఅందెల; కంకణాల= చేతికంకణాల; మ్రోఁతలు= ధ్వనులు; కర్ణ+ఉత్సవమై= చెవులపండుగగా; ఎసఁగెన్= వ్యాపించాయి.

**తా :** మచ్చలేని చంద్రునివంటి ముఖాలు గల ఆ గోపికలు కమలనేత్రుడైన కృష్ణునితో కూడి మనోహరంగా నాట్యం సలిపేవేళ– వారి నడుముల చిరుగంటలు, కాలిఅందెలు, కరకంకణాలు గల్లు గల్లుమని శబ్దంచేస్తూ వీనులవిందు చేశాయి.

**క. హరిణీనయనలతోడను, హరి రాసక్రీడ సేయ నంబరవీథిన్**
**సురనాథులు భార్యలతో, సొరిది విమానంబు లెక్కి చూచి రిలేశా! 1086**

**ప్రతి :** ఇలా+ఈశా= ఓ పరీక్షిన్మహారాజా!; హరిణీ నయనలతోడను= లేడికన్నులవంటి కన్నులున్న ఆ గోపయువతులతో; హరి= శ్రీకృష్ణుడు; రాసక్రీడ= రాసక్రీడను; చేయన్= చేయగా; అంబరవీథిన్= ఆకాశవీథిలో; సురనాథులు= దేవతాశ్రేష్ఠులు; భార్యలతోన్; సొరిది= బారులుదీరి; విమానంబులు+ఎక్కి= తమతమవిమానాలు అధిరోహించి; చూచిరి= చూశారు.

**తా :** పరీక్షిన్మహారాజా! లేడికన్నులవంటి కన్నులున్న ఆ గోపయువతులతో శ్రీకృష్ణుడు నిర్వహించిన ఆ రాసక్రీడను ఆకాశవీథిలో దేవతాశ్రేష్ఠులు వారిభార్యలతో కలసి బారులుదీరి విమానాలెక్కి దర్శించారు.

**క. కురిసెం బువ్వుల వానలు, మొరసెన్ దుందుభులు మింట ముదితలుఁ దారున్**
**సరసన్ గంధర్వపతుల్, వరుసన్ హరిఁ బాడి రపుడు వసుధాధీశా! 1087**

**ప్రతి :** వసుధా+అధీశా= ఓ పరీక్షిన్మహారాజా!; అపుడు= అప్పుడు; పువ్వులవానలు; కురిసెన్= కురిశాయి; దుందుభులు= భేరులు; మొరసెన్= మ్రోగాయి; గంధర్వపతుల్= గంధర్వ నాయకులు; ముదితలున్= వారి భార్యలూ; తారున్= తామూ; మింటన్= ఆకాశంలో; సరసన్= పక్కపక్కన నిల్చుని; వరుసన్= క్రమపద్ధతిలో; హరిన్+పాడిరి= శ్రీకృష్ణుణ్ణి స్తుతిస్తూ పాడారు.

**తా :** ఓ పరీక్షిన్మహారాజా! అప్పుడు పువ్వులవానలు కురిశాయి. భేరులుమోగాయి. ఆకాశంలో తమ భార్యలు తమ సరసనుండగా గంధర్వపతులు శ్రీకృష్ణుని స్తుతిస్తూ గానం చేశారు.

**విశే :** సంగీతానికి గంధర్వులు ప్రసిద్ధి. సంగీతానికి 'గాంధర్వం' అనే పేరు అందుకే వచ్చింది. వారు కృష్ణుని గుణగణాలను గానం చేయడం ఎంతైనా సమంజసంగా ఉంది.

**క. రామలతోడను రాసము, రామానుజుఁ డాడఁ జూచి రాగిల్లి మనో**
**రాములమీఁద వియచ్చర, రామలు మూర్ఛిల్లి పడిరి రాజకులేంద్రా! 1088**

**ప్రతి :** రాజకుల+ఇంద్రా= రాజశ్రేష్ఠుడవైన ఓ పరీక్షిన్మహారాజా!; రామలతోడను= గోపసుందరులతో; రామ+అనుజుఁడు= బలరాముని తమ్ముడైన శ్రీకృష్ణుడు; రాసము= రాసక్రీడ; ఆడన్= ఆడగా; చూచి; రాగిల్లి= మోహించి; మనస్+రాములమీఁదన్= తమప్రాణనాథులమీద; వియత్+చర రామలు= ఖేచరస్త్రీలు; మూర్ఛిల్లి= పారవశ్యంపొంది; పడిరి= వాలిపోయారు.

**తా :** రాజేంద్రా! శ్రీకృష్ణుడు గోపభామినులతో రాసక్రీడ సలుపగా చూచి, స్వామిపై మోహంచెంది, ఖేచరస్త్రీలు పారవశ్యంతో తమ ప్రాణేశ్వరులమీద మూర్ఛిల్లి వాలిపోయారు.

**క. తారాధిపనిభవదనలు, తారాధిపవంశ్యుఁ గూడి తారు నటింపం**
**దారలతోడ సుధాంశుఁడు, దారును వీక్షింప రేయి దడవుగ జరిగెన్. 1089**

**ప్రతి :** తారా+అధిప నిభవదనలు= నక్షత్రాలకు రాజైన చంద్రునితో సామ్యం వహించిన ముఖాలు గలిగిన ఆ గోపసుందరులు; తారా+అధిపవంశ్యున్= చంద్రవంశంలో జన్మించిన శ్రీకృష్ణునితోకూడి; తారు= తాము; నటింపన్= నృత్యం సలుపగా; తారలతోడన్= చుక్కలతోకూడి; సుధా+అంశుఁడు= చంద్రుడు; తారును= తారలూ; వీక్షింపన్= చూస్తూ ఉండగా; రేయి= రాత్రి; తడవుగ జరిగెన్= ఆలస్యంగా గడిచింది.

**తా :** చంద్రునితో సామ్యం వహించిన ముఖాలు గలిగిన ఆ గొల్లభామలు, చంద్రవంశంలో జన్మించిన శ్రీకృష్ణునితో చేరి నటించగా, చుక్కలతోకూడి చంద్రుడు ఆ నాట్యాన్ని వీక్షిస్తూ ఉండడంచేత రాత్రి ఆలస్యంగా గడిచింది.

**మ. యమునాకంకణచారియై వనజపుష్పామోదసంచారియై**
**రమణీఘర్మనివారియై మదవతీరాసశ్రమోత్తారియై**
**ప్రమదామానసనవ్యభవ్యసుఖసంపత్కారియై చేరి యా**
**కమలాక్షుం డలరంగ గాలి విసరెం గల్యాణభావంబునన్. 1090**

**ప్రతి :** యమునా కంకణ చారి+ఐ= కాళిందీ జలకణాలను కదిలించేదై; వనజపుష్ప+ఆమోద= తామర పూలసువాసనల్లో; సంచారి+ఐ= సంచరించేదై; రమణీఘర్మనివారి+ఐ= సుందరుల చెమటలను తగ్గించేదై; మదవతీ రాసశ్రము+ఉత్తారి+ఐ= యౌవనమదం కలిగిన గోపికలను రాసక్రీడవలన కలిగిన శ్రమనుండి తప్పించిందై; ప్రమదామానస= సుందరుల మనస్సులకు; నవ్య= నూతనమైన; భవ్య= మంగళకరమైన; సుఖసంపత్+కారి+ఐ= సుఖమనే సంపదను కలిగించేదై; చేరి; ఆ కమల+అక్షుండు= ఆ పద్మనేత్రుడైన శ్రీకృష్ణుడు; అలరంగన్= ఆనందించగా; కల్యాణభావంబునన్= మంగళకరంగా; గాలి= మందమారుతం; విసరెన్= వీచింది.

**తా :** యమునానది నీటితుంపరలను చిలికిస్తూ, తామరపూల సురభిళాల్ని విరజిమ్ముతూ, సుందరీమణుల చెమటల్ని తగ్గిస్తూ, రాసక్రీడవలన మదవతులకు కలిగిన శ్రమను పోగొడుతూ, రమణీమణుల మనసుల్లో కొత్తదైన, మేలైందైన సుఖం అనే సంపదను కలిగించేదై, పద్మనేత్రుడైన శ్రీకృష్ణుడు ఆనందించేట్లుగా, మంగళకరంగా మలయమారుతం వీచింది.

**వ. అప్పుడు. 1091**

**తా :** ఆ సమయంలో...

**చ. ప్రమద యొకర్తు మాధవుఁడు పాడ విపంచి ధరించి కేల సం**
**భ్రమమునఁ దంత్రి మీటుచుఁ దిరంబుగ ఠాయము సేసి యొక్క రా**
**గము దగ నాలపించి సుభగస్వరజాతులు వేఱు వేఱు కా**
**నమరఁగఁ బాడెఁ దన్ రమణుఁ డౌనన దారువు లంకురింపఁగన్. 1092**

**ప్రతి :** ప్రమద+ఒకర్తు= ఒక గోపసుందరి; మాధవుఁడు= కృష్ణుడు; పాడన్= పాడగా; విపంచి= వీణను; కేలన్+ధరించి= చేతబూని; సంభ్రమమున్= సవిలాసంగా; తంత్రిన్= తీగను; మీటుచున్= మీటుతూ; తిరంబుగన్= స్థిరంగా; ఠాయముచేసి= ఒక స్వరస్థాయిని నిర్ణయించి; రాగము తగన్+ఆలపించి= రాగాన్ని చక్కగా ఆలాపనచేసి; సుభగస్వరజాతులు= మనోహరమైన సరిగమాదిస్వరాలను; వేఱువేఱుకాన్= వేర్వేరు అయేటట్లు; అమరన్+కన్= ఒప్పిదంగా; దారువులు= ఎండినచెట్లు;

అంకురింపన్+కన్= రక్తిపుట్టి చిగురించగా; తన్= తనను; రమణుఁడు= ప్రియుడైన శ్రీకృష్ణుడు; ఔను+అనన్= మెచ్చుకోగా; పాడెన్= పాడింది.

**తా :** అపుడు ఒక గోపికారమణి శ్రీకృష్ణుడు పాడుతుండగా, వీణను చేతబట్టి సవిలాసంగా తీగెలుమీటింది. అతడు ఔను ఔను అని మెచ్చుకోగా, ఎండినచెట్లు చిగురించగా, నిలుకడగా ఒక స్వరస్థాయినందుకొని ఒకరాగాన్ని రమ్యంగా ఆలపించింది.

**క. ఆడుచుఁ బాడుచు నందొక, చేడియ మంజీరమంజుశింజితమమరం**
**గూడి హరికరము సనుఁగవ, పై డాయఁగ దిగిచె జఘనభారాలసయై. 1093**

**ప్రతి :** అందున్= వారిలో; ఒకచేడియ= ఒకగోపరమణి; మంజీర= కాలియందెల; మంజు శింజితము= మనోహరమైన ధ్వని; అమరన్= ఒప్పగా; కూడి; ఆడుచున్= ఆడుతూ; పాడుచున్= పాడుతూ; జఘనభార+అలస+ఐ= పిరుదుల బరువుచేత అలసట వహించి; హరికరము= కృష్ణునిహస్తాన్ని; చనుఁగవపై= తన కుచద్వయంపైకి; డాయన్+కన్= సమీపించేటట్లు; తిగిచెన్= లాగింది.

**తా :** ఆ గోపరమణులలో ఒక రమణి కాలిఅందెలు గల్లుగల్లుమని మనోహరంగా ధ్వనిస్తూ ఉండగా ఆడుతూ పాడుతూ, పిరుదుల బరువుచేత అలసట గలిగిందై, శ్రీకృష్ణుని హస్తాన్ని తన కుచద్వయం సమీపానికి లాగింది.

**క. చందనలిప్తంబై యర, విందామోదమున నొప్పు విపులభుజము గో**
**విందుఁ డొక తరుణిమూఁపునఁ, బొందించిన నది దెమల్చి పులకించె నృపా! 1094**

**ప్రతి :** నృపా= ఓ భూపతీ!; చందనలిప్తంబు+ఐ= మంచిగంధం పూయబడిందై; అరవింద+ఆమోదమునన్= తామరపూల పరిమళం గుబాళిస్తూ; ఒప్పు= విలసిల్లుతున్న; విపులభుజము= బలీయమైన తన భుజాన్ని; గోవిందుఁడు= శ్రీకృష్ణుడు; ఒక తరుణి మూఁపునన్= ఒక సుందరి భుజంపైన; పొందించినన్= ఉంచగా; అది= ఆ తరుణి; తెమల్చి= చలించి; పులకించెన్= పులకరించింది.

**తా :** ఓ రాజా! మంచిగంధంపూతతో, పద్మపరిమళంతో ఒప్పారుతూ ఉన్న తన బలమైన భుజాన్ని శ్రీకృష్ణుడు ఒక గోప రమణి భుజంమీద ఉంచగా, ఆమె చలించి పులకరించింది.

**సీ. చెలువ యొక్కతె చెక్కుఁ జెక్కుతో మోపిన విభుఁడు దాంబూలచర్వితము వెట్టె**
**నాడుచు నొకలేమ యలసినఁ బ్రాణేశుఁ డున్నతదోఃస్తంభ మూఁత సేసెఁ**
**జెమరించి యొకబాల సేరినఁ గొనగోరఁ జతురుఁడు కుచఘర్మజలము వాపె**
**నలకంబు లొక యింతి కలికచిత్రకరేఖ నంటినఁ బ్రియుఁడు వాయంగ దువ్వెఁ**

**ఆ. బడఁతి యొకతె పాటపాడి దస్సిన నధ, రామృతమున నాథుఁ డాదరించె**
**హార మొక్క సతికి నంసావృతం బైనఁ, గాంతుఁ డురముఁ జేర్చి కౌఁగిలించె. 1095**

**ప్రతి :** ఒక్కతె చెలువ= ఒక రమణి; చెక్కున్= తన చెక్కిలిని; చెక్కుతోన్= కృష్ణుని చెక్కిలితో; మోపినన్= మోపగా; విభుఁడు= కృష్ణుడు; తాంబూలచర్వితము= తను నములుతూ ఉండే తాంబూలాన్ని; పెట్టెన్= ఆమెకు పెట్టాడు; ఒక లేమ=

ఒక యువతి; ఆడుచున్= ఆడుతూ; అలసినన్= అలసిపోగా; ప్రాణ+ఈశుఁడు= ప్రాణనాథుడైన శ్రీకృష్ణుడు; ఉన్నత దోః స్తంభము= స్తంభంవలె సమున్నతమైన తన భుజాన్ని; ఊఁత+చేసెన్= ఆధారంగా చేశాడు; ఒకబాల= ఒక చిన్నది; చెమరించి= చెమటలు పట్టినదై; చేరినన్= తననుచేరగా; చతురుఁడు= నేర్పరి అయిన కృష్ణుడు; కుచఘర్మజలము= ఆమెస్తనాలమీద ఏర్పడిన చెమట నీటిని; కొనగోరన్= కొనగోటితో; పాపెన్= చిమ్మాడు; ఒక+ఇంతికిన్= ఒక గోపసుందరికి; అలకంబులు= ముంగురులు; అలిక= నుదుటిమీదనున్న; చిత్రకరేఖన్= తిలకాన్ని; అంటినన్= అంటుకోగా; ప్రియుఁడు= ప్రియుడైన కృష్ణుడు; పాయన్+కన్= పక్కకు దీసి; దువ్వెన్= దువ్వాడు; ఒకతె పడఁతి= ఒక రమణి; పాటపాడి; డస్సినన్= అలసిపోగా; నాథుఁడు= ప్రాణేశుడైన కృష్ణుడు; అధర+అమృతమునన్= మోవి అమృతంతో; ఆదరించెన్= సమాదరించాడు; ఒక్కసతికిన్= ఒక పడతికి; హారము= కంఠహారం; అంస+ఆవృతంబు+ఐనన్= మూపున చిక్కుకోగా; కాంతుఁడు= నాథుడైన కృష్ణుడు; ఉరమున్+చేర్చి= తన వక్షస్థలానికి చేర్చుకొని; కౌఁగిలించెన్= కౌగిలించుకున్నాడు.

**తా :** ఒక తరుణి కృష్ణునిచెక్కిలితో తన చెక్కిలి చేర్చగా అతడు తన పుక్కిటిలోని తాంబూలాన్ని ఆమె నోట ఉంచాడు. ఒక సుందరి ఆడుతూ అలసిపోగా, ప్రాణేశుడు స్తంభంవంటి ఉన్నతమైన తన బాహువును ఆమెకు ఆధారంగా చేశాడు. ఒక చక్కనిచుక్క చెమట కమ్మి తన దగ్గరికి చేరగా ఆమె చనుదోయిపై కమ్మిన చెమట బిందువులను ప్రియుడైన కృష్ణుడు కొనగోట చిమ్మాడు. ఒక బాలిక నుదుటి తిలకానికి అంటుకున్న ముంగురులను నాథుడైన కృష్ణుడు పక్కకు తీసి, కురులు దువ్వాడు. ఒక పడతి పాటపాడి అలసిపోగా ప్రాణేశుడైన కృష్ణుడు తన అధరామృతాన్ని ఇచ్చి సమాదరించాడు. ఒక చెలువకు హారం మూపున చిక్కు పడగా, ఆ హారాన్ని చక్కదిద్ది సుందరుడైన కృష్ణుడు దగ్గరకు లాక్కొని కౌగిలించుకున్నాడు.

**క. హాసంబులఁ గరతల వి, న్యాసంబుల దర్శనముల నాలాపములన్**
**రాసశ్రాంతల నా హరి, సేసెన్ మన్ననలు కరుణసేసి నరేంద్రా! 1096**

**ప్రతి :** నర+ఇంద్రా!= రాజోత్తముడవైన ఓ పరీక్షిన్మహారాజా; హాసంబులన్= చిరునవ్వులతో; కరతలవిన్యాసంబులన్= హస్తవిన్యాసాలతో; దర్శనములన్= చూడ్కులతో; ఆలాపములన్= రాగాలాపనలతో; రాసశ్రాంతలన్= రాసక్రీడలో అలసిన గోపరమణులను; కరుణ+చేసి= దయచూపుతూ; ఆ హరి= ఆ గోవిందుడు; మన్ననలు+చేసెన్= ఆదరణలు చూపాడు.

**తా :** రాజేంద్రా! గోవిందుడు రాసక్రీడలో అలసిన గోపరమణులను తన చిరునవ్వులతో, హస్తవిన్యాసాలతో, చూపులతో, రాగాలాపనలతో దయతో ఆదరించాడు.

**క. హరితనుసంగసుఖంబునఁ, బరవశలై వ్రేత లెల్లఁ బయ్యెదలు నిజాం**
**బరములు నెఱుఁగమి చోద్యమె?, సురసతు లీక్షించి కరఁగి చొక్కిరి మింటన్. 1097**

**ప్రతి :** వ్రేతలు+ఎల్లన్= గోపయువతులందరూ; హరితనుసంగసుఖంబునన్= గోవిందుని దేహసంగమసుఖంచేత; పరవశలు+ఐ= పారవశ్యం చెందినవారై; పయ్యెదలు= పైటలు; నిజ+అంబరములున్= ధరించిన వస్త్రాలు; ఎఱుఁగమి= (జారడంకూడా) తెలుసుకోలేక పోవడం; చోద్యము+ఎ= ఆశ్చర్యమా?; సురసతులు= దేవతాస్త్రీలు; మింటన్= ఆకాశంలో; ఈక్షించి= గోపసుందరీగోవిందుల తనుసంగమదృశ్యాన్ని దర్శించి; కరఁగి= కరిగిపోయి; చొక్కిరి= పరవశులయ్యారు.

**తా :** ఆ గోపసుందరులు గోవిందుని తనూసంగమసుఖంతో మిక్కిలి పరవశలై తమ పైటలు, ధరించిన వస్త్రాలు జారిపోవడం కూడా గమనించలేక పోవడం ఆశ్చర్యం కాదు. దేవతాస్త్రీలు ఆకాశంనుండి ఆ రాసక్రీడావిలాసమంతా వీక్షించి కరిగి సమ్మోహితలయ్యారు.

**వ. ఇట్లు భగవంతుండైన కృష్ణుం డాత్మారాముం డయ్యును గోపసతు లెంద ఱందఱకు నందఱై నిజప్రతి బింబంబులతోడం గ్రీడించు బాలుపోలిక రాసకేలి సలిపిన. 1098**

**ప్రతి :** ఇట్లు= ఈవిధంగా; భగవంతుండు+ఐన= పరమాత్ముడైన; కృష్ణుండు= శ్రీకృష్ణుడు; ఆత్మారాముండు= తనలో తానే ఆనందం పొందేవాడు; అయ్యును= అయికూడా; గోపసతులు= గోపభామలు; ఎందఱు= ఎందరో; అందఱకున్= అందరికీ; అందఱు+ఐ= అందరై; నిజప్రతిబింబంబులతోడన్= తన నీడలతో; క్రీడించు బాలు పోలికన్= ఆడుకునే పిల్లవాడువలె; రాసకేలి= రాసక్రీడ; సలిపినన్= చేయగా...

**తా :** ఈ విధంగా పరమాత్మ అయిన శ్రీకృష్ణుడు తాను ఆత్మారాముడైనా గోపసుందరులు ఎందరుంటే అందరికీ అంతమంది కృష్ణులై తన ప్రతిబింబాలతో ఆడుకునే పిల్లవాడువలె, రాసక్రీడ సాగించాడు.

**క. తగఁ గూడి యాడి మనముల, నగెఁ జూచెం బలికె నందనందనుఁ డనుచున్**
**మగువలు పెద్దఱికముతోఁ, బొగడిరి తమ పూర్వజన్మపుణ్యశ్రేణిన్. 1099**

**ప్రతి :** మగువలు= గోపికలు; నందనందనుఁడు= కృష్ణుడు; తగన్= సముచితంగా; కూడి= (తమతో) కూడి; ఆడి; నగెన్= నవ్వాడు; చూచెన్= తమను చూశాడు; పలికెన్= తమతో మాట్లాడాడు; అనుచున్= అనుకుంటూ; మనములన్= తమమనస్సులలో; పెద్దఱికముతోన్= కృష్ణుని మీది గౌరవంతో; తమ పూర్వజన్మపుణ్యశ్రేణిన్= తాము పూర్వజన్మలో చేసుకొన్న పుణ్యాల వరుసను; పొగడిరి= మెచ్చుకున్నారు.

**తా :** గోపికలు నందనందనుడైన కృష్ణుడు తమతో కలసిమెలసి నవ్వుతూ, చూస్తూ, సల్లాపాలు సలుపుతూ మెలిగాడని కృష్ణుని మీది గౌరవంతో, తమపూర్వజన్మపుణ్యాలను మెచ్చుకున్నారు.

## ❖ జలక్రీడాభివర్ణనము ❖

**వ. ఇట్లు హరి రాసకేళి సాలించి, కరకాంచితలగు తటిల్లతలచెలువున ఘర్మసలిలకణాక్రాంతలగు కాంతలం గూడి జలక్రీడాకుతూహలుండై యమునాజలంబులు సొర, నందు ముందర సుందరులు సొచ్చి పదప్రమాణంబు, జానుదఘ్నంబు, కటిద్వయసంబు, మధ్యమాత్రంబు, కుచంబులబంటి యని పలుకుచుం గుచ నయన నాభివివర కుంతలంబులు చక్రవాకజలచరావర్తశైవాలంబులచందంబున నందంబుగ నీడు వొందిన, యేఱులని కళిందనందన గరంబులు సాఁచి పరిరంభంబులకు నారంభించు కైవడి నెదురు చనుదెంచి తాఁకు తరంగంబులకు నులుకుచు, సారసంబులకుం గరంబులు సాఁచుచు, మరాళంబులం జోపుచుఁ, జెన్ను మిగిలిన యన్నుల చన్నుల యెత్తువత్తు మను నెపంబులం దపంబులు నీటఁ గావించు మాడ్కిని సంచరించు చక్రవాకంబులం దోలుచు, నితాంతకాంతి సదనంబులగు వదనంబులకు నోడి వ్రీడం జెంది కంది చందురుండు సలం బుడిగి జలంబునం బడి కంపించుకరణి, నిజకరచలిత జలప్రతిబింబితుండై కదలు చంద్రునిం గని మెచ్చి సోలుచు, సలిలావగాహ సమయ సముచ్చలిత వారిశీకర పరంపరలవలన మకరందపానమత్తమధుకరపక్ష విక్షేపణసంజాతవాతసముద్ధూత కుముదాది పరాగపటలంబులం జెఱుచుచు, మోముఁదమ్ముల కమ్మఁదనంబునకు**

**మూఁగి, జుమ్మురను తుమ్మెదలకు వెఱచుచుఁ గరంబుల నీ రెగయం జఱచుచు, నీలనీరద నిపతిత పయోబిందుసందోహంబులం దడియు పువ్వుఁదీవియల బాగునఁ గృష్ణకరద్వయతోయంబులం బెక్కుతోయంబులం దడియుచుఁ, గ్రందుకొని సుడియుచు, నసమబాణుని పులుగడిగిన కుసుమబాణంబుల పగిది మేనులు మెఱయ సలిలావగాహన పరాయత్తచిత్త లగుచు, మొత్తంబులై సరసభాషణములం ద్రుళ్లుచుఁ, గరంబుల నీరు నించి హరిమీఁదం జల్లుచుఁ, జల్లునెడం దడఁబడన్ దాఁటుచు, దాఁటి చనక నిలువరించుచు వినోదింప, హరియుం గరేణుకర వికీర్ణనీరధారాభిషిక్తంబగు శుండాలంబు లీల నాభీరకామినీకరసముజ్ఝిత జలాసారంబులం దోఁగుచు, వ్రజవధూజనహస్తప్రయుక్తకల్హార కైరవపరాగపటలంబువలన భూతిభూషణు సిరి వహించుచు, గోపికాజన పాణికిసలయసమున్ముక్త కమలదళంబులవలన సహస్రనయనుని రూపుఁ జూపుచు గోపాలబాలికా కుచకలశ కుంకుమపంకంబువలనఁ బ్రభాతబాలభానునిభంగి భాసిల్లుచు, ఘోషయోషాకటాక్ష విక్షేపణంబువలన మధుపపరివృత హరిచందనసౌందర్యంబు నొందుచు, వల్లవీహాసరుచులవలనఁ జంద్రికాప్రభాభాసిత నీలశైలంబు క్రియ నమరె; నంత. 1100**

**ప్రతి :** ఇట్లు= ఇలా; హరి= శ్రీకృష్ణుడు; రాసకేళిన్+చాలించి= రాసక్రీడ ముగించి; కరక+అంచితలు+అగు= వడగండ్లతోఒప్పే; తటిత్+లతల చెలువున్= మెరుపుతీగల అందంవలె; ఘర్మసలిలకణ= స్వేదబిందువులచే; ఆక్రాంతలు+అగు= ఆక్రమించబడిన; కాంతలన్= గోపసుందరులను; కూడి; జలక్రీడా కుతూహలుండు+ఐ= జలక్రీడ మీద ఉబలాటం కలిగినవాడై; యమునా జలంబులన్= యమునానది నీటిలో; చొరన్= ప్రవేశించగా; అందున్= దానిలో; ముందర= ముందుగా; సుందరులు= గోపస్త్రీలు; చొచ్చి= ప్రవేశించి; పదప్రమాణంబు= పాదాలలోతు; జానుదఘ్నంబు= మోకాటిలోతు; కటిద్వయసంబు= మొలలోతు; మధ్యమాత్రంబు= నడుములోతు; కుచంబులబంటి= స్తనాలలోతు; అని; పలుకుచున్= అంటూ; కుచ=స్తనాలు; నయన= నేత్రాలు; నాభివివర= బొడ్డురంధ్రాలు; కుంతలంబులు= శిరోజాలు; చక్రవాక= చకోరాలు; జలచర= చేపలు; ఆవర్త= సుడులు; శైవాలంబుల= నాచుల; చందంబునన్= సామ్యంతో; అందంబు+కన్= సుందరంగా; ఈడు+పొందిన= సమఉజ్జీలుకాగా; ఏఱులు+అని= ప్రవాహాలని; కళిందనందన= కాళింది; కరంబులు+చాఁచి= చేతులు చాచి; పరిరంభంబులకున్= కౌగిళ్లకు; ఆరంభించుకైవడిన్= మొదలుపెట్టినవిధంగా; ఎదురు చనుదెంచి= ఎదురేగి; తాఁకు= స్పృశించే; తరంగంబులకున్= అలలకు; ఉలుకుచున్= భయపడుతూ; సారసంబులకున్= బెగ్గురుపక్షులకోసం; కరంబులు+చాఁచుచున్= చేతులు చాచుతూ; మరాళంబులన్= హంసలను; చోపుచున్= తోలుతూ; చెన్నుమిగిలిన= సొంపారుతున్న; అన్నుల చన్నుల= తరుణులస్తనాల; ఎత్తు; వత్తుము= వస్తాము; అను= అనే; నెపంబులన్= వ్యాజాలతో; తపంబులు= తపస్సులు; నీటన్= నీటిలో; కావించుమాడ్కినిన్= చేసేవాటి లాగా; సంచరించు= కదలాడే; చక్రవాకంబులన్= చకోరపక్షులను; తోలుచున్= తోలుతూ; నితాంత= అధికమైన; కాంతి= ప్రకాశంయొక్క; సదనంబులు+అగు= ఉనికిపట్లైన; వదనంబులకున్= ముఖాలకు; ఓడి; వ్రీడన్+చెంది= సిగ్గుపడి; కంది= వెలవెలపోయి; చందురుండు= చంద్రుడు; చలంబు+ఉడిగి= పట్టుదల వదిలిపెట్టి; జలంబునన్= నీటిలో; పడి; కంపించుకరణిన్= వణకే విధంగా; నిజకర= తన చేతులచేత; చలిత= కదిలింపబడిన; జల= నీటిలో; ప్రతిబింబితుండు+ఐ= ప్రతిబింబించినవాడై; కదలు= కదిలే; చంద్రునిన్= చంద్రుణ్ణి; కని= చూచి; మెచ్చి; సోలుచున్= పరవశిస్తూ; సలిల+అవగాహసమయ= నీటిలో మునిగేవేళలో; సముచ్చలిత= మీదికి కదిలించబడిన; వారిశీకర= నీటితుంపరలయొక్క; పరంపరలవలనన్= ఎడతెగని సమూహాలవల్ల; మకరందపానమత్త= పూదేనెను తాగడంవల్ల మత్తెక్కిన;

మధుకర= తుమ్మెదల; పక్ష విక్షేషణ= రెక్కల కదలికవల్ల; సంజాత= జనించిన; వాత= గాలిచేత; సముద్ధూత= ఎగురగొట్టబడిన; కుముద+ఆది= తెల్లకలువలు మొదలైన పుష్పాల; పరాగపటలంబులన్= పుప్పొళ్లరాసులను; చెఱుచుచున్= పోగొడుతూ; మోము+తమ్ముల= పద్మాలవంటి వదనాల; కమ్మ+తనంబునకున్= సువాసనకోసం; మూఁగి= ముసురుకొని; జుమ్మురు+అను తుమ్మెదలకున్= జుంజుం అనే తుమ్మెదలకు; వెఱచుచున్= భయపడుతూ; కరంబులన్= చేతులతో; నీరు; ఎగయన్= ఎగిసేట్లు; చఱచుచున్= చరుస్తూ; నీలనీరద= నీలిమేఘాలనుండి; నిపతిత= జారిపడే; పయస్+బిందు సందోహములన్= నీటి బిందువుల గుంపులతో; తడియు= తడిసే; పువ్వు తీవియల బాగునన్= పూలతీగెల అందంతో; కృష్ణకరద్వయంబునన్= కృష్ణుని రెండుచేతుల నుండి; చిలుకు= చిలికించే; తోయంబులన్= నీటితో; పెక్కుతోయంబులన్= అనేక విధాలుగా; తడియుచున్= తడుస్తూ; క్రందుకొని= సందడిగొని; సుడియుచున్= సోలిపడుతూ; అసమబాణుని= పంచబాణుడైన మన్మథునియొక్క; పులుగడిగిన= మురికిపోయేటట్లు కడిగిన; కుసుమబాణంబుల పగిదిన్= పూలబాణాల విధంగా; మేనులు= శరీరాలు; మెఱయన్= ప్రకాశిస్తుండగా; సలిల+అవగాహన= నీళ్లలో మునగడంలో; పర= ఆసక్తితో; ఆయత్త= కూడుకొన్న; చిత్తులు= మనస్సుకలవారు; మొత్తంబులు+ఐ= గుంపులై; సరసభాషణంబులన్= వినోద సంభాషణలతో; త్రుళ్లుచున్= త్రుళ్ళింతలిడుతూ; కరంబులన్= చేతులతో; నీరు; నించి= నిండించి; హరిమీఁదన్= గోవిందునిమీద; చల్లుచున్= చల్లుతూ; చల్లున్+ఎడన్= చల్లేటప్పుడు; తడఁబడన్= తొట్రుపాటుపడుతూ; దాఁటుచున్= అవతలవైపు వెళ్తూ; దాఁటి= దాటుకొని; చనక= వెళ్లకుండా; నిలువరించుచున్= అడ్డుపడుతూ; వినోదింపన్= ఆనందించగా; హరియున్= కృష్ణుడు; కరేణుకర= ఆడఏనుగుల తొండాలనుండి; వికీర్ణ= వెదజల్లబడిన; నీరధారా+అభిషిక్తంబగు= నీటి ధారలతో తడిసిన; శుండాలంబులీలన్= మగఏనుగువలె; ఆభీరకామినీ= యాదవ యువతుల; కర= చేతులనుండి; సముజ్ఝిత= విడువబడిన; జల+ఆసారంబులన్= జడివానలచేత; తోఁగుచున్= తడుస్తూ; వ్రజవధూజన= గోపస్త్రీలయొక్క; హస్త ప్రయుక్త= చేతులతో చల్లబడిన; కల్హార= ఎఱ్ఱకలువల; కైరవ= తెల్లకలువల; పరాగపటలంబువలనన్= పుప్పొడి సమూహంవల్ల; భూతిభూషణుసిరిన్= భస్మమే అలంకారంగాగల శివునిసంపదను; వహించుచున్= పొందుతూ; గోపికాజన= గోపికలయొక్క; పాణికిసలయ= చిగురులవంటి చేతులనుండి; సమున్ముక్త= బాగా వదలబడిన; కమలదళంబులవలనన్= తామరరేకులవలన; సహస్రనయనునిరూపున్= వేయికన్నుల ఇంద్రుని స్వరూపాన్ని; చూపుచున్= చూపుతూ; గోపాలబాలికా= యాదవ యువతులయొక్క; కుచకలశ= కలశాలవంటి రొమ్ములమీద పూయబడిన; కుంకుమపంకంబువలనన్= బురదలాగా పూయబడిన కుంకుమపూతవల్ల; ప్రభాత= వేకువజాములోని; బాలభానునిభుగిన్= బాలసూర్యునిసామ్యంతో; భాసిల్లుచున్= ప్రకాశిస్తూ; ఘోషయోషా= వ్రేపల్లెలోని గోపస్త్రీలు; కటాక్షవిక్షేపణంబువలనన్= కడగంటి చూపుల వ్యాప్తివల్ల; మధుప పరివృత= తుమ్మెదలచేత చుట్టుకోబడిన; హరిచందన= పచ్చగంధపుచెట్ల; సౌందర్యంబున్= అందాన్ని; ఒందుచున్= పొందుతూ; వల్లవీ= గోపస్త్రీల; హొసరుచులవలనన్= నవ్వుకాంతులవలన; చంద్రికా= వెన్నెలయొక్క; ప్రభా= కాంతిచేత; భాసిత= ప్రకాశించే; నీలశైలంబుక్రియన్= అంజనాద్రిలాగా; అమరెన్= ఒప్పారాడు; అంతన్= అప్పుడు...

**తా :** ఇలా నందనందనుడు రాసక్రీడ చాలించి వడగండ్లతో ఒప్పేమెరుపుతీగవలె చెమటబిందువులతో కూడిన ఆ గోప యువతులతో కూడి జలక్రీడలాడాలనే ఉత్సాహంతో యమునాజలాలలో ప్రవేశించాడు. అతనికన్నా ముందే గోపికలు కాళిందిలో ప్రవేశించి ఇక్కడ అడుగులోతు, ఇక్కడ మోకాలులోతు, ఇక్కడ నడుంలోతు, ఇక్కడ రొమ్ములలోతు అంటూ ఆ నదినీటిలోనికి దిగారు. ఆ రమణుల స్తనాలు చక్రవాకాలతోను, కండ్లు చేపలతోను, బొడ్డు సుడులతోను, తలవెండ్రుకలు నాచుతోను పోలి ఉండడంవల్ల వారుకూడా తనవంటివారే అని భావించి కౌగిలించుకోడానికి యమునానది చేతులు చాచినట్లుగా, అలలు ఎదురుగా వచ్చి వారిని స్పృశించాయి. వారు ఉలికిపడ్డారు. నదిలోని బెగ్గురుపక్షులను పట్టాలని చూశారు. హంసలను

తోలారు. అందాలుచిందే ఆ సుదతుల కుచాలకు సాటిరాగలం అని నీటిలో తపం చేస్తున్నాయా అన్నట్లు అక్కడ సంచరించే జక్కవపక్షులను వారు తరిమేశారు. ఆ యువతుల చేతుల్లో చలిస్తూ ఉన్న జలాలలో ప్రతిఫలించిన చంద్రుడు అధికమైన ప్రకాశానికి ఉనికిపట్టులుగానున్న వారి వదనాలకు ఓడిపోయి సిగ్గుతో వెలవెలబోతూ, పట్టుదల విడిచి నీటిలో పడి వణకుతున్నాడా అన్నట్లున్నాడు. అలాంటి చంద్రుణ్ణి చూచి మెచ్చుకుంటూ గోపికలు పరవశించారు.

మకరందం తాగి మదించినతుమ్మెదల రెక్కలగాలికి రేగుతున్న కలువలు మొదలైన పూలయొక్క పుప్పొడి వారు నీటమునిగినపుడు పైకి చెదిరిన నీటి తుంపరలవల్ల అణిగి పోయింది. తమవదనపద్మ సౌరభానికి మూగి ఝుంఝుమ్మనే తుమ్మెదలను చూచి వారు భీతి చెందారు. అవి పైకెగిరి పోయేటట్లు అరచేతులతో నీళ్లను చరిచారు. నీలిమేఘాలనుండి రాలిన నీటిధారలవలన తడిసిపోయే అందమైన పూలతీగలవలె ఆ గోపయువతులు శ్రీకృష్ణుడు దోసిటితో చల్లే నీటితుంపరలవల్ల సంపూర్ణంగా తడిసిపోయారు. గుంపుగుంపుగా చేరి తొక్కిసలాడారు. మాలిన్యం పోయిన మన్మథుని పుష్పబాణాల్లాగా తళతళ మెరుస్తూ ఉన్న దేహాలతో గోపికాస్త్రీలు నీట మునగడానికి ఉత్సహించారు. వారు సరససల్లాపాలతో తుళ్లింతలాడుతూ, చేతుల నిండా నీరు ముంచుకొని తొట్రుపడుతూ గోవిందుని మీద చల్లారు. ఒకరికంటె ఒకరు ముందడుగువేసి శ్రీకృష్ణుడు తమని దాటి పోకుండా అడ్డపడి వినోదించారు. ఆడఏనుగులు తొండాలతో చిమ్మిన నీటి తుంపరలతో తడిసిన మదపుటేనుగువలె శ్రీకృష్ణుడు గోపసుందరులు పైకి చిమ్మిన జలధారలతో తడిసి ముద్దయ్యాడు. రేపల్లె యువతులు తమ చేతులతో హరిమీదికి ఎర్రకలువలను, తెల్లకలువలను విరజిమ్మారు. ఆ పూలపుప్పొడి ఆయన శరీరానికి అంటుకొని విభూతి ధరించిన పరమశివునివలె భాసించాడు.

ఆ సుందరులు చిగుళ్లవంటి తమ హస్తాలతో తామరపూలరేకులను తమప్రాణనాథుని మీదికి వెదజల్లారు. అప్పుడు కృష్ణుడు వేయికన్నుల దేవేంద్రుడుగా ప్రకాశించాడు. ఆ రమణులు కుంకుమ అలదిన కుంభాలవంటి స్తనాలతో కృష్ణుణ్ణి కౌగిలించుకోగా, అతడు బాలభాస్కరునివలె ప్రకాశించాడు. ఆ కాంతలు తమ కడగంటిచూపులను నాథునిమీద ప్రసరింపజేయగా, అతడు తుమ్మెదగుంపులు ముసిరిన పచ్చగంధపుచెట్టువలె విరాజిల్లాడు. ఆ పూబోండ్లు తమ చిరునవ్వులసిరులను తమ ప్రియునిపై పడేటట్లుచేయగా కృష్ణుడు వెన్నెలవెలుగులతో విలసిల్లే అంజనాద్రివలె విలసిల్లాడు తరువాత

**మ. సతులుం దానును నీటిలో వెడలి భూషాగంధచేలాద్యలం**
**కృతుఁడై కుంభి కరేణుయూథములతోఁ గ్రీడించుచందంబునన్**
**లతలందుం దరులందుఁ బుష్పమయలీలాశయ్యలందున్ సుఖో**
**న్నతుఁడై కృష్ణుఁడు క్రీడలం దనిపె నా నారీలలామంబులన్. 1101**

**ప్రతి :** కృష్ణుడు= గోవిందుడు; సతులున్= గోపరమణులూ; తానును= తానూ; నీటిలో వెడలి= యమునానది నీటినుండి బయటికి వచ్చి; భూషా= ఆభరణాలు; గంధ= చందనంపూత; చేల= వస్త్రాలు ధరించడం ఆది= మొదలైనవాటితో; అలంకృతుఁడు+ఐ= అలంకరించుకొన్నవాడై; కుంభి= గజరాజు; కరేణుయూథములతోన్= ఆడఏనుగులతో; క్రీడించుచందంబునన్= ఆడేవిధంగా; లతల+అందున్= తీగెల పొదరిండ్లలో; తరుల+అందున్= చిక్కనిచెట్ల ఛాయలలో; పుష్పమయ లీలాశయ్యలందున్= పూలతో ఏర్పరచుకున్న లీలాశయ్యలమీద; ఆ నారీలలామంబులన్= ఆ సుందరీమణులను; క్రీడలన్= తనక్రీడలతో; తనిపెన్= తృప్తిపరచాడు.

**తా :** అప్పుడు శ్రీకృష్ణుడు సుఖోన్నతుడై, గోపయువతులతో పాటు యమునానదినీటినుండి వెలికివచ్చాడు. ఆభరణాలు ధరించి, మంచి గంధం అలదుకొని, పీతాంబరాలు ధరించి అలంకరించుకొన్నాడు. గజరాజు ఆడఏనుగులతో క్రీడించిన విధంగా పొదరిండ్లలో, చిక్కనిచెట్ల నీడలలో, పూలశయ్యలమీద వారితో క్రీడించి సంతోషపెట్టాడు.

**వ. ఇట్లు శరత్కాలంబున వెన్నుం డింద్రియస్ఖలనంబు సేయక గోపికలతోడ రమించె నని చెప్పిన మునివరునకు భూవరుం డిట్లనియె. 1102**

**ప్రతి :** ఇట్లు= ఇలా; శరత్కాలంబునన్= శరదృతువులో; వెన్నుండు= శ్రీకృష్ణుడు; ఇంద్రియస్ఖలనంబు చేయక= రేతఃస్ఖలనం చేయకుండా; గోపికలతోడ; రమించెను= క్రీడించాడు; అని; చెప్పిన; మునివరునకున్= శుకయోగీంద్రునితో; భూవరుండు= పరీక్షిన్మహారాజు; ఇట్లు= ఇలా; అనియెన్= అన్నాడు.

**తా :** ఈ విధంగా గోవిందుడు శరత్కాలంలో గోపికలతో వీర్యస్ఖలనం చేయకుండా రమించాడు అని చెప్పగా విని, శుకయోగీంద్రునితో పరీక్షిన్మహారాజు ఇలా అన్నాడు.

**మత్తకోకిలము**

**ధర్మకర్తయు ధర్మభర్తయు ధర్మమూర్తియు నైన స**
**త్కర్ముఁ డీశుఁ డధర్మశిక్షయు ధర్మరక్షయుఁ జేయఁగా**
**నర్మిలిన్ ధరమీఁదఁ బుట్టి పరాంగనాజనసంగ మే**
**ధర్మ మంచుఁ దలంచి చేసె? సుదాత్తమానస! చెప్పుమా! 1103**

**ప్రతి :** ఉదాత్తమానస= మహాత్మా!; ఈశుఁడు+అ= పరమేశ్వరుడే; ధర్మకర్తయున్= ధర్మాన్ని నడిపేవాడూ; ధర్మభర్తయున్= ధర్మపోషకుడూ; ధర్మమూర్తియున్= ధర్మస్వరూపుడూ; ఐన= అయిన; సత్+కర్ముఁడు= మంచిపనులుచేసేవాడూ; అధర్మశిక్షయున్= అధర్మాన్ని శిక్షించడం; ధర్మరక్షయున్= ధర్మాన్ని రక్షించడం; చేయన్+కాన్= చేయడానికి; అర్మిలిన్= ప్రేమతో; ధరమీఁదన్= భూమిమీద; పుట్టి= జన్మించి; పర+అంగనాజనసంగము= అన్యస్త్రీలతో కూడడం; ఏ ధర్మము= ఎలాంటి ధర్మం; అంచున్= అని; తలంచి= భావించి; చేసెను= చేశాడు; చెప్పుము+ఆ= చెప్పండి.

**తా :** మహాత్మా! పరమేశ్వరుడు ధర్మానికి కర్త. ధర్మానికి భర్త. ధర్మమే స్వరూపంగా కలవాడు. మంచిపనులు చేసేవాడు. ఆయన అధర్మాన్ని శిక్షించడానికి, ధర్మాన్ని రక్షించడానికి భూమండలంలో జన్మించినవాడు గదా! అలాంటప్పుడు, ఆ భగవంతుడే ఎలాంటి ధర్మమని పరసతులను కూడాడో దయచేసి నాకు చెప్పండి.

**వ. అనిన శుకుం డిట్లనియె. 1104**

**ప్రతి :** అనినన్= ఇలా రాజు అడుగగా; శుకుండు= శుకమహర్షి; ఇట్లు= ఇలా; అనియెన్= అన్నాడు.

**తా :** ఇలా పరీక్షిన్మహారాజు అడుగగా, శుకమహర్షి ఇలా అన్నాడు.

**ఆ. సర్వభక్షుఁ డగ్ని సర్వంబు భక్షించి, దోషి గాని పగిది దోష మైనఁ**
**జేసి దోషపదముఁ జెందరు తేజస్వు, లగుటఁ జంద్రవాసవాదు లధిప! 1105**

**ప్రతి :** అధిప= రాజా; సర్వభక్షుడు= సర్వాన్ని భకించేవాడైన; అగ్ని= అగ్నిదేవుడు; సర్వంబు= సమస్తాన్నీ; భక్షించి= భుజించికూడా; దోషిగాని పగిదిన్= దోషికానట్లు; దోషము+ఐనన్= దోషమైనా; చేసి; చంద్ర వాసవ+ఆదులు= చంద్రుడు; దేవేంద్రుడు మొదలైనవారు; తేజస్వులు= తేజోవంతులు; అగుటన్= అవడంవల్లనే; దోషపదమున్= దోషస్థానాన్ని; చెందరు= పొందరు.

**తా :** సర్వభక్షకుడైన అగ్నిదేవుడు విశ్వంలోని సమస్తవస్తువులను భక్షించికూడా దోషి కాదు. అలాగే తేజోవంతులైన చంద్రఇంద్రాదులు దోషంచేసి కూడా దోషస్థానాన్ని పొందరు.

**విశే :** సర్వప్రాణులను హింసించి కాల్చి చంపడం అగ్నిచేసే పాపం. ఇది తినదగింది ఇది తినదగనిది అని కూడా చూడకుండా అన్నీ భక్షించడం దోషం.

గురుపత్నీగమనం చంద్రునిదోషం. చంద్రుడు తనగురువైన బృహస్పతి భార్యతో సంగమించి ఆ పాపం చేశాడు.

పరపత్నీగమనం దేవేంద్రుని దోషం. అహల్యను కామించి ఆమెభర్తరూపంలో వచ్చి అనుభవించిన దోషం అతనిది.

**క. ఈశ్వరుఁడు గానివాఁడు న, రేశ్వర! పరకాంతఁ దలఁచి యెట్లు బ్రదుకు? గౌ**
**రీశ్వరుఁడు దక్క నన్యుఁడు, విశ్వభయదవిషము మ్రింగి వెలయం గలఁడే? 1106**

**ప్రతి :** నర+ఈశ్వర= నరేంద్రా!; ఈశ్వరుఁడు= పరమేశ్వరుడు; కానివాడు; పరకాంతన్= పరస్త్రీని; తలఁచి= భావించి; ఎట్లు= ఏ విధంగా; బ్రదుకున్= జీవించగలడు; గౌరీ+ఈశ్వరుఁడు= పార్వతీపతి అయిన ఈశ్వరుడు; తక్కన్= తప్ప; అన్యుఁడు= ఇతరుడు; విశ్వభయదవిషము= లోకభయంకరమైన విషాన్ని; మ్రింగి= తాగి; వెలయన్+కలఁడు+ఏ=జీవించగలడా?

**తా :** నరేంద్రా! ఈశ్వరుడు కానివాడు పరకాంతను తలచి ఎలా జీవించగలడు? గౌరీశ్వరుడు తప్ప ఇతరుడు లోకభయంకరమైన విషం తాగి జీవించగలడా?

**విశే :** సర్వాత్మకుడైన దేవునికి ఏదిచేసినా చెల్లుతుంది. ఇతరులకు అది చెల్లదు. ఈశ్వరుడు శాస్త్రవశ్యుడుకాడు. శాస్త్రోక్త ధర్మాలను ఉల్లంఘించినా వారికి అది దోషం కాదు. శాస్త్రవశ్యుడు, కర్మవశ్యుడు అయిన సామాన్య మానవుడు దోషంచేస్తే అనుభవించవలసిందే!

**క. సత్యము ప్రభువులవచనము, నిత్యముఁ దద్వచనవీథి నిలుతురు పెద్దల్;**
**సత్యాసత్యము గావున, సత్య మనుచుఁ జనరు వారిచరితమున నృపా! 1107**

**ప్రతి :** నృపా= రాజా!; ప్రభువులవచనము= ఈశ్వరులమాట; సత్యము= నిజం; తద్+వచనవీథిన్= వారు పలికిన మార్గాన్నే; పెద్దల్= ఆర్యులు; నిలుతురు= అనుసరిస్తారు; సత్య+అసత్యము= పామరులకు సత్యంగాను, పండితులకు అసత్యంగాను కనిపించేది; కావునన్= కాబట్టి; వారిచరితమునన్= వారి ప్రవర్తనలో; సత్యము+అనుచున్= సత్యం అని భావించి; చనరు= అనుసరించరు.

**తా :** ఈశ్వరుల మాటలు ఒకటే సత్యం. అదే ప్రమాణం. వారు చెప్పిన మార్గాన్నే పెద్దలు నిత్యం అనుసరిస్తారు. ఒకొక్కప్పుడు ఈశ్వరుల నడవడి వారిమాటలకు విరుద్ధంగా ఉంటుంది. ఒకప్పుడు సత్యంగాను, మరొకసారి అసత్యంగాను ఉంటుంది. వారి నడవడి అంతా సత్యమని భావించి అనుసరించరాదు.

**మ. ఘనులై యెవ్వని పాదపంకజపరాగధ్యానసంప్రాప్త యో**
**గ నిరూఢత్వముచే మునీంద్రులు మహాకర్మంబులం బాసి బం**
**ధ నిరోధంబులు లేక విచ్చలవిడిన్ దర్పింతు, రా దివ్య శో**
**భనుఁ డెట్లుండిన నుండెఁగాక! కలవే బంధంబు లుర్వీశ్వరా! 1108**

**ప్రతి :** ఉర్వీ+ఈశ్వరా= నరేంద్రా!; ముని+ఇంద్రులు= మునిశ్రేష్ఠులు; ఎవ్వని= ఏ దేవుని; పాదపంకజ= పాదపద్మాలయొక్క; పరాగ= పుప్పొడిని; ధ్యాన= ధ్యానించడంవల్ల; సంప్రాప్త= పొందిన; యోగనిరూఢత్వముచేన్= యమనియమాదియోగాలలో చలించక నిలిచే స్వభావంచేత; ఘనులు+ఐ= అధికులై; మహాకర్మంబులన్= గొప్పవైన యజ్ఞాదికర్మలను; పాసి= వదిలి; బంధనిరోధంబులు= సంసారబంధరూపమైన అడ్డంకులు; లేక; విచ్చలవిడిన్= యథేచ్ఛగా; దర్పింతురు= అతిశయిస్తారో; ఆ దివ్యశోభనుఁడు= అలాంటి నిత్యశుభస్వరూపుడైన భగవంతుడు; ఎట్లు+ఉండినన్= ఎలాఉండినా; ఉండెన్+కాక= ఉంటాడుగాక!; బంధంబులు= సంసారాదిబంధాలు; కలవు+ఏ= ఉన్నాయా?

**తా :** నరేంద్రా! మునులు ఏ దేవునియొక్క పాదపద్మాల పుప్పొడిని, ధ్యానించడంవల్ల పొందిన యోగనిరూఢత్వంచేత అధికులై యజ్ఞాదిమహాకర్మలు చేయకుండా, సంసారబంధాలు వదిలించుకొని అతిశయిస్తూ ఉంటారో– అలాంటి నిత్యశుభస్వరూపుడైన భగవంతుడు ఎలా నడచుకొంటే నేం? ఏమి చేసినా అతనికి ఎలాంటి బంధాలు ఉండవు.

**ఆ. గోపజనములందు గోపికలందును, సకలజంతులందు సంచరించు**
**నా మహాత్మునకుఁ బరాంగన లెవ్వరు?, సర్వమయుఁడు లీల సలిపెఁ గాక? 1109**

**ప్రతి :** గోపజనముల+అందున్= గోపాలకులలోను; గోపికల+అందును= గోపికలలోనూ; సకలజంతుల+అందున్= అన్నిప్రాణులలోనూ; సంచరించు= అంతరాత్మయై సంచరిస్తూ ఉండే; ఆ మహా+ఆత్మునకున్= ఆ పరమాత్మకు; పర+అంగనలు= పరస్త్రీలు; ఎవ్వరు? సర్వమయుఁడు= సర్వవ్యాపి; లీలసలిపెన్+కాక= వినోదంగా క్రీడించాడు గాక!

**తా :** గోపాలకులలో, గోపికలలో, సర్వప్రాణులలో అంతర్యామియై సంచరించే సర్వమయుడైన పరమాత్మకు పరాంగనలు ఎవరు? అన్నీ తానే కాబట్టి అలా క్రీడించాడు.

**వ. అని చెప్పి శుకుం డిట్లనియె నంత బ్రాహ్మీముహూర్తంబునం గృష్ణు వీడ్కొని గోపిక లిచ్ఛ లేకయు నిండ్లకడ కేఁగినం గృష్ణమాయామోహితులై గోపకులు వారలం గోపింపనేరరై రివ్విధంబున. 1110**

**ప్రతి :** అని; చెప్పి; శుకుండు; ఇట్లు= ఇలా; అనియెన్= అన్నాడు; అంతన్= అప్పుడు; బ్రాహ్మీముహూర్తంబునన్= తెల్లవారుజామున; కృష్ణున్= శ్రీకృష్ణుని; వీడ్కొని= వదలి; గోపికలు= గోపయువతులు; ఇచ్ఛలేకయున్= ఇష్టంలేకుండానే; ఇండ్లకడకున్= తమగృహాల వద్దకు; ఏఁగినన్= వెళ్లగా; కృష్ణమాయామోహితులు+ఐ= హరి మాయచేత భ్రాంతివహించినవారై; గోపకులు= గోపాలురు; వారలన్= గోపికలను; కోపింపనేరరు+ఐరి= కోపించలేకపోయారు.

**తా :** అని చెప్పి శుకమునీంద్రుడు మళ్లీ పరీక్షిన్మహారాజుతో ఇలా అన్నాడు. వెళ్లడం ఇష్టంలేకున్నా తెల్లవారు జామున గోపికలు తమ ఇండ్లకు వెళ్లారు. కృష్ణమాయామోహితులైన గోపాలురు గోపికలపై కోపం చూపలేకపోయారు.

**విశే :** బ్రాహ్మీముహూర్తము= అరుణోదయానికి ముందు నలభై ఎన్మిది నిముషాలకాలం. (రెండు గడియలకాలం)

ఇంద్ర వజ్ర

**గోపాలకృష్ణుండును గోపకాంతల్**
**ప్రాపించి క్రీడించిన భంగు లెల్లన్**
**రూపించి వర్ణించి నరుండు హృత్సం**
**తాపంబులన్ బాయును దత్ప్రసక్తిన్.** **1111**

**ప్రతి :** గోపాలకృష్ణుండును= గోపాలకృష్ణుడూ; గోపకాంతల్= గోపికలూ; ప్రాపించి= చేరి; క్రీడించినభంగులు= క్రీడ చేసిన పద్ధతులను; ఎల్లన్= అన్నిటినీ; రూపించి= ఇలా అని నిశ్చయించి; వర్ణించి; నరుండు= మానవుడు, తత్+ప్రసక్తిన్= ఆ ప్రసక్తితో; హృత్+సంతాపంబులన్= మనసులోని దుఃఖరూపతాపాలను; పాయును= తొలగించుకుంటాడు.

**తా :** గోపాలకృష్ణుడూ, గోపకాంతలూ సలిపినరాసక్రీడను ఏ నరుడు వర్ణిస్తాడో, ఏ నరుడు దర్శించి నిశ్చయించుకొంటాడో అతడు ఆ ప్రసంగంవల్ల సమస్త హృదయతాపాలనుండి విముక్తుడౌతాడు.

**విశే :** ఈ పద్యం ఫలశ్రుతి

## ✤ సర్పరూపియగు సుదర్శనుం డను గంధర్వుని శాపవిమోచనము ✤

**వ. అంత నొక్కనాఁడు నందాదులైన గోపకు లంబికావనంబునకు శకటంబు లెక్కి, జాతరకుం జని సరస్వతీనదీ జలంబుల స్నానంబులు సేసి, యుమామహేశ్వరుల నర్చించి కానిక లిచ్చి, బ్రాహ్మణులకు గో హిరణ్యవస్త్రాన్నదానంబు లొసంగి, జలప్రాశనంబు సేసి, నియమంబున నుండ దైవయోగంబున నాఁకొని యొక్కమహోరగంబు నిదురవోయిన నందునిం గఱచి మ్రింగ నగ్గలింప నతండు కృష్ణ కృష్ణేతి వచనంబులం దన్ను విడిపింపు మని మొఱ యిడిన విని.** **1112**

**ప్రతి :** అంతన్= తరువాత; ఒక్కనాఁడు; నంద+ఆదులు+ఐన= నందుడుమొదలైన; గోపకులు= గోపాలకులు; అంబికావనంబునకున్= అంబికావనానికి; శకటంబులు+ఎక్కి= బండ్లెక్కి; జాతరకున్= పశుపతిజాతరకు; చని= వెళ్లి; సరస్వతీనదీజలంబులన్= సరస్వతీనదినీటిలో; స్నానంబులు+చేసి= పుణ్యస్నానాలుచేసి; ఉమామహేశ్వరులన్= పార్వతీపరమేశ్వరులను; అర్చించి= పూజించి; కానికలు+ఇచ్చి= కానుకలు సమర్పించి; బ్రాహ్మణులకున్; గో హిరణ్యవస్త్ర+ అన్నదానంబులు+ఒసంగి= ఆవులు, బంగారు, వస్త్రాలు, అన్నాలు, దానాలుగా ఇచ్చి; జలప్రాశనంబు+చేసి= నీరుమాత్రమే ఆహారంగా తీసుకొని; నియమంబునన్= నియమంతో ఉండగా; దైవయోగంబునన్= విధివశాత్తూ; ఆఁకొని= ఆ కలిగొన్న; ఒక్క మహా+ఉరగంబు= ఒక పెద్దపాము; నిదుర+పోయిన= నిద్రపోతూఉండిన; నందునిన్= నందగోపుణ్ణి; కఱచి; మ్రింగన్= మింగడానికి; అగ్గలింపన్= ప్రయత్నించగా; అతండు= ఆ నందుడు; కృష్ణకృష్ణ+ఇతివచనంబులన్= కృష్ణా! కృష్ణా! అనే మాటలతో; తన్నున్= తనను; విడిపింపుము= పాము చెరనుండి విడిపించు; అని; మొఱ+ఇడినన్= మొరపెట్టుకోగా; విని...

**తా :** తరువాత ఒకరోజు నందుడుమొదలైన గోపాలకులు పశుపతి జాతరకోసం ఎడ్లబండ్ల నెక్కి అంబికావనానికి వెళ్లారు. అక్కడ వారు సరస్వతీనదిలో స్నానంచేసి, పార్వతీపరమేశ్వరులను పూజించి కానుకలు సమర్పించారు. బ్రాహ్మణులకు గోవులు, బంగారం, వస్త్రాలు, అన్నమూ దానం చేశారు. తాము నీరుమాత్రమే ఆహారంగా గ్రహించి, నియమనిష్ఠలతో ఉన్నారు.

అప్పుడు విధివశాత్తూ ఆకలిగొన్న ఒక మహాసర్పం నిద్రపోతూ ఉండిన నందుణ్ణి కరచి మింగడానికి ప్రయత్నించింది. అతడు 'కృష్ణా! కృష్ణా! నన్ను విడిపించు అంటూ మొరపెట్టుకున్నాడు. ఆ మొరను గోపాలకులు విని

**క. గోపకు లందఱు మేల్కొని, కోపముతోఁ బెద్దగుదెలఁ గొఱవుల మొత్తన్**
**దాపము నొందియు వదలక, పాపపుఁ బెనుబాము నందుఁ బట్టె నృపాలా! 1113**

**ప్రతి :** నృపాలా= రాజా!; గోపకులు+అందఱున్= గోపాలకులందరూ; మేల్కొని= నిద్రలేచి; కోపముతోన్= కోపంతో; పెద్దగుదెలన్= పెద్దదుడ్డుకర్రలతో; కొఱవులన్= కొరవులతో; మొత్తన్= కొట్టగా; తాపమున్+ఒందియున్= బాధపడుతూ కూడా; పాపము+పెనుపాము= ఆ క్రూరమైన పెద్దపాము; నందున్= నందుణ్ణి; వదలక= వదలకుండా; పట్టెన్= పట్టుకొంది.

**తా :** రాజా! గోపాలకులందరూ మేల్కొన్నారు. కోపంతో ఆ పామును పెద్దపెద్ద దుడ్డుకర్రలతోనూ, కొరవులతోనూ మొత్తారు. అయినా ఆ క్రూరమైన మహాసర్పం నందుణ్ణి వదలకుండా పట్టుకొంది.

**వ. అ య్యవసరంబునఁ గృష్ణుండు దర్పించి పాదతాడనంబు సేసి త్రొక్కిన సర్పంబు సర్పరూపంబు విడిచి విద్యాధరేంద్రరూపంబుఁ దాల్చి హరికి మ్రొక్కిన నతనికి హరి యిట్లనియె. 1114**

**ప్రతి :** ఆ+అవసరంబునన్= ఆ సమయంలో; కృష్ణుండు; దర్పించి= విజృంభించి; పాదతాడనంబు+చేసి= కాలితో తన్ని; త్రొక్కినన్= ఆ పామును తొక్కగా; సర్పంబు= పాము; సర్పరూపంబున్= తన పామురూపాన్ని; విడిచి= వదలిపెట్టి; విద్యాధర+ఇంద్ర రూపంబున్= విద్యాధరశ్రేష్ఠుడి రూపాన్ని; తాల్చి= ధరించి; హరికిన్= శ్రీకృష్ణునికి; మ్రొక్కినన్= నమస్కరించగా; అతనికిన్= ఆ విద్యాధరునితో; హరి= కృష్ణుడు; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** ఆ సమయంలో శ్రీకృష్ణుడు విజృంభించి, కాలితో ఆ పామును తన్ని ఒక తొక్కు తొక్కాడు. వెంటనే ఆ పాము తన సర్పరూపం విడిచి, ఒక గంధర్వుని రూపం దాల్చింది. శ్రీకృష్ణుడు అతనితో ఇలా అన్నాడు.

**ఉ. మండితమూర్తితోఁ గనకమాలికతో శుభలక్షణుండవై**
**యుండెడు నీకుఁ గష్టపుమహోరగదేహ మిదేల వచ్చె? నె**
**వ్వండవు? నామ మెయ్యది? భవంబున కెద్ది మిషంబు? నాకు నొం**
**డొండ యెఱుంగఁ జెప్పుము బుధోత్తమ! నీ పని చోద్య మయ్యెడిన్. 1115**

**ప్రతి :** బుధ+ఉత్తమ= పండితులలో గొప్పవాడా!; మండితమూర్తితోన్= అలంకృతమైన స్వరూపంతో; కనకమాలికతోన్= బంగారుహారంతో; శుభలక్షణుండవు+ఐ= మంగళకరమైన లక్షణాలతో కూడిన వాడవై; ఉండెడు నీకున్= ఉండే నీకు; కష్టము+మహా+ఉరగరూపము= క్రూరమైన ఈ పెనుబామురూపం; ఇది; ఏల; వచ్చెన్= వచ్చింది?; ఎవ్వండవు= నీవు ఎవరవు?; నామము+ఏ+అది= పేరేమి?; భవంబునకున్= ఈ సర్పజన్మకు; ఏది; మిషంబు= నెపం; నాకున్; ఒందు+ఒండు+అ= ఒక్కటొక్కటే; ఎఱుంగన్+చెప్పుము= తెలియజెప్పు; నీ పని= నీ ఈ పని (నందుణ్ణి పట్టుకొన్న విషయం) చోద్యము+అయ్యెడిన్= వింతగా ఉంది.

**తా :** ఓ పండితశ్రేష్ఠుడా! అలంకృతమైన రూపంతో, బంగారుహారంతో, శుభలక్షణాలతో విరాజిల్లే నీకు ఈ క్రూరమైన పెనుబాముురూపం ఎందుకు వచ్చింది? నీవెవరు? నీ పేరేమి? ఏ కారణంగా ఈ జన్మ కలిగింది? ఒకటొకటే నాకు వివరంగా తెలుపు. నీవు నందుణ్ణి పట్టుకొన్న చర్య వింతగొలుపుతూ ఉంది.

**వ. అనిన వాఁ డిట్లనియె: 'దేవా! యేను సుదర్శనుండను విద్యాధరుండ; విమానారూఢుండనై రూపసంపద్గర్వంబులం జొక్కి దిక్కులం జరించుచు నొక్కయెడ నాంగిరసులైన ఋషులం గురూపులైన వారలం గని నగిన వారును నీవు రూపదర్పంబున మమ్ము నగితివి; గావున మహాసర్పంబవై యుండు' మని శపించి పిదప నే వేఁడుకొనిన నిట్లనిరి. 1116**

**ప్రతి :** అనినన్= ఇలా కృష్ణుడనగా; వాఁడు= ఆ గంధర్వుడు; ఇట్లు= ఇలా; అనియెన్= అన్నాడు; ఏను= నేను; సుదర్శనుండు+అను= సుదర్శనుడు అనే పేరుగల; విద్యాధరుండన్= విద్యాధరుణ్ణి; విమాన+ఆరూఢుండను+ఐ= విమానం ఎక్కినవాడనై; రూపసంపత్+గర్వంతో= సౌందర్యమదంతో; చొక్కి= గర్వించి; దిక్కులన్= నలుదిశలా; చరించుచున్= సంచరిస్తూ; ఒక్క+ఎడన్= ఒకచోట; కురూపులు+ఐనవారలన్= అందం లేనివాళ్లయిన; ఆంగిరసులు+ఐన= అంగిరసముని సంతతివారైన; ఋషులన్= మునులను; కని= చూచి; నగినన్= నవ్వగా; వారును; నీవు; రూపదర్పంబుననన్= సౌందర్యగర్వంతో; మమ్మున్= మమ్ములను చూచి; నగితివి= పరిహాసంగా నవ్వావు; కావునన్= కాబట్టి; మహాసర్పంబవు+ఐ= పెద్దపామువై; ఉండుము= ఉండు; అని; శపించి= శాపంపెట్టి; పిదప= తర్వాత; నే= నేను; వేఁడుకొనినన్= బతిమాలుకోగా; ఇట్లు= ఇలా; అనిరి= అన్నారు.

**తా :** శ్రీకృష్ణుని పలుకులకు అతడిలా అన్నాడు. నేను విద్యాధరుణ్ణి. నా పేరు సుదర్శనుడు. నేను సౌందర్యగర్వంతో పుష్పకవిమానంపై దిక్కులు తిరుగుతూ ఉండేవాణ్ణి. ఒకనాడు అంగిరసుని సంతతివారు, అందం లేనివాళ్లు అయిన ఋషులను చూచి పరిహాసంగా నవ్వాను. వారు 'సౌందర్యదర్పంతో నువ్వు మమ్ములను చూసి నవ్వావు కాబట్టి పెనుబామువై పడిఉండు' మని శపించారు. నేను బతిమలాడగా ఇలా అనుగ్రహించారు.

**చ. యదుకులమందు భక్తులభయంబు హరించుటకున్ జనార్దనుం**
**డుదయము నొంది యీ యడవి కొక్కదినంబున రాఁగలండు త**
**త్పదమున నీవు తన్నఁబడి పన్నగదేహము తోడఁ బాసి నీ**
**మొదలిటిమేను గాంచెదవు మూఢుఁడ! పొమ్మని రా దయానిధుల్. 1117**

**ప్రతి :** ఆ దయానిధుల్= దయకునిధివంటివారు; మూఢుఁడు+అ= ఓ మూర్ఖుడా!; భక్తులభయంబు= భక్తుల భయం; హరించుటకున్= పోగొట్టడానికి; జనార్దనుండు= శ్రీహరి; యదుకులము+అందున్= యాదవవంశంలో; ఉదయమున్+ఒంది= పుట్టి; ఈ అడవికిన్= ఈ అరణ్యానికి; ఒక్కదినంబుననన్= ఒక రోజున; రాన్+కలండు= వస్తాడు; తత్+పదముననన్= అతని పాదంతో; నీవు; తన్నన్+పడి= తన్నబడినవాడివై; పన్నగదేహము= పాము రూపం; తోడన్+పాసి= వెంటనే పోగొట్టుకొని; నీ మొదలిటిమేను= నీ పూర్వదేహాన్ని; కాంచెదవు= పొందగలవు; పొమ్ము= పో; అనిరి= అన్నారు.

**తా :** 'ఓ మూర్ఖుడా! భక్తుల భయాన్ని పోగొట్టడంకోసం శ్రీహరి యాదవకులంలో జన్మిస్తాడు. అతడు ఒకనాడు ఈ అడవికి వస్తాడు. అతనికాలితన్ను తిని నీవు సర్పరూపం విడిచి, నీ తొలిరూపమైన విద్యాధరరూపం పొందగలవు' అని దయానిధులైన ఆ ఋషులు పలికారు.

**మ. నినుఁ జింతించిన విన్నఁ బేరుకొనినన్ నిర్మూలమై క్రుస్సి పా**
**పనికాయంబు వినష్టమౌ నఁట! భవత్పాదంబు నామీఁదఁ బె**

ట్టినఁ దద్బ్రాహ్మణశాపసంజనితకౌటిల్యంబు దా నిల్చునే?
వనజాతేక్షణ? నేఁడు వాసె నురగత్వం బెల్ల నేఁ బోయెదన్. 1118

**ప్రతి :** వనజాత+ఈక్షణ= ఓ పద్మనేత్రా!; నినున్= నిన్ను; చింతించినన్= ధ్యానించినా; వినన్= నీ పేరు విన్నా; పేరుకొనినన్= ఉచ్చరించినా; పాపనికాయంబు= పాపసమూహం; క్రుస్సి= క్షీణించి; నిర్మూలము+ఐ= మొదలంటా; వినష్టము+ఔను+ అఁట= నశించిపోతుందట; భవత్+పాదంబు= నీపాదం; నామీఁదన్= నా మీద; పెట్టినన్= పెడితే; తద్+బ్రాహ్మణశాప= ఆ ఋషుల శాపంవల్ల; సంజనిత= కలిగిన; కౌటిల్యంబు= వికారమైన రూపం; తాన్= తాను; నిల్చును+ఏ= నిలిచి ఉంటుందా?; నేఁడు= ఈ దినం; ఉరగత్వంబు= నా సర్పస్వరూపం; ఎల్లన్= అంతా; వాసెన్= పోయింది; ఏన్= నేను; పోయెదన్= ఇక వెళతాను.

**తా :** ఓ పద్మనేత్రా! నిన్ను ధ్యానించినా, నీ మహిమలు విన్నా, నీ నామం కీర్తించినా పాపరాశి మొదలంటా కృశించి నశిస్తుందని అంటారు. నా మీద నీ పాదం మోపితే నాకు ఆ ఋషులశాపంవల్ల సంక్రమించిన వికారాకారం పోకుండా ఉంటుందా? నా సర్పరూపం పూర్తిగా పోయింది. నేను ఇక వెళతాను.

**వ.** అని విన్నవించి హరికిం బ్రదక్షిణంబు వచ్చి, మ్రొక్కి, సుదర్శనుండు దివంబునకుం జనియె, సర్పంబువలన నందుండు విముక్తుం డయ్యెఁ; దత్ప్రకారంబు విని వెఱఁగుపడి గోపకులు దేవతా మహోత్సవంబు సమాప్తి నొందించి కృష్ణకీర్తనంబు సేయుచు మరల మందకుం జని రంత. 1119

**ప్రతి :** అని; విన్నవించి= మనవిచేసి; సుదర్శనుండు= సుదర్శనుడు; హరికిన్= కృష్ణునికి; ప్రదక్షిణంబు వచ్చి= ప్రదక్షిణం చేసి; మ్రొక్కి= నమస్కరించి; దివంబునకున్= దేవలోకానికి; చనియెన్= వెళ్లిపోయాడు. సర్పంబువలనన్= పామువలన; నందుండు= నందుడు; విముక్తుండు+అయ్యెన్= విముక్తి పొందాడు; తత్+ప్రకారంబు= ఆ విషయం; విని; వెఱఁగుపడి= ఆశ్చర్యపడి; గోపకులు= గోపాలకులు; దేవతా మహా+ఉత్సవంబు= ఆ పశుపతిజాతరను; సమాప్తిన్+ఒందించి= పూర్తిచేసి; మరలన్= మళ్లీ; మందకున్= గోకులానికి; చనిరి= వెళ్లారు; అంతన్= తర్వాత...

**తా :** సుదర్శనుడు ఇలా మనవి చేసి, శ్రీకృష్ణునికి ప్రదక్షిణం చేసి, నమస్కరించి దేవలోకానికి తిరిగి వెళ్లిపోయాడు. నందగోపుడు సర్పంనుండి విముక్తి పొందాడు. ఈ సంగతి విన్న గోపకులు ఆశ్చర్యపోయారు. పశుపతిజాతరను గోపాలకులు సంపూర్తిగా నిర్వహించి తిరిగి తమ గోకులానికి మరలిపోయారు.

## ✤ శ్రీకృష్ణుఁడు కుబేరభటుండగు శంఖచూడుం డను గుహ్యకుని సంహరించుట ✤

**చ.** మఱి యొకనాఁటి రాత్రి బలమాధవు లుజ్జ్వల వస్త్రమాలికా
ధరులును లేపనాభరణధారులునై చని మల్లికాది పు
ష్ప రసనిమగ్నమత్తమధుపంబుల గీతము వించుఁ దద్వనాం
తరమున వెన్నెలన్ ప్రజనితంబిను లుండఁగఁ బాడి రింపుగన్. 1120

**ప్రతి :** మఱి+ఒకనాఁటిరాత్రి= మరొకనాటి రాత్రి; బలమాధవులు= బలరామకృష్ణులు; ఉజ్జ్వల(ఉత్+జ్వల)= ప్రకాశవంతమైన; వస్త్రమాలికాధరులును= వస్త్రాలు, పూమాలలు ధరించినవారూ; లేపన+ఆభరణధారులును+ఐ= చందనలేపనాలు, ఆభరణాలు

ధరించినవారూ అయి; చని= వెళ్లి; మల్లిక+ఆది= మల్లెలు మొదలైన; పుష్పరస= పూలలోని మకరందంలో; నిమగ్న= మునిగినవారై(క్రోలినవారై); మత్తమధుపంబుల= మదించిన తుమ్మెదల; గీతము= ఝుంకారం; వించున్= వింటూ; తద్+వన+ అంతరమునన్= ఆ బృందావనమధ్యంలో; వెన్నలన్= వెన్నెలలో; వ్రజనితంబినులు= గోపభామలు; ఉండన్+కన్= ఉండగా; ఇంపున్+కన్= కర్ణపేయంగా; పాడిరి= పాడారు.

**తా :** మరొక వెన్నెలరాత్రి బలరామకృష్ణులు ప్రకాశవంతమైన, స్వచ్ఛమైన వస్త్రాలను, హారాలను ధరించారు. చందనం పూసుకొన్నారు. ఆభరణాలు అలంకరించుకొన్నారు. బృందావనానికి వెళ్లి మల్లెలు మొదలైన పూల మకరందాన్ని ఆస్వాదించి మదించిన గండుతుమ్మెదల ఝుంకారాలు వింటూ, వెన్నెలలో గోపస్త్రీలు తమచుట్టూ ఉండగా ఇంపుగా గానం చేశారు.

**క. ఆ పాట సెవుల సోఁకిన, నేపాటియు దేహలతల నెఱుఁగక దృగ్వా**
**చా పాటవములు సెడి పడి, రా పాటలగంధులెల్ల నటవీవీథిన్. 1121**

**ప్రతి :** ఆ పాట= బలరామకృష్ణులు ఆలపించిన ఆ మధురగీతం; చెవుల సోఁకినన్= తమ చెవులకు తాకినంతనే; ఏ పాటియున్= ఏ మాత్రమూ; దేహలతలన్= తీగెలవంటి తమశరీరాలను; ఎఱుఁగక= తెలుసుకోక; దృక్+వాచా పాటవములు= చూడడం, మాట్లాడడం అనే నేర్పులు; చెడి= నశించి; ఆ పాటలగంధులు= కలిగొట్టుపూల సువాసనవంటి దేహ సౌరభం కలిగిన గోపస్త్రీలు; అటవీవీథిన్= ఆ వనసీమలో; పడిరి= పారవశ్యంలో మునిగిపోయారు.

**తా :** బలరామకృష్ణులు ఆలపించిన ఆ మధురగీతం చెవులు సోకినంతనే తమదేహాలస్పృహ ఏ మాత్రం లేనివారై, ఆ గోపికలు చూడడం, మాట్లాడడం మరిచిపోయి, ఆ బృందావన సీమలో పారవశ్యంలో మునిగిపోయారు.

**వ. ఇట్లు సకలభూతసమ్మోహనంబగు గానంబు సేయుచు, నిచ్ఛావర్తనంబులం బ్రమత్తులచందంబున రామకృష్ణులు క్రీడింపఁ గుబేరభటుండు శంఖచూడుం డనువాఁడు రామకృష్ణరక్షితలగు గోపికలం దన యోగబలంబున నుత్తరపుదిక్కునకుం గొనిపోవ నయ్యోషిజ్జనంబులు 'రామకృష్ణేతి' భాషణంబులం జీరి పులికి నగపడిన మొదవులక్రియ మొఱయిడిన విని. 1122**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; సకలభూత= సర్వప్రాణులకూ; సమ్మోహనంబు+అగు= పరవశం కలిగించేదిగా; గానంబు+ చేయుచున్= పాటలు పాడుతూ; ఇచ్ఛావర్తనంబులన్= విచ్చలవిడిగా; ప్రమత్తుల చందంబునన్= మత్తెక్కిన వారి మాదిరి; రామకృష్ణులు; క్రీడింపన్= ఆటలాడుతూ ఉండగా; కుబేరభటుండు= కుబేరుని కింకరుడైన; శంఖచూడుండు+అనువాఁడు= శంఖచూడుడనేవాడు; రామకృష్ణరక్షితలు+అగు= బలరాముని, కృష్ణుని రక్షణలో ఉన్నవారైన; గోపికలన్= గోపకాంతలను; తనయోగబలంబునన్= తన యోగప్రభావంతో; ఉత్తరపుదిక్కునకున్= ఉత్తరదిశకు; కొనిపోవన్= బలాత్కారంగా తీసుకొనిపోగా; ఆ+యోషిత్+జనంబులు= ఆ గోపస్త్రీలు; రామ,కృష్ణ+ఇతి= "రామా!కృష్ణా" అని; భాషణంబులన్= పలుకులతో; చీరి= పిలుస్తూ; పులికిన్= పులికి; అగపడిన= కనిపించిన; మొదవుల క్రియన్= గోవులవలె; మొఱ+ఇడినన్= మొరపెట్టగా; విని...

**తా :** ఈ విధంగా రామకృష్ణులు సర్వప్రాణులకు సమ్మోహం కలిగించే విధంగా గానంచేస్తూ, మత్తెక్కిన వారిమాదిరి, బృందావనంలో యథేచ్ఛాసంచారం చేస్తూ ఉన్నారు. ఇలా ఉండగా వారిరక్షణలో ఉన్న గోపకాంతలను శంఖచూడుడు అనే కుబేరభటుడు బలవంతంగా ఉత్తరదిక్కునకు తీసుకొని పోసాగాడు. ఆ గోపస్త్రీలు 'రామా!కృష్ణా! అని పిలుస్తూ, పులిబారినపడిన గోవులవలె మొరపెట్టారు. వారి మొర విని

**ఉ. గ్రద్దన సాలవృక్షములు గైకొని బల్లిదు లన్నదమ్ము లా**
**యిద్దఱుఁ గాలమృత్యువుల యేపున వే చని 'యోడకుండుఁ డో**
**ముద్దియలార' యంచుఁ దను ముట్టినఁ జూచి కలంగి గుహ్యకుం**
**డుద్దవిడిం దగం బఱచె నుత్తర మింతుల డించి భీతుఁడై. 1123**

**ప్రతి :** బల్లిదులు= బలవంతులైన; అన్నదమ్ములు; ఆ ఇద్దఱున్= బలరామ కృష్ణులు ఇద్దరూ; గ్రద్దనన్= వెంటనే; సాలవృక్షములు= మద్దిచెట్లను; కైకొని= చేతబుచ్చుకొని; కాలమృత్యువుల+ఏపునన్= కాలి మృత్యువుల విజృంభణంతో; వే= వేగంగా; చని= వెళ్లి; ముద్దియలార= ఓ ముగ్ధలైన గోపకాంతలారా; ఓడక+ఉండుఁడు= భయపడకుండా ఉండండి; అంచున్= అంటూ; తనున్= తనను; ముట్టినన్= తలపడగా, తాకగా; చూచి కలంగి= చూచి భయపడి; గుహ్యకుండు= యక్షుడు; ఉద్దవిడిన్= మహావేగంగా; ఇంతులన్= ఆ గోపస్త్రీలను; డించి= వదలిపెట్టి; భీతుఁడు+ఐ= భయపడినవాడై; ఉత్తరము= ఉత్తరదిక్కునకు; తగన్+పఱచెన్= వెంటనే పరుగెత్తాడు.

**తా :** బలశాలురైన అన్నదమ్ములు రామకృష్ణులు ఇద్దరూ వెంటనే మద్దిచెట్లను చేత పట్టుకొని కాలమృత్యువులవలె వేగంగా వెళ్తూ 'ఓ ముగ్ధగోపికలారా! భయపడకండి' అని ధైర్యం చెప్పి ఆ యక్షునితో తలపడ్డారు. ఆ గుహ్యకుడు కలతచెంది గోపికలను వదలి, భీతుడై అతివేగంగా ఉత్తరదిశగా పరుగెత్తాడు.

**వ. ఇట్లు గుహ్యకునిచేత విడివడిన గోపికల 'రక్షించుకొని యుండు' మని బలభద్రునిం బలికి. 1124**

**ప్రతి :** ఇట్లు= ఇలా; గుహ్యకునిచేత= యక్షునిచేతినుండి; విడివడిన= విముక్తలైన; గోపికలన్= గోపస్త్రీలను; రక్షించుకొని ఉండుము= రక్షిస్తూ ఉండుము; అని; బలభద్రునిన్= బలరామునితో; పలికి= చెప్పి...

**తా :** ఈ విధంగా యక్షుని చేతినుండి విముక్తలైన గోపికలను రక్షిస్తూ ఉండమని బలరామునితో చెప్పి

**శా. 'ఓరీ! గుహ్యక! పోకు పోకు మని రోషోక్తిన్ బకారాతి వాఁ**
**డే రూపంబున నెందుఁ జొచ్చె నెటఁ బోయెం దోడఁ దా నేఁగి దు**
**ర్వారోదంచితముష్టి వానితల ద్రెవ్వం బట్టి తద్వీరు కో**
**టీరభ్రాజితరత్నముం గొనియె దండిన్ గోపికల్ సూఁడఁగన్. 1125**

**ప్రతి :** ఓరీ! గుహ్యక!= ఓరీ! యక్షుడా!; పోకుపోకుము= పారిపోవద్దు! పారిపోవద్దు!; అని; రోష+ఉక్తిన్= కోపంతో పలుకుతూ; బక+అరాతి= బకాసురసంహారిఅయిన కృష్ణుడు; వాఁడు= ఆ యక్షుడు; ఏ రూపంబునన్= ఏ ఆకారంతో; ఎందున్= ఎక్కడ; చొచ్చెన్= ప్రవేశించాడో; ఎటన్= ఎక్కడికి; పోయెన్= వెళ్లాడో; తాను; తోడన్= వెంట; ఏఁగి= వెళ్లి; దుర్వార+ఉదంచిత= వారించరాని పైకెత్తిపెట్టబడిన; ముష్టిన్= పిడికిటితో; వానితలన్= వానిశిరస్సును; ద్రెవ్వన్+పట్టి= తెగి పడేటట్లు పొడిచి; తద్+వీరు= ఆ యక్షవీరునియొక్క; కోటీర విభ్రాజిత రత్నమున్= కిరీటంలో ప్రకాశించే రత్నాన్ని; దండిన్= శౌర్యంతో; గోపికల్; చూఁడన్+కన్= చూస్తూ ఉండగా; కొనియెన్= గ్రహించాడు.

**తా :** బకాసురసంహారి అయిన శ్రీకృష్ణుడు "ఓరీ! యక్షుడా! పారిపోవద్దు! పారిపోవద్దు" అని క్రోధంగా పలుకుతూ, యక్షుడు ఏ రూపంలో ఎక్కడ ప్రవేశిస్తున్నాడో, ఎక్కడికి వెళుతున్నాడో తానూ వానితో అక్కడ ప్రవేశించాడు. అక్కడికి వెళ్లి వానిని

పట్టుకొన్నాడు. సాటిలేని తన పిడికిటిపోటుతో వానితల తెగి పడేటట్లు పొడిచాడు. శౌర్యంతో ఆ యక్షవీరుని కిరీటంలో ప్రకాశించేరత్నాన్ని గోపికలు చూస్తూ ఉండగా గ్రహించాడు.

**వ. ఇట్లు శంఖచూడునిం జంపి వానిశిరోరత్నంబు దెచ్చి బలభద్రుని కిచ్చి మెప్పించె; మఱియు నొక్కదినంబునం గృష్ణుండు వనంబులకుం జనిన నతనిలీలలు పాడుచు నిండ్లకడఁ దద్విరహ వేదనానల భరంబు సహింపక గోపికలు దమలో నిట్లనిరి. 1126**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; శంఖచూడునిన్= శంఖచూడుణ్ణి; చంపి; వాని శిరోరత్నంబు= వాని చూడామణిని; తెచ్చి; బలభద్రునికిన్= బలరామునికి; ఇచ్చి; మెప్పించెన్= మెప్పుపొందాడు; మఱియున్; ఒక్క దినంబునన్= ఒక నాడు; కృష్ణుండు= శ్రీకృష్ణుడు; వనంబులకున్= అడవుల్లోకి; చనినన్= వెళ్లగా; అతని లీలలు= ఆయన లీలలను; పాడుచున్= పాడుకుంటూ; ఇండ్లకడన్= ఇండ్లవద్ద; తద్+విరహవేదన= అతని విరహశోకం అనే; అనలభరంబు= అగ్నిభారాన్ని; సహింపక= భరించలేక; గోపికలు; తమలోన్= తమలోతాము; ఇట్లు= ఇలా; అనిరి= అనుకోసాగారు.

**తా :** ఈ విధంగా శ్రీకృష్ణుడు శంఖచూడుణ్ణి చంపి, వాని శిరోరత్నం తెచ్చి బలరాముని కిచ్చి, అగ్రజుణ్ణి ఆనందింపజేశాడు. తర్వాత ఇంకొకరోజు కృష్ణుడు అడవులలోకి వెళ్లాడు. అప్పుడు అతనిలీలలను ఇండ్లలోనే పాడుకొంటూ విరహతాపానికి తాళలేక గోపికలు తమలో తాము ఇలా అనుకోసాగారు.

**శా. భ్రూవిక్షేపముతోడ దాపలి భుజంబుం జెక్కుఁ గీలించి కె**
**మ్మోవిన్ వేణువుఁ గూర్చి సుస్వరముగా మ్రోయించుచు న్నంగుళీ**
**ప్రావీణ్యంబు విభుండు సూపఁ గని సప్రాణేశలై యుండియున్**
**నీవీబంధము లూడఁ బొక్కుదురువో నింగిన్ నిలింపాంగనల్. 1127**

**ప్రతి :** విభుండు= మనలను ఏలిన కృష్ణుడు; భ్రూవిక్షేపముతోడన్= కనుబొమలు తిప్పుతూ; దాపలిభుజంబున్= ఎడమభుజంమీద; చెక్కు= చెక్కిలి; కీలించి= చేర్చి; కెంపు+మోవిన్= ఎర్రని అధరంపైన; వేణువున్= పిల్లనగ్రోవిని; కూర్చి= ఆనించి; సుస్వరము+కాన్= మధురస్వరం ఒలికేటట్లు; మ్రోయించుచున్= వాయిస్తూ; అంగుళీప్రావీణ్యంబు= వేళ్లనేర్పును; చూపన్= చూపిస్తూ ఉండగా; కని= చూచి; సప్రాణ+ఈశులు+ఐ= తమతమభర్తలతో కూడుకొన్నవారై; ఉండియున్= ఉండికూడా; నీవీబంధములు+ఊడన్= చీరముడులు వీడిపోగా; నింగిన్= ఆకాశంలో; నిలింప+అంగనలు= దేవతాస్త్రీలు; పొక్కుదురు+పో= మదనవేదనల పాలవుతున్నారు పో!

**తా :** మనలను ఏలిన శ్రీకృష్ణుడు ఎడమభుజంపైన చెక్కు ఆనించి, కెమ్మోవిపై మురళిని ఆనించి, మధురస్వరం ఒలికేటట్లు వేణువును వాయిస్తూ తన వేళ్లను వేణురంధ్రాల మీద నేర్పుగా సారించి, చూపుతూ ఉంటే మింట నిలిచి చూస్తున్న అప్సరసలు తమ ప్రాణేశులు తమవద్దనే ఉన్నా, పోకముళ్లు ఊడి పోతూ ఉండగా మదనవేదనపొందుతూ ఉంటారు గదా!

**మ. నవమాధుర్యము గల్గు కృష్ణమురళీనాదామృతస్యందముల్**
**సెవులం జొచ్చి హృదంతరాళముల భాసిల్లన్ సవత్సంబులై**
**యువిదా! మేపులకుం దొఱంగి మృగగోయూథంబు లుత్కంఠతో**
**దివికిం గంఠము లెత్తి లో వదలుఁ బో దేహేంద్రియవ్యాప్తులన్. 1128**

**ప్రతి :** ఉవిదా= ఓ చెలియా!; నవమాధుర్యము= కొత్తరుచి; కల్గు= కలిగిన; కృష్ణు= కృష్ణునియొక్క; మురళీనాద+అమృత స్యందముల్= పిల్లనగ్రోవినుండి జాలువారే అమృతస్రావాలు; చెవులన్= చెవులలో; చొచ్చి= ప్రవేశించి; హృద్+అంతరాళములన్= హృదయాలలోపల; భాసిల్లన్= విరాజిల్లగా; సవత్సంబులు+ఐ= దూడలతో కూడినవైన; మృగగోయూథంబులు= జంతువులూ, గోవులసమూహాలూ; ఉత్కంఠతోన్= అత్యాసక్తితో; దివికిన్= ఆకాశం వైపు; కంఠములు+ఎత్తి= మోరలెత్తి; దేహ+ఇంద్రియ వ్యాప్తులన్= దేహానికి సంబంధించిన ఇంద్రియవ్యాపారాలనన్నింటిని; లోన్+వదలున్+పో= మనస్సులోనే వదిలివేస్తాయి.

**తా :** ఓ పడతీ! కొత్తరుచి కలిగిన కృష్ణునిమురళీనాదం అనే అమృతధారలు చెవులలో ప్రవేశించి, హృదయాల లోపల చేరగానే దూడలతో కూడా గోవులసమూహాలు తక్కిన జంతువులు అత్యాసక్తితో ఆకాశంవైపు మోరలెత్తి దేహానికి సంబంధించిన ఇంద్రియవ్యాపారాలన్నిటినీ వదలి వేస్తాయి.

**శా.** **ఓ కంజేక్షణ! కృష్ణుఁ డుజ్జ్వలితహారోద్దాముఁడై గాన వి**
**ద్యా కౌతూహలితన్ మనోజ్ఞమురళీధ్వానంబు గావింపఁగా**
**నాకర్ణించి సశంపమై మొఱయు నీలాభ్రంబుగాఁ జూచుచుం**
**గేకారావము లిచ్చుచున్ మురియుఁ బో కేకీంద్రసంఘాతముల్.** **1129**

**ప్రతి :** ఓ కంజ+ఈక్షణ= ఓ పద్మనయనా!; కృష్ణుఁడు= శ్రీకృష్ణుడు; ఉజ్జ్వలిత= తళతళలాడుతూ ఉన్న; హార+ ఉద్దాముఁడు+ఐ= ముత్యాల హారాలచేత అతిశయం పొందినవాడై; గానవిద్యా= సంగీతవిద్యా; కౌతూహలితన్= కుతూహలం చేత; మనోజ్ఞమురళీధ్వానంబు= మనోహరమైన పిల్లనగ్రోవిధ్వని; కావింపన్+కాన్= చేయగా; ఆకర్ణించి= విని; సశంపమై మెరుపుతో కూడిందై; మొఱయు= శబ్దించే; నీల+అభ్రంబు+కాన్= నల్లనిమేఘంగా; చూచుచున్= భావిస్తూ; కేకి+ ఇంద్రసంఘాతముల్= మేటి నెమళ్లసమూహాలు; కేక+ఆరావములు= కేకారవాలు; ఇచ్చుచున్= చేస్తూ; మురియున్+పో= పరవశిస్తాయి గదా!

**తా :** ఓ పద్మనయనా! శ్రీకృష్ణుడు తళతళలాడే ముత్యాలహారం ధరించి, గాంధర్వవిద్యలో కుతూహలం అతిశయించగా, మనోజ్ఞంగా మురళిని వాయించినపుడు ఆ మురళీధ్వానం విన్న మేటినెమళ్లసమూహాలు కృష్ణుని మెరుపుతో కూడి శబ్దించే నల్లనిమేఘంగా భావించి పరవశంతో కేకారవాలు చేస్తాయి గదా!

**మ.** **లలనా! యేటికిఁ దెల్లవాఱె? రవి యేలా తోఁచెఁ బూర్వాద్రిపైఁ?**
**గలకాలంబు నహంబు గాక నిసిగాఁ గల్పింపఁ డా బ్రహ్మ దా**
**వలఱేఁడుం గృప లేఁడు; కీరములు దుర్వారంబు; లెట్లో కదే!**
**కలదే మాపటివేళయుం గలుగునే కంజాక్షు సంభోగముల్.** **1130**

**ప్రతి :** లలనా= ఓ యువతీ!; ఏటికిన్= ఎందుకు; తెల్లవాఱెన్= తెల్లవారింది; రవి= సూర్యుడు; ఏలా= ఎందుకు; పూర్వాద్రిపైన్= తూర్పుకొండమీద; తోఁచెన్= కనిపించాడు; కలకాలంబున్= కాలమంతా; అహంబు= పగలు; కాక= కాకుండా; నిసిగాన్= రాత్రిగా; ఆ బ్రహ్మ; కల్పింపఁడు= సృష్టించడు; తాన్= తాను; వలఱేఁడున్= మన్మథుడు కూడా; కృప లేఁడు= కరుణలేని వాడయ్యాడు; కీరంబులు= చిలుకలు; దుర్వారంబులు= వారింపరానివయ్యాయి; ఎట్లో కదే= ఎలాగో కదా; మాపటివేళయున్= రాత్రివేళ కూడా; కలదే= ఉందా; కంజాక్షుసంభోగముల్= కృష్ణునితో రతులు; కలుగునే= లభిస్తాయా?

**తా :** ఓ యువతీ! ఎందుకు తెల్లవారిందే? తూర్పుకొండపైన సూర్యుడు ఎందుకు ఉదయించాడే? పగళ్లన్నిటినీ తెల్లవారని రాత్రులుగా బ్రహ్మదేవుడు ఎందుకు చేయడే? మదనుడుకూడా దయలేని వాడయ్యాడు. చిలుకలు వారింపరానివిగా ఉన్నాయి. ఎలాగే? రాత్రివేళ వస్తుందంటావా? పద్మనేత్రుడితో సుఖపడే అదృష్టం లభిస్తుందా?

**ఉ. ఎప్పుడు ప్రొద్దు గ్రుంకు? హరి యెప్పుడు గోవుల మేపి వచ్చు? నా**
**కెప్పుడు తన్ముఖాంబుజసమీక్షణ మబ్బు? నతండు వచ్చి న**
**న్నెప్పుడు గారవించుఁ? దుది యెప్పుడు మద్విరహాగ్నిరాశికిం**
**జెప్పఁగదమ్మ! బోఁటి! మరుచేఁతల నుల్లము దల్లడిల్లెడిన్. 1131**

**ప్రతి :** బోఁటి= ఓ సుందరీ!; ప్రొద్దు= సూర్యుడు; ఎప్పుడు; క్రుంకున్= అస్తమిస్తాడు; హరి= శ్రీకృష్ణుడు; ఎప్పుడు; గోవులన్= ఆవులను; మేపి; వచ్చున్= వస్తాడు; నాకు; ఎప్పుడు; తద్+ముఖ+అంబుజ+సమీక్షణము= అతని వదనపద్మ దర్శనం; అబ్బును= కలుగుతుంది; అతండు= శ్రీకృష్ణుడు; వచ్చి; నన్ను; ఎప్పుడు; గారవించున్= ఆదరిస్తాడు; మద్+విరహ+అగ్నిరాశికిన్= నా విరహాగ్నిరాశికి; తుది= అంతం; ఎప్పుడు; చెప్పన్+కద+అమ్మ= చెప్పవమ్మా!; మరుచేఁతలన్= మన్మథుని చేష్టలవల్ల; ఉల్లము= హృదయం; తల్లడిల్లెడిన్= బాధపడిపోతున్నది.

**తా :** ఓ సుందరీ! పొద్దు ఎప్పుడు కుంకుతుంది? ఆవులను మేపుకొని గోవిందుడు ఎప్పుడు గోకులానికి వస్తాడు? ఎప్పుడు నాకు ఆ స్వామి ముఖపద్మదర్శనం అవుతుంది? దగ్గరకు చేరి అతడు నన్ను ఎప్పుడు ఆదరిస్తాడు? నా విరహాగ్నిరాశికి అంతం ఎప్పుడు? చెప్పవమ్మా! మన్మథునిచేతలవల్ల నా హృదయం తల్లడిల్లిపోతూ ఉంది.

**మ. చెలియా! కృష్ణుఁడు నన్నుఁ బాసి వనముం జేరంగ నయ్యా క్షణం**
**బులు నా కన్నియు నుండ నుండఁగఁ దగన్ బూర్ణంబులై సాఁగి లో**
**పలఁ దోఁచుం బ్రహరంబులై దినములై పక్షస్వరూపంబులై**
**నెలలై యబ్దములై మహాయుగములై నిండారు కల్పంబులై. 1132**

**ప్రతి :** చెలియా= ఓ చెలీ!; కృష్ణుఁడు; నన్నున్= నన్ను; పాసి= వదిలేసి; వనమున్= వనానికి; చేరన్+కన్= వెళ్లినప్పుడు; ఆ+ఆ+క్షణంబులు= ఆయాక్షణాలు; అన్నియున్= అన్నీ; ఉండన్+ఉండన్+కన్= తప్పక ఉంటాయా; తగన్= తగినట్లు; పూర్ణంబులు+ఐ= సంపూర్ణాలు అయి; సాఁగి= కొనసాగి; లోపలన్= నా మనస్సుకు; ప్రహరంబులు+ఐ= జాములై; దినములు+ఐ= దినాలై; పక్షస్వరూపంబులు+ఐ= పక్షాలై; నెలలు+ఐ= మాసాలై; అబ్దములు+ఐ= సంవత్సరాలై; మహాయుగములు+ఐ= మహాయుగాలై; కల్పంబులు+ఐ= కల్పాలై; తోఁచున్= తోస్తుంది.

**తా :** ఓ చెలీ! శ్రీకృష్ణుడు నన్ను వదిలిపెట్టి వనానికి వెళ్లినప్పుడు ఆయా క్షణాలు, అంతకంతకూ కొనసాగుతూ జాములై, దినాలై, పక్షాలై, నెలలై, సంవత్సరాలై, మహాయుగాలై, కల్పాలై నామనసులో తోస్తూ ఉన్నాయి.

**వ. అని మఱియుఁ గృష్ణవిరహదుఃఖంబున బహువిధంబులఁ బశ్చాత్తాపంబు నొందుచు గోపిక లోపికలు లేక యెట్టకేలకు దినంబు గడపి దినాంతసమయంబునందు. 1133**

**ప్రతి :** అని; మఱియున్= ఇంకా; కృష్ణవిరహదుఃఖంబునన్= కృష్ణవియోగ శోకంతో; బహువిధంబులన్= అనేక ప్రకారాలుగా; పశ్చాత్+తాపంబున్+ఒందుచున్= అనుతాపం పొందుతూ; గోపికలు; ఓపికలు లేక= సహనాలు లేక; ఎట్టకేలకున్= చివరికెలాగో; దినంబు+గడపి= పగలు వెళ్లబుచ్చి; దిన+అంత సమయంబున్+అందున్= సంధ్యాసమయంలో...

**తా :** ఈ విధంగా ఇంకా కృష్ణవియోగశోకంతో పలురీతులుగా పశ్చాత్తాపడుతూ గోపికలు సహనం కోల్పోయి ఎలాగో పగలు గడపి సాయంసంధ్యాసమయంలో

**మ. 'అదె భానుం డపరాద్రిఁ జేరె? నిదె సాయంకాల మేతెంచె; న**
**ల్లదె గోపాదపరాగ మొప్పెసఁగె, బృందారణ్యమార్గంబు నం**
**దిదె వీతెంచె వృషేంద్రఘోషము; ప్రియుం డేతెంచె రం' డంచుఁ దా**
**మెదు రేతెంతురు మాపు కృష్ణునికి న య్యింతుల్ పరిభ్రాంతలై. 1134**

**ప్రతి :** అదె= అదిగో; భానుండు= సూర్యుడు; అపర+అద్రిన్= పడమటికొండను; చేరెన్= చేరాడు; ఇది+ఎ= ఇదిగో; సాయంకాలం; ఏతెంచెను= వచ్చింది; అల్ల+అది+ఎ= అల్లదిగో!; గోపాదపరాగము= గోవులపాదధూళి; ఒప్పు+ఎసఁగెన్= ఒప్పారింది; బృంద+అరణ్యమార్గంబు+అందున్= బృందావన కాననమార్గంలో; వృష+ఇంద్ర ఘోషము= ఎద్దులరంకెలు; వీతెంచెన్= వినవస్తున్నాయి; ప్రియుండు= ప్రాణనాథుడు; ఏతెంచెన్= వచ్చాడు; రండు+రండు+అంచున్= రండి రండి అంటూ; ఆ+ఇంతుల్= ఆ గోపభామినులు; తాము; పరిభ్రాంతలు+ఐ= తొట్రుపాటుతో కూడిన మనస్సులు కలవారై; కృష్ణునికిన్= శ్రీకృష్ణునికి; ఎదురు+ఏతెంతురు= ఎదురుగా వెళతారు.

**తా :** ఆ సాయంసంధ్యాసమయంలో "అదిగో! సూర్యుడు పడమటికొండకు చేరాడు. ఇదిగో సాయంకాలం అయింది. అల్లదే! గోధూళి ఒప్పిదంగా రేగుతోంది. బృందావనమార్గంలో ఎద్దులరంకెలు వినిపిస్తున్నాయి. మన ప్రియుడు వచ్చేశాడు. రండి" అని ఒకరినొకరు పిలుచుకొంటూ, సాయంవేళ తొట్రుపాటుగల హృదయాలతో తమ ప్రియుడైన కృష్ణునికి ఎదురేగుతారు.

**వ. ఇట్లు తన కెదురు వచ్చిన మచ్చిక న చ్చెలువల నచ్యుతుం డిచ్ఛానువర్తనంబుల గారవించె నంత నొక్కనాఁడు. 1135**

**ప్రతి :** ఇట్లు= ఇలా; తనకు; ఎదురువచ్చిన= ఎదురుగా వచ్చిన; మచ్చికన్= ఆసక్తితో; అచ్యుతుండు= శ్రీకృష్ణుడు; ఆ+చెలువలన్= ఆ రమణులను; ఇచ్ఛా+అనువర్తంబులన్= వారికి ఇష్టంవచ్చిన ప్రణయచేష్టలతో; గారవించెన్= ఆదరించాడు; అంతన్= అంతలో; ఒక్కనాఁడు= ఒకరోజు...

**తా :** ఇలా గోపికలు తనకెదురు రాగా, ఆసక్తితో వారిని కృష్ణుడు వారి ఇష్టానుసారంగా ప్రణయ సల్లాపాలతో ఆదరించాడు. ఆ తర్వాత ఒకనాడు

## ✤ వృషభాసుర సంహారము ✤

**సీ. ఎవ్వనిమూఁపుర మీక్షించి మేఘంబు లద్రిశృంగం బని యాశ్రయించు**
**నెవ్వనిఱంకె కర్ణేంద్రియంబులు సోఁక గర్భపాతం బగు గర్భిణులకు**

**నెవ్వనిపదహతి నెగయుపరాగంబు లంధకారారాతి నావరించు**
**నెవ్వఁడు గొమ్ముల నెదిరించి చిమ్మినఁ బృథ్వీధరంబులు పెల్లగిల్లు**

**తే. నట్టి వృషభాసురేంద్రుఁ డహంకరించి, వాలలత యెత్తి పెనుఱంకె వైచి నేలఁ**
**గాలు ద్రవ్వుచు నిశితశృంగములు సాఁచి, మంద బెగడంగఁ గవిసె నమందగతిని. 1136**

**ప్రతి :** ఎవ్వని మూఁపురము= ఎవని భుజశిరం; ఈక్షించి= చూచి; మేఘంబులు= మేఘాలు; అద్రిశృంగంబు+అని= కొండశిఖరం అని; ఆశ్రయించున్= ఆశ్రయిస్తాయో; ఎవ్వని ఱంకె= ఎవని రంకె; కర్ణ+ఇంద్రియంబులు= చెవులు; సోఁకన్= సోకితే; గర్భిణులకున్= గర్భవతులకు; గర్భపాతంబు+అగున్= గర్భస్రావం అవుతుందో; ఎవ్వని పదహతిన్= ఎవని కాలిగిట్టల తొక్కిడికి; ఎగయు పరాగంబులు= ఎగిసే దుమ్మురేణువులు; అంధకార+అరాతిన్= చీకటికి శత్రువైన సూర్యుణ్ణి; ఆవరించున్= చుట్టూ కమ్ముకుంటుందో; ఎవ్వఁడు= ఎవడు; కొమ్ములన్= కొమ్ములతో; ఎదిరించి= ఎదుర్కొని; చిమ్మినన్= చిమ్మితే; పృథ్వీధరంబులు= కొండలు; పెల్లగిల్లున్= పెల్లగిలిపోతాయో; అట్టి= అలాంటి; వృషభ+అసుర+ఇంద్రుఁడు= వృషభుడనే రాక్షసరాజు; అహంకరించి= గర్వించి; వాలలత= తీగలాంటి తోకను; ఎత్తి; పెనుఱంకె= పెద్దరంకె; వైచి= వేసి; నేలన్= నేలమీద; కాలు+త్రవ్వుచున్= కాలుదువ్వుతూ; నిశితశృంగములు= వాడియైన కొమ్ములు; చాఁచి= చాచి; మంద= గోవులమంద; బెగడంగన్= భయపడే విధంగా; అమందగతిని= పరుగువేగంతో; కవిసెను= వచ్చిపడ్డాడు.

**తా :** ఎవని మూపురం చూచి మేఘాలు కొండశిఖరం అని భ్రమించి ఆశ్రయిస్తాయో - ఎవనిరంకె చెవులకు సోకితే గర్భవతులకు గర్భస్రావం అవుతుందో- ఎవని పాదఘట్టనలచే ఎగసే ధూళిరేణువులు సూర్యుణ్ణి ఆవరిస్తాయో- ఎవడు కొమ్ములతో కోరాడి చిమ్మితే కొండలే పెల్లగిల్లుతాయో - అలాంటి వృషభాసురుడు అహంకరించి, తీగలాంటి తన వాలాన్ని ఎత్తి, పెద్దరంకె వేసి, కాలితో నేలను తవ్వుతూ, ఆవులమంద భీతిల్లేటట్లు వాడికొమ్ములు చాచి అతివేగంగా వచ్చిపడ్డాడు.

**వ. అట్లు వృషభాకారంబున నరిష్టుఁడు హరికి నరిష్టంబు సేయం దలంచి పై కుఱికిన. 1137**

**ప్రతి :** అట్లు= అలా; వృషభ+ఆకారంబునన్= ఎద్దురూపంతో; అరిష్టుఁడు= అరిష్టుడనే రాక్షసుడు; హరికిన్= శ్రీకృష్ణునికి; అరిష్టంబు+చేయన్= కీడుచేయదలచి; పైకిన్; ఉఱికినన్= దూకగా...

**తా :** అలా వృషభాకారం దాల్చిన అరిష్టుడనే రాక్షసుడు హరికి కీడుచేయదలచి అతనిపైకి దూకగా

**ఉ. క్రేపులు పాఱె గోవులకుఁ, గ్రేపులు గోవులు గోవృషంబులం**
**బైపడె; వత్సధేనువృషభంబులు గోపకులందుఁ జొచ్చె; నా**
**గోపకు లా వృషేంద్రములు గోవులు లేఁగలు విచ్చి పాఱఁగా**
**గోపచమూవిభుండు గనె గోవృషదైత్యుఁడు వెంట నంటఁగన్. 1138**

**ప్రతి :** గోవృషదైత్యుఁడు= వృషభాసురుడు; వెంటన్+అంటన్+కన్= వెంటపడగా; గోవులకున్= ఆవులవద్దకు; క్రేపులు+పాఱెన్= దూడలు పరుగెత్తాయి; క్రేపులు= దూడలు; గోవులు= ఆవులు; గోవృషంబులన్= ఎద్దులపై; పడెన్= పడ్డాయి; వత్సధేనువృషంబులు= దూడలు, ఆవులు, ఎద్దులు; గోపకులందున్= గోపాలకులవద్దకు; చొచ్చెన్= చేరాయి; ఆ గోపకులు= ఆ గోపాలకులు; ఆ వృష+ఇంద్రములు= ఆ మేటిఎద్దులు; గోవులు= ఆవులు; లేఁగలు= దూడలు; విచ్చిపాఱఁగా= చెల్లాచెదరై పరుగెత్తగా; గోపచమూవిభుండు= గోపాలకుల సేనకు నాయకుడైన గోవిందుడు; కనెన్= చూశాడు.

**తా :** వృషభరూపం దాల్చిన అరిష్టుడనే ఆ రాక్షసుడు వెంటబడగా దూడలు ఆవులవద్దకు పరుగెత్తాయి. దూడలు, ఆవులుచేరి ఎద్దులలో వచ్చిపడ్డాయి. దూడలు, ఆవులు, ఎద్దులు ఏకమై గోపాలకుల వద్దకు పరుగెత్తాయి. గోపాలకులు, ఎద్దులూ, ఆవులూ, దూడలూ చెల్లాచెదరై పరుగెత్తడం గోవిందుడు చూశాడు.

**వ. ఇట్లు భయభ్రాంతులై కాంతలుం దారును గృష్ణ! కృష్ణ! రక్షింపు రక్షింపు మనియెడు గోపకులకు నడ్డంబు వచ్చి దీనజనరక్షకుండైన పుండరీకాక్షుం డిట్లనియె. 1139**

**ప్రతి :** ఇట్లు= ఇలా; భయభ్రాంతులు+ఐ= భయంతో పరిభ్రమిస్తూ ఉన్న; కాంతలున్+తారును= గోపికలూ తామూ; కృష్ణ!, కృష్ణ!; రక్షింపు= రక్షించు; రక్షింపుము= రక్షించు; అనియెడు= అని మొరపెట్టే; గోపకులకున్= గోపాలకులకు; అడ్డంబువచ్చి= అడ్డుపడి; దీనజనరక్షకుండు= దీనజనులను రక్షించేవాడైన; పుండరీక+అక్షుండు= పద్మనేత్రుడైన శ్రీకృష్ణుడు; ఇట్లు= ఇలా; అనియెన్= అన్నాడు.

**తా :** ఈ విధంగా భయంతో పరిభ్రమిస్తూ తామూ, తమకాంతలూ కృష్ణ కృష్ణా! రక్షించు! అని మొరపెడతూ కృష్ణుణ్ణి శరణుచొచ్చారు. దీనరక్షకుడైన శ్రీకృష్ణుడు గోపాలకులకు అడ్డంవచ్చి రాక్షసునితో ఇలా అన్నాడు.

**ఉ. 'బాలుర నింతులం బసులఁ బాఱఁగఁ దోలుట బంటుపంతమే**
**చాలు, వృషాసురేంద్ర! బలసంపదఁ జూపఁగ నెల్లబోఁటి గో**
**పాలురమంద గాదు; చను పైఁబడితేనిఁ బ్రచండ కృష్ణ శా**
**ర్దూలము నేఁడు నీగళముఁ ద్రుంపక చంపక పోవనిచ్చునే? 1140**

**ప్రతి :** వృష+అసుర+ఇంద్ర= వృషభాసురా!; బాలురన్= పిల్లలను; ఇంతులన్= స్త్రీలను; పసులన్= పశువులనూ; పాఱన్+కన్+తోలుట= పారదోలడం; బంటుపంతము+ఏ= పరాక్రమమా?; చాలు; బలసంపదన్= నీ బలాతిశయం; చూపన్+కన్= చూపడానికి; ఎల్లబోఁటి= అందరివంటి; గోపాలుర మంద= గోపికల గోపాలకుల సమూహం; కాదు; చను= వెళ్ళిపో!; పైన్+పడితి(వి)+ఏనిన్= పైకి వచ్చావంటే; ప్రచండ= భయంకరమైన; కృష్ణశార్దూలము= కృష్ణుడనే బెబ్బులి; నేఁడు= ఈనాడు; నీ గళమున్= నీ గొంతును; త్రుంపక= ఖండించకుండా; చంపక= చంపకుండా; పోవన్+ఇచ్చును+ఏ= పోనిస్తుందా?

**తా :** ఓరీ! వృషభాసురా! పిల్లలనూ, స్త్రీలనూ, పశువులనూ పారదోలడం పరాక్రమమా? నీప్రతాపం వారిమీద చాలించు. నీ బలం చూపెట్టి భయపెట్టడానికి మేము సామాన్యులమైన గోపగోపీజనులం కాదు. వెళ్ళిపో! మీదికి వచ్చావంటే నేడు ఈ కృష్ణుడనే పెద్దపులి నీ కంఠం ఖండించకుండా, నిన్ను చంపకుండా విడిచిపెట్టదు సుమా!

**ఆ. అనుచు ధిక్కరించి హస్తతలంబులఁ, జప్పుడించి నగుచుఁ జలము మీఱఁ**
**బన్నగేంద్రభయదబాహుదండము సాఁచి, దండి మెఱసి దనుజుదండ నిలిచె. 1141**

**ప్రతి :** అనుచున్= ఇలా అంటూ; ధిక్కరించి= రాక్షసునితో తిరస్కరించి పలికి; హస్తతలంబులన్= కరతలాలతో, అరచేతులతో; చప్పుడించి= శబ్దంవచ్చేటట్లు చరచి; నగుచున్= నవ్వుతూ; చలముమీఱన్= పట్టుదల అతిశయించగా; పన్నగ+ఇంద్ర= సర్పరాజంవలె; భయద= భీతికొలిపే; బాహుదండము= దండంవంటి బాహువును; చాఁచి= చాచి; దండి మెఱసి= శూరత్వం దీపించగా; దనుజుదండన్= వృషభాసురుని పక్కన; నిలిచెన్= (కృష్ణుడు) నిలిచాడు.

**తా :** ఇలా రాక్షసుణ్ణి ధిక్కరించి పలుకుతూ, అరచేతులతో చరుస్తూ, నవ్వుతూ, పట్టుదల అతిశయించగా, సర్పరాజంవలె భీతిగొలిపే బాహుదండాన్ని చాచి, శౌర్యంతో దనుజుని పక్కనే కృష్ణుడు నిలిచాడు.

**వ. అప్పుడు. 1142**

**తా :** ఆ సమయంలోనే...

**చ. ఖురముల నేలఁ ద్రవ్వుచు నకుంఠితవాలసమీరణంబులన్**
**విరవిరఁ బోయి మేఘములు వివ్వ విషాణము లొడ్డికొంచు దు**
**స్తరతరమూర్తియై వృషభదైత్యుఁడు కన్నుల నిప్పు లొల్కఁగా**
**దురదుర వచ్చి తాఁకె రిపుదుర్మదమోచనుఁ బద్మలోచనున్. 1143**

**ప్రతి :** వృషభదైత్యుఁడు= ఆ వృషభాసురుడు; దుస్తరతరమూర్తి+ఐ= నివారింపరాని స్వరూపంకలవాడై; ఖురములన్= గిట్టలతో; నేలన్+త్రవ్వుచున్= నేల తవ్వుతూ; అకుంఠితవాల సమీరణంబులన్= అడ్డులేని విధంగా తోక తిప్పడంవల్ల ఏర్పడే గాలులతో; మేఘములు; విరవిరన్+పోయి+వివ్వన్= విరవిర విచ్చిపోగా; విషాణములు= కొమ్ములు; ఒడ్డికొంచున్= ఒడ్డుతూ; కన్నుల= కన్నులలో; నిప్పులు+ఒల్కఁగాన్= నిప్పులు రాలగా; దురదుర= అతివేగంగా; వచ్చి; రిపుదుర్మదమోచనున్= శత్రువుల దుర్గర్వాన్ని పోగొట్టేవాడైన; పద్మలోచనున్= కమలనేత్రుడైన కృష్ణుణ్ణి; తాఁకెన్= ఎదుర్కొన్నాడు.

**తా :** అప్పుడు ఆ వృషభాసురుడు గిట్టలతో నేలతవ్వుతూ, అడ్డులేని విధంగా తిప్పే తనతోకవల్ల ఏర్పడే గాలులకు మేఘాలు విచ్చిపోతుండగా, కొమ్ములు ఒడ్డుకొంటూ, కన్నులలో నిప్పులు రాలుతుండగా, దుస్సహమైన రూపంతో రివ్వురివ్వున వచ్చి, శత్రువుల దుర్గర్వాన్ని నశింపజేసే పద్మనేత్రుడయిన శ్రీకృష్ణుని ఎదుర్కొన్నాడు.

**ఉ. యాదవకుంజరుండు వృషభాసురుకొమ్ములు రెండుఁ బట్టి య**
**ష్టాదశపాదమాత్రము గజంబు గజంబును ద్రొబ్బు కైవడిన్**
**భేదిల ద్రొబ్బ న య్యసుర బిమ్మిటి నొంది చెమర్చి మ్రొగ్గి దు**
**ర్మాదముతోడ డీ కొనెఁ బ్రమత్తవిమర్దను నా జనార్దనున్. 1144**

**ప్రతి :** యాదవకుంజరుండు= యాదవులలో శ్రేష్ఠుడైన శ్రీకృష్ణుడు; వృషభాసురుకొమ్ములు రెండున్= వృషభాసురుని రెండు కొమ్ములనూ; పట్టి= పట్టుకొని; అష్టాదశ పాదమాత్రము= పద్దెనిమిది అడుగులదూరం; గజంబు= ఏనుగు; గజంబును= ఏనుగును; ద్రొబ్బుకైవడిన్= తోసినవిధంగా; భేదిలన్= పడిపోయేటట్లు; ద్రొబ్బన్= తోయగా; ఆ+అసుర= ఆ వృషభాసురుడు; పిమ్మిటిన్+ఒంది= బాధను పొంది; చెమర్చి= చెమటలుపట్టి; మ్రొగ్గి= నేలవాలి; దుర్మాదముతోడన్= దుర్మదంతో; ప్రమత్తవిమర్దనున్= మదోన్మత్తుల్ని నాశనం చేసేవాడైన; ఆ జనార్దనున్= ఆ శ్రీకృష్ణుణ్ణి; డీకొనెన్= ఢీకొన్నాడు.

**తా :** యాదవశ్రేష్ఠుడయిన కృష్ణుడు వృషభాసురుని రెండు కొమ్ములు పట్టి, పద్దెనిమిది అడుగులదూరం ఏనుగు మరో ఏనుగును పడదోసినట్లు తోసివేశాడు. ఆ రాక్షసుడు తల్లడిల్లి శరీరమంతా చెమటలు కమ్మగా సొమ్మసిల్లి నేలపైపడి, మళ్లీ తేరుకొని దనుజమర్దనుడైన కృష్ణుణ్ణి దుర్మదంతో ఢీకొట్టాడు.

**ఆ. అంత గోపసింహుఁ డసురకొమ్ములు వట్టి, ధరణి ద్రొబ్బి త్రొక్కి దైత్యభటుల**
**కొమ్ము వీఁగ సురలకొమ్ము వర్ధిల వాని, కొమ్ము వెఱికి మొత్తి కూల్చె నధిప! 1145**

**ప్రతి :** అధిప= రాజా!; అంతన్= అప్పుడు; గోపసింహుఁడు= యదువంశసింహుడైన శ్రీకృష్ణుడు; అసురకొమ్ములు= వృషభాసురుని యొక్క కొమ్ములు; పట్టి= పట్టుకొని; ధరణిన్= భూమి మీదికి; ద్రొబ్బి= పడదోసి; త్రొక్కి= కాలితోతొక్కి పట్టి; దైత్యభటుల కొమ్ము= దానవ వీరుల బలం; వీఁగన్= అణగారగా; సురలకొమ్ము= దేవతల ఉత్సాహం; వర్ధిలన్= పెరుగగా; వానికొమ్ము= ఆ వృషభాసురుని కొమ్ము; పెఱికి= ఊడబెరికి; మొత్తి= బాది; కూల్చెను= చంపేశాడు.

**తా :** రాజా! యదుసింహుడైన శ్రీకృష్ణుడు వృషభాసురునికొమ్ములు పట్టుకొని, భూమిమీద పడవేసి, కాలితో తొక్కిపట్టి రాక్షస వీరుల బలం అణగారగా, దేవతల ఉత్సాహం అతిశయించగా వానికొమ్ము ఊడబెరికి, దానితోనే వాణ్ణి కొట్టి చంపాడు.

**క. ఉక్కు సెడి రోఁజి నెత్తురు, ముక్కున వాతను స్రవింప మూత్రశకృత్తుల్**
**మిక్కిలి విడుచుచుఁ బసరపు, రక్కసుఁ డని సమసెఁ బ్రజకు రాగం బమరన్. 1146**

**ప్రతి :** పసరము+రక్కసుఁడు= వృషభాసురుడు; ఉక్కు+చెడి= బలంకోల్పోయి; రోఁజి= రొప్పుతూ; నెత్తురు= రక్తం; ముక్కున వాతను= ముక్కులో, నోట్లో; స్రవింపన్= కారగా; మూత్రశకృత్తుల్= మూత్రం, మలం; మిక్కిలి= ఎక్కువగా; విడుచుచున్= వదలుతూ; ప్రజకున్= లోకులకు; రాగంబు+అమరన్= ప్రమోదం కలిగేటట్లు; అనిన్= యుద్ధంలో; సమసెన్= చచ్చిపోయాడు.

**తా :** వృషభాసురుడు బలముడిగి రొప్పుతూ, ముక్కులో, నోట్లో నెత్తురుకారుతూ ఉండగా, మలమూత్రాలు ఎక్కువగా విడుస్తూ, ప్రజలకు ఆనందం కలిగేటట్లు ప్రాణాలు విడిచాడు.

**వ. ఇట్లు వృషభాసురుం జంపిన, నిలింపులు గుంపులు గొని విరులు వర్షింప, గోపకులు హర్షింప గోపసతు లుత్కర్షింప బలభద్రుండును దానును గోవిందుండు పరమానందంబున మందకుం జనియె నంత. 1147**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; వృషభ+అసురున్= వృషభాసురుణ్ణి; చంపినన్= సంహరించగా; నిలింపులు= దేవతలు; గుంపులుగొని= సమూహాలుగా కూడి; విరులు వర్షింపన్= పూలుకురిపించగా; గోపకులు= గోపాలకులు; హర్షింపన్= సంతోషించగా; గోసతులు+ఉత్కర్షింపన్= గోపస్త్రీలు ఉప్పొంగగా; బలభద్రుండును= బలరాముడూ; తానును= తానూ; గోవిందుండు= కృష్ణుడు; పరమ+ఆనందంబునన్= మిక్కిలి సంతోషంతో; మందకున్= గోకులానికి; చనియెన్= వెళ్లాడు; అంతన్= ఆ తర్వాత...

**తా :** ఈ విధంగా కృష్ణుడు వృషభాసురుణ్ణి చంపగా, దేవతలు గుంపులుకూడి, పూలుకురిపించారు. గోపాలకులు ఆనందించారు. స్త్రీలు ఉప్పొంగిపోయారు. అప్పుడు శ్రీకృష్ణుడు బలరామునితో కలిసి పరమానందంతో గోకులానికి వెళ్లాడు ఆ తర్వాత –

**చ. ఘనుఁ డొకనాఁడు నారదుఁడు గంసునితోడ యశోద గూఁతుఁ దాఁ**
**గనుటయుఁ జక్రి దేవకికి గర్భజుఁ డౌటయు మున్ను రోహిణీ**
**తనయుఁడు రాముఁ డౌటయును దద్విభు లిద్దఱు మంద నున్న వా**
**రని యెఱుఁగంగఁ జెప్పిన మహాద్భుత మంచుఁ జలించి కిన్కతోన్. 1148**

**ప్రతి :** ఒకనాఁడు= ఒక రోజు; ఘనుఁడు= మహానుభావుడైన; నారదుఁడు; కంసునితోడన్= కంసునితో; మున్ను= ముందు; యశోద= యశోద; తాన్= తాను; కూఁతున్= కూతుర్ని; కనుటయున్= కనడమూ; దేవకికి; చక్రి= హరి; గర్భజుఁడు+ ఔటయున్= గర్భంలో పుట్టుటయు; రోహిణీతనయుఁడు= రోహిణికొడుకు; రాముఁడు= బలరాముదు; ఔటయును= అవడమూ; తద్+విభులు= ఆ ప్రభువులు; ఇద్దఱు= ఇద్దరూ; మందన్= గోకులంలో; ఉన్నవారు+అని= నివసిస్తూ ఉన్నారు అని; కంసునితోడన్= కంసునితో; ఎఱుఁగన్+కన్+చెప్పినన్= తెలిసేటట్లు చెప్పగా; మహా+అద్భుతము= గొప్ప ఆశ్చర్యం; అంచున్= అనుకుంటూ; కిన్కతోన్= కోపంతో; చలించి= కంపించి...

**తా :** మహానుభావుడైన నారదుడు ఒకనాడు కంసునితో– "యశోద కూతురును కన్నది. శ్రీకృష్ణుడు దేవకీ గర్భసంజాతుడు. బలరాముడు రోహిణికుమారుడు. ఆ ప్రభువులిద్దరూ గోకులంలో ఉన్నారు" అని తెలియజెప్పాడు. ఆ మాటలు విన్న కంసుడు 'ఇదిమహాద్భుతం' అనుకుంటూ కోపావేశంతో కంపించిపోయాడు.

**విశే :** నారదుడు చెప్పిన విషయాలన్నీ కంసునికి కొత్తవే. అందువల్లనే మహాద్భుతం అని ఆశ్చర్యపోయాడు. తనకు ప్రాణగండం అయిన దేవకీదేవి అష్టమగర్భం అయిన కృష్ణుడు బతికి ఉండడంతో కంసుడు ఆగ్రహావేశంతో కంపించిపోయాడు.

**చ. కొడుకుల మందలోన నిడి గొంటుతనంబున మోసపుచ్చె నీ**
**బడుగును బట్టి చంపు టిది భావ్య మటంచుఁ గృపాణపాణియై**
**వడి వసుదేవునిం దునుమ వచ్చిన కంసునిఁ జూచి నారదుం**
**డుడుగుము చంపఁ బోల దని యొడక మానిచి పోయె మింటికిన్. 1149**

**ప్రతి :** కొడుకులన్= కుమారులను; మందలోనన్= గోకులంలో; ఇడి= దాచి; గొంటుతనంబునన్= వంచనతో; మోసపుచ్చెన్= మోసంచేశాడు; ఈ బడుగును= ఈ కృశించిన వసుదేవుణ్ణి; పట్టి= పట్టుకొని; చంపుట= చంపడం; ఇది భావ్యం= ఇది చేయదగినపని; అట+అంచున్= అనుకొంటూ; కృపాణపాణి+ఐ= కత్తిచేతబూనినవాడై; వడిన్= తొందర తొందరగా; వసుదేవునిన్= వసుదేవుణ్ణి; తునుమ వచ్చిన= చంపడానికి వచ్చిన; కంసునిన్= కంసుణ్ణి; చూచి; నారదుండు= నారదుడు; చంపన్+పోలదు= చంపదగదు; అని; ఓడక= పట్టుదలతో; మానిచి= వారించి; మింటికిన్= దేవలోకానికి; పోయెన్= వెళ్లిపోయాడు.

**తా :** బక్క చిక్కిన ఈ వసుదేవుడు కొడుకులను గోకులంలో దాచి, వంచనతో నన్ను మోసం చేశాడు. ఇతణ్ణి పట్టిచంపడమే సరైంది అంటూ కత్తి చేతబూని వసుదేవుణ్ణి సంహరించడానికి వడివడిగా వచ్చే కంసుణ్ణి చూచి, నారదుండు "ఆగు! ఆగు! వసుదేవుణ్ణి చంపడం భావ్యంకాదు" అని గట్టిగా చెప్పి, వారించి, దేవలోకానికి తరలిపోయాడు.

**వ. మఱియు నలుకదీఱక కంసుండు దేవకీవసుదేవుల లోహపాశబద్ధులంజేసి కేశి యనువానిం బిలిచి రామకేశవులం జంపు మని పంపి, మంత్రిభటగజారోహకచాణూరముష్టికసాల్వకోసలప్రముఖుల రావించి యిట్లనియె. 1150**

**ప్రతి :** మఱియున్= ఇంకా; కంసుండు= కంసుడు; అలుకదీఱక= కోపంతగ్గక; దేవకీవసుదేవులన్= దేవకీ వసుదేవులను; లోహపాశబద్ధులన్+చేసి= ఉక్కుసంకెళ్లతో బంధించి; కేశి+అనువానిన్= 'కేశి' అనేవాణ్ణి; పిలిచి; రామకేశవులన్=

బలరామకృష్ణులను; చంపుము; అని; పంపి; మంత్రి భట గజ+ఆరోహక= మంత్రులను; భటులను; మావటివాండ్రను; చాణూర ముష్టిక= చాణూరుడు, ముష్టికుడు అనే మల్లయోధులను; సాల్వకోసల ప్రముఖులను= సాల్వుడు; కోసలుడు మొదలైన ముఖ్యులను రప్పించి; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** ఇంకా కంసునికి కోపం తీరక దేవకీవసుదేవులను ఉక్కుసంకెళ్లతో బంధింపజేశాడు. 'కేశి' అనేవాణ్ణి పిలిచి బలరామకృష్ణులను చంపుమని పంపాడు. మంత్రులను, భటులను, మావటివాండ్రను; చాణూరుడు ముష్టికుడు అనే మల్ల యోధులను; సాల్వుడు కోసలుడు మొదలైన ప్రముఖులను రప్పించాడు. వారితో ఇలా అన్నాడు.

**శా. ఎందున్ నన్నెదిరించి పోరుటకు దేవేంద్రాదులుం జాల రీ**
**బృందారణ్యము మంద నిప్పుడు మదాభీరార్భకుల్ రామ గో**
**విందుల్ వర్ధిలుచున్నవారఁట రణోర్విం గంసునిం ద్రుంతు' మం**
**చుం దర్పంబులు పల్కు చుందురఁట; యీ చోద్యంబులన్ వింటిరే? 1151**

**ప్రతి :** ఎందున్= ఎందైనా; నన్ను; ఎదిరించి; పోరుటకున్= పోరాడడానికి; దేవేంద్ర+ఆదులున్= దేవేంద్రుడు మొదలైన వారుకూడా; చాలరు= శక్తులు కారు; ఈ బృందా+అరణ్యము= ఈ బృందావనంవద్ద; మందన్= గోకులంలో; ఇప్పుడు; మద+ఆభీర+అర్భకుల్= మదించిన యాదవబాలురు; రామగోవిందుల్= బలరాముడూ, శ్రీకృష్ణుడూ; వర్ధిలుచున్+ఉన్నవారు+ అఁట= పెరుగుతూ ఉన్నారట; రణ+ఉర్విన్= యుద్ధభూమిలో; కంసునిన్= కంసుణ్ణి; త్రుంతుము= సంహరిస్తాం; అంచున్= అంటూ; దర్పంబులు పల్కుచున్+ఉందురు+అఁట= గర్వోక్తులు పలుకుతూ ఉన్నారట; ఈ చోద్యంబులన్= ఈ వింతమాటలను; వింటిరి+ఏ= విన్నారా?

**తా :** "నన్నెదిరించి పోరాడడానికి ఎక్కడైనా ఇంద్రాదులకుసైతం శక్తి చాలదు. బలరామకృష్ణులు అనే మదించిన యాదవ బాలురు ఇప్పుడు బృందావనం గోకులంలో పెరుగుతున్నారట! యుద్ధభూమిలో కంసుణ్ణి సంహరిస్తామంటూ గర్వోక్తులు పలుకుతున్నారట! మీరు ఈ వింతమాటలను విన్నారా"

**క. పట్టణజనములు సూతురు, దట్టంబుగ మల్లరంగతలపార్శ్వములం**
**బెట్టింపుఁడు తమగంబులు, పుట్టింపుఁడు వీట మల్లుపో రనుమాటన్. 1152**

**ప్రతి :** పట్టణజనములు= మధురానగరవాసులు; చూతురు= చూస్తారు; దట్టంబున్+కన్= ఎక్కువగా; తమగంబులు= మంచెలు; మల్లరంగతల= మల్లరంగస్థలానికి; పార్శ్వములన్= నాలుగువైపులా; పెట్టింపుఁడు= పెట్టించండి; వీటన్= నగరంలో; మల్లుపోరు= మల్లయుద్ధం; అనుమాటన్= అనే సంగతిని; పుట్టింపుఁడు= చాటండి.

**తా :** మల్లయుద్ధం ఏర్పాటు చేయండి. మల్లరంగస్థలానికి నాలుగు వైపులా దట్టంగా మంచెలు వేయించండి. మధురానగరంలో మల్లయుద్ధం జరుగుతుందని చాటింపు చేయండి. పట్టణ ప్రజలందరూ చూస్తారు.

**శా. విన్నాణంబులఁ బోర నేర్తురు మహావీర్యప్రతాపాది సం**
**పన్నుల్ మీరలు మేటిమల్లుగములం బ్రఖ్యాతులై పెంపుతో**
**మన్నా రా బలకృష్ణులం బెనఁకువన్ మర్దించి మత్ప్రీతి కా**
**సన్నుల్ గందు పురీజనుల్ వొగడ నో చాణూర! యో ముష్టికా! 1153**

**ప్రతి :** ఓ చాణూర!; ఓ ముష్టికా!; మీరలు= మీరిద్దరు; విన్నాణంబులన్= మల్లయుద్ధ నైపుణ్యాలతో; పోరన్+నేర్తురు= పోరాడడం తెలిసినవారు; మహావీర్య= గొప్పశౌర్యం; ప్రతాప+ఆది సంపన్నుల్= పరాక్రమం మొదలైనవి కలవారు; మేటి మల్లుగములన్= మేటియైన మల్లవీరుల సమూహాలలో; ప్రఖ్యాతులై= కీర్తిపొందినవారై; పెంపుతో మన్నారు= అతిశయంతో విలసిల్లేవారు; ఆ బలకృష్ణులన్= ఆ బలరామకృష్ణులను; పెనఁకువన్= పెనుగులాటలో, మల్లయుద్ధంలో; మర్దించి= మట్టుపెట్టి; పురీజనుల్= మధురాపురప్రజలు; పొగడన్= పొగిడేటట్లు; మత్+ప్రీతికిన్+ఆసన్నుల్= నాకు ప్రీతిపాత్రులు; కందు= కండి.

**తా :** ఓ చాణూర ముష్టికులారా! మీరు నైపుణ్యాలతో మల్లయుద్ధం చేయగలవారు. మహాశౌర్య పరాక్రమసంపన్నులు. మేటిమల్లయుద్ధవీరులలో కీర్తివహించి అతిశయంతో విరాజిల్లేవారు. ఈ మధురాపుర జనులు పొగడగా ఆ బలరామకృష్ణులను మల్లయుద్ధంలో మర్దించి నాకు ప్రీతిపాత్రులు అవండి.

**శా. రా రా హస్తిపకేంద్ర! గండమదధారాగంధలోభాంధ గం**
**భీరాళివ్రజమైన మత్కువలయాపీడద్విపేంద్రంబు మ**
**ద్ద్వారోదంచితదేహళీపరిసరస్తంభంబు డాయంగ నా**
**భీరుల్ రా నదలించి డీకొలుపు నీ బీరంబు తోరంబుగన్. 1154**

**ప్రతి :** హస్తిపకేంద్ర= ఓ మావటివాడా!; రారా= ఇలారా; ఆభీరుల్= యాదవులైన బలరామకృష్ణులు; మత్+ద్వార+ ఉదంచిత=ఎత్తైన నా భవనద్వారం; దేహళీపరిసరస్తంభంబు= గడప వద్దనున్న స్తంభాన్ని; డాయన్+కన్= సమీపంచగానే; గండమద ధారాగంధ= చెక్కిళ్ల మీద స్రవించే మదజలంయొక్క వాసనయందలి; లోభ= ఆశచేత; అంధ= గుడ్డివి అయిన; గంభీర+అళివ్రజము+ఐన= గండుతుమ్మెదల పిండును కలిగియున్న; మత్+కువలయాపీడద్విప+ఇంద్రంబు= మన కువలయాపీడం అనే గజరాజాన్ని; అదలించి; నీ బీరంబు= నీ పరాక్రమం; తోరంబున్+కన్= అతిశయించగా; డీకొలుపు= ఢీ కొట్టించు.

**తా :** ఓ మావటివాడా! ఇలారా! ఆ గోపాలకులైన బలరామకృష్ణులు ఎత్తైన మన భవనద్వారందగ్గర గడపవద్దనున్న స్తంభం దగ్గరకు రాగానే నీ ప్రతాపం ప్రదర్శించు. చెక్కిళ్లపై ఏర్పడిన మదధారల సువాసనలచేత గండుతుమ్మెదలసమూహాన్ని ఆశపెట్టి ఆకర్షించే నా కువలయాపీడమనే గజరాజాన్ని అదలించి, వారిమీదికి డీ కొలుపు! (ఢీ కొట్టించు)

**క. పశువిశసనములు సేయుఁడు, పశుపతికిం బ్రియము గాఁగ భావించి చతు**
**ర్దశినాఁడు ధనుర్యాగము, విశదంబుగఁ జేయవలయు విజయముకొఱకున్. 1155**

**ప్రతి :** విజయముకొఱకున్= మన విజయంకోసం; చతుర్దశినాఁడు= చతుర్దశి తిథిరోజు; ధనుర్యాగము= ధనుర్యాగం; విశదంబుగన్= వైభవోపేతంగా; చేయవలయున్= చేయాలి; పశుపతికిన్= రుద్రునికి; ప్రియముకాన్+కన్= ప్రీతి కలగాలని; భావించి; పశువిశసనములు= జంతుబలులు; చేయుఁడు= చేయండి.

**తా :** మన విజయంకోసం చతుర్దశినాడు ధనుర్యాగం చెయ్యాలి. పశుపతికి ప్రీతిగా జంతుబలులు సమర్పించండి.

**వ. అని తనవారి నందఱ నయ్యైపనులకు నియమించి యదుశ్రేష్ఠుండగు నక్రూరునిం బిలిపించి చెట్ట వట్టికొని యిట్లనియె. 1156**

**ప్రతి :** అని= అని చెప్పి; కంసుడు; తనవారిన్= తనవాళ్లను; అందఱన్= అందరినీ; ఆ+ఐ+పనులకున్= ఆయా పనులు చేయడానికి; నియమించి= నియోగించి; యదుశ్రేష్ఠుండు+అగు= యాదవులలో మేటిఅయిన; అక్రూరునిన్= అక్రూరుణ్ణి; పిలిపించి; చెట్ట+పట్టికొని= అతడిచేతిని తన చేతితో పట్టుకొని; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** కంసుడు ఇలా చెప్పి, తనవాళ్లనందరినీ ఆయా పనులు చేయడానికి నియమించి, యాదవశ్రేష్ఠుడైన ఆక్రూరుణ్ణి పిలిపించాడు. అతనిచేతిని తన చేతిలో ఉంచుకొని ఇలా అన్నాడు.

**విశే :** ఎవర్నైనా చేయిపట్టుకుని ఆదరిస్తే రాజు అతణ్ణి సన్నిహితుడుగా భావిస్తున్నాడనడానికి సంకేతం.

**శా. అక్రూరత్వముతోడ నీవు మనఁగా నక్రూరనామంబు ని**
**ర్వక్రత్వంబునఁ జెల్లె మైత్రి సలుపన్ వచ్చున్ నినుం జేరి నీ**
**వక్రోధుండవు మందలోన బలకృష్ణాభీరు లస్మద్వినా**
**శ క్రీడారతులై చరింతు రఁట యోజం దెచ్చి యొప్పింపవే? 1157**

**ప్రతి :** అక్రూరత్వముతోడన్= నొప్పించని మనస్తత్వంతో; నీవు; మనన్+కాన్= జీవిస్తూ ఉండగా; నిర్వక్రత్వంబునన్= సార్థకంగా; అక్రూరనామంబు= అక్రూరుడనేపేరు; చెల్లెన్= చెల్లింది; నినున్+చేరి= నీతో కలిసి; మైత్రి సలుపన్ వచ్చున్= స్నేహం చేయవచ్చు; నీవు; అక్రోధుండవు= కోపంలేనివాడివి; మందలోనన్= గోకులంలో; బలకృష్ణ+ఆభీరులు= బలరామకృష్ణులు అనే యాదవులు; అస్మత్+వినాశ= నన్ను చంపడం అనే; క్రీడారతులు+ఐ= క్రీడయందు ఆసక్తికలవారై; చరియింతురు (చరియించుదురు)+అఁట= సంచరిస్తున్నారట; ఓజన్+తెచ్చి= నేర్పుతో తీసుకువచ్చి; ఒప్పింపవు+ఏ= నాకు అప్పగించు.

**తా :** క్రౌర్యం లేకుండా నీవు మనుగడసాగిస్తూ ఉన్నందువల్ల నీకు అక్రూరుడనే సార్థకనామం సరిపోతూ ఉంది. నీతో మైత్రి చేయవచ్చు. నీవు కోపంలేనివాడివి. గోకులంలో బలరామకృష్ణులు అనే యాదవులు నన్ను చంపాలనే ఆసక్తితో ఉన్నారట. వారిని ఉపాయంతో తెచ్చి నాకప్పగించు!

**ఆ. నాకు వెఱచి సురలు నారాయణుని వేఁడి, కొనిన నతఁడు వచ్చి గోపకులము**
**నందుఁ గృష్ణమూర్తి నానకదుందుభి, కుదితుఁ డయ్యె ననఁగ నొకటి వింటి! 1158**

**ప్రతి :** నాకున్; వెఱచి= నాకు భయపడి; సురలు= దేవతలు; నారాయణునిన్= శ్రీ మహావిష్ణువును; వేఁడికొనినన్= ప్రార్థించగా; అతఁడు= ఆ శ్రీహరి; వచ్చి; గోపకులము+అందున్= యదువంశంలో; కృష్ణమూర్తినాన్= కృష్ణుడనే పేరుతో; ఆనకదుందుభికిన్= వసుదేవునికి; ఉదితుఁడు+అయ్యెన్= జన్మించాడు; అనన్+కన్= అంటున్న; ఒకటి= ఒక వార్త; వింటిన్= విన్నాను.

**తా :** నాకు భయపడి దేవతలు శ్రీమన్నారాయణుణ్ణి ప్రార్థించగా, అతడు యదువంశంలో వసుదేవునికి కృష్ణుడనే పేరుతో పుట్టాడని ఒక వార్త విన్నాను.

**వ. కావున నీవు గోపకులచేత నరులు గొని ధనుర్యాగంబుఁ జూడ రండని వారలం దోడ్కొని రమ్ము. వచ్చిన. 1159**

**ప్రతి :** కావున= కాబట్టి; నీవు; గోపకులచేతన్= గోపాలకులనుండి; అరులు+కొని= కప్పాలు పుచ్చుకొని; ధనుస్+యాగంబున్= ధనుర్యాగాన్ని; చూడన్= చూడడానికి; రండు+అని= రండి అని; వారలన్= ఆ బలరామకృష్ణులను; తోడ్కొని= వెంట తీసుకొని; రమ్ము= రండి; వచ్చినన్= అలా వస్తే...

**తా :** కాబట్టి నీవు గోపాలకులనుండి కప్పాలు పుచ్చుకొని, ధనుర్యాగం చూడడానికి రండి అని ఆ బలరామకృష్ణుల్ని తోడ్కొని రా. అలా వస్తే -

**శా. కొండల్ గూలఁగ ద్రొబ్బు గొమ్ముల తుదిం గోపించి కోరాడుచో**
**దండిన్ దండి నధఃకరించు నొకవేదండంబు నాయింట బ్ర**
**హ్మాండం బైనఁ గదల్ప నోపు బలకృష్ణాభీరులం బోరిలో**
**ఖండింపం దడ వెంత దాని కదియుం గాదేని నక్రూరకా! 1160**

**ప్రతి :** అక్రూరకా= అక్రూరా!; కొండల్= కొండలను; కూలన్+కన్= కూలేటట్లు; కొమ్ముల తుదిన్= దంతాల అగ్రాలతో; ద్రొబ్బున్= కూల తోస్తుంది; కోపించి; కోరాడుచోన్= కోరాడితే; దండిన్= నిండు పరాక్రమంతో; దండిన్= దండధరుడైన యముడ్నైనా; అధఃకరించున్= కిందుపరుస్తుంది; బ్రహ్మాండంబు= బ్రహ్మాండాన్ని; ఐనన్= అయినా; కదల్పన్+ఓపు= కదిల్చేశక్తికల; ఒక వేదండంబు= ఒక ఏనుగు; నా ఇంటన్= నా ఇంట్లో (ఉంది); బలకృష్ణ+ఆభీరులన్= బలరామకృష్ణులనే యాదవులను; పోరిలోన్= పోరులో; ఖండింపన్= చీల్చి చెండాడడానికి; దానికిన్= దానికి; ఎంత తడవు= ఎంత సేపు?; అదియున్= అదీ; కాదు+ఏనిన్= వీలుకాకపోతే...

**తా :** అక్రూరా! నా ఇంట్లో ఉండే కువలయాపీడం అనే గజరాజం తన దంతాల చివర్లతో కొండలనుకూడా కూలదోస్తుంది. మగటిమితో ఢీ కొంటే దండధరుడు అయిన యముణ్ణి అయినా కింద పరుస్తుంది. అది బ్రహ్మాండాన్నయినా కదిలిస్తుంది. అలాంటి గజరాజుకు బలరామకృష్ణులను చీల్చి చెండాడడానికి ఎంతసేపు పడుతుంది? ఒక వేళ అదీ కాకుంటే -

**శా. చాణూరుండును ముష్టికుండును సభాసంఖ్యాతమల్లుల్ జగ**
**త్ప్రాణున్ మెచ్చరు సత్త్వసంపదల బాహాబాహి సంగ్రామ పా**
**రీణుల్ వారలు రామకృష్ణుల బలోద్రేకంబు సైరింతురే?**
**క్షీణప్రాణులఁ జేసి చంపుదురు సూ సిద్ధంబు యుద్ధంబునన్. 1161**

**ప్రతి :** చాణూరుండును ముష్టికుండును= చాణూరుడూ, ముష్టికుడూ; సభాసంఖ్యాత మల్లుల్= సభలలో గణింపదగిన మల్ల వీరులు; సత్త్వసంపదలన్= బలసంపదలలో; జగత్+ప్రాణున్= వాయుదేవుణ్ణికూడా; మెచ్చరు= లెక్కసేయరు; బాహాబాహి సంగ్రామ పారీణుల్= బాహాబాహి యుద్ధంలో మిక్కిలి నేర్పుగలిగినవారు; వారలు= వారు; రామకృష్ణులబల+ఉద్రేకంబున్= బలరామకృష్ణుల బలాధిక్యాన్ని; సైరింతురు+ఏ= సహిస్తారా?; యుద్ధంబునన్= మల్లయుద్ధంలో; క్షీణప్రాణులన్+చేసి= ప్రాణాలను క్షీణింపజేసి; చంపుదురు= చంపుతారు; సూ= సుమా!; సిద్ధంబు= ఇది నిజం.

**తా :** చాణూరుడూ, ముష్టికుడూ సభలలో గణింపదగిన మల్లయోధులు. బలసంపదలో వారు వాయుదేవుణ్ణి కూడా లెక్కచేయరు. బాహాబాహి యుద్ధంలో వారు మిక్కిలి ప్రవీణులు. అలాంటివారు బలరామకృష్ణుల బలాధిక్యాన్ని సహిస్తారా? పోరాటంలో ప్రాణాలు తీసి వారిని సంహరిస్తారు. ఇది ముమ్మాటికీ నిజం.

**సీ. ఆ రామకేశవు లంతరించిన వసుదేవముఖ్యులఁ జంపి తెగువ మెఱసి**
**వృష్ణి భోజ దశార్హ వీరులఁ దెగటార్చి ముదుకఁడు రాజ్యకాముకుఁడు ఖలుఁడు**
**నగు నుగ్రసేను మా యయ్యఁ గీటడఁగించి పినతండ్రి దేవకుఁ బిలుకుమార్చి**
**మఱియు వైరులనెల్ల మర్దించి నే జరాసంధ నరక బాణ శంబరాది**

**ఆ. సఖులతోడ భూమిచక్ర మేలెదఁ బొమ్ము, తెమ్ము వేగమ వసుదేవసుతుల**
**మఖము పేరు సెప్పి మంత్రభేదము సేయ, వలయుఁ బెంపఁ జనదు వైరిజనుల. 1162**

**ప్రతి :** ఆ రామకేశవులు= ఆ బలరామకృష్ణులు; అంతరించినన్= సంహరించబడిన తర్వాత; వసుదేవముఖ్యులన్= వసుదేవుడు మొదలైన ప్రముఖులు; చంపి; తెగువ మెఱసి= సాహసం అతిశయించగా; వృష్ణి భోజ దశార్హ వీరులన్= వృష్ణి, భోజ, దశార్హవంశస్థులైన వీరులను; తెగటార్చి= చంపి; ముదుకఁడు= వృద్ధుడు; రాజ్యకాముకుఁడు= రాజ్యాభిలాష ఉన్నవాడు; ఖలుఁడు= నీచుడు; అగు+ఉగ్రసేనున్= అయిన ఉగ్రసేనుణ్ణి; మా+అయ్యన్= నాతండ్రిని; కీటు+అడఁగించి= సంహరించి; పినతండ్రి= చిన్నాన్న అయిన; దేవకున్= దేవకుణ్ణి; పిలుకుమార్చి= నిర్మూలించి; మఱియున్= ఇంకా; వైరులన్= శత్రువులను; ఎల్లన్= అందరినీ; మర్దించి= చంపి; నేన్= నేను; జరాసంధ, నరక బాణ శంబర+ఆది= జరాసంధుడు, నరకుడు, బాణుడు, శంబరుడు మొదలైన; సఖులతోడన్= స్నేహితులతోకూడి; భూమిచక్రము= సర్వభూమండలాన్ని; ఏలెదన్= పరిపాలిస్తాను; పొమ్ము; వసుదేవసుతులన్= వసుదేవునిపుత్రులైన బలరామకృష్ణులు; వేగము+అ= వెంటనే; తెమ్ము= తీసుకొనిరా; మఖముపేరు+చెప్పి= ధనుర్యాగం పేరు చెప్పి; మంత్రభేదము= గుట్టుచేధించడం; చేయవలయున్= చేయాలి; వైరిజనులన్= శత్రువులను; పెంపన్+చనదు= వృద్ధికానీయరాదు.

**తా :** ఆ బలరామకృష్ణులు అంతరించిన తర్వాత వసుదేవాదిప్రముఖులను తెగటారుస్తాను. సాహసంతో మెఱసి వృష్ణి, భోజ, దశార్హ జాతుల వీరులను సంహరిస్తాను. వృద్ధుడు, రాజ్యకాముకుడు, నీచుడు అయిన మా అయ్య ఉగ్రసేనుణ్ణి, మాపినతండ్రి దేవకుణ్ణి చంపేస్తాను. ఇంకా మిగిలిన నాశత్రువులందరినీ నాశనంచేసి, నేను నామిత్రులైన జరాసంధుడు, నరకుడు, బాణుడు, శంబరుడు మొదలైనవారితో కలిసి భూమండలం అంతా పరిపాలిస్తాను. నువ్వు వెళ్లి వెంటనే బలరామకృష్ణుల్ని తీసుకొనిరా! యాగం పేరు చెప్పి శత్రువులను నాశనం చేసే మంత్రాంగం చేయాలి. వైరుల్ని వృద్ధి పొందనీయరాదు.

**విశే :** కంసుడు చెడ్డకుమారుడు. తండ్రిని రాజ్యకాముకుడు, ఖలుడు, ముదుకడు అని పరుషపదజాలంతో నిందించాడు. చంపుతానన్నాడు. భారతంలో దుర్యోధనుడు కూడా తన తండ్రిని అంధుడని, ముసలివాడని నిందించడమేకాక అతణ్ణి లెక్కచేయలేదు. అందుకే తగిన ఫలాన్ని అనుభవించాడు.

జరాసంధుడు, నరకుడు, బాణుడు, శంబరుడు కంసుని మిత్రులు. జరాసంధుని భీమునిచేత కృష్ణుడు చంపిస్తాడు. నరకుడు సత్యభామ చేతిలో సంహరింపబడతాడు. బాణుడు, శంబరుడు కృష్ణుని చేతిలో ప్రాణాలు కోల్పోతారు.

**వ. అనిన నక్రూరుం డిట్లనియె. 1163**

**ప్రతి :** అనినన్= ఇలా (కంసుడు) పలుకగా; అక్రూరుండు= అక్రూరుడు; ఇట్లు+అనియెన్= ఇలా పలికాడు.

**తా :** ఇలా కంసుడనగా అక్రూరుడు ఇలా పలికాడు.

**ఉ. పంపినఁ బోనివాఁడనె నృపాలక! మానవు లెన్నఁ దమ్ము నూ**
**హింపరు దైవయోగముల నించుక గానరు తోఁచినట్లు ని**
**ష్కంపగతిం జరింతు రది గాదన వచ్చునె? యీశ్వరేచ్ఛఁ ద**
**ప్పింపఁగ రాదు నీపగతుబిడ్డలఁ దెచ్చెదఁ బోయి వచ్చెదన్. 1164**

**ప్రతి :** నృపాలక= ఓరాజా!; పంపినన్= నీవు పంపిస్తే; పోనివాఁడను+ఎ= పోకుండా ఉండగలనా?; మానవులు= నరులు; ఎన్నన్= యథార్థం ఆలోచిస్తే; తమ్మున్= తమశక్తిని; ఊహింపరు= తెలుసుకోలేరు; దైవయోగములన్= దైవలీలలను; ఇంచుక= కొద్దిగాకూడా; కానరు= చూడలేరు; తోఁచిన+అట్లు= తమకు తోచినవిధంగా; నిష్కంపగతిన్= భయం లేకుండా; చరింతురు= ప్రవర్తిస్తారు; అది= దాన్ని; కాదు+అనన్+వచ్చునె= కాదనవచ్చా?; ఈశ్వర+ఇచ్ఛన్= విధినిర్ణయాన్ని; తప్పింపన్+కన్ రాదు= తప్పింప వీలుకాదు, అనుల్లంఘనీయం; నీ పగతుబిడ్డలన్= నీ విరోధి అయిన వసుదేవసుతులను; తెచ్చెదన్= తీసుకొని వస్తాను; పోయివచ్చెదన్= (గోకులానికి) పోయివస్తాను.

**తా :** ఓ రాజా! నీవు పంపిస్తే పోక తప్పుతుందా? మానవులు తమశక్తిని సరిగ్గా ఊహించుకోలేరు. దైవలీలలను కొంచెం కూడా తెలుసుకోలేరు. తమకు తోచినట్లుగా నిర్భయంగా వ్యవహరిస్తుంటారు. దాన్ని కాదనవచ్చా? విధినిర్ణయం తప్పించలేము. నీకు విరోధి అయిన వసుదేవునిబిడ్డలైన బలరామకృష్ణుల్ని తోడ్కొని వస్తాను. వెళ్లి వస్తాను.

## ✤ శ్రీకృష్ణుఁడు కేశివ్యోమాసురుల సంహరించుట ✤

**వ. అని పలికి రథం బెక్కి యక్రూరుండు సనిన సకలజనుల వీడుకొలిపి కంసుం డంతిపురంబునకుం జనియె; నంతఁ గంసప్రేరితుండై. 1165**

**ప్రతి :** అని; పలికి= చెప్పి; రథంబు+ఎక్కి= రథమెక్కి; అక్రూరుండు= అక్రూరుడు; చనినన్= వెళ్లగా; సకలజనులన్= సభాసదులందరినీ; వీడు కొలిపి= పంపించివేసి; కంసుండు= కంసుడు; అంతిపురంబునకున్= తన అంతఃపురానికి; చనియెన్= వెళ్లిపోయాడు; అంతన్= ఆ తర్వాత; కంసప్రేరితుండు+ఐ= కంసునిచేత ప్రేరేపించబడినవాడై...

**తా :** అని చెప్పి రథమెక్కి అక్రూరుడు వెళ్లిపోయాడు. కంసుడుకూడా సభాసదుల్ని వీడ్కొల్పి, తన అంతఃపురానికి వెళ్లిపోయాడు. ఆ తర్వాత కంస ప్రేరితుడై

**సీ. ఖురపుటాహతిఁ దూలి కుంభినీచక్రంబు ఫణిరాజఫణులకు బరువుసేయ**
**భీషణహేషావిభీషితులై మింట నమృతాంధు లొండొరు నండ గొనఁగఁ**
**జటులచంచలసటాచ్ఛటలగాడ్పుల మేఘములు విమానములపై ముసుఁగు వడఁగ**
**వివృతాస్యగహ్వరవిపులదంతంబులు ప్రళయాగ్నికీలల పగిది మెఱయఁ**

**తే. గాలపాశలీలగా వాల మే పార, వాహ మగుచు గంధవాహగతుల**
**విజితశక్రపాశి వీర్యపయోరాశి, కేశి వచ్చె మంద క్లేశ మంద. 1166**

**ప్రతి :** ఖురపుట+ఆహతిన్= గట్టి గిట్టల తాకిడికి; తూలి= చలించి; కుంభినీచక్రంబు= భూవలయం; ఫణిరాజ ఫణులకున్= నాగరాజైన ఆదిశేషుని పడగలకు; బరువుసేయన్= భారం కలిగించగా; భీషణహేషా= భయంకరమైన సకిలింతలకు; విభీషితులై=

భయపడినవారై; మింటన్= ఆకాశంలో; అమృత+అంధులు= దేవతలు; ఒండొరున్= ఒకరినొకరు; అండన్+కొనన్+కన్= గట్టిగా పట్టుకోగా; చటుల చంచల= తీవ్రంగా కదిలే; సటాచ్ఛటల= జూలువెంట్రుకల; గాడ్పుల= గాలులతో; మేఘములు= మేఘాలు; విమానములపైన్= దేవతల విమానాలమీద; ముసుఁగు+పడన్+కన్= కమ్ముకోగా; వివృత+ఆస్యగహ్వర= బాగా తెరుచుకున్న బిలంలాంటి నోటిలోని; విపులదంతంబులు= పెద్దపండ్లు; ప్రళయ+ అగ్నికీలలపగిదిన్= ప్రళయాగ్ని జ్వాలలవలె; మెఱయన్= ప్రకాశించగా; వాలము= దానితోక; కాలపాశలీల+కాన్= యమపాశంవలె; ఏపారన్= వృద్ధిపొందగా; విజితశక్రపాశి= జయించిన ఇంద్ర, వరుణులు గల; వీర్యపయోరాశి= పరాక్రమసముద్రుడు అయిన; కేశి= కేశి అనే రాక్షసుడు; వాహము+అగుచున్= అశ్వమౌతూ; గంధవాహగతులన్= వాయువేగంతో; మంద= గోకులం; క్లేశము+అందన్= సంకటపడగా; వచ్చెన్= వచ్చాడు.

**తా :** ఇంద్రవరుణులను మించినవాడూ, పరాక్రమానికి సముద్రంవంటివాడూ అయిన కేశి అనే రాక్షసుడు కంసుని ప్రోత్సాహంతో గుఱ్ఱమై వాయువేగంతో నందుని మందలోకి ప్రవేశించి సంకటం కలిగించాడు. ఆ కేశిదానవుని దిట్టమైన గిట్టల తాకిడికి సంచలించిన భూమండలం నాగరాజైన ఆదిశేషునిపడగలకు బరువయింది. అతనిభయంకరమైన సకిలింతలకు మిక్కిలి భీతిచెంది ఆకాశంలో దేవతలు ఒకరినొకరు గట్టిగా పట్టుకున్నారు. ఆ రాక్షసుడు తన జూలు అటూ ఇటూ ఆడించడంవల్ల జనించిన గాలికి మేఘాలు ఎగిరిపోయి దేవతలవిమానాలను కమ్ముకొన్నాయి. అతని బిలంవంటి నోరు తెరచినపుడు నోటిలోని పెద్దపండ్లు ప్రళయకాలంలోని అగ్నిజ్వాలలవలె ప్రకాశించాయి. అతనితోక యమపాశంవలె కనిపించింది.

**క. భీషణ ఘోటక దానవ, హేషానిర్ఘోషభిన్నహృదయనిఖిల గో**
**యోషాపురుషార్భకమై, ఘోషము హరి సూడ దైన్యఘోషం బయ్యెన్. 1167**

**ప్రతి :** భీషణ= దారుణమైన; ఘోటకదానవ= గుఱ్ఱం ఆకారంలో ఉండే రాక్షసుని; హేషానిర్ఘోషభిన్న= సకిలింతల పెద్ద ధ్వనులచేత పగిలినవైన; హృదయ= హృదయాలు కలిగిన; నిఖిల= అందరి; గో= గోవులు దూడలు; యోషా= గోపికలు; పురుష= గోపాలకులు; అర్భకము+ఐ= బిడ్డలు కలిగిందై; హరి= శ్రీకృష్ణుడు; చూడన్= వీక్షిస్తూ ఉండగా; ఘోషం= గోకులం; దైన్యఘోషంబు= మొరలిడేధ్వనిగలది; అయ్యెన్= అయింది.

**తా :** దారుణమైన గుఱ్ఱం రూపంలో ఉన్న ఆ కేశిరాక్షసునిసకిలింత వినేసరికి అక్కడి ఆవులు, దూడలు, గోపికలు, గోపాలకులు, పిల్లలు– అందరి హృదయాలూ దద్దరిల్లాయి. కృష్ణుడు చూస్తుండగానే మంద దీనంగా మొరపెట్టే పెద్దధ్వనిగా మారిపోయింది.

**వ. అయ్యవసరంబున. 1168**

**ప్రతి :** ఆ+అవసరంబునన్= ఆ సమయంలో...

**తా :** ఆ సమయంలో

**ఉ. పేదల ఘోషగోపకుల బిట్టదలించుట వీరధర్మమా?**
**కాదు; వ్రజంబులో దనుజ ఘస్మరుఁ డేఁ డని తన్ను రోయు క్ర**
**వ్యాదునిఁ జూచి గోపకుల కడ్డము వచ్చి నిశాట! యింకఁ బో**
**రా దని శౌరి చీరె మృగరాజుక్రియ న్నెదిరించె దైత్యుఁడున్. 1169**

**ప్రతి :** పేదలన్= శక్తిహీనులైన; ఘోషగోపకులన్= మందలోని గోపాలకులను; బిట్టు+అదలించుట= భయపెట్టడం; వీరధర్మము+ఆ= వీరధర్మమా?; కాదు; వ్రజంబులోన్= వ్రేపల్లెలో; దనుజఘస్మరుఁడు= దానవ సంహారి అయిన కృష్ణుడు; ఏఁడి= ఎక్కడున్నాడు; అని; తన్ను= తనను; రోయు క్రవ్యాదునిన్= వెదికే రాక్షసుణ్ణి; చూచి; గోపకులకున్= గోపాలకులకు; అడ్డము వచ్చి= అడ్డంగా వచ్చి; నిశాట= రాక్షసా; ఇంకన్= ఇంక; పోరాదు= పోలేవు; అని; శౌరి= కృష్ణుడు; మృగరాజుక్రియన్= సింహంవలె (గర్జించి); చీరెన్= యుద్ధానికి పిలిచాడు; దైత్యుఁడున్= రాక్షసుడుకూడా; ఎదిరించెన్= ఎదిరించాడు.

**తా :** "శక్తిహీనులైన మందలోని గోపాలకులను భయపెట్టడం నీవంటి వీరునికి ధర్మం కాదు. ఈ గోకులంలో దానవనాశకుడైన కృష్ణుడెక్కడ?" అంటూ తనను వెదకుతున్న కేశిదానవుణ్ణి కృష్ణుడు చూశాడు. గోపాలురకు అడ్డం వచ్చి కృష్ణుడు "ఓరీ రాక్షసుడా! ఇక పోలేవు" అంటూ సింహంవలె గర్జించి వాణ్ణి యుద్ధానికి పిలిచాడు. ఆ రాక్షసుడు కూడా గోవిందుణ్ణి ఎదిరించాడు.

**ఆ. నిష్ఠురోగ్రసింహనినదంబుతో నింగి, మ్రింగుభంగి నోరు మిగులఁ దెఱచి**
**కఱవరాఁగ నతఁడు గాటు దప్పించినఁ, దన్నె నెగసి తురగదానవుండు. 1170**

**ప్రతి :** తురగదానవుండు= అశ్వరూపంలో ఉన్న 'కేశి' రాక్షసుడు; నిష్ఠుర+ఉగ్ర సింహనినదంబుతో= భయంకరమైన, కర్కశమైన సింహనాదం చేస్తూ; నింగిన్= ఆకాశాన్ని; మ్రింగుభంగిన్= మింగే విధంగా; నోరు; మిగులన్= పూర్తిగా; తెఱచి; కఱవరాన్+కన్= కరవడానికి రాగా; అతఁడు= ఆ శ్రీకృష్ణుడు; కాటు తప్పించినన్= వాని నోటి కాటుపడకుండా తప్పించుకోగా; ఎగసి= ఎగిరి; తన్నెన్= (కృష్ణుణ్ణి) తన్నాడు.

**తా :** అశ్వరూపంలోని కేశిదానవుడు భయంకరంగా, కర్కశంగా సింహనాదంచేస్తూ ఆకాశాన్ని మింగే విధంగా నోరు పెద్దదిగా తెరిచి, కృష్ణుణ్ణి కరవబోయాడు. వాని కాటును కృష్ణుడు తప్పించుకున్నాడు. దానవుడు కృష్ణుణ్ణి ఎగిరి తన్నినాడు.

**ఉ. తన్నిన తన్నునం బడక దానవహంత సమీకరంతయై**
**కన్నులఁ గెంపు పెంపెనయ గ్రక్కున ఘోటనిశాటుపాదముల్**
**వన్నె సెడంగఁ బట్టి వడి వైచె ధనుశ్శతమాత్రదూరముం**
**బన్నగడింభమున్ విసరి పాఱఁగ వైచు ఖగేంద్రుకైవడిన్. 1171**

**ప్రతి :** తన్నినన్= ఇలా తన్నగా; తన్నునన్= ఆకాలితన్నుకు; పడక= గురికాక; దానవహంత= దానవసంహారి అయిన శ్రీకృష్ణుడు; సమీక రంత+ఐ= యుద్ధంలో ఇష్టం కలవాడై; కన్నులన్= కండ్లలో; కెంపు= ఎఱ్ఱదనం; పెంపు+ఎనయన్= ఎక్కువకాగా; గ్రక్కునన్= వెంటనే; ఘోట నిశాటు= గుఱ్ఱంరాక్షసుని; పాదముల్= కాళ్లు; పట్టి= పట్టుకొని; వన్నెచెడన్+కన్= రూపుమారేటట్లు; ధనుస్+శతమాత్ర దూరమున్= నూరువిండ్లకొలత దూరానికి; పన్నగడింభమున్= పాముపిల్లను; విసరి; పాఱఁగవైచు= పారవేసే; ఖగ+ఇంద్రుకైవడిన్= గరుత్మంతునివలె; పడవైచెన్= పారవేశాడు.

**తా :** జాగ్రత్తగా ఆ తన్ను తప్పించుకొని రాక్షసాంతకుడైన శ్రీకృష్ణుడు రణోత్సాహం పొందాడు. కండ్లలో ఎరుపుదనం అతిశయించగా ఆ అశ్వదానవునిగర్వం తరిగేటట్లు అతనికాళ్లు పట్టుకొని గరుత్మంతుడు పాముపిల్లను పట్టుకొని విసిరి పారవేసినట్లు నూరువిండ్ల దూరంలో విసిరి పారవేశాడు.

**ఉ. వైచిన మ్రొగ్గి లేచి వెస వాజినిశాటుఁడు హుంకరించి సం**
**కోచము లేక పైఁబడిన గోపకులేంద్రుఁడు దిగ్గజేంద్రశుం**
**డా చటులప్రభాబలవిడంబకమైన భుజార్గళంబు దో**
**షా చరు నోటిలో నిడియెఁ జండఫణిన్ గుహ నుంచు కైవడిన్. 1172**

**ప్రతి :** వైచినన్= ఇలా విసరివేయగా; మ్రొగ్గి= నేలకువాలి; వెసన్= వెంటనే; లేచి; సంకోచములేక= జంకుకొంకులు మాని; హుంకరించి= హుంకారంచేసి; పైన్+పడినన్= మీదబడగా; గోపకుల+ఇంద్రుఁడు= యాదవకుల శ్రేష్ఠుడైన కృష్ణుడు; దిక్+గజ+ఇంద్ర= దిగ్గజ రాజుయొక్క; శుండా= తొండంవలే; చటులప్రభా= తీవ్రకాంతులయొక్క; బల= రూపాన్ని; విడంబకము+ఐన= పోలినట్టిదైన; భుజ+అర్గళంబు= బాహుదండాన్ని; నిశాచరునోటిలోన్= కేశిరాక్షసుని నోట్లో; చండఫణిన్= ప్రచండమైన సర్పాన్ని; గుహన్+ఉంచుకైవడిన్= గుహలో పెట్టినట్లుగా; ఇడియెన్= చొప్పించాడు.

**తా :** అలా కృష్ణుడు విసరిపడవేయగా, కేశిదానవుడు నేలపై పడి వెంటనే పైకి లేచి అహంకారంతో హుంకరిస్తూ, సంకోచం లేకుండా కృష్ణునిపైన పడ్డాడు. భయంకర సర్పాన్ని గుహలోనికి చొప్పించిన విధంగా కృష్ణుడు దిగ్గజం తొండంవలె బలిష్ఠమైన తన బాహుదండాన్ని కేశిదానవుని నోటిలోనికి చొప్పించాడు.

**శా. దంభోళిప్రతిమానకర్కశమహోద్యద్వామదోఃస్తంభమున్**
**శుంభల్లీల నఘారి వానిరదముల్ చూర్ణంబులై రాలఁగా**
**గంభీరంబుగఁ గుక్షిలోఁ జొనిపి వీఁకన్ వృద్ధిఁ బొందింపుచున్**
**గుంభించెం బవనంబు పిక్కటిలఁ దత్కుక్షిన్ నరేంద్రోత్తమా! 1173**

**ప్రతి :** నర+ఇంద్ర+ఉత్తమా= రాజశ్రేష్ఠుడవైన పరీక్షిన్మహారాజా! అఘ+అరి= అఘాసురుని శత్రువైన కృష్ణుడు; దంభోళి= వజ్రాయుధంతో; ప్రతిమాన= సాటియైన; కర్కశ= కఠినమైన; మహా+ఉద్యత్= గొప్పదై మీదికి చాచబడిన; వామ దోస్+స్తంభమున్= స్తంభంవంటి ఎడమచేతిని; శుంభత్+లీలన్= అధికమైన విలాసంతో; వానిరదముల్= ఆ రాక్షసునిదంతాలు; చూర్ణంబులై= పొడిపొడియై; రాలన్+కాన్= రాలిపోగా; కుక్షిలోన్= వాని కడుపులోనికి; చొనిపి= చొప్పించి; వీఁకన్= ఉత్సాహంతో; వృద్ధిన్+పొందింపుచున్= పెద్దది చేస్తూ; తత్+కుక్షిన్= వానికడుపులోని; పవనంబు= ప్రాణవాయువు; పిక్కటిలన్= ఉబికి వచ్చేటట్లు; కుంభించెన్= నిరోధించాడు.

**తా :** ఓ రాజశ్రేష్ఠుడవైన పరీక్షిన్మహారాజా! అఘాసురసంహారి అయిన శ్రీకృష్ణుడు వజ్రాయుధంవలె కఠినమై పైకి చాచబడిన స్తంభంవంటి తన ఎడమచేతిని రాక్షసుని దంతాలు చూర్ణమై రాలిపోయేటట్లు వాని కడుపులోనికి చొప్పించాడు. అలా చొప్పించిన చేతిని ఉత్సాహంతో పెంచుతూ ఆ దానవుని ప్రాణవాయువును నిరోధించాడు.

**క. వాయువు వెడలక నిలిచినఁ, గాయంబు సెమర్పఁ గన్నుగవ వెలి కుఱుకన్**
**మాయ సెడి తన్నుకొనుచును, గూయుచు నశ్వాసురుండు గూలెన్ నేలన్. 1174**

**ప్రతి :** వాయువు= కడుపులోని గాలి; వెడలక= వెలుపలికిపోక; నిలిచినన్= నిలిచిపోగా; కాయంబు చెమర్పన్= శరీరంపై చెమటపట్టగా; కన్నుగవ= కండ్లు; వెలికిన్+ఉఱుకన్= వెలికిరాగా; మాయచెడి= వాని మాయలు పనిచేయకపోగా;

తన్నుకొనుచును= తన్నుకొంటూ; కూయుచున్= పెడబొబ్బలు పెడుతూ; అశ్వ+అసురుండు= గుర్రంరూపంలోని కేశిదానవుడు; నేలన్= నేలపైన; కూలెన్= కూలిపోయాడు.

**తా :** ఇలా కృష్ణుడు చేసినందువల్ల, పొట్టలోని గాలి వెలుపలికి వెడలక నిలిచిపోయింది. రాక్షసునిదేహంపై చెమటలుపట్టాయి. కనుగుడ్లు బైటికి వచ్చాయి. తన మాయలు చెడిపోయి, తన్నుకొంటూ, రొప్పుకుంటూ కేశి నేలపైన కూలిపోయాడు.

**ఆ. ఘోటకాసురేంద్రుకుక్షిలోఁ గృష్ణుని, బాహు వధిక మైనఁ బట్టలేమిఁ**
**బగిలి దోసపండు పగిదిఁ దద్దేహంబు, వసుమతీశ! రెండు వ్రయ్య లయ్యె. 1175**

**ప్రతి :** వసుమతీ+ఈశ= ఓ రాజా!; ఘోటక+అసురేంద్రు= అశ్వాసురునియొక్క; కుక్షిలోన్= కడుపులో; కృష్ణుని; బాహువు; అధికమైనన్= పెద్దది కాగా; పట్టలేమిన్= పట్టక పోవడంవలన; దోసపండు పగిదిన్= దోసపండు మాదిరి; పగిలి= చీలి; తద్+దేహంబు= ఆ రాక్షసుని శరీరం; రెండు; వ్రయ్యలు+అయ్యెన్= ముక్కలయింది.

**తా :** ఓ రాజా! ఇలా అశ్వాసురుని కడుపులో కృష్ణుని బాహువు పెరిగి పెరిగి పట్టక పోవడంతో, వాని కడుపు దోసపండువలె రెండుముక్కలుగా పగిలిపోయింది.

**క. నలినాక్షుఁడు లీలాగతి, విలయముఁ బొందించె నిట్లు వీరావేశిన్**
**బలలాశిన్ జగదభినవ, బలరాశిన్ విజితశక్రపాశిం గేశిన్. 1176**

**ప్రతి :** నలిన+అక్షుఁడు= పద్మనేత్రుడైన శ్రీకృష్ణుడు; వీర+ఆవేశిన్= వీరావేశం కలిగినవాణ్ణీ; పలల+అశిన్= మాంసభక్షకుణ్ణీ; జగత్+అభినవ బలరాశిన్= లోకంలో నూతన బలానికి రాశివంటివాడూ; విజితశక్రపాశిన్= ఇంద్రుని, వరుణుని ఓడించినవాణ్ణీ అయిన; కేశిన్= కేశిరాక్షసుణ్ణి; లీలాగతిన్= అలవోకగా; ఇట్లు= ఇలా; విలయమున్+పొందించెన్= అంతమొందించాడు.

**తా :** పద్మనేత్రుడైన శ్రీకృష్ణుడు వీరావేశీ, మాంసాశనుడూ, ఆనాటి లోకంలో నూతనశక్తిరాశిగా ఉన్నావాడూ, ఇంద్రవరుణులను ఓడించినవాడూ అయిన కేశిరాక్షసుణ్ణి అలవోకగా సంహరించాడు.

**వ. ఆ సమయంబునం బుష్పవర్షంబులు గురియించి సురలు వినుతించి; రంత హరిభక్తి విశారదుండైన నారదుండు వచ్చి గోవిందుని సందర్శించి రహస్యంబున నిట్లనియె. 1177**

**ప్రతి :** ఆ సమయంబునన్= ఆ ఆనందసమయంలో; సురలు= దేవతలు; పుష్పవర్షంబులు= పూలవానలు; కురియించి= కురిపించి; వినుతించిరి= ప్రస్తుతించారు; అంతన్= ఆ తర్వాత; హరిభక్తి విశారదుండు+ఐన= హరిభక్తిలో ప్రవీణుడైన; నారదుండు= నారదముని; వచ్చి; గోవిందుని= శ్రీకృష్ణుణ్ణి; సందర్శించి= దర్శనం చేసుకొని; రహస్యంబునన్= ఏకాంతంగా; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** ఆ ఆనందసమయంలో దేవతలు పూలవానలు కురిపించారు. శ్రీకృష్ణునిమహిమలను కొనియాడారు. అప్పుడు విష్ణుభక్తి విశారదుడైన నారదుడు వచ్చి, కృష్ణునిదర్శనం చేసుకొని, రహస్యంగా ఇలా అన్నాడు.

**సీ. 'జగదీశ! యోగీశ! సర్వభూతాధార! సకలసంపూర్ణ! యీశ్వర! మహాత్మ!**
**కాష్ఠగతజ్యోతికైవడి నిఖిలభూతములందు నొకఁడవై తనరు దీవు**

**సద్గూఢుఁడవు; గుహాశయుఁడవు సాక్షివి నీయంతవాఁడవై నీవు మాయఁ**
**గూడి కల్పింతువు గుణముల; వానిచేఁ బుట్టించి రక్షించి పొలియఁ జేయు**

**ఆ. దీ ప్రపంచమెల్ల నిట్టి నీ విప్పుడు, రాజమూర్తు లయిన రాక్షసులను**
**సంహరించి భూమిచక్రంబు రక్షింప, నవతరించినాఁడ వయ్య! కృష్ణ! 1178**

**ప్రతి :** జగత్+ఈశ= విశ్వప్రభూ!; యోగి+ఈశ= యోగీశ్వరా!; సర్వభూత+ఆధార= స్థావరజంగమరూపులైన సమస్తప్రాణులకు ఉనికిపట్టయినవాడా!; సకలసంపూర్ణ= అన్నిటిలోనూ నిండి ఉన్నవాడా!; ఈశ్వర= సర్వనియామకా!; మహా+ఆత్మ= మహాత్మా!; కాష్ఠగతజ్యోతికైవడిన్= కట్టెలో నిక్షిప్తమై ఉండే నిప్పువలె; నిఖిల భూతము+అందున్= సర్వప్రాణులలో; ఒకఁడవు+ఐ= రెండవది లేనివాడవుగా; ఈవు= నీవు; తనరుదు(వు)= ప్రకాశిస్తుంటావు; సత్+గూఢుఁడవు= సత్తులో దాగిఉండే వాడవు; గుహా+ఆశయుఁడవు= ప్రాణుల హృదయాలనే గుహలో శయనించేవాడివి; సాక్షివి= సృష్టిస్థితిలయాలను పొందే ప్రాణులను దూరంగా ఉండి చూస్తూ ఉండే వాడవు; నీవు; నీ+అంతవాఁడవు+ఐ= నీకు సమానులు మరెవరూ లేనివాడివై; మాయన్+కూడి= మూలప్రకృతితో చేరి; గుణములన్= సత్త్వరజ స్తమోగుణాలను; కల్పింతువు= పుట్టిస్తావు; వానిచేన్= ఆ త్రిగుణాలద్వారా; ఈ ప్రపంచము+ఎల్లన్= ఈ సర్వప్రపంచాన్నీ; పుట్టించి= లోకాలను సృజించి; రక్షించి= (విష్ణువై) లోకాలను రక్షించి; పొలియన్+ చేయుదు(వు)= (రుద్రరూపం ధరించి) లోకాలను నశింపజేస్తావు; ఇట్టి నీవు= ఇలాంటి నీవు; ఇప్పుడు; అయ్య! కృష్ణ!; రాజమూర్తులు+అయిన= రాజులరూపంలోఉన్న; రాక్షసులను= దానవులను; సంహరించి= చంపి; భూమిచక్రంబు= భూమండలాన్ని; రక్షింపన్= రక్షించడానికి; అవతరించినాఁడవు= జన్మించావు.

**తా :** కృష్ణా! జగదీశ్వరా! అచింత్య ప్రభావంగల యోగీశ్వరా! అఖిల ప్రాణులకు ఆధారమైనవాడా! అంతటా నిండిన మహానుభావా! సర్వనియామకుడా! కట్టెలో నిక్షిప్తమై ఉన్న అగ్నివలె, సమస్తప్రాణులలో ప్రవేశించి ఎలాంటి వికారాలు లేక ఏకరూపుడవై విరాజిల్లుతున్నావు. ప్రాణుల హృదయగుహల్లో గూఢంగా ఉన్నావు. జీవులు చేసే పనులకు సాక్షిభూతుడవై ఉన్నావు. నీవు సర్వస్వతంత్రుడవు. నీకు అధీనమైన మాయాశక్తితోకూడి సత్త్వరజస్తమోగుణాలను కల్పిస్తున్నావు. ఈ త్రిగుణాల చేత బ్రహ్మ, విష్ణు, రుద్రరూపుడవై జగత్తును సృష్టిస్తున్నావు, రక్షిస్తున్నావు, సంహరిస్తున్నావు. ఇలాంటి నీవు నేడు రాజుల ఆకారాలు ధరించి ఉండే రాక్షసులను సంహరించి, ఈ భూమండలాన్ని కాపాడడానికి అవతరించావు.

**వ. దేవా! నీచేత నింకఁ జాణూర ముష్టిక గజ కంస శంఖ యవన ముర నరక పౌండ్రక శిశుపాల దంతవక్త్ర సాల్వ ప్రముఖులు మడిసెదరు; పారిజాతం బపహృతం బయ్యెడిని; నృగుండు శాపవిముక్తుం డగు; శమంతకమణి సంగ్రహంబగు; మృతబ్రాహ్మణపుత్త్రప్రదానంబు సిద్ధించు; నర్జునసారథివై యనేకాక్షౌహిణీబలంబుల వధియించెదవు; మఱియును. 1179**

**ప్రతి :** దేవా= స్వామీ!; నీచేతన్= నీ చేతిలో; చాణూర, ముష్టిక, గజ, కంస, శంఖ, యవన, ముర, నరక, పౌండ్రక, శిశుపాల, దంతవక్త్ర, సాల్వ; ప్రముఖులు= మొదలైనవారు; మడిసెదరు= చస్తారు; పారిజాతంబు= పారిజాతవృక్షం; అపహృతంబు+అయ్యెడిని= అపహరించబడుతుంది; నృగుండు= నృగుడు; శాపవిముక్తుండు+అగున్= శాపంనుండి విముక్తి పొందుతాడు; శమంతకమణి; సంగ్రహంబు+అగు= సంగ్రహించబడుతుంది; మృత= మరణించిన; బ్రాహ్మణపుత్త్ర= బ్రాహ్మణ

పుత్రుని; ప్రదానంబు= తెచ్చి ఇవ్వడం; సిద్ధించున్= నెరవేరుతుంది; అర్జునసారథివి+ఐ= అర్జునునికి రథసారథివై; అనేక+అక్షౌహిణీ బలంబులన్= అనేక అక్షౌహిణులసేనలను; వధియించెదవు= సంహరిస్తావు; మఱియును= ఇంకా...

**తా :** దేవా! ఇంకా నీచేత చాణూరుడు, ముష్టికుడు, గజాసురుడు, కంసుడు, శంఖుడు, యవనుడు, మురాసురుడు, నరకాసురుడు, పౌండ్రకవాసుదేవుడు, శిశుపాలుడు, దంతవక్త్రుడు, సాల్వుడు మొదలైనవారు సంహరించబడతారు. దేవలోకంనుండి పారిజాతవృక్షాన్ని పెకలించి భూలోకానికి తెస్తావు. నీవల్ల నృగునికి శాపవిమోచనం కలుగుతుంది. శమంతకమణిని స్వీకరిస్తావు. మృతులైన బ్రాహ్మణకుమారులను తిరిగితెచ్చి ఇస్తావు. అర్జునునికి రథసారథివై కురుక్షేత్ర యుద్ధంలో పదునెనిమిదిఅక్షౌహిణుల సైన్యాన్ని సంహరిస్తావు. ఇంకా -

**శా. కృష్ణా! నీ వొనరించు కార్యములు లెక్కింపన్ సమర్థుండె? వ**
**ర్ధిష్ణుండైన విధాత మూఁడుగుణముల్ దీపించు లోపించు రో**
**చిష్ణుత్వంబున నుండు నీవలన; నిస్సీమంబు నీరూపు నిన్**
**విష్ణున్ జిష్ణు సహిష్ణు నీశు నమితున్ విశ్వేశ్వరున్ మ్రొక్కెదన్. 1180**

**ప్రతి :** కృష్ణా!; నీవు+ఒనరించుకార్యములు= నీవు చేసే పనులు; లెక్కింపన్= గణించడానికి; వర్ధిష్ణుండు+ఐన విధాత= వర్ధనశీలుడైన బ్రహ్మ; సమర్థుండు+ఎ= సామర్థ్యం కలవాడా?; నీ వలనన్; మూఁడుగుణముల్= సత్వరజస్తమోగుణాలు మూడూ; దీపించున్= పుడతాయి; లోపించున్= లోపిస్తాయి; రోచిష్ణుత్వంబునన్+ఉండున్= వృద్ధిపొందుతాయి; నీరూపు= నీ రూపం; నిస్సీమంబు= మేరలేనిది; విష్ణున్= సర్వవ్యాపీ; జిష్ణున్= జయశీలుడూ; సహిష్ణున్= సహనశీలీ; ఈశున్= పరమేశ్వరుడూ; అమితున్= ప్రమాణరహితుడూ; విశ్వ+ఈశ్వరున్= ప్రపంచ నియామకుడూ (అయిన); నిన్= నీకు; మ్రొక్కెదన్= నమస్కరిస్తున్నాను.

**తా :** కృష్ణా! వర్ధనశీలుడైన విధాతకూడా నీవు చేసే ఘనకార్యాలను లెక్కించ లేడు. నీ వల్లనే సత్త్వరజస్తమోగుణాలు మూడూ పుడతాయి, వృద్ధి పొందుతాయి, నశిస్తాయి. నీరూపం మేరలేనిది. సర్వవ్యాపివీ, జయశీలివీ, సహనశీలివీ, పరమేశ్వరుడివీ, ప్రమాణరహితుడివీ, ప్రపంచనియామకుడివీ అయిన నీకు ప్రణమిల్లుతున్నాను.

**వ. అని వినుతించి వీడుకొని నారదుం డరిగె; నంత నొక్కనాఁడు కృష్ణసహితు లయి గోపకుమారు లడవికిం జని పసుల మేపుచు నొక్క కొండదండ నిలాయనక్రీడ సేసి రందు. 1181**

**ప్రతి :** అని; నారదుండు= నారదుడు; వినుతించి= ప్రస్తుతించి; వీడుకొని= వీడ్కొని; అరిగెన్= వెళ్లిపోయాడు; అంతన్= ఆ తర్వాత; ఒక్కనాఁడు= ఒకరోజు; కృష్ణసహితులు+అయి= కృష్ణునితోకూడినవారై; గోపకుమారులు= గోపబాలకులు; అడవికిన్= వనానికి; చని= వెళ్లి; పసులన్= గోవులను; మేపుచున్= మేపుకుంటూ; ఒక్క కొండదండన్= ఒక కొండపక్కన; నిలాయనక్రీడ= "దొంగ - రక్షకుడు" అనే దాగుడుమూతల్లాంటి ఆట; చేసిరి= ప్రారంభించారు; అందున్= అక్కడ

**తా :** ఇలా దేవదేవుణ్ణి ప్రస్తుతించి సెలవుతీసుకొని నారదుడు వెళ్లిపోయాడు. ఆ తర్వాత ఒకనాడు గోపబాలకులు కృష్ణునితో కలసి పశువులను తోలుకొని అడవికి వెళ్లారు. అక్కడ పసులను మేపుకుంటూ దాగుడు మూతల్లాంటి - దొంగ - రక్షకుడు అనే ఆట ఆడడం ప్రారంభించారు.

**క. కొందఱు గొఱియల మంచును, గొందఱు పాలకుల మంచుఁ గుటిలత్వమునం**
**గొందఱు దొంగల మనుచును, జెంది కుమారకులు క్రీడసేసిరి తమలోన్. 1182**

**ప్రతి :** కుమారకులు= గోపబాలురు; తమలోన్= తమలోపల; కొందఱు= కొందరు; గొఱియలము= గొ(ౌ)రెలం; కొందఱు= కొంతమంది; పాలకులము= గోవులనుకాచేవాళ్లం; అంచున్= అంటూ; కొందఱు= మరికొందరు; కుటిలత్వమునన్= కుటిలస్వభావంతో; దొంగలము; అనుచును+చెంది= అని ఏర్పడి; క్రీడ+చేసిరి= కనుమూసిగంతలాట ఆడసాగారు.

**తా :** గోపబాలురు తమలో కొందరు గొ(ౌ)రెలుగా, కొందరు కాపరులుగా, మరికొందరు దుస్స్వభావంగల దొంగలుగా ఏర్పడి కనుమూసి గంతలాటను (దాగుడుమూతల్లాంటి) ఆడడానికి ఆరంభించారు.

**శా. ఆలో దొంగలలో మయాసురసుతుం డాద్యుండు వ్యోముండు గో**
**పాలుండై చని మేషకల్పనలతో భాసిల్లి క్రీడించు త**
**ద్బాలవ్రాతము నెల్ల మెల్లన చతుఃపంచావశిష్టంబుగా**
**శైలాంతర్గుహలోనికిం గొని చనెం జౌర్యం బవార్యంబుగన్. 1183**

**ప్రతి :** ఆలోన్= అంతలో; దొంగలలోన్= దొంగవేషం వేసిన గోపబాలకులలో; మయాసురసుతుండు+ఆద్యుండు+వ్యోముండు= మయాసురుని పెద్ద కొడుకైన వ్యోమాసురుడు; గోపాలుండు+ఐ= గోపాలకుడై; చని= వెళ్లి; మేషకల్పనలతో= గొ(ౌ)రెలుగా (మేకలుగా) నటిస్తూ; భాసిల్లి= ప్రకాశించి; క్రీడించు= ఆటలాడే; తద్+బాలవ్రాతమున్= ఆ బాలుర సమూహాన్ని; ఎల్లన్= అందరినీ; చతుః పంచ+అవశిష్టంబు+కాన్= నలుగురైదుగురు తప్ప తక్కినవారిని; శైల+అంతః+గుహలోనికిన్=కొండగుహలోనికి; చౌర్యంబు= దొంగతనం; అవార్యంబు+కన్= అడ్డులేకుండా; కొని చనెన్= తీసుకొని వెళ్లాడు.

**తా :** అంతలో మయుడనే రాక్షసుని పెద్దకొడుకు వ్యోమాసురుడు గోపాలరూపం ధరించాడు. వాడు అడ్డులేని దొంగతనంతో ఆ ఆటలో గొఱ్ఱెలుగా నటిస్తున్న గొల్లపిల్లలో నలుగురైదుగురిని తప్ప మిగతా బాలురనందరినీ మెల్లమెల్లగా ఆ కొండ గుహలోనికి తీసుకొని వెళ్లాడు.

**వ. ఇట్లు కొండగుహలోనఁ గ్రమక్రమంబున గోపకుమారుల నిడి, యొక్క పెనుఱాతఁ దద్ద్వారంబుఁ గప్పి యెప్పటియట్ల వచ్చిన. 1184**

**ప్రతి :** ఇట్లు= ఇలా; గోపకుమారులన్= గోపబాలకులను; కొండగుహలోనన్= కొండ గుహలో; క్రమక్రమంబునన్= మెల్లమెల్లగా; ఇడి= ఉంచి; ఒక్కపెనుఱాతన్= ఒక పెద్దరాతితో; తద్+ద్వారంబు= ఆ గుహాద్వారాన్ని; కప్పి= మూసి; ఎప్పటి+అట్ల= ముందుమాదిరిగా; వచ్చినన్= రాగా...

**తా :** ఇలా ఆ వ్యోమాసురుడు గోపబాలకులను మెల్లమెల్లగా కొండగుహలోనికి చేర్చి, ఒక పెద్దరాతితో ఆ గుహాద్వారాన్ని మూసివేశాడు. అలా చేసిన తర్వాత ముందులాగా ఆ రాక్షసుడు రాగా

**ఉ. వీరుఁడు మాధవుం డఖిలవేది నిశాచరభేది నవ్వుతో**
**'నౌర! నిశాట! దొంగతన మచ్చుపడెన్ నెఱదొంగ వౌదు; వా**
**భీరుల నెల్ల శైలగుహఁ బెట్టితి చిక్కినవారిఁ బెట్టరా!**
**రార యటంచుఁ బట్టె మృగరాజు వృకాఖ్యముఁ బట్టు కైవడిన్. 1185**

ప్రతి : అఖిలవేది= సర్వజ్ఞుడూ; నిశాచరభేది= రాక్షసాంతకుడు; అయిన; మాధవుండు= శ్రీకృష్ణుడు; నవ్వుతోన్= నవ్వుతూ; ఔర! నిశాట!= ఓరీ! రాక్షసా! నీ దొంగతనము= నీ చౌర్యం; అచ్చుపడెన్= బయట పడింది; నెఱదొంగవు= పెద్ద దొంగవు; ఔదువు= ఔతావు; ఆభీరులన్= గోపబాలురను; ఎల్లన్= అందరినీ; శైలగుహన్+పెట్టితి(వి)= కొండగుహలో బంధించావు; చిక్కినవారిన్= మిగిలిన పిల్లలనుకూడా; పెట్టరా= పెడుదువు గాని రా; రారా= రారా; అట+అంచున్= అని అంటూ; మృగరాజు= సింహం; వృక+ఆఖ్యమున్= తోడేలు అనే పేరు గల జంతువును; పట్టుకైవడిన్= పట్టుకొన్న విధంగా; పట్టెన్= పట్టుకొన్నాడు.

**తా :** సర్వజ్ఞుడూ, రాక్షసాంతకుడూ, మహావీరుడూ అయిన శ్రీకృష్ణుడు నవ్వుతూ "ఓరీ! రాక్షసా! నీదొంగతనం గుట్టు బట్టబయలైంది. బలే దొంగవులే! యాదవ బాలకులందరినీ కొండగుహలో బంధించావు. మిగిలిన వారిని కూడా పట్టు కొందువుగాని రా! రారా! అంటూ సింహం తోడేలును పట్టుకున్నట్లు వాణ్ణి ఒడిసి పట్టుకొన్నాడు.

**ఉ. పంకజలోచనుం డొడిసి పట్టిన శైలనిభాసురాకృతిన్**
**బింకముతోడఁ బొంగి విడిపించుకొనంగ బలంబు లేమి లో**
**శంకిలి బిట్టు తన్నుకొనఁ జక్కన యా రణభీము వ్యోమునిం**
**గొంకకఁ గూల్చె న వ్విభుఁడు గోయని మింట సుపర్వు లార్వఁగన్. 1186**

ప్రతి : పంకజలోచనుండు= పద్మనేత్రుడైన శ్రీకృష్ణుడు; ఒడిసి పట్టినన్= గట్టిగాపట్టుకోగా; శైలనిభ+అసుర+ఆకృతిన్= కొండవంటి రాక్షసస్వరూపంతో; బింకముతోడన్= ధైర్యంతో; పొంగి= అతిశయించి; విడిపించుకొనన్+కన్= కృష్ణునినుండి విడిపించుకోడానికి; బలంబులేమిన్= బలం లేక పోయినందువల్ల; లోన్= లోలోపల; శంకిలి= సందేహించి; బిట్టు తన్నుకొనన్= గిజగిజ గుంజులాడగా; చక్కనన్= అతిశయంతో; ఆ రణభీమున్= ఆయుద్ధవీరుడైన; వ్యోమునిన్= వ్యోమాసురుణ్ణి; కొంకకన్= సంకోచం లేకుండా; ఆ+విభుఁడు= ఆ శ్రీకృష్ణుడు; కో+అని= ఓహో! అని; సుపర్వులు= దేవతలు; మింటన్= ఆకాశంలో; ఆర్వన్+కన్= ఆశ్చర్య ధ్వానాలు చేస్తుండగా; కూల్చెన్= సంహరించాడు.

**తా :** పద్మనేత్రుడైన శ్రీకృష్ణుడు ఇలా ఒడిసిపట్టగా అతడు గోపాలకునిరూపం వదిలి కొండలాంటిరాక్షసరూపంతో ఉప్పొంగి మిడిసిపడ్డాడు. కానీ విడిపించుకోవడానికి బలంచాలక, తన శక్తిమీద సందేహం గలిగి, ఎంతగానో గుంజులాడాడు. అపుడు ఆకాశంలో దేవతలు 'ఓహో' అని జయజయధ్వానాలు చేస్తుండగా కృష్ణుడు ఆ వ్యోమాసురుణ్ణి సంకోచం లేకుండా సంహరించాడు.

**ఆ. ఘోరదనుజు నేలఁ గూల్చి పర్వతగుహ, వాత నున్న ఱాయి వ్రయ్యఁ దన్ని**
**గుహఁ జరించుచున్న గోపాలకులఁ గొంచు, బల్లిదుండు గొల్లపల్లె కరిగె. 1187**

ప్రతి : బల్లిదుండు= బలవంతుడయిన కృష్ణుడు; ఘోరదనుజున్= ఆ భయంకరరాక్షసుణ్ణి; కూల్చి= సంహరించి; పర్వతగుహవాతన్= కొండగుహ ద్వారంలో; ఉన్నఱాయిన్= ఉన్న రాతిని; వ్రయ్యన్+తన్ని= పగిలిపోయేటట్లు తన్ని; గుహన్= గుహలో; చరించుచున్+ఉన్న= తిరుగుతూఉన్న; గోపాలకులన్= గోపబాలకులను; కొంచు= తీసుకొని; గొల్లపల్లెకున్= గోకులానికి; అరిగెన్= వెళ్లాడు.

**తా :** బలవంతుడైన శ్రీకృష్ణుడు ఆ భయంకరరాక్షసుణ్ణి సంహరించి, కొండగుహద్వారంలో అడ్డంగా ఉంచిన రాతిని పగిలిపోయేలా తన్నాడు. గుహలోపల చిక్కుబడిపోయి, తిరుగుతూ ఉన్న గోపబాలకులను కొండ గుహనుండి వెలుపలికి తీసుకొని వచ్చి గోకులానికి వెంటబెట్టుకుని వెళ్ళాడు.

**వ. అంత నారాత్రి మథురానగరంబున నక్రూరుండు వసియించి నియతుండయి మఱునాఁడు రేపకడ లేచి, నిత్యకృత్యంబు లాచరించి, రథంబెక్కి కదలి నందగోకులంబునకుం బోవుచుం దెరువునఁ దనలో నిట్లనియె. 1188**

**ప్రతి :** అంతన్= ఆ తర్వాత; ఆ రాత్రి; మథురా నగరంబునన్= మథురా పట్టణంలో; అక్రూరుడు; వసియించి= బసచేసి; నియతుండు+అయి= నియమంలో; మఱునాఁడు= మరుసటిరోజు; రేపకడన్= ప్రాతఃకాలంలో; లేచి= నిద్రనుండి మేల్కొని; నిత్యకృత్యంబులు= నిత్యకర్మానుష్ఠానాలు; తీర్చి= తీర్చుకొని; రథంబు+ఎక్కి= రథమెక్కి; నందగోకులంబునకున్= నందుడు నివసించే గోకులానికి; పోవుచున్= పోతూ; తెరువునన్= ఆ దారిలో; తనలోన్= తనలో; ఇట్లు+అనియెన్= ఇలా అనుకున్నాడు.

**తా :** ఆ తర్వాత, అక్రూరుడు ఆ రాత్రి మథురానగరంలో బసచేసి, నియమంలో ఉదయమే లేచి, నిత్యకర్మానుష్ఠానాలు తీర్చుకొని, రథమెక్కి, కదలి నందునిగోకులానికి ప్రయాణిస్తూ, దారిలో తనలో తాను ఇలా అనుకున్నాడు.

### ✤ కంసుని పంపున నక్రూరుండు బృందావనంబునకుఁ జనుదెంచుట ✤

**ఉ. ఎట్టితపంబు సేయఁబడె? నెట్టి చరిత్రము లబ్ధ మయ్యెనో?**
**యెట్టిధనంబు లర్హులకు నీఁబడెనో తొలిబామునందు; నా**
**యట్టి వివేకహీనునకు నాదిమునీంద్రులు యోగదృష్టులం**
**బట్టఁగ లేని యీశ్వరుని బ్రహ్మమయున్ హరిఁ జూడఁ గల్గెడిన్. 1189**

**ప్రతి :** తొలిబాము+అందున్= పూర్వజన్మలో; ఎట్టితపంబు= ఎటువంటి తపస్సు; చేయన్+పడెన్= నా చేత చేయబడిందో; ఎట్టిచరిత్రము= ఎటువంటి నడవడి; లబ్ధము+అయ్యెను+ఓ= నాకు సమకూడిందో; ఎట్టి ధనంబులు= ఎటువంటి సంపదలు; అర్హులకున్= యోగ్యులకు; ఈన్+పడెను+ఓ= ఇవ్వబడ్డాయో; నా+అట్టి= నావంటి; వివేకహీనునకున్= తెలివిలేనివాడికి; ఆదిముని+ఇంద్రులు= మునుపటి శ్రేష్ఠులైన మౌనులు; యోగదృష్టులన్= జ్ఞానదృష్టులచేత; పట్టన్+కన్+లేని= కనుగొనలేని; ఈశ్వరునిన్= సర్వమునకు ప్రభువైనవాణ్ణి; బ్రహ్మమయున్= వేదస్వరూపుణ్ణి; హరిన్= పాపాలను పోగొట్టే పరమాత్మను, శ్రీకృష్ణుణ్ణి; చూడన్+కల్గెడిన్= దర్శించే భాగ్యం నాకు కలుగుతోంది.

**తా :** గతజన్మలో నేను ఎటువంటి తపస్సుచేశానో? ఎటువంటి ప్రవర్తన కలిగి ఉన్నానో? యోగ్యులైనవారికి ఎటువంటి దానాలు చేశానో? ఆద్యులైన పరమయోగుల దివ్యదృష్టికిసైతం గోచరించని ప్రభువూ, పరబ్రహ్మస్వరూపుడూ అయిన శ్రీకృష్ణుణ్ణి నేను చూడబోతున్నాను.

**ఉ. సూరులు దొల్లి యే విభునిశోభితపాదనఖప్రభావళిం**
**జేరి భవాంధకారములఁ జిక్కక దాఁటుదు రట్టి దేవునిన్**
**వైరముతోడనైనఁ బిలువన్ ననుఁ బంచి శుభంబు సేసె ని**
**ష్కారణమైన ప్రేమ నిదె; కంసునిఁ బోలు సఖుండు గల్గునే? 1190**

**ప్రతి :** తొల్లి= పూర్వం; సూరులు= పండితులు; ఏ విభుని= ఏ ప్రభుని; శోభిత= ప్రకాశించే; పాద= చరణాలలోని; నఖ= గోళ్ళ; ప్రభా+ఆవళిన్= కాంతి సమూహాన్ని; చేరి= ఆశ్రయించి, పొంది; భవ+అంధకారములన్= పుట్టుకలనే కారుచీకట్లలో;

చిక్కక= తగుల్కోక; దాఁటుదురు= తరిస్తారో; అట్టి దేవునిన్= అలాంటి భగవంతుణ్ణి, వైరముతోడన్+ఐనన్= పగతోనయినా; పిలువన్= పిలుచుకొని రావడానికి; నిష్కారణము+ఐనప్రేమన్= కారణంలేని ప్రేమతో; ఇది+ఎ= ఇదిగో!; ననున్= నన్ను; పంచి= పంపి; శుభంబు+చేసెన్= (నాకు) మేలు గల్గించాడు; కంసునిన్+పోలు= కంసునితో సాటియైన; సఖుండు= మిత్రుడు; కల్గును+ఏ= నాకు లభిస్తాడా?

**తా :** పూర్వం ప్రాజ్ఞులైనవారు ఏ పరమపురుషుని ప్రకాశించే పాదాలగోళ్ళ కాంతిపుంజాన్ని ఆశ్రయించి జననమరణాలు అనే చీకట్లలో చిక్కుకొనక తరించారో, అలాంటి పరబ్రహ్మస్వరూపుడైన శ్రీకృష్ణుణ్ణి పగచేతనైనా జయించదలచి పిలుచుకొని రమ్మని నన్ను అవ్యాజమైనప్రేమతో పంపి, కంసుడు నా కెంతో మేలు చేశాడు. కంసుడితో సమానుడైన చెలికాడు నాకు మరొకడు లభించడు.

**మ. 'ఇతఁ డా కంసునిచేతఁ బంపువడి నన్ హింసింప నేతెంచి నాఁ**
**డతిదుష్టుం'డని చూచునో సకలభూతాంతర్బహిర్మధ్య సం**
**గతుఁ డౌటం దలపోసి నన్ను సుజనుంగాఁ జూచునో యెట్టి యు**
**న్నతి గావించునొ యే క్రియం బలుకునో? నాభాగ్య మెట్లున్నదో? 1191**

**ప్రతి :** ఇతఁడు= ఈ అక్రూరుడు; ఆ కంసునిచేతన్= నాకు ప్రబల విరోధియైన కంసుడిచేత; పంపు+పడి= ఆజ్ఞాపించబడినవాడై; నన్= నన్ను; హింసింపన్= బాధించడానికై; ఏతెంచినాఁడు= వచ్చాడు; అతిదుష్టుండు= మిక్కిలి చెడ్డవాడు; అని చూచున్+ఓ= అని చూస్తాడేమో!; సకలభూత= ఎల్లప్రాణుల; అంతస్= లోపల; బహిస్= వెలుపల; మధ్య= నడుమ; సంగతుండు= చేరి ఉన్నవాఁడు; ఔటన్= కావడంవల్ల; తలపోసి= యోచించి; నన్నున్= నన్ను; సుజనున్+కాన్= మంచివాణ్ణిగా; చూచున్+ఓ= తలంచునో; ఎట్టి= ఎలాంటి; ఉన్నతి= గౌరవం; కావించున్+ఒ= చేయునో!; ఏ క్రియన్= ఏ రీతిగా; పలుకున్+ఓ= మాట్లాడునో; నా భాగ్యము= నా అదృష్టం; ఎట్లు+ఉన్నది+ఓ= ఏ విధంగా ఉన్నదో!

**తా :** ఈ అక్రూరుడు కంసుడి ఆజ్ఞచేత నన్ను బాధించడానికి వచ్చిన పరమ దుర్మార్గుడని భావిస్తాడో! లేక సకలప్రాణుల లోపలా వెలుపలా నడుమా చక్కగ వ్యాపించి ఉన్న పరమాత్మ కనుక నాతత్త్వ మెరిగి నన్ను మంచివాణ్ణిగా ఎంచి ఎంతగా గౌరవిస్తాడో! నాతో ఏ విధంగా సంభాషిస్తాడో చూడాలి. ఇంతకూ నా భాగ్యం ఎట్లుందో తెలియదు.

**వ. అని మఱియును. 1192**

**ప్రతి :** అని= అని పలికి; మరియును= ఇంకనూ...

**తా :** అని ఇంకా

**మ. అలకభ్రాజితమై సుధాంశునిభమై హాసప్రభోద్దామమై**
**జలజాక్షంబయి కర్ణకుండలవిరాజద్గండమై యున్న యా**
**జలజాతాక్షు ముఖంబు సూడఁ గలుగున్ సత్యంబు వో నాకు నా**
**వల దిక్కేఁగుచు నున్న నీ వనమృగవ్రాతంబు లీత్రోవలన్. 1193**

**ప్రతి :** ఈ త్రోవలన్= ఈ దారులలో; ఈ వనమృగ వ్రాతంబులు= ఈ అడవి జంతువుల గుంపులు; నా వలదిక్కు= నాకు కుడివైపుగా ఉన్న దిశలో; ఏఁగుచున్+ఉన్నవి= పోతూ ఉన్నాయి. (అందువల్ల) అలకభ్రాజితము+ఐ= ముంగురులతో ప్రకాశించే; సుధా+అంశు నిభము+ఐ= అమృత కిరణుడైన చంద్రుడికి సాటివచ్చేదై; హాసప్రభా+ఉద్దామము+ఐ= నవ్వుల వెల్గులతో అతిశయించిందై; జలజ+అక్షంబు+అయి= పద్మాలవంటి నేత్రాలుగలదై; కర్ణకుండల విరాజత్+గండము+ఐ= చెవిపోగులతో మెరుస్తున్న చెక్కిళ్ళు గలదై; ఉన్న; ఆ జలజాత+అక్షుముఖంబు= తామర రేకులవంటి కన్నులుగల ఆ శ్రీకృష్ణుడి వదనం; నాకున్= నాకు; చూడన్+కలుగున్= చూడటం తటస్థిస్తుంది; సత్యంబు+పో= ఇది యథార్థం.

**తా :** ఈ అరణ్యంలోని మృగాల సమూహం ఈ మార్గాల గుండా నా కుడివైపునుంచి వెళుతోంది. ఈ శుభశకునాన్నిబట్టి ముంగురులతో శోభిల్లే, చంద్రుడితో సమానమైందీ, నవ్వుల వెలుగులతో విరాజిల్లే, పద్మాలవంటి నయనాలు గల, చెవులలోని మకరకుండలాలచేత దీపించే బుగ్గలు గల, తామర రేకులవంటి కన్నులుగలదైన ఆ శ్రీకృష్ణునిముఖం దర్శించే భాగ్యం నాకు తప్పక లభిస్తుంది.

**ఉ. మాపటివేళ నేను జని మాధవుపాదసమీపమందు దం**
**డాపతితుండ నైన నతఁ డాశుగకాలభుజంగవేగ సం**
**తాపిత భక్తలోకభయదారణమైన కరాబ్జ మౌదలన్**
**మోపి హసించి నా కభయముం గృపతోడుత నీయకుండునే? 1194**

**ప్రతి :** మాపటివేళన్= సంధ్యాసమయంలో; నేను; చని= వెళ్ళి; మాధవు= లక్ష్మీవల్లభుడైన శ్రీకృష్ణమూర్తియొక్క; పాదసమీపము+అందున్= అడుగులచెంత; దండ+ఆపతితుండను+ఐనన్= కర్రవలె నేలపై సాగిలపడ్డవాణ్ణికాగా; అతఁడు= ఆ శ్రీకృష్ణుడు; ఆశుగ= వేగంగా వెళ్ళే; కాలభుజంగ= కాలమనే నల్లత్రాచుపాముయొక్క; వేగ= త్వరచేత; సంతాపిత= మిక్కిలి తపింపజేయబడిన; భక్తలోక= భక్తులసమూహంయొక్క; భయ= భీతిని; దారణము+ఐన= చీల్చిన; కర+అబ్జము= పద్మంవంటి చేతిని; ఔదలన్= నా నడినెత్తిమీద; మోపి= ఆనించి; హసించి= నవ్వి; నాకున్= నాకు; అభయమున్= నిర్భయత్వాన్ని; కృపతోడుతన్= దయతో; ఈయక+ఉండును+ఏ= అనుగ్రహించకపోతాడా?

**తా :** నేను సంజపొద్దున నందగోకులానికి వెళ్ళి, లక్ష్మీవల్లభుడైన శ్రీకృష్ణునిపాదాలచెంత సాష్టాంగ నమస్కారం చేస్తాను. అలా మొక్కగా ఆయన శీఘ్రగమనం కల్గిన కాలమనే సర్పంయొక్క విజృంభణానికి తల్లడిల్లే భక్తజనుల భయాన్ని తొలగించే పద్మంవంటి తనహస్తాన్ని నా తలపై మోపి, చిరునవ్వు లొలికిస్తూ కరుణతో నాకు అభయ ప్రదానం చేయక మానడు.

**వ. అని మఱియు నక్రూరుం డనేకవిధంబుల గోవిందసందర్శనంబుఁ గోరుచు నమందగమనంబున సుందరస్యందనారూఢుండై చని చని. 1195**

**ప్రతి :** అని= ఇలా అనుకొంటూ; మఱియున్= ఇంకనూ; అక్రూరుండు= కృష్ణభక్తుడైన అక్రూరుడు; అనేక విధంబులన్= పలురీతుల; గోవింద సందర్శనంబున్= శ్రీకృష్ణుని సందర్శనాన్ని; కోరుచున్= కోరుకొంటూ; సుందర= అందమైన; స్యందన+ఆరూఢుండు+ఐ= రథాన్ని ఎక్కినవాడై; అమందగమనంబునన్= శీఘ్రమైన ప్రయాణంతో; చని చని= వెళ్ళి వెళ్ళి...

**తా :** అక్రూరుడు ఈ ప్రకారం పలురీతుల శ్రీకృష్ణుని సందర్శనం కోరుతూ వేగంగా వెళ్ళే అందమైన రథాన్ని అధిరోహించి చాలదూరం వెళ్ళాడు. అలా వెళ్ళి వెళ్ళి

క. ముందటఁ గనె ఘనచందన, కుంద కుటజ తాల సాల కురవక వట మా
కందన్ నందితబల గో, విందన్ వికచారుణారవిందన్ బృందన్. 1196

ప్రతి : ముందటన్= ఎదుట; ఘనచందన= గొప్పగందపుచెట్లు; కుంద= మొల్ల; కుటజ= కొండమల్లె; తాల= తాటిచెట్లు; సాల= మద్ది; కురవక= ఎర్రగోరింట; వట= మర్రి; మాకందన్= తియ్యమామిడిచెట్లు కల్గిందీ; నందిత= సంతోష పెట్టబడిన; బలగోవిందన్= బలరాముడూ, శ్రీకృష్ణుడూ కలదీ; వికచ= పుష్పించిన, అరుణ+అరవిందన్= ఎర్రతామరలు కలదీ అయిన; బృందన్= బృందావనాన్ని; కనెన్= చూచాడు.

తా : అక్రూరుడు ఎదుట బృందావనాన్ని సందర్శించాడు. ఆ బృందావనం గొప్పగందపుచెట్లు, మొల్ల, అడవిమల్లె, తాటి, మద్ది, ఎర్రగోరింట, మర్రి, తియ్యమామిడి మొదలైన, వృక్షాలనూ కలిగి ఉంది. వికసించిన ఎర్రతామరలతో అది విలసిల్లుతూ ఉంది. ఆ బృందావనం బలరాముణ్ణి, శ్రీకృష్ణుణ్ణి సంతోషపరుస్తున్నది.

వ. కని బృందావనంబు దఱియం జొచ్చి యందు సాయంకాలంబున నడవికి నెఱిగల మేఁతల వెంబడిం దిగంబడి రాక చిక్కిన కుఱ్ఱ కోడె పడ్డ తండంబులం గానక; పొద, యిఱుము, మిఱ్ఱు పల్లం బనక తూఱి, పాఱి, వెదకి కానక చీరెడు గోపకుల యాహ్వానశబ్దంబు లాకర్ణింపుచుఁ గోమలఘాసఖాదనకుతూహలంబులం జిక్కి మక్కువం గ్రేపులం దలంచి తలారింపక, తమకంబులం దమతమయంత నంభారవంబులు సేయుచు నూధంబులు స్రవింపఁ బరువులిడు ధేనువులును, ధేనువులకు నోసరించుచు సద్యోజాతంబులగు తర్ణకంబుల వహించి, నవసూతికలు వెనుదగులుటవలన దామహస్తులై చను వల్లవుల మెల్లన విలోకించుచు, మంద యిరుగెలంకులం గలంకరహితులై పులి సివంగి వేఁగి లోనగు వాలుమెకంబుల మొత్తంబులవలన నప్రమత్తులయి కుఠార కుంత శరాసన ప్రముఖాయుధంబులు ధరియించి, కావలి తిరుగు ప్రేలం గడచి, నానావిధ సరసతృణకబళ ఖాదన గరిష్ఠలై గోష్ఠంబులు ప్రవేశించి, రోమంథలీలాలసలై యున్న ధేనువులును, జన్నులు గుడిచి తల్లులమ్రోలఁ బెల్లురేఁగి క్రేళ్లుఱుకు లేఁగలును, వెదలైన మొదవులం బైకొని పరస్పర విరుద్ధంబులై డీకొని కొమ్ముల యుద్ధంబులు సలుపు వృషభంబులును, నకుంఠితబలంబులం గంఠరజ్జువులం ద్రెంచుకొని, పొద లుఱికి, దాఁటి తల్లులం దూఁటి, కుడుచు తఱిపి దూడల దట్టించి పట్టనోపక గ్రద్దనఁ బెద్దలం జీరు గోపకుమారులును, గొడుకుల మగల మామల మఱందుల వంచించి పంచాయుధభల్ల భగ్నహృదయలై గృహకృత్యంబులు మఱచి శంకిలక సంకేతస్థలంబులఁ గృష్ణాగమనతత్పరలై యున్న గోపకామినులును, గోష్ఠప్రదేశంబుల గోవులకుఁ గ్రేపుల విడిచి యొడ్డుచు, మరలం గట్టుచు, నీడ్చుచుం, గ్రీడించుగోపకులును, గోఖురసముద్ధూతకరీషపరాగపటలంబులవలన నుల్లారి దులదులనైన ధేనుదోహనవేళావికీర్ణపయోబిందుసందోహపరంపరాసంపాదితపంకంబులును, దోహనసమయ గోపకరాకృష్టగోస్తననిర్గతంబు లయి కలశంబులందుఁ బడియెడు క్షీరధారల చప్పుళ్లును, మహోక్షకంఠ సంస్పర్శనస్నిగ్ధంబులైన మందిరద్వారదారుస్తంభంబుల పొంతలనుండి, యులికిపడి నలుదిక్కులు గనుంగొని నూతనజనవిలోకనకుపితంబులై కరాళించుసారమేయంబులుం గలిగి, బలరామకృష్ణ బాహుదండప్రాకారరక్షావిశేషభూషంబైన ఘోషంబుఁ బ్రవేశించి యందు. 1197

**ప్రతి :** కని= చూచి; బృందావనంబు= బృందావనాన్ని; తఱియన్+చొచ్చి= సమీపించి; అందున్= ఆ బృందావనంలో; సాయంకాలంబునన్= సంజవేళలో; అడవికిన్= అరణ్యానికి; నెఱి+కల= ఒప్పిదమైన; మేఁతల వెంబడిన్= గ్రాసాలవెంట; దిగంబడి= ప్రవేశించి; రాక= మందతో రాకుండా; చిక్కిన= వెనుకబడిన; కుఱ్ఱ కోడె పడ్డ తండంబులన్= తొలిచూలిగేదెల, దూడల గుంపులను; కానక= కనుగొనక; పొద= ఇది పొద; ఇఱుము= ఇది మరుగు; మిఱ్ఱు= ఇది మిట్ట; పల్లంబు= ఇది పల్లపు ప్రదేశం; అనక= అని తలంచక; తూఱి= ఆ యా పొదలలో జొరబడి; పాఱి= నలుదిక్కులకు పరుగెత్తి; వెదకి= అన్నిచోట్ల చూచి; కానక= కనుగొనలేక; చీరెదు= పరస్పరం పేర్లతో పిలుచునట్టి; గోపకుల= పసులకాపరుల; ఆహ్వానశబ్దంబులు= పిలుపుల ధ్వనులు; ఆకర్ణించుచున్= వింటూ; కోమల= మృదువైన; ఘాస= గడ్డిని; ఖాదన= మేయడంలోని; కుతూహలంబులన్= వేడుకలలో; చిక్కి= తగుల్కొని; మక్కువన్= ప్రేమతో; క్రేపులన్= దూడలను; తలంచి= స్మరించి; తలారింపక= నిలువక; తమకంబులన్= మోహంచేత; తమ తమ+అంతన్= తమకు తామే; అంభారవంబులు+చేయుచున్= అంబాయని అరుస్తూ; ఊధంబులు స్రవింపన్= పొదుగులనుండి పాలుకారుతూ ఉండగా; పరువులు+ఇడు= పరుగెత్తు; ధేనువులును= ఆవులును; ధేనువులకున్= గోవులకు; ఓసరించుచున్= తొలగుతూ; సద్యః+జాతంబులు= అప్పుడే పుట్టినవి; అగు= అయినట్టి; తర్ణకంబులన్= దూడలను; వహించి= మోసుకొని; నవసూతికలు= కొత్తగా ఈనినగోవులు; వెనుదగులుటవలనన్= వెంబడించడంవల్ల; దామహస్తులు+ఐ= పలుపులు చేతులందు గలవారై; చను= వెళ్లే; వల్లవులన్= గొల్లలను; మెల్లనన్= నెమ్మదిగా; విలోకించుచున్= చూస్తూ; మంద+ఇరు+కెలంకులన్= పశువుల సమూహానికి రెండువైపులా; కలంకరహితులు+ఐ= కలవరపాటు చెందనివారై; పులి= చిరుతపులి; సివంగి= తరక్షువు అనే మృగం; వేఁగి= పెద్దపులి; లోనగు= మొదలైన; వాలు మెకంబుల మొత్తంబులవలనన్= క్రూర జంతువుల గుంపులవల్ల; అప్రమత్తులు+అయి= ఏమరుపాటు లేనివారై; కుఠార= గొడ్డలి; కుంత= ఈటె; శర+ఆసన= విల్లు; ప్రముఖ= మొదలైన; ఆయుధంబులు= ఆయుధాలు; ధరియించి= చేబూని; కావలి తిరుగు= కావలికాసే; వ్రేలన్= గొల్లలను; కడచి= దాటి; నానావిధ= పలురకాలైన; సరస= రసవంతాలైన; తృణకబళ= గడ్డి పిడుచలయొక్క; ఖాదన= మేయడంచేత; గరిష్ఠులు+ఐ= బలసినవై; గోష్ఠంబులు= కొట్టాలు; ప్రవేశించి= చొచ్చి; రోమంథలీలా+అలసలు+ఐ+ఉన్న= నెమరు వేసే వేడ్కయందు పారవశ్యం కల్గియున్న; ధేనువులును= గోవులును; చన్నులు+కుడిచి= పొదుగులలోని పాలుతాగి; తల్లుల మ్రోలన్= తమతల్లులముందు; పెల్లురేఁగి= మిక్కిలి విజృంభించి; క్రేళ్ళు+ఉఱుకు= చెంగు చెంగున గంతులువేసే; లేఁగలును= దూడలూ; వెదలు+ఐన మొదవులన్= ఋతుకాలం చేరువైన ఆవులను; పైకొని= ఆక్రమించి; పరస్పర విరుద్ధంబులు+ఐ= ఒకదానితో ఒకటి కలహించినవై; డీకొని= ఎదుర్కొని; కొమ్ములన్= కొమ్ములతో; యుద్ధంబులు సలుపు= పోరాటంచేసే; వృషభంబులును= ఎద్దులూ; అకుంఠిత బలంబులన్= మొక్కవోని శక్తులతో; కంఠరజ్జువులన్= మెడకు గట్టిన తాళ్ళను; త్రెంచుకొని= తెగిపోవునట్లు చేసుకొని; పొదలు+ఉఱికి= పొదల మీదికి దుమికి; దాఁటి= వాటినిగడచి; తల్లులన్= తల్లులైన ఆవులను; దూఁటి కుడుచు= పొదుగులను పొడిచి పాలుత్రాగే; తఱపి దూడలన్= ఆరునెలల ప్రాయంగల దూడలను; దట్టించి= అదలించి; పట్టన్+ఓపక= బంధించలేక; గ్రద్దనన్= శీఘ్రంగా; పెద్దలన్= పెద్దవాళ్ళను; చీరు= పిలిచే; గోపకుమారులును= గొల్లపిల్లలను; కొడుకులన్= కుమారులను; మగలన్= పెనిమిటులను; మామలన్= భర్తలయొక్క తండ్రులను; మఱందులను= మగలయొక్క తమ్ముళ్ళను; వంచించి= మోసగించి; పంచ+ఆయుధ= మన్మథునియొక్క; భల్ల= బాణాలచేత; భగ్న= భేదిల్లిన; హృదయలు+ఐ= మనసులు గలవారై; గృహకృత్యంబులు= ఇంటిపనులు; మఱచి= విస్మరించి; శంకిలక= జంకక; సంకేత స్థలంబులన్= కలుసుకోవడానికి నిర్ణయించుకొన్న ప్రదేశాలలో; కృష్ణ+ఆగమన తత్పరలు+ఐ+ఉన్న= శ్రీకృష్ణుని రాకయందే ఆసక్తి కలవారై ఉన్న; గోపకామినులును= గొల్లపడతులూ; గోష్ఠ ప్రదేశంబులన్= పశువుల కొట్టాలలో; గోవులకున్= ఆవులకు; క్రేపులన్ విడచి= పాలుతాగడానికి దూడలను వదలి; ఒడ్డుచున్= ముందుకు తోస్తూ; మరలన్+కట్టుచున్=

తిరిగి వాటిని వెనుకకులాగి బంధిస్తూ; ఈడ్చుచున్= కట్టు కంబాలనుండి పాలు కుడవటానికి వాటిని విడుస్తూ; క్రీడించు= ఈ రీతిగా వినోదించే; గోపకులును= గొల్లలూ; గోఖుర= ఆవులగిట్టలనుండి; సముద్ధూత= పైకి ఎగురగొట్టిన; కరీష= ఎండుపేడయొక్క; పరాగపటలంబులవలనన్= ధూళి సముదాయాలవల్ల; ఉల్లారి= ఆవరించి; దులదులన+ఐన= అంతటా నిండిన; ధేను దోహనవేళా= గోవుల పాలుపిదికే సమయంలో; వికీర్ణ= చెదరిన; పయస్+బిందు సందోహ= క్షీరకణాల సమూహంయొక్క; పరంపరా= వరుసలచేత; సంపాదిత= ఏర్పడిన; పంకంబులును= బురదలూ; దోహనసమయ= పాలుపిదికేవేళ; గోపకర+ఆకృష్ట= గొల్లల చేతులతో లాగబడిన; గోస్తన= ఆవుల చన్నులనుండి; నిర్గతంబులు+అయి= వెలువడినవై; కలశంబుల+అందున్= చెంబులలో; పడియెడు= పడుతున్న; క్షీరధారల చప్పుళ్ళును= పాలధారలయొక్క శబ్దాలూ; మహా+ఉక్ష= ఆబోతులయొక్క; కంఠసంస్పర్శన= మెడల రాపిళ్ళచేత; స్నిగ్ధంబులు+ఐన= నునుపు దేలిన; మందిరద్వార= భవనాల వాకిళ్ళలోని; దారుస్తంభంబుల= కొయ్యకంబములయొక్క; పొంతలనుండి= సమీపాలనుంచి; ఉలికిపడి= హఠాత్తుగా కంపించి; నలుదిక్కులు= నాల్గువైపులు; కనుంగొని= పారజూచి; నూతనజన= కొత్త మనుషులను; విలోకన= చూడటంవల్ల; కుపితంబులు+ఐ= కోపించినవై; కరాళించు= భౌ భౌ అని మొరిగే; సారమేయంబులున్= కుక్కలూ; కలిగి= కలిగినదై; బలరామకృష్ణబాహుదండ= బలరామ శ్రీకృష్ణులయొక్క కర్రలవంటి భుజములు అనే; ప్రాకార= చుట్టుగోడలచేత లభించిన; రక్షావిశేష= అధిక రక్షణమే; భూషంబు+ఐన= అలంకారంగా ఉన్న; ఘోషంబున్= వ్రేపల్లెను; ప్రవేశించి= చేరి; అందున్= ఆ వ్రేపల్లెలో...

**తా :** అక్రూరుడు బృందావనంలో ప్రవేశించాడు. సంజవేళలో దూడలూ, కోడెలూ, తొలిచూలు గేదెలూ గుంపులు గుంపులుగా మేతకై వెళ్ళి అక్కడక్కడ పచ్చని పచ్చికలు మేస్తూ, ఎంత సేపటికీ ఇండ్లకు మరలి రాకపోతే వాటిని వెదకటానికి వెళ్ళి పొదలూ, మరుగులూ, మిట్టపల్లాలూ లెక్కించక పొదల్లో దూరి పరుగెత్తుతూ వెదకి ఎక్కడా కనిపించక గోపాలురు ఒకరి నొకరు ఎలుగెత్తి పిలిచే సవ్వడిని ఆలకించాడు. మెత్తని పచ్చిక మేసే కుతూహలంతో ఆగి, అంతలో తమ లేగ దూడలను తలచుకొని ఆలసించక మమకారంతో తమకు తామే అంభారావాలు సలుపుతూ, పొదుగులనుండి పాలు కార్చుకుంటూ పరుగెత్తి వస్తున్న ఆవులను ఆలోకించాడు. అపుడే పుట్టినదూడల్ని దగ్గర ఉంచుకొని, పలుపులు చేత పుచ్చుకొని, కొత్తగా ఈనిన బాలెంతగోవులు వెంబడించగా, మెల్లగా వెళుతున్న గొల్లలను విలోకించాడు. చిరుతలు, సివంగులు, పెద్దపులులు మొదలైన క్రూరజంతువుల బారిన పడకుండా జాగరూకులై మందకు రెండు వైపులా గండ్రగొడ్డళ్లు, ఈటెలు, విండ్లు ధరించి కావలి కాస్తున్న పసుల కాపర్లను దాటి ముందుకు సాగాడు.

అక్కడ పలురకాలైన మిసిమిగల కసవులు మేసి చక్కగా బలిసి కొట్టాలలోచేరి ఆవులు హాయిగా నెమరు వేస్తున్నాయి. దూడలు పాలుగుడిచి తల్లులయెదుట చెలరేగి చెంగు చెంగున దుముకుతున్నాయి. ఎదకు వచ్చిన ఆవులను దాటుతూ వృషభాలు ఎదురునిలిచి ఒకదానితో ఒకటి ఢీకొని కొమ్ములతో కుమ్ములాడుతున్నాయి. ఆరునెలల వయసుగల దూడలు మొక్కవోని బలంతో మెడపలుపులు తెంచుకొని పొదలు దూరి కుప్పించి దుముకుతూ తల్లిపొదుగులను పొడిచి పొడిచి పాలు కుడుస్తున్నాయి. వాటిని అదలించి ఇవతలకు పట్టి ఈడువలేక పిల్లలు పెద్దలను పిలుస్తున్నారు. కొడుకులను, భర్తలను, మామలను, మరదులను మోసగించి మన్మథ శరపీడితలై గొల్లమగువలు ఇంటిపనులు మరచి, జంకు గొంకులు వదలి, సంకేత స్థలాలకు చేరి శ్రీకృష్ణుని రాకకై వేచి ఉన్నారు. గోపకులు పసుల కొట్టాలలో ఆవులకు దూడలను విడుస్తూ, తిరిగి వెనుకకు లాగి కట్టివేస్తూ, మరల విడుస్తూ, పట్టి ఈడుస్తూ ఇలా క్రీడిస్తున్నారు. ఆవులగిట్టలవల్ల పొడిపొడిగా పరుచుకొన్న ఎండుపేడయొక్క దుమ్ము, గోవులను పిదికేటప్పుడు చిందిన ఆ పాల తుంపురలవల్ల తడిసి, అణగిపోయి అడుసుగా మారింది. గోపాలురు పాలుపిండేటప్పుడు ఆవుల చనులనుండి చెంబులలోనికి కారే క్షీరధారలు జుంజుమ్మని చప్పుడు

చేస్తున్నాయి. ఆబోతులు తమ మెడ దురద తీర్చుకోడానికని, ఒరసికొనగా నునుపారిన గృహద్వారసీమల్లోని స్తంభాల సమీపాన పరుండి ఉన్న కుక్కలు ఉలికిపడి కొత్తగా వచ్చినవారిని చూచి కోపంతో భౌ భౌ అని మొరుగుతున్నాయి. బలరామశ్రీకృష్ణుల భుజదండాలు అనే ప్రాకారంతో పరిరక్షించబడుతూ ఈ రీతిగా ఉన్న ఆ వ్రేపల్లె లోనికి అక్రూరుడు ప్రవేశించాడు.

**క. జలజాంకుశాదిరేఖలు, గల హరిపాదముల చొప్పుఁ గని మోదముతోఁ**
**బులకించి రథము డిగి యు, త్కలికన్ సంతోషబాష్పకలితాక్షుండై. 1198**

**ప్రతి :** జలజ+అంకుశ+ఆదిరేఖలు= పద్మం, అంకుశం మొదలైన శుభలక్షణాల, చిహ్నాలు; కల= కలిగిన; హరిపాదముల= శ్రీకృష్ణుని అడుగులయొక్క; చొప్పున్= జాడను; కని= చూచి; (ఇసుక నేలపై ఏర్పడిన శ్రీకృష్ణుని పాదముద్రలు చూచి); మోదముతోన్= సంతోషంతో; పులకించి= గగుర్పాటు పొంది; రథము డిగి= రథం నుంచి క్రిందికి దిగి; ఉత్కలికన్= తహతహతో; సంతోషబాష్ప= ఆనందాశ్రువులతో; కలిత+అక్షుండు+ఐ= కూడిన నయనాలు కలవాడై...

**తా :** పద్మం, అంకుశం మొదలైన శుభచిహ్నాలతో కూడిన శ్రీకృష్ణుని అడుగుల గుర్తులను ఆ వ్రేపల్లె దారులలో అక్రూరుడు దర్శించాడు. ఆనందంతో అతడిశరీరం పులకించింది. కనులలో ఆనందబాష్పాలు నిండాయి. శ్రీకృష్ణణ్ణి సందర్శించ వలెననే తహతహతో ఆయన రథం నుంచి కిందికి దిగి

**మ. కనె నక్రూరుఁడు పద్మనేత్రులను రంగద్గాత్రులన్ ధేను దో**
**హనవాటీగతుల న్నలంకృతుల నుద్యద్భాసులం బీత నీ**
**ల నవీనోజ్జ్వలవాసులం గుసుమమాలాధారులన్ ధీరులన్**
**వనితాకాములఁ గృష్ణరాముల జగద్వంద్యక్రమోద్దాములన్. 1199**

**ప్రతి :** అక్రూరుఁడు= అక్రూరుడు; పద్మనేత్రులను= తామరలవంటి కన్నులు కలవారూ; రంగత్+గాత్రులన్= ఒప్పిదమైన శరీరాలు కలవారూ; ధేను దోహనవాటీ గతులన్= ఆవులపాలు పితికే వాడలలో చేరియున్న వారూ; అలంకృతులన్= అలంకరింపబడినవారూ; ఉద్యత్+భాసులన్= ఉదయిస్తున్న ప్రకాశం కలవారూ; పీత నీల నవీన+ఉత్+జ్వలవాసులన్= పచ్చనివి, నల్లనివి, కొత్తవి, మిక్కిలి ప్రకాశించేవి అయిన వస్త్రాలు కలవారూ; కుసుమమాలాధారులన్= పూలదండలు ధరించినవారూ; ధీరులన్=ధైర్యం గలవారూ; వనితాకాములన్= మగువలపాలిటికి మన్మథునివంటివారూ; జగత్+వంద్యక్రమ+ఉద్దాములన్= లోకాలు నమస్కరించదగ్గ విధానాలచేత అధికులూ అయిన; కృష్ణరాములన్= శ్రీకృష్ణుణ్ణి, బలరాముణ్ణి; కనెన్= చూచాడు.

**తా :** అక్రూరుడు కమలాలవంటి కన్నులు గలవారూ, ఒప్పిదమైన దేహాలు గలవారూ, ఆవుల పాలుపిండే వాడలలో మెలగే వారూ, అలంకరించబడినవారూ, మిక్కిలి ప్రకాశమానులూ, పచ్చనివి, నల్లనివి, ప్రకాశించేవి అయిన కొత్త బట్టలు కట్టినవారూ, పుష్పమాలికలు ధరించినవారూ, ధైర్యవంతులూ, మగువల పాలిటికి మన్మథులూ, భువనాలు నమస్కరించదగ్గ విధానాలచేత అధికులూ అయిన శ్రీకృష్ణబలరాముల్ని దర్శించాడు.

**క. కని వారల పాదములకు, వినయంబున మ్రొక్కె భక్తివివశుం డగుచుం**
**దనువునఁ బులకాంకురములు, మొనయఁగ నానందబాష్పములు జడి గురియన్. 1200**

ప్రతి : కని= చూచి; భక్తివివశుండు+అగుచున్= భక్తిచేత పరవశించిన వాడవుతూ; తనువునన్= శరీరమందు; పులక+ అంకురములు= గగుర్పాటు మొలకలు; మొనయన్+కన్= ఏర్పడగా; ఆనందబాష్పములు= హర్షంవల్ల కల్గిన కన్నీరు; జడిగురియన్= వానయై వర్షించగా; వారల పాదములకున్= ఆ బలరామకృష్ణుల అడుగులకు; వినయంబునన్= అణకువతో; మ్రొక్కెన్= నమస్కరించాడు.

తా : బలరామకృష్ణులను చూచి వారిపట్ల తనకుగల భక్తిచేత అక్రూరుడు పరవశించిపోయాడు. శరీరంలో గగుర్పాటు కలుగగా కనులనుండి ఆనందబాష్పాలు వానగా కురియగా వారిపాదాలకు నమస్కరించాడు.

**వ. తదనంతరంబ. 1201**

ప్రతి : తద్+అనంతరంబు+అ= అలా నమస్కరించిన పిమ్మట...

తా : అక్రూరుడు అలా నమస్కరించిన తరువాత

**క. అక్రూరులైన జనుల న, వక్రగతిం గాచు భక్తవత్సలుఁ డంత**
**న్నక్రూరుఁ గౌఁగిలించెను, జక్రాంకిత హస్తతలముఁ జాఁచి నరేంద్రా! 1202**

ప్రతి : నర+ఇంద్రా!= పరీక్షిన్మహారాజా!; అక్రూరులు+ఐనజనులన్= కఠినస్వభావం లేనట్టి నరులను; అవక్రగతిన్= కుటిలతలేని రీతితో; కాచు= రక్షించే; భక్తవత్సలుఁడు= భక్తులపై ప్రేమగల శ్రీకృష్ణుడు; అంతన్= అక్రూరుడు తమకు నమస్కరించిన పిదప; చక్ర+అంకిత హస్తతలమున్ చాఁచి= సుదర్శనమనే చక్రాయుధం గుర్తుతో గలిగిన తన కుడిచేతిని ముందుకు చాచి; అక్రూరున్= అక్రూరుణ్ణి; కౌఁగిలించెను= ఆలింగనం చేసుకున్నాడు.

తా : పరీక్షిన్మహారాజా! శ్రీకృష్ణుడు భక్తజనులపట్ల ప్రేమగలవాడు. క్రూరులుగాని మానవుల్ని మంచిస్వభావంతో రక్షించేవాడతడు. అక్రూరుడు తమకు నమస్కరించిన తరువాత సుదర్శన చక్రం ధరించే తన కుడిచేతిని ముందుకు సాచి అతణ్ణి కౌగిలించుకొన్నాడు.

**వ. మఱియు నక్రూరుండు బలభద్రునికిం బ్రణతుండైన నతండు గౌఁగిలించి చెట్ట వట్టుకొని కృష్ణసహితుండై గృహంబునకుం గొనిపోయి మే లడిగి గద్దియ యిడి పాదప్రక్షాళనంబు సేసి మధుపర్కంబు సమర్పించి, గోవు నిచ్చి, యాదరంబున రసవదన్నంబు పెట్టించి తాంబూల గంధమాల్యంబు లొసంగె నయ్యవసరంబున నందుం డుపవిష్టుండైన యక్రూరుని సత్కరించి యిట్లనియె. 1203**

ప్రతి : మఱియున్= ఇంకా; అక్రూరుండు= (వ్రేపల్లెకు వచ్చిన) అక్రూరుడు; బలభద్రునికిన్= బలరాముడికి; ప్రణతుండు+ఐనన్= నమస్కరించగా; అతండు= ఆ బలరాముడు; కౌఁగిలించి= ఆలింగన చేసుకొని; చెట్ట+పట్టుకొని= చేయిపట్టుకొని; కృష్ణసహితుండు+ఐ= శ్రీకృష్ణునితో కూడినవాడై; గృహంబునకున్= తన మందిరానికి; కొనిపోయి= తీసుకొని వెళ్ళి; మేలు+అడిగి= క్షేమం విచారించి; గద్దియ+ఇడి= ఆసనంపై కూర్చుండజేసి; పాదప్రక్షాళనంబుచేసి= కాళ్ళు కడిగి; మధుపర్కంబు సమర్పించి= పెరుగుతో కలిపిన తేనె నిచ్చి; గోవును+ఇచ్చి= ఆవు నొసగి; ఆదరంబునన్= గౌరవంతో; రసవద్+అన్నంబు= రుచికరమైన భోజనం; పెట్టించి= వడ్డింపజేసి; తాంబూల= తాంబూలం; గంధ= చందనం, మాల్యంబులు= పూలదండలు; ఒసంగెన్= ఇచ్చాడు; ఆ+అవసరంబునన్= ఆ సమయంలో; నందుండు= నందమహారాజు; ఉపవిష్టుండు+ఐన= ఆసనంలో కూర్చుని ఉన్న; అక్రూరునిన్= అక్రూరుణ్ణి; సత్కరించి= సన్మానించి; ఇట్లు+అనియెన్= ఈ రీతిగా మాట్లాడినాడు.

**తా :** అనంతరం అక్రూరుడు బలభద్రుడికి ప్రణమిల్లాడు. అతడు అక్రూరుణ్ణి కౌగిలించి, అతని చేయిపట్టుకొని, కృష్ణునితో గూడ తన గృహానికి తీసుకొని వెళ్ళాడు. కుశలప్రశ్న కావించాడు. గద్దెమీద కూర్చుండబెట్టి కాళ్ళు కడిగాడు. మధుపర్కం సమర్పించాడు. ఆవు నిచ్చాడు. సాదరంగా కమ్మనిభోజనం పెట్టించాడు. తాంబూలం, చందనం, పూలదండలు సమర్పించాడు. ఆ సమయంలో నంద మహారాజు ఆసీనుడై ఉన్న అక్రూరుణ్ణి ఆదరించి ఇలా అన్నాడు.

**క. చెలియలు మొఱయిడ నల్లుర, ఖలుఁడై పొరిగొనిన యట్టి కంసుఁడు బ్రదుకం**
**గలదే మనికి దశార్హుల, కిలపై? మీసేమ మింక నే మని యడుగన్? 1204**

**ప్రతి :** చెలియలు= తోబుట్టువైన దేవకీదేవి; మొఱ+ఇడన్= వేడుకోగా; అల్లురన్= చెల్లెలి కొడుకుల్ని; ఖలుఁడు+ఐ= మూర్ఖుడై; పొరిగొనిన+అట్టి= చంపిన; కంసుఁడు= కంసుడు; బ్రదుకన్= జీవించి ఉండగా; దశార్హులకున్= దశార్హవంశస్థులకు; ఇలపైన్= భూమిమీద; మనికి= బతుకు; కలదు+ఏ= ఉన్నదా?; మీ సేమము= మీయొక్క క్షేమం, కుశలం; ఇంకన్= మరి; ఏమి+అని= ఎట్లున్నదని; అడుగన్= ప్రశ్నించగలను?

**తా :** అక్రూరా! చెల్లెలు వేడుకొంటున్నా ఆమె కొడుకుల్ని చంపిన క్రూరుడైన కంసుడు బ్రతికి ఉండగా దశార్హవంశస్థులైన మీకు భూమిమీద మనుగడ లభిస్తుందా? ఇట్టి స్థితిలో మీ క్షేమాన్ని గూర్చి ఏమని విచారించేది?

**వ. అని పలికె నంత నక్రూరుం డొక పర్యంకంబున సుఖోపవిష్టుండై యుండ హరి యిట్లనియె. 1205**

**ప్రతి :** అని= అంటూ; పలికెన్= (నంద మహారాజు) వచించాడు; అంతన్= ఆ తరువాత, అటుపిమ్మట; అక్రూరుడు; ఒక పర్యంకంబునన్= ఒక మంచంమీద; సుఖ+ఉపవిష్టుండు+ఐ+ఉండన్= హాయిగా కూర్చొని ఉండగా; హరి= శ్రీకృష్ణుడు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తా :** నందమహారాజు ఆ విధంగా అన్నాడు. ఆ పిదప అక్రూరుడు ఒక మంచం మీద హాయిగా కూర్చొని ఉండగా శ్రీకృష్ణుడు అతనితో ఈ విధంగా అన్నాడు.

**మ. శుభమే నీకుఁ? బ్రమోదమే సఖులకుం? జుట్టాలకున్ సేమమే?**
**యభయంబే ప్రజకెల్ల? గోత్రజుల కాత్మానందమే? మామ ము**
**క్త భయుండే? వసుదేవదేవకులు తత్కారాగృహంబందు మ**
**త్ప్రభవవ్యాజనిబద్ధులై బ్రతికిరే ప్రాణానిలోపేతులై? 1206**

**ప్రతి :** నీకున్= అక్రూరా! నీకు; శుభము+ఏ= క్షేమమా?; సఖులకున్= మిత్రులకు; ప్రమోదము+ఏ= సంతోషమే గదా!; చుట్టాలకున్= బంధువులకు; సేమము+ఏ= క్షేమమా?; ప్రజకున్+ఎల్లన్= జనులందరికీ; అభయంబు+ఏ= భయము లేదుగదా!; గోత్రజులకున్= మన వంశంలో జన్మించినవారికి, దాయాదులకు; ఆత్మ+ఆనందము+ఏ= మనసులకు సంతోషమే గదా!; మామ= మా మేనమామ కంసుడు; ముక్తభయుండు+ఏ= భయంపోయినవాడే గదా!; వసుదేవ దేవకులు= మా తలిదండ్రులైన దేవకీ వసుదేవులు; తత్+కారాగృహంబు+అందున్= ఆ కంసుని చెరసాలలో; మత్= నాయొక్క; ప్రభవ వ్యాజ= పుట్టడం అనే మిషచేత; నిబద్ధులు+ఐ= బంధితులై; ప్రాణ+అనిల+ఉపేతులు+ఐ= ప్రాణవాయువుతో కూడినవారై; బ్రతికిరి+ఏ= జీవించి ఉన్నారా?

**తా :** అక్రూరా! నీకు కుశలమేగదా! మన స్నేహితులు సంతోషంగా ఉన్నారా? బంధువులు క్షేమంగా ఉన్నారా? మథురా నగరంలోని ప్రజలంతా భయంలేకుండ ఉన్నారు గదా! మన వంశంలో జన్మించినవా రందరూ మనస్సంతోషంతో ఉన్నారా? మా మేనమామ కంసుడు భయంలేకుండా ఉన్నాడా? నన్ను కన్నారనే సాకుతో చెరసాలలో బంధితులైన దేవకీవసుదేవులు ఊపిరితో జీవించియున్నారా?

**విశే :** ప్రాణం, అపానం, వ్యానం, ఉదానం, సమానం అనేవి పంచప్రాణవాయువులు.

**మ. నెఱి నేఁ డిక్కడ నీవు రాఁగ వగతో నీతోడ నేమైన నా**
**కెఱుఁగం జెప్పు మటంచుఁ జెప్పరు గదా యేమందు?రా వార్త యే**
**తెఱఁగున్ లేదని డస్సిరో వగచిరో దీనత్వముం జెందిరో**
**వెఱతో నాతలిదండ్రు లెట్లుపడిరో? విన్పింపు మక్రూరకా! 1207**

**ప్రతి :** అక్రూరకా= ఓ అక్రూరా!; నెఱిన్= ఒప్పిదంగా; నేఁడు= ఈ రోజు; ఇక్కడ= ఇచటికి; నీవు రాఁగన్= నీవురాగా; వగతోన్= చింతతో; నీ తోడన్= నీతో; ఏమి+ఐనన్= ఏ విషయమైనా; నాకున్= నాకు; ఎఱుఁగన్= తెలియునట్లు; చెప్పుము= వచించు; అటంచున్= అని; చెప్పరు+కదా!= వచించరుగదా!; ఆ వార్త= చెరలో బంధించిన విషయమై; ఏమి+అందురు= ఏమంటున్నారు? నా తలిదండ్రులు= నా జననీజనకులు; వెఱతోన్= కంసుడి భయంతో; ఏ తెఱఁగున్= ఏ దారీ; లేదు+అని= గోచరించదని; డస్సిరి+ఓ= బడలిపోయారో; వగచిరి+ఓ= శోకించారో; దీనత్వమున్= దైన్యం; చెందిరి+ఓ= పొందినారో; ఎట్లుపడిరో= ఎన్ని కష్టాల పాలయ్యారో; విన్పింపుము= చెప్పుము.

**తా :** అక్రూరా! నా తలిదండ్రులైన దేవకీ వసుదేవులు ఈ రోజు నీ విక్కడికి వస్తున్నప్పుడు నాకు చెప్పుమని నీతో ఏమైనా చెప్పారా? ఆ వార్తయేమి? కంసుడివల్ల భయపడి తమ కేదారీ లేదని వారెంత కృశించి పోయారో! ఎంత దుఃఖించారో! ఎట్టి దీనావస్థకు లోనయ్యారో! ఎన్నికష్టాల పాలైనారో? నాకు వినిపించు.

**వ. మఱియు నీ వేమి కారణంబున వచ్చి? తని హరి యడిగిన నతండు కంసునికి నారదుండు వచ్చి చెప్పిన వైరానుబంధప్రకారంబును గంసుండు దేవకీవసుదేవుల వధియింపం గమకించి మానిన తెఱంగును, ధనుర్యాగంబు పేరు సెప్పి పుత్తెంచినప్రకారంబును నెఱింగించిన రామకృష్ణులు నగి రంత తమ్ముం బరివేష్టించిన నందాదిగోపకులం జూచి కృష్ణుం డిట్లనియె. 1208**

**ప్రతి :** మఱియున్= ఇంకా; నీవు; ఏమి కారణంబునన్= ఏ పనిమీద; వచ్చితి(వి)+అని= వచ్చావని; హరి= శ్రీకృష్ణుడు; అడిగినన్= ప్రశ్నించగా; అతండు= అక్రూరుడు; కంసునికిన్= కంసుడికి; నారదుండు= దేవర్షియైననారదుడు; వచ్చి= అరుదెంచి; చెప్పిన= తెలిపిన; వైర+అనుబంధ ప్రకారంబును= విరోధాన్ని అనుసరించిన మాటల తీరును; కంసుండు= కంసుడు; దేవకీ వసుదేవులన్= దేవకీ వసుదేవుల్ని; వధియింపన్= చంపుటకు; గమకించి= యత్నించి; మానిన తెఱంగును= విరమించిన విధమునూ; ధనుస్+యాగంబు పేరు+చెప్పి= ధనుర్యాగమనే పేరు చెప్పి; పుత్తెంచిన ప్రకారంబును= తన్ను పంపిన విధం; ఎఱింగించినన్= తెలుపగా; రామకృష్ణులు= బలరాముడు, శ్రీకృష్ణుడు; నగిరి= నవ్వారు; అంతన్= ఆ తరువాత; తమ్మున్= తమను; పరివేష్టించిన= చుట్టిఉండే; నంద+ఆదిగోపకులన్= నందుడు మొదలైన గొల్లల్ని; చూచి= కనుగొని; కృష్ణుండు= మాధవుడు; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** అక్రూరా! నీవు ఏమి కారణంగా ఇక్కడికి వచ్చావో చెప్పుమని శ్రీకృష్ణుడు అడిగాడు. అప్పుడు అక్రూరుడు కంసుడి దగ్గరకు నారదుడు వచ్చి విరోధం పెరిగే మాటలు చెప్పి వెళ్ళడం, కంసుడు దేవకీ వసుదేవులను చంపడానికి పూనుకొని, మానుకోవడం, ధనుర్యాగమనే నెపంతో కంసుడు తన్ను పంపించినవిధం బలరామశ్రీకృష్ణులకు తెలిపాడు. ఆ మాటలకు రామకృష్ణులు నవ్వారు. తమ చుట్టూ చేరిన నందుడు మొదలైన గొల్లపెద్దలను చూచి శ్రీకృష్ణుడు ఇలా అన్నాడు.

**శా. భూనాథుండు మఖంబుఁ జూడఁ బిలువం బుత్తెంచినాఁ; డవ్విభుం**
**గానం బోవలెఁ; బాలు నెయ్యి పెరుఁగుల్ గట్నంబులుం గానుకల్**
**మీ నేర్పొప్పఁగఁ గూడఁబెట్టుఁడు తగన్ మీ మీ నివాసంబులన్;**
**యానంబుల్ గొని రండు పొండు మథురాయాత్రాభిముఖ్యంబుగన్. 1209**

**ప్రతి :** భూనాథుండు= కంసమహారాజు; మఖంబున్= తన ధనుర్యాగాన్ని; చూడన్= మనంచూడాలని; పిలువన్= ఆహ్వానించడానికి; పుత్తెంచినాఁడు= అక్రూరుణ్ణి పంపించాడు; ఆ+విభున్= ప్రభువైన కంసుణ్ణి; కానన్+పోవలెన్= చూడటానికి వెళ్ళాలి; మీ మీ నివాసంబులన్= మీ మీ గృహాలలోని; పాలు నెయ్యి పెరుఁగుల్= పాలు, నెయ్యి, పెరుగు అనేవాటిల్ని; కట్నంబులున్= కట్నాలూ; కానుకల్= బహుమతులూ; మీ నేర్పు= మీ సామర్థ్యం; ఒప్పన్+కన్= ప్రకాశించేటట్లు; తగన్= తగినట్లు; కూడన్+పెట్టుఁడు= సమకూర్చండి; మథురాయాత్రా+అభిముఖ్యంబు+కన్= మథురా పట్టణం వైపు బయలుదేరటానికి; యానంబుల్= వాహనాల్ని (బండ్లు మొదలైనవాటిని); కొనిరండు= తీసుకొనిరండి; పొండు= వెళ్ళండి.

**తా :** గోపకులారా! ప్రభువైన కంసుడు ధనుర్యాగం చూడటానికి మనల్ని పిలుచుక రమ్మని అక్రూరుణ్ణి పంపించాడు. కనుక మనం యాగం దర్శించడానికి వెళ్ళాలి. మీ శక్తి కొలదీ మీ మీ ఇండ్లలో పాలు పెరుగు, నెయ్యి, నూతనవస్త్రాలు మొదలైన కట్నాలూ, కానుకలు సమకూర్చుకొనండి. మథురానగరానికి యాత్రగా మనం వెళ్ళాలి. వాహనాలను తీసుకొనిరండి, వెళ్లండి.

**వ. అని నియమించె; నంత నక్రూరుండు మథురకు హరిం గొనిపోయెడి నని యెఱింగి వ్రేతలు గలంగి. 1210**

**ప్రతి :** అని నియమించెన్= అని ఆజ్ఞాపించాడు; అంతన్= ఆ తరువాత; అక్రూరుండు= అక్రూరుడు; హరిన్= శ్రీకృష్ణుణ్ణి; కొనిపోయెడిన్= తీసుక వెళతాడు; అని= అంటూ; ఎఱింగి= తెలిసి; వ్రేతలు= గోపకాంతలు; కలంగి= కలతనొంది...

**తా :** అని శ్రీకృష్ణుడు గొల్లలను ఆజ్ఞాపించాడు. అక్రూరుడు శ్రీకృష్ణుని మధురకు తోడ్కొని పోతాడని గ్రహించి గోపికలు కలత చెంది

**మ. హరినవ్వుల్ హరిమాటలున్ హరిమనోజ్ఞాలాపముల్ లీలలున్**
**హరివేడ్కల్ హరిమన్ననల్ హరికరాబ్జాలంబనాహ్వానముల్**
**హరిణీలోచన లందఱున్ మఱి యుపాయం బెట్లొకో యంచు లో**
**నెరియన్ ముచ్చటలాడి రంత గములై యేకాంతగేహంబులన్. 1211**

**ప్రతి :** అంతన్= ఆ పిమ్మట; హరిణీలోచనలు= ఆడులేడి కనులవంటి కనులు గల గోపికలు; అందఱున్= అందరూ; ఏకాంత గేహంబులన్= ఇండ్ల రహస్య స్థలాలలో; గములు+ఐ= గుంపులు గూడి; హరి= నారాయణుని; నవ్వుల్= నవ్వులు;

హరిమాటలున్= మాధవుని పలుకులు; హరి= గోవిందుని; మనోజ్ఞ+ఆలాపముల్= మదికింపైన సల్లాపాలు; లీలలున్= విలాసాలు; హరివేడ్కల్= ముకుందుని వినోదాలు; హరిమన్ననల్= అచ్యుతుని ఆదరణలు; హరికర+అబ్జ+ఆలంబన+ ఆహ్వానముల్= పద్మాలవంటి చేతులతోహరి చేసే సైగలవల్ల; లోన్+ఎరియన్= హృదయాలలో తాపం కలుగగా; మఱి= ఇంక; ఉపాయంబు= కృష్ణుణ్ణి తమచెంత నిల్పుకొనే ఉపాయం; ఎట్లు+ఒకో= ఎట్లాగో; అంచున్= అని; ముచ్చటలు+ఆడిరి= గుసగుసలు పోయారు.

**తా :** లేడి చూపులవంటి చూపులుగల గొల్ల భామలందరూ తమ ఏకాంతగృహాలలో గుంపులుగా చేరి, శ్రీకృష్ణుని చిరునవ్వులూ; పలుకులూ; సరససల్లాపాలూ, విలాసచేష్టలూ, వినోదాలూ, ఆదరణలూ, పద్మాలవంటి హస్తాల ఆలంబనాలూ, పిలుపులూ తమ మనసుల్లో మెదిలి వేదన గల్గించగా ఇక మీద ఇవన్నీ అనుభవించడానికి ఆయనను తమవద్ద నిలుపుకొనే ఉపాయ మేమిటా? అని మంతనాలు సలిపారు.

**వ. మఱియుఁ దమలో నిట్లనిరి. 1212**

**ప్రతి :** మఱియున్= ఇంకా; తమలోన్= తమలో; ఇట్లు+అనిరి= ఇలా అన్నారు.

**తా :** ఇంకా తమలో తాము ఇలా అనుకొన్నారు.

**ఉ. మేటిగృహస్థు బ్రహ్మ యని మిక్కిలి నమ్మితి మమ్మ! చూడ నే**
**పాటియు లేదు మాకుఁ బరిపాలకుఁడైన సరోజనేత్రు ని**
**చ్చోట వసింపనీక యొకచోటికిఁ బో విధియించి పిన్న బి**
**డ్డాటలు చేసె నీదుడుకు లక్కట! భారతికైనఁ జెప్పరే! 1213**

**ప్రతి :** అమ్మ= ఓ అమ్మలారా!; మేటి గృహస్థు= గొప్ప గృహస్థుడు; బ్రహ్మ+అని= బ్రహ్మదేవుడని; మిక్కిలి నమ్మితిమి= ఎక్కువగా విశ్వసించాము; చూడన్= విచారించగా; ఏ పాటియున్ లేదు= సంసారిలక్షణం ఏ మాత్రం లేదు; మాకున్= మాకందరికీ; పరిపాలకుఁడు+ఐన= ప్రభువైన; సరోజనేత్రున్= తామర రేకులవంటి కన్నులుగల గోపాలుణ్ణి; ఈ+చోటన్= ఇక్కడ, వ్రేపల్లెలో; వసింపన్+ఈక= ఉండనియ్యక; ఒక చోటికిన్= వేరొక తావుకు; పోన్= వెళ్ళడానికి; విధియించి= నిర్ణయించి; పిన్నబిడ్డ+ఆటలు+చేసెన్= చిన్న పిల్లవాడి చేష్టలు చేశాడు; అక్కట= అయ్యో!; ఈ దుడుకులు= ఈ దుండగాలు; భారతికిన్+ఐనన్= సరస్వతీదేవి కైనా; చెప్పరు+ఏ= చెప్పండమ్మా!

**తా :** బ్రహ్మదేవుడు పెద్ద సంసారి అని చాల విశ్వసించాం. ఆలోచించగా ఆయనలో ఉత్తమగృహస్థలక్షణం ఏ మాత్రం లేదు. మన ప్రభువైన కృష్ణుణ్ణి మనతో ఇక్కడ ఉండనీయక వేరొక చోటికి వెళ్లేందుకు నిర్ణయించి చిన్న పిల్లవాడివలె ఆటలాడుతున్నాడు. అయ్యో! ఆతని ఈ దుండగపు చేష్టలుగురించి ఆయన ఇల్లాలు సరస్వతికైనా చెప్పండి.

**వ. అని విధి దూఱుచు మదనతాపాయత్తచిత్తలై. 1214**

**ప్రతి :** అని= అంటూ; విధిన్= బ్రహ్మను; దూఱుచున్= నిందిస్తూ; మదనతాప+ఆయత్త చిత్తలు+ఐ= మన్మథ తాపానికి గురి అయిన మనసులు గలవారై...

**తా :** అని గొల్లపడతులు బ్రహ్మను నిందిస్తూ మన్మథ తాపానికి లోబడ్డ హృదయాలు గలవారై

ఉ. రమ్మని చీరినంతనె పురంబున కేగెడుఁ గాని నన్ను నీ
కొమ్మలు నమ్మినారు మరుకోలల కగ్గము సేసి పోవఁగా
ముమ్మరమైన తాపముల మ్రొగ్గుదురో యనఁ డంబుజాక్షుఁ డా
యమ్మలు గోపవృద్ధులుఁ బ్రయాణము వల్దన రైరి చెల్లరే! 1215

**ప్రతి :** అంబుజ+అక్షుఁడు= తామరరేకులవంటి కన్నులుగల శ్రీకృష్ణుడు; రమ్ము+అని= నా వెంట రమ్ము అని; చీరిన+అంతన్+ఎ= అక్రూరుడు పిలువగానే; పురంబునకున్= మథురానగరికి; ఏగెడున్+కాని= వెళతాడే తప్ప; నన్నున్= (కృష్ణుడనైన) నన్ను; ఈ కొమ్మలు= ఈ స్త్రీలు; నమ్మినారు= విశ్వసించారు (అలాంటి వీరిని); మరుకోలలకున్= మన్మథునిబాణాలకు; అగ్గము+చేసి= గురిచేసి; పోవన్+కాన్= వెళ్ళినట్లయితే; ముమ్మరము+ఐన= ఎక్కువైన; తాపములన్= వేదనలచేత; మ్రొగ్గుదురు+ఓ= కూలుతారేమో; అనఁడు= అని తలంచడు; ఆ+అమ్మలున్= బిడ్డలుగన్న మన ముత్తైదువలూ; గోపవృద్ధులున్= గొల్లముదుసళ్లున్నూ; ప్రయాణము= మథురకు పయనం; వల్దనరు+ఐరి= వద్దని చెప్పినవారు కారు; చెల్లరే= అక్కటా!...

**తా :** అక్రూరుడు మధురకు రమ్మని పిలువగానే శ్రీకృష్ణుడు వెళ్ళడానికి సంసిద్ధుడయ్యాడేగాని, అయ్యో! ఈ గోపయువతులు నన్నే నమ్ముకొని ఉన్నారు. వీళ్లను మన్మథబాణాల పాలుచేసి నేను వెళితే అధికమైన మదనతాపంతో కుమిలి కృశించి పోతారేమో అని ఏ మాత్రం అనుకోవడం లేదు. ఇకపోతే మన అమ్మలక్కలుగాని, మన గొల్లపెద్దలుగాని మథురకు పయనం మానుకొమ్మని అచ్యుతునితో మాట వరుసకైనా అనడంలేదే! అయ్యో! ఇక మన గతిఏమి?

**విశే :** చెల్ల, చెల్లరే, అయ్యో, అక్కటా– అనేవి సంతాపార్థకాలైన అవ్యయాలు

శా. అక్రూరుం డని పేరువెట్టుకొని నేఁ డస్మన్మనోవల్లభుం
జక్రిన్ మాకడఁ బాపికొంచు నరుగం జర్చించి యేతెంచి నాఁ
డక్రూరుం డఁట క్రూరుఁ డీతఁడు నిజం బక్రూరుఁ డౌనేని ని
ర్వక్రత్వంబునఁ గృష్ణుఁ బెట్టి తన త్రోవం బో విచారింపఁడే? 1216

**ప్రతి :** అక్రూరుండు+అని= క్రూరుడు కాని వాడని; పేరు+పెట్టుకొని= పేరుంచుకొని; నేఁడు= ఈ రోజు; అస్మద్+మనోవల్లభున్= మా మనస్సులకు ప్రియుడైన; చక్రిన్= శ్రీకృష్ణుణ్ణి; మాకడన్= మా దగ్గరనుండి; పాపి= తొలగించి; కొంచున్= తన వెంట తీసుకొని; అరుగన్= వెళ్ళడానికి; చర్చించి= బాగా యోచించి; ఏతెంచినాఁడు= వచ్చాడు; ఈతఁడు= ఈయన; అక్రూరుండు+ అఁట= క్రూరుడు కానివాడట!; క్రూరుఁడు= కఠినుడు; నిజంబు= (ఈ మాట) వాస్తవం; అక్రూరుఁడు+ఔను+ఏనిన్= కఠిన హృదయుడు కాకపోతే; నిర్+వక్రత్వంబునన్= ఋజు స్వభావంతో; కృష్ణున్= మాకు ప్రాణప్రియుడైన కృష్ణుణ్ణి; పెట్టి= వ్రేపల్లెలోనే ఉంచి; తన త్రోవన్= తాను వచ్చిన దారిలో; పోన్= వెళ్ళడానికి; విచారింపఁడు+ఏ= ఆలోచించకుండా ఉంటాడా?

**తా :** అక్రూరుడని పేరుపెట్టుకొని వచ్చి ఈ క్రూరాత్ముడు ఈ రోజు మా హృదయేశ్వరుడూ చక్రాయుధుడూ అయిన కృష్ణుణ్ణి మాచెంత ఉండనీయక తనవెంట మథురానగరికి తోడ్కొని వెళ్ళడానికి చక్కగా యోచించి విచ్చేశాడు. ఇతడు క్రూరాత్ముడు. అక్రూరుడే అయితే కుటిల బుద్ధులు మానుకొని శ్రీకృష్ణుణ్ణి ఇక్కడే దిగవిడిచి తనదారిని తాను వెళ్ళాలని అనుకోడా?

**ఉ. ఫుల్లసరోజలోచనలు పూర్ణసుధాంశుముఖుల్ పురాంగనల్**
**మెల్లనె యెల్లి పట్టణము మేడలనుండి సువర్ణలాజముల్**
**సల్లఁగ వారిఁ జూచి హరి సంగతి సేయఁ దలంచుఁ గాక వ్రే**
**పల్లె వసించుముద్దియలపైఁ బడ నేల తలంచు నక్కటా! 1217**

**ప్రతి :** అక్కటా!= అయ్యో!; ఫుల్లసరోజలోచనలు= వికసించిన తామరలవంటి కన్నులుగలవారూ; పూర్ణసుధా+అంశుముఖుల్= నిండైన అమృతకిరణుని (చంద్రుని) వంటి ముఖాలు గలవారును అగు; పుర+అంగనల్= మధురాపట్టణంలోని స్త్రీలు; ఎల్లి= రేపు; మెల్లనె= తిన్నగా; పట్టణము మేడలనుండి= పురంలోని మిద్దెల నుంచి; సువర్ణలాజముల్= బంగారుతో కూడిన లాజలు; చల్లన్+కన్= తనమీద చల్లగా; వారిన్= ఆ మధురానగరిలోని కాంతలను; చూచి= కనుగొని; హరి= శ్రీకృష్ణుడు; సంగతి+చేయన్= వారిని కలియడానికి; తలంచున్+కాక= యోచిస్తాడే తప్ప; వ్రేపల్లెన్= గొల్లపల్లెలో; వసించు= కాపురముండే; ముద్దియలపైన్= ముద్దుగుమ్మలమీద; పడన్= వ్రాలుటకు; ఏల= ఎందుకు; తలంచున్= భావిస్తాడు? భావించడని భావం.

**తా :** అయ్యో! క్రూరుడైన ఈ అక్రూర నామధేయుడు శ్రీకృష్ణుణ్ణి మధురానగరికి తోడ్కొని వెళ్ళగానే విప్పారిన తామర రేకులవంటి ముఖాలు గలవారూ, పూర్ణచంద్రబింబాలవంటి ముఖాలు గలవారూ అయిన ఆ మధురానగరిలోని స్త్రీలు రేపు మేడలమీదినుంచి తనమీద పసిడి పేలాలు మెల్లగా చల్లగా వారిని కనులార చూచి, వారితో సాంగత్యం సల్పడానికి యత్నిస్తాడే గాని, వ్రేపల్లెవాడలోని గొల్లపడతులమైన మనమీద పడటానికి అతడు ఉత్సాహపడడుగదా!

**క. పురసతుల విలోకనములు, సరసాలాపములు నర్మసంభోగములున్**
**మరగి హరి మనల నొల్లఁడు, నరవరు లోయమ్మ! నూతనప్రియులు గదే. 1218**

**ప్రతి :** ఓ+అమ్మ!= ఓ అమ్మలారా!; హరి= శ్రీకృష్ణుడు; పురసతుల= మధురా పట్టణ స్త్రీల; విలోకనములు= క్రీగంటి చూపులు, విలాస దృక్కులు; సరస+ఆలాపములు= రసవంతాలైన సల్లాపాలు; నర్మసంభోగములున్= వినోదంతో కూడిన కలయికలు; మరగి= అలవరచుకొని; మనలన్= గొల్ల స్త్రీలమైన మనల్ని; ఒల్లఁడు= ఇష్టపడడు; నరవరులు= రాజులు; నూతన ప్రియులు+కద+ఏ= కొత్తవాటియందు ప్రేమ గలవారు గదా!

**తా :** పట్టణంలోని నీటుకత్తెల చూపులు, సరససంభాషణాలు, తెరచాటు కలయికలు మరగి, మాధవుడు మనల్ని ఇచ్చగించడు. ఓ యమ్మా! రాజులు కొత్తలను కోరుతుంటారు గదా!

**క. పుట్టిన్నఁడు హరి నెఱుఁగని, పట్టణసుందరుల కితనిఁ బతిఁ జేసి కడున్**
**దట్టపువిరహాగ్నులకును, గట్టిఁడి దైవంబు ఘోషకాంతల వెదకెన్. 1219**

**ప్రతి :** కట్టిఁడి దైవంబు= కఠినుడైన దేవుడు; పుట్టి= జన్మించి; ఎన్నఁడున్= ఎప్పుడూ; హరిన్= పాపాలు హరించే శ్రీకృష్ణుణ్ణి; ఎఱుఁగని= తెలియని; పట్టణసుందరులకున్= మధురా పురిలోని భామలకు; ఇతనిన్= ఈ పరమపురుషుణ్ణి; పతిన్+చేసి= భర్తను కావించి; కడున్= మిక్కిలి; దట్టము= గాఢమైన; విరహ+అగ్నులకును= వియోగమనే నిప్పుల కాకను అనుభవించడానికి; ఘోషకాంతలన్= గొల్లపల్లెలోని మగువలను; వెదకెన్= అన్వేషించాడు.

**తా :** కఠినాత్ముడైన ఆ దేవుడు పుట్టినప్పటినుండి శ్రీహరి ఎలాంటివాడో తెలియని మధురాపురిలో నివసించే యువతులకు ఈయన్ను పతిగా చేసి, అధికమైన విరహాగ్నితాపం అనుభవించడానికి గొల్లపల్లెలోని మగువలమైన మనల్ని వెదకి తెచ్చాడు.

**మ. 'హరి నేలా కొనిపోయె' దంచు మన మా యక్రూరుఁ బ్రార్థింతమా?**
**'హరిఁ బోనీకుఁడు నిల్పరే' యనుచు నేఁ డర్చింతమా' వేల్పులన్?**
**హరిపాదంబుల కడ్డముల్ పడుదమా; 'హా దైవమా'! యంచు నా**
**తరుణుల్ కొప్పులుఁ జీరలున్ మఱచి కందర్పజ్వరభ్రాంతలై. 1220**

**ప్రతి :** హరిన్= శ్రీకృష్ణుణ్ణి; ఏలా కొనిపోయెదు(వు)+అంచున్= ఎందుకు తీసుక వెళుతున్నావని; మనము= మన మందరమూ; ఆ+అక్రూరున్= కృష్ణుణ్ణి పిలుచుకొనిపోవడానికి వచ్చిన ఆ అక్రూరుణ్ణి; ప్రార్థింతము+ఆ= వేడుకొందామా? హరిన్= నందనందనుణ్ణి; పోనీకుఁడు= వెళ్ళకుండా చెయ్యండి; నిల్పరు+ఏ= ఈ వ్రేపల్లెలోనే ఉండేటట్లు ఆపండి; అనుచున్= అని; నేఁడు= ఈ రోజు; వేల్పులన్= దేవతల్ని; అర్చింతము+ఆ= పూజిస్తామా? హరిపాదంబులకున్= గోవిందుడి అడుగులకు; అడ్డముల్ పడుదము+ఆ= కదలనీకుండా అడ్డుపడదామా? హా దైవమా+అంచున్= అయ్యో దేవుడా అంటూ; ఆ తరుణుల్= ఆ గోపకాంతలు; కొప్పులున్= జడముడులు వీడడం; చీరలున్= కట్టుకొన్న కోకలు జారడం; మఱచి= మరచిపోయి; కందర్ప జ్వరభ్రాంతలు+ఐ= మన్మథతాపం చేత భ్రాంతి చెందినవారై...

**తా :** మా మాధవుణ్ణి ఎందుకు మథురకు తీసుక వెళుతున్నావు? అలా తీసుక వెళ్ళవద్దు అని మన మందరం కలిసి ఆ అక్రూరుణ్ణి వేడుకొందామా? యదువల్లభుణ్ణి మధురకు వెళ్ళనివ్వకండి, వ్రేపల్లెలోనే నిల్పండి అని దేవతలను పూజిద్దామా? మథురకు వెళ్ళవద్దని గోవిందుని కాళ్ళకు అడ్డం పడదామా? ఓ దైవమా! మాకీ దుఃస్థితి ఎందుకు కల్పించావని ఆ గోపకాంతలు మన్మథతాపచేత భ్రాంతిచెంది, కొప్పులు వీడడం, కట్టిన చీరలు జారడంకూడా మరచిపోయారు.

**మ. ఉవిదల్ సిగ్గులు మాని కన్గవల నీ రొండొండ వర్షింపఁగా**
**వివశత్వంబులతోఁ గపోలతటసంవిన్యస్తహస్తాబ్జలై**
**పవనోద్ధూతలతాభలై 'మముఁ గృపం బాలింపు గోవింద! మా**
**ధవ! దామోదర' యంచు నేడ్చిరి సుజాతంబైన గీతంబులన్. 1221**

**ప్రతి :** ఉవిదల్= గోపకాంతలు; సిగ్గులుమాని= లజ్జలు వదలి; కన్+కవలన్= కన్నులజంటనుండి; నీరు= అశ్రువులు, దుఃఖబాష్పాలు; ఒండు+ఒండన్= ధారాపాతంగా; వర్షింపన్+కన్= కురవగా; వివశత్వంబులతోన్= మైమరపులతో; కపోలతట= చెక్కిటి ప్రదేశాలపై; సంవిన్యస్త= చక్కగా ఉంచబడిన; హస్త+అబ్జలు+ఐ= పద్మాలవంటి చేతులు గలవారై; పవన+ఉద్ధూత= వాయువుచేత ఎగురగొట్టబడిన; లతా+ఆభలు+ఐ= తీగలను పోలినవారై; గోవింద= గోవులను పాలించువాడా!; మాధవ= లక్ష్మీవల్లభా!; దామ+ఉదర= తులసీమాల దాల్చినవాడా!; మమ్మున్= గొల్లపడతులమైన మమ్మల్ని; కృపన్= దయతో; పాలింపు (ము)= ఏలుకో!; అంచున్= అంటూ; సుజాతంబు+ఐన= చక్కగా ఉదయించిన; గీతంబులన్= పాటలచేత; ఏడ్చిరి= విలపించారు.

**తా :** గోపకాంతలు లజ్జలు వదలి, కనులజంట నుండి ఎడతెగకుండా దుఃఖబాష్పాలు కారుతుండగా, శరీరాలు మరచి, చెక్కిళ్ళయందు కమలాలవలె కోమలాలైన చేతులుచేర్చి, గాలిచేత మిక్కిలి చలింపజేయబడిన తీగలకు పోల్చదగినవారై, గోవిందా! మాధవా! దామోదరా! అని పిలుస్తూ మమ్మల్ని దయతో రక్షించుమని స్వరబద్ధంగా, లయబద్ధంగా కీర్తనలతో విలపించారు.

**వ. అంత మఱునాఁడు సూర్యోదయకాలంబునం దన తోడఁ బయనంబునకు గమకించి నడచు గోపికలను 'మఱలి వత్తు' నని దూతికాముఖంబున నివర్తించి, కృష్ణుండు శకటంబులందుఁ గానికలు గోరసంబులు నిడుకొని నందాదు లయిన గోపకులు వెను తగుల నక్రూరచోదితం బయిన రథం బెక్కి మధురాభిముఖుండై చను సమయంబున. 1222**

**ప్రతి :** అంతన్= తరువాత; మఱునాఁడు= మరుసటిరోజు; సూర్య+ఉదయకాలంబునన్= ప్రాతఃకాలంలో; తనతోడన్= తనవెంట; పయనంబునకున్= ప్రయాణించుటకు; గమకించి= పూనుకొని; నడచు= నడచివచ్చే; గోపికలను= గొల్లభామలను; దూతికాముఖంబునన్= దూతికలద్వారా; మఱలి వత్తున్= మధురనుండి తిరిగి వస్తానని; నివర్తించి= వెనుకకు మళ్లించి; కృష్ణుండు= శ్రీకృష్ణుడు; శకటంబుల+అందున్= బండ్లలో; కానికలు= బహుమతులు; గోరసంబులున్= పాలు, పెరుగు, వెన్న, నేయి; ఇడుకొని= ఉంచుకొని; నంద+ఆదులు+అయిన= నందమహారాజు మొదలుగాగల; గోపకులు= గొల్లలు; వెనుతగులన్= వెంబడించగా; అక్రూరచోదితంబు+అయిన= అక్రూరుడిచే నడపబడునట్టి; రథంబు+ఎక్కి= తేరెక్కి; మధురా+అభిముఖుండు+ఐ= మధురాపురంవైపు తిరిగినవాడై; చనుసమయంబునన్= వెళ్ళే వేళలో...

**తా :** ఆ మరుసటిరోజు సూర్యోదయవేళలో తనతో ప్రయాణానికి పూనుకొని నడచివచ్చే గోపికల్ని నేను మధుర నుంచి తిరిగి వస్తా నని దూతికలద్వారా చెప్పించి, వారిపయనాన్ని శ్రీకృష్ణుడు మాన్పించాడు. బండ్లలో కానుకలు, పాలు, పెరుగు, వెన్న, నెయ్యి మొదలైన పదార్థాలను ఉంచుకొని, నందుడు మొదలైన గొల్లపెద్దలు వెంబడించగా అక్రూరుడు తోలే రథమెక్కి మధురానగరంవైపు వెళ్ళే సమయంలో

**చ. 'అదె చనుచున్నవాఁడు ప్రియుఁ డల్లదె తే రదె వైజయంతి, య**
**ల్లదె రథఘోటకాంఘ్రిరజ మాదెస మార్గము చూడుఁ డంచు లో**
**నొదవెడి మక్కువన్ హరిరథోన్ముఖులై గములై వ్రజాంగనల్**
**గదలక నిల్చిచూచి రటు గన్నుల కబ్బిన యంత దూరమున్. 1223**

**ప్రతి :** వ్రజ+అంగనల్= గోపకాంతలు; ప్రియుఁడు= మనోవల్లభుడైన శ్రీకృష్ణుడు; అది+ఎ= అదిగో; చనుచున్+ఉన్నవాఁడు= వెళుతున్నాడు; తేరు= రథం; అల్లదె= అదిగో; వైజయంతి= రథంమీది టెక్కెం; అది+ఎ= అదిగో కనిపిస్తున్నది; ఆ దెసన్= ఆ దిక్కులో; మార్గము= రథం వెళ్ళే దారి; చూడుఁడు= చూడండి; రథఘోటక+అంఘ్రిరజము= రథానికి పూన్చిన గుర్రాల కాలి డెక్కలవల్ల రేగిన దుమ్ము; అంచున్= అని పల్కుతూ; లోన్= తమ మనసుల్లో; ఒదవెడి మక్కువన్= కలిగే ప్రేమచేత; హరిరథ+ఉత్+ముఖులు+ఐ= శ్రీకృష్ణుడు వెళ్ళే రథంవైపు నిక్కిచూచే ముఖాలుగలవారై; గములు+ఐ= గుంపులుగా చేరి; కన్నులకున్= తమ నేత్రాలకు; అబ్బిన+అంత= లభించినంత; దూరమున్= దవ్వును; అటు= ఆ రథం వెళ్ళిన వైపు; కదలక నిల్చి చూచిరి= కదలకుండా నిలిచి దర్శించారు.

**తా :** శ్రీకృష్ణుడు మధురకు రథమెక్కి వెళుతుండగా గోపవనితలు గుంపులుగూడి అక్కడనే కదలక నిలిచి 'అదుగో! మన ప్రాణనాయకుడు మధురకు వెళుతున్నాడు. ఆయన ఎక్కిన రథం అదే. జెండా మాత్రం కనిపిస్తున్నది. ఆ వైపు ఆ రథానికి గట్టిన గుర్రాల కాలిగిట్టలవల్ల రేగిన ధూళి చూడండి' - అంటూ తమ హృదయాలలో నెలకొన్న ప్రణయంవల్ల శౌరి వెళ్ళిన రథంవైపే దృష్టి మరల్చి తమ కనులకు అందినంతవరకు ఆ దృశ్యాలనే ఉన్నచోటనే కదలకుండా నిలబడి, వారు చూశారు.

**వ. ఇట్లు బలభద్రాక్రూరసహితుండై చని. 1224**

**ప్రతి :** ఇట్లు= ఈ రీతిగా; బలభద్ర= బలరాముడితో; అక్రూరసహితుండు+ఐ= అక్రూరుడితో కూడినవాడై; చని= వెళ్ళి…

**తా :** ఈ విధంగా రథమెక్కి శ్రీకృష్ణుడు తన అన్న బలరాముడితో, బంధువైన అక్రూరుడితో వెళ్ళి

**క. అవలోకించెను గృష్ణుఁడు, ప్రవిమలకల్లోలపవనభాసితజన్య**
**న్నవసన్నపాపసైన్యన్, గవిజనమాన్యన్ గళిందకన్యన్ ధన్యన్. 1225**

**ప్రతి :** కృష్ణుఁడు= శ్రీకృష్ణుడు; ప్రవిమల= మిక్కిలి స్వచ్ఛములైన; కల్లోల= పెద్ద పెద్ద అలల మీదినుంచి వీచే; పవన= వాయువుచేత; భాసిత= ప్రకాశిస్తున్న; జన్యన్= జన్మ కలదానిని; అవసన్న= నశించిన; పాపసైన్యన్= పాపమనే దండుగలదానిని; కవిజనమాన్యన్= కవి పండితులచే (జలపక్షులచే) గౌరవింపదగినదానిని; ధన్యన్= కృతార్థురాలైన; కళిందకన్యన్= కళింద పర్వతం కూతురైన యమునానదిని; అవలోకించెను= చూశాడు.

**తా :** శ్రీకృష్ణుడు ఎంతో నిర్మలములైన అలలమీదినుంచి వెడలే చల్లని వాయువుతో కూడింది, సకలపాపాలను నశింపజేసేదీ, కవులూ, పండితులచే గౌరవింపదగిన దాన్ని, పరమధన్యాత్మురాలూ, కళిందపర్వతపుత్రీ అయిన యమునానదిని చూచాడు.

**వ. కని తత్కాళిందియందుఁ బరిక్షుణ్ణ మణిగణసముజ్జ్వలంబు లగు జలంబులు ద్రావి, తరుసమూహ సమీపంబున రామసహితుండై కృష్ణుండు రథంబు ప్రవేశించె; నంత నక్రూరుండు వారలకు మ్రొక్కి వీడ్కొని కాళిందీహ్రదంబు సొచ్చి విధిపూర్వకంబుగ వేదమంత్రంబుల జపించుచు. 1226**

**ప్రతి :** కని= చూచి, తత్+కాళింది+అందున్= ఆ యమునానదిలో; పరిక్షుణ్ణ= లెస్సగా సానపెట్టిన; మణిగణ= మణుల సమూహంవలె; సముజ్జ్వలంబులు= బాగా ప్రకాశిస్తున్నవి; అగు= అయిన; జలంబులు= నీళ్ళు; త్రావి= తాగి; తరుసముహ సమీపంబునన్= చెట్లగుంపు దగ్గర; రామసహితుండు+ఐ= బలరాముడితో కూడినవాడై; కృష్ణుండు= శ్రీకృష్ణుడు; రథంబు ప్రవేశించెన్= రథాన్ని ఎద్కాడు; అంతన్= ఆ పిమ్మట; అక్రూరుండు= అక్రూరుడు; వారలకున్= రామకృష్ణులకు; మ్రొక్కి= నమస్కరించి; వీడ్కొని= వారిని వదలి; కాళిందీహ్రదంబున్+చొచ్చి= యమునమడుగులో ప్రవేశించి; విధి పూర్వకంబు+కన్= శాస్త్రవిధానం ప్రకారం; వేదమంత్రంబులన్= (అఘమర్షణ సూక్తంలోని) మంత్రాలను; జపించుచున్= జపంచేస్తూ…

**తా :** శ్రీకృష్ణుడు యమునను చూచి సానబెట్టిన మణిసముదాయంవలె తళతళ మెరుస్తున్న ఆ నదీజలాన్ని తాగి బలరామునితోగూడ చెట్ల సమీపాన ఉన్న రథంలోపలికి చేరాడు. అప్పుడు అక్రూరుడు వారిద్దరికీ నమస్కరించి, అనుజ్ఞ పుచ్చుకొని, కాళిందీనదిమడుగులో దిగి యథావిధిగా వేదమంత్రాలు జపిస్తూ, స్నానం చేశాడు.

## ❖ అక్రూరుండు యమునలో రామకృష్ణుల దర్శించి నుతించుట ❖

**ఉ. స్నానము సేసి చేసి నది చల్లనినీటను రామకృష్ణులన్**
**మానుగఁ జూచి వీరు రథమధ్యమునన్ వసియించి యున్న వా**
**రీ నదినీటిలోపలికి నెప్పుడు వచ్చి? రటంచు లేచి మే**
**ధానిధి సూచె వారిని రథస్థుల భక్తమనోరథస్థులన్. 1227**

**ప్రతి :** నదిచల్లనినీటన్= యమునానదియొక్క చల్లటి నీళ్లలో; స్నానము+చేసి చేసి= అక్రూరుడు పలుమార్లు స్నానమాడి; రామకృష్ణులన్= బలరాముణ్ణీ, శ్రీకృష్ణుణ్ణీ; మానుగన్= ఇంపుగా; చూచి= కనుగొని; వీరు= ఆ బలరామ శ్రీకృష్ణులు; రథమధ్యమునన్= రథంయొక్క నడిమిభాగంలో; వసియించి+ఉన్నవారు= కూర్చొని ఉన్నారు; ఈ నదినీటిలోపలికిన్= ఈ యమునానది నీళ్లలోనికి; ఎప్పుడు వచ్చిరి= ఎప్పుడు వచ్చారు, అటంచున్= అని; లేచి= నీటినుండి పైకిలేచి; మేధానిధి= బుద్ధిశాలి అయిన అక్రూరుడు; భక్త మనోరథస్థులన్= భక్తుల మనస్సులనే రథాలపై ఉన్నవారిని; రథస్థులన్= యమునానది గట్టున ఉన్న రథంలో కూర్చొని ఉన్న; వారిని= రామకృష్ణులను; చూచెన్= దర్శించాడు.

**తా :** ప్రజ్ఞానిధి అయిన అక్రూరుడు చాలసేపు యమునలో స్నానంచేసి ఆ చల్లనినీటిలో రామకృష్ణుల్ని దర్శించాడు. తీరమందలి చెట్లనీడలో, రథమధ్యంలో ఉన్న వీరు నీళ్ళలోపలికి ఎప్పుడు వచ్చారని ఆశ్చర్యపడి నీళ్ళలో ముంచిన తల పైకెత్తి లేచి దృష్టిసారించి చెట్లనీడలో మునుపటివలె రథమధ్యంలో కూర్చున్న ఆ బలరామకృష్ణులను మరల చూశాడు.

**విశే :** శ్రీకృష్ణుడు భగవంతుడు. భగవంతుడు సర్వవ్యాపకుడు కావడంచేత ఏక కాలంలోనే కాళిందీజలాల్లోనూ, గట్టుమీది రథంలోనూ కనిపించాడు.

**వ. చూచి వెఱఁగుపడి. 1228**

**ప్రతి :** చూచి= వీక్షించి, కనుగొని; వెఱఁగుపడి= విస్మయం చెంది...

**తా :** చూచి అక్రూరుడు ఆశ్చర్యపడి

**శా. 'కంటిన్ మున్ను రథంబుపై; జలములోఁ గంటిన్ దుదిం; గ్రమ్మఱం**
**గంటిం దొంటి రథంబుమీఁద; నిదె యీ కల్యాణచారిత్రు లే**
**వెంటం దోఁచిరి రెండుదిక్కుల; మనోవిభ్రాంతియో? నీటిలో**
**నుం టాశ్చర్యము; చూతు నంచు మఱియు న్నూహించి మగ్నాంగుఁడై. 1229**

**ప్రతి :** మున్ను= ఇంతకు మునుపు; రథంబుపైన్= తేరుమీద; కంటిన్= చూశాను; తుదిన్= చివరలో; జలములోన్= నీళ్ళలో; కంటిన్= వీక్షించాను; క్రమ్మఱన్= మళ్ళీ; ఇది+ఎ= ఇదిగో!; తొంటిరథంబుమీఁదన్= ఇంతకు మునుపు కూర్చున్న రథంపైన; కంటిన్= తిలకించాను; ఈ కల్యాణచారిత్రులు= శుభకరమైన ప్రవర్తనగల ఈ రామకృష్ణులు; ఏ వెంటన్= ఏ తీరున; రెండుదిక్కులన్= రెండు వైపుల; అటు రథంమీద, ఇటు నీళ్ళలోపల; తోఁచిరి= కన్పించారు; మనస్+విభ్రాంతి+ఓ= ఇది నా మనసున ఏర్పడిన కలవరమేమో! నీటిలోన్= నీళ్లలో; ఉంట= వీరు ఉండటం; ఆశ్చర్యము= అద్భుతం; మఱియున్= ఇంకా; చూతున్+అంచున్= పరిశీలిస్తాను అనుకొని; ఊహించి= యోచించి; మగ్న+అంగుఁడు+ఐ= నీళ్లలో మునిగిన దేహంకలవాడై..

**తా :** పావనమైన నడవడిగల ఈ రామకృష్ణులను తొలుత రథంమీద వీక్షించాను. తరువాత నీటిలో దర్శించాను. ఇప్పుడు మరలా మునుపటి రథంలోనే ఉండటం చూస్తున్నాను. ఈ పుణ్యపురుషులు అటు రథంమీద, ఇటు నీళ్లలో ఇలా రెండు చోట్లా ఏకకాలంలో కనిపిస్తున్నారు. ఇది మహాద్భుతం. నా చిత్తభ్రాంతి కావచ్చు. మళ్ళీ పరిశీలిస్తాను అంటూ అక్రూరుడు నీళ్ళలో మునిగాడు.

**ఉ. పోషితబాంధవుండు యదుపుంగవుఁ డాజలమందుఁ గాంచె స**
**ద్భాషు సహస్రమస్తకవిభాసితభూషు నహీశు భూమిభృ**

ద్వేషుఁ గృపాభిలాషుఁ బ్రతివీరచమూవిజిగీషు నిత్య సం
తోషు నరోషు నిర్దళితదోషు ననేకవిశేషు శేషునిన్. 1230

**ప్రతి :** పోషిత బాంధవుండు= పోషించబడిన చుట్టాలుగలవాడు; యదుపుంగవుఁడు= యాదవులలో శ్రేష్ఠుడైన అక్రూరుడు; ఆ జలము+అందున్= ఆ యమునానదినీటిలో బ్రహ్మ తీర్థమనే కుండంలో; సత్+భాషున్= బాగా మాట్లాడేవాడూ; సహస్రమస్తక= వేయితలలందు; విభాసిత= బాగా ప్రకాశిస్తున్న; భూషున్= సొమ్ములు(మణులు)కలవాడూ; భూమిభృద్+వేషున్= (పర్వతవేషం కలవాడూ) రాజవేషం కలవాడూ; కృపా+అభిలాషున్= దయయందు ఆసక్తిగలవాడూ; ప్రతివీరచమూ= శూరులైన శత్రువుల సేనల్ని; విజిగీషున్= జయించడానికి ఇష్టపడేవాడూ; నిత్యసంతోషున్= ఎల్లప్పుడూ ఆనందించేవాడూ; అరోషున్= కోపంలేనివాడూ; నిర్దళితదోషున్= ఛేదించబడిన పాపాలు కలవాడూ; అనేక విశేషున్= పెక్కు ఆధిక్యాలు కలవాడూ; అహి+ఈశున్=సర్పములకు రాజైనవాడూ అయిన; శేషునిన్= ఆదిశేషుణ్ణి, అనంతుణ్ణి; కాంచెన్= చూచాడు.

**తా :** చుట్టపక్కాలను పోషించేవాడు, యాదవులలో శ్రేష్ఠుడు అయిన అక్రూరుడు యమునలోని బ్రహ్మ తీర్థ జలాలలో ఆదిశేషుణ్ణి దర్శించాడు. ఆదిశేషుడు చక్కగ మాట్లాడగల్గినవాడు. వేయి పడగలమీద వెలిగే మణిభూషలు గలవాడు. రాజవేషధారి; దయయందు అపేక్షగలవాడు. వీరశత్రుసేనల్ని జయించే కోరికగలవాడు. ఎల్లప్పుడూ సంతోషంగా ఉండేవాడు. కోపం లేనివాడు. దోషరహితుడు. అనేక విశేషాలు గలవాడు. అతడు సర్పాలకు దొర.

**విశే :** శేషుడంటే – సర్వకాలసర్వావస్థలలో ప్రత్యభిజ్ఞ కల్గి ఉండే 'అహమ్' అని చెప్పబడే ప్రజ్ఞ.

వ. మఱియు నీలాంబరసంయుతుండును, సిద్ధోరగాదిసన్నుతుండునునై యొప్పు న ప్పాఁపతేనిం దప్పక కనుంగొని. 1231

**ప్రతి :** మఱియున్= ఇంకా; నీల+అంబరసంయుతుండును= నల్లనివలువతో కూడినవాడూ; సిద్ధ+ఉరగ+ఆది సన్నుతుండునున్+ఐ= సిద్ధుల చేత, సర్పాలు మొదలైనవారిచేత మిక్కిలి శ్లాఘించబడేవాడై; ఒప్పు= ప్రకాశించే ఆ+పాము+తేనిన్= ఆ సర్పరాజును; తప్పక కనుంగొని= కన్నులార్పక వీక్షించి...

**తా :** నల్లని వస్త్రం ధరించి, సిద్ధులు, నాగులు మొదలైనవారిచే చక్కగా కొనియాడబడుతున్న సర్పరాజును కనురెప్పవాల్చక చూచి

సీ. ఆ భోగిభోగపర్యంకమధ్యంబున వలనొప్పు పచ్చనివలువవాని
మేఘంబుపైనున్న మెఱుఁగుచందంబున నురమున శ్రీదేవి యొప్పువాని
ముసురుతేఁటులు విప్ప ముఖచతుష్కము గల తనయుఁ డాడెడి బొడ్డుఁదమ్మివానిఁ
గదలిన బహుపదక్రమవిశేషంబుల రవము సూపెడి నూపురములవాని

ఆ. జలజగర్భ రుద్ర సనక సనందన, సద్ద్విజామర ప్రశస్యమాన
చరితుఁడైనవాని సౌందర్యఖనియైన, వాని నొక్క పురుషవర్యుఁ గాంచె. 1232

**ప్రతి :** ఆ భోగి భోగపర్యంక మధ్యంబునన్= ఆ సర్పంయొక్క శరీరమనే పానుపునడుమ; వలను+ఒప్పు= అందగించే; పచ్చని వలువవానిన్= పసుపురంగు పట్టువస్త్రం కట్టుకొన్నవాడూ; మేఘంబుపైన్= మబ్బుమీద; ఉన్న; మెఱుఁగు చందంబునన్=

మెరుపువలె; ఉరమునన్= తన వక్షఃస్థలంపై; శ్రీదేవి= లక్ష్మీదేవి; ఒప్పువానిన్= ప్రకాశించేవాడూ; ముసురు తేఁటులు= కమ్ముకునే తుమ్మెదలు; విప్పన్= చెదరిపోగా; ముఖచతుష్కము= నలుమోములు; కల= కల్గిన; తనయుఁడు= కుమారుడూ; ఆడెడి= క్రీడించే; బొడ్డు+తమ్మివానిన్= నాభిపద్మం కలవాడూ; కదలినన్= నడచేటపుడు; బహుపదక్రమ విశేషంబులన్= పెక్కు అడుగులు ముందుకు వేసే విలాసాలచేత; రవము+చూపెడి= శబ్దించే; నూపురములవానిన్= అందెలుగలవాడూ; జలజగర్భ= బ్రహ్మ; రుద్ర= శివుడు; సనక సనందన= సనకుడు, సనందనుడు అనేవారూ, సత్+ద్విజ= శ్రేష్ఠులైన బ్రాహ్మణులూ; అమర= దేవతలూ అనే వాళ్లచే; ప్రశస్యమాన చరితుఁడు= కొనియాడదగిన చరిత్రగలవాడూ; ఐనవానిన్= అయినట్టివాడూ; సౌందర్యఖని= అందాలకు గనీ; ఐనవానిన్= అయినవాడైన; ఒక్క పురుషవర్యున్= ఒక పురుష శ్రేష్ఠుని; కాంచెన్= వీక్షించాడు.

**తా :** అక్రూరుడు ఆదిశేషుణ్ణి పాన్పుగా చేసుకొని, ఆ మధ్యభాగంలో పవళించి ఉన్న అందగాడైన పురుషోత్తముణ్ణి అవలోకించాడు– ఆ దివ్యపురుషుడు మిసిమిగల పసుపువన్నె పట్టువస్త్రం ధరించి ఉన్నాడు. మేఘంమీద మెరిసే మెరుపులాగా అతనివక్షస్థలంలో లక్ష్మీదేవి ఒప్పులొలుకుతున్నది. మూగినతుమ్మెదలు చెదరిపోగా ఆయన నాభికమలంలో నాల్గు మోములుగల నందనుడు బ్రహ్మ ఆడుకుంటున్నాడు. కదలినపుడు ఆ పురుషోత్తముడికాలిఅందెలు పదం, క్రమం మొదలైన విశేషాలతో వేదనినాదాలు వెలువరిస్తున్నాయి. బ్రహ్మ, ఈశ్వరుడు, సనకసనందనులు, సద్బ్రాహ్మణులు, దేవతలు ఆతనిచరిత్రను ప్రశంసిస్తున్నారు.

**వ. మఱియును జారు లక్షణ లక్షిత నఖ పాద గుల్ఫ జాను జంఘోరు కటి నాభి మధ్యోదరుండును, సాదరుండును; శ్రీవత్సకౌస్తుభ వనమాలికావిరాజిత విశాలవక్షుండును, బుండరీకాక్షుండును; శంఖ చక్ర గదా పద్మ హస్తుండును, సత్త్వగుణప్రశస్తుండును; బ్రహ్మసూత్ర కటిసూత్ర హార కేయూర కటక కంకణ మకర కుండల కిరీటాది విభూషణుండును, భక్తజనపోషణుండును; సుందర కపోల ఫాల నాసాధర వదన కర్ణుండును, నీలనీరదవర్ణుండును; గంబుకంధరుండును, గరుణాగుణబంధురుండును; బ్రహ్లాద నారద సునంద నందప్రముఖ సంభావితుండును, శ్రీ పుష్టి తుష్టి కీర్తి కాంతీలోర్జావిద్యా, విద్యా శక్తి మాయాది సేవితుండునునై యొప్పు న ప్పరమేశ్వరునకు మ్రొక్కి భక్తిసంభ్రమంబు లగ్గలంబులుగ గద్గదకంఠుండై దిగ్గనం గరంబులు ముకుళించి యిట్లని వినుతించె. 1233**

**ప్రతి :** మఱియును= ఇంకా; చారులక్షణ= అందమైన చిహ్నాలచేత; లక్షిత= గుర్తించబడిన; నఖ= గోళ్ళు; పాద= పాదాలు; గుల్ఫ= చీలమండలు; జాను= మోకాళ్ళు; జంఘ= పిక్కలు; ఊరు= తొడలు; కటి= పిరుదులు; నాభి= బొడ్డు; మధ్య= నడుము; ఉదరుండును= పొట్టగలవాడూ; స+ఆదరుండును= ఆదరంతో కూడినవాడూ; శ్రీవత్స= శ్రీవత్సమనే పుట్టుమచ్చచేతను; కౌస్తుభ= కౌస్తుభమనే మణిచేతా; వనమాలికా= తులసీదళాలు, పూలు చేర్చికట్టిన తోమాలచేతా, విరాజిత= ప్రకాశించే; విశాల వక్షుండును= విరివియైన వక్షఃస్థలం గలవాడూ; పుండరీక+అక్షుండును= తెల్లదామరలవంటి కన్నులు కలవాడూ; శంఖ చక్ర గదా పద్మహస్తుండును= పాంచజన్యం అనే పేరుగల శంఖం, సుదర్శనమనే చక్రం, కౌమోదకి అనే గద, తామరమొగ్గ చేతులందు కలవాడూ; సత్త్వగుణ ప్రశస్తుండును= శుద్ధసత్త్వమనే గుణంతో ప్రసిద్ధి చెందినవాడూ; బ్రహ్మసూత్ర= జందెం, కటిసూత్ర= మొలనూలు; హార= ముత్యాలదండలు; కేయూర= భుజకీర్తులు; కటక= కాలిఅందెలు; కంకణ= చేతిమురుగులు; మకరకుండల= మొసలిఆకారంలో ఉన్న చెవిపోగులు; కిరీట+ఆది విభూషణుండును= కిరీటం మొదలైన ఆభరణాలు కలవాడూ; భక్తజన పోషణుండును= తనయందు ప్రేమగలభక్తుల్ని పోషించేవాడూ; సుందర= అందమైన; కపోల= చెక్కిళ్ళు; ఫాల= నుదురు; నాసా= ముక్కు; అధర= పెదవులు; వదన= ముఖం; కర్ణుండును= చెవులూ కలవాడూ;

నీలనీరద వర్ణుండును= నీలమేఘంవంటి రంగుకలవాడూ; కంబు కంధరుండును= శంఖంవంటి కంఠం కలవాడూ; కరుణా గుణ బంధురుండును= దయాగుణంచేత నిండినవాడూ; ప్రహ్లాద= ప్రహ్లాదుడు; నారద= నారదుడు; సునంద= సునందుడు; నందప్రముఖ= నందుడు మొదలయినవారిచే; సంభావితుండును= లెస్సగ ఆదరించబడేవాడూ; శ్రీ= సిరి; పుష్టి= బలుపు; తుష్టి= సంతృప్తి; కీర్తి= యశస్సు; కాంతి= శోభ; ఇలా= భూమి; ఊర్జా= ఉత్సాహం; విద్యా= ముక్తిహేతువైన విద్య; అవిద్యా= బంధహేతువైన అవిద్య; శక్తి; మాయా+ఆది= మాయమొదలైన వానిచేత; సేవితుండునున్+ఐ= కొలువబడుతున్నవాడై; ఒప్పు= ప్రకాశించే; ఆ+పరమ+ఈశ్వరునకున్= సర్వోత్కృష్టుడైన ఆ భగవంతుడికి; మ్రొక్కి= నమస్కరించి; భక్తిసంభ్రమంబులు= భక్తి, తొట్రుపాటు; అగ్గలంబులు+కన్= అధికంకాగా; గద్గదకంఠుండు+ఐ= బొంగురుపోయిన కంఠస్వరంకలవాడై; దిగ్గనన్= శీఘ్రంగా; కరంబులు= చేతులు; ముకుళించి= మోడ్చి; ఇట్లు+అని= ఈ రీతిగా; వినుతించెన్= స్తోత్రం చేశాడు.

**తా :** రమ్యాలైన శుభలక్షణాలతో కూడిన గోళ్ళు, పాదాలు, మడమలు, మోకాళ్ళు, పిక్కలు, తొడలు, పిరుదులు, బొడ్డు, నడుము, కడుపు కలవాడూ, ఆదరంతో కూడినవాడూ, శ్రీవత్సమనే పుట్టుమచ్చ, కౌస్తుభమనే మణి, వనమాల అనే పేరు కల్గి, పూలు, ఆకులు చేర్చి కట్టి, మెడనుంచి కాళ్ళవరకు వ్రేలాడే తోమాల – అనే వీటితో విరాజిల్లే విశాలమైన వక్షం కలవాడును, తెల్లదామరలవంటి కన్నులుగలవాడూ, జందెం, మొలనూలు, ముత్యాలపేరు, సందిటకట్టు కొనే సొమ్ములు (భుజకీరులు), అందెలు, మురుగులు, మొసలి ఆకారంతో ఉన్న చెవిపోగులు, కిరీటం మొదలైన ఆభరణాలు కలవాడూ, భక్తులను కాపాడేవాడూ, చక్కని చెక్కిళ్ళు, నొసలు, ముక్కు, పెదవులు, ముఖం, చెవులు కలవాడూ, నల్లని మబ్బువంటి శరీరచ్ఛాయ కలిగినవాడూ, శంఖంలాంటి మెడగలవాడూ, దయాగుణంతో నిండినవాడూ, ప్రహ్లాదుడు, నారదుడు, సునందుడు, నందుడు మొదలయిన వారిచేత పూజించబడేవాడూ, లక్ష్మి, పుష్టి, తుష్టి, కీర్తి, కాంతి, భూమి, ఊర్జ, విద్య, అవిద్య, శక్తి, మాయ మొదలైన తేజోమూర్తులచే సేవించబడేవాడూ అయిన ఆ పరమేశ్వరుడికి అక్రూరుడు నమస్కరించాడు. భక్తిసంభ్రమాలు అధికంకాగా వెంటనే చేతులు జోడించి, డగ్గుత్తికతో భగవంతుణ్ణి ఇలా స్తోత్రం చేశాడు.

**దండకము**

**శ్రీమానినీమానచోరా! శుభాకార! వీరా! జగద్ధేతుహేతుప్రకారా! సమస్తంబు నస్తంగతంబై మహాలోల కల్లోల మాలాకులాభీల పాథోనిధిం గూలఁగా, బాలకేళీగతిం దేలి నారాయణాఖ్యం బటుఖ్యాతి శోభిల్లు నీ నాభి కంజంబులో లోకపుంజంబులం బన్ను విన్నాణియై మన్న యా బమ్మ యుత్పన్నుఁ డయ్యెం గదా! పావ కాకాశ వాతావనీ వార్యహంకార మాయామహామానసాదుల్ హృషీకాదులున్ లోకముల్ లోకబీజంబులున్ నిత్యసందోహమై నీ మహాదేహమం దుల్లసించున్; వసించున్, నశించున్, జడత్వంబు లేకాత్మయై యొప్పు నీయొప్పిదం బెల్ల నోచెల్ల; చెల్లన్ విచారింపఁ దా రెంతవా? రెంతవారైన మాయాదు లా మాయతోఁగూడి క్రీడించు లోకానుసంధాత యీ ధాత నిర్ణేతయే? నీ కళారాశికిం గొంద అంభోజగర్భాదు లధ్యాత్మలందున్న శేషాధిభూతంబులందు న్ననేకాధిదైవంబులందున్ సదా సాక్షివై యుందు వంచుం దదంతర్గతజ్యోతి వీశుండ వంచుం, త్రయీపద్ధతిం గొంద ఱింద్రాదిదేవాభిధానంబులన్, నిక్క మొక్కండ వంచున్ మఱిం గొంద రారూఢకర్మంబులం ద్రుంచి, సంసారముం ద్రెంచి, సన్న్యస్తులై మించి విజ్ఞానచక్షుండ వంచున్, మఱిం బాంచరాత్రానుసారంబుగాఁ దన్మయత్వంబుతోఁ గొంద ఱీ వాత్మ వంచున్, మఱిం గొంద ఱా వాసుదేవాది భేదంబులన్ నల్వురై చెల్వు వాటింతు వంచున్; మఱిన్ నీవు నారాయణాఖ్యుండ వంచున్, శివాఖ్యుండ వంచున్, మఱిం బెక్కుమార్గంబులన్**

**నిన్ను నగ్గింతు; రెగ్గేమి? యేఋల్ పయోరాశినే రాసులై కూడు క్రీడన్ విశేషంబు లెల్ల న్నశేషంబులై డింది నీయం దనూనంబు లీనంబులౌ; నేకరాకేందు బింబంబు కుంభాంత రాళంబులం బింబితంబైన వేఋన్నదే? యెన్న నేలా? ఘటాంతర్గతాకాశముల్ తద్ఘటాంతంబులం దేకమౌ రేఖ లోకావధిన్ వీఁక నే పోకలం బోక; యేకాకివై యుందు; దీశా! కృశానుందు నెమ్మోము, సోముందు భానుందు కన్నుల్, దిశల్ కర్ణముల్, భూమి పాదంబు, లంభోనిధుల్ గుక్షి, శల్యంబు లద్రుల్, లతాసాలముల్ రోమముల్, గాలి ప్రాణంబు, బాహుల్ సురేంద్రుల్, ఘనంబుల్ కచంబుల్, నభోవీథి నాభిప్రదేశంబు, రేలుంబగళ్లున్ నిమేషంబు, లంభోజగర్భుండు గుహ్యంబు, వర్షంబు వీర్యంబు, నాకంబు మూర్ధంబుగా నేకమై యున్న నీ మేనిదందం బయోజాతగర్భాండముల్ మండి తోదుంబరానోకహానేకశాఖా ఫలాపూరి తానంతజంతుప్రకాండంబు లీలం బ్రసిద్ధోదరాశిస్థ జంతుప్రకారంబుగా నిండి యుండున్; మహారూప! నీ రూపముల్ వెగ్గలం బుగ్గడింపన్; లయాంభోధిలో మీనుమేనన్ విరోధిన్ నిరోధించి మున్ వేధకున్ వేదరాశిం బ్రసాదింపవే? త్రుంపవే కైటభ శ్రీ మధుం జక్రివై మొత్తవే! యెత్తవే మందరాగంబు రాగంబుతోఁ గూర్మలీలా పరిష్పందివై పందివై మేదినిన్ మీఁదికిం ద్రోచి దోషాచరుం గొమ్ములన్ నెమ్ములన్ జిమ్ముచున్ గ్రువ్వవే త్రవ్వవే ఘోరవైరిన్ నృసింహుండవై, దండివై దండి వైరోచనిం జూచి యాచింపవే? పెంపవే మేను బ్రహ్మాండము న్నిండఁ, బాఋండవై రాజకోటిన్ విపాటింపవే, రాజవై రాజబింబాస్యకై దుర్మదారిన్ విదారింపవే, నొంపవే క్రూరులన్ వాసుదేవాదిరూపంబులన్, శుద్ధబుద్ధుండవై వైరిదారాంతరంగంబుల న్నంతరంగంబులుంగా గరంగింపవే? పెంపు దీపింపవే? కల్కిమూర్తిం బ్రవర్తించి, నిన్నెన్న నే నెవ్వఁడన్, నన్ను మాయావిపన్నున్ విషణ్ణుం బ్రసన్నుం డవై ఖిన్నతం బాపి మన్నింపవే! పన్నగాధీశతల్పా! కృపాకల్ప!, వందారుకల్పా! నమస్తే నమస్తే నమస్తే నమః. 1234**

**ప్రతి :** శ్రీ మానినీ మానచోరా!= లక్ష్మీదేవి అభిమానాన్ని అపహరించినవాడా!; శుభ+ఆకార= మంగళస్వరూపుడా!; వీరా= వీరుడా; జగద్+హేతుప్రకారా!= ప్రపంచ సృష్టికి మూలమైన పంచమహాభూతాలకు కారణమైనవాడా!; సమస్తంబున్= సకలప్రపంచం; అస్తంగతంబు+ఐ= ప్రళయకాలంలో నశించింద్రై; మహాలోల= మిక్కిలి చలించే; కల్లోలమాలా= పెద్ద పెద్ద తరంగ సమూహంయొక్క; ఆకుల= సంక్షోభంచేత; ఆభీల= భయంకరమైన; పాథస్+నిధిన్= సముద్రంలో; కూలన్+కాన్= పతనం చెందగా; బాలకేళీగతిన్= పసిపిల్లవాడు ఆటలాడటంవలె; తేలి= ప్రళయసాగర జలంలో తేలి; నారాయణ+ఆఖ్యన్= నారాయణుడనే పేరుతో; పటుఖ్యాతిన్= గొప్ప కీర్తితో; శోభిల్లు= ప్రకాశించే; నీ నాభికంజంబులోన్= నీ బొడ్డు తామరపువ్వులో; లోకపుంజంబులన్= లోకసమూహాలను; పన్ను= సృష్టించే; విన్నాణి+ఐ= విజ్ఞానం కలవాడై; మన్న= బతికిన; ఆ బమ్మ= ఆ బ్రహ్మదేవుడు; ఉత్పన్నుఁడు+అయ్యెన్+కదా= పుట్టినాడుగదా!; పావక= అగ్ని; ఆకాశ= గగనం; వాత= వాయువు; అవనీ= భూమి; వారి= నీరు; అహంకార= సత్త్వ రజస్తమోగుణ రూపమైన అహంకారం; మాయా= త్రిగుణాత్మికమైన మూల ప్రకృతి; మహామానస+ఆదుల్= లోకసృష్టి సంకల్పరూపమైన మహత్తత్త్వం మొదలైనవి; హృషీక+ ఆదులున్= ఇంద్రియాలు మొదలైనవి, అనగా చతుర్దశేంద్రియాలు, వాటివృత్తులైన శబ్దస్పర్శ రూపరసగంధాలు; లోకముల్= పద్నాల్గుజగాలు; లోకబీజంబులున్= లోకాలకు కారణభూతులైన బ్రహ్మాదులు; నిత్యసందోహము+ఐ= సచ్చిదానందపూర్ణమై; నీ మహాదేహము+అందున్= నీ విరాడ్విగ్రహంలో; ఉల్లసించున్= ఉద్భవిస్తుంది; వసించున్= నివసిస్తుంది; నశించున్= లయిస్తుంది; జడత్వంబు లేక= మూఢత్వంలేక; ఆత్మ+ఐ= ఆయా వస్తురూపాలతో అంతటా వ్యాపించిన పరమాత్మవై; ఒప్పు= అలరారే; నీ+ఒప్పిదంబు+ఎల్లన్=

నీబాగు అంతా; ఓ చెల్ల= ఔరౌరా!; చెల్లన్= తగిందిగా; విచారింపన్= పరికించి తెలుసుకోవడానికి; తారు= తాము; ఎంతవారు+ఐనన్= ఎంత గొప్పవారైనను; ఎంతవారు= ఏ మాత్రంవారు?; మాయా+ఆదులు= మూలప్రకృతి మొదలైనవి; ఆ మాయతోన్+కూడి= ఆ ప్రకృతితో చేరి; క్రీడించు= వినోదించే; లోక+అనుసంధాత= లోకాలను కూర్చునట్టి; ఈ ధాత= ఈ బ్రహ్మ; నిర్ణేత+ఏ= నీయొక్క చిద్విలాసం ఇటాంటిదని నిర్ణయించగలడా?; నీ కళారాశికిన్= నీ చిత్కళాసమూహానికి; కొందఱు= కొంతమంది; అంభోజగర్భ+ఆదుల్= పద్మగర్భుడు (బ్రహ్మ) మొదలయినవారు; అధ్యాత్మల+అందున్+ఉన్న= తాపత్రయాల్లో ఉండే; అశేష+అధిభూతంబుల+అందున్= ఇంద్రియ విషయాలైన శబ్దాదులలో; అనేక+అధిదైవంబులందున్= ఇంద్రియాధి దేవతలైన చంద్ర, బ్రహ్మ, జీవ, రుద్రాదులలో; సదా= ఎల్లప్పుడు; సాక్షివి+ఐ= ఎడంగా ఉండి చూచేవాడివై; ఉందువు+అంచున్= ఉంటావనీ; తద్+అంతర్గత జ్యోతివి= ఆ అధ్యాత్మలు మొదలయిన వాటిలో నెలకొని ఉండే వెలుగువు; ఈశుండవు= నియంతవు; అంచున్= అనీ; కొందఱు= కొంతమంది; త్రయీపద్ధతిన్= వేదమార్గంలో; ఇంద్ర+ఆది+దేవ+ అభిధానంబులన్= పునరావృత్తికి హేతువులైన స్వర్గాదిలోకాలకు నాయకులుగా ఉన్న ఇంద్రుడు మొదలైన దేవతలయొక్క పేళ్ళతో; నిక్కము= నిజం; ఒక్కండవు+అంచున్= ఒక్కడివే అనీ; మఱిన్+కొందరు= జ్ఞాననిష్ఠులైన మరికొంతమంది; ఆరూఢ కర్మంబులన్= స్థిరాలైన కర్మలను; త్రుంచి= ఖండించి; సంసారమున్= జననమరణరూపమైన సంసారాన్ని; త్రెంచి= తెగగొట్టి; సన్న్యస్తులై= సన్యసించినవారై; మించి= అతిశయించి; విజ్ఞానచక్షుండవు+అంచున్= అనుభవజ్ఞానమే నేత్రాలుగా కల్గినవాడివని; మఱిన్= ఇంకా; పాంచరాత్ర+అనుసారంబు+కాన్= పాంచరాత్రమనే ఆగమసిద్ధాంతాన్ని అనుసరించడంచేత; తద్+మయత్వంబుతోన్= పరవశత్వంతో; ఈవు= నీవు; ఆత్మవు+అంచున్= ప్రత్యగాత్మ స్వరూపుడివని; కొందఱు= కొంతమంది; మఱిన్+కొందఱు= మరి కొంతమంది; వాసుదేవ+ఆదిభేదంబులన్= వాసుదేవ, ప్రద్యుమ్న, సంకర్షణ, అనిరుద్ధులనే నాల్గు వ్యూహభేదాలచేత; నల్వురు+ఐ= నలుగురై; చెల్వు+పాటింతువు+అంచున్= శోభిల్లుదు వనీ; మఱిన్= ఇంకా, నీవు; నారాయణ+అఖ్యుండవు+అంచున్= నారాయణుడనే నామం కలవాడవనీ; శివ+ఆఖ్యుండవు+అంచున్= శివుడనే పేరు కలవాడవనీ; మఱిన్= ఇంకా; పెక్కు మార్గంబులన్= అనేక విధాల; నిన్నున్= నిన్ను; అగ్గింతురు= కొనియాడుతారు; ఎగ్గు+ఏమి= కీడు ఏమి?; ఏఱుల్= నదులు; పయస్+రాశిన్+ఏ= సముద్రమునే; రాసులు+ఐ= గుంపులై; కూడు క్రీడన్= చేరే రీతిగా; విశేషంబులు+ఎల్లన్= జీవేశ్వరభేదాలన్నీ; అశేషంబులు+ఐ= ఏమీ మిగులకుండా; డింది= అణగి; నీ+అందున్= నీ లో; అనూనంబు= కొదువలేకుండా; లీనంబులు+ఔన్= ఐక్యమవుతాయి; ఏకరాకా+ఇందుబింబంబు= ఒకే ఒక పున్నమనాటి చంద్రబింబం; కుంభ+అంతరాళంబులన్= కుండలలోని నీళ్ళలో, బింబితంబు+ఐనన్= ప్రతిఫలించిన మాత్రాన; వేఱు+ఉన్నదే= ఆ బింబప్రతిబింబాలకు భేదంగలదా?; ఎన్నన్+ఏలా= ఈ విషయమై తర్కించడ మెందుకు? ఘట+అంతర్గత+ఆకాశముల్= కడవలోపల ఉన్న బయళ్ళు; తద్+ఘట+అంతంబుల+అందున్= ఆ కడవలు నశించిన పిమ్మట; ఏకము+ఔ రేఖన్= ఒకటి అగునట్లుగా (ఘటాకాశాలు మహాకాశంలో లీనమగునట్లుగా); లోక+అవధిన్= లోకాల చివర; వీఁకన్= పూనికతో; ఏ పోకలన్ పోక= పంచకృత్యాలలో ఏ కృత్యమందూ ప్రవర్తించక; ఏకాకివి+ఐ= ఒంటరివాడవై; ఉందుదు(వు)= ఉంటావు; ఈశా!= ప్రభూ; కృశానుండు= అగ్ని; నెమ్మోము (నెఱ+మోము)= నీ ముఖం; సోముండు= చంద్రుడు; భానుండు= సూర్యుడు; కన్నుల్= నీ నేత్రాలు; దిశల్= దిక్కులు; కర్ణముల్= చెవులు; భూమి= నేల; పాదంబులు= నీ చరణాలు; అంభస్+నిధుల్= సముద్రాలు; కుక్షి= నీ కడుపు; అద్రుల్= పర్వతాలు; శల్యంబులు= ఎముకలు; లతాసాలముల్= తీగలు, చెట్లు; రోమముల్= వెంట్రుకలు; గాలి= వాయువు; ప్రాణంబు= ఊపిరి; బాహుల్= చేతులు; సుర+ఇంద్రుల్= దేవతా నాయకులు, ఇంద్రుడు మొదలైన వారనుట; ఘనంబుల్= మేఘాలు; కచంబుల్= తలవెంద్రుకలు; నభస్+వీధి= ఆకాశమార్గం; నాభిప్రదేశంబు= బొడ్డున్నచోటు; రేలున్+పగళ్ళున్= రేపవళ్ళు; నిమేషంబులు= కనురెప్పపాట్లు; అంభోజగర్భుండు= బ్రహ్మదేవుడు;

గుహ్యంబు= శిశ్నం; వర్షంబు= వాన; వీర్యంబు= శుక్లం; నాకంబు= స్వర్గం; మూర్ధంబు+కాన్= శిరస్సుకాగా; ఏకము+ఐ+ఉన్న= అఖండస్వరూపుడివై ఉన్న; నీ మేనిదండన్= నీ శరీరంలో; పయోజాతగర్భ+అండముల్= కమలగర్భునియొక్క అండాలు అనగా బ్రహ్మాండాలు; మండిత= ప్రకాశమానమైన; ఉదుంబర+అనోకహ= మేడిచెట్టుయొక్క; అనేకశాఖా= పలుకొమ్మలందలి; ఫల= పండ్లలో; ఆ పూరిత= అంతటా నింపబడిన; అనంత= లెక్కలేని; జంతుప్రకాండంబులీలన్= ప్రాణుల సముదాయంవలె; ప్రసిద్ధ= ప్రఖ్యాతమైన; ఉదరాశిష్ఠ= జలరాశియందున్న (అనగా సముద్రమందున్న); జంతు ప్రకారంబు+కాన్= జంతువుల సముదాయంవలె; నిండి+ఉండున్= నీయందు పూర్ణమై ఉంటుంది; మహారూప= గొప్ప ఆకారం కలవాడా!; నీ రూపముల్= నీ ఆకారాలు; ఉగ్గడింపన్= ఇలాంటివని చెప్పడానికి; వెగ్గలంబు= అశక్యం; లయ+అంభోధిలోన్= ప్రళయ సాగరంలో; మీనుమేనన్= మత్స్యాకారంతో; విరోధిన్= శత్రువైన సోమకాసురుణ్ణి; నిరోధించి= అడ్డగించి; మున్= పూర్వం; వేధకున్= బ్రహ్మకు; వేదరాశిన్= వేదాల సమూహాన్ని; ప్రసాదింపవు+ఏ= అనుగ్రహించు; కైటభశ్రీన్= కైటభుని ప్రాణసంపదను; మధున్= మధుడనేవాణ్ణి; త్రుంపవు+ఏ= తుంచడమేగాక; చక్రివి+ఐ= చక్రాయుధం ధరించినవాడవై; మొత్తవు+ఏ= ఖండించలేదా?; కూర్మలీలా పరిష్పందివి+ఐ= తాబేలు రూపుతో వినోదించుటలో ఉత్సాహం కలవాడవై; పందివి+ఐ= వరాహమూర్తివై; మేదినిన్= ధరణిని; మీఁదికిన్+త్రోచి= నీటినుండి పైకెత్తి; దోషాచరున్= హిరణ్యాక్షుణ్ణి; నెమ్ములన్ కొమ్ములన్= ఇనుపమేకులవంటి కోరపండ్లతో; చిమ్ముచున్= ఎగురగొడుతూ; క్రువ్వవు+ఏ= పొడువలేదా? నృసింహుండవు+ఐ= నరసింహావతారం ధరించినవాడవై; ఘోరవైరిన్= భయంకరశత్రువైన హిరణ్యకశిపుణ్ణి; త్రవ్వవే= చీల్చలేదా? దండివి+ఐ= దండాన్ని ధరించినవాడివై; దండి= ప్రతాపవంతుడైన; వైరోచనిన్+చూచి= విరోచనుని కుమారుడైన బలిచక్రవర్తిని దర్శించి; యాచింపవు+ఏ= మూడడుగుల భూమినిమ్మని అర్థించలేదా? బ్రహ్మ+అండమున్+నిండన్= బ్రహ్మాండమంతా నిండేటట్లు; మేను= శరీరం; పెంపవు+ఏ= పెంచలేదా?; పాఱుండవు+ఐ= బ్రాహ్మణుడివై; రాజకోటిన్= రాజులసమూహాన్ని; విపాటింపవు+ఏ= చీల్చలేదా? రాజవు+ఐ=క్షత్రియుడవై రాజబింబ+ఆస్యకై= చంద్రబింబంవంటి ముఖం గల్గిన సీతాదేవికోసం; దుర్మద+అరిన్= చెడు గర్వం గల్గిన శత్రువును; విదారింపవు+ఏ= ఖండించలేదా? వాసుదేవ+ఆదిరూపంబులన్= శ్రీకృష్ణుడు మొదలయిన రూపాలతో; క్రూరులన్= దుష్టులను; నొంపవు+ఏ= బాధించలేదా? శుద్ధబుద్ధుండవు+ఐ= పవిత్రమైన బుద్ధావతారం దాల్చినవాడివై; వైరిదారా+అంతరంగంబులన్= శత్రువులైన త్రిపురాసురుల భార్యలయొక్క మనసులను; అంతరంగంబులున్+కాన్= రూపు చెడునట్లుగా; కరంగింపవు+ఏ= ద్రవించేటట్లు చేయ లేదా?; కల్కిమూర్తిన్= కల్కి అనే అవతారమూర్తివై; ప్రవర్తించి= మెలగి; పెంపుదీపింపవు+ఏ= అతిశయంతో ప్రకాశించవా? నిన్నున్= నిన్ను; ఎన్నన్= కొనియాడేందుకు; ఏను= నేను; ఎవ్వఁడన్= ఎంత మాత్రంవాణ్ణి; మాయావిపన్నున్= మాయచేత ఆపద పొందినవాణ్ణి; విషణ్ణున్= దుఃఖంపొందినవాణ్ణి అయిన; నన్నున్= నన్ను; ప్రసన్నుండవు+ఐ= అనుగ్రహపరుడవై; ఖిన్నతన్+పాపి= దుఃఖం తొలగించి; మన్నింపవు+ఏ= ఆదరించవా?; పన్నగ+అధీశతల్పా= ఆదిశేషుడు పాన్పుగా కల్గినవాడా; కృపా+ఆకల్ప= దయయే ఆభరణంగా కలవాడా? వందారు కల్పా= నమస్కరించేవారికి కల్ప వృక్షమైనవాడా?; నమస్+తే= నీకు నమస్కారం; నమస్+తే= నీకు ప్రణామం; నమస్+తే+నమః= నీకు వందనం; నమః= నమస్కారం.

**తా :** అభిమానవతియైన లక్ష్మీదేవి అంతరంగాన్ని అపహరించినవాడా! మంగళకరమైన స్వరూపం కలవాడా! ఓ వీరుడా! సకల ప్రపంచసృష్టికి కారణమైన పృథివ్యాది పంచమహాభూతాలకు కారణమైనవాడా! మిక్కిలి చలించే తరంగ శ్రేణిచేత కలతచెందిన భయంకర జలరాశిలో సర్వ ప్రపంచం రూపుమాసి లీనమై పోయినపుడు నీవు నారాయణ నామంతో ఖ్యాతిని వహించి బాలుడవై ఆ ప్రళయసాగరంలో తేలియాడావు.

అప్పుడు నీ నాభి కమలంనుంచి సకలభువనాలను సృజించే విజ్ఞానసంపన్నుడైన బ్రహ్మదేవుడు ఉద్భవించాడు. అగ్ని, ఆకాశం, వాయువు, భూమి, నీరు, అహంకారం, మాయ, మహత్తత్వం, మనస్సు మొదలైనవీ, ఇంద్రియాలూ, ఇంద్రియ వృత్తులైన శబ్దస్పర్శ రూపరసగంధాలూ, లోకాలూ, లోకకారణాలూ–ఈ సమస్తం నీ మహాశరీరంనుంచి పుట్టి పెరిగి నశిస్తూ ఉంటాయి. జడస్వభావంలేక ఆత్మస్వరూపుడవై ఉన్న నీ మహిమ ఇలాంటిదని వర్ణించడానికి ఎంత గొప్ప వారయినా సమర్థులు కారు. మాయ మొదలైన ముప్పదియారు తత్త్వాలు జడాలు కనుక నీ స్వరూపం గ్రహించలేరు. లోకాలను సృజించే పరమేష్ఠి మాయాసంబంధమైన గుణాలచేత ఆవరించబడి ఉన్నాడుకనుక, అతడు నిన్ను ఇలాంటివానిగా నిర్ణయించలేడు. హిరణ్యగర్భుడు మొదలైనవారు నిన్ను అధ్యాత్మ, అధిదైవ, అధిభూతాలకు అనగా దేహేంద్రియాధి దేవతలకు సాక్షిగా, అంతర్యామిగా, నియామకుడయిన ఈశ్వరునిగా భావిస్తారు.

వేదమార్గాములైన కొందరు కర్మయోగులు నీ వొక్కడవే ఇంద్రాదినామధేయాలతో నెగడుతుంటావు. ఇది నిజమంటున్నారు. మరికొందరు జ్ఞానయోగులు అన్నికర్మలను వదలి, సంసారం త్యజించి, సన్న్యాసులై నిన్ను విజ్ఞాన స్వరూపుడుగా వేర్కొంటున్నారు. వేరొక కొందరు పాంచరాత్రాగమపద్ధతిని అనుసరించి నీవు వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధ భేదాలతో నలువురై సొంపు ఘటిస్తున్నావని అంటున్నారు. కొందరు నీవు నారాయణుడివనీ, కొందరు శివుడివనీ అనేకమార్గాలలో నిన్ను శ్లాఘిస్తున్నారు.

నదులన్నీ సాగరాన్నే చేరుతున్నట్లు విశేషాలన్నీ నిశ్శేషంగా నీలోనే లీనమవుతున్నాయి. ఒకే పూర్ణచంద్రబింబం ఘటాలలోని జలాలలో పెక్కులుగా ప్రతిఫలించినంత మాత్రాన ఆ చంద్రబింబంకంటె ఈ ప్రతిబింబాలు వేరు కావుగదా! ఘటాంతర్గతమైన ఆకాశం ఘటం నశించగానే మహాకాశంలో చేరినట్లు, లోకాలన్నీ నశించగానే నీవు ఏ జాడలనూ తొక్కక ఒంటరివాడవై ఉంటావు. ఓ ప్రభూ! అగ్ని నీ ముఖం. చంద్రుడూ సూర్యుడూ నీ కన్నులు. దిక్కులు నీ చెవులు. భూమి నీ పాదాలు. సముద్రాలు నీ కడుపు. కొండలు నీ ఎముకలు. తీగలూ, చెట్లూ నీ రోమాలు, గాలి నీ ప్రాణం. ఇంద్రాదులు నీ బాహువులు. మేఘాలు నీ తలవెంద్రుకలు. ఆకాశం నీ బొడ్డు. రేయింబవళ్ళు నీ రెప్పపాట్లు. బ్రహ్మ నీ మేఢ్రం. వర్షం నీ వీర్యం. స్వర్గం నీ శిరస్సు. ఇలా నీ శరీరంలో బ్రహ్మాండాలు అత్తిచెట్టుకొమ్మల్లోనిపండ్లల్లో ఉన్న అనంతమైన ప్రాణి సమూహంలా, మహాసముద్రంలో జంతువుల మాదిరి నిండి ఉన్నాయి.

ఓ విరాట్పురుషా! నీ రూపాలు పొగడ్తకు అందవు. మునుపు మత్స్యరూపంతో ప్రళయ సముద్రంలో శత్రువైన సోమకాసురుణ్ణి ఎదిరించి సాధించి వేదప్రపంచాన్ని బ్రహ్మకు ప్రసాదించావు. హయగ్రీవుడవై చక్రం చేతధరించి మధుకైటభుల్ని చంపావు. కూర్మరూపంతో సంచరిస్తూ మందరగిరిని ఎత్తావు. వరాహరూపం దాల్చి క్రుంగుతున్న భూమండలాన్ని లేవనెత్తి హిరణ్యాక్షుని ఎముకలు విరుగునట్లు కోరలతో పొడిచి చంపావు. భయంకర శత్రువైన హిరణ్యకశిపుణ్ణి నరసింహాకారంతో నీవు సంహరించలేదా! ప్రతాపశాలివైన నీవు వామనమూర్తివై బలిచక్రవర్తిని యాచించలేదా? బ్రహ్మాండాలు నిండేటట్లు శరీరం పెంచలేదా? పరశురాముడివై క్షత్రియసమూహాన్ని వధించలేదా? దశరథరాముడివై చంద్రబింబంవంటి ముఖంగల జానకికోసం దుర్మదంతో కూడిన రావణుణ్ణి తునుమాడలేదా? వాసుదేవాది రూపాలను దాల్చి దుష్టులను శిక్షించలేదా? శుద్ధబుద్ధ స్వరూపివై శత్రుభార్యల మనస్సులు రహస్యంగా కరగించినావుగదా! కల్కిరూపం ధరించి పెంపుతో వెలుగొంద లేదా! దేవా! నిన్ను పొగడుటకు నేను ఏ పాటివాణ్ణి? నేను మాయచేత ఆపదలపాలైనవాణ్ణి. దుఃఖం చెందినవాణ్ణి. అనుగ్రహబుద్ధితో నా దిగులు తీర్చి నన్నాదరించు. ఆదిశేషుడు తల్పంగా ఉన్నవాడా! కరుణా స్వభావమే అలంకారంగా కలవాడా! నమస్కరించేవారికి కల్పవృక్షం వంటివాడా! నీకు నమోవాకం. నీకు వందనం. నీకు ప్రణామం. నమస్కారం.

**మ. కలలం బోలెడి పుత్త్రమిత్త్రవనితాగారాదిసంయోగముల్**
**జలవాంఛారతి నెండమావులకు నాసల్ సేయు చందంబునం**
**దలఁతున్ సత్యము లంచు; మూఢుఁడ వృథాతత్త్వజ్ఞుఁడన్ నాకు నీ**
**విలసత్పాదయుగంబు సూపి కరుణన్ వీక్షింపు లక్ష్మీపతీ! 1235**

**ప్రతి :** లక్ష్మీపతీ!= రమావల్లభా!; కలలన్+పోలెడి= స్వప్నాలతో సమానమైన; పుత్త్ర= కుమారుల; మిత్త్ర= స్నేహితులయొక్క; వనితా= భార్యల; అగార+ఆది= గృహాలు మొదలగువాటియొక్క; సంయోగముల్= కలయికలు; జలవాంఛారతిన్= దప్పికవల్ల కల్గిన నీటిమీది కోరిక చేత; ఎండమావులకున్= మృగతృష్ణలకు; ఆసల్+చేయు చందంబునన్= ఆశపడే విధంగా; సత్యములు+ అంచున్= నిజాలని; తలఁతున్= భావిస్తాను; మూఢుఁడన్= తెలివిలేనివాణ్ణి; వృథాతత్త్వజ్ఞుఁడన్= వస్తుస్వభావం బొత్తిగా తెలియనివాణ్ణి; నాకున్= ఇలాంటినాకు; నీ విలసత్ పాదయుగంబు+చూపి= నీయొక్క ప్రకాశించే అడుగుల జంటను చూపి; కరుణన్= కృపతో; వీక్షింపు= (నన్ను) చూడు.

**తా :** లక్ష్మీనాథా! దప్పిక తీర్చుకోడానికి నీళ్లవలె తోచే ఎండమావులకు ఆసపడేవిధంగా కలల వంటివైన పుత్రులు, మిత్రులు, భార్యలు, గృహాలు-ఈ మొదలైన జంజాటం సత్యమని భావిస్తుంటాను. నేను తెలివిమాలినవాణ్ణి. అసత్యాలను సత్యాలని తలంచేవాణ్ణి. ఇట్టినాకు ప్రకాశించే నీ పాదాల జంటను చూపి కరుణతో కటాక్షించు.

**వ. అని మఱియును వినుతింప నక్రూరునికి యమునాజలంబుల లోనన తన మొదలి మేను సూపి చాలించి నటునికైవడిం దిరోహితుండైన నక్రూరుండు నీరు వెడలి వెఱంగుపడుచు వచ్చి రథారోహణంబు సేసిన హరి యిట్లనియె. 1236**

**ప్రతి :** అని= అంటూ; మఱియును= ఇంకా; వినుతింపన్= ప్రార్థించగా; అక్రూరునికిన్= అక్రూరుడికి; యమునా జలంబులలోనన్+అ= యమునానదియందలి నీళ్లలోనే; తన మొదలి మేను= తన పూర్వశరీరాన్ని అనగా నాల్గుచేతులూ, ఆ చేతులందున్న శంఖ చక్ర గదా పద్మాలను; చూపి= కనబరచి; చాలించి= తన రూపాన్ని చూపడం నిలిపి; నటునికైవడిన్= నర్తకునివలె ఆడి తెరమరుగున జొచ్చినట్లు; తిరోహితుండు+ఐనన్= అదృశ్యుడుకాగా; అక్రూరుడు; నీరువెడలి= నీటినుండి లేచి; వెఱంగుపడుచున్ వచ్చి= ఆశ్చర్యపడుతూ వెలుపలికి వచ్చి; రథ+ఆరోహణంబు+చేసినన్= రథాన్ని ఎక్కగా; హరి= శ్రీకృష్ణుడు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికాడు.

**తా :** అక్రూరుడు ఈ విధంగా స్తోత్రం చేయగా శ్రీకృష్ణుడు ఆయనకు యమునా జలాలలో చతుర్భుజాలతో దీపించే తన మునుపటి దేహాన్ని చూపి, నర్తకుడు రంగస్థలంమీద ఆడి ఆడి తెరమరుగు జొచ్చినట్లు అంతలోనే అంతర్ధానం చెందాడు. అక్రూరుడు ఆశ్చర్యపడుతూ నీటినుండి వెలుపలికివచ్చి రథాన్ని అధిరోహించగా శ్రీకృష్ణుడు ఇలా అన్నాడు.

**క. జలములు చేరువ నున్నవి, తలపోయఁగ నీవు పోయి తడ వయ్యె, నదీ**
**జలముల నభమున ధరణిం, గలుగని చోద్యములు నీకుఁ గానం బడెనే? 1237**

**ప్రతి :** తలపోయన్+కన్= ఆలోచించగా; జలములు= నీళ్ళు; చేరువన్= సమీపంలో; ఉన్నవి= కలవు; నీవు పోయి= నీవు వెళ్ళి; తడవు+అయ్యెన్= ఎంతో సేపయింది; నదీజలములన్= యమునానది నీళ్ళలో; నభమునన్= ఆకాశంలో; ధరణిన్= భూమియందు; కలుగని= లేని; చోద్యములు= వింతలు; నీకున్= నీకు; కానన్+పడెను+ఏ= కనిపించాయా?

**తా :** అక్రూరా! దగ్గరలోనే నీళ్ళున్నాయి. నీవు స్నానానికి వెళ్ళి చాలసేపయింది. ఆకాశంలో, భూమిలో లేని వింతలు ఏమైనా నదీజలాలలో నీకు కన్పించాయా?

**వ. అనిన నతం డిట్లనియె. 1238**

**ప్రతి :** అనినన్= అని శ్రీకృష్ణుడు ప్రశ్నించగా; అతండు= అక్రూరుడు; ఇట్లు+అనియెన్= ఇలా బదులు పలికాడు.

**తా :** శ్రీకృష్ణ డలా ప్రశ్నించగా అక్రూరు డిలా సమాధాన మిచ్చాడు.

**క. 'నీలోన లేని చోద్యము, లేలోకములందుఁ జెప్ప; రీశ్వర! నీటన్**
**నేలన్ నింగిని నున్నవె? నీలోఁ జోద్యంబు లెల్ల నెగడు మహాత్మా!' 1239**

**ప్రతి :** ఈశ్వర!= ప్రభూ! నీలోనన్= నీలో; లేని చోద్యములు= కలుగని విచిత్రాలు; ఏ లోకములందున్= ఏ భువనాలలో; చెప్పరు= ఉన్నవని పెద్దలు వచించలేరు; మహా+ఆత్మా!= ఓ పరమాత్ముడా! నీటన్= నీటియందూ; నేలన్= భూమియందూ; నింగిన్= ఆకాశమందూ; ఉన్నవి+ఎ= ప్రత్యేకంగా కలవు; నీలోన్= నీయందే; చోద్యంబులు+ఎల్లన్= అద్భుతాలన్నీ; నెగడున్= గోచరిస్తాయి.

**తా :** ఇలా అడిగిన కృష్ణునితో అక్రూరుడు ఇలా అన్నాడు. స్వామీ! నీలో లేనివింతలు ఏ లోకాలలోనైనా ఉంటాయని పెద్దలు చెప్పలేదు. ఇక నీటిలో, నేలలో, నింగిలో ఉంటాయా?

**వ. అని పలికి సాయంకాలంబునకు నక్రూరుండు మథురానగరంబు సేర రథంబు గడపె; నంత నటమున్న చని నందాదులు పురోపవనంబున విడిసి యుండ వారలం గూడికొని కృష్ణు డక్రూరునిం జూచి రథంబు గొనుచు నగరంబునకుం జనుము; మేము వెనుక వచ్చెద' మనిన నతం డిట్లనియె. 1240**

**ప్రతి :** అని పలికి= ఆ విధంగా శ్రీకృష్ణునికి బదులు చెప్పి; సాయంకాలంబునకున్= సంధ్యాసమయానికి; అక్రూరుండు= అక్రూరుడు; మథురానగరంబు+చేరన్= మథురాపురానికి చేరునట్లు; రథంబు+కడపెన్= తేరును తోలాడు; అంతన్= అటు పిమ్మట; అటమున్ను+అ= అక్రూరుడి రథం మథురకు చేరక మునుపే; చని= వెళ్ళి; నంద+ఆదులు= నందుడు మొదలైన గొల్లపెద్దలు; పుర+ఉపవనంబునన్= పట్టణానికి సమీపంలో ఉన్న ఉద్యానవనంలో; విడిసి+ఉండన్= దిగి ఉండగా; వారలన్+ కూడికొని= వారితో చేరి; కృష్ణుఁడు= శ్రీకృష్ణుడు; అక్రూరునిన్+చూచి= అక్రూరుణ్ణి వీక్షించి; రథంబు+కొనుచున్= తేరును తోలుకొని; నగరంబునకున్= పట్టణానికి; చనుము= వెళ్ళు; మేము= మేమందరం; వెనుకన్= పిదప, వచ్చెదము= వస్తాము; అనినన్= అని పలుకగా; అతండు= అక్రూరుడు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా వచించాడు.

**తా :** అలా చెప్పి అక్రూరుడు సాయంకాలానికి మథురాపురి చేరేటట్టుగా రథాన్ని నడిపాడు. ముందుగా వెళ్ళిన నందుడు మొదలైనవారు పొలిమేరలోని తోపులో బసచేసి ఉన్నారు. కృష్ణుడు వారిని కలుసుకుని అక్రూరుణ్ణి చూచి 'నీవు రథాన్ని తోలుకొని పట్టణానికి వెళ్ళు. మేము తర్వాత వస్తాము' అని చెప్పగా అక్రూరుడు ఇట్లా అన్నాడు.

**క. 'నా యింటికి విచ్చేయుము, నీ యంఘ్రి సరోజరేణునికరము సోఁకన్**
**నా యిల్లు పవిత్రం బగు, శ్రీయుత! నీ భటునిఁ బెద్ద సేయం దగదే? 1241**

**ప్రతి :** శ్రీయుత= లక్ష్మితో కూడుకొన్న శ్రీకృష్ణా! నా+ఇంటికిన్= నా గృహానికి; విచ్చేయుము= రమ్ము; నీ+అంఘ్రి సరోజ రేణునికరము= పద్మాలవంటి నీ పాదాల్లోని ధూళి సముదాయం; సోఁకన్= తగులగా; నా+ఇల్లు= నా గృహం, పవిత్రంబు+ అగున్= పావన మవుతుంది; నీ భటునిన్= నీ సేవకుడినైన నన్ను; పెద్ద+చేయన్+తగదు+ఏ= ఆ మాత్రం మన్నించరాదా?

**తా :** లక్ష్మీ సంపన్నుడ వయిన శ్రీకృష్ణా! నీవు నా ఇంటికి విజయం చేయాలి. నీ పద్మాలవంటి పాదాలధూళి సమూహం సోకి నా ఇల్లు పావనమవుతుంది. నీ బంటునైన నన్ను ఆమాత్రం ఆదరించకూడదా?

**వ. అని మఱియుఁ బ్రార్థించిన హరి యిట్లనియె. 1242**

**ప్రతి :** అని= అంటూ; మఱియున్= ఇంకా; ప్రార్థించినన్= అక్రూరుడు వేడగా; హరి= వెన్నుడు; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** అక్రూరుడు ఈ విధంగా వేడుకోగా కృష్ణుడు ఇలా అన్నాడు.

## ✤ శ్రీ కృష్ణమూర్తి మథురానగరప్రవేశము సేయుట ✤

**క. యదుకులవిద్వేషణుఁడై, మదమున వర్తించు కంసు మర్దించి భవ**
**త్సదనంబుఁ జూడ వచ్చెదఁ, బొద యీ స్యందనముఁ గొనుచుఁ బురమున కనఘా!. 1243**

**ప్రతి :** అనఘా!= దోషరహితుడవైన అక్రూరా!; యదుకుల విద్వేషణుఁడు+ఐ= యాదవ వంశానికి శత్రువై; మదమునన్= పొగరుతో; వర్తించు= మెలగే; కంసున్= కంసుణ్ణి; మర్దించి= సంహరించి; భవత్+సదనంబున్= మీ యింటిని; చూడన్+వచ్చెదన్= చూడటానికి వస్తాను; ఈ స్యందనమున్= ఈ రథాన్ని; కొనుచున్= తీసుకొని; పురమునకున్= పట్టణానికి; పొద= వెళ్లుము.

**తా :** పుణ్యాత్ముడివైన అక్రూరా! యాదవవంశానికి శత్రువై, గర్వంతో సంచరిస్తున్న కంసుణ్ణి సంహరించిన తర్వాత ఇల్లు చూడడానికి వస్తాను. ఇప్పుడు నీవు ఈ రథాన్ని తీసుకొని నగరానికి వెళ్ళుము.

**వ. అని పలికిన నక్రూరుండు పురంబునకుం జని రామకృష్ణులు వచ్చి రని కంసున కెఱింగించి తన గృహంబునకుం జనియె; నంత నపరాహ్ణంబున బలభద్రగోపాలసహితుండై కృష్ణుండు. 1244**

**ప్రతి :** అని పలికినన్= అని శ్రీకృష్ణుడు చెప్పగా; అక్రూరుండు= అక్రూరుడు; పురంబునకున్= పట్టణానికి; చని= వెళ్ళి; రామకృష్ణులు= బలరామకృష్ణులు; వచ్చిరి+అని= నగరానికి వచ్చారని; కంసునకున్= కంసమహారాజుకు; ఎఱింగించి= తెలిపి; తన గృహంబునకున్= తన ఇంటికి; చనియెన్= వెళ్ళాడు; అంతన్= అటుపిమ్మట; అపర+అహ్నంబునన్= పగలు మూడుజాముల వేళలో (మధ్యాహ్నం దాటాక); బలభద్రగోపాల సహితుండు+ఐ= బలరాముడితో, గొల్లవాళ్ళతో కూడుకొన్నవాడై; కృష్ణుండు= శ్రీకృష్ణుడు...

**తా :** అని ఇలా శ్రీకృష్ణుడు చెప్పగా అక్రూరుడు నగరంలోనికి వెళ్ళి రామకృష్ణులు వచ్చారని కంసుడికి తెల్పి తన ఇంటికి వెళ్ళాడు. కృష్ణుడు అపరాహ్ణకాలంలో బలరామునితో, గోపకులతో కూడినవాడై మథురానగరం ప్రవేశించాడు.

**మ. పరిఖల్ గోటలుఁ గొమ్మలుం బడగలుం బ్రాసాదముల్ వీథులున్**
**హరులుం దేరులు వీరులున్ గజములున్ హర్మ్యంబులున్ వాద్యముల్**

**తరుణుల్ ధాన్యములున్ ధనంబులు మహోద్యానంబులున్ దీర్ఘికల్**
**గర మాశ్చర్యరుచిం దనర్చు మధురన్ గాంచెన్ విభుం డంతటన్.** 1245

**ప్రతి :** పరిఖల్= అగడ్తలు; కోటలున్= పట్టణం చుట్టు ఉన్న ప్రాకారాలు; కొమ్మలున్= బురుజులు; పడగలున్= పతాకాలు; ప్రాసాదముల్= రాజభవనాలు; వీథులున్= ఇండ్లవరుసల మధ్యగల త్రోవలు; హరులున్= గుర్రాలు; తేరులున్= రథాలు; వీరులున్= శూరులైన భటులు; గజములున్= ఏనుగులు; హర్మ్యంబులున్= మేడలు; వాద్యముల్= వీణ, వేణువు, మద్దెల మొదలైన వాద్యాలు; తరుణుల్= పడుచులు; ధాన్యములున్= గోధుమలు మొదలైన తిండిగింజలు; ధనంబులు= ద్రవ్యాలు; మహా+ఉద్యానంబులున్= గొప్ప ఉద్యానవనాలు; దీర్ఘికల్= నడబావులు; కరము= మిక్కిలి; ఆశ్చర్యరుచిన్= అద్భుతమైన ప్రకారంతో; తనర్చు= ఒప్పునట్టి; మధురన్= మధురాపురిని; విభుండు= ప్రభువైన కృష్ణుడు; అంతటన్= అప్పుడు; కాంచెన్= చూశాడు.

**తా :** శ్రీకృష్ణు డల్లంతలో అగడ్తలు, కోటలు, బురుజులు, టెక్కెములు, రాజభవనాలు, వీథులు, గుర్రాలు, రథాలు, గజాలు, మేడలు, శూరభటులు, యువతులు, ధాన్యాలు, ధనాలు, గొప్పఉద్యానవనాలు, నడబావులు, మొదలైనవాటివల్ల అత్యద్భుతమైన శోభతో విరాజిల్లే మధురానగరాన్ని వీక్షించాడు.

**వ. కని య ప్పురంబు ప్రవేశించి వచ్చు సమయంబున.** 1246

**ప్రతి :** కని= చూచి; ఆ+పురంబు= ఆ పట్టణమును; ప్రవేశించి= చొచ్చి; వచ్చుసమయంబునన్= వచ్చేటప్పుడు...

**తా :** శ్రీకృష్ణుడు మధురాపురిలో ప్రవేశించి వచ్చేవేళలో

**ఉ. 'నందతపఃఫలంబు, సుగుణంబులపుంజము, గోపకామినీ**
**బృందమునోముపంట; సిరివిందు; దయాంబుధి; యోగిబృందముల్**
**డెందములందుఁ గోరెదు కడింది నిధానము సేరవచ్చె నో**
**సుందరులార! రండు చని చూతము కన్నుల కోర్కి దీఱఁగన్.** 1247

**ప్రతి :** నంద తపఃఫలంబు= నందుని తపస్సుకు ఫలమైనవాడూ; సుగుణంబులపుంజము= సద్గుణాల రాశియైనవాడూ; గోపకామినీ బృందము= గొల్లపడతుల సమూహంయొక్క; నోముపంట= వ్రతాలకు ఫలరూపమైనవాడూ; సిరివిందు= లక్ష్మికి ప్రియుడూ; దయా+అంబుధి= కరుణాసముద్రుడూ; యోగిబృందముల్= యోగులయొక్క సముదాయాలు; డెందములందున్= హృదయాలలో; కోరెదు= కోరే; కడింది నిధానము= గొప్పనిధియైనవాడూ; చేరన్+వచ్చెన్= చెంతకు వచ్చాడు; ఓ సుందరులార= ఓ వనితలారా!; కన్నులకోర్కి తీఱన్+కన్= కన్నులయొక్క కోర్కె నెరవేరగా; చని= వెళ్ళి; చూతము రండు= దర్శిద్దాం రండి.

**తా :** ఓ రమణులారా! నందుని తపస్సుకు ఫలమైనవాడు, మేల్మిగుణాలరాశి, గొల్లవనితల నోములపంట, ఇందిరా సుందరిడెందానికి ఆనందం కలిగించేవాడు, కరుణకు సముద్రుడు, యోగిసమూహాలు తమమనసుల్లో కోరుకొనే అపురూపమైన పెన్నిధీ అయిన అచ్యుతుడు వస్తున్నాడు. కన్నుల కోర్కె తీరేటట్లు వెళ్ళి దర్శిద్దాం, రండి.

**వ. అని మఱియు గోవిందసందర్శనకుతూహలంబులఁ బౌరసుందరులు పరస్పరాహూయమానలై భుంజానలై భోజనభాజనంబులు దలంగఁ ద్రోచియు, శయానలై లేచియు, నభ్యజ్యమానలై జలంబు లాడకయు గురుజనశిక్ష్యమాణలై యోడకయు, గృహకార్యప్రవర్తమానలై పరిభ్రమింపకయు, రమణరమమాణలై రమింపకయు, శిశుజన బిభ్రాణలై డించియు, నలంకుర్వాణలై యన్యోన్య వస్త్రాభరణ మాల్యానులేపనంబులు వీద్వడ ధరించియు నరిగి. 1248**

**ప్రతి :** అని మఱియున్= అంటూ ఇంకా; గోవింద సందర్శన కుతూహలంబులన్= శ్రీకృష్ణుణ్ణి చూడటంలోని ఉబలాటంచేత; పౌరసుందరులు= పురంలోని సుందరాంగనలు; పరస్పర+ఆహూయమానలు+ఐ= ఒకరినొకరు పిలుచుకొంటున్నవారై; భుంజానలు+ఐ= భోజనం చేస్తున్నవారై; భోజనభాజనంబులు= భోజనపాత్రలు; తలంగన్+త్రోచియున్= కడుగకుండా దూరంగానెట్టి; శయానలు+ఐ= పండుకొన్నవారై; లేచియున్= పడకలనుండి పైకి లేచి; అభ్యజ్యమానలు+ఐ= తలంటుకు ప్రారంభించినవారై; జలంబులు+ఆడకయున్= స్నానం చేయకుండా; గురుజన శిక్ష్యమాణలు+ఐ= పెద్దలచేత దండింపబడుతున్నవారై; ఓడకయున్= జంకనివారై; గృహకార్యప్రవర్తమానలు+ఐ= ఇంటి పనులందు మెలగుతున్నవారై; పరిభ్రమింపకయున్= ప్రవర్తించనివారై; రమణ రమమాణలు+ఐ= మగలతో క్రీడిస్తున్నవారైనా; రమింపకయున్=క్రీడించనివారై; శిశుజన బిభ్రాణలు+ఐ= చిన్నబిడ్డలను ఎత్తు కొన్నవారైనా; డించియున్= చంకలనుంచి దించినవారై; అలంకుర్వాణలు+ఐ= అలంకరించుకొంటున్నవారై; అన్యోన్య= ఒకళ్ళొకళ్ళ; వస్త్ర= చీరలు; ఆభరణ= సొమ్ములు; మాల్య= పూలదండలు; అనులేపనంబులు= మైపూతలు; వీద్వడన్= తారుమారగునట్లు; ధరించియున్= తాల్చి; అరిగి= వెళ్ళి...

**తా :** అంటూ పట్టణంలోని అందగత్తెలు గోవిందుణ్ణి సందర్శించడానికి ఉబలాటపడి ఒకరి నొకరు పిలుచుకున్నారు. వారు అన్నం తింటున్నప్పటికీ పాత్రలను అవతలికి నెట్టివేశారు. పరుండి ఉన్నప్పటికీ పడకలనుంచి లేచారు. తలంటుకొంటున్నప్పటికీ స్నానం చేయలేదు. పెద్దలచే దండింపబడుతున్నప్పటికీ జంకినవారు కారు; మగలతో క్రీడిస్తున్నప్పటికీ క్రీడించడం చాలించారు. పసిపాపలను పట్టుకొన్నవారైనప్పటికీ దింపివేశారు. అలంకరించుకుంటున్న వారయినప్పటికీ పరస్పరం చీరలు, నగలు, పూలదండలు, మైపూతలు తారుమారుగా ధరించి వెళ్ళి

**క. వీటఁ గల చేడె లెల్లను, హాటకమణిఘటితతుంగహర్మ్యాగ్రములం**
**గూటువలు గొనుచుఁ జూచిరి, పాటించి విశాలవక్షుఁ బద్మదళాక్షున్. 1249**

**ప్రతి :** వీటన్= పట్టణంలో; కల= ఉన్నట్టి; చేడెలు+ఎల్లను= స్త్రీలందరూ; హాటక= బంగారంచేతా; మణి= రత్నాల చేతా; ఘటిత= కూర్చబడిన; తుంగ= ఎత్తయిన; హర్మ్య= మేడలయొక్క; అగ్రములన్= పైభాగాల్లో; కూటువలు+కొనుచున్= గుంపులుగా కూడి; విశాలవక్షున్= వెడల్పైన వక్షస్థలం కలవాడూ; పద్మదళ+అక్షున్= తామర రేకులవంటి కన్నులు గలవాడూ, అయిన శ్రీకృష్ణుణ్ణి; పాటించి= ఆదరించి; చూచిరి= కన్నారు.

**తా :** పట్టణంలో ఉండే స్త్రీలంతా రత్నాలు తాపిన ఎత్తయిన బంగారు మేడలపై గుంపులు గూడి విశాలమైన వక్షస్థలం కలవాడూ, తామరరేకులవంటి కన్నులుగలవాడూ అయిన శ్రీకృష్ణుణ్ణి చూశారు.

**సీ. వీఁడటే రక్కసి విగతజీవగఁ జన్నుఁబాలు ద్రావిన మేటిబాలకుండు**
**వీఁడటే నందునివెలఁదికి జగమెల్ల ముఖమందుఁ జూపిన ముద్దులాఁడు**

వీఁడటే మందలో వెన్నలు దొంగిలి దర్పించి మెక్కిన దాఁపరీఁడు
వీఁడటే యెలయించి వ్రేతలమానంబు సూఱలాడిన లోకసుందరుండు

**తే.** వీఁడు లేకున్న పుర మటవీస్థలంబు, వీనిఁ బొందనిజన్మంబు విగతఫలము
వీనిఁ బలుకనివచనంబు విహగరుతము, వీనిఁ జూడనిచూడ్కులు వృథలు వృథలు. 1250

**ప్రతి :** రక్కసి= రాక్షసియైన పూతన; విగతజీవగన్= పోయిన ప్రాణాలు గలదికాగా; చన్నుఁబాలు= స్తన్యం; త్రావిన= తాగిన; మేటిబాలకుండు= గడుసరి పిల్లవాడు; వీఁడు+అటే= ఇతడేనా? నందునివెలఁదికిన్= నందమహారాజుపత్నియైన యశోదాదేవికి; జగము+ఎల్లన్= విశ్వమంతా; ముఖము+అందున్= నోటిలో; చూపిన= కనబరచిన; ముద్దులాఁడు= మదికింపైనవాడు; వీఁడు+అటే= ఇతడేన; మందలోన్= వ్రేపల్లెవాడలో; వెన్నలు= వెన్నలు; దొంగిలి= దొంగిలించి; దర్పించి= చెలరేగి; మెక్కిన= మింగిన; దాఁపరీఁడు= దొంగ; వీఁడు+అటే= ఇతడేనంట; ఎలయించి= ఆసక్తి గొలిపి; వ్రేతల= గోపికలయొక్క; మానంబున్= అభిమానాన్ని; చూఱలు+ఆడిన= కొల్లగొట్టిన; లోకసుందరుండు= లోకంలో అందగాడు; వీఁడు+అఁటే= ఇతడేనంట; వీఁడు= ఇతడు; లేకున్నపురము= ఉండని పట్టణం; అటవీస్థలంబు= అరణ్యప్రదేశం; వీనిన్= ఈ శ్రీకృష్ణుణ్ణి; పొందని జన్మంబు= అనుభవించని పుట్టుక; విగతఫలము= ఫలం లేనిది; వీనిన్= ఈ శ్రీకృష్ణుణ్ణి; పలుకని= కొనియాడని; వచనంబు= మాట; విహగరుతము= పక్షికూత (అనగా అర్థశూన్యం); వీనిన్= ఈ పరమపురుషుణ్ణి; చూడని= దర్శించని; చూడ్కులు= చూపులు; వృథలు వృథలు= ఒకటికి రెండుసార్లు ప్రయోజనం లేనివి.

**తా :** పూతన అనే రాక్షసి అసువులు వీడేటట్లు స్తన్యపానం చేసిన అసాధ్యుడైన అర్భకుడు వీడేనంట! నందుని ఇల్లాలు యశోదకు, తన నోట విశ్వమంతా చూపించిన ముద్దుబిడ్డడు వీడేనట! గర్వించి మందలోని వెన్నలు దొంగిలించి భక్షించిన దొంగ వీడేనట! మనసులు కరిగించి గొల్లకన్నెల మానాన్ని కొల్లగొట్టిన భువనైక సుందరుడు వీడేనట! ఇతడు లేనిపట్టణం అరణ్యప్రదేశం. ఇతణ్ణి కలియని జన్మ నిరుపయోగం. ఇతణ్ణి పలుకరించని పలుకు పక్షిపలుకు. ఇతణ్ణి దర్శించని చూపులు నిజంగా వ్యర్థాలు.

**మ.** చెలియా! గోపిక లీ కుమారతిలకుం జింతించుచుం బాడుచుం
గలయం బల్కుచు నంటుచున్ నగుచు నాకర్షింపుచున్ హస్తగా
మలకక్రీడకుఁ దెచ్చి నిచ్చలును సమ్మానంబులం బొందఁగాఁ
దొలి జన్మంబుల నేమి నోఁచిరొ కదే దుర్గప్రదేశంబులన్ 1251

**ప్రతి :** చెలియా= ఓ సఖీ!; గోపికలు= గొల్లపడతులు; ఈ కుమార తిలకున్= పడుచువారిలో శ్రేష్ఠుడైన ఈ శ్రీకృష్ణుణ్ణి; చింతించుచున్= స్మరిస్తూ; పాడుచున్= గానంచేస్తూ; కలయన్+పల్కుచున్= కలగలుపుగా మాట్లాడుతూ; అంటుచున్= తాకుతూ; నగుచున్= నవ్వుతూ; ఆకర్షింపుచున్= తమవైపు చేరదీసుకొంటూ; హస్తగ+ఆమలక క్రీడకున్= అరచేతిలోని ఉసిరికకాయవలె ఆడించడానికి; తెచ్చి= అనుకూలపడేటట్లుచేసి; నిచ్చలును= ఎల్లప్పుడు; సమ్మానంబులన్= మర్యాదలను; పొందన్+కాన్= పొందేటందుకు; తొలిజన్మంబులన్= మునుపటి పుట్టుకలందు; దుర్గప్రదేశంబులన్= ప్రవేశించడానికి వీలుగాని స్థలాలలో; ఏమినోచిరొకదే= ఎట్టివ్రతాలు ఆచరించారో గదా!

**తా :** ఓ చెలీ! పడుచువారిలో మిన్నయైన ఈ కృష్ణుణ్ణి గోపికాస్త్రీలు చేతిలో ఉసిరిక కాయమాదిరి క్రీడకు తెచ్చి ధ్యానిస్తూ, కీర్తిస్తూ, సంభాషిస్తూ, స్పృశిస్తూ, నవ్వుతూ, లాగుతూ, లాలిస్తూ నిత్యం ఆనందిస్తున్నారు. వారు ఇలాంటిఆదరాన్ని పొందడానికి గడచిన పుట్టుకల్లో ఏ అడవుల్లో ఎటువంటి నోములు నోచారోగదా!

**క. అని మఱియుఁ బౌరకాంతలు, మునుకొని హరిరూపు నేత్రముల వెంటను లోఁ**
**గొని తాల్చిరి హృదయములను, జనితప్రమదమున విరులు సల్లుచు నధిపా! 1252**

**ప్రతి :** అధిపా!= పరీక్షిన్మహారాజా!; అని= ఇలాగని; మఱియున్= ఇంకా; పౌరకాంతలు= పురస్త్రీలు; మునుకొని= ముమ్ముందుగా; హరిరూపు= నారాయణుని ఆకారం; నేత్రముల వెంటను= నయనాలద్వారా; లోఁగొని= స్వాధీన పరచుకొని; జనిత ప్రమదమునన్= కల్గిన సంతోషంతో; విరులు= పూలు; చల్లుచున్= చల్లుతూ; హృదయములను= మనస్సుల్లో; తాల్చిరి= ధరించారు.

**తా :** ఓ పరీక్షిన్మహారాజా! ఈ విధంగా ఆ పట్టణంలోని అతివలు అదేపనిగా తమ నేత్రాలతో హరిరూపాన్ని ఆస్వాదిస్తూ హృదయాలలో నిల్పుకున్నారు. సంతోషంతో పూలజల్లులు చల్లారు.

**వ. మఱియును. 1253**

**ప్రతి :** మఱియును= ఇంకా...

**క. నానావిధగంధములుఁ బ్ర, సూనఫలాదులును హరితశుభలాజములుం**
**గానిక లిచ్చుచు విప్రులు, మానుగఁ బూజించి రా కుమారోత్తములన్. 1254**

**ప్రతి :** నానావిధగంధములున్= పలురకాలైన సువాసనద్రవ్యాల్ని; ప్రసూనఫల+ఆదులును= పూలు, పండ్లు మొదలయినవాటినీ; హరితశుభలాజములున్= పచ్చని మంగళాక్షతలను; కానికలు+ఇచ్చుచున్= బహుమతులుగా సమర్పణ చేస్తూ; మానుగన్= ఒప్పిదంగా, చక్కగా; ఆ కుమార+ఉత్తములన్= యువకుల్లో శ్రేష్ఠులైన బలరామకృష్ణుల్ని; విప్రులు= బ్రాహ్మణులు; పూజించిరి= అర్చించారు.

**తా :** అనంతరం మథురానగరంలోని బ్రాహ్మణులు పలురకాల చందన ద్రవ్యాలనూ, పూలు, పండ్లు మొదలైనవాటినీ, శుభకరాలైన పచ్చని అక్షతలనూ కానుకలుగా ఇస్తూ ఉత్తములైన ఆ వసుదేవకుమారులను ఉత్సాహంతో పూజించారు.

**వ. ఆ సమయంబున నగరద్వారంబు నుండి వచ్చు రాగకారుండగు నొక్క రజకుం గని హరి యిట్లనియె. 1255**

**ప్రతి :** ఆ సమయంబునన్= అప్పుడు, అట్టితఱి; నగరద్వారంబునుండి= పట్టణద్వారంనుంచి; వచ్చు= వస్తున్న; రాగకారుండు+అగు= బట్టలకు నీలిమ మొదలైన రంగులు వేసే; ఒక్క రజకున్= ఒకానొక చాకలిని; కని= చూచి; హరి= మాధవుడు; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** ఆ సమయంలో నగరంవాకిటినుంచి వస్తున్న, బట్టలు ఉదికి రంగులు వేసే ఒక చాకివాణ్ణి చూచి శ్రీకృష్ణుడు ఇలా అన్నాడు.

## ❖ శ్రీకృష్ణుండు రజకుని జంపి వాయకసుదాము లొసంగు పూజల నంగీకరించి మేలొసంగుట ❖

ఉ. విందులమై నరేశ్వరునివీటికి వచ్చితి మేము; మాకు మా
మందలలోనఁ గట్టికొన మంచిపటంబులు లేవు; నీ ముడిన్
సుందరధౌతచేలములు శోభిలు చున్నవి; తెమ్ము; నిన్ను మే
లందెదు; నిమ్ము; రాజుదెస నల్లుర; మో రజకాన్వయాగ్రణీ! 1256

**ప్రతి :** ఓరజక+అన్వయ+అగ్రణీ!= చాకలికులంలో శ్రేష్ఠుడా!; ఏము= మేము; విందులము+ఐ= బంధువులమై; నర+ఈశ్వరుని వీటికిన్= జనాధిపుడైన కంసుని పట్టణానికి; వచ్చితిమి= వచ్చాము; మాకున్= మాకు; మా మందలలోనన్= మా గొల్లపల్లెలలో; కట్టికొనన్= ధరించడానికి; మంచి పటంబులు లేవు= మేలైన వస్త్రాలు లేవు; నీ ముడిన్= నీ గుడ్డలమూటలో; సుందర ధౌతచేలములు= అందమైన ఉదికిన బట్టలు; శోభిలుచున్+ఉన్నవి= ప్రకాశిస్తున్నాయి; తెమ్ము= తీసుకరా; నిన్నున్= నిన్ను; మేలు+ఒందెదున్= శుభం చెందుతుంది; ఇమ్ము= మాకు ఇవ్వు; రాజుదెసన్= కంసమహారాజు గారివైపు; అల్లురము= మేనల్లుళ్ళం.

**తా :** ఓ రజకకులశిరోమణీ! మేము మీ రాజుగారినగరానికి అతిథులమై అరుదెంచాము. మా మందలో మాకు ధరించడానికి మంచిగుడ్డలు లేవు. నీ మూటలో ఉతికిన అందమైనబట్టలు ఉన్నాయి. మేము రాజుగారికి మేనల్లుళ్ళం. ఆ వస్త్రాలు మాకు ఇవ్వు. నీకు మేలు కలుగుతుంది.

వ. అనిన రోషించి వాఁ డిట్లనియె. 1257

**ప్రతి :** అనినన్= అని శ్రీకృష్ణుడు అడుగగా; వాఁడు= ఆ మడివేలు; రోషించి= కోపం వహించి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తా :** శ్రీకృష్ణుడు అలా అడిగిన మీదట ఆ చాకలి కోపంతో ఇలా అన్నాడు.

శా. ఎట్టెట్రా! మనుజేంద్రుచేలములు మీ కీఁ బాడియే? మీరలుం
గట్టం బోలుదురే? పయోఘృతదధిగ్రాసంబులన్ మత్తులై
యిట్టాడం జనెఁ గాక గొల్లలకు మీ కెబ్భంగి నోరాడెడిన్?
గట్టా! ప్రాణముఁ గోలుపోయెదు సుమీ కంసోద్ధతిన్ బాలకా! 1258

**ప్రతి :** బాలకా!= ఓ డింభకా!; ఎట్టు+ఎట్రా= ఏమి మాట్లాడుతున్నావురా?; మనుజ+ఇంద్రు= రాజుయొక్క; చేలములు= వస్త్రాలు; మీకున్= మీకు; ఈన్+పాడి+ఏ= ఇవ్వడం న్యాయమా? మీరలున్= మీరుగూడ; కట్టన్= ధరించడానికి; పోలుదురు+ఏ= తగుదురా?; పయస్+ఘృత దధిగ్రాసంబులన్= పాలు, నెయ్యి, పెరుగు, గడ్డి తనడంచేత; మత్తులు+ఐ= కొవ్వినవారై; ఇట్లు+ఆడన్+చనెన్+కాక= ఈ విధంగా మాట్లాడటం పొసగిందిగాని; గొల్లలకున్= పసులగాచుకునే గొల్లజాతివారికి; మీకున్= మీకు ఏ+భంగిన్= ఏ రకంగా; నోరు+ఆడెడిన్= అడగటానికి నోరు వచ్చింది?; కట్టా!= అయ్యో!; కంస+ఉద్ధతిన్= కంసునియొక్క కోపవిజృంభణంచేత; ప్రాణమున్= ఊపిరిని; కోలుపోయెదు(వు) సుమీ= పోగొట్టుకుంటావు సుమా!

**తా :** ఏమిరా బాలా! ప్రభువుగారివస్త్రాలు మీ కివ్వమంటారా? ఇది న్యాయమా? మీరు ఆ వస్త్రాలు ధరించడానికి అర్హులా? పాలు, నెయ్యి, పెరుగు మెక్కి తలకొవ్వి ఇలా కూశారు. కాకపోతే గొల్లలైన మీకు ఇలాంటి మాటలు నోటికెలా వస్తాయి? అయ్యో! కంస మహారాజుగారి ఆగ్రహానికి గురియై నీవు ప్రాణాలు పోగొట్టుకుంటావు సుమా!

**క. మా రాజుసొమ్ముఁ గైకొన, నే రాజులు వెఱతు; రింత యెల్లిదమే నీ;**
**కీ రాజరాజగృహమున, నీ రాజసమేల? గొల్ల! యేఁగుము తలఁగన్. 1259**

**ప్రతి :** గొల్ల= ఓరీ గొల్లవాడా!; మారాజు సొమ్మున్= మా ప్రభువైన కంసుని సొత్తును; ఏ రాజులున్= ఎంతటి ప్రభువులు కూడా; కైకొనన్= తీసుకోవడానికి; వెఱతురు= భయపడతారు; నీకున్= నీకు; ఇంత+ఎల్లిదము+ఏ= ఇంత ఎగతాళి అయిందా?; ఈ రాజరాజగృహమునన్= రాజులకు రాజైన కంసుని భవనంలో; నీ రాజసము= నీ రాచఠీవి; ఏల= ఎందుకు? తలఁగన్+ఏగుము= తొలగిపొమ్ము.

**తా :** ఓ గొల్లపిల్లవాడా! మా రాజుగారిసొమ్ము అంటుకోవడానికి ఏ రాజులైనా భయపడతారు. నీకింత వేళాకోళంగా ఉందా? రాజులకు రాజైన కంసునిరాజ్యంలో నీకింత రాజసమా? తొలగిదూరంగా పో!

**వ. అనిన విని రోషించి. 1260**

**ప్రతి :** అనినన్= అని చాకలిపల్కగా; విని= ఆలకించి; రోషించి= కోపించి...

**తా :** చాకలివాని మాటలు విని శ్రీకృష్ణుడు కోపించి

**క. ఘోరకరాగ్రతలంబున, ధీరుఁడు కృష్ణుండు శిరము దెగిపడఁ గొట్టెం**
**బౌరుల గుండెలు వగులఁగ, వీరోద్రేకిన్ మదావివేకిన్ జాకిన్. 1261**

**ప్రతి :** ధీరుఁడు= ధైర్యశాలి అయిన; కృష్ణుండు= శ్రీకృష్ణుడు; పౌరుల గుండెలు= మథురా నగరవాసుల హృదయాలు; పగులన్+కన్= బద్దలుకాగా; వీర+ఉద్రేకిన్= వీరరసంచేత చెలరేగినవాడూ; మద+అవివేకిన్= పొగరువల్ల తెలివి కోల్పోయినవాడూ అయిన; చాకిన్= చాకలివాణ్ణి; శిరము= తల; తెగిపడన్= ఖండితమై నేలమీద వాలగా; కొట్టెన్= చేతితో చరిచాడు.

**తా :** ధీరుడైన శ్రీకృష్ణుడు – బీరంతో రెచ్చినవాడూ, పొగరుబోతూ, తెలివిమాలినవాడూ అయిన ఆ చాకివాణ్ణి భయంకరమైన తన ముంజేతితో తల ఊడిపడేటట్లు కొట్టాడు. దీన్ని చూచి పురవాసులగుండెలు పగిలిపోయాయి.

**వ. ఇట్లు భగ్నుండైన రజకునిం జూచి వానివారలు పటంబులు డించి వెఱచి పఱచిన రామకృష్ణులు వలసిన వస్త్రంబులు ధరియించి కొన్ని గోపకుల కొసంగి చనుచుండ. 1262**

**ప్రతి :** ఇట్లు= ఈ రీతిగా; భగ్నుండు+ఐన= భంగపడిన; రజకునిన్= చాకివాణ్ణి; చూచి= కనుగొని; వానివారలు= ఆ మడివేలుకు సంబంధించినవాళ్ళు; పటంబులు= వస్త్రాలు; డించి= వదలిపెట్టి; వెఱచి= భయపడి; పఱచినన్= పరువెత్తి పోగా; రామకృష్ణులు= బలరామ శ్రీకృష్ణులు; వలసిన వస్త్రంబులు= తమకు కావలసినబట్టలు; ధరియించి= కట్టుకొని; కొన్ని= కొన్నిగుడ్డలు; గోపకులకున్= తమతో వచ్చిన గోపాలురికి; ఒసంగి= ఇచ్చి; చనుచున్+ఉండన్= వెళుతుండగా...

**తా :** ఇలా నేల గూలిన చాకలిని చూచి వానిమనుషులు బట్టలు అక్కడ వదలి భయంతో పరుగెత్తిపోయారు. అంతట బలరాముడూ, శ్రీకృష్ణుడూ తమకు కావలసిన వస్త్రాలు కట్టుకొని కొన్నిటిని గోపకులకిచ్చి ముందుకు సాగాగా

**క. అంతట నొక వాయకుఁ డా, క్రంతన్ వసుదేవసుతులఁ గని బహువర్ణా**
**త్యంత మృదుపటాభరణము, లెంతయు సంతసముతోడ నిచ్చెన్ మెచ్చన్. 1263**

**ప్రతి :** అంతటన్= ఆ పిదప; ఒకవాయకుఁడు= ఒక సాలెవాడు; ఆక్రంతన్= ఆ సందుదారిలో; వసుదేవసుతులన్= వసుదేవుని కుమారులైన బలరామకృష్ణుల్ని; కని= చూచి; బహువర్ణ= పెక్కురంగులతో; అత్యంతమృదు= మిక్కిలి నునుపైన; పట= వస్త్రాల్ని; ఆభరణములు= నగల్ని; ఎంతయున్= మిక్కిలి; సంతసముతోడన్= హర్షంతో; మెచ్చన్= శ్రీకృష్ణుడు శ్లాఘించగా; ఇచ్చెన్= సమర్పించాడు.

**తా :** ఆ సమయంలో ఒక నేత పనివాడు ఆ దారిలో వస్తున్న వసుదేవునికుమారులైన రామకృష్ణులను చూచి, వారు మెచ్చుకొనేటట్లు పలురంగులు కలిగి మిక్కిలి మెత్తనివైన వస్త్రాల్ని, నగల్ని పరమ సంతోషంతో ఇచ్చాడు.

**శా. కారుణ్యంబున వానిఁ గైకొని యలంకారంబు గావించి శృం**
**గారోదంచితదిగ్గజేంద్రకలభాకారంబులం బొల్చి రా**
**శూరుల్; మాధవుఁ డంత వాయకునిశుశ్రూషన్ మహాప్రీతుఁడై**
**సారూప్యంబును లక్ష్మియు న్నొసఁగె నైశ్వర్యాదిసంధాయియై. 1264**

**ప్రతి :** ఆ శూరుల్= వీరులైన ఆ బలరామకృష్ణులు; కారుణ్యంబునన్= దయతో; వానిన్= ఆ నేతపనివాడిచ్చిన వస్త్రాభరణాల్ని; కైకొని= స్వీకరించి; అలంకారంబు+కావించి= అలంకరించుకొని; శృంగార= సొగసైనవేషంచేత; ఉదంచిత= మనోహరమైన; దిక్+గజ+ఇంద్ర= ఐరావతాదులైన దిక్కులలోని ఏన్గులయొక్క; కలభ= గున్నలయొక్క; ఆకారంబులన్= రూపాలతో; పొల్చిరి= ప్రకాశించారు; అంతన్= అటుపిమ్మట; మాధవుఁడు= శ్రీకృష్ణుడు; వాయకునిశుశ్రూషన్= నేత పనివానియొక్క సపర్యచేత; మహాప్రీతుఁడు+ఐ= మిక్కిలి సంతోషం పొందినవాడై; సారూప్యంబును= సారూప్యమనే ముక్తిని (అనగా దేహావసానంలో తనతో సమానమైన రూపగుణాలు కల్గి ఉండేముక్తినీ); లక్ష్మియున్= సంపత్తీ; ఐశ్వర్య+ఆది సంధాయి+ఐ= ఐశ్వర్యము మొదలైనవాటి నిచ్చువాడై; ఒసఁగెన్= అనుగ్రహించాడు.

**తా :** శూరులైన రామకృష్ణులు వాటిని దయతో స్వీకరించి, అలంకరించుకొని సింగారించబడిన దిగ్గజాల గున్నలమాదిరి ప్రకాశించారు. అంతట మాధవుడు ఆ చేనేత పనివాని పరిచర్యకు పరమసంతుష్టుడై అతనికి ఐశ్వర్యాదులను అనుగ్రహించి, దేహావసానంలో సారూప్యమనే ముక్తిని ప్రసాదించాడు.

**వ. అంత నా రామకృష్ణులు సుదాముం డను మాలాకారుగృహంబునకుం జనిన నతండు గని లేచి గ్రక్కున మ్రొక్కి చక్కన యర్ఘ్యపాద్యాదికంబు లాచరించి సానుచరు లయినవారలకుఁ దాంబూల కుసుమగంధంబు లొసంగి యిట్లనియె. 1265**

**ప్రతి :** అంతన్= ఆ తరువాత; ఆ రామకృష్ణులు= ఆ బలరాముడు, శ్రీకృష్ణుడు; సుదాముండు+అను= సుదాముడు అనే పేరుగల; మాలాకారుగృహంబునకున్= పూలుకట్టేవాని ఇంటికి; చనినన్= వెళ్ళగా; అతండు= సుదాముడు; కని= వారిని

చూచి; లేచి= కూర్చున్నవాడు పైకి లేచి; గ్రక్కునన్= శీఘ్రంగా; మ్రొక్కి= నమస్కరించి; చక్కన్= బాగుగా; అర్ఘ్యపాద్య+ ఆదికంబులు= అర్ఘ్యం, పాద్యం మొదలైన ఉపచారాలు; ఆచరించి= చేసి–ఇలాంటి అతిథి మర్యాదలు చేసి; స+అనుచరులు+ ఐన= వెంట వచ్చిన వారితో కూడుకొన్న; వారలకున్= ఆ బలరామకృష్ణులకు; తాంబూల= తాంబూలం; కుసుమ= పూలు; గంధంబులు= చందనాలు; ఒసంగి= ఇచ్చి; ఇట్లు+అనియెన్= ఈ రీతిగా అన్నాడు.

**తా :** అనంతరం రామకృష్ణులు పూలదండలుకట్టే సుదాముని ఇంటికి వెళ్ళారు. అతడు వీరిని చూచిన వెంటనే లేచి నమస్కరించాడు. చక్కగా అర్ఘ్యం, పాద్యం మొదలైన పూజావిధులతో సత్కరించాడు. రామకృష్ణులకు, వారివెంటవచ్చిన వారికీ తాంబూలాలు, పూలు, గంధాలు ఇచ్చి ఈ రీతిగా అన్నాడు.

**ఉ. పావన మయ్యె నా కులము; పండెఁ దపంబు; గృహంబు లక్ష్మికిన్**
**సేవిత మయ్యె; నిష్టములు సేకుఱె: విశ్వనిదానమూర్తులై**
**భూవలయంబుఁ గావ నిటు పుట్టిన మీరలు రాకఁ జేసి నే**
**నే విధ మాచరింతుఁ? బను లెయ్యవి? బంట; నెఱుంగఁ జెప్పరే. 1266**

**ప్రతి :** విశ్వనిదానమూర్తులు+ఐ= ప్రపంచసృష్టికి మూలకారణమైన స్వరూపాలు కలవారై; భూవలయంబున్= ధరణీ మండలాన్ని; కావన్= రక్షించడానికి; ఇటు= ఈ విధంగా; పుట్టిన మీరలు= అవతరించినమీరు; రాకన్+చేసి= నా గృహానికి విచ్చేయుడంవల్ల; నా కులము= నా వంశం; పావనము+అయ్యెన్= పవిత్రమయింది; తపంబు= నేనొనర్చిన తపస్సు; పండెన్= ఫలించింది; గృహంబు= నా ఇల్లు; లక్ష్మికిన్= సిరికి; సేవితము+అయ్యెన్= ఆశ్రయించదగింది అయింది; ఇష్టములు= కోరికలు; చేకుఱెన్= లభించాయి; నేను= మీ దాసుడనైన నేను; ఏ విధము+ఆచరింతున్= ఏమి చెయ్యాలి? పనులు= కార్యములు; ఏ+అవి= ఎట్టివి? బంటన్= మీ సేవకుణ్ణి; ఎఱుంగన్+చెప్పరు+ఏ= నాకు తెలియజేయండి

**తా :** ప్రపంచానికి ఆదికారణమూర్తులై ధరణీచక్రాన్ని రక్షించడంకోసం ఇట్లా అవతరించిన మహానుభావులు మీరు. మీ రాకవల్ల నా వంశం పవిత్రమయింది. నా తపస్సు ఫలించింది. నా యిల్లు సిరిసంపదలతో నిండింది. నా కోరికలు ఈడేరాయి. నేను ఏ ప్రకారం నడుచుకోవాలి? ఏ పనులు చెయ్యాలి? నేను మీ సేవకుణ్ణి, సెలవియ్యండి.

**వ. అని పలికి. 1267**

**ప్రతి :** అని పలికి= అని సుదాముడు వచించి...

**క. దామోదరరాముల కు, ద్దామయశోహసితతుహినధాములకు వధూ**
**కాములకుఁ దెచ్చియిచ్చె సు, దాముఁడు ఘనసురభికుసుమదామము లధిపా! 1268**

**ప్రతి :** అధిపా!= ఓ పరీక్షిన్మహారాజా!; ఉద్దామ= అధికమైన; యశస్= కీర్తిచేత; హసిత= నవ్వబడిన; తుహినధాములకున్= చంద్రుడుగల వారికి; వధూకాములకున్= మగువలపాలింటికి మన్మథులైనవారికి; దామ+ఉదర రాములకున్= శ్రీకృష్ణబలరాములకు; సుదాముఁడు= సుదాముడు; ఘనసురభికుసుమదామములు= మిక్కిలి పరిమళముగల పూలదండలు; తెచ్చి+ఇచ్చెన్= తీసుక వచ్చి ఇచ్చాడు.

**తా :** అతిశయించిన కీర్తిచే చంద్రుణ్ణి అపహరించేవారూ, మగువల పాలిటి మన్మథులూ అయిన ఆ బలరామకృష్ణులకు సుదాముడు మిక్కిలి పరిమళంతో కూడిన పూలమాలలు సమర్పించాడు.

**క. వారును మాలికుఁ డిచ్చిన, భూరికుసుమదామములను భూషితులై ‘ నీ**
**కోరిన వర మిచ్చెద’ మని, కారుణ్యము సేయ నతఁడు గని యిట్లనియెన్. 1269**

**ప్రతి :** వారును= శ్రీకృష్ణబలరాములు; మాలికుఁడు= పూలదండలు కట్టే సుదాముడు; ఇచ్చిన= సమర్పించిన; భూరికుసుమదామములను= గొప్ప పూలదండలచేత; భూషితులు+ఐ= అలంకరించబడినవారై; నీ కోరినవరము= నీవు వాంఛించే వరం; ఇచ్చెదము+అని= ఇస్తామని; కారుణ్యము+చేయన్= దయచూపగా; అతఁడు= ఆ సుదాముడు; కని= బలరామకృష్ణులను గాంచి; ఇట్లు+అనియెన్= ఈ రీతిగా పలికాడు.

**తా :** బలరామశ్రీకృష్ణులు సుదాముడిచ్చిన పూలమాలలతో అలంకరించుకొని, ‘ఏమికావాలో కోరుకో. నీవు కోరినవరం ఇస్తాము’ అని దయతో పలుకగా సుదాముడు శ్రీకృష్ణునితో ఇట్లన్నాడు.

**క. ‘నీ పాదకమలసేవయు, నీ పాదార్చకులతోడినెయ్యమును నితాం**
**తాపారభూతదయయును, దాపసమందార! నాకు దయసేయఁ గదే! 1270**

**ప్రతి :** నీ పాదకమలసేవయున్= పద్మాలవంటి నీ అడుగుల్ని కొలవడం; నీపాద+అర్చకులతోడి నెయ్యమును= నీ అడుగులను పూజించే వారితో చెలిమి; నితాంత= అంతంలేని; అపార= హద్దులేని; భూతదయయును= జీవులయందు కారుణ్యమూ; తాపసమందార= తపస్వులకు కల్పవృక్షంవంటి శ్రీకృష్ణా!; నాకున్= నీ సేవకుడనైన నాకు; దయ+చేయన్+కదే= అనుగ్రహింపుమయ్యా!

**తా :** తపస్వులకు కల్పవృక్షం వంటివాడా! కృష్ణా! కమలములవంటి నీ పాదాలపరిచర్యనూ, నీ పాదాలు పూజించే భక్తులతో చెలిమినీ, సకలప్రాణులమీద అత్యంతమైన, అపరిమితమైన దయనూ నాకు ప్రసాదించండి.

**విశే :** భగవత్ప్రార్థనా పరమైన భాగవత పద్యాలలో “ఎవ్వనిచే జనించు”, “నీ పాదకమలసేవయు” బహుళవ్యాప్తిలోఉన్న ఆణిముత్యాలు. అసాధువులైనవారు భౌతిక సంపదలు కోరుతారు. సుదాముడు మహాత్ముల కోవలోనివాడు గనుక స్వామి పదసేవనే కోరుకున్నాడు.

**వ. అని వేఁడికొనిన నిచ్చి మఱియు మాధవుం డమ్మాలికునకు బలాయుఃకీర్తిసంపద లొసంగి వాని గృహంబు వెడలి రాజవీథిం జనిచని. 1271**

**ప్రతి :** అని వేఁడికొనినన్= అంటూ సుదాముడు ప్రార్థించగా; ఇచ్చి= అతడు కోరినవి ఇచ్చి; మఱియున్= ఇంకా; మాధవుండు= లక్ష్మీవల్లభుడైన కృష్ణుడు; ఆ+మాలికునకున్= ఆ పూలదండలు కట్టే సుదాముడికి; బల+ఆయుః కీర్తి సంపదలు= శక్తి, ఆయుస్సు, యశస్సు, ధనములు; ఒసంగి= ఇచ్చి; వాని గృహంబు వెడలి= అతని ఇంటినుండి బయలుదేరి; రాజవీథిన్= రాచబాటలో; చనిచని= పోయిపోయి...

**తా :** ఇలా వేడుకొన్నవన్నీ అనుగ్రహించి, ఇంకా శ్రీకృష్ణుడు సుదాముడికి బలం, ఆయుస్సు, తేజం, యశస్సు, సిరిసంపదలు కరుణించి, వానిఇంటినుండి బలరామసహితుడై బయలుదేరి రాజవీథిలో సాగిపోయాడు.

**క. ఆ నలినాక్షుఁడు గాంచెను, నానాలేపములభాజనము సేకొనుచుం**
**బూని చనుదెంచు దానిని, నాననరుచినిచయవినమితాబ్జం గుబ్జన్. 1272**

**ప్రతి :** ఆ నలిన+అక్షుఁడు= తామర రేకులవంటి కన్నులుగల శ్రీకృష్ణుడు; నానాలేపముల భాజనము= అనేకాలైన మైపూతలుగల పాత్రను; చేకొనుచున్= చేతధరించి; పూని= ప్రయత్నంతో; చనుదెంచు దానిని= వచ్చే స్త్రీని; ఆననరుచి నిచయ= ముఖకాంతుల సమూహంచేత; వినమిత+అబ్జన్= అణగిన పద్మం కలదాన్ని; కుబ్జన్= మరుగుజ్జుదాన్ని; కాంచెను= చూచాడు.

**తా :** కమలములవంటి కన్నులుగల శ్రీకృష్ణుడు పలురకాల మైపూతలుంచిన పాత్ర పట్టుకొని వస్తున్న కుబ్జను చూచాడు. దానిముఖకాంతిముందు పద్మం తలవంచుకుంటుంది.

**వ. కని యిట్లనియె. 1273**

**ప్రతి :** కని= చూచి; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** కుబ్జను చూచి శ్రీకృష్ణుడు ఇట్లన్నాడు.

**క. 'ఎవ్వరిదానవు? లేపము, లెవ్వరికిం గోరికొనుచు నేగెదు? నీ పే**
**రెవ్వతె' మా కి మ్మిన్నియు, నివ్వటిలెదు చక్క నగుచు నీరజనేత్రా!' 1274**

**ప్రతి :** నీరజనేత్రా!= పద్మాలవంటి కన్నులుగలదానా!; ఎవ్వరిదానవు= నీవు ఎవరికి సంబంధించిన స్త్రీవి; లేపములు= కలపములు; ఎవ్వరికిన్= ఎవరికి; కోరి= ఇవ్వదలచి; కొనుచున్= చేతబట్టుకొని; ఏగెదు(వు)= వెళుతున్నావు?; నీ పేరు= నీ నామం; ఎవ్వతె= ఎవరు?; ఇన్నియున్= నీవు తీసుకపోతున్నవన్నీ; మాకున్+ఇమ్ము= మాకివ్వు; చక్కన+అగుచున్= వక్రతలన్నీ తొలగి చక్కనిదానవై; నివ్వటిలెదు(వు)= వెలుగొందుతావు.

**తా :** ఓ పద్మాక్షీ! నీవు ఎవ్వరిదానవు? ఈ కలపములు ఎవరికోసం తీసుక వెళుతున్నావు? నీ పేరేమిటి? ఈ మైపూతలన్నీ మాకివ్వు. అలా ఇస్తే నీవు చక్కగా ప్రకాశిస్తావు.

**వ. అనిన న య్యబల యిట్లనియె. 1275**

**ప్రతి :** అనినన్= అని వాసుదేవుడు పలుకగా; ఆ+అబల= ఆ మగువ; ఇట్లు+అనియెన్= ఇలా బదులు పల్కింది.

**తా :** శ్రీకృష్ణణ్ణిమాటలకు కుబ్జ ఇలా బదులాడింది.

**ఉ. చక్కనివాఁడ వౌదు; సరసంబుల నొంపకు; మెల్లవారికిన్**
**జక్కఁదనంబు లెక్కడివి? చారుశరీర! త్రివక్ర యండ్రు; నే**
**నిక్కము కంసుదాసిని; వినిర్మలలేపనవిద్యదాన; నన్**
**మిక్కిలి రాజు మెచ్చుఁ; దగ మీరు విలేపనముల్ ధరింపరే? 1276**

**ప్రతి :** చారుశరీర= అందమైన దేహం కలవాడా!; చక్కని వాఁడవు= నీవు మహా సౌందర్యవంతుడివి; ఔదువు= అయ్యెదవు; (నీవు బలే అందగాడివిలే); సరసంబులన్= ఎగతాళిమాటలతో; నొంపకము= నొప్పించవద్దు; ఎల్లవారికిన్= లోకంలో ఉన్నవారందరికీ; చక్కన్+తనంబులు= అందాలు; ఎక్కడివి= ఎక్కడనుండి వస్తాయి (నేను అందగత్తెను కానిమాట వాస్తవమే అనుట); త్రివక్ర+అండ్రు= నన్ను త్రివక్ర అంటారు; నేన్= నేను; నిక్కము= నిజంగా; కంసుదాసిని= కంసుని సేవకురాలిని; వినిర్మల= స్వచ్ఛమైన; లేపన విద్యదానన్= పరిమళ ద్రవ్యాలు తయారుచేసే విద్య నేర్చినదాన్ని; నన్= నన్ను; రాజు=

కంసమహారాజు; మిక్కిలి మెచ్చున్= ఎక్కువగా మెచ్చుకుంటాడు; తగన్= ఒప్పుగా; మీరు= తమరు; విలేపనముల్= మైపూతలు; ధరింపరే= ధరించండి.

**తా :** ఓ సుందరాంగుడా! నీవు బలే అందగాడివిలే. పరిహాసవచనాలతో నన్ను వేధించకు. లోకంలో అందరికీ అందాలు ఎక్కడినుండి వస్తాయి? నన్ను త్రివక్ర అంటారు. నేను కంసుడిదాసిని. అచ్చమైన మైపూతలు చేయడమే నా నేర్చిన విద్య. నన్ను రాజు మిక్కిలి మెచ్చుకుంటాడు. మీరు ఈ చందనాదివిలేపనాలు పూసుకొనండి.

**క. అని పలికి యా కుమారుల, తనువులు నగవులును, వీక్షితమ్ములు మాటల్**
**తన చిత్తముఁ గరఁగించిన, ననులేపము లిచ్చె వారి కబల ప్రియముతోన్. 1277**

**ప్రతి :** అబల= కంసుని దాసియైన ఆ త్రివక్ర; అనిపలికి= అలా బదులుచెప్పి; ఆ కుమారుల= ఆ బలరామ శ్రీకృష్ణులయొక్క; తనువులు= శరీరాలు; నగవులును= నవ్వులు; వీక్షితమ్ములు= చూపులు; మాటల్= పలుకులు; తనచిత్తమున్= తనహృదయాన్ని; కరఁగించినన్= ద్రవింపజేయగా; వారికిన్= ఆ బలరామకృష్ణులకు; ప్రియముతోన్= ప్రేమతో; అనులేపములు= పరిమళద్రవ్యాలు; ఇచ్చెన్= సమర్పించింది.

**తా :** ఇలా పలికి పడుచువారైన ఆ బలరామకృష్ణుల నెమ్మేనులు, నవ్వులు, చూపులు, పలుకులు తనమనస్సును కరగించగా ఆ కుబ్జ ప్రేమతో వారికి మైపూతలు ఇచ్చింది.

**సీ. ఇ వ్విధంబునఁ గుబ్జ యిచ్చిన లేపంబు, లన్నియు, దాను దేహమున నలఁది-**
**కొని ప్రసన్నత నొంది కుబ్జ ముప్వంకల, యొడలు సక్కఁగ నొత్తి యునుపఁ దలఁచి**
**తత్పదంబుల మీదఁ దన పదంబులు ద్రొక్కి హస్తాంగుళద్వయ మబల గౌద-**
**క్రింద విప్పుగ నిడి కృష్ణుఁడు మీఁదికి, నెత్తిన వక్రత లెల్ల మాని**

**ఆ. చక్కనైన చిత్తజన్మబాణముక్రియఁ, గొమరు మిగిలి పిఱుఁదు గుచయుగంబు**
**సొంపు సేయఁ దరుణి సుందరమూర్తియై, కమలనయనుఁ జూచి కాంక్షతోడ. 1278**

**ప్రతి :** కృష్ణుఁడు= యదునందనుడు; ఈ+విధంబునన్= ఈ తీరున; కుబ్జ+ఇచ్చిన లేపంబులు= కంసుని దాసి ఇచ్చిన చందనాది సుగంధద్రవ్యాలు; అన్నియున్= మొత్తం; తాను= తాను (శ్రీకృష్ణుడు); దేహమునన్= తనువునందు; అలఁదికొని= పూసుకొని; ప్రసన్నతన్+ఒంది= అనుగ్రహముచెంది; కుబ్జ= కుబ్జయొక్క; ముప్వంకల (మూడు+వంకల)+ఒడలు= మూడువంకరలుగల్గిన శరీరం; చక్కన్+కన్+ఒత్తి= చక్కబరచి; ఉనుపన్+తలఁచి= ఉంచనెంచి; తత్+పదంబులమీఁదన్= ఆమె అడుగులమీద; తనపదంబులు= తనచరణాలు; ద్రొక్కి= ద్రొక్కిపట్టి, మోపి; హస్త+అంగుళద్వయము= తన బొట్టనవ్రేళ్ళురెండూ; అబలగౌదక్రిందన్= త్రివక్రయొక్క గడ్డముక్రింద; విప్పుగన్+ఇడి= విశాలంగా ఉంచి; మీఁదికిన్= పైకి; ఎత్తినన్= ఎత్తగా; వక్రతలు+ఎల్లన్= వంకరలన్నీ; మాని= తొలగి; చక్కనన్+ఐన= అందమైన; చిత్తజన్మబాణముక్రియన్= మన్మథునిబాణంవలె; కొమరు మిగిలి= సొంపు పెంపారగా; పిఱుఁదు= మొలకు వెనుకభాగం; కుచయుగంబు= చన్నులజంట; సొంపు+చేయన్= అందం చేకూర్చగా; తరుణి= ఆ పడతి; సుందరమూర్తి+ఐ= అందమైన ఆకారంగలదై; కాంక్షతోడన్= కోరికతో; కమలనయనున్+చూచి= పద్మాలవంటి కన్నులుగల మధుసూదనుణ్ణి కనుగొని...

**తా :** ఈ విధంగా కుబ్జ ఇచ్చిన విలేపనాలు అన్నింటినీ వెన్నుడు తన ఒంటినిండా పూసుకొని ఆమెపట్ల ప్రసన్నుడయినాడు. ముప్వంపులుగల ఆమె దేహాన్ని చక్కనొత్త దలచాడు. కుబ్జమీగాళ్ళమీద తన అడుగులుంచి అదిమిపట్టినాడు. తనచేతి రెండు బొటన వ్రేళ్ళను దాసి గడ్డం క్రిందపెట్టి ఒడలు చక్కగా సాగునట్లు పైకెత్తినాడు. అంతలో అది వంపులు దీరి మన్మథుని సమ్మోహనాస్త్రంవలె పొలుపారింది. పిరుదులు, చనుగవ, సొంపునింపగా కుబ్జ చక్కని చుక్కై కమలాక్షుడివైపు కాంక్షతో చూచింది.

**క. 'వేంచేయుము నా యింటికిఁ, బంచశరాకార!' యనుచుఁ బై కొం గాక**
**ర్షించి హరిఁ దిగిచెఁ గామిని, పంచాశుగబాణజాలభగ్నహృదయయై. 1279**

**ప్రతి :** పంచశర+ఆకార= మన్మథుని స్వరూపంవంటి స్వరూపంగల శ్రీకృష్ణా!; నా+ఇంటికిన్= నా గృహానికి; వేంచేయుము= రమ్ము; అనుచున్= అని పలుకుతూ; పైకొంగు= ఆయన ధరించిన ఉత్తరీయంయొక్క చెరగు; ఆకర్షించి= చేజిక్కించుకొని; కామిని= కామం గలిగిన త్రివక్ర; పంచ+ఆశుగ= పంచబాణునియొక్క; (మన్మథునియొక్క); బాణజాల= శరసమూహంచేత; భగ్నహృదయ+ఐ= భంగపడినహృదయం గలదై; హరిన్= నారాయణుణ్ణి; తిగిచెన్= పట్టిలాగింది.

**తా :** కాముకురాలైన కుబ్జహృదయం మదనుడి బాణసమూహంతో చెదరిపోయింది. ఆమె మన్మథాకారా! నా యింటికి దయచెయ్యి అంటూ పద్మనాభునిపయిపంచె చెంగుపట్టుకొని లాగింది.

**క. కామిని తిగిచినఁ గృష్ణుఁడు, రాముని వీక్షించి నగుచు రాజానన! మ**
**త్కామితముఁ దీర్చి పిదపన్, నీ మందిరమునకు వత్తు నేఁ డలుగకుమీ! 1280**

**ప్రతి :** కృష్ణుఁడు= శ్రీకృష్ణుడు; కామిని= కాముకురాలైన త్రివక్ర; తిగిచినన్= తన ఉత్తరీయపు కొంగునుబట్టి లాగగా; రామునిన్= బలరాముణ్ణి; వీక్షించి= చూచి; నగుచున్= నవ్వుతూ; రాజ+ఆనన!= చంద్రునివంటి మోముగలదానా!; మత్+ కామితమున్= నా కోరికను; తీర్చి= నెరవేర్చి; పిదపన్= అవతల; నీ మందిరమునకున్= నీ భవనమునకు; వత్తున్(వచ్చుదున్)= వస్తాను; నేఁడు= ఈ రోజు; అలుగకుమీ!= నేను రాలేదని కోపపడవద్దు.

**తా :** ఆ కాముకురాలు అలా లాగగా కృష్ణుడు బలభద్రుణ్ణి జూచి, నవ్వుతూ ఆమెతో ఇలా అన్నాడు. ఓ చంద్రముఖీ! నా వచ్చిన పని సాధించిన తర్వాత నీ గృహానికి వస్తాను. నేడు కోపించకు.

**వ. అని వీడుకొలిపి కృష్ణుండు విపణిమార్గంబునం జని చని తాంబూలమాలికాగంధంబులును బహువిధంబు లయిన కానికలును బౌరు లిచ్చినం బరిగ్రహించుచు ధనుశ్శాల కరిగి యందు. 1281**

**ప్రతి :** అని వీడుకొలిపి= అని చెప్పి పంపివైచి; కృష్ణుండు= శౌరి; విపణిమార్గంబునన్= అంగడి వీథిలో; చని చని= వెళ్ళి వెళ్ళి; తాంబూలమాలికా గంధంబులును= ఆకుపోకలు, పూలదండలు, మంచిగంధం; బహువిధంబులు+అయిన= పలురకాలైన; కానికలును= బహుమతులును; పౌరులు= మధురానగరవాసులు; ఇచ్చినన్= సమర్పించగా; పరిగ్రహించుచున్= స్వీకరిస్తూ; ధనుస్+శాలకున్= విల్లున్న యాగశాలకు; అరిగి= వెళ్ళి; అందున్= ఆ ధనుశ్శాలలో...

**తా :** ఇలా అంటూ ఆమెను సాగనంపి కృష్ణుడు అంగడి వీథిలో వెళ్ళి వెళ్ళి పురప్రజలిచ్చిన తమ్ములములూ, పూలదండలూ, చందనాలూ ఇంకా పలువిధాలైన కానుకలు స్వీకరిస్తూ ధనుశ్శాలకు వెళ్ళాడు. అక్కడ

**క. సురరాజువింటికైవడి, గురుతరమై భూరివీరగుప్తం బయి దు**
**స్తరమైన విల్లు పొడగని, నరులు వల దనంగ బిట్టు నగి వికసితుఁడై. 1282**

**ప్రతి :** సురరాజు వింటికైవడిన్= ఇంద్రధనుస్సువలె; గురుతరము+ఐ= చాలపెద్దదై; భూరివీరగుప్తంబు+అయి= గొప్ప వీరులచే కాపాడబడుతున్నదై; దుస్తరము+ఐన+విల్లు= ఎత్తడానికి శక్యంగాని చాపమును; పొడగని= చూచి; నరులు= ఆ ధనుశ్శాలలోని మనుషులు; వలదు+అనన్+కన్= వద్దని చెప్పగా; బిట్టునగి= బిగ్గరగా నవ్వి; అట్టహాసమొనర్చి; వికసితుఁడు+ఐ= ఉల్లాసము వహించినవాడై...

**తా :** ఇంద్రధనుస్సువలె మిక్కిలి గొప్పదై, మేటి వీరులచే రక్షింపబడుతున్న, దుర్భరమైన ఆ వింటిని అతడు వీక్షించాడు. రక్షకులు వద్దని అంటుండగా పక్కున నవ్వి ఉత్సాహవంతుడైనాడు.

**శా. బంధుల్ మేలన వామహస్తమునఁ జాపం బెత్తి మౌర్వీలతా**
**సంధానం బొనరించి కొంచెపుఁదెగన్ శబ్దించుచున్ ధీరతా**
**సింధుం డా హరి దాని ఖండితముగాఁ జేసెన్ జనుల్ చూడఁగా**
**గంధేభంబు రసాలదండము నొగిన్ ఖండించుచందంబునన్. 1283**

**ప్రతి :** బంధుల్= చుట్టాలు; మేలు+అనన్= బలే బలే అని ప్రశంసించగా; వామహస్తమునన్= ఎడమ చేతితో; చాపంబు+ఎత్తి= వింటిని, దాని స్థానంనుంచి పైకి లేవనెత్తి; మౌర్వీలతా సంధానంబు+ఒనరించి= తీగవంటి అల్లెత్రాటిని తగిలించి; కొంచెము+తెగన్= కొద్దిగా అల్లెత్రాడు లాగగానే; శబ్దించుచున్= టంగు టంగున మ్రోగిస్తూ; ధీరతా సింధుండు= ధైర్యసముద్రుడైన; ఆ హరి= ఆ నారాయణుడు; దానిన్= ఆ చాపాన్ని; గంధ+ఇభంబు= మదగజం; రసాల దండమున్= చెరకు గడను; ఒగిన్= క్రమంగా; ఖండించు చందంబునన్= విరిచే విధంగా; జనుల్= ప్రజలు; చూడన్+కాన్= చూస్తూండగా; ఖండితము+కాన్+చేసెన్= విరిచి వేశాడు.

**తా :** ధైర్యానికి సాగరం వంటివాడైన శ్రీకృష్ణుడు తనచుట్టాలు మెచ్చగా ఎడమచేతితో అలవోకగా ధనుస్సును పైకెత్తాడు. తీగవంటి అల్లెత్రాటిని కొద్దిగా లాగి తగిలించి నారిని మొరయిస్తూ మదపుటేనుగు చెరకు గడను తునిమే రీతిగా జనులు చూస్తుండగా వింటిని రెండుగా విరిచి వేశాడు.

**క. కోదండ భంగనిర్గత, నాదము వీనులకు భీషణం బయి యాశా**
**రోదోంతరములు నిండుచు, భేదించెన్ భోజవిభునిబింకము నధిపా! 1284**

**ప్రతి :** అధిపా!= పరీక్షిన్మహారాజా! కోదండ భంగనిర్గతనాదము= విల్లు విరగడంచేత వెలువడిన శబ్దం; వీనులకున్= చెవులకు; భీషణంబు+అయి= భయంకరమై; ఆశా రోదస్+అంతరములు= దిక్కులు, భూమ్యాకాశాలు అనేవాటి మధ్యప్రదేశాలు; నిండుచున్= నిండిపోతూ; భోజవిభుని బింకమున్= భోజవంశానికి చెందిన కంసరాజు గర్వాన్ని; భేదించెన్= చెరిచింది.

**తా :** పరీక్షిన్మహారాజా! విల్లు విరిగినప్పుడు పుట్టిన చప్పుడు చెవులకు భీతి గొల్పుతూ, దిగంతరాలను పూరిస్తూ భోజభూపాలుడైన కంసుడి ధైర్యాన్ని భేదించింది.

**వ. అప్పుడు. 1285**

**ప్రతి :** అప్పుడు= ఆ సమయంలో...

**ఉ. 'అద్దిర! రాచవిల్ విఱిచె నర్భకుఁ డెంతయు శంక లేక నేఁ**
**డుద్దవిడిన్ సహింపఁ దగ దుగ్రతఁ బట్టుద' మంచుఁ గ్రుద్ధులై**
**గ్రద్దన లేచి తద్ధనువుకావలివా రరుదేర వారి న**
**య్యిద్దఱుఁ గూడి పట్టి మడియించిరి కార్ముకఖండహస్తులై. 1286**

**ప్రతి :** అద్దిర!= ఔరా!; అర్భకుఁడు= పసివాడు; ఎంతయున్= మిక్కిలి; శంకలేక= జంకులేక; నేఁడు= ఈ రోజు; ఉద్దవిడిన్= ఒక్కుమ్మడి, తత్క్షణమే; రాచవిల్= రాజుగారి ధనుస్సును; విఱిచెన్= భగ్నంచేశాడు; సహింపన్+తగదు= ఈ దుశ్చర్యను ఓర్వరాదు; ఉగ్రతన్= భయంకరత్వంతో; పట్టుదము= ఇతణ్ణి బంధిద్దాం; అంచున్= అని పలుకుతూ; క్రుద్ధులు+ఐ= కోపగించినవారై; గ్రద్దనన్+లేచి= వెంటనే లేచి; తద్+ధనువు కావలివారలు= ఆ వింటికి కావలిగానున్న మనుషులు; అరుదేరన్= తమపైకిరాగా; వారిన్= ఆ కావలికాండ్రను; ఆ+ఇద్దఱున్= ఆ బలరామకృష్ణులిద్దరూ; కూడి= చేరి; కార్ముకఖండహస్తులు+ఐ= వింటియొక్క తుంటలు చేతులందుగలవారై; పట్టి= పట్టుకొని; మడియించిరి= చంపారు.

**తా :** "ఔరా! ఈ బాలు డేమాత్రం సందేహించక శౌర్యంతో ఇపుదు రాజుగారిధనుస్సు ఖండించాడు. ఇది సహించరాని సాహసకార్యం. ఇతణ్ణి పౌరుషంతో పట్టాలి" అంటూ చాపరక్షకులు కోపోద్రేకంతో వెంటనే లేచి మీదికి వచ్చారు. అంతట రామకృష్ణులు ఇద్దరూ ఆ వింటితుంటలు చేతపుచ్చుకొని వారిని పట్టి కొట్టి మట్టుపెట్టారు.

**వ. అట్లు రామకృష్ణులు మథురాపురంబున విహరించి వెడలి విడిదలకుం జని రంత. 1287**

**ప్రతి :** అట్లు= ఆ విధంగా; రామకృష్ణులు= బలరాముడు, శ్రీకృష్ణుడు; మథురాపురంబునన్= మథురానగరిలో; విహరించి= సంచరించి; వెడలి= బయలుదేరి; విడిదలకున్= తమ బసకు; చనిరి= వెళ్ళారు; అంతన్= అటుపిమ్మట...

**తా :** ఈ విధంగా బలరామకృష్ణులు మథురాపురంలో విహారంచేసి అక్కడినుంచి బయలుదేరి తమ విడుదులకు వెళ్ళిపోయారు. పిమ్మట

## ❖ సూర్యాస్తమయ చంద్రోదయముల వర్ణనము ❖

**మ. గగనారణ్యచరాంధకారగజముం గాలాహ్వయవ్యాధుఁ డ**
**చ్చుగఁ బట్టన్ గమకించి మ చ్చిడుటకై చూతాంకురశ్రేణిచే**
**నొగిఁ గల్పించిన కందుకం బనఁగ సూర్యుం డంత వీక్షింపఁగాఁ**
**దగె మందప్రభతోడ పశ్చిమమహాధాత్రీధరేంద్రంబునన్. 1288**

**ప్రతి :** గగన= ఆకాశమనే; అరణ్య= అడవియందు; చర= తిరుగునట్టి; అంధకార= చీకటి అనే; గజమున్= ఏనుగును; కాల+ఆహ్వయవ్యాధుఁడు= కాలమనే పేరుగల బోయవాడు; అచ్చుగన్= పద్ధతిగా; పట్టన్= బంధించడానికి; గమకించి= పూనుకొని; మచ్చు+ఇడుటకై= మచ్చుపెట్టుటకై; చూత+అంకురశ్రేణిచేన్= మామిడి చిగుళ్ళ మొత్తంతో; ఒగిన్= యోగ్యంగా;

కల్పించిన= ఏర్పరచిన; కందుకంబు= పుట్టచెండు; అనన్+కన్= అనునట్లు; అంతన్= అప్పుడు; సూర్యుండు= రవి; మందప్రభతోడన్= తగ్గిన కాంతితో; పశ్చిమ మహాధాత్రీధర+ఇంద్రంబునన్= పడమటి దెసలోని గొప్ప కొండయందు; వీక్షింపన్+కాన్+తగెన్= చూడదగి ఉన్నాడు.

**తా :** కాలమనే కిరాతుడు, ఆకాశమనే అరణ్యంలో, చీకటి అనే ఏనుగును బంధించడానికై పూనుకొని మచ్చుపెట్టుటకు తయారుచేసిన మామిడిచిగుళ్ల చెండా అన్నట్లుగా మార్తాండుడు మందగించిన కాంతితో పడమటి పర్వతంమీద చూడముచ్చట గొలిపాడు.

**క. తరుణుఁ డగు శీతకరునిన్, మరగి వియల్లక్ష్మి దన్ను మాని ముదుకఁడున్**
**ఖరకరుఁడు ననుచు ద్రొబ్బిన, కరణిన్ రవి పశ్చిమాద్రికడఁ గ్రుంకె నృపా! 1289**

**ప్రతి :** నృపా!= పరీక్షిన్మహారాజా!; వియత్+లక్ష్మి= ఆకాశమనే స్త్రీ; తరుణుఁడు= పడుచువాడు; అగు= అయినట్టి; శీతకరునిన్= చంద్రుణ్ణి; మరగి= వలచి; ముదుకఁడున్= ముసలివాడును; ఖరకరుఁడున్= వాడికిరణాలుగలవాడును; అనుచున్= అని; తన్నున్= తనను; మాని= వదలి; దొబ్బిన కరణిన్= తొలగదోసిన విధంగా; రవి= సూర్యుడు; పశ్చిమ+అద్రికడన్= పడమటి కొండదగ్గర; క్రుంకెన్= అస్తమించాడు.

**తా :** పరీక్షిన్మహారాజా! ఆకాశమనెడి వనిత లేతవయసువాడూ, చల్లని కిరణాలుగలవాడూ (చల్లని చేతులవాడు) అయిన చంద్రుణ్ణి వలచి, వృద్ధుడూ వాడికిరణాలు గలవాడూ (కరకు చేతులవాడు) అంటూ తన్ను త్రోసి రాజన్న విధంగా భానుడు పడమటి కొండదగ్గర అస్తమించాడు.

**క. కళలు కలుగుఁ గాక కమల తోడగుఁ గాక, శివుని మౌళిమీఁదఁ జేరుఁగాక**
**నన్యు నొల్లఁ దపనుఁడైన మత్పతి యని, సాధ్విభంగిఁ గమలజాతి మొగిడె. 1290**

**ప్రతి :** కళలు= పదహారుకళలు; కలుగున్+కాక= తనకు ఉండిన ఉండుగాక!; కమల= శ్రీమహాలక్ష్మి; తోడు+అగున్+కాక= తోడబుట్టిందైనా అగునుగాక; మౌళిమీఁదన్= పరమేశ్వరునితలమీద; చేరున్+కాక= ప్రవేశించిన ప్రవేశించునుగాక!; మత్+పతి= నా భర్త; తపనుఁడు+ఐనన్= తాపం కల్గించేవాడయినా; అన్యున్= ఇతరుణ్ణి, పరుడైన చంద్రుణ్ణి; ఒల్లన్= ప్రేమించను; అని= అంటూ; సాధ్విభంగిన్= పతివ్రతవలె; కమలజాతి= పద్మాల సమూహం; మొగిడెన్= ముకుళించింది; (సంధ్యాసమయంలో పద్మాలు ముకుళిస్తాయి. చంద్రోదయం తామరలకు వికసనహేతువు గాదు.)

**తా :** తాను షోడశ కళాపూర్ణుడగు గాక! లక్ష్మీదేవి తనకు తోబుట్టువగుగాక! తాను శివుని సిగనెక్కి నిక్కుగాక! అన్యుడైన ఆ చంద్రుడిపొత్తు మాకు అక్కరలేదు. తపింపజేసేవాడయినప్పటికీ మా భర్త సూర్యుడే అని పతివ్రతవలె పద్మినీజాతి మూతి ముడుచుకుంది.

**క. సుందరసాయంసంధ్యా, వందనవిప్రార్ఘ్యతోయవజ్రహతోద్య**
**న్మందేహాసురరక్త, స్యందము క్రియఁ గెంపుసొం పెసఁగె నపరదిశన్. 1291**

**ప్రతి :** సుందర= మనోహరమైన; సాయం సంధ్యావందన= సాయంకాలంలో సలిపే సంధ్యావందనంలో; విప్ర= బ్రాహ్మణులయొక్క; అర్ఘ్యతోయ= అర్ఘ్యజలమనే; వజ్ర= వజ్రాయుధంచేత; హత= సంహరించేటప్పుడు; ఉద్యత్= వెలువడిన;

మందేహ+అసుర= మందేహులనే రక్కసులయొక్క; రక్తస్యందము క్రియన్= నెత్తుటి స్రావం మాదిరి; అపరదిశన్= పడమటి దిక్కులో; కెంపుసొంపు= అరుణిమయొక్క శోభ, ఎర్రని కాంతియొక్క అందం; ఎసఁగెన్= ప్రకాశించింది.

**తా :** ఒప్పిదమైన సాయంకాలసంధ్యావందనంలో బ్రాహ్మణులయొక్క అర్ఘ్యప్రదానజలాలనే వజ్రాయుధంచేత ఖండించబడిన మందేహులనే రాక్షసులయొక్క దేహాలనుంచి వెలువడే రక్తస్రావమో అన్నట్లుగా సంజకెంజాయ పడమటి దిక్కులో వ్యాపించింది.

**విశే :** అమృత పానవిషయంలో ఏర్పడిన నష్టం కారణంగా - రాక్షసుల్లోని - మందేహుడు, అరుణుడు అనేవాళ్లు బ్రహ్మను గూర్చి తపస్సు చేసి, సూర్యునితో యుద్ధం చేస్తుండేటుగా వరంపొందారు. వీళ్లు సూర్యగమనాన్ని అడ్డుకొంటుంటారు. వీళ్లను చంపడానికి మూడుసంధ్యల్లో బ్రాహ్మణులు గాయత్రీ మంత్రంతో వదిలే అర్ఘ్యం కారణంగా - ఆ యిద్దరూ హతులవుతారు. కానీ బ్రహ్మ ఇచ్చిన వరప్రభావం వల్ల మరలా బ్రదుకుతుంటారు. ఈ విషయం సాయంసంధ్యావర్ణనమైన ఈ పద్యంలో ప్రస్తావించబడింది.

**ఆ. భూమి నుండి మింటఁ బూర్ణమై కర్కట, మకర మీనరాశి మహితమైన**
**హరియశస్సుధాబ్ధియందులతుంపురు, లనఁగ జుక్క లొప్పె నాకసమున. 1292**

**ప్రతి :** భూమినుండి= ధరణినుండి; మింటన్= ఆకాశమునందు; పూర్ణము+ఐ= నిండిందై; కర్కట మకర మీనరాశి= ఎండ్రకాయలు, మొసళ్ళు, చేపలు అనే వాటిగుంపుచేత; మహితము+ఐన= గొప్పదైన; హరి= శ్రీమన్నారాయణుని; యశస్+సుధా+అబ్ధి+అందుల= కీర్తి అనే క్షీరసాగరంలోని; తుంపురులు+అనఁగన్= బిందువులో అన్నట్లు; ఆకసమునన్= గగనంలో; చుక్కలు= నక్షత్రాలు; ఒప్పెన్= ప్రకాశించాయి.

**తా :** నారాయణమూర్తియొక్క కీర్తి అనే క్షీరసాగరం భూమినుండి గగనం వరకు వ్యాపించింది. అది కర్కట, మకర, మీనరాశులచే అతిశయించింది. అట్టి పాలవెల్లిలోని తుంపురులో అన్నట్లు చుక్కలు ఆకాశంలో ప్రకాశించాయి.

**విశే :** కీర్తి అనే క్షీరసాగరంలోని తుంపురు - ఆకాశంపైకి ఎగిరాయి. అది ఆకాశంలో కర్కటక, మకర, మీన రాశుల్లాగా ఉన్నాయి.

**క. ఎల్లదిశలు నిండిన శ్రీ, వల్లభు గుణమహిమ బ్రహ్మ వాసించుటకై**
**చల్లినమృగమద మనఁగా, వెల్లివిరిసెఁ దమము గగనవీథుల నెల్లన్. 1293**

**ప్రతి :** బ్రహ్మ= బ్రహ్మదేవుడు; ఎల్లదిశలు= అన్ని దిక్కులందు; నిండిన= వ్యాపించిన; శ్రీవల్లభు= లక్ష్మీవిభుని; గుణమహిమ= సద్గుణాలయొక్క గొప్పతనం; వాసించుటకై= పరిమళించుటకై; చల్లిన= చల్లినట్టి; మృగమదము= కస్తూరి; అనన్+కాన్= అనేటట్లు; తమము= చీకటి; గగనవీథులన్+ఎల్లన్= ఆకాశమార్గాలన్నింటిలోను; వెల్లివిరిసెన్= దట్టంగా వ్యాపించింది.

**తా :** అన్ని దిక్కులందు నిండిన లక్ష్మీనాథునిమహిమ పరిమళించుటకై బ్రహ్మదేవుడు చల్లిన కస్తూరి కాబోలు అన్నట్టు ఆకాశ వీథులన్నింటిలో చీకట్లు ముసురుకున్నాయి.

**విశే :** కస్తూరి నల్లగా ఉంటుంది కనుక చీకట్లను కస్తూరిగా భావించడమైంది.

**క. ఆ చీఁకటి వెనుతగిలినఁ, బ్రాచీదిశనుండి గంతుఁ బరువున రవి భ**
**ర్మాచలము మలఁక ద్రోవను, వే చనియెంగాక నిలిచి వెఱుగక యున్నే? 1294**

**ప్రతి :** ఆ చీఁకటి= ఆ అంధకారం; వెను తగిలినన్= తన్ను వెంబడించగా; ప్రాచీదిశనుండి= తూర్పుదిక్కునుంచి; గంతు+ పరువునన్= దుముకుతూ పరుగెత్తడంచేత; రవి= సూర్యుడు; భర్మ+అచలమున్= బంగరు కొండను (మేరుపర్వతాన్ని); మలఁక త్రోవను= చాయబాటలోగాక అడ్డదారిలో; వే చనియెన్+కాక= శీఘ్రంగా వెళ్ళి చేరినాడే తప్ప; నిలిచి= ఆ చీకటిని ఎదిరించి నిలిచితే; విఱుగక+ఉన్నే?= ఓడిపోకుండా ఉండగలడా? అపజయం పాలయ్యేవాడని భావం.

**తా :** గగనవీథులంతటా నిండిన కారుచీకటి తన వెంటబడి తరుమగా భయపడి సూర్యుడు తూర్పుదిక్కునుంచి చౌకళిస్తూ పరుగెత్తి, మేరుగిరిని అడ్డదారిలో క్షేమంగా చేరినాడే తప్ప – ఆ చీకటిని ఎదిరించి నిలిచితే అతడు తప్పక పరాజయం పాలయ్యేవాడే!

**ఉ. మీకును వైరి; యెప్పుడును మిక్కిలి మాకును వైరి; రాజు దో**
**షాకరుఁ; డింక వచ్చు జలజాతములార! మదీయబాలురం**
**జేకొనుఁ డంచు బాలకులఁ జీఁకటి దాఁచిన భంగిఁ జిక్కి రా**
**రాక వసించెఁ దుమ్మెదలు రాత్రి సరోరుహకుట్మలంబులన్. 1295**

**ప్రతి :** జలజాతములార!= ఓ పద్మములారా!; రాజు= చంద్రుడు; దోషాకరుఁడు= దోషములకు ఆకరుడు–అనగా పాపనిలయుడు (రాత్రిని కల్గించువాడు); ఎప్పుడును= సదా; మీకును వైరి= మీకు గూడా శత్రువు; మిక్కిలి= అధికంగా; మాకును వైరి= మాకుగూడా విరోధి; ఇంకన్= ఇక; వచ్చున్= వస్తాడు (ఉదయించబోతున్నాడు); మదీయబాలురన్= మా పిల్లలను; చేకొనుఁడు= స్వీకరించండి; అంచున్= అని; బాలకులన్= తమ బిడ్డలను; చీఁకటి= అంధకారం; దాచిన భంగిన్= కమల గర్భములందు రహస్యంగా ఉంచినదో అన్నట్లు, చిక్కి= సూర్యాస్త సమయంలో ముకుళించినపద్మాలలో చిక్కుకొని; రారాక= తామరలనుంచి వెలుపలికి వెడలి రాలేక; తుమ్మెదలు= భృంగాలు; రాత్రిన్= నిశయందు; సరోరుహ కుట్మలంబులన్= తామర మొగ్గలలో; వసించెన్= నివసించాయి.

**తా :** సూర్యుడు అస్తమించాడు. చీకటి ఏర్పడబోతున్నది. ఆ చీకటి తామరలను జూచి ఓ తమ్ములారా! చంద్రుడు మీకూ మాకూ శత్రువే. అతడు దోషాకరుడు–అంటే రాత్రిని కలుగజేసేవాడు. అడుగో రాబోతున్నాడు. మా బాలకులను స్వీకరించి భద్రంగా మీ కడుపుల్లో పెట్టుకొని కాపాడండి అంటూ చీకటి తన పిల్లలను దాచడానికి అప్పగించిన రీతిగా తుమ్మెదలు తామర మొగ్గలందు చిక్కుకొని, వెలుపలికి రాలేక రాత్రి అంతా అక్కడే నివసించాయి.

**సీ. ప్రాచీదిశాంగనాఫాలతలంబున, దీపించు సిందూరతిలక మనఁగ**
**దర్పించి విరహులధైర్యవల్లులు ద్రెంప, దర్పకుం డెత్తిన దాత్ర మనఁగ**
**నలిగి కాలకిరాతుఁ డంధకారమృగంబు ఖండింప మెఱయించు ఖడ్గ మనఁగ**
**గగనతమాలవృక్షము తూర్పుకొమ్మను, లలితమై మెఱయు పల్లవ మనంగఁ**

**ఆ. దొగలు సంతసిల్ల దొంగలు భీతిల్లఁ, గడలి మిన్ను ముట్టి కడలుకొనఁగఁ**
**బొడిచె శీతకరుఁడు భూరిచకోరక, ప్రీతికరుఁడు జారభీతికరుఁడు. 1296**

**ప్రతి :** ప్రాచీదిశా= తూర్పు దిక్కు అనే; అంగనా= స్త్రీయొక్క; ఫాలతలంబునన్= నుదుటిభాగంలో; దీపించు= ప్రకాశించే; సిందూర తిలకము= సిందూరపుబొట్టు (కుంకుమబొట్టు); అనన్+కన్= అనేటట్లున్నూ; దర్పించి= చెలరేగి; విరహుల=

వియోగులయొక్క; ధైర్యవల్లులు= ధైర్యమనే తీగలు; త్రెంపన్= తెగగోయటానికి; దర్పకుండు= మన్మథుడు; ఎత్తిన= చేతధరించిన; దాత్రము+అనన్+కన్= కొడవలో అన్నట్లునూ; అలిగి= కోపించి; కాలకిరాతుఁడు= కాలమనే బోయవాడు; అంధకారమృగంబున్= చీకటి అనే జంతువును; ఖండింపన్= నరకడానికి; మెఱయించు= జళిపించు; ఖడ్గము+అనన్+కన్= కత్తియా అన్నట్లూ; గగనతమాల వృక్షము= ఆకాశమనే చీకటిమానుయొక్క; తూర్పు కొమ్మను= తూర్పు దిక్కులోని శాఖయందు; లలితము+ఐ= మనోజ్ఞమై; మెఱయు= ప్రకాశించే; పల్లవము+అనన్+కన్= చిగురుటాకో అన్నట్లునూ; తొగలు= కలువలు; సంతసిల్లన్= సంతోషం చెందగా, వికాసంపొందగా; దొంగలు= చోరులు; భీతిల్లన్= భయపడగా; కడలి= సముద్రం; మిన్నుముట్టి= ఆకాశాన్నితాకి; కడలుకొనఁగన్= ఉప్పొంగగా; భూరిచకోరకప్రీతికరుఁడు= చకోరపక్షులకు మిక్కిలిసంతోషం కల్గించేవాడును; జారభీతికరుఁడు= విటులకు భయంకల్గించేవాడున్నూ అయి; శీతకరుఁడు= చల్లని కిరణాలుగల చంద్రుడు; పొడిచెన్= ఉదయించాడు.

**తా :** చకోరపక్షులకు ప్రీతినీ, విటకాంద్రకు భీతినీ కలిగిస్తూ చంద్రుడు ఉదయించాడు. అతడు తూర్పుదిక్కనే కోమలి ముఖంపై దీపించే కుంకుమబొట్టు అన్నట్లుగానూ, వియోగుల ధైర్యమనే తీగల్ని త్రెంచడానికి గర్వంతో మన్మథుడెత్తిన కొడవలి అన్నట్లుగానూ, కాలుడనే బోయవాడు చీకటి అనే మృగాన్ని ఖండించడానికి జళిపించే కత్తి అన్నట్లుగానూ, ఆకాశమనే కానుగుచెట్టుయొక్క తూర్పుకొమ్మలో మెరిసే మెత్తని చిగురాకు అన్నట్లుగానూ ఉన్నాడు. అతణ్ణిచూచి కలువలు వికసించాయి. దొంగలు భయపడ్డారు. సాగరం తరగలెత్తి అంబరమంటింది.

**క. దర్పితతారాధిపపరి, సర్పిత కిరణౌఘమిళితసకలదివంబై**
**యేర్పడి కమలభవాండము, గర్పూరపుఁ గ్రోవిభంగిఁ గనుపట్టె నృపా! 1297**

**ప్రతి :** నృపా!= ఓ పరీక్షిన్మహారాజా!; దర్పిత= విజృంభించిన; తారా+అధిప= నక్షత్రాలకు ఈశుడైన చంద్రుడియొక్క; పరిసర్పిత= అంతటా వ్యాపించిన; కిరణ+ఓఘ= కిరణసమూహాలతో; మిళిత= కూడిన; సకలదివంబు+ఐ= సమస్తమైన ఆకాశం కలదై; ఏర్పడి= తేటపడి; కమలభవ+అండము= బ్రహ్మాండం; కర్పూరము+క్రోవిభంగిన్= కర్పూరపు గొట్టం మాదిరి; కనుపట్టెన్= గోచరించింది.

**తా :** ఓ పరీక్షిన్మహారాజా! త్రుళ్ళిపడుతున్న చుక్కలరేడు చక్కగా ప్రకాశించగా పండువెన్నెల గగనతలమంతా వ్యాపించడంచేత బ్రహ్మాండం కర్పూరంతో నిండిన బరణి మాదిరి వెలుగొందింది.

**క. ఆ రేయి గోపయుతులై, క్షీరాన్నము గుడిచి రామకృష్ణులు మదిఁ గం**
**సారంభ మెఱిఁగి యిష్ట వి, హారంబుల నప్రమత్తులై యుండి రిటన్. 1298**

**ప్రతి :** ఆ రేయి= ఆ రాత్రియందు; రామకృష్ణులు= బలరాముడు, శ్రీకృష్ణుడు; గోపయుతులు+ఐ= గోపాలురతో కూడినవారై; క్షీర+అన్నమున్= పాలబువ్వను; కుడిచి= ఆరగించి; కంస+ఆరంభము= కంసునియొక్క పూనిక; మదిన్= మనసులో; ఎఱిఁగి= తెలిసి; ఇష్టవిహారంబులన్= తమకు ఇష్టమైన వినోదాలతో; అప్రమత్తులు+ఐ= జాగరూకులై; ఇటన్= మధురాపురి విడిదిలో; ఉండిరి= ఉన్నారు.

**తా :** ఆ వెన్నెలరాత్రి బలరామకృష్ణులు గోపకులతో కలసి పాలబువ్వ ఆరగించి, మనసులో కంసుని ప్రయత్నాలన్నీ గమనిస్తూ యథేచ్ఛావిహారాలతో ఆ నగరోపవనంలో జాగరూకులై గడిపారు.

**క. తన పురికి రామకృష్ణులు, సనుదెంచి నిజానుచరులఁ జంపుటయు మహా**
**ధనువు గదిసి విఱుచుటయును, విని కంసుఁడు నిదుర లేక విహ్వలమతియై. 1299**

**ప్రతి :** తన పురికిన్= తన పట్టణమైన మధురకు; రామకృష్ణులు= బలరామశ్రీకృష్ణులు; చనుదెంచి= వచ్చి; నిజ+అనుచరులన్= తన సేవకులను; చంపుటయున్= సంహరించడమున్నూ; మహాధనువున్= గొప్పవింటిని; కదిసి= సమీపించి; విఱుచుటయును= భగ్న మొందించడమున్నూ; విని= ఆకర్ణించి; కంసుఁడు= కంసభూపతి; నిదురలేక= నిద్రపోక; విహ్వలమతి+ఐ= కలవరపడిన మనసుగలవాడై...

**తా :** కంసుడు తన పట్టణానికి బలరామకృష్ణులు రావటమూ, తన అనుచరులను వధించడమూ, పెను ధనుస్సును విరిచి వేయడమూ విన్నాడు. అతనికి నిద్రపట్టలేదు. మనసు కలక బారింది.

**సీ. కర్ణరంధ్రములు చేఁ గప్పిన లోపలి ప్రాణఘోషము వినఁబడక డిందెఁ**
**దోయాదికములందుఁ దొంగిచూచిన యంతఁ దల గానరా దయ్యెఁ దనువుమీఁదఁ**
**గరశాఖ నాసికాగ్రంబుపై నిడి చూడ గ్రహతారకలు రెండుగా నగపడె**
**వెలుఁగున నిలుచుండి వీక్షింపఁగా మేనినీడ సరంధ్రమై నేలఁ దోఁచె**

**ఆ. నడుగుజాడ దృష్టమౌట లే దయ్యెను, దరువులెల్ల హేమతరువు లగుచు**
**మెఱయుచుండెఁ గాలమృత్యువు దగ్గఱ, బుద్ధి యెల్లఁ గలఁగె భోజపతికి. 1300**

**ప్రతి :** భోజపతికిన్= భోజవంశ ప్రభువైన కంసుడికి; కాలమృత్యువు= మరణసమయం; దగ్గఱన్= సమీపించగా; కర్ణరంధ్రములు= చెవులయొక్క రంధ్రాలను; చేన్= చేతితో; కప్పినన్= మూయగా; లోపలి ప్రాణఘోషము= చెవుల లోపలి ప్రాణవాయువుయొక్క శబ్దం; వినఁబడక= వినిపించక; డిందెన్= చెవిలోపలనే అణగిపోయింది; తోయ+ఆదికములందున్= నీరు మొదలైనవాటిలో; తొంగిచూచిన+అంతన్= ముందుకు వంగి చూచినప్పుడు; తనువు మీఁదన్= శరీరంపైన; తల= శిరస్సు; కానరాదు+అయ్యెన్= కనబడటం లేదు; కరశాఖన్= చేతివ్రేలిని; నాసికా+అగ్రంబుపైన్= ముక్కుయొక్క కొనమీద; ఇడి= ఉంచి; చూడన్= కనుగొనగా; గ్రహతారకలు= గ్రహాలు, నక్షత్రాలు; రెండుగాన్= ఒక్కొక్కటి రెండుగా; అగపడెన్= కనిపించాయి; వెలుఁగునన్= వెలుతురులో; నిలుచుండి= నిలబడి; వీక్షింపన్+కాన్= చూడగా; మేనినీడ= దేహచ్ఛాయ; నేలన్= భూమిమీద; సరంధ్రము+ఐ= రంధ్రంతో కూడిందై; తోఁచెన్= గోచరించింది; అడుగుజాడ= పాదంమోపినగుర్తు; దృష్టము+ఔట= కాన్పించుట; లేదు+అయ్యెన్= లేదాయెను; తరువులు+ఎల్లన్= చెట్లన్నీ; హేమతరువులు+అగుచున్= బంగారుచెట్లై; మెఱయుచున్+ఉండెన్= ప్రకాశిస్తూ ఉన్నాయి; బుద్ధి+ఎల్లన్= ప్రజ్ఞ అంతా; కలఁగెన్= కలతచెందింది.

**తా :** భోజభూపతి కంసుడికి మరణకాలం సమీపించడంవల్ల చెవిరంధ్రాలను చేతులతో మూసినపుడు తనలోపలి ప్రాణవాయువుయొక్క సంచారధ్వని వినిపించడం లేదు. నీళ్ళు, అద్దం మొదలైన వాటిలో తన ప్రతిబింబాన్ని చూచినపుడు తన శరీరంమీద తల కనిపించడం లేదు. ముక్కుకొనను వ్రేలుంచి పైకి వీక్షించినపుడు ఆదిత్యాదిగ్రహాలు, అశ్వని మొదలైన నక్షత్రాలు ఒక్కొక్కటి రెండు రెండుగా కనిపించాయి. వెలుతురులో నిలబడి తన నీడను చూచినప్పుడు ఆ నీడ నడుమరంధ్రాలు కనిపించసాగాయి. నేలమీద తాను నడచిన అడుగుల గుర్తు కనిపించడంలేదు. అతని కంటికి కనిపించే చెట్లన్నీ బంగారు వన్నెతో భాసించాయి. అతని బుద్ధి కలత చెందింది.

**విశే :** మరణం దగ్గర్లో రానున్నవారికి - ఈ పద్యంలో చెప్పిన దుస్సంఘటనలు గోచరిస్తాయి. ఇలా జరిగితే మృత్యువు తప్పదని శాస్త్రం.

**క. గరళముఁ దినుటయుఁ బ్రేతముఁ, బరిరంభించుటయు నగ్నభావుఁ డవుటయున్**
**శిరమునఁ దైలము వడుటయు, ఖరపతి నెక్కుటయు నతఁడు కలలోఁ గనియెన్. 1301**

**ప్రతి :** అతఁడు= కంసభూపతి; గరళమున్= విషాన్ని; తినుటయున్= భక్షించడం; ప్రేతమున్= పీనుగును; పరిరంభించుటయున్= కౌగిలించుకొనడం, ఆలింగనం చేసుకోవడం; నగ్నభావుఁడు+అగుటయున్= దిసమొలతో ఉండటం; శిరముననన్= తలమీద; తైలము+పడుటయున్= నూనె పడటం; ఖరపతిన్= గొప్పగాడిదను; ఎక్కుటయున్= అధిరోహించడం; కలలోన్= స్వప్నంలో; కనియెన్= చూచాడు.

**తా :** కంసుడు విషం తిన్నట్లు, శవాన్ని కౌగిలించుకొన్నట్లు, దిసమొలతో ఉన్నట్లు, నూనెతో తలంటుకొన్నట్లు, గాడిద నెక్కినట్లు కలగన్నాడు. (ఇలాంటి స్వప్నాలూ సన్నిహిత మృత్యువునే సూచిస్తాయి.)

**వ. మఱియు రక్తకుసుమమాలికాధరుండై యొక్కరుండును నెక్క డేనియుం జనుచున్న వాఁడ నని కల గాంచి మరణహేతుక భీతిఁ జింతాక్రాంతుండై నిద్రఁ జెందక వేగించుచున్న సమయంబున. 1302**

**ప్రతి :** మఱియున్= ఇంకా; రక్త కుసుమ మాలికాధరుండు+ఐ= ఎర్రని పూలదండలు ధరించినవాడై; ఒక్కరుండును= తానొక్కడే, ఒంటరిగా; ఎక్కడ+ఏనియున్= ఎచటికో; చనుచున్+ఉన్నవాఁడన్+అని= పోతున్నానని; కల+కాంచి= స్వప్నం కని; మరణహేతుక భీతిన్= చావుకు కారణమనే భయంతో; చింతా+ఆక్రాంతుండు+ఐ= దుఃఖంచేత ఆవరించబడినవాడై; నిద్రన్+చెందక= నిదురపోక; వేగించుచున్+ఉన్న సమయంబునన్= తెల్లవారుత్తున్న వేళలో...

**తా :** ఇంకా ఎర్రని పూలదండలు ధరించి ఏకాకై ఎక్కడికో వెళుతున్నట్లు అతడు కల గాంచాడు. మరణానికి కారణమైన భయంతో కంసుడు దుఃఖాక్రాంతుడై నిద్రపోక ఆ రాత్రి ఎలాగో వేగించాడు.

## ❖ సూర్యోదయ వర్ణనము ❖

**క. అరుణహరినఖరవిదళిత, గురుతిమిరేభేంద్రకుంభకూటవినిర్ము**
**క్త రుధిరమౌక్తికములక్రియ, సురపతిదిశఁ గెంపుతోడఁ జుక్కలు మెఱసెన్. 1303**

**ప్రతి :** అరుణ= సూర్యుడనే; హరి= సింహంయొక్క; నఖర= గోళ్ళచేత; విదళిత= చీల్చబడిన; గురుతిమిర= అధికమైన చీకటి అనే; ఇభ+ఇంద్ర= గజరాజంయొక్క; కుంభకూట= కుంభస్థలమనే శిఖరాలనుంచి; వినిర్ముక్త= విడువబడిన; రుధిర మౌక్తికముల క్రియన్= నెత్తురు, ముత్యాలు అనే వాటివలె; సురపతిదిశన్= ఇంద్రునికి సంబంధించిన దిక్కులో అనగా తూర్పు దెసలో; కెంపుతోడన్= ఎర్రదనంతో, అరుణిమతో; చుక్కలు= నక్షత్రాలు; మెఱసెన్= ప్రకాశించాయి.

**తా :** సూర్యుడనే సింహం గోళ్ళతో చీల్చగా దట్టమైన చీకటి అనే గజరాజుయొక్క కుంభస్థలమనే కొండకొమ్మునుండి వెలువడ్డ నెత్తుటితోగూడిన ముత్యాలో అన్నట్లు తూర్పుదిక్కులో ఎర్రదనంతో చుక్కలు ప్రకాశించాయి.

**విశే :** ఏనుగుల కుంభస్థలాల్లో మంచి ముత్యాలుంటాయని పెద్దలు చెప్తారు.

సీ. పౌలోమి తనబాలుపాన్పుపైఁ గనుపట్టఁ బన్నిన పవడంపుబంతి యనఁగ
నాయురర్థముల వ్యయంబు లొత్తిలి చాటు కాలజాంఘికు చేతిఘంట యనఁగ
ఘనజంతుజీవితకాలరాసుల విధి కొలువ నెత్తిన హేమకుంభ మనఁగఁ
బశ్చిమదిక్కాంత పరఁగఁ గైసేయుచో ముందట నిడుకొన్న ముకుర మనఁగఁ

తే. గోకతాపోపశమదివ్యఘుటిక యనఁగఁ, బద్మినీకాంతనోములఫల మనంగ
మూఁడుమూర్తుల సారంపు ముద్ద యనఁగ, మిహిరమండల ముదయాద్రిమీఁద నొప్పె. 1304

ప్రతి : పౌలోమి= పులోముని కూతురు శచీదేవి; తన బాలుపాన్పుపైన్= తన కుమారుడైన జయంతుడియొక్క పరుపుమీద; కనుపట్టన్= కనిపించేటట్లు; పన్నిన= ఏర్పాటుచేసిన; పవడము+బంతి= పగడాలచెండో; అనన్+కన్= అనే విధంగానూ; ఆయుస్+అర్థములవ్యయంబులు= ఆయుస్సు అనే ధనంయొక్క నష్టాలు; ఒత్తిలి= బిగ్గరగా; చాటు= ప్రకటించు, తెలియజేయు; కాలజాంఘికు చేతిఘంట= కాలమనే దండోరా వేయువాని చేతిలోని గంటయో; అనన్+కన్= అనునట్లున్నూ; ఘన= విశేషమైన; జంతు= ప్రాణులయొక్క; జీవితకాలరాశులన్= జీవితకాలాలనే సమూహాలను; విధి= బ్రహ్మ; కొలువన్= కొలుచుటకు; ఎత్తిన= పట్టిన, కైకొన్న; హేమకుంభము+అనఁగన్= బంగారుభాండమో అన్నట్లునూ; పశ్చిమదిక్+కాంత= పడమటి దిశ అనే అంగన; పరఁగన్= ఒప్పిదంగా; కైసేయుచోన్= అలంకరించుకొనేటప్పుడు; ముందటన్= ఎదుట; ఇడుకొన్న= ఉంచుకొన్న; ముకురము+అనఁగన్= అద్దమో అనునట్లుగానూ; కోక= చక్రవాకాలనే పక్షులయొక్క; తాప= వియోగంవల్ల కల్గిన వేదనయొక్క; ఉపశమ= శాంతికొరకైన; దివ్యఘుటిక+అనన్+కన్= దేవసంబంధమైన మాత్రయో అన్నట్లునూ; పద్మినీకాంత= తామరతీగ అనే స్త్రీయొక్క; నోములఫలము+అనంగన్= వ్రతాలఫలమో అన్నట్లునూ; మూఁడుమూర్తుల= త్రిమూర్తులయొక్క, బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులయొక్క; సారము+ముద్ద+అనఁగన్= శక్తులయొక్క రాశియో అన్నట్లునూ; మిహిరమండలము= సూర్యబింబం; ఉదయ+అద్రిమీఁదన్= తూర్పుకొండపైన; ఒప్పెన్= ప్రకాశించింది. (సూర్యుడు త్రిమూర్త్యాత్ముడు)

తా : సూర్యబింబం తూర్పు కొండమీద ఉదయించింది. శచీదేవి తన పిల్లవాడి పానుపుమీద కనిపించేటట్లు చిలుకల పందిరికి అమర్చిన పగడాల బంతియా అన్నట్లుంది. ఆయుస్సనే ధనం వ్యయమై పోతున్నది అని గట్టిగా చాటుతున్న కాలమనే వార్తాహరుడిచేతిలోని గంటా అన్నట్లుంది. బ్రహ్మదేవుడు ప్రాణుల జీవితకాలమనే ధాన్యరాశుల్ని కొలవడానికి ఎత్తిన బంగారు కుంచమా అన్నట్లుంది. పడమటిదిక్కు అనే అంగన అలంకరించుకునేటప్పుడు ముందుంచుకున్న అద్దమా అన్నట్లుంది. జక్కవ పిట్టల పరితాపం మాన్పే దివ్యమైన మందుగుళికయా అన్నట్లుంది. పద్మిని అనే నాయిక వ్రతఫలమా అన్నట్లుంది. ముమ్మూర్తుల వెలుగుముద్దయా అన్నట్లుంది.

క. వచ్చెం జల్లని గాడ్పులు, విచ్చెం గమలములు; దమము విరిసి బిలంబుల్
చొచ్చెం; బద్మమరందము, మెచ్చెం దుమ్మెదలు గ్రోలి మిహిరుఁడు వొడమన్. 1305

ప్రతి : మిహిరుఁడు= సూర్యుడు; పొడువన్= ఉదయించగా; చల్లనిగాడ్పులు= శీతలవాయువులు; వచ్చెన్= వీచాయి; కమలములు= తామరలు; విచ్చెన్= వికసించాయి; తమము= చీకటి; విరిసి= తొలగి; బిలంబుల్= గుహలు; చొచ్చెన్= ప్రవేశించింది; తుమ్మెదలు; పద్మమరందమున్= తామర పూలలోని తేనెను; క్రోలి= తాగి; మెచ్చెన్= పొగడాయి.

**తా :** సూర్యోదయ సమయంలో చల్లని గాలులు వీచాయి. పద్మాలు పూచాయి. చీకట్లు పటాపంచలై గుహలలో దూరాయి. తుమ్మెదలు తమ్మిపూదేనెను తాగి ఆనందించాయి.

**క. సంకాశితోదయాచల, పంకజసఖకిరణరాగపరిపూర్ణంబై**
**పంకేరుహగర్భాండము, కుంకుమసలిలంపుఁ గ్రోవి కొమరున నొప్పెన్. 1306**

**ప్రతి :** సంకాశిత= లెస్సగా ప్రకాశించిన; ఉదయ+అచల= తూర్పుకొండలోని; పంకజసఖ= తామరల చెలికాడైన సూర్యునియొక్క; కిరణరాగ= కిరణాలయొక్క రక్తిమచేత (ఎర్రదనంచేత); పరిపూర్ణంబు+ఐ= నిండిందై; పంకేరుహగర్భ+అండము= బ్రహ్మాండం; కుంకుమ సలిలము+క్రోవి కొమరునన్= కుంకుమ కలిపిన నీళ్ళగొట్టంవలె; ఒప్పెన్= ప్రకాశించింది.

**తా :** తూరుపు కొండమీద ఉదయించిన సూర్యుని కిరణాల అరుణిమతో నిండినదై బ్రహ్మాండం కుంకుమ నీటితో కూడిన బుడ్డివలె శోభిల్లింది.

**వ. తదనంతరంబ. 1307**

**ప్రతి :** తద్+అనంతరంబు+అ= ఆ తర్వాత...

**తా :** ఆ తరువాత

**సీ. పాషాణవల్మీకపంకాదిరహితంబు మృదులకాంచననిభమృణ్మయంబు**
**కమనీయకస్తూరికాజలసిక్తంబు బద్ధచందనదారుపరివృతంబు**
**మహనీయకుసుమదామధ్వజతోరణమండితోన్నతమంచమధ్యమంబు**
**బ్రాహ్మణ క్షత్త్రాది పౌరకోలాహలం బశ్రాంత తూర్యత్రయాంచితంబు**

**ఆ. నిర్మలంబు సమము నిష్కంటకంబునై, పుణ్యపురుషమనముఁ బోలి కంస**
**సైన్యతుంగ మగుచు సంతుష్టలోకాంత, రంగమైన మల్లరంగ మొప్పె. 1308**

**ప్రతి :** సంతుష్ట= సంతోషించిన; లోక= జనులయొక్క; అంతరంగము= మనస్సుగలది; ఐన= అయినట్టి; మల్లరంగము= జెట్టిపోరాటం జరిగే ప్రదేశం; పాషాణ= రాళ్ళు, వల్మీక= పుట్టలు; పంక= బురద; ఆదిరహితంబు= మొదలైనవి లేనిదీ; మృదుల= మెత్తని; కాంచననిభ= బంగారంతో సమానమైన; మృద్+మయంబు= మట్టితో నిండిందీ; కమనీయ= ఇంపైన; కస్తూరికాజల= కస్తూరి కలిపిననీళ్ళతో; సిక్తంబు= తడుపబడిందీ; బద్ధ= కట్టబడిన; చందనదారు= గంధపు కొయ్యలచేత; పరివృతంబు= చుట్టబడిందీ; మహనీయ= గొప్పవైన; కుసుమదామ= పూలదండలచేతను; ధ్వజ= జెండాలచేతను; తోరణ= మామిడాకుల తోరణాలచేతా; మండిత= అలంకరించబడిన; ఉన్నతమంచ= ఎత్తయిన మంచెలయొక్క; మధ్యమంబు= నడుముగలదీ; బ్రాహ్మణ= విప్రులు; క్షత్త్ర+ఆది= క్షత్రియులు మొదలైన; పౌర= పురజనులయొక్క; కోలాహలంబు= కలకల ధ్వనులుగలదీ; అశ్రాంత= ఎడతెగని; తూర్యత్రయ= నృత్తగీత వాద్యాలనే మూటిచేత; అంచితంబు= ఒప్పునట్టిదీ; నిర్మలంబు= మాలిన్యం లేనిదీ, పరిశుద్ధమైందీ; సమము= చదునైనది అనగా మిట్టపల్లాలులేనిదీ; నిష్కంటకంబును+ఐ= ముళ్ళులేనిదై; పుణ్యపురుషమనమున్+పోలి= పుణ్యాత్ముడైన మానవుడి మనస్సునకు సాటి అయిందై; కంససైన్యతుంగము= కంసుడి సేనచేత ఉన్నతం; అగుచున్= అవుతూ; ఒప్పెన్= అలరారింది.

**తా :** కంసభూపతి మల్లయుద్ధానికి సిద్ధపరచిన క్రీడారంగం రాళ్ళు, పుట్టలు, బురదలేనిదై, మెత్తని బంగారు వన్నె మట్టితో ఒప్పింది. అది కమ్మనికస్తూరిజలంతో తడుపబడింది. దానికి చుట్టూ గందపుకర్రలతో కంచె ఏర్పరచబడింది. గొప్ప పూలదండలతో, పతాకలతో, తోరణాలతో ఆ క్రీడారంగం అలంకరించబడింది. ఎత్తైన ఆసనాలమధ్య ఆ రంగం నిర్మించబడింది. బ్రాహ్మణులు, క్షత్రియులు మొదలైన పురప్రజల కోలాహలంతో రంగస్థలం నిండిపోయింది. ఎడతెగకుండా మ్రోగుతున్న వాద్యధ్వనులతో ఆ ప్రదేశం ఎసలారింది. అది పుణ్యపురుషుని మనస్సు మాదిరి మాలిన్యం లేనిదై, సమమై, కంటక రహితమై శోభిల్లింది. కంసుడి సైన్యంతో ఉన్నతమై వన్నెమీరింది. జనుల హృదయాలకు సంతోషం సమకూరుస్తున్నది.

**క. ఆ మల్లరంగపరిసర, భూమిస్థిత మంచమందు భోజేంద్రుఁడు మా**
**న్యామాత్యసంయుతుండై, భూమీశులు గొలువ నుండెఁ బొక్కుచు నధిపా! 1309**

**ప్రతి :** అధిపా!= పరీక్షిన్మహారాజా!; ఆ మల్లరంగ= జెట్టులు పెనుగులాడే ఆ ప్రదేశంయొక్క; పరిసర= సమీపమందలి, చేరువలోని; భూమిస్థిత= నేలమీద ఉన్న; మంచము+అందున్= ఉన్నతాసనంలో; భోజ+ఇంద్రుఁడు= భోజవంశంలో పుట్టిన కంసభూపతి; మాన్య+అమాత్యసంయుతుండు+ఐ= గౌరవార్హులైన మంత్రులతో కూడినవాడై; భూమి+ఈశులు= ధరాధిపతులు (రాజులు); కొలువన్= సేవిస్తుండగా; పొక్కుచున్= చింతిస్తూ; ఉండెన్= ఉన్నాడు.

**తా :** ఆ మల్లరంగానికి చేరువలో ఉన్న ఉన్నతాసనంలో భోజరాజేంద్రుడైన కంసుడు మాన్యులగు మంత్రులతోగూడి సామంతరాజులు తన్ను సేవిస్తుండగా దుఃఖపడుతూ కూర్చుని ఉన్నాడు.

**మ. సకలాంభోనిధిమేఖలావహనముం జాలించి యేతెంచు నా**
**గ కులాగంబులభంగి నొప్పుచుఁ దగం గైసేసి చాణూర ము**
**ష్టికకూటుల్ శలతోసలుల్ గురువులన్ సేవించుచున్ రంగ ధా**
**త్రికి నేతెంచిరి తూర్యఘోషముల నుద్రేకం బనేకంబుగన్. 1310**

**ప్రతి :** సకల= సమస్తమైన; అంభస్+నిధి మేఖలా= సముద్రాలు మొలనూలుగా గల్గిన భూమియొక్క; వహనమున్= బరువును మోయడాన్ని; చాలించి= మానుకొని; ఏతెంచు= వచ్చునట్టి; నాగ= ఐరావతాది దిగ్గజాలవలె; కుల+అగంబులభంగిన్= కులపర్వతాల మాదిరిగా; ఒప్పుచున్= శోభిల్లుతూ; తగన్= బాగుగా; కైసేసి= అలంకరించుకొని; చాణూర= చాణూరుడు; ముష్టిక కూటుల్= ముష్టికుడు, కూటుడు; శల తోసలుల్= శలుడు, తోసలుడు అనే మల్లురు; గురువులన్= విద్యనేర్పిన ఒజ్జలను; సేవించుచున్= కొలుస్తూ; తూర్యఘోషములన్= వాద్యపు మ్రోతలతో; ఉద్రేకంబు= విజృంభణం; అనేకంబుగన్= పెక్కురీతులు కాగా; రంగధాత్రికిన్= క్రీడారంగభూమికి; ఏతెంచిరి= వచ్చారు.

**తా :** సమస్త సముద్రాలు మొలనూలుగా ఉన్న భూమండలాన్ని మోయడం మానుకొని, నడిచి వస్తున్న దిగ్గజాలలాగా, కులపర్వతాల మాదిరి ఒప్పుతూ, తగినట్లు అలంకరించుకొని చాణూరుడూ, ముష్టికుడూ, శలుడూ, తోసలుడూ తమ ఉపాధ్యాయులను కొలుస్తూ, నానావిధాలైన వాద్యశబ్దాలకు బహువిధాలఉద్రేకం చెలరేగగా రంగస్థలానికి వచ్చారు.

**విశే :** కుల+అగంబులు= కులపర్వతాలు. ఇవి ఏడు. మహేంద్రం, మలయం, సహ్యం, శుక్తిమంతం, గంధమాదనం, వింధ్యం, పారియాత్రం అని.

**క. నందాదులైన గోపకు, లందఱుఁ జని కానుకలు సమర్పించి నృపున్**
**సందర్శించి తదనుమతిఁ, జెంది మహామంచముల వసించిరి వరుసన్. 1311**

**ప్రతి :** నంద+ఆదులు+ఐన= నందుడు మొదలైన; గోపకులు= గొల్లలు; అందఱున్= ఎల్లవారు; చని= మల్లరంగానికి పోయి; కానుకలు= బహుమానాలు; సమర్పించి= అర్పణంచేసి; నృపున్= ప్రభువైన కంసుణ్ణి; సందర్శించి= చూచి; తద్+అనుమతిన్+చెంది= ఆయన అంగీకారాన్ని పొంది; వరుసన్= క్రమంగా; మహామంచములన్= గొప్ప మంచెలయందు; వసించిరి= కూర్చున్నారు.

**తా :** నందుడు మొదలైన గోపాలకు లందరూవెళ్ళి, కంసరాజును సందర్శించి, కానుకలు సమర్పించి, ఆతనిఅనుజ్ఞతో పెద్దపెద్ద ఆసనాలమీద వరుసగా కూర్చున్నారు.

**వ. అంత రామకృష్ణులు నలంకృతులై మల్లదుందుభినినదంబు విని సందర్శన కుతూహలంబున. 1312**

**ప్రతి :** అంతన్= పిదప; రామకృష్ణులున్= బలరాముడు; శ్రీకృష్ణుడు; అలంకృతులు+ఐ= అలంకరించుకొన్నవారై; మల్ల దుందుభినినదంబు= మల్లురయొక్క నగరామ్రోత; విని= ఆలకించి; సందర్శన కుతూహలంబునన్= చూడాలి అనే ఉబలాటంతో...

**తా :** అంతట బలరామకృష్ణులు అలంకరించుకొని జెట్టీల భేరీ నినాదాలు విని, మల్లరంగం చూడటానికి ఉబలాటపడ్డారు.

**క. ఓడక రంగద్వారముఁ జూడం జని వారు కనిరి సమదకువలయా**
**పీడంబున్ భిన్నపరా, క్రీడంబుం బ్రమదకంటకితచూడంబున్. 1313**

**ప్రతి :** వారు= బలరామకృష్ణులు; ఓడక= జంకక; రంగద్వారమున్+చూడన్+చని= మల్లరంగముయొక్క వాకిలి దారిలో వెళ్ళి; భిన్న= భేదించిన; పర= ఇతర గజములయొక్క; ఆక్రీడంబున్= ఆటలు గలదియు; ప్రమద= అధికమైన మదంతో; కంటకిత= గగుర్పొడిచిన; చూడంబున్= శిరస్సు గలదీ; సమద= మదంతో గూడిన; కువలయ+ఆపీడంబున్= కువలయా పీడమనే పేరుగల కంసుడి యేనుగును; కనిరి= చూచారు. (కువలయ+ఆపీడనము= భూమండలాన్నంతా ఎక్కువగా పీడించేది)

**తా :** రామకృష్ణులు జంకూ గొంకూ లేకుండా రంగస్థలం వాకిలిదగ్గరకు వెళ్ళి మదంతో కూడిన కువలయా పీడమనే ఏనుగును చూచారు. అది గ్రొచ్చి కోరాడటంలో ఇతర గజాలను క్రిందుపరుస్తుంది. ఆ మత్తేభం అధికమదంతో గగుర్పొడిచిన ముందల కలది.

**వ. కని తత్కరిపాలశ్రేష్ఠుండైన యంబష్ఠునికి మేఘనాదగంభీరభాషణంబుల రిపుభీషణుండగు హరి యిట్లనియె. 1314**

**ప్రతి :** కని= చూచి; తత్+కరిపాలశ్రేష్ఠుండు+ఐన= ఆ కువలయా పీడమనే ఏనుగును పరిపాలించే వారిలో ప్రముఖుడైన; అంబష్ఠునికిన్= మావటివానికి; మేఘనాద= మేఘధ్వనివలె; గంభీర= గంభీరమైన; భాషణంబులన్= మాటలతో; రిపుభీషణుండు+అగు= శత్రువులకు భయంకరుడైన; హరి= మాధవుడు; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** అరిభయంకరుడైన శ్రీహరి ఆ మదగజాన్ని అవలోకించి, మేఘగర్జనంవలె గంభీరమైన కంఠంతో మావటివాళ్ళకు నాయకుడైనవాణ్ణి చూచి ఇట్లన్నాడు.

## ❖ శ్రీ కృష్ణుఁడు కువలయాపీడ మను గజంబును వధించుట ❖

**శా. ఓరీ! కుంజరపాల! మా దెసకు నీ యుద్యన్మదేభేంద్రముం**
**బ్రేరేఁపం బనిలేదు; త్రిప్పు; మరలం బ్రేరేఁచినన్ నిన్ను గం**
**భీరోగ్రాశనితుల్యముష్టిహతులన్ భేదించి నేఁ డంతకుం**
**జేరం బుత్తు మహత్తరద్విపముతో సిద్ధంబు యుద్ధంబునన్. 1315**

**ప్రతి :** ఓరీ కుంజరపాల!= ఓరీ మావటివాడా!; మాదెసకున్= మా తట్టుకు; ఈ+ఉద్యత్+మద+ ఇభ+ఇంద్రమున్= పూనిక వహించే ఈ మదించిన గజరాజమును; ప్రేరేఁపన్= పురికొల్పవలసిన; పనిలేదు= అవసరం లేదు; త్రిప్పు= దీన్ని వెనుకకు మరలించు; మరలన్= మళ్ళీ; ప్రేరేఁచినన్= మా మీదికి పురికొల్పితే; నిన్నున్= నిన్ను; గంభీర= గ్రహించుటకు వీలుకాని; ఉగ్ర= భయంకరమైన; అశనితుల్య= పిడుగుతో సమానమైన; ముష్టిహతులన్= పిడికిటి పోటులతో; భేదించి= పగులనడచి; నేఁడు= ఈ దినం; అంతకున్+చేరన్= యముడి దగ్గరకు పోయేటట్లు; యుద్ధంబునన్= పోరులో; మహత్తరద్విపముతోన్= బలీయమైన ఏనుగుతో; పుత్తున్= నిన్ను పంపుతాను; సిద్ధంబు= ఇది తథ్యం.

**తా :** ఓరీ మావటీ! మా వైపు ఈ మత్త మాతంగాన్ని తోలవలసిన పనిలేదు. దీన్ని వెనుకకు మరలించు. డీ కొలిపినావా పోరాటంలో నీ మదపుటేనుగుతోపాటు నిన్నూ గంభీరమైన, దారుణమైన, పిడుగు పాటులవంటి నా పిడిగ్రుద్దులతో పొడిచి చంపుతాను. యముడిపాలికి ఇపుడే పంపుతాను. ఇది నిజం.

**వ. అని పలికి. 1316**

**ప్రతి :** అని పలికి= అని అని...

**ఉ. మించిన కొప్పుఁ జక్కనిడి మేలనఁ బచ్చని చీర కాసె బం**
**ధించి లలాటకుంతలతతిన్ మరలించుచు సంగరక్రియా**
**చుంచుతఁ బేర్చి బాలకుఁడు చూచుజనంబులు దన్ను 'బాపురే'?**
**యంచు నుతింప దగ్గఱియె హస్తజితాగము గంధనాగమున్. 1317**

**ప్రతి :** మించిన= అతిశయించిన; కొప్పున్= జుట్టుముడిని; చక్కన్+ఇడి= గట్టిగా సవరించుకొని; మేలు+అనన్= గోపాలకులు సెబాసని మెచ్చగా; పచ్చనిచీర= పీతాంబరాన్ని; కాసెబంధించి= దట్టిగా చుట్టి; లలాటకుంతలతతిన్= నుదుటిపై జీరాడే ముంగురుల మొత్తాన్ని; మరలించుచున్= పైకి ఎగదోస్తూ; సంగరక్రియా చుంచుతన్= యుద్ధక్రీడలలోని నైపుణ్యంతో; పేర్చి= చెలరేగి; బాలకుఁడు= బాలుడైన శ్రీకృష్ణుడు; చూచుజనంబులు= ఈ దృశ్యాన్ని చూస్తున్న ప్రజలు; తన్నున్=తనను; బాపురే!= వహ్వారే, బళిరే; అంచున్= అని; నుతింపన్= పొగడగా; హస్తజిత+అగమున్= తన తొండంతో జయించబడిన కొండలుగలది అయిన; గంధనాగమున్= మదపుటేనుగును; దగ్గఱియెన్= సమీపించాడు.

**తా :** అందమైన జుట్టుముడిని చక్క చేసుకుని, మెల్లగా పీతాంబరాన్ని దట్టిగా బిగించి కట్టుకుని, నుదుట వ్రేలాడే ముంగురులను పైకి తోసుకుంటూ, యుద్ధకార్య నైపుణ్యంతో బాలుడైన శ్రీకృష్ణుడు చూచేవారు సెబాసని తన్ను మెచ్చుకుంటుండగా తొండంతో కొండలను పిండిచేసే ఆ మత్త వేదండాన్ని సమీపించాడు.

**క. అంజక బాలకుఁ డనియును, గొంజక దయమాలి రాజకుంజర! యంతం**
**గుంజరమును డీ కొలిపెను, గుంజరపాలకుఁడు గోపకుంజరుమీఁదన్. 1318**

**ప్రతి :** రాజకుంజర!= ఓ రాజశ్రేష్ఠుడా!; అంజక= సందేహించకుండా; బాలకుఁడు= పసివాడు; అనియును= అనికూడా; కొంజక= సంకోచించక; దయమాలి= కనికరం లేనివాడై; అంతన్= అపుడు; కుంజర పాలకుఁడు= మావటీడు; గోపకుంజరు మీఁదన్= గోపకులలో శ్రేష్ఠుడైన శ్రీకృష్ణుడిమీదికి; కుంజరమును= ఏనుగును; డీ కొలిపెను= పురి కొలిపాడు; (పైకి ఎగదోలాడు.)

**తా :** ఓ రాజోత్తమా! మావటివాడు – బాలుడని కూడా సందేహించక, కరుణమాలి కంసుడిఆజ్ఞానుసారం గోపకుల శ్రేష్ఠుడైన శ్రీకృష్ణుడిమీదికి ఏనుగును డీ కొలిపాడు.

**వ. మఱియు న య్యనేకపం బనేకపపాలకప్రేరితం బయి, మహావాతసంఘాతసముద్ధూతంబగు విలయకాలకీలికేళిని బిట్టు మిట్టిపడి, మృత్యుదేవత యెత్తునం, గాలుపోలిక, శమనునిగమనిక, నెదిరి మదసలిలపరిమళలుబ్ధపరిభ్రమద్భ్రమరగాయకఝుంకృతు లహంకృతి సంపాదింపం, గులకుంభినీధర గుహాకుంభగుంభనంబుగ ఘీంకరించి, రోషభీషణశేషభోగిభోగభయంకరంబగు కరంబున శౌరిం జీరి, చీరికిం గొనక, పట్టిన నట్టిట్టు గెంటి, విధుంతుదవదనగహ్వరంబువలన విడివడి యుఱుకు తరణికరణి దర్పించి కుప్పించి, పాదమధ్యంబునకు నసాధ్యుండై దూఁటి మాటుపడినం గ్రోధబంధురంబై సింధురంబు మహార్ణవమధ్యమంథాయమానమంథరమహీధరంబుకైవడి జిఱజిఱం దిరిగి, కానక భయానకంబై గాలివెరవునం గని పొంగి చెంగటం బ్రళయదండిదండప్రశస్తంబగు హస్తంబు వంచి వంచించి చుట్టిపట్టి పడవేయం గమకించినం జలింపక తెంపున హరి కరిపిఱింది కుఱికి మహారాహువాలవల్లికాకర్షణోదీర్ణుం డగు సుపర్ణు తెఱంగున నెగిరి శుండాలంబు వాలంబు లీలం గేల నొడిసిపట్టి జళిపించి పంచవింశతి బాణాసనప్రమాణదూరంబు బీరంబునం ద్రిప్పివైవ, న వ్వారణంబు దుర్నివారణంబై రణంబున కోహటింపక సవ్యాపసవ్యపరిక్రమణంబుల నవక్రంబై కవిసిన, నపసవ్యసవ్యక్రమంబులఁ దప్పించి, రొప్పి కుప్పించి యెదుర్కొనినఁ గర్కశుం డయి, మేచకాచలతుంగ శృంగనిభంబగు కుంభికుంభంబు చక్కటిప్రక్కలై చెక్కలెగయ దురంతకల్పాంతజీమూతప్రభూతనిర్ఘాతనిష్ఠురంబగు ముష్టి సారించి యూఁచి పొడిచినం దద్వికీర్ణపూర్ణ రక్తసిక్తమౌక్తికంబులు వసుంధరకు సంధ్యారాగరక్తతారకాచ్ఛన్నం బగు మిన్ను చెన్నులవరింప నిలువరింపక మ్రొగ్గి మోఁకరిలి, మ్రొగ్గక దిగ్గన న గ్గజంబు లేచి, చూచి, త్రోచి, నడచి, సంహారసమయసముద్రసంఘాత సంభూతసముత్తుంగభంగసంఘట్టితం బగు కులాచలంబుక్రియఁ గ్రమ్మఱ న మ్మహాభుజుని భుజాదండంబులవలన ఘట్టితంబై, కట్టలుక ముట్టి నెట్టి, డీకొని ముమ్మరంబుగం గొమ్ములం జిమ్మిన, న మ్మేటి చేసూటి మెఱసి హస్తాహస్తి సంగరంబునఁ గరం బొప్పి దప్పిం బడక నొప్పించిన, నకుంఠితకాలకంఠ కఠోరభల్లభగ్నంబగు పురంబు పగిది, జలధిం జటులఝంఝానిలవికలంబగు కలంబుకైవడి**

**న మ్మదకలంబు బలంబు దక్కిచిక్కి స్రుక్కువడి లోఖికరంబునుంబోలె దానసలిలధారావిరహితంబై, విరహితలంపునుం బోలె నిరంతరచిత్తజాతవిగ్రహంబై, గ్రహణకాలంబునుం బోలెఁ బరాధీనఖరకరంబై, ఖరకరోదయంబునుం బోలె, భిన్నపుష్కరంబై, పుష్కరవైరివిలసనంబునుం బోలె నభాసితపద్మకంబై యున్న సమయంబున. 1319**

**ప్రతి :** మఱియున్= ఆ తరువాత; ఆ+అనేకపంబు= ఆ యేనుగు; అనేకపపాలక= ఆ గజపాలకునిచేత (ఆ మావటివానిచేత); ప్రేరితంబు+అయి= శ్రీకృష్ణునిమీదికి పురికొల్పబడిందై; మహావాత= సుడిగాలియొక్క; సంఘాత= సమూహంచేత; సముద్ధూతంబు+అగు= ఎగురగొట్టబడిందైన; విలయకాల= ప్రళయకాలంలోని; కీలి కేళినిన్= అగ్నిరీతిగా; బిట్టుమిట్టిపడి= మిక్కిలి త్రుళ్ళిపడి, ఎగిరిపడి; మృత్యుదేవత+ఎత్తునన్= మృత్యుదేవతమాదిరి; కాలుపోలికన్= కాలపురుషుని రీతిగానూ; శమనుని గమనికన్= యముడి చందాన; ఎదిరి= ఎదిరించి; మదసలిల= చెక్కిటి మదజలంయొక్క; పరిమళ= వాసనకు; లుబ్ధ= పేరాసపడి; పరిభ్రమత్= తిరుగుచున్న; భ్రమరగాయక= తుమ్మెదలనే గాయకులయొక్క, పాటలు పాడేవారియొక్క; ఝుంకృతులు= జుమ్మనే రొదలు; అహంకృతి సంపాదింపన్= పెనుగర్వాన్ని కలిగించగా; కుల కుంభినీధర= సప్తకులపర్వతాల యొక్క; గుహాకుంభ= బిలములనే భాండములందు; గుంభనంబు+కన్= కూర్చినట్లుగా; ఘీంకరించి= గీపెట్టి; రోష= కోపంచేత; భీషణ= భయంకరమైన; శేషభోగి= ఆదిశేషుడనే సర్పంయొక్క; భోగ= శరీరంమాదిరి, భయంకరంబు+అగు= భీతిగల్గించే; కరంబునన్= తొండంతో; శౌరిన్= శూరుడనే వానియొక్క మనుమడైన శ్రీకృష్ణుణ్ణి; చీరి= తాకి; చీరికిన్+కొనక= లక్ష్యపెట్టక; పట్టినన్= పట్టుకోగా; అట్టు+ఇట్టు= ఆ ప్రక్కకు ఈ ప్రక్కకు; గెంటి= త్రోసి; విధుంతుద= రాహువుయొక్క; వదనగహ్వరంబువలనన్= గుహవంటి నోటినుంచి; విడివడి= తొలగి; ఉఱుకు= అవతలికి దాటుకొను; తరణి కరణిన్= సూర్యునివలె; దర్పించి= విజృంభించి; కుప్పించి= పైకెగిరి; పాదమధ్యంబునకున్= ఆ ఏనుగుయొక్క కాళ్ళనడిమికి; అసాధ్యుండు+ఐ= సాధించరానివాడై; దూఁటి= దూరి; మాటుపడినన్= మరుగుపడగా; సింధురంబు= కువలయాపీడమనే ఆ ఏనుగు; క్రోధబంధురంబు+ఐ= కోపంచేత నిండిందై; మహా+అర్ణవమధ్య= గొప్ప సముద్రంయొక్క నడుమ, మంథాయమాన= కవ్వంగా చేయబడిన; మంథర మహీధరంబుకైవడిన్= మందరమనే పర్వతంలాగా; జిఱజిఱన్+తిరిగి= గిరగిరా పరిభ్రమించి; కానక= శ్రీకృష్ణుణ్ణి కనుగొనలేక; భయానకంబు+ఐ= భీతి గల్గించునట్టిదై; గాలివెరవునన్= గాలిద్వారా; కని= శ్రీకృష్ణుణ్ణి వీక్షించి; పొంగి= చూచితిని గదా అని ఉబ్బిపోయి; చెంగటన్= సమీపంలోనే; ప్రళయ= కల్పాంతంలోని; దండి= యమునియొక్క; దండప్రశస్తంబు= దండంవలె ప్రసిద్ధమైంది; అగు= ఐన; హస్తంబు వంచి= తొండం సాచి; వంచించి= మోసపుచ్చి; చుట్టిపట్టి= మెలివైచి; పడవేయన్= నేలమీద కూల్చడానికి; గమకించినన్= పూనుకొనగా; హరి= నారాయణుడు; చలింపక= జంకక; తెంపునన్= తెగువతో; కరి పిఱిందికిన్= ఏనుగుయొక్క వెనుకవైపునకు; ఉఱికి= దుమికి; మహారాహు= గొప్ప రాహువుయొక్క; వాలవల్లికా= తీగవంటి తోకను; ఆకర్షణ= లాగుటలో; ఉదీర్ణుండు+అగు= గొప్పవాడైన; సుపర్ణుతెఱంగునన్= గరుత్మంతుడివలె; ఎగిరి= పైకి ఎగిరి; శుండాలంబవాలంబు= ఆ గజంయొక్క తోకను; లీలన్= సవిలాసంగా; కేలన్= చేతితో; ఒడిసిపట్టి= జవిరి పట్టుకొని; జళిపించి= ఆడించి; పంచవింశతి= ఇరవైఐదు; బాణ+ఆసనప్రమాణ= విండ్ల కొలతలుగల; దూరంబునన్= దవ్వులో; బీరంబునన్= పరాక్రమంతో; త్రిప్పివైవన్= త్రిప్పి విసరివేయగా; ఆ+వారణంబు= ఆ గజం; దుర్+నివారణంబు+ఐ= మిక్కిలి నివారించరానిదై; రణంబునకున్= యుద్ధానికి; ఓహటింపక= వెనుదీయక; సవ్య+అపసవ్య పరిక్రమణంబులన్= ఎడమ కుడివైపులకు దాటుకోవడంచేత; అవక్రంబు+ఐ= వంకరగా తిరుగుతూ; కవిసినన్= పైబడగా; అపసవ్య సవ్యక్రమంబులన్= కుడివైపు, ఎడమవైపుల తిరుగుతూ; తప్పించి= ఆ గజధాటిని తొలగించి; రొప్పి= తరిమి; కుప్పించి= దుముకి; ఎదుర్కొనినన్= ఎదిరించగా; కర్కశుండు+అయి= కఠినుడై; మేచక+అచల= అంజన పర్వతంయొక్క; తుంగ= ఎత్తైన; శృంగ= శిఖరంతో;

నిభంబు+అగు= సమానమైన; కుంభి కుంభంబు= ఏనుగుయొక్క కుంభస్థలం; చక్కటి వ్రక్కలు+ఐ= చక్కగా ఏర్పడిన ముక్కలై; చెక్కలు+ఎగయన్= ఖండాలు లేవగా; దురంత= అంతంలేని; కల్ప+అంత= ప్రళయకాలమందలి; జీమూత= మేఘాలనుండి; ప్రభూత= పుట్టిన; నిర్ఘాత= పిడుగువలె; నిష్ఠురంబు+అగు= కఠినమైన; ముష్టిన్= పిడికిలిని; సారించి= సాచి; ఊ౦చి= ఊగించి, లాగి; పొడిచినన్= పొడువగా; తద్= ఆ గజముయొక్క కుంభస్థలంనుంచి; వికీర్ణ= జాఱిన; పూర్ణ= నిండైన; రక్త= నెత్తుటితో; సిక్త= తడిసిన; మౌక్తికంబులు= ముత్యాలు; వసుంధరకున్= భూమికి; సంధ్యారాగ= సంధ్యాసమయమందలి; రక్తతారకాచ్ఛన్నంబు+అగు= ఎఱ్ఱని నక్షత్రాలచేత కప్పబడిన; మిన్ను చెన్ను= ఆకాశంయొక్క శోభను; అలవరింపన్= కల్గించగా; నిలువరింపక= నిలబడలేక; ప్రొగ్గి= ముందుకు వ్రాలి; మో౦కరిలి= మోకాళ్ళు నేలమీద ఆనించి; ప్రొగ్గక= ముందుకు వ్రాలక; దిగ్గన= శీఘ్రమే; ఆ+గజంబు= ఆ యేనుగు; లేచి= నిలబడి; చూచి= కనుగొని; త్రోచి నడచి= నెట్టుకుంటూ నడచిందై; సంహారసమయ= ప్రళయకాలంలోని; సముద్రసంఘాత= సాగరముల సమూహాలందు; సంభూత= జనించిన; సముత్తుంగ= మిక్కిలి ఉన్నతాలైన; భంగ= అలలచేత; సంఘట్టితంబు+అగు= లెస్సగా కొట్టబడిన, కుల+అచలంబు క్రియన్= కులపర్వతంవలె; క్రమ్మఱన్= మళ్ళీ; ఆ+మహాభుజుని= గొప్పబాహువులు గల మాధవునియొక్క; భుజాదండంబులవలనన్= పెద్ద కఱ్ఱలవంటి బాహువులవల్ల; ఘట్టితంబు+ఐ= కొట్టబడిందై; కడున్+అలుకన్= మిక్కిలి కోపంతో; ముట్టి= తాకి; నెట్టి= త్రోసి; డీకొని= ఎదిరించి; ముమ్మరంబు+కన్= తీవ్రంగా; కొమ్ములన్= దంతాలతో; చిమ్మినన్= పొడువగా; ఆ+మేటి= శూరుడైన ఆ శ్రీకృష్ణుడు; చేసూటి మెఱసి= చేతివాటంతో ప్రకాశించి; హస్తాహస్తిసంగరంబునన్= చేయి చేయి కలిపి చేసే పోరాటంలో; కరంబు+ఒప్పి= మిక్కిలి ప్రకాశించి; దప్పిన్+పడక= అలసట చెందక; నొప్పించినన్= ఆ యేనుగును బాధించగా; అకుంఠిత= మొక్కవోని; కాలకంఠ= శివునియొక్క; కఠోర= కఠినమైన; భల్ల= బల్లెంచే; భగ్నంబు+అగు= చెడినట్టి; పురంబుపగిదిన్= త్రిపురాసురుల పట్టణం మాదిరి; జలధిన్= సముద్రమందు; చటుల= తీవ్రమైన; ఝంఝూ+అనిల= వర్షంతో కూడిన గాలివలె; వికలంబు+అగు= సంధులు సడలినట్టి; కలంబు కైవడిన్= ఓడవలె; ఆ+మదకలంబు= ఆ మదపుటేనుగు; బలంబు+తక్కి= సత్తువచెడి; చిక్కి= శుష్కించి, లోబడి; స్రుక్కు+పడి= చింతనొంది; లోభికరంబునున్ పోలెన్= పిసినారి హస్తంమాదిరి; దానసలిలధారా= దానజలధారలు; విరహితంబు+ఐ= లేనిదై; (ఏనుగుపక్షంలో–చెక్కిటిమదజలంయొక్క స్రావంలేనిదై); విరహితలంపునున్+పోలెన్= భార్యావియోగతప్తుడి మనసుమాదిరి; నిరంతర= ఎడతెగని; చిత్తజాత= మన్మథుడియొక్క; విగ్రహంబు+ఐ= పోరుగలదై; గ్రహణ కాలంబునున్+పోలెన్= గ్రహణ కాలంవలె; పర+అధీన= విరోధికి వశమైన; ఖరకరంబు+ఐ= సూర్యుడుగలదై; (ఖరకరుడు= వాడికిరణాలుగలవాడు–సూర్యుడు, తీక్ష్ణమైన తొండముగలది–ఏనుగు) ఖరకర+ఉదయంబునున్+పోలెన్= సూర్యోదయంవలె; భిన్నపుష్కరంబు+ఐ= విరియబారిన తామరలుగలదై; భిన్నమైన–చీలిన తొండంయొక్క చివరగలదై (పుష్కరము= తొండముయొక్క చివర); పుష్కరవైరి విలసనంబునున్+పోలెన్= పద్మాలకు విరోధియైన చంద్రుడియొక్క కాంతివలె; అభాసిత పద్మకంబు+ఐ= ప్రకాశించని పద్మాలు గలదై (పద్మకము= ఏనుగుయొక్క ముఖమందలి బొట్టు); ఉన్న సమయంబునన్= ఉన్నవేళలో...

**తా :** ఇంకా పలువురు మావంతులు ఆ కువలయా పీడాన్ని పురికొలిపారు. పెనుగాలి గుంపుచేత పైకెగసిన ప్రళయకాలంలోని అగ్నిజ్వాలవిధంగా, ఆ మదపుటేనుగు త్రుళ్ళిపడుతూ మృత్యుదేవతమాదిరీ, కాలపురుషునికైవడీ, యముడితీరునా కృష్ణుణ్ణి ఎదుర్కొనింది. తన మదజలంమీది ఆశతో చుట్టూ తిరుగాడే తుమ్మెదలనే గాయకుల ఝంకారంవల్ల ఆ గజం అహంకరించింది. అది కులపర్వత గుహలనే కుంభాలను తన ఘీంకారంతో పూరించింది. ఆగ్రహోదగ్రుడైన ఆదిశేషుడి పడగవలె భయం కలిగించే తన తొండంతో నిర్లక్ష్యంగా శౌరిని పట్టుకుంది. అసాధ్యుడైన హరి అంతట అటూ ఇటూ పెనగి రాహువుముఖగహ్వారం

నుంచి తప్పించుకొని వెలికురికే సూర్యుని మాదిరి చెంగున ఎగిరి, దానికాళ్ళసందున దూరి దాక్కొన్నాడు. గోవిందుడు కనిపించకపోయేసరికి కువలయాపీడానికి క్రోధం పెల్లుబికింది. మహాసాగరమధ్యంలో పరిభ్రమించే మందరగిరిలాగా అది గిరగిర తిరుగాడింది. గాలివల్ల వాసన పసికట్టి కృష్ణుడున్నచోటు తెలుసుకొని ఉప్పొంగి పోయింది. ప్రళయ కాలంలోని యమదండంలాగా ప్రచండమైన తన తొండాన్ని క్రిందికి వంచి అది పద్మలోచనుణ్ణి వంచించి చుట్టిపట్టుకుని పడమొత్తడానికి ప్రయత్నించింది. మాధవుడు చలించక తెంపుతో దాని వెనుకవైపునకు ఉరికాడు. రాహువుతోకను పట్టిలాగే జగజెట్టి గరుడుని చందంగా శ్రీకృష్ణుడు ఒక్క ఎగురు ఎగిరి, ఆ ఏనుగువాలాన్ని చేతితో ఒడిసిపట్టుకున్నాడు. పరాక్రమంతో వందమూరలదూరానికి దాన్ని గిరగిర త్రిప్పి విసరివేశాడు.

ఆ మదేభం అడ్డుకొనరానిదై, అవక్రపరాక్రమంతో పోరాటానికి వెనుదీయక కుడిఎడమలుగా తిరుగుతూ మళ్ళీ మాధవుడిమీదికి ఉరికింది. అప్పుడు కృష్ణుడు కుంజరం కుడిప్రక్కకు తిరిగినప్పుడు తాను ఎడమప్రక్కకూ, అది ఎడమవైపునకు తిరిగినప్పుడు తాను కుడివైపునకూ తిరుగుతూ దానికి బాగా రొప్పు తెప్పించాడు. శ్రీకృష్ణుడు కాఠిన్యం వహించి దానిపైకి చెంగలించాడు. ప్రళయకాల మేఘాలనుంచి పడిన కఠోరమైన పిడుగులాంటి తన పిడికిలి బిగించి ఈడ్చి ఆ గజకుంభస్థలాన్ని గుద్దాడు. ఎత్తయిన అంజనగిరిశిఖరంలాంటి దానికుంభస్థలం పగిలి ముక్కలుచెక్కలై ఎగిరిపడింది. ఆ ఏనుగు కుంభస్థలంనుంచి నెత్తుటితో తడిసి చెదరి నేలరాలిన ముత్యాలు సంజకెంజాయలో ఎర్రటి నక్షత్రాలతో కప్పబడిన మింటిసొగసును ధరణికి సంతరించాయి. ఆ శుండాలం అంతటితో ఆగక మ్రొగ్గి మోకరిల్లి సంబాళించుకుని వెంటనే లేచింది. అటూ, ఇటూ చూచింది. ముందుకు ఉరవడించింది. ప్రళయవేళలో సముద్రాల సముత్తుంగతరంగాలచే కొట్టబడిన కులపర్వతం మాదిరి అది మళ్ళీ భుజబలసమేతుడైన శ్రీకృష్ణునిచే కొట్టబడింది. మిక్కుటమైన కోపంతో కువలయా పీడం గోవిందుణ్ణి ఒక్కుమ్మడిగా తన దంతాలతో చిమ్మింది. నందసుతుడు హస్తలాఘవం హెచ్చగా బాహాబాహియుద్ధంలో మిక్కిలి విజృంభించి దాన్ని తల్లడిల్ల జేశాడు.

అప్పుడు ఆ మదగజం మొక్కవోని ముక్కంటి బల్లెంతో భగ్నమైన త్రిపురాసురుల పురంలాగా, సముద్రంలో తీవ్రమైన ఝంఝూమారుతంవల్ల పాడైన ఓడలాగా శక్తి గోల్పోయింది. బక్కచిక్కి స్రుక్కింది. దానోదకధారలులేని పిసినారి చెయ్యివిధంగా అది చెక్కిటి మదజలధారలు లేనిదయింది. ఎడతెగని మదనుడి పోరుగల వియోగి హృదయంలాగా ఎడతెగక మదిలో జనించిన విరోధం కలది అయింది. పరాధీనుడైన ప్రభాకరుడుగల గ్రహణవేళమాదిరి ఎండినతొండం గలది అయింది. పూచిన తామరలుగల సూర్యోదయంలాగా తొండపు కొనగలది అయింది. ప్రకాశించని పద్మాలుగల చంద్రప్రకాశం తీరున వెలవెలపోయిన ముఖమందలి బిందువులు గలది అయింది.

**శా. కాలం ద్రొక్కి సలీలుఁడై నగవుతోఁ గంఠీరవేంద్రాకృతిం**
**గేలన్ భీషణదంతముల్ వెఱికి సంక్షీణంబుగా మొత్తి గో**
**పాలగ్రామణి వీరమౌళిమణియై ప్రాణంబులం బాపె నా**
**శైలేంద్రాభముఁ బ్రాణలోభము నుదంచత్సారగంధేభమున్. 1320**

**ప్రతి :** గోపాలగ్రామణి= గోపాలకుల్లో శ్రేష్ఠుడైన కృష్ణుడు; ఆ శైల+ఇంద్ర+ఆభమున్= పర్వతరాజంతో సమానమైందీ; ప్రాణలోభమున్= ప్రాణాలమీద ఆశగలదీ; ఉదంచత్+సార= ఒప్పిదమైన శక్తిగల; గంధ+ఇభమున్= మదపుటేనుగును; కాలన్= కాలితో; త్రొక్కి= మర్దించి; సలీలుఁడు+ఐ= విలాసయుక్తుడై; నగవుతోన్= నవ్వుతో; కంఠీరవ+ఇంద్ర+ఆకృతిన్=

శ్రేష్ఠమైన సింహంయొక్కరూపుతో; కేలన్= చేతితో; భీషణదంతముల్= భయంకరమైన కువలయాపీడంయొక్క కోరలను; పెఱికి= పెకలించి; సంక్షీణంబు+కాన్= నశించేటట్లుగా; మొత్తి= కొట్టి; వీరమౌళి+ఐ= వీరులలో శ్రేష్ఠుడై; ప్రాణంబులన్+ పాపెన్= ప్రాణాలు తీశాడు.

**తా :** గోపాలశేఖరుడూ, వీరశిరోరత్నమూ అయిన శ్రీకృష్ణుడు పర్వతరాజంతో సమానమైందీ, ప్రాణాలమీద ఆశగలదీ, అయిన ఆ మదపుటేనుగును మహాసింహంమాదిరి సవిలాసంగా నవ్వుతూ, కాలితో త్రొక్కి, చేతితో భయంకరమైన దాని దంతాలు పెరికి బక్కచిక్కేటట్లు బాది ప్రాణాలు తీశాడు.

**వ. మఱియు దంతిదంతతాడనంబుల దంతావళపాలకులం గాలుప్రోలి కనిపి తత్ప్రదేశంబు వాసి. 1321**

**ప్రతి :** మఱియున్= ఇంకా; దంతి= ఏనుగు; దంతతాడనంబులన్= దంతాలచేత కొట్టడంవల్ల; దంతావళపాలకులన్= మావటివాళ్ళను; కాలుప్రోలికిన్= యముని పట్టణానికి; అనిపి= పంపి; తత్+ప్రదేశంబు+పాసి= ఆ చోటువదలి...

**తా :** శ్రీకృష్ణుడు కువలయా పీడమనే ఏనుగుయొక్క దంతాలను ఊడబెరికి, వాటితోనే కొట్టి మావటివాళ్ళను అందరినీ చంపి ఆ ప్రదేశం నుంచి బయలుదేరి

**మ. కరిదంతంబులు మూఁపులందు మెఱయన్ ఘర్మాంబువుల్ మోములన్**
**నెఱయం గోపకులంత నంత మలయన్ నిత్యాహవస్థేము లా**
**హరిరాముల్ సనుదెంచి కాంచిరి మహోగ్రాడంబరాపూరితా**
**మర మర్త్యాది జనాంతరంగము లసన్మల్లావనీరంగమున్. 1322**

**ప్రతి :** నిత్య+ఆహవస్థేములు= ఎడతెగని యుద్ధాలలో స్థిరంగా ఉండేవారు; ఆ హరిరాముల్= ఆ శ్రీకృష్ణుడూ, బలరాముడూ; కరిదంతంబులు= కువలయాపీడగజంయొక్క, దంతాలు; మూఁపుల+అందున్= భుజాలమీద; మెఱయన్= ప్రకాశించగా; ఘర్మ+అంబువుల్= చెమటనీరు; మోములన్= ముఖాల్లో; నెఱయన్= వ్యాపించగా; గోపకులు= గొల్లలు; అంతన్+అంతన్= సమీప స్థలాల్లో; మలయన్= సంచరించగా; చనుదెంచి= వచ్చి; మహా+ఉగ్ర= మిక్కిలి భయంకరమైన; ఆడంబర=సందడిచేత, యుద్ధవాద్యధ్వనులతో; ఆ పూరిత= అంతటా నిండిన; అమర= దేవతలు; మర్త్య= మానవులు; ఆది= మొదలైన; జన= జనులయొక్క; అంతరంగమున్= మనసులు గల్గింది అయిన; లసత్= ఒప్పిదమైన; మల్ల+అవనీరంగమున్= మల్లురయొక్క క్రీడాప్రదేశాన్ని; కాంచిరి= చూచారు.

**తా :** కదనరంగంలో కాలు గదపక పోరాడే ఆ రామకృష్ణులు ఏనుగుదంతాలు తమ భుజాలపై మెరుస్తుండగా స్వేదబిందువులు ముఖాల్లో నిండగా, గోపాలకులు తమర్ని పరివేష్టించగా బయలుదేరి వచ్చి, మల్లభూమిని చూచారు. అది దేవమానవాదుల హృదయాలను మహాభయంకరమైన ఆడంబరంతో కలవరపెడుతూ ఉంది.

**సీ. మహితరౌద్రంబున మల్లుర కశనియై నరుల కద్భుతముగ నాథుఁ డగుచు**
**శృంగారమునఁ బురస్త్రీలకుఁ గాముఁడై నిజమృత్యువై కంసునికి భయముగ**
**మూఢులు బీభత్సమును బొంద వికటుఁడై తండ్రికి దయరాఁగఁ దనయుఁ డగుచు**
**ఖలులకు విరసంబుగా దండియై గోపకులకు హాస్యంబుగాఁ గులజుఁ డగుచు**

**ఆ. బాంధవులకుఁ బ్రేమ భాసిల్ల వేలుపై, శాంత మొనర యోగిజనుల కెల్లఁ**
**బరమతత్త్వ మగుచు భాసిల్లె బలునితో, మాధవుండు రంగమధ్యమందు. 1323**

**ప్రతి :** మాధవుండు= శ్రీకృష్ణుడు; మహిత రౌద్రంబునన్= అధిక రౌద్రరసంచేత; మల్లురకున్= జెట్టీలకు; అశని+ఐ= పిడుగై; నరులకున్= ప్రజలకు; అద్భుతము+కన్= ఆశ్చర్యకరంగా; నాథుఁడు+అగుచున్= ప్రభువవుతూ; శృంగారమునన్= శృంగార రసంచేత; పురస్త్రీలకున్= మధురలోని మగువలకు; కాముఁడు+ఐ= మన్మథుడై; కంసునికిన్= కంసుడికి; భయము+కన్= భీతికల్గేటట్లుగా; నిజమృత్యువు+ఐ= అతని పాలిటికి మిత్తి అగుతూ; మూఢులు= తెలివిలేనివారు; బీభత్సమును+పొందన్= బీభత్స రసాన్ని పొందగా; వికటుఁడు+ఐ= ఏవగింతను కల్గించేవాడై; తండ్రికిన్= జనకుడైన వసుదేవుడికి; దయరాన్+కన్= కరుణ కలుగగా; తనయుఁడు+అగుచున్= పుత్రుడవుతూ; ఖలులకున్= దుష్టులకు; విరసంబుగాన్= వెగటుగా; దండి+ఐ= యముడవుతూ; గోపకులకున్= గోపాలురకు; హాస్యంబు+కాన్= హాస్యంగా; కులజుఁడు+అగుచున్= వారి కులంలో పుట్టినవాడవుతూ; బాంధవులకున్= చుట్టాలకు; ప్రేమభాసిల్లన్= ప్రేమ ప్రకాశించగా; వేలుపు+ఐ= దేవత అయి; శాంతము+ ఒనరన్= శాంతరసం వెలయగా; యోగిజనులకున్+ఎల్లన్= మునీశ్వరులందరికీ; పరమతత్త్వము+అగుచున్= పరబ్రహ్మ స్వరూపుడవుతూ; బలునితోన్= బలరాముడితో; మాధవుండు= శ్రీకృష్ణుడు; రంగమధ్యము+అందున్= మల్లరంగముయొక్క నడుమ; భాసిల్లెన్= వెలుగొందాడు.

**తా :** శ్రీకృష్ణుడు బలరాముడితో మల్లరంగం మధ్య నవరసా లొలికిస్తూ, ప్రకాశించాడు. ఎలాగంటే అతడు జెట్టీలకు పిడుగై రౌద్రరసాన్నీ, ప్రజలకు నాథుడై అద్భుత రసాన్ని, పట్టణ స్త్రీలకు మన్మథుడై శృంగారరసాన్నీ, కంసుడిపాలిటి మృత్యువై భయానకరసాన్నీ, వికటుడై మూఢులహృదయాలలో బీభత్సరసాన్నీ, వసుదేవుడికి పుత్రుడై అతడిహృదయంలో కరుణ రసాన్నీ, ఖలులను దండించడంచేత వీరరసాన్నీ, తనతోడి గోపకులకు స్వకులస్థుడు కావడంవల్ల హాస్యరసాన్నీ, బంధువులైన యాదవుల్లో ప్రేమరసాన్నీ, దేవుడై యోగులందు శాంతరసాన్నీ నింపాడు.

**వ. అప్పుడు. 1324**

**ప్రతి :** అప్పుడు= ఆ సమయంలో...

**క. చచ్చిన కుంభీంద్రంబును, వచ్చిన బలమాధవులను వరుసం గని తా**
**నొచ్చిన చిత్తముతోడుతఁ, జెచ్చెరఁ గడు వెఱచె భోజసింహుం డధిపా! 1325**

**ప్రతి :** అధిపా!= పరీక్షిన్మహారాజా!; భోజసింహుండు= భోజవంశంలో శ్రేష్ఠుడైన కంసుడు; చచ్చిన= మరణించిన; కుంభి+ ఇంద్రంబును= గజరాజునూ; వచ్చిన= తనదగ్గరకు వచ్చిన; బలమాధవులను= బలరాముణ్ణి, శ్రీకృష్ణుణ్ణి; వరుసన్= క్రమంగా; కని= చూచి; తాన్= తాను; నొచ్చిన= వ్యథచెందిన; చిత్తముతోడుతన్= మనస్సుతో; చెచ్చెరన్ (చెర+చెర)= శీఘ్రంగా; కడున్= మిక్కిలి; వెఱచెన్= భయపడ్డాడు.

**తా :** పరీక్షిన్మహారాజా! ఆ సమయంలో చచ్చిన కువలయాపీడాన్నీ, వచ్చిన రామకృష్ణుల్నీ క్రమంగా చూచి భోజవంశశ్రేష్ఠుడైన కంసుడు నొచ్చిన మనసుతో మిక్కిలి భయపడ్డాడు.

**ఉ. ధీరుల వస్త్రమాల్యమణిదీప్తవిభూషణధారులన్ మహా**
**కారుల సర్వలోకశుభకారుల మానవమానినీమనో**

**హారుల రంగభూతలవిహారుల గోపకుమారులన్ మహా**
**వీరులఁ జూచి చూచి తనివిం దుదిముట్టక లోకు లందఱున్.** **1326**

**ప్రతి :** లోకులు+అందఱున్= సకలజనులూ; ధీరులన్= ధైర్యం కలవారునూ; వస్త్ర= బట్టలను; మాల్య= పూలదండలనూ; మణి= రత్నాలచేత; దీప్త= ప్రకాశించే; విభూషణధారులన్= సొమ్ములను ధరించినవారునూ; మహా+ఆకారులన్= గొప్పరూపం కలవారునూ; సర్వలోక= సమస్తజగాలకు; శుభకారులన్= మేలుచేసేవారునూ; మానవమానినీ= మానవకాంతలకు; మనోహారులన్= హృదయాల్ని హరించేవారును; రంగభూతల విహారులన్= మల్లరంగప్రదేశంలో తిరిగేవారునూ; మహావీరులన్= గొప్పశూరులునూ అయిన; గోపకుమారులన్= గొల్లపిల్లలను, బలరామకృష్ణులను; చూచి చూచి= కన్నార్పకుండా కనుగొని; తనివిన్= తృప్తిని; తుదిముట్టక= పూర్తిగా పొందక...

**తా :** ధీరులూ, వస్త్రాలు, పూలదండలు, రత్నాలతో ప్రకాశించే నగలు ధరించినవారూ, నటుల వేషంలో ఉన్నవారూ, సకలజగాలకూ క్షేమం కల్గించేవారూ, మగవారియొక్క, మగువలయొక్క మనసులు ఆకర్షించేవారూ, మల్లరంగంలో విహరిస్తున్నవారూ, మహావీరులూ అయిన ఆ గోపకుమారులను జనులందరూ చూచి చూచి తనివిదీరక...

**ఉ. సన్నుతరామకృష్ణముఖచంద్రమయూఖసుధారసంబులం**
**గన్నులఁ ద్రావుచందమునఁ గాంచుచు జిహ్వల నంటి చూచు లీ**
**ల న్నుతి సేయుచుం గరములం బరిరంభము సేయుభంగి న**
**త్యున్నతిఁ జూపుచుం దగిలి యొండొరుతోడ రహస్యభాషలన్.** **1327**

**ప్రతి :** సన్నుత= కొనియాడదగిన; రామకృష్ణ= బలరామ శ్రీకృష్ణులయొక్క; ముఖచంద్ర= ముఖాలు అనే చంద్రులయొక్క; మయూఖ= కిరణాలనుంచి స్రవించే; సుధారసంబులన్= అమృత రసాల్ని; కన్నులన్= నేత్రాలతో; త్రావుచందమునన్= పానం చేసేవిధంగా; కాంచుచున్= చూస్తూ; జిహ్వలన్= నాలుకలతో; అంటిచూచులీలన్= తాకి చూచే చందాన; నుతి+ చేయుచున్= స్తోత్రం చేస్తూ; కరములన్= చేతులతో; పరిరంభము+చేయుభంగిన్= కౌగిలించుకునే విధంగా; అతి+ఉన్నతిన్+ చూపుచున్= ఎక్కువ చేతులపొడవును చూపుతూ; తగిలి= వెంబడించి; ఒండు+ఒరుతోడన్= ఒకరు మరొకరితో; రహస్యభాషలన్= రహస్యములైన మాటలతో...

**తా :** అందమైన రామకృష్ణుల ముఖ చంద్రబింబాలనుంచి ప్రసరించే అమృతరసాన్ని కన్నులతో త్రాగేవిధంగా చూస్తూ, నాలుకలతో చప్పరించి చవి చూచే విధంగా స్తుతిస్తూ, చేతులతో కౌగిలించే విధంగా ముమ్మందుకు పొడవుగా చేతులు చాచుతూ, ఒకరితో ఒకరు గుజగుజలు పోయా

**క. వసుదేవునివాసంబున, వసుధన్ రక్షింప వీరు వైష్ణవతేజో**
**ల్లసనమునఁ బుట్టినారఁట, పసిబిడ్డ లనంగఁ జనదు పరదేవతలన్.** **1328**

**ప్రతి :** వీరు= ఈ గోపాల బాలకులు, బలరామకృష్ణులు; వసుదేవ నివాసంబునన్= వసుదేవుడి గృహంలో; వసుధన్= పుడమిని; రక్షింపన్= కాపాడుటకు; వైష్ణవతేజ+ఉల్లసనమునన్= విష్ణుతేజంయొక్క వికాసంచేత; పుట్టినారు+అఁట= జన్మించారట; పరదేవతలన్= దేవతాశ్రేష్ఠులైన ఈ రామకృష్ణులను; పసిబిడ్డలు= చిన్ని కుమారులు; అనన్+కన్+చనదు= అని పల్కడం యుక్తం కాదు.

**తా :** బలరామకృష్ణులు మహావిష్ణుని తేజోవిలాసంతో భూమిని కాపాడటానికి వసుదేవుడిగృహంలో జన్మించారట! దేవతాశ్రేష్ఠులైన వీరిని పసిపాప లనడం ఏ మాత్రం యుక్తం కాదు.

**సీ. చంపెఁ రక్కసిఁ బట్టి; చక్రవాకునిఁ గూల్చెఁ బడఁద్రొబ్బె మద్దుల; బకునిఁ జీరె;**
**నఘదైత్యుఁ బొరిగొనె; నడరి వత్సకుఁ ద్రుంచె; గిరి యెత్తి దేవేంద్రుఁ గ్రిందు పఱిచెఁ**
**గాళియు మర్దించె గహనానలముఁ ద్రావెఁ; గేశి నంతకుపురిక్రేవ కనిచె;**
**మయుపుత్రుఁ బరిమార్చె; మఱియును దానవభటుల మర్దించి గోపకులఁ గాచె;**

**తే. గోపకాంతలమనముల కోర్కి దీర్చె, నీ సరోరుహలోచనం డీ శుభాంగుఁ**
**డీ మహామహుఁ డీ దిగ్గజేంద్రనిభుఁడు, మనుజమాత్రుండె తలపోయ మాధవుండు? 1329**

**ప్రతి :** మాధవుండు= శ్రీకృష్ణుడు; రక్కసిన్+పట్టి= రాక్షసి అయిన పూతనను పట్టుకొని; చంపెన్= సంహరించాడు; చక్రవాకునిన్= సుడిగాలియై వచ్చిన తృణావర్తుడనే దైత్యుణ్ణి; కూల్చెన్= చంపాడు; మద్దులన్= మద్దిమాకులజంటను; పడఁద్రొబ్బెన్= పడద్రోశాడు; బకునిన్= కొంగ రూపులో వచ్చిన బకాసురుణ్ణి; చీరెన్= చీల్చివేశాడు; అఘదైత్యున్= అఘాసురుణ్ణి; పొరిగొనెన్= సంహరించాడు; అడరి= విజృంభించి; వత్సకున్= వత్సాసురుణ్ణి; త్రుంచెన్= ఖండించాడు; గిరి+ఎత్తి= గోవర్ధన పర్వతాన్ని పైకెత్తి; దేవ+ఇంద్రున్= దేవేంద్రుణ్ణి; క్రింద పఱిచెన్= అణగదొక్కాడు; గహన+అనలమున్= కార్చిచ్చును; త్రావెన్= తాగాడు; కేశిన్= కంసుడి పంపున అశ్వరూపుడై వచ్చిన కేశి అనే రాక్షసుణ్ణి; అంతకుపురి క్రేవకున్= యముడి పట్టణ సమీపానికి; అనిచెన్= పంపివేశాడు; మయుపుత్రున్= మయుడనేవాని కొడుకైన వ్యోమాసురుణ్ణి; పరిమార్చెన్= చంపాడు; మఱియున్= ఇంకా; దానవభటులన్= రాక్షసవీరుల్ని; మర్దించి= చంపి; గోపకులన్= గొల్లలను; కాచెన్= రక్షించాడు; గోపకాంతల= గొల్లపడతులయొక్క; మనములకోర్కి= మనసుల్లోని వాంఛను; తీర్చెన్= నెరవేర్చాడు; ఈ సరోరుహ లోచనుండు= ఈ తామర రేకులవంటి కన్నులుగలవాడు; ఈ శుభ+అంగుఁడు= ఈ మంగళకరమైన దేహం కలవాడు; ఈ మహామహుఁడు= ఈ గొప్ప తేజస్సుగలవాడు; తలపోయన్= భావించగా; మనుజమాత్రుండు+ఎ= సాధారణ మనుష్యుడా? (కాదని భావం).

**తా :** తామరలవంటికండ్లు కలవాడూ, మంగళకరమైన అంగసౌష్ఠవం కలవాడూ, గొప్పతేజస్సు కలవాడూ, దిగ్గజేంద్రానికి దీటైనవాడూ, లక్ష్మికి పతి అయిన శ్రీకృష్ణుడు రక్కసియైన పూతనను పట్టి చంపాడు. సుడిగాలి అయిన తృణావర్తుణ్ణి హతమార్చాడు. మద్దిమాకుల్ని పడగూల్చాడు. బకాసురుణ్ణి సంహరించాడు. అఘుడనే రాక్షసుణ్ణి అంతం చేశాడు. విజృంభించి వత్సాసురుణ్ణి వధించాడు. గోవర్ధన గిరిని పైకెత్తి దేవేంద్రుణ్ణి అవమానించాడు. కాళియుడనే నాగరాజును మర్దించాడు. కార్చిచ్చును తాగాడు. కేశి అనే దానవుణ్ణి యముడి చెంతకు పంపాడు. మయుని కొడుకైన వ్యోమాసురుణ్ణి నిర్మూలించాడు. ఇంకా ఎందరో రాక్షస వీరుల్ని దునుమాడి గోపకులను కాపాడాడు. గొల్లచేడెల మనసులోని కోరికలను ఈడేర్చాడు. ఆలోచించగా ఇతడు సామాన్య మానవుడు కాదు.

## ❖ శ్రీకృష్ణబలరాములు చాణూర ముష్టికులను వధించుట ❖

**వ. అని పలుకుచుఁ బౌరజనులు సూచుచుండ రామకృష్ణులకుఁ జాణూరుం డిట్లనియె. 1330**

**ప్రతి :** అని పలుకుచున్= అని మాట్లాడుతూ, పౌరజనులు= మథురాపురంలోని ప్రజలు; చూచుచున్+ఉండన్= చూస్తుండగా; రామకృష్ణులకున్= బలరామశ్రీకృష్ణులతో; చాణూరుండు= చాణూరుడనే మల్లుడు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికాడు.

**తా :** ఈ విధంగా మాట్లాడుతూ పురప్రజలు రామకృష్ణులను చూస్తున్నారు. అప్పుడు చాణూరుడు రామకృష్ణులతో ఇలా అన్నాడు.

**మ.** **వనమార్గంబున గోపబాలకులతో వత్సంబులన్ మేపుచుం**
**బెనఁగన్ మిక్కిలి నేర్చినా రనుచు నీ పృథ్వీజనుల్ సెప్ప మా**
**మనుజేంద్రుం డిట మిమ్ముఁ జీరఁ బనిచెన్ మల్లాహవక్రీడకుం;**
**జనదే కొంతపరాక్రమింప మనకున్ సభ్యుల్ విలోకింపఁగన్.** **1331**

**ప్రతి :** వనమార్గంబునన్= అడవిదారిలో; గోపబాలకులతోన్= గొల్లపిల్లలతో; వత్సంబులన్= దూడలను; మేపుచున్= పచ్చికలుమేపుతూ; పెనఁగన్= పెనగులాడటం; మిక్కిలి నేర్చినారు= ఎక్కువగా అభ్యసించారు; అనుచున్= అంటూ; ఈ పృథ్వీజనుల్= ఈ పుడమిలోని ప్రజలు; చెప్పన్= చెప్పగా; మా మనుజ+ఇంద్రుండు= మా కంసమహారాజు; ఇటన్= ఇక్కడికి; మిమ్మున్= మిమ్మల్ని; మల్ల+ఆహవక్రీడకున్= జెట్టిపోరాటమనే ఆటకు; చీరన్+పనిచెన్= పిలువనంపాడు; మనకున్= మల్లురమైన మనకు; సభ్యుల్= ఈ మల్లరంగంలోని సభ్యులు; విలోకింపన్+కన్= చూస్తుండగా; కొంత= కొంచెం; పరాక్రమింపన్= ప్రతాపం చూపడం; చనదు+ఏ= తగదా? తగునని భావం.

**తా :** అడవి దారుల్లో గొల్ల బుడుతలతో కలసి దూడలు మేపుతూ జెట్టిపోరులో మిక్కిలి నేర్పు గడించారని ఈ పుడమిలోని జనులు చెప్పుకుంటూ ఉండగా విని, మా మహారాజు మల్లయుద్ధ క్రీడకు మిమ్మల్ని ఇక్కడికి పిలిపించాడు. ఇప్పుడు ఇక్కడి మల్లరంగంలోని సభాసదులు చూస్తుండగా మనం మన పరాక్రమాలు కొంత ప్రదర్శించడం సముచితం.

**మ.** **జవసత్త్వంబులు మేలె? సాము గలదే? సత్రాణమే మేను? భూ**
**ప్రవరుం బోసన మి మ్మనంగ వలెనే? పాళీ లభీష్టంబులే?**
**పవివో? కాక కృతాంత దండకమవో? ఫాలాక్ష నేత్రాగ్నివో?**
**నవనీతంబుల ముద్దగాదు; మెసఁగన్ నా ముష్టి గోపార్భకా!** **1332**

**ప్రతి :** గోప+అర్భకా= ఓ గొల్లపిల్లవాడా; జవసత్త్వంబులు= వేగమూ, బలమూ; మేలు+ఎ= బాగా ఉన్నాయా?; సాము= వ్యాయామం; కలదు+ఏ= ఉన్నదా?; మేను= శరీరం; సత్రాణము+ఏ= రక్షణతో కూడిందా?; భూప్రవరున్= రాజును; పోసనము= పాలు; ఇమ్ము+అనన్+కన్+వలెను+ఏ= ఇమ్మని అడుగువలెనా?; పాళీలు= మల్లయుద్ధ విశేషాలు; అభి+ఇష్టంబులు+ఏ= ఇష్టము లేదా?; పవివి+ఓ= వజ్రాయుధానివా!; కాక= లేక; కృత+అంత దండకమ+ఓ= యముడి కాలదండము సుమా; (లేక) ఫాల+అక్షు= రుద్రునియొక్క; నేత్ర+అగ్నివి+ఓ= మూడవ కంటిలోని నిప్పువా!; నా ముష్టి= నా పిడికిలి; మెసఁగన్= నీవు ఆరగించడానికి; నవనీతంబుల ముద్ద+కాదు= వెన్నముద్దగాదు.

**తా :** వేగం, బలమూ బాగా ఉన్నాయా? సాములో నేర్పుందా? శరీరానికి రక్షణ కలదా? రాజుకు చెప్పి పాలు ఇప్పించాలా? పాళీలు మీకు ఇష్టమేనా? ఒరే! గొల్ల కుర్రవాడా నీవేం వజ్రాయుధానివా? యమదండానివా? ముక్కంటి కంటిమంటవా? నా పిడికిలి - మెక్కడానికి వెన్నముద్దలు కావుసుమా?

**క.** **జనములు నేర్చిన విద్యలు, జననాథునికొఱకుఁ గాదె? జననాథుఁడు నీ**
**జనములు మెచ్చఁగ యుద్ధం, బున మనముం గొంత ప్రొద్దు పుత్తమె? కృష్ణా!** **1333**

**ప్రతి :** కృష్ణా!= శ్రీకృష్ణా!; జనములు= ప్రజలు; నేర్చిన= అభ్యసించిన; విద్యలు= కళలు; జననాథుని కొఱకున్+కాదు+ఎ= రాజుగారి ఎదుట ప్రదర్శించడానికే కదా!; జననాథుఁడున్= ఈ కంసమహారాజును; ఈ జనములు= ఇక్కడున్న ప్రజలును; మెచ్చన్+కన్= కొనియాడగా; యుద్ధంబునన్= మల్లయుద్ధంలో; మనమున్= మనంకూడా; కొంతప్రొద్దు= కొంతసేపు; పుత్తము(పుచ్చుదము)+ఎ= కడపుదమా?

**తా :** కృష్ణా! జనులు విద్యలు నేర్వడం ప్రభువుల మెప్పుకోసమే గదా! రాజూ, ఈ ప్రజలూ మెచ్చుకునేటట్లు మనం మల్ల యుద్ధంతో కొంత కాలక్షేపం చేద్దామా?

**వ. అనిన విని హరి యిట్లనియె. 1334**

**ప్రతి :** అనినన్= అని చాణూరుడు పల్కగా; విని= ఆలించి; హరి= శ్రీకృష్ణుడు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తా :** చాణూరుడి మాటలువిని శ్రీకృష్ణుడిలా అన్నాడు.

**ఉ. సాములు లేవు; పిన్నలము; సత్త్వము గల్దన రాదు; మల్ల సం**
**గ్రామవిశారదుల్ గులిశకర్కశదేహులు మీరు, మీకడ**
**న్నేము చరించు టెట్లు? ధరణీపతివేడ్కలు సేయువారముం**
**గాము; వినోదముల్ సలుపఁ గాదన వచ్చునె యొక్కమాటికిన్. 1335**

**ప్రతి :** సాములు లేవు= జెట్టి పోట్లాటలో మాకు నేర్పు లేదు; పిన్నలము= పసివాళ్ళం; సత్త్వము= బలం; కల్దు+అనన్‌రాదు= ఉన్నది అని చెప్పలేము; మీరు= మీరు; మల్ల సంగ్రామవిశారదుల్= జెట్టి పోరాటంలో ప్రావీణ్యం గలవారు; కులిశ= వజ్రంవలె; కర్కశదేహులు= కఠినమైన శరీరంగలవారు; మీకడన్= మీ దగ్గర; ఏము= మేము; చరించుట+ఎట్లు= ఎలా మెలగగలం?; ధరణీపతి వేడ్కలు= రాజుకు వినోదాలు; చేయువారమున్+కాము= కల్గించే వాళ్ళంకూడా కాము; ఒక్కమాటికిన్= ఒక్కసారికి; వినోదముల్ సలుపన్= రాజుగారికి వేడుకలు గల్గించడానికి; కాదు+అనన్+వచ్చున్+ఎ= మా వల్ల కాదని చెప్పరాదుగదా!

**తా :** మాకు సాములు తెలియవు. మేము పిన్నవాళ్ళం. సత్తువ ఉందని చెప్పలేము. మీరో మల్లయుద్ధంలో నిష్ణాతులు. వజ్రాయుధం మాదిరి కఠినమైన శరీరాలు గలవారు. ఇట్టి మీతో మేమెట్లా తలపడగలం? మీ రాజుగారికి వేడుకను కలిగించే వాళ్ళమూ కాము. అయినా వినోదంకోసం మీరు పోరాటకు ఆహ్వానిస్తే కాదని ఎలా అంటాము?

**క. నీతోడుత నేఁ బెనఁగెదఁ, బ్రీతిన్ ముష్టికునితోడఁ బెనఁగెడి బలుఁ డు**
**గ్రాతతమల్లాహవమున, భూతలనాథునికి మెచ్చుఁ బుట్టింతు సభన్. 1336**

**ప్రతి :** నీ తోడుతన్= నీతో; ఏన్= నేను; పెనఁగెదన్= తలపడతాను; ప్రీతిన్= సంతోషంతో; ముష్టికునితోడన్= ముష్టికుడితో; బలుఁడు= మా అన్న బలరాముడు; పెనఁగెడిన్= పోట్లాడుతాడు; ఉగ్ర= భయంకరమైన; ఆతత= విరివియైన; మల్ల+ ఆహవమునన్= మల్లయుద్ధం; భూతలనాథునికిన్= రాజైన కంసుడికి; సభన్= సభలో; మెచ్చున్= మెప్పును; పుట్టింతున్ (పుట్టించుదును)= కలిగిస్తాను;

**తా :** నీతో నేనూ, ముష్టికుడితో మా అన్న బలరాముడూ ఉత్సాహంతో పెనుగులాడుతాం. భయంకర మల్లయుద్ధంలో ఈ భూమండలానికి ప్రభువైన కంసుడికి ప్రీతి కల్గిస్తాం.

వ. అనిన విని చాణూరుం డిట్లనియె. 1337

**ప్రతి :** అనినన్ విని= అని శ్రీకృష్ణుడు పల్కగా విని; చాణూరుండు= చాణూరుడు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తా :** శ్రీకృష్ణుని మాటలు విని చాణూరుడు ఇలా పలికాడు.

శా. నాతోఁ బోరఁగ నెంతవాఁడ? విసిరో నా పాటియే నీవు? వి
ఖ్యాతుండం; గులజుండ; సద్గుణుఁడ సత్కర్మస్వభావుండ, నీ
కేతాదృగ్విభవంబు లెల్లఁ గలవే? యీ వీటఁ బోరాడుటల్
వ్రేతల్ సూడఁగఁ గుప్పిగంతు లిడుటే? వీక్షింపు గోపార్భకా! 1338

**ప్రతి :** గోప+అర్భకా!= ఓ గొల్లకుర్రా! ఇసిరో= ఔరా!; నా తోన్= నా తోడ; పోరన్+కన్= పోట్లాడుటకు; ఎంతవాఁడవు= నీవు ఏ పాటివాడివి?; నీవు; నా పాటి+ఏ= నాతో సమానుడివా?; విఖ్యాతుండన్= నేను ప్రసిద్ధుణ్ణి; కులజుండన్= ఉత్తమవంశంలో జన్మించినవాణ్ణి; సత్+గుణుఁడన్= మంచి గుణాలు గల్గినవాణ్ణి; సత్కర్మస్వభావుండన్= మంచి పనులు చేసే అభ్యాసం గలవాణ్ణి; నీకున్= నీకు; ఏతాదృక్= ఇటువంటి; విభవంబులు+ఎల్లన్= బలాది సంపదలన్నీ; కలవు+ఏ= ఉన్నవా?; ఈ వీటన్= ఈ పట్టణంలో; పోరాడుటల్= పోట్లాడడాలు; వ్రేతల్= గొల్లలు; చూడన్+కన్= మీ పల్లెల్లో కనుగొనగా; కుప్పిగంతులు+ఇడుట+ఏ= కుప్పిగంతులు వేయడమే సుమా!; వీక్షింపు= ఇక చూడు.

**తా :** అవురా! ఓ గొల్లకుర్రా! నాతో పెనగులాడటానికి నీ వెంత వాడివి? నీవు నాకు సమానుడివా? నేను లోక ప్రసిద్ధుణ్ణి; శుద్ధమైన కులంలో పుట్టినవాణ్ణి. మంచిగుణాలు గలవాణ్ణి; సత్కర్మలాచరించే స్వభావం కలవాణ్ణి; నీకు, నా కుండే బలసంపదలున్నాయా? ఈ రాచవీటిలో పోరాటమంటే గొల్లల ముందు కుప్పిగంతులు వేయడం కాదుసుమా! బాగా ఆలోచించుకో!

శా. స్థాణున్ మెచ్చఁడు; బ్రహ్మఁ గైకొనఁడు; విష్వక్సేను నవ్వున్; జగ
త్ప్రాణున్ రమ్మనఁ డీడుగాఁ డని; మహాబాహాబలప్రౌఢి న
క్షీణుం; డాజికి నెల్లి నేఁ డనఁడు; వైచిత్రిన్ వినోదించు ని
చ్చాణూరుం డొక గోపబాలు ననికిన్ శక్తుండు గాకుండునే? 1339

**ప్రతి :** స్థాణున్= లయకర్త అయిన ఈశ్వరుణ్ణి; మెచ్చఁడు= మెచ్చుకోడు; బ్రహ్మన్= సృష్టికర్త అయిన బ్రహ్మదేవుణ్ణి; కైకొనఁడు= లెక్కపెట్టడు; విష్వక్సేనున్= లోకాలను పోషించే విష్ణుమూర్తిని; నవ్వున్= పరిహసిస్తాడు; జగత్ప్రాణున్= వాయుదేవుణ్ణి; ఈడు+కాఁడు+అని= తనకు సమానుడుకాడని; రమ్ము+అనఁడు= కలహానికి రమ్మని ఆహ్వానించడు; మహాబాహాబలప్రౌఢిన్= మిక్కుటమైన భుజబలంయొక్క సామర్థ్యంలో; అక్షీణుండు= తక్కువ కానివాడు; ఆజికిన్= యుద్ధానికి; ఎల్లి, నేఁడు+అనఁడు= రేపు, ఈరోజు అని పలుకడు; వైచిత్రిన్= ఆశ్చర్యకరంగా; వినోదించు= క్రీడించు; ఈ+చాణూరుండు= ప్రసిద్ధుడైన ఈ చాణూరుడు; ఒక గోపబాలున్= ఒక గొల్లకుర్రవానితో; అనికిన్= యుద్ధంలో పోరాడడానికి; శక్తుండు+కాక+ఉండును+ఏ= సమర్థుడు కాకపోతాడా?

**తా :** ఈ చాణూరుడు ఈశ్వరుణ్ణి మెచ్చుకోడు. బ్రహ్మదేవుణ్ణి లెక్కచేయడు. విష్వక్సేనుణ్ణి గేలిచేస్తాడు. తనకు సాటిరాదని వాయుదేవుణ్ణిసైతం రణరంగానికి రమ్మని పిలవడు. మిక్కుటమైన భుజబలాతిరేకం తరగనివాడు. యుద్ధానికి రేపు మాపు

అనడు. చిత్రవిచిత్రంగా అలవోకగా కదనం చేస్తాడు. ఇట్టి జగజెట్టి చాణూరుడు ఒక గొల్లకుర్రని పనిపట్టడానికి చాలక పోతాడా?

**క. ప్రల్లద మేటికి గోపక!, బల్లిదుఁడను; లోకమందుఁ బ్రఖ్యాతుఁడ; నా**
**చల్లడముక్రింద దూఱని, మల్లురు లే రెందు ధరణిమండలమందున్. 1340**

**ప్రతి :** గోపక= ఓ గోపాలుడా!; ప్రల్లదము= నోటిపొగరు; ఏటికిన్= ఎందుకు? బల్లిదుఁడను= బలం కల్గినవాణ్ణి; లోకము+ అందున్= లోకంలో; ప్రఖ్యాతుఁడన్= ప్రసిద్ధుణ్ణి; ధరణిమండలము+అందున్= భూమండలంలో; ఎందున్= ఎక్కడా; నా చల్లడము క్రిందన్= నేను ధరించే చెడ్డీకింద; దూఱని= దూరనట్టి; మల్లురు లేరు= జెట్టీలు లేరు.

**తా :** ఓ గొల్లడా! ప్రగల్భాలెందుకు? నేను మహాబలవంతుణ్ణి. లోకంలో ప్రసిద్ధిచెందినవాణ్ణి. భూమండలంలో ఎక్కడగాని, ఓడిపోయి; నా చల్లాడం (గుడిగి) కింద దూరని జెట్టీలే లేరు సుమా!

**సీ. చలమున ననుడాసి జలరాశిఁ జొరరాదు నిగిడి గోత్రముదండ నిలువ రాదు**
**కేడించి కుంభిని క్రిందికిఁ బోరాదు; మనుజసింహుఁడ నని మలయ రాదు;**
**చేరినఁ బడవైతుఁ జెయిసాఁపఁగా రాదు; బెరసి నాముందటఁ బెరుఁగ రాదు**
**భూనాథహింసకుఁ బోరాదు నను మీఱి; శోధింతుఁ గానలఁ జొరఁగ రాదు**

**ఆ. ప్రబలమూర్తి ననుచు భాసిల్లఁగా రాదు, ధరఁ బ్రబుద్ధుఁడ నని తలఁప రాదు**
**కల్కితనము చూపి గర్వింపఁగా రాదు, తరము గాదు; కృష్ణ! తలఁగు తలఁగు. 1341**

**ప్రతి :** చలమునన్= పంతంతో; ననున్= నన్ను; డాసి= సమీపించి, ఎదిరించి; జలరాశిన్= సాగరంలో; చొరన్‌రాదు= ప్రవేశించడానికి వీలుపడదు; (మచ్చరంతో నన్ను సమీపించినపుడు మత్స్యావతారం ధరించి సముద్రంలో ప్రవేశించినా నిన్ను వదలను); నిగిడి= నిక్కి; గోత్రముదండన్= పర్వతంచెంత అనగా మందరగిరికి ఆధారంగా; నిలువన్ రాదు= ఉండటం నీ తరంగాదు (కూర్మావతారమెత్తి మందరగిరికింద దాగినా నిన్ను విడువననడం); కేడించి= లక్ష్యపెట్టకుండా; కుంభిని క్రిందికిన్= భూమిక్రిందికి; పోరాదు= పోవడం నీ తరంకాదు; (వరాహావతారం ధరించి భూమికింద దూరినా నిన్ను వదలిపెట్టననడం); మనుజసింహుఁడన్+అని= మానవులలో శ్రేష్ఠుణ్ణి అని; మలయన్‌రాదు= తిరగడానికి వీలుగాదు (నరసింహావతారమెత్తి పెనుగులాడినా నిన్ను వదలననడం); చేరినన్= నా దగ్గరకు వస్తే; పడవైతున్= నేల కూలుస్తాను; చెయి= హస్తం; చాఁపన్+కాన్‌రాదు= చాచుటకు వీలుపడదు (వామనావతారం ధరించి చెయ్యి సాచి యాచించినా నిన్ను విడువననడం); బెరసి= చేరి, వ్యాపించి; నా ముందటన్= నా ఎదుట; పెరుఁగన్ రాదు= వృద్ధిపొందుటకు శక్యంగాదు (త్రివిక్రముడవై ముల్లోకాలు ఆక్రమించడం నీ తరంగాదనడం); ననున్ మీఱి= నన్ను అతిక్రమించి; భూనాథహింసకున్= రాజుల్ని హింసించుటకు; పోరాదు= పోవడానికి వీలుగాదు (పరశు రామావతారం దాల్చి రాజుల్ని నిర్మూలించవలెనని ఎంచినా అది నీ వల్ల కానిపని); శోధింతున్= వెదకి పట్టుకుంటాను; కానలన్= అడవులలో; చొరన్+కన్ రాదు= ప్రవేశించ నీ తరంగాదు (రామావతారమెత్తి అరణ్యాలలో చొచ్చినప్పటికీ నిన్ను విడువననడం); ప్రబలమూర్తిన్+అనుచున్= మిక్కిలి బలస్వరూపుణ్ణి అని; భాసిల్లన్+కాన్ రాదు= ప్రకాశించడానికి వీలుపడదు (బలరామావతారమెత్తి ప్రకాశించినా, నిన్ను విడువను); ధరన్= పుడమిలో; ప్రబుద్ధుఁడన్+అని= జాగరూకుడనని; తలఁపన్‌రాదు= భావించగూడదు, (బుద్ధావతారం ధరించి త్రిపుర స్త్రీల మానభంగం

చేసిన వాడవైనా నిన్ను వదలిపెట్టను); కల్కితనమున్= జాణతనాన్ని; చూపి= ప్రదర్శించి; గర్వింపన్+కాన్ రాదు= గర్వపడుటకు వీలుగాదు; (కల్క్యవతారమెత్తి దర్పించినా నిన్ను వదలను); తరముగాదు= నన్ను జయించడం నీకు శక్యంగాదు; కృష్ణ!= మాధవా!; తలఁగు తలఁగు= దూరంగా తొలగుము.

**తా :** కృష్ణా! మచ్చరంతో నన్ను సమీపించిన తరువాత నీవు సాగరంలో ప్రవేశించడానికి సాధ్యంకాదు (మత్స్యావతారం). పర్వతం చెంత నిక్కి నిలవడానికి శక్యం గాదు (కూర్మావతారం). అలక్ష్యంతో భూమికిందికి దూరడానికి వీలులేదు (వరాహావతారం). సింహంవంటి పురుషుణ్ణి అని పొగరుగా తిరగడానికి కుదరదు (నరసింహావతారం). దగ్గరకు వస్తే పడదోస్తాను. కనుక చెయ్యి సాచడానికి సందు దొరకదు (వామనావతారం). పెనగి నా ఎదుట పెచ్చు పెరగటం అలవిగాని పని (త్రివిక్రమస్ఫురణ). నన్నుదాటి రాజును హింసించడం నీకు శక్యంకాదు. (పరశురామావతారం). గాలిస్తాను కనుక అరణ్యాలలో ప్రవేశించడానికి అవకాశం లేదు (శ్రీరామావతారం). ప్రబలమైన ఆకారం కలవాడనని విర్రవీగడానికి వీలుండదు (బలరామావతారం). పుడమిలో నేను ప్రబుద్ధుణ్ణి అని భావించకు (బుద్ధావతారం); కల్కితనంతో (తెలివి తేటలతో) గర్వింపరాదు సుమా! (కల్క్యవతారం). నాతో యుద్ధం చెయ్యడం నీ తరంగాదు. తొలగిపో!

**విశే :** కృష్ణా! నీవు దశావతారాలెత్తి నన్ను సాధింపదలచినా అది నీ తరం గాదు. కనుక దూరంగా తొలగుమని చాణూరుడు మాధవుణ్ణి హెచ్చరించడం, ఈ పద్యంలోని విషయం. ఇక్కడ నారాయణుని దశావతార చర్యలు వర్ణితం.

**వ. అదిగాక నీవు శ్రీహరి నంటేని. 1342**

**ప్రతి :** అదిగాక నీవు= అంతేగాక నీవు; శ్రీహరిన్= నేను నారాయణుణ్ణి; అంటి(వి)+ఏనిన్= అని పల్కితే...

**తా :** అంతేగాక నేను శ్రీమన్నారాయణుణ్ణి అని అంటావా? అలాగయితే విను.

**సీ. మహిమతో నుండంగ మథురాపురము గాని పొలుపార వైకుంఠపురము గాదు**
**గర్వంబుతో నుండఁ గంసునిసభ గాని, సంసారరహితుల సభయుఁ గాదు**
**ప్రకటించి వినఁగ నా బాహునాదము గాని నారదువీణాస్వనంబు గాదు**
**చదురు లాడఁగ మల్లజననిగ్రహము గాని, రమతోడి ప్రణయవిగ్రహము గాదు**

**తే. వెలసి తిరుగంగ వేదాంతవీథి గాదు, మొఱఁగిపో మునిమనములమూల గాదు**
**సాఁగి నడవంగ భక్తులజాడ గాదు, శౌరి! నా మ్రోల నీ వెందుఁ జనియె దింక? 1343**

**ప్రతి :** మహిమతోన్= ప్రభావంతో; ఉండన్+కన్= నివసించడానికి; మథురాపురము+కాని= ఇది మథురా పట్టణమేగాని; పొలుపు+ఆరన్= సొబగు మీరగా; వైకుంఠపురముకాదు= వైకుంఠనగరం కాదుసుమా!; గర్వంబుతోన్+ఉండన్= దర్పంతో ఉండడానికి; కంసునిసభ+కాని= కంసునియొక్క సభ తప్ప; సంసారరహితుల= సంసారగంధంలేని (నిత్యసూరులయొక్క); సభయున్+కాదు= సభకాదుసుమా!; ప్రకటించి= చాటించి; వినన్+కన్= ఆలకించుటకు; నా బాహునాదము+కాని= నా భుజాస్ఫాలనశబ్దం తప్ప; నారదు వీణాస్వనంబు+కాదు= నారదుడియొక్క మహతి అనే వీణయొక్క రవళికాదుసుమా!; చదురులు+ఆడన్+కన్= చతురవచనాలు పలకడానికి; మల్లజననిగ్రహము+కాని= జెట్టీలయొక్క బెదిరించే మాటలుదప్ప; రమతోడి= లక్ష్మీదేవితో గూడిన; ప్రణయ విగ్రహముకాదు= ప్రణయ కలహంగాదుసుమా!; వెలసి= ప్రసిద్ధి వహించి;

తిరుగన్+కన్= చరించడానికి; వేద+అంతవీథి+కాదు= ఉపనిషన్మార్గంకాదు; మొఱఁగిపోన్= మోసగించి పోవడానికి; ముని= మునులయొక్క; మనములమూల+కాదు= మనస్సులనే రహస్యప్రదేశంకాదు; సాఁగి నడవన్+కన్= నిర్భయంగా చరించడానికి; భక్తులజాడ+కాదు= భక్తులు నడచిన బాటకాదు; శౌరి!= శూరుని మనుమడవైన కృష్ణా!; నా మ్రోలన్= నా ఎదుట; నీవు; ఎందున్= ఎక్కడికి; ఇంకన్= ఇక; చనియెదు(వు)= పోగలవు? పోజాలవని తాత్పర్యం.

**తా :** మహిమలు ప్రదర్శిస్తూ ఉండటానికి – ఇది వైకుంఠనగరంకాదు, కంసుడు పరిపాలించే మథురానగరం సుమా! గర్వంతో విర్రవీగుతూ ఉండటానికి – ఇది సంసార వాసన లేని నిత్యులుండే సభాభవనంగాదు; కంసుడియొక్క కొలువుకూటం సుమా! వీనులవిందుగా వినడానికి – ఇది నారద మహర్షియొక్క మహతి అనే వీణానాదంగాదు; చాణూరుని భుజాస్ఫాలన శబ్దం సుమా! నేరుపు మాటలాడటానికి ఇది లక్ష్మీదేవితోడి ప్రణయకలహంగాదు; జెట్టీలతోడి పోటు మాటలు సుమా! పేరు పెంపులు వహించి విహరించడానికి – ఇది వేదాంతవీథిగాదు; మథురానగరపు రాజవీథి సుమా! దాగి తప్పించుకొనడానికి ఇది మునీశ్వరుల మనసులలోని మూలస్థానం కాదు; మల్లయుద్ధరంగం సుమా! నీవు నిర్భయంగా చరించడానికి నీ భక్తుల కాలిజాడకాదు; భయంకరమైన జెట్టీలజాడసుమా! కృష్ణా! నా పాలబడిన నీవు తప్పించుకొని మరెక్కడికి వెళ్ళగలవు?(వెళ్ళలేవని భావం)

**వ. అని పలికి. 1344**

**ప్రతి :** అని పలికి= అని వచించి...

**సీ. రోషాగ్నిధూమప్రరోహంబు కైవడి శిరమున సన్నపుశిఖ వెలుంగ**
**నాశామదేభేంద్రహస్తసన్నిభములై బాహుదండంబులు భయదములుగ**
**లయసమయాంతకోల్లసితదంష్ట్రలభంగిఁ జాఁగిన కోఱమీసములు మెఱయ**
**నల్లని తెగ గల నడగొండ చాడ్పున నాభీలనీలదేహంబు మెఱయఁ**

**ఆ. జరణహతుల ధరణి సంచలింపఁగ నభో, మండలంబు నిండ మల్లసఱచి**
**శౌరిదెసకు నడచెఁ జాణూరమల్లుండు, పౌరలోకహృదయభల్లుఁ డగుచు. 1345**

**ప్రతి :** రోష+అగ్ని= కోపమనే నిప్పుయొక్క; ధూమప్రరోహంబు= పొగయొక్క అంకురం; కైవడిన్= వలె; శిరమునన్= తలమీద; సన్నము+శిఖ= సన్నని పిలకజుట్టు; వెలుంగన్= ప్రకాశించగా; ఆశా= దిక్కులందలి; మద+ఇభ+ఇంద్ర= మదించిన గజరాజులయొక్క; హస్తసన్నిభములు+ఐ= తొండాలతో సమానంగా ఉన్నవై; బాహుదండంబులు= కర్రలవంటి చేతులు; భయదములు+కన్= భీతికల్గించేవికాగా; లయసమయ= ప్రళయకాలంలోని; అంతక= యముడియొక్క; ఉల్లసిత= మెరిసిపోయే; దంష్ట్రలభంగిన్= కోరపండ్లవలె; చాఁగిన= పెరిగిన; కోఱమీసములు= మెలిదిరిగిన మీసాలు; మెఱయన్= ప్రకాశించగా; నల్లని తెగగల= నలుపూ, నిడుపూ గల్గిన; నడ+కొండచాడ్పునన్= నడిచే (నీల) పర్వతంలాగా; ఆభీల= భయంకరమైన; నీలదేహంబు= నల్లని శరీరం; మెఱయన్= ప్రకాశించగా; చరణహతులన్= కాలి తొక్కిళ్ళచే; ధరణి= భూమి; సంచలింపన్+కన్= కంపించగా; నభస్+మండలంబు నిండన్= గగనతలమంతటా వ్యాపించగా; మల్లచఱచి= భుజంచరచి; చాణూరమల్లుండు= చాణూరుడనే పేరుగల జెట్టి; పౌరలోకహృదయ భల్లుఁడు+అగుచున్= పట్టణ ప్రజానీకంయొక్క గుండెలకు బల్లెమవుతూ; శౌరిదెసకున్= కృష్ణుడున్న వైపునకు; నడచెన్= నడచివచ్చాడు.

**తా :** మల్లుడైన చాణూరుడు గగనమండలం నిండేటట్లు భుజాస్ఫాలనం చేశాడు. కోపమనే అగ్నినుంచి ప్రసరించే సన్నని పొగమాదిరిగా అతని తలపై పిలకజుట్టు ప్రకాశించింది. దిగ్గజాల తొండాలకు సమానమైన; పొడవైన చేతులు భీతిని కలిగిస్తున్నాయి. ప్రళయకాలంలోని యమధర్మరాజుయొక్క పదునైన కోరల విధంగా పొడవైన కోరమీసాలు మెరుస్తున్నాయి. నల్లని నిడుపైన నడగొండలాగా భయంకరమైన నల్లటిదేహం పెల్లుబుకుతున్నది. అతని అడుగుల తాకిడికి భూమి దద్దరిల్లగా చాణూరమల్లుడు కృష్ణుడివైపు నడిచాడు. ఈ దృశ్యం పట్టణ ప్రజల హృదయాలకు బల్లెమయింది.

**వ. ఇట్లగ్గలంబగు నగ్గలిక దగ్గఱిన మల్లునిం గని మెల్లన మొల్లంబగు బీరంబు వెల్లిగొన, వల్లవవల్లభుం డుల్లసిల్లి బాహునాదంబున రోదోంతరాళంబు పూరించి మించి కవిసె; ని ట్లిద్దఱు నుద్దవిడి నున్నత విషమంబులగు ఠాణ లిడి, కరి కరియును, హరి హరియును, గిరి గిరియునుం దాఁకు వీఁకం దలపడి, యితరేతరహేతిహింసితంబులగు దవానలంబుల తెఱంగునఁ బరస్పరదీర్ఘనిర్ఘాతఘట్టితంబులగు మహాభ్రంబుల విభ్రమంబున. నన్యోన్యతుంగతరంగతాడితంబులగు కల్పాంతకాలసముద్రంబుల రౌద్రంబున నొండొరుల ముష్టిఘట్టనంబుల ఘట్టితశరీరులై దద్దరిలక దగ్గఱి, గ్రద్దన న య్యిద్దఱుం దిరుగునెడ హరి సొచ్చి పేర్చి యార్చి జెట్టిం బట్టి పడం దిగిచి పాదంబుల జాడించి సముల్లాసంబున నెసకంబునకు వచ్చిన మెచ్చి, నొచ్చి య చ్చపలుండు మీఱి మోర సారించి, తెరలక, పొరలం ద్రొబ్బిన న బ్బలానుజుం డుబ్బి, గొబ్బున మేను వర్ధిల్ల నర్ధాంగకంబున నుండి జానువుల నొత్తుచు, నురవడిం గరవడంబున నున్న నా దుర్నయుండును 'బాల! మేలు మే' లని లీలం గాలు సోర నిచ్చి, త్రోచినం జూచి యేచి ఖేచరు లగ్గించి యుగ్గడింప న గ్గోపకుమారుండు పాటవంబున రాటవంబునకుం జని వెన్నెక్కి నిక్కిన నక్కంసభటుండు మదజలరేఖాబంధురంబగు గంధసింధురంబుచందంబునఁ బదంబును బదంబునం, గరంబును గరంబునన్ గ్రహించి, సహించి, వహించి నైపుణంబున లోపలం దిరిగి యట్టిట్టు దట్టించిన దిట్టతనంబునం దిటవు దప్పక య ప్పద్మలోచనుండు కేడించి, యేచి సమతలంబున వైచి ప్రచండంబగు వాని పిచండంబు వాగించి కాలం గాలు గీలించి డొక్కరంబు గొనిన న య్యభ్యాసిసభ్యులు సన్నుతింపం గ్రమ్మఱించి జడ్డనం గా లడ్డగించి, రక్షించుకొనిన నా రక్షోవైరి వానికటిచేలంబు వట్టి యెత్తి యొత్తి నడుమ రాగె యిడి, సందువెట్టి నవ్విన నవ్విరోధికాలు కాలిలో నిడి వేధించి నిరోధించిన నిరోధంబుఁ బాసి తిరిగి వసుదేవుపట్టి పట్టిసంబుగొని దట్టించిన నుబ్బరిక చేసి చాణూరుండు హరికరంబు వట్టి హుమ్మని నెమ్మొగంబునం గా లిడి మీఁదైనం గేళిబాలకుండు కాలిం గాల నివారించి మీఁదై నెగడి యుండనీక దుర్వారబలంబున విదలించి లేచి గృహీత పరిపంథిచరణుండై విపక్షునివక్షంబు వజ్రివజ్ర సన్నిభంబగు పిడికిటం బొడిచిన వాఁడు వాఁడి చెడక విజృంభించి యంభోరాశి మధ్యంబునం దిరుగు శైలంబుపోలిక నేల జిఱ జిఱం దిరిగి తన్నిన వెన్నుండు కుప్పించి యుప్పరం బెగసి మీఁద నుఱికిన నతండు కృష్ణపాద సంధిపరిక్షిప్తపాదుండై యెగసి లేచి సముద్ధతుం డయ్యె నయ్యెడ. 1346**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; అగ్గలంబు= అధికం; అగు+అగ్గలికన్= అయిన ఉత్సాహంతో; దగ్గఱిన మల్లునిన్= సమీపించిన జెట్టిని; కని= చూచి; మెల్లనన్= నెమ్మదిగా; మొల్లంబు+అగు= మిక్కుటమైన; బీరంబు= శౌర్యం; వెల్లిగొననన్= ప్రవహించగా; వల్లవ వల్లభుండు= గోపాల విభుడైన శ్రీకృష్ణుడు; ఉల్లసిల్లి= ఉత్సహించి; బాహునాదంబునన్= భుజాస్ఫాలన ధ్వనిచేత;

రోదస్+అంతరాళంబు= భూమ్యాకాశముల మధ్య ప్రదేశాన్ని; పూరించి= నింపి; మించి= అతిశయించి; కవిసెన్= చాణూరుడిమీదికి ఉరికాడు; ఇట్లు= ఈ రీతిగా; ఇద్దఱున్= శ్రీకృష్ణచాణూరులు ఇరువురూ; ఉద్దవిడిన్= శీఘ్రంగా; ఉన్నత విషమంబులు+అగు= హెచ్చు తక్కువలైన; ఠాణలు+ఇడి= స్థానాల్లో నిలిచి; కరి కరియును= ఏనుగు ఏనుగుతో; హరి హరియును= సింహం సింహంతో; గిరి గిరియునున్= కొండ కొండతో; తాఁకు= డీకొను; వీఁకన్= ఉత్సాహంతో; తలపడి= ఎదుర్కొని; ఇతర+ఇతర= పరస్పరం; హేతిహింసితంబులు= మంటలచేత బాధించబడినవి; అగు= ఐన; దవ+అనలంబుల తెఱంగునన్= కార్చిచ్చులవలె; పరస్పర దీర్ఘనిర్ఘాత ఘట్టితంబులు= అన్యోన్యం పొడవైన పిడుగులచేత కొట్టబడినవి; అగు= అయినట్టి; మహా+అభ్రంబుల విభ్రమంబునన్= గొప్పమేఘాలయొక్క విలాసంతో; అన్యః+అన్య= పరస్పరం; తుంగతరంగ తాడితంబులు= ఉన్నతాలైన అలలచేత కొట్టబడినవి; అగు= అయిన; కల్ప+అంతకాల= ప్రళయ కాలంలోని; సముద్రంబుల రౌద్రంబునన్= సాగరాలయొక్క భయంకరత్వంతో; ఒండు+ఒరుల= ఒకరు మరొకరి; ముష్టిఘట్టనంబులన్= పిడికిటి పోటులతో; ఘట్టితశరీరులు+ఐ= పొడువబడ్డ దేహాలుగలవారై; దద్దరిలక= చలించక, వణకక; డగ్గఱి= సమీపించి; గ్రద్దనన్= వేగంగా; ఆ+ఇద్దఱున్= ఆ ఇరువురు; తిరుగునెడ= తిరుగుతున్నపుడు; హరి= శ్రీకృష్ణుడు; చొచ్చి= ప్రవేశించి; పేర్చి= విజృంభించి; ఆర్చి= సింహనాదం చేసి; జెట్టిన్= చాణూరమల్లుణ్ణి; పట్టి= పట్టుకొని; పడన్+తిగిచి= నేలమీద పడేటట్లులాగి; పాదంబులన్= కాళ్ళతో; జాడించి= తన్ని; సముల్లాసంబునన్= మహోత్సాహంతో; ఎసకంబునకున్+వచ్చినన్= తన్ను మించి విజృంభించగా; మెచ్చి= మెచ్చుకొని; నొచ్చి= బాధితుడైకూడా; ఆ+చపలుండు= వడిగల ఆ చాణూరుడు; మీఱి= అతిశయించి; మోరసారించి= మూతినిచాచి; తెరలక= తొలగక, వెనుదీయక; పొరలన్ ద్రొబ్బినన్= పొరిలేటట్లు తోయగా; ఆ+బల+అనుజుండు= ఆ బలరాముని తమ్ముడైన శ్రీకృష్ణుడు; ఉబ్బి= ఉప్పొంగి; గొబ్బునన్= శీఘ్రంగా, వెంటనే; మేను= శరీరం; వర్ధిల్లన్= పెరుగగా; అర్ధ+అంగకంబునన్+ఉండి= వంగి మీది కురికే 'అర్ధాంగకము' అనే స్థానకంలో ఉండి; జానువులన్= మోకాళ్ళతో; ఒత్తుచున్= చాణూరుణ్ణి ఒత్తుతూ; ఉరవడిన్= వేగంతో; కరవడంబునన్= 'కరవడ'మనే మల్లబంధంలో; ఉన్నన్= ఉండగా; ఆ దుర్నయుండును= ఆ నీతిమాలిన చాణూరుడు; బాల= ఓ బాలుడా!; మేలు మేలు= బలే బలే; అని= అంటూ, శ్లాఘిస్తూ; లీలన్= విలాసంగా; కాలు+చొరన్+ఇచ్చి= కాలు చొప్పించి; త్రోచినన్= పడదోయగా; చూచి= కనుగొని; ఏచి= విజృంభించి; ఖేచరులు= గగనచారులైన వేల్పులు; అగ్గించి= మెచ్చి; ఉగ్గడింపన్= చెప్పికొనగా; ఆ+గోపకుమారుండు= ఆ గోపాలబాలుడు, కృష్ణుడు; పాటవంబునన్= నైపుణ్యంతో; రాటవంబునకున్+చని= 'రాటవము' అనే పేరుగల మల్లబంధంలోనికి; చని= వెళ్ళిపోయి; వెన్ను+ఎక్కి= చాణూరుని వీపుమీదనెక్కి; నిక్కినన్= గర్వించగా; ఆ+కంసభటుండు= ఆ కంసుడియొక్క సేవకుడు చాణూరుడు; మదజలరేఖా బంధురంబు+అగు= మదజలంయొక్క చారికలచేత నిండినట్టి; గంధసింధురంబు చందంబునన్= మదపుటేనుగు వలె; పదంబు= కాలిని; పదంబునన్= కాలితో; కరంబును= చేతిని; కరంబునన్= చేతితో; గ్రహించి= చేకొని, పట్టుకొని; సహించి= బాధలకోర్చి; వహించి= స్వీకరించి; నైపుణంబునన్= నేర్పుతో; లోపలన్= ఆ మల్లరంగంలోపల; తిరిగి= పరిభ్రమించి; అట్టు+ఇట్టు= అటు ఇటు; దట్టించినన్= అదిలించగా; దిట్టతనంబునన్= సామర్థ్యంతో; దిటవు= ధైర్యం; తప్పక= కోల్పోక; ఆ+పద్మలోచనుండు= తామరరేకులవంటి కన్నులుగల శ్రీకృష్ణుడు; కేడించి= లెక్కసేయక; ఏచి= విజృంభించి; సమతలంబునన్= చదునైన ప్రదేశంలో; వైచి= చాణూరుణ్ణి పడదోసి; ప్రచండంబు+అగు= మిక్కిలి భయంకరమైన; వాని పిచండంబు= అతడి కడుపును; వాగించి= తట్టి; కాలన్= కాలితో; కాలు+కీలించి= కాలు పెనవేసి; డొక్కరంబు= 'డొక్కరమ'నే మల్లబంధవిశేషాన్ని; కొనినన్= అవలంబించగా; (డొక్కరము-మూపుమీద మోకాళ్ళు మోపి చేతులతో అణచడం); ఆ+అభ్యాసి= నిత్యమూ సామొనర్చే చాణూరుడు; సభ్యులు= మల్లరంగంలోని జనులు; సన్నుతింపన్= తన్ను పొగడగా; క్రమ్మఱించి=

శ్రీకృష్ణుణ్ణి మరలించి; జడ్డనన్= వెంటనే; కాలు+అడ్డగించి= తనపాదం అడ్డంపెట్టి; రక్షించు కొనినన్= తన్ను కాపాడుకొనగా; ఆ రక్షస్+వైరి= రాక్షసశత్రువైన శ్రీకృష్ణుడు; వానికటిచేలంబు= ఆ చాణూరుని నడికట్టును, (కాసెను); పట్టి= చేతితో పట్టుకొని; ఎత్తి= పైకెత్తి; ఒత్తి= అదిమి; నడుమన్= ఆ నడికట్టు మధ్యలో; రాగె+ఇడి= 'రాగె' అనే మల్లబంధవిశేషాన్ని ప్రదర్శించి; సందు+పెట్టి= సందుచేసి; నవ్వినన్= నవ్వగా; ఆ+విరోధి= శత్రువైన ఆ చాణూరుడు; కాలు= తనపాదం; కాలిలోన్+ఇడి= శ్రీకృష్ణుని పాదంలో ఉంచి; అనగా తనకాలితో శ్రీకృష్ణుని కాలిని మెలివేసి; వేధించి= బాధించి; నిరోధించినన్= అడ్డగించగా; నిరోధంబున్+పాసి= చాణూరుని అడ్డగింతను తొలగించుకొని; తిరిగి= చరించి; వసుదేవుపట్టి= వసుదేవుని కుమారుడైన వెన్నుడు; పట్టిసము= పట్టిసమనే మల్లబంధ విశేషాన్ని; కొని= గ్రహించి; దట్టించినన్= అదలించగా; చాణూరుండు= చాణూరుడు; ఉబ్బరికచేసి= కుప్పించి; హరికరంబు= కృష్ణుని చెయ్యి; పట్టి= పట్టుకొని; హుమ్మని= హుమ్మంటూ; నెఱ+మొగమునన్= విశాలమైన ముఖమందు; కాలు+ఇడి= తన పాదముంచి; మీఁదు+ఐనన్= కృష్ణుణ్ణి అతిక్రమించగా; కేళిబాలకుండు= విలాసార్థం ఈ లోకంలో మనుష్యజాతి బాలుడైన శ్రీకృష్ణస్వామి; కాలిన్= తన ముఖంమీద మోపిన చాణూరుని పాదాన్ని; కాలన్= తన చరణంతో; నివారించి= తొలగద్రోసి; మీఁదు+ఐ+నెగడి+ఉండనీక= చాణూరుడు తనను అతిక్రమించినవాడై ఉండకుండ; దుర్వారబలంబునన్= నివారింపరాని శక్తితో; విదలించి= వానిని దులిపి; లేచి= పైకిలేచి; గృహీత= గ్రహించబడిన; పరిపంథిచరణుండు+ఐ= శత్రువుయొక్క కాళ్ళుగలవాడై; విపక్షుని వక్షంబునన్= విరోధిఅయిన చాణూరుడి గుండెను; వజ్రివజ్ర సన్నిభంబు= ఇంద్రునియొక్క వజ్రాయుధంతో సమానమైన; పిడికిటన్= పిడికిలితో; పొడిచినన్= పొడువగా, వాఁడు= చాణూరుడు; వాఁడిచెడక= పదను కోల్పోక; విజృంభించి= చెలరేగి; అంభస్+రాశి మధ్యంబునన్= సముద్రముయొక్క నడుమ; తిరుగు= భ్రమించునట్టి; శైలంబు పోలికన్= మందరగిరి మాదిరి; నేలన్= భూమిమీద; జిఱజిఱన్+తిరిగి= గిరగిరా పరిభ్రమించి; తన్నినన్= కాలితో తాచగా; వెన్నుండు= కృష్ణమూర్తి; కుప్పించి= హుమ్మని ఊపిరి బిగబట్టి; ఉప్పరంబు+ఎగసి= ఆకాశానికి ఎగిరి; మీఁదన్+ఉఱికినన్= చాణూరుడి పైకి దుముకగా; అతండు= చాణూర మల్లుడు; కృష్ణపాద= శ్రీకృష్ణుని కాలితాపుతో; సంధి పరిక్షిప్త= కీళ్ళుసడలిన; పాదుండు+ఐ= చరణాలు కలవాడై; ఎగసి= నేలనుండి పైకిలేచి; సముద్ధతుండు+అయ్యెన్= ఎదుర్కొనడానికి సంసిద్ధుడైనాడు; ఆ+ఎడన్= అట్టి సమయంలో...

**తా :** ఈ విధంగా మిక్కిలి పూనికతో సమీపించిన మల్లుణ్ణి గోపాలశేఖరుడు చూచాడు. మెల్లగా పరాక్రమాటోపం అతిశయిల్లగా, అతడుల్లాసంతో భుజమప్పళించాడు. ఆ నినాదం భూనభోంతరాళంలో నిండిపోయింది. అతడు జెట్టిపైకి ఉరికాడు. వారిద్దరూ మహావేగంతో హెచ్చు తగ్గైన స్థానాల్లో నిలిచి ఏనుగు ఏనుగుతో, సింహం సింహంతో, కొండ కొండతో డీకొన్నట్లు ఒకరితో ఒకరు తలపడ్డారు. రెండు కార్చిచ్చులు తమతమ అగ్ని జ్వాలలతో పరస్పరం పీడించుకొన్నట్లుగానూ, రెండు మహామేఘాలు తమపై అన్యోన్యం పెద్ద పెద్ద పిడుగులు రాల్చుకొన్నట్లుగానూ, ప్రళయకాలంలోని రెండు సముద్రాలు ఒకదాని నొకటి సముత్తుంగ తరంగాలతో కొట్టుకున్నట్లుగానూ వారిద్దరూ రౌద్రంతో ఒకరినొకరు పిడికిళ్ళతో గుద్దుకున్నారు. తబ్బిబ్బుపడక ఇరువురూ దగ్గరకు చేరుకుని వేగంగా మల్లరంగంలో పరిభ్రమించారు.

అప్పుడు హరి విజృంభించాడు. బొబ్బరిస్తూ జెట్టిని పట్టిపడలాగాడు. కాళ్లు జోడించి, మిక్కిలి ఉల్లాసంతో ఆ మల్లుడు విజృంభించటం వీక్షించి, గోవిందుడు మెచ్చుకున్నాడు. చపలుడైన చాణూరుడు బాధితుడైనప్పటికీ మెడనిక్కించి తొలగిపోక మురారిని పొరలాడేటట్లు తోశాడు. అంతట కృష్ణుడు శరీరం ఉప్పొంగగా తటాలున అర్ధాంగకంలో ఉన్నవాడై మోకాళ్ళతో వాణ్ణి ఒత్తాడు. వేగంగా "కరవడ" మనే ఒకమల్లబంధం పట్టులో ఉండినాడు. అపుడు దుర్నీతిపరుడైన మల్లుడు "డింభకా! మేలుమే"లని పల్కుతూ అలవోకగా కాలుచొప్పించి, శ్రీకృష్ణుణ్ణి పడదోశాడు. అప్పుడు వెన్నుడు చెలరేగి వేల్పులు

ప్రస్తుతించగా చాతుర్యంతో వెనుకకు వెళ్లి చాణూరుని వీపుపై ఎక్కి నిక్కాడు. కంసుని భృత్యుడైన చాణూరుడు మదజలధారలచారికలతో నిండిన మదగజంవలె మాధవుడిపాదాన్ని తన పాదంతో, చేతిని తనచేతితో పెనవేసి పట్టుకుని నేర్పుతో మల్లరంగ భూమిలో తిరుగుతూ అటూ ఇటూ అదిలించివేశాడు.

కమలాక్షుడు దిట్టతనంతో దిటవు కోల్పోక తొలగి చెలరేగి జెట్టిని సమతలంమీద పడదోసి పెద్దదైనవానికడుపుమీద మోదాడు. తనకాలితో వాడి కాలిని మెలివేసి డొక్కరమనే మల్లబంధవిశేషాన్ని ప్రదర్శించాడు.

మల్ల విద్యాభ్యాసం కల చాణూరుడు సభలోనివారంతా తన్ను పొగడుతుండగా కృష్ణుణ్ణి వెనుకకు మరలించి తటాలున తన కాలితో అడ్డగించి తన్ను కాపాడుకున్నాడు. రాక్షసవిరోధి అయిన కృష్ణుడు చాణూరుని దట్టి పట్టి ఎత్తి ఒత్తి రాగెబంధంవేసి సందుపెట్టి నవ్వాడు. పగతుడైన మల్లుడు తనకాలిని కృష్ణుడి కాలితో చేర్చి బాధించి నిరోధించాడు. వాసుదేవుడు విరోధినిరోధాన్ని తప్పించుకుని, పట్టిసమనే మల్లబంధం వేసి అదిలించాడు. చాణూరుడు వెంటనే చెలరేగి శ్రీహరి బాహువు పట్టుకుని హుమ్మని హుంకరించి ముఖాన కాలుపెట్టి అధికుడై నిలిచాడు.

లీలామానుష బాలుడైన కృష్ణుడు చాణూరుడి కాలిని తన కాలితో అడ్డగించి, అతడి విజృంభణం అణచి అడ్డుకోరాని బలిమితో విదిలించుకొని లేచాడు. పగవాడి పాదాన్ని తొక్కిపట్టి వజ్రాయుధంవంటి పిడికిలితో వాడి ఎదమీద పొడిచాడు. వాడు పోడిమి చెడక చెలరేగాడు. చిలికే సమయంలో సాగరమధ్యంలో తిరిగే మందరగిరి మాదిరి వాడు నేలమీద గిరగిర తిరుగుతూ కృష్ణుణ్ణి తన్నాడు. వెన్నుడు కుప్పించి గగనానికి ఎగిరి వాడిపై దుమికాడు. శ్రీహరిపాదాలతాకిడికి తన పాదాల సంధిబంధాలు సడలగా వాడు ఎగిరి పైకిలేచి విజృంభించాడు.

**క. బలభద్రుఁడు ముష్టికుఁడును, బలములు మెఱయంగఁ జేసి బాహాబాహిం**
**బ్రలయాగ్నుల క్రియఁ బోరిరి, వెలయఁగ బహువిధములైన విన్నాణములన్. 1347**

**ప్రతి :** బలభద్రుఁడు= బలరాముడు; ముష్టికుఁడును= ముష్టికుడనే పేరుగల మరొక మల్లుడు; బలములు= వారి వారి శక్తులు; మెఱయన్+కన్+చేసి= ప్రకాశించేటట్లు చేసి; బాహాబాహిన్= చేయి చేయితో కలపడంచేత; ప్రలయ+అగ్నులక్రియన్= ప్రళయకాలంలోని అగ్నులమాదిరి; బహువిధములు+ఐన= పలుతెరగులైన; విన్నాణములన్= మల్లయుద్ధ నైపుణ్యాలచేత; వెలయన్+కన్= విలసిల్లగా; పోరిరి= పోట్లాడినారు.

**తా :** బలరాముడు, ముష్టికుడు తమ తమ శక్తులు వ్యక్తమయ్యేటట్లు చేతులు చేతులు కల్పి ప్రళయ సమయంలోని అగ్నుల వలె పలురీతులైన మల్లయుద్ధ నైపుణ్య ప్రదర్శనలు చేస్తూ పోట్లాడారు.

**వ. ఇ వ్విధంబున. 1348**

**ప్రతి :** ఈ+విధంబునన్= ఈ రీతిగా...

**క. వల్లవులు పెనఁగి రున్నత, గల్లులతో భిన్న దిగిభకరవల్లులతో**
**మల్లులతో రిపుమానస, భల్లులతో భీతగోపవల్లులతోడన్. 1349**

**ప్రతి :** వల్లవులు= గొల్లలైన శ్రీకృష్ణబలరాములు; ఉన్నత గల్లులతోన్= ఎత్తయిన దౌడలు (చెంపలు) గలవారూ; భిన్న= భేదించునట్టి; దిక్+ఇభ= దిగ్గజాలయొక్క; కరవల్లులతోన్= తొండాలనదగిన తీగలవంటి చేతులు గలవారూ; రిపుమానస

భల్లులతోన్= శత్రువుల మనసులకు శూలాలవంటివారూ, భీతగోపవల్లులతోడన్= భయపెట్టబడిన గోపాలకుల విస్తారం కలవారూ అయిన; మల్లులతోన్= జెట్టీలతో; పెనఁగిరి= పోట్లాడినారు.

**తా :** నిక్కిన చెక్కిళ్లుగలవారూ, దిగ్గజాల తొండాలను భేదించే తీగలవంటి చేతులు గలవారూ, శత్రువుల మనస్సులకు బల్లెములవంటివారూ, గోపకుల సమూహానికి భయంకల్గించేవారూ అయిన ఆ మల్లురతో గోపాల బాలకులు బలరామకృష్ణులు పోట్లాడారు.

**వ. ఆ సమయంబునఁ బౌరకాంతలు మూఁకలు గట్టి వెచ్చనూర్పుచు ముచ్చటలకుం జొచ్చి తమలో నిట్లనిరి. 1350**

**ప్రతి :** ఆ సమయంబునన్= అట్టివేళలో; పౌరకాంతలు= మథురాపురిలోని స్త్రీలు; మూఁకలు+కట్టి= గుంపులు గూడి; వెచ్చనూర్పుచున్= వేడినిట్టూర్పులు విడుస్తూ; ముచ్చటలకున్+చొచ్చి= వార్తలు చెప్పుకోడానికి ప్రారంభించి; తమలోన్= తమలో తాము; ఇట్లు+అనిరి= ఇలా అనుకొన్నారు.

**తా :** బలరామకృష్ణులు మల్లులతో పెనగులాడే సమయంలో పట్టణస్త్రీలంతా గుంపులుగాచేరి, వేడి నిట్టూర్పులు విడుస్తూ, తమలో ఈ విధంగా ముచ్చటించుకొన్నారు.

**ఉ. మంచికొమారులం గుసుమమంజుశరీరులఁ దెచ్చి చెల్లరే!**
**యంచితవజ్రసారులు మహాద్రికఠోరులు నైన మల్లురం**
**గ్రించులఁ బెట్టి రాజు పెనఁగించుచుఁ జూచుచు నున్నవాఁడు; మే**
**లించుక లేదు; మాను మనఁ; డిట్టి దురాత్ముని మున్ను వింటిమే? 1351**

**ప్రతి :** రాజు= ప్రభువైన కంసుడు; మంచి కొమారులన్= ఉత్తమ బాలకులను; కుసుమ= పూలవలె; మంజు= మనోహరాలైన; శరీరులన్= దేహాలుగలవారిని; తెచ్చి= రప్పించి; అంచిత వజ్రసారులు= ఒప్పిదమైన వజ్రాయుధం చేవవంటి చేవగలవారూ; మహా+అద్రికఠోరులున్+ఐన= గొప్ప కొండలవలె మిక్కిలి కఠినులు అయిన; క్రించులన్= క్రూరులను; మల్లురన్= జెట్టీలను; పెట్టి= జతచేసి; పెనఁగించుచున్= పోట్లాడిస్తూ; చూచుచున్+ఉన్నవాఁడు= వినోదిస్తూ ఉన్నాడు; చెల్లరే= అక్కటా!; మేలు= మంచితనం; ఇంచుక లేదు= కొంచెమైనా లేదు; మానుము+అనఁడు= పోరు మానండని చెప్పడు; ఇట్టి+దుర్+ఆత్మునిన్= ఇట్టి చెడుమనస్సు గలవాణ్ణి; మున్ను వింటిమి+ఏ= ఇంతకు పూర్వం ఎపుడైనా విన్నామా? వినలేదని భావం.

**తా :** ఔరా! పూలవలె మృదువైన శరీరాలుగల మంచి బాలురను రప్పించి, వజ్రసారులూ, పర్వతాలవలె కఠోరులూ అయిన వీరులతో మల్లయుద్ధం చేయిస్తూ రాజు వినోదం చూస్తున్నాడు. ఇందులో మంచి ఏ కొంచెంకూడా లేదు. పోరు మానండి అని పలుకడు. ఇలాంటి దుర్మార్గుణ్ణి మునుపు ఎన్నడైనా విన్నామా? కన్నామా?

**క. చూచెదరు గాని సభికులు, నీ చిన్నకుమారకులకు నీ మల్లురకున్**
**ఓ చెల్ల! యీడు గాదని, సూచింపరు పతికిఁ దమకు శోకము గాదే? 1352**

**ప్రతి :** సభికులు= ఈ సభలోని జనులు; చూచెదరు+కాని= జెట్టీలతో ఈ బలరామకృష్ణులు పెనగడం చూస్తున్నారేతప్ప; ఈ చిన్న కుమారకులకున్= ఈ పసిబాలకులకు; ఈ మల్లురకున్= ఈ జెట్టీలకు; ఈడు+కాదు+అని= సాటికాదు అని; పతికిన్=

రాజైన కంసుడికి; సూచింపరు= తెలియజెప్పరు; ఓ చెల్ల!= అక్కటా!; తమకున్= సభలోని తమకు; శోకము+కాదు+ఏ= (ఈ పోరాటాన్ని వీక్షించడం) దుఃఖకరం కాదా? (దుఃఖకరం అని భావం)

**తా :** సభాసదులు చూస్తున్నారే కాని ఈ పసిపిల్లలకూ, ఈ మల్లురకూ జోడు కుదరదని రాజుకు చెప్పలేకున్నారు ఇది అధర్మం. ఇది తమకు (తమ రాజుకు) శోకం కలిగించక పోదు.

**సీ. వేణునాళముల మై వెలసిన మాధవుం డధరామృతము లిచ్చి యాదరించుఁ**
**బింఛదామములమై పెరిఁగిన వెన్నుండు మస్తకంబునఁ దాల్చి మైత్రి నెఱపుఁ**
**బీతాంబరములమై బెరసిన గోవిందుఁ డంసభాగమునఁ బాయక ధరించు**
**వైజయంతికలమై వ్రాలినఁ గమలాక్షుఁ డతికుతూహలమున నఱుతఁ దాల్చుఁ;**

**తే. దనరు బృందావనంబునఁ దరులమైనఁ, గృష్ణుఁ డానందమునఁ జేరి క్రీడ సల్పు**
**నెట్టి నోముల నయిన ము న్నిట్టివిధము, లేల కామైతి మోయమ్మ! యింక నెట్లు? 1353**

**ప్రతి :** వేణునాళములము+ఐ= మనం పిల్లనగ్రోవులమై; వెలసినన్= ఉంటే; మాధవుండు= శ్రీకృష్ణుడు; అధర+అమృతములు= పెదవినుండి స్రవించే సుధారసాలు; ఇచ్చి= ఒసగి; ఆదరించున్= మన్నించేవాడు; పింఛదామములము+ఐ= నెమలి పురిదండలమై; పెరిఁగినన్= వర్ధిల్లినట్లయితే; వెన్నుండు= ఈ విష్ణుస్వరూపుడు; మస్తకంబునన్+తాల్చి= తలమీద ధరించి; మైత్రినెఱపున్= చెలిమి చేసేవాడు; పీత+అంబరులము+ఐ= పచ్చని పట్టువస్త్రాలమై; బెరసినన్= పొందినచో (హత్తుకొన్నచో); గోవిందుఁడు= ఈ గోపాలుడు; అంసభాగమునన్= భుజస్కంధాలందు; పాయక= మానక; ధరించున్= ధరించేవాడు; వైజయంతికలము+ఐ= మనం వనమాలలమై; వ్రాలినన్= చెంత జేరి ఉంటే; కమల+అక్షుఁడు= పద్మాలవంటి కన్నులుగల శ్రీకృష్ణుడు; అతి కుతూహలమునన్= మిక్కిలి వేడుకతో; అఱుతన్= మెడయందు; తాల్చున్= ధరించేవాడు; తనరు= ఒప్పునట్టి; బృందావనంబునన్= బృందావనంలో; తరులము+ఐనన్= వృక్షాలమై ఉంటే; కృష్ణుఁడు= అచ్యుతుడు; ఆనందమునన్= సంతోషంతో; చేరి= మన దగ్గరకు వచ్చి; క్రీడసల్పున్= ఆటలాడేవాడు; ఎట్టినోములన్+అయినన్= ఎటువంటి వ్రతాలచేతగూడ; మున్ను= పూర్వం; ఇట్టి విధములు= ఇపుడు చెప్పిన పిల్లనగ్రోవులు మొదలైన పరికరాలుగా; ఓ+అమ్మ= ఓ తల్లులార!; ఏలకాము+ఐతిమి= ఎందుకు కాకపోయామో తెలియదు; ఇంకన్+ఎట్లు= మరి మనగతి యేమి?

**తా :** మనం పిల్లనగ్రోవులమై ఉంటే మాధవుడు కెమ్మోవిసుధ లిచ్చి మన్నించేవాడు. నెమలిపురి దండలమై ఉంటే గోవిందుడు శిరసున ధరించేవాడు. పీతాంబరాలమైఉంటే బుజాలపై విడువక ధరించి ఉండేవాడు. వనమాలికలమై ఉంటే కమలాక్షుడు మిక్కిలి ఆసక్తితో కంఠాన అలంకరించుకొనేవాడు. అందమైన బృందావనంలో వృక్షాలమై ఉంటే కృష్ణుడు ఆనందంతో చెంతకు జేరి క్రీడించేవాడు. ఓ యమ్మా! పూర్వజన్మలలో ఎట్టివ్రతాలనైనా ఆచరించి, ఇలా ఎందుకు కాలేకపోయామో! ఇపుడు ఇంకేమి చేయగలం?

**ఉ. పాపపు బ్రహ్మ! గోపికల పల్లెలలోన సృజింపరాదె ము**
**న్నీపురిలోపలన్ మనల నేల సృజించె? నటైన నిచ్చలున్**
**జేపడుఁ గాదె యీ సుభగుఁ జెందెడి భాగ్యము సంతతంబు నీ**
**గోపకుమారుఁ బొంద మును గోపకుమారిక లేమి నోఁచిరో! 1354**

**ప్రతి :** పాపము+బ్రహ్మ= పాపిష్ఠి విధాత; మనలన్= మనందరినీ; మున్ను= మునుపు; గోపికల= గొల్ల చేడెలయొక్క; పల్లెలలోనన్= గ్రామాలలో; సృజింపన్‌రాదు+ఎ= పుట్టించ వచ్చుగదా!; ఈ పురిలోపలన్= ఈ మథురానగరంలో; ఏల సృజించెన్= ఎందుకు పుట్టించాడు?; అటు+ఐనన్= ఆ విధంగా గొల్లపల్లెల్లో పుట్టించి ఉంటే; నిచ్చలున్= ఎల్లప్పుడూ; ఈ సుభగున్= ఈ సుందరుణ్ణి; చెందెడు= పొందునట్టి; భాగ్యము= అదృష్టం; చేపడున్+కాదు+ఎ= లభించేదిగదా! సంతతంబున్= నిత్యమూ; ఈ గోపకుమారున్= ఈ గొల్ల చిన్నవాణ్ణి; పొందన్= అనుభవించడానికి; ముని= పూర్వం; గోపకుమారికలు= గొల్ల కన్నెలు; ఏమి నోఁచిరి+ఓ= ఎట్టివ్రతాలు సల్పినారో గదా!

**తా :** పాపాత్ముడైన బ్రహ్మ మునుపే మనల్ని ఆ వ్రేపల్లెలో పుట్టించి ఉండగూడదా? ఈ మథురలో ఎందుకు పుట్టించాడో! ఆ గొల్ల పల్లెల్లోనే పుట్టించి ఉంటే ఈ సుందరాంగుణ్ణి పొందే సౌభాగ్యం, సంతోషం ఎల్లప్పుడు మనకు సమకూడి ఉండేవి గదా! ఈ గోపకుమారుణ్ణి పొందడానికి ఆ గోపికలు పూర్వం ఎట్టి నోములు నోచారో!

**క. గోపాలకృష్ణతోడను, గోపాలనవేళలందుఁ గూడి తిరుగు నా**
**గోపాలు రెంత ధన్యులొ, గోపాలుర కైన నిట్టి గురురుచి గలదే? 1355**

**ప్రతి :** గోపాలకృష్ణతోడను= గోవులను పాలించే శ్రీకృష్ణుడితో; గోపాలన వేళలందున్= ఆవులను మేపే సమయంలో; కూడి= అతడితో చేరి; తిరుగు= సంచరించే; ఆ గోపాలురు= ఆ గొల్లలు; ఎంత ధన్యులు+ఒ= ఎంత కృతార్థులో; గోపాలురకున్+ఐనన్= భూమిని పాలించే రాజులకైనా; ఇట్టి గురురుచి= ఇంతటి గొప్పతేజం (వైభవం); కలదు+ఏ= ఉన్నదా? లేదని భావం.

**తా :** గోపాలకృష్ణుడితో చేరి గోవులను మేపుతూ సంచరించే గొల్లలు ఎంత అదృష్టవంతులో? మరి భూపాలకులకైనా ఈ గోపాలురకుండే ఘనవైభవం లేదు.

**విశే :** గోపాల శబ్దం రెండుర్థాలుగల మాట; గొల్ల అని, రాజు అని అర్థం. గో అంటే గోవు, భూమి మొదలగు అర్థాలున్నాయి.

**క. శ్రమజలకణసిక్తంబై, కమలదళేక్షణునివదనకమలము మెఱసెన్**
**హిమజలకణసిక్తంబై, కమనీయం బగుచు నున్న కమలము భంగిన్. 1356**

**ప్రతి :** కమలదళ+ఈక్షణుని= తామరరేకులవంటి కన్నులుగల కృష్ణమూర్తియొక్క; వదనకమలము= ముఖం అనే పద్మం; శ్రమజలకణ సిక్తంబు+ఐ= చెమటనీటి బొట్లచేత తడిసిందై; హిమజల కణసిక్తంబు+ఐ= మంచునీటి బొట్లచేత తడిసినట్టిదై; కమనీయంబు+అగుచున్= మదికి ఇంపుగూరుస్తూ; ఉన్న= ఉన్నట్టి; కమలము భంగిన్= పద్మంవలె; మెఱసెన్= ప్రకాశించింది.

**తా :** మంచునీటి చుక్కలతో తడిసి మనోహరంగా ఉండే పద్మం మాదిరి, కమలాక్షుడి ముఖకమలం చెమట బిందువులచే తడిసి ప్రకాశిస్తున్నది.

**ఆ. సభకుఁ బోవ రాదు; సభవారి దోషంబు, నెఱిఁగి యూరకున్న నెఱుఁగకున్న**
**నెఱిఁగి యుండియైన నిట్టట్టు వలికినఁ, బ్రాజ్ఞుఁడైనఁ బొందుఁ బాపచయము. 1357**

**ప్రతి :** సభకున్= సదస్సుకు; పోవన్+రాదు= వెళ్ళగూడదు; సభవారి దోషంబున్= సభలో ఉన్నవారి తప్పును; ఎఱిఁగి= తెలిసి; ఊరక+ఉన్నన్= మిన్నకుండినను; ఎఱుఁగక+ఉన్నన్= తెలుసుకొనకున్ననూ; ఎఱిఁగి+ఉండి+ఐనన్= తెలిసి ఉన్నప్పటికీ;

ఇట్టు+అట్టు+పలికినన్= సత్యాధర్మాలకు విరుద్ధంగా మాట్లాడినా; ప్రాజ్ఞుఁడు+ఐనన్= పండితుడయినా; పాపచయమున్= పాపాల మొత్తాన్ని; పొందున్= పొందుతాడు (పాపఫలం అనుభవిస్తాడు.)

**తా :** సభకు వెళ్ళరాదు; వెళ్ళితే సభలోనివారుచేసే తప్పిదాలను తెలిసి ఉపేక్షించినప్పటికీ, ఆ దోషాలు తెలుసుకోలేక పోయినప్పటికీ, దోషాలు తెలిసికూడా న్యాయవిరుద్ధంగా పలికిన ఎంత పండితుడయినా పాపం అనుభవించి తీరుతాడు.

**వ. అని పెక్కంఁడ్రు పెక్కు విధంబులం బలుకుచుండఁ దద్బాహుయుద్ధంబున. 1358**

**ప్రతి :** అని= అంటూ; పెక్కంఁడ్రు= పలువురు; పెక్కు విధంబులన్= అనేక రీతుల; పలుకుచున్+ఉండన్= మాట్లాడుతుండగా; తద్+బాహు యుద్ధంబునన్= చేతులతో చేసే పోరాటంలో; మల్ల సంగ్రామంలో...

**తా :** ఈ విధంగా సభలో ఉన్న పలువురు పలువిధాల మాట్లాడుతుండగా ఆ ముష్టియుద్ధంలో

**క. ధృతి సెడి లోఁబడె మల్లుం, డతులితభవజలధితరికి హతరిపుపురికిన్**
**జితకరికిన్ ధృతగిరికిం, దతహరిరవభరితశిఖరిదరికిన్ హరికిన్. 1359**

**ప్రతి :** మల్లుండు= చాణూరుడనే ఆ జెట్టి; ధృతి+చెడి= ధైర్యం నశించి; అతులిత= సాటిలేని; భవజలధి= పుట్టుకలనే సముద్రానికి; తరికిన్= నావ అయినవాడును; హతరిపు పురికిన్= కొట్టబడిన శత్రువులయొక్క పట్టణాలు కలవాడును; జితకరికిన్= జయించబడిన కువలయాపీడమనే ఏనుగు గలవాడూ; ధృతగిరికిన్= ధరించబడిన పర్వతంగలవాడూ (గోవర్ధనగిరి నెత్తినవాడూ); తత= విస్తారమైన; హరిరవ= సింహనాదంచేత; భరిత= నిండించబడిన; శిఖరిదరికిన్= పర్వతగుహలు గలవాడూ అయిన; హరికిన్= శ్రీకృష్ణునికి; లోఁబడెన్= లొంగిపోయాడు.

**తా :** సాటిలేని సంసారమనే సముద్రాన్ని దాటడానికి నౌకవంటివాడూ, శత్రుపట్టణాలను ధ్వంస మొనర్చినవాడూ, కువలయాపీడగజాన్ని జయించినవాడూ, గోవర్ధనగిరిని ఎత్తినవాడూ, విస్తారమైన సింహగర్జనంతో పర్వత గుహలను పూరించినవాడూ అయిన శ్రీకృష్ణుడికి చాణూరుడు ధైర్యం చెడి లోబడిపోయాడు.

**క. హరికిని లోఁబడి బెగడక, హరియురము మహోగ్రముష్టి నహితుఁడు పొడువన్**
**హరి కుసుమమాలికాహత, కరిభంగిఁ బరాక్రమించెఁ గలహోద్ధతుఁడై. 1360**

**ప్రతి :** అహితుఁడు= విరోధి అయిన చాణూరుడు; హరికిని= శ్రీకృష్ణుడికి; లోఁబడి= అధీనుడై; బెగడక= భయపడక; హరి+ఉరమున్= శ్రీకృష్ణుడి రొమ్మును; మహా+ఉగ్రముష్టిన్= మిక్కిలి భయంకరమైన పిడికిలితో; పొడువన్= కుమ్మగా; హరి= వాసుదేవుడు; కలహ+ఉద్ధతుఁడు+ఐ= పోరాటంలో పటిమగలవాడై; కుసుమమాలికా= పూలదండచేత; హత= కొట్టబడిన; కరిభంగిన్= ఏనుగులా; పరాక్రమించెన్= శౌర్యం చూపాడు.

**తా :** పగవాడైన చాణూరుడు కృష్ణుడికి లోబడినప్పటికీ, భయపడక మహాభయంకరమైన పిడికిలితో వెన్నుని రొమ్మును పొడిచాడు. పూలదండచే కొట్టబడిన ఏనుగు లాగా ఆ పోటును లెక్కచెయ్యక శ్రీహరి యుద్ధంలో విజృంభించి, పరాక్రమం చూపాడు.

**క. శౌరి నెటిఁ జొచ్చి కరములు, క్రూరగతిన్ బట్టి త్రిప్పి కుంభిని వైచెన్**
**శూరుం గలహగభీరున్, వీరుం జాణూరు ఘోరు వితతాకారున్. 1361**

**ప్రతి :** శౌరి= శూరుని మనుమడైన శ్రీకృష్ణుడు; నెఱిన్= విక్రమంతో; చొచ్చి= కదనరంగంలో ప్రవేశించి; శూరున్= వీరుడునూ; కలహ గభీరున్= పోరాటంలో లోతైనవాడున్నూ; వీరున్= పరాక్రమవంతుడూ; ఘోరున్= భయంకరుడూ, వితత+ఆకారున్= దొడ్డరూపం కల్గినవాడునూ అయిన; చాణూరున్= చాణూరుణ్ణి; కరములు= చేతులను; క్రూరగతిన్= కర్కశమైన రీతితో; పట్టి= పట్టుకొని, చేజిక్కించుకొని; త్రిప్పి= గిరగిర త్రిప్పి; కుంభినిన్= నేలమీద; వైచెన్= పడవేశాడు, (కూల్చాడు.)

**తా :** పరాక్రమవంతుడూ, యుద్ధమందు గంభీరుడూ, భీతి గొలిపేవాడూ, దొడ్డదేహకలవాడూ, వీరుడూ అయిన చాణూరుణ్ణి, కృష్ణుడు చొచ్చుకొని పోయి కర్కశంగా వాడిచేతులు పట్టుకొని గిరగిర తిప్పి నేలపై కొట్టాడు.

**క. శోణితము నోర నొలుకఁగ, జాణూరుం డట్లు కృష్ణసంభ్రామణ సం**
**క్షీణుండై క్షోణిం బడి, ప్రాణంబులు విడిచెఁ గంసుప్రాణము గలఁగన్. 1362**

**ప్రతి :** చాణూరుండు= చాణూరుడు; శోణితము= రక్తం; నోరన్= నోటినుంచి; ఒలుకన్+కన్= కారగా; అట్లు= ఆ విధంగా; కృష్ణసంభ్రామణ= శ్రీకృష్ణుడు గిరగిర త్రిప్పడంవల్ల; సంక్షీణుండు+ఐ= మిక్కిలి క్షీణించినవాడై; క్షోణిన్+పడి= నేలమీద పడి; కంసుప్రాణము= కంసుడియొక్క ప్రాణం; కలఁగన్= కలతచెందగా; ప్రాణంబులు= అసువులు; విడిచెన్= వదిలాడు.

**తా :** ఆ విధంగా అచ్యుతుడిచేత గిరగిర తిప్పబడిన చాణూరుడు బాగా నలిగినవాడై నోటినుంచి నెత్తురు కారగా పుడమి మీద బడి ప్రాణాలు విడిచాడు. అతడి ప్రాణం పోగానే కంసుని ప్రాణం కలకబారింది.

**క. బలభద్రుండును లోకులు, బలభద్రుం డనఁగఁ బెనఁగి పటుబాహుగతిన్**
**బలభేది మెచ్చఁ ద్రిప్పెను, బలవన్ముష్టికునిఁ గంసుబలములు బెగడన్. 1363**

**ప్రతి :** బలభద్రుండును= బలరాముడు కూడ; లోకులు= జనులు; బలభద్రుండు+అనన్+కన్= బలంచేత, శ్రేష్ఠుడు అని మెచ్చుగా; పటుబాహుగతిన్= దృఢమయిన భుజవిక్రమంతో; పెనఁగి= పోరాడి; బలభేది= బలుడనే రక్కసుని సంహరించిన దేవేంద్రుడు; మెచ్చన్= కొనియాడగా; కంసు బలములు= కంసుడియొక్క సేనలు; బెగడన్= భయపడగా; బలవత్+ముష్టికునిన్= బలవంతుడైన ముష్టికుణ్ణి; త్రిప్పెను= పట్టుకొని గిరగిర తిప్పాడు.

**తా :** బలభద్రుడు నిజంగా బలభద్రుడే-బలంచే క్షేమం కలవాడే అంటూ లోకులు అంటుండగా, ఇంద్రుడు మేలు మేలని మెచ్చుకోగా, బలరాముడు అపారమైన బాహుబలంతో శక్తిశాలియైన ముష్టికుణ్ణి పట్టుకుని, ఇటూ అటూ త్రిప్పాడు. అది చూచి కంసుడిసేన బెదిరింది.

**ఆ. త్రిప్పి నేల వైవ దిగ్గన రక్తంబు, వదనగహ్వరమున వఱదవాఱ**
**ముష్టికుండు ఘోరముష్టి సత్త్వము సెడి, కూలె గాలిఁ దరువు గూలినట్లు. 1364**

**ప్రతి :** త్రిప్పి= గిరగిర తిప్పి; నేలన్+వైవన్= భూమిమీద పడవేయగా; దిగ్గనన్= వెంటనే, రక్తంబు= నెత్తురు; వదన గహ్వరమునన్= గుహవంటి నోటినుంచి; వఱద+పాఱన్= వెల్లువలై ప్రవహించగా; గాలిన్= వాయువుచేత; తరువు= వృక్షం; కూలిన+అట్లు= నేలమీద వాలినట్లు; ముష్టికుండు= ముష్టికుడు; ఘోరముష్టిన్= బలరాముని భయంకరమైన పిడికిటి పోటుతో; సత్త్వము+చెడి= సత్తువ నశించి; కూలెన్= నేలమీదపడ్డాడు.

**తా :** బలరాముడు అలా తిప్పి తిప్పి నేలపై దబ్బున పడవేయగా ముష్టికుడి గుహవంటి నోటినుంచి నెత్తురు వరదలై పారింది. బలరాముడి భయంకరమైన ముష్టిఘాతంతో ముష్టికుడు సత్తువ గోల్పోయి పెనుగాలివల్ల మహావృక్షం కూలినట్లు నేలపై కూలాడు.

**వ. మఱియును. 1365**

**ప్రతి :** మఱియును= ఇంకా...

**క. పాటవమున బలుపిడికిట, సూటిం బడఁబొడిచె బలుఁడు శోషిత ఘన బా**
**హాటోపనృపతికీటుం, గూటున్ వాచాటు నధికఘోరలలాటున్. 1366**

**ప్రతి :** బలుఁడు= బలరాముడు; పాటవమునన్= శక్తితో; శోషిత= శుష్కింపజేయబడిన; ఘనబాహా+ఆటోప= గొప్ప భుజావిజృంభణం కల్గిన; నృపతి+కీటున్= రాజునకు చీడపురుగైనవాడున్నూ; వాచాటున్= వదరుబోతున్నూ; అధికఘోరలలాటున్= మిక్కిలి భయంకరమైన నుదురుగలవాడున్నూ అయిన; కూటున్= కూటుడు అనే పేరుగల మల్లుణ్ణి; బలుపిడికిటన్= దృఢమైన ముష్టితో; సూటిన్= సూటిగా, గురి తప్పకుండా; పడన్= నేలమీద కూలునట్లు; పొడిచెన్= పొడిచాడు.

**తా :** గొప్ప భుజబలాటోపంగలవాడూ, రాజుకు చీడపురుగులాంటివాడూ, కల్లరీడూ, వదరుబోతూ, మిక్కిలి భయంకరమైన నుదురుగలవాడూ అయిన కూటుడనే మల్లుణ్ణి; బలభద్రుడు దిటవైన తన పిడికిలితో సూటిగా పడబొడిచాడు.

**వ. అంత న ద్దనుజాంతకుండు చరణప్రహరణంబుల భిన్నమస్తకులం జేసి వానిచెలులం గూట తోసల శలుల నంతకాంతికంబున కనిచిన. 1367**

**ప్రతి :** అంతన్= అటుపిమ్మట; ఆ+దనుజ+అంతకుండు= రాక్షసులకు యముడివంటివాడైన బలరాముడు; చరణ ప్రహరణంబులన్= కాలిదెబ్బలతో; వానిచెలులన్= ముష్టికుని స్నేహితుల్ని; కూట తోసల శలులన్= కూటుడు, తోసలుడు, శలుడు అనేవాళ్ళను; భిన్నమస్తకులన్+చేసి= పగిలిన తలలుగలవారిగా ఒనర్చి; అంతకు+అంతికంబునకున్= యముడి సమీపానికి; అనిచినన్= పంపగా...

**తా :** అటుతర్వాత రాక్షసులకు అంతకుడైన బలరాముడు ముష్టికుడి మిత్రులైన కూటుడు, తోసలుడు, శలుడు అనే వాళ్ళను తన కాలిదెబ్బలతో తలలు పగులగొట్టి యముడిచెంతకు పంపించాడు.

**క. వల్లవబాలకు లని మన, మల్లవరులు పెనఁగి నేఁడు మడిసిరి వీరల్**
**బల్లిదులు; తలఁడు తలఁడని, చెల్లాచెదరైరి పాఱి చిక్కిన మల్లుల్. 1368**

**ప్రతి :** వల్లవబాలకులు+అని= గొల్లపిల్లకాయలుకదా అని; మన మల్లవరులు= మన జెట్టీలలో శ్రేష్ఠులైన చాణూరుడు, ముష్టికుడు మొదలైనవారు; పెనఁగి= పోరాడి; నేఁడు= ఈ దినం; మడిసిరి= చనిపోయారు; వీరల్= ఈ బలరామశ్రీకృష్ణులు; బల్లిదులు= బలవంతులు; తలఁడు తలఁడు= తొలగండి, తొలగండి, దూరంగా వెళ్ళిపోండి; అని= అంటూ; చిక్కిన మల్లుల్= చావగా మిగిలిన జెట్టీలు; పాఱి= పరుగెత్తి; చెల్లాచెదరు+ఐరి= తలకొక దిక్కుగా అయ్యారు.

**తా :** కేవలం గోపాలబాలకులనే భావంతో వారితో యుద్ధంచేసిన మనమల్లశ్రేష్ఠులు మరణించారు. రామకృష్ణులు బలవంతులు; తొలగండి తొలగండి అంటూ మిగిలిన మల్లురు చెల్లాచెదరై పారిపోయారు.

**ఉ. మల్లురఁ జంపి గోపకసమాజములో మృగరాజురేఖ శో**
**భిల్లఁగఁ బాదపద్మములఁ బెల్లుగ నందెలు మ్రోయ వచ్చు నా**
**వల్లవరాజనందనుల వారక చూచి మహీసురాదు ల**
**ల్లల్లన సంస్తుతించిరి ప్రియంబుగఁ గంసుఁడు దక్క నందఱున్. 1369**

**ప్రతి :** మల్లురన్= జెట్టీలను; చంపి= సంహరించి; గోపక సమాజములోనన్= గొల్లల సమూహంలో; మృగరాజురేఖ= సింహంయొక్క తీరు; శోభిల్లన్+కన్= ప్రకాశించగా; పాదపద్మములన్= తామరలవంటి అడుగులందు; పెల్లుగన్= అధికంగా; అందెలు మ్రోయన్= కడియాలు రవళించగా; వచ్చు= ఏ తెంచునట్టి; ఆ వల్లవరాజనందనులన్= గొల్లల రేడైన నందుని కొడుకులను; వారక= మానక (కన్నార్పక); చూచి= కనుగొని; మహీసుర+ఆదులు= భూ దేవతలైన బ్రాహ్మణులు మొదలైన జాతులవారు; కంసుఁడు+తక్కన్= కంసుడు తప్ప; అందఱున్= ఎల్లరు; ప్రియంబు+కన్= ప్రేమతో; అల్లన+అల్లనన్= మెల్లమెల్లగా; సంస్తుతించిరి= మిక్కిలి పొగడారు.

**తా :** మల్లురను సంహరించి గొల్లలమధ్య సింహాలవలె శోభిల్లుతూ పద్మాలవంటి పాదాలలో అందెలు మ్రోగుతూ ఉండగా వస్తూన్న గొల్లలరాజైన నందుడి నందనులను బ్రాహ్మణులు మొదలైన వారందరూ రెప్పవాల్చక చూచి ప్రీతితో పొగిడారు. ఒక్క కంసుడు మాత్రం మచ్చరంతో వారిని మెచ్చుకోలేదు.

## ❖ శ్రీకృష్ణుఁడు కంసుని వధించుట ❖

**వ. అంత సభాజనంబుల కలకలంబు నివారించి మంత్రులం జూచి కంసుం డిట్లనియె. 1370**

**ప్రతి :** అంతన్= పిమ్మట; కంసుఁడు= కంసుడు; సభాజనంబుల కలకలంబు= సభలో ఉన్న ప్రజలయొక్క మాటల సందడి; నివారించి= మాన్పి; మంత్రులన్+చూచి= మంత్రుల్ని కనుగొని; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** అంతట సభాసదుల కోలాహలాన్ని నివారించి, కంసుడు తన మంత్రులను చూచి ఈ విధంగా అన్నాడు.

**ఉ. వల్లవబాలురన్ నగరివాకిటికిన్ వెడలంగ ద్రొబ్బుఁ; డీ**
**గొల్లల ముట్టికోల్ గొనుఁడు; క్రూరుని నందునిఁ గట్టుఁ; డుర్వికిం**
**దెల్లము గాఁగ నేఁడు వసుదేవునిఁ జంపుఁడు; తండ్రి గాఁడు వీఁ**
**డెల్లవిధంబులం బరుల కిష్టుఁడు కావకుఁ డుగ్రసేనునిన్. 1371**

**ప్రతి :** ఉర్వికిన్= భూమికి (లోకానికి); తెల్లము కాఁగన్= తెలిసేటట్లు; నేఁడు= ఇప్పుడు; వల్లవబాలురన్= గోపకుమారులైన బలరామకృష్ణుల్ని; నగరివాకిటికిన్= పట్టణద్వారం వెలుపలికి; వెడలన్+కన్ ద్రొబ్బుఁడు= వెళ్ళిపోయేటట్లు తరుమండి; ఈ గొల్లలన్= ఈ గొల్లవాళ్ళను; ముట్టికోల్+కొనుఁడు= ఆక్రమించండి; క్రూరునిన్ నందునిన్= కర్కశుడైన నందుణ్ణి; కట్టుఁడు= బంధించండి; వసుదేవునిన్= వసుదేవుణ్ణి; చంపుఁడు= సంహరించండి; వీఁడు= ఇతడు; తండ్రికాఁడు= నాకు జనకుడు కాడు; ఎల్లవిధంబులన్= అన్నివిధాలా; పరులకున్= నా శత్రువులకు; ఇష్టుఁడు= ప్రియమైనవాడు; (కనుక) ఉగ్రసేనునిన్= ఉగ్రసేనుణ్ణి; కావకుఁడు= కాపాడవద్దు.

**తా :** ఈ గోపబాలకుల్ని పట్టణద్వారం దాటి వెళ్ళేటట్లు తోసివేయండి. ఈ గొల్లలను ముట్టడించండి. క్రూరుడైన నందుణ్ణి బంధించండి. లోకానికి వెల్లడి అయ్యేటట్లు ఇప్పుడే వసుదేవుణ్ణి చంపివేయండి. ఉగ్రసేనుణ్ణి రక్షించవద్దు. వీడు నాకు తండ్రి కాదు. ఎల్లవిధాలా నా విరోధులకు ఇష్టుడు.

**వ. అని పలుకు సమయంబున. 1372**

**తా :** అని కంసుడు మాట్లాడే వేళలో...

**శా. జంఘాలత్వముతో నగోపరిచరత్సారంగహింసేచ్ఛ ను**
**ల్లంఘింపన్ గమకించు సింహముక్రియన్ లక్షించి పౌరప్రజా**
**సంఘాతంబులు తల్లడిల్ల హరి కంసప్రాణహింసార్థియై**
**లంఘించెం దమగంబు మీఁదికి రణోల్లాసంబు భాసిల్లఁగన్. 1373**

**ప్రతి :** జంఘాలత్వముతోన్= మిక్కిలి వడిగల నడకతో; నగ+ఉపరి= పర్వతం పైభాగంలో; చరత్= తిరుగుతున్న; సారంగ= ఏనుగుయొక్క; హింసా+ఇచ్ఛన్= బాధించుటలోని కోరికతో; ఉత్+లంఘింపన్= మీదికి దూకడానికి; గమకించు= యత్నించే; సింహము క్రియన్= సింహంలా; లక్షించి= చూడ్కినిలిపి; పౌరప్రజాసంఘాతంబులు= పట్టణంలోని జనసమూహాలు; తల్లడిల్లన్= భయంతో వణకుతుండగా; హరి= మాధవుడు, కంసప్రాణహింసా+అర్థి+ఐ= కంసుడి ప్రాణాలు తీయనెంచినవాడై; రణ+ ఉల్లాసంబు= యుద్ధమందలి వేడుక; భాసిల్లన్+కన్= ప్రకాశించగా; తమగంబుమీఁదికిన్= కంసుడు కూర్చొని ఉన్న మంచెమీదికి; లంఘించెన్= దుమికాడు.

**తా :** పిక్కబలంతో కొండ శిఖరాన తిరిగే ఏనుగును సంహరించడానికి కుప్పించి దుమికే సింహకిశోరంలాగా శ్రీకృష్ణుడు కంసుణ్ణి చంపదలచి గురిచూచి మంచెమీదికి రణోత్సాహంతో దుమికాడు. కొలువులో ఉన్న పురప్రజలంతా తల్లడిల్లారు.

**క. తమగమున కెగురు యదు స, త్తమగణ్యునిఁ జూచి ఖడ్గధరుఁడై యెదిరెం**
**దమగమివారలు వీరో, త్తమగణవిభుఁ డనఁగ గంసధరణీపతియున్. 1374**

**ప్రతి :** తమగమునకున్= కంసుడు కూర్చొని ఉన్న మంచెమీదికి; ఎగురు= దుముకే; యదుసత్తమ గణ్యునిన్+చూచి= యాదవశ్రేష్ఠులందు లెక్కించదగిన శ్రీకృష్ణుణ్ణి కనుగొని; కంసధరణీ పతియున్= కంస భూనాయకుడు; తమ= అతనియొక్క; గమివారలు= గుంపునకు చెందినవారు; వీర+ఉత్తమగణవిభుఁడు+అనన్+కన్= శ్రేష్ఠులైన పరాక్రమవంతులయొక్క సమూహానికి ప్రభువు ఇతడే అని మెచ్చగా; ఖడ్గధరుఁడు+ఐ= కత్తిని చేతబట్టినవాడై; ఎదిరెన్= ఎదిరించాడు.

**తా :** కంసుడు కూర్చొన్న మంచెమీదికి దుమికిన యదుశ్రేష్ఠులలో లెక్కించదగిన శ్రీకృష్ణుణ్ణి జూచి, కంసమహారాజు కత్తిని చేబూని ఎదిరించాడు. అప్పుడు కంసునిపక్షంలోని వారంతా కంసుడు మహాశూరకోటిలో అగ్రగణ్యుడని శ్లాఘించారు.

**శా. పక్షీంద్రుం డురగంబుఁ బట్టు విధ మొప్పన్ గేశబంధంబు లో**
**క క్షోభంబుగఁ బట్టి మౌళిమణు లా కల్పాంతవేళాపత**
**న్నక్షత్రంబులభంగి రాల రణసన్నాహంబు డిందించి రం**
**గ క్షోణిం బడఁ ద్రోచెఁ గృష్ణుఁడు వెసన్ గంసున్ నృపోత్తంసునిన్. 1375**

**ప్రతి :** కృష్ణుఁడు= శ్రీకృష్ణమూర్తి; పక్షి+ఇంద్రుండు= పక్షులకు రాజైన గరుత్మంతుడు; ఉరగంబున్= పామును; పట్టువిధము= పట్టుకొనే తీరు; ఒప్పన్= ప్రకాశించగా; కేశబంధంబున్= కంసునిజుట్టుముడిని; లోక క్షోభంబు+కన్+పట్టి= జనులంతా కలవరపడుతుండగా పట్టుకొని; మౌళిమణులు= కంసుడి సిగలో ఉన్న రత్నాలు; ఆ కల్ప+అంతవేళా= ప్రసిద్ధమైన ప్రళయ సమయంలో; పతత్= పడుతున్న; నక్షత్రంబులభంగిన్= చుక్కలమాదిరి; రాలన్= నేలమీద పడగా; రణసన్నాహంబున్= కంసుడి యుద్ధప్రయత్నాన్ని; డిందించి= అణచివేసి; నృప+ఉత్తంసునిన్= రాజులలో మేటి అయిన; కంసున్= కంసుణ్ణి; వెసన్= శీఘ్రంగా; రంగక్షోణిన్= మల్లయుద్ధ ప్రదేశంలో; పడన్= కూలునట్లు; త్రోచెన్= నెట్టివేశాడు.

**తా :** శ్రీకృష్ణుడు పక్షులకు రాజైన గరుత్మంతుడు పామును ఒడిసి పట్టుకొన్న విధంగా, కంసుడి జుట్టు ముడిని సభలోని జనులంతా కలవరపడుతుండగా పట్టుకున్నాడు. ప్రళయకాలంలో నీలాకాశంనుంచి చుక్కలు నేల రాలినట్లు ఆ కంసుడి సిగ ముడినుంచి రత్నాలు నేలరాలగా కంసుడి యుద్ధసన్నాహాన్ని అణచివేసి, మల్లరంగ ప్రదేశంలో పడేటట్లు త్రోసివేశాడు.

**శా. మంచాగ్రంబుననుండి రంగధరణీమధ్యంబునం గూలి యే**
**సంచారంబును లేక చిక్కి జను లాశ్చర్యంబునుం బొందఁగాఁ**
**బంచత్వంబును బొందియున్న విమతున్ బద్మాక్షుఁ డీడ్చెన్ వడిన్**
**పంచాస్యంబు గజంబు నీడ్చు పగిదిన్ బాహాబలోల్లాసియై. 1376**

**ప్రతి :** మంచ+అగ్రంబునన్+ఉండి= మంచె మీదిభాగంనుండి; రంగధరణీ మధ్యంబునన్+కూలి= మల్ల యుద్ధ రంగం మధ్యలో పడి; ఏ సంచారంబును+లేక= ఎట్టి కదలిక లేక; చిక్కి= శ్రీకృష్ణుడికి వశుడై; జనులు= దృశ్యం చూస్తున్న ప్రజలు; ఆశ్చర్యంబునున్+పొందన్+కాన్= ఆశ్చర్యపడుతుండగా; పంచత్వంబును+పొంది+ఉన్న= మరణం చెందినట్టి; విమతున్= విరోధియైన కంసుణ్ణి; పద్మ+అక్షుఁడు= తామర రేకులవంటి కన్నులుగల మాధవుడు; బాహాబల+ఉల్లాసి+ఐ= భుజశక్తిచేత మిక్కిలి వెలుగొందుతున్నవాడై; పంచ+ఆస్యంబు= సింహం; గజంబున్= ఏనుగును; ఈడ్చుపగిదిన్= లాగే విధంగా; వడిన్= వేగంగా; ఈడ్చెన్= లాగాడు.

**తా :** కంసుడు మంచెమీదినుంచి మల్లక్రీడారంగమధ్యంలోపడి ఎట్టి కదలికా లేక కట్టెలాగా బిగుసుకొని పోయాడు. అక్కడి జనులు అబ్బురపడుతూ చూస్తుండగా ఆ దుర్మతి అక్కడి కక్కడే మరణించాడు. పద్మపత్రాక్షుడైన శ్రీకృష్ణుడు భుజబలవిజృంభణంతో సింహం ఏనుగును ఈడ్చిన విధంగా అతణ్ణి ఈడ్చాడు.

**క. రోషప్రమోదనిద్రా, భాషాశనపానగతులఁ బాయక చక్రిన్**
**దోషగతిఁ జూచి యైన వి, శేషగతిన్ గంసుఁ డతనిఁ జెందె నరేంద్రా! 1377**

**ప్రతి :** నర+ఇంద్రా!= పరీక్షిన్మహారాజా!; రోష= కోపంలో; ప్రమోద= సంతోషంలో; నిద్రా= నిద్రలో; భాషా= మాటల్లో; అశన= ఆహారంలో; పాన= నీరుత్రాగడంలో; గతులన్= నడకల్లో; పాయక= మానక; చక్రిన్= సుదర్శనమనే చక్రాన్ని ధరించిన శ్రీకృష్ణుణ్ణి; దోషగతిన్= తప్పులెంచే రీతిలో; చూచి+ఐనన్= చూచికూడా; విశేషగతిన్= ప్రత్యేకమైనమార్గంలో, (వైరభక్తితో); కంసుఁడు= కంస భూపాలుడు; అతనిన్= పరమాత్మ అయిన శ్రీకృష్ణుణ్ణి; చెందెన్= పొందాడు.

**తా :** ఓ పరీక్షిన్మహారాజా! కంసుడు రోషంలో, సంతోషంలో, నిద్రలో, సంభాషణ సమయాల్లో, భోజన వేళలో, నీళ్లుతాగే పట్టులో, చక్రాయుధుడైన శ్రీకృష్ణుణ్ణి దోషబుద్ధితోనే చూచాడు. అయినప్పటికీ అతడు భగవంతుణ్ణే పొందాడు. ఉత్తమగతిని అందుకొన్నాడు.

**విశే :** కంసుడెంత పాపాత్ముడయినా నిరంతరం విరోధంచేతనైనా శ్రీకృష్ణుడిమీదనే ఆతని ధ్యానం. అందువల్లనే ఆతనిచేత కొట్టబడి ఆ స్వామినే పొందాడు.

**వ. అ సమయంబున. 1378**

**ప్రతి :** ఆ సమయంబునన్= అట్టివేళలో...

**క. గోపాలుఁ డొక్కఁ డద్దిర!, భూపాలకుఁ జంపె వీనిఁ బొడువుం డేత**
**ద్రూపాలస్యము లేలని, తాపాలఘురోష లగుచు దర్పోద్ధతులై. 1379**

**ప్రతి :** అద్దిర!= ఔరా! గోపాలుఁడు+ఒక్కఁడు= ఒక గొల్లవాడు; భూపాలకున్= భూమినేలు దొరను; చంపెన్= సంహరించాడు; వీనిన్= ఇతణ్ణి; పొడువుండు= పొడిచి చంపండి; ఏతద్+రూప+ఆలస్యములు+ఏల+అని= ఈ విధమైన జాగు చేయడాలు ఎందుకని; తాప= హృదయవేదనతో; అలఘురోషులు+అగుచున్= అధికమైన కోపం గలవారవుతూ; దర్ప+ఉద్ధతులు+ఐ= గర్వంతో నిక్కినవారై...

**తా :** ఒక్క గొల్లపిల్లవాడు ప్రభువును సంహరించాడు. ఔరా! ఎంత ఆశ్చర్యం! వీణ్ణి పొడిచి చంపండి. ఇంకా ఆలస్యం ఎందుకు? అంటూ పరితాపంతో అగ్గలమైన కోపంతో పొగరుబోతులై

**శా. న్యగ్రోధుండును గహ్వుఁడున్ మొదలుగా నానాయుధానీక సా**
**మగ్రిన్ గంసునిసోదరుల్ గవియుడున్ మాద్యద్గజేంద్రాభుఁడై**
**యుగ్రుండై పరిఘాయుధోల్లసితుఁడై యొండొండ చెండాడి కా**
**లాగ్రక్షోణికిఁ బంచె రాముఁడు గరీయస్థేముఁడై వారలన్. 1380**

**ప్రతి :** న్యగ్రోధుండును= న్యగ్రోధుడనేవాడు; కహ్వుఁడున్ మొదలు+కాన్= కహ్వుడు అనేవాడు తదితరులు; నానా+ఆయుధ+అనీక సామగ్రిన్= పలురీతులైన ఆయుధాలనే యుద్ధసామగ్రితో; కంసుని సోదరుల్= కంసుడియొక్క తోబుట్టువులు; కవియుఁడున్= కృష్ణుణ్ణి చుట్టుముట్టగా; రాముఁడు= బలరాముడు; మాద్యత్+గజ+ఇంద్ర+ఆభుఁడు+ఐ= మదించిన ఏనుగునకు సాటి అయినవాడై; ఉగ్రుండు+ఐ= భయంకరుడై; పరిఘ+ఆయుధ+ఉల్లసితుఁడు+ఐ= ఇనుపకట్ల గుదియ అనే ఆయుధంతో ప్రకాశిస్తున్నవాడై; గరీయస్+స్థేముఁడు+ఐ= అధికమైన దిటవుకలవాడై; వారలన్= కంసుడి సోదరులను; ఒండు+ఒండు+అ= క్రమ క్రమంగా; చెండాడి= ఖండించి; కాల+అగ్రక్షోణికిన్= యముడి ముందటి చోటికి అనగా యముని సంయమనీపురానికి; పంచెన్= పంపాడు.

**తా :** కంసుడి తోబుట్టువులు న్యగ్రోధుడు, కహ్వుడు మొదలయినవారు అనేకవిధాలైన యుద్ధపరికరాలతో కృష్ణుడి మీదికి విజృంభించారు. అప్పుడు మహాబలుడైన బలభద్రుడు రౌద్రమూర్తియై పరిఘ అనే ఆయుధం ధరించి మత్త మాతంగంలాగా ఒక్కొక్కరిని చెండాండి యముని సన్నిధికి పంపాడు.

**విశే :** కంసుని తోబుట్టువులు ఎనమండుగురు. వారు : 1) న్యగ్రోధుడు 2) కహ్వుడు 3) సునామకుడు 4) కంకుడు 5) సుభుడు 6) రాష్ట్రపాలుడు 7) విసృష్టుడు 8) తుష్టిమానుడు.

**వ. అ య్యవసరంబున. 1381**

**ప్రతి :** ఆ+అవసరంబునన్= ఆ సమయంలో...

**క. చేతులఁ దాళము లొత్తుచు, జేతోమోదంబుతోడ సిగముడి వీడన్**
**బాతర లాడుచు మింటను, గీతము నారదుఁడు పాడెఁ గృష్ణా! యనుచున్. 1382**

**ప్రతి :** నారదుఁడు= నారద మహర్షి; చేతులన్= హస్తాలతో; తాళములు+ఒత్తుచున్= తాళాలు వాయిస్తూ; చేతస్+మోదంబుతోడన్= చిత్తమందలి సంతోషంతో; సిగముడి వీడన్= జుట్టుముడి ఊడిపోగా; మింటను= ఆకాశంలో; పాతరలు+ఆడుచున్= నాట్యంచేస్తూ; కృష్ణా+అనుచున్= శ్రీకృష్ణా అని స్వామిని సంబోధిస్తూ, గీతమున్= సంకీర్తనను; పాడెన్= గానంచేశాడు.

**తా :** చేతులతో తాళాలు వాయిస్తూ, జుట్టుముడి వీడగా; నారద మహర్షి ఆనందంతో ఆకాశంలో కృష్ణా అంటూ పాటలు పాడుతూ నాట్యం చేశాడు.

**క. వారిజభవరుద్రాదులు, భూరికుసుమవృష్టి గురిసి పొగడిరి కృష్ణున్**
**భేరులు మ్రోసెను నిర్జర, నారులు దివి నాడి రధిక నటనముల నృపా! 1383**

**ప్రతి :** నృపా!= పరీక్షిన్మహారాజా!; వారిజభవ= పద్మ సంభవుడైన బ్రహ్మ; రుద్ర+ఆదులు= శివుడు మొదలైన వేల్పులు; భూరి= అధికమైన; కుసుమవృష్టిన్= పూలవానను; కురిసి= వర్షించి; కృష్ణున్= శ్రీకృష్ణుణ్ణి; పొగడిరి= నుతించారు; భేరులు= నగారాలు; మ్రోసెను= మోగాయి; నిర్జరనారులు= దేవతా స్త్రీలు (అప్సరసలు); దివిన్= గగనమందు; అధిక నటనములన్= విరివి అయిన నాట్య విశేషాలతో; ఆడిరి= నర్తించారు.

**తా :** పరీక్షిన్మహారాజా! బ్రహ్మ, ఈశ్వరుడు మొదలైన వేల్పులు కొల్లలు కొల్లలుగా పూలజల్లులు కురిపిస్తూ, శ్రీకృష్ణుణ్ణి స్తోత్రం చేశారు. దేవదుందుభులు మోగాయి. దేవతాంగనలు అనేక విధాలుగా ఆకాశంలో నాట్యం చేశారు.

**వ. అంతం గంసాదుల కాంతలు భర్తృమరణదుఃఖాక్రాంతలై కరంబుల శిరంబులు మోఁదుకొనుచు నశ్రుధారాపరిషిక్తవదనలై సదనంబులు వెలువడి వచ్చి వీరశయ్యానిద్రితు లయిన విభులం గౌఁగిలించుకొని సుస్వరంబుల విలపించిరి. అందుఁ గంసభార్య లిట్లనిరి. 1384**

**ప్రతి :** అంతన్= అటుపిమ్మట; కంస+ఆదులకాంతలు= కంసుడు మొదలయినవారి భార్యలు; భర్తృమరణ= పతుల చావు వల్ల కల్గిన; దుఃఖ+ఆక్రాంతలు+ఐ= విషాదంచేత ఆవరించినవారై; కరంబులన్= చేతులతో; శిరంబులు= తలలు; మోఁదుకొనుచున్= కొట్టుకొంటూ; అశ్రుధారా= కన్నీటిజాలులచేత; పరిషిక్త= తడిసిన; వదనలు+ఐ= ముఖాలు గలవారై; సదనంబులు వెలువడి వచ్చి= గృహాలనుండి బయలు దేరివచ్చి; వీరశయ్యానిద్రితులు+అయిన= శూరులకు పడక ఐన యుద్ధభూమిలో నిద్రపోతున్నవారైన; విభులన్= పెనిమిటులను; కౌఁగిలించుకొని= ఆలింగనం చేసుకుని; సుస్వరంబులన్= మంచి కంఠధ్వనులతో; విలపించిరి= ఏడ్చారు; అందున్= అలా ఏడ్చిన వారిలో; కంసభార్యలు= కంసుని పెండ్లాలు; ఇట్లు+అనిరి= ఇలా అన్నారు.

**తా :** అంతట కంసుడు మొదలైనవారి పత్నులు భర్తల మృతివల్ల శోకాక్రాంతలై చేతులతో తలలు బాదుకొంటూ, కన్నీటి ధారలతో తడిసిన ముఖాలతో తమతమ మందిరాలనుంచి వచ్చారు. వచ్చి వీరశయ్యలందు దీర్ఘనిద్ర చెందిన తమ భర్తలను ఆలింగనం చేసుకుని గద్గదకంఠస్వరాలతో విలపించారు. వారిలో కంసుని భార్యలు ఇట్లన్నారు.

సీ. గోపాలసింహంబు కోపించి వెల్వడి నిను గజేంద్రునిభంగి నేఁడు గూల్చె
యాదవేంద్రానిల మాభీలజవముల నిను మహీజముమాడ్కి నేల వ్రాల్చె
వాసుదేవాంభోధివారి యుద్వేలమై నిను దీవికైవడి నేఁడు ముంచె
దేవకీసుతవజ్రి దేవత లలరంగ నినుఁ గొండక్రియ నేఁడు నిహతుఁ జేసె

తే. హా మనోనాథ! హా వీర! హా మహాత్మ!, హా మహారాజ! నీ విట్లు హతుఁడ వయిన
మనుచు నున్నార మక్కట! మమ్ముఁబోలు, కఠినహృదయలు జగతిపైఁ గలరె యెందు? **1385**

**ప్రతి :** హా మనోనాథ!= అయ్యో! హృదయేశ్వరా!; గోపాల సింహంబు= కృష్ణుడనే కేసరి; కోపించి= కినుకపూని; వెల్వడి= బయలుదేరి; గజ+ఇంద్రుభంగిన్= గజరాజులా; నినున్= నిన్ను; నేఁడు= ఈ దినం; కూల్చెన్= చంపింది; హా వీర!= అయ్యో శూరుడా!; యాదవ+ఇంద్ర+అనిలము= యదువల్లభుడైన శ్రీకృష్ణుడనే గాలి; ఆభీల= భయంకరమైన; జవములన్=వేగాలతో; మహీజము మాడ్కిన్= చెట్టులా; నినున్= నిన్ను; నేలన్+వ్రాల్చెన్= భూమిపై పడేటట్లు చేసింది; హా మహాత్మ= అయ్యో! మహాత్ముడా!; వాసుదేవ+అంభోధివారి= వసుదేవసుతుడైన శ్రీకృష్ణుడనే సముద్రజలం; ఉత్+వేలము+ఐ= చెలియలి కట్టనుదాటి; దీవికైవడిన్= ద్వీపంలా; నినున్= నిన్ను; నేఁడు= ఈ దినం; ముంచెన్= ముంచివేసింది; హా మహారాజ!= అయ్యో! మహాప్రభూ! దేవకీసుతవజ్రి= దేవకీదేవి కుమారుడు శ్రీకృష్ణుడనే దేవేంద్రుడు; దేవతలు= వేల్పులు; అలరన్+కన్= సంతోషించగా; కొండక్రియన్= శైలంవలె; నినున్= నిన్ను; నేఁడు= ఈ రోజు; నిహతున్+చేసెన్= చెండివేశాడు; నీవు; ఇట్లు= ఈ విధంగా; హతుఁడవు+అయినన్= మరణించగా; మనుచున్+ఉన్నారము= బ్రతికి ఉన్నాం; అక్కట!= అయ్యో!; మమ్మున్+పోలు= మాకు సాటివచ్చే, మావంటి; కఠినహృదయలు= కటిక మనస్సుగలవారు; జగతిపైన్= పుడమిమీద; ఎందున్= ఎక్కడైనా; కలరు+ఎ= ఉన్నారా?(లేరని భావం)

**తా :** జీవితేశ్వరా! గోపాలుడనే సింహం కోపంతో వెడలివచ్చి గజేంద్రునివంటి నిన్ను హతమార్చింది. నాథా! యదునాథుడనే మారుతం దారుణవేగంతో వృక్షంలా నిన్ను నేలమీద వ్రాల్చింది. మహానుభావా! వాసుదేవుడనే సముద్రజలం చెలియలికట్టను దాటి, దీవిలా నిన్ను ఇప్పుడు ముంచివేసింది. మహారాజా! దేవకీ పుత్రుడనే దేవేంద్రుడు దేవతలు సంతోషించే విధంగా కొండవంటి నిన్ను చెండివేశాడు. అయ్యో! నీవిలా చనిపోయినప్పటికీ మేము బ్రతికి ఉన్నాము. అక్కటా! మావలె కఠిన హృదయం కలవారు భూమిమీద ఎక్కడైనా ఉన్నారా?(లేరని భావం)

క. భూతముల కెగ్గుసేసిన, భూతంబులు నీకు నెగ్గుఁ బుట్టించె వృథా
భూత మగు మనికి యెల్లను, భూతద్రోహికిని శుభముఁ బొంద దధీశా! **1386**

**ప్రతి :** అధి+ఈశా!= ప్రభూ!; భూతములకున్= జీవులకు; ఎగ్గు+చేసినన్= కీడొనర్చగా; భూతంబులు= ఆ ప్రాణులు; నీకున్= నీకు; ఎగ్గు= కీడు; పుట్టించెన్= కలుగజేశాయి; మనికి+ఎల్లను= బ్రతుకంతా; వృథాభూతము+అగున్= వ్యర్థమవుతుంది; భూతద్రోహికిని= జీవులకు కీడుచేసేవానికి; శుభము పొందదు= మేలు కల్గదు.

**తా :** ప్రాణులకు నీవు కీడు చేయగా – ఆ ప్రాణులే నీకు కీడు చేశాయి. ప్రాణులకు ద్రోహం చేసినవానికి మేలుకల్గదు. బ్రతుకంతా వ్యర్థమవుతుంది.

**విశే :** సర్వత్ర సమభావం లేనందుకే కంసుడు దుర్గతి పాలయ్యాడు.

**క. గోపాలకృష్ణుతోడను, భూపాలక! మున్ను దొడరి పొలసినవారిన్**
**నీ పాల బుధులు సెప్పరె, కోపాలస్యములు విడిచి కొలువం దగదే. 1387**

**ప్రతి :** భూపాలక!= ప్రభూ!; గోపాలకృష్ణుతోడను= గోవులను పాలించే శ్రీకృష్ణమూర్తితో; మున్ను= పూర్వం; తొడరి= తలపడి; పొలసినవారిన్= మరణించినవాళ్ళను; నీ పాలన్= నీ చెంత; బుధులు= విజ్ఞులు; చెప్పరు+ఎ= చెప్పలేదా? కోప+ ఆలస్యములు= కోపాన్ని, సోమరితనాన్ని; విడిచి= వదలిపెట్టి; కొలువన్+తగదు+ఏ= ఆ మహనీయుణ్ణి, సేవించుట యుక్తం కదా!

**తా :** మహారాజా! గోపాలకృష్ణుణ్ణి ఎదిరించి, ప్రాణాలు కోల్పోయినవారినిగురించి పూర్వం నీ సమక్షంలో పండితులు చెప్పలేదా? క్రోధమూ, జడత్వమూ విడిచి గోవిందుణ్ణి సేవిస్తే ఎంత బాగుండేది!

**వ. అని విలపించుచున్న రాజవల్లభల నూరార్చి, జగద్వల్లభుం డయిన హరి కంసాదులకుఁ బరలోక సంస్కారంబులు సేయం బనిచి దేవకీవసుదేవుల బంధనంబు విడిపించి, బలభద్రసహితుం డయి, వారలకుఁ బ్రణామంబులు సేసిన. 1388**

**ప్రతి :** అని= అంటూ; విలపించుచున్+ఉన్న= ఏడుస్తున్న; రాజవల్లభలన్= రాజపత్నులను; ఊరార్చి= ఊరడించి; జగత్+ వల్లభుండు+అయిన= లోకేశ్వరుడైన; హరి= మాధవుడు; కంస+ఆదులకున్= కంసుడు, అతని సహోదరులు మొదలైనవారికి పరలోక సంస్కారంబులు= ఊర్ధ్వలోక ప్రాప్తికి చేయవలసిన కార్యకలాపాలు; చేయన్+పనిచి= చేయడానికి తగినవారిని నియమించి; దేవకీ వసుదేవుల బంధనంబు విడిపించి= తన జననీ జనకులైన దేవకీ వసుదేవులను చెరనుండి తప్పించి; బలభద్ర సహితుండు+అయి= బలరాముడితో కూడినవాడై; వారలకున్= దేవకీ వసుదేవులకు; ప్రణామంబులు= నమస్కారాలు; చేసినన్= చేయగా...

**తా :** ఈ మాదిరిగా ఏడుస్తున్న రాచ ఇల్లాండ్రను ఓదార్చి లోకేశ్వరుడైన శ్రీకృష్ణుడు కంసుడు మొదలైనవారికి పారలౌకిక క్రియలు సల్పేందుకు ఆదేశించాడు. దేవకీవసుదేవులను చెర విడిపించి బలరాముడితో కూడి వారికి నమస్కారాలు చేశాడు.

### ❖ శ్రీ కృష్ణుఁడు దేవకీ వసుదేవుల చెఱ మాన్పి యుగ్రసేనునికి పట్టము కట్టుట ❖

**మ. కని లోకేశులుగాని వీరు కొడుకుల్ గారంచుఁ జిత్తంబులన్**
**జనయిత్రీజనకుల్ విచారపరులై శంకింపఁ గృష్ణుండు దా**
**జనసమ్మోహినియైన మాయఁ దదభిజ్ఞానంబు వారించి యి**
**ట్లనియెన్ సాగ్రజుఁడై మహావినతుఁడై యానందసంధాయియై. 1389**

**ప్రతి :** జనయిత్రీ జనకుల్= తలిదండ్రులైన దేవకీవసుదేవులు; కని= బలరామకృష్ణులను చూచి; వీరు= ఈ ఇద్దరు; లోక+ఈశులు+కాని= లోకాలు పాలించే దైవస్వరూపులు దప్ప; కొడుకుల్+కారు= సామాన్యులైన పుత్రులు కారు; అంచున్= అంటూ; చిత్తంబులన్= తమ మనసుల్లో; విచారపరులు+ఐ= ఆలోచనకు అధీనులై; శంకింపన్= సందేహించగా; కృష్ణుండు= శ్రీకృష్ణుడు; తాన్= తాను; జనసమ్మోహిని+ఐన= జనులను భ్రమింపజేసే; మాయన్= తన మాయచేత; తద్+అభిజ్ఞానంబు=

వారికి కల్గిన ఆ తెలివిని; వారించి= పోగొట్టి; స+అగ్రజుఁడు+ఐ= అన్నతో కూడినవాడై; మహావినతుఁడు+ఐ= మిక్కిలి విధేయుడై; ఆనందసంధాయి+ఐ= సంతోషం కల్గించేవాడై; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికాడు.

**తా :** తలిదండ్రులైన దేవకీవసుదేవులు తమ కుమారుల్ని చూచి "వీరు లోకాలకు ప్రభువులైన దేవతలే గాని సాధారణ మానవులు కారు" అని ఆలోచిస్తూ, తమ మనసుల్లో సంశయించ సాగారు. అపుడు శ్రీకృష్ణుడు తన అన్న బలభద్రునితో కూడినవాడై జనులను సమ్మోహింప జేసే మాయాశక్తిని ప్రయోగించి, వారితెలివిని తొలగిస్తూ వినయవినమ్రుడై ఇట్లన్నాడు.

**సీ. మమ్ముఁ గంటిరి గాని మా బాల్యపౌగండకైశోరవయసులఁ గదిసి మీర**
**లెత్తుచు దింపుచు నెలమి మన్నింపుచు నుండు సౌభాగ్యంబు లొంద రైతి;**
**రాకాంక్ష గలిగియు న్నది దైవయోగంబు తల్లిదండ్రులయొద్దఁ దనయు లుండి**
**యే యవసరమున నెబ్భంగి లాలితు లగుచు వర్ధిల్లుదు రట్టి మహిమ**

**తే. మాకు నిన్నాళ్ళు లేదయ్యె మఱియు వినుఁడు, నిఖిలపురుషార్థహేతువై నెగడుచున్న**
**మేని కెవ్వార లాఢ్యులు మీర కారె, యా ఋణముఁ దీర్ప నూఱేండ్ల కైనఁ జనదు. 1390**

**ప్రతి :** మమ్మున్+కంటిరి+కాని= మమ్ము కన్నారే తప్ప; మా బాల్య= మా బాల్యం; పౌగండ= పౌగండం; కైశోర= కిశోరం అనే; వయసులన్= లేతవయస్సులలో; కదిసి= చెంతకు జేరి; మీరలు= మీరు; ఎత్తుచున్= ఎత్తుకొంటూ; దింపుచున్= చంకనుండి దిగవిడుస్తూ; ఎలమిన్= ప్రీతితో; మన్నింపుచున్= ఆదరిస్తూ; ఉండు= మెలగునట్టి; సౌభాగ్యంబులు= అదృష్టాలు; ఒందరు+ఐతిరి= పొందలేక పోయారు; ఆకాంక్ష= కోరిక; కలిగియున్= ఉండికూడ; అది= ఆ కోరిక నెరవేర కుండటం; దైవయోగంబు= విధివిలాసం; తల్లిదండ్రుల+ఒద్దన్= జననీజనకులదగ్గర; తనయులు+ఉండి= కుమారులుండి; ఏ+అవసరమునన్= ఏ సమయములందు; ఏ+భంగిన్= ఏ విధంగా; లాలితులు+అగుచున్= బుజ్జగింపులు పొందుతూ; వర్ధిల్లుదురు= వృద్ధి చెందుతారో; అట్టిమహిమ= అటువంటి భాగ్యం; మాకున్= కొడుకులమైన మాకు; ఇన్నాళ్లు= ఇన్నిరోజులు; లేదు+అయ్యెన్= కలుగకపోయింది; లేకపోయింది; మఱియున్= ఇంకనూ; వినుఁడు= ఆలకించండి; నిఖిల= సమస్తమైన; పురుష+అర్థ= పురుషుడు సంపాదించవలసిన ధర్మార్థకామమోక్షాలకు; హేతువు+ఐ= కారణమై; నెగడుచున్+ఉన్న= ఒప్పుతున్న; మేనికిన్= శరీరానికి; ఏ+వారలు (ఎవ్వారలు)= ఎవరు; ఆఢ్యులు= సంపన్నులో (కారణభూతులో); మీరు+అ= మీరే; కారు+ఎ= కారా? ఆ ఋణమున్+తీర్పన్= ఆ పితౄణమును తీర్చుటకు (కనినట్టి అప్పును తీర్చుటకు); నూఱు+ఏండ్లకున్+ఐనన్= శత సంవత్సరాలు పరిశ్రమించి సేవించినప్పటికినీ; చనదు= తీరదు (శక్యం కాదు.)

**తా :** ఓ తల్లీ! ఓ తండ్రీ! మమ్ము కన్నారేగానీ మా బాల్యం, పౌగండం, శైశవం అనే ప్రాయాల్లో మమ్ము ప్రీతితో ఎత్తుకుంటూ, దించుతూ, లాలించి పాలించేభాగ్యాన్ని మీరు పొందలేదు. కోరిక ఉండికూడా విధివిలాసంవల్ల అది తీరలేదు. తలిదండ్రుల సమక్షంలో బిడ్డలుండి ఏ సమయంలో ఏ విధంగా బుజ్జగింపులు పొందుతూ, ఎదుగుతారో అట్టి అదృష్టం మా కిన్నాళ్ళూ లేకపోయింది. ధర్మార్థకామ మోక్షాలనే పురుషార్థాలు సాధించడానికి కారణమైన ఈ దేహాలకు కర్త లెవరు? జననీజనకులైన మీరే గదా! నూరేండ్లకయినా మీ ఋణం తీర్చుకోడానికి మాకు శక్యం కాదు.

**విశే :** ఐదేండ్లనుండి పదేండ్లవరకు గల వయస్సు పౌగండం. పదకొండునుంచి పదిహేను సంవత్సరాల నడిమి వయస్సు కైశోరం. కొందరు పదకొండు మొదలు ఇరవైయేండ్లవరకు అనీ, పండ్లు వచ్చినప్పటినుంచీ మూడేండ్లవరకూ కైశోరం అని కొందరూ చెప్పారు.

**క. చెల్లుబడి గలిగి యెవ్వఁడు, తల్లికిఁ దండ్రికిని దేహధనముల వృత్తుల్**
**సెల్లింపఁ డట్టి కష్టుఁడు, ప్రల్లదుఁ డా మీఁద నాత్మపలలాశి యగున్. 1391**

**ప్రతి :** ఎవ్వఁడు= ఏ నరుడు; చెల్లుబడి= సాగుదల; కలిగి= ఉండి; తల్లికిన్= అమ్మకు; తండ్రికిని= అయ్యకు, దేహధనములన్= శరీరంతో, ధనంతో; వృత్తుల్+చెల్లింపఁడు= సేవలు సాగించడో; అట్టి కష్టుఁడు= అటువంటి పాపాత్ముడు; ప్రల్లదుఁడు= దుష్టుడు; ఆ మీఁదన్= అటు తరువాత; ఆత్మపలల+ఆశి+అగున్= నరకలోకంలో తన దేహమాంసం తానే తినువాడవుతాడు.

**తా :** సమర్థుడై ఉండికూడా తన దేహంతో, ద్రవ్యంతో తన తలిదండ్రులకు ఎవడు సేవ చేయడో, అట్టివాడు కష్టుడు. వాడు చచ్చి పరలోకంలో తన శరీరమాంసం తానే తినేవాడవుతాడు.

**క. జననీజనకుల వృద్ధులఁ, దనయుల గురువిప్రసాధుదారాదుల నే**
**జనుఁడు ఘనుఁ డయ్యుఁ బ్రోవక, వనరును జీవన్మృతుండు వాఁడు ధరిత్రిన్. 1392**

**ప్రతి :** ఏ జనుఁడు= ఏ మనిషి; జననీజనకులన్= అమ్మనాయనలను; వృద్ధులన్= ముదుసళ్ళను; తనయులన్= కొడుకులనూ; గురు= గురువులనూ; విప్ర= బ్రాహ్మణులనూ; సాధు= మంచివాళ్ళనూ; దార+ఆదులన్= భార్య మొదలైనవాళ్ళనూ; ఘనుఁడు+అయ్యున్= సమర్థుడయికూడా; ప్రోవక= సంరక్షించక; వనరును= ఏడుస్తుంటాడో; వాఁడు= అటువంటివాడు; ధరిత్రిన్= పుడమిలో; జీవన్మృతుండు= బ్రతికి ఉండి కూడా చచ్చినవాడే!

**తా :** ఏ మానవుడు తలిదండ్రులనూ, వయో వృద్ధులనూ, చిన్నబిడ్డలనూ, గురువులనూ, బ్రాహ్మణులనూ, సాధువులనూ, ఇల్లాలు మొదలైనవారినీ సమర్థుడై ఉండికూడా పోషించక దీనాలాపాలాడుతాడో అట్టివాడు ఈ భూమిమీద బ్రతికియూ చచ్చినవాడే.

**వ. అదియునుం గాక. 1393**

**ప్రతి :** అదియునున్+కాక= అంతేకాక...

**శా. కారాశాలల మా నిమిత్తము మిముం గంసుండు గారింపఁగా**
**వారింపంగ సమర్థతల్ గలిగియున్ వారింపఁగా రాక ని**
**ష్కారుణ్యాత్ములమైన క్రూరుల మహాకౌటిల్యసంచారులన్**
**సారాతిక్షములార! మమ్ముఁ గొఱఁతల్ సైరించి రక్షింపరే! 1394**

**ప్రతి :** సార+అతిక్షములార= శ్రేష్ఠమైన మిక్కిలి సహనంగల తలిదండ్రులారా!; కంసుండు= కంసుడు; మా నిమిత్తము= మా కారణంగా; మిమున్= మిమ్మల్ని; కారాశాలలన్= చెరసాలల్లో; కారింపన్+కాన్= బాధించగా; వారింపన్+కన్= అలా బాధించకుండా మాన్పటానికి; సమర్థతల్= శక్తులు; కలిగియున్= ఉండికూడా; వారింపన్+కాన్ రాక= మాన్పుటకై మీ చెంతకురాకుండా; నిస్+కారుణ్య+ఆత్ములము+ఐన= దయలేని మనసులు గలవారమైనట్టి; క్రూరులన్= కఠినులను; మహాకౌటిల్య సంచారులన్= మిక్కిలి వక్రమార్గంలో మెలగేవారిని; మమ్మున్= మమ్మల్ని; కొఱఁతల్= లోపాలను; సైరించి= సహించి; రక్షింపరు+ఏ= కాపాడండి.

**తా :** జననీ జనకులారా! మీరు చాలా ఓర్పుగలవారు. మా కారణంగా మిమ్ము కంసుడు చెరసాలలో ఉంచి బాధిస్తూ ఉంటే వాణ్ణి వారించే సామర్థ్యం ఉండికూడా వారించని దయమాలినవాళ్ళం. క్రూరులం. కపటవేషధారులం. మా లోపాలు సహించి మమ్మల్ని మన్నించండి.

**వ. అని యిట్లు మాయామనుష్యం డయిన హరి పలికిన పలుకులకు మోహితులై, వారల నంకపీఠంబుల నిడుకొని, కౌఁగిలించుకొని, కన్నీటం దడుపుచుఁ బ్రేమపాశబద్ధులయి, దేవకీవసుదేవు లూరకుండిరి. అంత వాసుదేవుండు మాతామహుం డయిన యుగ్రసేనునిఁ జూచి. 1395**

**ప్రతి :** అని= అంటూ; ఇట్లు= ఈ ప్రకారం; మాయా మనుష్యుండు+అయిన= మాయచేత మానవరూపం ధరించినవాడైన; హరి= శ్రీకృష్ణుడు; పలికిన= చెప్పిన; పలుకులకున్= మాటలకు; మోహితులు+ఐ= మోహం పొందినవారై (అజ్ఞానంచేత అతడు భగవంతుడన్న జ్ఞానం లేనివారై); వారలన్= ఆ రామకృష్ణుల్ని; అంకపీఠంబులన్= తొడలనే పీఠాలమీద; ఇడుకొని= కూర్చుండ బెట్టుకొని; కౌఁగిలించుకొని= కౌగిట జేర్చుకొని; కన్నీటన్+తడుపుచున్= తమ నేత్రాలనుండి కారే బాష్పజలాలచేత వారిని తడుపుతూ; ప్రేమపాశబద్ధులు+అయి= ప్రేమ అనే త్రాటిచేత కట్టబడినవారై; దేవకీవసుదేవులు= దేవకీదేవి, వసుదేవుడు; ఊరక+ఉండిరి= మౌనం వహించారు; అంతన్= అటు పిమ్మట; వాసుదేవుండు= శ్రీకృష్ణుడు; మాతామహుండు+ అయిన= తన తల్లికి తండ్రియైన; ఉగ్రసేనునిన్+చూచి= ఉగ్రసేన మహారాజును కనుగొని...

**తా :** ఈ విధంగా మాయామానుషవిగ్రహుడైన శ్రీకృష్ణుడు పలికాడు. ఆ మాటలకు దేవకీవసుదేవులు మోహం చెందారు. వారు తమ పుత్రుల్ని ఒళ్ళల్లో కూర్చుండ బెట్టుకున్నారు. గట్టిగా కౌగిలించుకున్నారు. కన్నీళ్ళతో వారి శిరస్సులు తడిపారు. ప్రేమాతిశయంతో మాటలు రాక మౌనం వహించారు. అప్పుడు శ్రీకృష్ణుడు తన తల్లికి తండ్రిగారైన ఉగ్రసేనుణ్ణి తిలకించి ఇలా అన్నాడు.

**చ. అనఘ! యయాతిశాపమున యాదవవీరులకున్ నరేశ్వరా**
**సనమున నుండరాదు; నృపసత్తమ! రాజవు గమ్ము భూమికిన్;**
**నినుఁ గొలువంగ నిర్జరులు నీ కరివెట్టుదు రన్యరాజులం**
**బనిగొను టెంత! రమ్ము జనపాలనశీలివి గమ్ము వేడ్కతోన్. 1396**

**ప్రతి :** అనఘ!= పుణ్యాత్మా!; యయాతి శాపమునన్= యయాతిమహారాజు పెట్టిన శాపకారణంగా; యాదవ వీరులకున్= వీరులైన యదువంశస్థులకు; నర+ఈశ్వర+ఆసనమునన్= రాజపీఠంమీద; ఉండన్‌రాదు= కూర్చునే భాగ్యంలేదు (అందుచేత); నృపసత్తమ!= రాజులలో శ్రేష్ఠుడా!; భూమికిన్= పుడమికి (మథురా రాజ్యానికి); రాజవు+కమ్ము= నీవు పాలకుడవు కావాలి; నినున్= నిన్ను; కొలువన్+కన్= సేవించుటకై; నీకున్= నీకు; నిర్జరులు= దేవతలు; అరి+పెట్టుదురు= కప్పం చెల్లిస్తారు; అన్యరాజులన్= సామాన్యులైన భూపతుల్ని; పని+కొనుట+ఎంత= వారిని ఆజ్ఞాబద్ధుల్ని చేయడం నీకు ఒక లెక్కా?; రమ్ము= సిద్ధపడు; వేడ్కతోన్= కుతూహలంతో; జనపాలన శీలివి కమ్ము= ప్రజలను పరిపాలించే స్వభావం కలవాడివి కమ్ము.

**తా :** పుణ్యాత్ముడవైన రాజేంద్రా! యయాతి శాపంవల్ల వీరులైనప్పటికిన్నీ యాదవులు రాజపీఠం అధిష్ఠించడానికి వీలుగాదు. కాబట్టి, ఈ భూమికి నీవే అధిపతివిగా ఉండు. మేము నిన్ను సేవిస్తుంటాము. దేవతలే నీకు కప్పం చెల్లిస్తారు. ఇక ఇతర రాజులు నీ ఆజ్ఞ శిరసావహిస్తారని వేరుగా చెప్పడమెందుకు? వేడుకతో ప్రజాపరిపాలనకు సిద్ధపడు.

**వ. అని పలికి.** **1397**

**ప్రతి :** అని పలికి= అని వచించి...

**క. మన్నించి రాజుఁ జేసెను, వెన్నుఁడు సత్యావధాను విశ్రుతదానున్**
**సన్నుతమానున్ గదన, చ్ఛిన్నాహితసేను నుగ్రసేనున్ దీనున్.** **1398**

**ప్రతి :** వెన్నుఁడు= విష్ణుస్వరూపుడైన శ్రీకృష్ణుడు; సత్య+అవధానున్= సత్యమందే ఏకాగ్రత గలవాడును; విశ్రుతదానున్= ప్రసిద్ధమైన దానగుణం కలవాడును; సన్నుతమానున్= కొనియాడబడిన చిత్తౌన్నత్యం కలవాడూ; కదన= యుద్ధాలందు; ఛిన్న= ఛేదించిన; అహితసేనున్= శత్రుసేనలుగలవాడూ; దీనున్= కంసుడివల్ల నొచ్చినవాడూ అయిన; ఉగ్రసేనున్= ఉగ్రసేనుణ్ణి; మన్నించి= ఆదరించి; రాజున్+చేసెను= ప్రభువును చేశాడు.

**తా :** సత్యమందే ఏకాగ్రతకలవాడూ, దానాలు సల్పడంలో ప్రసిద్ధుడూ, కొనియాడబడిన పొగడ్త కాంచినవాడూ, సమరంలో శత్రుసైన్యాలను సంహరించేవాడూ, దర్పం లేనివాడూ అయిన ఉగ్రసేనుణ్ణి వాసుదేవుడు సంభావించాడు. మధురానగరానికి రాజును చేశాడు.

**వ. తదనంతరంబ తొల్లి కంసభీతులై విదేశంబులం గృశియించు చున్న యదు వృష్ణి భోజ మధు దశార్హ కుకురాంధక ప్రముఖులగు సకల జ్ఞాతిసంబంధులను రావించి, చిత్తంబు లలర విత్తంబు లిచ్చి వారి వారి నివాసంబుల నుండ నియోగించె; ని వ్విధంబున.** **1399**

**ప్రతి :** తద్+అనంతరంబు+అ= ఆ విధంగా శ్రీకృష్ణుడు ఉగ్రసేనుణ్ణి మధురకు రాజుగా చేసిన తరువాత; తొల్లి= అంతకు మునుపు; కంసభీతులు+ఐ= కంసుడివల్ల భయంచెందినవారై; విదేశంబులన్= ఇతర ప్రదేశాలలో; కృశియించుచున్+ఉన్న= బక్కచిక్కియున్న; యదు= యాదవులు; వృష్ణి= వృష్ణివంశస్థులు; భోజ= భోజులు; మధు= మధువంశానికి చెందినవారు; దశార్హ= దశార్హులు; కుకుర= కుకురులు; అంధక ప్రముఖులు+అగు= అంధకులు మొదలైన; సకల= సమస్తమైన; జ్ఞాతి= దాయాదుల్ని; సంబంధులను= చుట్టాలను; రావించి= మధురకు రప్పించి; చిత్తంబులు= మనస్సులు; అలరన్= సంతోషించేటట్లు; విత్తంబులు+ఇచ్చి= ధనము లొసగి; వారివారినివాసంబులన్= ఎవరియిండ్లలో వారిని; ఉండన్+ నియమించెన్= ఉండేలా ఆజ్ఞాపించాడు; ఈ+విధంబునన్= ఈ తీరున...

**తా :** ఆ తర్వాత శ్రీకృష్ణుడు పూర్వం కంసుడిభయంవల్ల ఇతరదేశాలలో గాసి చెందుతున్న తన జ్ఞాతులూ, చుట్టాలూ అయిన యాదవులు, వృష్ణులు, భోజులు, మధువులు, దశార్హులు, కుకురులు, అంధకులు, మొదలైనవారి నందరినీ మధురకు పిలిపించాడు. వారి మనసులు సంతసించేటట్లు ధనాదికం బహూకరించి, వారి వారి గృహాలలో నివసించడానికి ఏర్పాట్లు చేశాడు.

**క. మధుసూదనసత్కరుణా, మధురాలోకనవిముక్తమానసభయులై**
**మధురవచనములఁ దారును, మధురానగరంబు ప్రజలు మనిరి నరేంద్రా!** **1400**

**ప్రతి :** నర+ఇంద్రా!= పరీక్షిన్మహారాజా!; మధుసూదన= మధువనే రక్కసుణ్ణి సంహరించిన శ్రీకృష్ణునియొక్క; సత్కరుణా= మంచి దయచేత; మధుర= ఇంపయిన; ఆలోకన= చూపులతో; విముక్త= విడువబడిన; మానస= మనస్సులందలి; భయులు+ఐ=

భీతిగలవారై; మధురవచనములన్= తియ్యని పలుకులతో; తారును= తామున్నూ; మథురానగరంబు ప్రజలు= మథురాపురిలోని జనులు; మనిరి= జీవించారు.

**తా :** కరుణా రసంతో నిండిన మధుసూదనుని మధురమైన కటాక్ష వీక్షణాలతో మనసులోని భీతి తొలగినవారై తీయతీయని సల్లాపాలతో వారూ, మధురాపట్టణంలోని ప్రజలు కలసి మెలసి జీవించారు.

**వ. అంత నొక్కనాఁడు సంకర్షణసహితుండై నందునిం జీరి గోవిందుం డిట్లనియె. 1401**

**ప్రతి :** అంతన్= అటుపిమ్మట; ఒక్కనాఁడు= ఒకరోజు; గోవిందుండు= శ్రీకృష్ణుడు; సంకర్షణ సహితుండు+ఐ= బలరాముడితో కూడినవాడై; నందునిన్+చీరి= నందమహారాజును పిలిచి; ఇట్లు+అనియెన్= ఈ రీతిని పలికాడు.

**తా :** అనంతరం ఒకనాడు గోవిందుడు బలరాముడితో కలిసి నందుని వద్దకు వెళ్ళి ఇట్లన్నాడు.

**శా. తండ్రిం జూడము తల్లిఁ జూడము యశోదాదేవియున్ నీవు మా**
**తండ్రిం దల్లియు నంచు నుండుదుము సద్ధర్మంబులం దొల్లి యే**
**తండ్రుల్ బిడ్డల నిట్లు పెంచిరి? భవత్సౌజన్యభావంబులన్**
**దండ్రీ! యింతటివార మైతిమి గదా! తత్తద్వయోలీలలన్. 1402**

**ప్రతి :** తండ్రిన్= మమ్ము కన్నతండ్రి వసుదేవుణ్ణి; చూడము= మేము చూడలేదు; తల్లిన్+చూడము= కన్నతల్లి దేవకీదేవిని చూడలేదు; యశోదా దేవియున్ నీవు= యశోదమ్మా, నీవూ; మా తండ్రిన్+తల్లియున్+అంచున్= మా జననీ జనకులని; ఉండుదుము= భావిస్తూ ఉంటాము; తొల్లి= మునుపు; సత్+ధర్మంబులన్= ఉత్తమ ధర్మాలతో; ఏ తండ్రుల్= ఏ జననీజనకులు; బిడ్డలన్= తమసంతానాన్ని; ఇట్లు= మీ మాదిరిగా; పెంచిరి= పోషించారు? పోషించలేదనుట; తండ్రీ!= జనకా! నందమహారాజా! భవత్+సౌజన్యభావంబులన్= మీ మంచితనంతో కూడిన తలంపులతో; తద్+తద్= ఆ యా; వయస్+ లీలలన్= ప్రాయంలోని విలాసాలతో; ఇంతటి వారము+ఐతిమికదా= ఇట్లా పెరిగి పెద్దవాళ్ళమైనాము కదా!

**తా :** జనకా! నందమహారాజా! మేము మా తండ్రి వసుదేవుణ్ణి చూడలేదు. మా తల్లి దేవకీదేవిని చూచిన వాళ్ళం కాము. యశోదాదేవీ, నీవూ మా తలిదండ్రులని భావిస్తూ ఉంటిమి. ఇంతకు ముందు ఏ తలిదండ్రులు తమ బిడ్డల్ని ఇంత గారాబంగా పెంచారు? నీ మంచితనంవల్ల ఆ యా వయసులకు తగిన ఆటపాటలతో పెరిగి ఇంతవారమైనాము.

**ఉ. ఇక్కడ నున్న బాంధవుల కెల్లను సౌఖ్యము సేసి వత్తు మే**
**మక్కడికిన్; మదీయులకు నందఱకున్ వినిపింపు మయ్య నే**
**మెక్కడనున్న మాకు మది నెన్నఁడు బాయవు మీ వ్రజంబులో**
**మక్కువతోడ మీరు కృప మా కొనరించు క్రియావిశేషముల్. 1403**

**ప్రతి :** ఏము= మేము; ఇక్కడన్+ఉన్న= ఈ మథురాపురిలో ఉన్న; బాంధవులకున్+ఎల్లను= చుట్టాలందరికీ; సౌఖ్యము+చేసి= సుఖం కల్గించి; అక్కడికిన్= వ్రేపల్లెకు; వత్తుము (వచ్చుదుము)= రాగలం; మదీయులకున్+అందఱకున్= మావాళ్ళందరికీ; వినిపింపుము+అయ్య= అయ్యా! ఈ సంగతి చెప్పు; మీ వ్రజంబులోన్= మీ మందలో; మక్కువతోడన్= ప్రేమతో; మీరు; కృపన్= దయతో; మాకున్= మాకు; ఒనరించు= సల్పునట్టి; క్రియా విశేషముల్= గొప్ప గొప్ప ఉపచారక్రియలు; నేము=

మేము; ఎక్కడన్+ఉన్నన్= ఏ తావులో ఉన్నా; మాకున్= మాకు; మదిన్= మనసులో నుండి; ఎన్నఁడున్= ఎప్పుడూ; పాయవు= తొలగవు.

**తా :** ఇక్కడ మథురానగరంలో ఉన్న చుట్టాలందరికీ మేలు కలిగించి, అక్కడికి (వ్రేపల్లెకు) మేము వస్తాం. ఈ సంగతి మనవారందరికీ చెప్పండి. మీరు గోకులంలో ఎంతో మక్కువతో, దయతో మాకు చేసిన ఉపచారాతిశయాలు మేమెక్కడున్నా మా మనసునుంచి ఎన్నటికీ మరలిపోవు.

**వ. అని పలికి వస్త్రభూషణాదు లొసంగి సాదరంబుగం గౌఁగిలించుకొని గోవిందుం డనిచిన నందుండు ప్రణయవిహ్వలుండై బాష్పజలపూరితలోచనుం డగుచు వల్లవులుం దానును వ్రేపల్లెకుం జనియె; నంత. 1404**

**ప్రతి :** అని పలికి= అని చెప్పి; వస్త్రభూషణ+ఆదులు= గుడ్డలు, నగలు మొదలైనవి; ఒసంగి= ఇచ్చి; స+ఆదరంబు+కన్= మన్ననతో కూడునట్లు; కౌఁగిలించుకొని= ఆలింగనం చేసుకొని; గోవిందుండు= శ్రీకృష్ణుడు; అనిచినన్= పంపగా; నందుండు= నందుడు; ప్రణయ విహ్వలుండు+ఐ= ప్రేమచేత స్వాధీనత తప్పినవాడై; బాష్పజల పూరిత లోచనుండు+అగుచున్= కన్నీళ్ళతో నిండిన కన్నులుగలవాడవుతూ; వల్లవులున్= గొల్లలూ; తానును= తానుగూడా; వ్రేపల్లెకున్+చనియెన్= వ్రేపల్లెకు వెళ్ళాడు; అంతన్= అటుపిమ్మట...

**తా :** ఈ ప్రకారంగా పలికి శ్రీకృష్ణుడు వస్త్రాలూ, ఆభరణాలూ మొదలైన వాటి నిచ్చి ఆదరంతో కౌగిలించుకుని నందుణ్ణి సాగనంపాడు. నందుడు అనురాగంతో వశం తప్పినవాడై కన్నీళ్ళతో నిండిన కన్నులు గలవాడై గొల్లలతో కలిసి వ్రేపల్లెకు వెళ్ళిపోయాడు.

**క. గర్గాదిభూసురోత్తమ, వర్గముచే నుపనయనము వసుదేవుఁడు స**
**న్మార్గంబునఁ జేయించెను, నిర్గర్వచరిత్రులకును నిజపుత్త్రులకున్. 1405**

**ప్రతి :** వసుదేవుఁడు= వసుదేవుడు; నిర్+గర్వచరిత్రులకును= గర్వంలేని నడవడి గలిగినవారైన; నిజపుత్త్రులకున్= తన కుమారులైన రామకృష్ణులకు; గర్గ+ఆది= గర్గుడు మొదలైన; భూసుర+ఉత్తమ= బ్రాహ్మణ శ్రేష్ఠులయొక్క; వర్గముచేన్= సమూహంచేత; ఉపనయనమున్= వడుగును; సత్+మార్గంబునన్= మంచి పద్ధతిలో అనగా వేదోక్తమైన రీతిలో; చేయించెను= జరిపించాడు.

**తా :** అనంతరం వసుదేవుడు గర్వరహితమైన చరిత్రగల తన కుమారులకు గర్గుడు మొదలైన బ్రాహ్మణపురోహితులతో యథావిధిగా ఉపనయనసంస్కారం జరిపించాడు.

**విశే :** ఉపనయనం.

ఉప= సమీపే; నయతి= ప్రాపోన్ఓతి–ఇత్యుపనయనమ్= సమీపానికి చేర్చేది. అంటే వేదాభ్యాసం కోసం బాలుణ్ణి గురువువద్దకు పంపడానికై చేసే సంస్కారవిశేషం. గాయత్రీ ఉపాసనకు ఉపనయనం వల్లనే అధికారత ఏర్పడుతుంది.

**క. ద్విజరాజ వంశవర్యులు, ద్విజరాజ ముఖాంబుజోపదిష్ట వ్రతులై**
**ద్విజరాజత్వము నొందిరి, ద్విజరాజాదికజనంబు దీవింపంగన్. 1406**

**ప్రతి :** ద్విజరాజ+ఆదిక జనంబు= బ్రాహ్మణులు మొదలైన జనులు; దీవింపన్+కన్= ఆశీర్వదించగా; ద్విజరాజ= చంద్రునియొక్క; వంశవర్యులు= కులంలో పుట్టిన వారిలో శ్రేష్ఠులు–శ్రీకృష్ణబలరాములు; ద్విజరాజ= బ్రాహ్మణోత్తములయొక్క; ముఖ+అంబుజ= వదనపద్మాలనుంచి; ఉపదిష్ట= ఉపదేశించబడిన; వ్రతులు+ఐ= నియమాలు గలవారై; ద్విజరాజత్వము+ పొందిరి= రెండవజన్మమును పొందిన రాజులైరి.

**తా :** చంద్రవంశంలో జన్మించినవారిలో అగ్రగణ్యులై అలరారుతున్న బలరామకృష్ణులు బ్రాహ్మణోత్తముల ముఖకమలాలనుంచి ఉపనయన మంత్రోపదేశాలను గ్రహించినవారై, విప్రులు, రాజులు ఆదిగా గల జనులూ, గరుత్మంతుడు, ఆదిశేషుడూ మొదలైనవారూ దీవనలియ్యగా ద్విజత్వం (క్షత్రియత్వం) అందుకున్నారు.

**విశే :** ద్విజరాజత్వము పొందిరి – శ్రేష్ఠమైన రెండవ జన్మాన్ని పొందారు. ఉపనయనము రెండవ జన్మ. అది వహించిన వారైరి అనుట. తల్లిగర్భంనుంచి వెల్వడటం మొదటిజన్మ. ఉపనయన సంస్కారం పొందటం రెండవ జన్మ. బలరామకృష్ణులు గాయత్రీమంత్రోపదేశమనే రెండవ జన్మను పొందిన రాజులయ్యారు.

**వ. ఉపనయనానంతరంబున వసుదేవుండు బ్రాహ్మణులకు సదక్షిణంబులుగా ననేక గోహిరణ్యాది దానంబు లొసంగి తొల్లి రామకృష్ణుల జన్మసమయంబులందు నిజమనోదత్తులైన గోవుల నుచ్చరించి యిచ్చి కామితార్థంబుల నర్థులకుం బెట్టె; నిట్లు బ్రహ్మచారులై. 1407**

**ప్రతి :** ఉపనయన+అనంతరంబునన్= వడుగైన తరువాత; వసుదేవుండు= వసుదేవుడు; బ్రాహ్మణులకున్= విప్రులకు; సదక్షిణంబులు+కాన్= దక్షిణలతో కూడిన వగునట్లుగా; అనేక (న+ఏక) గో హిరణ్య+ఆది= పెక్కుగోవులు, బంగారం మొదలైన; దానంబులు+ఒసంగి= దానాలు చేసి; తొల్లి= మునుపు;రామకృష్ణుల=బలరామ, శ్రీకృష్ణులయొక్క; జననసమయంబులు+అందున్= పుట్టినవేళల్లో; నిజ= తనయొక్క; మనస్+దత్తులు+ఐన= మనస్సుతో సమర్పించిన; గోవులన్= ఆవులను; ఉచ్చరించి= పేర్కొని; ఇచ్చి= ఒసగి; అర్థులకున్= యాచకులకు; కామిత+అర్థంబులన్= కోరిన కోరికలను; పెట్టెన్= ఈడేర్చాడు; ఇట్లు= ఈ విధంగా; బ్రహ్మచారులు+ఐ= రామకృష్ణులు బ్రహ్మచర్య వ్రతాన్ని అవలంబించినవారై...

**తా :** ఉపనయనమైన తర్వాత వసుదేవుడు పలువురు బ్రాహ్మణులకు దక్షిణలతో కూడా గోదానాలు, హిరణ్యదానాలు చేసి, పూర్వం రామకృష్ణులు పుట్టినపుడు తన మనస్సులో దానమిస్తానన్న గోవులను అనుకొన్న విధంగా దానంచేసి యాచకులకు వారు కోరిన వాటినిచ్చి తృప్తి పరిచాడు. ఈ విధంగా ఉపనయనసంస్కారం పొందిన శ్రీకృష్ణ బలరాములు

**విశే :** బ్రహ్మచారీ – బ్రహ్మణి చరతీతి బ్రహ్మచారీ= బ్రహ్మమందు చరించేవాడు బ్రహ్మచారి. బ్రహ్మచర్యం, గార్హస్థ్యం, వానప్రస్థం, సన్న్యాసం అని ఆశ్రమాలు నాల్గు. వాటిలో ప్రథమాశ్రమమైన బ్రహ్మచర్యంలో ఉన్నవాడు – బ్రహ్మచారి. బ్రహ్మమంటే వేదం, తపస్సు, సత్యం, తత్త్వం, జ్ఞానస్వరూపం – అని అర్థాలు. వీటియందు నియమంతో చరించేవాడు బ్రహ్మచారి.

**శా. ఉర్విన్ మానవు లెవ్వరైన గురువాక్యోద్యుక్తులై కాని త**
**త్పూర్వారంభము సేయఁ బోల దనుచున్ బోధించు చందంబునన్**
**సర్వజ్ఞత్వముతో జగద్గురువులై సంపూర్ణులై యుండియుం**
**గుర్వంగీకరణంబు సేయఁ జని; రా గోవిందుఁడున్ రాముఁడున్. 1408**

**ప్రతి :** ఉర్విన్= పుడమిలో; మానవులు= మనుష్యులు; ఎవ్వరు+ఐనన్= ఎట్టివారైనా; గురువాక్య+ఉద్యుక్తులు+ఐ= గురువు మాటల్ని అవలంబించినవారై; కాని= తప్ప; తత్+పూర్వ+ఆరంభము= ఆ గురువుయొక్క వాక్యాలను అనుసరించడానికి ముందట ప్రయత్నం; చేయన్+పోలదు= చేయకూడదు; అనుచున్= అని; బోధించు చందంబునన్= తెలిపే విధంగా; సర్వజ్ఞత్వముతోన్= అన్నీ తెలిసినవారివిధంగా; జగత్+గురువులు+ఐ= లోకాలకు గురువులై; సంపూర్ణులు+ఐ= అన్నీ కల్గినవారై, కోరవలసింది ఏదీలేనివారై; ఉండియున్= ఉన్నప్పటికినీ; ఆ గోవిందుఁడున్= ఆ శ్రీకృష్ణుడూ; రాముఁడున్= బలరాముడూ; గురు+అంగీకరణంబు+చేయన్= గురువును అంగీకరించడంకోసం; చనిరి= వెళ్ళారు.

**తా :** భూమిలో మానవు లెవ్వరుగానీ గురుకులవాసంచేసి గురువుల ఉపదేశాలు శ్రద్ధతో ఆలకించితే తప్ప విద్యావంతులు కాలేరు సుమా! అని లోకానికి బోధించాలని బలరామకృష్ణులు భావించారు. సమస్తం తెలిసినవారైనప్పటికినీ, జగద్గురువు లయినప్పటికినీ, పరిపూర్ణు లయినప్పటికినీ వారు ఆచార్యుణ్ణి అన్వేషిస్తూ బయలుదేరారు.

**వ. చని మహావైభవరాశియైన కాశిం జేరి తత్తీరంబున నవంతీపుర నివాసియు, సకలవిద్యా విలాసియు నైన సాందీపని యను బుధవర్యుం గని యథోచితంబుగ దర్శించి, శుద్ధభావవర్తనంబుల భక్తిసేయుచుండ, వారలవలన సంతుష్టుండై. 1409**

**ప్రతి :** చని= వెళ్ళి; మహావైభవరాశి= గొప్పవైభవాల సమూహం గలది; ఐనకాశిన్+చేరి= అయినట్టి కాశీపట్టణాన్ని చేరి; తత్+తీరంబునన్= ఆ పట్టణం ఒడ్డున; అవంతీపురనివాసియున్= అవంతి అనే పట్నంలో నివసించేవాడూ, సకలవిద్యా విలాసియున్= సమస్త విద్యలయొక్క వినోదం కలవాడూ, అన్ని విద్యలు ఎరిగినవాడనుట; ఐన= అయినట్టి; సాందీపని+అను= సాందీపుడు అనే పేరుగల; బుధవర్యున్+కని= పండితోత్తముణ్ణి చూచి; యథా+ఉచితంబు+కన్= తమకు తగిన విధంగా; దర్శించి= చూచి; శుద్ధభావ వర్తనంబులన్= నిర్మలమైన తలంపులతో గూడిన ప్రవర్తనలతో; భక్తి+చేయుచున్+ఉండన్= భక్తితో కొలుస్తుండగా; వారలవలనన్= ఆ రామకృష్ణులవల్ల; సంతుష్టుండు+ఐ= సంతృప్తి చెందినవాడై...

**తా :** రామకృష్ణులు గొప్ప వైభవాలకు కాణాచి అయిన కాశీపట్టణం చేరుకున్నారు. అక్కడ ఉంటున్న అవంతీపుర వాస్తవ్యుడూ, సమస్త విద్యలచే విరాజిల్లువాడూ అయిన సాందీపని అనే పండితోత్తముణ్ణి సముచితరీతిలో సందర్శించారు. స్వచ్ఛమైన మనస్సుతో, సత్ప్రవర్తనతో, ప్రగాఢమైన భక్తితో ఆయనను వారు సేవించారు. ఆచార్యుడు ఆ శిష్యుల వినయ విధేయతలకు ఎంతో సంతోషించి

**శా. వేదశ్రేణియు నంగకంబులు ధనుర్వేదంబుఁ దంత్రంబు మ**
**న్వాదివ్యాహృతధర్మశాస్త్రములు నుద్యన్న్యాయముం దర్క వి**
**ద్యా దక్షత్వము రాజనీతియును శుద్ధప్రక్రియం జెప్పె నా**
**భూదేవాగ్రణి రామకృష్ణులకు సంభూతప్రమోదంబునన్. 1410**

**ప్రతి :** ఆ భూదేవ+అగ్రణి= ఆ బ్రాహ్మణోత్తముడైన సాందీపని; రామకృష్ణులకున్= బలరాముడికి, శ్రీకృష్ణుడికి; సంభూత ప్రమోదంబునన్= కలిగిన సంతోషంతో; వేదశ్రేణియున్= వేదములవరుస, (ఋగ్యజుస్సామాథర్వణములనే వేదరాశి); అంగకంబులు= వేదాంగాలైన శిక్ష, వ్యాకరణం, ఛందస్సు, నిరుక్తం, జ్యోతిషం, కల్పం అనే ఆరువేదాంగాలు; ధుర్+వేదంబున్= విలువిద్య; తంత్రంబున్= సిద్ధాంత విషయం; మను+ఆది= మనువు మొదలైన వారు; వ్యాహృత= చెప్పిన; ధర్మశాస్త్రములు=

స్మృతులు; ఉద్యత్+న్యాయమున్= ప్రకాశించే న్యాయశాస్త్రం; తర్క విద్యా దక్షత్వమున్= తర్కశాస్త్రమందు నైపుణ్యం; రాజనీతియును= రాజనీతియున్నూ; శుద్ధప్రక్రియన్= తేటతెల్లంగా; చెప్పెన్= బోధించాడు.

**తా :** భూసురోత్తముడని చెప్పదగిన ఆ సాందీపని సంతోషిత స్వాంతుడై రామకృష్ణులకు ఋక్, యజుస్, సామ, అథరా లనే నాల్గువేదాలు, శిక్ష, వ్యాకరణం, ఛందం, నిరుక్తం, జ్యోతిషం, కల్పం అనే ఆరు వేదాంగాలు, ధనుర్వేదం, తంత్రశాస్త్రం, మనువు మొదలయిన వారు చెప్పిన ధర్మశాస్త్రాలు, న్యాయశాస్త్రం, తర్కశాస్త్రం, రాజనీతిశాస్త్రం మొదలయిన వాటిని తేటతెల్లంగా బోధించాడు.

**క. అఱువది నాలుగు విద్యలు, నఱువది నాలుగు దినంబు లంతన వారల్**
**నెఱవాదులైన కతమున, నెఱి నొక్కొకనాఁటి వినికి నేర్చి రిలేశా! 1411**

**ప్రతి :** ఇలా+ఈశా!= భూపతీ! (పరీక్షిన్మహారాజా!); వారల్= రామకృష్ణులు; అఱువదినాలుగు విద్యలున్= చతుష్షష్టి కళలను; అఱువదినాలుగు దినంబులు+అంతన= అరవైనాల్గు రోజులలోనే; నెఱవాదులు= నేర్పరులు; ఐన కతమునన్= అయిన కారణాన; నెఱిన్= క్రమంగా; ఒక్క+ఒక నాఁటి వినికిన్= ఒక్కొక్క దినమందు వినడంచేతనే; నేర్చిరి= నేర్చుకున్నారు.

**తా :** పరీక్షిన్మహారాజా! రామకృష్ణులు మిక్కిలి నేర్పరులయినందున అరవైనాల్గు కళలనూ అరవైనాలుగు రోజుల్లో చక్కగా, ఒక్కొక్కనాడు ఒక్కొక్క కళవంతున వినికిడి చేతనే నేర్చుకున్నారు.

**విశే : అరువదినాలుగు విద్యలు (కళలు) :** 1) ఇతిహాసం 2) ఆగమం 3) కావ్యం 4) అలంకారం 5) నాటకం 6) గానం 7) కవిత్వం 8) కామశాస్త్రం 9) జూదం 10) దేశభాషా లిపిజ్ఞానం 11) లిపికర్మ 12) వాచకం 13) అవధానం 14) స్వరశాస్త్రం 15) శాకునం 16) సాముద్రికం 17) రత్నశాస్త్రం 18) రథాశ్వగజకౌశలం 19) మల్లశాస్త్రం 20) సూదకర్మం (వంటపని) 21) దోహదం 22) గంధవాదం 23) ధాతువాదం 24) ఖనివాదం 25) రసవాదం 26) జలవాదం 27) అగ్నిస్తంభం 28) ఖడ్గస్తంభం 29) జలస్తంభం 30) వాక్స్తంభం 31) వయస్తంభం 32) వశ్యం 33) ఆకర్షణం 34) మోహనం 35) విద్వేషణం 36) ఉచ్చాటనం 37) మారణం 38) కాలవంచనం 39) పరకాయ ప్రవేశం 40) పాదుకాసిద్ధి 41) వాక్సిద్ధి 42) ఘుటికా సిద్ధి 43) ఐంద్రజాలికం 44) అంజనం 45) దృష్టివంచనం 46) స్వరవంచనం 47) మణిమం త్రౌషధాదిసిద్ధి 48) చోరకర్మ 49) చిత్రక్రియ 50) దారుక్రియ 51) అశ్మక్రియ 52) మృత్క్రియ 53) దారుక్రియ 54) వేణుక్రియ 55) చర్మక్రియ 56) అంబరక్రియ 57) అదృశ్య కరణం 58) దూతీకరణం 59) మృగయ (వేట) 60) వాణిజ్యం 61) పాశుపాల్యం 62) కృషి 63) ఆసనకర్మం 64) ప్రాణిద్యూత కౌశలం (లావ, కుక్కుట, మేషాది యుద్ధ కారక కౌశలం)– ఇవి చతుష్షష్టి కళలు–అనగా అరువై నాలుగు విద్యలు. వీటిల్ని తెలుగు నిఘంటువుల్లో చూడవచ్చు.

**క. గురువులకు నెల్ల గురులై, గురులఘుభావములులేక కొమరారు జగ**
**ద్గురులు త్రిలోకహితార్థము, గురుశిష్యన్యాయలీలఁ గొలిచిరి వేడ్కన్. 1412**

**ప్రతి :** గురువులకున్+ఎల్లన్= గురువులందరికిన్నీ; గురులు+ఐ= గురులై; గురులఘు భావములు= పెద్ద పిన్న తేడాలు; లేక= లేకుండగా; కొమరారు= ఒప్పునట్టి; జగత్+గురులు= లోకాలకు గురువులైన బలరామకృష్ణులు; త్రిలోకహిత+అర్థము= మూడు లోకాల మేలుకొరకు; గురుశిష్యన్యాయలీలన్= గురువు శిష్యులు అనే న్యాయాన్ని అనుసరించి; వేడ్కన్= మక్కువతో; కొలిచిరి= సాందీపుల వారిని సేవించారు.

**తా :** గురువులకే గురువులయినవారూ, ఇతడు ఎక్కువ, అతడు తక్కువ అనే భేదభావాలు లేకుండా ప్రకాశించే లోకగురువులూ అయిన రామకృష్ణులు సంతోషంతో గురుశిష్యన్యాయంతో ఉపాధ్యాయుడైన సాందీపనిని సేవించారు.

**వ. ఇట్లు కృతకృత్యులైన శిష్యులం జూచి వారల మాహాత్మ్యంబునకు వెఱఁగుపడి సభార్యుండైన సాందీపని యిట్లనియె. 1413**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; కృతకృత్యులు+ఐన= అనుకొన్న పని నెరవేర్చుకొన్నవారైన; శిష్యులన్= శిష్యుల్ని; చూచి= కనుగొని; వారల మాహాత్మ్యంబునకున్= వారి గొప్పతనానికి; వెఱఁగుపడి= ఆశ్చర్యపడి; సభార్యుండు+ఐన= భార్యతో కూడినవాడైన; సాందీపని= సాందీపులవారు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తా :** ఈ విధంగా కృతార్థులైన శిష్యుల్ని చూచి, వారి గొప్పతనానికి ఆశ్చర్యపడి, భార్యతో ఆలోచించి, సాందీపని రామకృష్ణులతో ఇట్లన్నాడు.

**శా. అంభోరాశిఁ బ్రభాసతీర్థమున ము న్నస్మత్తనూసంభవుం**
**డంభోగాహముసేయుచున్ మునిఁగి లేఁ డయ్యెం గృపాంభోనిధుల్**
**శుంభద్వీర్యులు మీరు మీ గురునికిం జోద్యంబుగా శిష్యతన్**
**గాంభీర్యంబునఁ బుత్త్రదక్షిణ యిడం గర్తవ్య మూహింపరే! 1414**

**ప్రతి :** అంభస్+రాశిన్= సాగరంలో; ప్రభాసతీర్థమునన్= ప్రభాసమనే పేరుగల రేవులో; మున్ను= మునుపు; అస్మత్+తనూ సంభవుండు= మా కుమారుడు; అంభస్+గాహము+చేయుచున్= స్నానంచేస్తూ; మునిఁగి= ఆ తీర్థంలో ప్రవేశించి; లేఁడు+అయ్యెన్= తిరిగి పైకి రాలేదు; మీరు= మీ ఇద్దరూ; కృపా+అంభోనిధుల్= దయకు సముద్రాలవంటివారు; శుంభత్+వీర్యులు= మిక్కిలి పరాక్రమవంతులు; మీ గురునికిన్= మీ ఆచార్యుడనైన నాకు; చోద్యంబు+కాన్= ఆశ్చర్యకరంగా, విస్మయం కలిగేటట్లు; శిష్యతన్= శిష్యభావంచేత; గాంభీర్యంబునన్= గంభీరభావంతో; పుత్త్రదక్షిణ= కొడుకు అనే దక్షిణను (పుత్రభిక్షను); ఇడన్= ఇవ్వడం; కర్తవ్యము= మీరు చేయదగిన పని; ఊహింపరు+ఏ= యోచించండి.

**తా :** నాయనలారా! మా కుమారుడు మునుపు సముద్రంలో ప్రభాసమనే స్నానఘట్టంలో స్నానం చేస్తూ నీటిలో మునిగిపోయాడు. అంతే; మళ్ళీ అగుపించలేదు. దయకు సముద్రంలాంటివారూ, ప్రకాశించే ప్రతాపం గలవారూ అయిన మీరు మాకు శిష్యులైనారు. కనుక మాకు గురుదక్షిణగా, అందరికీ అచ్చెరువు కలిగేటట్లుగా మా కుమారుణ్ణి తెచ్చి, మా కివ్వండి. ఇది మీ కర్తవ్యంగా గుర్తించండి.

**క. శిష్యులు బలాఢ్యులైన వి, శేష్యస్థితి నొంది గురువు జీవించును; ని**
**ర్దూష్యగుణబలగరిష్ఠులు, శిష్యులరై గురునికోర్కి సేయం దగదే? 1415**

**ప్రతి :** శిష్యులు= శిష్యులు; బల+ఆఢ్యులు+ఐనన్= గొప్పశక్తి సంపన్నులు అయితే; గురువు= ఉపాధ్యాయుడు; విశేష్యస్థితిన్= ఉన్నత స్థితిని; ఒంది= పొంది; జీవించును= బ్రతుకుతాడు; నిర్దూష్య= నిందింపరాని; గుణ= సద్గుణాలచే; బల= శక్తిచే; గరిష్ఠులు= గొప్పవారైనమీరు; శిష్యులరు+ఐ= నాకు శిష్యులైఉండి; గురునికోర్కి= ఆచార్యుని కోర్కెను; చేయన్+తగదు+ఏ= నెరవేర్చడం యుక్తం గదా!

**తా :** శిష్యులు అత్యంత బలవంతులైతే గురువు ఉత్తమస్థితినొంది గౌరవంగా జీవిస్తాడు. ఉత్తమ గుణాలతో, అఖండ పరాక్రమంతో విరాజిల్లే మీరు శిష్యులై ఉండి గురునికోరిక నెరవేర్చడం న్యాయంకదా!

**వ. అనిన విని రామకృష్ణులు గుర్వర్థంబుగా దుర్వారరథారూఢులై రయంబునం జని రౌద్రంబున సముద్రంబుఁ జేరి యిట్లనిరి. 1416**

**ప్రతి :** అనినన్+విని= గురువుగారు అలా పలుకగా, విన్నవారై; రామకృష్ణులు= బలరామశ్రీకృష్ణులు; గురు+అర్థంబు+కాన్= గురువుకొరకు; దుర్వారరథ+ఆరూఢులు+ఐ= అడ్డగించరాని రథాన్ని ఎక్కినవారై; రయంబునన్= వేగంగా; చని= వెళ్ళి; రౌద్రంబునన్= భయం గొల్పేటట్లు; సముద్రంబున్= సాగరాన్ని; చేరి= సమీపించి; ఇట్లు+అనిరి= ఈ విధంగా పలికారు.

**తా :** ఆచార్యుడైన సాందీపనిపలుకులు విని, రామకృష్ణులు గురువుగారికోరిక తీర్చడంకోసం ఎదురులేని రథాన్ని అధిరోహించారు. తత్క్షణం సముద్రుడిసమీపానికి వెళ్ళి కోపంతో ఇలా అన్నారు.

**క. సాగర! సుబుద్ధితోడను, మా గురుపుత్రకునిఁ దెమ్ము మా ఱాడిన నీ**
**వాగడ మగుదువు; దుస్సహ, వేగరణాభీలనిశితవిశిఖాగ్నులకున్. 1417**

**ప్రతి :** సాగర= ఓ సముద్రుడా!; సుబుద్ధితోడను= మంచి బుద్ధితో; మా గురుపుత్రకునిన్= మా గురువుగారి కుమారుడు; తెమ్ము= తీసుకొనిరా; మాఱు+ఆడినన్= (అలా తీసుకరాక) బదులు మాటలు చెప్పితే; దుస్సహవేగ= భరింపరాని వడిగల; రణ+ఆభీల= యుద్ధంలో భీతి గొలుపే; నిశిత= వాడియైన; విశిఖ= బాణాలనే; అగ్నులకున్= నిప్పులకు; నీవు; ఆగడము+ అగుదువు= ఆహుతి అవుతావు.

**తా :** ఓ సముద్రుడా! మంచిబుద్ధితో మా గురువుగారి కుమారుణ్ణి తెచ్చి మాకు అప్పగించు. బదులు మాట్లాడితే సహించరాని వేగం గలవీ, రణరంగ భయంకరాలూ అయిన మా పదునైన బాణాలు విరజిమ్మే అగ్నిజ్వాలలకు నీవు దగ్ధమౌతావు.

**వ. అనిన వారలకు జలరాశి యిట్లనియె. 1418**

**ప్రతి :** అనినన్= అని రామకృష్ణులు పలుకగా; వారలకున్= ఆ అన్నదమ్ములకు; జలరాశి= సముద్రుడు; ఇట్లు+అనియెన్= ఈ రీతిగా పలికాడు.

**తా :** ఆ విధంగా రామకృష్ణులు పలుకగా వారికి సాగరుడు ఈ రీతిగా సమాధాన మిచ్చాడు.

**ఉ. 'వంచన యింత లేదు యదువల్లభులార! ప్రభాసతీర్థమం**
**దంచితమూర్తి విప్రసుతుఁ డార్యుఁడు తోయము లాడుచుండ ను**
**త్సంచలితోర్మి యొక్కటి ప్రచండగతిం గొనిపోయెఁ బోవఁగాఁ**
**బంచజనుండు మ్రింగె నతిభాసురశీలుని విప్రబాలునిన్. 1419**

**ప్రతి :** యదువల్లభులార!= యాదవకులంలో పుట్టిన నాయకులారా!; వంచన+ఇంతలేదు= మోసం రవంతకూడా లేదు; ప్రభాసతీర్థము+అందున్= ప్రభాసమనే పేరుగల స్నానఘట్టంలో; అంచితమూర్తి= ఒప్పిదమైన రూపం కల్గినవాడు; ఆర్యుఁడు= పూజ్యుడు ఐన; విప్రసుతుఁడు= బ్రాహ్మణ బాలుడు; తోయములు+ఆడుచుండన్= స్నానం చేస్తుండగా; ఉత్+సంచలిత+

ఊర్మి+ఒక్కటి= పైకి ఎగసిన ఒక తరంగం; ప్రచండగతిన్= మిక్కుటమైన వేగంతో; కొనిపోయెన్= లోనికి తీసుకపోయింది; పోవన్+కాన్= అట్లా తీసుకొని వెళ్ళగా; అతిభాసురశీలునిన్= మిక్కిలి ప్రకాశించే స్వభావం గలవాడైన; విప్రబాలునిన్= బ్రాహ్మణ కుమారుణ్ణి; పంచజనుండు= పంచజనుడనే రాక్షసుదు; మ్రింగెన్= కబళించాడు.

**తా :** యాదవేశ్వరులారా! నా మాటలలో మోసం ఏ కొంచెమైనా లేదు. ప్రభాస తీర్థంలో అందమైన ఆకారం గలవాడూ, సాధువూ అయిన బ్రాహ్మణ బాలుడు స్నానం చేస్తుండగా తరంగమొకటి పైకెగసి భయంకర వేగంతో అతణ్ణిలోనికి తీసుకపోయింది. అలా తీసుకొని పోగా మిక్కిలి మంచి స్వభావంగల ఆ బ్రాహ్మణ కుమారుణ్ణి పంచజనుడనే రాక్షసుడు మింగేశాడు.

**వ. అని వాని వసియించు చో టెఱింగించిన. 1420**

**ప్రతి :** అని= అంటూ; వాని వసియించు= ఆ పంచజనుడు నివసించే; చోటు= తావు; ఎఱింగించినన్= సాగరుడు తెల్పగా...

**తా :** అని సముద్రుడు ఆ పంచజనుడు నివసించే ప్రదేశం ఏదో రామకృష్ణులకు తెలిపాడు.

**శా. శంఖారావముతోడఁ బంచజనుఁడున్ శంకించి చిత్తంబులో**
**సంఖిన్నుండుగ వార్ధిఁ జొచ్చి దహనజ్వాలాభహేమోజ్జ్వల**
**త్పుంఖాస్త్రంబునఁ గూల్చి వానిజఠరంబున్ వ్రచ్చి గోవిందుఁ డ**
**ప్రేంఖచ్చిత్తుఁడు బాలుఁ గానక గురుప్రేమోదితోద్యోగుఁడై. 1421**

**ప్రతి :** శంఖ+ఆరావముతోడన్= శ్రీకృష్ణుడు పూరించిన శంఖధ్వనితో; పంచజనుఁడున్= పంచజనుడనే పేరుగల ఆ రాక్షసుడు; శంకించి= భయపడి; చిత్తంబులోన్= మనస్సులో; సంఖిన్నుండు+కన్= మిక్కిలి దుఃఖం చెందినవాడు కాగా; వార్ధిన్= సాగరంలో; చొచ్చి= శ్రీకృష్ణుడు ప్రవేశించి; దహనజ్వాలా+ఆభ= నిప్పుమంటలతో సమానాలై; హేమ+ఉత్+జ్వలత్= బంగారం మాదిరి మెరుస్తున్న; పుంఖ= పింజగల; అస్త్రంబునన్= మంత్రపూతమైనబాణంతో; కూల్చి= పంచజనుణ్ణి సంహరించి; వాని= ఆ రక్కసునియొక్క; జఠరంబున్= గర్భాన్ని; వ్రచ్చి= చీల్చి; అప్రేంఖత్+చిత్తుఁడు= చలించని మనస్సుగల్గిన, గోవిందుఁడు= శ్రీకృష్ణుడు; బాలున్+కానక= గురుపుత్రుణ్ణి చూడక; గురుప్రేమ= గురువునందలి ప్రేమచే; ఉదిత= జనించిన; ఉద్యోగుఁడు+ఐ= ప్రయత్నంగలవాడై...

**తా :** శ్రీకృష్ణుడు శంఖం పూరించాడు. ఆ శంఖారావం విని పంచజనుడు భయసందేహాలతో కంపించి పోయాడు. శ్రీకృష్ణుడు సాగరజలంలో ప్రవేశించాడు. అగ్నిజ్వాలలతో సమానాలై, బంగారు పింజలతో రంగారు బాణాలతో పంచజనుణ్ణి పడగూల్చి, వాని పొట్టను చీల్చాడు. అచంచల మనస్కుడైన శ్రీకృష్ణుడికి పంచజనుడి కడుపులో బ్రాహ్మణ కుమారుడు కన్పించలేదు. అతడు గురువుపట్లగల ప్రేమచే కార్యతత్పరుడయినాడు.

**క. దానవుని దేహజంబగు, మానితశంఖంబు గొనుచు మసలక బలుఁడుం**
**దో నేతేరఁగ రథియై, దానవరిపుఁ డరిగె దండధరపురికి నృపా! 1422**

**ప్రతి :** నృపా!= పరీక్షిన్మహారాజా!; దానవుని దేహజంబు= ఆ పంచజనుడి శరీరంనుండి పుట్టింది; అగు= అయినట్టి; మానిత శంఖంబున్= ఉత్తమశంఖాన్ని; కొనుచున్= స్వీకరిస్తూ; మసలక= ఆలసించక; బలుఁడున్= బలరాముడును; తోన్+

ఏతేరcగన్= తన వెంటరాగా; రథి+ఐ= తేరునెక్కినవాడై; దండధరపురికిన్= యముడి పట్టణానికి; దానవరిపుడు= రాక్షసవిరోధి అయిన శ్రీకృష్ణుడు; అరిగెన్= పోయాడు.

**తా :** పరీక్షిన్నరేంద్రా! రాక్షస విరోధి అయిన శ్రీకృష్ణుడు రక్కసుడైన పంచజనుడి శరీరంనుంచి జనించిన పాంచజన్యమనే గొప్ప శంఖాన్ని తీసుకున్నాడు. ఆలసించక బలభద్రసహితుడై రథాన్ని అధిరోహించి యముడిపట్టణానికి వెళ్ళాడు.

**వ. చని సంయమనీనామనగరంబుc జేరి తద్ద్వారంబునc బ్రళయకాల మేఘగంభీరనినదభీషణం బగు శంఖంబు పూరించిన విని వెఱcగుపడి. 1423**

**ప్రతి :** చని= వెళ్ళి; సంయమనీనామ నగరంబున్= సంయమని అనే పేరుగల యముడి పట్టణాన్ని; చేరి= చేరినవాడై; తద్+ద్వారంబునన్= ఆ పట్టణంవాకిట్లో; ప్రళయకాల= ప్రళయ సమయమందలి; మేఘ= మబ్బులయొక్క; గంభీర= లోతైన; నినద= శబ్దంచే; భీషణంబు+అగు= భయంకరమైన; శంఖంబు పూరించినన్= శంఖాన్ని ఊదగా; విని= ఆలకించి; వెఱcగుపడి= ఆశ్చర్యపడి...

**తా :** అలా వెళ్ళి శ్రీకృష్ణుడు 'సంయమని' అనే పేరుగల ఆ యమపురాన్ని చేరి ఆ పట్టణం వాకిట ప్రళయకాల మేఘంవలె గంభీర ధ్వనితో భీతి గొలిపే తన శంఖాన్ని పూరించాడు. ఆ శంఖ ఘోషం విని యమధర్మరాజు ఆశ్చర్యపడి

**శా. అస్మద్బాహుబలంబుc గైకొనక శంఖారావమున్ మానసా**
**పస్మారంబుగ నెవ్వc డొక్కొ నగర ప్రాంతంబునం జేసె? మ**
**ద్విస్మేరావహరోషపావకునిచే విధ్వస్తుcడై వాcడు దా**
**భస్మంబై చెడు నంచు నంతకుcడు కోపప్రజ్వలన్మూర్తియై. 1424**

**ప్రతి :** అస్మత్+బాహుబలంబున్= నా భుజశక్తిని; కైకొనక= లెక్కచేయక; ఎవ్వcడు+ఒక్కొ= వీడెవడోగాని; మానస+అపస్మారంబు+కన్= హృదయం కలతపడునట్లుగా; నగరప్రాంతంబునన్= మా పట్టణసమీపంలో; శంఖ+ఆరావమున్= శంఖధ్వనిని; చేసెన్= చేశాడు; వాcడు= ఆ విధంగా శంఖం ఊదినఅతడు; మత్= నాయొక్క; విస్మేర+ఆవహ= విస్మయం కల్గించే; రోషపావకునిచేన్= కోపమనే అగ్నిచేత; విధ్వస్తుcడు+ఐ= ధ్వంసం చేయబడినవాడై; తాన్= తాను; భస్మంబు+ఐ= బూదియై; చెడున్= నశిస్తాడు; అంచున్= అంటూ; అంతకుcడు= యముడు; కోప= కినుకచే; ప్రజ్వలత్= మండుతున్న; మూర్తి+ఐ= ఆకారం కలవాడై...

**తా :** నా భుజబలాన్ని లెక్కచెయ్యక నా మనసునకు క్రోధావేశం కలిగేటట్టు నగరం పొంత ఎవడో శంఖం పూరిస్తున్నాడు. వాడు ఆశ్చర్యకరమైన నా క్రోధాగ్నికి బూడిద అయిపోతాడు – అంటూ యముడు కోపంతో మండిపడుతూ వచ్చాడు.

**వ. వచ్చి రామకృష్ణులం గని వారు లీలామనుష్యు లయిన విష్ణుమూర్తులని యెఱింగి; భక్తితోడం బూజ చేసి సర్వభూతమయుండగు కృష్ణునకు నమస్కరించి 'యేమి సేయుదు నాన'తి మ్మనిన న మ్మహాత్ముం డిట్లనియె. 1425**

**ప్రతి :** వచ్చి; రామకృష్ణులన్= బలరామ శ్రీకృష్ణులను; కని= చూచి; వారు= ఆ ఇద్దరు; లీలామనుష్యులు+అయిన= విలాసార్థం మానవరూపం గైకొన్న; విష్ణుమూర్తులు+అని= నారాయణస్వరూపులు అని; ఎఱింగి= తెలిసి; భక్తితోడన్= భక్తితో;

పూజచేసి= పూజించి; సర్వభూతమయుండు= సకల ప్రాణిస్వరూపుడు; అగు= అయిన; కృష్ణునకున్= మాధవునికి; నమస్కరించి= మ్రొక్కి; ఏమి+చేయుదున్= నే నేమి చేయవలెనో; ఆనతి+ఇమ్ము+అనినన్= సెలవియ్యండని అడుగగా; ఆ+మహా+ఆత్ముండు= ఆ గొప్ప మనసు గలవాడైన శ్రీకృష్ణుడు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా బదులు చెప్పాడు.

**తా :** అలా వచ్చి అంతకుడు బలరామకృష్ణుల్ని అవలోకించాడు. వారు లీలలు నెరపుటకై నరులుగా అవతరించిన నారాయణులని గ్రహించాడు. భక్తితో పూజించాడు. సకలభూత హృదయ నివాసి అయిన ఆ పరమాత్మకు నమస్సులు సమర్పించి నేనేమి చెయ్యాలో ఆజ్ఞాపించుమని అడిగాడు. యమునిమాటలు విని అచ్యుతుడు ఇలా అన్నాడు.

**క. 'చెప్పెద మా గురునందనుఁ, దప్పు గలుగఁ జూచి నీవు దండనమునకున్**
**దెప్పించినాఁడ వాతని, నొప్పింపుము మాకు వలయు నుత్తమచరితా!' 1426**

**ప్రతి :** ఉత్తమచరితా!= శ్రేష్ఠమయిన నడవడి గల యమధర్మరాజా!; చెప్పెదన్= చెపుతున్నాను విను; మా గురునందనున్= మా గురువుగారి కుమారుని; తప్పు+కలుగన్+చూచి= దోషం కలుగగా గమనించి; నీవు; దండనమునకున్= శిక్షించడానికి; తెప్పించినాఁడవు= నీ దగ్గరకు తెప్పించుకున్నావు; మాకున్ వలయున్= అతడు మాకు కావాలి; ఆతనిన్= అతణ్ణి, ఆ బ్రాహ్మణబాలుణ్ణి; ఒప్పింపుము= మాకు ఒప్పగించు.

**తా :** మంచినడవడిగల యమధర్మరాజా! చెపుతాను. విను; మా గురుపుత్రునిలో ఏ తప్పు ఉండడంతో దండించడానికై అతణ్ణి తెప్పించుకున్నావు? ఆ బాలుణ్ణి ఇప్పుడు మాకు అప్పగించు. మాకు అతడు కావాలి.

**క. అనిన విని 'వీఁడె వీనిం, గొని పొం'డని భక్తితోడ గురునందను ని**
**చ్చినఁ గృష్ణుఁడు వీడ్కొనియెను, ఘనదుర్జనదమను మహిషగమనున్ శమనున్. 1427**

**ప్రతి :** అనినన్= అని శ్రీకృష్ణుడు పలుకగా; విని= విన్నవాడై; వీఁడు+ఎ= ఇతడే మీ గురుపుత్రుడు; వీనిన్= ఇతణ్ణి; కొనిపొండు= తీసుకొని వెళ్ళండి; అని= అంటూ; భక్తితోడన్= భక్తిభావంతో; గురునందనున్= గురుడగు సాందీపని కుమారుణ్ణి; ఇచ్చినన్= ఇవ్వగా; కృష్ణుఁడు= శ్రీకృష్ణుడు; ఘనదుర్జనదమనున్= మిక్కిలి చెడు మనుషులను దండించేవాడూ, మహిషగమనున్= దున్నపోతుమీద సంచరించేవాడూ అయిన; శమనున్= యముణ్ణి; వీడ్కొనియెను= వదలి వెళ్లాడు.

**తా :** శ్రీకృష్ణుని మాటలువిని యమధర్మరాజు 'ఇడుగో! వీడే! వీణ్ణి తీసుకపొండి' అని భక్తితో గురుపుత్రుణ్ణి ఇచ్చేశాడు. దుర్మార్గులను అణచి వేసేవాడూ, దున్నపై స్వారి చేసేవాడూ, అయిన యముణ్ణి వీడ్కొని శ్రీకృష్ణుడు గురుకుమారుణ్ణి తోడ్కొని బయలుదేరి వెళ్లాడు.

**వ. ఇట్లు జము నడిగి తెచ్చి రామకృష్ణులు సాందీపనికిం బుత్త్రుని సమర్పించి 'యింక నేమి సేయవలయు? నానతిం' దనిన నతం డిట్లనియె. 1428**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; రామకృష్ణులు= బలరాముడు, శ్రీకృష్ణుడు; జమున్= యముణ్ణి; అడిగి తెచ్చి= కోరి తీసుకొనివచ్చి; సాందీపనికిన్= గురువైన సాందీపులవారికి; పుత్త్రునిన్= ఆయన కుమారుణ్ణి; సమర్పించి= గురుదక్షిణగా ఇచ్చి; ఇంకన్= మరియూ; ఏమి+చేయన్+వలయున్= మేమేమి సల్పవలె?; ఆనతి+ఇందు= సెలవియ్యండి; అనినన్= అని పలుకగా; అతండు= ఆ సాందీపని; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** ఈ విధంగా యముని వద్దనుంచి పుత్రుణ్ణి తెచ్చి, గురుడైన సాందీపని కిచ్చి, రామకృష్ణులు 'ఇంకా ఏమి చెయ్యవలెనో సెలవియ్యండి' అని అడిగారు. అపుడు సాందీపని వారితో ఇలా అన్నాడు.

**క. 'గురునకుఁ గోరిన దక్షిణఁ, గరుణన్ ము న్నెవ్వఁ డిచ్చె? ఘనులార! భవ**
**ద్గురునకుఁ గోరిన దక్షిణఁ, దిరముగ నిచ్చితిరి మీరు దీపితయశులై. 1429**

**ప్రతి :** ఘనులార= గొప్ప శిష్యులారా!; గురునకున్= ఆచార్యునికి; కోరిన దక్షిణన్= కోరుకొన్న దక్షిణను; మున్ను= పూర్వం; ఎవ్వఁడు+ఇచ్చెన్= ఎవడిచ్చాడు?; (ఎవ్వడూ ఇవ్వలేదని భావం); మీరు= అన్నదమ్ములైన మీరు; దీపిత యశులు+ఐ= ప్రకాశించే కీర్తిగలవారై; భవద్గురునకున్= మీ ఆచార్యుడనైననాకు; కోరిన దక్షిణన్= అర్థించిన దక్షిణను; తిరము+కన్= శాశ్వతంగా; ఇచ్చితిరి= ఇచ్చారు.

**తా :** గొప్పశిష్యులారా! గురువుకు కోరిన దక్షిణ తెచ్చి ఇచ్చారు. మీ కీర్తి దిగంతాలలో ప్రకాశింపజేశారు. ఇంతవరకు ఎవడైనా తన గురువుకు అడిగిన ఇలాంటి దక్షిణను దయతో ఈ విధంగా ఇచ్చిన వాడున్నాడా?

**క. కాలునివీటికిఁ జని మృత, బాలకుఁ దే నొరుల వశమె? భవదీయ కృపన్**
**మేలు దొరకొనియె మాకు; వి, శాల మగుంగాత మీ యశము లోకములన్. 1430**

**ప్రతి :** కాలుని వీటికిన్= యముని పట్నానికి; చని= వెళ్ళి; మృత బాలకున్= మరణించిన బాలుణ్ణి; తేన్= తీసుకొని రావడం; ఒరులవశము+ఎ= ఇతరులకు శక్యమా? (కాదని భావం.) భవదీయ కృపన్= మీ కరుణతో; మాకున్= మాకు; మేలు దొరకొనియెన్= మంచి లభించింది; లోకములన్= లోకాలలో; మీ యశము= మీ కీర్తి; విశాలము+అగున్+గాత= విస్తరిల్లుగాక!

**తా :** యమపురానికి వెళ్ళి, చచ్చిన పిల్లవాణ్ణి తెచ్చి ఇవ్వడం, ఇతరులకు సాధ్యమా? ఎంతో శ్రద్ధాభక్తులతో మీరు మాకు మేలు కల్గించారు. మీ కీర్తి లోకాలలో విస్తరిల్లు గాక!

**వ. మహాత్ములారా! 'యేను గృతార్థుండ నైతి' నని దీవించిన సాందీపని వీడ్కొని కృతకృత్యులై రామకృష్ణులు రథారోహణంబు చేసి, మథురకుం జనుదెంచి పాంచజన్యంబు పూరించినఁ గని నష్టధనంబులు గనినవారి భంగిం బ్రజలు ప్రమోదించి; రంత నొక్క నాఁ డేకాంతంబున. 1431**

**ప్రతి :** మహాత్ములారా!= గొప్పహృదయంగల రామకృష్ణులారా!; ఏను= నేను; కృత+అర్థుండన్+ఐతిన్= నెరవేరిన ప్రయోజనం గలవాడినైనాను; అని దీవించినన్= అంటూ ఆశీర్వదించగా; రామకృష్ణులు= బలరాముడూ, శ్రీకృష్ణుడూ; సాందీపనిన్ వీడ్కొని= సాందీపులవారి దగ్గర సెలవు పుచ్చుకొని; కృతకృత్యులు+ఐ= కృతార్థులై (సకల విద్యలు గ్రహించినవారై అనుట); రథ+ఆరోహణంబు చేసి= రథం ఎక్కి; మథురకున్= మథురానగరానికి; చనుదెంచి= వచ్చి; పాంచజన్యంబు పూరించినన్= పాంచజన్యమనే శంఖాన్ని శ్రీకృష్ణుడు ఊదగా; కని= దర్శించి; నష్టధనంబులు= పోయిన ధనాలు; కనినవారి భంగిన్= మరల పొందినవారి వలె; ప్రజలు= జనులు; ప్రమోదించిరి= ఆనందించారు; అంతన్= అటు తరువాత; ఒక్కనాఁడు= ఒకరోజు; ఏకాంతంబునన్= ఒంటరిగా ఉండి శ్రీకృష్ణుడు...

**తా :** ఓ పుణ్యాత్ములారా! నేను ధన్యుణ్ణి అయినాను అని సాందీపని వారిని దీవించాడు. గురువు దగ్గర సెలవు తీసుకొని కృతార్థులై రామకృష్ణులు తేరెక్కి మథురానగరానికి వెళ్ళి శంఖాన్ని పూరించారు. అపుడు ప్రజలు తాము పోగొట్టుకొన్న ధనాన్ని తిరిగిపొందినట్లుగా చందాన సంతోషించారు.

## ❖ శ్రీకృష్ణుఁడు గోపకాంతల చెంతకు నుద్ధవునిఁ బంపుట ❖

శా. నాపైఁ జిత్తము లెప్పుడున్ నిలుపుచున్ నా రాకc గాంక్షించుచున్
నాపే రాత్మల నావహించుచు వగన్ నానాప్రకారంబులన్
గోపాలాంగన లెంత జాలిపడిరో? కోపించిరో? దూఱిరో?
వ్రేపల్లెన్ నిజనర్మ గేహములలో విభ్రాంతచైతన్యలై. **1432**

**ప్రతి :** నా పైన్= నా మీద; చిత్తములు= మనస్సులు; ఎప్పుడున్= ఎల్లవేళల్లో; నిలుపుచున్= ఉంచుతూ, లగ్నంచేస్తూ; నా రాకన్= నేను రావడం; కాంక్షించుచున్= కోరుతూ; నా పేరు= నా నామం; ఆత్మలన్= మనసులందు; ఆవహించుచున్= నిలుపుతూ; వగన్= చింతతో; నానాప్రకారంబులన్= అనేకవిధాల; గోపాల+అంగనలు= గోపికలు; వ్రేపల్లెన్= వ్రేపల్లెలో; నిజ= తమయొక్క; నర్మగేహములలోన్= రహస్యమందిరాలలో; విభ్రాంత చైతన్యలు+ఐ= కలతచెందిన మనసులు గలవారై; ఎంత జాలిపడిరో= ఎంత దైన్యం చెందినారో; కోపించిరో= ఎంతగా నాపై కినుక వహించారో; దూఱిరో= ఎంతగా నన్ను నిందించారోగదా!

**తా :** ఒకనాడు శ్రీకృష్ణుడు ఏకాంతంగా ఇలా తలపోశాడు. వ్రేపల్లెలోని గొల్లమగువలు నా మీదనే మనసు లగ్నంచేస్తారు. నా ఆగమనాన్ని ఎదురుచూస్తారు. నా పేరు ఆత్మలో ధ్యానిస్తారు. ప్రణయ పారవశ్యంతో తమ రహస్య గృహాలలో అనేక విధాలుగా వగ చెందుతుంటారు. పాపం! వారెంత దైన్యం పాలవుతున్నారో! నాపై ఎంత కినుక వహించారో! నన్నెంతగా దూషించుతున్నారో!

వ. అని చింతించి. **1433**

**ప్రతి :** అని చింతించి= అంటూ విచారం చెంది...

క. సిద్ధవిచారు గభీరున్, వృద్ధవచోవర్ణనీయు వృష్ణిప్రవరున్
బుద్ధినిధి నమరగురుసము, నుద్ధవునిం జూచి కృష్ణుఁ డొయ్యన పలికెన్. **1434**

**ప్రతి :** సిద్ధవిచారున్= ఫలించే ఆలోచన కలవాడును; గభీరున్= లోతైనవాడును; వృద్ధవచస్+వర్ణనీయున్= పెద్దల పలుకులచేత మెచ్చదగినవాడును; బుద్ధినిధిన్= ప్రజ్ఞకు నిలయమైనవాడును; అమర గురుసమున్= దేవతలకు గురువైన బృహస్పతికి సమానుడును; వృష్ణిప్రవరున్= వృష్ణివంశంలో శ్రేష్ఠుడును, అయిన; ఉద్ధవునిన్+చూచి= ఉద్ధవుణ్ణి కనుగొని; కృష్ణుఁడు= శ్రీకృష్ణుడు; ఒయ్యన= తిన్నగా; పలికెన్= మాటలాడాడు.

**తా :** నిశ్చితమైనభావాలు కలవాడూ, గంభీరుడూ, పెద్దలు మెచ్చదగినవాడూ, వృష్ణివంశస్థులలో ఉత్తముడూ, బుద్ధికి గనివంటివాడూ, దేవతాగురువైనబృహస్పతితో సమానుడూ అయిన ఉద్ధవుణ్ణి పిలిపించి, అతనితో శ్రీకృష్ణుడు మెల్లగా ఇట్లన్నాడు.

శా. రమ్మా యుద్ధవ! గోపకామినులు నా రాకల్ నిరీక్షించుచున్
సమ్మోహంబున నన్నియున్ మఱచి యే చందంబునం గుందిరో
తమ్మున్ నమ్మినవారి డిగ్గ విడువన్ ధర్మంబు గాదంద్రు; వే
పొమ్మా! ప్రాణము లే క్రియన్ నిలిపిరో ప్రోద్యద్వియోగాగ్నులన్. **1435**

**ప్రతి :** ఉద్ధవ= ఓ ఉద్ధవుడా!; రమ్ము+ఆ= ఇటురమ్ము; గోపకామినులు= గోపికలు; నారాకల్= నేను రావడాలు; నిరీక్షించుచున్= ఎదురుచూస్తూ; సమ్మోహంబునన్= మిక్కిలి వ్యామోహంతో; అన్నియున్ మఱచి= సమస్తం విస్మరించి; ఏ చందంబునన్= ఏ విధంగా; కుందిరి+ఓ= చింతించారో!; తమ్మున్= తమను; నమ్మినవారిన్= విశ్వసించినవాళ్ళను; డిగ్గవిడువన్= వదలివేయడం; ధర్మంబు కాదు+అండ్రు= న్యాయంకాదని పెద్దలంటారు; ప్ర+ఉద్యత్+వియోగ+అగ్నులన్= ఏర్పడిన యెడబాటు అనే అగ్నులచేత; ప్రాణముల్= అసువులు; ఏ క్రియన్= ఏ రీతిగా; నిలిపిరి+ఓ= నిల్పినారో (విచారించడానికి) వే పొమ్ము= శీఘ్రంగా వ్రేపల్లెకు వెళ్ళు.

**తా :** ఉద్ధవా! ఇలారా! ప్రణయమూర్తులైన గోపికలు నా రాకను ఎదురు చూస్తూ, నా మీది వ్యామోహంతో అన్నీ మరచిపోయి ఎంతగా దుఃఖిస్తున్నారో! నమ్ముకున్న తమ్ము విడవడం ధర్మం కాదని వారంటూ ఉండేవారు. వేగంగా వెళ్ళు. పెచ్చరిల్లుతున్న వియోగమనే అగ్నిజ్వాలలతో వారెలా ప్రాణాలు ధరించి ఉన్నారో!

**క. లౌకిక మొల్లక న న్నా, లోకించు ప్రపన్నులకును లోఁబడి కరుణా**
**లోకనములఁ బోషింతును, నా కాశ్రితరక్షణములు నైసర్గికముల్. 1436**

**ప్రతి :** లౌకికము= లోకాచారం, లోకధర్మం; ఒల్లక= అంగీకరించక, ఇష్టపడక; నన్నున్= పరమాత్ముడనైన నన్నే; ఆలోకించు= దర్శించే; ప్రపన్నులకును= శరణాగతులకు; లోఁబడి= వశుడనై; కరుణా+ఆలోకనములన్= దయతో గూడిన చూపులతో; పోషింతును (పోషించుదను)= కాపాడుతాను; నాకున్= నాకు; ఆశ్రిత రక్షణములు= ఆశ్రయించినవారిని కాపాడుటలు; నైసర్గికముల్= సహజలక్షణాలు.

**తా :** లోకధర్మాలను దిగవిడచి నా యందు చూపునిలిపి నాకు ప్రపత్తి చేసేవారికి నేను లోబడి దయామయ దృష్టులతో వారిని కాపాడుతాను. ఆశ్రయించినవారిని ఆదుకోవడం నాకు స్వభావ సిద్ధమైన గుణం.

**విశే :** ఈ పద్యంలో స్వామికిగల శరణాగతత్రాణపరాయణత్వం ఎలాంటిటో తెల్పబడింది.

**క. 'సందేహము మానుం డర, విందాననలార! మిమ్ము విడువను వత్తున్**
**బృందావనమున' కని హరి, సందేశము పంపె ననుము సంకేతములన్. 1437**

**ప్రతి :** అరవింద+ఆననలార= పద్మాలవంటి ముఖాలుగల గోపికలారా!; సందేహము మానుండు= కృష్ణుడు మనల్ని వదలివేశాడేమో అనే సంశయం వదలండి; మిమ్మున్= మిమ్మల్ని; విడువను= వదలను; బృందావనమునకున్ = బృందావనానికి; వత్తున్ (వచ్చుదును)= వస్తాను; అని= అంటూ; హరి= శ్రీకృష్ణుడు; సంకేతములన్= ఒడబాటుతో; సందేశము పంపెన్= సమాచారం పంపినాడు; అనుము= అని చెప్పుము.

**తా :** కమలాలవంటి కన్నులుగల కాంతలారా! సంశయం మానండి. మిమ్ము విడిచిపెట్టను. బృందావనానికి వస్తాను–అని శ్రీకృష్ణుడు వార్త పంపినాడని నీవు రహస్యంగా గోపికలకు చెప్పు.

**వ. అని మందహాససుందరవదనారవిందుండై కరంబు కరంబున నవలంబించి, సరసవచనంబు లాడుచు వీడుకొలిపిన నుద్ధవుండును రథారూఢుండై సూర్యాస్తమయసమయంబునకు నందవ్రజంబుసేరి వనంబులనుండి వచ్చు గోవుల చరణరేణువులం బ్రచ్ఛన్నరథుండై చొచ్చి నందుమందిరంబు ప్రవేశించిన. 1438**

**ప్రతి :** అని= అంటూ; మందహాస= చిరునవ్వుతో; సుందర= అందమైన; వదన+అరవిందుండు+ఐ= పద్మంవంటి ముఖం గలవాడై; కరంబు= ఉద్ధవునియొక్కహస్తం; కరంబునన్= తనచేతితో; అవలంబించి= పట్టుకొని; సరసవచనంబులు+ఆడుచున్= రసవంతములైన పలుకులు పలుకుతూ; వీడుకొలిపినన్= పోయిరమ్మని సాగనంపగా; ఉద్ధవుండును= ఉద్ధవుడు; రథ+ ఆరూఢుండు+ఐ= రథాన్ని ఎక్కినవాడై; సూర్య+అస్తమయ= పొద్దుగుంకు; సమయంబునకున్= వేళకు; నందవ్రజంబు+చేరి= నందుని మందపట్టుకు వచ్చి; వనంబులనుండి= అరణ్యాలనుంచి; వచ్చు= ఏతెంచునట్టి; గోవుల= ఆవులయొక్క; చరణరేణువులన్= కాలిదుమ్ములచేత; ప్రచ్ఛన్నరథుండు+ఐ= కప్పబడిన రథంగలవాడై; చొచ్చి= చొచ్చి; నందుమందిరంబు= నందమహారాజుయొక్క భవనాన్ని; ప్రవేశించినన్= చేరగా...

**తా :** అని చిరునవ్వుతో అందమైన కమలంవంటి మోముగల గోవిందుడు ఉద్ధవునిచేతిని తన చేతితో పట్టుకొని, రసవంతాలైన మాటలు మాట్లాడుతూ సాగనంపాడు. ఉద్ధవుడు ఆ రథాన్నెక్కి రవి అస్తమించే వేళకు వ్రేపల్లెకు చేరాడు. అడవులలో మేతమేసి వచ్చే ఆలమందల పాదధూళులు అతని రథాన్ని కప్పివేస్తుండగా చొచ్చి, ఉద్ధవుడు గోకులం చేరి నందుని మందిరంలో ప్రవేశించాడు.

**శా. ఆ పుణ్యాత్ముని́ఁ గౌఁగిలించుకొని నందాభీరుఁ డానందియై**
**'మా పాలింటికిఁ గృష్ణుఁ డీతఁ' డనుచున్ మన్నించి పూజించి వాం**
**ఛా పూర్ణంబుగ మంజులాన్న మిడి మార్గాయాసముం బాపి స**
**ల్లాపోత్సాహముతోడ నిట్లనియె సంలక్షించి మోదంబునన్. 1439**

**ప్రతి :** నంద+ఆభీరుఁడు= నందుడనే ఆ గొల్లప్రభువు; ఆనంది+ఐ= సంతోషించినవాడై; ఆ పుణ్య+ఆత్మునిన్= పవిత్రమైన మనస్సుగల ఆ ఉద్ధవుణ్ణి; కౌఁగిలించుకొని= ఆలింగనం చేసుకుని; మా పాలింటికిన్= మాకు; ఈతఁడు= ఈయన; కృష్ణుఁడు= శ్రీకృష్ణుడే; అనుచున్= అని పలుకుతూ; మన్నించి= ఆదరించి; పూజించి= అర్చించి; వాంఛాపూర్ణంబు+కన్= కోరిక పూర్తిగా తీరేటట్లు; మంజుల+అన్నము= కమ్మని భోజనం; ఇడి= పెట్టి; మార్గ+ఆయాసమున్= దారి బడలికను; పాపి= తొలగించి; సల్లాప+ఉత్సాహముతోడన్= ముచ్చటలాడటంలోని ఉబలాటంతో; సంలక్షించి= చక్కగా చూచి; మోదంబునన్= సంతోషంతో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికాడు.

**తా :** నందుడు ఆనందంతో ఆ పుణ్యాత్ముణ్ణి ఆలింగనం చేసుకున్నాడు. ఇతడు మా పాలిటికి గోపాలకృష్ణుడంటూ సాదరంగా పూజించాడు. కోరిక తీరేటట్లు కమ్మనిభోజనం పెట్టాడు. ప్రయాణంవల్ల కలిగినశ్రమ పోగొట్టాడు. అతణ్ణి చూచి ముచ్చటించ గోరి ఎంతో సంతోషంతో ఇట్లన్నాడు.

**క. నా మిత్రుఁడు వసుదేవుఁడు, సేమంబున నున్నవాఁడె? చెలువుగఁ బుత్త్రుల్**
**నేమంబున సేవింప మ, హామత్తుండైన కంసుఁ డడఁగిన పిదపన్. 1440**

**ప్రతి :** మహామత్తుండు+ఐన= మిక్కిలి మదించినవాడైన; కంసుఁడు= కంసుడు; అడఁగిన పిదపన్= నశించిన తరువాత; నా మిత్రుఁడు వసుదేవుఁడు= నా చెలికాడైన వసుదేవుడు; చెలువుగన్= బాగుగా; పుత్త్రుల్= కుమారులు; నేమంబునన్= నియమంతో; సేవింపన్= కొలుస్తుండగా; సేమంబునన్= క్షేమంతో; ఉన్నవాఁడు+ఎ= ఉన్నాడా?

**తా :** ఉద్ధవా! నా చెలికాడు వసుదేవునికి క్షేమమే కదా! గర్వాంధుడైన కంసుడు మరణించిన తరువాత తన కుమారుల సేవలు అందుకుంటూ సుఖంగా ఉన్నాడు గదా!

శా. అన్నా! భద్రమె? తల్లిదండ్రుల మమున్ హర్షించి చింతించునే?
తన్నుం బాసిన గోపగోపికల మిత్రవ్రాతమున్ గోగణం
బు న్నిత్యంబుఁ దలంచునే? వననదీభూముల్ ప్రసంగించునే?
వెన్నుం డెన్నఁడు వచ్చునయ్య! యిట మాౖవ్రేపల్లెకు న్నుద్ధవా! 1441

**ప్రతి :** అన్నా!= నాయనా!; భద్రము+ఎ= మీకు కుశలమా?; వెన్నుండు= విష్ణుమూర్తి (కృష్ణుడు); తల్లిదండ్రులన్ (తల్లి+తండ్రి+లన్) మమున్= జననీజనకులమైన మమ్ము; హర్షించి= సంతోషించి; చింతించునే= తలుస్తాడా?; తన్నున్= తనను; పాసిన= వీడిన; గోప= గోపాలురను; గోపికలన్= గోపికల్ని; మిత్రవ్రాతమున్= స్నేహితుల సముదాయాన్ని; గోగణంబున్= ఆవులమందనూ; నిత్యంబున్= ఎల్లప్పుడూ; తలంచునే?= అనుకుంటాడా?; వన నదీ భూముల్= ఇక్కడి అడవులు, ఏళ్ళు, పొలాల గురించి; ప్రసంగించునే= మాట్లాడుతాడా?; ఇట= ఇక్కడ ఉన్న; మా వ్రేపల్లెకున్= మా గొల్లపల్లెకు; ఎన్నఁడు వచ్చున్+అయ్య= ఎప్పుడు వస్తాడయ్యా!

**తా :** అన్నా! ఉద్ధవా! అక్కడ అందరికీ కుశలమేనా? శ్రీకృష్ణుడు తలిదండ్రులమైన మమ్ము సంతోషంతో తలచుకొంటూ ఉంటాడా? తనకు దూరమైన గోపకులనూ, గోపికలనూ, చెలికాండ్రనూ, ఆలమందలనూ, ఎల్లప్పుడూ స్మరిస్తాడా? ఇక్కడి వనాలనూ, నదులనూ, పొలాలనూ గూర్చి ముచ్చటిస్తుంటాడా? ఇక్కడి మా వ్రేపల్లెకు కృష్ణుడు ఎప్పుడు వస్తాడయ్యా!

క. అంకిలి కలుగక మా కక, లంకేందుని పగిదిఁ గాంతిలసితంబగు త
త్పంకజనయనుని నెమ్మొగ, మింక విలోకింపఁ గలనె యీ జన్మమునన్? 1442

**ప్రతి :** మాకున్= వ్రేపల్లె నివాసులమైన మాకు; అంకిలి= అడ్డు; కలుగక= లేకుండా; అకలంక+ఇందుని పగిదిన్= కళంకంలేని చంద్రుని మాదిరి; కాంతిలసితంబు+అగు= కాంతితో ప్రకాశిస్తున్న (ఒప్పుతున్న); తత్+పంకజనయనుని= ఆ పద్మనేత్రునియొక్క; నెమ్మొగము (నెఱ+మొగము)= నిండు మోము; ఇంకన్= ఇటుపై; ఈ జన్మమునన్= ఈ పుట్టువులో; విలోకింపన్+కలన్+ఎ= చూడగల్గుతానా?

**తా :** మచ్చలేనిచంద్రుని వలె అందాలు చిందుతూ కాంతులు వెదజల్లే ఆ కమలాక్షునిముద్దులముఖం అడ్డులేకుండా స్వేచ్ఛగా ఆలోకించే అదృష్టం ఈ జన్మలో నాకు లభిస్తుందా?

క. అని హరి ము న్నొనరించిన, పను లెల్లను జెప్పి చెప్పి బాష్పాకుల లో
చనుఁడై డగ్గుత్తికతో, వినయంబున నుండె గోపవీరుం డంతన్. 1443

**ప్రతి :** అని= అంటూ; గోపవీరుండు= గొల్లలనాయకుడగు నందుడు; హరి= శ్రీకృష్ణుడు; మున్ను= ఇంతకు మునుపు; ఒనరించిన= చేసిన; పనులు+ఎల్లను= కార్యాలన్నిటిని; చెప్పి చెప్పి= పలుమారు తెలిపి; బాష్ప+ఆకుల లోచనుఁడు+ఐ= కన్నీటిచేత కలత చెందిన కన్నులుగలవాడై, డగ్గుత్తికతోన్= దుఃఖం వల్ల బొంగురుపోయిన గొంతుతో; అంతన్= అప్పుడు; వినయంబునన్+ఉండెన్= అణకువతో ఉన్నాడు.

**తా :** ఈ విధంగా గోపాలవరేణ్యుడైన నందుడు శ్రీకృష్ణుడు మునుపు చేసిన కృత్యాలన్నింటినీ పలుమారు చెప్పి, బొంగురు పోయిన కంఠంతో మాట్లాడలేక కన్నీటితో కలకబారిన కన్నులు గలవాడై మిన్నకున్నాడు.

క. పెనిమిటి బిడ్డనిగుణములు, వినుతింప యశోద ప్రేమవిహ్వలమతియై
చనుమొనలఁ బాలు గురియఁగ, గనుఁగొనలను జలము లొలుకఁగా బెగ్గిలియెన్. 1444

**ప్రతి :** పెనిమిటి= తనభర్తయైన నందుడు; బిడ్డని గుణములు= కుమారుడైన శ్రీకృష్ణునిగుణాలను; వినుతింపన్= కొనియాడగా; యశోద= యశోదాదేవి; ప్రేమవిహ్వలమతి+ఐ= కృష్ణునిపైనున్న వాత్సల్యంచేత పరవశమైన మనసుగలదై; చనుమొనలన్= కుచాగ్రములనుండి; పాలు= క్షీరం; కురియన్+కన్= స్రవించగా; కనుఁగొనలను= కనుగొలకులనుంచి; జలములు+ ఒలుకన్+కాన్= బాష్పాలు జారగా; బెగ్గిలియెన్= చింతించింది.

**తా :** ఈ విధంగా తన భర్త గోపాలకృష్ణునిగుణాలు ఉగ్గడిస్తుండగా యశోద ప్రేమతో పరవశించిన మనసుగలదై, చనుమొనలనుంచి పాలుజాలువారగా, కనుగొనలనుంచి కన్నీటిధారలు కారగా చలించిపోయింది.

వ. ఇట్లు గోవిందసందర్శనాభావవిహ్వలులైన యశోదానందులకు నుద్ధవుం డిట్లనియె. 1445

**ప్రతి :** ఇట్లు= ఈ ప్రకారం; గోవింద సందర్శన+అభావ విహ్వలులు+ఐన= శ్రీకృష్ణుని చూడటం లేనందున కలతచెందినవారైన; యశోదానందులకున్= యశోదకు, నందునికి; ఉద్ధవుండు= ఉద్ధవుడు; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** ఈ విధంగా శ్రీకృష్ణసందర్శనం లేకపోవడంతో కలతచెందిన యశోదానందులతో ఉద్ధవు డిట్లన్నాడు.

క. జననీజనకుల మిమ్ముం, గనుఁగొన శీఘ్రంబె వచ్చుఁ గని భద్రంబుల్
వనజాక్షుం డొనరించును, మనమున వగవకుఁడు ధైర్యమండనులారా! 1446

**ప్రతి :** ధైర్యమండనులు+ఆర= ధైర్యమే భూషణంగా గల యశోదానందులారా!; జననీజనకులన్ మిమ్మున్= తలిదండ్రులైన మిమ్మల్ని; కనుఁగొనన్= చూడటానికి; వనజాక్షుండు= తామర రేకులవంటి నేత్రాలుగల శ్రీకృష్ణుడు; శీఘ్రంబు+ఎ= త్వరగానే; వచ్చున్= వస్తాడు; కని= మిమ్ము చూచి; భద్రంబుల్= మంగళాలు; ఒనరించును= కలుగజేస్తాడు; మనమునన్= మనస్సులో; వగవకుఁడు= చింతించకండి.

**తా :** తలిదండ్రులైన మిమ్ము దర్శించడానికి కమలాక్షుడు త్వరలోనే వస్తాడు. మీరు ధైర్యంగా ఉండండి. మిమ్ము చూచి మీకు శుభాలు చేకూరుస్తాడు, చింతించకండి.

మ. బలుఁడుం గృష్ణుఁడు మర్త్యులే? వసుమతీభారంబు వారింప వా
రల రూపంబులఁ బుట్టినాఁడు హరి నిర్వాణప్రభుం; డెవ్వఁ డు
జ్జ్వలుఁడై ప్రాణవియోగకాలమునఁ దత్సర్వేశుఁ జింతించు వాఁ
డలఘుశ్రేయముఁ బొందు బ్రహ్మమయుఁడై యర్కాభుఁడై నిత్యుఁడై. 1447

**ప్రతి :** బలుఁడున్= బలరాముడూ; కృష్ణుఁడున్= శ్రీకృష్ణుడూ; మర్త్యులు+ఏ= మానవులా? (కారనిభావం); వసుమతీభారంబున్= భూమి బరువును; వారింపన్= తొలగించడానికి; వారల రూపంబులన్= వారియొక్క ఆకారాలతో; నిర్వాణప్రభుండు= మోక్షానికి అధిపతి అయిన; హరి= శ్రీమన్నారాయణుడు; పుట్టినాఁడు= జన్మించాడు; ఎవ్వఁడు= ఏ నరుడు; ఉజ్జ్వలుఁడు+ఐ= ప్రకాశమానుడై; ప్రాణవియోగకాలమునన్= ప్రాణం పోయే సమయంలో; తత్+సర్వ+ఈశున్= సమస్తానికి

ప్రభువైన ఆ భగవంతుణ్ణి; చింతించున్= స్మరిస్తాడో; వాఁడు= అతడు; బ్రహ్మమయుఁడు+ఐ= పరబ్రహ్మస్వరూపుడై; అర్క+ఆభుఁడు+ఐ= సూర్యునితో సమానుడై; నిత్యుఁడు+ఐ= శాశ్వతుడై; అలఘుశ్రేయమున్= గొప్పమేలును అనగా ముక్తిని; పొందున్= పొందుతాడు.

**తా :** రామకృష్ణులు సామాన్యమానవులా? మోక్షానికి అధినేత అయిన శ్రీమహావిష్ణువు భూభారాన్ని తొలగించడానికి రామకృష్ణుల రూపాలలో భూమిమీద అవతరించాడు. ఏ మానవుడు జ్ఞానవంతుడై ప్రాణప్రయాణకాలంలో సర్వానికి ప్రభువైన ఆ భగవంతుణ్ణి సంస్మరిస్తాడో అట్టివాడు బ్రహ్మ స్వరూపుడై సూర్యునివలె తేజోవిరాజితుడై నిత్యత్వంపొంది ముక్తి రూపమైన శ్రేయస్సును చూరగొంటాడు.

**సీ. అట్టి నారాయణుం డఖిలాత్మభూతుండు కారణమానవాకారుఁ డైనఁ**
**జిత్తంబు లతనిపైఁ జేర్చి సేవించితి రతికృతార్థుల రైతి; రనవరతము**
**శోభిల్లు నింధనజ్యోతిచందంబున నఖిలభూతములందు నతఁ; డతనికి**
**జననీజనకదారసఖిపుత్త్రబాంధవశత్రు ప్రియాప్రియజనులు లేరు;**

**ఆ. జన్మకర్మములును జన్మంబులును లేవు;, శిష్టరక్షణంబు సేయుకొఱకు**
**గుణవిరహితుఁ డయ్యు గుణి యయి సర్వ ర, క్షణవినాశకేళి సలుపుచుండు. 1448**

**ప్రతి :** అట్టి నారాయణుండు= అలాంటి శ్రీమహావిష్ణువు; అఖిల+ఆత్మభూతుండు= అన్ని ప్రాణుల్లో ఆత్మగా ఉన్నవాడు; కారణమానవ+ఆకారుఁడు= కారణవశాన మనుజరూపం ధరించినవాడు; ఐనన్= కాగా; చిత్తంబులు= మనస్సులు; అతనిపైన్= ఆ పరమపురుషుని మీద; చేర్చి= ఉంచి; సేవించితిరి= మీరు కొలిచారు; అతికృత+అర్థులరు+ఐతిరి= మిక్కిలి కృతకృత్యులు అయినారు; అతఁడు= ఆ నారాయణుడు; అనవరతము= ఎల్లప్పుడు; ఇంధనజ్యోతి చందంబునన్= కట్టెలలో అగ్నివలె; నిఖిలభూతముల+అందున్= సమస్తప్రాణులలో; శోభిల్లున్= ప్రకాశిస్తాడు; అతనికిన్= ఆ భగవంతుడికి; జననీ= తల్లి; జనక= తండ్రి; దార= భార్య; సఖి= స్నేహితుడు; పుత్త్ర= కుమారుడు; బాంధవ= చుట్టం; శత్రు= విరోధి; ప్రియ= ఇష్టులు; అప్రియజనులు= ఇష్టులుకాని మనుషులు; లేరు= ఉండరు; జన్మకర్మములును= పుట్టడానికి కారణభూతములైన ఆగామిసంచిత ప్రారబ్ధ కర్మలు; జన్మంబులును= పుట్టువులును; లేవు; (కాని) శిష్టరక్షణంబు+ చేయుకొఱకున్= సాధువుల్ని సంరక్షించడానికి; గుణవిరహితుఁడు+అయ్యున్= సత్త్వరజస్తమో గుణాలు లేనివా డయినప్పటికినీ; గుణి+అయి= జ్ఞానబలైశ్వర్య వీర్యశక్తి తేజస్సులనే షాడ్గుణ్య సంపత్తిగలవాడై; సర్వరక్షణ= సమస్తాన్ని కాపాడటం; వినాశ= నశింపజేయడం అనే; కేళిన్= క్రీడను; సలుపుచున్+ఉండున్= చేస్తూ ఉంటాడు.

**తా :** అట్టినారాయణుడు అన్ని ప్రాణులందునూ ఆత్మగా ఉన్నాడు. కారణవశంగా మనుష్యరూపం గైకొన్న ఆయనపై మీరు మనసులు చేర్చి కొలిచారు. మీరు పరమధన్యాత్ములు. కట్టెలలో నిప్పున్నట్లు అత డెప్పుడూ సకలప్రాణుల్లోనూ ప్రకాశిస్తుంటాడు. ఆయనకు తల్లి, తండ్రి, భార్య, స్నేహితుడు, చుట్టం, విరోధి, ఇష్టుడు, అనిష్టుడు అంటూ ఎవ్వరూలేరు. జననమరణాలు లేవు. సజ్జనుల్ని సంరక్షించడానికై త్రిగుణరహితుడైనా గుణాలు గైకొని, సృష్టిస్థితిలయాలు అనే లీలలు సాగిస్తుంటాడు.

**వ. అని మఱియుఁ బెక్కువిధంబుల హరిప్రభావము లుపన్యసించుచు నా రేయి గడపి మఱునాఁడు దధిమథనశబ్దంబు లాకర్ణించుచు లేచి కృతానుష్ఠానుండై యుద్ధవుం డొక్క రహస్యప్రదేశంబున నున్న సమయంబున. 1449**

**ప్రతి :** అని= అంటూ; మఱియున్= ఇంకా; పెక్కువిధంబులన్= అనేకరీతులుగా; హరిప్రభావములు= మాధవుని మహిమలు; ఉపన్యసించుచున్= ప్రసంగిస్తూ; ఆ రేయి+కడపి= ఆ రాత్రి వెళ్ళబుచ్చి; మఱునాఁడు= మరుసటిదినం; దధిమథన శబ్దంబులు= పెరుగు చిలికే చప్పుళ్ళు; ఆకర్ణించుచున్= ఆలకిస్తూ; లేచి= నిద్రలేచి; కృత+అనుష్ఠానుండు+ఐ= స్నానసంధ్యాదులు ఆచరించినవాడై; ఒక్క రహస్య ప్రదేశంబునన్= ఒక ఏకాంతస్థలంలో; ఉన్న సమయంబునన్= ఉన్న వేళలో...

**తా :** అని పలువిధాల ఉద్ధవుడు శ్రీకృష్ణుడి మహిమలుగూర్చి ముచ్చటిస్తూ, ఆ రాత్రి గడిపాడు. వేకువనే పెరుగుచిలికే చప్పుళ్లు విని నిద్రలేచాడు. సంధ్యావందనాదినిత్యానుష్ఠానాలు నెరవేర్చుకుని ఒక ఏకాంతస్థలంలో ఉన్న సమయంలో

**శా. 'రాజీవాక్షుఁడు సుందరాస్యుఁడు మహోరస్కుండు పీతాంబరుం**
**డాజానుస్థితబాహుఁ డంబురుహమాలాలంకృతుం డుల్లస**
**ద్రాజ త్కుండలుఁ డొక్క వీరుఁ డిచటన్ రాజిల్లుచున్నాఁడు; మా**
**రాజీవాక్షునిభంగి' నంచుఁ గని రా రాజాన్వయున్ గోపికల్. 1450**

**ప్రతి :** గోపికల్= గొల్లకాంతలు; రాజీవ+అక్షుఁడు= పద్మాలవంటి నేత్రాలు కలవాడునూ; సుందర+ఆస్యుఁడు= అందమైన మోముగలవాడునూ; మహా+ఉరస్కుండు= విశాలమైన వక్షం కలవాడునూ; పీత+అంబరుండు= పచ్చనిపట్టు వస్త్రం కలవాడునూ; ఆజానుస్థితబాహుఁడు= మోకాళ్ళవరకున్న చేతులు గలవాడునూ, (పొడవైన చేతులు గలవాడు); అంబురుహమాలా+ అలంకృతుండు= తామరపూసల దండచేత అలంకృతుడూ; ఉల్లసత్+రాజత్+కుండలుఁడు= ఒప్పిదంగా ప్రకాశించే చెవిపోగులు గలవాడును అయిన; ఒక్కవీరుఁడు= ఒక శూరపురుషుడు; మా రాజీవ+అక్షునిభంగిన్= మా కమలలోచనుడైన శ్రీకృష్ణుని వలె; ఇచటన్= ఇక్కడ; రాజిల్లుచున్+ఉన్నాఁడు= వెలుగుతున్నాడు; అంచున్= అని పలుకుతూ; ఆ రాజ+అన్వయున్= ఆ చంద్రవంశంలో జన్మించిన ఉద్ధవుణ్ణి; కనిరి= దర్శించారు.

**తా :** ఆ సమయంలో గొల్ల చెలువలు అక్కడికి వచ్చారు. వారు పద్మాలవంటి కన్నులుగలవాడు; అందమైన వదనం కలవాడు, విశాలమైన వక్షం కలవాడు, పచ్చనిపట్టువస్త్రం కట్టినవాడు, మోకాళ్ళవరకు వ్రేలాడే చేతులుకలవాడు, కమలమాలా విభూషితుడు, మెరుగారు కుండలాలు ధరించినవాడు అయిన ఒకానొక పురుష పుంగవుడు మా మాధవునివలె ఇక్కడ ప్రకాశిస్తున్నాడు." అని చెప్పుకుంటూ చంద్రవంశ్యుడైన ఉద్ధవుణ్ణి చూచారు.

**వ. కని లజ్జాసహితహాసవిలోకనంబులు ముఖంబులకుం జెలు వొసంగ నిట్లనిరి. 1451**

**ప్రతి :** కని= ఉద్ధవుణ్ణిచూచి; లజ్జాసహిత= సిగ్గుతో కూడుకొన్న; హాసవిలోకనంబులు= చిరునవ్వుగల చూపులు; ముఖంబులకున్= తమ మోములకు; చెలువు= అందం; ఒసంగన్= సమకూర్చగా; ఇట్లు+అనిరి= ఇలా అన్నారు.

**తా :** అలా చూచి సిగ్గుతో కూడిన నవ్వులు, చూపులు తమ వదనాలకు సొంపు సంపాదించగా ఆ గోపకాంతలు ఉద్ధవుడితో ఇలా అన్నారు.

## ❖ భ్రమరగీతలు ❖

**చ. ఎఱుఁగుదు మేము నిన్ను వనజేక్షణ మిత్రుఁడ వీవు; కూరిమిన్**
**మెఱయుచుఁ దల్లిదండ్రులకు మే లెఱిఁగింపఁ బ్రియుండు పంపఁగా**

**వఱలెడు భక్తి వచ్చితివి; వారల నైన మనంబులోపలన్**
**మఱవఁడు శౌరి మేలు; మఱి మాన్యులు రాజున కెవ్వ రిచ్చటన్.** **1452**

**ప్రతి :** ఏము= మేము; నిన్నున్= నిన్ను; ఎఱుఁగుదుము= తెలియుదుము; ఈవు= నీవు; వనజ+ఈక్షణ మిత్రుఁడవు= కమలాలవంటి కన్నులుగల కృష్ణుని చెలికాడివి; కూరిమిన్= ప్రేమను; మెఱయుచున్= ప్రకటింపజేస్తూ; తల్లి+తండ్రులకున్= తన మాతాపితలైన యశోదానందులకు; మేలు+ఎఱిఁగింపన్= క్షేమం తెల్పడానికి; ప్రియుండు= మా మనోహరుడైన శ్రీకృష్ణుడు; పంపన్+కాన్= నిన్ను పంపగా; వఱలెడు భక్తిన్= ఒప్పుతున్న భక్తితో; వచ్చితివి= నీవు ఇక్కడికి వచ్చావు; శౌరి= మాధవుడు; వారలన్+ఐనన్= ఆ జననీజనకులనైనా; మనంబులోపలన్= తన చిత్తంలో; మఱవఁడు= మరచిపోలేదు; మేలు= అదెంతో నయం (దెప్పిపొడుపుమాట); మఱి= ఇక; ఇచ్చటన్= ఇక్కడ; రాజునకున్= వల్లభుడైన శ్రీకృష్ణునికి; మాన్యులు= ఆదరించదగినవారు; ఎవ్వరు= ఎవరున్నారు?

**తా :** అయ్యా! ఉద్ధవా! మేము నిన్ను తెలుసుకొన్నాము. నీవు కమలాలవంటి కన్నులుగల శ్రీకృష్ణుని నెచ్చెలికాడవు. ఆయన తనక్షేమం తలిదండ్రులకు తెలుపగోరి నిన్నిక్కడికి పంపగా నీవు ప్రస్ఫుటమైన భక్తితో వచ్చావు. ప్రియుడైన యదుపతి తన జననీ జనకులనయినా మరచిపోలేదు. అదెంతో నయం! ఈ వ్రేపల్లెలో ఆ రాజావారికి సంభావింపదగినవారు మరెవ్వరున్నారో మాకు తెలియదు.

**విశే :** 'మఱి మాన్యులు రాజున కెవ్వ రిచ్చటన్'– ఆదరింపదగినవారు రాజుకు ఎవ్వరూ ఇక్కడ లేరు. శ్రీకృష్ణునికి బదులుగా రాజుకు అని గోపికలు దెప్పిపొడుస్తున్నారు.

**క.** **మునివరు లైనను బంధుల, ఘనసఖ్యము విడువలేరు గాక విడువరే**
**సనిమిత్తసఖ్య మాఁకటి, పని దీఱిన నళులు విరులఁ బాయునొ లేదో?** **1453**

**ప్రతి :** మునివరులు+ఐనను= మునిశ్రేష్ఠులయినప్పటికీ; బంధుల= చుట్టాలయొక్క; ఘనసఖ్యమున్= గొప్పస్నేహాన్ని; విడువలేరుగాక= వదలలేరుగాని; అనిమిత్తసఖ్యమున్= కారణంలేని సాంగత్యము; విడువరే= వదలకుంటారా?; (వదలివేస్తారనుట); ఆఁకటిపని+తీఱినన్= ఆకలి శాంతించగానే; అళులు= తుమ్మెదలు; విరులన్= పూలను; పాయున్+ఒ లేదు+ఓ= వదలుతాయా లేదా.

**తా :** సర్వసంగ పరిత్యాగులైన మునిసత్తములుగూడా బంధువులతోడి స్నేహానుబంధం వదులు కోలేరు. మరి శ్రీకృష్ణుడు తన తలిదండ్రులకు ప్రియం ఆచరించడంలో వింత ఏముంది? ఇతరులతో చేసే చెలిమి ఒక ప్రయోజనాన్ని బట్టి ఉంటుంది. ఆ ప్రయోజనం తీరగానే ఆ స్నేహబంధం కూడా వదలిపోతుంది. ఆకలి తీరిన పిదప తుమ్మెదలు పూలను విడవడం లేదా? (విడుస్తున్నాయి కదా!)

**చ.** **అని యిటు గోపికల్ పలుక నం దొక గోపిక కృష్ణపాద చిం**
**తనమునఁ జొక్కి చేరువను దైవవశంబునఁ గాంచె నుజ్జ్వల**
**త్సునిశితసద్వివేకముఁ బ్రసూనమరందమదాతిరేకమున్**
**ఘనమృదునాదసంచలితకాముకలోకముఁ జంచరీకమున్.** **1454**

**ప్రతి :** అని= అంటూ; ఇటు= ఈ విధంగా; గోపికల్= గోపవనితలు; పలుకన్= మాట్లాడగా; అందున్= వారిలో; ఒకగోపిక= ఒక గొల్లపడతి; కృష్ణపాదచింతనమునన్= శ్రీకృష్ణునియొక్క చరణధ్యానంలో; చొక్కి= పరవశించి; చేరువను= దగ్గర; దైవవశంబునన్= విధివశాత్తుగా; ఉత్+జ్వలత్= ప్రకాశిస్తున్న; సునిశిత= మిక్కిలివాడియైన; సత్+వివేకమున్= మంచితెలివిడి గల్గిందీ; ప్రసూన మరంద= పూలలోని తేనెచేత కల్గిన; మద+అతిరేకమున్= మత్తుయొక్క ఆధిక్యంగలదీ; ఘన= గొప్పదైన; మృదునాద= మంజుల ధ్వనిచేత; సంచలిత= కలవరపెట్టబడిన; కాముకలోకమున్= కాముకుల సమూహం గలదీ అయిన; చంచరీకమున్= తుమ్మెదను; కాంచెన్= చూచింది.

**తా :** అని ఈ ప్రకారం గొల్లవనితలు పలుకుతుండగా వారిలో ఒక గోపిక శ్రీకృష్ణచరణధ్యాన పరవశురాలయింది. ఆమె తన సమీపంలో విధివశాన చురుకైన తెలివితేటలుగలదీ, పూదేనెను తాగి మత్తిల్లినట్టిదీ, తన మధురమంజుల ఝుంకార ధ్వనితో కాముకులను కలవరపరచేదీ అయిన ఒక గండుతుమ్మెదను చూచింది.

**వ. కని హరి తన్నుం బ్రార్థింపఁ బుత్తెంచినదూత యని కల్పించుకొని, యుద్ధవునికి నన్యాపదేశంబై యెఱుకపడ న య్యళికిం దొయ్యలి యిట్లనియె. 1455**

**ప్రతి :** కని= చూచి; హరి= శ్రీకృష్ణుడు; తన్నున్= తనను; ప్రార్థింపన్= వేడుకొనడానికి; పుత్తెంచిన= పంపిన; దూత= రాయబారి; అని కల్పించుకొని= అని ఊహించుకొని; ఉద్ధవునికిన్= ఉద్ధవుడికి; అన్య+అపదేశంబు+ఐ= వేరొకదాన్ని నెపం పెట్టుకొని చెప్పడం; ఎఱుకపడన్= తెలిసేట్లు; ఆ+అళికిన్= ఆ తుమ్మెదకు; తొయ్యలి= గోపవనిత; ఇట్లు+అనియెన్= ఈ రీతిగా పల్కింది.

**తా :** ఆ విధంగా తుమ్మెదను చూచిన ఆ గోపిక తన్ను వేడుకొనేందుకై ప్రియుడు పంపిన దూతగా కల్పించుకొని, ఉద్ధవునికి అన్యాపదేశంగా తాకునట్లు ఆ భ్రమరంతో ఇట్లనింది.

**మ. భ్రమరా! దుర్జనమిత్ర! ముట్టకుము మా పాదాబ్జముల్ నాగర**
**ప్రమదాలీకుచకుంకుమాంకితలసత్ప్రాణేశదామప్రసూ**
**న మరందారుణితాననుండ వగుటన్ నాథుండు మన్నించుఁ గా**
**క మము న్నేపుచుఁ బౌరకాంతల శుభాగారంబులన్ నిత్యమున్. 1456**

**ప్రతి :** దుర్జనమిత్ర= దుష్టునికి స్నేహితుడా!; భ్రమరా= ఓ తుమ్మెదా!; నాగర= నగరమందు నివసించే; ప్రమదా= స్త్రీలయొక్క; ఆళీ= సమూహంయొక్క; కుచకుంకుమ= స్తనాలకు పూసుకున్న కుంకుమ; అంకిత= అంటుకొన్నదై; లసత్= ఒప్పుతున్న; ప్రాణ+ఈశ= మా మనోనాథుడైన శ్రీకృష్ణునియొక్క; దామప్రసూన= దండలోని పూలలోన్న; మరంద= తేనెతో; అరుణిత= ఎర్రగా అయిన; ఆననుండవు+అగుటన్= ముఖంకలవాడవు కావడంచేత; మా పాద+అబ్జముల్= మా అడుగులనే తామరలను; ముట్టకుము= తాకవద్దు; నిత్యమున్= ప్రతిదినం; పౌరకాంతల= మధురాపుర నివాసినులైన మగువలయొక్క; శుభ+అగారంబులన్= శోభన గృహాలలో; మమున్= మమ్ము; ఏపుచున్= విరహంచేత తపింపజేస్తూ ఉన్న; నాథుండు= మా ప్రాణేశ్వరుడైన మాధవుడు; మన్నించున్+కాక= నిన్ను ఆదరిస్తే ఆదరించుగాక! మేము మాత్రం మన్నించమని భావం.

**తా :** దుష్టునికి మిత్రుడవైన ఓ మధుపా! నీవు మా పాదపద్మాలు స్పృశించవద్దు. మధురాపురకాంతలస్తనకుంకుమం అంటుకొన్న మా ప్రాణవల్లభుని పుష్పమాలికలోని మకరందం గ్రోలి, ఆ కుంకుమచేత ఎర్రబడిన ముఖం గలవాడివి గదా నీవు! మమ్ము

విరహబాధకు గురిచేసి పౌరాంగనల శోభనగృహాలలో నిత్యం కులుకుతున్న మా ప్రాణేశ్వరుడు నిన్ను మన్నించునేమోగాని మేముమాత్రం నిన్ను మన్నించం.

**మ. ఒకపువ్వందలి తేనె ద్రావి మధుపా! యుత్సాహివై నీవు వే**
**ఱొకటిం బొందెడు భంగి మ మ్మధరపీయూషంబునం దేల్చి మా**
**యకలంకోజ్జ్వల యౌవనంబుఁ గొని యన్యాసక్తుఁ డయ్యెన్ విభుం;**
**డకటా! యాతని కెట్లు దక్కె సిరి? మిథ్యాకీర్తి నమ్మెం జుమీ! 1457**

**ప్రతి :** మధుపా!= ఓ తుమ్మెదా!; నీవు; ఒకపువ్వు+అందలి= ఒక పుష్పంలోని; తేనె+ద్రావి= మధువునుతాగి; ఉత్సాహివి+ఐ= ఉల్లాసం చెందినవాడివై; వేఱు+ఒకటిన్= మరొక్క పుష్పాన్ని; పొందెడి భంగిన్= చెందునట్లు; మమ్మున్= మమ్ములను; అధరపీయూషంబునన్= అధరామృతంలో; తేల్చి= ఓలలాడించి; మా= మాయొక్క; అకలంక= మచ్చలేని; ఉజ్జ్వల= మిక్కిలి ప్రకాశించే; యౌవనంబున్= పడుచుదనాన్ని; కొని= అనుభవించి; విభుండు= నాథుడు; (శ్రీకృష్ణుడు) అన్యా+ఆసక్తుఁడు+ అయ్యెన్= ఇతర స్త్రీలందు మక్కువగలవాడైనాడు; అకటా= అయ్యో! ఆతనికిన్= ఆ శ్రీహరికి; సిరి= లక్ష్మి; ఎట్లుదక్కెన్= ఏ విధంగా లభించింది? మిథ్యాకీర్తిన్= పురుషోత్తముడనే అబద్ధపుయశస్సును; నమ్మెన్+చుమీ= విశ్వసించింది సుమా!

**తా :** ఓయీ! మధుపా! ఒక పువ్వులోని మకరందాన్ని పానంచేసి, దాన్ని వదలివేసి ఉత్సాహంతో మరొక్క పువ్వును నీవు ఆశ్రయించినట్లే – శ్రీకృష్ణుడు తన అధరసుధారసాన్ని ఒకసారి మమ్మల్ని గ్రోలనిచ్చి – మా అచ్చమైన పచ్చి యౌవనం కొల్లగొని, ఇతర స్త్రీలందు ఆసక్తుడయ్యాడు. అయ్యయ్యో! అతడు ఉత్తమశ్లోకుడనే బూటకపుమాటలు నమ్మి, శ్రీమహాలక్ష్మి అటువంటి చంచలచిత్తునికి కైవసమయింది.

**శా. భృంగా! కృష్ణుఁడు మంచివాఁ డనుచు సంప్రీతిం బ్రశంసించె; దీ**
**సంగీతంబున నేము సొక్కుదుమె? తచ్చారిత్రముల్ వింతలే?**
**యంగీకారము గావు మాకుఁ; బురకాంతాగ్రప్రదేశంబులన్**
**సంగీతం బొనరింపు వా రిడుదు రోజ నీకు నిష్టార్థముల్. 1458**

**ప్రతి :** భృంగా= ఓ తుమ్మెదా!; కృష్ణుఁడు= గోవిందుడు; మంచివాఁడు+అనుచున్= సత్పురుషుడని; సంప్రీతిన్= మిక్కిలి సంతోషంతో; ప్రశంసించెదు (వు)= కొనియాడుతున్నావు; ఈ సంగీతంబునన్= ఈ ప్రశంసారూప గానంచేత; ఏము= మేము; చొక్కుదుము+ఎ= పరవశిస్తామా?; తత్+చారిత్రముల్= ఆయన నడవడికలు; వింతలు+ఏ= మాకు కొత్తలా?; మాకున్= మాకు; అంగీకారము+కావు= సమ్మతించదగ్గవికావు; పురకాంతా+అగ్రప్రదేశంబులన్= పట్టణస్త్రీల సముఖమందు; సంగీతంబు+ఒనరింపు= గానం సల్పు; ఓజన్= క్రమంగా; వారు= ఆ పట్టణ కాంతామణులు; నీకున్= నీకు; ఇష్ట+అర్థముల్= కోరిన ద్రవ్యాలు; ఇడుదురు= ఇస్తారు.

**తా :** ఓ భృంగరాజా! శ్రీకృష్ణుడు మంచివాడని అతణ్ణి ఎంతో సంతోషంతో కీర్తిస్తున్నావు. నీ గానం విని, మేము సొక్కి సోలిపోతా మనుకున్నావా? అతనికథలు మాకు క్రొత్తవా ఏమి? నీ సంగీతం మేము అంగీకరించం. ఆ మధురానగరిలోని మగువలఎదుట నీ విద్య ప్రదర్శించు. వారు మెచ్చుకొని నీకు అభిమతార్థాలిస్తారు.

మ. సమదాళీశ్వర! చూడు ముజ్జ్వలితహాస భ్రూవిజృంభంబులన్
రమణీయుండగు శౌరిచేఁ గరఁగరే రామల్ త్రిలోకంబులం?
బ్రమదారత్నము లక్ష్మి యాతనిపదాబ్జాతంబు సేవించు; ని
క్కము మే మెవ్వర మా కృపాజలధికిం గారుణ్యముం జేయఁగన్. 1459

**ప్రతి :** సమద+అళి+ఈశ్వర= పొగరెక్కిన ఓ తుమ్మెదలరాజా!; చూడుము= చూడవయ్యా!; ఉత్+జ్వలిత= మిక్కిలి ప్రకాశిస్తున్న; హాస= చిరునవ్వుతోను; భ్రూవిజృంభంబులన్= కనుబొమలు ఆడించుటతోను; రమణీయుండు+అగు= అందగాడైన; శౌరిచేన్= శ్రీకృష్ణునిచేత; త్రిలోకంబులన్= ముజ్జగాలలో; రామల్= రమణులు; కరఁగరు+ఏ= అనురాగం పొందరా? ప్రమదారత్నము= వనితలలో శ్రేష్ఠురాలైన; లక్ష్మి= లక్ష్మీదేవి; ఆతని= ఆ నారాయణుని; పద+అబ్జాతంబున్= కమలంవంటి ఆతని చరణాన్ని; సేవించున్= కొలుస్తుంది; నిక్కము= నిజం; ఆ కృపా జలధికిన్= ఆ దయాసముద్రుడికి; కారుణ్యమున్+చేయన్+కన్= కరుణించుటకు; ఏము+ఎవ్వరము= మేమెంత వాళ్ళం?

**తా :** ఓ తుమ్మెదల రాయడా! మనోహరుడైన శ్రీకృష్ణునిమందహాసకాంతులకూ, బొమముడి విలాసాలకూ కరగిపోని కాంతలు స్వర్గమర్త్యపాతాళలోకాలలో కలరా? లేరు. స్త్రీ రత్నమైన ఆ కమలాదేవియే అతనిచరణ కమలాలను సేవిస్తుండగా, ఆ దయాసాగరుణ్ణి అనుగ్రహించడానికి మేము ఏ పాటివాళ్ళం? (మాకు అట్టి అర్హత లేదని భావం).

శా . రోలంబేశ్వర! నీకు దౌత్యము మహారూఢంబు; నీ నేరుపుల్
చాలున్; మచ్చరణాబ్జముల్ విడువు మస్మన్నాథపుత్త్రాదులన్
లీలం బాసి పరంబు డించి తనకున్ లీనత్వముం బొందు మ
మ్మేలా వాసె విభుండు? ధార్మికులు మున్నీ చందముల్ మెత్తురే? 1460

**ప్రతి :** రోలంబ+ఈశ్వర= ఓ తుమ్మెదల రాయడా!; నీకున్= నీకు; దౌత్యము= రాయబారం నెరపడం; మహారూఢంబు= మిక్కిలి ప్రసిద్ధం; నీ నేరుపుల్= నీ ప్రావీణ్యాలు; చాలున్= చాలించు; మత్+చరణ+అబ్జముల్= మా పాదపద్మాలను; విడువుము= వదలిపెట్టు; అస్మత్+నాథపుత్త్ర+ఆదులన్= మా భర్తలు, కొడుకులు మొదలైనవారిని; లీలన్= విలాసంగా; పాసి= వదలి; పరంబున్= ఉత్తమగతిని; డించి= వీడి; తనకున్= తనలో; లీనత్వమున్+పొందు= ఐక్యతను చెందే; మమ్మున్= మమ్మల్ని; విభుండు= మీ దొర; ఏలా పాసెన్= ఎందుకు వదలివేశాడు?; ధార్మికులు= ధర్మాన్ని అనుసరించేవారు; మున్ను= మునుపు; ఈ చందముల్= ఈ తీరులు; మెత్తురు (మెచ్చుదురు)+ఏ= అంగీకరిస్తారా?, సమ్మతిస్తారా? (సమ్మతించరని భావం.)

**తా :** ఓ చంచరీకమా! రాయబారం నడపడంలో నీవు చాల గడుసరివి. నీ నేర్పు లిక చాలు. మా చరణపద్మాలను విడిచిపెట్టు. మా భర్తలను, పుత్త్రాదులను చులకనగా వదలి, సద్గతిమాట తలపెట్టక, తనతో కలసిపోయిన మమ్ము, మీదొర ఏల పరిత్యజించాడు? ధర్మాత్ములు ఇలాంటి ప్రవర్తనలు మెచ్చుతారా?

శా. వాలిం జంపెను వేఁటకాని పగిదిన్ వంచించి; దైత్యానుజన్
లోలం బట్టి విరూపఁ జేసెను; బలిన్ లోభంబుతోఁ గట్టి యా

త్రైలోక్యంబు మొఱంగి పుచ్చుకొనియెన్; ధర్మజ్ఞుఁడే మాధవుం?
డేలా షట్పద! యెగ్గు మావలన నీ కెగ్గింపఁగా నేటికిన్? 1461

ప్రతి : షట్పద= ఓ తుమ్మెదా!; మాధవుండు= లక్ష్మీవల్లభుడైన శ్రీకృష్ణుడు; వేటకానిపగిదిన్= వేటకానివలె; వాలిన్= కపిరాజైన వాలిని; వంచించి= మోసగించి; చంపెను= చంపేశాడు; లోలన్= తనయందు ఆసక్తురాలైన; దైత్య+అనుజన్= రావణాసురుని చెల్లెలైన శూర్పణఖను; పట్టి= పట్టుకొని; విరూపన్+చేసెను= ముక్కుచెవులుకోసి వికృతరూపం గలదాన్ని చేశాడు.; లోభంబుతోన్= దురాశతో; బలిన్= బలిచక్రవర్తిని; కట్టి= బంధించి; ఈ త్రైలోక్యంబున్= స్వర్గమర్త్యపాతాళాలు అనే ముజ్జగాలను; మొఱంగి= మోసపుచ్చి; పుచ్చుకొనియెన్= స్వీకరించాడు; మాధవుండు= ఆ శ్రీకృష్ణుడు; ధర్మజ్ఞుఁడు+ ఏ= ఆ శ్రీకృష్ణుడు ధర్మం తెలిసినవాడేనా? మా వలనన్= మావల్ల; ఎగ్గు= దోషం; ఏలా= ఎందుకు; నీకున్= ఓ భృంగమా! నీకు; ఎగ్గింపన్+కాన్+ఏటికిన్= మాయందు దోషారోపణ మెందుకు?

తా : తాను వేటకానివలె వంచించి వానరరాజైన వాలిని వధించాడు. తనమీద మరులుగొన్న రావణునిచెల్లెలు శూర్పణఖను ముక్కుచెవులు కోసి విరూపను చేశాడు. పేరాసతో బలిచక్రవర్తిని బంధించి మోసపుచ్చి ముల్లోకాలూ ఆక్రమించాడు. లక్ష్మీవల్లభుడగు ఆ శ్రీకృష్ణుడు ధర్మమెరిగినవాడా? మా వల్ల తప్పేముంది? మా యందు దోషం ఆరోపించడం ఎందుకు?

ఉ. పన్నుగ మింటిపై కెగసి పాఱు విహంగములైన వీనులం
ద న్నొకమాటు విన్న గృహదారసుతాదులఁ బాపి విత్త సం
పన్నత డించి సంసరణపద్ధతిఁ బాపెడువాఁడు నిత్య కాం
క్ష న్నెటి నున్న మాబ్రదుకు సైఁచునె యేల మధువ్రతోత్తమా! 1462

ప్రతి : మధువ్రత+ఉత్తమా= తుమ్మెదలలో శ్రేష్ఠుడా!; పన్నుగన్= చక్కగా; మింటిపైకిన్= ఆకాశంమీదికి; ఎగసి= ఎగిరి; పాఱు= పరువెత్తే; విహంగములు+ఐనన్= పక్షులయిననూ; వీనులన్= చెవులతో; తన్నున్= తనను; ఒకమాటు= ఒకసారి; విన్నన్= వింటే; గృహదారసుత+ఆదులన్= ఇల్లు, ఇల్లాలు, పిల్లలు మొదలైనవారిని; పాపి= ఎడబాపి; విత్తసంపన్నతన్= ధన సమృద్ధిని; డించి= అణచి; సంసరణ పద్ధతిన్= సంసారవ్యవహారాన్ని; పాపెడువాఁడు= తొలగించే స్వామి; నిత్యకాంక్షన్= ఎడతెగని కోరికలతో; నెఱిన్+ఉన్న= నిండి ఉన్న; మా బ్రతుకున్= మా జీవితాన్ని; ఏల= ఎందుకు; సైఁచున్+ఎ= సహిస్తాడా?

తా : స్వేచ్ఛగా గగనతలంలో ఎగిరిపోయే పక్షులుసైతం చెవులారా తనపేరును ఒక్కమారు వింటే – ఇల్లు, ఇల్లాలు, పిల్లలు, మొదలయినవారిని దూరంచేసి, ధనం మొదలయినవాటిని విసర్జింపజేసి, సంసారమార్గం పోకార్చే ఆ కృష్ణుడు – ఎడతెగని కోరికలతో న్యాయం తప్పకున్న మా బ్రతుకులు సహిస్తాడా?

మ. కమనీయం బగు వేఁటకానిపలు కాకర్ణించి నిక్కంబుగాఁ
దమ చిత్తంబులఁ జేర్చి చేరి హరిణుల్ తద్బాణనిర్భిన్నలై
యమితోగ్రవ్యథనొందుభంగి హరిమాయాలాపముల్ నమ్మి దుః
ఖములం జెందితి మంగజాస్త్ర జనితోగ్రశ్రాంతి నిందిందిరా! 1463

**ప్రతి :** ఇందిందిరా!= ఓ తుమ్మెదా!; హరిణుల్= ఆడుజింకలు; కమనీయంబు+అగు= మనసునకు ఇంపైన; వేఁటకానిపలుకు= బోయవానిమాట; ఆకర్ణించి= విని; నిక్కంబు+కాన్= నిజంగా ఆ మాటను, తమ చిత్తంబులన్+చేర్చి= తమ మనసుల్లో నిలుపుకొని; చేరి= వేటకానివద్దకు వచ్చి; తద్+బాణనిర్భిన్నలు+ఐ= ఆతని శరాలచేత చీల్చినవై; అమిత+ఉగ్రవ్యథన్= అధికమైన భయంకరబాధను; ఒందుభంగిన్= చెందేవిధంగా; హరి= మాధవుని; మాయా+ఆలాపముల్= మోసపుమాటలు; నమ్మి= విశ్వసించి; అంగజ= మన్మథునియొక్క; అస్త్ర= బాణాలచేత; జనిత= కల్గిన; ఉగ్ర= దారుణమైన; శ్రాంతిన్= శ్రమచేత; దుఃఖములన్= దుఃఖాలను; చెందితిమి= పొందాము.

**తా :** ఓ భ్రమరమా! ఆడుజింకలు ఆకర్షణీయమైన వేటగానిపలుకులు ఆలకించి, పారవశ్యంతో చెంతకు జేరి, వాని బాణాలకు గురియై అతిదారుణమైన బాధను పొందేవిధంగా – శ్రీకృష్ణుని మాయమాటలు నమ్మి, మన్మథశరాల తాకిడికి స్రుక్కి మేము దుఃఖాల పాలయ్యాము.

**ఉ. బంధుల బిడ్డలన్ మగల భ్రాతలఁ దల్లులఁ దండ్రులన్ మనో**
**జాంధతఁ జేసి డించి శరణందిన మమ్ము వియోగదుర్దశా**
**సింధువులోనఁ ద్రోచి యిటు చేరక పోవుట పాడి గాదు; పు**
**ష్పంధయ! మీ యధీశునకుఁ బాదములంఁ బడి యొత్తి చెప్పవే! 1464**

**ప్రతి :** పుష్పంధయ!= తుమ్మెదా!; మనస్+జ+అంధతన్+చేసి= కామునిచే కన్నులు కనిపించనందున; బంధులన్= చుట్టాలనూ; బిడ్డలన్= సంతానాన్నీ, సుతులనూ; మగలన్= భర్తలనూ; భ్రాతలన్= తోబుట్టువులనూ; తల్లులన్= అమ్మలనూ; తండ్రులన్= అయ్యలనూ; డించి= వదలి; శరణు+అందిన= శరణజొచ్చిన; మమ్మున్= మా అందరినీ; వియోగ= ఎడబాటుచే గల్గిన; దుర్దశా= దీనస్థితి అనే; సింధువులోనన్= సముద్రములో; త్రోచి= నెట్టి; ఇటుచేరకపోవుట= మా చెంతకు రాకుండటం, పాడిగాదు= న్యాయంకాదు; మీ+అధి+ఈశునకున్= మీ నాయకుడైన శ్రీకృష్ణునికి; పాదములన్+పడి= చరణాలపై వ్రాలి; ఒత్తి చెప్పవు+ఏ= నొక్కివక్కాణించవా? గట్టిగా చెప్పుమని తాత్పర్యం.

**తా :** ఓ షట్పదా! చుట్టాలనూ, సుతులనూ, భర్తలనూ, అన్నదమ్ములనూ, తలిదండ్రులనూ కామాంధత్వంతో విడనాడి తన్నే శరణుజొచ్చాము. ఇలాంటి మమ్మల్ని విరహసాగరంలో త్రోసివేసి, మా చెంతకు చేరరాకుండటం న్యాయంకాదని ప్రభువైన శ్రీకృష్ణునికి పాదప్రణామంచేసి గట్టిగా నొక్కి చెప్పు.

**సీ. కాంచనరత్నసంఘటితసౌధంబులే మా కుటీరంబులు మాధవునకు**
**వివిధనరేంద్రసేవితరాజధానియే మా పల్లె యదువంశ మండనునకు?**
**సురభి పాదప లతాశోభితారామమే మా యరణ్యము సింహమధ్యమునకుఁ**
**గమనీయ లక్షణ గజతురంగంబులే మా ధేనువులు కంసమర్దనునకు?**

**తే. రూప విభ్రమ నైపుణ రూఢలైన, మగువలమె మేము మన్మథమన్మథునకు?**
**నేల చింతించు మముఁ గృష్ణుఁ డేల తలఁచుఁ?, బృథివి నధిపులు నూతనప్రియులు గారె! 1465**

**ప్రతి :** మాధవునకున్= శ్రీకృష్ణునికి; మాకుటీరంబులు= మా పూరిగుడిసెలు; కాంచన= బంగారంతో; రత్న= మణులతో; సంఘటిత= కూర్చబడిన; సౌధంబులు+ఏ= మేడలా?(కావని తాత్పర్యం); యదువంశమండనునకున్= యాదవ కులానికి

అలంకారమైన శ్రీకృష్ణునికి; మా పల్లె= మా చిన్నగ్రామం; వివిధనర+ఇంద్ర= పలురాజులచేత; సేవిత= కొలువబడుతున్న; రాజధానియే= ముఖ్యపట్టణమా? కాదని భావం; సింహమధ్యమునకున్= సింగం నడుమువంటి నడుము ఉన్న శౌరికి; మా+అరణ్యము= మా అడవి; సురభి= పరిమళవంతాలైన; పాదప= వృక్షాలతో; లతా= తీవలతో; శోభిత= విరాజిల్లే; ఆరామము+ఏ= ఉద్యానవనమా? (కాదని అభిప్రాయం); కంసమర్దనునకున్= కంసుణ్ణి సంహరించిన గోపాలదేవునికి; మాధేనువులు= మా గోవులు; కమనీయ= మనోహరాలైన; లక్షణ= శుభచిహ్నాలు గల; గజతురంగంబులు+ఏ= ఏనుగులా? గుఱ్ఱాలా? కావనుట; మన్మథమన్మథునకున్= మోహం కలుగజేసే మన్మథునికే మోహం కల్గించే పరమ సుందరుడైన శౌరికి; మేము= గొల్లవనితలమైన మేము; రూప= సౌందర్యంచే; విభ్రమ= విలాస చేష్టలచే; నైపుణ= నేర్పుచేత; రూఢలు+ఐన= ప్రసిద్ధిగాంచిన; మగువలము+ఏ= కాంతలమా? (కానే కామనుట); కృష్ణుఁడు= అచ్యుతుడు; మమున్= మమ్ము; ఏలచింతించున్= ఎందుకు ఆలోచిస్తాడు? ఏలతలఁచున్= ఎందుకు స్మరిస్తాడు? పృథివిన్= భూమిలో; అధిపులు= రాజులు; నూతన ప్రియులు+కారు+ఎ= కొత్తవాటియందు ప్రేమగలవారు గదా!

**తా :** లక్ష్మీవల్లభుడైన శ్రీకృష్ణుడికి మా పూరిగుడిసెలు బంగారంతో, మణులతో నిర్మితమైన మేడలా? యదువంశానికి అలంకారమైన వెన్నుడికి మా పల్లెటూరు, వ్రేపల్లె పలువురు రాజులచే సేవింపబడే ముఖ్యపట్టణమా ఏమి? సింహం నడుంవంటి నడుం కల్గిన శ్రీహరికి మా బృందారణ్యం సువాసనలీను చెట్లతో పూలతీగలతో శోభిల్లే ఉద్యానవనమా? కంసమర్దనుడైన కృష్ణునికి మా గోవులు సర్వశుభలక్షణలక్షితాలైన ఏనుగులా? గుఱ్ఱాలా? మన్మథుడికి మన్మథుడైన ఆ వన్నెకాడికి గొల్లపడతులమైన మేము రూపవిభ్రమవిలాసాలతో గణుతించదగిన కాంతామణులమా ఏమి? కనుక ఆ శ్రీకృష్ణుడు మమ్ముగురించి ఎందుకు ఆలోచిస్తాడు? ఎందుకు మమ్మల్ని స్మరిస్తాడు? లోకంలో ప్రభువులు నవ ప్రియులుగదా!

**వ. అని మఱియు నిట్లనేక విధంబులఁ గృష్ణసందర్శన లాలస లయి పలుకుచున్న గోపికల వచనంబులు విని యుద్ధవుండు మధురాలాపంబుల నూరార్చుచు నిట్లనియె. 1466**

**ప్రతి :** అని= అంటూ; మఱియున్= ఇంకనూ; ఇట్లు= ఈ విధంగా; అనేక విధంబులన్ (న+ఏక)= పెక్కు మార్గాల్లో; కృష్ణసందర్శన= కృష్ణుణ్ణి చూడాలని; లాలసలు+అయి= ఆసక్తిగలవారై; పలుకుచున్+ఉన్న= మాట్లాడుతున్న; గోపికల వచనంబులు= గొల్లమగువలమాటలు; విని; ఉద్ధవుండు= ఉద్ధవుడు; మధుర+ఆలాపంబులన్= తీయని పలుకులతో; ఊరార్చుచున్= వారిని ఓదారుస్తూ; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తా :** అని ఇంకా అనేక విధాలుగా కృష్ణసందర్శనంపై ఆశగల్గి మాట్లాడుతున్న గోపికలమాటలు కృష్ణసచివుడు ఉద్ధవుడు విన్నాడు. విని తీయటిమాటలతో వారిని ఊరడిస్తూ ఇలా అన్నాడు.

**మ. జపదానవ్రతహోమసంయమతపస్స్వాధ్యాయముఖ్యంబులన్**
**నిపుణుల్ గోరియు నే విభున్ మనముల న్నిల్పంగలే రట్టి స**
**ద్విపులాకారునిపై మహామహిముపై విశ్వేశుపై మీ కజ**
**స్ర పటుధ్యానము లిట్లు నిల్చునె? భవచ్చారిత్రముల్ చిత్రముల్. 1467**

**ప్రతి :** నిపుణుల్= నేర్పరులు; జప= గాయత్రి, అష్టాక్షరి, పంచాక్షరి మొదలైన మంత్రాలయొక్క జపాలు; దాన= గోదాన, భూదాన, హిరణ్యదానాదులు; వ్రత= ఏకాదశి మొదలైన వ్రతాలు; హోమ= యజ్ఞాలు; సంయమ= నియమవిశేషాలు (అనగా అహింస, అస్తేయం, సత్యం, బ్రహ్మచర్యం, అపరిగ్రహం అనేవి); తపస్= కృచ్ఛ్రచాంద్రాయణాది తపస్సులు,

స్వాధ్యాయముఖ్యంబులన్= వేదాలు చదవడం మొదలైనవాటిచేత; కోరియున్= వాంఛించికూడా; ఏ విభున్= సర్వవ్యాపకుడైన ఏ స్వామిని; మనములన్= చిత్తములందు; నిల్పన్+కన్+లేరు= నిలుపజాలరో; జపదానప్రతాదు లెన్ని ఉన్నా మహాత్ములునైతం ఏ భగవంతుణ్ణి హృదయంలో నిల్పలేరో-) అట్టి= అటువంటి; సద్+విపుల+ఆకారునిపైన్= ఉత్తమమూ, గొప్పదీ అయిన రూపంగలవానిమీద - (అనగా త్రికాలాలలో నశించని మహత్తుకంటె మహనీయుడైన, సత్యజ్ఞానానందములే నిజరూపంగావున్న వానిమీద); మహామహిముపైన్= సృష్టి స్థితిలయాదులైన గొప్ప కృత్యాలు సల్పగల మహాప్రభావశాలి మీద; విశ్వ+ఈశుపైన్= ప్రపంచ నాయకుడైన శ్రీకృష్ణ పరబ్రహ్మంమీద; మీకున్= మీకు; అజస్ర పటుధ్యానములు= ఎడతెగని దృఢమైన ధ్యానాలు; ఇట్లు= ఈ విధంగా; నిల్చును+ఎ= నెలకొనడం ఎంతోవింత!; భవత్+చారిత్రముల్= మీ నడవళ్ళు; (మీ కథలు); చిత్రముల్= అద్భుతములు.

**తా :** జపాలు, దానాలు, వ్రతాలు, హోమాలు, అంతరింద్రియబహిరింద్రియనిగ్రహం, తపస్సు, వేదపఠనం మొదలైన సత్కార్యాలు ఆచరిస్తూ, నేర్పరులైన మహనీయులు సర్వవ్యాపకుడైన ఏ స్వామిని తమ హృదయాలలో నిలుపు కొనలేరో, అట్టి గొప్ప స్వరూపం కలవాడూ, మహామహిమలు కలవాడూ, ప్రపంచ నాయకుడూ అయిన శ్రీకృష్ణభగవానుడి మీద ఎడతెగకుండా మీ ధ్యానాలు ఇట్లు కొనసాగడం వింత గదా! అమ్మలారా! మీ చరిత్రలు పరమాశ్చర్య కరాలు!

**క. నను మీ కడకుం గృష్ణుఁడు, పని పంపెడు వేళఁ బిలిచి పలికినపలుకుల్**
**వినుఁ; డన్నియు వివరించెద, వనజేక్షణలార! మీరు వగవకుఁ డింకన్. 1468**

**ప్రతి :** వనజ+ఈక్షణలార!= కమలాలవంటి కన్నులుగల గోపికలారా!; కృష్ణుఁడు= నందనందనుడు; ననున్= నన్ను; మీకడకున్= మీవద్దకు; పనిపంపెడు వేళన్= కార్యార్థమై పంపేటప్పుడు; పిలిచి= నన్ను ఆహ్వానించి; పలికిన పలుకుల్= చెప్పినమాటలు; వినుఁడు= ఆలకించండి; అన్నియున్= ఆ పలుకులన్నీ; వివరించెదన్= విశదీకరిస్తాను; ఇంకన్= ఇటుపై; మీరు వగవకుఁడు= మీరు చింతించవద్దు;

**తా :** తామరరేకులవంటి కన్నులుగల గోపికలారా! శ్రీకృష్ణుడు నన్ను మీ కడకు కార్యార్థంగా పంపేటప్పుడు నాతో చెప్పిన మాటలన్నీ మీకు వివరిస్తాను. వగపు మాని సావధానంగా ఆలకించండి.

**వ. అని హరివచనంబులుగా నిట్లనియె. 1469**

**ప్రతి :** అని= అంటూ; హరివచనంబులు+కాన్= మాధవునిమాటలుగా; ఇట్లు+అనియెన్= ఉద్ధవు డీవిధంగా అన్నాడు.

**తా :** అని ఉద్ధవుడు హరి చెప్పినమాటలన్నీ వారికిలా వినిపించాడు.

**సీ. ఎల్లకార్యములకు నేను బ్రధానకారణము గావున మీరు రమణులార!**
**కలుగదు మద్వియోగము చరాచరరూపములలో మహాభూతములు వసించు**
**కరణి నుండుదు సర్వగతుఁడనై నే మనః ప్రాణబుద్ధి గుణేంద్రియాశ్రయుండ**
**నాత్మయం దాత్మచే నాత్మఁ బుట్టింతు రక్షింతును ద్రుంతు హృషీకభూత**

**తే. గుణగణాకార మాత్మలోఁ గొమరు మిగులు, నిబిడమాయానుభవమున నిత్యశుద్ధ**
**మాత్మ విజ్ఞానమయమునై యమరు గుణముఁ, బ్రకృతికార్యమనోవృత్తిఁ బట్టి పొందు. 1470**

**ప్రతి :** రమణులార! = గోపికలారా!; ఎల్లకార్యములకున్= సకలకార్యాలకు; ఏను= భగవంతుడినైన నేను; ప్రధానకారణము= సృష్టి స్థితిలయాలకు ముఖ్యకారణభూతుణ్ణి; కావునన్= కాబట్టి; మత్+వియోగము= నావలని ఎడబాటు; కలుగదు= మీకు సంభవించదు; చర+అచర రూపములలోన్= స్థావరాలు, జంగమాలు అయిన సకలజీవులలో; మహాభూతములు= నీరు, నిప్పు, నేల, గాలి, ఆకాశం అనే పంచభూతాలు; వసించు కరణిన్= ఉండేవిధంగా; సర్వగతుఁడను+ఐ= అంతటా నిండినవాడనై; ఉండుదున్= ఉంటాను; నేన్= ఈ విధంగా సకలకార్యకారణ భూతడనైన నేను; మనః ప్రాణబుద్ధిగుణ+ ఇంద్రియ+ఆశ్రయుండన్; మనః= సంకల్ప వికల్పాత్మకమయిన మనస్సునకూ; ప్రాణ= ప్రాణ, అపాన, ఉదాన, వ్యాన, సమానములనే పంచప్రాణాలకూ; బుద్ధి= నిశ్చయాత్మకమైన బుద్ధికీ; గుణ= సత్త్వరజస్తమోగుణమయమైన ప్రకృతికీ; ఇంద్రియ= జ్ఞానేంద్రియాలయిన కన్ను, ముక్కు, చెవి, చర్మం, నాలుక అనే అయిదింటికినీ, వాక్కు, పాణి, పాదం, పాయువు, ఉపస్థ అనే అయిదు కర్మేంద్రియాలకూ; ఆశ్రయుండన్= ఆధారమైనవాణ్ణి – (అనగా అవి జనించడానికీ, నిలవడానికీ, నశించడానికీ ఆధారభూతుణ్ణి); హృషీక= ఇంద్రియాలు; భూత= పంచమహాభూతాలు; గుణ= సత్త్వరజస్తమస్సులనే త్రిగుణాలు అనువాటియొక్క; గణ= సముదాయంయొక్క; ఆకారము= రూపం అనగా వాటివాటి వృత్తులతో కూడి; ఆత్మలోన్= నాయందే; కొమరుమిగులున్= జనించి ప్రకాశిస్తుంది; నిబిడ= సర్వవ్యాపకమైన, మాయా= ప్రకృతియొక్క; అనుభవమునన్= అనుభవంవల్ల; నిత్యశుద్ధము= నిత్యనిర్మలమూ; విజ్ఞానమయము= అపరోక్షజ్ఞానస్వరూపము అయిన; ఆత్మ= పరమాత్మనైన నేను; అమరు= అమరిఉండి; వేఱు+అయ్యున్= వేరుగా తోచికూడ; గుణము= ఆ విధంగా తోచునట్టిగుణం; ప్రకృతి కార్యమనస్+వృత్తిన్= మాయాకార్యం అయిన అంతః కరణ కార్యాన్నీ; పట్టి= అవలంబించి; పొందున్= నన్ను పొందును.

**తా :** గోపికలారా! సృష్ట్యాది సమస్త కార్యాలకు కారణభూతుణ్ణి నేనే. కాబట్టి నాయెడబాటు మీకు కలుగదు. కలిగినట్లుతోచడం మాయాకార్యం. స్థావరజంగమాత్మకాలైన సకలప్రాణుల్లో పృథివ్యప్తేజోవాయ్వాకాశాలు అనే పంచమహాభూతాలు అణగి ఉండేటట్లు – నేను సమస్తంలోనూ ఉంటాను. మనస్సుకు, పంచప్రాణాలకు, బుద్ధికి, త్రిగుణాత్మిక అయిన ప్రకృతికి, ఇంద్రియవృత్తులైన శబ్దస్పర్శ రూప రస గంధాలకు, జ్ఞానకర్మేంద్రియాలకు నేను ఆధారభూతుడినై ఉన్నాను. నాయందే, నా సంకల్ప మహిమతో నాలో సూక్ష్మరూపంలో అణగియున్న చరాచరప్రపంచాన్ని స్థూలరూపంతో సృజిస్తాను, రక్షిస్తాను, నశింపజేస్తాను.

స్వరూపంచేత నిర్మలుడూ, జ్ఞానస్వరూపుడూ అయిన జీవునికి ప్రపంచస్వరూపం సత్త్వాది గుణాలు లేదా భూతేంద్రియ గుణాలతో కలుగుతున్నది. మాయాకార్యాలైన జాగ్రత్స్వప్నసుషుప్తులనే మనోవృత్తులందు అతడు దేవమనుష్యాది రూపాలతో కన్పిస్తున్నాడు.

**క. కలఁ గని లేచి మున్ను గలఁ గన్న సమస్తవిధంబుఁ గల్లఁగాఁ**
**దలఁచిన భంగి మానసపదార్థముచే నిఖిలేంద్రియార్థముల్**
**బలమునఁ గట్టి తద్జ్ఞుఁడు ప్రపంచము లేదనుఁ దన్మనంబుఁ దా**
**రలయక కట్టుడున్ బుధుల కవ్వల నొండొకభేద మున్నదే? 1471**

**ప్రతి :** కలన్+కని= స్వప్నంగాంచి; లేచి= మేలుకొని; మున్ను= మేల్కొనడానికి ముందు; కలన్= స్వప్నంలో; కన్న సమస్తవిధంబు= చూచిన సకలవిషయాలతీరు; కల్లన్+కాన్= అసత్యంగా; తలఁచినభంగిన్= భావించిన రీతిగా; తద్జ్ఞుఁడు= తత్త్వం తెలిసినవాడు; మానసపదార్థముచేన్= మనస్సనేవస్తువుచేత; నిఖిల+ఇంద్రియ+అర్థముల్= సమస్తములైన ఇంద్రియాలయొక్క విషయాలను;

(పద్నాలుగు ఇంద్రియ వృత్తుల్ని); బలమునన్+కట్టి= తనశక్తిచేత అరికట్టి; తద్+మనంబున్= ఇంద్రియార్థాలను నిరోధించుటకు సాధనమైన ఆ మనస్సును; తారు= బ్రహ్మజ్ఞానులైనతాము; అలయక= విసుగుచెందక; కట్టుడున్= అరికట్టగా; (శబ్దస్పర్శ రూపరసగంధాలు అనే విషయాలయందు ప్రవేశించనీయక నిలుపగా); బుధులకున్= విజ్ఞానులకు; అవ్వలన్= అటుపై (అనగా మనసును నిరోధించినతరువాత); ఒండు+ఒక భేదము= ఏదేని మరొక్క భేదం; ఉన్నది+ఏ= ఉందా? (లేదని భావం.)

**తా :** నిద్రించి మేలుకొన్నవాడు తాను స్వప్నంలో చూచిదంతా అసత్యమని భావించునట్లు, తత్త్వవేత్త మనస్సనే పదార్థంతో శబ్దస్పర్శాదిసకలవిషయాలనూ దృఢంగా నిరోధించి తనకన్న భిన్నంగా ప్రపంచం లేదని చెపుతాడు. ఆ మనస్సును పండితులు వేసట చెందక అరికట్టగా, ఆ మీదట భేదభావం పొడసూపదు.

**విశే :** ప్రపంచములేదు+అనున్= తనకంటె భిన్నంగా ప్రపంచంలేదు అని నిర్ణయిస్తాడు; (మనకు కనబడేది, వినబడేది, తనచేత ఊహించబడేది అయిన సమస్తం పరబ్రహ్మస్వరూపమేగాని దానికి భిన్నంగా ప్రపంచం లేదు).

మనస్సు ప్రపంచవిషయాకారంగా పరిణమించడమే బంధం. బ్రహ్మాకారంగా పరిణమించడమే మోక్షం. ఈ బంధమోక్షాలు రెండింటికీ కారణం మనస్సే గనుక అట్టి మనస్సును ప్రపంచవిషయాసక్తం కానీయక, బ్రహ్మంకంటే వేరొక పదార్థం లేనే లేదు అనేవృత్తిని పొందేటట్లు చేయాలి.

**ఆ. సాంఖ్యయోగనిగమసత్యతపోదమ, ములు మనోనిరోధములు గడపలఁ**
**గాఁగ నుండు జలధికడపలగాఁ గల, నదులభంగి నళిననయనలార! 1472**

**ప్రతి :** నళిననయనలార!= పద్మాలవంటి నేత్రాలుగల గోపికలారా; జలధి= సముద్రం; కడపల+కాన్+కల= మేరగా (హద్దుగా) గల్గినట్టి; నదులభంగిన్= ఏళ్ళవలె; సాంఖ్య= సాంఖ్యం; యోగ= యోగం; నిగమ= వేదాలు; సత్య= సత్యం; తపస్= తపం; దమములు= ఇంద్రియ నిగ్రహం అనేవి; మనస్+నిరోధములు= మనసును అరికట్టునట్టి సాధనాలు (మనస్సును విషయాసక్తం కాకుండా లోబరచుకొను ఈ నిష్ఠలు); కడపలన్+కాన్+కన్+ఉండున్= హద్దుగా ఉంటాయి.

**తా :** కమలాలవంటి కన్నులుగల గోపికలారా! నదులన్నీ కదలిపోయి కడకు సముద్రాన్ని చేరేటట్లు ఆత్మానాత్మవిచార రూపమైన సాంఖ్యం, యమనియమాదికమైన అష్టాంగయోగం, వేదం, సత్యం, తపం, ఇంద్రియ నిగ్రహమైనదమమూ ఈ నిష్ఠలన్నీ మనోనిగ్రహమందే పరిసమాప్తి చెందుతున్నాయి.

**మ. చెలువల్ దవ్వుల నున్న వల్లభులపైఁ జిత్తంబులం గూర్తు రు**
**త్కలికం జేరువవారికంటె నదియుం గాకెప్పుడున్ నన్ను మీ**
**రలు చింతించుచు నుండఁ గోరి యిటు దూరస్థత్వముం బొందితిన్**
**దలఁకం బోలదు నన్నుఁ గూడెదరు నిత్యధ్యానపారీణలై. 1473**

**ప్రతి :** చెలువల్= ఆడువారు; చేరువ వారికంటెన్= చెంతనున్న వారికంటె; దవ్వులన్+ఉన్న= దూరంలో ఉన్న; వల్లభులపైన్= ప్రియులమీద; ఉత్కలికన్= ఉత్కంఠతో; చిత్తంబులన్= మనస్సులలో; కూర్తురు= మక్కువగలవారై ఉంటారు; అదియున్+కాక= అంతేగాక; ఎప్పుడున్= నిరంతరం; మీరలు= మీరు; నన్నున్= పరమాత్మనైన నన్ను; చింతించుచున్+ఉండన్= స్మరిస్తూ

ఉండటానికై; కోరి= అభిలషించి; ఇటు= ఈ విధంగా; దూరస్థత్వమున్+పొందితిన్= మీకు దవ్వులనున్న వాణ్ణి అయినాను; తలఁకన్+పోలదు= భయపడవద్దు; నిత్యధ్యాన పారీణలు+ఐ= ఎడతెగని ధ్యానంలో పారం ముట్టినవారై; నన్నున్+గూడెదరు= నన్ను చెందుతారు.

**తా :** స్త్రీలు సమీపంలో ఉన్నవారికంటె దూరంలో ఉన్న ప్రియులపట్ల తహతహపాటుతో మనసులందు అనురక్తి గలవారై ఉంటారు. అంతేగాక, మీ రెల్లప్పుడు నన్నే స్మరిస్తూ ఉండాలి అని మీకు దూరంలో ఉన్నాను. భయపడకండి. నిరంతరధ్యాన పారంగతలై మీరు నన్నే పొందగలరు.

**వ. అని మీకుం జెప్పుమని కృష్ణుండు సెప్పె ననవుడు నుద్ధవునికిం గోపికలు సంతసించి యిట్లనిరి. 1474**

**ప్రతి :** అని= అంటూ; మీకున్+చెప్పుము+అని= మీకు తెలుపుమంటూ; కృష్ణుండు= శ్రీకృష్ణమూర్తి; చెప్పెన్= నాకు చెప్పాడు; అనవుడున్= అని ఉద్ధవుడు పలుకగా; ఉద్ధవునికిన్= ఉద్ధవునితో; గోపికలు= గొల్లవనితలు; సంతసించి= ఆనందపడి; ఇట్లు+అనిరి= ఈ విధంగా పలికారు.

**తా :** అని మీకు చెప్పుమని శ్రీకృష్ణుడు నాకు చెప్పిపంపాడు అని ఉద్ధవు డన్నాడు. ఆ పలుకులు విని గోపికలు సంతోషించి ఆయనతో ఇలా అన్నారు.

**ఉ. ఇమ్ముల నున్నవాఁడె హరి? యిక్కడి కెన్నఁడు వచ్చు? వచ్చి మా**
**యుమ్మలికంబు వాపునె? ప్రియుం డిట వచ్చెద నన్న సైఁతురే**
**య మ్మథురాపురీరమణు లడ్డము వత్తురుగాక చెల్లరే!**
**మమ్ము విధాత నిర్దయుఁడు మన్మథవేదనపాలు సేసెనే! 1475**

**ప్రతి :** హరి= మాధవుడు; ఇమ్ములన్+ఉన్నవాఁడు+ఎ= బాగున్నాడా?; ఇక్కడికిన్= మా వ్రేపల్లెకు; ఎన్నఁడు వచ్చున్= ఎపుడు విచ్చేస్తాడు? వచ్చి= అరుదెంచి; మా+ఉమ్మలికంబు= మా విరహవేదనను; పాపును+ఎ= తొలగిస్తాడా? ప్రియుండు= మా మనోవల్లభుడు; ఇట వచ్చెదన్+అన్నన్= ఇక్కడికి వస్తానంటే; ఆ+మథురాపురీరమణులు= ఆ మధురానగరస్త్రీలు; అడ్డమువత్తురు+కాక= ఆయనరాకకు అడ్డపడతారేగాని; సైఁతురు+ఏ= సహిస్తారా? (ఓర్చుకోరని భావం); చెల్లరే= అక్కటా! నిర్దయుఁడు= కరుణమాలినవాడైన; విధాత= బ్రహ్మ; మమ్మున్= మమ్మల్ని; మన్మథవేదనపాలు+చేసెను+ఏ= మారుని బాధకు గురిచేశాడు గదా!

**తా :** శ్రీకృష్ణుడు సుఖంగా ఉన్నాడా? ఆయన ఇక్కడికి ఎప్పుడు వస్తాడు? వచ్చి మా పరితాపం తీరుస్తాడా? మా ప్రాణేశ్వరుడు ఇక్కడికి వస్తానంటే ఆ మధురా పట్టణంలోని అతివలు అడ్డగిస్తారేకాని సహిస్తారా? అయ్యయ్యో! దయమాలిన బ్రహ్మ మమ్మల్ని మన్మథబాధలకు గురిచేశాడు గదా!

**క. మఱచునొకో మదిం దలఁచి మాధవుఁ డా యమునాతటంబునం**
**దఱచుగ దివ్యసౌరభలతాగృహసీమల నేము డాఁగఁగా**
**మఱువులనుండి నీడలకు మ మ్మెలయించి కలంచి దేహముల్**
**మఱచినఁ దేర్చి నూల్కొలిపి మన్మథలీలలఁ దేల్చు చందముల్. 1476**

**ప్రతి :** మాధవుఁడు= శ్రీహరి; మదిన్= మనస్సులో; తలఁచి= భావించి; యమునాతటంబునన్= కాళిందీనదీ తీరమందు; తఱచుగన్= విరివిగా; దివ్యసౌరభ= శ్రేష్ఠమైన సువాసనగల; లతాగృహసీమలన్= తీవపొదరిండ్లతావులలో; ఏము= మేము; డాఁగన్+కాన్= దాగుకొనఁగా; మఱువులనుండి= ఆ పొదరిండ్లమాటులనుంచి; నీడలకున్= ఆ పొదరిండ్లయొక్క నీడలకు; మమ్మున్= మమ్మల్ని; ఎలయించి= చేర్చి; కలంచి= కలవరపరచి; దేహముల్+మఱచినన్= శరీరాలు పారవశ్యం చెందగా; తేర్చి= తేరుకొనునట్లుచేసి; నూల్కొలిపి= మమ్ము ప్రోత్సహించి; మన్మథలీలలన్= మదన క్రీడల్లో; తేల్చుచందముల్= ఓలలాడించే విధాలు; మఱచున్+ఒకొ!= విస్మరించునోఏమో తెలియదు.

**తా :** లక్ష్మీవల్లభుడగు శ్రీకృష్ణుడు యమునానది ఒడ్డున కమ్మని సువాసనలు వెదజల్లే పూపొదరిండ్లలో దాగిన మమ్మల్ని పొంచి చూచేవాడు. అతడు పొదరిండ్లనీడలకు మమ్ము చేర్చి వలచి కలచి మేము మైమరపు చెందగా బుజ్జగించి ప్రోత్సహించి మమ్ము మన్మథక్రీడలలో తేల్చిన ఘట్టాలు మరచునా యేమి?

**శా. నీతో నర్మగృహంబులం బలుకునే నే మెల్ల వంశోల్లస**
**ద్గీతభ్రాంతలమై కళిందతనయాతీరంబునం జేరినం**
**జేతోజాతసుఖంబులం దనిపి మా చిత్తస్థితుల్ చూడ లీ**
**లా తంత్రజ్ఞత డాఁగి మెల్లన మదాలాపంబు లాలించుటల్. 1477**

**ప్రతి :** నేము+ఎల్లన్= మే మందరం; వంశ+ఉల్లసత్+గీతభ్రాంతలము+ఐ= పిల్లనగ్రోవియొక్క ఒప్పిదమైన పాటలకు భ్రమించిన వాళ్లమై; కళిందతనయా తీరంబునన్= యమునానదియొక్క గట్టునందు; చేరినన్= చేరగా; చేతోజాత సుఖంబులన్= మన్మథసౌఖ్యములందు; తనిపి= మమ్ము తృప్తి పొందించి; మా చిత్తస్థితుల్= మా మనసు పోకడలు; చూడన్= పరీక్షించడానికి; లీలాతంత్రజ్ఞతన్= విలాసచేష్టితాలు ఎరిగినవాడు కావడంచేత; డాఁగి= మరుగున ఉండి; మెల్లనన్= తిన్నగా; మత్+ఆలాపములు= మా పలుకులు; ఆలించుటల్= వినుటలు; నీతోన్= సచివుడవైన నీతో; నర్మగృహంబులన్= ఏకాంత మందిరాలలో; పలుకునున్+ఏ= మా మనోహరుడు చెపుతాడా?

**తా :** ఉద్ధవా! మేమందరం ఆయన పిల్లనగ్రోవి పాటలకు ఆకర్షితలమై యమునాతీరానికి రాగా మమ్ము మన్మథక్రీడలలో తృప్తి పొందించేవాడు. ఆ మీదట మా మనోగతులు తెలుసుకోడానికి విలాసతంత్రజ్ఞుడుగనుక ఎక్కడో దాగిఉండి మెల్లగా మా పలుకులు ఆలకించేవాడు. ఈ సంగతులన్నీ నీతో ఏకాంతంలో చెపుతాడా?

**క. ముచ్చట వేళలఁ జెప్పునె, యచ్చుగ మును నేము నోము నప్పుడు జలముల్**
**సొచ్చిన మా చేలంబులు, ముచ్చిలి యిచ్చినవిధంబు మూలం బెల్లన్. 1478**

**ప్రతి :** మును= మునుపు; నేము= మేము; నోము+అప్పుడు= కాత్యాయనీవ్రతం సలిపేటప్పుడు; జలముల్+చొచ్చినన్= స్నానమాడుటకు యమునానది నీళ్లలో ప్రవేశించగా; మా చేలంబులు= మా చీరలు; ముచ్చిలి= దొంగిలించి; ఇచ్చిన విధంబుమూలంబు= మళ్ళీ మాకిచ్చి నందులకు గల కారణాన్ని; ఎల్లన్= అంతయూ; అచ్చుగన్= స్పష్టంగా; ముచ్చట వేళలన్= నీతో వినోదంగ మాట్లాడే సమయాలలో; చెప్పున్+ఎ= చెపుతాడా?

**తా :** శ్రీకృష్ణుడు నీతో ముచ్చటాడు వేళలో కాత్యాయనీవ్రతం కావించడానికి మేము వివస్త్రలమై స్నానార్థం యమునా నదినీళ్లలో ప్రవేశించిఉన్నప్పుడు మా వలువలు దొంగిలించి, మళ్ళీ మా ప్రార్థనలపై చీరలిచ్చిన ఉదంతము అంతా చెపుతాడా?

శా. ఏకాంతంబున నీదుపై నొరగి తా నేమేని భాషించుచో
మా కాంతుండు వచించునే రవిసుతామధ్యప్రదేశంబునన్
రాకాచంద్రమయూఖముల్ మెఱయఁగా రాసంబు మాతోడ నం
గీకారం బొనరించి బంధనియతిం గ్రీడించు విన్నాణముల్. 1479

**ప్రతి :** మా కాంతుండు= లక్ష్మీవల్లభుడైన మాధవుడు; ('మా రమా మంగళదేవతా' – అమరం) రవిసుతా మధ్యప్రదేశంబునన్= యమునానదినడిమితావులో; రాకాచంద్రమయూఖముల్= పున్నమ జాబిలి కిరణాలు; మెఱయన్+కాన్= ప్రకాశించగా; రాసంబు= రాసక్రీడ; మాతోడన్= మాతో; అంగీకారంబు+ఒనరించి= సల్పుటకు సమ్మతించి; బంధనియతిన్= రాసబంధ నియమంతో; క్రీడించు విన్నాణముల్= క్రీడించే నేర్పులు; ఏకాంతంబునన్= ఇతరు లెవ్వరూలేని సమయంలో; నీదుపైన్= నీ మీద; ఒరగి= వ్రాలి; తాను= శ్రీకృష్ణుడు; ఏమేని భాషించుచోన్= ఏ విషయాలనైనా మాట్లాడునప్పుడు; వచించున్+ఏ= చెపుతాడా?

**తా :** నీవూ, హరీ ఒంటరిగా ఉన్నప్పుడు నీ భుజం మీదికి వ్రాలి నీతో ఏవో రహస్యసంభాషణలు సలిపేటప్పుడు పున్నమ వెన్నెలరేయి యమునానదీమధ్యభాగంలో మాతో రాసక్రీడలు నెరపుతూ బంధరతులొనర్చిన నేర్పులు అతడు ఉగ్గడిస్తాడా?

సీ. తనుఁబాసి యొక్కింత తడవైన నిటమీఁద నేలపై మేనులు నిలువ మనుము
నేలపై మేనులు నిలువక యట మున్న ధైర్యంబు లొక్కటఁ దలఁగు ననుము
ధైర్యంబు లొక్కటఁ దలఁగిన పిమ్మటఁ జిత్తంబు లిక్కడఁ జిక్క వనుము
చిత్తంబు లిక్కడఁ జిక్కక వచ్చినఁ బ్రాణంబు లుండక పాయు ననుము

తే. ప్రాణములు వోవ మఱి వచ్చి ప్రాణవిభుఁడు, ప్రాణిరక్షకుఁ డగు తన్నుఁ బ్రాణు లెల్లఁ
జేరి దూఱంగ మఱి యేమి సేయువాఁడు, వేగ విన్నప మొనరింపవే మహాత్మ! 1480

**ప్రతి :** మహా+ఆత్మ!= గొప్ప హృదయముగల ఉద్ధవా!; తనున్= తనను; పాసి= వీడి; ఒక్క+ఇంతతడవు+ఐనన్= ఇంచుక సేపయినా; ఇటమీఁదన్= ఇటుపై; నేలపైన్= భూమిమీద; మేనులు= మా శరీరాలు; నిలుపవు+అనుము= ఉండవని ఆయనకు చెప్పు; నేలపైన్= ఈ భూమిమీద; మేనులు= మా దేహాలు; నిలువక+అటమున్న+అ= నిలిచి ఉండటానికి ముందే; ధైర్యంబులు= జీవించగలమనే ధైర్యాలు; ఒక్కటన్= ఒక్కసారిగా; తలఁగున్+అనుము= తొలగిపోతాయని తెల్పు; ధైర్యంబులు= జీవితేచ్ఛలు; ఒక్కటన్= ఒక్కసారిగా; తలఁగిన పిమ్మటన్= తొలగిపోయిన పిదప; చిత్తంబులు= మా మనస్సులు; ఇక్కడన్= ఇచ్చట; చిక్కవు+అనుము= నిలువవని పల్కుము; చిత్తంబులు= మా మనస్సులు; ఇక్కడన్= ఈ మేనిలో; చిక్కక వచ్చినన్= నిలువనిస్థితి కలుగగా; ప్రాణంబులు= అసువులు; ఉండక= కాయంలో నిలువక; పాయున్+అనుము= తొలగునని చెప్పుము; ప్రాణములు పోవన్= మా అసువులు తొలగిపోగా; మఱి= అవతల; వచ్చి= తాను అరుదెంచి; ప్రాణవిభుఁడు= మా జీవితేశ్వరుడైన అచ్యుతుడు; ప్రాణిరక్షకుఁడు= జీవులను కాపాడేవాడు; అగుతన్నున్= అయినట్టి తనను; ప్రాణులు+ఎల్లన్= జీవులందరూ; చేరి= గుమిగూడి; దూఱంగన్= నిందించగా; మఱి= అటుపిమ్మట; ఏమి+చేయువాఁడు= ఏమి చేస్తాడు? (ప్రాణాలు పోయిన పిదప తానేమి సుఖపెట్టగలడని భావం); వేగ= శీఘ్రమే; విన్నపము+ఒనరింపవు+ఏ= విజ్ఞప్తి సలుపుమయ్యా!

**తా :** ఓ మహానుభావా! ఉద్ధవా! మా మాటలుగా ప్రాణేశ్వరునికి ఇలా విన్నవించు. నను విడిచి ఇటమీద ఇంచుక సేపైన మా దేహాలు ఉర్విపై ఉండవని చెప్పు. నేలపై మా శరీరాలు నిలువకమునుపే ఒక్కసారిగా మా మనోధైర్యాలు తొలగిపోతాయని చెప్పు. మా మనోధైర్యాలు ఒక్కసారిగా తొలగిపోయిన పిదప మా మనసు లిక్కడ ఉండవని చెప్పు. ఇక్కడ మనసులు నిలువకపోగా మా ప్రాణాలు ఎగిరిపోవునని చెప్పు. మా ప్రాణాలు ఎగిరిపోయిన పిమ్మట ప్రాణేశ్వరుడగు తాను వచ్చినా జీవరక్షకుడైన తనను జీవులందరూ గుమిగూడి నిందించగా ఏమిచేయగలడు? నీవీ సంగతి వెంటనే అతనికి విన్నవించు.

**క. తగులరె మగలను మగువలు?, దగులదె తను మున్ను కమల, తగవు విడిచియుం**
**దగిలిన మగువల విడుచుట, దగదని తనుఁ దగవు వలుకఁ దగుదువు హరికిన్. 1481**

**ప్రతి :** మగువలు= స్త్రీలు; మగలను= పురుషులను; తగులరు+ఎ= ప్రేమించరా? మున్ను= పూర్వం; కమల= లక్ష్మీదేవి; తనున్= తన్ను; తగులదు+ఎ= మోహింపదా?; తగవు విడిచియున్= న్యాయం వదలికూడ; తనున్= తన్ను (శ్రీకృష్ణుణ్ణి); తగిలిన మగువలన్= మోహించిన వనితల్ని; విడుచుట= వదలిపెట్టడం; తగదు+అని= ధర్మంకాదని; హరికిన్= శ్రీకృష్ణునికి; తగవు= న్యాయం; పలుకన్= చెప్పుటకు; తగుదువు= నీవు అర్హుడవు.

**తా :** స్త్రీలు పురుషులను ప్రేమించరా? లక్ష్మి మునుపు తన్ను ప్రేమించలేదా? న్యాయం వీడియు తనను ప్రేమించిన ఇంతుల్ని వీడటం తగదు అనే న్యాయాన్ని దామోదరుడికి తెల్పడానికి నీవే తగినవాడివి.

**సీ. విభుఁడు మా వ్రేపల్లె వీథుల నేతేరఁ జూతుమే యొకనాఁడు చూడ్కు లలరఁ**
**బ్రభుఁడు మాతో నర్మభాషలు భాషింప విందుమే యొకనాఁడు వీను లలరఁ**
**దనువులు పులకింప దయితుండు డాసినఁ గలుగునే యొకనాఁడు కౌఁగిలింపఁ?**
**బ్రాణేశ! మమ్మేల పాసితి వని దూఱ దొరకునే యొకనాఁడు తొట్రుపడఁగ?**

**తే. వచ్చునే హరి మే మున్నవనముఁ జూడఁ?, దలఁచునే భర్త మాతోడితగులు తెఱఁగుఁ?**
**దెచ్చునే విధి మన్నాథుఁ దిట్టువడక, యెఱుఁగఁ బలుకు మహాత్మ! నీ కెఱుఁగ వచ్చు. 1482**

**ప్రతి :** విభుఁడు= నాథుడు; మా వ్రేపల్లెవీథులన్= మా గొల్లపల్లెలోని వీథుల్లో; ఏ తేరన్= రాగా; చూడ్కులు+అలరన్= కనులవిందుగా; ఒకనాఁడు= ఒకరోజు; చూతుము(చూచుదుము)+ఎ= దర్శించగల మా?; ప్రభుఁడు= మా ప్రాణనాయకుడు; మాతోన్= చెలులమైన మాతో; నర్మభాషలు= ప్రియవచనాలు; భాషింపన్= మాట్లాడగా; వీనులు+అలరన్= చెవులు సంతోసింపగా; ఒకనాఁడు= ఒకరోజు; విందుమే= వినగలమా?; దయితుండు= వల్లభుడు; డాసినన్= మా చెంతకు రాగా; తనువులు= దేహాలు; పులకింపన్= గగుర్పాటుచెందగా; కౌఁగిలింపన్= ఆలింగనం చేయడానికి; ఒకనాఁడు= ఒకరోజు; కలుగునే= దొరకునా?; ప్రాణ+ఈశ= జీవితేశ్వరా!; మమ్మున్= మమ్మల్ని; ఏల పాసితివి+అని= ఎందుకు విడిచావంటూ; తొట్రుపడన్+కన్= సంభ్రమించగా; దూఱన్= నిందించుటకు; ఒకనాఁడు= ఒకరోజు; దొరకునే= మాకు లభిస్తుందా? హరి= గోవిందుడు; మేము+ఉన్న= మేము నివసించే; వనమున్+చూడన్= బృందావనాన్ని చూచుటకు; వచ్చునే= వస్తాడా? భర్త= మా ప్రియుడు; మాతోడి తగులుతెఱఁగు= మాతో తనకున్న సంబంధంయొక్క తీరును; తలఁచునే= స్మరిస్తాడా?; విధి= బ్రహ్మదేవుడు; తిట్టు+పడక= మాయొక్క దూషణల పాలుగాకుండ; మత్+నాథున్= మా విభుణ్ణి; తెచ్చునే= మా దగ్గరకు తీసుకవస్తాడా? మహా+ఆత్మ= ఓ మహానుభావా! ఉద్ధవా! నీకున్= నీకు; ఎఱుఁగన్ వచ్చున్= తెలిసి ఉంటుంది; ఎఱుఁగన్+పలుకు= మాకు తెలియజెప్పు.

**తా :** మా ప్రియతముడు వ్రేపల్లె వీథులకు రాగా ఒకనాడైనను కనులపండువుగా మేము కనగలుతామా? మా ప్రభువు మాతో ప్రియభాషణాలు భాషించగా ఒకనాడైనా వీనులవిందుగా వినగల్గుతామా? వల్లభుడు చెంతకురాగా ఒకనాడైనా ఒడలు గగుర్పొడవగా కౌగిలించుకునే భాగ్యం మాకు కల్గుతుందా? ఓ ప్రాణనాయకా! మమ్మెందుకు ఎడబాశావు అని తొట్రుపడుతూ తనను దూషించేందుకు ఒకనాడైనా మాకు అవకాశం కల్గుతుందా? హరి ఏనాటికైనా మేమున్న ఈ వనానికి చూడడానికైవస్తాడా? మా మనోవల్లభుడైన శ్రీకృష్ణుడు తనకు మాతో ఉన్న సంబంధాన్ని స్మరిస్తాడా? మాచేత తిట్టువడకముందే బ్రహ్మ మానాథుణ్ణి మా చెంతకు తెస్తాడా? ఓ మహాత్మా! ఇన్నీ నీకు తెలిసే ఉంటాయి కనుక మాకు వివరంగా చెప్పు.

**వ. అని 'దుఃఖార్ణవమగ్నంబైన గోకులంబు నుద్ధరింపుము రమానాథ' యని గోపికలు వగచి తదనంతరంబ మఱియు నుద్ధవ నిగదితం బయిన కృష్ణసందేశంబులవలన విరహవేదనలు విడిచి యుద్ధవునిం బూజించి; రిట్లు కృష్ణలీలావర్ణనలు సేయుచు వ్రేపల్లె నుద్ధవుండు గొన్నినెల లుండి నందాదుల వీడ్కొని మరలి రథారూఢుండై చని చని. 1483**

**ప్రతి :** అని= అంటూ; దుఃఖ+అర్ణవ నిమగ్నంబు= శోకమనే సాగరంలో మునిగింది; ఐన= అయినట్టి; గోకులంబున్= గొల్లలవంశాన్ని; ఉద్ధరింపుము= కాపాడుము; రమానాథ= లక్ష్మీవల్లభా, కృష్ణా! అని= అంటూ; గోపికలు= గొల్ల స్త్రీలు; వగచి= దుఃఖించి; తద్+అనంతరంబు+అ= అటుపిమ్మట; మఱియున్= ఇంకనూ; ఉద్ధవ నిగదితంబు+ఐన= ఉద్ధవునిచే చెప్పబడిన; కృష్ణసందేశంబులవలనన్= కృష్ణుడు చెప్పిపంపిన సమాచారాలవలన; విరహవేదనలు= ఎడబాటువల్ల కలిగిన తాపాలు; విడచి= వదలి; ఉద్ధవునిన్+పూజించిరి= ఉద్ధవుణ్ణి అర్చించారు; ఇట్లు= ఈ విధంగా; కృష్ణలీలావర్ణనలు+చేయుచున్= శ్రీకృష్ణునియొక్క విలాసాలు కొనియాడుతూ; వ్రేపల్లెన్= వ్రేపల్లెలో; ఉద్ధవుండు= ఉద్ధవుడు; కొన్నినెలలు+ఉండి= కొన్ని మాసాలు నివసించి; నంద+ఆదులన్= నందుడు మొదలైన గొల్లపెద్దలను; వీడ్కొని= వదలి, వారినుండి సెలవుగైకొని; మరలి= నందవ్రజమునుండి బయలుదేరి; రథ+ఆరూఢుండు+ఐ= రథమెక్కి; చనిచని= వెళ్ళి వెళ్ళి...

**తా :** ఇందిరానాథా! దుఃఖమనే సముద్రంలో మునిగినట్టి గోకులాన్ని ఉద్ధరించుమా! అంటూ ఉద్ధవునిముందు గోపికలు శోకించారు. అటుపిమ్మట ఉద్ధవుడు తెల్పిన శ్రీకృష్ణసందేశం ఆలకించి, వారు విరహ వేదనలు విడిచి అతణ్ణి పూజించారు. ఇలా శ్రీకృష్ణలీలలు వర్ణిస్తూ ఉద్ధవుడు కొన్ని మాసాలు వ్రేపల్లెలో గడిపాడు. పిదప నందాదియాదవపుంగవులను వీడ్కొని రథమెక్కి మధురకు బయలుదేరి వెళ్ళాడు.

**క. సారమతిఁ బ్రణుతి సేయుచు, నారయ నుద్ధవుఁడు గాంచె నఘసంహారిన్**
**హారిన్ మథురానగర వి, హారిన్ రిపుజనమదాపహారిన్ శౌరిన్. 1484**

**ప్రతి :** ఉద్ధవుఁడు= శ్రీకృష్ణసచివుడు; ఆరయన్= పరికింపగా; సారమతిన్= స్థిరమైన చిత్తంతో; ప్రణుతి+చేయుచున్= స్తోత్రంచేస్తూ; అఘసంహారిన్= పాపాలను పోగొట్టేవాడూ; హారిన్= మదికింపు గొల్పేవాడూ; మథురానగర విహారిన్= మథురాపట్టణంలో సంచరించేవాడూ, రిపుజనమద+అపహారిన్= విరోధులయొక్క గర్వం హరించేవాడూ అయిన; శౌరిన్= శూరుని మనుమడైన శ్రీకృష్ణుణ్ణి; కాంచెన్= దర్శించాడు.

**తా :** ఆ విధంగా స్థిరచిత్తంతో శ్రీహరిసంకీర్తనం కావిస్తూ వెళ్ళిన ఉద్ధవుడు పాపాలను పటాపంచలు చేసేవాడూ, మదికి ఇంపు గల్గించేవాడూ, శత్రుజనులమదం అణచేవాడూ, మథురాపురిలో విహరించేవాడూ, శూరునిమనుమడూ అయిన శ్రీకృష్ణుణ్ణి చూశాడు.

**వ. కని యథోచితంబుగా భాషించుచుఁ దనచేత నందాదులు పుత్తెంచినకానుకలు బలకృష్ణులకు నుగ్రసేనునికి వేఱు వేఱ యిచ్చెనని చెప్పి శుకుండు పరీక్షిన్నరేంద్రున కిట్లనియె. 1485**

**ప్రతి :** కని= దర్శించి; యథా+ఉచితంబు+కాన్= అప్పటికి తగినట్లుగా; భాషించుచున్= మాట్లాడుతూ; తనచేతన్= తనతో; నంద+ఆదులు= నందుడు మొదలైన గోపవృద్ధులు; పుత్తెంచిన= ఇచ్చిపంపిన; కానుకలు= బహుమతులు; బలకృష్ణులకున్= బలరామునికీ, శ్రీకృష్ణునికీ; ఉగ్రసేనునికిన్= శ్రీకృష్ణుని మాతామహుడైన (తల్లియొక్క తండ్రి= తాత) ఉగ్రసేన మహారాజుకూ; వేఱువేఱన్= విడివిడిగా; ఇచ్చెన్+అని చెప్పి= ఉద్ధవుడు సమర్పించాడని పలికి; శుకుండు= భాగవతపురాణకథకుడైన శుకమహర్షి; పరీక్షిత్+నర+ఇంద్రునకున్= పరీక్షిన్మహారాజుకు; ఇట్లు+అనియెన్= మరల ఈ విధంగా అన్నాడు.

**తా :** ఉద్ధవుడు శ్రీకృష్ణుణ్ణి సందర్శించి అతనితో తగురీతిగా మాట్లాడుతూ తనచేత నందుడు మొదలయినవారు ఇచ్చిపంపిన బహుమానాలు కృష్ణబలరాములకు, ఉగ్రసేనమహారాజుకు వేరువేరుగా సమర్పించాడు - అని పలికి శుకయోగీంద్రుడు మళ్ళీ పరీక్షిన్నరేంద్రునితో ఈ విధంగా అన్నాడు.

## ❖ శ్రీ కృష్ణుఁడు ఉద్ధవునితోఁ జేరి కుబ్జాగృహంబునకు నరుగుట ❖

**మ. తను మున్నంగజకేళిఁ గోరిన లతాతన్విన్ రతిక్రీడలం**
**దనుపం గోరి జనార్దనుం డరిగె రత్నస్వర్ణమాల్యాను లే**
**పన భూషాంబరధూపదీపపరిదీప్తంబై మనోజప్రదీ**
**పనమై యున్న తదీయగేహమునకుం బంచేషుపంచేషుఁడై. 1486**

**ప్రతి :** జనార్దనుండు= శ్రీకృష్ణుడు; తను= తనను; మున్ను= ఇంతకు మునుపు; అంగజకేళిన్= శృంగారక్రీడను; కోరిన= కోరుకున్న; లతాతన్విన్= తీగవంటి శరీరం గల పడతిని; రతిక్రీడలన్= మదన కేళులతో; తనుపన్+కోరి= తృప్తి పొందింపదలచి; రత్న= రత్నాలతో; స్వర్ణ= బంగారంతో; మాల్య= పూలహారాలతో; అనులేపన= మైపూతలతో; భూషా= నగలతో; అంబర= వస్త్రాలతో; ధూప= సుగంధధూపాలతో; దీప= దీపాలతో; పరిదీప్తంబు+ఐ= వెలిగిపోతున్నదైన; మనోజ+ప్రదీపనము+ఐ= కామాన్ని రేకెత్తించేదిగా; ఉన్న= ఉన్నట్టి; తదీయ గేహమునకున్= ఆమె (కుబ్జ) ఇంటికి; పంచ+ఇషు= ఐదుబాణాలు కలిగిన మన్మథుడికే; పంచ+ఇషుఁడు+ఐ= మన్మథుడై (అంటే మన్మథునికంటె అందగాడైన శ్రీకృష్ణుడు); అరిగెన్= వెళ్లాడు.

**తా :** తనతో శృంగారక్రీడ జరపాలని కుబ్జ మునుపే శ్రీకృష్ణుణ్ణి కోరింది. ఆమె తీగవలె సన్నగా ఉన్న అందగత్తె. అలాంటి కుబ్జను మన్మథ కేళిలో తేల్చవలెనని శ్రీకృష్ణుడు భావించాడు. ఆమెఇల్లు రత్నాలతో, బంగారంతో, పూలదండలతో కమ్మని మైపూతలతో, నగలతో, వస్త్రాలతో, అగరుసువాసనలతో, దీపాలతో విలసిల్లుతూ మన్మథోద్రేకాన్ని రేకెత్తిస్తున్నది. అలాంటి ఇంటికి మన్మథునికే మన్మథుడైన శ్రీకృష్ణుడు వెళ్లాడు.

**వ. ఇ ట్లరిగి తద్గేహమధ్యంబున. 1487**

**ప్రతి :** ఇట్లు+అరిగి= ఈ విధంగా వెళ్లి; తద్+గేహ= ఆమె ఇంటి యొక్క; మధ్యంబునన్= మధ్యభాగంలో...

**తా :** ఇలా ఆ కుబ్జఇంటికి వెళ్లి, ఆ ఇంట్లో

**ఆ. కాముశరమువోలెఁ గమలారి కళవోలెఁ, మెలఁగి యాడనేర్చు మెఱుపుఁ బోలె**
**నిఖిలభువనమోహినీదేవతయుఁ బోలెఁ, జెలువు మెఱసియున్న చెలువఁ గనియె. 1488**

**ప్రతి :** కాము= మన్మథునియొక్క; శరము+పోలెన్= బాణంలాగా; కమల+అరి= పద్మాలకు శత్రువు – అంటే చంద్రుడి యొక్క; కళ+పోలెన్= కళలాగా; మెలఁగి= కదలుతూ; ఆడనేర్చు= నర్తించడం నేర్చిన; మెఱుపున్+పోలెన్= మెరుపులాగా; నిఖిలభువన= మొత్తం ప్రపంచానికి; మోహినీ దేవతయున్+పోలెన్= మోహం కలిగించే దేవతలాగా; చెలువు= అందం; మెఱసి+ఉన్న= వెలిగిపోతున్న; చెలువన్= అందగత్తెను; కనియెన్= చూచాడు.

**తా :** ఆ కుబ్జ మన్మథుని బాణంలాగా ఉంది. చంద్రుడి కళలాగా కాంతు లీనుతూంది. కదలుతూ నర్తించే మెరుపుతీగలాగా ఉంది. మొత్తం జగత్తుకే మోహినీదేవతలాగా ఉంది. అందంతో మెరిసిపోతూ ఉంది. అలాంటి సౌందర్యవతిని శ్రీకృష్ణుడు చూచాడు.

**మ. హరి యేతెంచిన లేచి సంభ్రమముతో నాళీసమూహంబుచే**
**సిరి యొప్పన్ విహితోపచారములు తాఁ జేయించి సౌవర్ణ సుం**
**దర తల్పస్థితుఁ జేసి, యుద్ధవుని నుద్యత్ప్రీతిఁ బూజించి భా**
**సుర పీఠంబున నుండు మంచు మది నౌత్సుక్యంబు శోభిల్లఁగన్. 1489**

**ప్రతి :** హరి= శ్రీకృష్ణుడు; ఏతెంచినన్= రాగా (కుబ్జ); లేచి= నిలబడి; సంభ్రమముతోన్= తత్తర పాటుతో; ఆళీసమూహంబుచేన్= చెలికత్తెల సమూహంచేత; సిరి= వైభవం; ఒప్పన్= వెలిగిపోయేలా; విహిత+ఉపచారములు= తగిన సేవలను; తాన్= తాను; చేయించి= (వారితో) చేయించి; సౌవర్ణ= బంగారంతో చేయబడిన; సుందర తల్ప= అందమైన పడకపై; స్థితున్+చేసి= కూర్చోబెట్టి; ఉద్ధవునిన్= ఉద్ధవుడిని; ఉద్యత్+ప్రీతిన్= ఎంతో ఇష్టంతో; పూజించి= పూజచేసి; భాసుర= ప్రకాశిస్తున్న; పీఠంబునన్= పీఠంమీద; ఉండన్+పంచి= కూర్చోబెట్టి; మదిన్= మనసులో; ఔత్సుక్యంబు= ఉత్సాహం, ఉబలాటం; శోభిల్లన్+కన్= ప్రకాశించగా...

**తా :** శ్రీకృష్ణుడు తన ఇంటికి రాగానే కుబ్జ తత్తరపాటుతో లేచినిలబడింది. తన చెలికత్తెల బృందాన్ని పిలిచింది. తన వైభవానికీ, సంపదకూ తగినరీతిలో ఆయనకు ఉపచారాలను చేయించింది. అందంగా ఉన్న బంగారుమంచంపై శ్రీకృష్ణుణ్ణి కూర్చో పెట్టింది. ఆయన వెంట వచ్చిన ఉద్ధవుణ్ణి ఎంతో ఆదరంతో పూజించి, మెరిసిపోతున్న ఒక బంగారు పీఠంపై ఆయన్ను కూర్చో బెట్టింది. ఆమెమనసులో ఉత్సాహం, పరవళ్లు తొక్కింది.

**క. ఆళీనివహనివేదిత, మాలా మృగనాభిపంకమణిమయభూషా**
**చేలాలంకృత యగుచును, హేలావతి గోరె వనరుహేక్షణుఁ గవయన్. 1490**

**ప్రతి :** ఆళీ= చెలికత్తెల; నివహ= సమూహంచే; నివేదిత= వినయంగా సమర్పించబడిన; మాలా= పూలదండలు; మృగనాభిపంక= కస్తూరి లేపనంతో; మణిమయ= మణులతో నిండిన; భూషా= నగలతో; చేల= బట్టలతో; అలంకృత= అలంకరించబడింది; అగుచును= అవుతూ; హేలావతి= విలాసవతి; వనరుహ+ఈక్షణున్= పద్మంవంటి కళ్లు కల శ్రీకృష్ణుణ్ణి; కవయన్= పొందడానికి; కోరెన్= కోరుకుంది.

**తా :** చెలికత్తెలబృందం కుబ్జకు పూలదండలను, కస్తూరి లేపనాన్ని, మణులతో మెరిసిపోతున్న ఆభరణాలను, అందమైన వస్త్రాలను సమర్పించారు. వాటిల్ని ధరించి, ఆ విలాసవతి శ్రీకృష్ణుడితో సంగమాన్ని కోరింది.

**క. లీలావతీకృతోల్లస, దేలా కర్పూరమిళితహితమధురమహా**
**హాలారసపానమద, శ్రీలాలిత యగుచు నబల చేరెం గృష్ణున్. 1491**

**ప్రతి :** లీలావతీకృత= విలాసినులైన చెలికత్తెలచేత తయారు చేయబడిన; ఉల్లసత్= ప్రకాశిస్తున్న; ఏలా= ఏలకులతో; కర్పూర= పచ్చకర్పూరంతో; మిళిత= కూడిన; హిత= రుచికరమైన; మధుర= మధురమైన; మహాహాలారస= ప్రశస్తమైన మద్యం; పాన= త్రాగడంచేత; మద= మైకం యొక్క; శ్రీ= సంపదచే; లాలిత= మత్తెక్కినది; అగుచున్= అవుతూ; అబల= ఆ స్త్రీ (కుబ్జ); కృష్ణున్= శ్రీకృష్ణుణ్ణి; చేరెన్= చేరింది.

**తా :** విలాసవతులైన చెలికత్తెలు ఒక మద్యాన్ని తయారు చేశారు. అది ఏలకి, పచ్చకర్పూరంవంటి సుగంధ ద్రవ్యాలతో కూడింది. ఎంతో రుచికరమైంది. కమ్మనిది. అలాంటి ప్రశస్తమైన మద్యాన్ని త్రాగిన కుబ్జ తూలుతూ, అతణ్ణి సమీపించింది.

**మ. సరసాలోకనవృష్టి పైఁ గురియుచున్ సమ్యగ్వచోవైఖరిం**
**గరఁగంజేసి సువర్ణకంకణసమగ్రం బైన సైరంధ్రి కేల్**
**కరపద్మంబునఁ బట్టి తల్పమున కాకర్షించి గంభీరతం**
**బరిరంభాదుల నాన పుచ్చి మరుసంభావించుచున్ వేఁడుకన్. 1492**

**ప్రతి :** సరస+ఆలోకనవృష్టి= అనురాగపు చూపులవాన; పైన్= ఆ కుబ్జమీద; కురియుచున్= వర్షిస్తూ; సమ్యక్+వచస్+వైఖరిన్= తగిన మాటలను పలుకుతూ; కరఁగన్+చేసి= ద్రవింపచేసి; సువర్ణకంకణ= బంగారుగాజులతో; సమగ్రంబు+ఐన= నిండిన; సైరంధ్రి= సైరంధ్రిగా ఉన్న; కుబ్జకేల్= కుబ్జచేతిని; కరపద్మంబునన్= తామరపూలవంటి కోమలమైన తన చేత్తో; పట్టి= పట్టుకుని; తల్పమునకున్= పడకపైకి; ఆకర్షించి= లాగి; గంభీరతన్= గంభీరంగా; పరిరంభ+ఆదులన్= కౌగిలించడంవంటి చేష్టలతో; నానపుచ్చి= సిగ్గును తొలగించి; మరున్= మన్మథుణ్ణి; సంభావించుచున్= సమ్మానిస్తూ; వేడుకన్= సంబరంతో...

**తా :** శ్రీకృష్ణుడు అనురక్తిగల్గిన చూపులనే వానతో కుబ్జను ముంచెత్తాడు. సరసమైన మాటలతో ఆమెను కరిగించాడు. బంగారు కంకణాలతో నిండిన ఆమెచేతిని కోమలమైన తనచేత్తో పట్టుకున్నాడు. పానుపుమీదకు లాగాడు. గంభీరంగా కౌగిళ్లు మొదలైన చేష్టలతో సిగ్గు పోగొట్టాడు. మన్మథకేళిపట్ల ఆసక్తి చూపుతూ, వేడుకతో

**విశే :** స్వతంత్రురాలిగా ఉంటూ, పరుల గృహంలో ఉండి; చందనలేపనం, తిలకనిర్మాణం మొదలైన పనులు చేసే స్త్రీని సైరంధ్రి అంటారు.

**ఉ. జాతియుఁ గాలముం గళయు సత్త్వము దేశము భావచేష్టలున్**
**ధాతువుఁ బ్రాయముం గుణముఁ దద్దశయున్ హృదయంబుఁ జూడ్కియుం**
**బ్రీతివిశేషముం దెలిసి పెక్కువిధంబులఁ దొయ్యలిన్ మనో**
**జాత సుఖంబులం దనిపె శౌరి వధూహృదయాపహారియై. 1493**

**ప్రతి :** జాతియున్= ఆమె జాతిని; కాలమున్= కాలాన్ని; కళయున్= కళను; సత్త్వమున్= బలాన్ని; దేశమున్= దేశాన్ని; భావచేష్టలున్= స్వభావానికి సంబంధించిన చేతలగురించి; ధాతువు= త్రిధాతువులనూ; ప్రాయమున్= వయసునూ; గుణమున్= మూడుగుణాలను; తద్+దశయున్= ఆ దశఅవస్థలూ; హృదయంబు= మనసు; చూడ్కియున్= చూసే తీరు; ప్రీతివిశేషమున్=

విశేషమైన ప్రీతి కలిగి ఉండడం; తెలిసి= తెలుసుకుని; తొయ్యలిన్= స్త్రీని; పెక్కువిధంబులన్= అనేక విధాలుగా; వధూహృదయ+ అపహారి+ఐ= ఆ కన్యమనసును దోచుకున్నవాడై; మనస్+జాతసుఖంబులన్= మన్మథ సుఖాలతో; తనిపెన్= తృప్తి పరిచాడు.

**తా :** కుబ్జ జాతిని, కాలాన్ని, కళను, సత్త్వాన్ని, దేశాన్ని, భావచేష్టలను, ధాతువును, వయసును, గుణాన్ని, దశను, మనసును, చూపులను, ప్రీతి విశేషాలను తెలుసుకుని, అనేక విధాలుగా ఆమె మనసును దోచుకుని, మదనకేళీసుఖాలలో ఆమెను ముంచెత్తాడు.

**క. కరపద్మంబుల మాధవుఁ, గరమొప్పం గౌఁగిలించి కామానలముం**
**గరభోరువు వర్జించెను, గర మరు దని తోడిశీతకరముఖు లలరన్. 1494**

**ప్రతి :** కర= చేతులు అనే; పద్మంబులన్= తామరపూలతో; మాధవున్= శ్రీకృష్ణుడిని; కరము+ఒప్పన్= మిక్కిలి చక్కగా; కౌఁగిలించి= ఆలింగనం చేసుకొని; కామ+అనలమున్= కోరిక అనే అగ్నిని; కరభ+ఊరువు= మణికట్టు నుండి చిటికెనవ్రేలి వరకుగల సున్నితమైన భాగంవంటి తొడలు ఉన్న స్త్రీ; వర్జించెను= వదలిపెట్టింది; కరము= మిక్కిలి; అరుదు+అని= అపురూపమైందని; తోడి= వెంట ఉన్న; శీతకరముఖులు= చంద్రబింబంవంటి ముఖాలున్న చెలికత్తెలు; అలరన్= మురిసిపోగా...

**తా :** పద్మాల్లాంటి తన చేతులతో కుబ్జ గట్టిగా అందంగా శ్రీకృష్ణుణ్ణి కౌగిలించుకుంది. ఆ ఆలింగనం చేత కరభంలాంటి సుతిమెత్తని తొడలుగల కుబ్జ తన మదనతాపాన్ని పోగొట్టుకుంది. అది గమనించిన చంద్రవదనలైన ఆమె చెలికత్తెలు ఇది అరుదైన విషయమని సంతోషపడ్డారు.

**మ. సనకాదుల్ తలపోసి కానని విభున్ సర్వప్రభున్ దుర్లభున్**
**ముసు దా నిచ్చిన యంగరాగసుకృతామోదంబునం గూడియున్**
**ఘననిర్వాణవిభూతి యిమ్మనక యా కంజాక్షి 'యేఁ బాయఁ జా**
**ల ననుం గొన్నిదినంబు లంగభవలీలం దేల్పవే? నావుడున్. 1495**

**ప్రతి :** సనక+ఆదుల్= సనకుడు మొదలైన మహాత్ములు (సనకుడు, సనత్కుమారుడు, సనత్సుజాతుడు, సనందనుడు – వీళ్లు ఎప్పటికీ కౌమారావస్థలో ఉండే మహాతపస్వులు, జ్ఞానసంపన్నులు బ్రహ్మమానసపుత్రులు); తలపోసి= చింతించి; కానని= చూడలేని; విభున్= అంతటా నిండిన వాడిని; సర్వప్రభున్= అన్నిటికీ అధిపతి అయినవాడిని; దుర్లభున్= ఎంత కష్టించినా దొరకని వాడిని; ముసు= మునుపు; తాన్+ఇచ్చిన= తాను ఇచ్చిన; అంగరాగ= మైపూతవంటి; సుకృత+ఆమోదంబునన్= మంచి పనులవల్ల కలిగిన పుణ్యంచేత; కూడియున్= కలిసినప్పటికీ కూడా; ఘన= గొప్పదైన; నిర్వాణ= మోక్షం అనే; విభూతి= సంపదను; ఇమ్ము+అనక= ఇవ్వమని అడగకుండా; ఆ+కంజ+అక్షి= ఆ పద్మాల్లాంటి కనులున్న కుబ్జ; ఏన్= నేను; పాయన్+చాలన్= విడిచి పెట్టలేను; ననున్= నన్ను; కొన్ని దినంబులు= మరికొన్ని రోజులపాటు; అంగభవలీలన్= మన్మథునిక్రీడలో (మదన కేళిలో); తేల్పవు+ఏ= తేలించవా; నావుడున్= అనగా విని...

**తా :** శ్రీకృష్ణుణ్ణి పొందగలగడం గొప్ప భాగ్యం. సనకాదులవంటి మహాజ్ఞానులకు కూడా దొరకనివాడు – ఆ మహాత్ముడు. అలాంటి శ్రీకృష్ణుడు కుబ్జకు లభించాడు. ఆమె ఒకప్పుడు చందన మివ్వడంవల్ల ఈ పుణ్యం లభించింది. అంతటి శ్రీకృష్ణుడు తనకు లభిస్తే మోక్షం కోరుకోవాలి. కానీ, ఆమె కొన్నాళ్లు తన ఇంట్లోనే ఉండి, తనను మదనకేళిలో తేల్చుమని కోరింది.

**ఆ. వనిత గోరుకొనిన వర మిచ్చి శౌరి యా, యుద్ధవుండుఁ దాను నువిదయిల్లు**
**వెడలె నపుడు తియ్యవిలుకాఁడు సురభితోఁ, దీఁగెయిల్లు వెడలుతెఱఁగు మెఱయ. 1496**

**ప్రతి :** ఆ శౌరి= శూరుడనువాని మనుమడైన ఆ శ్రీకృష్ణుడు; వనిత= కుబ్జ; కోరుకొనిన= కావాలని అడిగిన; వరము+ఇచ్చి= కోరికను అనుగ్రహించి; ఉద్ధవుండున్= ఉద్ధవుడు; తానును= తానుకూడా; ఉవిద+ఇల్లు= ఆ కుబ్జ ఇంటినుండి; వెడలెన్= బయలు దేరాడు; అపుడు= ఆ సమయంలో; తియ్యవిలుకాఁడు= చెఱకుగడను విల్లుగా కలిగిన, మన్మథుడు; సురభితోన్= కామధేనువుతోకూడ; తీగెఇల్లు= తీగలతో అల్లబడిన పొదరింటినుండి; వెడలు= వెళ్లే; తెఱఁగు= విధము; మెఱయన్= ప్రకాశించగా...

**తా :** శ్రీకృష్ణుడు ఆ విధంగా కుబ్జ కోరుకున్న వరాన్ని ఇచ్చాడు. ఆమెఇంటినుండి ఉద్ధవుడితో శ్రీకృష్ణుడు బయటకు వచ్చాడు. అదెలా ఉందంటే, తీగలతో అల్లిన పొదరింటి నుండి కామధేనువుతో కలసి మన్మథుడు బయటకు వస్తున్నట్లుంది.

**క. ఏ వేదంబులుఁ గానని, దేవోత్తముఁ గాంచి ముక్తితెరు వడుగక రా**
**జీవేక్షణ రతి యడిగెను, భావింపఁ దదీయకర్మఫల మెట్టిదియో! 1497**

**ప్రతి :** ఏ వేదంబులున్= ఎటువంటివేదాలుకూడా; కానని= చూడని; దేవ+ఉత్తమున్= దేవతలలో ఉత్తముడైన శ్రీకృష్ణుణ్ణి; కాంచి= చూచి; ముక్తితెరువు+అడుగక= మోక్షానికి దారిని అడక్కుండా; రాజీవ+ఈక్షణ= పద్మాలవంటి నేత్రాలు కలిగిన కుబ్జ; రతి= శృంగారసంయోగాన్ని; అడిగెను= అడిగింది; భావింపన్= ఆలోచించి చూడగా; తదీయ= ఆమె యొక్క; కర్మఫలము+ఎట్టిదియో= కర్మఫలమనేది ఎలాంటిదో కదా!

**తా :** ఎటువంటి వేదాలుగూడా దర్శించలేని ఉత్తమదైవం శ్రీకృష్ణుడు. అలాంటివాణ్ణి చూడటమే భాగ్యం. అట్టి దర్శనం దొరికాక, మోక్షాన్ని కోరుకోవాలి. అలా అడగకుండా తనతో రతిక్రీడ జరుపుమని కోరింది. ఆమె కర్మఫలం ఎలాంటిదో కదా!

**క. కారుణ్యంబునఁ గృష్ణుఁడు, తారుణ్యము మెఱసి మదనతంత్రంబుల లీ**
**లారణ్యవీథి దేల్చెను, సైరంధ్రిన్ విభవవిజితశక్రపురంధ్రిన్. 1498**

**ప్రతి :** కారుణ్యంబునన్= కరుణతో; కృష్ణుఁడు= శ్రీకృష్ణుడు; తారుణ్యము= యౌవనం; మెఱసి= ప్రకాశించి; మదన తంత్రంబుల= మన్మథచేష్టలతో; లీలా+అరణ్యవీథిన్= లీలలనే అరణ్యవీథిలో; విభవ= సంపదచే; విజిత= జయించబడిన; శక్రపురంధ్రిన్= ఇంద్రునిభార్యను కలదియైన (శచీదేవిని); సైరంధ్రిన్= కుబ్జను; తేల్చెను= నిమగ్నురాలిని కావించాడు.

**తా :** కుబ్జ వైభవం శచీదేవిని మించి పోతూంది. శ్రీకృష్ణుడి యౌవనం మెరిసిపోతూంది. ఆ కుబ్జను మదన తంత్రమనే వన వీథిలో విహరింపజేశాడు. శృంగారక్రీడలో ఆమెను సంతృప్తి పరచాడు.

**వ. తదనంతరంబ కృష్ణుం డుద్ధవ రామ సహితుండై హస్తినాపురమునకు నక్రూరునిం బనుపం దలంచి తద్గృహంబునకుఁ జనిన నతండు వారలం గని లేచి రామకృష్ణులకు నమస్కరించి యుద్ధవుం గౌఁగిలించుకొని వారి నందఱను యథావిధిం బూజించి హరిపాదంబులు దన తొడలమీఁద నిడుకొని యిట్లనియె. 1499**

**ప్రతి :** తద్+అనంతరంబు+అ= అటు తర్వాత; కృష్ణుండు= శ్రీకృష్ణుడు; ఉద్ధవ రామ సహితుండు+ఐ= ఉద్ధవునితోనూ, బలరామునితోనూ కలిసి; హస్తినాపురమునకున్= హస్తినాపురానికి; అక్రూరునిన్= అక్రూరుణ్ణి; పనుపన్+తలంచి= పంపాలని

అనుకుని; తద్+గృహంబునకున్= అతని ఇంటికి; చనినన్= వెళ్లగా; అతండు= ఆ అక్రూరుడు; వారలన్+కని= వాళ్లను చూచి; లేచి= నిలబడి; రామకృష్ణులకున్= బలరామునికీ, శ్రీకృష్ణునికీ; నమస్కరించి= నమస్కారం చేసి; ఉద్ధవున్= ఉద్ధవుణ్ణి; కౌగిలించుకొని= ఆలింగనం చేసుకొని; వారిన్+అందఱను= వాళ్లను అందరినీ; యథావిధిన్= శాస్త్రప్రకారం తగిన రీతిలో; పూజించి= పూజచేసి; హరిపాదంబులు= శ్రీకృష్ణునిపాదాలను; తన తొడలమీఁదన్+ఇడుకొని= తన తొడలమీద ఉంచుకుని; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తా :** ఆ తర్వాత బలరాముడితో, ఉద్ధవుడితో కలిసి శ్రీకృష్ణుడు అక్రూరుని ఇంటికి వెళ్లాడు. హస్తినాపురానికి అక్రూరుణ్ణి పంపాలని శ్రీకృష్ణుడి ఆలోచన. అలా వారు రాగానే అక్రూరుడు లేచి నిలబడి, వారికి నమస్కరించాడు. ఉద్ధవుడిని కౌగిలించుకున్నాడు. అందరికీ తగిన రీతిలో గౌరవమర్యాదలు జరిపాడు. శ్రీకృష్ణుని పాదాలను తన తొడలమీద ఉంచుకుని ఇలా అన్నాడు.

**క. అనుచరులుఁ దాను గంసుఁడు, సనియెన్ నీచేత జముని సదనంబునకున్**
**ఘనులార! మీ బలంబున నొనరఁగ యాదవులవంశ ముద్ధృత మయ్యెన్. 1500**

**ప్రతి :** అనుచరులున్= తన వెంట నడిచేవాళ్లు; తాను= తాను; కంసుఁడు= కంసుడు (కూడా); నీ చేతన్= నీ పరాక్రమంచేత; జముని సదనంబునకున్= యముడి ఇంటికి; చనియెన్= వెళ్లాడు; ఘనులార= ప్రసిద్ధులైన బలరామ కృష్ణులారా!; మీ బలంబునన్= మీ శక్తిచేత; ఒనరన్+కన్= ఒప్పిదంగా; యాదవులవంశము= యాదవులవంశం; ఉద్ధృతమయ్యెన్= ఉద్ధరించబడింది.

**తా :** మహానుభావులారా! మీ పరాక్రమంచేత కంసుడు తన అనుచరులతో కూడ మరణించాడు. మీ శక్తివల్ల యాదవకులం ఉద్ధరించబడింది.

**వ. మహాత్ములారా! విశ్వాదిపురుషులరు, విశ్వకారణులరు, విశ్వమయులరగు మీకుం గార్యకారణంబులు లే; వవధరింపుము. పరమేశ్వరా! నీవు రజోగుణంబున నఖిలంబు సృజియించి, కారణరూపంబునఁ దదనుప్రవిష్టుండవై శ్రుతదృష్టకార్యరూపప్రపంచాకారంబున దీపించుచుందువు. కార్యరూపచరాచర దేహంబులకుం గారణంబు లయిన భూప్రముఖంబు లనుగతంబులును, గార్యరూపదేహంబులు నయి ప్రకాశించుచందంబున నొక్కండవు, కారణరహితుండవు, నాత్మతంత్రుండవు నై యుండియు విశ్వాకారంబునం బెక్కగుదువు. సృష్టిస్థితిలయంబులం జేయుచుండియు విజ్ఞానమూర్తి వగుటం బరిభ్రాంతుండైన జీవునిభంగి గుణకర్మబద్ధుండవు కావు. కావున సిద్ధంబు తన్నిమిత్తంబున బంధహేతువును సిద్ధింపదు. 1501**

**ప్రతి :** మహా+ఆత్ములారా= మహానుభావులైన బలరామకృష్ణులారా!; విశ్వ+ఆదిపురుషులరు= విశ్వానికి ఆదిపురుషులు; విశ్వకారణులరు= ప్రపంచానికి కారణభూతులు; విశ్వమయులరు+అగు= విశ్వమంతా నిండిన వారైన; మీకున్= మీకు; కార్యకారణంబులు= కార్యమూ, కారణమూ; లేవు= లేవు; అవధరింపుము= దయతో వినండి; పరమ+ఈశ్వరా!= మహాప్రభూ! శ్రీకృష్ణా!; నీవు= నీవు; రజస్+గుణంబునన్= రజోగుణంతో; అఖిలంబున్= అంతటినీ; సృజియించి= సృష్టిచేసి; కారణరూపంబునన్= కారణం అనే రూపంతో; తద్+అనుప్రవిష్టుండవు+ఐ= దానిలోనికి ప్రవేశించినవాడివై; శ్రుత= వినబడేది; దృష్ట= చూడబడేది అగు; కార్యరూప= కార్యరూపంతో ఉన్న; ప్రపంచ+ఆకారంబునన్= ప్రపంచం అనే ఆకారంతో;

దీపించుచున్+ఉందువు= ప్రకాశిస్తూ ఉంటావు; కార్యరూప= కార్యరూపంతోడి; చర+అచర దేహంబులకున్= కదిలేవీ, కదలనివీ అయిన అన్నిశరీరాలకు; కారణంబులు+ఐన= పుట్టుకకు కారణమైన; భూ ప్రముఖంబులు= భూమి మొదలైన పంచభూతాలు (పృథివ్యాపస్తేజో వాయురాకాశములు) అనుగతంబులును ఒకదానివెంట మరొకటి రాగా; కార్యరూపదేహంబులును+అయి= కార్యరూపాలైన శరీరాలను కలిగినవై; ప్రకాశించు చందంబునన్= వెలిగే రీతిలో; ఒక్కండవున్= ఒక్కడివి; కారణరహితుండవున్= పుట్టుక స్థితిలయము అనేవి లేని వాడివి; ఆత్మతంత్రుండవును+ఐ+ఉండియు= స్వతంత్రత కలిగిన వాడివై కూడా; విశ్వ+ఆకారంబునన్= జగత్తు అనే ఆకృతితో; పెక్కు+అగుదువు= ఎన్నో రూపాలుగా కనిపిస్తావు; సృష్టిస్థితి లయంబులన్= సృష్టిని కల్పించడం, నిలబెట్టడం, నాశనం చేయడం; చేయుచున్+ఉండియును= అనేవి చేస్తూ ఉండికూడా; విజ్ఞానమూర్తివి+అగుటన్= బ్రహ్మవిష్ణు మహేశ్వరులకు అతీతమైన పరతత్త్వానివి కావడంచేత; పరిభ్రాంతుండు+ఐన= పుట్టడం, మరణించడం అనే చక్రంలో పడి తిరుగుతున్న; జీవునిభంగిన్= జీవునివలె; గుణకర్మబద్ధుండవు కావు= త్రిగుణాలతోనూ, కర్మలతోనూ కట్టబడిన వాడివి కావు; కావునన్= కాబట్టి; సిద్ధంబు= తప్పనిసరిగా; తద్+ నిమిత్తంబునన్= ఆ కారణంచేత; బంధహేతువును= పుట్టుక, చావు అనే వాటితో కట్టబడిన బంధం; సిద్ధింపదు= కలుగదు.

**తా :** మహితాత్ములైన బలరామ కృష్ణులారా! ఈ విశ్వానికి మీరు ఆదిపురుషులు, విశ్వం జన్మించడానికి మీరు కారకులు, మీరు విశ్వమంతా నిండినవాళ్లు, మీకు కార్యం, దానికి కారణం అనేవి లేవు; దేవా! శ్రీకృష్ణా! నా మనవి విను. నీవు రజోగుణంతో ఈ సృష్టి చేశావు. దానికి కారణరూపుడిగా అందులోకి ప్రవేశిస్తావు. వినబడడం, కనబడడం అనే కార్యరూపాలతో కూడిన ప్రపంచాకారంలో వెలిగిపోతుంటావు. భూమి, నీళ్లు, అగ్ని, వాయువు, ఆకాశం వంటివి ఒకదాన్నొకటి అనుసరించి కదిలేవీ, కదలనివీ అయిన దేహాలకు కారణమవుతాయి. అవి కార్యరూపదేహాలై ప్రకాశిస్తాయి. అలాగ నీవు ఒక్కడివి, కారణరహితుడివి, ఆత్మలో స్వతంత్రత ఉండికూడా విశ్వాకారంలో ఎన్నో రూపాలుగా కనిపిస్తావు. కల్పించడం, కాపాడడం, నశింపచేయడం అనేవి చేస్తూ ఉండికూడా పరబ్రహ్మతత్త్వానివి నీవే కాబట్టి జననమరణచక్రంలో పడిన జీవుడివలె ఉండవు. గుణాలతో, కర్మలతో కట్టుబడవు. కాబట్టి దానివల్ల బంధకారణమూ నీకు కలుగదు.

**సీ.** **పరఁగ జీవునికైన బంధమోక్షము లంట వంటునే పరతత్త్వమైన నిన్ను**
**నంటునే యీశ! దేహాద్యుపాధులు ననిర్వచనీయములు గాన వరుస నీకు**
**జన్మంబు జన్మసంశ్రయభేదములు లేవు కావున బంధమోక్షములు లేవు**
**గణుతింప ని న్నులూఖలబద్ధుఁ డనుటయు నహిముక్తుఁ డనుటయు నస్మదీయ**

**ఆ.** **బాలబుద్ధిఁ గాదె? పాషండముఖర మా, ర్గములచేత నీ జగద్ధితార్థ**
**మైన వేదమార్గ మడఁగిపో వచ్చిన, నవతరించి నిలుపు దంబుజాక్ష!** **1502**

**ప్రతి :** పరఁగన్= చూడగా; జీవునికిన్+ఐన= జీవునికే అయినట్టి; బంధమోక్షములు+అంటవు= బంధం, మోక్షం అనే రెండూ నీకు అంటవు. (బంధం అంటే ఏదో ఒకదానితో అంటిపెట్టుకుని ఉండడం, మోక్షం అంటే అలాంటి బంధాలనుండి విడుదల పొందడం); అంటునే= తగులుతాయా?; పరతత్త్వము+ఐన= జ్ఞాన తత్త్వస్వరూపమైన; నిన్ను= నిన్ను; అంటునే= స్పృశిస్తాయా?; ఈశ= దేవా!; దేహ+ఆది+ఉపాధులున్= శరీరం మొదలైన ఉపాధులు ఉండే; అనిర్వచనీయములు= చెప్పడానికి వీలు లేనివి (మాయ); కాన= కాబట్టి; వరుసన్= వరుసగా; అంటునే= అంటుతాయా; నీకున్= నీకు; జన్మంబు= పుట్టుకగానీ; జన్మసంశ్రయభేదములు= జన్మ ఎత్తడానికి కారణమైన విషయాలుగానీ (అవిద్యవంటివి); లేవు; కావునన్= కాబట్టి;

బంధమోక్షములు= బంధం మోక్షం రెండూ; లేవు= లేనే లేవు; గణుతింపన్= ఆలోచించగా; నిన్నున్= నిన్ను; ఉలూఖలబద్ధుఁడు+అనుటయున్= రోటికి కట్టబడినవాడనడమూ; అహిముక్తుఁడు+అనుటయున్= (కాళీయుడనే) పాముచే వదలిపెట్టబడినవాడనడమూ; అస్మదీయ= మాయొక్క; బాలబుద్ధిన్+కాదు+ఎ?= అపరిపక్వమైన బుద్ధివలన కాదా?; పాషండ= వేదబాహ్య (పాషండులు అంటే సంసారబంధానికి కారణమైన శాస్త్రాలను పలికేవాళ్లు అని అర్థం); ముఖర= అప్రియమైన మాటలను పలికే; మార్గముల చేతన్= మార్గాలచేత; ఈ జగత్+హిత+అర్థము+ఐన= ఈ జగతికి మంచి కలిగించేదైన; వేదమార్గము= వేదాలు తెలిపిన మార్గం; అడఁగిపోవచ్చినన్= అణగారిపోతున్నప్పుడు; అవతరించి= అవతారాన్ని ధరించి; నిలుపుదు(వు)= కాపాడుతావు; అంబుజ+అక్ష= పద్మాలవంటి కండ్లు గల శ్రీకృష్ణా!

**తా :** పద్మాలవంటి కండ్లు గల శ్రీకృష్ణా! బంధం, దానినుండి ముక్తి పొందడం అనే రెండూ జీవుడినే అంటవు. అలాంటిది–జ్ఞానతత్త్వ స్వరూపమైన నిన్ను అంటుతాయా? దేవా, స్థూల సూక్ష్మకారణదేహాలు వంటివి లేనందువల్ల నీకు పుట్టుక లేదు. దానికి కారణమైన అవిద్యవంటివి కూడా లేవు. అందుచేత, నీకు బంధంగానీ, మోక్షంగానీ లేవు. నిన్ను రోటికి కట్టేశారని అనుకోవడం, కాళీయుడనే పెద్దపాము నిన్ను వదిలిపెట్టింది అనుకోవడం రెండూ కూడా మా అపరిపక్వమైన పసిమనసునే సూచిస్తున్నాయి. వేదబాహ్యులు అప్రియమైన మాటలను పలికే వాళ్లూ కొందరున్నారు. జగతికి హితం కలిగించే వేదమార్గం వాళ్లకారణంగా అణగారిపోతున్నపుడు నీవు అవతారమెత్తి ఆ వేదమార్గాన్ని కాపాడుతావు.

**క. ఆ నీవు ధరణిభారము, మానిచి రక్కసుల నెల్ల మర్దించుటకై**
**యానకదుందుభి యింటను, మానుగ జన్మించితివి సమంచితకీర్తిన్. 1503**

**ప్రతి :** ఆ= అలాంటి; నీవు= నీవు; ధరణి= భూమియొక్క; భారమున్= బరువును; మానిచి= తొలగించి; రక్కసులను+ఎల్లన్= రాక్షసులను అందరినీ; మర్దించుటకున్+ఐ= అణచి వేయడంకోసం; ఆనకదుందుభి= వసుదేవుడి (ఇతడికి ఆనకదుందుభి అని మరో పేరు); ఇంటను= ఇంటిలో; మానుగన్= చక్కగా; సమంచితకీర్తిన్= ప్రసిద్ధకీర్తితో; జన్మించితివి= పుట్టినావు.

**తా :** అలాంటి నీవు రాక్షసులను అందరినీ అణచి వేసి, భూ భారాన్ని తొలగించడంకోసం, పదిమంది గొప్పగా చెప్పుకునే రీతిలో వసుదేవుడి ఇంటిలో పుట్టావు.

**విశే :** వసుదేవుడు పుట్టినపుడు, ఆకాశంలో దేవదుందుభులు మ్రోగాయట. కనుక, అతడికి 'ఆనకదుందుభి' అని పేరు వచ్చింది.

**మ. త్రిజగత్పావనపాదతోయములచే దీపించి వేదామర**
**ద్విజముఖ్యాకృతివైన నీవు కరుణన్ విచ్చేయుటం జేసి మా**
**నిజగేహంబులు ధన్యతం దనరెఁబో ని న్నార్యు లర్చింపఁగా**
**నజితత్వంబులు వారి కిత్తు వనుకంపాయత్తచిత్తుండవై. 1504**

**ప్రతి :** త్రిజగత్+పావన= మూడు లోకాలనూ పవిత్రంచేసే; పాదతోయములచేన్= నీ పాదాలనుండి పుట్టిన నీటితో, (ఆకాశగంగ విష్ణుపాదోద్భవ); దీపించి= వెలిగి; వేద+అమర+ద్విజ= వేదాలు, దేవతలు, ద్విజులు; ముఖ్య+ఆకృతివి+ఐన= ముఖ్య స్వరూపం కలవాడవైన; నీవు; కరుణన్= దయతో; విచ్చేయుటన్+చేసి= వచ్చినందువల్ల; మా నిజగేహంబులు= మా ఇండ్లు; ధన్యతన్= ధన్యతతో; తనరెన్+పో= ప్రకాశించాయిలే; నిన్ను; ఆర్యులు+అర్చింపఁగాన్= మహాత్ములు పూజించగా;

వారికిన్= వాళ్ళకు; అజితత్వంబులు= ఇంద్రియాల ద్వారా ఓటమి కలుగకుండా ఉండే స్థితిని; ఇత్తువు(ఇచ్చుదువు)= ఇస్తావు; వారికిన్= అట్టివాళ్లకు; అనుకంప+ఆయత్త= దయతో నిండిన; చిత్తుండవు+ఐ= మనస్సు కలిగిన వాడవై.

**తా :** నీ పాదాలనుండి పుట్టిన ఆకాశగంగ మూడులోకాలనూ పావనం చేస్తున్నది. వేదాలకు, దేవతలకు, ద్విజులకు నీవు ప్రముఖ స్వరూపానివి. అలాంటి తేజస్సుగల నీవు దయతో వచ్చినందువల్ల మా ఇండ్లు ధన్యమయ్యాయి. పెద్దలు, మహాత్ములు నిన్ను పూజిస్తారు. ఇంద్రియజయాన్ని దయతో వాళ్లకు ప్రసాదిస్తావు.

**శా. ఏ పుణ్యాతిశయప్రభావముననో యీ జన్మమం దిక్కడన్**
**నీ పాదంబులఁ గంటి ని న్నెఱిఁగితిన్ నీవుం గృపాళుండవై**
**నాపై నర్మిలిఁ జేసి మాన్పఁ గదవే నానాధనాగార కాం**
**తా పుత్త్రాదులతోడిబంధనము భక్తవ్రాతచింతామణీ! 1505**

**ప్రతి :** భక్తవ్రాత= భక్తసమూహాల పాలిటి; చింతామణీ= చింతామణి వంటి శ్రీకృష్ణా!; ఏ= ఎటువంటి; పుణ్య= పుణ్యంయొక్క; అతిశయ ప్రభావముననో= అధికమైన మహిమవల్లనో; ఈ జన్మము+అందున్= ఈ పుట్టుకలో; ఇక్కడన్= ఈ చోట; నీ పాదంబులన్= నీ పాదాలను; కంటిన్= చూచాను; నిన్నున్+ఎఱిఁగితిన్= నిన్ను తెలుసుకున్నాను; నీవున్= నీవుకూడా; కృపాళుండవు+ఐ= దయకలిగినవాడివై; నాపైన్= నా మీద; అర్మిలిన్+చేసి= ప్రేమచేత; నానా= అనేక విధాలైన; ధన+అగార= ధనముండే ఇండ్లతో; కాంతా= భార్యతో; పుత్త్ర+ఆదులతోడి= కొడుకులు మొదలైనవాళ్లతో ఉండే; బంధనము= ప్రేమపాశాన్ని; మాన్పన్+కదవే= తొలగించవా.

**తా :** భక్తులకు కోరినవన్నీ ప్రసాదించే చింతామణివంటి శ్రీకృష్ణా! ఏ మహాపుణ్యమహిమవల్లనో ఈ జన్మలో ఇక్కడ నీ పాదాలను దర్శించగలిగాను. నిన్నుగురించి తెలుసుకొన గలిగినాను. నీవుకూడా నా పై దయతో, ప్రేమతో నానావిధాలైన ధనమూ, ఇల్లూ, వాకిలీ, భార్యాపిల్లలూ మొదలైనవాటిపై కలిగే మోహపాశాన్ని తొలగించు.

**వ. అని పలికిన నగుచు నక్రూరునికి మాటలవలన సంసారసంబంధం బగు మోహంబును గీలుకొలుపుచు హరి యిట్లనియె. 1506**

**ప్రతి :** అని= పై విధంగా; పలికినన్= అనగా; నగుచున్= నవ్వుతూ; అక్రూరునికి (న్); మాటలవలన= మాటలద్వారా; సంసారసంబంధంబు+అగు= సంసారంతో కట్టుబడిందైనా; మోహంబున్= వ్యామోహాన్ని; కీలుకొలుపుచున్= నాటుకునేలాగా కూర్చుతూ; హరి= శ్రీకృష్ణుడు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తా :** అక్రూరుడు పై విధంగా మాట్లాడితే దానికి శ్రీకృష్ణుడు నవ్వుతూ, అతనికి (అక్రూరునికి) సంసారం పట్ల ఇష్టాన్ని కలిగిస్తూ శ్రీకృష్ణుడు ఇలా అన్నాడు.

## ✤ శ్రీకృష్ణుఁడక్రూరుని హస్తినాపురంబునకుఁ బంపుట ✤

**క. బంధుండవు సద్యోహిత, సంధుండవు వావిఁ జూడ జనకుఁడవు కృపా**
**సింధుండ వెల్లగుణముల, నంధుండవు గావు ప్రోవ నర్హుఁడ వెందున్. 1507**

**ప్రతి :** బంధుండవు= మాకునీవు బాంధవుడివి; సద్యస్+హితసంధుండవు= ఇప్పటి కిప్పుడే మేలు కలిగింపజేసేవాడివి; వావిన్= వరుసను; చూడన్= గమనిస్తే; జనకుఁడవు= తండ్రివి; కృపా= దయకు; సింధుండవు= సముద్రంవంటివాడివి; ఎల్లగుణములన్= అన్ని గుణాల విషయంలోనూ; అంధుండవు గావు= గుడ్డిగా ప్రవర్తించేవాడివి కావు; ప్రోవన్= మమ్ములను కాపాడడానికి; అర్హుడవు+ఎందున్= ఏ విషయంలోనైనా తగినవాడవు.

**తా :** (అక్రూరా) నీవు మాకు బాంధవుడివి. సమయానికి మేలును కూర్చేవాడివి; వరుసకు గమనిస్తే తండ్రివి (పినతండ్రి), దయాసముద్రుడివి; గుణాలపట్ల గుడ్డిగా ప్రవర్తించనివాడివి. మమ్మల్ని కాపాడడానికి అన్నివిధాలా నీవు సమర్థుడవు.

**విశే :** వృష్ణివంశంలో శ్రీకృష్ణుడు జన్మించాడు. అదే వంశానికి చెందిన శ్వఫల్కుని పుత్రుడు అక్రూరుడు. ఈ దృష్టితో బంధువు, జనకసమానుడు అవుతాడు.

**చ. కొలుతురు మర్త్యు లిష్టములు గోరి శిలామయదేవసంఘమున్**
**జలమయతీర్థసంఘమును సంతతము న్న టు వారు గొల్వఁగా**
**వల దనరాదు గాక భగవత్పదభక్తులరైన మీ క్రియన్**
**సొలయక దేవతీర్థములు చూచిన యంతనె కోర్కు లిచ్చునే? 1508**

**ప్రతి :** మర్త్యులు= మానవులు; ఇష్టములు= కోరికలను; కోరి= నెరవేరాలని ఆశించి; శిలామయ= రాళ్లతో నిర్మింపబడిన; దేవ= దేవతా; సంఘమున్= సమూహాలను; (అంటే రాతివిగ్రహాలను); జలమయ= నీరే స్వరూపంగా కల; తీర్థసంఘమును= పుణ్యతీర్థాల సమూహాలను; సంతతమున్= ఎల్లప్పుడూ; కొలుతురు (కొలుచుదురు)= సేవిస్తారు; అటు= ఆ విధంగా; వారు= వాళ్లు (మానవులు); కొల్వన్+కాన్= సేవించగా; వలదు+అనరాదుగాక= అలా సేవించకండి అని చెప్పడకూడదు కానీ; భగవత్+పద= భగవంతుని పాదాలయందలి; భక్తులరు+ఐన= భక్తిని కలిగినవారైన (భక్తులైన); మీక్రియన్= మీవలె; సొలయక= విముఖత లేక; చూచిన+అంతనె= ఊరకే దర్శించినంత మాత్రాన్నే; దేవతీర్థములు= దేవతలు పుణ్యతీర్థాలు; కోర్కులు+ఇచ్చునే= కోరిన కోరికలను అనుగ్రహించగలవా?, అనుగ్రహించలేవు. అంటే – దర్శనమాత్రాన్నే కోర్కెలు సిద్ధింపజేసేది సజ్జన సంఘమే తప్ప, వేరొకటి కాదని భావం.

**తా :** మానవులు తాము తలచిన కోరికలు నెరవేరాలని ఆశిస్తారు. దానికోసం రాతివిగ్రహాలను, పుణ్యతీర్థాలను సేవిస్తారు. అలా పూజించవద్దు అనకూడదు కానీ, భగవంతునిపాదాలను నిత్యం సేవించే మీ వంటి భక్తులను దర్శిస్తేనే చాలు అనుకొన్నవి నెరవేరతాయి. ఆ విగ్రహాలు, తీర్థాలు మీలాగా అతిసులభంగా కోరికలను నెరవేర్చలేవు.

**వ. మహాత్మా! పరమభాగవతుండవైన నీవు మా కభీష్టంబుల నొనరింప నర్హుండవు; వినుము. పాండురాజు పరలోకగతుం డైనఁ గుంతీసహితు లయిన పాండవులు ధృతరాష్ట్రశాసనంబున నేతెంచి కరిపురంబున నున్నవారఁట. నిజపుత్రమోహితుం డగు న య్యంధనృపతి వారియందు సమత్వంబునం జరింపం డటు గావున. 1509**

**ప్రతి :** మహా+ఆత్మా= గొప్ప మనసున్నవాడా; పరమభాగవతుండవు+ఐన= గొప్ప భాగవతోత్తములలో శ్రేష్ఠుడవైన; నీవు; మాకు(న్); అభీష్టంబులన్= కోరికలను; ఒనరింపన్= తీర్చడానికి; అర్హుండవు= తగినవాడివి; వినుము= ఆలకించు; పాండురాజు= (కుంతీదేవిభర్త అయిన) పాండురాజు; పరలోకగతుండు+ఐనన్= మరణించినవాడు కాగా; కుంతీసహితులు+ ఐన=

కుంతీదేవితోపాటు ఉన్న; పాండవులు= పాండురాజు పుత్రులు; ధృతరాష్ట్ర= ధృతరాష్ట్రునియొక్క; శాసనంబునన్= ఆజ్ఞచేత; ఏతెంచి= వచ్చి; కరిపురంబునన్= హస్తినాపురంలో; ఉన్నవారు+అఁట= ఉన్నారట; నిజపుత్ర= తనకొడుకుపై; మోహితుండు+అగు= (గుడ్డి) ప్రేమగలవాడైన; ఆ+అంధనృపతి= ఆ కండ్లులేనిరాజు; వారి+అందున్= పాండవుల విషయంలో; సమత్వంబునన్+చరింపండు= సమభావంతో ప్రవర్తించడంలేదు; అటు+కావునన్= అందువల్ల...

**తా :** గొప్ప మనసున్నవాడా! నీవు భాగవతులలో శ్రేష్ఠుడివి. మా ఇష్టాలను నెరవేర్చగల శక్తిమంతుడివి. మా మనవి ఆలకించు. పాండురాజు మరణించగా, కుంతీదేవి తన కొడుకులైన పాండవులతో పాటు, ధృతరాష్ట్రుని ఆజ్ఞ ననుసరించి హస్తినాపురానికి వచ్చి, అక్కడ ఉన్నారట. ఆ ధృతరాష్ట్రుడికి కొడుకైన దుర్యోధను డంటే గుడ్డిప్రేమ. ఆ పుత్రవ్యామోహం కారణంగా పాండవులపట్ల సమభావాన్ని చూపడంలేదు. కాబట్టి

**క. వారలు బంధులు గావున, వారలకును మే లొనర్చి వా రలరంగా**
**వారింపవలయు దుస్థితి, వారిజరిపువంశ! పొమ్ము వారిం జూడన్. 1510**

**ప్రతి :** వారిజరిపు= పద్మాలకు శత్రువైన చంద్రునియొక్క; వంశ= వంశంలో జన్మించినవాడా; వారలు= వాళ్లు (పాండవులు); బంధులు = (మనకు) బంధువులు; కావునన్= కాబట్టి; వారలకును= వాళ్లకు; మేలు+ఒనర్చి= మేలు కలిగింపచేసి; వారు+అలరన్+కాన్= వాళ్లు సంతోషించునట్లుగా; దుస్+స్థితిన్= స్థితిని; వారింపవలయున్= తొలగింపచేయాలి; వారిన్+చూడన్= వాళ్లను చూడడానికి; పొమ్ము= వెళ్లు.

**తా :** చంద్రవంశంలో పుట్టినవాడా! అక్రూరా! ఆ పాండవులు మనకు బంధువులు. కాబట్టి, వాళ్లకు మేలుచేయాలి. వాళ్లను సంతోష పరచాలి. వాళ్ల దుర్దశలను తొలగింప చేయాలి. కాబట్టి, వాళ్లను చూడడానికి నీవు వెళ్లు.

**వ. అని పలికి సంకర్షణోద్ధవసహితుండై హరి నిజగృహంబునకుం జనుటయు నక్రూరుండు కౌరవరాజధాని యగు కరిపురి కరిగి యందు ధృతరాష్ట్ర భీష్మ విదుర బాహ్లిక భారద్వాజ గౌతమ దుర్యోధన కర్ణాశ్వత్థామాదులం గుంతీసహితులైన పాండవులం దక్కిన బంధువులనుం గని యథోచితసత్కారంబుల నొంది తత్తద్వర్తనంబు లెఱిఁగికొనుచుఁ గొన్నిదినంబు లుండ నొక్కనాఁడు విదురుండు విన నేకతంబున నక్రూరునికిఁ గుంతి యిట్లనియె. 1511**

**ప్రతి :** అని పలికి= ఈ విధంగా చెప్పి; సంకర్షణ+ఉద్ధవ= బలరామ ఉద్ధవులతో; సహితుండు+ఐ= కలిసి ఉండేవాడై; హరి= శ్రీకృష్ణుడు; నిజగృహంబునకున్= తన ఇంటికి; చనుటయున్= వెళ్లగా; అక్రూరుండు= అక్రూరుడు; కౌరవ= కౌరవులయొక్క; రాజధాని+అగు= రాజధాని అయిన; కరిపురికిన్= హస్తినాపురానికి; అరిగి= వెళ్లి; అందున్= అక్కడ; ధృతరాష్ట్ర= ధృతరాష్ట్రుడు; భీష్మ= భీష్ముడు; విదుర= విదురుడు; బాహ్లిక= బాహ్లికుడు; భారద్వాజ= భారద్వాజుడు; గౌతమ= గౌతముడు; దుర్యోధన= దుర్యోధనుడు; కర్ణ= కర్ణుడు; అశ్వత్థామ= ద్రోణపుత్రుడు అశ్వత్థామ; ఆదులన్= మొదలైనవారినీ; కుంతీ= కుంతీదేవితో; సహితులు+ఐన= కలిసి ఉంటున్న; పాండవులన్= పాండవులనూ; తక్కిన= మిగిలిన; బంధువులనున్= చుట్టాల్ని కూడా; కని= చూచి; యథా+ఉచిత= వారి నుండి తగినట్లు; సత్కారంబులన్= గౌరవమర్యాదలను; ఒంది= పొంది; తత్తత్+వర్తనంబులు= వారి వారి ప్రవర్తనలను; ఎఱిఁగి కొనుచున్= తెలుసుకుంటూ; కొన్ని దినంబులు+ఉండన్= కొన్ని రోజులపాటు అక్కడే ఉండగా; ఒక్కనాడు= ఒక రోజు; విదురుండు వినన్= విదురుడు వినేట్లుగా; ఏకతంబునన్= ఏకాంతంలో; అక్రూరునికిన్= అక్రూరునితో; కుంతి= కుంతీదేవి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పింది.

**తా :** అని చెప్పాక, శ్రీకృష్ణుడు బలరామ ఉద్ధవులతో కలిసి తన ఇంటికి వెళ్లాడు. అక్రూరుడు హస్తినాపురానికి వెళ్లాడు. అది కౌరవుల రాజధాని. అక్కడ ధృతరాష్ట్రుణ్ణీ, భీష్ముణ్ణీ, విదురుణ్ణీ, బాహ్లికుణ్ణీ, భారద్వాజుణ్ణీ, గౌతముణ్ణీ, దుర్యోధనుణ్ణీ, కర్ణుణ్ణీ, అశ్వత్థామనూ మొదలైనవాళ్లనూ, కుంతీదేవితోపాటు ఉన్న పాండవులనూ చూచాడు. తక్కిన బంధువులనూ కూడా చూచాడు. వాళ్లనుండి తగిన రీతిలో గౌరవమర్యాదలను పొందాడు. వాళ్లవాళ్ల ప్రవర్తనలను గ్రహించాడు. కొన్నాళ్లు అక్కడ ఉన్నాడు. అలా ఉండగా, ఒకరోజు ఏకాంతంలో కుంతీదేవి విదురుడు వింటుండగా, అక్రూరునితో ఇలా అనింది.

**శా. అన్నా! తల్లులు దండ్రులున్ భగినులు న్నల్లుండ్రు మద్భ్రాతలున్**
**నిన్నుం బొమ్మనువేళ నే మనిరి? మా నెవ్వల్ విచారింతురే?**
**యున్నారా సుఖయుక్తులై? మృగి వృకవ్యూహంబులో నున్న రే**
**ఖ న్నే నిక్కడ నున్నదానఁ గుమనఃకౌరవ్యమధ్యంబునన్. 1512**

**ప్రతి :** అన్నా!= అన్నయ్యా! (అక్రూరా!); తల్లులున్+తండ్రులున్= తల్లిదండ్రులు; భగినులున్= అక్కాచెల్లెళ్లూ; అల్లుండ్రు= అల్లుళ్లు; మత్+భ్రాతలున్= మా అన్నలు, తమ్ముళ్లూ; నిన్నున్= నిన్ను; పొమ్ము+అనువేళన్= (హస్తినాపురానికి) వెళ్లు అనే సమయంలో; ఏమి+అనిరి= ఏమని చెప్పారు?; మా నెవ్వల్= మా దుఃఖాలను; విచారింతురు(విచారించుదురు)+ఏ= (గురించి) ఆలోచిస్తున్నారా?; సుఖయుక్తులు+ఐ= సుఖంతో కూడుకున్నవారై; ఉన్నారా= (వాళ్లు) ఉన్నారా?; కుమనః= చెడు బుద్ధులున్న; కౌరవ్య= కౌరవుల; మధ్యంబునన్= నడుమ; మృగి= ఆడుజింక; వృకవ్యూహంబులోన్= తోడేళ్లగుంపులో; ఉన్న= ఉన్నట్టి; రేఖన్= విధంగా; ఇక్కడన్= ఇక్కడ; ఉన్నదానన్= నేను ఉన్నాను.

**తా :** అన్నా అక్రూరా! మా తలిదండ్రులు; అక్కచెల్లెళ్లు, అల్లుళ్లూ, మా అన్నదమ్ములు నిన్ను ఈ హస్తినాపురానికి పంపే వేళలో ఏమని చెప్పారు? వాళ్లు మా దుఃఖాల్నిగురించి ఆలోచిస్తున్నారా? సుఖంగా ఉన్నారా? దుర్బుద్ధులైన ఈ కౌరవుల మధ్య నేను తోడేళ్లగుంపు నడుమ ఉన్న ఆడుజింకలా ఉన్నాను.

**మ. కఱపించెన్ ఫణికోటిచే లతికలం గట్టించి గంగానదిన్**
**నెఱిఁ ద్రోపించె విషాన్వితాన్న మొసఁగెన్ నిద్రారతిం జెంది యే**
**మఱి యుండం బొడిపించె నాయుధములన్ మత్పుత్రులం దేమియుం**
**గొఱ గాఁ డీ ధృతరాష్ట్రసూనుఁడు మహాక్రూరుండు గార్యంబులన్. 1513**

**ప్రతి :** ఫణికోటిచేన్= ఎన్నో పాములచేత; కఱపించెన్= కటిపింప చేశాడు; లతికలన్= తీగలతో; కట్టించి= కట్టేయించి; గంగానదిన్= గంగానదిలో; నెఱిన్= కుటిలతతో; త్రోపించెన్= తోయించాడు; విష+అన్విత+అన్నము= విషం కలిపిన అన్నాన్ని; ఒసఁగెన్= పెట్టాడు; నిద్రారతిన్= గాఢనిద్రలో; చెంది= ఉంటూ; ఏమఱి+ఉండన్= ఏమరుపాటులో ఉన్నప్పుడు; ఆయుధములన్= ఆయుధాలతో; పొడిపించెన్= పొడిపింపజేశాడు; మత్+పుత్రులు+అందున్= నా బిడ్డలపట్ల; ఏమియున్= ఏ కొంచెం కూడా; కొఱగాఁడు= మంచివాడు కాడు; ఈ ధృతరాష్ట్రసూనుఁడు= ఈ ధృతరాష్ట్రుని కొడుకైన దుర్యోధనుడు; కార్యంబులన్= చేతలలో; మహాక్రూరుండు= చాలా క్రూరస్వభావంకలవాడు.

**తా :** ఈ ధృతరాష్ట్రుని కొడుకైన దుర్యోధనుడున్నాడే – వాడు చాలా క్రూరుడు. నా బిడ్డలతో కొంచెంకూడా సరిగా ఉండడు. నా పిల్లలను పాములతో కరిపింపచేశాడు. తీగలతో బంధించి కుటిలత్వంతో గంగానదిలో తోయించాడు. విషాన్ని కలిపిన అన్నం తినిపించాడు. గాఢనిద్రలో ఒళ్లు మరచి ఉన్నప్పుడు ఆయుధాలతో పొడిపించాడు.

**మ. బలుఁడుం గృష్ణుఁడు నెన్నడైనఁ దమలో భాషించి మేనత్త బి**
**డ్డలకున్ మేలు దలంతురే? వగపులన్ దయ్యంగఁ బాలై రయో!**
**జలజాతాక్షుఁడు భక్తవత్సలుఁ డిలాచక్రంబు భాగించి యి**
**మ్ములఁ నిప్పించునె నాకుమారకులకున్ ముఖ్యప్రకారంబులన్. 1514**

**ప్రతి :** బలుఁడున్= బలరాముడూ; కృష్ణుఁడున్= శ్రీకృష్ణుడూ; ఎన్నడు+ఐనన్= ఎప్పుడైనా; తమలోన్= తమలో తాము; భాషించి= మాట్లాడుకుని; మేన+అత్త= మేనత్త అయిన కుంతియొక్క; బిడ్డలకున్= బిడ్డలైనపాండవులకు; మేలున్= మంచిని; తలంతురే= ఆలోచిస్తారా?; వగపులన్= ఏడుపులతో, బాధలతో; దయ్యన్+కన్= కృశించడానికి; పాలు+ఐరి= వశులవుతున్నారు; అయో= అయ్యో!; జలజాత+అక్షుడు= పద్మాలవంటి కండ్లుగల శ్రీకృష్ణుడు; భక్తవత్సలుడు= తన భక్తులపట్ల వాత్సల్యం ఉన్నవాడు; ఇలా చక్రంబున్= భూమండలాన్ని; భాగించి= సమభాగాలుగా చేసి; నా కుమారకులకున్= నా బిడ్డలైన పాండవులకు; ముఖ్యప్రకారంబులన్= శ్రేష్ఠమైన పద్ధతులలో; ఇమ్ములన్= అనుకూలంగా; ఇప్పించున్+ఎ= ఇప్పిస్తాడా?

**తా :** బలరాముడూ, శ్రీకృష్ణుడూ ఎప్పుడైనా తమలో తాము మాట్లాడుకుని మేనత్త అయిన కుంతిబిడ్డలు పాండవులకు మంచి జరగాలని ఆలోచిస్తారా? ఏడుపులతో, బాధలతో వీళ్లు కృశించిపోతున్నారే అయ్యో! పుండరీకాక్షుడూ, భక్తవత్సలుడూ అయిన శ్రీకృష్ణుడు ఈ భూమండలాన్ని (రాజ్యాన్ని) నా బిడ్డలకు శ్రేష్ఠపద్ధతిలో సమభాగంగా పంపకాలు చేసిస్తాడా?

**వ. అని పలికి, కృష్ణునిఁ జిత్తంబున నిల్పి నమస్కరించి సంకీర్తనంబు చేసి, 'సర్వాత్మక! సర్వపాలక! పుండరీకాక్ష! శరణాగతనైన నన్ను రక్షింపు మని' వగచుచున్న కుంతికి నక్రూరుండు విదురసమేతుండై ప్రియవచనంబుల దుఃఖోపశమనంబు సేసి వీడ్కొని బంధుమిత్రమధ్యంబున సుఖోపవిష్టుండై యున్న ధృతరాష్ట్రున కిట్లనియె. 1515**

**ప్రతి :** అని పలికి= అని చెప్పి; కృష్ణునిన్= శ్రీకృష్ణుణ్ణి; చిత్తంబునన్= మనసులో; నిల్పి= నిలుపుకొని; నమస్కరించి= నమస్కారం చేసి; సంకీర్తనంబు చేసి= స్తుతించి; సర్వ+ఆత్మక= అందరిలో ఆత్మగా ఉండేవాడా!; సర్వపాలక= అందరినీ, అంతటినీ పాలించేవాడా; పుండరీక+అక్ష= తెల్లతామరరేకులవంటి కండ్లుకలవాడా!; శరణాగతన్+ఐన= శరణుకోరుతున్న దానినైన; నన్ను(న్); రక్షింపుము= కాపాడు; అని= అంటూ; వగచుచున్+ఉన్న= ఏడుస్తూ ఉన్న (దుఃఖిస్తూ ఉన్న); కుంతికిన్= కుంతీదేవికి; అక్రూరుండు= అక్రూరుడు; విదుర= విదురునితో; సమేతుండు+ఐ= కూడినవాడై; ప్రియవచనంబులన్= ప్రీతిని కలిగించే మాటలతో; దుఃఖ+ఉపశమనంబు+చేసి= దుఃఖం తగ్గేటట్లు ఓదార్చి; వీడ్కొని= సెలవు తీసుకొని; బంధు= బంధువుల; మిత్ర= స్నేహితుల; మధ్యంబునన్= మధ్యలో; సుఖ+ఉపవిష్టుండు+ఐ= సుఖంగా కూర్చొని; ఉన్న; ధృతరాష్ట్రునకున్= ధృతరాష్ట్రునితో; ఇట్లు+అనియెన్= ఇలా చెప్పాడు.

**తా :** అని చెప్పి, శ్రీకృష్ణుణ్ణి మనసులో నిలుపుకుని కుంతి నమస్కారం చేసింది. అతణ్ణి స్తుతించింది. 'అంతటా నిండి ఉన్నవాడా! అంతటినీ పాలించేవాడా! తెల్ల తామరరేకులలాంటి కండ్లు గలవాడా! నిన్ను శరణుకోరాను, నన్ను రక్షించు' అని దుఃఖపడింది. అలా ఏడుస్తున్న కుంతిని అక్రూరుడు విదురునితో కలిసి చల్లనిమాటలతో ఓదార్చాడు. అక్కడినుండి సెలవు తీసుకున్నాడు. ఆ తర్వాత బంధువుల, స్నేహితుల మధ్య సుఖంగా కూర్చొని ఉన్న ధృతరాష్ట్రుని దగ్గరకు వెళ్లాడు. అతనితో ఇలా అన్నాడు.

## ❖ అక్రూరుండు ధృతరాష్ట్రునితో హితోపదేశముగా సంభాషించుట ❖

**ఉ. నీ యనుజుండు పాండుధరణీవిభుఁ డీల్గిన నీవు భూమి ధ**
**ర్మాయతబుద్ధి నేలుచుఁ బ్రజావళిఁ గాచుచు గౌరవంబుతోఁ**
**బాయక లోకులందు సమభావన చేసితి వేనిఁ గీర్తియున్**
**శ్రేయము గల్గు; వే ఱొకటి చేసిన దుర్గతి గల్గు భూవరా! 1516**

**ప్రతి :** భూవరా= రాజా!; నీ+అనుజుండు= నీ తోడబుట్టివాడైన (నీ తమ్ముడైన); పాండుధరణీవిభుఁడు= పాండురాజు; ఈల్గినన్= మరణించగా; ఈవు= నీవు; భూమి= భూమండలాన్ని; ధర్మ+ఆయతబుద్ధిన్= ధర్మబద్ధమైన విశాలహృదయంతో; ఏలుచున్= పరిపాలిస్తూ; ప్రజా+ఆవళిన్= ప్రజాసమూహాన్ని; కాచుచున్= కాపాడుతూ; గౌరవంబుతోన్= పెద్దరికంతో; పాయక= విడిచి పెట్టకుండా; (తప్పకుండా); లోకులు+అందున్= ప్రజల పట్ల; సమభావనన్= సమత్వాన్ని; చేసితివి+ఏనిన్= చూపినట్లైతే; కీర్తియున్= మంచిపేరు; (కీర్తి); శ్రేయమున్= శుభమూ; కల్గున్= కలుగుతాయి; వేఱు+ఒకటి= అలా కాకుండా వేరేవిధంగా; చేసినన్= చేస్తే, (అంటే భేదభావం చూపితే); దుర్గతి= చెడ్డ గతి(నరకం); కల్గున్= కలుగుతుంది.

**తా :** ఓ రాజా! (ధృతరాష్ట్రమహారాజా!) నీ తమ్ముడైన పాండురాజు మరణించగా నీవు రాజ్యాన్ని ఏలుతున్నావు. ప్రజలను ధర్మబద్ధమైన బుద్ధితో పాలిస్తూ, కాపాడుతూ, పెద్దతనంతో, సమానదృష్టితో వాళ్లను చూసుకుంటే నీకు కీర్తి, శ్రేయస్సూ కూడా కలుగుతాయి. అలాకాక వేరేవిధంగా ఉంటే మాత్రం దుర్గతిపాలవుతావు.

**సీ. అవనీశ! పాండవులందు నీ నందనులందు సమానుండ వగుట బుద్ధి**
**యెవ్వనితో యోగ మిం దెవ్వనికి నిత్య మంగనాగారపుత్త్రాదికముల**
**వలన నయ్యెడి దేమి? వసుమతి నొకజంతు వుదయింప నొకజంతు వుక్కడంగు**
**నొకఁడు పుణ్యముఁ జెందు నొకఁడు పాపము నొందు మీనజీవనభూతమిళితజలము**

**ఆ. తత్తనూజు లెట్లు ద్రావుదు రట్లు మూ, ఢాత్మువిత్తమెల్ల నపహరింతు**
**రహితులైనకొడుకు లటమీఁద మనియైనఁ, జచ్చియైనఁ దండ్రిఁజాడఁ జనరు. 1517**

**ప్రతి :** అవని+ఈశ= భూమికి అధిపతి అయినవాడా, రాజా!; పాండవుల+అందున్= పాండవులపట్ల; నీ నందనుల+అందున్= నీ కొడుకుల పట్ల; సమానుండవు+అగుట= సమభావంతో ఉండడం; బుద్ధి= మంచిది; ఎవ్వనితో= ఎవడితో; యోగము= కలిసి ఉండడం; ఇందున్+ఎవ్వనికిన్= ఇక్కడ (ఈ ప్రపంచంలో) ఎవరికి; నిత్యము= శాశ్వతంగా ఉంటుంది?; అంగన+ఆగార= భార్య, ఇల్లు; పుత్త్ర+ఆదికములవలనన్= కొడుకులు మొదలైనవారివల్ల; అయ్యెడిది+ఏమి= అయ్యేది ఏముంది?; వసుమతిన్= నేలపై; ఒక జంతువు= ఒక ప్రాణి; ఉదయింపన్= జన్మించగా; ఒక జంతువు= ఇంకో ప్రాణి; ఉక్కు+అడంగున్= మరణిస్తుంది; ఒకఁడు= ఒకడు; పుణ్యమున్+చెందున్= పుణ్యాన్ని పొందుతాడు; ఒకఁడు= ఇంకొకడు; పాపమున్+ఒందున్= పాపాన్ని పొందుతాడు; మీనజీవనభూత= చేపలకు ప్రాణభూతమైన; మిళితజలము= అన్నిటితో మిశ్రితమైన నీళ్లు; తత్+తనూజులు= ఆ చేపలసంతానం; ఎట్లు= ఏ విధంగా; త్రావుదురు= తాగుతారో; అట్లు= అదే విధంగా; మూఢ+ఆత్ము= బుద్ధిహీనుడైనవాని యొక్క; విత్తము+ఎల్లన్= ధనాన్ని అంతా; అపహరింతురు= హరిస్తారు; అహితులు+ఐన=శత్రువులైన; కొడుకులు;

అటమీఁదన్= ఆ తర్వాత; మని+ఐనన్= బ్రతికి ఉన్నా; చచ్చి+ఐనన్= చనిపోయినా; తండ్రి= తమ తండ్రియొక్క; జాడన్= వైపునకు; చనరు= వెళ్లరు.

**తా :** ధృతరాష్ట్రమహారాజా! నీవు పాండవులను, నీ కొడుకులైన కౌరవులను సమానంగా చూడటం మంచిది. ఈ ప్రపంచంలో ఎవరుమాత్రం ఎవరితో ఎల్లకాలం ఉంటారు? ఏదీ శాశ్వతం కాదు. భార్య, పిల్లలు, ఇల్లు ఇలాంటి వాటివల్ల ఏం ఒరుగుతుంది? భూమిపై ఒకప్రాణి జన్మిస్తే మరోప్రాణి మరణిస్తూ ఉంటుంది. ఒకడు పుణ్యం సంపాదిస్తే, మరొకడు పాపం మూట కట్టుకుంటాడు. చేపకు ప్రాణభూతమైన నీళ్లను దానిపిల్లలు ఏ విధంగా తాగుతాయో అదే విధంగా బుద్ధిహీనుడిధనాన్నంతా వాడిదుర్మార్గపుకొడుకులే దోచుకుంటారు. ఆ తర్వాత తండ్రి బ్రతికాడా, చచ్చాడా అనికూడా విచారించరు. ఆ తండ్రి ఉన్నవైపునకూ వెళ్లరు.

**క. కావున మూఢాత్ముఁడవై, నీ వార్జించిన ధనంబు నీ పుత్త్రులు దు**
**ర్భావులు పుచ్చుకొనంగా, భూవర! నిందితుఁడ వగుదు భూనాకములన్. 1518**

**ప్రతి :** కావునన్= కాబట్టి; మూఢ+ఆత్ముఁడవు+ఐ= తెలివిలేనివాడివై; నీవు; ఆర్జించిన= సంపాదించి పెట్టిన; ధనంబున్= సంపదను; దుర్భావులు= దుర్బుద్ధికలిగిన; నీ పుత్రులు= నీ కొడుకులైన దుర్యోధనుడు మొదలైనవారు; పుచ్చు కొనన్+కాన్= తీసుకోగా; భూవర= రాజా!; భూనాకములన్= భువిలోనూ, దివిలోనూకూడా; నిందితుఁడవు+అగుదు(వు)= నిందించబడతావు.

**తా :** కాబట్టి, ఓ ధృతరాష్ట్రమహారాజా! తెలివితక్కువవాడివై నీవు సంపాదించిన ధనసంపదలను, దుర్బుద్ధులైన నీ కొడుకులు తీసుకొంటారు. అప్పుడు నిన్ను ఈ లోకంలోనూ, స్వర్గలోకంలోనూ కూడా అందరూ నిందిస్తారు.

**శా. నిందం బొందకు మయ్య! యీ తనువు దా నిద్రాకళాదృష్టమౌ**
**సందోహంబు విధంబు నిల్వదు సుమీ! జాత్యంధతం బొందియున్**
**మందప్రజ్ఞత లేల చేసెదవు సమ్యగ్ జ్ఞానచక్షుండవై**
**సందేహింపక యిమ్ము పాండవులకున్ సర్వంసహాభాగమున్. 1519**

**ప్రతి :** నిందన్= అపనిందను; పొందకుము+అయ్య= పొందవద్దు రాజా; ఈ తనువు= ఈ శరీరం; తాన్= తాను; నిద్రాకళా= నిద్రయొక్క భాగంలో; దృష్టము+ఔ= చూడబడినవైన; సందోహంబు= వస్తు సమూహంయొక్క; విధంబు= పద్ధతి(గా ఉంటుంది); నిల్వదు సుమీ= శాశ్వతంగా నిలిచి ఉండదు; జాతి+అంధతన్= పుట్టుకతోనే గుడ్డితనాన్ని; పొందియున్= పొందికూడా; మందప్రజ్ఞతలు= బుద్ధిలేని పనులను; ఏల= ఎందుకు; చేసెదవు= చేస్తావు; సమ్యక్= సరి అయిన; జ్ఞాన= జ్ఞానం అనే; చక్షుండవు+ఐ= నేత్రాలను కలిగినవాడివై; పాండవులకున్= పాండవులకు; సందేహింపక= అనుమానించకుండా; సర్వంసహా+భాగమున్= భూమండలంలో వారికివ్వవలసిన భాగాన్ని; ఇమ్ము= ఇచ్చేయి.

**తా :** రాజా! అపనింద పొందవద్దు. ఈ శరీరం నిద్రలో వచ్చిన కలలోని వస్తువులాంటిది. ఇది శాశ్వతంగా నిలిచేది కాదు సుమా! పుట్టంధుడివైకూడా, ఎందుకిలాంటి బుద్ధిలేనిపనులను చేస్తావు? సరి అయిన దృష్టితో చూడు. ఏ అనుమానం లేకుండా పాండవులకు వారికివ్వవలసిన భూ భాగాన్ని పంచి ఇవ్వు.

**వ. అనిన ధృతరాష్ట్రుం డిట్లనియె. 1520**

**ప్రతి :** అనినన్= అని పలుకగా; ధృతరాష్ట్రుండు= ధృతరాష్ట్రుడు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తా :** పై రీతిగా పలికిన మాటలను విని ధృతరాష్ట్రుడు ఇలా అన్నాడు.

**సీ. నీమాట మంచిది నిశ్చయ; మగునైన నస్థిరంబయిన నాయంతరంగ**
**మందు నిల్వదు సుదామాచలస్ఫటికశిలాతలోద్యతతటిల్లతిక భంగి;**
**నమృతంబు నొందియు నానందితుఁడు గాని నరుమాడ్కి నేను నానంద మొంద;**
**నీశ్వరాజ్ఞావిధ మెవ్వఁడు దప్పింపనోపు విజ్ఞానియై యుండియైన**

**ఆ. విశ్వమెల్లఁ జేసి విభజించి గుణముల, నెవ్వఁ డనుసరించె నెవ్వఁ డవని**
**భారమెల్లఁ బాయఁ బ్రభవించె దేవకి, కెవ్వఁ డాత్మతంత్రుఁ డీశ్వరుండు. 1521**

**ప్రతి :** నీ మాట= నీవు చెప్పిన మాట; మంచిది= ఉత్తమమైంది; నిశ్చయము+అగునున్= నిజమైందికూడా అవుతున్నది; ఐనన్= కానీ; సుదామ+అచల= సుదామమనే కొండయొక్క; స్ఫటిక శిలాతల= పటికరాయిమీద; ఉద్యత= సిద్ధమైన; తటిత్+లతిక భంగిన్= మెరుపు తీగలాగా; అస్థిరంబు+ఐన= చంచలమైన; నా+అంతరంగము+అందున్= నా మనసులో; నిల్వదు= ఆ మాట నిలబడదు; అమృతంబున్+ఒందియున్= అమృతాన్ని పొందినప్పటికీ; ఆనందితుఁడు+కాని= ఆనందంపొందని; నరుమాడ్కిన్= మనిషివలె; నేనున్= నేనుకూడా; ఆనందము+ఒందను= ఆనందాన్ని పొందలేను, సంతోషించలేను; ఈశ్వర+ఆజ్ఞావిధము= దేవుని ఆ జ్ఞాన పద్ధతిని; ఎవ్వఁడు= ఎవడు మాత్రం; తప్పింపన్+ఓపు= తప్పించగలడు?; విజ్ఞాని+ఐ+ఉండి+ఐనన్= గొప్పజ్ఞానం కలవాడై ఉండి కూడా; విశ్వము+ఎల్లన్= ప్రపంచాన్నంతటినీ; చేసి= నిర్మించి; విభజించి= వేరు వేరు భాగాలుగా చేసి; గుణములన్= త్రిగుణాలైన సత్వం, రజస్సు, తమస్సు అనే వాటిని; ఎవ్వడు+అనుసరించెన్= ఎవడు అనుసరించాడో; ఎవ్వడు+అవనిభారము+ఎల్లన్= ఎవడు భూమిభారాన్నంతటినీ; పాపన్= తగ్గించడానికి; దేవకికిన్= దేవకీ దేవికి; ఎవ్వఁడు= ఎవడైతే; ఆత్మతంత్రుఁడు+ఈశ్వరుండు= తన సొంత వ్యూహాలు కలవాడైన దేవుడు; ప్రభవించెన్= జన్మించాడో...

**తా :** నీవు చెప్పిన మాట నిజమే. కానీ నా మనసు చంచలం. అందులో నీ మాట నిలవదు. సుదామపర్వతంయొక్క స్ఫటికశిలపై ఉదయించి తళుక్కున మెరిసే మెరుపు వెలుగులాగా నా మనసు నిలకడ లేనిది. అమృతాన్ని పొందికూడా, సంతోషం పొందలేని మనిషివలె నేనూ ఆనందం పొందలేను. దేవుడు నిర్ణయించిన దాన్ని ఎవడు తప్పించగలడు? ఎంత గొప్ప జ్ఞానిఅయినా దాన్ని అనుభవించాల్సిందే. ఈ ప్రపంచాన్ని సృజించడమేగాక, త్రిగుణాల ప్రకారం ఎవడు విభజించి, తానూ అనుసరించాడో, ఎవడు భూభారాన్ని తగ్గించడానికి దేవకీదేవి గర్భంలో జన్మించాడో; ఎవడికి తన స్వతంత్ర వ్యూహాత్మక శక్తి ఉందో, ఎవరు ఈశ్వరుడో

**వ. అట్టి కృష్ణునకు నమస్కరించెద; ఆ నందనందనునిదివ్యచిత్తమునం గల తెఱంగునం బ్రతుకం గలవార మని వీడ్కొలిపిన, నక్రూరుం డతనితలం పెఱింగి యిట్లనియె. నీ తలంపు గనుంగొంటి. నీ కిష్టం బగునట్లు వర్తింపుమని పలికి, మరల మథురకుం జనుదెంచి, తదీయవృత్తాంతంబు రామకృష్ణుల కెఱింగించె. 1522**

**ప్రతి :** అట్టి కృష్ణునకున్= అలాంటి శ్రీకృష్ణునికి; నమస్కరించెదన్= నమస్కారం చేస్తాను; ఆ+నందనందనుని= ఆ నందుని కుమారుడైన కృష్ణుని; దివ్యచిత్తంబునన్+కల= గొప్పమనసులో ఉన్న; తెఱంగునన్= విధంగా; బ్రతుకన్+కలవారము=

బతుకుతాము; అని= అని చెప్పి; వీడ్కొలిపినన్= వీడ్కోలు చెప్పగా; అక్రూరుండు= అక్రూరుడు; అతని+తలంపు+ఎఱింగి= అతడి ఆలోచనను గ్రహించి; నీ+తలంపున్= నీ అభిప్రాయాన్ని; కనుంగొంటిన్= గ్రహించాను; నీకు+ఇష్టంబు+అగునట్లు= నీకు ఇష్టమైన విధంగా; వర్తింపుము= ప్రవర్తించు; అని పలికి= అని చెప్పి; మరలన్= మళ్లీ; మథురకున్= మధురానగరానికి; చనుదెంచి= వచ్చి; తదీయ= అతణ్ణి (ధృతరాష్ట్రుణ్ణి) గురించిన; వృత్తాంతంబున్= విషయాన్ని; రామకృష్ణులకున్+ఎఱింగించెన్= బలరామ కృష్ణులకు తెలియజేశాడు.

**తా :** 'అలాంటి శ్రీకృష్ణునికి నమస్కరిస్తాను. ఆ నందకుమారుడు తన మనసులో ఎలా భావిస్తున్నాడో, అలా బతుకుతాము'. అని చెప్పి, ధృతరాష్ట్రుడు వీడ్కోలు పలికాడు. అతడిఅభిప్రాయం ఏమిటో అక్రూరునికి అర్థమైంది. "నీ అభిప్రాయం తెలుసుకున్నాను. నీకు ఇష్టం అయిన రీతిలోనే ప్రవర్తించు" అని చెప్పి, అక్రూరుడు తిరిగి మథురనగరానికి వచ్చాడు. అతని సమాచారం బలరామకృష్ణులకు తెలిపాడు.

**వ. అంతఁ గంసభార్య లగు నస్తియుం బ్రాస్తియు, విధవలయి, దుఃఖింపుచుం దమదండ్రి యయిన జరాసంధుని కడకుం జని. 1523**

**ప్రతి :** అంతన్= అటు తర్వాత; కంసభార్యలు+అగు= కంసునిభార్యలైన; అస్తియున్= అస్తి అనే ఆమె; ప్రాస్తియు= ప్రాస్తి అనే ఆమె; విధవలు+అయి= భర్తను పోగొట్టుకున్నవారై (అంటే కంసుడు మరణించాడని అర్థం); దుఃఖింపుచున్= దుఃఖిస్తూ; తమతండ్రి+అయిన= తమకు తండ్రి అయిన; జరాసంధుని కడకున్= జరాసంధుని వద్దకు; చని= వెళ్లి...

**తా :** అటు తర్వాత కంసుని భార్యలైన అస్తి, ప్రాస్తి అనే ఇద్దరూ తమ భర్త మరణించినందుకు ఏడుస్తూ వాళ్ల తండ్రి అయిన జరాసంధునివద్దకు వచ్చి,

## ✤ జరాసంధుఁడు మథురాపట్టణముమీఁద దండెత్తివచ్చి కృష్ణునితో యుద్ధము చేయుట ✤

**శా. వాండ్రున్ వీండ్రును రాజులే యనుచు గర్వప్రౌఢితో యాదవుల్**
**వేండ్రంబైన బలంబుతో మథురకున్ వే వచ్చి నిష్కారణం**
**బాండ్రున్ బిడ్డలు బంధులున్ వగవఁ గంసాదిక్షమానాథులన్**
**దండ్రీ! చంపిరి కృష్ణుచేత నిటు వైధవ్యంబు వచ్చెన్ జుమీ! 1524**

**ప్రతి :** వాండ్రున్+వీండ్రును= వాళ్లూ వీళ్లూ; రాజులే+అనుచున్= రాజులేనా అంటూ; గర్వప్రౌఢితో= మిక్కిలి గర్వంతో; యాదవుల్= యాదవవంశంలో పుట్టినవాళ్లు (బలరామ కృష్ణులని సూచన); వేండ్రంబు+ఐన= శౌర్యంకలదైన; బలంబుతో= సైన్యంతో; మథురకున్= మధురానగరానికి; వే+వచ్చి= వెంటనే (వేగంగా) వచ్చి; నిష్కారణంబున్= అకారణంగా; బిడ్డలున్= బిడ్డలు; బంధులున్= బంధువులు; వగవన్= ఏడుస్తూ ఉండగా; కంస+ఆది= కంసుడు మొదలైన; క్షమానాథులన్= భూనాథులను; తండ్రీ= ఓ తండ్రీ! (జరాసంధమహారాజా); చంపిరి= వధించారు; కృష్ణుచేతన్= శ్రీకృష్ణునివలన; ఇటు= ఈ విధంగా; వైధవ్యంబు= విధవత్వం; వచ్చెన్+చుమీ= వచ్చింది చూడు.

**తా :** వారు తమ జనకునితో 'తండ్రీ! లోకంలోని వారూ, వీరూ రాజులేనా అని యాదవులు మిక్కిలి గర్వించి శౌర్యవంతమైన సైన్యంతో వచ్చి, మథురాపట్టణాన్ని ముట్టడించారు. భార్యలు, పిల్లలు, చుట్టాలు ఆక్రందిస్తుండగా కంసుడు మున్నగు రాజుల్ని వధించారు. ఈ విధంగా మాకు కృష్ణునివల్ల వైధవ్యం సంప్రాప్తించింది.

**వ. అనిన విని, ప్రళయకాలానలంబు తెఱంగున మండిపడి శోకరోషంబులు బంధురంబులుగా జరాసంధుం డిట్లనియె. 1525**

**ప్రతి :** అనినన్= కొమార్తెలు అలా చెప్పగానే; విని= ఆలకించి; ప్రళయకాల+అనలంబు= ప్రళయకాలంలోని అగ్ని; తెఱంగునన్= వలె; మండిపడి= రగిలిపోతూ; శోక రోషంబులు= ఏడుపు, కోపం; బంధురంబులు+కాన్= బాధకాలు కాగా; జరాసంధుండు+ ఇట్లు+అనియెన్= జరాసంధుడు ఇలా అన్నాడు.

**తా :** ఈ మాటలను వినగానే జరాసంధుడు ప్రళయకాలాగ్ని వలె మండిపడ్డాడు. దుఃఖం, కోపం రెండూ ఎక్కువై బాధిస్తుండగా అపుడు ఇలా అన్నాడు.

**శా. ఏమీ! కంసునిఁ గృష్ణుఁడే రణములో హింసించె నోచెల్ల! నా**
**సామర్థ్యంబుఁ దలంపఁ డించుకయు మచ్చండప్రతాపానలో**
**ద్దామార్చుల్ వడి నేఁడు గాల్చు యదుసంతానాటవీవాటికన్**
**భూమిం గ్రుంగిన నింగిఁ బ్రాఁకిన మహాంభోరాశిలోఁ జొచ్చినన్. 1526**

**ప్రతి :** ఏమీ= ఏమన్నారూ?; కంసునిన్= కంసుణ్ణి; కృష్ణుఁడు+ఏ= శ్రీకృష్ణుడే; రణములోన్= యుద్ధంలో; హింసించెను+ఓ చెల్ల= చంపాడా? ఔరా!; నా+సామర్థ్యంబున్= నా బలాన్ని గురించి; ఇంచుకయున్= కొంచెం కూడా; తలంపఁడు= ఆలోచించడే; మత్+చండ ప్రతాప+అగ్ని= నా యొక్క భయంకరమైన పరాక్రమమనే అగ్నినుండి వెలువడే; ఉద్దామ= పైకి ఎగసి పడుతున్న; ఆర్చుల్= మంటలు; వడిన్= వెంటనే; నేఁడు= ఈ రోజు; యదు= యాదవ; సంతాన= సంతానమనబడే; అటవీవాటికన్= అడవులసమూహాన్ని; భూమిన్= భూమిలో; క్రుంగినన్= దాక్కున్నప్పటికీ; నింగిన్= ఆకాశానికి; ప్రాఁకినన్= ఎగిసిపోయినప్పటికీ; మహా+అంభస్+రాశిలోన్= మహాసముద్రంలో; చొచ్చినన్= ప్రవేశించినప్పటికీ; కాల్చున్= కాల్చేస్తాయి.

**తా :** ఏమీ? కంసుణ్ణి శ్రీకృష్ణుడే యుద్ధంలో చంపాడా? ఔరా! నా బలంగురించి కొంచెంకూడా ఆలోచించలేదే. భూమిలో దాక్కున్నా సరే, ఆకాశానికి ఎగిరినా సరే, మహాసముద్రంలో ప్రవేశించినా సరే నా పరాక్రమమనే భయంకరమైన అగ్నినుండి ఎగసిపడే మంటలు ఈ రోజే యాదవసమూహమనే అడవులను కాల్చేస్తాయి.

**క. యాదవవిరహిత యగుఁ బో, మేదిని నాచేత నేఁడు మీఁదు మిగిలి సం**
**పాదితబలులై హరి రు, ద్రాదులు నింద్రాదు లెవ్వ రడ్డం బైనన్. 1527**

**ప్రతి :** నాచేతన్= నా వలన; నేఁడు= ఈనాడు; మీఁదు మిగిలి= అతిశయించిన; సంపాదిత బలులు+ఐ= సమకూర్చుకున్న సైన్యం కలవారై; హరి= విష్ణువు; రుద్ర+ఆదుల్= శివుడుమున్నగువారు; ఇంద్ర+ఆదుల్= ఇంద్రుడు మొదలైనవాళ్లు; ఎవ్వరు= ఎవరైనా; అడ్డంబు+ఐనన్= అడ్డువస్తే కూడా; మేదిని= భూమి; యాదవ విరహిత= యాదవులు లేకుండా; అగున్+పో= అవుతుందిగాక!;

**తా :** బ్రహ్మవిష్ణుమహేశ్వరులు, ఇంద్రుడు మొదలైనవాళ్లు ఎవ్వరు అడ్డుపడినా, ఈ రోజు నా చేతిలో యాదవులు మరణిస్తారు. భూమిలో యాదవులే లేకుండా చేస్తాను.

**వ. అని పలికి, సమరసన్నాహసంకులచిత్తంబునఁ గోపంబు దీపింప సంగరభేరి వేయించి కదలి.1528**

**ప్రతి :** అని= ఈ విధంగా; పలికి= చెప్పి; సమరసన్నాహ= యుద్ధానికి సిద్ధం కావడంతో; సంకుల= నిండినదైన; చిత్తంబునన్= మనసులో; కోపంబు= కోపం; దీపింపన్= ప్రజ్వలింపగా; సంగరభేరిన్= యుద్ధ భేరిని; వేయించి= మ్రోగింపజేసి; కదలి= ముందుకు కదలి.

**తా :** అని ఇలాగ తన కుమార్తెలకు ఓదార్పు మాటలు చెప్పాడు. యుద్ధానికి సిద్ధపడుతున్న మనసులో కోపం మండిపోతుండగా యుద్ధభేరిని మ్రోయించి ముందుకు కదిలాడు.

**క. దక్షుండై యిరువది మూఁ, డక్షౌహిణులైన బలము లనుగతములుగా**
**నా క్షణమ జరాసంధుఁడు, ప్రక్షోభముతోడ మధురపైఁ జనియె నృపా! 1529**

**ప్రతి :** నృపా= రాజా!; ఇరువదిమూఁడు= ఇరవైమూడు; అక్షౌహిణులు+ఐన= అక్షౌహిణులుగా ఉన్న; బలములు= సైన్యాలు; అనుగతములు+కాన్= వెంట నడుస్తూండగా; ఆక్షణము+అ= ఆ క్షణమే; దక్షుండు+ఐ= సమర్థుడై; జరాసంధుఁడు= జరాసంధుడు; ప్రక్షోభముతోడన్= మిక్కిలి కలతపడుతూ; మధురపైన్= మధురానగరం మీదికి; చనియెన్= దాడి చేయడానికి వెళ్లాడు.

**తా :** రాజా! దక్షుడైన జరాసంధుడు ఇరవైమూడుఅక్షౌహిణులసైన్యం తన వెంట నడుస్తుండగా, మిక్కిలి కోపోద్రిక్తుడై మధురానగరం మీదికి దండెత్తాడు.

**క. గంధేభ తురగ రథ భట, బంధుర చరణోత్థితోగ్ర పాంసుపటల యో**
**గాంధీభూతములై దివి,మంథరగతి నడచె నపుడు మార్తాండహరుల్. 1530**

**ప్రతి :** గంధ= మదజలంచే పరిమళించే; ఇభ= ఏనుగులు; తురగ= గుర్రాలు; రథ= రథాలు (తేరులు); భట= భటుల (కాల్బలము); బంధుర= సంకీర్ణమైన; చరణ= అడుగుల తొక్కిడినుండి; ఉత్థిత= పైకి లేచిన; ఉగ్ర= భయానకమైన; పాంసు= దుమ్ముయొక్క; పటల= రేణువులతో; యోగ= కూడి; అంధీభూతములు+ఐ= చీకట్లు క్రమ్ముకొన్నవై (ఏమీ కనిపించకపోయినవై); మార్తాండ= సూర్యుని; హరుల్= గుర్రాలు; దివిన్= ఆకాశంలో; మంథరగతిన్= నెమ్మదిగా; అపుడు; నడచెన్= నడిచాయి.

**తా :** అలా జరాసంధుడు దండెత్తిన వేళలో మదించి ఏనుగుల, గుఱ్ఱాల, రథాల భటుల కాలితొక్కిడికి దట్టంగా దుమ్ము పైకిలేచి ఆకాశంలో చీకట్లు కమ్ముకొన్నాయి. అందువల్ల సూర్యుని రథాశ్వాలు మెల్లగా నడిచాయి.

**వ. ఇట్లు చని నిరంతర కిసలయ పత్ర కోరక కుసుమ ఫలభార వినమిత వృక్షవిలసిత మహోద్యానంబును, ఉద్యానవనభాగ వలమాన జలోన్నయన దారుయంత్రలతానిబద్ధ కలశ విముక్త సలిలధారాశీకర పరంపరా సంపాదిత వర్షాకాలంబును, కాలకింకర సదృశ వీరభట రథతురగ సామజానీక సంకులంబును,గులాచార ధర్మప్రవీరపౌరజనభాసురంబును, సురాభేద్యమానమహోన్నతాట్టాలకయంత్రభయంకర ప్రాకారచక్రంబును, జక్ర సారస హంసాది కలకలరవ కలితసరోవరంబును, సరోవరసంపుల్లహల్లక కమలపరిమళమిళిత పవన విరాజితంబును, జితానేకమండలేశ్వరభూషణమణిగణరజోనివారితమదగజేంద్రదానజలప్రభూతపంకంబును, బంకరహిత యాదవేంద్రదత్త సువర్ణాచల కల్పతరు కామధేను సమ్మర్దిత విద్వజ్జన నికేతనంబును,గేతన సన్నిబద్ధ**

**చామరమయూర చాప శింజినీనినద పరిపూరితాభ్రంబును, నభ్రంలిహమహాప్రాసాదసౌధగవాక్షరంధ్ర నిర్గతఘనసారధూపధూమపటలవిలోకనసంజనిత జలధరభ్రాంతి విభ్రాంత శిఖండితాండవ రుచిరంబును, జిరతరానేక దేవాలయ జోఘుష్యమాణ తూర్యనినద పరిభావిత పారావారకల్లోల ఘోషంబును, ఘోషకామినీ ప్రాణవల్లభ బాహుదండ పరిరక్షితంబునునై, పరులకు నలక్షితంబైన మథురానగరంబు చేరి, వేలాలంఘనంబు చేసి, వెల్లివిరిసిన మహార్ణవంబు తెఱంగున పట్టణంబునకు ముట్టణంబు చేసి, చుట్టును విడిసిన జరాసంధుని బలౌఘంబు గని, వేళావిదుండగు హరి తన మనంబున. 1531**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; చని= వెళ్లి; నిరంతర= ఎల్లప్పుడు ఉండే; కిసలయ= చిగుళ్లు; పత్ర= ఆకులు; కోరక= మొగ్గలు; కుసుమ= పువ్వులు; ఫల= పండ్లు; భార= (వీటిచే) బరువెక్కి; వినమిత= నేలకు వంగిన; వృక్ష= చెట్లచే; విలసిత= ప్రసిద్ధి పొందిన; మహా+ఉద్యానంబును= గొప్పతోటను; ఉద్యానవనభాగ= ఆ తోటలోని భాగంలో; వలమాన= చుట్టబడి; జల+ఉత్+ నయన= నీళ్లను పైకి చిమ్మే; దారుయంత్ర= చెక్కతో చేయబడిన యంత్రాలు; లతా= తీగలచేత; నిబద్ధ= కట్టబడిన; కలశ= నీళ్లు ఎగజిమ్మడానికి వీలుగా ఉన్న చిన్న మూతి కలిగిన గిండిగ నుండి; విముక్త= వదలబడిన; సలిల= నీటి; ధారా= ధారలయొక్క; శీకర= తుంపరల; పరంపరా= సమూహంవల్ల; సంపాదిత= కల్పింపబడిన; వర్షాకాలంబును= వానాకాలం (కలది); కాలకింకర సదృశ= యమకింకరులవంటి; వీరభట= పరాక్రమవంతులైన భటులయొక్క; రథ= రథాలు (తేరులు); తురగ= గుఱ్ఱాలు; సామజ= ఏనుగులతో; సంకులంబును= నిండింది; కుల+ఆచార= తమ కులాలకు తగిన ఆచారాలలోను; ధర్మ= ధర్మంలోనూ; ప్రవీణ= కుశలురైన; పౌరజన= పురజనంతో; భాసురంబును= వెలిగిపోతున్నదీ; సుర+అభేద్యమాన= దేవతలకైనా భేదించడానికి వీలుకాని; మహా+ఉన్నత= చాలా పొడవైన (ఎత్తైన); అట్టాలక= కోట బురుజుల మీది; యంత్ర= యంత్రాలచేత; భయంకర= భయం కలిగిస్తున్న; ప్రాకార చక్రంబును= వలయాకారపు ప్రాకారంతోను; చక్ర= చక్రవాక పక్షులు (జక్కవలు); సారస= కొంగలు; హంస= రాజహంసలు; ఆది= మొదలైన పక్షులయొక్క; కలకలరవ= మధురధ్వనులతో; కలిత= కూడిన; సరస్+వరంబును= ఉత్తమమైన సరస్సును కలిగింది; సరోవర= సరస్సుల్లోని; సంఫుల్ల= బాగా వికసించిన; హల్లక= ఎఱ్ఱకలువపూలు; కమల= తామరపూల; పరిమళ= సువాసనలతో; మిళిత= కూడిన; పవన= గాలిచే; విరాజితంబును= వెలుగుతున్నదియు; జిత= జయించబడిన; అనేక= చాలామంది; మండల+ఈశ్వర= రాజుల; భూషణ= ఆభరణాలలోని; మణిగణ= మణుల సమూహంయొక్క; రజస్= పొడిచేత; నివారిత= పోగొట్టబడిన; మదగజ+ఇంద్ర= మదించిన శ్రేష్ఠమైన ఏనుగుల; దానజల= చెక్కిళ్ల నుండి స్రవించే మదజలంవల్ల; ప్రభూత= ఏర్పడిన; పంకంబును= బురదతో కూడిందీ; పంకరహిత= పాపరహితులైన (పుణ్యాత్ములైన); యాదవ+ఇంద్ర= యాదవ శ్రేష్ఠులచే; దత్త= ఇవ్వబడిన; సువర్ణ+అచల= బంగారుకొండ (మేరుపర్వతం); కల్పతరు= కల్పవృక్షం; కామధేను= కామధేనువు; సమ్మర్దిత= వీటితో కూడిన; విద్వత్+జన= విద్వాంసులైనవారి; నికేతనంబును= ఇళ్లతోకూడిందీ; కేతన= పతాకంపై (టెక్కెము); సత్+నిబద్ధ= బాగా కట్టబడిన; చామర= వింజామరల; మయూర= నెమళ్ల; చాప= ధనుస్సుల; శింజిని= వింటినారి; నినద= ధ్వనులచేత; పరిపూరిత= నిండిపోయిన; అభ్రంబును= ఆకాశంకలదియు; అభ్రంలిహ= ఆకాశాన్ని తాకుతున్న; మహాప్రాసాద= గొప్ప భవనాల; సౌధ= మేడల; గవాక్ష రంధ్ర= కిటికీ రంధ్రాలనుండి; నిర్గత= బయటకి వెళ్తున్న; ఘనసార= పచ్చకర్పూరపు; ధూప= ధూపాల; ధూమ= పొగయొక్క; పటల= గుంపును; విలోకన= చూడడంచే; సంజనిత= కలిగిన; జలధర= వానాకాలపు మబ్బులు అనే; విభ్రాంత= భ్రమతో; శిఖండి= నెమళ్లయొక్క; తాండవ= ఆనందనాట్యంచే; రుచిరంబును= వెలుగులీనుతున్నదియు; చిరతర= ఎడతెగని; అనేక= మిక్కుటమైన; దేవ+ఆలయ= గుడులలో; జోఘుష్యమాణ= మోగుతున్న; తూర్య= వాద్యాల; నినద=

శబ్దంతో; పరిభావిత= అవమానించబడుతున్న; పారావార= సముద్రంయొక్క; కల్లోల= ఎగసిపడుతున్న అలల; ఘోషంబును= శబ్దం కలదియు; ఘోషకామినీ= గోప వనితలకు; ప్రాణవల్లభ= ప్రాణప్రియులైన భర్తలయొక్క; బాహుదండ= బలమైన చేతులచే; పరిరక్షితంబును+ఐ= బాగా రక్షించబడుతున్నదై; పరులకున్= ఇతరులకు, (శత్రువులకు); అలక్షితంబు+ఐన= చూడడానికికూడా వీలుకాందైన; మధురానగరంబు= మధురానగరాన్ని; చేరి= ప్రవేశించి; వేలాలంఘనంబుచేసి= గట్టుదాటి; వెల్లివిరిసిన= ఎగసి దూకిన; మహా+అర్ణవంబు= మహాసముద్రం; తెఱంగునన్= వలె; పట్టణంబునకున్= మధురానగరాన్ని; ముట్టణంబుచేసి= ముట్టడించి; చుట్టును= అన్నివైపులా; విడిసిన= విడిది చేసిన; జరాసంధుని; బల+ఔఘంబున్= సైన్యసమూహాన్ని; కని= పరికించి; వేళావిదుండు+అగు= ఏ సమయంలో ఏం చేయాలో తెలిసినవాడైన; హరి= శ్రీకృష్ణుడు; తన మనంబునన్= తన మనస్సులో...

**తా :** ఇలా బయల్దేరి వెళ్లిన జరాసంధుని సేనలు మధురానగరానికి చేరాయి. ఆ నగరంలో పెద్ద ఉద్యానవనాలున్నాయి. అందులో ఎప్పుడూ చిగుళ్లతో, ఆకులతో, మొగ్గలతో, పూలతో, పళ్లతో బరువెక్కి వంగిన పెద్దపెద్ద చెట్లున్నాయి. ఆ వనాల్లో జలయంత్రాలున్నాయి. అవి చెక్కతో చేసినవి. వాటికి నీటిని పైకి చిమ్మడానికి వీలుగా చిన్నికలశంలాంటి మూతిని అమర్చారు. అందులో నుండి నీరు పైకి ఎగసి చిమ్ముతూ ఉంటుంది. ఆ నీటి ధారల తుంపరలచే కల్పించబడిన వర్షాకాలంలాగా ఉంది. యమకింకరులవంటి పరాక్రమవంతులైన భటులతో, రథాలతో, గుర్రాలతో, ఏనుగులతో నగరం నిండి ఉంది. తమ కులాలకు తగిన ఆచారాలలోనూ, ధర్మంలోనూ ప్రావీణ్యం కల పౌరులతో ఆ ఊరు వెలిగిపోతూ ఉంది. దేవతలకైనా భేదించడానికి వీలుకానంతటి ఎత్తైన కోటలున్నాయి. ఆ కోట బురుజులమీద (రాళ్లను విసిరే) యంత్రాలున్నాయి. ఆ ప్రాకారవలయం భయం కలిగించేదిగా ఉంది. అక్కడ శ్రేష్ఠమైన సరస్సులున్నాయి. అందులో జక్కవ (చక్రవాక) పక్షులు, బెగ్గురు పక్షులు, రాజహంసలు కలకలారావాలు చేస్తున్నాయి. ఆ సరస్సుల్లో బాగా విచ్చుకున్న ఎర్రకలువలు, తామరలు ఉన్నాయి. వాటి పరిమళాలతో కూడిన గాలులు వీస్తున్నాయి. వీటితో ఆ ఊరు అందంగా ఉంది. ఆ ఊళ్లో మదించిన ఏనుగులున్నాయి. వాటినుంచి మదజలం స్రవించి నేల బురదతో నిండిపోయింది. ఓడించబడిన ఎందరో రాజులు ధరించిన ఆభరణాల, మణుల పొడిరాలి, ఆ బురద పూడిపోతూ ఉంది. పాపరహితులైన యాదవ శ్రేష్ఠులు అక్కడి పండిత జనానికి మేరుపర్వతాన్ని, కల్పవృక్షాన్నీ, కామధేనువునూ ఇచ్చారు. ఈ కానుకల సమ్మర్దంతో వారి ఇండ్లు వెలుగుతున్నాయి. (అంటే యాదవ శ్రేష్ఠులు ఇచ్చిన కానుకలు అంత విలువైనవని అర్థం). అక్కడి పతాకాలపై వింజామర, నెమలి, ధనుస్సు మొదలైన గుర్తులున్నాయి. అవి గాలికి రెపరెపలాడుతూ ఆ శబ్దంతో ఆకాశాన్ని నింపుతున్నాయి. అక్కడ గొప్పభవనాలు ఆకాశాన్ని తాకుతున్నాయి. ఆ భవనాల, మేడల గవాక్షాల రంధ్రాల్లో నుండి పొగలు బయటకు వెళ్తున్నాయి. అవి పచ్చకప్పూరపు ధూపాలు. వాటిని చూసి నెమళ్లు మబ్బులని భ్రమించి, పింఛం విప్పి ఆనందంతో నర్తిస్తున్నాయి. వీటితో ఆ ఊరు సొగసుగా ఉంది.

ఆ ఊళ్లోని దేవాలయాల్లో మంగళ వాద్యాలు ఎడతెగక మ్రోగుతుంటాయి. అవి సముద్రంలో చెలరేగుతున్న అలల శబ్దాలను తిరస్కరిస్తుంటాయి. గోపవనితల ప్రాణనాథులయొక్క బాహుబలంచేత ఆ ఊరు రక్షించబడుతూ ఉంది. శత్రువులు కన్నెత్తి కూడా చూడడానికి వీలు లేనంతటి ప్రతాపం ఉన్న మధురానగరం – అది. ఆ నగరాన్ని చేరి ఎగిసిపడిన మహాసముద్రంవలె, జరాసంధుడు ముట్టడించాడు. అన్ని వైపులా విడిది చేశాడు. సమయజ్ఞుడైన శ్రీకృష్ణుడు అతని సైన్యసమూహాన్ని చూచి, తన మనసులో ఇలా అనుకున్నాడు.

**మ. ఐదు న్నాలుగు నాఱు రెండు నిరు మూఁడక్షౌహిణుల్ సుట్టి సం**
**ఛాదించెన్ బురమెల్ల, మాగధు నెడన్ సామంబు దానంబు సం**

**భేదంబున్ బనిలేదు దండవిధి శోభిల్లం బ్రయోగించి యీ**
**భూదేవీ తనుభార మెల్ల నుడుపన్‌బోలున్ జయోద్భాసినై. 1532**

**ప్రతి :** అయిదున్నాలుగు నాఱు రెండు నిరుమూఁడక్షౌహిణులు= 5+4+6+2+3+3= ఇరవైమూడుఅక్షౌహిణులు; చుట్టి= చుట్టుకొని; పురము+ఎల్లన్= నగరమంతా; సంఛాదించెన్= కమ్ముకున్నాయి; మాగధుని+ఎడన్= మగధరాజైన జరాసంధుని పట్ల; సామంబు= సామం; దానంబు= దానం; సంభేదంబున్= భేదం (అనేవి); పనిలేదు= అవసరం లేదు; దండవిధిన్= దండోపాయం; శోభిల్లన్= వెలుగొందేలా; ప్రయోగించి= ఉపయోగించి; జయ+ఉద్భాసిని+ఐ= విజయంతో వెలుగులీనే వాడినై; ఈ= ఈ; భూదేవీ= భూదేవి యొక్క; తనుభారము+ఎల్లన్= శరీర బరువునంతటినీ; ఉడుపన్+పోలున్= పోగొట్టాలి.

**తా :** జరాసంధుడు ఇరవైమూడు అక్షౌహిణుల సైన్యంతో ఊరిని చుట్టుముట్టాడు. అతనిపట్ల సామదానభేదాలు సాగవు. ఇక అతనికి దండమే తప్పనిసరి. దానితో వాణ్ణి జయించి భూదేవికి బరువు తగ్గిస్తాను.

**క. ఏ నవతరించు టెల్లను, మానుగఁ జతురంతధరణి మండలభరమున్**
**మానుపుకొఱకుం గాదే, పూనెద నిది మొదలు దగిలి భూభర మణఁపన్. 1533**

**ప్రతి :** ఏన్= నేను; అవతరించుట+ఎల్లను= దివినుండి నేలకుదిగి జన్మించడం అంతా కూడా; మానుగన్= బాగా; చతుర్+అంత= నాలుగు దిక్కుల చివరలదాకా ఉన్న; ధరణిమండల= భూవలయంయొక్క; భరమున్= బరువును; మానుపుకొఱకున్+కాదే= తొలగించడం కోసమే కదా!; భూభరము+అణఁపన్= భూమిభారాన్ని తగ్గించడానికి; తగిలి= ప్రయత్నించి; ఇది మొదలు= నేటితో మొదలుపెట్టి; పూనెదన్= ప్రారంభిస్తాను;

**తా :** నేను భూలోకంలో అవతరించడంకూడా నాలుగుదిక్కులచివర్లదాకా ఉన్న భూభారాన్ని తగ్గించడానికే కదా! అందుచేత, ఈ క్షణంనుండి భూమిబరువును తగ్గించే ప్రయత్నాలను ఆరంభిస్తాను. (అంటే – దుష్టశిక్షణం, శిష్టరక్షణం చేస్తానని భావం)

**ఆ. మగధనాథుఁ బోర మడియింపఁ బోలదు, మడియకున్న వీఁడు మరలి మరలి**
**బలము గూర్చికొంచుఁ బఱతెంచుఁ బఱతేరఁ, ద్రుంపవచ్చు నేల దొసఁగు దొఱఁగ. 1534**

**ప్రతి :** మగధనాథున్= మగధదేశాధిపతి అయిన జరాసంధుణ్ణి; పోరన్= యుద్ధంలో; మడియింపన్+పోలదు= చంపకూడదు; మడియక+ఉన్నన్= అలా చావకుండా ఉంటే; వీఁడు= ఈ జరాసంధుడు; మరల మరల= మళ్లీ మళ్లీ; బలమున్= సైన్యాన్ని; కూర్చుకొంచున్= సమీకరించుకుంటూ; పఱతెంచున్= దాడి చేయడానికి వస్తాడు; పఱతేరన్= అలా రాగా; నేల= భూమియొక్క; దొసఁగున్= కష్టం; (బరువు); తొఱఁగన్= తొలగిపోయేటట్లుగా; త్రుంపవచ్చున్= చంపేయవచ్చు.

**తా :** ఈ మగధరాజైన జరాసంధుణ్ణి ఇప్పుడు చంపకూడదు. వదిలివేయాలి. వాడు మళ్లీ మళ్లీ సైన్యాన్ని సమకూర్చుకుని దాడి చేయడానికి వస్తాడు. అలా వచ్చిన వాళ్లను వధిస్తూ ఇలా భూభారాన్ని తగ్గించి, చివరకు వీణ్ణికూడా చంపేయాలి.

**వ. అని యిట్లు చింతించుచున్న సమయంబున నభోభాగంబుననుండి మహాప్రభాసమేతంబులును, సపరిచ్ఛదసూతంబులును, ననేక బాణ బాణాసన చక్రాది వివిధాయుధోపేతంబులు నైన రథంబులు రెండు మనోరథంబులు పల్లవింప దైవయోగంబునం జేరవచ్చినం జూచి హరి సంకర్షణున కిట్లనియె. 1535**

**ప్రతి :** అని+ఇట్లు= అని ఈ విధంగా; చింతించుచున్+ఉన్న= ఆలోచిస్తూ ఉన్న; సమయంబునన్= వేళలో; నభస్+భాగంబున నుండి= ఆకాశం నుండి; మహాప్రభా= గొప్ప వెలుగుతో; సమేతంబులును= కూడుకొన్నవి; సపరిచ్ఛద= కవచాలతో; సూతంబులునున్= సారథులతోనూ (కూడిన); అనేక= ఎన్నో; బాణ= బాణాలూ; బాణ+ఆసన= ధనుస్సులు; చక్రం; ఆది= మొదలైన; వివిధ= రకరకాల; ఆయుధ+ఉపేతంబులును+ఐన= ఆయుధాలతో కూడినవైన; రథంబులు= రథాలు; రెండు; మనస్+రథంబులు= మనసులోని ఇష్టాలు, కోరికలు; పల్లవింపన్= చిగురెత్తగా (చిగురించగా); దైవయోగంబునన్= దైవ యోగంచేత; చేరవచ్చినన్= తమను చేరగా; చూచి= పరికించి; హరి= శ్రీకృష్ణుడు; సంకర్షణునకున్= బలరామునితో; ఇట్లు= ఇలా; అనియెన్= అన్నాడు.

**తా :** అని ఇలా శ్రీకృష్ణుడు ఆలోచిస్తూ ఉండిన ఆ సమయంలో ఆకాశం నుండి గొప్పవెలుగుతో కూడిన రెండురథాలు వాళ్లవద్దకు వచ్చాయి. అవి కవచాలతోనూ, సారథులతోను, రకరకాల బాణాలు, ధనుస్సులతోను, చక్రంవంటి ఆయుధాలతోను ఉన్నాయి. మనసులోని కోరికలను చిగురింప చేసేవిగా ఉన్న ఆ దివ్యరథాలు దైవయోగంచేత బలరామకృష్ణులను చేరాయి. వాటిల్నిచూచి శ్రీకృష్ణుడు బలరామునితో ఇలా అన్నాడు.

**శా. కంటే రామ! రథంబు లాయుధములున్ గాఢప్రకాశంబులై**
**మింటన్ వచ్చెను; వీనిఁ గైకొని సురల్ మెచ్చన్ నృపశ్రేణులన్**
**బంటింపం బనిలేదు చంపుము; ధరాభారంబు వారింపు; మీ**
**వెంటన్ నీ యవతారమున్ సఫలమౌ; వేవేగ లె మ్మాజికిన్. 1536**

**ప్రతి :** కంటే= చూశావా!; రామ= బలరామా!; రథంబులు= రథాలు; ఆయుధములున్= ఆయుధాలు; గాఢప్రకాశంబులు+ఐ= అధికమైన వెలుగుతో కూడినవై; మింటన్+వచ్చెను= ఆకాశంనుండి వచ్చాయి; వీనిన్= వీటిని; కై+కొని= తీసుకొని; సురల్+మెచ్చన్= దేవతలు మెచ్చుకునేరీతిలో; నృపశ్రేణులన్= రాజసమూహాలను; పంటింపన్+పనిలేదు= ఆలస్యం చేయనవసరంలేదు; చంపుము= చంపివేయి; ధరాభారంబున్= భూ భారాన్ని; వారింపుము= తొలగించు; ఈ+వెంటన్= దీనివల్ల; నీ+అవతారమున్= నీఅవతారకార్యం; సఫలము+ఔ= ఫలవంతమవుతుంది; ఆజికిన్= యుద్ధానికి; వేవేగ= వెంటనే; లెమ్ము= లే.

**తా :** బలరామా! చూశావా! ఆకాశంనుంచి గొప్ప వెలుగుతో రథాలు, ఆయుధాలు వచ్చాయి. వీటిని తీసుకో. దేవతలు తల ఊపుతూ మెచ్చుకునేరీతిలో రాజసమూహాలను చంపు. ఏమీ వెనకాడకు. భూభారాన్ని తగ్గించు. దీనివల్ల నీ అవతారానికి ప్రయోజనం కలుగుతుంది. వెంటనే లే. యుద్ధానికి బయలుదేరు.

**వ. అని పలికి. 1537**

**ప్రతి :** అని= ఈ విధంగా; పలికి= చెప్పి...

**తా :** ఈ విధంగా చెప్పి శ్రీకృష్ణుడు ఏం చేశాడంటే

**క. ఖరులై దృఢకవచ ధను, శ్శరులై యధిగత రథానుచరులై మదవత్**
**కరులై ఘనహరులై బల, హరు లయ్యెడ నాజి కేగి రరిభీకరులై. 1538**

**ప్రతి :** ఖరులు+ఐ= ఎదిరించరానంత తీవ్రత కలవారై; దృఢకవచ= బలమైన కవచంతోనూ; ధనుస్+శరులు+ఐ= విల్లు, అమ్ములను కలిగి; అధిగత= పొందబడిన; రథ+అనుచరులు+ఐ= రథంయొక్క అనుచరులు కలిగినవారై; మదవత్+కరులు+ఐ= మదపుటేనుగులుకలవారై; ఘనహరులు+ఐ= గొప్ప గుర్రాలను కలిగినవారై; బలహరులు(బల+హరి+లు)= బలరాముడు, శ్రీకృష్ణుడు; అతిభీకరులు+ఐ= చాల భయం కలిగించేవాళ్లై; ఆ+ఎడన్= అపుడు; ఆజికిన్+ఏగిరి= యుద్ధానికి వెళ్లారు.

**తా :** అపుడు బలరామకృష్ణులు తీక్ష్ణమైన స్వభావంతో ఉన్నారు. బలమైన కవచాల్నీ, ధనుస్సుల్నీ, బాణాల్నీ, రథాల్నీ, అనుచరుల్నీ కల్గిఉన్నారు. శత్రుబలాన్ని తొలగించగల దిట్టలు బలరామకృష్ణులు, ఎదుటి పక్షానికి భయాన్ని కలిగిస్తూ మదపుటేనుగులతోను, గుర్రాలతోను యుద్ధానికి వెళ్లారు.

**వ. ఇట్లు సమరసన్నాహంబునం బురంబు వెడలి. 1539**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; సమర= యుద్ధానికి సంబంధించిన; సన్నాహంబునన్= ఏర్పాట్లతో; పురంబున్= నగరంనుండి; వెడలి= బయలుదేరి...

**తా :** ఇలాగ యుద్ధానికి తగిన ఏర్పాట్లతో నగరం నుండి బలరామకృష్ణులు బయలుదేరి

**ఉ. అన్యులు దల్లడిల్ల దనుజాంతకుఁ డొత్తె గభీరఘోష కా**
**ఠిన్య మహాప్రభావ వికటీకృత పద్మభవాండ జంతు చై**
**తన్యము ధన్యమున్ దివిజ తాపస మాన్యముఁ బ్రీత భక్త రా**
**జన్యము భీతదుశ్చరితశాత్రవసైన్యముఁ బాంచజన్యమున్. 1540**

**ప్రతి :** అన్యులున్= శత్రువులు; తల్లడిల్లన్= తల్లడిల్లిపోయేలాగా; దనుజ+అంతకుఁడు= రాక్షసులకు యముడువంటివాడైన శ్రీకృష్ణుడు; గభీర= గంభీరమైన; ఘోష= శబ్దంలోని; కాఠిన్య= కఠినత్వంయొక్క; మహాప్రభావ= గొప్ప మహిమచే; వికటీకృత= చిందరవందర చేయబడ్డ; పద్మభవ+అండ= బ్రహ్మాండంలోని; జంతు= జీవుల; చైతన్యము= ప్రాణం కలదీ; ధన్యమున్= ధన్యమైందీ; దివిజ= దేవతలచేత; తాపస= ఋషులచేత; మాన్యమున్= గౌరవప్రపత్తులతో ఆదరించబడిందీ; ప్రీత= సంతోషింపజేయబడిన; భక్తరాజన్యమున్= భక్తులైన రాజులను కలిగిందీ; భీత= భయపెట్టబడిన; దుశ్చరిత= దుష్టచరిత కలిగిన; శాత్రవ= శత్రువులయొక్క; సైన్యమున్= సైన్యం కలిగినది; (అయిన); పాంచజన్యమున్= పాంచజన్యం అనే పేరుగల శంఖాన్ని; ఒత్తెన్= పూరించాడు.

**తా :** శ్రీకృష్ణుడు పాంచజన్యమనే తన శంఖాన్ని పూరించాడు. అది గంభీరమూ, కర్కశమూ అయిన ధ్వనితో ఉంది. దాన్ని విని శత్రువులు తల్లడిల్లిపోయేలా ఉంది. బ్రహ్మాండంలోని జీవుల ప్రాణం కకావికలై పోయేలా ఉంది. ఆ ధ్వని ధన్యమైందిగా ఉంది. దేవతలు, ఋషులు భక్తితో గౌరవించేదిగా ఉంది. భక్తులైన రాజులు సంతోషించేలాగా ఉంది. (శ్రేష్ఠులైన భక్తులు ఆనందించేలా ఉంది). దుష్టచరిత కలిగిన శత్రుసైన్యం భయపడిపోయేలాగా ఉంది.

**విశే :** శ్రీకృష్ణుడు తన గురువును దక్షిణగా సముద్రంలోని ప్రభాసతీర్థంలో స్నానంచేస్తూ మరలిరాని గురుపుత్రుణ్ణి తెచ్చి యిచ్చే సందర్భంగా, సముద్రంవద్దకు వెళ్లినపుడు – సముద్రంలోపలనున్న పంచజనుని కడుపును చీల్చగా – అందులో 'శంఖం' ఉండింది. దీన్ని కృష్ణుడు స్వీకరించాడు. **పంచజనుని నుండి తీసుకొన్నది కాబట్టి ఆ శంఖంపేరు పాంచజన్యం అయింది.**

**క. సింధురభంజనపూరిత, బంధురతరశంఖనినదభారమున జరా**
**సంధునికిని గల సైన్యము, లంధములై సంచరించె నాహవభూమిన్. 1541**

**ప్రతి :** సింధుర= ఏనుగులను; భంజన= బెదిరింపజేసేలా; పూరిత= పూరించబడిన; బంధురతర= చాలా గాఢమైన; శంఖ= శంఖంయొక్క; నినద= శబ్దంయొక్క; భారమునన్= అతిశయంచేత; ఆహవభూమిన్= యుద్ధభూమిలో; జరాసంధునికిన్= జరాసంధునికి; కల= ఉన్న; సైన్యములు= సేనాబలాలు; అంధములు+ఐ= కళ్లు కనిపించనివై; సంచలించెన్= అటూ ఇటూ తిరిగాయి.

**తా :** గంభీరమైన ఆ శంఖధ్వని ఏనుగులను కూడా బెదరగొడుతూ ఉంది. అంత దుర్భరమైన ధ్వనిని విని యుద్ధంలోని జరాసంధుని సైన్యం కళ్లు కనిపించక అటూ ఇటూ తిరుగుతున్నాయి.

**వ. అ య్యవసరంబున మాగధుండు మాధవున కిట్లనియె. 1542**

**ప్రతి :** ఆ+అవసరంబునన్= ఆ సమయంలో; మాగధుండు= మగధ దేశానికి రాజైన జరాసంధుడు; మాధవునకున్= శ్రీకృష్ణునితో; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** ఆ సమయంలో మగధదేశానికి చెందిన జరాసంధుడు శ్రీకృష్ణుడితో ఇలా అన్నాడు.

**సీ. అదలించి రొప్పంగ నాలమందలు గావు గంధగజేంద్రసంఘములు గాని**
**పరికించి వినఁగ నంభారవంబులు గావు వాజీంద్రహేషారవములు గాని**
**పదహతిఁ గూల్పంగఁ బ్రాఁతబండ్లును గావు నగసమానస్యందనములు గాని**
**ప్రియము లాడంగ నాభీరలోకము గాదు కాలాభవైరివర్గంబు గాని**

**తే. యార్ప వనవహ్ని గాదు బాణాగ్ని గాని, మురియ బృందావనము గాదు మొనలు గాని**
**యమున గాదు నటింప ఘోరాజిగాని, పోరు నీకేల గోపాల! పొమ్ము పొమ్ము. 1543**

**ప్రతి :** అదలించి= బెదిరించి; రొప్పన్+కన్= తోలడానికి; ఆలమందలు కావు= (ఇవేమీ) ఆవులమందలు కావు; గంధగజ+ఇంద్ర= శ్రేష్ఠమైన మదగజాల; సంఘములుగాని= గుంపులు తప్ప; పరికించి= పరిశీలించి; వినన్+కన్= వినడానికి; అంభారవంబులు= అంభా అనే దూడ అరుపులు; కావు; వాజి+ఇంద్ర= ఉత్తమజాతిగుర్రాల; హేషా= సకిలింతల; రవములుగాని= ధ్వనులు తప్ప; పదహతిన్= కాలితోకొట్టి; కూల్పన్+కన్= కూల్చేయడానికి; ప్రాఁతబండ్లు= పాతవైన బండ్లు; ఇవి కావు; నగసమాన= కొండతో సమానమైన; స్యందనములుగాని= రథాలు తప్ప; ప్రియములు+ఆడన్+కన్= ముచ్చటలాడడానికి; ఆభీరలోకము= గొల్లవాళ్ల గుంపుకాదు; కాల+ఆభ+వైరివర్గంబు+కాని= యముడితో సమానమైన శత్రువర్గం తప్ప; ఆర్పన్= ఆర్పేయడానికి; వనవహ్ని= అడవిలో పుట్టిన జ్వాల (కార్చిచ్చు); కాదు; బాణ+అగ్ని+కాని= బాణాల నుండి కురిసే అగ్ని తప్ప; మురియన్= మురిసిపోవడానికి; బృందావనము= నీవు ఆటలాడుకునే బృందావనం; కాదు; మొనలుగాని= సైన్యాలు తప్ప; నటింపన్= నాట్యం చేయడానికి; యమున+కాదు= (ఇదేమీ) యమునానది కాదు; ఘోర+ఆజిగాని= భయంకరమైన యుద్ధం తప్ప; పోరు= యుద్ధం; నీకున్+ఏల= నీకెందుకు; గోపాల= ఆవులను కాచుకునే వాడా (కృష్ణా!); పొమ్ము పొమ్ము= వెళ్లు వెళ్లు.

**తా :** పసులకాపరీ! బెదిరించి తరమడానికి ఇవేమీ ఆవులమందలు కావు – ఇవి మదించిన ఏనుగుల గుంపులు. చెవియొగ్గి వినడానికి దూడల అరుపులు కావు – ఇవి శ్రేష్ఠమైన గుర్రాల సకిలింతలు. కాలితో తంతే విరిగిపోయే పాతబండ్లు కావు; ఇవి పర్వతంలాంటి రథాలు. ముచ్చట్లాడుకోడానికి ఇది గొల్లలగుంపు కాదు; యమునితో సాటిరాగల శత్రు సమూహం. ఆర్పేయడానికి ఇదేమీ కార్చిచ్చు కాదు. బాణాలనుంచి కురిసే అగ్ని; మురిసిపోవడానికి ఇది బృందావనం కాదు – సైన్యమిది. నాట్యం చేయడానికి ఇది యమునానది కాదు. భయంకరమైన యుద్ధభూమి; నీకెందుకయ్యా ఈ యుద్ధం? వెనక్కి వెళ్లిపో.

**మ. తరుణిం జంపుటయో బకుం గెడపుటో ధాత్రీజముల్ గూల్చుటో**
**ఖరముం ద్రుంచుటయో ఫణిం బఱపుటో గాలిన్ నిరోధించుటో**
**గిరి హస్తంబునఁ దాల్చుటో లయమహాగ్నిస్ఫారదుర్వార దు**
**ర్భరబాణాహతి నెట్లు నిల్చెదవు సప్రాణుండవై గోపకా! 1544**

**ప్రతి :** తరుణిన్= ఆడుదాన్ని; చంపుట+ఓ= చంపడమో; బకున్+కెడపుట+ఓ= బకుణ్ణి (కొంగను) చంపడమో; ధాత్రీజముల్= చెట్లను; కూల్చుట+ఓ= కూల్చడమో; ఖరమున్= గాడిదను; త్రుంచుట+ఓ= చంపడమో; ఫణిన్+పఱపుట+ఓ= పామును తరిమేయడమో; గాలిన్= గాలిని; నిబంధించుట+ఓ= బంధించడమో; గిరిన్= కొండను; హస్తంబునన్= చేతితో; తాల్చుట+ఓ= ఎత్తి పట్టుకోవడమో; లయ= ప్రళయవేళలోని మహా+అగ్ని= భయంకరమైన గొప్ప అగ్నివంటి; స్ఫార= విస్తరించిన; దుర్వార= వారించలేని; దుర్భర= భరించలేని; బాణ= నా బాణాలయొక్క; ఆహతిన్= దెబ్బలచే; స+ప్రాణుండవు+ఐ= ప్రాణాలతో బ్రతికి ఉండి; ఎట్లు= ఎలాగ; నిల్చెదవు= నిలబడగలవు? (నిలబడలేవని భావం).

**తా :** ఓయీ పసులకాపరీ! ఆడదాన్ని చంపడమో, కొంగను చంపడమో, చెట్లను పడగొట్టడమో, గాడిదను చంపడమో, పామును తరమడమో, గాలిని బంధించడమో, కొండను చేతపట్టుకోడమో కాదు. ప్రళయకాలంలో చెలరేగిపోతున్న ఆర్పలేని, భరించలేని అగ్నివంటి బాణాల దెబ్బలను తట్టుకొని బతికి ఉండగలవా?

**విశే :** పూతనాసంహారం, బకాసురవధ, యమళార్జునుల శాపవిముక్తి, గార్దభాసురవధ, కాళీయమర్దనం, తృణావర్తసంహారం, గోవర్ధనోద్ధరణ వంటివి తేలికైన కార్యాలనీ, తనతో పోరాడి బతికి ఉండడం అనేది దుస్సాధ్యం అని జరాసంధునిభావం.

**వ. అదియునుం గాక. 1545**

**ప్రతి :** అదియునున్= అదీ కాక...

**తా :** అంతే కాకుండా, ఇంకా

**సీ. గోపికావల్లకీఘోషణంబులు గావు శింజినీరవములు చెవుడుపఱచు**
**వల్లవీకరముక్తవారిధారలు గావు శరవృష్టిధారలు చక్కుసేయు**
**ఘోషాంగనాపాంగకుటిలాహతులు గావు నిశితాసినిహతులు నిగ్రహించు**
**నాభీరకామినీహస్తాబ్జములు గావు ముష్టిఘాతంబులు మురువు డించు;**

**తే. నల్ల వ్రేపల్లె గాదు ఘోరావనీశ, మకరసంఘాతసంపూర్ణమగధరాజ**
**వాహినీసాగరం బిది వనజనేత్ర!, నెఱసి నిను దీవికైవడి నేఁడు ముంచు. 1546**

**ప్రతి :** వనజనేత్ర= తామరపూవులవంటి కన్నులుగల ఓ బాలకృష్ణా!; గోపికా= గోపస్త్రీలయొక్క; వల్లకీ= వీణ; ఘోషణంబులు కావు= ధ్వనులు కావు; చెవుడుపఱచు= చెవుడును కలిగించే; శింజినీ= అల్లెత్రాళ్లయొక్క; రవములు= శబ్దాలు; వల్లవీ= గోపికలయొక్క; కర= చేతులనుండి; ముక్త= వదలబడిన; వారి= నీటి; ధారలు; కావు; చక్కు+చేయు= ముక్కలు ముక్కలు చేసే; శర= బాణాలయొక్క; వృష్టిధారలు= వర్షపరంపరలు; ఘోష+అంగనా= గొల్లస్త్రీలయొక్క; అపాంగ= క్రీగంటిచూపుల; కుటిల= వక్రమైన; ఆహతులు= దెబ్బలు; కావు; నిగ్రహించు= అణచివేసే; నిశిత= పదునైన; అసి= కత్తులయొక్క; నిహతులు= దెబ్బలు; ఆభీరకామినీ= గోపవనితలయొక్క; హస్త+అబ్జములు= పద్మాలవంటి కోమలమైన చేతులు; కావు; మురువున్= పొగరును; డించున్= అణచివేసే; ముష్టి= పిడికిటి; ఘాతంబులు= పోట్లు; అల్ల వ్రేపల్లె= చిన్నదైన రేపల్లె; కాదు; ఇది; నెఱసి= పైకి ఎగసి; నినున్= నిన్ను; దీవి కైవడి= ద్వీపంవలె; నేఁడు= ఈ రోజు; ముంచు= ముంచివేసే; ఘోర= అతిభయంకరమైన; అవని+ఈశ= రాజులు అనే; మకర= మొసళ్ల; సంఘాత= గుంపుతో; సంపూర్ణ= నిండుగాఉన్న; మగధరాజ= మగధరాజైన జరాసంధునియొక్క; వాహినీ= సైన్యం అనే; సాగరంబు= మహాసముద్రం.

**తా :** పద్మాలవంటి కన్నులు గల బాలకృష్ణా! ఇవి గోపస్త్రీల వీణావాదన ధ్వనులు కావు - చెవుడును కల్గించే అల్లెత్రాటి ఝుంకారాలు సుమా! ఇవి గోపవనితలు నీపైన చల్లే నీటి తుంపరలు కావు - నిన్ను ముక్కలుగా చేసే బాణవర్షాలు. ఇవి గోపికల వాలుచూపులు కావు - నిన్ను నరకే పదునైన కత్తిదెబ్బలు. ఇవి గోపకాంతల మెత్తని పద్మాలవంటి చేతులు కావు- నీ పొగరును దించే పిడికిలి పోట్లు. ఇది మీ చిన్నదైన రేపల్లె అనుకున్నావా? కాదు. ఇది మగధరాజుకు చెందిన సైన్యమనే మహాసముద్రం. ఇందులో భయంకరులైన రాజులు అనే మొసళ్లున్నాయి. ఈ సముద్రం ఉప్పొంగి ద్వీపంలాంటి నిన్ను ముంచివేస్తుంది.

**వ. అనిన శ్రీహరి యిట్లనియె. 1547**

**ప్రతి :** అనినన్= జరాసంధుడు అలా పలుకగా; శ్రీహరి= శ్రీకృష్ణుడు; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తా :** అలా జరాసంధుడు మాట్లాడగా, దానికి శ్రీకృష్ణుడు ఇలా జవాబిచ్చాడు.

**ఉ. పంతము లేల? తొల్లి జనపాలురఁ బోరుల గెల్చినాఁడ వం**
**ద్రంతియ చాలదే? బిరుదు లాడుట బంటుతనంబుత్రోవయే?**
**యింతటఁ దీఱెనే? మగధ! యేటికిఁ బ్రేలెదు? నీవ యేల క**
**ల్పాంతమహోగ్రపావకునినైన హరింతు వరింతు సంపదన్. 1548**

**ప్రతి :** మగధ= మగధరాజా!; పంతములు+ఏల= ప్రగల్భాలు ఎందుకు?; తొల్లి= మునుపు; జనపాలురన్= కొందరు రాజుల్ని; పోరులన్= యుద్ధాలలో; గెల్చినాఁడవు+అంద్రు= గెల్చినావని అంటారు; అంతి+అ చాలదే= ఆ మాత్రం చాలునా?; బిరుదులు+ఆడుట= గొప్పలను చెప్పుకోవడం; బంటుతనంబు= వీరత్వంయొక్క; త్రోవయే= పద్ధతా?; ఇంతటన్= ఈ మాత్రంతోనే; తీఱెనే= తీరిపోతుందా?; ఏటికిన్= ఎందుకు; ప్రేలెదు= వదరుతావు; నీవు+ఏల= నీవేమిటి?; కల్ప+అంత= ప్రళయకాలంలోని; మహా+ఉగ్ర= అతిభయంకరమైన; పావకునిన్+ఐనన్= అగ్నిని అయినా సరే; హరింతున్= అణచివేస్తాను; సంపదన్= సంపదను; వరింతున్= పొందుతాను.

**తా :** మగధరాజా! వట్టి ప్రగల్భాలెందుకు? మునుపు నీవు కొందరు రాజులను గెలిచావని కొందరంటారు. ఆ మాత్రం చాలునా? శౌర్యం నిరూపించుకోవాలి. వట్టి బీరాలు పలకడం వీరుల పద్ధతికాదు. ఇలా మాట్లాడితే సరిపోయిందా? ఎందుకు వదరుతావు. నీవే కాదు. ప్రళయకాలంలోని భయంకరమైన అగ్నినైనా సరే హరించి సంపదలను పొందుతాను.

**క. గోపాలుఁడ వని పలికితి, భూపాలక! దీన నేమి? పోరాడంగా**
**గోపాలమహీపాల, వ్యాపారాంతరము దెలియవచ్చుం బిదపన్. 1549**

**ప్రతి :** గోపాలుఁడవు+అని= ఆవులను పాలించేవాడివని; పలికితి= అన్నావు; భూపాలక= రాజా!; దీనన్+ఏమి= ఇలా అన్నందువల్ల ఏమి ప్రయోజనం; పోరాడన్+కాన్= యుద్ధం చేస్తే; గోపాల= పసులకాపరికి; మహీపాల= భూపాలునికి; వ్యాపార+అంతరమున్= చేతలలో ఉండే తేడా; పిదపన్= తర్వాత; తెలియవచ్చున్= తెలుస్తుంది.

**తా :** రాజా! నీవు నన్ను గోవులను కాచుకునే వాడనన్నావు. దీనివల్ల ఏం తక్కువయింది? యుద్ధం చేసినపిదప పసులకాపరికి, భూపాలునికి చేతల్లో ఉండే తేడా తెలుస్తుంది.

**వ. అనిన రోషబంధురుండై జరాసంధుం డిట్లనియె. 1550**

**ప్రతి :** అనినన్= అని పలుకగా; రోషబంధురుండు+ఐ= కోపంతో అతిశయించినవాడై; జరాసంధుండు= జరాసంధుడు; ఇట్లు= ఇలా; అనియెన్= అన్నాడు.

**తా :** అని శ్రీ కృష్ణుడు పలుకగా, జరాసంధుడు మిక్కిలి కోపంతో ఇలా అన్నాడు.

**ఉ. బాలుఁడ వీవు కృష్ణ! బలభద్రునిఁ బంపు రణంబు సేయ; గో**
**పాలకబాలుతోడ జనపాలశిఖామణియైన మాగధుం**
**డాలము సేసె నంచు జను లాడెడిమాటకు సిగ్గు పుట్టెడిం**
**జాలుఁ దొలంగు దివ్యశరజాలుర మమ్ము జయింప వచ్చునే? 1551**

**ప్రతి :** కృష్ణ= కృష్ణా!; ఈవు బాలుఁడవు= నీవు చిన్నపిల్లవాడవు; రణంబుసేయన్= యుద్ధం చేయడానికి; బలభద్రునిన్= బలరాముడిని; పంపు= పంపించు; గోపాలకబాలుతోడన్= పశువుల కాపరి అయిన పిల్లవాడితో; జనపాల= రాజులలో; శిఖామణి+ఐన= అత్యంతఉన్నతుడైన; మాగధుండు= మగధదేశాధిపతి అయిన జరాసంధుడు; ఆలము= యుద్ధం; చేసెన్+అంచున్= చేశాడు అంటూ; జనులు= జనం; ఆడెడి= పలికే; మాటకు; సిగ్గు; పుట్టెడిన్= కలుగుతుంది; చాలున్= ఇక చాలు; తొలంగు= వెళ్లిపో; దివ్యశరజాలురన్= మహిమగల బాణాలున్న; మమ్ము= మమ్ములను; జయింపన్+వచ్చునే= గెలవడానికి సాధ్యమవుతుందా? (సాధ్యకాదని భావం).

**తా :** కృష్ణా! నీవు చిన్నపిల్లవాడవు. నాతో యుద్ధం చేయడానికి మీ అన్న బలరాముడిని పంపించు. నీతో యుద్ధం చేశాననుకో! పసులకాపరి అయిన పిల్లవాడితో మహోన్నతుడైన మహారాజు యుద్ధం చేశాడు – అని లోకం అనుకుంటుంది. ఆ మాట తలచుకుంటేనే సిగ్గవుతూంది. మహిమాన్వితమైన బాణాలున్న నన్ను నీవు గెలువలేవు. అందువల్ల నీవు తొలగి వెళ్లిపో.

**వ. అనిన నగి నగధరుం డిట్లనియె. 1552**

**ప్రతి :** అనినన్= అని జరాసంధుడు పల్కగా; నగి= హేళనగా నవ్వుతూ; నగధరుండు= గోవర్ధనగిరిని ధరించిన శ్రీకృష్ణుడు; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** జరాసంధుడు ఆ విధంగా పల్కగా; శ్రీకృష్ణుడు హేళనగా నవ్వుతూ ఇలా అన్నాడు.

**క. పొగడుకొనుదురే శూరులు?, మగఁటిమిఁ జూపుదురు గాక! మాగధ! నీకున్**
**మగతనము గలిగెనేనిం, దగు మెఱయ వికత్థనములు దగ వీ పోరన్. 1553**

**ప్రతి :** మాగధ= మగధదేశీయుడా!; శూరులు= వీరులైనవాళ్లు; పొగడుకొనుదురే= తమను తాము ఇలా పొగడుకుంటారా?; మగఁటిమిన్= మగతనాన్ని; చూపుదురున్+కాక= చూపుతారుగానీ; నీకున్= నీకు; మగతనము= పౌరుషమనేది; కలిగెన్+ఏనిన్= ఏమైనా ఉంటే; తగున్= తగినట్లుగా; మెఱయన్= బయలుపడేటుగా; వికత్థనములు= సొంతపొగడ్తలు; ఈ పోరన్= ఈ యుద్ధంలో; తగవు= పనికిరావు.

**తా :** మగధదేశీయుడా! జరాసంధుడా! శౌర్యప్రతాపాలు ఉండేవాళ్లు ఇలా పొగడుకుంటారా? మగతనాన్ని చూపుతారు కదా! నీకు నిజంగా పౌరుషమనేది ఉంటే ఈ ప్రగల్భాలు పలుకకుండా యుద్ధంలో మెఱిపించు సరిపోతుంది.

**వ. అని రోషించి. 1554**

**ప్రతి :** అని= ఈ విధంగా పలుకగా; రోషించి= కోపించి...

**తా :** ఇలా కృష్ణుడు అన్నాక, కోపంతో జరాసంధుడు

**చ. పవనుఁడు మేఘరేణువుల భానుకృశానులఁ గప్పు కైవడిన్**
**వివిధబలౌఘముం బనిచి వేగమ మాగధుఁ డావరించె భూ**
**మ్యవనచరిష్ణులం గువిమతావనినాథనిరాకరిష్ణులన్**
**దివిషదలంకరిష్ణుల నతిస్థిరజిష్ణుల రామకృష్ణులన్. 1555**

**ప్రతి :** పవనుఁడు= గాలి; మేఘరేణువుల= చిన్నచిన్న మబ్బుల్తో; భాను కృశానులన్= సూర్యుణ్ణీ, అగ్నిదేవుడినీ; కప్పు= కప్పే; కైవడిన్= రీతిగా; వివిధ= రకరకాల; బల+ఓఘమున్= సైన్యసమూహాన్ని; పనిచి= పంపి; వేగము+అ= వెంటనే; మాగధుఁడు= మగధపాలకుడైన ఈ జరాసంధుడు; భూమి+అవన= భూమిని కాపాడడానికి; చరిష్ణులన్= తిరుగుతున్నవారిని; కు+విమత+అవనినాథ= దుష్టులు, శత్రువులు అయిన రాజులను; నిరాకరిష్ణులన్= నిరాకరించే వారిని; దివిషత్= దేవతలను; అలంకరిష్ణులన్= అలంకరించేవారిని; అతి= చాలా; స్థిర= స్థిరమైన; జిష్ణులన్= గెలుపు కలవారిని; రామకృష్ణులన్= బలరామకృష్ణులను; ఆవరించెన్= చుట్టుముట్టాడు.

**తా :** గాలి చిన్నచిన్న మొబ్బులతో సూర్యుణ్ణీ అగ్నినీ కప్పే విధంగా - జరాసంధుడు బలరామకృష్ణులను చుట్టుముట్టాడు. వాళ్లిద్దరూ భూమిని కాపాడడానికి అవతరించినవాళ్లు, దుష్టులైన శత్రురాజులను నిరాకరించే వాళ్లు, దేవతలకే ఆభరణాల్లాంటి వాళ్లు, నిలకడగా ఉండే విజయం కలిగినవాళ్లు - అలాంటి బలరామ కృష్ణులను జరాసంధుడు చుట్టుముట్టాడు.

**మ. హయహేషల్ గజబృంహితంబులు రథాంగారావముల్ శింజినీ**
**చయటంకారములున్ వివర్ధితగదాచక్రాస్త్రనాదంబులున్**

**జయశబ్దంబులు భేరిభాంకృతులు నిస్సాణాదిఘోషంబులున్**
**భయదప్రక్రియ నొక్కవీఁక నెగసెన్ బ్రహ్మాండభేదంబుగన్.** **1556**

**ప్రతి :** హయ= గుఱ్ఱాల; హేషల్= సకిలింతలు; గజ= ఏనుగుల; బృంహితంబులు= ఘీంకారాలు; రథ+అంగ+ఆరావముల్= రథచక్రాల శబ్దాలు; శింజినీచయ= వింటినారుల సమూహాలయొక్క; టంకారముల్= టంకార ధ్వనులు; వివర్ధిత= అంతకంతకూ పెరుగుతున్న; గదా= గదయొక్క; చక్ర= చక్రాలయొక్క; అస్త్ర= అస్త్రాలయొక్క; నాదంబులున్= శబ్దాలు; జయశబ్దంబులు= జయఘోషలు; భేరి= నగారాలయొక్క; భాంకృతులు= 'భాం' అనే పెద్ద శబ్దాలు; నిస్సాణ+ఆది= తప్పెట్లు మొదలైనవాద్యాలయొక్క; ఘోషంబులున్= మహాధ్వనులు; భయద= భయాన్ని కలిగించే; ప్రక్రియన్= పద్ధతిలో; ఒక్కవీఁకన్= ఒకే విధమైన విజృంభణంలో; బ్రహ్మ+అండ= బ్రహ్మాండాన్ని; భేదంబుగన్= బ్రద్దలు కొట్టేలాగా; ఎగసెన్= ఎగిశాయి.

**తా :** గుర్రాల సకిలింతలు, ఏనుగుల ఘీంకారాలు, రథచక్రాల ధ్వనులు, వింటినారి శబ్దాలు, అంతకంతకూ పెరుగుతున్న గద, చక్ర, అస్త్రాల శబ్దాలు; జయ జయ నినాదాల ఘోషలు, భేరీశబ్దాలు, తప్పెట్లు మొదలైన వాద్యాల శబ్దాలు భయంపుట్టించే రీతిలో విజృంభించి, పైకి ఎగశాయి. అవి బ్రహ్మాండాన్ని బ్రద్దలు గొట్టే రీతిలో ప్రతిధ్వనించాయి.

**వ. మఱియు నయ్యెడ మాగధ మాధవ వాహినులు రెండు నొండొంటిం దాఁకి రౌద్రంబున సంవర్త సమయసముద్రంబులభంగి నింగికిం బొంగి చెలంగి చలంబునం దలపడి పోరునెడ మసరు కవిసి మహారణ్యంబులు వెలువడి మార్కొనుమదగజంబులమాడ్కిని, మహోత్కంఠంబులగు కంఠీరవంబుల తెఱంగున, దుర్లభంబులగు శరభంబులచాడ్పునం, బ్రచండంబులగు గండభేరుండంబులగమనికం, దమతమ మొనలకుం దలకడచి వీరరసంబులు వివిధరూపంబులైనవిధంబునం బదుగురు, నూర్వురు, వేవురు గములై కులకుధర గుహాంతరంబులు నిండ సింహనాదంబు లొనర్చుచు, నార్చుచు, నట్టహాసంబులు సేయుచు, నరివీరుల రోయుచుఁ , బటహ కాహళ భేరీ శంఖ శబ్దంబులకు నుబ్బుచు, గర్వంబునం బ్రబ్బుచు, గదల వ్రేయుచుఁ, గాండంబుల నేయుచు, ముద్గరంబుల నొత్తుచు, ముసలంబుల మొత్తుచు, గుంతంబులం గ్రుచ్చి యెత్తుచుఁ, గరవాలంబులం ద్రెంచుచుఁ, జక్రంబులం ద్రుంచుచు, శస్త్రంబులం దఱుఁగుచుఁ, జిత్రంబుగఁ దిరుగుచుఁ, బరిఘంబులఁ ద్రిప్పికొట్టుచు, బ్రాసంబులం బెట్టుచు, శూలంబులఁ జిమ్ముచు, సురియలం గ్రుమ్ముచు, బహుభంగులఁ బరాక్రమించు వీరభటులును, నిబిడ నీరంధ్ర నేమినిర్ఘోషంబుల నాకాశంబు నిరవకాశంబుగ ననర్గళచక్రమార్గంబులం బడు పదాతులు చదియ నరదంబులు దోలి, వివిధాయుధప్రయోగంబుల వైరుల వ్రచ్చి, చిందఱవందఱలాడు రథికులును, రథికశరపరంపరలఁ గంపింపక మహామోఘమేఘధారలకుం జలింపని ధరణీధరంబులచాడ్పున రథంబులకుం గవిసి, కల్పాంతకాల దండిదండ ప్రచండంబులగు శుండాదండంబులు సాఁచి పూఁచి కడనొగ లొడిసి తిగిచి కుదిచి విఱిచి, కూబరములు నుఱుములుగఁ జిఱజిఱఁ ద్రిప్పివైచియు, భటులం జటులగతి బంతులక్రియ నెగురవైచి దంతంబుల గ్రుచ్చియు, ఘోటకంబుల వ్రచ్చియు విచ్చలవిడిం దిరుగుకరులును, వజ్రి వజ్రధారలకుం దప్పి కకుప్పులకు నెగయు ఱెక్కలు గల గిరుల సిరులం బక్కెరలతోడ హేషారవభీషణంబులై మనోజవంబులగు తురంగంబులం బఱపి తురంగ పద పాంసుపటల ప్రభూత**

**బహుళాంధకారంబులు గరకలిత కఠోరఖడ్గమరీచిజాలంబుల నివారించుచు నానాప్రకారంబులం బ్రతివ్యూహంబులం జించి చెండాడు రాహుత్తులుం గలిగి సంగ్రామంబు భీమం బయ్యె నందు. 1557**

**ప్రతి :** మఱియునున్= ఇంకా; ఆ+ఎడన్= ఆ వేళలో; మాగధ= జరాసంధుని; మాధవ= శ్రీకృష్ణుని; వాహినులు= సైన్యాలు; రెండును= రెండూ కూడా; ఒందు+ఒంటిన్= ఒకదానినొకటి; తాఁకి= ఎదుర్కొని; రౌద్రంబునన్= భీకరత్వంతో; సంవర్తసమయ= ప్రళయకాలంలోని; సముద్రంబులభంగిన్= సముద్రాలవలె; నింగికిన్= ఆకాశానికి; పొంగి= ఎగసి; చెలంగి= చెలరేగి; చలంబునన్= పట్టుదలతో; తలపడి= ఒకరితో ఒకరు ఎదుర్కొని; పోరు+ఎడన్= యుద్ధం చేసేటపుడు; మసరుకవిసి= ఆవేశపడి; మహా+అరణ్యంబులు= పెద్ద అడవులనుండి; వెలువడి= బయటికి వచ్చే; మదగజంబులమాడ్కినిన్= మదపుటేనుగులవలె; మహా+ఉత్కంఠంబులు+అగు= చాలా ఉత్సాహంతో ఉన్న; కంఠీరవంబుల తెఱంగునన్= సింహాలవలె; దుర్లభంబులు+అగు= ఎక్కడా లభించనట్టి; శరభంబులచాడ్పునన్= శరభమృగాలవలె; ప్రచండంబులు+అగు= అత్యంత కోపంతో ఉన్న; గండభేరుండంబుల= గండభేరుండ పక్షుల; గమనికన్= విధంగా; తమ తమ= తమ తమకు సంబంధించిన; మొనలకున్= సైన్యాలకు; తలకడచి= మించి; వీరరసంబులు= వీరరసాలు; వివిధ రూపంబులు+ఐన= పలు రూపాలైన; విధంబునన్= పద్ధతిలో; పదుగురు= పదిమంది; నూర్వురు= నూరుమంది; వేవురు= వేయిమంది; గములు+ఐ= గుంపులుగా చేరి; కులకుధర= కుల పర్వతాల; గుహ+అంతరంబులు= గుహల అంతర్భాగాలు; నిండన్= నిండి పోయేలా; సింహనాదంబులు+ ఒనర్చుచున్= సింహనాదాలు చేస్తూ; ఆర్చుచున్= బొబ్బరిస్తూ; అట్టహాసంబులు చేయుచున్= గట్టిగా శబ్దం వినిపించేలా వికటంగా నవ్వుతూ; అరివీరులన్= శత్రువీరులను; రోయుచున్= వెదకి పట్టుకుంటూ; పటహ= తప్పెట్ల; కాహళ= బాకాల; భేరీ= నగారాల; శంఖ= శంఖాల; శబ్దంబులకున్= శబ్దాలకు; ఉబ్బుచున్= పొంగిపోతూ; గర్వంబునన్= గర్వంతో; ప్రబ్బుచున్= అతిశయిస్తూ; గదలన్= గదలతో; వ్రేయుచున్= కొడుతూ; కాండంబులన్= బాణాలను; ఏయుచున్= ప్రయోగిస్తూ; ముద్గరంబులన్= ఇనుపగుదియ (సమ్మెట్లు); ఒత్తుచున్= అదుముతూ; ముసలంబులన్= రోకళ్లతో; మొత్తుచున్= కొడుతూ (పొడుస్తూ); కుంతంబులన్= ఈటెలతో; గ్రుచ్చి= గుచ్చి; ఎత్తుచున్= పైకి ఎత్తుతూ; కరవాలంబులన్= కత్తులతో; త్రెంచుచున్= నరికి పడేస్తూ; చక్రంబులన్= చక్రాలతో; త్రుంచుచున్= ముక్కలు చేస్తూ; శస్త్రంబులన్= పదునైన కత్తివంటివాటితో; తఱుఁగుచున్= తరిగిపడేస్తూ; చిత్రంబు+కన్= విచిత్రంగా; తిరుగుచున్= అటూ ఇటూ తిరుగుతూ; పరిఘంబులన్= ఇనుపకట్ల గుదియలతో; త్రిప్పి= గిరగిర త్రిప్పుతూ; కొట్టుచున్= కొడుతూ; ప్రాసంబులన్= ఈటెలతో; పెట్టుచున్=గ్రుచ్చుతూ; శూలంబులన్= శూలాలతో; చిమ్ముచున్= పొడుస్తూ; సురియలన్= చురికలతో (చురకత్తులతో); క్రుమ్ముచున్= కుమ్ముతూ; బహుభంగులన్= రకరకాలుగా; పరాక్రమించుచున్= వీరత్వాన్నిచూపుతూ; వీరభటులును= వీరులైన సైనికులును; నిబిడ= దట్టమైన; నీరంధ్ర= ఏ మాత్రం సందుల్లేని; నేమి= రథచక్రాల చుట్టూ ఉన్న ఇనుప చట్రంయొక్క; నిర్+ఘోషంబులన్= విపరీతమైన శబ్దాలతో; ఆకాశంబు= ఆకాశం; నిరవకాశంబుగన్= ఎడతెరిపి లేకుండా అయి; అనర్గళ= అడ్డంలేని; చక్ర= చక్రాలు నడిచే; మార్గంబులన్= దారులలో; పడు= పడే; పదాతులు= కాల్బలం; చదియన్= నలిగిపోతుండగా; అరదంబులు తోలి= రథాలను నడిపి; వివిధ+ఆయుధ= రకరకాలైన ఆయుధాల; ప్రయోగంబులన్= ప్రయోగించడాలవల్ల; వైరులన్= శత్రులను; వ్రచ్చి= చీల్చి; చిందఱ వందఱలు+ఆడు= అటూ ఇటూ ఖండిస్తూ; రథికులును= రథాలపైనుండి యుద్ధంచేసేవాళ్లు; రథిక= ఆ రథికులయొక్క; శర= బాణాల; పరంపరలన్= తెరిపిలేని వరుసలతో; కంపింపక= చెదరక; మహా+అమోఘ= ఎదిరించలేనంత గొప్పదైన; మేఘధారలకున్= మేఘాలనుండి కురుస్తున్న వానకు; చలింపని= ఏ మాత్రం కదలకుండా ఉండే; ధరణీధరంబుల చాడ్పునన్= కొండలవలె; రథంబులకున్= రథాలమీదికి; కవిసి= చొచ్చి; కల్ప+అంతకాల= ప్రళయకాలంలోని;

దండి= యమునియొక్క; దండ= దండంవలె; ప్రచండంబులు+అగు= భయంకరమైన; శుండాదండంబులు= తొండాలు అనబడే (యమ) దండాలను; సాచి= చాచి; పూచి= పూనికతో; కడనొగలు= నొగల చివరలను; ఒడిసి= తేలికగా పట్టుకొని; తిగిచి= లాగి; కుదిచి= కుదించివేసి; విఱిచి= ముక్కలుచేసి; కూబరములు= నొగలు; నుఱుములు+కన్= పొడిపొడి అయ్యేలాగా; చిఱచిఱన్= గిరగిరా; త్రిప్పివైచియున్= తిప్పిపడేస్తూ; భటులన్= భటులను; చటులగతిన్= చలించేట్లుగా; బంతులక్రియన్= బంతులవలె; ఎగురవైచి= ఎగరేస్తూ; దంతంబులన్= దంతాలతో; గ్రుచ్చియున్= గుచ్చుతూ; ఘోటకంబులన్= గుఱ్ఱాలను; వ్రచ్చియున్= చీల్చుతూ; విచ్చలవిడిన్= తమకు ఇష్టం వచ్చినట్లు; తిరుగు= తిరిగే; కరులును= ఏనుగులును; వజ్రి= (వజ్రాయుధాన్ని ధరించిన) ఇంద్రునియొక్క; వజ్రధారలకున్= వజ్రాయుధపు పదునైన అంచులకు; తప్పి= తప్పించుకుని; కకుప్పులకున్= దిక్కులకు; ఎగయు= ఎగసిపోయే; ఱెక్కలుగల= రెక్కలున్న; గిరుల సిరులన్= కొండల వైభవాలతో; పక్కెరలతోడన్= కవచాలతో; హేషారవ= సకిలింత శబ్దాలతో; భీషణంబులు+ఐ= భయం కలిగించేవై; మనస్+జవంబులు+అగు= మనస్సుయొక్క వేగంవంటి వేగం గల్గినవైన; తురంగంబులన్= గుఱ్ఱాలను; పఱపి= ఉరుకెత్తించి; తురంగ= గుఱ్ఱాల; పద= డెక్కలనుండి రేగిన; పాంసు= ధూళి; పటల= సమూహంనుండి; ప్రభూత= పుట్టిన; బహుళ+అంధకారంబులున్= విస్తృతంగా పరచుకున్న చీకటులును; కర= చేతితో; కలిత= పట్టుకోబడ్డ; కఠోర= అతికఠినంగా ఉండే; ఖడ్గ= కత్తుల; మరీచి= వెలుగుల; జాలంబులన్= గుంపులను; నివారించుచున్= తొలగింపజేస్తూ; నానా= రకరకాల; ప్రకారంబులన్= పద్ధతులతో; ప్రతివ్యూహంబులన్= ఎదుటిపక్షం వేసే ఎత్తుగడలను; చించి= చీల్చి; చెండు+ఆడు= బంతులాట ఆడే; రాహుత్తులున్= రౌతులును (గుఱ్ఱాలను తోలేవారు); కలిగి; సంగ్రామంబు= యుద్ధం; భీమంబు+అయ్యెన్= భయంకరం అయింది; అందున్= అక్కడి యుద్ధంలో...

**తా :** ఆ సమయంలో ఇంకా – జరాసంధ శ్రీకృష్ణుల సైన్యం ఒకదానినొకటి ఎదుర్కొన్నాయి. రౌద్రంతో రగిలిపోతున్నాయి. అవి రెండూ ప్రళయకాలంలోని సముద్రాలవలె, నింగికి ఉప్పొంగిపోయి, పోరాడసాగాయి. అక్కడి యోధులు పరాక్రమవంతులు. మహారణ్యాలనుండి వెలువడి మదమెక్కిన మహాగజాలవలె రేగిపోతున్నారు. ఉత్సాహంతో మీదికి ఎగసి దూకే సింహాలలాగా పోరాడుతున్నారు. మునుపెప్పుడూ చూడని శరభాల మాదిరిగా పోరాడారు. భయం కలిగించే గండభేరుండ పక్షులా ఇవి అనిపించేలా తమతమ సైన్యానికి చేరి రకరకాలుగా పది, నూరు, వేయి మంది గుంపులై పోరుతున్నారు. వాళ్లు కులపర్వతాల గుహలలో నిండే విధంగా సింహనాదం చేస్తున్నారు, అరుస్తున్నారు, అట్టహాసాలు చేస్తున్నారు. తెరపి లేకుండా శత్రువీరులను వెతికి పట్టుకుంటూ, పటహ, కాహళ, భేరీ, శంఖాలవంటి యుద్ధవాద్యాల ఘోషకు పొంగిపోతున్నారు. గర్వంతో ఉబ్బిపోతున్నారు. గదలతో కొట్టి చంపుతున్నారు. బాణాలను వేస్తున్నారు. రాతిగదలతో ఒత్తుకొంటున్నారు. రోకళ్లతో మొత్తుకొంటున్నారు. ఈటెలతో గుచ్చి ఎత్తుతున్నారు. కత్తులతో ముక్కలు చేస్తున్నారు. చక్రాలతో తునకలు చేస్తున్నారు. శస్త్రాలతో తఱిగిపోస్తున్నారు. విచిత్రమైన రీతుల్లో సంచరిస్తున్నారు. శత్రువుల ఆయుధాలను అట్లాగే తిప్పి కొడుతున్నారు. చురకత్తులతో పొడుస్తున్నారు. రకరకాలుగా విజృంభించి సైనిక వీరులు వీరత్వం చూపుతున్నారు. రథచక్రాల శబ్దాలు ఆకాశాన్నంటాయి. రవంత ఎడమివ్వకుండా వచ్చే రథచక్రాల కిందపడి శత్రువీరులు నలిగిపోయారు. రకరకాల ఆయుధాల ప్రయోగాలవల్ల శత్రువులను చీల్చిపడేశారు. ఏనుగులు శత్రువుల బాణవర్షాలకు చెదరడం లేదు. దుర్భరమైన వర్షం కురుస్తున్నప్పటికీ చెదరని కొండలు ఎలా నిలబడతాయో, ఆ విధంగా – బాణవర్షాలకు నిలకడగా నిలిచాయి – అవి. అలా ఉండి, యమదండాలవంటి తమ తొండాలను సాచి, రథాల నొగలచివరలను అవలీలగా పట్టి, కిందపడేసి ముక్కలుగా విరుస్తున్నాయి. గిరగిరా తిప్పి పడేస్తున్నాయి. వీరభటులను బంతులవలె విసిరి పడేస్తున్నాయి. దంతాలతో కుమ్ముతున్నాయి. గుఱ్ఱాలను చీల్చివేస్తున్నాయి. తమకు తోచినట్లు విచ్చలవిడిగా తిరుగుతున్నాయి. ఇక గుఱ్ఱాల సంగతి చూస్తే – అవి ఇంద్రుడి వజ్రాయుధపు అంచుల దెబ్బలనుంచి తప్పించుకున్న రెక్కలున్న కొండలవలె – కవచాలతో ఉన్నాయి. భయంకరంగా సకిలిస్తున్నాయి. మనసుకు ఎంతవేగం ఉందో అంత వేగంతో

అవి పరుగులెత్తగలవిగా ఉన్నాయి. రౌతులు వాటిని ఉసికొలిసి, ఉరుకెత్తిస్తున్నారు. వాటి డెక్కల దెబ్బలకు దుమ్ము తెరలతెరలుగా లేస్తూ ఉంది. ఆ ధూళిపటలంతో చీకట్లు వ్యాపిస్తున్నాయి. ఆ చీకట్లను తమకత్తుల వెలుగుతో నివారిస్తూ రౌతులు దూకుతున్నారు. శత్రువుల వ్యూహాలను తిప్పికొడుతున్నారు. రకరకాల పద్ధతులతో శత్రులను ఎదుర్కొంటున్నారు. ఇలా సమరం భీకరంగా ఉంది. అక్కడ

**క. చెదురథములుఁ దెగుహరులును, బడుకరులును మడియుభటులుఁ బఱచురుధిరమున్**
**మడియుతల లొఱగుతనువులుఁ, బొడియగుతొడవులును మధురిపునిదెసఁ గలిగెన్. 1558**

**ప్రతి :** చెడు= కూలిపోతున్న; రథములున్= రథాలూ; తెగు= నరకబడుతున్న; హరులును= గుర్రాలూ; పడు= నేలకూలుతున్న; కరులును= ఏనుగులూ; మడియు= మరణిస్తున్న; భటులన్= భటులూ; పఱచు= పారుతున్న; రుధిరమున్= రక్తం; మడియు= తెగి పడుతున్న; తలలు; ఒఱగు= కూలిపోతున్న; తనువులున్= శరీరాలూ; పొడి అగు= పొడిపొడి అయిపోతున్న; తొడవులును= ఆభరణాలూ; మధురిపుని= మధుడు అనే రాక్షసుణ్ణి చంపిన శ్రీకృష్ణుని; దెసన్= వైపున; కలిగెన్= ఏర్పడ్డాయి.

**తా :** శ్రీకృష్ణునివైపున రథాలు విరిగిపోయాయి. గుర్రాలు తెగిపడ్డాయి. ఏనుగులు నేలకూలాయి. పదాతిదళం కుప్ప కూలింది. రక్తం ప్రవాహంగా పారింది. తలలు తెగిపడ్డాయి. శరీరాలు కూలిపోయాయి. ఆభరణాలు పొడిపొడి అయిపోయాయి.

**క. భీతంబై హతసుభట, వ్రాతంబై భగ్నతురగవారణరథ సం**
**ఘాతంబై విజయశ్రీ, వీతంబై యదుబలంబు విఱిగె నరేంద్రా! 1559**

**ప్రతి :** నర+ఇంద్రా= రాజా!; భీతంబు+ఐ= భయపడిన; సుభట= వీరభటుల; వ్రాతంబు+ఐ= సమూహం కలిగిందై; భగ్న= విరిగిపోయిన; తురగ= గుర్రాల; వారణ= ఏనుగుల; రథ= రథాల; సంఘాతంబు+ఐ= సమూహంతో కూడిందై; విజయశ్రీ= గెలుపు అనే సంపద; వీతంబు+ఐ= లేనిదై; యదుబలంబు= యాదవసైన్యం; విఱిగెన్= చెల్లాచెదురై పోయింది.

**తా :** రాజా! యాదవసైన్యం భయపడిపోయింది. వీరులంతా కుప్పకూలిపోయారు. గుర్రాలు, ఏనుగులు చచ్చిపడ్డాయి. రథాలు ముక్కలై పోయాయి. గెలుపు అనేదే లేకుండా యాదవసైన్యం చెల్లాచెదరైపోయింది.

**శా. 'యోధాగ్రేసరుఁ డీ హలాయుధుఁడు లోకోత్కృష్టబాహాబల**
**శ్రీధౌరేయుఁడు కృష్ణుఁ డిట్టి ఘనులం జిత్రంబు;నేఁ డిట్లు సం**
**రోధించెన్; బలముం దెరల్చె; మగధేంద్రుం' డంచు నీక్షించుచున్**
**సౌధాగ్రంబులఁ బౌరకాంతలు మహాసంతప్తలై రెంతయున్. 1560**

**ప్రతి :** యోధ+అగ్రేసరుఁడు= యోధులలో మొదటగా నిలిచేవాడు; ఈ హల+ఆయుధుఁడు= హలాన్ని ఆయుధంగా ఉన్న ఈ బలరాముడు; లోక+ఉత్కృష్ట= లోకంలో అత్యుత్తమమైన; బాహాబల= భుజబలం అనే; శ్రీ= సంపదను; ధౌరేయుఁడు= తాల్చిన వాడు; కృష్ణుఁడు= శ్రీకృష్ణుడు; ఇట్టి= ఇలాంటి; ఘనులన్= గొప్పవీరులనిద్దరినీ; చిత్రంబు= ఆశ్చర్యకరంగా ఉంది; నేడు= ఈ రోజు; ఇట్లు= ఇలాగ; సంరోధించెన్= అడ్డుకున్నాడు; బలమున్= సైన్యాన్ని; తెరల్చెన్= తరిమేశాడు; మగధ+ఇంద్రుండు= మగధరాజైన జరాసంధుడు; అంచున్= అనుకుంటూ; సౌధ+అగ్రంబులన్= మేడపై భాగాలనుండి; ఈక్షించుచున్= చూస్తూ; పౌరకాంతలు= నగరస్త్రీలు; ఎంతయున్= ఎంతగానో; మహాసంతప్తలు+ఐరి= మిక్కిలి బాధపడ్డారు.

**తా :** 'అటు బలరాముడు మహాయోధులలో మొదటివాడు. ఇటు శ్రీకృష్ణుడేమో లోకోత్తరమైన భుజబలసంపద ఉన్నవాడు. ఇలాంటి ఇద్దరు మహావీరులను ఈ రోజు జరాసంధుడు ఎదుర్కొని నిలబడడం, వాళ్ల సైన్యాలను తరిమికొట్టడం ఆశ్చర్యంగా ఉంది'. అనుకొంటూ నగరంలోని స్త్రీలు మేడలమీదనుండి చూస్తూ, ఎంతగానో దుఃఖించారు.

**వ. ఇట్లు తన మొనలు విఱిగి పాఱినం గనుంగొని, సమరసంరంభంబున హరి విశ్వంభరాభరణవేదండ తుండాభంబులగు బాహుదండంబులు వెంచి, విజృంభించి, బ్రహ్మాండకుహర కుంభపరిస్ఫోటనం బగు పాంచజన్యనినదంబు నిబిడనిర్ఘాతశబ్దంబుగా, నుదంచితపింఛదామంబు సంక్రందనచాపంబుగాఁ, బ్రశస్తహస్త లాఘవంబున శరాకర్షణసంధానమోక్షణంబు లేర్పడక, నిర్వక్రచక్రాకారంబుతోడ మార్తాండమండల ప్రభా ప్రచండంబగు శార్ఙ్గకోదండంబు క్రొమ్మెఱుంగులుగా, దిగ్గజేంద్ర కర్ణభీషణంబులగు గుణఘోషణంబులు ఘుమఘుమారావదుస్సహంబు లయిన గర్జనంబులుగా, రథతురంగమరింఖాసముద్ధూతపరాగపటల పరంపరాసంపాదితపుంజీభూతంబగు పెంజీఁకటి యిరులుగా, నసమసమర సన్నాహ చాతురీ విశేషంబులకుం జొక్కి, నిక్కి కరంబు లెత్తి నర్తనంబులం బ్రవర్తించు నారదహస్తవిన్యాసంబులు లీలాతాండవ మండితమహోత్కంఠంబు లగు నీలకంఠంబులుగా, సుందరస్యందననేమినిర్ఘోషభీతులయి కుంభికుంభములపై వ్రాలు వీరులు మత్తమయూరకేకారవచకితులై యువతీకుచకుంభంబులమీఁద వ్రాలెడు కాముకులుగా, నానానరేంద్రరక్తపిపాసాపరవశంబులై వాచఱచుచున్న భూతవ్రాతంబులు వర్షవర్షేతి నిస్వనంబు లొసంగు చాతకంబులుగా, నభంగసంగరప్రేరకుండగు హలాయుధుండు వృష్టికారణంబగు మందసమీరణం బుగా, ననల్పకల్పాంతకాల నీలవలాహకంబు భాతిం బరగు మేనిచాయతోడం దోయజనాభుం డరాతిచతురంగ దేహక్షేత్రంబులం బుంఖానుపుంఖంబులుగ నసంఖ్యాతబహువిధదివ్యబాణవర్షంబు గురియునెడ శస్త్రాస్త్రపరంపరాసంఘట్టన జనితంబులగు మిడుఁగుఱులు వర్షాకాలవిహితవిద్యోతమాన ఖద్యోతంబులుగ, విశిఖవికీర్ణవీరకోటీరఘటితపద్మరాగశకలంబు లింద్రగోపంబులును, మహితమార్గణ విదళితమత్తమాతంగ కుంభమౌక్తికంబులు వడగండ్లుగఁ, జటులార్ధచంద్రశరచ్ఛిన్నచరణంబు లయి 'కృష్ణ! కృష్ణ! నిలు నిలు' మని పలుకుచుం గూలెడు మేనులు కృషీవలకరపరశుధారావిదళితమూల విశాలసాలంబులుగ, భాసురభల్ల భగ్నంబు లయిన వదనగహ్వరంబుల వలన డుల్లెడు దంతపుంజంబులు మాలతీకుసుమమంజరులుగ, నవ్యనారాచభిన్నదేహంబు లయి దిగ్గనఁ గ్రొగ్గండ్లవలన వెడలు రక్తస్యంద సందోహంబులతో సంచరింపక ప్రాణంబులు విడుచు శుండాలంబులు సెలయేఱులతోడి కొండలుగఁ, గఠోరకాండఖండితంబు లయిన భుజాదండంబులతోడఁ గలసి పడిన వజ్రమయకంఠికాభరణంబులు భోగిభోగసమేతకేతకీకుసుమంబులుగఁ, బ్రళయార్ణవకల్లోలశబ్దసన్నిభంబు లయిన భేరీరవంబులు భీకరభేకీనికరారవంబులుగ, దారుణేషువిలూన వాహవారణమనుజమస్తిష్కంబు రొంపిగ, సొంపు మెఱయ నాభీలకీలాలప్రవాహంబులు ప్రవహించె; నందు భుజములు భుజంగంబులుగఁ గపాలంబులు కమఠంబులుగ, శిరోజంబులు శైవాలంబులుగఁ, గరంబులు మీనంబులుగ, హయంబులు నక్రంబులుగ, గజంబులు దీవులుగ, ధవళచ్ఛత్రంబులు నురువులుగఁ, జామరంబులు గలహంసంబులుగ, భూషణరత్నరేణురాసులు పులినంబులుగ నొప్పె; నప్పుడు. 1561**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; తన; మొనలు= సైన్యం; వితిగి= చెదరి; పాతినన్= పారిపోగా; కనుంగొని= చూచి; సమరసంరంభంబునన్= యుద్ధంలోని ఉత్సాహంతో; హరి= శ్రీకృష్ణుడు; విశ్వంభరా= భూమిని; భరణ= మోస్తున్న; వేదండ= ఏనుగుల; తుండ+ఆభంబులు+అగు= తొండాల వంటి; బాహుదండంబులున్= తన భుజదండాలను; పెంచి; విజృంభించి= చెలరేగి; బ్రహ్మ+అండ= బ్రహ్మాండమనే; కుహర= గుహలాంటి; కుంభ= కుండను; పరిస్ఫోటనంబు+అగు= పగలగొట్టేదిలాగా ఉన్న; పాంచజన్య= పాంచజన్యం అనే పేరున్న శంఖముయొక్క; నినదంబున్= ధ్వనిని; నిబిడ= మొత్తం నిండిన; నిర్ఘాత శబ్దంబు+కాన్= పిడుగుల మోతగా; ఉదంచిత= అందమైన; పింఛదామంబు= నెమలిపింఛం; సంక్రందనచాపంబు+కాన్= ఇంద్రధనుస్సువలె రంగులీనగా; ప్రశస్త= పొగడదగిన; హస్త= చేతుల; లాఘవంబునన్= నైపుణ్యంచేత; శర+ఆకర్షణ= బాణాలను తీయడం; సంధాన= ఎక్కుపెట్టడం; మోక్షణంబులు= సారించివదలడం; ఏర్పడక= తెలియరాకుండగా; నిర్వక్ర= వంకరలేని; చక్ర+ఆకారంబుతోడన్= చక్రంలాంటి ఆకారంతో; మార్తాండమండల= సూర్యమండలంయొక్క; ప్రభా= కాంతి; ప్రచండంబు+అగున్= చూడడానికి వీలులేనంతటి తీవ్రమైనదై; శార్జ్గ కోదండంబు= శార్జ్గమనే పేరున్న ధనుస్సు; క్రొత్త+మెఱుంగులుగాన్= కొత్తగా తళుకులీనుతుండగా; దిక్+గజ+ఇంద్ర= దిక్కుల చివర్లలో ఉన్న ఏనుగుల; కర్ణ= చెవులకు; భీషణంబులు+అగు= భయాన్ని కలిగించే; గుణ= వింటినారులయొక్క; ఘోషణంబులు= శబ్దాలు; ఘుమఘుమ+ఆరావ= ఘుమఘుమశబ్దాలతో; దుస్సహంబులు+అయిన= భరించడానికి వీలుకానివిగా ఉన్న; గర్జనంబులుగా= మేఘాల ఉరుముల శబ్దాలవలె; రథ= రథాలచేత; తురంగమ= గుఱ్ఱాల; రింఖా= గిట్టలచేత (పాదగతిచేత); సముద్ధూత= పైగి రేగిన; పరాగపటల= ధూళి సమూహంయొక్క; పరంపరా= ఎడతెగనిక్రమంతో; సంపాదిత= పొందిపబడిందై; పుంజీభూతంబు+అగు= గాఢంగా ఏర్పడిన; పెను+చీఁకటి= దట్టపు చీకటి; ఇరులు+కాన్= అంధకారంగా; అసమసమర= సాటిలేని యుద్ధంయొక్క; సన్నాహ= ఏర్పాట్లలో; చాతురీ= చతురతయొక్క; విశేషంబులకున్= ప్రత్యేకతలకు; చొక్కి= (పరవశించి) ఆస్వాదించి; నిక్కి= నిలబడి; కరంబులు+ఎత్తి= చేతులెత్తి; నర్తనంబులన్= అభినయాలతో; ప్రవర్తించు= కనిపిస్తూ ఉండే; నారద= నారదునియొక్క; హస్తవిన్యాసంబులు= చేతుల కదలికలు; లీలాతాండవ= ఒయ్యారంగా చేసే నృత్యంచేత; మండిత= అలంకృతమైన; మహా+ఉత్కంఠంబులు+అగు= ఎంతో తహతహలు కలిగిన; నీలకంఠంబులు+కాన్= నల్లని మెడలు కలిగిన నెమళ్లుగా; సుందర= అందమైన; స్యందన= రథంయొక్క; నేమి= ఇరుసుచేసే; నిర్ఘోష= గొప్ప శబ్దానికి; భీతులు+అయి= భయపడినవారై; కుంభి= ఏనుగుల; కుంభములపై= కుంభస్థలాలపై; వ్రాలు= వాలిపోతున్న; వీరులు; మత్త= మదించిన; మయూర= నెమళ్లయొక్క; కేకారవ= క్రేంకారశబ్దాలకు; చకితులై= ఆశ్చర్యపడినవారై; యువతీ= యువతులయొక్క; కుచ= స్తనాలు అనే; కుంభంబులమీఁదన్= కుంభస్థలాల మీద; వ్రాలెడు= వాలిపోతున్న; కాముకులు+కాన్= కాముకులైన వారిలాగా కనిపించగా; నానా= అనేకులైన; నర+ఇంద్ర= రాజులయొక్క; రక్త= రక్తాన్ని; పిపాసా= తాగడంచేత; పరవశంబులు+ఐ= తమకంతో నిండినవై; వాచఱచున్+ఉన్న= కేరింతలు కొట్టుతున్న; భూతవ్రాతంబులు= భూతాల గుంపులు; వర్ష వర్ష+ఇతి= వాన వాన అంటూ; నిస్వనంబులు+ఒసంగు= శబ్దాలు చేసే; చాతకంబులు+కాన్= చాతక పక్షులు కాగా; అభంగ= విరామం లేని; సంగర= యుద్ధానికి; ప్రేరకుండు+అగు= ప్రేరేపించే వాడయిన; హల+ఆయుధుండు= నాగలిని ఆయుధంగా కలిగిన బలరాముడు; వృష్టి= వర్షానికి; కారణంబు+అగు= కారణమైన; మంద సమీరణంబు+కాన్= నెమ్మదిగా వీచే చల్లనిగాలిగా; అనల్ప= గొప్ప; కల్ప+అంతకాల= ప్రళయ సమయంలోని; నీల= నల్లని; వలాహకంబు భాతిన్= మేఘంవలె; పరగు= ఉన్నటువంటి; మేనిచాయతోడన్= శరీరపురంగుతో; తోయజనాభుండు= పద్మాన్ని నాభియందు కలవాడు - శ్రీకృష్ణుడు; అరాతి= శత్రువులయొక్క; చతురంగ= చతురంగ బలాలయొక్క (రథ - గజ - తురగ - పదాతిదళాలు); దేహ= శరీరం అనే; క్షేత్రంబులన్= పొలాలలో; పుంఖానుపుంఖంబులుగన్= ఒకదాని వెంట మరొకటి ఎడతెరిపిలేకుండా; అసంఖ్యాత=

లెక్కకు మిక్కుటమైన; బహువిధ= రకరకాలైన; దివ్య= పవిత్రమైన; బాణవర్షంబు= బాణాల వాన; కురియున్+ఎడన్= కురిసేటపుడు; శస్త్ర+అస్త్ర= ఖడ్గం, శూలం వంటి ఆయుధాల, నాగాస్త్రం, బ్రహ్మాస్త్రం వంటి మంత్రపూరితఅస్త్రాల; పరంపరా= వరుస; సంఘట్టన= ఒకదాని కొకటి ఒరసుకోవడంవల్ల; జనితంబులు+అగు= పుడుతున్నవైన; మిడుఁగుఱులు= నిప్పురవ్వలు; వర్షాకాల= వానాకాలంలో; విహిత= ఉండదగిన; విద్యోతమాన= వెలుగుతున్న; ఖద్యోతంబులు+కన్= మిణుగురుపురుగులుగా; విశిఖ= బాణాలచే; వికీర్ణ= చెల్లాచెదరు చేయబడిన; వీర= వీరుల; కోటీర= కిరీటాలలో; ఘటిత= పొదుగబడ్డ; పద్మరాగ= ఎఱ్ఱరాళ్ల (కెంపుల); శకలంబులు= ముక్కలు; ఇంద్రగోపంబులును= ఆరుద్రపురుగులుగా; మహిత= గొప్ప; మార్గణ= బాణాలచే; విదళిత= చీల్చబడిన; మత్త= మదించిన; మాతంగ= ఏనుగులయొక్క; కుంభ= కుంభస్థలాలలోని; మౌక్తికంబులు= ముత్యాలు; వడగండ్లుగన్= వడగళ్లుగా; చటుల= చలిస్తున్న; అర్ధచంద్ర= అర్ధచంద్రాకారంలో ఉండే; శరత్+ఛిన్న= బాణాలచేత నరుకబడిన; చరణంబులు+అయి= కాళ్లున్న వాళ్లై; కృష్ణ కృష్ణ= ఓ కృష్ణా, కృష్ణా; నిలునిలు= ఆగాగు; అని; పలుకుచున్= అంటూ; కూలెడు= నేలమీద కూలుతున్న; మేనులు= శరీరాలు; కృషీవల= రైతుయొక్క; కర= చేతిలోని; పరశుధారా= గండ్రకొడ్డలిపదునుచేత; విదళిత= నరకబడిన; మూలవిశాలసాలంబులు+కన్= మూలమైన పెద్దవృక్షాలుగా; భాసుర= వెలుగుతున్న; భల్ల= బాణాలతో; భగ్నంబులు= ముక్కలుగా; అయిన; వదన= నోళ్లు అనే; గహ్వరంబులవలన= గుహలనుండి; దుల్లెడు= దొర్లిపడుతున్న; దంతపుంజంబులు= పళ్లసమూహాలు; మాలతీకుసుమ= జాజిపూల; మంజరులుగన్= గుత్తులుగా; నవ్య= కొత్త; నారాచ= బాణాలతో; భిన్న= చీల్చబడిన; దేహంబులు+అయి= శరీరాలై; దిగ్గనన్= హఠాత్తుగా; క్రొత్త+గండ్ల వలనన్= కొత్తగా తగిలిన దెబ్బల రంధ్రాలనుండి; వెడలు= ఉబికివస్తున్న; రక్తస్యంద= రక్తప్రవాహాల; సందోహంబులతోన్= వరుసలతో; సంచరింపక= తిరుగాడకుండా; ప్రాణంబులు= ప్రాణాలను; విడుచు= విరుస్తున్న; శుండాలంబులు= ఏనుగులు; సెలయేఱులతోడి= వాగులతో ఉన్న; కొండలు+కన్= కొండలుగా; కఠోర= పదునైన; కాండ= బాణాలచే; ఖండితంబులు+అయిన= నరకబడిన; భుజాదండంబులతోడన్= విశాలమైన భుజాలతో; కలసి; పడిన= క్రిందపడిన; వజ్రమయ= వజ్రాలతో నిండిన; కంఠిక+ఆభరణంబులు= కంఠాభరణాలు, (గుండ్రంగా ఉండి, మెడలో ధరించే ఆభరణాలు); భోగి= పాముల; భోగ= శరీరాలతో; సమేత= కూడి ఉన్న; కేతకీ= మొగలి; కుసుమంబులు+కన్= పూలుకాగా; ప్రళయ= ప్రళయకాలంలోని; అర్ణవ= సముద్రంవలె; కల్లోల శబ్ద= ఎగసిపడే హోరుశబ్దంతో; సన్నిభంబులు+ఐన= సమానమైన; భేరీరవంబులు= భేరులు చేస్తున్న ధ్వనులు; భీకర= భయం కలిగించే; భేకీ= ఆడ కప్పల; నికరారవంబులు+కన్= కూతలుగా; దారుణ+ఇషు= భయంకరమైన బాణాలచే; విలూన= కత్తిరించబడ్డ; వాహ= గుఱ్ఱాల; వారణ= ఏనుగుల; మస్త= తలలలోని; మస్తిష్కంబు= మెదడుతో; రొంపి+కన్= బురదగా; సొంపు= అందంతో; మెఱయన్= మెరుస్తుండగా; ఆభీల= భయంకరమైన; కీలాలప్రవాహంబులు= రక్తప్రవాహాలు; ప్రవహించెన్= పారాయి; అందున్= అక్కడ; భుజంబులు= భుజాలు; భుజంగంబులుగన్= పాములుగా; కపాలంబులు= పుఱ్ఱెలు; కమఠంబులుగన్= తాబేళ్లుగా; శిరోజంబులు= వెంట్రుకలు; శైవాలంబులు+కన్= నాచుగా, కరంబులు= అరచేతులు; మీనంబులు+కన్= చేపలుగా; హయంబులు= గుఱ్ఱాలు; నక్రంబులు+కన్= మొసళ్లుగా; గజంబులు= ఏనుగులు; దీవులు+కన్= ద్వీపాలుగా; ధవళఛత్రంబులు= తెల్లని గొడుగులు; నురువులు+కన్= నురుగుగా; చామరంబులు= వింజామరలు; కలహంసంబులు+కన్= అందమైన తెల్లని హంసలుగా; భూషణ= నగల (ఆభరణాల); రత్న= విలువైన రత్నాల; రేణు= ముక్కల; రాసులు= కుప్పలు; పులినంబులుగన్= ఇసుక దిబ్బలుగా; ఒప్పెన్= అందగించాయి; అప్పుడు= ఆ సమయంలో...

**తా :** ఇలాగ తన సైన్యం భయంతో పరిగెత్తి పోవడాన్ని శ్రీకృష్ణుడు గమనించాడు. యుద్ధం చేయాలని విజృంభించాడు. దిగ్గజాల తొండాలలాంటి తన చేతులను చాచాడు. బ్రహ్మాండభాండం బ్రద్దలయ్యేలా పాంచజన్య శంఖాన్ని పూరించాడు. అది

దట్టమైన పిడుగుల మ్రోతలాగా ఉంది. అతడు ధరించిన నెమలిపింఛం రంగులీనుతున్న హరివిల్లులా ఉంది. అతడి హస్తలాఘవం, ధనుస్సును పట్టి బాణాలను ఎపుడు కూరుస్తున్నాడో, ఎపుడు నారి లాగుతున్నాడో, ఎపుడు బాణాలను వదులుతున్నాడో తెలియరాకుండా జరిగిపోతూంది. సూర్యుడిచుట్టూ ఒక వలయం ఉండి, తేరిపారచూడడానికి వీలుకానట్లుగా, అతనిధనుస్సు మెరిసిపోతూ ఉంది. దిక్కుల చివర్లలో ఉండే ఏనుగుల చెవులకు భయం కలిగిస్తూ అతని అల్లె త్రాళ్లు గర్జిస్తున్నాయి. రథాలకు కట్టిన గుర్రాల గిట్టల తాకిడికి ధూళి ఆకాశానికి రేగుతూ ఉంది. ఆ ధూళి కమ్మి చీకటి ఏర్పడుతూ ఉంది. శ్రీకృష్ణునియుద్ధకళానైపుణ్యానికి నారదుడు మురిసిపోయాడు. నిలబడి, నిక్కి చేతులెత్తి నాట్యం చేశాడు. అలా చేస్తున్న హస్తవిన్యాసం నెమళ్లు చేస్తున్న తాండవ నృత్యంలా ఉంది. అందమైన రథచక్రాల ధ్వనికి భయపడి వీరులు ఏనుగుల కుంభస్థలాల మీదికి ఒరిగిపోతున్నారు. అదెలా ఉందంటే, నెమళ్ల అరుపులకు ఉలికి పడిన కాముకులు యువతుల కుచకుంభాల మీదికి వాలిపోతున్నట్లుంది.

ఎందరెందరో రాజులు మరణించారు. వాళ్లరక్తం తాగడానికి పిశాచాలు గుంపులు కట్టాయి. 'వాన, వాన' అని కేరింతలు కొడుతూ చాతకపక్షులు వాననీటిని తాగినట్లు పిశాచాలు రక్తం తాగుతున్నాయి. తిరుగులేని యుద్ధాన్ని ప్రేరేపించిన బలరాముడు వానరాకకు కారణమైన చల్లగాలి అయ్యాడు. ప్రళయకాలం చివరలో కురిసే నీలిమబ్బులవంటి వన్నెతో వెలిగే శ్రీకృష్ణుడు శత్రువుల చతురంగబలాల దేహాలు అనే పొలాలమీద లెక్కలేనన్ని దివ్యశరాల వర్షాన్ని కురిపించాడు. ఆ సమయంలో తెరిపిలేకుండా కురుస్తున్న శస్త్రాస్త్రాలు ఒక దానికొకటి తగిలి నిప్పురవ్వలు ఎగురుతున్నాయి. అవి వానాకాలంలో ఎగిరే మిణుగురుపురుగులవలె ఉన్నాయి. బాణాల దెబ్బకు వీరుల కిరీటాలలోని పద్మరాగమణులు ముక్కలై పడుతున్నాయి. ఎర్రని ఆ మణుల శకలాలు ఆరుద్ర పురుగులవలె ఉన్నాయి. పదునైన బాణాలు ఏనుగుల కుంభస్థలాలను చీల్చేస్తున్నాయి. ఆ కుంభ స్థలాలనుంచి రాలుతున్న ముత్యాలు వడగళ్లవలె ఉన్నాయి. అర్ధచంద్రాకారపు బాణాల తాకిడికి కాళ్లు తెగిన వీరులు 'కృష్ణా, కృష్ణా ఆగు' అని అరుస్తూ కుప్ప కూలిపోతున్నారు. వారు రైతుచేతిలోని గండ్రగొడ్డలితో నరికితే కూలిపోతున్న పెద్దమానులవలె ఉన్నారు. పదునైన బల్లెముల దెబ్బకు నోరు అనే గుహలనుంచి రాలిపడుతున్న దంతాలు, జాజిపూల గుత్తులవలె ఉన్నాయి. ఏనుగులపై వాడి బాణాలు కురిసి కొత్త కొత్త గాయాలవుతున్నాయి. వాటి నుంచి రక్తం ప్రవహిస్తూ ఉంది. ఆ దెబ్బలకు తిరుగజాలక కుప్పకూలి ప్రాణాలు వదలుతున్నాయి. అవి సెలయేళ్లతో ఉండే పెద్ద కొండలవలె కనిపిస్తున్నాయి. వీరుల చేతులు తెగి నేలమీదపడ్డాయి. ఆ చేతులు పాములవలె ఉన్నాయి. ఆ చేతులతో పాటు పడిన కంఠాభరణాలు పాముపడగలతో ఉన్న మొగలిపూలవలె ఉన్నాయి. ప్రళయకాలంలో సముద్రం చేసే కల్లోలశబ్దంవలె యుద్ధభేరీస్వనాలు మోగుతున్నాయి. అవి అతిదారుణమైన కప్పల బెకబెకలవలె ఉన్నాయి. భయంకరమైన బాణాలతో నరకబడ్డ చతురంగ బలాల మెదడు బురదగా ఉంది. రక్తం కాలువలు కట్టి ప్రవహించింది. ఆ ప్రవాహంలో పొడవైన చేతులు పాములవలె ఉన్నాయి. కపాలాలు తాబేళ్లవలె ఉన్నాయి. తలవెంట్రుకలు నాచువలె ఉన్నాయి. అరచేతులు చేపలవలె ఉన్నాయి. గుర్రాలు మొసళ్లవలె ఉన్నాయి. ఏనుగులు ద్వీపాలవలె ఉన్నాయి. తెల్లగొడుగులు నురుగుల్లా కనిపిస్తున్నాయి. వింజామరలు రాజహంసలవలె ఉన్నాయి. ఆభరణాలపొడి ఇసుకతిన్నెలవలె ఉంది. అప్పుడు ఇలా జరిగింది.

**లయవిభాతి.**

**హసిత హరినీలనిభ వసనము విశాలకటి నసమనయనాద్రి పరిలసిత మగు మేఘో**
**ల్లసనము వహింపఁ గరకిసలయము హేమమణివిసరవలయద్యుతులు దెసల తుదలందున్**

**బసలు గురియంగ సరభసమున బలుండు దరహసితము ముఖాబ్జమున నెసఁగ ఘనకాలా**
**యస మయ మహోగ్రతరముసలము వడిన్ విసరి కసిమసఁగి శత్రువుల నసువులకుఁ బాపెన్. 1562**

**ప్రతి :** హసిత= నవ్వుతున్న; నీలనిభ= నీలమణులవంటి; వసనము= వస్త్రం; విశాలకటిన్= విశాలమైన నడుమున; అసమ+నయన+అద్రిన్= (ఎగుడుదిగుడు కళ్లున్న) శివుని కొండ అయిన కైలాసాన్ని; పరిలసితము+అగు= అంతటా ఆవరించుకొని ఉన్న; మేఘ+ఉల్లసనమున్= మేఘాల ప్రకాశాన్ని; వహింపన్= తాల్చగా; కర+కిసలయము= చిగురాకులవంటి చేతులు; హేమ= బంగారులో కూర్చిన; మణి= మణుల; విసర= సమూహాలతో; వలయ= కంకణాల; ద్యుతులు= కాంతులు (వెలుగులు); దెసల తుదల+అందున్= దిక్కుల చివర్లలో; పసలున్= వెలుగులను; కురియంగన్= చిమ్మగా; సరభసమునన్= వేగంతో; బలుండు= బలరాముడు; దరహసితము= చిరునవ్వు; ముఖ+అబ్జమునన్= ముఖమనే పద్మంపై; ఎసఁగన్= అతిశయించగా; ఘన= గొప్ప; బరువైన; కాల+ఆయసమయ= నల్లని ఇనుముతో కూడిన; మహా+ఉగ్రతర= చాలా భయంకరమైన; ముసలమున్= రోకలిని; వడిన్= తటాలున; విసరి= విసరివేసి; కసిమసఁగి= కోపంతో చెలరేగి; శత్రువులన్= శత్రువులను; అసువులకున్= ప్రాణాలకు; పాపెన్= దూరం చేశాడు. (చంపాడు అని భావం)

**తా :** బలరాముడు నీలమైన వస్త్రాన్ని ధరించాడు. అది కైలాసపర్వతాన్ని ఆవరించుకున్న నీలిమేఘంవలె ఆయన నడుముపై అందంగా ఉంది. ఆయనచేతులు చిగురాకులవలె ఉన్నాయి. ఆ చేతులకు బంగారు కంకణాలు ఉన్నాయి. దానిపై రత్నాలు పొదుగ బడ్డాయి. ఆ బంగారు వన్నె, రత్నాల వెలుగు దిక్కుల చివర్లకు వ్యాపిస్తున్నాయి. పద్మంలాంటి ఆయన ముఖంపై చిరునవ్వు కదలాడుతూ ఉంది. కోపంతో చెలరేగి బరువైన, బలమైన ఇనుప రోకలితో అతివేగంగా శత్రువుల ప్రాణాలను హరించాడు.

**విశే :** లయవిభాతి పద్యంలో నసన నసన నసన నసగ అనే గణాలుంటాయి. పదేసి అక్షరాలకు ప్రాసయతి ఉంటుంది. ప్రాసనియమం ఉంది.

**లయవిభాతి.**

**ప్రలయసమయాంతకుని చెలువునఁ గటాక్షముల నలఘుచటులాగ్నికణములు సెదరఁ గోలా**
**హలముగ సువర్ణమణివలయ నిచయోజ్జ్వలిత హలము వడిఁ జాచి శిరములు నురములు న్ని**
**ర్దలితములుగన్ శకలములుగ నొనరింపఁ గని బెలుకుతి జరాసుతునిబలము రణవీథిన్**
**జలితదనుజావలికి బలికి భయభీతసురఫలికిఁ ద్రిజగచ్ఛలికి హలికిఁ దల డించెన్. 1563**

**ప్రతి :** ప్రలయ సమయ= ప్రళయకాలంలోని; అంతకుని= యముడి; చెలువునన్= విధంగా; కటాక్షములన్= కనుచూపుల్లో; అలఘు= ఎక్కువగా; చటుల= తీక్ష్ణమైన; అగ్నికణములు= నిప్పురవ్వలు; చెదరన్= ఎగసి పడుతుండగా; కోలాహలము+కన్= గొప్పధ్వనులుగా; సువర్ణ= బంగారుతో పొదిగిన; మణి వలయ= మణుల చుట్టల; నిచయ= వరుసలతో; ఉత్+జ్వలిత= బాగా వెలిగిపోతున్న; హలము= నాగలియొక్క; వడిన్= వేగానికి; చాచి= చాచి; శిరములున్= తలలు; ఉరములున్= వక్షాలు; నిర్దలితములు+కన్= చీల్చబడినవిగా; శకలములు+కన్= ముక్కలుముక్కలుగా; ఒనరింపన్= చేయగా; కని= చూచి; పెలుకుతి= వశంతప్పి; జరాసుతుని= జర అనే రాక్షసిసుతుడైన ('జరా' అనే రాక్షసిచేత సంధింపబడిన శరీరంకలవాడు) జరాసంధునియొక్క; బలము= సేన; రణవీథిన్= యుద్ధరంగంలో; చలిత= చెదరిపోతున్న; దనుజ+ఆవలికిన్= రాక్షసుల

గుంపునకు; బలికిన్= బలం కలిగినవానికి; భయభీత= భయంతో ఉన్న; సుర= దేవతలకు; ఫలికిన్= ఫలాన్ని కలిగించేవానికి; త్రిజగత్+ఛలికిన్= మూడులోకాలనూ సంచలింపచేయగలవానికి; హలికిన్= నాగలికలవానికి (అయిన బలరామునికి); తలడించెన్= తల వాల్చింది.

**తా :** ప్రళయకాలంలోని యముడివలె బలరాముడి కన్నుల్లో నిప్పురవ్వలు ఎగసిపడుతున్నాయి. అతని చేతిలో నాగలి ఉంది. అది ఆయుధం, దానిపై బంగారుతోనూ, రత్నాలతోనూ వలయాలు చుట్టబడి ఉన్నాయి. అవి వెలిగిపోతున్నాయి. అలాంటి హలాయుధంతో శత్రువుల తలలను, వక్షాలను కొట్టి చీల్చేస్తున్నాడు. ముక్కలు ముక్కలుగా చేస్తున్నాడు. దీన్ని చూచి జరాసంధుడి సైన్యం వశం తప్పి చెదరిపోతున్నది. అంత బలంతో బలరాముడు దేవతల భయాన్ని పోగొడుతున్నాడు. మూడులోకాలనూ చలింపచేయగల ఆ హలాయుధుడి బలం ముందు జరాసంధుని సైన్యం తలదించి, చెదరిపోయింది.

**శా. రోషోద్రేకకళాభయంకరమహారూపంబుతో నొక్కచే**
**నీషాదండము సాఁచి లాంగలము భూమీశోత్తమగ్రీవలన్**
**భూషల్ రాలఁ దగిల్చి రాఁ దిగిచి సంపూర్ణోద్ధతిన్ రోఁకటన్**
**వేషంబుల్ సెడ మొత్తె రాముఁడు రణోర్విన్ నెత్తురుల్ జొత్తిలన్. 1564**

**ప్రతి :** రోష+ఉద్రేక= కోపంతో చెలరేగడం అనే; కళా= కళానైపుణ్యంతో; భయంకర= భయం కలిగించే; మహారూపంబుతోన్= గొప్పరూపంతో; ఒక్కచేన్= ఒక చేత్తో; ఈషాదండమున్= నాగలికర్రను; సాఁచి= చాచి; లాంగలమున్= నాగలిని; భూమి+ఈశ+ఉత్తమగ్రీవలన్= ప్రసిద్ధులైన రాజుల మెడలందలి; భూషల్+రాలన్= నగలు రాలిపడేటట్టుగా; తగిల్చి= తగిలించి; రాన్+తిగిచి= దగ్గరికి లాగి; సంపూర్ణ+ఉద్ధతిన్= పూర్తి విజృంభణతో; రాముఁడు= బలరాముడు; రణ+ఉర్విన్= రణభూమియందు; నెత్తురుల్= రక్తం; జొత్తిలన్= ఎర్రగిలి పారగా; రోఁకటన్= రోకలితో; వేషంబుల్= వేసుకున్న దుస్తులు, అలంకారాలు వంటివి; చెడన్= చెదరిపోయేట్టుగా; మొత్తెన్= మొత్తాడు.

**తా :** బలరాముడు కోపంతో చెలరేగిపోయాడు. ఆయనరూపం భయంకరంగా ఉంది. శత్రువులు మూర్ఛపోయేలా ఉంది. ఆయన ఒక చేత్తో నాగలికర్రను పట్టి చాచి, రాజోత్తముల మెడలకు తగిలించి, వాళ్ల నగలు రాలిపడేటట్టుగా, వస్త్రాలు చెదిరేటట్లుగా దగ్గరికి లాగాడు. విజృంభించి రక్తం ఎర్రగలి పారునట్లుగా రోకలితో వాళ్లను మొత్తాడు. వాళ్ల భూషణాలు, వస్త్రాలు చెదరిపోయాయి.

**క. హలిహలహృతకరికుంభస్థలముక్తాఫలము లోలిఁ దనరెఁ గృషిక లాం**
**గల మార్గకీర్ణబీజా, వలి కైవడి నద్భుతాహవక్షేత్రమునన్. 1565**

**ప్రతి :** హలి= హలాన్ని ధరించిన బలరాముని; హల= నాగలిచే; హృత= చేర్చుకోబడిన; కరి= ఏనుగుల; కుంభస్థల= కుంభస్థలాలలో ఉండే; ముక్తాఫలముల్= ముత్యాలు; ఓలిన్= వరసగా; కృషిక= రైతుయొక్క; లాంగల= నాగటి; మార్గ= చాలులో; కీర్ణ= చల్లిన; బీజ+ఆవలి కైవడిన్= విత్తనాల సమూహంవలె; అద్భుత+ఆహవక్షేత్రమునన్= ఆశ్చర్యాన్ని కలిగించే యుద్ధరంగంలో (యుద్ధమనే పొలంలో); తనరెన్= అందంగా కనిపించాయి.

**తా :** బలరాముడు ఏనుగుల కుంభస్థలాలను చీల్చాడు. అందులోని ముత్యాలు బయటపడ్డాయి. రైతు నాగటి చాలులో చల్లినవిత్తనాల వరుసవలె, యుద్ధమనే పొలంలో ఆ ముత్యాలు అందంగా గోచరించాయి.

**క. తతిమి హలి హలము విసరుచు, నెఱిఁ గదిసిన బెగడి విమత నికరము లెడలై**
**వెఱఁగుపడు నొదుఁగు నడఁగును, మఱుపడుఁ జెడు మడియుఁ బొరలు మరలుం దెరలున్. 1566**

**ప్రతి :** హలి= బలరాముడు; తతిమి= తరిమేస్తూ; హలము= నాగలిని; విసరుచున్= విసురుతూ; నెఱిన్= క్రమంగా; కదిసినన్= ఆక్రమించుకోగా; బెగడి= బెదరిపోయి; ఎడలు+ఐ= పక్కకుపోయి; వెఱఁగుపడున్= ఆశ్చర్యపడుతున్నాయి; ఒదుఁగున్= ఒదిగి పోతున్నాయి; అడఁగును= అణిగిపోతున్నాయి; మఱుపడున్= దాచి పెట్టుకుంటున్నాయి; చెడు= రూప హీనమవుతున్నాయి; మడియున్= మరణిస్తున్నాయి; పొరలున్= పొర్లుతున్నాయి; మరలున్= వెనక్కి మరలిపోతున్నాయి; తెఱలున్= పారిపోతున్నాయి.

**తా :** బలరాముడు నాగలిని గిరగిరా తిప్పుతూ శత్రుసైన్యాన్ని సమీపించాడు; సైన్యం బెదరి పక్కకు పోయింది, ఆశ్చర్యపడుతూంది, అతని ప్రతాపానికి సేన ఒదిగిపోతూ ఉంది, అణగిపోతూ ఉంది, దాక్కుంటూ ఉంది, రూపహీనమైపోతూ ఉంది, మరణిస్తూ ఉంది, పొర్లుతూ ఉంది, వెనక్కిమరలిపోతూ ఉంది, పారిపోతూ ఉంది.

**క. హరి తిగ్మగోశతంబుల, హరిదంతర మెల్లఁ గప్పు నాకృతిఁ గడిమిన్**
**హరితిగ్మగోశతంబుల, హరిదంతర మెల్లఁ గప్పె నతిభీకరుఁడై. 1567**

**ప్రతి :** హరి= సూర్యుడు; తిగ్మ= తీవ్రమైనకాంతి ఉన్న; గోశతంబులన్= వందలకొద్దీ కిరణాలచేత; హరిత్+అంతరము= దిక్కుల మధ్యభాగాన్ని; ఎల్లన్= అంతటినీ; కప్పు+ఆకృతిన్= కప్పేసినట్లుగా; కడిమిన్= ప్రతాపంతో; హరి= శ్రీకృష్ణుడు; అతిభీకరుఁడు+ఐ= చాలా భయాన్ని కలిగిస్తూ; తిగ్మ= పదునైన; గోశతంబులన్= వందలకొద్దీ బాణాలచేత; హరిత్+అంతరము= దిక్కుల నడిమి భాగాన్ని; ఎల్లన్= అంతటినీ; కప్పెన్= కప్పేశాడు.

**తా :** సూర్యుడు తీక్షణమైన కిరణాలతో అన్ని దిశలనడిమిభాగాన్ని కప్పేసినట్లుగా, శ్రీకృష్ణుడుకూడా శత్రువులకు భయంకరుడై, తీవ్రశక్తిగల తన తీక్షణబాణాలతో అన్నిదిశలనడిమిభాగాన్ని నింపేశాడు.

**సీ. పదుగు రేగురు దీర్ఘబాణముల్ గాఁడిన గుదులు గ్రుచ్చినభంగిఁ గూలువారు**
**దలలు ద్రెవ్విన మున్ను దారు వీక్షించినవారల నొప్పించి వ్రాలువారు**
**పదములు దెగిపడ్డ బాహులఁ బోరి నిర్మూలితబాహులై మ్రొగ్గువారు**
**క్షతముల రుధిరంబు జల్లింప నిర్ఝరయుతశైలములభంగి నుండువారు**

**ఆ. భ్రాతృ పుత్త్ర మిత్ర బంధువుల్ వీఁగిన, నడ్డ మరుగుదెంచి యఱఁగువారు**
**వాహనములు దెగిన వడి నన్యవాహనా, ధిష్ఠ లగుచు నెదిరి త్రెళ్ళువారు. 1568**

**ప్రతి :** పదుగురు= పదిమంది; ఏగురు= ఐదుమంది; దీర్ఘబాణముల్+కాఁడినన్= పొడవైన బాణాలు గుచ్చుకోగా; గుదులు గుచ్చినభంగిన్= గుదికర్రలతో గుచ్చినవిధంగా; కూలువారు= కూలిపోతున్నవారు; తలలు; త్రెవ్వినన్= తెగిపోగా; మున్ను= ఇంతకు మునుపు; తారు= తాము; వీక్షించినవారలన్= చూచినవాళ్లను; నొప్పించి= బాధపెట్టి; వ్రాలువారు= కిందపడిపోతున్నవారు; పదములు= కాళ్లు; తెగిపడ్డ= తెగి కిందపడిన; బాహులన్= చేతులతో (బాహువులతో); పోరి= యుద్ధంచేసి; నిర్మూలిత= మూలమట్టంగా తొలగించబడిన (నరకబడిన); బాహులు+ఐ= చేతులు కలవారై; మ్రొగ్గువారు= ఒరిగి పడుతున్నవాళ్లు;

క్షతములన్= గాయాలలో; రుధిరంబు= రక్తం; చల్లింపన్= చిందింపగా; నిర్ఝరయుత= సెలయేళ్లతో కూడిన; శైలములభంగిన్= కొండలవలె; ఉండువారు= ఉండేవాళ్లు; భ్రాతృ= అన్నదమ్ములు; పుత్త్ర= కొడుకులు; మిత్ర= స్నేహితులు; బంధువుల్= బంధువులు; వీఁగినన్= పరువెత్తిపోతుంటే; అడ్డము+అరుదెంచి= అడ్డం వచ్చి; అణఁగువారు= అంతమైపోతున్నవాళ్లు; వాహనములు= రథం, గుర్రం మొదలైన వాహనాలు; తెగినన్= ధ్వంసమైపోగా; వడిన్= వెంటనే; అన్యవాహన+అధిష్ఠులు+ అగుచున్= వేరే వాహనాలపై ఎక్కిన వారవుతూ; ఎదిరి= ఎదుర్కొని; త్రెళ్లువారు= మరణిస్తున్నవారు.

**తా :** శ్రీకృష్ణుడు అలా విజృంభించడంతో, పొడవైనబాణాలు గుచ్చుకుని ఒక్కసారిగా పదిమంది, ఐదుమంది కుప్పగా కూలుతున్నారు. కొంతమంది తలలు తెగి నేలమీద పడుతున్నారు. అలాంటివారు మునుపు తాము చూచినవాళ్లను గాయపరచి కూలిపోతున్నారు. కాళ్లు తెగి పడుతున్నారు. చేతులతో పోరాడి, అవి కూడా తెగిపోగా, మరణిస్తున్నారు. గాయాలనుండి రక్తం చిమ్ముతూ ఉండగా కొంతమంది సెలయేళ్లతో కూడిన కొండలవలె ఉన్నారు. అన్నదమ్ములు, కొడుకులు, స్నేహితులు, బంధువులు పరువెత్తి పోతున్నారు. కొందరు అడ్డం వచ్చి చచ్చిపోతున్నారు. గుర్రాలు, ఏనుగులువంటి వాహనాలు కుప్పకూలగా, కొందరు వెంటనే వేరే వాహనాలెక్కి ఎదిరించి మరణిస్తున్నారు.

**వ. మఱియును. 1569**

**ప్రతి :** మఱియును= ఇంకా...

**తా :** ఇంతేకాకుండా ఇంకా

**శా. ఈ కాయంబులఁ బాసినంతటనె మా కెగ్గేమి? జేతృత్వమున్**
**నీకుం జెల్లదు కృష్ణ! నిర్జరులమై నిన్నోర్తు మామీఁదటన్**
**వైకుంఠంబున నంచుఁ బల్కుక్రియ దుర్వారాస్త్రభిన్నాంగులై**
**యాకంపింపక కొంద ఱాడుదురు గర్వాలాపముల్ కృష్ణునిన్. 1570**

**ప్రతి :** కృష్ణ= ఓ కృష్ణా!; ఈ కాయంబులన్= ఈ శరీరాలను; పాసినంతటన్+ఎ= వదలిపెట్టినంతమాత్రాన; మాకు(న్); ఎగ్గు+ఏమి= కీడు ఏముంది?; జేతృత్వమున్= గెలుపు; నీకున్= నీకు; చెల్లదు= దక్కదు; నిర్జరులము+ఐ= మేము దేవతలమై; ఆమీఁదటన్= ఆపై; వైకుంఠంబునన్= వైకుంఠంలో; నిన్నున్= నిన్ను; ఓర్తుము(ఓర్చుదుము)= ఓడిస్తాము; అంచున్= అంటూ; పల్కుక్రియన్= పలికినవిధంగా; దుర్వార+అస్త్ర= ఎదిరించడానికి వీలుకాని అస్త్రాలచే; భిన్న= నరుకబడిన; అంగులు+ఐ= అవయవాలు కలవారై; ఆకంపింపక= చలించకుండా; కొందఱు= కొంతమంది; గర్వ+ఆలాపముల్= పొగరుమాటలను; కృష్ణునిన్= కృష్ణుని ఉద్దేశించి; ఆడుదురు= పలుకుతున్నారు.

**తా :** కొంతమంది శరీరాలు తెగి నేలమీదపడినా పొగరుగా వదరుతున్నారు; 'కృష్ణా, ఈ శరీరాలను విడిచి చచ్చినంత మాత్రాన మాకు నష్టమేముంది? గెలుపు నీకు దక్కదు; మేము దేవతలమై నిన్ను వైకుంఠంలో ఓడిస్తాము – అంటూ పలుకుతున్నారు.

**వ. ఇ వ్విధంబున. 1571**

**ప్రతి :** ఈ విధంబునన్= ఈ రీతిలో...

**తా :** ఈ విధంగా

**క. జగదీశ! యేమి సెప్పుదు?, నగణితలయవార్ధిభయదమై మూఁగిన య**
**మ్మగధేశుబలము నెల్లను, దెగఁ జూచిరి హరియు హలియుఁ దీవ్రక్రీడన్. 1572**

**ప్రతి :** జగత్+ఈశ= లోకేశ్వరుడవైన పరీక్షిన్మహారాజా!; ఏమిచెప్పుదున్= ఏమని చెప్పేది; హరియున్= శ్రీకృష్ణుడు; హలియున్= బలరాముడు; తీవ్రక్రీడన్= తీవ్రమైన క్రీడతో; అగణిత= లెక్కించడానికి వీలుకానంతగా ఉన్న; లయ= ప్రళయకాలంలోని; వార్ధి= సముద్రంవలె; భయదము+ఐ= భయం కలిగించేదై; మూఁగిన= కమ్ముకున్న; ఆ+మగధ+ఈశు= ఆ మగధ రాజైన జరాసంధుని; బలమును+ఎల్లను= సైన్యామంతటినీ; తెగన్+చూచిరి= చంపాలనుకొన్నారు.

**తా :** పరీక్షిన్మహారాజా! ఏమని చెప్పగలను? ప్రళయకాలంలో సముద్రం లెక్కించడానికి వీలుకానంతగా ఎలా పొంగుతుందో, అలా జరాసంధుడి సైన్యం కమ్ముకుంది. అది భయంకరంగా ఉంది. బలరామకృష్ణులు ఇద్దరే విజృంభించిన వీరత్వంతో ఆ సైన్యం యొక్క అంతుచూశారు.

**క. భువనభవస్థితివిలయము, లవలీలం జేయుహరికి నరినాశన మెం**
**త విషయమైన మనుజుఁడై, భవ మొందుటఁ జేసి పొగడఁబడియెం గృతులన్. 1573**

**ప్రతి :** భువన= లోకాలను; భవ= పుట్టించడం; స్థితి= నిలబెట్టడం (కాపాడడం); విలయము(ల్)= నాశనం చేయడం; అవలీలన్+చేయు= అతిసులభంగా చేసే; హరికిన్= శ్రీమహావిష్ణువుకు; అరినాశనము= శత్రువులను నశింపజేయడం; ఎంత విషయము+ఐనన్= ఎంతపెద్దవిషయమైనప్పటికి; మనుజుఁడు+ఐ= మనిషిగా; భవము+ఒందుటన్+చేసి= పుట్టినందువల్ల; కృతులన్= కావ్యాలలో; పొగడన్+పడియెన్= స్తుతించబడినాడు.

**తా :** లోకాలను పుట్టించడం, వాటిఉనికిని కాపాడడం, నాశం చేయడం అనే పనులను శ్రీమహావిష్ణువు అవలీలగా చేయగలడు. అలాంటి మహాశక్తిమంతుడికి శత్రువులను చంపడం పెద్దవిషయమా? అయినా, ఆయన మనిషిగా పుట్టినందువల్ల కావ్యాల్లో అలా ప్రశంసలు పొందినాడు.

**వ. ఆ సమయంబున. 1574**

**ప్రతి :** ఆ సమయంబునన్= ఆ సమయంలో...

**తా :** ఆ సమయంలో ఇలా జరిగింది.

**శా. అంహఃకర్ములు తల్లడిల్ల భయదాహంకారుఁడై సీరి దో**
**రంహం బొప్ప హలాహతిన్ రథధనూరథ్యంబులం గూల్చి త**
**త్సంహారస్పృహఁ జొచ్చి పట్టెను జరాసంధున్ మదాంధున్ మహా**
**సింహంబుం బ్రతిసింహముఖ్యము బలశ్రీఁ బట్టు నేర్పేర్పడన్. 1575**

**ప్రతి :** అంహఃకర్ములు= పాపాలను చేసినవాళ్లు; తల్లడిల్లన్= అల్లలాడిపోగా; భయద+అహంకారుఁడు+ఐ= భయాన్ని కలిగించే గర్వమున్నవాడై; సీరి= బలరాముడు; దో+రంహంబు+ఒప్పన్= చేతులవేగం అతిశయించగా; హల+ఆహతిన్= నాగలిదెబ్బతో; రథ= రథాన్నీ; ధనూ= ధనుస్సులనూ; రథ్యంబులన్= రథానికి పూన్చిన గుర్రాలనూ; కూల్చి= పడవేసి;

తత్+సంహార= ఆ జరాసంధుణ్ణి చంపాలనే; స్పృహన్= కోరికతో; చొచ్చి= చొరబారి; మద+అంధున్= మదంతో కన్నూమిన్నూ కాననివాడైన; జరాసంధున్= జరాసంధుణ్ణి; మహా సింహంబున్= గొప్ప సింహాన్ని; ప్రతిసింహముఖ్యము= సాటి అయిన మరో గొప్పసింహం; బలశ్రీ= బలంయొక్క సమృద్ధితో; పట్టు= పట్టుకునే; నేర్పు+ఏర్పడన్= మెళకువ తెలిసి వచ్చేలాగా; పట్టెన్= పట్టుకున్నాడు.

**తా :** పాపాలు చేసేవాళ్లు అల్లలాడి పోతుండగా బలరాముడు వేగంగా చేతులను తిప్పుతూ భయం కలిగిస్తూ విజృంభిస్తున్నాడు. శత్రువుల రథాలనూ, ధనువులనూ, గుర్రాలనూ, నాగలి దెబ్బలతో కుప్ప కూలుస్తున్నాడు. ఒక మహాసింహాన్ని మరో మహాసింహం మెళకువతో బలసమృద్ధితో పట్టుకున్నట్లుగా, పొగరెక్కి కన్నూమిన్నూ కానని జరాసంధుణ్ణి బలరాముడు పట్టుకున్నాడు.

**వ. ఇట్లు పట్టుకొని. 1576**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; పట్టుకొని...

**తా :** ఈ విధంగా పట్టుకుని

**ఉ. కుంఠితులై పరుల్ బెగడ ఘోరబలుండు బలుండు వాని సో**
**ల్లుంఠము లాడుచున్ దిగిచి లోకభయంకరమైనముష్టిచేఁ**
**గంఠగతాసుఁ జేసి తమకంబున మొత్తఁగ భూభరక్షయో**
**త్కంఠుఁడు చక్రి మీఁ దెఱిఁగి కార్యము గల్దని మాన్పి యిట్లనున్. 1577**

**ప్రతి :** కుంఠితులు+ఐ= భంగపడినవారై; పరుల్= శత్రువులు; బెగడన్= భయపడగా; ఘోరబలుండు= భయం కలిగించేటంత బలవంతుడైన; బలుండు= బలరాముడు; వాని= ఆ జరాసంధునిగూర్చి; స+ఉల్లుంఠములు= ఉపాలంభంగా పలికేవాక్యాలు (తప్పులు ఎత్తిచెప్పి నిందించటం); ఆడుచున్= మాట్లాడుతూ; తిగిచి= కిందికి లాగి; లోకభయంకరము+ఐన= లోకాలకు భయం పుట్టించేదైన; ముష్టిచేన్= పిడికిటిదెబ్బతో; కంఠగత+అసున్+చేసి= కంఠంలో ప్రాణం ఉన్నవాణ్ణిగా చేసి;తమకంబునన్= వేగంతో; మొత్తఁన్+కన్= కొట్టగా; భూభర క్షయ+ఉత్కంఠుఁడు= భూమిభారాన్ని తొలగించాలనే మిక్కిలి ఆసక్తి కలిగినవాడైన; చక్రి= సుదర్శనమనే చక్రాన్ని దాల్చిన శ్రీకృష్ణుడు; మీఁదు+ఎఱిఁగి= ముందు జరగాల్సిన పనులను గుర్తించి; కార్యము+కల్దని (కల్దు+అని)= ఇంకా వీడివలన జరగాల్సిన పని ఉందని; మాన్పి= చంపే ఆలోచనను మాన్పించి; ఇట్లు+అనున్= ఇలా అన్నాడు.

**తా :** భయం కలిగించేటంతటి బలమున్న బలరాముని శౌర్యానికి శత్రువులు చెల్లాచెదరై భయపడి పారిపోయారు. బలరాముడు జరాసంధుణ్ణి ఎత్తిపొడుపు మాటలతో కిందపడవేసి లాగి, భయంకరమైన పిడికిటిపోటు పొడిచాడు. ఆ దెబ్బకు వాడిప్రాణం కంఠంలో నిలిచింది. భూభారాన్ని తగ్గించాలనే ఆసక్తి ఉన్నవాడు, తర్వాత జరగాల్సిన పనుల గురించి ఆలోచించినవాడు అయిన శ్రీకృష్ణుడు ఇపుడే ఈ జరాసంధుణ్ణి చంపరాదు. వీడితో ఇంకా కొంతపని ఉంది అనుకొని వాణ్ణి చంపే ప్రయత్నాన్ని మాన్పించి ఇలా అన్నాడు.

**విశే :** బలరాముడు ఇంకొక్క పిడికిటిపోటు పొడిస్తే జరాసంధుడు మరణిస్తాడు. కానీ, అలా అపుడే వాడు చావరాదని కృష్ణుడు భావించాడు. 'చక్రి మీ దెరిగి' అనడంలో భావికథాసూచన ఉంది. జరాసంధునిమరణం ఏ విధంగా జరగాలో శ్రీకృష్ణునికి

తెలుసు. అందుచేత, ఇక్కడ మరణానికి చేరువలో ఉన్నవాడిని గట్టెక్కించాడు. 'మాన్పి' అంటే చంపడాన్ని మానిపించా దని అర్థం. (జరాసంధుని మరణం భీమునిచేతిలో జరుగుతుంది)

**శా. దుఃఖింపం బనిలేదు; పొమ్ము; బలసందోహంబులం దెమ్ము; చే**
**తఃఖేదం బెడలంగ రమ్ము; రిపులం దండింపు; కాదేని భూ**
**స్వఃఖేలజ్జన మెల్ల మెచ్చ నృప! నీ శౌర్యోన్నతుల్ సూపి మే**
**దఃఖండంబులు భూతముల్ దినఁ దనుత్యాగంబు సేయం దగున్. 1578**

**ప్రతి :** నృప= రాజా! జరాసంధా!; దుఃఖింపన్= ఏడువవలసిన; పనిలేదు= అవసరం లేదు; పొమ్ము= వెళ్లు; బలసందోహంబులన్= నీ సేనా సమూహాలను; తెమ్ము= తీసుకుని రా; చేతః+ఖేదంబు= మనసులోని దిగులు; ఎడలన్+కన్= పోయిన తర్వాత; రమ్ము= మళ్లీ రా; రిపులన్= శత్రువులను; దండింపు(ము)= శిక్షించుము; కాదు+ఏనిన్= అలా కాని పక్షంలో; భూ+స్వః= భూమిపైనా, స్వర్గంలోనూ; ఖేలత్= తిరుగుతూ ఉన్న; జనము+ఎల్లన్= జనమంతా; మెచ్చన్= పొగడునట్లు; నీ= నీలోని; శౌర్య+ఉన్నతుల్= శౌర్యంయొక్క అతిశయాలు; చూపి= చూపించి; మేదః+ఖండంబులు= నీ మెదడు ముక్కలు (మాంసఖండాల్ని); భూతముల్= పిశాచాలు; తినన్= తినేట్లుగా; తనుత్యాగంబు= శరీరాన్ని త్యజించటం; చేయన్+తగున్= చేయదగును.

**తా :** రాజా! జరాసంధా! దీనికి నీవేమీ ఏడువవలసిన అవసరం లేదు. వెళ్లు. నీ సైన్యసమూహాన్ని తీసుకుని రా! నీ మనసులో దిగులు తీరిన తరువాత రా! వచ్చి, శత్రువులను శిక్షించు. అలా కాని పక్షంలో భూమిపైనా, స్వర్గంలోనూ తిరిగే జనమంతా మెచ్చుకునేలాగా నీ ప్రతాపాన్ని చూపించి, నీ తలపగిలి మెదడులోని మాంసఖండాలను పిశాచాలు తినేలా నీ శరీరాన్ని వదిలిపెట్టు. అది చేయదగిన పని.

**వ. అని నగుచు విడిపించిన, చిడిముడికి నగ్గలం బయిన సిగ్గున గ్రుగ్గి నెఱ్ఱమొగంబు సూపక, కోప కపట భావంబులు మనంబునం బెనంగొనఁ దపంబు చేసియైన వీరలం జయించెద నని, పలాయితులైన రాజులం గూడుకొనుచు జరాసంధుఁడు విఱిగి చనియె; సురలు గుసుమవర్షంబులు గురియ హలియు హరియును మథురానగరజనవందిమాగధజేగీయమానులై వీణావేణుమృదంగశంఖదుందుభినినదంబు లాకర్ణించుచు, మృగమదజలసిక్తవిమలవీథికాశతంబును, వివిధవిచిత్రకేతనాద్యలంకృతంబును, సువర్ణమణిమయజయస్తంభ నిబద్ధతోరణసంయుతంబును, వేదనాదనినాదితంబును, సంతుష్టజన సంకులగోపురంబును నైన పురంబును బ్రవేశించి రందు. 1579**

**ప్రతి :** అని= ఇలా అని; నగుచున్= నవ్వుతూ; విడిపించినన్= విడిచిపుచ్చగా; చిడిముడికిన్= తొట్రుపాటుకంటె; అగ్గలంబు+ఐన= ఎక్కువైన; సిగ్గునన్= సిగ్గుతో; గ్రుగ్గి= కుమిలిపోయి; నెఱి+మొగంబున్= కుటిలమైన ముఖాన్ని; చూపక= చూపించలేక; కోప= కోపానికి చెందిన; కపట= మోసానికి చెందిన; భావంబులు= భావాలు; మనంబునన్= మనస్సులో; పెనన్+కొనన్= అల్లుకోగా; తపంబు= తపస్సు; చేసి+ఐనన్= చేసి అయినా; వీరలన్= వీళ్లను (బలరామకృష్ణుల్ని); జయించెదను+అని= గెలుస్తానని; పలాయితులు+ఐన= పారిపోయిన; రాజులన్= రాజులను; కూడుకొనుచున్= కలుపుకుంటూ; జరాసంధుఁడు=

జరాసంధుడు; విఱిగి= ఓడి; చనియెన్= పోయాడు; సురలు= దేవతలు; కుసుమవర్షంబులు= పూలవానలు; కురియన్= కురిపించగా; హలియున్= బలరాముడూ; హరియును= శ్రీకృష్ణుడూ; మధురానగర= మధురానగరంలోని; జన= పౌరులచే; వంది= వందిమాగధులచే; జేగీయమానులు+ఐ= జేజేలను పొందినవారై; వీణా= వీణ; వేణు= పిల్లనగ్రోవి; మృదంగ= మద్దెల; శంఖ= శంఖం; దుందుభి= నగారాలయొక్క; నినదంబులు= శబ్దాలను; ఆకర్ణించుచున్= వింటూ; మృగమద= కస్తూరికలిపిన; జలసిక్త= నీళ్లచే తడుపబడిన (కస్తూరినీళ్లతో కళ్లాపి చల్లిన); విమల= శుభ్రమైన; వీథికాశతంబును= వందలకొద్దీ వీథులను కలిగింది; వివిధ= రకరకాల; విచిత్ర= ఆశ్చర్యకరమైన; కేతన= పతాకలు; ఆది= మొదలైన వాటిచే; అలంకృతంబును= అలంకరించబడింది; సువర్ణ= బంగారంతో; మణి= మణులతో; మయ=కూడిన; జయస్తంభ= గెలుపును ప్రకటించే స్తంభాలకు; నిబద్ధ= కట్టబడిన; తోరణ= తోరణాలతో; సంయుతంబును= కూడింది; వేద= వేదాల; నాద= ధ్వనితో; నినాదితంబును= మారుమోగుతున్నది; సంతుష్ట= తృప్తి పొందిన; జన= ప్రజల; సంకుల= కలకలమున్న; గోపురంబునున్= గోపుర ద్వారం కలది; అయిన= అయినట్టి; పురంబును= పురాన్ని; ప్రవేశించిరి= చొచ్చారు; అందున్= అక్కడ...

**తా :** అలా నవ్వుతూ జరాసంధుణ్ణి శ్రీకృష్ణుడు విడిచి పుచ్చాడు. జరాసంధుడికి చెప్పరాని తడబాటు, విసుగు, సిగ్గు మనసులో అల్లుకున్నాయి. ముఖం చూపలేక పోయాడు. కోపమూ, వంచనా రెండూ పెనవేసుకొన్నాయి. తపస్సు చేసైనా సరే వీళ్లను జయిస్తాననుకొన్నాడు. పారిపోతున్న రాజులను కలుసుకుని అతడు వెనుతిరిగి పోయాడు. ఆ సమయంలో దేవతలు బలరామకృష్ణులమీద పూలవాన కురిపించారు. మధురానగరంలోని పౌరులు, వందిమాగధులు వారిని కీర్తించారు. వీణ, వేణువు, మద్దెల, శంఖం, దుందుభి వంటి వాద్యాల సందడిని వింటూ, కస్తూరి కలిపిన నీళ్లతో శుభ్రంచేసిన వందల కొద్దీ వీథులుకలది, రకరకాలచిత్రమైనజండాలతో అలంకరింపబడింది, బంగారుతోనూ, రత్నాలతోనూ నిండిన జయస్తంభాలకు తోరణాలు కట్టబడింది, వేదనాదాలతో ధ్వనించేది, జనసమ్మర్దముండే గోపురద్వారం కలది అయిన మధురానగరంలో బలరామకృష్ణులు ప్రవేశించారు.

**ఉ. వెల్లువలైన వైరినృపవీరుల నెల్ల జయించి వీటికిన్**
**బల్లిదులైన కృష్ణబలభద్రులు వచ్చుచు నున్నవారు రం;**
**దుల్లములారఁ జూత మని యున్నతసౌధము లెక్కి వారిపైఁ**
**బల్లవపుష్పలాజములు పౌరపురంధ్రులు సల్లి రెల్లెడన్. 1580**

**ప్రతి :** వెల్లువల్+ఐన= వరదలాగా ఉబికి వస్తున్న; వైరినృప వీరులన్+ఎల్లన్= శత్రురాజుల నందరినీ; జయించి= గెలిచి; వీటికిన్= నగరానికి; బల్లిదులు+ఐన= బలవంతులైన; కృష్ణ బలభద్రులు= శ్రీకృష్ణబలరాములు; వచ్చుచున్+ఉన్నవారు= వస్తూ ఉన్నారు; ఉల్లములు+ఆరన్= మనసారా; చూతము(చూచుదము)= చూద్దాము; రండి; అని= అంటూ; ఉన్నత= ఎత్తైన; సౌధములు+ఎక్కి= మేడలపైకి ఎక్కి; వారిపై= ఆ ఇద్దరిమీద; పల్లవ= చిగురాకులను; పుష్ప= పువ్వులను; లాజములన్= పేలాలను, సేసలను; పౌరపురంధ్రులు= పురస్త్రీలు; ఎల్లన్+ఎడన్= అంతటా; చల్లిరి= చల్లినారు.

**తా :** 'శత్రువులు వెల్లువలాగా ఉబికి వస్తుంటే, ఆ శత్రువీరులనందరినీ జయించి, నగరానికి తిరిగి వస్తున్నారు. మహా బలవంతులైన ఆ బలరామకృష్ణులను చూద్దాం రండి' అని ఆ పురస్త్రీలు ఎత్తైన మేడల నెక్కి ఆ ఇద్దరిమీద చిగురాకులను, పువ్వులను, పేలాలు, సేసలను చల్లినారు.

## ✤ కాలయవనుండు శ్రీకృష్ణుని మీఁద దండెత్తి మథురాపురమును ముట్టడి వేయుట ✤

**వ. ఇట్లు పురంబు ప్రవేశించి యుద్ధప్రకారం బెల్ల నుగ్రసేనున కెఱింగించి కృష్ణం డిచ్ఛావిహారంబుల నుండె; మఱియు నెక్కువమత్సరంబున నమ్మాగధుండు మహీమండలంబునం గల దుష్టమహీపతుల నెల్లం గూడికొని సప్తదశవారంబులు సప్తదశాక్షౌహిణీబలసమేతుండై మథురానగరంబుపై విడిసి, మాధవభుజా ప్రకారరక్షితులగు యాదవులతోడ నాలంబు సేసి, నిర్మూలితబలుండై పోయి క్రమ్మఱ నష్టాదశయుద్ధంబునకు వచ్చునెడం గలహవిద్యావిశారదుం డగు నారదుండు కాలయవను కడకుం జని యిట్లనియె. 1581**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; పురంబు= పట్టణంలో; ప్రవేశించి; యుద్ధప్రకారంబు+ఎల్లన్= యుద్ధం ఎలా జరిగిందీ, ఏమిటి అనే విషయాలన్నిటినీ; ఉగ్రసేనునకున్= ఉగ్రసేనమహారాజుకు; ఎఱింగించి= తెలియజేసి; కృష్ణుండు= శ్రీకృష్ణుడు; ఇచ్ఛావిహారంబులన్= యథేచ్ఛా విహారాలతో; ఉండెన్= ఉండినాడు; ఆ+మాగధుండు= ఆ జరాసంధుడు; మఱియున్= ఇంకా; ఎక్కువ= చాలా; మత్సరంబునన్= క్రోధంతో; మహీమండలంబునన్+కల= భూమండలంలో ఉండే; దుష్ట మహీపతులన్+ఎల్లన్= దుర్మార్గులైన రాజులనందరినీ; కూడుకొని= కలుపుకుని; సప్తదశవారంబులు= పదిహేడుసార్లు; సప్తదశ+అక్షౌహిణీ= పదిహేడు అక్షౌహిణుల సేనతో; సమేతుఁడు+ఐ= కూడినవాడై; మథురానగరంబుపైన్= మథురానగరం మీదికి; విడిసి= దండెత్తి; మాధవ= శ్రీకృష్ణునియొక్క; భుజప్రాకార రక్షితులు+అగు= భుజాలనే కోటలచే రక్షించబడుతున్న; యాదవులతోడన్= యాదవులతో; ఆలంబు చేసి= యుద్ధంచేసి; నిర్మూలిత= పూర్తిగా తొలగించబడ్డ; బలుండు+ఐపోయి= బలం కలవాడై పోయి; క్రమ్మఱన్= మళ్లీ; అష్టాదశ= పదునెనిమిదవ రోజు; యుద్ధంబునకున్= యుద్ధానికి; వచ్చు(వచ్చు+న్+ఎడన్)+ఎడన్= వచ్చేటపుడు; కలహవిద్యావిశారదుండు+అగు= వ్యక్తులమధ్యకలహాలను కల్పించడంలో ప్రవీణుడైన; నారదుండు= నారదుడు; కాలయవనుకడకున్+చని= కాలయవనునివద్దకు వెళ్లి; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** ఈ విధంగా బలరామకృష్ణులు మథురలోకి ప్రవేశించారు. యుద్ధం జరిగిన పద్ధతిని గురించి శ్రీకృష్ణుడు ఉగ్రసేన మహారాజుకు చెప్పి తాను యథేచ్ఛగా విహరిస్తూ ఉండినాడు. కానీ, జరాసంధుడు మిక్కిలి క్రోధంతో లోకంలో ఉండే దుర్మార్గులైన రాజులను సమకూర్చుకుని పదిహేడుసార్లు పదిహేడు అక్షౌహిణుల సైన్యాన్ని తీసుకుని మథురపై దండెత్తాడు. శ్రీకృష్ణుడు కోటలాంటి తన భుజశక్తితో కాపాడుతున్నయాదవులతో జరాసంధుడు యుద్ధం చేశాడు. ఉన్న బలమంతా ఊడ్చిపెట్టుకు పోయింది. మళ్లీ పదునెనిమిదవసారి యుద్ధానికి వస్తున్నాడు. ఆ సమయంలో కలహాలు పెట్టడం అనే విద్యలో ప్రవీణుడైన నారదుడు కాలయవనునివద్దకువెళ్లి ఇలా అన్నాడు.

**మ. యవనా! నీవు సమస్తభూపతుల బాహాఖర్వగర్వోన్నతిం**
**బవనుం డభ్రములన్ హరించుపగిదిన్ భంజించియు న్నేల యా**
**దవులన్ గెల్వవు? వారలన్ మఱచియో? దర్పంబు లేకుండియో?**
**యవివేకస్థితి నొందియో? వెఱచియో? హైన్యంబునుం జెందియో? 1582**

**ప్రతి :** యవనా= ఓ కాలయవనా!; నీవు; సమస్త భూపతుల= రాజులందరియొక్క; బాహా+అఖర్వ= చేతులయొక్క అధికమైన; గర్వ+ఉన్నతిన్= గర్వాతిశయంచే; పవనుండు= గాలి; అభ్రములన్= మేఘాలను; హరించు పగిదిన్= చెదరగొట్టే విధంగా; భంజించియున్= సంహరించి కూడా; ఏల= ఎందుకు; యాదవులన్= యాదవులను; గెల్వవు= జయించవు? వారలన్=

వాళ్లను; మరచి+ఓ= మరచిపోవడం వల్లనా?; దర్పంబు= వీరత్వం; లేకుండి+ఓ= లేనందువల్లనా?; అవివేక స్థితిన్= తెలివి తక్కువ స్థితిని; ఒంది+ఓ= పొందడంవల్లనా; వెఱచి+ఓ= భయపడడం వల్లనా?; హైన్యంబునున్= అల్పత్వాన్ని; చెంది+ఏ= పొందడం వల్లనా? (ఎందుకు అర్థం కావడం లేదు అని భావం).

**తా :** యవనా! నీవు నీ తిరుగులేని బాహుబలగర్వంతో లోకంలోని రాజులనందరినీ జయించావు. మబ్బులను గాలి ఎలా ఎగుర గొడుతుందో అలా వారిని నాశం చేశావు. అలాంటి నీవు ఎందుకు యాదవులను గెలవడం లేదు? వాళ్లను మరచిపోయావా? లేక ఆ మాత్రం శౌర్యం లేదా? తెలివి తక్కువ స్థితిలో ఉన్నావా? భయపడ్డావా? అల్పత్వాన్ని పొందావా? ఏమో తెలియదుమరి!

**క.** **యాదవులలోన నొక్కఁడు, మేదినిపై సత్త్వరేఖ మెఱసి జరాసం**
**ధాదులఁ దూలన్ దోలెన్, దాదృశుఁ డిల లేఁడు వినవె తత్కర్మంబుల్.** **1583**

**ప్రతి :** యాదవులలోనన్= యాదవులలో; ఒక్కఁడు= ఒకడు; మేదినిపై= ఈ నేలపై; సత్త్వరేఖన్= బలాతిశయంతో; మెఱసి= వెలుగొంది; జరాసంధ+ఆదులన్= జరాసంధుడు మొదలైనవారిని; తూలన్= తొలగిపోయేటట్లు; తోలెన్= తోలాడు; తాదృశుడు= అలాంటి వాడు; ఇలన్= భూమిపై; లేడు; తత్+కర్మంబుల్= వాడు చేసే పనులగురించి (చెపుతాను); వినవు+ఎ= వినవయ్యా!

**తా :** యాదవులలో ఒకడున్నాడు. వాడు గొప్పబలంతో ఈ భూమిపై వెలిగిపోతున్నాడు. జరాసంధుడు మొదలైన రాజులను తొలగదోలాడు. అలాంటివాడు ఇంకొకడు ఈ నేలపై లేడు. వాడు చేస్తున్నపనులగురించి చెపుతాను. వినవయ్యా!

**వ.** **అనిన విని, కాలయవనుం డిట్లనియె.** **1584**

**ప్రతి :** అనినన్= అనగా; విని; కాలయవనుడు; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** అలా నారదుడు చెప్పగా విని కాలయవనుడు ఇలా అన్నాడు.

**శా.** **ఏమీ! నారద! నీవు చెప్పిననరుం డే రూపువాఁ? డెంతవాఁ?**
**డే మేరన్ విహరించు? నెవ్వఁడు సఖుం? డెందుండు? నేపాటి దో**
**స్సామర్థ్యంబునఁ గయ్యముల్ సలుపు? నస్మద్బాహుశౌర్యంబు సం**
**గ్రామక్షోణి భరించి నిల్వఁగలఁడే? గర్వాఢ్యుఁడే? చెప్పుమా!** **1585**

**ప్రతి :** నారద= నారదా!; ఏమీ= ఏమన్నావు?; నీవు చెప్పిన= నీవు చెప్తున్నట్టి; నరుండు= ఆ మనిషి; ఏ రూపువాఁడు= ఎలాంటి రూపంలో ఉంటాడు!; ఎంతవాఁడు= ఎంతటివాడు?; ఏమేరన్= ఏ పద్ధతిలో; విహరించున్= వ్యవహరిస్తాడు? ఎవ్వఁడు సఖుండు= అతనికి మిత్రుడు ఎవ్వడు?; ఎందున్+ఉండున్= ఎక్కడ ఉంటాడు?; ఏ పాటి= ఎంతమాత్రం; దోస్+సామర్థ్యంబునన్= భుజబలంచేత; కయ్యముల్= యుద్ధాలను; సలుపున్= చేస్తాడు; అస్మత్= నా యొక్క; బాహుశౌర్యంబున్= బాహుపరాక్రమాన్ని; సంగ్రామక్షోణిన్= యుద్ధభూమిలో; భరించి= తట్టుకుని; నిల్వన్+కలడు+ఏ= నిలువగలడా?; గర్వ+ఆఢ్యుఁడే= గర్వసమృద్ధి కలవాడేనా?; చెప్పుమా= చెప్పండి.

**తా :** నారదా! ఏమన్నావు? నీవు చెప్పుతున్నావే ఆ మనిషి ఏ రూపంలో ఉంటాడు? ఎంతటివాడు? ఏ తీరుగా అతడు ప్రవర్తిస్తాడు? యుద్ధాలు చేయడంలో భుజబలం ఏ మాత్రం ఉంటుంది? యుద్ధభూమిలో నా బాహుబల శౌర్యాన్ని తట్టుకొని నిలవగలడా? గర్వసమృద్ధి కలవాడేనా?; చెప్పు!

**వ. అనిన విని, దేవముని యిట్లనియె. 1586**

**ప్రతి :** అనినన్= అనగా; విని; దేవముని= నారదుడు; ఇట్లు= ఇలా; అనియెన్= అన్నాడు.

**తా :** అలా కాలయవనుడు అడుగగా, దానికి బదులుగా దేవముని నారదుడు ఇలా అన్నాడు.

**సీ. నీలజీమూతసన్నిభశరీరమువాఁడు తామరసాభనేత్రములవాఁడు**
**పూర్ణేందుబింబంబుఁ బోలెడి మోమువాఁ డున్నతదీర్ఘబాహువులవాఁడు**
**శ్రీవత్సలాంఛనాంచితమహోరమువాఁడు కౌస్తుభమణిపదకంబువాఁడు**
**శ్రీకర పీతకౌశేయచేలమువాఁడు మకరకుండలదీప్తి మలయువాఁడు**

**తే. రాజ! యింతంతవాఁ డనరానివాఁడు, మెఱసి దిక్కుల నెల్లను మెఱయువాఁడు**
**తెలిసి యే వేళ లందైన నఁ దిరుగువాఁడు, పట్టనేర్చినఁ గాని లోఁబడనివాఁడు. 1587**

**ప్రతి :** రాజ= ఓ యవనరాజా!; అతడు= ఆ వ్యక్తి; నీల= నల్లని; జీమూతసన్నిభ= మేఘంవంటి; శరీరము వాఁడు= దేహం కలవాడు; తామరస+అభ= తామరపూల వంటి కాంతిమంతమైన; నేత్రములవాఁడు= కండ్లుగలవాడు; పూర్ణ+ఇందు బింబంబున్= నిండుచంద్రబింబాన్ని; పోలెడి= పోలిన; మోమువాఁడు= ముఖం కలవాడు; ఉన్నత= ఎత్తైన; దీర్ఘ= పొడవైన; బాహువులవాఁడు= చేతులు కలవాడు; శ్రీవత్సలాంఛన= శ్రీవత్సం అనే పుట్టుమచ్చగుర్తుతో; అంచిత= సుందరమై ఉన్న; మహా+ఉరమువాఁడు= విశాలమైనవక్షము కలవాడు; కౌస్తుభమణి= కౌస్తుభమనే మణి ఉన్న; పదకంబువాఁడు= పతకం ఉన్నవాడు; శ్రీకర= శుభం కలిగించే; పీత= పసుపు పచ్చని; కౌశేయ చేలమువాఁడు= పట్టువస్త్రాన్ని తాల్చినవాడు; మకరకుండలదీప్తిన్= మొసలిఆకారంలో ఉన్న చెవికుండలాలవెలుగుతో; మలయువాఁడు= ఒప్పుతుండేవాడు; ఇంత+అంత+వాఁడు= ఇంత గొప్పవాడు, అంత గొప్పవాడు అని; అనరానివాఁడు= చెప్పడానికి సాధ్యం కానివాడు; మెఱసి= ప్రకాశించి; దిక్కులన్+ఎల్లను= అన్నిదెసలలోను; మెఱయువాఁడు= వెలిగేవాడు; తెలిసి= తెలుసుకొని; ఏ వేళల+అందున్+ఐనన్= ఏ సమయాల్లోనైనా సరే; తిరుగువాఁడు= సంచరించేవాడు; పట్టనేర్చినన్+కాని= ఎలా పట్టుకోవాలో నేర్చి ఉంటేతప్ప; లోన్+పడనివాఁడు= దొరకనివాడు.

**తా :** ఓ యవనరాజా! ఆయన నల్లనివానమబ్బువంటి శరీరం ఉన్నవాడు. తామరపూలవంటి కాంతిమంతమైన; కండ్లున్నవాడు; నిండుచందమామవంటి గుండ్రనిముఖం ఉన్నవాడు; ఎత్తైన, పొడవైన చేతులున్నవాడు; శ్రీవత్సమనే పుట్టుమచ్చతో అందంగా ఉన్నవిశాలవక్షఃస్థలం కలవాడు. కౌస్తుభమణిని పతకంగా ధరించినవాడు. వైభవోపేతమైన పసుపుపచ్చని పట్టువస్త్రాన్ని తాల్చిన వాడు; మొసలి ఆకారంలో ఉండే చెవి కుండలాలతో ప్రవేశిస్తుండేవాడు. అతడు ఇంతటివాడు, అంతటివాడు అని చెప్పడానికి వీలుకానివాడు. అన్నిదిక్కులలో నిండి ప్రకాశించేవాడు. ఏ సమయంలో ఏమి చేయాలో తెలిసి ప్రవర్తించేవాడు. ఎంతో నేర్పు ఉండి అతణ్ణి ఎలా పట్టుకోవాలో తెలిస్తే తప్ప పట్టుబడేవాడు కాడు.

**విశే :** "పట్ట నేర్చిఁగాని లోఁబడని వాడు" అనేమాట శ్రీకృష్ణుణ్ణి భక్తితోమాత్రమే పట్టుకోవచ్చుననే సూచన ఉంది.

**వ. అని మఱియు నతనిలక్షణంబులు చెప్పిన విని, సరకుసేయక యవనుం డిట్లనియె. 1588**

**ప్రతి :** అని= ఈ విధంగా చెప్పి; మఱియున్= ఇంకా; అతని= శ్రీకృష్ణుని; లక్షణంబులు= గుర్తులు; చెప్పినన్= చెప్పగా; విని= ఆలకించి; సరకుసేయక= లక్ష్యపెట్టక; యవనుండు= కాలయవనుడు; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తా :** ఈ విధంగా చెబుతూ నారదుడు శ్రీకృష్ణుణ్ణి గురించి ఇంకా వివరంగా వర్ణించి చెప్పాడు. అంతా వినికూడా కాలయవనుడు ఆ మాటలను లక్ష్యపెట్టకుండా, నారదునితో ఇలా అన్నాడు.

**ఉ. యాదవుఁ డెంతవాఁడు ప్రళయాంతకుఁ డైన నెదిర్చె నేనియున్**
**గాదనఁ బోర మత్కలహకర్కశబాహుధనుర్విముక్త నా**
**నా దృఢహేమపుంఖకఠినజ్వలదస్త్రపరంపరాసము**
**త్పాదితవహ్నికీలముల భస్మముఁ జేసెదఁ దాపసోత్తమా! 1589**

**ప్రతి :** తాపస+ఉత్తమా= మునిపుంగవా!; యాదవుఁడు= యాదవుడైన శ్రీకృష్ణుడు; ఎంతవాఁడు= ఏ మాత్రంవాడు?; ప్రళయ+అంతకుఁడు+ఐనన్= ప్రళయకాలంలో వచ్చే యముడే ఐనా సరే; ఎదిర్చెన్+ఏనియున్= ఎదిరించాడంటే మాత్రం; కాదనన్= కాదు అని చెప్పను; పోరన్= యుద్ధంలో; మత్+కలహ= నాతో జరిపే పోరులో; కర్కశ= కఠినమైన; బాహు= భుజబలం ఆధారంగా; ధనుస్+విముక్త= విల్లునుండి వదలబడ్డ; నానా= రకరకాల; దృఢ= గట్టియైన, హేమ= బంగారు; పుంఖ= పింజలు ఉండి; కఠిన= కఠోరంగా; జ్వలత్= మండుతున్న; అస్త్ర పరంపరా= బాణాలవరసతో; సముత్పాదిత= పుట్టింపబడిన; వహ్నికీలములన్= అగ్నిజ్వాలలతో; భస్మమున్= బూడిదను; చేసెదన్= చేస్తాను.

**తా :** నారదా! ఈ యాదవుడనగా ఎంతటివాడు? ప్రళయకాలంలోని యముడే అయినా సరే, నన్ను ఎదిరిస్తే నేను చేత కాదని చెప్పను. యుద్ధం చేస్తాను. నా కర్కశహస్తాలు ధరించిన ఈ ధనుస్సు నుంచి రకరకాల బాణాలను ప్రయోగిస్తాను. అవి బంగారు పింజలు ఉండే బాణాలు. వాటినుంచి వెలువడే అగ్నిజ్వాలలతో అతణ్ణి - బూడిద చేస్తాను.

**వ. అని పలికి కాలయవనుండు మూఁడుకోట్లమ్లేచ్ఛవీరులం గూడుకొని, శీఘ్రగమనంబున దాడివెడలి, మథురాపురంబుమీఁద విడిసినం జూచి, బలభద్రసహితుం డయి కృష్ణుం డిట్లని వితర్కించె. 1590**

**ప్రతి :** అని= ఈ విధంగా; పలికి= చెప్పి; కాలయవనుండు= ఆ కాలయవనుడు; మూఁడుకోట్ల= మూడుకోట్లమంది; మ్లేచ్ఛవీరులన్= ద్వీపాంతరంనుండి వచ్చిన దుష్టవీరులను; కూడుకొని= కలుపుకుని; శీఘ్రగమనంబునన్= చాలావేగంగా ప్రయాణిస్తూ; దాడి వెడలి= దాడి (దండయాత్ర) చేస్తూ; మథురాపురంబుమీఁదన్= మథురానగరంపై; విడిసినన్= విడిది చేయగా; చూచి; బలభద్రసహితుండు+అయి= బలరామునితో కూడినవాడై; కృష్ణుండు= శ్రీకృష్ణుడు; ఇట్లు+అని= ఈ విధంగా; వితర్కించెన్= ఆలోచించాడు.

**తా :** కాలయవనుడు ఇలా నారదునితో అన్నాక, మూడుకోట్లమంది మ్లేచ్ఛవీరులతో చాలా వేగంగా ప్రయాణిస్తూ మథురానగరం మీద దండెత్తాడు. మథురలో విడిది చేశాడు. శ్రీకృష్ణుడు దీన్ని చూచాడు. బలరామునితో కలిసి ఇలా ఆలోచించాడు.

### ❖ విశ్వకర్మ కృష్ణనియోగంబున సముద్రములో ద్వారకా నగరమును నిర్మించుట ❖

**సీ. యవనుండు పురమెల్ల నావరించెను నేఁటి యెల్లింటిలోపల నీ నడుమను**
**మాగధుండును వచ్చి మనమీఁద విడియును యవనమాగధులు మహాప్రబలులు**
**పురి రెండువంకలఁ బోరుదు రట్టిచో నోపినభంగి నొక్కొక్కచోట**
**మనము యుద్ధము సేయ మఱియొక్కఁ డెడసొచ్చి బంధుల నందఱఁ బట్టి చంపు**

**తే. నొండెఁ గొనిపోయి చెఱఁబెట్టు నుగ్రకర్ముఁ, డైన మాగధుఁ; డదిగాన నరివరులకు**
**విడియఁ బోరాడఁగా రాని విషమభూమి, నొక్కదుర్గంబు సేసి యం దునుపవలయు. 1591**

**ప్రతి :** యవనుండు= కాలయవనుడు; పురము+ఎల్లన్= మధురానగరాన్నంతా; ఆవరించెను= ఆక్రమించాడు; నేఁటి= ఈరోజు; ఎల్లింటి లోపలన్= ఎల్లుండి లోపల; ఈ నడుమను= లేదా ఈ మధ్యలోనో; మాగధుండును= మగధ రాజైన జరాసంధుడు కూడా; వచ్చి; మనమీఁద= మనపై; విడియును= దాడి చేస్తాడు; యవన; మాగధులు= కాలయవనుడు, జరాసంధుడు; మహా ప్రబలులు= గొప్ప బలవంతులు; పురి= మధురా నగరంయొక్క; రెండు వంకలన్= రెండు వైపులా; పోరుదురు= దాడి చేసి పోరాడతారు; అట్టిచోన్= అలాంటప్పుడు; ఓపిన భంగిన్= చేతనైనంతవరకు; ఒక్క+ఒక్కచోటన్= ఒక్కొక్కచోట; మనము= మనం; యుద్ధము+చేయన్= యుద్ధం చేస్తూ ఉండగా; మఱియొక్కఁడు= మరొకడు; ఎడ; చొచ్చి= మధురలోకి ప్రవేశించి; బంధులన్+అందఱన్= బంధువులనందరినీ; పట్టి= పట్టుకొని; చంపును= చంపేస్తాడు; ఒండెన్= అలాకాకుంటే; (లేదా); ఉగ్రకర్ముఁడు+ఐన= భయంకరమైన పనులు చేసేవాడైన; మాగధుఁడు= జరాసంధుడు; కొనిపోయి= తీసుకునిపోయి; చెఱన్+పెట్టున్= కారాగారంలో బంధిస్తాడు; అది+కాన= అందుచేత; అరివరులకున్= మేటిశత్రువులకు; విడియన్= విడిది చేసి ఆక్రమించడానికి గానీ; పోరాడన్+కాన్= యుద్ధం చేయడానికి; రాని= వీలుకాని; విషమభూమిన్= క్లిష్టంగా ఉండే ప్రదేశంలో; ఒక్క= ఒక; దుర్గంబున్= దుర్గాన్ని; చేసి= కట్టించి; అందున్= అందులో; ఉనుపన్ వలయున్= మనవాళ్లందర్నీ ఉంచాలి.

**తా :** కాలయవనుడు మధురపై దాడిచేసి ఆక్రమించాడు. ఇక ఈ రోజో, రేపో ఎల్లుండో జరాసంధుడు కూడా దాడి చేస్తాడు. ఈ ఇద్దరూ చాలా భయంకరులు, క్రూరులు. మనకు గొప్ప శత్రువులు. ఒకడితో మనం పోరాడుతూ ఉంటే, మరొకడు మరోవైపు నుంచి దాడి చేస్తాడు. మన బంధువులనందరినీ చంపేస్తారు. లేదా చెఱపడ్తారు. జరాసంధుడు చాలా క్రూరుడు అంచేత, ఇలాంటి గొప్ప శత్రువులకు దాడి చేయడానికి వీలుకాని ఒక క్లిష్ట ప్రదేశంలో ఒక దుర్గాన్ని కట్టాలి. అందులో మన బంధువుల నుంచాలి.

**వ. అని వితర్కించి సముద్రు నడిగి సముద్రమధ్యంబునఁ బండ్రెండుయోజనంబుల నిడుపు, నంతియ వెడల్పుం గల దుర్గమప్రదేశంబు సంపాదించి, తన్మధ్యంబునం గృష్ణుండు సర్వాశ్చర్యకరంబుగ నొక్క నగరంబు నిర్మింపు మని విశ్వకర్మం బంచిన. 1592**

**ప్రతి :** అని= ఈ విధంగా; వితర్కించి= ముందు వెనుకలు ఆలోచించి; సముద్రున్+అడిగి= సముద్రుడిని అడిగి; సముద్రమధ్యంబునన్= సాగరమధ్యంలో; పండ్రెండుయోజనంబుల= పన్నెండు ఆమడల; నిడుపున్= పొడవును; అంతి+అ వెడల్పున్= అంతే వెడల్పు కూడా; కల= ఉన్న; దుర్గమ ప్రదేశంబు= ప్రశేశించ వీలుకాని ప్రదేశాన్ని; సంపాదించి= పొంది; తద్+మధ్యంబునన్= దాని మధ్యభాగంలో; కృష్ణుండు= శ్రీకృష్ణుడు; సర్వ+ఆశ్చర్యకరంబు+కన్= చూచేవారందరికీ ఆశ్చర్యం కలిగే విధంగా; ఒక్క నగరంబు= ఒక నగరాన్ని; నిర్మింపుము+అని= నిర్మించి ఇవ్వమని; విశ్వకర్మన్= దేవతల శిల్పి అయిన విశ్వకర్మను; పంచినన్= ఆజ్ఞాపించగా...

**తా :** ఈ విధంగా శ్రీకృష్ణుడు ముందు వెనుకలు ఆలోచించాడు. శత్రువులకు ప్రవేశించడానికి, సమీపించడానికి వీలుకాని ఒక దుర్గం కట్టించాలనుకున్నాడు. దానికోసం సముద్రంమధ్యంలో పన్నెండు ఆమడల పొడవు, అంతే వెడల్పు ఉన్న స్థలాన్ని, సముద్రుడి నడిగి సంపాదించాడు. అందరికీ ఆశ్చర్యం కలిగించేలా అక్కడ ఒక నగరాన్ని నిర్మించమని విశ్వకర్మను కోరాడు.

ఆ. వరుణపురముకంటె వాసవుపురికంటె, ధనదువీటికంటె దండధరుని
నగరికంటె బ్రహ్మనగరంబుకంటెఁ బ్ర, స్ఫుటముగాఁగ నొక్కపురముఁ జేసె. 1593

**ప్రతి :** వరుణపురముకంటెన్= వరుణదేవునిపురం కంటె; వాసవుపురికంటెన్= ఇంద్రునినగరంకంటె; ధనుదువీటి కంటెన్= కుబేరుని నగరం కంటె; దండధరుని నగరికంటెన్= దండధరుడైన యముని నగరం కంటె; బ్రహ్మనగరంబు కంటెన్= బ్రహ్మ ఉండే పట్టణంకంటె; ప్రస్ఫుటముకాన్+కన్= మించి వెలిగిపోయేవిధంగా; ఒక్క పురమున్= ఒక నగరాన్ని; చేసెన్= నిర్మించాడు.

**తా :** వరుణదేవుని పురాన్ని, ఇంద్రునినగరాన్ని, కుబేరునినగరాన్ని, యముడిపట్టణాన్ని; బ్రహ్మనగరాన్ని మించి పోయేలా, గొప్పగా ప్రకాశించే ఒకనగరాన్ని విశ్వకర్మ రూపొందించాడు.

వ. అందు. 1594

**ప్రతి :** అందున్= ఆ నగరంలో...

క. ఆకసముతోడిచూ లనఁ, బ్రాకారము పొడవు గలదు పాతాళమహా
లోకముకంటెను లోఁతెం, తో కల దా పరిఖ యెఱుఁగ దొరక దొకరికిన్. 1595

**ప్రతి :** ఆకసము= ఆకాశంయొక్క; తోడిచూలు+అనన్= తోడబుట్టిందా అనేటట్లుగా; ప్రాకారము= కోటగోడ; పొడవు గలదు= చాలా ఎత్తుగా ఉంది; పాతాళ మహాలోకముకంటెను= పాతాళం అనబడే గొప్పలోకంకంటె; లోఁతు+ఎంతో కలదు= చాలా లోతు ఉంది; ఆ పరిఖ= ఆ కోటకు ఉన్న కందకం; ఎఱుఁగన్= తెలుసుకోడానికి; ఒకరికిన్= ఏ ఒకరికీ కూడా; దొరకదు= అంతుపట్టదు.

**తా :** ఆ కోటగోడ ఎంత ఎత్తుందంటే, అది ఆకాశానికి తోడబుట్టిందా అన్నట్లు ఉంది. దానికి ఉన్న కందకాలు పాతాళం కంటె లోతుగా ఉన్నాయి. ఆ లోతు ఎంతో ఎవరికీ అంతు చిక్కదు.

క. కోటయు మిన్నును దమలోఁ, బాటికి జగడింప నడ్డపడి నిల్చిన వా
చాటులరుచిఁ దారకములు, కూటువలై కోటతుదలఁ గొమరారుఁ బురిన్. 1596

**ప్రతి :** పురిన్= ఆ నగరంలో; కోటయున్= కోట; మిన్నును= ఆకాశం- రెండూ కూడా; తమలోన్= తమలో తాము; పాటికిన్= ఎవరు ఎత్తయినవారు అని సరిచూసుకోడానికి; జగడింపన్= కొట్లాడుకోగా; అడ్డిపడి= అడ్డుకుంటూ; నిల్చిన= నిలబడిన; వాచాటుల రుచిన్= వదరుబోతులవలె; తారకములు= నక్షత్రాలు; కూటువలు+ఐ= గుంపులు కట్టి; కోటతుదలన్= కోట ప్రాకారాల చివరలలో; కొమరు+ఆరున్= అందంగా కనిపిస్తుంటాయి.

**తా :** ఆ నగరంకోట ఎత్తైనది. అది ఆకాశంతో పోటీ పడుతుంది. కోట, ఆకాశం రెండూ తమలో తాము కలహించుకుంటున్నాయి. ఎవరు ఎత్తైన వాళ్లో తేల్చుకోవాలను కుంటున్నాయి. ఆ ఊళ్లో ఆ రెంటిమధ్య జరుగుతున్న గొడవను అడ్డుకోవడానికి మధ్యలో నిలబడ్డ వాచాటుల గుంపువలె, కోట ప్రాకారాల చివర నక్షత్రాల గుంపులు ఆవేళలో అందంగా ప్రకాశిస్తూ ఉంటాయి.

శా. సాధుద్వారకవాటకుడ్యవలభిస్తంభార్గళాగేహళీ
వీథీవేదిగవాక్షచత్వరసభావేశ్మప్రఘాణప్రపా

**సౌధాట్టాలక సాల హర్మ్య విశిఖా సౌపాన సంస్థానముల్**
**శ్రీధుర్యస్థితి నొప్పుఁ గాంచనమణి స్నిగ్ధంబులై య ప్పురిన్. 1597**

**ప్రతి :** ఆ+పురిన్= ఆ నగరంలో; సాధు= చక్కని; ద్వార= వాకిళ్లు; కవాట= తలుపులు; కుడ్య= గోడలు; వలభి= ఇంటికప్పు నుంచి ముందుకు చొచ్చుకు వచ్చిన చూరులు; స్తంభ= స్తంభాలు; అర్గళా= గడియలు; గేహళీ= గడపలు; వీథీ= ఇళ్లమధ్య ఉండే దారి; వేది= అరుగు; గవాక్ష(గో+అక్ష)= కిటికీ; చత్వర= ముంగిలి; సభా= సమావేశ స్థలం; వేశ్మ= ఇండ్లు; ప్రఘాణ= చావడి (తలవాకిల ప్రక్కనుండే ఇల్లు); ప్రపా= చలివేంద్రం; సౌధ= భవనాలు; అట్టాలక= మిద్దెలు; సాల= కోట; హర్మ్య= రాచభవనాలు; విశిఖా= రచ్చబండలు; సౌపాన= మిద్దె మెట్లు; సంస్థానముల్= నాల్గువీథుల కూడళ్లు; శ్రీ= వైభవాన్ని; ధుర్య= దాల్చిన; స్థితిన్= స్థితిలో; కాంచన= బంగారుతో; మణి= మణులతో; స్నిగ్ధంబులు+ఐ= నున్నగా మెరిసిపోతూ; ఒప్పున్= వెలుగుతున్నాయి.

**తా :** ఆ నగరంలో అందమైన ప్రవేశ ద్వారాలున్నాయి. తలుపులు, గోడలు, ఇంటి చూరులు, స్తంభాలు, గడియలు, దారులు, అరుగులు, కిటికీలు, ముంగిళ్లు, సమావేశస్థలాలు, ఇళ్లు, చావళ్లు, చలివేంద్రాలు, భవనాలు, మిద్దెలు, కోటలు, రాచభవనాలు, రచ్చబండలు, మిద్దెమెట్లు, నాల్గువీథులకూడళ్లు అన్నీ ఎంతోవైభవంతో, బంగారుతో, మణులతో కూడి నున్నగా తళతళలాడుతున్నాయి.

**క. కూడి గ్రహంబులు దిరుగఁగ, మేడలతుది నిలువులందు మెలఁగెడిబాలల్**
**క్రీడింపరు పురుషులతో, వ్రీడం దద్వేళలందు విను మా వీటన్. 1598**

**ప్రతి :** ఆ వీటన్= ఆ పట్టణంలో; కూడి= కలిసి; గ్రహంబులు= ఆకాశంలోని ఎన్నో గ్రహాలు; తిరుగన్+కన్= తిరుగుతూంటే; మేడల= మిద్దెలమీద; తుది= చివరి; నిలువుల+అందున్= అంతస్థులలో; మెలఁగెడి= తిరిగే; బాలల్= బాలికలు; పురుషులతో= తమ పురుషులతో; వ్రీడన్= సిగ్గుతో; తద్+వేళలు+అందున్= ఆ సమయాల్లో; క్రీడింపరు= సుఖించరు; వినుము= వినండి.

**తా :** వింటున్నావా మహారాజా! ఆ పట్టణంలో ఎత్తైన మేడలున్నాయి. ఆ మేడలచివరిఅంతస్థులపై రకరకాల గ్రహాలు తిరుగుతూ ఉండడం వల్ల, ఆ అంతస్థులలో తమ పురుషులతో రమించే స్త్రీలు సిగ్గుపడి సుఖించకుండా ఉన్నారు.

**ఉ. ఆయతవజ్రనీలమణిహాటకనిర్మిత హర్మ్యసౌధ వా**
**తాయనరంధ్రనిర్యదసితాభమహాగరుధూపధూమముల్**
**తోయదపంక్తులో యనుచుఁ దుంగమహీరుహరమ్యశాఖలం**
**జేయుచు నుండుఁ దాండవవిశేషము లప్పురిఁ గేకిసంఘముల్. 1599**

**ప్రతి :** ఆయత= పొడవుగా ఉన్న; వజ్ర= వజ్రాలతో; నీలమణి= నీలమణులతో; హాటక= బంగారంతో; నిర్మిత= నిర్మించబడిన; హర్మసౌధ= మిద్దెలైన రాజభవనాలయొక్క; వాతాయనరంధ్ర= కిటికీలరంధ్రాలనుండి; నిర్యత్+అసిత+ఆభ= బయటికి వస్తున్న నల్లని కాంతిగల; మహా+అగరుధూప= విరివిగా అగరుధూపాల; ధూమముల్= పొగలు; తోయదపంక్తులో= మేఘాల వరుసలో; అనుచున్= అనుకుంటూ; తుంగ= ఎత్తైన; మహీరుహ= గొప్పచెట్లయొక్క; రమ్యశాఖలన్= అందమైన కొమ్మలమీద; ఆ+పురిన్= ఆ నగరంలో; కేకి సంఘముల్= నెమళ్ల సమూహాలు; తాండవ విశేషములు= నృత్య విశేషాలు; చేయుచున్+ఉందున్= చేస్తూ ఉంటాయి.

**తా :** ఆ పురంలో వరుసగా ఉన్నట్టి వజ్రాలతో, నీలమణులతో, బంగారంతో మిద్దెలైన రాజభవనాలు ఉన్నాయి. అవి – ఆ భవనాల కిటికీల నుంచి అగరుపొగలు దట్టమైన నల్లని మేఘాలవలె వెలువడుతున్నాయి. వాటిని చూచి, ఎత్తైన చెట్ల కొమ్మలమీద చేరి, నెమళ్లు నాట్యం చేస్తున్నాయి.

**విశే :** మేఘాలు క్రమ్ముకొని వర్షం వచ్చేస్తుంటే – ఆ సన్నివేశంలో ఆనందంతో నెమళ్లు పురులు విప్పి నాట్యం చేస్తాయి. అగరుల పొగలు మేఘాలు అనుకొన్నాయి – నెమళ్లు.

**ఆ.** **సరస నడచుచుండి సౌధాగ్రహేమ కుం, భములలోన నినుఁడు ప్రతిఫలింప**
**నేర్పరింపలేక యినులు పెక్కం డ్రంచుఁ, బ్రజలు సూచి చోద్యపడుదు రందు.** **1600**

**ప్రతి :** సరసన్= సమీపాన; నడచుచున్+ఉండి= నడుస్తూ ఉండి; సౌధ+అగ్ర= మేడల పై భాగాలలో ఉండే; హేమ కుంభములలోనన్= బంగారు కలశాలలో; ఇనుఁడు= సూర్యుడు; ప్రతిఫలింపన్= ప్రతిబింబిస్తూ ఉండగా; ఏర్పరింపలేక= ఏది బింబమో ఏది ప్రతిబింబమో నిర్ధారించుకోలేక; ఇనులు= సూర్యులు; పెక్కండ్రు+అంచున్= చాలామంది ఉన్నారు అనుకొంటూ; ప్రజలు= ఆ ఊరి పౌరులు; చూచి; అందున్= అక్కడ; చోద్యపడుదురు= ఆశ్చర్యపడుతూ ఉంటారు.

**తా :** ఆ ఊళ్లోని జనం పెద్ద భవనాలకు దగ్గరగా పోతున్నపుడు వాటిమేడలపై నున్న బంగారుకలశాలలో సూర్యుడు ప్రతిబింబించగా ఏదిబింబమో, ఏది ప్రతిబింబమో నిర్ధారణచేసుకోలేక పలువురు సూర్యులు ఉన్నారని ఆశ్చర్యపడుతూ ఉంటారు.

**ఉ.** **శ్రీరమణీయగంధములఁ జెన్ను వహించుఁ బురీవనంబులం**
**గోరక జాలకస్తబకకుట్మలపుష్పమరందపూర వి**
**స్ఫారలతాప్రకాండవిటపచ్ఛదపల్లవవల్లరీశిఫా**
**సారపరాగమూల ఫలసంభృతవృక్షలతావిశేషముల్.** **1601**

**ప్రతి :** పురీ= నగరంలోని; వనంబులన్= తోటల్లో; కోరక= మొగ్గలు; జాలక= పసరు మొగ్గలు; స్తబక= పూలగుత్తులు; కుట్మల= అరవిరిసిన పూలు; పుష్ప= విచ్చుకున్న పూలు; మరందపూర= పువ్వులలోని తేనె ధారలు; విస్ఫార= వ్యాపించిన; లతా= తీగలతో; ప్రకాండ= బోదెలతో; విటప= కొమ్మలతో; ఛద= ఆకులతో; పల్లవ= చిగుళ్లతో; వల్లరీ= తీగలతో; శిఫా= ఊడలతో; సార= సారవంతమైన; పరాగ= పుప్పొడితో; మూల= వేళ్లతో; ఫల= పండ్లతో; సంభృత= నిండిన; వృక్ష= చెట్లు; లతా= తీగల; విశేషముల్= భిన్నమైన రకాలు; శ్రీ= శోభచేత; రమణీయ= మనోజ్ఞమైన; గంధములన్= పరిమళాలతో; చెన్ను వహించున్= సుందరంగా ఉన్నాయి.

**తా :** ఆ తోటలలో రకరకాల వృక్షాలున్నాయి. లతలు, మొగ్గలు, కసి మొగ్గలు, పూల గుత్తులు, అరవిరిసిన పూలు; పూలలోని తేనె ధారలు, ప్రకాశిస్తున్న తీగలతో, కాండాలతో, బోదెలతో, కొమ్మలతో, ఆకులతో, చిగుళ్లతో, పూలతీగలతో, ఊడలతో, పుప్పొడితో, వేళ్లతో నిండిన పెద్దమానులతో, రకరకాల తీగలతో ఉండి, మంగళశోభలతో, మనసును దోచుకునే పరిమళాలను విరజిమ్ముతున్నాయి.

**క.** **శ్రీకరములు జనహృదయ వ, శీకరములు మందపవనశీర్ణమహాంభ**
**శ్శీకరములు హంసవిహం, గాకరములు నగరికువలయాబ్జాకరముల్.** **1602**

**ప్రతి :** నగరి= ఆ నగరంలోని; కువలయ+అబ్జ+ఆకరముల్= కలువలకూ, పద్మాలకూ నెలవైన సరస్సులు; శ్రీకరములు= శుభాన్ని, సంపదను కలిగించేవి; జనహృదయ= ప్రజల మనసులను; వశీకరములు= వశం చేసుకొనేవి; మందపవన= మెల్లగా వీచే గాలులచే; శీర్ణ= చెదరగొట్టబడిన; మహా+అంభస్+శీకరములు= పెద్దవైన నీటి తుంపరలు కలవి; హంస= హంసలకు; విహంగ+ఆకరములు= పక్షులకు నివాసస్థానాలు.

**తా :** ఆ నగరంలో కొలనులున్నాయి. అందులో కలువలు, తామరపూలు ఉన్నాయి. ఆ కొలనులు వైభవోపేతంగా ఉన్నాయి. చూచేవారికి మనోహరంగా ఉన్నాయి. నెమ్మదిగా వీస్తున్న గాలికి చెదరగొట్టబడిన విస్తారమైన నీళ్ల తుంపరలు ఎగెసిపడుతున్నాయి. అక్కడ హంసలు, వాటితో పాటు నీటి పక్షులూ ఉన్నాయి.

**క. నవకుసుమామోదభరా, జవనము రతిఖిన్నదేహజస్వేదాంభో**
**లవనము సమధిగతవనము, పవనము విహరించుఁ బౌరభవనములందున్. 1603**

**ప్రతి :** పౌరభవనముల+అందున్= ఆ నగరంలోని పౌరులమేడలలో; నవ= కొత్త; కుసుమ= పూల; ఆమోద= పరిమళాల; భర= బరువుతో; అజవనము= వేగంలేకుండా నెమ్మదించింది; రతి= సంభోగశృంగారంలో; ఖిన్న= అలసిపోయినవారి; దేహ+జ= శరీరాలనుండి పుట్టిన; స్వేద+అంభస్= చెమట నీళ్లను; లవనము= పోగొట్టేది; సమధిగత= పొందబడ్డ; వనము= తోటగలది; అయిన; పవనము= గాలి; విహరించున్= తిరుగాడుతూ ఉంటుంది.

**తా :** ఆ నగరంలోని పౌరులమేడలలో గాలి కొత్తగా పూచిన పూలపరిమళాల బరువుతో వేగం తగ్గి నెమ్మదిగా వీస్తూ, మదనకేళిలో అలసిన తనువుల మీది చెమటను పోగొడుతూ ఉద్యానవనాల నుండి వస్తున్న గాలి విహరిస్తూ ఉంటుంది.

**క. బ్రహ్మత్వము లఘువగు నని, బ్రహ్మయు బిరుదులకు వచ్చి పట్టఁడుగా కా**
**బ్రహ్మాదికళలఁ దత్పురి, బ్రహ్మజనుల్ బ్రహ్మఁ జిక్కుపఱుపరె చర్చన్. 1604**

**ప్రతి :** బ్రహ్మత్వము= బ్రహ్మ అనే స్థితిని పొంది ఉండడం; లఘువు= పలచన; అగున్+అని= అవుతుందేమో నని; బ్రహ్మయున్= బ్రహ్మ కూడా; బిరుదులకున్= తనశక్తిని ప్రకటించుకొనేందుకై; వచ్చి; పట్టఁడు= వీరితో చర్చలకు దిగడు; కాక= కానీ; తత్+పురి= ఆ ఊరిలోని; బ్రహ్మజనుల్= బ్రాహ్మణులు; ఆబ్రహ్మ+ఆది+కళలన్= బ్రహ్మవిద్య మొదలుకొని అన్ని కళలలో; చర్చన్= చర్చల్లో; బ్రహ్మన్= చతుర్ముఖ బ్రహ్మను; చిక్కుపఱుపరె= చిక్కుపెట్టకుండా ఉంటారా?

**తా :** బ్రహ్మత్వం చులకన అవుతుందని బ్రహ్మ తన సత్తా చాటుకోవడానికి రాడుగాని, ఒకవేళ వస్తే ఆ నగరంలోని బ్రాహ్మణులు బ్రహ్మవిద్యాది కళల్లో ప్రజ్ఞావంతులై చర్చలలో ఆ బ్రహ్మదేవుణ్ణి చిక్కులపాలు చేస్తారు.

**క. నగరీభూసురకృత లస, దగణితమఖధూమపిహితమై కాక మహా**
**గగనము నీలం బగునే?, మిగులఁగ బెడఁగగునె గ్రహసమృద్ధం బయ్యున్. 1605**

**ప్రతి :** మహాగగనము= విశాలమైన ఆకాశం; నగరీ= నగరంలోని; భూసుర= బ్రాహ్మణులచే; కృత= చేయబడ్డ; లసత్= వెలుగులీనుతున్న; అగణిత= లెక్కించరానంత గొప్ప; మఖ= యజ్ఞాలయొక్క; ధూమ= పొగ కారణంగా; పిహితము+ఐ= అవరించబడింద్రై; కాక= (అందువల్లనే) తప్ప; నీలంబు+అగునే= (లేకపోతే) నీలం రంగులో ఉంటుందా? (నల్లబడుతుందా?); గ్రహ= గ్రహాలతో; సమృద్ధంబు+అయ్యున్= నిండి ఉన్నప్పటికీ; మిగులఁగ= చాలా; బెడఁగు+అగునె= అందంగా ఉంటుందా?

**తా :** ఆ నగరంలోని బ్రాహ్మణులు చేసిన యజ్ఞాలనుంచి లేచిన పొగవల్ల విశాలమైన ఆకాశం నల్లరంగుతో ఎంతో అందంగా ఉంది. లేకపోతే గ్రహాలు పట్టిందైనా గగనం అలా ఉంటుందా?

**క. తిరుగరు పలు కర్థులకును, సురుఁగరు ధన మిత్తు రితరసుదతీమణులన్**
**మరగరు రణమునఁ బిఱిఁదికి, నరుగరు రాజన్యతనయు లా నగరమునన్. 1606**

**ప్రతి :** ఆ+నగరమునన్= ఆ నగరంలో; రాజన్యతనయులు= రాజకుమారులు; పలుకున్= ఇచ్చిన మాటను; తిరుగరు= వెనక్కి తీసుకోరు; అర్థులకును= అడిగినవారి నుండి; సురుఁగరు= తప్పించుకుని దాచిపెట్టుకోరు (దానమిస్తారు); ఇతర= పరాయి; సుదతీమణులన్= స్త్రీలను; మరగరు= ఇష్టపడరు (కోరుకోరు); రణమునన్= యుద్ధంలో; పిఱిఁదికిన్= వెనక్కి; అరుగరు= పోరు (వెనకడుగు వేయరు);

**తా :** ఆ ఊళ్లోని రాజకుమారులు ఏదైనా మాట ఇస్తే దాన్ని వెనక్కి తీసుకోరు. మాటపై నిలబడతారు. సహాయం కోరి ఎవరైనా అడిగితే వాళ్ల నుండి తప్పించుకుని దాచిపెట్టుకోరు. సహాయం చేస్తారు. ఇతరుల స్త్రీలను ఆశించరు. యుద్ధంలో వెనకడుగు వేయరు.

**క. రత్నాకరమై జలనిధి, రత్నము లీ నేర దేటి రత్నాకరమో?**
**రత్నములఁ గొనుదు రిత్తురు, రత్నాకరజయులు వైశ్యరత్నములు పురిన్. 1607**

**ప్రతి :** రత్న+ఆకరము+ఐ= రత్నాలకు నెలవైంది అనే పేరు ఉన్నప్పటికీ; జలనిధి= సముద్రం; రత్నములు= రత్నాలను; ఈ నేరదు= ఇవ్వలేదు; ఏటి= అదెలాంటి; రత్నాకరము+ఓ= రత్నాలకు నెలవోమరి!; రత్నములన్= రకరకాలైన రత్నాలను; పురిన్= ఆ నగరంలోని; వైశ్యరత్నములు= ఉత్తములైన కోమట్లు; కొనుదురు= కొంటారు; ఇత్తురు(ఇచ్చుదురు)= ఇస్తారు (అమ్ముతారు); రత్న+ఆకర+జయులు= రత్నాలకు నెలవని పేరుపడిన సముద్రాన్ని జయించినవాళ్లు.

**తా :** సముద్రానికి 'రత్నాకరం' అని పేరు. రకరకాల రత్నాలకు అది నెలవు అని ప్రసిద్ధి. అలాంటి పేరున్నప్పటికీ అది రత్నాలను ఇవ్వలేదు. మరి అది ఎలాంటి రత్నాకరమో! ఈ ఆనగరంలో శ్రేష్ఠులైన వైశ్యులున్నారే, వాళ్లు రకరకాల రత్నాలను కొనగలరు, అమ్మగలరు. వాళ్లు రత్నాకరాన్నే జయించినవాళ్లు.

**విశే :** 'రత్నాకరం' అంటే రత్నాలకు నెలవుగా ఉన్నది అని అర్థం. కవి ఈ మాటపై చమత్కారం సాధిస్తున్నాడు. అది రత్నాల నిచ్చేది కాదనీ, వట్టి నీటిమూట అనీ చెపుతున్నాడు. అందుకే 'జలనిధి' అని తేల్చి చెప్పాడు.

రత్నాలు తొమ్మిది. ముత్యం, పద్మరాగం, వజ్రం, పగడం (ప్రవాళం), మరకతం, నీలం, గోమేధికం, పుష్యరాగం, వైదూర్యం. ఇవి నవరత్నాలు. ఇవి సముద్రంలో ఉంటాయని అంటారు.

**క. తుంగంబులు కరహతగిరి, శృంగంబులు దానజలవశీకృతభృంగీ**
**భృంగంబులు పటుశైల స, మాంగంబులు నగరి మత్తమాతంగంబుల్. 1608**

**ప్రతి :** నగరి= ఆ నగరంలో ఉండే; మత్తమాతంగంబుల్= మదించిన ఏనుగులు; తుంగంబులు= చాలా ఎత్తుగా ఉంటాయి; కర= తొండాలతో; హత= కొట్టబడిన; గిరి= కొండలయొక్క; శృంగంబులు= శిఖరాలను కలిగినవి (అంటే పెద్ద కొండశిఖరాలను

కూడా తొండంతో పడగొట్ట గల శక్తి ఉన్నవి); దానజల= చెక్కిలినుండి కారే మదజలంచేత; వశీకృతభృంగీ= వశం చేసుకోబడినవైన; భృంగంబులు= తుమ్మెదలను కలిగినవి; పటు శైల= మహాపర్వతం; ఆభ= వంటి; సమ+అంగంబులు= సౌష్ఠవం కలిగిన శరీరం కలిగినవి.

**తా :** ఆ ఊళ్లోని మదపుటేనుగులు చాలా ఎత్తైనవి. తొండాలతో పర్వత శిఖరాలను పడగొట్ట గలిగినంత బలమున్నవి. వాటి చెక్కిళ్లనుండి స్రవించే మదజలం కోసం తుమ్మెదలు సమ్మోహితమైపోతుంటాయి. ఆ ఏనుగుల శరీర సౌష్ఠవం ఎంతటి దంటే వాటిని మహాపర్వతంతో పోల్చి చెప్పవచ్చు.

**క. ప్రియములు జితపవన మనో, రయములు కృతజయము లధికరమణీయ గుణా**
**న్వయములు సవినయములు ని, ర్భయములు హతరిపు చయములు పట్టణహయముల్. 1609**

**ప్రతి :** పట్టణ= ఆ పట్టణంలోని; హయముల్= గుర్రాలు; ప్రియములు= ఇష్టాన్ని కలిగించేవి (అందమైనవి); జిత= జెయించిన; పవన= గాలియొక్క; మనః= మనస్సుయొక్క; రయములు= వేగాలను కలిగినవి (అంటే వాయువేగ, మనోవేగం కలవి); కృత= సాధించబడిన; జయముల్= గెలుపులను కలిగినవి; అధిక= చాలా; రమణీయ= అందమైన; గుణ+అన్వయములు= లక్షణాలున్న వంశంలో పుట్టినవి; సవినయములు= వినయంతో ఉండేవి; నిర్భయములు= భయము లేనివి (ధైర్యమున్నవి); హత= చంపబడ్డ; రిపు= శత్రు; చయములు= సమూహాలను కలిగినవి.

**తా :** ఆ పట్టణంలోని గుర్రాలు అందరికీ ఇష్టాన్ని కలిగిస్తాయి. వేగంలో వాయువేగ, మనోవోగాలను మించిపోతాయి. ఉత్తమ జాతికి చెందినవి. వినయంగా, ఒద్దికగా ఉండేవి. భయ మెరుగనివి. శత్రు సమూహాలను గెలువ గలిగినవి.

**క. పులుల పగిదిఁ గంఠీరవ, ముల క్రియ శరభముల మాడ్కి ముదిత మదేభం**
**బుల తెఱఁగున నానావిధ, కలహమహోద్భటులు భటులు గల రా వీటన్. 1610**

**ప్రతి :** ఆ వీటన్= ఆ పురంలో; పులుల పగిదిన్= పులులవలె; కంఠీవముల క్రియన్= సింహాలవలె; శరభముల మాడ్కిన్= శరభాల (ఎనిమిది కాళ్లు ఉన్న ఒక పెద్ద మృగం శరభం)వలె; ముదిత= సంతోషంతో ఉండే; మద+ఇభంబుల తెఱఁగునన్= మదపుటేనుగులవలె; నానావిధ= రకరకాలైన; కలహ= పోరాటాలలో (యుద్ధాలలో); మహా+ఉద్భటులు= గొప్ప దారుఢ్యం కలిగిన వాళ్లు అయిన; భటులు; కలరు= ఉన్నారు.

**తా :** ఆ పురంలో భటులున్నారు. వాళ్లు ఎలాంటివారంటే, పులులవలె, సింహాలవలె, శరభాలవలె, మదపుటేనుగులవలె గొప్ప దారుఢ్యం కలిగిన వాళ్లు. రకరకాలైన యుద్ధాలలో ప్రవీణులు.

**విశే :** అ. **'సింహో మృగేంద్రః పంచాస్యో హర్యక్షః కేసరీహరిః**

కంఠమందు ధ్వని కలది కంఠీరవం. సింహధ్వని అడవిలో ప్రతిధ్వనిస్తుంది. అందుచేత ఆ పేరు.

సింహాన్ని చంపగలిగినది శరభం. దీనికి ఎనిమిది కాళ్లుంటాయని ప్రతీతి.

**క. ఆ వీట నుండువారికి, భావింపఁగ లేవు క్షుత్పిపాసాదులు త**
**ద్గోవింద కృపావశమున, దేవప్రతిమాను లగుచు దీపింతు రిలన్. 1611**

**ప్రతి :** ఆ వీటన్= ఆ నగరంలో; ఉండువారికిన్= నివసిస్తున్నవారికి; భావింపన్+కన్= గమనిస్తే; క్షుత్= ఆకలి; పిపాస+ఆదులు= దప్పిక మొదలైనవి; లేవు; తద్= ఆ; గోవింద= శ్రీకృష్ణుని; కృపావశమునన్= దయచేత; దేవప్రతిమానులు+అగుచున్= దేవతలకు సాటిరాగలవాళ్ళు అవుతూ; ఇలన్= భూమిపై; దీపింతురు(దీపించుదురు)= ప్రకాశిస్తూ ఉంటారు.

**తా :** ఆ ఊళ్లో ఉండేవాళ్లకు ఆకలి, దప్పిక వంటివి లేవు. శ్రీకృష్ణుని దయావిశేషం వల్ల వాళ్లు ఈ భూమిమీద దేవతలతో సమానులై ప్రకాశిస్తూ ఉంటారు.

**సీ. ఆసక్తి కృష్ణముఖావలోకనమంద హరిపాదసేవనమంద చింత**
**వెఱపు నారాయణవిముఖకార్యములంద పారవశ్యము విష్ణుభక్తియంద**
**బాష్పనిర్గతి చక్రిపద్యసంస్తుతులంద పక్షపాతము శార్ఙ్గిభక్తులంద**
**లేమి గోవిందాన్యలీలాచరణమంద శ్రమము గోవిందపూజనములంద**

**తే. బంధ మచ్యుతేతరదుష్టపథములంద, జ్వరము మాధవవిరహితక్షణములంద**
**మచ్చరము లీశకైంకర్యమతములంద, నరవరోత్తమ! వినుము తన్నాగరులకు. 1612**

**ప్రతి :** నరవర+ఉత్తమ= రాజులలో శ్రేష్ఠుడవైనవాడా!; తద్+నాగరులకున్= ఆ ద్వారకాపురిలోని ప్రజలకు; కృష్ణ= శ్రీకృష్ణుని; ముఖ+అవలోకనము+అందున్+అ= ముఖాన్ని చూడడంలోనే; ఆసక్తి= ఇష్టం; హరి= శ్రీకృష్ణుని; పాద= పాదాలను; సేవనము+అందున్+అ= సేవించటంలోనే; చింత= ఆలోచన; నారాయణ= శ్రీకృష్ణునికి; విముఖ= ప్రతికూలమైన; (వ్యతిరేకమైన); కార్యములు+అందున్+అ= పనులను చేయడంలోనే; వెఱపు= భయం; విష్ణు= శ్రీకృష్ణునిపట్ల; భక్తి+అందున్+అ= భక్తిలోనే; పారవశ్యము= మైమరపు; చక్రి= శ్రీకృష్ణునిపై; పద్య= పద్యరూపంలో ఉన్న; సంస్తుతుల+అందున్+అ= స్తోత్రాలను చెప్పడంలోనే; బాష్పనిర్గతి= ఆనందబాష్పాలు; శార్ఙ్గి= శార్ఙ్గమనే ధనుస్సును ధరించినశ్రీకృష్ణుని; భక్తుల+అందున్+అ= భక్తులయందే; పక్షపాతము= అధికమైన అభిమానంచూపుట; గోవింద= శ్రీకృష్ణునికంటె; అన్య= వేరైన; లీలా+ఆచరణము+అందున్+అ= లీలను ఆచరించడంలోనే; లేమి= దరిద్రత (లేకుండటం); గోవింద= శ్రీకృష్ణుని; పూజనములు+అందున్+అ= పూజించడంలోనే; శ్రమము= శ్రమించడం; అచ్యుత+ ఇతర దుష్ట పథములు+అందున్+అ= అచ్యుతుని మార్గంకాని ఇతర దుర్మార్గపు త్రోవల్లో నడవడంలోనే; బంధము= బంధనం; మాధవ= శ్రీకృష్ణుని; విరహిత= ఎడబాసిన; క్షణములు+అందున్+అ= క్షణాలలోనే; జ్వరము= తపించడం; ఈశ= శ్రీకృష్ణుని; కైంకర్య= సేవనుగురించిన; మతములు+అందున్+అ= పద్ధతులలోనే; మత్సరములు= అసూయలు.

**తా :** రాజా విను. ఆ నగరంలో ఉండే ప్రజలు శ్రీకృష్ణునిపాదాలను సేవించడంలోనే ఆసక్తి చూపుతారు. శ్రీకృష్ణునికి విరుద్ధమైన పనులను చేయడంలోనే వారికి భయం. శ్రీకృష్ణునిపట్ల భక్తిలోనే మైమరచిపోతారు. శ్రీకృష్ణునిపై స్తోత్రాలను చెప్పడంలోనే ఆనందబాష్పాలు కారుస్తారు. శ్రీకృష్ణుని భక్తులపైననే పక్షపాతం వహిస్తారు. శ్రీకృష్ణునికంటే భిన్నమైన ఇతరుల లీలలను ఆచరించడంలోనే వ్యతిరేకత చూపుతారు. శ్రీకృష్ణునిపూజను చేయడంలోనే శ్రమిస్తారు. అచ్యుతునిమార్గం కాక దుష్టులైన పరులు నడిచే త్రోవల్లోనే నడవడంలోనే వీరికి బంధం ఏర్పడుతుంది. శ్రీకృష్ణుణ్ణి ఎడబాసిన క్షణాలలోనే బాధ కలుగుతుంది. శ్రీకృష్ణుని సేవించే పద్ధతుల్లోనే ఒకరిపై ఒకరికి వీళ్లలో మాత్సర్యాలు - అంతే తప్ప ఇతర విషయాల్లో కాదు.

**వ. మఱియు న ప్పురవరంబున హరికిం బారిజాతమహీజంబును సుధర్మ యనియెడి దేవసభయును దేవేంద్రుం డిచ్చె. కర్ణైకదేశంబుల నలుపు గలిగి మనోజవంబులును, శుక్లవర్ణంబులు నైన తురంగంబుల వరుణుం డొసంగె. మత్స్య కూర్మ పద్మ మహాపద్మ శంఖ ముకుంద కచ్ఛప నీలంబులను నెనిమిది నిధులఁ గుబేరుండు సమర్పించె. నిజాధికారసిద్ధికొఱకుఁ దక్కిన లోకపాలకులును దొల్లి తమకు భగవత్కరుణా కటాక్షవీక్షణంబుల సంభవించిన సర్వసంపదల మరల నతిభక్తితో సమర్పించి రివ్విధంబున. 1613**

**ప్రతి :** మఱియున్= ఇంకా; ఆ+పురవరంబునన్= శ్రేష్ఠమైన ఆ నగరంలో; హరికిన్= శ్రీకృష్ణునికి; దేవ+ఇంద్రుండు= దేవేంద్రుడు; పారిజాత= పారిజాతమనే పేరుగల; మహీజంబును= వృక్షాన్నీ; (కల్పవృక్షాన్ని); సుధర్మ+అనియెడి= సుధర్మ అనే పేరున్న; దేవసభను= దేవతల కొలువుకూటాన్ని; ఇచ్చెన్= సమర్పించాడు; కర్ణ+ఏకదేశంబులన్= కేవలం చెవిదగ్గర మాత్రం; నలుపు కలిగి= నల్లదనం కలిగినవి; మనస్+జవంబులును= మనోవేగం కలవి; శుక్ల= తెల్లని; వర్ణంబులును+ఐన= రంగున్నవీ అయిన; తురంగంబులన్= గుర్రాలను; వరుణుండు= వరుణదేవుడు; ఒసంగెన్= అర్పించాడు; మత్స్యకూర్మ పద్మమహాపద్మ శంఖముకుంద కచ్ఛప నీలంబులు+అను= మత్స్యం; కూర్మం; పద్మం; మహాపద్మం; శంఖం; ముకుందం; కచ్ఛపం; నీలం అనే పేర్లతో ఉన్న; ఎనిమిది నిధులన్= ఎనిమిదిరకాల నిధులను; కుబేరుండు= ధనాధిపతి అయిన కుబేరుడు; సమర్పించెన్= ఇచ్చాడు; నిజ+అధికార= తమ అధికారాలయొక్క; సిద్ధి కొఱకున్= పొందుకోసం; తక్కిన= మిగిలిన; లోకపాలకులును= లోకాలను పాలించేవారుకూడా; తొల్లి= మునుపు; తమకు(న్); భగవత్= భగవంతుని; కరుణా= దయతో కూడిన; కటాక్ష= క్రీగంటి; వీక్షణంబులన్= చూపులవల్ల; సంభవించిన= కలిగిన; సర్వసంపదలన్= అన్ని సంపదలను; మరలన్= తిరిగి; అతిభక్తితో= ఎంతో భక్తితో; సమర్పించిరి= సమర్పించారు; ఈ+విధంబునన్= ఈ విధంగా...

**తా :** శ్రేష్ఠమగు ఆ పట్టణంలో నివసించే శ్రీహరికి పారిజాతవృక్షమునూ, 'సుధర్మ' అనే దేవసభనూ దేవేంద్రు డిచ్చాడు. ఒక చెవిమాత్రమే నలుపురంగు గలిగి తక్కిన ఒడలెల్ల తెల్లనై, మనోవేగం కలిగిన గుఱ్ఱాలను వరుణు డిచ్చాడు. మత్స్యం, కూర్మం, పద్మం, మహాపద్మం, శంఖం, ముకుందం, కచ్ఛపం, నీలం అనే పేర్లుగల ఎనిమిది నిధులను కుబేరు డొసగినాడు. తక్కిన లోకపాలకు లందరూ తమ తమ అధికారాల సిద్ధికోసం మునుపు తమకు భగవంతుని అనుగ్రహంవల్ల లభించిన సకలవిభూతులను మరల అచ్యుతునికే అతిభక్తితో సమర్పించారు.

**క. దర్పించి చేసి పురము స, మర్పించెను విశ్వకర్మ మంగళగుణ సం**
**తర్పితగహ్వరికిన్ గురు, దర్పితదుఃఖప్రవాహతరికిన్ హరికిన్. 1614**

**ప్రతి :** మంగళ= శుభాన్ని కలిగించే; గుణ= గుణాల (లక్షణాల) వల్ల; సంతర్పిత= సంతృప్తి పొందింపబడిన; గహ్వరికిన్= భూమిని కలిగినవాడికి; గురు= గొప్పగా; దర్పిత= చెలరేగి పోతున్న; దుఃఖ= దుఃఖమనే; ప్రవాహ= ప్రవాహానికి; తరికిన్= నావ అయినవాడికి; హరికిన్= శ్రీకృష్ణునికి; విశ్వకర్మ= దేవ శిల్పి అయిన 'విశ్వకర్మ' ; దర్పించి= ఉత్సహించి; పురమున్= ఒక నగరాన్ని; చేసి= రూపొందించి; సమర్పించెను= వినయంగా అర్పించాడు.

**తా :** భూదేవిని తన శుభలక్షణాలతో సంతృప్తిపరచినవాడు, భయంకరంగా చెలరేగుతున్న దుఃఖమనే వరదను దాటించే నావ వంటివాడు అయిన శ్రీకృష్ణునికి విశ్వకర్మ అనే దేవశిల్పి తన శిల్పకళాప్రావీణ్యంతో ఒక నగరాన్ని ఉత్సాహంతో నిర్మించి సమర్పించాడు.

**వ. ఇట్లు విశ్వకర్మనిర్మితంబైన ద్వారకానగరంబునకు నిజయోగప్రభావంబున మథురాపురజనుల నందఱం జేర్చి, బలభద్రున కెఱింగించి తదనుమతంబున నందనవనమునిర్గమించు పూర్వదిగ్గజంబు పెంపున, మేరుగిరిగహ్వరంబువెలువడు కంఠీరవంబుతెఱంగున, హరిహయదిగంతరాళంబున నుదయించు నంధకారపరిపంథికైవడి మథురానగరంబు వెలువడి నిరాయుధుండై యెదురు వచ్చుచున్న హరిం గని. 1615**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; విశ్వకర్మ= దేవశిల్పి అయిన విశ్వకర్మచే; నిర్మితంబు+ఐన= రూపొందించబడిన; ద్వారకా నగరంబునకున్= 'ద్వారక' అనే పేరున్న నగరానికి; నిజ= తన; యోగ ప్రభావంబునన్= యోగశక్తిచేత; మథురాపుర= మథురా నగరంలోని; జనులను= ప్రజలను; అందఱన్+చేర్చి= అందరినీ అక్కడికి చేర్చి; బలభద్రునకున్= బలరామునికి; ఎఱింగించి= తెలియచేసి; తద్+అనుమతంబునన్= ఆయన అనుమతితో; నందనవనము= ఇంద్రునితోట అయిన నందనవనం నుండి; నిర్గమించు= బయటకి వస్తున్న; పూర్వదిక్+గజంబు పెంపునన్= తూర్పుదిశలో ఉండే ఐరావతం అనే ఏనుగువలె వెలిగి పోతూ; మేరుగిరి= మేరు పర్వతంయొక్క; గహ్వరంబు= గుహనుండి; వెలువడు= వెలుపలికి వస్తున్న; కంఠీరవంబు తెఱంగునన్= సింహంవలె; హరిహయదిక్+అంతరాళంబునన్= ఇంద్రునికి చెందిన తూర్పుదిక్కునడుమ; ఉదయించు= పుడుతున్న; అంధకార= చీకటికి; పరిపంథి కైవడిన్= శత్రువు (అయిన సూర్యుని)వలె; నిర్+ఆయుధుండు+ఐ= ఆయుధాలేవీ లేనివాడై; ఎదురు= ఎదురుగా; వచ్చుచున్+ఉన్న= వస్తూ ఉన్న; హరిన్= శ్రీకృష్ణుణ్ణి; కని= చూచి...

**తా :** ఇలా విశ్వకర్మ సృష్టించిన కొత్తనగరం ద్వారక. అందులో మథురానగరప్రజలను, శ్రీకృష్ణుడు తన యోగశక్తితో చేర్చాడు. ఆ విషయాన్ని తన అన్న అయిన బలరామునికి చెప్పాడు. ఆయన అనుమతి తీసుకుని మథురానగరం నుండి బయటికి వచ్చాడు. అలా వస్తూండే శ్రీకృష్ణుడు నందనవనంనుండి బయటికి వస్తున్న ఐరావతంవలె ఉన్నాడు. మేరు పర్వతగుహల నుండి వెలికి వస్తున్న సింహంవలె శోభిస్తున్నాడు. చీకట్లను చీల్చే సూర్యుడు తూర్పుదిశలో నుండి పొడుచుకుని వస్తున్నట్లున్నాడు. అలా బయటికి వస్తూ, ఏ ఆయుధాలూ లేని శ్రీకృష్ణుణ్ణి (కాలయవనుడు) చూశాడు. చూచి

## ❖ శ్రీకృష్ణుఁడు నిరాయుధుండై కాలయవనుఁడు వెంటనంటఁ బరువెత్తుట ❖

**మ. కరిసంఘంబులు లేవు; రావు తురగౌఘంబుల్; రథవ్రాతముల్**
**పరిసర్పింపవు; రారు శూరులు; ధనుర్బాణాసిముఖ్యాయుధో**
**త్కరముం బట్టఁడు; శక్రచాపయుతమేఘస్ఫూర్తితో మాలికా**
**ధరుఁ డొక్కం డదె నిర్గమించె నగరద్వారంబునం గంటిరే? 1616**

**ప్రతి :** కరి= ఏనుగుల; సంఘంబులు= సమూహాలు; లేవు; తురగ= గుర్రాల; ఓఘంబుల్= సమూహాలు; రావు= వెంట రావడంలేదు; రథ వ్రాతముల్= రథాల వరుసలు; పరిసర్పింపవు= చుట్టూరావడం లేదు; శూరులు= శౌర్యమున్న సైనికులు; రారు= రావడంలేదు; ధనుస్+బాణ+అసి ముఖ్య= ధనుస్సు, బాణాలు, కత్తి మున్నగునవైన; ఆయుధ+ఉత్కరమున్= ఆయుధాల సమూహాన్ని; పట్టఁడు= ధరించలేదు; శక్రచాపయుత= ఇంద్రధనుస్సుతో గూడిన; మేఘస్ఫూర్తితో= మేఘంవలె; మాలికాధరుఁడు= (వైజయంతిమాల అనే) పూలదండ ధరించినవాడు; ఒక్కండు= ఒక్కడే; అది+ఎ= అదిగో; నగర= నగరంయొక్క; ద్వారంబునన్= ప్రవేశద్వారంనుండి; నిర్గమించెన్= బయలుదేరాడు; కంటిరి+ఏ= చూశారా?

**తా :** ఏనుగుల గుంపులు లేవు; గుఱ్ఱాల సమూహాలు చుట్టూ లేవు. రథాలు వెంట రావు. వీరసైనికులు వెంట లేరు. ధనుస్సు, బాణం, కత్తి మున్నగు ఆయుధాలను ధరించడు. ఇంద్రధనుస్సుతో కూడిన మేఘంవలె, మెడలో వైజయంతీ మాలను ధరించి, ఒక్కడే అదిగో! నగరద్వారంనుండి బయటికి వస్తున్నాడు చూశారా?

**శా. ఎన్నే నయ్యె దినంబు లీ నగరిపై నేతెంచి పోరాటకున్**
**ము న్నెవ్వండును రాఁడు వీఁడొకఁడు నిర్ముక్తాయుధుం డేగు దెం**
**చె న్న న్నోర్వఁగనో ప్రియోక్తులకునో శ్రీఁ గోరియో చూడుఁ డం**
**చు న్నాత్మీయజనంబుతోడ యవనేశుం డిట్లు తర్కింపఁగన్. 1617**

**ప్రతి :** ఈ+నగరిపైన్= ఈ నగరం మీదికి; ఏతెంచి= దండయాత్రకు వచ్చి; దినంబుల్= రోజులు; ఎన్ని+ఏన్+అయ్యెన్= ఎన్ని అయినాయో; పోరాటకున్= యుద్ధానికి; మున్ను= ఇంతకు మునుపు; ఎవ్వండును= ఎవడుకూడా; రాఁడు= రాలేదు; వీఁడు+ఒకఁడు= వీడెవడో ఒకడు; నిర్ముక్త+ఆయుధుండు= వదిలేయబడిన ఆయుధాలు కలవాడు (ఆయుధాలేవీ లేనివాడు) ఏగుదెంచెన్= వచ్చాడు; నన్నున్+ఓర్వన్+కన్+ఓ= నన్ను జయించడానికో; ప్రియ+ఉక్తులకున్+ఓ= తియ్యగా మాట్లాడడానికో; శ్రీన్= సంపదను; కోరి+ఓ= కోరుకోవడానికో; చూడుఁడు= చూడండి; అంచున్= అంటూ; ఆత్మీయ జనంబుతోడన్= తనవాళ్లతో; యవన+ఈశుండు= యవనరాజు; ఇట్లు= ఈ విధంగా; తర్కింపన్+కన్= చర్చించగా (చర్చించాడు)...

**తా :** 'ఈ నగరం పైకి దండెత్తి వచ్చి ఎన్నిదినాలైందో! ఇంతకు ముందెవ్వడూ ఈ నగరంపైకి దండయాత్రకు రాలేదు. వీడెవడో ఒకడు – చేతిలో ఆయుధాలు లేకుండానే వస్తున్నాడు. నన్ను గెలవడానికి వస్తున్నాడా? లేక ప్రియంగా మాట్లాడిపోవడానికా? లేదా సంపదలను పొందడానికా? అటు చూడండి అంటూ తనవాళ్లతో కాలయవనుడు ఇలా చర్చించగా–

**క. విభులగు బ్రహ్మప్రముఖుల, కభిముఖుఁడై నడవకుండునట్టి గుణాఢ్యుం**
**డిభరాజగమన మొప్పఁగ, నభిముఖుఁడై నడచెఁ గాలయవనున కధిపా! 1618**

**ప్రతి :** అధిపా= పరీక్షిన్మహారాజా; విభులు+అగు= అన్నిలోకాలకూ అధిపతులైన; బ్రహ్మ ప్రముఖులకు= బ్రహ్మ మొదలైన వాళ్లకు; అభిముఖుఁడు+ఐ= ఎదురై; నడవక+ఉండున్+అట్టి= నడవకుండా ఉండే; గుణ+ఆఢ్యుండు= మంచి గుణాలనే సంపద కలిగిన శ్రీకృష్ణుడు; ఇభరాజ గమనము= శ్రేష్ఠమైన ఏనుగు ఎలా నడుస్తుందో అంత గంభీరంగా ఉన్న నడక; ఒప్పన్+కన్= అందంగా కనిపించగా; కాలయవనునకున్= కాలయవనుడికి; అభిముఖుఁడు+ఐ= ఎదురుముఖం కలవాడై; నడిచెన్= నడిచాడు;(వచ్చాడు).

**తా :** పరిక్షిన్మహరాజా, ఈ రేడులోకాల నేలే బ్రహ్మ మొదలైన వారికికూడా ఎదురుగా నడవని మంచిగుణాలకు నిధి శ్రీకృష్ణుడు. ఆయన ఆ సమయంలో శ్రేష్ఠమైన ఏనుగునడకవంటి నడకతో అందంగా, నెమ్మదిగా; కాలయవనునికి ఎదురు నడిచాడు.

**వ. ఆ సమయంబున న య్యాదవేంద్రు నేర్పడం జూచి. 1619**

**ప్రతి :** ఆ సమయంబునన్= అట్టి వేళలో; ఆ+యాదవ+ఇంద్రున్= ఆ యాదవశ్రేష్ఠుడైన శ్రీకృష్ణుణ్ణి; ఏర్పడన్+చూచి= ఎగాదిగా విమర్శించి చూచి...

**తా :** ఆ సమయంలో యాదవశ్రేష్ఠుడైన ఆ శ్రీకృష్ణుడిని కాలయవనుడు ఎగా దిగా పరిశీలనగా చూచి (ఇలా అనుకున్నాడు)

**మ.** **'వనజాతాక్షుఁడు సింహమధ్యుఁడు రమావక్షుండు శ్రీవత్సలాం**
**ఛనుఁ డంభోధరదేహుఁ డిందుముఖుఁ డంచద్దీర్ఘబాహుండు స**
**ద్వనమాలాంగదహారకంకణసముద్యత్కుండలుం డీతఁ డా**
**ముని సూచించిన వీరుఁడౌ' ననుచు న మ్మూఢుండు గాఢోద్ధతిన్. 1620**

**ప్రతి :** వనజాత+అక్షుఁడు= పద్మాలవంటి కండ్లు కలవాడు; సింహమధ్యుఁడు= సింహం నడుమువంటి సన్నని నడుమున్నవాడు; రమావక్షుండు= శ్రీలక్ష్మీదేవికి నిలయమైన వక్షఃస్థలం కలవాడు; శ్రీవత్సలాంఛనుఁడు= శ్రీవత్సమనే పుట్టుమచ్చ ఉన్నవాడు; అంభస్+ధర= మేఘవర్ణం (నీటిని ధరించేది మేఘం) దేహుఁడు= శరీరంకలవాడు; ఇందుముఖుఁడు= చంద్రబింబంవంటి ముఖం కలవాడు; అంచత్= అందంగా ఉన్న; దీర్ఘబాహుండు= పొడవైన చేతులు కలవాడు; సద్+వనమాలా= మంచి పూలమాల; అంగద= భుజకీర్తులు; హార= హారాలు; కంకణ= కడియాలు; సముద్యత్= బాగా వెలిగి పోతున్న; కుండలుండు= చెవి కుండలాలున్నవాడు; ఈతఁడు= అయిన ఈ వ్యక్తి; ఆ+ముని= ఆ నారదుడు; సూచించిన= తెలియజేసిన; వీరుఁడు+ఔన్= వీరుడు అయి ఉండాలి; అనుచున్= అనుకుంటూ; ఆ+మూఢుండు= ఆ తెలివి తక్కువ వాడైన కాలయవనుడు; గాఢ+ఉద్ధతిన్= ఎంతో పొగరుతో...

**తా :** పద్మాలవంటి అందమైనకండ్లు కలవాడు, సింహం నడుమువంటి సన్నని నడుమున్నవాడు, లక్ష్మీదేవికి నెలవైన వక్షాన్ని కలిగినవాడు, శ్రీవత్సమనే పుట్టుమచ్చ కలిగినవాడు, వానమబ్బువంటి వన్నె కలిగిన దేహమున్నవాడు, చందమామవంటి ముఖమున్న వాడు, అందంగా ఉన్న పొడవైన చేతులున్నవాడు, మెడలో చక్కని వనమాలను ధరించినవాడు, భుజకీర్తులు, హారాలు, కంకణాలు, వెలిగిపోతున్న కుండలాలు కలిగిన ఇతడే నారదముని సూచించిన వీరుడు అయి ఉండవచ్చునని అనుకొంటూ – మూఢుడైన ఆ కాలయవనుడు చాలా పొగరుతో

**సీ.** **చటులవాలాభీలసైంహికేయునిభంగి లాలితేతరజటాలతిక దూలఁ**
**బ్రళయావసరబృహద్భానుహేతిద్యుతిఁ బరుషారుణశ్మశ్రుపటలి వ్రేలఁ**
**గాదంబినీఛన్నకాంచనగిరిభాతిఁ గవచసంవృతదీర్ఘకాయ మమర**
**వల్మీకసుప్తదుర్వారాహికైవడిఁ గోశంబులో వాలు కొమరు మిగుల**

**ఆ.** **నార్చి పేర్చి మించి యశ్వంబు గదలించి, గమలసంభవాదిఘనులకైనఁ**
**బట్టరాని ప్రోడఁ బట్టెద నని జగ, దవనుఁ బట్టఁ గదిసె యవనుఁ డధిప! 1621**

**ప్రతి :** అధిప= పరీక్షిన్మహారాజా!; చటుల= చలిస్తున్న; వాల= తోకతో; ఆభీల= భయంకరమైన; సైంహికేయుని భంగిన్= సింహిక పుత్రుడైన రాహువువలె; లాలిత+ఇతర= లలితంగా లేని (కర్కశమైన); జటాలతిక= పొడవైన జడ; తూలన్= ఊగుతుండగా; ప్రళయ+అవసర= ప్రళయకాలంలోని; బృహద్+భాను= విజృంభించే అగ్నియొక్క; హేతి= జ్వాలవంటి; ద్యుతిన్= వెలుగుతో; పరుష= బిరుసుగా ఉండే; అరుణ= ఎర్రని; శ్మశ్రు= గడ్డం మీసాలయొక్క; పటలి= గుంపు; వ్రేలన్= వేలాడుతూ ఉండగా; కాదంబినీ= మేఘాలవరుసతో; ఛన్న= కప్పబడిన; కాంచన గిరి భాతిన్= బంగారు కొండవలె

(మేరుపర్వతంవలె); కవచ= కవచంతో; సంవృత= చుట్టబడిన; దీర్ఘ కాయము= విశాలమైన శరీరం; అమరన్= అమరి ఉండగా; వల్మీక= పుట్టలో; సుప్త= నిద్రిస్తున్న; దుర్వార= ఎదిరించడానికి వీలులేనంతటి; అహి కైవడిన్= పామువలె; కోశంబులోన్= ఒఱలో; వాలు= కత్తి; కొమరు మిగులన్= దీపిస్తూ ఉండగా; ఆర్చి= గట్టిగా అరచి; పేర్చి= చెలరేగి; మించి= అతిశయించి; అశ్వంబున్= గుర్రాన్ని; కదలించి= కదలింప చేసి; కమలసంభవ+ఆది= కమలంలో పుట్టిన బ్రహ్మ మొదలైన; ఘనులకున్+ఐనన్= గొప్పవాళ్ళకైనా; పట్టరాని= దొరకని; ప్రోడన్= ప్రౌఢుణ్ణి; పట్టెదను+అని= పట్టుకుంటానని; జగత్+అవనున్= లోకాన్ని కాపాడేవాడైన శ్రీకృష్ణుణ్ణి; పట్టన్= పట్టుకోడానికి; యవనుఁడు= కాలయవనుడు; కదిసెన్= దగ్గరికి వచ్చాడు;

**తా :** ఓ పరీక్షిన్మహారాజా! బ్రహ్మవంటి మహామహులకే దొరకనివాడు శ్రీకృష్ణుడు. అలాంటివాడిని కాలయవనుడు పట్టుకోడానికి వచ్చాడు. ఆ యవనుడు చలిస్తున్నతోకతో భయంకరుడైనరాహువువలె కర్కశమైనజడలు ఊగుతూ ఉన్నాయి. ప్రళయకాలంలో అగ్నిజ్వాలవలె బిరుసైన అతనిగడ్డం, మీసం వేలాడుతున్నాయి. మేఘాలు కప్పిన మేరుపర్వతంవలె కవచంతో వాడిశరీరం కప్పబడి ఉంది. పుట్టలో నిద్రిస్తున్న భీకరసర్పంవలె ఒరలో కత్తి ఉంది. అలాంటి కాలయవనుడు గట్టిగా అరస్తూ, విజృంభించి గుర్రాన్ని పరిగెత్తిస్తూ, ఎవరికీ దొరకని శ్రీకృష్ణుణ్ణి తాను పట్టుకుంటానని దగ్గరకు వచ్చాడు.

**క. ఇటు దన్నుఁ బట్టవచ్చినఁ, బటుతరజవరేఖ మెఱసి పట్టువడక ది**
**క్తటము లదర హరి వాఱెం, జటులగతిన్, వాఁడు దోడఁ జనుదేరంగన్. 1622**

**ప్రతి :** ఇటు= ఈ విధంగా; తన్నున్= తనను; పట్టన్+వచ్చినన్= పట్టుకోవడానికి రాగా; పటుతర జవరేఖన్= మిక్కిలి వేగమైన రీతిలో; మెఱసి= మెరిసి; పట్టు+పడక= దొరకకుండా; దిక్+తటముల్= దిక్కుల చివరలు; అదరన్= కంపిస్తుండగా; చటులగతిన్= వేగంగా; హరి= శ్రీ కృష్ణుడు; పాఱెన్= పరుగెత్తాడు; వాఁడు= ఆ కాలయవనుడూ; తోడన్= వెంబడిస్తూ; చనుదేరన్+కన్= పోతుండగా (పోతున్నాడు)...

**తా :** ఇలా కాలయవనుడు పట్టుకోడానికి వెంట బడేసరికి, శ్రీకృష్ణుడు పట్టుబడకుండా మెరుపు వేగంతో దిక్కుల చివరలు అదిరే విధంగా పరువెత్తాడు. కాలయవనుడు వెంటబడుతూనే ఉన్నాడు.

**వ. అప్పుడు కాలయవనుం డిట్లనియె. 1623**

**ప్రతి :** అప్పుడు= ఆ సమయంలో; కాలయవనుండు= కాలయవనుడు; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** అప్పుడు కాలయవనుడు ఇలా అన్నాడు.

**మ. యదువంశోత్తమ! పోకు పోకు రణ మీ నర్హంబు; గంసాదులన్**
**గదనక్షోణి జయించి తీ వని సమిత్కామంబునన్ వచ్చితిన్;**
**విదితఖ్యాతులు వీటిఁ బోవ నరికిన్ వెన్నిచ్చి యి ట్భంగి నే**
**గుదురే రాజులు? రాజమాత్రుఁడవె? వైగుణ్యంబు వచ్చుం జుమీ! 1624**

**ప్రతి :** యదువంశ+ఉత్తమ= యదువంశంలో ఉత్తముడైనవాడా; పోకు పోకు= వెళ్లకు వెళ్లకు; రణము+ఈన్= యుద్ధం చేయడానికి; అర్హంబు= తగును; కంస+ఆదులన్= కంసుడు మొదలైనవారిని; కదనక్షోణిన్= రణభూమిలో; జయించితి(వి)+ ఈవు+అని= నీవు జయించావు అనుకొని; సమిత్+కామంబునన్= యుద్ధం చేయాలని ఎంతో ఆశతో; వచ్చితిన్= వచ్చాను;

విదితఖ్యాతులు= ఇప్పటిదాకా తెచ్చుకున్న మంచిపేరు ప్రతిష్ఠలు; వీటిన్+పోవన్= చెడిపోయేటట్లు; అరికిన్= శత్రువుకు; వెన్ను+ఇచ్చి= వెన్ను చూపి; రాజులు; ఈ+భంగిన్= ఈ విధంగా; ఏగుదురు+ఏ= వెళ్లిపోతారా?; రాజమాత్రుఁడవు+ఎ= నీవేమైనా మామూలు రాజువా?; వైగుణ్యంబు= నీ గుణాలకు చేటు; వచ్చున్+సుమీ= వస్తుంది సుమా!

**తా :** యదువంశోత్తమా! కృష్ణా! పారిపోకు పారిపోకు. నాతో యుద్ధం చేయడమే తగిన పని. కంసుడు మొదలైనవాళ్లను నీవు రణభూమిలో గెలిచావని తలంచి, నీతో యుద్ధం చేయాలని చాలా ఆశతో వచ్చాను. ఇంతవరకు పొందిన పేరుప్రతిష్ఠలు చెడిపోయేట్లుగా నీవంటి రాజులు శత్రువుకు వెన్ను చూపి పారిపోవచ్చునా? నీవేమైన సామాన్య రాజువా? గుణహీనుడవనే అపకీర్తి నీకు వస్తుంది సుమా!

**మ. బలిమిన్ మాధవ! నేఁడు నిన్ను భువనప్రఖ్యాతిగాఁ బట్టుదున్**
**జలముల్ సొచ్చిన, భూమిక్రిందఁ జనినన్, శైలంబుపై నెక్కినన్**
**బలిదండన్ విలసించినన్ వికృతరూపంబుం బ్రవేశించినన్**
**జలధిన్ దాఁటిన నగ్రజన్మహలికాశ్వాటాకృతుల్ దాల్చినన్. 1625**

**ప్రతి :** మాధవ= లక్ష్మీదేవికి భర్త అయినవాడా! (శ్రీకృష్ణా); నేఁడు= ఈ రోజు; జలముల్+సొచ్చినన్= నీటిలో దాక్కున్నప్పటికీ(మత్స్యం); భూమి క్రిందన్= భూమికి కిందికి; చనినన్= వెళ్లినప్పటికీ(వరాహం); శైలంబు= కొండ; పైన్= శరీరంమీదికి ఎక్కినా; ఎక్కినన్= ఎక్కినప్పటికీ(కూర్మం); బలి+దండన్= బలవంతుని వద్ద; విలసించినన్= చెలరేగి పోయినప్పటికీ(వామన); వికృత= వికారమైన; రూపంబున్= రూపంలో; ప్రవేశించినన్= చేరినప్పటికీ (నృసింహ); జలధిన్= సముద్రాన్ని; దాఁటినన్= దాటినాకూడా (రామ); అగ్రజన్మ= బ్రాహ్మణాకృతిలో ఉండి నప్పటికీ (పరశురామ); హలిక= నాగలిని ధరించినా కూడా (బలరామ); అశ్వాటాకృతుల్= గుర్రాన్ని ఎక్కి తిరిగే వాడిలాంటి (కల్కి) ఆకారాలను; తాల్చినన్= ధరించినప్పటికీ కూడా; నేఁడు= ఈ రోజు; నిన్ను; భువనప్రఖ్యాతి+కాన్= లోకంలో మంచి ఖ్యాతి లభించేటట్లు; పట్టుదున్= పట్టుకుంటాను.

**తా :** మాధవా! నీవు ఎక్కడ ఉన్నా నిన్ను పట్టుకుంటాను. నీళ్లలో ప్రవేశించవచ్చు, భూమిక్రిందకు పోయి దాక్కోవచ్చు, కొండపై నెక్క వచ్చు, బలవంతుడెవడిదగ్గరైనా ఆశ్రయం పొందవచ్చు, వికృతరూపాన్ని పొందవచ్చు, సముద్రాన్ని దాటవచ్చు, బ్రాహ్మణునిలా ఉండవచ్చు, నాగలితో పొలాలు దున్నుతుండవచ్చు, గుర్రమెక్కి తిరిగే వాడిఆకారంలో ఉండవచ్చు. నీ వెక్కడ ఉన్నా, ఎలా ఉన్నా నిన్ను నేడు లోకమంతా నా కీర్తి చెప్పుకునేలా పట్టితీరుతాను.

**విశే :** శత్రువులు కృష్ణణ్ణి నిందించే సమయాల్లోకూడా – అంతర్గతంగా దశావతారాల విశేషాలు స్ఫురించేటుగా చెప్పడం పోతన ప్రత్యేకత. ఈ పద్యంలోనూ తొమ్మిది అవతారాలు వచ్చాయి, కృష్ణణ్ణి ఎత్తిపొడుపుగా ఉంటున్నందున – 9+1=10.

**వ. అదియునుం గాక. 1626**

**ప్రతి :** అదియునున్+కాక= అదీ కాకుండా...

**తా :** అంతేగాకుండా, ఇంకా

**మ. శరముల్ దూఱవు; మద్ధనుర్గుణలతాశబ్దంబు లేతేర వా**
**హరిరింఖోద్ధతధూళి గప్ప; దకటా! హాస్యుండవై పాఱె; దు**

ర్వరపై నే క్రియఁ బోరితో కదిసి మున్ వాతాశితోఁ గేశితోఁ
గరితో మల్లురతో జరాతనయుతోఁ గంసావనీనాథుతోన్. 1627

**ప్రతి :** శరముల్= బాణాలు; దూఱవు= ఒంటిపై గుచ్చుకో లేదు; మత్+ధనుస్+గుణలతా= నా వింటికి ఉన్న తీగలాంటి నారియొక్క; శబ్దంబుల్= శబ్దాలు; ఏతేరవు= నీ దగ్గరకు రావు (వినిపించవు); ఆ+హరి= ఆ గుఱ్ఱాలయొక్క; రింఖా= డెక్కల నుండి; ఉద్ధత= పైకిలేచిన; ధూళి= దుమ్ము; కప్పదు= నిన్ను కప్పడం లేదు; ఉర్వరపైన్= నేల మీద; మున్= మునుపు; వాత+అశితోన్= గాలిని తినే పాము (అయిన అఘాసురుని)తో; కేశితోన్= కేశి అనే రాక్షసునితో; కరితోన్= ఏనుగుతో; మల్లురతోన్= చాణూరముష్టికులనే మల్లవీరులతో; జరాతనయుతోన్= 'జరా' అనే రక్కసి కొడుకుతో; (జరాసంధునితో) కంస+అవనీనాథుతోన్= కంసుడనే రాజుతో; ఏక్రియన్= ఏ విధంగా; కదిసి= సమీపించి; పోరితి(వి)+ఓ= పోరాడినావో అకటా= అయ్యో; హాస్యుండవు+ఐ= నవ్వులపాలై; పాఱెదు(వు)= పారిపోతున్నావు.

**తా :** కృష్ణా! నీ ఒంటిపై నా బాణాలు వెయ్యనే లేదు; నా అల్లెతాటి శబ్దాలు నీకు వినపడనే లేదు. గుఱ్ఱాల డెక్కల నుంచి దుమ్మురేగి నిన్ను కప్పేయడం లేదు. అయినా అయ్యో! నగుబాటు పాలవుతూ పారిపోతున్నావే! ఇలాంటి నీవు ఇంతకు మునుపు అఘాసురుడితో, కాళీయుడితో, కేశితో, కువలయాపీడంతో, మల్లురతో, జరాసంధునితో, కంసుడితో ఎలా పోరాడావో ఏమో! అశ్చర్యంగా ఉంది మరి!

వ. అని పలుకుచుఁ గాలయవనుండు వెంట నరుగుదేర సరకుసేయక మందహాసంబు ముఖారవిందం బునకు సౌందర్యంబు నొసంగ 'వేగిరపడకు; రమ్ము ర' మ్మనుచు హరియును. 1628

**ప్రతి :** అని= ఈ విధంగా; పలుకుచున్= అంటూ; కాలయవనుండు= కాలయవనుడు; వెంటన్= వెనుకనే; అరుగుదేర= వస్తూ ఉండగా; సరకు సేయక= ఏ మాత్రం లక్ష్యపెట్టక; మందహాసంబున్= చిరునవ్వు; ముఖ+అరవిందంబునకున్= పద్మంవంటి ముఖానికి; సౌందర్యంబున్= అందాన్ని; ఒసంగన్= ఇవ్వగా; వేగిరపడకు(ము)= తొందరపడవద్దు; రమ్ము రమ్ము+అనుచున్= రా,రా, అని పిలుస్తూ; హరియును= శ్రీకృష్ణుడు కూడా...

**తా :** ఇలాగ కాలయవనుడు అంటూ, వెంటపడగా; శ్రీకృష్ణుడు వాడిని ఏమాత్రం లక్ష్యపెట్టక చిరునవ్వు నవ్వుతున్నాడు. పద్మంవంటి ఆయన ముఖానికి ఆ నవ్వు మరింత అందాన్ని ఇస్తూ ఉంది. అలా నవ్వుతూ, కాలయవనుడితో 'తొందరపడకు, నా వెంట రావయ్యా రా, రా' అని పిలుస్తూ

సీ. 'అదె యిదె లోఁబడె' నని పట్టవచ్చినఁ గుప్పించి లంఘించుఁ గొంతతడవు
పట్టరా; దీతని పరు వగ్గలం' బని భావింపఁగా సమీపమున నిలుచు
నడరి పార్శ్వంబుల కడ్డంబు వచ్చినఁ గేడించి యిట్టట్టు గికురువెట్టు
వల్మీకతరుసరోవరము లడ్డంబైన సవ్యాపసవ్యసంచరతఁ జూపుఁ

తే. బల్లముల డాఁగు దిబ్బల బయలుపడును, నీడలకుఁ బోవు నిఱుముల నిగిడి తాఱు
నన్నుఁ బట్టిన నీవు మానవుఁడ' వనుచు, యవనుఁ డెగువంగ బహుజగదవనుఁ డపుడు! 1629

**ప్రతి :** అధిప= ఓ పరీక్షిన్మహారాజా; బహుజగత్+అవనుఁడు= ఎన్నో లోకాలను కాపాడేవాడైన శ్రీకృష్ణుడు; యవనుఁడు= కాలయవనుడు; ఎగువంగన్= వెంటబడగా; నన్నున్+పట్టిన= నన్ను పట్టుకో గలిగితే; నీవు; మానవుఁడవు+అనుచున్=

మనిషివి (మగవాడివే) అంటూ; అది+ఎ, ఇది+ఎ= అదిగో, ఇదిగో; లోన్+పడెన్= దొరికిపోయాడు; అని= అంటూ; పట్టవచ్చినన్= పట్టుకోడానికి రాగా; కుప్పించి= నేలపై కాళ్లు తాడించి; లంఘించున్= ఎగిరి దూకుతాడు; కొంత తడవు= కొంచెం సేపు; పట్టరాదు= పట్టుకోడానికి వీలుకాదు; ఈతని= ఈ కృష్ణుడి; పరువు= పరుగు; అగ్గలంబు+అని= అధికమైందని; భావింపన్+కాన్= మనసులో అనుకోగా; సమీపమునన్= దగ్గరలోనే; నిలుచున్= నిలబడతాడు; అదరి= ప్రయత్నించి; పార్శ్వంబులకున్= ప్రక్కల నుంచి; అడ్డంబు వచ్చినన్= అడ్డం వచ్చి నిలబడితే; కేడించి= తొలగి వెళ్లి; ఇటు+అట్టు= ఇటూ అటూ; కికురున్+పెట్టున్= ఏమార్చి పారిపోతాడు; వల్మీక= పుట్టలు; తరు= చెట్లు; సరస్+వరములు= కొలనులు; అడ్డంబు+ ఐనన్= అడ్డం వస్తే; సవ్య+అపసవ్య= కుడి ఎడమల వైపులకు; సంచరతన్= తిరగడం; చూపున్= చేస్తాడు; పల్లముల= పల్లపు ప్రదేశాలలో; డాఁగున్= దాక్కుంటాడు; దిబ్బలన్= ఎత్తైన ప్రదేశాలలో; బయలుపడును= కనబడతాడు; నీడలకున్+ పోవున్= నీడలలోకి వెళ్తాడు; ఇఱుములన్= మరుగు ప్రదేశాలలో; నిగిడి= నిక్కి; తాఱున్= నక్కుతూ పోతాడు.

**తా :** పరీక్షిన్మహారాజా! శ్రీకృష్ణుణ్ణి పట్టుకోవాలని కాలయవనుడు రకరకాలుగా ప్రయత్నం చేశాడు. శ్రీకృష్ణుడు దొరకలేదు. వాణ్ణి ముప్పు తిప్పలు పెట్టాడు. 'ఇదిగో ఇదిగో దొరికి పోయాడు' అని యవనుడు పట్టుకోడానికి వస్తాడు. శ్రీకృష్ణుడు అందకుండా ఒక్కసారి ఎగిరి దూకి దూరంగా పోతాడు. 'ఇతడితో పాటు పరిగెత్తలేను. వీడివేగం అందుకోలేను. ఇక నేను పట్టుకోలేను' అని యవనుడు మనసులో అనుకగానే కృష్ణుడు దగ్గరగా వచ్చి నిలుస్తాడు. ఏదో ప్రయత్నం చేసి పక్కనుంచి యవనుడు అడ్డు వచ్చి నిలిస్తే, వెనకకు అటూ ఇటూ వెళ్లి ఏమార్చి పారిపోతాడు. పుట్టలు, చెట్లు, సరస్సులు అడ్డం వస్తే కుడిఎడమలుగా తిరుగుతూ వెళ్తాడు. తగ్గు ప్రదేశాల్లో దాక్కొని. ఎత్తు ప్రదేశాల్లో కనపడతాడు. నీడల్లోకి వెళతాడు. మరుగుప్రదేశాలలో తిరుగుతాడు. 'నన్ను పట్టుకోగలిగితే నీవు సరిఅయిన మగవాడివి, అంటూ కవ్విస్తాడు. అనేక లోకాలనూ కాపాడే శ్రీకృష్ణుడు కాలయవనుణ్ణి ఇలా ముప్పుతిప్పలు పెట్టాడు.

**విశే :** 'నన్ను పట్టుకోగలిగితే నీవు మానవుడివి' అని చేసిన హెచ్చరికలో వీరత్వమూ ఉంది, ఆధ్యాత్మికతా ఉంది. 'పట్టుకో చూద్దాం. పట్టుకుంటే నీవు మగాడివే అని ఒప్పుకుంటాను' అనే కవ్వింపు పైపైన ఉంది. 'నన్ను భక్తితో వశం చేసుకో గలిగితే నీవు మానవుడుగా పూర్ణత్వం పొందుతావు' అనే సూచన ఉంది.

**వ. మఱియును. 1630**

**ప్రతి :** మఱియును= ఇంకా...

**తా :** ఆ తర్వాత

**సీ. సకలభూతవ్రాతసంవాసుఁ డయ్యును వనములు నగములు వరుస దాఁటు**
**లోకోన్నతుండును లోకచక్షుఁడు నయ్యు మాటిమాటికి నిక్కి మగిడి చూచుఁ**
**బక్షవిపక్షసంబంధశూన్యుం డయ్యుఁ, దను విపక్షుఁడు వెంటఁ దగుల నిగుడు**
**విజయాపజయభావవిరహితుం డయ్యుఁ దా నపజయంబును జెందినట్లు తోఁచు**

**ఆ. నభయభయవిహీనుఁ డయ్యు భీతునిమాడ్కిఁ, గానఁబడును సర్వకాలరూపుఁ**
**డయ్యుఁ గాలచకితుఁడైన కైవడి వన, మాలి పఱచు వెఱపుమాలి యధిప! 1631**

**ప్రతి :** అధిప= పరీక్షిన్మహారాజా!; సర్వకాలరూపుఁడు+అయ్యున్= తాను సర్వకాలస్వరూపుడు అయి ఉండినప్పటికీ; కాల= కాలం చేత; చకితుఁడు+ఐన కైవడిన్= భయపడి నోట మాటరానివాడు అయిన రీతిగా; వనమాలి= వనమాలను ధరించిన శ్రీకృష్ణుడు; వెఱపుమాలి= భయాన్ని విడిచి; పఱచున్= పరుగెడతాడు; సకల= అన్ని; భూతవ్రాత= ప్రాణుల సమూహాలకు; సంవాసుఁడు+అయ్యును= నివాసస్థానం అయినప్పటికీ; వనములు= అడవులు; నగములు= కొండలు; వరుసన్= వరుసగా; దాఁటున్= దాటుతాడు; లోక+ఉన్నతుండును= లోకాలలో అధికుడు; లోకచక్షుఁడున్= లోకానికంతా కన్నుగా ఉన్నవాడు (సర్వసాక్షి); అయ్యున్= అయినప్పటికీ; మాటిమాటికి= పదే పదే; నిక్కి= మెడ పై కెత్తి; మగిడి చూచున్= వెనక్కి తిరిగి చూస్తాడు; పక్ష= తనవారు; విపక్ష= ఎదుటివారు అనే; సంబంధ శూన్యుండు+అయ్యున్= సంబంధాలు లేని వాడయినప్పటికీ; తనున్= తనను; విపక్షుఁడు= శత్రువైన కాలయవనుడు; వెంటన్+తగులన్= వెంటబడగా; నిగుడున్= పరుగెత్తిపోతాడు; విజయ+అపజయ= గెలుపు, ఓటమి అనే; భావవిరహితుండు+అయ్యున్= భావాలు లేనివాడైనప్పటికీ; తాను; అపజయంబును= ఓటమిని; చెందిన+అట్లు= పొందినట్లు; తోఁచున్= తలపిస్తాడు; అభయ= భయం లేకపోవడం; భయ= భయం ఉండడం; విహీనుఁడు+అయ్యున్= (అనేవి) లేకపోయినప్పటికీ; భీతునిమాడ్కిన్= భయపడినవానివలె; కానన్+పడును= అగుపిస్తాడు.

**తా :** పరీక్షిన్మహారాజా! శ్రీకృష్ణుడు కాలస్వరూపుడు. అన్నికాలాలూ ఆయనరూపమే. అయినప్పటికీ, కాలాన్ని చూచి, నోటమాట రాని వానిలా కనబడతాడు. భయం లేకుండా పారిపోతాడు. అన్ని ప్రాణులకు తానే ఆవాస స్థానమైనప్పటికీ, అడవులు, కొండలు దాటిపోతాడు. లోకంలో అన్నిటికంటే ఉన్నతుడు, లోకాలకు కన్నువంటివాడు అయినప్పటికీ, పదే పదే మెడ ఎత్తి, వెనక్కి తిరిగి నిక్కిచూస్తాడు. తనవారు, పగవారు అనే సంబంధాలేవీ లేనప్పటికీ, శత్రువు తన వెంట పడితే పారిపోతాడు. గెలుపు, ఓటమి అనే భావాలు లేకున్నాకూడా, తాను ఓటమి పొందినట్లు అగుపిస్తాడు. భయపడక పోడవం, భయపడడం అనేవి ఏవీ లేకపోయినా కూడా భయపడ్డవాడువలె కనిపిస్తాడు – అంటే ద్వంద్వాతీతుడు.

**వ. ఇ వ్విధంబున. 1632**

**ప్రతి :** ఈ+విధంబునన్= ఈ రీతిగా...

**క. దారితశాత్రవభవను న, పారమహావేగవిజితపవనున్ యవనున్**
**దూరము గొని చని కృష్ణుఁడు, ఘోరంబగు నొక్క శైలగుహ వడిఁ జొచ్చెన్. 1633**

**ప్రతి :** దారిత= చీల్చబడిన; శాత్రవ= శత్రువుల; భవనున్= భవనాలను కలిగినవాడు; అపార= అంతులేని; మహావేగ= గొప్పవేగంచేత; విజిత= గెలువబడిన; పవనున్= గాలి కలవాడైన; యవనున్= కాలయవనుణ్ణి; దూరమున్+కొని= దూరంగా తీసుకుని పోయి; కృష్ణుఁడు= శ్రీకృష్ణుడు; ఘోరంబు+అగు= భయంకరమైన; ఒక్క= ఒక; శైల= కొండయొక్క; గుహన్= గుహలోనికి; వడిన్= వేగంగా; చొచ్చెన్= దూరాడు.

**తా :** శత్రువులభవనాలను చీల్చినవాడు, అంతులేని వేగంతో గాలినే ఓడించినవాడు అయిన కాలయవనుణ్ణి పైవిధంగా కృష్ణుడు దూరంగా తీసుకునిపోయి. భయం గొలిపే ఒక కొండగుహలోకి గబుక్కున ప్రవేశించాడు.

**క. అదె లోఁబడె నిదె లోఁబడె, నదె యిదె పట్టెద నటంచు నాశావశుఁడై**
**యదుసింహునిపదపద్ధతి, వదలక గిరిగహ్వరంబు వాఁడుం జొచ్చెన్. 1634**

**ప్రతి :** అది+ఎ= అదిగో; లోన్+పడెన్= దొరికి పోయాడు; ఇది+ఎ= ఇదిగో; లోన్+పడెన్= దొరికి పోయాడు; అది+ఎ, ఇది+ఎ= అదిగో, ఇదిగో; పట్టెదన్+అటంచున్= పట్టుకుంటాను అంటూ; ఆశావశుఁడు+ఐ= ఆశకు వశమైనవాడై; యదుసింహుని= యాదవసింహమైన శ్రీకృష్ణునియొక్క; పదపద్ధతిన్= అడుగుల జాడల్ని; వదలక= విడిచిపెట్టకుండా అనుసరిస్తూ; గిరిగహ్వరంబున్= కొండగుహలో; వాఁడున్= వాడుకూడా; చొచ్చెన్= ప్రవేశించాడు.

**తా :** 'అదిగో దొరికి పోయాడు, ఇదిగో దొరికిపోయాడు అదిగో పట్టుకుంటాను. ఇదిగో పట్టుకుంటాను' అంటూ ఆశకు లోబడిన కాలయవనుడు యాదవసింహమైన శ్రీకృష్ణునికాలిగుర్తులను అనుసరించి వెళుతూ' వాడు కూడా కొండగుహలో ప్రవేశించాడు.

**వ. ఇట్లు సొచ్చి మూఢహృదయంబునుం బోలెఁ దమఃపూర్ణంబయిన గుహాంతరాళంబున దీర్ఘతల్ప నిద్రితుండై గుఱకపెట్టుచున్న ఒక మహాపురుషునిం గని శ్రీహరిగాఁ దలంచి. 1635**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; చొచ్చి= ప్రవేశించి; మూఢ= తెలివిలేనివాని; హృదయంబునున్= మనస్సును; పోలెన్= పోలినట్లుగా; తమస్ పూర్ణంబు+అయిన= చీకటితో నిండిన; గుహా+అంతరాళంబునన్= గుహ లోపల; దీర్ఘతల్ప= పొడవైన తల్పంమీద; నిద్రితుండు+ఐ= నిద్రపోతూ; గుఱకపెట్టుచున్+ఉన్న= గురక పెడుతున్న; ఒక మహాపురుషునిన్+కని= ఒక మహాపురుషుణ్ణి చూచి; శ్రీహరి+కాన్= శ్రీకృష్ణుడుగా; తలంచి= భావించి...

**తా :** ఇలా గబుక్కున గుహలోకి దూరి కాలయవనుడు - మూర్ఖునిమనస్సువలె చీకటితో (అజ్ఞానంతో) నిండి ఉన్న ఆ గుహలో పెద్దపరుపుమీద నిద్రలో మునిగి గురకపెడుతున్న ఒక మహాపురుషుణ్ణి చూచి, అతడే శ్రీకృష్ణుడని తలచాడు. ఆయన్ను చూచి

**ఉ. ఆలము సేయలేక పురుషాధమ! దుర్లభకంటకద్రుమా**
**భీలమహాశిలాసహితభీకరకుంజరఖడ్గసింహ శా**
**ర్దూలతరక్షుసంకలితదుర్గపథంబునఁ బాఱుతెంచి యీ**
**శైలగుహన్ సనిద్రుక్రియఁ జాఁగి నటించినఁ బోవనిత్తునే? 1636**

**ప్రతి :** పురుష+ అధమ= పురుషులలో అధముడా! కృష్ణా!; ఆలము= యుద్ధం; చేయలేక= చేయడానికి చేతకాక; దుర్లభ= పొందడానికి వీలుకాని; కంటక ద్రుమ= ముండ్లచెట్లతో; ఆభీల= భయంకరమైన; మహాశిలా= పెద్దరాళ్లతో; సహిత= కూడిన; భీకర= భయం కలిగించే; కుంజర= ఏనుగులతో; ఖడ్గ= ఖడ్గమృగాలతో; సింహ= సింహాలతో; శార్దూల= పెద్దపులులతో; తరక్షు= సివంగులతో; సంకలిత= కూడిన; దుర్గపథంబునన్= ప్రవేశించడానికి వీలుకాని దారిలో; పాఱుతెంచి= పరుగెత్తి వచ్చి; ఈ శైలగుహన్= ఈ కొండగుహలో; సనిద్రుక్రియన్= నిద్రించేవాడివలె; చాఁగి= (కాళ్లు) చాచుకుని; నటించినన్= నటించినా; పోవన్+ఇత్తునే(ఇచ్చుదునే)= పోనిస్తానా?

**తా :** పురుషాధమా! నాతో యుద్ధంలో పోరాడలేక, పారిపోతూ ముళ్లచెట్లతో, పెనుశిలలతో, భయం గొలిపే ఏనుగులతో, ఖడ్గమృగాలతో, సింహాలతో, పెద్దపులులతో, సివంగులతో నిండిన చొరరానిమార్గంలో పరుగెత్తి వచ్చి, ఈ కొండగుహలో నిద్రిస్తున్నవాడివలె కాళ్లు చాచుకొని నటిస్తున్న నిన్ను పోనిస్తానా? (పోనివ్వనని భావం)

**క. ఎక్కడ నెవ్వారలకును, జిక్క వనుచు నారదుండు సెప్పెను నాకుం**
**జిక్కితి వెక్కడఁ బోయెదు?, నిక్కముగా నిద్రపుత్తు ని న్నీకొండన్. 1637**

**ప్రతి :** ఎక్కడను= ఎక్కడ కూడా; ఏ+వారలకును= ఎలాంటి వారికైనా; చిక్కవు+అనుచున్= చేతికి చిక్కవు అని; నారదుండు= నారదుడు; చెప్పెను= చెప్పాడు; నాకున్+చిక్కితివి= నాకు చిక్కావు; ఎక్కడన్+పోయెదు(వు)= ఎక్కడికని పోతావు; నిన్ను; ఈ కొండన్= ఈ కొండలోనే; నిక్కముగా= నిజంగా; నిద్రపుత్తున్(నిద్రపుచ్చుదున్)= నిద్రపోయేలా చేస్తాను.

**తా :** నీవు ఎక్కడా దొరకవనీ, ఎవరికీ చిక్కవనీ నారదుడు అన్నాడు. మరి నాకు దొరికావు. ఎక్కడికని పోగలవు? నీవు నిద్ర నటిస్తున్న నిన్ను నిజంగా ఇక్కడే – ఈ కొండలోనే నిన్ను శాశ్వతంగా నిద్రపుచ్చుతాను.

**విశే :** నారదుడు చెప్పినమాట ఆధ్యాత్మికం. యవనుడు గ్రహించిన అర్థం లౌకికం. 'ఎవరికీ దొరకడు' అంటే మహా యోగులకే అందనిపరతత్త్వం ఆ కృష్ణుడు అని నారదుని ఉద్దేశం.

**ఆ. అనుచు యవనుఁ డట్టహాసంబు గావించి, చటులకఠినకులిశసదృశమైన**
**పాదమెత్తి తన్నెఁ బాఱి తద్దేహంబు, నగగుహం బ్రతిస్వనంబు నిగుడ. 1638**

**ప్రతి :** అనుచున్= అంటూ; యవనుఁడు= ఆ కాలయవనుడు; అట్టహాసంబున్+కావించి= వికారపు నవ్వు నవ్వుతూ; నగగుహన్= కొండగుహలో; ప్రతిస్వనంబు+నిగుడన్= ప్రతిధ్వని ఏర్పడగా; చటుల= చలించే; కఠిన= కర్కశమైన; కులిశ సదృశము+ఐన= వజ్రాయుధం వంటిదైన; పాదము+ఎత్తి= కాలిని పైకెత్తి; పాఱి= పరుగెత్తి, ఎగసి; తద్+దేహంబున్= ఆ శరీరాన్ని; తన్నెన్= తన్నాడు.

**తా :** ఇలా అంటూ యవనుడు వికటంగా శబ్దంచేస్తూ – నవ్వి, వేగంగా పరుగెత్తుతూ వచ్చి, వజ్రాయుధంవంటి కర్కశమైన తన కాలితో – నిద్రిస్తున్న ఆ వ్యక్తిని ఎగసి తన్నాడు, ఆ కాలిదెబ్బతో గుహ ప్రతిధ్వనించింది.

**ఉ. తన్నిన లేచి నీల్గి కనుఁదమ్ములు మెల్లన విచ్చి లోపలన్**
**సన్నపుఁ గిన్క వర్ధిల దిశల్ గని దృష్టిసమిద్ధవిగ్రహో**
**త్పన్నమహాగ్నికీలముల భస్మముసేసె నతండు సాయక**
**చ్ఛిన్నవిరోధికంఠవను శ్రీభవనున్ యవనున్ లఘుక్రియన్. 1639**

**ప్రతి :** తన్నినన్= అలా తన్నగానే; లేచి= నిద్ర లేచి; నీల్గి= ఒళ్లు విరుచుకుని; కను+తమ్ములు= పద్మాలవంటి కండ్లను; మెల్లన= మెల్లగా; విచ్చి= తెరిచి; లోపలన్= మనసులో; సన్నము+కిన్క= పొటమరించిన కోపం; వర్ధిలన్= ఎక్కువ కాగా; దిశల్+కని= దిక్కులు చూచి; దృష్టి= చూపుల్లో; సమ్+ఇద్ధ= ప్రజ్వరిల్లిన; విగ్రహ= వాని శరీరంనుండి; ఉత్పన్న= పుట్టుక వస్తున్న; మహా+అగ్ని కీలములన్= పెద్దమంటలజ్వాలలతో; సాయక= బాణాలతో; ఛిన్న= నరికి ముక్కలు చేయబడ్డ; విరోధి= శత్రువుల; కంఠవనున్= కంఠాలనే అడవులు కలిగినవాడు; శ్రీభవనున్= సంపన్నుడైనవాడు అగు; యవనున్= అయిన కాల యవనుణ్ణి; లఘుక్రియన్= చాలా తేలికగా; అతండు= అతడు; భస్మమున్= బూడిదగా; చేసెను= చేశాడు.

**తా :** అలా తన్నగానే ఆ మహాపురుషుడు నిద్ర లేచాడు. ఒళ్లు విరుచుకున్నాడు. పద్మాలవంటి రెండుకళ్లనూ మెల్లగా తెరిచాడు. లోలోపల కోపం చెలరేగింది. ఆ కోపం పెరుగుతూ వచ్చింది. కండ్లలో అగ్నిజ్వాలలు రేగాయి. శత్రువుల తలలను నరికిన యవనుణ్ణి ఆ మహాపురుషుడు క్షణాల్లో దగ్ధం చేసి, బూడిదకుప్పగా మార్చాడు.

**వ. ఇట్లేకక్షణమాత్రంబున యవనుండు 'నీఱయ్యె' ననిన విని రా జిట్లనియె. 1640**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; ఏక క్షణ మాత్రంబునన్= కేవలం ఒక్క క్షణంలోనే; యవనుండు= కాలయవనుడు; నీఱు+అయ్యెను= బూడిద అయ్యాడు; అనినన్= అని పల్కగా; విని; రాజు= పరీక్షిన్మహారాజు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తా :** ఇలా కేవలం ఒక్క క్షణంలోనే కాలయవనుడు బూడిద అయిపోయాడు - అని చెప్పగా విని పరీక్షిన్మహారాజు ఇలా అన్నాడు.

## ✤ ముచుకుందుని పూర్వకథాభివర్ణనము ✤

**ఆ. 'ఎవ్వఁ డాతఁ? డితని కెవ్వండు దండ్రి ఘో, రాద్రిగుహకు నేటి కతఁడు వచ్చి**
**నిద్రవోయె? యవను నిటు గాల్ప నెట్లోపెఁ?, దెలియఁ బలుకు నాకు ధీవరేణ్య!' 1641**

**ప్రతి :** ధీవరేణ్య= బుద్ధిమంతులలో శ్రేష్ఠుడా! శుకయోగి!; ఎవ్వఁడు+ఆతఁడు= అతడు ఎవరు; ఇతనికిన్= ఆ నిద్రపోతున్న ఈ వ్యక్తికి; ఎవ్వండు తండ్రి= తండ్రి ఎవరు?; ఘోర+అద్రిగుహకున్= భయం కలిగించే ఆ కొండగుహకు; ఏటికిన్= ఎందుకు; అతఁడు= అతడు; వచ్చి; నిద్ర+పోయెన్= నిద్రపోయాడు; యవనున్= కాలయవనుణ్ణి; ఇటు= ఇలా; కాల్పన్= కాల్చడానికి; ఎట్లు+ఓపెన్= ఎలా చేయగలిగాడు?; నాకున్= నాకు; తెలియన్+పలుకు= తెలియ చెప్పు.

**తా :** ప్రజ్ఞావంతులలో శ్రేష్ఠుడవైన ఓ శుకమహర్షీ! ఆ పడుకున్న వ్యక్తి ఎవరు? అతనికి తండ్రి ఎవరు? భయం కలిగించే ఆ కొండ గుహకు ఎందుకు వచ్చి నిద్రపోయాడు? కాలయవనుణ్ణి ఇలా కాల్చ గలిగే శక్తి అతనికి ఎలా వచ్చింది? ఇదంతా వివరంగా నాకు తెలియ చెప్పు.

**వ. అనినం బరీక్షిన్నరేంద్రునకు నతికుతూహలంబుతో శుకయోగివర్యుం డిట్లనియె; నిక్ష్వాకుకుల సంభవుండు మాంధాతకొడుకు ముచుకుందుం డను రాజు రాక్షసభీతులైన వేల్పులం బెద్దకాలంబుసంరక్షించిన మెచ్చి, వా రమరలోకరక్షకుండైన యా రాజకుమారునికడం జేరి వరంబు వేఁడు మనిన వారలం గనుంగొని, మోక్షపదం బడిగిన వార లతని కిట్లనిరి. 1642**

**ప్రతి :** అనినన్= అని అడుగగా; పరీక్షిత్+నర+ఇంద్రునకున్= పరీక్షిన్మహారాజుతో; అతికుతూహలంబుతో= ఎంతో కుతూహలంతో; శుకయోగివర్యుండు= శుకమహర్షి; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు; ఇక్ష్వాకుకులసంభవుండు= ఇక్ష్వాకు వంశంలో పుట్టినవాడైన; మాంధాతయొక్క; కొడుకు= పుత్రుడు; ముచుకుందుండు+అను= ముచుకుందుడు అనే పేరున్న; రాజు; రాక్షస భీతులు+ఐన= రాక్షసులవల్ల భయపడుతూంటే; వేల్పులన్= దేవతలను; పెద్దకాలంబు= ఎంతో కాలం; సంరక్షించినన్= కాపాడగా; మెచ్చి= మెచ్చుకుని; వారు= వాళ్లు; అమరలోక= దేవతాలోకాన్ని; రక్షకుండు+ఐన= కాపాడుతున్న వాడైన; ఆ రాజకుమారుని; కడన్= దగ్గరకి; చేరి; వరంబు వేఁడుము+ అనినన్= వరాన్ని కోరుకోమనగా; వారలన్= వాళ్లను; కనుంగొని= చూచి; మోక్షపదంబు= ముక్తిని; అడిగినన్= కోరగా; వారలు= వాళ్లు; అతనికిన్= అతనితో; ఇట్లు= ఇలా; అనిరి= అన్నారు.

**తా :** ఇలా పరీక్షిన్మహారాజు ప్రశ్నించగా యోగివర్యుడైన శుకమహర్షి ఇలా జవాబిచ్చాడు. ఆ వ్యక్తి ఇక్ష్వాకువంశంలో పుట్టిన మాంధాత అనే మహాత్మునికొడుకు. అతడే ముచికుందుడు అనే రాజు. దేవతలకు రాక్షసులవల్ల కలిగిన భయాన్ని పోగొట్టి

కాపాడినవాడు. అతని రక్షణకు మెచ్చుకుని, వాళ్లు దేవలోకాన్ని కాపాడిన ఆ రాజకుమారునికి వద్దకు వెళ్లి వరం కోరుకొమ్మని చెప్పారు. వెంటనే ముచుకుందుడు ముక్తిని అడుగగా అతనితో దేవతలు ఇలా అన్నారు.

**మ. జగతి న్నిర్గతకంటకం బయిన రాజ్యంబున్ విసర్జించి శూ**
**ర గణాగ్రేసర! పెద్దకాలము మమున్ రక్షించితీ; లోన నీ**
**మగువల్ మిత్రులు బంధులున్ సుతులు సంబంధుల్ భువిన్ లేరు, కా**
**ల గతిం జెందిరి; కాల మెవ్వరికి దుర్లంఘ్యంబు దా నారయన్. 1643**

**ప్రతి :** శూరగణ+అగ్రేసర= వీరులలో ముందుండేవాడా!; జగతిన్= లోకంలో; నిర్గత= పోగొట్టబడిన; కంటకంబు+ అయిన= ముండ్లవలె బాధించే శత్రుసంఘం కల్గినట్టి; (అంటే శత్రువులు లేని); రాజ్యంబున్= రాజ్యాన్ని; విసర్జించి= వదిలిపెట్టి; పెద్దకాలము= ఎంతోకాలం; మమున్= మమ్ములను; రక్షించితి(వి)= రక్షించావు; ఈలోనన్= ఇంతలో; నీ= నీకు సంబంధించిన; మగువల్=స్త్రీలు; మంత్రులు; బంధులున్= బంధువులు; సుతులు= కొడుకులు; సంబంధుల్=సంబంధమున్నవాళ్లు (వివాహాదివిషయాల ద్వారా సంబంధం ఉన్నవాళ్లు); భువిన్= భూమిపై; లేరు; కాలగతిన్+చెందిరి= కాలధర్మం చెందారు (మరణించారు); ఆరయన్= ఆలోచించగా; కాలము= కాల మనేది; ఎవ్వరికిన్= ఎలాంటివారికి కూడా; దుర్+లంఘ్యంబు= దాటరానిది కదా!

**తా :** వీరులలో మొదటగా నిలబడేవాడా! లోకంలో శత్రువంటూ లేనిరాజ్యం నీది. అలాంటిరాజ్యాన్ని వదిలేసి, ఎంతోకాలం ఇక్కడ ఉండి మమ్ములను రక్షించావు. ఇంతలో నీకు సంబంధించిన స్త్రీలు, మంత్రులు, బంధువులు, కొడుకులు, సంబంధీకులు ఎవ్వరూ భూమిపై లేరు. కాలధర్మం చెందారు. ఆలోచిస్తే కాలమనేది ఎంతటివాళ్లకైనా దాటరానిది కదా!

**క. కాలము ప్రబలులకును బలి, కాలాత్ముం డీశ్వరుం డగణ్యుఁడు జనులం**
**గాలవశులుగాఁ జేయును, గాలము గడవంగలేరు ఘను లెవ్వారున్. 1644**

**ప్రతి :** కాలము= కాలమనేది; ప్రబలులకును= గొప్ప బలవంతులకంటె; బలి= బలీయమైంది; కాల+ఆత్ముండు= కాలస్వరూపుడు; ఈశ్వరుండు= భగవంతుడు; అగణ్యుఁడు= కొలవడానికి అందనివాడు; జనులన్= జనాన్ని; కాలవశులన్+కాన్= కాలానికి లొంగిపోయేటట్లు; చేయును= చేస్తాడు; కాలమున్= కాలాన్ని; ఘనులు+ఏ+వారున్= గొప్పవాళ్లెవరైనా సరే; కడవంగన్ లేరు= అతిక్రమించలేరు.

**తా :** కాలమనేది మహాబలవంతులందరికంటె బలీయమైంది. దైవం కాల స్వరూపుడు. అతడిని లెక్కించడానికి సాధ్యం కాదు. ఆయన లోకంలోని వాళ్లను కాలానికి లొంగిపోయేలా చేస్తాడు. ఎంతెంత గొప్పవాళ్లయినా సరే కాలాన్ని అతిక్రమించలేరు.

**క. వర మిచ్చెద మర్థింపుము, ధరణీశ్వర! మోక్షపదవి దక్కను మే మె**
**వ్వరమును విభులము గా మీ, శ్వరుఁడగు హరి దక్క మోక్షసంగతిఁ జేయన్. 1645**

**ప్రతి :** ధరణి+ఈశ్వర= భూమికి అధిపతి అయినవాడా, రాజా!; మోక్షపదవి= మోక్షం; తక్కను= తప్ప; వరము+ఇచ్చెదము= నీవు కోరుకున్నది ఇస్తాము; అర్థింపుము= కోరుకో; మోక్ష సంగతిన్= ముక్తి విషయాన్ని చేయన్= లభింపజేయడానికి; ఈశ్వరుఁడు+అగు= ప్రభువైన; హరి తక్క= విష్ణువు తప్ప; మేము+ఎవ్వరమును= మేము ఎవరమూ కూడా; విభులము= అధికారులం; కాము.

**తా :** రాజా! నీవు కోరుకున్న వరాన్ని ఇస్తాం, మోక్షం తప్ప మరేదైనా అడుగు. మోక్షమివ్వడానికి ప్రభువైన విష్ణువు ఒక్కడు తప్ప మేమెవరమూ అధికారులం కాము.

**వ. అని పలికిన దేవతలకు నమస్కరించి, ముచుకుందుండు నిద్రం గోరి దేవదత్తనిద్రావశుండై పర్వతగుహాంతరాళంబున శయనించి యుండె; యవనుండు నీఱైన పిమ్మట, హరి ముచుకుందునిముందట నిల్చిన. 1646**

**ప్రతి :** అని= ఈ విధంగా; పలికినన్= చెప్పగా; దేవతలకున్= దేవతాసమూహానికి; నమస్కరించి= అభివాదం చేసి; ముచుకుందుండు= ముచుకుందుడు; నిద్రన్+కోరినన్= నిద్రకావాలని కోరుకోగా; దేవదత్త= దేవతలచేత ప్రసాదింపబడిన; నిద్రావశుండు+ఐ= నిద్రకు లొంగిపోయినవాడై; పర్వత= కొండయొక్క; గుహ+అంతరాళంబునన్= గుహలోపలి భాగంలో; శయనించి+ఉండెన్= పవళించి ఉన్నాడు; యవనుండు= కాలయవనుడు; నీఱు+ఐన= బూడిదైన; పిమ్మట= తరువాత; ముచికుందుని; ముందట= ఎదుట; హరి= శ్రీకృష్ణుడు; నిల్చినన్= నిలబడగా...

**తా :** ఇలా చెప్పిన దేవతాసమూహానికి ముచికుందుడు నమస్కరించి. నిద్రను కోరుకున్నాడు. వారిచ్చిన నిద్రకు వశుడై గుహలోపల నిద్రిస్తూ ఉండినాడు. కాలయవనుడు బూడిదైన తర్వాత, శ్రీకృష్ణుడు ముచుకుందునిఎదుట నిలబడ్డాడు. అప్పుడు-

**సీ. వనరుహలోచను వైజయంతీదామశోభితు రాకేందుసుందరాస్యు**
**మకరకుండలకాంతిమహితగండస్థలుఁ గౌస్తుభాలంకృతు ఘనశరీరు**
**శ్రీవత్సలాంఛనాంచితవక్షు మృగరాజమధ్యుఁ జతుర్బాహు మందహాసు**
**గాంచనసన్నిభకౌశేయవాసు గాంభీర్యసౌందర్యశోభితుఁ బ్రసన్ను**

**ఆ. న మ్మహాత్ముఁ జూచి యాశ్చర్యమును బొంది, తన్మనోజ్ఞదీప్తి దనకుఁ జూడ**
**నలవిగాక చకితుఁడై యెట్టకేలకుఁ, బలికెఁ బ్రీతి నవనిపాలకుండు. 1647**

**ప్రతి :** వనరహ= (నీటిలో పుట్టింది) కమలంవంటి; లోచనున్= కళ్లు కలవాడిని; వైజయంతీదామ= వైజయంతీ అనే పేరున్న పూలమాలచేత; శోభితున్= విలసిల్లుతున్నవాడిని; రాకా+ఇందు= పున్నమినాటి చంద్రునివంటి; సుందర+ఆస్యున్= అందమైన ముఖం కలవాడిని; మకరకుండల= మొసలివంటి ఆకారంలో ఉన్న కర్ణకుండలాలయొక్క; కాంతి= వెలుగుతో; మహిత= గొప్పవైన; గండస్థలున్= చెక్కిళ్లు కలవాడిని; కౌస్తుభ= కౌస్తుభమనే మణిచేత; అలంకృతున్= అలంకరింపబడినవాణ్ణి; ఘనశరీరున్= మేఘంవలె నల్లనైన శరీరం కలవాడిని; శ్రీవత్స= శ్రీవత్సమనే పేరున్న లాంఛన= మచ్చతో; అంచిత= పూజింపదగిందైన (గొప్పదైన); వక్షున్= వక్షస్థలం కలవాడిని; మృగరాజమధ్యున్= సింహం నడుమువంటి నడుము కలిగినవాడిని; చతుర్+బాహు= నాలుగు చేతులున్న వాడిని; మందహాసున్= చిరునవ్వు నవ్వుతున్నవాడిని; కాంచన సన్నిభ= బంగారురంగువంటి రంగుగల్గిన; కౌశేయవాసున్= పట్టువస్త్రాన్ని తాల్చినవాడిని; గాంభీర్య= గంభీరం చేతను; సౌందర్య= సుందరత్వం చేతను; శోభితున్= భాసిల్లే వాడిని; ప్రసన్నున్= అనుగ్రహం కలవాడిని; ఆ+మహా+ఆత్మున్= ఆ మహానుభావుడైన శ్రీకృష్ణుణ్ణి; చూచి; ఆశ్చర్యమును+పొంది= ఆశ్చర్యపడి; తద్+మనోజ్ఞ దీప్తి= ఆ మనోహరమైన ఆతని అందమైన కాంతి; తనకున్= తనకు; చూడన్+అలవి కాక= చూడడానికి వీలుగాక; చకితుఁడు+ఐ= భయపడినవాడై; అవనిపాలకుండు= రాజు; (ముచుకుందుడు); ఎట్టకేలకున్= అతి ప్రయాసంతో; ప్రీతిన్= ప్రేమతో; పలికెన్= ఇలా అన్నాడు.

**తా :** శ్రీకృష్ణుని కండ్లు కమలాలవలె అందంగా ఉన్నాయి ఆయనమెడలో వైజయంతిమాల ఉంది. నిండు పున్నమినాటి చందమామవలె ఆయనముఖం వెలుగులీనుతూ ఉంది. మకరకుండలాలు కాంతిమంతంగా ఉన్నాయి. ఆ కాంతికి చెక్కిళ్లు మెరుగెక్కినాయి. మెడలో కౌస్తుభం అనే మణిని ధరించాడు. వానమబ్బువంటి అందమైన వన్నెతో అతడి దేహం సొగసుగా ఆయనది. ఆయనకు శ్రీవత్సమనే పేరున్న పుట్టుమచ్చ ఉంది. సింహానికి ఎలా సన్నని నడుముంటుందో అలాంటి నడుము ఉంది. ఆయనకు నాలుగు చేతులున్నాయి. చిరునవ్వు చిందిస్తూ ఉన్నాడు. బంగారు రంగువంటి రంగుతో ఉన్న పట్టువస్త్రాన్ని కట్టుకున్నాడు. గంభీరంగా ఉన్నాడు. అత్యంత సుందరంగా ఉన్నాడు. అతనిమనోహరమైన కాంతిని ఎదిరించి చూడడం సాధ్యంకాక, అంతటి మహా తేజస్సంపన్నుడైన, మహాత్ముడైన శ్రీకృష్ణుని చూచి ముచికుందుడు సంభ్రమంచెంది అతికష్టంపై ఆశ్చర్యం నుంచి తేరుకుని, ప్రీతితో ఇలా మాట్లాడాడు.

**మ. శశివో? యింద్రుఁడవో? విభావసుఁడవో? చండప్రభారాశివో?**
**శశిచూడామణివో? పితామహుఁడవో? చక్రాంకహస్తుండవో?**
**దిశలున్ భూమియు మిన్ను నిండె నిదె నీతేజంబుఁ జూడంగ దు**
**ర్వశమై; యెవ్వఁడ? వేల వచ్చి తిచటన్ వర్తించె దేకాకివై? 1648**

**ప్రతి :** శశివి+ఓ= చంద్రుడవో; ఇంద్రుఁడవు+ఓ= ఇంద్రుడవో; విభావసుఁడవు+ఓ= ప్రకాశించే అగ్నిదేవుడవో; చండప్రభారాశివి+ఓ= సూర్యదేవుడవో; శశిచూడామణివో= తలపై చంద్రుణ్ణి మణిగా తాల్చిన శివుడవో; పితామహుఁడవు+ఓ= బ్రహ్మవో; చక్ర+అంక+హస్తుండవు+ఓ= చక్రాన్ని చేతదాల్చిన శ్రీమహావిష్ణుడవో; ఇది+ఎ= ఇదిగో; నీ తేజంబున్= నీ తేజుస్సు; దిశలున్ = దిక్కులు; భూమియున్= భూమి; మిన్ను= ఆకాశం; చూడన్+కన్= చూడడానికి; దుర్వశము+ఐ= వశంకానిదై (లొంగనిదై); నిండెన్= నిండింది; ఎవ్వఁడవు= ఎవరివి నీవు; ఏకాకివి+ఐ= ఒంటరివాడవై; ఇచటన్= ఇక్కడ; వర్తించెదు(వు)= తిరుగుతున్నావు; ఏల వచ్చితి(వి)= ఎందుకు వచ్చావు?

**తా :** చంద్రుడవో, ఇంద్రుడవో, చెలరేగి వెలుగుతున్న అగ్నివో, ప్రకాశించే సూర్యుడవో, తలపై చంద్రుని దాల్చిన శివుడవో, బ్రహ్మదేవుడవో, చక్రాన్ని దాల్చిన శ్రీమహావిష్ణుడవో తెలియడం లేదు. నీ కాంతి దిక్కులు, నేల, ఆకాశం అంతా నిండిపోయింది. ఈ తేజస్సు చూడడానికి శక్తి చాలటం లేదు. ఎవరివి నీవు? ఎందుకు వచ్చావు? ఒంటరిగా ఇక్కడ ఎందుకు తిరుగుతున్నావు?

**క. ఈ యడవి విషమకంటక, భూయిష్ఠము ఘోరసత్త్వపుంజాలభ్యం**
**బో యయ్య? యెట్లు వచ్చితి?, నీ యడుగులు కమలపత్త్రనిభములు సూడన్. 1649**

**ప్రతి :** ఈ+అడవి= ఈ అరణ్యం; విషమ= ఎగుడుదిగుడులతో; కంటక= ముండ్లతో; భూయిష్ఠము= నిండి ఉంది; ఘోర= భయంకరమైన; సత్త్వ పుంజ= జంతువుల సమూహాలతో; అలభ్యంబు= చొరరానిది; ఓ+అయ్య= ఓ స్వామీ!; ఎట్లు= ఎలా; వచ్చితి(వి)= వచ్చావు? నీ+అడుగులు= నీ పాదాలు; చూడన్= చూడగా; కమలపత్త్ర నిభములు= తామరరేకులమాదిరి ఉన్నాయి.

**తా :** ఓ స్వామీ! నీ పాదాలు చూస్తే కోమలమైన తామరరేకులవలె ఉన్నాయి. మరి ఈ అడవి అంతా ఎగుడుదిగుడుగా ఉంది. ముళ్లతో నిండి ఉంది. భయంకరమైన మృగాలతో ఉంది. ప్రవేశించడానికి వీలుకానిదిగా ఉంది. అలాంటి అడవిలోకి ఎలా వచ్చావు?

**వ. మహాత్మా! యేను నీకు శుశ్రూషణంబు సేయం గోరెద; నీ జన్మగోత్రంబు లే నెఱుంగ నర్హుండనేని నెఱింగింపుము; నే నిక్ష్వాకువంశసంభవుండ; మాంధాతృనందనుండ; ముచుకుందుం డనువాఁడ; దేవహితార్థంబు చిరకాలజాగరశ్రాంతుండ నయి నిద్ర నొంది యింద్రియసంచారంబులు మఱచి. 1650**

**ప్రతి :** మహా+ఆత్మా= మహానుభావా!; ఏను= నేను; నీకు; శుశ్రూషణంబు= సేవ; చేయన్+కోరెదన్= చేయాలని ఆశిస్తున్నాను; నీ= నీకు సంబంధించిన; జన్మ గోత్రంబులు= పుట్టుక గోత్రాలు; ఏన్= నేను; ఎఱుంగన్= తెలుసుకొనుటకు; అర్హుండను+ఏనిన్= అర్హత కలిగినవాడినైతే; ఎఱింగిపుము= తెలియజెప్పు; నేను; ఇక్ష్వాకువంశసంభవుండన్= ఇక్ష్వాకువంశంలో పుట్టినవాడిని; మాంధాతృ= మాంధాతయొక్క; నందనుండన్= కొడుకును; ముచుకుందుండు+అనువాఁడన్= ముచుకుందుడు అనే పేరుగల వాడిని; దేవహిత+అర్థంబు= దేవతలకు మేలు చేయాలనే ఉద్దేశంతో; చిరకాల= చాలాకాలం; జాగర= మేల్కొని; శ్రాంతుండను+ఐ= అలసిపోయినవాడినై; నిద్రను+ఒంది= నిద్రను వరంగా పొంది; ఇంద్రియసంచారంబులు= ఇంద్రియాలకు సంబంధించిన కదలికలు (వినడం, చూడటం వంటివి); మఱచి= మరచి...

**తా :** మహాత్మా! నీకు సేవచేయాలని నేను కోరుకుంటున్నాను. నీ పుట్టుక, వంశంగురించి నేను తెలుసుకోవడానికి అర్హుణ్ణి అనిపిస్తే తెలియజేయి. నేను ఇక్ష్వాకువంశంలో పుట్టాను. మాంధాతకొడుకును. నాపేరు ముచుకుందుడు. దేవతలకు సహాయం చేయాలని చాలాకాలం నిద్రపోక మేలుకునే ఉన్నాను. బాగా అలసిపోయాను. అందువల్ల నిద్రను వరంగా పొంది, ఇంద్రియవ్యాపారాలు మరచి

**శా. ఏ నిద్రించుచు నుండ నొక్క మనుజుం డేతెంచి దుష్కర్ముఁడై**
**తా నీఱై చెడె నాత్మకిల్బిషమునన్ దర్పోగ్రుఁడై; యంతటన్**
**శ్రీనాథాకృతివైన నిన్నుఁ గని వీక్షింప న్నశక్తుండనై**
**దీనత్వంబును జెందితిన్; ననుఁ గృపాదృష్టిన్ విలోకింపవే. 1651**

**ప్రతి :** ఏన్= నేను; నిద్రించుచున్+ఉండన్= నిద్రపోతూ ఉండగా; ఒక్క మనుజుండు= ఒక మనిషి; ఏతెంచి= వచ్చి; దుష్కర్ముఁడు+ఐ= చెడుప్రవర్తన కలిగినవాడై; ఆత్మకిల్బిషమునన్= తాను చేసినపాపంవల్ల; దర్ప+ఉగ్రుఁడు+ఐ= భయంకరమైన పొగరబోతుతనంతో; తాన్= తాను; నీఱు+ఐ= బూడిదగా మారి; చెడెన్= నశించాడు; అంతటన్= ఆ తర్వాత; శ్రీనాథ+ ఆకృతివి+ఐన= శ్రీమహావిష్ణువువంటిరూపంతో ఉన్న; నిన్నున్+కని= నిన్ను చూచి; వీక్షింపన్= తేరిపారజూడడానికి; అశక్తుండన్+ఐ= శక్తి చాలనివాడినై; దీనత్వంబునున్= దైన్య స్థితిని; చెందితిన్= పొందాను; ననున్= నన్ను; కృపాదృష్టిన్= దయతో కూడిన చూపులతో; విలోకింపవు+ఏ= చూడవా?

**తా :** నేను నిద్రపోతుండగా ఎవరో మనిషి ఒకడు వచ్చాడు. వాడిప్రవర్తన ఏమీ బాగాలేదు. చాలా పొగరుబోతు. తాను చేసినపాపంవల్ల తానే బూడిదగా మారి నాశనమై పోయాడు. అటు తర్వాత, శ్రీమహావిష్ణువువంటిరూపంతో నీవు కనిపించావు. నిన్ను తేరిపార చూద్దామంటే కూడా నాకు చేత కావడం లేదు. నేను దీనుడి నయ్యాను. నన్ను నీ దయతో కూడిన చల్లనిచూపులతో చూడవా?

**వ. అనిన విని మేఘగంభీరభాషణంబుల హరి యిట్లనియె. 1652**

**ప్రతి :** అనినన్= అని వేడుకోగా; విని; మేఘగంభీర= మేఘంయొక్క గంభీరమైన గర్జనవంటి ధ్వనిగల; భాషణంబులన్= మాటలతో; హరి= శ్రీకృష్ణుడు; ఇట్లు+ అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** ముచుకుందుడు అలా వేడుకోగా, విని శ్రీకృష్ణుడు మేఘగర్జనవంటి గంభీర స్వరంతో ఇలా అన్నాడు.

**సీ. భూరజంబులనైన భూనాథ! యెన్నంగఁ జనుఁగాని; నా గుణజన్మకర్మ**
**నామంబు లెల్ల నెన్నంగ నెవ్వరుఁ జాల రది యేల? నాకును నలవిగాదు**
**నేలకు వ్రేఁగైన నిఖిలరాక్షసులను నిర్జించి ధర్మంబు నిలువఁబెట్ట**
**బ్రహ్మచే మున్ను నేఁ బ్రార్థింపఁబడి వసుదేవునింటను వాసుదేవుఁ డనఁగఁ**

**ఆ. గరుణ నవతరించి కంసాఖ్యతో నున్న, కాలనేమిఁ జంపి ఖలుల మఱియుఁ**
**ద్రుంచుచున్నవాఁడఁ దొడరి నీ చూడ్కి నీ, ఱైనవాఁడు కాలయవనుఁ డనఘ! 1653**

**ప్రతి :** భూనాథ= రాజా; అనఘ= పుణ్యాత్మా!; భూరజంబులను+ఐనన్= భూమిలోని ధూళి కణాలనైనా; ఎన్నన్+కన్= లెక్కపెట్టడానికి; చనున్+కాని= వీలవుతుంది కాని; నా= నాయొక్క; గుణ= గుణాలనుగురించి గానీ; జన్మ= పుట్టుకలను గురించిగానీ; కర్మ= చేతలనుగురించిగానీ; నామంబులు+ఎల్లను= పేర్ల గురించి గానీ వీటన్నిగురించి; ఎన్నన్+కన్= లెక్కించడానికి; ఎవ్వరున్= ఎవ్వరుకూడా; చాలరు= తగిన శక్తి ఉన్నవాళ్లు కారు; అది+ఏల= అంతెందుకు; నాకునున్= నాకు కూడా; అలవి గాదు= చేతకాదు; నేలకున్= భూమికి; వ్రేఁగు+ఐన= బరువైన; నిఖిల రాక్షసులను= రాక్షసులనందరినీ; నిర్జించి= జయించి; ధర్మంబున్= ధర్మాన్ని; నిలువన్+పెట్టన్= నిలబెట్టడానికి; బ్రహ్మచే= బ్రహ్మచేత; మున్ను= మునుపు; నేన్= నేను; ప్రార్థింపన్+పడి= వేడుకోబడి; వసుదేవుని; ఇంటను= ఇంట్లో; వాసుదేవుఁడు+అనన్+కన్= వాసుదేవుడు అనే పేరుతో; కరుణన్+అవతరించి= దయతో జన్మించి; కంస+అఖ్యతోన్+ఉన్న= కంసుడనే పేరుతో ఉండిన; కాలనేమిన్+చంపి= కాలనేమి అనే రాక్షసుణ్ణి వధించి; మఱియున్= ఇంకా; ఖలులన్= చెడ్డవాళ్లను; త్రుంచుచున్+ఉన్నవాఁడన్= చంపుతూ ఉన్నాను; తొడరి= పూనుకొని; నీ చూడ్కిన్= నీ చూపుసోకి; నీఱు+ఐనవాఁడు= బూడిద అయినవాడు; కాలయవనుఁడు= కాలయవనుడు.

**తా :** పాపాలుసోకనిమహారాజా! భూమిపై ఉన్నధూళికణాలను లెక్కపెట్టవచ్చు కానీ నా గుణాలను గురించి, పుట్టుకలను గురించి, చేతలనుగురించి, పేర్లనుగురించి – వీటిన్నిటిని గురించి లెక్కించడానికి ఎవరికీ శక్తి లేదు. అంతదాకా ఎందుకు? నాకుకూడా చేతకాదు. భూమికి బరువుగా ఉన్న రాక్షసులను జయించి, ధర్మాన్ని నిలబెట్టమని మునుపు బ్రహ్మ నన్ను వేడుకున్నాడు. సరే! అని, దయతో నేను వసుదేవునిఇంట్లో పుట్టాను. నన్ను వాసుదేవుడని అంటారు. కంసుడనే పేరుతో ఉన్న కాలనేమి అనే రాక్షసుణ్ణి చంపాను. ఇంకా చెడ్డ వాళ్లందరినీ చంపుతున్నాను. నీవు కళ్లుతెరచి చూస్తే ఇపుడు బూడిదై పోయాడే, వాడు కాలయవనుడు.

**వ. వినుము; తొల్లియు నీవు నన్ను సేవించినకతంబున ని న్ననుగ్రహింప నీ శైలగుహకు నేతెంచితి; నభీష్టంబు లయిన వరంబు లడుగు మిచ్చెద. మద్భక్తులగుజనులు క్రమ్మఱ శోకంబున కర్హులు గా రనిన హరికి ముచుకుందుండు నమస్కరించి, నారాయణదేవుం డగుట యెఱింగి, యిరువదియేనిమిదవ మహాయుగంబునందు నారాయణుం డవతరించు నని మున్ను గర్గుండు చెప్పుటఁ దలంచి. 1654**

**ప్రతి :** వినుము= ఆలకించుము; తొల్లియున్= మునుపు; నీవు; నన్నున్= నన్ను; సేవించిన= పూజించిన; కతంబునన్= కారణంవల్ల; నిన్ను(న్); అనుగ్రహింపన్= అనుగ్రహించడానికి; ఈ శైలగుహకున్= ఈ కొండగుహకు; ఏతెంచితినిన్= వచ్చాను; అభి+ఇష్టంబులు+అయిన= నీకు బాగా ఇష్టమైన; వరంబులు+అడుగుము= వరాలను కోరుకో; ఇచ్చెదన్= ఇస్తాను; మత్+భక్తులు+అగు= నాకు భక్తులైన; జనులు= ప్రజలు; క్రమ్మఱన్= తిరిగి; శోకంబునకున్= దుఃఖం పొందడానికి; అర్హులు+కారు= తగినవాళ్లు కాదు; అనినన్= అని చెప్పగా; హరికిన్= శ్రీకృష్ణునికి; ముచుకుందుండు= ముచుకుందుడు; నమస్కరించి= నమస్కారం చేసి; నారాయణ దేవుండు+అగుటన్= ఈయన శ్రీమహావిష్ణువు అని; ఎఱింగి= తెలుసుకుని (గ్రహించి) ఇరువది+ఎనిమిదవ= ఇరవై ఎనిమిదో; మహాయుగంబున+అందున్= మహాయుగంలో; నారాయణుండు= శ్రీమహావిష్ణువు; అవతరించున్+అని= అవతరిస్తాడని; మున్ను= మునుపు; గర్గుండు= గర్గుడు అనే ఋషి; చెప్పుటన్= చెప్పిన విషయాన్ని; తలంచి= గుర్తు చేసుకుని;

**తా :** ఒక విషయం చెప్తాను ఆలకించు. మునుపటి జన్మల్లో నీవు నన్ను పూజించావు. అందుకని, నిన్ను అనుగ్రహించడం కోసం ఈ కొండగుహకు వచ్చాను. నీకు ఏం కావాలో కోరుకో ఇస్తాను. నాకు భక్తులైన వాళ్లు ఇక దుఃఖం పొందడానికి అనర్హులు అని శ్రీకృష్ణుడు చెప్పాడు. ఈ మాటను విని, ముచుకుందుడు శ్రీకృష్ణునికి నమస్కరించాడు. అతడు సాక్షాత్తు శ్రీమహావిష్ణు వని గ్రహించాడు; ఇరవైఎనిమిదవ మహాయుగంలో శ్రీమన్నారాయణుడు అతవరిస్తాడని మునుపు గర్గుడు అనే ఋషి చెప్పిన మాటను ముచుకుందుడు గుర్తుచేసుకున్నాడు.

## ❖ ముచుకుందుఁడు శ్రీకృష్ణుని స్తోత్రము చేయుట ❖

**క. నీ మాయఁ జిక్కి పురుష, స్త్రీమూర్తికజనము నిన్ను సేవింపదు; వి**
**త్తామయగృహగతమై సుఖ, తామసమై కామవంచితం బయి యీశా! 1655**

**ప్రతి :** ఈశా= ఈశ్వరా!; నీ మాయన్= నీయొక్క మాయలో; చిక్కి= తగిలి; పురుషస్త్రీమూర్తికజనము= మగవాళ్లు ఆడవాళ్లు అనే రూపాల్లో ఉన్న జనం; విత్త+ఆమయ= ధనమనే రోగాల్ని; గృహ= ఇండ్లు, సంసారాన్ని; గతము+ఐ= పొందిందై (సంసారంలో పడిపోయి); (విత్త+ఆమయ గృహగతము+ఐ= ధనంనందు, రోగంనందు, సంసారంనందు నిష్ఠకలిగినదై); సుఖ= క్షణకాల సుఖాలనే; తామసము+ఐ= చీకట్లు కలదై; కామవంచితంబు+అయి= కోరికలచేత మోసగించబడిందై; నిన్నున్= నిన్ను; సేవింపదు= పూజ సేయదు.

**తా :** ఈశ్వరా! ఈ ప్రపంచంలో స్త్రీ పురుషరూపాలతో ఉన్న జనం నీ మాయాజాలంలో తగుల్కొని. నిన్ను పూజించరు. ధనం ఒక రోగంలాగా వాళ్లను పీడిస్తుంది. ఇల్లు, సంసారం, సుఖం అనే ఆలోచనలతో కళ్లు మసకబారతాయి. సుఖాల మాయలో పడతారు. కోరికలు వాళ్లను మోసం చేస్తాయి.

**ఉ. పూని యనేకజన్మములఁ బొంది తుదిం దన పుణ్యకర్మ సం**
**తానము పేర్మిఁ గర్మవసుధాస్థలిఁ బుట్టి ప్రపూర్ణదేహుఁడై**
**మానవుఁడై గృహేచ్ఛఁ బడు మందుఁ డజంబు తృణాభిలాషియై**
**కానకపోయి నూతఁ బడు కైవడి నీ పదభక్తిహీనుఁడై. 1656**

**ప్రతి :** అజంబు= మేక; తృణ+అభిలాషి+ఐ= గడ్డిమీద ఆశతో; కానక= చూడకుండా; (గమనించకుండా); పోయి= వెళ్లి; నూతన్ పడు కైవడిన్= బావిలోపడినవిధంగా; నీ= నీయొక్క; పద= పాదాలపై; భక్తిహీనుఁడు+ఐ= భక్తిలేనివాడై; మందుఁడు= తెలివిలేనివాడు; పూని= ప్రయత్నంతో; అనేకజన్మములన్= ఎన్నో జన్మలను; పొంది= పొందుతూ; తుదిన్= చివరలో; తన పుణ్యకర్మ= తాను చేసిన మంచిపనుల; సంతానము పేర్మిన్= సమూహాల బలంతో; కర్మవసుధాస్థలిన్= ఈ కర్మభూమిలో; పుట్టి= జన్మించి; ప్రపూర్ణదేహుఁడు+ఐ= పూర్ణశరీరం కలవాడై; మానవుఁడు+ఐ= మనిషిగా మారి; గృహ+ఇచ్ఛన్= ఇల్లు అనే (మమకారంలో) కోరికలో; పడున్= పడతాడు.

**తా :** బావి మీద గడ్డి పెరిగి ఉంటుంది. మేక దాన్ని చూచి తినాలనే ఆశతో దగ్గరికి వెళ్లి, బావిని గమనించక అందులో పడిపోతుంది. అలాగే జీవికూడా లెక్క లేనన్ని జన్మలనెత్తుతుంది. అలా జన్మలెత్తుతూ ఎత్తుతూ చివరకు తాను చేసిన పుణ్యకర్మలకు ఫలితంగా కర్మభూమిలో పదే పదే పుట్టి 'మనిషిగా మంచిశరీరంతో జన్మించికూడా చివరకు మూఢుడై' నీ పై భక్తిలేనివాడై ఇల్లూ వాకిలి అనే మమకారంలో పడతాడు.

**క. తరుణీపుత్త్రధనాదుల, మరగి మహారాజ్యవిభవమదమత్తుఁడనై**
**నరతనులుబ్ధుఁడ నగు నా, కరయఁగ బహుకాల మీశ! యాఱడిఁబోయెన్. 1657**

**ప్రతి :** ఈశ= ఈశ్వరా!; తరుణీ= వయసులో ఉన్న ఆలు; పుత్త్ర= కొడుకులు; ధన+ఆదులన్= ధనము మొదలైనవాటిని; మరిగి= రుచి మరిగి; మహారాజ్య= గొప్పరాజ్యమనే; విభవ= వైభవంతో; మద= పొగరెక్కి; మత్తుఁడన్+ఐ= మైకంలోపడి; నరతను లుబ్ధుఁడన్+అగు= మానవశరీరంమీదిఆశతో ఉన్న; నాకు(న్); అరయన్+కన్= చూడగా; బహుకాలము= చాలాకాలం; ఆఱడిన్+పోయెన్= వృథాగా గడిచిపోయింది.

**తా :** భార్య, పిల్లలు, ధనసంపాదన అనే వాటిలో పడిపోయాను. మహారాజ్యవైభవంతో మత్తెక్కిపోయిన మనస్సు కలవాడినైనాను. ఈ శరీరంపైన అంతులేనిఆశ పెంచుకున్నాను. ఈ ఆలోచనలలో పడిననాకు ఈశ్వరా! ఎంతోకాలం వృథాగా గడిచిపోయింది

**క. ఘటకుడ్యసన్నిభం బగు, చటులకళేబరముఁ జొచ్చి జనపతి నంచుం**
**బటుచతురంగంబులతో, నిటు నటుఁ దిరుగుదును నిన్ను నెఱుఁగక యీశా! 1658**

**ప్రతి :** ఈశా= ఈశ్వరా!; ఘట= కుండతో; కుడ్య= గోడతో; సన్నిభంబు+అగు= సమానమైందయిన; చటుల= చంచలమైన; కళేబరమున్= శరీరాన్ని; చొచ్చి= ప్రవేశించి; జనపతిన్+అంచున్= నేను చక్రవర్తిని అంటూ; పటు= దృఢమైన; చతురంగంబులతోన్= రథ, గజ, తురగ, పదాతిదళాలు అనే నాలుగు అంగాలుగల బలాలతో; నిన్నున్= నిన్ను; ఎఱుఁగక= తెలుసుకోలేక; ఇటున్+అటున్= ఈ వైపు ఆ వైపులకు; తిరుగుదును= తిరుగుతున్నాను.

**తా :** ఈశ్వరా! కుండలాంటి, గోడలాంటి పెళుసై చంచలమైన ఈ శరీరంలో ప్రవేశించి, నేను రాజును అనుకుంటూ, రథ గజ తురగ పదాతిబలంతో గర్విస్తూ అటూ ఇటూ తిరుగుతూ ఉంటినేగాని నిన్ను తెలుసుకోలేక పోయాను.

**ఆ. వివిధకామభోగవిషయలాలసు మత్తు, నప్రమత్తవృత్తి నంతకుండ**
**వైన నీవు వేళ యరసి త్రుంతువు సర్ప, మొదిఁగి మూషికంబు నొడియు నట్లు. 1659**

**ప్రతి :** వివిధ= రకరకాలైన; కామ= కోరికలు; భోగ= సుఖాలు అనే ఆశలు; విషయ= ఇంద్రియవిషయాలలో; లాలసున్= మిక్కిలి ఆశ కలిగినవాడిని; మత్తున్= మైకంలో ఉన్నవాడిని; అప్రమత్తవృత్తిన్= ఏమాత్రం ఏమారని పద్ధతిలో; అంతకుండవు+ఐన=

యముని ఆకృతి ధరించినట్టి; నీవు; సర్పము= పాము; ఒదిఁగి= పొంచి; మూషికంబున్= ఎలుకను; ఒడియు+అట్లు= చటుక్కున ఒడిసి పట్టుకొన్నట్లు; వేళ+అరసి= సమయం చూచి; త్రుంతువు(త్రుంచుదువు)= సంహరిస్తావు.

**తా :** పలువిధములైన కోరికలూ, సుఖాలు మున్నగు ఇంద్రియ విషయాలపై మిక్కిలి ఆశగల్గినవాణ్ణి, మత్తుణ్ణి, నీవు ఏమరుపాటు చెందక అంతకస్వరూపుడివై – పాము కనిపెట్టి యుండి తటాలున ఎలుకను ఒడిసి పట్టుకున్నట్లు సమయం రాగానే పట్టి హరిస్తావు.

**క. నరవర సంజ్ఞితమై రథ, కరిసేవితమైన యొడలు కాలగతిన్ భీ**
**కర మృగ భక్షితమై దు, స్తర విట్క్రిమి భస్మసంజ్ఞితం బగు నీశా! 1660**

**ప్రతి :** ఈశా= ఈశ్వరా; నరవర= రాజు అనే; సంజ్ఞితమై= పేరుతో పిలువబడింద్రై; రథ= రథాలతో; కరి= ఏనుగులతో; సేవితము+ఐన= సేవించబడిందైన; ఒడలు= శరీరం; కాలగతిన్= కాలక్రమంలో; భీకర= భయంకరమైన; మృగ= జంతువుల చేత; భక్షితము+ఐ= తినబడింద్రై; దుస్తర= దాటడానికి వీలు కాని (తప్పించుకోలేని); విట్+క్రిమి= మలమనీ, క్రిమి అనీ; భస్మ= బూడిద అనీ; సంజ్ఞితంబు+అగున్= వ్యవహరింపబడుతున్నది (పిలువబడుతూంది).

**తా :** ఈశ్వరా! ఈ శరీరం రాజు అనే పేరుతో పిలువబడుతూ, రథాలతో, ఏనుగులతో సేవించబడుతూ కాలక్రమంలో భయంకరమైన జంతువుల చేత తినబడడంవల్ల మలమనీ, క్రిములతో నిండిందనీ, బూడిద అనీ వ్యవహరింపబడుతున్నది.

**ఆ. సకలదిశలు గెలిచి సములు వర్ణింపంగఁ, జారుపీఠ మెక్కి సార్వభౌముఁ**
**డైన సతులగృహములందుఁ గ్రీడాభోగ, వృత్తినుండు; నిన్ను వెదకలేఁడు. 1661**

**ప్రతి :** సకల దిశలు= అన్ని దిక్కులను; గెలిచి= జయించి; సములు= సాటివాళ్లు; వర్ణింపన్+కన్= తనను పొగడుతూ ఉంటే; చారు పీఠము+ఎక్కి= ఒప్పిదమైన ఆసనాన్ని ఎక్కి కూర్చుని; సార్వభౌముఁడు= చక్రవర్తి; ఐనన్= అయినప్పటికీ; సతుల= ఆడవాళ్ల; గృహముల+అందున్= ఇండ్లలో; క్రీడా+భోగ= కామసుఖాలయొక్క; వృత్తిన్= అనే పనిలో; ఉండున్= ఉంటాడు; నిన్ను(న్); వెదకలేఁడు= వెదకడానికి (తెలుసుకోవడానికి) ప్రయత్నించడు.

**తా :** అన్ని దిక్కులను గెలుచుకుని, తన సాటివాళ్లు తనను గురించి పొగడుతూ ఉంటే, ఉన్నతమైన ఆసనం ఎక్కి కూర్చొని సార్వభౌముడు అనిపించుకుంటాడు మనిషి. అంత స్థాయికి వెళ్లినప్పటికీ కూడా ఆడవాళ్ల మందిరాలలో శృంగార క్రీడల్లో కాలం గడుపుతూ ఉంటాడు తప్ప – నిన్ను వెతకాలని (తెలుసుకోవాలని) అనుకోడు.

**ఆ. మానసంబుఁ గట్టి మహితభోగంబులు, మాని యింద్రియముల మదము లడఁచి**
**తపము సేసి యింద్రతయుఁ గోరుఁ గాని నీ, యమృతపదము గోరఁ డజ్ఞుఁ డీశ! 1662**

**ప్రతి :** ఈశ= ఈశ్వరా!; మానసంబున్= మనస్సును; కట్టి= ఎటూ చలించకుండా బంధించి; మహిత= గొప్ప; భోగంబులు= భోగాలను; మాని= అనుభవించక వదిలేసి; ఇంద్రియముల= పంచేంద్రియాల; మదములు= పొగరులను; అడఁచి= అణచిపెట్టి; తపము+చేసి= తపస్సు చేసి; ఇంద్రతయున్= ఇంద్రపదవిని; కోరున్+గాని= కోరుతాడుగాని; అజ్ఞుఁడు= అజ్ఞాని; నీ+అమృతపదము= శాశ్వతమైన నీ సన్నిధిని (మోక్షాన్ని); కోరఁడు= కోరుకోడు.

**తా :** ఈశ్వరా! అజ్ఞాని అయినవాడు, మనస్సును కట్టడిచేసి, భోగాలను మానేసి; ఇంద్రియాలను అణచి, తపస్సు చేసి ఇంద్రపదవి కోరుకుంటాడు తప్ప, శాశ్వతమైన ముక్తి నిచ్చే నీ సన్నిధిని కోరుకోడు.

**సీ. సంసారియై యున్నజనునకు నీశ్వర! నీకృప యెప్పుడు నెఱయఁ గల్గు**
**నప్పుడు బంధంబు లన్నియుఁ దెగిపోవు; బంధమోక్షంబైనఁ బ్రాప్త మగును**
**సత్సంగమంబు; సత్సంగమంబున నీదు భక్తి సిద్ధించు;నీభక్తివలన**
**సన్ముక్తి యగు; నాకు సత్సంగమునకంటె మును రాజ్యబంధనిర్మూలనంబు**

**తే. గలిగినది దేవ! నీ యనుగ్రహము గాదె?, కృష్ణ! నీ సేవ గాని తక్కినవి వలదు**
**ముక్తిసంధాయి వగు నిన్ను ముట్టఁ గొలిచి, యాత్మబంధంబు గోరునే యార్యుఁ డెందు? 1663**

**ప్రతి :** ఈశ్వర= దేవా!; సంసారి+ఐ+ఉన్న= సంసారంలో పడి ఉన్న; జనునకున్= మనిషికి; నీ కృప= నీ దయ; ఎప్పుడు= ఎప్పుడైతే; నెఱయన్= పూర్తిగా; కల్గున్= కలుగుతుందో; అప్పుడు= అప్పుడే; బంధంబులు+అన్నియున్= బంధాలన్నీ కూడా; తెగిపోవున్= వదలిపోతాయి; బంధమోక్షంబు+ఐనన్= అలా బంధాలు వదలిపోతే; సత్సంగమంబు= మంచివారితో సహవాసం; ప్రాప్తము+అగును= దొరుకుతుంది; సత్+సంగమంబునన్= అలా సత్పురుషులతో సహవాసం వల్ల; నీదు= నీపై; భక్తి; సిద్ధించున్= లభిస్తుంది; నీ భక్తివలనన్= అలా లభించిన నీపై భక్తివల్ల; సత్+ముక్తి+అగున్= ఉత్తమమైన మోక్షం చేకూరుతుంది; నాకు(న్); సత్+సంగమునకంటెన్= మంచివారితో సహవాసంకంటే; మును= మునుపే; రాజ్యబంధ= రాజ్యమనే బంధంయొక్క; నిర్మూలనంబు= తొలగిపోవడం; కలిగినది= జరిగింది; దేవ= దేవా!; నీ+అనుగ్రహము గాదె= ఇది నీ అనుగ్రహమే కదా!; కృష్ణ= కృష్ణా!; నీ సేవ గాని= నీకు చేసే సేవ తప్ప; తక్కినవి= మిగిలినవి; వలదు= వద్దు; ముక్తి సంధాయివి+అగు= ముక్తిదాయకుడవైన; నిన్నున్= నిన్ను; ముట్టన్+కొలిచి= చేరుకునేట్లుగా సేవించి; ఆర్యుఁడు= విజ్ఞుడయినవాడు; ఎందున్= ఎక్కడైనా; ఆత్మబంధంబున్= తనను తాను బంధించుకోవడాన్ని; కోరునే= కోరుకుంటాడా?;

**తా :** శ్రీకృష్ణా! సంసారంలో పడి పరిభ్రమించేవాళ్లకు నీ దయ ఎప్పుడు పూర్తిగా కలుగుతుందో అప్పుడే వాళ్లబంధాలన్నీ తెగిపోతాయి. బంధాలన్నీ అలా తెగిపోగానే సత్పురుషులతో సాంగత్యం కలుగుతుంది. అలాంటి సాంగత్యంతో నీపై భక్తి సిద్ధిస్తుంది. నీపై భక్తివల్ల ఉత్తమమైన ముక్తి కలుగుతుంది. నాకు సత్పురుష సాంగత్యంకంటె ముందే రాజ్యబంధం నుంచి విముక్తి లభించింది. ఇది నీ దయవల్లనే కదా దేవా! నీసేవ తప్ప నాకు కృష్ణా! వేరే ఏమీ వద్దు. విజ్ఞుడైన వాడెవడైనా ముక్తిదాయకుడవైన నిన్ను విడిచి, ఆత్మబంధాన్ని కోరుకుంటాడా? (కోరుకోడు.)

**వ. కావున రజస్సత్త్వతమోగుణంబులయనుబంధంబు లగు నైశ్వర్యశత్రుమరణధర్మాదివిశేషంబులు విడిచి, యీశ్వరుండును, విజ్ఞానఘనుండును, నిరంజనుండును, నిర్గుణుండును, నద్వయుండును నైన పరమపురుషుని నిన్నాశ్రయించెదఁ; జిరకాలంబు గర్మఫలంబులచేత నార్తుండనై క్రమ్మఱం దద్వాసనల సంతప్తుండనై తృష్ణం బాయక శత్రువులైన యింద్రియంబు లాఱింటిని గెలువలేని నాకు శాంతి యెక్కడిది? విపన్నుండ నైన నన్ను నిర్భయుం జేసి 'రక్షింపు' మనిన ముచుకుందునికి హరి యిట్లనియె. 1664**

**ప్రతి :** కావునన్= కాబట్టి; రజస్= రజోగుణం; తమస్= తమోగుణం; సత్త్వ= సత్త్వగుణం అనే; గుణంబులన్= త్రిగుణాలతో; అనుబంధంబులు+అగు= సంబంధించినవైన; ఐశ్వర్య= సంపదలు; శత్రు= శత్రువులు; మరణ= మరణం; ధర్మ+ఆది=

ధర్మం మొదలైన; విశేషంబులు= విశేషాలను; విడిచి= వదలిపెట్టి; ఈశ్వరుండును= అన్నిటిపై అధిపత్యం కలిగినవాడును; విజ్ఞానఘనుండునున్= విజ్ఞానమూర్తి అయినవాడును; నిరంజనుండును= దోషంలేనివాడును; నిర్గుణుండును= త్రిగుణాలతో సంబంధలేనివాడును; అద్వయుఁడునున్= తనకు సమానుడు, తనకంటె అధికుడు (రెండవవాడు) కలుగనివాడును; ఐన= ఐనట్టి; పరమపురుషునిన్= పురుషులలో ఉత్తముణ్ణి; నిన్నున్(న్); ఆశ్రయించెదన్= శరణు పొందుతాను; చిరకాలంబు= చాలాకాలం; కర్మఫలంబులచేతన్= చేసిన కర్మనుండి లభించేఫలితాలవల్ల; ఆర్తుండన్+ఐ= దుఃఖితుడనై; క్రమ్మఱన్= తిరిగి; తద్+వాసనలన్= ఆ కర్మలపై ఉన్న ఆసక్తిచే; సంతప్తుండను+ఐ= సంతాపం పొందుతున్నవాడినై; తృష్ణన్+పాయక= ఆశవదలక; శత్రువులు+ఐన= శత్రువులైన; ఇంద్రియంబులు= ఇంద్రియాలు; ఆరింటిని= చర్మం, కళ్లు, చెవులు, నాలుక, ముక్కు, మనస్సు అనే జ్ఞానేంద్రియాలు ఆరింటిని; గెలువలేని నాకున్= జయించలేని నాకు; శాంతి+ఎక్కడిది= శాంతి ఎలా లభిస్తుంది?; విపన్నుండను+ఐన= ఆపన్నుడనైన; నన్నున్(న్); నిర్భయున్+చేసి= భయం లేనివాణ్ణిగా చేసి (నాభయాన్ని పోగొట్టి); 'రక్షింపుము= కాపాడుము; అనిన= అని వేడుకొన్న; ముచుకుందునికి; హరి= శ్రీకృష్ణుడు; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** కాబట్టి సత్త్వం, రజస్సు, తమస్సు అనే మూడుగుణాలతో పాటు వచ్చే సంపద, శత్రుమరణం, ధర్మం మొదలైన వాటిల్ని నేను వదిలేస్తాను. ఈశ్వరుడవు, విజ్ఞానఘనుడవు, మాయక్రమ్మనివాడవు, గుణరహితుడవు, నీకు సమానుడూ, అధికుడూ లేనివాడవు, పరమపురుషుడవు అయిన నిన్ను ఆశ్రయిస్తాను. ఎంతోకాలంగా కర్మఫలాలవల్ల వేదన పొందుతున్నాను. మళ్లీ ఆ కర్మవాసనలు వీడక దుఃఖాన్ని పొందుతున్నాను. ఆశ వదలడం లేదు. చర్మం, కన్ను, చెవి, నాలుక, ముక్కు, మనస్సు అనే ఆరు ఇంద్రియాలు శత్రువులయ్యాయి. వాటిల్ని గెలువలేక పోతున్నాను. అలాంటి నాకు శాంతి ఎక్కడిది? ఆపదల్లో అల్లల్లాడిపోతున్న నా భయాన్ని పోగొట్టు. నన్ను రక్షించు అని ముచుకుందుడు వేడుకున్నాడు, ఆ మాటలకు శ్రీకృష్ణుడు ఇలా అన్నాడు.

**ఉ.** **మంచిది నీదు బుద్ధి నృపమండన! నీవు పరార్థ మెట్లు వ**
**ర్తించిన నైనఁ గోరికల దిక్కునఁ జిక్కవు మేలు; నిర్మలో**
**దంచితవృత్తి నన్ గొలుచు ధన్యు లబద్ధులు నెట్లు నీకు ని**
**శ్చంచలభక్తి గల్గెడిని సర్వము నేలుము మాననేటికిన్.** **1665**

**ప్రతి :** నృపమండన= రాజులకు అలంకారమైనవాడా!; నీదు బుద్ధి= నీ బుద్ధి; మంచిది= స్వచ్ఛమైంది; నీవు; పర+అర్థము= ఇతరులకోసం; ఎట్లు= ఏ విధంగా; వర్తించినన్+ఐనన్= ప్రవర్తించినప్పటికీ కూడా; కోరికల= కోరికల; దిక్కునన్= వైపునకు; చిక్కవు= దొరకవు; మేలు= మంచిది; నిర్మల+ఉత్+అంచిత వృత్తిన్= మలినం లేని స్వచ్ఛమైన ప్రవర్తనతో; నన్= నన్ను; కొలుచు= పూజించే; ధన్యులు= ధన్యాత్ములు; ఎట్లు+అబద్ధులు= సంసారమాయకు ఏ విధంగానూ కట్టు బడరు; నీకున్= నీకు; నిశ్చంచల భక్తి= ఏ మాత్రం చలించని భక్తి; కల్గెడిని= కలుగుతుంది; సర్వమున్= సమస్తాన్ని, ఈ లోకాన్నంతా; ఏలుము= పరిపాలించు; మానన్+ఏటికిన్= మానడం ఎందుకు?

**తా :** రాజులకు అలంకారమైనవాడా! ముచుకుందా! నీ బుద్ధి మంచిది. నీవు పరులకోసం ఏ విధంగా ప్రవర్తించినా కూడా ఆశలకు, కోరికలకు ప్రలోభపడడం లేదు. ఇది నీకు మంచిది. స్వచ్ఛమైన ప్రవర్తనతో నన్ను సేవించేవాళ్లు ధన్యులు. సంసారమాయకు వాళ్లు ఏ విధంగానూ కట్టుబడరు. నీకు అచంచలమైన భక్తి కలుగుతుంది. ఈ లోకాన్నంతా పరిపాలించు. మానడం దేనికి? (మానవద్దు.)

**వ. 'నరేంద్రా! నీవు తొల్లి క్షత్త్రధర్మంబున నిలిచి, మృగయావినోదంబుల జంతువుల వధియించినాఁడవు; తపంబునఁ దత్కర్మవిముక్తుండవై తర్వాతిజన్మంబున సర్వభూతసఖిత్వంబు గలిగి, బ్రాహ్మణశ్రేష్ఠుండవై నన్నుం జేరెద' వని వీడ్కొలిపిన హరికిం బ్రదక్షిణంబు వచ్చి నమస్కరించి గుహ వెడలి సూక్ష్మప్రమాణ దేహంబులతో నున్న మనుష్యపశువృక్షలతాదులం గని కలియుగంబు ప్రాప్తంబగు నని తలంచి, యుత్తరాభిముఖుండై తపోనిష్ఠుం డగుచు, సంశయంబులు విడిచి సంగంబులు పరిహరించి విష్ణునియందుఁజిత్తంబుఁ జేర్చి గంధమాదనంబు ప్రవేశించి, మఱియు నరనారాయణనివాసంబైన బదరికాశ్రమంబు చేరి, శాంతుండై హరి నారాధించుచుండె. నిట్లు ముచుకుందుని వీడ్కొని. 1666**

**ప్రతి :** నర+ఇంద్రా= రాజా!; నీవు; తొల్లి= పూర్వం; క్షత్రధర్మంబునన్= క్షత్రియధర్మాన్ని పాటించి; నిలిచి= ఉండి; మృగయావినోదంబులన్= వేట మొదలైన వేడుకలతో; జంతువులన్= జంతువులను; వధియించినాఁడవు= చంపావు; తపంబునన్= తపస్సు చేసి; తత్+కర్మ= ఆ చేసిన కర్మనుండి; విముక్తుండవు+ఐ= విడివడినవాడవై; తర్వాతిజన్మంబునన్= మరుసటిజన్మలో; బ్రాహ్మణశ్రేష్ఠుండవు+ఐ= ఉత్తమబ్రాహ్మణుడవై; సర్వభూత= అన్నిజీవులపట్ల; సఖిత్వంబున్= స్నేహం; కలిగి; నన్నున్+చేరెదవు= నన్ను పొందుతావు; అని= అని చెప్పి; వీడ్కొలిపినన్= వీడ్కోలు చెప్పగా; హరికిన్= శ్రీకృష్ణునికి; ప్రదక్షిణంబు వచ్చి= ప్రదక్షిణం చేసి; నమస్కరించి= ప్రణమిల్లి; గుహ వెడలి= గుహనుండి వెలుపలికి, వచ్చి; సూక్ష్మప్రమాణదేహంబులతోన్= మిక్కిలి చిన్న చిన్న శరీరాలతో; ఉన్న= ఉన్నటువంటి; మనుష్య= మనుషులను; పశు= జంతువులను; వృక్ష= చెట్లను; లతా+ఆదులన్= తీగలు మొదలైనవాటిని; కని= చూచి; కలియుగంబు= కలియుగం; ప్రాప్తంబు+అగున్+అని= రాబోతున్నదని; తలంచి= భావించి; ఉత్తర+అభిముఖుండు+ఐ= ఉత్తరదిశ వైపుగా తిరిగి; తపస్+నిష్ఠుండు+అగుచున్= తపోదీక్షపూనినవాడై; సంశయంబులు= సందేహాలను; విడిచి= వదలిపెట్టి; సంగంబులు= బంధాలను; పరిహరించి= వదిలిపెట్టి; విష్ణుని+అందున్= విష్ణువుపై; చిత్తంబున్= మనస్సును; చేర్చి= నిలిపి; గంధమాదనంబు= గంధమాదనపర్వతాన్ని; ప్రవేశించి; మఱియున్= ఇంకా; నరనారాయణ= నరుడు నారాయణుడు అనే మహామునులు; నివాసంబు+ఐన= నివసించిన ప్రాంతమైన; బదరిక+ఆశ్రమంబున్= బదరికాశ్రమాన్ని; చేరి; శాంతుండు+ఐ= ప్రశాంతమైన మనస్సు కలిగి; హరిని= శ్రీకృష్ణుణ్ణి; ఆరాధించుచున్= పూజిస్తూ; ఉండెన్= ఉండినాడు; ఇట్లు= ఇలా; ముచుకుందుణ్ణి; వీడ్కొని= వదలిపెట్టి...

**తా :** "రాజా! నీవు మునుపటికాలంలో క్షాత్రధర్మాన్ని పాటిస్తూ, జంతువులను వేటాడావు. నీకు అదొక వేడుక. కానీ దాని కర్మఫలం ఒకటి ఉంటుంది. నీవు తపస్సు చేసి ఆ కర్మఫలం నుండి విముక్తి పొందు. తర్వాత వచ్చేజన్మలో బ్రాహ్మణ శ్రేష్ఠుడవై అన్ని జీవులపట్ల స్నేహభావంతో ఉండి నన్ను చేరుకుంటావు వెళ్లు" అని శ్రీకృష్ణుడు చెప్పాడు. ముచుకుందుడు శ్రీకృష్ణుడి చుట్టూ తిరిగి ప్రదక్షిణం చేస్తూ నమస్కారం చేశాడు. గుహనుంచి బయటికి వచ్చాడు. బయట మనుషులు, పశువులు, చెట్లు, తీగలు మొదలైన వాటిని చూశాడు. అవన్నీ చిన్న చిన్న దేహాలతో ఉన్నాయి. వాటిల్ని చూడగానే – 'ఓహో కలియుగం దగ్గర పడుతోంది' అనుకున్నాడు. ఉత్తరం వైపు తిరిగి, తపస్సుకు వెళ్లాడు. సంశయాలను విడిచి పెట్టాడు. బంధాలను వదలిపెట్టాడు. శ్రీమహావిష్ణువు పై మనస్సు నుంచాడు. గంధమాదనపర్వతాన్ని చేరాడు. అలానే నరనారాయణులనే మహామునులు నివాసమున్న బదరికాశ్రమానికి వెళ్లాడు. ప్రశాంతమైన మనస్సుతో శ్రీమహావిష్ణువును పూజిస్తూ ఉన్నాడు. ఇలా ముచుకుందుణ్ణి శ్రీకృష్ణుడు వీడ్కొన్నాడు.

**శా. అచ్ఛిద్రప్రకటప్రతాపరవిచే నాశాంతరాళంబులం**
**బ్రచ్ఛాదించుచుఁ గ్రమ్మఱన్ మథురకుం బద్మాక్షుఁ డేతెంచి వీ**
**డాచ్ఛాదించి మహానిరోధముగఁ జక్రాకారమై యున్న యా**
**మ్లేచ్ఛవ్రాతము నెల్లఁ ద్రుంచె రణభూమిం బెంపు సొంపారఁగన్. 1667**

**ప్రతి :** పద్మ+అక్షుఁడు= పద్మాలవంటి కండ్లుగల శ్రీకృష్ణుడు; అచ్ఛిద్ర= ఏమాత్రం తరగకుండా; ప్రకట= బయలుపరచిన; ప్రతాప= పరాక్రమమనే; రవిచేన్= సూర్యతేజంతో; ఆశా+అంతరాళంబులన్= దిక్కుల మధ్యగల భాగాలను; ప్రచ్ఛాదించుచున్= కప్పివేస్తూ; క్రమ్మఱన్= తిరిగి; మథురకున్= మథురానగరానికి; ఏతెంచి= వచ్చి; వీడున్+ఆచ్ఛాదించి= నగరాన్ని ఆవరించి; మహానిరోధము+కన్= ఎంతో ఆటంకంగా; చక్ర+ఆకారము+ఐ ఉన్న= చక్రాకారంలో ఉన్న; ఆ మ్లేచ్ఛవ్రాతమున్+ఎల్లన్= ఆ యవనసమూహాన్నంతటినీ; రణభూమిన్= యుద్ధ రంగంలో; పెంపు= అతిశయం; సొంపు+ఆరన్+కన్= ప్రకాశించగా; త్రుంచెన్= చంపాడు.

**తా :** పద్మాలవంటి అందమైన కండ్లున్న శ్రీకృష్ణుడు ఏ మాత్రం తరగని పరాక్రమం అనే సూర్య కాంతితో దిక్కుల నడిమి ప్రాంతాన్ని కప్పివేస్తూ తిరిగి మథురానగరానికి వచ్చాడు. పట్టణానికి ఆటంకంగా చక్రాకారంలో నిలబడ్డ ఆ యవన సమూహాన్ని యుద్ధంలో తన అతిశయం, మహత్త్వం, ప్రకాశించేరీతిగా చంపాడు.

## ❖ జరాసంధుండు ప్రవర్షణగిరిని దహించుట ❖

**వ. ఇట్లు మ్లేచ్ఛులం బొరిగొని మఱియు న మ్మథురానగరంబునం గల ధనంబు ద్వారకానగరంబునకుం బంచిన, మనుష్యులు గొనిపోవు నెడ. 1668**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; మ్లేచ్ఛులన్= మ్లేచ్ఛసైన్యాన్ని; పొరిగొని= చంపి; మఱియున్= తర్వాత; ఆ+మథురా నగరంబునన్+కల= ఆ మథురానగరంలో ఉన్న; ధనంబున్= సంపదను; ద్వారకానగరంబునకున్= ద్వారకానగరానికి; పంచినన్= పంపగా; మనుష్యులు= ఆ తీసుకువెళ్లే మనుష్యులు; కొనిపోవు+ఎడన్= తీసుకు వెళ్లే సమయంలో...

**తా :** ఇలా మ్లేచ్ఛసైన్యాన్ని చంపి, మథురానగరంలో ఉండే ధనాన్ని ద్వారకకు పంపాడు – శ్రీకృష్ణుడు, ఆ ధనాన్ని తరలించడానికి కొందరు మనుష్యులను కూడా ఏర్పాటు చేశాడు. వాళ్లు ధనాన్ని తరలించే వేళలో –

**సీ. ఘోటకసంఘాతఖురసమున్నిర్గతధూళి జీమూతసందోహముగను**
**మహనీయమదకలమాతంగకటదానధారలు కీలాలధారలుగను**
**నిరుపమస్యందననేమినిర్ఘోషంబు దారుణగర్జితధ్వానముగను**
**నిశితశస్త్రాస్త్రమానితదీర్ఘరోచులు లలితసౌదామనీలతికలుగను**

**తే. శత్రురాజప్రతాపాగ్ని శాంతముగను, వృష్టికాలము వచ్చు న వ్విధము దోఁప**
**నేఁగుదెంచె జరాసంధుఁ డిరువదియును, మూఁడు నక్షౌహిణులు దన్ను మొనసి కొలువ. 1669**

**ప్రతి :** ఘోటక= గుర్రాల; సంఘాత= గుంపుయొక్క; ఖుర= గిట్టలనుండి; సముత్+నిర్గత= పైకి ఎగసి లేస్తున్న; ధూళి= దుమ్ము; జీమూత= నల్లనిమేఘాల; సందోహముగను= సమూహంవలె ఉండగా; మహనీయ= గొప్ప; మదకల= మదించిన;

మాతంగ= ఏనుగులయొక్క; కట= చెక్కిళ్లనుండి స్రవించే; దానధారలు= మదజలాలు; కీలాలధారలుగను= నీటిధారలవలె ఉండగా; నిరుపమ= సాటిలేని; స్యందననేమి= రథాలకంటికడకమ్ములు; నిర్ఘోషంబు= మహాధ్వని; దారుణ= భయంకరమైన; గర్జిత ధ్వానముగను= ఉరుముల ధ్వనివలె ఉండగా; నిశిత= పదునైన; శస్త్ర= కత్తికటారులవంటి ఆయుధాల; అస్త్ర= మంత్రశక్తులతో కూడిన బ్రహ్మాస్త్రంవంటి ఆయుధాల; మానిత= మన్నింపబడిన; దీర్ఘరోచులు= విశాలమైన కాంతులు; లలిత= కోమలమైన; సౌదామనీలతికలుగను= మెరుపుతీగలవలె ఉండగా; శత్రురాజ= శత్రువులైన రాజుల; ప్రతాప+అగ్ని= పరాక్రమమనే అగ్ని; శాంతముగను= చల్లార్చేటట్లు; వృష్టి కాలము= వర్షాకాలం; వచ్చు+ఆ+విధము= వచ్చిన విధం; తోఁపన్= అనిపించగా; ఇరువదియును మూఁడు= ఇరవైమూడు; అక్షౌహిణులు= అక్షౌహిణుల సైన్యం; తన్నున్= తనను; మొనసి= పూని; కొలువన్= సేవిస్తూ ఉండగా; జరాసంధుఁడు= జరాసంధుడు; ఏఁగుదెంచెన్= దండెత్తి వచ్చాడు.

**తా :** జరాసంధుడు మథుర మీదికి దండెత్తి వచ్చాడు. ఇరవై మూడు అక్షౌహిణుల సేనతో అతడు కదిలాడు. ఆ సమయంలో గుర్రాల గిట్టల నుంచి పైకి లేస్తున్న దుమ్ము నల్లమబ్బులగుంపువలె ఉంది. పెద్ద పెద్ద ఏనుగుల చెక్కిళ్ల నుంచి మదజలం స్రవిస్తుంటే, అది నీటి ధారలవలె ఉంది. సాటిలేని రథచక్రాలు మహాధ్వని చేస్తుంటే, భయంకరమైన ఉరుములశబ్దంవలె ఉంది. పదునైనశస్త్రాస్త్రాల కాంతులు కోమలమైన మెరుపుతీగలవలె ఉన్నాయి. అతడి రాక శత్రురాజుల ప్రతాపం అనే అగ్నిని చల్లార్చడానికి వచ్చే వర్షాకాలంవలె ఉంది.

**చ. ఇటు చనుదెంచియున్న మగధేశ్వరవాహినిఁ జూచి యుద్ధ సం**
**ఘటనము మాని మానవులకైవడి భీరుల భంగి నోడి ముం**
**దటి ధనమెల్ల డించి మృదుతామరసాభపదద్వయుల్ క్రియా**
**పటువులు రామకేశవులు పాఱిరి ఘోరవనాంతరంబులన్. 1670**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; చనుదెంచి+ఉన్న= నగరం మీదికి దండయాత్రకు వచ్చిన; మగధ+ఈశ్వర= జరాసంధుని; వాహినిన్= సైన్యాన్ని; చూచి; యుద్ధ సంఘటనము= యుద్ధం చేసేప్రయత్నం; మాని= వదిలేసి; మానవులకైవడిన్= మామూలు మనుష్యులమాదిరి; భీరుల భంగిన్= పిరికివాళ్లవలె; ఓడి= బెదిరి; ముందటి ధనము= తమముందున్న ధనం; ఎల్లన్= అంతటినీ; డించి= వదిలి; మృదు= మెత్తని; తామరస+ఆభ= తామరరేకులతో సమానమైన; పదద్వయుల్= పాదాలజంట కలిగినవాళ్లు; క్రియాపటువులు= పనిచేయడంలో సమర్థత ఉన్నవాళ్లు; అయిన; రామకేశవులు= బలరామకృష్ణులు; ఘోరవన+అంతరంబులన్ = భయంకరమైన అడవులలోకి; పాఱిరి= పారిపోయారు.

**తా :** ఇలా జరాసంధునిసైన్యం మథురమీదికి దాడి చేసింది. శ్రీకృష్ణుడు చూచాడు. ఇపుడు యుద్ధం చేయడం మంచిది కాదనుకున్నాడు. ఒక మామూలు మనిషిలాగా, భయస్థుడివలె ప్రవర్తించాడు. తమ ధనాన్ని అంతా అక్కడ వదిలేసి మెత్తని తామరపూలవంటి పాదాలున్నవాళ్లు, కార్యశూరులు అయిన బలరామకృష్ణులు ఘోరమైన అడవులలోకి పారిపోయారు.

**వ. ఇట్లు పఱచుచున్న కృష్ణబలభద్రులం జూచి వారలప్రభావంబు లెఱుంగక పరిహసించి. 1671**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; పఱచుచున్+ఉన్న= పారిపోతున్న; కృష్ణబలభద్రులన్= శ్రీకృష్ణబలరాములను చూచి; వారల= వాళ్లిద్దరి; ప్రభావంబులు= మహిమలు; ఎఱుంగక= తెలియక; పరిహసించి= ఎగతాళి చేసి...

**తా :** శ్రీకృష్ణుడు, బలరాముడు అలా పారిపోతుంటే జరాసంధుడు చూచి, వాళ్ల మహిమలు తెలియక ఎగతాళి చేస్తూ

**ఉ. 'ఓ యదువీరులార! రభసోద్ధతిఁ బాఱకుఁ; డిట్లు పాఱినం**
**బోయెదువాఁడఁ గాను; మిము భూమి నడంగిన మిన్ను ఁబ్రాఁకినం**
**దోయధిఁ జొచ్చినం దగిలి త్రుంచెద'నంచు సమస్తసేనతోఁ**
**బాయక వచ్చె వెంటఁబడి బాహుబలాఢ్యుఁడు మాగధేశుఁడున్. 1672**

**ప్రతి :** ఓ యదువీరులార!= ఓ యాదవ వీరులారా!; రభస+ఉద్ధతిన్= తొక్కిడి పడుతూ వేగంతో; పాఱకుఁడు= పారిపోకండి; ఇట్లు= ఇలా; పాఱినన్= పారిపోతే; పోయెదువాఁడన్+కాను= వదిలిపెట్టే వాణ్ణి కాను; భూమిన్+అడంగినన్= భూమిలోపల ప్రవేశించినా; మిన్నున్= ఆకాశంలో; ప్రాఁకినన్= ఎగిరినప్పటికి; తోయధిన్= సముద్రంలో; చొచ్చినన్= చొరబారినప్పటికీ; మిమున్= మిమ్ములను; తగిలి= వెంటాడి; త్రుంచెదను= చంపుతాను; అంచున్= అంటూ; సమస్త సేనతోన్= సకల సైన్యంతో; బాహుబల+ఆఢ్యుఁడు= భుజబల సంపన్నుడు; మాగధ+ఈశుఁడున్= మగధరాజైన జరాసంధుడు; పాయక= విడవకుండా; వెంటన్+పడి= వెంటపడుతూ; వచ్చెన్= వచ్చాడు.

**తా :** "ఓ యాదవవీరులారా! తొక్కిడిపడుతూ అలా పారిపోకండి. అలా పారిపోతే మిమ్మల్ని విడిచి పెడతానని అనుకున్నారేమో – మీరు భూమిలో దాక్కున్నా, ఆకాశానికి ఎగిరినా, సముద్రంలోకి దూరినా వెంటాడి చంపుతాను అంటూ సకలసైన్యంతో భుజబలసంపన్నుడైన జరాసంధుడు విడవకుండా వెంటబడి వచ్చాడు.

**విశే :** 'భూమి నడంగిన, మిన్ను ఁబ్రాఁకినం, దోయధిఁ జొచ్చినం, దగిలి త్రుంచెదన్' అనడంలో కూర్మావతారం, త్రివిక్రమావతారం, మత్స్యావతారాలు స్ఫురిస్తున్నాయి.

**వ. మఱియుం బలాయమానులై బహుయోజనంబుల దూరంబు సని విశ్రాంతులై దమకు డాఁగ నెల వగు నని యింద్రుండు మిక్కిలి వర్షింపఁ బ్రవర్షణాఖ్యంబై పదునొకండుయోజనంబుల పొడవును నంతియ వెడలుపును గల గిరి యెక్కి రంత. 1673**

**ప్రతి :** మఱియున్= మరల; పలాయమానులు+ఐ= పారిపోతున్నవారై; బహుయోజనంబుల= పెక్కు ఆమడల; దూరంబు= దూరం; చని= వెళ్లి; విశ్రాంతులు+ఐ= విశ్రాంతిని కోరి; తమకు(న్); డాఁగన్= దాక్కోవడానికి; నెలవు+అగున్+అని= తగిన చోటుగా ఉంటుందని; ఇంద్రుండు= ఇంద్రుడు; మిక్కిలి= అధికంగా; వర్షింపన్= వానకురిపించగా; ప్రవర్షణ+ఆఖ్యంబు+ఐ= ప్రవర్షణమనే పేరు పొందిందై; పదునొకండు= పదకొండు; యోజనంబుల= ఆమడల; పొడవునున్= పొడవూ; అంతి+అ= అంతే; వెడలుపును= వెడల్పూ; కల= ఉన్న; గిరి= కొండను; ఎక్కిరి= ఎక్కారు; అంతన్= అంతలో...

**తా :** ఇలా పారిపోతున్న బలరామకృష్ణులు పెక్కామడలదూరం వెళ్లి, అలసిపోయారు. సేద తీర్చుకోవడానికి, తాము దాక్కోడానికి తగిన చోటని తలచి, ఇంద్రుడు విస్తారంగా వానలు కురిపించిన ఒక కొండను ఎక్కారు. ఎక్కువ వర్షం దానిపై కురిపించడంవల్ల దానికి ప్రవర్షణగిరి అని పేరు ఏర్పడింది. అది పదకొండు ఆమడల పొడవూ, అంతే వెడల్పూ కలిగి ఉంది. అంతలో

**శా. ఆ శైలేంద్రముఁ జుట్టిరా విడిసి రోషావిష్టుఁడై మాగధో**
**ర్వీశుం డా వసుదేవనందనులఁ దా వీక్షింపఁగా లేక త**

**న్నాశేచ్ఛన్ బిలసానుశృంగములఁ బూర్ణక్రోధుఁడై కాష్ఠముల్**
**రాసుల్ గా నిడి చిచ్చువెట్టఁ బనిచెన్ రౌద్రంబుతో భృత్యులన్. 1674**

**ప్రతి :** ఆ+శైల+ఇంద్రమున్= ఆ పర్వతరాజాన్ని; చుట్టిరాన్= చుట్టూరా; విడిసి= దండుతో విడిది చేసి; రోష+ఆవిష్టుఁడు+ఐ= కోపంతో ఉడికి పోతూ; మాగధ+ఉర్వీశుండు= మగధాధిపతి అయిన జరాసంధుడు; ఆ వసుదేవ నందనులన్= ఆ వసుదేవునికొడుకులైన బలరామకృష్ణులను; తాన్= తాను; వీక్షింపన్+కాన్ లేక= కనుక్కోలేక; తద్+నాశ+ఇచ్ఛన్= వాళ్లిద్దరూ నాశనం కావాలనే ఆశతో; పూర్ణక్రోధుఁడు+ఐ= మిక్కిలి కోపంతో నిండినవాడై; బిల సాను శృంగములన్= గుహలలో, కొండచరియలలో, శిఖరాలలో; కాష్ఠముల్= ఎండుకట్టెలు; రాసుల్+కాన్+ఇడి= గుంపులుగా పేర్చి; రౌద్రంబుతోఁన్= భయం గొలిపే కోపంతో; చిచ్చున్+పెట్టన్= నిప్పు పెట్టడానికి; భృత్యులన్= సేవకులను; పనిచెన్= ఆజ్ఞాపించాడు.

**తా :** మగధదేశాధీశుడైన జరాసంధుడు కోపవివశుడై ఆ పర్వతరాజం చుట్టూ దండు విడిశాడు. అక్కడ రామకృష్ణులను కనుగొనలేక పోయాడు. వారి వినాశం కోరి అ కొండగుహల్లో, చరియల్లో, శిఖరాల్లో కట్టెల గుంపులు పేర్చి, దహించివేయడం డని రౌద్రంతో సేవకులను ఆజ్ఞాపించాడు.

**వ. ఇట్లు జరాసంధపరిజనప్రదీపితంబైన మహానలంబు దరికొనియె నందు. 1675**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; జరాసంధ= జరాసంధుని; పరిజన= సేవకులచేత; ప్రదీపితంబు+ఐన= రగిలించబడిన; మహా+అనలంబు= పెద్ద మంట; దరికొనియెన్= అంటుకుని కాలింది; అందున్= ఆ జ్వాలల్లో...

**తా :** ఇలా జరాసంధునిసేవకులచే రగిలించబడిన మహాగ్ని అంటుకుని ఆ పర్వతాన్ని కాల్చివేసింది. ఆ మంటల్లో

**క. పొగ లెగసెఁ బొగల తుదలను, మిగులుచు మిడుఁగుఱులు నిగిడె మిడుఁగుఱుగమి ము**
**న్నుగ బ్రహ్మాండము నిండెను, భగ భగమని మంట లొదవె భయదము లగుచున్. 1676**

**ప్రతి :** పొగలు= (కమ్ముకున్న) పొగలు; ఎగసెన్= పైకి లేచాయి; పొగల తుదలను= పొగలకు పై భాగంలో; మిగులుచున్= బాగా ఎక్కువగా; మిడుఁగుఱులు= నిప్పురవ్వలు; నిగిడెన్= విస్తరించాయి; మిడుఁగుఱుగమి= నిప్పురవ్వల గుంపు; మున్ను+కన్= ముందుగా; బ్రహ్మాండమున్= బ్రహ్మాండమంతటా; నిండెను= నిండింది; భయదములు= భయపెట్టేవిగా; అగుచున్= అవుతూ; భగభగ+అని= భగభగ అంటూ; మంటలు+ఒదవెన్= మంటలు లేచాయి.

**తా :** ముందుగా పొగలు వచ్చి పైకి లేచాయి. ఆ పొగల చివర పైభాగంలో నిప్పు రవ్వలు అల్లుకున్నాయి. ఆ నిప్పురవ్వల గుంపుతో బ్రహ్మాండమంతా నిండిపోయింది. అలా నిండగా, భయం గొలుపుతూ భగభగ మంటూ మంటలు పైకి లేచాయి.

**వ. మఱియు న మ్మహానలంబు బిలసానుశృంగవృక్షలతాకుంజపుంజంబుల దరికొని, శిఖలు కిసలయంబులుగ, విస్ఫులింగంబులు విరులుగ, సముద్ధూతధూమపటలంబులు బంధురస్కంధ శాఖావిసరంబులుగ, ననోకహంబుకైవడి నభ్రంకషంబై ప్రబ్బి కఠోరసమీరణసమున్నతమహోల్కాజాల తిరోహితవియచ్చ రవిమానంబును, వివిధవిధూమవిస్ఫులింగవిలోకనప్రభూతనూతనతారకాభ్రాంతి విభ్రాంతగగనచరంబును, సంతప్యమానసరోవరసలిలంబును, విశాలజ్వాలాజాలజాజ్వల్యమాన**

**తక్కోలచందనాగరుకర్పూర ధూమవాసనావాసితగగనకుహరంబును, గరాళకీలాజాలదందహ్యమాన కీచకనికుంజపుంజసంజనితచిటపటారావపరిపూరితదిగంతరాళంబును, భయంకరబహుళతర శాఖాభిద్యమానపాషాణఘోషణపరిమూర్ఛితప్రాణిలోకంబును, సంతప్యమానశాఖిశాఖాంతరనిబిడనీడనిహిత శాబకవియోగదుఃఖడోలాయమానవిహంగకులంబును, మహాహేతిసందీప్యమానకటిసూత్రసంఘటిత మయూరపింఛకుచకలశయుగళభారాలసశబరకామినీసమాశ్రితనిర్ఝరంబును, దగ్ధానేకమృగ మిథునంబు నై యేర్చునెడ. 1677**

**ప్రతి :** మఱియును= తర్వాత; ఆ+మహా+అనలంబు= ఆ మహాగ్ని; బిల= గుహల్లోనూ; సాను= చరియల్లోనూ; శృంగ= శిఖరాలలోను; వృక్ష= చెట్లలోనూ; లతా= తీగల్లోనూ; కుంజపుంజంబులన్= పొదరిళ్ల గుంపుల్లోనూ; దరికొని= అల్లుకుని మండుతూ; శిఖలు= మంటల చివరలు; కిసలయంబులు+కన్= చిగురాకులుగా; విస్ఫులింగంబులు= నిప్పురవ్వలు; విరులు+కన్= పుష్పాలుగా; సముద్ధూత= పైకి బాగా ఎగిసిన; ధూమపటలంబులు= పొగలసమూహాలు; బంధుర= దట్టమైన; స్కంధ శాఖా= చెట్లకాండాలకు ఉన్న కొమ్మల; విసరంబులు+కన్= గుంపులుగా; అనోహకంబుకైవడిన్= వృక్షంవలె; అభ్రంకషంబు+ఐ= ఆకాశాన్ని రాచుకుంటున్నట్లుగా; ప్రబ్బి= అల్లుకొని; కఠోర= దారుణమైన; సమీరణ= గాలిచే, సమున్నత= పైకి లేచిన; మహా+ఉల్కా= పెద్దపెద్ద కొరవి కట్టెల; జాల= గుంపు చేత; తిరోహిత= కమ్ముకోబడి కనిపించకుండా మరుగుపడిన; వియత్+చర= ఆకాశంలో తిరిగే దేవతల; విమానంబును= విమానాలను కలిగింది; వివిధ= రకరకాల; విధూమ= పొగలతో ఉన్న; విస్ఫులింగ= నిప్పు రవ్వలను; విలోకన= చూడడంచేత; ప్రభూత= పుట్టిన; నూతన= కొత్త; తారకాభ్రాంతి= నక్షత్రాలనే భ్రమతో; విభ్రాంత= తిరుగుతూ ఉన్న; గగనచరంబును= ఆకాశంలో తిరిగేవారిని కలిగింది; సంతప్యమాన= క్రాగిపోతున్న; సరోవర= సరస్సుల; సలిలంబును= నీటిని కలిగింది; విశాల= వ్యాప్తి పొందిన; జ్వాలాజాల= మంటల సమూహంచేత; జాజ్వల్యమాన= వెలుగుతున్న; తక్కోల= తక్కోలము; చందన= చందనం; అగరు= అగరు చెట్లు; కర్పూర= కర్పూరంచెట్ల యొక్క; ధూమ= పొగలయొక్క; వాసనావాసిత= సువాసనలచే పరిమళిస్తూ ఉన్న; గగన కుహరంబును= ఆకాశ మండలం కలది; కరాళ= భయంకరమైన; కీలాజాల= మంటల వరుసచేత; దందహ్యమాన= దగ్ధం చేయబడుతూ ఉన్న; కీచకనికుంజ= వెదురుపొదల; పుంజ= గుంపులనుండి; సంజనిత= పుట్టిన; చిటపట+ఆరావ= చిటపట ధ్వనులతో; పరిపూరిత= నిండిన; దిక్+అంతరాళంబును= దిక్కుల నడిమి ప్రదేశం కలది; భయంకర= భయాన్ని కలిగించే; బహుళతర= మిక్కుటమైన; శాఖా= కొమ్మల చేత; భిద్యమాన= పగలగొట్టబడుతున్న; పాషాణఘోషణ= రాళ్ల మోతవలన; పరిమూర్ఛిత= సొమ్మసిల్లిపోయిన; ప్రాణిలోకంబును= జీవలోకం కలది; సంతప్యమాన= దగ్ధమవుతున్న; శాఖి= చెట్లలోని; శాఖా+అంతర= కొమ్మలనడుమ; నిబిడ= దట్టమైన; నీడ= గూళ్లలో; నిహిత= ఉంచబడిన; శాబక= పిల్లల; వియోగ= ఎడబాటువల్ల కలిగిన; దుఃఖ= వేదనతో; డోలాయమాన= ఊగిసలాడిపోతున్న; విహంగకులంబును= పక్షులగుంపు కలది; మహాహేతి= పెద్దపెద్ద మంటలచేత; సందీప్యమాన= కాలిపోతున్న; కటిసూత్ర సంఘటిత= మొలనూళ్లయందు కట్టబడిన; మయూరపింఛ= నెమలి ఈకలవల్ల; కుచకలశయుగళ= కుండలవంటి రెండువక్షోజాల; భార= బరువుచే; అలస= నెమ్మదిగా నడుస్తున్న; శబరకామినీ= శబరయువతులచేత; సమాశ్రిత= బాగా ఆశ్రయించబడిన; నిరఝరంబును= సెలయేర్లు కలది; దగ్ధ= దహించబడిన; అనేక= పెక్కయిన; మృగమిథునంబును= జంతువుల జంటలను కలిగింది; ఐ= అవుతూ; ఏర్చు+ఎడన్= దహించబడుతున్నప్పుడు...

**తా :** తరువాత ఆ మహాజ్వాల కొండగుహల్లోనూ, చరియల్లోనూ, శిఖరాల్లోనూ, చెట్లలోనూ, తీగల్లోనూ, పొదరిండ్ల గుంపుల్లోనూ అల్లుకుంది. అది ఒక పెద్ద మంటల మహావృక్షంగా ఆకాశాన్ని తాకినట్లుగా ఉంది. జ్వాలలు చిగుళ్ల లాగా ఉన్నాయి. నిప్పురవ్వలు ఆ చెట్టుపువ్వులవలె ఉన్నాయి. పైకి ఎగసి లేస్తున్న దట్టమైనపొగలు చెట్టుకాండంవలె, కొమ్మలవలె ఉన్నాయి. ప్రచండమైన గాలివల్ల పొడవుగా నిలిచి కొరవుల్లా మండుతున్న కర్రలచేత ఆకాశంలో దేవతా విమానాలు కనిపించకుండా పోతున్నాయి. పొగలేకుండా నిప్పుకణికలు కణకణలాడుతూంటే పై నుంచి చూచిన దేవతలు ఇవి కొత్తనక్షత్రాలేమో అని భ్రమపడ్డారు. సరస్సులలో నీళ్లన్నీ మరగిపోయాయి. మంటలు అల్లుకోవడంచేత తక్కోలం, చందనం, అగరు, కర్పూరంవంటి చెట్లు తగలబడిపోతున్నాయి. ఆ చెట్లనుండి పరిమళాలు ఎగసి ఆకాశాన్ని నింపుతున్నాయి. వెదురుపొదలు దగ్ధమవుతూండగా 'చిటపట' అనే భయంకరమైన ధ్వని పుట్టి, దిక్కుల నడిమిప్రదేశాన్ని నింపింది. భయంకరమైన చెట్లకొమ్మలుపడి రాళ్లు పగిలిపోతున్నాయి. ఆ శబ్దం ఘోరంగా ఉండి, జీవలోకం సొమ్మసిల్లిపోతున్నది. చెట్లకొమ్మలలో పక్షిపిల్లలున్న గూళ్లున్నాయి. ఆ గూళ్లు కాలిపోతున్నాయి. తమపిల్లలవియోగంతో పక్షులు వేదనతో కలతపడిపోతున్నాయి. ఎగసినమంటలకు శబరకాంతల మొలనూళ్లకు కట్టబడి ఉన్న నెమలిఈకలకు మంటలు అంటుకున్నాయి. కలశాలవంటి రెండువక్షోజాలబరువుతో వాళ్లు నెమ్మదిగా నడుస్తూ నీటివాగులను చేరుకుంటున్నారు. జంతువుల జంటలు ఎన్నో ఆ అగ్నికి ఆహుతై పోయాయి.

**క. ఇల నేకాదశయోజన, ముల పొడవగు శైలశిఖరముననుండి వడిన్**
**బలకృష్ణులు రిపుబలముల, వెలి కులికిరి కానఁబడక విలసితలీలన్. 1678**

**ప్రతి :** ఇలన్= నేలపై; ఏకాదశయోజనముల= పదకొండు ఆమడల; పొడవు= పొడవు (ఎత్తు); అగు= ఉన్న; శైల= కొండయొక్క; శిఖరమున్+ఉండి= చిట్టచివరికొమ్మునుండి; వడిన్= వేగంగా; రిపు బలముల= శత్రుసేనలకు; వెలికి= బయటకు; కానబడక= కనిపించకుండా; బలకృష్ణులు= బలరాముడు, శ్రీకృష్ణుడు; విలసిత లీలన్= ఆటల్లో లాగా, కుప్పించి; ఉఱికిరి= దూకారు.

**తా :** ఆ కొండ కొమ్ము పదకొండు యోజనాల ఎత్తుంది. చుట్టూ జరాసంధుని సైన్యం ఉంది. వాళ్లెవరికీ కనిపించకుండా, అంత ఎత్తున్న కొండకొమ్మునుండి బలరామ కృష్ణులిద్దరూ ఆటల్లో దూకినంత సులువుగా ఆ శత్రుబలాలకు అవతలి వైపున కుప్పించి దూకారు.

**వ. ఇట్లు శత్రువుల వంచించి యాదవేంద్రులు సముద్రపరిఖంబైన ద్వారకానగరంబునకుం జనిరి. జరాసంధుడు వారలు దగ్ధు లైరని తలంచుచు బలంబులుం దానును మగధదేశంబునకు మరలి చనియె; నంత. 1679**

**ప్రతి :** ఇట్లు= ఇలా; శత్రువులన్= విరోధులను; వంచించి= మోసగించి; యాదవ+ఇంద్రులు= యాదవశ్రేష్ఠులైన బలరామ శ్రీకృష్ణులు; సముద్ర= సముద్రమే; పరిఖంబు+ఐన= కందకంగా ఉన్న; ద్వారకా నగరంబునకున్= ద్వారకా నగరానికి; చనిరి= వెళ్లారు; వారలు= వాళ్లిద్దరూ దగ్ధులు+ఐరి+అని= కాలిపోయారని; తలంచుచున్= అనుకుంటూ; జరాసంధుఁడు; బలంబులున్= సైన్యమూ; తానును= తానూ; మగధ దేశంబునకున్= మగధ దేశానికి; మరలి= తిరిగి; చనియెన్= వెళ్లాడు; అంత= ఆ తర్వాత...

**తా :** ఇలా బలరామకృష్ణులు శత్రువులను మోసగించారు. సముద్రమే కందకంగా ఉన్న ద్వారకానగరానికి చేరుకున్నారు. ఆ ఇద్దరూ అగ్నిలో దగ్ధమై పోయారని జరాసంధుడు అనుకున్నాడు. తాను తన సైన్యంతో పాటు తిరిగి మగధకు వెళ్లాడు. ఆ తరువాత,

## ❖ రుక్మిణీ కల్యాణ కథాప్రారంభము ❖

**క. ఆ వనజగర్భుపంపున, రైవతుఁ డను రాజు దెచ్చి రామున కిచ్చెన్**
**రేవతి యనియెడు కన్యను, భూవర! మును వింటి కాదె బుద్ధిం దెలియన్. 1680**

**ప్రతి :** భూవర= రాజా!; ఆ వనజగర్భు= కమలమే గర్భంగా గల ఆ బ్రహ్మయొక్క; పంపునన్= ఆజ్ఞననుసరించి; రైవతుఁడు+అను రాజు=రైవతుడు అనే పేరున్న రాజు; రేవతి+అనియెడు=రేవతి అనే పేరున్న; కన్యను; తెచ్చి= తీసుకొనివచ్చి; రామునకున్+ఇచ్చెన్= బలరామునికి ఇచ్చాడు; బుద్ధిన్+తెలియన్= మతికి బాగా తెలిసే విధంగా (వివరంగా); మును= ఇదివరలో; వింటి(వి)కాదు+ఎ= విన్నావు కదా!

**తా :** ఓ పరీక్షిన్మహారాజా! మునుపు బ్రహ్మదేవుడు ఆజ్ఞాపించడం వల్ల రైవతుడనే రాజు తన పుత్రిక రేవతిని తీసుకొనివచ్చి బలరాముని కిచ్చాడు. ఈ విషయాన్ని గురించి నీవు వివరంగా విన్నావు కదా!

**వ. తదనంతరంబ. 1681**

**ప్రతి :** తద్+అనంతరంబు+అ= ఆ తర్వాత...

**తా :** ఆ తర్వాతి విషయం ఏమనగా,

**మ. ఖగనాథుం డమరేంద్రు గెల్చి సుధ మున్ గైకొన్న చందంబునన్**
**జగతీనాథులఁ జైద్యపక్షచరులన్ సాళ్వాదులం గెల్చి భ**
**ద్రగుఁడై చక్రి వరించె భీష్మకసుతన్ రాజీవగంధిన్ రమా**
**భగవత్యంశభవన్ మహాగుణమణిన్ బాలామణిన్ రుక్మిణిన్. 1682**

**ప్రతి :** భీష్మక= భీష్మకుడనే రాజుయొక్క; సుతన్= కూతురిని; రాజీవగంధిన్= పద్మంవంటి సువాసనతో ఉన్న శరీరం కలదానిని; రమాభగవతీ+అంశభవన్= లక్ష్మీదేవిఅంశతో పుట్టినదానిని; మహాగుణమణిన్= గొప్ప గుణవంతురాలిని; బాలామణిన్= కన్యలలో మిన్న అయిన దానిని; రుక్మిణిన్= రుక్మిణీదేవిని; ఖగనాథుండు= పక్షిలోకానికి రాజైన గరుత్మంతుడు; అమర+ఇంద్రున్= దేవతలకు ప్రభువైన ఇంద్రుణ్ణి; గెల్చి= జయించి; సుధ= అమృతాన్ని; మున్= మునుపు; కైకొన్న= తీసుకొన్న; చందంబునన్= విధంగా; చైద్యపక్షచరులన్= చేదిరాజైన శిశుపాలుని అనుచరులను; సాళ్వ+ఆదులన్=సాళ్వుడు మొదలైన (వారిని); జగతీనాథులన్= భూపతులను; గెల్చి= జయించి; భద్రగుఁడు+ఐ= మంగళం పొందినవాడై; చక్రి= చక్రాన్ని ఆయుధంగా ధరించిన శ్రీకృష్ణుడు; వరించెన్= పెండ్లాడినాడు.

**తా :** పక్షులకు రాజైన గరుత్మంతుడు మునుపు దేవేంద్రుడిని జయించి అమృతాన్ని తెచ్చాడు. ఆ విధంగా శ్రీకృష్ణుడు శిశుపాలుడినీ, అతడిని అనుసరించే సాళ్వుడు మొదలైన రాజులనూ జయించాడు. భీష్మకుని పుత్రిక రుక్మిణిని వరించాడు. ఆమెశరీరం తామరపూలసువాసనతో ఉంది. ఆమె లక్ష్మీదేవిఅంశ. గొప్పగుణాలతో ప్రకాశిస్తున్నది. కన్యకలలో శ్రేష్ఠురాలు.

**విశే :** 'ఖ' అంటే ఆకాశం; 'గ' అంటే గమించేది= పక్షి అని అర్థం. అలాంటి పక్షిలోకానికి రాజు గరుత్మంతుడు. ఆయన వినతాతనయుడు. ఇంద్రాదులను జయించి, స్వర్గంనుండి అమృత భాండాన్ని తెచ్చి ఇచ్చి, తన తల్లి దాస్యాన్ని పోగొట్టిన గరుడునిశౌర్యంవలె శ్రీకృష్ణుడు రాజులను జయించి రుక్మిణిని పొందాడు.

**వ. అనిన రాజిట్లనియె. మున్ను రాక్షసవివాహంబున స్వయంవరంబునకు వచ్చి హరి రుక్మిణిం గొనిపోయె నని పలికితివి. కృష్ణం డొక్కరుం డెవ్విధంబున సాళ్వాదుల జయించి తన పురంబునకుం జనియె; నదియునుం గాక. 1683**

**ప్రతి :** అనినన్= ఈ విధంగా (శుకమహర్షి) చెప్పగా; రాజు= (పరీక్షిత్తు అనబడే) రాజు; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు; మున్ను= ఇంతకుమునుపు; రాక్షస వివాహంబునన్= రాక్షస వివాహపద్ధతిలో; స్వయంవరంబునకున్= స్వయంవరానికి; వచ్చిన= విచ్చేసిన; హరి= శ్రీకృష్ణుడు; రుక్మిణిన్= రుక్మిణీదేవిని; కొనిపోయెన్+అని= తీసుకు వెళ్లాడు అని; పలికితివి= అన్నావు; కృష్ణుండు+ఒక్కరుండు= కృష్ణుడు ఒక్కడే; ఏ+విధంబునన్= ఏ రీతిగా; సాళ్వ+ఆదులన్= సాళ్వుడు మొదలైనవాళ్లను; జయించి= ఓడించి; తనపురంబునకున్= తన నగరానికి; చనియెన్= వెళ్లాడు; అదియునున్+కాక= అదీ కాకుండా...

**తా :** ఈ విధంగా శుకమహర్షి చెప్పగానే వింటున్నపరీక్షిత్తు ఇలా అడిగాడు. రుక్మిణీదేవిస్వయంవరానికి వచ్చిన శ్రీకృష్ణుడు రాక్షసవివాహపద్ధతిలో ఆమెను తీసుకుని వెళ్లాడని మునుపు చెప్పావు. సాళ్వుడు మొదలైన రాజులందరినీ శ్రీకృష్ణుడు ఒక్కడే ఎలా ఓడించాడు? రుక్మిణీదేవిని తన నగరానికి ఎలా తీసుకెళ్లాడు? అదీ కాకుండా –

**శా. కల్యాణాత్మకమైన విష్ణుకథ లాకర్ణించుచున్ ముక్త వై**
**కల్యుం డెవ్వఁడు తృప్తుఁ డౌ; నవి వినంగాఁ గ్రొత్త లౌచుండు సా**
**కల్యం బేర్పడ భూసురోత్తమ! యెఱుంగం బల్కవే! రుక్మిణీ**
**కల్యాణంబు వినంగ నాకు మదిలోఁ గౌతూహలం బయ్యెడిన్. 1684**

**ప్రతి :** కల్యాణ+ఆత్మకము+ఐన= శుభంతో కూడుకొన్నవైన; విష్ణుకథలు= శ్రీ మహావిష్ణువును గురించిన కథలు; ఆకర్ణించుచున్= వింటూ; ముక్తవైకల్యుండు= సంసార దుఃఖాలనుండి విముక్తి పొందినవాడు; ఎవ్వఁడు= ఎవడు; తృప్తుఁడు+ఔన్= తృప్తిని పొందినవాడవుతాడు? (ఎవడికైనా తృప్తికలుగుతుందా? కలుగదు అని అర్థం) అవి= ఆ కథలు; వినన్+కాన్= వింటూ ఉండగా; క్రొత్తలు+ఔచున్+ఉండున్= ఎప్పటికప్పుడు కొత్తగా అనిపిస్తూ ఉంటాయి; సాకల్యంబు= సంపూర్ణంగా; ఏర్పడన్= తెలిసేవిధంగా; భూసుర+ఉత్తమ= బ్రాహ్మణులలో ఉత్తముడైనశుకమహర్షీ; ఎఱుంగన్+పల్కవే= తెలియచెప్పవా; రుక్మిణీకల్యాణంబు= రుక్మిణీదేవికల్యాణకథను; వినన్+కన్= వినడానికై; నాకు(న్); మదిలోన్= మనస్సులో; కౌతుహలంబు+ అయ్యెడిన్= చాలా కుతూహలం కలుగుతూ ఉంది.

**తా :** బ్రాహ్మణులలో ఉత్తముడవైన శుకమహర్షీ! శ్రీమహావిష్ణువుకథలను వింటూ సంసార దుఃఖాల నుండి విముక్తి పొందిన వారు, ఇక వినింది చాలనుకుంటారా? అలా ఎవరైనా తృప్తి పొందుతారా? ఆ కథలను వింటూ ఉంటే అవి ఎప్పటికప్పుడు కొత్తవిగా ఉంటూ చవులూరిస్తాయి. కాబట్టి, రుక్మిణీదేవి వివాహగాథను గురించి మొదటి నుంచి చివరిదాకా మొత్తం వినిపించు. ఎపుడెపుడు విందామా అని మనసంతా కుతూహలంగా ఉంది.

**క. భూషణములు సెవులకు బుధ, తోషణము లనేకజన్మదురితౌఘవిని**
**శ్శోషణములు మంగళతర, ఘోషణములు గరుడగమనుగుణభాషణముల్. 1685**

**ప్రతి :** గరుడుగమను= గరుత్మంతుడిపై పయనించే మహావిష్ణువును గురించిన; గుణ= గుణాలను తెలిపే; భాషణములు= మాటలు; చెవులకున్= చెవులకు; భూషణములు= అలంకారాన్ని కలిగించే ఆభరణాలు; బుధ= విద్వాంసులకు; తోషణములు=

మనసుకు సంతోషం కలిగించేవి; అనేక= ఎన్నో; జన్మ= జన్మలయొక్క; దురిత= పాపాలనెడి; ఓఘ= ప్రవాహాల్ని; వినిశ్శోషణములు= పూర్తిగా ఎండింపజేసేవి; మంగళతర= మిక్కిలి శుభాలను కలిగించే; ఘోషణములు = శబ్దాలు.

**తా :** శ్రీ మహావిష్ణువుగుణాలను గురించి చెప్పుకోవడంలో విశేషం – ఆ కథలు వినేవారిచెవులకు ఆభరణాలు. విద్వాంసులకు ఆనందకారకాలు. జన్మజన్మాల పాప ప్రవాహాల్ని ఎండింప చేసేవి. ఆ కథలను పలుకుతుంటేనే శుభాలు కలుగుతాయి. అంతటి మహిమ ఉన్నవి ఆ గరుడగమనుడైన శ్రీవిష్ణువు కథలు.(ఇంతటి ప్రయోజనం, ఆనందం, ఫలం కల్గుతుందని భావం)

**వ. అని రా జడిగిన శుకుం డిట్లనియె. 1686**

**ప్రతి :** అని= ఈ విధంగా; రాజు+అడిగినన్= పరీక్షిన్మహారాజు అడుగగా; శుకుండు= శుకమహర్షి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తా :** ఈ విధంగా రాజు శుకుడిని అడిగాడు. శుకుడు ఇలా చెప్పసాగాడు.

**చ. వినుము విదర్భదేశమున వీరుఁడు కుండినభర్త భీష్మకుం**
**దను నొక దొడ్డరాజు గల; డాతని కేవురు పుత్త్రు లగ్రజుం**
**డనయుఁడు రుక్మి నాఁ బరఁగు; నందఱకున్ గడగొట్టుచెల్లెలై**
**మనుజవరేణ్య! పుట్టె నొక మానిని రుక్మిణి నాఁ బ్రసిద్ధయై. 1687**

**ప్రతి :** మనుజవరేణ్య= మనుష్యులలో శ్రేష్ఠుడవైన రాజా; వినుము= ఆలకించుము; విదర్భదేశమునన్= విదర్భ అనబడే దేశంలో; వీరుఁడు= పరాక్రమవంతుడూ; కుండిన భర్త= కుండిన నగరానికి అధిపతీ అయిన; భీష్మకుండు+అను= భీష్మకుడు అనే పేరున్న; దొడ్డరాజు= పెద్ద రాజు (అంటే మహారాజు); కలఁడు= ఉన్నాడు; అతనికిన్= ఆ రాజుకు; ఏవురు= ఐదుమంది; పుత్రులు= కుమారులు; అగ్రజుండు= వారిలో పెద్దవాడు; రుక్మినాన్+పరఁగున్= రుక్మి అనే పేరు కలవాడు; అందఱకున్= వారందరికీ; కడగొట్టు= చిట్ట చివరి; చెల్లెలు+ఐ= చెల్లెలుగా; ఒక మానిని= ఒక మానవతి అయిన అమ్మాయి; రుక్మిణి+నాన్= రుక్మిణి అనే పేరిట; ప్రసిద్ధ+ఐ= ప్రసిద్ధురాలై; పుట్టెన్= పుట్టింది.

**తా :** మనుష్యులలో శ్రేష్ఠుడవైన పరీక్షిన్మహారాజా! ఆలకించు. విదర్భ అని ఒక దేశముంది. అందులో కుండిన పురం అని ఒక నగరం. దానికి అధిపతి భీష్మక మహారాజు. అతనికి ఐదుమంది కొడుకులు. వారిలో పెద్దవాడు రుక్మి. అందరికంటె చిట్టచివరిది చెల్లెలు రుక్మిణి అనబడే అమ్మాయి. ఆమె అభిమానవతి. ప్రసిద్ధురాలు.

**క. బాలేందురేఖ దోఁచిన, లాలిత యగు నపరదిక్కులాగున ధరణీ**
**పాలునిగేహము మెఱసెను, బాలిక జన్మించి యెదుగ భాసుర మగుచున్. 1688**

**ప్రతి :** బాల+ఇందురేఖ= సన్నని చంద్రరేఖ; తోఁచినన్= కనబడగానే (పైకి రాగానే); లాలిత+అగు= మనోహరంగా కనిపించే; అపరదిక్కు= పడమటిదిక్కు; లాగునన్= వలె; ధరణీపాలుని= మహారాజైన భీష్మకునియొక్క; గేహము= ఇల్లు; బాలిక= చిన్నపాప అయిన రుక్మిణి; జన్మించి= పుట్టి; ఎదుగన్= పెరుగుతూ ఉండగా; భాసురము+అగుచున్= ఎంతో తేజస్సుతో; మెఱసెను= తేజరిల్లింది.

**తా :** సన్ననిచంద్రరేఖ ఉదయిస్తూనే పడమటిదిక్కు మనోహరంగా కనిపిస్తుంది. అలాగే, ఆ చిట్టిపాప రుక్మిణి పుట్టి, పెరుగుతూ ఉంటే మహారాజైన భీష్మకునిఇల్లు మనోజ్ఞంగా ప్రకాశిస్తూంది.

**వ. మఱియు దినదినప్రవర్ధమానయై. 1689**

**ప్రతి :** మఱియున్= తర్వాత; దినదిన= రోజురోజుకూ; ప్రవర్ధమాన+ఐ= ఎదుగుతున్నదై...

**తా :** రుక్మిణి రోజురోజుకూ ఎదుగుతూ ఉండగా

**సీ. పేర్వేర బొమ్మలపెండ్లిండ్లు సేయుచు నబలలతోడ వియ్యంబు లందు**
**గుజ్జెనగూళ్ళను గొమరొప్ప వండించి చెలులకుఁ బెట్టించుఁ జెలువు మెఱసి**
**రమణీయమందిరారామదేశంబులఁ బువ్వుఁదీఁగెలకును బ్రోదివెట్టు**
**సదమలమణిమయసౌధభాగంబుల లీలతో భర్మడోలికల నూఁగు**

**తే. బాలికలతోడఁ జెలరేగి బంతులాడు, శారికాకీరపంక్తికిఁ జదువు సెప్పు**
**బర్హిసంఘంబులకు మురిపములు గఱపు, మదమరాళంబులకుఁ జూపు మందగతులు. 1690**

**ప్రతి :** పేర్వేరన్= పేరుపేరునా(బొమ్మలకు పేర్లు పెట్టడం, ఆ పేర్లతో వాటిని పిలుస్తూ); బొమ్మల పెండ్లిండ్లు= బొమ్మలకు ఒకదానితో మరొకదానికి పెండ్లిండ్లు; చేయుచున్= చేస్తూ; అబలలతోడన్= తనతోపాటు ఆడుకుంటున్న ఆడపిల్లలతో; వియ్యంబులు+అందున్= సంబంధాలు కలుపుకుంటూ ఉంటుంది; గుజ్జెన గూళ్ళను= ఆట్లాడుకోవడంలో భాగంగా గురుగులతో వండిన వంటకాలను; కొమరు+ఒప్పన్= మనోజ్ఞంగా (ఇంపుగా); వండించి= వండింపజేసి; చెలువు మెఱసి= ముచ్చటగా మెలగుతూ; చెలులకున్= తన స్నేహితురాండ్రకు; పెట్టించున్= వడ్డింపజేస్తుంది; రమణీయ= సుందరమైన; మందిర+ ఆరామదేశంబులన్= అంతఃపురంలోని తోటలలో; పువ్వుతీఁగెలకును= పూల తీగలకు; ప్రోదిపెట్టున్= పాదులుచేసి నీళ్లుపోసి పోషణ చేస్తుంది; సత్+అమల= మిక్కిలి స్వచ్ఛమైన; మణిమయ= రకరకాల మణులతో కూడిన; సౌధ భాగంబులన్= మేడల పైభాగాలలో; లీలతో= విలాసంగా; భర్మ= బంగారు; డోలికలన్= ఉయ్యాలల్లో; ఊఁగున్= ఊగుతుంది; బాలికలతోడన్= తనతోపాటు ఆడుకునే ఆడపిల్లలతో; చెలరేగి= ఉత్సాహంతో; బంతులు+ఆడున్= బంతులాట ఆడుతుంది; శారికా= గోరువంకల; కీర= రామచిలుకల; పంక్తికిన్= వరుసలకు; చదువు+చెప్పున్= చదువు చెప్పిస్తుంది; బర్హి= పింఛమున్న నెమళ్ల; సంఘంబులకున్= సమూహాలకు; మురిపములు= ఒంపుఒయ్యారాలను; కఱపు= నేర్పుతుంది; మదమరాళంబులకున్= మదించిన రాజహంసలకు; మందగతులు= నెమ్మదైన నడకలు; చూపున్= చూపుతుంది (నేర్పుతుంది).

**తా :** రుక్మిణీదేవి తనతోడి అమ్మాయిలతో ఆడుకుంటూ ఉంది. బొమ్మలకు పేర్లు పెట్టి, వాటికి పెళ్లిళ్లు చేయిస్తూ, తన సహచర కన్యలతో వియ్యమందుకుంటుంది. గురుగులతో వంటకాలు చేయిస్తూ తన చెలులకు వడ్డింపజేస్తుంది. అంతఃపురంలో ఉండేతోటల్లో పూలతీగెలకు పాదులు చేసి 'నీళ్ళు పోసి' పోషణ చేస్తుంది. శుభ్రంగా ఉండే మేడపైభాగాల్లో విలాసంగా బంగారుఊయలలూగుతుంది; అమ్మాయిలతో ఉత్సాహంగా బంతులాట లాడుతుంది. గోరువంకలకు, రామచిలుకలకు పలుకులు చెపుతుంది. పింఛం విప్పుకున్న నెమళ్లగుంపులకు ఒయ్యారాలను నేర్పుతుంది. మదించిన హంసలకు నడకల సొగసులను చూపుతుంది (అంటే వాటికే గతులు నేర్పగలిగిన అందగత్తె రుక్మిణి అని అర్థం)

**వ. అంత. 1691**

**ప్రతి :** అంత= అటు తరువాత...

**తా :** ఆ తర్వాత

**సీ. దేవకీసుతుకోర్కి తీఁగెలు వీడంగ వెలఁదికి మైదీఁగె వీడఁ దొడఁగెఁ;**
**గమలనాభునిచిత్తకమలంబు వికసింపఁ గాంతి నింతికి ముఖకమల మొప్పె;**
**మధువిరోధికి లోన మదనాగ్ని పొడసూపఁ బొలఁతికి చనుదోయి పొడవు సూపె;**
**శౌరికి ధైర్యంబు సన్నమై దయ్యంగ జలజాక్షిమధ్యంబు సన్నమయ్యెఁ;**

**ఆ. హరికిఁ బ్రేమబంధ మధికంబుగాఁ కేశ, బంధ మధిక మగుచు బాల కమరెఁ**
**బద్మనయనువలనఁ బ్రమదంబు నిండార, నెలఁత యౌవనంబు నిండి యుండె. 1692**

**ప్రతి :** దేవకీసుతు= దేవకీదేవి కొడుకైన శ్రీకృష్ణునియొక్క; కోర్కి= కోరిక; తీఁగెలు వీడన్+కన్= తీగలుగా విస్తరించగా; వెలఁదికిన్= రుక్మిణికి; మైదీఁగె= శరీరమనే తీగ; (తీగెలాంటి శరీరం అని భావం) వీడన్+తొడఁగెన్= విస్తరించ సాగింది; కమలనాభుని= కమలాన్ని నాభియందు కలిగిన శ్రీకృష్ణునియొక్క; చిత్తకమలంబు= మనస్సు అనే కమలం; వికసింపన్= విప్పారగా; కాంతిన్= కాంతితో; ఇంతికిన్= స్త్రీకి (రుక్మిణికి) ముఖకమలము+ఒప్పెన్= వదనసరోజం, ముఖమనే కమలం ప్రకాశించింది; మధువిరోధికిన్= మధుడు అనే రాక్షసునికి శత్రువైన శ్రీకృష్ణునికి; లోనన్= మదిలో; మదన+అగ్ని= మన్మథాగ్ని; పొడచూపన్= కనిపించగా; (కలుగగా); పొలఁతికిన్= అందగత్తెకు (రుక్మిణికి); చనుదోయి= స్తనాలజంట; పొడువు+చూపెన్= కనిపించసాగింది; శౌరికిన్= శ్రీకృష్ణునికి; ధైర్యంబు= ధైర్యం; సన్నము+ఐ= తక్కువై; దయ్యన్+కన్= బలహీనం కాగా; జలజ+అక్షి= పద్మాలవంటి కళ్లున్న రుక్మిణీదేవియొక్క; మధ్యంబు= నడుము; సన్నము+అయ్యెన్= కృశించి పోయింది; హరికిన్= శ్రీకృష్ణునికి; ప్రేమబంధము= ప్రణయబంధం; అధికంబు+కాన్= ఎక్కువ కాగా; కేశబంధము= జుట్టుముడి, కొప్పు; అధికము+అగుచున్= ఎక్కువ అవుతూ; బాలకున్+అమరెన్= బాల అయిన రుక్మిణీ దేవికి అమరింది; పద్మనయనువలనన్; తామర పూలలాంటి కళ్లున్న శ్రీకృష్ణుని వైపు; ప్రమదంబు= సంతోషం; నిండారన్= నిండి ఉండగా; నెలఁత= కోమలయైన రుక్మిణిలో; యౌవనంబు= యౌవనం; నిండి+ఉండెన్= పూర్తిగా విప్పారి ఉండింది.

**తా :** శ్రీకృష్ణునికి రుక్మిణిపట్ల కోరిక విస్తరించింది. రుక్మిణికి తీగలాగ శరీరం విస్తరించింది. శ్రీకృష్ణునికి మనసనే పద్మం విరబూసింది. రుక్మిణికి ముఖమనే పద్మం వెలుగులు చిమ్మింది. శ్రీకృష్ణునిమదిలో మన్మథాగ్ని కనిపించింది. రుక్మిణికి స్తనాలజంట కనిపించింది. శ్రీకృష్ణునికి ధైర్యం సన్నగిల్లింది. రుక్మిణికి నడుము సన్నగిల్లింది. ఆ కృష్ణునికి ప్రేమబంధం ఎక్కువయింది. రుక్మిణికి కేశబంధం ఎక్కువయింది. శ్రీకృష్ణునిలో సంతోషం నిండి ఉండగా, రుక్మిణిలో యౌవనం విప్పారింది.

**విశే :** శూరునికొడుకు వసుదేవుడు. అతని కొడుకు శ్రీకృష్ణుడు. శూరుని మనుమడు కాబట్టి 'శౌరి' అని శ్రీకృష్ణునికి పేరు.

**వ. ఇట్లు రుక్మి, రుక్మరథ, రుక్మబాహు, రుక్మకేశ, రుక్మనేత్రులను నేవురకుం జెలియలైన రుక్మిణీదేవి తన యెలప్రాయంబున. 1693**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; రుక్మి, రుక్మరథ, రుక్మబాహు, రుక్మకేశ, రుక్మనేత్రులు+అను+ఏవురకున్= అనే పేర్లున్న ఐదుమందికి; చెలియలు+ఐన= చెల్లెలైన; రుక్మిణీదేవి; తన ఎలప్రాయంబునన్= తన లేతవయసులో...

**తా :** ఈ విధంగా రుక్మి, రుక్మరథుడు, రుక్మబాహుడు, రుక్మకేశుడు, రుక్మనేత్రుడు – అనే అయిదుమందికి చెల్లెలుగా ఉన్న రుక్మిణి లేతవయసులో ఉండగా

**క. తనతండ్రిగేహమునకుం, జనుదెంచుచు నున్న యతిథిజనులవలనఁ గృ**
**ష్ణునిరూపబలగుణాదులు, విని కృష్ణుఁడు దనకుఁ దగినఁ విభుఁ డని తలఁచెన్. 1694**

**ప్రతి :** తన తండ్రి= తన తండ్రి అయిన భీష్మకుని; గేహమునకున్= ఇంటికి; చనుదెంచుచున్+ఉన్న= వస్తూ ఉండినట్టి; అతిథి; జనుల వలనన్= అతిథులవల్ల; కృష్ణుని= శ్రీకృష్ణుని; రూప= అందం; బల= బలం; గుణ+అదులున్= గుణము మొదలైన వాటిల్ని గురించి; విని; కృష్ణుఁడు= శ్రీకృష్ణుడు; తనకున్= తనకు; తగిన= సరియైన; విభుఁడు+అని+తలఁచెన్= భర్త అని నిర్ణయించుకొనింది.

**తా :** రుక్మిణి తండ్రి అయిన భీష్మకునిఇంటికి ఎందరో అతిథులు వస్తూ ఉండే వారు. వాళ్లు శ్రీకృష్ణుని అందం గురించి, శక్తిని గురించి చెపుతూ ఉండే వారు. వాటిని విని, శ్రీకృష్ణుడే తనకు తగిన భర్త అని రుక్మిణి తలంచింది.

**క. ఆ లలనరూపు బుద్ధియు, శీలము లక్షణము గుణముఁ జింతించి తగన్**
**బాలారత్నముఁ దన కి, ల్లాలుగఁ జేకొందు ననుచు హరియుం దలఁచెన్. 1695**

**ప్రతి :** ఆ లలన రూపు= ఆ కోమలి అయిన రుక్మిణియొక్క అందమైనరూపాన్ని; బుద్ధియు= వివేకాన్ని; శీలమున్= నడవడికను; లక్షణమున్= శుభ లక్షణాన్ని; గుణమున్= సద్గుణాన్ని; చింతించి= (గురించి) ఆలోచించి; తగన్= తగినట్లుగా; బాలారత్నము= కన్యలలో రత్నంవంటి ఆ రుక్మిణిని; తనకున్+ఇల్లాలు+కన్= తనకు భార్యగా; చేకొందున్+అనుచున్= స్వీకరిస్తానని; హరియున్= శ్రీకృష్ణుడు కూడా; తలఁచెన్= అనుకున్నాడు.

**తా :** ఆ రుక్మిణీదేవియొక్క అందమైన రూపాన్ని, ఆమె తెలివిని, నడివడికను, శుభలక్షణాన్ని, సద్గుణాన్ని, గురించి తెలుసుకొని, శ్రీకృష్ణుడు కన్యలలో రత్నంవంటి రుక్మిణిని తనకు భార్యగా చేసుకోవాలని అనుకున్నాడు.

**వ. అంత. 1696**

**ప్రతి :** అంతన్= అప్పుడు...

**తా :** ఆ తర్వాత

**ఉ. బంధువు లెల్లఁ గృష్ణునకు బాలిక నిచ్చెద మంచు శేముషీ**
**సింధువులై విచారములు సేయఁగ వారల నడ్డుపెట్టి దు**
**స్సంధుఁడు రుక్మి కృష్ణునెడఁ జాలవిరోధముఁ జేసి మత్త పు**
**ష్పంధయవేణి నిత్తు శిశుపాలున కంచుఁ దలంచె నంధుఁడై. 1697**

**ప్రతి :** బంధువులెల్లన్= (రుక్మిణీదేవివైపు) బంధువులందరూ; కృష్ణునకున్= శ్రీకృష్ణునికి; బాలికను= రుక్మిణీదేవిని; ఇచ్చెదము+ అంచున్= ఇచ్చి వివాహం చేస్తామని; శేముషీ సింధువులు+ఐ= బుద్ధికి సములై; విచారములు= ఆలోచనలు; చేయన్+కన్= చేస్తూ ఉండగా; వారలను+అడ్డుపెట్టి= వాళ్ల మాటను వారించి; దుస్సంధుఁడు= దుష్టులతో మైత్రి కలిగినవాడైన; రుక్మి; కృష్ణుని+ఎడన్= శ్రీకృష్ణునిపట్ల; చాల విరోధమున్+చేసి= ఎంతో పగను పెంచుకుని; అంధుఁడై= గుడ్డివాడై, (రుక్మిణి ఆశలను, బంధువుల ఆలోచనలను పట్టించుకోకుండా) మత్తపుష్పంధయవేణిన్= మదించిన తుమ్మెదలబారులాంటి నల్లని, దట్టమైన జడ కలిగిన రుక్మిణిని; శిశుపాలునకున్= శిశుపాలునికి; ఇత్తున్(ఇచ్చుదును)= ఇస్తాను; అంచున్= అంటూ; తలంచెన్= సంకల్పించాడు.

**తా :** తర్వాత రుక్మిణీదేవి వైపున్న బంధువులందరూ బాగా ఆలోచించి, ఆమెను శ్రీకృష్ణునికి ఇచ్చి వివాహం చేయాలని తీర్మానించుకొన్నారు. వాళ్ల ఆలోచనలను లక్ష్యపెట్టకుండా, వాళ్లను కాదని, దుష్టులతో స్నేహంకల రుక్మి శ్రీకృష్ణుని పై చాలా శత్రుత్వాన్ని పెంచుకున్నాడు. గుడ్డిగా తాను తలచిందే చేస్తానని మొండి పట్టుపట్టాడు. నల్లని తుమ్మెదల బారువలె ఒత్తైన జడ ఉన్న రుక్మిణిని శిశుపాలుని కిస్తాను అని తలచాడు.

**విశే :** దుస్+సంధుడు - దుష్టమైన సంధి కలవాడు - శ్రీకృష్ణుడికి రుక్మిణితో సంబంధాన్ని కలపాలనుకునే వాళ్లు శేముషీ సింధువులు. అలా కాదనుకునే వాడు దుస్సంధుడు. వాడికి ఆలోచన లేదు. ముందు చూపు లేదు. అందుకే 'అంధుడు' అయినాడు.

**ఉ. అన్నతలంపు దా నెఱిఁగి య న్నవనీరజగంధి లోన నా**
**పన్నత నొంది, యాప్తుఁడగు బ్రాహ్మణు నొక్కనిఁ జీరి గర్వ సం**
**ఛన్నుఁడు రుక్మి నేఁడు ననుఁ జైద్యున కిచ్చెద నంచు నున్న వాఁ**
**డెన్ని విధంబులం జని బుధేశ్వర! చక్రికి విన్నవింపవే! 1698**

**ప్రతి :** అన్న తలంపు= అన్న అయిన రుక్మి ఆలోచనను; తాను+ఎఱిఁగి= తాను తెలుసుకుని; ఆ+నవనీరజ గంధి= అప్పుడే పూచిన తామరపూల సువాసనతో పరిమళించే శరీరంకల ఆ రుక్మిణి; లోనన్= మనసులో; ఆపన్నతన్+ఒంది= విపత్తుకల్గి; ఆప్తుఁడు+అగు= తనకు దగ్గరివాడయిన; బ్రాహ్మణున్+ఒక్కనిన్= ఒక బ్రాహ్మణుణ్ణి; చీరి= పిలిచి; గర్వసంఛన్నుఁడు= పొగరుతో కప్పబడినవాడైన రుక్మి; నేఁడు= ఇప్పుడు; ననున్= నన్ను; చైద్యునకున్= చేదిరాజైన శిశుపాలునకి; ఇచ్చెదను+అంచున్= ఇస్తానని అంటూ; ఉన్నవాఁడు= ఉన్నాడు; ఎన్నివిధంబులన్= ఏ విధంగానైనా సరే; చని= వెళ్లి; బుధ+ఈశ్వర= పండితులలో ఉత్తముడా!; చక్రికిన్= చక్రాన్ని ఆయుధంగా కలిగిన శ్రీకృష్ణునికి; విన్నవింపవు+ఏ= (నా పరిస్థితిని) మనవి చేయు స్వామీ!

**తా :** తన అన్న రుక్మి ఆలోచనలను రుక్మిణి గ్రహించింది. అప్పుడే పూచిన తామరపూలవలె పరిమళించే శరీరం గల ఆమె మనసులో దిగులు పడింది. తనకు బాగా ఆప్తుడైన ఒక బ్రాహ్మణుణ్ణి పిలిచింది. గర్వంతో కూడినవాడైన మా అన్న రుక్మి ఇపుడు నన్ను చేదిరాజైన శిశుపాలునికి ఇవ్వాలని అనుకుంటున్నాడు. పండితోత్తమా! ఏ విధంగానైనా సరే వెళ్లి ఈ విషయాన్ని చక్రాయుధుడైన శ్రీకృష్ణునికి విన్నవించుము.

**క. అయ్యా! కొడుకు విచారము, లయ్యయు వారింపఁ జాలఁ డటు గాకుండన్**
**నెయ్య మెఱిఁగించి చీరుము, చయ్యన నిజసేవకానుసారిన్ శౌరిన్. 1699**

**ప్రతి :** అయ్యా= బ్రాహ్మణోత్తమా!, పూజ్యుడా!; కొడుకు విచారములు= కొడుకైన రుక్మి చేస్తున్న ఆలోచనలను; అయ్యయున్= మా నాన్న (తండ్రి) కూడా; వారింపన్+చాలఁడు= వద్దని చెప్పలేకున్నాడు; అటు+కాక+ఉండన్= అలా (రుక్మి అనుకున్నట్టు) జరుగకుండా; నెయ్యము+ఎఱిఁగించి= నా స్నేహాన్ని తెలిపి; నిజసేవక+అనుసారిన్= తనను సేవించేవారిని అనుసరించే వాడైన; శౌరిన్= శ్రీకృష్ణుణ్ణి; చయ్యనన్= వెంటనే; చీరుము= పిలుచుకొని రా.

**తా :** పూజ్యుడా! కొడుకైన రుక్మి చేస్తున్న ఆలోచనలను మా తండ్రికూడా కాదనలేకున్నాడు. రుక్మి అనుకున్నట్లు జరుగకుండా, శ్రీకృష్ణునికి నా స్నేహాన్ని విన్నవించు. తనను సేవించే వారికి తోడుగా నిలిచే ఆయనను వెంటనే పిలుచుకొనిరా.

**వ. అని కొన్ని రహస్యవచనంబులు సెప్పిన విని బ్రాహ్మణుండు ద్వారకానగరంబునకుం జని, ప్రతీహారుల వలనఁ దనరాక యెఱింగించి య న్నగధరుం డున్ననగరుఁ బ్రవేశించి,యందుఁ గనకాసనాసీనుండై యున్నపురుషోత్తముం గాంచి 'పెండ్లికొడుకవు గ' మ్మని దీవించిన ముసిముసినగవులు నగుచు బ్రహ్మణ్యదేవుండైనహరి తనగద్దియ దిగ్గన డిగ్గి, బ్రాహ్మణుం గూర్చుండ నియోగించి, తనకు దేవతలు సేయుచందంబునం బూజలు సేసి, సరసపదార్థసంపన్నంబైన యన్నంబు పెట్టించి, రెట్టించిన ప్రియంబున నయంబున భాసురుండైన భూసురుం జేరి లోకరక్షణప్రశస్తంబయిన హస్తంబున నతనియడుగులు పుడుకుచు మెల్లన నతని కిట్లనియె. 1700**

**ప్రతి :** అని= పై విధంగా అంటూ; కొన్ని రహస్య వచనంబులు= కొన్ని రహస్యమైన మాటలు; చెప్పినన్= చెప్పగా; విని= ఆలకించి; బ్రాహ్మణుండు= ఆ బ్రాహ్మణుడు; ద్వారకా నగరంబునకున్= ద్వారకానగరానికి; చని= వెళ్ళి; ప్రతీహారుల వలనన్= ద్వారపాలకులద్వారా; తనరాక= తాను వచ్చిన విషయాన్ని; ఎఱింగించి= తెలిపి; ఆ+నగధరుండు+ఉన్న= ఆ గోవర్ధనధారి అయిన శ్రీకృష్ణుడు ఉన్న; నగరున్= నగరాన్ని (అంతఃపురాన్ని); ప్రవేశించి; అందున్= అక్కడ; కనక+ఆసన+ఆసీనుండు+ఐ= బంగారుఆసనంమీద కూర్చుని; ఉన్న; పురుష+ఉత్తమున్= పరమపురుషుడైన శ్రీకృష్ణుణ్ణి; కాంచి= చూచి; పెండ్లికొడుకవు కమ్ము= పెళ్లి కుమారుడవు కమ్ము అని; దీవించినన్= అంటూ ఆశీర్వదించగా; ముసిముసి నగవులు= చిరునవ్వులు; నగుచున్= నవ్వుతూ; బ్రహ్మణ్యదేవుండు+ఐన= బ్రాహ్మణులకు హితం కల్గించేవాడైన; హరి= శ్రీకృష్ణుడు; తన గద్దియ= తన ఆసనాన్ని; దిగ్గన డిగ్గి= తటాలున దిగి; బ్రాహ్మణున్= ఆ బ్రాహ్మణుణ్ణి; కూర్చుండన్= కూర్చుండుటకై; నియోగించి= ఏర్పరచి; తనకున్= తనకు(న్); దేవతలు చేయుచందంబునన్= దేవతలు చేసే విధంగా; పూజలు చేసి= పూజించి; సరస పదార్థ= అన్నిరసాలతో (షడ్రుచులతో) కూడిన పదార్థాలతో; సంపన్నంబు+ఐన= సమృద్ధమైన; అన్నంబున్= ఆహారాన్ని; పెట్టించి= వడ్డింపజేసి; రెట్టించిన ప్రియంబునన్= రెండింతలైన ప్రేమతో; నయంబునన్= వినయంతో; భాసురుండు+ఐన= తేజస్సుతో వెలిగిపోతున్న; భూసురున్= బ్రాహ్మణుణ్ణి; చేరి= దగ్గరకు వచ్చి; లోకరక్షణ= లోకాలను కాపాడంలో; ప్రశస్తంబు+అయిన= ప్రశంసించదగిందైన; హస్తంబునన్= చేతితో; అతని= ఆ బ్రాహ్మణుని; అడుగులు= పాదాలను; పుడుకుచున్= ఒత్తుతూ; మెల్లనన్= మెల్లగా; అతనికిన్= ఆ బ్రాహ్మణునితో; ఇట్లు= ఇలా; అనియెన్= అన్నాడు.

**తా :** పై విధంగా మాట్లాడి, రుక్మిణి ఇంకా కొన్ని రహస్యవిషయాలను చెప్పింది. అన్నిటినీ విని ఆ బ్రాహ్మణుడు ద్వారకానగరానికి వెళ్లాడు. ద్వారపాలకుల ద్వారా తన రాకను గురించి తెలిపాడు. గోవర్ధన గిరిధారి అయిన శ్రీకృష్ణుడున్న ఆ నగరును ప్రవేశించాడు. అందులో బంగారు పీఠంపై కూర్చొని ఉన్న పురుషోత్తముడైన శ్రీకృష్ణుణ్ణి చూచి 'పెండ్లికొమరుడివి' కమ్మని

ఆశీర్వదించాడు. దానికి శ్రీకృష్ణుడు ముసిముసి నవ్వులు నవ్వుతూ తన ఆసనం నుండి గబుక్కున లేచి దిగాడు. ఆ బ్రాహ్మణుని కూర్చోబెట్టాడు. తనకు దేవతలు ఎలాంటి పూజలను చేస్తారో అలాంటిపూజను ఆ బ్రాహ్మణునికి చేశాడు. పిదప షడ్రుచులతో కూడిన రుచికరమైన భోజనం సమృద్ధిగా పెట్టించినాడు. ఇష్టంతో, వినయంతో అతని దగ్గర కూర్చొని, లోకరక్షణలో ప్రశస్తికెక్కిన తన చేతితో ఆయనపాదాలను ఒత్తుతూ శ్రీకృష్ణుడు ఇలా అన్నాడు.

**సీ. జగతీసురేశ్వర! సంతోషచిత్తుండ వై యున్న నీధర్మ మతిసులభము**
**వృద్ధసమ్మత మిది విత్త మెయ్యది యైనఁ బ్రాపింప హర్షించు బ్రాహ్మణుండు**
**తనధర్మమున నుండుఁ దరలఁ డా ధర్మంబు గోరిక లతనికిఁ గురియుచుండు**
**సంతోషి గాఁ డేని శక్రుఁ డైన నశించు నిర్ధనుం డైనను నింద్రుఁ బోలు**

**ఆ. సంతసించెనేని, సర్వభూతసుహృత్త, ములకుఁ బ్రాప్తలాభ ముదిత మాన**
**సులకు శాంతులకును సుజనులకును గర్వ, హీనులకును వినతు లే నొనర్తు. 1701**

**ప్రతి :** జగతీసుర+ఈశ్వర= బ్రాహ్మణులో గొప్పవాడా!; సంతోష చిత్తుండవు+ఐ+ఉన్న= సంతోషం పొందే మనసున్న వాడవై ఉన్న; నీ ధర్మము= నీ గుణం (స్వభావం); అతిసులభము= సులువుగా అనుసరణీయం; వృద్ధ సమ్మతము+ఇది= ఇది పెద్దలందరూ అంగీకరించిన పద్ధతి; విత్తము= సొమ్ము (ధనం); ఏ+అది+ఐనన్= ఏ పాటిదైనా; ప్రాపింపన్= దొరికితే; బ్రాహ్మణుండు= బ్రాహ్మణుడు; హర్షించున్= సంతోష పడతాడు; తన ధర్మమునన్+ఉండున్= తాను నిర్వర్తించవలసిన ధర్మంలోనే ఉంటాడు; ఆ+ధర్మంబు= ఆ విధ్యుక్త ధర్మంనుండి; తరలఁడు= ప్రక్కకు తొలగిపోడు; అతనికిన్= అలాంటి వాడికి; కోరికలు= సర్వవాంఛలు; కురియుచుండున్= వాటికవే కురుస్తుంటాయి, (సఫలమవుతూ ఉంటాయి); సంతోషికాఁడు+ ఏనిన్= తృప్తిపడి సంతోషించేవాడు కాకపోతే; శక్రుఁడు+ఐనన్= ఇంద్రుడైనప్పటికీ; నశించున్= నాశనమవుతాడు; నిర్ధనుండు+ ఐననున్= ధనహీనుడైనా కూడా; సంతసించెన్+ ఏనిన్= సంతృప్తితో ఉంటే; ఇంద్రున్+పోలున్= ఇంద్రునితో సమానుడవుతాడు; సర్వభూత= సృష్టిలోని అన్ని ప్రాణుల పట్ల; సుహృత్+తములకున్= హితంకోసం మంచిమనస్సు ఉన్నవాళ్లకు; ప్రాప్తలాభ= దొరికిన దానితోనే; ముదిత= సంతోషించే; మానసులకున్= మనసున్నవాళ్లకూ; శాంతులకును= శాంతి స్వభావులకూ; సుజనులకును= సత్పురుషులకూ; గర్వహీనులకును= గర్వం లేనివారికీ; ఏను= నేను; వినతులు= నమస్కారాలను; ఒనర్తున్ (ఒనర్చుదును)= చేస్తాను.

**తా :** బ్రాహ్మణోత్తమా! సంతోషపడే మనస్సు నీది. ఈ స్వభావం నీకు అతి సులభంగా అలవడింది. పెద్ద లందరూ ఇది మంచి పద్ధతి అని అంగీకరించారు. బ్రాహ్మణుడు తనకు లభించిన సొమ్ము ఎలాంటిదైనా తృప్తిపడతాడు. తన ధర్మాన్ని ఎప్పుడూ తప్పడు. అలాంటి వాడికి కోరికలు వాటంతట అవే నెరవేరుతాయి. ఒకవేళ తృప్తికలగకపోతే, వాడు ఇంద్రుడైనా సరే నాశనమవుతాడు. అదే, సంతోషించేవాడయితే అలాంటి వాడు ధనహీనుడయినాసరే ఇంద్రునితో సమానమవుతాడు. సృష్టిలోని అన్ని ప్రాణులపట్ల మంచిమనసుతో ప్రవర్తించేవాళ్లకు, దొరికినదేదైనా దానితోనే సంతోషించే మంచి మనస్సున్న వాళ్లకు; ప్రశాంతంగా ఉండేవాళ్లకు; గర్వం లేనివాళ్లకు నేను నమస్కారాలు చేస్తాను.

**ఉ. ఎవ్వని దేశమం దునికి; యెవ్వనిచేఁ గుశలంబు గల్గు మీ;**
**కెవ్వని రాజ్యమందుఁ బ్రజలెల్ల సుఖింతురు వాఁడు మత్ప్రియుం**

**'ఎవ్వనరాశి దుర్గమున కె ట్లరుదెంచితి వయ్య! నీవు? లే**
**నవ్వులు గావు; నీ తలఁపునం గల మే లొనరింతు ధీమణీ!** **1702**

**ప్రతి :** ధీమణీ= పండితోత్తమా, జ్ఞానశ్రేష్ఠుడా!; ఎవ్వని= ఎవరి; దేశము+అందున్+ఉనికి= దేశంలో ఉంటావు; ఎవ్వని చేన్= ఎవరివల్ల; మీకు(న్); కుశలంబు= క్షేమం; కల్గున్= కలుగుతున్నది; ఎవ్వని రాజ్యము+అందున్= ఎవరి రాజ్యంలో; ప్రజలు+ఎల్లన్= ప్రజలంతా; సుఖింతురు(సుఖించుదురు)= సుఖపడతారో; వాఁడు= అలా క్షేమసుఖాలను కలిగించినవాడు; మత్+ప్రియుండు= నాకు ఇష్టమైనవాడు; ఈ+వనరాశి దుర్గమునకున్= సముద్రం మధ్యలో ఉండే ఈ కోటకు; నీవు; ఎట్లు+అరుదెంచితివి+అయ్య= ఎలా వచ్చావయ్యా?; లే నవ్వులు= వట్టి పరిహాసాలు; కావు= కానే కావు; నీ తలఁపునన్+ కల= నీ మనస్సులో ఉన్నట్టి; మేలు+ఒనరింతున్(ఒనరించుదును)= మంచి కోరికలను చేకూరుస్తాను.

**తా :** పండితోత్తమా! ఏ దేశంలో ఉంటున్నావు? ఎవరు మీ క్షేమ సమాచారాలు విచారిస్తున్నారు? ఎవరి రాజ్యంలో ప్రజలు సుఖిస్తారో ఆ రాజు నాకు ప్రీతిపాత్రుడు. సముద్రమధ్యంలో ఉన్న ఈ కోటకు ఎలా వచ్చావు? వట్టి పరిహాసాలు కావు. నీవేం కోరుకుంటున్నావో చెప్పు తీరుస్తాను.

**విశే :** ఎవని రాజ్యంలో ప్రజలు సుఖశాంతుల్తో ఉంటారో అట్టి రాజుయొక్క ధర్మ పరిపాలనకు సంతోషించి, దేవతలుకూడా ఆ రాజుకు నమస్కరిస్తారనే దివ్యప్రబోధం – ఈ పద్యంలో శ్రీకృష్ణుని మాటల ద్వారా తెలుస్తూంది.

**వ. అని యిట్లు లీలాగృహీతశరీరుండైన యప్పరమేశ్వరుం డడిగిన ధరణీసురవరుం డతనికి సవినయంబుగ నిట్లనియె. దేవా! విదర్భదేశాధీశ్వరుండైన భీష్మకుండను రాజు గలం; డా రాజుకూఁతురు రుక్మిణి యను కన్యకామణి గల; ద య్యిందువదన నీకుఁ గైంకర్యంబు సేయంగోరి వివాహమంగళ ప్రశస్తంబయిన యొక్కసందేశంబు విన్నవింపు మని పుత్తెంచె నవధరింపుము.** **1703**

**ప్రతి :** అని+ఇట్లు= అని ఈ విధంగా; లీలాగృహీత శరీరుండు+ఐన= లీలామానుషవిగ్రహుడైన; ఆ+పరమ+ఈశ్వరుండు= ఆ శ్రీకృష్ణుడు; అడిగినన్= అడుగగా; ధరణీసురవరుండు= ఆ బ్రాహ్మణశ్రేష్ఠుడు; అతనికిన్= కృష్ణునితో; సవినయంబు+కన్= అడకువతో; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు; దేవా= దేవా!; విదర్భదేశ= విదర్భ అనే దేశానికి; అధీశ్వరుండు+ఐన= అధిపతియైన; భీష్మకుండు+అను= భీష్మకుడు అనే పేరున్న; రాజు; కలండు= ఉన్నాడు; ఆ రాజుకూఁతురు= ఆ రాజుయొక్క కొమార్తె; రుక్మిణి+అను= రుక్మిణి అని పేరున్న; కన్యకామణి= ఉత్తమమైన కన్య; కలదు= ఉంది; ఆ+ఇందువదన= చందమామనుబోలిన ముఖమున్నఆమె; నీకున్= నీకు; కైంకర్యంబు= సేవ; చేయన్+కోరి= చేయాలనే కోరికతో; వివాహమంగళ ప్రశస్తంబు+అయిన= వివాహమనే మంగళత్వంచేత శ్రేష్ఠమైన కార్యంకోసం; ఒక్క= ఒక; సందేశంబు= సందేశాన్ని; విన్నవింపుము+అని= మనవి చేయుమని చెప్పి; పుత్తెంచెన్= పంపింది; అవధరింపుము= దయతో వినవలసింది.

**తా :** ఇలా లీలా మానుష విగ్రహుడైన శ్రీకృష్ణుడు అడిగాడు. దానికి ఆ బ్రాహ్మణుడు ఇలా అన్నాడు. "దేవా! విదర్భ అనే దేశానికి అధిపతిగా భీష్మకుడు అని ఒక రాజున్నాడు. అతనికి రుక్మిణి అని ఒక కూతురుంది. ఆమె కన్యకామణి. చందమామవంటి ముఖం కల ఆమె నీకు సేవలను చేయాలను ఆశపడుతూ ఉంది. ఆ ఆశతో తనను మీరు వివాహం చేసుకోవాలని ఆశిస్తూ ఉంది. ఆ వివాహ మంగళప్రశస్తమైన విషయంగా నా ద్వారా మీకు సందేశంపంపింది. దయతో ఆలకించండి.

**సీ. ఏ నీ గుణములు కర్ణేంద్రియంబులు సోఁక దేహతాపంబులు దీఱిపోవు**
**నే నీ శుభాకార మీక్షింపఁ గన్నుల కఖిలార్థలాభంబు గలుగుచుండు**
**నే నీ చరణసేవ లేప్రొద్దుఁ జేసిన భువనోన్నతత్వంబు బొందఁ గలుగు**
**నే నీ లసన్నామ మే ప్రొద్దు భక్తితోఁ దడవిన బంధసంతతులు వాయు**

**తే. నట్టి నీ యందు నాచిత్త మనవరతము, నచ్చి యున్నది నీ యాన నాన లేదు,**
**కరుణఁ జూడుము కంసారి! ఖలవిదారి! శ్రీయుతాకార! మానినీచిత్తచోర! 1704**

**ప్రతి :** కంస+అరి= కంసునికి శత్రువైనవాడా!; ఖల= దుష్టులను; విదారి= నశింప చేసేవాడా!; శ్రీయుత+ఆకార= సౌందర్య సంపదతో కూడిన ఆకార సౌష్ఠవం కలవాడా!; మానినీ= మానవతులైన స్త్రీల; చిత్త= మనస్సును; చోర= కొల్ల గొట్టేవాడా!; ఏ నీ గుణములు= నీలో ఉండే ఏ ప్రశస్తమైన గుణాలు; కర్ణ+ఇంద్రియంబులు= చెవులకు; సోఁకన్= సోకగానే; దేహతాపంబులు= శరీరంలోని అన్ని బాధలు; తీఱిపోవున్= శమిస్తాయో; ఏ నీ శుభ+ఆకారము= మంగళకరమైన నీ స్వరూపం; ఈక్షింపన్= చూడగానే; కన్నులకున్= కండ్లకు; అఖిల+అర్థలాభంబు= అన్ని ప్రయోజనాలూ లభించడం; కలుగుచున్+ఉండున్= జరుగుతూ ఉంటుందో; ఏ నీ చరణ సేవ= ఏ నీ పాదాలను సేవించడం; ఏ ప్రొద్దున్+చేసినన్= ఏ వేళలో చేసినా కూడా; భువన+ఉన్నతత్వంబున్= లోకంలో ఉన్నతస్థితిని; పొందన్+కలుగున్= పొందడం కలుగుతుందో; ఏ నీ లసత్+నామము= ఏ నీ దివ్యమైన పేరును; ఏ ప్రొద్దు= ఎప్పుడూ; భక్తితోన్= నీపట్ల భక్తితో; తడవినన్= స్మరిస్తే; బంధసంతతులు= సంసార బంధాలు; పాయున్= తొలగి పోతాయో; అట్టి= అలాంటి; నీ+అందున్= నీలో; నా చిత్తము= నా మనస్సు; అనవరతమున్= ఎల్లప్పుడు; నచ్చి+ఉన్నది= లగ్నమై ఉంది; నీ+ఆన= నీపై ఒట్టు; నాన లేదు= సిగ్గుపడడం లేదు; కరుణన్+చూడుము= నన్ను దయతో కటాక్షించుము.

**తా :** కంసుణ్ణి చంపినవాడా! దుష్టుల్ని నాశనం చేసేవాడా! సౌందర్యమనే సంపదతో అలరారే అందమైన ఆకృతి కలవాడా! మానవతుల మనస్సును కొల్లగొట్టే వాడా! శ్రీకృష్ణా! నీ గుణాల్ని గురించి చెవిన పడితే చాలు, శరీరతాపాలన్నీ తీరిపోతాయి. సర్వశుభాలనూ కలిగించే నీ ఆకృతిని చూస్తే చాలు, కళ్లకు అన్ని ప్రయోజనాలూ లభిస్తాయి. నీ పాదాలను ఏ వేళలో సేవించినా కూడా, లోకంలో ఉన్నత స్థితి కలుగుతుంది. నీ దివ్యమైన నామాన్ని ఏ వేళలో స్మరించినా సంసార బంధాలు తొలగిపోతాయి. అలాంటి మహిమాన్వితుడవైన నీ పట్ల నా మనస్సు నిరంతరం లగ్నమై ఉంది. నీ మీద ఒట్టు. సిగ్గు వదిలి చెప్తున్నాను. నన్ను దయ చూడుము.

**శా. ధన్యున్ లోకమనోఽభిరాముఁ గులవిద్యారూపతారుణ్య సౌ**
**జన్యశ్రీబలదానశౌర్యకరుణాసంశోభితున్ నిన్ను నే**
**కన్యల్ గోరరు? కోరదే మును రమాకాంతాలలామంబు రా**
**జన్యానేకపసింహ! నావలననే జన్మించెనే మోహముల్? 1705**

**ప్రతి :** రాజన్య+అనేకప+సింహ= శత్రురాజులు అనబడే ఏనుగులపాలిటి సింహంవంటివాడా, శ్రీకృష్ణా!; ధన్యున్= ధన్యుడు; లోకమనస్+అభిరామున్= లోకంలోని మనసులన్నిటికీ నచ్చినవాడు; కుల= వంశంచేత; విద్యా= చదువుచేత; రూప= అందంచేత; తారుణ్య= తరుణ వయస్సుచేత; సౌజన్య= మంచితనంచేత; శ్రీ= సంపదలచేత; బల= బలంచేత; దాన=

దానంచేత; శౌర్య= ప్రతాపంచేత; కరుణా= దయవంటి అనేక గుణాలతో; సంశోభితున్= అలరారుతున్న; నిన్నున్= నిన్ను; ఏ కన్యల్ కోరరు= ఏ కన్నెపిల్లలుమాత్రం వరించకుండా ఉంటారు; మును= మునుపు; రమాకాంతాలలామంబు= లక్ష్మీదేవి అనే స్త్రీరత్నం; కోరదు+ఏ= నిన్ను కోరలేదా?; మోహముల్= నీ పైని వ్యామోహం పొందడాలు; నావలననే= నా ఒక్కదానివల్ల మాత్రమే; జన్మించెనే= పుట్టిందా?;

**తా :** శత్రురాజులనే గజాలను సంహరించే సింహంవంటి శ్రీకృష్ణా! నీవు ధన్యుడివి. లోకుల మనస్సులను రంజింపజేసేవాడివి. వంశం, విద్య, చక్కదనం, జవ్వనం, మంచితనం, సంపద, బలం, దానం, పరాక్రమం, కారుణ్యం అనే సద్గుణాలతో అలరారుతున్నావు. ఇటువంటి నిన్ను ఏ కన్యలు వరించకుండా ఉండగలరు? వనితలలో ఉత్తమురాలైన శ్రీమహాలక్ష్మి అలనాడు నిన్ను చెట్టబట్టలేదా? నే నొక్కతెనే నిన్ను మోహించితినా ఏమి? వలపు అనేది నా వల్లనే జన్మించిందా?

**ఉ. శ్రీయుతమూర్తి! యో పురుషసింహమ! సింహముపాలి సొమ్ము గో**
**మాయువు గోరుచందమున మత్తుఁడు చైద్యుఁడు నీ పదాంబుజ**
**ధ్యాయినియైన నన్ను వడిఁ దాఁ గొనిపోయెద నంచు నున్న వాఁ**
**డా యధమాధముం డెఱుఁగఁ డద్భుతమైనభవత్ప్రతాపమున్. 1706**

**ప్రతి :** శ్రీయుత= లక్ష్మీదేవితో కూడిన; మూర్తి= స్వరూపంకలవాడా! (శ్రీయుత= శుభం కలిగించే; మూర్తి= స్వరూపుడా) ఓ పురుషసింహమ!= పురుషులలో సింహంవంటివాడా!; సింహముపాలి= సింహానికి చెందవలసిన; సొమ్ము= పదార్థాన్ని; గోమాయువు= నక్క; కోరుచందమునన్= కోరుకున్న విధంగా; మత్తుఁడు= పొగరెక్కినవాడు; చైద్యుండు= చేదిదేశానికి చెందిన రాజు; శిశుపాలుడు; నీ పద+అంబుజ= పద్మాలవంటి నీ పాదాలను; ధ్యాయిని= ధ్యానించే నన్ను; వడిన్= శీఘ్రంగా; తాన్+కొనిపోయెదన్+అంచున్= తాను తీసుకునిపోతాను అని అంటూ; ఉన్నవాఁడు= ప్రయత్నిస్తూ ఉన్నాడు; ఆ+అధమ+అధముండు= అల్పుల్లోకెల్లా అల్పుడైన ఆ శిశుపాలుడు; అద్భుతమైన= ఆశ్చర్యకరమైన; భవత్+ప్రతాపమున్= నీ పరాక్రమాన్ని గురించి; ఎఱుగఁడు= తెలిసుకోలేడు.

**తా :** శ్రీ లక్ష్మీదేవితో కూడి ఉన్న మంగళమూర్తీ! పురుషులలో సింహంవంటివాడా! శ్రీకృష్ణా! సింహానికి చెందవలసిన పదార్థాన్ని నక్క కోరుకొన్నట్లుగా – నీ పాదకమలాలను ధ్యానించే నన్ను – మదించినవాడు, చేదిదేశస్థుడు (అయిన శిశుపాలుడు) వెంటనే తీసుకుపోవాలని అనుకుంటున్నాడు. ఆ నీచాతినీచునికి నీ అద్భుతమైన పరాక్రమం గురించి తెలియదు.

**మ. వ్రతముల్ దేవగురుద్విజన్మబుధసేవల్ దానధర్మాదులున్**
**గతజన్మంబుల నీశ్వరున్ హరి జగత్కల్యాణుఁ గాంక్షించి చే**
**సితి నేనిన్ వసుదేవనందనుఁడు నా చిత్తేశుఁ డౌఁగాక ని**
**ర్జితులై పోదురుగాక సంగరములోఁ జేదీశముఖ్యాధముల్. 1707**

**ప్రతి :** గతజన్మంబులన్= గడచిపోయిన జన్మలలో; వ్రతముల్= పుణ్యప్రదమైన వ్రతాలు; దేవ= దేవతల; గురు= గురువుల; ద్విజన్మ= బ్రాహ్మణుల; బుధ= జ్ఞానుల; సేవల్= సేవలను; దాన= గోదాన భూదానాల్లాంటి దానాలు; ధర్మ+ఆదులున్= పెద్దలు చెప్పిన ధర్మపద్ధతులలో నడుచుకోవడం మొదలైనవి; ఈశ్వరున్= అన్నిటికీ అధిపతి అయిన; హరిన్= శ్రీమహావిష్ణువును; జగత్+కల్యాణున్= ప్రపంచానికంతా శుభం కలిగించేవాడిని; కాంక్షించి= కోరుకుని; చేసితిన్+ఏనిన్= నేను చేసి ఉండినట్లయితే;

వసుదేవనందనుఁడు= వసుదేవునికొడుకైన శ్రీకృష్ణుడు; నా చిత్త+ఈశుఁడు= నా మనసును ఏలుకునేవాడు; ఔన్+కాక= అవుతాడుగాక!; సంగరములోన్= యుద్ధంలో; చేది+ఈశ= చేదిరాజు; ముఖ్య+అధముల్= మొదలైన నీచులు; నిర్జితులు+ఐ= పరాజితులై; పోదురు+కాక= పోతారుగాక!

**తా :** నేను పూర్వజన్మల్లో వ్రతాలు చేసిఉంటే, గురువుల, బ్రాహ్మణుల, జ్ఞానుల సేవలను చేసి ఉంటే, దానధర్మాలు మొదలైనవి చేసిఉంటే, సర్వాధిపతి, లోకానికి శుభం కలిగించేవాడు అయిన శ్రీమహావిష్ణువును సేవించిఉంటే, వసుదేవనందనుడైన శ్రీకృష్ణుడు నా మనస్సు నేలుకొనేవాడు అగుగాక! చేదిరాజు మున్నగు పరమనీచులు యుద్ధంలో ఓటమిపాలై పోవుదురుగాక!

**ఉ. అంకిలి సెప్పలేదు; చతురంగబలంబులతోడ నెల్లి యో**
**పంకజనాభ! నీవు శిశుపాలజరాసుతులన్ జయించి నా**
**వంకకు వచ్చి రాక్షసవివాహమునన్ భవదీయశౌర్యమే**
**యుంకువ సేసి కృష్ణ! పురుషోత్తమ! చేకొని పొమ్ము వచ్చెదన్. 1708**

**ప్రతి :** ఓ పంకజనాభ= నాభిలో పద్మం కలిగినవాడా!; పురుష+ఉత్తమ= పురుషులలో శ్రేష్ఠుడా!; కృష్ణ= శ్రీకృష్ణా!; అంకిలి చెప్పన్= అడ్డు చెప్పడానికి; లేదు= ఏమీ లేదు; ఎల్లి= రేపు; చతురంగబలంబులతోడన్= రథ, గజ, తురగ, పదాతిదళాలు అనే నాలుగురకాలు సేనాబలంతో; శిశుపాల= శిశుపాలుణ్ణీ; జరాసుతులన్= జర అనే రాక్షసికొడుకైన జరాసంధుణ్ణీ; జయించి= గెలిచి; నా వంకకున్= నా వైపునకు; వచ్చి; భవదీయ= నీయొక్క; శౌర్యము+ఏ= ప్రతాపాన్నే; ఉంకువ= కట్నంగా; చేసి= ఇచ్చి; రాక్షస వివాహమునన్= 'రాక్షస'మనే పేరున్న వివాహపద్ధతిలో; చేకొనిపొమ్ము= తీసుకొని పో; వచ్చెదన్= వస్తాను.

**తా :** పద్మనాభా! పురుషులలో శ్రేష్ఠుడా! కృష్ణా! నీకు అడ్డుపడడానికి ఏమీలేదు. రేపు నీవు రథ గజ తురగ పదాతి దళాలనే నాలుగు రకాల సేనలతోనూ వచ్చి, శిశుపాలుణ్ణీ, జరాసంధుణ్ణీ జయించి నా దిక్కుకు వచ్చి, రాక్షసవివాహరీతిలో నన్ను గ్రహించు. నీ ప్రతాపాన్నే కట్నంగా (ఓలె) ఇచ్చి నన్ను తీసుకుని పో, నేను వస్తాను.

**సీ. లోపలి సౌధంబులోన వర్తింపంగఁ దేవచ్చునే నిన్నుఁ దెత్తునేనిఁ**
**గావలివారలఁ గల బంధువులఁ జంపి కాని తేరా దని కమలనయన!**
**భావించితేని నుపాయంబు సెప్పెద నాలింపు కులదేవయాత్రఁ జేసి**
**నగరంబు వెలువడి నగజాతకును మ్రొక్కఁ బెండ్లికి మునుపడఁ బెండ్లికూఁతు**

**తే. నెలమి మావారు పంపుదు రేను నట్లు, పురము వెలువడి యేతెంచి భూతనాథు**
**సతికి మ్రొక్కంగ నీవు నా సమయమందు, వచ్చి కొనిపొమ్ము నన్ను నవార్యచరిత! 1709**

**ప్రతి :** కమలనయన= పద్మాలవంటి కండ్లు కలవాడా! శ్రీకృష్ణా!; లోపలి సౌధంబులోనన్= ఎక్కడో లోలోపలి కన్యాంతః పురంలో; వర్తింపన్+కన్= ఉండగా; తేన్+వచ్చునే= తీసుకుపోవడం సాధ్యమా?; నిన్నున్= నిన్ను; తెత్తున్+ఏనిన్= అలా తెచ్చానే అనుకో; కావలి వారలన్= కాపలావారిని; కల బంధువులన్= అక్కడ ఉండే బంధువర్గాన్ని; చంపి కాని= చంపితే తప్ప; తేరాదు+అని= తీసుకురావడం సాధ్యం కాదని; భావించితి(వి)+ఏనిన్= అనుకునే పక్షంలో; ఉపాయంబు చెప్పెదన్=

ఒక ఉపాయం చెపుతాను; ఆలింపు= వినుము; కులదేవతయాత్రన్+చేసి= ఇంటి దేవతను పూజించడానికి చేసే యాత్ర నెపంగా; నగరంబు= పట్టణాన్ని; వెలువడి= వీడి; నగజాతకును= పార్వతీదేవికి; మ్రొక్కన్= మ్రొక్కడానికై; పెండ్లికిన్= పెళ్లికి; మునుపడన్= ముందుగా; పెండ్లికూఁతున్= పెళ్లికొమార్తెను; ఎలమిన్= ప్రేమతో; మావారు పంపుదురు= మావాళ్లు పంపిస్తారు; ఏనున్= నేనుకూడా; అట్లు= అదేవిధంగా; పురము వెలువడి= నగరం వదలి; ఏతెంచి= వచ్చి; భూతనాథుసతికిన్= సర్వభూతాలకు అధిపతి అయిన శివుని అర్ధాంగి పార్వతీదేవికి; మ్రొక్కన్+కన్= మొక్కుతూ ఉండగా; నీవును= నీవు కూడా; ఆ సమయము+అందున్= ఆ వేళలో; అవార్యచరిత= అడ్డగింపరాని నడవడికలవాడా!; వచ్చి; నన్ను(న్); కొనిపొమ్ము= తీసుకుని పొమ్ము.

**తా :** పద్మాలవంటి అందమైన కండ్లుగలవాడా! శ్రీకృష్ణా! నీవు రుక్మిణిని ఎలా తీసుకురావడం అని ఆలోచిస్తూంటావేమో! “ఆమె ఎక్కడో రాజకన్యలు ఉండే అంతఃపురంలో ఉంటుంది ఎలా బయటికి తీసుకురావడం? ఒకవేళ చొరబడి తెస్తే అక్కడి కాపలాదారులుగా ఉండే వాళ్లనూ, ఎదిరించిన బంధుజనాలనూ చంపాలి, తప్పదు” – అని భావిస్తున్నావా స్వామీ! దానికో ఉపాయం ఉంది. చెబుతాను. విను. పెళ్లి జరగడానికి ముందుగా. మా కులదేవత అయిన పార్వతీదేవికి పెళ్లికూతురిచేత పూజింపచేసి మొక్కిస్తారు. అలా నేనుకూడా దేవికి మొక్కడానికి బయటకు రావాలి. ఊరిబయట ఉన్న పార్వతీదేవిఆలయానికి నేను వస్తాను. వారించడానికి వీలులేనిపద్ధతి తెలిసినవాడవు. ఆ సమయంలో వచ్చి నన్ను తీసుకుని పో!

**మ. ఘను లాత్మీయ తమోనివృత్తికొఱకై గౌరీశుమర్యాద నె**
**వ్వని పాదాంబుజతోయమందు మునుఁగన్ వాంఛింతు రే నట్టి నీ**
**యనుకంపన్ విలసింపనేని వ్రతచర్యన్ నూఱుజన్మంబులన్**
**నినుఁ జింతించుచుఁ బ్రాణముల్ విడిచెదన్ నిక్కంబు ప్రాణేశ్వరా! 1710**

**ప్రతి :** ప్రాణ+ఈశ్వరా= నా ప్రాణనాథా!; ఘనులు= జ్ఞానులైన గొప్పవాళ్లు; తమస్+నివృత్తి కొఱకున్+ఐ= అజ్ఞానమనే చీకటిని పోగొట్టుకోవడంకోసం; గౌరీ+ఈశు మర్యాదన్= గౌరీదేవి భర్తఅయిన శివుని విధంగా; ఎవ్వని= ఎవరి; పాద+అంబుజ= పాదపద్మాలనుండి పుట్టిన; తోయము+అందున్= నీటిలో; మునుఁగన్= మునగడానికి; వాంఛింతురు(వాంఛించుదురు)= కోరుకుంటారో; ఏన్= నేను; అట్టి= అలాంటి; నీ+అనుకంపన్= నీ అనుగ్రహంతో; విలసింపన్+ఏనిన్= ప్రకాశించనిచో; వ్రతచర్యన్= వ్రతదీక్షలో ఉంటూ; నూఱుజన్మంబులన్= నూరు జన్మల్లో అయినాసరే; నినున్+చింతించుచున్= నిన్నే ధ్యానిస్తూ; ప్రాణముల్= ప్రాణాలను; విడిచెదన్= వదిలేస్తాను; నిక్కంబు= ఇది నిజం.

**తా :** నాథా! శ్రీకృష్ణా! మహాత్ములు తమ అజ్ఞానమనే చీకటిని పోగొట్టుకోవడానికి పరమేశ్వరునివలె ఎవరి పాదకమలాలనుంచి పుట్టినపవిత్రజలాలలో మునగాలని కోరుకుంటారో అతడివే నీవు! అలాంటి నీ అనుగ్రహానికి నేను అర్హురాలను కాకపోతే నూరు జన్మలైనాసరే నిన్నే ధ్యానిస్తూ నా ప్రాణాలు విడుస్తాను. ఇది నిజం!

**సీ. ప్రాణేశ! నీ మంజుభాషలు వినలేని కర్ణరంధ్రంబులకలిమి యేల?**
**పురుషరత్నమ! నీవు భోగింపఁగా లేని తనులతవలనిసౌందర్య మేల?**
**భువనమోహన! నిన్నుఁ బొడగానఁగా లేని చక్షురింద్రియములసత్త్వ మేల?**
**దయిత! నీ యధరామృతం బానఁగా లేని జిహ్వకు ఫలరససిద్ధి యేల?**

**ఆ. నీరజాతనయన! నీ వనమాలికా, గంధ మబ్బలేని ఘ్రాణ మేల?**
**ధన్యచరిత! నీకు దాస్యంబు సేయని, జన్మ మేల? యెన్ని జన్మములకు? 1711**

**ప్రతి :** ప్రాణ+ఈశ= ప్రాణవల్లభా!; ఎన్ని జన్మలకున్= ఎన్ని జన్మలకైనా సరే; నీ మంజుభాషలు= నీ తియ్యని మాటలను; వినలేని= వినడానికి నోచుకోని; కర్ణరంధ్రంబుల= చెవి రంధ్రాల; కలిమి= ఉండడం; ఏల= దేనికి?; పురుషరత్నమ!= పురుషులలో రత్నంవంటివాడా!; నీవు; భోగింపన్+కాన్= నీవు అనుభవించడానికి నోచుకోని; తనులతవలని= తీగలాంటి శరీరంవల్ల కలిగే; సౌందర్యము= శరీరలావణ్యం; ఏల= ఎందుకు?; భువనమోహన= లోకాలను సమ్మోహనపరచేవాడా!; నిన్నున్= నిన్ను; పొడగానన్+కాన్‌లేని= చూడడానికి నోచుకోని; చక్షుస్+ఇంద్రియముల= కండ్లు అనే ఇంద్రియాల; సత్త్వము= చూడగలిగిన శక్తి; ఏల= ఎందుకు?; దయిత= ప్రియుడా!; నీ+అధర అమృతంబు= నీ పెదవి నుండి స్రవించే సుధారసం; ఆనన్+కాన్‌లేని= ఆస్వాదించలేని; జిహ్వకున్= నాలుకకు; ఫలరససిద్ధి= ఫలరసాలప్రాప్తి; ఏల= ఎందుకు?; నీరజాతనయన= పద్మాలవంటి కండ్లు కలిగినవాడా!; నీ వనమాలికాగంధము= నీవు మెడలో ధరించిన పూలమాలపరిమళం; అబ్బలేని= వాసనచూడలేని; ఘ్రాణము+ఏల= ముక్కు ఎందుకు?; ధన్యచరిత= ధన్యమైన ప్రవర్తన కలిగినవాడా!; నీకు(న్); దాస్యంబున్+చేయని= సేవ చేయని; జన్మము+ఏల= జన్మ ఎందుకు?

**తా :** ప్రాణవల్లభా! నీ తియ్యనిమాటలను వినలేకపోతే, ఈ చెవిరంధ్రాలు ఉండీ ఏం ప్రయోజనం? పురుషులలో రత్నంలాంటివాడా! నీవు అనుభవించడానికి నోచుకోకపోతే ఈ తీగలాంటి అందమైన శరీరంలోని చక్కదనం దేనికి? ప్రపంచాన్ని సమ్మోహనపరచేవాడా! నిన్ను చూడలేకపోతే ఈ కళ్లకు చూపు ఉండడం ఎందుకు? ప్రియుడా! నీ పెదవిలోని అమృతాన్ని ఆస్వాదించలేకపోతే నాలుకకు ఫలరసాలను గురించిన తెలివిడి దేనికి? పద్మాలవంటి కండ్లున్నవాడా! నీ మెడలోని పూలమాలసువాసనను చూడజాలకపోతే ముక్కు ఎందుకు? అందమైన నడవడిక గలవాడా! నీకు పరిచర్య చేయడానికి నోచుకోని జన్మదేనికి? ఇలా ఎన్ని జన్మలెత్తినా ఏం ప్రయోజనం?

**విశే :** తెలుగునాట ఇంటింటా ప్రచారమైన పద్యాలలో ముఖ్యమైందిది. ప్రతిపాదంలోనూ ప్రారంభమే ఒక సంబోధన. పంచేంద్రియాలజ్ఞానం పరమేశ్వరసమర్పణలోనే పరమార్థాన్ని పొందుతుంది. శబ్దం, స్పర్శం, రూపం, రసం, గంధం (వాసన) అనే అయిదు పంచతన్మాత్రలు. పద్యంలో ఒకొక్క పాదంలోనూ ఒక్కో అంశం గురించి చెప్పాడు కవి. సర్వం హరిసమర్పణ చేయాలి. దాసభావంతో ఉండాలి. అలా ఉన్నదే జన్మ.

**వ. అని యిట్లు రుక్మిణీదేవి పుత్తెంచిన సందేశంబును, రూపసౌందర్యాదివిశేషంబులును బ్రాహ్మణుండు హరికి విన్నవించి 'కర్తవ్యం బెద్ది సేయ నవధరింపు' మని సవర్ణనంబుగా మఱియు నిట్లనియె. 1712**

**ప్రతి :** అని+ఇట్లు= అంటూ ఇలా; రుక్మిణీదేవి; పుత్తెంచిన= పంపిన; సందేశంబును= సందేశాన్ని; రూప సౌందర్య+ఆది= ఆమె ఆకారలావణ్యం మొదలైన; విశేషంబులును= విశేషాలనుకూడా; బ్రాహ్మణుండు= అగ్నిద్యోతనుడనే ఆ బ్రాహ్మణుడు; హరికిన్= శ్రీకృష్ణునికి; విన్నవించి= మనవిచేసి; కర్తవ్యంబు+ఎద్ది= చేయదగినపని ఏది; చేయన్= చేయవలసి ఉందో; అవధరింపుము+అని= చిత్తగించండి అని; సవర్ణనంబు+కాన్= సవివరంగా; మఱియున్= ఇంకా; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** ఇలా అగ్నిద్యోతనుడు సందేశాన్ని తెలిపాడు. రుక్మిణీదేవి విన్నవించిన విషయాలతోపాటు, ఆమె ఆకృతిని, చక్కదనాన్ని మొదలైన అంశాలను గురించీ చెప్పాడు. 'ఇక చేయదగిన పని ఏమో దేవరవారు చేయాలి' అని మనవి చేశాడు. రుక్మిణి నీకు వరించదగింది అని మరోసారి వివరిస్తూ శ్రీకృష్ణుడితో ఇలా అన్నాడు.

సీ. పల్లవవైభవాస్పదములు పదములు గనకరంభాతిరస్కారు లూరు;
లరుణప్రభామనోహరములు గరములు గంబు సౌందర్యమంగళము గళము
మహితభావాభావమధ్యంబు మధ్యంబు చక్షురుత్సవదాయి చన్నుదోయి
పరిహసితార్ధేందుపటలంబు నిటలంబు జితమత్తమధుకరశ్రేణి వేణి

ఆ. భావజాశుగములప్రాపులు చూపు లు, కుసుమశరునివింటికొమలు బొమలు
చిత్తతోషణములు చెలువభాషణములు, జలజనయనముఖము చంద్రసఖము. **1713**

**ప్రతి :** పదములు= (రుక్మిణి)పాదాలు; పల్లవ= చిగురాకుల; వైభవ= సంపదలకు; ఆస్పదములు= ఉనికిపట్టులు; ఊరులు= (ఆమె) తొడలు; కనక= బంగారు; రంభా= అరటిబోదెలను; తిరస్కారులు= ధిక్కరించగలిగినవి; కరములు= (ఆమె) చేతులు; అరుణప్రభా= కోమలమైన ఎరుపు కాంతులతో; మనస్+హరములు= మనసును దోచుకునేంత అందమైనవి; గళము= (ఆమె) మెడ; కంబు= శంఖంలోని; సౌందర్య= అందంతో; మంగళము= శ్రేష్ఠమైంది; మధ్యంబు= (ఆమె) నడుము; మహిత= గౌరవింపదగినదై; భావ+అభావ= ఉన్నదా, లేదా; మధ్యంబు= అనే రెండు భావాలకు నడుమ ఉండేది; చన్నుదోయి= (ఆమె) చనుల జంట; చక్షుస్= కళ్లకు; ఉత్సవదాయి= పండుగ చేసేది; నిటలంబు= నుదురు; పరిహసిత= గేలిచేయబడిన; అర్ధ+ఇందుపటలము= అర్ధచంద్రమండలం; వేణి= జడ; జిత= జయించబడిన; మత్త= మదించిన; మధుకరశ్రేణి= తుమ్మెదల గుంపు; చూపులు= (ఆమె) చూపులు; భావజ= మన్మథుని; ఆశుగముల= బాణాలకు; ప్రాపులు= ఆశ్రయమిచ్చేవి; బొమలు= (ఆమె) కనుబొమలు; కుసుమశరుని= పూలబాణాలు కలిగిన మన్మథుని; వింటి కొమలు= ధనుస్సుకొమ్మలు; చెలువ= అందగత్తె అయిన రుక్మిణి; భాషణములు= మాటలు; చిత్త= మనస్సుకు; తోషణములు= సంతోషాన్ని కల్గించేవి; జలజనయన= కలువకన్నులు గల ఆమెయొక్క; ముఖము= మొగము; చంద్రసఖము= చందమామకు తోడైనది.

**తా :** శ్రీకృష్ణా! ఆమెపాదాలు చిగురాకుల సొగసులకు ఉనికిపట్టు. ఆమె తొడలు బంగారు అరటిబోదెలనుకూడా మించి ప్రకాశిస్తుంటాయి. ఆమెచేతులు లేత ఎరుపు వన్నెతో మనసును దోచుకుంటాయి, ఆమెకంఠం శంఖంవలె శ్రేష్ఠమైన సొగసుతో ఉంటుంది. నడుము చూస్తే ఉందా లేదా అన్నట్లుగా చాల నాజూకుగా ఉంటుంది. ఆమెచనుదోయి కనులపండుగ చేస్తుంది. నుదురు కాంతిమంతంగా ఉండి, అర్ధచంద్రునికాంతిమండలాన్ని గేలిచేస్తుంది. ఆమెజడనల్లనితుమ్మెదల బారును జయిస్తుంది. ఆమెచూపులు మన్మథునిబాణాలకు ఆశ్రయాన్నిస్తాయి. ఆమెకనుబొమలు మన్మథునివింటి కొమ్మలు. ఆ అందగత్తెపలుకులు మనస్సుకు హాయిని కలిగిస్తాయి. కలువకన్నులున్న ఆమెముఖము చందమామకు తోడుగా నిలుస్తుంది.

ఉ. ఆ యెలనాఁగ నీకుఁ దగు; నంగనకుం దగు దీవు; మా యుపా
ధ్యాయులయాన పెండ్లి యగుఁ; దప్పదు; జాడ్యము లేల? నీవు నీ
తోయమువారిఁ గూడుకొని తోయరుహాననఁ దెత్తుగాని వి
చ్చేయుము; శత్రులన్ నుఱుముసేయుము; సేయుము శోభనం బిలన్. **1714**

**ప్రతి :** ఆ+ఎలనాఁగ= ఆ లేతజవరాలు; నీకున్+తగున్= నీకు తగింది; అంగనకున్= ఆ అమ్మాయికి; తగుదు(వు)+ఈవు= నీవు తగినవాడవి; మా+ఉపాధ్యాయుల+ఆన= మా గురువులమీద ఒట్టు; పెండ్లి+అగున్= మీకు పెళ్లిజరుగుతుంది; తప్పదు= తప్పదు; జాడ్యములు+ఏల= ఆలస్యాలు చేయడమెందుకు? నీవు; నీ తోయమువారిన్= నీ బంధువర్గంతో; కూడుకొని=

కలిసి; తోయరుహ+ఆననన్= పద్మంవంటి ముఖం కలిగిన రుక్మిణిని; తెత్తుగాని(తెచ్చుదువు)= తీసుకుని వద్దువుగాని; విచ్చేయుము= బయలుదేరు; శత్రులన్= వైరులను; నుఱుము చేయుము= పొడిచేసెయ్యి; ఇలన్+శోభనంబు= ఈ లోకంలో మేలు; చేయుము;

**తా :** శ్రీకృష్ణా! ఆ లేతజవరాలు నీకు తగింది. నీవుకూడా ఆమెకు తగినవాడవి; మా గురువులమీద ఒట్టేసి చెపుతున్నాను. ఈ పెళ్లి జరిగి తీరుతుంది. తప్పదు. ఇంకా ఆలస్యం చేయడాలు దేనికి? నీవు నీవర్గంవాళ్లతో కలిసి, ఆ పద్మముఖిని తెచ్చుకుందువు గానీ, వచ్చేసేయి. ఎదిరించినవాళ్లను పొడి పొడి చేయి. ఈ లోకానికి మేలు కలిగించు.

## ❖ శ్రీకృష్ణుఁడు కుండిన నగరంబునకు రథారూఢుండై చనుట ❖

**వ. అని యిట్లు పలికి, బ్రాహ్మణునివలన విదర్భరాజతనయ పుత్తెంచిన సందేశంబును, రూపసౌందర్యాది విశేషంబులును విని, యవధరించి, నిజకరంబున నతని కరంబుఁబట్టి నగుచు న య్యాదవేంద్రుం డిట్లనియె. 1715**

**ప్రతి :** అని+ఇట్లు= అని ఈ విధంగా; పలికిన= చెప్పిన; బ్రాహ్మణునివలనన్= అగ్నిద్యోతనుడనే బ్రాహ్మణునిద్వారా; విదర్భరాజతనయ= విదర్భరాజుకూతురైన రుక్మిణి; పుత్తెంచిన= చెప్పిపంపిన; సందేశంబును= సందేశాన్ని; రూప= (ఆమె) ఆకృతిని; సౌందర్య= (ఆమె) చక్కదనాన్ని; ఆది= మొదలైన; విశేషంబులును= విశేషాలను; విని= ఆలకించి; అవధరించి= ఆసక్తి చూపి; నిజకరంబునన్= తనచేతితో; అతని= ఆ బ్రాహ్మణుని; కరంబున్+పట్టి= చేతిని పట్టుకుని; నగుచున్= నవ్వుతూ; ఆ+యాదవ+ఇంద్రుండు= ఆ యాదవశ్రేష్ఠుడైన శ్రీకృష్ణుడు; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** అని ఈ విధంగా బ్రాహ్మణునిద్వారా రుక్మిణి చెప్పిపంపిన సందేశాన్ని శ్రీకృష్ణుడు విన్నాడు. అతనిద్వారా ఆమె అందమైన ఆకృతిని, చక్కదనం మొదలైన వివరాలను మనసుపెట్టి తెలుసుకున్నాడు. పిదప తనచేతితో అతని చేతిని పట్టుకొని నవ్వుతూ, ఆ యాదవశ్రేష్ఠుడైన శ్రీకృష్ణుడు ఇలా అన్నాడు.

**ఉ. కన్నియమీఁద నాతలఁపు గాఢము; కూరుకు రాదు రేయి నా**
**కెన్నఁడు; నా వివాహము సహింపక రుక్మి తలంచు కీడు నే**
**మున్నె యెఱుంగుదున్; బరులమూఁక లడంచి కుమారిఁ దెత్తు వి**
**ద్వన్నుత! మాను ద్రచ్చి నవవహ్నిశిఖన్ వడిఁ దెచ్చు కైవడిన్. 1716**

**ప్రతి :** విద్వత్+నుత= విద్వాంసులచేత పొగడబడేవాడా; కన్నియమీఁదన్= ఆ కన్య అయిన రుక్మిణి మీద; నా తలఁపు= నా కోరిక; గాఢము= బలమైంది; నాకున్+ఎన్నఁడున్= నాకు ఎప్పుడూ; రేయి= రాత్రుల్లో; కూరుకు రాదు= నిద్రపట్టదు; (ఆమె ఊహల్లో నిద్రరాదు); నా వివాహము= నా పెళ్లి రుక్మిణితో జరగడాన్ని; సహింపక= ఓర్వలేక; రుక్మి= రుక్మిణి అన్న అయిన రుక్మి; తలంచు= ఆలోచించే; కీడు= అపకారం; నేన్= నేను; మున్ను+ఎ+ఎఱుంగుదున్= ఈ విషయంగురించి ముందే తెలుసు; మానున్+త్రచ్చి= చెట్టును మథించి; నవవహ్నిశిఖన్= కొత్త అగ్నిజ్వాలను; వడిన్= వేగంగా; తెచ్చు కైవడిన్= తెచ్చే విధంగా; పరులమూఁకలు= ఎదిరించిన శత్రువర్గాలను; అడంచి= నశింపజేసి; కుమారిన్= కన్య అయిన రుక్మిణిని; తెత్తున్ (తెచ్చుదును)= తీసుకుని వస్తాను.

**తా :** విద్వాంసులచేత ప్రశంసింపబడేవాడా! ఆ కన్య రుక్మిణిమీద నాకు ఎంతగానో కోరిక ఉంది. రాత్రివేళల్లో ఆమెను గురించి ఆలోచనలతో నిద్రపట్టదు. నా పెళ్లి రుక్మిణితో జరగడాన్ని ఆమెఅన్న రుక్మి ఓర్వలేక నాకు హాని చేయాలని భావిస్తున్నాడు. ఈ విషయం నాకు ముందే తెలుసు. చెట్టును మథించి కొత్త అగ్నిజ్వాలను పుట్టించి, తెచ్చినట్లుగా ఎదిరించిన శత్రువుల గుంపులను సంహరించి, రుక్మిణిని తీసుకుని వస్తాను.

**క. వచ్చెద విదర్భభూమికిఁ; జొచ్చెద భీష్మకునిపురము; సురుచిరలీలన్**
**దెచ్చెద బాలన్; వ్రేల్మిడి, వ్రచ్చెద నడ్డంబు రిపులు వచ్చినఁ బోరన్. 1717**

**ప్రతి :** విదర్భభూమికిన్= విదర్భ దేశానికి; వచ్చెదన్= వస్తాను; భీష్మకునిపురమున్= ఆ దేశాధిపతి అయిన భీష్మకుని నగరాన్ని; చొచ్చెదన్= ప్రవేశిస్తాను; రిపులు= శత్రువులు; పోరన్= యుద్ధంలో; అడ్డంబువచ్చినన్= అడ్డం వస్తే; వ్రేల్మిడిన్= చిటికె వేసేటంతలో; వ్రచ్చెదన్= ముక్కలు చేస్తాను; సురుచిరలీలన్= ఒప్పిదమైన రీతిలో; బాలన్= బాలామణి అయిన రుక్మిణిని; తెచ్చెదన్= తీసుకొనివస్తాను.

**తా :** విదర్భదేశానికి వస్తాను. ఆ దేశాధిపతి అయిన భీష్మకునినగరాన్ని ప్రవేశిస్తాను. అందమైనరీతిలో బాలామణి రుక్మిణిని చిటికెలో తెస్తాను. శత్రువులు అడ్డం వచ్చినట్లైతే యుద్ధంలో వాళ్లను ముక్కలు చేస్తాను.

**వ. అని పలికి, రుక్మిణీదేవిపెండ్లినక్షత్రంబు దెలిసి, తన పంపున రథసారథియైన దారుకుండు శైబ్య సుగ్రీవ మేఘపుష్పవలాహకంబులను తురగంబులం గట్టి, రథ మాయత్తంబు చేసి తెచ్చిన, నమోఘ మనోరథుండైన హరి తానును, బ్రాహ్మణుండును రథారోహణంబు సేసి, యేకరాత్రంబున నానర్తకదేశంబులు గడచి, విదర్భదేశంబునకుం జనియె; నందుఁ గుండినపురీశ్వరుండైన భీష్మకుండు కొడుకునకు వశుండై, కూఁతు శిశుపాలున కిత్తు నని తలంచి, శోభనోద్యోగంబు సేయించె; నప్పుడు. 1718**

**ప్రతి :** అని పలికి= అని చెప్పి; రుక్మిణీదేవిపెండ్లినక్షత్రంబున్= రుక్మిణీదేవిపెళ్లికి నిశ్చయించబడిన నక్షత్రం ఏది అనే సంగతిని; తెలిసి= తెలుసుకొని; తన పంపునన్= తన ఆజ్ఞచేత; రథసారథి+ఐన= రథాన్ని నడిపేవాడైన; దారుకుండు= 'దారుకుడు' అనే వ్యక్తి; శైబ్యసుగ్రీవ మేఘపుష్ప వలాహకంబులు+అను= శైబ్యం, సుగ్రీవం, మేఘపుష్పం, వలాహకం అనే పేర్లున్న; తురగంబులన్= గుర్రాలను; కట్టి= పూనిచి; రథము= రథాన్ని; ఆయత్తంబుచేసి= ప్రయాణించడానికి సిద్ధంచేసి; తెచ్చినన్= తీసుకునిరాగా; అమోఘ= తిరుగులేని; మనస్+రథుండు+ఐన= కోరిక కలిగినవాడైన; హరి= శ్రీకృష్ణుడు; తానును= తానూ; బ్రాహ్మణుండును= బ్రాహ్మణుడైన అగ్నిద్యోతనుడుకూడా; రథ+ఆరోహణంబుచేసి= రథం ఎక్కి; ఏకరాత్రంబునన్= ఒక రాత్రిలోనే; ఆనర్తకదేశంబులు= ఆనర్తకం అనే దేశాలను; కడచి= దాటి; విదర్భ దేశంబునకున్= విదర్భదేశానికి; చనియెన్= వెళ్లాడు; అందున్= అక్కడ; కుండినపురి+ఈశ్వరుండు+ఐన= కుండిననగరానికి ఏలిక అయిన; భీష్మకుండు= భీష్మకుడు; కొడుకునకు వశుండు+ఐ= కొడుకు చెప్పిన మాటలకులోబడి; కూఁతున్= తన కూతురిని; శిశుపాలునకున్+ఇత్తును(ఇచ్చుదును)+అని= శిశుపాలునికి ఇచ్చి పెళ్లి చేస్తానని; తలంచి= అనుకుని; శోభన= మంగళకార్యాలయొక్క; ఉద్యోగంబున్= ప్రయత్నం; చేయించెన్= చేయించాడు; అప్పుడు= ఆ సమయంలో...

**తా :** అని చెప్పి, రుక్మిణీదేవిపెళ్లినక్షత్రాన్నీ ముహూర్తసమయాన్నీ శ్రీకృష్ణుడు తెలుసుకున్నాడు. తన సారథి దారుకుణ్ణి రథాన్ని సిద్ధం చేయమని ఆజ్ఞాపించాడు. దారుకుడు శైబ్యం, సుగ్రీవం, మేఘపుష్పం, వలాహకం అనే పేర్లుగల నాలుగు గుర్రాలను

కట్టి రథాన్ని సిద్ధం చేశాడు. దృఢమైన కోరికగల శ్రీకృష్ణుడు, ఆ అగ్నిద్యోతనుడనే బ్రాహ్మణునితో పాటు రథమెక్కాడు. ఒకే రాత్రిలో ఆనర్తకదేశాలను దాటాడు. విదర్భదేశానికి వెళ్లాడు. అక్కడ కుండినమనే నగరానికి భీష్మకుడు రాజు. అతడు తనకొడుకైన రుక్మిమాటలకు లొంగిపోయి, రుక్మిణిని శిశుపాలునికిచ్చి పెళ్లిచేద్దామనుకుని మంగళప్రదమైన కార్యక్రమాల ప్రయత్నాలను చేయిస్తున్నాడు. ఆ సమయంలో

**సీ. రచ్చలు క్రంతలు రాజమార్గంబులు విపణిదేశంబులు విశదములుగఁ**
**జేసిరి; చందనసిక్తతోయంబులు గలయంగఁ జల్లిరి; కలువదములు**
**రమణీయవివిధతోరణములు గట్టిరి సకలగృహంబులఁ జక్క సేసి;**
**కర్పూరకుంకుమాగరుధూపములు వెట్టి రతివలుఁ బురుషులు నన్నియెడల**

**ఆ. వివిధవస్త్రములను వివిధమాల్యాభర, ణానులేపనముల నమరియుండి**
**రఖిలవాద్యములు మహాప్రీతి మ్రోయించి, రుత్సవమున నగర మొప్పి యుండె. 1719**

**ప్రతి :** రచ్చలు= మండపాలు; క్రంతలు= సందుదారులు; రాజమార్గంబులు= రాజమార్గాలు; విపణిదేశంబులు= అంగళ్లుండేతావులు; విశదములుగన్= శుభ్రంగా; చేసిరి= చేశారు; చందనసిక్త= మంచిగంధం కలిపిన; తోయంబులు= నీళ్లు; కలయంగన్= కలయునట్లుగా; చల్లిరి= చల్లారు; కలువదములు= కలువపూలసరాలను; రమణీయ= మనోహరమైన; వివిధ= రకరకాలైన; తోరణములు= తోరణాలను; కట్టిరి= కట్టారు; సకల గృహంబులన్= అన్నిఇండ్లలోనూ; చక్కన్+చేసి= పద్ధతిప్రకారంచేసి; కర్పూర= కర్పూరంతో; కుంకుమ= కుంకుమతో; అగరుధూపములు= సుగంధ ధూపాలను; పెట్టిరి= పెట్టారు; అతివలున్= స్త్రీలు; పురుషులున్= మగవాళ్లు; అన్ని+ఎడలన్= అన్నివైపులా; వివిధవస్త్రములను= రకరకాల వస్త్రాలతో; వివిధమాల్య+ఆభరణ= రకరకాలైన పూలమాలలతో; అనులేపనములన్= ఒంటికి పూసుకునే పరిమళ ద్రవ్యాలతో; అమరి+ఉండిరి= అలంకరించబడి ఉన్నారు; అఖిలవాద్యములు= మొత్తం మంగళవాద్యాల నన్నింటినీ; మహాప్రీతిన్= చాలా ఇష్టంతో; మ్రోయించిరి= వాయించారు; ఉత్సవమునన్= ఉత్సవంతో; నగరము= పట్టణం; ఒప్పి+ఉండెన్= అందంగా ఉండింది.

**తా :** పెళ్లివేడుకలకై నగరాన్ని అంతా అలంకారం చేశారు. మండపాలు, చిన్నసందులు, రాజమార్గాలు, అంగళ్లుండే ప్రదేశాలు అన్నిటినీ శుభ్రపరిచారు. చందనంనీళ్లతో కళ్లాపి చల్లారు. కలువపూలను దండలుగా కూర్చి తోరణాలుగా కట్టారు. నగరంలోని ఇళ్లన్నిటినీ తీర్చిదిద్దారు. కర్పూరంతో, కుంకుమతో అలంకరించారు. అగరుపొగలతో పరిమళింప చేశారు. రకరకాల వస్త్రాలతో, రకరకాల పూలమాలలతో అలంకరించుకుని ఆడవాళ్లు, మగవాళ్లు పరిమళాలను అద్దుకుని కనిపిస్తున్నారు. ఎంతో ఇష్టంతో వాద్యాలను మ్రోగిస్తున్నారు. నగరమంతా ఉత్సవంతో అందంగా ఉంది.

**వ. అంత నా భీష్మకుండు విహితప్రకారంబునం బితృదేవతల నర్చించి బ్రాహ్మణులకు భోజనంబులు వెట్టించి, మంగళాశీర్వచనంబులు సదివించి, రుక్మిణీదేవి నభిషిక్తం జేసి, వస్త్రయుగళభూషితం గావించి, రత్నభూషణంబు లిడం జేసె; ఋగ్యజుస్సామాథర్వణమంత్రంబుల మంగళాచరణంబు లొనరించి, భూసురులు రక్షాకరణంబు లాచరించిరి; పురోహితుండు గ్రహశాంతికొఱకు నిగమనిగదితన్యాయంబున హోమంబుఁ గావించె; మఱియు**

**నా రాజుదంపతుల మేలుకొఱకుఁ దిలధేనుకలధౌతకనకచేలాదిదానంబులు ధరణీదేవతల కొసంగె నయ్యవసరంబున. 1720**

**ప్రతి :** అంతన్= తర్వాత; ఆ భీష్మకుండు= భీష్మకుడనే ఆ రాజు; విహిత ప్రకారంబునన్= శాస్త్రంలో చెప్పిన పద్ధతులను అనుసరించి; పితృదేవతలన్+అర్చించి= పితృదేవతలను పూజించి; బ్రాహ్మణులకున్= బ్రాహ్మణులకు; భోజనంబులు పెట్టించి= భోజనాలు పెట్టించి; మంగళ+ఆశీస్+వచనంబులు= మంగళప్రదమైన ఆశీర్వాదాలు; చదివించి= పఠింపజేసి; రుక్మిణీదేవిని+ అభిషిక్తన్+చేసి= రుక్మిణీదేవికి స్నానం చేయించి; వస్త్రయుగళ భూషితన్+కావించి= రెండువస్త్రాలచేత; అలంకరింపచేసి; రత్నభూషణంబులు+ఇడన్+చేసెన్= రత్నాలు పొదిగిన నగలను అలంకరింపజేశాడు; ఋక్+యజుస్+సామ+ అథర్వణమంత్రంబులన్= ఋగ్వేదం, యజుర్వేదం, సామవేదం, అథర్వణవేదం అనే నాలుగు వేదాల మంత్రాలచే; మంగళ+ ఆచరణంబులు= స్వస్తిపుణ్యాహవాచనాలు; ఒనరించి= చేసి; భూసురులు= బ్రాహ్మణులు; రక్షాకరణంబులు= రక్షను కలిగింపచేసే పనులను; ఆచరించిరి= చేశారు; పురోహితుండు= పురోహితుడు; గ్రహశాంతికొఱకున్= గ్రహాలను శాంతింపజేయడంకోసం; నిగమ= వేదాలలో; నిగదిత= చెప్పబడిన; న్యాయంబునన్= పద్ధతిలో; హోమంబున్= హోమాన్ని; కావించెన్= చేశాడు; మఱియున్= ఇంకా; ఆ రాజు= ఆ భీష్మకుడు; దంపతుల= పెళ్లికొడుకు పెళ్లికూతుళ్ల; మేలుకొఱకున్= క్షేమంకోసం; తిల= నువ్వులు; ధేను= ఆవులు; కలధౌత= వెండి; కనక= బంగారు; చేల= వస్త్రాలు; ఆది= మొదలైన; దానంబులున్= దానాలను; ధరణీదేవతలకున్= బ్రాహ్మణులకు; ఒసంగెన్= ఇచ్చాడు; ఆ+అవసరంబునన్= ఆ సమయంలో...

**తా :** తర్వాత భీష్మకుడు శాస్త్రంలో చెప్పినవిధంగా పితృదేవతలకు పూజలు చేశాడు. బ్రాహ్మణులకు భోజనాలు పెట్టించాడు. వారినుండి ఆశీర్వాదాలు గ్రహించాడు. రుక్మిణీదేవికి తలంటుస్నానం చేయించి ఆమెకు వస్త్రాలు, ఆభరణాలు ఇచ్చి, అలంకరింపచేశాడు. ఋక్ – యజుస్ – సామ – అథర్వణవేదాల మంత్రాలతో శుభకార్యాలు జరిపించి, బ్రాహ్మణులు రక్షలు కట్టారు. పురోహితుడు గ్రహశాంతికోసం పద్ధతిప్రకారం హోమం చేయించాడు. కొత్తదంపతులకు మేలు కలగాలని భీష్మకుడు నువ్వులు, గోవులు, వెండి, బంగారం, వస్త్రాలు మొదలైనవి బ్రాహ్మణులకు దానం చేశాడు.

**మ. భటసంఘంబులతో రథావళులతో భద్రేభయూథంబుతోఁ**
**బటువేగాన్విత ఘోటకవ్రజముతో బంధుప్రియశ్రేణితోఁ**
**గటుసంరంభముతో విదర్భతనయం గైకొందు నంచున్ విశం**
**కట వృత్తిం జనుదెంచెఁ జైద్యుఁడు గడున్ గర్వించి య వ్వీటికిన్. 1721**

**ప్రతి :** భటసంఘంబులతోన్= కాల్బలంగా వస్తున్నభటుల పటాలంతో; రథ+ఆవళులతోన్= రథాల బారులతో; భద్ర+ ఇభయూథంబుతోన్= భద్రజాతి ఏనుగుల సమూహంతో; పటువేగ+అన్విత= మిక్కిలి వేగంతోకూడిన; ఘోటకవ్రజముతోన్= గుర్రాలగుంపుతో; బంధు= బంధువుల; ప్రియ= ఇష్టులైనవాళ్ల; శ్రేణితోన్= వరుసతో; కటు= ప్రచండమైన; సంరంభంబుతోన్= ఆటోపంతో; విదర్భతనయన్= విదర్భరాజు కొమార్తెను; కైకొందున్+అంచున్= చేయిపట్టి గ్రహిస్తానని (పెళ్లాడతానని); చైద్యుఁడు= చేదిరాజైన శిశుపాలుడు; కడున్= చాలా; గర్వించి= పొగరెక్కి; ఆ+వీటికిన్= ఆ కుండిన నగరానికి; విశంకట వృత్తిన్= దర్పంతో కూడిన రీతిలో; చనుదెంచెన్= వచ్చాడు.

**తా :** ఆ సమయంలో విదర్భరాజపుత్రిని చేపడతానంటూ మదోన్మత్తుడైన శిశుపాలుడు భటుల పటాలంతో, తేరులబారుతో, భద్రజాతికి చెందిన కుంజర బృందంతో, కడువడిగా పరుగిడే గుఱ్ఱాల పౌజుతో బంధుమిత్ర సమేతంగా మహాటోపంతో కుండిన నగరానికి వచ్చాడు.

**ఉ. బంధులఁ గూడి కృష్ణబలభద్రులు వచ్చినఁ బాఱఁ దోలి ని**
**ర్మంథరవృత్తిఁ జైద్యునికి మానినిఁ గూర్చెద మంచు నుల్లస**
**త్సింధుర వీరరథ్యరథసేనలతోఁ జనుదెంచి రా జరా**
**సంధుఁడు దంతవక్త్రుఁడును సాల్వవిదూరకపౌండ్రకాదులున్. 1722**

**ప్రతి :** బంధులన్= బంధువులతో; కూడి= కలిసి; కృష్ణ బలభద్రులు= శ్రీకృష్ణబలరాములు; వచ్చినన్= వచ్చినా కూడా; పాఱన్+తోలి= పారిపోయేలాగా తరిమి; నిర్మంథర= అడ్డులేని; వృత్తిన్= రీతిలో; చైద్యునికిన్= చేదిరాజైన శిశుపాలునికి; మానినిన్= మానవతి అయిన రుక్మిణీదేవిని; కూర్చెదము+అంచున్= ఇచ్చి పెళ్లిచేస్తామని; ఉల్లసత్= వెలిగిపోతున్న; సింధుర= ఏనుగులు; వీర= వీరభటులు; రథ్య= గుఱ్ఱాలు; రథ= రథాలతోకూడిన; సేనలతోన్= సైన్యంతోకూడి; ఆ జరాసంధుఁడు= ఆ జరాసంధుడనే రాజు; దంతవక్త్రుఁడును= దంతవక్త్రుడు; సాల్వ= సాల్వుడు; విదూరక= విదూరకుడు; పౌండ్రక= పౌండ్రకవాసుదేవుడు; ఆదులున్= మొదలైనవాళ్లు; చనుదెంచిరి= వచ్చారు

**తా :** బంధువులతో కలిసి శ్రీకృష్ణుడు, బలరాముడు, వచ్చినా, వాళ్లను పారిపోయేలా తరిమి, నిరాటంకంగా రుక్మిణిని శిశుపాలుని కిచ్చి పెండ్లి జరిపిస్తామని ఏనుగులు కాల్బలం, గుఱ్ఱాలు, రథాలతో కూడిన సైన్యంతో జరాసంధుడు, దంతవక్త్రుడు, సాల్వుడు, విదూరకుడు, పౌండ్రకుడు మొదలైనవాళ్లంతా వచ్చారు.

**వ. మఱియు నానాదేశంబుల రాజు లనేకు లేతెంచి; రందు శిశుపాలు నెదుర్కొని పూజించి, భీష్మకుం డొక్క నివేశంబున నతని విడియించె; నంత నా వృత్తాంతంబు విని. 1723**

**ప్రతి :** మఱియును= ఇంకా; నానాదేశంబుల= దేశదేశాల; రాజులు; అనేకులు+ఏతెంచిరి= పెక్కుమంది వచ్చారు; అందున్= అక్కడ; శిశుపాలునిన్= శిశుపాలుణ్ణి; ఎదుర్కొని= ఎదురుగా వెళ్లి; పూజించి= పూజచేసి; భీష్మకుండు= భీష్మకుడనే ఆ రాజు; ఒక్క నివేశంబునన్= ఒక భవనంలో; అతనిన్= అతనిని; విడియించెన్= విడిది చేయించాడు; అంతన్= అంతలో; ఆ వృత్తాంతంబున్= ఆ సమాచారాన్ని; విని...

**తా :** తర్వాత ఎన్నోదేశాలను పరిపాలిస్తున్న రాజులు చాలమంది వచ్చారు. వాళ్లు శిశుపాలునికి ఎదురుగా వెళ్లి పూజించారు. భీష్మకుడు అతనికి ఒక ప్రత్యేక నివాసస్థానాన్ని ఏర్పరిచి, అక్కడ విడిది చేయించాడు. అంతలో ఆ సమాచారమంతా విని,

**చ. హరి యొకఁ డేగినాఁడు మగధాదులు చైద్యహితానుసారులై**
**నరపతు లెందఱేనిఁ జనినారు కుమారికఁ దెచ్చుచోట సం**
**గర మగుఁ; దోడు గావలయుఁ గంసవిరోధికి నంచు వేగఁ దా**
**నరిగె హలాయుధుండు గమలాక్షునిజాడ ననేకసేనతోన్. 1724**

**ప్రతి :** హరి+ఒకఁడు= కృష్ణుడు ఒక్కడే; ఏగినాఁడు= వెళ్లాడు; మగధ+ఆదులు= మగధరాజైన జరాసంధుడు మొదలైనవాళ్లు; చైద్యహిత= చేదిరాజైన శిశుపాలునికి మంచి జరగాలని; అనుసారులు+ఐ= అనుసరిస్తున్నవారై; నరపతులు= రాజులు; ఎందఱు+ఏనిన్= ఎందరెందరో; చనినారు= వెళ్లారు; కుమారికన్= పెళ్లికూతురిని; తెచ్చుచోటన్= తీసుకునివచ్చే చోట;

సంగరము+అగున్= పోరు జరుగుతుంది; కంసవిరోధికిన్= కంసవిరోధి అయిన శ్రీకృష్ణునికి; తోడు కావలయున్= తోడుగా నిలబడేవాళ్లు కావాలి; అంచున్= అంటూ; హల+ఆయుధుండు= నాగలిని ఆయుధంగా కల బలరాముడు; వేగన్= వెంటనే; కమల+అక్షుని= కమలంవంటి కళ్లున్న శ్రీకృష్ణుని; జాడన్= మార్గంలో; అనేక సేనతోన్= అసంఖ్యాకమైన సైన్యంతో; తాన్+అరిగెన్= తానూ వెళ్లాడు.

**తా :** 'శ్రీకృష్ణుడు ఒంటరిగా వెళ్లాడు. జరాసంధుడు మొదలైనవాళ్లు, శిశుపాలునికి మేలు జరగాలని అతణ్ణి అనుసరిస్తున్న ఎందరో రాజులు వెళ్లారు. కన్యను తెచ్చే చోట యుద్ధం జరగవచ్చు. శ్రీకృష్ణునికి సహాయం కావాలి' – అనుకొని వెంటనే బలరాముడు అసంఖ్యాకమైన సైన్యంతో శ్రీకృష్ణుడు వెళ్లినమార్గంలో తానూ వెళ్లాడు.

**క. ఆ లోపల నేకతమున, నాలోలవిశాలనయన యగు రుక్మిణి త**
**న్నా లోకలోచనుఁడు హరి, యాలోకము చేసి కదియఁ డని శంకితయై. 1725**

**ప్రతి :** ఆలోపలన్= అంతలో; ఏకతమునన్= ఒంటరిగా ఉన్న; ఆలోల విశాలనయన+అగు= అటూ ఇటూ చలిస్తున్న విశాలమైన కళ్లుగల; రుక్మిణి; తన్నున్= తనను; ఆ లోకలోచనుఁడు= లోకానికి కన్నులాంటివాడైన; హరి= ఆ శ్రీకృష్ణుడు; ఆలోకముచేసి= (తన సందేశాన్ని) తిలకించి; కదియఁడు+అని= (తన) దగ్గరికి రాడేమో అని; శంకిత+ఐ= సందేహం పొందిందై...

**తా :** అంతలో రుక్మిణి ఏకాంతమందిరంలో ఆలోచిస్తూంది. విశాలమైన ఆమెనేత్రాలు అటూ ఇటూ చలిస్తున్నాయి. లోకానికి కన్నులాంటివాడైన శ్రీకృష్ణుడు తన సందేశాన్ని తిలకించి తన దగ్గరకు వస్తాడో రాడో అనే సందేహంతో

**శా. లగ్నం బెల్లి; వివాహముం గదిసె; నేలా రాఁడు గోవిందు? దు**
**ద్విగ్నం బయ్యెడి మానసంబు; వినెనో వృత్తాంతమున్; బ్రాహ్మణుం**
**దగ్నిద్యోతనుఁ డేటికిం దడసె? నా యత్నంబు సిద్ధించునో**
**భగ్నంబై చనునో విరించికృత మెబ్భంగిన్ బ్రవర్తించునో? 1726**

**ప్రతి :** లగ్నంబు= లగ్నసమయం (పెళ్లిముహూర్తం); ఎల్లి= రేపే; వివాహమున్= పెళ్లికూడా; కదిసెన్= దగ్గరికి వచ్చింది; ఏలా= ఎందుకని; గోవిందుఁడు= శ్రీకృష్ణుడు; రాఁడు= ఇంకా రాడు; మానసంబు= మనస్సు; ఉద్విగ్నంబు+అయ్యెడిన్= ఆందోళనపడుతున్నది; వృత్తాంతమున్= ఈ వార్తను; వినెన్+ఓ= విన్నాడో లేదో; అగ్నిద్యోతనుఁడు= (అగ్నివలె ప్రకాశించేవాడు) అగ్నిద్యోతనుడనే; బ్రాహ్మణుండు= నా సందేశకర్త అయిన బ్రాహ్మణుడు; ఏటికిన్= ఎందువల్ల; తడసెన్= ఆలస్యం చేశాడు?; నా యత్నంబు= నేను చేసిన ప్రయత్నం; సిద్ధించున్+ఓ= ఫలిస్తుందో; భగ్నంబు+ఐ చనున్+ఓ= విఫలమైపోతుందో; విరించికృతము= బ్రహ్మదేవుని (దైవ) నిర్ణయం; ఏ+భంగిన్= ఏ విధంగా; ప్రవర్తించున్+ఓ= జరుగుతుందో?

**తా :** రేపే ముహూర్తం. పెళ్లికూడా దగ్గరపడింది. ఎందుకు శ్రీకృష్ణు డింకా రాలేదు? మనసంతా కలవరంగా ఉంది. ఈ పెళ్లిగురించి సమాచారాన్ని విన్నాడో లేదో. అగ్నిద్యోతనుడు ఎందుకు ఆలస్యం చేశాడు? నా ప్రయత్నం ఫలిస్తుందో లేక వికటిస్తుందో? బ్రహ్మదేవుని సంకల్పం ఎలా ఉందో!

**మ. ఘనుఁ డా భూసురుఁ డేఁగెనో? నడుమ మార్గశ్రాంతుఁడై చిక్కెనో**
**విని కృష్ణుం డిది తప్పుగాఁ దలఁచెనో? విచ్చేసెనో? యీశ్వరుం**
**డనుకూలింపఁ దలంచునో తలఁపఁడో? యార్యామహాదేవియున్**
**నను రక్షింప నెఱుంగునో యెఱుఁగదో? నా భాగ్య మెట్లున్నదో? 1727**

**ప్రతి :** ఘనుఁడు= మహానుభావుడు (అయిన); ఆ భూసురుఁడు= ఆ బ్రాహ్మణుడు; ఏఁగెన్+ఓ= వెళ్లాడో?; నడుమన్= మధ్యలోనే; మార్గశ్రాంతుఁడు+ఐ= నడచి నడచి అలసిపోయి; చిక్కెన్+ఓ= ఆగిపోయాడో ఏమో!; విని= ఆ బ్రాహ్మణుడు చెప్పినదంతా ఆలకించి; కృష్ణుండు= శ్రీకృష్ణుడు; ఇది= ఇలా చెప్పిపంపడాన్ని; తప్పు+కాన్= దోషంగా; తలఁచెన్+ఓ= అనుకున్నాడేమో!; విచ్చేసెన్+ఓ= లేక ఈ పాటికే ఇక్కడికి వచ్చేశాడేమో; ఈశ్వరుండు= పరమేశ్వరుడు; అనుకూలింపన్= అంతా నాకు మేలు కలిగించేవిధంగా; తలంచున్+ఓ= భావిస్తాడో?; తలఁపఁడు+ఓ= భావించడో?; ఆర్యామహాదేవియున్= పార్వతీదేవికూడా; ననున్= నన్ను; రక్షింపన్= కాపాడాలని; ఎఱుంగున్+ఓ= తెలుసునో; ఎఱుఁగదు+ఓ= తెలియదో; నా భాగ్యము= నా అదృష్టం; ఎట్లు+ఉన్నదో= ఏ విధంగా ఉందోమరి?

**తా :** ఆ మహాత్ముడైన బ్రాహ్మణుడు వెళ్లాడో? లేక నడిదారిలోనే నడచినడచి అలసి ఆగిపోయాడో? లేక బ్రాహ్మణుడు సందేశాన్ని తెలపగానే శ్రీకృష్ణుడు విని తప్పుగా భావించాడో? లేక ఈ పాటికే ఇక్కడికి వచ్చినాడేమో? పరమేశ్వరుడు నాకు అనుకూలం కలిగించాలని తలుస్తాడో? తలచడో? పార్వతీదేవికి నన్ను రక్షించాలని తెలుసునో! తెలియదో! తెలియదు. ఇంతకూ నా అదృష్టం ఎలా ఉందో?

**వ. అని వితర్కించుచు. 1728**

**ప్రతి :** అని= ఈ విధంగా; వితర్కించుచున్= రకరకాలుగా ఆలోచనలు చేస్తూ...

**తా :** రుక్మిణి మనసులో సందేహాలూ, విశ్వాసాలూ పెనవేసుకుని ఉన్నాయి. ఔను – కాదుల మధ్య మనసు ఊగిసలాడుతూ ఉంది.

**ఉ. పోఁ దను బ్రాహ్మణుండు యదుపుంగవు వీటికి; వాసుదేవుఁడున్**
**రాఁ దను; నింకఁ బోయి హరి రమ్మని చీరెడి యిష్టబంధుఁడున్**
**లేఁ దను; రుక్మికిం దగవు లే దిటఁ జైద్యున కిత్తు నంచు ను**
**న్నాఁ దను; గౌరి కీశ్వరికి నావలనం గృప లేదు నేఁ డనున్. 1729**

**ప్రతి :** బ్రాహ్మణుండు= సందేశకర్తగా వెళ్లిన అగ్నిద్యోతనుడు; యదుపుంగవువీటికిన్= యాదవులలో ఉత్తముడైన శ్రీకృష్ణుని నగరానికి; పోఁడు+అనున్= పోయి ఉండడు అనుకుంటుంది; వాసుదేవుఁడున్= శ్రీకృష్ణుడుకూడా; రాఁడు+అనున్= రాడు అని అనుకుంటుంది; ఇంకన్+పోయి= ఇక ఈ సమయంలో మరల వెళ్లి; హరిన్= శ్రీకృష్ణుణ్ణి; రమ్ము+అని= విచ్చేయుమని; చీరెడి= పిలిచే; ఇష్టబంధుఁడున్= ఆత్మబంధువుకూడా; లేఁడు+అనున్= లేడు అనుకుంటుంది; రుక్మికిన్= నా అన్న రుక్మికి కూడా; తగవు= న్యాయం, నీతి; ఇటున్= ఇక్కడ (ఈ విషయంలో); లేదు= లేదు; చైద్యునకున్= చేదిదేశపువాడైన శిశుపాలునికి; ఇత్తున్(ఇచ్చుదును)+అంచున్= ఇచ్చి వివాహం చేస్తానని; ఉన్నాఁడు+అనున్= ఉన్నాడు కదా అనుకుంటుంది; ఈశ్వరికిన్=

సర్వశక్తి స్వరూపిణి అయిన; గౌరికిన్= పార్వతీదేవికి; నా వలనన్= నా మీద; నేఁడు కృప లేదు= ఈ రోజు దయకలగడం లేదు; అనున్= అనుకుంటుంది.

**తా :** సందేశహరుడైన అగ్నిద్యోతనుడు శ్రీకృష్ణుని దగ్గరకుపోయి ఉండడు అనుకుంటుంది. శ్రీకృష్ణుడుకూడా ఇక్కడికి రాడు అనుకుంటుంది. మళ్లీ ద్వారకకువెళ్లి శ్రీకృష్ణుణ్ణి పిలిచే ఆత్మబంధువు ఎవడూ లేడే అనుకుంటుంది. నా అన్న రుక్మికి ఈ విషయంలో నీతి, న్యాయం తెలియదు అనుకుంటుంది. చేదిరాజైన శిశుపాలునికి నన్ను ఇస్తానని ఉన్నాడు – అనుకుంటుంది. అయ్యో! సర్వశక్తి స్వరూపిణి అయిన పార్వతికి కూడా నా పైన ఈ రోజు దయలేదు – అనుకుంటుంది.

**విశే :** వాక్యాలు, వాక్యాలుగా విడిపోతున్న ఈ పద్యంలో 'అనున్ అనున్' అనే క్రియల ప్రయోగం రుక్మిణియొక్క వేదనను తెలుపుతుంది.

**ఉ. చెప్పదు తల్లికిం దలఁపుఁజిక్కు; దిశల్ దరహాసచంద్రికం**
**గప్పదు; వక్త్రతామరసగంధసమాగతభృంగసంఘమున్**
**రొప్పదు; నిద్రఁ గైకొన దురోజపరస్పరసక్తహారముల్**
**విప్పదు; కృష్ణమార్గగతవీక్షణపంక్తులు ద్రిప్ప దెప్పుడున్. 1730**

**ప్రతి :** తలఁపున్+చిక్కు= తన ఆలోచనలోని వేదనను; తల్లికిన్= తన తల్లికికూడా; చెప్పదు= చెప్పుకోదు; దిశల్= దిక్కులలో; దరహాసచంద్రికన్= చిరునవ్వుల వెన్నెలను; కప్పదు= నింపదు; వక్త్రతామరస= ముఖం అనే పద్మంనుండి వెలువడుతున్న; గంధ= పరిమళంకోసం; సమాగత= వచ్చిన; భృంగ సంఘమున్= తుమ్మెదల గుంపునుకూడా; రొప్పదు= తరమదు; నిద్రన్+కైకొనదు= నిద్రపోదు; ఉరోజ= వక్షాలమీద; పరస్పర= ఒకదానితో ఒకటి; సక్త= పెనవేసుకున్న; హారముల్= దండలు; విప్పదు= విడదీసి సరిచేయదు; కృష్ణ= శ్రీకృష్ణుడు వచ్చే; మార్గగత= మార్గాన్ని పొందిన; వీక్షణపంక్తులు= చూపుల వరుసలను; ఎప్పుడున్= ఎప్పటికీ; త్రిప్పదు= పక్కకు మరలింపదు.

**తా :** రుక్మిణి తనమనసులోని చెలరేగే వేదనను తల్లికికూడా చెప్పుకోదు. దిక్కులలో చిరునవ్వు వెన్నెల నింపదు. తన ముఖం నుండి వెలువడే పరిమళానికి తుమ్మెదలు మూగుతున్నా వాటిని తోలదు. నిద్రపోదు. వక్షంపై హారాలు ఒకదానిపై ఒకటి పెనవేసుకుని ఉన్నా వాటిని సరిచేసుకోదు. శ్రీకృష్ణుడు వస్తాడని ఎదురుచూచే దారిపై నిలిపిన తన చూపును మాత్రం ఎప్పటికీ పక్కకు తిప్పదు.

**చ. తుడువదు కన్నులన్ వెడలు తోయకణంబులు; కొప్పుఁ జక్కగా**
**ముడువదు; నెచ్చెలిం గదిసి ముచ్చటకుం జన; దన్న మేమియుం**
**గుడువదు; నీరముం గొనదు; కూరిమి కీరముఁ జేరి పద్యమున్**
**నొడువదు; వల్లకీగుణవినోదము సేయదు; డాయ దన్యులన్. 1731**

**ప్రతి :** కన్నులన్= కండ్లనుంచి; వెడలు= ఉబికివస్తున్న; తోయకణంబులు= కన్నీటి బొట్లను; తుడువదు= తుడుచుకోదు; కొప్పున్= కొప్పును; చక్కగా= సరిగ్గా; ముడువదు= ముడుచుకోదు; నెచ్చెలిన్+కదిసి= తన ప్రియసఖిని సమీపించి; ముచ్చటకున్= సరసమైన మాటలు మాట్లాడడానికి; చనదు= వెళ్లదు; అన్నము+ఏమియున్= అన్నం ఏ మాత్రంకూడా; కుడువదు= తినదు;

నీరమున్= మంచినీళ్లనుకూడా; కొనదు= తీసుకోదు; కూరిమి= ఇష్టమైన; కీరమున్= రామచిలుక దగ్గరకు; చేరి= వెళ్లి; పద్యమున్= పద్యాన్ని; నొడువదు= చెప్పదు; వల్లకీగుణవినోదము= వీణాతీగలను మీటి ఆనందపడడం; చేయదు; అన్యులన్= వేరే ఎవరినీ; డాయదు= చేరదు

**తా :** ఈ వేదనవలన రుక్మిణికళ్లలో కన్నీళ్లు ఉబికి వస్తున్నాయి. వాటిని తుడవనైనా తుడవదు. కొప్పు సవరించుకొని సరిగా ముడవదు. తన ఇష్టసఖిని కలిసి ఏదో సరససల్లాపాలకైనా వెళ్లదు. ఏ మాత్రంకూడా అన్నం తినదు. నీళ్లుకూడా తాగదు. ప్రియమైన రామచిలుక వద్ద చేరి, పద్యాన్ని చెప్పించదు. వీణతీగను మీటి వినోదించదు. ఎవరివద్దకూ వెళ్లదు.

**సీ. మృగనాభి యలఁదదు మృగరాజమధ్యమ జలముల నాడదు జలజగంధి**
**ముకురంబుఁ జూడదు ముకురసన్నిభముఖి పువ్వులు దుఱుమదు పువ్వుఁబోణి**
**వనకేళిఁ గోరదు వనజాతలోచన హంసంబుఁ బెంపదు హంసగమన**
**లతలఁ బోషింపదు లతికాలలితదేహ తొడవులు దొడవదు తొడవు తొడవు**

**ఆ. తిలక మిడదు నుదుటఁ దిలకినీతిలకంబు, కమలగృహముఁ జొరదు కమలహస్త**
**గారవించి తన్నుఁ గరుణఁ గైకొన వన, మాలి రాఁడు తగవుమాలి యనుచు. 1732**

**ప్రతి :** వనమాలి= పరిమళించే మాలనుధరించిన శ్రీకృష్ణుడు; తగవుమాలి= న్యాయం లేకుండా (నా పట్ల దయ ఉండడం న్యాయం అనీ - దయలేదే అనీ భావం); గారవించి= ఆదరించి; తన్నున్= తనను; కరుణన్= దయతో; కైకొనన్= చేపట్టడానికి; రాఁడు= రాడేమి; అనుచున్= అనుకుంటూ; మృగరాజ మధ్యమ= మృగాలకు రాజైన సింహం నడుమువంటి నడుముగల రుక్మిణి; మృగనాభి= కస్తూరిని; అలదదు= శరీరానికి అద్దుకోదు; జలజగంధి= పద్మంవలె పరిమళించే ఆ రుక్మిణి; జలములన్+ ఆడదు= నీళ్లలో ఆడుకోదు; ముకురసన్నిభముఖి= అద్దంవంటి మెరుగైన ముఖమున్న ఆమె; ముకురంబున్= అద్దాన్ని; చూడదు= చూచుకోదు; పువ్వు+పోణి= పువ్వులాంటి కోమలమైన శరీరంగల ఆ రుక్మిణి; పువ్వులు= పూలను; తుఱుమదు= తలలో పెట్టుకోదు; వనజాత= నీటిలో పుట్టిన కమలాలవంటి; లోచన= కండ్లుగల ఆమె; వనకేళిన్= తోటల్లో విహరించడాన్ని; కోరదు= ఇష్టపడదు; హంసగమన= హంసనడకలవంటి నడకగల రుక్మిణి; హంసంబున్= హంసను; పెంపదు= పోషించదు; లతికా= తీగవలె; లలితదేహ= సుకుమారమైన శరీరమున్న ఆమె; లతలన్= తీగలను; పోషింపదు= పెంచదు; తొడవు= ఆభరణాలకే; తొడవు= ఆభరణంవంటిదైన రుక్మిణి; తొడవులు= నగలను; తొడువదు= అలంకరించుకోదు; తిలకినీ తిలకంబు= స్త్రీలకు తిలకం(శ్రేష్ఠం)వంటిదైన ఆమె; నుదుటన్= నుదురుపై; తిలకము+ఇడదు= తిలకం పెట్టుకోదు; కమలహస్త= కమలాలవంటి చేతులుగల ఆమె; కమలగృహమున్= తామరపూలకు ఇంటివంటి సరోవరంలో; చొరదు= ప్రవేశించదు.

**తా :** పరిమళించే వనమాలను ధరించిన శ్రీకృష్ణుడు కొంచెమైనా న్యాయం లేకుండా నన్ను ఆదరించి దయచూపకుండా ఉన్నాడే! నన్ను చేపట్టడానికి రాడే! అని రుక్మిణి వేదనపడుతూ ఉంది. సింహంనడుమువంటి సన్నని నడుముగల ఆమె కస్తూరి పూసుకోవడం లేదు. పద్మంవలె పరిమళించే ఆమె జలకాలాడడం లేదు. అద్దంవంటి ముఖం కల ఆమె అద్దం చూడడం లేదు. పూలవంటి సున్నితమైన శరీరమున్న స్త్రీ ఆమె పూలను పెట్టుకోడం లేదు. కలువపూలవంటి కండ్లున్న ఆ రుక్మిణి వనవిహారం చేయడం లేదు. హంసవలె ఒయ్యారంగా నడిచే ఆమె హంసలను చేరదీయడం లేదు. తీగవలె నాజూకైన శరీరంకల ఆమె తీగలను పెంచడం లేదు. నగలకే నగవంటి ఆమె ఏ నగనూ పెట్టుకోవడం లేదు. తిలకం

పెట్టుకునే స్త్రీలందరికీ తిలకంవంటి ఆమె నొసట తిలకం పెట్టుకోదు. పద్మాలవంటి చేతులున్న ఆమె కమలాలతో ఉన్న కొలనులోకి ప్రవేశించదు.

**వ. మఱియును. 1733**

**ప్రతి :** మఱియును= తర్వాత...

**తా :** ఇంకా

**మ. మలఁగున్ మెల్లని గాలికిం; బటురటన్మత్తద్విరేఫాళికిం**
**దలఁగుం; గోయిలప్రోఁతకై యలఁగు; నుద్యత్కీరసంభాషలం**
**గలఁగున్; వెన్నెలవేడిమి న్నలఁగు; మాకందాంకురచ్ఛాయకుం**
**దొలఁగుం గొమ్మ మనోభవానలశిఖాదోదూయమానాంగియై. 1734**

**ప్రతి :** కొమ్మ= అందగత్తె అయిన రుక్మిణి; మనస్+భవ+అనల= మన్మథాగ్నియొక్క; శిఖా= జ్వాలలచే; దోదూయమాన+ అంగి+ఐ= తపించిపోతున్న శరీరం కలదై; మెల్లనిగాలికిన్= సుకుమారంగా వీస్తున్నగాలికి (మందమారుతానికి); మలఁగున్= దూరంగాపోతుంది; పటురటత్= బాగా ధ్వనులు చేస్తున్న; మత్త= మదించిన; ద్విరేఫ+ఆళికిన్= తుమ్మెదల వరుసలకు; తలఁగున్= తొలగిపోతుంది; కోయిలప్రోఁతకున్+ఐ= కోయిల కూతకు; అలఁగున్= కోపపడుతుంది; ఉద్యత్+కీర+ సంభాషలన్= పుట్టుకొస్తున్న రామచిలుకల మాటలకు; కలఁగున్= ఉలకిపడుతుంది; వెన్నెలవేడిమిన్= వెన్నెలవేడికి; నలఁగున్= అలసిపోతుంది; మాకంద+అంకుర= గున్నమామిడి కొమ్మల; ఛాయకున్= నీడకు; తొలగున్= దూరంగాపోతుంది;

**తా :** రుక్మిణీదేవి మన్మథాగ్నిజ్వాలల్లో తపించిపోతున్న శరీరంకలదై – సుకుమారంగా, నెమ్మదిగా వీస్తున్న చల్లగాలికి ఆమె దూరంగా తొలగిపోతూంది. మత్తెక్కిన తుమ్మెదలు ఝుంకారాలతో తిరుగుతూంటే, పక్కకు వెళ్లిపోతుంది. కోయిల కూతకు కోపగించుకుంటుంది. రామచిలుకలనుంచి ముద్దుమాటలు పుట్టుకొస్తూంటే మదనవేదనతో ఉలికిపడుతుంది. వెన్నెల వేడికి అలసిపోతుంది. చిరుమామిడికొమ్మల లేతనీడలకు దూరంగాపోతుంది.

**వ. ఇట్లు హరిరాక కెదురు సూచుచు సకలప్రయోజనంబులందును విరక్తయై మనోజానలంబునం బొగిలెడి మగువకు శుభంబుఁ జెప్పుచందంబున వామలోచనభుజంబు లదరె నంతఁ గృష్ణనియోగంబున వేగంబున బ్రాహ్మణుండు సనుదెంచిన, నతనిముఖలక్షణం బుపలక్షించి యా కలకంఠి మహోత్కంఠతోడ నకుంఠితయై మొగంబునం జిఱునగవు నిగుడ నెదురు సని నిలువంబడిన బ్రాహ్మణుం డిట్లనియె. 1735**

**ప్రతి :** ఇట్లుగ= ఈ విధంగా; హరిరాకకున్= శ్రీకృష్ణుడి రాకను గురించి; ఎదురు+చూచుచున్= ప్రతీక్షిస్తూ; సకల= అన్నిరకాల; ప్రయోజనంబుల+అందును= కార్యాలలోనూ; విరక్త+ఐ= ఇష్టంలేనిదై; మనోజ+అనలంబునన్= మన్మథాగ్నిలో; పొగిలెడి= పరితపిస్తున్న; మగువకున్= స్త్రీకి (రుక్మిణికి); శుభంబున్= మంచివార్తను; చెప్పుచందంబునన్= చెప్పే విధంగా; వామలోచనభుజంబులు= ఎడమకన్ను, ఎడమభుజం; అదరెన్= అదిరాయి; అంతన్= తర్వాత; కృష్ణ= శ్రీకృష్ణుని; నియోగంబునన్= ఆజ్ఞానుసారం; బ్రాహ్మణుండు= తన సందేశకర్తగా వెళ్లిన అగ్నిద్యోతనుడనే బ్రాహ్మణుడు; చనుదెంచినన్= తిరిగి రాగా; అతని= ఆ బ్రాహ్మణుని; ముఖలక్షణంబు= ముఖవైఖరిని; ఉపలక్షించి= గమనించి; ఆ కలకంఠి= కోకిలస్వరంవంటి మధురమైన

కంఠస్వరమున్న ఆ రుక్మిణి; మహా+ఉత్కంఠతోడన్= ఎపుడెపుడు చూస్తానా అనే తహతహతో; అకుంఠిత+ఐ= అడ్డులేనిదై; మొగంబునన్= ముఖంలో; చిఱునగవు= చిరునవ్వు; నిగుడన్= విస్తరిస్తూ ఉండగా; ఎదురు+చని= ఎదురుగా వెళ్లి; నిలువన్+పడినన్= నిలబడగా; బ్రాహ్మణుండు+ఇట్లు+అనియెన్= ఆ బ్రాహ్మణుడు ఇలా అన్నాడు.

**తా :** రుక్మిణి ఈ విధంగా విచారిస్తూ ఉంది. శ్రీకృష్ణుడు ఎపుడు వస్తాడా అని ఎదురుచూస్తూ ఉంది. ఏ పని చేయడానికీ ఆమెకు ఆసక్తి లేదు. మనసులో మదనాగ్ని చెలరేగుతూ ఉంది. ఆమె దుఃఖపడుతూ ఉంది. అలాంటి స్థితిలో ఆమెకు మంచివార్తను చెప్పే విధంగా; ఎడమకన్ను, ఎడమభుజం అదిరాయి. అంతలో శ్రీకృష్ణుడు ఆనతిచ్చిన రీతిలో అగ్నిద్యోతనుడు తిరిగి వచ్చాడు. అతనిముఖలక్షణాలను గమనించింది - రుక్మిణి. ఆ లక్షణాలు తనకు శుభాన్ని చెపుతున్నాయి. మధురమైన కంఠస్వరంగల రుక్మిణి శ్రీకృష్ణుణ్ణి ఎప్పుడు చూస్తానా అనే అద్భుతొలగడంతో ముఖంలో చిరునవ్వు చిందులాడగా ఆ బ్రాహ్మణునికి ఎదురువెళ్లి నిలబడింది. అపుడు ఆ బ్రాహ్మణుడు ఇలా అన్నాడు.

**ఉ. మెచ్చె భవద్గుణోన్నతి; కమేయధనావళు లిచ్చె నాకుఁ; దా**
**వచ్చె సుదర్శనాయుధుఁడు వాఁడె; సురాసురు లెల్ల నడ్డమై**
**వచ్చిన నైన రాక్షసవివాహమునం గొనిపోవు నిన్ను; నీ**
**సచ్చరితంబు భాగ్యమును సర్వము నేఁడు ఫలించెఁ గన్యకా! 1736**

**ప్రతి :** కన్యకా= అమ్మాయీ!; సుదర్శన+ఆయుధుడు= సుదర్శనచక్రాన్ని ఆయుధంగా కలిగిన; వాఁడు+ఎ= ఆ కృష్ణుడు; తాన్+వచ్చెన్= తానే వచ్చాడు; భవత్= నీయొక్క; గుణ+ఉన్నతికిన్= ఉత్తమమైన గుణాలకు; మెచ్చెన్= మెచ్చుకొన్నాడు; నాకున్= నాకు; అమేయ= అంతులేని; ధన+ఆవళులు+ఇచ్చెన్= ధనరాసులను ఇచ్చాడు; సుర+అసురులు+ఎల్లన్=దేవతలు, రాక్షసులు అందరూకూడా; అడ్డము+ఐ= నిరోధించినవాడై; వచ్చినన్+ఐనన్= వచ్చినప్పటికీ కూడా; రాక్షసవివాహమునన్= రాక్షస వివాహ పద్ధతిలో; నిన్నున్= నిన్ను; కొనిపోవున్= తీసుకుని వెళతాడు; నీ సత్+చరితంబున్= నీ మంచి నడవడిక; భాగ్యమును= అదృష్టం; సర్వమున్= అన్నీకూడా; నేఁడు= ఈ రోజు; ఫలించెన్= ఫలించాయి.

**తా :** అమ్మాయీ! సుదర్శనచక్రాన్ని ఆయుధంగా కల్గిన శ్రీకృష్ణుడు అదిగో తానే వచ్చాడు. నీ ఉత్తమగణగణాలను మెచ్చాడు. నాకు అంతులేని ధనరాసులను కూడా ఇచ్చాడు. దేవతలూ, రాక్షసులూ నిరోధించినా అతనికి లెక్కలేదు. రాక్షసవివాహపద్ధతిలో నిన్ను తీసుకొనిపోతాడు. నీ మంచిప్రవర్తన, నీ అదృష్టం అన్నీకూడా నేటికి ఫలించాయి.

**వ. అనిన వైదర్భి యిట్లనియె. 1737**

**ప్రతి :** అనినన్= అని పలుకగా; వైదర్భి= విదర్భ రాజపుత్రి; ఇట్లు+అనియెన్= ఇలా అంది.

**తా :** అలా అగ్నిద్యోతనుడు అన్న మాటకు విదర్భరాజపుత్రి అయిన రుక్మిణి ఇలా అంది.

## ✤ రుక్మిణీదేవి అగ్నిద్యోతనునికి నమస్కరించుట ✤

**మ. జలజాతేక్షణుఁ దోడితెచ్చితివి నా సందేశమున్ జెప్పి; నన్**
**నిలువం బెట్టితి; నీ కృపన్ బ్రదికితిన్; నీయంత పుణ్యాత్మకుల్**

**గలరే? దీనికి నీకుఁ బ్రత్యుపకృతిం గావింప నే నేర; నం**
**జలిఁ గావించెద; భూసురాన్వయమణీ! సద్బంధుచింతామణీ! 1738**

**ప్రతి :** భూసుర+అన్వయమణీ= బ్రాహ్మణవంశానికి రత్నంవంటివాడా!; సత్+బంధుచింతామణీ= మంచి బంధువుల పాలిటికి కోరిందెల్లా ప్రసాదించే చింతామణివంటివాడా; నా సందేశమున్= నేను నీకు చెప్పిపంపిన సందేశాన్ని; చెప్పి= కృష్ణునికి చెప్పి; జలజాత+ఈక్షణున్= పద్మాలవంటి కండ్లున్న శ్రీకృష్ణుణ్ణి; తోడితెచ్చితివి= తోడ్కొనివచ్చావు; నన్= నన్ను; నిలువన్+పెట్టితి(వి)= ప్రాణాలతో నిలిపావు; నీ కృపన్= నీ దయవల్ల; బ్రతికితిన్= బతికాను; నీ+అంత= నీ అంతటి; పుణ్య+ఆత్మకుల్= పుణ్యస్వభావులు; కలరే= ఎక్కడైనా ఉన్నారా?; దీనికిన్= నీవు చేసిన ఈ ఉపకారానికి; నీకున్= నీకు; ప్రతి+ఉపకృతిన్= తిరిగి ఉపకారాన్ని; కావింపన్= చేయడమెలాగో; నే నేరన్= నాకు తెలియడం లేదు; అంజలిన్+కావించెదన్= రెండు చేతులూ జోడించి నీకు నమస్కరిస్తాను.

**తా :** బ్రాహ్మణవంశానికే రత్నంవంటివాడా; నీ బంధువులపాలిటి చింతామణివంటివాడా! పద్మాలవంటికండ్లున్న శ్రీకృష్ణునికి నా సందేశాన్ని వినిపించి; ఆయనను వెంట తీసుకుని వచ్చావు. నా మనసులోని మాటను కృష్ణునికి చెప్పి నన్ను ప్రాణాలతో నిలబెట్టావు. నీ దయవల్ల నేను బతికాను. నీలాంటి పుణ్యాత్ములెక్కడైనా ఉంటారా! ఇంత సహాయంచేసిన నీకు నేను ఎలాంటి ఉపకారాన్నీ తిరిగి చేయాలో? నాకు తెలియడం లేదు, కృతాజ్ఞలాగా రెండు చేతులూ చేర్చి నమస్కరిస్తాను.

**వ. అని నమస్కరించె; నంత రామకృష్ణులు తమకూఁతువివాహంబునకు వచ్చుట విని, తూర్యఘోషంబులతో నెదుర్కొని, విధ్యుక్తప్రకారంబునం బూజించి మధుపర్కంబు లిచ్చి, వివిధాంబరాభరణంబులు మొదలైన కానుక లొసంగి, భీష్మకుండు బంధుజనసేనాసమేతులైనవారలకుం దూర్ణంబున సకల సంపత్పరిపూర్ణంబులైన నివేశంబులు కల్పించి విడియించె; నిట్లు కూడినరాజుల కెల్లను వయోవీర్య బలవిత్తంబు లెట్లట్ల కోరినపదార్థంబు లెల్ల నిప్పించి పూజించె; నంత విదర్భపురంబుప్రజలు హరిరాక విని వచ్చి చూచి, నేత్రాంజలులం దదీయవదనకమలమధుపానంబు సేయుచు. 1739**

**ప్రతి :** అని= ఈ విధంగా పలికి; నమస్కరించెన్= నమస్కారం చేసింది; అంతన్= తర్వాత; రామకృష్ణులు= బలరామశ్రీకృష్ణులు ఇద్దరూ; తమ కూఁతు వివాహంబునకున్= తమకొమార్తె అయిన రుక్మిణివివాహమహోత్సవానికి; వచ్చుటన్+విని= వచ్చారన్న వార్తను విని; భీష్మకుండు= భీష్మకుడు; తూర్యఘోషంబులతోన్= మంగళవాద్యాలధ్వనులతో; ఎదుర్కొని= ఎదురుగా వెళ్లి; విధి+ఉక్త ప్రకారంబునన్= శాస్త్రంలో చెప్పబడినపద్ధతిలో; పూజించి= వాళ్లిద్దరినీ పూజించి; మధుపర్కంబులు+ఇచ్చి= పెరుగుతో కలిసిన తేనెలనిచ్చి (ఇవి అతిథిసేవలో భాగం); వివిధ= రకరకాలైన; అంబర= వస్త్రాలు; ఆభరణంబులు= నగలు; మొదలైన; కానుకలు= బహుమతులు; ఒసంగి= సమర్పించి; బంధుజన= బంధువులతోనూ; సేనా= సైన్యంతోనూ; సమేతులు+ఐనవారలకున్= కూడినవారైన బలరామకృష్ణులకు; తూర్ణంబునన్= సత్వరమే; సకల= అన్నిరకాల; సంపత్+పరిపూర్ణంబులు+ఐన= సంపదలతో నిండినవైన; నివేశంబులు= విడిది ఇళ్లను; కల్పించి= కలిగింపచేసి; విడియించెన్= విడిది చేయించాడు; ఇట్లు= ఈ విధంగా; కూడిన= కలిసిన; రాజులకున్+ఎల్లను= రాజులకు అందరికీ; వయస్+వీర్యబలవిత్తంబులు= వయస్సు, ప్రతాపం, శక్తి, ధనసంపద; ఎట్లు+అట్ల= ఎంతగా తగ్గిందో అంతగా; కోరినపదార్థంబులు+ఎల్లన్= అడిగిన పదార్థాలనన్నింటిని; ఇప్పించి= ఇప్పింపజేసి; పూజించెన్= గౌరవించాడు; అంతన్= తరువాత; విదర్భపురంబు ప్రజలు= విదర్భనగరపౌరులు;

హరిరాక విని= కృష్ణుడు వచ్చినవిషయం విని; వచ్చి చూచి= అక్కడికి వచ్చి దర్శించి; నేత్ర+అంజలులన్= కండ్ల అనే దోసిళ్లతో; తదీయ= ఆ శ్రీకృష్ణుని; వదనకమలమధుపానంబు= ముఖమనే పద్మంలోని మకరందాన్ని తాగడం; చేయుచున్= చేస్తూ... (ఇలా అన్నారు)

**తా :** ఇలా పలికి రుక్మిణి చేతులు జోడించి నమస్కరించింది. తర్వాత, ఆమెతండ్రి భీష్మకుడు తనకూతురుపెళ్లికి బలరామకృష్ణులు వచ్చారని విన్నాడు. వెంటనే మంగళవాద్యాలధ్వనులతో వారికి ఎదురుగా వెళ్లి, ఆహ్వానించాడు. వారికి మధుపర్కం సమర్పించి గౌరవించాడు. వాళ్లకు వస్త్రాలూ, నగలూ కానుకలుగా ఇచ్చాడు. బంధువులతోనూ, సైన్యంతోనూ వచ్చిన ఆ బలరామకృష్ణులకు అన్నిరకాల సౌకర్యాలతోనూ ఉన్న విడిదిగృహాలను ఏర్పాటు చేశాడు. ఇలాగే ఈ ఉత్సవానికి ఎందరో రాజులు వచ్చారు. వాళ్లు వయసులోనూ, ప్రతాపంలోనూ, శక్తిలోనూ, ధనసంపదలలోనూ గొప్పవాళ్లు. కనుక వాళ్ల వాళ్ల హోదాలకు తగిన రీతిలో, రాజు అన్ని పదార్థాలను ఇప్పించి, వాళ్లను గౌరవించాడు. ఇంతలో పెళ్లికి శ్రీకృష్ణుడు వచ్చాడనే వార్త విదర్భనగరప్రజలకు తెలిసింది. ఆయన్ను చూడాలని వాళ్లు వచ్చారు. తమ కళ్లు అనే దోసిళ్లతో ఆయన ముఖపద్మంలోని మకరందాన్ని ఆస్వాదిస్తూ (వాళ్లు ఇలా అన్నారు.)

**మ. తగు నీచక్రి విదర్భరాజసుతకుం; దథ్యంబు వైదర్భియుం**
**దగు నీచక్రికి; నింతమంచి దగునే? దాంపత్య మీ యిద్దఱిం**
**దగులం గట్టిన బ్రహ్మ నేర్పరి గదా! దర్పాహతారాతియై**
**మగఁడౌ గావుతఁ జక్రి యీ రమణికిన్ మా పుణ్యమూలంబునన్. 1740**

**ప్రతి :** ఈ చక్రి= చక్రాయుధం కలిగిన ఈ శ్రీకృష్ణుడు; విదర్భరాజసుతకున్= విదర్భరాజుకూతురైన రుక్మిణీదేవికి; తగున్= తగినవాడు; తథ్యంబు= ఇది నిజం; వైదర్భియున్= విదర్భరాకుమార్తె రుక్మిణికూడా; ఈ చక్రికిన్= ఈ శ్రీకృష్ణునికి; తగున్= తగింది; దాంపత్యము= భార్యాభర్తల సహజీవనం; ఇంతమంచిది+అగునే= ఇంతకంటె అందంగా ఉంటుందా?; ఈ ఇద్దఱిన్= ఈ రుక్మిణీశ్రీకృష్ణులను; తగులన్+కట్టిన= జతకలిపిన; బ్రహ్మ= సృష్టికర్త అయిన బ్రహ్మ; నేర్పరిగదా= నైపుణ్యమున్నవాడు కదా!; మాపుణ్యమూలంబునన్= మేము చేసుకున్న పుణ్యంవల్ల; దర్ప+ఆహత+అరాతి+ఐ= తన ప్రతాపంచేత శత్రువులను దెబ్బతీసినవాడై; ఈ రమణికిన్= ఈ అందాలరాశి రుక్మిణికి; చక్రి= శ్రీకృష్ణుడు; మగఁడు+ఔన్+కావుతన్= భర్త అగుగాక!

**తా :** చక్రాన్ని ఆయుధంగా కల ఈ శ్రీకృష్ణుడు విదర్భరాజకుమారికి తగినవాడు. అలాగే విదర్భరాజపుత్రికూడా శ్రీకృష్ణునికి సరైన జోడు. భార్యభర్తల జత ఇంత అందంగా ఉంటుందా? ఈ ఇద్దరినీ జతకూర్చిన బ్రహ్మ మంచినేర్పరి కదా! శత్రువుల గర్వాన్ని అణచివేసి, శ్రీకృష్ణుడు ఈ అందాలరాశికి మగడు కావాలి. మా పుణ్యఫలంవల్ల వీరిద్దరూ దంపతులు అగుదురుగాక!

**విశే :** జనం వచ్చింది శ్రీకృష్ణుణ్ణి చూడాలని. కానీ చూస్తున్నది రుక్మిణీ కృష్ణులను. ఎంత మంచిజంట అంటున్నారు. పైగా ఇలాంటి జంటను కూర్చిన బ్రహ్మ 'నేర్పరి' అంటున్నారు. వీళ్లపెళ్లి మా పుణ్యఫలం. ఈ వేడుకను చూడడం మా భాగ్యం అనుకోవడంలో భక్తి, ప్రేమలు పెనవేసుకున్నాయి.

**వ. అని పలికి రా సమయంబున. 1741**

**ప్రతి :** అని= ఈ విధంగా; పలికిరి= అన్నారు; ఆ సమయంబునన్= ఆ సమయంలో...

**తా :** ఈ విధంగా అందరూ అన్నారు. ఆ సమయంలో

సీ. సన్నద్ధులై బహుశస్త్రసమేతులై బలసి చుట్టును వీరభటులు గొలువ
ముందట నుపహారములు గానుకలుఁ గొంచు వర్గంబులై వారవనిత లేఁగఁ
బుష్పగంధాంబరభూషణకలితలై పాడుచు భూసురభార్య లరుగఁ
బణవమర్దలశంఖపటహకాహళవేణుభేరీధ్వనుల మిన్ను పిక్కటిలఁగఁ

ఆ. దగిలి సఖులు గొలువఁ దల్లులు బాంధవ, సతులుఁ దోడ రాఁగ సవినయముగ
నగరు వెడలి నడచె నగజాతకును మ్రొక్క, బాల చికురపిహితఫాల యగుచు. **1742**

**ప్రతి :** సన్నద్ధులు+ఐ= ఎలాంటి ప్రమాదమెదురైనా ఎదుర్కోవడానికి సంసిద్ధులై; బహు= అనేక; శస్త్రసమేతులు+ఐ= ఆయుధాలను ధరించినవారై; బలసి= కమ్ముకుని; చుట్టును= అన్నివైపులా; వీరభటులు= పరాక్రమం కలిగిన సేవకులు; కొలువన్= సేవిస్తుండగా; ముందటన్= ముందువైపు; ఉపహారములు= నైవేద్యాలు; కానుకలున్= ముడుపులును; కొంచున్= తీసుకొని; వర్గంబులు+ఐ= గుంపులుకట్టి; వారవనితలు= వేశ్యలు; ఏఁగన్= వెళుతుండగా; పుష్ప= పూలు; గంధ= చందనం; అంబర= వస్త్రాలు; భూషణ= ఆభరణాలు; కలితలు+ఐ= మున్నగు వీటితో కూడినవాళ్లై; పాడుచున్= పాటలు పాడుతూ; భూసురభార్యలు= బ్రాహ్మణుల సతులైన ముత్తైదువలు; అరుఁగన్= వెంట వెళ్లుతుండగా; పణవ= చిన్న తప్పెట్ల (ఉడుక); మర్దళ= మద్దెల; శంఖ= శంఖం; పటహ= పెద్ద తప్పెట; కాహళ= బాకా; వేణు= పిల్లనగ్రోవి; భేరీ= నగారా; ధ్వనులన్= ధ్వనులతో; మిన్ను= ఆకాశం; పిక్కటిలన్+కన్= నిండిపోతుండగా; తగిలి= వెంట ఉండి; సఖులు= చెలికత్తెలు; కొల్వన్= సేవిస్తుండగా; తల్లులు; బాంధవసతులు= బంధువర్గానికి చెందిన స్త్రీలు; తోడరాన్+కన్= వెంట వస్తుండగా; నగజాతకును= పార్వతీదేవికి; మ్రొక్కన్= నమస్కరించడానికి; బాల= కన్య అయిన రుక్మిణీదేవి; చికుర= ముంగురులచే; పిహిత= కప్పబడిన; ఫాల= నుదురు గలది; అగుచున్= అవుతూ; సవినయము+కన్= వినయంతో; నగరు= అంతఃపురంనుండి; వెడలి= బయలుదేరి; నడచెన్= నడిచింది

**తా :** పెళ్లిమంటపంనుంచి రుక్మిణి బయలుదేరింది. ఊరిబయట ఉన్న పార్వతీదేవిఆలయానికి వెళుతూంది. ఎలాంటి ప్రమాదపరిస్థితి ఎదురైనా సరే, ఎదుర్కొని పోరాడడానికి ఆమెకు రక్షణగా చాలమంది భటులు బయలుదేరారు. వాళ్ల చేతుల్లో రకరకాల ఆయుధాలు ఉన్నాయి. ఇంతటి రక్షణమధ్య, ముందువైపు గుంపులుగా వేశ్యలు వెళ్తున్నారు. వాళ్ల చేతుల్లో నైవేద్యాలు, ముడుపులు ఉన్నాయి. వాళ్ల అలా వెళ్తుండగా, బ్రాహ్మణసువాసినులు పూలు, గంధం, మంచి వస్త్రాలు, నగలు కలిగినవాళ్లై, మంగళప్రదమైన పాటలుపాడుతూ నడిచారు. ఉడుక, మద్దెల, శంఖం, తప్పెట, బాకా, పిల్లనగ్రోవి, భేరి మొదలైన వాద్యాల ధ్వనులు హోరెత్తించి, ఆకాశమంతా అలముకున్నాయి. చెలికత్తెలు తనను సేవిస్తుండగా, తనను పెంచిన తల్లులు, బంధువుల భార్యలు వెంటరాగా; నుదుట ముంగురులతో కన్యరుక్మిణి పార్వతీదేవికి మొక్కడానికి వినయంగా అంతఃపురంనుండి వెడలి నడిచింది. ఆ రుక్మిణి నుదురును ముంగురులు కప్పేస్తున్నాయి.

**వ. మఱియు సూతమాగధవందిగాయకపాఠకజను లంతంత నభినందించుచుం జనుదేర మందగమనంబున, ముకుందచరణారవిందంబులు డెందంబునం దలంచుచు నిందుధరసుందరీ మందిరంబు సేరి సలిలధారాధౌతకరచరణారవిందయై వార్చి శుచియై, గౌరీసమీపంబునకుం జనియె; నంత ముత్తైదువలగు భూసురోత్తముల భార్యలు భవసహితయైన భవానికి మజ్జనంబు గావించి గంధాక్షతంబు లిడి,**

**వస్త్రమాల్యభూషణాదుల నలంకరించి, ధూపదీపంబు లొసంగి, నానావిధోపహారంబులు సమర్పించి, కానుక లిచ్చి, దీపమాలికల నివాళించి రుక్మిణీదేవిని మ్రొక్కించి రప్పుడు. 1743**

**ప్రతి :** మఱియున్= తరువాత; సూత= రాజు సంపాదించిన కీర్తిని గురించి చెప్పేవాళ్లు; మాగధ= రాజ వంశవీర్యాదులను పొగడి జీవించువాళ్లు; వంది= రాజును పొగడేవాళ్లు; గాయక= జయగీతాలను పాడేవాళ్లు; పాఠక జనులు= రాజవంశం గురించి చదివేవాళ్లు అయిన; జనులు= జనం; అంతన్+అంతన్= కొంచెం దూరంగా ఉండి; అభినందించుచున్= ప్రశంసిస్తూ; చనుదేరన్= వెంట వస్తుండగా; మందగమనంబునన్= నెమ్మదిగా నడుస్తూ; ముకుంద= శ్రీకృష్ణుని; చరణ+అరవిందంబులు= పాదపద్మాలను; డెందంబునన్= మనస్సులో; తలంచుచున్= స్మరిస్తూ; ఇందుధరసుందరీమందిరంబున్= చంద్రుని తలపైధరించిన శివుని భార్య అయిన పార్వతీదేవిఆలయాన్ని; చేరి; సలిలధారా= నీళ్లధారలచేత; ధౌత= శుభ్రం చేసుకోబడిన; కర చరణ+ అరవిందంబులు= పద్మాలవంటి కాళ్లు చేతులు కలదై; వార్చి= ఆచమించి; శుచి+ఐ= శుద్ధురాలై; గౌరీసమీపంబునకున్= పార్వతీదేవి దగ్గరికి; చనియెన్= వెళ్లింది; అంతన్= అంతలో; ముత్తైదువలు+అగు= ముత్తైదువలైన; భూసుర+ఉత్తములభార్యలు= ఉత్తములైన బ్రాహ్మణుల సతులు; భవసహిత+ఐన= శివునితో కూడుకొని ఉన్న; భవానికిన్= పార్వతీదేవికి; మజ్జనంబు= అభిషేకం; కావించి= చేయించి; గంధ+అక్షతంబులు+ఇడి= గంధాక్షతలను; ఇడి= సమర్పించి వస్త్ర= బట్టలతోనూ; మాల్య= పూలతోను; భూషణ+ఆదులన్= నగలు మొదలైన వాటితోను; అలంకరించి= అలంకారంచేసి; ధూప= పరిమళధూపాన్ని; దీపంబులు= దీపాలను; ఒసంగి= సమర్పించి; నానావిధ= రకరకాలైన; ఉపహారంబులు= నైవేద్యాలను; సమర్పించి= అర్పించి; కానుకలు+ఇచ్చి= కానుకలను; ఇచ్చి; దీపమాలికలన్= దీపాలవరుసతో; నివాళించి= హారతులిచ్చి; అప్పుడు= ఆ సమయంలో; రుక్మిణీదేవిని= పెళ్లికూతురైన రుక్మిణీదేవితో; మ్రొక్కించిరి= మొక్కింపజేశారు.

**తా :** రుక్మిణీదేవి గౌరీఆలయానికి వస్తూ ఉంది. ఆమెవెంట సూతులు, వందిమాగధులు, గాయకులు, పాఠకజనం వస్తున్నారు. వాళ్లు ఆమె వంశకీర్తినీ, ప్రతాపాన్నీ, వంశాన్ని గురించి ప్రశంసిస్తున్నారు. అలా అందరూ వెంటవస్తూ ఉండగా ఆమె నెమ్మదిగా నడుస్తూన్నది. శ్రీకృష్ణునిపాదకమలాలను మనసులో స్మరిస్తూ పార్వతిదేవిగుడికి చేరింది. కాళ్లూ చేతులూ నీటిధారలతో శుభ్రం చేసుకున్నది. ఆచమనం చేసి శుచియై గౌరీదేవిదగ్గరకు వెళ్లింది. అపుడు బ్రాహ్మణ ముత్తైదువలు శివునితో కూడిన పార్వతికి అభిషేకం చేయించారు. గంధాక్షతలను సమర్పించారు. వస్త్రాలతో, పుష్పాలతో, నగలతో అలంకరింపజేశారు. ధూపదీపాలను ఇచ్చారు. రకరకాలైన నైవేద్యాలను నివేదింపజేశారు. కానుకల అర్పించారు. దీపమాలికలతో హారతులెత్తినారు. పిదప రుక్మిణీదేవితో దుర్గాదేవికి మొక్కింపచేశారు. అప్పుడు

**ఉ. నమ్మితి నా మనంబున సనాతనులైన యుమామహేశులన్**
**మిమ్ముఁ బురాణదంపతుల మేలు భజింతు గదమ్మ! మేటి పె**
**ద్దమ్మ దయాంబురాశివి గదమ్మ హరిం బతి సేయు మమ్మ నిన్**
**నమ్మినవారి కెన్నఁడును నాశము లేదు గదమ్మ యీశ్వరీ! 1744**

**ప్రతి :** ఈశ్వరీ= సర్వశక్తిమంతురాలవైన ఓ గౌరీదేవీ!; సనాతనులు+ఐన= శాశ్వతులైన; ఉమామహేశులన్= ఉమా మహేశ్వరులను; పురాణదంపతులన్= ఆదిదంపతులైన; మిమ్మున్= మిమ్ములను; నా మనంబునన్= నా మనస్సులో; నమ్మితిన్= నమ్ముకున్నాను; మేలు= మంచి జరగాలని; భజింతున్= భక్తితో వేడుకుంటున్నాను; కద+అమ్మ= కద అమ్మా; మేటి పెద్ద+అమ్మ= అందరికీ పూజనీయురాలవైన పెద్దతల్లివి; దయా+అంబురాశివి= దయకు సముద్రంటాంటిదానివి;

కద+అమ్మ= కదమ్మా!; హరిన్= శ్రీకృష్ణుణ్ణి; పతిన్+చేయుము= భర్తను కావించు; అమ్మ= అమ్మా; నిన్= నిన్ను; నమ్మినవారికిన్= నమ్ముకున్నవాళ్లకు; ఎన్నఁడును= ఎప్పటికీ; నాశము లేదు కద+అమ్మ= నాశనం లేదు కదమ్మా!;

**తా :** సర్వశక్తిమంతురాలివైన గౌరీదేవి! ఎప్పటికీ ఉండే పురాతనదంపతులైన ఉమామహేశ్వరులు మీరు. మిమ్ములను పూజిస్తున్నాను. అమ్మా! మంచి చేకూర్చు. నీవు అందరికీ పూజనీయురాలివి. దయకు సముద్రంలాంటి దానివి కదమ్మా! శ్రీకృష్ణుణ్ణి నాకు భర్తగా చేయమ్మా! నిన్ను నమ్ముకున్నవారికి నష్టమనేది లేదుకదమ్మా!

**విశే :** 'సదాభవః సదాతనః సనాతన శ్చ' – నాశనం లేనిది సనాతనం. సనాతునులైన ఆదిదంపతులు పార్వతీపరమేశ్వరులు. వారిని ప్రార్థిస్తున్న, రుక్మిణి. 'ఉమా' శబ్దప్రయోగంతో తనను రక్షించుమని వేడుకుంటున్న. 'అవతీత్యుమా' రక్షించేది ఉమ. పద్యమంతటా 'అమ్మా' అని పిలుస్తున్నట్లే ఉంది. పైగా ప్రాసాక్షరం ద్విత్వమకారం కావడంతో శిశువు తల్లి వెంటబడి వెళుతూ'అమ్మా అమ్మా' అని వేడుకుంటున్నట్లే ఉంది.

**వ. అని గౌరీదేవికి మ్రొక్కి పతులతోడం గూడిన బ్రాహ్మణభార్యలకు లవణాపూపంబులును, దాంబూల కంఠసూత్రంబులును, నిక్షుదండంబులు నిచ్చి రుక్మిణీదేవి వారలం బూజించిన. 1745**

**ప్రతి :** అని= ఈ విధంగా అంటూ; గౌరీదేవికిన్= పార్వతీదేవికి; మ్రొక్కి= నమస్కరించి; పతులతోడన్= తమభర్తలతోఉన్న; బ్రాహ్మణభార్యలకున్= బ్రాహ్మణులసతులైన ముత్తైదువలకు; లవణ= ఉప్పుతోకూడిన; అపూపంబులునున్= పిండివంటలూ; తాంబూల= తాంబూలం; కంఠసూత్రంబులునున్= మెడలో వేసుకునే పసుపుదారాలూ; ఇక్షుదండంబులున్= చెఱకుగడలు; ఇచ్చి; రుక్మిణీదేవి= రుక్మిణి; వారలన్= వాళ్లను; పూజించినన్= భక్తితో గౌరవించగా...

**తా :** ఈ విధంగా పలికి, పార్వతీదేవికి ఆమె మొక్కింది. ఆ తర్వాత పతీసమేతంగా ఉన్న బ్రాహ్మణముత్తైదువలకు ఉప్పుతోకూడిన పిండివంటలు, తాంబూలం, మెడలో వేసుకునే పసుపు దారాలూ, చెఱకుగడలు ఇచ్చి, రుక్మిణీదేవివాళ్లను భక్తితో పూజించింది.

**ఆ. వార లుత్సహించి వలనొప్ప దీవించి, సేస లిడిరి యువతిశిరమునందు;**
**సేస లెల్లఁ దాల్చి శివవల్లభకు మ్రొక్కి, మౌననియతి మాని మగువ వెడలె. 1746**

**ప్రతి :** వారలు= ఆ ముత్తైదువలు; ఉత్సహించి= ఉప్పొంగిపోయి; వలను+ఒప్పన్= బాగా; దీవించి= దీవెనలిచ్చి; సేసలు+ఇడిరి= అక్షతలు వేశారు; యువతి= రుక్మిణీదేవి; శిరమున+అందున్= తలమీద; సేసలు+ఎల్లన్= అక్షతలనన్నిటినీ; తాల్చి= ధరించి; శివవల్లభకున్= శివుని భార్యయైన పార్వతికి; మ్రొక్కి= నమస్కారంచేసి; మౌననియతిన్= మౌనవ్రతాన్ని; మాని= చాలించి; మగువ= రుక్మిణీదేవి; వెడలెన్= గుడినుండి బయటకు వెళ్లింది.

**తా :** ఆ ముత్తైదువలు సంతోషంతో పొంగిపోయారు. మనసారా దీవించారు. అక్షతలు వేశారు. రుక్మిణీదేవి తన తలపై అక్షతలను ధరించి, పరమశివునిసతి పార్వతిదేవికి మొక్కింది. మౌనవ్రతాన్ని చాలించి మందిరంనుండి బయటకు వెళ్లింది.

**వ. ఇట్లు మేఘమధ్యంబు వెలువడి విలసించు క్రొక్కారు మెఱుంగుతెఱంగున, మృగధరమండలంబు నిర్గమించి చరించుమృగంబు చందంబునఁ, గమలభవ నర్తకుం డెత్తిన జవనిక మఱుఁగు దెరలి పొడసూపిన మోహినీదేవతకైవడి, దేవదానవసంఘాతకరతలసవ్యాపసవ్యసమాకృష్యమాణపన్నగేంద్రపాశపరివలయిత పర్యాయపరిభ్రాంతమందరాచలమంథానమథ్యమానఘూర్ణిత ఘుమఘుమాయిత మహార్ణవమధ్యంబున నుండి**

**చనుదెంచు నిందిరాసుందరీవైభవంబున, బహువిధప్రభాభాసమానయై, యిందుధర సుందరీమందిరంబు వెడలి మానసకాసారహేమకమలకాననవిహరమాణమత్తమరాళంబు భంగి, మందగమనంబునఁ గనకకలశయుగళసంకాశకర్కశపయోధరభారపరికంప్యమానమధ్యయై, రత్నముద్రికాలంకృతం బైన కెంగేల నొక్క సఖీలలామంబు కైదండ గొని, రత్ననివహసముదంచితకాంచనకర్ణపత్త్రమయూఖంబులు గండభాగంబుల నర్తనంబులు సలుప, నరవిందపరిమళకుతూహలావతీర్ణ మత్తమధుకరంబుల మాడ్కి నరాళంబులైన కుంతలజాలంబులు ముఖమండలంబునఁ గ్రందుకొన, సుందర మందహాసరోచులు దిశలందు బాలచంద్రికాసౌందర్యంబు నావహింప, నధరబింబఫలారుణ మరీచిమాలికలు రదనకుందకుట్మలంబుల కనురాగంబు సంపాదింప, మనోజాతకేతనసన్నిభంబైన పయ్యెదకొంగు దూఁగ, సువర్ణమేఖలాఘటిత మణికిరణపటలంబు లకాలశక్రచాపజనకంబులై మెఱయఁ, జెఱకువిలుతుం డొఱవెఱికి వాఁడి యిడి జళిపించిన ధగద్ధగాయమానంబు లగు బాణంబుల పగిది, సురుచిరవిలోకననికరంబులు రాజవీరులహృదయంబులు భేదింప, శింజానమంజుమంజీర నినదంబులు చెవుల పండువులు సేయఁ, బాదసంచారంబున హరిరాక కెదురుచూచుచు, వీరమోహినియై చనుదెంచుసమయంబున. 1747**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; మేఘమధ్యంబు= మేఘాల నడుమనుండి; వెలువడి= బయటకువచ్చి; విలసించు= ప్రకాశించే; క్రొక్కారుమెఱుంగుతెఱంగునన్= తొలకరి వానాకాలంనాటి మెరుపువలె; మృగధర మండలంబు= చంద్రునిమండలంనుంచి; నిర్గమించి= వెలువడి; చరించు= తిరిగే; మృగంబుచందంబునన్= జింకవలె; కమలభవ నర్తకుండు= బ్రహ్మ అనే నటుడు; ఎత్తిన= పైకెత్తిన; జవనిక= తెర; మఱుఁగు= చాటును; తెరలి= వీడి; పొడసూపిన= కనిపించిన; మోహినీదేవతకైవడిన్= జగత్తును సమ్మోహంలో ముంచెత్తే దేవతవలె; దేవ= దేవతల; దానవ= రాక్షసుల; సంఘాత= సమూహంయొక్క; కరతల= చేతులతో; సవ్య+అపసవ్య= అటూ ఇటూ; (కుడి ఎడమలకు); సమాకృష్యమాణ= లాగబడుతున్న; పన్నగ+ఇంద్ర= పాములలో గొప్పదైన వాసుకి అనే; పాశ= తాడుచే; పరివలయిత= బాగాచుట్టబడిన; పర్యాయ= పద్ధతిప్రకారం; పరిభ్రాంత= తిరుగుతున్న; మందర+అచల= మందరం అనే పేరున్న కొండ అనే; మంథాన= కవ్వంతో; మథ్యమాన= చిలకబడుతున్నందువల్ల; ఘూర్ణిత= తిరుగుడు పడుతున్న; ఘుమఘుమాయిత= ఘుమఘుమ ధ్వనులతో కూడిన; మహా+అర్ణవ= గొప్పసముద్రంయొక్క; మధ్యంబునన్+ఉండి= నడుమనుండి; చనుదెంచు= వస్తున్న; ఇందిరాసుందరీ= లక్ష్మీదేవి; వైభవంబునన్= వైభవంతో; బహువిధ= రకరకాలైన; ప్రభా= కాంతులతో; భాసమాన+ఐ= వెలుగులీనుతున్నదై; ఇందుధరసుందరీమందిరంబు= (చంద్రుని ధరించిన) శివుడికి భార్య అయిన పార్వతీదేవి గుడిని; వెడలి= వీడి; మానసకాసార= మానససరస్సులోని; హేమకమల కానన= స్వర్ణ పద్మారణ్యంలో; విహరమాణ= విహరించే; మత్తమరాళంబు భంగిన్= మదించిన హంసవలె; మందగమనంబునన్= మెల్లని నడకతో; కనకకలశయుగళ సంకాశ= బంగారుకుండల జంటవంటి; కర్కశ= కఠినమైన; పయస్+ధర= స్తనాలయొక్క; భార= బరువువల్ల; పరికంప్యమాన= తూలియాడుతున్న; మధ్య+ఐ= నడుముకలదై; రత్నముద్రికా+అలంకృతంబు+ఐన= రత్నాలు పొదిగిన ఉంగరాలచే సింగారించబడిన; కెంపు+కేలన్= ఎర్రని చేతితో; ఒక్క= ఒక; సఖీలలామంబు= ఇష్టసఖులలో శ్రేష్ఠురాలియొక్క; కైదండన్+కొని= చేతిని ఆసరాగా పట్టుకుని; రత్ననివహ= మణులసమూహంచేత; సముదంచిత= ఒప్పుచున్న; కాంచన= బంగారు; కర్ణపత్ర= చెవిలోలాకులయొక్క; మయూఖంబులు= కిరణాలు; గండభాగంబులన్= చెక్కిళ్లపై; నర్తనంబులు= చిందులు; సలుపన్= వేస్తూండగా; అరవింద= పద్మాల; పరిమళ= సువాసనలపై; కుతూహల= ఇష్టంతో; అవతీర్ణ= క్రిందికి

దిగిన; మత్తమధుకరంబుల మాడ్కిన్= మదించిన తుమ్మెదలవలె; అరాళంబులు+ఐన= ఉంగరాలు తిరిగిన; కుంతల జాలంబులు= ముంగురుల సమూహం; ముఖమండలంబునన్= గుండ్రనిముఖంమీద; క్రందుకొనన్= కమ్ముకోగా; సుందర= అందమైన; మందహాసరోచులు= చిరునవ్వుల కాంతులు; దిశల+అందున్= దిక్కులలో; బాలచంద్రికా సౌందర్యంబున్= లేతవెన్నెలల సొగసును; ఆవహింపన్= కలిగించగా; అధర బింబఫల= దొండపండువంటి పెదవియొక్క; అరుణ= ఎర్రని; మరీచిమాలికలు= వెలుగుల వరుసలు; రదన= పండ్లు అనే; కుందకుట్మలంబుకున్= మొల్లమొగ్గలకు; అనురాగంబు= ఎరుపురంగును; సంపాదింపన్= కలిగించగా; మనస్+జాత= మన్మథుని; కేతనసన్నిభంబు+ఐన= పతాకంవలె; పయ్యెదకొంగు= పైట చెంగు; తూఁగన్= తూగాడుచుండగా, వ్రేలాడుచుండగా; సువర్ణమేఖలా= బంగారు మొలత్రాడుకు; ఘటిత= కూర్చబడిన; మణి= మణులయొక్క; కిరణపటలంబులు= కాంతులసమూహాలు; అకాల= కాలంకానికాలంలో; శక్రచాప= ఇంద్రధనుస్సును; జనకంబులు+ఐ= పుట్టిస్తున్నవై; మెఱయన్= తళతళమని వెలిగిపోతుండగా; చెఱకువిలుతుండు= చెఱకును ధనుస్సుగా కలిగిన మన్మథుడు; ఒఱవెఱికి= ఒరనుండి పైకి తీసి; వాఁడి+ఇడి= పదునుపెట్టి; జళిపించిన= భయపెట్టిన; ధగద్ధగాయమానంబులు+అగు= ధగధగ వెలిగిపోతున్న; బాణంబుల పగిది= బాణాలవలె; పగిది= లాగా; సురుచిర= అందమైన; విలోకన నికరంబులు= చూపులు; రాజవీరుల= వీరులైన రాజుల; హృదయంబులు= మనస్సులను; భేదింపన్= చెండివేయగా; శింజాన= మువ్వలతో ఉన్న; మంజు= అందమైన; మంజీర= అందెల; నినదంబులు= సవ్వడులు; చెవుల పండువులు= చెవులకు విందులు; చేయన్= కలిగించగా; పాదసంచారంబునన్= కాలినడకతో; హరిరాకకున్= శ్రీకృష్ణుడి రాకకోసం; ఎదురుచూచుచున్= ఎదురుచూస్తూ; వీరమోహిని+ఐ= వీరులను మోహింపచేసేదై; చనుదెంచు= వస్తున్న; సమయంబునన్= సమయంలో...

**తా :** ఈ విధంగా వస్తున్న రుక్మిణి మేఘాల మధ్యనుండి వెలువడిన తొలకరి వర్షాకాలపు మెరుపుతీగలా మెరుస్తున్నది. చంద్రబింబంనుండి బయటికి వచ్చి తిరుగుతున్న జింకవలె ఉంది. బ్రహ్మదేవుడు అనే నటుడు నాటకరంగంలోని తెర పైకి ఎత్తితే రంగంమీద ప్రత్యక్షమైన మోహినీదేవతవలె ఉంది. దేవతలు, రాక్షసులు ఒకానొకప్పుడు మందరపర్వతాన్ని కవ్వంగా చేసుకుని, వాసుకి అనే పామును తాడుగా చుట్టి అటూ ఇటూ లాగి పాలసముద్రాన్ని చిలికారు. ఆ సమయంలో ఘుమఘుమ అని శబ్దం చేస్తున్న సముద్రంనుండి పుట్టిన లక్ష్మీదేవిలా ఉంది – రుక్మిణి. రకరకాల నగలు ధరించి రుక్మిణి ప్రకాశిస్తూంది. మెల్లగా గౌరీదేవ్యాలయంనుండి బయటికి వచ్చింది. మానససరస్సులో బంగారు తామరపూల మధ్య విహరిస్తున్న రాజహంసలా ఉంది. పసిడికుండలజంటను పోలిన కఠిన వక్షోజాల బరువుతో ఆమె నడుము వణకిపోతున్నది. ఆమెచేతులకు ఉంగరాలున్నాయి. వాటిపై రత్నాలు పొదగబడి ఉన్నాయి. అలాంటి ఎర్రటిచేతులతో ఒక ఇష్టసఖిచేతిని ఆసరాగా పట్టుకుంది. రుక్మిణిచెవులకు బంగారు లోలాకులున్నాయి. వాటివెలుగులకిరణాలు ఆమెచెక్కిళ్లపై పడి మెరుస్తున్నాయి. ఉంగరాల ముంగురులు ఆమెముఖంమీద తారాడుతున్నాయి. అది పద్మాలపరిమళాలపై ఆసక్తితో గండుతుమ్మెదలు మూగుతున్నట్లుంది. ఆమె అందంగా చిరునవ్వు నవ్వుతున్నది. ఆ నవ్వుల వెలుగులు దిక్కులంతటా లేత వెన్నెలకాంతులతో నింపుతున్నాయి. ఆమెపెదవులు దొండపండ్లవలె ఎర్రగా ఉన్నాయి. పలువరుస మొల్లమొగ్గల్లా ఉన్నాయి. పెదవుల ఎరుపు సోకి పలువరసకు ఎరుపువన్నె కలుగుతోంది. కదులుతున్న పైట మన్మథుని పతాకంలా ఉంది. మొలనూళ్లపై ఉన్న మణులు మెరుస్తున్నాయి. ఆ మెరుపులు అకాలంలో హరివిల్లును సృష్టిస్తున్నాయి. మన్మథుడు ఒరనుండి పైకితీసి సానపెట్టిన – మెరుస్తున్న బాణాలవలె ఆమెచూపులు వాడిగా ఉన్నాయి. అవి రాజవీరుల హృదయాలను ముక్కలు చేస్తున్నాయి. కాలిమువ్వలసవ్వడి కమనీయంగా ఉండి, చెవులకు విందు చేస్తున్నాయి. అలా ఉండే ఆమె శ్రీకృష్ణునికోసం ఎదురుచూస్తూ కాలినడకతో వస్తున్నది.

**మ. అలినీలాలకఁ బూర్ణచంద్రముఖి నేణాక్షిం బ్రవాళాధరం**
**గలకంఠిన్ నవపల్లవాంఘ్రియుగళన్ గంధేభకుంభస్తనిం**
**బులినశ్రోణి నిభేంద్రయాన నరుణాంభోజాతహస్తన్ మహో**
**త్పలగంధిన్ మృగరాజమధ్యఁ గని విభ్రాంతాత్ములై రందఱున్. 1748**

**ప్రతి :** అలి= తుమ్మెదలవంటి; నీల+అలకన్= నల్లని ముంగురులు గలిగింది; పూర్ణచంద్రముఖిన్= నిండు చంద్రునివంటి ముఖం కలిగినది; ఏణ+అక్షిన్= జింకకన్నులవంటి కండ్లు కలిగినది; ప్రవాళ+అధరన్= పగడంవలె ఎర్రనైన పెదవి కలిగింది; కలకంఠిన్= తియ్యని కంఠస్వరం కలిగినది; నవపల్లవ+అంఘ్రియుగళన్= కొత్తచిగురుటాకువంటి అడుగులజంట కలిగింది; గంధ+ఇభ కుంభస్తనిన్= మదించిన ఏనుగుకుంభస్థలాలవంటి వక్షోజాలు కలిగింది; పులినశ్రోణిన్= ఇసుక దిబ్బలనుపోలిన పిరుదులు కలిగింది; ఇభ+ఇంద్రయానన్= ఉత్తమమైన ఏనుగునడకవంటి నడక కలిగింది; అరుణ+అంభస్+జాతహస్తన్= ఎర్రని తామరలవంటి చేతులు కలిగింది; మహా+ఉత్పలగంధిన్= గొప్ప తామరపూలవాసనతో పరిమళించే శరీరం కలిగింది; మృగరాజమధ్యన్= సింహం నడుమువంటి సన్నని నడుము కలిగింది; కని= (అయిన రుక్మిణిని) చూచి; అందఱున్= అక్కడ ఉన్న వారందరూ; విభ్రాంత+ఆత్ములు+ఐరి= ఆశ్చర్యంతోకూడిన మనస్సుకలవారయ్యారు.

**తా :** రుక్మిణికురులు తుమ్మెదలవలె నల్లగా ఉన్నాయి. ముఖం చంద్రబింబంలా ఉంది. ఆమెచూపులు జింక చూపులవలె ఉన్నాయి. పెదవి పగడంవలె అరుణవర్ణంలో ఒప్పారుతూ ఉంది. కంఠస్వరం అవ్యక్తమధురంగా ఉంది. కొత్త చిగురుటాకులవలె ఆమె పాదాలజంట శోభిస్తున్నది. మదించిన ఏనుగుకుంభస్థలాలవలె వక్షోజాలున్నాయి. పిరుదులు ఇసుకతిన్నెలవలె ఉన్నాయి. ఆమెనడకగజరాజగమనాన్ని పోలి ఉంది. చేతులు ఎర్రతామరలను పోలి ఉన్నాయి. ఆమె శరీరంనుండి పద్మాల పరిమళం వెలువడుతున్నది. ఆమె నడుము సింహం నడుమువలె సన్నగా ఉంది. ఇలాంటి సౌందర్యంతో ఉన్న రుక్మిణిని అక్కడ ఉన్న వారందరూ చూచి ఆశ్చర్య మనస్కులయ్యారు.

**వ. మఱియు న య్యింతి దరహాసలజ్జావలోకనంబులం జిత్తంబు లేమఱి ధైర్యంబు దిగనాడి, గాంభీర్యంబులు విడిచి, గౌరవంబులు మఱచి, చేష్టలు మాని, యెఱుక లుడిగి, యాయుధంబులు దిగవైచి గజతురగరథా రోహణంబులు సేయనేరక, రాజులెల్ల నేలకు వ్రాలి; రా యేణీలోచన తన వామకరనఖంబుల నలకంబులు దలఁగం ద్రోయుచు నుత్తరీయంబు సక్కనొత్తుచుఁ గడగంటిచూపులం గ్రమంబున నా రాజలోకంబు నాలోకింపుచు. 1749**

**ప్రతి :** మఱియున్= అంతేకాకుండా; ఆ+ఇంతి= ఆమె; దరహాస= చిరునవ్వుతోను; లజ్జ= సిగ్గుతోను కూడిన; అవలోకనంబులన్= చూపులవల్ల; చిత్తంబులు+ఏమఱి= మనస్సులను మరచిపోయి; ధైర్యంబున్= ధైర్యాన్ని; దిగన్+ఆడి= వదిలిపెట్టి; గాంభీర్యంబులు= గంభీరభావాలను; విడిచి= విడిచిపెట్టి; గౌరవంబులు= గొప్పతనాలు; మఱచి= మరచిపోయి; చేష్టలుమాని= కదలికలు మానేసి; ఎఱుకలు+ఉడిగి= తెలివి మాలినవారై; ఆయుధంబులు= ఆయుధాలను; దిగవైచి= జారవిడిచి; గజ= ఏనుగులను; తురగ= గుర్రాలను; రథ= తేరులను; ఆరోహణంబులు చేయనేరక= ఎక్కలేక; రాజులు+ఎల్లన్= రాజులందరూ; నేలకున్ వ్రాలిరి= నేలకు వాలిపోయారు; ఆ ఏణీలోచన= ఆ జింక కన్నులవంటి కన్నులున్న రుక్మిణి; తన వామకర= ఎడమచేతి; నఖంబులన్= గోళ్లతో; అలకంబులు= ముంగురులను; తలఁగన్+త్రోయుచున్= పైకి ఎగదోసుకుంటూ;

ఉత్తరీయంబున్= పైటను; చక్కన్+ఒత్తుచున్= సరిచేసుకుంటూ; కడకంటి చూపులన్=వాలుచూపులతో; క్రమంబునన్= వరుసగా; ఆ రాజలోకంబున్= ఆ రాజుల సమూహాన్ని; ఆలోకింపుచున్= చూస్తూ...

**తా :** అంతేకాదు, ఆ రుక్మిణి చిరునవ్వును, సిగ్గుతోకూడిన చూపులను, చూచి ఆ రాజలోకానికి మనసులు చలించాయి. ధైర్యం జారిపోయింది. తమ పెద్దరికాలను విడిచిపెట్టారు. తాము గొప్పవాళ్లమనే విషయాన్ని మరచిపోయారు. చేతలు ఉడిగిపోయారు. బుద్ధి పని చేయలేదు. ఆయుధాలను పడేశారు. ఏనుగులను, గుర్రాలను, రథాలను ఎక్కకుండా రాజులందరూ నేలకు వాలారు. ఆ జింక కన్నులవంటి కన్నులున్న రుక్మిణి తన ఎడమచేతి గోళ్లతో ముంగురులను ఎగదోసుకుంటూ, పైటను సవరించుకుంటూ ఆ రాజలోకాన్ని కడగంటిచూపులతో చూస్తూ

**మ. కనియెన్ రుక్మిణి చంద్రమండలముఖుం గంఠీరవేంద్రావ ల**
**గ్ను నవాంభోజదళాక్షుఁ జారుతరవక్షున్ మేఘసంకాశ దే**
**హు నగారాతిగజేంద్రహస్తనిభబాహుం జక్రిఁ బీతాంబరున్**
**ఘనభూషాన్వితుఁ గంబుకంఠు విజయోత్కంఠున్ జగన్మోహనున్. 1750**

**ప్రతి :** చంద్రమండలముఖున్= చంద్రబింబంవలె అందమైన ముఖం కలవాడిని; కంఠీరవ+ఇంద్ర+అవలగ్నున్= శ్రేష్ఠమైన సింహం నడుమువంటి నడుమున్నవాడిని; నవ+అంభోజదళ+అక్షున్= కొత్త తామరరేకులవంటి కండ్లున్నవాడిని; చారుతర= రమణీయమైన; వక్షున్= వక్షఃస్థలం కలవాడిని; మేఘసంకాశ= మేఘాన్ని పోలిన వన్నెగల; దేహున్= శరీరమున్నవాడిని; నగ+అరాతి= కొండలకు శత్రువైన ఇంద్రుని; గజ+ఇంద్ర= (ఇంద్రవాహనం) ఐరావతంయొక్క; హస్తనిభ= తొండంతో పోల్చదగిన; బాహున్= చేతులు కలవాడిని; చక్రిన్= చక్రాన్ని ఆయుధంగా కలవాడిని; పీత+అంబరున్= పసుపువన్నెగల పట్టువస్త్రం కలవాడిని; ఘనభూష+అన్వితున్= గొప్ప ఆభరణాలతో కూడినవాడిని; కంబు= శంఖంవంటి; కంఠున్= మెడ కలిగినవాడిని; విజయ+ఉత్కంఠున్= గెలుపు సాధించాలనే ఆసక్తితో ఉన్నవాడిని; జగత్+మోహనున్= లోకాన్ని సమ్మోహపరచేవాడిని; (అయిన శ్రీకృష్ణుణ్ణి) రుక్మిణి= రుక్మిణీదేవి; కనియెన్= దర్శించింది.

**తా :** రుక్మిణి శ్రీకృష్ణుణి దర్శించింది. ఆయన చంద్రబింబంలాగా చల్లని వెలుగులీనుతున్న ముఖంతో ఉన్నాడు. శ్రేష్ఠమైన సింహం నడుమువంటి సన్నని నడుముతో ఉన్నాడు. క్రొత్తగా అప్పుడే విచ్చుకున్న తామర పూలరేకులవలె ఆయనకళ్లు ఉన్నాయి. ఆయనవక్షం చూడసొంపుగా ఉంది. మేఘం వన్నెలాంటి వన్నెతో ఆయన శరీరం ప్రకాశిస్తూంది. కొండలకు శత్రువైన ఇంద్రుని ఏనుగు – ఐరావతంయొక్క తొండంవలె బలిష్ఠంగా శ్రీకృష్ణుడిచేతులు ఉన్నాయి. అతడు చక్రాయుధంతో ఉన్నాడు. పసుపుపచ్చని పట్టువస్త్రాన్ని ధరించి ఉన్నాడు. గొప్పనగలతో అలంకరింపబడి ఉన్నాడు. ఆయనకంఠం శంఖంవలె అందంగా ఉంది. గెలుపు సాధించాలనే ఆసక్తితో ఉన్నాడు. ప్రపంచాన్ని సమ్మోహపరుస్తున్నాడు.

## ❖ శ్రీకృష్ణుఁడు శత్రురాజులు చూచుచుండ రుక్మిణీదేవిని గొనిపోవుట ❖

**వ. కని తదీయ రూపవయోలావణ్య వైభవగాంభీర్యచాతుర్యతేజోవిశేషంబులకు సంతసించి, మనోభవ శరాక్రాంతయై రథారోహణంబు గోరుచున్న వరారోహం జూచి, పరిపంథిరాజలోకంబు సూచుచుండ మందగమనంబున గంధసింధురంబు లీలం జనుదెంచి ఘేరవంబుల నడిమిభాగంబు గొనిచను కంఠీరవంబు**

**కైవడి నిఖిలభూపాలగణంబుల గణింపక తృణీకరించి రాజకన్యకం దెచ్చి హరి తనరథంబుమీఁద నిడికొని భూనభోంతరాళంబులు నిండ శంఖంబు పూరించుచు బలభద్రుండు తోడ నడవ యాదవవాహినీ పరివృతుండై ద్వారకానగరమార్గంబు వట్టి చనియె; నంత జరాసంధవశులయినరాజులందరు హరిపరాక్రమంబు విని, సహింప నోపక. 1751**

**ప్రతి :** కని= దర్శించి; తదీయ= ఆ శ్రీకృష్ణుని; రూప= రూపానికి; వయస్= వయసుకు; లావణ్య= మెరుస్తున్న శరీరకాంతికి; వైభవ= వైభవానికి; గాంభీర్య= గంభీరస్వభావానికి; చాతుర్య= నేర్పరితనానికి; తేజస్= కాంతియొక్క; విశేషంబులకున్= మొదలైన అపురూపవిషయాలకు; సంతసించి= సంతోషపడి; మనస్+భవ= మన్మథుని; శర+ఆక్రాంత+ఐ= బాణాలకు గురియై; రథ+ఆరోహణంబు= తేరును ఎక్కడం; కోరుచున్న= కోరుకుంటున్న; వర+ఆరోహన్+చూచి= అందమైన పిరుదులున్న ఆమెను చూచి; హరి= శ్రీకృష్ణుడు; పరిపంథిరాజలోకంబు= శత్రురాజుల సమూహం; చూచుచున్+ఉండన్= చూస్తుండగా; మందగమనంబునన్= మెల్లనినడకతో; గంధసింధురంబులీలన్= మదించిన ఏనుగువలె; చనుదెంచి= వచ్చి; ఫేరవంబుల= నక్కల; నడిమిభాగంబు= మధ్యగలమాంసాన్ని; కొని చను= తీసుకుని వెళ్లే; కంఠీరవంబుకైవడిన్= సింహంవలె; నిఖిలభూపాలగణంబులన్= సకలరాజలోకాన్ని; గణింపక= లెక్కచేయక; తృణీకరించి= తిరస్కరించి; రాజకన్యకన్= రాజకుమార్తె అయిన రుక్మిణిని; తెచ్చి= తీసుకొనివచ్చి; హరి= శ్రీకృష్ణుడు; తన రథంబుమీఁదన్= తన రథంమీద; ఇడికొని= పెట్టుకొని; భూ నభస్+అంతరాళంబులు= భూమ్యాకాశాలు; నిండన్= నిండిపోయే విధంగా; శంఖంబు= పాంచజన్యశంఖాన్ని; పూరించుచున్= ఊదుతూ; బలభద్రుండు= బలరాముడు; తోడన్+నడవన్= వెంట రాగా; యాదవవాహినీ= యాదవసైన్యంచే; పరివృతుండు+ఐ= చుట్టుకొనబడినవాడై; ద్వారకానగర= ద్వారకా నగరంయొక్క; మార్గంబున్+పట్టి= దారిని అనుసరించి; చనియెన్= వెళ్లాడు; అంతన్= అపుడు; జరాసంధవశులు+అయిన= జరాసంధునికి లోబడిన; రాజులు+అందరు= భూపాలకులందరూ; హరి= శ్రీకృష్ణుని; పరాక్రమంబు= విక్రమాన్ని గురించి; విని; సహింపన్+ఓపక= సహించలేక, తట్టుకోలేక...

**తా :** ఆ రుక్మిణి శ్రీకృష్ణుని అందమైన ఆకృతిని చూచింది. ఆయనవయసునూ, శరీరపుమిసిమినీ, వైభవాన్ని, గంభీర స్వభావాన్నీ, నేర్పరితనాన్నీ, కాంతినీ మొదలైన విశేషాలను గమనించింది. సంతోషించింది. ఆమె మన్మథబాణాలకు గురి అయింది. తన రథాన్ని ఎక్కాలని ఆశపడుతున్న రుక్మిణిని శ్రీకృష్ణుడు చూచి శత్రురాజసమూహం చూస్తూండగా నక్కల మధ్యఉన్న మాంసభాగాన్ని సింహం ఎలా తెచ్చుకుంటుందో, అలా శ్రీకృష్ణుడు రుక్మిణిని తెచ్చి, అక్కడున్న రాజలోకాన్ని లెక్క చేయకుండా తన రథంమీద ఎక్కించుకున్నాడు. భూమ్యాకాశాలు నిండిపోయే విధంగా అతడు పాంచజన్య శంఖం పూరించాడు. వెంట బలరాముడు వస్తుండగా ద్వారకానగరంవైపు రథాన్ని మళ్లించాడు. ఆ సమయంలో జరాసంధుడికి లొంగిఉన్న రాజులందరూ శ్రీకృష్ణుని ప్రతాపాన్నిగురించి విని భరించలేక

**మ. ఘనసింహంబులకీర్తి నీచమృగముల్ గైకొన్నచందంబునన్**
**మనకీర్తుల్ గొని బాలఁ దోడ్కొనుచు నున్మాదంబుతో గోపకుల్**
**సనుచున్నా రదె? శౌర్య మెన్నటికి? మీ శస్త్రాస్త్రముల్ గాల్పనే?**
**తనుమధ్యన్ విడిపింపమేని నగరే ధాత్రీజనుల్ క్రంతలన్. 1752**

**ప్రతి :** ఘనసింహంబుల= గొప్పసింహాలయొక్క; కీర్తి= గొప్పకీర్తిని (గొప్పతనాన్ని); నీచమృగముల్= అల్పమైన పశువులు (జింకల్లాంటివి); కైకొన్న= చేజిక్కించుకున్న; చందంబునన్= విధంగా; మనకీర్తుల్= మన యశస్సులను; కొని= తీసుకుని;

బాలన్= కన్యకను (రుక్మిణిని) అది+ఎ= అదిగో అటుచూడండి; ఉన్మాదంబుతో= కావరంబుతో; గోపకుల్= గొల్లవాళ్లు; చనుచున్+ఉన్నారు= వెళుతున్నారు; శౌర్యము= మన ప్రతాపం; ఎన్నటికి= ఎప్పుడు చూపాలి?; మీ= మీయొక్క; శస్త్ర= ఖడ్గంవంటి ఆయుధాలు; అస్త్రముల్= మంత్రపూరితమైన ఆయుధాలు; కాల్పన్+ఏ= తగులబెట్టడానికా?; తనుమధ్యన్= (సన్నని నడుముకల) రుక్మిణిని; విడిపింపము+ఏనిన్= వాళ్లనుండి విడిపించలేకపోతే; ధాత్రీజనుల్= ప్రజలు; క్రంతలన్= సందుల గొందుల్లో; నగరే= నవ్వుకోరా?

**తా :** గొప్పసింహాలకు చెందిన కీర్తిని పనికిరాని నీచమృగాలు దొంగిలించుకుని పోయినట్లు ఈ గోపాలురు మనకీర్తిని, కొల్లగొట్టి మన కన్యను ఎత్తుకుని, అదిగో కావరంతో వెళుతున్నారు. ఇప్పుడు కాకపోతే ప్రతాపాలు ఇక ఎప్పుడు చూపాలి? మీ దగ్గర ఉన్న శస్త్రాలూ, అస్త్రాలూ ఎందుకు? తగలబెట్టడానికా? ఆ రుక్మిణిని వాళ్లబారినుండి విడిపించలేకపోతే ప్రజలు ఏమనుకుంటారు? సందుల్లో, గొందుల్లో చేరి మనగురించి చెప్పుకుని నవ్వుకోరా? (తప్పకుండా నవ్వుకొంటారని భావం)

**వ. అని యొండొరులం దెలుపుకొని, రోషంబులు హృదయంబుల నిలుపుకొని, సంరంభించి, తనుత్రాణంబుల వహించి, ధనురాదిసాధనంబులు ధరియించి, పంతంబు లాడి, తమ తమ చతురంగబలంబులం గూడికొని, జరాసంధాదులు యదువీరుల వెంటనంటి, తాఁకి నిలు నిలుండని ధిక్కరించి పలికి యుక్కు మిగిలి, మహీధరంబుల మీఁద సలిలధారలు గురియు ధారాధరంబులచందంబున బాణవర్షంబులు గురిసిన యాదవసేనలం గల దండనాయకులు కోదండంబు లెక్కిడి, గుణంబులు మ్రోయించి, నిలువంబడి రప్పుడు. 1753**

**ప్రతి :** అని= ఇలా పలుకుతూ; ఒండు+ఒరులన్= ఒకరు మరొకరికి; తెలుపుకొని= తెలియజెప్పుకుని; రోషంబులు= కోపావేశాల్ని; హృదయంబులన్= మనస్సులలో; నిలుపుకొని= ఉంచుకుని; సంరంభించి= తొందరపడి; తనుత్రాణంబులు= కవచాల్ని; వహించి= తొడుక్కొని; ధనుస్+ఆది= విల్లు మొదలైన; సాధనంబులు= ఆయుధాలను; ధరియించి= వెంటతీసుకుని; పంతంబులు+ఆడి= ప్రతిజ్ఞలుచేసి; తమతమ= తమకు సంబంధించిన; చతుర్+అంగబలంబులన్= రథ, గజ, తురగ పదాతిదళాలు అనే నాలుగురకాల సేనాబలాల్ని; కూడికొని= కలుపుకుని; జరాసంధ+ఆదులు= జరాసంధుడు మొదలైనవాళ్లు; యదువీరులవెంటన్+అంటి= యాదవవీరుల వెంబడించి; తాఁకి= ఎదుర్కొని; నిలు నిలుండు+అని= నిలబడండి నిలబడండి అంటూ; ధిక్కరించి పలికిన్= ఎదిరించి పలుకుతూ; ఉక్కుమిగిలి= బలంతో చెలరేగి; మహీధరంబులమీఁదన్= కొండలమీద; సలిలధారలు= జలధారలు; కురియు= కురిపించే; ధారాధరంబులచందంబునన్= మేఘాలవలె; బాణవర్షంబులు= శరవర్షాలు; కురిసినన్= కురిపించగా; యాదవసేనలన్+కల= యాదవసైన్యంలో ఉన్న; దండనాయకులు= సేనాధిపతులు; కోదండంబులు= ధనుస్సులు; ఎక్కు+ఇడి= ఎక్కుపెట్టి; గుణంబులు మ్రోయించి= వింటినారులను మోగించి; నిలువన్+పడిరి= నిలబడ్డారు; అప్పుడు= ఆ సమయంలో...

**తా :** అని పలుకుతూ ఒకరినొకరు హెచ్చరించుకుంటూ రాజులు మనసుల్లో కోపావేశాల్ని నిలుపుకున్నారు. ఆటోపంతో, కవచాల్ని ధరించి, ధనుస్సు మొదలైన ఆయుధాలను వెంటతీసుకొని వెళ్లారు. ప్రతిజ్ఞలు చేస్తూ, తమతమ రథగజ తురగపదాతులైన సైన్యాల్ని వెంట తీసుకుని 'జరాసంధుడువంటివాళ్లు యాదవవీరుల వెంటపడ్డారు. వాళ్లను చేరి 'నిలబడండి నిలబడండి' అని ఎదిరించి పలికారు. బలంతో చెలరేగిపోయారు. కొండలమీద వానచినుకులు కురిపించే మేఘాలవలె యాదవసేనమీద రాజులు బాణాలను కురిపించారు. యాదవసేనానాయకులు ధనుస్సులను ఎక్కుపెట్టి, అల్లెత్రాళ్లను మోగిస్తూ, నిలబడ్డారు. అప్పుడు–

**క. అరిబలభటసాయకముల, హరిబలములు గప్పఁబడిన నడరెడు భీతిన్**
**హరిమధ్య సిగ్గుతోడను, హరివదనముఁ జూచెఁ జకితహరిణేక్షణయై. 1754**

**ప్రతి :** అరిబల= శత్రువుల సేనలోని; భటు= సైనికులయొక్క; సాయకములన్= బాణాలచే; హరిబలములు= శ్రీకృష్ణునిసేన; కప్పఁబడినన్= మూసికొనిపోగా; అడరెడుభీతిన్= ఎక్కువవుతున్న భయంతో; హరిమధ్య= సింహం నడుమువంటి నడుంకల రుక్మిణి; చకిత= బెదిరిన; హరిణ+ఈక్షణ+ఐ= జింక చూపులవంటి చూపులు కలదై; సిగ్గుతోడను= సిగ్గుతో; హరివదనమున్= శ్రీకృష్ణుని ముఖాన్ని; చూచెన్= చూచింది.

**తా :** శత్రువులు శ్రీకృష్ణుని సేనలను బాణాలతో కప్పివేయడం చూచి ఎక్కువగా భయపడి సింహంనడుమువంటి నడుమున్న రుక్మిణీదేవి సిగ్గుతో బెదిరిన జింక చూపులవంటి చూపులతో శ్రీకృష్ణుడిని ముఖంవైపు చూచింది.

**వ. ఇట్లు చూచిన. 1755**

**ప్రతి :** ఇట్లు= ఇలా; చూచినన్= చూడగా...

**తా :** ఇలా రుక్మిణీదేవి చూస్తుండగా

**క. చొచ్చెద రదె యదువీరులు, వ్రచ్చెద రరిసేన నెల్ల వైరులు పెలుచున్**
**నొచ్చెదరును విచ్చెదరును, జచ్చెదరును నేఁడు చూడు జలజాతాక్షీ! 1756**

**ప్రతి :** జలజాత+అక్షీ= కమలనయనా! రుక్మిణీ!; అది+ఎ= అదిగో; యదువీరులు= యాదవవీరులు; చొచ్చెదరు= వస్తున్నారు; అరిసేనన్+ఎల్లన్= శత్రువుల సైన్యాన్నంతటినీ; వ్రచ్చెదరు= చీల్చేస్తారు; వైరులు= శత్రువులు; నేఁడు= ఈ రోజు; పెలుచన్= బాగా; నొచ్చెదరును= నొప్పిపడతారు; విచ్చెదరును= చెల్లాచెదరైపోతారు; చచ్చెదరును= చచ్చిపోతారు కూడా; చూడు= చూస్తూ ఉండు.

**తా :** కలువవంటి కన్నులుగల రుక్మిణీ! అదిగో యాదవవీరులు వచ్చేస్తున్నారు. శత్రుసైన్యాన్నంతటినీ ముక్కలు ముక్కలుగా విరిచిపడేస్తారు. ఈ రోజు శత్రువులు బాగా దెబ్బతింటారు. చెల్లాచెదరైపోతారు. చచ్చిపోతారుకూడా. చూస్తూ ఉండు.

**వ. అని రుక్మిణీదేవిని హరి యూఱడించె; నంత బలభద్రప్రముఖులైనయదువీరులు ప్రళయవేళల మిన్నునం బన్ని బలుపిడుగు లడరించు పెనుమొగిళులవడువున జరాసంధాదిపరిపంథిరాజచక్రంబుమీఁద నవక్రపరాక్రమంబున శిఖిశిఖాసంకాశనిశితశిలీముఖనారాచభల్ల ప్రముఖంబులైన బహువిధ బాణపరంపరలు గురియ, నదియును విదళితమత్తమాతంగంబును, విచ్ఛిన్నతురంగంబును, విభిన్న రథవరూథంబును, వినిహత పదాతియూథంబును, విఖండితవాహవారణరథారోహణమస్తకంబును, విశకలితవక్షోమధ్యకర్ణకంఠ కపోలహస్తంబును, వికీర్ణ కేశజాలంబును, విపాటితచరణజానుజంఘంబును, విదళిత దంతసంఘంబును, విఘటిత వీరమంజీర కేయూరంబును, విభ్రష్ట కుండల కిరీట హారంబును, విస్మృతవీరాలాపంబును, విదార్యమాణగదాకుంతతోమరపరశుపట్టిసప్రాసకరవాలశూలచక్రచాపంబును, వినిపాతిత కేతనచామరచ్ఛత్రంబును, విలూనతనుత్రాణంబును, వికీర్యమాణఘోటకసంఘరింఖాసముద్ధాత**

**ధరణీపరాగంబును, వినష్టరథవేగంబును, వినివారితసూతమాగధవందివాదంబును, వికుంఠితహయహేషాపటహభాంకార, కరటిఘటాఘీంకార, రథనేమిఘటాత్కార, తురగనాభిఘంటాఘణఘణాత్కార, వీరహుంకారభూషణఝుణఝుణాత్కార, నిస్సాణధణధణాత్కార, మణినూపురక్రేంకార, కింకిణీగణకిణాత్కార, శింజినీటంకార, భటపరస్పరధిక్కారనాదంబును, వినిర్భిద్యమాన రాజసమూహంబును, విద్యమానరక్తప్రవాహంబును, విశ్రూయమాణభూతబేతాళకలకలంబును, విజృంభమాణ ఫేరవకాకకంకాది సంకులంబును, బ్రచలితకబంధంబును, బ్రభూతపలలగంధంబును, ప్రదీపిత మేదోమాంసరుధిర ఖాదంబును, బ్రవర్తితడాకినీ ప్రమోదంబునునై యుండె; నప్పుడు. 1757**

**ప్రతి :** అని= ఈ విధంగా చెప్పి; రుక్మిణీదేవిని= అప్పటిదాకా బెదరిపోయి ఉన్న రుక్మిణీదేవిని; హరి= శ్రీకృష్ణుడు; ఊఱడించెన్= సాంత్వనపరిచాడు; అంతన్= అంతలో; బలభద్రప్రముఖులు+ఐన= బలరాముడు మొదలైన వారితో ఉన్న; యదువీరులు= యాదవవీరులు; ప్రళయవేళలన్= ప్రళయం ముంచుకొని వచ్చే వేళలలో; మిన్నునన్= ఆకాశంలో; పన్ని= వ్యాపించి; బలుపిడుగులు+అడరించు= భయంకరమైన పిడుగుపాటులను కలిగించే; పెనుమొగిళుల= విస్తారమైన మబ్బుల; వడువునన్= రీతిలో; జరాసంధ+ఆది= జరాసంధుడు మొదలైన; పరిపంథిరాజచక్రంబు మీఁదన్= శత్రురాజుల సమూహంమీద; అవక్రపరాక్రమంబునన్= మొక్కవోనివీరత్వంతో; శిఖిశిఖాసంకాశ= అగ్నిజ్వాలలవంటి; నిశిత= పదునైన; శిలీముఖ= ఉక్కుమొనలు ఉన్న; నారాచ= సన్నని పొడవైన బాణాలు; భల్ల= బల్లెములు; ప్రముఖంబులు+ఐన= మొదలైన; బహువిధ= రకరకాల; బాణపరంపరలు= బాణాలను వర్షంవలె; కురియన్= కురిపించగా; అదియును= ఆ సైన్యం; విదళిత= నరకబడిన; మత్తమాతంగంబును= మదపుటేనుగులతోనూ; విచ్ఛిన్న= ముక్కలుగా చేయబడ్డ; తురంగంబును= గుర్రాలతో ఉన్నదీ; విభిన్న= రూపుచెడిన; రథవరూథంబను= రథాల పైకప్పులున్నదిగానూ; వినిహత= దెబ్బతిని పడిన; పదాతియూథంబును= కాల్బలంతో ఉన్నదీ; విఖండిత= నరకబడిన; వాహ= గుర్రాల్ని; వారణ= ఏనుగుల్ని; రథ= రథాల్ని; ఆరోహణమస్తకంబును= ఎక్కిన వీరుల తలలు కలిగింది; విశకలిత= ముక్కలైన; వక్షస్= రొమ్ములు; మధ్య= నడుములు; కర్ణ= చెవులు; కంఠ= మెడలు; కపోల= చెక్కిళ్లు; హస్తంబును= చేతులతో ఉన్నదీ; వికీర్ణ= (నేలపైన) పరచుకున్న; కేశజాలంబును= వెంట్రుకలతోనూ; విపాటిత= విరచబడిన; చరణ= కాళ్లు; జాను= మోకాళ్లు; జంఘంబును= పిక్కలతో ఉన్నదీ; విదళిత= రాల్చబడిన; దంతసంఘంబును= పలువరసల కుప్పలున్నదీ; విఘటిత= ముక్కలుగా విడదీయబడిన; వీరమంజీర= వీరులు ధరించిన మంజీరాలు; కేయూరంబును= భుజకీర్తులు కలిగిందీ; విభ్రష్ట= పాడైపోయిన; కుండల= చెవికమ్మలు; కిరీట= కిరీటాలు; హారంబును= హారాలు కలదీ; విస్మృత= మూగపోయిన; వీర+ఆలాపంబును= వీరుల సింహనాదాలు కలదీ; విదార్యమాణ= ముక్కలుగా చేయబడిన; గదా= గదలు; కుంత= ఈటెలు; తోమర= చిల్లకోలలు; పరశు= గండ్రగొడ్డళ్లు; పట్టిస= పొడవైన పట్టాకత్తులు; ప్రాస= బల్లెములు; కరవాల= కత్తులు; శూల= శూలాలు; చక్ర= చక్రాలు; చాపంబును= ధనుస్సులు ఉన్నదీ; వినిపాతత= కిందపడిన; కేతన= పతాకాలు; చామర= చామరాలు; ఛత్రంబును= గొడుగులు ఉన్నదీ; విలూన= చీల్చబడిన; తనుత్రాణంబును= కవచాలు ఉన్నదీ; వికీర్యమాణ= చెల్లాచెదరు చేయబడిన; ఘోటకసంఘ= గుర్రాల గుంపుల; రింఖా= డెక్కలనుంచి; సముద్ధూత= చెలరేగుతున్న; ధరణీపరాగంబును= నేలనుంచి లేస్తున్న దుమ్ముతోనూ; వినష్ట= ఆగిపోయిన; రథవేగంబును= రథాల గమనవేగం కలదీ; వినివారిత= కట్టువడిన; సూత= సూతుల; మాగధ= మాగధుల; వంది= వైతాళికుల; వాదంబును= స్తోత్రపాఠాలతోనూ; వికుంఠిత= అణగిపోయిన; హయహేషా= గుర్రాల సకిలింతలు; పటహభాంకార= తప్పెటల మోతలూ; కరటిఘటా= ఏనుగుల గుంపుల; ఘీంకార= 'ఘీ' అనే శబ్దాలతో; రథనేమి= రథచక్రాలకుండే కమ్ములు;

ఘటాత్కార= ఘటఘట శబ్దాలతో; తురగనాభిఘంటా= గుర్రాల బొడ్డులకు పక్కగా వ్రేలాడుతున్న గంటల; ఘణఘణాత్కార= ఘణఘణ శబ్దాలతో; వీరహుంకార= వీరభటులు 'హుం' అని విజృంభిస్తున్నశబ్దాలతో; భూషణ= నగలయొక్క; ఝణఝణాత్కార= ఝణఝణశబ్దాలతో; నిస్సాణ= భేరీ వాద్యాల; ధణధణాత్కార= ధణధణ మోతలతో; మణినూపుర= మణులు పొదిగిన కాలి అందెల; క్రేంకార= 'క్రేం' అనే శబ్దాలతో; కింకిణీగణ= మువ్వల కుప్పల; కిణాత్కార= కిణ కిణ అనే శబ్దాలతో; శింజినీటంకార= అల్లెతాళ్ల 'టం' అనే శబ్దాలతో; భట= సైనికుల; పరస్పర= ఒకరినొకరు; ధిక్కారనాదంబును= ఎదిరించుకునే శబ్దాలతో; వినిర్భిద్యమాన= భేదింపబడుతున్న; రాజసమూహంబును= రాజుల గుంపులు కలదీ; విద్యమాన= స్పష్టంగా కనిపిస్తున్న; రక్తప్రవాహంబును= నెత్తురు కాలువలు కలదీ; విశ్రూయమాణ= వినబడుతున్న; భూతబేతాళ= భూతాల పిశాచాల; కలకలంబును= కలకల శబ్దం కలదీ; విజృంభమాణ= చెలరేగిపోతున్న; ఫేరవ= నక్కల; కాక= కాకుల; కంక+ఆది= రాబందులు మొదలైనవాటి; సంకులంబును= గుంపులతో కూడినదీ; ప్రచలిత= కదలాడుతున్న; కబంధంబును= మొండెములున్నదీ; ప్రభూత= పుట్టుకొస్తున్న; పలల= మాంస; గంధంబును= వాసన కలదీ; ప్రదీపిత= వెలుగుతున్న; మేదస్= కొవ్వు; మాంస= మాంసాన్ని; రుధిర= రక్తాన్ని; ఖాదంబును= తినడంలో (తాగడంలో); ప్రవర్తిత= అటూ ఇటూ తిరుగుతున్న; డాకినీ= డాకిని అనే పిశాచాలకు; ప్రమోదంబునున్+ఐ= ఆనందాన్ని కలిగించేదై; ఉండెన్= ఉంది; అప్పుడు= ఆ సమయంలో...

**తా :** అని చెపుతూ శ్రీకృష్ణుడు రుక్మిణీదేవికి సాంత్వన వాక్యాలు పలికాడు. అంతలో బలరాముడు మొదలైన యాదవవీరులు ప్రళయకాలంలో ఆకాశంలో అల్లుకుని పిడుగులు కురిపించే నల్లమబ్బులవలె చెలరేగిపోయారు. శరవర్షం కురిపించారు. జరాసంధుడు మొదలైన శత్రురాజసమూహంమీద మొక్కవోని ప్రతాపంతో అగ్నిజ్వాలల్లాంటి పదునైనఇనుపముక్కుల బాణాలను, బల్లెములు మొదలైన రకరకాల బాణాలను తెరిపి లేకుండా కురిపించారు. ఆ దెబ్బకు సైన్యం కకావికలైంది. మదపుటేనుగులు నరకబడ్డాయి. గుర్రాలు ముక్కలు ముక్కలైపోయాయి. ఎక్కడ చూచినా రథాల పైకప్పులు కుప్పలుగా పడ్డాయి. కాల్బలం దెబ్బతిని పడిపోయింది. గుర్రాలను, ఏనుగులను, రథాలను ఎక్కివస్తున్న వీరుల తలలు తెగి నేలకూలాయి. ముక్కలైపోయిన వక్షాలతోనూ, నడుములతోనూ, చెవులతోనూ, మెడలతోనూ, చెక్కిళ్లతోనూ, చేతులతోనూ రణరంగం భయంకరంగా కనిపించింది. మరణించినవాళ్ల వెండ్రుకలు నేలపై పరచుకుని పడిఉన్నాయి. పాదాలు, మోకాళ్లు, పిక్కలు ముక్కలైపడ్డాయి. వీరులు ధరించిన మంజీరాలు, భుజకీర్తులు విడివిడిగా చెదరిపడ్డాయి. చెవికమ్మలు, కిరీటాలు, హారాలు భ్రష్టమై పడ్డాయి. వీరులప్రలాపాలు వినిపించడం లేదు. గదలు, ఈటెలు, చిల్లకోలలు, గండ్రగొడ్డళ్లు, పట్టాకత్తులు, బల్లెములు, కత్తులు, శూలాలు, చక్రాలు, ధనుస్సులు అన్నీ నడిమికి విరిగి ముక్కలయ్యాయి. రథంపై ఉండే పతాకలు, రాజగౌరవాన్ని చాటే చామరాలు, గొడుగులు నేలకూలాయి. కవచాలు చీల్చబడిన పీలికలైనాయి. గుర్రాలగుంపులు చెల్లాచెదురై పోయాయి. వాటిడెక్కలు తగిలి? నేలనుంచి దుమ్ము రేగింది. అప్పటిదాకా ఉరుకులెత్తిన తేరులవేగం మందగించింది. సూతులు, వంది మాగధులు పొగడడం ఆగిపోయింది. తెరిపిలేకుండా గుర్రాలు సకిలిస్తున్నాయి. తప్పెటలు మోగుతున్నాయి. ఏనుగులగుంపులు 'ఘీ' అని అరుస్తున్నాయి. రథచక్రాలకమ్ములు ఘటఘట శబ్దం చేస్తున్నాయి. గుర్రాలబొడ్డులకు పక్కవేలాడుతున్న గంటలు ఘణఘణ మోగుతున్నాయి. విజృంభించిన వీరభటుల 'హుం'కారాలు వినిపిస్తున్నాయి. యుద్ధం చేస్తున్న వారిఆభరణాలు ఘణఘణ శబ్దం చేస్తున్నాయి. భేరీ వాద్యాలు ధణధణ మోగుతున్నాయి. మణులతో కూడిన కాలిఅందెలు 'క్రేం' కారం చేస్తున్నాయి. మువ్వల కుప్పలు కిణకిణ మోగుతున్నాయి. అల్లెత్రాళ్లు 'టం' అని శబ్దం చేస్తున్నాయి. వీరభటులు ఒకరినొకరు తిరస్కరించుకుంటూ ఎదిరించేధ్వనులు వినిపిస్తున్నాయి. రాజుల గుంపులు భేదింపబడుతున్నాయి. రక్తం కాలువలుగట్టి పారడం కనిపిస్తున్నది. భూతాలు, పిశాచాలు కలకలం సృష్టిస్తున్నాయి. నక్కలు, కాకులు, రాబందులు మొదలైనవి

చెలరేగిపోతున్నాయి. గుంపులుగా ఉన్నాయి. అక్కడక్కడ తలలు తెగిన మొండెములు ఇంకా కదులుతున్నాయి. మాంసం వాసన కమ్ముకుంటున్నది. కొవ్వు, మాంసం తింటూ, రక్తం తాగుతూ డాకినీ పిశాచాలు యుద్ధరంగంలో తిరుగుతూ ఆనందిస్తున్నాయి. అప్పుడు

**చ. మగిడి చలించి పాఱుచును మాగధముఖ్యులు గూడి యొక్కచో**
**వగచుచు నాలిఁ గోల్పడినవానిక్రియన్ గడు వెచ్చనూర్చుచున్**
**మొగమున దప్పిదేరఁ దమ ముందటఁ బొక్కుచు నున్న చైద్యుతోఁ**
**బగతురచేతిలోఁ బడక ప్రాణముతోడుత నున్నవాఁడవే. 1758**

**ప్రతి :** మాగధముఖ్యులు= జరాసంధుడు మొదలైనవాళ్లు; మగిడి= వెనుతిరిగి; చలించి= బెదిరిపోయి; పాఱుచును= పారిపోతూ; ఒక్కచోన్= ఒకచోట; కూడి= సమావేశమై; వగచుచున్= చింతిస్తూ; ఆలిన్= భార్యను; కోల్పడిన వానిక్రియన్= పోగొట్టుకున్న వానివలె; కడువెచ్చన్+ఊర్చుచున్= మిక్కిలి వేడి నిట్టూర్పులు విడుస్తూ; మొగమునన్= ముఖంలో; దప్పి+తేరన్= అలసట కనిపిస్తుండగా; తమముందటన్= తమ ఎదుట; పొక్కుచున్+ఉన్న= దుఃఖిస్తున్న; చైద్యుతోన్= చేదిరాజైన శిశుపాలునితో; పగతురచేతిలోన్= శత్రువులచేతిలో; పడక= పడకుండా; ప్రాణముతోడుతన్= ప్రాణాలతో; ఉన్నవాఁడవు+ఏ= బతికే ఉన్నావు కదా!

**తా :** జరాసంధుడు మొదలైనవాళ్లు శ్రీకృష్ణుని ప్రతాపానికి బెదిరి యుద్ధభూమినుండి వెనుదిరిగి పారిపోయారు. అలా పరిగెత్తుతూ అందరూ ఒకచోట చేరారు. ఎదురుగా శిశుపాలుడు 'భార్యను పోగొట్టుకున్నవానివలె వేడి నిట్టూర్పులు విడుస్తున్నాడు. అతనిముఖం వాడిపోయి ఉంది. అలా ఉన్న శిశుపాలుని చూచి, తక్కినరాజులు శత్రువులచేతిలో పడకుండా ప్రాణాలతో బతికే ఉన్నావు గదా అని ఓదార్చారు.

**వ. అని మఱియును. 1759**

**ప్రతి :** అని= ఈ విధంగా చెప్పి; మఱియునున్= ఇంకా...

**తా :** అని ఈ విధంగా చెప్పినతర్వాత మళ్లీ ఇలా

**ఆ. బ్రతుకవచ్చు నొడలఁ బ్రాణంబు లుండిన, బ్రతుకు గలిగెనేని భార్య గలదు;**
**బ్రతికి తీవు; భార్యపట్టు దైవ మెఱుంగు, వగవ వలదు చైద్య! వలదు వలదు. 1760**

**ప్రతి :** చైద్య= చేదిరాజా! శిశుపాలా!; ఒడలన్= శరీరంలో; ప్రాణంబులు+ఉండినన్= ప్రాణాలుంటే; బ్రతుకవచ్చున్= ఎలాగైనా బతకడానికి వీలుంది; బ్రతుకు కలిగెనేనిన్= అలా బతుకు కలిగి ఉంటే; భార్య కలదు= భార్య ఎక్కడో ఒకచోట దొరుకుతుంది; బ్రతికితి(వి)+ఈవు= నీవు బతికావు చాలు; భార్యపట్టు= భార్య ఎక్కడుందో వెదకడం; దైవము+ఎఱుంగున్= దేవుడికి తెలుసు; వలదు వలదు= వద్దు వద్దు; వగవవలదు= చింతించవద్దు

**తా :** చేదిరాజా శిశుపాలా! శరీరంలో ప్రాణాలంటూ ఉంటే ఎలాగోలా బతకవచ్చు. బతుకు కలిగిందంటే భార్య ఎక్కడో ఒకచోట దొరకక పోదు. నీవు బతికావు. ఇక నీ భార్య ఎక్కడుందన్న విషయం దేవుడికి తెలుసు. నీవు చింతించడం వద్దు వద్దు.

**వ. వినుము. దేహధారి స్వతంత్రుఁడు గాఁడు. జంత్రగానిచేతి జంత్రపుబొమ్మకైవడి నీశ్వరతంత్ర పరాధీనుండై, సుఖదుఃఖంబులందు నర్తనంబులు సలుపు. తొల్లి నేను మథురాపురంబుమీఁదఁ బదియేడు మాఱులు పరాక్రమంబునన్ విడిసి, చక్రిచేత నిర్మూలితబలచక్రుండనై, కామపాలుచేతం బట్టువడి, యీ కృష్ణుండు కరుణతో విడిపించిన వచ్చి, క్రమ్మఱ నిరువదిమూఁ డక్షౌహిణులం గూడికొని, పదునెనిమిదవ మాఱు దాడిచేసి, శత్రువులం దోలి, విజయంబు చేకొంటిని. జయాపజయంబులందు హర్షశోకంబుల నెన్నండును జెంద; నేఁటిదినంబున నీ కృష్ణుని కెదిరి పోర మన రాజలోకంబు లెల్ల నుగ్రాక్షుం గూడుకొని, యెదిరి పోరిన నోడు. ఇంతియ కాక దైవయుక్తంబైన కాలంబునం జేసి, లోకంబులు పరిభ్రమించుచు నుండు; నదియునుం గాక. 1761**

**ప్రతి :** వినుము= విను; దేహధారి= దేహాన్ని ధరించిన జీవి; స్వతంత్రుఁడు గాఁడు= అస్వతంత్రుడు; జంత్రగానిచేతి= మరబొమ్మల్ని ఆడించే వానిచేతిలో; జంత్రము+బొమ్మ కైవడిన్= మరబొమ్మవలె; ఈశ్వరతంత్ర= సృష్టికర్త చేతలకు; పర+అధీనుండు+ఐ= వశుడైపోయి; సుఖదుఃఖంబుల+అందున్= సుఖంలోనూ, దుఃఖంలోనూ; నర్తనంబులు= నటనలు; సలుపున్= చేస్తూ ఉంటాడు; తొల్లి= మునుపు; నేను (జరాసంధుడు); మథురాపురంబుమీఁదన్= మథుర అనే నగరంమీద; పది+ఏడుమాఱులు= పదిహేడుసార్లు; పరాక్రమంబునన్= వీరత్వంతో; విడిసి= దండయాత్ర చేసి; చక్రిచేతన్= చక్రాయుధాన్ని ధరించిన శ్రీకృష్ణునిచేత; నిర్మూలిత= మొత్తం తుడిచిపెట్టబడిన; బలచక్రుండును+ఐ= సేనా సమూహం కలిగినవాడనై; కామపాలు చేతన్= బలరామునిచేత; పట్టువడి= పట్టుకోబడి; ఈ కృష్ణుండు= ఈ కృష్ణుడు; కరుణతోన్= దయతో; విడిపించినన్= విడిపించగా; వచ్చి= తిరిగివచ్చి; క్రమ్మఱన్= మళ్లీ; ఇరువదిమూఁడు= ఇరవైమూడు; అక్షౌహిణులన్= అక్షౌహిణుల సైన్యాన్ని; కూడికొని= సమకూర్చుకొని; పదునెనిమిదవమాఱు= పదునెనిమిదోసారి; దాడిచేసి= దాడి సాగించి; శత్రువులన్+తోలి= శత్రువులను తరిమేసి; విజయంబు చేకొంటిని= గెలుపును సొంతం చేసుకున్నాను; జయ+అపజయంబుల+అందున్= గెలుపు ఓటమి అనే వాటిలో; హర్షశోకంబులన్= సంతోషం దుఃఖం అనే వాటిని; ఎన్నండును= ఎప్పుడు కూడా; చెందన్= పొందను; నేఁటి దినంబునన్= ఈ రోజు; ఈ కృష్ణునికిన్+ఎదిరిపోరన్= శ్రీకృష్ణుడిని ఎదిరించి యుద్ధం చేయడానికి; మనరాజలోకంబులు+ఎల్లన్= మన రాజలసమూహాలన్నీ; ఉగ్ర+అక్షున్+కూడుకొని= శివుడితో కూడి; ఎదిరి పోరినన్= ఎదిరించి పోరాడినా కూడా; ఓడున్= ఓడిపోతాం; ఇంతియకాక= ఇంతే కాకుండా; దైవయుక్తంబు+ఐన= దైవమనే శక్తితోకూడిన; కాలంబునన్+చేసి= కాలం కారణంగా; లోకంబులు= లోకాలు; పరిభ్రమించుచున్+ఉండున్= తిరుగుతూ ఉంటాయి; అదియునున్+కాక= అదీ కాకుండా...

**తా :** శిశుపాలా! వినుమని జరాసంధుడు ఇలా చెప్పాడు. మానవుడు తన ఇష్టాలను తానే తీర్చుకోదగినవాడు కాడు. కీలుబొమ్మల్ని ఆడించే తన చేతిలోని బొమ్మను ఆడించినట్లు ఈశ్వరుడు జీవుణ్ణి ఆడిస్తుంటాడు. ఒకసారి సంతోషిస్తాడు. మరోసారి దుఃఖిస్తాడు. ఇదంతా దైవం ఆడించేఆట. ఇదివరలో నేను మథురానగరంపై పదిహేడుసార్లు దాడిచేశాను. ఏమయింది? శ్రీకృష్ణుడిచక్రాయుధం దెబ్బకు నా సమస్త సైన్యం నేలకూలింది. బలరాముడికి దొరికిపోయాను. అలా పట్టుపడిన నన్ను దయదలచి ఈ కృష్ణుడు విడిపించాడు. నేను మళ్లీ ఇరవైమూడు అక్షౌహిణులు సైన్యాన్ని సమకూర్చుకొని పద్దెనిమిదోసారి దండయాత్ర చేశాను. శత్రువులను తరిమి కొట్టాను. గెలుపు సాధించాను. గెలుపు వస్తే పొంగిపోలేదు. ఓడిపోతే కుంగిపోలేదు. ఈ రోజు మన పరిస్థితిని చూస్తే ఎలా ఉందంటే మన రాజులందరూ మూడోకన్ను ఉన్న ఆ శివునితో కూడి ఎదిరించినా మనం ఓడిపోతాం. అంతేకాదు. కాలం అనేది దైవంచేతిలో ఉంది. కాలంచేత ఈ లోకాలన్నీ తిప్పబడుతుంటాయి. అంతేకాదు.

**మ. తమకుం గాలము మంచిదైన మనలం ద్రైలోక్యవిఖ్యాత వి**
**క్రములం గెల్చిరి యాదవుల్ హరిభుజాగర్వంబునన్ నేఁడు; కా**
**లము మేలై చనుదెంచెనేని మనమున్ లక్షించి విద్వేషులన్**
**సమరక్షోణి జయింత మింతపనికై శంకింప నీ కేటికిన్. 1762**

**ప్రతి :** తమకున్= తమకు (యాదవులకు); కాలము మంచిది+ఐన= కాలం అనుకూలించింది కాబట్టి; త్రైలోక్య విఖ్యాత= ముదులోకాల్లోనూ పేరుపొందిన; విక్రములన్= మహావీరులమైన; మనలన్= మనలను; నేఁడు= ఈ రోజు; హరి= శ్రీకృష్ణుని; భుజాగర్వంబునన్= భుజశక్తిచేత; యాదవుల్= యాదవులు; గెల్చిరి= జయించారు; కాలము= కాలం; మేలు+ఐ+ చనుదెంచెన్+ఏని= ఒకవేళ మనకు అనుకూలించి వచ్చిందంటే; మనమున్= మనం కూడా; లక్షించి= పంతగించి; సమరక్షోణిన్= యుద్ధరంగంలో; విద్వేషులన్= శత్రువులను; జయింతము= గెలుద్దాం; ఇంతపనికిన్+ఐ= ఈ మాత్రం దానికి; శంకింపన్= సందేహపడడం; నీకున్+ఏటికిన్= నీకు ఎందుకు?

**తా :** నేడు ఆ యాదవులకు కాలం అనుకూలంగా ఉంది కాబట్టి, ముల్లోకాల్లోనూ మహావీరులమని పేరుపొందిన మనలను ఈ కృష్ణునిభుజబలంతో గెలువ గలిగారు. ఒకవేళ కాలం మనకు అనుకూలంగా వచ్చిందంటే, సమయం కనిపెట్టి, యుద్ధంలో మనంకూడా శత్రువులను జయించగలం. ఇది చాలా చిన్నవిషయం. ఈ మాత్రందానికి నీవు మనసులో ఏవేవో సందేహాలు పెట్టుకోడం దేనికి?

**వ. అని యిట్లు జరాసంధుండును, నతని యొద్దిరాజులును, శిశుపాలునిపరితాపంబు నివారించి, తమ తమభూములకుం జనిరి. శిశుపాలుండు ననుచరసేనాసమేతుం డయి తన నగరంబునకుం జనియె; నంత రుక్మి యనువాఁడు కృష్ణుండు రాక్షసవివాహంబునం దన చెలియలిం గొనిపోవుటకు సహింపక, యేకాక్షౌహిణీబలంబుతోడ సమరసన్నాహంబునం గృష్ణుని వెనుదగిలి పోవుచుఁ, దన సారథితో నిట్లనియె. 1763**

**ప్రతి :** అని+ఇట్లు= అని ఈ విధంగా; జరాసంధుండునున్= జరాసంధుడును; అతని+ఒద్దిరాజులును= అతనిచెంత ఉండే రాజులును; శిశుపాలుని పరితాపంబున్= శిశుపాలుడి మనోవేదనను; నివారించి= తొలగించి; తమ తమ భూములకున్= తమ తమ దేశాలకు; చనిరి= వెళ్లారు; శిశుపాలుండును= శిశుపాలుడుకూడా; అనుచర= అనుచరులతోనూ; సేనాసమేతుండు+ అయి= సైన్యంతోనూ కూడినవాడై; తన నగరంబునకున్= తన నగరానికి; చనియెన్= వెళ్లాడు; అంతన్= అంతలో; రుక్మి+ అనువాఁడు= రుక్మి అనేవాడు; కృష్ణుండు= శ్రీకృష్ణుడు; రాక్షసవివాహంబునన్= రాక్షస వివాహపద్ధతిలో; తన చెలియలిన్= తన చెల్లెలైన రుక్మిణిని; కొనిపోవుటకున్= తీసుకొనిపోవడాన్ని; సహింపక= ఓర్చుకోలేక; ఏక+అక్షౌహిణీబలంబుతోడన్= ఒక అక్షౌహిణీ సేనతో; సమరసన్నాహంబునన్= యుద్ధప్రయత్నంతో; కృష్ణుని= శ్రీకృష్ణుణ్ణి; వెనుదగిలి= వెన్నాడి; పోవుచున్= వెళుతూ; తన సారథితోన్= తన రథాన్ని నడుపుతున్నవాడితో; ఇట్లు+అనియెన్= ఇట్లన్నాడు.

**తా :** ఈ విధంగా జరాసంధుడు, అతని అనుచరులైన రాజులు శిశుపాలుని మనోవేదనను తొలగించి తిరిగి తమతమ దేశాలకు వెళ్లారు. శిశుపాలుడు కూడా తన సైనికులతోపాటు తన నగరానికి వెళ్లాడు. ఇంతలో రుక్మిణి అన్న అయిన రుక్మి రాక్షసవివాహపద్ధతిలో తన చెల్లెలైనరుక్మిణిని శ్రీకృష్ణుడు అలా తీసుకుపోవడం ఓర్చుకోలేక ఒక అక్షౌహిణీసైన్యాన్ని తీసుకుని యుద్ధప్రయత్నంతో శ్రీకృష్ణుణ్ణి వెంబడిస్తూ తన సారథితో ఇలా అన్నాడు.

**ఉ. బల్లిదు నన్ను భీష్మజనపాలకుమారునిఁ జిన్నఁ జేసి నా**
**చెల్లెలి రుక్మిణిం గొనుచుఁ జిక్కని నిక్కపు బంటువోలె నీ**
**గొల్లఁడు వోయెడిన్; రథముఁ గూడఁగఁ దోలుము; తేజితోల్లస**
**ద్భల్లపరంపరన్ మదముఁ బాపెదఁ జూపెద నా ప్రతాపమున్. 1764**

**ప్రతి :** బల్లిదున్= శక్తిమంతుణ్ణీ; భీష్మజనపాలకుమారునిన్= భీష్మకమహారాజు పుత్రుణ్ణీ అయిన; నన్నున్= నన్ను; చిన్నన్+చేసి= చిన్నపిల్లవానివలె చులకనచేసి; నా చెల్లెలి రుక్మిణిన్= నా చెల్లెలైన రుక్మిణిని; కొనుచున్= తీసుకుని; చిక్కని నిక్కము+బంటు+పోలెన్= మిక్కిలి అసహాయశూరునివలె; ఈ గొల్లఁడు= ఈ గొల్లవాడు; పోయెడిన్= వెళుతున్నాడు; రథమున్= రథాన్ని; కూడన్+కన్+తోలుము= దగ్గరగా పోనివ్వు; తేజిత+ఉల్లసత్= పదును కలిగి ప్రకాశిస్తున్న; భల్లపరంపరన్= బల్లెముల వరుసతో; మదమున్+పాపెదన్= పొగరు అణచివేస్తాను; నా ప్రతాపమున్= నా పరాక్రమాన్ని; చూపెదన్= చూపిస్తాను;

**తా :** నేను భీష్మకుడనే మహారాజుపుత్రుణ్ణి. మహాబలవంతుణ్ణి. అలాంటి నన్ను చిన్న పిల్లవానివలె చులకన చేసి, నా చెల్లెలైన రుక్మిణిని తీసుకుని ఏదో పెద్ద అసహాయశూరునివలె ఈ గొల్లవాడు వెళుతున్నాడు. మన రథాన్ని అతని దగ్గరగా పోనివ్వు; పదునెక్కి మెరుస్తున్న ఈ బల్లెములను వరుసగా ప్రయోగించి వాడి పొగరు అణచివేస్తాను. నా ప్రతాపమేమిటో చూపిస్తాను.

**వ. అని యిట్లు రుక్మి హరికొలంది యెఱుంగక సారథి నదలించి రథముఁ గూడ దోలించి 'గోపాలకా! వెన్నదొంగ! నిమిషమాత్రంబు నిలు నిలు, మని తిరస్కరించి, బలువింట నారి సారించి మూఁడు వాఁడితూపుల హరి నొప్పించి యిట్లనియె. 1765**

**ప్రతి :** అని+ఇట్లున్= అని ఈ విధంగా; రుక్మి; హరిన్= శ్రీకృష్ణుని; కొలంది= శక్తిని; ఎఱుంగక= తెలియక; సారథిన్= సారథిని; అదలించి= గద్దించి; రథమున్= రథాన్ని; కూడన్+తోలించి= శ్రీకృష్ణునికి దగ్గరగా పరుగెత్తించి; గోపాలకా!= గోవులను కాచుకునే యాదవా!; వెన్నదొంగ= వెన్నదొంగా!; నిమిషమాత్రంబున్= ఒక్క నిమిషంపాటు; నిలుము+నిలుము= ఆగాగు; అని= అంటూ; తిరస్కరించి= నిర్లక్ష్యంగా పలికి; బలువింటన్= బలంగా ఉన్న తన ధనుస్సులో; నారి సారించి= అల్లెత్రాడును లాగి; మూఁడు వాఁడితూపులన్= పదునైన మూడుబాణాలతో; హరిన్+నొప్పించి= శ్రీకృష్ణుణ్ణి బాధించి; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** శ్రీకృష్ణునిశక్తిని తెలుసుకోలేక రుక్మి సారథిని గద్దించి శ్రీకృష్ణునికి దగ్గరగా తనరథాన్ని తోలింపజేసి 'ఓ గోవులను కాచుకునేవాడా! వెన్నను దొంగిలించేవాడా! ఒక్క నిమిషం పాటు ఆగాగు' అని నిర్లక్ష్యంగా పలికి 'బలమైన తన ధనుస్సుకున్న అల్లెత్రాటిని లాగి మూడు పదునైన బాణాలను ప్రయోగించి' శ్రీకృష్ణుణ్ణి బాధిస్తూ ఇలా అన్నాడు.

**సీ. మా సరివాఁడవా మా పాపఁ గొనిపోవ? నేపాటి గలవాఁడ? వేది వంశ?**
**మెందు జన్మించితి? వెక్కడఁ బెరిఁగితి? వెయ్యది నడవడి? యెవ్వఁ డెఱుఁగు?**
**మానహీనుఁడ వీవు? మర్యాద లెఱుఁగవు; మాయఁ గైకొని కాని మలయ రావు;**
**నిజరూపమున శత్రునివహంబుపైఁ బోవు; వసుధేశుఁడవు గావు వావి లేదు;**

**ఆ. కొమ్మ నిమ్ము; నీవు గుణరహితుండవు, విడువు; విడువ వేని విలయకాల**
**శిఖిశిఖాసమానశితశిలీముఖముల, గర్వ మెల్లఁ గొందుఁ గలహమందు. 1766**

**ప్రతి :** మాపాపన్+కొనిపోవన్= మా పాప అయిన రుక్మిణిని తీసుకుని పోవడానికి; మా= మాతో; సరివాఁడవు+ఆ= సమానుడవా?; ఏపాటి= ఏమాత్రం; కలవాఁడవు= సంపద ఉన్నవాడవు?; ఏదివంశము= నీ వంశం (కులం) ఏది?; ఎందున్+జన్మించితివి= ఎక్కడ పుట్టావు?; ఎక్కడన్+పెరిఁగితివి= ఎక్కడపెరిగావు; ఎయ్యది నడవడి= నీ ప్రవర్తన ఎలాంటిది?; ఎవ్వఁడు+ఎఱుఁగున్= ఇవన్నీ ఎవడికి తెలుసు? మానహీనుఁడవు+ఈవు= నీవు అభిమానంలేనివాడవు; మర్యాదలు+ ఎఱుఁగవు= కట్టుబాట్లు తెలియనివాడవు; మాయన్+కైకొనికాని= మోసం చేసిగానీ; మలయరావు= ఎదుటపడవు; నిజరూపమున్= నీ అసలు రూపంతో; శత్రునివహంబుపైన్= నీ వైరివర్గం మీదికి; పోవు= వెళ్లవు; వసుధా+ఈశుఁడవు= రాజువు; కావు; వావి లేదు= బంధుత్వం లేదు; కొమ్మను+ఇమ్ము= మా అమ్మాయిని ఇవ్వు; నీవు; గుణరహితుండవు= గుణాలు లేనివాడవు; విడువు= వదలిపెట్టు; విడువవు+ఏని= అలా వదలకపోతే; విలయకాల= ప్రళయకాలంలోని; శిఖిశిఖా= అగ్నిజ్వాలలతో; సమాన= సమానమైన; శిత= పదునైన; శిలీముఖములన్= ఇనుపముక్కలు ఉన్న బాణాలతో; కలహము+అందున్= యుద్ధంలో; గర్వము+ఎల్లన్= నీ పొగరంతటినీ; కొందున్= హరిస్తాను.

**తా :** మా చెల్లెలిని తీసుకు పోవడానికి నీవు మాతో తులతూగ గలిగిన వాడివా? నీ వెంతమాత్రపువాడివి? నీ వంశమేది? ఎక్కడ పుట్టావు? ఎక్కడ పెరిగావు? నీ నడవడిక ఎలాంటిదో? ఎవ్వరికీ తెలియదు. నీకు మాన మర్యాదలు లేవు. మోసం చేసిగాని ఎదుటపడవు. నీ శత్రువులమీదికి నీ అసలు రూపంతో వెళ్లవు. (అన్నీ మారువేషాలే అని అర్థం). నీవు రాజువు కావు. వావివరుసలు లేవు. మా అమ్మాయిని తిరిగి ఇవ్వు. నీవు గణాలు లేనివాడవు. మా పాపను వదిలిపెట్టు. అలా వదలకపోతే ప్రళయకాలంలోని అగ్నిజ్వాలలతో సమానమైన వాడిబాణాలతో యుద్ధరంగంలో నీ గర్వాన్నంతటినీ హరించి వేస్తాను.

**వ. అని పలికిన నగధరుండు నగి, యొక్క బాణంబున వానికోదండంబు ఖండించి, యాఱు శరంబుల శరీరంబు దూఱనేసి, యెనిమిది విశిఖంబుల రథ్యంబులం గూల్చి, రెండమ్ముల సారథిం జంపి, మూఁడు వాఁడితూపులం గేతనంబు ద్రుంచి, మఱియు నొక్క విల్లందినం ద్రుంచి, వెండియు నొక్క ధనువు వట్టిన విదళించి, క్రమంబున పరిఘపట్టిసశూలచర్మాసిశక్తితోమరంబులు ధరియించినం దునుకలు సేసి, క్రమ్మఱ నాయుధంబు లెన్ని యెత్తిన నన్నియు శకలంబులు గావించె. నంతటం దనివిసనక వాఁడు రథంబు డిగ్గి, ఖడ్గహస్తుండై, దవానలంబుపైఁ బడు మిడుతచందంబునం గదిసిన, ఖడ్గకవచంబులు చూర్ణంబులు సేసి, మెఱుంగులు చెదర నడిదంబు వెఱికి ఝుళిపించి వానిశిరంబుఁ దెగవ్రేయుదు నని గమకించి, నడచుచున్న నడ్డంబు వచ్చి రుక్మిణీదేవి హరిచరణారవిందంబులు పట్టుకొని యిట్లనియె. 1767**

**ప్రతి :** అని= ఈ విధంగా; పలికినన్= రుక్మి మాట్లాడగా; నగధరుండు= (గోవర్ధనమనే) కొండను ఎత్తిన శ్రీకృష్ణుడు; నగి= హేళనగా నవ్వుతూ; ఒక్కబాణంబునన్= ఒక బాణంతో; వాని కోదండంబున్= ఆ రుక్మి చేతిలోని ధనుస్సును; ఖండించి= ముక్కలు చేసి; ఆఱుశరంబులన్= ఆరు బాణాలతో; శరీరంబున్= దేహాన్ని; దూఱన్+ఏసి= దూరిబయటకు వచ్చేటట్లువేసి; ఎనిమిది విశిఖంబులన్= ఎనిమిదిబాణాలతో; రథ్యంబులన్+కూల్చి= రథానికి కట్టిన గుర్రాలను నేలకూల్చి; రెండు+అమ్ములన్= రెండు బాణాలతో; సారథిన్+చంపి= రథాన్ని నడిపేవాడిని చంపి; మూఁడు వాఁడితూపులన్= మూడుపదునైన బాణాలతో;

కేతనంబున్+త్రుంచి= పతాకాన్ని ఖండించి; మఱియున్= ఆ తర్వాత; ఒక్కవిల్లు+అందినన్= రుక్మి మరొక ధనుస్సును అందుకోగా; త్రుంచి= విరుగగొట్టి; వెండియున్= మళ్లీ; ఒక్కధనువున్+పట్టినన్= రుక్మి ఇంకొక ధనుస్సును చేతపట్టుకోగా; విదళించి= ఖండించి; క్రమంబునన్= వరుసగా; పరిఘ= ఇనుపగద; పట్టిస= అడ్డకత్తి; శూల= ఇనుపశూలాలు; చర్మ= డాలు; అసి= కత్తి; శక్తి; తోమరంబులు= చిల్లకోలలు; ధరియించినన్= చేత దాల్చి దాడి చేయగా; తునుకలు+చేసి= వాటిల్ని తుంటలు చేసి; క్రమ్మఱన్= మళ్లీ; ఆయుధంబులు+ఎన్ని+ఎత్తినన్= ఎన్ని రకాల ఆయుధాలను చేత పట్టినప్పటకీ; అన్నియున్= అన్నిటినీ; శకలంబులు= ముక్కలు ముక్కలుగా; కావించెన్= చేశాడు; అంతటన్= అంతటితో; తనివిన్+చనక= తనివి తీరక; వాఁడు= ఆ రుక్మి; రథంబు డిగ్గి= రథంనుండి క్రిందికి దిగి; ఖడ్గహస్తుండు+ఐ= చేత కత్తిదాల్చినవాడై; దవానలంబుపైన్= కార్చిచ్చుమీదికి; పడు= దూకే; మిడుతచందంబునన్= మిడుతవలె; కదిసినన్= సమీపించగా; ఖడ్గకవచంబులు= కత్తినీ కవచాలనూ; చూర్ణంబులు+చేసి= పొడిపొడిగాచేసి; మెఱుంగులుచెదరన్= మెరుపులు చిమ్మగా; అడిదంబు+పెఱికి= కత్తి సర్రున బయటికి లాగి; ఝళిపించి= కళ్లముందు ఊపి (ఝళిపింపచేసి) వాని శిరంబున్= రుక్మి తలను; తెగవ్రేయుదును+అని= నరికి పడేస్తాను అని; గమకించి= యత్నించి; నడచుచున్+ఉన్నన్= వస్తుండగా; అడ్డంబువచ్చి= అడ్డం వచ్చి; రుక్మిణీదేవి= రుక్మి చెల్లెలైన రుక్మిణి; హరిన్= శ్రీకృష్ణుని; చరణ+అరవిందంబులు= పద్మాలవంటి పాదాలను; పట్టుకొని; ఇట్లు+అనియెన్= ఇలా అనింది.

**తా :** రుక్మి ఇలా మాట్లాడుతుండగానే గోవర్ధనగిరినెత్తిన శ్రీకృష్ణుడు నవ్వాడు. ఒకే ఒక్క బాణంతో అతని ధనుస్సును ముక్కలు చేశాడు. ఆరు బాణాలు వేసి, అతని శరీరంలోంచి దూసుకుపోయేలా చేశాడు. ఎనిమిదిబాణాలతో రథానికి కట్టిన గుర్రాలను కూల్చేశాడు. రెండు బాణాలు వేసి రథాన్ని నడిపేవాడిని చంపేశాడు. మూడు బాణాలు వేసి రథంపై ఉన్న పతాకను కూల్చాడు. రుక్మి ఇదంతా చూచి, మరో విల్లు అందుకున్నాడు. అలా అందుకోగానే శ్రీకృష్ణుడు దాన్ని ముక్కలు చేశాడు. రుక్మి మళ్లా ఇంకొక ధనుస్సును చేతపట్టాడు. శ్రీకృష్ణుడు దాన్నికూడా విరిచేశాడు. ఇలా వరుసగా ఇనుపగద, అడ్డకత్తి, శూలం, డాలు, కత్తి, శక్తి, తోమరం వంటి ఆయుధాలను రుక్మి చేత పట్టుకున్నాడు. అతడు అలా పట్టుకోగానే శ్రీకృష్ణుడు వాటిల్ని ఛిన్నాభిన్నం చేశాడు. అప్పటికీ రుక్మి ఊరుకోలేదు. తన రథం దిగి, కత్తి చేతిలో పట్టుకుని శ్రీకృష్ణుని పైకి దూకాడు. పెద్ద పెద్ద జ్వాలలతో అడవి అడవంతా మంటలతో ఎగసి పడుతూంటే – ఆ మంటల మీదికి ఒక మిడుత దాడి చేస్తే ఎలా ఉంటుందో – రుక్మి శ్రీకృష్ణునిపై దూకడం అలా ఉండింది. అలా వస్తే – శ్రీకృష్ణుడు అతడి కత్తినీ, కవచాలనూ పొడిపొడి చేశాడు. తన కత్తి తళతళ మెరుస్తూండగా, సర్రున పైకి లాగి రుక్మి కళ్లముందు ఝళిపించాడు. అతడితలను నరుకుతా నని ముందుకు నడిచాడు. అలా నడుస్తూన్న శ్రీకృష్ణునికి రుక్మిణి అడ్డు వచ్చింది. శ్రీకృష్ణుని పాదారవిందాలను పట్టుకుని ఇలా ప్రాధేయపడింది.

**మత్త. నిన్ను నీశ్వరు దేవదేవుని నిర్ణయింపఁగ లేక యో**
**సన్నుతామరకీర్తిశోభిత! సర్వలోకశరణ్య! మా**
**యన్న యీతఁడు నేఁడు చేసె మహాపరాధము నీ యెడన్**
**నన్ను మన్నన చేసి కావు మనాథనాథ! దయానిధీ! 1768**

**ప్రతి :** సత్+నుత+అమర+కీర్తిశోభిత= గొప్పవాళ్లచేత పొగడబడిన శాశ్వతమైనకీర్తిచే శోభించేవాడా; సర్వలోక= లోకాలకన్నిటినీ; శరణ్య= శరణైనవాడా; అనాథ= ఏ దిక్కూలేనివారికి; నాథ= దిక్కయినవాడా; దయానిధీ= దయకు నెలవైనవాడా; నిన్నున్= నిన్ను; ఈశ్వరున్= సర్వాధికారిని; దేవదేవునిన్= దేవతలకే దేవుడవైనవాణ్ణి; నిర్ణయింపన్+కన్+లేక= ఎలాంటివాడివో

నిశ్చయించలేక; నేఁడు= ఈ రోజు; మా+అన్న= నా సోదరుడైన; ఈతఁడు= ఈ రుక్మి; నీ+ఎడన్= నీ పట్ల; మహా+అపరాధమున్= చాలా అపచారం; చేసెన్= కావించాడు; నన్నున్= నన్ను; మన్ననచేసి= మన్నించి; కావుము= మా అన్నను కాపాడుము;

**తా :** గొప్పవాళ్ల చేత పొగడబడిన శాశ్వతమైన కీర్తివల్ల వెలుగొందుతున్నవాడా! లోకాలకన్నిటినీ బ్రోచేవాడా! ఏ దిక్కూలేనివారికి దిక్కయినవాడా! దయకు నెలవైనవాడా! సర్వాధికారివి, దేవతలకే దేవుడవు అయిన నిన్ను ఎంతటివాడివో నిశ్చయించుకోలేక నేడు మా అన్న రుక్మి నీ పట్ల ఎంతో అపచారం చేశాడు. నన్ను దయతో మన్నించి మా అన్నను రక్షించు;

**మత్త. కల్ల లేదని విన్నవించుట గాదు వల్లభ! యీతనిన్**
**ప్రల్లదుం దెగఁ జూచితేనియు భాగ్యవంతుల మైతి మే**
**మల్లుఁ డయ్యె ముకుందుఁ డీశ్వరుఁ డంచు మోదితు లైన మా**
**తల్లిదండ్రులు పుత్త్రశోకముఁ దాల్చి చిక్కుదు రీశ్వరా! 1769**

**ప్రతి :** వల్లభ= నాథా! ఈశ్వరా= సర్వశక్తిమంతుడా! కల్లలేదు+అని= (రుక్మిలో) తప్పులేదు అని; విన్నవించుట కాదు= మనవి చేయడం లేదు; ప్రల్లదున్= దుర్మార్గుడైన; ఈతనిన్= ఈ రుక్మిని; తెగన్+చూచితి(వి)+ఏనియున్= చంపాలనుకుంటే; ఈశ్వరుఁడు= సర్వశక్తి సంపదలూ కలిగినవాడైన; ముకుందుఁడు= శ్రీమహావిష్ణువు; అల్లుఁడు+అయ్యెన్= మాకు అల్లుడయ్యాడని; ఏమున్= మేము; భాగ్యవంతులము+ఐతిమి= అదృష్టవంతులమయ్యాము అని; మోదితులు+ఐన= సంతోషంతో పొంగిపోతున్న; మా తల్లిదండ్రులు= మా అమ్మా నాన్నలు; పుత్త్రశోకమున్+తాల్చి= కొడుకును పోగొట్టుకున్న దుఃఖంలో; చిక్కుదురు= తగులు కొందురు.

**తా :** నాథా! సర్వశక్తిమంతుడా! రుక్మి చేసినపనిలో తప్పులేదని నేను విన్నవించుకోవడం లేదు. ఇతడు దుర్మార్గుడే! కానీ, ఇతణ్ణి చంపితే, మా అమ్మానాన్నలకు కొడుకు పోయాడన్న దుఃఖం కలుగుతుంది. సర్వశక్తి సంపదలూ కలిగిన శ్రీమహావిష్ణువు అల్లుడు అయ్యాడన్న సంతోషంకంటె వారిని పుత్త్రశోకం కృశింప చేస్తుంది.

**మ. అని దగ్గుత్తికతో మహాభయముతో నాకంపితాంగంబుతో**
**వినతశ్రాంతముఖంబుతో శ్రుతిచలద్వేణీకలాపంబుతోఁ**
**గనుదోయిన్ జడిగొన్న బాష్పములతోఁ గన్యాలలామంబు మ్రొ**
**క్కిన రుక్మిం దెగవ్రేయఁ బోక మగిడెన్ గృష్ణుండు రోచిష్ణుఁడై. 1770**

**ప్రతి :** అని= ఈ విధంగా; దగ్గుత్తికతోన్= బొంగురుపోతున్న గొంతుతోను; మహాభయముతోన్= ఎంతో భయంతోను; ఆకంపిత+అంగంబుతోన్= వణకిపోతున్న శరీరంతోను; వినత= కిందికి వంచిన; శ్రాంత= వాడిపోయిన; ముఖంబుతోన్= ముఖంతోను; శ్రుతిచలత్= చెవులమీదికి జారుతున్న; వేణీకలాపంబుతోన్= జడపాయలతోను; కనుదోయిన్= రెండు కళ్లలో; జడిన్+కొన్న= జలజలా రాలుతున్న; బాష్పములతోన్= కన్నీళ్లతోను; కన్యాలలామంబు= కన్యలకు తలమానికమైన రుక్మిణి; మ్రొక్కినన్= నమస్కరించగా; రుక్మిన్= రుక్మిని; తెగవ్రేయన్+పోక= చంపకుండా; రోచిష్ణుఁడు+ఐ= తేజస్సుతో వెలుగులీనుతున్నవాడై; కృష్ణుండు= శ్రీకృష్ణుడు; మగిడెన్= వెనుతిరిగాడు.

**తా :** అని ఈ విధంగా బొంగురుపోతున్న గొంతుతో రుక్మిణి ప్రార్థించింది. ఆమె కృష్ణునితో మాట్లాడ్డానికి గొప్పభయంతో ఉంది. ఒళ్లంతా గజగజ వణుకుతున్నది. తల వంచుకుంది. ముఖం వాడిపోయి ఉంది. మాటాడుతూంటే, చెవులమీదనుంచి

జడపాయ జారుతున్నది. రెండుకళ్లలో కన్నీరు ఉబుకుతున్నది. ఇలాగ ఆ కన్యాతిలకమైనరుక్మిణి – శ్రీకృష్ణునికి నమస్కరించింది. అపుడు తేజోమూర్తి అయిన విష్ణువు ఆమె విన్నపాన్ని మన్నించి రుక్మిని చంపకుండా వెనుతిరిగాడు.

**వ. ఇట్లు చంపక బావా! రమ్మని చిఱునగవు నగుచు, వానింబట్టి బంధించి గడ్డంబును మీసంబును దలయును నొకకత్తివాతి యమ్మున రేవులువాఱఁ గొఱిగి, విరూపిం జేసె; నంతట యదువీరులు పరసైన్యంబులం బాఱఁ దోలి, తత్సమీపంబునకు వచ్చి; రప్పుడు హతప్రాయుండై కట్టువడి యున్న రుక్మిం జూచి కరుణచేసి, బలభద్రుండు బంధంబులు విడిచి హరిని డగ్గఱి యిట్లనియె. 1771**

**ప్రతి :** ఇట్లున్= ఈ విధంగా; చంపక= చంపకుండా; బావా+రమ్ము+అని= 'బావా! రా' అంటూ; చిఱునగవు నగుచున్= చిరునవ్వు నవ్వుతూ; వానిన్+పట్టి= అతడిని పట్టుకుని; బంధించి= కట్టేసి; గడ్డంబును మీసంబును= గడ్డాన్ని, మీసాన్ని; తలయునున్= తలజుట్టుకూడా; ఒక కత్తివాతి+అమ్మునన్= కత్తిలాగా పదునుగా ఉన్న ఒక బాణంతో; రేవులువాఱన్= పాయలు పాయలుగా కనిపించేటట్లు; గొఱిగి= గొరిగి; విరూపిన్+చేసెన్= కురూపుణ్ణి చేశాడు; అంతటన్= అప్పుడు; యదువీరులు= యాదవవీరులు; పరసైన్యంబులన్= శత్రుసైన్యాలను; పాఱన్+తోలి= తరమివేసి; తత్+సమీపంబునకున్= శ్రీకృష్ణుని సన్నిధికి; వచ్చిరి= వచ్చారు; అప్పుడు= ఆ సమయంలో; హతప్రాయుండు+ఐ= చచ్చినవాడువలె ఉండి; కట్టువడి+ఉన్న= బంధింపబడి ఉన్న; రుక్మిన్+చూచి= రుక్మిని చూచి; కరుణచేసి= దయ తలచి; బలభద్రుండు= బలరాముడు; బంధంబులు విడిచి= కట్టుతాళ్లను విప్పి; హరిని= శ్రీకృష్ణుణ్ణి; డగ్గఱి= దగ్గరికి వెళ్లి; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** ఇలా రుక్మిణి ప్రార్థనను విని, శ్రీకృష్ణుడు రుక్మిని చంపకుండా వదిలేశాడు. 'బావా! ఇటు రా' అని చిరునవ్వు నవ్వుతూ దగ్గరికి తీసుకున్నాడు. అతణ్ణి పట్టుకుని బంధించాడు. ఒక పదునైన కత్తిలాంటి బాణాన్ని తీసుకున్నాడు. అతడి మీసాలు, గడ్డం, తలవెంట్రుకలను పాయలు పాయలుగా గొరిగి వికారరూపుణ్ణి చేశాడు. ఆ సమయంలో శత్రుసైన్యాన్ని తరిమేసిన యాదవవీరులు శ్రీకృష్ణుని దగ్గరికి వచ్చారు. అప్పుడు బలరాముడు జీవచ్ఛవమై బంధింపబడి ఉన్న రుక్మిని చూచి దయతో అతడికట్టుతాళ్లను విప్పించి శ్రీకృష్ణుని దగ్గరికి వచ్చి ఇలా అన్నాడు.

**క. తల మనక భీష్మనందను, తలయును మూతియును గొఱుగఁ దగవే! బంధుం**
**దలయును మూతియు గొఱుగుట, తల దఱుగుటకంటె దుచ్ఛతరము మహాత్మా! 1772**

**ప్రతి :** మహా+ఆత్మా= మహనీయా!; భీష్మనందనున్= భీష్మకుని కొడుకైన రుక్మిని; తలము+అనక= మంచిపద్ధతి కాదనకుండా; తలయును, మూతియునున్= తలనూ, మూతి మీసాలనూ; (గడ్డాలనూ); గొఱుగన్= గొరగడం అనేది; తగవే= న్యాయమా? బంధున్= బంధువైనవాణ్ణి; తలయును, మూతియున్= తలనూ, మూతినీ; గొఱుగుటన్= గొరగడం అనేది; తల తఱుగుట కంటెన్= తలను నరకడంకంటె; తుచ్ఛతరము= నీచాతినీచం.

**తా :** మహాత్ముడైన శ్రీకృష్ణా! భీష్మకుని కొడుకైన ఈ రుక్మిని 'తొలగిపో' అని చెప్పకుండా తలనూ, మూతినీ గొఱగడం ఏమైనా బాగుందా? బంధువైనవాడి తలనూ, మూతినీ గొరగడం తలనరకడం కంటె నీచాతినీచం కదా!

**క. కొందఱు రిపు లని కీడును, గొందఱు హితు లంచు మేలు గూర్పవు; నిజ మీ**
**వందఱియందును సముఁడవు, పొందఁగ నేలయ్య! విషమబుద్ధి ననంతా! 1773**

**ప్రతి :** అనంతా= అంతం లేనివాడా!; ఈవు= నీవు; కొందఱు= కొంతమంది; రిపులు+అని= శత్రువులని; కీడునున్= హానినీ; కొందఱు= కొందరు; హితులు+అంచున్= నీకు మిత్రులని; మేలున్= మంచినీ; కూర్పవు= కలిగించవు; ఈవు+అందరి+ అందును= నీవు అందరి యెడల; సముఁడవు= సమాన దృష్టిఉన్న వాడవనేది; నిజము=సత్యం; విషమ బుద్ధిని= (ఇలాంటి) భేదబుద్ధిని; పొందన్+కన్+ఏల+అయ్య= ఎందుకు పొందాలి కృష్ణా!

**తా :** ఆదిమధ్యాంతరహితా! శ్రీకృష్ణా! నీకు అందరూ సమానులే. వీడు శత్రువని హాని కలిగించవు. మరొకడు మిత్రుడని మంచిని చేకూర్చవు. అంతటా సమదృష్టితోనే ఉంటావు. ఇది సత్యం. అలాంటి నీవు మరి ఈ రుక్మి విషయంలో ఎందుకు భేదబుద్ధిని చూపావు?

## ❖ సహోదరుని భంగమునకు ఖిన్నయగు రుక్మిణీదేవిని బలభద్రుం డూరార్చుట ❖

**వ. అని వితర్కించి రుక్మిణీదేవి నుపలక్షించి యిట్లనియె. 1774**

**ప్రతి :** అని= ఈ విధంగా; వితర్కించి= ముందు వెనుకలు ఆలోచించి; రుక్మిణీదేవిన్= రుక్మిణీదేవిని; ఉపలక్షించి= గమనించి; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** ఈ విధంగా బలరాముడు ముందు వెనుకలు ఆలోచించి రుక్మిణీదేవిని గమనిస్తూ ఇలా అన్నాడు.

**శా. తోడంబుట్టిన వానిభంగమునకున్ దుఃఖించి మా కృష్ణు నె**
**గ్గాడం జూడకు మమ్మ! పూర్వభవకర్మాధీనమై ప్రాణులన్**
**గీడున్ మేలును జెందు; లేఁ డొకఁడు శిక్షింపంగ రక్షింప నీ**
**తోడంబుట్టువు కర్మశేషపరిభూతుం డయ్యె నేఁ డియ్యెడన్. 1775**

**ప్రతి :** అమ్మ= రుక్మిణీ!; తోడన్+పుట్టినవానిన్= నీ తోడుగా పుట్టిన నీ అన్నయొక్క; భంగమునకున్= అవమానానికి; దుఃఖించి= దిగులుపడి; మా కృష్ణుని= మా తమ్ముడైన శ్రీకృష్ణుణ్ణి; ఎగ్గు+ఆడన్= నిందించడానికి; చూడకుము= చూడవద్దు; పూర్వభవ= గడచిన జన్మలోని; కర్మ= చేసిన పనికి; అధీనము+ఐ= లోబడిందై; ప్రాణులన్= జీవులకు; కీడున్= చెడూ; మేలునున్= మంచీ; చెందు= (అనేవి) కలుగుతుంటాయి; శిక్షింపన్+కన్= దండించడానికి; రక్షింపన్= కాపాడడానికి; లేఁడు+ఒకఁడున్= కర్త ఒకడంటూ లేడు; నీ తోడన్+పుట్టువు= నీతోపాటు జన్మించిన రుక్మి; కర్మశేష= గడచిన జన్మలో మిగిలినకర్మవలన; నేఁడు= ఈ రోజు; ఈ+ఎడన్= ఇక్కడ; పరిభూతుండు+అయ్యెన్= అవమానం పొందాడు.

**తా :** అమ్మా! రుక్మిణీ! నీ తోడబుట్టినవానికి అవమానం జరిగిందని దిగులు పడకు. మా తమ్ముడైన శ్రీకృష్ణుణ్ణి తప్పు పట్టబోకు. ఇవన్నీ కర్మకు సంబంధించిన విషయాలు. కడచిన జన్మలో చేసిన కర్మనుబట్టి ఈ జన్మలో జీవికి మంచీ, చెడూ అనేవి కలుగుతూ ఉంటాయి. శిక్షించడానికీ, రక్షించడానికీ ఎవడూ కర్త అంటూ లేడు. నీ అన్నకూడా ఈ రోజు ఇక్కడ ఈ అవమానం పొందాడంటే, అదంతా అతడు చేసిన కర్మఫలమే తప్ప మరొకటి కాదు.

**క. చంపెడి దోషము గలిగినఁ, జంపఁ జనదు బంధుజనులఁ జను విడువంగాఁ**
**జంపిన దోషము సిద్ధము, చంపను మఱి యేల మున్న చచ్చినవానిన్. 1776**

**ప్రతి :** చంపెడి దోషము= చంపవలసినంతటి తప్పు; కలిగినన్= ఉన్నప్పటికీ కూడా; బంధుజనులన్= బంధువులను; చంపన్+చనదు= చంపకూడదు; విడువన్+కాన్= విడిచిపెట్టడం; చనున్= చేయదగినపని; చంపినన్= చంపితే; దోషము= పాపం; సిద్ధము= తప్పని సరి; మున్ను+అ= మునుపే; చచ్చినవానిన్= చచ్చినవాడిని; చంపను= చంపడం; మఱి+ఏల= మళ్లీ దేనికి?

**తా :** బంధువులు ఏదైనా తప్పుచేస్తే, అది చంపవలసినంతటి తప్పైనా వాళ్లను చంపకూడదు. క్షమించి విడిచిపెట్టాలి. అది పద్ధతి. అలా కాకుండా చంపామనుకో, పాపం అనేది తప్పకుండా అంటుకుంటుంది. పైగా ముందే చచ్చినవాడిని మళ్లీ చంపవలసిన అవసరం కూడా లేదు.

**ఆ. బ్రహ్మచేత భూమిపతుల కీ ధర్మంబు, కల్పితంబు రాజ్యకాంక్షc జేసి**
**తోడిచూలు నైనc దోడcబుట్టినవాcడు, చంపుచుండుc గ్రూరచరితుc డగుచు. 1777**

**ప్రతి :** బ్రహ్మచేత= సృష్టికర్త అయిన బ్రహ్మచేత; భూమిపతులకున్= రాజులకు; ఈ ధర్మంబు= ఈ ధర్మం; కల్పితంబు= సృష్టించబడింది; రాజ్యకాంక్షన్+చేసి= రాజ్యాన్ని సొంతం చేసుకోవాలనే ఆశతో; తోడిచూలున్+ఐనన్= తనతోపాటు జన్మించిన సోదరుణ్ణి అయినా; తోడన్+పుట్టినవాcడు= తోడబుట్టినవాడు; క్రూరచరితుcడు+అగుచున్= క్రూరమైన ప్రవర్తన కలిగిన వాడవుతూ; చంపుచున్+ఉండున్= చంపుతూ ఉంటాడు.

**తా :** సృష్టికర్త అయిన బ్రహ్మ రాజులకు ఈ ధర్మాన్ని సృష్టించాడు. రాజ్యాన్ని సొంతం చేసుకోవాలనే ఆశతో తన తోబుట్టువును తోడబుట్టినవాడే క్రూరహృదయుడై చంపుతుంటాడు.

**క. భూమికి ధనధాన్యములకు, భామలకును మానములకుc బ్రాభవమునకుం**
**గామించి మీcదు గానరు, శ్రీమదమున మానధనులు చెనకుదు రొరులన్. 1778**

**ప్రతి :** భూమికిన్= రాజ్యంకోసం; ధనధాన్యములకున్= డబ్బుకోసం ధాన్యం కోసం; భామలకును= స్త్రీలకోసం; మానములకున్= పరువుప్రతిష్ఠలకోసం; ప్రాభవములకున్= వైభవాలకోసం; కామించి= ఆశపడి; మీcదున్+కానరు= తరువాతి కర్మపరిణామాలను గురించి ఆలోచించరు; శ్రీమదమునన్= ఐశ్వర్యమదంచేత; మానధనులు= అభిమానమే ధనంగా ఉన్నవారు; ఒరులన్= ఇతరులను; చెనకుదురు= పోట్లాటకు రెచ్చగొడుతుంటారు.

**తా :** రాజ్యంకోసం, ధనంకోసం, ధాన్యంకోసం, స్త్రీలకోసం, పరువుప్రతిష్ఠలకోసం, వైభవాలకోసం మానధనులైనవాళ్లు ఆరాటపడతారు. సంపద ఉందనే పొగరుతో ఇతరులను కూడా రెచ్చగొట్టి పోరాటాలకు దింపుతారు.

**వ. వినుము. దైవమాయం జేసి దేహాభిమానులైన మానవులకున్ బగవాcడు, బంధుండు, నుదాసీనుండు నను మోహంబు సిద్ధంబై యుండు; జలాదులయందుc జంద్రసూర్యాదులును, ఘటాదులయందు గగనంబును బెక్కై కానంబడు భంగి, దేహధారుల కందఱికి నాత్మ యొక్కం డయ్యును బెక్కండ్రై తోcచు; నాద్యంతంబులు గల యీ దేహంబు ద్రవ్యప్రాణగుణాత్మకంబై, యాత్మయందు నవిద్యచేతc గల్పితంబై, దేహిని సంసారంబునం ద్రిప్పు. సూర్యుండు తటస్థుండై యుండc బ్రకాశమానంబు లయిన దృష్టిరూపంబులుంబోలె నాత్మ తటస్థుండైయుండ దేహేంద్రియంబులు ప్రకాశమానంబు లగు; నాత్మకు వేఱొక్కటితోడ సంయోగవియోగంబులు**

**లేవు; వృద్ధిక్షయంబులు చంద్రకళలకుం గాని చంద్రునికి లేని కైవడి, జన్మనాశంబులు దేహంబునకుఁ గాని, యాత్మకుఁ గలుగనేరవు. నిద్ర వోయినవాఁ డాత్మను విషయఫలానుభవంబులు సేయించు తెఱంగున, నెఱుక లేనివాఁడు నిజము గాని యర్థమునందు ననుభవము నొందుచుండుఁ గావున. 1779**

**ప్రతి :** వినుము= రుక్మిణీ! విను; దైవమాయన్+చేసి= దైవం చేసే మాయవలన; దేహ+అభిమానులు+ఐన= శరీరమే తాను అనుకునే; మానవులకున్= మానవులకు(న్); పగవాఁడు= శత్రువు; బంధుండు= బంధువు; ఉదాసీనుండున్= ఏ సంబంధమూ లేనివాడు; (తటస్థుడు) అను= అనే; మోహంబునన్= అజ్ఞానంవల్ల; సిద్ధంబు+ఐ+ఉండున్= తప్పక కలుగుతూ ఉంటుంది; జల+ఆదుల+అందున్= నీళ్లూ మొదలైనవాటిలో (అద్దాలు, మణులు మొ॥వి); చంద్రసూర్య+ఆదులును= చంద్రుడు సూర్యుడు మొదలైనవి; ఘట+ఆదులు+అందున్= కుండ మొదలైనటువంటి వాటిలో; గగనంబునున్= ఆకాశంకూడా; పెక్కు+ఐ= అనేకాలుగా; కానంబడు భంగిన్= కనబడే రీతిలో; దేహధారులకున్+అందఱికిన్= శరీరాన్ని ధరించిన అందరికీ; ఆత్మ+ఒక్కండు+ అయ్యునున్= ఆత్మ ఒక్కటే అయినప్పటికీ కూడా; పెక్కండ్రు+ఐ= పెక్కులుగా; తోఁచున్= అనిపిస్తుంది; ఆది+అంతంబులు కల= మొదలు, తుది (చావు, పుట్టుక) అనేవి ఉన్న; ఈ దేహంబు= ఈ శరీరం; ద్రవ్య= పంచభూతాలనే ద్రవ్యాలతోనూ; ప్రాణ= పంచప్రాణాలతోనూ; గుణ= త్రిగుణాలతోనూ; ఆత్మకంబు+ఐ= కూడిన స్వరూపమున్నదైన; ఆత్మ+అందున్= ఆత్మలో; అవిద్యచేతన్= అజ్ఞానంచేత; కల్పితంబు+ఐ= కల్పించబడిందై; దేహిని= దేహంకలిగిన జీవిని; సంసారంబునన్= సంసారచక్రంలో; చావు పుట్టుకలనే వాటితో నిరంతరపరిణామశీలమైన ప్రపంచంలో; త్రిప్పున్= పరిభ్రమింపజేస్తున్నది; సూర్యుండు= సూర్యుడు; తటస్థుండు+ఐ+ఉండన్= దేనితోను సంబంధంలేక ఉదాసీనుడై ఉండగా; ప్రకాశమానంబులు+అయినన్= కనిపిస్తున్న; దృష్టి= చూపు; రూపంబులున్= ఆకారాలు; పోలెన్= మాదిరిగా; ఆత్మ; తటస్థుండు+ఐ+ఉండన్= ఉదాసీనుడై ఉండగా; దేహ+ఇంద్రియంబులు= శరీరం మరియు ఐదు జ్ఞానేంద్రియాలు, ఐదు కర్మేంద్రియాలు; ప్రకాశమానంబులు+అగున్= కనిపిస్తుంటాయి; ఆత్మకున్= ఆత్మకు; వేఱు+ఒక్కటితోడన్= మరొకదానితో; సంయోగ వియోగంబులు= కలయికలు, విడిపోవడాలు; లేవు= ఉండవు; వృద్ధి= పెరగడం; క్షయంబులు= తరిగిపోవడం అనేవి; చంద్రకళలకున్+కాని= చంద్రునికి ఉన్న కళలకే తప్ప; చంద్రునికి లేని కైవడిన్= చంద్రుడికి ఉండని విధంగా; జన్మనాశంబులు= పుట్టడం, చావడం అనేవి; దేహంబునకున్+కాని= దేహానికే తప్ప; ఆత్మకున్= ఆత్మకు; కలుగనేరవు= కలుగజాలవు; నిద్ర+పోయినవాఁడు= నిద్రించినవాడు; ఆత్మను; విషయఫల+అనుభవంబులు= విషయాలవలన సుఖదుఃఖాలు; చేయించుతెఱంగునన్= కలిగింపచేసే విధంగా; ఎఱుకలేనివాఁడు= జ్ఞానహీనుడు; నిజము+కాని= అసత్యమైన; అర్థము+అందున్= అర్థంలో; అనుభవమున్= అనుభవాన్ని; ఒందుచున్+ఉండున్= పొందుతుంటాడు; కావునన్= కాబట్టి...

**తా :** రుక్మిణీ! విను. లోకంలోని మానవులకు వీడు తనవాడు, వీడు పగవాడు, వీడు తటస్థుడు అనే దృష్టిభేదం దేహాభిమానంవల్ల కలుగుతుంది. ఆ దేహాభిమానం దైవమాయవల్ల కలుగుతుంది. చంద్రుడు, సూర్యుడు వంటివి నీళ్లలో, అద్దాలలో కనిపించి అనేకం ఉన్నాయనిపిస్తుంది. కుండలువంటి వాటిలో ఆకాశం కూడా అనేక ఆకాశాలుగా కనిపిస్తుంది. అదేవిధంగా ఆత్మ ఒక్కటే అయినా, ఎన్నో శరీరాలలో ఉండి అనేకంగా అనిపింపజేస్తుంది. ఈ శరీరం చావుపుట్టుకలతో కూడింది. ఇది పంచభూతాలతో, పంచప్రాణాలతో, త్రిగుణాలతో కూడింది. ఈ శరీరం ఆత్మలో అజ్ఞానంచేత కల్పింపబడి జీవుడిని సంసారంలో తిప్పుతుంటుంది. సూర్యుడు దేనితోనూ సంబంధంలేక ఉదాసీనుడుగా ఉండగా దృష్టి, రూపం అనే వానివలె ఆత్మ ఉదాసీనంగా ఉండగా శరీరం, ఐదు జ్ఞానేంద్రియాలు, ఐదు కర్మేంద్రియాలు ప్రకాశమానమవుతాయి. ఆత్మ అనేదానికి మరొకదానితో కలయికగానీ, ఎడబాటుగానీ లేవు. పెరగడం, తరగడం అనేవి చంద్రకళలకే గానీ చంద్రునికి ఉండవు. అదేవిధంగా

చావుపుట్టుకలు శరీరానికే గానీ, ఆత్మకు కాదు. నిద్రపోయినవాడు కలలో విషయాలవలన కలిగే సుఖదుఃఖాల్ని ఆత్మకు అనుభవింపచేస్తాడు. జ్ఞానహీనుడు అసత్యమైన విషయాలలో అనుభవాన్ని పొందుతుంటాడు. నిజానికి సుఖదుఃఖాలనేవి ఆత్మకు అంటవు.

**క. అజ్ఞానజ మగు శోకము, విజ్ఞాన విలోకనమున విడువుము నీకుం**
**బ్రజ్ఞావతికిం దగునే, యజ్ఞానుల భంగి వగవ నంభోజముఖీ! 1780**

**ప్రతి :** అంభోజముఖీ!= పద్మముఖీ! రుక్మిణీ!; అజ్ఞానజము+అగు= తెలియనితనంవలన కలిగే; శోకమున్= దుఃఖాన్ని; విజ్ఞాన= విజ్ఞానం, అనే; విలోకనమునన్= విశిష్టమైన చూపుచేత; విడువుము= విడిచిపెట్టు; ప్రజ్ఞావతికిన్= మతిమంతురాలవైన; నీకున్= నీకు; అజ్ఞానులభంగిన్= జ్ఞానంలేని వాళ్లవలె; వగవన్= శోకించడం; తగునే= తగునా?;

**తా :** పద్మంలాంటి ముఖం కలిగిన రుక్మిణీ! దుఃఖమనేది తెలియనితనంవల్ల వస్తుంది. జ్ఞానమనే దృష్టితో ఆ దుఃఖాన్ని విడిచిపెట్టు. విశిష్టమైన జ్ఞానమున్నదానివైన నీవుకూడా అజ్ఞానులవలె శోకింపదగదు.

**వ. ఇట్లు బలభద్రునిచేతఁ దెలుపంబడి, రుక్మిణీదేవిదుఃఖంబు మాని యుండె; నట రుక్మి యను వాఁడు ప్రాణావశిష్టుండై, విడువఁబడి తన విరూపభావంబునకు నెరియుచు, హరిం గెల్చికాని కుండిన పురంబుఁ జూడ నని ప్రతిజ్ఞ సేసి, తత్సమీపంబున నుండె నివ్విధంబున. 1781**

**ప్రతి :** ఇట్లున్= ఈ విధంగా; బలభద్రునిచేతన్= బలరామునివల్ల; తెలుపన్+పడి= తెలియపరచబడి; రుక్మిణీదేవి; దుఃఖంబుమాని+ఉండెన్= దుఃఖాన్ని విడిచిపెట్టి ఉండింది; అటన్= అక్కడ; రుక్మి+అనువాఁడు= రుక్మిణి అన్న అయిన రుక్మి; ప్రాణ+అవశిష్టుండు+ఐ= కేవలం ప్రాణాలతోమాత్రం మిగిలనవాడై; విడువన్+పడి= వదలిపెట్టబడి; తన= తనకు కలిగిన; విరూపభావంబునకున్= వికారస్వరూపానికి; ఎరియుచున్= పరితపిస్తూ; దిగులుపడుతూ; హరిన్= శ్రీకృష్ణుణ్ణి; గెల్చికాని= జయించిగాని; కుండినపురంబున్= తన నగరమైన కుండిన పురాన్ని; చూడను+అని= చూడనంటూ; ప్రతిజ్ఞన్+చేసి= ఒట్టుపెట్టుకుని; తత్+సమీపంబునన్= ఆ పట్టణ సమీపంలోనే; ఉండెన్= ఉండినాడు; ఈ+విధంబునన్= ఈ విధంగా...

**తా :** ఇలా బలరాముడు ప్రబోధించగా రుక్మిణి దిగులు మానింది. అటుచూస్తే, రుక్మి పరిస్థితి భిన్నంగా ఉంది. శ్రీకృష్ణుడు అతణ్ణి కేవలం ప్రాణాలతో వదలిపెట్టాడు. కృష్ణుని వల్ల తనకు వికార రూపం రావడంతో దానికి రుక్మి చాలా దుఃఖించాడు. ఇంత అవమానం చేసిన శ్రీకృష్ణుని గెలిచి కాని తిరిగి తన పట్టణమైన కుండిన పురానికి పోనని ప్రతిజ్ఞ చేసి పట్టణ సమీపంలోనే ఉండిపోయాడు.

**క. రాజీవలోచనుఁడు హరి, రాజసమూహముల గెల్చి రాజస మొప్పన్**
**రాజిత యగు తన పురికిని, రాజాననఁ దెచ్చె బంధురాజి నుతింపన్. 1782**

**ప్రతి :** రాజీవలోచనుఁడు= పద్మాలవంటి కండ్లున్నవాడైన; హరి= శ్రీకృష్ణుడు; రాజసమూహములన్= రాజలోకాలను; గెల్చి= జయించి; రాజసము+ఒప్పన్= రాజదర్పంతో ఒప్పుతూ; రాజిత+అగు= విభ్రాజమానమైన; తనపురికిని= తన నగరానికి; రాజ+ఆననన్= చంద్రునివలె ప్రకాశిస్తున్న ముఖంకల రుక్మిణిని;బంధురాజి= చుట్టాలందరూ; నుతింపన్= పొగడుతుండగా; తెచ్చెన్= తీసుకుని వచ్చాడు.

**తా :** ఇలా పద్మాలవంటి నేత్రాలుకల శ్రీకృష్ణుడు రాజసంతో రాజలోకాలను గెలిచి వెలిగాడు. వెలుగులీనుతున్న తన నగరానికి చంద్రబింబంవంటి ముఖంగల రుక్మిణిని తెచ్చాడు అంటూ బంధువులందరూ శ్రీకృష్ణుని పొగడ్తలతో ముంచెత్తారు.

## ❖ శ్రీకృష్ణుఁడు రుక్మిణీదేవినిఁబెండ్లి యాడుట ❖

**వ. అంత న య్యాదవేంద్రునినగరంబు సమారబ్ధవివాహకృత్యంబును, బ్రవర్తమానగీతవాద్యనృత్యంబును, బ్రతిగృహాలంకృతవిలసితాశేషనరనారీవర్గంబును, బరిణయమహోత్సవసమాహూయమానమహీపాలగజఘటా గండమండలదానసలిలధారాసిక్తమార్గంబును, బ్రతిద్వారమంగళాచారసంఘటితక్రముకకదళికాకర్పూర కుంకుమాగరుధూపదీపపరిపూర్ణకుంభంబును, విభూషితసకలగృహవేదికాకవాటదేహళీస్తంభంబును, విచిత్రకుసుమాంబరరత్నతోరణవిరాజితంబును, సముద్ధూతకేతనవిభ్రాజితంబును నై యుండె; న య్యవసరంబున.** **1783**

**ప్రతి :** అంతన్= అప్పుడు; ఆ+యాదవ+ఇంద్రుని= ఆ యాదవశ్రేష్ఠుడైన శ్రీకృష్ణుని; నగరంబు= పురం; సమారబ్ధ= ఆరంభించబడిన; వివాహకృత్యంబునున్= పెళ్లిపనులతో కూడింది; ప్రవర్తమాన= జరుగుతున్న; గీత= పాటలతో; వాద్య= సంగీతవాద్యాలతో; నృత్యంబునున్= నృత్యాలతో కూడింది; ప్రతిగృహ= ఇంటింటా; అలంకృత= అలంకరించబడి; విలసిత= ప్రకాశిస్తున్న; అశేష= అంతులేని; నర= పురుష; నారీ= స్త్రీ; వర్గంబునున్= సమూహాలు ఉన్నది; పరిణయమహా+ఉత్సవ= పెళ్లి మహోత్సవాలకు; సమ్+ఆహూయమాన= ఆహ్వానింపబడిన; మహీపాల= రాజుల; గజ ఘటా= ఏనుగుల గుంపులయొక్క; గండమండల= చెక్కిళ్లనుండి కారుతున్న; దానసలిలధారా= మదజలధారలచేత; సిక్త= తడిసిన; మార్గంబునున్= దారి కలిగింది; ప్రతిద్వార= ప్రతివాకిలికి; మంగళ+ఆచార= శుభకార్యం చేయడంకోసం; సంఘటిత= కట్టబడిన; క్రముక= పోకచెట్లు; కదళికా= అరటిబోదెలు; కర్పూర= కర్పూరపుపొడి; కుంకుమ; అగరు= అగరుపొడి; ధూప= పరిమళపుపొగలు; దీప= దీపాలు; పరిపూర్ణ= నిండుగా ఉన్న; కుంభంబునున్= పూర్ణకుంభాలను; విభూషిత= అలంకరించబడిన; సకల= సమస్తమైన; గృహ= ఇండ్లయొక్క; వేదికా= అరుగులు; కవాట= వాకిళ్లు; దేహళీ= గడపలు; స్తంభంబునున్= కంబాలు కలది; విచిత్ర= అపురూపమైన; కుసుమ= పూలతోను; అంబర= వస్త్రాలతోనూ; రత్న= మణులతోనూ; తోరణ= తోరణాలతోనూ; విరాజితంబును= ప్రకాశిస్తున్నది; సమ్+ఉద్ధూత= రెపరెపలాడుతున్న; కేతన= పతాకాలచేత; విభ్రాజితంబునున్+ఐ= వెలిగిపోతున్నదై; ఉండెన్= ఉండింది; ఆ+అవసరంబున= ఆ సమయంలో...

**తా :** అప్పుడు యాదవశ్రేష్ఠుడైన ఆ శ్రీకృష్ణునినగరంలో పెళ్లివేడుకలు మొదలయ్యాయి. పాటలు, వాద్యాలు, ఆటలు ఎక్కడచూచినా జరుగుతున్నాయి. ప్రతి ఇంటిలోనూ స్త్రీ పురుషులు అందంగా అలంకరించుకొన్నారు. పెళ్లికి దేశదేశాల రాజులు ఆహ్వానింపబడ్డారు. వాళ్లు ఏనుగుల నెక్కి వస్తున్నారు. ఆ మదపుటేనుగుల చెక్కిళ్లనుండి మదజలం ధారగా స్రవిస్తోంది. ఆ ధారకు నగరవీథులు తడిసిపోయాయి. ప్రతివాకిలికీ మంగళతోరణాలు కట్టారు. పోక, అరటి బోదెల్ని వాకిళ్లకు అలంకరించారు. కర్పూరం, కుంకుమలతో అలంకారాలు తీర్చారు. అగరుపొగలతో పరిమళింపచేశారు. దీపాలు వెలిగించారు. పూర్ణకుంభాలు నిలిపారు. ప్రతి ఇంటి అరుగు, వాకిలి, గడప, స్తంభాలను రకరకాలుగా అలంకరించారు. రంగురంగుల అపూర్వ పుష్పాలనూ, వస్త్రాలనూ, రత్నాలనూ, తోరణాలనూ కట్టి అందగింపచేశారు. పతాకలు గాలికి ఎగురుతూ రెపరెపలాడుతూ ద్వారకానగరం విలసిల్లింది. ఆ సమయంలో

**శా. ధ్రువకీర్తిన్ హరి పెండ్లి యాడె నిజచేతోహారిణిన్ మాన వై**
**భవగాంభీర్యవిహారిణిన్ నిఖిలసంపత్కారిణిన్ సాధు బాం**
**ధవ సత్కారిణిఁ బుణ్యచారిణిఁ మహాదారిద్ర్యసంహారిణిన్**
**సువిభూషాంబరధారిణిన్ గుణవతీచూడామణిన్ రుక్మిణిన్. 1784**

**ప్రతి :** హరి= శ్రీకృష్ణుడు; నిజచేతస్+హారిణిన్= తన మనసును దోచుకున్నది; మాన= ఆత్మగౌరవంతో; వైభవ= ఐశ్వర్యంతో; గాంభీర్య= తొణకని నిబ్బరంతో; విహారిణిన్= విహరించేదీ; నిఖిల= సర్వ; సంపత్+కారిణిన్= సంపదలను కలిగింపజేసేది; సాధు= మంచి స్వభావమున్న; బాంధవ= బంధువులయొక్క; సత్+కారిణిన్= సమ్మానం కల్గిందీ; పుణ్యాచారిణిన్= పవిత్రమైన ప్రవర్తన కలిగింది; మహాదారిద్ర్య సంహారిణిన్= అత్యంత దరిద్రాన్ని నశింపచేయగలిగింది; సువిభూషా+అంబర= అందమైన మంచి ఆభరణాలు, వస్త్రాలను; ధారిణిన్= ధరించింది; గుణవతీ= మంచి గుణవతులగు స్త్రీలకు; చూడామణిన్= శిరోమణి అయిందీ; (అయిన) రుక్మిణిన్= రుక్మిణిని; ధ్రువకీర్తిన్= శాశ్వతమైన కీర్తి కలిగేటట్లుగా; పెండ్లి+ఆడెన్= పెళ్లాడాడు.

**తా :** రుక్మిణి శ్రీకృష్ణుని మనస్సును దోచుకుంది. అభిమానవతి. సంపద ఉన్నది. నిబ్బరంగా వ్యవహరించేది. సర్వసంపదలనూ కలిగించేది. మంచివారైన బంధువులను సమ్మానించేది, పవిత్రమైన నడవడిక కలది. హీనమైన దరిద్రాన్ని కూడా పోగొట్ట గలిగింది. మంచి నగలను, వస్త్రాలనూ దాల్చింది. గుణవతులైన స్త్రీలకు తలమానికంవంటిది. ఇన్ని గుణాలున్న రుక్మిణీదేవిని శ్రీకృష్ణుడు శాశ్వతమైన కీర్తి కలిగేలా వివాహం చేసుకున్నాడు.

**క. సతులుం దారును బౌరులు, హితమతిఁ గానుకలు దెచ్చి యిచ్చిరి కరుణో**
**న్నతవర్ధిష్ణులకును మా, నితరోచిష్ణులకు రుక్మిణీకృష్ణులకున్. 1785**

**ప్రతి :** సతులున్= భార్యలూ; పౌరులు= పురప్రజలైన; తారును= తాము; కరుణన్= కరుణా స్వభావంచేత; ఉన్నత= పైపైకి; వర్ధిష్ణులకున్= ఎదిగే స్వభావమున్నవారు; మానిత= గొప్పగా చెప్పబడ్డ; రోచిష్ణులకున్= వెలుగుతో ఉన్నవారు అయిన; రుక్మిణీకృష్ణులకున్= రుక్మిణికి, శ్రీకృష్ణునికి; హితమతిన్= మంచి మనస్సులతో; కానుకలున్= కానుకలను; తెచ్చి+ఇచ్చిరి= తెచ్చి సమర్పించారు.

**తా :** అపుడు ప్రజలు తాము తమ భార్యలతో కలిసి వివాహానికి వచ్చి, దయాగుణంతో పైపైకి ఎదిగే లక్షణమున్నవాళ్లూ, పదిమంది చెప్పుకునేలా తేజస్సుతో వెలుగుతున్న వాళ్లూ అయిన రుక్మిణీ కృష్ణులను వారు సకుటుంబంగా దర్శించి, మంచి మనస్సులతో కానుకలను సమర్పించారు.

**క. హరి పెండ్లికిఁ గైకేయక, కురు సృంజయ యదు విదర్భ కుంతినరేంద్రుల్**
**వరమానందముఁ బొందిరి, ధరణీశులలోన గాఢతాత్పర్యములన్. 1786**

**ప్రతి :** హరిపెండ్లికిన్= శ్రీకృష్ణుని వివాహానికి; ధరణి+ఈశులలోన్= రాజులలో; కైకేయక= కైకేయ రాజవంశానికి చెందినవారు; కురు= కురువంశానికి చెందినవారు; సృంజయ= సృంజయవంశీకులు; యదు= యాదవవంశానికి చెందినవారు; విదర్భ= విదర్భవంశస్థులు; కుంతి= కుంతిభోజవంశస్థులు అయిన; నర+ఇంద్రుల్= రాజులు; గాఢ= సాంద్రమైన; తాత్పర్యమునన్= అభిప్రాయంతో; పరమ+ఆనందమున్= అపరిమితమైన ఆనందాన్ని; పొందిరి= అనుభవించారు.

**తా :** శ్రీకృష్ణుని వివాహానికి కేకయ, కురు, సృంజయ, యాదవ, విదర్భ, కుంతి రాజ్యాలనుండి వచ్చిన రాజులు చాలమంది నిశ్చయమైన అభిప్రాయంతో వచ్చి పరమానందం పొందారు.

**క. హరి యీ తెఱఁగున రుక్మిణి, నరుదుగఁ గొనితెచ్చి పెండ్లి యాడుట విని దు**
**ష్కరకృత్య మనుచు వెఱఁగం, దిరి రాజులు రాజసుతులు దిక్కుల నెల్లన్. 1787**

**ప్రతి :** హరి= శ్రీకృష్ణుడు; ఈ తెఱఁగునన్= ఈ విధంగా; రుక్మిణిన్= రుక్మిణిని; కొనితెచ్చి= తీసుకునివచ్చి; పెండ్లి+ఆడుట= పెళ్లి చేసుకోవడం; విని; దుష్కరకృత్యము+అనుచున్= ఇది మరొకరికి చేతకాని పని అని; దిక్కులన్+ఎల్లన్= దిక్కు దిక్కుల్లో ఉన్నరాజులు; రాజసుతుల్= రాజపుత్రులు; వెఱఁగు+అందిరి= ఆశ్చర్యపడ్డారు

**తా :** అన్నిదిక్కుల్లో ఉన్న రాజులు, రాజకుమారులు శ్రీకృష్ణుడు ఈ విధంగా రుక్మిణిని తెచ్చి పెళ్లి చేసుకోవడం అనన్య సామాన్యమైన కార్యమని ఆశ్చర్యపడ్డారు.

**ఆ. అనఘ! యాదిలక్ష్మి యైన రుక్మిణితోడఁ, గ్రీడ సలుపుచున్న కృష్ణుఁ జూచి**
**పట్టణంబులోని ప్రజ యుల్లసిల్లిరి, ప్రీతు లగుచు ముక్తభీతు లగుచు. 1788**

**ప్రతి :** అనఘ!= పాపరహితుడవైన పరీక్షిన్మహారాజా!; ఆదిలక్ష్మి+ఐన= ఆది లక్ష్మీదేవి అపరావతారమైన; రుక్మిణి+తోడన్= రుక్మిణితో; క్రీడన్+సలుపుచున్+ఉన్న= విలాస జీవనం సాగిస్తున్న; కృష్ణున్+చూచి= శ్రీకృష్ణుని చూచి; పట్టణంబులోని= పురంలో ఉండే; ప్రజలు= జనం; ముక్త= విడువబడ్డ; భీతులు+అగుచున్= భయంకలవారై; ప్రీతులు+అగుచున్= సంతోషిస్తూ; ఉల్లసిల్లిరి= పొంగిపోయారు.

**తా :** పాపరహితుడవైన పరీక్షిన్మహారాజా! ఆదిలక్ష్మీదేవి అవతారం అయిన రుక్మిణితో హాయిగా కాలం గడుపుతున్న శ్రీకృష్ణుణ్ణి పురప్రజలందరూ దర్శించి 'భయంనుండి విముక్తులై' సంతోషంతో పొంగిపోయారు.

**వ. అని చెప్పి. 1789**

**ప్రతి :** అని= ఈ విధంగా; చెప్పి= చెప్పిన తరువాత...

**తా :** అని ఈ విధంగా రుక్మిణీ శ్రీకృష్ణుల పరిణయగాథను చెప్పిన తరువాత. ఇంకా

**క. కువలయరక్షాతత్పర, కువలయదళనీలవర్ణకోమలదేహా!**
**కువలయనాథశిరోమణి!, కువలయజనవినుతవిమలగుణసంఘాతా! 1790**

**ప్రతి :** కువలయ= భూమండలాన్ని; రక్షాతత్పర= కాపాడడంలో ఆసక్తికలవాడా!; కువలయదళ= కలువ రేకులవలె; నీలవర్ణ= నల్లనికాంతి కల్గిన; కోమలదేహా= మృదువైనశరీరంగలవాడా! కువలయనాథ= భూపాలకులకు; శిరస్+మణి= శిరోభూషణమైనవాడా; కువలయజన= భూప్రజలచేత; వినుత= పొగడబడిన; విమల= పవిత్రమైన; గుణసంఘాతా= గుణసమూహం కలవాడా!

**తా :** భూమండలాన్ని రక్షించడంలో ఆసక్తికలవాడా! కలువరేకులవలె నీలపువన్నెగల సుకుమారమైన శరీరం కలవాడా! భూపాలకులకు శిరోభూషణమైనవాడా! భూప్రజలచేత పొగడబడే సుగుణరాశి కలవాడా!

**మాలిని. సరసిజనిభహస్తా! సర్వలోకప్రశస్తా!**
**నిరుపమశుభమూర్తీ! నిర్మలారూఢకీర్తీ!**
**పరహృదయవిదారీ! భక్తలోకోపకారీ!**
**గురుబుధజనపోషీ! ఘోరదైతేయశోషీ! 1791**

**ప్రతి :** సరసిజ నిభహస్తా= పద్మంవంటి చేతులు కలవాడా; సర్వలోక= అన్ని లోకాలచేత; ప్రశస్తా= పొగడబడినవాడా!; నిరుపమ= సాటిలేని; శుభమూర్తీ= మంగళస్వరూపా!; నిర్మల+ఆరూఢ కీర్తీ= వన్నెకెక్కిన కీర్తికలవాడా!; పరహృదయ= శత్రువుల గుండెలను; విదారీ= ఖండించువాడా!; భక్తలోక+ఉపకారీ= భక్తసమూహానికి మేలుచేయువాడా; గురుబుధజనపోషీ= పెద్దలను, పండితులను పోషించేవాడా; ఘోరదైతేయశోషీ= భయంకరులైన రాక్షసులను నశింప చేసేవాడా!

**తా :** పద్మాలవంటి చేతులున్నవాడా! అన్నిలోకాలచేత పొగడబడినవాడా! సాటిలేనిమంగళస్వరూపా! స్వచ్ఛమైన, వన్నెకెక్కిన కీర్తి కలిగినవాడా! శత్రువుల గుండెలను చీల్చువాడా! భక్తుల సమూహానికి సహాయం చేసేవాడా; పెద్దవారినీ, పండితులను పోషించేవాడా! భయంకరమైన రాక్షసులను అణచివేసేవాడా!

**గ. ఇది శ్రీపరమేశ్వరకరుణాకలితకవితావిచిత్రకేసనమంత్రిపుత్త్రసహజపాండిత్యపోతనామాత్య ప్రణీతంబయిన శ్రీమహాభాగవతంబను మహాపురాణమునందు దేవకీదేవివివాహంబును, గగనవాణీశ్రవణంబును, కంసోద్రేకంబును, వసుదేవ ప్రార్థనంబును, యోగమాయాప్రభావంబును, బలభద్రుని జన్మంబును, బ్రహ్మాదిసురస్తోత్రంబును, కృష్ణావతారంబును, ఘోషప్రవేశంబును, యోగనిద్రాచరితంబును, నందపుత్త్రోత్సవంబును, పూతనాసంహారంబును, శకట భంజనంబును, తృణావర్తుమరణంబును, గర్గాగమనంబును, నారాయణాదినామనిర్దేశంబును, బాలక్రీడయును, మృద్భక్షణంబును, వాసుదేవవదనగహ్వరవిలోక్యమానాఖిలలోకాలోకనంబును, నవనీతచౌర్యంబును, యశోదారోషంబును, ఉలూఖలబంధనంబును, అర్జునతరుయుగళనిపాతనంబును, నలకూబరమణిగ్రీవులశాపమోక్షణంబును, బృందావనగమనంబును, వత్సపాలనంబును, వత్సాసురవధయును, బకదనుజవిదారణంబును, అఘాసురమరణంబును, వత్సాపహరణంబును, నూతనవత్సబాలకకల్పనంబును, బ్రహ్మవినుతియును, గోపాలనంబును, గార్దభాసురదమనంబును, కాళియఫణి మర్దనంబును, గరుడకాళియనాగవిరోధకథనంబును, ప్రలంబాసురహింసనంబును, దవానల పానంబును, వర్షర్తువర్ణనంబును, శరత్కాలలక్షణంబును, వేణువిలాసంబును, హేమంతసమయ సమాగమంబును, గోపకన్యాచరితహవిష్యవ్రతంబును, కాత్యాయనీసేవనంబును, వల్లనీ వస్త్రావహరణంబును, విప్రవనితాదత్తాన్నభోజనంబును, ఇంద్రయాగనివారణంబును, నందముకుంద సంవాదంబును, పర్వతభంజనంబును, పాషాణసలిలవర్షంబును, గోవర్ధనోద్ధరణంబును, వరుణకింకరుండు నందునిం గొనిపోయినహరి దెచ్చుటయు, వేణుపూరణంబును, గోపికాజనఘోషనిర్గమంబును, యమునాతీరవనవిహరణంబును, కృష్ణాంతర్ధానంబును, ఘోషకామినీగణపరిదేవనంబును, గోపికాన్వేషణంబును, గోపికాగీతలును, హరిప్రసన్నతయును,**

రాసక్రీడనంబును, జలకేళియును, సర్పరూపకుం డయిన సుదర్శనవిద్యాధరుండు హరిచరణతాడనంబున నిజరూపంబు వడయుటయును, శంఖచూడుండనుగుహ్యకుని వధించుటయును, వృషభాసురవిదళనంబును, నారదోపదేశంబున హరిజన్మకథ నెఱిఁగి కంసుండు దేవకీవసుదేవుల బద్ధులం జేయుటయును, ఘోటకాసురుం డయిన కేశి యను దనుజుని వధించుటయును, నారదస్తుతియును, వ్యోమదానవమరణంబును, అక్రూరాగమనంబును, అక్రూరరామకృష్ణులసల్లాపంబును, ఘోషనిర్గమంబును, యమునాజలాంతరాళంబున నక్రూరుండు హరివిశ్వరూపమును గాంచుటయును, అక్రూరస్తవంబును, మథురానగరప్రవేశంబును, రజకవధయును, వాయకమాలికులచే సమ్మానమొందుటయును, కుబ్జాప్రసాదకరణంబును, ధనుర్భంగంబును, కంసుదుస్స్వప్నంబును, కువలయాపీడపీడనంబును, రంగస్థలప్రవేశంబును, చాణూరముష్టికుల వధయును, కంసవధయును, వసుదేవదేవకీబంధమోక్షణంబును, ఉగ్రసేనురాజ్యస్థాపనంబును, రామకృష్ణులు సాందీపనివలన విద్య లభ్యసించుటయును, సంయమనీనగరగమనంబును, గురుపుత్త్రదానంబును, ఉద్ధవునిఘోషయాత్రయును, భ్రమరగీతలును, కుబ్జావాసగమనంబును, కరినగరంబునకు నక్రూరుండు సని కుంతీదేవి నూరార్చుటయు, కంసభార్యలగు నస్తి ప్రాప్తులు జరాసంధునకుఁ గంసుమరణం బెఱింగించుటయును, జరాసంధుని దండయాత్రయును, మథురానగరనిరోధనంబును, యుద్ధంబున జరాసంధుండు సప్తదశవారంబులు పలాయితుం డగుటయు, నారదప్రేరితుండై కాలయవనుండు మథురపై దాడి వెడలుటయును, ద్వారకానగరనిర్మాణంబును, మథురాపురనివాసులం దనయోగబలంబున హరి ద్వారకానగరంబునకుఁ దెచ్చుటయు, కాలయవనుండు హరివెంటం జని గిరిగుహయందు నిద్రితుండైన ముచుకుందునికోపదృష్టివలన నీఱగుటయును, ముచుకుందుండు హరిని సంస్తుతి చేసి తపంబునకుం జనుటయును, జరాసంధుఁడు గ్రమ్మఱ రామకృష్ణులపై నేతెంచుటయును, ప్రవర్షణపర్వతారోహణంబును, గిరిదహనంబును, గిరి డిగ్గ నుఱికి రామకృష్ణులు ద్వారకకుం జనుటయు, రుక్మిణీజన్మంబును, రుక్మిణీ సందేశంబును, వాసుదేవాగమనంబును, రుక్మిణీగ్రహణంబును, రాజలోకపలాయనంబును, రుక్మి యనువాని భంగంబును, రుక్మిణీకల్యాణంబును ననుకథలు గల దశమస్కంధంబునందుఁ బూర్వభాగంబు సంపూర్ణము. **1792**

**ప్రతి :** ఇది= దశమస్కంధంయొక్క పూర్వభాగం; శ్రీ పరమేశ్వర= శ్రీ పరమేశ్వరునియొక్క; కరుణా= దయచేత; కలిత= పొందబడిన; కవితావిచిత్ర= కవిత్వ వైచిత్రి కలవాడునూ; కేసనమంత్రి పుత్త్ర= కేసనమంత్రియొక్క కుమారుడునూ; సహజపాండిత్య= సహజసిద్ధమయిన పాండిత్యం కలవాడును అయిన; పోతనామాత్య= బమ్మెర పోతనామాత్యునిచేత; ప్రణీతంబు+అయిన= రచింపబడిన; శ్రీమహాభాగవతంబు+అను= శ్రీమహాభాగవతం అనే; మహాపురాణంబున్+అందున్= మిక్కిలి గొప్పదయిన పురాణంలో; దేవకీదేవి వివాహంబును= వసుదేవునితో జరిగిన దేవకీ దేవియొక్క పెళ్లీ; గగనవాణీ శ్రవణంబును= ఆకాశవాణిని (మాటలు) కంసుడు వినడమూ; కంస+ఉద్రేకంబును= కంసునియొక్క కోపంతో కూడిన; కృష్ణావతారంబును= శ్రీ కృష్ణునియొక్క అవతారమూ; ఘోషప్రవేశంబును= గొల్లపల్లెలో ప్రవేశించడమూ; యోగనిద్రా చరితంబును= యోగనిద్రయొక్క వృత్తాంతమూ; వసుదేవ ప్రార్థనంబును= వసుదేవునియొక్క ప్రార్థనమూ; యోగమాయా ప్రభావంబును= యోగమాయయొక్క మహిమా; బలభద్రుని జన్మంబును= బలరామునియొక్క పుట్టుకా; బ్రహ్మ+ఆదిసురస్తోత్రంబును= బ్రహ్మ మొదలయిన దేవతలయొక్క

స్తుతులూ; నందపుత్త్ర+ఉత్సవంబును= నందుని పుత్త్రుడు (శ్రీకృష్ణుడు) పుట్టినప్పటి వేడుకా; పూతనా సంహారంబును= పూతన అనే రాక్షసిని చంపడమూ; శకట భంజనంబును= శకటాసురుని చంపడమూ; తృణావర్తుమరణంబును= తృణావర్తుడను రాక్షసుడు చావడమూ; గర్గ+ఆగమనంబును= గర్గుడనే పురోహితుడు రావడమూ; నారాయణ+ఆదినామ నిర్దేశంబును= నారాయణుడు మొదలైన పేర్లను పెట్టడమూ; బాలక్రీడయును= శ్రీకృష్ణుని బాల్యక్రీడలూ; మృత్+భక్షణంబును= కృష్ణుడు మట్టితినడమూ; వాసుదేవ వదనగహ్వర= (యశోద) శ్రీ కృష్ణుని నోరు అనే గుహయందు; విలోక్యమాన= చూడబడుచున్న; అఖిలలోక+ఆలోకనంబును= సమస్తలోకాల సందర్శనమూ; నవనీత చౌర్యంబును= బాలకృష్ణుడు వెన్నను దొంగిలించడమూ; యశోదా రోషంబును= యశోద కోపగించడమూ; ఉలూఖల బంధనంబును= యశోద కృష్ణుని ఱోటికి కట్టివేయడమూ; అర్జున తరుయుగళ నిపాతనంబును= రెండు మద్దిచెట్లు కూల్చి వేయడమూ; నలకూబర మణిగ్రీవుల= నలకూబరుడు, మణిగ్రీవుడు అనే గుహ్యకులయొక్క; శాపమోక్షణంబును= శాపాలకు విముక్తి కలగడమూ; బృందావన గమనంబును= బృందావనానికి వెళ్లడమూ; వత్సపాలనంబును= దూడలను మేపడమూ; వత్స+అసుర వధయును= వత్సుడనే రాక్షసుణ్ణి చంపడమూ; బక దనుజ విదారణంబును= బకుడు అనే రాక్షసుణ్ణి చీల్చడమూ; అఘ+అసుర మరణంబును= అఘుడనే రాక్షసుడి చావూ; వత్స+అపహరణంబును= ఆవు దూడలను బ్రహ్మ దొంగిలించడమూ; నూతన వత్స బాలక కల్పనంబును= శ్రీకృష్ణుడు కొత్తగా ఆవుదూడలను గోపాలురను సృష్టించడమూ; బ్రహ్మవినుతియు= బ్రహ్మ చేసిన స్తోత్రమూ; గోపాలనంబును= శ్రీకృష్ణుడు గోవులను మేపడమూ; గార్దభ+అసుర దమనంబును= గాడిద రూపంలో ఉన్న రాక్షసుణ్ణి చంపడమూ; కాళియఫణి మర్దనంబును= కాళియుడనే సర్పాన్ని అణచివేయడమూ; గరుడ కాళియనాగ విరోధ కథనంబును= గరుత్మంతునికీ, కాళియుడనే సర్పానికి మధ్య ఏర్పడిన శత్రుత్వం గురించి వివరించడమూ; ప్రలంబ+అసురహింసనంబును= ప్రలంబుడనే రాక్షసుణ్ణి బలరాముడు చంపడమూ; దవ+అనలపానంబును= శ్రీకృష్ణుడు అరణ్యంలో పుట్టిన దావాగ్నిని మ్రింగడమూ; వర్ష+ ఋతువర్ణనంబును= వర్షఋతువును వర్ణించడమూ; శరత్కాల లక్షణంబును= శరదృతువుయొక్క లక్షణాలూ; వేణువిలాసంబును= పిల్లనగ్రోవి మ్రోయించి ఆనందించడమూ; హేమంత సమయ సమాగమంబును= హేమంతఋతువు రావడమూ; గోపకన్యా+ ఆచరిత హవిష్యవ్రతంబును= గోపికాస్త్రీలచే ఆచరించబడిన హవిష్యవ్రతమూ; కాత్యాయనీ సేవనంబును= కాత్యాయనీ దేవిని పూజించడమూ; వల్లవీ వస్త్ర+అపహరణంబును= గోపికాకాంతల వస్త్రాలను అపహరించడమూ; విప్రవనితా దత్త+అన్న భోజనంబును= బ్రాహ్మణ స్త్రీలు తెచ్చిన అన్నాన్ని శ్రీకృష్ణుడు తినడమూ; ఇంద్రయాగ నివారణంబును= ఇంద్రయాగాన్ని శ్రీకృష్ణుడు నివారించడమూ; నందముకుంద సంవాదంబును= నందుడికీ, శ్రీకృష్ణుడికీ మధ్యజరిగిన సంభాషణమూ; పర్వత భంజనంబును= గోవర్ధన పర్వతాన్ని పెకలించడమూ; పాషాణసలిల వర్షంబును= ఇంద్రుడు రాళ్లవాన కురిపించడమూ; గోవర్ధన+ఉద్ధరణంబును= గోవర్ధనం అనే పర్వతాన్ని ఎత్తడమూ; వరుణకింకరుండు= వరుణదేవుని సేవకుడు; నందునిన్+ కొనిపోయినన్= నందుణ్ణి తీసుకుపోగా; హరి+తెచ్చుటయును= శ్రీకృష్ణుడు తిరిగి తీసుకొనిరావడమూ; వేణుపూరణంబును= శ్రీకృష్ణుడు పిల్లనగ్రోవిని ఊదడమూ; గోపికాజన ఘోషనిర్గమంబును= గోపికాస్త్రీలు గొల్లపల్లెను విడిచి శ్రీకృష్ణుని వద్దకురావడమూ; యమునాతీర వనవిహరణంబును= యమునాతీరంలోని వనంలో విహరించడమూ; కృష్ణ+అంతర్ధానంబును= కృష్ణుడు మాయం కావడమూ; ఘోషకామినీ గణ పరిదేవనంబును= గోపకాంతలు దుఃఖించడమూ; గోపికా+అన్వేషణంబును= శ్రీకృష్ణుని కొఱకు గోపికలు వెదకడమూ; గోపికాగీతలును= గోపికా గీతలునూ; హరి ప్రసన్నతయును= శ్రీకృష్ణుడు ప్రసన్నుడు కావడమూ; రాసక్రీడనంబును= రాసక్రీడలాడడమూ; జలకేళియును= జలక్రీడలాడడమూ; సర్పరూపకుండు+అయిన సుదర్శన విద్యాధరుడు= పాము రూపంలో ఉండే సుదర్శనుడనే పేరుగల విద్యాధర దేవజాతికి చెందినవాడు; హరిచరణ తాడనంబునన్=

శ్రీకృష్ణునియొక్క పాదాల తాకిడివల్ల; నిజరూపంబు+పడయుటను= తన అసలు రూపాన్ని పొందడమూ; శంఖచూడుండు+అను గుహ్యకుని వధించుటయును= కుబేరుని సేవకుడయిన శంఖచూడుడు అనే యక్షుణ్ణి శ్రీకృష్ణుడు చంపడమూ; వృషభ+ అసురవిదళనంబును= వృషభాసురుణ్ణి చంపడమూ; నారద+ఉపదేశంబునన్ హరిజన్మకథన్+ఎఱిఁగి కంసుండు దేవకీవసుదేవుల బుద్ధులన్+ చేయుటయును= నారదుడు చెప్పడంవల్ల శ్రీకృష్ణుని పుట్టుకను తెలుసుకొన్న కంసుడు దేవకీవసుదేవులను బంధించడమూ; ఘోటక+అసురుండు+అయిన కేశి+అను దనుజుని వధించుటయును= గుర్రం ఆకారంలో వచ్చిన కేశి అనే రాక్షసుణ్ణి శ్రీకృష్ణుడు చంపడమూ; నారదస్తుతియును= నారదుడు శ్రీకృష్ణుని గూర్చి చేసిన స్తోత్రమూ; వ్యోమదానవ మరణంబును= వ్యోమాసురుడి మరణమూ; అక్రూర+ఆగమనంబును= అక్రూరుడు రావడమూ; అక్రూర రామకృష్ణుల సల్లాపంబును= అక్రూరుడు, బలరాముడు శ్రీకృష్ణుడుతో మాట్లాడడమూ; ఘోషనిర్గమంబును= వ్రేపల్లెనుండి బయలుదేరడమూ; యమునాజల+ అంతరాళంబునన్, అక్రూరుండు హరి విశ్వరూపంబును+కాంచుటయు= యమునానదీ నీటిలోపల అక్రూరుడు శ్రీకృష్ణుని విశ్వరూపం దర్శించడమూ; అక్రూరస్తవంబును= అక్రూరుడు చేసిన శ్రీకృష్ణ స్తోత్రమూ; మథురాగననగర ప్రవేశంబును= మథురా నగరంలోకి ప్రవేశించడమూ; రజక వధయును= చాకలివాణ్ణి చంపడమూ; వాయక మాలికులచే – సమ్మానము+ పొందుటయును= సాలెవాడు ఇచ్చిన వస్త్రాలను, సుధాముడు ఇచ్చిన పుష్పాలను ధరించడమూ; కుబ్జాప్రసాద కరణంబును= కుబ్జను అనుగ్రహించడమూ; ధనుస్+భంగంబును= వింటిని విరవడమూ; కంసు దుస్స్వప్నంబును= కంసుడికి పీడకల రావడమూ; కువలయాపీడ పీడనంబును= కువలయాపీడం అనే ఏనుగును శ్రీకృష్ణుడు చంపడమూ; రంగస్థల ప్రవేశంబును= మల్లయుద్ధపు బరిలోకి దిగడమూ; చాణూరముష్టికుల వధయును= చాణూరుడు ముష్టికుడు అనే మల్లయోధులను కృష్ణబలరాములు చంపడమూ; కంసవధయును= కంసుణ్ణి చంపడమూ; వసుదేవ దేవకీబంధమోక్షణంబును= చెఱసాలనుండి దేవకీవసుదేవులను విడిపించడమూ; ఉగ్రసేను రాజ్యస్థాపనంబును= కంసుని తండ్రియైన ఉగ్రసేనునికి రాజ్యాధికారాన్ని కట్టబెట్టడమూ; రామకృష్ణులు సాందీపనివలన విద్యలు+అభ్యసించుటయును= బలరామకృష్ణులు సాందీపని అనే గురువువద్ద సకలవిద్యలను నేర్చుకోవడమూ; సంయమనీ నగర గమనంబును= కృష్ణుడు గురువు కొరకు సంయమని అనే పేరుగల యముని నగరానికి వెళ్లడమూ; గురుపుత్త్రదానంబును= గురువుయొక్క కొడుకును యమునివద్ద నుండి తీసుకువచ్చి ఇవ్వడమూ; ఉద్ధవుని ఘోషయాత్రయును= ఉద్ధవుడు గోకులానికి రావడమూ; భ్రమరగీతలును= భ్రమరగీతలునూ; కుబ్జా+ ఆవాసగమనంబును= కృష్ణుడు కుబ్జ ఇంటికి వెళ్లడమూ; కరినగరంబునకున్+అక్రూరుండు+చనికుంతీదేవిన్+ఊరార్చుటయును= హస్తినాపురానికి అక్రూరుడు వెళ్లి కుంతీదేవిని ఓదార్చడమూ; కంసభార్యలు+అగు+అస్తిప్రాస్తులు జరాసంధునకున్+ కంసుమరణంబు+ఎఱింగించుటయును= అస్తి, ప్రాస్తి అనే పేర్లుగల కంసుని భార్యలు ఇద్దరూ తమ భర్త చావు గురించి జరాసంధుడికి తెలియజేయడమూ; జరాసంధుని దండయాత్రయును= జరాసంధునియొక్క దాడియూ; మధురానగర నిరోధంబును= జరాసంధుడు మధురానగరాన్ని చుట్టుముట్టడమూ; యుద్ధంబున జరాసంధుండు సప్తదశవారంబులు పలాయితుండు+అగుటయు= యుద్ధంలో జరాసంధుడు పదిహేడుసార్లు ఓడిపోయి పారిపోవడమూ; నారదప్రేరితుండు+ ఐ+కాలయవనుండు మధురపై దాడి వెడలుటయును= నారదమహర్షి ప్రేరేపణవల్ల కాలయవనుడు మధురానగరంపై దండయాత్ర చేయడమూ; ద్వారకానగర నిర్మాణంబును= సముద్రంలోపల ద్వారక అనే నగరాన్ని నిర్మించడమూ; మథురాపుర నివాసులన్+తనయోగబలంబున్ హరి ద్వారకానగరంబునకున్+తెచ్చుటయును= మథురానగరంలో ఉండేవారిని కృష్ణుడు తన యోగబలంతో ద్వారకా నగరానికి తీసుకుపోవడమూ; కాలయవనుండు హరివెంటన్+చని గిరిగుహ+అందున్ నిద్రితుండు+ ఐన ముచుకుందుని కోపదృష్టివలనన్ నీఱు+అగుటయును= కాలయవనుడు శ్రీకృష్ణుని వెంబడించి కొండగుహలో నిద్రిస్తున్న ముచుకుందుని కోపదృష్టికి బూడిదైపోవడమూ; ముచుకుందుండు హరిని సంస్తుతి చేసి తపంబునకున్+చనుటయును=

ముచుకుందుడు శ్రీకృష్ణుని స్తుతించి తపస్సుకోసం వెళ్లడమూ; జరాసంధుండు+క్రమ్మఱన్ రామకృష్ణులపైన్+ఏతెంచుటయును= జరాసంధుడు మళ్లీ బలరామకృష్ణులపై దాడిచేయడమూ; ప్రవర్షణ పర్వత+ఆరోపణంబును= బలరామకృష్ణులు ప్రవర్షణమనే పర్వతాన్ని ఎక్కడమూ; గిరిదహనంబును= ఆ కొండను జరాసంధుడు దహించడమూ; గిరిడిగ్గన్+ఉరికి రామకృష్ణులు ద్వారకకున్+చనుటయు= ప్రవర్షణ పర్వతంనుండి దూకి బలరామకృష్ణులు ద్వారకానగరానికి పోవడమూ; రుక్మిణీ జన్మంబును= రుక్మిణీదేవి పుట్టుకా; రుక్మిణీ సందేశంబును= శ్రీకృష్ణునికి రుక్మిణి పంపిన సందేశమూ; వాసుదేవ+ఆగమనంబును= రుక్మిణికొరకు కుండిన నగరానికి శ్రీకృష్ణుడు రావడమూ; రుక్మిణీ గ్రహణంబును= శ్రీకృష్ణుడు రుక్మిణిని చేపట్టడమూ; రాజలోక పలాయనంబును= రాజసమూహం కృష్ణునితో యుద్ధం చేసి పారిపోవడమూ; రుక్మి+అనువానిభంగంబును= రుక్మి అనేవానికి జరిగిన అవమానం; రుక్మిణీ కల్యాణంబునున్= రుక్మిణీదేవి వివాహం; అనుకథలు+కల= అనే కథలు కలిగివున్న; దశమస్కంధంబు+అందున్= పదవ స్కంధంలో; పూర్వభాగంబు సంపూర్ణము= పూర్వభాగం ఇక్కడితో పరిసమాప్తం అయింది.

**తా :** శ్రీమహాభాగవతం అనే ఈ మహాపురాణం పరమేశ్వరుని దయవల్ల పోతనామాత్యునిచేత రచించబడింది. అతడు కవితావైచిత్రి ఉన్నవాడు. కేసనమంత్రికి పుత్రుడు. సహజపండితుడు. అతడు చేసిన ఈ రచనలో ఇది దశమస్కంధం పూర్వభాగం. ఇందులో

దేవకీదేవివివాహం, ఆకాశవాణిపలుకులను కంసుడు వినడం; కంసుడు కోపంతో ఊగిపోవడం, వసుదేవుడు వేడుకోవడం, యోగమాయాదేవిమహిమ, బలరాముడిపుట్టుక, బ్రహ్మ మొదలైన దేవతలు చేసినస్తోత్రం, శ్రీకృష్ణుని అవతారం, గొల్లపల్లెలోనికి ప్రవేశించడం, యోగనిద్ర వృత్తాంతం, శ్రీకృష్ణుని పుట్టుక, నందుడి ఆనందం, శ్రీకృష్ణుడు పూతనను చంపడం, శకటాసురుణ్ణి విరిచేయడం, తృణావర్తుడనే రాక్షసుడు మరణించడం, గర్గుడనే పురోహితుడు రావడం, 'నారాయణ' మొదలైన పేర్లను నిర్దేశించడం, శ్రీకృష్ణుని బాలక్రీడలు, మట్టితినడం, శ్రీకృష్ణుని నోటిలో యశోద సర్వలోకాలనూ దర్శించడం, కృష్ణుడు వెన్న దొంగలించడం, యశోద కోపగించుకోవడం, రోటికి కట్టేయడం, రెండు మద్దిచెట్లు కూలిపోవడం, నలకూబరుడు, మణిగ్రీవుడు అనే వాళ్లకు శాపాలు తీరడం, బృందావనానికి వెళ్లడం, శ్రీకృష్ణుడు దూడలను మేపడం, వత్సాసురుడు అనేవాణ్ణి చంపడం, బకుడు అనే రాక్షసుణ్ణి చంపడం, అఘాసురుణ్ణి చంపడం, బ్రహ్మదేవుడు ఆవుదూడలను మాయం చేయడం; శ్రీకృష్ణుడు మళ్లీ కొత్తగోవులను దూడలను గోపాలకులను సృష్టించడం; బ్రహ్మ శ్రీకృష్ణుణ్ణి స్తోత్రం చేయడం; కృష్ణుడు ఆవులను మేపడం; గర్ధభాసురుణ్ణి చంపడం, కాళియుడనే సర్పాన్ని అణచడం; గరుడునికి కాళియుడనే సర్పానికి శత్రుత్వం కలిగినకథ; ప్రలంబుడనే రాక్షసుణ్ణి బలరాముడు చంపడం; శ్రీకృష్ణుడు దావాగ్నిని మింగడం; వర్షఋతువర్ణనం, శరత్కాలలక్షణాలు; పిల్లనగ్రోవి మ్రోయించి వినోదించడం; హేమంత ఋతువు రావడం; గోపకన్యలు హవిష్యవ్రతాన్ని చేయడం; కాత్యాయనీదేవిని పూజించడం; గోపికావస్త్రాపహరణం; బ్రాహ్మణపత్నులు తెచ్చి ఇచ్చిన అన్నాన్ని శ్రీకృష్ణుడు తినడం; ఇంద్రునియాగాన్ని కృష్ణుడు నివారించడం, నందుడికీ శ్రీకృష్ణునికీ మధ్య జరిగిన సంభాషణం, శ్రీకృష్ణుడు గోవర్ధనగిరిని కదలించడం, ఇంద్రుడు రాళ్లవాన కురిపించడం, గోవర్ధనమనే కొండను ఎత్తడం, వరుణుని సేవకుడు నందుణ్ణి తీసుకుని వెళితే శ్రీకృష్ణుడు తిరిగి తీసుకునిరావడం, శ్రీకృష్ణుడు పిల్లనగ్రోవిని ఊదడం, గోపికలు శ్రీకృష్ణునివద్దకు మందను వీడి రావడం, యమునానదీతీరంలో విహరించడం, శ్రీకృష్ణుడు మాయం కావడం, గొల్లకన్యలు అతడు కనిపించక దుఃఖించడం, గోపికలు శ్రీకృష్ణుణ్ణి వెదకడం, గోపికాగీతలు, శ్రీకృష్ణుడు ప్రసన్నుడు కావడం, రాసక్రీడావర్ణనం, జలకేళి, పాముురూపంలో ఉండే సుదర్శనుడనే విద్యాధరుడు శ్రీకృష్ణుని కాలితాకిడితో తన అసలు రూపాన్ని పొందడం, కుబేరునిసేవకుడైన శంఖచూడుడనే యక్షుణ్ణి శ్రీకృష్ణుడు చంపడం, వృషభాసురుణ్ణి చంపడం, నారదుడు చెప్పినందువల్ల కంసుడికి శ్రీకృష్ణుడి పుట్టుక గురించి తెలిసి దేవకీవసుదేవులను బంధించడం, గుర్రం ఆకారంలో

వచ్చిన కేశి అనే రాక్షసుణ్ణి కృష్ణుడు చంపడం, నారదుడు శ్రీకృష్ణుణ్ణి స్తోత్రం చేయడం, వ్యోమాసురుడిని కృష్ణుడు చంపడం, అక్రూరుడు రావడం, అక్రూరుడు, బలరామకృష్ణులు సంభాషించుకోవడం, మథురకు బయలుదేరడం, యమునా నదీ జలాల్లో అక్రూరుడు శ్రీకృష్ణుని విశ్వరూపాన్ని దర్శించడం, అక్రూరుడు శ్రీకృష్ణుణ్ణి స్తుతించడం, మథురానగరంలోకి ప్రవేశించడం, రజకుణ్ణి చంపడం, సాలె ఇచ్చిన వస్త్రాలను, సుదాము డిచ్చిన పూలను ధరించడం, కుబ్జపట్ల కృష్ణుడు ప్రసన్నుడు కావడం, ధనుస్సును విరవడం, కంసుడికి పీడకల రావడం, కువలయాపీడం అనే ఏనుగును శ్రీకృష్ణుడు చంపడం, కృష్ణుడు మల్లయుద్ధం బరిలోకి దిగడం, చాణూరుడు, ముష్టికుడు అనే మల్లవీరులను బలరామకృష్ణులు చంపడం, కంసుణ్ణి చంపడం, చెరసాలలో ఉన్న దేవకీవసుదేవుల్ని విడిపించడం, ఉగ్రసేనునికి రాజ్యాధికారాన్ని ఇవ్వడం, సాందీపుడు అనే గురువుదగ్గర బలరామకృష్ణులు అరవైనాలుగువిద్యల్ని నేర్చుకోవడం, గురువుకోసం శ్రీకృష్ణుడు సంయమనీనగరానికి వెళ్లడం, గురుపుత్రుణ్ణి యముడివద్దనుంచి అడిగి వెనక్కి తీసుకురావడం, ఉద్ధవుడు గోకులానికి రావడం, భ్రమరగీతలు, శ్రీకృష్ణుడు కుబ్జ ఇంటికి వెళ్లడం, హస్తినాపురికి అక్రూరుడు వెళ్లి కుంతిని ఓదార్చడం, అస్తి ప్రాప్తి అనే పేర్లున్న కంసుడిభార్యలు తమభర్త చావునుగురించి జరాసంధుడికి చెప్పడం, జరాసంధుని దాడి, మథురానగరాన్ని జరాసంధుడు చుట్టుముట్టడం, పదిహేడుసార్లు ఓడిపోయి జరాసంధుడు పారిపోవడం, నారదుడు ప్రేరేపించడంవల్ల కాలయవనుడు అనేవాడు మథుర మీద దాడి చేయడం, సముద్రంలో ద్వారక అనే నగరాన్ని నిర్మించడం, మథురానగరంలో ఉన్నవారిని తన యోగబలంతో కృష్ణుడు ద్వారకానగరానికి తీసుకురావడం, కాలయవనుడు శ్రీకృష్ణుని వెంటబడి కొండగుహలో నిద్రిస్తున్న ముచుకుందుని కోపదృష్టులకు బూడిదైపోవడం, ముచుకుందుడు శ్రీకృష్ణుణ్ణి స్తోత్రంచేసి తపస్సుకు వెళ్లడం, జరాసంధుడు తిరిగి బలరామకృష్ణులపై దాడిచేయడం, ప్రవర్షణమనే కొండను ఎక్కడం, జరాసంధుడు ఆ కొండను దహింపచేయడం, కొండనుంచి దూకి శ్రీకృష్ణబలరాములు ద్వారకకు రావడం, రుక్మిణి పుట్టుక, శ్రీకృష్ణునికి రుక్మిణి సందేశం పంపడం, శ్రీకృష్ణుడు ఆమెకోసం కుండినపురానికి రావడం, రుక్మిణిని చేపట్టడం, రాజులందరూ యుద్ధంచేసి ఓడిపోవడం, రుక్మి అనేవాడికి అవమానం, రుక్మిణీకల్యాణం, అనే కథలు గల దశమస్కంధంలో పూర్వభాగం ఇక్కడితో పరిసమాప్తం అయింది.

*:: శ్రీకృష్ణార్పణమస్తు ::*

# పద్యగద్యసూచి

## దశమస్కంధము - పూర్వభాగము

| | | |
|---|---|---|
| 28. | తులసి నిత్యపూజ, తులసీఉపయోగాలు | 10-00 |
| 29. | శ్రీ చక్ర రహస్య విజ్ఞానమ్ | 36-00 |
| 30. | శ్రీచక్ర పూజావిధానం(పెద్దది) | 36-00 |
| 31. | లక్ష్మీ - గౌరీ నిత్యపూజ | 10-00 |
| 32. | శ్రీ సరస్వతీ నిత్యపూజ | 10-00 |
| 33. | శ్రీ దుర్గానిత్యపూజ | 10-00 |
| 34. | కాలభైరవ నిత్యపూజ | 10-00 |
| 35. | శివపూజ | 10-00 |
| 36. | వీరభద్ర పూజ | 10-00 |
| 37. | ఆంజనేయ నిత్యపూజ | 10-00 |
| 38. | నాగేంద్ర స్వామి పూజ | 10-00 |
| 39. | సుబ్రహ్మణ్య నిత్యపూజ | 10-00 |
| 40. | రామదేవుని కథ | 10-00 |
| 41. | శివదేవుని కథ | 10-00 |
| 42. | లక్ష్మీనరసింహపూజ | 10-00 |
| 43. | వేంకటేశ్వరపూజ | 10-00 |
| 44. | బ్రహ్మంగారి నిత్యపూజ | 10-00 |
| 45. | సూర్య నిత్యపూజ | 10-00 |
| 46. | నవగ్రహ నిత్యపూజ | 10-00 |
| 47. | రుక్మిణీ కల్యాణం | 25-00 |
| 48. | ఉమామహేశ్వర వ్రతం | 36-00 |
| 49. | శ్రీ కామేశ్వరీ వ్రతం | 36-00 |
| 50. | 16 సోమవారముల వ్రతము | 25-00 |
| 51. | పార్వతీకల్యాణం | 25-00 |
| 52. | సహస్రకమలవర్తి వ్రతము | 25-00 |
| 53. | పంచముఖ ఆంజనేయ పూజావిధానము | 36-00 |
| 54. | అష్టనాగపూజ | 36-00 |
| 55. | పూజలు ఎందుకుచేయాలి ? | 36-00 |
| 56. | ఏ దేవునికి ఏపుష్పాలతో పూజించాలి? | 36-00 |
| 57. | ఏ దేవునికి ఏప్రసాదం నైవేద్యం పెట్టాలి? | 36-00 |
| 58. | ఏదేవునికి ఏవిధముగాదీపారాధనచెయ్యాలి? | 36-00 |
| 59. | ఏదేవునికి ఎన్ని ప్రదక్షిణలుచేయాలి ? | 36-00 |
| 60. | హనుమద్ వ్రతం | 36-00 |
| 61. | పంచాయతన పూజ | 63-00 |
| 62. | 28 వ్రతములు | 120-00 |

63. కలశపూజలు (9ఒకేసారి) 150-00
64. కలశపూజలు (విడివిడిగా) (ప్రింటులో) ....
65. హ్రీంకార మహాయజ్ఞం (ప్రింటులో) ....
66. గోమాత 40-00

## 2. స్తోత్రాలు-సుప్రభాతములు సహస్రనామములు

1. శ్రీ లలితా విష్ణు సహస్రనామస్తోత్రాలు 45-00
పురాణపండ రాధాకృష్ణమూర్తిగారి సంకలనం
2. లలితావిష్ణు సహస్రనామస్తోత్రములు (హిందీ) ,, 50-00
3. లలితావిష్ణు సహస్రనామస్తోత్రములు (ఇంగ్లీషు) ,, 50-00
4. స్థూలాక్షరిలలితావిష్ణుసహస్రనామస్తోత్రములు(పత్రికసైజ్) 99-00
5. లలితావిష్ణు (కేస్ బైండ్) 1/8 డెమ్మి 63-00
6. స్థూలాక్షరీ లలితావిష్ణు (క్రౌన్‌సైజు)కేస్‌బైండ్ 108-00
7. సర్వదేవతా స్తోత్రమంజరి 120-00
8. సకలదేవతా అష్టోత్తరశతనామావళిః (63) 24-00
9. విష్ణుసహస్రనామస్తోత్రమ్ (క్రౌన్) 25-00
10. లలితా సహస్రనామ స్తోత్రమ్ (క్రౌన్) 36-00
11. లలితా సహస్రనామములు 24-00
12. లక్ష్మీ సహస్రనామములు 24-00
13. దుర్గా సహస్రనామములు 24-00
14. ఆంజనేయ సహస్రనామములు 24-00
15. శివ సహస్రనామములు 24-00
16. విష్ణు సహస్రనామములు 24-00
17. గణపతి సహస్రనామములు 24-00
18. సుబ్రహ్మణ్య సహస్రనామములు 24-00
19. గాయత్రి సహస్రనామములు 24-00
20. లలితావిష్ణు సహస్రనామస్తోత్రాలు 24-00
21. శ్రీరామా సహస్రనామములు 24-00
22. సరస్వతి సహస్రనామములు 24-00
23. సూర్యసహస్రనామములు & ఆదిత్యహృదయం 24-00
24. శ్రీవేంకటేశ్వరసహస్రనామములు 24-00
25. మణిద్వీపవర్ణన (పెద్దది) 24-00
26. సంధ్యావందనం 24-00
27. మంత్రపుష్పమ్ ....
28. త్రిభాషా హనుమాన్‌చాలీసా 15-00
29. హనుమాన్ చాలీసా 10-00

| | | |
|---|---|---|
| 30. | మణిద్వీపవర్ణన (పాకెట్) | 10-00 |
| 31. | ఆరు చాలీసాలు | 10-00 |
| 32. | శివారాధన (శివస్తోత్రాలు) | 10-00 |
| 33. | వేంకటేశ్వర సుప్రభాతం (పాకెట్) | 10-00 |
| 34. | ఆరుదండకాలు | 5-00 |
| 35. | వేంకటేశ్వర గోవిందనామములు | 5-00 |
| 36. | అష్టలక్ష్మీ స్తోత్రమ్ కనకధారాస్తోత్రమ్ | 10-00 |
| 37. | దేవీఖడ్గమాలాస్తోత్రమ్ (మహిషాసురమర్దనీస్తోత్రంతో) | 10-00 |
| 38. | సుందరకాండ (పాకెట్) | 10-00 |
| 39. | భగవద్గీత మూలం | 27-00 |
| 40. | రామరక్షాస్తోత్రమ్ | 15-00 |
| 41. | స్తోత్ర రత్నావళి | 36-00 |
| 42. | పురాణపండ లలితా-విష్ణు సహస్రనామస్తోత్రమ్(మినీ) | 10-00 |
| 43. | పురాణపండ లలితాసహస్రనామస్తోత్రమ్(మినీ) | 10-00 |
| 44. | పురాణపండ విష్ణు సహస్రనామస్తోత్రమ్ | 10-00 |
| 45. | పురాణపండ ఆదిత్య హృదయం | 10-00 |
| 46. | మంత్రపుష్పం (మినీ) | 10-00 |
| 47. | శివానందలహరి-సౌందర్యలహరి | 36-00 |
| 48. | కుజదోషం | 10-00 |
| 49. | కాలసర్ప దోషం | 10-00 |
| 50. | మీ అప్పులు తీరాలా? | 10-00 |
| 51. | దృష్టిదోషాలు నివారణ | 10-00 |
| 52. | పంచసూక్తములు | 10-00 |
| 53. | సంధ్యావందనం | 10-00 |
| 54. | రుద్రనమకమ్-చమకమ్ | 10-00 |
| 55. | గాయత్రీమంత్రాలు | 10-00 |
| 56. | హయగ్రీవ స్తోత్రమాల | 10-00 |
| 57. | దక్షిణామూర్తి స్తోత్రమాల | 10-00 |
| 58. | ద్వాదశ జ్యోతిర్లింగాలు - పంచారామాలతో | 10-00 |
| 59. | శ్రీసూక్తం పురుష సూక్తం | 10-00 |
| 60. | నవగ్రహస్తోత్రమాల | 36-00 |
| 61. | మహాన్యాసమ్ | 36-00 |
| 62. | సుందరకాండ గానామృతం | 36-00 |
| 63. | గోమాతపూజావిధానము | 10-00 |
| 64. | ఆనందసిద్ధి - 1 శ్రీదేవీ స్తోత్రమాల | 108-00 |

| | | |
|---|---|---|
| 65. | ఆనందసిద్ధి - 2 ఏ సమస్యకు ఏ స్తోత్రమ్ పారాయణచేయాలి | 108-00 |
| 66. | ఆనందసిద్ధి-3 మానసదేవీ స్తోత్రమాల | 108-00 |
| 67. | శ్రీ కాలభైరవ రక్షా కవచమ్ | 63-00 |
| 68. | అర్చన | 40-00 |
| 69. | నిత్యదేవతార్చన | 40-00 |
| 70. | సర్వదేవతా స్తోత్ర నిధి | 99-00 |
| 71. | శ్రీచక్ర నవవరణార్చన | 63-00 |
| 72. | చండీ సప్తశతి పారాయణ క్రమం | 99-00 |
| 73. | శ్రీదేవి స్తోత్ర రత్నావళి 32 దేవి స్తోత్రాలకు తాత్పర్యంతో | 99-00 |
| 74. | వనదుర్గా మంత్రానుష్ఠాన క్రమమ్ | 63-00 |
| 75. | శ్రీ కాలభైరవ వ్రతము | 63-00 |

## 3. శ్రీ సాయి దత్త గ్రంథములు

| | | |
|---|---|---|
| 1. | శ్రీ సాయిబాబా సచ్చరిత్ర | 120-00 |
| 2. | సంపూర్ణ శ్రీ గురు చరిత్ర | 120-00 |
| 3. | శ్రీ సాయిఆరాధన-షిర్డివైభవం | 120-00 |
| 4. | శ్రీ సాయిబాబా జీవిత చరిత్ర (క్రౌన్) | 63-00 |
| 5. | శ్రీ గురుచరిత్ర (క్రౌన్) | 63-00 |
| 6. | నవనాధ చరిత్ర | 99-00 |
| 7. | శ్రీసాయిచరిత్ర (బైండు) ప్రయాణపుపారాయణగ్రంథం | 63-00 |
| 8. | శ్రీగురుచరిత్ర (బైండు) ప్రయాణపుపారాయణగ్రంథం | 63-00 |
| 9. | సత్యదత్తవ్రతం దత్తాత్రేయపూజాకల్పం,సహస్రంతో | 30-00 |
| 10. | అనఘాదేవీ వ్రతం | 30-00 |
| 11. | భక్తుల ప్రశ్నలకు బాబా జవాబులు | 30-00 |
| 12. | శ్రీ సాయిపూజాకల్పం (సహస్రంతో) | 25-00 |
| 13. | శ్రీ సాయిభజనమాల | 20-00 |
| 14. | శ్రీ సాయి భజన్స్ | 20-00 |
| 15. | శ్రీ సాయిభక్తి గీతాలు | 20-00 |
| 16. | శిరిడిహారతులు (భావంతో) | 20-00 |
| 17. | "శ్రీసాయి"కోటి | 27-00 |
| 18. | "శ్రీసాయిరామ్"కోటి | 20-00 |
| 19. | శ్రీ సాయినాథ స్తోత్రమంజరి | 10-00 |
| 20. | శ్రీ సాయివేయినామాలు | 8-00 |
| 21. | శ్రీ సాయి హారతులు (పాకెట్) | 15-00 |
| 22. | శ్రీ సాయి స్తవనమంజరి | 10-00 |
| 23. | హిందీ శ్రీ సాయి హారతులు | 15-00 |

| | | |
|---|---|---|
| 24. | శని సింగణాపూర్ క్షేత్రమాహాత్మ్యం | 63-00 |
| 25. | ఇంగ్లీషు శ్రీ సాయిహారతులు | 15-00 |
| 26. | షిరిడి దర్శనం-శ్రీసాయి వైభవం | 99-00 |
| 27. | సాయిసత్యవ్రతం | 30-00 |
| 28. | సాయి అనుగ్రహమ్ | 120-00 |
| 29. | నవగురువారాల వ్రతకల్పము | 15-00 |
| 30. | శ్రీదత్తలీలామృతము | 99-00 |
| 31. | హృదయంలో సాయి | 15-00 |
| 32. | శ్రీషిరిడీసాయి లీలామృతం(శ్రీసచ్చరిత్ర) | 120-00 |
| 33. | గజాననమహరాజ్ చరిత్ర | 99-00 |

## 4. జ్యోతిషాలు

| | | |
|---|---|---|
| 1. | 'కాలచక్రం' గంటలపంచాంగం (గార్గేయ) | 72-00 |
| 2. | గ్రహభూమి పంచాంగము (గార్గేయ) | 108.00 |
| 3. | ఆనందసిద్ధి పంచాంగం (వై.వి.శాస్త్రి) | 63.00 |
| 4. | ములుగు వారి రాశిఫలితాలు (12రాశులువారికి) | 50.00 |
| 5. | ములుగు వారి రాశిఫలితాలు విడివిడిగాఒక్కొక్కటి | 12.00 |
| 6. | కాలచక్రంజ్యోతిషక్యాలండర్ | 25.00 |
| 7. | గ్రహబలం క్యాలండర్ (శ్రీనివాసగార్గేయ-భక్తిటివి) | 25.00 |
| 8. | శుభమస్తు (పిడపర్తి) క్యాలండర్ | 25.00 |
| 9. | సాదా క్యాలండర్ | 5.00 |
| 10. | పాకెట్ క్యాలండర్ | 15.00 |
| 11. | తాజకనీలకంఠీయమ్ | 100-00 |
| 12. | కేరళ జ్యోతిష రహస్యాలు | 180-00 |
| 13. | జ్యోతిష బ్రహ్మ రహస్యాలు | 180-00 |
| 14. | మానసాగరి జాతకపద్ధతి | 180-00 |
| 15. | వరాహమిహిర జాతకపద్ధతి | 180-00 |
| 16. | వధూవర వివాహమైత్రిద్వాదశకూటములు | 99-00 |
| 17. | సింపుల్ రెమిడీస్ | 180-00 |
| 18. | శంభు హోరప్రకాశిక | 250-00 |
| 19. | పూర్వ పరాశరి | 100-00 |
| 20. | పరాశర జ్యోతిషవిజ్ఞాన సర్వస్వం | 200-00 |
| 21. | ప్రశ్న సింధు | 99-00 |
| 22. | నక్షత్ర విశేష ఫలితాలు | 63-00 |
| 23. | సూర్యసిద్ధాంతపంచాంగగణితంచేయడంఎలా? | 180-00 |
| 24. | దృక్సిద్ధాంతపంచాంగగణితం చేయడంఎలా? | 180-00 |

| | | |
|---|---|---|
| 25. | ఆయుర్దాయ నిర్ణయం | 63-00 |
| 26. | జాతక గణిత ప్రవేశిక | 63-00 |
| 27. | జ్యోతిషమర్మబోధిని | 63-00 |
| 28. | జ్యోతిష ప్రశ్నోత్తరమాల | 63-00 |
| 29. | ముహూర్తం నిర్ణయించడంఎలా? | 63-00 |
| 30. | జాతక మకరందం | 63-00 |
| 31. | జ్యోతిష సరస్వతి | 63-00 |
| 32. | మీజననకాల విశేషాలు | 63-00 |
| 33. | ముహూర్త విజ్ఞాన భాస్కరం | 63-00 |
| 34. | జ్యోతిష స్వయంబోధిని | 63-00 |
| 35. | శుభముహూర్త శిరోమణి | 63-00 |
| 36. | నక్షత్ర ఫలమంజరి | 36-00 |
| 37. | పంచాంగం చూసే విధానం | 36-00 |
| 38. | సర్వార్థ జ్యోతిషం | 36-00 |
| 39. | ప్రాథమిక జ్యోతిషం | 36-00 |
| 40. | నవరత్నములు శుభయోగములు | 36-00 |
| 41. | శుభశకునాలు | 30-00 |
| 42. | హస్తరేఖాఫలితాలు | 36-00 |
| 43. | సంఖ్యల్లో భవిష్యత్ | 36-00 |
| 44. | ముహూర్త దీపిక | 99-00 |
| 45. | పుట్టుమచ్చలు ఫలితాలు | 30-00 |
| 46. | కలలు ఫలితాలు | 30-00 |
| 47. | జాతక చక్రం వేయడం ఎలా? | 36-00 |
| 48. | మానసాగరి (ప్రాచీనజ్యోతిషగ్రంథం) -పుచ్చాశ్రీనివాసరావు | 250-00 |
| 49. | జ్యోతిషశాస్త్ర చిట్కాలు | 120-00 |
| 50. | గుప్తా శతాబ్ది పంచాంగం (1940-2050) | 999-00 |
| 51. | ప్రశ్నచండేశ్వరమ్ | 63-00 |
| 52. | ద్వాదశభావ ఫలచంద్రిక | 250-00 |
| 53. | జ్యోతిష శతయోగరత్నావళి (నూరుయోగాలఫలితాలు) | 120-00 |
| 54. | అంగసాముద్రికం | 36-00 |
| 55. | హస్త సాముద్రికం | 63-00 |
| 56. | లాల్ కితాబ్ | 99-00 |
| 57. | శకునశాస్త్రం | 63-00 |
| 58. | ఆధునికప్రశ్నశాస్త్రం | 120-00 |
| 59. | పరాశరజ్యోతిష ప్రశ్నజ్యోతిషం | 180-00 |

| | |
|---|---|
| 60. అష్టకవర్గు (కొండపల్లి) | 63-00 |
| 61. బృహత్‌జాతకం (ప్రాచీనప్రతికిపునర్ముద్రణ) | 250-00 |
| 62. లగ్నరత్నాకరం | 63-00 |
| 63. షట్పంచాశిక | 120-00 |
| 64. 40 రోజుల్లో జ్యోతిషంనేర్చుకొనండి | 270-00 |
| 65. 40 రోజుల్లో సాముద్రికంనేర్చుకొనండి | 180-00 |
| 66. 40 రోజుల్లో సంఖ్యాశాస్త్రం | 180-00 |
| 67. 40 రోజుల్లో నక్షత్ర (నాడీ) ఫలితములు | 270-00 |
| 68. 40 రోజుల్లో వైద్యజ్యోతిషం నేర్చుకోండి | 250-00 |
| 69. మీ పుట్టినతేదీ అద్భుతరహస్యాలు (సాయిగణపతిరెడ్డి) | 270-00 |
| 70. కె.పి.జ్యోతిషం (పరిచయం) | 63-00 |
| 71. ముహూర్తచింతామణి | 99-00 |
| 72. సూర్యచంద్ర గ్రహణములు | 63-00 |
| 73. ప్రసిద్ధవ్యక్తుల జాతకాలు (వేరేకొండప్ప) | 180-00 |
| 74. అదృష్టరెమెడీస్ | 144-00 |
| 75. గ్రహసంచార ఫలనిర్ణయదీపిక | 63-00 |
| 76. జ్యోతిష రెమిడీస్ | 300-00 |
| 77. జాతకమార్తాండం పాతప్రతికి యథాతథం (కొండపల్లి) | 250-00 |
| 78. జ్యోతిషవిద్యాప్రకాశిక పాతప్రతికి యథాతథం (కొండపల్లి) | 250-00 |
| 79. నాడీజ్యోతిషం | 63-00 |
| 80. నక్షత్రపారిజాతం (గోరసవీరభద్రాచార్య) | 63-00 |
| 81. లగ్నపారిజాతం (గోరసవీరభద్రాచార్య) | 63-00 |
| 82. గౌతమసంహిత | 63-00 |
| 83. హోరరత్నమాల | 63-00 |
| 84. జాతకఫల మణిమంజరి | 200-00 |
| 85. పుష్కర పంచాంగం (2013-14నుండి 2024-25) | 560-00 |
| 86. దశాభుక్తిఫల నిర్ణయం | 250-00 |
| 87. వింత జోష్యములు | 63-00 |
| 88. షోడశవర్గులు | 200-00 |
| 89. రవిగ్రహ సమస్త ప్రభావములు | 99-00 |
| 90. చంద్ర గ్రహ సమస్త ప్రభావములు | 99-00 |
| 91. కుజ గ్రహ సమస్త ప్రభావములు | 99-00 |
| 92. బుధ గ్రహ సమస్త ప్రభావములు | 99-00 |
| 93. గురు గ్రహ సమస్త ప్రభావములు | 99-00 |
| 94. శుక్ర గ్రహ సమస్త ప్రభావములు | 99-00 |

| | |
|---|---|
| 95. శని గ్రహ సమస్త ప్రభావములు | 99-00 |
| 96. రాహు & కేతు గ్రహముల సమస్త ప్రభావములు | 99-00 |
| 97. ఆధునిక గ్రహములు-ఉపగ్రహములు సమస్త ప్రభావములు | 99-00 |
| 98. ముహూర్తమార్తాండం | 63-00 |
| 99. లఘుజాతకం | 63-00 |
| 100. జాతకాలంకారము | 63-00 |
| 101. మేషలగ్న ఫలితములు | 99-00 |
| 102. వృషభ లగ్న ఫలితములు | 99-00 |
| 103. మిధున లగ్న ఫలితములు | 99-00 |
| 104. కర్కాటక లగ్న ఫలితములు | 99-00 |
| 105. సింహలగ్న ఫలితములు | 99-00 |
| 106. కన్యలగ్న ఫలితములు | 99-00 |
| 107. తుల లగ్న ఫలితములు | 99-00 |
| 108. వృశ్చిక లగ్న ఫలితములు | 99-00 |
| 109. ధనుస్సు లగ్న ఫలితములు | 99-00 |
| 110. మకర లగ్న ఫలితములు | 99-00 |
| 111. కుంభ లగ్న ఫలితములు | 99-00 |
| 112. మీన లగ్న ఫలితములు | 99-00 |
| 113. నారద సంహిత | 200-00 |
| 114. పంచాంగపీఠికలేఖికాగణితం | 250-00 |
| 115. తారాబలం - చంద్రబలం (వేరే కొండప్ప) | 99-00 |
| 116. సులభలగ్న సాధన (చిత్రాలగురుమూర్తిగుప్తా) | 200-00 |
| 117. రాహు కేతువుల యోగము | 99-00 |
| 118. ఛాయాగ్రహములు | 99-00 |
| 119. జ్యోతిషవిజ్ఞాన దీపిక | 63-00 |

## బి.వి.రామన్ గారి గ్రంథములు

| | |
|---|---|
| 120. జ్యోతిష విద్యారంభం | 50-00 |
| 121 గ్రహభావ బలములు | 50-00 |
| 122. కాలచక్రదశ | 50-00 |
| 123. అనుభవ ప్రశ్నాజ్యోతిషం | 50-00 |
| 124. జ్యోతిషశాస్త్రంలో వాతావరణ భూకంపాలు | 50-00 |
| 125. పురోగామి జాతకం | 50-00 |
| 126. భావార్థరత్నాకరం | 75-00 |
| 127. భారతీయజ్యోతిష సర్వస్వం | 75-00 |
| 128. అష్టకవర్గ పద్ధతిః | 75-00 |

| | | |
|---|---|---|
| 129. | జ్యోతిషశాస్త్రంలో సందేహాలు,సమాధానాలు | 75-00 |
| 130. | ప్రశ్నతంత్ర | 75-00 |
| 131. | ముహూర్తం | 75-00 |
| 132. | విశిష్ట జాతకములు | 125-00 |
| 133. | భారతీయఫలితజ్యోతిషం | 125-00 |
| 134. | 300 ముఖ్యమైన యోగములు | 125-00 |
| 135. | జాతకంపరిశీలించడంఎలా ? | 300-00 |

రాష్ట్రపతి అవార్డుగ్రహీత, మహామహోపాధ్యాయ, వాచస్పతి
శ్రీ మధురకృష్ణమూర్తిగారి గ్రంథములు

| | | |
|---|---|---|
| 136. | బృహత్‌పరాశరహోరాశాస్త్రము-1 | 200-00 |
| 137. | బృహత్‌పరాశరహోరాశాస్త్రము-2 | 200-00 |
| 138. | బృహత్‌పరాశరహోరాశాస్త్రము-3 | 200-00 |
| 139. | బృహత్‌పరాశరహోరాశాస్త్రము-4 | 200-00 |
| 140. | భావార్థరత్నాకరము | 100-00 |
| 141. | ముహూర్త చింతామణి | 100-00 |
| 142. | ముహుర్త చింతామణి-పార్టు2 | 200-00 |
| 143. | స్వప్న శాస్త్రము | 36-00 |
| 144. | శతయోగమంజరి | 50-00 |
| 145. | వ్రతనిర్ణయకల్పవల్లి | 250-00 |
| 146. | దైవజ్ఞవల్లభం | 75-00 |
| 147. | వసంతరాజశకునమ్ (బృహత్‌శకునశాస్త్రం) | 250-00 |
| 148. | వాస్తుశాస్త్రవివేకము-1 | 100-00 |
| 149. | వాస్తుశాస్త్రవివేకము-2 | 200-00 |
| 150. | వాస్తుశాస్త్రవివేకము-3 | 100-00 |
| 151. | వాస్తుశాస్త్రవివేకము-4 | 200-00 |
| 152. | అనుభవసులభవాస్తు - 1 | 50-00 |
| 153. | అనుభవసులభవాస్తు - 2 | 100-00 |
| 154. | పంచాంగ వివేకము | 99-00 |
| 155. | వశిష్ఠ సంహిత | 360-00 |
| 156. | పంచపక్షి శాస్త్రం (కేస్‌బైండ్) | 200-00 |

## 5. వాస్తులు

| | | |
|---|---|---|
| 1. | 40 రోజుల్లో "వాస్తువిద్య" నేర్చుకొనండి | 180-00 |
| 2. | వాస్తుశాస్త్ర రహస్యములు | 200-00 |
| 3. | వాస్తునుబట్టి మీ ఇల్లు | 63-00 |
| 4. | మీరూ మీ వాస్తు | 63-00 |

| | | |
|---|---|---|
| 5. | గృహవాస్తు చిట్కాలు | 63-00 |
| 6. | వాస్తు పూజ | 63-00 |
| 7. | వాస్తు సూత్రములు | 63-00 |
| 8. | వాస్తుశాస్త్ర రహస్యాలు | 63-00 |
| 9. | గృహవాస్తు వర్గులు | 99-00 |
| 10. | విశ్వకర్మవాస్తు శాస్త్రరీత్యా మీ ఇంటి ప్లానులు | 63-00 |
| 11. | విశ్వకర్మ వాస్తుశాస్త్రరీత్యా మీఇండ్లఆయములు | 99-00 |
| 12. | విశ్వకర్మ వాస్తు శాస్త్రం(చిత్రాలగురుమూర్తిగుప్తా) | 180-00 |
| 13. | ఆధునిక గృహవాస్తు | 99-00 |
| 14. | శుభవాస్తు | 270-00 |
| 15. | వాస్తుయంత్ర రత్నావళి | 120-00 |
| 16. | వాస్తుశాస్త్రం | 120-00 |
| 17. | హౌస్ ప్లాన్స్ | 63-00 |
| 18. | గృహనిర్మాణ వాస్తు | 63-00 |
| 19. | వాస్తు రెమెడీస్ | 63-00 |
| 20. | గృహవాస్తు దర్పణం | 63-00 |
| 21. | జ్యోతిష-గృహవాస్తుచంద్రిక | 200-00 |
| 22. | వాస్తురత్నాకరం (కొండపల్లి) | 63-00 |
| 23. | వాస్తుశిరోమణి ,, | 120-00 |
| 24. | వాస్తుసంగ్రహమ్ ,, | 63-00 |
| 25. | పంచవాస్తు పారిజాతం ,, | 120-00 |
| 26. | వాస్తుడిండిమమ్ ,, | 63-00 |
| 27. | వాస్తుదుందిభి ,, | 120-00 |
| 28. | విశ్వకర్మవాస్తుప్రకాశిక (కేస్‌బైండ్) | 250-00 |
| 29. | కృష్ణవాస్తుశాస్త్రము | 63-00 |
| 30. | జలవాస్తు,శల్యవాస్తు (దంతూరిపండరీనాథ్) | 99-00 |
| 31. | మయవాస్తు (గోరసవీరభద్రాచార్య) | 120-00 |
| 32. | వాస్తు జ్యోతి | 63-00 |
| 33. | మన ఇల్లు-మనవాస్తు | 99-00 |
| 34. | వాస్తవ వాస్తుపూజావిధానము | 108-00 |
| 35. | వాస్తు దర్పణం | 120-00 |

## 6. మంత్రశాస్త్రాలు

| | | |
|---|---|---|
| 1. | మంత్రసాధన | 63-00 |
| 2. | తంత్రజాలం | 63-00 |
| 3. | మంత్రశక్తి | 63-00 |

| | | |
|---|---|---|
| 4. | దత్తాత్రేయ తంత్రవిద్య | 63-00 |
| 5. | దత్తాత్రేయ మూలికాతంత్రమ్ | 63-00 |
| 6. | తాంత్రిక పంచాంగం | 63-00 |
| 7. | యక్షిణీ తంత్రం | 63-00 |
| 8. | మంత్రానుష్ఠాన చంద్రిక | 63-00 |
| 9. | సర్వదేవతా మంత్రకవచములు | 63-00 |
| 10. | మంత్రాక్షరాలరహస్యం (బీజాక్షరనిఘంటువు) | 63-00 |
| 11. | సర్వదేవతా మంత్రరత్నావళి | 63-00 |
| 12. | సదాచార దీపిక | 63-00 |
| 13. | యోగినీ-వామకేశ్వరతంత్రం | 63-00 |
| 14. | ప్రపంచసారతంత్రం | 63-00 |
| 15. | బదనిక తంత్రమ్ | 63-00 |
| 16. | ఉచ్ఛిష్ట గణపతి తంత్రమ్ | 63-00 |
| 17. | గుప్త సాధన తంత్రం | 63-00 |
| 18. | గంధర్వ తంత్రమ్ | 63-00 |
| 19. | సౌందర్యలహరి (మంత్రయంత్రరత్నావళి) | 63-00 |
| 20. | యంత్ర మంత్ర తంత్ర | 63-00 |
| 21. | పాశుపత తంత్రం | 99-00 |
| 22. | పంచదశ మహాఖడ్గ తంత్రం | 99-00 |
| 23. | రుద్రాష్టాధ్యాయః | 99-00 |
| 24. | మంత్రసిద్ధి | 120-00 |
| 25. | పరశురామతంత్రమ్ | 108-00 |
| 26. | శ్రీలలితావిలోమ పంచదశీ | 108-00 |
| 27. | శ్రీ గురు తంత్రం | 108-00 |
| 28. | గాయత్రీ తంత్రమ్ | 108-00 |
| 29. | మహాశక్తి మంత్ర తంత్ర రహస్యాలు | 150-00 |
| 30. | శ్రీ దుర్గ తంత్రమ్ | 200-00 |
| 31. | మహామృత్యుంజయఅమృతపాశుపతమ్ | 200-00 |
| 32. | సర్ప (నాగ)తంత్రం | 250-00 |
| 33. | హవన తంత్రం | 250-00 |
| 34. | షోడశనిత్యతంత్రం | 250-00 |
| 35. | శాక్తేయతంత్రం | 250-00 |
| 36. | రుద్రయామళతంత్రం | 250-00 |
| 37. | లక్ష్మీప్రత్యంగిరా తంత్రమ్ | 250-00 |
| 38. | హిరణ్యశూలినీ తంత్రమ్ | 250-00 |

| | | |
|---|---|---|
| 39. | మాయాప్రత్యంగిరా తంత్రమ్ | 250-00 |
| 40. | శ్రీ విశ్వరూప ప్రత్యంగిరా తంత్రమ్ | 250-00 |
| 41. | స్వర్ణాకర్షణభైరవతంత్రం | 250-00 |
| 42. | కాశీవిశాలాక్షి తంత్రం | 250-00 |
| 43. | శాంతితంత్రమ్ | 250-00 |
| 44. | యంత్రసిద్ధి | 360-00 |
| 45. | శ్రీ లక్ష్మీతంత్రమ్ | 360-00 |
| 46. | మంత్రమహోదధి (స్త్రీదేవతాఃకల్పమ్) | 360-00 |
| 47. | మంత్రమహోదధి (పురుషదేవతాఃకల్పమ్) | 360-00 |
| 48. | మంత్రశాస్త్రం (గ్రంథము) | 360-00 |
| 49. | ప్రత్యంగిరాకృత్యాతంత్రం | 360-00 |
| 50. | కామధేనువు తంత్రం | 360-00 |
| 51. | శూలినీదుర్గాతంత్రం | 360-00 |
| 52. | శ్రీవిద్య రహస్యం | 290-00 |
| 53. | కులార్ణవ తంత్రమ్ | 150-00 |
| 54. | ఆచార్య సిద్ధ నాగార్జునతంత్రం (ఒరిజనల్) | 390-00 |
| 55. | సిద్ధమూలిక రహస్యం (మంత్ర,యంత్రసహితం) | 63-00 |

## 7. గ్రంథాలు - ఆరాధనలు

| | | |
|---|---|---|
| 1. | భగవద్గీత శ్లోక తాత్పర్య సహితం | 54-00 |
| 2. | భగవద్గీత (వచనం) | 99-00 |
| 3. | భగవద్గీత శ్లోకతాత్పర్యం-కేసుబైండింగ్ | 72-00 |
| 2. | గణేశ ఆరాధన 1 | 99-00 |
| 3. | గణేశోపాసన 2 | 99-00 |
| 4. | నవగ్రహవైభవం | 99-00 |
| 5. | నవగ్రహ రెమెడీస్ | 99-00 |
| 6. | నవగ్రహ వేదం | 99-00 |
| 7. | శనిగ్రహారాధన | 99-00 |
| 8. | ఆదిత్యారాధన | 99-00 |
| 9. | సుబ్రహ్మణ్యారాధన | 99-00 |
| 10. | శ్రీ శివ ఆరాధన | 99-00 |
| 11. | లక్ష్మీ ఆరాధన | 99-00 |
| 12. | హనుమదారాధన | 99-00 |
| 13. | లలితారాధన | 99-00 |
| 14. | శ్రీ చక్రారాధన | 99-00 |
| 15. | గాయత్రీ ఆరాధన | 99-00 |

| | | |
|---|---|---|
| 16. | వీరభద్రారాధన | 99-00 |
| 17. | కుజగ్రహారాధన | 99-00 |
| 18. | భైరవారాధన | 99-00 |
| 19. | దైవారాధన | 99-00 |
| 20. | గీతారాధన (భగవద్గీత శ్లోకతాత్పర్యసహిత) | 99-00 |
| 21. | శ్రీవేంకటేశ్వరాధన | 99-00 |
| 22. | హయగ్రీవారాధన | 99-00 |
| 23. | లక్ష్మీనరసింహారాధన | 99-00 |
| 24. | శ్రీ బాలాత్రిపురసుందరీ స్తోత్ర కదంబం | 99-00 |
| 25. | దేవీ లీలామృతం | 99-00 |
| 26. | పురాణపండ సుందరకాండ వచనం | 99-00 |
| 27. | పురాణపండ రామాయణం | 99-00 |
| 28. | పురాణపండ భారతం | 99-00 |
| 29. | పురాణపండ భాగవతం | 99-00 |
| 30. | (సూరి) వాల్మీకి రామాయణం | 99-00 |
| 31. | కాలసర్ప యోగం | 99-00 |
| 32. | నిత్య జీవితములో రుద్రాక్షలు | 99-00 |
| 33. | నిత్య జీవితములో నవరత్నాలు | 99-00 |
| 34. | వేదసూక్తములు | 99-00 |
| 35. | వేమన పద్యసారామృతం | 99-00 |
| 36. | పండగలు పర్వదినాలు | 99-00 |
| 37. | సూక్తిరత్నాలు | 99-00 |
| 38. | హనుమచ్చరిత్ర | 99-00 |
| 39. | నవగ్రహ దర్శనమ్ | 99-00 |
| 40. | నిత్యజీవితంలో నవగ్రహాలు | 99-00 |
| 41. | సాలగ్రామములు | 99-00 |
| 42. | గురుశుక్ర ప్రభావము చంద్రకళానాడీ | 99-00 |
| 43. | శనిగ్రహరెమిడీస్ | 99-00 |
| 44. | జాతకసుధాసారము-జాతకమోక్షప్రదాయిని | 99-00 |
| 45. | వివాహజ్యోతిషమంజరి-మ్యారేజ్‌మ్యాచింగ్‌గైడ్ (సాయిగణపతిరెడ్డి) | 99-00 |
| 46. | మీపుట్టినతేదీనిబట్టి మీజీవితరహస్యాలు (న్యూమరాలజీ లైఫ్‌గైడ్) ,, | 99-00 |
| 47. | మీఅదృష్టానికి (పేరు) నేమ్‌కరక్షన్ ,, | 99-00 |
| 48. | న్యూమరాలజీ రెమిడీస్ | 99-00 |
| 49. | మూకపంచశతీ | 99-00 |
| 50. | శ్రీరామకర్ణామృతం | 99-00 |

